# శ్రీ దేవీ భాగవతము

ములుగు పాపయారాధ్య ప్రణీతము





ప్రకటనకర్తలు
పుచ్చా కోటయ్య
బేతపూడి వీరశరభయ్య

SANKAR*FOUNDRY

శ్రీ మహాగణాధిపతయే నమః



శ్రీ మత్పరదేవతాయైనమః

# శ్రీ దేవీభాగవతము

శ్రీ ములుగు పాపయారాధ్య ప్రణీతము.

శ్రీ కింకవీంద్ర ఘటాపంచాననులు, శతావధానులు.
బ్రిహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిచే
పరిష్కృతము

శ్రీ శారదాంబాయైనమః



శ్రీ రమాయైనమః



ప్రికటనకర్తలు:
పుచ్చా కోటయ్య
బేతపూడి వీరశరభయ్య
ప్రొప్రయిటర్సు: శంకర ఫౌండ్రి
దుర్గాపురం, బెజవాడ.

 1942 వెల అమూల్యము

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు [illegible] లక్ష్మీనరసయ్యచే ముద్రితము.

ఓం

శ్రీ మాత్రే నమః



# శ్రీ దేవీ నిజకరుణానురూప భక్తి ప్రచార సమితి, బెజవాడ.



## మహాశయులకు విజ్ఞాపనము!

శ్రీ వ్యాసప్రోక్తమగు మహాపురాణములలో దేవీభాగవతముకూడ నొకటియే. ఇయ్యది సంస్కృతమునుండి తెలుఁగులోనికిఁ బండితులచే తర్జుమా చేయఁబడి లోకమునందుఁ గొంతవరకు వ్యాప్తిచెంది యుండుట పండితులకు విశదమే కాని పామరులలో మాత్రము దీని వ్యాప్తి తక్కిన పురాణములకుఁ గలదిగా లేదు. శ్రీ దేవీస్వరూపము శ్రీ దేవీధ్యానము శ్రీ దేవీ భక్తవాత్సల్యత మున్నగునవి లోకమునకు విశదముగాఁ దెలియకుండుటచే నా త్రిజగజ్జననియొక్క మాతృరూపము, మాతృసేవ, మాతృప్రేమ తెలిసికొనఁజాలక కేవలము "దేవి" "శక్తి" మొదలగు దేవీస్వరూపపర్యాయపదములచేతనే మిక్కిలి భయమంది, శ్రీ దేవీసేవలకు దూరులై యైహికాముష్మికముల సాధింపఁజాలకున్నారు.

శ్రీ దేవీభాగవతముయొక్క ముఖ్యోద్దేశములు లోకప్రచారమునకు గాను ప్రస్తుతము ముద్రితములైన భాషాంతరీకరణములుగాక దీని కనేకసంవత్సరములకుఁ బూర్వము "శ్రీ యమరావతి" సంస్థాన నవరత్నకవులలోఁ బ్రథమ కవిరత్నంబులును, 'వజ్రరత్న' బిరుదాంకితులును నగు బ్రహ్మశ్రీ ములుగు పాపయారాధ్యులవారిచే రచింపఁబడిన యాంధ్రదేవీభాగవత మను గ్రంథమును పామరులకు గల్గిన శక్తినామకారణ మగు భయమును మాన్పి తల్లి ప్రేమను కల్గించుటకై బెజవాడలోఁ గల శ్రీ శంకరఫౌండరీ యనెడి సంస్థ ముద్రించుటకై పూనుకొని యున్నది. కాన విద్యాభిమానులు, మతాభిమానులు, శ్రీ దేవీపాదపూజానిరతులును మా యీ యుద్యమమునకుఁ దోడ్పడి శ్రీ దేవీభాగవతమ్మును యువకుల కుద్బోధముచేసి సంఘీయులకు శ్రీదేవియొక్క మాతృరూపమందలి భక్తివిశ్వాసమును బెంపొందఁ జేయ వేడుచున్నాము.

ఈ యుద్దేశము నెరవేర్చుటకై యొక యధికారివర్గము నేర్పాటు చేసి తద్ద్వారా పండిత లోకమునకు ముఖ్యోద్దేశములను దెలియఁజేసి వారి సహకారముచే మా యీ పనిని సఫలము చేయఁదలంచుచున్నాము. కాన మహాశయులు తగు శ్రమవహించి శ్రద్ధగైకొని మా యీ యుద్దేశములను బూర్తిగా గ్రహించి యందు కనుగుణ మగు నితరములగు సలహాల నిచ్చి మా యుద్దేశములను నిర్విఘ్నముగాఁ గొనసాగించుటకుఁ బ్రార్థించుచున్నాము.

ఇట్లు తోడ్పడు మహాశయులకు యోగ్యతాపత్రములు బహుమానములు మొదలగు సత్కారములు ప్రతిసంవత్సరము శ్రీ దేవీనవరాత్రోత్సవసందర్భమున నొసంగఁబడుటయే గాక వారు వ్రాసిన విమర్శనములును ఉపన్యాసములు మొదలగునవి యధికారివర్గముచేఁ బరిష్కరింపబడి యందు నెన్నికగొన్నవి పత్రికలలోఁ బ్రచురింపఁబడును.

పై యుద్దేశముల నెరవేర్చుటకుఁ గొన్ని ముఖ్యమార్గములు :—

1. శ్రీ దేవీభాగవతము పురాణరూపముగా బహుజనులకు వినిపించుట.

2. శ్రీ దేవీభాగవతమునుగుఱించి యుపన్యాసము లొసంగుట.

3. శ్రీ దేవీభాగవత విమర్శనములు వ్రాయుట.

4. శ్రీ దేవీభాగవతమందలి నియమింపఁబడు భాగములను విద్యార్థులకు బోధించి వారలను నధికారివర్గముచేఁ బ్రతిసంవత్సరముఁ జరుపఁబడు పరీక్షలకుఁ బంపుట.

5. శ్రీ దేవీభాగవతమును మాతృకగాఁ గైకొని కీర్తనలు మొదలగునవి రచించి శ్రీ దేవీభాగవత గాథలు భాగవతగానరూపముగాఁ బండితపామరులకు రంజకముగాఁ గాలక్షేపములు జరుపుట.

ప్రప్రథమమునఁ బఠనీయము సంస్కృతాంగ్ల కళాశాలలలోని విద్యార్థులకు సులభసాధ్యముగానఁ గళాశాలాధికారులు శ్రద్ధవహించి యోగ్యత గలవారిని బ్రోత్సాహపరచి వారి వారి శక్త్యనుసారముగా పైయుద్దేశముల నెఱవేర్చి శ్రీ శంకర ఫౌండరీ సంస్థయొక్క కృతజ్ఞతకును శ్రీ దేవీప్రసాద స్వీకరణమునకును బాత్రు లగుదురు గాక.

---

షరా:—శ్రీ దేవీభాగవతము నందభిమానము గలవారు శ్రీ శంకర ఫౌండరీ సంస్థచే నియమింపఁబడి యీ దిగువఁ దెలిపిన యధికారివర్గమువలన నుచితముగాఁ బడయఁగలరు. ఇవి గాక వలయు నితరాంశములను నుత్తరప్రత్యుత్తరములద్వారా యధికారివర్గ కార్యదర్శిగారినుండి తెలియనగును.

శంకర ఫౌండరీ,<br>బెజవాడ.

పుచ్చా కోటయ్య,<br>బేతపూడి వీరశరభయ్య.

## అధికారివర్గము

1. శ్రీ డాక్టరు, పి. శ్రీనివాసాచారిగారు, M. A., Ph. D. (లండను)<br>ప్రిన్సిపాలు, యస్. ఆర్. ఆర్. కళాశాల, బెజవాడ.
2. శ్రీ డి. వి. సూర్యనారాయణగారు, B. A., L. T.,<br>రిటైర్డు హెడ్మాస్టరు, బోర్డుహైస్కూలు. (కృష్ణా.)
3. శ్రీ గాయకసార్వభౌమ, పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు,
4. శ్రీ అంబడిపూడి రామనాథ భాగవతులుగారు,
5. శ్రీ విద్వాన్ ఖమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారు, శతావధాని.

## కార్యనిర్వాహకసంఘము

1. శ్రీ డాక్టరు: పి. శ్రీనివాసాచారిగారు, M. A., Ph. D. (లండను)<br>ప్రిన్సిపాలు, యస్. ఆర్. ఆర్. కళాశాల, బెజవాడ, ప్రెసిడెంటు,
2. శ్రీ డి. వి. సూర్యనారాయణగారు, B. A., L. T.,<br>రిటైర్డు హెడ్మాస్టరు, బోర్డుహైస్కూలు (కృష్ణా) కార్యదర్శి,
3. శ్రీ గాయకసార్వభౌమ, పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు.

శ్రీ మత్పరదేవతాయై నమః

# మున్నుడి

మహాశయులారా :

ఈ దేవీభాగవత మను మహాపురాణమునకుఁ బ్రకటనకర్తలు అనాది దంపతులు శ్రీ దుర్గామల్లేశ్వరులు. పాఠకుల కా యనాదిదంపతుల లీలానుభూతి సులభముగా నగుటకై శ్రీపరమశివానందలీలలు అను పేరుతో నొకచిన్న పొత్తము ముద్రింపబడి యిందుఁ జేర్పబడినది. ఈలీలానాటకమున ప్రధానపాత్రలుగ నేనును నామిత్రుడు పుచ్చా కోటయ్య దంపతులును జేర్కొనఁబడియుంటిమి. పిపీలికాది బ్రహ్మపర్యంతము వెలసియున్న యీ సృష్టిస్థితిలయము లా యనాదిదంపతుల లీలావిశేషమే యని సర్వవిదితము. ఆ దంపతుల లీల లనఁగా జీవులయెడఁ బ్రసరించు వారి నిగ్రహానుగ్రహవిశేషములే యని నా యాశయము. ఇట్టి యనాదిదంపతుల మహానుగ్రహలీలానాటకమున మమ్ము నవిద్యావంతుల మని సంశయింపక ప్రధానపాత్రల నొసంగి యకించిత్కరములైన మా సేవల నంగీకరించి యింతవరకును మా జీవితనౌకకుఁ గర్ణధారులై నడపిన యాదంపతులకుఁ గృతజ్ఞతాపూర్వకనమస్కృతము లర్పించుచున్నాము. ప్రప్రథమమున నీ యానందలీల "పరమశివానంద పిండిమర" యను పేరుతో మొలకెత్తి దానిని సదానుగ్రహజలములచేఁ బోషించుచు నీ పాత్రధారులను నిమిత్తమాత్రులుగా నుంచి వారి ప్రయత్నవిశేషము లను మిషచే నా మొలక మారాకు దొడిగి కొట్టకట్టి మ్రానై చివరకు 'శంకరఫౌండరీ' అను పేరున మహావృక్షముగ విరాజిల్లునట్లనుగ్రహించిరి. ఇంకను వారి యనుగ్రహవాహినీసేచనముచే నా వృక్షరాజమును బోషించుచు దానికి 'శ్రీ పురలావర్కుషాపు' అను నొకమహాశాఖ పొటమరించి పెంపొందునట్లు చేసిరి. ఇట్లు వారి యనుగ్రహలీలావిలాసము సర్వతోముఖమై చెలంగుచున్న నా దంపతుల నమ్ముకొని సేవల కొప్పుకొనిన మాకుమాత్ర మిట్లు పెరుగుచున్న తదనుగ్రహవృక్షపోషణధారణభారము శ్రమయని తోచి తుదకుఁ బరులసహాయ మపేక్షింపవలసి వచ్చినది. అందులకును నార్తత్రాణపరాయణులైన యా దంపతులు సేవకులమైన మా మనోదౌర్బల్య ముపేక్షించి యీ మహావృక్షాభివృద్ధికి బరమోపాదానమైన భక్తి యను మహాసామగ్రి నుపార్జించిపెట్ట నూతఁ జేయూతమై యనుగ్రహించిరి. ఒకప్పుడు పంచభూతములలో సర్వత్రవ్యాప్తమైన జలభూతము మాపై నాగ్రహింప నా దంపతు లడ్డుపడి సర్వభూతజీవనదాత్రి యగు

శ్రీమత్పరదేవతాయై నమః

# మున్నుడి

మహాశయులారా!

ఈ దేవీభాగవత మను మహాపురాణమునకుఁ బ్రకటనకర్తలు అనాది దంపతులు శ్రీ దుర్గామల్లేశ్వరులు. పాఠకుల కా యనాదిదంపతుల లీలానుభూతి సులభముగా నగుటకై శ్రీపరమశివానందలీలలు అను పేరుతో నొకచిన్న పొత్తము ముద్రింపబడి యిందుఁ జేర్పబడినది. ఈలీలానాటకమున బ్రధానపాత్రలుగ నేనును నామిత్రుడు పుచ్చా కోటయ్య దంపతులును బేర్కొనఁబడియుంటిమి. పిపీలికాది బ్రహ్మపర్యంతము వెలసియున్న యీ సృష్టిస్థితిలయము లా యనాదిదంపతుల లీలావిశేషమే యని సర్వవిదితము. ఆ దంపతుల లీల లనఁగా జీవులయెడఁ బ్రసరించు వారి నిగ్రహానుగ్రహవిశేషములే యని నా యాశయము. ఇట్టి యనాదిదంపతుల మహానుగ్రహలీలానాటకమున మమ్ము నవిద్యావంతుల మని సంశయింపక ప్రధానపాత్రల నొసంగి యకించిత్కరములైన మా సేవల నంగీకరించి యింతవరకును మా జీవితనౌకకుఁ గర్ణధారులై నడపిన యాదంపతులకుఁ గృతజ్ఞతాపూర్వకనమస్కృతము లర్పించుచున్నాము. ప్రప్రథమమున నీ యానందలీల "పరమశివానంద పిండిమర" యను పేరుతో మొలకెత్తి దానిని సదానుగ్రహజలములచేఁ బోషించుచు నీ పాత్రధారులను నిమిత్తమాత్రులుగా నుంచి వారి ప్రయత్నవిశేషము లను మిషచే నా మొలక మారాకు దొడిగి రెట్టకట్టి మ్రానై చివరకు 'శంకరఘాండరీ' అను పేరున మహావృక్షముగ విరాజిల్లునట్లనుగ్రహించిరి. ఇంకను వారి యనుగ్రహవాహినీసేచనముచే నా వృక్షరాజమును బోషించుచు దానికి 'శ్రీ పురలావర్కుషాపు' అను నొకమహాశాఖ పొటమరించి పెంపొందునట్లు చేసిరి. ఇట్లు వారి యనుగ్రహలీలావిలాసము సర్వతోముఖమై చెలంగుచున్న నా దంపతుల నమ్ముకొని సేవల కొప్పుకొనిన మాకుమాత్ర మిట్లు పెరుగుచున్న తదనుగ్రహవృక్షపోషణధారణభారము శ్రమయని తోచి తుదకుఁ బరులసహాయ మపేక్షింపవలసి వచ్చినది. అందులకును నార్తత్రాణపరాయణులైన యా దంపతులు సేవకులమైన మా మనోదౌర్బల్యముపేక్షించి యీ మహావృక్షాభివృద్ధికి బరమోపాదానమైన భక్తి యను మహాసామగ్రి నుపార్జించిపెట్టి మాకుఁ జేయూతమై యనుగ్రహించిరి. ఒకప్పుడు పంచభూతములలో నన్యతమమైన జలభూతము మాపై నాగ్రహింప నా దంపతు లడ్డుపడి సర్వభూతజీవనదాత్రి యగు

నాభూతమును పండితుల తోడ్పాటుతో మాకు సాక్షాత్కరింప జేసిరి. ఇట్లీ మహా వృక్షపోషణమునందు నిమిత్తమాత్రపాత్రధారులమైన మే మెంత పాటుపడుచున్నను గొంతకాలమువరకు నా తల్లిదండ్రుల యనుగ్రహము పండి యజమానునకు దృప్తి కరమైన ఫలములు లభింపవయ్యె. ఇట్లు మేము నిమిత్తమాత్రులమై ప్రధానపాత్రి త్వము వహించియుఁ బాపపుణ్య మిశ్రఫలప్రదమగు నైహికసంతానము కంటె నైహికాముష్మికప్రదమై పాపరహితమై యుభయతారకమైన సత్సంతానప్రాప్తి నే కోరుచు నీ వృక్షమును బరిరక్షించుకొనుచుంటిమి. పరిస్థితు లిట్లుండ నాదంపతుల యనుగ్రహముచే శరన్నవరాత్రోత్సవ, కపిలగోసేవా హేతువున సత్సంతానము లను మహాఫలములు యజమాన తృప్తికరములై యీ వృక్షమున ఫలింప సాగెను. శరన్నవరాత్రోత్సవ సేవలకు నిదర్శనముగ గత సంవత్సరశరదృతువునందు ఆరాను ప్రతిష్ఠ లభించుటయే యందు ప్రథమసంతానము. రెండవ సంతానముకూపప్రతిష్ఠ గాఁ బరిణమించెను. ఇప్పు డీ దేవీభాగవత మహాపురాణ ముద్రణమే మూడవ సంతానమై వెలయుచున్నది. ఈ సంతానత్రయములోఁ దృతీయమైన యీ దేవీభాగవత ముద్రణ మ్మా యనాదిదంపతుల మహానుగ్రహలీలావిశేషమునకు బరమతార్కాణము.

ఈ గ్రంథకర్త బ్రహ్మశ్రీ ములుఁగు పాపయారాధ్యులవారు. ఈయన కేవల కవిమాత్రుడేగాక శ్రీవిద్యోపాసకుఁడై శ్రీదేవ్యుపాసనార్థమై కవితా రూపకైంకర్య మొనర్చిన మహాభక్తుఁడు. అమరావతి ప్రభువులైన శ్రీ వాసిరెడ్డి వారి యాస్థానమున బ్రధానపండితు డయ్యును పోతనగారివలె సంపదల నిచ్చగింపక దారిద్ర్యముతోఁ గాలక్షేపము చేయుచు నీ మహాగ్రంథమును దాళపత్రములపై లిఖించి కైలాసప్రాప్తు డయ్యెను. ఇది నూ రేండ్లనాటిమాట. నాటినుండి యీ గ్రంథము పలువురు వ్రాయసగాండ్రచే హస్తాహస్తిగా కాగితములపై లిఖింప బడుచు పలుచోటులఁ బలురూపములొంది చివరకు శ్రీ పిఠాపురసంస్థానముఁ జేరి యందొక పుష్కరకాలము నిలచియుండెను. అటుపై నీ గ్రంథము గంజాంజిల్లా సిద్ధాంత గ్రామ వాస్తవ్యులైన త్రిపురాన తమ్మయ్య దొరవారియొద్దకుఁ జేరెను. వీరును దేవీభాగవతమును సాంగముగాఁ దెనిగించిన మహానుభావులు. వారి దేవీ భాగవతముకూడ నచ్చుగాకముందే వారును బరమపదించిరి.

ఇట్లుండ నీ పాత్రధారు లీ యనాదిదంపతులచే శ్రీ పాపయారాధ్యులవారి దేవీభాగవతము నచ్చొత్తింపఁ బ్రేరితులై శ్రీ త్రిపురాన తమ్మయ్య దొరవారి కుమారులును, బండిత కవులును, మొగిలురాయబారము, మున్నగు ననేక గ్రంథ కర్తలును నగు శ్రీ త్రిపురాన వెంకట సూర్యప్రసాదరావు కవిరాజు వారియొద్ద వ్రాత ప్రతి యున్నదని తెలిసి ప్రయత్నింప భాషాసేవకులైన వారు కరుణించి యీ వ్రాత

ప్రీతిని మా కొసంగిరి. వారికి మే మెంతయుఁ గృతజ్ఞులము. ఈ వ్రాతప్రతి యింతకాల మిందరు శ్రీమంతుల, రాజుల, పండితులయొద్దనుండియు ముద్రితము గాక నేటికి నస్మదుపాస్యులగు నీ యానాదిదంపతుల మహానుగ్రహవృక్షమునకు బుట్టిన సంతానములోఁ దృతీయత్వము నంది యీ పాత్రధారులకు లభించుట మృతజీవుడైన యీ కవియొక్క అనుపమేయ భక్తిప్రభావమునకును నా యనాది దంపతుల యనుగ్రహలీలావిశేషమునకు గొప్ప తార్కాణమై వెలయుచున్నది.

ఇంక నీ మహావృక్షమునకు జతుర్థసంతానమో యన్నట్లు శివ ప్రతిష్ఠా కార్యము పూవుపూచి కాయమై పసరుచిన్నెలు చిందుచున్నది. ఇట్టి వింకను సత్సంతానత్రితయ మవశిష్టముగా నున్నది. ఈ సంతానసప్తకము సంపూర్ణరూపము నొందినప్పటికిగాని యీ పాత్రధారుల సేవాప్రీతికిఁ బూర్ణ శాంతత సిద్ధింపదు. కావున నీ మహాపురాణమును బఠించు భక్తపండితవర్యు లీ పాత్రధారుల మహావాంఛా ఫలసిద్ధి యగుత మని యాశీర్వదింప బ్రార్థితులు.

ఈ దేవీభాగవతమును బరిష్కరించిన మహాకవులు, దేవ్యుపాసకులు శ్రీ కింకవీంద్రఘటాపంచాననేత్యాది బిరుదాంకితులు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు. శ్రీ శాస్త్రులవారు ప్రవయస్కులయ్యు కడుంగడు దీక్షాశక్తితో కేవలము శ్రీ దేవ్యుపాసనాబలమున నీ పరిష్కరణమును గట్టెక్కించి మమ్ముం గృతార్థుల గావించినందులకు వారి యిష్టదైవతమైన శ్రీమత్కామేశ్వరీ మహాదేవత పూర్ణాయురారోగ్యసౌభాగ్య ప్రదాత్రియై సర్వశ్రేయము లొనగూర్చు గాత మని యీ పాత్రధారు లా పరమమాతృదేవతను బ్రార్థించుచున్నారు.

ఈ గ్రంథ ముద్రణ భారమును వహించిన ఆంధ్ర గ్రంథాలయ ముద్రా శాలవారు తొలుదొలుత చేసిన వాగ్దానము ప్రకార మీ సంవత్సర శర న్నవరా త్రోత్సవములకే గ్రంథముద్రణము పూర్తిచేసి యిచ్చినందులకు, దీనినిగురించి విశేషముగా శ్రద్ధాళుత బ్రకటించి మిక్కిలి పాటుపడిన ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్సు మానేజరు, శ్రీ కుందా లక్ష్మీనరసయ్యగా రెంతయు నభినంద్యులు.

ఇక తుదిపలుకు. ఈ యనాది దంపతుల లీలలలో నీ గ్రంథమున బేర్కొన బడిన ప్రధాన పాత్రధారులము మే మిరువురమే. కాని యీ సత్కార్యనిర్వాహణమునం దింతకాలము మిక్కిలి భక్తిశ్రద్ధలతోఁ దోడుపడుచుండి యింతకాలము శ్రమలకోర్చి ప్రయత్నసఫలీకరణమునకు సహాయభూతమైయున్న తృతీయపాత్రధారిణి మా పుచ్చా కోటయ్యగారి అర్ధాంగి, శ్రీమతి పోషిత కనకదుర్గాంబ. ఈమెను గురించి శ్రీ వేంకటశాస్త్రిగారు ఉపోద్ఘాతములో నీమె సౌశీల్యమును బూర్ణముగ నభివర్ణింప ననువుపడక "యెంతచెప్పిన గొంత కొంతయె వడునని వ్రాసిరి.

పండితులకే యట్లు గోచరింప పామరుడను నే నెట్లు వ్రాయ గలుగుదు నని దానిని విడిచితిని.

ఈ మహాగ్రంథములో మా మువ్వురి చిత్రపటములు ముద్రింపు డని మిత్రు లెందరు చెప్పినను బాత్రతలేదని యందుల కంగీకరింప నైతిమి. కాని యిప్పుడు ముద్రణము పూర్తియై బైండు చేయబడనున్న సమయమున నా దంపతుల ప్రేరేపణచే నీజన్మమునఁ గాకపోయినను మరేజన్మముననైన వారి సాలోక్యసామీప్య సారూప్య సాయుజ్యములలో నేదేని యొక మహాస్థితి యొసంగు ననుగ్రహము కలిగెనేని నాఁడు వారల సన్నిధి సేవల జేయ నేర్చు స్వతంత్రత యబ్బుటకై యభ్యాస ప్రాయముగ వారిపాత్తమునందుఁ బటరూపమున నుండి కొంత యనుగ్రహము సంపాదింప నగునని యందుల కంగీకరించితిమి. పండితులు మన్నించి మాకోర్కెలు ఫలసిద్ధి నొందుతమని యాశీర్వదింతురు గాక !

కాని యెంత ప్రయత్నించినను గ్రంథకర్త శ్రీ పాపయారాధ్యులవారి రూపపటము (ఫొటో) చిక్కనందున కెంతయు చింతిల్లుచున్నాను.

బెజవాడ,
25—9—1942.

ఇట్లు, బుధజనవిధేయుఁడు
బేతపూడి వీరశరభయ్య.



శ్రీ మాత్రే నమః.

# విజ్ఞప్తి

తండ్రులారా! పండిత సత్కవీంద్రులారా!

ఈ దేవీభాగవతమున ననుబంధప్రాయముగా ముద్రింపఁబడిన శ్రీ పరమ శివానందలీలలు అను గ్రంథమునఁ బేర్కొనఁబడిన పాత్రధారులలో నేను తృతీయ పాత్రముగా బరిగణింపఁబడితిని. అస్మత్తాతపాదులు బ్రహ్మశ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారు రచించిన పీఠికయందును; దేవీభక్తులును, మహాకవులును నగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు రచించిన యుపోద్ఘాతమునందును; నాకు విద్యాగురువులైన శ్రీ బేతపూడి వీరశరభయ్యగారి మున్నుడియందును నన్ను గురించి గోరంతలు కొండంతలుగా చేసి యేమేమో లిఖించిరి. ఆడుదానను, అందును బూర్వోక్త మహనీయులు మువ్వురికంటెను ఎన్నో వెనుకల చిన్నదానను, నన్నుఁగూర్చి వీరిట్లు పొగడుటచూడఁ బోరుపెట్టి యేడ్చుచున్న పసిపిల్లను మరపించి నిద్రపుచ్చుటకై యల్లిబిల్లి పాటలుపాడు తల్లుల యుల్లంపు మొల్లమువలెనై యున్నది. ఈ మహనీయులు మువ్వురును తమ బిడ్డనగు న న్నిట్లు పొగడ్తల పాల్సేయుట కొంత విడ్డూరముగా నుండకపోదు. ఉభయకవిమిత్రుడు తిక్కనగారు చెప్పినట్లు:

క. మృదుభాషణముల దుర్జన
హృదయములు ప్రసన్నతామహిమ పొందునె యె
ల్లిదమగు గొని యంతంతకు
మద మెక్కంగాక దురభిమానము పేర్మిన్.

అను పద్యమునకుఁ దార్కాణముగా వీరి పొగడ్తలు నా కపకారకము లగునేమో యని సందియ మగుచున్నది. కాని యివి వట్టి పొగడ్తలు కావు. కరుణాపేశల హృదయులైన యీ మూవురు తండ్రుల యమృతాత్మలు పొంగి పొర్లిన ప్రేమ పూర్ణాశీర్వాదము లని శిరసా స్వీకరించుచున్నాను. తిక్కనగా రనినట్లు:

క. కారణము లేకయు నుప
కారపరత్వమున నొరుల కార్యమ్ములకుర్
వారని యలజడి పడిమెదు
వారలు......

అగు నీ మహనీయులు పలికిన యీ ప్రేమోక్తులకంటెఁ జిన్నతనమునుండి యీనాటివరకు నే నొనరించిన దోసంగుల నుద్ఘాటించి తమకు సర్వదా శాసితవ్యనగు

శ్రీ మాత్రే నమః.

# విజ్ఞప్తి

తండ్రులారా! పండిత సత్కవీంద్రులారా!

ఈ దేవీభాగవతమున ననుబంధప్రాయముగా ముద్రింపఁబడిన శ్రీ పరమశివానందలీలలు అను గ్రంథమునఁ జేర్కొనఁబడిన పాత్రధారులలో నేను తృతీయపాత్రముగా బరిగణింపఁబడితిని. అస్మత్తాతపాదులు బ్రహ్మశ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారు రచించిన పీఠికయందును; దేవీభక్తులును, మహాకవులును నగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు రచించిన యుపోద్ఘాతమునందును; నాకు విద్యాగురువులైన శ్రీ బేతపూడి వీరశరభయ్యగారి మున్నుడియందును నన్నుగురించి గోరంతలు కొండంతలుగా చేసి యేమేమో లిఖించిరి. ఆడుదానను, అందును బూర్వోక్త మహనీయులు మువ్వురికంటెను ఎన్నో వెనుకల చిన్నదానను, నన్నుఁగూర్చి వీ రిట్లు పొగడుటచూడఁ బోరుపెట్టి యేడ్చుచున్న పసిపిల్లను మరపించి నిద్రపుచ్చుటకై యల్లిబిల్లి పాటలుపాడు తల్లుల యుల్లంపు మొల్లమువలెనై యున్నది. ఈ మహనీయులు మువ్వురును తమ బిడ్డనగు నన్నిట్లు పొగడ్తల పాల్సేయుట కొంత విడ్డూరముగా నుండకపోదు. ఉభయకవిమిత్రుడు తిక్కనగారు చెప్పినట్లు:

క. మృదుభాషణముల దుర్జన
హృదయములు ప్రసన్నతామహిమ పొందునె మె
ల్లిదముగ గోని యంతంతకు
మద మెక్కుంగాక దురభిమానము పేర్మిన్.

అను పద్యమునకుఁ దార్కాణముగా వీరి పొగడ్తలు నా కపకారకము లగునేమో యని సందియ మగుచున్నది. కాని యివి వట్టి పొగడ్తలు కావు. కరుణాపేశల హృదయులైన యీ మూవురు తండ్రుల యమృతాత్మలు పొంగి పొర్లిన ప్రేమ పూర్ణాశీర్వాదము లని శిరసా స్వీకరించుచున్నాను. తిక్కనగా రనినట్లు:

క. కారణము లేకయు నుప
కారపరత్వమున నొరుల కార్యమ్ములకున్
వారని యలజడి పడియెడు
వారలు......

అగు నీ మహనీయులు పలికిన యీ ప్రేమోక్తులకంటెఁ జిన్నతనమునుండి యీనాటివరకు నే నొనరించిన దోసంగుల నుద్ఘాటించి తమకు సర్వదా శాసితవ్యనగు

నన్నుఁ బలురీతుల నీతుల శాసించి యుండిన నింతకు నెన్నో మడుంగు లానందించి యుండెడిదానను. మహాకవి చెప్పినట్లు మెచ్చునకై యిచ్చకములాడు తచ్చనగాండ్రు వేన వే లుందురు గాని హితము గోరి మతి జతనువడ జెప్పు హితులు గానరారు. అయినను వీరి పొగడ్తలయందు నక్షరాక్షరము వెంబడి గంభీరానుమేయస్వరూపమై యలరారుచున్న మహోపదేశనిబంధనమును మనసా గ్రహించి తలయొగ్గుచుంటిని.

చిన్నతనంబున పోపువేయుటకు మిరపకాయ లవసరమని యెఱుంగని మంద బుద్ధిని నేను. ఒక్క యక్కరమేని జదువనేర్వని యవిద్యావతిని. ఇట్టిదానిని నన్ను దమ ధర్మపత్నిగా స్వీకరించి విద్యాబుద్ధులు నేర్పింపను, బరమకరుణాసనాథు లైన య య్యాదిదంపతుల సేవాభాగ్యము నొంది ధన్యత గడింపను, గోసేవాద్యనేక సత్కార్యములందుఁ బాల్గొని తరింపను నా కవకాశము నొసంగి నన్నుఁ గంటికిఁ ఱెప్పగా గాచి రక్షించిన ప్రధాన పాత్రధారి నా భర్త బ్రహ్మశ్రీ పుచ్చా కోటయ్యగారికిఁ గృతజ్ఞతాభరవినత నై వినతిశతము లర్పించుచున్నాను. నేఁ బొనర్చిన సుకృత మేదియేని యున్న నది యా మహాభాగునిది; అందర్థాంశ మునకుమాత్రమే నే నధికారిణిని.

గురుజనుల పొగడ్తచే నుక్కిరి బిక్కిరియై పరితపించి యీ నాల్గు ముక్కలు వ్రాసికొనిన నా యవినయమును బాఠకమహాశయులు మన్నింతురుగాక!

బెజవాడ,
27—9—1942.

ఇట్లు సజ్జనవిధేయ,
పుచ్చా పోషిత కనకదుర్గాంబ.

శ్రీ

# పరమశివానందలీలలు




గ్రంథకర్త:

కేశవభొట్ల సుదర్శనవేణుగోపాలమూర్తి

# కృతిసమర్పణము

క॥ శ్రీకంఠ నాకుఁ గల్గిన
యీ కన్నియ నిత్తు నీకె, యీ వధిపుఁడవై
సాకఁగ నగు మా కెప్పుడుఁ
బ్రాకటముగ నిహముఁ బరము, భవ్యముగాఁగన్.

శ్రీ

# పరమశివానందలీలలు

## దేవతాప్రార్థనము



శ్రీవిఘ్నేశకుమారపాదముల సంఽసేవించి ప్రీతిం బరా
దేవిం దత్పతి సర్వతోముఖమహాఽదేవున్ మదిన్ జేర్చి కీ
ర్త్యావాసం బగునట్టి కావ్యరచనాఽవ్యాపారమం దెల్లెడన్
బ్రోవన్ భక్తితరంగడోలికలలోఁ ఽ బూజించి యూగించెదన్.

శా॥ వాణీపాణితలంబునం దెపుడు సంఽవాసంబునుం బొందు త
ద్వీణానాదరసప్రయుక్తమయి హృఽద్వీథిన్ దగం జొచ్చి య
క్షీణానందరసంబు గావ్యముల నిఽక్షేపించు వేదంబు ద
ద్వాణీనాథవచోవిధానముల సంఽప్రాప్తించుగా కిందులన్.

మ॥ కమలారమ్యకటాక్షవీక్షణముల ఽ న్గన్మాల విందంది, చో
ద్యము లొప్పారఁగ విశ్వపోషణసుకాఽర్యం బాస్థ సాధించు వి
ష్ణుమనోజ్ఞాకృతు లిందు నిల్చుచు శుభఽస్తోమంబుఁ జేకూర్చుచు
న్విమలంబై భువి కావ్యకన్య మెలఁగన్ ఽ వీక్షించి పోషించుతన్.

మ॥ గిరిజాసుస్మితచిహ్నితం బగుచు సంఽగీతానుకూలంబుగా
వరశబ్దధ్వనితాళసమ్మిళితమై ఽ వ్యాపించి కర్ణామృతం
బు రహింబారఁగ సాంధ్యరాగముల పెంఽపున్ జూచి యావేశసుం
దరమౌచు న్నటరాజతాండవము మఽత్కావ్యంబున న్నిల్చుతన్.

శ్రీ శ్రీ శ్రీ



# గురుప్రార్థన



ఉ॥ కేశవభొట్లవంశజుఁడు ఽ కీర్తివిహారుఁడు, తత్త్వశాస్త్రసం
కాశుఁడు, సత్త్వధాముఁ డురుఽగణ్యుఁడు మజ్జనకుండు దేశికుం
డాశల గెల్వఁగాఁదగు మఽహాచరణుం డనఘుండు, రక్షకుం
డీశుఁడు నా కటంచు మదిఽనెంచెద మ్రొక్కెద వేంకటేశ్వరుల్.

మ॥ భువి నాజన్మకుఁ గారణుండ వగుటల్ ఽ బుణ్యాత్మ! నా కుర్వియం
దవబుద్ధుల్ దొలఁగంగఁ బ్రాచ్యశుభవిఽద్యాబీజముల్ నాటి తీ
కవితాధారయు దానివల్లనెకదా ఽ కల్గెన్! బ్రసాదంబహో!
భువి నిన్నెంచుచు వేంకటేశ్వరగురూ! ఽ పూజింతు నశ్రాంతమున్.

మ॥ రసికాత్మప్రముఖుండ వీవు కవితాఽరాజ్యమ్ము నీసొమ్ము రా
జస మోహా! యితనిన్ వరించె ననఁగా ఽ సంసారమందుండి యిం
పెసలారంగను శిష్యసంతతిని నీ ఽ యేకైకమార్గంబునం
దొసఁగంజాలితి; నిన్నుఁ గొల్తు గురురాఽయుల్ రాజగోపాలునిన్.

శా॥ జోకొట్టంబడినట్లు మానసమునన్ ఽ సుప్తిన్ దమిం బడ్డ యీ
నాకైతల్ పయివెల్గ బోధనలఁ దా ఽ నవ్యంబుగాఁ జేసెఁ బో
ప్రాకారంబులు నేడు దాటఁగను దఽద్భవ్యుల్ గురుల్ భక్తిల
క్ష్మీకాంతాహ్వయుఁ గొల్తుఁ బింగళికులఽశ్రీమంతునిన్ మద్గురున్.

కం॥ గురువులు గల రెందఱొ నే, వరుసఁగ నవ్వారిఁ గొల్తు ఽ భయభక్తులతోన్
గురువులమించిన గురువగు, పరమాత్మునిగొల్తు సహజఽపాండితి నిడుటన్.

శ్రీ శ్రీ శ్రీ



# అవతారిక



కం॥ శ్రీకరమా నీ లీలల, నాకర్ణింపంగఁదగును నవతారిక సా
ఖ్యాకరమగు మీ కరుణన్, మా కీయఁగ దేవ! దేవి! మఱిమఱిఁగొల్తున్.

వ॥ అవధరింపవేఁడెద.

మ॥ వృషవైశాఖపు శుక్లపక్షవిదియన్ శేరాజువారంబునన్
విషకాలంబున కెంతొ పూర్వముననే వేసంగిలోఁ బ్రొద్దునన్
వృషభారూఢుని కంటినిప్డు యను నా గ్రీష్మంబునం దే నెదో
విషయం బొందు మనంబునం దలఁచి వేవేగంబ యేతెంచుచోన్.

మ॥ మును చండాలురవాఁడయంచు విబుధుల్ ముక్కుల్ వడిన్ మూసి గొ
బ్బున ఛీకొట్టుచు దాటిపోవునట నాఁపూర్వంపుచందంబులేఁ
గనరా కెంతయు శుభ్రమై తనరి నా కన్నుల్ గదున్ జోద్యమున్
గనెనోయంచు భ్రమింప సైకతములన్ గప్పంబడన్ గాంచితిన్.

తే॥ కాంచి యటనున్న పనివారిఁకడకుఁబోయి, యేమిచేయుదు రిట మిమ్ము నెవ్వరంపి
రనఁగ శరభయ్యగారు మమ్మంపినారు, దేవళంబును గట్టింపఁబోవుచుండ్రి.

చ॥ అన మనసింత సంతసము నందెను బిమ్మట దైవకార్యమున్
బనిఁగొని చేయువాఁడు శరభయ్య బలే యిది కావ్యరూపమున్
గొనఁదగు వృత్తమే నిపుడుఁ గూర్చుచునుంటినిగాదె మత్కృతం
బనఁబడి వెల్గుదైవనిలయాల ప్రతిష్ఠలరీతి భక్తిమైన్.

వ॥ ఇట్లనుకొనుచు మద్గృహంబున కేగ గృహాంగణంబున కెదురుగా నున్న చతుర్వేదుల నృసింహశాస్త్రిగారను విప్రవర్యుం డయాచితంబుగా నచటి కేతెంచ నబ్భూసురునితో మద్భావంబు నివేదింప నా బ్రాహ్మణోత్తముఁ డీవు కవివి, కవికిం దోచినభావంబు రిత్తపోవునే యితివృత్తం బబ్భగవంతునిదై యుండె నింక నీ యభిమతంబును భగవత్ప్రేరితంబ యని తోచుచున్నయది శరభార్యునకుం జెప్పుము, లేనినాఁడు మనస్సాక్షికి వ్యతిరిక్తంబుగా నడచినవాఁడ వగుదువు. ఇయ్యది మంచికాలంబు పొమ్ము పొమ్మని నన్నుం బ్రోత్సాహించె నంత దుర్గానివాసంబునకుం బోయి యా శరభయార్యుం జూడ నయ్యనఘుండు గార్యాంతరాసక్తచిత్తుండయ్యు సగౌరవంబుగా నుచితాసనం బొసంగి మదాగమనకారణశ్రవణకుతూహలాయత్తుం డగుటయు నేతత్కాలానుకూలంబుగా మద్విషయంబు గావ్యసంబంధం బని మాత్రము సూక్ష్మంబుగా నివేదించి మత్కృతి కృష్ణ

# గురుప్రార్థన



ఉ॥ కేశవభొట్లవంశజుఁడు కీర్తివిహారుఁడు, తత్త్వశాస్త్రసం
కాశుఁడు, సత్వధాముఁ డురుగణ్యుఁడు మజ్జనకుండు దేశికుం
డాశల గెల్వఁగాఁదగు మహాచరణుం డనఘుండు, రక్షకుం
డీశుఁడు నా కటంచు మదినెంచెద మ్రొక్కెద వేంకటేశ్వరున్.

మ॥ భువి నాజన్మకుఁ గారణుండ వగుటన్ బుణ్యాత్మ! నా కుర్వియం
దవబుద్ధుల్ దొలఁగంగఁ బ్రాచ్యశుభవిద్యాబీజముల్ నాటి తీ
కవితాధారయు దానివల్లనె కదా కల్గెన్! బ్రసాదంబహో!
భువి నిన్నెంచుచు వేంకటేశ్వరగురూ! పూజింతు నశ్రాంతమున్.

మ॥ రసికాత్మప్రముఖుండ వీవు కవితారాజ్యమ్ము నీసొమ్ము రా
జస మోహో! యితనిన్ వరించె ననఁగా సంసారమందుండి యిం
పెసలారంగను శిష్యసంతతిని నీ యేకైకమార్గంబునం
దొసఁగంజాలితి; నిన్నుఁగొల్తు గురురాయున్ రాజగోపాలునిన్.

శా॥ జోకొట్టంబడినట్లు మానసమునన్ సుప్తిన్ దమిం బడ్డ యీ
నాకైతల్ పయివెల్గ బోధనలఁ దా నవ్యంబుగాఁ జేసెఁ బో
ప్రాకారంబులు నేడు దాటఁగను దద్భవ్యున్ గురున్ భక్తి ల
క్ష్మీకాంతాహ్వయుఁ గొల్తుఁ బింగళికులశ్రీమంతునిన్ మద్గురున్.

కం॥ గురువులు గల రెందఱో నే, వరుసఁగ నవ్వారిఁ గొల్తు భయభక్తులతోన్
గురువులమించిన గురువగు, పరమాత్మునిఁగొల్తు సహజపాండితి నిడుటన్.

శ్రీ శ్రీ శ్రీ



# అవతారిక



కం॥ శ్రీకరమా నీ లీలల, నాకర్ణింపంగఁదగును ౹ నవతారిక సా
ఖ్యాకరమగు మీ కరుణన్, మా కీయఁగ దేవ! దేవి! ౹ మఱిమఱిగొల్తున్.

వ॥ అవధరింపవేడెద.

మ॥ వృషవైశాఖపు శుక్లపక్షవిదియన్ ౹ రేరాజువారంబునన్
విషకాలంబున కెంతొ పూర్వముననే ౹ వేసంగిలోఁ బొద్దునన్
వృషభారూఢుని కంటినిప్పు యను నా ౹ గ్రీష్మంబునం దే నెదో
విషయం బొండు మనంబునం దలఁచి వేవేగంబ యేతెంచుచోన్.

మ॥ మును చండాలురవాఁడయంచు విబుధుల్ ౹ ముక్కుల్ వడిన్ మూసి గొ
బ్బున ఛీకొట్టుచు దాటిపోవునట నాఁ పూర్వంపుచందంబులేఁ
గనరా కొంతయు శుభ్రమై తనరి నా ౹ కన్నుల్ గడున్ జోద్యమున్
గనెనోయంచు భ్రమింప సైకతములన్ ౹ గప్పంబడన్ గాంచితిన్.

తే॥ కాంచి యటనున్న పనివారిఁ గడకుఁబోయి, యేమిచేయుదు రిట మిమ్ము నెవ్వరంపి
రనఁగ శరభయ్యగారు మమ్మంపినారు, దేవళంబును గట్టింపఁబోవుచుండ్రి.

చ॥ అన మనసింత సంతసము ౹ నందెను బిమ్మట దైవకార్యమున్
బనిఁగొని చేయువాఁడు శరభయ్య బలే యిది కావ్యరూపమున్
గొనఁదగు వృత్తమే నిపుడుఁ ౹ గూర్చుచునుంటినిగాదె మత్కృతం
బనఁబడి వెల్గుదైవనిలయాల ప్రతిష్ఠలరీతి భక్తిమైన్.

వ॥ ఇట్లనుకొనుచు మద్గృహంబున కేగ గృహాంగణంబున కెదురుగా నున్న చతు
ర్వేదుల నృసింహశాస్త్రిగారను విప్రవర్యుం డయాచితంబుగా నచటి కేతెంచ
నబ్భూసురునితో మద్భావంబు నివేదింప నా బ్రాహ్మణోత్తముఁ డీవు కవివి,
కవికిం దోచినభావంబు రిత్తపోవునే యితివృత్తం బబ్భగవంతునిదై యుండె నింక
నీ యభిమతంబును భగవత్ప్రేరితంబ యని తోఁచుచున్నయది శరభార్యునకుం
జెప్పుము, లేనినాఁడు మనస్సాక్షికి వ్యతిరిక్తంబుగా నడచినవాఁడ వగుదువు.
ఇయ్యది మంచికాలంబు పొమ్ము పొమ్మని నన్నుం బ్రోత్సాహించె నంత దుర్గా
నివాసంబునకుం బోయి యా శరభయార్యుం జూడ నయ్యనఘుండు గార్యాంత
రాసక్తచిత్తుండయ్యు సగౌరవంబుగా నుచితాసనం బొసంగి మదాగమనకారణ
శ్రవణకుతూహలాయత్తుం డగుటయు నేతత్కాలానుకూలంబుగా మద్విష
యంబు గావ్యసంబంధం బని మాత్రము సూక్ష్మంబుగా నివేదించి మత్కృతకృష్ణ

భ్యుదయకావ్యంబుం జూడ నొసంగి వచ్చి నృసింహశాస్త్రిగారికి నివేదించిన యనంతరంబు.

ఉ॥ నాలుగురోజు లేగిన యనంతర మా శరభార్యుఁ డంపె రా
వీలగునో యటంచు నను నా బిల్వఁగ బాలుని నొంటివాని నా
కాలము సాంధ్యయొక్క పెనుగాళుపు నప్పుడె పోయి వాలుగా
గాలియు వీవ నంత శుభకాలమటం చెద నెంచి పోయితిన్.

వ॥ అంత నమ్మతిమంతుండగు శరభార్యుండు సగౌరవంబుగా బీఠం బొసంగి చేరికం గూర్చుండి విషయశ్రవణానుకూలమానసుండగుటయు.

ఉ॥ ఆ నరసింహశాస్త్రి కవు నా డచ్చటఁ జెప్పినరీతి యంతయున్
నే నటఁ బూనగుచ్చినటు నా నిక్కము దెల్పిన వించుఁ బిమ్మటన్
దానును జెప్పఁ దోఁచిన విశదంబున నద్దియు శాస్త్రిమాటచం
దానసె యుండె మా యుభయధారణ యొక్కటియయ్యె నంతటన్.

వ॥ సంతోషపూర్వకంబుగా వీరశరభార్యుం డంతయు నా జగజ్జనకులగు పరమేశ్వరీ పరమేశ్వరులే ప్రవర్తింపఁ జేతురు. ఆ పురాణదంపతుల లీలావిశేషంబున నే నొక్క సన్మిత్రుం గంటి. అయ్యనఘుండే నా భాగస్థుండగు కోటయార్యుండు ఏ విషయంబును నాతనితో నివేదింప నగు. మా యుభయులవై కనిపించు భోగ భాగ్యాది సర్వస్వములకుఁ గర్తృత్వ భోక్తృత్వాధికారు లా జననీజనకులే యై యున్నవారలు. కావున గావ్యకన్యం బరిగ్రహించుటకు మేము స్వతంత్రులము గాము. కాని మీకుం బొడమిన భావంబు భగవత్ప్రేరితంబు గానోపు, లేనిచో నింతదనుక హితభావంబులేని మీకు నేఁ డిట్టి హితభావంబు వొడమ రానేల! మీ మిత్రభావంబు మాకును సంతోషదాయకంబు. కాఁగాక! కావ్యకన్యం బరిగ్రహింప నర్హులమని మే మెన్నఁడును దలంపము. మీరచన పరమేశ్వరపరంబుగా నుండుట మా తలంపు. ఆ పరమేశ్వరుని లీలానాటకరంగంబున మేము పాత్రధారులము మాత్రమే యగుదుము. కావ్యం బారీతిని నుండనగును. అట్టి కావ్యంబు మీరు రచింపనెంచినచో నందులకు మా యభిమతంబు దెల్పుటకై యోచించు కొనుటకు గడువు రెండు మూడుదినంబు లని ప్రీతిపూర్వకంబుగా మద్గృహంబున కనిచి పుచ్చుటయు భగవంతునికే కావ్యం బంకితం బొసంగు నా యభిమతంబు ఫలవంతం బగుటయు నయ్యె ననంతరంబు బృహస్పతివాసరంబున బ్రాహ్మ ముహూర్తంబున నేను వర్తమానంబంది దుర్గానివాసంబునకుం బోవ శరభార్యుండు సంప్రీతుండై యిచ్చటి కొక్క బంధుపండితులు విచ్చేసియున్న వార లవ్వారి మీకుం జూపించెద రమ్మని గృహగర్భంబునకుం గొనిపోయి భూసురుం జూపునంత,

ఉ॥ భూసురకాంతిసంపద ప్రమోద మొనర్చుటఁ జూచి నేను నో
హో సుకృతాత్ముఁ డార్యుఁడు మహోత్తముఁడంచు నమస్కరింప శు
భాసిన మిచ్చి కొన్ని విషయంబుల నడ్గుచుఁ బ్రీతిపాత్రుఁగా
నీ సమయంబునందె గ్రహియించితి మిమ్మనె నమ్మహాత్ముఁడుర్.

ఉ॥ "నిండుమనంబు నవ్య నవనీతసమం"బగు విప్రులందు, భూ
మండలమందు నేఁ డిటుల మానస ముండుట వేడ్క; తమ్ము బ్ర
హ్మాండముగాఁ దలంచెద రహంబునఁ గొందరి కట్లుగాక ని
ట్లుండుట భూసురుం డిది మహోన్నతపుణ్యము దైవలీలయో.

ఆ॥ భమిడిపాటివారు పండితునింటి పేరములఁ డయ్యపార్యుఁ డా ఘనుండు
శమము దమము గల్గు శరభార్య మిత్రుండు, సముఁడు గోటయార్యసతికిఁ దండ్రి.

వ॥ అమ్మహానుభావుండు ప్రేమపురస్సరంబుగా రచనాసందర్భంబులఁ గొన్ని హితం బులం దెల్పి పిమ్మటఁ గృష్ణపక్ష ద్వితీయాదినంబున సుముహూర్తంబు నిశ్చయించె నంత నే గ్రామాంతరంబున కేగి యేతత్ప్రకారంబు విదియదినంబున దుర్గానివాసం బునకుం జనినంత సాయంతనంబు మంచికాలంబుగా నెన్నుకొనంబడియె. స్నానా నంతరంబున సాయంకాలంబున నుచితపీఠంబుల నాసీనులమైయున్నంత నయ్యపా ర్యుండు నన్నుం గావ్యాదిపద్యంబు నొ్నడువుమనియె, నప్పుడు ప్రథమాశ్వాస ప్రారంభంబున నిలిపిన యీ పద్దెంబు నొడివితి.

కం॥ శ్రీ పరమశివానందుఁడు, దాపయి సుగుణంబు శుభము ధనసంపదయుర్
రేపులుమాపులు నొసఁగెడు, నాపక కోటార్య శరభయార్యుల కెపుడుర్.

వ॥ అయ్యపార్యుం డీ పద్దంబునకుం జాల మోదంబందె. శరభార్యుండును జాలఁ బ్రియంబంది పరమశివానందలీలఁ బాత్రధారులలో నొకరగు శరభార్యపాత్రకుం బ్రాథమికదశావిశేషంబుల నొడువునంతలో ద్వితీయపాత్రధారియగు నా కోట యార్యుండును విచ్చేసె, నంత నయ్యనఘునకు శరభార్యుం డేతద్విషయం బంతయు నివేదించె నంత నా బుద్ధిమంతుండును బ్రీతుండై తల్లీలల రెండవ పాత్రి ధారి యుదంతంబునుం దెల్పె ననంతరంబు భోజనకాలం బగుటయు నక్కోటయా ర్యునిసతి పోషితకనకదుర్గాంబ.

ఉ॥ శ్రీమహిమంబుఁగల్గియును సేవకు లున్నను గేహినీస్థితిర్
నేమముమీఱ నల్పఁ గడు నేర్పగు వంటను సాధ్వి యామెయే
సామముతోడఁ జూత ఫలసంయుత దివ్యఘృతాప్తచోష్యలే
హ్యామృతభోజనం బిడె స్వహస్తముల నొ్నరించె వడ్డనల్.

వ॥ అనంతరంబు మందమారుతములకు సుఖంబందుచు నిష్టగోష్ఠిం గొంతసేపు గడపి నిదురించి యమ్మఱునాడు రేపకడ బంధుగృహంబునందు స్నానసంధ్యాదివిహిత కృత్యంబు లొనర్చికొని దుర్గానివాసంబునకుం బోవుచున్నంతలో నా శరభార్యుని ప్రియం బెంతయొకదా! అప్పుడే నా రాకకై వర్తమానంబుతోఁ బుత్తెంచు వార్తాహరుం డొక్కరుం డెదు రయ్యె నేనును వానితోఁ దుర్గానివాసంబునకుం బోయి శ్రీ పరమశివానందలీలం బాత్రధారులైన శ్రీ కోటార్యశరభార్యుల చరిత్రంబులను సాంగోపాంగంబుగా గ్రహియించుకొనుచుండ శరభార్యుండును జెప్పుచుండె నప్పుడు.

ఉ॥ ఎంతయదృష్టవంతుఁ డతఁ ‡ డేమని చెప్పుదుఁ జెప్పినంత సే
పంతయు దైవలీలగనె ‡ నమ్మహితుం డెడ నెంచెఁగాని తా
నింతయుఁ గర్తగాఁ దలఁపఁ ‡ డెన్నఁటికేనియు, గద్గదంబునన్
గొంతుకనిల్చెఁ గన్నులను ‡ గూరెను నిండుగ నందబాష్పముల్.

వ॥ ఓ దేవాధిదేవా! ఓ పరమేశ్వరా! హే పరమశివానందా! ఈ యానందబాష్పంబులును నీ రుద్ధకంఠంబును నీయందలి నిశ్చయభక్తిభావోద్రేకంబులకు నిదర్శనంబులుగావే! అహో! శరభార్యుం డింతటి సుకృతుండగునే! అమ్మహానుభావునకుం దోడు మహాసత్త్వసంపన్నుండగు కోటయార్యు నొసంగితివే! అట్టి యీ యిర్వురను నీ లీలావినోదంబులకుం బాత్రధారులుగా నొనర్చితివే! ఆ లీలాచరితంబు వ్రాయ నా కాజ్ఞాపించితివే.

ఉ॥ ఏల జనింప జేసితివొ ‡ యీ తలఁపుల్ హృదయంబునం దహో
శ్రీలలనామనోహర విశేష మదేదియొ లేకపోదు సు
శ్రీల మదీయకావ్య మతిశీఘ్రముగా వెలుగొంద సర్వదా
పాలనఁజేసి ప్రోవవె కృపాపరిపూరితదృష్టిమత్ప్రభూ!

వ॥ దేవా! సర్వము నీవకావే! శివుఁడ వైన నీవే! కేశవుఁడ వైన నీవే! శివకేశవుల కేమియు భేదంబు లేదను భావంబు చిత్తంబున సునిశ్చితం బగునటుల దేవీసహితుండవై నీ వీ సుదర్శనకవిహృదయంబున సర్వకాలంబును జల్లగా వసియింపఁ బరమేశ్వరా! నిన్నే పలుమారు వేడెద.

ఉ॥ ఈవె యెఱుంగుదయ్య! పరమేశ్వర! నా హృదయంబు సర్వదా
నీ విమలాంఘ్రిపద్మముల ‡ నిల్వఁగ వేడెద నింతయేల దే
వా వినిపించుకొమ్మిక శుభంబగు నీ చినికావ్యకన్యకున్
జీవిక నీవె కమ్మనుచుఁ జెప్పెద ‡ నిక్కము చంద్రశేఖరా!

వ॥ ఈ భక్తకవి జీవితరేఖల నీలీలావినోదంబులు ప్రతిష్ఠాసౌష్ఠవం బను గ్రంథంబున వినిపించుకొనుచున్నవాఁడు. ఆ కావ్యకన్యకను శ్రీ సీతారామరూపంబున నీవే పరిణయంబు గమ్ము, కృష్ణాభ్యుదయకావ్యంబునంద గోపాలరూపంబున నీవే కృతిం బొందితివి. తక్కునొడుల నెట్లు కృతి నొసంగవలయునో యానతిమ్ము, హేమహానుభావా! కృతిభర్తవు నీవు, కృతికర్తృత్వము నా కొసంగితివి. ఇతివృత్తంబు నీలీలాచరితంబు, పాత్రధారులు నీకృపాపాంగభాగ్యము నడసిన భక్తవరులు; వారలకును భక్తపరమాణువు నగు నాకును సమస్త శుభంబులంగూర్చి కావ్యంబు శుభారంభితంబై శుభయుక్తంబై సుబోధంబై సర్వజనాదరణీయంబై శుభంబులతో జిరస్థాయిగా వెలుంగఁజేయ నీదేభారము. సర్వభారంబులు నీకే వదలి కథాప్రారంభంబునకుం గడంగెద.



శ్రీ

# పరమశివానందలీలలు

## ప్రథమాశ్వాసము



పరమశివానందుఁడు
దాపయి సుగుణంబు శుభము ధనసంపదయున్
రేపులు మాపులు నొసఁగెడు
నాపక కోటార్యశరభయార్యుల కెపుడున్.

వ॥ శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును, సమస్తచరాచర జీవరాసులకును శాస్తయునై జగన్నాటకసూత్రధారుం డగు శ్రీ పరమశివానంద లీలాచరితంబు నకుం గథాక్రమం బెట్టిదనిన

ఉ॥ శ్రీలఁ జెలంగు మా తెలుఁగుసీమకు గర్భము చంద్రవంశ భూ
పాలుఁడు పార్థుఁ డా నరుఁడు భక్తితపంబులు పండ వీరుఁడై
ఫాలవిలోచనుం గెలిచి పాశుపతంబును గొన్న పౌరుషా
స్ఫాలన భూమి యా విజయవాడ వెలుంగు జగద్ధితంబుగాన్.

ఉ॥ భక్తిని భారమెల్ల భగవంతుని దే యయినట్లు భూరిదో
శ్శక్తిని బౌరుషేయ మన సర్వముఁ దోఁచగఁ జేయుభంగిఁ ద
ద్భక్తియుఁ బౌరుషంబు జతబారిన పున్నెపుమేటిభూమిగా
రక్తిని మల్లికార్జునుఁడు రాజిలు నప్పురి హేమదుర్గతోన్.

ఉ॥ ఎంతటి భక్తవత్సలుఁడొ! యింద్రతనూజుని సేరఁ బట్టె మున్
సంతత మీ ప్రపంచమునఁ జల్లఁగ వెల్గెడునట్లు చేసి క
ల్పాంతముఁ బార్థపౌరుషము నాకస మందఁగ నిల్పెనంత మా
కింతయుదంత మిచ్చె పరమేశుఁడు లీలలవ్రాయ నిచ్చుచున్.

క॥ శ్రీ దుర్గామల్లేశ్వరు, లాదరమున నాటనుండి యాంధ్రుల నిధులై
మోదము భక్తుల కొసఁగెడు, స్వాదువుగను నింద్రకీలసదనమునందున్.

ఉ॥ ఆగిరిపాదసన్నిధి దిగంతములందలి పుణ్యసంపదల్
దాఁ గొనివచ్చి కృష్ణనిజతత్త్వమహత్త్వముతోడ నిల్పఁగాఁ

దోఁగుచు స్వాగతమ్మొసఁగి ధూర్తులుగూడను సత్త్వభావులై
యా గిరికన్య శంకరు నహర్నిశలున్ భజియింత్రు భక్తిమై.

వ॥ అంతియకాక యా కృష్ణాస్రవంతి,

మ॥ తన పూతాంబువు లాత్మమండలమునన్ దారుల్ గొనం బ్రీతమై
తనపుణ్యంబులవారి వెం టనుపుచున్ ధాన్యస్వరూపంబునన్
మనసాప్పారఁగనిచ్చు బిడ్డలకుఁ దా మాన్యంబులన్ వార లీ
శునకుం బ్రాలను నోగిరంబిడ సదా శోభించు సంతృప్తితోన్.

ఉ॥ భక్తిని సంధ్యలన్ జనులు భావసుమమ్ముల మాలగ్రుచ్చి యా
సక్తి నొసంగఁ బొంగి శుభసౌఖ్యము లిచ్చి యకార్యభారముల్
నక్తములందుఁ బట్టణమునన్ దరిఁ జేరఁగనీక తత్ప్రజల్
రక్తిఁ జెలంగఁజాల ననురక్తినిఁ బ్రోచును దుర్గ సర్వదా!

ఉ॥ పూతమనస్సుపాత్రిలను బుణ్యజలంబులఁ బౌరు లా భవున్
స్నాతునిఁ జేయఁగాఁ బవలు సంతసమంది యతండు బాపపున్
భీతి తొలంగి సంపదల వృద్ధినిబొంది పరస్పరమ్ము సం
ప్రీతిఁ బ్రజల్ మెలంగఁగ వివేకమొసంగి సతంబు నోమెడిన్.

వ॥ ఇవ్విధంబున శ్రీదుర్గామల్లేశ్వరు లవ్విజయవాడ రక్షించుచు శుభంబులొసంగుచుండ,

శా॥ ప్రాతస్సంధ్య ధునీజలంబులవడిన్ బాపంబు వోనాడుచున్
భూతేశున్ స్వభిషిక్తుఁజేసికొనుచున్ బుణ్యాన మధ్యాహ్నమున్
మాతన్ బూజలుసేసి సంపదలతో మర్యాద సాయంతనం
బా తీరస్థులు సంతసిల్లుదురు తా మాస్తిక్యభావంబులన్.

వ॥ అదెట్టు లనిన,

ఉ॥ వేదము శాస్త్రముల్ చదివి వేల్చెడివారలు గొంతమంది యా
వేదము శాస్త్రముల్ దెలిసి వేతృతఁ గొందఱు పంచమంబిదే
వేదము భారతం బనుచు వేడ్కఁ బఠించుచుఁ గొంద ఱిట్టు లా
వేదమె యేదొరూపమున విద్యగఁ గొందరు విప్రు లప్పురిన్.

మ॥ ద్విజభక్తిన్ గడు నారితేరి ఘనులై తేజంబు పెంపొందఁగా
ద్విజధర్మంబున వెల్గు నిష్ఠపరులై ధీరుల్ మహోదారులై
సుజనత్వం బది వృద్ధినొంద విధి సత్సూక్తుల్ విచారించి య
ద్విజరూపాంతరఁ గన్యకాంబ నతిభక్తిన్ గొల్తు రవ్వైశ్యులున్.

ఉ॥ బొబ్బిలివారి పౌరుషముఁ జూపుదురో! యదియేల మాకటం
చిబ్బడి యాడురో తెలియ నేర్పుదురో! యాంధ్రులపూర్వరక్తమే
యుబ్బుచునుండి మాటి కని నోర్చెడి శక్తియు నున్న భక్తితో
నబ్బ! యనంగ నుందురట నన్నగరింగల తక్కువారలున్.

ఉ॥ తీరికలేక వారిపని తీరులనున్నను ధర్మమన్నచో
బేరము లాపియైనను గుబేరులె యైనను వర్తకుల్ సదా
వారక విందుఁ జేతురు, శుభంబగువారికి దాన నెందు సం
బారము నిండుకుండయగు వచ్చినఁ బోయినఁ గర్వ ముండినన్.

వ॥ ఇట్లాస్తిక్యభావంబుల నలరారు పౌరబృందసంశోభితంబగు నప్పురంబు.

చ॥ సురపురి మించునో యనిన చోద్యమ దేలను జంద్రశేఖరున్
దరిసెనముం బొనర్పఁజని తద్దయు భక్తిని దేవదానవుల్
వరుసఁగ వారి సంపదలు భవ్యవిధిం గొని తెచ్చి వేగఁ ద
ద్గిరిని వసింప నెంతు రట దృశ్యము కేవల మబ్రమైచనన్.

ఉ॥ కాంచనచేలుఁడున్ జెలియఁ గాంచఁగ రాఁడొకో వచ్చునప్పు తాఁ
గొంచెపు రీతి వచ్చునొకో కూరిమి సోదరుఁ జందురుఁ జూడఁగా
నెంచదొ లక్ష్మి తా మనుగడించరె ధాతయు వాణి యందుచే
మించదె సర్వలోకముల మేదిని నున్నను నప్పురంబెటుల్.

వ॥ అంతియె కాక.

ఉ॥ "ఆపురిఁ బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి" యం
చే పుడమీసురుండో వచియించెను, నిక్కమొ! కాదొ! కాని యా
హా! పసఁబాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తు లెం
దీపురిఁ బార్వతీరమణి కిందుధరేశు ప్రయోజనార్థమై.

వ॥ అప్పరమేశ్వరీ పరమేశ్వరు లాగిరికందరంబున సంసరణంబున నుండ.

ఉ॥ ఆ గిరికందరంబున విహంగమరావము కృష్ణతీరమం
దూగెడి కాశనిస్వనము లోమ్మనురీతిఁ బ్రతిధ్వనింపఁగా
వాగధినాథుఁడున్ శ్రుతులఁ బల్కుచునుండెడి సామగానమై
సాగుచుఁ జంద్రమౌళి కట సంతసమున్ గడుఁగూర్చుచుండెడిన్.

వ॥ మఱియు.

శా॥ ధ్యేయుండైన మహేశు నాలయమునన్ - దివ్యంబుగా మ్రోయు ఘం
టా యోగాంకృతి దుష్టమానసములన్ - టాంటాయ్మనన్ మ్రోగుచున్
గాయమ్మున్ ఘనపాపభీతి వడిగాఁ - గావించు విజ్ఞానికిన్
సాయంబిచ్చును నాదరూపఘనునిన్ - సాధించి చేపట్టగన్.

శా॥ ఘాంకారంబులు ఘంటికారవములున్ - బాలేందుమౌళీశ్వరున్
ఓంకారంబుల స్తోత్రముల్ సలుపఁగా - నోహో సరుండే ధను
ష్టాంకారం బొనరించుచుండె నొక వేసటన్ బోడు తథ్య మ్మిదే
ఢంకా కొట్టెదమంచు బాలు రట నాడెదన్ వింతసంధిల్లెడిన్.

వ॥ ఈరీతి నున్నయా పట్టణంబున.

ఉ॥ కేంద్రము వర్తకంబునకుఁ - గృష్ణ యొసంగును నింద్రకీలమం
దింద్రతనూజు పుణ్యమున - నీశుడు వృద్ధినిఁ జేయునర్థ మ
దీంద్రునిపుత్రి సర్వశుభ - మిచ్చుచుఁ బ్రోచును దాన నెల్లరున్
సాంద్రయశంబు సంపదలసారముతోఁ బురి నుండు చక్కఁగా.

వ॥ అట్టి పురమందు.

ఉ॥ చక్కని వీథులం దిసుకఁజల్లిన రాలదు రాకపోకరా
పెక్కువ కొండలెక్క మది - కెక్కెడి దృశ్యము చుట్టుకొండలే
మక్కువఁగొల్పు రెల్లున సుమమ్ములు గృష్ణను స్వచ్ఛసైకతం
బక్కడ తళ్కుతళ్కుమని - యక్కజముం బురికొల్పు చుండుగా.

తే॥ ప్రకృతిసౌందర్యనతి కింతప్రాణధనము, భూమిపురవర ఘనశిరోభూషణమ్ము
కేంద్రసముదాయకూటస్థకీలకమ్ము, విమలధుని గల్గువాడ యవ్విజయువాడ.

వ॥ కేంద్రరాజ్ఞీపదంబున నలరారు నవ్విజయవాటిక వణిగ్వ్రతంసానుకూలంబుగా ధూమశకటకేంద్రంబై తిప్పలెక్కు కొండలం బురుడించుచుం గొన్నియును బర్వెత్తు తాచుపాములవలె గొన్నియును బుస్సులిడుచు నల్లిబిల్లిగా నల్లుకొన్న నయోమార్గంబుల నమిత దుతగమనంబు లొనర్చుచు జనంబులను వస్తుసముదాయంబులను జేరవైచుచుఁ బోవు ధూమశకటంబులచే నొప్పారు నంతియె కాక.

ఉ॥ పున్నెము లానగట్టిరనఁ - బూతజలంబుల నానకట్టతో
నిన్నరనాథు లాపి గమిసయింపఁగఁజేసిరి వారిఁ గాల్వలన్
గన్నమహాద్భుతంబగుచు - కాదికఁ గాల్వల వర్తకాళి సం
పన్నులు వారి యానమునఁ - బన్నుదు రబ్రము దారుపాత్రలన్.

వ॥ ఇట్టి వర్తకోద్యమంబున,

తే॥ నాల్గుజాతులవార లున్నారుకాని, వృత్తియందున వర్తకప్రవృత్తి యగుట
సఖ్యమొప్పంగఁ గొట్లలోనసరసయందె, సోదరులభాతిఁజరియింతు రిచ్చోద్యమౌర.

వ॥ శ్రీ పరమేశ్వరలీలావినోదంబుల నీరీతి వృత్తిసోదరత్వం బూని పాత్రధారులై చరియించు నప్పురీనాటకరంగంబున.

ఉ॥ ఏదరినుండియో దరికి నేగినముత్తెపు చిప్పలట్లు తా
మాదరువందఁగా శరభయార్యుఁడు గోటయనామధేయుఁ డా
మోదముతోడఁ దన్నగరమున్ జొరవచ్చిన పాత్రధారు లా
హ్లాదకరంబు లావరగుణాఢ్యులగాథలు శైవలీలలౌ.

వ॥ ఆ మూర్తుల వంశాద్యుదంతంబులం బేర్కొందు నదెట్లులనిన నందుఁ బ్రథమమూర్తియైన కోటయార్యుండు గౌతమసగోత్రాంచితంబై పేర్వడ్డ పుచ్చాన్వయుండు, కృష్ణామండలాంతర్గతంబగు శృంగారపు పాడనుగ్రామంబు నివాసంబు, శ్రీహనుమాయమ కుమారస్వాముల గర్భశుక్తి ముక్తాఫలంబు. ఇమ్మతిమంతునకుం బితృవ్యులు మువ్వురు. అవ్వారలు గురవయ నృసింహము బైరాగి వెంకటసుబ్బయాభిధానులను గీర్తిమంతులు పితామహుండు పరదేశార్యుండు వేంకటసుబ్బాఖ్యుండు జ్యేష్ఠసోదరుండు. అంతియగాక నీమహానుభావుండు లక్ష్మాంబా దుర్గాంబా అరుణాచలాంబా వెంకటసుబ్బమాంబా, వెంకటసుబ్బమాంబా సత్యమాంబాభిధానంబుల వెల్గు సోదరీమణులమధ్య జనకులసంతానంబున నల్లారు ముద్దుగాఁ బెరిగి వన్నెవెట్టుచుండె ననంతరంబు.

ఉ॥ తొలుతఁగ వేడ్కతోఁ గనకదుర్గమ యన్ సతి నాడెఁ బెండ్లి యా
లలన గతించె మేదిని సులక్షణధామ యనంగఁ బేరుతో
విలసిలి; పిమ్మటన్ బరుసవేదిని బోషితశాప్యదుర్గ యన్
గలికిని సాధ్విఁ దాఁ గడు సుఖంబుగఁ జెందె వివాహమందునన్.

వ॥ కోటయార్యుం డీరీతిఁ బండితగణ్యంబగు నాంధ్రబ్రాహ్మణ వెలనాటి వైదిక కుటుంబంబునందు గౌరవపాత్రుండై పరమేశ్వరలీలానాటకరంగంబునకుం దదనుగ్రహంబంది పాత్రధారుం డగుటయు నటఁగర్తపురీమండలాంతర్గతంబగు బేతపూడి యనుగ్రామంబున శ్రీవత్సగోత్రాంకితంబై విలసిల్లు బేతపూడివంశంబునకు వన్నెవెట్టుచు, వికృతిసంవత్సర భాద్రపద శుక్ల తృతీయాంగారకవారంబున హస్తానక్షత్రయుక్త మకరలగ్నంబున శ్రీ సుబ్బారాయ పిచ్చమాంబా గర్భంబుల శ్రీ తిరువళ్లూరి వీరరాఘవస్వామివారి వరప్రసాద జనితుండై పితామహపితృవ్య

నామాంకితంబుగా వీరశరభాభిధేయంబున, నార్యగౌరవనీయంబగు నొక్క యాంధ్రశైవనియోగి బ్రాహ్మణకుటుంబాలంకారుండై వ్యవహరింపఁబడు చుండు. ఈ ధీమంతునకు బితృవ్యు లిద్దరు. వారలు శరభయనాగభూషణ నామంబులఁ బరగువారు. అందు జ్యేష్ఠపితృవ్యుండగు శరభయ పంచాబ్ద వయస్కుం డైనంతఁ బరమపదంబు నొందె. ఇంక నాగభూషణంబు కుటుంబ వ్యవహారంబులు సక్కం బెట్టుచుండు, నౌదార్యుండు స్వసంతానంబును సోదర సంతానంబును సమానానురాగంబునం జూచు మహనీయుండు. అంతియేకాక వీరశరభార్యునకు విద్యాబుద్ధులు సెప్పించిన గురుసమానుండు వీరశరభార్యుని తండ్రి సుబ్బరాయుండు దన తండ్రియగు వీరయార్యునివలె సునిశ్చయాత్ముండై నిరంతరమ్ము భవాభిషేకంబునం గాలంబుఁ గడుపువాడు. ఇయ్యనఘునకు వీర శరభార్యుండుగాక నింకిద్దరు పుత్రులుగలరు. వారలు వీరరాఘవస్వామి నామాంకి తుండగు వీరరాఘవ, వీరయ లను సోదరులు. అవ్వారలకు నాగాంబ, శరభాంబ, సుబ్బాంబయను సోదరీమణులు ముగ్గురు గలరు. వారితో వీరశరభార్యుండు గుటుంబాభరణుండై రాజధానీకేంద్రం బగు చెన్నపురిం దండ్రి యుద్యోగం బొనర్ప సంవత్సరచతుష్టంబువఱకు నుండి యనంతరంబు స్వగ్రామంబున వంశక్రమాగతగురుండగు కస్తూరి మార్తాండనందనుం డగు చలపతిరాయ గురు సాన్నిధ్యంబునం గొంతకాలంబును, రేపల్లె మత్స్యపుర, గర్తపురంబుల మఱి కొంతకాలంబును విద్యాభ్యాసం బొనర్చి పిమ్మట.

చ॥ ములుగుకులాబ్ధిరామ గుణపుష్పసుదామ కులాంగనాతపో
బలసుకృతాభిరామ శుభసారదధామ కృపాంతరంగభూ
విలసితధర్మసీమ సతి ♦ వియ్యమనామఁ బరిగ్రహించెఁ దా
వెలయ గృహస్థధర్మమున ♦ వేడుక నాశరభాభిధానుఁడున్.

వ॥ ఇట్లు స్వచ్ఛతరంబైన కుటుంబచరిత్రంగల శరభార్యుండు కోటయార్యునిరీతిఁ బరమశివానందలీలా నాటకరంగంబైన విజయవాటికం బాత్రధారుం డగుటకుం బరమేశ్వరకటాక్షంబందె నంత.

ఉ॥ ఆటవికంబు నామలక ♦ మంబుధిలో లవణంబు నూర జం
జాటము సల్పుచుండ్ రుచులఁ ♦ జాటవె? యవ్విధి సద్గుణంబులన్
బాటిలు గోటయార్యు నురుభక్తునిఁ దచ్ఛరభార్యుఁ జక్కనౌ
చాటల నుంచెఁగా శివుఁడు ♦ పాత్రలఁ జేయుచు లీలఁ జాటఁగన్.

చ॥ ఉసిరిక యుప్పునుం గలసి ♦ యొప్పుగ మాగిన దోషహారతన్
మెసవిన వారి రోగముల ♦ మేదినిఁ గన్పడనీక సౌఖ్యమే

యొసఁగెడు నట్టు లొండొరులు కొండొనఁ జేరుట భవ్యులౌచు నా
పసఁ దమ యాశ్రితాన్వయుల కెల్లఁ భవ్యులుగా నొనరింతురి లీలలన్.

ఉ॥ స్థానబలంబు వీడి పెఱతావుల దానిబలంబు నంది య
ద్దానను గారవంబొదవకుండుట దొరంగక భక్తి నిష్ఠలన్
బూనుచు సంపదన్ గనిరి కొప్పో శరభార్యుఁడు గోటయార్యుఁ డీ
శానుకృపాపరీతసరసత్వ మదెంతయుఁ జేయనోపదే!

వ॥ ఇంకమును దెవ్విధంబున నీశ్వరుండు శరభయ కోటయ పాత్రధారుల నాత్మలీలా
నాటకరంగంబునం బ్రవర్తింపంజేసి సుకృతపాత్రులం గావించె ముందు కథా
విశేషంబులం గ్రహియింతురుగాక!

ఇంద్రవజ్రవృత్తము

సూర్యుండు జంద్రుండు విశుద్ధ కీర్తిన్
బర్యంతమున్ వంశ శుభంబు లీయన్
గార్యాల నీపాత్ర లిఁకన్ వెలుంగన్
ధైర్యంబు నీశుండు సతంబు నిచ్చున్.

గద్య

ఇయ్యది శ్రీ భారద్వాజసగోత్ర మంగమాంబా వేంకటప్పార్య పుత్రాంజనేయ
వరప్రసాదలబ్ధకీర్తి కేశవభొట్ల సుదర్శన వేణుగోపాల మూర్తి ప్రణీత
శ్రీ పరమశివానందలీలలందుఁ బ్రథమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

# పరమశివానందలీలలు

## ద్వితీయాశ్వాసము

క॥ కోటయ శరభయ లతి ధీ, పాటవమున జంట నుండి వర్తకసరణిన్
దీటుగ వెలుఁగుచు భక్తిన్, జాటఁగఁ దన లీల శివుఁడు సంపద లిడెడున్

వ॥ అనంతరం బప్పరమేశ్వరుండు దన లీలాకథావిధానంబునఁ గోటార్య వీరశర
భార్యపాత్రుల నెట్లు పోషించె నన.

శా॥ అద్దేపల్లికులాబ్ధిసోముఁ డనఘుం డాగర్భలక్ష్మీయుతుం
డుద్దామప్రతిభాకరుండు ప్రమనుం డుత్కృష్టుఁ డర్థిప్రజా
పోద్దండామరభూరుహుండు సుజనప్రోక్తప్రమాణైకల
క్ష్యోద్దేశ్యుండను వెంకటప్పయ ఘనుం డొప్పారుచుం డప్పురిన్.

ఉ॥ వైశ్యకులావతంసుఁ డురుభక్తిని నీశుకటాక్షసంపదల్
వశ్యముఁ జేసికొన్న గుణవంతుఁడు సత్రము దేవళంపుటా
వశ్యకర్తన్ గ్రహించి పరిపాలనఁ జేయు ఘనుండు నబ్రమా
దృశ్యము గల్గ నుత్సవము దేవుని కెప్డు నొనర్చు ధన్యుఁడున్.

ఉ॥ మాటికి భక్తితంత్రులనుమానములేకయె మానసాంగులన్
మీటి శివప్రతిష్ఠమును మించి గవర్నరుపేటలోన న
వ్వీటను జేసె నంత నట విష్ణుని నిల్పెను బాతయూరిలోఁ
జాటవె రెండు నీతనికిఁ జాలిన భక్తులు లేరటంచటన్.

క॥ అప్పన వేంకట కృష్ణయ, నప్పనమునఁ గూడె వేంకటప్పయ భక్తుం
డప్పురి నప్పరశివుఁ బై, జెప్పిన యటు నిల్పియున్న శ్రీకరవిధిలోన్.

ఉ॥ సంతతమోదమానసుఁడు సాహసుఁ డాశ్రితవత్సలుండు నా
గంతుకవిష్ణుపూజనుఁడు కారణకార్యవివేచనుండు గో
రంతయు గర్వమే మెఱుఁగనట్టి వణిగ్ధనుఁ డీతఁ డంచటన్
జింతలు వోవ నాకరికిఁ జేరుదురా ఘను చెంత కెల్లరున్.

వ॥ ఇవ్విధంబున నాకరికిం జేరినవారియందు.

ఉ॥ చిక్కిన ముళ్లపూడి కులశేఖరవేంకటసుబ్బయ వేంకటప్పయర్
లెక్కవిధంబులం దనిపి పెద్దగుమాస్తపదంబు నందె నా
లెక్కలమేటిచెంత నొక లేఖకుఁగా ఘనుఁ గోటయార్యుఁ బెం
పెక్కఁగ నిల్పె నీశ్వరియు నీశుఁడు లీలలఁ బాత్రిఁజేయుచున్.

ఉ॥ ఆ పరమేశుచర్యల మహాత్మ్య మదెంతయొ కోటయార్యునిన్
దాపునఁ జేర్చఁగానె ధనధాన్యపరంపరవృద్ధియాటచే
నేపుగ వర్తకంబును విశృంఖలరీతిఁ బెరింగె నంతఁ దా
మాపురి వైశ్యబృందము లహా యని మెచ్చిరి వేంకటప్పయన్.

ఉ॥ ఆవిధిఁ గొన్నినాళ్లరిగిన సంతనె స్వర్గనివాసమంద భూ
దేవుఁడు ముళ్లపూడి కులనాథుఁడు నేరుటఁ గోటయార్యుఁ డే
యావలఁ బెద్దయయ్యె శివునాజ్ఞయు నట్లగుఁగాక యున్నచోఁ
గేవలమాయు వంతటనె క్రీడ్పడు వృద్ధుఁడె సుబ్బయార్యుఁడున్.

ఉ॥ ఆమహితుం గృతజ్ఞత సహర్నిశమున్ దలపోసి కోటయా
ర్యామలచిత్తుఁ డాపదవి కవ్విధి న్యాయముఁ గల్గజేయఁగన్
సామిరుణంబు దీరునని శాంతి నెఱుంగని పాటుఁ జేయుచున్
సామముతోడ సర్వమును సాధనఁజేయు మహేశు నెంచుచున్.

చ॥ ఇనశశివహ్నినేత్రుకృప నెప్పటికప్పుడు వర్తకంబునన్
ఘనత దిగంతమై పెరిఁగె గావునఁ గోటయఁ దప్పనేరినిన్
వినఁ డల వేంకటప్పయ సువృత్తము గల్గుట, వత్సలత్వమం
దున నతఁడున్ గృతజ్ఞతను దూగును గోటయతోఁ సమంబుగన్.

తే॥ కోటయార్యుండె సర్వంబుఁ గూర్చుచుండ, స్వామి తీరిక భారతశ్రవణమం
అందివచ్చినఁ బ్రీతినిధి నరసికొనుట, తెలియనెంతొ భాగ్యంబుగాదె! జగ

చ॥ అతులితభక్తి చిత్తమునఁ హత్తఁగ నప్పయ యెప్పు డాత్మ సం
గతులను నీతిబోధయుతగాథల వించుఁ బురాణగోష్ఠి భా
రతకథయందు సల్పునది రమ్యతఁ జూరులుఁ బెండెలందు వ్యా
పితమయి యెల్లవారికిని బ్రీతిని గూర్చును మారుమ్రోగుచున్.

తే॥ మంచిగంధపుఁ జెట్టదేమ్రానికైన, దివ్యగంధంబుఁ గూర్చఁగాదె కనంగ
నప్పయాఖ్యుని యాశ్రయంబలతియాన్నె, కూర్చెధర్మాభిరతి నెంతొ కోటయకును

ఉ॥ కోటయ మేటి యంచచటి కోవిదులందునఁ బేరుఁ గాంచి యా
ర్భాటము లేక శాంతముగ భవ్యవిధిన్ యజమాని కష్టపు మో
మోటమినూని లాభములె ముఖ్యముగా గణియించి యేమియున్
జాటులులేక సత్యముగ శర్వునియాజ్ఞ గ్రహించె జీతముల్.

ఉ॥ ఈ కలిలో ధనంబెగద హేతువు దేనికి నందుఁ బుణ్యమున్
జేకొన దాన మొక్కటియె చేయుము చేయుము చేయుమం చహో
వాకొను శాస్త్రముల్ వినమె వానిని గోటయ సేయఁ దోడుగాఁ
దా కరుణామయుం డొసఁగె ధార్మికు నా శరభాభిధానునిన్.

తే॥ యదుకులోత్తంసుఁ డా పాండవాగ్రజునకు,నప్పనాన్వయుఁ డల వేంకటప్పయకును
బేతపూడికులాబ్ధి సంభూతసోముఁ, డౌర కోటయకును సూటినాప్తు లైరి.

ఉ॥ ఆ శరభార్యుఁడున్ జదువు లందెడి వీలికఁ బిన్నతండ్రి దా
పేశలమైన పెత్తనము వేరుపడంగనె తీరెఁ దండ్రి కే
కోశమునందు ఘ్యాణమునఁ గూఁమి లేమి గృషిం బ్రసక్తి వి
ద్యాశనుగోసె దాన నతఁ డాత్మను గ్రుంగె నదొక్కతీరునన్.

ఉ॥ చింతయొ కాదొ కాని యతిశీఘ్రముగాఁ బదునైదు నేండ్లకే
వింతగ నిల్లు వీడి కడువేగమ వచ్చి యనంతరంబు సా
మంతునిభంగి నిబ్బరము మన్నుచుఁ దా బెజవాడ దిక్కుకున్
బంతముఁ బూనుచున్ జనియెఁ బౌరుషమో యది దైవికంబొకో.

ఉ॥ కొత్తగ నన్యదేశమునఁ గూరిమి బంధులులేక యెందు కా
యత్తముగాని రిక్తవిధి యందున నుండుట దుర్భరం బహో
అత్తటి నీశ్వరుం డతని నత్తరువర్తకులందుఁ బెద్దయౌ
పెత్తనగాని యొద్ద కనిపెన్ దగ నెంతొ కృపాక్తచిత్తుఁడై.

చ॥ అతఁ డొక శూద్రుఁడై పరగునంతియకాదు సతంబుఁ గామితా
ర్థతపనమందె కాలమును ధన్యుఁడనంచును బుచ్చువాఁ డికే
వితమున బాపనిన్ దరికిఁ బ్రీతిగఁ జేర్చెనో! యెంచనేల తా
నతనిని నాగభూషణుఁడె యా శరభార్యున కిచ్చె లీలలన్.

క॥ కే. భాష్యం నాయుఁడటం,చా భవ్యుఁడు పిలువఁబడుచు నతిచిత్రంబౌ
శ్రీభరితాత్ముండై నిర,తాభవ సేవలను మెలగు నంతటినుండిన్.

చ॥ అతఁ డికఁ గొప్పగా మెలఁగె నంతటనుండియు వేరె యేల నా
వితమునఁ బారివచ్చి తగు వృత్తియె లేకఁ గలంగువానికిన్

బ్రతుకు నొసంగ యత్నములు వారకఁ జేయుచు నంతలోనఁ దా
మెతుకుల డబ్బుకై కుదువ మిన్నకయుండె శివాజ్ఞ యేమొకో.

చ॥ పరుఁ డనియెంచఁబోఁడు గరువం బెద నెంచఁ డహంబుతోడుతన్
విరసముఁజూపఁ డాతనికి వెక్కసమందఁడు పీడయంచు వే
గిరపడి పొమ్మనండు మదిఁ గిన్కను బూనఁ డెఱుంగకుండినన్
సరసత సానుభూతిని నొసంగును నెంతొ దయార్ద్రచిత్తుఁడై.

చ॥ అరమరలేక బిడ్డవలె నన్నిటఁ జూచుచు నిల్లొసంగి సం
బరమున నెల్ల వేళల శుభంబును గూర్చును బూర్వవాసనా
భరితముగాని యిప్పటి భవంబునఁ గల్గిన స్నేహమానె నీ
శ్వరుకృప వచ్చెఁగాక మఱి సాధన నీకలి నిట్లు కూడునే!

వ॥ ఆభావ్యంనాయుఁ డీవిధంబున వీరశరభార్యుని యభ్యున్నతికై ప్రయత్నించు సందర్భంబున,

మ॥ కృషిం యెంతేని యొనర్చినం గలసి రాకింకన్ విశేషంబుగా
విషమావస్థ బెరింగి తచ్ఛరభు నావేగంబునన్ ముంచుఁ ద
ద్విషయాసక్తిని మానిపోవు తలపావేశించె నాలోన నా
విషభుగ్గీలలఁ బాత్రిగన్పడుటకై వేళాయె రంగంబునన్.

క॥ పేరూరు విశ్వనాథము, వారను మదరాసువారు వ్యాపారమునన్
వే రుపశాఖం జేర్చుచు, బేరము సాగించుచుండ్రి బెజవాడపురిన్.

క॥ చేరినశాఖను వారల, పేరున నట నోరుగంటి వేంకటరత్నో
దారుండే జంటగుచున్, గూరిమిఁ బాలించుచుండెఁ గొదువలు లేకన్.

చ॥ అరయ మనఃప్రవృత్తి కలహంబును బూనును బాహ్యచర్యతో
సరళహృదంతరాళునకు; సైకతమున్ జల మేచినట్లుగా
నొరపిడిఁజేయుఁ జిత్తమును నొప్పిదమా గురుభావవీచికల్
సరసుఁడు రెంటి నెంచి పనిసల్పును నేర్పుగ రాజనీతులన్.

చ॥ ఇహమె సతంబటంచు ధనమేర్చడు మార్గమెదైనఁబట్టి తా
నహముఁ బరంబటంచుఁ బనియందున శ్రద్ధనుమాని ద్రవ్యమున్
బ్రహతము సేయఁ డా ద్వ్యయము రక్షణఁజేయు సువృత్తి నూనుచున్
సుహృదుఁడెయా నిహంబునకుఁ జూడఁ బరంబునకున్ సమానుఁడై.

చ॥ నిరతము స్వామివిత్తమును ♦ నేమముతో గణియించుచుండి నా
కరి పని కెంతొ న్యాయమును ♦ గల్గఁగఁజేసి యిహత్యులందుఁ బో
టరి యన వెల్గి కీర్తిసతిఁడాయఁగ నాపని మేటిలేఖినీ
పరుఁడయి నిర్మలాత్మశుభబంధుర వర్తనుఁ డయ్యె నాతఁడున్.

ఉ॥ అట్టి మహానుభావుఁ డతఁ ♦ డౌనల వేంకటరత్న మెంతొ కాఁ
బట్టినవానిచందమున ♦ వర్ధిలఁజేయును వృత్తియందుఁ జేఁ
బట్టినవారి; సామి ధనవంతుఁడుగా నిహరీతి నెంచి తా
కట్టుగ నుంచుకొన్నటులఁ ♦ గట్టిడిఁజేయును వారి నాపనిన్.

చ॥ సొరిదిగ నాయుఁ డా ఘనుని ♦ జూచుట కేగుచుఁ బిచ్చమాంబికా
వరసుతు నంపి ప్రీతిఁ బనివానినిఁ జేయుము వీని నెంతొ నీ
కు రహినిఁ బుణ్యమా ననిన, ♦ గూర్మిని వేంకటరత్న మాతనిన్
ఘరమునఁ జిన్ని వేతనముగ వానినిగా నొనరించె నప్పుడే.

చ॥ మొదటనె నైదురూప్యములు ♦ మోదముతో నతఁడిత్తునం చనన్
దుదకొక యేఁడొసంగు మవి ♦ తూగునమంబుగఁ దిండిఖర్చు కం
చదనున మాట వేసినను ♦ నాతఁడు గాదనఁ దోవలేకఁ దా
వదలుట తప్పటంచు శరభయ్యయె యాతనివద్దఁ జేరెఁగా.

ఉ॥ కాని నెలావలం దతనిగౌరవ మేమియొ! యారుమాకలన్
దానె యొసంగుచున్ క్రమముదప్పక యొక్కొకరూప్యవృద్ధితో
నే నెలఁ గూడ జీత మతఁడిచ్చెను నారునెలల్ భళీ! యుమా
జానికటాక్షమేగద విచారముసేయఁగ దేని కేనియున్.

ఉ॥ వేతనవృద్ధిఁ బొందుచును ♦ వృత్తి మెలంగుచునుంట నాయనిన్
బ్రీతునిఁ జేసి సమ్మతిని ♦ వేరుగ నద్దెగదిన్ నివాసమున్
జేతను గాసు లుండగనె ♦ చేసెను నేరికి భార మీయన
బ్బా! తగ దింక నంచు శరభయ్య మనోజ్ఞమనోజవంబునన్.

ఉ॥ సంకటముల్ దొలంగి మదిఁజల్లదనంబును బొంది కొన్ని నా
ళ్ళింక గతించెనో! మఱియు ♦ నేమొ యెఱుంగమి కొక్కనాఁడు దా
వెంకటరత్న మేదొ తమవృత్తిని మాదిరిలేఖఁ జెప్పఁగాఁ
జంకక వ్రాయుచుండెనఁట ♦ శీఘ్రఁగ నా శరభయ్య షాపులో.

వ॥ వ్రాఁతయం దొక్కింత తుడుపువడ నద్దుకొని వ్రాయుచున్నంతలో.

ఉ॥ చూడుము తుద్పు లిట్టి వెటఁగజూడము బాగిక చాలుఁ జాలటం
చాడెడి రత్నమ్మర్ విననఁగ నా శరభయ్యకు నోళ్లు మండి తా
వీడి కలంబుఁ బత్రిమును వేరొకచోటుకుఁ ద్రోసి యూరకే
గోడకుఁ గూరుచుండెనటఁ గోపము మోమునఁ జిందు లందఁగన్.

ఉ॥ తా నొక పత్రిముం గని సుకతారపు వ్రాఁతను జెప్పుచుండఁగా
వీనుల "ఊఁ"రవంబు తగసవిన్పడునంతకు వ్రాయువానినిం
గానకయుండె రత్న మఁటఁ గాని ధ్వనిన్ శరభయ్య కుద్ధుఁడై
మానుచుఁ గూరుచుండ ననుమానము నెందుచుఁ జూచె రత్నమ్మర్.

ఉ॥ చూచి యిదేమిటన్న నిదిసచోద్యము గా దలపోల్లుమాట న
న్నాచెను మన్మనంబదియె యోప దిఁ కోపిన నింతదూరమే
యాచనఁ జేసి రాను మతిసయాదయె ముఖ్యము దానిచేఁతనే
నోచకపోతిఁ దండ్రికడ నూల్కొనియుండెడి భాగ్య మక్కటా!

ఉ॥ అందును విన్మ నాగృహముసనందునఁ బట్టెడు భోజనంబదే
సందునఁ జూచినంగలదు చాలును దానికిఁ జింతలేదు నే
వందరి పౌరుషంబునకు వచ్చితిఁ గావున నిట్టిపల్కులన్
గొందల మందె డెంద మిది కూళతనంబొకొ వైశ్యరత్నమా!.

ఉ॥ అంతియకాదు నన్నుఁ బనిసయందునఁ జేర్చెడునాఁడు నీకు ర
వ్వంతయుఁ జేతఁగాదు పని మైదె యొసంగుదు నంటి వింతలో
నంతయు నేర్చినాఁడనె మసహాత్వము గల్గెనె నాకుఁ జాలు నీ
చింత యదేల నా కొదునసజీతము ని మ్మిఁకఁ బోయివచ్చెదన్.

వ॥ అని యా వీరశరభార్యుం డీరీతి వికలచిత్తుండై పరిపరివిధంబులం బల్కుచుండ వేంకటరత్నాఖ్యుండు చకితుండయి సులోచనంబుల వ్రాఁతబల్లపై నునిచి బోధనాపూర్వకంబుగా,

ఉ॥ పోఁదలపుల్ ఘటిల్లె నికస బోయినఁబోవుము బాధలేదుకా
నీ దయఁజూపునట్లు పని నేర్పని సోమరివానిఁ జేరకన్
"వాదనఁ జేసి కోపపడి భావము ద్రిప్పు వచోవిధాను నే
సాదని యెంచి చేరు" మదె చక్కని రీతి యటంచుఁ దెల్పెనన్.

మ॥ అది యేవేళయొకాని చెప్పతరమే! "యామాట" "సద్బోధ"గాఁ
బదిలంబయ్యెను జిత్తమందుఁ గుమనోసభావంబు శాంతించెఁ ద

ద్ధృదయంబుల బరివర్తనంబును శుభాకవృత్తంబుగా నయ్యె శ
ర్వదయాబంధురభాగ్య మబ్బునపుడీ సృత్పన్నముల్ గల్గవే!.

వ॥ అస్త్రబద్ధంబైన మేటిసింగంబు పంజరంబునం జొచ్చిన పగిది రత్నవచస్సమ్మోహనాస్త్రంబున శరభార్యమనం బాకర్షింపంబడ లేఖనకుతూహలాయత్తచిత్తుండై కాకితంబుం గొని వ్రాయంబూనె నంత రత్నంబును బ్రియపూర్వకంబుగా నంతయు నొడివె నింక లేఖ పూర్తియయ్యె, ననంతరం బిద్దరును బరస్పరంబు వీడం జాలక వాత్సల్యకృతజ్ఞతానందభావంబుల నలరారుచుండి రంత.

శా॥ నాటంగోలెను వీరరాఘవుని యజ్ఞన్నుల నవ్యభావంబు లే
పాటం బెంపును బొంది వర్తకముసం దెంతేని బేరిచ్చుచుల
గోటార్యుండును బూటకూలి బసలోం గూర్మించి తాం జేరు వే
ర్పాటయ్యెల శివలీలయందుం దగు పాత్రింబొంద రంగంబునన్.

వ॥ ఇవ్విధంబున నప్పరమేశ్వరలీలావిలాసంబున నవ్విజయవాటికం గోటార్యశర భార్యసమాగమంబయ్యె ననంతరంబు.

స్వాగత వృత్తము

పాత్రధారులు శుభంబులు వొందన్
మైత్రిం గూర్చుతం గ్రమంబుగ దేవుం
డా త్రిశూలియె సహాయుండుగాం దా
నా త్రివిక్రముని సంటినరీతిన్.

గద్య

ఇయ్యది శ్రీ భారద్వాజసగోత్ర మంగమాంబా వేంకటస్వార్యపుత్రాంజనేయ
వరప్రసాదలబ్ధకీర్తి కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తి ప్రణీత
శ్రీ పరమశివానందలీలలందు ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ

# పరమశివానందలీలలు

## తృతీయాశ్వాసము

క॥ శితికంఠుండన్ శివయోగిన్, సతమును గోటార్యసతియు సాధ్వియునగు పో
షిత కనకదుర్గఁ బ్రోచుత, హితముగఁ దమలీలఁ గ్రొత్త యితివృత్తముతోఁ

వ॥ అనంతరంబు.

శా॥ ఆ పాత్రద్వయజీవికాలతల దృష్టానేకపుష్పంబులా
హా! పుష్పింపఁగ సాగె ధర్మమకరందాస్వాదనాసక్తిమై
ప్రాపుం జేరెదు నర్థిభృంగములకున్ బ్రాప్తించునో తేనె! గా
రీపాలాద్భుతలీలరీతి యెటు లారీతిన్ గదా యేర్పడున్.

ఉ॥ మ్రోడుతనంబువారి కసు మొండిగఁ గాండము లూర్ధ్వదృష్టితో
వేడఁగ నీశుఁడా మొరను వించతివేగ దయావసంతునిన్
బోడిమిఁ గూర్ప నంపె నది పుణ్యమొ యేమొకొ చేవఁబట్టుచున్
వాడని దివ్యపుష్పముల వర్ధిలు వారల జీవికాద్రుముల్.

వ॥ అదెట్టు లనిన.

ఉ॥ భోజనశాలలోఁ గలసె మొట్టమొదల్; తరువాతఁ గూడె బా
గా జత యద్దెయింటఁ; ద్వరగా నది వర్ధిలె, నంత నొండొరుల్
రాజితలీలమైత్రి గిరిరాజసుతాధిపదివ్యలీలలం
దోజఁ జెలంగుచుండిరి నయోక్తిని వారలు పాత్రధారులై.

చ॥ అది యొకచిత్ర మొక్క దినమందున నాగదిఁ జీట్లపేకకై
పదిలము జేయఁగా ధనము పాపపు సొమ్మగుటేమొ పోవుటన్
హృదయము మండి కోటయ సుహృచ్ఛరభార్యుని బందిఁ జేయఁగా
మదిఁ దలఁచెన్? "మహేశుఁడది మన్పనె" తా నొకరీతి నెంచుటన్.

ఉ॥ అంతియె! నాటితో సరి ప్రయత్నము లొండొరులన్ జయింపఁగా
సుంతయుఁ జేయరైరి గడుసుందనమన్నను గాదిఁకెందు సి
ద్ధాంతమె సుమ్ము సౌహృదవిధానము వారికిఁ బిమ్మటేవొ కా
ర్యాంతరభేదరీతులను [illegible] సాధకరించెనన్.

చ॥ అది మొదలో ముందు ముందు గన నౌను నుమాధవులీలఁ జిత్రమా
నదనుల నింక హూణశకమందున నేఁడులు లెక్కపెట్టఁగాఁ
బదిపయిఁ దొమ్మిదింగలుఁగు వందలపై బదిరెండునేళ్ళకున్
బిదపను గోటయార్యునకుఁ బెండిలి యయ్యె శుభావహంబుగన్.

ఉ॥ శక్యముగాని పండితుఁడు శంకరుఁ బోలిన సూరిపెద్ది మా
ణిక్యమునాఁ బరంగు శుభనిస్తులమూర్తి కుమార్తె విప్రరాట్
వాక్యములం బ్రమోదమునఁ బాణిఁ గ్రహించెను గోటయార్యుఁ డా
జోక్యము పార్వతీపతిదె సూ! యదికాక మఱేరి దయ్యెడున్.

ఉ॥ సూరిజనంబులం గనిన సుందరియోయను సూరిపెద్ది సం
సారఫలంబు భూరిశుభసార మనందగు ధర్మదుర్గ యా
సారసనేత్రి దత్సతిసుసంగతిఁ గోటయ వృద్ధిఁ బొందెఁ గా
సారమునందుఁ గల్వవలెఁ జల్లగ సంస్కృతి నెల్లరీతులన్.

ఉ॥ వత్సర మింతలోఁ గడచెఁ బాత్రిలమైత్రి గ్రమాభివృద్ధిమై
వత్సలతన్ బరస్పరము బాగుదలంచుచు నుండ రప్పుడే
సత్సమయంబు వచ్చె నిఁక శర్వుదయన్ శరభాభిధానుఁడున్
దత్సతి వియ్యమాంబికను ధన్యతఁ బెండిలియాడెఁ బ్రీతిమై.

క॥ మున్నంగి యనెడియూరను, గన్నం గడుఁ గలిమితోడ గణనీయంబై
యెన్నందగు వృత్తంబున, నన్నెలతుక ములుఁగుకులమునందు జనించెన్.

ఉ॥ పుట్టినయిల్లు చాలఁ బరిపూత మొనర్చుటెగాక యింకఁ దా
మెట్టిన యింటికిన్ భువిని మేదురకీర్తి యొసంగి కొండ రా
పట్టివలెన్; శుభోదయము వారక నా శరభార్యుఁ జెందఁగాఁ
బట్టపుదేవి యయ్యె ధనభావము జాతకమందు నిండగన్.

చ॥ ఇరువది నాల్గువత్సరము లీ డపు డా శరభయ్య కింతలో
సిరి తనయంతఁ దా నతనిఁ జేరెను వియ్యమతోడ నెట్లనన్
గరువము లేనిరీతి నొడికంబుగ నౌకరిఁ జేయ స్వామి తా
నెర గొనుచున్ శతత్రయము లిచ్చె బహూకృతి యంచు రూప్యముల్.

వ॥ అంత నా శరభార్యుం డా విత్తం బెద్దానికి సరిపడునని యోచించి యొక్క పిష్ట యంత్రంబుం గొన నిశ్చయించి,

క॥ పదియుం దొమ్మిది పైనన్, బదునేనవయేట జూనుమాసమునందున్
బదులకు రెంటికినిం బై, యదనము మూడున్న దినమునందునఁ బ్రీతిన్

4

క॥ పరమశివాజ్ఞలతోఁ డర్థిఁ, వరలుచు నొకపిండిమరను వర్తక మేర్పన్
బురిఁ గొని యెనమండ్రాన్వయ, నరసింహామువలనఁ గొన నొనర్చిరి యాజ్ఞన్.

వ॥ ఇవ్విధంబున నరసింహాహ్వయునివలనఁ బిష్టయంత్రంబుం దెప్పించిన యనం
తరంబు పూర్ణంబుగా ద్రవ్యంబు సెల్లించి యా మరం గైకొననుండు నవసరంబున
గోరి కోటయార్యుండు భాగస్థుండై,

చ॥ కొదువధనంబుఁ దానె తన కూరిమిపత్ని యెఱుంగకుండ నే
యదను నెఱింగి యామె నగ లా శరభయ్యకు నీయ నాతఁడున్
గుదువకు "బ్యాంకు"నం దునిచి కూరిచె సప్తశతమ్ము లందుచే
ముదమునఁ బాత్రధారు లగు మూర్తులు పొందిరి తృప్తి నెంతయున్.

చ॥ ఇదియొక తప్పటంచు నెవ రెంచఁగఁ జెల్లదు శైవలీలయే
మది నిటు లూహనిచ్చె ననుమానమటందురో! ముందుముందు మీ
మదులకు నబ్బిమై తనరు మాదిరి పాత్రల భర్గలీలలన్
జదివిన యప్పుడైన నిది సత్యమటంచు నెఱుంగఁ జెల్లదే!.

వ॥ అనంతరంబు,

ఉ॥ అప్పటికైన యంత్రమున కా ధన మంతయు లేకపోవఁ దా
నప్పు ఘరంబునన్ శరభయార్యుఁడు దెచ్చె శతద్వయమ్ముఁ దాఁ
దప్పకఁ గోటయార్యుఁ డికఁ దానును దక్కువ పైక మేర్చఁగా
నప్పొనరింపఁగా వలసె నందుకు మార్గము నెంచుచుండఁగన్.

వ॥ 'వెతుకఁబోయిన తీవ కాలికిం దవిలిన చందంబున, శైవలీలాసందర్భంబున శ్రీ
గుడివాడవంశదుగ్ధవార్ధిచంద్రుండగు సీతారామాఖ్యుండను కోటయ మిత్రుం
సహస్రరూప్యంబుల నప్పొసంగె నా చొప్పునఁ బాత్రధారులు పిష్టయంత్రంబు
గైకొని రంత.

తే॥ అర్ధనారీశుఁ డానంద మందియపుడు, మరకుఁ దన పేరుఁ బెట్టంగ మతినొసంగ
సరగ నవ్వారి హృదయకాసారములను, భక్తిపద్మము లంత విప్పారి మెరసె.

వ॥ అంత,

క॥ "పరమశివానంద" యనన్, బరగఁగ మర పేరుఁ బెట్టి వర్తక మేర్పన్
బురికొని పాత్రద్వయమును, బరమునిలీలలను బురిని భాసిలుచుండన్.

తే॥ కొంగు బంగారమై యెంతొ కూర్మితోడఁ, దనకు సంబంధులగువారికధనపు గసి
వెలసె నవ్వీటిలో మర వికసితముగ, పరములీలలఁ బాత్రలపరముఁ జేసి.

చ॥ పుర మొక నాట్యరంగ మతిపుణ్యులు వారలు పాత్రధారు లా
గిరిపతిపుత్రికాధిపుఁడె గీతము లల్లెడి సూత్రధారుఁడా
మర పనిముట్టు మోఁయఁగ నుమాపతిలీలలె వృత్త మింక నే
విరసము గల్గు దృశ్యమున వీనుల విందగు దృక్సుభాగ్యమా.

చ॥ శరభయ కోటయార్యు లురుసాహసవంతులు పిష్టయంత్రముల్
జరపెడివేళనైనఁ దమ స్వాములవద్దనె యుండి నౌకరుల్
సొరిదిగఁ జేయుచుండి కడుచోద్యము వారల సానుభూతి కా
కరులయి సాయమున్ గొనిరి సర్వవిధంబులఁ బెంపుఁ జెందుచున్.

ఉ॥ అంతటఁ గొద్ది కాల మెడమా విధి వారికి భార్య లిద్దరున్
జెంతకుఁ జేరి సౌఖ్యములు నేకురఁ జేయ గృహస్థధర్మముల్
సంతతభక్తి సవ్యముగ సల్పుచు వా రిఁక నొక్కయింటనే
వంతలు లేక భవ్యవిధి వాస మొనర్చుచు నుండి ప్రీతిమై.

చ॥ చదువరు లిక్కఁడే మరువఁజాలరు చిత్రము దైవలీలలన్
మెదుగుచు కార్యకారణ నిమిత్తములందున భేదరీతి తా
మెదలను బూనకుండినను నేమొకో? మాటలనాఁడ కెంతయో
ముద మొనరించి యీకథను ముందుకుఁ జేర్తురు మించి చక్కఁగాన్.

వ॥ అదెట్టులనిన.

ఉ॥ ఉంపున దొక్కచోటఁ దమ యుండెడి వృత్తియు నొక్క టందులో
నండగ నొండొరుల్ గలసి యచ్చటి పిండిమరందు భాగముల్
దండిగఁ జెందుచుండియు వృథా యనిపించఁగ మాటలాడ కే
"కొండొకరీతి నుండి రటఁ గూరిమి మిత్రులు" చిత్ర మయ్యెడిన్.

చ॥ ఇరువురుఁ బ్రత్యహంబుఁ దమవృత్తికిఁ బోవుచు నింటి కిద్దరున్
మరలుదు రప్పుడైన నొక మాటను నాడరు చూడ భేదముల్
విరుగని యట్టు లుండినను వేగిరమందక యీశులీల నా
చరణమునందు నొండొరులచర్యలు ఖండనఁజేయ రెప్పుడున్.

ఉ॥ ఇద్దరి సంస్కృతుల్ గడువ నెప్పుడు మెచ్చము కోటయార్యుఁడే
పద్దులఁ దెచ్చుచున్ బిదపఁ బరిపును నాశరభయ్య చెంత కా
పద్దులచీటిఁ గాంచి శరభయ్య యొసంగును ద్రవ్య మంతె యే
సుద్దు లెఱుంగ రింక మనసుల్ గలతంబడి పోవ వెన్నఁడున్.

ఉ॥ కోటయ మెచ్చముల్ గొనుచుఁ గూరిమితో నిలు సూచుచుండఁగా
దీటుగఁ బిష్టయంత్రమును దిద్దుచు నాశరభయ్య పెంచు నిం

కేటికిఁ బాత్రిధారులకు ǂ నెన్నఁడు మోసపుటూహగాని మో
మోటమి గాని లేదు పని ǂ ముఖ్యము సూనృతవాక్యసంపదన్.

ఉ॥ వారలిటుల్ చెలంగ మగవారలు గావునఁ జెల్లవచ్చునన్
గూరిమి నాడువారలును ǂ గూడి మెలంగుదు రెట్లు నిండు గం
భీరిమయోగముల్ గలసి ǂ ప్రీతిగ వారలయండఁ జేరె నిం
కేరినిఁ జేరనౌను ఘను ǂ లీశునిభక్తులు వీరె కావునన్.

క॥ ఊరక మాటలనాడరొ, కారణ మేమైన నిందుఁ గలదో! ǂ యన్నన్
వే రేమియు లే దధిపుల, వైరమె వీరలఁ గనఁబడు ǂ వైరముభంగిన్.

వ॥ అదెట్టు లనిన.

చ॥ ఉభయుల స్వాములున్ గలహ ǂ మొక్కటఁ బొందుచుఁ గోర్టులోనఁ దా
ముభయులు వ్యాజ్యమాడుచు నియోగముఁ జేసిరి వీరి వీర లా
యుభయులపక్షముల్ గెలువ ǂ నొండొరులున్ దమ స్వామిభక్తిఁ దా
ముభయులె వా రనందగిన ǂ యొప్పిదవృత్తిని వ్యాజ్యమాడుచున్.

చ॥ ఒక గృహమందు భోజనము ǂ నొందుచుఁ గోర్టుకు నొక్కవేళనే
చకచకఁ బోయి వ్యాజ్యమును ǂ జక్కనొనర్తురు వారి భావముల్
బ్రకటనఁ జేసికోరు తమస్వాముల రీతినె నుండి మైత్రితో
వికసితరీతి నుండ్రి కడువింతగ మాటల నాడకుండఁగన్.

ఉ॥ అన్నిటికంటెఁ జిత్రమగు ǂ నా యధిపుల్ శరభయ్య కోటయల్
గొన్నిట మిత్రులౌటఁ దమకూరిమి నా వ్యవహారమందునే
యెన్నుచుఁ బాడొనర్తురని ǂ యెన్నఁడుఁ దల్పక వారినే సదా
మున్నుగఁ బంపుచుండ్రి తగుమూర్తులుగా "ఘనవృత్త మద్దిరా!".

మ॥ ఒకఁడా శైవనియోగిబ్రాహ్మణుఁడు వే ǂ రొక్కండొ! వెల్నాటివై
దికవిప్రుం డెటు నేఁడు గూర్తు రిఁక వాదింపంగలారైన వా
రికి సంబంధము? శైవలీల నెటు వారింపంగ శక్యంబహో
సకలాంతర్యచరుండె స్నేహవిధులన్ ǂ సాగించెఁ బో వారికిన్.

ఉ॥ మానముతోడ నెప్పు డనుమానములేని సుబుద్ధి యుంట యే
మానులయందునో కలుగు ǂ మాన్యుఁడు కౌశికమౌని గోరఁగా
మౌని వశిష్ఠుఁ డంపె ననుమానము లేకయు రాము; సత్క్రియా
మానితు లాత్మమిత్రు లనుమానితు లట్టుల బెట్టి కుండినన్.

క॥ కోటయశరభయ లివ్విధి, దీటుగ మదిఁ జెలిమిఁ గలిగి * తేకువతోడన్
బైటికి నెటులో యున్నన్, సాటిగ మునులట్లు పనులు * సల్పుదు రెపుడున్.

ఉ॥ అబ్బుర మిద్దిగాదె యిటు * లౌట మహత్త్వముగాదె కాదనన్
నిబ్బరవృత్తి నెవ్వ రిటు * నిశ్చయభావముతోఁ బ్రశాంతి గా
కబ్బము దాల్చఁగాఁదగిన * కార్యము మాటలు లేని మైత్రితో
జబ్బులులేక సేయుదురు * శర్వునిలీలలఁ గాక వేరుగా.

చ॥ వినుఁ డికఁ జర్య లెన్న శ్రుతి*పేయముగా గల వీరలీల లా
యన తన భక్తులం గడు ద*యామతి వృద్ధికిఁ దెచ్చి భక్తిమై
యనవరతంబుఁ దన్నె కొని*యాడెడి బుద్ధి యొసంగెఁ జాలఁగా
ఘనతను నిల్పె నైహికవి*కాసముతోఁ బర మెంచి పొందఁగన్.

వ॥ ఇట్లుండ హూణశకంబునఁ బందొమ్మిదివందల పదునేడవవత్సరంబు వచ్చెనపుడు.

చ॥ శరభయ యున్న యా ఘరము * సాకెడి వేంకటరత్న ధీరుఁడున్
ఘరముకు స్వామియై సకల*భారముఁ దాల్చిన విశ్వనాథమున్
విరసముఁ జెంది భావముల * భేదము నూనుట విశ్వనాథ మా
శరభయఁ బిల్చి రత్నమును * సాగఁగ నంపుదు మేలు “ఘర్మ”నన్.

ఉ॥ ఎంత కృతజ్ఞుఁడో గద సు*హృత్తన నా శరభార్యుఁడే గదా.
నుంతయు నొల్లఁ డావనికి * సొమ్మున కాశనుజెంది సామి యెం
తెంతఁగఁ గోర సాగినను * వృత్తి నొసంగినవాని ప్రేమ ర
వ్వంతయు సన్నగిల్ల నగు * నాచరణం బొనరింపఁజాలమిన్.

క॥ మేమే రత్నము నంపుచుఁ, బ్రేమ న్నినుఁ గొందుమయ్య * భిడియ మదేలా
మా మాటన్ బోనియ్యక, నీ మాటను వదలి గద్దె * నిలువు మటన్నన్.

చ॥ మరిమరిఁ గోరి సాములగు * మాన్యులు దన్ విడనాడకుండుటన్
గరువ మటంచు నెంచెదరొ*గా యని వారలఁ దృష్టి జేయఁ దా
విరసపుపద్ధతిన్ వదలి * వెండియు నొప్పక యొప్పినట్లుగా
శరభయ యొట్టకేల కిఁక * సమ్మతిఁ జూపెను వింతపద్ధతిన్.

చ॥ అతఁ డెదిమైన వర్తకము * నారునెలల్ గతియించులోపుగా
యతన మొనర్చ నాథునని * యందలి ప్రేమను నం దెయుండునే
నతఁ డది నేయకున్న మిము * నప్పుడె తప్పకఁ జేరియుందు నం
చతుకుగఁ జెప్పె నా శరభ*యార్యుడు స్వాముల కపు తృప్తిగాన్.

వ॥ అంత.

ఉ॥ బేరము సారముల్ సలుప \ వేగపడం డల రత్న మింక నా
యారు నెలల్ గతించి గడు \ వప్పుడె వచ్చెను బిచ్చమాత్మజుం
డారయ రత్నముల్ గలయ \ నాతఁడు బేరము లేదనన్ దుదిన్
జేరె ఘరంబునం దతఁడు \ చేకొని సర్వవిధాధికారముల్.

వ॥ ఏతత్ప్రాతినిధ్యంబున నొక్కవత్సరంబు గతించె నంత.

ఉ॥ శంకరఘౌండరీ యపుడె \ స్థాపితమయ్యెను వారిచేతఁ ద
చ్ఛంకరభవ్యనామమున \ శంకరుఁడే యటుచేసె దాన నే
వంకలులేక సాగె నది \ వర్ధిలుచుండును నేఁడుఁగూడఁ దా
నింకను వృద్ధిఁజెందు నిల \ నీశుకృపాపరిణద్ధసంపదన్.

చ॥ ఇటు లొక నాలుగేండ్లు గతిసయించెను ఘౌండరి వృద్ధిఁ బొందెఁ బి
మ్మట నట విపణివీథికిలు \ మారుచుఁ గాపురముండు నప్డు సం
కటములు రోగముల్ గలచెసగా కడు నా శరభార్యు నెంచఁగా
నెటు లొక రీతిగా నరునకే యుగ మందునఁ గాల ముండెడిన్.

ఉ॥ ఇక్కడ జాతకంబు వినుఁడీ శరభార్యుని జన్మలగ్నమం
దెక్కె గురుండు దా మకర, \ మెక్కెను రాహువు నెద్దు, సింహమే
యెక్కిరి సూర్యమందబుధు, \ లింక భృగేందులు గన్యఁ బొంది ర
ల్లక్కడ కేతువున్ గుజుఁడు \ లాభముకై తులఁ దూగుచుండఁగన్.

చ॥ రవిబుధమందు లష్టమము, \ రాహువు పంచమముల్, గురుండు నా
రవిజగృహంబునన్ మకరసరాశిని లగ్నము, కేతువున్ గుజుం
డవనిజరాశి వృశ్చికముసనందున లాభము, నింక రాజ్య మా
ననమముఁ జంద్రశుక్రులు ఘనంబుగఁ బొందిరి జాతకంబునన్.

వ॥ ఇట్లు శరభయార్యుండు హస్తానక్షత్రంబునఁ జంద్రదశాశేషంబున జన్మించి కుజరాహుమహాదశలం గడపి గురుమహాదశ నందుకొనియె, నందు

క॥ గురుదశయందున ద్రవ్యం,తరమున శరభయ్య రుగ్మసతాగ్రస్తుండై
భరమై జీవిక దోచుటఁ, జరమావస్థయె యనుకొని \ చాలఁగ భీతిన్.

ఉ॥ తల్లిని దండ్రినిన్ విడచి \ తాలిమి వీడుచు నిందుఁ జొచ్చి నే
నొల్లకఁబోతి వారి నిపు \ డొద్దను జేరెడి వార లెవ్వరో
యెల్లవిధంబులన్ జెడితి \ నేమని చెప్పుదు జీవనంబు నా
కల్లరియయ్యె నింక బ్రతుకకద్దిర! చూడఁగ "మొండిచెట్టి"గాన్.

చ॥ జననియు జన్మభూమియును స్వర్గముకన్నను మిన్నయేరి కా
జనకులె దృశ్యదైవములు సత్యము సత్యము వారిసేవతో
నెనయగు పుణ్యకార్యముల నేదియు లేదిది తథ్యమింకఁ ద
ద్ధనమును గోలుపోయితి వృథాగథ జీవిత మేమి సేయుదున్.

చ॥ అని యిటు లెంతొ చింత మన మారడి నొందుచునుండ నంతలోఁ
ననె నిదియేమి పిచ్చి కట! నాస్తిగదా తలిదండ్రు లాప్తులున్
ధనము సహోదరుల్ గృహము దానికిఁ జెల్లునె యింత యేడ్వఁగా
జనకులు సోదరుల్ ధనము సర్వము నా శివుఁ డంచు మెచ్చుచున్.

క॥ శ్రీ పరమశివానందా, చేపట్టుము దేవ! నన్నుఁ జింతలు వోవన్
బ్రాపయి బాధ లడంగన్, దాపముఁ జల్లార్చుమయ్య దయఁ జూపి ప్రభో!

ఉ॥ ఆపఁగలేను బాధ పరమాత్మ దయాపర దేవదేవ నా
కోపిక లేదు నిన్ బిలువ నోపదు దేహము శర్వ నీ మదిన్
గోప మదేల నీవెగద కూరిమి మిత్రుఁడు తల్లిదండ్రియున్
గాపునొసంగు మయ్య కలికాలము నిన్నె భజింతు మత్ప్రభూ!

ఉ॥ ఈవెగదా సమస్తమును నేలెడివాఁడవు నీవులేని యా
తావది యేది! చిత్తమునఁ దాపము గల్గఁగ నేమి హేతువం
దీవు వసింపవే! హృదయ మెప్పుడు నిన్ గనుచుంటఁ జూడ వే
కావవు కారణమ్ము? కలికాలము నేత్రువె కాలయాపనన్?

శా॥ కాలాకారుఁడ వీవు దేవ కలికాలంబు గాదన్న నా
త్మాలక్ష్యంబును జేసికొందువె మహాత్మా! ఆనుకూల్యంబునా
కాలం బెయ్యది సార్వకాలిక సుఖాకారుండవై దర్శనం
బేలా? యీయవు; జాల మేల శుభవార్ధీ భర్గ! శ్రీశంకరా!

శా॥ భక్తిన్ గోరి తదాత్మ పంజరమునన్ బంధింప నవ్యక్తతన్
భక్తాత్మాళిని నిల్చియుంటివె మహాత్మా! భక్తదేహం బిటుల్
త్యక్తం బౌటకు సిద్ధమైన యపుడున్ ద్యాగంబుఁ జూపింపవే
రక్తిన్ సౌధము దాటిరావె యిటు లౌరా! బిడ్డ వేధించెదే.

శా॥ ఆరాటంబున నున్న బిడ్డఁ గన నీ కాయంబశాసించుచున్
బోరా దన్నె మహేశ్వరా! జనక నిన్ బుత్రుండు మూర్ఖుండె గా
నీ! రానిష్టము లేదొ నీకు జనకున్ నే వీడుటన్ గోపమో
మీరే తల్లియుఁ దండ్రి నా కెపుడిఁకేమీ దేవ! సర్వేశ్వరా!

మ॥ అని వేమారులుఁ బల్వరించుచును దాసనా వేళ నిద్రింప నా
తనిస్వప్నంబున బ్రాహ్మణాకృతిని బ్రత్యక్షంబుగా వచ్చి నా
యన! నా బిడ్డవు దుఃఖమందకుము నిన్నాలింపనే! బేలవై
ఘనధైర్యంబును వీడరా దనుచు శ్రీకంఠుం డటుల్ చెప్పఁగాన్.

ఉ॥ ధైర్యము వీడగాఁ దగదు ధర్మమెయౌను మహేశ! వేడుటే
కార్యముగాదె! బాధ యతిగా నను వేపుచునుండె నింక నా
ధైర్యము సన్నమయ్యె నిను ధ్యాన మొనర్చితి నీదె భారమా
దార్య! శుభంకరా! భవ! సుధాకర శేఖర! భక్తకింకరా!

చ॥ అనవుడు భక్తుఁ గాంచి యదియా? యటు బాధకుఁ దాళ లేనిచో
నొనరుపరాదె? కొండపయి నుండెడి సామికి రేపె విప్రుచే
తను నభిషేక మాజలము తాగఁగరాదె! భయంబు వాయ మం
దును గొననేల? దుఃఖమును దోఁగుచు నంచు నదృశ్యుఁ డౌటయున్.

ఉ॥ అప్పుడె లేచి వీరశరభార్యుఁడు చుట్టును జూచె నచ్చటే
చప్పుడు లేదు దేహమును జాల సుఖమ్ముగఁ దోచి రోగమే
చప్పగఁ బోయినట్లు మదిఁ జక్కని యూహయుఁ గల్గె బాధలే
చొప్పునఁ గానరాక మనసున్ గడుఁ దేలికయయ్యెఁ జిత్రమా.

చ॥ ఉదయమునందు లేవఁ గడు నోపిక వచ్చినయట్టు లుంట నా
పద దొలగెంగదా యనుచుఁ బల్మరు భర్గు భజించి భక్తితో
సదమలుఁ గొత్తపల్లికులసంభవుఁ బండిత సోమయాజిఁ బి
ల్చి దొరను గాలకంఠు నభిషేక మొనర్చు మటంచు వేడినన్.

ఉ॥ క్షేమముగల్గ విప్రుఁ డభిషేకజలంబును బిల్వపత్రితో
నేమముతోడఁ దెచ్చిన, పునీతజలం బని కండ్ల కద్దుచున్
బ్రేమను ద్రావె నెమ్మనకు భీతిల కెవ్వరి కేమి చెప్పినన్
స్వామి వచించినట్లపుడె చక్కని వజ్రశరీర మాటయున్.

ఉ॥ ఔషధసేవ మానె నిఁక నారయ వైద్యుఁడు వచ్చి నిన్న నా
యౌషధ మెంత దొడ్డదియొ ఔర! అదే గొనుమయ్య యంచుఁ దా
నౌషధ మంపె దానిఁ గొని యల్లన దాచుచు నెట్టకేల కా
యౌషధ మంతఁ జూపె శరభార్యుఁడు; వైద్యుఁడుఁ దెల్లబోయెఁగా.

చ॥ ఇది యొకలీల యింక నివి యెన్నొగదా! శరభాభిధానుఁ డా
సదనము వీడెఁ దా నచట సంకట మొందుటచే, గోటయార్యుఁడున్

వదలె గృహంబు దాన జనవంద్యులు వారలు చీలియుండఁగాఁ
గదలిరి వేరుచోటులకుఁ గాపురముల్ పొనరించి రచ్చటన్.

ఉ॥ వెండియు నేకగేహమున వెన్కటిరీతినె వారు చక్కఁగా
నుండిరి యాశలీలల మహోత్తమనైఖరికార్యసాధనో
ద్దండు లనంగ మాటల విధంబుల నెంచని మైత్రి బాపురే!
గండరగండలో యన సుఖంబుగఁ గాలము బుచ్చి రంతటన్.

ఉ॥ కాలము సెల్లిపోయెఁ గలకాలము నుందురె యెల్లవారలున్
గా లిడె ముందు స్వర్గమును గాంచుతలంపున హేమదుర్గ దా
నేల యటంచు వియ్యమయు నేగెఁ; గ్రమంబుగ శ్రావణంబునన్
వ్రాలినపక్షమందునను ద్వాదశి నాశ్వజశుద్ధసప్తమిన్.

చ॥ అపుడు పునర్వియోగము గృహంబును వీడుటఁ గల్గె వారి కా
తపమునరీతి వేరయిన తావులఁ దండ్రి కుటుంబమందునం
జపలత నా పురంబున విచారము తోడుతనుండ నంత వి
న్నపముగఁ జేరెఁ గోటయకు నవ్యవధూశుభదప్రసంగముల్.

ఉ॥ వచ్చిరి పిల్ల నీయ గుడివాడపురంబుననుండి నాకు నీ
కచ్చటి వన్ని నచ్చ సతినందుదు నంచును గోటయార్యుఁడే
పచ్చనిమాట వీరశరభయ్యకుఁ బంపెను; బాగు! వహ్వారే!
అచ్చపు నమ్మకమ్ము మరియాదయు మాటలు లేనిమైత్రియున్.

తే॥ అతఁడు గబు రంపె నీతఁడు నటులె చేసె
బాపురే యెంత భాగ్యమ్ము బాగు! బాగు!
"తనువు లవి రెండె యనుమాట తథ్యమైన
హృదయ మొక్కటె యనురీతి" యెఱుగఁబడియె.

వ॥ అంత నాయుదారస్వభావుండైన వీరశరభార్యుండు గన్యానిశ్చయంబునకై గుడివాడపురంబునకుం బోయి వచ్చి.

ఉ॥ బాగు! శుభమ్ము గల్గును వివాహము గమ్మిపు డా సతీమణిన్
జాగొనరింపఁగా జనదు చక్కనివంశము మేల్పసిండి బొ
మ్మై గనుపించుఁగాని సుకుమారము పేశలశాంతి యుక్తమై
యా గజయానపాలఁబడఁ నామె గనంబడు హీనసత్వమై.

ఉ॥ మేదినిఁ బండితాళిఁ బరమేష్ఠి యనందగి, సత్కవిత్వ వి
ద్యాదయితత్వ మంది, యవధానిశిరోమణి యాతఁ డంచు వి

5

శ్వాదరణంబు నందిన మహాత్ముఁడు పండితుఁ డయ్యపార్యుఁడే
గాదిలితండ్రి యామెకు సుఖం బగు నామెను బెండిలాడినన్.

వ॥ మఱియు నామె జనని పేరమాంబ యనంబడు సాధ్వి.

ఉ॥ శిష్టజనప్రియుండును వసిష్ఠునిఁ బోలిన యయ్యపార్యుఁ డా
యిష్టసతిన్ విశాలమతి నెంచ నరుంధతి యామెఁ గూడి యే
కష్టములేని కష్టములుగాఁ గనుపింపక యుండురీతి సం
తుష్టి గృహస్థధర్మములఁ దూగును దీటుగ నిండు వేడుకన్.

చ॥ గృహములు శోభిలన్ గృహిణులేగద మూలల మిఁ కట్టివారిలో
మహిత యనంగ నొప్పును సుమా! సతి పేరమ యయ్యపార్య స
ద్గృహిణి క్షమన్ వసుంధర నుతింపఁగఁ జాలెడి సాధ్వి సర్వదా
గృహమునఁ బంధుగల్ సలుపుఁ గేవల మామెకు సాటి యామెయే.

తే॥ కూతురై తల్లిగుణములె కూర్చుకొనియె, మనసు నిండఁగఁ బోషితకసకదు
గానఁ దత్పుతి బెండిలిఁ గమ్మ నీవు, గనఁగనయ్యెడు శుభమంచుఁగబురునంపె

వ॥ అంత.

ఉ॥ హైమవతీకరగ్రహణసమా నగు శ్రీసతి పెండ్లి శారదా
రామ వివాహమాను నవురా! యనఁ బోషితరాప్యదుర్గఁ ద
త్కోమలి భర్మదుర్గ దగు కోవెలఁ గోటయ యింద్రికీల మం
దే మహితంబుగా నతిసుధీమతిఁ బ్రీతిగఁ బెండ్లియాడెఁగా.

చ॥ ముసిముసి నవ్వుదంపతుల మోములయందున గంతువేయఁగా
హసితముఁ జేసె బాసికము లప్పుడె నవ్వెను బెండ్లిబొట్టులున్
మిసిమిసి బుగ్గ కాటుకలు మెల్లన సస్మితలయ్యె నాపసల్
ముసిరి సదస్యులన్ గవిసె మోహనశక్తులఁ బల్కరించుచున్.

చ॥ సతి గతియింపఁ దత్సతిని శర్వుఁడు పార్వతిగా గ్రహించె నా
వితమునఁ గోటయార్యునకుఁ బెండిలిఁ జేసె శివుండు పార్వతీ
సతిదయతోడఁ దత్సతిని జల్లనిచేతులఁ గాదనంగ నే
కతమున వాని కిద్దరును గల్గిరి భార్యలు దుర్గనామలై.

చ॥ పసగల యట్టి యా భమిడిపాటికులంబును నద్రివంశమా
నసదృశదక్షుఁడైన ఘను నయ్యపపండితు నద్రిరాజమున్
బొసగఁగఁ జేసి సామ్యములఁ బోషణఁజేయుచు లీలలందుఁ దా
నెసకమెసంగ నవ్వుకొనునేమొ శివుండు దయాసముద్రుఁడై.

వ॥ ఇవ్విధంబున జరిగిన వైవాహికసందర్భంబున,

చ॥ వదినెను జూడఁగాఁదలచి ౯ వచ్చిన లక్ష్మియనంగ సాటియై
పొదలెడి యాశుపెండిలికిఁ ౯ బొల్పుగ దిక్పతులంపు కానుకనా
ముదముగ నదిరాజునకు ౯ భూపతు లిచ్చిన కట్న మట్లుగా
నదనున వచ్చె నొక్క "మనిరయార్డరు" నయ్యప కష్ట పెండ్లికై.

వ॥ ఈ రీతిఁ బోషితకనకదుర్గను వివాహమంది సాటిలేనివిభవంబున నెల్లరు మెచ్చ గార్హస్థ్యధర్మంబున మఱల నిలిచి లోకహితుండై కోటయార్యుండు సకల సుఖంబుల నలరారుచుండె నింక.

ఉ॥ పరములె తల్లిదండ్రులుగ ౯ భక్తియె భాగ్యముగాన్ సురాలయా
కరమగు పుణ్యపుణ్ ఫలమె ౯ గర్భఫలంబుగ నిత్యపూజలే
వరగృహకృత్యసంతతిగ ౯ భావనఁ జేయుచు వర్తకంబునన్
సరసముగా గణింపనగు ౯ చర్యఁ గొనెన్ శరభార్యుఁ డంతటన్.

చ॥ అలరుచు రెండువత్సరము ౯ లవ్విధిఁ బుచ్చఁగ నద్దె ఘొండరీ
స్థలముగలారు విక్రయము ౯ సల్పఁగ నెంచుటఁ బాత్రధారులే
విలిచిరి; వేగ నందు నిలు ౯ వేయఁగ నాశరభార్యుఁ డెంచఁగా
వలదనెఁ గోటయార్యుఁ డిఁక ౯ వాదముఁ బూనక మానె నాతఁడున్.

చ॥ మరలను గోటయార్యుఁడె సుకమా యిలువేయగఁ బ్రోత్సహించె నా
శరభయ నొక్క వత్సరము ౯ సాగెడిలోపలనే! యదేమొకో
శరభయ మాననెంచఁడు పసందుగ భక్తిగృహంబుఁ గట్టి శం
కరునిఁ బ్రవేశపెట్టె నధికారి యతం డని పూజసేయుచున్.

ఉ॥ ఆ పరమేశు నింట నడికయాసలు లేకయె పాత్రధారులున్
గాపుర ముండి రెండు నధికారి యతం డని పూజఁ జేసి తా
మేపనిఁ జేయనెంచినను ౯ నెప్పుడు నా పరమేశునాజ్ఞకై
చాపుచు వార లిద్ద రతిసఖ్యత నుండిరి యేరు మెచ్చఁగన్.

చ॥ అమలమతుల్ మహేశ్వరుని ౯ యానతి మైత్రిని దత్పసన్నమా
గమమున భక్తితత్పరత ౯ గర్వములేక సదా వినమ్రులై
తమతమ నౌకరుల్ సలిపి ౯ ద్రవ్యము ఘొండరి నిండఁజేసి య
బ్రముగను నీశులీలలఁ బ్రకవర్తనముం బొనరించి రంతటన్.

## భద్రికవృత్తము

ఛిద్రిమెల్లఁ దొలంగుచుఁ
భద్రి మెప్పుడుఁ గల్గ చి
న్ముద్రి నింటను నిల్చి తా
రుద్రిఁ డోమును బాత్రిలఁ.

## గద్య

ఇయ్యది శ్రీ భారద్వాజసగోత్రి మంగమాంబా · వేంకటప్పార్యపుత్రాంజనేయ
వరప్రసాదలబ్ధకీర్తి కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తి ప్రణీత
శ్రీ పరమశివానందలీలలందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

# పరమశివానందలీలలు

## చతుర్థాశ్వాసము

క॥ కాశీరామేశ్వరుఁడై, దేశంబున రెండుదిశల ధ్యేయుండగు స
ర్వేశుఁడె భక్తుల ముద్వరఁ, బేశలమతిఁ బ్రోచుఁగాతఁ బ్రీతిన్ సతతమున్.

సీ॥ భగభగారవములఁ బొగలు మిన్నులఁ జిమ్మ, సెగలయావిరి యంపశచిచ్చనంగ
కిరకిరార్భటి మ్రోయు మరసారె తిరుగుళ్ళ,రథచక్రగమనసంరంభ మనఁగ
కూవుకూవనునాళకుంభితధ్వనిచుట్టు, దరిఁగొన్న భూతనాదం బనంగ
కిణకిణంబులనయస్కీలితయోగముల్, బహుళాశ్వఖురపుటస్వన మనంగఁ

గీ॥ త్రిపురసంహారిరథ మన్న దిరుగసాగె, భూరిశంకర ఘోండరి పుడమియందు
లేమి రక్కసి నణగించి సేమ మొసఁగ, నింక రథికుండు సర్వంబు శంకరుండె.

ఉ॥ పాత్రలు నామకార్థము గపర్దిమనంబునఁ గల్గుకోర్కెయే
సూత్రము దేనికేనియును జోద్యమదే! యది గాంచి భక్తిమై
పాత్రలు జీవయాత్ర గడపందలపుం గ్రహియించు కొంచు నే
మాత్రము నాత్రమందరు సుమా! తమకోర్కెల కై మనంబునన్.

వ॥ పాత్రధారు లీ రీతి శివభక్తులై యుండియు శివకేశవుల కభేదంబు నెంచి ప్రార్థించుచుందు రందుకుఁ దార్కాణంబు శరభార్యుఁ డింతకుం బూర్వమే యంగారకమహాదశ శ్రీరామమంత్రం బుపదేశంబయ్యె ననంతరం బా యనఘునిజాతకంబునఁ గాలక్రమంబున శనిమహాదశ యేతెంచె నింక.

క॥ రవ్యంతరంబు శనిలో, సవ్యముగా జరుగఁగలదె శారీరంబున్.
ద్రవ్యము జబ్బుల పాల్పడె, నవ్యయులీలలను నణఁగె నవి శరభునకున్.

వ॥ హూణశకంబునందుఁ బందొమ్మిది వందల యిరువది తొమ్మిదవ వత్సరంబున రవ్యంతరంబున శరభార్యుం డీరీతి జబ్బువడుటయు మహాసంగ్రామానంతరఫలితంబుగా లోకం బార్థికదుస్థితిం జెందుటయు సంభవించె నా క్లిష్టసమయంబున,

మ॥ ధనమా లేదిల నార్థికంబుఁ గడువార్ధక్యంబునన్ గ్రుంగె మూ
డిన యుద్ధంబున వర్తకంబుపస వాడెన్ వీడె సౌఖ్యం బికన్

దనువు న్నొకరిఁజేయ వీల్పడదు సాధ్యం బేమి గానట్టి తీ
రున నిట్లా శరభార్యుఁ డుండె నెటు తీర్పుల్ దద్దునో యీశుఁడున్.

వ॥ అంత నా శరభార్యుండు.

ఉ॥ పోయె శరీరదార్ఢ్య మికఁ ౯ బోవుట నౌకరి కేమి చెల్ల దే
మాయె! మహేశుఁ డుండె నని ౯ మానుట కా యజమానిచెంతకున్
వ్రాయఁగ నాతనిన్ విడువ ౯ వల్లభు లొల్ల రదెంతనమ్మకం
బో! యెవ రీ ఫరంబు నేఁటఁ ౯ బూనుదు రంచును వ్రాసి రంతటన్.

ఉ॥ వారిదు గౌరవమ్ము శరభయ్యకు సొమ్మగు నమ్మకమ్మొ గా
నీ రహిరోగి కిష్టమగునే ఘృత మెంతటిదైన? నౌకరిం
భారముగల్లునంచు బ్రతిమాలిన వీడరు దానిచేతఁ దా
నోరిమిలేక వారి కొక ౯ యుత్తరమంపెను "లా" ప్రకారమున్.

వ॥ అది యెట్టిదనిన.

క॥ పెద్దల పంచాయతికిన్, బద్దుల లెక్కలను జూపి ౯ భారము విడ మీ
వద్దకు బీగము నంపెద, సుద్దులు వేయేల యనుచు ౯ సుడివడ వ్రాసెన్.

వ॥ ఇంకఁ జేయునదిలేక యజమానులు లెక్కలం జూచుకొని శరభార్యు నొద్దను ఫరంబు నప్పగించుకొని రప్పు డా శరభార్యుండు నిర్మలచిత్తంబున వ్రాసియుం లెక్కల ననుసరించి యానాటికి దాను ఫరంబున కొసంగవలసిన యెనమన్నూ యిరువదియేడు రూపాయిలపై నారణాల పదిపైసలు నాయజమానుల కొ వారు దనను విడలేక విడురీతి మహావిశ్వాసపాత్రుండై విడిపోయి యనంతరం కొలూరి సీతారామార్యుని సహాయంబున మాండలికపరస్పరసహాయసంఘంబు బండెండు భాగంబులం గొని యారువేలరూకలం దెచ్చి యార్థికదుస్థి బాపుకొని యా రుణంబు గాలక్రమంబునఁ దీర్చి శుభంబుల నుండెనంత.

ఉ॥ అంతట నొక్కనాడు తనయంతటఁ దానుగ సాంబనుబ్బసి
ద్ధాంతి హఠాత్తుగా నొక విధంబుగ వచ్చి గృహంబుఁ గట్టఁగా
నింతకుఁ బూర్వ మెన్నఁడును ౯ నిట్టి సులగ్నముఁ జూడ మింక మీ
రెంతకునైన నీ గృహము ౯ నిప్పుడు పూర్తిగఁ గట్టు డంచనన్.

చ॥ కన నెటఁ గాసు లేదు ఘనకార్యముఁ బూనఁగ నొల్ల మిప్పు మీ
రనునది సత్యమైన నను ౯ నా ఘనులన్ గని తాను శాస్త్రి య
ట్లనకుడు లగ్నదార్ఢ్యమున ౯ నన్నియుఁ జేకురు నారి కేళమున్
గొనుటకు శక్తి లేదొ! కొని ౯ కొట్టుడు సర్వము సిద్ధమౌ ననన్.

తే॥ గీ॥ మారుపల్కంగ నేరక ♣ వార లంత
నారికేళంబుఁ గొట్టి పుసనాదిఁ దీసి
రపుడు శ్రీశైలమందుఁ జెన్నలర సతి
మోకటి విలసిల్లు లాటరి ♣ యొండు వచ్చె.

క॥ ఆలాటరిలాభంబుల్, ఫాలాక్షుసి కీయఁ గొనిరి ♣ ఘండరితోడన్
నాలుగు పేరులఁ జీట్లన్, జాలుగ సతి కోటయయును ♣ శరభార్యుండున్.

మ॥ జలధిన్ దేలుచు వచ్చి యాత్రికులకున్ ♣ సాన్నిధ్యమా పెద్ద సొ
మ్ములు పెట్టెంబలె బాతిధారులకు సమ్మోదంబు సంధిల్ల లీ
లలె సర్వేశునియందు భక్తి ఘనమా ♣ లక్ష్యంబు సేకూర్పగా
భళిరా ! లాటరి లాభముల్ శుభము సంప్రాప్తించె నవ్వారికిన్.

క॥ నలువురి చీట్లను లాటరిఁ, గలుపఁగ ముప్వురకు వచ్చెఁ ♣ గల లాభం బా
నెలతుక కోటయ సతికిని, నలఘాండరి కింక శరభయార్యుని పేరన్.

ఆ॥వె॥ ముగుర పేర్లవచ్చె ♣ మూఁడు రెండున్నర, వందలన్ని వారు ♣ వాడుకొనుచు
సరగ శ్రీగిరినల ♣ సతిపుకొల్లకై, నదియు నింకఁ గొంత ♣ యంపి రపుడు.

వ॥ అనంతరం బప్పాత్రిధారులు గృహంబుం బూర్తి యొనర్చి యొకపక్క వీరశర భార్యుం డొంటరిగను వేరొకప్రక్కఁ గోటయార్యుండు దన సతియగు పోషిత కనకదుర్గతోఁ గలసియును సుఖంబుగాఁ గాలంబుఁ గడపుచుండి రప్పుడు.

చ॥ అతి సుకుమారగాత్రిముల ♣ కాత్మలు కర్కశమట్లు గాక న
మ్రితగల పేశలత్వమున ♣ రాజిలి యెల్లరు మెచ్చురీతిగా
శతపుటమైన బంగరున ♣ సంశ్రితమయ్యెను గమ్మతావి యన్
వితము తనూమనంబు లొదవెన్ గద పోషితరావ్యదుర్గకున్.

సీ॥ భామామణీమంజుభాషణంబులు లోని, భావమార్దవమును ♣ బయలుపరుప
నారీసుమందయానంబులు మదిలోని, శాంతపరిభావంపుసరణిఁ దెలుపఁ
బూబోణిపరమైన ♣ భూతదయారతి, జాలిగుండియ గల్గుజాడ నీయఁ
దన్వంగి కున్నట్టి ♣ దానపరత్వంబు, సౌదార్యచిత్తరమ్యతను జూపఁ

తే॥ సతివభక్తితాత్పర్యంబు ♣ లార్యసంప్రదాయ సంసిద్ధమైన విశ్వవృత్తుఁ దెలుప
శీలవతులందు భూరి సుశీలయనఁగఁ, గాంచెఁ బేరును బోషితకనకదుర్గ.

తే॥ మంచియన్నంబులోనికి ♣ మంచికూర, దొరకు టరుదగు నటుగాక పదులనుదూగఁ
గోటయార్యుండు నాతని ♣ కూర్మిసతియు, దీటుగా నన్నిటన్ నెల్లు ♣ మేటులౌర.

వ॥ ఈరీతి నాదంపతులు గార్హస్థ్యంబున వెలుగొంచుచు భూతదయాపరత్వంబు నుండునప్పుడు.

తే॥ గీ॥ వీరశరభార్యు డాయింట వేరుభాగ,మందు సర్వేశు భజియించి యలరుచుం
యొంటివాఁడౌట నొక్కని వంటకునిచి, పోషణమునల్పుకొనుచుండు బాలుపుమీ

తే॥ ఇట్టు లుండంగ నొక్కనా డేగె మాని, వంటనౌకరి యిక నంత నింటిలో
బ్రిక్కనేయున్న మిత్రుఁడా ఫక్కి నెఱిగి, పిల్వ నట భోజనము సేసెఁ బ్రీతి నతఁ

తే॥ కడపి యొక రెండుదినములు దడయ కచట, వంటపనివానికై వేగపడుచు నతఁ
మొదటినుండియు గృహకృత్యములనుసల్పు గోటయార్యునెయవ్వానిఁ గూర్చుమని

తే॥ వినియుఁ గోటయపూనఁ డా పనిని జేయ, నచటె యెప్పుడు శరభార్యుఁ డారగిం
వలయునని యెడి తలపును గలిగి మదిని, మైత్రి మహిమంబు నెన్న సామాన్యమగు

క॥ శరభయ నిరసించునో యనఁ, సరణిని గోటార్యుఁ డాత్మ సద్భావంబున్
సరగున నెఱుకం బరపక, కర మరుదుగ నుండెఁ జెలిమి కలిమిని శాంతిన్.

ఉ॥ శాంతము శాంతమం చిలను సర్వజనంబులు సెప్పికొంటయే
గాంతుముగాని యంతటి ప్రకారము గాంతుమె వర్తనంబునన్
శాంతమొ శాంతరూపమొ వశంబని తోఁచదు కోటయార్యునిన్
సాంత మెఱుంగ నెంతటి విశాలమనస్కున కేనియున్ భువిన్.

క॥ కోటయ శాంతిగ నుండన్, మాటికి శరభయ్య వంటమానిసికొఱ కే
పూటను దొందరపడుటన్, గోటయ యిటు తెలిపెఁ దనదు కోరికఁ బ్రీతిన్.

వ॥ అ దెట్టులనిన,

ఉ॥ నిండుమనంబునన్ దనదునేస్తుని గాంచుచుఁ గోటయార్యుఁ డీ
వుండినరీతి నుంతయును నొప్పను వండగనేల వేఱె మా
కుండను నొక్కవంటఁ దినఁగూడదె! యియ్యది గష్టమానె నా
కుండిన కోర్కెఁ దీర్పు మిది యొప్పగు నీకును నా కటంచనన్.

చ॥ శరభయ, మిత్రమా యిది విశాలమనఃస్థితిఁ దెల్పుగాని యే
విరసము సంభవించునో వివేచన సేయుము కొంత; దూరమే
సరసత నిల్పెడిన్; జనవు చాలఁగఁ గల్గిన లక్ష్యభావ మొం
డొరులకుఁ బోవుఁ గాన నిది యొప్ప దటంచును జెప్పె నాతఁడున్.

ఉ॥ చెప్పినఁ దప్ప దీవిధము సేరికఁ గూర్చును నీకు నాకు నేఁ
డొప్పిన భావసామ్యముల [illegible] మాటచే

నొప్పవు నీ నుడుల్; గలసియుండుట ధర్మ మనంగ నేమియున్
జెప్పఁగలేక నొక్క నెల | సెప్పెను దా గడువందు కొప్పఁగాన్.

వ॥ ఇష్టంబు లేకున్నను గోటయార్యుం డెట్టకేల కా గడువున కొప్పుకొని మొదటి యభిప్రాయంబునె పురస్కరించుకొనియుండె.

ఉ॥ అలసటఁ జెందుఁ బత్ని యని | యాతఁడు దల్పఁడు ప్రాణమైత్రినే
తలఁచునుగాని తత్సతియు | ధర్మమె యెంచును గష్ట మెన్న దీ
కలి నిటు దంపతుల్ గలుగు | కాల మ దింకను బోవలేదు స
ల్లలితవిశాలభావముల | లక్ష్యము వీరల మూర్తు లందెఁగా.

శా॥ ఓహో భూరిగృహస్థధర్మ మిది యోహో భర్తృధర్మం బిదే
యోహో ధర్మసతీమహత్త్వ మిది యోహో భూతకారుణ్యమా
నోహో దంపతి కేకమానస మి దోహో భావవైశాల్యమా
నోహో దివ్యపురాకృతం బగును నోహో ధర్మరాజ్యం బిదా.

వ॥ ఇవ్విధంబున నన్యోన్యానుపమానప్రేమంబున నా దంపతులు భూరిగార్హస్థ్యధర్మంబున మెలంగుచుండ,

తే॥గీ॥ నెలదినంబులు నంతలోపలనె గడచెఁ, గలవిధంబునె దంపతుల్ గలిగియుండి
రపుడు శరభయ్య యొప్పంగనయ్యెనింకఁ, గలసియుండిరి మైత్రితో మెలగుచుండి.

తే॥గీ॥ నాటినుండియు వారికి నేటివఱకు, నాదిభావంబె మనసుల | నతికియుండు.
మచ్చునకునైనఁ గలుగదు | మాటపొల్లు, గలదె యీరీతి యీశులీలలనుగాక.

వ॥ ఇవ్విధంబునఁ బృథక్పాకంబు వీడి యేకపాకంబునం బాత్రిధారు లెల్లరున్ భుజియించుచుఁ బరమేశ్వరలీలానాటకరంగంబునఁ బ్రవర్తిల్లుచు భారతాస్తిక్యభావంబుల నలరారుచున్న సమయంబున నా శరభార్యుండు.

ఉ॥ భారతసంప్రదాయము శుభప్రదమాటను బాటిసేయుచున్
భూరిపవిత్రతీర్థముల | బ్రింగఁగఁ గోరిక లీరికెత్త బృం
దారకవాహినీధరుని | తాండవరాజితవారణాసికిన్
జేరఁ బ్రయాణ మయ్యెఁ దను | చిన్నలుఁ బెద్దలు మెచ్చునట్లుగాన్.

ఉ॥ రైలుప్రయాణ మెంతొ సుకరంబగుటన్ శరభాభిధానుఁడున్
రైలునఁ బోవుచుండ నొకరాతిరిఁ జక్కని స్వప్నమయ్యె నా
రైలు మొగల్‌సరాయి యన | రాజిలు స్టేషనునందు నుండఁగా
"రైలయినంత స్వప్నములరాకకు నేమి నిరోధ మయ్యెడిన్."

చ॥ సుకమగు పాన్పుగావలె సుషుప్తి కటంచును నేమ మున్నదే
మకమక లాడునట్టు లనుమానము లుండిన చిత్తుఁ డెంతయున్
సుకమగుపాన్పు లిచ్చినను సుప్తినిఁ జెందునె పల్వరించి తో
పక యెటొ దొర్లుచుండడె కపాలము చిందఱవందఱందఁగన్.

మ॥ అతినిశ్చింతను సర్వభారములు దా నాత్మార్థ్యుఁడై యీశుపై
సతము న్నిల్పెడి శాంతచిత్తుఁ డెపుడున్ సంతోషుఁడై యుండు నా
వితమే గూర్చు సుకమ్ము దాన సకలోర్వీన్ గెల్వ సాధ్యంబు త
న్మతియే సార్థకజన్ముఁ డౌను నిహామున్ దక్కున్ బరం బేర్పడున్.

ఉ॥ సర్వము శర్వుఁడే నడుపఁజాలెడివాఁడని నిశ్చయాత్మమై
గర్వములేని భావములఁ గాలముఁ బుచ్చుచు విజ్ఞవీగ కీ
యుర్విఁ జరించుటన్ దుడుకు లొందక యా శరభయ్య హాయిగా
శర్వరి నిద్రపోవుటకు సంకట మేల తటస్థ మయ్యెడిన్.

చ॥ మొగలుసరాయి స్టేషనున మోదమునిచ్చుచు స్వప్నమందుఁ బొం
దుగ నొక భూసురాన్వయుఁడు దోఁచుచుఁ బిల్వదళంబు కాశి మెం
డుగఁ గల దంచుఁ జెప్పి యతఁడున్ దృగతీతుఁడుగా భవుండె తా
నుగఁ దనపూజఁ దెల్పె నిది నోమనుచున్ శరభయ్య యెంచుచున్.

చ॥ శివునకుఁ గాశిలోన నభిషేక మొనర్చుచు బిల్వపూజఁ దా
నవిరళభక్తి సల్పి మనసారఁగ నప్పుడె నన్నపూర్ణకున్
నవనవపుష్పసంతతుల నమ్మిక నర్చన సల్పి వెండియున్
బ్రవిమలరీతి జాహ్నవిని బాపముపోవఁగఁ గ్రుంకె నాతఁడున్.

వ॥ అనంతరంబు.

చ॥ లలితను బూజసేయుతఱి లక్ష్మికి నామము సెప్పెఁ దంబి, కే
వలముగ శక్తియేగనుక బాధ యొకింతయు లేదు నామముల్
లలితవె చెప్పఁగా ననిన లక్షణ మొప్పదు కర్మలందు నా
లలితకు శంభుఁడున్ మఱియు లచ్చికి వెన్నుఁడు భర్త లౌటచేన్.

మ॥ అని పండాదరి కేగి యా శరభయాఖ్యార్యుండు పూజావిధిన్
వినిపింపన్ గడుఁ జింతనొంది యతఁడున్ వేరొక్కనిన్ బంప నా
తనిసాయంబునఁ బూజనల్ సలిపి నిత్యం బేకభుక్తంబులన్
గనుచున్ దా పదునేడు రోజు లట సౌఖ్యం బందుచున్ నిల్వఁగన్.

ఉ॥ కూరిమి మిత్రుఁడైన యల కోటయ యుత్తరమంపె నందు మీ
రూరికి వచ్చు టెప్పు డని యుంటిమి; మీరలు కాలభైరవున్
భూరిగఁ బూజసేయఁగనఁ బుట్టిన యింటికిఁ బంపనొల్ల నా
దారను సాధ్విఁ బ్రీతిమెయి దండ్రియె పిల్చెననంచు వ్రాసెఁగా.

తే॥ కోపమునఁ బట్టి బంధింపఁ గోరినట్టి, కోటయార్యుండె నేఁడయ్యెఁ గూర్మిసఖుఁడు
దలఁప నెయ్యది యెట్లౌనొ తెలియవశమె, పరమశివలీలలందు నెవ్వారికేని.

ఉ॥ ఉత్తరయాత్రలన్నియును నొప్పగు రీతిని బూర్తియాట నా
యుత్తరమందఁగానె తన యున్కిని వీడుచు వేగఁ బుణ్యసం
పత్తును నెంతొ దెచ్చె బెజవాడకుఁ బిమ్మట భూరిభోజనా
యత్తులఁ జేసి బ్రాహ్మణనికాయంతలఁ దృప్తి యొనర్చె భక్తిమై.

వ॥ అనంతరంబు శరభార్యుండు గాశినుండి తెచ్చిన సీతారామలక్ష్మణాన్నపూర్ణా విశ్వేశ్వర లక్ష్మీశ విష్ణు గణప త్ర్యాంజనేయ విగ్రహంబులం గూడ శివకేశవ భేదంబులు లేక పూజించుచు నిత్యభారతశ్రవణంబున భక్తిభావంబులతో నుప్పొంగుచున్న యా సమయంబున,

చ॥ అరయఁ బురాకృతమ్ము గనకానొనె మనుష్యున కెప్పు డేది యే
వరుసఁ ఫలమ్ము నిచ్చునొ! శుభంకరకార్యము సేయుటే మహ
త్తరమగు పుణ్యసత్ఫలవిధంబగు; గోవులఁ బెంపనెంచి రా
శరభయకోటయార్యు లెట సల్పిరొ యింతటి పూర్వపుణ్యమున్.

ఉ॥ బాపురె! భారతశ్రవణభాగ్యము డాగిన పూర్వపుణ్యమున్
దాపునఁ జేర్చి ముందునకు దక్కెడి సత్క్రియ సేయఁ బ్రేరణం
బేపునఁ జేసె నొజ్జవిధి నెన్నఁగ వారల కప్డు; భారత
శ్రీపరతంత్రుఁడైన గుణశీలుఁడు గాంచఁగ రిత్తపోవునే!

వ॥ పాత్రధారు లివ్విధి గోసంప్రాప్తినొంది యానందంబున నుండునప్పు డొక్క నాఁడు శరభార్యుండు,

ఉ॥ ఈశ్వరపూజనమ్మునకు నేగితిఁ గాశికి నందు భక్తి వి
శ్వేశ్వరు నన్నపూర్ణను వివేకముతో భజియించితి నింక రా
మేశ్వరపూజ సల్పకిపు డెట్టులు పూర్తి యొనర్తు యాత్ర స
ర్వేశ్వరుఁ డీ పనిన్ సలుప లేఁడొకొ; యంచును బోయె యాత్రకున్.

ఉ॥ ఆతనితోడఁ గోటయయు నాతని పత్నియుఁ బోయి మువ్వురున్
సేతువునందు స్నానములు సేయుచుఁ దక్కటి తీర్థయాత్రలన్

బూతము నొంది యీశ్వరుని బూజ యొనర్చుచు గోవుదానముఁ
జేతుము నీలకంఠునకుఁ జిక్కనిపాల నొసంగనంచటఁ.

ఉ॥ చక్కని పాడియావునకుఁ జాలఁ బ్రియత్నము సేయ నొక్కెడఁ
జిక్కెను నొక్కవైశ్యకడఁ జేవలు దీరినగోవు వత్సముఁ
మక్కువ వాటి బేరముల మాకు నొసంగుమటన్న నమ్మగా
నెక్కడివాఁడొ యియ్యకొనఁ డెంచఁడు దేవునినైన నాత్మలోఁ.

ఉ॥ చేయునదేమిలేక యటఁ జేసెడి యాత్రిలుఁ బూర్తియాట శూ
లాయుధులీలయంచు నల యావునకై మనసింత లాగఁగాఁ
బోయిరి రైలు కప్పుడది పున్నెము వైశ్యుఁడు బేరమీయఁ దా
డాయఁగ వచ్చె వాని నికటమ్మున గోవును బొంది రంతటఁ.

సీ॥ ధేనుయానము మదిఁ దిద్దిన యుత్సాహ, మాశాతతులయందె యాక్రమింపఁ
కపిలకంఠధ్వనుల్ గలిగించు కర్ణామృ, తం బెంతొ ప్రవహించి ధరణిఁ బొ
గోతనూకాంతి చేకూర్చిన ముఖకాంతి, రోదసీకుహరాన మోదమంద
సురభిమాపురమిడు వరభుజోన్నతి మిన్ను, లంటంగ నెగపొంగ్రయదరుచుండ

గీ॥ సరససర్వాంగసౌందర్యసరణి యిచ్చు, ముచ్చటలు మేను నుబ్బించి హెచ్చునేయ
నాలయంబున కాముచ్చు రలరియపుడు, బిడ్డతోఁ బోవు నావుతో వెడలి రపుడు

వ॥ అహో! మహానుభావులగు నప్పాత్రధారుల పూర్వపుణ్యం బింత యని యెన్న నగునే! గోదానంబును నందును సత్పాత్రదానంబును దొఱకుట దుర్లభంబు గదా! యింక నిరుపమాన సత్పాత్ర మహేశ్వరుండె యా పాత్రధారులకుం దొఱకె; బాగు! అవ్వార లుత్సాహంబున గోదానంబునకై వత్ససహితంబైన గోవుతో నాలయంబునకుం బోవ నట.

శా॥ కుప్పించెఁ వడి గోవు నూపి తన సోకుఁ ద్వారసామీప్యమం
దప్పాటుంగన దానితో నెగసెఁ బో యవ్వారి ప్రాణంబులుఁ
దప్పెఁ! బోయి మహాసముద్రమునకుఁ దారందునంచుండఁగా
రెప్పఁ మూసెడిలోనఁ జేర సరిదాకారిం బోయి సంస్థాధిపుఁ.

చ॥ మనసులు గూడువట్టె ననుమానము వీడెను ధర్మకర్తనుం
గనుచు సమస్తముం దెలుపఁగా నతఁ డప్పుడె వారినంపఁ గా
దన విధిఁ జేసెఁ దృప్తివడి ధన్యతనొందితి మంచు వారల
య్యనఘునియాజ్ఞనైనొని ప్రయాణము నెసరి పుణ్యసంపదఁ.

తే॥ బాపురే! గంట జాగుగా ƒ బయలు దేరె, జిత్రమయ్యెడు! రైలేమి ƒ చెప్పవలయు
నీశు లీలలగాక వేరెందుఁ గల్గు, నిట్టివింతలు జనులార ƒ యెంచిచూడ.

వ॥ పాత్రధారు లీ రీతి సుఖంబుగా విజయవాటికం జేరి విధివిధానంబుగా సమారాధనాదికంబులం బూర్తియొనర్చి గోవితానంబులం భక్తితోఁ బెంచుచు నిరంతరసౌభాగ్యంబుల నలరారుచుండు రంత.

## సాధ్వీవృత్తము

భూమిని సకల విభూతియు నిజమగు, భూతదయయు గురుపూజనముల్
నేమము సతముఁ బ్రసిద్ధియు వినయము, శీలము పరశివచింతనముల్
కామరిపుసతి ప్రకాశము పరచుత, గాంచి పురుషులకు ƒ గల్గుకి సా
ధ్వీమణి కెపుడు సుధీమణు లగుటను, దివ్యమహిమ లిలఁ ƒ దేజరిల్లఁ.

## —◆ గద్య ◆—

ఇయ్యది శ్రీ భారద్వాజసగోత్ర మంగమాంబా వేంకటప్పార్య పుత్రాంజనేయ
వరప్రసాదలబ్ధ కీర్తి, కేశవభొట్ల సుదర్శనవేణుగోపాలమూర్తి ప్రణీత
శ్రీ పరమశివానంద లీలలందుఁ
జతుర్థాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

# పరమశివానందలీలలు

## పంచమాశ్వాసము

క॥ గోవును దేవిని దనర్చ, గేవలముగ భక్తిపరతఁ - గీర్తించుచు నీ
భావలయంబునఁ గీర్తికిఁ, దావలముగ వీరు వెలుఁగఁ - దా శివుఁ డోమున్.

సీ॥ ముక్కోటివేల్పులు - మొదలుకై సేతలఁ, బొడసూపి వెలుగొందు - పుణ్యమూర్తి
ముక్కంటి నడికన్ను - మొనచిచ్చు సెగలచేఁ, గపిలత్వమును గన్న - గణ్యచరిత
ముక్కోపిఁ గౌశికు - మూడు చెఱువుల నీళ్ళు, ద్రావించి పేర్వడ్డ - ధన్యకీర్తి
మొక్కుచెల్లించంగ - మొగకొంచు సంతృప్తి, సంతాన మొసగెడి - సదయహృదయ

తే॥ గోవు దానిమించు శుభము - లేవి యొసఁగు, దాన శరభయకోటాభి - ధానులెపుడు
గోవులను బెంచగా నిష్ఠ - గొనిరి యామె, కామధేనువెయై వారిఁ - గాచుచుండె

తే॥ భర్గులీలలరంగానఁ - బాత్రలైన, శరభకోటాభిధానుల - సరణి నింక
గల్పతరువౌచు నోము దు - గ్ధామతల్లి, కామధేనువె యై ప్రోచుఁ - గపిలగోవు

ఉ॥ గోవు మహాపవిత్రతను - గూర్చునటంచును సర్వపాపముల్
పోవు నటంచు మ్రొక్కుటయె - పోఁ గనుచుందుము నిశ్చయాత్మతో
గోవును గోవుభక్తికొఱ - కున్ భరియించుటయే గృహస్థుఁడో
యీవసుధన్ గలిన్ గనఁగ - నెంచిన నెందును దుర్లభంబగున్.

ఉ॥ పాలకుఁ బెంతు రావు లవి - పాలనుమానిన మేతవేయఁగాఁ
జాలరు దండుగంచు వరు - సన్ ముసలమ్మలు పాపమంచనన్
గోలఁ బడంగలేక గడుఁ - గొట్టుచు వేగమ యమ్మివైతు రీ
కాలము భక్తినోటనె వి - కాసముఁ జెందుటఁ జూచుచుండమే.

ఉ॥ మైనపు ముత్తెముల్ గనుచు - మాటికి వేసరు దృష్టి యొక్కరం
గాన సువార్తికత్రయము - గాంచినతోడనె ప్రీతిఁ జెందుఁ దా
మే నయరీతి గౌరవ మ - విమ్మని కోరెన! కోరఁ గల్గునా
కాన స్వభావసిద్ధమగు - గౌరవ మబ్బును మంచివారికిన్.

తే॥ కోటయ శరభయ లివ్విధి, చాటిరి గోభక్తి జగతి సాటికి నటులే
కోటికి నొకరైనను నీ, పాటికి నెట నున్నఁ గలవు వచ్చునె పుడమిన్.

ఉ॥ పంచమవేదమై తనరు భారతచోదితపద్ధతిన్ బురా
సంచితవృత్తి తోడ్పడఁగఁ జక్కనిభక్తిని గోవితానమున్
బెంచుసుభాగ్య మబ్బె నది ప్రీతియొనర్చె జగంబుఁ జూడఁగా
నెంచినవారి కెల్ల మదిఁ దృప్తిగఁ గన్నుల పండువౌవిధిన్.

ఉ॥ అమ్మరొయొ! తల్లియో! మఱియు నామెయొ! యామెయొ! కాని గోవు న
న్యమ్మగుమాటలం బిలుచు టారయ మెన్నఁడు వారినోటఁ ద
థ్యమ్ముగ నౌకరుల్ పిలుతు రవ్విధినే ప్రభుఁ డట్లు పిల్వఁ జో
ద్య మ్మదియేల నౌకరు తథావిధిఁ బిల్వఁడె వారివాడలన్.

ఉ॥ గోవులు నందులోఁ గపిలగోవులు కేవలదివ్యమూర్తులౌ
రా! వరకాలరూపిణులు రమ్యకళాంచిత మోహనప్రభా
శ్రీవహదైవతమ్ములు వశీకృతసర్వనిలింపశక్తు లా
యావులఁ బెంపఁగాఁ దగు మహాత్త్వము నెన్నవశంబె యేరికిన్.

క॥ రుద్రుఁడు కపిలత నొసఁగెన్, భద్రత నజువలనఁ బొందె బ్రహ్మకుఁ బైఁ జి
న్ముద్రితగోలోకమునన్, రుద్రులపదకొండుగురకు రూపము నొసగెన్.

తే॥ సకలసురలకు సేవ్యమౌ సత్స్థలంబు, సాదిమధ్యాంతమూర్తుల కాకరంబు.
శ్రీమహాదేవి కోరినకథామ మరయ, మహిని గోరూప మెన్న సామాన్యమగునె.

తే॥ అగ్గిదాచెను హోమాలహవ్యమొసఁగె, రహిమునీశ్వరునకుఁ దపోరక్షయయ్యె
ఘనగృహస్థులపాలిటి కనకమయ్యె, గోవు సేవింప నెవ్వారిఁ బ్రోవకుండు.

శా॥ గోలోకంబును గాంచఁగల్గెదరొ! తద్గోప్యంబు కైవల్యమే
యాలక్షింతురొ! ధర్మదేవతను దా మైక్యంబుఁ గానేర్తురో?
శ్రీలన్ క్షామము లేక సర్వజగతిన్ క్షేమంబుగా నుంతురో?
వాలాయమ్ముగ గోవితానములతో వర్ధిల్లుచున్ బాత్రిలున్.

సీ॥ మురిపెంపుటడుగుల మోహనగతు లెంతొ, చూచువారి మనమ్ము జూరఁగొనఁగఁ
జిటికొమ్ము సొగసుల చేవలు సూటిగాఁ, గాంచువారి యెడంద గ్రిమ్ముకొనఁగఁ
గుదురైన గిట్టల కూర్పుల జంజాట, మగయువారలయాత్మ నావరింప
నెనరైన మైవెల్గు నిగ్గుపసందులు, దెలియు వారలగుండెఁ దేర్చుచుండ

ఆ॥ దుర్గ, అన్నపూర్ణ, దుహిత, పర్వతవర్ధ, నమ్మయనెడు పేర్ల నరసికొనుచుఁ
బాత్రిధారు లెంతొ భక్తితో గోవులఁ, జాలఁ బెంచుచున్న సమయమునను

ఉ॥ అక్కజమైన యొక్కకల నా శరభార్యుఁడె యొక్కరాత్రిఁ బెం
పెక్కెడిరీతిఁ గాంచె నది యేమనఁ గొట్టము సాలకుంట మ
మ్మెక్కడ నుంపనౌ ననుచు నెన్నకు తూరుపుదిక్కునందునం
జిక్కను నేల నీ కనుచుఁ జెప్పినరీతినిఁ దోఁచె నద్దియో.

ఉ॥ ఎందఱు స్వప్నముల్ గన రి కెందఱు గాంతురో యెంచిచూడ వా
రందఱి స్వప్నముల్ నిజము లయ్యెనె! యెక్కడనైనచో మహా
నందము నీయఁజాలెనె గదా! శరభార్యునిభక్తి యెంతయో
డెందము నిర్మలంబయి వసిల్లెఁ గలగ్గలు శుభావహంబుగన్.

మ॥ కల సత్యంబికఁ బాత్రలన్ గొనిరి దుర్గాదేవి నామంబునన్
బిలువంగాఁబడు భూమి బాలయకడన్ వేగన్ గడుంబ్రీతి నీ
ళ్ళులకై బావిని ద్రవ్వఁబూని రట నాలోచించి లగ్నమ్ము వా
రలు గోశాలనుగట్టి గోవులకగారం బీయు విశ్రాంతిగన్.

ఉ॥ నీటికిఁ బావిఁద్రవ్వనట నీరొకచుక్కయు లేకపోయెనా
నీటికె గొట్టముల్ జొనుపనేలయె మారకఁబోయె దానిచే
మాటికిమాటికిన్ శరభు మానసమెంతయు వేడినొంద నా
నాటను రాత్రియే జ్వరము నల్గఁగఁజేసె శరీర మంతటన్.

తే॥ అపుడె గోదుర్గ నీళ్లుల నానకుండెఁ, బ్రొద్దుగ్రుంకినదాది యీ పోకయేమొ
యెవ్వరేగిన దరికి రానీయ దకట, యంచు నౌకరి వే నివేదించుటయును.

ఉ॥ ఎట్టులొలేచి కొట్టమున కేగుచు దుర్గమొగమ్ము మూపుపైఁ
బెట్టుక గంగడోలు గడుఁ బ్రీతిగఁ జేతులదువ్వి యమ్మరో!
యిట్టులొనర్ప న్యాయమె మఱేమి యొనర్తును నీళ్లబావికై
యట్టులఁబోతి నా మనసునందలి కష్టము నీవెఱుంగవే.

ఉ॥ పెట్టితి నెంతొడబ్బుఁ గనిపెట్టుము; కాదన వట్టిగొడ్డు తా
కట్టగు నేలఁగొంట; పృథకాదొకొ? యెందుకు నీళ్ళులేనిచోఁ
గొట్టము గట్టనేలఁ బ్రతికూలము గల్గె నదేమొ తల్లి నే
నిట్టుల బిట్టువేగు తఱి యీ వెటుమానితొ తిండి నకటా.

క॥ ఆలోకించఁగ నిను నే, జాలమ్మొనరించి తంచు సాకునఁ దినవో
మీలోనేమై నంగల, హాలంబడి తినవొ తల్లి యరయఁగనేరన్.

చ॥ అనుచుఁ బొరింబొరిన్మనసునారడిఁ బుచ్చుచుఁ బల్కుచుండఁగా

వినుచును దుర్గ యా శరభుఁబ్రభువును నాకుచు మాటలాపిన్

దినియెను మేత నీళ్లు కడుఁ § దేర్పుచుఁ దా ప్రివె నికష్టు దృష్టి నా
యన పడకింటఁజేరి నిదుసరందెను హాయిగ భక్తియుక్తుఁడై.

వ॥ అంత యథావిధి నా శరభార్యుండు శుభప్రదంబైన స్వప్నం బొండు గాంచెనందు మరునాడు రేపకడ నా నేల నుదకంబు లభ్యంబగు నట్లుగాఁ దోఁచె ననంతరం బుద యంబున నయ్యనఘుండు మేల్కాంచి మొక్కి సంతసించి యుద్యమించి దుర్గా పురంబునం గల బావిలో గొట్టంబు దిగుచు నేర్పాటొనరింప నా దిగుచువారలు నిరుత్సాహు లగుచుండ నంతలో నాగంతుకంబుగా వచ్చిన పెన్నిధిం బోలె నొక్క నిముసంబున నేబదిరెండున్నర యడుగులలోతున నొక్కుమ్మడి బుగ్గ పగిలి జలధార పెల్లురేగి కన్నులపండువొనర్చి స్వప్నంబు సత్యంబై శరభార్యు నకు సంపూర్ణాహ్లాదంబు నేకూర్చె నంత.

తే॥ గోగృహంబులఁ గట్టించి § గోగృహ ప్రవేశ మొనరించి యెంతయుఁబ్రీతిపడిరి శరభయార్యుండు గోటయ § సాధు వతని, కాంత పోషితకనకదుర్గాంబసతియు.

వ॥ అనంతరం బప్పాత్రిధారు లుత్కృష్టభక్తితత్పరులై శ్రీ దుర్గామహామాత నర్చించుచు నామె పేర "పురల వర్కుషాప"ను కర్మాగారంబును స్థాపించి రద్దియును,

ఉ॥ శక్తియె సర్వసాధనము § శక్తిపురస్సరు లా త్రిమూర్తులున్
శక్తియె ముక్తికాంతే యగు § శక్తివినా ఘన సృష్టి నాస్తి యన్
సూక్తిని జాటఁగావలయుసూ ! పురలా యను యంత్రశాల నా
భక్తులచెంత నీశ్వరుఁడె § వర్ధిలఁజేసె జగద్ధితంబుగన్.

చ॥ సరసనె నండగాగ మహిషాసురమర్దని యంత్రరూపమున్
పురలగఁబొంది వర్తకము § పోషణసల్పుచు నౌత్తరాహసం
గరమునఁ బోటిరక్కసిని § ఖండనజేయుచు భక్తసంతతిన్
దరతరముల్ గదుర్దయ నుదారతఁ బ్రోవఁగ నిల్చెవెల్గుచున్.

వ॥ శ్రీమన్మహాదేవీకటాక్షవీక్షణంబుల నివ్విధంబునఁ బురల కర్మాగారంబు నిండు తేజంబున వెల్గుచుండ దుర్గానివాసభవన నిర్మాణంబునకు దేవియొక్క యను గ్రహం బగుటయు దత్పాత్రధారు లవ్విధికిం బూనుకొని యున్నతటి శరభార్యుని స్వప్నంబున ముగ్గురు దేవీమూర్తులు దర్శనంబొసంగి రవ్వారలు భ్రమరాంబ గోటమ నామంబులను దృతీయవ్యక్తి యవ్యక్త నామంబునను గోచరించి యందు భ్రమరాంబ యాత్మీయంబైన యొక్క పురాతనాభరణంబు శరభార్యునిహస్తం బుల నునిచినంత నాతండయ్యది గృహనిర్మాణంబున కేమూల సరియయ్యెడునని సంశయాకులాత్మున్ం డగుటయుఁ గోటమ భ్రమరాంబంగని భక్తుండు భవదీయా

భరణంబు వెచ్చింప సంశయింపుచున్న వాఁడనినఁ గాదుకాదని యో పుత్రీ
చాలునా ? యని సంశయింపకుము సర్వంబుం దీనసమకూరును గ్రహియిం
మభీష్టంబు సేకూరు నని యంతర్హితులై రంత వైశంబ గృహప్రవేశ మొనరిం
నాతురభవననిర్మాణకార్యక్రమంబునర్ దొందర వహియింప నొక్క స్త్రీ
పురుష వ్యక్తి స్వప్నంబునం గోచరించి యింక నలుబది యైదు దినంబులకుంగా
లగ్నంబురాదు తొందఱ యేల నని వాక్రుచ్చి యంతర్ధానుండయ్యె; నంత శ
భార్యయందు వేకువ మేల్కాంచి సిద్ధాంతినిం బిలువంబంచి లగ్నంబడుగ స్వప్నం
తథ్యంబయ్యె నప్పుడు సంతోషభరితాంతరంగుండై గృహంబు శాంతంబుగా
బూర్తి యొనర్చి సాలంకృతంబుగాఁజేసి లగ్నం బేర్పరించి యుత్సాహంబుననుం
రనంతరంబు.

చ॥ అపుడు సువాసినీతతుల యర్చనఁజేసెడి కోర్కెఁ బూరుషుల్
విపుల మనఃప్రమోదమున వీధినివీధిని గుంపులై మల్లిలిర్
దపనమెతక్క నైదువలు దక్కమిఁ జాలినరీతి దేవికిన్
గృప గలుగంగ లేదనుచుఁ గ్లేశముతోడుత నింటికేగినర్.

వ॥ ఆసమయంబున వీరశరభార్యని స్వప్నంబున.

శా॥ సాక్షాత్కారము సేసి దుర్గ నిజతేజస్స్ఫూర్తి లీలావిధిన్
సాక్షింబోలుచు స్త్రీల స్త్రీలె పిలువన్ సాగించుఁడీ యన్నఁ బ్రి
త్యక్షంబై చనుదెంచె దేవి యిఁక లెం డాలస్యముల్ మాని తా
దక్షత్వంబు వహించునామె యని యాశతం డోజ వాకుప్రిచ్చినర్.

ఉ॥ స్త్రీలను స్త్రీలె పిల్చు టది శ్రేయము భారతనీతి మీరి త
చ్ఛీలవిరుద్ధపద్ధతిని జేయుచు సిద్ధిని బొందనౌనె యిం
కేలయటంచు శీఘ్రముగ నేగెను బోషితకాప్యదుర్గ యా
వేళను జెందె నైదువల వేడ్కగ లెక్కకు మిక్కుటమ్ముగన్.

ఉ॥ అందఱుఁ దద్విధంబు వినినంతనె నెంతయు మేరలేని యా
నందము తోడఁ బొంగి చిఱునవ్వులు మోములఁ దాండవించురీ
తిం దమకంబునన్ గదలి తీరుగ దుర్గదయామృతంబునుం
జింది గృహప్రవేశమును జేయఁగఁ జేసిరి పాత్రిధారులై.

ఉ॥ పూలను గుంకుమన్ బసుపు పూజలసేయుచుఁ జీరెలిచ్చుచున్
జాలగఁ దుర్గఁదల్లినటఁ జక్కని భక్తిని గొల్చుచుండఁగా
జాలముసేయ కాయమయు సాధ్వియె తానయి యిల్లుసొచ్చి యా
వేళ స్వయమ్ము [illegible] ప్రీతిగఁ బూజల స్వీకరించెఁగా.

వ॥ ఇట్టి విశేషంబు లనేకంబులు గల యొక్కయెడ శరభార్యుండు మహోన్నతంబైన యింద్రకీలపర్వతశిఖరంబుపై నుండి గుభాలున లోయలోనికిం బడియె నప్పుడును విషూచిజాడ్యాదులయందును నప్పరమేశ్వరీపరమేశ్వరులే నిదర్శనంబుగాఁ బ్రోచి రింక.

ఉ॥ ఏమని చెప్పఁగా వలయు ఽ నెన్నిఁటిఁ జూడఁగ నౌను మాటికిన్
దాము పురాణదంపతులు ఽ తథ్యము లీలనిదర్శనమ్ములన్
బ్రేమను బాత్రధారులకుఁ ఽ బ్రీతి యొనర్చుచుఁ దమ్మె వేడఁగా
క్షేమము గూర్తు రెల్లరకుఁ ఽ జిత్రముగాఁగను భక్తి నిండఁగన్.

ఉ॥ మ్రొక్కినఁ బ్రోవలేని కడు ఽ ముక్కరమూర్తిని వేడనేల తా
నక్కజమైన పద్ధతి మహాదరణమ్మున దర్శనమ్ములన్
జక్కఁగఁ జూపు దేవతకు ఽ సాగిలి దండము వెట్టి నీవె నా
దిక్కని బత్తి హత్తుకొనఁ ఽ దేకువ వేఁడుట చెల్లియుండదే.

చ॥ శరభయకోటయార్యులకు ఽ సాధ్వికి పోషితరౌప్యదుర్గకున్
వరము నిదర్శనమ్ములను ఽ వాసియు వన్నెయు నిచ్చి ప్రోచి త
త్పురనికరమ్ము మెచ్చుకొని ఽ చూడఁగ నయ్యెడి మాత యబ్బె నిం
కరమర యేల వారికి మహత్త్వము సిద్ధముగాదె సర్వదా.

ఉ॥ అందునఁ బట్టుగొమ్మ యగు ఽ నమ్మయె వారికి మూలకారణం
బెందుకు మాతయే గద సురేంద్రుడు మూర్తులు నామెవల్లనే
చెందిరి రూపసంపదలు ఽ జీవ మొసంగుచు నెల్లవేళలన్
గందఱఁ జేయు మాత కిల ఽ గాదిలిబిడ్డలు పాత్రు లద్దిరా!

ఉ॥ అమ్మయుఁ బుత్రుఁ డొండొరుల ఽ నంద ఱెఱుంగుటె కాదు వారికే
తమ్ము గ్రహించు యోగ్యతయు ఽ ధర్మము తాలిమి దార్ఢ్య మున్నచో
నమ్మనుగూర్చి పుత్రునకు ఽ నాత్మజుఁగూరిచి యమ్మ కన్నులం
గ్రమ్మను బాష్పముల్ మదుల ఽ గల్గిన ప్రేమలు పొంగి పొర్లఁగన్.

క॥ ఆయమ్మకు నా పుత్రున, కీయవనిని దండ మిడిన ఽ నే పాపమ్ముల్
డాయఁగఁ గడు భయమందున్, సాయమ్ములు గల్గు దైవసాన్నిధ్యమునన్.

ఉ॥ అయ్యను మించు నమ్మ తనయాత్మజులందునఁ బ్రేమ నింపఁగాఁ
నయ్యది యందఱున్ దెలిసి ఽ యంబను భక్తిని బూజసేయఁ దా
మియ్యకొనంగజాల రిల ఽ నెంతటి మూర్ఖులో మార్దనం బెదన్
జయ్యన నమ్మకే గలుఁగు ఽ జాగగు నేది యొసంగ నయ్యకున్.

ఉ॥ ఇమ్మహిఁ బాత్రిధారులకు • నేమి యొసంగెనొ తండ్రి చాలఁగా
లమ్మునుండి దాసిపయి • లాభము మించి యొసంగెఁ దల్లి సౌ
ఖ్యమ్ములఁ గొద్దికాలమున • నాయమ ప్రేమ నెఱుంగఁజాల రే
యమ్మలఁ గన్న యమ్మయును • నయ్యలఁగాంచిన యమ్మ యామెయే.

ఉ॥ ఆమె గ్రహించినట్టి ఘనుసలాయతభక్తులు పాత్రిధారు లీ
భూమి సతంబు దేవిదయఁబొంది మెలంగుచు నెంతొ వేడ్కమై
యామెకు సామికిన్ నిరత • మర్చన సల్పుచు యాత్మనిష్ఠగాఁ
దా మెద నెంచి యేపనియుఁ • దల్లికిఁ జెప్పుచుఁ జేతు రెప్పుడున్.

వ॥ తత్సందర్భంబునఁ బాత్రిధారులు,

దండకము:— శ్రీమత్పరాశక్తి ! మాతా ! మృడానీ ! మహాదేవి ! నారాయ
బ్రాహ్మి ! రౌద్రి ! విశాలాక్షి ! కాత్యాయనీ ! పూర్ణమాయా ! మహావిద్య
యోంకారిణీ! దేవదేవీ! సదాకార వీవే! చిదాకార వీవే! మహానంద వీవే! ప
త్యాత్మ వీవే ! యుగాంతంబ వీవే ! యుగాలన్ని నీవేగదా ! శాంతియున్ దా
యున్ ముక్తియున్ రక్తియున్నీవె ! త్రైగుణ్యమా సృష్టియున్, స్రష్టయు
విష్ణువున్, రుద్రుఁడున్, శారదా, వైష్ణవీ, శాంభవీ, సర్వదేవాళి, నక్రంచరు
నాగులున్, లోకసంతానముల్, నీవెగాదే! మహాపూరుషున్ వశ్యుఁ గావిం
కొన్నావు తేజంబు సూర్యుం బ్రభాసిల్లఁగాఁ జేసి సూర్యుండె తా నౌచుఁ
సూర్యుఁడౌ భంగి బ్రహ్మంబునం దీవు నేకత్వముం బొంది భేదంబు లే కా
సీనవై నీవతం డౌచు సోపాధికం బందు నుత్పత్తికాలంబునన్ భేద మున్న
కల్పించి యుత్పత్తి లేన ప్పభేదంబుగా నుండి బ్రహ్మంబె సత్యంబుగాఁ జే
నిత్యత్వ మెంచంగ నీవేకదా ! తల్లి! నీ మార్దవం బెంతొ ! నీమాట నీచూ
నీచేత నిండారు ప్రేమంబునం జాల రుచ్యంబుగా నుండుఁ జల్లందనంబిచ్చు సద్భ
జేకూర్చు నాఁ జక్కెరన్ మించునాఁ జంద్రికన్ మీరు నానంద బాష్పంబు
దిచ్చు హాయిన్ మదిన్ దేలికంజేయు శాంతిన్ గడున్ వృద్ధి నొందిం
జెప్పంగ లేనట్టి చందమ్ముమైనట్టి నీ నైజరూపంబు నా దేవతాబృందమే వర్ణ
జేయలేరన్న ని న్నెంచ మే మెంత? మా కెప్డు నీ ధ్యానమే యింపు నీ గా
సొంపు నీ సేవ మాపెంపు వే శేల మా కింక సర్వంబు నీవేకదా దేవి! లోకా
కళ్యాణముల్ వొందగా నీవు నీ భక్తసంతానముల్ జాల రక్షింతు వో హా
రాశి మాయమ్మ మా యాత్మ లెల్లప్డు నీ పాదపద్మమ్ములన్నిల్వఁగాఁ జేసి
సర్వభారమ్ము నీయందె కైసేసి నిత్యంబు నీసేవకృత్యంబుగా నిచ్చి మే కృత్య
దీవె ముందుండి ధర్మైకమార్గమ్ములన్ మమ్ము నీ బిడ్డలన్ బెట్టి యీలోకమం

పైలోకమందేమి మా జన్మజన్మాలకు నీవె మా తల్లివై మమ్ము రక్షించు దేవీ!
యపర్ణా! జగన్మాత! దుర్గా! నమస్తే! నమస్తే! నమస్తే నమః.

క॥ ఈరీతిఁ బాత్రధారులు, దారెప్పుడుఁ దల్లియానఁ । దప్పక కొనుచున్
సూరిజనాదర్శకులై, సారెకు మదిభక్తిఁ బూజ । సల్పుచునుండన్.

వ॥ హూణశకంబునఁ బందొమ్మిదివందల ముప్పదితొమ్మిదవ సంవత్సరం బేతెంచె
నప్పుడు.

క॥ కామ్యవృషోత్సర్జనమున్, భూమ్యాకాశంబులంట । భూరివిధానన్
సామ్యం బిల లేకుండన్, రమ్యంబుగఁ జేసిరంత । రహిఁ దత్పాత్రల్.

ఉ॥ గోవులఁ బూజసేయుటలు । గొప్పవిశేషము; చూడ నింక నా
గోవుల దానముల్ సలుప । గూడెడి పుణ్య మదెంతొ కన్యలా
గోవులఁ బెంచి భర్తలను । గూర్చుటఁ బెండిలి నెన్న నౌనె యీ
భూవలయంబునన్ గలిగె । మూఁడును బాత్రల కింపుసొంపుగన్.

తే॥ ప్రీతి గంగాభవాని నా । విశ్వనాథ, మునకు భ్రమరాంబ మల్లేశ్వరునకు నిచ్చి
పెండిలిం జేసి యవ్వారు । వినుతికెక్క, యంబయాజ్ఞలఁ బాలించి యలరుచుండ్రి.

వ॥ ఇవ్విధంబున గోకన్యల వృషభంబుల కిచ్చి పరిణయం బొనర్చుట కామ్యవృషోత్స
ర్జనం బనఁబడు నద్దాని నొనర్చి యా భక్తులు గోభక్తిం బ్రకటించి రాగోవుల
సంప్రదాయంబు వివరించెద; నం దన్నపూర్ణకు భ్రమరాంబా విశ్వనాథులును
దుర్గకు మల్లేశ్వరుండును బర్వతవర్ధనికి గంగాభవానియును గల్గి రందు గంగాభవానీ
విశ్వనాథులకు శరభయార్యుండును, భ్రమరాంబా మల్లేశ్వరులకుఁ గోటయార్యుం
డును బరిణయం బొనర్చి వ్రతంబుం బూర్తియొనర్చి దేవిం బ్రార్థించుచు శుభం
బుల నందుచుండి రప్పుడు మూఁడవపాత్రధారిణియైన పోషితకనకదుర్గకు
స్వప్నంబులయందు దేవి యనుగ్రహంబున భావిఫలసూచనంబులు గోచరించు
చుండుటయు నొక్కనాఁ డాయమ చక్కని కలం గనియె నందు దుర్గావిలాసభవ
నంబునుండి పశ్చిమంబున సత్యనారాయణపుర రైలుస్టేషను పర్యంతముగల నేల
నిండు పందిరులఁ దృప్తిఁ జెందుచున్న బ్రాహ్మణ భోజనపఙ్క్తిం గాంచె నంత
నత్తెఱంగు పాత్రధారు లెల్లరుం గ్రహియించి యాయంబకట్టి యుత్సవం బెన్నఁడు
నెఱవేరునో గదా, శంకరఘాండరీనివాసంబునన్ గృహప్రవేశంబైన తండ్రి శ్రీ
మల్లికార్జునస్వామిని దుర్గావిలాసంబున గృహప్రవేశంబైన తల్లి శ్రీ దుర్గాదేవిని
నీ యుభయభవనంబులకు మధ్య నొక్కచో విశాలతలంబునఁ బరస్పర సాన్ని
ధ్యంబున నుంచ నెంచు మన కోరిక కిదియే సూచనం బహో యెవ్వారలే భూమి
నొసంగుదురో గదా యని యెంచుచుండ.

కం॥ గుడివాడ రామనాయుఁడు, కడవారల నునిచి యద్దె గైకొను స్థలమ్మున్
వడి నమ్మెదనని వచ్చెను, తడయక కైకొనిరి పాత్రధారులు దానిన్.

కం॥ పుడమిపతులఁ గడుదీనులఁ, గడవారల భూమిసురులఁ గల్పద్భదంబుల్
గడు వెతకిన శివసన్నిధి, కడఁగల్గునె భక్తియొకటి గల్గిన మెడలన్.

వ॥ భూమీసురులైన నప్పాత్రధారులయందును గడవారల నివాసంబైన యా న్యా
స్థలంబునందును దుర్గామల్లేశ్వరుల యనుగ్రహంబు ప్రసరించె నింక నా స్థలంబు
నవ్వారలు తమ మాతాపితలైన యా పురాణదంపతుల నునిచి సేవిం
భాగ్యంబు దిగ్విజయంబై యలరారుచుండు.

తే॥ శివుని యాజ్ఞయెలేనిది చీమయైన, బృథివిఁ గదలంగఁజాల దాఁరీతి నెఱిగి
యాయనకె సర్వమర్పించి యలరుచుండు, పాత్రధారుల భాగ్యమే భాగ్యమ

వ॥ ఇంక.

ఉ॥ కోటయ కిచ్చె స్వప్నమునఁ గూరిమి నీశుఁడు దర్శనమ్మనీ
మాటికఁ బానువట్టమున మధ్యశివుండును నిల్చినట్టుల
ప్పాటది క్రొత్తదైన గుడివాడ కులాత్మజు భూమిలోన నే
ర్పాటయియుంట భక్తిమెయి రంజిలి వా రొకనాఁడు వేడుకన్.

వ॥ మహాపరిజ్ఞానవంతుం డగు నొక్క జ్యోస్యున కాలయనిర్మాణార్హంబైన స్థల
నిర్వచించుటకై ప్రాయ నాతఁడు భళీ! కోటయార్యునకు స్వామిదర్శనం బొ
గిన ప్రదేశంబే నిర్ణయించునంత,

క॥ "పరియివేటు" దేవళమ్మని, వయినమ్ముగ పూరాణమునను బలికినదానిన్
జయమంచును శివుదుర్గను, బరియమారఁ బరితిష్ఠ నిల్ప వేడిరి భక్తిన్.

తే॥ కేవలమ్ముగఁ "బ్రయివేటు" దేవళమ్మె, కాని యన్యంబదెంతయుఁ గాదు
సంశయంబేల వినుఁడా పరిశంస యిపుడె, పరమపావనులార సద్భక్తులార!

చ॥ తెలియుఁగదా సమస్తమును దేవియు దేవరయంచుఁ బాత్రధా
రులు ఘనభక్తివేరసుల రూపుల దుర్గయు మల్లికార్జునుం
డలరి గృహాపరివేశముల నావిధిఁ జేయుట; యిట్టి సద్విధిన్
గల గృహదేవతార్చనము గాదని క్రొత్తఁగఁ జెప్పఁ జెల్లునే.

తే॥గీ॥ అంతకున్ బూర్వమందుండి యర్చనలను, విగ్రహాకారములతోడఁ బ్రీతిని
నందుచుండిన యమ్మ సాయన లగాని, నూత్న రూపులుగారని నుడువనే

తే॥ గీ॥ తండ్రి "శంకరఫౌండరీ" ◊ దనరుచుండఁ, దల్లి "దుర్గానివాసాన"◊నుల్లసిల్లు
"నిసుపురీ జతఁ"దమయున్కి◊సరసయందె, నుంచుకోరికతప్ప వేఱొండుకాదు.

తే॥ గీ॥ ఇట్టి కోరికతోడనే ◊ యట్టిభూమి,
విరివిగా నుంటకై యప్డు ◊ విలిచినారు
చూడు డదియును "పబ్లీకు" ◊ చోటు కాదు,
ధనముతోఁగొన్న "ప్రయివేటు" ◊ స్థలమె గాని.

ఉ॥ ఉమ్మడి రచ్చతావనుట ◊ కొప్పని యొక్కనిదైన చేను బే
రమ్మున నెల్ల హక్కులను ◊ వ్రాసితె "రిజిష్టరి"తోడ సొమ్ముతో
నమ్మహితాత్ము లాత్మనిల◊యమ్ముసమీపమునందు భక్తిమై
యమ్మను నాయనన్ గలసి ◊ యర్చనసేయఁగఁ బొంది రంతియే.

వ॥ గృహదేవతార్చనాకృతులైన మాతాపితల విగ్రహవిషయంబును నెల్లహక్కులం గొన్న తదాలయప్రదేశవిషయంబును దెలియనయ్యె. నింక నెవ్వారేని యందు సేవించు తెఱంగు నెఱుంగనగు నది యెట్టు లనిన.

చ॥ పిలువకయున్న రాఁదగదు ◊ పిల్చినరానగు నెవ్వరేని సే
వల కట భక్తభావమున ◊ వచ్చిన రానగుఁగాని దాయలై
కల విట హక్కు లంచు నొడి◊కంబుగఁ బబ్లికు దేవళంబుగా
ఫలమును బొందఁ వీల్పడదు ◊ బందుగుఁడైనను "లా" ప్రకారమున్.

ఉ॥ తల్లికిఁ దండ్రి కుత్సవ ము◊దారత సల్పుచునుండి భక్తిఁ దా
మ్ముల్లస మొప్పఁగాఁ బిలుతు ◊ రొప్పుగ వత్తురు మిత్రులంద రిం
కల్లరివారు వచ్చునెడ ◊ నావల నుంచుట మార్గ మద్దియే
చెల్లునుగాని భిన్నములు ◊ సెల్లవు దేవళ మేర్పరించుటన్.

వ॥ ఇంక నా ప్రయివేటుసంస్థ కేమి యాస్తి కలదనిన.

తే॥ సంస్థ గృహదేవనిలయమ్ము ◊ సంస్థలెల్ల, గృహమునవెకాని ప్రత్యేక ◊ మెట్టులగును
నింటియజమానులదియెల్ల ◊ నింటిదగును, నింటఁగలవార లవ్వారి ◊ కంటియుంద్రు.

వ॥ మఱియు.

తే॥ ప్రభువులేనియు నటువంటి◊వారలేని, యీయలేదేమి ◊ నామము ◊ లిమ్మటంచుఁ
బాత్ర లడుగరువాటికై◊వాంఛశూన్య,మీయగ్రహియింపరే కాన◊యింతయేల.

తే॥ సంస్థపేరునఁ జెయిసాచు ◊ చనవుగొనరు, జనకు లిచ్చినదానితో ◊ సలుపుచుంద
రెద్దియేనియు; సంతృప్తి ◊ నెపుడు నుంద్రు, తల్లిదండ్రులఁ బూజించు◊తలపుతోడ.

వ॥ అచటి పూజాదికవిశేషంబు లెట్టివనిన.

తే॥ తామె పూజింతు రొకవేళఁ దప్పనపుడు, పరుల ననుతురు పూజాది సేవసల్పఁ
గాని యవ్వారి కెందేని గలుఁగ వెపుడు, వరుస వంశపు హక్కులౌ పనులు సేయ.

వ॥ మఱియు నా దైవతముల కైంకర్యాదికంబుల వాహనారూఢులై బయల్వెడల
సందర్భం బెట్టిదనిన వాహ్యాళివంటిదే గాని యన్యంబుఁ గాదని యెఱుఁగునది
అందులకు రాజబాటల నుపయోగించు హక్కు లెట్టివనఁ బాత్రిధారులు తమ
నివాసాదికంబులకుం బన్నుగట్టుచుందు రట్టిచోఁ దా ముత్సాహపురస్సరంబుగా
దమ జననీజనకుల వాహ్యాళిం గొనిపోవ రాజబాటల నుపయోగించు స్వతంత్ర
గలవార లవ్వారిగృహంబున నితరసందర్భంబులఁ దమ యాత్మీయులఁ బురస్క
గించినచోఁ దద్గృహంబున నితరజనంబులకు హక్కు గలదని చొరవడనగునే
కావునఁ బాత్రిధారులు దమ జననీజనకులవిషయంబునను నట్టివిధంబె వర్తిం
జేయుచుందు రందుచే వేరొండువిధంబునఁ "బబ్లికు" దేవాలయవిధానం బెవ్వరే
యీ దేవాలయంబునకుఁ బ్రయోగింప నర్హత లే దీరీతిం బాత్రిధారులు గృహ
దేవతార్చనముం బ్రతిష్ఠించి తత్కార్యకృత్వంబు వంశపరంపరాగతంబగున ట్లొసఁ
భక్తిపరతంత్రులై యుందు రింక భూమిపైఁ గీర్తి శాశ్వతంబుగా నిల్పి పృథివి
దాముమ్నంతకాలంబు ప్రతిష్ఠాపకులకు స్వర్గనివాసం బొసంగు సప్తసంతానంబుల
బూర్తిచేయ తలంపుం బొంది పాత్రిధారు లందులకుం బ్రథమంబున

తే॥ ములుగు వంశంబునకు నెల్ల ముఖ్యుఁడైన, పాపయారాధ్యపండితప్రవరుఁడెపుడొ
భక్తితోడ దేవీభాగవతము దెల్గుఁ, జేసె నద్దాని ముద్రింపఁ జేయుచుండ్రి.

ఉ॥ మున్నుగ శక్తిసంగతుల ముచ్చట నచ్చొనరింపఁ బూని రిం
కెన్నఁడు శక్తి లోటగునె! యీశ్వరి మందిరమందు నిల్చి సం
పన్నులఁ జేసి ధర్మపథవర్తన మిచ్చి యశంబుఁ గూర్చి కై
కొన్నది వారి బారములఁ గోరిక, నెంతటి పుణ్యవంతులో

ఉ॥ ఉద్ధరణ మ్మొనర్చుటయె యొప్పఁగఁ బూర్వపువారిఁత గొత్రలా
పద్ధతులందుఁ గావ్యముల వ్రాయఁగఁ జేయుటకంటె నందులో!
శ్రద్ధ వహించి శక్తినిజసంగతిఁ దెల్పఁగ బూనుకొన్న స
ద్బుద్ధి శతాధికమ్మయిన పుణ్య మొసంగు నటన్న సబ్రమే!.

ఉ॥ వారు తరింతు రేమియు వివాదము లేదికఁ బూర్వ మెన్నఁడో
కోరికతోడఁ దెల్గు నుడికూర్పుపసందుల నమ్మవారిచె
ల్వారఁగ జూపినట్టి ములుగన్వయ పాపయశాస్త్రి కీర్తిశా
రీరముఁ జూపి యెల్లరఁ దరింపఁగ జేసిరి యంతవార్పరా,

ఉ॥ ఆ యమరావతింగల మహాంధ్రమహేంద్రసభాంతరంబునం
దాయన జీవభంబయి మహాకవిపండితవజ్రరత్నమై
కాయము వెళ్ళబుచ్చె నలకైతల దేవిని బూజసేయుచున్
ధ్యేయుఁడు గాఁడె తెల్గుకులధీరుఁడు పాపయశాస్త్రి నేఁటికిన్.

ఉ॥ పుచ్చిన తెల్గుగుండెలకుఁ బూర్వపువ్రాతలె జీవ మిచ్చు నా
యచ్చ తెలుంగుఁబోటరి మహాకవి పాపయశాస్త్రికైత నే
డచ్చునఁ గ్రుద్దెఁ జచ్చువడినట్టి తెలుంగున జీవరేఖ తా
నిచ్చెను వేడిరక్త మభిషేకించుచుఁ దెల్గులపూర్వసంస్మృతుల్.

చ॥ పొరిపొరి గుండె లాడవొకొ పోయిన సత్కవిఁగూర్చి వెండియున్
గరువము గల్గదే తెలుఁగుఁగైతల ముద్దియ దిద్దుపెద్ద భూ
సురుఁడని మానసంబులను జూడవె తెల్గుల యేలుఁబళ్ళు సం
బరమునఁ బాపయార్యుని యపారమహత్త్వకవిత్వసంపదన్.

చ॥ సరసపుకైతదేవి ! నిను జాలెను బాపయశాస్త్రి ! నేడిఁకన్
దిరుపతి వేంకటేశకవిధీరులలో నొకఁడైన వేంకటే
శ్వరుఁ డల చెళ్లపిళ్లకులచంద్రుఁడు లేఖకదోషముల్ పరి
ష్కరణము నేఁడు చేసి నిను జక్కఁగఁ జూపును మాకు బాపురే.

మ॥ రవియున్ గానఁగలేని మర్మముల సర్వస్వంబు గాలించి స
త్కవియే జాతికి బోధ సేయుఁ దనవౌ కావ్యంబులం దట్టి యా
కవి కాదర్శకుఁ డెవ్వఁ డంబకథ మున్ గావించెనో తెల్గు నా
కవిరాడ్వంద్యుఁడె దిద్దుఁ బాపయకృతోద్గ్రంథంబు తల్లేఖనిన్.

ఉ॥ హూణతమస్సునన్ నిదుర నుండినజాతిని మేలుకొల్పి సం
త్రాణనముం బొనర్చి కవితాసతి దిద్దుచుఁ దెల్గువెల్గులో
వాణినిఁ జూపి దిగ్విజయభాగ్యమునందిన వేంకటేశుఁడే
రాణఁ జెలంగ నీ కథ హూరంగుల నింపిన లోప మేమగున్.

చ॥ నిరతయశశ్శరీరములు నిర్మలభావము లార్యు లెందరో
సరసకవిత్వసంపదలఁ జాటిరి వారికి నేఁడు వెల్గు నా
తిరుపతివేంకటేశకవిధీరుల కవ్విధి నున్న వారికిన్
నరునగ మొక్కి యీ తెలుఁగువారలకైన ఋణమ్ము దీర్చరే.

తే॥ గీ॥ మఱియు నవ్వారి నెన్నడు మరువనీక, వారిరచనల ముద్రించుపావనాత్ము
లైన యిప్పాత్రధారుల ననిశ మవని, సంస్మరింపంగఁ జెల్లదే సరసులార!

వ॥ ఇట్లామహాత్ములైన పాత్రిధారు లాపాపయారాధ్యుని దేవీభాగవతం బచ్చా త్తించుచుండిరి; మరి నీ శ్రీపరమశివానందలీలారచనవిషయం బెఱింగినదియె కదా; యింక దేవీకటాక్షంబున దద్భక్తులగు వీర లెన్ని పురాతనగ్రంథంబు లచ్చొ రింపనలయునో యెన్ని నూత్నకావ్యంబుల రచియింపంజేయనలయునో యెవ్వ రెఱుక? యింక సప్తసంతానంబుల మరికొన్నిఁ బ్రతిష్ఠించి రావిధం బెట్టిదనిన.

తే॥ గీ॥ మకరలగ్నాన రేవతిఁ ♦ మార్గశీర్ష, శుక్ల మేకాదశిఁ స్థిరసుదినమందు
నిష్ఠఁ జేసిరి కూపప్రతిష్ఠ వారు, పాత్రిధారులు వృషనామసంవత్సరమున.

వ॥ మఱియు నా భక్తు లాలగ్నంబుననే బహుళపక్షంబున రోహిణీనక్షత్రయుక్త ప్రతిపత్సహిత దేవగురువాసరంబున నారామప్రతిష్ఠ గావించి రింక నంతయు నా మహేశ్వరీమహేశ్వరుల యధీనంబుగావున నాజనకులయానలం బ్రవర్తించుచు దత్పాత్రిధారులు దుర్గానివాసంబున నిశ్చితభక్తితో నుందురు దాని నెఱుంగునది.

ఉ॥ వాణియు లక్ష్మియుం గలసి ♦ పాత్రిలజీవితమందు వంతులన్
వాణియె భారతాస్తికత ♦ వైష్ణవి నిత్యధనంబు సర్వదా
పోణిమి నత్త కోడ లనుపోరులు లేక యొసంగుఁ బెద్దమై
రాణ చెలంగ దుర్గ యవునా! యన దానపరత్వ మీయఁగన్.

వ॥ ఇట్లు నిరతదానాభిరతులై పాత్రిధారు లంబాసాన్నిధ్యంబున నివసించు నా దుర్గావిలాసంబున మహేశ్వరుఁ డేణవిలాసుఁ డగుట నేమో యేణంబులు గన్నులపండువుగా సంచరించుచుండు నయ్యది నంద్యాలనివాసి యగు మహానందయ్య గారివలనఁ బాత్రిధారులు వడయగల్గి రా యేణంబుల రాముఁ డను బాలుం డు స్తన్యపానం బొనరించు నప్పుడు తక్క తక్కినకాలంబుల దుర్గాదేవిసన్నిధి నిలిచియుండు నహో జంతువులకును జగన్మాతయందుఁ గలభక్తి యపారముగదా! యింక

ఉ॥ ఏణవిలాసులై తనరు ♦ నీశుని కంబకు ముద్దుఁగూర్చి వి
న్నాణముతోడ భక్తిని ♦ దినంబును గొల్చుచు నేణనేత్రిలం
దాణిమెఱుంగుపూసవలె ♦ నా గృహమందున నయ్యె నిత్యక
ల్యాణము పచ్చతోరణము ♦ లాయమ పోషితకావ్యదుర్గమే.

వ॥ దుర్గానివాసం బీరీతి నిత్యకల్యాణంబులచే శోభిల్లుచు నందుకు దోహదంబుగా బ్రతివత్సరంబును శరన్నవరాత్రంబుల నుత్సవంబులందు నేత్రపర్వంబు సేయుచుండు.

ఉ॥ ఏపటి వాడిపోయి సగమెండిన మామిడితోటయైన దు
ర్గాపురి వే చిగుర్చ...

శ్రీపరిరంభణంబుల వాసింపఁగ వచ్చు వసంతుఁ డద్దిరా!
దాపున దుర్గ యుండెను గదా యిది సంభవమాట యబ్రిమో!

వ॥ ఆ శరన్నవరాత్రంబులఁ బాత్రధారులు ముప్పుర దేవీరూపంబుల మొత్తంపు రూపంబైన పరాశక్తిని నధికభక్తివిశ్వాసంబుల శాస్త్రచోదిత విధానంబున నారాధించి యానందింతు రప్పుడు.

ఉ॥ ముప్పురు దేవులుర్ గలయు మొత్తపురూపము నంబఁ జూడఁగా
దవ్వుల నందురే మిగుల ధన్యత నందఁగ దేవదేవికిఁ
బువ్వుల పూజసేయుచుఁ బ్రమోదము నందుటకై నిలింపులుర్
రివ్వున దూకి రారె ఘనరీతిని నా నవరాత్రులందునర్.

వ॥ సకలసురనివాసంబైన యా దేవీనివాసంబగు దుర్గానివాసంబున.

సీ॥ ఒకమారు వాణిగాయక సార్వభౌమవాగ్గేయ కారకదివ్యగీతి నిలచు
ఒకసారి శ్రీదేవి వికసించి ధనధార, నర్థుల దోసిళ్ల నవతరించు
ఒకతూరి యచలపుత్రిక మైదువులపూజ, కనువిందుగాఁ దానె కానిపించు
ఒకవేళ బ్రహ్మరాణికిఁ దోడు జ్ఞానమ్ము, హరికథాగానమధురిమఁ జిలుకు

తే॥ విష్ణు వనిశంబు శాత్రవజిష్ణుఁ డగును, దవిలి నటరాజు సంధ్యలఁ దాండవించు
వార కెవ్వేళ దుర్గానివాసమందు, నలరి నవదుర్గ యందరి కంబ గాఁగ.

వ॥ ఈరీతి నవరాత్రమహోత్సవంబులం జరపి నిరంతరానందడోలాసమాలోలచిత్తు లగుచుఁ బాత్రధారులు దీపావళిని నా దుర్గానివాసంబును దీపకాంతిం దేజరిల్లం జేయ నయ్యది విక్రాంతించు రుద్రతేజంబురీతి బయల్వెడలి యచటి కొండకన్నియం బొంది దుర్గావిలాసంబున గజానన కార్తికేయాది మహావీరజననసూచనంబుగా శోభిల్లుచుండు నిప్పటికి శ్రీ పరమశివానందలీలానాటకరంగంబునఁ బాత్రధారుల కార్యక్రమంబునందు హూణశకంబునఁ బందొమ్మిదివందల నలుబదియొకటవ వత్సరంబు నిండె నింక దేవీకటాక్షంబున.

ఉ॥ పాత్రల జీవనౌక శుభవార్ధిని భక్తితరంగడోలలన్
శాత్రవషట్కనక్రముల శాంతిసుకర్ణికఁ ద్రోసి యోగస
ద్యాత్రల నాత్మదర్శనము నందుచు హాయిగ నూగి రేబవల్
మిత్రులు భక్తులుర్ జదువ మేదిని శాశ్వతవృత్త మిచ్చుతన్.

కం॥ ఈ కథ విన్నం జదివిన, నీ కలి నీశ్వరియు నీశుఁ డెవ్వరినేనిం
గైకొని తమ భక్తులుగా, సాకుచు సతతంబు సకలసంపద లిచ్చున్.

మంగళమహాశ్రీ

శ్రీకరము సూరిజనసేవనము భక్తకులజీవనము కైతలకు గీర్మణి
లోకహితకారణము లోలకిల ధామమును లుబ్ధులకు సిగ్గొసగు సీర్తి
బాలికృతులు బాగుపడు వర్తనపుబోధనము పాత్రలకుఁ దోడునయికావ్య
బీ కలిని దాటుటకు నీశ్వరియు నీశ్వరుఁడు నెల్లపుడు బ్రోచుత శుభోక్తిన్.

—◆ గద్య ◆—

ఇయ్యది శ్రీ భారద్వాజసగోత్ర మంగమాంబా వేంకటప్పార్య పుత్రాంజనేయ
వరప్రసాదలబ్ధ కీర్తి, కేశవభొట్ల సుదర్శనవేణుగోపాలమూర్తి ప్రణీత
శ్రీ. పరమశివానందలీలలందుఁ
సర్వంబును
బంచమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ దేవ్యై నమః

# ప్రస్తావన

దేవీభాగవతమునుగూర్చి పండితులకు దెలియని విషయములు ఎన్నియో లేవు. అదియుంగాక గ్రంథప్రాశస్త్యమును గూర్చియు కొన్ని ముఖ్యములైన ఇతర అంశములనుగూర్చియు బ్రి॥ శ్రీ చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారును ఇతరులును విస్తరించి యున్నారు. కాని దేవీభాగవతమును పామరులుగూడ అధికముగా పఠించుచుందురుగాన ప్రధానముగా వారి యుపయోగమునకే కొన్ని విషయము లిందు ప్రస్తావించితిని.

దేవీభాగవతము ఒక పురాణమని అందరును చెప్పుచుందురు కాని పురాణమన నేమో దాని ప్రాముఖ్య మెట్టిదో చాలమందికి తెలియదు. వేదములు, శాస్త్రములు, ఇతిహాసములు మాత్రమే ప్రధాన పఠనీయగ్రంథము లనియు, పురాణములు తక్కువతరగతికి జెందిన గ్రంథములనియు కొందరికొక యభిప్రాయము గలదు. కాని పురాణములప్రశంస వైదికవాఙ్మయమునందే కలదు. దీనినిబట్టి వాని ప్రాముఖ్యము తెలియుచున్నది. అథర్వవేదమందు (15-16) ఇతిహాస, పురాణ, గాథల, ప్రస్తావన గలదు. శతపథ బ్రాహ్మణమునందు (XIV—VI—10-6) కూడ ఋగ్వేద యజుర్వేద సామవేద అథర్వవేద ఇతిహాస పురాణ ఉపనిషత్ సూత్రముల ప్రశంస కలదు. తైత్తిరీయ ఆరణ్యకమునందుకూడ (II - 9) పురాణవాఙ్మయము వేదములతోను, ఇతిహాసములతోను జేర్పబడినది. ఛాందోగ్యోపనిషత్తునందు (VII)

> స హోవాచ ఋగ్వేదమ్ భగవోఽధ్యేమి
> యజుర్వేదగ్ సామవేద మాథర్వణమ్
> చతుర్థ మితిహాస పురాణమ్ పంచమమ్
> వేదానాం............''

అని చెప్పబడినది.

మనుసంహితయందుకూడ (III - 232) పురాణప్రశంస కలదు. దీనినిబట్టియే పౌరాణిక వాఙ్మయము అనాదియనియు వైదికవాఙ్మయమునందుకూడ దీనిప్రాశస్త్యము గణ్యత కెక్కిన దనియు స్పష్ట మగుచున్నది.

పురాణములు క్రీ. వె. 6 వ శతాబ్దమునందు అనగా నిప్పటికి దాదాపు 1300 సంవత్సరముల క్రితము రచియింపబడి యుండునని పాశ్చాత్యు లభిప్రాయపడుచున్నారు.

పురాణముల రచననుగూర్చి భాగవతమునందే యీ క్రిందివిధమున నున్నది.

భాగవతము :

"ఆరుణి, కాశ్యప, సవర్ణి, అకృతవర్ణ, సంపప్రియన, హారితి. ఆరుగురు పౌరాణికులు. వారు వ్యాసశిష్యుడైన మా తండ్రివద్దనుండి పురాణమును నేర్చుకొనిరి. వారు మాతృకమైన సంహితను జదివి ఒక్కొక్క రొక్కొక్క ప్రత్యేక సంహితను రచించిరి.'' వ్యాసునినుండి ప్రథమమున రోమహర్షణుడు లేక లోమహర్షణుడు పురాణమును నేర్చుకొనెనని ఆతనినుండి యితరు లందరు నేర్చుకొనిరని భాగవతవ్యాఖ్యానకారు డగు శ్రీధరస్వామియు, అగ్నిపురాణమును చెప్పుచున్నవి. కాబట్టి పాశ్చాత్యులు చెప్పినట్లు పురాణము లంత యర్వాచీనగ్రంథములు గావని స్పష్ట మగుచున్నది.*

కాని సాత్త్వికపురాణములలో రెండవదిగ నెన్నబడు భాగవతము వైష్ణవ గ్రంథమగు శ్రీ భాగవతమా! లేక దేవీభాగవతమా అని యొక్కచర్చ అనాదినుండి గలదు. శ్రీభాగవతము అసలు వ్యాసప్రోక్తమే కాదనియు, యాదవ వంశరాజగు రామచంద్రదేవుని కాలమున బరగిన హేమాద్రి వద్దనుండిన పండితులలో నొకడగు వోపదేవుడు రచించెననియు గడాకాశీనాథ భట్టు అనునొక కాశీపండితుడు వాదించి దుర్జనముఖచపేటిక యను నొక గ్రంథము రచించెను. దీనిని ప్రతిఘటించుచు భట్టోజీదీక్షితుని శిష్యుడగు రామస్వామిపండితుడు మరియొక గ్రంథమును రచించెను. రామస్వామి పండితుని వాదమును నిరసించుచు దుర్జనముఖపద్మపాదుక యను మరియొక గ్రంథముగూడ గలదు.♦ ఈ గ్రంథములను సమగ్రముగ పరిశోధించినయెడల దేవీభాగవత ప్రాశస్త్యము చక్కగ బోధపడగలదు.

---

* పురాణముల సంఖ్య అష్టాదశ యనియు అవి సాత్త్విక, రాజస, తామసంబు లని మూడు తెగలను జెందినవనియు అంద రెరిగిన యంశము.

పురాణములనుగూర్చి యింకను దెలిసికొనగోరువారు ఈ క్రింది పట్టికను గమనింపవచ్చును.

1. విల్సన్ : విష్ణుపురాణము (విల్సన్ దొరగారి పీఠిక).
2. బోస్ : శ్రీకృష్ణుడు, అతని జీవితము, అతని బోధలు.
3. కె. సి. కంగీలాల్ : పురాణముల తత్త్వము.
4. కె. నారాయణస్వామి అయ్యర్ : పురాణములు, ఆధునిక భౌతిక విజ్ఞానము.

♦ ఈ విషయము నింకను పరిశోధింప నుద్దేశించినయెడల క్రింద పేర్కొనిన గ్రంథములను చూడనగును.

1. విల్సన్ : విష్ణుపురాణము, పీఠిక
2. బర్నఫ్ : భాగవతపురాణము, పీఠిక
3. లయల్ : యేషియాటిక్ రీసెర్చెస్
4. లాస్సెన్ : ఇండియన్ యాంటిక్వారీ సం 4
5. బెల్వాల్కర్ : సంస్కృతవ్యాకరణమతములు (Systems of Sanskrit Grammar)

ఇక దేవిని గూర్చి యొకింత జ్ఞాపకము చేసికొందము. దేవినామములు అనంతములు, ఆమె రూపములు అనంతములు; కాని చతుర్దశరూపములును భక్తులు బాగుగా నెఱిగినవే. 1 దుర్గ, 2 దశభుజ, 3 సింహవాహిని 4 మహిషాసురమర్దని, 5 జగద్ధాత్రి, 6 కాళి, 7 ముక్తకేశి, 8 తార, 9 ఛిన్నమస్తక, 10 జగద్గౌరి, 11 ప్రత్యంగిర, 12 అన్నపూర్ణ, 13 గణేశజనని 14 కృష్ణక్రోడ, యీ రూపముల ధ్యానింపబడు దేవీమూర్తుల లక్షణములు పురాణములందును ఆగమములందును తంత్రములందును విశదీకరింపబడియున్నవి. దేవీగాథలు, అద్భుతచర్యలు ముఖ్యముగా స్కాందపురాణమునందును, మార్కండేయపురాణమునందును, వామనపురాణమునందును, లింగపురాణమునందును, వరాహపురాణమునందును వర్ణింపబడియున్నవి. అధ్యాత్మరామాయణమునందు గూడ దేవీప్రస్తావనయు, ఆమె అద్భుతకార్యముల వర్ణనయు గలదు. మహాభారతమునందు అర్జునోక్తమయిన దేవీస్తోత్ర మొకటి గలదు. * గ్రంథ విస్తరభీతిచే పండితులకు కరతలామలకములైన పై విషయములను విస్తరింప బూనుకొనను.

ప్రాచీన శిల్పులు ఎంతో అందముగ దేవీమూర్తిని శిలయందు తీర్చి దిద్దగల్గిరి. అట్టిశిల్పమును జూచిననే చాలు - దేవీభక్తి యీ కాలమున నెంతవ్యాప్తియందుండెనో స్పష్టమగును. ముఖ్యముగా ఎల్లోరాగుహలయందున్న దేవీమూర్తియు మయూరభంజ్ సంస్థానమునందు ఖిచింగ్ నందుదొరికిన, దేవీమూర్తియు నైజాము యిలాఖా నాందేడుజిల్లాయందు ముఖేడునందు దొరికి ప్రకృతము కలకత్తా

---

* పురాణములను ఇతిహాసములను చదివి యర్థము చేసికొనలేనివారు కేవలము ఇంగ్లీషు గ్రంథములపైననే యాధారపడి దేవీప్రభావము నొకింత తెలిసికొనవచ్చును. అట్టి ఆంగ్లగ్రంథములు సమగ్రమైన యభిప్రాయమునుగాని సక్రమమైన దృష్టినిగాని కలుగజేయ లేక పోయినను దేవీగాథలయందును దేవీప్రభావమునందును అభిరుచియైనగల్గించి సరియైన గ్రంథములను జదువ ప్రేరేపింపగలవు.


**Dowson** : Dictionary of Hindu mythology
**Kennedy** : Hindu mythology
**Moore** : Hindu Pantheon
**Garret** : Classical dictionary of India
**Coleman C.** : Hindu mythology
**Coomaraswamy and Nivedita** } Myths of the Hindus and Buddhists
**Ellis E. S.** : 1000 Mythological characters briefly described
**A. B. Keith** : Indian Mythology
**Mackenzie B. A.** : Indian Myth and legend
**Max Muller** : Contribution to the Science of Mythology
**Mc Donnel M. A.** : Vedic Mythology
**Rodrigues E. A.** : Hindu Pantheon
**Wilkins Rev. W.T.** : Hindu Mythology

మ్యూజియమునందున్న మూర్తియు, మధ్య హిందూదేశమునందున్న నాగోడసంస్థానము నందున్న భూమారాయందు దొరికిన దేవీమూర్తియు ప్రాచీనశిల్పమున సుప్రసిద్ధములు. వీనిఛాయాచిత్రము (ఫోటో)లను జూచిననుగూడ శిల్పిసామర్థ్యము వ్యక్తమగును.

*  *  *  *

దేవీభక్తి అంతకంతకు నశించుచున్నది. దైవభక్తియే, ఆస్తికత్వమే నశించుచున్న యీ రోజులలో భక్తి యనిన అదియొక పొరబాటుగనో దురలవాటుగనో పరిగణింపబడుచున్నది. కాననే శ్రీ బేతపూడి వీరశరభయ్యగారును శ్రీపుచ్చా కోటయ్యగారును వారి ధర్మపత్నియు ఆదర్శప్రాయముగ మనోవాక్కాయములచే దేవ్యారాధనను సల్పుచు దేవీభక్తిని పండితులయందును పామరులయందునుగూడ పెంపొందించుటకు అసమాన ప్రయత్నములు జేయుచుండుట కడు ప్రశంసనీయము. వీరి ప్రయత్నములు సర్వతోముఖముగ నున్నందున తప్పక సఫలము లగు ననుటకు సందియము లేదు.

శ్రీ వీరశరభయ్యగారి భక్తితత్పరతలు వారి సౌజన్యమునకును సుగుణ సంపదకును వన్నెబెట్టుచున్నవి. తమ సర్వస్వమును దేవీ ప్రసాదమునకై ధారవోసిన త్యాగి యితడు. దేవి యనుగ్రహమును బడయుటకై తన జీవితమునందలి ప్రతి సందర్భమును విమర్శించి కార్యాచరణకు గడంగిన నిగ్రహశాలి యితడు.

శ్రీ పుచ్చా కోటయ్యగారును వారి ధర్మపత్నియు ఆదర్శగృహస్థులని వేనకువేలు చాటి చెప్పగలరు. ఆదర్శగృహిణి లభించినందులకు శ్రీ కోటయ్యగారు ధన్యులు. ఆమెయు అజ్ఞానులకు, స్త్రీ మహత్వ మెఱుగనివారికి, అబలగాని, నిజముగ మహాశక్తి సామర్థ్యములు గల భక్తురాలు. ఎంతమందికో ఆమె మార్గదర్శినియైనదనుట యంద ఱెఱిగిన విషయమే.

ఈ భక్తాగ్రేసరులకు తమ ప్రస్తావన యంతగా రుచింపదు. అందుననే నాకును వారికినిగల పరిచయమువలన నా యభిప్రాయములను విశదీకరించుటయు గూడ కొంత యనౌచిత్యమున కాస్పద మిచ్చునేమో! కనుక నింతటితో విరమించెద.

దేవీభక్తి పెంపొందుగాత!

శ్రీ రాజా రంగయ్యప్పారాయ
కలాశాల, బెజవాడ,
5—10—1942.

ఇట్లు,
పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు.
M. A., Ph. D. (Lond.)
Principal.

శ్రీ పరత్పరదేవతాయై నమః

# ఉపోద్ఘాతము.



మే మాంధ్రీకరింప మొదలిడునప్పటికి మేమే ప్రప్రథముల మనుకొన్న

క॥ [ఎన్నిపురాణమ్ములఁ దా, మన్నిటి నాంధ్రీకరించి యనుకంపఁగ గా
కున్నఁగ దీనిఁగ విడుతురె, నన్నయభట్టాది కవిజనమ్ములు మాకుఁగ]

(మా దేవీభాగవతము చూడుఁడు.)

దేవీభాగవతాంధ్రీకరణకర్త లిప్పటికి నల్వురుగాఁ దేలిరి. అందు మొట్ట మొదటివారే యీ

ముల్గు పాపయారాధ్యులవారు.

వీరు సుప్రసిద్ధజమీందారులుగ గుంటూరు మండలములోని అమరావతీ పుణ్యక్షేత్రమును రాజధానిగాఁ జేసికొని యేలిన శ్రీవాసిరెడ్డి—

వేంకటాద్రి నాయఁడు

గారి కాలమందును, వారి దత్తపుత్రుల కాలమందును నున్నవారని యీ గ్రంథములోని వంశావతారమునందలి—౮౧-౮౨-౮౩ సంఖ్యలు గల పద్యముల వల్ల నవగతమయ్యెడిని. నర్సారావుపేట జమీనుదారులు శ్రీమలాౘిజు గుండా రాయణింగారును ఈ వేంకటాద్రినాయఁడుగారును సమకాలీనులైనట్లు కొన్ని యితిహాసములు గుంటూరుమండలమునందలి పెద్దలవలన విని యుంటిని. ఉభయులును ధర్మప్రభువులే యైనను వేంకటాద్రినాయఁడుగారి ధర్మదీక్ష సమకాలీనుఁడగు శ్రీ మలాౘిజు గుండా రాయణింగారే మెచ్చుకొనుచుండెడివారని వినికి. అందొకటి యుదాహరింతును. గుండారాయణింగారికిని నాయఁడుగారికిని బావమఱఁది పరియాచకమఁట! ఆపరియాచకపుఁ బ్రసంగములో నీయుదాహరించెడి వాక్య మొక్కటి; గుండారాయణింగా రిట్లనువారఁట:—

బావా! నేను మృతిఁజెందినచో.........దుఃఖింతురు, నీవు మృతి చెందినచో బండితులును కవులును దుఃఖింతురు.

ఆ యీవాక్యమువలన వేంకటాద్రినాయఁడు గారెక్కుడు విద్వత్పక్షపాతి యనియు దేవబ్రాహ్మణభక్తితత్పరుఁ డనియు విస్పష్టపడును. అయినను తోడి జమీనుదారుని నోటనుండి వెలువడిన దన్నచో నిక వందిమాగధాదులవలన నెన్ని రెట్లుగా వ్యవహరింపఁబడెడిదో ఆకాలమందలి విజ్ఞులకుఁగాని యిప్పుడు మనకు గోచరింపదు—ఏజమీందారునినోట నీనుతి వెలువడినదో ఆయనకూడ సామాన్యుఁడు

కాఁడు. ధర్మపురుషుఁడే——కావుననే ధర్మతత్పరత్వము నభినందించెను. గుంటూరు సమీపమునందలి చేబ్రోలులో——

బ్రిహ్మాలయము

స్వయముగా నేను సందర్శించినదే. అట నూఱువఱకు నాలయములు శ్రీ వేంకటాద్రినాయఁడుగారు నిర్మింపఁజేసి పూజాపురస్కారములకు వసతు లేర్పఱచి రనియు నిపు డందులో నేకొన్నిటికో తప్ప ధూపదీపనైవేద్యాదులు జరుగుట లేదనియు నిప్పటికి సుమా రిరువది సంవత్సరములకిందట మే మాగ్రామమునందలి పెద్దలవలన వినియుంటిమి. బ్రిహ్మాలయ మెచ్చటను లేనిలోటుతీర్చుటకై ఆయూరిలో (తఱచుగా లేవుగాని యుత్తర దేశమం దొకటను గోదావరీమండలములో, ఓదూరులో నొకటను గలదని యెఱుఁగునది. ఈయూరు దాక్షారామునకు సమీపము) బ్రహ్మకుఁ గూడ నాలయనిర్మాణాదులు జరిపిరి. అది యిప్పటికిని గలదు. ఇతర దేవాలయముల వలెఁ గాక యీ ఆలయ మొక చిన్నకోనేటిలో నున్నయది. వేయేల ? యీ వేంకటాద్రినాయఁడుగా రిచ్చిన యగ్రిహారాలకును, చేసిన దానధర్మములకును మితి యున్నట్లే లేదు. ఈయన సాక్షాత్తుగా ధర్మపురుషుఁడే అని చెప్పికొందురు. శ్లో॥ నరః పతితకాయోఽపి యశఃకాయేన జీవతి'. ఇట్టివారు జమీందారులలో నెందఱో యుండరు. శసివారపుపేట——

ధర్మాప్పారాయణింగారి

పేరే పేరు, ఈయనపేరే పేరు. ఈజంటలో వేంకటాద్రినాయుఁడుగారే కొంచెము పూర్వులు. ధర్మకార్యములకు సంబంధించిన యితిహాసముల కిరువురు నిరువురే. దేవతాభక్తి తత్పరత్వమున కిరువురు నగ్రిగణ్యులే. ధర్మాప్పరాయణింగారి ప్రాణోత్క్రమణసమయమునకు సూర్యమండలము భేదిల్లిన దని చెప్పుకొందురు. (అప్పారావుస్వామిసన్నిధిబైఁ టే" చూ) వేంకటాద్రినాయఁడుగా రెక్కుడు శివపూజా ధురంధరులనియు వారికి భగవంతుఁడు తోడునీడగా నుండువాఁడనియు సామాన్య ముగాఁ జెప్పికొనుమాటలు వినుటయే కాక నిన్నమొన్న నొక యితిహాసముకూడ వింటిని. అది చెప్పినవారు ప్రస్తుత మీదేవీభాగవతమును కేవల పారమార్థికబుద్ధితో నచ్చొత్తించుచున్న శ్రీ పుచ్ఛాకోటయ్యా

శ్రీ బేతపూడి శరభయ్యా

గార్లే. నావలెనే వారుఁగూడ దీని నెవరివల్లనో వినియుందురు. ఆయితిహాస మియ్యది. వేంకటాద్రినాయఁడుగారిని నాఁటి నైజా మేదోమిషమీఁద నాహ్వానించి పిమ్మట బందీగా బంధించికూడఁ దగుమర్యాదలు జరుపుచుండెడివాఁడనియుఁ బరమ శివభక్తాగ్రేసరులును మహాకవివతంసులును నగు నీపాపయారాధ్యులవారు ప్రతిదిన మును శివపూజ నిర్వర్తించుకొన్న పిమ్మట పూజానేటికలో సంస్థానపుష్పే మనమా

చారములు వ్రాసి యాతాళపత్రము భద్రముగా నిడెడివారనియు నయ్యది శ్రీ వేంకటాద్రినాయఁడుగారి శివపూజాకాలమునకుఁ బూజాపేటికలోనికి వచ్చి యుండెడిదనియు దానిం జదివికొని శివపూజానంతరము తమ క్షేమ సమాచారములు వ్రాసి తమ పూజాపేటికలో భద్రపఱచువారనియు నీ తాళపత్రముగూడ శ్రీ పాపయారాధ్యులవారి కిదే విధముగ · నందుచుండెడి దనియు నాయీ విషయ మప్పటి పాదుషాకుఁ (తపిసీలుగా పేరు తెలియదు) దెలియవచ్చి యిది యెట్లు జరుగుచున్న దని శ్రీ నాయఁడుగారిని బ్రశ్నింపఁగా మా యిష్టదేవతానుగ్రహ మని నాయఁడుగారు వచించి ప్రత్యక్ష మొనరించిరనియుఁ బిమ్మట వారిదేవత పేరిట నా కాలములో సా॥ ౧కి సుమారు మూఁడువేల రూపాయీల రాబడి గల యగ్రహారము నొసఁగిరనియు నయ్యది యిప్పటికిని నా దేవాలయమునకు జరుగుచున్న దనియుఁ బరమభక్తాగ్రేసరు లగు శరభయ్యగారు వచింపఁగా వింటిని. ఇట్టిదే "ముక్తిద్వారము తల్పుతీయఁగదె" అను పద్యపాదమునకు సంబంధించిన యితిహాసము వేఱొకటి కలదు. అది తత్ప్రస్తావనలో నుదాహరింతును. నేనుగూడ నిట్టి చరిత్రలయందు నమ్మిక గలవాఁడ నగుటచే నిందుదాహరించితిని. (అస్తిచే న్నాఽస్తికో హతః) నిక్కములే యైనను ఇట్టి గాథలు నేఁటినాగరకులలోఁ బలువురు విశ్వసింపరు. భవతు, వేంకటాద్రినాయఁడుగారును వారి గురువులును,పరమ శైవాగ్రగణ్యులును శివభక్తిపారమ్యము నందినవారునన్నంతవఱకేని యేకవాక్యతగా లోకము విశ్వసించుట కభ్యంతర ముండదని నే నిం దీ గాథ నుదాహరించితిని.

ఈ యారాధ్యకవిప్రవరుఁడు వేంకటాద్రినాయఁడుగారి సభలోనుండు కవి (తొమ్మండుగురుకవు లున్నట్లు వినికిడి మాత్రము కలదు. ఈయన పేరును "బుచ్చివెంకు" అనెడి కళావంతుని పేరును మాత్రమే నాకుఁ దెలియును) నవకములో నగ్రపూజ్యుఁ డని వింటిని. పాండిత్య కవిత్వ ప్రయుక్త గౌరవమే కాక యీ కవిశిరోమణి యం దితర గౌరవముకూడ నాయఁడుగారి కున్నది. అయ్యది పంచాక్షర్యుపదేశ ప్రయుక్త గురుత్వ ప్రయుక్తము. వేంకటాద్రినాయఁడుగారి ప్రభుత్వ కాలముగాని యీ గ్రంథరచనాకాలముగాని యిప్పటికి నూఱువత్సరములకన్న మించియుండెడిని. నాయఁడుగారు 1756 సం॥ జననమంది 1816 సం॥లో స్వర్గస్థులైనట్టు లీ పాపయారాధ్యులవారి రచనయే యగు

స ర్వ మ ధు ర

మనెడి అచ్చతెలుఁగు కబ్బపుఁ బీఠికయందు కీ॥ శే॥ లు తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు వ్రాసియున్నారు. అందే యిమ్మహాకవి శతాధిక గ్రంథకర్త యని కూడ వ్రాయుటయే కాక కందుకూరి వీరేశలింగంపంతులవారు ప్రకృత కవినిగూర్చి పడిన యపోహను (సలక్షణకవి కాఁడనెడి దానిని) సోపపత్తికముగా

ఖండించి యున్నారు. దేవీభాగవతాంధ్రీకర్తలలో నీయన మొదటివారు. రెండు త్రిపురానతమ్మయదొర, మూఁడవస్థానము మాది- నాల్గు శ్రీ దాసు శ్రీరామ కవిగారు. కాని మాభాగవతము ముగిసినపిమ్మటఁ జాలకాలము వ్రాఁతప్రతిగానే యుండవలసి వచ్చుటచేఁ బ్రప్రథమమునఁ బాఠకలోకమున కందిన గ్రంథము శ్రీ దాసువారిది మాత్రమే. శ్రీరామకవిగారు వారి గ్రంథములో మా పేరెత్తి కొనుటచేతఁ [చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీవరులన్ " చూ.] గాని లేకున్నచో మేము తుట్టతుదివారము కానలసి వచ్చెడిది. ఏలూరిలో నొకపరి శ్రీరామకవి గారును మేమును గలిసికొనుట తటస్థించినపుడు మా మా గ్రంథములలోని పద్యము లన్యోన్యమును వినుచుట ప్రసక్తమై వా రట్టు లుటంకించిరి. ఆ యీ విషయము శ్రీరామకవిగారి భాగవతమునకు నేను వ్రాసిన పీఠికలో విస్తరించియుంటిని. వలయు వా రందుఁ దిలకింపఁగల రని యిందు స్పృశించి విడిచితిని. ఆ యీ దేవీభాగవతము నాంధ్రీకరించినకవు లెల్లరును భగవద్భక్తు లైనను ప్రకృత గ్రంథకర్త యెక్కుడు భక్తుఁడని చెప్ప నొప్పెడిని. ఈయన శ్రీమద్భాగవతమును పోతరాజుగారి వలెనే యీ భాగవతమును గొంత పెంచియున్నారు. అంతియకాదు, ఆ భాగవతమునందలి పద్యములవంటి పద్యములను గూడఁ గొన్నిటిని భక్తిరస ముట్టిపడునట్లు విరచించి యున్నారు. దిఙ్మాత్ర మిట నుదాహరింతును:—

సీ॥ అఖిలాండజననినిత్యార్చన లేనట్టి కొంప గాదది కోళ్ళగంపగాని
త్రిపురసుందరి తృప్తిదీర్పని యన్నిచు సిరులు గావవి కొండచఱులుగాని
ఆదిశక్తినిగూర్చి యర్చనల్పనివాని కేలుగా దది బండికీలుగాని
అంబిక నెప్పుడు నభినుతింపనివాని నోరు గాదది కట్టెవేరుగాని
తే॥ గీ॥ భగవతి కొసంగలేని దుర్భగుఁడుగూర్చు, ధనము గాదది నరకసాధనముగాని
ధారుణీశ్వర ! తెలియంగలేరు జనులు, తల్లి జగదంబ నతకల్పవల్లి సుమ్ము.

(శివ స్కంధము)

సీ॥ రాజరాజేశ్వరీరంజకంబులకన్న వ్యంజకంబులు సత్త్వభంజకములు
భువనేశ్వరీతత్త్వబోధకంబులకన్న సాధకంబులు పుణ్యబాధకములు
నారసింహీగుణ ప్రేరణంబులకన్నఁ దారణంబులు జన్మకారణములు
విశ్వేశ్వరీమూర్తివీక్షణంబులకన్న రక్షణంబులు పాపభక్షణములు
తే॥ గీ॥ సమరసానందసుఖవర్తనములకన్నఁ, గీర్తనంబులు పరలోకనర్తనములు
ఘోరసంసారవారాశిఁ గూలినట్టి, జనులకును నావ యఖిలాండజననిసేవ.

(శివ. స్కంధము)

సీ॥ ఈశ్వ రేశ్వరికటాక్షేక్షణంబులు మోహారణ్యోభయా ర్త సంరక్షణములు
ఈశ్వ రేశ్వరికటాక్షేక్షణంబులు ఘోరభవభీతిదుర్మార్గభక్షణములు
ఈశ్వ రేశ్వరికటాక్షేక్షణంబులు నవ్యచిత్తసంబోధనాశిక్షణములు
ఈశ్వ రేశ్వరికటాక్షేక్షణంబులు మహాదురితదావాగ్ని సంధుక్షణములు
తే॥ గీ॥ స్వమతసిద్ధాంతవాచావిశాలభేద, బోధబోధకజననపరిభేదజనన
ధర్మకర్మతజిహ్వాకాతక్షణంబు, లీశ్వ రేశ్వరి సత్కటాక్షేక్షణములు.

(శివ స్కంధము)

తక్కిన పద్యములు గ్రంథమందే చూచికొందురని యుపేక్షించితిని. ఎక్కడఁగాని మూలములో నున్న యంశములను వదలినట్లు లేదు. సూత్రప్రాయముగా నున్న మూలములోని యనేకాంశములకు నీయన యనువాదము భాష్యప్రాయముగా నుండును. ఋతువర్ణనములు, సూర్యోదయాదివర్ణనములు, లోనైనవి తారసించినపుడు స్వకపోలకల్పితముగాఁ గూడ నీయన కొంత పెంచినట్లు పొడకట్టెడిని. మొత్తము మీఁద సంస్కృతములో గ్రంథపరిగణనము చేసిన రీతిని పరిగణించునెడల నించుమించుగా నిదికూడ పదునెన్మిది వేల గ్రంథముగ నుండెడి నని నాకుఁ దోఁచినది. దాసు శ్రీరామకవిగారి గ్రంథముకూడఁ గొంత విస్తరింపఁబడినను నంతకన్న నిదియే విస్తృతి నొందినట్లు నాకుఁ దోఁచినది. ఈయన విద్వత్కవిగాని కేవల కవులతరగతి లోనివాఁడు కాఁడు, కవిత్వము తఱచు తత్సమపదభూయిష్ఠమే. పాక మెటనేని నారికేళపాకముగఁ గన్పట్టినను సర్వసాధారణముగాఁ గదళీపాకములో నుండును. కొంచెములో నిముడు నంశము గొప్పలో వ్యాఖ్యానించుటయే యీయనకభిమతము. ఏదో విశేషణము చేర్పకుండ నీయన యేమాట గాని వాడరు. ఆ యీకారణము లచే గ్రంథము మఱింత పెరిగి యుండును. ఎక్కడఁ జదివి చూచినను వాణి మిక్కిలి రసవంతముగ నుండును గాని ఆస్వాదకులు సంస్కృతమందుఁ గూడఁ బ్రవిష్టులుగా నుండవలయును. కొలఁది కాలము నాఁటిదే యైనను గ్రంథము స్వహస్తలిఖితము ముద్రాపకులకు దొరకలేదు. శిథిలమగుచున్న కాగితములు పిఠాపురపుగ్రంథమండలి వారికి దొరకినట్లును వారు శుద్ధిచేసి ఆకాగితములం బట్టి యొకప్రతి వ్రాయించి భద్రపఱిచినట్లును ఆ ప్రతి యెట్లో త్రిపురానసూర్యరాయకవిగారు జాగ్రత్త పెట్టినట్లును (ఈ సూర్యరాయ కవిగారు దేవీభాగవతానువాదకులలో నొకరగు తిమ్మన దొరగారికొమాళ్ళు) వారివల్ల శరభయ్యగారు సంపాదించినట్లును దెలిసినది. ఏమైనను గ్రంథ మిటీవలివారిమార్పులకుగూడఁ జాలవఱకు గుఱియైన యనంతరమే శరభయ్య గారిచేతికి వచ్చినది. ఇంతలో నీ దేవీభక్తుఁడు శరభయ్యగారనెడి యొక రీపుణ్యాకార్య మునకుఁ బూనుకొనుట కేవలము దైవాదేశము. అట్లే కానిచో నీమహాగ్రంథము కొలఁదికాలములో నంతరించెడిదే. ఈయన ఆరాధ్యుఁడే కాక దేవీభక్తుఁడు కావున

నారాధకశిరోమణి గూడ నగుటచేత నీ దేవీభాగవత ప్రకటన ద్వారమున సప్పరా
శక్తి యనుగ్రహమును సంపాదించుకొని తాను దరించి మఱికొందఱు దేవీభక్తులను
గూడఁ దరింపఁజేయుటకై (ఏక స్స్వాదు న భుంజీత)యీ మహాకార్యమునకుఁ బూను
కొననే గాని దీనివలన లేశమును ధనార్జన మొనర్చు తలఁపుతోఁ గాదు. ప్రతివత్సర
మును శరన్నవరాత్రములలో నీ భక్తుఁ డొనర్చు సమారాధన మిఱువదివేలకన్న
నెక్కుడుజనమును దృప్తిపఱచుచున్నది యనియు నాదినములలో నొనర్చు సువాసి
న్యర్చనము ("సువాసిన్యర్చసప్రీతా" చూ) చూచి తీరవలసినదే యనియుఁ బలు
వురు బ్రాహ్మణోత్తములు చెప్పఁగా వింటిని. అంతమాత్రమే కాదు. ఈయన
యొనర్చు పుణ్యకార్యము లింకను జాలఁ గలవు. వానింగూర్చి ముందు వివరింతును. ఆ
యీ పుణ్యకార్యమునందు నాకు జోక్యము కల్గుకారణము శ్రీ చుండూరి వేంకట
రెడ్డి షాహుకారు. ఆయనకు నే నంకితముగా రచించిన—

శివభక్తి

యను పుణ్యకావ్యమును వినుచుటకై బెజవాడకు వెళ్లి యీ పని ముగిసిన
పిమ్మటఁగూడ నాయలఘుని యాదరాతిశయమున సుమారు రెండుమాసము
లచ్చటనే యుంటిని. ఆదినములలో గ్రంథాలయ ప్రెస్సులో నాయీ—

దేవీభాగవతము

అచ్చగుచున్నదని విని దానిం దిలకించుటకై ప్రెస్సువారి నడిగితిని. వారు
శరభయ్యగారికిఁ దెల్పి నా కొసఁగిరి. అప్పటికి రెండు స్కంధములు మాత్రమే
ముద్రిత మైనవి. అవి చదివి యానందించుచుండఁగా నా యీ ముద్రణ భారమును
నిర్వహించుచున్న శరభయ్య (వీరిని వీరశరభయ్య అనియు వాడుదురు)గారే నా
యున్నచోటికి కరుదెంచి దీని సంస్కరణభారము నాపైఁ బెట్టిరి. ఏవిధమైన శక్తియు
లేకున్నను ఆయన యొనర్చు పుణ్యకార్యమునందలి యాదరాతిశయముచే సప్పరా
శక్తియే నాకుఁగూడ దీనిసంస్కరణమునకుం దగిన శక్తి యొసంగితీరు నను పూర్ణ
విశ్వాసముతో నంగీకరించితిని. అప్పుడు నాతో వచ్చిన పరివారములో మా పిన
తండ్రి కొమారుఁడు చిన వేంకటశాస్త్రి యల్లుఁడు చి॥ ఓలేటి సూర్యనారాయణ
శాస్త్రి కూడ నా యొద్దనే యున్నాఁడు. అతనింగూడ నీ సంస్కరణమునకుఁ దోడుగా
దీసికొని మూలమును జూచియు శ్రీ దాసువారి యనువాదమును మా యనువాద
మును దోడుచేసికొనియు శక్తిలోపము లేకుండ సంస్కరించితిని. ఇంకను లోపములు
నిల్చినచో నయ్యవి నావిగా విమర్శకులు భావింతురు గాక. బెజవాడలోనే తృతీయ
చతుర్థ, పంచమస్కంధములు సంస్కరించి యచ్చున కిచ్చితిని. ఆ యీ గ్రంథము
చాలవఱకు మార్పుచెందియే శరభయ్యగారి కడకు వచ్చినదిగాని స్వస్వరూపముతో
రాలేదని లోఁగడనే వ్రాసితిని గదా! ఆ కారణమున దీనిని సంస్కరించునప్పుడు

## కవి హృదయ

మేదో తెలిసికొనుట చాలఁ గష్టసాధ్యమని వ్రాయనక్కఱలేదు. అట్లయ్యును- "భుజంగఏవ జానీతే భుజంగపదసర్పణమ్" కనుక నెట్లో హృదయము నెఱింగియే సంస్కరింపఁగలిగితి నని తృప్తిపడు చున్నాఁడను. ఆయీ మహాకవి సర్వమధుర మనియెడి అచ్చ తెలుఁగు కబ్బమును రచించె నని లోఁగడ లిఖించి యుంటిని. దీని యందు దానిపై రుదాహరింపకుంటచే దానిరచన దీనిరచన కిటీవలిది యని మన మనుమానింపవచ్చును. ఈయన స్వతంత్రరచన మాకబ్బమునందే కాక మఱికొన్ని టియందుఁ గూడఁ బాఠకులు తెలిసికొన వచ్చును.

శా. భక్తత్రాణధురీణమాఁ గద! భవత్స్వాంతంబు వేదాంతని
ర్నిక్తం బీమహిమం బటంచు గురు నిర్ణీతి న్మది న్నమ్మి శా
స్త్రోక్తాచారపరుండ నైతిఁ ద్రివిధవ్యూహాంతమైనట్టి నీ
ముక్తిద్వారము తల్పు తీయఁగదె చాముండా! జగజ్జీవనీ! ౧

శా. భోక్తవ్యంబు శివప్రసాదమని సంబోధించువారికి సదా
వక్తవ్యంబు శివాఖ్యమంత్రమని సంభావించువారికి మనో
వాక్త్రైక్యనిరూఢి నీవయని సేవావృత్తి నున్నాఁడ నీ
ముక్తిద్వారము తల్పు దీయఁగదె చాముండా! జగజ్జీవనీ! ౨

శా. శాక్తాచారధురీణచక్రిక సమస్తాచ్చసిద్ధశుద్ధక్రియా
దాక్తాస్వాదన మోదనప్రవణ విద్యావిత్ప్రసంవేద్యతా
భాక్తల్పాంతిక తాళవృంత కలనావ్యాపారినై నిల్తు నీ
ముక్తిద్వారము తల్పు దీయఁగదె చాముండా! జగజ్జీవనీ! 3

శా. రక్తాంభోరుహగర్భసోదరకళారాజ్యమానారుణా
లక్తాంకంబగు నీ పదద్వయము ఫాలస్థాయిగాఁ జేసి య
ర్వ్యాక్తత్త్వంబుల మీఱఁగోరితిఁ గృపాపాథోనిధానంబవై
ముక్తిద్వారము తల్పు దీయఁగదె చాముండా! జగజ్జీవనీ! ౪

శా. శుక్తిభ్రాంతుఁడు రౌప్యనిశ్చయము గాంచుంగాదె? యప్పోల్కి న
వ్యక్తత్వానుభూతి సర్వసురులం గ బ్రార్థించు మేలెద్ది? శ్రీ
వాక్తన్వంగులచే బనుల్గొను మహావాల్లభ్య మేఁ గంటి నీ
ముక్తిద్వారము తల్పు దీయఁగదె చాముండా! జగజ్జీవనీ! ౫

శా. యుక్తాయుక్త విచారదూరులకు నుస్సద్యోగం బలభ్యం బిసీ!
భిక్షాపాత్రుఁడనంచుఁ ద్రోచెదె? కృతార్థీభూతుఁ బ్రోవేల? తి
ర్యక్తుల్యుండ జడుండ న న్మనుచు పెంపొందినన్ యశంబౌఁగదా?
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౬

శా. భుక్తుల్ స్వానుగుణంబుగా నొసఁగు స్వైర్యాభారసారాళి యు
దిక్తంబై కల దెంతయైన నమృతార్థిన్ నన్ను వీక్షాసుధా
సిక్తం జేయఁగనోపునే యది? భవత్సేవాప్యహాఁ గాన నీ
ముక్తిద్వారము తల్పు దీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౭

శా. వక్తుంకామతఁ దావకీనవిజయవ్యాపారతారావళుల్
వాక్తంతుచ్ఛటఁ గ్రుచ్చి దిగ్గజగతిప్రారంభముల్ సేతు నా
వక్తృత్వం బెడలించి విస్మిత తన్నూభారంబుగాఁ జొచ్చె నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౮

శా. రక్తస్రోతము లుర్వి నేరులయి పాఱన్ జండముండాదులా
నక్తంచారులఁ గూల్చి గాసిలితి వానందించి యస్మన్మనః
ప్రక్తాపంబులుదీఱఁ బాదములు సంవాహింతు మే లెంచి నీ
ముక్తిద్వారము తల్పు దీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౯

శా. సక్తంబయ్యె మదీయచిత్తము బృహత్సంసారపంకాబ్ధి న
వ్యక్తాతీతభవత్కటాక్షలహరీసవాక్పూరసంస్ఫీతిచే
సిక్తం బౌనటు లార్చి కింకరతచేఁ శిక్షావిధిం గూర్చి నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౦

శా. శక్తుల్ డస్సియు నింద్రియావళి దురాశాపాశసంయుక్తి ని
ర్ముక్తాపావ్రిజమట్ల యాత్మవిషయామోదాంబుధిన్ మున్గె నే
యుక్తింజేసి తరింపఁ జేసెదవొకో? చిత్తంబు నాభాగ్యమై
ముక్తిద్వారము తల్పు దీయఁగదె! చాముండా! జగజ్జీవనీ. ౧౧

శా. భక్తాదుల్ ధనధాన్యసంపదల నభ్యర్థింతురే? యట్లు నీ
భక్తిం గోరుచు నున్న నా కితరథాప్రాప్తవ్య మింకేది? నీ
దృక్తారాపరిసరపరితాపములఁ బాతీభూతునిం జేసి నీ
ముక్తిద్వారము తల్పు దీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౨

ఏకపాత్రితతో రచింపఁబడిన యీ యిరువదియేడును భార్యావియోగము కల్గినపు డీమహాభక్తుఁడు రచించినట్లు జనశ్రుతివలన నెఱుంగనయ్యెడిని. (విస్తరభీతిచే నిటఁ గొన్నిటినిమాత్రమే చూపితిని) మఱియు నిమ్మహాకవి తన యవసానమును గుఱితించి రచించిన పద్యములుకూడ (17) పదియేడు లభించినవి—

శా॥ ప్రస్థంబెక్కి ఝురీలునర్ జఱియ జార్ఱ వచ్చుఁ గాలాహిచే
దుస్థంబైనను వామలూరువున కేఁ ల్దూర్చంగవచ్చున్ దవా
గ్ని స్థానంబుల నిల్వవచ్చు మది సంస్థింపంగరా దిమ్మహా
ప్రస్థానావసరంబు డాసె దరిఁజేర్పన్ నీవెసూ భ్రామరీ!

శా॥ ఆర్థన్ జాఠరపూరణార్థినయి విద్యాగర్వ దుర్వ్యాప్తి రా
జస్థానంబుల మల్లడిఁగొనుచు నీకై కాసింపలే కన్యథా
వస్థన్ జెందుచుఁ ద్రాగి మొగ్గినటులై వట్రిల్లె నెట్లో మహా
ప్రస్థానావసరంబు డాసె దరిఁజేర్పన్ నీవె సూ భ్రామరీ!

శా॥ ఆస్థేయం బని యన్యదైవరతి చిత్తాంతంబు గాకుండ భ
క్తిస్థేమంబునఁ బాఱఁదోలిన ఘనుల్ జేర్పంగనైనాఁడ స
ర్వస్థాలిన్ మెఱుఁగుండదే? కృపకుఁ బాత్రీభూతుఁగా నిమ్మహా
ప్రస్థానావసరంబు డాసె దరిఁజేర్పన్ నీవెసూ భ్రామరీ!

శా॥ ఖస్థుండైన రసాతలస్థుఁడయినన్ గట్టుగుఁడై కాలుఁ డా
త్మస్థానీయుని జేయకుండఁడుగదా మన్నించి దుగ్ధాబ్ధి మ
ధ్యస్థానీయముఁ జేర్చెదో? మదపరాధం బెంచెదో! యిమ్మహా
ప్రస్థానావసరంబు డాసె దరిఁ జేర్పన్ నీవె సూ భ్రామరీ!

శా॥ ప్రస్థాదుల్ స్వసమానమానములఁ గార్యంబుల్ సమర్థించి నా
కిస్థావర్యము మెచ్చు పుట్టఁగ నుపాసింపంగలేనైతిఁ బ్రే
ష్ఠస్థైర్యాస్పద వంచు నమ్మి మది శంకన్ బాసియుంటిన్ మహా
ప్రస్థానావసరంబు డాసె దరిఁజేర్పన్ నీవె సూ భ్రామరీ!

శా॥ అస్థిస్రక్కులు తారహారములు భస్మాంకంబు కాశ్మీరజ
న్మస్థాగిత్వము నిందిరాలగతి గానంజేసె నేమందు? న
మ్మా! స్థిత్యంతర మే నెఱుంగనుగదమ్మా! యెట్టులమ్మా? మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పన్ నీవె సూ భ్రామరీ!

శా॥ అస్థానార్కసుతాముఖారితనయావ్యాసంగదృఙ్మందహా
సస్థానాస్యవినిర్గళన్మధురవాచాచర్చలం దేర్చి కూ

టస్థైకీకృతిఁ గూర్చెదంచు మది వేఁడుక న్నమ్మితిం గా! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పన్ నీవె సూ భ్రామరీ !

శా॥ ప్రస్థానస్పృఘ్ఘనతార్థనీయముగదా ? పాథేయ మేతాదృశ
ప్రస్థానంబునకున్ ద్వదీషణము సంభావ్యంబు తల్లేశ లే
శస్థేయం బెఱుఁగంగనైతిఁ గడ తేర్చన్ దిక్కులే దిమ్మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పన్ నీవె సూ భ్రామరీ !

శా॥ స్వస్థావేశముచేఁ బిశాచులఁ గలంచన్ నేరఁ బాతంజల
ప్రస్థానత్రయ ముఖ్యశాస్త్రముల నభ్యాసిజ్ఞుండ యోగాదులం
దస్థాన్నుండను దత్త్వనిశ్చయము లేదయ్యెన్ గదమ్మా ! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పన్ నీవె సూ భ్రామరీ !

శా॥ అస్థూలాదివపుర్విభేదమున విశ్వాదిప్రభేదంబు మ
ధ్యస్థాత్మప్రవిభేదము న్గెడపి లింగైక్యానుసంస్ఫూర్తి స
త్త్వస్థాయిత్వసుఖానుభూతి కరుణింపన్ వేళ సుమ్మా! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పన్ నీవె సూ భ్రామరీ!

శా॥ అస్థూలాల్పకుటీనిభం బగుచు మేను నానమ్రమై చంచలా
వస్థాపన్నత నొంది కుంది చరమావస్థోచితం బయ్యె న
మ్మా ! స్థాపత్యుఁడ నాదుఁ జేర్చుకొనవమ్మా! పీడకమ్మా! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పన్ నీవె సూ భ్రామరీ !

శా॥ ఆస్థానీశులు హస్తివాజిరథకోట్యాపత్తి సంపత్తులం
దస్థేయ స్తతఁ ద్రోవఁబట్టి జముపాలై పోదు రింకేల? యే
మాస్థన్ జేసెద మేనిపై; సమయ మమ్మా! రాఁగదమ్మా! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పన్ నీవె సూ భ్రామరీ!

శా॥ "తస్థౌ స్థాస్యతి తిష్ఠతీద"మను నర్థం బార్యుల్ వేడఁగా
"తస్థౌ స్థాస్యతి తిష్ఠతీద మఖిలం ? తద్విద్ధి"యం చాడి రం
తస్థానర్థం బది యెట్టిదో ? కనమి సంతాపింపఁగా నిమ్మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పన్ నీవె సూ భ్రామరీ !

శా॥ ఆ స్థాలీభవుఁ డబ్ధిసప్తకము నేకాపోశనం బౌనటుల్
గా స్థాపించెదఁ గుక్షి నట్టు లఘుపంకం బెల్ల మాయించి సిం
హ స్థారిన్ దుమికించి వేగ నిటురమ్మా! పట్టినమ్మా! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పన్ నీవె సూ భ్రామరీ!

శా॥ ఆస్థాణూపమ దైవతంబు నిఖిలాండజాండంబు ముక్తిప్రదుం
డా స్థాణుండు తదీయసత్త్వ భవదాశ్రయత్వంబు నీ చిత్తమీ
మై స్థాణుత్వము గాంచె నిట్లు తగదమ్మా! యెట్టు లమ్మా! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పవే నీవె సూ భ్రామరీ!

శా॥ స్వస్థాత్మప్రజశేఖరార్పితము నీ పాదంబు "హస్తస్తవా
యస్థేయం" బని చాటుచున్నవి శ్రుతుల్ హర్షానుమర్షాప్తి చి
త్తస్థాపుత్యరుణాంగ నర్తనమునన్ దాక్షించవమ్మా! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పవే నీవె సూ భ్రామరీ!

శా॥ "నస్థాతుం నచగంతు మక్షమతయా కైన్నైరాశ్యబుద్ధ్యా మయా
తస్థే హే కరవాణి" యంచని మనోదైవస్వముల్ గాంచి యం
భస్థ స్నంబో లవణంబనైతి గనవమ్మా! రాగదమ్మా! మహా
ప్రస్థానావసరంబు డాసె దరిజేర్పవే నీవె సూ భ్రామరీ!

ఆ యీ పద్యములలో నేకొన్నిటియందో తప్ప సహృదయాహ్లాదకమైన భావమున్నట్లు గోచరింపదు. దుష్కరప్రాసముతో నున్న మకుట మగుటచే నేభావము గాని యిముడుట కష్టసాధ్యమని వ్రాయనక్కఱలేదు. అయినను "జీవతః కవేః ప్రతిష్ఠవ్యం" కనుక శ్రీపాపయారాధ్యులవారి జీవితకాలములో విన్నవారెవరేని యెవరికేని దెల్పినచో నాశ్రితృజనపరంపర మెచ్చుటనేని యున్నచో వారివలన నిందలిరహస్యము గ్రహింప వలనగునని ఆ యీ పద్యము లిందుఁ జేర్చితిని. ఈపద్యములే కాదు. లోఁగడ నుదాహరించిన—'ముక్తిద్వార' పద్యముల విషయముగూడ నిట్టిదే యని చదువరు లరయుదురుగాక - గ్రంథకర్తృ స్వహస్తలిఖితమైనది దొరకకుంటచే నిందుఁ గొన్ని ప్రమాదములుగూడ నుండవచ్చును. కొన్ని సవరించితిని. కొన్ని సవరింప లేకపోతిని. "క్షంతు మర్హంతి సంతః".

దుష్కరప్రాసముతో నిన్నిపద్యము లిట్టిధారతో విరచించు మహాకవి పాండిత్య మెట్టిదై యుండునో సహృదయులు పరిశీలింతురుగాక! సంస్కృతాంధ్ర భాషలలో నెందఱో మహాకవు లున్నను వారిలోఁ గొందఱు మాత్రమే భక్తులు. సంస్కృతకవులలో—

(1) లీలాశుకుఁడు (2) జయదేవుఁడు (3) నారాయణతీర్థులు

వీరు భక్తకవులు. ఇఁక నాంధ్రమునందో?

పోతరాజుగా

నొక్కరే భక్తకవిగాఁ గనుపట్టుచున్నారు. పదకవులలో, త్యాగరాయాదులు పలువు రున్నను బ్రకృతపరిసక్తి పద్యకవులకు సంబంధించినది. ఆయనవంటి కవి

'న భూతో న భవిష్యతి'

అన్న చోఁ గాదనువా రుండరు. నన్నయాదులు శ్రీనాథాదులు కూడ భక్తులే యైనను పోతరాజుగారికే యీ పేరు దక్కుటకుఁ గారణము భాగవతమునందు భక్తికి సందర్భించిన ఘట్టములయందుఁ దన్మయత్వ మగుపట్టుటయే. ప్రకృత కవి వతంసుని కవిత్వమునందుఁగూడ నట్టి సువిశేష మాయాఘట్టములయందు గోచరించును. కావున నీయనను రెండవ పోతరాజని సంభావింపనగు. సహృదయులు పరిశీలింతురుగాక. ఇమ్మహాకవి రచించిన యితరగ్రంథముల పేళ్ళు కొన్నిమాత్రమే సర్వమధురగ్రంథపీఠికవలనఁ దెలియవచ్చినవి. వాని నిట నుదాహరింతును.

(1) కళ్యాణచంపువు, (2) ఏకాదశీవ్రతచంపువు, (3) ఆర్యాశతీశివస్తోత్రము. ఈ మూఁడును సంస్కృతభాషాకావ్యములు. ధారాధారాళతకై పై గ్రంథములనుండి ఆపీఠికయందుదాహరించిన శ్లోకములలో మూఁడిట్యేడ నుదాహరింతును.

శ్లో॥ హరిచందన మనులింపే, త్యుక్తే రపశబ్ద శేముషీం మాగాః
అపశబ్దో౽ప్యపశబ్దో, న స్యా దపశబ్ద ఏవహి సుశబ్దః.

(కళ్యాణచంపువు)

శ్లో॥ కతి నహి భువనాని బ్రహ్మణా నిర్మితాని, ప్రథితసుగుణశోభాభాసమానాని సంతి
తదపి సకలసంపత్సద్మవేధో౽ణ్డరాశే, ర్వినిహితమణిపేటీ రాజతే మధ్యలోకః॥

(ఏకాదశీవ్రత చంపువు)

శ్లో॥ శాటీకృతచర్మాణం, ఘోటీకృతనిగమ మసమకర్మాణమ్
కోటీరదమృతసూతిం, పాటీరదనంగభూతి మాటీకే॥

(ఆర్యాశతీ శివస్తోత్రము)

ఆ యీ శ్లోకముల శైలిని బట్టి యీ కవివతంసునకు సంస్కృతభాషారచనయం దెంతటి నిరాఘాటప్రజ్ఞ యున్నదో సహృదయులు నిర్ణయింపఁగలరు. అచ్చతెలుఁగులోఁ బ్రత్యేకించి

స ర్వ మ ధు ర ము ను

రచించుట, అచ్చ సంస్కృతములో సుప్రసిద్ధకావ్యములు రచించుట, ఈ రెండును నిమ్మహనీయుని నా రెండు భాషలలోఁ బరమోత్కృష్టుఁ డని వక్కాణించుటకుఁ బూర్తిగాఁ దోడ్పడుచున్నవి. ఈయనను నేటికాలపుఁ గవులలో నొకరగు చల్లా పిచ్చయ్య శాస్త్రిగారు—

"అరరె ? అభినవకాళిదాసాంకితుని మహాకవిని ముల్గుపాపయప్రాజ్ఞవరుని" అని పేర్కొనుటచే నీ యలఘునకు—

అభినవ కాళిదాసు

అనెడి బిరుద మున్నట్లు ధ్రువపడెడి. (ఆయా బిరుదము కాళీభక్తుఁడైన మహాకవియగుటచే వచ్చినదని తోఁచెడిని. భాగవతచంపూనిర్మాతకే కాక మఱి కొందఱు కవులకుఁగూడ నీబిరుద మున్నది.) మఱియు—

సర్వమధుర

గ్రంథపీఠికయం దుదాహరింపఁబడిన యేతత్కవివిరచిత వేమనారాధ్య చరిత్రమునందలి—

'సరసరుచిసాంద్ర! సంగమేశ్వరకవీంద్ర!'

అనెడి పద్యపాదమువలన నీపాపయారాధ్యులకు సంగమేశ్వరుఁడనెడి వేఱొకపేరు గూడ నున్నట్లు స్పష్టమగుచున్నది. సర్వమధురగ్రంథ పీఠికలో—

సంగమేశ్వర

నామమే తల్లిదండ్రు లిడిన నామ మని ధ్రువపఱుపఁబడినది. ఆ గ్రూ నామ ధేయము వీరి పితామహునిదే యనికూడఁ దెలుపఁబడినది. ఈదేవీభాగవతగద్య మునందేమి లోకమునందేమి యీమహాకవి పేరు—

పాపయారాధ్య

లనియే విస్పష్టముగా నవగతమయ్యెడిని. (ఇది పాపాయి యను ముద్దు పేరునుండి వచ్చినదేమో అని నాయూహ.) ఈ యుభయసామానాధికరణ్యము తేజస్తిమిరములవంటిది కాకుంటచే నిందునుగుఱించి విశేషించి చర్చింప వలసి యుండదు. లోఁగడ నుదాహరించిన "ముక్తిద్వారము తల్పు తీయఁగదె! చాముండా" అను పద్యములకుం గల ప్రసక్తి యీ క్రిందియితిహాసమువలన విస్పష్టమయ్యెడిని. ఆయీపాపయారాధ్యులవారి సహధర్మచారిణి లింగైక్యము నందినప్పుడు పై మకుట ముతో నిరువదియేడు పద్యము లాశువుగా రచించి భార్యకు ముక్తి కల్గుట కివి సాధనము లనియెడి నమ్మికతో నున్న ఈ మహాభక్తశిఖామణియెడల నసూయాపర వశు లగు తోడిసంస్థానకవులు కొందఱు—

"ఇక్కడ నీయనపద్యములు చెప్పి తల్పు తీయు మన్నంతటిలో నాలోకమ్మునఁ దల్పులు వీడునా? సంగీతమునకు చింతకాయలు రాలవు."

అని వారిలో వారు గుసగుస లాడుకొనుచుండుటను మహాభక్తశిఖామణి శ్రీ వేంకటాద్రినాయఁడుగారెట్లో గమనించి ఆయాకవులతో—

తప్పక యట్లు జరిగి తీరుననియు నమ్మహాకవీంద్రునియెడ నమ్మహామాత కట్టిదయ కలదనియు బోధించినను విశ్వసింపక ఆయాయసూయాపరవశులు ప్రభువుతో

"అయ్యా! పరలోకమునందలి ద్వారముమా టట్టులుంతము. ఈ లోకము నందలి అమ్మవారి దేవళమును దలుపులు మూయించి పరీక్షింపవలసినది"

అని కోరిరనియు రాజుగారి కట్టి పరీక్ష యిష్టము లేకున్నను వారి వారికి శ్రీ కవిగారి వాక్శుద్ధినే కాక అమ్మవారి యనుగ్రహ మెట్టిదో తెల్పుట కట్టి పరీక్ష కంగీకరించి రనియుఁ బిమ్మట నీ పద్యములు కవిగారు చదువఁగనే భద్రముగా మూసియుంచిన తల్పులు వీడెననియు జనపరంపర యిప్పటికిని జెప్పికొందురు. (ఈ యితిహాసము మఱియొక విధమునఁ గొందఱు చెప్పికొందురు. కథకుఁ గాళ్లును ముంతకుఁ జేతులును నుండవు గదా!) కావుననే సర్వమధుర పీఠికలో నీ యితిహాస ముదాహృతమై యున్నది. ఇది మాత్రమే కాదు. శ్రీ వేంకటాద్రినాయుఁడుగారికిని నాఁటి చెంచులకును సంబంధించిన చరిత్రలోఁగూడ నేఁటికాలపువారు విశ్వసింపని విషయములు గొన్ని యున్నవి. అట్టివి యీ వాసిరెడ్డివారి సంస్థానమునందు మాత్రమే కాదు — గద్వాల, ఆత్మకూరు, వేంకటగిరి మొదలైన సంస్థానచరిత్రల యందును గొన్ని శ్రుత మయ్యెడిని. వానిని విశ్వసింపనిచో నా యాయి సంస్థానముల పుట్టుకకే భంగము సంఘటించెడిని. అవి ప్రస్తుత కవిచరిత్ర కంతగా సంబంధించినవి కాకుంటచే స్పృశించి మాత్రము విడిచితిని. మఱియు నిమ్మహాకవిరచితము లగు నితరాంధ్రగ్రంథములపేళ్లు కొన్ని సర్వమధురపీఠికలోఁ గలవు. వానిం గూడ నుదాహరింతును.

(1) అహల్యాసంక్రందన విలాసము, (2) వేమనారాధ్యచరిత్రము, (3) సరస హృదయానురంజనము, (4) శంతను చరిత్ర, (5) ఘూర్జర చరిత్ర, (6) ఇంద్రాత్మజా పరిణయము——

ఇవి ఆఱును, అచ్చ తెలుఁగుసర్వమధురమును, ప్రస్తుత గ్రంథము దేవీభాగవతమును, లోఁగడ నుదాహరించిన సంస్కృతభాషా గ్రంథత్రితయమును, వెరసి పదికొండు మాత్రమే యిప్పటికి సర్వమధురపీఠికవల్ల మనకు గోచరించినట్లయినది. శతాధికమైన యాయుర్దాయముతో శతాధిక గ్రంథకర్తయై అపరకాళిదాసుఁడై దేదీప్యమానమైన యశస్సుతో జీవయాత్ర గడపి తాను మాత్రమే కాక తన కాశ్రయ మిచ్చి యాదరించిన శ్రీ—— ......

వా సి రె డ్డి వా రి

సంస్థానమునుగూడ ధన్య మొనర్చిన యిట్టి ధన్యజీవులు కవులలోఁ గడుంగడు మృగ్యు లనుటలో నతిశయోక్తి యుండ దనుకొందును. ఇన్ని కబ్బములు రచించినను నింతవఱ కేయొకటో (సర్వమధురము) తప్ప నితరములు లోకములో వ్యాప్తికి రాకపోవుట శోచ్యము. ఇట్లెందఱు మహాకవులగ్రంథములు కాలగర్భమున లీనములగుచున్నవో, యెవరి కెఱుక ? కృష్ణదేవరాయలు తన ఆముక్తమాల్యదలో——

మ దా ల స చ రి త్ర

లోనైన గ్రంథములపేళ్లుదాహరించి యున్నాఁడు. కాని యందులో దేనిని

గాని చూచినవారు లేరు. అట్లే ప్రకృతగ్రంథకర్త యితరగ్రంథములును నామ మాత్రావశిష్టములు (కొన్నిటిపేళ్లుగూడఁ దెలియవు) కావలసి వచ్చినది. ఆయీ—

దే వీ భా గ వ త ము

కూడ నట్టిదశకే రావలసినకాల మాసన్నమైనది గాని యంతలో శ్రీ దేవి తనభక్తులును, అనవరత పారమార్థిక కార్యతత్పరులును శ్రీ శంకరఫౌండ్రీ జాయంటు వ్యాపారప్రవర్తకులును నగు

శ్రీ కో ట య్య శ ర భ య్య గా ర్ల

నీపుణ్యకార్యమునకుఁ బురికొల్పినది. ఆయీ మహాగ్రంథములో శ్రీ పాపయా రాధ్యులవారు స్వవిరచితములైన యే యితరగ్రంథముల నామములనుగాని పేర్కొన కుంటచే నియ్యదియే వీరిరచనలలో మొట్టమొదటిదేమో యని యనుమానింప వలసి యున్నను, ఇంతమాత్రముచే నట్లు నిర్ధారణ చేయుట సాహస మనుపించుకొని యెడిని. భారతములో నన్నయ్యగాని తిక్కన్నగాని యంతకు మున్ను రచించిన గ్రంథములను బేర్కొని యుండిరా? లేదుగదా! అంతమాత్రముచేత వారివారిరచనల కదియే ప్రథమ మని యాపాదింపఁ గలమా? మఱియొకటేదేని యిమ్మహాకవిది ప్రబంధము దొరకినచో దానిం బట్టి పరిశీలించి యీనిర్ణయము చేయుట కొంతవఱకు సంఘటించునుగాని అది సంభవించ లేదు. దొరకిన—

స ర్వ మ ధు ర ము

అచ్చతెలుఁగగుటచే దీనితో దానిని దులఁదూచి నిర్ణయించుటలో నేది ప్రప్రథమరచనయో తేల్చుట సంఘటింపదు. అది అచ్చతెలుఁగు. ఇదియో నూటికిఁ దొంబదివంతులు తత్సమపదములుగనే యుండుటచే సంస్కృతమే యనుకొన్నను నను్కోవచ్చును. ఆయీ గ్రంథమునందుఁ బ్రధానముగా యశోరాశి యగు శ్రీ

వేం క టా ద్రి నా య ఁ డు

గారి పేరుండక తద్దత్తపుత్త్రిలలో నొకరగు

జ గ న్నా థ రా వు

గారి పేరుండుటచేత ఇయ్యది వేంకటాద్రినాయఁడు గారి ప్రభుత్వకాల ములో—యద్వా—వారి జీవితకాలములో రచింపలేదని యనుమానించుట యుక్తి యుక్తము కాకపోదు. ఈ విషయము సరిగా నెఱిఁగినవా రింకను గొంద ఱుండక పోరు గాని అట్టివారి సమావేశము నాకు లేమింజేసి యీ యంశ మనుమానప్రమా ణమునకు బరాతము చేయవలసి వచ్చినది. భవతు— ఈ విషయము

కా క స్య క తి వా ద ం తాః

అనుట వంటిదే కాని యీ కాలపువారు దీనికిఁ గూడ నెక్కుడు ప్రాధాన్య మిచ్చువా రగుటచే నింతవఱకుఁ జర్చించి విడిచితిని. గ్రంథరచనాకాలము నాటికి

నాయఁడుగా నున్నను లేకున్నను గ్రంథకర్త నాయఁడుగారి ప్రభుత్వ కాలములోఁ గూడ నున్నవాఁ డనుట నిర్వివాదము. మఱియు నీ కవి

పరమశైవుఁడు

గా నుద్భవమంది శివపూజాధురంధరులలో నగేశ్వరుఁడని పేరు చెంది శివపూజాధురంధరులగు శ్రీ వాసిరెడ్డివారి యాస్థానకవినవకములో నగ్రిగణ్యుఁడై కూడ లేశమును విష్ణుద్వేషము లేకుండ దన కవితారచనను సాఁగించినట్లు—

సర్వమధురము

నందలి యీ పద్యపాదము ప్రబలసాక్షిగా నున్నది.

"అట్టి సిరిమగఁ డెమరఁ గప్పట్టె నంత"

ఆ యీ పద్యము సీసము - సర్వము శ్రీవిష్ణు నన్నసమే. ఆ యీ కబ్బము నందలి కథయును—

విష్ణుకల్యాణమే!

కథ యేదియే నగుఁగాక! శైవుఁడు—అందులో లింగధారణముగల శైవుఁడే కాక వేమనారాధ్య (ఈయన పీఠస్థులలోఁ బ్రిధానులు గదా?) పీఠస్థుల వంశోత్పన్నుఁడై కూడఁ ద్రికాలములందో, మట్కాలములయందో, తనచే సర్పింపఁబడు శ్రీ సదాశివుఁడు స్వప్నమున సాక్షాత్కరించినట్లు పేర్కొనక—

సిరిమగఁడు

ప్రత్యక్షమైనట్లు పేర్కొనుటచే నీయన—

శ్లో॥ "శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే,
శివస్య హృదయంవిష్ణు, ర్విష్ణోశ్చ హృదయగ్ం శివః.

అను శ్లోకార్థమును. మన్నించు నారాధ్యబ్రాహ్మణుఁ డనుట నిర్వివాదము. వైష్ణవులలోఁ గూడ నిట్టివారు కొందఱుందురు. కించిజ్ఞులకుఁ దప్ప నితరుల కాయాయి వైషమ్యము లుండవనుట కీయంశ ముపకరించెడి దగుటచే నింతగా దీనిని వ్యాకరించితిని. షష్ఠస్కంధములో నీ—

దేవీభాగవతములో

నీ యభేదమునుగూర్చి స్పష్టముగా నున్నది. వలయువా రందుఁ జూడఁగలరు. ఇంకొకవిశేషాంశ మీస్వప్నమువలన మన కవగతము కాఁగలదు. కవులలోఁ జాల మంది ఈ స్వప్నములను గతానుగతికముగా (గతానుగతికో లోకో నలోకః పారమార్థికః) నుదాహరించుచున్నారే గాని ప్రతికవికిని స్వప్నము వచ్చియుండదని యిప్పటివారు పలువురు వ్రాయుచున్నారు. అందు సర్వమును గాకున్నను గొంతేని సత్యము లేకపోదు. ప్రస్తుతస్వప్న మట్టి స్వప్నములలో జమకట్టఁదగ్గదియే యైనచో నిది శివప్రత్యక్షముగనే యుండెడిదనియు నీయన నన్నయ్య చెప్పినట్లు—

**నిత్యసత్యవచనుఁ**

డగుటచే జరిగినది జరిగినట్లే తెల్పెననియు విమర్శకులు గుఱితింపకపోరు. ఈ

**నిత్యసత్యవచనత్వమును**

కవికిఁ జేర్కొన్న గుణాలలో లక్షణకర్తలెందుకుఁ జేర్పలేదో గాని కవికి నుండఁదగిన గుణములలో నీసుగుణము మొట్టమొదటఁ జేర్కొనఁదగినదని నా యాశయము. ఆంధ్రకవితాగురువగు నన్నయ్యగారి ప్రవృత్తి నా యూహను బూర్తిగా బలపఱచుచున్నదికదా? అది యటుండె నీయనయం దింకొక సుగుణ మితరారాధ్య మతదుర్లభమైనది పొడకట్టుచున్నయది. లింగధారులు సంధ్యావందనాదులలో విష్ణువాచకము లగు

**కేశవాదినామముల**

నుచ్చరింపరు. ఆ చతుర్వింశతినామములకును మాఱుగా 'శివాయనమః, శంభవే నమః' అని శివపర్యాయములనే వాడికొందురు. అట్లే శ్రీవైష్ణవులు నక్షత్రాది దోషపరిహారార్థ మేర్పడిన శాంతిలోనైన వానిలో విధిగా నొనర్పఁదగిన (శ్లో॥ అరిష్ట వారక శ్శంభుః) శివాభిషేకము నొనర్పరు. వివాహమునందు సంప్రదాయసిద్ధమైన గౌరీతపస్సుగూడ నామోదింపరు. ఇంకను నిట్టిపరస్పరభేదములు చాలఁగలవు. అందఱు నెఱిఁగినవే యగుటంజేసి దిఙ్మాత్ర ముదాహరించితిని. అనుక్త మన్యతో గ్రాహ్యమ్.

ఇట్లుండ నీయన సర్వమధురములోఁ జూపిన విష్ణుభక్తిపారమ్య మీయన సామాన్యశైవుఁడు కాఁడనియు నద్వైతి యనియు వేయినోళ్ల నుద్ఘాటించుచుంటచే నియ్యెడ వక్కాణింపవలసి వచ్చినది. ఈ మహాకవి—

**రేఫశకటరేఫమైత్రి, అఖండవిశ్రమములు**

లోనైనవి మాత్రమేగాక శబ్దరత్నాకరమునం దుదాహరింపని - చనుమానము లోనైన పరిశుద్ధమైన వ్యావహారికపదములను వాడియున్నాఁడు. నిఘంటువున లేకున్నంతలో నయ్యవి తప్పులని శబ్దతత్త్వజ్ఞులు నిరసింపకుందురుగాక. సరసకవితాధురంధరులు దాసు శ్రీరామకవిగారు వారి భాగవత పీఠికలోఁ బూర్వమహాకవి ప్రయోగము లుదాహరించి పై సందర్భములు శిష్టసమ్మతము లని సమర్థించి యున్నారు. వలయువా రందుఁ జూడఁగలరు. ఆ యీ రేఫద్వయమైత్రివలనఁ గాని అఖండవిశ్రామాంగీకారమువలనఁ గాని నిఘంటులో లేనిపదము లుపయోగించుటవలనఁగాని కవికిఁ గల్గు న్యూనత లేశమును లేకున్నను గొందఱు దీనినే పెద్దగాఁ గైకొని గ్రంథకర్తల నీసడించుట కలదు. నేను గూడఁ గొంతకాల మట్టివారిలోనే చేరి మా ముత్తాతగారి-

**వేంకటేశ్వరవిలాసము**

ప్రతిపద్యమును దిద్ది తుట్టతుదకు నాదిద్దుఁబాటు కేవలము ప్రమాదప్రయుక్త మని తెలిసికోఁగల్గి —

సంస్కృతత్వ

మనఁగా — గ్రంథకర్త హృదయమును గసిపెట్టుటయే కాని తన యిచ్చవచ్చి నట్లెల్ల మార్పు చేయుట గాదని యథాశ్రుతపాఠముల నట్లే యుంచితిని. ఈయతి ప్రాసల విషయము తెలుఁగుభాషకుఁ బుట్టువుతోడనే పుట్టినట్లును సహజాలంకార మైనట్టును నేనుగూడఁ గొందఱితోపాటు చెప్పువాఁడనే. సహజమైన యీ విశ్లిష్ట ప్రపంచకమునకు నిటీవలఁ గొన్ని నియమములు కొంద ఱేర్పఱచిరి. అందులో నీ

అఖండవిశ్రమము

నొప్పకయుఁ దీరినది కాదు. ఒప్పికొను శబ్దములలోఁ గొన్నిటిలో స్వర మున్నదను నంశము కవులలో ననేకులకు గోచరించదు. ఒప్పుచో నెక్కడ నొప్ప వలె నను సంశయము కల్గినది— పలుతోవలు తొక్కిరి. ఎవరికి వీలైనట్లు వారు ప్రాచీన గ్రంథములను దిద్దిరి. ఇప్పటికిని దిద్దుచునే యున్నారు. ఈచర్చ యెన్నఁ టికిని దేలునది కాదు—అప్పకవి—

"భానుసమానభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై"

అని తన సమ్మతిని దెలిపెను. చక్కఁగా విచారించినచో నట్లున్న యెడలనే యీ యతి సహజాలంకార మనెడి వారి సిద్ధాంతమును బోషింపఁగల్గును గాని మఱి కొన్ని యతు లీ సిద్ధాంతమును భంగించెడి వున్నవి. అవి యప్పకవీయమునందే కలవు. అన్యత్ర ఆ యతులం గూర్చి విస్తరించి చర్చించి ఆవిశ్రమములు "గుడిలోని దేవున కంగడిలోని బెల్లము నైవేద్య మిడుట వంటిది" యని నిరూపించి యుంటిని గాన నిట స్పృశించి విడుచుచున్నాఁడను. సంస్కృతమునందువలెఁ దెలుఁగులోఁ గూడ నిది యైచ్ఛికమని కొందఱు నేఁటి యువకవులు నిర్యతిప్రాసముగా రచన సాఁగించుచున్నారు. కాని మొట్టమొదటి నుండియు యతిప్రాసలతో రచించుట కలవాటుపడిన వారి కట్టి రచనకూడఁ ద్వరగా నడువదని నా యనుభూతిం బట్టి చెప్పుచున్నాఁడను. నేను నిన్న మొన్న రచించిన—

శివభక్తి

గ్రంథములో నిట్టి రచన కొంచెము చేసియున్నాఁడను. అభ్యాసము లేకుం టచే నట్టి రచన చేయుట కూడఁ గష్టసాధ్యముగనే కనుపట్టినది. వక్తవ్యాంశము ప్రకృత మహాకవి తన నాఁటికిఁ గల మహాకవులు సమ్మతించిన యతు లన్నిటిని బుద్ధిపూర్వకముగా వాడెను, కావున నవి ప్రమాదప్రయుక్తములు గావని తెల్పుటయే.

జన్మ - జన్మము, కర్మ - కర్మము

ఈ రూపములు చిన్నయ్యసూరి వ్యాకరణమును బట్టి చూచినచో నిందులో నొకటి మాత్రమే నిర్దుష్ట మనవలసివచ్చును. కాని ముపర్ణకముతో నున్న రూపము

కొన్ని యెడల హృదయంగమముగా నుండదని అన్యత్రి వ్యాకరించి యున్నాఁడను. ఈ మహాకవిగూడఁ జిన్నయ్యసూరికి వ్యతిరేకముగనే ఆ యాశబ్దముల నుపయో గించి శ్రవణసుఖమును గాపాడినందుల కభినందింతును. నేను వాడకున్నను సూరికి వ్యతిరేకించి యీ రూపములు వాడెడివారి నన్యత్రి అభినందించి యుంటచే నా కివి సమ్మతముఁలే యని పాఠకలోకము గ్రహించుఁగాక. ఈకవియును జిన్నయ్యసూరియు నించుమించు సమకాలికులై యుందు రనుకొన్నను చిన్నయసూరి వ్యాకరణము నీయన చూడలేదనుటకుఁ బెక్కు లుదాహరణములు కలవు. విస్తరభీతిచే నెత్తి చూపలేదు. చిన్నయ్యసూరికాలము నూఱువత్సరములకు లోపు. ఈయన యున్న కాలము నూఱువత్సరముల కేమాత్రిమో ఆవలిది. కనుక చిన్నయ్యసూరి సిద్ధాం తము లీయనను శాసింపనేరవు. నామమాత్రిము వ్యాకరణము లున్నను నయ్యవి కవు లను—అందుఁగూడఁ దెలుగుకవులను ఏకొంచెమో తప్ప సమగ్రముగా శాసింపనేర వనియుఁ జెప్పవచ్చును. మఱియు—

'జా యా చ ప తి శ్చ'

దంపతీ— జంపతీ, అను నిత్యద్వివచనాంతరూపమున కీ మహాకవి పలుచోట్ల (సమాసమునఁ గాదు) వ్యస్తావస్థలోనే—

దం ప తి

అని ప్రియోగించెను. ఇతరు లర్థమునుబట్టి—

దం ప తు లు

అని వాడియున్నారు—అసమగ్రముగా నున్న తెలుఁగు వ్యాకరణము నూతన ముగాఁ గొని దిద్దవలసి వచ్చుచో నెందఱు మహాకవులకో అపచారము చేయవలసి వచ్చునను భయము గల నేను దానిని దిద్ద సాహసించలేదు. దిక్ప్రిదర్శనముగా నిది యొకటి చూపితిని. మఱికొన్ని యిట్టి వుండును. ప్రాజ్ఞులగు పాఠకులు వానిని గమనింపఁగలరని సూచించి విడిచితిని. ఈ పీఠికలో 8 వ పేజీలో 12 వ పద్యము మూఁడవ పాదములో యతి తప్పినది. దానిని సవరింపవలసి యున్నను కవికి నభిమ్రేత మగు "చిత్తంబు నాభాగ్యమై" అను లోకోక్తి యిముడదని యుపేక్షించితిని. "యుక్తిం జేసి తరింపఁజేయఁ గలవాక్కా! చిత్తమ్ముగ్ భాగ్యమై" అని సవరించుకొనుచోఁ గొంత యుక్తమని తోఁచినది. సహృదయులు పరిశీలింతురుగాక. ఈ కవి విద్వత్కవి యని నా నమ్మకము.

దం ప తి

అనుచోటఁ బూర్వోత్తరపక్షములు చాలఁ గలవు కాని మహాకవి మైన యీయన కవి గోచరింపక యుండునా? లోకవ్యవహారముగూడ—దంపతులు— అనియే కలదు కాని దంపతి అని లేదు. అయినను ఈ విద్వత్కవి పలుచోట్ల బుద్ధి పూర్వకముగాఁ బ్రియోగించెను. ఎట్లో సమర్థింపవలయునే కాని దిద్దుటకు వీలులేదు.

"స్థితస్య గతి శ్చింతనీయా"

కదా! నామీఁద సంస్కారభారము పడుటకుఁ బూర్వ మచ్చైన భాగము నందే యున్న వీ ప్రయోగములు. ఉపేక్షించుట కిదికూడ నొకకారణము. కొన్ని ప్రయోగములు చూచిన నిక్కవి పెద్దతరగతికిఁ జెందినవాఁడని తోఁచుననియుఁ గొన్ని చూచిన సామాన్యుఁడేమో యనిపించు ననియు నొకరు నాతోఁ బ్రసంగించిరి. స్వహస్తలిఖితము చిక్కినఁ గాని యేమనుటకును వలనుపడదని నే ననుకొంటిని. ఉభయభాషలలో నుద్దండుఁ డన్నంతవఱకు నిర్వివాదము. ఎక్కడనేని సర్వథా విరుద్ధమైన ప్రయోగ మగుపట్టినను అది పాండిత్యమును భంగించుననుటకన్న భ్రాంతి మూలక మనుకొనుట యుక్తము.—

"భ్రాంతి గడవంగ శక్యమే బ్రహ్మకేని?"

బొత్తిగా నస్తవ్యస్తముగ నున్న వ్రాతప్రతిని జాలవఱకు సంస్కరించి కొంత స్వరూపమును దీనికిఁ గలిగించినది ఈ గ్రంథము నచ్చొత్తించు కోటయ శరభయ గార్లలోఁ గోటయగారికి శ్వశురుఁడు భమిడిపాటి అయ్యప్పశాస్త్రి. ఇతఁడు మా పినతండ్రికుమారుఁడు చిన్న వెంకటశాస్త్రికి శిష్యుఁడు. కవి, అవధాని, ఉపాధ్యాయుఁడు నగుటచేత నీ గ్రంథమును జక్కఁగా సంస్కరింపఁగలిగెను.

మఱియు నిమ్మహాకవికి లోకములో నెవరికో తప్ప సర్వకవిసాధారణముగా సంఘటింపని మహాభాగ్యము చేకూరినది. అది పుత్రుఁడుకూడఁ గవి యగుటయే.

(౧) "కవిరాజులకుఁ గవిరాజు లన్వయో, త్తేజకులై జనించు టది దృశ్యమదృశ్యముగూడ నౌటచే" (బొబ్బిలి పట్టాభిషేకము)

(౨) "కనెనే నన్నయభట్టు విజ్ఞులను? దిక్కన్నేనియుఁ దాఁ గలా, ఖనులన్ గాంచిన యట్లు వింటిమె?" (సౌభాగ్యకామేశ్వరి)

(3) "గాలింపం గనుపట్టె బాణకవి తత్కాదంబరిన్ దండితోఁ, బోలన్ వీఁడనునంత మంచి ఫణితిన్ బూరించె" (సౌభాగ్యకామేశ్వరి)

ఆ యీ మాపద్యభాగములవలనఁ దండ్రి కొడుకు లిరువురును కవు లగుట కవులకు సంఘటించెడి భాగ్యములలో నెక్కుడుగా గణింపఁదగినది యనుట నిర్వివాదము. ఇమ్మహాకవి కుమారుఁడు—

వియ్యనారాధ్యులు

రచించిన గ్రంథము లిప్పటికి మాకుఁ జిక్కలేదు కాని కొన్ని పద్యములు మాత్రము శరభయ్యగా రిచ్చిరి. వానిలోఁ గొన్నిటి నియ్యెడఁ జూపుదును.

సీ. దారుకావనమౌనిసతులను వలపించి, సురతగోష్ఠులలోనఁ జొక్కలేదె?
మిన్నేటిజవరాలిసమిన్నపై మరులొంది, శిరసావహించి కాంక్షించలేదె?

భల్లాణభూపాల∫పత్నిని జలపట్టి, సెజ్జకు వలచి రా∫జేయలేదె?
అల తిలోత్తమమీఁది∫వలపుచే బహుముఖం,బుల భ్రాంతినొందియుం∫పోలయలేదె?
తే. ఇంతశృంగారివై యొడ∫లెల్ల బూదిఁ, బూసి జడలూనినంత స∫న్యాసివగుదె;
అంబుధినిషంగ! చాముండి∫కాంతరంగ! చంద్రధవళాంగ! క్రౌంచామ∫రేంద్రలింగ!

సీ. పదునాల్గులోకముల్ ∫ భరియించుకొండ వి,ల్లేమంటపమున సం∫ధించినావు
సర్వరక్షకమైన ∫ శతురింజయాస్త్ర మే, తలుపుచాటునఁ బెట్టి∫దాఁచినావు
అక్షయశరపూరి∫తాంబకాసనము లే, దిక్కోణమున లోన ∫ డించినావు
ప్రళయానలాదియౌ ∫ భయదసాధనపాళి, యేమూలలను సంత∫రించినావు
తే. బీదబంటుతనంబుఁ జూ∫పించుమాత్రి, రక్షకుఁడ వీవు గాని యు∫పేక్ష గలదె?
అంబుధినిషంగ! చాముండి∫కాంతరంగ! చంద్రధవళాంగ! క్రౌంచామ∫రేంద్రలింగ!

సీ. వేదాశ్వముల నెక్కి ∫ విహరించువాఁడవై, వేణుడోలల నేల∫విహరణములు
వసుమతీరథముపై ∫ వర్తించువాఁడవై, జతురథంబుల నేల ∫ సంతసిలుట?
రజతాద్రిశిఖలపై ∫ రంజిల్లువాఁడవై, పాషాణగుహల సం∫భ్రమములేల?
శతకోటిమదనభా∫స్వరలీలవాఁడవై, స్థాణురూపమున సం∫చారమేల?
తే. యెందుకీ మాయ నీ కీవి ∫ యెల్లఁజూపి, నన్ను మన్నింప నింత య∫న్యాయమేల?
అంబుధినిషంగ! చాముండి∫కాంతరంగ! చంద్రధవళాంగ! క్రౌంచామ∫రేంద్రలింగ!

సీ. కోటి యర్థం బిచ్చి∫కొనియెద మనియన్న, నబ్బునే? యాయుష్య ∫ మర్థఘటిక
యిట్టి యాయుష్యంబు ∫ నేలొకో వ్యర్థంబు, సేయుచు నున్నారు ∫ చిడిపిజనులు
సుఖముఖోచ్చారణ∫స్ఫురితవాగ్ధోరణుల్, గలుగవో? ప్రారబ్ధ∫కర్మఫలమొ?
"శివశివా"యను నామ∫చింతనామృత మేల, ఘోరలక నరకాగ్నిఁ ∫ గూలువారొ?
తే. గర్భవాసులు గారె? లో∫కములవారు, గర్భవాసుల బలెఁ బ్రోవు ∫ కరుణలేదె?
అంబుధినిషంగ! చాముండి∫కాంతరంగ! చంద్రధవళాంగ క్రౌంచామ∫రేంద్రలింగ!

సీ. శ్రీపర్వతేంద్ర కా∫శీగయాకేదార, గోకర్ణ వృషభాద్రి ∫ కుంభకోణ
రామసేతుచిదంబ∫రబ్రహ్మమానస, శ్రీకాళహస్తి కాం∫చీప్రభాస
జయవాటికారుణా∫చల జంబుకేశ్వర, వైద్యనాథాది ది∫వ్యస్థలములఁ
బ్రస్తుతికెక్కు నా∫రామపంచకమున, నీకెనయౌమూర్తి ∫ నింగిసమము
తే. మరగినాఁడఁజుమీ? నిన్ను ∫ మదిఁదలంచి, సంచితం బెల్ల మాయించి ∫ సంతరింపు
మంబుధినిషంగ! చాముండి∫కాంతరంగ!, చంద్రధవళాంగ! క్రౌంచామ∫రేంద్రలింగ!*

---

* శరభయ్యగారి ఈ యా యీ పద్యములు సంపాదించి యిచ్చినవారు ములుఁగు మల్లయారాధ్యులు.

ఆ యీ మహాపురాణము నచ్చొత్తించుచున్నవారు

కో ట య్య, శ ర భ య్య గా ర్ల ని

లోఁగడనే తెల్పియుంటిని. ఈద్వితయములో నాకుఁ గొంత పరిచితులు శర భయ్యగారే. కోటయ్యగారితో నాకుఁ బరిచితి లేకున్నను వినికిడివలన నంఘర్మ్మఖుఁడు నిరాడంబరజీవి యని యెఱిఁగి సంతసించుచు నాయానందము నిందు వెలునరించితిని.

మఱియు నీ పరమభక్తు లిరువురు నాయాయీకార్యమునందే కాక దేవీ నవరాత్రాదులయందేమి సర్వదా సల్పు కపిలగోసపర్యాసందర్భములయందేమి తోడునీడలై యభేదాధ్యవసాయంబుగ వర్తించుచుందురు.

వీ రిరువురును నొకయూరివారుకారు. ఒక శాఖవారును గారు; ఈ యంశము

శ్రీ ప ర మ శి వా నం ద లీ ల లు

అను పొత్తమున గ్రంథకర్త (శ్రీ కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తి గారు) యీ విధముగా నుద్ఘాటించెను. దాని నుదాహరింతును:

(౧) మ. ఒకఁడా? శైవనియోగి బ్రాహ్మణుఁడు, వేఱొక్కండు వెల్నాటి వైదికవిప్రుండు...

(౨) క. కోటయ శరభయ లిర్వురు దీటుగ మదిఁ జెలిమిగలిగి...

వీరి కెట్లు మైత్రిగలిగెనో, వీ రిరువు రేయేరీతి నభివృద్ధికి వచ్చిరో వివరించుట ప్రస్తుతము గాదు. ఇద్దఱును దైవతభక్తులు. భక్తులని వ్రాసినంతలో సరిపోదు. ఏమాట వ్రాసినచో లగించి యావదర్థమును స్ఫురింపఁజేయునో అట్టిమాట నాకు దొరకలేదు. సత్కార్యాచరణదీక్షాపరతంత్రులు. సామాన్యస్థితినుండి వర్తకద్వార మున (వీరి వర్తకపు షాపుపేరు (౧) శ్రీ శంకరఘాండరీ. (౨) పురలా వర్కుషాపు.) నుచ్చస్థితికి వచ్చి తమ యావదార్జనమును

గో బ్రా హ్మ ణ దై వ తా ర్థ ము న

వినియోగించువారును ననునదియే వక్తవ్యాంశము. వీరి గోపూజనుగూర్చి కూడఁ బూర్వోదాహృత గ్రంథమే విస్తరించి ప్రశంసించినది. లోకములో వర్తకు లును గలరు. విశేషించి దానివలన లాభము నందినవారలును గలరు. కాని యింతటి పారమార్థికదృష్టితోఁ దమతమయార్జనకు సార్థక్యము గలిగించువారుమాత్ర మెక్క డనో నూటనాట నొక్కరు గనవత్తురు.

(౧) శ్లో. అర్థానా మార్జనే దుఃఖ మార్జితానాంచ రక్షణే,
ఆయే దుఃఖం వ్యయే దుఃఖం కిమర్థం దుఃఖభాజనమ్.

(౨) సీ. కామరోగాది దుష్కరశతుర్వర్గప్రతాపప్రధాన సాధనము ధనము,
......తలఁచిచూడంగ వట్టి దంధనము ధనము.

(3) శ్లో. శరీరపతనావధి ప్రభుని షేవణా పాదనా,
దబింధన ధనంజయ ప్రశినమదం ధ్వనం దంధనమ్.

ఇట్లు మన పెద్దలు ధనమునుగూర్చి పలువిధములఁ బలుచోట్ల నిరసించి యున్నారు. ప్రకృత పుణ్యపురుషు లిర్వురును బైవారి నిరసనకుఁ జాల దూరమగు ధనార్జన కలవారని నేను పలువురవలన విని యిం దుదాహరించితిని. గోసేవనుగూర్చి కొంచెము లోఁగడ నుదాహరించిన షోత్తమునుండియే చూపుదును.

ఉ॥ అమ్మరొయో? తల్లిరో? మఱియు నామెయొ యీమెయొ యందు రిగాని య
న్యమ్మగు మాటలం బిలుచు టారయ మెన్నఁడు వారినోటఁ; ద
థ్యమ్ముగ నౌకరుల్ పిలుతు రవ్విధినే; ప్రభు వట్లు పిల్వఁ జో
ద్యమ్మదియేల? నౌకరు తథావిధిఁ బిల్వఁడె వారివాడలన్

ఆ॥ వె॥ దుర్గ, అన్నపూర్ణ, దుహిత, పర్వతవర్ధ, నమ్మ యనెడిపేర్ల నరసికొనుచుఁ
* పాత్రధారులెంతొ భక్తిమై గోవులఁ, జాలఁ బెంచుచున్న సమయమందు.

ఇంకను గోపూజావిషయమేకాదు, ఆయీ క్షీరములు వినియోగించుటేకాదు, శరన్నవరాత్రి పూజా పురస్కార జపతపోనిష్ఠాగరిష్ఠత్వమే కాదు, దేవాలయనిర్మాణ ధర్మారామస్థాపనాది పుణ్యకార్య సమాచరణమే కాదు, విస్తరించి చూడఁగోరు వారు లోఁగడ నుదాహరించిన యా షోత్తమునందే చూడఁగలరని యిందు సంక్షేపించితిని. ఈ కోటయ, శరభయ్యగార్లేకాక కోటయ్యగారి ధర్మపత్ని

శ్రీ చి. సౌ. పోషిత కనక దుర్గాంబ

కూడఁ బూర్వోక్త పుణ్యకార్యములయందు మిక్కిలి యాదరముగల సాధ్వి యని వినియుంటయేకాదు- ఈ సాధ్వీమణిని జూచియుంటిని. మనుచరిత్రలోని—

"వండ నలయదు వేవురు వచ్చిరేని, అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి"

అను పద్యార్థమున కాపె ప్రథమోదాహరణ మని సంతసించితిని. ఈపె లోఁగడ నుదాహరించిన అస్మత్ప్రశిష్యుఁ డయ్యప్పశాస్త్రి కొమార్త. ఈపె విద్వత్కవి సంతానమగుటచేతనే కాక పూర్వజన్మసంచిత భాగ్యవశమునఁ దా నే పరమేశ్వరి నామధేయమును ధరించినదో? ఆ పరమేశ్వరిని ప్రతిదినమును బూజించుపట్ల నితర సాహాయ్యము నపేక్షింపక స్వయముగనే తత్తన్మంత్రములతో (ఆయీ పూజావిధా నాదిపరిజ్ఞాన మీసాధ్వికి "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అనుచొప్పున నలవడిన దని నానమ్మిక) యజింపఁగలది యని వినియుంటిని. సంతానము లేదను కొఱంత తప్ప నీపె కే విధమగు కొఱంతయు లేదు. ఆయీ సాధ్వీమణికిఁ గాని భర్తకుఁగాని యేకోరికయు లేకున్నను నిష్కామప్రయుక్త మగు నీ దేవీభాగవతముద్రణ మీలోప మును దీర్చుఁగాక యని యాశీర్వదించుచున్నాఁడను.

---

* ఆ గ్రంథమునందు వీరికి "పాత్రధారులు" అనుపదము వాడె నని తెల్పెడి.

మఱియు శరభయ్యగారి భార్య కీర్తిశేషురాలుకూడ సుశీలయే యని వింటిని. ఈమెకును సంతానములేదు. ఈమె పేరు వియ్యమ్మ. శరభయ్యగారు తిరిగి వివాహము చేసికొనలేదు.

వీ రేకార్య మొనర్చినను దైవముపై భారము వేసియే చేయుచుందురు. దానికిఁ దథ్యముగా దైవసాహాయ్యము వీరికిఁ గల్గుచుండును. ఈ యంశమును ధృవపఱచు సందర్భము లీ గ్రంథమునందు సప్రమాణముగా వివరింపఁబడి యున్నవి. త్యాగరాయలవారు నొడివినట్లు—

"కద్దన్నవారికిఁ గద్దు"

దైవము, లేదన్నవారికో? లేదు. వీరు మొదటి శరగతికిఁ జెందినవారు కను కనే పుణ్యపుంజ మగు నీ

"దేవీ భాగవత సేవ"

వీరికి లభించినదని నావిశ్వాసము. వీరి సత్కార్యాచరణము లసకృదావృత్తిగా విని యిందు సూత్రప్రాయముగా నుదాహరించితిని. ఇట్టి పరమభక్తులను గనుటకు నీ

కోటయ, శరభయగార్ల

వంశము లెంతటి సుకృత మొనర్చెనో? ఈ మహాగ్రంథపీఠికయందా పుణ్యాత్ముల నామధేయములుగూడ నుదాహరించుట యావశ్యకమేకదా?

మ॥ హనుమాంబాసుకృతావతార మగు కోటయ్యాఖ్యునిం గన్నస
త్ప్రణుతశ్రీకుఁ డుదారధీకుఁడు కుమారస్వామి నీపుణ్యు తం
డ్రిని శ్రీమత్పరదేశి నీ యనఘు తద్విఖ్య శీల సంపన్న న
త్యనఘ శ్రీ నరుణాచలాంబ నుతిసేయన్ శక్యమే? యేరికిన్.

చ॥ శరభయ తల్లి పిచ్చమ ప్రశస్తగుణాకర, తండ్రి సుబ్బరా
ట్టురుమతి; తాతగారు కడు యోగ్యుఁడు వీరయ, నాయనమ్మ ధీ
వరనుత వేంకమాంబ, శరభయ్యకు నీదృశపుణ్యకార్యత
త్పరతకుఁ గారణం బితని వంగడపుం జిరపుణ్యపాకమే.

ఆయీ యుభయుల వంశములే కాక వీరి సుకృతకార్యములతో యత్కించిత్సంబంధమేనిగల్గినవారుకూడ ధన్యులని నానమ్మిక. కావుననే యీ వార్ధక్యములో నే నిద్దానిని సంస్కరించుభారము వహించితిని గాని తగినసామర్థ్యము కల్గియుండి కాదు. ఈ యంశము లోఁగడ సూచించినదే యైనను మరల నుద్ఘాటించుచున్నాఁడను.

"ధన్యో మాఘకవి ర్వయంచ కృతిన స్తత్సూక్తి సంశీలనాత్"

అను మల్లినాథోక్తి సర్వథా మాననీయము. ఇఁక నీశరభయ కోటయగార్లకును కోటయ్యగారి భార్య శ్రీమతి పోషితకనకదుర్గాంబకును నే నొసఁగిన యాశీర్వాచన పద్యములు మాత్ర ముదాహరించి దీనిని ముగింతును—

## ఆశీర్వచనము

చ. శరభయ కోటయల్ మిగుల సజ్జనమాన్యులు దేవతామహీ
సురవరభక్తు లెంతయు విశుద్ధచరిత్రులు సర్వథా యశ
స్కరములు పుణ్యకార్యములు సల్పుటకే జనియించి రిట్టి వీ
రిరువుర శంకరుండు పరమేశ్వరుఁ డేలుత భద్రకాళియుఁ. ౧

చ. శరభయ కోటయల్ సలుపు సత్కృతు లిన్నియు నన్ని గావు శం
కరునకు నాలయం బుమకుఁ గా నొక దేవళ మాలపూజ ల
బ్బురమును గొల్పు నార్జన సమూలముఁ బైసయుఁగూడ దుర్వ్యయం
బెఱుఁగదు వీరి నిట్లు పరమేశ్వరుఁ డెందు కనుగ్రహించెనో ? ౨

చ. శరభయ కోటయల్ గడుఁ బ్రశస్తగుణాఢ్యులు వీర లొక్క రొం
డొరులకు నేమికావలయునో ? యన నేమియుఁ గారు గాని సో
దరు లని కొత్తమానిసు లెరుఁగ గణియింతురు శాఖకూడ వీ
రిరువుర దొండు కాదు పరమేశ్వరభక్తతపట్ల సోదరుల్. ౩

చ. శరభయ కోటయల్ గడు విశాలమనస్కు లుదారశీలు రే
యడమర లేని పుణ్యమతు లక్కనమాదన లిద్ద ఱిప్పు డీ
ధరణి జనించి సత్కృతులు తాము తరింప నొనర్చి యన్యు లం
దఱు తరియించుమార్గము గనంగఁ జరించెద రుత్తమోత్తముల్. ౪

చ. శరభయకోటయల్ పరమె సాధ్యము సత్య మిహంబు తుచ్ఛ మం
చెఱిఁగి చరించు కోవిదు లహీనగుణాఢ్యులు వీర లంబికా
కరుణకుఁ బాత్రులై యశము గాంచి సుఖింతురుగాక వేంకటే
శ్వరకవిదీవనల్ సతము వారికి నూతములై రహించుతన్. ౫

మఱియు వీరిరువురకన్నను ఆయీ పుణ్యకార్యాచరణమువట్లనే కాక వీర లేకగర్భజనితులకన్న మిన్నగ నేకభాండాశనులై వర్తించుటకు నీదేవీభక్తురాలు. పోషితకనకదుర్గాంబసాశీల్యమే ముఖ్యకారణ మగుటచే నీయనఘాత్మురాలి నెంత యగ్గించినను గొంత కడమయుండును.

తే. కడు విశుద్ధాత్మ పోషితకనకదుర్గ, కనకదుర్గాకటాక్షవీక్షణముకల్మి
నింతకన్నను భక్తికి నిక్క యగుచు, వర్ధిలుత నామధేయంబు సార్థకముగ.

స్వస్తి.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని.

శ్రీ మత్పరదేవతాయై నమః.

# పీఠిక



## —॥ శ్రీ ముల్గు పాపయారాధ్య కవిసార్వభౌముఁడు ॥—

సీ॥ సంస్కృతాంధ్రోన్నత సాహితీగరిమంబు, బాలత్వమున నుగ్గుపాలుగాఁగ
బహుపదార్థ రసస్వభావపరిభావంబు, పిన్నతనంబున వెన్నగాఁగ
నవనవకల్పనానంతసామర్థ్యంబు, చిఱుతప్రాయమున లేఁజివురుగాఁగ
సర్వవిజ్ఞానపరిపన్న పరిసారంబు, సహజపరిసాదభూషణముగాఁగఁ
ఆ॥ దారివి మెసవి తొడిగి తాల్చి శోభారతి, భారతీసుతానుభావ మంది
పరిబలుచుండు ముల్గుపాపయారాధ్య పరి,సూక్తి సకలకావ్యరక్తి భక్తి.

### కవి పితృక్రమము

సీ॥ ఏ మహనీయున కెలమిని సమకూర్చు, నామె "పితామహి" "యక్కమాంబ"
యేసాధుమూర్తికిని "బితామహుఁడు" వి,ప్రేశ్వరుండగు "సంగమేశ్వరుండో"
యే ధర్మవిభునకు నింతకుఁ గారణం,బగు భాగ్యమగు "భ్రమరాంబ" "తల్లి"
యే తపశ్శాలి సమృద్ధికిఁ బండిన, పండగు "వీరేశ్వరుండు" "తండ్రి"
తే॥ గీ॥ యెవని "భార్య" "లింగాంబ" శ్రీయువతిసాటి
యెవని "గోత్రమ్ము" "కౌండిన్య" వృద్ధికరము
"సంగమేశ్వరుం"డను పేర సంతసించు
"పాపయారాధ్యకవిసార్వభౌముఁ డతఁడె.

తే॥గీ॥ త్రివిధలింగార్చనార్చిత త్రిణయనుండు, షట్స్థలజ్ఞానసంపన్న శక్తియుతుఁడు
ఉభయభాషాప్రవీణుఁ డుద్యోగమూర్తి,పాపయారాధ్యకవిసార్వభౌముఁడితఁడు.

కం॥ పదునెనిమిదివందల యేఁ,బదిరెండవ హూణమాన భవ్యదినము డె
బ్బదినాల్గు వత్సరమ్ముల, యదనగు వయసునను శివునియందునఁ జేరెఁ.

### కవి సంతతి క్రమము

సీ॥ పటుతరసాహితీప్రజ్ఞగాంచిన యట్టి, "యగ్రసుతుండు" "జోగయ్యశాస్త్రి"
అది వియన్నది వియన్నదిరసంబ నెడియా,యన "ద్వితీయుండు" "విశయ్యన్నసుకవి"
జ్యోతిషంబందుఁ బ్రఖ్యాతినందిన ద్విజ,పతి "తృతీయుఁడు" "బసవయ్యశాస్త్రి"
శాస్త్రానుసరణప్రసక్తి మించిన నరా,టము "తురీయుండు" "కోటయ్యశాస్త్రి"

తే॥గీ॥ "ప్రథమపుత్రిక" "శాంభవి" పరమసాధ్వి
పండితారాధ్యవంశ వైభవము పెంచె
"రెండవ కొమార్త" "సావిత్రి" నిండు వేడ్క
గలిగి సివలెంక వంశమ్ము కలిమిమించె.

ఉ॥ జోగయశాస్త్రి పుత్రుఁడయి శోభను గాంచెను "మల్లయాఖ్యుఁడున్"
బాగుగఁ దత్సుతుండగుచు వైభవమందెను "వీరభద్రుఁడున్"
యోగత "మల్లికార్జునుఁడు" నుద్భవమందెను వాని కట్టులే
వేగము "వీరభద్రుఁ"గనె వియ్యానసత్కవిహంస యద్దిరా!

సీ॥ కోటయ్యశాస్త్రికిఁ గొడుకులైదుగురుంద్రి, శరభయ్య, బసవయ్య వరుసగాను
మూఁడు సుబ్రహ్మణ్యముసు మఱి పాపయ్య, నైదుమార్కండేయులై రివారు
శరభయ్య కొమరుండు సరి రామలింగయ్య, యేతదాత్మజుఁడు విశ్వేశ్వరయ్య
శరభసుబ్రహ్మణ్య మరయ నాతనిపట్టి, యటు బసవయ్యకు నాత్మజుండు
తే॥ గీ॥ కోటిలింగమ్ముఁ బాపయ్య కొడుకు లిర్వు
రొకఁడు బసవయ్య యింక వేరొకఁడు చంద్ర
మౌళి యింక మార్కండేయ మాన్యునకును
సుబ్బరాయఁడు పుత్రుఁడై శుభము గాంచె.

సంగమేశ్వరుఁడను నామమున కీ కవి వేమనారాధ్య చరిత్రము.

సీ॥ పదపదార్థ నిబంధబంధురంబుగ ధరాతల మెల్ల నెఱుఁగ శంకరనుచరిత్ర
సరసశృంగారానుషంగముల్ రవణిఁ జూపఁగ నహల్యావధూపరిణయంబు
ధీమజ్జనస్తవ్య ధీమజ్జనోన్మేష, కరముగా నలరు ఘూర్జరచరిత్రి
లసదలంకారలాలస విశంకటముగాఁ, బరగు నిందాత్మజాపరిణయంబు
తే॥గీ॥ శతకపూజాస్తవంబుల సంఖ్య సంఖ్య, మీర నీవు ప్రసంగించు మేలికావ్య
రచన మాకెల్ల సమ్మదార్ద్రితఁబొనర్చె, సరసరుచిసాంద్ర! సంగమేశ్వరకవీంద్ర

పాపయారాధ్యు లను నామమున కీ కవి "సరసహృదయానురంజనము"

మ॥ వరపుంభావసరస్వతీచతురతావాల్లభ్యసంసూచనా
కరపాతంజలవాగ్విశుద్ధకవితాకల్హారమాలీరసాం
కురితస్నిగ్ధనిబంధబంధురకథాంకూరాంకితగ్రంథ క
ల్పరతోత్సాహివి పాపయార్యసుకవీ! ప్రత్యక్షశోభారవీ!

వీరి గురువులు "శ్రీ శంభులింగముగా" రనుటకు:

సీ॥ ఆరాధ్యసింహాసనాంబురాశికిఁబూర్ణ, రాకాసుధాంశుఁడే రమ్యమూర్తి
శిష్యహృద్గతతమశ్ఛేదనాపాదనా, ర్చిష్మంత మెవ్వాని శిక్షణంబు
షడ్దర్శనీవచస్సాహిత్యవిధిసరో, విహరన్మరాళ మే విభుని మనము
భక్తిభావాందూనిబంధశాంభవమహా, సింధురం బెవ్వాని చిదభివృద్ధి

తే॥గీ॥ పటుశమీశాఖికాశిఖాపటనిరుద్ధ, జాతవేదప్రమాణనిశ్శంకబిరుద
మెవని కీరేడు జగముల నెసగునట్టి, శంభులింగార్యదేశికస్వామిఁ గొల్తు.

వీరినిగుఱించి "బ్రహ్మశ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి గారు" వ్రాసిన యభిప్రాయము:

సీ॥ తీరుగా సీసపద్దెంబు సాగించుచో, శ్రీనాథకవిరాజుసిరులు గురియుఁ
జిలుగుఁ బూఁబొదల మంచ్చికల నల్లించుచో, నలసాని పెద్దన యనువునెనయు
నెడద లోతులనెల్ల యెడలను బారుచోఁ, జక్కఁగాఁ దిక్కన్న చక్కఁజొక్కుఁ
గొప్పిందేనెయూట పలుకులవాకఁ దూఁగుచో, ముకుతిమ్మనార్యుని ముద్దునెఱపు

తే॥గీ॥ నరరె యభినవకాళిదాసాంకితుని మ, హాకవిని ముల్గు పాపయ ప్రాజ్ఞనరుని
మధురమాధవవేళల మఱగినట్టి, ప్రౌఢకవితాలతాంగి ధీప్రౌఢియేమొ?

వీరి నివాసస్థలము గుంటూరు మండలములోని

"అమరావతీ పట్టణము"

* పిమ్మట వీరి ప్రభువుల ననుసరించి 'లక్ష్మీపురము' అను నామాంతరము గల "చింతపల్లి"లో నివాసము నేర్పరచికొనినారు. ఈ "చింతపల్లె" గుంటూరు మండలములోని సత్తెనపల్లి తాలూకాలో నున్నది.

ఈ మహాత్ముఁడు

సహజపాండిత్య మహాకవి సార్వభౌముఁడు.

శ్రీ దేవీ భాగవతము

ను దెలిఁగించిన యిప్పటికిఁ దేలిన మిగిలిన ముప్పురివంటివాఁడుగాక నిష్పక్షపాతియై సర్వజనానురంజకముగా, ధారాళముగఁ దెనిగించెను. సంస్కృతమునకుఁ గొన్నిచోట్ల వన్నె పెట్టెను. సంస్కృతాంధ్రశబ్దజాలము వీనిని వలఁచి వలపించురీతిఁ జేయును.

---

* ఈ సంగతులు పాపయారాధ్యులవారి నాల్గవ కొమరులగు కోటయ్య శాస్త్రిగారి మనుమఁడు ముల్గు రామలింగేశ్వరశాస్త్రిగారి వల్లఁ దెనాలిలో నాచేఁ దెలిసికొనఁబడినవి.)

## కవిత్రియము

వారి పోకడల నీ మహాత్ముఁడు గౌరవించి తన నైపుణ్యమునే వెల్లడించెను.

## తిక్కన్న సోమయాజి

రీతి మెల్లచోటులను వెలువరించెను. తన కవిత్వమునం దందరికవులచమ త్కృతులు గనపఱచెను.

తల్లిని జూచియును భయపడు నిప్పిదపకాలమున సయితము

## శ్రీదేవి

శక్తి సామర్థ్యములు రసవంతముగా నిరూపించి మాతృప్రేమను బుత్రుల కందురీతిని విశదీకరించెను. ఈకవి ధనికుఁడు కాఁడు, ధనార్జనాపరుఁడును గాఁడు.

కావుననే యంకితము దైవమున కిచ్చి తన ప్రభువులకు దేవీవాత్సల్యమును బ్రసాదింపఁజేసెను.

(ప్రథమాశ్వాసములో) 14 వ పేజీలో 96 వ వచనము "......జగన్నాథ ధరావరుండును దత్కళత్రావతంసంబగు నచ్చమాంబ యను నిరువురు నొక్కనాఁ డేకాంతంబునఁ గొంత తడవు పారమార్థికోదంతంబులఁ గాలంబు గడుపుచుఁ బురాతన సత్క్రియాప్రకాశం బగునట్లుగా నొక్క సత్కృతి భగవదర్పణంబుగాఁ గొనందగు నని నిశ్చయించి.

చ॥ "కృతిఁ గొనఁ గోరినారము సమీహితబుద్ధి పురాణసత్కథా
సతతసమావృతంబగు ప్రశస్తపవిత్రచరిత్ర మెద్దియే
నతులరసానుషంగముగ నీ వార్షమునన్ రచియించి యీఁదగున్, ౧౦౮

సీ॥ ......దేవీభాగవతము సంతతము నా వాంఛితంబు

గీ॥ ద్వాదశస్కంధములు భవత్కవితఁ దెనుఁగు
చేసి ప్రకటింపవలయుఁ దత్సిద్ధి కేము
మిమ్ముఁ గోరితి మన్న...... ౧౦౯

క॥ సంతుష్టాంతఃకరణత, నెంతయు నే నియ్యకొనిన నీశ్వరునకు ని
శ్చింతత నర్పించుట మే, లెంతయు సంతసము సర్వసమిష్టంబనుచున్." ౧౧౦

మొదలగు వానింబట్టి భగవదర్పణంబునకుఁ దగిన కారణంబు ప్రకటీకృతం బయ్యెను.

పోతరాజువంటి మహాభక్తకవిని సైతము

ఉ॥ కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో

యని యనిపించిన

## భా ర తి

చ॥ విదితకవిత్వతత్త్వవినివేదితచిత్తులు మీర లాటచే
నుదితసహస్రరశ్మిరుచియోగము సంతమసంబుపాపు చా
య దురితభంజకంబు భవదావృతమైన కవిత్వ మెయ్యెడన్ ... ..... ౧౦౯

అను పొగడ్తను నీ మహాత్మునకు ననుగుణింపఁ జేసినది.

కవులలోఁ బోతరాజు లుండవచ్చును. తిక్కన సోమయాజు లుండవచ్చును. ఇద్దరి యంశము లొక్కటనే యుండుట దుర్లభము. అట్టివిశేష మీపాపయ్య భట్టారకున కందినది.

ఈకవిచంద్రుని పద్యములు స్వభావోక్తిని ననువదించుటలో ముందంజవేయు చుండును.

## ని త్య స త్య వ్రి త ము

కలవారిలో నీకవికి ముఖ్యస్థాన మున్నది. పరిశుద్ధచరిత్రుఁడనుటకును నగ్రిస్థాన మలంకరించెను. ఈకవి యుపయోగించిన పదమెల్లను బద్యమో, శ్లోకమో, యయితీరును. కాని నిరర్థకపద మీయన నోటినుండి వెడలదు.

## తి రు ప తి వేం క ట క వు లు

ఉ॥ ..........................................గా
ధారచనా విశేషమున ధార కొకింతయు లోటులేదు

అని వ్రాసికొనినారు.

..........................................గా
ఉ॥ ధారచనావిశేషమున ధార కొకింతయు వన్నె వోదు

అని వీరి కనుమతింపవలసి వచ్చును. ఆంధ్రీకరణమునందు వీరికి సములు వీరే. కష్టములైనవి మానుటఁగాని వీలునుబట్టి పెంచుటకాని వీరి కలవాటులేదు. సంస్కృత శ్లోకములకన్నను సారములగునట్టు లాంధ్రపద్యములు రచించి యందమును నానందమును వెల్లువచేసెను. చదువుకొన్నకొలఁదిని జదువవలెనను కుతూహల మినుమడించు చుండును.

నకు నేనును బీఠిక వ్రాయు నవకాశము లేకపోలేదు. శ్రీ దేవీభాగవతమును ముద్రింపించుచున్న శ్రీ పుచ్చా కోటయ్య బేతపూడి వీరశరభయ్య గార్లతో నాకును గొంత సంబంధ మున్నది. అల్లుఁడు కోటయ్యగారు. నాసంతానములో శ్రీ పోషిత కనకదుర్గాంబ కోటయ్యగారి భార్య. వీరశరభయ్య గారు ప్రాణమిత్రులు. మా యీ యమ్మాయి కాంధ్రమును బోధించిన గురువర్యులు. ఈ వీరశరభయ్యగారిని గుఱించి వ్రాయుట సాధ్యమగు విషయముకాదు. పండితులలోఁ బండితుఁడు. పని వారలలోఁ బనివాఁడు. లౌకికులలో లౌక్యుఁడు. భక్తులలో భక్తుఁడు. వ్యవహర్తలలో వ్యవహర్త. వక్తలలో వక్త. "చూచినది, తలంచినది" కానిది లేదు. ధార్మికులలో నత్యుత్తమధార్మికుఁడు.

తోడునీడ కోటయ్యగారాయాయి సత్కృతులయం దన్నింటియందు నెంతయును బ్రోత్సాహ మినుమడింపఁజేయుచుండును.

కోటయ్య శరభయ్యగార్ల మైత్రివిషయమై కొంత విశదీకరింపఁదగును. ఈయుభయులును బ్రిటిషు ప్రభుత్వమున వేర్వేరు వ్యక్తులయొద్ద నౌకరీ చేయుచు బసలలోను నివాసములయందును గలసి మెలసియుండుచుఁ గొంతకాలమున కా సందర్భములో నొక 'పిండి మర' శ్రీపరమశివానంద యనెడి నామధేయముతో స్థాపించిరి. అప్పుడును వారి వారి నౌకరీపనులు సక్రమముగా నెరవేర్చుకొనుచునే యుండిరి. తదుపరి

శ్రీ శం క ర ఫౌ ం డ రీ

యను దానిని నెలకొల్పికొనిరి. క్రమముగా నితరుల సేవకు నిరుత్సాహులై శ్రీ దేవీసేవయందు మాత్రమే తత్పరులై యుండిరి. ఆకాలమునందే వీరి యన్యోన్య మైత్రిని విశదీకరించు స్వస్థాననివాసమునందలి యేకకుటుంబభోజనము మున్నగునవి సంప్రాప్తము లయినవి. అద్దాన మిక్కిలి యభివృద్ధిని గాంచుటయే గాక, శ్రీ కపిల గోసంరక్షణ మున్నగు సుకృతములకు నెంతయుఁ దావులైరి. పిమ్మటఁ

...బు ర లా వ ర్క్ షా ప్...............

ముఖమునుండి శ్రీ దుర్గానివాసము మొదలగు మహానిలయముల యొక్క నిర్మాణములకును, సప్తసంతానములయొక్క ప్రయత్నములకును, ప్రతిష్ఠలకును బ్రముఖులయిరి. ఇఁక వీరు సేవించిన తీర్థయాత్రలు లెక్కకు మిక్కుటములు. చేసిన ధర్మకార్యము లసంఖ్యాకములు.

ఈ సందర్భములో నొక్క సమయమం దిద్దుఁ ధారే సంభాషణానుసరణసంబంధము ననుసరించి

## శ్రీ దే వీ భా గ వ త

పరిశంస చేయుచున్నపుడు నేనును శక్తికొలందిని సేవ కనుమతించితిని.

నాచుణ్ణోఁగూడియును దామరపూవు సుంతయు శోభను దగ్గదు. ఈనాటి పారఁబోటులకు గురియయ్యును, బాపయారాధ్యుని కవిత్వము వన్నెదగ్గదు. చీకటిని బట్టియేకదా ప్రకాశము వన్నెకెక్కినది? వీరికవిత్వమున కివియును నాసికే ముఖ్యకారణములు కారాదా!

పై యంశముల కనుకరించునవి,

### ప్ర థ మా శ్వా స ము

ఉ॥ పిల్లలఁ జూచి చిత్తములఁ ◊ బ్రేమము నొందుట వింతయయ్యె నీ
మొల్లమి చూడనబ్బురము ◊ మోహము విప్పఁగరాదు భూమిలో
నెల్లెడఁ బుత్రసంపదకు ◊ నీడగు సంపద లెవ్వి కావు నాఁ
డెల్లము సర్వభోగమును ◊ దీనికి నీడని పల్కినారొకో?

ఉ॥ గట్టులచెంతఁ గాపురము◊గా నివసించు జనాళియట్టి తే
పట్టిని జేరి యోయధిప! ◊ పల్లెల నద్దమ రేయి దాటి యే
పట్టున నిల్వ కొక్కమొగి ◊ బారులుగట్టుచుఁ గొల్లపులుల్ పసిన్
బట్టుచు మట్టుమీఱి బహు◊బాధలఁ బెట్టఁగఁ జొచ్చె నేమనన్?

### ద్వి తీ యా శ్వా స ము

మ॥ అయయో నా మెయి లేశమాత్రము గుణం◊బా లేదు కాదయ్యెనే
ప్రియ మెట్లయ్యెను గేలువట్టితివి నన్ ◊ బ్రేమింప నర్హంబె? దు
ర్జయకామవ్యధచేఁ గలంగ మునికిన్ ◊ స్వాభావికం బౌనొకో?
యయశం బెంతయొ తెల్లమౌనె? మునిచంద్రా! ధర్మమున్ గాంచుమా.

మ॥ కనియెన్ గాంచనగాత్రిఁ గజ్జలకచన్ ◊ గంజాతపత్రేక్షణన్.

ఆ॥ కట్టబట్టలేక ◊ పొట్ట కన్నములేక, పెట్టసొమ్ము లేక ◊ బికిరమెత్తి
నట్టిపోల్కియున్న ◊ దిట్టబోటికి నింత, యబ్బురంపుఁ దావి ◊ యలరు టెట్లొ?

గీ॥ ఇంత నాపయి మరులొందె ◊ నేని నీకు, నేల తప్పించుకొన నిప్పు ◊ డేలుకొనఁగ
వలదె యననేల? కులధర్మ◊వర్తనంబు, రక్షణీయంబు మావంటి◊రమణులకును.

ఉ॥ కన్యను నిన్నుఁగూడుతమిఁ ◊ గాంచఁగ నేరను ధర్మమూర్తివై
మాన్యత సర్వసాక్షివయి ◊ మద్హృదయం బెఱుగంగఁజాలవే

ధన్యతఁ గోరి పిల్చితిని దద్దయు మ్రొక్కుడుదానఁ గాని య
న్యోన్యసుఖాభిలాష భవదగ్రమునన్ నిలువంగనేర్తునే?

ఉ॥ తల్లుల కెల్లఁ దల్లియగు తల్లిని గానఁగలేక యెందఱో
తల్లులగర్భశోకములఁ దా రుదయించుచు జన్మజన్మలన్
దల్లుల సంతరింతురు జనంబు లహా! పరశక్తి! నీవె నా
తల్లినటన్న మాత్రమునఁ దల్లులు లేరు సుమా త్రిశుద్ధిగన్.

## తృ తీ య స్కం ధ ము

ఉ॥ ఎద్దియు నీవుగాని దొకటేనియు లే దఖిలంబు నీవమై
యెద్దికచే నటింతువు జనోచితసత్క్రియ లెల్ల నీవె కా
కెద్దన వేఱకల్గునె? గ్రహింపఁగఁ బూరుషుఁడైన శక్తుఁడౌఁ
ద్వద్దయనీయుఁడైన నిది తథ్యమె తచ్ఛ్రుతిసూక్తి శాంకరీ!

మ॥ బలమా! సున్న, సహాయులా! నహి, ధనంబా! లేదు మంత్ర్యాదులన్
గలలో మాట స్వయంవరం బనుచు శంకల్ మాని వార్వారు భూ
స్థలిరాజన్యులు వత్తు రుత్సవము దుర్ధర్షంబు చక్షుర్ద్వయీ
ఫల మివ్వేడుకయంచు వచ్చితిని సంభావ్యంబు గాకుండునే.

సీ॥ కలుములజవరాలి కన్నతల్లికిఁ బట్టి, గురునియిల్లాలికిఁ గోడెకాఁడు
జారచోరుల విలోచనములకపురంబు, విరహిణీజనముల వేరువిత్తు
దంపతివిహారణోత్సవకామకల్పక, మమరులయాకటి కన్నరాశి
తోవవెలందికిఁ బ్రేమఁ దులకించు చెలికాఁడు, వెలిరాలఁ గరగించువింతవాఁడు
గీ॥ తామరసపాళులకు నెల్ల దరువుకాఁడు, కమ్మవిల్తుని పట్టంబు కట్టువాఁడు
చిఱుతగాలినిమంత్రిగాఁ జేయువాఁడు, చందురుఁడువచ్చెనుదయాద్రిచరియఁ బ్రాకి.

ఉ॥ సంపద లాపదల్ ధరణి సర్వసమానము నింతలోన నీ
పెంపుల కింత నిక్కట వివేకముగాదని నవ్వినట్టులన్
బొంపిరివోని తావులను బూసెను దావులు కల్వగుంపులం
దింపుఁదొలంగ నెల్లతఱి నెల్లతఱిన్ గొఱయానె? యుబ్బఁగన్.

## చ తు ర్థ స్కం ధ ము

మ॥ సుమకోదండము చేతఁ బూని విజయస్ఫూర్తిన్ రసాలాస్త్రముల్
భ్రమరజ్యా ఘటియించి కీరతురగాళివల్గద్గతిన్ దూఁగుచున్

హిమభూభృద్బదరీవనీతటమునం ౯ దిచ్ఛావిహారోచిత
క్రమముల్ సల్పుచుఁ గంతుఁ డంత జయదీక్షాదక్షుఁడై చేరెన్.

ఉ॥ సమ్మతి నమ్మనీందుఁడు రసాతలసీమకుఁ జేరి చిల్వరా
కొమ్మలు పూజలన్ దనుపఁ ౯ గొన్నిదినంబులు సంచరించి భో
గమ్ముల నిమ్ములన్ నెగడు ౯ క్రవ్యభుగగ్రణి రాజధానికిన్
బిమ్మట నెమ్మినేగి కడు ౯ వేడుక నయ్యెడలన్ వసింపఁగన్.

ఇట్టి తేటతెల్లంబు లగు పదంబులచే మనోహరంబుగా రచించుటయం దీకవి యద్వితీయుఁడు. శ్రీదేవీభాగవతము నందీకవి సంస్కృత మొక్కెడను వేరొక్కెడ నచ్చ తెలుఁగును, వాడుకమాటల నుపయోగించి పండితపామరానురంజకముగా భాషాం తరీకరించెను. చదివితీరవలెనేగాని చెప్ప నలవికాదు. "నిరంకుశాః కవయః" అన్న నుడి కీయన తావయినాఁడు. చెవి కింపుగా నుండు పదములు స్వతంత్రముగా నుపయోగించిన కవివరేణ్యుఁడు.

ఇద్దానిరసము రసికు లనుభవింతురు గాక.

"ఉ పో ద్ఘా త ము"

లో "ఏకపాత్రితో రచింపఁబడిన యీ యిరువదేడును భార్యావియోగము కల్గినపు డీ మహాభక్తుఁడు రచించినట్లు జనశ్రుతివలన నెఱుంగనయ్యెడిని. (విస్తర భీతిచే నిటఁ గొన్నిటిని మాత్రమే చూపితిని)" అని వ్రాసినారు.

చదువరుల యానందమునకై మిగిలినవి పదియారును జూపుచున్నాను.

ఉపోద్ఘాతములోని, 8వ పేజీలో, 12వ, పద్యములో, మూడవ పాదములో, మొదట, "యుక్తింజేసి" యనుటకు, మాఱుగా, "సిక్తుంజేసి" యని సరి చేసి చదువకొనఁదగును.

—• న క్ష త్ర మా లి క •—

శా॥ ముక్తాపాండురహాసచంద్రికలు కేశమ్మోర్వి గుబాళింప మా
దృక్తాపత్రయి విన్నవించి పతి కెంతేఁ బ్రేమ పుట్టించి ప్రా
గుక్తాళీచరణాంగదారవసముద్ఘోషాంగివై వచ్చి, నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౩

శా॥ వ్యక్తావ్యక్త జగద్విలక్షణము నీ ౯ వాస్తవ్య మంచున్ బృహ
త్సూక్తాళుల్ మొఱవెట్టినట్లు చిదచిత్సూత్రమ్మంత నీ వౌదు దీ

వ్యక్తుల్ మాదృశులా! కనన్ గరుణ నాపై నుంత యుం తేని నీ
ముక్తిద్వారము తల్పు దీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౪

శా॥ రుక్తాపానలవేదనాశిథిలితోద్రుఙ్మాంసమేదోవసా
తిక్తుండన్ గృతమక్షికాకృతినిరర్థీభూతమా గాత్ర మీ
దృక్తాగ్రంథిల జన్మలన్ విసివి తల్లీ! కావుమంటిన్ గదా!
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౫

శా॥ సక్తుస్వాదన కాలయాపన ముపేక్షన్ జేసి రేయున్ బవల్
న్యక్తుచ్ఛోక్తుల తోవఁ బోనక పరానందస్వరూపంబు ప్ర
త్యక్తారాధ్యగమైన నీ పదము నందన్ గోరితిన్ గాన నీ
ముక్తిద్వారము తల్పు దీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౬

శా॥ రక్తిన్ నీ పతి యంతరాసవపరీరంభక్రియాలాలసా
ధుక్తారుణ్యవతిన్ నిన్న్ గలసి యెంతో వేడ్కఁ గర్మాటవీ
ధక్తోషం బిడ నీదు పాదముల చెంతన్ దండ మర్పింతు నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౭

శా॥ రుక్తీక్ష్ణంబగు సూర్యమండలి సమారోహించి సామాద్రిమా
భాక్తిన్ శోషిలనేల? నాదు హృదయాంభస్సంభవంతస్సుధా
ముక్తల్పంబున నిల్పి యర్చ లిడుదున్ క్రముం దట్లు చెల్లించి నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౮

శా॥ దారిక్తారాపతిశేఖరాంఘ్రిజలజధ్యానావధానాది తృ
ష్ణక్తాంచద్ధృదయాళువై నను మనస్సక్తిన్ గటాక్షించి వే
స్వక్తాదాత్మ్యము నొందె దంచుఁ గడు నభ్యర్థించి వాకుచ్చెదన్
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౯

శా॥ దృక్తారంబులు సేస చల్లి మధురోక్తి స్రుక్కులాకంధమా
ముక్తస్ఫూర్తి నలంకరింపుచుఁ గరమ్ముల్ మోడ్తునం చంటి వి
ష్వక్తేజమ్ము దిగంతరాళములు గప్పన్ మూర్తిఁ గాన్పించి నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౨౦

శా॥ మోక్తుంకామత కందళింపఁగ భవన్మూర్తిన్ గనన్ గోరితిన్
రక్తదృక్ప్రసవాగ్రజాతి సదనోద్యద్రత్నాధరోష్ఠ ప్రభా
యుక్తర్ణస్మిత వక్త్రచంద్రము సముద్యద్ద్యోతింపఁగా వచ్చి నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౧

శా॥ స్విక్తారుణ్యము మధ్యమంబును సునాభీలోల లోకత్రయీ
భాక్తాల్యంబును గర్తృకార్యతలఁ దేల్పన్ లోకమాతృత్వ ధీ
యుక్తిన్ గాంచితి వేఱెయేల? భవదీయుల్ బ్రోవ నింకేరు? నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౨

శా॥ ధిక్తాం ధింధిమి ధిక్త ధెయ్యనుచు సద్దేవాంగనాసంఘముల్
ముక్తానస్వర మేళనంబులుగ నిర్మూల్ వెంచి నర్తింప న
ద్రిక్తిన్ జూపెదు వాకిటన్ నిలచి చింతాతంతువుల్ ద్రెంచి నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౩

శా॥ త్వక్తారుణ్యము దుస్సె డస్సె వలవంతల్ చూపు లోపించె న
వ్యక్తంబయ్యె దిగంతకాళము భవిష్యద్భ్రాంతు లూటాడె సం
పృక్తంబయ్యెను బుద్ధిమాంద్యము భవత్ప్రేమంబు దిక్కంటి నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె? చాముండా! జగజ్జీవనీ! ౧౪

శా॥ బుక్తేజోజ్వలితోపలత్రయకృతాభీష్టానుసంధాతృబు
ద్ధ్యాక్ప్రస్థావరివధ్వవద్విమల నైకవేదోద్గ్రహీ తేంద్రియ
స్పృక్తేజోజ్వలితాత్మ సంయుతుఁడనై శ్రేయంబు గన్నాఁడ నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౫

శా॥ మౌక్తుల్ సాంజలులై సతీపతులు పుష్పల్మూర్తుల్ దలంబ్రాల్ మహో
ద్వ్యక్తిన్ నింపఁగ నభ్రకేశు లగుటన్ శ్రీదోయంబులన్ వచ్చు నీ
ముక్తుల్ నింగివిధో? మొగిళ్ళవో? యనన్ శ్రీ బోధింపఁగా తల్లి! నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౬

శా॥ సక్తిన్ నామభవాభిముఖ్యులగు నాసాశక్తు లత్యంతిమా
సక్తామోదరవీశి నీవు మధు వాస్వాదించుచోఁ గ్రమ్మి జం
ఝుక్తాళంబులు వ్రేయ గంతులిడు నాసక్తిన్ జెందియున్నాఁడ నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౧౭

శా॥ తు క్తస్త్రీధనలాభలోభములతోఁ ద్రోపుల్ దలంబట్టి యా
శక్త్యాపావహసంవృతిజ్వలనవిక్షోభంబు గల్పించి ప్రా
త్యుక్తుల్ వొందిరి యాత్మలెల్ల జననాంతోర్ధ్వల్ ముముక్షగొల్చి నీ
ముక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముండా! జగజ్జీవనీ! ౫

శా॥ విద్వద్వందితమైన "క్రౌంచగిరి" దేవర్షిముల్లు పాపయ్య ము
క్తిద్వారస్తవరత్నరాజమున నెంతే మెచ్చఁగాఁ జేసెర్షి
స్వాద్వస్వాదుఫలాభిలాష లితరవ్యాసంగ మాలింతువే
తద్వచ్ఛ్రీకము నొందకుందురె? పరార్థప్రాప్తవాంఛారతుల్.

మఱియు

ఉ॥ "సింహము గర్భమందునను సింహము పుట్టుట నైజమే కదా!"

అను సూక్తి ననుసరించి

పాపయారాధ్యకవిసార్వభౌముని

కుమారరత్నము

వియ్యానారాధ్య కవిసింహము

రచించిన (గ్రంథము లిప్పటికిఁ జిక్కలేదు) కొన్ని పద్యములు (బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ల పెదవెంకటశాస్త్రిగారు చూపించినవి గాక) మఱికొన్ని యిద్యెడఁ జూపుదును.

సీ॥ భ్రమరాంబికాదేవి పాయదు నీదంట, కంతుఁ డెఱుంగు నీకంటిమంట
పంచాక్షరీదేవి పట్టును నీ వెంట, నీదుసాన్నిధ్యంబు నాదుపంట
భక్తపరాధీనపారవశ్యము దంట, వడిదెబ్బ తింటివి పార్థువింట
భుజగముల్ సొమ్ములై పొలుపొందె నీయొంట, మెడఁబాయకుండు టదేమి కుంట
తే॥గీ॥ వ్యోమకేశుఁడు నిన్ను వెలిఁబెట్టెలోహఘంట, నిర్జరులు సంచరింతురు నీదుకంట
పార్వతీమానసోల్లసత్పద్మభృంగ! చంద్రఖండోత్తమాంగ! శ్రీశైలలింగ!

సీ॥ విన్నవైతివయ్యామో మనసిచ్చి నాతంతు, గట్టిగఁ జాలించు మిట్టితంతు
గరళభక్షణముచే గమలెను నీ గొంతు, వరమీయ దేవరవారివంతు
నీదు చరిత్రముల్ నిజముగ వినుపింతు, నంతకుఁ డెరుగు నీవింతగంతు
సకలలోకములలో జనులెల్ల నీ సంతు, దీనులఁ బ్రోవు మిదిమెగ పంతు.
గీ॥ యాచకులపట్ల గూడదు నీచురంతు, పాలుమాలక మనసు నీపైన నుంతు
పార్వతీమానసోల్లసత్పద్మభృంగ!, చంద్రఖండోత్తమాంగ! శ్రీశైలలింగ.

సీ॥ భ్రమచేసి పేలాలు ఽ నమలెఁగా నీ దౌడ, నెరవైన తేజంబు ఽ నీదు గోడ
మెచ్చియే గుహుఁడు దాటించినాఁడట యోడ, సాదులహృదయంబు నీదు మేడ
కాళీయఫణిఫణాగ్రములందు నీవాడ, గండుతుమ్మెదలు రాగంబు వాడ
నత్తరాధామణి ఽ గుత్తగొంటివి చూడ, నేదిక్కునందును ఽ నీదె జాడ
గీ॥ నల్లనయ్య! నీపంపు వేపల్లెవాడ, దండిదండగు పనులకు ఽ దుండగీడ
రుక్మిణీమణిచిత్తసరోజభృంగ, నవఘనశ్యామలాంగ! మన్నారురంగ!

సీ॥ రావణుం డిలను హాహాకారి బోరైవ్వరి, నింగి గంగాదేవి ఽ నీ కొమారి
తెలిమోర గద్దెపై ఽ దేవర సవ్వారి, వైకుంఠనగరిలో ఽ నీ కచేరి
నెఱిని సుగ్రీవుండు ఽ నీకు సుబేదారి, ఫణిరాజు నీ మృదుపాదసూరి
అలగొల్లపల్లెలో వల నొప్ప నీదారి, వెన్న దొంగయ్య నీ ఽ యన్న సీరి
తే॥గీ॥ ఎంత వేడిన ననుఁ బ్రోవవేమి శౌరి, రవ్వ నందక మొరవినరా! మురారి!
రుక్మిణీమణిచిత్తసరోజభృంగ!, నవఘనశ్యామలాంగ! మన్నారురంగ!

సీ॥ మురళికిఁ దెలియు నీమోవి తేనెను హాయి, రాధ యెరుంగు నీ ఽ రతిబడాయి
చిందమెఱుఁగును నీయందుఁ బుట్టుసనాయి, కంసుఁ డెరుంగుఁ గాగల లడాయి
నలువకుఁ దెలియు నీనాభిలోని హవాయి, యాహల్య యెరుగు నీయడ్గుదోయి
పూతన తెలియు నీమూతిపీల్పు సిఫాయి, కలజగా లెరుగు నీకడుపువాయి
తే॥గీ॥ కుబ్జయెరుగును నీ గుణాగుణము లోయి, చెలగి లోకమ్ము లేలెడి ఽ శేషశాయి!
రుక్మిణీమణిచిత్తసరోజభృంగ!, నవఘనశ్యామలాంగ! మన్నారురంగ!

సీ॥ తలచిచూడఁగ యశోదాదేవి నీతల్లె, యల సుభద్రమ్మ నీ ఽ యలరు చెల్లె
లీవు పుట్టి పెరుగు చెరుగును రేపల్లె, యాదిలక్ష్మీమణి ఽ నీదు ముల్లె
పచ్చనివన్నెల ఽ పసిడట నీ వల్లె, చల్లగ నుండును ఽ గొల్లపల్లె
పాలమున్నీటిలోపల నుండు నీ యిల్లె, మూఁడులోకముల నీముద్దు చెల్లె
తే॥గీ॥ రమణ నీ వెక్కు పులుగులరాజు బొల్లె, కుబ్జ నీమీద గంధంబు ఽ గోరిచల్లె
రుక్మిణీమణిచిత్తసరోజభృంగ! నవఘనశ్యామలాంగ! మన్నారురంగ!

సీ॥ నీకుమారుండును ఽ లోకు లెన్నిన పల్వ, నీ బొడ్డుపుట్టిన ఽ నిసువు కల్వ
నింగి గంగాదేవి ఽ నీపాదమున మొల్వ, వాతూలసుతుఁడు దేవరను గొల్వ
అలనాడు రాధ మేనల్లరమ్మని పిల్వ, వరుస గాదని గోపి ఽ సరస నిల్వ
నీవు మేనునఁ గప్పినావు పచ్చనిశాల్వ, మెన్నెన్ని భవములు ఽ నిన్ను విల్వ
తే॥గీ॥ జయ్యనను హంసతూలికశయ్యపిల్వ, నన్నుఁ బ్రోవక యుంటివా ఽ నిన్నుఁ బిల్వ
రుక్మిణీమణిచిత్తసరోజభృంగ!, నవఘనశ్యామలాంగ! మన్నారురంగ!

సీ॥ నిను యశోదాదేవి మును గట్టెఁ బెనురోళ్ళఁ, దగు మొలతిరిగి రాఁదగినత్రాళ్ళ
రంగుగాఁ గట్టుంగరాలు నీ పదివ్రేళ్ళ, నీ తల వెలసె వన్నెల రుమాళ్ళఁ
గాంచనకశ్యపుకడుపు చించితి గోళ్ళ, మేలైన నీచెయ్యి వాలుబిళ్ళ
శ్రీపాదరజముచే స్త్రీ చేసితివి రాళ్ళఁ, జెలఁగి రేపల్లె కాచితివి తూళ్ళ
తే॥గీ॥ నీ వడుగునను గన్నవి గనింగి నీళ్ళ, వెన్నదొంగయ్య నీపని వేయినోళ్ళ
రుక్మిణీమణిచిత్తసరోజభృంగ, నవఘనశ్యామలాంగ! మన్నారురంగ!

సీ॥ సుల్తాను బహదరీ చూపించె నలఖాబు, మెచ్చువచ్చిన నిచ్చ లిచ్చు జేబు
కై వార మొనరించు కలికిచ్చు తసిరీబు, ఖానుఖుషినిగూడి ఖీనుఖాబు
అలకాధిపతికైన నప్పులిచ్చుగరీబు, నలమికొందురు సవారులు రికాబు
జనులకు రామరాజ్యం బయ్యెను జరీబు, పెంచుచోటుల బడాయించుఖాబు
తే॥ గడియమెడలేదు పౌనరంగ బుడికిలేబు, ఖడ్గకాళికి రిపులమూకలకవాబు
ఘనతగుణమణితతికి బంగారుగాబు, నవనవోల్లాసి మాజగన్నాథబాబు.

సీ॥ శివినేలినవాని సేవలోన నఖీబు, గుణగణం బార్జించు మణిసరాబు
జగమెచ్చు తేజంబు సమకూర్చు నాప్తాబు, కల్మిచే ముక్కంటి కలిజవాబు
వింతల్లో సేవించు నంత మేల్గనిసాబు, చలపట్టి సేయు వైరులకరాబు
వాసిరెడ్డి కులాబ్ధి వర్ధిలు మైతాబు, సర్కారుసాధించు సరిజబాబు
తే॥ సాదుసాహెబ్ మెహర్బాను సాకుడాబు, జబరుదస్తుల కెల్ల దూస్రానవాబు
కన్ను వేసినదిర తమ్మికంటిబూబు, నవనవోల్లాసి మాజగన్నాథబాబు.

ఇక వీరియొక్క కాలమునుగురించి విశదీకరింపవలసియున్నది. ఇందును గురించి సరసకవితాధురంధరు లగు దాసు శ్రీరామకవిగారు వారి దేవీభాగవతము లోని విషయసూచికకు మున్నుఁగల పేజీలో,

## దే వీ భా గ వ త ము

చ॥ వినఁబడె ముల్గు పాపయ కవిప్రవరుం డొక వందయేండ్లకున్
మునుఁ దెలిఁగించె భాగవతమున్ సరసంబుగ నంచు, దీని ము
ద్రిణమున నాల్గు స్కంధములు దాటిన వెన్క! నతండు నాదు వం
దనముల కర్హుఁ డెంతయును ధన్యుఁ డతండుగదా ధరాస్థలిన్.
చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీమణులన్ గొనియాడి మ్రొక్కెదన్
సరసులు నాకు మిత్త్రిలును సర్వజన స్తవనీయ పాండితీ
భరితయశుల్ తెలుంగునను భాగవతంబు రచింపఁబూనిరం
చెరిగితి వారివల్ల గణియింపరు నా యపరాధపుంజమున్.

అనియు వ్రాసికొనియున్నారు. అందులోనే వారి జీవితచరిత్రసంగ్రహమునందు 6 వ పేజీలో "ఆన 1900 సం॥ మార్చినెలలో దేవీభాగవతాంధ్రీకరణము నుపక్రమించి......పూర్తిచేసి......ముద్రణమునకొసంగిరి" అనియు వ్రాయఁబడియున్నది.

దానినిబట్టి పరిగణింపఁగా,

"శ్రీ పాపయారాధ్యులవారు"

ఇప్పటి కొకటియున్నర శతాబ్దములకుఁ బూర్వము శ్రీ దేవీభాగవతాంధ్రీకరణ మొనర్చినట్లు స్పష్టమయ్యెడిని. దీనినిబట్టి హూణశకము 1770 ప్రాంతములయం దీ కవిసార్వభౌముఁడు జీవించియున్న ట్లవగత మగుచున్నది.

బ్రహ్మశ్రీ "కింకవీంద్ర ఘటాపంచానన" ఇత్యాది బిరుదాంకితు లగు "తిరుపతి వేంకటేశ్వర కవులలో నొక్కరును, బహుస్తుతము "కళాప్రపూర్ణ" ఇత్యాది మహాబిరుదాంకితు లగు శ్రీ చెళ్ళపిళ్ళ పెద్ద వేంకటశాస్త్రి శతావధానిగారు శ్రీ ములుగు పాపయారాధ్యులవారి యీ దేవీభాగవతమున కుపోద్ఘాతము వ్రాసి సంస్కరణభారమంతయును వహించియుండుట యెంతయును శుభావహము. ఈ శతావధానిగారే శ్రీ దాసు శ్రీరామ కవిగారి దేవీభాగవతమునకును నుపోద్ఘాతము వ్రాసినారు.

వీరును దెలిఁగించినారు. (వీరి దేవీభాగవతములోని దశమస్కంధమును (వీరికిఁ బిన్నతండ్రి కుమారులును, నస్మద్గురువరులును, సన్నుతాచారులును నగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల చిన్న వెంకటశాస్త్రి శతావధానిగారు) దెలిఁగించిరి.)

వీరు వయోవృద్ధు లనఁగా, డెబ్బదియేండ్లకుఁ బైఁబడిన వయస్సుగల వారైనను, శరీరదౌర్బల్య మేర్పడినను వాక్పాటవమును బుద్ధిబలమును గవితానైపుణ్యమును నెంతయును వృద్ధినందుచునే యున్నవి. వీరే తమకుఁ దాము శ్రీదేవీభక్తిచే, నీ భాగవతమునం దుత్సాహపూరితులై రి. సంస్కరణమునకును ముందంజవేసిరి. వీరి యుత్సాహమున కెంతయు నభినందింపవలసియున్నది.

సంతసము

సీ॥ పుత్త్రుఁడొక్కఁడు ముందుఁ గ బుట్టెను బిమ్మటఁ, బుత్త్రిక లిర్వురు గ పుట్టినారు.
నను భార్య షేరమ్మ గ యనుకరించుచునుండ, సిద్ధాంతమందు వసించియున్న
కనకదుర్గాదేవి గ వినుతి నాగేశ్వరస్వామి సంస్తుతిచేసి గ భాగ్యమలరు
నంత మీరాబాయి గ హరికథ వ్రాసితిఁ, దనివిమై "పోషితగకనకదుర్గ"
నను ... యుల్లసించె

గీ॥ పుట్టెఁ బుత్త్రిక పూర్వపుణ్యమునఁగ, దల్లి బంగరు బొమ్మని గ యుల్లసించె
బుద్ధి మాణిక్య మగుట నుపశాంగినాను, దల్లిదండ్రుల కిదెగ సంతసము నిచ్చు.

ఉ॥ పుత్రిక లేవు రుండి రోకరపుత్రుఁడు మా కిఁక దుర్గపేర నీ
పాత్రత సంభవించె నది ర భావ్యము కాదొకో ? పుత్రికాదృతిన్
బాత్రులు తల్లిదండ్రులయి ర పండువు కై కొనుచుండు రెంతయున్
బాత్రత సుస్వభావమును ర భక్తిని నీమెకుఁ బెంచు దేవియే.

ఉ॥ ఈమెకుఁ బెండ్లికోసమయి ర యేనయి చేసితి నెన్నొ యత్నముల్
నోములపంట లట్టులు విరనోదమగున్ బెజవాడ దుర్గయై
యామె " నృసింహారావు " " శరరభయ్యలఁ " బంపెను బెండ్లిపెద్దలన్
మేమును సంతసించితిమి ర మేల్కొనెఁ గోటయ, దుర్గమాత్మజన్.

సీ॥ "కోటయ్య"యన"వెండిరకొండ"యే, యానని,యానందమును శరరభయ్య కాంచు
"శరభయ్య"యన"స్వర్ణరగిరి"యెయవ్యెడునని, హర్షమ్మునటులెకోరటయ్యకనును
"కోటయ్య" మాటయేరకోరుచునుండును, న్యాయ్యమ్మునన్ శరరభయ్య మనము
"శరభయ్య" భావమే ర యరయుచు నుండును, నన్యోన్యమందుఁ గోరటయ్యయాత్మ

ఆ॥వె॥ అడవి యుసిరికాయ ర యంబుధిలవణంబు, సాటివీర లిట్లు ర జంటలైరి
కూర్మి నేర్మి మేల్మి ర కోటయ్య శరభయ్య, చెలిమి దేవికరుణ ర వెలయుఁగాక.

ఉ॥ కూతురు నల్లుఁడున్ సఖుఁడుఁ ర గూరిమిమై విలసిల్లుచుండుటన్
జేతము పల్లవించు నిది ర సిద్ధము దీనికి మించునేదియో
హేతువు "పూర్వపుణ్య"మగు ర నిట్టులె వీరు మహేశ్వరీకృపన్
నీతిని ధర్మకార్యములు ర నిశ్చలభక్తిని జేయుచుండుతన్.

ఉ॥ ఆ పలుకుల్ వెలందిపలు ర కంద మొనర్చుచు నుండుఁగాక మేల్
ప్రాపయి కల్మిమేల్మిజవరరాలు ప్రకాశ మొసంగుఁగావుతన్
శ్రీపరమేశ్వరీమహిమ ర చిత్తము స్వచ్ఛము చేయుఁగాత, దా
నోపిక దుర్గమాంబిక మరహోత్సవముల్ విలసింపఁజేయుతన్

మ॥ అనసూయాదిమహాపతివ్రతల కురయ్యాలించి లాలించు, మేల్
మనముంన్ గూరుచు, సంతతమ్ము వరసరమ్మానంబు హత్తించు, నె
మ్మనమం దెంతయు పొంగుచుండు, నటె "శ్రీ ర మాహేశ్వరీ దేవి" పు
త్త్రిని మాపోషిత దుర్గమాంబికను బురత్త్రీప్రేమతోఁ బెంచుతన్.

ఉ॥ గోమహిమానురాగ మొనరగూరిచి, పూజకుఁ దా వొసంగి, యు
ద్దామపతివ్రతామహిమరతత్త్వము బోధను జేసిచేసి, యా
రామ ఫలంబు లందఁ దగు ర రాజపథంబును నిల్పి దేవి స
త్ప్రేమను దుర్గమాంబికను ర బెంచుచుఁ బ్రోచుచు నుండుఁగావుతన్

ఉ॥ తల్లికిఁ దండ్రికిన్ సుతులు ఽ ధార్మికమార్గము లందుఁ జూడఁగాఁ
దల్లికిఁ దండ్రికిన్ సుతలె ఽ దైన్యముఁ బాపుచు రిందు నందునే
నుల్లము సంతసించుఁ గద ఽ నుత్తముఁరాండ్రు కొమార్తె లున్న, మా
తల్లియె యిచ్చు సంతసము ఽ తప్పక శాంకరి దుర్గ నోముతన్.

ఆ శీ ర్వ చ న ము

సీ॥ ఇరువురు. వేర్వేరు ఽ పురముల జన్మించి, పిన్నతనమున నూఽర్విడిచినారు
విడిచి యేమాత్రమో ఽ బడిచదు వుంటచే, నౌకరీ చేయఁగాఁ ఽ బ్రాకినారు
ప్రాకి యంతంతకు ఽ వన్నెలు గైసేసి, యధిపకృత్యములందు ఽ నమరినారు
అమరి యందందున ఽ నధివాస మొనరించి, జతఁగూడి పెంపొంద ఽ సాగినారు

తే॥ గీ॥ సాగి భావంబు లొకటియై ఽ తూగులాడ, వేరుగాఁజేరి కృత్యముల్ ఽ పెంచినారు
శాంకరీదేవి 'కోటయ' ఽ 'శరభయ'లను,నిండుకరుణచేఁ బ్రోచుచుఽనుండుఁగాక.

సీ॥ తమ కుటుంబమ్ము లుఽత్తమకుటుంబమ్ములు, సమముగాఁ గూర్మించుఽసరణియందు
ధనములయందు బోఽధనములయందు న,న్యోన్యభావమ్మందు ఽ యోగమందు
నయమార్గములను విఽనయమార్గములను భా,సిల్లుచు నుండెడి ఽ చేష్టలందు
దేవతాభక్తి భూఽదేవతాభక్తి యు,ద్బోధమ్ము చేసెడు ఽ బుద్ధియందు

తే॥ గీ॥ నౌకరి నౌక్కరు మున్ముందుఁ ఽ బ్రోత్సహించి
పొంగుచుందురు ఋజుమార్గఽభూషణములు
శాంకరీదేవి 'కోటయ' ఽ 'శరభయ'లను
నిండు కరుణచేఁ బ్రోచుచు ఽ నుండుఁగాక.

సీ॥ కలికాలమందు నాఽల్గవపాలె ధర్మంబు, కలదనిపల్కు పఽల్కులను దెలిసి
ద్వాపరమ్మందును ఽ దాదాపు గలిలీల, చరియించుచుండు నాఽచరణ మెరిగి
త్రేతాయుగంబెందుఁ ఽ బ్రీతిదాయక మని, చెన్నలరారెడు ఽ వన్నె లరసి
కృతయుగారంభంబు ఽ హితకృతారంభంబు, కల్పించు ననెడి సంఽకల్ప మంది

తే॥ గీ॥శక్తిమహిమచే విధికృతాఽసక్తులగుచుఁ,గలినె కృతమునుగాఁజేయఁఽగలిగినారు
శాంకరీదేవి 'కోటయ' ఽ 'శరభయ' లను, నిండుకరుణచేఁ బ్రోచుచుఽనుండుఁగాక.

సీ॥ పరమశివానందఽభావం బదేమొకో?, "పిండిమర"యె, దానిఽవిధముఁ దెలిసె
శంకరమహిమానుఽసారంబు నా నేమొ?, "ఫాండరీ"యద్దాని ఽ నిండు నేర్చె

పురలా ప్త దేవీ ప్రబోధం బదేదియో?, "వర్కుషాప్" తదీయ స్వభావ మందె
స ప్తసంతానప్రసక్తి యెట్లుండునో?, "ధర్మవనంబు" తద్ధర్మమూనె

తే॥గీ॥ జగమెయాత్మగాఁ దలపోయుసంగడీంద్రు, భావసమరూపవర్తనుల్ భక్తవరులు
శాంకరీదేవి "కోటయ" "శరభయ"లను, నిండుకరుణచేఁ బ్రోచుచునుండుఁ గాక.

సీ॥ పారమార్థికబుద్ధి భాషింతురేకాని, ప్రతిఫలాపేక్ష యెప్పట్ల లేదు
కార్యసాఫల్యంబు గలిగింతురేకాని, స్వాభిలాషను నింపు భావ మరుదు
రాజమార్గములలో రంజింతురే కాని, ప్రక్కదారులు చూచు పక్కి సున్న
సకలానుకూలమ్ము సమ్మతింతురెకాని, యేకానువాద మొక్కింత కాదు

తే॥గీ॥ వీరి వర్తనముల కింక వీరెసాక్షు, లరసి యక్కన్న మాదన్నలనుట నిజము
శాంకరీదేవి "కోటయ" "శరభయ"లను, నిండు కరుణచేఁ బ్రోచుచునుండుఁగాక.

సీ॥ పరమశివానందభవనమ్ము భవనమ్ము, సమములై యొకచోట సాగుఁగాక
సర్వఫలారామసంతతి సంతతి, సరసత నొక్కట మెరయుఁగాక
భావసంకలితరాజీవమ్ము జీవమ్ము, సంతతానందం బొసంగుఁగాక
కార్మికాగారవిజ్ఞానమ్ము జ్ఞానమ్ము, కరుణానుమోదమ్ము గాంచుఁగాక

తే॥గీ॥ నీతిమృదువర్తనములకు నేమమేమి?, కలిమిచెలుములపంట మేల్ గలుగుజంట
శాంకరీదేవి "కోటయ" "శరభయ"లను, నిండు కరుణచేఁ బ్రోచుచునుండుఁగాక.

సీ॥ వర్తకవ్యాపారవర్తనంబులయందు, సరిచూడ నెవ్వరు సాటిరారు
ధార్మికౌదార్య ప్రధానకార్యములందుఁ, దూచఁగా సామ్యంబు దోచదెందు
గోపోషణాద్యనుకూలమార్గమ్ములలో, నెన్నఁగా నుపమాన మింత లేదు
కార్మికాగారపరికారంబులందును, నంకురించును బరిణావాంకురంబు

తే॥గీ॥ సంపదలతావు లలరులకెంపుఠీవు, లనెడు జనముల పలుకుల కనుకరింప
శాంకరీదేవి "కోటయ" "శరభయ"లను, నిండుకరుణచేఁ బ్రోచుచునుండుఁగాక.

సీ॥ కలరవానందప్రకాశముల్ ధార్మికా, ధారమ్ము లభివృద్ధి గోరుఁగాక
ఫలదాయకా ప్తస్వభావముల్ దేవతా, వాసముల్ మహిమచే బ్రబలుఁగాక
కిలకిలారావ ప్రకీర్ణముల్ రామాను, కీరముల్ సిరులఁ బల్కించుఁగాక
లలితానురాగసంకలితానుకరణముల్, భరణమ్ము లంతట మెరయుఁగాక

తే॥గీ॥ మల్లెమొల్లలై కీరుతు ల్లల్లుచుండు, రెల్లవారికిఁ దలలయి యుల్లసింతు
శాంకరీదేవి "కోటయ" "శరభయ"లను, నిండుకరుణచేఁ బ్రోచుచునుండుఁగాక.

సీ॥ "సత్పదార్థంబులు" సమ్మతి దయచేసి, శ్రీజగజ్జనని రక్షించుఁగాక
"సజ్జన సంగతి" చక్కఁగాఁ గల్పించి, శ్రీజగదంబ భూషించుఁగాక
సత్కాలగోష్ఠిని సతతంబు నెలకొల్పి, శ్రీలోకమాత పోషించుఁగాక
సత్యధర్మాదృతి నిత్యంబుగా నిచ్చి, శ్రీ పరాశక్తి భాషించుఁగాక
తే॥గీ॥ సచ్చిదానందసుకృతిసాక్షాత్కరించి, శాశ్వతైశ్వర్యఫలము లొసంగుఁగాత
శాంకరీదేవి "కోటయ" "శరభయ"లను, నిండు కరుణచేఁ బ్రోచుచునుండుఁగాక.

## — ప్రోత్సాహము —

ఉ॥ పిల్లలఁ బ్రోచు తల్లివలెఁ బెంచుచునుండును భక్తకోటులన్
దల్లులతల్లి భాగవతధర్మములన్ దిలకించుచున్నచో
నుల్లము పల్లవింపఁగ మహోత్సవముల్ పొనరించుఁగాన మీ
రెల్లరు దేవినిన్ దలఁచి యెంతయు మేలును గాంచుచుండుఁడీ.

గుడివాడ,
27—1—1942.

విద్వాన్ ధమిడిపాటి అయ్యప్పశాస్త్రి, శతావధాని,
ప్రధానాంధ్రపండితుఁడు, స్థానికోన్నత పాఠశాల.



# అభిప్రాయములు

శ్రీ

శ్రీ చంద్రమౌళీశ్వరాయనమః.

( శ్రీవారి ముద్ర )

శ్రీ శంకరాచార్య స్వాములవారి శ్రీమతం సంస్థానము

మకాం : మన్నారుగుడి 11-4-1942

## శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతి జగద్గురు శ్రీ శంకరాచార్యస్వాములవారి శ్రీమఠం — మకాంఆఫీసు మేనేజరుగారు

శ్రీవారి మహాసన్నిధానములో సుసమయమున ఈ దేవీభాగవతము శ్రుతమయినది.

దేశభాషలో ములుగు పాపయారాధ్య కవిసార్వభౌములుగారు రచించిన శ్రీ దేవీభాగవతమును బెజవాడ శ్రీ శంకరఫౌండరీ ప్రొప్రయిటర్లు మ.రా.శ్రీ పుచ్చా కోటయ్యగారు. మ.రా.శ్రీ బేతపూడి వీరశరభయ్యగారున్నూ ప్రచురింపంబంచియుండు అంశము. దెలిసి శ్రీవారు సంతసించుచున్నారు.

లోకోపకారార్థమై సర్వజనసాధారణముగా గ్రంథార్థపరిజ్ఞానము కలుగుటకు సాధనమైయుండు ఇట్టి సద్గ్రంథమును అచ్చువేయించి ప్రచురించుట చాలమంచి దని యీ అభిప్రాయమును తెలియ జేయుమని శ్రీవారు సన్నిధానమం దాజ్ఞాపించిన ప్రకారము దెలియజేయడమైనది.

(సం) వై. వి. లక్ష్మీనారాయణశాస్త్రి, మేనేజరు.

---

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ
తాతా సుబ్బారాయశాస్త్రి,

విజయనగరము,
18—3—1942.

శ్రీ ముల్గు పాపయారాధ్య కవిసార్వభౌమునిచే రచియింపఁబడిన యాంధ్ర దేవీభాగవతములో గొంతభాగమును నేఁ జదివితిని. అష్టాదశపురాణాంతర్గతమగు దేవిభాగవతమున కాంధ్రీకరణ మాంధ్రలోకమునకు విశేషోపకారకమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఈ దేవీభాగవతము నిటీవలఁ గొంద రాంధ్రీకరించినను నంతకుమున్దుగా నాంధ్రీకరించిన యీ పాపయారాధ్య కవిసార్వభౌములు విశేషకృతజ్ఞతకుం బాత్రు లగుటలో సందియములేదు. ఈగ్రంథశైలి కొన్నిచోట్ల నన్నయభట్టును గొన్నిచోటులఁ దిక్కన సోమయాజిని ననుసరించుచున్నది. నన్నయ కవిత్వము సంస్కృతపద భూయిష్ఠముగను దిక్కనకవిత్వ మాంధ్రపదభూయిష్ఠముగను నున్నటుల నెల్లరకుఁ దెలిసిన సంగతియె. వీరికవిత్వములోఁ గొన్ని పద్యములలో నన్నయ పద్ధతియుఁ, గొన్ని పద్యములలోఁ దిక్కనపద్ధతియు నున్నటులు పాఠకులకు గోచరింపకమానదు. గంగాశంతనుల పవిత్ర ప్రేమను వర్ణించుటలో నన్నయకవిత్వమునకు వీరి కవిత్వమునకుఁ బూర్ణమైన సామ్యము కన్పట్టుచున్నది. నన్నయాదికవిత్వమునకు వీరి కవిత్వమునకు సామ్యమును జూపుటకై యనేకోదాహరణములు చూపవచ్చునుగాని నా ప్రవయస్కతను బట్టి గ్రంథవిస్తరభీతిచే నట్టి భారమును యువకులగు పాఠకులపై నుంచి విరమించుచున్నాను. ఈ గ్రంథము ప్రసాదగుణభూయిష్ఠ మగుటచేఁ బండితులకే గాక సామాన్యులకుఁగూడ విశేషోపకారక మని తలఁచుచున్నాను. చాలకాలముక్రిందట రచింపఁబడినను సముద్రితమగుటచే నింతదనుక నాంధ్రలోకమునకు విశేషోపకారకము కాలేదు. అట్టి కొఱతను దీర్చుటకు దీనిని ముద్రింపించుటకు బద్ధకంకణులైన శ్రీ పుచ్చా కోటయ్యగారు, బేతపూడి వీరశరభయ్యగారు దీనిని ముద్రింపించి యాంధ్రలోకమునకు వెదజల్లుటచే నాంధ్రు లెల్లరును నీయుభయులయెడలను గ్రంథకర్తయెడలను గృతజ్ఞతఁ జూపుదురని నమ్ముచున్నాను. ఈ ముద్రాపకు లిటు లనేకగ్రంథములను ముద్రింపించి యాంధ్రలోకోపకారకు లగుదురుగాక యని భగవంతుని ప్రార్థించుచున్నాను.

కళాప్రపూర్ణులు, కవిసార్వభౌములు, శ్రీ కృష్ణభారతాది విఖ్యాత గ్రంథకర్తలు,

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, రాజమండ్రి.

ఈ దేవీభాగవతము శ్రీమదుభయభాషాభూషణ ములుఁగు పాపయారాధ్య ప్రణీతము. సంస్కృతమున కాంధ్రానువాదము. నే నీ గ్రంథమునందుఁ దృతీయాశ్వాసమున నందం దించుమించుగాఁ జదివితిని. పాపయారాధ్యుల పాండిత్య కవిత్వ తత్త్వము నేను సంపూర్ణముగా నెఱుంగుదును. ఆధునికకవులలో నట్టి ప్రామాణికకవి, మఱియొకం డిదినరకుఁ బుట్టలేదు. నాకు శ్రీనాథునికవిత్వమం దెట్టి ప్రీతియో వీరి కవిత్వమందు నట్టిప్రీతి. శ్రీనాథుని సంస్కృతకవిత్వము చూచుభాగ్యము మనకుఁ గలుగలేదుగాని వీరి సంస్కృతకవిత్వము చూచు మహాభాగ్యము కలిగినది. సంస్కృత మెంత మనోహరముగా నుండునో తెలుఁగుకూడ నంత మనోహరముగా నుండును. వీ రనేకసంస్కృతాంధ్రగ్రంథములు చేసియున్నారు. అందుఁ గొన్నిమాత్రము ముద్రితములు. వారి కృతులలో నీ దేవీభాగవత మొక్కటి. దేవీభాగవతము నిటీవలఁ గొంద రాంధ్రీకరించియున్నారు. వారిలో వీరే యగ్రగణ్యులు. నే నొండు రెండు చూచియుంటిని. వానికిని దీనికి హస్తిమశకాంతరముగాఁ గానవచ్చెడిని.

శ్రీ దేవీభాగవతము పాదుకాంతదీక్షితులై శ్రీవిద్యోపాసకులైనవారే తెలిం గింపఁజాలినవారు. "బ్ర॥ శ్రీ పరమశివాద్వైత భావనారాధ్య సిద్ధసారస్వత విద్యాసాన్నిధ్యపాపయారాధ్య" అనియున్న వారి గద్యము వారి ప్రభావము వెల్లడించెడిని. నే నీ యారాధ్యులవారిని బ్రామాణికకవు లని వ్రాసియుంటిని. వారి పోకడ లన్నియు శ్రీనాథునిపోకడలం బోలియుండును.

---

కాశీ కృష్ణాచార్యులు, గుంటూరు,
అవధానిశిరోమణి. 14–3–1942.

నేటికి శ్రీ ములుఁగు పాపయారాధ్యప్రణీతం బగు ఆంధ్రదేవీభాగవతము ముద్రితమగుట చూడఁగల్గితిమి. ఇదివఱకుఁ బలువురు దానిం దెనిగించినట్లు వినుటయే కాని యా యాంధ్రీకరణములను నేను జూచియెఱుఁగను. కావున వానితోఁ బోల్చి చూడ నవకాశము నాకుఁ గల్గలేదు. కలుగు నవసరమును లేదు. శ్రీముల్గు పాపయారాధ్యులవారినిగుఱించియు వారికవితను గుఱించియుఁ బలుమారులు వినియుంటిని. నేడు వారి కీర్తిశరీరములలో నక్షరరూప మగు నొక శరీర మీ యాంధ్రీకృత దేవీభాగవతమని తలంచితిని. కవిత ధారాళము. ప్రసాదగుణవిశిష్టము. మృదుమధురశైలి. నిర్దుష్టము.

క. నేఁ గని యెఱుఁగను దేవీ,భాగవతపు టాంధ్రపద్యకపరివర్తనముల్
నేఁ గంటి నిపుడె దేవీ,భాగవతపు పాపయాంధ్రకపరివర్తనముల్.

ఉ. సాధ్యమె కైత? అందును నసాధ్యము మార్చుట యన్యభాషకుఁ
సాధ్యముకాదు. సాంతమును కశాస్త్రివ్యతఁ జూపుట యద్ది పండితా
రాధ్యము గూడగా నది పురాకృత పుణ్యమె; ముల్గు పాపయా
రాధ్యుని కైత యౌర! కడుశాస్త్రివ్యము భావ్యము సర్వసేవ్యమున్.



బాలసరస్వతి, ఆశుకవీంద్రసింహ, ఆశుకవిచక్రవర్తి, కుండినకవిహంస, కవిరత్న, అవధానిపంచానన,
కవికేసరి, కల్పితకథారచనా ధురీణ, కవిభూషణ, ప్రౌఢభారతి, కథాశుకవీశ్వర,
ఆశుకవిశిఖామణి, ఆశుకవిసమ్రాట్, ప్రముఖ బిరుదాంకితులు

కొప్పరపు సోదరకవులు, శతావధానులు - 4-2-42.

శారదాపుంస్వరూపులగు బ్రహ్మశ్రీ ములుఁగు పాపయారాధ్యమణులచే రచింపఁబడిన, శ్రీ దేవీభాగవత మహాగ్రంథమును... జక్కఁగ, శ్రద్ధతోఁ బఠించితిమి. బ్ర. శ్రీ దాసు శ్రీరామకవిగారు తన్నిర్మించిన దేవీభాగవతపీఠికలో, ఈమహాకవిమణిం గూర్చి యుగ్గడించి యగ్గించినది, ఇంతకుఁబూర్వము కంటిమి. తదాది ఈ మహాకవిగ్రంథము తిలకించు మహాభాగ్య మెప్పు డందికొనెదమా యని యువ్విళ్లూరుచుండితిమి. నేటికి "గంగాజలలవకణికా పీతా" అనున ట్లొకింత వీక్షించి పరమానంద మందితిమి.

మా లిఖించు నభిప్రాయము: బ్రహ్మశ్రీ పాపయారాధ్యకవిచూడామణులు రచించిన శ్రీ దేవీభాగవతము అన్నివిధముల సర్వోత్కృష్టదశ నందియున్నది; వీరికి శ్రీ దేవీవిద్యయందు సంపూర్ణ పరిచయము కలిగెనని తత్తద్ఘట్టముల నుటంకించిన దానింబట్టి, మంత్రశాస్త్రకించిద్వాసనాయుతులకును కరస్థలామలకం బగుచున్న యది. ఆ శైలి, ఆ ధార, ఆ ప్రయోగవైచిత్రియు, మహాకవులును గొండాడఁ దగియున్నవి. ఈ మహాకవినిగూర్చి యెంత వ్రాసినను, స్వభావోక్తియే యగుఁగాని, అన్యథా వచింప, నసహిష్ణులకును గానిపని. ఇఁక సుహృత్తులకు నీయన, ఆజీవితము, స్మరణీయుఁడు. శ్రీ శ్రీ బమ్మెరపోతరాజుమహాకవికవిత్వమును నీమహనీయుఁ డనుకరించినట్టు లచ్చుటచ్చుటఁ గన్పడెడు. ఇది కవిసంప్రదాయసిద్ధముకాని, దోషలేశమును గాదు. "పూర్వకవీశ్వర వాక్ప్రయోగదక్షుఁడు"గా కవి యుండవలెనని, యుత్తమాశయుఁడగు కాకునూరి అప్పకవి సుకవిలక్షణములో నుటంకించెను. కావున ఈ మహాగ్రంథము మూలమున నీ కవిమౌళి యశశ్చంద్రికలు దిగ్దశకమును క్షీరపారావారమును జేయఁగలవు. ఈ మహాగ్రంథమును ముద్రాభాగ్య మందఁజేయుచున్న శ్రీ పుచ్చా కోటయ్యగారియొక్కయు, శ్రీ బేతపూడి వీరశరభయ్యగారియొక్కయు జన్మములు ధన్యము లనుట నిర్వివాదాంశము. ఇట్లే మహాగ్రంథ ముద్రణమునకు సాయపడుచు నీ యుభయులు నిహపరధనలాభముల గణింతురుగాక.



# శ్రీ దేవీ భాగవతము

## విషయ సూచిక



## ప్రథమస్కంధము

## ద్వితీయ స్కంధము

## తృతీయస్కంధము



## చతుర్థస్కంధము

## పంచమస్కంధము

# శ్రీ దేవీ భాగవతము

## ద్వితీయ భాగము

## విషయసూచిక

### షష్ఠస్కంధము

## సప్తమస్కంధము



## అష్టమస్కంధము

## నవమస్కంధము

## దశమస్కంధము



## ఏకాదశస్కంధము



## ద్వాదశస్కంధము



---

# చిత్రపటసూచిక

## ప్రథమభాగము



## ద్వితీయభాగము

# देवी सिद्धिदात्री



सिद्धगन्धर्वयक्षाद्यैरसुरैरमरैरपि ।
सेव्यमाना सदा भूयात् सिद्धिदा सिद्धिदायिनी ॥

THE GITA PRESS. GORAKHPUR.

No. 407.

శ్రీ ర స్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ శారదాంబాయై నమః

శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము - శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దే వీ భా గ వ త ము

## ప్ర థ మ స్కం ధ ము





కలుగఁజేయు దేవీ,
భాగవతంబునను నిదియె ఽ ప్రథమ స్కంధం
బాగమ రహస్య విమల
ప్రాగల్భ్యము గాన నియమ ఽ పద్ధతిఁ గనుఁడీ ! ౧

### — ఇ ష్ట దే వ తా స్తు తి —

శా॥ శ్రీకాంతాముఖ దేవతాంగనలు సధ్రీచీన శృంగార లీ
లాకల్పాంచితలై తనుం గొలువ బ్రహ్మాదుల్ జయాశీర్వచ
స్సాకల్యం బలరింప నాఁడు విభునిన్ ఽ సంతుష్టయై గాంచు లో
కైకత్రాణ విడంబ నంబను సదాఽభీష్టార్థినై వేఁడెదన్. ౨

సీ॥ ఒక చెంతఁ జిలువలై యొక చెంతఁ గలువలై, సలలితాభరణముల్ సందడింప
ఒక దండఁ జర్మమై యొక దండ భర్మమై, పరిధానసంవ్యాప్తి పరిఢవిల్ల
ఒక యోరఁ గన్నుగా నొకయోరఁ జన్నుగాఁ, దరుణాగ్నిశిఖ ధగద్ధగ లెసంగ
ఒక వంకఁ దెల్లనై యొకవంక నల్లనై, తనురుచి ప్రచయముల్ తాండవింప
గీ॥ బాహ్యభేదంబు గల్గియు భక్తవిసర, కుశల సంధానమున నేకగుణముఁ జూపు
నాదిదంపతు లఖిల లోకైక జనకు, లంబికాశంకరులు ప్రోతురనుదినంబు. ౩

మ॥ కలశాంభోధి మథించుచో నచల సంఘర్షంబులన్ బుట్టు న
య్యలపుల్ తత్తనయోపగూహముల మాయన్ జేసి కెమ్మోవి తే
నెలచే సాధజనుల్ నిరాకరణమున్ నిండించె నా దేవతా
వళికిన్ బంచి సుధన్ వెలార్చు హరి మద్వాఙ్మాధురిన్ నింపఁడే. ౪

ఉ॥ తల్లికిఁ దల్లియైన తన తల్లికిఁ దానును దల్లియై ధరన్
దల్లుల కెల్లఁ దల్లియయి తల్లి! నన్నుఁ గరుణింపు మన్నచోఁ
దల్లులు గాననీని మరుత్తల్లిని సజ్జన కల్పవల్లి మా
తల్లిని సన్నుతింతు జనతాఫలదస్మితమల్లి నెంతయున్. ౫

మ॥ నిగమారామ మొనర్చి యందు సుమనోనీరంధ్రతల్ గూర్చి స
ర్వగరీయఃఫలపాళిచే శుక ముఖ వ్రాతంబులన్ దేర్చి ది
వ్యగురుం డైన విధాత మాలికుని సేవన్ మద్వచోవైఖరీ
స్రగలంకారము లెల్ల దిక్సతుల వక్షస్సీమలన్ దార్చుతన్. ౬

ఉ॥ శారద చంద్ర చంద్రికల చాయల మాయలఁ బెట్టి మైసిరుల్
సారసగర్భమేన విరజాజులుగాఁ దన మేన భక్తి శా
రీర విభాళి హల్లక పరిస్ఫురణం బిడ రాగమూర్తియా
శారద మద్వచస్స్థితి విశారదయై విలసిల్లుఁ గావుతన్. ౭

మ॥ కరముల్ మోడ్చి నమస్కరించెద మనఃకంజాత సంజాత మం
దరభృద్వర్ణితమూర్తికిన్ నటకుటాధస్స్థానసద్వర్తికిన్
బరిపూర్ణానుభవ ప్రపూర్తికిఁ బదాబ్జధ్యాన నిష్ఠా నిరం
తరహృన్మునిజనానువర్తికిని మేధాదక్షిణామూర్తికిన్. ౮

శా॥ కోదండాకృతి దేవదేవు మదిఁ గోర్కుల్ దీఱ సేవించి ని
ర్వాదంబొప్ప వరంబుగాంచిన సువర్ణక్ష్మాధరం బోయనం
గా దీపించుచు వెండికొండపయి శంకరన్ బాసి క్రీడించు న
వ్వేదండాననుఁ దండవిఘ్నహతికై వే దండ మర్పించెదన్. ౯

సీ॥ ఎండ లీనంగ రేయెండ లీనఁగఁ జాలు, వేల్పు లిర్వురు వంశ విభులు గాఁగ
భూజాత భోజాధిభూజాతయును మన, స్సంభవానందసంస్థానములుగ
విబుధ భూతిని ధరావిబుధభూతినిఁ గాంచి, సంతసిల్లుటలు నైజములుగాఁగ
ధర్మసంభవశక్తి ధర్మసంభవరక్తి, మది విడరాని నేమములుగాఁగ
గీ॥ విజయ పక్షంబుచే జగద్వినుతి గాంచి, దానవధ్వంసి యపరావతారు లగుచు
వెలయు శ్రీరామ కృష్ణుల విబుధవినుత, విక్రమాలంకరిష్ణుల వేఁడుచుందు.౧౦

## —। కవిస్తుతి ।—

సీ॥ శ్రీరామ సత్కథాసిద్ధాంత శుద్ధాంత,రంగులై విబుధానుషంగులగుచు
శ్రీకృష్ణ గుణ సుధాసేచనా లోచన, స్వాంతులై నిష్ఠానిశాంతు లగుచు
రాజర్షి చర్యాభిరంజన రంజనా, స్వాదులై నిశ్చయామోదు లగుచు
ఘన పంచమత్రయీకల్పనా జల్పనా,రంభులై సతత నిర్దంభు లగుచు
గీ. వెలయు నాద్యాంధ్ర భాషా కవిత్వమతుల, నలరు వాల్మీకి భాస్కరువ్యాసుఁ బోత
రాజు శ్రీహర్ష శ్రీనాథుకర్త నెంచి, జగము మెచ్చు కవీంద్రులసన్నుతింతు.౧౧

వ॥ అని నిఖిల జగజ్జన్మాదికారణచర్యాశ్చర్యానుబంధకృతి యగు మూలప్రకృతిన్ గొనియాడి, యిష్టదేవతాభివందనంబును,సనాతనాధునాతన కవిజనాభివందనంబును గావించి చతుర్విధ పురుషార్థసాధకంబులగు పురాణేతిహాస కథాసుధాసాధనంబును నిరంతర గోష్ఠీ గరిష్ఠతన్ బ్రతిష్ఠింపుచుఁ బరమార్థబోధకంబును నిరంతర నిరంతరాయకైవల్య లక్ష్మీసాధకంబును, జిరంతన జన్మాజహాదభిలబ్ధ ప్రారబ్ధవేధకంబును కుటిలజన దుర్వాదపారంపరీ బాధకంబును బరమపద ప్రదాతృ పరదేవతారాధకంబును బిండాండ బ్రహ్మాండాది జగత్త్రయీ మర్యాదాశోధకంబును నగు నొక్క కథ శ్రోతృజన మనోరంజన కథావిధానంబుగా మిశ్రకవితా నిబంధనంబున సంధానింపఁ దలంచి శ్రవణ పఠనంబుల ముక్తివిధాయకం బెయ్యదియో యని విమర్శింపుచుఁ దదేకాయత్త చిత్తుండనై యున్న యవసరంబున.

## —। కృతిపతివంశావళి ।—

సీ॥ ఏ వేల్పు పాదరాజీవంబు జగదేక, ముక్తితీర్థంబుల మూలగొంది
ఏ దేవు కనుదమ్ము లెల్లలోకములకు, భయము దీర్పఁగఁ జాలు భవ్యరుచులు
ఏ సామి పొక్కిలి యీరేడు భువనముల్, పుట్టించు నెఱజాణ పుట్టినిల్లు
ఏ నాథు నిజమూర్తి యేకోత్తరస్థలి, విహరణంబుల నిత్య విభవ మెనయు
గీ॥ నట్టి తీర్థాంఘ్రి సూర్యచంద్రాక్షుఁ డబ్జ,యోని జనకుండు నిఖిల తత్త్వోత్తరుండు
నైన శ్రీవల్లభుండు దేవాదిదేవుఁ, డాదికిని నాది యగు దేవుఁ డలరు జగతి.౧౩

ఉ॥ అబ్జలజాలయాపతికి నాత్మజుఁడై జగదేకసృష్టి సం
పజ్జనకస్వభావుఁడు శుభంకరమూర్తి విరించి సంతతో
ద్యజ్జనతాసిసృక్షఁ హృదయంబునఁ గ్రమ్మఁ జతుర్దశంబులౌ
నిజ్జగముల్ సృజించెను యథేచ్ఛ రజోగుణ సంభృతాత్ముఁడై. ౧౪

చ॥ వదనమునన్ ధరాసురుల బాహువులన్ నృపసంతతిన్ ముదం
బొదవఁగ నూరుగర్భమున నూరుజులన్ జరణాంబుజంబునన్
బదపడి తుర్యవర్ణుల సమస్త గుణాభ్యుదయ ప్రపూర్ణులన్
విదిత మనస్కులన్ గనియె విశ్రుతిగాంచిరి వారు దిక్కులన్. ౧౫

ఉ॥ అందుఁ దురీయవర్ణులు గుణాభ్యుదయంబునఁ బూర్వవర్ణులన్
గందళితాంతరంగు లయి కాల సపర్యలఁ దన్పుచున్ మహా
నందము గాంచి ధర్మకలనావినివేశిత చిత్తవృత్తిచేఁ
జందన కుంద దీప్తి వెదచల్లు యశంబులు గాంచి రెల్లెడన్. ౧౬

క॥ అక్కులమున రిపుతతులన్, జిక్కులు పెట్టుచు వెడంద సిరులును దొరలన్
దిక్కులు మెచ్చఁగ సొబగునఁ, జుక్కల దొర లనఁగఁ గమ్మసూరులు వొల్తుర్.

ఉ॥ కమ్మకులంబు వారి తలకట్టయి బెట్టుగ వాసిరెడ్డి వా
రిమ్మహి నెల్లదేశముల నెన్నిక కెక్కి భుజాబలంబునం
దమ్మరుదాత్మజాతులను నబ్బురమున్ దొరయంగఁ జేయుచున్
గొమ్మల కమ్మవిల్తు లన ఘూర్ణిలి రాహవసద్గభీరులై. ౧౭

గీ॥ అందు వీరపనీఁడు నానింకుమకుట,ఘటిత హృదయుండు సదయుండు కవిజనులకు
భండనారాతి ఖండనోద్దండ చటుల,శౌర్యధుర్యుం డవార్యుండు శాసనమున. ౧౮

సీ॥ సాధించినాఁడు విశ్వఖ్యాతముగ జమీం,దారి విపక్ష బృందములు చెదర
బోధించినాఁడు భూభుజుల కెల్లను నీతి, పరిపాలన క్రమప్రాభవంబు
వేధించినాఁడు దుర్విషయాభిలాషి దు,ర్జన సంఘములను రాష్ట్రములలోన
శోధించినాఁడు విస్ఫూర్జితాద్వైత వి,ద్యాహృద్యధిషణా రహస్యములను

గీ॥ రాజమాత్రుండె సురరాజ రాజరాజ, రాజవిభవ ఘనాహ్లాద రమ్యతలను
రాజమాన్యుండు యశముచే దేజరిల్లి, నాఁడు వీరపనీఁ డెందు లేఁడు సముఁడు. ౨౦

క॥ భీరముచే రణరంగ విహారము చే సాటిదొరల కబ్బురపు టలం
కారముచే వర్తించెను, వీరపనీఁ డర్థి సురగవీరత్నంబై. ౨౧

శా॥ కట్టుగ్రుం డయి వైరులం జిదిపి దోర్గర్వంబుచే నర్థికి
నెట్టన్ బండినపంటవోలెఁ గలుముల్ నిండార భండారముల్.

గట్టన్ జేయుచు నాఁడు నాఁటికిని రాకాచంద్రుఁడై కీర్తులన్
గట్టావారికి నల్లుఁడయ్యె హరి దుగ్ధక్షీరధుల్ సాటిగన్. ౨౨

ఉ॥ వీరపసీని కింతియయి ÷ విప్రజనావన దీక్షలన్ సదా
ధారత నూని పెట్టియల ÷ దాచక విత్తము పంచియిచ్చుచున్
సారెకుఁ దత్సపర్యలను ÷ శ్రాంతిమెఱుంగక వీరవృత్తి నొ
ప్పారుట వీరలక్ష్మి యను ÷ నాఖ్య వహించె రహించె వేడుకన్. ౨౩

క॥ అవ్వనితాతిలకముతోఁ, బువ్వుల విలుతుండు రతిని ÷ బొందువడువునన్
మవ్వమునఁగూడి సరిదొర, లువ్విళ్లూరంగ సుతుల ÷ నొప్పుగఁ గనియెన్. ౨౪

ఉ॥ రాజమరాళ దీధితుల ÷ రంజిలు కీర్తులనొందుచున్ మరు
ద్రాజవిభూతి నివ్వటిలి దాన ధురాప్తి జలంధరుల్ గదా
యీ జగదేకవీరు లని ÷ యెంచఁగ నొప్పిరి రామనేతయున్
శ్రీజయశాలి రాఘవ ధరిత్రివిభుండును జంద్రమౌళియున్. ౨౫

ఉ॥ మువ్వురు సుప్రసిద్ధు లయి ÷ మోహనమూర్తులఁ దేజరిల్లుచున్
గవ్వపుఁ గొండదారి సరిగా జనపాలన కేళిసల్పుచున్
జివ్వలఁ జువ్వలన్ బొడిచి ÷ చిక్కులఁ బెట్టి విపక్షబృందముల్
చివ్వన దక్షిణంపుదొర ÷ చేరువఁజేర్చిరి పేర్చి రుద్ధతిన్. ౨౬

సీ॥ సింగంబులకుఁ దారసిల్లుచుఁ జెడపోట్ల, దంష్ట్ర లూడఁగఁ గాలఁదన్నువారు
కొండలతో మారుకొని పిండిపిండిగాఁ, బిడికిళ్లపోటులఁ ÷ బెనఁగువారు
సాగరమ్ముల నైన ÷ చంగుచంగున దూకి, మించు రాజ్యమ్ము లార్జించువారు
రణరంగముల సింహరావంబులకు నబ్జ, జాండంబు పగులంగ ÷ నార్చువారు.

గీ॥ వారు మువ్వురు రామభూపాలవరుఁడు, రాఘవక్షోణిపాలుం డరాతిశైల
భిదుర మగు చంద్రమౌళియుఁ బృథివి నన్య, భూమిపాలురతో సాటిఁబోలువారె?

సీ॥ మోహనాంగులు వారి ÷ మువ్వురలోపల, నగ్రజుండైన రామాధిపతికి
రాఘవ ప్రతిభుఁడౌ ÷ రాఘవయ్యయుఁ జిన, పద్మనాభుఁడు భుజాబలఘనుండు
చంద్రమౌళియు వైభవేంద్రుఁడౌ పెదనర,సన్న భూపతియు వీరన్ననృపతి
రామలింగన్న భూరమణుండనఁగ నార్వు,రాత్మజుల్ కల్గిరి ÷ యా నృపాలు

గీ॥ రలహరిశ్చంద్రుఁడాది యానట్టి చక్ర,వర్తులార్వురఁబోలి భూవలయమేలి
రటుల ధర్మాభివృద్ధి దోశ్చటుల విక్ర,మర్ధి వెలయఁగ రణరంగ ÷ పార్థులగుచు.

క॥ ఒక్కొక్కని విక్రమములు, లెక్కింపఁగ శక్యమవునె? ÷ లేఖ గురునకున్
దిక్కుల విజయ స్తంభం, బెక్కించిరి సంస్తుతింప ÷ నెవరికిఁదరమా. ౨౭

ఉ॥ విక్రమ విక్రమార్కుఁడగు ౹ వీరపనీనికిఁ బౌత్రుఁడై ధరా
శక్రుఁడనంగఁ జెన్నలరు ౹ సంపదలన్ జినపద్మనాభు దోః
ప్రక్రమ మేమనందగు నవక్ర పరాక్రమ వైరి మర్దనో
పాక్రమణంబునం దతిభయంకరమైన మహూ రసన్ దగెన్. ౩౦

క॥ అవిరళ లక్ష్మీవైభవ, నవహర్షములందుఁ బద్మనాభుఁడు హరి యీ
యవనీ విభుఁ డట్లగుటన్, భువిలోఁ జిన పెద్ద వాసి ౹ పొలుపెసఁగెఁజుమీ. ౩౧

సీ॥ అప్రతీపప్రతాపాన్వితుండైన యీ,చిన పద్మనాభ రాట్సింహమర్థి
హైదరాబాదు సాహసియై ప్రవేశించి, యవన రాజన్యు నెయ్యంబు తనదు
సొమ్ముగా సాధించి ౹ శూరత మెరయించి, కొండవీడును వినుకొండ మొదలు
మృత్తుజా సర్కారు ౹ మెచ్చుగా మన్నె వా,ర్దేశముఖీపర్వు ౹ దెచ్చిరుసుము

గీ॥ సావరంబులు కై సేసి ౹ జాగిరులకు, నరుల నిర్జించి సాటిభూవరుల మించి
చిరతరంబుగ రాజ్యంబు ౹ చేసెఁ బ్రజలు, రామరాజ్యసుఖంబుగా ౹ రంజిలంగ.

గీ॥ పాదుషా హీ మెహఁర్బాను ౹ బాదుకొల్పి, దత్తుఁడౌ బుచ్చిరాఘవ ౹ ధరణి విభుని
పేరిట జమీను వ్రాసి తెప్పించి దీర్ఘ,సత్రములు వేసి సత్కీర్తి ౹ సంఘటించె.

గీ॥ వ్రతముగా నవరాత్రోత్సవం బొనర్చి,దంపతీపూజ లొనరించుచతఁడు ఘృతంబు
ధారలుగఁ బోయఁ బేరినఁ ౹ ద్రవ్వి వేయ,నతనికిని నేతి పద్మనాభాఖ్యదనరె.

సీ॥ భూత్యాగముల జగత్పూజ్యుఁడై యితఁడుండ, భూత్యాగమొనరించి పోయిరరులు
శ్రీరామరక్షిత ౹ శ్రేయమీతనిఁ జేర, శ్రీరామ రక్షగాఁ ౹ జెడిరి రిపులు
అబ్ధిగాదిలి బిడ్డ ౹ యతనియిల్లు చొరంగ, నగ్రజ చేరెఁ బ్రత్యర్థులిండ్ల
ధూర్తవిధ్వంస నోద్ధురత యీతనిఁ జేర, జన్మగేహము చేరె ౹ శత్రుచయము

గీ॥ సాటి దేశాహిగలఁడె? రాజన్యమకుట,మార! చినపద్మనాభ గోత్రాధినేత
యరుల కోటలుదున్నించి యాముదంపు, వెదలుపెట్టించె మున్మహావీరుఁడగుచు.

క॥ రెండవరాఘవ వసుధా,ఖండలునకుఁ గొమరుఁడయ్యెఁ ౹ గందర్ప సమా
నుండు పెదపద్మనాభుం, డండజపతిఁబోలి భూభరాశ్రయుఁడగుచున్. ౩౬

ఉ॥ మూఁడవ భూమిపాలకుఁ డమోఘవచస్కుఁడు చంద్రమౌళి క్రో
ధ్వాడితనంబునన్ మెలఁగి ౹ వాడుకకెక్కి ధరిత్రి యేలుచున్
జోడితఁడే సుమీ వెదకి ౹ చూచినలేఁ డొకఁడంచు నెంచఁగా
నీడగు రాఘవయ్య ధరణీశునిఁగాంచెఁ గృపారమేశునిన్. ౩౭

సీ॥ ఆరాఘవయ్యకు ౹ నాత్మజుల్ కల్గిరి, యచ్చన్న నాఁజను ౹ నవనిపతియు
రాజమౌళియనంగ రాజసింహుఁడు మేరు, మందరమ్ములసాటి ౹ మహితలమున

ధైర్యధుర్యతఁ జంద్ర । సూర్యుల నెనవచ్చు, సౌందర్య విక్రమశౌర్యము లన
వార లిర్వురు నైభవముల నప్రతిములై, వెలసి రందవరజ । విభు పితృవ్యాణ
గీ॥ మబ్భ కుసుమంబుగాఁగ సూతాగ్రగణ్యులైరి శ్రీరామలింగ క్షమాధినాథుఁ
డతుల బాహుబలంబున । ననిలసుతుని, నీసడించును వీరధాత్రీశ్వరుండు. ౩౮

సీ॥ జగతీసురుల కన్నసత్రంబులే కాదు, పెట్టించెఁ బెనుగడి । పేరుఁబొనఁగఁ
దారసిల్లిన వైరి । తండంబులనె కాదు, దట్టించె విషయ దుర్దాంతపటిమ
అరిరాష్ట్రములఁ దోరణావళులే కాదు, కట్టించె హరిహరాగారపటలి
భండారముల నెల్ల । నిండురొక్కమె కాదు, రెట్టించె నిషధాధినృపులయశము
గీ॥ విలసదుత్తరవాహినీ । విశద కృష్ణవేణికాతీర నిత్య కళ్యాణముక్తి
పట్టణాస్థాన రాజీవ । భాస్కరుండు, తీవ్రరుచి రామలింగ ధాత్రీవరుండు. ౩౯

మ॥ కనియెన్ గల్పక పంచకం బుదధిదాఁ । గన్నట్లు శ్రీరామ లిం
గ నరాధీశుఁడు పుత్రులన్ బ్రభ చెలంగగన్ రాజమౌళిన్ స్మితా
నను లక్ష్మీపతి రాఘవాఖ్యుని ననూన ప్రాభవున్ జంద్రమౌ
ళిని వెంకాధిపు వీరి నేవురను హేళిన్ ధాత్రి పాలింపుచున్. ౪౦

ఆ॥ అందుఁ జంద్రమౌళి । కబ్బయ్యయను పేర, నందనుండు గలిగె । నిందుకుంద
చందనాభకీర్తి । మందిరుండు సుధాంశు, సుందరుండు ధైర్య । మందరుండు.

క॥ సకలపురాణశ్రవణ, ప్రకటీకృత శంభుభక్తి । భరితస్వాంతుం
డకుటిల సుగుణ నిశాంతుం, డకలంకత రాజ్యమేలె । నబ్బయ్య తగన్. ౪౨

సీ॥ అభ్రంకషం బైన । యట్టి శృంగోన్నతి, సానుకూలోర్ధ్వధీ । స్థానరంబు
కనకరత్నోజ్జ్వలత్కమనీయ భవనంబు, మహనీయ విబుధ సమ్మానితంబు
హరి నివాస వ్యాపనాతిశయంబును, సద్భక్త సంపూర్ణ । సరస వృత్తి
భార్గవ ధర్మసంభవస్మనోహరతయు, ఘనగోత్ర విఖ్యాతి । గల్గుటయును
గీ॥ గానఁ జిన వేంకటాద్రి విఖ్యాతిగలుగ, నోపునని పండితులు మెచ్చ । నొప్పుమీఱి
యాశ్రితామరభూజ మబ్బయ్య నృపతి, శౌర్యధైర్యంబులను జగజ్జనుల నేలె.

ఉ॥ శాశ్వతకీర్తి యబ్బ నృపచంద్రుఁడు గాంచెను నందనాళి ము
క్తీశ్వర చంద్రమౌళుల నహీనగుణాఢ్యు సదాశివేంద్రు న
శ్వాశ్వసమాన విక్రమత । నయ్యవనీశు సుతత్రయంబు ము
క్తీశ్వరపూజ నా నియతి । నేలుచునుండిరి భూతలంబునన్. ౪౪

క॥ అబ్బయ్య పితృవ్యుం డగు, నబ్బలభిదోర్భోగి వేంకటాధిపుఁడు గనెన్
బిబ్బోకవతీ మదనున్, నిబ్బరముగ రామలింగ । నృపకులతిలకున్. ౪౫

గీ॥ రసికజనశేఖరుం డైన ౯ రాఘవయ్య, ననఘు లక్ష్మీపతిని మువ్వురతిశయించి
రతుల దానపరాక్రమాత్యంత చతుర,తను రసజ్ఞత విబుధ బృందంబు లెన్న.

సీ॥ విఖ్యాత చరితుఁడౌ ౯ వీరపనీనికి, రెండవ కొమరుం డఖండ యశుఁడు
రాఘవాధీశు పుత్రావతంస మగు చండ, భండనోద్దండ దీప్త ప్రతాపి
పెదపద్మనాభ భూభృచ్ఛిరోమణికిని, నాత్మజు లైరి రామాధిపతియు
నచ్చన్న భూపతి ౯ బుచ్చిరాఘవ నేత,నాగవసుంధరానాథమౌళి

గీ॥ అందు నగ్రజుఁ డైన రామాధిపతికిఁ, బట్టులై వీర నృపతియుఁ ౯ బద్మనాభ
ధరణిపాలురు వెలసిరి ౯ ధైర్య శౌర్య, కార్య సందర్భ చాతుర్య ౯ ధుర్యు లగుచు.

గీ॥ అటుల నచ్చన్న నృపునకు ౯ నాత్మభవులు, రహిని వేంకటరామ శ్రీరామలింగ
రాజలింగావనీశులు ౯ రాజితముగ, రమ్య గుణశాలు లైరి ధరాతలమున. ౪౮

గీ॥ అందు వేంకటరామన్న ౯ కాత్మభవులు, ధరను వెలసిరి కీర్తిఁ గోదండరామ
నృపుఁడు నచ్చయ్య యనెడి భూనేత వీర, లిర్వురుఁ బ్రసిద్ధులైరి యహీనగరిమ.

గీ॥ ధరణి వేంకటరామ సోదరుఁడు రామ,లింగ భూపతి సుతుల నపాంగికనిమె
నవని వేంకటరామ భూధవుని బుచ్చి,రాఘవ నృసింహ నృపతుల ౯ రామవిభుని.

గీ॥ బుచ్చిరాఘవ భూపాల ౯ పుత్రరత్న, మవనిఁ గోదండరామ లింగగన్న దనరె
దాన దాక్షిణ్య కీర్తి ప్రతాప వినయ, నయ కళా భోగముల మహార్ణవుఁడనంగ.

గీ॥ రాజలింగ వసుంధరా ౯ రమణునకును, బద్మనాభ విభుండు పాపయ్య నృపతి
చెల్లయాధీశుఁడును నాగ ౯ జితసపత్ను,లగుచు మువ్వురు నందను ౯ లైరి జగతి.

వ॥ అనంతరంబ పెద పద్మనాభ మహీపాల పుత్రచతుష్టయంబునందు. ౫౩

ఉ॥ అట్టులు తుర్యుఁడై యలరు ౯ నా ధరణీధవు పుత్రులైరి హా
గట్టు నదల్చు ధీరత విశకర్తన తేజుఁడు రామ భూవిభుం
డిట్టలమైన విక్రమపు ౯ టిక్కవ జగ్గవిభుండు చేగపుం
జెట్టుల తీవి నీవి విరచించు నుదారుఁడు వేంకటాద్రియుర్. ౫౪

సీ॥ భోగంబు విబుధానురాగంబు సంతత, త్యాగంబు నిత్య సంయోగ మెనయ
బీరంబు శత్రు సంహారంబు వితత భం,డారంబు నిరత విస్తారమంద
న్యాయంబు సాధనోపాయంబు దుర్జనా,పాయంబు నాత్మవిధేయతగన
శీలంబు వర సుహృజ్జాలంబు నాభీల, సాలంబు తన కనుకూల మెనఁగ

గీ॥ సరస లక్ష్మీపురీ మహాస్థానమునను, రమ్య కృష్ణా తటద్వయీ ౯ రాజ్య భోగ
మహితుఁడై చక్రవర్తి సమానుఁ డనఁగఁ, బరిఢవిల్లెను రామ నృపాలమౌళి.

వ॥ అందు మూఁడవ విభుండు. ౫౬

సీ॥ బంధుబృందము లెల్ల బలసి యిర్వంకల,గొండ లడ్డము వోలెఁగొలిచియుండ
విద్వత్సమాజ మావిర్భూతవరవచో, మాధుర్యసరణి నెమ్మది గతంప
యాచకావళులు పెల్లలమి సంభావితు, లగుచు సందీక యంగదందువెలయఁ
గవిగాయకానీక గణికావినోదంబు, లెడతీక కొలువులో నిచ్చఁగొలువ
గీ॥ నిలకు నేతెంచు నింద్రుఁడే యితఁడనఁగ, భోగభాగ్యంబులకు నెల్లఁ బుట్టినిల్లు
నాయఁడమ్మ నృపాలుఁ డనంతగరిమఁ, దనరె నిస్సీమ భూదాన తత్పరతను.

సీ॥ ఇందు రామమహీశుఁడిందు శేఖర కృపా,నందంబుచే డెంద మంద మంద
పాపయ్య విభుఁ డను భాగ్య దేవేంద్రుని, నందనుఁ గాంచె నానరపతికిని
రామాధినాథుండు రామచంద్రునిపోల్కి, నింద్రవైభవుఁ డయ్యె సాంద్రరుచుల
రామద్వితీయావరజుఁడు విక్రమ తీవ్ర, భుజుఁడు సంరక్షిత ద్విజుఁడు నాయఁ
గీ॥ డమ్మ భూనాయకుఁడు గర్జ దరి దివాంధ, హేళి నీశ్వర చరణాంబుజాళి నిఖల
సుగుణమణిపాళిహృదయ స్ఫూర్తికాళి,నింద్రవైభవుఁజంద్రమాళీంద్రుఁగనియె

సీ॥ అర్థిబృందం బభీష్టార్థసిద్ధి వహించి, సార్థకీకృతిఁ జెంది సంతసిలుట
దస్యువారంబు సార్థతఁజెంది శైలేంద్ర, కందరమ్ముల డాఁగి కదలకుంట
స్వస్థాన జనులెల్ల సహజసౌఖ్యము లంది, నిత్యభోగములచే నివ్వటిలుట
విబుధ సందోహ మన్వితిఁగాంచి మొదలేని, రాజాశ్రయంబున రహివరలుట
గీ॥ చంద్రమౌళిక్షమాపాల చంద్రుఁ డవని, భరము దోశ్శక్తిని భరింపఁ బ్రజలకెల్ల
రామ రాజ్యంబుగాఁ దోచె రాష్ట్రమెల్లఁ, గొల్లకొల్లఁగ సిరులెల్ల వెల్లివర్వె.

క॥ ఆ విభునకు నందను పరి, భావిత వీరారివంశపావన సుగుణ
ప్రావీణ్య ధనుఁడు గలిగె ధ,రావిభుఁడై పద్మనాభరామవిభుఁ డనఁగ. ౬౦

వ॥ ఇత్తెఱంగున వంశకందం బగు వీరపనీని నందనత్రయంబునందు ద్వితీయ తృతీయ
పుత్రవంశ పారంపరీ ప్రకారంబు ప్రవర్తిల్లుచుండు. ౬౧

ఉ॥ అగ్రజుఁడైన రామవసుధాధిపు నార్వురు పుత్రు లందు న
వ్యగ్రపరాక్రమ ప్రకటితాద్భుతచర్యుఁడు వీరభూవరుం
డాగ్రహకేళి నుగ్రుఁ డగు నట్టి కుమారుఁ గుమారతుల్యు భూ
పాగ్రణి సూరభూవిభుని నబ్బుర మొందఁగఁ గాంచె మించుగాన్. ౬౨

ఉ॥ వైరుల రాజ్యముల్ గొని యవారణ వారిగడీలు గొబ్బునన్
జూరలుపెట్టి దిక్కులు మహామారుపడన్ జగదేకవీరుఁడై
మారుతసూను దోర్బల మహామానుషశక్తియుఁ గల్గి వర్ధిలెన్
సూరధరావరుండు రణశూరుఁ డుదారుఁడు ధీరుఁ డిమ్మహిన్. ౬౩

క॥ వీరులు శూరులు ధీరు లు,దారులు గంభీరు లవనిఁ | దక్కువకా దీ
సూరయ్యవిభునితో సరి, గారయ్యా యెందరైన | గణుతింపంగా౯. ౬౪

క॥ అన్నరపాలుఁడు చిన నర, సన్నను జినరామలింగ | జనపాలకునిన్
గన్న౯ గన్నులవిల్తుని, కన్నన్ సొబగైన సుతులఁ | గనియెన్ ఘనుఁడై. ౬౫

క॥ వారికి సరిగా నెదుర్త౯, బోరికి నోర్వక విపక్షు|భూపాలవరుల్
చేరిరి కొండల దండల, దూఱిరి య ద్దొరలఁ బొగడ | దొరకొను నోక్కో.

క॥ ఆ రాజకుమారులలో, ధారాధరవితరణైక | ధారాపటిమ౯
ధారాధర జయలక్ష్మి, పారము గని రామలింగ|పరివృఢుఁ డలరె౯. ౬౭

సీ॥ తమ యమిత్రత గుహా|ధ్వాంత సంచరణైక, వృత్తిచే సార్థక|కృతి వహింపఁ
దమ యరిత్వము రాజ|దర్శన భీతిచే, సహజార్థ సంపత్తి | సరణిఁ జూప
దమ విపక్షత బంధు|తాదూర సంవాహ, భావంబున నిసర్గ|పదవి నెఱపఁ
దమ దస్యు శబ్దార్థ | తత్పరత్వము నిశా, విహరణమ్మున సార్థ|విఖ్యాతి గఱప
గీ॥ నవనిఁ జిన రామలింగ ధ|రాధినాథు, వైరు లతిభీతి మలలలో|పల వసించి
రచ్చలకుఁ బాసి ప్రోషిత | భ్రమణ మొనసి, చౌర్యమున జీవనముచేయ|సాగిరపుడు.

సీ. ఎర్లగడ్డ కులాబ్ధి | హిమకరాకారుఁడౌ, కోదండరామ రా|ట్కులమణికిని
నందనమై బుధా|నంద కోరకపుంజ, మంజరి యైన భా|మావతంస
మలివేణి రంగమ్మ|యను వధూమణి తన, పట్టంపు రాణిగాఁ | బ్రబలి సిరుల
నరులఁ దన్పుచు శక్తి | నరులఁ దున్మచు నవ్వ, తీవ ప్రతాప సం|దీప్తుఁ డగుచు
గీ॥ క్ష్మాతలావృత కల్ప వృ|క్షం బనంగ, హితుల నతులానుభావపం|డితుల సుకవి
తతుల నక్షయ భోగ సం|గతులఁ జేసి, యలరె శ్రీరామలింగగో|త్రాధినేత.

మ॥ అతఁ డుద్దండ పరాక్రమ క్రమిత గో|త్రాధీశుఁడై ధాత్రి సం
తత దోశ్శక్తి భరించి యర్థిజనతా|నాకద్రుమం బన్న వి
శ్రుతి విఖ్యాతి వహించి సంపదలు వా|సుల్ చూడ స్వర్లోక వ
ర్ణిత వీక్షారతి నేఁగెనో యనఁగ న|ర్థిన్ స్వర్గతుండౌ నెడ౯. ౭౦

క॥ వీరపనీని ద్వితీయ కు,మారుని సంతతిని నాగ|మహిపతి సుతుఁడౌ
ధీరుఁడు జగ్గ మహీపతి, శూరుండై రాజ్య భార | సుస్థిరుఁ డయ్యె౯. ౭౧

గీ॥ అతుల జగ్గాధినేత భు|జాగ్ర జాగ్ర, దుగ్ర కరవాలధారా వి|యోజితారి
మండలేశ పరంపర | మకుట రత్న, నిచిత ధాత్రీతలుం డౌచు | నేల నేలె. ౭౨

సీ॥ ఇరుగెలంకులు మూగి | మెలగోల్ తుపాకీలు, మూకలు పెనఁగి చి|కాకు వఱుపఁ
జువ్వగుంపులఁ భోరు | జోదు లొక్కుమ్మడి, గోవింద యనుచు గ|గ్గోలు చేయఁ

దురికీ సవారులు ఘూమ్ చలాయించుచుఁ, గిలకిలార్భటులఁ గ్రిక్కిరిసిదుముకఁ
బోటుబంటులుతన్నుఁబొదివియార్చుచు వెన్ను, దన్ని మన్నీలతోఁ దఱిమియుఱుకఁ
గీ॥ గొండవీడును వినుకొండ కొండపల్లి, మొదలుగాఁ గల్గు దుర్గముల్ మసరి కసరి
లగ్గలకు నెక్కి సాధించి మొగ్గరముల, గండఁడై బెండుపఱిచె జగ్గప్రభుండు.

గీ॥ కమ్మవిలుకాని రాణి చక్కఁదనమ్ము, కొమ్మపడ నేయు నందమ్ము గుమ్మరనఁగఁ
గొమ్మలకు నెమ్మెయై నీటు గుమ్మరిలఁగ, నమ్మహీజాని జాని యచ్చమ్మ దనరె.

క॥ అద్దంపతి ద్వాపరమున, మద్దులుగూల్చిన మహాత్మ్య మహితుఁడ కలిలో
దిద్దుగడ సల్పునని జను, లద్దిరపడ వేంకటాద్రి యను సుతుఁ గనిరో. ౭౫

సీ॥ చిఱుతకాలము నాఁడె చేదోయి కిదిపని, యంచు నర్థుల కిచ్చె నర్థసమితి
బాల్యప్రాయము నాఁడె పలు కేతదర్థమం, చని సత్యవచనంబు లాడఁదొడఁగె
ఆట ప్రాయము నాఁడె యంగ మీ క్రియకంచు, హరిహర సేవ చేనెఱపఁదనరె
చిన్న నాఁటను గోలె జిత్త మీ త్తెఱగున, నంచు నధ్యాత్మ మభ్యాసపఱిచె
గీ॥ నేమి చెప్పుదు నవ్వసుధేశ సుతుఁడు, నిరుపమాన గుణక్రియా నిరతిఁదవిలి
దివ్యలీలా విభూతులఁ దేజరిలుట, వేంకటాద్రి క్షితీశుఁ డవ్వేంకటాద్రి. ౭౬

సీ॥ దుర్గాష్టకంబుపైఁ దోరణంబులు గట్టి, శత్రుమంత్రాంగముల్ చక్కఁబఱిచి
ధరనిండ శాసన స్తంభముల్ వేయించి, కోట్యన్న దాతయై కొమరుమిగిలి
యగ్రహార శతంబు లగ్రవర్ణుల కిచ్చి, బహుకోటు లర్థముల్ పంచిపెట్టి
హరిహరాలయశతం బలరారఁగాఁజేసి, నిత్య లింగార్చనానియతిఁగాంచి
గీ॥ ఘన తులాభార నిత్య విఖ్యాతి నొనరి, మణి కిరీటంబు పెట్టిన మండలీంద్రుఁ
డర్థి రాడ్ధీరుఁడ వ్వేంకటాద్రి విభుఁడు, మన్నె హంవీరుఁ డమ్మేటి నెన్నఁదరమె?

ఉ॥ ఆ వసుధాసుధాంశునకు నంగనయై రి ధరిత్రి వెఱ్ఱెమాం
బా వనితాలలామ కులపాలికయై తగు పార్వతమ్మ య
ప్పావనులర్ నుతించు కవిపాళి రసజ్ఞలె సార్థకంబులౌఁ
గేవల సంజ్ఞలంచుఁ బరికింపఁగ నింపు ఘటిల్లుఁ గానిచోఁ ౭౭

సీ॥ నూఱు వే యని యన నేర దర్థుల కర్థ, మిచ్చుచో వారల మెచ్చుచోట
ఉత్తమాధమ భేద మొందదు విప్రులఁ, దనుపుచో దయచేసి మనుపుచోట
పరులు నావారను భ్రాంతి నూనదు ధర్మ, మెంచుచో సత్య మార్జించుచోట
తలక దించుకమైన దైవవ్రతంబులు, సలుపుచోఁ జిత్తంబు నిలుపుచోట
గీ॥ విభు వధూటుల మేల్బంతి వెఱ్ఱెమాంబ, దానదాక్షిణ్య కరుణానిధాన మగుచుఁ
బతికినను రాగమునబహిఃప్రాణమనఁగఁ, గనఁగరతిఁబోలు సౌందర్యగరిమఁదనరె.

సీ॥ పతికి నోడక యర్ధభాగంబు గొని చంక, నెక్కని హిమభూధరేంద్రకన్య
నాథుని వేఱుగానఁగనీక ఱొమ్మెక్కి, చలచిత్తగాని యజ్జలధిపుత్రి
తలవాకిలి మలంగి ధవు నింటఁ దనమాట, సభకు రాఁగోరని శారదాంబ
కాంతు నెవ్వారిని గననీక తనలోన, నణఁచివేయని శంబరారాత్మజాత
గీ॥ ధైర్య సంపత్ప్రశస్తి సౌందర్యములను, నవని నా రాజపత్ని యం చఖిలజనము
లభినుతింపంగఁ బార్వతమ్మాభిధమున, వేంకటాద్రీంద్ర రాజ్ఞియై వెలసె నిలను.

సీ॥ ఆ వధూవరులకు నాత్మజులై జగ,న్నాథ భూపతి రామనాథనృపతి
నిత్యప్రసాద వర్ణిత మహామహిమాను,భావులై సతత లక్ష్మీవిలాస
సౌఖ్య మార్జించుచు సంతత వితరణ, ప్రౌఢి రూఢికి నెక్కి ప్రబలయుక్తిఁ
జిత్ర భోగస్ఫూర్తిఁ జెంది స్వర్ణాంబరా,భిఖ్యఁ బద్మాంబరస్ఫీతు లగుచు
గీ॥ విబుధ జనములు వినుతింప విచ్చలవిడి, కవిగురులు గొల్వ విశ్వ రక్షావిచక్ష
ణాక్షయశ్రీలఁ జెల్వొంది రఖిలజనులు,తనదు సన్నిధిఁ గాంక్షింప ధన్యులగుచు.

సీ॥ విబుధ దేవేంద్రుఁ డా వేంకటాద్రీంద్రుండు, సంతతిలేమి శాస్త్రప్రసక్తిఁ
దలఁచి పితృవ్యనందను లైన మాళయ్య, పాపయ్య పతులకుఁ బట్టులైన
యి జ్జగన్నాథ మహీశుని రామనా,థాధిపుఁ దోడ్తెచ్చి యాత్మజులుగఁ
జేకొని యిర్వుర చేడల నన్యోన్య, మర్థి నొసంగి కృతార్థవృత్తిఁ
గీ॥ గన్న కొమరులకన్నను గన్నులందుఁ, గన్న కొమరులు వార లుత్కలికఁ దల్లి
దండ్రులకుఁ గూర్మి పట్టులై తనరి రవనిఁ, జెలువొసంగిన చేగంపుఁ జెట్టులనఁగ.

సీ॥ న్యాయవర్తనముచే నడచు టెంతియొ కాని, కర్మఫలంబు లాకాంక్షగొనఁడు
రాజధర్మము లంచు రంజిల్లుటే కాని, యాత్మభోగములపై నాసగొనఁడు
అధికారశక్తిచే నార్జించుటే కాని, దాన భోగంబులఁ దఱుగనీఁడు
వ్యావహారిక భేద వర్తనంబే కాని, పూర్ణభావం బందుఁ బోవనీఁడు
గీ॥ వేంకటాద్రి వసుంధరావిభుని యగ్ర, నందనుండైన శ్రీ జగన్నాథనృపతి
సఫలముగఁ జేసెఁ బురుషార్థ సమితి నెల్ల, సముఁడు జనకద్వయికిని సత్పంగతులను.

సీ॥ సౌందర్యమున ధరాకందర్పుఁ డనవచ్చుఁ, గాకున్నను మనఃప్రకాండ మెద్ది?
వైభవంబున ధరావాసవుం డనవచ్చుఁ, గాకున్న నహిబలాక్రమణ మెద్ది?
అర్థసంపద ధరాయక్షేశుఁ డనవచ్చుఁ, గాకున్న రాజాధికార మెద్ది?
సంతసంబున ధరాచంద్రుఁడే యనవచ్చుఁ, గాకున్నఁ గువలయాక్రమణ మెద్ది?
గీ॥ యనఁగఁ దనరారె శ్రీవేంకటాద్రినాథు, రెండవ కుమారుఁడైన యఖండ భోగ
వైభవాఖండలుఁడు ధరావరవరుండు, రామనాథ క్షమాపాలరత్న మవని.

గీ॥ వెత్త్రమాంబా వధూటియు వేంకటాద్రి, భూమిపాలుండును నానర్ఘ్య పూర్వపుణ్య
పుంజ మయ్యె జగన్నాథ భూమి భర్త, కర్త వితరణ విక్రమ క్రమసిసృక్ష.

సీ॥ రణరంగ పార్థుండు రాజమండలిలోన, నగ్రగణ్యుఁడు సద్గుణానుషక్తి
నలనహుషాది భూనాథ సన్నిభకథా, జన నవజనన ప్రచార యుతుఁడు
అశ్రాంత విశ్రాణనాసారవర్ధిత, సకలవిద్వజ్జన చాతకుండు
కరుణాకటాక్ష వీక్షణ సుధా తర్పిత, స్వజన బంధుజన విద్వద్వినోది
గీ॥ భండనారాతి ఖండన ప్రబలశౌర్య, ధుర్యదోస్తంభ సంభృతా వార్యకుతల
భోగ ధౌరంధరీ సముద్భూత జయ ర, మావరుండు జగన్నాథ భూవరుండు.

మ॥ చిరుమామిళ్ళ కులాబ్ధిశీతరుచి లక్ష్మీ మూలకందంబు శౌ
ర్య రసాలంబనమై చెలంగు క్షితి రాజాధీశు పాపయ్య భూ
వరు కన్యామణి యచ్చమాంబ యను దివ్య శ్రీలలామంబు సుం
దరియై డెందము నందగించె వసుధాధ్యక్షున్ జగన్నాథునిన్. ౮౭

క॥ మఱియును వంశమణియనగు, చిరుమామిళ్ళాన్వయంపు శివరామ ధరా
వరసుత రంగాంబా సుందరి రెండవతరుణి యయ్యె ధరణీశునకున్. ౮౮

గీ॥ కలిమిలేములు భిన్నాధికరణములుగ, శాస్త్రవాదులు పల్కుట సత్యమయ్యె
లలన రంగాంబ జఘనావలగ్నములను, గలిమిలేములు నేకాధికరణఘనత.

సీ॥ పరమ పతివ్రతాభరణంబు శరణంబు, దీనావనోల్లాసమానితంబు
ధర్మమార్గక్రియాధారంబు సారంబు, నిత్యవ్రతాచార నిష్ఠఁగలిమి
పరమార్థసాధనాభవ్యంబు సేవ్యంబు, పతిదేవతాభావ పరిణతలను
కరుణారసావాల చరితంబు భరితంబు, సౌభాగ్యభాగ్య విస్తారములను
గీ॥ నచ్చమాంబావధూరత్న మవనిపాల, దంతిగమనలలో మేలు బంతియయ్యె
నవ్వధూమణి సుగుణ శోభాతిశయము, సన్నుతింపంగ వేనోళ్ళు చాలునొక్కొ

చ॥ అడిగిన లేపు మాపనుట యంబరపుష్ప మమూల్య వస్తు వం
చుడుగుట వెన్క ముందుఁ గను టొండొక టిచ్చెద నంట సున్న దా
నడిగిన నెట్టి సొమ్మయిన నర్థికి దాఁచు టెఱుంగ కిచ్చుచో
గడుసరి యచ్చమాంబ సరిగా మఱి గానరు గాదె యుద్ధరన్. ౯౧

సీ॥ రాజపత్నుల మంచు రంజించుటే కాని, చంద్ర దేవేంద్రుల సరసిజాక్షు
లను నామములను జెన్నందుట తగవౌనె?, యని యాసడించుచు నచ్చమాంబ
దండి నఖండ భూమండలాధిపతిత్వ, పూజ్యుఁడై నాథుండు రాజ్య మేల
రాజపత్నిని నేను రాద్ధాంతికంబుగా, నని యన్నదానంబు లర్థదాన

గీ॥ములను రాణించిమించి యాƒమమిష్మకంబు, కొంగుముల్లెయకాఁగఁ జేƒకొని యెవనిమె
విమల సకలపురాణార్థ ƒ విశదకథలు, మనియె భువి జన్మసాఫల్యƒమహితయగుచు.

సీ॥ నెమ్మోము చంద్రాభƒనివ్వటిల్లుటె కాదు, నెమ్మేను చంద్రాభƒనెగడుకొనియె
నడసొంపు నాగంబు ƒ నవ్వు టింతియె కాదు, జడయింపు నాగంబు ƒ చక్కఁబెట్టె
బదములు చివురుల ƒ పసచెలంగుటె కాదు, రదములు చివురుల ƒ రక్తిగొలిపె
డెంద మాత్మజ లీలƒనందగించుటయె కా, దంద మాత్మజ హేల ƒ నావరించె

గీ॥ రాణివాసంపు సతులని ƒ రాణిరాణి, యచ్చమాంబా వధూమణి ƒ నభినుతింపఁ
దరమె తరమెన్న దేవకాంƒతాజనమ్ము, లందయిన మెచ్చవచ్చు నƒమ్మందయాన.

సీ॥ అన్నదానములందు ƒ నన్నపూర్ణాదేవి, కలిమి చొక్కఁముల సాƒగరతనూజ
సారస్యసంధాన ƒ సరణి శ్రీభారతి, ధవుని నెయ్యముఁన సీƒతావధూటి
యతిశాంతమునను రƒత్నాకరమేఖల, స్థిరభోగముల సునాƒసీరరమణి
స్వస్వరూపజ్ఞాన ƒ సంధానమున లీల, సౌందర్య ధుర్యత ƒ సత్యభామ

గీ॥ మాటలేటికి లక్ష్మీ మవƒధూటి నెనసి, విష్ణుదేవుఁడె ధరణిపై ƒ వెలసె ననఁగ
శ్రీజగన్నాథ భూపాల ƒ శేఖరుండు, నచ్చమాంబావధూటి చెƒన్నలరి రంతే.

సీ॥ వాసిరెడ్డి కులాబ్ధి ƒ వర్ధిల్ల నుదయించు, నమృతాంశుఁడే యని ƒ యనఁగవచ్చు
వివిధ వైభవ మహాƒవిర్భూతిచే సునా,సీరుఁడేయని యంచుఁ ƒ జెప్పవచ్చు
జనలోకములను రంƒజనచేయఁ బరతెంచు, భర్మాద్రియే యని ƒ పలుకవచ్చు
విద్వన్మయూరముల్ ƒ విలసిల్లి విహరించు, జలధరుండే యంచుఁ ƒ జాటవచ్చు

గీ॥ విలసనాభోగధీరత ƒ వితరణముల, నా జగన్నాథ నృపతికి ƒ నచ్చమాంబ
కనుఁగు కొమరుండు శ్రీవేంకƒటాద్రినాయఁ,డమ్మ వర్ధిల్లు రాజరƒత్న మ్మనంగ.

వ॥ ఇత్తెలుంగున జగత్ప్రకాశంబై వెలుంగు శ్రీవల్లుట్ల గోత్రంబునకు నుత్తేజకులై గుణమణులు వెదచల్లు జగన్నాథ ధరావరుండును దత్కళత్రావతంసం బగు నచ్చమాంబయు నిరువు రొక్కనాఁ డేకాంతంబునఁ గొంతతడవు పారమార్థికోదంతంబులఁ గాలంబు గడపుచుఁ బురాతన సత్క్రియాప్రకాశం బగునట్లుగా నొక సత్కృతి భగవదర్పణపూర్వకంబుగాఁ గొనం దగునని నిశ్చయించి,

— • రాజదంపతులు కవిని గౌరవించుట • —

క॥ అమ్మహిపాలక దంపతి, మమ్ముం జేరంగఁబిలిచి ƒ మదిఁ బ్రేమలతల్
గమ్మన విరిసిరులన్ వెలిఁ, గ్రమ్మగ నిట్లనిరి మధురƒకలనాఫణితిన్.

చ॥ సరస కవిత్వ తత్త్వరుచి ƒ సంభృతవాగ్రచనానుబంధ బం
ధురముగ సత్ప్రబంధము లƒనూనత నర్మిలిగూర్చి పండితుల్

వరకవులంచు మెచ్చఁగ నవారణ మత్సభఁ బూర్వభూపతుల్
నిరతము కూర్మిఁ జేయఁ బరినిష్ఠితు లైతిరి మీర లిమ్ముల౯. ౯౮

క॥ మా కుల శీలము లెఱిఁగిన, మీకున్ మాకున్ గలట్టి మిత్త్రిత విబుధా
స్తోక మనోహర మగు ని, ష్పాకము వసుసహిత రత్నపరిపాటిగదా. ౯౯

సీ॥ శ్రీ వేమనారాధ్యసింహాసనంబునఁ, బేరెన్నికకు నెక్కి పేర్మి గలిగి
షణ్మత సిద్ధాంత సారస్య సంగ్రహ, ప్రౌఢిరూఢికి నెక్కి పరిఢవిల్లి
వాసిరెడ్డి కులాబ్జ వనజాప్తు లగు రాజ,సింహుల సన్నిధిఁ జెలిమిగాంచి
సరస కవిత్వ ప్రచార సామంజస్య, పరిపాటిఁ బూర్వుల ప్రతిభఁ దనరి

గీ॥ వెలయు విద్వత్కవీశ్వరుల్ విబుధవంద్య, వివిధలక్షణ శిక్షా వివేకదక్షు
లగు ప్రసిద్ధులు ముల్లుపాపయ్యశాస్త్రు,లనుచుసత్కీర్తి ధరయెల్ల నలమికొనఁగ.

క॥ మించితిరి సర్వపటిమన్, గాంచితిరి కవిత్వతత్త్వ కలనఁ గవితతిన్
వంచితిరి మీ సమర్థత, లెంచన్ దరమౌనె ! ధరణి నెవ్వరికైన౯. ౧౦౧

ఉ॥ ఏము జగత్ప్రసిద్ధముగ నెన్నిక కెక్కఁగ సప్తసంతతి
స్తోమము లీశ్వరార్పణ విశుద్ధి వహింపఁగఁ జేసినార ము
ద్దామము సప్తసంతతుల తండములన్ గృతిగొంటయట్లగా
భూమహితంబు శ్రేయము నపూర్వమగున్ గద యిందు నందున౯. ౧౦౨

క॥ సంతతి సప్తకమునకు ది,గంతములఁ బ్రసిద్ధిగూర్చునది కద కృతి మ
త్సంతాన రాజమూర్తు ల,నంతస్థిరకీర్తినొందు నభిలాషముచే౯. ౧౦౩

చ॥ కృతిగొనఁగోరినారము సమీహితబుద్ధి పురాణ సత్కథా
సతత సమావృతంబగు ప్రశస్త పవిత్రచరిత్ర మెద్దియే
నతుల రసానుషంగముగ హర్షమునన్ విరచించి యీఁదగున్
గృతుల కసాధ్య మెద్ది యగుఁ బ్రీతమనస్కులు వారు ధారుణి౯. ౧౦౪

చ॥ పదఘటనాధురంధరులు పండితు లెందఱు లేరు మత్సభన్
విదితకవిత్వతత్త్వనివేశిత చిత్తులు మీరలౌటచే
నుదిత సహస్రరశ్మి రుచియోగము సంతమసంబు పాపు చా
య దురితభంజకంబు భవదావృతమైన కవిత్వ మెయ్యెడ౯. ౧౦౫

శా॥ ఆకల్పాంతయశః ప్రకాశక మఖండానందసంధాయి భా
గ్యాకల్పంబగు నీ ప్రబంధము మదీయాభీష్టమా గ్రంథమ
స్తోకప్రౌఢిమఁ జెప్పి యియ్యఁదగు నంచు౯ బల్మరు౯ దెల్పి యం
గీకారోచితమౌఁ గదా యనఁగ సత్కీర్తిన్ బ్రశంసింపుచు౯. ౧౦౬

వ॥ అంగీకృతలతావేష్టిత మానిహృదయోపశ్రుతుండనై యిట్లంటి. ౧౦౭

ఉ॥ ఎన్ని విశేషకార్యముల ♩ నిమ్మహిఁ జేసినవారి కెల్లఁ బే
రు న్నెఱిపెంపునుం గలుగు ♩ రూఢయశంబును గల్గజేయుఁగా
వన్నియ కెక్కు సత్కృతి యవశ్యము తత్ఫలసిద్ధిచెంద మీ
కున్నిరతోత్సవం బొసఁగుఁ ♩ గోరిక యిట్టిదిగాదె యేరికిన్. ౧౦౮

సీ॥ వివిధపురాణార్థ ♩ విజ్ఞానసారస్య, మఖిలంబు మీ హృదయావలంబ
మటుగానఁ బూర్వవిఖ్యాత సత్కథలలో, మదిమెచ్చు చారిత్ర ♩ మది యెఱింగి
యిది తెల్గుచేసి మాకీఁదగు నని తెల్ప, నట్లొనరించి మీయభిలషితముఁ
దీర్చెద మన్న శోధించి దేవీభాగ,వతము సంతతము మదాంఛితంబు

గీ॥ ద్వాదశస్కంధములు భవత్కవితఁ దెనుఁగు, చేసి ప్రకటింపవలయుఁ దత్సిద్ధి కేము
మిమ్ముఁ గోరితిమన్న నమ్రిమలిమనమ్ము, గ్రమ్ముకొను నబ్బురమ్మున ♩ సమ్మతించి.

క॥ సంతుష్టాంతఃకరణత, నెంతయు నే నియ్యకొనిన ♩ నీశ్వరునకు ని
శ్చింతత నర్పించుట మే, లెంతయు సంతసము సర్వమిష్టంబనుచున్. ౧౧౦

## —। స్వప్నవృత్తాంతము ।—

వ॥ వచించి విశేషంబొక్కటి తెలిపెద నపూర్వరాత్రంబున ననల్పం బగు తల్పంబున నిద్దురం జెందియున్న యెడ మదీయ స్వప్నంబున జగదద్భుతంబగు దివ్య తేజంబున స్త్రీపురుష ద్వంద్వంబు దృష్టిగోచరం బగుటయు నదరి తల్పం బుజ్జగించి ప్రదక్షిణం బొనరించి సాష్టాంగవందనం బిడి హర్షాశ్రుబిందు సందోహంబు జలజల దొరంగ మేనన్ బులకాంకురంబులు సందడింపఁ గేల్మోడ్చుచు నెదుట నిలిచియున్న మమ్ముం గాంచి యేము మీయెడల వాత్సల్యంబునం బొడకట్టితి మన్నపూర్ణా విశ్వేశ్వరులము, మీకుఁ జిన్ననాటనుంగోలె మద్భక్త్యతిశయంబు గలదు, దీనికిన్ వన్నెయగునట్లుగా నపూర్వంబును దివ్యకథాభరితంబును బఠన శ్రవణంబులఁ బుణ్యఫలదంబును నగు దేవీభాగవతంబు సర్వజనసాధారణంబుగాఁ దెలుఁగునఁ బ్రబంధంబుగా రచింపఁజేసి మత్సమర్పణం బొనర్పవలె నని యంతర్ధానంబు నొందిరి గావున నన్నపూర్ణాసహితుం డగు విశ్వేశ్వరునకు సమర్పణంబుగాఁ జేయవలె ననియునుం జెప్పి యద్దంపతులు సమర్పించు నభినవజాంబూనదాంబరాభరణాగ్రహార వీటికా కర్పూరాదు లందుకొని గంధచందన మాలికాలంకృతుండనై యన్నపూర్ణాసనాథుం డగు కాశీ విశ్వనాథు నభివర్ణించెద. ౧౧౧

## — శ్రీ కాశీవిశ్వనాథస్తుతి —

సీ॥ సకల లింగస్థాన సార్వభౌమం బైన, పుర మే మహాత్ము కాపురపు నెలవు
సద్యోవిముక్తిదస్థానంబు లెవ్వాని, కరుణాకటాక్ష వీక్షావితతులు
బ్రహ్మాండగత తీర్థపటలంబు లెవ్వాని, పాదాశ్రయాపేక్ష పంక్తి గట్టు
ఘోర సంసారాంధకార పరంపర, కెవ్వాని సద్భక్తి యినమరీచి

గీ॥ యట్టి శ్రీ కాశికాభక్త యన్నపూర్ణ, కాలు మెట్టిన దిట్ట దిక్పాల మకుట
రత్న నిర్మితదీప్తి నీరాజితాంఘ్రి, యీశ్వరేశ్వరుఁడైన విశ్వేశ్వరుండు. ౧౧౨

సీ॥ దిక్పాలభామినీ దివ్యవేణికలపై, నెవ్వాని పదధూళి పువ్వుబంతి
సురకోటు లెవ్వాని చూపుకోపులదండ, వాంఛితాపేక్షచే వదలలేరు
సర్గస్థితిధ్వంస సహజకృత్యములకు, నెవ్వాని భ్రూసంజ్ఞ హేతుసత్త
యద్వితీయుండయ్యు సద్వితీయభ్రాంతి, నెవ్వాఁడు జగముల నెసక మెసఁగు

గీ॥ తలఁపు వలపులలోఁ జొచ్చి తాను నేను, ననెడి మెఱుపులఁ గఱపుచు నఖిలభూత
చేతనంబెల్లఁ దానయై చిక్కు లెడపు, నట్టి చిజ్జ్యోతి విశ్వేశుఁడతఁడుగాఁడె.

సీ॥ కనినవారలను దాఁ గనినవారలుగాఁగఁ, జెంత మన్నించు దాక్షిణ్యమూర్తి
జేజేయనినయంత జేజేల మిన్నగా, సంపత్తు లొసఁగు వాత్సల్యశాలి
అడుగు పట్టిన భవంబడుగుపట్టఁగఁ జేయు, సత్యప్రతిజ్ఞ కాశ్చర్యపదము
నీవాఁడ నను నంత నీవాడ కాపరి, కాఁడ నే నను నుపకారపరుఁడు

గీ॥ పరుఁడు బ్రహ్మాదులకుఁ బరాత్పరుఁడు హరుఁడు, విశ్వనాథుండు త్రిభువనవిదితనిత్య
శాశ్వతైశ్వర్య ధుర్యతాసాంద్రుఁ డర్ధ, చంద్రఖండోత్తమాంగుఁ డెంచంగఁదరమె?

వ॥ మఱియు ననవరతమునిజనపరిపఠిత నిగమసిద్ధాంతరాద్ధాంతిత స్తుతిశతశ్రవణ సంజాత సంతతామోద మోదమాన చిత్తుండును భక్తపరాయత్తుండును వితరిత నిఖిల చేతన సారూప్య దీక్షాదక్ష బిరుద పఠనాఖర్వ గంధర్వ వీణాక్వాణన ముఖరిత సభాభాగుండును నన్నపూర్ణాముఖ కమల ముహుర్ముహురీక్షణాను రాగుండును భృంగి నటన ప్రచార వీణానినాదవిలోక నానంద కందళిత వదనార విందుండును నందికేశ్వర విజ్ఞాపిత సురాసుర చర్యాసంజనితానుగ్రహ నిగ్రహణ సమగ్ర విగ్రహ ప్రకృతి వికృతి సమూహ కనత్ప్రౌఢవచనాస్పదుండును గాల భైరవ హరికేశాది పురపాలక నిర్ణీత నీతిప్రశంసాందోళిత శిరఃకంపనోజ్జ్వల ద్భూషాయిత భుజంగ శిరోమణి ప్రభాచకచ్చకిత నిజాంగస్ఫటిక మరీచి వీచీ ప్రజ్వలిత దవధనంజయ జ్వాలాజాజ్వల్యమాన తేజోవిరాజమానుండును ముక్తి సామ్రాజ్య పరిపాలనాధీనుండును గంగోత్తుంగ తరంగ రింఖత్ప్లవమాన సంచల

జ్జటాకోటీరకోటి నటత్కుటిల వామకర రేఖానిష్యందమాన తుషారపరంపరా పరిషిక్త సభాంతరాళ నిత్యశీతలతాసుఖిత ప్రమథగణకోలాహలుండును బలభిదుపలహారాయితస్ఫారరుచిరతరాంచిత కంఠహాలాహలుండును దీనజన రక్షణోత్సాహదోహలుండును బ్రపన్న జన శరణ్యుండును నిఖిలదేవతాగ్రగణ్యుండును నగు శ్రీవిశ్వేశ్వరుండు శ్రీమజ్జగన్నాథవసుంధరావల్లభునకుఁ దదర్ధాంగలక్ష్మీ శోభాభిరామ యగు నచ్చమాంబా వధూలలామంబునకు నభీష్టప్రదాన ధురంధరుండై ప్రవర్తించు. ౧౧౪

## —• షష్ఠ్యంతములు •—

క॥ ఏవంవిధ జగదేక, ప్రావీణ్యాగుణోన్నతికిని భవభయహతికిన్
సేవకరక్షణమతికిన్, జీవప్రణవోపదేశ చింతారతికిన్. ౧౧౬

క॥ శ్రీజాహ్నవీఝరీవి, భ్రాజితశీర్షునకు భక్తిపరిణతచేతో
రాజీవమధూళీ ని,ర్వ్యాజాస్వాదప్రమోదహతతర్షునకున్. ౧౧౭

క॥ మణికర్ణికా సరోవిహా,రణవైలోలునకు సత్కరాంచిత బాలా
రుణ తేజోజ్జ్వలిత జటా, గణగణనాభీలునకు జగత్పాలునకున్. ౧౧౮

క॥ డుంఠిగణాధిప రక్షో,త్కంఠునకున్ దారువిపిన కాంతానురతో
ల్లుంఠునకున్ స్మరహరణా,కుంఠునకు భుజంగభూష్యగురుకంఠునకున్. ౧౧౯

క॥ శంభునకు నన్నపూర్ణా, గంభీరవతీవిహార కౌతుక కలనా
రంభునకుఁ గరంభునకున్, జంభారిమదప్రవాద సంస్తంభునకున్. ౧౨౦

క॥ ఈశునకున్ వసనితసక,లాశునకున్ ముక్తిమంటపాంతరకృత సం
వేశునకున్ గాశీ వి,శ్వేశునకున్ నతియొనర్చి యిష్టం బలరన్. ౧౨౧

వ॥ సమర్పితంబుగా నా యొనర్పంబూనిన దేవీభాగవతం బను మహాపురాణంబునకుఁ గథాప్రారంభం బెట్టి చందంబునఁ బ్రవర్తిల్లె ననిన— ౧౨౨



## — కథా ప్రారంభము —

క॥ శ్రీమాతృ త్రిగుణాత్మిక, మై మమ్మె యెల్లమతుల నలరించు పరం
ధామము భువనాకృతి మా,యామయచైతన్యరూప మాత్మఁ దలంతున్.

### — సూతుండు మునులను జూడవచ్చుట —

శా॥ శ్రీరంజిల్లఁగ నైమిశం బను మహాక్షేత్రంబునం దాత్మవి
ద్యాగూఢాంతర వృత్తిచే జపతపోధ్యానావధానక్రమా
చారప్రక్రియ మౌనిచంద్రులు సమాజస్థాయులై యుండఁ ద
త్త్వారబ్ధామరశాఖి పండె ననఁ జేరన్ వచ్చె సూతుం డొగిన్. ౧౨౪

క॥ వచ్చిన సూతునిఁ గనుగొని, యచ్చటి మునులెల్ల గౌరవాభ్యర్చనముల్
గ్రచ్చుకొన నతిథిపూజలు, మెచ్చి యిడిరి హర్షలసదమేయస్ఫూర్తిన్. ౧౨౫

క॥ సమయోచిత చర్యాకృత, విమలవచోగోష్ఠి నున్న వేళల నతనిన్
బ్రముదమునఁ గాంచి శౌనకుఁ, డమలిన సంతోష భరితుఁడై యిట్లనియెన్.

సీ॥ బాదరాయణమునిప్రవరబోధిత ధర్మ, కలనానుషంగవిఖ్యాత సూత
ధర్మరథప్రవర్తన సూతుఁడవుగాన, సూతనామమ్ము నీ సొమ్ముగాదె
యెంతధన్యుఁడవు నీవెంత ఘనుండవు, వ్యాసదయాసహాయతఁ బురాణ
సంహితల్ వింటివి సర్వంబు లోఁగొంటి, వతిరహస్యములు నీయందెగలవు

ఆ॥ మాదుపుణ్యవశత మహిఁ గలిదోషంబు, లణఁచి దివ్యఫలదమైనయట్టి
యిట్టి యాశ్రమమున కేతెంచినాఁడవు, మునిసమాజ మిందె మొనసియుండె.

క॥ తాపత్రయతిమిరమహా, దీపమవై వెలయు మయ్య దీర్ఘాయువుచే
నోపికఁ బురాణసంహిత, లీ పట్టునఁ జెప్ప నిశ్చయింపఁగవలయున్. ౧౨౮

క॥ చతురానన సంభవమై, యతులం బై వినిన కనినయంతనె ముక్తి
స్థితి కాలవాలమై శ్రుతి, శతసిద్ధంబౌ పురాణసంహిత వలయున్. ౧౨౯

చ॥ సరసత గల్గి ధర్మముల సార మెఱింగి మనీషులై చెవుల్
తిరముగఁ గల్గియుండియును దివ్యపురాణ కథాసుధారసా
దరమతిలేనివారు వసుధన్ విధివంచితులంచుఁ బల్కఁ ట
బ్బురమొకొ వారి జన్మములు భూమికి భారము లౌట వింతయే? ౧౩౦

క॥ ఆఱురసంబులచే నల,రారును రసనత్రయంబు నంతియెమూఁడో
నాఱురసంబులచేఁ జెన్నారున్ శ్రోత్రేంద్రియంబు లందఱెఱుంగన్. ౧౩౧

ఉ॥ దోనులువోని కర్ణములతోఁ జెలువొందుచు నుండియున్ శుభా
ధానములౌ పురాణము లుదంచితవృత్తి వినంగలేని య
మ్మానవు లశ్రువుల్ ఫణిసమాజ మకర్ణమె యయ్యె శబ్ద సం
ధానము గోరు నన్న నుడిఁతారెఱుఁగన్ దలపోయ రేలకో. ౧౩౨

క॥ కావున నిమ్మునివర్యులు, నీవలనన్ శ్రవణవాంఛ నిష్ఠితులై నేఁ
డీ వనమున నిలిచిరి కలి,దావము నీ వాక్కథాసుధాప్లుతి యార్పన్. ౧౩౩

క॥ ఏలాగుననైనను భువిఁ, గాలముఁ గడపంగవలయుఁ గావున విద్వ
జ్జాలము సత్కథలన్ మూ,ర్ఖాళియు దుర్వ్యసనములను నని శ్రుతి యనదే?

చ॥ ఇదివఱకేము నీవలన నెన్నియొ వింటిమి శాస్త్రవాదముల్
విదిత విషాదయుక్తములు విశ్రుతహేతుయుతంబు లెంతయున్
బదపడి సత్త్వరాజసతమఃప్రథితంబులు న్యాయముల్ సుఖ
ప్రదములు నౌ పురాణము లపారముగా మది నాస దీఱమిన్. ౧౩౪

గీ॥ పంచలక్షణముల జగత్ప్రథితమగుచుఁ, బంచమశ్రుతియైన శ్రీభాగవతము
ముక్తిదంబని యొకసారి ముచ్చటించి, చెప్పితివిగాన విశదంబు సేయుమయ్య.

మ॥ పురుషార్థత్రయ సాధనీకృత మహాబోధంబు లెన్నేనియున్
బరమార్థం బొసగంగ నేరవుగదా పల్మారు ముక్తిస్థిరీ
కర మద్భాగవతం బటంచుఁ బలుకంగా వింటిమాఁ గాన నీ
పరమాస్వాదసుఖంబునన్ మునులఁ దేర్పన్ జూడుమీ సత్కృపన్. ౧౩౭

చ॥ గురుపదభక్తిగల్గుట నగున్ గద సర్వమెఱుంగుటల్ సమా
దరమతితోఁ బురాణములు ధర్మములున్ మది సంగ్రహించి స
త్వర సగుణాశ్రయుండ వయి ధన్యుఁడవై తివిగాన మాయెడన్
బరమదయాళుతన్ గల సమస్తము తెల్పితి వింటి మంతయున్. ౧౩౮

క॥ దినదినము సురలు సుధచేఁ, దనివొందఁగలేని యట్లు త్వద్వాక్యసుధన్
గొనిమేమును దనివొందక, మనుచుంటిమిగాన మమ్ము మన్ననఁగొనుమా. ౧౩౯

మ॥ రసనాచాపలవృత్తిచే సురలు వారాశిన్ సుధన్ దెచ్చి నీ
రసభావం బెఱుగంగలేక రుచివాఱున్ బీల్చుచేకాని స
ద్రస మీ భాగవతాంబుధీకృత సుధాధారానుషంగం బటం
చు సమర్థించుట లేమిచేఁ గద ముముక్షుల్ గాక భోగించుటల్. ౧౪౦

క॥ సద్యోముక్తిప్రద మన,వద్యం బని భాగవతము వాంఛించినచో
నా ద్యుమణిగభస్తులచే, ఖద్యోతము లట్లు వెతలు కడముట్టుఁగదా. ౧౪౧

మ॥ అమృతాహారము నందఁగోరుచు మహాత్మా ! యెన్నియజ్ఞంబులో
విమలోత్సాహులు మాచు నల్పఁగ మనోవిశ్రాంతి నొందంగ నే
మనుతోడం గడు ముక్తిదం బయిన యీ ॥ మాన్యత్కథన్ శ్రోత్రప
ర్వము గావింపుము యజ్ఞకర్తృతలు స్వర్గప్రాప్తిమాత్రంబులో. ౧౫౨

క॥ క్రతుసాధితఫలము పునః, పతనంబొనరించుఁగానఁ ॥ బరమార్థముచే
మతిఁదెలియ జ్ఞానహీనత, సతమానే స్వస్వరూప ॥ సాక్షాత్క్రియకున్. ౧౫౩

క॥ విమలాత్మ కాలచక్ర, భ్రమణంబునఁ దిరుగుచున్న ॥ పామరులము నేఁ
డమలముగ భాగవతకథ, సమూలముగ ముక్తిచెందుసరణిఁ దెలుపుమీ. ౧౫౪

క॥ అని ప్రశ్నచేయు శౌనక,ముని వచనము లాలకించి ॥ మోదమునఁ దపో
ధని యగు సూతుఁడు తన మన,మున నామోదించి మౌనిముఖ్యుల కనియెన్.

శా॥ఎంతోధన్యుఁడనైతి వాక్యమున కెంతేఁ బౌరమున్ముట్టె ధీ
మంతుల్ మీరు మహాత్ములిక్కరణి సామాన్యున్ ననున్ జాలఁగా
నెంతో మన్ననచేసి వేడెదరు నీవే సత్కథన్ దెల్పు మ
న్నంతన్ సంతస మందినాఁడను మదీయంబౌ తపంబెట్టిదో ? ౧౫౬

శా॥మీవాంఛల్ సఫలంబులై వెలయు నెమ్మిన్ సర్వవేదార్థ సా
రావిర్భావము శాస్త్రసమ్మత మఖండానందదం బాగమ
శ్రీవాల్లభ్యముగాఁగ భాగవతమున్ ॥ శ్రేయోభిలాషన్ వినం
గా వర్ణించెద సావధానమతి శంకాపంక మింకేటికిన్. ౧౫౭

—• సూతమహర్షి దేవీభాగవతప్రశంస చేయుట •—

సీ॥ సంపత్పరంపరాసారశక్రోద్భూతి, శ్రీమత్పరాశక్తి ॥ చింతనంబు
కైవల్య సంప్రాప్తి ॥ కమలమార్తాండంబు, శ్రీమత్పరాశక్తి ॥ చింతనంబు
ప్రారబ్ధభోగానుభవశైల దంభోళి, శ్రీమత్పరాశక్తి ॥ చింతనంబు
విపదపార పయోద ॥ విసరగంధవహంబు, శ్రీమత్పరాశక్తి ॥ చింతనంబు

గీ॥ వేదవేదాంత వాక్యార్థ ॥ విశద తత్వ, సారనిశ్చిత పదవస్తు ॥ సహజభావ
సంతతాద్వైతసిద్ధి మహాంతరాయ, కృంతనంబు పరాశక్తి ॥ చింతనంబు. ౧౫౮

క॥ అఖిలాండేశ్వరి పదయుగ, నఖముఖ చంద్రాతపము లనారతమును స
న్ముఖములయి దృక్చకోరీ, సుఖతృప్తి నొసంగుఁగాత ॥ శుభసూచకతన్.

క॥ వేదములకు షట్శాస్త్రను, వాదములకు నందరాని ॥ వస్తువు భేదా
భేదములకు నెలవు పరా, పాదయుగం బదియె మాకుఁ ॥ బ్రాప్యపదంబౌ.

క॥ తపములకు మునిజనాదృత, జపముల కందవు భవానిచరణంబులు మా
కపవర్గాభరణంబులు, చపల జరామరణవార్ధి ఘురతరణంబుల్. ౧౫౧

శా॥ బ్రహ్మాస్త్రవ్యము ముక్తిదంబు విమలబ్రహ్మణ్యవేద్యంబు మా
బ్రాహ్మీసేవ్యము యోగిహృద్యము పరాంబాశ్రీపదధ్యానముల్
బ్రహ్మాద్వైతమతిన్ దలంచి రసధుర్యం బప్పురాణం బస
ద్బ్రాహ్మీభంజక మే వచింతు మునులారా! దేవి నామాంకముల్. ౧౫౨

మ॥ భవవిచ్ఛేదిని సర్వహృన్నిలయ సర్వజ్ఞానపారీణ దు
ర్భవ దుర్భేయ మునీంద్ర వందితయునై శ్రౌతాధ్వలన్ విద్యయం
చవలోకింపఁగ నెప్పు డాధికమదీయస్వాంతమం దన్వహా
త్సవ బుద్ధిప్రదమై వసించి కరముల్ సాక్షాత్కృతిన్ జేయుతన్. ౧౫౩

మ॥ నవలీలన్ సదసత్స్వరూపములుగా నానావిధప్రక్రియన్
భువనంబుల్ కలిగించి పెంచి విలయంబున్ గూర్చ సంవర్తకా
ల విహారంబొనరించు విశ్వజననిన్ లావణ్య పాథోనిధిన్
శివ నర్చింతు మనంబులోఁ ద్రిగుణపుంజీభూత నంబూద్భవన్. ౧౫౪

సీ॥ అబ్జజుండు సృజించెననుచుఁ బురాణముల్, వివరించుఁగద వేదవిధుల వలన
నతఁడు విష్ణువు నాభియందుద్భవింపఁడే, హరి శేషశయ్యపై నధివసించు
నదిగానఁ బూర్వ పూర్వాపేక్ష సృష్టికి, వలయుఁగావున సృష్టి వనజభవుఁడె
చేసెనాఁ బనియేమి శేషుఁడాధారమై, హరిమోసె నచ్యుతుండజుని మోసె
గీ॥ నింతమాత్రముచేఁ గర్తలెవరుగారు, ప్రళయజలధికిఁ బాత్ర ముద్భవ పదంబె
గాన జగదేక కర్త్రియా కాళికాంబ, దీనజనమానసాలంబ దిక్కు మాకు.

ఉ॥ అంబుజసూతి యేల కనకాంబరుఁడైనను స్రష్టయంచుఁ బ
ల్కఁ బనిలేదు సృష్టివిధికై విధి శేషశయానుఁడైన శౌ
రిం బరికించియుర్న నిలిచి శ్రీజగదంబికగా నుతించెఁ గా
నం బెరవారికెట్లు భవనత్రయ సర్జనశక్తి గల్గుటల్. ౧౫౬

ఆ॥ కాన విశ్వజననియైన మహాకాళి, మద్రసజ్ఞ నిలిచి మధురవచన
రచన భాగవతము రహిఁదెల్పు భాగ్యంబు, చెలఁగు ప్రజ్ఞ కలుగఁజేయుఁగాత.

సీ॥ మోక్షలక్ష్మీసౌఖ్యమూలమై యలరారు, సగుణీగుణంబేను సంస్తుతించి
అభిరామమును బుణ్యమైన భాగవతంబు, వినిపింతు మునులార! వినుఁడు మీరు
అష్టాదశసహస్రమగు శ్లోకసంఖ్యచే, ద్వాదశ స్కంధముల్ తనరె నిందు
అష్టాదశోత్తరంబౌ త్రిశతంబుచే, నధ్యాయసంఖ్య చెన్నలరు దీన

గీ॥ ముఖ్యసర్గమ్ము ప్రతిసర్గమును మనోజ్ఞ, వంశ మన్వంతరములును వంశచరిత
లమర లక్షణ విలసితంబై తనర్చు, బంచలక్షణభరిత మీ భాగవతము. ౧౫౯

సీ॥ అధ్యాయవింశతి యలరు నాదిస్కంధ, మవ్వలఁ బదియు రెం డయ్యె మీఁద
ముప్పదియిరువదే యొప్పు నావల ముప్ప, దేనుపై నొకటి తా నూని మూఁడు
పదులయ్యె నట నాల్గుపదు లనంతరమున, నంత నిర్వదినాలు గలరుఁ బిదప
నేఁబది నవమంబు నెనయును బదుమూఁడు, దశమ మిర్వదినాల్గు విశదమవల
గీ॥ ద్వాదశస్కంధమలరారుఁబదియునాల్గు,నిట్లుసిద్ధాంతమొనరించియిహముఁబరము
శ్రద్ధధానుల కనువగు సరణిఁదలఁచి, బాదరాయణుఁ డలరించె భాగవతము.

శా॥ సర్వవ్యాపినియై మునీంద్ర హృదయాబ్జధ్యేయయై నిత్యయై
సర్వాధారత నొంది నిర్గుణయునై సర్వాంతరజ్యోతియై
సర్వం బయ్యుఁ దురీయయై నెఱయు నా శర్వాణి లోకత్రయీ
నిర్వాణైకనిధానమూర్తి వెలుగున్ నిస్తంద్ర సంతోషయై. ౧౬౦

గీ॥ ఆ మహాదేవి సాత్వికంబయ్యె లక్ష్మి, రాజసంబయ్యె భారతీరమణి తమము
తా మహాకాళియయ్యెఁదత్త్రియము ప్రథమ,సృష్టమైసర్గమంచు వర్తించెశ్రుతుల.

క॥ సృష్టిస్థితి సంహార, స్పష్టతకై హరి విరించి భర్గులు పొడమన్
శిష్టులు ప్రతిసర్గం బని, యష్టాదశతంత్రములు సమర్పించి రొగిన్. ౧౬౨

చ॥ రవిశశివంశకీర్తనము రమ్యతరంబు హిరణ్యకశ్యపో
ద్భవమును వంశకీర్తనము భావ్యవతార నిరూపణంబు త
ద్భవచరితాదివర్ణనము తన్మనుజీవితకాల సంఖ్యయున్
వివృతియుఁ బంచలక్షణ వివేకము దక్షతఁగాంచె నయ్యెడన్. ౧౬౩

ఉ॥ భారత మేకలక్షము సపాదముగా విరచించె వ్యాసుఁ డో
ప్పారఁ దదీయనామ మితిహాసము పంచమవేదసమ్మతం
బారయ నట్టు లయ్యు బుధులందఱు దానిఁ బురాణమంచు ని
చ్ఛారతిఁ బల్కరైరి శ్రుతిసామ్యముచే శ్రుతిగా వచింతురే? ౧౬౪

క॥ అని పలికిన శౌనకముని, విని సూతునిఁజూచి పలికె విశ్వావసుధా
వనధివి పురాణసంఖ్యయు, ఘనతర తద్గ్రంథసంఖ్యక్రమ మెట్టిదొకో. ౧౬౫

క॥ వినఁగోరి యున్నవారలు, వినిపింపుము తత్ప్రకారవిధి సర్వము నీ
కనుమాన రహితమది గా, వునఁ జెప్పుము ప్రీతి మానిపుంగవు లలరన్. ౧౬౬

మ॥ కలిసంప్రాప్తము గాఁగనచ్చెనని శంకకన్ మేము పూర్వమ్ము నం
జలజాతాసను వేడినన్ గరుణచే ♦ స్వస్వాంత సంభూతమై
వెలయంగా నొక చక్ర మిచ్చి పలికెన్ ♦ వెన్వెంట నీ చక్రముం
గలయన్ బొండిది నేమి శీర్ణమయి యెకక్కానన్ బడున్ దత్థ్సలిన్. ౧౮౭

క॥ నివసించియుండుఁ డచ్చట, నివహంబై మీరు కలిని ♦ నిర్భయులై యా
త్మవిలోకన మొనరింపుఁడు, వివిధోత్సాహములు కలవు ♦ వెఱనకుఁ డచ్చోన్.

చ॥ అని యొక చక్రమిచ్చి మము ♦ నందఱఁబంపిన దాని వెంబడిన్
జని నిఖిలావనిన్ దిరిగి ♦ చయ్యన నిందుఁ దదీయ నేమి గొ
బ్బునఁబడ నిర్వనంబునకు ♦ భూస్థలి నైమిశనామ మయ్యె నిం
దనువుగ నున్నవారము మహాత్మ! కలిన్ భయమంది యాత్మలోన్. ౧౮౯

క॥ కలిభయ మియ్యాశ్రమమునఁ, గలుగదు కృతయుగమువచ్చు ♦ కాలము దనుకన్
నిలునఁగలవార మీవును, వలసినకాలమున నిందువచ్చితి ననఘా! ౧౨౦

సీ॥ పశురూప మగు యజ్ఞపటలి పురోడాశ, సిద్ధిఁగోరుచు నొనర్చితిమి చాల
కాలంబు జరిగె నింకను మీఁదఁ గృతయుగాగమనంబు పెక్కేండ్లకలదుగాన
నంతవట్టును గాలమరుగుమార్గములేక, విసివియుంటి మపూర్వ ♦ విదితసిద్ధి
యాటకు నీరాకయాఁగాన ఘనతర, ధర్మ కామార్థ వర్ధనముగాఁగ

గీ॥ నఖిల భువనైకమాత యైనట్టి దేవి, చరిత ముక్తిప్రదంబును ♦ శర్మదంబు
మలగుణధ్వంసియునుగాన ♦ మాకు నీవు, వీను లలరంగ వినిపింపవే మహాత్మ!

క॥ నావిని సూతుం డిట్లను, నో విప్రవరేణ్యులార! యుచితోక్తులచే
నే వినిపింతుఁ బురాణము, , లా వేదవ్యాససూక్తి ♦ యట్టుల మీకున్. ౧౨౨

## —• పు రా ణ సం ఖ్యా క థ న ము •—

ఆ॥ మద్వయంబు పిదప ♦ భద్వయంబును బ్రత్రయము చతుష్టయంబు ♦ వాదినగుచు
అనపకూస్కలింగ ♦ మష్టాదశపురాణ, సంఖ్యకాదివర్ణ ♦ సమితి యొప్పు. ౧౨౩

సీ॥ పదునాల్గువేలచేఁ ♦ బరగు మాత్స్యమ్ము మార్కండేయము నవసంఖ్యను దనర్చుఁ
బదునాల్గువేలపై ♦ పంచశతంబు భవిష్యంబు నావలద్వినవసంఖ్య
భాగవతంబును ♦ బదివేలు బ్రహ్మంబు, పదియు రెండగువేలపై ని శతము
బ్రహ్మాండ మలరును ♦ బదియు నెన్మిది బ్రహ్మవైవర్తము పదినివామన మిరు

గీ॥ వదియునాల్గు వేలార్వార్ల్గువాయు దైవ, మిర్వదియునాల్గువేలచే ♦ నెసగు వైష్ణ
వంబు నిర్వదినాల్గువేలంబొసంగుఁ, బై వరాహ మాగ్నేయంబు ♦ పదియునాఱు

ఉ॥ నారద మిర్వదేనగును ♦ నర్మిలి నేఁబదియేను బద్మమో
యారయ రుద్రసంజ్ఞిక సహస్రము లింగము నిర్వదింటిలో
గారుడ మొండు తక్కువగుఁ♦గాఁ బదియేడగుఁ గూర్మ మట్టులే
గౌరవ మన్నిఁటన్ గలుగు ♦ స్కాందము నెన్బదియొక్కవే యగున్. ౧౭౫

వ॥ అదియునుంగాక సనత్కుమారంబును నారసింహంబును నారదంబును శైవంబును దౌర్వాసంబును గాపిలంబును మానవంబును నౌశనంబును, వారుణంబును, గాళికాఖ్యానంబును సాంబంబును నందీకృతంబును సౌరంబును బారాశరంబును నాదిత్యంబును మాహేశ్వరంబును భాగవతంబును వాసిష్ఠంబును మొదలగు నుపపురాణమ్ములు కొన్ని విరచించి సకలపురాణసారంబుగాఁ బంచమవేదం బగు భారతం బను నితిహాసం బుద్ధరించి మహాత్ముం డగు మద్గురుండు ప్రతిమన్వంతరంబున ద్వాపర ద్వాపరంబునఁ జతుర్విధ పురుషార్థ ప్రదాయకంబు లగు పురాణంబులు నిర్మించి వేదవిభాగం బొనరించి కలి సంప్రాప్తం బయిన యప్పుడు విప్రులల్పాయుష్యంబున మందబుద్ధి వలన మూఢు లౌట యెఱింగియు స్త్రీశూద్రద్విజబంధువులకును వేదంబు శ్రవణగోచరంబు గారాదని యెంచి నిర్హేతుకకృపావంతుం డగుటంజేసి వారలం బారం బొందింపం దలంచి సప్తమంబగు వైవస్వత మన్వంతరంబున నష్టావింశతితమంబగు ద్వాపరంబున సత్యవతీసూనుం డగు మద్గురుండు పురాణకర్తయై ప్రవర్తించె, ముందు రాఁగల ద్వాపరంబున నశ్వత్థామ వ్యాసుండు గాఁగలండు. పూర్వంబున నవతరించిన వ్యాసమునులు సప్తవింశతిసంఖ్యాకులు, వారలునుం దత్తద్యుగంబులఁ బురాణకర్తలై వక్తలై ప్రవర్తించి రని చెప్పిన, ౧౭౬

క॥ విని సూతుని మధురోక్తులు, మును లద్భుత మొంది మౌనిముఖ్యుఁడు వ్యాసుం
డనుయుగ మవతారము చే, సెనటంటివి వారి తెలుఁగు ♦ చెప్పు మటన్నన్. ౧౭౭

వ॥ అవ్వచనంబు లాలకించి మునీంద్రులారా! వినుండని పలికి సూతుం డిట్లని చెప్పం దొడంగె. ప్రథమద్వాపరంబున స్వయంభువుండును గ్రమంబున నక్లే ద్వాపర ద్వాపరంబునఁ బ్రజాపతియు నుశనుండును బృహస్పతియు సవితృండును మృత్యువు మఘవంతుండును వసిష్ఠుండును సారస్వతుండును త్రిధామయు వృషభుండును భారద్వాజుండును నంతరిక్షుండును ధర్ముండును నరుణుండును ధనంజయుండును మేధాతిథియు వ్రతియు నత్రియు గౌతముండును హర్యాత్ముండును వేనుండును సోముండును దృణబిందుండును భార్గవుండును శక్తియు జాతుకర్ణుండును మద్గురుం డగు కృష్ణద్వైపాయనుండును విలసిల్లుదు రిమ్మహానుభావుని వలన సర్వదుఃఖ నాశకంబును భుక్తిముక్తిప్రదంబును వేదార్థోపబృంహణంబును సర్వాగమరసావాలంబును ముముక్షుసమాశ్రయణీయంబును నగు నిబ్భాగవతంబు నరణిసంభవుండును

వైరాగ్య యుక్తుండును బుత్త్రుండు నగు శుకమహామునితోడన్ బోధింపంబడి ధన్యుండనైతిని గావున, ౧౭

గీ॥ అతిరహస్యమైన యప్పురాణము సూనుఁ, డడుగఁ దండ్రిచెప్పు నచట నిలిచి తత్ప్రసాదలబ్ధిఁదాగ్రహించిన దాట, మర్మమెల్ల వింటి మానులార!

శా॥ శ్రీమద్భాగవతామరాగఫలమా జీవుండు సంసారని ష్కామాత్ముండు శుకుండు దుర్భరజిఘృక్షున్ గోరె నెద్దాని నా శ్రీమద్భాగవతంబు నెవ్వఁడు కలిక్షేమంబు తాఁగోరి స ద్ప్రేమన్ వీనులవిందుగాఁ గొనఁగ నర్థిన్ వ్యర్థుఁడై పుచ్చునో. ౧౮

ఉ॥ జ్ఞానవిహీనుఁడై నిగమసంచితధర్మము లుజ్జగించి దు ర్దానదురన్నముల్ గొనుచుఁ దత్పరవృత్తి యొకింతలేక యే యే నరుఁ డెట్టికైతవము నేనియుఁ బూని పురాణరాజమున్ వీనుల విందొనర్చు నతనిన్ జగదంబ కృతార్థుఁ జేయదే. ౧౯

ఉ॥ మానుషజన్మమెత్తి బుధమార్గ మెఱింగి భవాబ్ధి దాటఁగాఁ బూనిన వాంఛగల్గియు నపూర్వము భాగవతంబు వీనులం దానఁగఁ గోరఁడేని నతఁడవ్విధివంచితుఁ డంచు మూర్ఖుఁడం చే నొనరించెదన్ బ్రతిన నెత్తి భుజాగ్రము లభ్రవీధికిన్. ౨౦

చ॥ శ్రుతియుగళంబుఁగల్గియుఁ ద్రిశుద్ధిమతిన్ దనరారి మూలసం స్తుత నిగమార్థ సారరసధూర్వహమైన పురాణరాజ మ ద్భుతఫలదంబు భాగవతమున్ వినఁజాలని మందబుద్ధి యీ క్షితిని జనించనేమి? పరికింప జనింపకయుండె నే మికన్. ౨౧

## వ్యాసముని వృత్తాంత ప్రశంస

చ॥ అన విని శౌనకుం డనియె నంబురుహాసనతుల్యుఁ డైన వ్యా సునకు శుకుండు పుత్త్రుఁ డనుచున్ దగఁజెప్పితి వెద్ది తల్లి? యా తనికి సదేహుఁడే, యతఁ డుదంతము సర్వము తెల్పుమన్న మ న్ననఁగొని సూతుఁడిట్లనియె నవ్యవచోరచనాచమత్కృతిన్. ౨౨

ఆ॥ అయ్యుదంత మతిరహస్యంబు మద్గురు, ముఖమువలన విందు మున్ను మీకుఁ దేటపఱతు నేఁడు తెల్లంబుగా గర్భ,యోగి యనుచు నుండి యొక్క యెడను.

చ॥ అమలసరస్వతీతటమునందున సత్యవతీసుతుండు స్వా శ్రమ మొనరించి పెక్కు దివసంబులు గాఢతపోగరిష్ఠుఁడై

శమదమవృత్తి నున్నతఁడె సన్నిధి నొక్క నికుంజనీడమం
దమిత ముదమ్మునన్ మెలఁగుచుండెడి విహంగమయుగ్మమున్ గనెన్. ౧౪౬

ఉ॥ ఆ కలవింకదంపతి యహర్నిశమున్ రసరంజితస్థితిన్
రాఁకలఁ బోఁకలన్ దనకు రాగము నింపుచు సంచరింప న
స్తోకమనీషఁ దద్విహృతిఁ జూచుచుఁ జేతనచర్య సర్వమం
దేకవిధంబకా యనుచు నెంచుచు నాత్మవినోద మందుచున్. ౧౪౭

క॥ అంతర్ముఖవృత్తులచే, సంతతనిరతుండు నయ్యు సంయమి బాహ్యా
స్వాంతుఁ డగువేళ ఖగయుగ, కాంతవిహారావలోకకలనావశుఁడై. ౧౪౮

చ॥ తప మొనరించుచున్న యెడఁ దచ్చటకాంగములన్ ధరించి త
ద్విపినమునం దొకానొక నవీన కులాయమునందు నండముల్
విపులభరంబునన్ గని సలీలసుఖస్థితి నుండ నీశ్వరీ
కృప వలనన్ దదండము లొగిన్ బృథుకాకృతిఁ దాల్చె మెచ్చుగాన్. ౧౪౯

క॥ అచ్చమగు మోహవశమునఁ, బిచ్చుక దంపతులు తాము పిల్లలఁ బ్రేమం
బచ్చుపడఁగ నెడఁబాయక, నిచ్చలుఁ బెంచుచును మోహనీరంధ్రములై. ౧౫౦

మ॥ అరుణాస్యంబులు చూచుచున్ సుభగ సర్వాంగమ్ములున్ గాంచుచున్
దరుణోద్యద్రుచిపింఛికాచ్ఛటలు నేత్రద్వంద్వపర్వంబుగా
వరుసన్ జంచుపుటంబులన్ దుడుచుచున్ వాత్సల్యమంతంత క
బ్బురమై మిన్నును ముట్టఁ బెంచుచుఁ బరిస్ఫూర్తిన్ గొనం జేయుచున్. ౧౫౧

సీ॥ కాసారములకేగి కమలినీసుమనోమ,రందముల్ దెచ్చి యగ్రమున నిడుచు
సహకార ఫలరసాసారంబుఁ గొని తెచ్చి, యింపు మీఱఁగ నందియిచ్చికొనుచు
సరసనీహారాదిసంగ్రహం బొనరించి, చంచూపుటముల నర్పించుకొనుచు
శైలశృంగాగ్ర నిర్ఝర శీతలాంబువుల్, కృప చిల్కవంచి త్రాగించుకొనుచు

గీ॥ మోము మోమునఁ గీలించి ముద్దులిడుచు, మేలు మేలని తలఁచుగా మెచ్చికొనుచు
ప్రేమతళ్కొత్తఁ బిల్లలఁ బెంచు విహగ, దంపతులఁ జూచి వ్యాసుఁడత్యాదరమున. ౧౫౨

క॥ ఎంతయొ యబ్బురపడి మదిఁ, జింతాతత్పరత నంది చింతించి బలా
వింత లవి కానఁదిరుగుడు, లెంతో వినోదములఁ జూపె నేమనవలయున్. ౧౫౩

## —॥ సంసారప్రశంస ॥—

క॥ తిర్యక్కులలో నీ బుధ, చర్యలు నమకట్టె భోగసారములు బలా
ధుర్యమనంబుల నరులీ, చర్యకు లోఁబడుట కేమి సంశయ మవనిన్. ౧౫౪

క॥ నీటుగ వివాహ మెట్టులు, పాటిల్లెనో యిందు నెందు ♦ బటుసాధన సం
ఘాటం బెట్టులొ రెయెుండొరు, కూటములంథెనసి మెచ్చ ♦ కొను టెట్టులొకో. ౧౯౫

## —• సంతానము •—

ఉ॥ పిల్లలఁజూచి చిత్తములఁ ♦ బ్రేమము నొందుట వింతయయ్యె నీ
మొల్లమిచూడ నబ్బురము ♦ మోహము విప్పగరాదు భూమిలో
నెల్లెడఁ బుత్రసంపదకు ♦ నీడగు సంపద లెవ్వికావునాఁ
డెల్లము సర్వభోగమును ♦ దీనికి నీడని పల్కనొకో. ౧౯౬

చ॥ అదియునుగాక వార్ధకము ♦ నందుఁ దలల్ వణకంగ దంతముల్
కదలఁగ దండమూని ధరఁ ♦ గాల్కదలింపఁగ లేని వేళలన్
ముదమలరంగ భక్తిమెయి ♦ ముందర చే బిగియంగఁబట్టి త
త్స్వద మెద నందనీక సుఖ ♦ సాధకుఁడై సుతుఁడేలుఁ దండ్రులన్. ౧౯౭

క॥ సాంసారిక సుఖములను బ్రశంసన్ జేయంగఁ బుత్ర ♦ సౌఖ్యముఁబోలన్
సంసారసుఖముగలదే, కంసారి యెఱుంగుఁగాక ♦ కలరే యన్యుల్. ౧౯౮

క॥ నందనునిఁగాంచి సఫలానందుండై కౌఁగిలించి ♦ యర్మిలిఁ బ్రేమా
స్పందుఁ డగు జనకు జీవన, మిందందును భుక్తి ముక్తి ♦ హేతువగుఁగదా. ౧౯౯

సీ॥ పరలోకసాధన ♦ ప్రత్యక్ష హేతువుల్, కలవు పెక్కులు శాస్త్ర ♦ గతిగణింప
సాధనంబులలోన ♦ శాశ్వత స్వర్లోక, వాసంబునకు ముఖ్య ♦ భాసకంబు
పుత్రసంపత్తి గావున "నపుత్రస్య గతి ర్నాస్తి" యని శ్రుతుల్ ♦ తేటపఱిచెఁ
"బుత్త్రవాన్ స్వర్గమాప్నోతి" యటంచును, మన్వాది సిద్ధాంత ♦ మతము తెల్పెఁ
గీ॥ బుత్త్రవంతులు దివికినై ♦ పోవుటలును, బుత్త్రహీను లధస్థితి ♦ పొందుటలును
విందుమే కాదె? సభలఁ గోవిదులవలన, నందరాని ఫలం బిచ్చు ♦ నందనుండు.

మ॥ సుతహీనుం డగువాఁడు వార్ధకముచే ♦ శుష్కించి రోగంబులన్
స్మృతిప్రాప్తించినవేళ సంచితములై ♦ మేలైన వస్త్రార్థ గో
తతి గేహంబుల కెల్ల భర్తలగు క ♦ ర్తల్ లేరు మత్సంపదల్
వితతంబుల్ వితథంబు లయ్యెనని యో ♦ లిన్ జాలఁ జింతిల్లెడున్. ౨౦౦

ఉ॥ ఇట్టివిచారముల్ మదికి ♦ నెంతయుఁ దోఁచునుగాన నంతమం
దెట్టగు వాసనాస్థితి గ్ర ♦ హింపఁగ నట్లగువానికిన్ గతుల్
పట్టియుఁ గల్గ నన్నిటికి ♦ భారకుఁడౌఁ గద యట్టివానికిన్
బుట్టదు లోనఁ జింతయు న ♦ పూర్వగతిన్ గన్గాదె సర్వమున్. ౨౦౧

క॥ అని బహువిధ చింతలఁబడి, ముని సత్యవతీసుతుండు ǂ మోమున దైన్యం
బినుమడిఁగొల్పఁగ రోజుచు, మననాలస మైన మనసు ǂ మల్లడిగొనఁగన్. ౨౦౩

మ॥ పరమాద్వైతరసానుభూతిసుఖసంపన్నుండటే వ్యాసుఁ డి
వ్వరుసన్ సంసరణోచిత వ్యసనభావం బూనె నొండేల? య
ప్పరదేవీ కుహనాబ్ధి మజ్జనము దప్పన్ ద్రోయ నెవ్వారికిన్
దరమే స్థావరజంగమానుభవ సిద్ధంబేగదా యెంచఁగన్. ౨౦౪

ఉ॥ అంతఁ బరాశరాత్మజుఁ డహర్నిశమున్ మదిఁబుట్టు చింత న
త్యంతము కంది కుంది సకలార్థము లెన్నఁ దపంబటంచు వి
శ్రాంతమనస్కుఁడై కనకశైలముపొంత వసించి యాత్మలోఁ
జింతిలఁజొచ్చె నే విభునిఁ జేరి తపం బొనరింతునం చొగిన్. ౨౦౫

క॥ హరియో హరుఁడో విధియో, మరుదీశుఁడొ సూర్యుఁడో హిమానీకరుఁడో
కరిముఖుఁడొ కార్తికేయుఁడొ, వరుణుఁడొ పావకుఁడొ వేగ వరము లొసంగన్. ౨౦౬

చ॥ అని మదిఁ జింతనంది యనయంబు విచార మొనర్చుచుండ న
వ్వనికి యదృచ్ఛచే విబుధవంద్యుఁడు నారదమౌని వల్లకీ
నినదము వక్త్రపంజరవినిర్గత నామసుధారసంబుతో
నెనయ గతాగతోచిత సమీహిత నచ్చటి కేగుదెంచినన్. ౨౦౭

క॥ వచ్చిన సురముని కెదురుగ, వచ్చి నమస్కృతి యొనర్చి ǂ పల్లవపీఠం
బిచ్చి సుఖస్థితిఁబూన్చిన, నచ్చో నారదుఁడు బాదరాయణమునితోన్. ౨౦౮

క॥ ద్వైపాయన! కుశలమె? నిష్పాపఘనాత్మ ప్రశాంతమనీషా
దాపసవృత్తుల నవసెదు, చూపోపమిగాక మనసు ǂ చొప్పన్యంబై. ౨౦౯

ఉ॥ ఉన్నది నీ మనోబ్జమున ǂ నున్న విచార మదెట్టిదయ్య నీ
వున్న తెఱంగు వేఱు వినయోచితవృత్తి నొసంగఁబల్కుమా
యన్నఁ బరాశరాత్మజుఁ డనంత కృపారసశాలి నారదుం
డన్న మృదూక్తి నారసి సమాహితబుద్ధి వచించె నిట్లులన్. ౨౧౦

సీ॥ ధృతి నపుత్రస్య గతి ర్నాస్తి యను వేదవిధి నాదు నెమ్మది ǂ వెతఁగలంచె
వివరింపఁగా మనోవిశ్రాంతి లేదయ్యె, నాధ్యాత్మికంబు నన్నలమికొనియె
సర్వజ్ఞమూర్తి నీ ǂ సన్నిధి ప్రాపించెఁ, బెన్నిధి పేదకబ్బిన విధమున
శరణాగతుఁడనైతి ǂ సత్వరంబున వరప్రదుఁడైన వేలుపెవ్వాఁడొ వాని
గీ॥ విశద ఫణితిని నెఱిగింపవే మహాత్మ!, దృఢతపం బొనరించి యా ǂ దీనబంధు
మెచ్చికొనఁజేసి మదభీష్టమిచ్చునటులు, గోరియున్నాఁడఁ బల్కుగైకొనఁగవలయు.

చ॥ విదితజగత్త్రయుండ వని ౯ వేడితి నిన్నుఁ బరేంగితజ్ఞతా
స్పదహృదయంబుతో మదభికవాంఛ వచింపు మటన్న నారదుం
డెదఁ దలపోసి యిట్లనె సమీహితుఁడై కమలాసనుండు దా
సదయుని శౌరిఁగాంచి శ్రుతిసమ్మతి సూక్తులు పల్కె భక్తితోన్. ౨౧౩

## — విష్ణుస్తుతి —

సీ॥ కౌస్తుభోద్భాసి వక్షస్థ్సలీ మోహన, శంఖ చక్రాది హస్తప్రశస్త!
లలిత పీతాంబరాలంకృత సర్వాంగ!, శ్రీవత్సలక్షణాంచితవిహార!
పుణ్యాకారణరూప ౯ పురుషోత్తమ ముకుంద, హరి వాసుదేవ మహానుభావ!
సర్వజగన్నాథ ౯ సర్వాత్మ సర్వజ్ఞ, దేని గుఱించి యీతీరు తపము
గీ॥ చేయుచుంటివి తపముచేఁ ౯ జెంద నెద్ది, విస్మితంబయ్యెడు మనంబు ౯ వేయునేల!
చిత్ర మఖిలేశునకు నేమి ౯ సిద్ధి కొఱత, నీ కటాక్షంబు నిఖిలైకనిధియెఁగాదె!
ఆ॥ నిఖిలకర్తనైన ౯ నేను నీ పొక్కిలి, తమ్మిఁ బొడమినాఁడఁ దండ్రి నీకు
నధికు లెవ్వరింక ౯ నట్టివా రున్నేని, వారిఁగూర్చిగద తపంబునేఁత. ౨౧౪

క॥ కర్తవు భువనావళికిన్, భర్తవు తత్కృత్య సర్వభరణమ్మునకున్
హర్తవు సంవర్తంబుల, మూర్తంబుల కెల్ల నాదిమూర్తివి దేవా! ౨౧౫

శా॥ నీ యాజ్ఞన్ దలఁదాల్చి నేను త్రిజగన్నిర్మాణమున్ జేసితిన్
నీ యాజ్ఞన్ హరుఁడెల్ల విష్టపములన్ ౯ నేత్రాగ్ని మాయించు న
ట్లా యర్కేందులు వహ్నివాయువులు దేవాధీశుఁడున్ స్వస్వక
ర్మాయత్తోచితవృత్తి నుండుదురు దేవా! ధ్యేయుఁ డెవ్వండొకో. ౨౧౬

క॥ ఏదేవుఁడు నీ కధికుం, డా దేవుని ముజ్జగంబులందు వినంగా
లేదిది నిగమం బట్టులు, వాదింపదె? నిశ్చయార్థమై ఖరిగాదే? ౨౧౭

చ॥ హితుల నెఱుంగఁజేయునది ౯ యెద్దియు లేదని చాటుచుండవే
శ్రుతులు స్మృతుల్ పురాణములు ౯ సూనృతవాదులు నట్లు పల్కరే
గతి మతి నీవెకాన నిను గట్టిగ నమ్మితిఁ దండ్రి చెప్పవే
హితుఁడను భక్తుఁడన్ సుతుఁడ ౯ నేటికి సంశయ మొంద నెమ్మదిన్. ౨౧౮

## — శ్రీ విష్ణువు శక్తి మహిమంబు వివరించుట —

సీ॥ అబ్జసంభవుఁ డిట్టు ౯ లాడినమాటలు, ప్రేమను విందుగా ౯ వినుచు శౌరి
వత్స! నీవును నేను ౯ వామదేవుండును, సృష్టిస్థితిధ్వంస ౯ శిక్షకులము.

అస్మద్విధానమే ¤ యఖిలమహానని దేవ, మానవు లందురుఁగాన నిదియె
కర్తృత్వమున నిన్ను ¤ భర్తృత్వమున నన్ను, హర్తృత్వమున రుద్రు ¤ నధికరించి

గీ॥ శాసనమొనర్ప నెవ్వరో ¤ సర్వకర్త, లెవ్వరో యని నిగమంబు ¤ లిట్లు వెదకు
నట్టి మర్మంబుఁ దెల్పెద ¤ సావధాన, మానసోల్లాసివై వినుమా ! కుమార !

గీ॥ జగములు సృజింప రాజసీశక్తి యగుచు, జగములు భరింప సాత్వికీశక్తి యగుచు
జగము లణఁపంగఁ దామసీశక్తి యగుచు, నిన్ను నన్నును హరునిఁ దానిల్పెనంబ.

సీ॥ రాజసీశక్తిచే ¤ స్రష్టవైతివి నీవు, సాత్వికీశక్తిచే ¤ సాక నేను
దామసీశక్తిచే ¤ దండింప రుద్రుండు, కర్తలమైతి మిఁక కారణి మనము
తత్కుటుంబము స్వతంత్రత లేదు మనయొద్ద, మచ్ఛక్తి లక్ష్మినా మహితయయ్యె
స్వాధీనపత్నివై ¤ సతతంబు నాతోడ, విహరించుఁ దదధీనవృత్తి భాండ

గీ॥ గర్భదాసునిఁబోలి యక్కాలికి మొడలఁ, దృష్టిచేఁ దుష్టినొందుచుఁ ¤ దుష్టిగాని
యెడల దీనుండనైయుండు ¤ నీవు నిటులె, రాజసిని, దామసిని శూలిఁ ప్రవిమలాత్మ!

క॥ పరతంత్రులమైయుండుము, నిరతమ్మా ముప్వురకును ¤ నీ వెఱుఁగవె నేఁ
బరతంత్రుఁడనై లక్ష్మిపరిచర్య లొనర్తు దాసపద్ధతి వత్సా ! ౨౨

సీ॥ పవళింపు మన్నచో ¤ ఫణితల్పమున నుందుఁ, గడఁగి తదాజ్ఞ రక్కసుల నడఁతు
ననురాగమునఁ జూచునంత మేనొగ్గుదుఁ, గరుణింప నేకాంతగతికిఁ జొఱుదు
నొక్కొక్కతఱి లక్ష్మి ¤ నుజ్జగించుచు నవ, తారంబులెత్తి తత్తద్విహార
మొనరింపనే హీనయోనులఁ బొడమనే, యేకార్ణవమున నీవెఱుఁగ వొక్కొ

గీ॥ వర్షశతసహస్రమ్ములు ¤ బాహుయుద్ధ, భటుఁడనై మధుకైటభభంజనంబుఁ
జేసితినిగాదె వారు నాచెవులఁ బుట్టి, దుష్టులై మదమత్తులై ¤ తొడరరొక్కొ.

వ॥ అదియునుగాక నొక్కతఱి మదీయంబగు శిరంబు ధనుష్కోటివలన విచ్ఛిన్నం
బైనయెడల నాసత్యులవలన సంయోజితంబగు నశ్వశిరంబున హయాననుండనై
రాక్షస నిర్హరణం బొనరింపఁ బ్రవర్తింపనే? కావున సర్వాధికుఁడ వని నన్నుం
గీర్తింపనేటికి? సర్వంబును బరాశక్తి పారతంత్ర్యంబు వహించుట యెఱుంగవే
యని మధుసూదనుండు నలువ కెఱుంగఁజేసె నన విని రోమహర్షణితో నమ్మహా
మును లిట్లనిరి. ౨౪

— హయగ్రీవావతారఘట్టము —

ఉ॥ సూత! రమామనోహరుఁ డజుం డచలుం డమరుం డనాది ఖ
ద్యోత సహస్రతేజుఁ డఖిలోద్భవమూల మటంచు విందు లో
కాతిశయాఢ్యుఁడౌ హరికి ¤ నట్టియుపద్రవ మేల వచ్చె నే
లా? తల డుల్ల విస్మయము ¤ నద్భుతమున్ వినవయ్యె నక్కటా! ౨౫

క॥ సందేహాబ్ధిని మునిఁగెన్, డెందము నీ వృత్తమెన్నఁగ డేనియు విన మీా
చందం బెట్టిదొ మీాచే, విందుము తెలియంగవలయు ౯ వినిపింపు తగన్. ౨౬

క॥ తురగాననుఁడై యమ్ముర,హరుఁ డుండుట కేమి హేతు ౯వయ్యాపదలన్
బొరపడుట కేమి హేతువు, పరిపూర్ణబ్రహ్మ మనుచుఁ ౯ బలుకనె జగముల్.

ఉ॥ ఎవ్వనిచేఁ ద్రిలోకము లహీనములై చెలు వొందు దేవతల్
మవ్వముఁ గాంతు రెవ్వని సమగ్ర కృపారస సార మగ్నులై
యెవ్వని వేదముల్ దెలుపు ౯ నిట్టి పరాత్పరు సర్వకారణున్
గవ్వపుఁ గొండదారిఁ జెనకన్ గల వాఁడెవఁడయ్యెఁ దెల్పవే ? ౨౭

క॥ ఏపట్ల దైవగతి నీ, యాపద సంధిల్లె ? హరికి ౯ నట్టి యుదంతం
బోపికచే వినిపింపుము, తాపసజను లెల్ల వినఁగఁ ౯ దత్పరమతినై. ౨౮

క॥ అని యడిగిన సూతుఁడు ముని,జనులారా ! వినుఁడు, తొల్లి ౯ చక్రాయుధునిన్
గని యసురవర్యు లామొ,ధనమునకున్ బిలువ హరియు ౯ దర్పోద్ధతుఁడై.

ఉ॥ సంగర కౌతుకంబు మది ౯ సందడిఁ బెట్టఁగఁ జక్ర శార్ఙ్గ యు
ద్ధాంగ సమేతుఁడై వర విహంగ తురంగము నెక్కి వారితో
డం గదనంబుఁ జేసెఁ బ్రకటస్ఫుటశార్ఙ్గ వినిర్గతాశుయా
భంగుర సాయకాగ్నులు నభంబునఁ గ్రమ్మచుఁ జుట్టు ముట్టఁగాన్. ౨౩౦

క॥ పదివేలయేండ్లు రక్షః, కదన మ్మొనరించి యలసి ౯ ఘన విశ్రాంతిన్
బొదలుచు సమభూస్థలమునఁ, గదలక పద్మాసనస్థ ౯ గతిఁ గూర్చున్నన్.

క॥ అట్టితరి సుమాళంబున, నెట్టన నొకకొమ్ము పాదమ ౯ నిలిపి గళమునన్
నెట్ట నొకకొమ్ము నిలువఁగఁ,బట్టెన్ గార్ముకము మోదభరితుం డగుచున్.

ఉ॥ దారుణ యుద్ధ కర్కశతఁ ౯ దాలిమిఁ దూలిన వాఁడుఁ గాన నా
సారసలోచనుం డలసి ౯ చయ్యన నిద్దురబార వశ్యమున్
గూరుడుఁ దా నొడల్ మఱచి ౯ కూర్కెడు నంతట నంత కంత ని
ద్రారస మగ్నతన్ బరఁగెఁ ౯ "దథ్యము నిద్ర సుఖం బెఱుంగునే ?" ౨౩౪

ఉ॥ ఆ సమయమ్మునందు సురలందఱు నొక్కట బ్రహ్మ శూలభృ
ద్వాసవ చంద్ర సూర్య సహితం బయి యాగ మొనర్పఁ గోరి బ్ర
హ్మాసనకర్త యైన కమలాక్షుఁడు లేఁడని యెల్లచోటులున్
రోసి వికుంఠధామమును ౯ రోయఁగ నచ్చటి కేగి రందఱున్. ౨౩౫

క॥ అచ్చో లేమి పొసంగిన, విచ్చలవిడి సకలదిశలు ౯ వెదకుచు నొకచో
ముచ్చట మునుఁగుచు నిద్రా,భ్యుచ్చయమున నున్న హరిని ౯ బొడఁగని రంతన్.

—• యోగమాయామోహితుం డయి యున్న విష్ణువృత్తాంతము •—

ఉ॥ తానయి పాకశాసనుఁడు ✽ దైవత వర్గముఁ గాంచి శౌరి తా
మే నెఱుఁగంగలే కిపుఁడు ✽ మిక్కిలి నిద్దురఁ జెందినాఁ డీఁకే
మేని నెఱుంగఁ జింత మన ✽ కెద్ది యుపాయము నిద్ర వాపఁగా
రానిది దోషహేతు వనఘా! బుధు లెల్ల జగత్త్రియంబునన్. ౨౩౭

ఉ॥ ఏమి యుపాయ మన్న హరుఁడిట్లనియెన్ గల దొక్క ధర్మము
ద్దామము యజ్ఞ ముఖ్య ఘనధర్మ వికల్పము లందెనేని ని
చ్చో మది సంశయింపక యశోధన కర్మకు నోర్వవచ్చు ని
ద్రామహితాత్ముఁ డీతఁ డుచితం బగు నిద్దుర మేలుకొల్పఁగన్. ౨౩౮

చ॥ అని యొకపూర్వుఁ జేసి కమలాసనుఁ డంపిన నద్ది యేగి త
ద్ధను వడుగున్ గ్రహించు నది ✽ తప్పక చాపము బెట్టు డుల్లు నం
తన హరి నిద్ర మేల్కొను యథావిధిఁ గార్యము చక్క నౌ నటం
చని హరుఁ డానతియ్యఁ గమలాసనుఁ డప్పురువున్ సృజింపఁగన్. ౨౩౯

ఆ॥ దేవదేవుఁడైన ✽ యీ వాసుదేవుని, నిదుర కెట్లు చెఱుపు ✽ నే నొనర్తు?
దంపతులకుఁ గలఁత ✽ తల్లి పిల్లలవేఱు, నిదుర చెఱుపు నేత ✽ నిరయ మంద్రు.

ఉ॥ కావున దేవతావళికిఁ ✽ గార్య విరోధము గాఁగ నేమి యీ
దేవుని నిద్దురన్ జెఱుప ✽ ధీ మెయిఁగొన్నది గాదు సర్వమున్
భావరసార్థసార్థకము ✽ పాతక మెట్లొనరింతు నన్న నా
దైవత కార్య సిద్ధి కుచితంబుగఁ దెల్పెను నొక్క ధర్మమున్. ౨౪౧

క॥ యాగముల యందు నీ కొక, భాగము గల్పింతు నిదుర ✽ భంగించుచు నీ
భోగిశయానుని నీవే, వేగిరపడి నిదురఁ దెల్పు ✽ వెఱపింకేలా? ౨౪౨

గీ॥ హోమ కర్మల చెంతల ✽ నొలికి చెదరి, పడు హవిర్ద్రవ్య మెల్ల నీ ✽ భాగ మగును
సత్వరంబుగ నిదురించు ✽ చక్రపాణి, బోధ గొల్పు మటన్న నా ✽ పుర్వుబలిమి.

—• పురువు ధనువును గొఱుకుట-విష్ణుని శిరము సముద్రములోఁ బడుట •—

శా॥ సూచింపన్ బడి వజ్రదంష్ట్రమును నాశుప్రేరితం బౌట సం
కోచం బింతయు లేక తద్ధనురథఃకోటిన్ గ్రహింపంగ మౌ
ర్వీ చంచద్గతి నూర్ధ్వకోటి కడు ఘూర్ణిల్లన్ మినున్ ముట్ట గో
త్రాచక్రం బద్రువంగ ఘోరమయి నిర్ధ్వానంబు పుట్టెన్ దగన్. ౨౪౪

సీ॥ దిక్కటాహం బెల్ల ✽ దిద్దిరఁ దిరుగంగ, ధరణీతలం బెల్లఁ ✽ దందరింప
సప్త సాగరము లుచ్చైఃక్షోభ మొందంగ, ఝంఝూసమీరముల్ ✽ సందడింప

మెఱుపు లొక్కట జాతిమింట నుల్కలు చల్ల, గురుశైలతతు లెల్ల ఘూర్ణిలంగ
దెస లసూర్యంబుగాఁ దివిరి చీఁకటిగ్రమ్మఁ జేతనాచేతనస్థితి దొఱంగ
గీ॥ నేమి యుత్పాతమో యంచు నెల్లసురలు, సాధ్యసాధ్వసులై యుండఁ జక్రపాణి
మకుట కుండల సహితమౌ మస్తకంబు, కర్పరం బంట నెగసె దిగ్భ్రమణ మెనయ.
వ॥ అంత, ౪౮౬
కం॥ కమలజ హర ముఖ్యామర, సమితి శిరోహీన మైన శౌరి కబంధం
బమితప్రభ చెడియుండుటఁ, దెమలఁగ రానట్టి యడరు దీటుకొనంగన్. ౪౮౭
సీ॥ అయ్యయో! నీ కింత యపరాధులమె? మేము, హా నాథ! నీకిట్టి హానిగలుఁగ
నేమైన మాచేత నిబ్బంది కలిగెనో, యపహృతం బయ్యెనో యమరుఁడవు న
భేద్యుండ వయ్యును బృథుశక్తిఁ జెడితివే, యిట్టి నీ వీల్గిన నెవరు దిక్కు
గలుగు వారలు దైవఘటనచే నీ లీలఁ, గలిగెఁ గాబోలు రాక్షసుల వలనఁ
గీ॥ బాడము విఘ్నంబు గాదు మా యెడలఁ దప్పు, వలనను ఘటిల్లెనో కాక? యీ వరుసఁ దలప
సత్త్వ రాజస తామస శక్తి శక్తిఁ, గాదు జగదీశ్వరుని మాయ కతననొక్కొ. ౪౮౮
క॥ ఏమి యుపాయము మా కిఁక, నే మెట్టులు దేఱువార మెవ్వరు గతి మా
కో మాధవ! యని శోక వి, రామము లే కడలు సురలరాజిన్ గనుచున్.
క॥ ఆంగిరసుండు గురుండు గ, నుంగొని శోకాబ్ధిలో మునుంగఁగ నేలా
వెంగళుల పోల్కి దైవ మె, ఱుంగని దొక్కటియుఁ గలదె యూర్జిన్ దెలియన్.
క॥ శోకము సుఖవిధ్వంసక, మే కొలఁదిని సుఖము దుఃఖ మింతయుఁ బ్రాణి
ప్రాకట నిజ ధర్మములై, రాక తొలంగునొకో? యెట్టి రాజుల కైనన్. ౪౯౧
ఉ॥ ఎంతటి వారికైన ఫలియింపవె దైవము పౌరుషంబునన్
జింత మునుంగ నేమిటికిఁ జెచ్చెర దీని కుపాయ మెట్టిదో?
మంతన మొప్పఁ జేసి యనుమానము దీఱఁగఁ జేయఁబోలు ని
ట్లింతఁగ మీరు దుఃఖమున నీఁదగఁ జెల్లునె యూరడిల్లుఁడీ. ౪౯౨
క॥ అంతటఁ బురుహూతుం డను, సంతాపింపంగ నేమి జగముల దైవం
బెంతయు నధికము పౌరుష, మింతయు వితథంబు నిజ మిదే సురలారా. ౪౯౩
క॥ మనమందఱము గనుంగొన, వనజాక్షుని కింతపాటు వచ్చెన్ గనుఁడీ
తనతలఁపు వలెనె దైవము, మనమునఁ దలపోయునొక్కొ మహి నెవ్వరికిన్.
చ॥ అన విని బ్రహ్మ యిట్టులనె నద్దివిజావళితోడ వింతలే
జనులకు నిట్టి కర్మములు సంఘటితంబులు గాక పోవునే
మును పొకవేళ దైవగతి మూర్ధము శంకరుచేతఁ గృత్తమై
నను విలపింపఁ దల్లడిలు నన్ను నుదేర్చిరె మీర లందఱున్. ౪౯౫

ఉ॥ దివ్యులు మీరు శోకమునఁ జేఁ బరదేమి "యవశ్య మేవ భో
క్తవ్య" మటన్న వేదగతి తప్పునె దైవము వేడి మొక్కినన్
భవ్యము నొందఁగాఁ గల యుపాయము నాత్మఁ దలంచి చూడుఁడీ
యవ్యయ వృత్తి సంఘటిలు నట్టులు నిర్జరులార! యియ్యెడన్. 	౨౫౬

ఉ॥ సాధనహీనుఁడై ఋషుల శాపము నందఁడె శంకరుండు స్వ
ర్ణాధుఁ డహల్యకై భగపరంపర నొందఁడె దేహ మెల్ల దు
ర్బాధల నొంది మానసరంబున వర్ష శతంబు దాఁగఁడే
యీ ధర దుఃఖవారిధుల నెవ్వఁడు మున్గనివాఁడు కాంచుఁడీ. 	౨౫౭

వ॥ అది గావున సనాతనంబై మహామాయామయంబై విద్యావిద్యలు రెండును దానై జగత్కారణంబై పరాప్రకృతి రూపంబైన పరంజ్యోతి గావున నా మహాశక్తిం బ్రార్థించిన మన యధ్వరకార్యంబు సఫలంబు గాఁగలదు. జనార్దనుండును నెప్పటియట్లు పునర్జీవితుండు గాఁగలం డని కమలాసనుం డెఱింగించిన. 	౨౫౮

మ॥ సురలారా! శ్రుతులార! మీరలు సదాస్తోత్రప్రభావోజ్జ్వలన్
బరశక్తిన్ జగదీశ్వరిన్ స్ఫుటమహామాయన్ బ్రశంసింపుడీ
వరుసన్ గార్యము సిద్ధినొందు మనకున్ భవ్యంబు ప్రాపించుఁ ద
త్కరుణావారిధి మజ్జనంబు గలుగున్ గాలంబు పోనీకుఁడీ. 	౨౫౯

ఆ॥ అను విరించి పలుకు లాలించి నిర్జరుల్
నిగమ చయము నాత్మ నిమ్మఁ గొలిపి
జ్ఞానగమ్య యైన జనని నుమన్ ధ్యాన
మభినుతించి రాగమార్థ ఫణితి. 	౨౬౦

## — లలితా స్తోత్రము —

దండకము:—శ్రీమన్మహాదేవి! మాయాజగజ్జన్మ హేతుప్రశస్తా! శివా! నిర్గుణా! సర్వభూతేశి! మాతా! మదిష్టమ్ము లిమ్మా! మహాభూత సంఘమ్ములన్ భూతివై ప్రాణులన్ బ్రాణమై బుద్ధివై లక్ష్మివై కాంతివై శాంతివై శ్రద్ధవై నవ్యవై భవ్యవై సర్వలోకానురాగార్ద్రవై వాగ్భవావాసవై శీర్షమున్ వ్యాహృతుల్ గూర్చు గాయత్రివై సృష్టిసంహారకద్వంద్వమున్ బూని బ్రహ్మాచ్యుతేంద్రాగ్ని సూర్యేందురూపంబులన్ జేతనాచేతనస్ఫూర్తిచే నేకరూపంబు పాటించి వే భూర్భువస్స్వర్ముఖానేకలోకమ్ములన్ సృష్టి సల్పంగ బ్రహ్మాదులన్ దార్చి సృష్టిస్థితిధ్వంసనంబుల్ తదాయత్తముల్ చేసి సంసారచక్రంబునం దంట మెవ్వానికిన్ గల్గు నీ నామసంధ్యాన రాకున్న నీరూపు గాంచంగ నైపుణ్య

ధుర్యుండు నెచ్చోటునం గల్గునే నీదు నైశ్వర్య మంభోజగర్భాదులుం గందుశ్రే, సింధుపారంబు చేరంగఁ జేయింతర్లఁ బోవువా రెవ్వ రున్నారు నీ శక్తి యెవ్వారికిఁ గల్గునే? యెల్లలోకాళికిన్ దల్లి వీవేకదా యేతదర్థప్రమాణంబు వేదంబె కా సృష్టివేళఁ నిరీహాఁ జగత్కర్తృతఁ గాంచు నీ చిత్త మెచ్చోటులం గల్గునే యిచ్చ లేకున్నఁ గార్యస్థితుల్ కల్గునే కల్గుటల్ చిత్రముల్ గాక విశ్వంబు నిర్విఘ్న మౌనట్లు చేయంగ నీకెంత లోకైకమాతృత్వముఁ బూని సర్వజ్ఞనై యంబుజాక్షుండు దీర్ఘాపదం బొందుచోఁ బ్రోవలేనైతివో తత్కృతంబైన ప్రారబ్ధమన్నై విపత్తిన్ గొనంజేసె నీ పాదపంకేజ నిష్ఠాగరిష్ఠాత్ముఁడౌ వాఁడు ప్రారబ్ధమున్ జెందునే కాక నీవిట్లుపేక్షించుటన్ జేసి కాదే హృషీకేశమూర్ధంబు దేవాపదాధ్యాయకంబై మహాశ్చర్యదంబై తొలంగెంగదా తల్లి దుఃఖాభిభూతిన్ మమున్ బ్రోసి చూడంగ నేలా పునఃపూర్వరూపంబు నొందింప మాబోటులా యేల యాలస్య మిప్పట్టునన్ మత్కృతంబైన దోషంబుచేనో తదీయాతిగర్వంబుచేనో యనంగాఁ బనేమమ్మ నీచిద్విలాసంబు లేవంవిధంబుల్ మహాయుద్ధరంగంబులన్ ధ్వస్తులై రాక్షసుల్ విష్ణుశీర్షంబు బల్ మచ్చరంబూనియే దాచిరో యిట్టి శీర్షంబు లేనట్టి భీకృత్కబంధంబు చూడంగ నీకుఁ వినోదంబొకో లచ్చిపై కోపముఁ బూని యాబోటినిన్ నాథహీనస్వరూపంబుతోఁ జూడఁగాఁ గోరితో నేరముల్ సైచి శ్రీనాథునిన్ గాచి దుఃఖాబ్ధినిర్మగ్నయా భార్గవిన్ దేర్చి మా తప్పులన్ ద్రోసి మేమెల్ల శోకాబ్ధిలో మున్గకుండన్ రమానాథు బోధింపు మో తల్లి! యా విష్ణుశీర్షంబు దృగ్గోచరత్వంబునుఁ జెంద కెచ్చోటనో డాఁగె దచ్ఛీర్షముఁ బూర్వరీతిఁ హారిఁ గూర్పఁగా నీవెకాదా జగన్నాథవై పుత్త్రిలఁ బ్రోవ నీవేకదా దిక్కు శోకార్ణవాంతర్నిమజ్జత్సుధాంధోగణంబుఁ దయాసారధారానదీ తృప్తి వీక్షించి రక్షింపు మమ్మాఁ పరాశక్తి! విద్యామయీ! బ్రహ్మవిద్యా! నమస్కారముల్ గూర్తుమమ్మా! భవానీ! భవశ్రీ ర్నమస్తే! ౨౬౧

లయగ్రాహి॥ కాండము మహాధ్వములఁనిండ ముద మంది సుర
తండములు సన్నుతు లఁఖండముగ సర్వో
ద్దండముగ సర్థపదఁశౌండముగ భక్తులు ప్ర
చండముగఁ జేయుచు వితండములు లేశే
శుండములఁ బోలు భుజ కి దండముల నెత్తిసిః
తుండములు దైన్యసుకరండములు గాఁగఁ

గండములం బాపు మఖిలాండముల తల్లి! శివ!
దండమిదె దండమిదె దండ మని మ్రొక్కన్. ౨౮౨

చ॥ కనికర మూని శాంకరి యఖండగురు స్తుతులన్ బ్రసన్నయై
యనుపమిత ప్రకాశమున నాకస మెల్ల వెలుంగఁ జేయుచున్
ఘనపదచారి సన్నిధి నఖండకృపా విలసత్కటాక్షయై
గనఁబడె నంతలో సురలు గన్గొని హర్షరసార్ద్రచిత్తులై. ౨౮౩

క॥ శిరములను నంజలీకృత, కరములను బ్రదక్షిణంబుగాఁ దిరుగుచు సం
బరములను భక్తిభావా, దరముల నెడలేని నయ విధంబున నిల్చన్. ౨౮౪

ఉ॥ ఆ జగదంబ శాంకరి సుధాశన బృందముఁ గాంచి పల్కె ను
ద్వేజితవృత్తి మానుఁ డిఁకఁ దెల్పుఁడు మీ యభిలాష మేను ని
ర్వ్యాజతఁ దీర్పవచ్చితిని వారక మీరు నుతించు సంస్తుతుల్
భూజను లెవ్వరేనిఁ బరిపూర్ణత విన్నఁ బఠింప మేలగున్. ౨౮౫

క॥ కాలత్రియమున నెవ్వం, డీ లలితాస్తోత్రలేశ మేనియుఁ దలఁపన్
శ్రీలన్ మత్సాయుజ్య, శ్రీలన్ జెలువొంది నిత్యసిద్ధిఁ బడయున్. ౨౮౬

ఉ॥ కారణ మేది లేక యొకకార్యము పుట్టదు ముజ్జగంబులన్
శౌరిశిరంబు కృత్తమయి సాగరమగ్నత నొంది యుంటకై
కారణ మొండు గల్గు నవికారమనస్కతతో వినుండు దై
త్యారి తనంతఁ దెచ్చికొని నట్టిదె యీ యపరాధ మే మనన్. ౨౮౭

చ॥ ఒకపరి మాధవుండు కలశోదధి శేషశయానుఁడై నిజాం
తికమున రామణీయకనిధిన్ గమలాలయఁ జూచి హాసభా
సక మగు మోమునం జెలఁగ సాగరకన్యకఁ గాంచి నాథుఁ డే
మొకొ ననుఁ జూచి నవ్వె నని మోమున దైన్యము నిండి పాఱఁగాన్. ౨౮౮

మ॥ అనిమిత్తంబుగ నన్నుఁ జూచి ప్రియుఁడే హాసంబు సూచించె నే
మనుమానం బొక హేతుశూన్యముగ నీ హాసంబు సంధిల్లు నే
మని చాలన్ వెతఁ జెందు చిత్తమున నన్యస్త్రీసమాకాంక్షచే
వను వంచింపఁ దలంపఁ బోలు నని య న్నాళీకపత్రాక్షి యున్. ౨౮౯

చ॥ మదిఁ దలపోసి క్రోధ మసమంజస మంచు గణింపలేమి న
మ్మదవతి యంతకంత కవిమార్గసముద్భవ మా నమర్ష మున్
తుద మొదలంద కల్గుకొనఁ దోడుతఁ దామసశక్తి యంతలోఁ
బొదిగి మనంబు చుట్టుకొనెఁ బోవునె స్త్రీ సహజస్వభావముల్. ౨౯౦

క॥ నిలుపోపలేక భార్గవి, కలుషాత్మిక యగుచు మస్తకము కృత్తంబై
జలరాశినిఁ బడు నని తాఁ, బలికెన్ మీ కార్యసిద్ధికై నిక్కఁ గనుఁడీ. ౨౨౧

చ॥ తన సుఖభంగ మం చనక ♦ తామరసాలయ యాడు దాటచే
ఘనతర కాలయోగమునఁ ♦ గాంగల యర్థము నోట శాప మీ
సునను ఘటింపఁజేసె నదిగో సురసూదను నుత్తమాంగభం
జనమున కాదికారణము ♦ సర్వసుపర్వులు మీరు వింటిరే. ౨౨౨

మ॥ కడులోభంబును మాయ సాహసము మూర్ఖత్వం బసంశుద్ధియున్
బుడమిన్ స్త్రీలకు నైజముల్ సవతితోఁ ♦ బోరాట మీతండు నా
కిడెఁగా యీ వెతకన్న బోటులకు నెంతే మేలు వైధవ్య మం
చిడెఁగా శాపము లక్ష్మి సాహసముగా దే! యెంచ దావంతయున్. ౨౨౩

—: హయగ్రీవావతారప్రశంస :—

ఆ॥ అయిన నేమి యిప్పు ♦ డంబుజాక్షుని తల, లవణవార్ధియందు ♦ లగ్నమయ్యె
సంశయింప నేల ♦ సశిరస్కుఁగాఁ జేసి, మనుపు దాన నింక ♦ మాటలేల? ౨౨౪

మ॥ సురలారా! వినుఁ డన్యకారణము నే ♦ సూచింతు దానన్ మహా
త్తర సౌఖ్యం బిక మీకుఁ గల్గును ధరన్ ♦ దైత్యాధినాథుండు దు
ర్ధర బాహాబలశాలి లోకవిజయప్రారంభధుర్యుండు దు
ష్కరశౌర్యుండు హయాననుం డనఁగ నొక్కండుం డాదికాలంబునన్. ౨౨౫

క॥ సారస్వత తీరంబున, దారుణమౌ తప మొనర్చి ♦ తడవుచు మాయా
తారకమాయాబీజా, ధారక మేకాక్షరంబు ♦ తత్పరమతియై. ౨౨౬

చ॥ మనమును బిగ్గఁబట్టి యభిమానము డుల్చి సుఖంబు మీటి యా
యనుపమ మౌ తదాకృతిని ♦ నాత్మఁదలంచి జితేంద్రియుండు భో
జన రహితుండునై విజన ♦ సంశ్రియుఁ డౌచు సహస్రవర్షముల్
ఘనతప మాచరించె నది ♦ గానఁ బ్రసన్నత మేను గాంచితిన్. ౨౨౭

ఉ॥ ఓ సురలార! వాఁడు మది ♦ నుంచిన యాకృతిఁదాల్చి నేను నా
యాసురనాథు చెంగట మృగాధిపవాహననై ప్రసన్ననై
గాసిల నేల లెమ్ము మదిఁ ♦ గాంక్షిత మెయ్యది చెప్పు మన్న ను
ద్భాసిత వక్త్రుఁడై స్వకరపంకజముల్ ముకుళించి మ్రొక్కుచున్. ౨౨౮

క॥ జేజే మాయారూపిణి, జేజే జయభరణకరణ ♦ శిక్షణ కర్త్రీ
జేజే భక్తానుగ్రహి, జేజే పురుషార్థదాత్రి! ♦ జేజే ధాత్రీ! ౨౨౯

ఆ॥ తత్త్వపంచకంబు ∘ తత్తదింద్రియములు, తద్గుణంబులెల్లఁ ∘ దల్లి నీవు
నీవు గాదె జగము ∘ నిఖిలమ్ము సర్వాంత, రస్థ వీవు తత్పదస్థ వీవు. ౨౮౦

ఉత్సాహము॥ కావుకావు మనుచు నేడ్వఁ ∘ గాచుఁ దల్లి పిల్లలన్
గావుకావు మంటి నన్నుఁ ∘ గావుమో మహేశ్వరీ!
ప్రోవులై సురల్ నుతింపఁ ∘ బోయి వారివైరులన్
జేవులై పడంగఁగోసి ∘ ప్రేమఁ బ్రోతు వంబికా. ౨౮౧

శా॥ నన్నుం గావు మటన్న మెచ్చి యనుమానం బేల యిత్తున్ వరం
బన్నన్ నిత్యతఁ గోరెఁ గోరినను నేఁ నల్లేల సిద్ధించు సం
పన్నుండౌ నినుఁ బోలు శాత్రవునిచేఁ ∘ బ్రాపించుఁ బంచత్వ మం
చు న్నేఁ బల్కితి సంతసించె, దనుజేశుం డద్భుతోత్సాహుఁడై. ౨౮౨

క॥ పుట్టువు గిట్టుటకొఱకే, గిట్టుట పుట్టువున కగును ∘ గృత మిది ధరలో
నిట్టట్టు తొలఁగ నేరదు, నెట్టన దైవంబుచేత ∘ నియతియె యనుచున్. ౨౮౩

వ॥ అని పలికి హయగ్రీవునిచే నితనికిఁ బంచత్వం బయ్యెడునని తలంచి యంతర్ధానంబు నందిన. ౨౮౪

మ॥ బలవంతుం డయి రాక్షసాధిపుఁడు దుస్సాధ్యాచంబున్ మానులన్
గలయన్ బాధలు పెట్టుచున్ సురుల నిష్కారుణ్యుఁడై యేచుచున్
జలమున్ జేవయు నీసునున్ గలిగి దోశ్శౌర్యంబు రెట్టింప స
ర్వలయోల్లాసము చెందినాఁడు గలఁడే ∘ వానిన్ హతున్ జేయఁగాన్. ౨౮౫

క॥ లోకత్రితయములో న,స్తోకపరాక్రముఁడు వాఁడు ∘ తురగముఖుండై
యో కొలఁదిని హరి వానిన్, జేకొని మర్దింపఁగలఁడు ∘ సిద్ధము వినుఁడీ. ౨౮౬

—. విష్ణువు కబంధమునకు హయగ్రీవము నతుకుట .—

ఉ॥ వేగమె విశ్వకర్మఁ బిలిపించి తదుద్యమ శక్తిచే జయో
ద్యోగము గాంచుఁ డన్న సురలొక్కటఁ ద్వష్టను బిల్వ నంపి నీ
వే గతి శౌరి కంఠమున ∘ నిప్పుడె యశ్వశిరంబుఁ దార్పఁగా
భోగిశయానుఁ డుద్దవిడిఁ ∘ బోయి హయాననుఁ దైత్యుఁ జంపెడున్. ౨౮౭

క॥ మనమెల్ల సుఖింతుము నీ, వనుమానము దక్కి చేయుమా యనియన్నన్
ఘనుఁడతఁడు శౌరిగళమున, నునిచెన్ ఘోటకముఖంబు నురుతర శక్తిన్. ౨౮౮

మ॥ నిదురన్ జెందినవాఁడు లేచినగతిన్ ∘ నీరేరుహాక్షుండు మై
విదలన్ నిక్కుచు లేచి చుట్టుఁగొని గుంపుల్ కూడు వేల్పుంగమిన్
సదయోత్సాహత మీర లేమి పనికై ∘ సంఘీకృతిన్ జెంది నా
రిది దెల్పుం డన దేవతల్ పలికిరో ∘ శ్రీశా? మమున్ గావవే. ౨౮౯

క॥ తురగాననుండు మము సం,గరముల నిర్జించి చటులగర్వాంధుండై
తిరుగం జొచ్చెం వానిం, ఖరనందకధారి! శిరము ఖండింపు మనన్. ౨౯౦

సీ॥ అమరేంద్రులార! నాకదియెంత పని మీరు, నిస్సంశయంబుగా నిలువుఁడింకఁ
జనివానిం దునిమి నేం జనుదెంతు నని మహా, సంరంభజృంభితాస్తంభహస్త
శుంభన్మహాస్తంభ గంభీర మగు ఖడ్గ, మంచితంబుగ ఝళిపించికొనుచు
సత్వరంబుగ నేగి జలరాశిం జొచ్చి య, త్తటిఘోరదానవాధమునిం దునిమి

గీ॥ యెల్లలోకంబులకు వేడ్క యుల్లసిల్ల, సురలు స్వస్థానవాసులై పరిఢవిల్ల
హరి హయగ్రీవ విక్రమం బతిశయిల్ల, మెఱసె వింటిరె మునులార! మీరలెల్ల.

శా॥ మాయాశక్తి చరిత్రమై సఫలమై మాంగల్య మూలంబునై
యీ యాఖ్యానము విన్నవారలకు సర్వేష్టప్రదానంబులన్
జేయంజాలుచు భవ్యమై పఠనచే క్షేమప్రదంబై తుదిన్
శ్రేయఃప్రాప్తికరంబునై వెలయు నిస్సీమప్రకాశోన్నతిన్. ౨౯౨

—॥ మధుకైటభోత్పత్తి ॥—

చ॥ అన విని శౌనకాదిమును లాస్తత సూతునిఁజూచి పల్కి రో
యనఘ! కథాప్రసంగసముదాహృతిమై మధుకైటభామిషా
శనయుగళీచరిత్రము ప్రశంస యొనర్చితి వారి శౌరి యే
యనువునఁ దునిమెనో ప్రళయ మందుఁగఁ గారణ మెట్టు గల్గెనో. ౨౯౩

సీ॥ పంచసహస్రాబ్ద పరిమితకాలంబు, నాహవం బొనరించె నచ్యుతుండు
నని చెప్పితివి వార లతిబలవంతులు, నగుట కేమి కతంబొ యమరులకును
దుర్జయు లంటివి తొడరుట యెట్టులో, తద్భవం బెట్టులో తచ్చరిత్ర
వినఁగోరుచున్నాము విధివశంబున భవ, త్సంయోగ మిచ్చోట సంభవించె

గీ॥ సర్వవిజ్ఞాని వీవు సజ్జనుల సన్నిధాన మమృతంబు మూర్ఖ సంస్థాన మవని
విషసమం బని వేదోక్తి వెలయు నీదు, సన్నిధి సుధారసాస్వాదసమముగాదె.

క॥ సదసజ్జ్ఞానము పశువుల, కొదవదు విషయానుభవమహోద్యమ మసదే
మదనోత్సవ నిద్రాదులు, వదలవు మోక్షంబుగలదె? పశుతతి కెందున్. ౨౯౪

వ॥ అదియునుంగాక పతంగభుజంగాదులు కొన్ని తిర్యక్కులైనను శ్రవణ సౌఖ్యం
బభిలషించుఁ దత్సుఖం బెఱుంగని మానవులు చతుష్పాదంబులు గొఱంతయే
గాని పశువులని పలుకం బడరే? హృషీకపంచకంబున నేత్రశ్రోత్రంబులు
ముఖ్యంబులు. నేత్రంబులు చిత్తరంజన మాత్రంబులు. శ్రోత్రంబులు నందు

ముఖ్యంబులు. శ్రోత్రంబులు తద్గుణంబులయ్యును బరవస్తువిజ్ఞానసంధాన పాత్రంబులుగదా! యట్టి శ్రవణంబు సత్వరజస్తమోభేదంబునఁ ద్రివిధంబు. వేద వేదాంతార్థంబు సాత్త్వికం బుత్తమంబు. కావ్యాదివిజ్ఞానంబు రాజసంబు మధ్యమంబు. పరదోష ప్రకాశకం బయిన యుద్ధవార్తాదికంబు తామసం బధమంబు. అందు సాత్త్వికంబు త్రివిధంబై స్వోక్త సిద్ధాంత పరిశ్రమంబు పరసిద్ధాంత పరిజ్ఞాన కుతూహలంబు బౌద్ధ చార్వాకముఖరాద్ధాంతలోలుపత్వంబు నను తెఱంగుల బ్రవర్తించు. మఱియు స్వీయా వారయోషా నవోఢా నాయికా వృత్తాంత శ్రవణరూపంబయ్యును బ్రవర్తిల్లు రాజసం బేకరూపంబు, తామసంబును ద్రివిధంబై యుత్తమ మధ్యమాధమ భేదంబున నాతతాయి సహవాసంబును, దాండవాది లోలతయును, గలహవివాదాదికౌతుకంబును నను రీతి బొసంగు. బుద్ధి ప్రవర్ధనంబును బుణ్యంబును బాపప్రణాశంబును నగుట నుత్తమ సాత్వికంబు గావునఁ బురాణకథాశ్రవణం బపేక్షించితిమి. బాదరాయణముఖోద్గీర్ణం బగు నట్టి ప్రకారంబున. ౨౯౬

—॰ మధుకైటభులు పాలసంద్రములోఁ దివురుట ॰—

గీ॥ అయ్యుదంతంబు విశదోక్తి ◊ నానతిమ్ము, వినఁగఁ గోరితి మన్న నా ◊ వృత్త మాను పూర్వికంబుగ సూతుఁ డప్పుడమి వేల్పు, వేల్పుదొరలకు నిట్లని ◊ వెల్లడించె.

సీ॥ యుగరాజమగుకృత◊యుగమాదియగునాల్గు, యుగములుగలయం◊గొక్కయుగము
నగు నివి వేమాఱు◊లైన నల్వకు దినం, బగు నంత నిశియగు ◊ నట్టివేళ
నాతండు నిద్రించు ◊ నంత నేకార్ణవం, బగు ముజ్జగంబులు ◊ నఖిలజంతు
విలయంబు సంధిల్లు ◊ విష్ణుండు ఫణితల్ప, శాయి యాచు సముద్ర ◊ సలిలమునను

గీ॥ నిదురఁ జెందిన యవ్వేళ ◊ నీరజాక్షు, కర్ణముల జాతు లగుచు ని◊క్కైటభుండు
మధు వనెడు దైత్యు లురుభుజా◊మదమహోగ్ర,భీకరాకారులగుచు ని◊ర్భీతులగుచు.

ఆ॥ ఇచ్ఛవచ్చినటుల ◊ నేకార్ణవంబు మ,ధ్యంబునందుఁ గ్రీడ◊లాడుకొనుచుఁ
గర్వరంబు నంటఁ◊గా మహాకాయులై, యింత నంత నెందు ◊ నెదురు లేక. ౨౯౭

ఉ॥ అన్నయుఁ దమ్ము లిర్వురు జ◊లాంతరసీమఁ జరించుచుండ్ మదా
భ్యున్నతి నొక్కచో నిలిచి ◊ యొండొరు లీ జలరాశిఁబొంగి యీ
యున్న తెఱంగిదేమి? భువి◊నొక్కటఁ గారణ కార్యముల్ సమా
సన్నములౌఁగదా విడిచి ◊ సంస్తుతి నందునె నొక్కఁడేనియున్. ౩౦౦

క॥ ఆధేయ మెల్ల భువిలో, నాధారముఁబట్టి యుండు ◊ నాధారం బౌ
యాధేయము విడువదు గద, యాధారాధేయభావ ◊ మది యెట్టిదొకో. ౩౦౧

ఉ॥ ఇజ్జల మెందు నిల్చెనొకొ ౹ యెవ్వఁడు దీని సృజించెనొక్కొ య
స్మజ్జననం బదెట్టిదొకొ ౹ మజ్జనకుం డెవఁడొక్కొ సంశయం
బిజ్జగతిన్ దెరల్పఁగను ౹ నెవ్వఁడొ చూచినయంతవట్టు వా
ర్మజ్జన మందె లోకము సమాహిత వృత్తి నెఱుంగఁగాఁ దగున్. 30౨

—॥ మధుకైటభులు తపంబు సేయుట ॥—

క॥ ఏవంవిధమానస చింతావిలులై యన్నదమ్ము ౹ లహరహమును సం
భావింప లేకయున్నెడఁ, దా వెనుకొని తమ్ముఁ డనియెఁ ౹ దన యగ్రజునిన్. 303

శా॥ అన్నా! యీ ప్రళయార్ణవంబున నొకింతైనన్ శ్రమన్ జెందక
చ్ఛిన్నంబౌ దృఢశక్తినిల్చుట మహాశ్చిత్రంబె? దేవీకృపా
భ్యున్నత్యం బని లోఁదలంపుము జలం ౹ బాధేయమై యుంటయున్
దన్నీరంధ్రమహాతిరేకమయపాత్రంబందె యం చెంచుమీ. 30౪

కం॥ నా విని మధుండు మెచ్చుచుఁ, గేవలనిశ్చయము దెల్పి ౹ కృతకృత్యత సం
భావించితి వని యనఁగా, ద్యోవీథిన్ వాగ్భవంబు ౹ దోఁచెన్ నుడివై. 30౫

శా॥ సద్యస్సంవృత మైన వాగ్భవము నిష్ఠన్ డెందమం దుంచి వా
రుద్యద్భక్తిఁ బఠింపఁ దామసి స్వరూపోద్యుక్తిఁ గల్పించి తా
విద్యుద్దీప్తి నడంగినన్ గని మహావీరుల్ నభోవీథిచే
నుద్బోధించిన పల్కు మంత్ర మని లో ౹ నూహించి నిష్ఠాత్ములై. 30౬

క॥ తోడనె సగుణాకృతి దివిఁ, గ్రీడించుచు సురలు మునులుఁ ౹ గీర్తింపఁగఁ దో
డ్తోడనె యదృశ్యయై చనె, నేఁడాదిగఁ దపము సేత ౹ నిశ్చయ మనుచున్. 30౭

శా॥ ఆహారంబు పరిత్యజించి విషయవ్యాపారముల్ మాని సం
దేహం బించుక లేక తన్మయతచే ౹ దేహాభిమానాదులం
దీహల్ లేక సహస్రవర్షములు సూర్యేందుస్థితాలోకులై
మోహస్నేహవిషాదహీనతఁ దపంబున్ జేసి రుగ్రాకృతిన్. 30౮

మ॥ కరుణావారిధి యా జగజ్జనని సింహగం బెక్కి దేవావళుల్
పరివేష్టించి నుతింప వారి యెదుటన్ ౹ బ్రత్యక్షమై యో నిశా
చరులారా! త్వదభీష్టమెద్ది? కొనుఁడీ ౹ సాన్నిధ్యమున్ జెందితిన్
బరితుష్టాత్మక నైతి వాంఛితము సంప్రాప్తించుఁ గొం కేటికిన్. 30౯

సీ॥ అని పల్కు పరదేవి ౹ యంభోద గంభీర, సంరంభ వాగ్జృంభ ౹ ఝుంకృతులను
నంతర్ముఖంబులై ౹ యణఁగియున్న హృషీక,విజ్ఞానముల్ బయల్ ౹ వెడలి యెదుట
సాక్షాత్కరించిన ౹ జననిపైఁ దెలియంగఁ, దెలివొంది లేచి చేతులు మొగిడ్చి
పరమపావని మమ్ముఁ ౹ బాలింపవే యని, [illegible] వేడి సద్భక్తి యుక్తిఁ

గీ॥ బ్రహ్మనుతియొనరించి స్వేచ్ఛామయశరణముమాకు, వరముగానిచ్చికరుణింపనలయుఁజుమ్ము
శరణ మర్థించితిమి నీదు చరణపద్మ, శరణులము గాన మా కోర్కెనెఱపు మనిన.

—॰ మధుకైటభులు బ్రహ్మను గనుంగొనుట ॰—

ఆ॥ అట్లు చేసి దేవి యంతర్ధి నొందినఁ, దొల్లియట్లు దైత్యు లుల్లసిల్లి
కల్పవార్ధి యెల్లఁ గలయంగఁ దిరుగుచోఁ, గానుపించె నొక్క కడ విధాత. ౩౧౧

ఉ॥ అంబుజగర్భుఁ జూచి ప్రళయార్ణవమం దితఁ డెవ్వఁ డొక్క పు
ల్లాంబుజమధ్యసీమ నొకఁడై శయనించినవాఁడుగాన వీ
నిం బరికింపఁగావలయు నిశ్చయ మం చని డాయ నేగి నీ
వంబుచరుండవై యొకఁడ వాత్మ భయంపడకుండ నేటికిన్. ౩౧౨

సీ॥ నిర్భీతుఁడవుపోలె నీ వున్నవాఁడవు, మాకు సంగర మిమ్ము మఱల మిందు
నెడసేయఁ బనిలే దొకింతయు బలములే, దేనియుఁ దొలఁగు మీ విందు జగతి
వీరభాగ్యంబైన విమలపీఠంబునఁ, గాతరులకు నుండు కతముగలదె?
వేవేగఁ బీఠంబు విడువు దుర్బలుఁడవై, యిట్టి సింహాసనం బెక్కుటేల?

గీ॥ యనినఁ జింతానిమగ్నుఁడై యబ్జగర్భుఁ, డేమి చేయుదు బలవంతు లిద్దురాత్ము
లిట్టియెడ నొంటిఁ బరికించి రీ విపత్తి, కంధి దాటింప నెవ్వండు గలఁడు మాకు.

గీ॥ సమతచే నాహవము చేయఁగజాలఁ డేని, సామదానాద్యుపాయముల్ సలుపవలయు
భేదనోపాయ మొండు నిర్భీకులైన, వారియెడల విచారింప వలయు ధరణి.

మ॥ బలమా చాలదు దండమున్ గొనఁగ నిష్పాపాత్ములన్ సామగా
థలచేఁ జొన్పఁగఁ జాల దానమున కా దైత్యుల్ సిరుల్ లేవె ని
శ్చలతన్ భేదము చేయఁగా వలయు నిస్సందేహ మంచున్ మదిన్
గలయం జూచుచుఁ గార్యమెంచి విధి తత్కల్పాంతపాథోనిధిన్. ౩౧౫

ఉ॥ శేషశయానుఁడై నిదురఁ జెందు జనార్దను మేలుకొల్పి ని
శ్శేషము నీ యుదంతమును జెప్పి హరిం గొనితెచ్చు నంత నీ
దోషులచే వెతల్ తొలఁగు దోర్బలశాలి మదీయ రక్షణా
శేషమనస్కు నవ్విభునిఁ జేరక నీ వెతదీఱ దింతయున్. ౩౧౬

క॥ హరిశరణం బని మనమునఁ, బరికించి తదీయచరణపంకేరుహముల్
నిరతిశయభక్తిఁ బెనఁగొన, సరసిజగర్భుండు తలఁచి సంస్తుతిచేసెన్. ౩౧౭

## —• శ్రీ హ రి స్తో త్ర ము •—

సీ॥ నారాయణా! జగన్నాథ! దీనావనా!, భక్తార్తిహర! జగద్భరణధుర్య!
విష్ణో! హరీ! చక్రి! వేదసంస్తుత! యోగ, నిద్రాసమాసక్త! నిత్యసత్య!
వాసుదేవ! దయాబ్ధి! వనజలోచన! సర్వ, శక్తిసమన్విత! సర్వరక్ష!
సర్వజ్ఞ! సర్వేశ! సర్వాంతరస్థ! దు,ష్టారినాశన! హృషీకాధినాథ
గీ॥ మమ్ముఁ గరుణించి నిద్దుర లెమ్ము లెమ్ము, దైత్యు లిర్వురు మర్దింపఁ దలఁచినారు
సర్వరక్షాకరుండవై సంకటమునఁ,బడిన నన్ని ట్లుపేక్షింపఁ బాడి యగునె? ౩౦౮

ఆ॥ కరణ భరణ హరణ కారణ! నిర్గుణ, పుణ్యనామ! నిఖిల పూర్ణ ధామ!
పాలనంబు నీకుఁ బరమధర్మం బని, నమ్మినాఁడ నో యనాథనాథ! ౩౦౯

చం॥ స్తుతిశత మిట్లు చేసిన సుషుప్తిఁ దొలంగక నిద్దురించు నా
దితిసుతవైరిఁ గాంచి కడు దీనత నొంది హిరణ్యగర్భుఁ డ
ప్రతిహతమౌ విషాదమునఁ బాయని చింత మునింగి యేలొకో
యితఁ డతినిద్ర మేల్కనఁ డిఁ కెద్ది యుపాయ మొ యంచు నెంచుచున్. ౩౧౦

గీ॥ యోగనిద్రాసమాసక్తి నున్నవాఁడు, చేతనుం డయ్యు హరి యి ట్లచేతనత్వ
మొంది నిష్ప్రాణిచేష్టల నొందినట్టు,లార్తి మొఱఁగంగ లేఁ డయ్యె నని తలంచి.

శా॥ నిద్రాసక్తి వశీకృతుం డగుచు నిన్నీ రేజనేత్రుండు మ
ద్భద్రస్తోత్రములన్ వినండు జగదంబామాయచే సర్వమున్
నిద్రాముద్రితమౌట వింతయొకో వర్ణింపంగ దైత్యద్విష
న్నిద్రాదుల్ సకలంబు తద్వశత నాశ్రూఢిన్ బ్రవర్తించుఁగా. ౩౧౧

క॥ ప్రాకృతజనుపోలిక హరి, యీ కరణిన్ నిదురఁ జెంద నితరులగతి నే
నే కోలఁది లెక్కసేయుదు, నాకుఁ దరంబౌనె? తలఁప నానాస్తుతులన్. ౩౧౩

మ॥ స్ఫుటనిద్రావశుఁ డైన యీ హరిని సంబోధింప నా కౌనె దు
ర్ఘటనాచాతురిచే జగత్త్రయము సంకల్పించు నిద్రామయిన్
బటుమాయామయి సన్నుతించినఁ దగన్ బద్మాక్షుఁడున్ లేచు సం
కటముల్ పాయు నటంచు దేవిని నుతుల్ గావించె నిద్రాకృతిన్. ౩౧౪

## —• యో గ ని ద్రా స్తు తి •—

మ॥ నిరతోత్సాహముచేఁ జరాచరము నిర్ణిద్రప్రభావాఢ్యమై
కర మొప్పన్ విరచించినా వనుచు నేఁ గంటిన్ గదా కాని దే
ని రమానాథుఁడు నిద్రచే వివశుఁడై నీ యాజ్ఞకున్ జిక్కె నే
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ! ౩౧౫

మ॥ హరి నీ మాయకు లొంగి నిద్రవివశుండై యుండ మూఢుండ ని
న్నరయన్ జాలనివాఁడ నేను బరులేలా వేఱె చెప్పంగ నీ
కరణిన్ వేదవిదుల్ వచింతురు మహాగాథంబు నీ మాయ యీ
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౨౬

మ॥ పురుషాధీనత నుండు నా ప్రకృతినిన్ భూమండలిన్ జేతనా
విరహవ్యక్తికిఁ బల్కుచుందురు బుధుల్ వేయేల నీ వల్లయై
కరుణాహీనత నున్న దానవు సమగ్రప్రాభవమ్ బూని యీ
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౨౭

మ॥ వరుసన్ సంధ్యల ముమ్మరున్ బుధులు సద్భక్తిన్ నినున్ గొల్వరే
పరు లెవ్వారలు కర్తృతన్ గని జగదాధారంబు పూనంగ స
త్వరతన్ దీనుఁడనైన నన్నుఁ గని యార్తత్రాణ పారీణవై
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౨౮

మ॥ నరులం దెల్లెడ బుద్ధివై కమలవై నానాగుణోద్భూతివై
వరసంధాయినివై యశో ధృతి మతి ప్రాగల్భ్య సంధాత్రివై
స్థిరకాంతిప్రదవై చెలంగుదువు మద్క్షేమంబు నీ కొప్పదే
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౨౯

మ॥ భరమౌ దుఃఖము నల్వ చెందఁగలఁ డప్రామాణ్యమున్ జెంది శ్రీ
వరుఁ డీ నిద్దురఁ జెందఁ బోలుఁ గరుణావారాశివై ప్రోతు వ
స్థిరచిత్తంబున నన్నుఁ బ్రోచుటకు నీ చిత్తంబు కాదేని శ్రీ
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౩౦

మ॥ ధరణిన్ వేదము వేదవేత్తలు నినున్ దర్శింప లేరన్నచోఁ
బరమార్థంబు జగత్త్రయాకరణ భావస్వచ్ఛశక్తి నీయందె సు
స్థిరమై యుండుఁగదా మదీయ సకల క్షేమార్థివై యిప్పు డీ
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౩౧

మ॥ హరుఁడున్ విష్ణువు నేను మానులు మదీయాత్మోద్భవుల్ దేవతల్
పరిపూర్ణం బగు నీ మహామహిమ నెప్పాటన్ గనన్ జాల మ
ట్టురమౌఁ గాదె త్రయీముఖోక్తు లిటులన్ బోధించు నేఁ గాదె యీ
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౩౨

మ॥ ధరణీమండలి వేదవేత్తలు మదిన్ దాత్పర్యమున్ బూని య
ధ్వరముల్ సేయుచు స్వాహ యంచు నిగమోక్తప్రక్రియన్ బల్క క

ధ్వరభాగంబు లొసంగ లేరు సుర లా భాగంబు కై సేయ రా
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ! ౩౩౩

మ॥ పరిరక్షించితి వాది మమ్ము ఖచరప్రత్యర్థు లీవేళ భీ
కరరూపంబుల న న్వధింప గతశంకన్ బైకొనన్ జూచిరే
శర ణంటిన్ శరణార్థినిన్ విడువఁగా శ్రౌతోక్తి కాదంచు మా
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ! ౩౩౪

మ॥ హరి రక్షాచణుఁ డిట్టి వేళల మదీయాయాసమున్ గాంచఁ డా
తురుఁడై నిద్దురఁజెంది తద్వశత నొందున్ గాత రక్షఃకృతో
ద్ధురబాధం బడినాఁడ నీ కృపకుఁ బాత్రుంజేయు దేగాని శ్రీ
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ! ౩౩౫

మ॥ హరిముఖ్యామరకోటి గొల్తురు భవద్వ్యామోహితుల్ సర్వతః
పరమా నీ మహిమం గనుంగొనఁగ నెవ్వా రింతకున్ సాక్షి ని
ద్దురచే నీ హరి బద్ధుఁడౌ టెఱుఁగ రెంతో వింత నీమాయ శ్రీ
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ! ౩౩౬

మ॥ సరసీజాలయయున్ భవద్వశుని నీ చక్రిన్ బ్రబోధింప లే
కరుదా నిద్దురఁజెందెఁ దానును మదీయాలాప మాలింప నె
వ్వరు దీనార్తికి దైవమే గతిగదా! పల్మాట లింకేల? యీ
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ! ౩౩౭

మ॥ పరదైవాళిఁ బరిత్యజించి మది నిన్ భావించి సేవింతు రె
వ్వరు వారేగద ధన్యు లెల్లెడ మనోవాంఛార్థ సంసిద్ధికిన్
సురధేనుస్థితి నీవు గల్గఁ బరకాంక్షల్ వ్యర్థ లౌ టబ్రమే
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ! ౩౩౮

మ॥ సరసీజాక్షునిఁబాసి యెం దరిగెనో శాంతిక్షమాశ్రీయశ
స్స్థిరతాదుల్ భవదాజ్ఞచే నితఁడు బందీభూతుఁడై యుండుటన్
గర మొక్కింతయుఁ గాన రా కరిగె నాఁ గా యెంత యాశ్చర్య మో
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ! ౩౩౯

మ॥ ధరణీవార్ముఖ తత్త్వసంఘము భవత్పాదాగ్రరేణూద్భవం
బరయంగా నటు లయ్యు సర్వము పరార్థాయత్తమై తోఁచు నీ
ధరలో స్వార్థ మొకొండు గల్గునె? పరార్థంబై నటించున్ గదా
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ! ౩౪౦

మ॥ ధరణీభృద్ధరు నాదికల్పమున నుద్యల్లీలఁ గల్పించి భూ
భరణం బెల్లను దద్వశం బగుటకై కపాల్వెట్టి నే డయ్యయో
కరుణన్ మాలితి వీశ్వరీచ్ఛలకు శంకల్ గల్గునే? యెయ్యెడన్
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౪౧

మ॥ పరమానందము నొంది నన్నుఁ గనుచున్ బాలించుచున్ గొన్ని వ
త్సరముల్ వైచి కృతాపరాధి నని సంత్రాసింపఁగాఁ జూచితో
చరణాజీవుఁడఁగాని నేర మొక లేశంబైన నన్నంట దీ
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౪౨

మ॥ సారిదిన్ గానఁగనయ్యె నీ హృదయ మిచ్చో నే త్రిలోకీ పరం
పర లెల్లన్ గలిగించి వీని మఱలన్ మాయింపఁగాఁ జూచితో
సరిగా నన్నటు లిచ్చగించితివి యిచ్ఛామాత్రమే సర్వమున్
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౪౩

మ॥ మరణాద్భవభీతి నా మదిని గ్రమ్మన్ లేదు పుట్టించి న
న్నిరవొందించి విడంగఁ జూచు నయశం బీ వొందుదో యంచు నే
నిరతాంతర్వ్యథఁ గుందినాఁడను జుమీ నీ చిత్తమె ట్లున్నదో
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ! ౩౪౪

మ॥ కరపాదోగ్రభయంకరాకృతిని ఖడ్గం బూని లెమ్మింకఁ గ
ర్బురయుగ్మచ్ఛిద యో? మదీయ ఖిద యో రోషించి గావించు మం
తర మే మున్నది సర్వమున్ సమమె యైనన్ జెంత నే చేరితిన్
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ? ౩౪౫

## విష్ణువు మేలుకొనుట

కం॥ ఏవంవిధవాచార్భటి,చే విన్నప మాచరించు శ్రీపతి తనయున్
గావ సమకట్టి కేశవు, బోవిడిచి తొలంగె నిద్ర భువనావనమై. ౩౪౬

ఆ॥ యోగనిద్ర తన్ను నుజ్జగించిన హరి, మేలుకొనియె నల్వ మేలుకొనియె
నదియెకాదు జగము లన్నియు ముదముతో, మేలుకొనియె సిరులుజాలుకొనియె.

## శక్తిస్వరూపకథనము

శా॥ ఆ పౌరాణిక సత్తమోక్తి విని మోహాయత్తులై మౌను లో
హో పల్కుల్ వినఁజోద్యమో మదికి నే యుక్తిన్ సమర్థింప వి
ప్పాపం బెన్నఁడు వీనులన్ వినము సర్వద్రష్టవై పల్కుచో
నీ పట్లన్ సటలంచు నెంచఁదగునే యెంతో విచిత్రం బగున్. ౩౪౭

ఆ॥ చాల సందియంబు ఽ సంధిల్లె బ్రహ్మయు, హరియు రుద్రుఁ డబ్జ ఽ జాండమునను
నధికు లింతకన్న ఽ నన్యంబు లేదు వీ,రాదిపురుషు లనుచు ఽ ననిరి బుధులు.

కం॥ వరుసన్ సృజింపఁగా విధి, భరణంబున నచ్యుతుండు ఽ ప్రళయంబుల సం
హారణ మొనర్పఁగ రుద్రుఁడు, పరు లెవ్వరు వేఱలేరు ఽ పరతత్త్వంబుల్. ౩౫౦

శా॥ ఏకాకారము మూఁడురూపములచే ఽ నిచ్ఛానురూపంబుగా
జోకన్ గ్రీడ లొనర్చు బ్రహ్మను రజఃస్ఫూర్తుల్ తమస్ఫూర్తు లా
శ్రీకంఠున్ బ్రకటించు సాత్త్వికము లక్ష్మీనాథుఁ బ్రాపించు న
స్తోకప్రౌఢిమ స్వస్వకార్యముల నుద్యుక్తుల్ కడున్ మువ్వురున్. ౩౫౧

సీ॥ వారిలో నధికుండు ఽ వనజాక్షుఁ డాదిమ, దేవుండు పరముండు ఽ తీర్థమూర్తి
సర్వక్రియలకెల్ల ఽ సాక్షాత్సమర్థుండు, వేఱొక్కఁ డధికుండు ఽ వెదక లేఁడు
నిఖిలేశ్వరుఁడు యోగఽనిద్రచే వివశుఁడై, యస్వతంత్రత నుండెఽననుచు వింటి
మట్టి సర్వేశ్వరుం ఽ డప్రాకృతుండు, ప్రాకృతజీవుపోల్కి నిద్రింప నేల?

గీ॥ నమ్మహామహు విజ్ఞాన ఽ మడఁగు టెట్టు, లెంత సందేహమో మది ఽ కిమ్మడించెఁ
బరమపురుషుని నిదురలోఁ ఽ బడఁగఁ జేయు, శక్తి యేదొకో యెచ్చోటఽసంభవంబొ!

సీ॥ ఆదిమై సృష్టికి ఽ నంతమై యెవ్వాఁడు, మూలకారణ మౌచు ఽ లీలఁ దనరు
నే దేవుఁ డఖిలలోఽకేశుండు పరమాత్మ, సచ్చిదానందుండు ఽ సర్వకర్త
సర్వసంశ్రయసీమ ఽ సర్వగుం డజరుండు, శుచిపరానందుండు ఽ శ్రుతివిధాయి
పరతంత్రుఁడై బంధఽపరవశుఁడై యుంట, యద్భుతంబై తోఁచెఽనయ్య మాకు

గీ॥ సందియం బెల్ల నడఁగించి ఽ సకలభువన,మాతయైనట్టి పరదేవి ఽ మహిమఁ దెలిపి
మమ్ముఁ గృతకృత్యులుగఁ జేయుఽమార్గమెల్ల,భవదధీనంబు సూత! వాఽగ్భవసమేత!

క॥ అని పల్క సూతుఁ డిట్లను, మునులారా! సందియంబు ఽ ముజ్జగములలో
మునులకు సురలకుఁ గల దిది, యనుమానము దీర్తు వినుఁడు ఽ వ్యాసకృపాప్తిన్.

క॥ నారద కపిలాదులు నీ, పారము దెలియంగలేరు ఽ బహుగూఢము ని
స్సారోక్తుల భ్రమపడి యున్నారు గురూక్తులను దెలిసినాను నిజమ్మున్.

శా॥ సందేహం బిది దుస్తరంబు సవిమర్శన్ జేసి భేదింప న
స్పందప్రౌఢిమ వేదవాదులు ధరన్ ఽ సర్వేశ్వరుం డంచు వే
దాందోళక్రమపద్ధతుల్ భువనబృందాధీశుఁ డద్దేవుఁ డం
చుం దా రర్చలు చేయుచుందురు మనఃస్ఫూర్తిన్ దృఢోల్లాసులై. ౩౫౬

చ॥ అటువలెఁ గొంద ఱాగమపరాయణులై నిఖిలేశ్వరుండు ప్ర
స్ఫుట నిగమాంతగోచరుఁడు [illegible] కల్పనా

పటుఁడు త్రిలోచనుం డజుఁడు ✻ పంచముఖుం డని నమ్మి యాతనిన్
జటుల సపర్యలన్ దనిపి ✻ శాశ్వతమౌ పథ మొందుచుం డ్రిలన్. 　３౫౭

ఉ॥ కొందఱు వేదవేత్తలవికుంఠితులై హరిదశ్వపూజనా
స్పందమతిన్ ద్రికాలము నుపాసనఁ జేయుచు వేదశాస్త్ర వా
గ్వందితుఁడున్ బరాత్పరుఁ డఖండమహోమయ మూర్తి యంచు లో
నందియముల్ దొలంగి సువచస్తుతిఁ జేసి భజింతు రెప్పుడున్. 　３౫౮

చం॥ జ్వలనుఁ డటంచుఁ గొందఱును ✻ శకుఁ డటంచును గొంద ఱట్టులే
జలనిధినాథుఁ గొందఱును ✻ శాశ్వతమౌ పద మిచ్చుఁ గోరి పూ
జలఁ దనివొందఁ జేయుచు విశారదులై నిగమార్థపద్ధతుల్
పలుకుచు వాదులన్ గెలిచి ✻ ప్రస్తుతి గాంచుచునుందు రుర్విలన్. 　３౫౯

సీ॥ దేవదేవుఁడు వాసుదేవుఁ డచ్యుతుఁడు జనార్దనుం డఖిలేశుఁ ✻ డవ్యయుండు
పంచవక్త్రుఁడు పరాత్పరుఁ డర్ధనారీశుఁ, డీశ్వరుం డఖిలభూతేశ్వరుండు
భానుఁ డంతర్జ్యోతి ✻ పరమాత్మ సర్వ ప్రకాశుఁ డర్కుఁడు చిదాకాశమూర్తి
పావకుం డఖిలత్రయీవస్తు వామ్నాయ, వేద్యుండు యాగసంవిద్విధాత

గీ॥ యింద్రవరుణాదులును ద్రిలోకేశ్వరులు ద,లంప బహుళప్రవాహమై పెంపుగనిన
గంగపోలిక సర్వదేశాంగమగుచు, వేదరాశి ప్రవర్తించు ✻ వివిధగతుల. 　３౬౦

సీ॥ మహిని బ్రత్యక్షానుమానశబ్దంబులు, ముఖ్యప్రమాణముల్ ✻ మూఁడటంచుఁ
బలికిరి కొందఱు ✻ పండితు లుపమాన, సహితంబులై చతుస్సంఖ్యఁ గొనిరి
కొంద ఱర్థాపత్తిఁ ✻ గూడ నై దనిరి కొం,దఱు సప్తసంఖ్యఁ గొందఱు వచించి
రీ ప్రమాణములచే ✻ నేమియు బ్రహ్మంబు, దుర్జ్ఞేయమైయుండుఁ ✻ దొటు పడక

గీ॥ నిశ్చయాత్మక యుక్తిచే ✻ నిర్ణయించి, శిష్టమార్గానుసారవిశిష్టవృత్తి
స్వస్వరూపాపరోక్ష సాక్షాత్కృతులను, దేశికులు బ్రహ్మవిజ్ఞప్తి తెలియవలయు.

సీ॥ నలినాసనుని సృష్టి ✻ జలజాక్షు పాలన, శూలిసంహారంబు ✻ సూర్యదీప్తి
క్షితిచక్రి కచ్ఛప ✻ శేషాదికిటులందు, ధారణ పావకు ✻ దహనశక్తి
పృషదశ్వునెడఁ గల్గు ✻ ప్రేరణ జంగమ, స్థావరంబుల తృష్ణ ✻ సర్వమెల్ల
శక్తిరూపము కదా ✻ శక్తిహీనంబైనఁ, గదలుట మెదలుట ✻ కలదె? యెందుఁ

గీ॥ గుండలిని లేనిచో మేల్మికొండ వింటి,సామి తృణమైనఁ గదలింపఁ ✻ జాలునొక్కొ
శక్తిహీనుఁడు తినుటకు ✻ జయముఁగొనఁగ, నడవఁజాలుదు రనుట యేనాటగలదె?

## —• శక్తి మహిమము •—

కం॥ ఈ విధమున బ్రహ్మాది, స్థావర పర్యంతమైన ✻ జగమున శక్తి
ప్రావీణ్య విరహితంబుగ, నే వస్తువుగలదె? బుద్ధినెఱుఁగుఁడు మీరల్. 　３౬３

సీ॥ సత్వగుణోద్రిక్త ఽ శక్తిహీనుండైన, బాలింపఁ గలఁడె విశ్వంభరుండు
రాజసీశక్తి విభాజమానుఁడుగాక, పుట్టింపనేరఁ డంబుజభవుండు
తామసీశక్తి సంధానమ్ము లేకున్న, భంజింపఁగలఁడె మృత్యుంజయుండు
అదిగాన శక్తియే ఽ యఖిలంబు గల్పింప, రక్షింప శిక్షింప ఽ దక్షయగును

ఆ॥ బ్రహ్మ హరియు హరుఁడు ఽ పావకుం డర్కుఁడు, వరుణ శక్ర ముఖులు ఽ వారివారి
కార్యకరణములను ఽ గర్తలే యమ్మహా, శక్తివలనఁగాదె ఽ సర్వమగుట. ౩౬౪

గీ॥ అమ్మహాశక్తి ద్వివిధమై ఽ యలరు సగుణ, నిర్గుణ యనంగ వారిలో ఽ నిర్గుణార్చ
నము విరాగులు చేయుదు ఽ రమలభోగ, చిత్తులగువారు సగుణ నర్చింతురెలమి.

మ॥ పురుషార్థంబులు నాలుగింటికిని దాఁ ఽ బుట్టిల్లుగా నిల్చి యె
వ్వరు చిత్తంబున నెద్దిగోరుదురొ తద్వాంఛారతుల్ దీర్చి యె
ల్లరకున్ బ్రాప్యము దానయై శుభదలీలాలోలమై సర్వసం
భరణారూఢి వసించు నెల్లెడ మహామాయానుభావంబునన్. ౩౬౬

సీ॥ ఆ మహాదేవి మాయాప్రభావంబున, శుద్ధపరిజ్ఞానశూన్యు లగుచుఁ
దత్త్వమెఱుంగరు ఽ ధరఁగొంద ఱెఱిఁగియుఁ, నెఱుఁగనివారలై ఽ యెల్లదిశలఁ
బండితమ్మన్యులై ఽ పాషండవర్తన, భ్రమను గావింతురు ఽ భ్రాంతమతుల
బహుభేదబోధల ఽ పాలయి చెడుదురు, కలిమూఢులై జనుల్ ఽ కలుషమతుల

గీ॥ వెదకిచూచిన నిలమీఁద ఽ వేదబాహ్య, వర్తనమెకాని పరమార్థ ఽ వర్తనమున
నిలువనొక్కఁడు లేఁడు నిర్ణిద్రమైన, యప్పరాశక్తిమాయ యేమనఁగఁగలము!

చం॥ హరిహరులున్ విరించియును ఽ నాదిమకాలమునందు నిల్చి దు
ర్భర తప మాచరించిరి యభంగుర యజ్ఞములన్ యజించి య
ప్పరమ సనాతనిన్ బరమపావని బ్రహ్మముగా నెఱింగి రి
ద్ధరణిని ముక్తికాంక్షులకుఁ ఽ దద్భజనంబె నిధాన మింతకున్. ౩౬౮

ఆ॥ ఏను వ్యాసువలన ఽ నెఱిఁగితి నారదు,వలన నతఁడు దెలిసె ఽ వనజగర్భు
వలన నతఁడు గనియె ఽ వాసుదేవునిచేత, నజుఁడుగనియె నీ యుదంతమెల్ల.

చం॥ ఇతర కథా ప్రసంగముల ఽ నేమి ప్రయోజన మెల్ల వారికిన్
సతతము భక్తి సేవ్యయగు ఽ సర్వచరాచర భూతకోటులం
దతులిత శక్తిహీన మగు ఽ నట్టి తెఱంగులు గంటిరే కదా
సతతము శక్తిమంతులకు ఽ సర్వము హస్తగతంబు చూడఁగన్. ౩౭౦

కం॥ అనుషంగ వశంబున నో, మునులారా ! యీ చరిత్రములు నుడివితి న
వ్వనజాక్షు విడిచి తామసి, ఘనపదమున నిలిచె శౌరి ఽ కన్నులు విచ్చెన్. ౩౭౧

ఉ॥ కన్నులు విచ్చిచూచి తన కట్టెదుటన్ భయభీతుఁడై మహా
పన్నునిఁ బోలె మేన్వణఁకఁ బ్రాంజలియై వినుతించుచున్న బ్ర
హ్మన్నలినాంబకుండుగని యభ్రగభీరనినాదవాక్కులన్
మన్ననచేసి పల్కె ననుమానము దీఱఁగ స్మేరవక్త్రుఁడై. ౩౨౨

ఉ॥ ఏమిటి కిందువచ్చితి విధీ కేది ప్రయోజన మేల యీ యెదన్
మోము విచారదైన్యమున మున్గినయట్టులు గాననయ్యె నో
తామరసాసనా! భవ దుదంతము తెల్పుము నిర్వికారమౌ
నీ మది వ్యాకులస్థితి గనన్ గద సందియమేల యింతకున్? ౩౨౩

మ॥ అనినన్ బద్మభవుండు పల్కె వినుమో యబ్జాక్ష మీలో నెఱుం
గని యర్థంబులు గల్గునే జగములం గావంగఁ బాల్పడ్డ దే
వునిగా నిన్ను నెఱింగివచ్చితిని నన్బ్రోవంగ నీవేకదా
విను మా వృత్తము దెల్పెదన్ ఘనకృపావిర్భావ భావుండవై. ౩౨౪

కం॥ మధుపానమత్తు లగుచున్, మధుకైటభు లనెడి కర్ణమలజులు దితిజుల్
ప్రథనమున నన్ను నోర్వఁగ, విధివశమునఁ దారసిలిరి వీరోద్భటులై. ౩౨౫

ఉ॥ రమ్మని నన్నుఁ బిల్చిన దురమ్ముల దుర్బల వృత్తివాఁడ బీ
రమ్మొకయింత లేక విధురమ్మగు చిత్తముతోడ దుష్టనై
రమ్మని భీతినొంది సుకరమ్మని నీ శరణంబు గోరి దూ
రమ్మని చూడకే సుఖకరమ్మని నీ చరణంబుఁ జేరితిన్. ౩౨౬

కం॥ రక్షకులులేని వారల, రక్షింపఁగఁ గర్త వీవె రక్షోభీతున్
రక్షింపు ముపేక్షింప క,ధోక్షజ! యన మెచ్చి హరి సుతునితో ననియెన్. ౩౨౭

## —॰ మధుకైటభ యుద్ధము ॰—

క॥ ఇచ్చోట నిలువు మభయం, బిచ్చితి మధుకైటభుల వధించెద వారల్
పెచ్చుపెరిగి నా యెదుటికి, వచ్చిరి హతమగుట నిజము వలదిఁక వెఱవన్. ౩౨౮

మ॥ అనునంతన్ దితిజాధముల్ నలువ నయ్యైచోటులన్ రోయుచున్
గని యొక్కింత భయంబులేక యిచటన్ గన్గొన్మ భీతుండవై
చనితో యంచు మహోదకంబున మనస్త్రాసం బొకింతైన లే
కనుమానింపక పైపయింగవిసి మాద్యద్దంతియుగ్మం బనన్. ౩౨౯

గీ॥ ఎందుదాగితివో పోయి యింతవట్టు, సంగరం బిమ్ము శార్ఙ్గి చూడంగ నిన్నుఁ
ద్రుంచి యాతనిఁబదపడి త్రుంచువార, మటులు గాకున్న దాసుండనై తిననుము.

ఉ॥ అప్పురుషోక్తులన్ విని జనార్దనుఁ డోఖలులార! యెట్టులున్
దప్పదు మీకు నావలనఁ దథ్యము మారణ మంచుఁ బల్కఁగన్
నిప్పులు రాలఁగా మధుఁడు నిష్ఠురవృత్తి భుజంబులెత్తి ని
న్నిప్పుడె బాహుయుద్ధమున నేఁ బడఁద్రోయుదు నంచుఁ దార్కొనన్. ౩౮౧

కం॥ కరికరి గిరిగిరి గవిసిన, కరణిని యుద్ధంబు హరియుఁ గ్రవ్యాదుండున్
బరిపరి విధములఁబోరఁగ, గరమలయుచు మధుఁడు వెనుకకు కాల్వేయంగన్.

ఉ॥ కైటభుఁ డంతఁ దారసిలి కంజవిలోచను తోడుతన్ నిరా
ఘాటము యుద్ధమున్ సలిపెఁ గ్రమ్మర వాఁ డలయన్ మధుండునున్
మాటికి మాటి కొండొరులు మార్చుచుఁ బోరఁగ నైదువేల యేం
డ్లోటమిలేక వారు హరియున్ దితిజుల్ దగఁ బోరుచుండఁగాన్. ౩౮౩

చం॥ హరి కడు నొచ్చి చింతిలుచు నక్కట వీరు మదాంధవృత్తి సం
గర మొనరింపఁజొచ్చిరి యకంపనులై గెలువంగరాదు వీ
రరయ నవధ్యులైన తెఱఁగయ్యెడు మేనలయంగఁ జొచ్చె నా
తురత పొసంగెఁ జిత్తమునఁ దొట్రుపడెన్ గరపాదయుగ్మముల్. ౩౮౪

ఉ॥ ఇంత బలంబు దప్పుటకు నేదియొ కారణ మెన్నిమార్లు దు
ర్దాంతుల రాక్షసాధములఁ దప్పక యాజులఁ గూల్పలేదు వీ
రెంత బలాఢ్యులో జగతి నిట్టి విచిత్ర మెఱుంగనంచు లోఁ
జింతిలు వేళ నద్దితిజశేఖరు లిట్టులు పల్కి రుద్ధతిన్. ౩౮౫

చం॥ కడు నలపొంది నీవు తడగాల్ పడియుంటివి దోసిలొగ్గినన్
విడువుఁడు దాసుఁడన్ భవదనిందిత విక్రమశక్తి కోటమిన్
బడితి నటంటి వేని విడువారము బీరము గల్గెనేని ని
ప్పుడ నిను నాజిఁ ద్రుంచి యొక పోటున నబ్జజుఁ ద్రుంతు మన్నచో. ౩౮౬

కం॥ తన్నిశిచరవాక్యము విని, వెన్నుఁడు దాఁబల్కె మీరు వీరులైనన్
వెన్నార్చి పోరఁదగునే, యెన్నం డిటువంటిపోరు లెఱుఁగము ధరణిన్. ౩౮౭

మ॥ అరివీరుం డెదిరించి నిల్చునెడ బాహాప్రౌఢిమన్ జూపుచున్
మరణంబో? గెలుపొక్కొ? రెండుగనుటల్ మర్యాద శూరాళికిన్
బరి భీతిన్ గని మార్చిమార్చి సమరప్రాగల్భ్యముల్ చూపుటల్
ధర మెప్పౌ నొకో? యట్లుగాన వినుఁడీ ధర్మం బొకం డియ్యెడన్. ౩౮౮

కం॥ అలసినవానిన్ భయమునఁ, దొలఁగినవానిన్ శరంబు దొఱఁగినవానిన్
గలఁగినవానిన్ బాలున్, గలయుదురే? వీరులెందుఁ గలరే యిట్టుల్. ౩౮౯

గీ॥ పంచవర్ష సహస్రముల్ - ప్రబలబాహు, బలసమేతులతోడను - బ్రథన మేను
జేసి యలసితి నొక్కింత - సేపు విశ్రమించి మీతోడఁ బోరంగ - మేలుగాన.

ఉ॥ ఇయ్యెడ మీరలున్ దగ నొకించుక విశ్రమ మొందుఁడన్న వా
రొయ్యన విశ్వసించి యొక - యోరఁ దొలంగిన మాధవుండు దాఁ
గయ్యములోన వారు బలగర్వితులౌటకుఁ గారణంబు న
ష్షయ్యవరప్రభావ ఫలసాధ్యముగా నెఱిఁగెన్ మనోగతిన్. ౩౯౧

కం॥ ఇచ్ఛాకటాక్ష సంచిత, మిచ్ఛామరణంబు వీరి - కిటులౌటఁ గదా
యిచ్ఛాశక్తియె నాయెడ, నిచ్ఛారతిఁ దజ్జయంబు - నిచ్చునటంచున్. ౩౯౨

వ॥ కృతనిశ్చయుండై భక్తాభీష్టప్రదాయిని యగు నిచ్ఛాశక్తిన్ డెందంబునం దలంచి యో జగజ్జననీ! యిట్టి యాపత్సమయంబున భవచ్చరణంబె శరణం బని పల్కి భవత్ప్రసన్నతాహీను లగు నరులకు నభీష్టంబు లొనఁగూడ నేరవు గదా యని కరణత్రయైక భావంబులన్ దలంచుచుఁ గరపంకజంబులు శిరంబున ఘటింపుచు నమస్కృతి యొనర్చు నవసరంబున నభోమధ్యంబున సవాహ సపరివారయై పొడ గట్టి నిలిచిన, ౩౯౩

ఉ॥ అంబర మధ్యమంబున ముకుందుఁ డాయెడ యోగనిద్ర నొ
ప్పం బరికించి చూచి కరపంకజముల్ ముకుళించి దేవి! యో
యంబ! కృపాకటాక్షమున - నారయు మంచు వచించి దైత్యనా
శం బెదఁగోరి భక్తియెయి - శాంకరి నిట్లు నుతించె భక్తితోన్. ౩౯౪

ఉ॥ దండము భుక్తిముక్తిదకు - దండము చండికి దండ మంబకున్
దండము సృష్టిసంహరణ - దక్షకు దండ మనాదిసంస్థకున్
దండము దేవదేవికిని - దండము మాయకు దండ మిచ్ఛకున్
దండము యోగనిద్రకును - దండము భక్తదయాసముద్రికున్. ౩౯౫

చ॥ సగుణమొ నిర్గుణంబొ పరశక్తి! త్వదాకృతి నే నెఱుంగ నీ
జగతి నపారమై ఖచరసన్నుతమై నిగమ ప్రసిద్ధమై
నెగడు చరిత్ర మెట్లు గననేర్తును నా కనుభూతమయ్యె నో
భగవతి! నీదు నిద్దురకుఁ - బాల్పడి యెద్దియుఁ గానకుండుటన్. ౩౯౬

సీ॥ యోగనిద్ర మునింగియున్నచో నలువ బోధించినఁ గుంచి తేంద్రియుఁడ నగుచు
నీకు వశుండనై - నిశ్చేతనుండనై, యుండియు నీ కృపాయుక్తివలన
మేల్కని పోరాడి - మేటి రక్కసులతో, నలసి బెగ్గిల్లితి - నమ్మ, వారు
వరబల గర్వితుల్ - మరణ మిచ్ఛాధీన, మగుటచే గెలువ నే - యనువు లేదు

గీ॥ నలువ మర్దించి యామీఁద । నన్నడంపఁ, జాలియున్నారటంచు నే । శరణమంటి
నెట్టిసాహాయ్యమునమమ్ము । నేలుకొనెదొ, యోగహృదయాంబుజోన్నిద్ర । యోగనిద్ర!

చం॥ స్తుతిశత మిట్లుచేయు మురసూదను హాసముఖారవిందమై
యితఁ డతిభీతుఁడై బెగడి । యీవె సుమీ శరణం బటంచు న
న్నతులిత భక్తి వేఁడుచు దయారస ముప్పతిలంగఁ జేసె న
ద్దితిజజయం బొసంగెద నతిస్ఫుట మన్మహిమానుభావతన్. ౩౯౮

కం॥ అని నిర్ణయించి శార్ఙ్గిన్, గనుఁగొని యెప్పటి విధమునఁ । గలహింపుము నే
నని వారల భ్రమ కొల్పెదఁ, జను మాజికి నచట నీకు । జయమౌను హరీ! ౩౯౯

చం॥ వరబల మొందినార మని । వారు మహోన్నతి నిన్ను గెల్వఁగాఁ
దర మెఱుఁగంగలేక యటు । తారసమైరి మదీయ దృష్టి సం
గరమున వక్రితన్ గనిన । కాలమునన్ హతు లౌదు రింక నీ
వరుగుము భీతినొందకయె । యాహవమున్ గొను మన్న శౌరియున్. ౪౦౦

## — విష్ణువు యోగమాయాప్రభావమును గనుఁగొనుట —

కం॥ ప్రేమరసాన్వితమగు దేవీ మధురాలాప సమితి । విని విష్ణుఁడు సం
గ్రామతలంబున నిలుచుచు, నా మధుకైటభులఁ బిలిచె । నాహవమునకున్. ౪౦౧

మ॥ విని దైత్యాంతకు మాట రక్కసులు దోర్వీర్యం బవార్యంబుగా
జనవాక్యంబు జయాజయంబులకు నెంచన్ దైవమే దిక్కటం
చనఁగా విందుము తొల్లి దైత్యులు మహాయాసంబునన్ జెంది యీ
తనిచే నొచ్చిరి యీతఁ డిప్పుడు మదౌద్ధత్యంబుచే నొచ్చెఁగా. ౪౦౨

కం॥ సబలుఁడు దైవబలంబున, నబలుండై పోవుటరుదె? । యబలుఁడు విధిచే
సబలుండౌ టబ్రంబొకో, సబలుఁడు దుర్బలుఁడు విధికి । సములౌదురుగా. ౪౦౩

ఉ॥ శూరులు పోరికిన్ బిలుచుచో వెనుదీయుట పాడిగాదు దై
త్యారి రణంబునన్ నిలిచి । యార్భటి చేయుచు నున్నవాఁడు మ
ద్ఘోరశనిప్రఘాతములఁ । ద్రుప్పు సడల్చెద మంచు ఘోరసిం
హారవముల్ చెలంగ సమరావని నొంచిరి శౌరి ముష్టులన్. ౪౦౪

శా॥ అన్యోన్యంబు నిబద్ధయుద్ధులయి దైత్యారాతియున్ రక్కసుల్
మన్యుజ్వాలలు నభ్రచంచలలునా । మండన్ రణాశాదృతో
దన్యత్వంబునఁ బోర ఘోరమగు నౌద్ధత్యంబు సప్తార్ణవీ
జన్యోత్తుంగ తరంగ ఘుంఘుమ నవష్టంభించె నొక్కుమ్మడిన్. ౪౦౫

లయవిభాతి:— అడుగులను దప్పకయ ౯ నడనుడిని ఝుంకృతిని
బెడిదములుగా వడిని ౯ బిడుగులను పోల్కిన్
బిడికిళుల పోటులను ౯ నెడనెడను మొత్తుచును
దడఁబడక యిర్వురును ౯ సుడిఁబడయ కేఁచన్
వెడవెడను నార్పులును ౯ వెడలఁగను బైపయిని
నడరు బలురక్కసుల ౯ యడపులను జెందన్
జిడిముడిపడన్ మఱియు ౯ బడలికల నొందుచును
గడిమిని జెలంగఁగను ౯ దొడఁబడిరి యంతన్. ౩౦౮

కం॥ చేయునది లేక యుంట స,హాయంబుగ నున్న దేవి ౯ యాననమున యు
ద్ధాయాసదీనదృష్టుల, నా మెడఁ బ్రసరింపఁజేసె ౯ హరి యా లోనన్. ౪౦౭

—॥ శ్రీ మాయాదేవి మధుకైటభులను వంచించుట ॥—

మ॥ అరవిందాక్షుఁడు దీనుఁడై తనదు వక్త్రాంభోజమున్ జూచి యా
తురుఁడై యుండుటెఱింగి నవ్వుచును దోర్దర్పోఁ గామినీ లీలచే
సరసాలోకన చాతురిన్ దితిజులన్ ౯ సంగ్రామసీమన్ గనన్
దరుణీ దర్శన లాలసత్వమున నద్దైత్యాధముల్ కాములై. ౪౦౮

ఉ॥ చక్కని మోముఁ జూచుచును ౯ సారసుధాధర మానఁ గోరుచున్
జెక్కులు నొక్కఁగా మనసుఁ ౯ జేర్చుచుఁ గామశరాభిఘాతులై
దక్కఁ గొనంగఁ గల్గునొకొ ౯ తన్వి నటంచునె మోహబద్ధులై
రక్కసు లాజికౌతుకభరమ్ముల నించుక యోరసిల్లిరన్. ౪౦౯

మ॥ కరుణాశాలినియై జగజ్జనని నన్నోగావన్ దలంచెన్ నిశా
చరు లద్దేవి చికీర్షితం బెఱుఁగ కచ్చంబౌ మనోభ్రాంతిచే
స్మరపీడావశులైరి యుద్ధమునఁ బ్రాల్మాలన్ మదిన్ జేర్చి నా
రు రహిన్ వీరల మాయఁ జేయుటకు నేర్పున్ గంటినం చామెడన్. ౪౧౦

ఉ॥ వారలఁ జూచి యో దితిజవంశశిఖామణులార! పోరులం
దారయ మిమ్ముఁ బోలిన మహాబలు లెవ్వరు లేరు మీ విధిన్
ఘోరరణాగ్రసీమల నకుంఠితవిక్రమ శక్తి నిల్వ నె
వ్వారికి శక్యమా భువనవంద్యము గాదె! భవత్ప్రకర్షముల్. ౪౧౧

ఉ॥ ఎందఱితోడ నాహవము ౯ నే నొనరింపను దైత్యకోటి వా
రందఱు మద్భుజాయుగ పరాక్రమ శక్తికి నొచ్చి పర్చియున్

ప్రమందరె చీరికిఁ గొనరు ♦ నన్ను భవద్భుజశక్తి మెచ్చితిఁ
గందరు కుంద రిప్పటికిఁ ♦ గావున మీకు నభీష్ట మిచ్చెదన్. ౪౧౩

ఉ॥ కొంచక కోరుఁడీ వర మహాకుంతల వైఖరి నిత్తు నా మన
శ్చంచలతన్ సరోజముఖి ♦ సన్నిధియాటను సాభిమానులై
వంచనమం చెఱుంగమిని ♦ వారది యేటికి నిచ్చువారికిన్
గొంచెపుఁ గార్య మేల మముఁ ♦ గోరిన నెద్దియు నీ కొసంగమే ? ౪౧౩

ఉ॥ అర్థుల మైతి మేని నిను ♦ నర్థము వేడుదు మెట్టి యర్థముల్
సార్థక లీల నీ కొసఁగఁ ♦ జాలినవారము నీదు శక్తి య
త్యర్థము మెచ్చువచ్చెను మహాదాహవరంగమునన్ దొలంగఁ బ్రి
త్యర్థిని వాజ తర్పణ మహా సుబలుండవుగానఁ గేశవా! ౪౧౪

— విష్ణువు మధుకైటభులను వారిమరణమును గుఱించి యాచించుట —

గీ॥ ఎంత దుష్కరమైన మే ♦ మిచ్చువార, మడుగు మీ కోర్కె యెట్టిదో ♦ యనుడు దంభ
కుంభివరదుండు యాచించుకొనఁదలంచి, యర్థి పోలిక వారల ♦ యండఁజేరి.

ఉ॥ దానవ వంశభూషణు లుదాత్త చరిత్రులు సత్యభాషణుల్
గాన మదీయ వాంఛిత మొకం డది గోరుదు “మీర లిర్వురున్
మానక నాకు వధ్యు లగు ♦ మాట సుమీ”! యదియే వర మ్మటం
చా నలినాంబకుం డడుగ ♦ నబ్బుర మొందుచు దానవోత్తముల్. ౪౧౬

ఉ॥ వంచన చేసె నీతఁడని ♦ వారలు నెమ్మది శోకతప్తులై
మించెను గార్య సంగతి భ్రమింపఁగఁ జేసెను దైవ మంచు నొ
క్కించుక సేపు చింతిలుచు ♦ నిచ్చితి మిచ్చితి మాత్మ శుద్ధిగాఁ
గాంచఁగ నిర్జల స్థలినిఁ ♦ గట్టుము మమ్మని బెట్టు చూపిరన్. ౪౧౭

గీ॥ అంబుజాక్షుండు తనయూరు ♦ వబ్ధిపలిల, పీఠిఁ గలయంగ నెల్లెడఁ ♦ బెంచి యందు
నిర్జలస్థలి నిర్వురు ♦ నిల్వుఁడనిన, మాట కొడఁబడి దైత్యు లహమ్మాడ్కి నిలువ.

— మధుకైటభుల మరణము —

మ॥ తలఁచెన్ విష్ణుఁ డవక్రవిక్రమకళాసుధారేయుడై తేయ దో
ర్బల విధ్వంసన కార్య నిర్వహణ శుంభత్ప్రౌఢిమావక్రిమున్
బ్రళయాంభోధర చంచలా శత సహస్ర ప్రౌఢ గాఢ ప్రభా
విలయాభావకరస్వదీధితివృతోర్వీచక్రమున్ జక్రమున్. ౪౧౮

గీ॥ అంతలోనన సప్తార్ణ * వైక్యసమయ, చండకరమండ లోదగ్ర * చక్రధార
దైత్యశిరములు దఱుగంగ * దదలఁచునంత, నూపులలమంగఁ బెంచిరి * యొడలులపుడు.

చ॥ తనువులు వారు పెంప హరి * తప్పక యూపులు పెంప నంబుధుల్
ఘనపథముల్ దిగంతములు * గ్రిమ్మఁగ నద్భుతలీలఁ జక్రిమ్ముఁ
బెనఁగొని కంఠముల్ చిదుమ * విస్తృతమై మెద డెల్ల నిండ మే
దిని యను నామమయ్యె జగ * తీ జగతీస్థలి కద్భుతంబుగాఁ. ౪౨౧

కం॥ అప్పిశితాశన పలలము, కుప్పలు తిప్పలుగఁ బడుటఁ * గుతలమునందుఁ
జెప్పుదురు గాదె బుధతతి, యెప్పటికిని మన్నుఁదినుట * హేయంబుగదా. ౪౨౨

ఉ॥ తాపసులార! వింటి రొకో * దైవమె యంతకు మూల మంచు ని
చ్ఛాపరతంత్రమై, జగము * సర్వము వర్తిలు సర్వరక్షకుం
డై పరతత్త్వమైన హరి * యంత శ్రమంపడి దేవి సత్కృపన్
జూపినఁ గాదె గెల్చె నిది * చోద్యమొకో పరశక్తి శక్తికిన్. ౪౨౩

శా॥ అంతర్వాణులు శాస్త్రవాదములచే * నారాధ్యమై సర్వ వే
దాంతార్థ స్తవనీయమైన యఖిలాండాధీశి దేవిన్ దయా
స్వాంతన్ లోన గుణద్వయోచిత విలాసవ్యూహగా నెంచి ని
శ్చింతన్ బూజ యొనర్పఁగా వలయు సంసేవ్యంబు గాదొం డిలన్. ౪౨౪

—॥ వ్యాసునకు హరుండు ప్రత్యక్ష మగుట ॥—

కం॥ అని యివ్విధ మంత్రయు విని, మునివర్యులు సూతుఁ జూచి * ముదమున శుకునిన్
దనయుఁగను వ్యాసుఁ డెట్టులు, గనియెను వినిపింపు మిట్టి * కథ విశదముగాన్. ౪౨౫

—॥ వ్యాసకృత తపంబు ॥—

ఉ॥ నారదుఁ గాంచి సత్యవతి * నందనుఁ డీ యమరాళిలోన నె
వ్వారలు సత్వరంబుగఁ దపఃఫల మిచ్చెదరన్న నాతఁ డ
వ్వారిజగర్భ కేశవుల * వైఖరిఁ జెప్పి తదర్థ సార మొ
ప్పారఁగ "శక్తి" యంచని యథార్థముగా వివరించె సత్కృపన్. ౪౨౬

కం॥ ఏకాక్షర మంత్రం బస్తోకము వాగ్బీజ మర్థితోఁ గొని యో సు
శ్లోకా! జపింపుమని యం, చీ క్రోలఁదిని, జెప్పి యాతఁ డేగె నిజేచ్ఛన్. ౪౨౭

ఉ॥ హాటక శైల శృంగమున * నంతట సత్యవతీసుతుండు ఘో
రాటవిలో వసించి జగదంబిక నెమ్మది నిల్పి బాహ్య జం

ఝూటము లెల్ల మాని సుతసంభవవాంఛ శతాబ్దముల్ సము
త్పాటిత కాముఁడై తపము పావనుఁడై యొనరించె నయ్యెడన్. ౪౨౮

ఆ॥ పంచతత్త్వ వీర్య బలసమగ్రుండైన, పట్టెఁ గౌరి పవనభక్షి యగుచు
సర్వపూజ్య యనుచు శాంకరి మదిఁ గౌరి, తప మొనర్చె జగము తల్లడింప.

ఉ॥ అందు వసించునట్టి యమరావళియున్ మునులున్ వనౌకసుల్
కొందఱు వేగ నేగి సురకుంజర సత్యవతీసుతుండుని
ష్పంద తపంబుచేయుచు నభంగురవృత్తి వసించినాఁడు మే
మందఱమున్ దపించితిమి యాతని ఘోర తపోగ్నికీలలన్. ౪౩౦

గీ॥ అమ్మహామాని జడలెల్ల నగ్నికీల, లనఁగ నరుణంబు లయ్యె మీ యమలకర్ణి
కార వనమధ్యమున నుండెఁ గాన మేము, విన్నవించితి మన్న నా విబుధవరుఁడు.

మ॥ దెసలెల్లన్ వెలిగించు నమ్ముని మహాతేజంబు లక్షించి సా
ధ్వసమున్ జెంది శచీవరుండు గిరిజాభర్తన్ గనుంగొంచుఁ దా
నసకృద్వాక్కుల పాహి పాహి యనుచున్ హస్తద్వయిన్ మోడ్చుచు
న్న సురాధీశునిఁ గాంచి శంభుఁడు మహానందమ్ముతో నిట్లనున్. ౪౩౨

శా॥ ఏలా శోకము నిర్జరేంద్ర! మును నెంతే నిష్ఠచే నాత్మలోఁ
జాలన్ నాకయి చేయుచుందురు తపశ్చర్యల్ భవద్భోగముల్
మేలెవ్వారికిఁ బుత్రి కాముకత నెమ్మిన్ నిల్చినాఁ డీతఁ డీ
వాలోచింపఁగ నేల వేగఁజను మింద్రా! నీవు నీ యింటికిన్. ౪౩౩

ఆ॥ వెఱపుఁదీర్చి యింద్రు విబుధవాసముఁ జేర్చి, బాదరాయణుండు బడలినాఁడు
తపమువలన ననుచుఁ దలపోసి హరుఁడు ప్ర, త్యక్షమయ్యె నతని తపము మెచ్చి.

కం॥ లెమ్మా! ద్వైపాయన! చే, కొమ్మా సుతు నిత్తు నీకుఁ గొమరుఁడు విజ్ఞా
నమ్మునఁ దేజమ్మున విన, యమ్మున ఘనుఁడౌ జగత్త్రయంబున వినుమా. ౪౩౫

శా॥ అమ్మాటల్ విని బాదరాయణుఁడు సాష్టాంగంబు గావించి, మో
ద మ్మెంతో హృదయమ్ముఁ గ్రమ్మఁగ సుధాధారానుసారస్థితిన్
జెమ్మల్ గ్రమ్మెడు హర్షవార్షరము నిస్సీమంబుఁ గావింపఁ జి
త్తమ్మాలోకనపారవశ్యమును జెందన్ బ్రార్థనల్ సేయుచున్. ౪౩౬

వ॥ ఆ సమయంబున మహాదేవు ననుజ్ఞన్ గైకొని స్వాశ్రమంబునన్ బ్రవేశించి కతిపయ దినంబులు జరిగినన్ బదంపడి యధ్వరం బొనర్చు తలంపున సకలలోకోపకరణ సంపాదన సావధానుండై తాపస వర్గంబులఁ గూడంగట్టి యాగశాలామధ్యంబున నగ్నిమథనంబు చేయునెడ. ౪౩౭

గీ॥ అమ్మహాత్ముని చిత్తమ్ము సగ్రిమ్ముకొనుచు, నిరత సంతాపహేతువై నివ్వటిలుచు
నొక్క చింతాభరం బప్పు డుద్భవించె, సర్వమును దైవకృత మాట సంశయించె.

ఉ॥ ఏమొకొ సర్వమున్ మిథునమేకద ముజ్జగమెంచ జాతవే
దో మథనంబునన్ నిజము దోఁచును నట్టులుగాని దేని ను
ద్దామ గుణాన్వితుండు శిఖి తద్దయు నందనుఁడై జనించు గా
దే మహి మంథనారణులు నిట్టులు స్త్రీపురుషానుబంధముల్. ౪౩౯

మ॥ తనయోద్భూతికి సానుకూల్యమును సంధానింప మద్వాంఛకై
ఘన పుత్రారణి సత్కులోద్భవ సమగ్ర స్వచ్ఛ సౌందర్య యౌ
వన సంపన్న పతివ్రతామణియు నా వామాక్షి యెట్లబ్బునో
వనవాసంబున జీర్ణులౌ మునుల కీ వాంఛల్ దగన్ దీఱునే! ౪౪౦

ఆ॥ నిర్వికారుఁడైన నీలకంఠుండును, గాంత యనెడు తొట్రఁ గట్టఁబడఁడె
యెట్లు దొరకు నాకు నిట్టి గార్హస్థ్యంబు, దుర్ఘటంబటంచు దోఁచె నిపుడు. ౪౪౧

శా॥ సంకల్పాదులయందు ధర్మమగు నీ జ్యావహ్ని రక్షాదులా
శంకన్ జెందక యుండు నాశ్రమ నివాసస్వార్థతన్ గూర్చునే
వంకన్ జూచినఁ గామ మీఁదనగుగా వాల్గంటి యం చాత్మ మీ
నాంక ప్రేరణ నొంది తచ్ఛరశతవ్యాలీఢ చేతస్కుఁడై. ౪౪౨

— • వ్యాసుఁడు ఘృతాచిని జూచుట • —

శా॥ చిత్తంబు త్తల మెందు నత్తటి ఘృతాచీ నామయౌ కాంత యు
ద్యత్తారుణ్య రసాభిజృంభిత వపుస్సౌందర్యయై కన్పడన్
మత్తేభేంద్ర సమానయానఁ గనియెన్ మానీంద్రుఁ డచ్చోట ను
ద్యత్తేజోమతి సంచలించు నెడఁ జింతాక్రాంతుఁడై యాత్మలోన్. ౪౪౩

కం॥ ధర్మోత్తమ మగు నధ్వర, కర్మాచరణంబు నేడె గలిగె నిఁక మన
శ్శర్మద మెట్టుల విడిచెద, మర్మవిభేదమ్ము లౌర మగువల వలపుల్. ౪౪౪

ఉ॥ ఎట్టులనైన నిత్తరుణి నించుక డాయఁగఁ జేరఁదీసి చే
పట్టెద నన్నఁ దాపసులు పక్కున నవ్వరె ? పెక్కు వర్షముల్
గట్టిగఁ జేయు నత్తపము గన్మష మొందును నిందఁ జెందు నే
మట్టుకు మీరు నీ మదను మాయకు లోఁబడఁ జాలనం చొగిన్. ౪౪౫

చ॥ అనుపమమున్ సుఖప్రదము హృన్మద మాత్మజ సౌఖ్య దాయకం
బనితర వేదనీయము గృహస్థపథంబని యెంచి యప్పురో

వనితలఁ బొందినన్ బరము | వాయదు స్వర్గ సుఖంబు గల్గు నా
మును పొకనాఁడు దేవఋషి | ముఖ్యునిచే వినియుంటి నింతయున్. ౪౪౬

గీ॥ చందమామకు మనుమండు | చక్రవర్తి, యగు పురూరవుఁడూర్వశీ | యందుఁజిక్కి
వలపు చెన్నంద నబ్బోటి | వలన దివ్య,సౌఖ్య మొందెనటంచు ని | స్సంశయముగ.

కం॥ అనుషంగవశంబున ని,ట్లని చెప్పెడు నయ్యుదంత | మాలించి మునుల్
ఘనుఁడగు పురూరవుఁడు సుర,వనితకు లోఁబడుట యెందు | వలననొ యనుచున్. ౪౪౭

శా. నీ మాటల్ సుధకన్న దివ్యరసముల్ | నింపున్ గదా ప్రేమచే
నే మెల్లన్ విని తృప్తి నొందము గదా | యెప్పట్టునన్ దేవతా
స్తోమంబుల్ సుధ త్రావి తృప్తు,లగు చొం | దున్ విందుమే నిత్యమున్
బ్రేమన్ గోరెలుచునుండరే యటుల సు | స్వామ్మా! రోమహర్షోద్భవా! ౪౪౮

గీ. ఆ మహారాజు ఋషివృత్త | మానుపూర్వి, కంబుగా వినిపింపునాఁ | గౌతుకంబు
మదిఁ జెనఁగొనంగ నిట్లనె | మానులార,వినుఁడు మద్గురుసూక్తి | నే విన్నయంత. ౪౪౯

## —• బుధోత్పత్తి •—

మ. త్రిదశాధీశునకున్ గురుండగుచు నెం | తే గౌరవం బొప్ప ది
వ్య దశాభోగధురంధరుం డగుచు స | ర్వస్తుత్య సాద్గుణ్యసం
పదవాప్తిన్ జెలువొందుచున్ గురుఁడు శుం | భల్లీల శోభిల్ల నిం
పొదవన్ దార యనంగ భార్య యగు న | య్యోషావతంసం బొగిన్. ౪౫౦

ఉ॥ చక్కని బోటులన్ మిగులఁ | జక్కనిదై తన ప్రాణనాథునిన్
దక్కఁగొనంగఁ జాలు సుమ | ధర్మవిలాసము లుప్పతిల్లఁ జె
న్నెక్కువ నాథునిన్ గలసి | మాన్యతఁ గాంచి గృహస్థ వృత్తిచేఁ
జొక్కుచుఁ జంద్రధామమును | జూడఁగ నేగెను జూచి యాశశిన్. ౪౫౧

ఉ॥ ఈ నవమోహనాంగుని ప | యింబడి కౌఁగిటఁ జేర్చి కెంపురా
మానికమున్ హసించు రుచి | మంజులమౌ నధరాధరామృతం
బానుచు మర్మముల్ చెనకి | యుబ్బురపుం బలుగుబ్బ గుత్తులన్
బూని యురమ్ము గ్రుమ్మి రతి | భోగముఁ జెందఁగఁ గల్గుటెట్లొకో? ౪౫౨

మ. అని చింతింపుచు నుండ నాతఁడు తదా | యత్తైక చిత్తంబునన్
వనితారత్నము దీనితోఁ గలయ దై | వంబెట్లు సిద్ధింప వ
చ్చునో యబ్బోటికి వశ్యుఁడౌ పురుషుఁడే | సూనాస్త్ర విద్యా రహ
స్య నిధానంబగు లేక తక్కిన నికే | ర్పేలా నాని జన్మం బిలన్. ౪౫౩

కం॥ ఇత్తెఱఁగున నన్యోన్యం, బత్తరుణియు, శిశిరకరుఁడు ♦ ననితర మోహా
యత్తము లగు చిత్తంబుల,ఁ జిత్తజభోగాభిలాషఁచే నున్నంతన్. ౫౫౫

—॥ గురుని పరితాపము ॥—

ఉ॥ కొన్నిదినంబు లిట్లుఁ జనఁ ♦ గోమలియున్ మృగలాంఛనుండు మో
హోన్నతి నిర్భరం గలసి ♦ యోడక సౌఖ్యము లొందుచుండి సం
పన్న సుఖానుభూతి నిజభాగ్యఫలంబు లభించె నంచుఁ దా
మన్నియు వీడి కామవిధి ♦ హర్షవిధానము లంది రయ్యెడన్. ౫౫౬

శా॥ కర్ణాకర్ణిక, జంద్రిగేహమున నక్కంజాక్షి కామోత్సవో
దీర్ణాంతఃకరణ ప్రధాన రస వృత్తిన్ గాపురం బుండుటల్
నిర్ణీతంబుగ సద్గురుండు విని యెంతే దుఃఖమున్ జెంది దు
ర్వర్ణాచారము పుట్టెనంచు సురగర్వ్యాంబైన చిత్తంబునన్. ౫౫౭

శా॥ అంతేవాసిని నొక్కనిన్ బిలిచి నీవజ్జారిగేహంబునన్
గాంతారత్నము తార యున్నయది యక్కంజాక్షిఁ దోతెమ్ము నా
నంతన్ వాఁడట కేగి రమ్మనినఁ జంద్రాధీనయై రామి వృ
త్తాంతంబెల్ల నెఱుంగఁజేయ గురుఁ డొయ్యన్ బంపె నింకొక్కనిన్. ౫౫౮

ఉ॥ ఆతఁడు నేగి రమ్మనిన ♦ నట్టులె చెప్పుచు రాకయున్నచో
నాతత నిగ్రహాగ్రి సముదగ్ర మహాగ్రహుఁడై గురుండు జై
వాతృక మందిరంబునకు ♦ వచ్చి శశిన్ గని పల్కె నింత దు
ర్ణీతిపరుండవై గురుని ♦ నీరజలోచనఁ దెచ్చు టేలొకో. ౫౫౯

గీ॥ సర్వలోక గురుండనై ♦ సర్వకర్తనైన నా భార్యఁదెచ్చు టన్యాయమనక
ధర్మగర్హితమైన యీ ♦ కర్మమెట్టు, లాచరించితి చంద్ర! దుర్వ్యసనసాంద్ర! ౫౬౦

కం॥ సురఁగ్రోలుట యొక్కటి భూ,సురహరణము రెండు కనకచోరత మూఁడున్
గురుదారఁ గొనుట నాలుఁగు, నరసిది దన్నెమ్రితియున్ మహాపాతకముల్. ౫౬౧

సీ॥ అతి గర్వితుఁడవై దురాచారివై మహా, పాతకం బొనరించి ♦ పాపివైతి
గురుదార భోగించి ♦ కొంటివేనియు దేవ, సదనార్హుఁడవు గావు ♦ వదలుమింక
విడువవేనియు నిన్ను ♦ విబుధేంద్రసభలోన, గురుతల్పహారుఁడనిపరిభవింతు
నని పల్కఁ గ్రోధియై ♦ యంగనావిరహియై, ఘోషించుచున్న యగ్గురునిఁజూచి

గీ॥ క్రోధఘూర్ణాయమానుఁడై కుముద సఖుఁడు, బ్రాహ్మణుండీతఁడాహవప్రౌఢి లేదు
ఏమి చేయగలండు నన్నిప్పు డనుచు, నంబుదార్భటి పోలె నిట్లనియె నంత. ౫౬౨

## —। చంద్రుని సమాచారము ।—

సీ॥ క్రోధంబు విడువు మీ క్రోధులౌ విప్రులు, శాస్త్రజ్ఞులగుచుఁ బ్రాజ్యతపహింతు
రిచ్చచే నాయింట నిప్పుడున్నది తార, రక్తి గల్గిన నందురాదె మఱల
నింతచే హాని నీకేయ్యది ప్రాపించుఁ, గామించి యిచ్చోటఁ గదలదయ్యెఁ
గొంతకాలము మీఁదఁ గూడంగఁ గలదు నీ,వికఁ జెప్పవే శాస్త్రమిట్టిదనుచుఁ

ఆ॥ గామమందుఁ గొంత గాంచదు సంతృప్తి, వేదకర్మమందు ద్విజుఁడు కనఁడు
చాన విప్రుఁడును రాజశ్చార వేదకృత్యముల శుద్ధి గొంతు రలుగనేల. ౪౬౩

మ॥ చను మన్నన్ గురుఁ డార్తినొందుచు నమర్షం బాత్మలో నాపి చ
య్యనఁ దానింటికి నేగి యొక్కెడ దుఃఖార్తిన్ గడన్ క్రోధియై జా
లని మోహాంధత శిష్యుఁ జంద్రునెడఁ జాలన్ రోషతామ్రాక్షుఁడై
చని తద్ద్వారమునందు నిల్చి పిలిచెన్ జంద్రున్ గఠోరార్భటిన్. ౪౬౪

చ॥ పిలచిన రాక యున్న నతి భీకరుఁడై గురుఁ డోరి దుష్ట! నీ
బలము చలంబుఁ జూచుకొని పల్మరు నేఁ బిలువంగ నింటిలో
పల నిలువంగఁ బాడియొకొ భామిని నిమ్ము కృతఘ్న! యీనిచో
నిల నిను భస్మమై పడఁగ నిచ్చెద శాపముఁ గొమ్ము నావుఁడున్. ౪౬౫

చ॥ ఇటు పురుషోక్తు లాడఁగ సహింపక చంద్రుఁడు లేచి వచ్చి వా
కిటఁ జిఱునవ్వు నవ్వుచు నొకించుక నిల్చి వెలంది నీను బా
మ్మిటు బహుభాషలేల తగ వీ లలితాంగికి దైవమిట్లు దు
ర్ఘటన మొనర్చెఁ "గాకి మెడఁగట్టిన బింబఫలంబుకైవడిన్". ౪౬౬

గీ॥ అఖిల లక్షణ లక్షిత యైన యట్టి, యిట్టి జవరాలు నీ కేల నెందు నేనిఁ
దగిన బోటిని గొమ్ము సుందరి యిదెట్లు, భిక్షునకు నర్హ యగు? నింక వేయునేల. ౪౬౭

క॥ రతితో నెన యనఁదగు నీ, సతి చక్కఁదనంబు కామశాస్త్రోక్తములో
నతులిత ధర్మము నెఱుఁగని, మతిహీనున కేల నిట్టి మదవతి పొందుల్. ౪౬౮

ఉ॥ ఇత్తునె నీకు నీ యబల నేటికిఁ బ్రేలఁగఁ గామపీడితుం
డెత్తిన శాపవాక్యము గణింతునె సాధ్వస మించుకైన నా
చిత్తము నందు నాటదు వచించెద నిక్కము శక్యమేని నీ
చిత్తము వచ్చినట్టులనె చేయుము మాటలు వేయునేటికిన్. ౪౬౯

క॥ నీ వలన భయము లేదిఁక, బోవలయు నటన్న దుఃఖపూరితుఁడై క్రో
ధావిల చిత్తము గవలున్, దేవేంద్రుని సభకు జేరె దీనాననుఁడై. ౪౭౦

కం॥ వచ్చిన సురగురు గనుఁగొని, యచ్చంబుగఁ బాద్య మర్ఘ్య | మాసనమిడి పు
ష్పోచ్చయ పూజ లొనర్చుచుఁ, దచ్చరణంబులకు మ్రొక్కి | తద్దయు భక్తిన్.

వ॥ కృతాంజలియై పురందరుండు గురునితో నిట్లనియె. ౪౭౩

సీ॥ నిర్జరాచార్యుని | నెమ్మోము దీనంబు, చిత్తంబు వికలమై | చెదరియున్న
దెవ్వండు నీ శక్తి | యెఱుఁగక నిరసించె, నా రాజ్యమునకును | నాకు నీవ
కర్తవై యుండుట | గనఁడొ దేవాళులు, సందీక పరిచర్య | సలుపువారు
దిక్పతుల్ నీ వారు | తివిరి బ్రహ్మాదులు, నీకు సహాయులు | నీకు నింత

గీ॥ చింత యేటికి గిరి దరి | స్థితమహాగ్రి, జాగ్రదవికుంఠకంఠీర | వాగ్రసీమఁ
జిలిపి గంతులు వేయంగ | దలఁచినాఁడు, వాఁడు దంభోళిహతిఁ బడు | వాఁడు కాఁడె?

గీ॥ సందియం బేల మీకింక | సంకటంబు, సంఘటిలఁ జేసిన కృతఘ్ను | జాడ దెల్పు
మనిన నొక్కింత లజ్జ లో | నన యడంచి, యెట్టకేలకు సురగురుం | డిట్టులనియె.

సీ॥ మసిఁబూయ నేరేడు | మాడ్కి నా యింటనే, పెక్కువిద్యలు నేర్చి | యొక్కయెడను
నా బహిఃప్రాణంబు | నలినాక్షి సుందరిఁ, దారఁ జేకొని యింట | దాగినాఁడు
పలుమాఱు నే నేగి | భార్యనిమ్మని వేడ, నెంత కృతఘ్నుఁడో | యీక తక్క
దుష్టుండు విడివడి | దుర్భాషణములాడె, నేమిచేసెదవు న | న్నింక నీవు

గీ॥ దిక్కుగల దేని నచ్చోట | దెలిపికొమ్ము, పొమ్మనుచుఁ ద్రోసె నిఁక శర | ణమ్ము నీవ
తొలఁగ ద్రోయఁగరాని యీ | దుఃఖమెల్ల, నడఁగ నా బోటి నిప్పింపు | మయ్య శక్ర.

క॥ ఇలఁ బంచమహాపాతక, ములలో గురుదార గొనుట | మొదటి యధర్మం
బలదుష్టుని శిక్షించుట, బలశాసన ధర్మమనినఁ | బలికె నతండున్. ౪౭౬

ఉ॥ కోవిదు లిట్లు మీరు మదిఁ | గుందఁగ నేటికి బుద్ధిఁ జెప్పి మో
హావిల్కుఁడైన చంద్రుని భ | యంపడఁ జేసెదఁ దారఁ దెచ్చెదన్
నా వచనంబు నమ్ము భవ | నంబున నుండుఁడు పంపఁడేని నే
దేవచమూసహస్రము ల | తిత్వర నంపెదఁ గట్టి తెచ్చెదన్. ౪౭౭

—॥ చంద్రునియొద్దకు దేవేంద్రుని దూత వెళ్లుట ॥—

కం॥ అని యూరడించి గురునకు, ననుమానముఁదీర్చి యింటి | కనిపి మహేంద్రుం
డనువైన వాని దూతం, బనిచెన్ వాఁడేగి కుముద | పతిఁ గని పల్కెన్. ౪౭౮

ఉ॥ వాసవకింకరుండ సుర | వల్లభుఁ డంపఁగ వచ్చినాఁడ నం
త్రాసము లేక మద్గురుని | దారను ముచ్చిలి తెచ్చి దుష్కృతిన్
జేసియు బోటి నీక గురు | చిత్తము నుత్తలమొంద నిందనున్
జేసితి నీతిమాలుట య | సీ! తగునే? నినువంటివానికిన్. ౪౭౯

గీ॥ మునిసభాసదుఁడై మానిముఖ్యుఁడైన, యత్రి కనుపండువుగఁ గన్నయట్టిపట్టి
విట్టి నీవిట్లు గురుదార నింటఁజేర్ప, శాస్త్రమర్యాదయే నీకుఁ జందమామ.

ఉ॥ కామినులైన యట్టి పరకాంతలఁ గాములు గోరుటొప్పు స
ర్వామరనింద్య మాను గురునాలిని దెచ్చుట పాడియయ్యె? సు
త్రామముని యానఁ గైకొని యథామతి నర్పణఁజేయు టొప్పు న
క్కామినిఁ గాదయేని నినుగాదని నే గురుపత్నిఁ దెచ్చెదన్. ౪౮౧

గీ॥ "ఆత్మవత్సర్వభూతాని" యనుట వినవొ, యిరువదెనమండ్రు గలరునీకిగురుబోండ్లు
పట్టి తెప్పింతుఁజెఱఁబట్టిభయముగలిగి, బ్రతుకుమింకొక్క వచనమేర్పడఁగవినుము.

కం॥ సురలోకము లోపల నచ్చర లెందఱు లేరు వారి సంభోగములన్
నిరతము కామము దీఱదె, గురుతల్పద్రోహి వనెడు కొఱయేమిటికిన్. ౪౮౩

కం॥ ధర్మజ్ఞులైనవార ల,ధర్మాచరణం బొనర్ప ధర నెల్లరునున్
ధర్మముఁ దప్పుదు రంతట, ధర్మములు నశించు నిది యధర్మంబు సుమీ. ౪౮౪

కం॥ కావున గురువరు తరుణిన్, నీ విప్పుడ విడువవలయు నిష్కారణ మీ
దేవగురు తోడఁ గలహము, గావింపఁగనేల దేశికద్రోహమునన్. ౪౮౫

చ॥ పలికెడువాఁడు దూత యను భావముఁ దాల్పకు మంబుజారి! నే
డల బలశాసనుం డనుచు నాత్మఁదలంపు మటంచు దూత దాఁ
బలుకఁగ రోహిణీవిభుఁ డభంగుర రోషశిఖాసముజ్జ్వల
జ్జ్వలనము వోలె మండిపడి చయ్యన నిట్టులు పల్కె వానితోన్ ౪౮౬

మ॥ శత యజ్ఞంబులఁ జేసినాఁ డతని సాక్షాత్స్వర్గలోకేశ్వర
స్థితి దీపించె నటంచు నేఁడెఱిగితిన్ దెల్లంబుగా నిప్పురో
హితుఁడున్ నీవును నొక్కరూప యని యీరేడు జగంబుల్ గనున్
మతు లూహింపఁగ నొక్క పోలిక గదా మాటాడ నింకేటికిన్ ౪౮౭

క॥ పరులకు నుపదేశింపన్, గురులెందఱొ గలరు పేరుకొన నేటికిఁ ద
త్కరణము దుర్లభ మేరికి, ధరలో నీ యర్థ మెల్లఁ దలపోయరొకో! ౪౮౮

ఉ॥ ధరణిన్ మానవు లెల్ల నీ గురుని శాస్త్రం బాదృతిం గొందురం
దరయన్ గోరినకాంతఁ జేకొనుటచే నన్యాయ మానంచు నె
వ్వరుఁ బల్కన్ వినలేదు తార మది నన్ వాంఛించె నబ్బోటినిన్
గరమొప్పన్ గయికొంటి నిట్టి యనురక్తన్ నే విడన్ జూతునే? ౪౮౯

గీ. స్వీయ పరకీయ యనియెడు భేదమెట్లు, గలుగుఁ గాంతలయెడ బలగర్వితులకు
దుర్బలులు పల్కు ధర్మంపుత్రోవగాని, తనదికానిది గల్గునే ధనపతులకు? ౪౯౦

క॥ రక్తి గల కాంతతో నను, రక్తిన్ గృహధర్మవృత్తి ♦ రమణీయంబా
రక్తిం దొలంగిన చెలితో, నక్తిం గాపురము సేయఁ గజన దెవ్వరికిన్. ౪౯౧

మ॥ అనురాగంబు ఘనంబు నా యెడల నీ ♦ యబ్జాక్షికిన్ నాకు నీ
యనుమానంబులతోఁ బనేమి ధరయిష్టంబైనఁ బోనిత్తునే
వనితారత్నము నా పురందరునకున్ ♦ బ్రతిభ్యుత్తరం బిట్లు నే
ననినా నంచు వచింపు మేగుమని శీతాంశుండు పల్కెన్ వడిన్. ౪౯౨

శా॥ చారుం డేగి యథోక్తమానటుల నబ్జద్వేషి పల్కుల్ మరు
ద్వారం బెల్ల వినంగ నిందునినకుఁ దెల్పన్ గ్రోధతామ్రాక్షుఁడై
ఘోరామర్త్యచమూసమేతుఁ డయి దిక్కోణంబు లల్లాడఁగా
రేతేనిన్ సమయింతు నం చరిగె నా ♦ వృద్ధశ్రవుం డయ్యెడన్. ౪౯౩

కం॥ మరణాంతము వైరంబని, ధరఁ బెద్దలు చెప్పు టెల్లఁ దథ్యముగా నా
సురగురుని వైరమున నా, సురగురుఁడరుదెంచి కలసె ♦ శుభ్రమయూఖున్. ౪౯౪

చ॥ గురుసుతుఁ డిగ్గురుం డనుచు ♦ ఘోర మహాహవ వాంఛ నొంది చం
దురుఁడును జిష్ణుఁ బోరునెడ ♦ దుస్తర భూర్భువరాదిలోకముల్
పరిపరి భంగులన్ జెదరఁ ♦ బద్మభవాండము సంచలింప దు
ర్భరమయి పెక్కువర్షములు ♦ పాయక చెల్లె సురాసురాళికిన్. ౪౯౫

## —• బ్రహ్మదేవుఁడు చంద్రునకు బుద్ధి చెప్పుట •—

ఉ॥ అయ్యెడఁ బద్మజాతుఁ డధికాహవమధ్యమునందు వింతఁగాఁ
జయ్యన నిల్చి యాంగిరసు ♦ సారసలోచన నిమ్ము కానిచో
దయ్యె మెఱుంగు నీ బ్రతుకు ♦ దైత్య విరోధినిఁ దెత్తు సంక్షయం
బయ్యెడు నీ బలం బనుచు ♦ నబ్జ విరోధికిఁ దెల్పి యా భృగున్. ౪౯౬

కం॥ గురుతల్పగమనుఁడగు నీ, దురితాత్మునితోడఁ బగతుఁ ♦ దొడరితి విధి స
చ్చరితముగాదని వాణీవరుఁ డతనికిఁ దెల్పె శశిని ♦ వారింపంగన్. ౪౯౭

చ॥ సురరిపుదేశికుం డపుడు ♦ శుభ్రగభస్తినిఁ జూచి దేవతా
గురుఁడు భవద్గురుం డతని ♦ కోమలిఁ దెచ్చుట ధర్మహానియున్
నిరయనివాసమున్ దొలఁగనేరదు నీ జనకుండు శాంతి మే
లరసిమె నీకుఁ దెల్లమగునట్టులు పంపెను దార వీడుమీ. ౪౯౮

మ॥ అపవాదం బిటు లొందనేల గురుభార్యం దెచ్చినావంచు నీ
యపరాధంబని పెద్దలున్ బలికిరి ♦ ట్లాచార్యు హింసించె దే

చపలాపాంగి నొసంగు మన్న విని యాచంద్రుండు తర్కించి లో
నవు డాచార్యున కిచ్చె గుర్విణిని నయ్యబ్జాక్షి నిన్ దారనున్. ౯౯

మ॥ గురుఁడున్ శంకరుఁడున్ విరించియును నగ్గోత్రారితోఁ గూడ ని
ర్జర సంఘంబులు గొల్వ నేగిరి నిజస్థానంబులన్ జెంద న
గ్గురు భార్యామణి తార వల్లభునితోఁ గూర్మిన్ బ్రవర్తింపుచున్
వర తేజోమయుఁ బుత్రునిన్ గనియె భవ్యంబైన లగ్నంబునన్. ౧౦౦

గీ॥ జాతకర్మాది సత్క్రియల్ సలుప గురుఁడు, సంతసంబందఁగా రహస్యమున జనులు
గుజగుజలు సేయుచో లోనఁ గుదిలుకొనుచు, నుండునత్తఱి రోహిణీశుండు కడిమి.

కం॥ నా నందనుఁ డీతండని, యానందము నొంది యుండనగునే నీకున్
నానందనుఁ డీతండని, పూనిక నగ్గురునితోడఁ బోరన్ జొచ్చెన్. ౧౦౧

వ॥ ఇత్తెఱంగునఁ బెక్కు దినంబులు మద్రూప లావణ్యాది యోగంబున నీతండు మన్నందనుం డని చంద్రుఁడును మదీయ వచోవిశేషమనీషాధురంధరుండు గావున మన్నందనుం డని యాంగిరసుండును వివాదించు నెడ నుభయ పక్షంబులకును సహాయులై దేవదానవు లున్మాదంబునఁ జెలరేగి గుంపులు గట్టు నెడ శాంతితత్పరుండై నలినోదరుండు విజయంబుచేసి యేకాంతంబున లజ్జింపంబనిలేదు తథ్యం బెఱిగింపు మనిన నవ్వారారోహారత్నంబగు తార యధోముఖియై చంద్రవీర్యోద్భవుం డని వక్కాణింప సుతున్ జేకొని బుధుం డని నామకరణం బొనర్చి రోహిణీకాంతుండు నిశాంతంబున కరిగె, బ్రహ్మాదులును దమతమ గృహంబులకున్ జనిరి. పురూరవప్రసంగంబున ననుషంగంబుగాఁ గురుక్షేత్రంబునఁ జంద్రువలన బుధోత్పత్తి నెఱింగించితి నింక బాదరాయణముఖోద్గీర్ణ ప్రకారంబున బుధునివలన నిలాకాంతయందుఁ బురూరవజననం బగుట వివరించెద సావధానులరై విన్నుండని సూతుం డిట్లనియె. ౧౦౨

## —♦ పురూరవ జననము ♦—

శా॥ విద్యుద్వద్ప్రతిమాన దాన లహరీ విశ్రాంత సర్వార్థియై
ఖద్యోత ప్రకట ప్రతాపఘనతా ఖద్యోతితారాతియై
ప్రద్యుమ్న ప్రతిబింబ దివ్య సుషమా త్రైలోక్య విఖ్యాతుఁడై
సుద్యుమ్నుం డను రాజొకండు గలఁ డాసూర్యావనీధుర్యతన్. ౧౦౩

క॥ కలనైన ననృత మెఱుఁగడు, బలిమి హృషీకములఁ జెదరి పాఱఁగనీఁ డు
జ్జ్వల నిర్వక్ర పరాక్రమ, విలసద్దోస్సంభవవిభుత విపులుం డగుచున్. ౧౦౪

ఉ॥ ఏకసితాతపత్రుఁడయి యెల్ల రిపుల్ శరణార్థులై కృపా
స్తోక సుధాబ్ధి నిర్ఝరులఁ దోఁగఁగఁ గోరుచుఁ జెంత నిల్వ ని
ర్భీకత రాజ్యపాలనముఁ బెంపుఁదలిర్పఁగఁ జేయుచున్ శర
ద్రాత్రిక వెలుంగు చంద్రుఁ డనఁ దద్ధరణీధవుఁ డొప్పె నంతటన్. ౧౦౬

ఉ॥ గట్టుల చెంతఁ గాపురముగా నివసించు జనాళి, యట్టి శే
పట్టినిఁ జేరి యో యధిప! పల్లెల నద్దమరేయి దూఱి యే
పట్టున నిల్వనొక్క మొగి బారులు గట్టుచుఁ గ్రొల్లుపులుల్ పసుల్
బట్టుచు మట్టుమీఱి బహుబాధలఁ బెట్టఁగఁ జొచ్చె నే మనన్. ౧౦౭

క॥ తప్పింపలేక మీకడ, కిప్పుడు వచ్చితిమి కావవే యని పైపైఁ
గప్పికొని జనులు దెల్పఁగ, నప్పొలమున విభుఁడు వేటలాడెడుబుద్ధిన్. ౧౦౮

ఉ॥ జాలరులన్ వడిన్ బిలిచి జాలములున్ శునకంబులున్ మృగా
భీలశితాసి చక్రముఖ భేదనసాధకసాధనంబు లు
ద్వేలముగాఁగఁ బూని పరతెండని చాటఁగఁబంచి తాను వా
తూల జవోన్నతం బయిన దొడ్డతురంగము నెక్కి యుద్ధతిన్. ౧౦౯

క॥ సన్నాహ సమేతుం డయి, యన్నరపాలుండు కుండలాభరణుండై
యున్నతకార్ముకధరుఁడై, మిన్నందుచు సంతసంబు మెయిఁకొనఁ గదలెన్.

ఉ॥ కాననసీమలన్ దిరిగి కార్ముక మెక్కిడి యప్పు డచ్చటన్
గోనల లోయలన్ వెదకి కోల తరక్షు చమూరు ఖడ్గ పం
చానన శల్య సైరిభ శశాజినయోని వృకాచ్ఛభల్ల ము
ఖ్యానృజు వన్య జంతువుల నయ్యవనీపతి వేటలాడుచున్. ౧౧౧

గీ॥ వేఁటతమి సేనవారల విడిచి యొకఁడ, కార్ముకం బెక్కుడించక కదిసి ఘోర
వన్య మృగములఁ దునుమఁచుచు వరతురంగ,మద్వితీయతఁ జనియెఁ గుమారవనికి.

—: పురూరవుడు స్త్రీయగుట :—

వ॥ అవ్వనం బనంత మందారాశోక తిలక వకుళ రసాల తాల తమాల హింతాల చంపక పనస రసాల నీప మధూక దాడిమ నారికేళ కదళీ షండ మండితంబును మాలతీ మాధవీ మల్లికా యూథికా కుంద ప్రముఖ పుష్పవల్లీ రమణీయంబును హంస కారండవ క్రోయష్టిక చక్రవాక ప్రముఖ జల విహంగమ నిస్వన ప్రచుర సరోవరంబును భ్రమర ఝుంకార కోలాహల పరిభరిత కమల కల్హార విభాసమాన నిర్ఝర సహస్ర సంభావితంబును సర్వసుఖప్రదంబును నగుచు నదృష్టచరంబై యుండుట వలనఁ దత్ప్రవిలాస విశేషావలోకన జనితానంత కౌతూహలంబు ముప్పిరి గొన సంచరించుచు నచ్చటచ్చట విశ్రమించుచు సుఖం బుండునంత.

గీ॥ పురుషరూపంబు వెడలి యశ్బాభ్వపతికిని, నాడురూపంబు సంప్రాప్తమయ్యెనచట
నదియె యననేల నత(డెక్కు నశ్వమునకు, నశ్లె యాడుదనంబు సంప్రాప్తమయ్యె.

ఉ॥ అంతట నా విభుండు తన కాడుదనంబు ఘటించు నబ్బురం
బెంతయు వింతయైన మది నేమియుఁ దోఁపక చింత మున్గి య
త్యంతము లజ్జ నొంది యిఁక నాత్మగృహంబున కెట్లు లేగుదుఁ
జెంతలఁ గొల్చు భూపతు లిఁక యన రాజ్యము నెట్లు సేయుదుఁ. ౧౧౬

గీ॥ ఏమి సేయుదు వంచించె నెవ్వఁడొక్కొ, యిట్టి స్త్రీభావ మెడలింప నెవరుగలరొ
యెట్లు గడపెద నని చాల నెదఁ గలంగి, యందు నివసించె నన మానసలఁడిగి రంత.

ఉ॥ దేవవిభుం డటంచు మును దెల్పవె యా యవనీవిభుండు స్త్రీ
భావము నొంద నేమొకొ? స్వభావ విరుద్ధము చిత్ర మయ్యెడిఁ
దైవవశంబె సర్వమును దప్పదు పౌరుష మించు కేనియుఁ
గావలెఁ గాన నవ్విభుఁ డకార్యము లవ్వని నేవి చేసెనో. ౧౧౭

మ॥ అనిమిత్తంబుగ నిట్టి యాపద విభుం డచ్చోట నెట్లుండెనో
వినిపింపఁ దగునన్న సూతుఁడు సమావిర్భూత హర్షంబునఁ
మునులారా! వినుఁ డాదికాలమున శంభుఁ గాంచఁగాఁ గోరుచుఁ
సనకాదుల్ చని రాత్మతేజముల నాశాపాళి భాసింపఁగాఁ. ౧౧౮

## —। శివుని నియమము ।—

ఉ॥ అత్తఱి శంకరుండు ప్రియదాన్వితుఁడై విహరించుచున్న భూ
భృత్తనుజాత నిర్వసనవృత్తిఁ బ్రియాంతికసీమ నిల్చి య
య్యుత్తమ తాపసుల్ ప్రియునియొద్దకు వచ్చుటఁగా నెఱింగి లోఁ
దత్తరపాటునఁ వలువఁదాల్చి చరించె మహేశు సన్నిధిఁ. ౧౧౯

చ॥ అనవసరంబు కల్గినది యంచుఁ దపస్విజనంబు చయ్యనఁ
వనికిఁ బ్రదక్షిణంబుగ నవారితులై బదరీవనాంతరం
బునకుఁ దొలంగిపోయి రది భూధరకన్య యెఱింగి సిగ్గుచే
మన మురియాడ వల్లభుని మార్గముగమై కనలేకయుండినఁ. ౧౨౦

క॥ సిబ్బితి నొందఁగ నేలా, బిబ్బోకవతీ! యటంచుఁ బ్రియుఁ డా సతికిఁ
గొబ్బున హర్షం బొందఁగ, నబ్బుర మగు శాప మొకటి యవ్వని కిడియెఁ. ౧౨౧

క॥ నేఁడాదిగ నివ్వని కెవ్వాఁ డరుదేరంగలండొ వాఁ డాడుదియై
పోఁడిమి చెడు నని మలవిలు, కాఁ డనియెఁ దాన నిట్టిగతి సిద్ధించెఁ. ౧౨౨

క॥ ఈ వృత్తముఁ దెలిసిన వా, రావనికిన్ జన రొకించుచుఁ గైనను దెలియన్
బోవునె సుద్యుమ్నుఁడు నిటు, దైవవశమ్మదియె తెచ్చెఁ దరుణియుఁ గాఁగన్.

ఉ॥ కావున సిగ్గుచే బడలి కాననసీమఁ జరించుచున్ వధూ
భావముచే నిజాలయము పజ్జకుఁ జేరక యింత నంత న
య్యా వనభూములన్ దిరిగి యచ్చట నచ్చటఁ బొద్దు పుచ్చుచున్
గావర మింతఁ జేసె నని కర్మము దూఱుచు నున్న యత్తఱిన్. ౧౨౪

క॥ ఇల యను నభిధానముచే, నిల యెల్లన్ దిరిగి యొక్కయెడఁ జంద్రసుతున్
జెలి గనియె నాతఁ డాపెన్, దిలకించె మనోభవుండు దీసెన్ దూపుల్. ౧౨౫

ఉ॥ ఆ రమణీమనోభవుని యందముఁ జూచి యమందమోహయై
మారుని పూవుటంపఱకు మగ్నత నొంది దృఢానురక్తిచే
నా రమణీలలామ దరహాస ముఖాంబుజ మెత్తి చూపులన్
గూరిమి నాటఁ జూచె మదిఁ గోరిక లీరిక లెత్త నత్తఱిన్. ౧౨౬

ఉ॥ చంద్రతనూజుఁడున్ దరుణి చక్కఁదనం బెద మెచ్చి మేనునన్
సాంద్రముగాఁగ ఘర్మజలజాలము లూరఁగఁ గామభోగ వాం
ఛం దవిమంది తత్కళలుఁ జాఱఁగ నవ్వనితామణిన్ బ్రిధా
నేంద్రియవృత్తి నన్యరసహేయత నొంది చలింపకున్నెడన్. ౧౨౭

క॥ అన్యోన్యాలోకన చతు, రాన్యోన్య వశీకృతులకు నావాలంబై
యన్యోన్యముఁ గల సిరి రా, జన్యవధూ సోమసుతులు సమసుఖరతులై.

మ॥ సుముహూర్తంబున నచ్చటన్ గనియెఁ దా సుతాగ్రిమసంకాశు స
ర్వ మహీపాలన సుప్రకాశు ధరణీవాల్లభ్య లభ్యామిత
ప్రమదోద్భాసన సన్నివేశు నియమప్రాగల్భ్య సంప్రాప్త సం
యమిసందేశుఁ బురూరవుం డనెడు గోత్రాధీశు నంచద్గతిన్. ౧౨౯

గీ॥ దైవ వశమున బుధుని నేస్తంబు నొంది, పౌరుషము లేమిచే మనోవ్యథఁ గలంగి
సార్వభౌమునిఁ గన్న హర్షమున మునిఁగి, జనుల కీ రెండు సరియఁకాయని తలంచి.

చ॥ కులగురుఁడౌ వసిష్ఠమునిఁ గోరి యొకానొకనాఁడు వేఁడినన్
బలమఱియున్న యవ్విభుని భావ మెఱింగి శశాంకశేఖరుం
దలఁచి యితండు బోటియయి దైవవశంబునఁ బౌరుషంబు లే
కలజడి నొందినాఁడు కరుణాన్విత పుంస్త్వ మొసంగు నావుడున్. ౧౩౧

గీ॥ హరుఁడు గరుణించి యొక నెల యాఁడుదగుచు, నొక్క మాసంబు పురుషుఁడై యుండుననుచు
దనదు తొల్లిఁటి పల్కు సార్థకముఁ జేసి, వర మొసంగిన నా రాజు వచ్చెఁ బురికి. ౧౩౨

చ॥ ప్రమదము నొందె నగ్గురుఁ డపారకృపారసభూతిచేతఁ బుం
స్త్వముఁగొని రాజ్యపాలన ముదారతఁ జేయుచు నొక్కమాసము౯
రమణులలోన నంతిపురి రాణిగ నుండుచు నొక్కమాసము౯
గ్రమమునఁ బొద్దుపుచ్చుచును రాజును నాడుది యౌచు నుండఁగ౯. ౧౩౩

కం॥ ఆ వసుధాధిపు పాలితు,లా వారలు మదిని రోసి యాజ్ఞావశులై
పోవెఱచుటె కాని ప్రహ, స్త్రావిర్భూతి౯ గడంగరై రేమనఁగా౯. ౧౩౪

చ॥ తెలిసి మహీవిభుం డపుడు దివ్య కళామయ మూర్తి భూరి దో
ర్బలునిఁ బురూరవు౯ భువికిఁ బట్టముఁగట్టి విరక్తచిత్తుఁడై
స్థల జల కాననాంతర రసాధర సీమలఁ దాపసాశ్రమ
స్థలులఁ దపంబు సేయుచు విశంకట వృత్తిఁ జరించు చున్నెడ౯. ౧౩౫

ఉ॥ శారద నీర దాభ్ర హారి సైంధవ సింధుర పారదాభుఁడౌ
నారదుఁ డాశ్రమంబున కనారత నామ కథా సుధా రసో
దార విపంచికాధ్వనులు తారము ముట్టగ నందు వచ్చిన౯
భూరమణుండు మ్రొక్కి సుమపూజ లొనర్చుచు సంతసంబున౯. ౧౩౬

### — పురూరవుఁడు దేవిని గుఱించి తపంబు సేయుట —

వ॥ మహానుభావా! భవత్కటాక్షంబువలన నొక్క దివ్యమంత్రం బనుగ్రహింపఁ బ్రార్థించెద ననిన నతండు నిఖిల మంత్రాధిరాజం బగు నొక్క మహామంత్రంబు నిరంత రానుష్ఠాన సమాసాదిత సర్వార్థకంబుగా జగదంబికం గుఱించి నమస్కరించి న్యాస ధ్యాన పురస్సరంబుగా నొసంగిన నన్నవాక్షరంబు సావధానమనస్కుండై బహిరింద్రియ వ్యాపారంబు లంతర్ముఖంబులైన మనంబునం బెరయఁ జిత్తం బాత్మావలంబంబై తనయం దేకీభవింపఁ దానును శుద్ధ చిద్రూపంబై పరాద్వైత నిష్ఠ నాత్మమానియు౯ బోలెఁ దపించుచున్న యెడఁ బరితుష్టాంతరంగంబున సగుణీకరించి దివ్యరూపిణియై వారుణీ పానమదోన్మాదంబున ఘూర్ణాయమానలోచనంబులు దిగ్వధూసర్వాంగంబుల కయత్నరాగాభరణ ప్రభల నీనఁ దామసీశక్తి ప్రసన్న యైన౯ బ్రదక్షిణ పూర్వకంబుగాఁ బ్రణామం బొనర్చి యిట్లని స్తుతించె.

### — అంబా స్తోత్రము —

మ॥ జననీ దివ్యము లోకరక్షకము శశ్వద్భాస్వరంబైన నీ
తను వేఁ జూచితిఁ గానఁ గామదము బోధ ప్రాపకంబు౯ విము
క్తి నిధానంబును దివ్యసేవ్యమును గాదే! నీపదాంభోజ మం
చని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౧౩౭

మ॥ మునులే నిన్గొనియాడ లేరనఁగ నీమూర్ఖాధాత్ములౌ మర్త్యు లే
మని వర్ణింతురు నిర్జరుల్ గనదు నీమైశ్వర్య మట్లయ్యు న
న్ననుమానింపక పోతయా నటులు పవిత్రత్వస్ఫూర్తిఁ జెంది తీ
వని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౧౩౯

మ॥ వనజాక్షుండు విరించి రుద్రుఁడు వసుల్ దేవేంద్రుఁ డగ్ని చంద్రానిలుల్
ధననాథుండును సూర్యుఁడున్ వరుణుఁడున్ దర్పంబు నీశక్తిఁ గ
న్గొనఁగాఁ జాలరటన్న మర్త్యుఁడను నాకున్ గాంచఁగా శక్యమే
యని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౧౪౦

మ॥ వనజాతాక్షుఁడు వారిజాసనుఁడు శర్వాణీ విభుండున్ భవ
త్తనువుల్ సత్త్వ రజ స్తమో వికృతులన్ దత్తత్స్వరూపంబుగాఁ
గను లేకాని పరాత్పరంబనుచుఁ జక్కన్ గాంచలే రెంతయో
యని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౧౪౧

మ॥ నను మర్త్యుం డనియున్ బ్రభావమును నంతన్ జాలఁడంచున్ మనం
బున నీ వెంచక సన్నిధాన మిడి సంబోధించుటల్ సేవకా
వన కౌతూహలమా ధరన్ దొరలకున్ దా వాల్లభ్య మబ్బంగదా
యని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౧౪౨

మ॥ వనజభ్రాంతి నెఱుంగఁడయ్యెనో? నీ పాదార్చనం బెట్టి యీ
సుననో నిద్ర మునుంగఁ జేసితివి విష్ణుం డాదిదేవుండె యై
నను నీ మాయ నెఱుంగఁజాలఁ డనుచో నా బోటులా గాంచఁగా
నని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౧౪౩

మ॥ ఘన కామార్తత విష్ణుఁడున్ విధియు నక్కామారియున్ దారెయై
యనురూపించి యశోక మట్లు పరిణతిన్ దా యాచింతురి పాదాహతిన్
గొన కేతెంచెదు తావకంబయిన నైర్గుణ్యంబు సర్వాత్మకం
బని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౧౪౪

మ॥ వినఁగాఁ జిత్రము వాసుదేవు నెదపై వెంచేసి సర్వాకృతిన్
గని భోగించుట యెంతయో యసురులన్ ఖండించుచో సింహవా
హనమై నిన్ను వహించుఁ గేశవుఁడు వేదాతీత మాహాత్మ్య వం
ఛని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౧౪౫

మ॥ జననంద్యుం డగు విష్ణు వాక్కతతి నిస్సామర్థ్యమున్ జెంది స
ర్వనిషిద్ధం బగు కర్మనొందఁడె? పునస్సర్వాల్లభ్యమున్ జెంది దే

వనికాయంబులఁ బ్రోవఁడే తృణము చేపట్టన్ మహా మేరువౌ
నని నే మ్రొక్కెద సానురాగ వయి యంబా! నన్ను రక్షింపవే. ౫౪౬

మ॥ వనితల్ చెప్పఁగనేల బ్రహ్మమొదలౌ స్వర్లోక వాస్తవ్యు లె
ల్లను సౌఖ్యప్రదమైన నీ విభూతి లీలల్ మించరే నిన్ను వ
ర్ణన సేయంగ సమర్థు లెవ్వరు? మహానందానుసంధాన వీ
వని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౫౪౭

మ॥ కనఁగా నిర్గుణవో? గుణాన్వితవొ? యాకారంబు పుంరూపమో
వనితారూపమొ యీ వికల్పములు సంభావింప నాకేల భా
వనచే సర్వము నీవటంచు మదిలో భావించి సేవింతు నం
చని నే మ్రొక్కెద సానురాగవయి యంబా! నన్ను రక్షింపవే. ౫౪౮

క॥ అని బహువిధముల మ్రొక్కుచు, జనితానందుఁడయి రాజు 'శరణంభవ మే'
యని శరణాగతుఁడై పద, వనజమ్ములు సోక నడ్డపడె శాంకరికిన్. ౫౪౯

క॥ అయ్యెడ జగదీశ్వరి య, క్షయ్యకృపాదృష్టిఁ దేల్చి సాయుజ్య శ్రీ
పయ్యెద చెఱంగుఁబట్టఁగ, ని య్యెడయుం డగునటంచు నిచ్చెన్ ముక్తిన్. ౫౫౦

ఉ॥ కూరిత రారిభైరవుఁ బురూరవుఁ గాంతునిఁగాఁగఁ జెందియున్
భూరమణీ లలామ సుఖభోగము లందుచు స్వర్గలక్ష్మి జం
భారినిఁగూడి నిత్యవిబుధానుభవోచిత భాగధేయసం
పూరిత మైన యట్లు పరిపూర్ణ శుభస్థితిఁ గాంచె నత్తరిన్. ౫౫౧

సీ॥ సకలప్రజాభిరంజనసముల్లాసియై, యాచకవ్రాళపర్యంతముగను
సులభుఁడై తనమేనిసొంపు విలాసినీ, దృగ్భాగధేయమై తృప్తినీన
శక్తిత్రయప్రౌఢి సామాదిసంరూఢి, వర్ణాశ్రమాచార వర్ధనంబు
దక్షిణయుతశతాధ్వరకర్తృకత్వంబు, దానచాతురి సంతతంబు గలిగి
గీ॥ ధరఁ బ్రతిష్ఠాన మను రాజధాని యెపుడు,తన కధిష్ఠానముగనుండు తటిఁగ్రమస్వ
రూప శీలాదిగుణముల రూఢి వినుచు, వలపు మరులొందె నూర్వశీలలన వాని.

## —॰ పురూరవుఁ డూర్వశిని ప్రేమించుట ॰—

క॥ విధివశమున నయ్యూర్వశి, విధిశాపము వలన మర్త్యవేశ్యయగుచు ద్యో
వధివాసముఁ దొఱఁగఁగ నం,బుధిరశనాకాంతుఁ గవిసి పొందొనరించెన్. ౫౫౩

క॥ రమణీమణి యూర్వశి రతి, సమయంబున విభునితో డసమయ మొనర్చెన్
సుమనస్కుఁడవై మేషయుగము గావుము విన్న విడుతుఁ గావమి ననుచున్.

వ॥ మఱియును నేనెప్పుడును ఘృతాహారం బొనరించుచుండుటయును సురత సమయం బునం దక్క నగ్నుండవైన నిన్నున్ జూడకుండుటయును వ్రతంబు లని పలికి.

శా॥ భాషాబంధము దప్పితేని నిను నేఁ బాయఁ దలంతున్ జుమీ
యోషిత్పుష్పశరుండ వంచు సుఖ సంయోగంబులన్ దేల్తుఁ ద
ద్దోషం బొందక యుండఁ గావు మన సంప్రీతాంతరంగంబుతో
నీవ ద్వేషము లేని నెయ్యమున భూమీశుండు స్వేచ్ఛారతిన్. ౨౫౬

గీ॥ పెక్కువర్షంబు లబ్బోటి ప్రక్కఁ బాయ, కతను కేళీవిలోలుఁడై యవనియందె దివ్యకాంతారతోల్లాస దీక్షవదల, కవ్విభుఁడు బద్ధకంకణుం డయ్యెనంత. ౨౫౭

క॥ ధర్మము లగు నధర్మముఖ, కర్మములను సడలి పుష్పకార్ముక విద్యా మర్మములఁ దెల్పి శుచిరస, కర్మఠుఁడై దేవకాంతఁ గలసెన్ మెలసెన్. ౨౫౮

ఉ॥ వాసవుఁ డొక్కనాఁడు సురవారవధూతతినృత్తకేళి ను
ల్లాసముతో సుధర్మను విలాస మొనర్పఁగఁ జూచి పల్కె నే
డీ సభ నూర్వశిన్ గన మొకించుక యేనియు రక్తిఁ గల్గ దే
వాసమునందు నెందరిగ వచ్చుటఁ గానము పెక్కునాళ్ళ కేన్. ౨౫౯

క॥ ఊర్వశిఁ దోతెండని గంధర్వులఁ బెక్కండ్రఁ బంప దరమిడి వారీ యుర్విన్ గలయన్ గుర్మ్మారి, పర్వేందుముఖిన్ నృపాలు పజ్జం గనుచున్. ౨౬౦

క॥ విభ్రాంతి నొంది పొంచి యుం,రభ్రద్వయి పలువు లూడ్చి రాతిరి గుంపై యభ్రపదంబున కెగసిరి, దభ్రత్వర రాజభీతిఁ దార్కొను నెదలన్. ౨౬౧

సీ॥ గంధర్వవరు లిట్లు గన్నవారలు గాన, నూర్వశి రప్పింప నోజఁ దెలుప
గొర్ట్రెపోతుల నెత్తికొని పోయి రయ్యెడ, మేషముల్ ఘోషించె మింటితోవ
నదిరి మేల్కొని లేచి యూర్వశి నాతోడ, నమ్ముఁడవై నిద్దురవ నల్వె దీవు
ప్రతిరోధు లెవ్వరో పట్టిరి మేష యుగంబని పలుక నా క్ష్మావిభుండు

గీ॥ కలయికల నగ్నుఁడై యుంటఁ గనక లేచి, చేతఁ గరవాలు ఝళిపించి చెదరి పొలఁ దఱిమి వెనువెంట నంటఁ గాదాకి పోవు, దొంగల నదల్చి పొట్టేళ్ళఁ దోడి తెచ్చె.

గీ॥ కాన నూర్వశి రాజుతోఁ గలసి యునికి, మెఱుపు మెఱియుట వలన నమ్మేదినీశు నగ్న భావంబు గాంచి మిన్నక యదృశ్య, యగుచు నెం దేగెనో జని యెనయ్యవనివిభుఁడు.

## —పురూరవుని పరితాపము—

ఉ॥ కానలు కోనలున్ గనులు గట్టులు చెట్టులు సందు గొందులున్
దానిని రోయుచున్ మనసు దందడిఁ గొల్పఁగ రాజ్యభోగముల్

మాని వియోగ వారినిధిఁ మగ్నత సర్వధరాతలంబులుఁ
దీనమనస్కుఁడై తిరిగి ꣳ త్రిప్పఁగ రాని మనోభవ వ్యథన్. ౧౬౪

వ॥ కురుక్షేత్రంబునం దొక్కతతి నూర్వశిం గాంచి పరిహృష్టవదనుండై యన్నరో త్తముండు ప్రాణేశ్వరీ! నిలువుము, నిరపరాధినగు నన్నుఁ గసరివైచి విడుచుట నీకు న్యాయంబుగాదు. నీచేఁ బరిత్యజింపఁబడిన మద్దేహంబు వృకకాకాదుల వలనన్ భక్షితంబగునని విలపించుచుఁ గౌగిటం జేర్చి యడలుచున్నఁ గనుం గొని యోరాజా! స్వైరిణీవశుండవై యిట్లు పొరలుట ధర్మంబె, యని విరక్తిఁ గొలిపినఁ దత్కాల జనిత వివేక దవానలంబున వాసనాత్రయ జనిత విషయాభి లాషకాననంబుల భస్మసాత్కృతి నొనర్చి నారదువలన ముక్తిమార్గం బరసి మూలప్రకృతి యనుకంపావశంబున ననితరకథనీయంబగు పదంబునన్ జెంది ననుషంగ వశంబునఁ జక్రవర్తి వృత్తాంతంబు సవిస్తరంబుగాఁ దెల్పితి నింకఁ బ్రకృతానుసరణం బొనర్చెదమే యని ఘృతాచీదర్శనంబునఁ జేతశ్చలనంబు నొంది వ్యాసుండు దన మనంబున. ౧౬౫

## —॥ ఘృ తా చి శు క మ గు ట ॥—

ఉ॥ ఈ కమలాక్షిఁ జేకొనుట ꣳ యెల్లిద మెల్లెడ దేవకాంత యాఁ
గాక తలంప నచ్చర యొకానొక నేర్పునఁ గొంద మన్న సు
శ్లోకయుఁగా దపాంసుల బుషుల్ నిరసింతురు త్రిప్పరాని చిం
తాకులవృత్తి గల్గినదియంచు విషాదమునొందు మానియున్. ౧౬౬

కం॥ భయభీత యగుచు నమ్ముద్దియ మునియు శపించు ననుచు ꣳ దెసలన్ శుకియై
పయికెగసి చనియె నతివి, స్మయమున ద్వైపాయనుండు ꣳ సంభ్రాంతుండై.

ఉ॥ చింతిలుచున్న యత్తఱి వశీకృతి నొందినదాట డెందమ
త్యంతము నప్సరోవనితయందు మరుల్కొని తిర్గుపాటు లే
కెంతయుఁ దత్పరిగ్రహణ ꣳ మెట్లగునో యనుచుండెఁగాని యా
వంతయు నన్యవస్తు విషయస్పృహ నొందఁ డదేమి చిత్రమో. ౧౬౭

కం॥ ఇంధనోద్భూతికినై, మంథన మొనరించువేళ ꣳ మానస మతి కా
మాంధ మగుఁడు మునివీర్యము,బంధమువిడి యరణిలోనఁ ꣳ బడియెన్ గడియన్.

క॥ దైవవశ మిట్టిదే సుమి, భావజ వశులకును నొక్క ꣳ పద్ధతి గలదే
దేవనిభుం డగు మద్గురుఁ, డీ వింత యొనర్చె మునుల ꣳ కిది రట్టనుచున్. ౧౭౦

## —• శుకుని జననము •—

ఉ. అచ్చటి మౌనులెల్లఁ బరమాద్భుతవారిధి మున్గ వ్యాసుఁడే
యచ్చుఁగఁ దానె రెండవది § యా తనువొందె ననంగ జ్ఞానసం
పచ్చయమూర్తియై శుకుఁడు § బ్రహ్మకథామయరూపుఁడై కనన్
వచ్చె సముజ్జ్వలజ్జ్వలన § వైఖరి దిక్కులు తేజరిల్లఁగన్. ౫౭౧

క॥ కరుణానిధి యగు శంకరు, వరమున నందనుఁడు గల్గె § వాంఛితసిద్ధిన్
బరగితినని ద్వైపాయనుఁ, డరుదందెన్ శుకుఁడు దీప్తి § ననలుని మించెన్. ౫౭౨

సీ॥ నిర్జర భేరికా § నినదంబు దివిమ్రోసె, విబుధ ద్రుమములు పుష్పవృష్టిఁగురిసె
హావ భావ స్ఫూర్తి § నచ్చర లాడిరి, గంధర్వ గానముల్ § గలయఁబొఱసె
సుర సిద్ధ చారణుల్ § చూడంగ వచ్చిరి, జాహ్నవీ దేవి తా § జలక మార్చె
దివినుండి దండంబు § దివ్య కమండలు, హరిణాజినంబులు § ధరకుఁదొఱఁగె

గీ॥ జాతకర్మాది సత్క్రియల్ § సలిపి తండ్రి, హర్షమునఁబొందె నానాఁటఁగర్భకుండు
హవ్యముల నగ్నిపోలిక § నతిశయించి, దివ్య తేజో విభూతి వర్ధిల్లెనంత. ౫౭౩

ఆ॥ వె॥ సర్వ కర్మ వేత్త § సత్యవతీ సూతి, సురల మునులఁ బిలచి § సుతున కుపన
యన మొనర్చె బ్రహ్మ § యఖిల వేద రహస్య, మెల్ల నొసఁగెఁ దండ్రి కిడినయట్లు.

ఉ॥ కీర వధూ స్వరూపమునఁ § గేవల విభ్రమ మొందఁజేసి యా
సౌరకులాప్సరఃప్రమద § సంచరణం బొనరించుటన్ శుకుం
డారయ నీతఁ డౌనని శుకాభాఖ్య నొసంగె హిరణ్యగర్భుఁడున్
బూరిత దివ్య తేజుఁడయి § పొల్పెసలారె శుకుండు నత్తఱిన్. ౫౭౪

ఉ॥ ఆంగిరసాంతికంబున సమాహితుఁడై నిగమాగమంబులున్
సాంగరహస్యమంత్రములు § సర్వ మతేస్మృతివాదముల్ జగ
న్మంగళ మూర్తియై పితృసమానుఁ డటంచు మునుల్ వచింప ను
ప్పొంగుచు నభ్యసించెఁ దలఁపున్ వలపున్ గొని తండ్రి యానతిన్. ౫౭౫

క॥ సముపాత్త సర్వ విద్యా, విమలాంతఃకరణుఁడగుచు § వినయంబున స్వా
శ్రమమున గురునకు సన్మతి, నమితంబుగ దక్షిణలు సమర్పలు నెఱపెన్. ౫౭౬

## —• వ్యాసుఁడు శుకుని వివాహమునకుఁ బ్రోత్సహించుట •—

చ॥ ఎదుటికివచ్చి నందనుని § నెత్తి కవుంగిటఁజేర్చి మూర్ధమిం
పొదవఁగ మూరుకొంచు గురునొద్దఁ బఠించిన విద్యలెల్లఁదాఁ
బదపడి నిశ్చితార్థముల § పట్ల పరీక్ష లొనర్చుచున్ మన
స్సుదమల హర్ష వాగ్ఝరులు § సాంద్రములై దెస లావరింపఁగన్. ౫౭౭

ఆ॥ బాదరాయణుండు ♦ పట్టినిఁ గని నీవు, సకలశాస్త్రవితతిఁ ♦ జదివినావు
వేదవిహిత ధర్మ ♦ విధి గాన గార్హస్థ్య, ధర్మసిద్ధి సముచితంబుగాదె. ౧౭౯

చ॥ పరమ పవిత్రి బ్రహ్మఋషి ♦ వంశ సముద్భవమైన కన్య సుం
దరి గల దిత్తుఁ దెత్తు సముదారత దార పరిగ్రహంబు భూ
సురుల కవశ్యకార్య మనుచున్ బ్రకటించి ఋణత్రయానుసం
హరణముఁ జేసి యజ్వవయి ♦ యైహిక సౌఖ్యము లొందఁగాఁ దగున్. ౧౮౦

క॥ పుత్రోద్భూతినిఁగాని య,పుత్రిత నాముష్మికంబు ♦ పొసఁగునె యెందున్
బుత్త్రుఁడు "పున్నామ్నో నర,కాత్త్రాయత" యనెడు ధర్మగతి శ్రుతి యనదే.

ఉ॥ నా మదియందు నున్నది యనారతవాంఛిత మిట్లుచేసి నీ
వీ మెయి సౌఖ్యదం బగు సహీనసతీగ్రహణంబొనర్చి న
న్నోషుము పుత్ర నీకు నయి యుగ్ర తపం బొనరించితిన్ ననున్
ధీమహితుండ వీవును మదిన్ దగు సంతస మొందఁ జేయుటల్. ౧౮౧

మ॥ అవరోధింపకు మన్నఁ దండ్రిఁగని సభ్యవ్రాత మాలింప న
న్నవిరక్తున్ బలెఁబల్కరించితివి నీకై శంభునింగూర్చి ఘో
ర వనిం జాలఁ దపించినాఁడ నని పుత్త్రాద్యధర్మానుబో
ధవశుల్ సద్గతిఁ గాంచరంచును వచోధర్మంబు నీ కేటికిన్. ౧౮౨

ఆ॥ తండ్రి గురుఁడ వీవు ♦ తత్త్వమెట్టిదో చూచి, యెద్ది నా కనుజ్ఞనిడెదో దాని
ధర్మమం చొనర్చెదను దరింతురు దుఃఖ, భంజనంబు సుఖవివర్ధనంబు. ౧౮౩

చ॥ అన విని వ్యాసుఁ డా శుకుని ♦ హర్షము నందగఁజూచి పుత్త్రి! నీ
కనుపమ సుందరాంగి నిపుడారసి పెండ్లిఁజేసి యా పయిన్
జని జననాథు నొక్కనిని ♦ సంతసముంగని తెచ్చియిచ్చెదన్
ధనము కొలంతయే సుఖనిధానము దుఃఖహరౌషధం బిలన్. ౧౮౪

వ॥ అని యిట్లు వచించు నిజజనకునకు సవినయంబుగా శుకుం డిట్లనియె. ౧౮౫

ఉ॥ ఉత్తమ సౌఖ్యమంచు సమయోచితమౌ నుడిగాని యంగనా
యత్తున కేటి సౌఖ్యము యథార్థముగాను వచింతుఁ దండ్రి తా
నెత్తటి మూఢుఁడేనిఁ దరియించునుగాని వధూవశంకరుల్
చిత్తమునందుఁ దెల్విఁగని ♦ చెన్నుఁగ సంసృతినిం దరింతురే. ౧౮౬

మ॥ మలమంజూష లవశ్యనశ్యములు దుర్మాంసాస్థిపుంజంబు లెం
దలఘుగ్రంథి సహస్ర బద్ధములు మాయాబీజముల్ దేహముల్
లలనాదేహము లా పయిన్ సతరుణాలంకారముల్ తండ్రి న
న్నలతన్ బెట్టకు మే నయోనిజుఁడ నా కేకద్యాయి పొత్తేటికిన్. ౧౮౭

గీ॥ ఆత్మసుఖము త్యజించి యఽనంగసుఖము, నిచ్ఛగింపఁగ నేనెట్టుఽలియ్యఁకొందు
జగతి విణ్మూత్రములతో నఽసహ్యమైన, యంగనా దేహ విభ్రాంతిఽనందు టెట్లు?

గీ॥ చదివితిని వేదచయము హింఽసామయంబు, కర్మమార్గంబు దాన సుఽజ్ఞానమెట్లు
గలుగుఁ గర్మమునను బుట్టుఽగర్మఫలము, వితొ్తకటి నాటఁజెట్టొకఽవిధముగనునె?

గీ॥ గురుఁడువిద్యాప్రధానసంఽసరణమగ్న, హృదయుఁడతఁడెట్లుసుజ్ఞానఽమియ్యఁ గలఁడు
రోగికిని రోగివైద్యుఁ డా ఽ రోగిరోగ, మెట్లుశాంతించు నౌషధ ఽ మెంతయిడిన

చ॥ అనితరవేద్యమైన పరఽమాత్మసుఖం బెద నిచ్ఛగింపకే
ఘనమల పంకసంకలిత ఽ కామ్యసుఖం బభివాంఛ సేయునే
మనమున నెట్టి మూఢుఁడును ఽ మద్హృదయంబు భవాంబురాశి మ
జ్జనమున శుద్ధిఁగోరదు వఽచస్థితిగాదు విశుద్ధిఁ బల్కఁగన్. గీ-౨

ఉ॥ మానవుఁడై జనించి శ్రుతిఽమర్మము లెల్ల నెఱింగి తత్త్వమున్
గానక సంసృతిన్ మునుఁగఽగా మదిఁ జేర్చినవాఁడు దుర్గమం
బౌ నరకాగ్నిఁ గూలక పఽరాత్మసుఖానుభవంబుఁ గాంచునే
మానరుగాక పెద్దలభిఽమానముచే స్వవచోవివాదముల్. గీ-౩

గీ॥ సర్వ శాస్త్రార్థవిజ్ఞాన ఽ సరణి నెఱిఁగి, సంసృతిన్ బడి పడఁతియే ఽ స్వర్గమనుచు
సంతసించు నరులకును ఽ శ్వానసూక,రాది జంతువులకు భేద ఽ మవనిఁ గలదె?

గీ॥ పుత్త్రదారగృహాసక్తిఁ ఽ బోవనీక, పండితులమంచు సభలలో ఽ వాక్యబోధ
సేయుదురెగాని యాచారఽసిద్ధిగలదె?, పరులకుద్బోధ సేయనంఽదఱును ఘనులె?

క॥ మాయాగుణముల స్త్రీజన, మాయల సంసరణకర్మఽమర్మంబులపై
హేయతఁగను నెవ్వాఁడు వి, ద్యాయుతుఁ డవ్వాఁడె యోగ్యుఁ ఽ డమలుం డతఁడే.

క॥ వేదంబులు శాస్త్రార్థవి, వాదంబులు నెన్నియేనిఁ ఽ బరికించిన న
బ్జాభదివిజుఁడు సంసృతినెదఁ, బోఁదలఁపక మోక్షపదముఁ ఽ బొందునె తండ్రీ.

క॥ నరజన్మము దుర్లభమం, చరసియు శాస్త్రములఁ జదివి ఽ యాత్మజ్ఞానం
బెఱుఁగక తిరిగెడు మనుజుఁడు, నరుఁడే వానరుఁడుగాక ఽ నవ్యవిభూతిన్. గీ-౮

సీ॥ ఈషణత్రయముల ఽ నెడలించు నాతఁడు, ధీరుం డుదారుండు ఽ సూరివరుఁడు
ఆత్మసౌఖ్యమ్మంచు ఽ నాజ్ఞయే మేధావి, విడరాని బంధంబు ఽ వేత కలదె
చదువులు వేయేలఽసంసారబంధంబుఁ, గడఁద్రోయు చదువు నొఽక్కటియె చాలు
నెక్కడిసౌఖ్య మింఽకెక్కడి తపము గా, ర్హస్థ్యంబు చేకొను ఽ నాసపడిన

గీ॥ దారపై నాసఁ బెరిఁగినఁ ఽ దపమదెట్లు, నిశ్చయంబెట్లు తన కోక ఽ నీమమెట్లు
గలుగు క్షణసౌఖ్య మధికదుఃఽఖంబుగాక, శాశ్వతసుఖానుభవమెట్లుఽ సంఘటించు.

గీ॥ సంసరణభీతి నొంది నీ ౹ చరణసేవ, నభిలషించితి వేదవేదాంతవాక్య
నిశ్చితార్థంబు బోధించినిత్యసత్య, వస్తుతాదాత్మ్యమొనఁగూర్పవలయుఁదండ్రి.

వ॥ అని యిత్తెఱంగున శుకుండు బాదరాయణునితోడఁ బలుకు నవసరంబున, ౬౦౧

క॥ వరజుండౌటను శుకముని, విరజుం డయ్యెనని మునులు ౹ వినుతిం గొనర్పన్
సురలును బుత్రాదిచ్ఛే,త్పరాజయం బనిరి వ్యాసుఁ ౹ బరిపక్వమతిన్. ౬౦౨

శా॥ వత్సా! నా పలు కాలకింపుము వచోవాదంబు లిక్కెల్ల శ్రీ
వత్సాంకుండును నాదిగాఁగల మహాభాగుల్ వధూసంగ్రహం
బుత్సాహంబునఁజేసిరే కద తదుద్యోగంబు రూఢంబె కా
కుత్సింపఁగ బనిలేదు నిశ్చితము మాకున్ వేదశాస్త్రోక్తులున్. ౬౦౩

క॥ బందీభవనము గాదిది, సందీని సుఖంపు నెలవు ౹ జాయాగ్రహణం
బెందేని భోగసిద్ధుల, కందిన సత్కామధేను ౹ వట్టిదిగాదే! ౬౦౪

క॥ మనసున విడుచుట విడుచుట, తనువున విడుటేమిదొడ్డ ౹ ధైర్యఘనుండై
తనువున సంస్మృతిఁ బుట్టియు, జనఁడాత్మాద్వైతభోగ ౹ సరసతఁగాంచున్ ౬౦౫

సీ॥ సత్యంబు దప్పక ౹ శాస్త్రోక్తధర్మాను, తృప్తులై ద్రవ్యమార్జించి పుత్రి
దారాది పోషణ ౹ దగఁజేసి గార్హస్థ్య, కర్మంబునడపినఁ ౹ గలదు ముక్తి
బ్రహ్మచారులు వనవాసులు యతులు న, భ్యాగతాతిథులు గృహస్థులందు
నాధారపడి యుందు ౹ రదిగాక దేవర్షి, పితృఋణములు దీర్ప ౹ విధి సతంబు

గీ॥ స్థలజలంబుల నిచ్చుచు ౹ శాంతనియతి, నర్హసత్కృతు లొనరించు ౹ నట్టిగృహికి
నైహికాముష్మికంబులుహస్తగతము, లగుటసందియమొక్కింతయుఁనయవనియందు.

గీ॥ ధర్మములలోన గార్హస్థ్య ౹ ధర్మసదృశ, ధర్మ మింకొండు గలదె సద్ధర్మపరులు
ధర వసిష్ఠాదిమౌను లుదారయశులు, దారసంగ్రహు లగుటఁదథ్యముగ వినవె.

గీ॥ దారచేకొని గార్హస్థ్య ౹ ధర్మపరత, వేదశాస్త్రసదాచార ౹ విధులఁ దెలిసి
మెలఁగు మహితాత్ములకుమంచిమేలుగలుగు,స్వర్గమోక్షంబులననేమిసర్వమబ్బు

చ॥ తొలుతటి యాశ్రమంబు విధిధూర్వహవృత్తిఁ బరిత్యజించి య
వ్వలనగు నాశ్రమంబు విధివత్పరిగృహ్య ఘటంచుఁ బల్కు పె
ద్దల యనుశాసనం బెఱిఁగి ౹ తప్పక యుండుట లెస్సగాన నా
పలుకులు వీనులందిడి శుభం బెదఁగోరుము పుత్రి! ప్రీతితోన్. ౬౦౬

సీ॥ గార్హస్థ్య మార్జించి ౹ కర్మకర్మఠుఁడవై, సదసద్విభూతి సత్సంగమెనసి
యధ్వర మొనరించి ౹ యజ్వవై దేవర్షి, పితృతర్పణంబులఁ ౹ బ్రీతినిచ్చి

తనయులఁగని పెంచి ధనధాన్య వస్తుసం, భారంబు లెల్లను బంచి యిచ్చి
భవనము వెలువడి వనవాస మొనరించి, వ్రతముల శుష్కించి యతివినగుచు
గీ॥ నాశ్రమమునుండి యాశ్రమంబధిగమించి, యింద్రియంబుల గెల్చి సమిద్ధబుద్ధిఁ
బరమ వైరాగ్య సంసిద్ధిఁ బడసి తేనిఁ, బరమపదసాధని శ్రేణిఁ బట్టువడదె. ౬౧౦

శా॥ విశ్వామిత్రుఁడు యౌవనంబునఁ దపోవిశ్వాసియై కానలన్
శశ్వన్నిష్ఠలఁ గాలమోర్చుచు మహాశ్చర్యంబుగా స్తంభకృ
న్నిశ్వాసుండయి మూఁడు వేల సమముల్ నిష్ఠన్ నిరాహారుఁడై
యాశ్వాసింపఁగ లేక యచ్చరకు వశ్యభ్రాంతి లోఁగాఁడొకో. ౬౧౧

గీ॥ కౌశికుఁడు బిట్టుతపమునఁ గ్రాగుచున్న, వేళ మేనక యను దేవవేశ్యరాఁగఁ
గాంచి నా తప మిట్లు ఫలించి వచ్చె, ననఁగఁ జను దెంచె నీ సుందరాంగి యహహ.

చ॥ అని వగలాడి సోయగము నారసి యారసి మోహవిభ్రమం
బెనయఁగ హావభావముల కెంతయుఁ జిక్కి నితాంత కామబా
ణనిహతి సుక్కి యక్కలికి నవ్యరతోత్సవ కేళిఁ దేలుచుం
దనయ శకుంతలం గనిమెఁ దాత వరింపఁడె దాశపుత్రికన్. ౬౧౩

ఆ॥ తమ్మిచూలి తనదుతనయ పై మరులొంది, పంచబాణ తీవ్ర బాణహతికిఁ
దాళలేక తుదకుఁ దలఁగోలుపడె హరుఁ, డడఁగెఁ గామబాధనడచువాఁడు.

ఉ॥ కావున సత్కుల ప్రభవఁ గన్నియఁ దెచ్చెదఁ బెండ్లియై సదా
భావభవప్రదీప సుఖపారణలన్ దనివొంది పుత్రపౌ
త్రావళి గాంచి తాపస జనాశ్రమ సీమలఁ దోడివారితో
నీవు సుఖింపుమయ్య సుత! నిన్ గని నిచ్చలు నూరడిల్లెదన్. ౬౧౪

సీ॥ చతురాశ్రమాధార సార్వభౌమతఁ దెచ్చు, నద్వితీయము ద్వితీయాశ్రమంబు
ప్రకృతి పూరుష భేద భావ ప్రభంజకం, బద్వితీయము ద్వితీయాశ్రమంబు
దేహేంద్రియాయాస దీర్ఘాటవీవహ్ని, యద్వితీయము ద్వితీయాశ్రమంబు
అనులాప విరహితం బయి సర్వమొనఁగూర్చు నద్వితీయము ద్వితీయాశ్రమంబు
గీ॥ నిరవధిక నిత్య నిరుపమ నిర్వికార, భోగ సామ్రాజ్య సమరస స్ఫూర్తినొసఁగి
యేది కోరిన నెడలేక యిచ్చు సిద్ధి, నద్వితీయము శ్రీద్వితీయాశ్రమంబు.

## — శుకకృత సంసారనింద. —

చ॥ పలుమరు నిట్లు తండ్రి యను పల్కులు వీనుల నానసీక ని
శ్చలతరమానసుండయి ప్రసన్నముఖంబునఁ దండ్రిఁ జూచి స

న్నలమటఁ బెట్టనేల నిరహంకృతినై వనవాసి నయ్యెదన్
వలదు గృహస్థ వృత్తి ఘనవాగురతో సమ మెల్లవారికిన్. ౬౧౭

మ॥ ధనచింతాతురుఁడై దిగంతముల సంతాపించుచో లేశమై
నను జాలింగొని యెవ్వఁడిచ్చు నదియున్ ~ గాకెల్ల మిత్రాళి ని
ర్ధనునిన్ జూచి హసింతురే కద సదా ~ దారాత్మజార్థంబు భూ
జన సంఘాట కవాట వాటముల నీర్ష్యన్ దోఁపులున్ దప్పునే? ౬౧౮

క॥ లోకత్రియ పాలకుఁడగు, పాకారియు బికిరమునకుఁ ~ బడు శ్రమ మసదే
లోకములో నన్యులగతి ,నే కొలఁది వచింతు బిచ్చమెత్తక చనునే. ౬౧౯

మ॥ వనిలో నిల్చి తపంబు సేయుచు సుఖవ్యాపారియై యున్న మా
నిని గన్గొన్న సురేంద్రుఁడై నను మదిన్ ~ నిర్నిద్రుఁడై భీతుఁడై
తనభోగంబుల కాసఁజెందు నని చింతన్ జెంది దేవాళితో
ఘనవిఘ్నంబులు నిచ్చలున్ సలుపఁగాఁ ~ గాంక్షించుఁ దా నెంతయున్. ౬౨౦

ఉ॥ భారతిఁ గూడి ధాతయును ~ భార్గవిఁ గూడి జనార్దనుండు సం
సారపరిశ్రమార్తులయి ~ చాల శ్రమంపడరే?. తపంబులున్
ఘోరరణంబులున్ సవనకోటులు సేయుటకున్ గతంబు సాం
సారిక ధర్మవృత్తి గద ~ సంయమి కిట్టి విపత్తు లున్నవే. ౬౨౧

మ॥ భగవంతుం డగు శంకరుండును గృహారంభియై పార్వతిన్
సగమై, చేకొనఁగాదె సౌఖ్య మొక లేశంబైనఁ దాఁ గాంచెనే
జగతిన్ నిర్ధనుఁడౌ నరుండు వనితాసంయుక్తి సాధించి దు
ర్భగవృత్తిన్ బరిచరించి లోకులు నగన్ ~ భ్రంశంబు నొందున్ గదా. ౬౨౨

చ॥ తెలియని యర్థముల్ గలవె ~ దేవసమానులు మీరు శంకరున్
వలగొని తత్ప్రసాదమున ~ నన్ను నయోనిజుఁ బుత్రుఁగాంచి చం
చలమగు ఘోర సంసరణ ~ సాగర పూరములోనఁ ద్రోతురే
వలదిఁక స్వస్వరూప సుఖవాంఛను దీర్ప ననుగ్రహింపుఁడీ. ౬౨౩

సీ॥ మలమూత్ర భక్షినై ~ మాతృకుక్షినిఁబుట్టి, జననజరామృతుల్ ~ గనుచునుండి
వేదశాస్త్రాభ్యాస ~ వివశుఁడై ధనకాంక్ష, శ్రీమంతుల గృహాళిఁజేరుకంటె
నేకోదరుం డౌచునింద్రియార్తికి వనో,జ్జ్వల మూలఫలముల ~ సంతతంబు
నే నేరుపుననైన ~ నీ కుక్షిఁబూరించి, బ్రతుకక యీషణాత్రయముఁదవిలి

గీ॥ పటుకుటుంబంబు పెంచి తద్భరణదుఃఖ,పీడితుండగుకంటె నిర్విషయవృత్తి
భోగరాగంబులనువీడి ~ పూర్ణబోధ, మొంది సర్వాత్మ నగుచు నే ~ నుందుఁదండ్రి

ఉ॥ కొందఱు జ్ఞానశాస్త్రమని ♦ కొందఱు యోగమటంచు భూస్థలిం
గొందఱు ధర్మశాస్త్రమని ♦ కోటివిధంబులఁ బల్కుచుందు రే
నిందఱి మార్గముల్ గొనఁగ ♦ నిచ్చఁ జనింపదు వేదమార్గముం
గొందును దద్విధుల్ గన నకుంఠితముల్ క్షయవృద్ధు లొందుటల్. ౬౨౫

చ॥ శతపదిరీతి నిల్ మరగిఁ ♦ సంతతముం రుధిరంబుఁ బీల్చుచుం
బతి వెతలం గలంచుఁ గద ♦ భామిని యీ నడిఁ గానలేక మూ
ర్ఖత జను లంగనాసుఖముఁ ♦ గాంక్షయొనర్తురు తేనెఁబూయు ఖ
డ్గతతులు పంకజాక్షు లనఁగా వినమే బహుభాష లేటికిం. ౬౨౬

కం॥ కుటిలోక్తుల మానసములు, పటుభోగముల న్ధనమ్ము ♦ బలముం జలముం
విటతాటన మొనరింతురు, కుటిలాలక లెటులు నమ్మఁగానగుఁ దండ్రీ. ౬౨౭

ఆ॥ దారసంగ్రహంబు ♦ ధాత విధించుట, మూఢులకును నిదుర ♦ మొదలఁ జెడుట
సుఖముపోక పరము ♦ శూన్యమై పోవుట, నింతకన్నఁగలదె హేయవృత్తి. ౬౨౮

కం॥ ఎన్నివిధంబులు చూచిన, నన్నులతోఁ బొందు మానహానియు దుఃఖం
బెన్నటికిం దప్పదు సౌఖ్యోన్నతి యిసుమంత లేదహో! యనునంతం. ౬౨౯

కం॥ తానును నాశ్రమవాసులు, మానులునుం దగినయట్టిమాటల సుతునిం
మానసముఁ ద్రిప్ప నేరుపుఁ, గానక వ్యాసుండు చాలఁ ♦ గటకటపడుచుం. ౬౩౦

ఉ॥ కన్నుల నీరునింపి తటకాపడి చూచుచు మేను వణంకఁగా
విన్నఁదనంబు మోముపయి ♦ వేదురుఁ గొల్పఁగ శోక సాగరో
త్పన్న తరంగ శీకర వితానము పైఁబొరలెత్తె నాఁగ మై
మున్నె చెమర్ప గద్గదిక ♦ ముని యొకింతయుఁ బల్కకుండినం. ౬౩౧

సీ॥ విస్మయోత్ఫుల్లమై ♦ వికసించు తామర,కవ నాఁగ నేత్రయుగ్మమ్ము తనర
శుకుఁడు దండ్రినిఁ జూచి ♦ శోకనిర్మగ్నుఁడై, దీనుడై యున్నట్లు ♦ తెల్లమయ్యె
ననుచు నవ్వుచును మాయామహత్త్వం బెన్న, నలవియే వేదవేదాంత వేది
సర్వజ్ఞుఁ బండితుఁజతురు బద్ధులఁ జేయు, నీ మాయ యంచు నేనింత యెఱుఁగ

గీ॥ నెంతవారల దా నింక ♦ నింత సేయ, దీ మహాత్మ్యఁడు నిగమంబు ♦ లేర్పరించె
భారతముఁ జెప్పెను బురాణపటలమెల్ల, నర్మిలి వచించె దెలియంగనల్పుడయ్యె.

క॥ ఘటనాఘటనపటీయసిఁ, జటుల మహామాయ నంబ ♦ సామర్థ్యవతిన్
స్ఫుటవాఙ్మనస్కృతులచే, జటదోఁగఁగ భక్తి సల్పి ♦ శరణమటంచున్. ౬౩౩

కం॥ హరిహర హిరణ్యగర్భులఁ, బరవశులన్ జేయుఁగానఁ ♦ బరులకు మాయా
గరిమముఁ దెలుపక సర్వోత్తరమై వర్తించుఁగాదె ♦ తా సర్వంబై. ౬౩౪

సీ॥ ముజ్జగంబుల సర్వ◊మోహనావహమైన, యేదేవి మాయ మా◊యించుచుండు
మూర్తిత్రియంబును ◊ మోహితుల్ గారొకో, యేదేవి బలవీర్య◊సమృద్ధి గరిమ
నేమని ధ్యానింతు ◊ నిట్లు మోహమ్మున, బాదరాయణుని సం◊బద్ధుఁ జేసె
నారాయణుని యవ◊తారము సర్వజ్ఞుఁడీ వ్యాసుఁ డని జనం◊బెల్లఁ బొగడఁ

గీ॥ గలము పగిలిన వర్తకుఁ ◊ గరణి మోహ,సాగరంబున మునిఁగె మ◊జ్జనకుఁడహహ
పరమ శక్తి మహామాయ◊బడక యెవఁడు, నిల్వఁజాలును ధరణి ని◊ర్ణిద్రమహిమ!

గీ॥ పంచభూత మయం బీ ప్ర◊పంచమెల్ల, నితఁడు జనకుండు నందనుం ◊ డితఁ డటంచు
భ్రాంతి మాత్రంబె కాని యా◊వాసనలకుఁ,గారణంబిట్టిదని చెప్పఁ◊గలమె యెందు!

కం॥ అది గావున నా శక్తిన్, మదిలోఁ దలపోసి మ్రొక్కి ◊ మాయామయ స
ర్వదయానిధి నీశ్వరి నెంచెద నని సేవించి మునుల ◊ చిత్తము లలరన్. ౬౩౭

శా॥ దీనుండై ఘనశోకమగ్నుఁడయి యెం◊తేఁ గన్నులన్ గార్వలై
మేనెల్లన్ దిగజాఱు నశ్రుజలముల్ ◊ మేల్మేల్మిఁ బోఁజేయుచున్
గ్లానిన్ జెందుచునున్న తండ్రిఁగని శం◊కన్ బాసి యంతర్ముఖీ
సూనుం డయ్యరణభవుం డనియె న◊చ్చో వేదసారోక్తులన్. ౬౩౮

గీ॥ ప్రాకృతుండైన మానవు ◊ పగిది నీవు, తండ్రి! శోకింపఁ బనియేమి ◊ ధరణి సర్వ
బోధకుండవు సర్వజ్ఞ◊ బుద్ధిశాలి, వగుచు నిట్లడలంగ న్యా◊యమ్మె నీకు. ౬౩౯

శా॥ ఏ యే జన్మములందు నే సుతుఁడనై ◊ యెవ్వారికిన్ బుట్టనో
యా యా తండ్రుల నే నెఱుంగుదునె నేఁ ◊ డాత్మోద్భవుం డంచు ని
ట్లాయాసంబును జెందనేల మన కీ ◊ యన్యోన్యసంబంధముల్
మాయాకల్పితముల్ భ్రమాత్మకము సు◊మ్మా! "నీవు నే న న్నడుల్." ౬౪౦

చ॥ తెలిసినవాఁడవై మనసు ◊ దీనత నొందఁగఁ జింతఁదక్కి వం
తలు గొన నేది మోహమయ◊ధర్మములంచు నెఱుంగు మీ వికన్
జెలఁగి చరింపుమయ్య వన◊సీమల నిత్య విరక్తచిత్తతన్
మెలఁగెడు మిమ్ము బోఁటులకు ◊ మేకొనఁగూడునె యిట్టి కృత్యముల్. ౬౪౧

సీ॥ కడుపార మెక్కక ◊ కొడుకులఁ జూచిన, నాకలి తీరిన ◊ దనుటఁ గలదె
శీతలోదకముల ◊ సేవింప కాత్మజ, దర్శనంబున నింత ◊ దప్పిచనునె
శ్రోత్రాదులను శబ్ద◊సుఖము నొందక పుత్రి, దర్శనంబున నింత ◊ తనివిగలదె
శ్రీచందనాదులఁ ◊ జెందక కొమరునిఁ, గన్నంత సంతృప్తి ◊ గలుఁగు నొక్కొ

గీ॥ గాధిజుఁడు పశుకాముఁడై ◊ కాంక్ష సేయ, సుతు నజీగర్తు నీయఁడే ◊ సొమ్ముగోరి
మాటమాత్రంబెకా యిట్టి ◊ మమతలెల్ల, భ్రాంతిగాఁ జూడవలదొకో◊పండితులకు.

గీ॥ ఇమ్మహి సుఖార్థులకు ధనంబిమ్ము సుమ్ము, ధనముగాంచి సుఖింపుముతండ్రి! నన్ను మమతఁ జేకొని లోలత మఱగ దేని, నేమి సుఖ మబ్బు భ్రాంతి నీవింక విడుము.

కం॥ దైవజ్ఞుఁడ వీ విఁకఁ నను, బోవిడుపక, బుద్ధిఁగొలిపి బోధింపుము గ ర్భావాస భీతుఁడను శర, ణానన! నా కోర్కెఁ దీర్ప నాత్మహితమగున్. ౬౪౪

ఉ॥ మానుషజన్మ దుర్లభము మానవుఁ డయ్యును విప్రుఁడౌట మే లౌను భవత్కృపాగరిమ యన్నిఁటికిన్ మఱి మేలుతావు నం దే నుదయించినాఁడ నను నేటికిఁ బద్ధునిఁజేయఁజూచెదో మానివతంస! సంసరణమాయకు డాయకు మంచుఁదెల్ప వే. ౬౪౫

కం॥ అనితర శరణత నీ పద, వనజంబులు, పట్టినాఁడ వదలకుము దయా వనధీ! యని వేఁడెడు శుకుఁ, గని వ్యాసుఁడు పల్కెఁ దనకుఁ గ్రమ్మరఁ డనుచున్.

## —॥ దేవీభాగవత ప్రశంసనము ॥—

సీ॥ ఓమహాభాగ! నేనొకటి దెల్పెదఁ బంచ, లక్షణలక్షితం బక్షతంబు భాగవతంబను బ్రహ్మబోధకము పు, రాణంబుగలదు సర్వనిగమార్థ సారంబు ద్వాదశస్కంధ బంధురము దే, వీ పరం బది విన్న వికృతు లడఁగు సదసద్వివేకంబు సంధిల్లు సర్వ పు, రాణ భూషణ మది రక్తిఁగొల్పు
గీ॥ బటన సేయుము విష్ణుండు ప్రళయమునను, వటదళశయానుఁడై బాలభావమూని యేలను సృజించెఁ జిద్రూపి యిటులనన్ను, సర్వవిజ్ఞాన మెట్టులు సంభవించు.

మ॥ అని చింతించుచు ముక్తిదుండయిన యయ్యంభోజనేత్రుండు నె మ్మన మూఁడాడఁదలంచు నత్తఱి మహామాయా పరాశక్తి యి ట్లనియెన్ సర్వము నేనె సుమ్మిఁక మదన్యం బింతయున్ లేదనన్ విని తద్వాక్యము సర్వమున్ దెలిసి యవ్విష్ణుండు విభ్రాంతుఁడై. ౬౪౭

ఉ॥ ఈ పలు కెట్లు వచ్చెనొకో యెవ్వరొ వక్తలు వారు చూడఁగా స్త్రీపురుషాది రూపములచేఁ జెలువొందుదు రొక్కొ! యెట్లు నా కీ పరమార్థముల్ దెలియ నెద్ది యుపాయ మటంచుఁ జింతచే నా పురుషోత్తముండు మది నల్లిన చింత మునింగి యున్నెడన్. ౬౪౮

సీ॥ సాత్త్వికీ రూపమై శంఖచక్రాదులు, భుజచతుష్టయమునఁ బొలుపుమీఱ దివ్యాంబరంబులు దివ్యభూషణములు, భాగధగ్యస్ఫూర్తి తళుకులెత్తఁ దనరూపు రేఖల దనరి వేల్పొలంది, చెలికత్తియలు భూతి చెలువుఁ దెలుప వటపత్రశాయియౌ వాసుదేవునిచెంత, శ్రీమహాలక్ష్మియై చిన్నినగవు

గీ॥ నెమ్మొగంబునఁ జిగురింప ఽ నిలిచియెదుట, సకలభువనైక జనని విఽశ్వప్రకాశి
సర్వ సమ్మోహినీశక్తి ఽ సగుణయగుచు, సన్నిధానంబునందు సాఽక్షాత్కరించె.

వ॥ ఇత్తెఱంగునన్ బ్రసన్నయై రతియును, భూతియును, బుద్ధియు, మతియును, గీర్తియు, స్మృతియు, ధృతియు, శ్రద్ధయు, మేధయు, స్వధయు, స్వాహయు, క్షుధయు, నిద్రయు, దయయును, గృతియును, దుష్టియును, బుష్టియు, క్షమయు, లజ్జయు, జృంభయును, దంద్రియు, జయయు, విజయయు మొదలగు శక్తి సహ స్రింబులు పార్శ్వభాగంబులన్ గొలువ, మందారమాలాలంకరణంబులు, ముక్తా హారంబులు, నానావిధరత్నాభరణంబులు మెఱయన్ బ్రత్యక్షమై యున్న పరాశక్తిం గాంచి, యీ ప్రళయార్ణవంబున సకల భూత విలయంబై యున్న యెడ నీ మహాభాగ యెవ్వతెయో జననం బెచ్చోటనో పరిచారికాసహస్రంబు లెందు వర్తింతురో యీ న్యగ్రోధం బెం దుదయించె, న న్నీ వటపత్రంబునన్ బవ్వళింపన్ జేయువా రెవ్వారలో, బాలభావంబున నన్ను నియమించుట యెట్లు లొకో, నాకున్ జననియో, కాక మహారూపిణియైన కాళరాత్రియో దేని గుఱించి వచ్చెనో, పలుకరింతునో, యూరకుందునో యని విస్మితుండై తలపో యుచు బాలభావంబున నెఱుంగన ట్లూరకుండుట మేలని తలంచి యున్నంత.

మ॥ వటపత్రంబునఁ బవ్వళించి తన దిఽవ్యంబైన రూపంబు పైఁ
దటకా చూపు నిగుడ్చి యున్న హరిపై ఽ దాక్షిణ్యమున్ జూపుచున్
స్ఫుటవాగ్ధోరణి నంబ పల్కె విను మంఽచున్ జిత్రమేలయ్య ? యు
త్కట తేజోమహిమాఢ్య నిర్గుణ పరంఽధామంబు సర్వంబునన్. ౬౭

గీ॥ అమ్మహాదేవి కృత్యంబు ఽ లద్భుతములు, నిముసమునఁ గర్వరమునంటఽనిన్ను నన్నుఁ
ద్రిప్పు నద్దేవి ప్రళయాంబుఽధిని నిజేచ్ఛ, సగుణులము నీవు నేను నఽజ్జనని కెపుడు.

ఆ॥ సాత్త్వికుఁడవు నీవుఽ సాత్త్వికనేను న,స్మద్విభూతులెల్ల ఽ శక్తు లెఱుఁగు
మింతమీఁదఁ బ్రళయఽ మెడలు నీ నాభి ప,ద్మంబులోనఁ బొడముఽ ధాత వినుము.

చ॥ నలువ తపంబుఁ జేసి యవిఽనశ్యముగాఁగను గర్త యాచుఁ ద
ద్బలమున ముజ్జగంబులు యఽథావిధి సృష్టి నొనర్చు రాజస
చ్ఛలమగు లీలచే విషయఽసంతతి నింద్రియనాథులన్ నిరా
విలముగ నీవు నీ జగము ఽ పెంచుచు నుందువు సర్వకాలమున్. ౬౮

సీ॥ అంబుజాసనుని ఫాఽలంబున రుద్రుండు, ప్రభవించి ఘోరతఽపం బొనర్చి
తామసీశక్తితో ఽ దంటయై కల్పాంత, కాలంబునను జగఽత్త్రయ మొనర్చు
నేను సాత్త్వికను నేఽనెప్పుడు నీ దంటఁ, బాయకయుందు శ్రీఽవత్సమునను
నని పల్కె నోదేవి ఽ యాది శ్లోకార్థంబు, వింటి యదుక్తమో ఽ యింటవెడలెఁ

గీ॥ జెన్నిధిని మాటిమాటికిఁ జేదవోలె, సంస్మరింపుదుఁ బరమార్థసారమైన
తద్రహస్యంబుఁ దెలుపు సార్థకతఁగాఁగ, సందియముఁదీర్చి కరుణింపఁజాలెదనిన.

చ॥ దితిజ విరోధి పల్కువిని దేవి మొగమ్మున నవ్వుదొల్క సం
తత కరుణార్ఘురుల్ దొరఁగి తండము గట్టఁగఁ బల్కె నిర్గుణా
కృతియగు నాదిశక్తి కృపఁ గీల్కొని నీకుఁ గలట్టి చింత నీ
మతినెడ సేయు సందియము మాన్పఁదలంచి వచించె నట్టులన్. ౬౪౮

గీ॥ వేదసారంబు శాస్త్రార్థ విదిత మిట్టి, యర్థ మానతి యిచ్చె నయ్యాదిశక్తి
యింతకన్న రహస్యంబు లేమిగలవు, తెలియఁదగు నర్థ మిదియంచుఁ దెలిపెనాపె.

చ॥ కరుణకుఁ బాత్రి మీ వనుచుఁగాదె జగజ్జనయిత్రి యిట్టు లం
బర వచనంబుగాఁ బలికె భవ్యము నీ కగు నన్న దేవి కిం
కరణిని నామెడన్ గరుణగల్గెను సందియమేల మద్భుజాం
తర వరపీఠి నిల్పుమని తాఁగొనె సాత్త్వికి నచ్యుతుం డొగిన్. ౬౪౯

కం॥ వెలుపల సాక్షాద్రూపము, నిలుపుటయే గాక లోననిలిచెన్ హృదయ
స్థలమున జగదంబిక ని,శ్చలమంత్రాకృతి నభీష్టసంసిద్ధులతోన్. ౬౫౦

—॥ శ్రీవిష్ణువు దేవీమహిమంబు చెప్పుట ॥—

ఉ॥ అంతట నాభిపంకజమునందు జనించెను దమ్మిచూలి దు
ర్దాంతులు దైత్యు లిర్వురు మదమ్మునఁ గ్రొవ్వి యజున్ గలంప దై
త్యాంతకుఁ డేగుదెంచి దితిజాధములన్ దెగటార్చి మంత్రి మ
త్యంత ముదమ్మునన్ జపవిధానముచేత జపించె నిచ్చలున్. ౬౫౧

ఉ॥ ధ్యానసమాధినిష్ఠుఁ డగు తండ్రినిఁ జూచి మహాత్మ! యెవ్వరిన్
బూని జపించెదీవు పరిపూర్ణుఁడ వెవ్వఁడు నీకు జప్యుఁడౌ
నా నలినాక్షుఁ డిట్లనియె నన్నును నిన్నును గన్న తల్లి నే
మానసమందు నిల్పి గరిమంబు జపించెద సర్వశక్తినిన్. ౬౫౨

సీ॥ సంవర్తమున జగత్సమితి యే పరశక్తి, యుదరంబులోపల నొదిగియుండు
దృష్టృ దర్శన దృశ్యతాదాత్మ్యమునను దా;నఖిల స్వరూపమై యధివసించు
విలయంబు దీఱిన వెనుక యథాపూర్వ,లోకసృష్టి యొనర్చి లోన నణఁగు
ముక్తి సామ్రాజ్యాభిషిక్తులుగాఁ జేసి, యాత్మల నాత్మైక్య మందఁజేయు

గీ॥ నిత్య సత్య స్వరూపమై నిఖిలమెల్ల, శుద్ధ చిన్మాత్రముగఁ గీలు చూపి యద్వి
తీయమై బ్రహ్మమై పరాదేవి ననుచు, వెలయు నట్టి పరంజ్యోతి వినఁగలేదె

సీ॥ సంసార బంధముల్ చక్కాడి ముక్తికి, మూలమై వెలయు నస్మూర్తి వలన
ముజ్జగంబులు గల్గె మూఁడు గుణంబు ల,మ్మువ్వుర మైతిమి మొదటి చిత్తు
శక్తిసుమీ వత్స! సందేహ మిసుమంత, సేయకు సిద్ధాంతసిద్ధి యిదియ
శ్లోకార్థమునఁ జెప్పెఁ జూవె భాగవతంబు, ద్వాపరాంతంబున వ్యాసువలన
గీ॥ విస్తరిల్లు నా బ్రహ్మకు విష్ణువొసఁగె, నతఁడు నారదునకు నిచ్చె నతనివలన
నేఁబఠించితి వివరించి నిశ్చయించి, ద్వాదశస్కంధములు చేసి పరముఁగంటి.

క॥ నిరతము నీవును దేవీ, చరిత ముత్తమము తత్త్వసారము వృతాని
సురవధ వినోద భరితము, దురిత నివారణము దుఃఖదూరము పుత్రా.

కం॥ అజ్ఞాన నాశకము బ్రహ్మజ్ఞానోత్పాదకంబు నతులంబును ద
త్త్వజ్ఞులకు నుపాదేయము, ప్రాజ్ఞుఁడవై యభ్యసించు భాగవతంబున్. ౬౬౬

వ॥ మఱియు నిప్పురాణంబు దీర్ఘాయుష్కరంబును బాఠకశ్రోతృజనంబులకుఁ బుత్ర
పౌత్ర ప్రవర్ధకంబును గావున మచ్ఛిష్యుం డగు రౌమహర్షణియును సచ్ఛాత్రుండై
నీతోడం గూడి పఠియింపఁగలవాఁడు మీ రిరువురును బఠింపుఁడని నియోగించిన
తదాజ్ఞాప్రకారంబు నియమంబున మే మిర్వురము పఠించితిమి. శుకుం డట్లయ్యును
మనోవిశ్రాంతిన్ జెందక దీనుండై యుండి యక్కడక్కడఁ దిమ్మరుచు వికల
చిత్తంబున భోజనమజ్జనాదులయం దాసక్తుఁడు గాక నుపవసింపుచుఁ జింతా
విష్టుండై యున్న పుత్రునింజూచి మద్గురుండు కుమారా! యేల నీ విట్లు ఋణ
గ్రస్తుండునుం బోలెఁ జింతిల్లుచు నధ్యయనం బొనర్పకున్న వాఁడ వేను గలుగ
వెఱపేటికి నిత్య సుఖివై కామంబు లనుభవింపుము జ్ఞానం బుపార్జింపుము మద్వా
క్యంబుల నవిశ్వాసి వై తేని మిథిలకుం జను మందుఁ బరిపూర్ణజ్ఞానవంతుండును
శుచియు యోగియు శాంతుండును వక్తయు యోగప్రియుండును నగు జనకుం
డను రాజర్షి గలం డమ్మహాభాగుని వలనం దెలియందగు సందియంబుల నెఱుంగు
మని పలుమాఱు బుజ్జగించిన నా శుకుండు వ్యాసున కిట్లనియె. ౬౬౭

## —• శుకుఁడు మిథిలా నగరంబున కేగుట •—

ఉ॥ దంభము మూర్తి దాల్చిన విధంబున నున్నది మైథిలుండు భూ
జంభవిరోధియై ధరణి సర్వము పాలనసేయు నాతఁ డ
స్తంభ వివేకశాలి పరతత్త్వవిభాగ సమర్థుఁడంటి వు
జ్జృంభత వంధ్యకుఁ సుతునిజెప్పిన పోలికఁదోచ నయ్యెడిన్. ౬౬౮

శా॥ జీవన్ముక్తుఁ డటంచుఁ జెప్పితివి యా శ్రీమంతుఁ డీ సంసృతిన్
భావం బేమియుఁ జొన్ప కంబుజదళాంతఃపద్ధతిన్ నిల్చు నం

చీ వాచస్ఫురణంబు సేయుట మనం । బెంతేని సందేహ భా
రావిష్టం బయి రాజుఁ గాంచుటకునై । యావేశముం జెందెడిన్. ౬౬౯

క॥ ఇంతన నేటికిఁ జన సిద్ధాంతము బలె మోక్షమార్గ । మది భిన్నంబో
వింతగఁ గృత మకృతమ్మని, స్వాంతములన్ గనుట గలదె జగములలోనన్. ౬౭౦

క॥ భుక్త మభుక్తం బగునో కో, సక్తుఁడు గాకున్న విషయసంగతిగలదే
రక్తిగాని కర్మసేయక, వ్యక్తంబుగఁ గార్యసిద్ధి । వశమే పొందన్. ౬౭౧

సీ॥ తల్లియుఁ గొమరుండు సోదరుణియుఁ జెల్లెలుఁ, గులటయు నని యనుకొనుట గలదె
తీపి కారము చేదు । తిక్తము మొదలగు, రుచు లెఱుంగక భుక్తి । రూఢిగలదె
శీతోష్ణ సుఖదుఃఖ । సిద్ధ్యసిద్ధ్యాది విజ్ఞాన మెబ్భంగి విశదమునగును
సఖులును శాత్రవుల్ । సఖ్యముల్ వైరముల్, గనుట యేరీతి సంఘటితమగును

గీ॥ గాన నిటువంటి భేదంబు । గనక రాజ్య, పాలనం బెట్లు సిద్ధించుఁ । బరగనేని
నతఁడు ముక్తుండటంచు నెట్లనఁగనగును, ముక్తుఁడగుటకు గార్హస్థ్యమునఁ దరంబె.

చ॥ ధరణిని భేదభావములు । దక్కక ముక్తి పొసంగ నేర దె
వ్వరికిని నిట్లయేని గృహవర్తన మెప్పుడు ద్వంద్వశూన్యుఁ డౌ
నరపతి మానియంటివి విసనం గడు నబ్బురమయ్యె నవ్విభున్
స్థిరమతిఁ గాంచు వేడుక మదిన్ జివురించెను నాన తిమ్మఁగన్. ౬౭౩

చ॥ అని జనకాంఘ్రిపద్మముల । యందు నమస్కృతిఁ జేసి భక్తియున్
వినయము మించ మీ పలుకు । వేడుకఁ బుట్టఁగఁ జేసె నాత్మలో
జనపతిఁ జూచివత్తు నృపసమ్మతిగాంచునొ ద్వంద్వశూన్యుఁడై
జనముల నేలునో కడఁగి । శాసనమందునొ తెల్లమయ్యెడిన్. ౬౭౪

గీ॥ దండమునకును మూలంబు ధర్మమని వచించి రార్యులు మన్వాదిస్మృతులయందు
జనకుఁ డెబ్భంగి రాజ్యంబు సలుపువాఁడొ, యతనిఁ గనుఁగొనెదను దండ్రి యాజ్ఞ నిమ్ము.

ఉ॥ పోయెద నన్నఁ బుత్రుఁ గని । పొంగుచుఁ గౌఁగిటఁ జేర్చి బ్రహ్మవి
ద్యాయతవృత్తి నిస్పృహుఁడవౌచుఁ జరింపుము నీకు మేలు దీ
ర్ఘాయువు నయ్యెడున్ జనకుఁ । డాదరవృత్తి బహూకరించు నీ
వాయెడ కేగిరమ్ము మఱి । యచ్చట నచ్చట నిల్వఁబోకుమీ. ౬౭౬

ఉ॥ నందన! నిన్నుఁ జూడని దినంబు యుగం బగు నిన్నుఁ జూచినన్
జందనలభ్యమౌ నటులు । సౌఖ్యము గల్గును గానఁ జింతలోఁ
గుందఁగ నీకు మీవె సుమి । కోరిన పట్టివి నాకుఁ బ్రాణమై
యుండె వసింపు మెచ్చటికి । నేగకు మ వ్విభుఁ జూచి రమ్మఁగన్. ౬౭౭

కం॥ నీ మదిలో సందేహము, లేమియు లేనట్లు దెలియు * మెంతయు సరిగా
నా మహనీయుఁడు దెల్పును, క్షేమం బగుఁ దత్త్వసిద్ధిఁ * జెందుము వనినన్. ౬౭

చ॥ అని యిటులాడు తండ్రికి నయంబున మ్రొక్కి శరంబు బోవు రీ
తిని బహుదేశ దేశములుఁ * దిర్మి పల్లెలు పట్టణంబులున్
వనులు నదుల్ గిరుల్ ప్రణవనాదసముల్లసితాశ్రమస్థలుల్
చనిచని మేరుపర్వత విశాలపథంబున నొంటి నేగుచున్. ౬౮

సీ॥ తరణి సందర్శన * తప్త మానీంద్రుల, నిత్యాగ్నిహోత్రుల * నియమపరుల
ప్రాణ సంయమన యోగాభ్యాస ధీరుల, వనవాసులను శైవవైష్ణవులను
సౌర శాక్తికులను * సదసద్విచారుల, సారసోత్కీర్ణ కాసారములను
దిలకించుచును సురాచలపథంబును దాటి, దీవ్యద్ధిమాద్రిని * దిరిగి యొక్క-

ఆ॥ వత్సరమున దాటివచ్చి మహా భోగ, భరితమైన జనక * పట్టణంబు
గాంచి భోగభాగ్య * కలితులై సుఖమందు, జనులఁజూచి సంతసమునఁ బొదలి.

కం. అధ్యయనాధ్యాపక చతు,రాధ్యేతృజనమ్ముఁ జూచి * హర్షించుచు బ్ర
హ్మాధ్యానతత్పరత శుకుఁ, డధ్యాసంబనుచు నెంచి * యరుగుచు నెదుటన్. ౭౦

## —• శుకుని భటుఁ డడ్డగించుట •—

మ॥ మిథిలాద్వారముఁ జొచ్చునంత నొక కుంభీనాథసంకాశుఁడా
నథముం డడ్డమువచ్చి యెందుఁ జనెదో * యర్థంబు వాంఛించి యే
పథమున్ దూఱెదఁటన్నఁ బల్కక బహిర్ద్వారంబు చెంతన్ వసిం
చి ధరాకాంతునిఁ జూడఁగోరుచు సునిశ్చింతాత్ముఁడై యుండఁగాన్. ౭౧

కం॥ ఎవ్వారల నీక్షింపక, యెవ్వారలతోడఁ బలుక * కెడనెడఁ దనలో
నవ్వుచు నబ్బురమందుచుఁ, గవ్వపుఁగొండవలె నిలిచి * కదలకయున్నన్. ౭౨

సీ॥ ద్వారపాలకుఁడంతఁ * దఱిసి బ్రాహ్మణుఁడవు, పలుకక యిట్లేల * పరితినఁబట్టి
నట్టులుంటివ దేమి * యర్థించి వచ్చితి, విందిరియవ్యాపార * మెడలెనేనిఁ
బ్రాణికిఁ గార్యముల్ * ఫలమొందవని నాకుఁ, దోఁచును విభునాజ్ఞఁ దోవవిడుతు
మజ్ఞాత కులగోత్రులగువారి కివ్విడుఁ, జొరరాదు మారాజుఁజూడఁగోరి

గీ॥ వచ్చితివి నాకుఁ దెల్పక * వశముగాదు, నన్ను వంచింపఁదలఁచియోగివ్వోదీవు
నీ విరాగంబు దంభంబు * నేను గందు, నిట్టి వాఁడవు నీ వేల ? * యిందునిలువ. ౭౩

కం॥ అసిధారకన్నఁ దీక్ష్ణము, మసలఁగ నీ యధిపునాజ్ఞ * మన్త్రియవృత్తిన్
వెసఁజను మొందేని నరన్, హసనమునం బల్కె బాదరాయణి యంతన్. ౭౪

చం॥ పరులకుఁజేర దుర్లభము పట్టణమంచని నే నెఱుంగుదుర్
ధరణిపులందు దుర్లభులు దర్శనమీరని మున్న గాంచితిన్
సరిసరి నేను వచ్చుపని సార్థకమయ్యెను భ్రాంతినొంది భూ
వరుఁ గన వచ్చినాఁడ వనవాసుల కిట్టి విచార మేటికిన్. ౬౮౬

ఉ॥ ఐనను వచ్చినాఁడ వసుధాధిపుఁ జూడఁగ నింతమాత్ర నీ
చే నవమాన మొందితిని సీ! యననేటికిఁ జేయు కర్మముల్
మానునె ప్రాణులన్ ఫల నిమగ్నత నొంపక దీనఁ జింత లే
దేను వచింతు మద్విధము నెల్లను దెల్లముగాఁగ నీ కిటన్. ౬౮౭

సీ॥ భ్రమనింపుఁ గర్మంబు పలు తెఱంగులఁ బ్రాణి, నందు ధనాశ యత్యంతవిషమ
మదిలేదు నా యెడ నన్యవాంఛయును లే,దమరాచలము తుషారాచలంబు
దాటి యిమ్మిథిలకుఁ దఱియుట యెట్టిదో, ప్రారబ్ధ మనుభవింపంగవలసి
వచ్చుటగాఁ దోఁచె వారణాసియుఁగాదు, గంగయుఁ గాదేమి గలదొయందు
గీ॥ గోరివచ్చుట కెద్ది గన్గొనఁగ నిందుఁ, గర్మవశమునఁ దిరుగుట యొక్కటియెగాదె?
తెలియఁగలవారి కెందేని దెలియువారి, కెల్లనుచితార్థమిదియన్న నిట్లు వినుచు.

శా॥ ఏ దేశస్థుఁడొ తత్త్వవేత్త సుఖియై యీ భూతలం బంతటన్
మోదం బారఁగ క్షేత్రతీర్థకలనాముఖ్యాంతరంగంబుతో
వేదధ్యానమునన్ దిశావళులు నిర్భేదించుచున్ భావనా
స్వాదోల్లాసముచేఁ జరించునని, రాజద్వారపాలుం డొగిన్. ౬౮౯

ఆ॥ ఇచ్చవచ్చినట్టు లేగుము నే నప,రాధినైతి మిమ్ము రాజభీతి
నడ్డగించినాఁడ నాగ్రహం బేటికిఁ, జనుము శాంతులకును క్షమయె కాదె?

శా॥ నా నేరంబు క్షమింపఁగాఁ దగు నన్ నవ్యేందు వక్త్రప్రభా
ధానం బెల్ల దిగంతరం బలమఁ జింతాతంతువుల్ బూనితిన్
గానీ దూషణ మేమి? దీన విభు రక్షావశ్యులా వారికిన్
న్యానంబే యిది రేఁబవల్ పురములన్ శోధింప నీ కయ్యెడన్. ౬౯౧

కం॥ చోరాది విమర్శ పరిష్కారంబుగఁ జేయఁదగదె కార్యవిధులలో
ధారకులై తీర్పక భూదారుల మన్ననకుఁ బాత్రతన్ గాంతు రొకో. ౬౯౨

ఆ॥ అడ్డగించినాఁడ వంతియ కాని న,న్నేమి యంటి విట్టి దేమి తప్పు?
పరగృహంబులకును భయమేది వచ్చుట, నాది నేర మనుట న్యాయమనిన.

చ॥ ఇలను సుఖంబు దుఃఖ మన నెట్టిదొ మేలును గోరి చేయ ని
చ్చలు తగు కార్యమెద్ది సఖు శత్రువు నెట్లెఱుఁగంగ వచ్చునో

కలఁకయడంగఁ దెల్పుమనఁగాఁ జిఱునవ్వునఁ బారికాంక్షి య
త్యలఘువచో విలాసమున నాతని కిట్లు వచించెఁ బేర్మిమై. ౬౯౪

సీ॥ రక్తు లనంగ విరక్తు లనంగను, రెండు తెఱంగుల నుండు జనము
ఇరువుర చిత్తంబు లిల రెండు తెఱఁగులు, వారిలోన విరక్తివాఁడు మూఁడు
తెఱఁగులు తెలిసియుఁ దెలియక తెలిసియుఁ, దెలియక రాగియుఁ దెలియ రెండు
తెఱఁగుల నుండును దీర్ఘమార్గ్యంబునఁ, జాతుర్యమున నిందుఁ జతురునందు
గీ॥ శాస్త్రజం బని నిజబుద్ధిజం బటంచుఁ, గలదు ద్వైవిధ్య మా బుద్ధి గనఁగ భిన్న
యుక్తియు నయుక్తయనఁగను వ్యక్తఫణితిఁ, బలికితినటన్నఁ బరీక్షిపలికెనిట్లు.

కం॥ గూఢోక్తులఁ బలికితి వే, మూఢుఁడఁ దెలియంగలేక మోహితినయ్యా
రూఢముగా వివరింపుము, ప్రౌఢోక్తుల ననిన శుకుఁడు పలుకఁ దొడంగెన్. ౬౯౫

శా॥ సంసారేచ్ఛల రాగియౌ నతనికిన్ సౌఖ్యంబు దుఃఖంబు నా
శంసన్ జేసినఁ బెక్కురూపముల నిచ్చల్ గల్గు సౌఖ్యంబు నా
హింసాశూన్యతఁ బుత్రదారధనరాసాహిత్యంబు దుఃఖంబు నా
హింసాయుక్తతఁ బుత్రదారధనరాసాహిత్యంబు ముమ్మాటికిన్. ౬౯౬

కం॥ ఆర్య మత మేను దెల్పెదఁ, గార్యము సుఖసాధనంబు గా వ్రాథ్యమునన్
జర్యల హితుఁడు సుఖుండగుఁ, జర్యల నహితంబు చేయు జనుఁ డరిగాఁడే. ౬౯౭

కం॥ ఎచ్చో జతురుఁడు వెడలన్, బుచ్చుఁడు విశ్రాంతి మొఱకు ముచ్చటమునుఁగన్
నిచ్చలు సంసృతి గాథలు, నచ్చంబగు తెఱఁగు దెలియనగు నెల్లరకున్. ౬౯౮

కం॥ ధనమును దారయు సుఖసాధనములు మఱియవియె దుఃఖదాయకములు దా
ననుభవము గనిన వాఁ డిం, ధనములు గాఁగను విరాగి తత్త్వవిదుండై. ౬౯౯

కం॥ రాగులలోఁ జతురుం డిల, భోగంబుల నొందు మఱియు మూర్ఖుఁడు కడు మో
హాగతుఁడయి భువి సంసృతి, సాగరమున మునిఁగి తేలు సరభసవృత్తిన్. ౭౦౦

గీ॥ ఎవఁడు తనదగు సుఖమాత్మ నిచ్చగించు, నాతఁడు హితుండు సుఖమునకన్యథాత్వ
మెవ్వఁడొనరించు నాతఁ డహితుఁడు ధరణి, నవియె సంసారమునను జెన్నలరుచుండు

సీ॥ క్షితి విరాగికి నాత్మచింతనం బేకాంత, సేవనం బుపనిషచ్చింతనంబు
సౌఖ్యంబు తదితరాసక్తి దుఃఖము వాని, సౌఖ్యసాధనమున శతుకోటి
కామరోగాది వర్గంబులు హితకోటి, సర్వభూత దయానుషంగ మనినఁ
బరిహారి కేల్మోడ్చి పరమార్థ విజ్ఞాని, యని శుకు దివ్యకథ్యాంతరమ్ము
గీ॥ నందు నీ యిచ్ఛవచ్చిన యట్టులేగు, మనిన శుకుఁడంతఁ జని చని యా పురీజ
నంబుల బుధోత్తముల దేవళంబులఁ గడు, నందమగు పువ్వుఁదోఁటల నరసియరసి.

గీ॥ రాగరోష పరియుక్తి భేరంబులాడు, వణిజవీథుల సకల సంపదలఁ జెలఁగు
హర్మ్యనిశ్రేణికలయందు నమరసి వచ్చుచుండె మోక్షార్థి మునిభాస్కరుండనంగ.

కం॥ నిలునిలుమని యొకఁడనఁగాఁ, బలుకక మోక్షాత్మదృష్టిఁ బరమ నిరూఢిన్
దలఁగక స్థాణువువలెఁ దా, నిలిచిన శుకమౌనిఁ గాంచి నిర్విణ్ణుండై. ౨౦౬

ఉ॥ ఎండకు నీడకున్ వెఱవ కేకమనస్కత ధ్యాననిష్ఠుఁడై
యొండొక చింతదక్కి యిటులున్న మహాత్మునిఁ జూచి మంత్రి కేల్
దండను బూని మ్రొక్కుచును దన్నృపమందిరకక్ష్యలోనికిన్
రండని చేరఁదీసి ఫలరాజి విరాజితమా వనంబులోన్. ౨౦౭

గీ॥ అతిథి సత్కార మొనరించి యందు నిలుప, నిత్యసుఖతృప్తి నొందుచు నిలిచె నచటఁ
గొన్ని దినములు గడచిపోనున్న సన్న, దలప కాత్మైక భావంబుఁ దవిలియుండ.

సీ॥ సంగీత సాహిత్య సరసవాక్చాతుర్య, ధుర్యల దివ్యసౌందర్యవతుల
నవనవానూనభావ విలాస రంజిత, నృత్యాభినయకళానిపుణమతుల
సింహేంద్రమధ్యల స్మితరుచి పరిచలిత, శారదపూర్ణిమాచంద్రముఖుల
నిభరాజ కుంభసన్నిభపయోధర భరాలసల మన్మథకలాభ్యాసనరతల

గీ॥ ననుపమాత్మైక్య శుకసపర్యార్చనలకు, ననిచి యమ్మంత్రివరుఁ డేగ నువిదలెల్ల
సరస మధురాన్న భక్ష్య భోజ్యములఁ బక్వ, ఫలరసంబుల సంతుష్టిపఱచి రతని.

చ॥ కలకలలాడు మేన్ మిసిమి గ్రిక్కడు నందమునిండ జవ్వనం
బలరెడు ముద్దుపల్కులును నచ్చపునింపొనఁగూర్చు తళ్కురూ
పుల మురిపెంబొనర్చు నెఱ పోడిమిచేఁ దనరారు శ్రీ శుకున్
గులుకులఁజూచి జవ్వనులు గోరిరి మన్మథవశ్య చిత్తలై. ౨౦౯

ఉ॥ కన్నుల వాలుచూపులను గట్టి చనుంగవ నిక్కులన్ బసల్
పన్నిన పల్కు నేర్పులను బైపయి సన్నలఁ దొంగలింపుచున్
గొన్నినవింటివాని విరిగోలల పాలయి యాసఁ జెందినన్
మిన్నక యుండు వారలను మేల్కను దల్లులఁగాఁ దలంచుచున్. ౨౧౦

సీ॥ ఆగ్రహం బెఱుఁగఁడు నిగ్రహం బందఁడు, తద్వికారములలోఁ దగులఁ డెపుడు
విరితల్పములఁ దార్చు విరిబోండ్లు నానోప, కరణముల్ గూరిచి చరణసేవఁ
జేసెద మన్న మచ్చిక లేచి కుశపాణి, యగుచు శుచిర్భూతుఁ డై యథోక్త
విధి సంధ్య వార్చి హృద్వీధి నిరంతర, ధ్యానావధానతత్పరత నుండు

గీ॥ నొక్క యామం బొనర్చు ననుచితవృత్తి, రెండుజాములు నిదురించి యుండు వేగు
జామునను మేలుకొను ధ్యానసరణి నిలుచు, వేగ శీతోదక స్నానవిధుల నలరు.

శా॥ ఈ వార్తల్ విని మెచ్చి భూవరుఁడు మాకందుక్రిందు విచ్చేసి క
న్యావాసం బగు మద్వనిన్ నిలిచినాఁడంచున్ శుకితం బయ్యెఁ దీ
వ్రావేశంబునఁ బొందు లెండని పురోధాగ్రేసరున్ బంప బ్రి
హ్మావిర్భూతిని శ్రీశుకున్ గని స్వహస్తాంభోజముల్ మోడ్చుచున్. ౨౧౨

ఉ॥ ఏను బురోహితుండ ధరణీశుఁడు పంపగ వచ్చినాఁడ నా
కానతి యిచ్చెఁ దోడ్కొని రయ మ్మరుదెమ్మని రండు వేగమే
యా నరనాథు సన్నిధికి హర్షమునన్ జనుఁదెండు మీకు నై
దా నట వేచి యుండు మునితల్లజు లెంతయుఁ బూజ్యు లీ భువిన్. ౨౧౩

కం॥ అనుటయు శుకుఁడును హర్షం,బున నాతనితోడ నరుగ భూవిభుఁ డెదురున్
జని సాగి మ్రొక్కి దివ్యా,సనమునఁ గూర్చుండఁబెట్టి సంతస మలరన్. ౨౧౪

గీ॥ అర్ఘ్యపాద్య ఫలంబుల నర్చఁజేసి, ధేనువు నొసంగి పొంగి క్షోత్రేన నిచ్చి
నానఁబ్రాలు సమర్పించి మౌనివర్య !,కుశలమే? యని పలికి రాకట్కుంజరుండు.

## —• జనక శుక సంవాదము •—

ఉ॥ మౌని కులేంద్ర నిస్పృహులు మమ్మును జూడఁగఁ గోరి వచ్చినా
కారణ మే నిమిత్తమొకో యంతయు వేగమె చెప్పుఁడన్న భూ
జానినిఁజూచి పల్కె ముని జ్ఞానవర ! నన్నుపనీతుఁజేసి స
న్మానిత విద్యలన్ గఱపి నా జనకుం డను వ్యాసుఁ డిమ్మెగన్. ౨౧౫

గీ॥ కౌమరుఁబ్రాయమునందు నీ గోష్ఠులేల, యాశ్రిమంబులలో ద్వితీయాశ్రమంబు
శ్రేష్ఠ మదిగాన దారపరిగ్రహంబు, చేయుమని వేయు మాఱులు చెప్పెఁ దండ్రి

సీ॥ అంగీకరింపక యంతర్ధి వాక్కుల, వాదింప నను మునుల్ వచ్చి తండ్రి
మాట మన్నింపుము మా పల్కు లాలింపు, మనుచు బోధింప మదంతరంగ
మిట్టికార్యంబున కిచ్చగింపకయుండె, నంత మజ్జనకుఁ డత్యాదరమున
మిథిలలో జనకుఁ డన్మేదినీశుండు జీవన్ముక్తుడై రాజ్యపాలనంబు

గీ॥ సేయుచున్నాఁడకంటక స్థితి దలిర్ప, నాజవంజవజంబాల మంటియుండి
యబ్జదళబిందు వననెద్ది యంటనీక, మైహికాముష్మికములు రెండాత్మయందు.

గీ॥ అమ్మహారాజు దారపుత్రాదిసహితుఁ, డగుచునున్నాఁడో? లేడో? యిందనుచితంబు
కలదో ? లేదోకో? యిట్టి సంకల్పజనిత, సంశయములెల్లఁ దీఱును జనుము వేగ.

ఉ॥ సంశయముల్ దెరల్పఁగల జ్ఞానుఁడ వీవని నన్నుఁబంప ని
స్సంశయ వృత్తి ముఖ్యమని సన్నిధిఁజేరితి మోక్షకాంక్షినై

ప్రాంశుతపోభరంబున నఘంబులు దూల్చెదఁ గాని సంసృతి
భ్రంశము నొంది దుర్గతుల ♦ పాలయి పోవఁగఁ జాల భూవరా. ౨౨౦

సీ. సంశయ ధ్వాంత భాస్కరుఁడైన జనకుని, సన్నిధానంబున ♦ సంశయములు
పోవంగఁ బెట్టి గొబ్బున రమ్మనీవని, పంపిన వచ్చినవాఁడ నైతి
తపమొ తీర్థంబొ వ్రతంబొ స్వాధ్యాయంబొ, యాగమో త్యాగమో యాత్మరతియొ
యెద్ది? జీవులకు దుఃఖేతర నిరతిశ, యానంద మొందించు ♦ నట్టి త్రోవ

గీ॥ సకల వేదాంత సిద్ధాంత ♦ సారసరణి, నిర్ణయించి విమర్శించి ♦ నేర్పుకొలఁది
నానతీయంగఁ దగుదు వీవనఘ! నాకు, నర్థిఁ దెల్పంగదయ్య యో ♦ యవనినాథ!

వ॥ అని యిట్లు శుకుండుఁ బల్కిన జనకుం డిట్లనియె నోమునీంద్రా! మోక్షం బపే
క్షించు నగ్రవర్ణునకు ముం దుపనీతుండై వేదాధ్యయనం బొనర్చి సాంగ గురు
దక్షిణ యొసంగి తదనుజ్ఞాతుండై గృహస్థ ధర్మం బవలంబించి న్యాయవర్తనంబున
సిద్ధ్యసిద్ధుల యెడ సమచిత్తుండై నిరాశుండును గతకల్మషుండును సత్యభాషణుం
డును నగుచు యాగాద్యనుష్ఠానంబు లొనరించి పుత్ర పౌత్రాది సమృద్ధంబగు
కుటుంబంబు సంపాదించి ధనదారాదికంబు పుత్రాధీనం బొనర్చి వానప్రస్థుండై
యింద్రియంబుల విషయంబుల వలనను మరలించుచు సాగ్నియగు నేని నగ్నుల
నాత్మారోపణం బొనర్చి తుర్యాశ్రమంబు నవలంబించి విధ్యుక్తుండై యుండుట
వేదహితంబని యస్మన్మతంబున నలువదెనిమిది సంస్కారంబులు వేదచోదితం
బులై బ్రాహ్మణులకు నవశ్యానుష్ఠేయంబు లందు గృహస్థునందు నలువదియగు
ముక్తికామునకు శమదమాద్యష్టవిధు లగు నదిగావున "నాశ్రమా దాశ్రమం
గచ్ఛే" త్తను శిష్టానుశాసనంబునఁ బ్రవర్తించుటవలన నిమ్మార్గం బుత్తమంబని
పెద్దలవలనఁ జెప్పంబడియె ననిన. ౨౨౨

మ॥ ధరణీశోత్తమ! జ్ఞానభూమికలచేతన్ నిత్య వైరాగ్య మం
తర మందెప్పుడు గాఢమౌ నపుడె కాంతారంబులం దాశ్రమాం
తర సీమన్ నివసింపఁగాఁ దగు నదుక్తం బిట్లుగాఁ దోఁచఁగా
పరబోధంబుల లాలసుం డయినచోఁ ♦ బ్రాప్తించు సర్వాపదల్. ౨౨౩

కం॥ అన విని రాజిట్లనియెన్, ముని యింద్రియములు బలములు ♦ మూఢంబులు గా
వున సర్వాంతఃకరణత, గనకున్న వికారపటలి ♦ గాసిలఁ జేయున్. ౨౨౪

సీ॥ జవ్వనంబున గృహస్థ ప్రవర్తనలచే, గడపక యతియయి ♦ కాననమున
సంచరింపంగ భోజన సుఖేచ్ఛాది వి, కారముల్ పుట్టింపఁ ♦ గడగు నెట్లు
దుర్జయ వాసనాదులు క్రమక్రమముగా, శాంతింప యతియైనఁ ♦ జక్కనగును
నెత్తునఁ బవళింప ♦ నిలఁబడు భూమిపైఁ, బవళించు వానికిఁ ♦ బడుట గలదె

ఆ॥ మొదట సన్న్యసించి మూఢుఁడై చెడినచో, వానికగునె యుక్తవర్తనంబు
చెట్టుమొదటఁ జీమ చేరును గ్రమముగా, ఫలమునట్లు పొందవలయునయ్య. ౨౨౭

చ॥ పతగము మింట వేగఁజని పాదపమెక్కి ఫలంబుఁ జెందు న
ట్లతుల విరక్తచిత్తుఁడయి యాశ్రమ మొందుట కష్టమాట సం
తతమును దుర్వ్రజేయ మకృతజ్ఞులకున్ మన మట్టి దాని ని
శ్చితమతి లాగి పట్టి విశ్వసింపక పోయినఁ జెంద నేర్చునే. ౨౨౮

గీ॥ ఆశ్రమానుక్రమంబున నంతరంగ, వృత్తిఁ జెదరంగ నీక నిర్విషయ భావ
మొందఁజేసి క్రమంబున యోగివరుఁడు, చీమవలె ఫలభుక్తులఁ జెందవలయు.

సీ॥ గార్హస్థ్య మార్జించి కడుశాంతుఁడై సుఖ, దుఃఖంబులకుఁ జాలఁ దొట్రుపడక
సుమతియై స్వాతంత్ర్య విమలుఁడై విమత క, ర్మాద్యనుష్ఠానంబు లలవరించి
యాత్మ సంతుష్టిచే ననువొందు నరునకు, మోక్షమార్గము కొంగు మూటగాదె
రాజునై భోగాభిరంజనం బొనరించి, కృత్యముల్ చేసియుఁ గీడుఁ జెంద

ఆ॥ కిచ్చవచ్చి నటుల నెల్లచో విహరింతు, మంచిచెడ్డ లెవ్వి మదినిఁ జొరవు
ముక్తికాంత గలదు మునివర్య! నాపల్కు, తత్త్వమెఱిఁగి ధైర్యధనుఁడవగుము.

కం॥ దృశ్యము వివరింపఁబడు న, దృశ్యము గోచరముగాదు తెలియ నెవరికిన్
దృశ్యములు భూతకోటు ల, దృశ్యంబులు తద్గుణములు పృథివీగనిన్. ౨౨౯

మ॥ అనుమానంబున దృశ్యుఁ డాత్మ విను ప్రత్యక్షంబునన్ గానరా
డని వేదంబులు పల్కుఁ దా నచలుఁడై యంతర్హితుండై నిరం
జనుఁడై సత్తయి నిర్వికారుఁడయి శశ్వద్భాసియై యుండు నా
ఘనతత్త్వం బెఱుగంగ నెవ్వరికి నింకన్ మానిచూడామణీ. 230

గీ॥ మనసు సుఖ దుఃఖ మూలంబు మర్మమిదియె, నిర్మల మొనర్చి యాత్మపై నిల్పితేని
సర్వమును నిర్మలంబగు సంయమీంద్ర! బంధమోక్షంబులకు నదిపట్టుఁగొమ్మ

ఉ॥ తీర్థస్నానము లెన్ని చేసినను సద్దేవార్చనల్ చేసినన్
వ్యర్థంబుల్ హృదయంబు నిర్మలముగా కన్యభ్రమన్ జెందినన్
దీర్థస్నానము లెన్ని చేసినను సద్దేవార్చనల్ చేసినన్
వ్యర్థంబుల్ హృదయంబు నిర్మలతచే నాత్మార్థమై యుండినన్. ౨౩౧

ఆ॥ కారణములు కావు కాయంబు జీవంబు, నింద్రియముల జగతి నెఱిఁగి రేని
బంధమోక్షములకు ప్రథమ కారణమును, మనసనంగ దాని మహిమఁ గనుము.

సీ॥ నిత్యనిరంజన నిర్మల నిరుపమ, నిర్లేపుఁ డాశ్రయ నిర్గుణుండు
వశ్యుఁడుగాఁ డెంత వానికి బంధ మోక్షములు మనస్సంభవములు గాఁగ

నది శాంతి నొందిన నన్నియు శాంతించు, నది తలయెత్తిన నన్నిగలవు
ద్వంద్వ భేదంబు లెద్దాన నుత్పన్నంబు, లదిలేమి నైకాత్మ్య మరుదుకాద
గీ॥ బ్రహ్మ జీవుఁడటన్న యప్పలుకు భేద, బుద్ధి సంస్కృతి వశతచేఁ బొడముఁగాదె
విద్య యనఁగ నవిద్య నా వేలు వేలుఁ, జెప్పుదురు గాదె! పండితుల్ క్షితితలమున.
గీ॥ ఆతపము గాన నగునె? యనాతపంబు, దెలియకయమున్న యట్లని తెలియవలయు
ముందుఁగనవిద్యలయ మొందమునివరేణ్య!, విద్యదెలియంగవచ్చుఁగోవిదమతంబు
గీ॥ భూతములఁ గూడి వర్తించుభూతకోటి, యింద్రియంబుల నెనయుఁదదిందియములు
గుణములను గూడి క్రీడించుగుణచయంబు, పుణ్యపాపంబులని చెప్పఁబోలుటెట్లు?
చ॥ సకల జనావనంబులకు శాశ్వతమై శ్రుతిచెప్పు పద్ధతిన్
వికలతఁ బొందెనేని ధర వేఱొకటుండునె? ముక్తిమార్గముల్
సుకరత వేదసంగతుల చొప్పున దానను సర్వవర్ణముల్
ప్రకృతులఁ బౌరుషాదులను బాలనగాఁ దనరున్ ద్రిలోకముల్. ౨౩౭
క॥ అదిగావున వేదోక్తిన్, విదితంబగు పథముపట్టి విడువక నడువన్
గుదురుపడు మోక్షమార్గం, బిది మా నిశ్చయము తాపసేంద్రా! యనినన్. ౨౩౮
మ॥ వసుధావల్లభ! సందియం బొకటి మహత్స్వాంతంబునన్ దోఁచె నీ
వసమశ్రౌతపరాయణుండవు మహాబ్రహ్మ విద్యా సము
ల్లసనాప్రౌఢుఁడ వీవు దెల్పిన సమాలాపంబుపైఁ దోఁచు మ
ద్వ్యసనోదీరిత మాలకింపుము దయార్ద్రస్వాదుధీవృత్తివై. ౨౩౯
సీ॥ వేదోక్త ధర్మముల్ విడువరా దంటివి, సోమపానము పశుసూదనంబు
క్రవ్యభక్షణ సురాగ్రహణంబు ద్యూతంబు, మొదలగువిధు లెట్లు మోక్షదములు
అదిగాక శశిబిందు వను రాజు యజ్ఞముల్, పెక్కులు చేసె బుత్విక్కులకును
భూరి దక్షిణ లిచ్చెఁ బోషించె ధర్మముల్, సత్యముల్ నెలకొల్పె సవనములను
గీ॥ జర్మములు గిరులయ్యె నాచర్మగిరుల, నుండి యేతెంచు జలముచే నొప్పునదియె
దివురుఁ జర్మణ్వతి యతండు దివిఁ జేరె, నింతఁజేసియుఁ గర్మల నిచ్చ లేదు.
గీ॥ ఆలిఁగొని బిడ్డలను గాంచు నాశలేదు, తత్సుఖాసక్తి దగులంగ దాశఁజాల
నిందు నిర్మగ్నుఁడగువానికెట్లుముక్తి, యగునో! సిద్ధాంతమానతిమ్మనుచుఁబలుక.
శా॥ యాగీయంబగు హింస హింసయన రాదాహింస నోపాధియై
భోగంబిచ్చుట హింసయయ్యె మదిలో భోగేచ్ఛ లేకున్నచో
యాగోన్ముక్తికి నింధనం బిడిన ధూమారంభమౌఁగా దొకో?
రాగం బింతకు మూలమన్విధులు గార్హస్థ్యోచితంబుల్ ధరన్. ౨౪౦

గీ॥ రాగమున హింస యొనరించు + రాగులకును, జననమరణ ప్రవాహముల్ + సాగనీవు
రాగమెడలిన హింస వి + రాగులకును, జననమరణ ఘురంబు గో + ష్పదముగాదె.

గీ॥ విబుధులు పరోక్షవాదంబు + వేదమనుట, దెలియవలదొకో? మీవంటి + దేశికులకు
రాగకృతమె యహంకార + రంజనంబు, నదియ లేకున్న నదియును + నదియులేదు.

వ॥ అది గావున యాగీయం బగు హింస హింస యనుట వేదవిరుద్ధంబు దాని
గామోపాధికంబు గానీక ముముక్షోపాధికంబుగా నొనర్చి శతయాగంబు లొన
ర్చినఁ దత్ఫలంబుల నిర్లేపుండై శాశ్వత బ్రహ్మసాయుజ్యం బనుభవించు నని
చెప్పిన. ౨౪౩

శా॥ మాయామధ్యమునందుఁ జిక్కి యతి కా + మ క్రూర వాతాహతిన్
ద్రోయంబడ్డ నరుండు నిస్పృహత నా + రాధుండు గానేర్చునే
న్యాయాన్యాయ వివేక శాస్త్ర కలనా + నైపుణ్యాధీరుండు తా
హేయాహేయము లెంచ కెట్లు సముఁడై + యేగున్ నృపా! ముక్తికిన్? ౨౪౬

కం॥ చీఁకటిఁ బాయుట దీపము, లేకున్నను గలదె? యెఱుక + లేకున్న యెడన్
డీకొను నంతస్తమమున్, బోకడఁ బెట్టించు నెఱుక + పొసఁగునె? గృహికిన్.

ఆ॥ సకల భూత సమితి + సమత వర్తింపక, మోక్షకామి కెట్లు + ముక్తి దొరకు
సర్వ సముఁడ ననుచు + జగతి వర్తించిన, నట్టివాని కెట్టు + లగును గృహము.

చ॥ ధనమున వాంఛఁ బో విడిచి + దార సుతాది విలాసమున శ
త్రునిహననేష్టి మానక న + రుల్ పరమందఁగ లేరు వీనిఁ జే
కొనక గృహస్థధర్మమున + కున్ గొఱగాఁడు నరుండు ద్వంద్వ సం
జనిత మహాపదల్ దొలఁగు + జాణవు దెల్పుము రాజశేఖరా! ౨౪౫

ఆ. చోర బుద్ధి గలదు + చోరులఁ గాంచిన, మానులందు సాధు + మతియుఁగలదు
స్వ పర భేద బుద్ధి + సహజమైయున్నది, నీ విదేహ భావ + నియతి యెట్లొ?

సీ॥ షడ్రసంబుల సమా + స్వాదించి హేయ ము,పాదేయ మనియ హే + యంబు విడిచి
సరి జాగ్రతాద్యవ + స్థలు గల్గియుండియు, హస్త్యశ్వ రథ పదా + త్యాదికముల
శిక్షింప దొరవయ్యు + శిష్ట మృష్టాన్నాది, భక్షివై సకలాను + భవము లెఱిఁగి
సమభావుఁడవటంచు + జగతీజనము లెంచ, నిర్ద్వంద్వ భావంబు + నెఱపు దీవు
గీ॥ దంభమని తోఁచుచున్న దీ + తత్త్వమెల్లఁ, గలదె గార్హస్థ్యమునకు మో + క్షంబునకును
నైకమత్యంబు వెన్నెల + యందుఁ దమము, గలయునే యిట్టిదే కాదె + ధూమ్రవర్ణ

మ. నిరహంకారుఁడనై యరణ్యములలో + నిర్ద్వంద్వ వృత్తిన్ ధనా
దరణం బేమియు లేక దార గృహ పు + త్ర భ్రాంతిఁ బోఁదోలు నా

కరయన్ జిత్తము వశ్యమై తెలియఁగ నాకనాకార రాగాది సం
కరమై తావక చిత్తవృత్తికిని ముక్తత్వంబు గానేర్చునే.　　౭౫౨

క॥ వైరులయెడఁ జింతయు ధన, దారాదుల చింత పుత్రతత్పర చింతన్
బూరించి యుండ నిను భూ,దారా! నిశ్చింతుఁ డనుచుఁ | దల్పఁగఁదగవే. ౭౫౩

మ॥ జలపానాదులచే జితేంద్రియతచే | సౌఖ్యావరోధంబుచే
బలమున్ దప్పి కృశించు మానులును దుర్వ్యాపార సంసార పా
శ లతాగ్రంథులఁ జిక్కి వేసరుచు మోక్షప్రాప్తి లేకున్నచో
బలవ ద్వేషము లట్టివారి కిఁకఁ జెప్పన్వచ్చునే ముక్తులన్.　　౭౫౪

గీ॥ రాజ నీ వంశమునఁ బుట్టు, రాజులెల్ల, దలఁపగ విదేహసుప్రసిద్ధతను గనుట
కుటిల మంచును నే ననుకొనెడివాఁడ, నట్లుగాదేని కలదె యాశ్చర్యబ్బురంబు.

క॥ పండితుఁడు మూర్ఖుఁడగునే, చండాంశుం డంధుఁడగునె | జగతిని లక్ష్మీ
శౌండుఁడు దరిద్రుఁడగునే, యొండనఁగా నేల నాత్మ | నూహింపు మిఁకన్. ౭౫౬

క॥ కావునఁ ద్వద్వంశోద్భవు, లావారు విదేహు లనెడునర్థము దెలియం
గా వచ్చె నామమాత్రత, భావింపఁగఁ గర్మపరతఁ | బలుకం దగునే.　　౭౫౭

## —. విదేహ వృత్తాంతము .—

సీ॥ జగతీశ ! మీ వంశసంభవుం డగు నిమి,సత్కర్మకరుణానుషంగ కలన
యజ్ఞార్థమై గురు | నభిమంత్రణము సేయ, నతఁడు శక్రాభిమంత్రితుఁడ నై తి
నైంద్రంబు గడపి యేనరుదెంతు నంతకుఁ, గనియుండఁ దగుననిచనిన నతఁడు
నొండొక గురుఁదెచ్చియొడయుండు జన్నంబు, గడుపంగ గురుఁడంతఁగనలినీవు

గీ॥ దేహరహితుఁడ వగు మన్నఁ | దెమలకపుడె, నీవు నట్లనె కమ్మని | నిమి శపింప
నొండొరులు నట్లమైరని | యుర్వి విందు, మిది విదేహత మీ కొట | మెల్లిదంబె.

క॥ ఇదియే విదేహనామము, విదితము మీ వారి కెల్ల | విమలజ్ఞానా
భ్యుదయమున నొటఁగాదని, మదీయమత మనిన మునికి | మహిపతి యనియెన్.

ఉ॥ సత్యముఁ బల్కితీవు మునిచంద్రమ ! నీ వను పల్కునం దనౌ
చిత్యములేదు తథ్యమగుఁ | జెప్పెద విస్మితులైనఁ దండ్రి నా
పత్యతచేఁ గృశింప సుతభావముఁగైకొని యొక్కరుండవై
నిత్య విముక్తు నాతని వనిన్ విడనాడి తపింపఁబోవు దే.　　౭౬౦

గీ॥ తండ్రి యనుబంధ మొక్కటేతప్పఁగాని, వనతల మృగాది బంధంబువద లెన్నో
యెల్లెడలఁ బంచభూతంబులెనక మెసఁగ, నీకు నిస్సంగత ఘటించునియమ మెట్లు?

శా॥ ఆహారార్థము చింత నిన్నలమఁగా ౯ నచ్చోట నిశ్చింతతన్
స్వాహాకారము సంభవించునొకొ ? పితాశ్రీలాపమం దెట్లు చిం
తాహైన్యంబు భవన్మనంబునను సంధానించెనో ! రాజ్య చిం
తాహైన్యంబును నా మనంబునను సంధానించె నిస్సంగతన్. ౨౬౨

శా॥ సంకల్పోపహతుండవై మనములో ౯ సందేహముల్ మాన్ప ని
శ్శంకన్ వచ్చితి వింతదూరము భవచ్ఛ్వాంతంబు సంకల్పముల్
సాంకర్యంబులఁ ద్రోయఁజాలెనె గృహస్థత్వంబుచే నిర్వికల్
ల్పాంకం బెవ్వరి సొమ్ము నీవె కనుమీ ౯ యాత్మాంతరంగంబునన్. ౨౬౩

సీ॥ ఇచ్ఛవచ్చినయట్టులే నిదురించెద, నిష్ట పదార్థంబు ౯ లే భుజింతుఁ
దెలియని దెద్దియుఁ ౯ దెలియంగలేదయ్యె, గాంక్షింపఁదగినది ౯ కానరాదు
సర్వదా సౌఖ్యంబె ౯ సంగ్రహించుచునుందు, నట్టులఁగాదు నీ ౯ యంతరంగ
మనిశంబు దుఃఖోపహత మయి వేద్యంబు, దెలియంగఁదగినదై ౯ తెలియువారి

గీ॥ వెదకుచును సంశయములచే వెతలఁబడుచు,నున్నయది కాదె నామతంబొనరవినుము
సందియములెల్ల విడనాడి ౯ సౌఖ్యరూపి, నేన యనుచు సమాహితమానుమయ్య

కం॥ దేహేంద్రియధనగృహ ని,ర్మోహత మది దృఢముఁజేసి ౯ మునివర! సర్వం
'నాహం' 'న మమ' యనందగు,నూహన్ నెలకొల్పుమనుచునొడయఁడుపల్కెన్.

## —• శుకుండు జనకుని బోధనము విని తిరిగి యిల్లుచేరుట •—

చ॥ ఆ ధరణీశుఁ డాడు వచనామృత మాని శుకుండు ప్రీతుఁడై
బోధముగాంచి నిత్యసుఖపూరిత చిత్తము విశ్రమింప భూ
నాథు ననుజ్ఞఁ గైకొని సనాతనమానిజనాశ్రమంబు స
ద్గాథను వించుఁ దండ్రిఁగనఁగా నిజవాసముఁ జేర నంతటన్. ౨౬౬

## —• శు కు న కు వి వా హ ము •—

సీ॥ తన యాశ్రమముఁ జేరఁ ౯ జనుదెంచి మ్రొక్కిన, నందనుఁగాంచి యానంద మొంది
వ్యాసుండు కౌఁగిట ౯ నలమి శిరంబు మూర్కొని రాక వోకలఁగుశల మడిగి
యాశ్రమస్థులఁ గూడి ౯ యధ్యయనంబును, సర్వశాస్త్రంబులు ౯ చదువుకొనుచు
జనకసన్నిధి నిల్చి ౯ జనకమహారాజ, చరితంబు చిత్తవిశ్రాంతి నొసఁగ

గీ॥ సంచరించుచునున్నఁ దజ్జనకుఁ డర్థిఁ, బీవరీ యను కన్యకఁ ౯ బ్రీతిఁ దెచ్చి
శుకునకు వివాహమొనరింప సొబగుఁజెంది,తండ్రియానతి గార్హస్థ్యధన్యుఁ డయ్యె

ఉ॥ ఆ రమణీలలామ నవశ్రీయౌవనశాలినిఁ గూడి సౌరత
శ్రీరమణీయుఁడై సుతులఁ గాంచె, సుహూపవిలాస సర్వ వి
ద్యారమణీయమూర్తుల నవనంతయశఃప్రతిభానువర్తులన్
భూరి కళాకలాప పరిపూర్తుల సంభృత సజ్జనార్తులన్. ౭౬౮

— శుకునకు సంతానము కలుగుట —

వ॥ అన్నలువురు కృష్ణుండును, గౌరప్రభుండును, భూరియును, దేవశ్రుతుండును ననన్ బ్రసిద్ధులైరి. మఱియుఁ గీర్తి యను కన్యను గని విభ్రాజి పుత్రుం డగు నణుహుని కొసంగిన నమ్మహామహుండు పరమ ప్రతాప నిర్వారణుం డగు బ్రహ్మదత్తుం డను పుత్రునిన్ బడసె, నతం డేకచ్ఛత్రాధిపతియై రాజ్యం బొనర్చి పదం పడి నారదుని వల్ల నుపదేశంబుం గొని పుత్రునందు రాజ్యంబుంచి బదరికాశ్రమంబు చేరె. శుకుండు నారదోపదేశంబువలనఁ బరమవిజ్ఞాన మార్జించి పితృ సంగం బుజ్జగించి కైలాసశిఖరంబున నిర్వికల్పధ్యాననిష్ఠన్ బ్రవర్తిల్లుచు, నొక్కయెడ నంతరిక్షంబున కెగసి రెండవ సూర్యునిం బోలె నపర మహామారుతంబునుం బోలె నెగయు సమయంబునఁ బర్వతశిఖరంబు వ్రక్కలై యనేకోత్పాతంబుల నీనుచు బ్రహ్మాండంబు మహాధ్వానంబు సేయు నయ్యవసరంబున. ౭౬౯

— శుకుని దివ్యజ్ఞానము —

చ॥ అదె శుకుఁ డేగె నంచు భువి నాకస మెల్లను బూరటిల్లఁగా
నదులు సముద్రముల్ గిరు లవనారత నిస్వన వృత్తి మ్రోయఁగా
నుదిరెఁ దనంతఁ భీతిగ నోహహో! యని వ్యాసుఁడు కేక వేయుచున్
గదిరెడి కంఠ గద్గదిక గ్రమ్మఁగ నల్దెసలన్ భ్రమించుచున్. ౭౭౦

సీ॥ హాపుత్ర! హాపుత్ర! హాపుత్ర! యనుచును, వ్యాసుండు ఘోషించి యడలిపడుచుఁ
గన్నుల బాష్పముల్ గాల్వలై పాఱంగ, దొడివడ దీనుఁడై దుఃఖపడుచుఁ
గానలఁ గోనల గట్టులఁ జెట్టుల, వెదకుచుఁ గేకలు వేసికొనుచు
శుకుఁడ రమ్మని మిన్నుఁ జూచుచు విలపింప, సన్నిధిఁ జేసి శ్రీశంకరుండు

గీ॥ విడుము శోకంబు శుకునకై వెగడు వడఁగ, నేల? బ్రహ్మజ్ఞుఁడై యిఁక నెట్టివారి
కలవిగాని పరంపద మందుఁగలసె, నతనికై శోక మందంగ నగునె నీకు.

కం॥ ఆ నందను జన్మంబున, నానందము నిన్నుఁ జెందె నమ్మానియు బ్ర
హ్మానందము నందెను లో,కానందముఁ గోరి యింక నడలకు మునిరా. ౭౭౧

చ॥ మృడ! పరమేశ! శంకర! యభీష్టద! చంద్రధరా! జగత్పతీ!
కొడుకును జూడఁ గోరు మదిఁ గోరికఁ దీఱదు కన్నులంధతన్

విడువదు మానసేచ్ఛ కడు ఖేదులు కల్గె నొనర్తునేమి మీ
యడుగుల యాన కావుమని యంఘ్రులపైఁ బడి లేవకుండిరన్. ౨౨౩

సీ॥ బాదరాయణ ! నీకు భయపడ నేటికి, నీ పార్శ్వవర్తియై నీదు సుతుని
ఛాయాస్వరూపంబు సన్నిధిఁగా నిల్చు, నదిచూచి దుఃఖమ్ము నడఁచికొనుము
అది నీకు వరమని యభవుఁ డంతర్ధాన, మొందిన వ్యాసుఁ డానంద మొంది
ప్రతినిధియై చెంతఁ బాయక నిలిచిన, శుకసన్నిభునిఁ బుత్రుఁ జూచుకొనుచు
గీ॥ నూరడిల్లి స్వాశ్రమమున నొద్దనిలుచు, తత్సుతునితోడ సద్గోష్ఠిఁ దవిలికొనుచు
నిప్పటికి బాదరాయణుఁ డిష్టగోష్ఠి, ధర్మశిక్షావిధాయియై తరలకుండె. ౨౨౪

కం॥ మునులారా ! వింటిరె శుక, ముని వృత్తమటన్న మోదమున సూతునితో
ననిరి శుకుఁడట్లు చన నా, వెనుకన్ శ్రీవ్యాసమౌని విధ మెటు లయ్యెన్. ౨౨౫

చ॥ పరమ పదంబుఁ జెంది పర భావనచే శుకమౌని సర్వ సం
భరితత నొప్ప స్వాశ్రమము పజ్జ వసించె నటంచు మీరు విం
టిరిగద శిష్యులై విడివడెన్ నిగమాగమశాస్త్ర శిక్షలన్
బరగెడు వారలం బిలచి పల్కె మృదూక్తుల నిత్తెఱంగునన్॥ ౨౨౬

గీ॥ అఖిల విద్యలు నా యొద్ద నభ్యసించి, పూర్ణ విజ్ఞాన సంపత్తి బొదలితీరు
భూతలంబున కేగి యపూర్వవిధులఁ, గర్మవిజ్ఞాన వక్తలై కడుముదమున.

శా॥ వర్తింపన్ దగువార లన్న విని యా వ్యాసాజ్ఞఁ జేకొంచు స
ర్వార్తి ధ్వంస విధాన మార్గముల నయ్యైచోటులన్ దెల్పుచున్
స్మార్తాచార ధురంధరత్వమున నుచ్చైర్మార్గ వర్తిష్ణులై
మూర్తబ్రహ్మలువోలె నుండిరి మహామోదమ్ము పెంపొందఁగన్. ౨౨౭

మ॥ సరివారై యసితుండు దేవలుఁడు వైశంపాయనుండున్ గుణో
త్తరుఁడౌ జైమిని యా సుమంతుఁడును దక్షద్గోష్ఠులన్ గర్మ మా
ర్గరతిన్ గొందఱు జ్ఞానమార్గరతి విభ్రాజిష్ణుతన్ గొందఱున్
వరబోధం బొనరించి తెల్పిరి శ్రుతిప్రౌఢోక్తి సిద్ధాంతమున్. ౨౨౮

క॥ ప్రతిబింబ రూపుఁడగు సుతుఁ డతులానందంబుఁ గూర్చు నట్టైన మదిన్
సుతుపై మమతన్ విడువని, యతితరశోకమున విన్ననై యంతంతన్. ౧౩౦

ఉ॥ ఆశ్రమవాసియై యునికి నాత్మ సహింపఁగ లేమిఁ బుట్టి ఋ
ష్యాశ్రమ సీమలెల్లఁ గలయన్ దిలకింపుచు జాహ్నవీతటిన్
సాశ్రువిలోకియై యడరునట్టి విషాదసుతన్ స్వమాత న
ప్రశ్రుత వృత్తిచే విడిచి ప్రాథగతిన్ జను టాత్మఁ దోచినన్. ౨౩౧

—। వ్యాసుండు తల్లినిఁ జూడఁగోరుట. ।—

ఆ॥ తల్లిఁ జూచు వేడ్కఁ ♦ దహతహత్తో దైవ, తటినిఁ జేరి యచటఁ ♦ దల్లిలేమి
నచటివారి నడుగ ♦ నవనీశు శంతనుఁ ♦ జెట్టఁబట్టె ననుచుఁ జెప్పుటయును. ౨౮౨

ఉ॥ అంతట దాశభూమిపతి ♦ వ్యాసునిఁగాంచి నమస్కరించి, ని
శ్చింతఁగ స్వాగతం బిడి విశేషము పూజ లొనర్చి నమ్రుఁడై
సంతస మొందినాము మునిచంద్రమ! వచ్చినకార్య మేమొకో!
సంతత మియ్యెడన్ నిలిచి ♦ శాంత తప మ్మొనరింపు చుండుఁడీ. ౨౮౩

ఉ॥ కోరికలన్ని పండె ననుకూలము జన్మము శ్రీ సరస్వతీ
తీరమునందె యాశ్రమము ♦ దివ్యతరం బగు నన్న వ్యాసుఁ డి
చ్ఛారతి మెచ్చి సత్యవతి ♦ శంతనుఁ జేరుట పుత్త్రు లిద్దఱన్
గూరిమిఁ గాంచి యుండుటయుఁ ♦ గూఢచరిత్రము గాంచె నంతయున్. ౨౮౪

సీ॥ శంతను క్షితిపాల ♦ చంద్రున కాత్మజుల్, చిత్రాంగదుండు విచిత్రవీర్యుఁ
డిరువురు కాదె యయ్యిద్దరుఁగాక త,జ్జనపతి యగ్రనందనుఁడు దేవ
నది యందుఁ గల్గిన ♦ విదితుండు భీష్ముండు, ముప్వురు విక్రమమూర్తులగుచు
ధైర్య గాంభీర్య చాతుర్య సౌందర్యాది, గుణ గరిష్ఠతఁ బెరుగుచును జెలఁగఁ

గీ॥ దండ్రియీ రేడులోకముల్ దనమనమున, దృణముగానెంచుచునుసముద్దీప్తుడగుచు
భువన పరిపాలనోదీర్ణ ♦ పూర్ణశక్తి, ననుభవింపుచుఁ దానంతనరిగె దివికి. ౨౮౫

ఆ॥ ప్రీతి పాత విడుచు ♦ నడుపునఁ గాయంబు, విడిచి తండ్రి దివికి ♦ వెడలు నంత
నగ్రసుతుఁడు భీష్ముఁడౌర్ధ్వదైహిక కృత్య, మెల్లఁజేసెఁబితరులెల్లమెచ్చ. ౨౮౬

శా॥ తా దేవవ్రతుఁడౌట భీష్ముఁడు, దురంతంబైన రాజ్యంబు దోః
ప్రాదుర్భూత పరాక్రమాక్రమిత శుంభద్వైరిన్ దమ్మునిన్
మోదం బొప్పఁగ రాజుఁజేసికొని రాజ్యార్థన్యతన్ భూగతుం
డౌ దేవేంద్రునిఁ బోలె నేలెఁ జతురంతాపూర్ణ భూమండలిన్. ౨౮౭

సీ॥ అంతఁ జిత్రాంగదుండతివీర్యవంతుఁడై, శత్రు పాటన కళాసాహసమున
పర చక్రముల భుజాబలముచే నార్జించి, దిగ్విజయంబుగాఁ ♦ దిరుగు నెడల
దర్పితుండైన గంధర్వుండు చిత్రాంగ,దుం డనువానితోఁ ♦ దొడరి మూఁడు
హాయనంబులు పోరి ♦ యక్కురుక్షేత్రంబు,నందుఁ గాలముచేసి ♦ యరిగె దివికి

గీ॥ భీష్ముఁ డవ్వార్త విని చాల ♦ బెగ్గడిల్లి, యౌర్ధ్వదైహిక మొనరించి యయ్యధీశు
నవరజు విచిత్రవీర్యు రాజ్యమున నిలిపి, చెలఁగఁ బట్టాభిషేకంబుఁ జేసెనంత.

ఆ॥ అవ్విచిత్రవీర్యుఁ ♦ డగ్రజు ననుమతి, ధరణినేలె విప్రతతులఁ బ్రోచి
వేద విహిత కర్మవిధు లాచరించుచు, జనని సత్యవతియు ♦ సంతసింప. ౨౮౯

చ॥ తనకు విచిత్రవీర్యుఁడును దమ్ముఁడె కానఁ బరాశరాత్మజుం
డనుదినవర్తమాన తదుదంతము లారయుచుం బ్రమోద సం
జనిత రసానుభూతి సుఖసంపదఁ దేలఁగ భీష్ముఁడంత న
య్యనుజునకుం వివాహకరణార్థము యత్నముసేయుచున్నెడన్. ౭౮౦

మ॥ బలవంతుం డగు కాశిరాజు సుమనోభావానురూపప్రభా
లలితల్ లక్షణలక్షితల్ శుభగుణాలంకారలౌ పుత్రికల్
కులశీలంబులు గల్గు రాజసుతులన్ గూర్పంగ నూహించి ది
క్కులఁ జాటంగ స్వయంవరార్థమయి రాట్టుల్గంభీరదుర్ లొక్కుమ్మడిన్. ౭౮౧

కం॥ అచ్చోటికి విచ్చేయుటఁ, జెచ్చెర విని, భీష్ముఁ డచటి క్షితిపులనెల్లన్
విచ్చలవిడి శరములచేఁ, గ్రుచ్చి నృపాత్మజల మువురఁగొని తెచ్చె వడిన్. ౭౮౨

కం॥ తల్లుల మన్నింపుచుఁ దన, చెల్లెండ్రకుఁ బోలెఁ గూర్మిఁ జేకుఱుచుచుఁ దాఁ
బిల్లలవలెఁ బెంచుచు సం, ఫుల్లాబ్జాక్షులను హస్తిపురికిన్ దెచ్చెన్. ౭౮౩

## —॰ అంబాసమాచారము ॰—

చ॥ ఉపరిచరాత్మజాతకును నొప్పునఁ జేసి పురోహితాళులన్
దపసుల దైవవేదులను ధర్మవిధిజ్ఞులఁ బిల్వనంపి య
చ్చపు సుముహూర్తముం దెలిసి చానలఁ బెండిలి సేయఁబూనుచో
నపుడు తదగ్రజాత యగు నంబ మరుద్ఘురిపుత్రు సన్నిధిన్. ౭౮౪

ఉ॥ సిగ్గున మోమువాంచి మఱి చెంత వసించి వచించె నీవు స
మ్యగ్గుణగుంభితుండవు సమస్తవిధిజ్ఞుఁడ వార్యగోష్ఠిలో
వాగ్గణనీయమూర్తివి శుభంబగు నా పలు కాలకింపుమీ
ముగ్గురిలోన నన్ విడిచి ముద్దియ లిద్దఱఁ బెండ్లిసేయుమా. ౭౮౫

ఆ॥ ఏను సాళ్వుమీఁద నెత్తిన మరులచే, నున్నదాన నతఁడు నన్నెకోరి
యున్నవాఁడు గాన యుక్తమే కృతపూర్వఁ, బెండ్లిసేయ నొరులఁ బ్రేమఁగూర్చి'

కం॥ ధర్మజ్ఞులలో నుత్తమ, ధర్మజ్ఞుఁడ వీవు గనని ధర్మము గలదే
ధర్మజ్ఞుల వశ మగు నీ, ధర్మము వివరించి చేయు ధర్మైకనిధీ! ౭౮౭

చ॥ అని యిటులాడు నంబ పలు కభ్రధునీసుతుఁ డాలకించి త
ల్లిని నిజమంత్రులన్ బుధుల లెక్కకు నగ్గలమైన పెద్దలన్
గని విడిపింప నాజ్ఞఁగొని కన్యక నంబను జేరఁబిల్చి నీ
మనమునఁ గోరు సాళ్వునకు మానినివై విహరింపుమీ యనన్. ౭౮౮

కం. వారలచే విడువంబడి, వారిజముఖి యంబ సాళ్వసవసుధాధీశా
గారముఁ జేరి తనంత వ, రారోహను నన్ను నేలుమనె నవ్విభుతోన్. ౯౯

ఉ॥ నీ యెడఁ బ్రేమ మగ్గలము ♦ నిన్ను వరించెద నంచుఁ బల్కి మో
హాయత వృత్తి భీష్ము విడనాడి నినున్ మదిఁ గోరి వచ్చితిన్
నా యనుకూలనాథుఁడవు ♦ నన్ను వరింపు మటంచుఁ బల్కి నీ
కై యనిశంబు నాదు మది ♦ నందఁగఁ జేసితి నయ్య భూవరా! ౨౦౦

క॥ మఱుమాట లాడ నేటికి, నఱమరగా దేలుకొను మనటంచని నవలా
గిఱికొను తమకముచే వా, తెఱయానఁగ నిలిచి యెదుటను దెరలకయున్నన్.

ఉ॥ ఏఁ గనుచుండ భీష్ముఁడు సమీహిత బుద్ధి గ్రహించి ముప్పురన్
వేగఁగుఁ దేరిపై నిలిపి ♦ వేగొనిపోవుటఁ గంటి నన్యుచే
నాఁగి పరోపనీత వయినట్టి నినున్ మతిహీనుఁడైన నే
లాఁగు పరిగ్రహించు సభవారలు నను నవ్వరె తోడి భూపతుల్. ౨౦౨

కం॥ సరి సరి ధరించి విడు విరి, సరము వలెన్ భీష్ముచేత ♦ సంత్యక్తవు నేఁ
గరమున నంటుదునే నిను?, నరుగుము నినుఁ దెచ్చు భీష్ము ♦ నంతికమునకున్.

చ॥ ప్రతివచనంబు లాడకుము ♦ భామిని! వచ్చిన త్రోవఁ బొమ్మనన్
మతి గలగంగ సాళ్వునెడ ♦ మార్గముగమై విలపించుచు న్నదీ
సుతు నెడకేగి సాళ్వుఁ డిది ♦ చోద్యముగా మదినెంచి వీడ్కొనెన్
గతి యిఁక నీవె సుమ్ము కొఱగాదిఁక జేకొనకున్న భూవరా! ౨౦౪

కం॥ నీ తమ్మున కుపయామముఁ, జేతో మోదమున నన్నుఁ ♦ జేయుము గాదే
నాతతవహ్ని జ్వాలల, కీ తను వాహుతి నొనర్తు ♦ నేగెద ననినన్. ౨౦౫

ఉ॥ అన్యమనస్కవైన నిను ♦ నందఱు నవ్వఁగ నెట్లు చేకొనన్?
గన్యవు తల్లిదండ్రులను ♦ గన్గొనఁగాఁ జను మేల శోక మే
ధన్యునకో? నరేంద్రునకొ? ♦ దద్దయు నిచ్చెద రేగు మన్న దా
ర్జన్యముచే మహాతపము ♦ సల్పఁగ నేగె వనాంతరంబులన్. ౨౦౬

క. అంబిక యంబాలిక యన, బింబోష్ఠులఁ బెండ్లినేసె ♦ బినతమ్మునకున్
సంబరమున భీష్ముఁడు విభ, వాంబరచరవిభుత జగము ♦ లాశంసింపన్. ౨౦౭

ఉ॥ అంత విచిత్రవీర్యుఁడు నిజాంగన లిర్వురఁ గూడి మోహదు
ర్దాంత దురంత కామరతిఁ ♦ దత్పరుఁడై నవవత్సరంబు ల
త్యంత కుతూహలంబున వనాంత గృహాంత ఝరాంత సీమలన్
దొంతర భోగముల్ మఱిగి ♦ దుర్దమ సౌఖ్యరసాభిలోలుఁడై. ౨౦౮

క॥ రేబగలుఁ దెలిపి గాంచని, యా బిబ్బోకినుల రతుల * యలమటల బల ,
పారిబల్యముచెడి యమ్మెయి, మైఁబొడమిన రాజయక్ష్మ * మరణము నొందెన్.

ఉ॥ కన్నకుమారు లిర్వురును * గాలికిఁబోయిరటంచుఁ దల్లి యా
పన్నమనస్కయై వనట*పట్టిన నూరడఁజేసి భీష్ముఁ డ
భ్యున్నతిఁ బ్రేతకృత్యము యథో_క్తముగాఁగ నొనర్చి మంత్రులన్
బిన్నలఁ బెద్దలన్ బొదివి * పేరిమి చింత మునింగియున్నెడన్. ౮౧౦

—॥ ధృతరాష్ట్ర, పాండు విదుర జననము ॥—

శా॥ ఏకాంతంబున భీష్మునిన్ బిలిచి నీ * విచ్ఛానురూపంబుగా
నీ కౌరవ్య మహానుభూతికి సునే*తృత్వంబు వాటించి యీ
నా కోడండ్రఁ బరిగ్రహించి కులమున్ * నష్టంబు గానీక నా
శోకస్ఫుంగతిచేఁ బితృప్రతతికిన్ * గాతూహలం బీఁగదే. ౮౧౧

శా॥ నా పల్కుల్ పెఱపల్కులట్ల విడఁగా * న్యాయంబు గాదన్నఁ ద
ల్లీ! పితృర్థము దారసంగ్రహము భూ*మీశత్వమున్ మాని ని
ర్వ్యాపారస్థితి నున్నవాఁడ నను వా*క్యంబెంచి నీవెట్లు లి
ప్పాపం బేటికి సంఘటించెద వనన్ * వాల్గంటి చింతిల్లుచున్. ౮౧౨

క॥ సంతతి లేనిమిషంబున, సంతతిలో నిలిచి రాజ్య*శాసనమున దు
ర్దాంతుఁడు లేఁడయ్యెను ని,శ్చింతత మెట్లనుచుఁ దల్లి*చింతింపంగాన్. ౮౧౩

ఉ॥ అమ్మరో! యింతచింతఁ గన*నా నొకొ! యన్వయ రక్షణంబు నీ
సొమ్మయి యుండఁ జింతిలుట * చోద్యము పట్టి విచిత్రవీర్యు క్షే
త్రమ్మునఁ బుత్రునిన్ బడసి * ధర్మపరిగ్రహణం బొనర్పుమీ
యుమ్మలికమ్ము మాను మని * యుక్తిఁ బొసంగఁగ జెప్పి యిట్లనున్. ౮౧౪

ఆ॥ సత్కులప్రసూతు * శాస్త్రధర్మజ్ఞునిఁ, గూర్చు మతఁడు గూడి * కోడలికిని
బుత్త్రు నిచ్చువాఁడు * క్షేత్రజ్ఞుఁడగు రాజ్య, మాతఁడేలు సౌఖ్య*మందుమనిన.

ఉ॥ సంతసమంది సత్యవతి * శాస్త్రవిధిజ్ఞుఁడు బాదరాయణుం
డెంతయుఁ గోర్కెఁదీర్చునని * యెంచి మనమ్మున సంస్మరింప న
శ్రాంత తపోగరిష్ఠుఁ డగు * సంయమి వ్యాసుఁడు చెంతఁజేరి య
త్యంతకుతూహలంబుగను * నంతఁ బ్రణామముఁ జేసెఁ దల్లికిన్. ౮౧౫

క॥ గంగాసుతుఁడొనరించు న,భంగురపూజలను గొనుచు * భరితజ్వాలా
సంగతి నధూమపావక, భంగిన్ వెలుగొందుచున్న * పట్టిన్ గనుచున్. ౮౧౬

చ॥ అమిత ముదంబునన్ బొదలి ? యజ్జలజాస్య విచిత్రవీర్యు క్షే
త్రమున సుతుల్ గనన్ దగు నుదారత దావక రూప రేఖలన్
విమలయశస్కు డాతఁడగు ? వే మఱు నా పలు కాలకింపుమీ
యమల యశఃప్రకాశి వని ? యాయమ వల్కి యథానుపూర్వతన్. ౮౧౮

ఉ॥ అన్వయ వృద్ధిసేయు మను ? నంబిక మాటకు మాఱుపల్కక
చ్ఛాన్వితవృత్తినై ఋతుసమాగమనం బగు నంతఁకోర్చి శు
ద్ధాన్వయ నంబికన్ గలయ ? నయ్యెలనాగ తదీయవక్త్ర మా
త్మన్వెఱచాఱి చూడమిని ? దారకుఁ డంధకుఁడయ్యె నామెకున్. ౮౧౯

ఉ॥ కన్నులులేని యా శిశువుఁ ? గన్గొని ముత్తవ దుఃఖపూర సం
పన్నతచే ద్వితీయ యగు ? భామినిఁ గూర్చిన గంతు కేళిలో
నన్నెలఁతన్ రమించె మునినాథుఁడు వ్యాసుఁడు మోము వెల్లనై
యున్న రతంబునం బొడమె ? నుగ్మలికి న్దనయుండు పాండువై. ౮౨౦

ఉ॥ పాలన కేళికిన్ దగఁడు ? పాండుఁడితం డని భీష్ముఁడంత నీ
లాలక తల్లితో నుడివె ? నామె భుజిష్య నొకర్తుఁ బంపె న
బ్బాలిక నిర్భయాత్మ యయి ? వ్యాసునితో రతి కేళి సల్పి జం
బాల పరాక్రమాక్రమిత ? భారకుఁడౌ సుతుఁ గాంచె నర్మిలిన్. ౮౨౧

క॥ ధృతరాష్ట్ర పాండు విదురులు, వితతయశస్కులయి జగతి ? విఖ్యాతభుజా
తతవిక్రమసంపన్నత, నతిజయ మందిరి తదన్వయాభ్యున్నతిచేన్. ౮౨౨

క॥ మునులార! బాదరాయణ, మునివృత్తము సర్వమును సముత్సుకమతిచే
వినిపించితి నవ్వంశం, బనవరతాభ్యుదయ మంది ? యలరెన్ ధరణిన్. ౮౨౩

క॥ అని సూతుఁడు శౌనకముఖ, మునులకు నీ వృత్త మిటుల ? మును తొని తెలుపన్
విని యవ్వలికథ తెలుఁగె, ట్లనవుడు వారికిని రోమహర్షణి పలికెన్. ౮౨౪

—* స్కంధాంతము *—

శా॥ జంభారాతి ముఖామర స్తుతి వచస్సంస్తుత్యశంసన్నిశాం
తాంభస్సంభవ బంధుకోటిరుచిరోద్యద్రత్నసింహాసన
స్తంభ ప్రాకృత పుణ్యపుంజిత మహానందోహమూర్తీ భవ
చ్ఛుంభద్విగ్రహసాగ్రహాతిపురరక్షోరాట్త్రియానిగ్రహా. ౮౨౫

క॥ వక్షోరక్షస్సురగణ, దక్షఫణారత్నరుచి వితానస్వాహా
దృక్షుజ్వాలా ప్రకరస,దృక్షజటాభారతిజగతీతనుహారా! ౮౨౬

మాలినీవృత్తము. రజతగిరి నివాసా! రాజరాజత్ప్రభాసా!
గజదితిజవిభేదా! ఖండిత ద్వైతపాదా!
విజయ విజయకారీ! విశ్వలీలా విహారీ!
భజనపరసనాథా! పార్వతీ ప్రాణనాథా! ౮౨౮

కం॥ దేవీభాగవత స్కంధావళిలోఁ బ్రథమ మచ్చుకమాంబాజగ్గ
త్మావరుల కభీష్టార్థ, శ్రీవెలయం జేసి సుప్రసిద్ధిఁ జెందుఁ. ౮౨౯

—♦ గద్యము ♦—

ఇది శ్రీ పరమశివాద్వైత భావనాసాధ్య ముల్గుసదన్వయ సిద్ధసారస్వత విద్యా
సాన్నిధ్య వేమనారాధ్య వంశార్ణవ కళానిధాన పాపయారాధ్యాభి
ధాన ప్రణీతంబైన శ్రీ దేవీభాగవత మహాపురాణంబునందుఁ
బ్రథమ స్కంధము.



శ్రీ ర స్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ శారదాంబాయై నమః

శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము - శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## ద్వితీయ స్కంధము



దేవీ భాగవతో

పాదిత నిగమార్థసారసంభరితం బగు వ్యా

సాదేశాసాదితమున,

నాదిస్కంధ ద్వితీయ ఁ మవర్ణిన్ జెలఁగన్. ౧

కం॥ శ్రీగౌరీ వక్షోజ, స్థాగురు గంధాంక నీలసంహార గళ నిభా

భోగ శుభంకర గుణపర, భాగా ! శ్రీవిశ్వనాథ ! భక్తసనాథా ! ౨

వ॥ దేవా ! సకల పురాణేతిహాస సుధాస్వాదననిస్తంద్రులగు నమ్మునిచంద్రులు

తన్మనోరథ రథచోదనాసూతుండగు సూతున్ గనుంగొని. ౩

ఉ॥ ఏ జనయిత్రి లోకముల ఁ నెల్ల సృజింప భరింపఁ ద్రుంపఁగా

రాజస ధాతృ సాత్త్విక ముఁరంజయ తామస రుద్ర లీల ని

ర్వ్యాజముగాఁగఁ గైకొని తఁదబ్జముఖీత్రియ లీలలన్ వచో

భోజకరాభవాను లనఁ ఁ బొల్పగు నప్పరదేవిఁ గొల్చెదన్. ౪

శా॥ ప్రాచీనం బగు నిప్పురాణము శుభ్రితార్థంబౌనె? యెవ్వారికిన్
వాచాగోచర నీ జగజ్జనని నెవ్వాఁ డర్చలన్ దన్నడో
నీచుం డా నరుఁ డాత్మతత్వకలనా నిర్ణీతుఁడున్ గాఁడు లో
కాచారంబున వాని జన్మమును ఫలాయత్తంబు కానేర్చునే?   ౫

చ॥ హరి హర తత్త్వనిర్ణయ కథాఢ్య పురాణములెల్లఁ దెల్పి బా
దర వనవాసి భాగవతతత్త్వ మహాస్త గుణంబుగాఁగ స
ర్వ రస సమగ్రమై నిగమవర్ణితమై యపవర్గదాయమై
ధర విలసిల్లఁజేసెఁ బరతత్త్వ రుచిజ్ఞులు మెచ్చ శాంతుఁడై.   ౬

కం॥ విజ్ఞాన సాధనంబై, యజ్ఞాన ధ్వంసకంబు నగు భాగవతం
బజ్ఞుల కైనను సద్యః, ప్రాజ్ఞత చేకూరు నీశ్వరాజ్ఞావితతిన్.   ౭

వ॥ అని వితర్కించి,   ౮

సీ॥ సూతుని వాక్సుధాస్వాతమై సత్యవతీసూను వృత్తంబు దెలియఁబడియె
సత్యాద్భుతంబయ్యెనందు సందేహంబు, పొడముచున్నది మాకుఁ బుడమి నీకుఁ
దెలియని యర్థంబు దివిఁబుట్టు కుసుమంబు, గాన నిన్నడుగంగఁ గలము మేము
సత్యవతీ నభూసంభవం బెట్టిదో, శంతనునకు నెట్లు సకియయయ్యె
వ్యాసున కబ్బోటి వలన సంభవ మెట్లొ, వివరించి చెప్పు మా వృత్తమెల్ల
గీ॥ నీ లలిత వాక్సుధా ఝురుల్ గ్రోలిక్రోలి,తనివి నొందదు మా మనస్తప్తఫలక
మిచ్చగించి కృపామృతవృష్టి ముంచి, సావధానత వివరింపఁ జాలుదనిన.   ౯

సీ॥ పరదేవి నాత్మలో భావించి ధర్మార్థ, కామమోక్షదమైన కథ వచింతు
నేదేవి తలఁపుచే నిష్టార్థ సంసిద్ధి, యగు దంభమున నైన నదియ నిజము
సర్వకామార్థముల్ సంఘటించెద రేని, స్మర్తవ్య వానికి సర్వజనని
వాగ్భవబీజమ్ము వక్త్రపంజరమున, విహరించు వారికి నహరహంబు
గీ॥ సిద్ధ సారస్వతుం డగు క్షితి సతండు,నట్టి జగదంబఁ గొనియాడి యాత్మహితము
నేయువాఁడను మిము సంతసింపఁజేయు,హర్ష మొందుటకన్న భాగ్యమ్ము గలదె

## సత్యవతీ జననక్రమము

ఉ॥ రాజకులావతంసుఁడు సురప్రభుపూజ్యుఁడు ధార్మికుండు లీ
లాజిత పుష్పబాణుఁ డబలాజన మోహన దివ్యమూర్తి నా
నాజనపాలమౌళితటనవ్యమణిద్యుతి చాకచక్య నీ
రాజిత పాద పల్లవుఁడు రంజిలుఁ జేది ధరిత్రి నేలుచున్.   ౧౧

కం॥ ఉపరిచరుం డను నా రా,జపరిమిత తపోగరిష్ఠుకై యింద్రునిచే
నుపమానాతీతం బగు, నుపరిచరం బగు విమానకమొక్కటి గొనియెా. ౧౨

ఉ॥ అట్టి విమానరాజ మనఘయ మ్మధిరోహ మొనర్చి పల్లెలున్
బట్టణముల్ మహానదులుఁ గ బర్వతముల్ దిలకించుచున్ మదిన్
గట్టులగొంగతోడ నెడగానని సఖ్యముగాంచి యా వసుం
డిట్టలమైన కీర్తిని గణించుచు విశ్రుతిగాంచె నుర్వరన్. ౧౩

ఉ॥ అవ్వసుధామహేంద్రునకు గ నంగనయా గిరికన్య నాఁగ లే
జవ్వని రామణీయకపుసారు గణింపఁగ దేవకాంతయో!
కవ్వపుగొండ పాల్కడలిగమ్మనఁ బ్రచ్చిననాటి లచ్చియో?
యవ్వలజేనిబోటి యొకో గ యంచనఁ జెల్లు వధూవతంసమై. ౧౪

కం॥ ఆవనితయందుఁ బుత్రుల, నేవురఁగాంచెను మహీమహేంద్రుఁడు వారల్
భూవలయము లేలిరి జన,కావేశితపద్ధతిన్ మహా విక్రములై. ౧౫

వ. ఇట్లుండ. ౧౬

చం॥ ఒకతఱి నవ్వధూమణి ప్రియోక్తుల వల్లభుఁగాంచి నాథ! నా
కొక యభిలాష గల్గె మదనోద్యమవృత్తిఁ జరించి మన్మన
స్సుకర సుఖోపభుక్తులను గ జొక్కుచు నా కడ నుండు మన్న నీ
వకుటిలవృత్తి వేటఁ జనుమంచును దండ్రి యనుగ్రహించుటన్. ౧౭

కం॥ కామవశంబునఁ బల్కిన, కామినివాక్యమును బితృముఖంబున మృగయో
ద్దామతఁ జను మను పల్కును, దా మదిలోఁ జూనిపి విభుఁడు గ ధైర్యధనుండై. ౧౮

చం॥ ఋతుమతియౌచుఁ బిల్చుమనియెన్ నిజకాంత పితృప్రసక్తి యు
ద్ధతిమెయి వేటఁబొమ్మనుట గ యయ్యె గురూక్తి ఘనం బటంచు ని
శ్చితమతి వేటకున్జని విచిత్రవనీవిహృతిన్ జెలంగియున్
ఋతుమతియైన బోటిపయి గ నెత్తిన మోహభరంబు పెల్లుగాన్. ౧౯

కం॥ రెండవ లచ్చి యనన్ దగు, నండజగమనన్ దలంచి గ యతిమోహభరం
బొండొండ నలమ రేతః,పిండము ధరమీఁదఁ దొఱఁగెఁ గ బింజించి వెసన్. ౨౦

—॥ ఉపరిచరుని వీర్యమును డేగ గొనిపోవుట ॥—

మ॥ స్ఖలితంబై పడు నింద్రియంబుఁగని రాజన్యావతంసంబు ని
ష్ఫలమై పోవ దమోఘమంచు మదిలో గ భావించి న్యగ్రోధ ప

త్రి లసత్పాత్రిమునందు నుంచి నిజహస్తన్యస్త మహాశ్యేనమున్
గలయన్ జూచి వచించె నిప్పటము వేగన్ గొంచుఁ బొమ్మింటికిన్. ౨౧

కం॥ తప్పక యిప్పటమును గొని, యిప్పుడె నా భార్యకడకు నేగు మనినఁ దా
నప్పులుగు దొన్నెఁగొని పే,రుప్పరమునఁబట్టి యెగసె నురుతరగతులన్. ౨౨

శా॥ తుండాగ్రిమ్మున దొన్నె గైకొని మహోత్తుంగాభ్రవీథిన్ జనన్
దుండోద్దండ పతంగ మొక్కటి గరుద్దోధూయమానచ్ఛటా
శౌండంబై పలలాశఁ జేరిన మహాసంరంభ నిర్దంభమై
తుండాతుండిఁ జెలంగ నందికొని హేతుల్ వోలె ముక్కోటులన్. ౨౩

కం॥ ఆ పోరాటము లోపల, నాపంగాలేమి నింద్రియపుఁ బొట్లము తుం
డాపతితంబై కాళిం,దీపాథములోనఁ బడియెఁ దిరుగుడు వడుచున్. ౨౪

ఉ॥ అయ్యెడ నద్రికాఖ్య యను నచ్చర పుష్కరకేళి సల్పుచోఁ
జయ్యన కుంభక స్థితుల సంతసమందుచు నొక్క విప్రుఁ డ
క్షయ్య జపంబు చేయునెడఁ గాల్ దన కేల్గవఁ బట్టుకొన్న వెన్
దియ్యక ధ్యానవిఘ్నము మదిన్ దలపోసి శపించె నీసునన్. ౨౫

ఆ॥ ఘోర శాపహతినిఁ గోమలి యమునలో, శఫరి రూపు నొంది సంచరించు
చుండి పడిన వీర్యపిండము గబళించి, పట్టువడియె దాశవనితచేత. ౨౬

వ॥ అంత. ౨౭

—• మత్స్యరూపమున నున్న యద్రిక యను దాని కిద్దఱు పిల్లలు పుట్టుట •—

ఉ॥ జాలములోనఁ జిక్కుటయు జాలరు లప్పెనుచేపఁబట్టి భూ
పాలున కప్పగింపఁ బరిపాకముచేయుటకై మహానసో
త్తాలవిశాల శాలకును దద్దయుఁ బంప గుణోత్కరంబు పెన్
వాలునఁ గుక్షిఁజీల్చినఁ గనంబడి రిద్దఱు పుత్త్రి పుత్త్రుఁడున్. ౨౮

ఆ॥ మత్స్యనాముఁ డగుచు మాణవకుండు దా, సంగృహీతుఁ డయ్యె జనకుచేత
నాడుపిల్ల నచట నండజ జీవి ధీ,వరుఁడు పెంచె భూమివరుని యాన. ౨౯

ఉ॥ ఆ దృతి ధీవరుండు తనయామతిఁ బెంపఁగఁ గాళినాగమ
తోయదరి మత్స్యగంధి యన నొప్పులు ముప్పిరిగొన్న పోల్కి న
ప్పైదలి నాఁడునాఁటికిని బాలికయయ్యెను సర్వదృక్సమా
స్వాద సుఖానుభూతిఁ జెలువమ్ము నవమ్ముగ నివ్వటిల్లఁగాన్. 30

క॥ వసుధాసుధాంశుఁ డగు న,వ్వసువసుమతిపాలవీర్య ✦ వర్ధని యగుటన్
గుసుమాంబకు నంబక మన, మసలెన్ ధీవరునియింట ✦ మగువ మెఱుంగై. ౩౧

చ॥ అనునెడ మౌను లిట్లనిరి ✦ యద్రిక విప్రునిచేత శప్తయై
దినకరనందినీ విమల ✦ తీర్థమునన్ శఫరీభవంబు చే
కొనెనని చెప్పితీవు పటు ✦ కోపముచేసి శపించె విప్రుఁ డే
యనువున దేవకాంత యయి ✦ నాకముఁ జేరెనొ తెల్పుమీ యనన్. ౩౨

కం॥ భూసుర శాపాహతిచే, గాసిలి యా విప్రు చరణ ✦ కమలంబులపై
వేసరి దుఃఖమ్మొందఁగ, నా సతిఁ గరుణించి విప్రుఁ ✦ డనియెన్ బిదపన్. ౩౩

శా॥ శోకింపన్ బనియేమి? మీను వయి యచ్చోఁ బుత్త్రినిన్ బుత్త్రినిన్
నీ కుక్షిన్ గలిగింపఁజేసి విధిచే ✦ నీ వంతమున్ బొంది నా
ర్యాకారంబున నాక మందెదవు పొమ్మా! యన్న నప్లాచు ది
వ్యాకం బద్రిక చేరె నిత్తెఱఁగుచి ✦ త్తాయత్త మయ్యెన్ గదా. ౩౪

ఆ॥ మత్స్యగంధి దాశ ✦ మందిరమునఁ దండ్రి,పెంపు నంది కూర్మి ✦ నెల్లువలను
జవ్వనంబు కలిమిఁ ✦ జలనంబు లేకిల,నిలుచు మెఱపనంగ ✦ నివ్వటిల్లె. ౩౫

— ♦ వ్యాసోత్పత్తి ♦ —

సీ॥ దేవసన్నిభుఁ డైన ✦ దివ్యమౌని పరాశ,రుండు యాత్రార్థమై ✦ రోసి రోసి
గంగాదులను నవ ✦ గాహం బొనర్చుచు, నవశంబుగాఁగ సూ ✦ ర్యాత్మజాత
తీరంబుచేరి యా ✦ ధీవరుఁ బొడగాంచి, యోడ నెక్కించి మ ✦ మ్మొడకుండఁ
బారంబు చేర్పంగ ✦ భారకుండ వనంగ, వానికి భోజనా ✦ వసర మగుటఁ
గీ॥ దరుణి యీ మౌనివర్యుని ✦ దరణిలోనఁ,దనర నెక్కించి యావలి ✦ దరికిఁ జేర్పు
గంతుకాముఁడై యున్నాఁడు ✦ గాన వేగ, నలత పడనీక చేర్పుమీ ✦ వరుగుమనిన.

ఆ॥ తండ్రియానఁ గాంచి ✦ ధన్యుని ముని నావ, నునిచి త్రోయుచున్న ✦ నువిద మేని
సోయగంబు గాంచి ✦ సుమశరాసను బాణ,బద్ధహృదయుఁడగుచుఁ ✦ బరమమౌని. ౩౭

ఉ॥ చక్కని మోము చూచి తమి ✦ జంకెన చూపులు గాంచి కంచెలన్
నిక్కుచుఁ బిక్కటిల్లు వలి ✦ నిబ్బరపు న్ననుగబ్బి గుబ్బలన్
నొక్కను ముర్వునెంచి జిగి ✦ నిద్దముతావి దలంచి బోటిపై
మక్కువ నందెఁగాని చెడు ✦ మార్గ మటంచుఁ దలంపఁ డింతయున్. ౩౮

కం॥ లోకము నిందింపదె పర,లోకము చెడిపోదె యంచు ✦ లోఁగాంచఁగలే
కా కాంత మరులుగొని యితఁ,డేకాంతము సేయుటకును ✦ నెంచెను దనలోన్. ౩౯

ఉ॥ అంతకు నంతమై సుమశరాసనబాణ విభిన్న లాలస
స్వాంతము సంచలింపఁ దటిదంకురమై కనఁగాఁ జకచ్చకన్
గంతులు వేయు దాని మెయికాంతులు కన్నులఁ దొట్రిలంగ వి
శ్రాంతి యెఱుంగ కప్పరమసంయమి డిగ్గునలేచి డాయుచున్. ౪౦

ఆ॥ పట్టఁదలఁచి పడఁతిపజ్జకు నేగి త,ద్దక్షిణంపుఁ గరము దాల్మిదూలి
తనదు కుడి కరమునఁ దరిసిపట్టఁగఁ జిన్ని, నగవు నవ్వి పలికె నలిననేత్ర. ౪౧

మ॥ కులశీలంబున నీచురాలను మహాకుంభీభవత్సత్తపో
బలశీలంబులఁ బెద్ద లద్భుతజగత్ప్రఖ్యాతిమంతుల్ వశి
ష్ఠుల దాయాదులు ధర్మకర్తలు నన్ శోధింప కిట్లేల చం
చలతన్ దూలితి రే తలంపు పొడమన్ సైరింపు డింకేటికిన్. ౪౨

ఉ॥ మానుషజన్మ దుర్లభము మధ్యమలోకమునందు నందులో
మానవుఁడయ్యు విప్రుఁడయి మాన్యత గాంచుట దుర్లభంబు నా
నానయధర్మవేదివి యనంత తపస్వివి యిట్టిభావ మె
ద్దాన జనించె బేడిసల తావులఁ గుప్పెడి నన్నుఁ గాంచినన్. ౪౩

మ॥ అయయో ! నామెయి లేశమాత్రము గుణం బా లేదు కాదయ్యె నే
ప్రియ మెట్లయ్యెను గేలుపట్టితివి నన్ బ్రేమింప నర్హంబె దు
ర్జయ కామవ్యథచేఁ గలంగ మునికిన్ స్వాభావికం బానొకో
యయశం బెంతయొ తెల్లమౌనె ? మునిచంద్రా ! ధర్మమున్ గాంచవే. ౪౪

ఆ॥ ఎవ్వరైన నేను నిసుమంత సోకిన, నీట మునుఁగుచుందు నీచురాలఁ
బిఱికిపారు మనసు బిగఁబట్టి వలరాజు, బారిఁదోలఁగఁ ద్రోయవలదె మీకు.

ఉ॥ ధీరతతోడ నిల్వు మిఁకఁ దీరముఁజేర నొనర్తు నోడ న
ప్పారముఁజేరి యాశ్రమముపజ్జకుఁబోవుఁ డనంగ మాని యా
చారువిలోచనన్ గని వశంపడనీని మనోభవవ్యథన్
బారమునొందఁ జేయుటయె పారముఁ జేర్చుట యంచుఁ బల్కుచున్. ౪౬

కం॥ దరిఁజేరిన యోడన్ దిగి, తరిఁజేరఁగ లేని కుసుమధన్వు శరహతిన్
గరమువిడి మోముఁజూచుచుఁ, గర మనురాగంబు మించి గాసిలఁజేయన్.

గీ॥ విన్నఁదనమునఁ దనమోము వీక్షసేయు, మునినిఁ గన్గొని తా నేమియనఁగలేక
పొలసు వలపున మది రోఁతపుట్టఁజేయు, నన్నుఁగలసి సుఖింప మీకున్నె మనము.

మ॥ తన క్రీడాసతులన్ రతోత్సవము సత్సౌఖ్యమ్ము ముగ్ధన్ గదా
గనుఁడీ మీరలు ప్రౌఢు లార్య లదియున్ గాకేను దుర్గంధనై

తి నటస్నన్ ముని విశ్వసించి తనదా ॥ దివ్య ప్రభావంబుచే
ననితల్ యోజనగంధిఁ జేసితి రమింపర్ మాఱుమా టే మనల్. ౪౯

మ॥ మునిచంద్రా! జనకుండు తీరమున మిమ్ముంగన్ నన్నునున్ గాంచుచుం
డెను "లోకంబును మాయ మాఁకుడవె" నింపదింపంగ దూఱిందు నే
మనఁగాఁజాలఁ బళుత్వ మిద్ది మనుజుల్ ॥ హ ర్షింతురే పాపమం
చన రే పెద్దలు నీ మనం బిపుడు ధర్మాయత్తమున్ జేయుమా.

మ॥ ఘనమానీంద్ర! యిఁకొక్క మాట ॥ గల లోకమ్మందు నెందైననున్
జను లెవ్వారు పవల్ రమింతురొకొ మహత్త్వాంతంబుసం దిచ్చ యా
మినినైయైనన్ సుఖమంద మేలగును జుమ్మీ యెల్ల నెవ్వారలున్
గనఁగా నీ పగలన్న నవ్వుచును సంకల్పించె నీహారమున్. ౫౧

కం॥ మిహిరప్రకాశ మెడలఁగఁ, దుహినము గప్పంగ రతికిఁ ॥ దూకొను మానిన్
దహతహలోఁ గని స్వామీ, యిహసౌఖ్యం బిచ్చిపోన ॥ నేమగు నొక్కో. ౫౨

ఉ॥ మీర లమోఘవీర్యులు సమీహితమాఁగద మీ ప్రియంబు నన్
భారముగాఁగ గర్భమగుఁ ॥ బల్వురు నింద నొనర్తు రెట్టు ల
ద్దూఱు సహింతు మజ్జనకుతోఁ నడియెట్టులు పాకొందు నా
నేరమిఁ జూచువారెవరు ॥ నేర్పులు నోర్పులు దీర్పు లార్పులో. ౫౩

వ॥ ఇట్లు చెప్పుచున్న నత్తపసి ముసిముసి నగవు నగుచు. ౫౪

గీ॥ కలికి! కన్యాత్వభంగంబుగాకయుండ, వరమొసంగితి నీమది ॥ వలయునట్టి
వల్లభుఁడు సంభవించు నావలపుఁదీర్పు, మబలపుత్రుండు పుట్టుఁజుమ్మనిన నదియు.

కం॥ కన్నెఱికము చెడకుండన్, గన్నసుతుఁడు నన్నుఁబోలఁగలవాఁడగు నీ
తిన్నని వలపుల మేనున్, మన్నించి యొనర్పు మిపుడె ॥ మరుకేళి నిఁకన్. ౫౬

సీ॥ వెఱవనేల సుతుండు ॥ విష్ణుసమానుఁడు, గాఁగలం డఖిలలోకప్రసిద్ధుఁ
డెన్నఁడు నా మనం ॥ బిట్లు బద్ధముగాదు, కననొకో యప్సరోంగనల దివిని
జిత్తంబు ధైర్యంబు ॥ చెడుట దుర్గంధియా, నిన్నుఁ గనుంగొని ॥ నేఁడు చెడెను
గారణ మొక్కండు ॥ గలదు పురాణముల్, వేదవిభాగంబు ॥ విస్తరింపఁ

గీ॥ గలుఁగు సుతుఁడు నీ వలనను ॥ గలుగవలయు, దైవవిధియిది తప్పింపదరముగాదు
గాన ననుకూలవగు మనఁగన్నె సిగ్గు,కలిగి యనుకూలవతి యయి యలరుచున్న.

ఆ॥ ఘనమునీశ్వరుండు ॥ కామిని చేబట్టి, మృదులశయ్య నునిచి ॥ మేను నిమిరి
మన్మథోత్సవమున ॥ మన్నించి లాలించి, మనసు దీఱ భోగ ॥ మనుభవించి.

కం॥ రవితనయా జలములలో, నవగాహ మొనర్చి తపసి యరిగెఁ బిదప స
త్యవతియుఁ దోఁగుచు దీవిని, నవలీలఁ గనియె సుతుని ననవ్యయరూపున్

ఉ॥ నందనుఁడాచు శార్ఙ్గియము ననాతటి రెండవ కాముఁ డీతఁడన్
చందమునన్ వెలుంగుచును సర్వజగద్రమణీయ లీల నా
నందముతోడఁ దల్లిఁ గని నవ్య సుధారస వాక్చమత్కృతుల్
కందళమొందఁ జేయుచును గన్గొని చేతులు మోడ్చి యిట్లనున్. ౬౦

సీ॥ తల్లి నెమ్మది నీవు తలఁచిన యప్పుడు, విచ్చేయువాఁడ నిర్విఘ్నముగను
నిందుండఁ జనదు పోయి మ్మింటికి వేగమే, తండ్రి నీకై నదీతటమునందుఁ
దరలకున్నాఁడని తల్లి నింటికిఁ బంపి, చండాంశుకరణి దృక్ఛటలు వెలయ
నవ్యదేహంబును దివ్య తేజంబును, దిక్కటాహమునందుఁ దీరుఁ గాంచ

ఆ॥ ద్వీప జన్మమునను ద్వైపాయనుం డని, విష్ణు తేజమునను గృష్ణుఁ డనుచుఁ
దెలిసి వినుతిఁ జేయఁ దీర్థతీర్థమ్ములఁ, దిరుగుచుండు మాకు దేశికుండు. ౬౧

ఆ॥ చరమ యుగమునందు జడులైన మనుజుల, బోధచేయ నిగమపుంజ మెల్ల
విభజనం బొనర్చి వేర్వేరుగా వ్యాసుఁ, డనఁగ వెలసె బాదరాయణుండు.

వ॥ మఱియును నతం డష్టాదశపురాణసంహిత లొనర్చి సపాదలక్షంబగు మహాభార
తంబు నిర్మించి సుమంతుండును జైమినియును బైలుండును వైశంపాయనుండును
నసితుండును దేవలుండును నను శిష్యులను నాత్మోద్భవుం డగు నారణేయునితో
నధ్యాపనం బొనరించి యఖిలంబునకు నైహికాముష్మిక ఫలసిద్ధు లొడంబఱుపఁ
బరాశరనందనుం డిచ్ఛానురూపంబునన్ బరివర్తిల్లుచున్నవాఁ డీ యుదంతంబున
సత్యవతీసంభవంబును వ్యాసోత్పత్తియు నిస్సంశయంబుగా వింటిరి. మహజ్జనంబు
గుణగ్రాహ్యంబు, తత్తత్కారణంబుల వలన నట్టట్లయగునుగాదే యిట్టిధర్మాత్ముం
డగు పరాశరుండు సమాకులుండగుటయు ననార్యజుష్టంబును నధర్మంబు నగునవి
యకార్యంబున సంభవించునే మహాత్ముల చర్యలు దైవకారణంబు లని నిశ్చ
యించుచుండ విన్నమాత్రంబున సర్వపాపహరంబులు ముక్తిప్రదంబులు నగుట
నిశ్చయింపవలయు నని సూతుండు విన్నవించిన. ౬౩

సీ॥ తాపసోత్తము లయ్యుదంతంబు విని సూతుఁ, గనుఁగొని యత్యంత గౌరవమున
వ్యాసునిజన్మంబు వ్యాసమాతృకయైన, సత్యవతీదేవి జన్మకథయు
వింటి మక్కోమలి విభువరేణ్యుండైన, శంతనుఁ డేరీతి సంతసమునఁ
బెండ్లి యయ్యెన్ కర్ణవీరుండు నైపాడి చేష్టలై నమట విచిత్రమయ్యెఁ

గీ॥ బురుకులోద్భూతుఁడై ధర్మపరత మనిన, రాజు కులహీన నెట్లు కరంబుపట్టె
నవ్విభున కగ్రమహిషి యైయలరునతివ, యెవ్వ తెయొయాపురావృత్తమెట్టిదగునొ.

కం॥ ఆ రమణీ గర్భమునఁ గుమారుండై, భీష్ముఁడెట్లు మహి వరరూపో
దారత వర్ధిల్లెను గథ, గౌరవమునఁ జెప్పుమయ్య కాంక్షదలిర్పన్. ౬౫

వ॥ అదియునుంగాక సత్యవతీగర్భంబునఁ జిత్రాంగద విచిత్రవీర్యులను నిరువురు తనయులు గలుఁగుటయును వారలును గ్రమక్రమంబునఁ దేజోమహితుండగు భీష్మ ననుమతంబున మహీపాలనం బొనర్చి కాలసాత్కృతు లగుట యెఱింగించితివి. బలవంతుండును, రూపవంతుండును, ధర్మిష్ఠుండు నగు భీష్ముం డగ్రజుండు కలిగియుండఁ గనీయులు నగువారలు మహీపాలనం బొనరించుట యద్భుతంబై తోఁచుచున్నయది మఱియును సత్యవతి యాత్మజవిహీనయై కోడండ్రవలన క్షేత్రజులగు వంశకర్తలంగాని భీష్మునకు రాజ్యం బొసంగక పాలనంబు దదధీనంబు చేసెనని వింటిమి. ఇంత జుగుప్సితంబగు కర్మంబునకు దివ్య తేజోమహితుండగు బాదరాయణుం డనుకూలించుట యత్యాశ్చర్యకరంబని తోఁచుచున్నయది నిఖిల పురాణప్రవర్తకుండగు నా మహాముని పరజావతులందుఁ బుత్రోత్పాదనం బెట్లొనర్చె జగంబునఁ బరదారాభిమర్శంబు మహాపాతకంబగు భ్రాతృజాయాగమనంబు నత్యంతదురితధూసరంబుగదా కావున నక్కథావిధానంబున ననేక సంశయలతలు మదీయ హృదయాలవాలంబుల నంకురించుచున్నవి, నీవు మేధావంతుఁడవు ధర్మజ్ఞుండవు వ్యాసశిష్యుండవు మదీయసంశయచ్ఛేదం బొనర్పఁ జాలెదవు మేమును శ్రోతుకాములమై యీధర్మసందేహములు మీవలన వినఁ గలవారమై యున్నవారము, మదభీష్టంబు నిర్వహింపుమనుటయు. ౬౬

## —• మహాభిషోపాఖ్యానకథనము •—

సీ॥ మునికులోత్తములార యిసవంశ సంభవుం,డిక్ష్వాకు వను భూతలేశ్వరుండు
అతని వంగడమున నతులవిక్రమశాలి, యనుపమానుండు మహాభిషుండు
ధర్మశీలుఁడు మహోదారుండు సత్యవా,క్సౌందర్య ధైర్య విక్రమభుజుండు
వసుమతి ఖరచక్రవర్తియై యిలయెల్ల, నేలుచు నెచ్చోట నెదురులేక

గీ॥ వాజపేయ సహస్రముల్ వాజిమేధ, శతము లొనరించి శక్రుని హితునిఁజేసి
నాకలోకంబుఁజేరి సుశ్లోకుఁడగుచు, దివ్యభోగానుభవలీలఁ దేజరిల్లె.

ఉ॥ దివ్యవిమాన మెక్కి శరదీధితిమత్ప్రభుఁ డుల్లసిల్లి సం
భావ్య కుతూహలుండయి సుపర్వసమాజము వెంటరా జగ
ద్భవ్యమునీంద్రసేవ్యు నలుసర్వ గొలువంగఁ దలంచి సంతసం
బవ్వయసై చెలంగఁ గమలాసను సన్నిధి కేగ నొక్కెడన్, ౬౭

మ॥ చని పద్మాసనుఁ గాంచి తత్పద సమర్చల్ సల్పి రాజర్షి మ
ధ్యనవోత్తుంగ చిరత్నరత్న కనకోద్యత్పీఠి పైఁ బంకజా
సన సేవారతిఁ గూరుచున్న యెడ నాకశాపాళులన్ గల్గు ది
వ్యనదీభామిను లంబుజాసనుని గొల్వన్ వచ్చి రుచ్చైర్గతిన్. ౧౯

శా॥ నానాభూషణ రత్నకాంతులు మహానందంబునన్ జూచు దే
వానీకంబుల దృక్పరంపరలకున్ వ్యామోహమున్ గొల్ప భ
క్త్యానమ్రాననముల్ సభాసదుల కాత్మాలోకనాభావతా
దీనత్వంబును గూర్ప గుంపులయి యెంతే వేడ్క నేతేరఁగాన్. ౨౦

ఉ॥ శైవలినీనితంబినుల సంఘములోపల మేల్ ప్రమాణమై
దేవనదీవధూమణి ప్రదీపిత భూషణ భూషితాంగ శో
భావిలసచ్ఛకచ్ఛకల బ్రహ్మసభాభవనం బయత్న సం
ధ్యావృతమైన యట్లలరు నందము గూర్పఁగ నుండె నయ్యెడన్. ౨౧

క॥ కూలంకషాంగనలు సుర, కూలంకషతోడఁ గూడి కోవిద నిష్ఠా
కూలంకషచే వీచిరి, వేలుపు పెద్దకును మిసిమి వింజామరలన్. ౨౨

ఉ॥ అత్తఱి మారుతాహతిని నభ్రతరంగిణి యంశుకంబు పై
నొత్తిల మర్మదర్శన భరోద్ధురులై సురలెల్ల శీర్షముల్
చిత్తములన్ మరల్ప రసికసేవన లాలసుఁడై మహాభిషుం
డెత్తిన ప్రేమఁ జూచి మదినెంచు తమిన్ మరులందె నయ్యెడన్. ౨౩

కం॥ మిన్నేటి బోటియును దన, యున్నతజఘనంబు గాంచి యురు మోహమునన్
గన్నార్పక మదనశరా, పన్నుండగుటఁ గని రాజుపై మరులొందెన్. ౨౪

కం॥ అన్యోన్యాలోకనముల, మాన్యత విడనాడి మదిని మరులందుచుఁ దా
రన్యోన్యస్మరపీడా, జన్యంబగు వలపు నంది సందడి పడఁగాన్. ౨౫

మ॥ అరవిందాసనుఁ డాగ్రహించి యుభయవ్యామోహముల్ గాంచి దు
స్తర దోషావహ వృత్తి నందితిరి యౌద్ధత్యంబునన్ మీరు వే
ధరణిన్ మర్త్యత నొంది కాఁగలుగు నర్థం బెల్ల భోగించి స
త్వరతన్ సన్నిధి మీరు చేరుఁడనఁ జింతామగ్నులై రిర్వురున్. ౨౬

వ॥ అంత బ్రహ్మలోకంబును వీడి వచ్చుచు. ౨౭

గీ॥ అమ్మహారాజు మదిలోన నరసి ధర్మ, తత్పరుండు ప్రతీపభూధవుఁ డటంచు
వానిఁ దండ్రిగ భావించి వసుమతికిని, బ్రహ్మభవనంబు వెల్వడివచ్చె నంత.

కం॥ ఆసమయంబున వసువులు, భాసిల్లుచు దైవవశత ♦ భార్యాయుతులై
వాసిష్ఠాశ్రమ సన్నిధి, వేసరిలి విహారయుక్తి ♦ విలసిల్లునెడన్. ౭౯

—• వసువులు వసిష్ఠుని ధేనువు నపహరించుట •—

కం॥ ఉత్తముఁడను వసువొక్కఁడు, బిత్తరిరిన్ గలసి ద్యువియుఁ ♦ బ్రేమ విహారా
యత్తతను మించి తిరుగఁగ, నత్తరుణి వసిష్ఠ ధేను ♦ నవలోకించెన్. ౮౦

గీ॥ నందినీ ధేను ధర్మసంతానంద జనిత, లాలసంబున నగుచు వల్లభునిఁ జూచి
యవ్వధూటి వచించె నోయాత్మనాథ! గంటె గవి దీని శృంగారగరిమలెల్ల.

ఉ॥ కొమ్ములచంద మెందుఁ గనుగొందుమె మేని నిగార మెంచ రా
దమ్మకచెల్ల! యీ పొదుగు ♦ నందము గోవులబృందమందు లే
దెమ్మెగదా జగత్త్రితయి ♦ నీ నవమోహన మూర్తి పాలకుం
డిమ్మహి నెవ్వఁడో? యతనిదే కద యోగ్యము భాగ్య మెంచఁగన్. ౮౨

వ॥ అనిన ౮౩

ఉ॥ కొమ్మరో? ధేనురత్న మిది ♦ కుంభజుడైన వసిష్ఠమౌని సొ
మ్మిమ్మహి నెవ్వఁడేని నొకయించుక యీ గవి దుగ్ధబిందువి
ష్టమ్ముగఁ ద్రావెనేనిఁ దిరిదశపభ్రచే నయుతాయువై మనం
బుమ్మలికంబు దక్కి సుఖమొందు జరారహితత్వ సంపదల్. ౮౪

కం॥ అనిపల్కినఁ బ్రియుమాటలు, విని యా చేడియ వచించె ♦ వినయమ్మున నా
మనమున నొకకోరిక గల,దనుమానము దక్కి వినుము ♦ హర్షం బెసఁగన్. ౮౫

సీ॥ ధర నుశీనరుఁడు భూవరశిఖామణి మహా, రాజర్షి గలఁడు ధర్మజ్ఞమూర్తి
యాతని కొకపుత్రి ♦ యతిమనోహర గాత్రి, యబ్బోటి నాచెల్మి ♦ యనునయించుఁ
గావున నా కొమ్మకై సవత్సంబుగా, నీధేనువు నొసంగ ♦ నిచ్చఁ బొడమె
నతివేగమున వసిష్ఠాశ్రమస్థితి మాన్పి, కొని తెమ్ము గోవును ♦ గోర్కి దీఱఁ

గీ॥ జెలిమికత్తె కొసంగెద ♦ క్షీర మాపె, ద్రావి సంపూర్ణ యౌవనావస్థాయి యగుచు
మానుషానంద మెల్ల నిర్మత్సరమునఁ, జెలఁగుచు సుఖింపఁ గలదన్నఁ ♦ జిత్తమలరి.

ఉ॥ దుష్ట మనస్కుఁడై వసువు ♦ తోయరుహాక్షికి సమ్మతంబుగన్
శిష్టవరేణ్యుఁడై తగు వసిష్ఠమహాముని శక్తిఁ గాంచ లే
కిష్టముగా గణించి మది ♦ నెంచి దురాగ్రహవృత్తి నన్నలన్
బుష్టిగఁ గూడ ధేనువును ♦ బోవఁగ నీక హరించెఁ జెచ్చెరన్. ౮౭

గీ॥ అంతట సమిత్ఫలార్థియై యడవిగి, కేయచ్చటచ్చటఁ దిరిగి మహాతపస్వి
కార్యసిద్ధినిఁ జెంది యొక్కండ తనరి, స్వాశ్రమముఁ జేరెను వసిష్ఠుఁ డశ్రమమున.

ఉ॥ వచ్చి నిజాశ్రమంబున సవత్సను ధేనువుఁ గాంచ కచ్చటన్
గ్రిచ్చఱిఁ గానలన్ గుహలఁ గ్రిమ్మఱి సందులు రోసి రోసి గో
వెచ్చటలేమిఁ గన్గొనియె నించుక యోర్వఁగలేక యాత్మలో
నొచ్చెములేని ధ్యానము ననూనము చేసి దురాత్ములౌ వసుల్
మచ్చరమూని నన్ను నవమాన మొనర్చి హరించి రంచొగిన్. ౮౯

—• వసిష్ఠుఁడు వసుపులను శపించుట. •—

ఆ॥ తెలిసి యాగ్రహించి ధేనుతస్కరు లిల, మర్త్యయోనిఁ దెఱఁగు మాలి పుట్టఁ
గల రటంచుఁ దిట్టెఁ "దొలఁగునే చేసిన, కర్మమనుభవమునఁ గాక" యెందు.

ఉ॥ పాపవశంబునన్ వెతలఁ బొల్పడి యమ్మునిచే సముజ్జ్వల
చ్చాప శరాహతిన్ దమకు సంకటవృత్తి పొసంగె నంచు దు
ష్ప్రాపతపోధురంధరుని పజ్జకుఁ జేరి ప్రదక్షిణంబు ని
ర్లేప! పరిగ్రహింపుము భరింపుము మా యపరాధకోటులన్. ౯౧

క॥ మదమంది మిమ్ముఁ దెలియక, పదపడి దురితం బొనర్చి పరిభవకర్మా
స్పదుల మయినార మని ముని, పదములఁ బడి వసుగణంబు ప్రార్థింపంగాఁ.

మ॥ కరుణాశాలియు ధర్మతత్పరుఁడునున్ గానన్ వసిష్ఠుండు దై
న్యరసావిష్టుల శాపభీతులఁ గృపాయత్తావలోకంబులన్
బరిశీలించి వచించె నా పలుకు దప్పన్ రాదు మీ రెల్లరున్
ధర నొక్కించుక మర్త్యలోకమున జింతన్ బొంది యుండన్ దగున్. ౯౩

కం॥ మీయందు ధేనుచౌర్యం, బే యధముఁడు చేసె వాఁ డనేకాబ్దంబుల్
పాయక మానుపలోక, స్థాయిత వర్తించు నాదు శాపోద్వృత్తిన్. ౯౪

వ॥ అనిన,

ఉ॥ కోపముఁ జల్లనార్చి మునికుంజరు శాసన మూని వచ్చుచో
నాపథమందు వారు జలజాసను నాజ్ఞను శాపతప్తయై
భూపతనంబునన్ మిగులఁ బొక్కుచు దీనత స్త్రీస్వరూపయై
యాపద నొంది వచ్చు దివిజాపగఁ గాంచి నమస్కరింపుచున్. ౯౫

—• గంగావసు సంభాషణము •—

శా॥ దేవీ! మా కొఱకై మనుష్యతను సందేహింప కీ వూన్కి మ
మ్మా విఖ్యాతుల వెంటవెంటఁ గొని గంగాంభఃప్రవాహంబునన్

వేవైవర్ల దగునంచు వేఁడికొన నాశవృత్తాంత మాత్మానుకూ
ల్యావిష్కార మొనర్ప సంతసిలి యాశతాంగీకృతిం దెల్పిరంత్. ౯౭

వ॥ మీ రెవ్వరెట్టులు నాగర్భమందుఁ బుట్టుదురని యడుగఁ దమ శాపము మొదలగు
వృత్తాంతము సర్వమును జెప్పి యిట్లనిరి. ౯౮

క॥ శంతనుఁ డను రాజర్షికిఁ, గాంత వగుచు మమ్ముఁ గని నిశకామవేగిమంల్
జింతిల్లక విడువుము గం,గాంతస్సీమ నని వారు లరిగిరి వసువుల్. ౯౯

క॥ తలపోయుచు శంతను రా,జలలామం బెందునుండు సతినై యతనిం
గలిసికొనుట యెన్నండని, వలపుల నాకాశగంగ వచ్చెన్ భువికిన్. ౧౦౦

వ॥ ఇట్లుండ. ౧౦౧

— శంతనుని చరిత్రము —

సీ॥ బ్రహ్మలోకమునందుఁ బంకజాసనునాజ్ఞ, నవనికిఁ జేరి మహాభిషుండు
పురువంశమునకెల్ల భూషణుండు ప్రతీప, భూపాలుఁ డతనికిఁ బుత్రుఁ డగుచు
శంతనుఁ డనుపేర సర్వ ధర్మజ్ఞుఁడై, యావనావిర్భూతి నలరుచుండఁ
దండ్రి యాతనిఁ జూచి తనయ మద్వచనంబు, వినుమనెఁ దొల్లిఁ టొకవేళ నేను

గీ॥ స్ఫుటనదీతీరమునఁ దపస్స్ఫూర్తి నిలిచి, భాస్కరధ్యాన మొనరించుపట్టునందు
సలిలమధ్యంబు వెల్వడి సకియయొర్తు, దివ్యసుందరియై వచ్చి తేఁటిచూచి.

వ॥ మదీయం బగు సాలసంకాశంబగు దక్షిణోత్సంగంబు నధిష్ఠించినం గని రూప
యావనశాలిని యగు నబ్బోటిం గాంచి మదీయపుత్రస్థానంబయిన దక్షి
ణాంకం బెక్కితివి. నీ పుణ్యవశంబుననైనను నాకుఁ బుత్రోత్సాహంబగుడు నీ
మనోరథం బీడేరు ననిన, నట్లెయని యద్దివ్యాంగన యంతర్ధానంబు నొందె, నంతం
గొంతకాలంబున కస్మన్మందిరమునకరుదెంచి మనంబున సమాహితగతి నస్పందుండ
నై యుండి గంగాస్మరణ పవిత్రకుఁడనై యుండునెడ, మత్పుత్రుండనై నీ వవత
రించితి వింక శీఘ్రకాలంబున నీ కవ్వరారోహ యప్రయత్నంబుగా లభించుం
గావున. ౧౦౩

గీ॥ మన్ని యోగంబుచే నిట్టి మానవతిని, నింతిగాఁ గోరి రాజ్యంబు నేలికొనుము
దివ్యసుఖమంది యశమునఁ దేజరిల్లు, మఖిలజనముల సంస్తుతు లందఁగలవు.

ఉ॥ తప్పఁగరాదటంచు ఫలితంబుగ, నాత్మజుతోడఁ దెల్పి తా
నప్పుడె యవ్విభుండు చతురంబుధిమధ్యధరాధిరాజ్యమున్

విప్పగు వి_త్తసంపదయు & వేగము, పుత్రుని కప్పగించి పెం
డెప్పరమైన కాన కతి తీవ్రతపస్థితి నేగి యచ్చటన్. ౧౦౫

చ॥ జలరుహనేత్రునిం గొలిచి & శాశ్వతసౌఖ్యమునన్ బ్రతీప భూ
తలపతి ము_క్తినొందుటయు & ధాత్రికి నెల్లను జక్రవ_ర్తియై
యలరుచు శంతనుండును యయాతికులంబున మేలుబంతియై
యిలఁ గృప నీతిఁ దప్పక వహించె, మహిం జెలువారు సంపదల్. ౧౦౬

ఉ॥ భూతలమేలుచున్ భువనభూషణమౌ యశమంది శంతనుం
డాతతవిక్రమక్రమహితాంబరమధ్యవిరోధియై ధను
ర్ధాతమొనర్చి యొక్కతఱి & దుష్టమృగాదులఁ గానసస్థలిం
జాతకుతూహలుండయి, వెసన్ మృగయావ్యసనావలీఢుఁడై. ౧౦౭

శా॥ ఘోరారణ్యమునన్ జరించుచు మహాకౄరంబులౌ దుష్ట స
త్వారూఢాచలగహ్వరంబుల దురంతారణ్య మార్గంబులన్
ధీరుండై మృగయావినోదమున నర్థిం దుంచి ప్రాల్మాలి గం
గారోధంబున విశ్రమించె లతికాకల్ప_ప్తకుంజస్థలిన్. ౧౦౮

—• గంగాశంతనుల సంభాషణము •—

కం॥ కుసుమావిర్భవ మలయ, శ్వసనంబులు వీవ సతతసౌఖ్య సమగ్ర
వ్యసనుండై భూపాలుం,డసమానందమును జెందుచున్ త్తఱి వేడ్కన్. ౧౦౯

చ॥ అమరనదీలలామము నిరంతర దంతురితాసమాశుగ
భ్రమదలసాంతరంగమున భామిని రూపముఁదాల్చి భూవరో
_త్తము నెదుటన్ జలింపక యథావిధి నొందు మెఱుంగు చాడ్పునన్
గమల సుగంధ గంధిల ముఖశ్వసనంబులు వీవ నిల్చినన్. ౧౧౦

మ॥ కనియెన్ గాంచనగాత్రిఁ గజ్జలకచన్ & గంజాతపత్రేక్షణన్
గనకాద్రీంద్రసమానబంధురకుచన్ & గాలాహిరోమావళిన్
గనదుచ్చైర్జఘనన్ గపోలముకురన్ & గమ్రాబ్జపాదన్ గళా
వనధిం గల్కి నొనొకాక ర్తుఁ గమలావాసన్ గడున్ వేడుకన్. ౧౧౧

కం॥ కాంచి తదీయ ముఖాంబుజ, చంచన్మధుపాన వివశసరస స్వాంతో
దంచిత పంచాశుగ శర, పంచకమున వ్రేటుఁబడియెఁ & బ్రభుమణి యచటన్.

కం॥ ఒడలెల్ల గగురు పొడువఁగ, వెడవిల్తుని బారిఁజిక్కి & విడువని తమితో
నోడయఁడు తపాతపాపముచున్, బడుచున్ బాలించె దనకు & భార్యగఁ గోనఁగన్.

సీ॥ ధరణీశుదృష్టి యత్తరుణీలలామపై, నఖిలాంగముల మీఁద ✽ నావరించి
వేర్వేరఁ గచకుచాస్యవిస్ఫూర్తి రుచి తళ, త్తళలతో నందంద ✽ తాండవించి
రసికానుబంధసారస్యంబుఁ బెరయ నొ, క్కొక్కచో విడరాని ✽ యుబ్బు నొంది
యవయవాంతర వీక్ష ✽ నలముచోఁ దొల్లింటి, యవయవంబుల సందులరసియరసి

గీ॥ పలుచనై దట్టమై యొరపాటునొంది, యబ్బురంబుగ ముదమునం దల్లుకొనఁగఁ
దావి యలరుల నెనసినతావి చాన, మేనిపై నల్లిబిల్లిగా ✽ మిళిత మయ్యె. ౧౧౪

ఉ॥ చూచు భ్రమించుఁ బైఁబడఁగఁ జూచుఁ గుచంబులు గోటనొక్కఁగాఁ
జూచు సుధాధరంబుఁ దమిఁ ✽ జుబ్బన జూఱఁగఁ బంటనొక్కఁగాఁ
జూచు దృఢోపగూహమునఁ ✽ జొక్కుచు మన్మథకేళిఁ దేలఁగాఁ
జూచు మహీశుఁ డవ్వనితఁ ✽ జూచిన యంతట మోహ మెట్టిదో? ౧౧౫

చ॥ తెమలఁగనీని మోహమునఁ ✽ దిట్టతనంబును వీడనాడి భూ
రమణుఁడు కొంతసేపు విడరాని తమిన్ భ్రమఁ జెంది యంతలో
నమరిన చిత్తవృత్తియయి ✽ యాత్మఁ దలంప నిదేమిచిత్ర మీ
రమణినిఁ జూచునంతట విరాళి మదిన్ గొనె నేమి హేతువో. ౧౧౬

వ॥ అని వితర్కించి. ౧౧౭

చ॥ జనకుఁడు నన్నుఁ గూరిచి పరిసంగవశంబునఁ బల్కెఁ గాదె యి
ట్లని తనయాగ్రగణ్య! నవయౌవనసంపద భారతీరతీ
వనితలఁ బోలి దివ్యసతి ✽ వచ్చి భవత్సవిధంబుఁ గోరు న
క్కనకనిభాంగిఁ జేకొనుము ✽ గాంచుము సౌఖ్య చిరాయురున్నతుల్. ౧౧౮

క॥ కావున నీ వనజానన,పై నెడవిల్తుని విరాళి ✽ పరిభవించెఁ "బర
స్త్రీవిముఖమైన చిత్తము, పోవునె వేఱొక్కచోటి ✽ పొందికఁ గోరన్". ౧౧౯

క॥ ఇత్తెఱఁగున ధరణీవిభుఁ, డుత్తలపా టొంది మదిని ✽ నోర్వఁగలేమిన్
దత్తరపా టొందఁగ నా, బిత్తరి చిఱునవ్వునవ్వి ✽ ప్రేమ తొలంకన్. ౧౨౦

చ॥ కదలక ధారుణీశ్వరు మొగంబునఁ జూపులు నిల్పి చూచుచున్
వదలక మోహలాలసత ✽ వందురి తందరఁ గొన్నయట్లు లోఁ
జెదరియు నిల్చినట్టులుగ ✽ సిగ్గొకయించుక గానిపింప న
మ్మదవతిఁ జూచి పల్కె నృపమాన్యుఁడు శంతనుఁ డంత వేడుకన్. ౧౨౧

సీ॥ నలినాక్షి! నీవు మానవకన్యకవా? కాక, గంధర్వకన్యవో ✽ కాక యక్ష
కన్యవో? దేవతాకన్యవో? ఫణిరాజ, కన్యవో? కిన్నరకన్యవొక్కొ?

యెవ్వతెవే నైన § నేమి నన్ జేపట్టి, భార్యవై బ్రతికింపఁ § బొలుపసుము
ప్రేమ చెన్నలరారఁ § గామించితిని నిన్ను, పలరాజు గెల్వ నా § వశముగాదు
ఆ॥ ధర్మపత్ని వగుము § తడయక మన్నింపు, నేల నాల్గుచెఱఁగు § లేలువాఁడ
నఖిల రాజ్య సుఖము § లనుభవించెద వీవు, శకుని కేలుపట్టు § శచియనంగ.

ఆ॥ పారికాంక్షులార! § పరమపావనిగంగ, యనుచు శంతనుండె § గనఁడుగాని
యమరనది యెఱుంగు § నతఁడు మహాభిషుం, డనుచు జన్మభేద § మదియె యగుట.

ఉ॥ దైవవశంబునన్ దనకుఁ § దాఁ బొడగట్టిన ప్రేమబంధ మ
త్యావిలమై మరల్కొన నృపాగ్రణి పల్కులు వీనులందునన్
దావిని మందహాస కలితమ్మగు మోమున సాంద్రచంద్రికా
శ్రీ విలసిల్లఁ జంద్రరుచిరేఖ చివుర్కొన బోటి రాజుతోన్. ౧౨౪

ఉ॥ దీనజనావనా! నినుఁ బ్రతీపనృపాత్మజుఁగా నెఱుంగుదున్
గాన భవత్కరగ్రహణకాంక్ష జనించియె చేరవచ్చితిన్
మానవ లోక మన్మథ సమానుఁడవౌ నినుఁ గోరనట్టి యే
మానవతీమణుల్ గలరో? § మానవభోగమునందు నెంచఁగాన్. ౧౨౫

కం॥ భూపశిఖామణి! న న్నిఁకఁ, జేపట్టఁ దలంతువేని § జెప్పెద విను మ
ద్వ్యాపారము శుభ మశుభం, బేపాటిది యైన సమ్మతింపఁగవలయున్. ౧౨౬

చం॥ ఇది సమయంబుగాఁ గొని గ్రహించితివేని నన్ బ్రమోద సం
పద చివురొత్త నిన్ గలసి § భావజకేళి రమించుదాన నె
య్యది యయినన్ సహింపక నిరర్థకతన్ దలపోసెదేని న
య్యదనున నేఁదొలంగుదు యథార్థముఁ బల్కితి భూతలేశ్వరా. ౧౨౭

కం॥ ఇంచుక యైనను మది శం,కించిరియొ? యడ్డంబుచెప్పి § కినిసిరియొ యున్నన్
వంచించి పోవుదానను, గొంచక యిది ప్రతినచేసి § కూడుము పిదపన్. ౧౨౮

కం॥ వసువుల కిష్టార్థంబుగ, వసుధావరుతోడఁ బ్రతిన § పాటించి విభున్
వెస మరులుకొల్పి యొడఁబఱచి సరిద్భామాలలామ § క్షితిపున్ గలసెన్. ౧౨౯

## —• భీ ష్మో ద య ము •—

చం॥ మనుజవధూటి పోలె నృపమందిర సీమ వసించి రాజుతో
ననిశము పెక్కుభోగముల § నందుచు నంతయుఁ దానయై నికే
తనమున సర్వమాన్య యయి § దర్పకకేళుల రాజుఁ దేల్చుచున్
మనమునఁ బూర్వమోహ రసమగ్నత సార్థకవృత్తి నింపఁగాన్. ౧౩౦

కం॥ మిన్నేటి బోటి మెలఁగఁగ, నన్నృపమణి యాపె నెనసి, ✽ యారామగృహా
భ్యున్నత సౌధంబుల సంపన్న మనస్కత రమించెఁ ✽ బవలున్ రేయిన్. ౧౩౧

సీ॥ అల పులోమజ సుపర్వాధీశుఁగలసిన, పగిదినిఁ దనుఁగూడి ✽ పవలు రేయి
యని యెఱుంగక యనేకాబ్దంబు లిష్టార్థ, సుఖభోగ గరిమ విస్ఫూర్తిచెంద
రాజశేఖరుఁడు నా ✽ రాజబింబాస్యతో, నసమాశుగక్రీడ ✽ లనుభవించెఁ
గాల మిప్పగిదినిఁ ✽ గడవఁగాఁ బదపడి, భామాలలామ గర్భంబుదాల్చి

గీ॥ వల్లభుఁడు ప్రేమ లాలింప ✽ నుల్లమలరి, పదినెలలు నిండఁ గోర్కెచేఁ ✽ బట్టుకొనియె
నంతలోననె యా శిశు ✽ నంబుమధ్య, సీమఁబడవైచె జాహ్నవి ✽ ప్రేమమాలి.

శా॥ ఆ వృత్తాంత మెఱింగి రాజు కడు దుఃఖాయాసముల్ జెందియున్
భావం బించుక గాననీక సమయప్రత్యాహతిన్ గుందుచున్
"దైవాధీనము సర్వ"మంచు మదిలోఁ ✽ దన్వంగిపై మోహపా
శావిద్ధుండయి కూడదంచనక భోగాసక్తినందెన్ లలిన్. ౧౩౩

క॥ ఇట్టుల నేడ్వురు సుతులను, గట్టిడిమై కన్నయంత ✽ గంగన్ ద్రోయన్
గట్టలుకఁ జెందఁడాయెను, రట్టడి దొరపట్టి మనసు ✽ ఱాచందంబై. ౧౩౪

క॥ గర్భములో నిలిచిన యా, యర్భకుఁడు వసిష్ఠధేను ✽ వంగనకొఱకై
దుర్భర దురితం బనకయె, నిర్భీకతఁ గొనుట ధరణి ✽ నిలుచుంగానన్. ౧౩౫

ఉ॥ అంతట నవ్వధూమణియు ✽ నవ్వసుగర్భమునందుఁ బుత్రునిన్
గంతుసమానసుందరు నఖండపరాక్రముఁ గాంచు కాలమ
త్యంతము డాయ దైవవశ ✽ మట్టిది కావునఁ జెంతఁజేరి యా
శంతనుఁ డింతితో ననియె ✽ శాంతవచోరచనాచమత్కృతిన్. ౧౩౬

మ॥ వనజాక్షీ! సుతసప్తకం బెటులొకో ✽ వమ్మయ్యె నీ రూపమో
యనఘం బంతర మెంత కర్కశమొ? యన్యాయంబు చేకూరె నీ
యనుమానస్థితిఁ గూడ నోర్చితిని వంశాంకూర మా యర్భకున్
మనుపంగాఁదగు, నొండు పల్కకుము దుష్కర్మానంబుఁ బోఁజేయుమీ!. ౧౩౭

క॥ నీ కోరిన వరమిచ్చెద, రాకాశశివదన మత్సరము మానుము నన్
జేకొని పుత్రుని గావుము, లోకము మెచ్చంగ నూర్ధ్వలోకము కలుగున్. ౧౩౮

క॥ నా వంశము రక్షింపుము, పావనుఁ డీ సుతుఁడు వంశపాలనమునకై
గావుము హితమేఁ దెల్పితి, భూవిభుఁడై జనుల నెల్లఁ ✽ బోషించుఁగదా. ౧౩౯

ఆ॥ సుతులు లేక యున్న గతిలేదు జగతిలోఁ, దల్లిదండ్రులకును ధర్మ మిదియ
టంచు వేదవేత్తలాడుట వినవె నీ, వెఱుఁగనట్టి యర్థమేది గలదొ!

ఉ॥ కావున నిన్ను వేఁడెద నకల్మషవృత్తి పొసంగఁ బుత్రునిన్
గావుము పుత్రదానమునఁ గావున నన్నని యెంతవేఁడినన్
భూవరుఁ జీరికిన్ గొనక భుగ్గున మండుచుఁ గోపవహ్ని పె
ల్లావిరి చుట్టు ముట్ట వసుధాధిపుతోఁ గుహనావధూటియున్. ౧౪౧

ఆ॥ ప్రతినఁ దప్పఁ జేసి భంగించెదవె నన్ను, సరసుఁడ వని, నీదు సంగతికిని
నభిలషించి చెడితి నటులైన నీ పుత్రుఁ, బట్టుకొను మటంచుఁ బాఱవైచి.

శా॥ పోవన్ జూచినయంత భూవరుఁడు సంబోధింప నంతంతకున్
జేవన్ దేలెడు రోషకీల లెగయన్ సీ! యంచు భర్జించుచున్
బోనంగా సమకట్టెఁగాన సతి యా భూపాలుఁ డాబోటితో
నీ వాల్లభ్య మెఱింగితిన్ జనుము దుర్నీతిన్ యథేచ్ఛంబుగాన్. ౧౪౩

గీ॥ ఇంత పాపాత్మురాలవం చెఱుఁగనైతి, వంశవిచ్ఛేద మొనరింప వచ్చినట్టి
రాక్షసాంగన వనుచు నీ రాక దెలిసె, నింక నీజోలి నాకేల నేగు మెటకొ. ౧౪౪

ఆ॥ ఏను జేయుకార్య మెద్ది యీపట్టి నా, వంగడమున నిల్చువాఁడు వీని
విడువఁజాల ననుచు వేదుఱుగొనుమాడ్కిఁ, గొడుకుఁగొనుచు సతిని విడిచె విభుఁడు.

ఉ॥ క్రోధరసాతిరేకమున ఘూర్ణిలుచున్ గడు బాష్పపూరసం
బాధ మగాధమై నయన పక్ష్మము లార్చుచు దీనుఁడైన య
బ్భూధవుఁ జూచి దైన్యమును బూనఁగ నేల మహీంద్ర! నాదు దు
ర్బోధము లొందినాఁడ నని పోయెద నూఱడు మేను జాహ్నవిన్. ౧౪౬

సీ॥ విధివశంబున మర్త్యవిష్టపమ్మున నేను, వచ్చుచో వసువులు వచ్చి నన్నుఁ
దల్లి! నీ కడుపునఁ దనయుల మౌదుము, పుట్టి నంతట నీటఁబట్టి వైవు
మని ప్రార్థనము చేయ నట్లు చేసితి దైవ, కార్యమం చని యాత్మఁగనుము వీఁడు
శాపంబుచే బెక్కు సంవత్సరంబులు, భూతలంబున నుండు భూవరేణ్య!

గీ॥ పేరు గాంగేయుఁ డగు నేను బెంచుదాన, జ్ఞాన విజ్ఞాన విక్రమదాన ధర్మ
నిరతుఁడై యుండఁగలఁడని నిజముఁ దెలిపి, పుత్రుఁ గైకొని జాహ్నవి పోవఁదలఁచి.

ఉ॥ భూరమణాగ్రగణ్య! కడుఁ బొక్కఁగ నేల సుశీలుఁడౌ మహో
దారుఁడు విక్రమాఢ్యుఁడు పదంపడి జ్ఞానము గల్గు నంతకున్
గూరిమిఁ బెంతుఁ "దల్లి పసి కూనలఁ బెంప" నటంచుఁ బల్కి బృం
దారకవాహినీమణి యథావిధివృత్తి సపుత్రయై చనెన్. ౧౪౮

సీ॥ సతిని బాయుట కాక సుతునిఁ బాయుటచేత, మది దుఃఖదావాగ్ని క్రమ్మగ్గొనుచు
నిజగృహంబున నిల్చి ప్రజలఁ బాలింపుచు, నిలిచినచోటనే నిలువలేక
వెతలఁ గుందుచుఁ గామ వేదనాభరమున, వివశాత్ముఁడై కడు వేదు అంది
కుసుమశయ్యల నొంటి గూర్కుచు మజ్జన, భోజనాదులయెడ బుద్ధిలేక
గీ॥ నాటినాటికి నెదలోన నాటుకొన్న, బోటిపైఁ దమిఁ గంతు విసపాటికోటి
పాలుసేయఁగ ధైర్యంబు పట్టుదప్పి, త్మ్మాతలేశుఁడు గాలంబు గడపి కడపి. ౧౪౯

—♦శంతనుఁడు వేఁటకుఁ బోయి భీష్ముని౯ జూచుట♦—

క॥ ఒకతఱి మృగయావాంఛన్, బ్రికటీకృతచాపబాణవస్తువితతి రా
జకలంక మతిఁ బదాతి, ప్రికరంబులు గొలువ నటవి పజ్జ౯ జనియె౯. ౧౫౦

ఉ॥ పోయి యభేద్యధన్వుఁ డయి భూరిశరాహతి వ్యాఘ్రభల్లుక
స్ఫాయ లులాయ సింహ గజ వన్యమృగంబుల వేట లాడి సే
నాయుతుఁడై పరిశ్రమముస౯ సురనిర్ఝరిణీతటంబు నం
దాయత కుంజపుంజమలయానిలయుక్తిని విశ్రమించుచు౯. ౧౫౧

కం॥ కనియె నొకచోట స్వీకృ, ఘనశస్త్రాస్త్రములు గనులు గట్టఁగఁ జాప
ధ్వనుల దిశ లెల్ల మొరయఁగ,వనిఁ దిరుగుచు నున్న వీరవపు నర్భకుని౯. ౧౫౨

ఉ॥ సుందరగాత్రు వీరరససూచితపావకనేత్రుఁ బుత్రుని౯
డెందములోన నభ్రము గడింది మగంటిమిఁ గంటి నంచు నా
నందమనీష నచ్చెరుతనందనుఁ జేరి మహాప్రభావ! నీ
చందము వింత యయ్యె సురసన్నిభ చర్యల నుందు వియ్యెడ౯. ౧౫౩

ఉ॥ ఒక్కఁడ వీ సరిత్తటము నోలము౯ విహరింతు వీవు నీ
చక్కఁదనంబు శౌర్యమును సాహసము౯, గనుఁగొన్నఁ జిత్రమా
నక్కట సార్వభౌమదశ నంది, ధరాస్థలి నేలఁగల్గు నీ
కిక్కడ సంచరింపఁ దగవే భవదీయము వృత్త మెట్టిదో? ౧౫౪

తావలంబు జనపదం బదేది?
ఆ॥ తల్లి యెవ్వరొక్కొ? తండ్రి యెవ్వండొకో?,
నీదు వృత్తమెల్ల నిశ్చయమ్ముగ మాకుఁ, దెలియ మనసు వొడమెఁ దెలుపుమనిన.

ఉ॥ అప్రతిమాన తేజుఁ డసమాంబకసన్నిభుఁ డర్భకుంతు దీ
వ్రప్రముఖాంబకమ్ముల ప్రభల్ దెస౯ మిఱుమిట్లు గొల్ప దే
వప్రతిమానుఁడై వడిగ బాణపరంపరఁ జొన్పు నేర్పుగా
నే ప్రతివాక్య మీయఁడు గణింపఁడు తండ్రి వచించు పల్కుల౯. ౧౫౬

ఆ॥ తండ్రిపేరడుగఁడు ˢ తనపేరు దెల్పఁడు, శరశరాసనముల ˢ సాధనముల
లాఘవముల యెడల ˢ లక్షించుఁగాని యన్యపరిసంగములకు ˢ నాశపడఁడు.

మ॥ తనతోఁ బల్కక లక్ష్యపెట్టక దురంతప్రౌఢవీరోజ్జ్వల
ద్ఘనశౌర్యప్రకటీకృతిన్ వనమునన్ ˢ గారాడు నా యర్భకున్
గని సూనుం డగు నంచు నిశ్చయము ప్రాకాంక్షింప లే కాత్మలో
వనటన్ గుంది యిఁ కేమొనర్తు నని భూపాలుండు చింతించుచున్.

## —• గంగ శంతనునకు భీష్మ నప్పగించుట. •—

చ॥ త్రిదశనదిన్ మదిన్ దలఁచి ˢ దివ్యనుతుల్ ప్రకటించి దేవి! నీ
సదయత మన్మనోగతవిసంకట సంశయవృత్తిఁ బాపఁగా
నద నిది దర్శనం బిడు మనన్యమనస్కత నిన్నె నమ్మితిన్
గద కొఱఁజూప కిమ్మెయి ప్రకాశితమూర్తివి గమ్ము నావుడున్. ౧౫౯

గీ॥ అంతఁ బ్రత్యక్షమయ్యెఁ బూర్వానురూప, రూపవతి యాచు దిఙ్ముఖోద్దీపక స్వ
తేజ మభ్రాంతరం బెల్ల ˢ దీప్తిఁగొనఁగ, సురనదీదేవి భూపతి ˢ చూచి పల్కె.

క॥ ఇభరాజముతోడను స, న్నిభుఁ డగు నీ చిఱుతపట్టి ˢ నేఁ బరికింపన్
శుభదృష్టి నన్నుఁ జూడక, యభయుం డై బలిమి వేఁట ˢ లాడెదఁ గంటే. ౧౬౧

ఉ॥ ఈతనివృత్త మెవ్విధము ˢ యీతనికిన్ దలిదండ్రు లెవ్వరో
వీతి దనర్ప నా మదికిఁ ˢ బెద్దయు సంశయ ముప్పతిల్లె ని
శ్చైతుకృపాకటాక్షమున ˢ నిష్టునిఁగా ననుఁ జూచి పూర్వవి
ఖ్యాతసుహృత్త్వ మూని పలుకన్ దలపోయు మటన్న గంగయున్. ౧౬౨

మ॥ అవనీనాయక! నీ సుతుం డితఁడు ధైర్యాదార్యశౌర్యంబులన్
భవదాభుండు మదీయరక్షణమునన్ ˢ బ్రౌఢత్వమున్ జెంది దై
వవశత్వంబున శాప మంది వసుధన్ ˢ వర్ధిల్లె మద్గర్భ మం
దవగాహింపుము సత్య మష్టమవసుం ˢ డత్యంతసమ్మోది వై. ౧౬౩

శా॥ గంగారూపిణి నైన నాదు శుచియౌ ˢ గర్భంబునన్ బుట్టుటన్
గాంగేయుం డను పేరఁ జెన్నలరి సత్కార్మిష్ఠుఁడై యన్వయా
భంగోద్వృత్తికి మూలమై తపమునన్ ˢ బ్రఖ్యాతి సాధించి యు
త్తుంగారాతుల బిట్టు మాన్పు విలసద్దోర్గర్వదుర్వార్యుఁ డై. ౧౬౪

క॥ వేదము లన్నియును ధను, ర్వేదమ్మును నభ్యసించి ˢ విమలమనీషా
పాదిదుర్భాతి వసిష్ఠుని, యాదరమును బొందెఁ దాపసాశ్రమములలోన్. ౧౬౫

గీ॥ సర్వవిద్యాపరిగల్భుండు సర్వకార్య, నిర్వహణశాలి భుజవీర్యనిధి శుచి యగు
జామదగ్న్యుండు నేర్పిన చదువులెల్ల, నిపుణుఁడై నేర్చె నీతండు నీదుసుతుఁడు.

శా॥ ప్రౌఢుండై బలవంతుఁడై దనుక మహత్పూర్వంబునన్ బెంచితిన్
గాఢ ప్రేమ భవద్విశాలసకలక్ష్మామండలీ పాలన
వ్యూఢుండై నిను మించు నీవు సుఖివై యుండన్ దగున్ సంతతా
రూఢపరిక్రియ నిశ్చితార్థమును నే రూపించితిన్ భూవరా! ౧౬౭

కం॥ నీ కొడు కీతం డీతనిఁ, జేకొని నీ వింటికేగు చింతిల్లకు మం
చీ కొలఁదిఁ బలికి యమరన,దీకాంత యథేచ్ఛ జనియె దివ్యస్ఫూర్తిన్. ౧౬౮

చం॥ క్షితిపతి యంత నాత్మజుని జేకొని చెక్కులు గీటుచున్ లలిన్
హితమతిఁ గౌఁగిలించి మొగమెత్తి శిరంబును మూరుకొంచు నా
తతధవళాబ్జపత్రములఁ దార్కొను కన్నుల సమ్మదాశ్రులు
ప్పతిలఁగ హస్తినాపురికిఁ బ్రస్థితుఁడయ్యెఁ జమూసమేతుఁడై. ౧౬౯

సీ॥ గంధర్వశత శతాంగము నెక్కుటే కాదు, కొడుకుగల్గుట చేతఁ గొండ యెక్కి
రథవైజయంతి నభ్రము ముట్టుటే కాదు, మేల్ కుమారునిఁ గాంచి మిన్నుముట్టి
పటహఢాంకృతి భేరిభాంకృతుల్ గగనంబు, శబ్దగుణంబని చాటిచెప్ప
హస్త్యశ్వరథభటోద్ధత మహాఘోషంబు, బ్రహ్మాండ కుహరంబు నావరింప

గీ॥ జయ జయ ధ్వానముల వందిజనులు గొలువ,నాత్మజు రథంబుపై నిడి యతిరయమున
సమ్మదాంబుధిఁ బొంగి యుచ్చైఃస్వరమున,శంతనుక్ష్మావరేణ్యుండు చని యెబురికి.

వ॥ ఇట్లు పురంబు ప్రవేశించి దైవజ్ఞులఁ బిలిపించి శుభముహూర్తంబు పరిశీలించి పౌర
జానపదామాత్యాది నిఖిల ప్రకృతి ప్రభృతి జనయుతుండై యువరాజ్యంబున
గాంగేయు నభిషిక్తుం జేసి జాహ్నవీవియోగంబు మఱచి శంతనుండు సుఖం
బుండెనని చెప్పి. ౧౭౧

సీ॥ ఓయతులార! గాంగేయు జన్మంబును, సౌరతరంగిణీ సంభవంబు
గంగావతరణంబు గంగగర్భంబున, వసుసంభవంబు తద్వర్ణనంబు
విమలవాచారూఢి విశ్రుతుండగు బాద,రాయణ వాక్సుధారస వినిస్సృ
తంబైన పగిదిఁ దథ్యముగఁ జెప్పితి నిట్టి, యితిహాస మెవ్వార లేని వినిన

గీ॥ సర్వపాపముల్ పోవును సౌఖ్య మలరు,శుభము లన్నియుఁ గలుగుఁ జిత్తశుద్ధి నిచ్చు
వింటిరే మీరు మునులార! విషయమెల్ల, సంతసంబును గనినారె! సంతతంబు.
౧౭౩

వ॥ అన విని.

మ॥ ముని లా సూతునిఁజూచి డెందముల సమ్మోదించి నీ వాక్సుధా
ఘన సంసేవన తృప్తిఁ గాంచము జగత్కల్యాణమౌఁగాన శం
తను భూపాలుఁడు వ్యాసమాత యగు సత్యవ్రతిఁ బెండ్లియై యో
జనగంధిన్ శ్రుతిధర్మవేత్తయయి, హస్తగ్రాహ్య మెట్లందెనో. ౧౭౪

కం॥ ఈ సంశయవిచ్ఛేదం, బో సూత! యొనర్పు మనుచు నొక మొగమున బ్ర
త్యాసక్తిఁ దెలుప సూతుం, డా సంయమివరుల కిట్టులనియె ముదమునన్. ౧౭౫

సీ॥ శంతనుం డొకనాఁడు సామ్రాజ్య దక్షుఁడై, ధరణిఁ బాలింపుచు ధర్మవిధులు
నెడలేక చేయుచు నేకాంత వర్తియై, మృగయాభిలాషంబు మించి నిఖిల
సేనలు తనుఁగొల్వ స్థిరరథారూఢుఁడై, సాత్మజుం డగుచు వనన్యావిహార
మాచరించుచుఁ గిటివ్యాఘ్రాదిదుష్ట సత్వంబుల నణఁచుచుఁ దతిని యొకఁడ

గీ॥ ధన్వియై గిరికానన స్థలుల వేఁట,లాడుచును జతురబ్దంబు లడవిలోన
నిలిచి క్రీడించుచును నంత నెలవు దప్పి, తరణితనయాతటప్రాంతధరణిఁ జేరి.

గీ॥ అరసి గుఱ్ఱంబు దిగి కోమలావనిజ, శీతలచ్ఛాయయందు నాసీనుఁ డగుచు
విశ్రమించిన యెడ మరుద్వేగమునను,గంధ మొక్కటి పొలసె మిన్ గ్రమ్మికొనుచు.

—• శంతనుఁడు యోజనగంధిని జూచుట. •—

క॥ అయ్యామోదపు ఘుమఘుమ, మెయ్యెడ సందీక యలమె నెద నబ్రముగా
న య్యవనీపతి చిత్రం, బెయ్యది యీ గంధ మనుచు నిటునటు గనుచున్. ౧౭౮

ఉ॥ అచ్చట నచ్చటన్ బొదల నండల దండల నీవలావలన్
జొచ్చి పరిభ్రమించుచుఁ బ్రసూన సుగంధము లే నెఱుంగనే
యెచ్చట నిట్టితావిని గణించితిమే సురభూజచంపకా
భ్యచ్చ మృగీమదాభ్యుదయపూర్వసుగంధము లందిపొందమే. ౧౭౯

కం॥ ధర సకల సుగంధంబులఁ, బరిభూతి యొనర్చి దిశల బంధురమై యీ
పరిమళ రాజ మపూర్వ, స్ఫురణంబున మించె దీని పుట్టెట్టిదొకో ? ౧౮౦

శా॥ నాసామోహనమై నిరంతరమునై నా డెంద మల్లార్చుచున్
భాసిల్లెన్ గనఁబోలునంచు వెదకన్ భానూద్భవాతీరమం
దాసల్ పెంచుచుఁ బోయిపోయి యెదుటన్ హర్షంబునం గాంచె దు
ర్వాసస్సంవృత మైనదాని వనిలో రత్నప్రశస్తాంగనన్. ౧౮౧

కం॥ శృంగార రహితమై యీ, యంగన విహరించుచున్నయది యీ యసితా
పాంగీ సుగంధవహానొకో, వెంగడమై తోఁచె నిట్టి విధ మెట్టిదొకో.

ఉ॥ చక్కదనంబుచూడ సురసారసలోచనఁ బోలియున్న దీ
చక్కెరబొమ్మ యిట్టి సతి సారసగర్భుఁడు వే సృజించి యీ
డెక్కటి గర్వవృత్తులకు నిక్కయొనర్చె నిజంబు దీని మై
చొక్కపుగంధమే యనుచు క్షోణితలేశుఁడు నిశ్చయించుచున్. ౧౮౩

ఆ॥ కట్ట బట్టలేక పొట్టకన్నములేక, పెట్టుసొమ్ములేక బికిరమెత్తు
నట్టి పోల్కియున్నదిట్టిబోటికి నింత, యబ్బురంపుఁ దావియలరుటెట్లొ? ౧౮౪

ఉ॥ తావిఁగనంగ నద్భుతము దప్పక విక్రమరేఖ యౌవనం
బావిలమౌచుఁ గాముకుల స్వాంతములన్ గరఁగంగఁ జేయు స
ద్భావముగల్గునో యుగముఁ బాయక యీ తరుణీలలామ పొం
దే వరుసన్ గడింతు నెడమియ్యక యున్నది చిత్రమౌనొగిన్. ౧౮౫

ఉ॥ ఎవ్వరిదానవే ? సరసిజేక్షణ ! దేవవధూటివో ? వనిన్
మవ్వముగాఁ జరించు ఫణిమానినివో ? మనుజాబ్జనేత్రివో ?
యివ్విధి దేవతాంగనవొ ? యెవ్వతె ? వీ వటుగాదయేని నీ
జవ్వన మీ యొయారముఁ బొసంగునె ? యన్యవధూజనంబులన్. ౧౮౬

మ॥ కుహనారూపముచేఁ జరించు సుమరుత్కూలంకషన్ గా ముహు
ర్ముహురాలోచన మంది సందియము దీరకున్ గాక యంచున్ దమిన్
మహిళారత్నము చేరఁగాఁ జని సుహృన్మందారుఁడౌ రాజు సం
స్పృహుఁడై పల్కె వచశ్చమత్కృతులు పేర్మిన్ గూర్మిఁ బుట్టింపఁగన్. ౧౮౭

సీ॥ తరుణి నీకెవ్వరు తల్లిదండ్రులు మహా,గహనంబులో నొంటిగాఁ జరింతు
వేకతంబున నిందు నేకాంతవర్తన, మ్మాచరించెదవు పద్మాయతాక్షి !
వోఢవో? లేక యవోఢవో ? నినుఁజూచి, స్మరశరాసన ముక్తశర వితతికి
దావలంబైతి నీతనుగంధజాలంబు, మచ్చిత్త శబరిని మరులుకొల్పి

గీ॥ యిందు నాకర్షణమొనర్చె నేమిచేయు,దానవై యుందు విచ్చోటదథ్యముగను
నీదువృత్తం బదెట్టిదో నీరజాక్షు,నాన యిందేల విహరించెదో నిజంబు. ౧౮౮

వ॥ తెలుపుమని వసుధావల్లభుం డడిగిన. ౧౮౯

ఉ॥ భూవర ! దాశరాజునకుఁ బుత్రిని దండ్రిగృహంబునందు స్వే
చ్ఛావశవర్తనంబులు పొసంగఁగఁ గన్నియనై వసింతు నీ
శైవలినీతరిన్ గడపి చక్కఁగఁ బాంథుల సంతరింతు స
ద్భావతఁ దండ్రి ! నన్నిచటఁ దప్పక నిల్పి భుజిక్రియార్థమై. ౧౯౦

ఆ॥ ఇంటి కేగినాఁడు వంటకమ్ము భుజించి, వచ్చునంతవట్టు వదల కేను
నిలిచి పాంథజనులఁ గలముపై నెక్కించి, కడపి దరికిఁ జేర్పఁగల నటన్న.

మ॥ విని రాజన్యుఁడు చిన్ననవ్వొలయ నో బింబోష్ఠి ! నీ కేటి కీ
పను లత్యంతమనోజ్ఞ వీవు జగతీభారంబు దోర్మండలీ
ఘనపీఠంబున నిల్పువాఁడ రిపురాడ్గర్వాంధకారార్కుఁడన్
విను నన్నున్ గురువంశదీపకునిఁగా వేయేల ముమ్మాటికిన్. ౧౯౨

గీ॥ నిన్నుఁజూచినయది మొదల్ నీరజాస్త్ర, శస్త్రసంయోగచిత్తంబు జలదరించి
మఱుఁగుఁజేరితి నన్నింక నెమన్న నలకుఁ, బాతునిఁగఁ జేయవలయు సంభావనమున.

సీ॥ ఒండొకకాంతతో నున్నవాఁడను గాను, మద్ధర్మపత్నివై మద్గృహమున
సుఖమందు మింక దాసుండనయ్యెద మనో,భవతాప వేదనాభరము వెడలి
తొల్లి యొకర్తు నాతో సుందరీమణి, గలసి యెంతో నన్నుఁగాసి పఱచి
చనియె నాటనుగోలె సఖియఁ జేకొనకుంటి, సర్వావయవరూపశాలిని వగు

గీ॥ నిన్నుఁగాంచి మనంబు వేదీని పార,వశ్యమును జెందియున్నది వలపుతలఁపు
సఫలమొనరింప నీవె పోచతుర వనుచుఁ, బౌరవుండిట్లు పలుక నప్పడఁతియనియె

మ॥ అవనీనాయక ! నిన్నుఁ గన్నమొద లత్యంతంబు మచ్చిత్తమున్
స్వవశంబై నిలువంగ నేరదు మనోజాతక్రియా కౌశలం
బవనిన్ స్త్రీపురుషానురూపము గదా యట్లయ్యు నేఁగన్యకన్
భవనస్థుండగు తండ్రిపంపున భవత్పాణిగ్రహం బొప్పగున్. ౧౯౫

గీ॥ ఏను స్వైరిణిఁగాను నభీష్ట వల్ల, భాభిలాషతఁ జెంది నీవడిగి తేనిఁ
దండ్రి నన్నిచ్చుమనకోర్కి ధన్యమౌఁగ, దా! యనుచు నాతరుణియుఁ దద్దయును బల్కె.

చ॥ జనకుఁడు నీవు వేడినను సందియమందుచు నీయఁడేని నీ
వనితనుగాఁ దలంపు మిఁక వల్లభుఁగా నినుఁగొందుఁ గాని య
న్యుని మది నిచ్చగింప హృదయోద్భవు నాన యటంచుఁ దాల్మి నె
మ్మనమున నూరడిల్లుమని మాటికిమాటికిఁ బల్కఁ గల్కియున్. ౧౯౭

గీ॥ ఇంత నాపయి మరులొందెదేని నీకు, నేల తప్పించుకొన నిప్పుడేలుకొనఁగ
వలదె యన నేల కులధర్మవర్తనంబు, రక్షణీయంబు మా వంటి రమణులకును.

—॥ శంతనుఁడు దాశరాజును జూచుట ॥—

చ॥ ముసిముసి నవ్వులొల్క నగుమోము చివుర్పఁగ నిట్లుపల్కె నా
యొసపరి పల్కులెల్ల విని యొర్వఁగ రాని మనోభవవ్యథన్

మసలుచు దాశవల్లభుని ¸ మందిర సీమకు నేగి వాని నిం
పెసగఁగఁ గాంచె వాఁడు మదిఽనెల్లిదమై యెదురేగి యంతటన్. ౧౯౯

గీ॥ ఏఁగృతార్థుఁడనైతి భూఽమీశ్వరుండు, తనకుఁ దానింటి కరుదెంచెఽననుచు ¸ మ్రొక్కి
శీర్షమున నంజలిఘటించి ¸ చిత్తమలరి, రాజభూషణ ! నీవిందుఽరాక మేలు.

ఉ॥ దాసుఁడ నైతి యుష్మ దుచిఽతంబగు నాసన మిందు నాగమా
యాసముఁ దీఱ విశ్రమణఽమందు మటంచును బీఠమిచ్చి సం
తోసము వెల్లి పర్వఁ గరఽతోయజముల్ ముకుళించి యోగ్యపూ
జాసరణిన్ భజించి సరఽసస్తుతులన్ మది కింపొసంగుచున్. ౨౦౧

కం॥ నేఁజేసిన తొలితపములు, రాజిల్లెన్ నీదు రాక ¸ రంజిల్లెఁ గదా !
నాజన్మము నినుపొడుపున, రాజీవముఽవోలె సుకృతఽరాజిన్ గనెఁగా. ౨౦౨

ఉ॥ ఏమి దలంచి వచ్చితిరొ ¸ యిచ్చటికిన్ మదిలోనఁ గర్జమి
చ్ఛామహితమ్ముగా నుడివి ¸ సంతసమొందఁగఁ జేయుమన్న సు
త్రామనిభుండు శంతనుఁడు ¸ దాశుని తోడ వచించె నీ సుతన్
గోమలగాత్రి గంధవతిఁ ¸ గోరితి నీ మది మెచ్చి యీయుమా. ౨౦౩

ఆ॥ ధర్మపత్నిఁ జేసి ¸ ధరణీభరంబెల్లఁ, దాన యేలునట్లు ¸ తప్ప కిడుదు
నెద్ది యభిలషింతు ¸ వీవు నే నదియిత్తు, నీయఁ దగినవస్తుఽవేది యయిన. ౨౦౪

శా॥ కైవర్తాధిపుఁ డట్టులేని వసుధాఽకాంతా! మదాత్మోద్భవన్
నీ వాంఛారతి దీఱనిత్తుఁగాను మఽన్నీరేజపత్రేక్షణన్
నావాంఛన్ సమకూర్చి యామెసుతునిన్ ¸ నానా మహీపాలన
శ్రీవాల్లభ్యము కూర్చెదేని ననినన్ ¸ జిత్తమ్మునన్ గొంకుచున్.

— శంతనుఁడు దాశరాజు వాక్యమునకుఁ జింతిల్లుట. —

మ॥ బలవంతుం డగు భీష్ముఁ డుండఁగ ధరాఽపాలుండు వీఁడౌనె? యి
ట్టులుకైవర్తుఁడు పల్కె బొంకుటకు నెట్లో? బోటి రాకున్న ఘో
ర లతాంతాయుధు బారి కోర్వఁగలనే ¸ రాజ్యంబు గాంగేయ దో
ర్బల గమ్యంబగు వీనికెట్లొడఁబడున్ ఽభారంబుగాఁ దోచుటన్. ౨౦౬

గీ॥ అని తలంచుచు మదిలోన ¸ నవనివిభుఁడు, మాఱుమాటాడఁగా లేకఽమరులుగొనిన
విరహవారిధి ముంచిన ¸ వెరవు దప్పి, యింటికరుదెంచె సేనాఽసమేతుఁ డగుచు.

మ॥ ధరణీపాలన మాచరింపఁడు సుఖాఽగ్రక్రీడ లాలింపఁ డా
తురుఁడై మజ్జనభోజనాదులకు సంఽతోషింపఁ డేకాకియై

పరచింతావ్యసనంబునఁ బొరలుచుఁ । భావంబు పట్టిక యె
వ్వరినిఁ జూడఁడు పల్కఁ, డిట్టితెఱఁగునఁ । వర్తిల్లె నానాఁటికిన్. ౧౦౮

ఆ॥ వెఱ్ఱివాఁడు వోలె । వివశుఁడై యేకాంత, వర్తనమున మసలి । వనటఁ బొగులు
తండ్రిఁ జూచి యేమి । తలఁచెనో జనకుండు, చిత్తమిూక వగలు । చెందెననుచు.

— శంతనుని గాంగేయుఁడు ప్రశ్నించుట. —

వ॥ దేవవ్రతుండు తండ్రిసన్నిధానంబునకుఁ జని యభివందనంబొనర్చి, మహీపాలా! భవదవక్రవిక్రమంబున నిఖిలారాతిమండలంబులును గరంబులు ముకుళించుచు శరణాగతంబులై యున్నయవి యెందేనిబలవంతుండగు నభియాతి వశుండు గాడేనిఁ బట్టిభంజించెదఁ జింతింపం బనియేమి నావంటి తనయుండు గలిగియు బుణ దుఃఖపీడలంబొరయ నవకాశంబుగల్గునే భవదీయాజ్ఞావశంవదుండనైన నన్నుఁ గటాక్షింపుము, పితృవాక్యపరిపాలనంబు కంటె మదీయజన్మసాఫల్యంబు గలదే రఘువంశచంద్రుం డగు శ్రీరామభద్రుండు రాజ్యంబువిడిచి లక్ష్మణ జానకీ సమేతుండై యరణ్యావాసంబొనర్చి శైలకందరాదిసంచారంబొనర్చుట దశరథానుజ్ఞను గాదె, లోహితాస్యుండను రాజకుమారుండు దాసుండై విప్రునిచేఁ బీడితుండై దాస్యంబొనర్చుట తండ్రియగు హరిశ్చంద్రు ననుమతివలనం గాదే, విశ్వామిత్రునివలనఁ బాశబంధంబు వెడలుటయేకాని శునశ్శేపుండు తండ్రి యగు నజీగర్తునిచేత విక్రయంబడి క్రీతుండుగాడే, తండ్రి యాదేశంబువలనఁ బరశురాముండు మహాదురితం బని యెఱింగియు మాతృశిరఃఖండనం బొనర్పఁడే, కావున మచ్ఛరీరంబు భవదధీనంబు నేను గింకరుండ దుఃఖవ్యాప్తివలనం దొఱంగి యసాధ్యంబగు నర్థంబునైనను బ్రతిపాదింపుము, ధనుర్ధరుండనై దుర్భరంబగు కార్యంబునైనను నెఱవేర్చెద భవదీయంబగు చింతాభరంబపన యింపక వాక్రువ్వఁడు మజ్జన్మంబునకుఁ గృతార్థంబు సంఘటించునే భవచ్ఛీర్షం బమోఘం బగుననియుఁ దండ్రి యాప్సితంబు నెరవేర్పనిసుతుం డేటికి నట్టివాఁ డుద్భవింప కుంట మేలు వానిం జెప్పనేల యనియుఁ బెక్కురీతుల శంతనునిఁ బ్రార్థించిన-

మ॥ వినయవివేకశీలి యతివిశ్రుత దోర్బలశాలి యైన భీ
ష్మని పలుకాదరించి మది । ముంచిన సిబ్బితి మోమువంచి సా
మనసనదీసుతుఁ గని కుమారక! సర్వము సద్ధితంబె నె
మ్మనమున సాధ్యమౌ దురభిమానము దోడ్పడ దించు కేనియున్. ౧౧౧

క॥ చతురంబుధివేలం బగు, క్షితియెల్లను నిస్సపత్న । సీమంబయ్యెన్
మతినించు కేనిఁ గడమయి, కుతుకము నిండారు నొక్కరుఁ డొక్కఁ తెలిపెదన్. ౧౧౨

కం॥ ఆయుర్భాగ్యంబులు ధర, నేమెడఁ బ్రాణులకు స్థిరత ♦ నెనయవు సత్యం
బీ యర్థము ప్రారబ్ధ మ,మేయమ్మగుఁగాన, దెలియుమీ మోక్షకృతిన్. ౨౧౩

సీ॥ సంగ్రామమున మహైశ్వర్య ధుర్యంబైన, దోర్బలంబున నీవుతో టు ప్రపడక
నైరుల నిర్జించు ♦ శూరుండ వభిమాని, వరిప రాజ్యముఖవృత్తి ♦ యగుట లెఱుఁగ
వేకాత్మజుండవై ♦ యిట్టిదుష్కరరణ, ప్రారంభముల శత్రుభంజనంబు
గావింతు వోటమి ♦ గలుగ దెప్పటికిని, నటులయ్యుఁ జాలపర్యాయవశత

గీ॥ నొండుగతి సంఘటిల్లెనే ♦ నుండి లేని,వాఁడ నీకనేమి చేయఁగావచ్చు నాకు
నిది మహాచింతయై మనంబెంతొ వగలఁ, గుందు టేకాని వేఱొక్కటొఁతగలదె?

మ॥ అనుచున్ మందటిలంగఁ బల్కి మదిలో ♦ నర్థంబెడన్ లేని యా
జనకస్వాంత మెఱుంగఁ జాలనని వెచ్చన్ శ్వాసముల్ నింపి మం
త్రినికాయంబుల వృద్ధులన్ బిలిచి వారింగూడి యేకాంత వ
ర్తన నిండోలగముండి భీష్ముఁడనిరెన్ ♦ ధర్మానురూపంబుగన్. ౨౧౪

సీ॥ భూపాలుఁ డడవికిఁబోయి వేటాడి యిం,టికి వచ్చినది మొదల్ ♦ తీవి దప్పి
మదిలోని చింతచే ♦ మఱుఁగుచుఁ గొల్వేది, రాజకార్యోత్సాహరక్తిమాలి
లీలావిహారాది ♦ ఖేలనంబులఁ బ్రొద్దు, గడపుట మానె నిక్కముగ వినుడి
యెడలేని ప్రేమంపు ♦ టిక్కగా ననుఁజూచు,వాఁడు నాతో మాటలాడుటయును

గీ॥ వీడియున్నాఁడు తలఁపెట్టివిధము కలదొ, తెలిసి మీరెల్లనాతోడఁ దెలుపవలయు
నెంత దుస్తరమైన సాధింతు నిజము, రాజచిత్తమ్ము పరికించి ♦ రండు వేగ. ౨౧౫

చం॥ చనుఁడని పంప వారలును ♦ శంతనుసన్నిధి కేగి పల్కి రో
యనఘ భవన్మనోగతి నిరాకుల మెప్పుడు నట్టి మానసం
బనితర భేద్యమై వివశమైనటులున్నది కారణంబు మా
కనువు పడంగఁ దెల్పుము దయామతి నన్యులుగాఁ దలంతువే. ౨౧౬

కం॥ మామెడఁ దెలుపని కార్యం,బేమెడ మీయందు లేమి ♦ నెఱుఁగుదుము కదా
యీయర్థము మఱుఁగుంపక, యో యవనీపాల తెలుపు ♦ మొయ్యన ననినన్.

ఉ॥ గంధవతీసతిన్ గనిన ♦ కాలము నాటనుగోలె నించి పు
ష్పంధయమార్వి వంచి పటుశాతసుమాశుగకోటి నాటి ని
ర్బంధపరంపరల్ వయసుపాటొనరించె మరుండు మానసం
బింధనరాశి నేర్చుగతి ♦ నేర్చు వియోగదవానలం బికన్. ౨౧౮

కం॥ అమ్మరు లిఁక నాచిత్తం,బుమ్మలికము చేసెననుచు ♦ నుర్వీనాథుం
డమ్మంత్రిముఖ్యులకుఁ ద,థ్యమ్ముగఁ దెలుపంగ వారు ♦ తటినీసుతుతోన్.

—॰ గాంగేయుఁడు దాశరాజుతో సంభాషించుట ॰—

ఆ॥ తెలిసి వచ్చినాము ॥ దేవవ్రతా ! రాజ, మానసంబటంచు ॥ మంత్రివరులు
విన్నవింప నతఁడు ॥ వేగ వారలఁగూడి, దాశమందిరంబు ॥ దరికిఁజనియె. ౨౨౧

మ॥ చని యద్దాశునిఁ గాంచి నమ్రుఁడయి యా ॥ స్వర్గాపగాపుత్రుఁ డో
యనఘా ! నీ సుత నిమ్ము మజ్జనకుఁ డౌ ॥ నా శంతనుక్ష్మాతలే
శునకున్ నేఁగొమరుండ గంధవతియేసూ ! తల్లి నాకయ్యెఁ బ్రా
ర్థనమున్ జేయఁగవచ్చినాఁడ సుతకున్ ॥ దాసుండనై తిన్ గదా. ౨౨౨

శా॥ చింతింపన్ బనియేమి కూతునిడు మాకచిత్తంబు రంజిల్లు నం
చెంతో వేడిన ధీవరుండనియె నీ ॥ కిల్లాలుగా నిత్తు న
త్యంతోత్సాహముతోడఁ జేకొనుము భాకవ్యం బిట్టిచందంబు భూ
కాంతున్ శంతనుఁ గాంతుఁజేసిన నయోకగ్యప్రక్రియల్ గావొకో. ౨౨౩

కం॥ ఆతత విక్రమ సంప, త్ఖ్యాతుఁడవగు నీవు రాజవై నిలిచినచో
నాతనయాతనయుం డే, రీతిన్ రాజగుట గలుగు ॥ వృథయగుఁగాదే. ౨౨౪

శా॥ నామాటల్ చెవినింపి బోటిగొను మకన్నన్ నవ్వి గాంగేయుఁ డా
ప్తామాత్యాన్వితుఁడై వచించె విను కాకజ్యం బొల్ల నాతల్లి యీ
భామారత్నము తత్సుతుండు వసుధాకపాలుండు తథ్యంబుగా
నీమైఁ బల్కితి నిందుసందియము లేకదెవ్వారలున్ విందుగా. ౨౨౫

శా॥ శ్రీమంతంబుగఁ బెండ్లిచేయుమని తకచ్చిత్తంబు రంజింప న
బ్భూమీశాత్మజుతోడ దాశుఁడనియెన్ ॥ భూరిప్రతాపోజ్జ్వల
ద్ధామోద్దాముఁడ వీవు నీకొమరుఁ డుకద్య ద్దర్ప దోర్విక్రమ
శ్రీమాన్యుండగు నేని సర్వధరణిన్ ॥ జేకొంట తథ్యంబగున్. ౨౨౬

కం॥ అత్తఱి మత్పుత్రిసుతు, నత్తనె రాజ్యంబు సఫలకమగు నిక్కార్యం
బిత్తెఱఁగు నియ్యకొందునె, తత్తరపడి కూతు నీదుకతండ్రికి నీయన్. ౨౨౭

శా॥ వ్యర్థుండై మనుమండు నాయిలుసొరన్ ॥ వానిన్ గనుంగొంచు న
స్వర్థప్రక్రియ మిమ్ముఁదారసిలి యోకర్వన్ బోరులన్ నిల్చి స
ర్వార్థంబుల్ సఫలంబు చేయఁగలమే ॥ యా జోలి నాకేల మ
త్స్వార్థం బేమి ఘటింపఁ జేసికొనుటల్ ॥ హాస్యాస్పదంబుల్ కదా. ౨౨౮

కం॥ జంబాల మలమ నేటికి, నంబువులన్ గడుఁగనేల ॥ నరుగుము సామా
న్యంబునఁ బెండిలియొప్పు ని,జంబుగ మన పెండ్లియగు నసామ్యము వినుమా. ౨౨౯

ఆ॥ సార్వభౌమ పదవి సడిసన్న వారలు, మీర లోడఁ గడపుఁవార మేము
మీకుమాకుఁ దెలియ "మేరు సర్షపరీతి", వెఱతుఁ గూతునీయ విను మనంగ.

—• గాంగేయుఁడు వివాహము చేసికొనననని ప్రతిజ్ఞచేయుట. •—

మ॥ వినుమీ నాదుప్రతిజ్ఞ దేవతలు నుర్వీముఖ్య భూతంబులున్
వినఁగాఁ బల్కెదఁ బారలౌకిక జయావిర్భూతిఁ బుత్రార్థినై
జనలోకాప్తి వివాహమున్ గొనను స్వేచ్ఛన్ సంచరింతున్ జుమీ
ధన దారాత్మజ మీషణత్రయము యాథార్థ్యంబుగా వీడితిన్. ౩౩౧

కం॥ ధీవర! నిశ్చయ మిది మద్ధీవరణీయార్థ మని నదీసూనుఁడనన్
జీవనచరజీవనుఁ డా, భూవరునకు నిచ్చెఁ దనదు పుత్రి సుగాత్రిన్. ౩౩౨

ఆ॥ అంత శంతనుండు హరిణాక్షి యోజనగంధిఁ బెండ్లియాడి గాంచె సుతుల
నిరువురను దదీయ వృత్తాంత మానుపూర్వికముగాఁ దెలిపెద వినుఁడు మీరు.

సీ॥ చిత్రాంగదుండు విచిత్రవీర్యుండును, నన నిర్వు రా పార్థివాత్మజులకు
నంబి కాంబాలికలను కాశిరాజు పుత్రికలను భీష్ముండు దెచ్చి పెండ్లి
తగఁజేయఁ బిమ్మటఁ దెగిరి వా రిర్వురు,క్షయనొంది గంధర్వ కలహమొంది
వారి వధూటులవలన వ్యాసప్రసాదమునను ధృతరాష్ట్ర ధరణివిభుఁడు
గీ॥ పాండురాజనుపుత్రుండుప్రథముఁడంధుఁ డయ్యె రెండవపుత్రుండు వ్యాస కోప
వశతఁదెల్లనివాఁడయ్యె వారి దాసివలన విదురుండు మేధావి గలుగుటయును.

చ॥ క్రమమున నీకుఁ జెప్పితిని గాదె తదగ్రజుఁ డంధుఁడౌటచే
విమల ధరాధిరాజ్య పదవిన్ సురశైవలినీ సుతుండు పాం
డుమహీపతిన్ విభున్ గొని కరమున్ రిపుకోటి నడంచి రాజపీ
ఠము ప్రభవింపఁజేసెఁ బ్రకట ప్రతిభాప్రతిమాన తేజుఁడై. ౩౩౫

సీ॥ ధృతరాష్ట్ర విభునకుఁ దేర్వ లిర్వురువారు, గాంధారి యనియెడు కమలనయన
వైశ్యనా నిర్వురిఁ బాణిగ్రహణమయ్యెఁ, బాండుభూపతికిని బడఁతు లిరువు
రందుఁ గుంతియనంగ నంభోరుహదళాక్షి, శూరసేనునకుఁ గుమారి యయ్యె
మాద్రినా నొక్కతె మద్రభూపతికిని, గూతురై తనరె నబ్జాతనేత్రి

ఆ॥ అంధుఁ డైన రాజు గాంధారివలనఁ బు, త్రశతిఁ గాంచెఁ బిదప ధర్మపత్ని
వైశ్య యనెడి బోటివలన యుయుత్సునిఁ,గాంచె వార లెలమి గాంచి రవని.

ఆ॥ పాండురాజు ధర్మపత్ని కుంతీదేవి, తండ్రియింట నుండుతఱిని దరణి
కరుణవలనఁ గనియెఁ గర్ణుఁడన్కుమారుని, ధైర్య శౌర్య కార్యధనుని ఘనుని.

ఉ॥ నావిని మాను లిట్లనిరి ఽ నవ్య వయఃపరిపూర్ణ గాక కుం
తీ వనజాక్షి కన్యయయి ఽ తేకువఁ బుత్త్రినిఁ గాంచె నంటి వా
జీవనజాక్షి పాండువిభు ఽ శేఖరు నెట్టులు పెండ్లియాడె మా
కీ విధి యబ్బురం బిదియె ఽ యిష్టము తెల్పుము విస్తరంబుగన్. ౨౩౮

—• కుంతీదేవి దుర్వాసునివలన మంత్త్రం బుపదేశంబగుట. •—

సీ॥ అనిపల్కు నత్తపోధనులను దిలకించి, సూతుఁ డిట్లనిపల్కె ఽ శూరసేన
ధరణీశునింటను ఽ దరుణి కుంతీదేవి, కన్యయై వర్ధిల్లు ఽ కాలమునను
నృపతి కుంతీభోజుఁ ఽ డపరిమితోత్సాహి, చెలిమికాఁ డగుట వి ఽ చ్చేసి శూర
సేనునిఁ జూచి యి ఽ చ్చేడియ నిమ్మని, కుంతిని దాఁ గోరి ఽ కొనిన నిచ్చెఁ

గీ॥ గూతు గాఁగను గొనిపోయి ఽ కుంతిభోజుఁ, డాదరంబునఁ బెంపంగ ఽ నచ్చటికిని
వచ్చె దుర్వాసుఁడను ముని ఽ ప్రవరుఁ డొకఁడు, తత్తపోధనుఁ బూజించి ఽ ధరణివిభుఁడు.

క॥ చాతుర్మాస్యమ్మున మునిఁ, బ్రీతిన్ దనయింట నిలిపి ఽ ప్రియపూర్వక వి
ఖ్యాతసపర్యలఁ దనిపెన్, జేతోమోదమున ముని వ ఽ సించెన్ నియతిన్. ౨౪౦

క॥ బాలామణి యగు కుంతీ, లోలాక్షి తపస్విసేవ ఽ లో నిరతంబున్
గాలముఁ గడుపుచు భక్తి స, మాలంబిత హృదయ యగుచు ఽ నయ్యెడ నుండెన్.

సీ॥ కర్మంది మేల్కొను ఽ కాలంబునకు ముందు, మేల్కొని శుచియయి ఽ మృదులధౌత
వసనంబు గైసేసి ఽ వచ్చి గృహాసన, పూజోపకరణముల్ ఽ పొందు పఱిచి
మజ్జనంబలరించి ఽ మడికాపు లర్పించి, వలయువస్తువు లెల్ల ఽ వలనుపఱచి
దీక్షయా పిమ్మటఁ ఽ దివిరి ప్రొద్దువసించి, తా నింటను భుజించి ఽ దండఁ జేరి

గీ॥ యతఁడు నిదురించునందాక ఽ నచట నుండి, యీగతినిఁ జేసె, శుశ్రూష ఽ లెల్లయెడల
బాల యయ్యును రంజిల్లెఁ ఽ బ్రౌఢ యట్టు, లిట్లు సేవింప ముని మెచ్చి ఽ యింతినిఁ గని.

కం॥ నందన! నీభక్తికి నా, నందము నొందితి నటంచు ఽ నవ్యతర దయా
స్పందుఁడయి యిచ్చె మంత్త్రము, ఛందోయుతముగఁ బఠించె ఽ సతి యమ్మనువున్.

—• కర్ణుని జననము •—

సీ॥ ఏ దేవుని గుఱించి ఽ యిమ్మంత్త్రము పఠింప, నా దేవుఁ డరుదెంచు ఽ నట్టిశక్తి
గలిగించు మంత్త్రమై ఽ కల్కియందు వసించె, నంతఁ గొన్ని దినంబు ఽ లందునిలిచి
ఘనమౌని యరిగినఁ ఽ గాంత యొక్కెడను నీ, మంత్త్రపరీక్షకై ఽ మదిఁ దలంచి
యే దేవుని భజింతు ఽ నే నని తలపోసి, యుదితుఁడై వచ్చు సూ ఽ ర్యునిఁ గుఱించి

గీ॥ పఠన మొనరించు నంతలో ఽ భాస్కరుండు, మండలము వెల్వడుచు నొక ఽ మానుషంపు
రూపుఁ దాల్చి [illegible] ఽ [illegible] వచ్చె నా ఽ కస్మికముగ.

ఉ॥ సుందరమూర్తియై యెదుటఁ జొక్కముగాఁ గనిపించు భాస్కరున్
గందొవలన్ గనుంగొనుచుఁ గాంత నిరంతర సాత్త్వికోదయా
మంద రసానుభావమున మానిని కంపిత గాత్రియై త్రపా
మందర మానసాంబుజము మాటికి మాటికిఁ గొంకుపాటునన్. ౨౪౫

చం॥ వెలవెల వాఱి వెల్లనయి వేమరు వేమరు భారి నొంది చే
తులు ముకుళించి కన్నుఁగవ తొంగలిఱెప్పలఁ దూఁగ వింతలై
తలఁపులు నుప్పతిల్ల భయతత్పరయై గ్రహనాథ! మిమ్ముఁ గ
న్నులఁ గనుగొంటి ధన్యత యనూనత నొందెఁ గృపాదృష్టిఁ జూచుచున్. ౨౪౬

కం॥ కరుణించి నీదు నెలవున, కరుగుము నినుఁ జూచి ధన్య నైతిని నన్నన్
సరసిజబాంధవుఁ డిట్లను, తరుణీ! నీ మంత్రశక్తి దటిసితిని జుమీ. ౨౪౭

ఉ॥ రమ్మని నన్నుఁ బిల్చి యనురాగము లోఁ జివురించి యుండియున్
గమ్మనివింటివాని సుమకార్ముకమర్మ విభేదనంబులన్
సొమ్మసిలెన్ మనంబు ననుసొంపుఁగ నింపొనరింపఁ జూచితిన్
బొమ్మననేల వచ్చుటకుఁ బోవుటకై చెడి వచ్చినాఁడనే. ౨౪౮

ఆ॥ నీదు మంత్రశక్తి నే మరు లందితి, నించుఁబోఁడి పరిభవింపనేల
నన్నుఁ బొందు మనుచు నళినబంధువు పల్క, వెఱచి కుంతి పలికె వినుము దేవ!

ఉ॥ కన్యను నిన్నుఁ గూడుతమిఁ గాంచఁగనేరను ధర్మమూర్తివై
మాన్యత సర్వసాక్షి వయి మద్హృదయం బెఱుఁగంగఁజాలవే
ధన్యతఁ గోరి పిల్చితిని దద్దయు మ్రొక్కెడుదానఁ గాని య
న్యోన్యసుఖాభిలాష భవదగ్రమునన్ నిలువంగ నేర్తునే. ౨౫౦

సీ॥ కరుణించి చనుమన్నఁ గలికిరో! యూరక, పోయితినేని నాకబోఁటి సురలు
నవ్వరే యిటులేల జవ్వని నా కోర్కెఁ, దీర్పుమీ యటులు గాదేని నీకు
మంత్రమిచ్చిన యట్టి మానిని నీతండ్రి, కుంతిభోజుని మద్దురంతభాను
చిత్రభానుజ్వాలచే దహించెద నీవు, వెఱచెదవేని జగం బెఱుఁగకుండఁ

గీ॥ గన్యకాధర్మమఖిలమార్గగాదె శౌర్య, ధైర్యఘనుఁడైన బలవంతుఁదనయు నిత్తు
మ న్మనోరథ మీడేర్చి మగువ! మరుని, బారి,ద్రోయక వలచి చేపట్టుమనిన.

గీ॥ ఎద్దియును దోచ కబ్బోటి యెదుట నిలిచి, తన్మనస్కత లజ్జచేఁ దరలకున్నఁ
గౌఁగిట నలంచి భోగించి కరమువరము,నొసఁగి యంతర్ధియయ్యె నయ్యువిదయంత.

ఉ॥ గర్భముఁదాల్చి యెవ్వరికిఁ గానఁగనీక తమిన్ గలంగుచున్
దుర్భరవేదనన్ నొగిలి తోయరుహాక్షి నిజావరోధ మం

దర్పకుఁ గాంచె భవ్యసుషమాంచిత విక్రమదక్షుఁ బ్రోల్లస
ద్వార్భవబంధు తేజుఁ బరివర్ధితదానధురాభ్రిభూజునిన్. ౨౧౩

ఆ॥ పుట్టుతోడ సహజభూషణంబులు గాఁగఁ, గవచకుండలములు గనుపడంగ
మెఱసె నంత శిశువు మేదిని రెండవ, భానుఁ డనఁగ వహ్నిసూనుఁ డనఁగ. ౨౧౪

చ॥ నలువ యెఱుంగుఁగాని భువనంబుల నెవ్వ రెఱుంగకుండ ని
ప్పాలపునఁ బుత్రునిన్ గనుచు బోటి భయాతురయై వడంకినన్
గలవరమొంది వచ్చి నయకౌశల ధాత్రియుఁ జెంతఁజేరి యో
వెలఁది భయంపడన్ వలదు వేదన లేటికి నేను గల్గఁగాన్. ౨౧౫

కం॥ చింతిల్లకు వెరవుగల దొ,కింతని ధాత్రేయి పలికి యెత్తి కుమారున్
దొంతర మందసమున నిడి, ప్రాంతస్థ నదీప్రవాహ పతితు నొనర్తున్. ౨౧౬

కం॥ నా విని నందను రవితే,జో విభవానందనున్ వసుంధరఁ బొరలం
గా వీక్షించుచుఁ గుంతీ, దేవి పయింబడి మహార్తి దీర్ఘధ్వనులన్. ౨౧౭

ఉ॥ కన్నులనీరు గాల్వలయి కాఱఁగఁ బుత్రునిఁ గౌఁగిలించి యో
యన్న! నినున్ ద్యజించి యిటు లారడి పాలయిపోతి నేమొన
ర్తున్నినుఁ బాసి యేమియును దోపదటంచును దాపవేదనా
భ్యున్నత యౌచు నేలఁబడి యొక్కెడ దుఃఖభరావలీఢయై. ౨౧౮

గీ॥ ప్రాణములకన్నఁ దీపి నా పట్టి నిన్నుఁ, బాసి యెట్లోర్తు నేమని పల్లటింతు
నింత నిర్భాగ్యనైతి నికన్నెట్లు విడుతు, నెంత చేసెను విధి వాని నేమనందు.

శా॥ అన్యాధీనము జీవితం బగుటచే నన్నా! నినున్ బాయు నీ
యన్యాయంబు ఘటిల్లెఁ గన్యలకు నెంతద్దైనన్ వినన్ వింత దుః
ఖన్యాయం బెటు లానొ రాట్కులము లీ గర్హ్యాక్రియల్ సైతురే
మాన్యుం డౌ జనకుం డెఱింగిన నిసీ! మానంబు గోల్పోవఁడే. ౨౨౦

గీ॥ అఖిల లక్షణ లక్షితుండైన యట్టి, పుత్రు నెడఁబాసి నే నెందుఁ బోవుదానఁ
"గలికులాచార ధర్మ సంకటమువలన, నింతఁ బాపిష్ఠనైతి" నిం కే మొనర్తు.

ఉ॥ భానుభయంబునన్ బెగడి పాంసులనైతిఁ గఠోరవృత్తిలో
నూనితి దేవదేవి సగుణోద్గుణరూపిణి విశ్వవంద్య మ
న్మానసవాస శాంకరి సమస్త జగజ్జనయిత్రి యంబ ది
క్కై కొనుఁ గన్నతండ్రి నినుఁ బ్రాణములన్ వదిలెట్టిపోవదే. ౨౨౧

ఉ॥ పున్నమచందురుల్ దెగడి ౯ పొల్పగు నీ నగుమోముఁ జూచి యో
యన్న ముదమ్ముఁ గాంచుటకు ౯ నాలయమై సుఖ మంద నైతి నే
నెన్నఁడు తొల్లి దేవిని భజించిన దానను గానొ యట్లులై
న న్నినుఁ బాయజేయునె? యనారత దుఃఖభయాబ్ధి ముంచునే. ౨౬౩

కం॥ దేవీపదపంకజములు, భావించిన దాననైనఁ ౯ బట్టి! యిటుల దుః
ఖావిల నౌదునె! త్రిజగ,జ్జీవని కృపగలుగ నింత ౯ చెడుటయుఁ గలదే. ౨౬౪

సీ॥ ఈ కుంతిభోజుని ౯ యింటిలోన వసించి, నియతిచే నమ్మౌని ౯ నిలువనేల
నిలిచెబో మునియొద్ద ౯ నిరతనిష్ఠాయుక్తి, జెదరక పరిచర్య ౯ చేయనేల
చేసితిఁబో మౌని ౯ సిద్ధోపదేశంబు,చేసి యా మంత్రంబు ౯ చెప్పనేల
చెప్పెఁబో నది పరీక్షించెదనని సూర్యుఁ, దలపంగనేల తద్ధ్యానమున నె,

గీ॥ వచ్చి మరులంది కౌఁగిటఁ గ్రుచ్చిరతుల, నేలఁగా నేల యింతకు ౯ నేనె మూల
మనుచుఁదలపోసి కుంతివంతను దపింప,మందసము నందు నుంచి యాత్మజుని ధాత్రి.

—• బాలకర్ణుని మందసములోనుంచి నదిలో విడుచుట. •—

మ॥ యమునాంభోర్ఘురమందు వైచి యవగాహస్నానముల్ జేసి వే
గమ కుంతిసవిధంబుఁ జేరి నయవాక్యప్రౌఢిమల్ దేర్చి స్నా
నము చేయించి మడుంగు గట్టి నొడలన్ ౯ నవ్యోరుభూషల్ ధరిం
చి మనం బూరడిలంగ నంత నివసించెన్ దండ్రి గేహంబునన్. ౨౬౬

గీ॥ సవితృ కరుణానుభూతిగా ౯ సరసిజాక్షి, కన్యకాత్వంబు పొలివోవ ౯ గర్భవేద
నాదిబాధ లెఱుంగక ౯ యబలవోలెఁ, బెంచు తండ్రిగృహంబునఁ ౯ బెరుగుచుండె.

సీ॥ మందసంబును నదీ ౯ మధ్యంబునను దేలి, యాడుచు నంతంత ౯ నరిగి యరిగి
యొక లంక పట్టఁగా ౯ నురుశౌర్యనిధియైన, యతిరథుం డను ధీవరాగ్రగణ్యుఁ
డ మ్మందసముఁబట్టి ౯ యందుఁ బ్రొత్తర్భాను, భాసమానవపుర్విభాసమాను
నర్భకుఁ గాంచి హస్తాంబుజంబుల నెత్తి, యిల్లాలి కిడిన నయ్యింతి పెనుపఁ

గీ॥ గర్ణుఁ డను పేర ధీవరాగారమునను, బెరిగె నయ్యెడఁ గుంతిపైఁ ౯ బ్రేమఁదండ్రి
పరిణయ మొనర్పఁ దలపోసి ధరణిఁ గలుగు, రాజవరుల కెల్ల స్వయంవరమ్ముచాటె

—• పాం డు రా జు వి వా హ ము •—

ఉ॥ పాండు నృపాల శేఖరుఁ డభంగుర వీరచమూసమేతుఁడై
భండన భూస్థలిన్ నిఖిలపార్థివముఖ్యులఁ బాఱఁదోలి య

య్యండజయానఁ గుంతిఁ గొని । యాలిగఁ జేకొని మద్రిరాట్సుతన్
రెండవ యింతిగాఁ గొనుచు । ఱేఁడయి రాజ్యములెల్ల నేలుచున్. ౨౮౯

క॥ ఘోటక మెక్కి కృపాణము, ఖేటంబులు దాల్చి భటులు । కిక్కిరియఁగ నా
ఖేటకళానిపుణుండై, వేటకు నెల్వడియె విపిన । వీథుల వెంటన్.

—॰ పాండురాజునకు శాపము గలుగుట ॰—

ఉ॥ పెక్కుమృగమ్ములన్ గెడపి । భీమ భుజాబల విక్రమక్రమం
బొక్కెడఁ జూపుచుండ నతఁ । డుజ్జ్వల బాణ కృపాణధారలన్
జిక్కక దూర మేగు ఘనచిత్రి తరత్సు కదంబకంబులన్
ద్రొక్కి తురంగధాటి వడిఁ । దున్మిచుచు, నొక్కయెడన్ మృగాకృతిన్. ౨౯౦

క॥ క్రీడించు మౌనిదంపతి, జాడన్ వెనువెంట నరిగి । జనపాలుఁడు తా
నోడక పురుషాకృతిచేఁ, గ్రీడించు మునీంద్రునేసె । క్షితిపైఁబడఁగన్. ౨౯౧

క॥ క్రిందఁబడి లేచి మునియగు, కిందముఁడు వచించె నీవు । క్రీడార్థము బో
టిం దమిఁగూడిన యంతటఁ, డిందెద వని క్రోధరస ప్రకటిష్ఠుం డగుచున్. ౨౯౨

సీ॥ శాపానల జ్వాల । సంతప్త పాండుభూ, పాలుఁడు నతిదుఃఖ । భావ మంది
రాజ్యభోగములపై । రక్తిఁగాంచక వన, వాసంబుచేయుచు । వనటఁ బొగిలి
యింతులఁ బొమ్మన్నఁ । గాంతు వీడఁగలేక, కుంతియు మాద్రియు । గూఢవృత్తి
నమరనదీ తీర । మందు మున్యాశ్రమ, సీమలఁ దిరుగుచు । క్షేత్రతీర్థ

గీ॥ సేవచేయుచు మునికోటిచేఁ బురాణ, కథలు వినుచును గాలంబుఁ । గడపికొనుచు
వినియె నొకచోటఁ బుత్రహీనునకు ముక్తి, లే దుపాయాంతరమ్మునవేదయుక్తి.

వ॥ మఱియును నౌరసుండును బుత్రికాపుత్రుండును క్షేత్రజుండును గోళకుండును
గుండుండును సహోఢుండును గానీనుండును స్వయంప్రాప్తుండును దత్తుండును
క్రీతుండును నశక్తుండును ధనగ్రాహియును నను ద్వాదశవిధపుత్రులలో నుత్త
రోత్తరు లవరీయు లారోహణంబును నవరోహణంబును ననికృష్టులను దేటపడన్
దెల్పి పుత్రసంగ్రహం బనన్యకద్రవ్యంబని సిద్ధాంతీకరించిన. ౨౯౪

మ॥ విని యా రాజవరేణ్యుఁ డంతఁ దనయాప్తివిస్ఫూర్తి లేదేని ది
వ్య నివాసస్థితి గల్గదంచు మది సంభావించి కుంతీమృగా
క్షిని దాఁ జేరఁగఁ బిల్చి యకథ శుభోక్తిన్ దెల్పి నా యాజ్ఞచే
ఘనుఁడౌ తాపసిఁగూడి పుత్రునిఁ గనంగా నూహ సేయందగున్. ౨౯౫

## —॰ పాండవుల జననము. ॰—

గీ॥ వల్లభుని యాజ్ఞ చేఁ బుత్రవాంఛ నస్య, పురుష భోగంబు దోషంబు పొడమదనినఁ
దొల్లి యొకరాజు తనపత్నితో వసిష్ఠుఁ, గలిపి సుతుఁగాంచె నని వినఁగలముగాన.

మ॥ వసుధావల్లభ! పిన్ననాఁడె ముని దుర్వాసుండు సర్వేష్టదం
బసమంబౌ నొకమంత్రమిచ్చె "నది మత్స్వాంతంబునన్ సంస్మరిం
ప సమావేశమునొందు నెవ్వరిఁ దలంపన్వారు నీయాజ్ఞచే
వెస నట్లే యొనరింతు" పుత్రుఁ గను సంప్రేమంబిటుల్ భూవరా! ౨౭౯

కం॥ ఏదేవుఁ దలఁప వలెనో, యా దేవునిఁ దెలుపు మనిన నవనీశుఁడు దే
వీ! దండధరునిఁ దలఁపుము, నా దార దలంచె యముని నతఁ డరుదెంచెన్.

మ॥ నవలావణ్యము దండడింప నమితానందంబునన్ గూడి శా
త్రవ విధ్వంసు యుధిష్ఠిరున్ గనియె నంతన్ వాయుశక్తిస్థితిన్
భవసందర్భమునన్ వృకోదరుని బీభత్సున్ గనెన్ మువ్వురా
హవ దోర్దర్ప జితారివీరులయి ధైర్యస్థైర్య వీర్యోద్ధతిన్. ౨౮౦

ఉ॥ వర్ధిలుచున్నఁ జూచి నిజవల్లభుఁ గాంచి మహానుభావ! మ
త్స్వార్థముఁ గూర్పఁ జాలుటకు సన్మునిమంత్రములేదు నా జను
ర్వ్యర్థతఁ దీర్ప దుఃఖ పరిహారము చేయు మనంగ మాద్రి యా
ప్రార్థన మంతఁ గుంతి విని భర్తయనుజ్ఞ నొసంగె మంత్రమున్. ౨౮౧

ఆ॥ మంత్రమహిమ వలన మాద్రి మానసమందు, ధన్య మనుచు నియమతత్పరతను
దలఁచె నశ్వినులను దత్కృపాభూతిచేఁ, గొడుకుఁగవ జనించెఁ బడఁతి కపుడు.

కం॥ నకులుండు సహదేవుండును, బ్రకటౌదార్యములఁ జెంది ప్రబలిరి విద్వి
ట్ప్రకరారణ్యదవానలు, లకలంక యశోవిశాలు రగుచు ధరిత్రిన్. ౨౮౩

ఉ॥ పాండవు లిట్టు లేవురయి పాండుమహీపతి కాత్మజాతులై
నిండుముదమ్మునన్ జెలఁగి నిర్జర నిర్మలినాంశ లంది యొం
డొండు వయస్సునం దొకరి కొక్కఁడు జ్యేష్ఠ కనిష్ఠభావతన్
గొండొకపిన్న లైరి జనకుల్ ముదమంద శరత్క్రమస్థితిన్. ౨౮౪

ఆ॥ క్షేత్రజాతులనఁగఁ క్షితి సుప్రసిద్ధులై, పాండుసుతులు గనిరి ప్రబలశక్తి
నంత నొక్కనాఁడు హరిమధ్య యగు మాద్రిఁ, గాంచి పాండురాజు కామవశతఁ

## —• పాం డు రా జ మ ర ణ ము •—

చ॥ విజన వనప్రదేశమున ✽ వేమరు వేమరు బారిఁజెంది త
ద్ద్విజకృత శాపమున్ మఱచి ✽ తీవెలజాడఁ జరించు మాద్రి నం
గజ సమరానుషంగమున✽కై బలిమిన్ వలదన్న మాన "కం
బుజిని నిభంబు పట్టుగతి" ✽ బోరునఁ బాండువిభుండు వట్టుచున్. ౫౮౬

ఆ॥ కాంతఁ గౌఁగిలించు ✽ నంతలో శాపోప, హతిని నేలఁగూలె ✽ నవనివిభుఁడు
చెట్టువిఱిగి పట్టు✽చెదరి నేలను గూలు, తీవె పోల్కి" మాద్రి ✽ తెలివిదక్కి. ౫౮౭

క॥ నేలన్ బడి ఘోరలుచు దుఃఖాలంబమువలన వేద✽నాలాపములన్
బాలింబ కేళిమై భూ, పాలా! యని, యేడ్చుచుండఁ ✽ బటువేగమునన్. ౫౮౮

శా॥ ఆర్తాలాపము లాలకించుచు మనం ✽ బత్యంత శోకార్ణవా
వర్తోద్వర్తన మొందునట్లు తలఁచున్ ✽ వామాక్షి యా కుంతి సం
వర్తం బప్పుడె వచ్చినట్లు భయసం✽భారాంతరంగంబుతో
నార్తిన్ బుత్రులఁగూడి యేడ్చుచును శో✽కావిష్టయై వచ్చినన్. ౫౮౯

చ॥ సవతులు నిర్వురున్ గలసి ✽ చాల విషాదము నొందఁగాఁ దనూ
భవులును దండ్రిపైఁబడి య✽భంగుర దుఃఖవిలాప వేదనా
వివశత నొందఁ జెంత ముని✽బృందములెల్ల నిదేమి యొక్కో? దై
వవశత నింత పుట్టుటకు ✽ వచ్చిన తీ రది యేదియో కదా? ౫౯౦

ఉ॥ దివ్యసువాసినీసమతఁ ✽ దేజము గాంచుచుఁ గుంతి మాద్రియున్
భవ్యసుఖంబు నొందుచును ✽ బాండుమహీపతితోడఁగూడి యీ
నవ్యవనీనికుంజముల ✽ నందన బృందములోడ దేవ సం
సేవ్యసుఖంబు లందుదురు ✽ చిత్తము వంతలు గాంతురేలొకో. ౫౯౧

ఆ॥ ఏమి వింత పుట్టె ✽ నింతలో వీరెల్ల, నేడ్చుచున్నవార ✽ లేమి కతము
యనుచు గుంపుగూడి ✽ యచ్చోటునకు వచ్చి, యవనివిభునిపాటు ✽ నరసియంతఁ

చ॥ నరులకుఁ జావు పుట్టుకయు ✽ నైజము లౌటను బోధచేసి యా
సరసిరుహాక్షులన్ గదిసి ✽ చల్లనిమాటల నూరడించి వే
తరతరవృత్తిఁ బాండవులఁ ✽ దద్దయు నూరడిలంగఁ జేసి భూ
వరునకుఁ బారలౌకికము ✽ వారలచే నొనరింపఁ జేయుచున్. ౫౯౩

మ॥ సురకల్లోలముచెంత భూతలము సం✽శోధించి యచ్చోట భూ
వరునిన్ జందనకాష్ఠ సంచయములన్ ✽ వైశ్వానరజ్వాలలన్

వర మంత్రోక్తవిధిఁ దహించునెడ నా వాల్గంటి మద్రేశు కూ
తురు దావహ్నిఁ జొరంగఁగోరుటయు సంతోషించి యబ్బోటికిన్. ౨౯౪

కం॥ పతి సహగమనము శ్రుతిస,మ్మత మని మును లాదరించి మహిప తిలకునిన్
జితిఁగలిపి వహ్నినిడి రా,సుతులన్ జేపట్టి కర్మ సూచించి రొగిన్. ౨౯౫

మ॥ జలదానాదిక కృత్యముల్ సుతులచే సన్మంత్రపూర్వంబుగాఁ
గలపట్టెల్ల నొనర్పఁజేసి శిశువుల్ కాంతార మధ్యంబునన్
బలవ ద్దుష్టమృగాళిలోఁ దిరుగుటల్ భావ్యంబె యం చెల్లరున్
గలయన్ బల్కుచుఁ గుంతిఁజేర్చి పురి కింతన్ బోవుఁడీ యంచు వే. ౨౯౬

—• పాండవులు గృహంబునకుఁ జేరుట. •—

క॥ అని తనయులనేవురితో, మునిముఖ్యులు, కుంతిఁగూర్చి మోదంబున హ
స్తినగరిఁ జేర్చిరి భీష్ముం, డును విదురుఁడు రాక విని కడున్ మోదమునన్.

ఉ॥ పౌరులుఁ జారులున్ భటులు బంధువులున్ ధృతరాష్ట్రుఁడున్ మహో
దారత వెంటరాఁగఁ జని తామరనేత్రుణఁ గుంతిఁ జూచి యా
సౌరనదీతనూభవుఁడు సారసలోచన కుంతి వీర లె
వ్వారలటంచు నర్భకుల వార్త లెఱుంగఁగఁ బ్రశ్నచేసినన్. ౨౯౭

ఉ॥ కన్నుల వెంట నశ్రుతతి కాల్వలుకట్టఁగ భీష్మ,జూచి యీ
పిన్నలు దేవతాసుతులు పెద్దలు విశ్వసనీయు లన్నచో
మిన్నున దేవసంఘములు మిథ్యయుఁగా దిది తథ్య మంచుఁ దా
రున్న తెఱంగు పల్క విని యొప్పిద మంచును సంతసింపుచున్. ౨౯౯

కం॥ తనయసహితముగఁ గుంతీ, వనజాక్షినిఁ దోడుకొనుచు వా రెల్లరు హ
స్తినపురి కేగిరి సంతస,మునఁబొదలన్ రాష్ట్రి మెల్లఁ బూర్ణవిభూతిన్. ౩౦౦

కం॥ పాండవు లేవురు భీష్ము న,ఖండ భుజాబలము మేరయగాఁగొని పటు కో
దండ పరిశ్రమ రథ వే,దండ తురంగాది రోహణాదిచతురులై. ౩౦౧

వ॥ ఇత్తెఱంగునఁ బాండవు లేవురు నిఖిల విద్యాపారంగతులై కరినగరంబున సుఖం
బుండి దుృపదమహీపతికిన్ గూతురగు ద్రౌపదిన్ బెండ్లియాడి తమతమ గుణాతి
శయంబులకు ననల్పం బగు సద్గుణ సముల్లాసంబు గల పుత్రుల నేవురన్ గనిరి.
అం దర్జునుండు వాసుదేవునకుఁ జెలియ లగు సుభద్రం బరిణయంబయి మహావీర
శేఖరుం డగు నభిమన్యుంగాంచె, వీ రార్వురు భారతరణమందు నిహతులై చనిన
పిమ్మట విరాటజనపతికిన్ గూతురును నభిమన్యు వధూమణియు నగు నుత్తర

వంశాంతరసమయంబున గర్భంబుధరించిద్రోణపుత్రుండగు నశ్వత్థామచే.బ్రయుక్తం బగు బ్రహ్మాస్త్ర దవానలంబున దగ్ధుండు గాకుండ వాసుదేవకటాక్షవీక్షణంబున మనిపికొని పరీక్షిత్తుసర్వ బోషించె వంశపరిక్షయంబున జనించినవాఁడుగావున బరీక్షిత్తుం డనుపేర ధరణీతలంబున విఖ్యాతిఁ గాంచె. అయ్యాహవంబున సుత

## —• ధృతరాష్ట్రుని సమాచారము •—

శతంబు నిహతంబైన ధృతరాష్ట్రుం డతిదుఃఖితుండై పాండవరాజ్యంబున భీమ వాగ్బాణ నిపీడితుఁడై గృశించుచుండె నతని యిల్లాలగు గాంధారియు సుతశోకా తురయై యట్టుల నివసించె. యుధిష్ఠిరుండును నహోరాత్రంబులు వేసట నొందక వా రిర్వురకుం బరిచర్యచేయుచుండె, నతిధర్మాత్ముండగు విదురుండు శాంతివచ నంబులఁ బ్రజ్ఞాచక్షుం డగు ధృతరాష్ట్రుని బోధించుచు భ్రాతృపరిసరంబుననిలిచె, బుత్రశోకమ్ము మనమ్మునఁ బొడగట్టనేని శపించునను వెఱపున భీముండు దక్క మిగిలినవారలు సేవింపుచుండిరి. వృకోదరుం డతిరోషితుండై వాఁఖడ్గంబులఁ గురు పతి నొప్పించుచుండు. 30౨

## —• భీముఁడు ధృతరాష్ట్రుని దూఱుచుండుట •—

చ॥ మడుగులఁగూలఁదోసి మధుమాంసములన్ గరళంబు పెట్టి పైఁ
బడి పెనుబాములన్ బడఁగవైచి నిశీథములన్ గృహమ్ములం
దడలఁగఁ జిచ్చువెట్టి మహితాటవిపా లొనరించి దుష్టులన్
విడువఁగఁజాలనట్టి పెనుపీఁటిడి మాకెటు దాపరించెనో? 303

ఆ॥ అంధుఁడగుచు నఖిలబాంధవ ధ్వంసియై, పాపకర్మములకుఁ బంజరంబు
వినువకున్నవాఁడు వీఁడు వీనుఁగువోలె, ననుచుఁ దిట్టు భీముఁ డహరహంబు.

చ॥ తనయశతంబు నొక్కమొగి దర్ప మడంచితి నాహవంబునన్
బెనఁగి మహాగ్రహంబునకుఁ బెద్దయుఁ బొద్దు వధించె నొక్కనిన్
జనములుచూడ ఱొమ్ము నఖసంఘములన్ బెడలించి శోణితం
బెనయఁగఁ ద్రావితిన్ వినియు నీతఁడు మ్రిగ్గఁ డిదేమి చిత్రమో. 30౫

క॥ కాకోలమువలె మమ్ములఁ, జీకా కొనరింప నింటఁ జేరినవాఁడీ
చీఁకుకుఁ బిండం బిడుమని, యీకోలఁదిని నుడువు భీముఁ డెప్పుడు వినఁగన్. 30౬

ఉ॥ వీనుల నిక్క రోమములు వించు మనంబున దుఃఖపూరితుం
డై నిరతంబు వేదనము నొంది యుధిష్ఠిరు డంతరంతరన్

దా నయవాక్యముల్ వలికి - తండ్రి వృకోదరుఁ డట్టివాఁ డిసీ!
వానిని మూర్ఖుగా నెఱిఁగి - వందుర నేటి కటంచుఁ దెల్పెదన్. ౩౦౭

—॰ ధర్మరాజు ధృతరాష్ట్రి నోదార్చుట ॰—

ఆ॥ ఏను గల్గియుండ - నెవ్వరితో నేమి,పని యటంచు ధర్మపరుఁడుగాన
ధర్మజుండు దేర్పఁ దద్దయు ధృతరాష్ట్రి, డింటఁ బదియు నెన్మి దేండ్లు నిలిచి. ౩౦౮

మ॥ వనవాసం బొనరింపఁగా మనములో - వాంఛించి యున్నాఁడ నం
చని ధర్మాత్మజుతోడఁ బల్కిన మహాయాసంబు దుర్దర్ప కా
ననసంచారము వార్ధకంబునఁ గృపన్ - నా యింటనే నిల్వుమం
చనఁ బ్రజ్ఞానయనుండుఁ బల్కె వినుమన్నా! యొండు నేఁ బల్కెదన్. ౩౦౯

చ॥ వలయు ధనం బొసంగిన నవారణ మత్తనయాళికిన్ విధిన్
స్ఖలనము నొందకుండఁ బరకార్యము చేయఁగఁ గోరినాఁడ నా
ఖలుఁడు వృకోదరుండు మదిఁ గ్రౌర్యమునన్ బరలోక కృత్యముల్
వెలయఁగఁ జేయలే దిపుడు - వే యననేటికి నేన చేసెదన్. ౩౧౦

—॰ భీముఁడు ధర్మజుని లోపము లుగ్గడించుట ॰—

కం॥ ధన మొసఁగి తేని సుతులకు, ఘనతరముగ నౌర్ధ్వదైహికం బొనరిచి నే
వనమునఁ దపింపఁ జని యెద,ననిపల్కిన మఱియు విదురుఁడనిమెన్ బతితోన్. ౩౧౧

చ॥ మనసు కలంగి లో దురభిమానముచే ధృతరాష్ట్రుఁ డెంతయున్
వనరుచు నున్నవాఁడు జనవల్లభు కోరినయట్టు లాతనిన్
ధనమునఁ దృప్తిఁ దేల్చు మన - ధర్మజుఁ డట్టుల సంతసించి తా
ననుజులతోడఁ బల్కె విని - యంతట మారుతిపల్కె నన్నతోన్. ౩౧౨

సీ॥ ధర్మజ్ఞుఁడవు నీ వధర్మశీలుర మేము, తెలుపంగ వలదొకో - వలయుపనులు
అంధపుత్రులకెల్ల - నౌర్ధ్వదైహికకృత్య, మొనరించుటకు ధనం బొసఁగవలదె
కన్నులఁగానని - కరణిని సౌఖ్యంబు,నేయంగఁ జెల్లదే - క్షితివరేణ్య!
నీదు దుర్మంత్రంబు - నిఖిలాపదలకెల్ల, మూలమ్ము మేమెల్ల - జాలఁగాసి

గీ॥ పడుటయును ద్రౌపదియు మానభంగ మొంది
చెడుటయును మత్స్యపురిలోని - చెనటిపనులు
నేయుచును బాపఁబడుటయు - స్థిర భవ త్ప్రి
యుక్త ధర్మంబుచేఁగాదె - యూహ సేయ. ౩౧౩

గీ॥ కొండ లైనను బిడికిటఁ గొట్టి గూల్చు, వాఁడ మాత్స్యుని వంటలవాఁడ నగుచుఁ
బొట్ట నింపుట నీ ధర్మభూతిఁ గాదె, చెప్పఁగా నేల తలఁచిన సిగ్గు గాదె. ౩౧౪

శా॥ గాండీవప్రథమాన విక్రమ కళాగంభీరదుర్వార దో
శ్శౌండుండైన కిరీటి కజ్జలము పక్ష్మశ్రేణి సంధించి యొం
డొండన్ జేతులఁ గంకణంబు లిడి యయ్యో యాఁడుడై కన్యకా
తండంబుల్ నటియింప నేర్పుటలు నీ ధర్మంబు రాజోత్తమా! ౩౧౫

సీ॥ పాకశాసన దత్త పటుకిరీటం బూడ్చి, కొప్పుఁ బెట్టిన యట్టి కొమరుఁ జూచి
మగరాల వలయముల్ మాటి కేల్ దోయిని, గాజులు దొడిగిన యోజఁ గాంచి
చంద్రికళంకంబు ఛాయ నాసవెడల్చి, పేడిమై విహరించు పేర్మి యెఱిఁగి
సింహాసనం బెక్కి చెలఁగు వేషముఁ దోసి, నర్తకాకృతి నొందు నాణె మరసి

గీ॥ విజయ కృష్ణాది నామముల్ విడిచిపుచ్చి, యే బృహన్నల నను పేర నెసగు పార్థు
వైభవం బెల్ల నీ ధర్మవర్తనమునఁ, గాదె! ధర్మజ! యిడుములు గల్గు టెల్ల. ౩౧౬

ఆ॥ అల పురోచనుఁడు మహార్ధరాత్రమునందుఁ, గొంపచిచ్చుఁ బెట్టి కూల్చుటెల్ల
నీదు ధర్మసిద్ధి నెగడుటయే కదా, దైవవశతఁ గీడు దప్పెఁ గాని. ౩౧౭

సీ॥ ద్రౌపదిభంగంబు దప్పించుకొనికదా, శతకీచకధ్వంస సలిపినాఁడ
నట్టుల సభను నీయాజ్ఞనుంటిని గాని, క్షితి నజేయుఁ లె నాకు సతమువారు
రాజేంద్ర! గంధర్వరాజుచేఁ జెఱఁబడ్డ, ఖలులను విడిపింపఁ దలఁపరొక్కొ
యిన్నిఁటికిని మూలమీవవయై మమునెల్ల, వెతలపాలొనరించి నెతలఁబడితి

గీ॥ వీవు నిందు నటించు దుర్వృత్తికెల్లఁ, గందమగు గుడ్డివానికిఁ గలధనంబు
కొల్లబెట్టింపఁ దలఁచితే కొంకుమాలి, యీయనని భీముఁడావలి కేగునంత. ౩౧౮

ఉ॥ తమ్ములు మువ్వురున్ గలసి ధర్మజుఁడంత మహీశునొద్దఁ జి
త్తమ్మలరంగ విత్తము సతమ్ముఁగ రాసులుగూర్చి పేర్చినన్
నెమ్మది నూరడిల్ల సుతనిర్వృతికై పరలోక సత్క్రియల్
సమ్మతిసల్పి దానము లసంఖ్యముగా ద్విజకోటి కిచ్చుచున్. ౩౧౯

## —• ధృతరాష్ట్రుఁడు వనంబున కేగుట •—

వ॥ కొన్నిదినంబు లిత్తెఱంగున యుధిష్ఠిరు మన్ననన్ గృహంబున నిష్టోపభోగంబు లనుభవింపుచు నిలిచి పరిచర్యార్థంబుగా గాంధారీకుంతులు తోడుగా విదురసంజయులన్ గలసి వనవాసంబునకున్ జనియె, ధర్మజ వృకోదరాదులు వెనువెంటన్ జనుచు విలపించుచున్నను మరల శూరసేనాత్మజయగు కుంతియు ధృతరాష్ట్ర శాప భయంబునఁ బుత్ర క్షేమంబుఁ గోరుచుఁ జనిన పిమ్మట, ౩౨౦

ఆ॥ భీమసేనుఁడాదిఁ గ బెద్దయు విలపించి, యమరనదినిదాటి గ యవలఁజనిన
వృద్ధరాజు విడిచి గ వివిధజనంబెల్ల, సింధురాఖ్యనగరిఁ గ జేరఁజనిరి. ౩౨౧

ఉ॥ వారలు జాహ్నవీతటిని గ వన్యఫలాశన భక్షులై తపో
ధీరత నొక్కచో స్థిరమగ్ఢ్ని శతయూపమహార్షి యాశ్రిమో
దారవనిం దపస్థ్సితికిఁ గ దావలమా నుటజంబొనర్చి మే
లారసి యాఱువత్సరము గ లందు వసించిరి మౌనికోటితోన్. ౩౨౨

చ॥ పదపడి ధర్మజుండు గజపట్టణమం దొకనాఁడు శయ్యపై
నిదురఁదొఱంగి లేచి మది గ నివ్వెఱపాటును జెంది యక్కటా
ముదిమిని నంతకష్టదశ గ ముచ్చట మున్గె నటంచుఁ జింతచేఁ
బొదలుచు బంధులంబిలిచి గ పొక్కుచు నిట్లని పల్కె వారితోన్. ౩౨౩

ఆ॥ కన్నతల్లి నేఁడు గ కలలోనఁ గన్పడె, ఘోరకాననమున గ గుదిలగొనుచు
బలములేక వనట గ పాలయి యున్నట్టు, లేమిచేయువాఁడ గ నీశ్వరాజ్ఞ. ౩౨౪

ఉ॥ చూడక యున్నయంతకును గ జొప్పడనేరదు నెమ్మనంబు కా
ల్జాడయుఁగాననేరక వశంపడనీని మహావ్యథధ్వనిన్
దోడగువారు లేక వెతఁ గ దొట్రిలు మా పెదతల్లిదండ్రులన్
గూడి కృశించుచుండిరి తగన్ విదురుం డిటువంటి వేళలన్. ౩౨౫

ఆ॥ అట్టివిదురుఁ గాంచి గ యాత్మవేది యనంగ, నొనరునట్టి సంజయునిఁగనంగ
వేడ్కపుట్టె నిపుడె గ వెడలువాఁడ నటంచుఁ, దెలిపి ధర్మసుతుఁడు గ దెసలఁజనఁగ.

సీ॥ ప్రస్థాన భేరికాభయద భాంకారమ్ము, బ్రహ్మాండభాండంబుఁ గ బడలుపఱుపఁ
జతురంగ సేనా ప్రచారంబుచే ధరా,తల మెల్లఁ గంపించి గ తందరిల్ల
స్యందన శ్రేణికాస్పంద ఘట్టనజాత, ధూళిపాళికలచే గ హేళిమాయఁ
బటువై జయంతికాంబరపృథివ్యావాప్తి, నంబరం బస్పర్థ గ మయ్యెననఁగఁ

గీ॥ దమ్ములునుదోడఁగదలంగద్రౌపదియును,నుత్తరయుఁగూడఁబౌరులయొత్తడములు
బెరసి సందీకయుండఁగఁబృథివిఁగదలి,నటులధర్మాత్మజుండు ప్రయాణమయ్యె.

చ॥ నదులును బర్వతంబులు వనంబులు దివ్యసరంబులున్ శుభా
భ్యుదయముతోడ దాటుచు నానాగరీన్ శతయూపమౌని స
మ్మదమున నిల్చు నాశ్రమము గ ముందరఁగాంచి చమూసమూహమున్
వదలి యుధిష్ఠిరుండు తగు గ వారలతో మునియాశ్రమంబునన్. ౩౨౮

## విదురుని మరణము

ఆ॥ తల్లిఁ గాంచి పెద్దతల్లిదండ్రులఁ గాంచి, సూతసుతునిఁ గాంచి చుట్టువెదలి
విదురుఁ జూడ మదిని వేడుక నడిగిన, నంబికాతనూజుఁ డానతిచ్చె. 3౨౯

మ॥ విరతిం జెంది యరణ్యమధ్యమున నవ్వీరుండు నిష్కృత్యుఁడై
గిరులం గానలఁ గోనలం దిరుగు చున్నిక్కంగ గానరాఁ డెరికిం
బరిపూర్ణాధ్వయు నచ్యుతుం గనఁగ భవ్యధ్యాన పారీణుఁడై
సరి నేగుం గనరాఁడు రాఁడు జనసంచారంబులో లేఁ డనన్. 330

కం॥ పరికింపఁగ రెండవనాఁ, డరయుచు గంగావగాహనార్థముగ యుధి
ష్ఠిరుఁడు గనుఁగొనియె నంత వి,దురునిం దురితాద్రిచయభిదురునిం గురునిన్

ఉ॥ చూచి నమస్కరించి యిటుచూడుము నేను యుధిష్ఠిరుండ వ
న్యాచరవృత్తి నెవ్వరికి నందక సర్వగురుండవై జగ
ద్గోచరవృత్తి మానితివి తోడనె దైవము నిన్నుఁ జూచె నా
లోచన పర్వమైతి గుణలుబ్ధుఁడవై నిలుమీ! దయానిధీ! 33౨

ఆ॥ నిన్నుఁ జూడఁ గోరి నిమిషంబు యుగముగాఁ, గడపుచున్న వాఁడ గరుణఁ దవిలి
నిల్వు మనిన నతఁడు నిలిచె నంతటను ద, త్తేజ మపుడు ధర్మరాజుఁ గలసె. 333

మ॥ సమవర్త్యంశజు లౌటచే విదురు తేజం బా నృపుం గూడెఁ ద
త్సమయోరుస్థితిచే వ్యథం బొగులుచున్ ధర్మాత్మజుం డాతనిం
దమి నిస్సంగతుఁ జేయఁ గోరు నెడ నంతం బల్కె నాకాశవా
ణి మహీవల్లభ! దాహ మీతనికిఁ జన్నే పొమ్ము నీ కేటికిన్. 33౪

ఉ॥ అప్పలు కాలకించి శమనాత్మజుఁ డాప్తులఁ గూడి గంగలో
నప్పులముగ్గి యంధపతి కంతయు విన్నప మాచరించి పె
న్గుప్పులఁ గూడి య వ్విదురుఁ గూర్మిఁ దలంచుచు నెల్ల వారలుం
దెప్పలఁ దేలి రశ్రుజలధిం బడి ఘోరవిలాపదీనులై. 33౫

ఆ॥ కొంత యారడిల్లి ఘోరాటవిని ధృత, రాష్ట్రునంతికమున రవితనూజ
నందనుండు నిల్వ నందు ధర్మజుఁ జూడ, దివ్యమౌను లరుగుదెంచి రటకు. 33౬

వ॥ బాదరాయణుండును, నారదుండును, గపిలుండును, గణ్వుండును, గౌతముండును, గాలవుండును మొదలుగాఁ గల మహర్షు లరుగుదెంచి యజాతశత్రుం గాంచి యంతిపురంబునఁ గుంతిం గనుంగొనం జనిన యెడ నా శౌరసేనియుఁ బారాశర్యుం గనుంగొని యిట్లనియె. 33౭

— వ్యాసుఁడు, చనిపోయిన కర్ణుఁడు మొదలగు వారిని జూపించుట. —

ఉ॥ కన్నియనాఁడు భాస్కరుని గాటపుఁగూరిమి గన్న పిన్న క
ర్ణున్నవమోహనాంగుఁ దపనున్ సరిజేయఁగవచ్చువాని నేఁ
గన్నదెఱుంగఁ గనుంగొనుటగాని మ ఱెద్దియు గానరైతి నా
కన్నులఁ జూపి మానసికకర్కశతాపము దీర్ప వేఁడితిన్. ౩౩౯

గీ॥ కర్మసాక్షివి దుర్ఘటకార్యకరణ,దక్షుఁడవుగాన నా వాంఛితమ్ము దీర్ప
వలయునని పాదములమీఁద వ్రాలియడలు,నంత గాంధారి బాదరాయణునకనియె.

ఉ॥ యోధవరేణ్యుఁ డాప్తజనయోగమనస్కుఁడు నాదుపట్టి దు
ర్యోధనుఁ డాహవంబునకుఁ గ్రోధముతోఁ జనువేళఁ గాంచితిన్
బాధితమై మనంబు బహుభంగుల దాపము నొంది కుందు నో
సాధుజనాగ్రగణ్య ! సహజన్మసమేతుని నాకుఁ జూపవే. ౩౪౦

ఉ॥ దీనజనావనుండ వని తెల్లముచేసితి నన్న సంతఁ దా
పానల దహ్యమాన హృదయాంబుజ యాచు సుభద్ర మ్రొక్కి దే
వా ! ననుఁ గన్నతండ్రిఁ బ్రియవర్ధను నా యభిమన్యుఁ జూపవే
నీ నలినాంఘ్రియుగ్మ మెద నే శరణం బని నమ్మియుండితిన్. ౩౪౧

చ॥ మఱియును గూర్మినయ్యెడల మానిను లమ్మహితాత్మ వేడినన్
గొఱఁతలు దీర్చు నా మహితుఁ డౌవిదుఁ డౌటఁ బరాశరాత్మజుం
డఱమరలేని కూర్మి మదినట్టులు వారికి సంతసంబిడన్
గఱకరిఁ బుట్టు కుంభకవిఘట్టిత నిశ్వసనానురోధియై. ౩౪౨

సీ॥ పూరక రేచకస్ఫుటతఁ గుంభక దృష్టి,నిర్ణిరోధాత్మకనియతిఁ గొల్వ
నిభృతాంగ విక్రియ నిర్ణిద్ర విస్ఫూర్తి, నభ్యస్తకాష్ఠమా నాప్తి నిలుప
ముఖవికాసాంతఃప్రమోదమూలసవృత్తి, స్వస్వరూపైకవిశ్రాంతిఁ దెలుప
బాహ్యాంతరవిభేదభావనాభావంబు, "తత్త్వమ"స్యర్థ సత్త్వంబు నెఱప

గీ॥ ధ్యాన నిర్మథనాభ్యాస తత్పరతను, సర్వ మెల్లను దానయై స్వస్వరూప
పరశివానందమునఁ బరాశరసుతుండు, నాదిశక్తిఁ బరంజ్యోతి నభినుతించి.

ఉ॥ అంతట సంజయైన విబుధాపగతీరమునందుఁ జేరి య
య్యంతకనందనాదుల సమస్తజనంబులఁ బిల్వనంపినన్
శాంతమనస్కుఁడై సలిలమజ్జనముం దగ నాచరించి స
ర్వాంతర సంస్థయౌ ప్రకృతి నాత్మఁ దలంచెను భక్తి నెంతయున్. ౩౪౩

చం॥ హరియు హరుండు బ్రహ్మయును నంతకుఁడున్ బురుహూతుఁ డగ్నియున్
వరుణుఁడు వాయు వర్కుఁడును వారిజవైరియు లేనివేళ దు
స్తర తమమెల్లఁగప్పఁ గడు సర్వము శక్తినినిల్పు నో పరా
త్పర! జగదంబ! నీదు పదపంకజముల్ శరణంబు గావుమీ. ౩౪౫

చం॥ క్షితి మొదలైన భూతములు చిత్తము సత్వ రజస్తమంబులున్
మతియును దీవ్రభానుఁడు హిమద్యుతి జీవుఁడు లేనివేళ నా
వృతి నిజతేజ మెల్లెడల విస్ఫురితం బొనరించియేకదా
రతి వెలుగొందు దీవు నినుఁ బ్రస్తుతి చేసెద నంబ! శాంకరీ! ౩౪౬

మ॥ ద్రుహిణాండంబులు జీవబృందములు సందోహించి చిత్తంబులన్
మహి సృష్టిన్ బ్రకటించి సర్వ లయవిన్యాసంబుఁ దల్లింగకో
శ హవిష్యంబులు నాత్మతంత్రి దహనజ్వాలన్ హుతంబొగలిన్
విహృతుల్ సల్పెడు దేవి! మ్రొక్కెద మనోవిశ్రాంతికై నిచ్చలున్. ౩౪౭

కం॥ దివి కేగిన మృతజీవుల, భువి నీ లోకులు గనంగ బుద్ధిఁ దలఁచినన్
గవిసిరి నా వశమానే, యవలోకింపంగఁజేయు మమ్మా వారిన్. ౩౪౮

మ॥ కరుణింపన్ సమయం బటంచు ముని వక్కాణింప నయ్యాదిశ
క్తి రహిన్ స్వర్గసుఖాభిభోక్తలయి యెంతే వింతఁ గ్రీడించు న
ద్ధరణీపాలురు దేవియాజ్ఞఁ గొని యత్యంత ప్రమోదమ్మునన్
వరుసన్ వచ్చిరి పూర్వరూపములచే వా రెల్ల వీక్షింపఁగాన్. ౩౪౯

వ॥ అయ్యెడఁ గుంతియు, గాంధారియు, సుభద్రయు మఱియుంగల మహర్షి జనంబులును, పాండవులు మొదలగు రాజలోకంబునుగాక లోకావతరణం బొనరించి మర్త్యం బధిరోధించు పుత్ర,మిత్ర, పతి, సుహృదాదులన్ గనుంగొని యన్యోన్యాలింగన స్పర్శన సంభాషణాది సౌఖ్యంబు లనుభవింపుచుఁ గించిత్కాలంబు విహరించి యోగనిద్రారూపిణి యగు మహాశక్తిన్ స్మరించి బాదరాయణు ననుజ్ఞఁ గొని యాహూతులై వార లెల్లరును బునర్జీవితులై చనిరి. ఈ యద్భుతంబు మహేంద్రజాలంబు తెఱంగున జనంబులకుఁ దెలియ నలవిగానిదై ప్రవర్తించె నని యప్పుడ మ్మహామునులు పాండవుల నామంత్రణం బొనర్చి నిజాశ్రమంబులకున్ జనిరి. యుధిష్ఠిరుండును బురోహితామాత్య బంధుసమేతుండై యనుజన్ములు వెంటరా మార్గమధ్యంబున సత్యవతీనందన మాహాత్మ్యంబున కభినందించుచుఁ గరినగరంబుఁ బ్రవేశించియుండె నంత. ౩౫౦

## —• ధృతరాష్ట్రుడు మొదలగువారి మరణము •—

క॥ ధృతరాష్ట్రుఁడు వర్షత్రయి,గతమానెడఁ గానలోనఁ ♦ గాలాగ్నిశిఖా
తతి మ్రగ్గె మఱఁదలును దన, సతియును గూడంగ దైవసంకల్పమునన్. ౩౫౧

ఉ॥ సంజయుఁ డంత దానశిఖిసంధుల మెల్లనఁ దారి యాడుచున్
గుంజములందఁ జేసికొని ♦ ఘోరదవానలదాహ మూడ్చుచున్
మంజుల శీతలాగముల ♦ మార్గముఁ బట్టి యశేషతీర్థయా
త్రం జిర మందు వేడ్కఁ జనె ♦ దైవగతిన్ దురపిల్లుచున్ మదిన్. ౩౫౨

ఆ॥ తనదు తల్లి పెద్ద ♦ తల్లిదండ్రులు గారు,చిచ్చులోనఁ బడుట ♦ నచ్చముగను
నారదోక్తి విని యనారతదుఃఖార్తి, నొంది ధర్మసూతుఁ ♦ డుమ్మలించె. ౩౫౩

ఉ॥ భారత సాంప్రదాయమునఁ ♦ బాండవపక్షముఁబట్టి పుత్రులన్
నూఱుపురన్ దయన్ గెడపి ♦ నుగ్గొనరింపఁగఁ జేసె నంచు గాం
ధారి శపించెఁగాన నది ♦ దైవవశంబున ముప్పదింటిపై
నాఱవ హాయనంబునను ♦ యాదవ సంక్షయహేతు వౌటచేన్. ౩౫౪

## —• యాదవుల మరణము. •—

చ॥ మఱియును విప్రశాపమున ♦ మర్దితులౌటను యాదవుల్ గడున్
గెరలి ప్రభాసతీర్థమునఁ ♦ గ్రీడ లొనర్చుచుఁ గల్లుఁ ద్రావి ని
వ్వెఱబడి యొండొరున్ గదిసి ♦ విక్రమకేళి రణావలీధులై
గుఱుతులు దప్పి కొట్టుకొని ♦ కూలిరి రాముఁడుఁ గృష్ణమూర్తియున్. ౩౫౫

ఆ॥ ఒడలు విడిచి రాముఁ ♦ డొందెఁ గాలవశంబు,వ్యాధబాణహతిని ♦ బడియె హరియు
వంత వినియెనంత ♦ వసుదేవుఁ డా ద్వార,వతిని మేనుదొఱఁగ ♦ వనటఁ బొగిలి.

ఉ॥ వాసవపుత్రుఁ డందుఁ జని ♦ వారలనెల్లను సంస్కరించి ప్ర
భాసనమీప దేశమునఁ ♦ బల్మఱుఁ గానల నచ్చటచ్చటన్
గాసిలి దుఃఖితుం డగుచుఁ ♦ గంజవిలోచను మేనుఁ గాంచి భా
ర్యాసహితంబుగా నతని ♦ నగ్నుల సంస్కరణం బొనర్చుచున్. ౩౫౭

గీ॥ అష్టభార్యానుగతిఁ బూర్వసమచ్యుతుండు, దివికి నేగుటవలన నేత్రిన మహార్తి
నడరుచును బట్టభద్రునియొడలు గాంచి,సఖియ పతితోడ నగ్నిని ♦ సంస్కరించె.

ఉ॥ ద్వారకఁజేరి యర్జునుఁడు ♦ తండ్రితఁ దత్కురువాససంఘముల్
గూరిచికొంచు వే నెడలి ♦ ఘోరసముద్రతరంగ మందు నా

ద్వారక ముంచివైచె సురశతల్లజపుత్రుఁడు మార్గ సంవృతా
భీరులచే మురాంతకుని ౖ భీరులఁ గొల్లపడి దుఃఖిత పృథుఁడై. ౩౫౯

క॥ ఇంద్రప్రస్థముఁ జేరి మ, హేంద్రాత్మజుఁ డఖిలరాజ్య ౖ మిచ్చి కృపాప్తిన్
సాంద్రప్రభు వజ్రుని ని, స్తంద్రతఁ బట్టంబుగట్టి ౖ ధర్మజుకడకున్. ౩౬౦

చ॥ అరుగుచు మార్గమధ్యమున ౖ నద్భుతభాసుని వ్యాసుఁ గాంచి దు
స్తర మగు నీ యుదంతము యథావిధి విన్నపమాచరింప న
ప్పరమమహర్షి యాఁడు నుపాయ మొనర్చి మహామునీ! యుగాం
తరమున నీదు తేజము జనార్దను సత్కృపచేసి మేల్కనున్. ౩౬౧

కం॥ చింతిల్లకు మని పల్కిన, నంతఁ దదీయాజ్ఞఁ గొనుచు ౖ నగ్రజుకడకున్
దంతిపురి కేగి యర్జునుఁ, డింతయు వృత్తాంత మన్న ౖ కెఱిఁగించె వెసన్. ౩౬౨

ఆ॥ పాండవాగ్రజుండు ౖ పార్థుచే హరి యట్లు, పరమపదమునకును ౖ నరిగె ననెడు
వార్త వినిన యంత ౖ వసుధఁగూలుచు నశ్రు, ధార లక్షులందుఁ ౖ గాఱుచుండ.

శా॥ హా! కంసాంతక! హా! కృపాశరనిధీ! ౖ హా! దేవకీనందనా!
హా! కృష్ణా! యదుభూషణా! యదుపతీ! ౖ హా! మత్సఖా! పోయితే
మాకున్ దిక్కయిపోవువా రెవరొకో! ౖ మమ్మిట్లు పోనాడి యే
లోకంబేగితి వేమి సేయుదుము సుశ్లోకా! జగద్రక్షకా! ౩౬౪

క॥ నీతోడ వచ్చువారము, మాతోఁ దెల్పక యె నీవు ౖ మమ్మిందఱునున్
భూతలమునఁ దిగనాడుచు, నే తెఱఁగున జనితి వింక ౖ నేగతి యొక్కో? ౩౬౫

వ॥ అని సానుజుండై యుధిష్ఠిరుండు కొంతవడి దుఃఖించి శ్రీకృష్ణరహితంబైన వసు
ధాతలంబునఁ జరింపం జాల నని మహాప్రస్థానంబున కుద్యోగించి. ౩౬౬

—• పాండవనిర్యాణము •—

ఉ॥ ముప్పదియాఱు వర్షము లమోఘపరాక్రమధుర్యుఁడై యరుల్
కుప్పలుఁగూడ సంపదలు ౖ గూర్చుచు రాజ్యముఁ లేలి ధర్మజుం
డప్పుడ యుత్తరాసుతుని ౖ నాథ్యునిఁ జేసి హిమాద్రికై చనన్
దప్పక నిశ్చయించి తన ౖ తమ్ములు ద్రౌపది వెంట నేగఁగా. ౩౬౭

కం॥ కరినగరము వెల్వడి యా, ధరణీపతి హిమనగంబు ౖ దఱియన్ జని యా
గిరి నధివసించె సక్రమ పరుఁడై యనుజాన్వితుఁ డయి ౖ భార్యాయుతుఁడై. ౩౬౮

## —♦ పరీక్షిత్తునకు శాపకారణము ♦—

సీ॥ అవలఁ బరీక్షితుం డవని బాలించుచు, నర్వదివర్షంబు లఖిలశత్రు
మథనంబొనర్చి ధర్మజ్ఞుఁడై క్రతువులుఁ, బెక్కులొనర్చి నిర్భీకుఁడగుచు
మృగయావినోదియై నగగహ్వరంబులు, దిరుగుచు నొకలేడి తెఱఁగుఁబట్టి
యొక్కండ కోదండ మెక్కించి వెన్వెంట, నంటిపోవంగ మధ్యాహ్న మగుట

గీ॥ నలసి తృష్ణాక్షుధార్తుఁడై యా వనమున, బడలుపడి మౌనియాశ్రమప్రాంతమునకు
నరిగి ధ్యానస్థుఁడై యున్న నరయలేక, మునినిఁ గని మ్రొక్కి జలము లిమ్మనుచు వేఁడ.

శా॥ అంతర్లగ్న హృషీకుఁడై తపసి బాహ్యజ్ఞాన రాహిత్య వి
శ్రాంతిన్ జెందుటఁ బల్కమిన్ గనలి తత్ప్రాంతంబునన్ జచ్చి వి
భ్రాంతిన్ గోల్పడు నొక్క సర్పశవమున్ బాహూద్ధనుష్కోటి న
త్యంతాఘం బని లోఁదలంపక మునీంద్రు దగ్రీవ మందుంచె వే. ౩౨౦

ఆ॥ కలివశంబువలనఁ గన్నెఱుంగక రాజు, చిలువపీనుఁగుఁ గంఠసీమఁ జుట్టి
యరిగెఁ గాని మౌని యయ్యకృత్యము కింతఁ, దెలియకున్కిఁ జలన మొలయఁడయ్యె.

చం॥ క్షితిపతి యీ యకృత్యమును జేసియుఁ బల్కక యుంట నచ్చటన్
మతినిలుపంగలేక యనుమానముఁ దక్కి గృహంబుఁ జేరె న
య్యతిపతి గోపమున్ గొనఁడ "యాత్మపరుల్ బహిరంతరక్రియా
వృతికిఁ జలింతురే?" చరమవేదికిఁ జెందునె? దుర్విచారముల్. ౩౨౨

ఉ॥ కందఫలాభిలాషి యయి కాననసీమఁ జరించుచున్న త
న్నందనుఁ డంత శృంగియు ననారతమున్ దప మొందు మౌనిసం
క్రిందను కంఠసీమ నొక కాలభుజంగ శవంబు వ్రేలు నే,
డిందఱు మేము గంటి మని యెల్లరు మిత్రులు వల్కఁ గ్రుద్ధుఁడై. ౩౨౩

చ॥ కరములఁ దోయముల్ గొని యకంపనుఁడై యెవఁడేనిఁ దండ్రికం
ధరమునఁ జిల్వపీనుఁగు బెడిదంబుగఁ జుట్టినపాపి సప్తవా
సరములఁ దక్షకోగ్రహతి సంయమనీశునిఁ జేరుఁగాక యం
చురుతరశాపమిచ్చి జల మూర్విఁ బడన్ వెదచల్లె నీసునన్. ౩౨౪

చ॥ ఎఱుఁగక నందనుం డిటు శపించెను భూవరు నంచు నక్కటా!
చిఱుతతనంబు చేసెనని చిందరనంది దురంత వేదనన్
గఱకటిఁ జెంది శిష్యుని నొకానొకనిన్ గని వేగమేగి నీ
వఱిముఱి ఘోరశాపగతి నంతయుఁ దెల్పుమటన్న నాతఁడున్. ౩౨౫

సీ॥ రాజసన్నిధిఁ జేరి రాజన్య వనములో, వేఁటాడుచును జని వీథిఁదిరిగి
మల్లాడుచు శమీకమౌని యాశ్రమమున, నొక యకృత్యమొనర్చి యుగ్రశాప
హతి నొందితివి సప్తమాహంబునను దక్ష, కోగ్రదంశనమృతి నొందఁ గలవు
మద్గురుండు శమీకమౌనికంఠంబునఁ, బాముఁజుట్టుట మౌనిపట్టి శృంగి

గీ॥ నిన్ను నే శపించె గురుఁడు నన్నుఁ బంపి, తెలుపుమని చెప్పె నదిగాన దివ్యమంత్ర
తంత్రములఁ గాచికొమ్ము నీ తనువటంచుఁ,బలికి శిష్యుండు చనిన నప్పార్థివుండు.

మ॥ అనివార్యంబయి విప్రశాప మపు డత్యాసన్నమై వచ్చెఁ జే
యు నుపాయంబిఁక నేదియంచు మదిలో నూహించి సన్మంత్రులన్
ఘనతావృద్ధులఁ బిల్వనంపి యొక దుష్కార్యమ్మునన్ శాపమొం
దినవాఁడన్ దనచేయు కర్మములు ధాత్రిన్ దప్పిపోనిచ్చునే! ౩౭౭

ఆ॥ నిగమవాదులెల్ల నిశ్చయింతురు గాదె, పుట్టువారికెల్ల గిట్టుటనుచు
నట్టు లయ్యె శాస్త్రసమాచరణీయంబు, లాచరింపవలయు నందు గాదె. ౩౭౮

ఉ॥ కొంద ఱుపాయవేదులగు కోవిదులందు దురంత దుర్దశా
క్రందనమందినన్ దగిన కార్యమొనర్పఁ దొలంగునంచు న
స్పందతరార్థముల్ తెలియఁజాలిన పెద్దలు మీరు నేర్పులన్
గొందలముల్ దొలంగఁ గడు గూర్చును దైవమటంచు నెంచితిన్. ౩౭౯

—• పరీక్షిత్తు శాపమునుండి తప్పించుకొనుటకుఁ జేయుమార్గము •—

మ॥ మణిమంత్రౌషధశక్తులన్ గడు ధరన్ మాయన్ గదా బాములం
దణుమాత్రంబును, నిష్ఠవీడక సుధావ్యాసంబు సేయన్ దగున్
గుణవంతుల్ మది నేతదర్థముల సంకోచస్థితిన్ సల్ప ని
ర్గుణమా దైవము తత్సహాయతకు నోర్చున్ గాదె యం దెందునన్. ౩౮౦

చ॥ తొలుతటి కాలమందు మునితోయజగంధి భుజంగదష్టయై
యిలఁబడ నాయురర్ధ మపు డింతికొసంగి సజీవఁజేయఁడే
కల విటువంటి వింతలు జగత్త్రయమందును దారసించి మీ
రలఘుసహాయవృత్తి ననయమ్ము నయ మ్మొనరింపఁగాఁ దగున్. ౩౮౧

సీ॥ బ్రహ్మచారి గృహస్థు భైక్షాశి రక్తుండు, నిష్కామి పరతంత్రి నిపుణబుద్ధి
యెట్టివాఁడైనను హితమొండు వలసిన, వలయు యత్నమొనర్చి వానివలనఁ
జేయించునవి లేక క్షితి సర్వమునకును, దైవంబు కర్తగాఁ దలఁచునేనిఁ
దనచేతి యన్నంబు దానోట నిడకున్నఁ, దనకుఁదా నిండునే తనదుకుక్షి

గీ॥ పురుషుఁడగువాఁడు యత్నంబుఁ జూనిచేయఁ, గార్యసిద్ధియొసంగు సంకల్పవశత
నన్యథా యవునేని దైవానుకూల్య, మట్టిదని నిశ్చయింపంగ నగు నటన్న.

ఉ॥ మానవనాథునిన్ గనుచు మంత్రులుఁబల్కిరి సర్పదష్ట యా
మానిని కర్థమాయుష మమానుషశక్తి నొసంగినట్టి య
మ్మౌనివరేణ్యుఁ డెవ్వఁడు సమంజసవృత్తిఁ దదీయ వృత్త మో
మానవనాథ! తెల్పుమన మంత్రులకిట్లని పల్కె నర్థిన్. ౩౮౩

—॥ రురుముని చరిత్రము ॥—

చ॥ భృగుఁ డను తాపసోత్తముఁ డభిన్నతపః ప్రవణుండు వానికిన్
మగువ పులోమనాఁ గలుగు మంజుల రూప విలాస సంపదన్
జగముల మేలుబంతియగుఁ జ్యావనుఁడన్మని తత్కుమారుఁడై
పొగడు గనంగ నాతనికిఁ బోటి సుకన్యయనంగఁ జెల్వగున్. ౩౮౪

క॥ వారిర్వురకున్ బ్రమతియు, నా రంజిలు సుతుఁడు సత్ప్రియామణియగుచున్
బేరు ప్రతాపి యనంగా, నారూఢిన్ దనరు సుందరాంగి ధరిత్రిన్. ౩౮౫

చ॥ ప్రమతి ప్రతాపి యందుఁ గులపావనుఁడౌ రురుమౌనిఁగాంచి ప్రే
మము చిగురొత్తఁ బెంచునెడ మాన్యతపోనిధి స్థూలకేశుఁడన్
విమలతపస్వి యొక్కయెడ విశ్రుతమైన నిజాశ్రమంబునన్
బ్రమదమెలర్ప నున్న సురభామిని మేనక యొక్కకాంతతోన్. ౩౮౬

వ॥ విశ్వావసు సన్నిధానంబున కరిగి పునరాగమనంబుచేయునెడ స్థూలకేశాశ్రమం
బున సర్వలోకాతిసుందరి యగు కన్యకన్ విడిచి నిజస్థానంబునకున్ జనిన నదీ
తీరంబున స్థూలకేశుం డక్కన్యకంజూచి ప్రమద్వర యను నామంబిడి పుత్రిగా
భావించి పెంచునెడ నక్కన్నియ సంప్రాప్తయౌవనయై సర్వలక్షణసంయుతం
బగు లావణ్యంబున భూతలగతయగు చంచలాలతికప్రభన్ జరించు నా ప్రమద్వర
యనుదాని రురుండు గాంచి కామబాణార్థితుండై నిజాశ్రమంబునకున్ జనిన
విన్ననగు మోమున దీనుండగు పుత్రునిన్ గాంచి యర్భకా! విన్నమనస్కుం
డవై యున్నవాఁడ విదేమని యడిగినఁ దండ్రియగు ప్రమతిన్ జూచి స్థూలకేశా
శ్రమంబునఁ బ్రమద్వర యను కన్నెన్ జూచి కామార్తుండనైతిఁ దత్కన్యకా
కరగ్రహణం బొనరించి చింతాభరంబు నివర్తింపఁజేయుమని పలికిన. ౩౮౭

—॥ ప్రమద్వర సర్పదష్ట యగుట ॥—

సీ॥ ప్రమతి మౌనీంద్రుండు పట్టికై స్థూలకేశుని యాశ్రమముఁ జేరిచూచియతనిఁ
జతురవాక్యములఁ బ్రసన్నుఁగాఁజేసి నేస్నుమఁగాఁగఁ గొందు నీసుత నొసంగు

మనుచు నభ్యర్థింప ఽ నంగీకరించి యా, యుద్యమంబున వార ఽ లున్న యెడలఁ
గన్నియ వనజాక్షి ఽ కన్యలతోఁ గూడి, సంచరింపఁగ సుప్తసర్ప మొకటి

గీ॥ యడుగు సోకినయంత ఫణాగ్రమెత్తి, యొరసికఱచిన నక్కన్య ఽ యుర్విఁబడియె
నచ్చటఁ జరించు మునులెల్లసనలముకొనుచు, నార్తులై విలపింప సర్వార్థవినుచు.

గీ॥ గురుఁడుఁ జనుదెంచి దుఃఖార్తి ఽ నురువడించు, తల్లిదండ్రులు మునరిన ఽ తాపసులను
గాంచి నిర్జీవయయ్యు భూగత తటిల్ల, తా రుచిరమైన యాప్రమద్వరనుగాంచి.

సీ॥ బహిరాశ్రమమున దుర్భర విరహాకుల, హృదయుఁడై గళమెత్తి ఽ యేడ్చియేడ్చి
సౌఖ్య విఘాతియై ఽ సర్వంబు దైవ వ, శంబున నచ్చోట ఽ సమయఁ జేసె
నేమిచేయుదు నింక ఽ నెందుఁబోవుదుఁ బ్రాణ, వల్లభయైన నీ ఽ వనిత మడియ
జీవించి ఫలమేమి ఽ చెడితిఁబో ప్రియఁబాసి, మందభాగ్యున కిట్టి ఽ మగువగలదె

గీ॥ యొక్కయాలింగనంబైన ఽ నొక్కయధర, చుంబనంబైనఁ గొననైతి ఽ సుదతి కేలు
చేతనిడినట్టి హోమంబు ఽ చేయలేదు, ప్రాణములు పోవకున్న విశ్వప్పట్టు నందు.

గీ॥ మానుషసుఖంబు దొరకని ఽ మానవునకు, దివ్యసుఖమెట్లు చేకూరు ఽ దేవునెంచి
ప్రాసపావక ఖడ్గకుంతాసినికర, మృతులచే నైన నేనింక ఽ మేను విడుతు. ౩౯౧

చ॥ అని విలపించుచుం రురుమహాముని యన్నదిపొంత నిల్చి నె
మ్మనమున నూహచేసెఁ దన ఽ మారణమేఁ సుఖమేమికల్గుఁ బె
ల్చనఁ గడు నాత్మహత్య యవశంబునఁ గల్గును దల్లిదండ్రులుం
దనయ వియోగవేదనలఁ ఽ దాళక యాల్గినఁ బాపమౌఁగదా. ౩౯౨

మ॥ పరలోకంబుననైనఁ దన్విఁగను సామర్థ్యంబు సిద్ధింపఁగా
మరణంబొందిన నాత్మహంతకు సుఖమ్మా! యేల చేకూరు దు
ష్కరమౌ దుర్గతిపాల్పడుం నెలఁతకై ఽ కాయంబుఁ బోఁజేసినం
దురితవ్రాతముఁ బాయఁజేయుదునె? పుణ్యాల్ మెత్తురే? యాపనిం. ౩౯౩

గీ॥ అని విమర్శించి రురువు తీర్థావగాహ, నం బొనర్చి జలాచమనంబుచేసి
దోయిట జలంబులెత్తి కందోయిమూసి, పలికె నమ్మౌని సత్యసంభాషణముల.

మ॥ గురు దేవాతిథి సూర్య వహ్ని పితృ భక్తుల్ కల్గి పూజారతిం
గర మొప్పం దొలుమేనఁ బూజన మిలం ఽ గావించి సేవించి దు
స్తర శాస్త్రోక్త తపో జప స్థిరవిధుల్ ఽ సంధిల్లనేనిం బ్రియ
ద్వర జీవించునుగాక యొండయిన నేఁ ఽ బ్రాణానిలం బూడ్చెదం. ౩౯౪

ఆ॥ సకల వేద పటలిఁ ఽ జదివితినేని గా, యత్రి చిత్తమునను ఽ నధివసించి
నిలిచెనేని బ్రతుకు ఽ నీరజదళనేత్రి, యనుచు జలము విడిచె ఽ నవనిమీఁద. ౩౯౫

ఉ॥ సాహసమూని బోటి తమిస్రసైపక చింతిలు మౌనివర్య వ్యా
మోహా నివృత్తికై యమరసముఖ్యుని దూతయొకండు వచ్చి సం
దేహములేక నిశ్చితమనర్తిఁ మెయివీడఁ దలంచినావు దై
వాహతు లెందుఁ బూర్వకృత ♦ మందక స్వేచ్ఛఁ జరింపనేర్తురే? ౩౯

సీ॥ అవని గతాయువు ♦ లగువారు నత్తురే, యిబ్బోటి మృతియయ్యె ♦ నేలవగవఁ
నిది వివాహిత గాదు ♦ హితమెంచి యింకొక్క, పంకజాక్షిని నీవు ♦ పరిణయింపు
మేలప్రేమింపను ♦ నేల దీనిని గని, శోకింపనేల నా ♦ సురచరునకుఁ
దెలిపె రురుండును ♦ దీని నేను వరింతు, నొండొక్కసతిని నింకొల్ల దేవ

గీ॥ దూతయటులైననొకనేర్పుసతోడబ్రతుకు, "నాయువర్ధంబొసంగు"మీసయతివకనిన
నట్ల చేసెదనని రురుం ♦ డాత్మఁదలఁచి, యాయురర్ధంబొసంగితిననుడు నంత. ౩౯

—• రురుముని తనయాయువులో సగమిచ్చి ప్రమద్వరను బ్రతికించుట •—

వ॥ దివ్యవిమానారూఢుండై విశ్వావసు తనపుత్త్రికయగు ప్రమద్వర మృతియాట
యెఱింగి యచ్చటి కరుదెంచి తానును దేవదూత యతని మంత్రులును గృతాంత
సన్నిధానంబున కరిగి ప్రమద్వర యను కన్నియ రురుండను ముని పరిణయింప
నుద్యోగించు సమయంబున సర్పదష్టయై మృతియగుటవలన రురుండు తదాయుర
ర్ధంబునఁ బునర్జీవితగఁ జేయం గలవాఁడై యున్నవాఁడు భవదాజ్ఞయు నట్లగుం
గాక యని ప్రార్థించిన ధర్ముం డిట్లనియె. ౩౯

గీ॥ అట్లయగుఁగాక యని ధర్ముఁడానతియ్య, నంత నచ్చోటి కరుదెంచి ♦ యత్తపస్వి
యభిమతార్థంబు సంధింప ♦ నంతలోన, నిదుర లేచిన యట్టులు ♦ నెలఁత బ్రతికె.

—• రురుఁడు ప్రమద్వరను బెండ్లియాడుట •—

మ॥ రురుఁ డా నీరజపత్రనేత్రను సమర్థుండై కరంబూనె నె
ల్లరు మౌనీంద్రులు సంతసించిరి వపుస్లాలిత్యమై యా ప్రమ
ద్వరయున్ మౌనియు నిష్టసౌఖ్యములచే ♦ వర్ధిల్లిరంతన్ మరు
చ్చరవిశ్వావసు లాత్మగేహములకున్ ♦ సంతుష్టులై పోవరే. ౪౦౧

ఉ॥ కావున శాస్త్రసమ్మతముగా మణిమంత్రజపాద్యుపాయముల్
గావలయున్ గదా యని సుఖస్థితికై సచివాదులన్ నిజ
ప్రావరణంబునన్ నిలిపి ♦ ప్రాణముఁ గావఁగ సాప్తభౌమిక
శ్రీవిలసిల్లు సౌధమునఁ ♦ జేరి వసించెను సాధ్వసంబుగాన్. ౪౦౨

సీ॥ మణిమంత్రధరులను । మందిరంబున నిల్పి, సిద్ధుల నంతంత । జేరఁదీసి
సచివపుత్రుల సందు । సందుల నెలకొల్పి, యెవ్వారి న మ్మేడ । నెక్కనీక
స్నానసంధ్యాదు లచ్చటఁ జేయుచును మజ్జ,నము భోజనము రాజు । నయవిధాన
మచట సల్పుచు విహంగగాధిపు స్మరణంబు, చేయుచు దినసంఖ్య । జేసికొనుచు

గీ॥ నిర్భయ విహారియై యిట్లు । నిలుచునెడను విప్రశాపంబుచే రాజు । వెఱచియున్న
వాఁడు నేఁబోయిబ్రతికించు । వాఁడననుచుఁ, గశ్యపాభిఖ్యుఁడగుద్విజా । గ్రణియొకండు.

— తక్షక కశ్యపుల సంభాషణము —

ఆ॥ ఏనుబోయి భూత । లేశుని బ్రతికించి, వలయుధనముఁ దెచ్చు । వాఁడ ననుచు
గారుడోపనిష ద । ఖండ మంత్ర రహస్య,వేది వచ్చుచుండె । విభునికడకు. ౪౦౪

సీ॥ బ్రాహ్మణో త్తముని శా । పమున బద్ధుండయ్యె, నుర్వీశుఁడని పన్న । గోత్తముండు
తక్షకుం డెఱిఁగి వృ । ద్ధత వహించిన మహా, ద్విజరూపియై వచ్చు । తెన్నునందుఁ
బొడగాంచి నీ వెందు । బోయెదవనియన్నఁ, గశ్యపుండనియెఁ ద । క్షకునితోడ
భుజగభీతుండైన । భూపతి రక్షింప, మంత్రింబు గలదు త । న్మహిమవలన

గీ॥ విభు నపజ్వరుఁజేసి జీ । వింపఁదలఁతు, మృతినిఁబొందిన బ్రతికించి । మెప్పుగాంతు
మేలు ధనములొసంగు వే । యేలనాకు, సార్థతీర్థంబులన్నియు । సఫలమగును. ౪౦౫

ఉ॥ తక్షక దంశితుం డగుచు । ధర్మపరుండగు రాజుగూలె నే
నీ క్షితిచక్రమెల్లను లయించుఁ బదంపడి యస్మదాదులున్
భైక్షములెత్తఁగా వలయుఁ । బన్నములొందమె గాన నిప్పుడే
యీ క్షితినాథు ప్రాణముల । నిత్తు నరున్ మఱి తక్షకుండనన్. ౪౦౬

ఆ॥ ఏనె తక్షకుండ । నిల నెవ్వఁడేని మ,ద్దష్టు మనుపఁజేయు । తరమువాఁడె
శక్యమగునె నీకుఁ । జను ముందుచోటికి, ననిన విప్రుఁడనియె । నహిపతికిని. ౪౦౭

ఆ॥ విప్రుశాపవశత । వెఱవక ధరణీశుఁ, గఱచి తేని మంత్ర । గరిమమునను
బ్రతుకఁ జేయువాఁడ । బన్నగ! నాశక్తిఁ, దెలియకుంటివనినఁ । బలికెనతఁడు. ౪౦౮

— తక్షకునికాటున భస్మమగు మఱ్ఱిచెట్టును గశ్యపుఁడు బ్రతికించుట —

ఉ॥ భూమిసురేంద్ర మచ్ఛ్వసన । ఫూత్కృతిచే హతుఁడైనవాని నీ
వే మనుపంగఁ జేయుటకు । నెల్లిదమయ్యెడు నట్లులైన నే
నీ మహిజంబు దంష్ట్రల ద । హించెద నెప్పటియట్లు చేయుమీ
నీ మహిమంబు గాంతునని । నిష్ఠుర ఘోర విషాగ్నికీలలన్. ౪౦౯

ఆ॥ చెంతనున్న మఱ్ఱిచెట్టు దంష్ట్రిఁజీరి, గరళవహ్ని కీలఁ గాల్ప నదియు
భస్మమయ్యె నేలఁబడియె నాద్విజముఖ్యు, డవనిఁబడిన భూజ మంత గాంచి.

మ॥ అభిమంత్రించి మహీజభస్మమున విప్రాగ్రణ్యుఁ డొయ్యన్ జలం
బభిసంప్రేక్షణ సేయఁ బూర్వగతి శాఖాళుల్ దివిన్ బర్వ సా
రభ పుష్పోత్కర పత్ర గుచ్ఛ ఫలతారాజద్గతిన్ గల్ప స
న్నిభమై యొప్పినఁజూచి తక్షకుఁడు దానిన్ విస్మయావిష్టుఁడై. ౪౧౧

ఆ॥ విప్రవర్యుఁ జూచి వినవయ్య నామాట, నీ పరిశ్రమమున కేద్దిబీజ
మనినఁ గశ్యపాఖ్యుఁ డహివల్లభుని తోడఁ, బలికె నిట్టు లనుచుఁ బ్రౌఢిమెఱయ.

చ॥ మహిపతి యస్మదీయ పటు మంత్రబలంబున జీవనాథ్యుఁడై
సహజ సుఖంబునొందిన విశంకట విత్తముఁ గొందునంచు నే
నహరహ మెంచి వచ్చితిని నంతియకాని మఱొండులేదు నా
నహిపతి పల్కె నీవడుగు నర్థము నేన యొసంగెదన్ జుమీ. ౪౧౩

గీ॥ ఎంతయర్థంబు వలయునో యంత నిత్తు, ననుచు ధనరాశియొసఁగిన నాక్షణంబ
ద్విజుఁడు పరమార్థమెఱిఁగి సందేహమంది, యంతరంగంబులోన నిట్లని తలంచె.

మ॥ ధనమున్ గైకొని యింటికేగిన జనుల్ ధర్మజ్ఞుఁడై యుండియున్
ధనలాభం బెద నెంచెఁ గాని పరమార్థం బెంచఁడయ్యెన్ జనా
వన సంరక్షకుఁడైన రాజు బ్రతికింపన్ జాలఁడంచున్ సభన్
నను నిందింతురు గాదె జీవిత మిసీ! నాకేటి కిప్లాటచేన్. ౪౧౪

సీ॥ జన్మమొందుట వల్ల సత్యంబు గీర్తిసాధించుట ధనలాభ తృప్తివలనఁ
బరలోకహానియుఁ బటుయశోహీనతఁ, బ్రాప్తించు నిందకుఁ బాలుపడుదు
ధరణీశు జీవింపఁ దలఁచితినేనిఁ గీర్తియుఁ బుణ్యమును ధనతృప్తిగలదు
రక్షణీయము కీర్తి యక్షయంబైనను, విత్తమ్ముగాల్పనే వినమె తొల్లి

గీ॥ రఘు హరిశ్చంద్ర కర్ణాది రాజవరులు, యశము సాధించి విఖ్యాతి నందిరనుచుఁ
గాన విషవహ్నిచేఁ గూలు క్ష్మాతలేశు, నెట్లుపేక్షింతు నింటికే నెట్లుచనుదు.

ఉ॥ జీవితుఁజేచు రాజు సుఖసిద్ధిఁ బొసంగిన భూజనంబులన్
జీవనమిచ్చి ప్రోచు విభుసేమము ధాత్రికి సేమ మట్లుగా
దే! వసుధాతలంబునకు నేలిక లేమి నరాజకంబు గాఁ
బోవదె? రాజ్యముల్ చెడినఁ బొందదె? యా దురితంబు నన్నిఁకన్. ౪౧౬

క॥ ధనలాభపరుఁడ నగు న, న్ననుమానింపన్ బనేమి! యపకీర్తిపరుం
డని నిందింతురటంచని, మనమున నొక్కింత సేపు మగ్నుండగుచున్. ౪౧౭

వ॥ అని యొక్కింతసేపు చింతించి దైవవశం బట్లుండు కతంబున రాజుం గతాయుష్కుంగా నెంచి సర్వకార్యంబులు దైవాధీనంబులని తలచుచుఁ దక్షక విసర్జితంబగు సర్వధనంబు పరిగ్రహించి కశ్యపాభిధానుం డగు ద్విజవర్యుండు నివృత్తుండై నిజగృహంబున కరిగిన, ౪౧౯

ఉ॥ సప్తమవాసరంబు కడు సన్నిహితంబని తక్షకుండు సం
గుప్తశరీరుఁడై కదలి కుంభిపురంబు సమీపభూములన్
సాప్తికభామికాగ్రిమున సర్వజనంబులుఁ గాచుచుండ సం
క్షిప్తభయామయుండగుచుఁ గేవలమైన వివిక్తభూమికిన్. ౪౨౦

క॥ మణిమంత్రౌషధ వేత్తలు, క్షణకాలంబైన విడక సన్నిధినిలువన్
ఫణిభయమున క్షితిరక్షాచణుఁడు పరీక్షిత్తునిలుచు చక్కిన్ వినుచున్. ౪౨౧

శా॥ చింతావిష్టతఁ దక్షకుండు ద్విజు డిచ్చెన్ శాప మేనెట్లు దు
ర్దాంతంబై నరవాసమై యొసఁగు సౌధంబెట్లు చేరంగ భూ
కాంతున్ సన్మణిమంత్రతంత్రములచేఁ గాపాడుచున్ మాంత్రికుల్
చెంతన్ జుట్టి వసించినారని జనుల్ చెప్పంగ వింటిన్ గదా. ౪౨౨

క॥ ఎట్టులు వంచన చేసెద, నిట్టి ద్విజద్రోహి పతితుఁ డిట్టి కృతఘ్నుం
డెట్టులు పాండవకులమునఁ, బుట్టెనొ? యిటువంటి పాపి భూమి నెఱుఁగన్.

ఉ॥ తాపసకంధరంబున మృతంబగు సర్పముఁ జుట్టి యెంతయున్
బాపముఁ జేసియున్ దనకు బంధము సంఘటిలెన్ గదా యటం
చోపిక రక్షణంబునకు నుద్యమముల్ పచరించెఁగాని యీ
పాపము భోగనశ్య మను పల్కుఁగనండు గదా నృపాలుఁడున్. ౪౨౪

శా॥ చుట్టున్ రక్షకకోటి నిల్పికొని విస్ఫూర్జన్మహా సౌధమం
దిట్టట్టున్ గనిపెట్టు మృత్యువును వంచింపంగ రాజున్న వాఁ
డెట్టో వాని మదీయఘోర గరళాగ్నిధ్మంబు గావింతునో
కట్టా! విప్రునిపల్కు సార్థకముగాఁ గన్ జేయ నెట్లౌనొకో? ౪౨౫

గీ॥ ఎంత మందుండొకాని భూకాంతుఁడెంచ, మరణ మనివర్తనంబని మదిఁదలఁపఁడు
సౌధముననుండి చుట్టు రక్షకులనిలిపి, విప్రశాపంబుఁ గడతు నన్ స్వేచ్ఛనుండె.

శా॥ ఏకాలంబున నే దినంబుననొ యే యేవేళలం దెప్పుడో
యాకాలంబున నాదినంబుననె యా యావేళలం దప్పుడే
రాకన్ మానదు మృత్యు వెల్లరకునున్ రానీక పోఁబెట్టు నా
లోకాతీతుఁడు దైవమైనను సమాలోకింప నెందుండునో. ౪౨౭

ఉ॥ పాండవ వంశసంభవుఁ డశేషకృపాభరణుండు వైభవా
ఖండలుఁ డట్టిరాజు నయకర్మఠుఁ డయ్యును మేనెఱుంగ కీ
దుండగపుంబనిన్ సలిపె తోడనె మృత్యువునందు నక్కటా!
యొండనఁ నేల యేగతి నహహా! విధి దప్పునె? ప్రాణికోటికిన్. ౪౨౮

శా॥ ఆధివ్యాధుల దానధర్మముల మాయన్ జేయఁగాఁ జేసి దు
స్సాధంబౌ నపమృత్యువున్ గెలిచి రక్షన్ జెందఁగా వచ్చు దు
ర్బోధంబౌ ద్విజశాపముం గడచు నేర్పుం గాంచఁగా వచ్చునే
వేధోముఖ్యులకైనఁ ద్రిప్పఁ దరమే? విప్రోక్తి సామాన్యమే? ౪౨౯

కం॥ బాడబశాపము సాగర, బాడబమునకన్న బహుళభయదము దెలుపన్
లేఁడయ్యె నొక్కవిప్రుఁడుఁ, బోఁడిమిఁ జెడవలసివచ్చెఁ బో! భూపతికిన్. ౪౩౦

మ॥ ఎదఁ జింతించుచు నిట్లు తక్షకుఁడు దోనే తెంచు నాగంబులన్
ముదిమిం జెందిన విప్రవేషములచే మూర్తిభవత్ప్రక్రియన్
గదురం జేయుచు వారిచే ఫలములుం గంధప్రసూనంబులున్
ముద మొప్పారఁగఁ బంపఁగాఁ దలఁచి విస్ఫూర్జత్ఫలప్రక్రియన్. ౪౩౧

సీ॥ అందొక్క ఫలములోనణురూపమునఁ గీట, కాకృతిఁ దాల్చి తానణఁగియుండెఁ
గుహనామునులు గుంపుగూడి రాజగృహంబు, దరిసి ప్రాసాదంబుదండనిల్వ
రక్షకుల్ మీరిందు రాఁబని యేమన్న, నరపతిఁ గనవచ్చినార మనిన
దర్శనంబీయఁ డిత్తఱి భూపతి యటన్న, మఱియు నాథర్వణ మంత్రశిఖల
గీ॥ సేచన మొనర్చి కుశలంబు సేయఁదలఁచి, వచ్చినారము భారతవంశమునను
దాపసుల నిట్లు పేక్షించు ధరణిపతులు, గలుగరు మహీశుఁ గన్గొని గడియలోన.

క॥ శ్రుతిసూక్తులను బఠింపుచు, క్షితిపతికిన్ గుశల మొసఁగి చెచ్చెర వనికిన్
స్థితగతి నరిగెద మనిరన్, యతిసంఘముతోడ వాద మర్హమె? యనుచున్.

సీ॥ రాజు నాదేశంబు నోజఁబల్కుదుము రా, జాజ్ఞ మాకెల్ల నియంత్రితంబు
ఎవ్వరేతెంచిన నెల్లివచ్చెద నంచు, నెఱుక చేయుం డని యిచ్చెఁగానఁ
బలికితి మిట్లని ప్రాసాద మెక్కంగ, నానతిలేదు మీ రరుగుఁ డనిన
నట్లైనచో నీఫలాదులు గొనిపోయి, మేము పంపుటఁ దెల్పి మీ రొసంగుఁ
గీ॥ డనుచు మునితతి పల్క వా రధిపునొద్ద, కరిగి మునివర్యులు ఫలంబులనుపఁదలఁచి
ద్వారమున నున్నవారన్న ధరణివిభుఁడు, పలికె వారలతోడ సద్భక్తియుక్తి.

మ॥ ఫలమూలాదులు మీరలందుకొని భూపాలుండు చేమోడ్చి మీ
రలు మాయొద్దకు వచ్చు టేమికత మో రాఁగోరిరన్ దర్శనా

దులు మీకెల్ల ఘటించునంచు నోగిఁ దోడ్తోఁ దెల్పఁ బొండన్న వా
రలు నత్తాపసులంపు పుష్ప ఫలవారంబుల్ ముదం బందుచున్. ౪౩౭

ఆ॥ అంది పుచ్చుకొనుచు నధిపతి సన్నిధి, కరిగి యిడిరి తాపసాకృతులను
వచ్చు భుజగకోటి వలయు చోటుల కేఁగెఁ జింతితంబు సిద్ధిఁజెందె ననుచు.

మ॥ ధరణీశుండు ఫలంబు లందికొని చెంతన్ నిల్చు విప్రాళికిన్
బరిపక్వంబులు పండ్లు మీరు కొనుచున్ భక్షింపుడంచున్. సమా
దరణంబొప్ప నొసంగి తా నొకటి చేతన్ గొంచు విప్రార్పితం
బరుదా నీ ఫలమంచు గోటికొన నొయ్యన్ జీరె రాజంతటన్. ౪౩౮

—॰ పరీక్షిత్తు తక్షకవిషాగ్నిచే మృతుండగుట. ॰—

ఆ॥ దానిలోన నొక్క తరుణారుణాకృతిఁ, గృష్ణనయన మగుచుఁ గ్రిమి యొకండు
వెడల దానిఁజూచి విస్మయపడుచు భూపాలుఁ డనియె సచివవరులఁగాంచి.

ఉ॥ కంటిరె వింత యీ ఫలము గర్భమునన్ గ్రిమిపుట్టె నివ్విషం
బంటు నటంచు నే భయము నందుటలే దిఁక శాపభీతి న
న్నంటదటంచుఁ గంఠమున నా క్రిమి నంటఁగఁ బట్టునంతలోఁ
దుంటరి తక్షకుండు పెనుభూర్త నిజాకృతిఁ జూపి భూపతిన్. ౪౩౯

ఆ॥ ఒడలు గలయఁజుట్టి యుబుసు పుచ్చఁగనీక, కోఱలెల్లఁ గ్రుచ్చి ఘోరవిషము
మంటలెగయఁ గాట నంటించి మహిపతిఁ, బడఁగఁ ద్రోసె సభికభయదముగను.

క॥ చండ విషజ్వాలలతోఁ, మండుచునున్నట్టి భుజగమహితునిఁ గని తా
రొండొరులు భయార్దితులై, గండడఁగుచుఁ బరుగు లిడిరి కలవారెల్లన్. ౪౪౧

సీ॥ అచటి రక్షకులు హాహాకారము లొనర్చి, పర్వులెత్తంగ భూపాలుఁడంత
ఫణివేష్టితుం డౌచు బలపౌరుషములెల్లఁ, జెడి చలింపఁగలేక నుడువలేక
తక్షకానన మహాత్తర విషజ్వాలల, నడఁగి గతప్రాణుఁడగుచుఁ బడినఁ
దక్షకాహియు నంతరిక్షంబునకు వేగ, నెగసిన జనులెల్ల వగచి వగచి

గీ॥ గగనసీమాంత సదృశమహా కాలభుజగ, రేఖఁగని భీతినొంది యుర్వీజనంబు
లబ్బురంబు భయభ్రాంతు లలమికొనఁగఁ, జిత్తమున నెమ్మిఁగొనక నిశ్చేష్టులైరి.

ఆ॥ దగ్ధభూరుహంబు ధర భస్మరాశియై, పడినయట్లు భస్మపటలియగుచుఁ
బ్రోవువడిన యట్టి భూపతిఁ జూచిరి, యార్తభావ మంది రఖిలజనులు. ౪౪౩

మ॥ సకలామాత్యులు జాహ్నవీతటమునన్ సత్కారపూర్వంబుగాఁ

బ్రకటశ్రౌతవిధిన్ దహించి బహువిప్రశ్రేణిఁ బూజించి స

ర్వకళాదక్షునిఁ దత్సుతున్ శుభముహూర్తంబందుఁ బట్టంబుగ
ట్టి కడున్ మోదమునొంది సౌఖ్యములు రెట్టింపంగ సోల్లాసులై. ౪౪౪

కం॥ కంఠీరవపీఠిన్ సోత్కంఠన్ జనమేజయున్ బ్రధానులు విజయా
కుంఠత నిలుపుచు ద్విజకలకంఠులు నాశీర్వదింపఁ గడు మోదమునన్. ౪౪౫

—• జనమేజయుండు పట్టభద్రుండగుట •—

సీ॥ పౌరసంఘము జానపదులు చుట్టును బర్వ, జనమేజయుండు రాజన్యపదవి
నభిషిక్తుఁ డగుచును నంద ఱానందింప, ననుదినవర్ధమానాంగుఁడగుచు
రాజచిహ్నములు సర్వస్వంబు ధాత్రియుఁ, బరిపాలనంబు లభ్యస్తములుగ
దినదినంబును మహాదీప్తతేజస్వియై, ధైర్య గాంభీర్య సౌందర్యకలన
గీ॥ ననుపమానప్రభావ్యాప్తి నతిశయిల్లెఁ, దండ్రి తాతల పోల్కి నుద్దండుఁడగుచు
సద్గుణసముద్రుఁడో నాఁగ జగతిఁ బ్రబలి, యంత్ర తాసాధ్యమంత్ర సహాయుఁడయ్యె.

శా॥ ప్రాప్తైకాదశవర్షుఁడైన వసుధాపాలాత్మజున్ వంశమం
దాప్తుండైన పురోహితుండు ద్విజముఖ్యాంగీకృతిన్ సత్క్రియా
గుప్తిన్ వే నుపనీతుఁ జేసి తెలిపెన్ గోదండ విద్యాదు లా
జ్ఞప్తిన్ జేయుచు నస్త్రశస్త్రకలనాశర్మిష్ఠనిష్ఠారతిన్. ౪౪౭

ఆ॥ అర్జునుండు ద్రోణు నంతికంబున నూత,సూతి పరశురాము ప్రీతివలనఁ
బ్రాస్త్రవిద్యలైన పగిదిని జనమేజ,యక్షితీశుఁ డఖిల మభ్యసించె. ౪౪౮

వ॥ అంత ధనుర్వేదమును వేదశాస్త్రంబులును రాజనీతియు మొదలగు నెల్ల విద్య
లును జదివి సత్యవాదియు జితేంద్రియుండును బరమార్థజ్ఞుండును ధర్మాత్ముండును
నగుచు యుధిష్ఠిరుపోలిక ధరణీపాలనం బొనర్చుచు సువర్ణధర్మాక్షుం డను
కాశిరాజ పుత్రికన్ శుభాంగి యను కన్యకన్ బరిణయించి సుభద్రన్ జేకొన్న
పార్థుండునుం బోలెఁ బులోమజను గరగ్రహణం బొనర్చు శతక్రతుండునుం బోలె
శౌర్యవిభవంబులన్ బరిణతుండై ప్రజాక్షేమంబు లరయుచున్ గర్మకుశలు లగు
నమాత్యుల వలన సర్వకార్యంబులు సమర్థించుచు సుఖంబుండు నవసరంబున,

—• ఉత్తంకుని యాగమనము •—

శా॥ ఉత్తంకుం డను మౌనివర్యుఁడు మహోద్యోగంబునన్ దక్షకా
వృత్తంబైన యమర్ష మాత్మఁ గరమున్ బ్రేరేపఁగా నీసునన్
మత్తుండౌ మదరాతిపక్షకఫణిన్ మాయింప శక్తుండు రా
జత్తేజుం డితఁ డంచు హస్తిపురికిన్ సక్రోధుఁడై వచ్చినన్. ౪౫౦

సీ॥ జనమేజయక్షితీశ్వరుఁడు తద్ద్విజురాక, తెలిసి యింటికిఁ దోడ్కొ తెచ్చి యతనిఁ
గనకాసనమునందు నునిచి పూజించి గో,దానం బొసంగి పాదముల కెఱఁగి
యేమికార్యముఁగోరి యిందువచ్చితిరి మీ,దర్శనంబున జన్మ ధన్యమయ్యె
నీకు హితంబేమి నే నొనర్తును వేగ, నానతిమ్మన విప్రుఁ డతనితోడ
గీ. నేమి దెల్పుదు రాజేంద్ర! యేను నిన్ను, ధనముగోరుచు వచ్చుటఁ దలఁపవలదు
నీవుఋణవంతుఁడవునాకునిజముసుమ్ము, కార్యమునఁగార్యమెఱుఁగనికరణియయ్యె.

ఉ॥ క్రోధివిగావు వైరియెడఁ గ్రూరత లేదు నిరుద్యమం బసం
బాధముగాఁగ నీయెడలఁ బ్రాల్పడి యున్నది బాలిశుండవై
క్రోధ మెఱుంగ వజ్ఞతను గోరితి విట్టి నినుం గడించి యే
సాధులుగాని కార్యగతిఁ జక్కఁగఁ జేయఁదలంతురే యనన్. ౪౧౨

చ॥ ఎఱుఁగని వైరముల్ గలవె యేనభియాతికిఁ జిక్కినాఁడనే
మఱచుటగల్గునే నిరభిమానముచేఁ గరణీయకృత్యముల్
మఱతునె బాల్యచేష్టలను మానిన్పుడు హెచ్చుటలేదు నాయెడన్
గొఱఁత గణించి పల్కుటకుఁ గూడునె విప్రకులావతంసమా. ౪౧౩

క॥ కలదేనిఁ దెల్పుమని రాట్కులమణి జనమేజయుండు కుపితుండై యి
ట్టులముగఁ బల్కిన భూసుర, తిలకుఁ డుదంకుండు పలికెఁ దీవ్రోక్తులచేన్. ౪౧౪

ఉ॥ దుష్టకులాధముండుఁ గడు ధూర్తుఁడుఁ దక్షకుఁ డట్టివానిచే
దష్టత నొంది ఘోరవిషదాహమునొంది మృతుండుగాఁడె యీ
కష్టపుఁ జావు మంత్రులు నొకానొకవేళను దెల్పరై రొకో
క్లిష్టముగాదె నీ బ్రతుకు కొకింత మదిన్ దలపోయుమీ యనన్. ౪౧౫

గీ॥ తనదు మంత్రులఁ జూచి యుదంకసూక్తి, వింటిరే యన సచివు లవ్విభునిఁ గాంచి
దేవ! భవదీయ జనకుండు ద్విజునిశాప, వశతఁ దక్షునిచేఁ గాలవశమునొందె.

ఉ॥ తథ్యము మానిపల్కని ప్రధానులు పల్కిన రాజు మానితో
మిథ్యలు పల్కఁగాఁ దగ దమేయ తపోధనమూర్తి తిట్టుటన్
వధ్యతనొందెఁ దక్షకుని వంక నొకించుక దోషమెట్టిదు
స్సాధ్యము విప్రశాప మని చక్కఁగ దానిక్రమం బెఱుంగుచున్. ౪౧౬

గీ॥ తక్షకుఁడు ద్రోహిగాఁడు మాతండ్రియెడల, నతనిపైఁ గీడుదలఁచుట యభిమతంబు
గాదనిన మానిపల్కె నో, క్ష్మాతలేంద్ర, చిలువచేసిన ద్రోహంబు చెప్పుదునిఁక.

ఉ॥ శృంగి శపించె శాపగతిఁ జెప్పఁగ వించు మహానుభావుఁ డు
త్తుంగ భుజంగ మాంత్రికత ధూర్వహుఁడొ నొక విప్రముఖ్యుఁ డ

బ్భంగముఁ దీర్పఁగాఁ దలఁచి వచ్చుటఁ గాంచి ధనంబు గొంత యీ
యఁగ నతండు వోయెఁ గడు హన్యుఁడు తక్షకుఁ డంచు నెంచుమీ. ౪౫౯

చం॥ పరమపవిత్రుఁ డా రురుని భార్య భుజంగముచేత దష్టయై
మరణమునొంద నింకొక సమంజసరూపవిలాసియౌ చెలిన్
బరిణయమందు మన్న విని భార్య సజీవితఁ బెండ్లియాడఁగా
రురుఁడు ప్రతిజ్ఞఁ జేసె మఱిఁ దున్నింపఁగ సర్పకులంబు నంతయున్. ౪౬౦

కం॥ ఈరీతిఁ బ్రతిజ్ఞాపరుఁడై రురుఁడు కృపాణపాణి యగుచు వెదకె నీ
ధారుణి నెల్లఁ జరించుచుఁ, ఘోర భుజంగములఁ జంపఁ గోరికఁ గడిమిన్. ౪౬౧

ఉ॥ ఘోరవనంబునన్ ముసలి కుండలి డుండుభనామధేయునిన్
గ్రూరతఁ జూచి దండమున గొట్టఁగ నేగిన రోషదూషితుం
డై రురుఁ జూచి పల్కె నహి యయ్యయొ! నీ కపరాధిఁ గాను నీ
వారయ ధర్మమూర్తి విటు లౌనె! నన్ను గడు హింస సేయఁగాన్. ౪౬౨

శా॥ శాంతిన్ జెందుమటన్న మాని యనియెన్ సర్పాధమా! తొల్లి మ
త్కాంతన్ నీ కులజుండు గూల్చునెడ నుద్యత్కోపినై నేను దు
ర్దాంతంబైన ప్రతిజ్ఞఁ జేసితి నహిప్రధ్వంస చేయంగ నీ
గంతుల్ మానుము దండమర్దితుని నిన్ గావింతు నా నిట్లనున్. ౪౬౩

క॥ నీ పడఁతికి నపరాధము, నే పాపి యొనర్చె వాని హింసింపక న
న్నీపట్లఁ జంపఁ జూచుట, పాపము గాదొక్కొ? ధర్మపద్ధతి వినుమా. ౪౬౪

శా॥ ధర్మజ్ఞుండవు బ్రహ్మనిష్ఠుఁడవు వేదవ్యక్త వాక్ప్రక్రియా
మర్మజ్ఞాన ధురంధరుండవు బలెన్ భాసిల్లె దీ విట్టి దు
ష్కర్మ ప్రోత్సహనంబునన్ గెరలు నుగ్రప్రౌఢి నూనంగ నే
ధర్మంబంచని యెంచెదే వినుము మద్వాక్యంబు మౌనీశ్వరా! ౪౬౫

చ॥ భుజగశరీరధారణముఁ బూనుటె గాని గణించి చూడు మే
భుజగము గానటన్న మునిపుంగవుఁ డా ఫణివక్త్రకాంతమై
బుజువగు మానుషోక్తి విని ప్రీతినిఁ గాంచి వచించె నిట్టులై
విజనవనమ్మునందు ఫణివేషముతో నివసింప నేటికిన్. ౪౬౬

క॥ నీ వింత సమర్థుఁడవై, యీ విధమున నుండు టేది హేతువొ యన నా
భూవిబుధాగ్రణితో ననె, నా విధమున్ వినుము మౌనినాథా! ప్రేమన్. ౪౬౭

ఉ॥ ఏనొక బ్రాహ్మణుండ విను మిచ్ఛఁ జరించుచు సత్యవాదినై
మానితవృత్తి నింద్రియసమాజము గెల్చుచు ధర్మమూర్తినై

భూసుతుఁడైన యొక్కద్విజు - మోసముచేసితిఁ బామురీతి నై
శ్వానర గేహమం దిడుచుఁ - జక్కనిగడ్డిని దానఁగ్రోధియై. ౪౧౯

ఆ॥ అతఁడు భీతుఁ డగుచు - నతివిహ్వలుండునై, మందబుద్ధి నన్ను - మండలించెఁ
దృణభుజంగమమునఁ - దిగులందఁ జేసితి, నదియుఁ గానఁ జిలువ - వగుమటంచు.

వ॥ శపించినఁ వెఱగంది పాదంబులపయిఁ బడి శాపంబున కవసానంబు గల్పింపుఁడని ప్రార్థించినఁ గ్రోధం బొక్కింత యడంచుకొని, "ప్రమతిపుత్రుండగు రురుండు భవల్లోచనగోచరం బగు నప్పుడు నీకు శాపభయంబు తొలంగు" నని వచించె. నీవు రురుండవు, నేను బరమవంచకుండ నగు బ్రాహ్మణుండ. సర్వధర్మోత్తమం బగు నహింస విప్రులకు ధర్మంబు. వేత్తయగువాఁడు చరాచరంబులయందుఁ గారుణ్యంబు గలిగి వర్తించుట యాత్మీయసుకృతంబునకన్న విశేషఫలం బని బోధించి సర్పయోని విముక్తుండై చనియె. రురుండును ద్విజశాపాంతం బొనరించి హింసాపరిత్యాగంబుచేసి సుఖంబుండె నని చెప్పి. ౪౨౦

మ॥ అహిత ద్వేషమునందు బ్రాహ్మణున కీ - యావేశ మిట్లుండఁగా
మహిపాలుండవు నిగ్రహాగ్రహములన్ - మాన్యుండవై యుండియుఁ
విహితంబా పితృహంత మారణసము-ద్వేగంబు నీకేల లే
దహహా! రాజవిధంబు వ్యర్థముగఁ గ్రోధావేశముఁ మానితే. ౪౨౧

ఆ॥ నింగి నీదుతండ్రి - నిలిచి సద్గతిలేక, స్నాన దాన ధర్మహీనుఁ డగుచు
నున్నవాఁడు తండ్రి - నుద్ధరించుట సర్ప, భేదనమునఁ గాని లేదుసుమ్ము. ౪౨౨

కం॥ పితృవైర మణఁపఁజాలని, సుతుఁడు మనియు మృతుఁడె యగును సూ! వానికి దుర్గతి దప్పదు పితృవైరిని, హతిఁ జేసెడు దనుక ధర్మమని కనుగొనుమా. ౪౨౩

— • జనమేజయుఁడు సర్పయాగంబు చేయనెంచుట • —

మ॥ జనక ద్వేష నివారణంబునకునై - సత్రంబు సాగించి స
ర్ప నికాయంబుల నుజ్జ్వలజ్జ్వలనసంపాతంబునఁ వేల్చి ది
వ్యనిశాంతంబునఁ బూర్ణభోగములఁ దేల్పఁ గూడదే తండ్రి! నీ
కనుమానం బిఁకనేల చేయుము మహార్హంబైన యీ యజ్ఞముఁ. ౪౨౪

మ॥ అపబోధంబని యెంచఁబోకుము మదీయాలాప మాలించి ని
ష్కృపచే నీ సవనంబుఁ జేయు మన ధాత్రీశుండు బాష్పాంబువుల్
విపులాక్షిద్వయి జాలువాఱఁగఁ బితృద్వేషాపనోద క్రియఁ
జపలున్ నన్నిఁకఁ గాల్పనే యనుచు శశ్వత్క్రోధ సంభూతుఁడై. ౪౨౫

కం॥ ఉరగనిపీడితుఁ డగుచున్, నిరయంబునఁ బడియెఁ దండ్రి । నిష్కృతికొఱ । క
ధ్వర మొనరించెద వైశ్వానరకీలల సర్పకులము । నవియ నొనర్తున్. ౪౭౬

సీ॥ జనమేజయుం డెట్టులనుచు మంత్రులనెల్ల, రప్పించి యీయధ్వరమ్ము సల్ప
సంభార మొసఁగుఁడు । జాహ్నవీతటమునఁ, గనక శతస్తంభ । ఘటితముగను
మండపంబు రచించి । మహిత వేదికఁ దీర్పఁ, డందు నుదంకుం డనగును హోత
పశువు తక్షకుఁడు విశపవిత్రితముల నెల్లఁ, బలిపింపుఁడని పల్కె వలయునటుల

గీ॥ మంత్రిలోనరింప దీక్షాభిమంత్రితుఁడయి, నవనవహ్నుల గూఢ పాంద్ధవ్యవిధులు
సలిపి జనమేజయుండు యజ్ఞంబుచేయ, నురగకులములు నాశంబునొందనపుడు.

గీ॥ మఖము సలిపెడినవ్వార్త మహితలమున, మ్రోయవిని తక్షకుండువిధేయుఁడగుచు
సాధ్వసమునొంది సుత్రామసన్నిధికిని, బాహి పాహి యటంచునుబర్వులెత్తె.

గీ॥ అంతవెలువకుమనియిందుఁడహిపతికిని, నభయమిచ్చుటవినియుదంకాహ్వయుండు
సేంద్రతక్షకముగ మంత్రమెత్తి చదువ, నుభయవినిపాతమునవహ్నినొందవునంత.

—• ఆస్తీకుఁడు సర్పయాగము మాన్పుట •—

కం॥ యాయావర వంశోద్భవుఁడై యాస్తీకుఁడు చెలంగు । నా మౌనీంద్రుం
డామెడ సర్పాధ్వర సంస్థాయి యయిన నృపునిఁ జూడఁ జయ్యనవచ్చెన్. ౪౮౦

కం॥ వచ్చుజరత్కారుసుతున్, మెచ్చుచు నెదురేగి మ్రొక్కి । మృదుపీఠమునం
దెచ్చఁగను నిలిపి పూజన, మిచ్చెన్ బాద్యాదివిధి నభీష్టముగాఁగన్. ౪౮౧

ఉ॥ ఎయ్యది మీరుగోరిన యభీష్టము దెల్పు మనంగఁ దాపసుం
డొయ్యన వస్త్రభూషణ ధనోన్నత వాజి మతంగజాదులం
దియ్యెడ వాంఛలేదు ధరణీశ్వర! యధ్వరశాంతి చేయుటే
నెయ్యము మాకు గలిగి । నీ వఖిలార్థము లిచ్చుటల్ సుమీ. ౪౮౨

కం॥ అధ్వరశాంతి యొనర్చి య,హిధ్వంసన కేళి యుడుగుమటే కోర్కియనన్
సాధ్వవతంసము మెచ్చి దు,రధ్వంబని సర్పయాగమది చాలించెన్. ౪౮౩

—• జనమేజయుఁడు జనకుని ముక్తి విధానంబు వ్యాసునివలనఁ దెలియుట •—

శా॥ వైశంపాయనుఁ డంతభారతము భూపాలున్ వినన్ జేసినన్
దా శాంతిన్ గనలేక వ్యాసముని సందర్శించె మౌనీంద్ర! స
ర్వాశిజ్వాలల మ్రగ్గురీతి హృదయం । బాశానుతాపక్రియా
వేశం బొందిన యట్టులున్న దిసుమీ వేగంబు దీర్పన్ దగున్. ౪౮౪

ఉ॥ పార్థుని మన్మఁడై ధరణీపాలుర లోపల మేటియై ఘన
స్వార్థ పరార్థ నిర్వహ సమర్థత గల్గియు నంతలోనె దా
వ్యర్థముగా మృతుండయిన వార్త మనం బెరియించు చున్నదే
వ్యర్థకమైన క్షత్రకులజాహతి సంస్థఁగొనంగఁ జాలకే. ౪౮౫

కం॥ నాతండ్రి దుర్గతిన్ బడ, కేతెఱఁగున దివికిఁ జనునో యీ మహితార్థం
బో తాపసవర ? తెల్పుము ! చేతోముద మొదవ దానిఁ జేసెద ననినన్. ౪౮౬

సీ॥ బాదరాయణుఁడిట్లు పలికె నచ్చెరువును, నద్భుతంబును గుహ్యతమతులపుణ్య
మగు భాగవతము నీ వాలింపు మిఁకఁ దొల్లి, సుతునకుఁ దెల్పితి సుతులపొల్కిఁ
బరమరహస్యంబు పురుషార్థమూలంబు, శుభదంబు నిత్యంబు సుఖద మఖిల
వేదసారం బిది వినుటచేత మనంబు, విశ్రాంతియగు నింక వేయునేల

గీ॥ యనినట్టులు నగుఁగాక యస్తికుండు, రాఁగతం బేమి యీయధ్వరంబు శాంతి
గూర్చుటకు నేమి కతము తద్గాథ పాద, రక్షణమ్మున మునికి సార్థక్యమేమి?

## — ఆస్తీకుని చరిత్రము —

గీ॥ ఓమహాభాగ! ముందుగా నీ మునీంద్రు, కథను వినిపించి పిదప భాగవతకథ సు
ధాభిభూతునిఁ జేయు మురుద్భవము పరమ, పావనము చేయుమన్న నాపారికాంక్షి.

వ॥ జరత్కారుండను నొక్క మహాముని పరమశాంతుండును, ధర్మజ్ఞుండును, వేద
సాంగుండునునై గృహాశ్రమం బొల్లక బ్రహ్మాత్మైక్య నిష్ఠం బ్రవర్తింపుచుఁ
దపోవనంబులఁ జరింపుచుఁ బిమ్మట నొక మహాగర్తంబునఁ లంబమానులై
వ్రేలు స్వపూర్వజులఁ గాంచి మీ రెవ్వరని యడిగిన నేము జరత్కారుని పితృ
దేవతల మని వచించిన మీ రీ యంధకూపంబునఁ వ్రేలఁ బనియేమి యని యడి
గిన మద్వంశ సంభూతుండగు జరత్కారుండు గార్హస్థ్యం బొల్లక చరించుచున్న
వాఁడు గావున నతం డపుత్రకుండైన కతంబునన్ మాకుఁ బరలోకము లేమిచే
నిట్లు వ్రేలెదమనిన వెఱంగుపడి యా జరత్కారుండు సంసృతిభయంబును
రోసిపరిణయింపకున్న వాఁడ భవదాజ్ఞ వలన మదీయాభిధానమైన కన్నియ లభించె
నేనిఁ బరిగ్రహించెదనని వారలను సంతసింపం జేసి తీర్థాటనంబునకుం జనియె.

ఉ॥ ఆతఁడెఁ గశ్యపాఖ్యునకు నంగన లిర్వురు కద్రువ సరో
జాతత నేత్రమైన వినతాఖ్యయు భానురథాశ్వ వీక్షణ
ప్రీతిఁ జెలంగఁ గాంచి యది బెట్టగు తెల్లని కాంతి నొప్పుటఁ
శ్వేతగిరింద్రమో యని విచిత్రతరంబయి చూడ నొప్పెడన్. ౪౯౦

క॥ అని వినత పల్కఁ గద్రూ, వనితామణి నీలగిరి విభాభాసితమై
కనుపడె నెయ్యెడఁ దెల్లని, దనియెద వేమనుచుఁ బంత మాడుచు వేగన్. ౪౯౧

— సర్పంబులకు శాపకారణము —

కం॥ అన్యోన్యాభిప్రాయో, పన్యాసముగాఁగ నిట్లు పన్నిదములచే
నన్యాయత సన్యాయత, శూన్య వివాదం బొనర్చి సుదతు లిరువురున్. ౪౯౨

చం॥ తమతమ యిండ్ల కేగ వినతా వనితా వచనంబు తథ్యమౌ
ట మనమునం దెఱింగి కడు టక్కరి కద్రువ స్వాత్మజాతులన్
బ్రమదముతోడ మీరు చని భానురథాశ్వము చుట్టుఁడన్న వా
రమలమనస్కులై దురితమట్టులు చేయ మనంగ నీసునన్. ౪౯౩

కం॥ జనమేజయునధ్వరమున, ఘనవహ్నిశిఖాళి మ్రగ్గఁగాఁగల రంచున్
జనని శపించెను గొందఱు, వినయముచే మాతృసూక్తి విని కొందఱొగిన్. ౪౯౪

మ॥ జననీ వాంఛిత సిద్ధికై రవిరథాశ్వంబున్ ఫణాపఙ్క్తులన్
ఘన నీలద్యుతిఁ బర్వఁజుట్టుకొని రీ కద్రూపయోజాక్షియున్
వినతాబ్జాస్యయు నిర్వురున్ గనుఁగొనన్ వేపోయినన్ నల్లనై
యునికిన్ దాస్యము సంభవించె వినతాయోషాశిరోభూషకున్. ౪౯౫

ఉ॥ దాస్యముచేయుచుండ వినతన్ గని కద్రువపల్కె "నోసరో
జాస్య! భవద్భుజాంతరము నందు వసించి జగంబు చూడ నా
శాస్యము గాఁగ నున్నయది చక్కఁగ నిల్వు"మటన్న ఖిన్నయై
యాస్యమువంచి బాష్పముఖియై విలపించుచు నున్న యయ్యెడన్. ౪౯౬

మ॥ ఖగనాథుం డరుదెంచి చూచి కడు దుఃఖం బొందఁగా నేల? శూ
రగరీయుం డరుణాంశుసారథియుఁ బుత్రశ్రేష్ఠుఁ డుండంగ నీ
యగరీయస్థితిఁ గాంతు విట్టి బలగర్వాంధుండ నేనుండఁగా
వగవన్ నీకుఁబనేమి? తల్లి! రిపుదుర్వారుల్ సుతుల్ గల్గియున్. ౪౯౭

— గరుత్మంతుఁడు తల్లి దాస్యము పోఁజేయుట. —

కం॥ నీకోర్కెఁ దీర్పఁజాలని, యీ కొమరులపుట్టు కేల యిలలో దుఃఖం
బీకొలఁది చెంద నేటికి, నాకారణ మీవు తెల్పుమని పలుమాఱుల్. ౪౯౮

ఉ॥ తల్లిని వేడుచున్న వినతావనితామణి పుత్రుఁ జూచి సం
ఫుల్ల సరోజనేత్ర! మదిఁ బొక్కుచు దాస్యముచేయుచుండ రో

పిల్లుచు నన్ను నెక్కి గిరి సింధు సరిద్వన సందిదృక్షచే
నెల్లెడ సంచరింతు ననిశమెన్ ననుఁ గద్రువ నిర్దయాత్మయై. ౯౯

ఆ॥ అందువలన నింత నంతరంగము పొక్కి, కుందుచుంటి నన శోకుంతవిభుఁడు
తానుజూడఁ గోరు ధరణీతలం బెల్ల, నెఱుఁగువాఁడ వలయుశనేని మోసి. ౧౦౦

ఉ॥ కానలు కోనలున్ గిరులుఁ గందరముల్ వనముల్ సరస్సులున్
దాను గనంగఁగోరునవి తథ్యము సర్వముఁజూపువాఁడ నెం
తేనియు సంతసించి నను నెక్కి కనుంగొనుమంచుఁ దెల్పు మా
మానవతీమణీ! జనని! మానుము దుఃఖమటంచుఁ బల్కుచున్. ౧౦౧

క॥ కద్రూపార్శ్వంబున నిర్నిద్రుండై యున్న గరుడునిన్ జూచి ప్రమో
దోద్రేకముతో నచ్చెలి, భద్రాసనపీఠ మనెడి పక్షీంద్రు మెయిన్. ౧౦౨

వ॥ సపుత్రియై యధిష్ఠించి నదీనదంబులును, సరోవరంబులును, గిరికందరంబులును, సాగరద్వీపంబులును, లోకాలోకంబులును, మహోద్యానంబులును, ఋష్యాశ్రమంబులును మొదలగు నానా దేశంబులు విలోకించి సంతసంబున మనంబు సుమాశంబున నున్న యెడ గరుడుం డెఱింగి తల్లీ! మదీయమాతయగు వినతకు దాస్యం బెబ్బంగి నపనయించు నని యడిగిన దేవతలవలన నమృతం బార్జించి మన్నందనుల కొసంగితేని దాస్యంబువిడిపింపఁ గలదానవని పలికిన నయ్యంతన్ గొంతసేపు విహారక్రీడలన్ దనిపి గృహంబు ప్రవేశింపన్ జేసి నిజగృహంబు ప్రవేశించి తద్వృత్తాంతం బంతయు జనని కెఱింగించి-

ఉ॥ అక్షయ పక్షవాత హతి కద్రిచయంబులు సంచలింప స
ర్వక్షయ కాల రుద్ర రుచిర స్ఫుట కేశ కపర్దకాంత సం
ధుక్షిత నేత్రశోచులు విశధూత విరోచనకాంతిఁ బర్వఁగాఁ
బక్షికులావతంసము నభస్థ్సలికై యరిగెన్ జవోద్ధతిన్. ౧౦౪

చ॥ అమరపురంబుఁజేరి నిఖిలామరసంఘముపై నెదిర్చినన్
సమర మొనర్చి యింద్రకులిశక్షతిఁ దూలక వార్యవీర్యుఁడై
యమృతముదెచ్చి కద్రువకు నర్పణచేసి బ్రమోదమాన చి
త్తముననను నాత్మమాతకును దాస్యమువాపి ఖగేంద్రుఁడేగినన్. ౧౦౫

క॥ అమృతముఁగోలఁగ నహితతతి, యమరనదీస్నానమునకు నరిగినదానిన్
నముచిపరిపంథి గొనిచనె, విమనస్కత భుజగు లెల్ల వెగడొందంగన్. ౧౦౬

కం॥ దుర్భగులగు పవనాహార్భకులకు నమృతలేశమై యున్న యధో
దర్భతతి నాక, జిహ్వ, గర్భంబులు చీలి నాలుకలు రెండయ్యెన్. ౧౦౭

—• బ్రహ్మదేవుఁడు సర్పములకు శాపము పోవు మార్గం బెఱింగించుట •—

మ॥ అమృతాహారములేమిచే బడలి దీర్ఘాయుష్యముల్ లేక శా
పమహాభీతిఁ బితామహుల్ గనుచు దేవా! శాపజంబౌ భయం
బమితంబై శరణంబునొందితిమి కుయ్యాలింపు మన్నన్ వచో
రమణుం డా ఫణికోటిఁ జూచి పలికెన్ బ్రవ్యక్తవాచార్భటిన్. ౫౦౮

కం॥ మౌని జరత్కారుం డను, వానికి నర్పింపవలయు వాసుకిభగినిన్
దానికి న స్త్రీకుండన,గా నొక్కఁడు సుతుఁడు గలుఁగు గాచున్ మిమ్మున్. ౫౦౯

చ॥ భయపడ కింటికిన్ జనుఁడు పన్నగులార! యటన్నఁ బంకజో
దయవచనంబు వాసుకి యథాస్థితి విన్చుఁ దపోవనంబులన్
బ్రియమలరంబొరిం దిరిగి పేర్మిమను పల్లటిలంగ నెందు నా
మెయి మునిఁగానలేక యనుమేయ మమేయము దూలఁజేయఁగన్. ౫౧౦

మ॥ ధరణీమండల మెల్ల రోసి యొకచో ధన్యున్ జరత్కారునిన్
భరితబ్రహ్మకళానిధిన్ గనుచు సన్మానించి తోడ్కొంచు మం
దిరమున్ జేరి ధరాసురోత్తమున కాసర్పిన్ జెల్లెలిన్ బెండ్లిచే
సె రహిన్ వల్లభతుల్యనామరుచిరశ్రీధామ నుల్లాసియై. ౫౧౧

కం॥ అప్రియమెన్నండేనియు, నీ ప్రమద యొనర్చెనేని నేవిడిచెద నే
నప్రియము చేయనెన్నం, డీప్రియకని పెండ్లియాడె నెల్లరుమెచ్చన్. ౫౧౨

మ॥ నదిప్రాంతన్ వనవాటిఁ బర్ణకుటి నానందంబునన్ బట్టి య
మ్మదిరాక్షిన్ సుఖభోగయోగముల సంభావించె నబ్బోటియున్
వదలన్ రాని పతివ్రతానియతి మై భావించి కాంచెన్ బతిన్
ముద మొప్పారఁగ నిర్వురున్ గదిసి సంపూర్ణేచ్ఛులై యుండఁగన్. ౫౧౩

సీ॥ ఒకనాఁడు భోజనంబొనరించి శయ్యపైఁ, బతి నిదురింప నప్పుడతి యతని
పదములొత్తఁగఁ జిత్రభానుండు గ్రుంకినఁ, బతిని మేల్కొనఁ జేయుపథ మెఱిఁగియు
నలసి నిద్రించెద నతివ! మేల్కొల్పక, కాపాడు మని పతి గట్టుకతన
నిదుర మేల్కొల్ప నెమ్మది నూరకుంటకు, సందిగ్ధమై చాల సంశయంబు

గీ॥ నొందె యిఁక నేమిచేయుదు నొరులు లేరు, లేపినను లేపకున్నను గోపియగును
ధర్మనాశంబు వచ్చెను ధర్మపరత, మెయికొనుటకంటె మరణంబు మేలుగాదె.

మ॥ అని చింతించుచు రెంటిలో నుచితరంబై యొప్పు ధర్మంబు భ
ర్తను మేల్కొల్పుట యంచు మేలుకొలుపన్ దద్భర్త కోపించి యో

## —♦ గద్య ♦—

ఇది శ్రీపరమ శివాద్వైత భావనారాధ్య సిద్ధసారస్వత విద్యాసాన్నిధ్య
వేమనారాధ్య వంశార్ణవ కళానిధాన ములుగు
పాపయారాధ్యాభిధాన ప్రణీతంబైన
దేవీభాగవతం బను మహాపురాణంబునందు
ద్వితీయ స్కంధము.

శ్రీమ దుమామహేశ్వరార్పణమస్తు

శ్లో॥ దిగ్వధూ కర్ణ కల్హార, చూళీ కేళీం తనోతు సా.
వ్యోమారాధ్య కులీనాయా, పాపయారాధ్య భారతీ.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ రస్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ శారదాంబాయై నమః

శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము - శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీభాగవతము

## తృతీయ స్కంధము





గౌరవ మిడు దేవీ
భాగవతంబునఁ దృతీయభాగము సకలా
ర్థాగమభావంబున నమ
రాగఫలంబుల నొసంగు నమలకరంబౌ. ౧

కం॥ శ్రీముక్తి మహిళాంత, స్థేమ విహారాభిరామ చేతన చేత
స్తోమ రసభృంగ నిర్జిత, కామగుణాసంగ భక్తకలుష విభంగా. ౨

వ॥ దేవా! సకలపురాణేతిహాస కథాసుధాస్వాదనని స్తంద్రులగు నమ్మునిచంద్రు
లకుఁ దన్మనోరథ రథచోదనాసూతుం డగు సూతుం డిట్లనియె. ౩

కం॥ శ్రీభారతీ ముఖాఖిల, సౌభాగ్యవతీ శుభానుసంధానకర
స్వాభావిక శోభామయ, బాభాసిత చిద్ఘనానుభావన్ దలఁతున్. ౪

సీ॥ ఏ దేవి చరితానువాదముల్ వేదాంత, సిద్ధాంతముల కెల్లఁ జేరుగడలు
ఏ దేవి కరుణాప్రసాదముల్ సురలకుఁ, బ్రోధాన్యములొసంగు బండరువులు
ఏ దేవి ముఖసుధామోదముల్ బ్రహ్మాండ, బీజరాసులుగూర్చు పెనుగరిసెలు
ఏ దేవి కేళీవినోదముల్ సంసార, పార మీఁదించు నవపారతరులు

గీ॥ అట్టి యఖిలాండ జనని దాస్యంబొనర్చి, మోక్షలక్ష్మీసుఖాస్థానమున వసింపఁ
గలుగుఁగాకన్యముల ముక్తి గలుగుననుటఁ, గగనకుసుమంబనినరులు గనఁగవలయు.

సీ॥ వేదంబులును వేదవాదు లనాదినిధన గాఁగ. నే దేవిఁ దలఁచుచుందు
రజ హరి ప్రముఖులా నజరు లే దేవిని, ధ్యానంబొనర్తురు స్వాత్మలందు
బహుళ యూప స్తంభ భరితాధ్వరములందు, నర్చింతు రే దేవి యజ్వకోటి
సకలార్థసిద్ధికై సన్మౌని సంఘంబు, లే దేవి నామంబు నిచ్చ నుడువు

గీ॥ నట్టి పరశక్తి కభిముఖుండగుచు నిలిచి, శిరమునం దంజలి ఘటించి జిహ్వ యుప్పు
డుల్ల సన్నుతి నొనరించి కొల్లగాఁగ, ముక్తిఁగొననట్టి నరుఁడెపో మూఢుఁడరయ.

—• జనమేజయుఁడు సృష్టిపరిజ్ఞానము దెలియఁగోరుట. •—

చ॥ ప్రణుతి నొనర్చి భూపతి పరాశరనందనుఁ జూచి పల్కె నో
యనఘ! భవత్కృపాతిశయ మందితి ధన్యుఁడ నైతి శ్రీ జగ
జ్జనని కథాసుధారసము సంసృతితాపనివారణంబు గా
ననయముఁ గ్రోలఁగోరితి నుదాహరణం బొనరింపఁగాఁ దగున్. ౭

ఉ॥ ఎచ్చటఁ బుట్టెనో? గుణము లెట్టివొ? యెవ్వరు కారణంబొకో?
నిచ్చలు రూపమెట్టిదొ? యనింద్యత దర్శనమెట్టిదో? పరా
భ్యుచ్చయ మెల్లఁ దెల్పి కరుణోదధి! నన్నిఁక ధన్యుఁ జేయు మీ
విచ్చటి కేగుఁదెంచుట మదిష్టఫలం బొనఁగూడుటే కదా. ౮

ఉ॥ అంతియ కాదు వారిజభవాండము యత్కృత మెట్టిదొక్కొ? యొ
క్కింతయు మీ రెఱుంగనిది యుజ్జగతిన్ గగనారవిందమా
వింతలుగాఁగ సత్కథలు విష్ణువు రుద్రుఁడు బ్రహ్మయున్ జగం
బింతకుఁ గార్యదక్షు లని యే మును వింటిమి గాదె? ముువ్వురన్. ౯

ఆ॥ కరణ భరణ హరణ కార్యత్రయంబున, బ్రహ్మ విష్ణు భూతపతులె కర్త
లంచు విందుఁ దొల్లి యమ్మువ్వురు స్వతంత్రు, లగుదురొక్కొ; కాక యన్యతములొ?

సీ॥ అమ్మువ్వురును సచ్చిదానందరూపులు, చావు పుట్టువు లేని సన్మయులన
విందు వారలు భూతబృందసంయుక్తులో, కర్తలౌటకు యుక్తి గలదొ? లేదొ?
వారట్టి వారయ్యుఁ గారణాంతరమున, జన్మించిరను మాట సందియంబు
హర్ష శోకములు నిద్రాలస్యములు గల్గు, కాయంబు వారికిఁ గలదొ? లేదొ?

గీ॥ అవయవంబులు ధాతుమయంబు లగునొ?, కావొ? యే ద్రవ్యమే తత్త్వమే విషయమొ?
భోగ మాయుః ప్రమాణ [illegible] విధులు [illegible] మానీంద్ర విస్తరింపు.

గీ॥ ఇట్టి విధమెల్లఁ దెలియక యేను సంది, యమ్మ నెమ్మదిఁ బొడమి మీ యంఘ్రికమల
సేవచే సంశయగ్రంథి చిదిమినైన, గోరుచున్నాఁడఁ గోర్కెలు కొనలుసాఁగ.

వ॥ మఱియు నో మహానుభావా! వితతంబగు నీ బ్రహ్మాండంబునకుఁ గర్త యెవ్వండో? యేమి నిమిత్తంబున సముత్పన్నం బయ్యెనో? నిత్యంబో? యనిత్యంబో? యేక కర్తృకంబో? బహుకర్తృకంబో? కాక యకర్తృకంబో? కర్తృరహితం బంటివేని యకార్యంబగుఁ గావున విరుద్ధంబుగఁ దోఁచుచున్నయది. ఇట్టిసందేహ సందోహ మగ్నుండనై వికల్పకోటిఁ బ్రవర్తించు నన్ను నపార సంసార సాగరంబు దరింపంజేయుఁడు. ప్రళయోత్పత్తివర్జితుండును, నాత్మారాముండును, సురేశుండును, నిర్గుణుండును, నిర్మలుండును, సంసారనాశకుండును, సృష్టి స్థిత్యంత కారణుండును నిత్యుండును సదాశివుండును మహాదేవుండును నగు శంకరుఁ గుఱించి కొందఱు సిద్ధి నభిలషింతురు. మఱికొందఱు సర్వప్రభుండును నీశ్వరుండును బరమాత్మయు నవ్యక్తుండును సర్వశక్తిసమన్వితుండును, భుక్తిముక్తిప్రదుండును శాంతుండును సర్వాధిపతియు సర్వాదియు సర్వతోముఖుండును వ్యాపకుండును వితతుండును విశ్వుండును ననాదినిధనుండును హరియు నగు విష్ణుమూర్తిఁ గొంద ఱాశ్రయించి పూజలఁ దనిపి ముక్తి వాంఛింతురు. మఱియును గొందఱు వేద వక్తయు సర్వభూతప్రవర్తకుండును నగు చతుర్ముఖుండును సురేశ్వరుండును బద్మోద్భవుండును సర్వలోకస్రష్టయు సత్యలోకనివాసియు నగు ధాతఁ దలంచుచుఁ దత్కృతంబగు ముక్తిసిద్ధిం బడయుదు మని కోరుచుండుదు రని యడిగి మఱియు నిట్లనియె. ౧౩

మ॥ అమరాధీశుని సర్వవల్లభు సహస్రాక్షుఁ ద్రిలోకేశు య
జ్ఞమయుఁ వాసవు దేవదేవుని శచీశాతోదరీశుఁ సమ
స్త మఖాహారియు సోమపప్రియుని నా శక్రుఁ మదిన్ గోరి ని
త్యము పూజించుచుఁ గొంద ఱాస్తికులు మోక్షాపేక్షులై యుండరే. ౧౪

కం॥ కొందఱు దినకరుఁ గొల్తురు, కొందఱు గాయత్రిఁ గొలువఁ గోరుదు రవనిన్
గొందఱు వరుణానిల శమ,నేందుకుబేరులను గొలుతు రిచ్చఁ దలిర్పన్. ౧౫

శా॥ హేరంబుఁ గజవక్త్రుఁ గామదుని విఘ్నేశుఁ బరుఁ సర్వగుఁ
బ్రారంభప్రియపూజనుఁ స్మరణమాత్రశ్రీకరుఁ సత్క్రియా
ధారుఁ మూషకవాహనుఁ దలఁచి యాత్మత్రాణపారీణులై
ఘోరంబౌ భవసాగరంబుఁ గడవఁ గుప్పింతు రన్యుల్ నుతుల్. ౧౬

సీ॥ కొంద ఱాచార్యులు కుంభిని నఖిలార్థ,దాయి మహాశక్తి మాయ ప్రకృతి
సృష్ట్యాదికారిణి సిద్ధిభవాని య,నాదినిధన యఖిలార్థ దాత్రి

పురుషానుగ భవాని ◊ పూర్ణ వైష్ణవి బ్రాహ్మి,వారుణి వాసవి ◊ నారసింహి
నిగమమాత పరాంబ ◊ నిర్గుణ దేవేశి, స్మరణ కామప్రద ◊ సగుణ శాంతి

గీ॥ త్రిగుణ రహితయు నగునట్టి ◊ దేవదేవి, నిరుపమ నిరంజనారూప◊నిర్వికల్ప
పరతరబ్రహ్మ మనుచుఁ దాపసులు గొలిచి, ముక్తిఁగోరుచునుందు ర◊మోఘచరిత.

కం॥ వేగన్నులు వేదలలును, వేగాళ్లును గలిగి వెలుఁగు ◊ విష్ణుపరంబా
నాగగనమ్ము విరాట్టని,యోగులు కొందఱు భజింతు ◊ రుత్సుకమతులై. ౧౯

సీ॥ కొంద ఱీశ్వరుఁడని ◊ కొంద ఱేమియు లేదు, జగమనీశ్వర మని ◊ తగ వచింతు
రటువలెఁ గొంద ఱీ ◊ యఖిలంబునకుఁ గర్త్రి, ప్రకృతియే పురుషుండు◊ప్రకృతికంట
డందురు గాన నీ ◊ సందేహ సందోహ,మంతరంగము నంటి ◊ యలపుసేయు
నో పితామహ! యోప◊కుంట ధర్మాధర్మ, విజ్ఞప్తియును మనో◊విశ్రమంబు

గీ॥ గలుగ నిది ధర్మమని తెల్పి ◊ తెలియ దాని, చిహ్నములు దెల్పుసత్వసం◊సిద్ధిగలిగి
సురలు వర్తింతురట దాని◊చొప్పు దెలిపి, సందియంబెల్ల విడిపింపఁ ◊ జాలుదీవ.

కం॥ ధర్మస్థితిఁదప్పని శ్రుతి, మర్మజ్ఞులు పాండవులు న◊మానుషతరదుః
ఖోర్మియగు కృచ్ఛ్రకంధిని, శర్మముచెడి పడుట మదిని ◊ సంశయ మొదవెఁ. ౨౦

ఆ॥ సందియంబులెల్ల ◊ జక్కాడి ననుఁగాచి, నాదు పితరు లెల్ల ◊ నాకలోక
సిద్ధినొందునటులు ◊ చేయవే యని మ్రొక్క, వసుమతీశుతోడ ◊ వ్యాసుఁడనియె.

మ॥ వసుధాధీశ శిఖామణీ! వినుము నీ ◊ ప్రశ్నంబు లోకోత్తరం
బసమానంబుగదా! గనంగఁ బ్రకృతం ◊ బజ్ఞానిఁబోలెన్ మనం
బసదై యున్నది జ్ఞానినయ్యును నిమ◊గ్నాంతర్వ్రామీకుండ నీ
కిసుమంతైనను నుత్తరం బిడఁగ నెం◊తే దుర్భరంబయ్యెడిన్. ౨౧

— వ్యాసుం డాత్మవిషయ మెఱింగించుట —

గీ॥ వేదశాఖపురాణముల్ ◊ వేదశిఖలు, భారతంబును వివరించి ◊ పటుతరార్థ
శోధన మొనర్చినాఁడ హె◊చ్చుగ మనమ్ము,మూఢమైయుండెనద్దాన◊మోహ మొదవె

చ॥ కఠినతపంబొనర్చి కడుఁ ◊ గానలఁ గోనల సంచరించుచున్
జఠరకృశానుశోషమున ◊ శంక యెఱుంగక శంకరుః మనో
లురదతిసాధ్వసం బెడలి ◊ లోకముమెచ్చఁ బ్రసన్నుఁజేసితిన్
హఠముగ యో[illegible]సములందుఁ జయల్పడు చే నెఱుంగనే. ౨౪

చ॥ హరుకరుణన్ శుకుండనెడు నాత్మజుఁగాంచ నతండు బ్రహ్మత
త్పరుఁడయి తత్త్వమున్ గలసె తత్కృత భూరి వియోగవేదనా
భరమునఁ గుందుచున్నయది పార్థివ నామన మేమిచెప్పఁ గ
ర్పురగిరి డిగ్గి తల్లిఁగనఁ బోయెదనం చిటురాఁగ నయ్యెడన్. ౨౬

గీ॥ వంశ మింతటితోఁబోవు వసుధ నేలు, వాఁడు లేఁడయ్యెఁ బుత్రి! నీభ్రాతృభార్య
లందుసుతులనుబడసి యీయన్వయంబు, నిలుపుమని నన్ను మాయమ్మ పలికెనంత.

గీ॥ తల్లియానతి నే జవదాఁటలేక, వరుస ధృతరాష్ట్రుఁ బాండుభూవరుని విదురు
నాత్మజుల ముగ్గురనుగాంచి యధిక మోహ, పరవశతఁజిక్కి మాయలోఁబడితిఁ జెడితి.

చ॥ అదియునుగాక భారతరణాంగణ సీమల బంధుసంస్థలన్
గదురు మనోవ్యథన్ బొగిలి గాసిలి యుంటినిగాన నొక్కచో
నిది పథమంచు నిర్ణయము నింతయు నే వివరింపలేక నే
నదమదమైన చిత్తమున నల్పితి వాగ్రచనా విభేదముల్. ౨౭

కం॥ హరియని హరుఁడని యుమయని, సురపతియని యనలుఁడని యజుండని నళినీ
వరుఁడని నిర్గుణ నిష్కళ, పరచిద్బ్రహ్మ మని పలుకఁ బడె నచటచటన్. ౨౮

మ॥ ఇది యిట్లే ప్రతిభానుభావ్యము పరం బీదైవమంచున్ యథా
ర్థదశన్ నిక్కముఁదెల్పనేరక నిరర్థప్రక్రియన్ బల్కితిన్
గదితంబుల్ పలుతోవలయ్యెఁ బిదపన్ గర్హించి చింతించి నే
మ్మది నానావిధ కల్పనావిధురతా మందస్థితిన్ జొత్తిలెన్. ౩౦

గీ॥ స్వాశ్రమంబున నిలిచి దుస్తరతపంబు, సేయుచుండెడువేళ వేంచేసె నటకు
స్రష్టపుత్రుండు విద్యావిశారదుండు, నారదుండు లసచ్ఛరన్నారదుండు. ౩౧

## వ్యాసునియొద్దకు నారదుండు వచ్చుట

సీ॥ తీర్థసేవాసక్తిఁ దిరుగుచు నానుషం, గికముగా మాకు సంకేతమైన
యాశ్రమస్థలిఁ జేర నర్ఘ్యపాద్యాదుల, నర్చించి మృదులోన్నతాసనమున
నునిచి యమ్మునిఁ జూచి యోమహాభాగ! నా ప్రశ్నంబునకు నుత్తరంబొసంగ
వలయు నంచని, నీవు వలె నేనుఁ బల్కిన, ననుఁజూచిచిఱునవ్వు నగుచుమౌని

గీ॥ బాదరాయణ! నీపోల్కి నాదుమనము, సందియమునొంది మున్నొకసారియజునిఁ
గాంచి పల్కితి నో తండ్రి! కరుణ గలిగి, యాత్మసందేహ మెడలించుమనుచునిట్లు

— నారదుండు విరించిని బ్రశ్నించుట —

శా॥ భాషావల్లభ! దుర్భరంబయిన యీ బ్రహ్మాండ మెట్లయ్యెనో?
శేషాలంకరణుం డొనర్చెనొకొ? లక్ష్మీభర్త నిర్మించెనో?
దోషధ్వంసక! నీవుచేసితివొ? దోశ్శక్తిఁ బూజ్యుఁ డెవ్వాఁడు? ని
శ్శేషామర్త్యగణాధికుం డెవఁడు? భాషింపన్ దగున్, సత్కృపన్. ౩౩

క॥ సందేహాందోళితమై, డెందము విశ్రాంతిఁ గొనక డిందెను దుఃఖా
మందం బగు సంసృతిచే, వందురితిని సంశయంబు వారింపఁ గదే! ౩౪

— బ్రహ్మ సృష్టిని దెలియఁజేయుట —

సీ॥ దేవపూజలయందుఁ, దీర్థాటనములందుఁ దత్త్రప్రసిద్ధసాధనములందు
బహుముఖంబుల దృఢప్రాధాన్య మెఱుఁగక నిశ్చితశాస్త్రార్థ నియతిఁగనక
వెతఁగలంగినది మద్విధ మారసి వచింపు, సంస్మరింప భజింప సంస్తుతింప
సర్వేశుఁ డెవ్వఁడో? సత్యార్థము వచించి, యలరింపఁ దగునన్న నవ్విరించి
గీ॥ ప్రశ్నమిది దుస్తరంబౌటఁబట్టి! దురవగాహమై యుండు లోకనాకె కాదు నన్నుఁ
గన్న వెన్నున కైనను గానరాదు, వినుము వివరింతు నిగమార్థ విశదముగను.

గీ॥ ఈషణత్రియ బద్ధుఁడై యెసఁగెనేని, నట్టివానికి సంసార మబ్ధిసమము
ఈషణత్రియ రహితమై యెసఁగెనేని, నట్టివానికి సంసార మణుసమంబు. ౩౬

వ॥ కల్పాంతంబున సప్తసంఖ్యాకంబులగు నర్ణవంబు లేకంబై స్థావరజంగమంబులు నశించి
సూర్యచంద్ర నక్షత్ర వృక్ష పర్వతాది స్వరూపంబు లెవ్వియు లేక గాఢాంధంబై
యుండు సమయంబున నే నొక్కరుండఁ గమలకర్ణికామధ్యంబున నివసించి యుండి
యిమ్మహార్ణవంబున నెవ్వరివలనం జనియించితి నాకున్ గర్తయు భర్తయు
హర్తయు నెవ్వండు? విమర్శింప ధరణీతలంబు గానంబడ దిజ్జలం బెద్ది యాధారం
బుగానుండు? మదీయపీఠంబైన యిప్పంకజంబు రూఢియోగంబులఁ బంకంబునందుఁ
బుట్టుఁగదా? దీనిమూలం బరసెద నిచ్చోట వసుధాతలం బుండఁబోలు సందియంబు
వలవ దని పంకజనాళావలంబినై యరుగుచు నధోముఖంబుగా సహస్రవర్షంబు
లెంతయున్ వెదకుచుఁ జని చని “తప తప” యను గగనభారతి నాలకించి
సహస్రాబ్దంబులు పద్మంబునఁ దపం బొనరించుచున్న యెడ “సృజ సృజ” యను
నాకాశవాణి కర్ణగోచరం బగుడు మూఢుండనై నే నేమి సృజింతు నని చింతించు
చున్న యెడ. ౩౭

కం॥ పోటరు లగు నసురులు మధు, కైటభు లనువారు నన్నుఁ గలహించుడు నే
నోటరి, నాళము వెంబడి, నీటమునుంగఁబురుషుఁడు కాఁడు నిలిచె నెదురుగన్. ౩౮

సీ॥ పరమాద్భుతుండును బురుషుండు నీలమేఘశ్యాముఁడంబుజాక్షద్వయుండు
శంఖచక్రగదాదిసాధనుండు చతుర్భుజుండు కౌస్తుభరత్నశోభితుండు
స్వర్ణాంబరుండు శ్రీవత్సాంకితుఁడు శేషపర్యంకశాయి యస్పంద దేహి
యైన యచ్యుతుఁ గాంచి యతఁడు మేల్కొనమిని నతని దేహమునందు నావరించు

గీ॥ యోగనిద్రను ధ్యానింప నొడలువిడిచి, దేవి దివి నిల్వ విష్ణుండు తెలివినొంది
పంచవర్ష సహస్రముల్ భండనమున, నిలిచి దైత్యుల నిరువుర నేలఁగూల్చె.

గీ॥ అంత ముప్పురుమూర్తుల నంతరిక్ష, నిలయ యగు దేవిఁ గనుగొని నియతిపరత
నభినుతించినమము' జూచి యాదిశక్తి, చనుఁడు మీ సేయు కార్యముల్ సలుపుఁడనియు

శా॥ స్వస్థానంబులఁ జేరి సృష్టి మొదలౌ స్వస్వక్రియాదక్షులై
యాస్థన్ వర్తిలుఁడంచు దేవి మధురవ్యాహారముల్ సల్పె మ
త్స్వస్థానంబులఁ జేరి చేయుదము సంభావ్యంబు తద్వాక్కుచి
త్తస్థానీయ పరాంబ తత్కరుణచేతన్ సిద్ధి గాకుండునే? ౪౧

చ॥ అని తలపోసి దేవిఁ గని యంబ! జగత్త్రియ మెల్ల నీమెడన్
వననిధి ముంచి యున్న యది వాయుముఖాఖిలభూతసంతతుల్
మునిఁగిన వింద్రియంబులు సమూలముగాను నశించియున్న వి
య్యనువున సృష్టి చేయఁగల యట్టి ప్రయోజన మెల్లఁ దెల్పుమా. ౪౨

—:బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు విమానమెక్కి చరించుచు విచిత్రసృష్టి గనుఁగొనుట:—

చ॥ హరిహర పద్మజాదు లిటు లంబనుగూర్చి వచించునంత నం
బరమున హేమరత్న రుచిమండితమైన విమానరాజ మ
బ్బురముగ రాఁగ వారినిటు పుత్రికులార! వసింపుఁ డిందు నాఁ
గరమరుదార వారలు ప్రకాశత నెక్కిరి తద్విమానమున్. ౪౩

కం॥ సురమందిర సదృశంబును, వరమౌక్తిక రత్నఘన మవార్యంబగు నం
బరయానము దేవికృపన్, హరిహరులును నేను నెక్కి యభినందింపన్. ౪౪

చ॥ అరుదగు నవ్విమానము దిగంతర వీధుల నేగి యొక్కచోఁ
దిరముగ నిల్వ నచ్చట నతిస్ఫుటకాంతులఁ దేజరిల్లుచున్
జిరతర తాపతప్తమగు చెల్వున నిర్జరవాస మున్న న
బ్బురపడి యచ్చటన్ నిలిచి భూరి ముద మ్మెదఁ గ్రిమ్మఁ జూచుచున్. ౪౫

సీ॥ పరిపక్వఫలరసాస్వాద కోకిల శుక, ప్రకర రమ్యోద్యానపటలములును
సుమసంభృతామోద ఘుమఘుమానిలచల, ద్దళకంజకాసారవలయములును

బహునిర్ఝరాకీర్ణ గహనదుర్గమశృంగ, సంశోభితోత్తుంగ శైలములును
వాపీతటాక సంగలిత పుష్పవనాగ్ర, విచరద్ద్విరేఫ సంవేల్లనములు,

గీ॥ వెలయు దేశంబులును జగద్విదితపురుష, నదనదీపశు పల్వల నవ్యవిషయ
విసరములఁ గంటిమి సమగ్రవివిధచిత్ర, రంజితంబులు పొగడంగ బ్రజ్ఞ గలదె?

మ॥ వరరత్నోచ్చయ రమ్యపుష్కర లిఖత్ప్రాకార సంశోభి మం
దిర సౌధాయుత సంయుతంబు పురవర్తి ప్రౌఢనారీ నర
స్ఫురదాలాపసుధారసాప్లుతము విస్ఫూర్జన్మహాచిత్ర వి
స్ఫురితంబౌ నగరంబు గంటి మచటన్ జూడ్కుల్ భ్రమం బొందఁగన్. ౪౮

గీ॥ కాంచి యప్పురి స్వర్గంబుగాఁ గఁదలఁచి, సందియమునొంది యెవ్వాని స్వర్గమొకొ
యనుచుఁ జింతించునంతలో నప్పురంబు, నేలునొడయండు వెడలె మేళమెల్లఁ గనఁగ.

శా॥ అక్షోభ్య ప్రకటప్రతాపుఁడు సుపర్వాధీశు చందంబునన్
వీక్షావంతుఁ డనంగ భూతలమునన్ విశ్రాంతుఁ డౌటేల్లొకో?
యక్షయ్య ప్రతిభావిశేషముల దేవాకారుఁ డంచున్ జగ
ద్రక్షుల్ దేవవిమానముల్ నిలిపి యబ్రం బొప్ప వీక్షింపఁగన్. ౪౯

ఆ॥ మదిఁదలంచి చూడ మహిపతి మృగయా వి,హారపరత నేగునట్లు దోఁచు
ననెడు నంత నెగసి యవ్వలఁజనె దేవ,యాన మచటివార లబ్రమంద. ౫౦

వ॥ ముహూర్తమాత్రంబున దేశాంతరంబు ప్రవేశించిన నచ్చోట నందనవనంబును
బారిజాతతరుచ్ఛాయాసంశ్రిత యగు కామధేనువును దత్సమీపంబునఁ జతు
ర్దంతదంతియగు నైరావతంబును మేనకాదు లగు నప్సరోభామినుల నృత్త గీత
వాద్యంబులును విద్యాధర యక్ష గంధర్వ ప్రముఖ వీణారవానుకారి మంజుల
గానరవంబులును బరామర్శింపుచు సుధర్మాస్థానంబునఁ గొలువున్న పురందరున్
జూచి విస్మయంబునొందుచున్నంత దేవయానంబు లోకాంతరంబుఁ బ్రవేశింప
నచ్చో వరుణుండును, గుబేరుండును, యముండును, సూర్యుండును, ననలుండును
దమతమ సభాసదులంగూడి కొలువుండుటం గాంచి విస్మయావిష్టులమై యిది
యేమి యని యూహించుచున్నంతలో వ్యోమయానంబు సత్వరంబున బ్రహ్మ
లోకంబునకుం జనిన నచ్చోట సర్వదేవనమస్కృతుండై యున్న యొండొక
బ్రహ్మంగాంచి విస్మితులై హరిహరులు నన్నున్ గాంచి యాతం డెవండు? సభా
మధ్యంబున దేవతలును, సముద్రంబులును, సరిత్తులును, పర్వతంబులును, బన్న
గంబులును విహరించుట విస్మయంబుగాఁ దోఁచుచున్నయది యనిన వారలతో

నే నిట్లంటి. ౫౧

ఆ॥ సృష్టికర్తయగుచు । సృష్టిపోలిక నున్న, వాఁ డితండు కనిసకవాఁడు గాఁడు
ఎవ్వఁడొక్కొ యితనిఁ నెన్నఁడెఱుంగ నే, ననుచుఁ బలుకుచున్న । యంతలోన.

వ॥ విమానరాజం బొండుకడ కేగుటయు నచ్చోటఁ బూర్ణచంద్రశోభావహమై సమున్నతశిఖరావృతయక్షకిన్నరకిన్నరావాసశోభిమై ప్రమథగణకోలాహలంబై యొప్పు పావనంబగు రౌప్యధరాధరంబు పార్శ్వంబున నివసింప మేము కల్పావనిజాతకోకిలశుకాలపనంబులు వించునుండ. ౫౩

సీ॥ సేనాధిపతులై గజానన వీరభద్ర కుమారు లిరుఁగడఁ । దరలి నడువ
నీలాభ్రనిభతనుశ్యామలోలమై దుర్గ, వామభాగస్థమై । వలపులీనఁ
జలువలీనుచు శిరస్సునలి జటాపటలిపై, నెలవంక లేత వెన్నెలలుగాయఁ
గటితటిఁ బులితోలు । కట్టుపుట్టంబుగా, హరిచర్మ ముత్తరీయంబుగాఁగ
గీ॥ దశభుజంబులు పంచవక్త్రములు సూర్య, చంద్రశిఖి నేత్రములతో భుజంగభూషి
తాంగుడై నందిముఖగణామలరికొలువ, వచ్చె వృషభంబునెక్కి వైభవమెసంగ.

చ॥ అతనినిఁగాంచి ధూర్జటియె । యా నని యెంచి యిదేమి యద్భుతం
బితఁ డెటనుండి వచ్చె నిపు । డిర్వురలో శివుఁ డెవ్వఁడంచు మే
మతనిని మమ్ము నట్లతఁడు । నల్లనఁ జూచుచు విస్మయంబుగా
మతిఁదలపోయుచున్నెడ విమానము నేగె వికుంఠధామమున్. ౫౪

కం॥ ఇది యేలోకము ? కన నింపొదవెడి నెవ్వం డధీశుఁడో? దీనికి; సం
పద పెంపుఁజూడ లక్ష్మీసదనంబనఁ జెల్లు దీని । సాటియుఁగలదే. ౫౬

ఉ॥ అంత రమాధినేతయు సనంత సభాసదసంఘయుక్తి న
త్యంతముదమ్మునన్ వెడలి । యర్జునచేలము నీలకాంతి నా
గాంతకవాహనమ్ము చతురాయతహస్తము లొప్ప భార్గవీ
కాంతయుఁ జామర మ్మిడఁగఁ । గ్రక్కదుర్ బొడఁగట్టె వింతఁగన్. ౫౭

ఉ॥ అవ్విభుఁజూచి విస్మితములైన మొగమ్ములఁ జిన్నినవ్వుతో
ముప్వుర మొం డొకళ్లరక । ముచ్చటలాడఁగ నభ్రవీధిపై
నవ్విబుధాధియానము రయమ్మున నేగుచు గోష్పదంబుగా
నవ్వలదాఁటె నీరధి ననంత రవిప్రభ లుల్లసిల్లఁగన్. ౫౮

## —॰ దేవీసభాసందర్శనము ॰—

సీ॥ పారిజాతమహీజ । పటలీపరీవృతం, బతిరమ్యమంటపప్రతతియుతము
కురవకాశోకసంకులమహోద్యానంబు, మౌక్తికోద్దామదామప్రభంబు

కోకిలారావ సంఘుష్టనికుంజంబు, దివ్యగంధామోద దీపితంబు
భ్రమరఝంకార సంభరిత ప్రసూనంబు, బహుళాంతరీపసంవ్యాపితంబు
గీ॥ నగుచు సాగర మధ్యమం దద్భుత ప్రకాశ బంధురశోభా వికస్వరంబు
మణిమయద్వీప మొక్కటి మాకు నెదుట, గోచరం బయ్యె వాచామగోచరంబు.

ఉ॥ అందు మహేంద్రచాపసమమై మణిదీధితు లుల్లసిల్ల ని
ష్పందతరోపబర్హ పరిబంధురమై మణిపుత్త్రికా శతా
నందదమై మరాళవరసవ్యగరున్మయతల్పరాజ మం
తం దమకన్నుదమ్ములకు ధన్యవికాసము గల్గి వెల్గఁగన్. ౬౦

గీ॥ మణిమయద్వీపతల్పాగ్ర మధ్యమమునఁ, గోటిసూర్య ప్రభఁ జెలంగ గుందబృంద
విశదదంతప్రకాశముల్ వెలికినుఱుక, జిన్నినగుమోముతో నొక్క చిగురుబోఁడి.

సీ॥ బంధూకకుసుమ ప్రభా విభాసితములౌ, రక్తమాల్యంబులు రక్తవసన
రక్తచోళంబులు రక్తగంధంబులు, రక్తాధరద్యుతి రంజిలంగ
రక్తనేత్ర విలాస రామణీయకమును, గలిగి ప్రాతర్భానుకలితమైన
నెమ్మోముతోఁ గోటి నీరజనిలయలు, వడిఁబనుల్ సేయఁ బ్రాభవము మెఱయ

గీ॥ నిండుకొలువున్న యట్టి యన్నీరజాక్షిఁ, గాంచుచు నపూర్వదృష్టమై గానఁబడియె
నబ్బురము సంతసము లోన నలముకొనఁగ, నతు లర్పించి నిలిచితిమచట మేము.

ఉ॥ అక్షిసహస్రముల్ కరసహస్రము లాస్యసహస్రముల్ శ్రవః
కుక్షిసహస్రముల్ మెఱయఁ గోటిసహస్ర మయూఖదీప్తులన్
వీక్షణ దుస్పృహంబగు నభేద్యవిభన్ బ్రకటించుచున్న ద
ధ్యక్షత నిజ్జగంబులకు నాది యనాదియుఁ గాఁగఁ దోఁచుఁగా. ౬౩

ఉ॥ చారణ సిద్ధ సాధ్యసురచంద్రముఖీతతిఁ గన్నవార మ
వ్వారలలోని దంచు నుడువన్ దగ దచ్చరగా దుపేక్షచే
నారయ కేగరాదు జగమంతయు నేలెడి పోల్కి నున్న దీ
సారసపత్రనేత్ర యని సందియ మంది తలంచుచున్నెడన్. ౬౪

క॥ సాభిజ్ఞానత సరసిజ, నాభుఁడు మముఁ జూచి పిన్న నగవులు నగుచున్
స్వాభిప్రాయముఁ దెల్పెద, నీ భగవతి జగములకును హేతువు సుండీ. ౬౫

— బ్రహ్మకు హరి దేవిని గుఱించి తెలియఁజేయుట —

సీ॥ ఈదేవి మనకెల్ల నాదికారణము మహామాయ యనఁగ నవ్యయ యనంగ
మూలప్రకృతి పూర్ణ[illegible]శక్తి మహావిద్య, దుర్జ్ఞేయ[illegible]గోచర దురవగాహ

పరమాత్మ కిచ్ఛమై ౹ పరఁగు నిత్యానిత్య, రూపిణి విశ్వేశి ౹ క్రూరహంత్రి
స్వల్పభాగ్యులకు దుస్సరారాధ్య శ్రుతిగర్భ, సర్వమహేశ్వరి ౹ సర్వజనని

గీ॥ త్రిగుణమున విశ్వజనన సంప్రదీపనక్షు, యమ్మ లొనరించు లింగబీజమ్ము లెల్ల
లోన నణఁచి జగద్బీజయై నటించుఁ, గంటిరే? భూతు లెల్ల నిక్కలికిడండ.

వ॥ దివ్యాభరణయు దివ్యగంధావలేపనయు నగుచు, ననేకశక్తిసహస్రంబులు పరిచర్య లొనర్ప నఖిలజగదధికారగరిమంబు వహించుచున్నయది మనము ధన్యులము కృతకృత్యులము మహాభాగ్యుల మగుట కతనఁ సాక్షాత్కరణం బొనర్చెఁ దొల్లి మనముచేసిన తపఃఫలంబెల్లను సిద్ధియగుటంగదా యీజగజ్జనని సందర్శనంబు లభించుట మఱియొం డగునేని సరాగుల మగు మనకెట్లు సిద్ధించు? దాంతులును దపస్వులును గృతపుణ్యులు నగు వారలకుఁ గదా! జగజ్జనని కటాక్షంబు సులభం బన్యులకు దుర్లభంబు, పురుషసంగతయై ప్రకృతియనఁ బరఁగు నిద్దేవి మనకు బ్రహ్మాండంబు సావరణ సలోక సరూప సభేద భేదంబుగా దర్శింపఁ జేయఁగలదు, నే ననంగను మీ రనంగను సుర లనంగను రమాదిసురాంగన లనంగను బృథగ్భావంబు కలదే? తదంశలేశాంశంబునఁ గోట్యంశంబు నొందినవారము కావున నిమ్మాహేశ్వరి సాభిజ్ఞానంబుగా మన్మనంబునఁ బొడకట్టుచున్నయది సవిస్తరంబుగఁ దెల్పెద వినుండు. ౬౭

సీ॥ ఈదేవి వార్నిధు ౹ లేకార్ణవంబుగాఁ, బొరలంగ, వటపత్రపుటమునందు
హస్తంబుచేతఁ బాదాంగుష్ఠమాస్యమ్ము, నందిడి బాలచేష్టానువశతఁ
గ్రీడించుతఱిఁ బాటపాడుచుండి తరంగ, డోలలయందు నుయ్యాలలూఁచి
కాలంబు గడపుచుఁ ౹ గన్నతల్లియుఁబోలె బుజ్జగించుచు నాదుబొజ్జ నిమిరి

గీ॥ నిదురఁబుచ్చుచు విడువక ౹ నిలిచిచెంత, నూఱడించినయట్టి సనాతనమ్మతల్లిఁ
గంటినేఁడిటఁ గన్నుల ౹ కర్వుదీఱ, జన్మసాఫల్యమొందె నిస్సంశయంబు. ౬౮

క॥ అని తెల్పుచు వనజాక్షుం, డనిమెన్ మనమేగి దేవి ౹ యంఘ్రులకును వం
దనమొనరుప వేడ్కఁ మన, కనిశము వరములనొసంగి ౹ యభయములిచ్చున్.

ఉ॥ సన్నిధి కేగునంతఁ బరిచారకు లడ్డము వచ్చిరేని యా
పన్నత నచ్చటన్ నిలిచి ౹ ప్రస్తుతిసేయుద మన్న నట్లుగా
నన్నలినాక్షునిన్ గలసి ౹ యందఱమున్ జగదీశ్వరీసమా
సన్నతఁగోరి మందిరము ౹ చాయకు నేగి కవాటసంస్థితిన్. ౭౦

గీ॥ ద్వారపాలురఁ జూచి మాతలఁపు దేవి, కెఱుగఁజేయుఁడటన్న వారరేగి జనని
హరిహరులు నీరజాసనుం ౹ డరుఁగుదెంచి, ద్వారమున నున్నవారని ౹ తగవచింప. ౭౧

ఉ॥ ద్వారముచెంగటన్ నిలుచు తమ్ముఁగనుంగొని నవ్వె నంతటన్
చారువిభూషణాంగములు సర్వమనోహరరూపసంపదల్
స్ఫారకుచంబులున్ గరము సన్నపుఁగౌనును గల్గు నంగనా
కారముఁ గాంచి విస్మయముఁ గ్రమ్మ మనమ్ముల నుమ్మలింపఁగన్. ౨౨

చ॥ వివశతనొంది చిత్తముల వేమఱు భ్రాంతి జనింప నెద్దియున్
స్వవశముగాక దేవిపదసారసయుగ్మసమీపభూమిఁ గే
ల్గవ ముకుళించి సాఁగిలి యఖండనుతుల్ పచరించుచున్ బ్రశ
స్తవిధలసత్కటాక్షరససంస్మృతిఁగోరుచు నెద్ది తోఁపమిన్. ౨౩

క॥ అన్యోన్యముఖాలోకన, విన్యాసముఁజేసికొనుచు వెఱచుచు దేవీ
ధన్యోజ్జ్వలమణిపీఠ మ,నన్యమనస్కత భజించి యటులున్న యెడన్. ౨౪

సీ॥ భాస్కరకోటిసంభాసమానం బగు, సింహాసనమునకుఁ జెంతనిలిచి
యేము మువ్వురమున్న యెడ రక్తచేలలు, పీతాంబరలు నవధాతువసన
లతినీలవస్త్రలు నగు పరిచారికల్, దివ్యభూషణ సముద్దీప్త లగుచు
నాడుచుఁబాడుచు నతులవాద్యంబులు, మ్రోయించుచును జగన్మోహనులన

గీ॥ భాసమానాంగనలు సముల్లాసమెసఁగ, దేవిచిత్తంబు రంజిల్లఁ దిరిగి సేవ
సేయుచుండఁగఁ జూచుచుఁ జిత్తములను, భీరురూపంబు నొందుట బెదరిబెదరి.

ఉ॥ చెప్పవశంబుగామి నొక చిత్రము గంటిమి దేవదేవిపైఁ
దప్పక చూపు నిల్పి గనుఁదమ్ముల విందొనరించు వేళ న
య్యొప్పులకుప్ప పాదనఖరోజ్జ్వలదర్పణమధ్యమంబునన్
గుప్పగఁ గూరినట్లు కనుఁగోఁదగె నంబుజజాండభాండముల్. ౨౬

ఉ॥ స్థావరజంగమంబులును శంకరుఁ డేనును గేశవుండునున్
బావకుఁ డింద్రుఁడున్ వరుణ వాయు కుబేర రవీందు ధర్మవి
శ్వావసుచిత్రకేతు సురవారవధూ మునియక్షసిద్ధసా
ధ్యావళులున్ ఫణీశముఖరాహికులంబులు విశ్వ లశ్వినుల్. ౨౭

సీ॥ గరుడ గంధర్వ కిన్నర రాక్షసావళుల్, తుంబురు నారదాదులును గిరులు
నదులు నదంబులు నలినాకరంబులు, వైకుంఠ కైలాసలోకములును
సత్యలోకంబును సర్వంబు గాన్పింప, గంటి మజ్జన్మపంకజము నచట
దానిపై నన్నును దానవాంతకు మధు,కైటభాదులఁగాంచి కడుముదమ్ము

గీ॥ విస్మయమ్మును బెనఁగొన వెఱగుపడుచు, నిట్టి యద్భుత మెట్టిదో యెన్నఁడెఱుఁగ
మనుచు శంకాకళంకంబు [illegible] నెద్ది తెలియక యట్టులుండి. ౨౮

గీ॥ అమ్మహాదేవి యనుకంప । నంతనంత, జగములకు నాదియైనట్టి । జననిగాఁగఁ
దెలిసి వర్షశతంబు వర్తిలుచునుంటి,మంగనారూపమున నె యంగదణఁగియుండి. ౧౯

మ॥ అమృతాంభోనిధి నంతరీపమున నయ్యంబా సఖీ శ్రేణితోఁ
బ్రమదం బందుచు సేవఁజేయుచు వసింపన్ మమ్ముఁ దత్ప్రస్థభ్రూ
పము దేవీపరిచారికాశతములోఁ । దథ్యంబుగా నాత్మసం
భ్రమ మొక్కింతయులేక గాంచె రమణీభావైకతావాప్తిచే. ౨౦

## —। హరికృత శాంకరీ స్తోత్రము ।—

క॥ ఒకతఱి హరి హరిమధ్యన్, వికృతింగాఁగొలుచు నంబ । విశ్వేశి వచః
ప్రకర ప్రస్ఫుట గుణబోధక సన్నుతి సేయఁదొడఁగెఁ । దత్పరమతియై. ౨౧

ఉ॥ మ్రొక్కెద నంబకున్ సవిదమోఘకృపారసదృక్కదంబకున్
మ్రొక్కెదఁ దల్లికిన్ జరణమూలనమజ్జనకల్పవల్లికిన్
మ్రొక్కెద సిద్ధికిన్ విషయమోహ నిరాసపదైకబుద్ధికిన్
మ్రొక్కెద మాయకున్ సురసమూహ వచోరచనానుగేయకున్. ౨౨

చ॥ అరయఁగ నయ్యె నిజ్జగము । లన్నియు నీనఖ దర్పణస్థలాం
తరమున లీనతన్ గనుట । తప్పదు కారణ మీవ యంచు నేఁ
డరసినకార్యకారణము । లైక్యము గాంచుట తథ్యమాట నీ
గరిమము శక్యమే పొగడఁగన్ సకలేశివి నీవు శాంకరీ. ౨౩

శా॥ నీలో మువ్వుర మేము పుట్టుటఁ గనన్ । నీయందె సంహారమున్
వాలాయంబునుగాన నీవె కద! యవ్యక్తంబునా నుందు వి
చ్ఛాలాలిత్యముచేఁ జరింతు పురుషాసక్తిన్ విచిత్రక్రియా
జాలాలోలత నింద్రజాలములుగాఁ । జర్చింపఁగా శాంకరీ. ౨౪

మ॥ సదసద్రూపముగా సృజించి జగముల్ । సర్వంబు లాయామెడన్
గదియన్ డాయుచుఁ బూరుషున్ మదికి రాగంబొప్పఁ గాన్పింతు త
త్త్వదశద్వంద్వము నాల్గునున్ గలిపి చిత్రం బింద్రజాలంబుగా
నిది చర్చింప ననన్యసాధ్యము కదా? । యెంచన్ మదిన్ శాంకరీ. ౨౫

ఉ॥ ఎద్దియు నీవుగాని దొకటేనియు లే దఖిలంబు నీవయై
రొద్దికచే నటింతువు జనోచితసత్క్రియ లెల్ల నీవె కా
కెద్దెస వేఱకల్గునె గ్రహింపఁగఁ బూరుషుఁడైన శక్తుఁడొఁ
ద్వద్దయనీయుఁడైన నిది । తథ్యమె సచ్ఛ్రుతిసూక్తి శాంకరీ. ౨౬

చ॥ కడుదురితాత్ములైన మధుకైటభులన్ సమయించి లోకముల్
వడివడిఁ గానుపింప మముఁ బ్రస్ఫుట గౌరవమందఁ జేసి యి
వ్వడువున నేలి తమ్మ నిను వర్ణనసేయఁగ నీప్రభావమున్
గడుఁ దెలియంగఁ జాలుదుమె కావుము! సత్కృప మమ్ము శాంకరీ. ౮౭

శా॥ నీచే సంతసమందు నీవలన వర్ణన్నెల్ గాంచి రాణించు స
ధ్రీచీనంబు జగంబు నీ మహిమ వర్ణింపన్ దరంబా నాకో?
వాచాగోచర మంత్యవేళలను సర్వస్వమ్మునున్ మ్రింగి ప్రే
రేచున్ నీదగు వైభవంబు సహజప్రేమంబె కా శాంకరీ. ౮౮

మ॥ హరుఁడైనన్ విధియైన నే నయిన మా కన్యుంశు వేఱొక్కఁడై
న రతిన్ నీచరితంబుఁ బేర్కొన ననంతంబా విభావ్యంబు నీ
చరణాంచన్నఖదర్పణంబున జగజ్జాలం బగణ్యంబుగా
నరుదై చొప్పడె నీ చరిత్రము మహార్థంబొఁ గదా శాంకరీ. ౮౯

ఉ॥ ఎక్కువవారికన్న మము నెక్కువగాఁగ గణింతు రట్టి మే
మిక్కడ నీ ప్రభావము నొకించుక గాంచఁగ నేరకున్న వే
ఱొక్కఁడెఱుంగఁ జాలునొకో! యుర్వి భవన్మహిమంబు గానఁగాఁ
జిక్కుపడున్ శ్రుతుల్ సతము జెప్పఁగఁ జాలవుగాక శాంకరీ. ౯౦

చ॥ కరములు నీ పదాబ్జములఁ గన్నులు నీ ముఖదర్శనంబునన్
గరమలరంగఁ జిత్తము జగన్మయ తావక రూపరేఖ నా
దు రసన నీదునామమును దొట్రిల కెప్పుడు నిల్చునట్లుగాఁ
గరుణ నొకింతఁ జూపినను గాంతుము ముక్తిపదంబు శాంకరీ. ౯౧

మ॥ మముఁ బాలింపఁగ నీవ యేలికవు నీమాటల్ శిరస్సీమలం
దమలాంతఃకరణంబులన్ నిలిపి దాస్యప్రక్రియన్ జూపు ను
త్తములౌ దాసుల మేము మద్భరణ మత్యంతంబు నీదే కదా!
సమయాచార పరిశ్రమంబునను దీక్షన్ గొల్పు మో శాంకరీ! ౯౨

ఉ॥ తల్లివి నీవు బిడ్డలము తామయి యుండఁగ వేఱుగల్గునే?
యుల్లము పల్లవింప మము నొద్దికతో నియమించి సత్కృపో
త్ఫుల్లమనస్కవై నియమపూర్ణులఁ జేసి భవాగ్నికీలలన్
జల్లనిచూపుగుంపు వెదచల్లి యడంపఁగదమ్మ శాంకరీ. ౯౩

శా॥ సంసారాంబుధిలో మునింగి కడు నస్వాతంత్ర్యమున్ బూని యా
శంసాహీనులమైన మమ్ము [illegible]

హింసాహింసలు నీ వెఱుంగుదువు కావే దేవి హితంబు గాని "సో
హంసోహ" మ్మని పోవు మమ్ము జడులన్ హర్షంబునన్ శాంకరీ ౯౪

ఉ॥ ఏనును నల్వ పెంపఁగ సృజింపఁగ నంచు హరుం డడంచు నం
చీనిఖిలప్రపంచమును నిట్టులఁ బల్కుఁ ద్వదీయమాయకున్
లోనయి కానలేక రవి లోకతమం బెడఁబాపు గాక తా
రానివహంబుచే నగునె? భ్రాంతి నెఱుంగరు గాక శాంకరీ! ౯౫

మ॥ కరణాది త్రితయైక కర్తృతలచేఁ గల్పింతు మమ్మెల్ల; నీ
చరణద్వంద్వమునందుఁ బుట్టి మనుజుల్ సంహారమున్ జెందఁగాఁ
బరులౌ నింద్రముఖామరుల్ గణనయే భావింప నెక్కాలమున్
స్థిరమౌ తత్త్వము నీవ యంచు శ్రుతి వర్ణించున్ గదా! శాంకరీ. ౯౬

చ॥ పురుషుఁ డనీవుఁ డీశుఁడు విభుండు పురాణుఁడు విష్ణు వంచు నీ
పరిసరవాసియై కరము భాసిలు వేల్పొకఁడైనచో నతం
డరయ ననామకుండై ఖసుమమట్ల యభావత నొందఁడొక్కొ? బు
ద్ధిరచన నింతయాటయు సుధీవిశదమ్ముగుఁగాదె! శాంకరీ. ౯౭

చ॥ మతిబలకీర్తిసంపదల మన్ననఁ జేసి చరాచరంబులన్
మతిబలకీర్తి ముఖ్యగుణమండలి నీవయి భక్తకోటికిన్
గతు లిడి తత్పదంబులును గన్గొన నీవయి ముక్తిఁగూర్చి య
గ్గతియును నీవయై నిలుతుగాదె కృతాకృతసాక్షి శాంకరీ! ౯౮

శా॥ సావిత్రీ నిగమాగమస్మృతి కళాస్వాహా స్వధా తారకాం
తావిష్టస్ఫురదర్ధమాత్రిలును నీవై యట్లు వేదోక్తిచే
దేవజ్యేష్ఠులఁ జేసి మా కొసఁగి యుద్దీపింపఁగాఁ జేయు నీ
భావం బెంత దయారసార్ద్రి మని సంభావింతు మో శాంకరీ. ౯౯

శా॥ అంభోరాశి తరంగపాళిఁ బలె బ్రహ్మాండంబులన్ జేసి ని
ర్దంభప్రక్రియ ముక్తికై శ్రుతిశిఖార్థంబుల్ ప్రతిష్ఠించి సో
హంభావం బొనఁగూర్చి జీవులను నాత్మాన్యంబు పొందింతు వ
స్తంభంబుల్ గద ? నీ వినోదములు చిత్రం బెన్న నో శాంకరీ. ౧౦౦

శా॥ శైలూషీనటనంబు ప్రస్తుత కథాసంశాంతి శాంతించి న
ట్లీలోకాదికముల్ సృజించి విరమాపేక్షేచ్ఛచే గర్భపా
ళీలీనం బొనరింతు వింతయును నీ లీలావినోదంబు లీ
బాలు ర్గందురె? నీప్రభావము గణింపన్ శక్యమే శాంకరీ. ౧౦౧

మ॥ భవభీవారిధి మున్గి జంతుతతుల న్బాలింప నీవమ్మ మో
హవశత్వమ్మున నార్తిఁ జెంది కడఁదో ర్వం దేయ రాని రాగాది సం
భవదుఃఖమ్ముల కాలయమ్ము లగు మాపట్లన్ గృపాదృష్టి ని
ల్పి విలోకించి తరింపఁజేయుము సమర్పింతున్ నతుల్ శాంకరీ. ౧౦౨

శా॥ అమ్మా! మ్రొక్కెద నీపదంబులకు సర్వార్థంబు లీఁజాలు దీ
వమ్మా యజ్ఞత బాపి జ్ఞానమిడవమ్మా! దీన సంరక్షణం
బిమ్మెఁ జేయక తీరదమ్మ వినతోపేక్షల్ భవద్దృష్టి లే
వమ్మా! నమ్మితినమ్మ! కావవలెనమ్మా! నెమ్మదిన్ శాంకరీ. ౧౦౩

## హరకృత మహేశ్వరీ స్తోత్రము

కం॥ అని వినుతించు హరింగని, జనితప్రమదమ్ము చిత్తజలజమధు శ్రీ
ఘనఘనరనిభమై పొదలన్, జనవాసఁగెడు దేవిఁ జూచి శంకరుఁ డనియెన్. ౧౦౪

మత్తకోకిల॥ వారిజాక్షునిఁ గంటి వేనియు వారిజోదరుఁ గాంచవే?
వారి నిర్వురఁ గన్న నేనొక భారమాదునె? మెంచిరన్
వారు వీరన నేల? కారణ వాసనాకృతిఁబూని సాం
పారఁ గన్నది నీవటంచు జోహారొనర్తు మహేశ్వరీ. ౧౦౫

మత్తకోకిల॥ నేల నీరును జిచ్చు గాలియు నింగి యేను మహత్తునున్
మూలమున్ విషయేంద్రియంబులు ముజ్జగంబులు నీవయై
లీలచే విహరింపుచుండి! యలేపవైతివి నిన్ను మ
ర్త్యాళికిన్ బొగడంగనౌనె? జోహారొనర్తు మహేశ్వరీ. ౧౦౬

మత్తకోకిల॥ లోకనిర్మితి ధాతృపంకజలోచనాదికృతంబుగా
లోకు లంద తెలుంగఁజాలక లుప్తనిశ్చయబుద్ధిచే
నీకతంబునవైన నివ్విధి నేను నేననుచుంట మా
యాకృతంబుగదా! యటంచు జోహారొనర్తు మహేశ్వరీ. ౧౦౭

మత్తకోకిల॥ తత్త్వముల్ విషయంబులున్ గుణతారతమ్యమునన్ జగ
త్తత్త్వకల్పనఁ జేసెనేనియుఁ దథ్యమై యిపు డుండునే?
సత్త్వరూప భవత్కళామయసర్గమౌ ననవచ్చు ని
త్యత్వసంపద నిల్చుఁగాన జోహారొనర్తు మహేశ్వరీ. ౧౦౮

మత్తకోకిల॥ కారణావ్యయ రూపకల్పితకార్యమైన జగమ్ము ని
ర్ధారితంబు భవన్మయంబని తప్పకెక్కు

చారువేషవిలాస కౌతుకసత్త్వ యేల సృజించు సం
హారముర్ బ్రకటించుఁగాదె జోహారొనర్తు మహేశ్వరీ. ౧౦౯

మత్తకోకిల॥ ఏము ముప్వుర మీ జగమ్ముల నెల్ల నిట్లొనరించి స
ర్వామర ప్రముఖత్వ పౌరుషమంది విశ్రుతిఁ జెందుటల్
నీమనోజ్ఞ పదాంబుజద్వయ నిష్ఠఁగల్గుట గాదె? మా
యామయాకృతి వంచు వేడ్క జోహారొనర్తు మహేశ్వరీ! ౧౧౦

మత్తకోకిల॥ భారతీశు రజోగుణంబునఁ బంకజాక్షుని సత్త్వభా
స్వాచరణీకృతివై రచించి తసార ఘోరత మోగుణో
ద్ధారుఁ జేసితి నన్నుఁ దద్గుణధార నీమహిమాబ్ధిలో
నారటంబొనరింప లేక జోహారొనర్తు మహేశ్వరీ! ౧౧౧

మత్తకోకిల॥ రాజ మంత్రి భటాది భేద మరాతి మిత్రముఖాంతరం
బాజవంజవ సౌఖ్యకృద్ధనహానివృద్ధి విభిన్న సా
మాజికంబగు సంసృతిర్ విషమంబుగా నొనరించు టే
లా! జనంబులఁ బ్రోవుమమ్మ! జోహారొనర్తు మహేశ్వరీ. ౧౧౨

మత్తకోకిల॥ స్వర్గపాలన సంహృతి త్రియ శక్తిగల్గియు మమ్ము నీ
దుర్గమక్రియలందు నైచి ప్రాదుండనర్ బనియేమి? యా
భార్గవీ ముఖ కామినీతతిసభంగి సేవ లొనర్తు మ
త్యర్గళమ్ముగఁ జిత్త మిమ్ము జోహారొనర్తు మహేశ్వరీ! ౧౧౩

మత్తకోకిల॥ నీరజోదరుఁ డచ్యుతుండును నేను ముప్వుర మబ్బురం
బార సారవిమాన మెక్కి దిగంతముల్ గనుచుండి కాం
తార శైలసరిత్స్ఫురద్భరితమ్ముఁ జూచితి మెల్ల నొ
య్యార మెవ్వరి సర్గమమ్మ? జోహారొనర్తు మహేశ్వరీ! ౧౧౪

మత్తకోకిల॥ ఎప్పుడెప్పుడు లోకపాళి సృజించి ప్రోచి హరించుచున్
జెప్పఁజిత్రముగా విహారము సేయుటల్ గనమెక్కొ! నీ
కప్పురాతనపూరుషున్ సుఖమందఁ జేయఁగఁగాదె! మా
యప్ప వమ్మ వటంచు నేడి జోహారొనర్తు మహేశ్వరీ! ౧౧౫

మత్తకోకిల॥ పాదపంకజసేవ యావత్భావసంభవలబ్ధిచేఁ
గాదె? కల్గుట పౌరుషస్థితిఁ గల్గునేని లభించు నే
తాదృశంబగు దుఃఖసంపరితాప మొందఁగ లేము మ
మ్మాదరింపుమికన్ దయాప్తి జోహారొనర్తు మహేశ్వరీ! ౧౧౬

మత్తకోకిల॥ కాలకర్మ విసృష్టి నీపదకంజసేవ లభించె మా
కేల యిందిరపదంబు నన్యము నిచ్చటన్ దురితాభివా
తూల మా భవదంఘ్రినిష్ఠయె దూరగొనన్ గరుణించి ప
ల్కాలకింపుము వేడ్కనింపు జొహారొనర్తు మహేశ్వరీ! ౧౧౭

మత్తకోకిల॥ తావకాంఘ్రి సరోరుహద్వయతత్పరుం డనుభామినీ
భావనన్ మును గీర్తిగాంచుత బావనుండను నెల్లెడన్
నీవిశాల కటాక్ష వీక్షణ నిర్మలామృతధారచే
నావరింపుము దుర్భరమ్మ జొహారొనర్తు మహేశ్వరీ! ౧౧౮

మత్తకోకిల॥ నీసమీపమునందు నిల్చుచు నిన్నుఁగొల్చుచు నెంతొ యు
ల్లాసమువంచి మహావిభుత్వము లాలస మ్మెదఁ గోరునే!
యాసచేఁజెడు నైన నట్టియనర్థకంబులఁజెంది యా
యాసమొందఁగఁ జాల నీకు జొహారొనర్తు మహేశ్వరీ! ౧౧౯

మత్తకోకిల॥ నిన్నుఁగొల్వని కామ్యయే యొక నీరజాసనకల్ప మం
చెన్నిమానులు నిన్నెఱుంగక యిద్ధతాపసవృత్తులన్
గన్నులార్పక యుందు రేమనఁ గాలవంచితు లంచు మే
మన్నవారము కల్లగాదు జొహారొనర్తు మహేశ్వరీ! ౧౨౦

మత్తకోకిల॥ దానముల్ దపముల్ వ్రతంబులు ధర్మముల్ సురపూజనల్
స్నానముల్ మొదలైన కర్మలు సల్పినన్ భవదీక్షణ
ధ్యానపాద పరాగలేపనతన్ స్వతంత్రతలేక నీ
యాన ముక్తి ఘటించదంచు జొహారొనర్తు మహేశ్వరీ! ౧౨౧

మత్తకోకిల॥ ఇచ్చమెచ్చి ననున్ దయామతి నేలుకోఁ దలఁపొప్పునే
నొచ్చెమేమియు లేదు దివ్య మహానుభావ్యమైన సుమంత్రమున్
హెచ్చుగా నుపదేశమిమ్ము మహాదీప్తితంబు నవార్ణ మే
నచ్చుగా జపియించి నీకు జొహారొనర్తు మహేశ్వరీ! ౧౨౨

మత్తకోకిల॥ ఆదిజన్మమునం దధీతమునైన విస్మృతమయ్యె నేఁ
డాదిగాఁగ నవార్ణమంత్రము నభ్యసించి పఠించెదన్
బాద మాన కటాక్షవీక్షణపాతురిఁడన్ దయఁజేసి న
న్నాదరింపుము నిశ్చయంబు జొహారొనర్తు మహేశ్వరీ! ౧౨౩

సీ॥ అని యిట్లు వినుతించు హరుని దయాదృష్టి, నీక్షించి యుపదేశ మిచ్చెనంబ
యన్న వాక్షరమంత్రము ముచ్ఛలతో బనువు ప్పెక్షలకామదము ముక్తి కగమ్య

మగుట నద్దేవి పాదాబ్జంబులకు మ్రొక్కి, జపము సేయుచు నిత్యసౌఖ్య మొంది
యానందమున నోలలాడుచుఁ జంద్రార్ధ, శేఖరుం డున్న నా - చెంత నిలిచి
గీ॥ దేవిపాదమ్ములకు మ్రొక్కి - సావధాన, చిత్తవృత్తి విధాత యాశ్రితుఁడ నన్నుఁ
గావవే! తల్లి ! సద్భక్తకల్పవల్లి, యనుచు వేడుచు నిట్లని - యభినుతించె. ౧౩౪

## —౹ బ్రహ్మ దేవీధ్యానము చేయుట ౹—

## ద్విరదగతిరగడ

భగవతి జగజ్జనని - పాలించు నినుఁగంటి, జగములు నిరంతరము - శాసింప నీవంటి
వేదములు నీమహిమ - వెదకియును గనలేవు, కాదనక వేదములుగన్న దానవునీవు
యాగీయములుగొనఁగనై నస్వాహవుసుమ్మ, జాగ్రదుత్పత్తికిని - జననివీవునిజమ్మ
అఖిలాండజననినీయాధిపత్యము దెలిసె, నిఖిలకర్తనటన్న - నెఱతనముభువిఁగలిసె
చరణరేణువుసోఁకి - సఫలుండనైతిని, గరుణాప్రసాదమునఁ - గంటి నిశ్చితమతిని
భక్తుఁడనుభీతిగని భవములెత్తఁగఁజాల, ముక్తినాకొసఁగుమని మ్రొక్కితినినినుఁజాల
మోహవారాశిలోమునిఁగిపడియున్నాఁడ, సాహసింపక యిమ్ము సద్భక్తి చెలువాడ
గలదె యజనామకము - కమలభవునకు నటుల, వలదమ్మ కింకరత వర్తింతు నేనిటుల
నీయాజ్ఞ తలఁదాల్చి నిలుతునీసన్నిధిని, మాయఁ గెడపుచుఁబ్రోవుమా! కృపంగోరితిని.
తెలియనేరక జనులు దేవుఁడందురునన్నుఁ, గలయ నెఱిగినత్రోవఁగాంచరేయిటుమున్న
జన్నములుచేసిసురసౌఖ్యములఁగోరుటలు, కన్నతల్లినినిన్నుఁగనక మితిమీఱుటలు
నలుమొగంబులతోడనన్నాదిఁగంటివని, తెలియరెవ్వరుకంటిఁదెలియకున్నారలని
తల్లి నీచరితంబు - తారకంబని కనక, చెల్లెఁబో! యోగములు - సిద్ధ మంధులమనక
తత్త్వములులెక్కించితత్పరమునీవెయని, తత్త్వవేత్తలుమూఢతములంచుఁబల్కితిని
భీమమగు సంసార - భీతినడపఁగ నీదు, నామ మనవలె వేఱ - కామింప నిఁక లేదు
ఆజ్ఞానుభూతంబు - నాఁపగా వశమౌనె, ప్రాజ్ఞులకు నీనామజపతన మగు విరితేనె
సృష్టికెల్లను నీదు - దృష్టియే మూలంబు, స్పష్టమయ్యెను నాదిసర్గెంద్రజాలమ్ము
కడలినన్నుఁగాచిమధుకైటభులనువధించి, కడఁజేర్చిపంపితివి - కావుమని నియమించి
మృడునిసంవర్తమునమిాఁటితివినాబొమల, నడుమ వెడలెను నేఁడునామమునునిడుమమల
ఎందు జన్మించితివో యెఱుఁగరెవ్వరునిన్ను, నెందు వెదకినఁబుట్టు వెల్ల రకుమునుమున్న
ముప్పురమునీవలన - ముఖ్యకర్తల మైతి, మివ్విధమ్మున విడిచి తేనివిడువదుభీతి
పాదదర్శనముచే - బాసి భేదజ్ఞప్తి, సాదింపు మిఁక మాకు సానందసుఖతృప్తి.

ఉ॥ ఏనును శంకరుండు హరి - యెట్టులనో ! పరులెల్ల సృష్టి సం
స్థాన భవిష్యదుల్ల సన - సంస్థితులౌఁగదె? నీదుసన్నిధిన్.

గానక యల్పబుద్ధులు జగన్మయ వీ వని పల్కలేరు దే
వీ! ననుఁగన్నతల్లివి క్షమింపుము నింపుము నీ కటాక్షముల్. ౧౨౬

సీ॥ అగుణుం డకర్తయు ననుపాధికుండు ని, రీహుం డరూపి నిరీశ్వరుండు
నట్టులయ్యును నీమహావినోదమ్మున, గర్తయు భర్తయు హర్తయనుచు
భాసించె నిజము "సర్వంఖల్విదంబ్రహ్మ", యనువేదసూక్తి యథార్థమనుచుఁ
బలుకరా దందొక్క భావవినోదంబు, గలదు మీరిరువురు గాన నీవొ
గీ॥ యీశ్వరుండొ జగన్మూల మిట్టిసంశ, యమ్ము విడఁజేసి యొండు రెండనుచుఁ దెలిపి
నామనఃపంకసంక్షాళనం బొనర్చి, నిత్యశుద్ధియొసంగి మన్నింపుమమ్మ. ౧౨౭

చ॥ చిర సుకృతోదయమ్మున భజింపఁగఁగల్గెను నీ పదాబ్జముల్
పురుషుఁడవో? నితంబినివొ బుద్ధినెఱుంగ నిజమ్ముఁ దెల్పి దు
స్తరతరసంసృతుల్ గెడపఁ జాలు నవార్ణ మొసంగి నామదీ
దిరమగు సందియ మ్మణఁచి దీనుని నన్ గరుణింపు మంబికా! ౧౨౯

## — దేవి యాత్మతత్త్వము దెలుపుట —

క॥ వినయావనతుఁడనై యిటు, వినుతించు నన్ దయాబ్ధి విశ్వేశ్వరి దా
ననిమె మదుక్తి యథాస్థితి, వినుమా! యనుమాన మెడలి విశదముఁగాగన్.

సీ॥ పురుషుండు ప్రకృతియ న్నెఱపల్కులనె కాని, భేదంబొకింతయు లేదుసుమ్ము
పురుషుండునా నేన పొలఁతియునా నేన, భేదశ్రుతులు పల్కు వేఱువేఱ
నిరువురం దంతరం బెద్దియు లేదని, తెలియు నాతండువో ధీయుతుండు
నతఁడ విముక్తుండు మితిలేనిసంసార, పారంబుఁగనినట్టి పండితుండు
గీ॥ అద్వితీయం బనామయంబైన బ్రహ్మ, మొక్కటేగాక యన్యంబు లున్నె జగతి
ద్వైతభావంబుగాంచు నుత్పత్తికాల, మునను దద్భావ మెఱిఁగింతు వినుము వత్స.

కం॥ అంబుముఖోపాధులఁ బ్రతి,బింబించిన దీపమట్లు విమలంబగు న
ద్దంబున నాత్మాకృతి బ్రతి,బింబించినభాతి దీని వివరము గనుమీ. ౧౩౦

కం॥ సృష్టివ్యపదేశమునన్, వ్యష్టి గనన్ జేసి భేదవశతన్ గనుచున్
వ్యష్టిసమష్టివిభేదము, సృష్టిన్ బెరయించి క్రీడసేతును వత్సా. ౧౩౧

సీ॥ పురుషుండఁగాను నపుంసకుండనుగాను, గాంతను గాను సర్గంబు వలయు
తఱి భేదమున నొప్పి తల్లయంబున నొక్కడై యుండు బుద్ధిలో నరయుమిటుల
స్మృతి కీర్తి ధృతి బుద్ధి మతి మేధ శ్రీ శ్రద్ధ, దయలజ్జ క్షుధ కాంతి సదమము క్షమము
శాంతి నిద్ర పిపాస జరా విద్యా వాంఛయు, శక్తి యశక్తి యక్షమము సిరియు

గీ॥ త్వక్కు వస మజ్జ రుధిరము • తరసకలల, ముఖ్యములు శబ్దదృక్స్పర్శముఖరములును
సర్వ సంశ్రియ నాడులు • సంసృతి ప్రవాహమున నేనుగాని దెప్పటికిలేదు. ౧౩౩

గీ॥ సర్వ మేనని తెలియు నిస్సంశయముగఁ, గలదటంచు నిరూపింపఁ • గలవె? వత్స
యద్వితీయంబు నైన నాయందె సృష్టి, వేళ భేదంబు వెలసె వివేకి వగుము. ౧౩౪

శా॥ నానానాకనివాసబృందముల నానానామచేష్టాదులన్
నానారూపములన్ వసించి విహృతుల్ • నానాస్థితిన్ సల్పుదున్
మానివారితము లిట్లెఱుంగుదురు సన్మానించి యొక్కొక్కచో
నానాశక్తి విభేద మొంది జగతిన్ • నర్తింతు నిచ్ఛారతిన్. ౧౩౫

వ॥ మఱియు నైంద్రియు బ్రాహ్మియు రౌద్రియు వారాహియు వైష్ణవియు వారు
ణియుఁ గౌబేరియు నారసింహియు వాసవియు నను నామంబులఁ దత్తత్కార్యం
బుల నమరుల నావేశించి కార్యంబులఁ జక్కంబెట్టుచు జలంబుల శీతంబును
ననలంబున దాహంబును దివాకరునం దాతపంబును నిశాకరునందు హిమంబును నై
వర్తించుచు మదీయయోగంబున సర్వంబును సమర్థంబుగాఁ జేయుచు జడ
భూతం బగు సంసారంబున చేతనంబు నేనై యుండుదు. మద్విహీనుండగు రుద్రుం
డును దైత్యనిర్వాపణంబునందు నిపుణుఁడగునే? శక్తిహీనుండగు నరుండు దుర్భగుం
డని చెప్పంబడు, శక్తిహీనం బనుటగల్గునుంగాని రుద్రహీనంబును విష్ణు
హీనంబును బ్రహ్మహీనంబును ననుటం గల్గునే? యశక్తుండనుట గల్గుఁగాని యరు
ద్రుండును నవిష్ణుండును నబ్రహ్మండును ననుటం బొసంగునే? శక్తిహీనత్వంబునన్
గాదె పతిత స్ఖలిత భీత శాంత కాంతావశంగతత్వాదులఁ జెంది దుర్బలులై
యుండుట, హరి హర విరించి పురందర ధనంజయ నిశాకర ప్రభాకర యమ
వరుణ వాయు కుబేరాదులు తమతమ కార్యంబులన్ బ్రవర్తించుట శక్తివశం
బునఁగాదే వసుంధరానంత కమఠవరాహ దిగ్గజాదులు మద్వశంబున భారధురీ
ణంబులై యుండవే! తత్త్వంబులన్ గ్రసించి యొక్కయెడల సత్యంతాభావంబు
ప్రాగభావంబును బ్రధ్వంసాభావంబును మృత్పిండకపాలంబులయం దన్యోన్యా
భావంబును బ్రతిష్ఠింపనే? ప్రకృతంబునఁబృథివి యొందడంగెనో? విమర్శింపుము.
పరమాణురూపం బయ్యెనో? లేదో? యెఱుంగుము, శాశ్వతంబును క్షణికంబును
శూన్యంబును నిత్యంబును ననిత్యంబును నకర్తృకంబును సకర్తృకంబును నను
సప్తభేదంబులన్ బ్రవర్తించు నాత్మను జేకొని మహదహంకార పంచతన్మాత్ర
భూత విషయేంద్రియాదులచే నెప్పటియట్ల జగత్సర్గం బొనర్పుఁడు, మీమీ
గృహంబులకున్ జనుండు, హరిహరులును గలసి మీమీ కార్యంబుల సమర్థించు
కొనుఁడని! చెప్పి. ౧౩౬

## —• బ్రహ్మ సరస్వతిని గైకొనుట •—

సీ॥ జగదేక మోహనాశ్చర్యాకృతి వహించి, చిఱునవ్వు మోమునఁ జెంగలింప
గాంగ డిండీర శుభ్రాంగమ్ముపై శుద్ధ,ధవళదుకూల వస్త్రంబుగట్టి
దివ్యభూషణములు దివ్యమాల్యంబులు, తళ్కొత్త వరదహస్తంబుఁ బట్టి
మందమందమ్ముగా మలయుచుండెడి హంస, తురగంబుపై నెక్కి యమరియుచున్న

గీ॥ తనదుసహచారిణి నొసంగి కొనుము దీని, నామము సరస్వతి విరించి నాదునాజ్ఞ
నేలుకొమ్ము భవన్మనోధీనయగుచుఁ,బొలుచు నీచెంత నిది మద్విభూతిసుమ్ము.

మ॥ అవమానించెదవేని నీకెదిరి నీ హర్షంబు మాయించు సం
భవ సంభార నికారముల్ సలుపు మద్వాక్ఛక్తి వాణీశ! నీ
స్వవశత్వమ్మున నుండు స్వస్తియగు బీజం బీరజస్సృష్టిచేఁ
బ్రవణం బొందఁగ విశ్వసర్గమున కారంభింపుమీ పుంస్థితిన్. ౧౩౯

గీ॥ సత్యలోకమ్మునకుఁ బొమ్ము చనినయుగము, లందుబలె జంగమస్థావరాదికములఁ
గాల కర్మ స్వభావాఖ్య కారణముల, సగుణ సర్గ విధానంబు సలుపుమయ్య.

మ॥ హరి పూజ్యుండును మాననీయుఁడును సర్వాధిక్యసంశోభి స
త్త్వరసోల్లాసి భవత్ప్రకల్పితజగత్సంతానరక్షాధురం
ధరుఁ డయ్యె సమయమ్ములన్ ఖలవధార్థంబై నరాద్యాకృతి
స్థిరతన్ దా నవతారముల్ గొనుచు శాసించున్ జగద్ద్రోహులన్. ౧౪౦

గీ॥ నీకు సాహాయ్య మొనరించి నిల్చుఁగాన, హరి మహాబలుఁ డతనితోఁ బెరసియుండి
సురధరాసురరాడ్వైశ్య కరణకర్త, వగు ముదారాధ్వరములందు హర్షమంది.

సీ॥ మంత్రపూర్వకముగా మఖవిధుల్ సలిపిన, ధరణి సంపత్సమృద్ధతఁ జెలంగు
నన్యోన్యసంతృప్తి నలరి హర్షించిన, సఫలమై నీసృష్టి జగతిఁ బరఁగు
హరికన్నఁ బూజ్యుండు హరుఁడు తమోగుణుం, డధ్వరంబులఁ బూజ్యుఁడగ్రములను
నీకుసహాయంబు నెఱపుఁ దత్పూజనం, బేమఱకుండుమీ యిచ్చనెఱిఁగి

గీ॥ యేనును సహాయనై వచ్చి యింద్రముఖుల, కరిభయంబైనచోఁ గాళికాదిరూప
ధారణ మొనర్చి దైత్యవిధ్వంసనమ్ము, సేయుచుందుదు నిఁక నొండు చెప్పనేల.

గీ॥ నారసింహియు వారాహినాఁ దనర్చు, శక్తిరూపంబులను నేను జగదరాతి
నిశిచరధ్వంస మొనరించి నీనిసర్గ, సర్గ మభివృద్ధి నొనరింతుఁ జనుము వత్స!

కం॥ బీజధ్యానయుతంబై, రాజిలు నవ వర్ణమంత్రరాజము హృదయాం
భోజమ్మునను జపింపుచు, నీ జగతీకార్యముల రచింపుము వత్సా! ౧౪౪

— హరి లక్ష్మిని గైకొనుట —

గీ॥ బ్రాహ్మణోపాస్య మగుట నీపరమమంత్ర, మఖిలకార్యార్థసిద్ధులకై జపింపు
మనుచు నాతోడఁబల్కి యయ్యాదిశక్తి, వనజలోచనుఁజూచి యిట్లనియెఁ బ్రీతి.

ఉ॥ సారసనేత్ర ! నీవు నిఁక సన్నుతగాత్రి జగత్త్రియీమహో
దారచరిత్రి యీ సకియ దారగఁజేకొను మీమె లక్ష్మి వ
క్షోరమణీయపీఠమునఁ గ్రుంగ దగియున్నది నావయస్య కీ
ర్తి రతి నేలుకొమ్ము ప్రకటప్రతిభన్ సకలార్థదాయినిన్. ౧౪౬

మ॥ అవమానంబున కోర్వ దింతయును నిత్యాభోగభోగార్థివై
పవలున్ రేయి సుఖింపుమీ రమణి శోభామూర్తియై నీయెడన్
బ్రవిభాగం బిసుమంతలేక సకలార్థ ప్రక్రియన్ గూర్చుచున్
గవయైయుండెడు మాటలన్ నడవడిన్ గామోత్సవోల్లాసయై. ౧౪౭

కం॥ నానుడిఁ గైకొను మిది ల,క్ష్మీనారాయణసమాఖ్యచే నగుయోగం
బౌ నీకని మన్నింపుచు, నానతి నిడి మరల ననియె హరితో నిట్టుల్. ౧౪౮

కం॥ సురజీవనార్థమై య,ధ్వరములను సృజించితిన్ సదక్షిణములు గా
సురరిపువిరోధ మగునెడఁ, బరిభవమున్ బొరయకుండఁ బాలింపవలెన్. ౧౪౯

మ॥ హరునిన్ ధాతనుగూడి మువ్వురును యజ్ఞారాతులౌ దుష్టులన్
బరిమార్పన్ దగు నేర్పుఁబూని సవనప్రారంభరక్షైకత
త్పరతన్ వర్తిలుఁడంబుజాక్షు! విను మద్వాక్యంబు లీ మువ్వురన్
గరిమన్ మద్గుణకల్పితుల్ జగములన్ గైకొందు రర్వాక్స్థితిన్. ౧౫౦

కం॥ మీమువ్వురలో భేదం, బే మానవులైనఁ జెప్పి రేనియు నరకో
ద్దామజ్వాలల మ్రగ్గుదు, రామూఢుల కందరాని దగు మత్పదమున్. ౧౫౧

కం॥ హరి హరుఁడు, హరుఁడు హరి. యి,ర్వురకును భేదంబు లేదు రూఢంబను వా
రరుదగు మత్పదమునఁ గా,పురమును జేసెదరు వారెపో! ముక్తమతుల్. ౧౫౨

చ॥ ఎఱుక హిరణ్యగర్భుఁ డని యెవ్వరు పల్కుదు రట్టివారు సం
సరణభయంబు దక్కి సుఖసంపదలన్ జెలువొందు ముక్తికిన్
బరిణతులౌదు రొండయిన భావముల నందుదు రందు నిందు దు
ర్భర నరకాధివాసమును బాయదు చేసితి శాసనం బిటుల్. ౧౫౩

సీ॥ ఇంకొక గుణభేద మెఱిఁగింతుఁ బరమాత్మ, చింతనంబున సత్త్వవంతుఁడవయి
స్వస్వరూపానంద సామరస్యంబును, సర్వాత్మభావంబు సంతరించి

వలయు వేళల రజోవంతుఁడవై తమో, వంతుఁడవై యుండవలయుఁజుమ్ము
రాజసంబున లక్ష్మిఁ గ్రతిఁగాంచుము దమోగుణమ్మున దితిజనాశమ్మొనర్పు

గీ॥ శంకరుఁడు దక్షకన్యని ర్జరులకెల్లఁ, గర్తవై యుండుము మదాజ్ఞ గలదు నీకు
విశ్వవిశ్వంభరాభారశశ్వదవన, దీక్షితుఁడవౌచుఁ బుండరీకాక్ష! నిలుము.

క॥ బీజత్రియ సంధిత మను,రాజము వాగ్భవము కామరాజము మాయా
బీజము గలసిన నిదిగొను,మీ జయసిద్ధియని యొసఁగి మితిమీఱు కృపన్.

ఉ॥ కాలభయంబులేక లయకాలము నందెడు నంతవట్టు లీ
లాలలితుండవై సుఖవిలాస విలోలత సంచరింపు మ
క్కాలమునందు మువ్వురను గైకొని యాత్మ లయంబొనర్తు నేం
డేల? సదా స్మరింపు మఖిలేష్టద మీమనురాజమున్ హరీ. ౧౫౬

క॥ పరమాత్మభజన పరతన్, బురుషోత్తమ! నీ వికుంఠభువనంబునఁ గా
పుర మొనరింపుము సిరితో, మురహర! సురరక్షణంబు ముఖ్యము నీకున్.

శా॥ శోద్గీథంబుగ మంత్రిరాజము సమగ్రోత్సాహివై యెప్పుడున్
హృద్గోప్యం బొనరించి మర్త్యక మదీయేచ్ఛానుకూలుండవై
సద్గేయస్థిరకీర్తి వర్ధిలుము నిస్సందేహ మస్మద్దయాం
చద్గంభీర పరాక్రమ ప్రతిభ రక్షస్సంహృతిన్ సల్పుచున్. ౧౫౮

—• హరుఁడు గౌరిని గైకొనుట •—

క॥ ఇటుల హరిన్ మన్నింపుచు, నిటలాంబకుఁజూచి ప్రకృతి నిర్మల కరుణా
స్ఫుటలోచన సరసిజయై, యిటురమ్మని చేరఁబిల్చి యిట్లనిపల్కెన్. ౧౫౯

క॥ నాకున్ బ్రియసఖి యీమె మ,హాకాళి మనోహరాంగి యఖిలప్రద గౌ
రీకాంత దీనిఁ జేకొను, మోకాలాంతక యటంచు నొసఁగి మృదూక్తిన్.

ఉ॥ తామసమున్ బ్రధానమగుఁ దద్దయు సత్త్వరజోగుణమ్ములీ
చ్ఛామహిమంబులై యొసఁగు సత్త్వగుణమ్ము పరాత్మచింతలం
దేమఱకుండు మివ్విధ మభీష్టతపంబుల మత్ప్రమూర్తిన్ హృదా
రామము గాఁగ నిల్పుము పురప్రవినాశక! నాదునానతిన్. ౧౬౧

సీ॥ కైలాసమున జగద్ధ్వంసరక్షణాక్షీణ, దీక్షావిచక్షణాధ్యక్షమతిని
నివసింపు మిద్దేవి నిఖిలభోగోల్లాస, ధుర్యవై నీతోడఁ దొలఁగకుండు
సకలకామవిధానసామర్థ్య యీబోటి, కవరోధము గొఱంత యనుట లేదు
అఘటితఘటనాదులందుఁ జాతుర్యంబు, గలిగి దైత్యావళి ఖండనముల

గీ॥ వెలయుమీసృష్టిత్రిగుణైక ✽ విహితమగుట, వలయునెడఁదద్గుణవ్యాప్తి ✽ వలయుమీకు
నస్మదాజ్ఞానువర్తిపై ✽ యలరుమయ్య, సాక్షినై సర్వరక్షణ ✽ మాచరింతు. ౧౬౨

క॥ పరమాత్మ నిర్గుణం బెవ్వరికిని గోచరము గాదు ✽ వలయునెడల శం
కర! సగుణ నిర్గుణకృతి, స్థిరమతి నధికార మూని ✽ తిరుగుదు నెందున్. ౧౬౩

ఉ॥ కారణరూప మొంది గుణ ✽ కార్యము లెల్ల సృజింతు నిర్గుణా
కారతఁ బూరుషాంతికముఁ ✽ గల్గిమ్మి వసింతు జగమ్ము సర్వమున్
గారణకార్యభేదములు ✽ కల్పితతంత్రము లౌట నన్నె కా
ధారణ సేయఁగావలయుఁ ✽ దథ్యముఁ బల్కితి మాటలేటికిన్. ౧౬౪

సీ॥ మహదహంకారముల్ ✽ మాత్రలు భూతముల్, విషయేంద్రియంబులు ✽ వేఱువేఱ
నన్యోన్యమును గారణాకృతిఁ గార్యస్వ, రూపంబుననయుండు ✽ రూఢిమెఱసి
మఱియు నహంకృతి ✽ మాయయా నాయందుఁ, బ్రభవించుటను గుణ ✽ త్రయవిశిష్ట
మందు మాత్రలుపుట్టె ✽ నవి పంచభూతైక, కారణంబులు సృష్టి ✽ కలనములును

గీ॥ జ్ఞాన కర్మేంద్రియమ్ములు ✽ తో నభంబు, నాదిగాఁ బంచతత్త్వంబు ✽ లంతరంగ
మన్నియునుగూడిపదియాఱు ✽ నయ్యెఁగార్య, కారణాకృతినుభయాప్తి ✽ గాంచుఁడాత్మ.

క॥ శర్వ! యతిసూక్ష్మ మిదిగన, సర్వోద్భవ మిట్టులయ్యె ✽ సంక్షేపవిధిన్
నిర్వచనముఁ జేసితి శ్రుతి, పర్వముగాఁ దెలిసి సర్గ ✽ పద్ధతిఁ గనుమీ. ౧౬౬

క॥ అని శంకరు మన్నించుచు, జనితోల్లాసమున మీరుఁ ✽ జనుఁడీ మీమీ
మనుకుల కని సుమనోవా, హనమిచ్చి త్రిలోకజనని ✽ యనుపుచు వారిన్. ౧౬౭

క॥ స్మరణంబుచేయ సాక్షా, త్కరణమొనర్చెదను విషమ ✽ కాలంబులలోఁ
బరమరహస్యముమీకున్, స్మరణంబున సర్వకార్య ✽ సంసిద్ధి యనన్. ౧౬౮

ఉ॥ మ్రొక్కి విమానమెక్కి సుర ✽ ముఖ్యులు మువ్వురు నాత్మశక్తులన్
నెక్కొను ప్రేమఁ గూడుకొని ✽ నిర్మల చిత్త సరోజ వీథులన్
దక్కిన యంబికాచరణ ✽ తామరసద్వయి భావనంబుచే
నొక్కటఁ బౌరుషాకృతుల ✽ నొందితి మబ్బురమయ్యె నయ్యెడన్. ౧౬౯

గీ॥ అంతలోన సుధా సింధు ✽ వంతరిప, మంబికా దివ్యసామ్రాజ్య ✽ మద్భుతంబు
గదుర నంతర్ధినొందె నకల్పజలధి, మున్ను మేమున్న యెడ నుంటి ✽ మున్నయట్లు.

సీ॥ త్రిజగత్పరాంబ యీ ✽ తెఱఁగున నాకును, హరునకు హరికి నా ✽ త్మావలోక
సాక్షాత్కృతి నొసర్చి ✽ యాక్షణంబునన యం, తర్ధినొందె నటంచుఁ ✽ దండ్రివలన
విని నారదుఁడు చాల ✽ విస్మయంబును బొంది, సగుణాసర్గమువింటిఁ ✽ దత్రిగుణయుతము
నిర్గుణంబెట్టిదో ✽ నిజముగాఁ బ్రకృతియుఁ, బురుషుండు నిర్గుణ ✽ భూతివలన

గీ॥ నెట్టులుందురో ? తద్వృత్తమిట్టియెడలఁ, దెలుపవలెఁజుమ్ము నేఁడొల్లి శ్రీవ్రతపము
పాండురద్వీపమునఁ జేసి పరుని గనఁగఁ, జాలనైతిని బటుయోగజాలములను.

గీ॥ తాపసాశ్రమసీమలఁ దపమొనర్చి, యమ్మహాత్ముల గోష్ఠుల నాలకించి
బహువిధోపాయముల సిద్ధిఁ బడయలేక, ప్రకృతి పురుషుల నిర్గుణభావ మరయ.

ఆ॥ వశముగాక యున్నవాఁడను గరుణించి, నిర్గుణం బెఱుంగ నేర్పుఁగొలిపి
తత్త్వరూప మెల్లఁ దండ్రి! నాకెఱిగింప, వలయు ననిన నజుఁడుఁబలికెనిట్లు.

—• బ్రహ్మ నారదునకు నిర్గుణసృష్టిస్వరూపము తెలుపుట •—

కం॥ నారద ! నిర్గుణరూపం, బారయ దృగ్గోచరంబె ? యటుగావున నె
వ్వారికిఁ దెలియని తత్త్వ మ,పారం బనుపమము దెలియఁబడ దింతైనన్. ౧౭౪

కం॥ దృష్టంబెల్లను ధరణిన్, నష్టంబగుఁగాన నిర్గుణము శ్రుతులందున్
దృష్టముగాదని పరమో,త్కృష్టతఁ బల్కుదురు మునులు స్థిరమతి ధరణిన్.

సీ॥ ప్రకృతియుఁ బురుషుండు భావనీయులు గాని, దర్శనీయులు గారు తలఁపనెందు
నాదియు మధ్యంబు నంతంబు వారికి, లేవు వేఱన్నను లేకయుండు
వేదమార్గంబులు విశ్వసించిన వారి, కభిముఖు లౌదురు విభులువారు
చైతన్యరూపులై సర్వభూతములందు, వ్యాపించి తేజస్స్వభావమునను

గీ॥ భావసప్తకమున సర్వభావములను, వెలియు లోనన నిండి వ్యాపించి తారు
లేనిచోటెల్లెడలఁజూడ లేక యుండి, ప్రకృతిపురుషులు స్వస్వరూపమున నుంద్రు.

వ॥ మఱియును జిద్రూపులును, నిత్యులును, నిర్మలులును, నేకరూపులును, నెల్ల
యెడలఁ దారులేనిచోటు లేక యుండువారును బ్రకృతియే పురుషుండును, బురు
షుఁడే ప్రకృతిగా నేర్పరింప నలవిగాకుండుదురు. తద్భేదం బేర్పరించి తెలియ
నలవియగునే యహంకారకృతం బగు స్థావర జంగమాత్మక ప్రపంచంబున విరతిం
దప్ప వేఱొకంటఁగన నతిసూక్ష్మంబు, సగుణుండై నిర్గుణంబు గనిమెదనని సంక
ల్పించిన మాత్రంబునన్ జొప్పడునె సాంగవేదాధ్యయనము లొనర్చియు సర్వ
శాస్త్రమర్మంబు లెఱింగియుఁ దదంతరంగం బెఱుంగ వశంబుగాదు పైత్యదోషం
బున నావరింపంబడు జిహ్వ రసభేదంబు లెఱుంగునే? దృష్టి చాక్షుషపరిజ్ఞానంబున
సమర్థంబగునే? యట్లు గుణత్రయసంఛన్నంబగు చిత్తం బాత్మతత్త్వం బెఱుంగఁ
జాలనేరదు, మఱి యహంకారజనితం బగు విశ్వం బహంభావవిరహితం బగు,
తత్త్వం బెఱుంగ నేరదు, గుణసాంకర్యంబున మునుంగు నంతవట్టు తద్దర్శనంబు
దుర్లభంబై యుండు నని చెప్పిన విని నారదుం డిట్లనియె. ౧౭౭

మ॥ భువనాధీశ! యహంకృతిన్ ద్రివిధమై పుట్టెన్ గదా? భేద; మీ
భువనంబుల్ గనఁ దన్మయంబులు గదా పొల్పొందు తద్భేదముల్
వివిధారంభ గుణత్రియోల్లసనముల్ వేర్వేఱ బోధింపు మె
ద్ది వినం గల్గిన ముక్తినొంది విరతిస్థేమంబు నా కబ్బునో? ౧౭౮

సీ॥ సత్త్వరజస్తమ స్తత్త్వగుణంబుల, మూటికి శక్తులు మూఁడు గలవు
జ్ఞానశక్తియుఁ గ్రియాశక్తియు ద్రవ్యశ,క్తియునాఁగ నమ్మూటికని విభేద
మెఱుఁగంగవలయును నెంతో సాత్త్వికమున, జ్ఞానశక్తియు రాజసంబునందుఁ
గ్రియయును ద్రవ్యశక్తియుఁ దామసంబున, వేర్వేఱఁ గందురు వివేకమతులు

గీ॥ తద్భవంబులు వివరింతుఁ దామసంబు, ద్రవ్యశక్తియుఁగూడి శబ్దంబు స్పర్శ
రూపరసగంధములఁ జేసె రూఢిమెఱసి, శబ్దగుణమయ్యె గగనంబు సరవిఁగనుము.

కం॥ అనిలంబు స్పర్శగుణమును, ననలంబున రూపగుణము నంబుల రసముల్
జను పృథివి గంధగుణమును, వినుమిది సూక్ష్మంబు వేదవితతం బనఘా! ౧౮౦

గీ॥ ద్రవ్యశక్తియుతంబులై తనరుఁ బదియుఁ, దామసాహంకరణ సృష్టిఁ దప్పకుండు
నిందిరియంబులు ప్రాణాదు లివి పదేను, రాజసగుణక్రియాశక్తి రంజితములు.

సీ॥ సాత్త్వికమ్మును జ్ఞానశక్తియు జతఁగూడి,దిగ్వాయుసూర్యాంబుధిపుల నాశ్వి
నేయుల ధీంద్రియనేతలఁ గనిమెను, నట్టుల కర్మేంద్రియముల కెల్లఁ
దప్ప దధిష్ఠాన దైవంబు లొప్పగుఁ, దెలియంగవలయు సుధీమణులకుఁ
జంద్రుఁడు బ్రహ్మయు శంభుఁడు క్షేత్రజ్ఞుఁ, డనెడు నంతఃకరణాధిపతుల

గీ॥ సాధనానందవృత్తుల సంఘములను, గాంచె నివి సాత్త్వికపుసృష్టి ఘనులు దీని
సూక్ష్మమనుజీవదేహంబు సూత్రమునని, పలుకుదురు వేదములునిట్లు పలుకుచుండు.

కం॥ పురుషునకుల్ స్థూలంబై, పరఁగెడు దేహంబు, వినుము పట్టీ! మును నే
వరుసన్ దన్మాత్రల తెరు,వరసి వచించితిని వానియందు జనించెన్. ౧౮౩

సీ॥ పంచతన్మాత్రలు పంచీకృతంబులై, పంచభూతముల యుత్పత్తి నెఱపి
పంచీకరణ కర్మపద్ధతి సంక్షేప,విధి నేను దెల్పెద వినుము వత్స!
మును రస తన్మాత్ర మొనసి మనంబుతో, జలభూత తత్త్వంబు సంతరించె
నటులు తత్తన్మాత్ర లంతరింద్రియముతో, నెనసి తత్త్వచతుష్క మేర్పరించె

గీ॥ నందుఁజైతన్య సంవ్యాప్తి నహమహమ్మ, టంచునభిమానముత్పన్నమయ్యెనదియె
సాధనమ్ముగఁ బురుషుఁడన్ సంజ్ఞఁబొదలె, సర్వగతమైన యట్టియాసత్తునకును.

కం॥ ఏకైక గుణవివృద్ధిని, నాకాశాదులు వివృద్ధి నందుచు బ్రహ్మం
డాకారము నొందినయద్ది, యీశ్వరుఁడది యటంచు నిశ్చయింపఁగ దరమే. ౧౮౬

వ॥ తత్ప్రకారంబు వివరించెద సావధానుండవై వినుము, గగనంబునకు శబ్దంబెకాని యొండుగుణమ్ములేదు. గంధవహునందు శబ్ద స్పర్శంబులును, ధనంజయునందు శబ్ద స్పర్శ రూపంబులును సలిలంబున శబ్దస్పర్శరూపరసంబులును, వసుంధరయందు శబ్ద స్పర్శ రూప రస గంధంబులును నేతద్విధంబున వర్ధితంబగు, నబ్జజాండంబు చతురశీతి లక్షజీవజాతులును మఱియుఁ దత్స్థావరజంగమాది భేదంబుల నగు సృష్టి సర్వస్వంబును మిళితంబై విరాట్టనంబడి పరమాత్మకు స్థూలదేహం బయ్యె, నివ్విధంబు మనంబునం దవధానింపుమని తెల్పి మఱియును. ౧౮౬

—• బ్రహ్మ సగుణ సృష్టిని దెలుపుట •—

కం॥ సృష్టిక్రమమెల్ల నతి, స్పష్టముగాఁ దెల్పినాఁడ బట్టీ! త్రిగుణీ
సృష్టీకరణముఁ జెప్పెద, వ్యష్టిసమష్టులను దెలియవలయుఁ జుమ్మా. ౧౮౭

సీ॥ సాత్త్వికం బానంద సంజ్ఞంబు దానిచే, సుఖ ముద్భవించు నా సుఖమువలన
నార్జవంబును సత్యమనుకంప లజ్జయు, శ్రద్ధా క్షమా ధృతుల్ శాంతి ముదము
మొదలగువానిచే నిది యెఱుంగఁగఁదగుఁ, బాండురచ్ఛాయచేఁబరఁగు సకల
సంతోషదంబయి శ్రద్ధ నుత్పాదించుఁ, దచ్ఛ్రద్ధ రాజసి తామసియును

గీ॥ సాత్త్వికియునై త్రిభంగులజగతిఁ దత్త్వ, వేత్తలగు మానివరులచే విశదముగను
రాజసగుణంబుఁ దెల్పెద రక్తవర్ణ, మప్రియోత్పాదక మగుచు నతిశయిల్లు.

శా॥ విద్వేషంబును ద్రోహమత్సరముఖావిర్భూతియున్ స్తంభమున్
విద్వద్వాసన నిద్రయున్ మొదలుగా వేర్వేఱ నీ చేష్టలన్
దద్వద్భావము గాంచఁగావలయు నంతర్వాణు; లప్పోల్కిఁగా
విద్వాంసుల్ మదగర్వమానముల నావేదింతు రుర్వీస్థలిన్. ౧౮౯

శా॥ ఆలస్యంబును నింద దైన్యము భయం బజ్ఞానమున్ మోహమున్
లోలత్వంబు విషాదమున్ గృపణతాలోభంబులున్ రోష దు
శ్శీలత్వంబులు నాస్తికత్వము పరక్షేమాసహిష్ణుత్వమున్
జాలంబున్ గుటిలత్వమున్ దమమునన్ జర్చింపఁగా నైజముల్. ౧౯౦

కం॥ నల్లనిదై యాపద వెద,చల్లుచు నరకాధివాస సాధకమై వ
ర్తిల్లెడు గావున వేత్తల, కుల్లమునన్ ముదము నింపదోయి కుమారా!. ౧౯౧

శా॥ శ్రేయోర్థుల్ రజమున్ ద్యజించి తమమున్ జెండాడి సత్త్వంబు సో
పాయప్రక్రియచే స్ఫుటం బగునటుల్ పల్మాఱు సాధించుచున్
మాయాబీజములౌ రజస్తమములన్ మాయించు టభ్యుచ్ఛ్రియం
బీయర్థంబు త్రి[illegible]నిశ్చితముగా నేఁబల్కితిన్ నారదా! ౧౯౨

కం॥ అన్యోన్యాభిభవాదృతి, నన్యోన్యం బగు గుణంబు । లఖిలజనాళిన్
మాన్యుల నన్యులఁ జేసియు, నన్యుల మాన్యులను జేసి । యయ్యవి యలరున్.

కం॥ ఇమ్ముల్కొంటిలోన నొండొం, డెమ్మెయి జనులందు నిలువ । దిన్నియుఁ గూడన్
గ్రిమ్ముకొని యుండ వెతలన్, దిమ్మవడంజేయు మాని దేశికునైనన్. ౧౯౪

శా॥ ఈయర్థంబు సవిస్తరంబుగ సుతా! । యేఁ దెల్పెదన్ విన్ము స్వా
త్మాయత్తంబగునేనిఁ జెప్పెదఁ దదన్యార్థంబుఁ దెల్పన్ జుమీ
పాయస్వానుభవంబునన్ దెలిసెఁ బారస్పర్య సాంకర్యమున్
దోయంజాలని వానివౌ త్రిగుణముల్ । ధూమాగ్నిహోమంబులౌ. ౧౯౫

కం॥ వినినన్ గనినన్ ముట్టినఁ, దినినన్ దత్ఫలము గనెడు । తెరువబ్బునొకో?
వినమిన్ గనమిన్ ముట్టమిఁ, దినమిన్ తత్ఫలముఁ జెందు । తెరువబ్బదొకో? ౧౯౬

సీ॥ గంగాది తీర్థముల్ । కలుషాపహములంచు నరిగి నీళులఁ దోఁగి । యందునిలిచి
నిత్య నైమిత్తిక । కృత్యంబులన్ దీర్చి స్నానదానంబులు । సలిపి సలిపి
యాత్మగేహముఁ జేరి ? యౌచిత్య మొనర రాగద్వేషముల నొంది కామరోష
కలితుండు గాఁడొకో । గంగకుఁ గలుషాపహారణంబు, ఫలమైన । నాగ్రహోదు

గీ॥ లఘములౌఁ గాదొ? పోమె నేయతని విడిచి, త్రిగుణములు సంకరత నొంది తెలియనీక
ఫలములను గొనిచని కర్తబడయనీవు, విత్త్వము నశింపఁ జేయు నవ్విధ మొనర్చు.

ఉ॥ చెట్టులు గొట్టి చేను ససిఁ జేసి త్రిహల్య మొనర్చి చుట్టునున్
గట్టగఁ గాపుఁ బెట్టి యొడి । గట్టుక విత్తులు పెట్ట మొక్కచాల్
పుట్టఁ బతంగముల్ కొటికి । పోయిన కర్షకునట్లు తీర్థముల్
మెట్టిన గౌణసంకరత । మేకొన నేర్చునె? కర్త సిద్ధులన్. ౧౯౭

ఉ॥ కామము లోభమోహములు । గర్వ మసత్యము మత్సరంబునున్
దామసమున్ గృహస్థునకుఁ । దప్పవు దుష్కృత మౌనొ? కాదొ? యి
జ్యామరుదర్చనాదుల నపాస్తతఁ జెందెనె? కావునన్ ధరన్
నేమమె గోరువారికిని । సిద్ధి లభించునె? తత్త్రియాదృతిన్. ౧౯౮

సీ॥ శాస్త్రప్రదర్శనముచే । సత్త్వంబు వైరాగ్య, జనకమై ఫలమొందు । సమయమునను
రాజస తామసారంభంబు గలిగిన, సత్త్వంబుఁ జెడుటకు । సందియంబె?
యట్టులీ రెండును । నభివృద్ధిఁ బొందిన, యెడ సత్త్వ మారెంటి । నడఁచివైచు
సత్త్వవృద్ధిని ధర్మసంగ్రహాపేక్షలు, జన్మించు నంత రాజసము తమము

గీ. నడఁచి మోక్షాభిలాషివై । యాంతరంబు, ననుపమంబగు పరమాత్మ నందఁ జేసి
శుద్ధ సత్త్వాతిశయమున జూనిపికొనుచు, బ్రహ్మసాయుజ్య మొందుట పరమహితము.

ఉ॥ రాజసవృద్ధిచే మన మహారాతి వినిగ్రహ భోగ వాంఛలన్
భూజనులన్ మదోల్లసనభూతిఁ బ్రవర్తిలఁజేయు నంతలో
నైజమెకానఁ దామసమునన్ స్ఫురితంబుగఁజేసి మాపుచో
రాజసవృత్తులన్ బెరిఁగి రా గుణముల్ పరవృద్ధి నైఁచునే? ౨౦౧

ఉ॥ తామసవృత్తిచే నిగమధర్మములన్ గడురోఁతఁబుట్టు ను
ద్దామ పరాపకారకృతి తదత్పరతన్ జొరఁజూచు నంతలోఁ
దామును సత్త్వమున్ రజము దాని నడంచి స్వకృత్యకర్తృతా
ధామములై పయింబడిన తామసమల్లె యడంగుఁ గర్తకున్. ౨౦౨

కం॥ లోకములో జనముల కిది, ప్రాకటమగు గుణము దీని పద్ధతివిడువన్
జీకాకై యిహపరముల, శోకకు నెలవగుచు సమసిపోవున్ జుమ్మీ! ౨౦౩

కం॥ క్షణికంబగుచు గుణత్రియ, మణుకాలంబైన విడక యాయాస మవా
రణఃజేయుచుండుఁ గర్తకు, గుణబంధము ప్రాణులందు ఘూర్ణిల్లుఁజుమీ. ౨౦౪

ఆ॥ మిథునధర్మములను మితిమీఱి గుణములు, దానిఁజెఱుప నదియు దీనిఁజెఱుప
నదియునగుచు నెసఁగునదిగాన గుణపోష, మడఁచు టభ్రకుసుమమనఁగవచ్చు.

ఉ॥ స్త్రీపురుషుల్ పరస్పరము చిత్తములన్ గరఁగించి యింద్రియే
చ్ఛాపరతంత్రులై విహృతి సల్పెడు మాడ్కి గుణత్రయంబు ను
ద్దీపితనిత్యసంగమ విరోధిన్ బ్రకటింపుచుఁ దీపిఁగొల్పుచున్
దీపులు తీపులౌనటుల దెప్పిరలేవుసుమీ! తనూభవా! ౨౦౬

కం. అని బహువిధములఁ దెల్పిన, విని నారదుఁడనియెఁ దండ్రి వింటి గుణకథన్
వినియును దృప్తిం జెందను, వినవలఁతున్ మఱియుఁ జెప్పవే! యన నజుఁడున్. ౨౦౭

## — గుణముల వివరము —

మ. అనుభూతంబులు నాకు నిన్నియు నసమ్యగ్జ్ఞుండ నీప్రశ్నకున్
జనితోత్సాహత నుత్తరం బిడుదు సుస్వాంతుండవై విన్మ క
న్గొనఁగా సత్త్వము మిశ్రభావమును బూనన్ గాని యయ్యాకృతిన్
గనరా దెప్పటి కెంతవారికిని నే కాలంబునన్ బుత్రకా! ౨౦౮

సీ. అత్తమామలయందు నాఁడుబిడ్డలయందుఁ, బతి సుత బంధు సపత్నులందు
ననుకూలమైయుండు [illegible], సత్త్వంబు సకలైకసమ్మతంబు

గార్హస్థ్యవృత్తిగాఁ గాంతకు రాజస, తామస వృత్తు లంతంతనలమ
విపరీతమైనట్లు విమలసత్త్వంబును, దామసరాజసాంతరిత మగుచు

గీ॥ పూర్వగుణ వైపరీత్యంబుఁ బొందుచుండుఁ, గర్తకును భావసిద్ధతఁ గాంచ మించి
గుణసముల్లాస మిటులఁగన్గొనఁగ వలయు, ననిన నన్యోన్యసంబంధ మడఁగ దెపుడు.

వ॥ మఱియును సౌందర్య గుణ సముల్లాసినియు లజ్జాది గుణ మధురయు వినయ సం యుతయుఁ గామకళా కుశలయు ధర్మానుకూలయుఁ బతిప్రీతికారిణియు నగు పత్ని సపత్నుల యెడ నాగ్రహంబువలన దుఃఖాత్మికమై యుండుఁ గావున రజోగుణంబును స్వభావవిషమంబయ్యును సత్త్వంబు నవలంబించుం గావున గుణంబులకు మిశ్రీభావంబు తొలంగనేరదని చెప్పి మఱియును, ౨౧౦

సీ॥ క్షత్రికులుండును సర్వాయుధ ధరుండు, రణసాహసమున శూరతఁగడంగి
యరుల మర్దింపుచు నట్టిసేనలుగొంచు, జారచోరాదులఁ జంపి సాధు
జనులరక్షించు రాజన్యుపోలికఁ దామ, సం బతితరవిషమంబునయ్యు
నొక్కొక్కతఱి సత్త్వ మొందుట గాదొకో, జనరక్షణాక్షీణచతురిమములఁ

గీ॥ గానగుణములు తమలోనఁ గలసిమెలసి, న్యూనతాధిక్య సమ వర్తనోద్యమముల
వర్తిలుచునుండుఁ గాన నెవ్వారికైన, గుణవిభేదంబు దెలియంగఁ గూడ దెపుడు.

సీ॥ స్తనిత విద్యు ద్వర్ష సంయుతాంభోధర, ధూర్వహంబగు నొక్కదుర్దినంబు
కర్షకులకు మేలు గల్పించి తృణకాష్ఠ, సంగ్రహీతలకుఁ గష్టము ఘటించి
పోషితులగునట్టి పురుషుల నెలఁతలఁ, గామసంప్రేరణఁ గలయఁజేసి
యేకరూపంబమై యివ్విపరీతతఁ, గన్నట్లు త్రిగుణసాంకర్య మవని

గీ॥ సత్త్వలక్షణములకు నాస్థానమగుచు, సాత్త్వికత రాజసతఁ దామసతను గర్త
నభినయించుచు నొకఁడొకఁడతిశయించి, స్వస్వరూపంబుఁ బ్రకటింపఁజాలియుండు.

ఉ॥ ఎవ్వనియందు సత్త్వము సమిద్ధముగా విలసించు నచ్చటన్
మవ్వపుమాటలున్ మనసు మచ్చికలున్ విశదప్రకాశమున్
అవ్వకుమార్గగంబు ముఖరమ్యతఁ దేటయు ధర్మవాంఛయున్
నివ్వటిలున్ గదా! సుగుణసారథి! యంచు వచింపఁగాఁదగున్. ౨౧౩

ఉ॥ ఎచ్చట రాజసం బతిశయించునొ? జృంభయు స్తంభమున్ బలం
బిచ్చఁజరించు నాశ కలహేచ్ఛయుఁ జంచలచిత్తమున్ జనుల్
మెచ్చు వచశ్చమత్కృతులు మేయెుఱపుల్ విలసిల్లుచుండఁగా
నచ్చట సూక్ష్మవేదులకు నయ్యయి జాడ లెఱుంగ నయ్యెడిన్. ౨౧౪

ఉ॥ తామసవృత్తి యేపురుషునందు వసించునో? వానికెందుని
ద్రామయవృత్తి ధార్మికవిరక్తి మనోమననాదిశూన్యతల్
ధీమధురత్వహైన్యమును దిప్పఁగరాని మనోజవాసనల్
ప్రేమములేమియున్ సహజవృత్తులుగాఁగ గణింపఁగాఁదగున్. ౨౧౫

కం॥ ఇవ్విధమున విధి పలికిన, నవ్విబుధమునీంద్రుఁడనియె నవనిన్ గుణముల్
జివ్వకును దా గణించిన, యవ్వడువున నుండుఁ గర్త కగునే చెయువుల్. ౨౧౬

కం॥ ఒకచోఁ బ్రతిపక్షులవలె, వికటములై జనులనెల్ల వేధింపంగా
నొకచోట నొకనికైనను, నొకకర్జంబైనఁ జేయ నోనరునె? యనిన్. ౨౧౭

సీ॥ వినుము నారద! గుణవృత్తుల విధమెల్ల, దీపవర్తులపోల్కిఁ దేజరిల్లుఁ
దైల మర్చియు వర్తి త్రియముఁగూడిన నర్థ, సిద్ధియాఁగద? ధాత్రిచేతనులకు
వర్త్యాదు లన్యోన్య వైరుద్ధ్యముననుండి, కార్యసిద్ధి నొనర్పఁగలుగునొక్కొ?
యటుల సత్త్వాదులు నైక్యమొందుచుఁ గార్య,కరణసామర్థ్యంబుఁగలుగఁజేయు
ఆ॥ సగుణవృత్తికార్యచతురంబు గాకున్న, నిర్గుణమునఁ గార్యనియతిగలదె?
యనుచుఁదెల్ప మనమునందు సంతసమొంది,నాఁడ ననుచుఁ బలికె నారదుండు.

కం॥ నీవడిగిన ప్రశ్నంబున, కీవృత్తము నిశ్చయార్థహేతు వటంచున్
భూవరునకు సత్యవతీ, దేవీనందనుఁడు దెల్పి స్థిరమతి ననియెన్. ౨౧౯

ఉ॥ ఓజనమేజయా! వనజజోక్తము నారదవక్త్రనిర్గతం
బై జగదేకహృద్యమగు నట్టి చరిత్రముఁ దెల్పినాఁడ న
వ్యాజముగాఁగ నుత్తరము వచ్చెనె? ప్రశ్నకు; దీనఁ గీర్తి ల
క్ష్మీజయసౌఖ్య సంపదలు సిద్ధి భవద్వశమయ్యె నియ్యెడన్. ౨౨౦

ఉ॥ ఏ పరశక్తిచే జగము లెంతయు వ్యాప్తము లయ్యె నట్టి దే
వీపరికల్పితంబు పృథివీముఖ తత్త్వకదంబకంబు త
ద్దీపిత మీచరాచరము ధీవిశదంబుగఁ గాంచు భేదదృ
గ్రూపితమైనయట్లెసఁగుఁ గూర్మి జగజ్జనయిత్రి మాయచేన్. ౨౨౧

కం॥ పరుఁ డవ్యయుఁడు నిరీహుఁడు, పరిపూర్ణుఁడు పురుషుఁడీప్రపంచమున కుదా
హరణముగాదు చరాచర, మరయ మహాప్రకృతివలన నయ్యె మహీశా!

సీ॥ బ్రహ్మ విష్ణు మహేశ భాను చంద్రమహేంద్రు,లాశ్వినేయ త్వష్టృ యక్షపతులు
వసువులు వరుణుఁడు వహ్ని వాయువు రవి, విఘ్నేశ గుహ ముఖుల్ విశ్వకార్య
కర్తలౌదురె? శక్తి కలితంబుగానిచో సంచలింపన్ జేయ శక్తిగలదె?
యీజగతీరాజ్యమెల్ల నేలఁగ శక్తి, యాదికారణము నరాధినాథ

గీ॥ అట్టిపరమేశ్వరినిఁ గొల్వ నర్చసేయు, మభినుతింపు మద్దేవి నీ కకహరహంబు
నిత్యసంతృప్తిఁగూర్చి నిర్ణిదవృత్తిఁ, గొలిచిమనుటయె సంసృతిగెలిచి చనుట.

వ॥ మఱియు మహాలక్ష్మియు మహాకాళియు మహాసరస్వతియు భూతేశ్వరియు సర్వకార
ణంబును సుఖసేవ్యయు నవ్యయయు దయాన్వితయు నామోచ్చారణమాత్రంబున
సకలవాంఛితార్థప్రదయు బ్రహ్మాదినిఖిలదేవతారాధ్యయు నిగృహీతమనస్కులై
మోక్షకాములగు తపస్విజనంబులకు ముఖ్యోపాస్యయు నగు నమ్మహాదేవి నామం
బవశంబుననైనను వర్ణలోపాధిక్యంబులనైనను నుడివినంత మాత్రంబున దుష్ట
వ్యాఘ్ర భుజంగ వృశ్చిక చోర శత్రు ప్రముఖ సాధ్వసంబుల నడంచి రక్షించు
చుండు. ౨.౨౪

కం॥ ఇందుకు దృష్టాంతముగా, ముందొకచో వింటి, నేను ముచ్చట హృదయా
నందముగఁ దాపసోత్తమ, బృందముచే నదియు నేను వినిపింతుఁ దగన్.

సీ. జఠరగోళమునందుఁ జక్కఁగాఁ బనిఁబూని, కాంచిన నొక్కయక్షరములేదు
పరమమూర్ఖుం డనక్షరకుక్షి, యలసుండు, సత్యవ్రతుండు ద్విజన్ముఁడొకఁడు
కిటిమోరనుండి యొక్కట వినంబడినట్టి, ఐకార మాలించి యందు బిందు
హీనమైనను దాని నెడద నుడువుటచే, సంతుష్టమై జగజ్జనని దేవి

గీ॥ బిందుహీనాహ్వయంబైనఁ బ్రియముదవిలి, కవిశిరోమణిఁ జేసెను జ్ఞానియయ్యె
నన్నిలోకంబులందుఁ బ్రఖ్యాతిఁగాంచెఁ, గాళికాదేవి నెన్నంగఁగలమెమనము?

క॥ సారమసారముగాఁగ న, సారము సారముగఁ జేయు జగదారాధ్యన్
గొరిభజింపుము తద్విధి, యారయ వివరింతు వినుము హర్షంబెసఁగన్ ౨.౨౬

కం॥ సత్యవతీనందనుఁ డిటు, సత్యవ్రతుచర్యఁ జెప్ప జనమేజయుఁ డా
సత్యవతీనందనుఁగని, సత్యవ్రతు వృత్తి వినఁగ సంతసమొదవన్. ౨.౨౭

శా॥ ఏదేశంబున నుద్భవించె నతఁ డేయేవృత్తి జీవించెనో?
యీ దీనాత్మునకిట్టి సిద్ధి యెటులయ్యెన్ బీజ మెట్లబ్బెఁ గా
ళీదేవీ కరుణైకపాత్రమయి యేలీలన్ బ్రకాశించెనో?
వేదవ్యాస! సవిస్తరంబు వినఁ దద్వృత్తాంతమున్ దెల్పవే. ౨.౨౮

కం॥ నావిని వేదవ్యాసుం, డావిభుతో, ననియెఁ దాపసాశ్రమసీమన్
నేవింటిఁ దొల్లి యొకురు, భూవర! విను మిప్పురాణపుణ్యాచరితమున్.

సీ॥ తీర్థసేవాసక్తిఁ దిరుగుచు నొకనాఁడు, నైమిశారణ్యంబునకు నరిగ
పావనంబగు మౌనిపరిషత్తుఁగని యందుఁ, బుత్రులునుం బౌత్రపౌత్రులును మ

హోవ్రతుల్ ముక్తులు నగువారి సేవించి, యందున్న జమదగ్ని యను మహర్షి
మౌనులఁ జూచి యో మహితాత్ములార! సందేహ మొక్కటి నాదు మోహవశత

గీ॥ మదిజనించెను సందేహ మజ్జనంబు, తగునె మీసన్నిధిని దానిఁ దప్పఁ ద్రోయ
వలెనటంచును నమ్మౌని పల్కె నపుడు, దేవతాపూజ్యతత్త్వంబుఁ దెలియఁ దలఁచి.

శా॥ శర్వుండో? హరియో? విరించియొ? బిడౌజస్సూర్యచంద్రాగ్నులో?
గుర్వాదిగ్రహబృందమో? వరుణుఁడో కోక్కో? త్వష్టృసేనానులో?
సర్వాధీశులు సర్వకామదులు పూజాయోగ్యు లీయర్థముల్
సర్వంబుల్ వివరింపఁగాఁ దగుదు మత్స్వాంతంబు శాంతంబుగన్. ౨౩౩

గీ॥ రేణుకావల్లభుం డొనరించుప్రశ్న, విని సవిస్తరముగ మౌనివిభుఁడు రోమ
శుండు చెప్పెను మునులెల్లఁ జోద్యమందఁ, దాపసోత్తముఁ డౌ జమదగ్నితోడ.

మ॥ పలువుర్ దేవతలేల? ముక్తికయి సర్వప్రార్థనీయంబు దే
వలలామంబు జగత్పరాంబ మురజిద్బ్రహ్మాది సంసేవ్య వే
దలతాపక్వఫలంబు సర్వద జగత్ప్రారంభమూలంబు కే
వలచిద్రూపిణి యాదిశక్తియసుమీ వాదింప నింకేటికిన్. ౨౩౪

కం॥ స్మరణోచ్చారణమాత్రత, వరములొసంగుచును భక్తవత్సల యగుచున్
గరుణావరుణాలయయగు, పరదేవిన్ గొల్చుటయె శుభం బెల్లరకున్. ౨౩౫

మ. ఇతిహాసంబు వచింతు మౌనులు! వినుం డేకాక్షరోచ్చారణా
హృతి విప్రుండొకఁ డంబికాకరుణసార్ద్రీభూతజన్ముండు స
ద్గతికిన్ బోయె వినుండు కోసలములన్ క్ష్మాదేవవర్యుం డొకం
డతివిఖ్యాతుఁడు దేవదత్తుఁ డనపత్యత్వంబునన్ డయ్యుచున్. ౨౩౬

మ॥ తమసాతీరమునందు వేదవిదులౌ ధర్మజ్ఞులన్ గూర్చి యు
త్తమమార్గంబున సూత్రసూక్తివిధిసిద్ధాంతంబుగా వేదికా
సమకుండంబుల వహ్నులన్ నిలిపి సత్స్వాహావిధానంబునన్
బ్రమదం బొప్పఁగ నందనేష్టి సలిపెన్ బ్రహ్మన్వయుల్ మెచ్చఁగన్. ౨౩౭

వ॥ అందు సుహోతుండు బ్రహ్మయు యాజ్ఞవల్క్యుం డధ్వర్యుండును బృహస్పతి హోతయును గణ్వుండు ప్రస్తోతయు గోబిలుం డుద్గాతయు గౌతమ గాలవాదులు సభాసదులుగా సాంగదక్షిణ లొసంగుచు సవనం బొనర్చునెడ నుద్గాతయగు గోబిలుండు సప్తస్వర సమన్వితంబుగా రథంతరసామంబు గానంబు సేయుచుండ స్వరభంగం బగుటవలన దేవదత్తుండు గోబిలున్ జూచి కోపించి యిట్లనియె. ౨౩౮

గీ॥ ఎంతమూర్ఖతముఁడ విట్టిచో మత్కామ్య, కర్మమధ్యమున నశర్మదంబు
స్వరవిభేద మెట్లు సల్పితి వనఁగ న,గ్గోబిలుండుపల్కెఁ గోపమడరి. ౨౩౯

— గోబిలుఁడు దేవదత్తుని శపించుట —

ఉ॥ మూఢుఁడనై నను౯ బదరి ముచ్చటఁజెప్పెదు శ్వాసవేగము౯
గాఢముగాఁగ నత్తెఱఁగు గన్పడె నీ కది దోష మంచు నీ
ప్రౌఢతనంబుఁ జూపెదవు పాపము నాయెడలేదు గాన న
వ్వ్యాధమనస్కుఁడు౯ శఠుఁడుఁ బుత్రుఁడు గాఁగలఁ డంచుఁ బల్కిన౯. ౨౪౦

శా॥ అమ్మాటల్ విని శాపభీతుఁడయి దుఃఖావేశము౯ జెంది తా
నమ్మౌని౯ గని దేవదత్తుఁడు వృథాహంకార మేలయ్యా! నీ
విమ్మై నేల శపించె దక్కట! తపస్వీంద్రుల్ గతద్వేషు ల
ల్ప మ్మౌనేరము సైఁప కిట్టులు శపింప౯ జూచితే? యోమునీ! ౨౪౧

ఉ॥ పుత్రవిహీనతన్ బొరలి పొక్కుచునున్న నపుత్రి నయ్యయో!
శత్రుఁడువోలె ఘోరమగు శాప మొసంగితి మూర్ఖబుద్ధి యో
పుత్రునిఁ గాంచుకంటెను నపుత్రికుఁడౌటయె మేలు ధాత్రిలోఁ
బాత్రుఁడు గాఁడు మూర్ఖుఁడని పల్కరె? వేదవిదుల్ మహీసురా! ౨౪౨

గీ॥ పశువువలెశూద్రుపోల్కి నపాత్రుఁడై య, యోగ్యుఁడౌ సుతుఁగాంచి; యయోగ్యవృత్తి
నెట్లు మనియెద శూద్రుండయేని మేలు, మూర్ఖుఁడౌ విప్రుకంటె నీపుడమి వినమె?.

సీ॥ మూర్ఖుఁడౌ విప్రుండు ముఖ్యపూజాదాన, హోమాదులందు నయోగ్యుఁడనుచు
పార్థివుల్ శూద్రుని భంగిఁ జూతురు వాని, నిగమవర్జితుఁడు దుర్జన్ముఁడునతండు
కరదుండు శూద్రుని కై వడి ముట్టంగ,రానివాఁ డర్హత లేనివాఁడు
కర్మసిద్ధికి దేవకార్యంబులందును, బిత్రుకార్యములయందుఁ బిలువఁదగఁడు
గీ॥ కుశలమెదఁగోరి నేనియుఁగుశలకైన, శ్రాద్ధ మిడవచ్చు మూర్ఖుని జనదు పిలువ
వానితోఁ భోక్తగారాదువాఁడు మెసవు, నన్నమున కన్న నిడఁగరాదధిక మెందు.

శా॥ వానిం బాత్రుని గాఁగ నెంచఁదగ దెవ్వండేని యే మిచ్చుచో
వాని౯ బాత్రునిఁగాఁగఁ జూడఁదగ దెప్పాట౯; ధరిత్రీవిభుల్
దానాదానములందు మూర్ఖజనుల౯ దార్పంగఁ గండ్రేని ఆ
భూనాథుల్ మఱి వారిరాజ్యముఁ గదు౯ భూభారము౯ జెందెదు౯.

కం॥ పుడమిని నెవ్వాఁడు మూర్ఖుం,డిడు నన్నముఁగుడుచు వానియేడుతరంబుల్
కడఁజనిన పితరులెల్లను, బడుదురు నరకాగ్నిశిఖల బహువత్సరముల్. ౨౪౬

కం॥ ఆసన పూజన దాన ని,వాసములన్, మూర్ఖవిబుధ ఽ వైరుద్ధ్యము లే
దే సభ నిలువన్ గూడదు, దోసములకు వెఱచు,కోవి ఽ దుల కా ఽ సభలోన్.

కం॥ ఎచ్చోట దానమానము,లెచ్చు మూర్ఖులకుఁ గలవొ? ఽ హేయంబని తా
రచ్చోట నిలువనొల్లరు, సచ్చరితులు నిరయభీతి ఽ సందియపడుచున్. ౨౪౮

మ॥ పిచుమందంబులు పూచికాచి ఫలసం ఽ భిన్నంబులై వేఁటులన్
ఖచరన్నీచములైన కాకములకొ ఽ గా! యట్లు దుర్మార్గు లా
కుచరుల్ వర్ధిలఁజేయు సంపదలు మూ ఽ ర్ఖుల్ తృప్తి నొందంగ నా
సుచరితుండవు మాని విట్లు పలుకన్ ఽ క్షోభంబుగల్గెన్ గదా. ౨౪౯

ఆ॥ వేదవేత్తయైన ఽ విప్రుండు తనయింటఁ, దృప్తిఁ జెందెనేని ఽ దివిని సాప్త
పూరుషంబు సుగతిఁ ఽ బొందించుఁ బితరుల, మూర్ఖు రోయుఁగాదె ఽ ముజ్జగములు.

మ॥ మృతికన్నన్ గడు గర్హ్యమైనది గదా ఽ మిత్రుండనా నాకు నీ
వతికోపంబున నిచ్చుశాపము దురం ఽ తాయాసమున్ గొల్పె సం
భృతదాక్షిణ్యుఁడవై కృపన్ గొనుము నన్ ఽ బ్రేమంబునన్ జూడు సం
తతమున్ నీ చరణాంబుజంబులకు నే ఽ దండంబు లర్పించెదన్. ౨౫౧

మ॥ అనుకంపాతిశయంబుచేఁ గనుమటం ఽ చద్దేవదత్తుండు వి
ప్రునిపాదంబులమీఁద నడ్డపడి సా ఽ శ్రుండై కడున్ దీనతన్
నను రక్షింపుము కావుమీవె యని నా ఽ నాస్తోత్రవాక్చాతురుల్
దొనరన్ వేడిన గోబిలుండు కరుణా ఽ ర్ద్రుండై రుషన్ వీడుచున్. ౨౫౨

ఉ॥ దావముఁబోలె డెందమునఁ ఽ దందరఁబెట్టెడు తాపమార్చి య
బ్బావిబుధున్ హిమాంబువులఁ ఽ బోలెడు చల్లని చూపుఁజూచె నో
పావకయుక్తి నుష్ణమగు ఽ పాథము వహ్నియడంగఁ జల్లనై
పోవదె? యంత దీనుఁడగు ఽ భూసురుఁ గన్గొని పల్కె సత్కృపన్. ౨౫౩

ఆ॥ నీదు వినయవృత్తి ఽ నే మెచ్చినాఁడను, మొదల నీ సుతుండు ఽ మూర్ఖుఁడయ్యు
వేదవేత్తయగుచుఁ ఽ బృథివి వర్తిలుఁగాత, మనుచు నానతిచ్చె ఽ నతిముదమున.

సీ॥ ద్విజవరేణ్యుండగు ఽ దేవదత్తుండంత, నధ్వరంబు సమాప్తి ఽ నందఁజేసి
యవభృథంబొనరించి ఽ యవనీసురులకెల్ల, సాంగదక్షిణ లిచ్చి ఽ యనిపి పిదప
సుఖభోగ సంయుక్తి ఽ సుదతియా రోహిణీ, సన్నిభ రోహిణి ఽ సంతతంబుఁ
గలసి సుఖించుచో ఽ గర్భంబును ధరించె, సీమంతముఖ కర్మ ఽ సిద్ధిఁబడసి
గీ॥ యిష్టి సఫలంబుగా నెంచి ఽ హితుల నతుల, దానమానంబులను దృప్తిఁ ఽ దనియఁజేసి
ముదితుఁడై యుండఁగనియె నా ఽ సుదతిసుతుని, శుభదినముహూర్తతారకా ఽ విభవమెసఁగ.

## సత్యవ్రతుని జననము

సీ॥ పామరాదులయందుఁ బండితాదులయందు, బుధులే దనిపించి పుట్టుఁబోసి
విరసవాటులయందు సరసకోటులయందుఁ, బేరుగాంచునటంచుఁ బేరుపెట్టి
జారచర్యలయందు ధీరవర్యులయందు, మేలుబంతి యటంచు జోలఁబాడి
ద్విజ బంధువుల గుణవ్రజసింధువుల నెల్లఁగావఁగాఁ గలఁడంచుఁ గాపుఁబెట్టి

గీ॥ తల్లిదండ్రులు కూర్మిచేఁ దనయు నిట్లు, నాఁటఁబెంచెడు వానిఁబూఁటఁబెంచి
ముదము దళుకొత్తనెల్లరు ముద్దుసేయ, వర్ధిలె నుతథ్యుఁ డనుపేర వసుమతీశ!

ఆ॥ ఓ కుమార! తథ్య మొనరంగఁ బల్కుచు, వెలయుమని పురాణవేత్తలెల్లఁ
జంద్రదర్శనంబు సల్పి యుతథ్యుఁడన్, పేరువెట్టి రపుడు పేర్మి మెఱయ.

కం॥ గర్భాష్టమహాయనమున, నర్భకు నుపనీతుఁజేసె, నతిముదమునఁ బ్రా
దుర్భూత శుభదినమ్మున, గర్భశ్రీమంతుఁ డగుచుఁ గనియెన్ సిరులన్.

సీ॥ అధ్యాపకులయొద్ద నధివసింపఁగఁజేసి, తండ్రి వేదాభ్యాస తత్పరమతిఁ
జొనుపంగఁ బ్రణవమైనను నుచ్చరింపక, ముగ్ధుండువోలెఁ దా మూతి ముడుచు
బెక్కుమాఱులు తండ్రి బెదరింపఁ బరుగెత్తి, చాటుమాటులకుఁబోదాఁటుచుండు
మనము నొల్లదు నిగమము పఠింపఁగ నెంతో, బతిమాలుకొన్నఁదా బండవాఱు

గీ॥ తనయు మూర్ఖతఁగని తండ్రి తహతహపడఁ, బదియురెండేండ్లుజరిగినప్పటికిఁజదువు
లేదు సంధ్యయొక్కింతయు రాదు కరము, తిరుగుఁబలుగాకియై వాఁడు దిమ్మరీఁడు

ఉ॥ తల్లియుఁదండ్రియున్ బహువిధంబుల బంధువులెల్లఁజూచి ఛీ!
"లల్ల" యటంచుఁదిట్టఁ గడు లజ్జ మునుంగుచు నింటనుండఁగా
నుల్లమురాక దుష్టమృగయూధసమాకులకాననంబులన్
దల్లడ మింతలేక మృతితత్పరుఁడై తిరిగెన్ దనంతటన్. ౨౬౦

ఆ॥ అంధుఁడైనఁ బంగుఁడైనను మఱిమఱి, మూకుఁడైన మేలు మూర్ఖసుతుఁడు
గలుగుకంటె ననుచుఁ దలిదండ్రులిరువురు, విడిచియూరకున్న విప్రసుతుఁడు.

### — సత్యవ్రతుఁడు వనమున నివసించుట —

శా॥ గంగాతీరముఁజేరి పర్ణకుటికన్ గల్పించి యందుండి స
ర్వాంగంబుల్ కడుశోషిలన్ బరుషవన్యాహారముల్ మెక్కి ని
స్సంగుండై నియమవ్రతాచరణసంసక్తిన్ బ్రవర్తింపుచున్
భంగంబొందని బ్రహ్మచర్యమున విభ్రాజిష్ణుఁడై సుస్థితిన్. ౨౬౧

కం॥ సత్యంబె నుడువువాఁడ న,సత్యంబును బలుకననుచు సమమతితోడన్
నిత్యవ్రతచర్య ద్విజా,పత్యము నివసించె సత్యపరత విరక్తిన్. ౨౬౩

సీ॥ జపతపోధ్యానముల్ సంధ్యలు దేవతా,ర్చనము ప్రాణాయామసరణి భూత
శుద్ధి ప్రత్యాహృతి శుచివృత్తి గాయత్రి,మంత్రకీలకములు మానానియతి
ప్రాణాగ్నిహోత్రంబు బలిదానహోమంబు,లతిథిపూజనములు నాచమనము
నేగోడు నెఱుఁగక వృషలునిబలె నీట,మునిఁగి సంకల్పంబు మున్నె లేక

గీ॥ తరణి కడు నింగికే తెంచు తఱినివన్య, ఫలములోకకొన్ని యార్జించి భక్ష్యములు న
భక్ష్యములటంచు నెఱుఁగక భక్షణంబు,సలిపి నివసించుఁ దనపర్ణశాలయందు.

క॥ అవశతనైన నసత్య,మ్ముఁ వచింపఁడు తనదుప్రాణముల పోకకునై
న వశుండగుఁగాని వచో,ఽనవహితుఁడగుటెఱుఁగఁ డాద్విజాత్మజుఁడెందున్.

ఉ॥ అచ్చటనచ్చటన్ దిరుగునట్టి నిషాదులు భిల్లులున్ మునుల్
వచ్చుచుఁబోవుచున్ గనుచు వాఙ్నియమంబుఁ దలంచి యెల్లరున్
సచ్చరితుం డితండు కడుసత్యతపోధనుఁడంచుఁ బల్కఁగా
నొచ్చెము లేదటంచు గడునూహయొనర్చిరి నాఁడునాఁటికిన్. ౨౬౬

చ॥ హిత మహితంబటం చెఱుఁగఁ డెవ్వరికిన్; గడుపారఁగా ఫల
వ్రతతులుమెక్కి పర్ణకుటి భల్లుకమున్బలె నిద్దురించు నా
తతగహనాంతరం బనఁడు దర్పితవన్యమృగావిలంబు సం
తతఫణిభీకరం బనుచు దారకుఁ డేభయమెంచఁ డాత్మలోన్. ౨౬౭

సీ॥ అయ్యయో! ప్రతిభయంబగునరణ్యంబునఁ, గష్టింపవలసె వ్యాఘ్రంబులేని
యొకచోటఁబైఁబడి మెకవు మృతిలేక, చిక్కితి మూర్ఖుని జీవనంబు
పుడమికిభారంబు చెడుగుదైవము మూర్ఖుఁ,గాఁజేసె నింతకుఁ గారణమ్ము
దైవంబె ద్విజులిండ్లఁ దప్పఁబుట్టితి నింక, నేమి సేయుదు మఱి యెందుఁజొత్తుఁ

ఆ॥ పాలులేనిగోవు ఫలరహితంబైన, చెట్టు బిడ్డలేని చేడెవోలె
తనదుజన్మ విఫలతను బొందె నక్కటా!, యనుచుఁ బొక్కు నీరు గనులనించు.

కం॥ పరులను నిందించుట కడు, దురితము దైవంబ యింతధురపిల్లగఁజే
సెర! దక్షులెవ్వరిఁక నీ, ధరణిన్ దాఁజేయుకర్మ తను విడిచెడినే? ౨౬౯

ఉ॥ పుస్తకమైనఁగట్టి యొకభూసురవర్యున కియ్యలేదు స
ర్వ్యాస్తవనీయదాన మయి రంజిలు విద్యయు నైనఁజెప్ప లే
దాస్తికునొద్ద ధర్మవిధులైనను నే వినలేదు గాన నీ
దుస్తరఘోరపాతకముచే [illegible] బ్రాహ్మణజన్మమెత్తితిన్. ౨౭౦

చ॥ గురుతరపుణ్యతీర్థములఁ గ్రుంకనొ ? సాధుజనాంఘ్రిసేవలన్
బరిణతినందనో ? యిటు లపారమనోవ్యథఁ గుందుచున్ భయం
కరగహనాంతరస్థలులఁ గ్రాఁగుచు వ్రాత్యుఁడనైతిఁ బాప డెం
తెఱఁగొ కజన్నిదంబునను దేక్కొనె నన్యము లేదొకింతయున్. ౨౭౧

గీ॥ వేదశాస్త్రార్థ పారగుల్ వేనవేలు, మౌనిపుత్రులఁగంటి నిక్కాననలోన
సిగ్గు తలకెక్క వారి వీక్షింప మూఢ,తముఁడనై యుండవలసె నేదైవవశత.

మ॥ తపమా? సేయఁగనేరఁ; దద్విధులు కొల్లేర్తల్ నాకు; మిథ్యాతపం
బపలాపం బగు మౌనికోటికి; దురంతాఘంబు నాకబ్బు ని
త్రపతాభారము నెట్టులోర్తు మది విభ్రాంతంబు గా దక్కటా!
విపరీతస్థితి దైన మిట్టిదయి నిర్వేదంబు పాల్ చేసెఁగా. ౨౭౩

ఆ॥ పౌరుషమునకన్నఁ బరము దైవంబగుఁ, బురుషకారమునను బొసఁగనేని
పనులు దైవవశతఁ బాటిల్లు సులభంబు, లగుచు శాస్త్రసమితి యట్లపలుకు.

శా॥ ఏలా ! యింతవిచార మచ్యుతుఁడు భూతేశుండు వాణీశుఁడున్
గాలాధీనులుగారె ? యెల్లరకు నక్కాలంబు దుర్ధర్ష; మీ
లీలన్ జంతుతతిన్ విచిత్రకలనాశ్లేషంబునన్ గ్రమ్ముచున్
దూలించున్ గద? క్రిందుమీఁదుగఁ బరున్ దోడ్పాటుగాఁ గోరునే ! ౨౭౪

కం॥ ఇట్టి వితర్కంబులచేఁ, బుట్టిన విన్నఁదన మొంది బుగులుకొనుచు ని
ట్టట్టనక యానిశీథము, నట్టె యరణ్యమున నిల్చు నమరనది తటిన్. ౨౭౫

మ॥ పదునాల్గబ్దము లందు నిల్చి పరితాపంబొప్ప నచ్చోట భూ
విదితంబయ్యెను సత్యవాది యని సంభావిచ్ఛాన్యుఁడై శుద్ధికిన్
మొదలౌ స్నానము సంధ్యయున్ జపతపోముఖ్యంబులన్ గాంచెఁ దా
నదియే నిచ్చలు నేమమయ్యెను గదా యావిప్రునం దారయన్. ౨౭౬

కం॥ సత్యవ్రతుఁడని జనతతి, యత్యానందరసమగ్నులగుచుఁ బిలువఁగా
నిత్యంబగు సత్యకృతౌన్నత్యయశశ్శ్రీఁ జెలంగె నానాదిశలన్. ౨౭౭

వ॥ ఇత్తెఱంగున సత్యవ్రతుండు పర్ణకుటీరంబున వసించి కాలయాపనం బొనర్చు
చున్న యెడ ధనుర్ధరుండును, కృతాంతసమకాయుండును, మృగవిహగాది హనన
క్రియాదక్షుండును, నిబిడాంధకార సదృశ నీలవర్ణుండును నగు నొక్క నిషాదుండు
మృగయావిహారం బొనర్చుచు వచ్చివచ్చి యొక్క వరాహంబున్ గని నిశితంబగు
శరంబుదొడిగి యేయన్ భయవిహ్వలంబై రుధిరార్ద్రదేహంబునన్ బొరలుచు
నా ద్విజపుంగవు నొద్దకుఁ బలాయితంబై చేర దయార్ద్రభావంబునన్ జూచుచు

వేపమానదేహుండై యజ్ఞాతపూర్వంబును నవశవక్త్రనిర్గతంబునునైన వాగ్భవ
బీజంబు బిందువిహీనంబుగా నుచ్చరించి దుఃఖంబునఁ బొరలుచు నున్న యక్కో
లంబు పర్ణశాలాప్రాంతంబున నొక్కనికుంజమధ్యంబున విలీనం బగుటయు. ౪౯

శా॥ అన్వేషించుచు నవ్వరాహముఁ గృతాంకతాఖిలదేహంబుతో
డ నవ్వీరుండగు భిల్లశేఖరుఁ డఖండప్రౌఢి వాచార్భటిన్
మున్వారాహపథంబు వెంటనె శరంగంబుల్ వైచుచున్ విక్రమో
దన్వత్తుంగతరంగసన్నిభధనుర్దండంబు మ్రోయించుచున్. ౫౦

ఆ॥ వచ్చివచ్చి మౌనివరుఁ బొడగాంచి జోహారుఁ జేసి మచ్ఛరాసనోగ్ర
విశిఖపీడ నొంది వెఱచి వరాహంబు, కాందిశీకమయ్యెఁ గంటిరొక్కొ. ౫౧

ఉ॥ చూచితిరేని చెప్పుఁడనుచున్ దగఁబల్కుచు మీరు సత్యవా
చాచతురుల్ యథార్థముగ జాడ నెఱుంగక వచ్చినాఁడ నా
కాచఁగరాని డప్పియు క్షుధాతిశయమ్మును వేచుచున్నదో
భూచతురాస్య! పల్కుమని బోయఁడు వేడఁగ నెమ్మనమ్మునన్. ౫౨

## సత్యవ్రతుని సత్యము

మ॥ సవితర్కంబుగ భూసురోత్తము డపారస్తంభమౌను సత్యవ్రతం
బు విరుద్ధంబుగఁ "బోత్రి జాడ నెఱుఁగన్ బొమ్మన్న; నిందున్నద
న్న విశేషాఘము సంఘటించుఁ గడు నన్యాయంబు సంధిల్లె ని
ట్టివిచారంబున కెట్టులోర్వఁ బరిహారం బిఁక జూడరా దక్కటా! ౫౩

కం॥ సత్యంబైనను హింస న,సత్యంబగు నన్ఋతమైన సత్యమహింసా
వ్యత్యయ మవ్యయహేతువు, కృత్య మకృత్యత్వ సరణిఁ గెరలె నిఁకెట్లో. ౫౪

కం॥ క్షితి నెవ్వరికేనియు హిత,కృతి సత్యమటంచు బుధులు కీర్తింతురు నా
మతిశోధించిన రెండును, హితములుగాఁ దోఁచె సంధికిరవైతిఁ గదా. ౫౫

ఆ॥ చూచినాఁడనని సూకరహింసయౌ, జాడనెఱుఁగనన నిషాదహింస
యతని నోటికడికి నవరోధ మొనరించు, వాఁడనౌదు నింతనవచ్చు నిజము. ౫౬

చ॥ ఉభయహితంబుగా నుడువు నుత్తరమెల్ల మృషార్థకంబ యౌ
నభయ మొసంగి సంకట మపాస్తముసేయఁగ దిక్కుగాన దు
ర్లభమగు ధర్మసిద్ధి యెటులన్ జెడకబ్బునొ? యంచు దీనుఁడై
సభయత నున్నయుత్తముఁ బ్రసన్నమనస్కత గౌరి మెచ్చుచున్. ౫౭

మ॥ శరవిద్ధంబగు పోతిఁ ర క్తమును హింసార్తబాధన్ గాంచి భూ
సురుఁడాత్మాభిధ బిందుహీనముగ నుచ్చోఁబల్కుటన్ జేసి దు
స్తర విద్యావిభవం బొసంగిన దురంతప్రౌఢి వాల్మీకికిన్
సరియా సత్కవియయ్యెఁ గావ్యరచనాసందర్భధారేయుఁడై. ౨౮౮

సీ॥ దేవీకృపాయుక్తి ధీమంతుఁడై విప్రుఁ, డాకిరాతునితోడ ననియెనిటుల
"యేదివరాహంబు వీక్షించెనో? యది, పలుకనేరనిది చెప్పంగఁగలదె?
పలుకనేర్చినయది పందినిఁ గనలేదు, చూడక తెల్పెడు జాడగలదె?"
యని పల్కిన నిషాదుఁడమ్మాట దెలియక, కార్యార్థియై కానఁ గలయఁదిరిగె

గీ॥ నమ్మహాత్మునికీర్తి దిగంతరముల, వెలసె సత్యవ్రతుండని విబుధసభల
సన్నుతింతురు తద్బీజసంస్మరణము, విడువక జపించు చుండెడు విప్రుఁడెపుడు.

కం॥ కనుఁగొనినవి కన్నులుఁ గా, వున బలుకవు, రసన పలుకుఁ బోలు పెటేఁగెడిఁ గా
వున నది చూడఁగ నేరని, దని సత్యవ్రతుఁడు సత్యమనె నిటు గనుమీ. ౨౯౦

ఉ॥ అంతటఁదల్లిదండ్రులును నాప్తులు బంధువు లెల్లవచ్చి య
త్యంతముదమ్మతో నతని నారసి తోడ్కొని పోయి రోయి భూ
కాంతలలామ! దేవికృప! గంటివె? సర్వజగత్పరాంబ ని
శ్చింత భజించి కాంచు ఫలసిద్ధి;గొఁబంతిలు గల్గనేర్చునే. ౨౯౧

గీ॥ ఆదిశక్తి పరాదేవి యఖిలభువన, కారణం బమ్మహాశక్తిగాన వేద
విధిఁదొలంగక యర్చనావిధి నొనర్ప, సకలకామ్యార్థసిద్ధి నిస్సంశయంబు.

మ॥ స్మరణ ధ్యాన సమర్చనాదుల సదాశక్తిన్ యథాశక్తి నె
వ్వరు సేవింతురొ ? వాంఛితార్థముల నవ్వారిన్ బ్రసాదించు నీ
శ్వరియంచున్ బుధులెల్లఁ బల్కుదురు నీస్వాంతంబునన్ నమ్మి వే
దరహస్యంబగు నట్లుచేయుము సుకర్తవ్యంబుగా దే ధరన్. ౨౯౩

సీ॥ అంధులై పంగులై యార్తులై దీనులై, మూఢులై కృపణులై మూర్ఖులగుచు
దాసులై యభియాతి దండ్యులై క్షుద్రులై, యన్నపానవిహీనులై యశక్తు
లై యజితేంద్రియులై రాజపీడితు,లై ధనరహితులునై విరుద్ధ
బుద్ధులై పరరాజరుద్ధులై భవపాశ,బద్ధులై భోగనిబద్ధు లగుచు

గీ॥ శఠులు జగదీశ్వరిని గొల్చు జాడఁదెలియ,కిట్టియడరులఁ జెందుదు రిది నిజంబు
సానుమానమ్ముగా నిశ్చయమ్మొనర్చి, శాస్త్రసిద్ధాంత మని రిల సకలబుధులు.

సీ॥ శూరులై కుశలులై ధీరులై విభవసం,పన్నులై, సౌందర్యభరితు లగుచుఁ
బుత్రపౌత్రకళత్రభూరిభోగాఢ్యులై వేదజ్ఞులై, బ్రహ్మవాదు లగుచు

సామ్రాజ్య లక్ష్మీ ప్రసన్నులై సత్త్వసాధనదక్షులై ధరాధ్యక్షులగుచు
స్వజనాదియుక్తులై జనవశీకరణాది,నిపుణులై జపతపోనిష్ఠు లగుచు

గీ॥ వెలయుదురు పుణ్యు లేవేళ విశ్వజనని, పూజలొనరించి సుఖమందిపూజ్యులగుచు
సానుమానమ్ముగా నిశ్చయమ్మొనర్చి, శాస్త్ర సిద్ధాంత మని రిల సర్వమునులు.

గీ॥ రాజరాజేశ్వరీ దేవిపూజ సేయు, వారు సిరి సంపదలుగలవార లెపుడు
రాజరాజేశ్వరీ దేవిపూజ వీడు, వారు సిరి సంపదలు లేనివార లెపుడు. ౨౯౬

సీ॥ అఖిలాండజనని నిత్యార్చన లేనట్టి, కొంపగా దది కొల్లగంప గాని
త్రిపురసుందరిఁదృష్టిదీర్పని యన్నిచు, సిరులుగా వవి కొండచరులు గాని
ఆదిశక్తినిగూర్చి యర్చసల్పనివాని, కేలుగా దది బండికీలు గాని
అంబికనెప్పుడు నభినుతింపని వాని, నోరుగా దది కట్టెవేరు గాని

గీ॥ భగవతికొసంగలేని దుగ్ధుగుఁడు గూర్చు, ధనముగా దది నరకసాధనము గాని
ధారుణీశ్వర! తెలియంగలేరు జనులు, తల్లి జగదంబ; నతకల్పవల్లిసుమ్ము. ౨౯౭

క॥ అని జమదగ్నికి రోమశ,ముని దెల్పఁగ నిట్టి వృత్తమును వింటివి నీ
వనుమానమెడలి దేవిన్, ఘనశక్తిఁ గాంచి కనుము కామితసిద్ధుల్. ౨౯౮

క॥ ఈ సుమతిచరిత్రము న,భ్యాసకృతాభీష్ట మగుచు నలరు ననిన నా
వ్యాసునిఁ గని జనమేజయ,భూసురపతి యిట్టులనియె బుధహృద్యముగన్. ౨౯౯

ఉ॥ గంధవతీతనూజ! జనకామితదాయిని యైన సత్కృపా
సింధువు దేవి తన్మఖముసేయుట యెట్టిదొ ? హోమమంత్ర సం
బంధము లెట్టివో? వలయు బ్రాహ్మణు లెవ్వరొ? సర్వమౌళిఁ బ్రా
గ్బంధములెల్లఁదీఱఁగ భవద్వచనామృతవృష్టిఁ దెల్పవే. 300

## — దేవీ పూజావిధానము —

ఉ॥ తావకవక్త్రనిర్గత సుధారససేవన మంతకంతకున్
బావన మయ్యెఁ జిత్తము సమాహితమయ్యును దృప్తినొంద ద
ద్దేవిచరిత్రఁ దెల్పు మన దీప్తముఖుండయి మెచ్చు వచ్చెనో
భూవర! యంబికార్చనము పొల్పు గనుఁ శ్రుతి మూఁడురీతులన్. 301

ఉ॥ సత్త్వరజస్తమోవిధుల శాస్త్రవిధిజ్ఞులు దెల్పి రందులో
సత్త్వము మౌనికోటికి రజఃకలితం బగు రాజకోటికిన్
సత్త్వరజోవిహీనులు నిశాచరు లాటను దామసంబు వే
తృత్వముగల్గి చేయఁదగు దీనఁ బరాంబ కృపాప్తిఁ జొన్పెడిన్. 302

సీ॥ విజ్ఞానమయయమాచు ♦ వెలయు ముక్తుల యర్చ,నంబు దెల్పుదు విశదంబుగా, గ
దిగ్దేశకాలముల్ ♦ దెలిసి మంత్రద్రవ్య, విప్రసంయుతము గావించెనేని
సాత్త్వికం బగు సర్వసంసిద్ధి గలుగుట, నది పూర్ణఫల మిచ్చునందుఁ బుధులు
అక్రమముగ ద్రవ్యమార్జించి సుకృతంబుఁ, జేసిన నిహపరసిద్ధి లేదు
గావున విధినియుక్తముగఁ జేసినకర్మ, మిహపరంబుల సుఖంబిచ్చు మిగులఁ

గీ॥ బాండవులు సాంగదక్షిణాభాగముగను, రాజసూయ మొనర్చి యరాతివితతి
నలమటిలఁ జేయుటం జేసి ♦ వ్యర్థమయ్యె, నధ్వరంబునఁ దక్కువయనుట గలదె.

ఉ॥ యాదవవంశరత్నమగు ♦ నంబుజనాభుఁడు కృష్ణమూర్తి యం
డాదర మొప్ప నిల్చె వసుధామరబృందము సంతతాన్న దా
నాదిక మొక్కమాసము సమగ్రఘృతప్లుతమయ్యె మాంత్రికా
పాదితమంత్రఘోషములఁ ♦ బద్మభవాండము తల్లడిల్లదే. ౩౦౪

కం॥ భారద్వాజుఁడు మొదలగు, వారు సభాస్తారు లగుచు ♦ భాసిల్లరె? యం
దారయ నవభృథపూర్ణం,బై రంజిలె సర్వదేవతావళి పొగడన్. ౩౦౫

సీ॥ ద్యూతభంగమ్ము వసుధామానహాని య,రాతులవలనఁ బరాజయంబు
వనవాసకష్టంబు ♦ వైరాటదాస్యంబు, కీచకకృత వధూక్లేశనంబు
మున్నగు కష్టముల్ ♦ మొనయవే విప్రుల, యాశీఃఫలంబు లేమయ్యెనొక్కొ?
కర్పరం బంటగాఁ ♦ గనలి మండెను వహ్ని, హోమక్రియాఫలం బేమియయ్యె?

ఆ॥ తమదు చిత్తశుద్ధి ♦ దైత్యాంతకుని రక్ష, యెందుఁ గలసె వారలేమియైరి
సాత్త్వికంబుగాని ♦ సత్కర్మ మనుజుండు, చేసెనేమి పదటఁ ♦ ద్రోసెనేమి.

మ॥ సతిఁ బాంచాలి నపాత్రుఁ డీడ్చుటెటి ద్రోహస్సత్త్వంబు సూచించి య
చ్యుత ధర్మాత్మజ ముఖ్యు లడ్డపడ రారొక్కండునున్ గాల మా
గతి వైగుణ్యము నొంది ధర్మపథ సాంకర్యంబునన్ బోవుచో
వితథంబయ్యెను సాధనాదికము సద్వేదం బపార్థంబుగన్. ౩౦౬

వ॥ మఱియును భవితవ్యం బెల్లవారికి నలంఘనీయం బగునేని మంత్రాగమ వేద సాధ
నోపాయ జప తపో ధ్యాన స్మృతి హేతు శబ్దాదు లప్రమాణంబులై వ్యర్థవాదంబులై
నిరర్థకంబులై చనుం గావునఁ గర్తృ మంత్ర ద్రవ్య సాద్గుణ్యవైగుణ్యంబుల నెఱింగి
కల్పింపవలయుఁ దొల్లి పురందరుండు రాక్షసవిజయార్థియై విశ్వరూపుం గురుం
జేసికొని మఖంబు వేల్చిన నసురుండు మాతృసుఖార్థియై కర్మ మొనర్ప నసు
రులు సంతుష్టులైరి గని శక్రుండు వజ్రంబున విశ్వరూపుశిరంబులు నఱికెనే వండే?
క్రియావైగుణ్యంబు ఫలించునే? క్రియాది వైగుణ్యంబు లేమిం జేసి గాదే భార
ద్వాజహననంబును బార్థసంభావనంబునుం గోరి ద్రుపదుండు సవనంబు వేల్చిన

ధృష్టద్యుమ్న ద్రౌపదు లుద్భవించుట; మఱియు దశరథుండు పుత్రార్థియై వేల్చు
టచేఁ బుత్రచతుష్టయంబు సంభవించుట యని మఱియు నిట్లనియె. ౩౦౮

కం॥ అదిగావున సదుపాయము, గదిరెడు కర్మములు సిద్ధిఁ గాంచున్ గ్రియలన్
బొదలెడు నైగుణ్యమునన్, జెదరున్ ధర్మార్థసిద్ధి క్షితిపాలమణీ! ౩౦౯

చ॥ శమనసుతుండు ద్రౌపదియుఁ జక్కటివారలు మంచివార ల
య్యు మఖమునందు వ్యత్యయము నొందుటచే గుణవైపరీత్యమున్
గ్రమముగఁ గల్పనీయ మగుఁ గాదె? యదంభము సాత్త్వికంబునై
నమఖము సిద్ధిఁగాంచియు ననంతఫలం బొడఁగూర్చుఁ గర్తకున్. ౩౧౦

ఆ॥ సాత్త్వికాధ్వరములు శాంతులై దాంతులై, విపినవాసులైన విఖనసులకుఁ
గాక యొరులకెట్లు ఘటియించు? సత్కర్మ, ఫలము బ్రహ్మయోగపథముగాదె?. ౩౧౧

కం॥ విధిచోదితమగు సన్నమ, తిథులకు నిడి శేషమెవఁడు దిను నయ్యాది స
ద్బుధులు పురోడాశమునకు, నధికము సాత్త్వికమునందు రవనీనాథా!. ౩౧౨

గీ॥ మంత్రతంత్రార్థము లెఱింగి మానసంబు, శుద్ధమై కర్మ సేయుచో శ్రద్ధ గలిగి
ఫలముఁ గోరక సేయు నధ్వరము లెల్ల, సాత్త్వికంబులె తగు విప్రజాతులకును.

గీ॥ ద్రవ్య బహుళాధ్వరమ్ములు రాజసములు, సాభిమానంబులౌ బాహుజన్ములకును
నూరుజాతుల కగునని పారికాంక్షి, వరులు పలుకుదు రాగమవాక్యఫణితి.

క॥ తామసములైన మఖములు, సామర్షము లగుచుఁ గ్రౌర్యసాహస కాంక్షా
కామమదాదులఁ బెనుచును, ధీమహితులు వాని మెచ్చ తెరువులు గండే?

ఉ॥ మానస ముత్తమం బనుచు మానులు మెత్తురు దివ్యమంత్ర కా
లానయనంబులందు సులభాత్మతఁ గాంచుట బాహ్యయజ్ఞముల్
న్యూనము లెట్టులైనఁ గ్రియనో! ద్విజమంత్రకలాపవస్తు సం
ధానతనో! గనన్ దుదకు దబ్బరలౌ నని యంద్రు తాపసుల్. ౩౧౬

క॥ అదిగావున ముందుగఁ దన, మది శోధింపంగవలయు మానసశుద్ధుల్
చెదరి విషయాభిలాషలఁ, గదురక యింద్రియగణంబు గట్టుటసుమ్మీ.

ఉ॥ ఇంద్రియపంచకంబు వశమేని మనంబు ద్రొలంగకుండు స
ర్వేంద్రియ యుక్తమై మన మభీష్టపథంబున నిల్చెనేని ని
స్తంద్రిత మానసాధ్వర విధానమునం దధికారి యాతఁడై
యింద్రిముఖాధికారములు నేనియు నిచ్చఁ జలింపకుండెడున్. ౩౧౮

సీ॥ అదిగాన నధికారి యగుచుఁ జిత్తంబున, బహుయోజనాయామబంధురంబు
సవనోచిత స్తంభ సాహస్ర రుచిరంబు, బహుసాధన సమాజపరివృతంబు
గాఁగ నధ్వరశాలఁ గల్పించి విశదమా, వేదిక యొనరించి విధులు తెలిసి
యగ్నుల నెలకొల్పి యందు విప్రుల నిల్పి, వలయు సామగ్రి యవ్వారిఁ జేసి

గీ॥ హోత ప్రస్తోత బ్రహ్మయు నుద్గాత గలసి, యందు నధ్వర్యుఁడును బ్రతిహర్తయార్వ
రధ్వరంబున దక్షులై యలర సకల, యత్నసంసిద్ధుఁడై మానసాంతరమున. ౩౧౯

కం॥ ప్రాణాపానవ్యానో, దాన సమానములఁ బంచధా వహ్నులు గా
మానసమున భావించుట, మానివ్రత మనుచుఁ గనుము మనుజాధీశా!. ౩౨౦

వ॥ ప్రాణానిలంబు గార్హపత్యంబును నపానం బాహవనీయంబును వ్యానంబు దక్షిణాగ్నియు నుదానంబు సభ్యుండును సమానం బావసథ్యకుండునుగా భావించి నిర్గుణం బగు యాగీయద్రవ్యకదంబంబును యజ్ఞాధిదేవతయు నిర్గుణయు సనాతనియు బ్రహ్మవిద్యయు సర్వజ్ఞయు సర్వగయు సర్వాధారయు బ్రహ్మంబును నగు శక్తి యందు వినియోగించి పరమపదంబు నొందవలయు, యజ్ఞాంతరంబులు కామఫలప్రదంబులై ప్రవర్తించుచుండు మనీషిజనంబులు స్వర్గకాములై యగ్నిష్టోమాదికం బొనర్పవలె ననియు వారలు క్షీణపుణ్యులై మర్త్యలోకంబునఁ జన్మింతు రనియు వచింతురుగదా? భగవద్వాక్యం బట్టు వచించు టెఱుంగవే? కావున మానసాధ్వరం బక్షయంబై బ్రహ్మపథం బొసంగు నది రాజుల కయోగ్యంబు, తొల్లి నీవు తామసంబగు సర్పయాగం బొనర్చి సర్పకులంబు భస్మసాత్కృతం బొనర్చి దురాత్ముండగు తక్షకుం డొనర్చిన పితృద్వేషంబు నిర్వహింపవే? యమ్మఖంబు పారమార్థికఫలప్రదంబు గాదని యెఱుంగుము. ౩౨౧

సీ॥ విధిపూర్వకంబుగా విశ్వేశ్వరిని గూర్చి, యధ్వరం బొనరించె నచ్యుతుండు
అట్టులే నీవును నధ్వరం బొనరింపు, మంత్రార్థవేత్తలై మాన్యులైన
యాజకుల్ గలరు వారందఱు నంబికా, బీజజ్ఞులును యాగవిధులయందు
దక్షులు నీవు తత్సాహాయ్యమున యజమానుండవై సేయు మఖముఁ దండ్రి

గీ॥ నుద్ధరింపుము దుర్గతి నొందనీక, బ్రాహ్మణపరాభవమున శాపమున దుష్ట
మరణమున దుర్గతిం జెందె మనుజనాథ, సేయ వలవదె సుకృతముల్ వేయునేల.

చ॥ భుజగముచేత దష్టుఁడయి భూతలవల్లభ! నీదుతండ్రి సా
మజపురి స్నాన దాన ముఖసమానిత కర్మము లెవ్వి లేక దు
ర్వ్రజినకరంబు సంస్థితిని వీడ్కొని దేహము భూమిమీఁదఁగా
కజయకరంబు సౌధమున నమ్మెను దుర్మృతి నీ వెఱుంగవే! ౩౨౩

క॥ నరకోపయోగమగు పరి,కరమెల్లను సంభవించెఁ । గావున నీయ
ధ్వర మొనరించి సదా సుఖ,కరమగు సద్గతికిఁ బంపఁ । గాదొకొ? తండ్రీ.

సీ॥ తన కవసానమఁ । దటియయ్యె నని ప్రాణి, తెలిసి సంకటముల । వలయు సాధ
నములు లేవనుచు సంతాపంబు నొందక, యంగంబు పంచభూతాత్మకంబు
నశ్యమౌ నేను సనాతనుండను నిర్గుణుండ నవ్యయుఁడఁ బరుండఁ దత్త్వ
సంచయంబులు దుల్లు । సంతాప మందఁగాఁ, బనియేమి? ముక్తుండ । బ్రహ్మమ నని

గీ॥ తనువు విడిచిన బ్రహ్మపథంబు నొందు, దేహసంబంధ మెఱుఁగక । తెలివి మాలి
స్నానదానంబు । లెవ్వియుఁ గానిలేక, వితథమరణంబు నొందిన । వేడ్కఁగలదె.

చ॥ అటువలెఁగాక నీజనకుఁ । డక్కట నిష్ప్రతిపక్షమైన యు
త్కటసుఖభోగముల్ విడిచి । కామపరుండయి జీవనేచ్ఛచే
దటతట నొంది మేఁవిడిచెఁ । దాపస శాపపరాభవంబుచేఁ
బటునరకానలంబునకుఁ । బాల్పడకుండునె లోఁ దలంపుమీ. 3౨౮

కం॥ ప్రారబ్ధవశంబున సం,సారి నగుచుఁ దనువునొంది । సదసత్క్రియలన్
గోరితి నింతియె ముక్తుఁడ, నారయ నాకేమికొదవ । యని యనఁ డెవఁడున్.

మ॥ కలియోగంబుననైనఁ గార్య మిది శంకన్ మాని నీవాత్మలో
పలఁ జింతించి మదీప్సితంబగు క్రియాప్రాగ్భారముం దేవి ని
శ్చలభక్తిన్ వినుతింప నీ జనకుఁ డక్షయ్యంబు లోకంబునం
వెలయున్ జింతిలనేటి కంచు ముని యావేదింప భూపాలుఁడున్. 3౨౯

ఆ॥ శోకతప్తుఁ డగుచు । నక్కటా! నాజన్మ, విఫలమయ్యె ననుచు విపులశోక
వనధిఁ దేలి యెట్లు । వర్తింతు నీయాజ్ఞ, కరణసిద్ధి యెట్లు । గలుగునంచు.

కం॥ చింతిల్లుచు వ్యాసునిఁ గని, సంతాపము లోన మ్రింగి । స్వామీ! హరి స
ర్వాంతరుఁ డెవ్విధి నీమఖ, మెంతయు నొనరించె నని వచించితిరి గదా! 330

—॥ విష్ణువుచేసిన దేవీమఖ వృత్తాంతము ॥—

ఉ॥ కారణకారణుం డయిన । కంజదళాక్షుఁడు దేవిఁగూర్చి యె
వ్వారలఁ దోడుఁజేసికొని । వాంఛితసిద్ధికిఁ జేసె నిమ్మఖం
బారయ వార లజ్ఞనవయాగము ధర్మములెల్ల మంత్రితం
త్రాప్రచితప్రకాశముల । సాంగవిధిజ్ఞతఁ జేసి యుండిరే? 33౧

కం॥ ఈ వృత్తాంతము విని నే,నావల నొనరింతు నంబికాధ్వరమును సం
భావించి విష్ణుకృత మగు, నీవృత్తము దెల్పుమన సమీహితమతియై. 33౨

ఉ॥ ఈ పొనరించుప్రశ్నమున కేను వచించెద నుత్తరంబు రా
జీవదళాయతాక్షుఁడును జీవనజోద్భవుఁడున్ భవుండునున్
దేవియనుజ్ఞచేఁ జనుటఁ దెల్పితిఁగాదె? మహార్ణవంబునం
దావిబుధోత్తముల్ దమకు నాశ్రయముల్ విరచించి యాపయిన్. ౩౩౩

మ॥ భవితవ్యం బగు సృష్టికై జనని యుత్పాదించి పంపించు శ
క్తివితానంబును బట్టుగా నిలిపి మేదిన్యాదిసృష్టిన్ బురా
భవభావంబుగఁ జేసి యిద్ధరణికిన్ భారోద్వహంబైన వ
స్తువిధానం బొనరించి నిల్పిరి సమర్థుల్ గాన భూచక్రముల్. ౩౩౪

గీ॥ మొదట మధుకైటభులమేదమునను మేదినియు ధరించుట ధరయును నిఖిలవస్తు
భరణవివశతఁ బృథివినాఁ బరగె నపుడు, వసుధ కిమ్మూఁడునామముల్ వసుమతీశ.

మ॥ ధరణీచక్రము మోయ శేషుని యథాస్థానంబునన్ నిల్పి భూ
ధరముల్ లోహశలాక లట్ల కడు సంధానించి మధ్యంబునన్
సురశైలంబు నమర్చి రత్నశిఖరస్తోమంబుచే ఘట్టితాం
బరమై యుండఁగఁ జేసి రందు రుచిరావాసంబులన్ భూవరా! ౩౩౬

వ॥ మఱియును మరీచియు నారదుండును నత్రియును బులస్త్యుండును బులహుండును గ్రతుండును దక్షుండును వసిష్ఠుండు నను నాత్మజులన్ బడసి విరించి పుత్రులు సహాయులుగా సృష్టి నొనర్చునెడ మరీచికిఁ గశ్యపప్రజాపతి యను పుత్రుండు జనించి త్రయోదశసంఖ్యాక లగు దక్షకన్యలఁ బరిణయింప వారివలన ననేకులు దైత్యదానవు లుదయించుటఁ గాశ్యపంబగు సృష్టి యతివిస్తృతంబై మనుష్యపశు సర్ప విహంగమ జాతి భేదంబునఁ బ్రవర్తిల్లె నంత. ౩౩౭

కం॥ ఆయెడ బ్రహ్మాంగార్ధము, స్వాయంభువుఁడయ్యె మిగులు సగ మాతనికిన్
జాయారూపత శతరూ, పాయతనేత్రి యయి తనరె నద్దంపతికిన్. ౩౩౮

సీ॥ ఒనరఁ బ్రియవ్రతుం డుత్తానపాదుండు,నను నాత్మజులు గల్గి రవల మువురు
కన్నెలు గల్గిరి కడు సుందరాంగులు, కనకాచలము మీఁదఁ గట్టె బ్రహ్మ
సత్యలోకంబునా జలజనేత్రుండు వైకుంఠంబునా నీలకంఠుఁ డంతఁ
గైలాసమనఁ దమకై నివాసమ్ములు,మూర్తిత్రయ మొనర్ప మోద మెసఁగ
గీ॥ విబుధనాథుండు గట్టెఁ ద్రివిష్టపంబు,తత్తదావాసములయందుఁ దనరి మునులు
భాగవతులును బ్రమథులు యాగభుజులు,విశ్రమింతురు సతతంబు వివిధగతుల.

ఉ॥ అంతట దుగ్ధసింధుమథనావసరంబునఁ గామగో చతు
ర్దంతిగజాప్సర స్సురతురంగమ కల్పమహీజ ముఖ్య వ

న్వంతర సృష్టి యయ్యె నదిసయంతయుఁ జేకొనె శకుఁడంత ధ
న్వంతరి చంద్రిముల్ పొడమి వచ్చిరి లోకములెల్ల నుబ్బఁగన్. ౩౮౦

గీ॥ నాఁడు నాఁటికి సృష్టి యనారతంబు, నిండి భువనంబులెల్ల నిర్విఘ్నవృత్తిఁ
దనర మూర్తిత్రియంబు స్వస్థానములను, విఖ్యాతి సల్పంగ నొకనాఁడు విష్ణుమూర్తి.

ఉ॥ క్షీర సముద్రి మధ్యమునఁ జెన్నగు ద్వీపము సంస్మరింప సం
తారణ కారణం బగు నుదారచరిత్రిము గల్గు మంత్రి సం
స్కారము దోఁపఁ దన్మనువు సంస్మరియింపుచు నంబికా దయా
సార సుధార్ద్రిమై మనసు సంతస మందఁగ నధ్వరేచ్ఛఁడై. ౩౮౨

చ॥ తన భువనంబు వెల్వడి సుధానిధిభూమ విరించి పాకశా
సన ధనదాగ్ని దేవగురు సంయమ వారుణ వామదేవులన్
మునులను నెల్లదేవతల ముందర రా నియమించి యధ్వరం
బునకు సమస్త వస్తుచయముల్ గొని మంటప మేర్పరింపఁగన్. ౩౮౩

గీ॥ ఏకవింశతి సంఖ్యగా ఋత్విజులను, వరణ మొనరించి యంబికావర్ణయుతము
లైన మంత్రింబులుపఠించి యగ్నియందు, వినియతముగాఁగనాహుతుల్ వేల్చునంత

కం॥ ఆకాశశరీరిణి యగు, లోకేశ్వరి పల్కె జలజలోచన! కడు న
స్తోకుఁడవై గుణముల సుశ్లోకుఁడవై కీర్తి గనుము సురవరులందున్. ౩౮౫

సీ॥ బ్రిహ్మాది సురలెల్ల భజియించెదరు నిన్ను, ననినఁ బూజింపరె యఖిలజనులు
వరదుండవై నీవు వర్తింతు వెల్లెడ, వేయునేటికి నీవ విశ్వపతివి
నిఖిలాధ్వరంబుల నీవ పూజ్యుండవు, నిగమాగమములెల్ల నిన్నె దెలుపు
ధర్మహాని పొసంగు తఱి దత్తదంశల, నవతరించి యొనర్పు మఖిలరక్ష

గీ॥ నీదు నవతారములు భూమి నిలిచియుండు, నీకు సాహాయ్య మొనరించి నేనునిలిచి
నారసింహియు వారాహి నాఁ దనర్చు, శక్తినై వచ్చి నీ కిత్తు జయము కుజ్జ!

కం॥ నానాయుధధారిణినై, నానామణిభూష నగుచు నారాయణ! నీ
మానసమున సురకార్యముఁ, బూని యొనర్చునెడ నిలుతు భువనస్తుత్యా. ౩౮౭

ఉ॥ భారతఖండమందు భవభంజన రూపము లొంది సర్వ సాం
సారికపూజ్యనై నరుల సౌఖ్యము లొందఁగ జేయుచుందు నీ
వారయ నట్లె మర్త్యుల కనంతసుఖంబు లొసంగుమయ్య? దు
ర్వార పరాక్రిమాక్రిమిత రాక్షస సంహరణోచిత క్రియన్. ౩౮౮

కం॥ ఓపురుషోత్తమ! సప్త, ద్వీపంబుల నీవు నేను దెరలక నరులన్
బాపముల నణఁచి సిరులన్, బ్రోపింపఁగఁ జేయవలయుఁ బరమప్రీతిన్. ౩౮౯

సీ॥ నాయట్ల నీవును ! నలినాక్ష ! యెల్లెడఁ, జేతను లెల్లఁ బూజింప వారి
నేమంబు లరయుము ॥ శ్రీమంతులై వారు, వేదోక్త పూజఁ గావింతు రెలమి
నిష్కాములై పూజ ॥ నెఱపిన ముక్తి నొసంగుము నా కదిసమ్మతంబు
నీయిచ్ఛ నాయిచ్ఛ ॥ నేనును మెచ్చితిఁ, "ద్వ మహం" విభేద మొకత్తఱిని లేదు
గీ॥ సకల సంరక్ష కీవె దక్షత వహించి, యుండుము మదాజ్ఞచే నీవు ॥ యోగయుక్తి
తత్త్వ సర్వ స్వరూప సంధాన శక్తి, గలుగఁ జేసితి నని పల్కె ॥ గగనవాణి.

వ॥ అంతర్ధానము నొందిన గోవిందుండు సంపూరితాధ్వరుండై యవభృథంబొన
రించి బ్రహ్మాదులుం దానును వైకుంఠంబునకుం జనిరి. తక్కుంగలవా రెల్లరుఁ
దమతమ స్థానంబులకుఁ బోయిరి. అది మొదలుగా నెల్లవారలు నశరీరిణి యగు
నాదిశక్తిని బ్రణుతించుచుఁ దద్భజనం బొనరింపుచు సుఖంబున నుండి రని
చెప్పిన. ౩౫౧

శా॥ పారాశర్య మునీంద్ర ! నీకరుణచేఁ ॥ బద్మాక్షయాగీయ స
చ్చారిత్రంబు వ్రాతాఘ్నమై శ్రుతిసుఖస్వాస్థ్యంబు సంధించె నా
త్మారాముల్ జగదాదిశక్తికి గుణాయత్తంబు చిత్తంబు దై
వారన్ నాయెడఁ గల్గునట్లు తగ సంభావించి బోధింపవే. ౩౫౨

కం॥ మునినాథు నిట్లు వేడుచు, జనమేజయుఁ డడుగ సంతసము నొంది ఘనా
ఘనవేణి గారివృత్తము, వినిపించెను వ్యాసమౌని ॥ విశదముగాఁగన్. ౩౫౩

మ॥ ధరణీపాలకులావతంస ! జగదంతర్యామియై బ్రహ్మమై
పరమై వర్తిలు శక్తివృత్తము సుధాప్రాయంబుగాఁ దెల్పెదన్
బరమంబౌ నితిహాస మొక్కటి శ్రవణపర్వంబుగా విన్ము త
చ్చరితంబుల్ బిదపన్ వచింతు నితిహాసంబై ధరన్ వర్తిలన్. ౩౫౪

— ధ్రువసంధి చరిత్రము —

సీ॥ కోసలాధీశుండు ॥ గుణరత్నవారాశి, రవివంశ తిలకుండు ॥ రాజమాన్యుఁ
డతిరమ్య దేహుఁ డహర్పతి తేజుండు, ధ్రువసంధి యనెడు భూధవుఁడు జ్ఞాని
బహుపుణ్యవంతుండు ॥ పటుధర్మనిరతుండు, వర్ణాశ్రమాచారవర్ధనుండు
నగుచు నయోధ్యయన్నగరంబు నిజరాజధానిగా నేలుచు ॥ దానములును
గీ॥ మానముల విప్రవిత్తాభిమానములను, వినుతికెక్కె సదా ప్రభావిష్ణుఁ డగుచు
బ్రాహ్మణక్షత్రవైశ్యశూద్రప్రముఖ్యు, వృత్తు లరయుచు ధరనేలె ॥ విమలకీర్తి.

ఉ॥ చోరులు ధూర్తులుం శఠులు సూనృతహీనులు సాపరాధులుం
జారులు దంభులుం ఖలులు సజ్జనహింసకులుం గృతఘ్నులుం
లేరల రాజు రాజ్యమున లెక్కిడ రాదు మహీశు సద్గుణో
దారపరంపరల్ గడు నుదాత్తచరిత్రుఁ డుదారుఁ డెన్నఁగన్. 3౫౬

క॥ అయ్యవనీపతి కిరువురు, తొయ్యలు లతిరూపవతులు దురిత విదూరల్
వెయ్యారులలో సరి లే, రయ్యన్నుల కధిప భక్తియందు ధరిత్రిన్. 3౫౭

గీ॥ అగ్రదార మనోరమ యన, ద్వితీయ, తగియె లీలావతి యనంగఁ దరుణులిరువు
రతి ముదం బొనరింప గోశతాధినాథుఁ, డుపవన గృహాది విహరణం బొనరఁజేయు.

ఉ॥ సౌధములన్ మహీధర రసాల ఫలద్రుమ కుంజ వీధికా
యూధములన్ సరిత్తటుల యొద్ద మనోభవ కేళిలోలుఁడై
యా ధరణీశుఁ డిర్వురఁ గుసలాంగనలన్ దనియించుచున్ రతీ
నాథుఁడు వోలె నెల్లెడల నవ్యవిలాసము లొందుచుండఁగన్. 3౫౯

క॥ ఆపన్న సత్త్వ యగుచున్, భూపతి యగ్రాంబుజాక్షి పుత్రునిఁ గనె ను
ద్దీపిత తేజు సుదర్శను, రూపవిజిత కుసుమచాపు రుచిరాటోపున్. 3౬౦

## —• సుదర్శన శత్రుజిత్తుల జననము. •—

క॥ లీలావతి యను భార్యయు, లీలామన్మథునిఁ గనియె లేఖాధిప భూ
లాలిత లావణ్య సుగుణ, శీలున్ సుందరుని ధైర్యజిత మందరునిన్. 3౬౧

గీ॥ జాత కర్మాది సంస్కారజాత మాత్మ, జాత యుగమున కొనరించి జనకుఁ డపుడు
పుత్ర జన్మ ప్రమోదాప్తి భూసురులకు, భూరిదానంబు లొసఁగె నవ్వారిగాఁగ.

మ॥ అవరోధంబున నిర్వురన్ సదృశ సౌహార్దంబునన్ జూచి యే
యవరోధంబులు లేక ప్రేమ మనువంశ్యుండైనన్ విభిన్నంబుగా
నవలంబింపక రాజచంద్రముఁ డపత్యద్వంద్వమున్ జిత్తసం
భవ సమ్మోదమునన్ గనుంగొనుచు సామ్యం బొప్పఁగాఁ బెంచుచున్. 3౬3

శా॥ చూడాకర్మ మొనర్చె నిర్వురకు విస్ఫూర్జన్మహా వైభవ
శ్రీ డంబంబుఁ జెలంగ నిర్వురు సుతుల్ స్నేహానుబంధంబుచే
గ్రీడల్ సల్పుచు లోకరంజన సముద్దీర్ణాను మోదంబుచే
నాడన్ బాడఁగఁ బ్రీడ వైరి జను లత్యంతంబు లాలింపఁగన్. 3౬౪

క॥ ఇరువురలోన సుదర్శనుఁ, డిరవొందుచుఁ బెద్దయగుచు నెసఁగె యవీయుం
డరు దరు దని లోకంబులు, కర మెన్నఁగ శత్రుజిత్తుఁ గాంచెన్ మెచ్చుల్.

సీ॥ మాతృగర్భంబున ఘమాసంబు నివసించి, కలిగిన ఘన యోగగరిమ వలన
సరస వాక్చాతుర్య సౌందర్య గాంభీర్య, శౌర్య ధైర్యాది విస్తార పటిమ
మంత్రులు పురజనుల్ మాటిమాటికి వాని, మెచ్చి మన్నించు నర్మిలి కడంకఁ
గుంభినీశుఁడు పిన్నకొమరుని సువిశాల, గుణయోగమున ముద్దుగొనుచునుండ

ఆ॥ మందభావుఁ డౌట మందానురాగుఁడై, యగ్రసుతుని యెడల నాత్మలోన
నించుకంత గొఱత నెంచుచు లోకసా,ధారణుండు గాఁగఁ దలఁచుచుండు.

ఉ॥ అంతట నొక్కనాఁడు వసుధాధిపుఁ డాటవికానుయాతుఁడై
సంతస మిన్మడింప మృగసంఘ జిఘాంస మహాటవీరతిన్
దంతి తురంగ సద్భట రథ ప్రతతుల్ వెనువెంట రాఁగ దు
ర్దాంత ధనుర్ధరుం డగుచుఁ దాఁ జనియెన్ మృగయావినోదియై. 3౧౯

కం॥ హరిణంబుల సూకర కరి, శరభంబుల ఖడ్గ గవయ చమరీమృగ శ
ల్య రురుశశాదుల విపినాం,తరమున వేటాడి త్రుంచె ధరణిపుఁ డంతన్.

ఆ॥ తఱిమి తఱిమి నృపతి తత్రత్య జంతు సం,తతులఁ గూల్పనట్టి తఱి మహోగ్ర
సింహ మొకటి రాజుచే శరవిద్ధమై, క్రోధకుటిల మగుచుఁ గొఱలి యెదుట.

ఉ॥ కొండలు ఘూర్ణిలం జటుల ఘోష మొనర్చుచుఁ దోఁకఁ ద్రిప్పి యొం
డొండ మహోర్భటుల్ చెలఁగ హుమ్మని పైఁబడునంత రాజు ను
ద్దండత రాసిచర్మములు దాలిచి భీకరమూర్తి యౌచుఁ దా
రెండవ సింహమో యనఁ బిఱిందికి రాక కలంచె నెంతయున్. 3౨౦

కం॥ వీరులగు సైనికులు కం,ఠీరవ రాజంబు మీఁద డీకొని శరముల్
ఘోరముగఁ గురియ హాహా, రావముతో భట మృగేంద్రరణము చెలంగెన్.

చ॥ అతిభయదంబుగా నెగసి యామృగరాజము రాజుపై నఖ
క్షతములు సేయుచున్ దుముకఁగా నృపవర్యుఁడు ఖడ్గధార రో
హిత మురలంగ నేయ నది యించుక గొంకక తీక్ష్ణదంష్ట్రలన్
బ్రతత నఖంబులన్ దనువు వ్రచ్చిన నిల్వఁగ లేక కూలుచున్. 3౨౧

కం॥ క్షితిపతి. వివశుండయి పడి, మృతిపొందిన భటులు కడిమి మొఱసి శరాళుల్
కృతనిశ్చయులయి యేసిన, హతమై కంఠీరవంబు నవనిఁ గూలెన్. 3౨3

శా. ఆక్రోశింపుచు సైనికోత్తములు గోత్రాధీశునిం జేరి ని
ర్వక్రప్రౌఢిమ మంత్రులన్ గలసి శాస్త్రప్రక్రియన్ గాఢ స
వ్యక్రోడీకరణంబునన్ దహనకృత్యంబెల్లఁ గావించి స్వ
ర్గక్రీడా కుశలంబుగా నపరకర్మంబుల్ వసిష్ఠాదృతిన్. 3౨౪

క॥ చేయించి రంతఁ బ్రకృతిని,కాయము కుంభజునిఁగూడి క్ష్మాతలపతి గాఁ
జేయుటకు సుదర్శను మది, రోయుచు రెండవకుమారు రూఢిగ ననుచున్. ౩౨౧

—• శత్రుజిత్తు రాజ్యము గైసేయుట •—

సీ॥ సరస వాక్చాతుర్య సంధాన ధౌరేయుఁ, డరిసైన్య దళన శౌర్య ప్రకర్షి
శుభ రాజ లక్షణ స్తోమాభిరాముండు, ధర నేల నితఁడే తగు నటంచు
శత్రుజిత్తును దెచ్చి సామ్రాజ్య ధౌరేయుఁ, గావించి పట్టంబు గట్టి యతని
యాజ్ఞ వర్తింపుచు నఖిలకార్యంబులు, చక్కఁ జేయుచు నున్న నక్కుమారుఁ
గీ॥ డురుభుజావిక్రమక్రాంత పరనరేశ, చక్రుఁడై వైభవావనీ శక్రుఁడగుచు
రాజ్య పరిపాలనోన్నద్ధ రాజమాన, ధైర్య గాంభీర్యధుర్యుఁడై తనరు ననుచు.

క॥ ఆలోచన సేయఁగ నా,లీలావతి తండ్రి విభవ లేఖాధిపుఁ డ
బ్బాలుని దౌహిత్రునిఁ గన, జాలిన్ విచ్చేసెఁ దండ్రి చావెఱుఁగుటచే. ౩౨౨

సీ. ఉజ్జయినీనాథుఁ డురుభుజాబలుఁడు యు,ధాజిత్తు చనుదెంచి తనయఁ గాంచి
తగఁ బరామర్శించి తనకు దౌహిత్రుఁడౌ శత్రుజిత్తును గాంచి సంతసించి
మనుమని మేల్ గోరి మంత్రి వృద్ధులఁ గూర్చి, యాలోచనము సేయు నట్టి తఱిని
దనకూఁతుఁ దేర్పంగఁ దలఁచి కళింగాధి,పతి వీరసేనుండు బలబలారి
గీ॥ వచ్చి పుత్రికఁ దేర్చి యవ్వాలుగంటి, నందను సుదర్శనునిఁ దేర్చి యందుఁ దనదు
మనుమనికి మేలు వాఁడయి మంత్రివరులఁ, గలసి మంత్రాంగ మొనరింపఁ గడఁగె నంత.

—• వీరసేన యుధాజిత్తుల యుద్ధము •—

చ॥ ఉభయ సహాయులై నరవరోత్తము లిర్వురు మంత్రిణ క్రియా
విభవము లేర్పరించు తఱి విశ్రుత దోర్బలుఁ డా యుధాజితుం
డభిమత సద్గుణాతిశయుఁడౌ తన మన్మఁడె శౌర్యధుర్యుఁడై
విభుఁడగు నంచు నగ్రజుఁడు వెంగలి గూడ దటంచుఁ బల్కినన్. ౩౨౯

గీ॥ ధర్మపత్నీ సుతుండయ్యుఁ దగని వాఁడె, యగ్రజుం డటుగాక శాస్త్రాభిమతము
విబుధ సమ్మత మిది యని వీరసేనుఁ, డంబుధర గర్జవోలెఁ బెల్లార్భటింప. ౩౩౦

గీ॥ అంత నుజ్జయినీ విభుం డనియె నిట్లు, జ్యేష్ఠుఁ డనినంత నేమి యాచింత విడువు
మతఁడె రాజగు నిట్టి నిరర్థకోక్తిఁ బలుక వలదని యనిన సభ్యవ్రజంబు. ౩౩౧

మ॥ మహిమాఢ్యుం డగు మండలేశ్వరు యుధాజిన్మన్యువున్ బ్రశంసించి వీఁ
డహితధ్వాంత దివాకరుం డతని యాజ్ఞాలంబ మానంచుఁ ద

ద్వాహనోల్లాసతకియ్యకొన్నతటి నవ్వార్థల్ స్మృతిప్రక్రియా
వహాముల్ గావని యాత్మలం గినిసి శుంభత్సంభృతాటోపులై. ౩౮౨

ఉ॥ కొందఱు వీరసేను డరికుంజరసింహము వీనియాజ్ఞ న
స్పంద సుదర్శనుండు నృపసంపదకుం దగువాఁడటంచు బల్
సందడిపెట్ట వచ్చుటయు శాస్త్ర వచో విభవానుభూతిచే
దండడి గొన్న యత్తటి యుధాజితుఁ డుద్ధతిఁ బల్కె వారితోన్. ౩౮౩

ఆ॥ మంత్రులార! మీరు మందుఁడైనను రాజు, కొల్లగాఁగ ధనముఁ గూర్పవచ్చు
రాజు సబలుడైన రారాపు ఘనము మా, కలవిగాకయుండు నని తలఁతురె?

గీ॥ శత్రుజిత్తు బలాఢ్యుండు సకల రాజ్య, పదముఁ జేకొన మనకెల్లఁ బ్రాణగొడ్డ
మగు సుదర్శనుఁ డధిపుఁడై యలరెనేని, మేమె దొరల మటంచు భ్రమింతురొక్కొ?

ఉ॥ ఏను ధురానహుండ నయి యిచ్చటనుండఁగ ధుర్యులై మదీ
యానుమతంబుఁ బోవిడిచి యాచితి మందుని రాజుఁ జేయఁగాఁ
బూనిన నోర్తునే? నిఖిలభూపతిసన్నిధి శత్రుజిన్నృపా
ధీనముగాఁగ రాజ్య మిడి ధీరుఁడనై విమతాళిఁ గొల్తునే. ౩౮౬

కం॥ చొచ్చెద రణరంగములో, వ్రచ్చెద రిపుకోటి నెల్లవారలు గన నే
నిచ్చెద నా మనుమనికిన్, విచ్చలవిడి సకలరాజ్యవిభవం బనినన్. ౩౮౭

గీ॥ వీరసేనుండు గర్జించి విక్రమించి, రాజలక్షణయుతుఁ డర్క తేజుఁడైన
యారసుఁడు పెద్దయుండఁగ నర్హుఁడనుచు, బిన్నకును రాజ్యమిచ్చుట పృథివిఁ గలదె.
౩౮౯

వ॥ అదియునుంగాక.

శా॥ సామర్థ్యంబున నిందు నే నిలువ నిస్సందేహవృత్తిన్ ననున్
సామాన్యున్ బలెఁ జూచి పల్కెదరె భూచక్రంబు లల్లాడినన్
స్వామిన్ జేసి సుదర్శనున్ బితృధరాసామ్రాజ్య మేలింతు నా
సామర్థ్యంబుఁ గనుం డటంచుఁ గడు నాచారంభమున్ జూపినన్. ౩౯౦

సీ॥ సభలోన నున్నట్టి సామంత భూపాల, సందోహ మెల్లను సంచలించె
చెలఁగిరంత నుభయ సేనలు గూడి యురువడించి మహోగ్ర, సింహధ్వనులు చేసి
ధరణీతలేంద్రు లిర్వురు బలంబులఁ గూర్చి, యుద్ధాభిలాష సన్నద్ధులైరి
బందికై చోరఁబాటి పరువు లిడిరి గడి రాజ్యముల ధరాకాంతు లంతంతట,
దారెచ్చరించి రాజుమృతినొందెసుతులుపోరాడఁదొడఁగి, రిదిమొసమయంబటంచుఁ

గీ॥ చోరు లంతంత గుంపులై చొచ్చి యవని, జనపదగ్రామములు దోచికొనిరి కడఁగి.

మ॥ సమరారంభగృహీతశస్త్రిలు సమస్తప్రక్రియోద్దండులున్
విమతచ్ఛేదసదక్షు లున్నతమహావీరాగ్రగణ్యుల్ నృపుల్
సమయోత్సాహతఁ దారసిల్లిరి జయోల్లాసైకనిర్దంభతన్
దుములం బయ్యె బలద్వయంబునకుఁ దోడ్తో నింగి యాటాడఁగన్. ౩౯౨

క॥ అత్తఱి యుధాజితుఁడు తన, మొత్తంబు బలంబు లెల్ల ముసుకొని నడువన్
గొర్త్తి యగు సాహవోత్సవ, మెత్తఁగ సన్నద్ధుఁడయ్యె నేపు దలిర్పన్. ౩౯౩

ఉ॥ వాసవతుల్యుఁడైన పటుభాసురసింహము వీరసేనుఁడు
ద్భాసితసైన్యయుక్తుఁడయి బాణకృపాణధనుర్ధరాహవ
శ్రీసముపేతుఁడై విజయసిద్ధి మదిన్ దలపోసి క్షాత్రధ
ర్మాసమకేళిలోలత రణాంగణసీమకు వచ్చె నుగ్రుఁడై. ౩౯౪

మ॥ గిరిఁబోలెన్ సమరాంగణంబున బలాకీర్ణంబుగాఁ గొల్వ భూ
వరపంచాస్యు యుధాజితున్ గని భుజావష్టంభసంరంభియై
శరవర్షంబులఁ దోఁగఁజేసిన రణోచ్ఛన్ బొంది యవ్వీరసే
నరసాధీశుని బాణముల్ నతికె దోర్నైపుణ్య మేపారఁగన్. ౩౯౫

ఉ॥ ఇట్టులు రాజు లిర్వురు జయేచ్ఛఁ బెనంగుచు రెండు సేనలన్
గట్టులఁబోలె నేనుఁగులు కాల్బల మశ్వములున్ శతాంగముల్
దిట్టలు గట్ట రక్తనది దిక్కులు వాఱఁగఁ గంక గృధ్రముల్
చుట్టుకొనంగ నిర్జరులు చోద్యము నొంద దురంబు రాజిలెన్. ౩౯౬

క॥ తురగ భటేభాంగంబులఁ, దొఱఁగెడు రక్తనది చూడఁ గనొచ్చెన్ రణకా
తరులకు రవిజదిగాగత, ఝురమో యనఁ బొరలి ఘోరసమరావనిలోన్. ౩౯౭

క॥ వ్రేలాడు కేశములతో, నోలిని నల్లనదిఁబడిన యొడయలశిరముల్
బాలురు కేళికి వైవన్, గాళిందిన్ దేలెడి సొరకాయ లనఁదగెన్. ౩౯౮

చ॥ వరతురగాధిరోహకుల వ్రాలిలు శిరంబులు గాంచి గృధ్రముల్
సొరిది ఫలేచ్ఛ మేకొనఁగఁ జూచి దివిన్ జరియించు టొప్పె సుం
దరములు దచ్ఛరీరములు దత్థినతిమేలనఁ జేరఁ గోసు భూ
వరభటజీవులో యనఁగ వర్ణన సేయఁగ నెల్లవారికిన్. ౩౯౯

మ॥ కలహాళిందములోన నిల్చి రిపుచే ఖడ్గాహతుండై సురీ
లలనన్ దాఁ దొడమీఁదఁ బెట్టుకొని లీలన్ బోవుచో నొక్కఁడా
మెలనాగన్ గని కంటె నాతనువు నిశ్శ్వేలంబుగా నుండియున్
జలజాస్త్రోజ్జ్వల[illegible] విచ్ఛాయంబుగా కింతకున్. ౪౦౦

ఆ॥ ఎంతలోన రిపుని ♦ యేటునఁ గూలి యొక్కండు మించి దేవ♦కాంతఁ గూడె
నంతలోన వహ్ని ♦ ననుగమించుచు నొక్క-చేడె గూడెఁ బతిని ♦ జిత్రి మరయ.

శా॥ బాహాబాహవిఁ బోరి యిర్వురు భటుల్ ♦ ప్రాణాంతమున్ జెంది సం
దేహం బింతయు లేక నాకమున కెం♦తే వేడ్క నేగంగ ను
త్సాహం బొప్పఁగఁ దమ్ముఁగోరు సురకాం♦తల్ జెందు కాంక్షల్ బున
ర్బాహాబాహవిఁ బోరి రక్కట సుర♦వారిత్రంబు లాహా! యనన్. ౪౦౨

ఉ॥ ఒక్కఁ డరాతిచే మడిసి యుద్ధ♦తుండై దివి కేగి ప్రేమచే
నొక్కసురాంగనన్ గని మ♦దోద్ధతి మోహముఁ జెంది చూడు మేఁ
జక్కనివాఁడ శౌర్యగుణ♦శాలిని నన్ను వరింపు మంచుఁ బే
రక్కున వ్రాలి దానిఁ గుసు♦మాస్త్రరతిన్ వలపించె మించుగన్. ౪౦౩

చ॥ ఒకతతి భూరజం బెగసి ♦ యుద్ధతిమై దివిఁ బర్వుచున్ రవిన్
బ్రకటగభస్తిమై గగన♦పద్ధతిఁ గన్పడనీదు వెంటనే
వికట తురంగ నాగ భట♦వీర శరీర వినిర్గతాస్రి వా
ర్నికర సముద్రముల్ పొరలి ♦ నీరజబాంధవుఁ గానఁ జేసెఁడే. ౪౦౪

చ॥ ఒక యనుకూలనాయకత ♦ నొప్పెడు వీరుఁడు పోర వైరిచే
వికలశరీరుఁడై మడిసి వేగమ ♦ నింగికిఁ బోవుచో నొకా
నొకసురకాంత త న్గలయ♦నోజ నెదుర్పడ దానిఁ గాంచి ప
ట్టక చనియెన్ వ్రతచ్యుతిఁ గ♦డంగు నటంచని పాపభీతుఁడై. ౪౦౫

—. వీరసేనుఁడు మృతుఁడగుట. .—

క౦॥ భీమంబై సంగర ము,ద్దామంబై చెల్లుతతి యుధాజిత్తు శర
స్తోమంబునఁ బడఁజేసెన్, భీమబలున్ వీరసేనుఁ ♦ బృథివి యదురివఁగాన్. ౪౦౬

గీ॥ భిన్నశీర్షుఁ డగుచుఁ ♦ బృథివిపైఁ గూలిన, వీరసేను బలము ♦ వెఱచి నాల్గు
దెసలఁ బాఱెఁ జెట్టు ♦ తెగిపడ్డ తఱిఁ బక్షి,గణము లేచి పోవు♦గతి గణింప. ౪౦౭

ఉ॥ అంతటఁ దండ్రి ఘోరసమ♦రావనిఁ గూలె నటంచు వించు దు
ర్దాంత విషాదవేదన ధ♦రన్ బడి యశ్రులు జాలువాఱ వి
భ్రాంతమనస్క యాచు వెఱ♦వాఱి మనోరమ పూర్వ వైరమున్
స్వాంతమునన్ దలంచి కడు ♦ నర్భకు మత్సుతు నేమి నేయునో. ౪౦౮

ఆ॥ రాజ్య లోభ వశత ♦ రాజులు దురితంబ,టంచు వెఱపు లేక ♦ యఖిలబంధు
జన విరోధమునకు ♦ సాహసింతురు నాదు, తనయునెడల నతఁడు ♦ దయనుగనునె.

మ॥ అతిమోహంబునఁ బెంచు తండ్రియును లేఁ — డత్యంత మోహమ్మునన్
సతతంబున్ గడు ముద్దు సేయు కరుణాసాంద్రుండు మాతామహుం
డతఁడున్ నాకము సేరె నింకిట మదీయాత్మోద్భవున్ గావఁగా
గతి యింకెవ్వరొ? యేమిసేతు నకటా! — గాఱించె దైవం బిటుల్. ౪౧౧

శా॥ లోభావిష్టులు పాపచిత్తులు కరాళుల్ రాజు లాత్మార్థమై
లాభం బించుక గల్గెనేని గురువుల్ — భ్రాతల్ పితల్ బంధువుల్
గా భావింతురె? యెట్టులైన హతులన్ గాఁ జూతురే గాని యీ
భూభాగంబున మేలుచూచి మనుపన్ — బుద్ధిన్ దలన్ దాల్తురే?

గీ॥ ఏమి సేయుదునింక నే నెందుఁ బోదు, నెఱవకు మనంగ నా కొక్క — వేల్పుఁ గలఁడె
ధూర్వహుం డిప్పురంబునఁ — దోడుగలఁడె, పట్టియెడఁ గీడుగల దేని బ్రతుకుగలదె.

శా॥ అత్యాశాపరులైన దుర్మతు లభక్ష్యంబైన భక్షింతు రా
చిత్యం బెంచ కగమ్యనైనఁ గలయన్ — జింతింతు రొండేల ధ
ర్మత్యాగంబునకైన నియ్యకొని యాత్మన్ మెత్తు రీరాజు దా
ర్గత్యం బెంచునె? నాదుపట్టి నెద దీర్ఘక్రోధిఁ గాఁ జూడఁడే! ౪౧౩

గీ॥ సవతియైన లీలావతి — సమయ మెంచి, నన్ను వంచించు జనకసనాథ యగుచు
నాదుసుతుమీఁద ననుకంపనాటఁ జేసి, తనదుసుతుఁ బోలెఁ జూడఁగాఁ దలఁచునొకో:

—• మనోరమ సుత సహితయై పాఱిపోవుట •—

ఉ॥ ఇత్తఱి నెందునేనిఁ జన — కిచ్చట నుంటినయేని పుత్రునిన్
మత్తిలునైరివర్గముల మాటున — బంది బిగించి నన్నెదన్
దత్తఱమందఁ జేసి యిలు — దాఁటఁగ నంపెడు వింతలేల నా
చిత్తము పల్లటించె నిఁకఁ జేయ — నుపాయము లేదు దైవమా. ౪౧౪

సీ॥ మాతృగర్భంబున — మరుదీశ్వరుఁడుఁ జొచ్చి, వజ్రంబుచే వ్రేసి — వ్రచ్చి వైచి
తొలఁగక యేడేడుతుండెముల్ గాఁ గొట్టె, యనిలు నల్పునిఁ జేసెననఁగ వినమె!
సవతి గర్భముఁ దాల్పసైఁపక యొండొక, సవతి విషంబిడ్డ — సగరుఁ డనుచు
నంగంబు విషముచే — నావృతంబుగఁ బట్టి, కలిగెనంచును దొల్లి — పలుకవినమె!

ఆ॥ అన్న నడవి కనిపి — యనుజుఁ డిద్ధర నేలఁ, గైక పతికిఁ బోధ — గఱపెననుచుఁ
గథలు చెప్ప వినమె — కాన సపత్నుల, సిరికి నోర్చువారు — క్షితినిఁ గలరె!

ఆ॥ నాదు సుతుని రాజుఁగాఁ దలంచిన యట్టి, యెల్లవారు వారి — కిష్టులైరి
యిఁక యుధాజితుఁడు గ — నెదు రెఱుంగక తన, యిచ్చ వచ్చినట్లు లెగసి పడఁడె.

ఉ. దైవవశంబునన్ దనకుఁ బ్రదా బెడిదంబగు కష్ట మయ్యె ని
చ్చావశవర్తియైన నృపచంద్రుఁడు దోర్బలశాలి లేఁడయో !
యేవిధి నాపదంబునిధిఁ నీఁదుచు నూరక యుంటినేని పు
త్రావన మెట్టులయ్యెడు నుపాయ మొకండు దలంపఁగాఁ దగున్. ౪౧౮

మ॥ అని చింతించి విదల్లుఁడన్నచివు నేకాంతంబునన్ జేరఁబి
ల్చి నయజ్ఞుండవు సర్వకార్య వహన క్షేమంకర ప్రక్రియా
జనితోత్సాహి వటంచు నందనునిహస్తం బాత్మహస్తంబునన్
దనరన్ బట్టుచు బాష్పసంకలితనేత్రద్వంద్వయై యిట్లనున్. ౪౧౯

అ॥ తాత మడిసెఁగలనఁ దండ్రియంతకుమున్నె, దివికి నేగె సుతుఁడుతెరువెఱుంగఁ
డాజిశూరుఁ డయ్యుధాజిత్తు నాకుఁ గర్తవ్యమేమొ చెపుము తండ్రి యనిన.

ఆ॥ తల్లి! నీదు పలుకు తథ్యంబు వెఱవకు, మిందు నిలువఁ జనద యిపుడె నీకు
నడరు పుట్టఁ గాశికరుగుద మందు,మామాతులుండు గలఁడు మనుచు మిమ్ము.

చ॥ అతఁడు మహాబలుండు సమరాంగణధీరుఁడు నిన్నుఁ గావఁగా
మతిఁ దలపోయు నంచని సుమర్మముగా వచియించి ద్వార్థనం
తతికి యుధాజితున్ గనఁగ సత్వరతన్ జనువార మంచు న
మ్మతిఁ గొనఁ దెల్పి రాసుతుఁడు మాతయుఁ దాను రథాధిరూఢులై. ౪౨౨

ఆ॥ పోవుచున్న యెడలఁ బొక్కుచు మదిలోనఁ, దండ్రిఁ దలఁచి తనదు ధవునిఁ దలఁచి
వగచి వగచి దుఃఖవారాశి మున్గుచు, రాజధాని వెడలె రాజపత్ని. ౪౨౩

కం॥ అరదముపై సత్వరమున, నరిగి దినద్వయము మీఁద నమరనదితటిన్
గర మొప్ప నిలువఁ బాటచ్చర బృందము వెంటనంటి సమయోత్కంఠన్.

ఉ॥ తెచ్చు ధనంబు వస్త్రములు దీప్తవిభూషణముల్ రథంబునన్
ముచ్చిలి చోరు లేగ విధిమోసము నెంచుచు దుఃఖ మొందుచున్
వెచ్చని యూర్పుఁ బుచ్చుచును వేఁదుటనొందుచు వాతెర దూఱుచున్
గ్రచ్చఱ నొక్క చేడెచెయి గట్టిగఁ బట్టుక దాఁటె జాహ్నవిన్. ౪౨౪

వ॥ మఱియుఁ దత్తరంబునఁ ద్రికూటం బను నొక్క పర్వతంబు చేరి యందు భార
ద్వాజాశ్రమంబున నైరంధ్రీసమేతంబుగా మంత్రియుం దానును నందనుండును
నలువురు భయభ్రాంతులై చనుచుండ నయ్యెడ నొక్క తాపసుండు రాజవల్లభం
జూచి యమ్మా? నీ వెవ్వరిదాన విట్లతికృచ్ఛ్రంబునం బోవుచున్నదానవు
మనుష్యాంగనవో? దివ్య భామినివో? రాజ్యభ్రష్టవై పుత్రసహితంబుగా దారిం
గానక యడలుచు నడవులన్ బడి పోవుచున్న యట్లుగాఁ దోఁచుచున్నయది

యనిరఁ గన్నుల బాష్పంబు లురల దుఃఖ సంతప్తయై తన దీన వృత్తంబు చెప్పం
జాలక విదల్లు మోమునఁ వీక్షింప నతం డత్తాపసోత్తమున కిట్లనియె. ౪౨౯

సీ॥ ధ్రువసంధి యనెడు భూధవునకు నిల్లాలు, పేరు మనోరమ పెద్దకాల
మఖిల భోగంబుల ననుభవించినయది, పతి సింహనిహతుఁడై పడిన మీఁద
నరులు రాజ్యంబెల్ల నపహరింపఁగ నిల్లు, వెడలి యిట్లరుదెంచె వీరసేనుఁ
డీయింతి తండ్రి దౌహిత్రహితార్థియై, కదనంబు లోపలఁ గడఁగి చనియె

గీ॥ వైరి యైన యుధాజిత్తు వలన భీతిఁ, జెంది మీపాలఁ జేరె నిశ్చలియ బాల
పుత్రి రక్షకులరు మీరు భూతహితుల, రార్తరక్షణ మదిమీకు ననర్హమనఘ.

చ॥ అభయ మొసంగి రక్షకులరై రిపుసంభవమై తనర్చు న
ట్టి భయముఁ బాఱఁద్రోలుచుఁ గడింది కృపామతిఁ బ్రోవుఁడన్న న
య్యిభవరయానఁ గాంచి తరుణీ! వెఱపేటికి నిందు నిల్వు మం
చభయ మొసంగి నీవు భవదాత్మజుఁ డిందు మనుం డభీకులై. ౪౩౦

కం॥ నీనందనుండు దుర్జయుఁ, డై నవ్య సుఖంబు నొందు నవనీరాజ్య
శ్రీనిధి గాఁగలఁ, డుడుగుము, మానిని! దుఃఖం బటంచు మన్ననఁ జేసెన్.

గీ॥ అమ్మనోరమ సచివుండు నాత్మజుండు, తోడి చేడియ తనకుఁ జేదోడు గాఁగ
నందు నివసించి దుఃఖంబు నపనయించి, మౌని కాంతలఁ గూడి నెమ్మదిఁ జరించె.

సీ॥ అంత యుధాజిత్తు హర్షమ్మునను సంగ, రాంగణమ్మున విజయమ్ము నొంది
భేరీ మృదంగ ముఖ్యారవంబులు నృత్య, గీత వాదిత్ర సంకీర్తనములు
వంది స్తుతుల్ పర్వ వాసిష్ఠ పూర్వంబు, గా స్వర్ణకలశోదకములఁ దనదు
దౌహిత్రునకు మహోత్సవముగా మూర్ధాభి, షేకంబు గావించి లోక మెల్ల

గీ॥ విన విజయశాసనం బెత్తి విక్రమించి, శత్రుశేషంబనుచు సుదర్శనునిఁ జంపఁ
దలఁచి యన్వేషణ మొనర్పఁ దల్లితోడ, వెడలిపోయె నటంచుఁ దా విని కలంగి.

ఉ॥ వేగిరపాటు నొందుచు గవేషణ కృత్యమునన్ భటాళి ను
ద్వేగమనస్కుఁడై యనిపి విశ్రుతమౌ స్వబలంబు గొల్వ నా
నాగరిమంబులన్ దుహితృనాగరికుల్ దను నంప స్వీయ భూ
భాగముఁ జేరె భేరిపటుభాంకృతు లెంతయు మిన్నుముట్టఁగన్. ౪౩౨

సీ॥ సాకేతపురిలోన సాధుజనమ్ములు, కటకటా! భూపాలకాంత కెంత
యలజడిపుట్టె నేమయ్యెనో పసిబిడ్డఁ డాసుదర్శనుఁడు నేమయ్యెనొక్కొ?
పతిపోవుటే కాక వైరులచేఁ దండ్రి, హతుఁడైన వెఱచి శోకార్త యగుచు
మృతినొందెనో? లేక గతిమాలి యెందేని, చనియెనో? గనిరేని జంపివైతు

గీ॥ రెంత కష్టంబు గలిగె నీ కివింత దెలియ, మనకుఁ బ్రాణాంత మగునని కి మాటుపఱిచి
శత్రుజిద్వశవర్తులై కి సమయ మెఱిఁగి, స్వార్థపరు లయి వర్తింపసాఁగి రెలమి.

చ॥ దురితమనస్కుఁడైన నృపధూర్తు యుధాజితుఁ డాసుదర్శనున్
గిరిగహనాదులన్ వెదకి కి కీడ్వడి కానక కింకరాళి యె
ల్లరు వినిపింపఁ జింతిలి, యిఁకన్ గలయన్ బరికించి యొక్కచో
సురనదిచెంత శైలమునఁ కి జూచితిమంచని జాడఁ జెప్పఁగన్.

చ॥ గిరికిఁజనన్ యుధాజితుఁడు కి కృత్రిమసేనలఁ గూర్చి యొక్కఁడన్
గెరలుచు శృంగిబేరపురి కి గీముగ నిల్చు నిషాదనాథునిన్
బరిచితుఁజేసి వెంటనిడి కి ప్రస్థితుఁడై చనుదేరఁ దత్థ్సితిన్
నరవరకాంత దా విని యనారతదుఃఖభరార్తి సోలుచున్. ౪౩౫

—• మనోరమ సుదర్శనునితో భరద్వాజాశ్రమమున నుండుట •—

వ॥ పరమతపోధనుండగు భరద్వాజ మహామునిని జేరన్ జని కుయ్యిడుచు, మహాత్మా! మత్పితృహంత యగు యుధాజితుండు తన దౌహిత్రునకుఁ బట్టంబు గట్టి మత్పుతుం డగు సుదర్శనునిన్ జంప బలాన్వితుండై దుర్ధర్షుం డను నొక్క నిషాదాధిపతిం గూడికొని యిచ్చితఱికూటంబున కేగుదెంచుచున్నవాఁ డని వింటి, నింక నేమి చేయుదు? శరణం బెవ్వ రాదురు? తొల్లి పాండవులు ద్వైతవనంబున నివసించి యున్న తఱిఁ బతులేగురు మృగయావినోదులై యన్యవనంబునకుం జనినఁ బర్ణశాలామధ్యంబున నేకాకినియై పాంచాలి యున్నతఱి ధౌమ్యుండును నత్రియు గాలవుండును గౌత్సుండును జాబాలియు గౌతముండును భృగుండును జ్యవనుండును వీతిహోత్రుండును శ్వేతకేతుండును సుమంతుండును యజ్ఞదత్తుండును వాత్స్యాయనుండును యవక్రీతుండును యజ్ఞకృత్తుండును భారద్వాజుండు మున్నగు మహర్షులు వేదపారాయణం బొనర్చుచున్నయెడ సర్వాంగసుందరియై యనేక దాసీజనసమేతయై యాజ్ఞసేని మునిజనసమక్షం బగుట వల్లభులు దూరంబు చనినను భయంబొందక యుండెఁ, గావున ననశంబుగా జయద్రథుండు బలసమన్వితుండై దేశాంతరం బరుగుచు వేదఘోషంబులు విని మునిదర్శనలాలసుండై వారల సమీపించి కొమ్మెఱుంగు వడువున మెఱయుచు మునిపత్నుల నడుమనుండివచ్చు ద్రౌపదిం గాంచి మోహావిష్టుండై తపోధనుం డగు ధౌమ్యుం గాంచి యిట్లనియె.

—• ద్రౌపదీ వృత్తాంతము •—

సీ॥ యౌవనమధ్యస్థయగు నివ్వరారోహ, యెవ్వాని పాణిగృహీతి? తండ్రి
యెవ రీమె పే రేమి! కి యిలకు డిగ్గిన పులోమజయొ? బర్బరవనసమధ్యకలిత

కల్పకలతయొ? ద్రాక్షాలతాయుతమైన, రంభయో? యనఁగ విభ్రాజమాన
రూపలావణ్య శోభాపూర్ణయగు నిట్టిభామిని యెందుఁ జూపట్టదయ్యె

గీ॥ నిజముఁ బల్కుము ధౌమ్య! భూభుజునిపత్ని, పోల్కి నున్నది తాపసపుత్రిగాదు
మెఱసి నిలిచిన తొలుకారు మెఱుపనంగఁ, జూడఁదగియున్న దీ బోటి సొంపుమీఱి.

చ॥ అన విని ధౌమ్యుఁ డిట్లనియె నయ్యవనీశునితోడఁ బాండవాం
గన ద్రుపదాత్మజాత యిది కార్యవశంబున స్వాశ్రమాంతరం
బున నివసించుచున్నయది పుత్త్రికవోలె శుభాశుభంబులన్
గని యిట నుండువార మని కందువఁ దెల్పిన నాతఁ డిట్లనున్. ౪౩౯

క॥ ఇమ్మచ్చెకంటి నిటనిడి, యెమ్మెయిఁ జనినారు భర్తలెఱిఁగింపుము వా
రిమ్మేదిని శూరులు విజయమ్ము మహిమ సిరులు గలుగు ననఘులు సుండీ!

ఉ॥ నావుఁడు ధౌమ్యు డిట్లనియె నల్వురు తమ్ములఁగూడి ధర్మజుం
డీవనమధ్యమందు మృగయేచ్ఛ రథంబుల మీఁద నెక్కి యెం
తే వడిఁ జన్నవారల హరీశ్వరుఁ డంబరమధ్య మెక్క బ
ర్ణావసథంబుఁ జేరుదు రటన్నను డిగ్గనలేచి వాఁడొగిన్. ౪౪౦

క॥ మన్నింపు మనుచు ద్రౌపది, సన్నిధికిన్ బోయి మ్రొక్కి సరసజముఖి! ని
న్నెన్నో యేండ్లయ్యెను గని, నిన్నిట విడి భర్తలెచట నిలిచిరో? యనఁగన్.

మ॥ ద్రుపదాత్మోద్భవ సైంధవున్ గని జయాస్త్రోకుండ వై యుండు మం
చుపలాలించి వనంబునందు మృగయావ్యాసక్తాత్ములై యేవురున్
విపులోత్సాహముతోడ నేగి రిపుడే విచ్చేయు కాలంబు, ప
ల్కపలాపింపక నిల్వుమీ? యనుచు మార్గ్యం బొప్పఁగాఁ బల్కినన్. ౪౪౧

క॥ విశ్వాసపరుని పోల్కి న,విశ్వాసి జయద్రథుండు వెలఁదిన్ గొనఁగాఁ
బశ్వాశయుఁ డద నరయుచు, నశ్వరమతి దుష్టచేష్ట ననువర్తించెన్. ౪౪౩

క॥ ఇమ్మహి నెవ్వరినేనియు, నమ్మంగారాదుసు మ్మనారతము కదున్
నమ్మికచేఁ గాదే మును, నమ్మాధవుచేత బలి భయంబొందె మునీ! ౪౪౪

సీ॥ సత్యసంధుఁడు సాధుసమ్మతుఁ డధ్వరకర్త ధర్మిష్ఠుండు భర్త పుడమి
కతిదాత ప్రహ్లాదునంతవానికిఁ బౌత్రుఁ, డలవిరోచనునకు నాత్మజుండు
నగు బలి యేకోనయజ్ఞశతంబు సదక్షిణంబుగఁ జేసెఁ దఱి మెఱింగి
నిర్వికారుండును నిఖిలేశ్వరుఁడు సర్వమూర్తి యోగైకగమ్యుండు శార్ఙ్గ

గీ॥ కశ్యపాత్మజుఁడై దేవకార్య మెంచి, కపట వామన వేషియై గాదె బలిని
సప్త సాగర సంక్రాంత సకలరాజ్య, మపహరించె వచింపఁగా నన్యుఁడేల?

క॥ కావున నెవ్వని నెప్పుడు, నేవాఁడును విశ్వసింప నిచ్చఁ దలంపం
డే విధి నైనను గడు లో,భావిష్టుఁడు మోసగించు నది నిజము సుమీ. ౪౪౬

క॥ పర ధన దారాగ్రహ త,త్పరులకుఁ బరలోకహాని భయ మొందదు త
ద్దురితాత్ముఁడు లోభాహతిఁ, గరణత్రయమునను బద్ధకాంక్షత నుండున్.

ఉ॥ ముక్తి నొసంగఁగల్గు సురముఖ్యుల నైన ధనంబు వేడియ
వ్యక్తతఁ బెంపొనర్తురు దురాత్ములటంచు వచింప నేటికిన్
శక్తి కొలంది కార్యములు సల్పిరొ? యాచనఁ జేసిరో? ఖలుల్
ప్రాక్తనకర్మ మెంచక ధ్రువంబని యార్జనసేతు రర్థముల్. ౪౪౭

క॥ అర్థము గోరెదు జనులు ప,రార్థమ్ముగ దేవపూజమైనను జేయన్
వ్యర్థులయి కోరుదురు పర,మార్థము గోరుటకు వారి కగునే తలఁపన్. ౪౪౮

సీ॥ రవి నిశానాథోపరాగంబు లందైన, నర్థార్జనము సేయునట్టి ఖలులు
గంగాదితీర్థావగాహనంబులు సేయు, పుణ్యులు ధనధాన్యభూహిరణ్య
వస్త్రాదికంబులు వలయునట్టు లొసంగు, వారని వెనువెంట బాఱుచుందు
రట్టిమూర్ఖులకుఁ దీర్థాధ్యయనాదులు, కృతములై యుండి యకృతము లగును
గీ॥ గాన లోభోపహతులైన ఖలుల నమ్మ,రాదు సైంధవుఁ డటు నిల్చి రమణి ద్రుపద
పుత్రికను జెఱఁబట్టఁడే భోగదుర్మ,దాంధుఁడైన యుధాజిత్తుఁ డట్ల సేయు.

గీ॥ ఏను మీచెంత వాల్మీకి యింట సీత, యాత్మజోపేతయై యున్నయటుల నుందు
నాయుధాజిత్తు నెటులైన నాగ్రహించి, యిందు రానీకుఁ డని వేడు నిందుముఖిని.

చ॥ తలఁగకు ద్రోహచిత్తుఁడు కృతఘ్నుఁడు వాని గిరీంద్ర మెక్కనీ
నలఘువచఃకృపాణముల నచ్చటనే మరలంగఁ జేతుఁ బై
దలి యిది నమ్ము మంచని యుధాజితు సన్నిధిఁ జేరవచ్చి య
త్యలఘుతపోగరిష్ఠుఁ డగు నమ్మునిచంద్రుఁడు పల్కె వానితోన్. ౪౫౧

మ॥ సమదారంభము సైన్యమున్ గొనుచు రాజా! వచ్చుటెట్లో? మనో
రమ దుఃఖార్తి సపుత్రియై వెఱచి మోర్వన్ జాల కిందుండె నా
శ్రమ మెంతో వికలంబుగాఁ గలదు పై సైరింప మిందేల యో
ప్పమి రాకుండఁ బురంబు సేరుము వృథాప్రాగల్భ్య మింకేటికిన్ ౪౫౩

ఉ॥ పొమ్మని పల్క, "బుస్సు" మను ¦ భూరిభుజంగముఁ బోలె, రోజుచున్
హుమ్మని యీ హుతంబు విడు ¦ మొయ్యన నీవు మనోరమన్ సుతున్
దె మ్మటు సేయవేనిఁ బటు¦తీవ్రబలాహుతి నాశ్రమమ్ము నా
శమ్మొనరించి వారలను ¦ జయ్యన బట్టెదఁజూ! బలాత్కృతిన్. ౪౫౪

మ॥ పరుషోక్తం బిటు లాడినన్ విని భర¦ద్వాజుండు నీవింత దు
ర్భరశక్తిన్ వహియించెదేని మును న ¦ వ్వాసిష్ఠధేనుగ్రహా
దరుఁడై పాతిన గాధిసూతివలె దు¦ర్ధర్షాస్మదీయోక్తిము
ద్గరధారాశకలీకృతాంగుఁడవు కాఁ¦గా దూఱరే? భూజనుల్. ౪౫౫

క. ఏటికి మాతో వాదిఁక, వీటికిఁ జనుమనిన రాజు ¦ వెఱచి సచివు న
చ్చోటికిఁ బిలిపించి రహః, కూటమునన్ బలికె నిట్లు ¦ గొంక కతనితోన్. ౪౫౬

ఉ॥ తాపసి యడ్డమై నిలిచి ¦ తన్వి సుదర్శనుఁ బట్టనీ నటం
చేపున నున్నవాఁడు రిపుఁ ¦ డించుక యల్పుఁడటంచుఁ జూచినన్
బైపయి మ్రింగరాని కడి¦భంగి భరంబగు గాదె? సూటిగా
నాపద వేఱొకండగు న¦టంచుఁ దలంచెద మంత్రిసత్తమా! ౪౫౭

గీ॥ రాజయక్ష్మయు ధరణి న¦రాతిజనుఁడు, సరిమె కాఁజూచి సమయింపఁ¦జాలఁడేని
గాన రాకున్న యటు లుండి ¦ కసి మసంగి, యెంతవానిని జెడఁజేయు ¦ టిది నిజంబు.

ఉ॥ ఇచ్చట సేన లేదు మద ¦ మెక్కిన యోధులు గానరారు నా
యిచ్చ సుదర్శనున్ బలిమి ¦ నీడ్చినఁ దాపసు లడ్డ మాదురే?
తెచ్చి శిరంబుఁ ద్రుంపఁ గడ¦తేరదె? వైరము; శత్రుజిత్తు స
ర్వోచ్చయుఁడై యకంటకత ¦ నుర్వి సమస్తము నేలు వాఁ డగున్. ౪౫౯

చ॥ బలముల కానతి మ్మనినఁ ¦ బార్థివుఁ జూచి యమాత్యుఁ డిట్లనెన్
జలము వహింప కయ్య మది ¦ సాహసమున్ విడు మయ్య, కూడ ద
త్యలఘులు తాపసోత్తములు ¦ తద్వచనంబులు వజ్రతుల్యముల్
కల దొక వృత్త మీవు విన¦గా వచియించెదఁ జిత్తగింపుమా! ౪౬౦

—విశ్వామిత్రుఁడు నందినీధేనువును బట్టుకొనుట.—

సీ॥ అధిప విశ్వామిత్రు¦డను రాజు మృగయాభి, హరియై గిరిగహ¦నాంతరముల
నడయాడుచు వసిష్ఠు ¦ నాశ్రమ సీమకుఁ జనుదెంచి మ్రొక్కి య¦హాసనయమీంద్రు
నాశ్రమంబున నిల్వ ¦ నతఁడు నిమంత్రించి, నందినీకృతభోజ¦నంబు షడ్ర
సోపేతముగ నిడ ¦ నుప్పొంగి సైన్యస¦మేతంబుగా భుజి¦యించి తృప్తి

గీ॥ నొంది యాశక్తి తపసికి నొనరు శెల్ల, నందినీప్రభావంబునను గోయటంచు
శక్తిజనకునిఁ జేరి యాచన మొనర్చె, నందిని నొసంగు మని గాధినందనుండు.

క॥ ధేను సహస్రం బిచ్చెద, దీనిని నా కిమ్ము నిత్యతృప్తులు మీ కీ
ధేనువుతోఁ బని యేమని, మానక పలుమాఱు నడుగ మహిపతి కనియెన్.

క॥ హోమార్థ సంగృహీతం, బే మెట్టు లొసంగు వార మీధేనువరం
బో మానవేశ! గోతతు, లేమిటికిన్ బనికి వచ్చునే ? యిట్లనుగన్. ౪౬౩

క॥ ఈఁదగ దని నను విసువక, యేఁ దెచ్చెద ధేనులక్ష నిచ్చెద వీనిన్
గాదన కిమ్ము మనస్కృతి, గా దేని హరింతుఁ జుమ్ము గవి నే ననినన్. ౪౬౪

ఉ॥ గాధికుమార! మ మ్మిటులఁ గట్టిఁడివై వెఱపింపనేల ? యీ
సాధువిరోధ మేమిటికి సజ్జనయోగ్యము గాదు నీకు నీ
క్రోధ మదేల మాపయుని, గోవును బట్టఁగఁ జూచితేని నీ
యోధులఁ గూడి పట్టుకొను ముద్ధతి నా విని రాజు దండిమై. ౪౬౫

చ॥ బలయుతులైన భృత్యులను బట్టుఁడు గోవును గట్టుఁడంచు దాఁ
బలువుర రాజు పంపఁ బశుబంధనరజ్జులు గొంచు బల్మిమై
నిలునిలుమంచు బిట్టఱచి నిష్ఠురదండము లెత్తి కొట్టుచున్
బలుపులు పెట్టి కట్టిరి యభంగురచండపరాక్రమంబునన్. ౪౬౬

క॥ కట్టుఁబడి భటుల నెల్లను, గట్టలు పడ నీడ్చికొనుచు గాధితనూజున్
గట్టలుకఁ జూచి యకటా, కట్టిఁడివై నన్నుఁ బట్టఁగాఁ జూచితివో ! ౪౬౭

వ॥ అని వసిష్ఠునిం గనుంగొని, ౪౬౮

మ॥ అపరాధం బిసుమంత లేదు నృపభృత్యవ్రాతముల్ వెంట నం
టి పరాభూతి నొనర్చి కట్టి రిదె దూర్ధిన్ దెల్పు నన్నిచ్చితో?
కృప యొక్కింతయు లేకపట్టిరో? పరిక్షీణంబు గాత్రంబు నా
యపరాధంబు వచింపు మీ విటు లుపేక్షాయత్తతన్ నిల్వఁగన్. ౪౬౯

కం॥ దీనోక్తుల నిటు పల్కెడు, నా నైచికిఁ జూచి తపసి యనియెన్ విసువన్
బూనఁగఁ జాలుదునే నిను, ధేనూత్తంసంబ? యింత తెలియదె నీకున్. ౪౭౦

గీ॥ ఏమి సేయుదు విప్రుండ నితఁడు భూత, లేంద్రుఁ డెంతయుఁ గఠినుఁడై హితము తప్పి
యింత పని కిచ్చగించె నిర్హేతుకముగ, మాట కైనను విడువంగ మనసు రాదు.

చ॥ అని ముని పల్కినన్ విని భయంకరమూర్తి వహించి లేచి వా
మ్మని మెడ రజ్జువుల్ దునిసి యంతట నంతట భూమి రాలఁ గా

ఘనముగ మేను పెంచి బలఖండనకేళి నటింప నొక్కటన్
ధ్వని యొనరింపఁ బెల్లగిలెఁ దద్బల మెల్లను భీతిఁ గ్రుంగుచున్. ౪౭౩

కం॥ కుండోధ్నీ గాత్రింబునఁ, జండతరాయుధులు కవచసంఛన్నులు ను
ద్దండు లగు యామినీచరు, లొండొండన్ వెడలి రాహవోత్సాహముతోన్.

చ॥ వెడలి నిశాచరుల్ భయదవీర్య ధురంధరులై బలంబులన్
విడివడఁ దు్రించి నైచుచును వెంబడి నంటి శితాయుధంబులన్
కడి కడి ఖండఖండములుగా నొడళుల్ శకలంబులై ధరం
బడ నటుకన్ బలాయనము పాలయి దిక్కులఁ బాఱ నొక్కటన్. ౪౭౪

ఉ॥ బష్కయణీ దృగుల్లసిత పావక తీర్థ శిఖాకలాపముల్
దుష్కర రాజసేన పయిదోఁగిన నీఱయి గాలిఁ దూలినన్
శుష్క తటాకముం బలెఁ బశువ్రిజ నిర్గమ శూన్య గోష్ఠ భా
విష్కరణంబనన్ దనరె వే యన నేటికిఁ దద్బలం బాగిఁ. ౪౭౫

కం॥ శోకావిష్టుం డయి యవివేకమునన్ మూఢుఁడగుచు విశ్వామిత్రుం
డేకాకి నైతి నని గడుఁ, జీకాకై పఱచె సిగ్గు చిడిముడి పెట్టన్. ౪౭౬

ఉ॥ సాధ్యము గాని కృత్యమున సాహస మే మగు? గాధిజుం డని
ర్వేధ్యము మామకప్రబలవీర్య మటంచును నమ్మితిన్ దురా
రాధ్యము బ్రహ్మతేజము ధరన్ గడు నల్పము క్షాత్త్ర మంచు సం
శోధ్యము గాఁగ నెంచి పరిశుద్ధ తపస్స్థితి నుండెఁ గావునన్. ౪౭౭

క॥ మన కేటికి ముని జనులన్, మనమును నొప్పింప వంశనాశనకరమై
మన యాముష్మిక నాశన, మొనరించున్ గానఁ గర్వ ముడుగుము నీవున్. ౪౭౮

శా॥ భారద్వాజ మునీంద్రుఁ డెల్లెడల శుంభద్బ్రహ్మవిద్యాతపో
ధీరుం డన్యదురాసదుం డనుచు నెంతే విశ్రుతిన్ జెందె ని
ర్వైరంబున్ మది నెంచి సన్నిధికిఁ జేరన్ బోయి కేల్మోడ్చి త
త్కారుణ్యంబున నింటి కేగుదము సంధానిర్వాహం బేటికిన్. ౪౭౯

క॥ బాలుఁడు సుదర్శనుఁడు ముని, యాలంబన మనెడుఁగాత మాతనితో నిం
కేలా వైరము కానల, జాలిం బడి మృతుఁడు గాక చక్కంబడునే? ౪౮౦

క॥ దైవాధీనము సర్వము, భూవర! భూతలమునందుఁ బొసఁగునె? యాష్టల్
గావలయు పనులు గావే, యేవరుసలఁ గాని వౌనె యేవిధినైనన్. ౪౮౧

గీ॥ దైవయోగంబు సుకరమై తనకుఁగల్గ, వజ్రమైనను దృణరీతి వాఁడి చెడదె!
యదియ విపరీతమైయున్న నశనియగుచుఁ, దృణము వజ్రంబుపగిది సంప్రదీప్తమగును.

మ॥ శశకం బొక్కొకవేళ సాహసమునన్ శార్దూలమున్ మ్రింగెడిన్
మశకం బొక్కొకవేళ పైఁబడి మదోన్మత్తేభమున్ మ్రింగెడిన్
వశమే దైవము గెల్వ నెవ్వరికినిన్ వైరంబుఁ బోఁదోఁచి త్వ
ద్వశమౌ రాజ్యము నేలుకొమ్ము కలవే భావింప సత్యార్థముల్? ౪౮౩

క॥ పోదము మునిసన్నిధికిన్, వాదము మన కేల? యనిన వసుధేశుఁడు సం
పాదిత వినయుండై ముని, పాదంబుల దండఁజేరి ప్రణుతిన్ జేసెన్. ౪౮౪

ఉ॥ మ్రొక్కిన నాదరించి మునిముఖ్యుఁడు సర్వదయాపరుండవై
మక్కువఁ బ్రాణికోటులను మన్ననఁ దన్పుచు నుండు మన్న రా
జక్కటికంబునన్ మునివరాంతికసీమ సుదర్శనున్ బొరిన్
వాక్కుల నాదరించి బుజవర్తనుఁడై పురిఁ జేరె నంతటన్. ౪౮౫

క॥ సభ్యోత్తంసుం డగు ముని, యభ్యాశమునందుఁ దొల్లి యాత్మజు నయవి
ద్యాభ్యాసం బొనరింపుచు, నభ్యుదయము నొందుచుండె ననవరతంబున్.

క॥ మునిబాలకుఁ డనఁగ సుద, ర్శనుఁడును నానాఁటి కందు సన్మునికరుణా
వనధిన్ దేలుచు వృద్ధిన్, గనియెన్ విద్దెలకు మొదటి గనియో యనఁగన్.

### సుదర్శనుఁడు దేవీమంత్రముఁ బఠించుట

చ॥ అనవరతమ్ము నమ్ముని సమక్షమున న్వసియించుటన్ విద
ల్లునకుఁ బ్రసంగసంగతి నలుప్తము గా స్మరబీజ ముచ్చరిం
చిన నది యాలకించి నృపసింహకిశోరము సంతతంబు త
ద్ఘనతరమంత్రబీజము యథావిధి తాఁ బఠియించె నచ్చుగన్. ౪౮౮

మ॥ భవితవ్యం బగు భాగ్యవైభవము శుంభద్భల్లీల భోగింప దై
వవశం బట్టుల నుంటఁ బ్రాప్తమయి సంబంధించుటన్ బాలుఁ డ
య్యు విచారం బొకయింత లేక పఠనోద్యోగంబుఁ బాటించెఁ బ్రా
గ్భవయోగంబులు దప్ప నెవ్వరికిఁ జెప్పన్ వచ్చునే? ప్రాప్తముల్. ౪౮౯

క॥ ధ్యానన్యాసచ్ఛందో, హీనంబయ్యును మహామునీంద్రుని కరుణా
ధీనుఁడగుఁ గాన బీజము, వానికి సబ్బె నొకపంచవత్సరములలోన్. ౪౯౦

క॥ ఆడెడునప్పుడు గీతముఁ, బాడెడునప్పుడును మంత్రపఠనము మఱవన్
జూడఁడు ఖలజనములతోఁ, గూడండు సుదర్శనుండు గుణఖని యగుచున్. ౪౯౧

సీ॥ అంత నేకాదశహాయనంబున భర, ద్వాజుండు కరుణించి । రాజసుతుని
నుపనీతునిగఁ జేసి విపులధనుర్వేద, సారంబు నీతిశాస్త్రంబు మొదలు
సకలశాస్త్రంబులు । చదివింప దినదినం, బభివృద్ధిఁ జెంది శోభాతిశయతఁ
బ్రబలుఁడౌ నొకతఱిఁ బ్రత్యక్షమై శక్తి, సాంగరూపమున సాక్షాత్కరింప

ఆ. రక్తవస్త్రములును । రక్తభూషణములు, రక్తకాంతి, విహగరాజయాన
మలరు వైష్ణవీ మహాదేవిఁ బొడఁగాంచి, ధన్యుఁడగుచు నాసుదర్శనుండు. ౪౯-౨

గీ॥ రక్తమాల్యానులేప వస్త్రములతోడ, భూషణోజ్జ్వలకాంతు లబ్బురము గొల్వ
నమ్మహాదేవి వైష్ణవి । యాదిశక్తి, విహగవాహనమై నిల్వ వేడ్కఁ గాంచి. ౪౯-౩

క॥ క్షితిఁజాగిలఁబడి రాసుతుఁ, డతులితభక్తి నుతియింప । నంబిక కరుణా
యతమతి దీవించి తిరో,హితయయ్యె సుదర్శనుం డహీనవిభవుఁడై. ౪౯-౪

ఉ॥ ఆవనమందు నిల్చి జగదంబికసత్కరుణన్ సమస్తవి
ద్యావిదుఁడౌచుఁ దల్లి ననయంబు నయంబు భయంబుఁ జొప్పడన్
సేవ నొనర్చుచున్ దివిజసింధుతటీవనిలో నటింప న
ద్దేవి యొసంగె బాలునకు । దివ్యశరాసనబాణతూణముల్. ౪౯-౫

ఉ॥ అంతటఁ గాశిరాజతనయామణి సుందరగాత్రి యామినీ
కాంతవిభావిభాసురముఖద్యుతి దివ్యవధూసమాన యే
కాంతమునందు రాట్సుతుల । యందము లందఱు వందలింప న
శ్రాంతవనస్థుఁడౌ విధునిచందము నొందు సుదర్శనున్ విన్. ౪౯-౬

సీ. సర్వలక్షణ కళాసంపన్నుఁ డతిశూరుడవని కేతెంచు పుష్పాయుధుండు
సరసవాక్చాతుర్యసంధాయి యంబికా, కరుణైకనిలయుండు । ఘనుఁడటంచు
వందిసందోహంబు । వలన వీనులవిందు,గా విని యతనిసంకల్పవశత
వల్లభుఁగాఁ గోరి । వాంఛించుతఱి నొక్క, రేయి స్వప్నమున సంప్రీతితోడ

గీ॥ దేవి శర్వాణి కనిపించి । తెలవ నాడు, భక్తుఁడు సుదర్శనుండు సంభావనీయ
ధైర్యగాంభీర్యధుర్యుం డుదారుఁ డతని, వరునిగాఁ జేసికొనుము భవ్యంబు నీకు.

ఉ॥ నాకరుణన్ సుదర్శనుని । నాథునిగాఁ గొని సర్వసౌఖ్యసు
శ్రీకరమూర్తివై సకలసిద్ధులు గాంచెద వంచుఁ బల్కి ని
ర్వ్యాకులచిత్తఁ జేసి పరవస్తువు శాంకరి యభ్రవీధి నా
లోకపదంబు మీఱి చన । లోలవిలోచన నిద్ర మేల్కొనెన్. ౪౯-౭

గీ॥ మేలుకాంచితి నని యంత । మేలుకాంచి, స్వప్నవృత్తాంత మెల్లను సంస్మరించి
హర్షకారణమగు నీయుదంత మెల్ల, [illegible]చు వెసన్ జెమర్చు. ౪౯

ఉ॥ అంతట నంతటన్ దెలిసి యాశశిలేఖసవిత్రి పుత్రిగు
బ్బెంతయు గుర్తెఱింగి యిదియేమని పుత్రిని గ్రుచ్చి గ్రుచ్చి నీ
వింతగఁ జింతనొందుటకు హేతువుఁ దెల్పు మటన్నఁ దల్లికిన్
స్వాంతము విప్పి చెప్పుటకునై ధృతిచాలక సాకుఁజెప్పఁగన్. ౫౦౦

గీ॥ సఖులు కొంద ఱీ విధమగు జాడ నెఱిఁగి, తల్లి! మీతల్లికినిఁ జెప్ప నొల్లకున్న
మానె మాకును నెఱిఁగింపరానిదున్నె?,యనుచు బతిమాల నత్తన్వియంతనంత.

గీ॥ సిగ్గు ముమ్మరమై తనుఁజెప్పనీక, వెనుకకును లాగ సఖులు ముందునకు లాగఁ
జెప్పకయుఁ దప్పదయ్యె నాచెలికిఁ దనదు, స్వప్నవృత్తంబునింతదాఁచక వచించె.

గీ॥ అంతట వసంత మెల్లెడ నలమి చిగురు, జొంపములఁబూలగుత్తుల సొంపు నింప
సమయము లభించె నని సుమశరములకును, జెట్టు చెట్టుకుఁ దిరుగాడెఁజిత్తభవుఁడు.

ఉ॥ చంపక .కేతకీ కుటజ సాల తమాల రసాల మంజరీ
సంపద లుల్లసిల్లు నొకచల్లనితోఁట సఖీసమేతయై
పొంపిరి వోవు తావిగల పువ్వులు గోయుచు శాంతి నొంది ద
ట్టంపు నికుంజమధ్యమున డస్సి వసించె నెలంత యంతలో. ౫౦౪

ఉ॥ చెంత వనాంతరమ్మునను శీఘ్రగతిన్ జనుదెంచు నొక్క దే
శాంతరవాసి విప్రుని దృగంతములన్ గనుఁగొంచు సమ్మద
స్వాంతము తోడ మ్రొక్కి ద్విజవర్య? వడిన్ జనె దెందుఁ బోయె దొ
క్కింత యెఱుంగఁ దెల్ప చనవే! యన విప్రుఁడు పల్కెఁ గల్కితోన్. ౫౦౫

క॥ ఏను భరద్వాజగిరి,స్థానంబుననుండి యిందుఁ జనుదెంచితి నా
తో నేమి వలయు పనికై, పూనితొ, నే నటకు వేగ బోవలయు ననన్. ౫౦౬

గీ॥ ఓ మహాభాగ! యయ్యాశ్రమోత్తమమున, నుండి వచ్చితి రచ్చటనుండు వింత
లెట్టివో? విశేషములు మీరలెఱిఁగి యుందు,రందు వినఁదగినట్టి వేమైనఁ గలవొ.

వ॥ ఏను కాశీరాజతనుజను, శశికళ యనుదాన; మీకుం దెలిసిన చక్కనివిశేషం
బొక్క టెఱింగింపఁ బ్రార్థించెద ననిన నా భూసురుండు తొయ్యలీ! నీవంటి
రాకుమారిక వినఁదగిన దొక్క విశేషంబు వివరింతు నాకర్ణింపు మని యిట్లనియె.

సీ॥ ధ్రువసంధి యను నొక్కయవనీశుఁ డాతని, తనయుఁడై తగు సుదర్శనుఁ డనంగ
నక్కుమారునినామ మన్వర్థమై యొప్పు,బురుషోత్తముఁడటంచుఁబొగడఁదగదె?
తన్మహాభాగుని దర్శనంబు సమస్త, చేతనులకు ఫలసిద్ధి సుమ్ము
సకలగుణమ్ములు సరసిజాసనుఁ డందె, సృజియించె ననుటయె సిద్ధ మరయ

గీ॥ కలికి! సద్గుణముల కెల్ల గని యతండు, నీకు సతనికిఁ జూపరేఖాకలాప
విభవ మొక్కటి గాక వేఱేవ్వియు గలదె, తరుణి! నీయాస యతఁడెసూతగినవాఁడు.

గీ॥ అతనికిని నీకు ననుబంధమయ్యె నేని, గనకమును రత్నమును గూర్చు కరణిఁబొసగు
బూవుఁదావియుఁ గలసినపోల్కి నుండుఁ, గాన మీ కిర్వురకు దైవఘటన గలదు.

క॥ భారద్వాజాశ్రమమున, సారం బగు వర్ణ్య మిదియ చనెద న టంచున్
సారసనయనకుఁ దెల్పి య, థారుచి నా విప్రుఁ డేఁగెఁ దరుణియు నంతన్.

చ॥ మును ననురాగమగ్న యయి మోహవశంవద యాట విప్రవ
క్త్రనళిననిర్గతం బగుచుఁ దట్టియుఁ దేనియ తేటమాటలన్
బెనురుచిఁ బుట్టి కామశరపీడిత యై సఖిఁ జూచి పల్కె నో
వనరుహనేత్రి నాతలఁ పవారిత మయ్యెఁ గదా తలంచినన్. ౫౧౨

మ॥ రసవిజ్ఞానము లేదు, బాలను, వికారం బాత్మఁ బెల్లయ్యె, రా
జసినై రాట్కులమందుఁ బుట్టితి మదిష్టం బెట్లు చేకూర్చునో?
కుసుమాస్త్రం; డిఁక నేమి సేయుదును గోర్కుల్ దీర మన్నించి సం
తసమున్ జేయఁగ నెవ్వ రోపుదురు సంతాపింప నయ్యెన్ గదా! ౫౧౩

మ॥ కలలో నచ్చెలికానిఁ గంటి ధరణీకందర్పుఁడే తెల్లము
య్యెల పోల్కిన్ మది యూఁగఁ జొచ్చె విరహం బెచ్చయ్యె లో నెంతో న్యా
కులతల్ గల్గెడు సైఁపఁజాల నిదె లోకుల్ విన్న హాస్యాస్పదం
బిలలో "నందని మ్రాని పండునకుఁ జేయెత్తంగ సిద్ధించునే?" ౫౧౪

సీ॥ చందనంబు విషంబు చంద మయ్యెడు మేన, సరులు కాలాహులై శ్రమము గొల్పె
నిండువెన్నెలలు వహ్నిజ్వాలలై త్రోఁచె, మేడలయందున్కి గోడుగూర్చె
దీర్ఘికావిహృతి వర్తింప నిచ్చఁ దొలంగె, సుఖసాధనంబు లసుఖము లయ్యెఁ
దల్ప తాంబూల గీతవినోద నృత్యముల్, సంతసింపఁగఁ జేయఁజాలవయ్యె
గీ॥ అన్నపానాదికంబులు నరుచు లయ్యె, సఖుఁడు వసియించియున్నట్టిజాడ దెలియ
జనకుఁడు స్వయంవరం బైనఁ జాటఁ దలఁపఁ, డేమి సేయుదు నింక నేనెందుఁ జొత్తు.

గీ॥ ఎన్నఁ డైనను దాసినై యెసఁగు భాగ్య, మబ్బఁ జేయునో? చేయఁడో! యతనియింట
నలువయనితోఁచుచున్నదో నళిననయన!, దైవ లిఖితంబుఁ దెలియనాతరముగాదు

మ॥ ధరణీ భోగ ధురంధరుల్ నృపకులుల్ ధాత్రిన్ బ్రవర్తింపరో?
వరసంపద్విభవాభివృద్ధులు జగద్వాల్లభ్యముల్ చేయవో?
వరణీయుల్ తన కంచు నెంచుదునె? మద్వాంఛాస్పదుం డాతఁడే
కర మొప్పార వరుండు గాఁగలఁ డికన్ గావించు మ్మెయ్యేటికిన్. ౫౧౭

వ॥ జనమేజయా! పరదేవీ మాహాత్మ్యం బెఱుంగ వచ్చునే? యేకాకియు నిర్ధనుండును బలహీనుండును వనవాసియు ఫలాహారుండును నగు సుదర్శనుండు తనకు భర్త యగునని యమ్మహారాజపుత్త్రి యంతరంగంబునం దలంచి వరించుట దేవీ మంత్రబీజమహిమంబకదా! సుదర్శనుండు మంత్రజపసిద్ధిం బడసె; పరదేవీ ధ్యానపరుం డగుటవలన స్వప్నంబున నఖండితయు విశ్వమాతయు నవ్యక్తయు సర్వసంపత్కరయు నగు వైష్ణవీశక్తి సాక్షాత్కరించి యనుగ్రహించె, నంత శృంగిబేరపురవరాధ్యక్షుండగు దుర్దర్శనుండు సనుదెంచి తురంగచతుష్టయసంయుతంబును బతాకామండితంబును నగు నరదంబును సమర్పించి యీతండె సర్వాధిపతి కాఁగలం డని కానుక లొసంగిన మునిజనంబు లానందించి కతిపయదినంబులఁ బితృరాజ్యాధికారంబు నిన్నుం జెందుఁ బరితాపంబున నన్యగుండవై యుండెదు విశ్వమోహిని యగు నంబిక నీకుం బ్రసన్న యయ్యె, సహాయంబును సత్త్వసంపన్నతయు లభించు నని మనోరమను గాంచి, నీ సుతుండు ధరాధీశుండు గాఁగలఁ డనిన భవదుపాసనమున నట్టి వాఁడగుట సందియంబే యని నుడువుచు సచివసహాయరహితుం డైన మత్పుత్త్రునకు మీ యాశీర్వచనసహాయంబున నింత యగుట కేమి కొఱంత యని వచించు నత్తన్వి పలుకుల నభినందించి సుదర్శను దుర్దర్శనున కప్పగించి యేతద్భరణంబు భవదధీనం బని పల్కె నంత. ౫౧౮

చ॥ అరదము నెక్కె రాజసుతుఁ డంతఁ బ్రయాణము సేయునంతనే
వరచతురంగసేనలును వాద్యములుం వెనువెంట వచ్చు న
ట్లరు దన నేల? మంత్రమహిమాతిశయంబున సర్వసిద్ధులుం
గరము లభింపవే? సకలకామితముల్ ఫలియించు టబ్రమే. ౫౧౯

గీ॥ మంత్రబీజ ప్రతాపైకమహిమవలన, నతని యక్షౌహిణీసేన లావరించి
కేళ్లు దాఁటుచు దెసలఁ గ్రిక్కిఱిసి నడచె, మదనబీజప్రభావ మిస్మూడ్కి గాదె?

సీ॥ పరదేవి భజియించు పావనునకు సర్వ, కామితార్థంబులు గలుగు టరుదె?
కాళి ప్రసన్నయై కరుణించువారికి, లభియింపరాని దుర్లభము లున్నె!
ముక్తి చిచ్ఛక్తి మదిలోనఁ జింతించువానికిఁ, గరతలామలకంబు గాదె?
భగవతీపాదాబ్జభక్తుఁడౌ వానికి, నైశ్వర్యసంప్రాప్తి యబ్బురంబె?

గీ॥ కాన విశ్వాసమునఁ జిత్తకమలమందు,
నాది శక్తిని భజియింప నట్టివాఁడు
పరమనిర్భాగ్యుఁ డని మతిభ్రష్టుఁ డనియు
మూఢుఁ డని మూర్ఖుఁ డని యెంచుకొమో మహీశ. ౫౨౧

ఆ॥ అఖిలదేవమాతయై యుగారంభ వి,ఖ్యాత గాన నాదిమాత యనెడు
నామమునఁ జెలంగెనా మహామూర్తి స,చ్చరిత మింక వినుము కురునృపాల!

సీ॥ బుద్ధి కీర్తి స్మృతి శ్రద్ధా మతులు లక్ష్మి, ధృతి శక్తి యనఁగ నీదేవి రూపు
లఖిలామరులకుఁ బ్రత్యక్ష నిదర్శనం,బులు మానవులు మాయమోహితు లయి
తెలియంగ లే రాదిదేవి విశ్వేశ్వరి,గా భజింపరు కుతర్కజ్ఞు లగుచు
బ్రహ్మ విష్ణ్వీశానవరుణ వాయు కుబేర,శమ నాన లార్క చంద్రములు మఱియుఁ

గీ॥ ద్వష్టృ పూ షాశ్వినులు దేవతలు మరుద్గ,ణంబులును విశ్వదేవు లనారతంబు
నఖిలసృష్టిస్థితిధ్వంసనాథ్య మైన, యట్టి దేవిని ధ్యానింతు రవనినాథ.

గీ॥ అట్టి పరశక్తి సేవింప నహరహంబు, గలఁడె లోకత్రియంబున గణ్యతముఁడు
ఆ సుదర్శనుభాగ్య మేమనఁగవలయు, దేవి సర్వార్థద యటంచుఁ దెలిసినాఁడు.

సీ॥ రాజరాజేశ్వరీ రంజకంబుల కన్న, వ్యంజకంబులు సత్త్వభంజకములు
భువనేశ్వరీ తత్త్వబోధకంబులకన్న, సాధకంబులు పుణ్యబాధకములు
నారసింహీగుణ ప్రేరణంబుల కన్నఁ,దారణంబులు జన్మకారణములు
విశ్వేశ్వరీమూర్తి వీక్షణంబులకన్న, రక్షణంబులు పాపభక్షణములు

గీ॥ సమరసానందసుఖవర్తనములకన్నఁ, గీర్తనంబులు పరలోకనరత్నములు
ఘోరసంసారవారాశిఁ గూలి నట్టి,జనులకును నావ యఖిలాండజననిసేవ.

క॥ మోక్షేచ్ఛ గలుగువారికి, రక్షక మగు యోగవిద్యరసికుల కఖిలా
ధ్యక్ష యయి మోక్ష మిచ్చి క,టాక్షింపదె దురవగాహయై భక్తిమెయిన్‌.

శా॥ ఏ విశ్వేశ్వరి విద్య యయ్యును స్వతంత్రేచ్ఛన్ ద్రిలోకమ్ము స
ద్భావం బొప్ప సృజించి పెంచి పరమాత్మన్ మెచ్చఁగాఁ జేసి స
ర్వావస్థామయమాయయై కుతుకచర్యాయుక్తిఁ గల్పాంతకా
లావిర్భూతి నడంచు నాయమ మహత్త్వావాప్తి సామాన్యమే.

గీ॥ కాననమ్మునఁ గాయలు కంద మెసవి, బడుగుపోలిక నున్న భూపాలసుతుఁడు
విశ్వసామ్రాజ్యపూజ్యుఁడై వెలయుటెల్ల, జిత్సుబీజైకపఠనసంసిద్ధి గాదె.

—• శశికళ సుదర్శనుని బెండ్లియాడుట •—

ఉ॥ అయ్యెడఁ జంద్రరేఖకు సుమాశుగవేదన తాళలేక లో
నెయ్యము పల్లవింపఁ బ్రియునిన్ గవయన్ సదుపాయ మేమి లే
కయ్యును శారికాశుకపికార్భటిఁ దల్లడ మందుచున్ గడున్
డయ్యుని తాపవేదన కడంక వడంకుచు నిట్టులుండఁగన్.

ఉ॥ నందని యాత్మ వేదన మనంబునఁ గాంచి వరాభిలాషచేఁ
గొందలమందు టారసి యనుకంతితవృత్తి స్వయంవరమ్ము సే
యం దలపోసి కాశిపతి యాత్మపురిన్ ద్రివిధంబుగా జగ
ద్వందితమై యెసంగ నయనతత్పరుఁడై యొనరించె మెచ్చుగన్. ౯౩౦

కం॥ కోరినవరున కొసంగుట, ఘోరంబగు పణము గెల్చికొననిచ్చుటయున్
శూరతఁ గెలిచిన నిచ్చుట, యారయ నిమ్మూఁడుదెఱఁగులగు రాజులకున్.

వ॥ అది గావున స్వయంవరంబు త్రివిధంబై ప్రవర్తించుటవలనఁ దత్ప్రకారంబు సవిస్తరంబుగా శిల్పిజనంబులఁ బిలిపించి రత్నకీలితస్వర్ణమంచాలంకృతంబుగా నతి విశాలమంటపంబు నిర్మింపన్ జేసి సమస్తసంభారంబులఁ గుదిర్చి తోరణాలంకృతంబును ధూపధూమోద్దీపితంబును సుగంధద్రవ్యసంభృతంబును గా స్వయంవర స్థానంబుఁ జేయుట సఖీజనంబులవలన నెఱింగినదై యొక్క సఖిన్ జేరన్ బిలిచి శశికళ యిట్లనియె. ౯౩౨

కం॥ తరుణీ యంతిపురంబున, కరిగి రహస్యంబుగాఁగ నాత్మజననికిన్
స్థిరమతిఁ దెల్పుము స్వీయాంతరవృత్తి నెఱుంగునట్లు తడయక నీవున్. ౯౩౩

సీ॥ ధ్రువసంధి యనునట్టి యవనీంద్రు తనయుండు, చక్కనివాఁడు సుదర్శనుండు
వరుఁడు గాఁగలఁడు నే వరియింతు నాతని, నన్యుల వరియించునటభ్రమమము
నిజముగాఁ దెల్పుము నీ వందుఁ జని యన్న,వచ్చి యచ్చెలి రాజవనితఁ గాంచి
అమ్మ! నీబిడ్డ నీసమ్ముఖంబున కేగి, వినిపించు మను పల్కు వినుము తెలియ
గీ॥ రాజపుత్రిక "నే భరద్వాజు నాశ్రమమ్మున సుదర్శనుం డను మహిపసుతుని
గోరికొని యున్నదాన నాకును దదన్యవరునిపైఁ గోర్కి లే"దని పలికె ననిన.

కం॥ ఆ మహిషి యాత్మనందని, ప్రేమోక్తులు చెవులు సోఁక విని తన కడకున్
భూమిపతి రాఁగఁ దన తనయామణి యనురాగవిషయ మంతయుఁ దెలిపెన్

శా॥ ఆమాటల్ విని నవ్వి విస్మితుఁడు నై యారాజు నైదర్భియా
భామారత్నము భార్యతో ననియె నీబాలుండు శౌర్యోగ్రుడౌ
భూమీపాలున కోడి యొక్కఁడు జనంబుల్ గానరానట్టి వ
న్యామధ్యంబున నిర్ధనుండగుచు నున్నాఁ డెట్లు వాంఛించెనో! ౯౩౬

ఆ॥ తెలియు మఖిలనృపులు దేశాంతరంబుల,నుండి వేడ్కవచ్చుచున్నవారు
తా స్వయంవరమున ధరణీశుఁ జేకొన,మెప్పుగాదె తెలుపు మిప్పుడైన.

చం॥ అనుచు సుబాహుఁ డిట్లు తన యంగనతో వివరింప రాజ్ఞియున్
దనయను నూరుపీఠమునఁ దాల్చి విచారము నొంది తత్తుద

ర్శనుఁడు దరిద్రుఁడై విధివశమ్మున రాజ్యముఁ గోలుపోయి కా
ననములఁ గందమూలము లనారతమున్ భుజియించుచుండెడిన్.

సీ॥ బలకోశరహితుండు బంధువిహీనుండు, నగుచు రాజ్యభ్రష్టుఁడై పురంబు
వెడలి తల్లిని వెంట నిడుకొని యొక్కఁడు, గాసిలుచున్నాఁడు గాన నీకుఁ
దగిన వాఁ డగునె? కందర్పతుల్యులు కృత, ప్రజ్ఞులు గుణనిధుల్ సుప్రబలవీర్య
గాంభీర్యధుర్యతాశాలినులు రాట్పుత్రులు, గల రందు నొక ధరాకాంతుఁ జెట్టఁ

గీ॥ బట్టి తేనియు మాకెల్లఁ బట్టి! సంత,సమ్ము; గాదేని నీ మానసంబు నందుఁ
గోరినట్టులఁ గావింతుఁ గొఱఁత వలదు, చెప్పఁదగురీతి యిది విశ్వసించి వినుము.

ఉ॥ నీ మదిఁ గోరినట్టి వరుని బురి వెళ్ళఁగఁగొట్టినట్టి సు
తామసమాన వైభవుఁడు దర్పకతుల్యుఁడు తమ్ముఁ డున్న వాఁ
డా మహిపాలునాజ్ఞ సకలావని కున్న దితండు శూన్యుఁడై
యేమఱి యున్నవాఁ డతని కెచ్చగు వైరము గల్గియుండెడిన్. ౫౪౦

చ. ధరణి యుధాజితుం డనెడు దండిమగండు విరోధి యాతనిన్
బరిభవ మొందఁజేసి పగఁబట్టి వధింపఁగ నున్నవాఁడు స
త్వరముగ వచ్చి యమ్మునులదండ వసించుటఁజేసి యమ్మునుల్
భరపడి యడ్డపడ్డ నిలువన్ గలిగెన్ ధరఁ జావు దప్పుటన్. ౫౪౧

ఆ॥ ఇందువలన మదినిఁ గొందల మంది నే, నిటులఁ జెప్పినాఁడ నింతమీఁద
నీదుచిత్త మనుచు నీ తండ్రి నీతోడఁ, జెప్పు మనియె ననినఁ జెలియ పలికె.

సీ॥ తల్లి! నీ యాన సుదర్శనుఁబతిఁ గాఁగ, నాత్మలో వరియింపనయ్యె నాకు
నతనితో వసియింతు నదిగాక భర్తకుఁ, బరిచర్య సేయుట పరమహితము
అవ్యాజ కృతమైన యట్టి వర్తనము సౌ,ఖ్యదము మోక్షదము స్వర్గదముగాదె
పరశక్తి కలలోనఁ బ్రత్యక్షమై సుద,ర్శనుని జేకొనుమనియనియెఁ గాన

ఆ॥ నాలలాటభిత్తి నలువ వ్రాసెను నీ సు,దర్శనుండు నీకు ధవుఁ డటంచు
నతని విడిచి యొరున కాసింప నిదియ త్రి,శుద్ధి యనుచు నిజము సుత వచింప.

కం॥ ఆరాజపత్ని పతికిఁ గు,మారికవచనంబు లెల్ల మతిఁ బట్టఁగ ని
ర్ధారణముగఁ జెప్పిన విని, భూరమణుఁడు సంశయంబుఁ బోవిడిచె నృపా.

చ॥ ముదమునఁ జంద్రరేఖ ద్విజముఖ్యుని నొక్కని బిల్వ నంపి యో
సదయ! యతిత్వరంబుగ నశంకితవృత్తినిఁ దండ్రి గాన కుం
డ దయితునంతికంబున కొండంబడిపోవలయున్ మదుక్తి స
మ్మద మొదవంగఁ దెల్పి నృపముఖ్యు సుదర్శను నిందుఁ దేఁ దగున్. ౫౪౨

సీ॥ తండ్రి సుబాహుండు తనయనౌ నాకు స్వయంవరం బొనరింప నాత్మఁదలఁచి
చాటింపఁ బంప రాజన్యు లంతంతట, వచ్చుచున్నారు ని న్వరునిఁగాఁగఁ
గోరితిఁ గలలోన గౌరి యానతి యిచ్చె, నిట్టులు నిన్నుఁ జేపట్టు మనుచు
గరళంబు మ్రింగుదు గనలుచిచ్చునైనఁ, బడుదు వారిధినైన విడుతుఁ దనువుఁ

గీ॥ దల్లిదండ్రులయాజ్ఞకు నొల్లకుంటి, వాఙ్మనఃకాయముల నిన్నె వలచియుంటి
భగవతీకృప నీవె నాభర్త వగుదు, రమ్ము దైవమ్ముగతి సందియమ్ము లేదు.

కం॥ తల్లి జగజ్జాలంబుల, కెల్లను భగవతి వచించు నే యర్థంబుల్
పొల్లగునె? దేవజననికి, నుల్లము మనయందుఁ గలుగు టూహింపు మొగిన్.

గీ॥ "నావమన్యేత యోషితో" యనెడు సూక్తి, మఱిఁ దలంపుము రా వేని మాట లేల
యేను బలికిన శపథంబు లిన్ని నిజము, రమ్మనుచుఁ జెప్పు మని పర్వరాజవదన!

వ॥ సదక్షిణంబుగాఁ దాంబూలం బొసంగి పంపించిన నతండు సత్వరంబుగా భారద్వా
జాశ్రమంబునకుం జని యందు సుదర్శను దర్శించి యేతద్వృత్తాంతంబు సవిస్త
రంబుగాఁ దెల్పి సుదర్శనాగమనం బవశ్యకర్తవ్యంబుగా నొడంబఱిచికొని పున
రాగతుం డయ్యె నంత సుదర్శనుండు మునిప్రేరితుండై ప్రస్థాననిశ్చయం బొనర్చు
తఱిఁ దల్లియగు మనోరమ యిట్లనియె. ౧౪౯

శా॥ అన్నా! యొంటిగ నిట్టు లేగెదు భుజాహంకార మేపార సం
పన్నుల్ రాజులు వచ్చియుండిరి బలంబా! లేదు బాలుండ వీ
వన్నింటన్ గడు దుర్బలుండవు వృథావ్యాపార మింతేల? నన్
జిన్నం బుచ్చఁదలంచువాఁడగు యుధాజిత్తుండు వే యేటికిన్. ౧౫౦

ఉ॥ ఆతఁడు వచ్చుఁ దప్పక స్వయంవరసీమకు వచ్చెనేని య
త్యాతతసాహసుండు హననార్థియు గావునఁ బోవ నేల? న
న్నీతఱి నేకపుత్రిను సమీహిత మెంచక యిందు డించి నీ
వీ తెఱఁ గాచరించుట మదిష్టము గా దని యెంచుమీ!మదిన్. ౧౫౧

మ॥ అకటా! నన్ను నిరాశఁ జేసి చను టేలయ్యా! పితృద్వేషియా
వికటుండైన యుధాజితుండు ప్రబలావిఖ్యాతి సంపన్నుఁ డీ
వకలంకస్థితిఁ బోవఁ జూచెదు సహాయం బింతయున్ లేదు వ్య
ర్థకథల్ మానుము నాదుమాట విని కుశజ్ఞా! సుంత యోజింపుమా! ౧౫౨

వ॥ అని యివ్విధంబునం బల్కిన మాతం జూచి సుదర్శనుం డిట్లనియె. ౧౫౩

గీ॥ కాఁగలుగు నర్థ మెట్లును — గాకయున్నె?, తల్లి? నీ కింత వగ పేల — తల్లితల్లి
యాజ్ఞ గలదు శుభంబె యాసనఖిల దిశల, క్షత్రియాణివి శోకంబు — చనదు నీకు

క॥ భగవతి యనుగ్రహంబున, జగ మెల్లన్ గెలిచి తెత్తు — సౌందర్యవతీ
వగ పేల? కోడలిని జూచి గణింతువు నాదు బలము — చెలువము తల్లీ! ౫౫౫

క॥ అని పలికి రథారోహణ, మొనరించి సుదర్శనుఁడు సముద్ధతి నెడలెన్
ఘన తేజో భాసురుఁడై, చను కొమరుని గాంచి తల్లి — స్వస్తి పఠించెన్. ౫౫౬

## —• మనోరమ పుత్రుని దీవించుట. •—

క॥ శ్రీ దళుకొత్త సుదర్శన!, యా దళదబ్జాక్షి శివ మహామాయ దయా
సాదర యగ్రింబున నా,మోదించుచు నిలిచి మనుచు — మ్రొక్కులు గొనుచున్.

క॥ నీ కిరు క్రేవలను గృపా,స్తోకకటాక్షేక్షణములఁ — జూచుచు నెపుడున్
శ్రీకర యగు పార్వతి శివ.భీకరశత్రుల నడంచి — పెంపొసఁగు సుతా. ౫౫౮

క॥ సార కటాక్షేక్షణములు, పై రంజిలఁ జేసి భయదహభల్లుక వృక కం
ఠీరవ ముఖముల నణఁచి కు,మారా! వారాహి గాచు — మార్గములందున్. ౫౫౯

క॥ దుర్గమము లౌ భయంకర,దుర్గస్థలులందు విషమహావోర్గర్వ ధురా
నర్గళుల నరులఁ గూలిచి,దుర్గ నినున్ గాచుఁ బుత్ర? — తొడిబడ కెపుడున్. ౫౬౦

క॥ ఆళీజనపరివృత యై, కేళులను నటించు పోల్కిఁ — గీలాభీలో
త్తాలకరవాలకరయై, కాళిక రక్షించు నిన్నుఁ — గలహములందున్. ౫౬౧

క॥ మంటపమధ్యంబున నినుఁ, గంటకులన్ జొరఁగ నీక — గాచున్ నీవె
న్వెంటన్ దిరుగుచు నిను భయ, మంటదు మాతంగి కరుణ — నరుగుము వత్సా!

క॥ సమ్యక్కరుణాశాలిని, సౌమ్య స్వయంవరణవేళ — సంరక్షించున్
గమ్యాగమ్యములందున, రమ్యములగు తేజములను — రంజిలు తనయా! ౫౬౩

క॥ భవమోచని యగు పార్వతి, స్వవశీకృతి నిలిచి కొండచరియలయందున్
దవిలి నినుఁ గాచుచుండెడు, నవశత సరివరుల గెలుతు — వరుగుము పట్టీ!

క॥ గిరిదుర్గస్థలులను సం,చరణము లొనరించు నట్టి — సమయమునందున్
గిరిజాదేవి కటాక్షో,త్కరమున రక్షించు నిన్ను — దారతఁ జనుమీ! ౫౬౫

క॥ భీమబలోద్దామంబున, నీ ముంగిట నిలిచి కాచు — నిఖిలావనయా
చాముండిక శాంభవి చను, మేమియు సాధ్వసము నీకు — నెనయదు పుత్రా!

క॥ ఘోరారణ్యమునందు న, పారకటాక్షేక్షణములఁ బాలించుఁ గృపా
ధార యగు కామగమన; యుదారుఁడ వై చనుచు విజయ మందుము తండ్రీ!

క॥ భేదింపఁదలఁచు శత్రువి,వాదంబుల నిన్నుఁగాచు వైష్ణవి కరుణా
స్వాద కటాక్షేక్షణములఁ, బ్రోది యొనర్చుచును జిఘుత! పామ్మెసకమునన్.

క॥ అఖిలాండజనని ప్రోచున్, నిఖిలపరిత్యర్థివీరనివహము లందున్
సుఖముగఁ జని వచ్చెదు ముని, సఖు లెదురై చూచుచుండఁ జనుమో వత్సా!.

క॥ అని యాశీర్వచనోక్తులఁ, దనయుని దీవించి పనిచి తడఁబడి యేనున్
నిను విడువఁ దోన వచ్చెద, నని గద్గదకంఠ యగుచు నశ్రులు దొరఁగన్.

చ॥ ఒడలు వడంకఁ దోడఁ జను నొద్దిక మాతయు నాయితంబుగా
నొడఁబడి తేరి పై నునిచి యొక్క వయస్యను దోడుఁజేసి య
వ్వడువున విప్రదత్తశుభవాక్ప్రతతుల్ గయికొంచుఁ గాశికిన్
వెడలె సుదర్శనుండు పురవీధుల నెల్లరుఁ జూడ నంబతోన్. ౫౭౧

ఉ॥ వచ్చె సుదర్శనుం డనెడు వార్త సుబాహుఁడు వించు నంతలో
నచ్చట దివ్యసౌధముల యందు నివాస మొనర్పఁ జేసి య
భ్యుచ్ఛ్రయ మొంద సత్కృతులఁ బ్రోది యొనర్చి భుజిష్యసంతతిన్
మెచ్చఁ దదంతికంబునకు మేకొనఁ బంపెను సేవనార్థమై. ౫౭౨

సీ॥ పాంచాలనాథుండు పార్వతేయుండును, గామరూపవిభుండు ఘనబలుండు
కర్ణాటభూపతి గర్వధూర్వహమూర్తి, నైదర్భుఁ డురుభుజావైభవుండు
మొదలు గాఁగల రాజముఖ్యులు తత్స్వయం,వరదిదృక్షు బెనంగ వచ్చి రటకు
నలువది మూఁడగు నక్షోహిణుల సేన, లేకార్ణవంబుగ నెనసి పురము

గీ॥ నెల్ల యెడలను సందీక యేపు మిగిలి, సూచికాగ్రంబు మోపంగఁ జోటు లేక
రాజులును రాజసేనలు రాజవీధు,లందు సందీక నిలిచి రిలాధినాథ! ౫౭౩

మ॥ చతురంగంబుల తోడ వచ్చితిమి దోశ్చాతుర్య ధౌరేయతా
స్థితి నన్యోన్య నిరాకరిష్ణులము సందేహింప మెవ్వారికిన్
ధృతిచే నింతయుఁ జెప్ప నొప్పెసఁగు నెంతే నీతఁ డొక్కండ యై
క్షితిభృన్మండలిలో సుదర్శనుఁడు వచ్చెన్ వింతయా నం చొగిన్. ౫౭౪

కం॥ అన్యోన్యముఁ గలయుచు రాజన్యులు తమలోనఁ దాము సరసోక్తులచేఁ
గన్యామణికిని జేతో,విన్యాసము సేయఁదగిన వీరుఁడ ననియో. ౫౭౫

ఆ॥ వెంట సేన లేదు ♦ వీరుండునుఁ గాఁడు, దుర్బలుండు లేదు♦దోర్బలంబు
నెల్లవారి విడిచి ♦ యింతి తన్నువరించు, ననుచు వచ్చె నొక్క♦యనుచుఁబల్క.

మ॥ విని యా సూక్తి యుధాజితుండు వివిధోర్వీపాలురఁ జూచి యే
యనుమానంబును లేక సాటి నృపతుల్ ♦ హాసోక్తి సూచింప వ
చ్చినవాఁ డేసహియింపఁ గోధవశతన్ ♦ శీర్షంబు ఖండింతు వీం
ని నిమిత్తంబు గవేషణక్రియలచే ♦ నే డస్సి యుంటిన్ గదన్. ౧౮౮

గీ॥ దైవవశమున నేఁడింధుఁ ♦ దారసించెఁ, దొలఁగి చననీను ఖండింతు♦దోర్బలమున
ననుచుఁ గరవాలు బెఱుకంగ ♦ నాక్షణంబ, కేరళాధీశుఁ డడ్డమై ♦ కెరలి పట్టి.

చ॥ అనుచిత మీ స్వయంవరము♦నందు విరోధముఁబూని సేయు టి
య్యనువున నిట్టికార్యము సమంచితమే? బలిమిన్ గొనంగ లే
మనిమిషనేత్రి నెవ్వని గుణాశ్రత నెంచి వరింపఁ గోరునో?
వనజభవుండు ఫాలమున ♦ వ్రాసినవ్రాఁతవిధాన నయ్యెడున్. ౧౮౯

శా॥ అన్యాయంబునఁ దాతఁ జంపితివి రాజ్యంబెల్ల దౌహిత్రు నం
దే న్యాయం బని యుంచినం జెడి విపత్తిం జెంది శైలంబు లం
ఘించి న్యాసంబుల మెట్టుచున్ దిరిగి యార్తిన్ గంపమూలాదులన్
వన్యావాసత మెక్కి రాజ నని తా ♦ వచ్చెన్ దిదృక్షాదృతిన్. ౧౯౦

కం॥ కాకుత్స్థవంశజుఁడు సు,శ్లోకుం డితఁ డర్భకుండు ♦ చూడఁగ దగదే?
యీ కాఠిన్య మదేటికి, నీకున్ బాలుఁ డని గవయ♦నీతియె దలఁపన్. ౧౯౧

కం॥ "ధర్మో జయతి" య టంచును, ధర్మజ్ఞులు పలుక రొక్క ♦ తప్పునె సూక్తుల్?
ధర్మము పరిపాలించు న,ధర్మము చక్కడఁచుఁ గలదు ♦ దైవం బెపుడున్.

కం॥ సత్యము ధరణిన్ గెలుచు న,సత్యమ్ము నశించు ననుచు ♦ శ్రోత్రము పలుకున్
సత్యము మన్నింపుము నీ,కత్యాజ్యము సత్య మాత్మ ♦ నరయఁగ వలదే. ౧౯౩

ఉ॥ నీ మనుమండు రూపమున ♦ నీరజబాణసముండు రాజ్యర
క్షామహనీయమూర్తి ధన♦సంపద యక్షవిభున్ జయించు వాఁ
డీమెయి రాకతక్కనొకొ ? ♦ యిమ్మెలనాగ వరింప రాదె ? యిం
దీ మహిపాలసంఘముల ♦ నెవ్వనిఁ జేకొనునో ? యెఱుంగుదే. ౧౯౪

కం॥ ఒక్కం డెలనాగకుఁ బతి, తక్కినవా రెల్ల వాని ♦ దండింతురొకో ?
తక్కుము వైరము రాజున, [illegible] ♦ మేటికిఁ జెపుమా.

ఉ॥ కేరళభూవరుండు బుధకీర్తితకీర్తి వివాద మిట్లు దు
ర్వారవచోవిలాసియయి ౙ వారణసేయ యుధాజితుండు గం
భీరవచస్కుఁడై తలఁచుఁ ౙ బేరిలెదు దీనని సత్యవాది నై
తో రమణీయమూర్తులగు ౙ ధూర్వహు లుండఁగ గచ్చు లేటికిన్. ౪౮౬

క॥ రాజులు న్యాయం బెఱుఁగని, యోజన్ వచియించెదీవు ౙ యోగ్యులనడుమన్
ధీజడు లున్నను వారల, రాజీవాక్షులు వరింపరా? తెలియమిచే. ౪౮౭

ఉ॥ బెట్టుగఁ జెప్ప వచ్చెద వభీతుఁడనై "మృగనాథయోగ్యమై
నట్టి మదేభకుంభదళితామిష భాగము నక్క కబ్బునే"
యట్టి సుదర్శనుండు తగునే, లలితాంగి సుబాహుపట్టికిన్
గొట్టెద వీని నిల్వెడలఁ ౙ "గోఁతికి నేటికి నారికేళముల్." ౪౮౮

చ॥ ద్విజకులులైన వారికిని ౙ వేదము గాదె బలంబు; ధాత్రి భూ
భుజులకు నట్ల యాయుధమె ౙ భూరిబలంబు సునీతి గాదె? భూ
భుజుఁడు బలాఢ్యుఁ డీమెఱుఁగుఁ ౙ బోఁడి గ్రహించుట యిట్టి దేబె రా
డ్ద్విజమునఁ జూడ నైఁతునె? వివాదము లేటికి నీకు నాకికన్. ౪౮౯

చ॥ అదియును గాక భూభుజులయందు వివాహము శుల్కపద్ధతిన్
విదితము సుమ్ము బాహుబలవిశ్రుతుఁ డందఱిఁ గొట్టి బల్మిచే
గదిమి నెలంతలన్ గొనుట ౙ కర్జము గాన గుణంబుఁజేసి య
మ్మదవతిఁగొందమి న్నియతి ౙ మానితి మేనియుఁ జివ్వపుట్టెడున్. ౪౯౦

ఆ॥ అట్టులైన మనకు ౙ నందఱకును బోరు, ఘోరమైనఁ బ్రళయఘోష మగుచు
సర్వసంక్షయంబు ౙ సంధిల్లు "మధుబిందు", కలహమట్లు తెలియ గలము తుదకు.

చ॥ అటుల వివాదఘోషము భయంకరమై చద లావరింప ను
త్కట చతురపరిత్రాపు లగు ౙ తద్ధరణీశ్వరు లెల్ల విక్రమో
ద్భటుని సుబాహునిన్ బిలిచి ౙ పార్థివ! వింటివె యీవివాద మి
చ్చట నొక నీతి సేయఁదగు ౙ శాస్త్రవిధిన్ వివరించి తెల్పుమా. ౪౯౨

గీ॥ పణవిధి నొనర్చి తేనియుఁ ౙ బార్థివులకు, నేమమగునట్లు కాదేని ౙ జిడిముడి పడి
యెల్లరాజులు తమలోన ౙ నేటులాడ, నసమయపరిణయంబయె నసనిన రాజు.

ఉ॥ ఏను సుదర్శనున్ బరిణయించెద నొండొక రాజు కేలు చేఁ
బూనెదనే యటంచుఁ దనబుద్ధియకాని పొసంగఁ జెప్ప నే
నానయవాక్యముల్ వినక ౙ యాన మునుంగఁగఁ జేయుచున్న దే
మా నొకొ? యింత పుట్టు నని ౙ యాత్మఁ దలంచితి నేమి సేయుదున్. ౪౯౪

గీ॥ నాకు వశము గాకున్నది • నలిన నేత్ర, సందియము నొంద కిటు సుదర్శనుఁడు వచ్చె
నీతఁ డేకాకి రాజ్యవిహీనుఁ డిట్టి, కార్యముల సాటిలేకున్నఁ • గడచు టెట్లు?

గీ॥ ఏను జేయంగఁగల దింక • నేమి లేదు, బుద్ధిశాలులు మీ రెద్ది • పొందు చేసి
కార్య మెఱిఁగింతు రట్టులే • కన్యనొసఁగు, వాఁడ నని పల్కె రాజన్యవరులు గలసి.

శా॥ ఆలోచించి సుదర్శనుం బిలిచి యొయ్యార్ మన్ననల్ చేసి యిం
దేలా వచ్చితి వేమి గోరితివి నిన్నెవ్వారు రమ్మన్న వా
రీలో బంధువు లెవ్వ రిచ్చటికి భూమీశుల్ ప్రతాపానల
జ్వాలాభీలురు వచ్చినారు కడు సంబాధంబుగా నర్భకా!

కం॥ ఏకాకివి దోర్బలవద, నీకము లేఁగంగ మంత్రినిపుణులు లే ర
స్తోకమగు ధనము లేదీ, రాకకు ఫల మేమొ తెలుపు • రాజకుమారా! ౫౯౮

చ॥ ఇచట స్వయంవరం బనుచు • నెల్లరు రాజులు వచ్చినారు ని
ర్వచనము సేయఁగూడదు ధురంధరులందఱు ధైర్యసాహస
ప్రచురులు మత్తకుంజరవరంబులసన్నిధి నిట్టి పోల్కి రా
ణ్నిచయములో మెలంగుటకు • నే ర్పొక యింతయు లేమి గన్వడే. ౫౯౯

కం॥ నీతమ్ముఁడు శూరుం డభి, యాతి యుధాజిత్తు తత్సహాయుఁడు నీకిం
దీతఱి వర్తించుట శుభ, మై తోఁపదు నీ యభీష్టమూవల ననినన్.

వ॥ నావుడు సుదర్శనుండు,

మ॥ బలమా? సున్న, సహాయులా నహి! ధనంబా? లేదు, మంత్ర్యాదులుం
గలలోమాట, స్వయంవరం బనుచు శంకల్ మాని వార్వారు భూ
స్థలి రాజన్యులు వత్తు రుత్సవము దుర్దర్శంబు చక్షుర్ద్వయీ
ఫల మిద్వేడుకయంచు వచ్చితిని సంభావ్యంబు గాకుండునే? ౬౦౨

మ॥ కలలోనన్ జగదంబ, నీవు చనుమా • కల్యాణ సంప్రేక్ష దు
ర్బలతాసాధ్వసమెల్ల నీకు నజహద్భవ్యంబు సిద్ధించు ని
శ్చలచిత్తంబునఁ బొమ్మటన్న విని నిస్సందేహతన్ వచ్చితిన్
గలదే? నా కొక కార్య మిచ్చట; జగత్కల్యాణి హార్దేచ్ఛయే. ౬౦౩

కం॥ భావ్యంబులు ప్రాణులకను, భావ్యము లగు నెందుఁ జింతపడుటకుఁ బని లే
దవ్యయము దైవ మదియే, సేవ్యము, తదధీనవృత్తిఁ • జెందినవాఁడన్. ౬౦౪

చ॥ నరసురపన్నగావళు లనారతమున్ స్వభుజాబలంబునన్
బరిణతి నొంది కార్యముల • సఫల ధురీణులమం చహంకృతిన్

గెరలుచె కాని దైవకృతకృత్య మటంచు నెఱుంగలేరు భూ
వరుని దరిద్రుఁగా నధనుఁ బార్థివుఁగా విధి చేయఁజాలెడిన్. ౬౦౫

కం॥ పరశక్తి శక్తివలనన్, హరిహరవిధిముఖ్యు లెల్ల నారయ శక్తుల్
బరశక్తి కృపఁదొలంగినఁ, గరమెత్తఁగఁ గలరె? యెంతఘనబలు లైనన్. ౬౦౬

ఉ॥ శక్తుఁడనో యశక్తుఁడనొ సందియ మేల? సహాయ మా పరా
శక్తి కృపాకటాక్ష మని సంతసమంది స్వయంవరంబు సు
వ్యక్తముగాఁ గనన్ దలఁచి వచ్చితి నా కభయప్రదాత్రి యై
ప్రాక్తనకర్మభోగములఁ బాలన సేయదె? వేయు నేటికిన్? ౬౦౭

కం॥ జయములఁ బ్రాప్తింపఁ బరా,జయములు ప్రాప్తింప సిగ్గు సంధిల్లదు త
ద్దయనీయుఁడ నా కేటికి, భయ మని యారాచపట్టి పలికినయంతన్. ౬౦౮

కం॥ ఒండొరులఁ జూచి వసుధా,ఖండలు లప్పిన్నఁ జూచి తథ్యము నీవా
క్తండము మేలు యుధాజి,న్మండలపతి ద్రోహచింత మదికిన్ దెలియన్.

మ॥ హననోద్యుక్తత నాయుధంబు గొని నీయం దీసు రెట్టింప భం
డన కేళీకృతసాహసుండయి పటిష్ఠప్రౌఢిఁ దీండ్రించి లే
దనుమానంబు భవత్సమాహితము యాథార్థ్యంబుగా నెంచి సా
ధన మెట్లో యటు లాచరింపుము భుజాదర్పాంధుఁ డాతం డనన్. ౬౧౦

ఉ॥ మిత్రులుగాన మీ రిటు లమేయకృపారసచిత్తులై పుర
శ్శత్రువిరోధ మిట్టిదని సర్వముఁ బల్కితి రెందు నేని దు
ర్మిత్రులు మిత్రులౌదురె? ధరిత్రిని ప్రాణులఁ బెంపఁ జంపఁగన్
బాత్రులు వేఱె గల్గుదురె భావ్యము భావ్యము జంతుకోటికిన్. ౬౧౧

ఉ॥ స్థావర జంగమాత్మకము సర్వము గావఁగఁ బ్రోవఁగాఁ గడున్
దైవమె, మృత్యు వెవ్వరికిఁ దప్పునె? యెప్పుడు నెవ్వఁ డేనియున్
గేవల మాత్మబంధువయి కీడయినన్ సుఖ మొందఁగల్గునే?
భావిఫలం బపాకృతము పద్ధతి నొందఁగ వేఱె యేలగున్. ౬౧౨

శా॥ ధీమంతుల్ త్రివిధంబు కర్మమని యర్థిన్ బల్కి రెట్లన్న ను
ద్దామంబై తగు సంచితంబును భవద్భావ్యంబులన్ మాఁటిచే
క్షేమాక్షేమము లొందుచున్ జగము లక్షీణంబులై నిల్చు మ
ర్త్యామర్త్యాదులఁ జంపునట్టి దొకటేయాఁ గాల మింతేటికిన్ ౬౧౩

సీ॥ మహిలోపల నిమిత్తమాత్రుఁడౌ సంహర్త, సర్వంబు కాలవశంబుగాదె
మాతామహునివధయునగుట యుధాజిత్తువలన
సింహంబుచేఁ దండ్రి చెడుట

యత్నకోటులనైన నగునె సంహారంబు, నట్టుల బ్రతుకుటకుఁ దానె ప్రాణి
కఖిలంబు దైవయోగాధీన మగుఁ గాదె, యేను యుధాజితుం డింతవానిఁ

గీ॥ గాఁ దలంతునె దైవంబె కర్త యనుచు, భగవతీస్మరణామృతపానమత్త
చిత్తమున నుండువాఁడ నక్షీణ కరుణ, సకలకల్యాణసంసిద్ధి సలుపకున్నె?

క॥ పూర్వార్జితకర్మంబు ల, పూర్వములె శుభాశుభములఁ బొందింపుచు స
ర్వోర్విని జనులను ద్రిప్పు న, ఖర్వము దైవంబు కర్తగా గొండగునే? ౬౧౫

క॥ అజ్ఞుఁడగువాఁడు కర్మగ, తి జ్ఞానములేక బుద్ధిఁ దెలియక నీతుల్
ప్రాజ్ఞులు చెప్పిన వినక య, భిజ్ఞాహంకృతి నిమిత్తభేదముఁ దెచ్చున్. ౬౧౬

క॥ శోకము భయమును వైరము, లేక నిరాతంకవృత్తి లీలార్థముగా
నేకాకినై స్వయంవర, లోకాలోకేచ్ఛ నొంది లోలతఁ గంటిన్. ౬౧౭

శా॥ ఈ సంతుష్టి యుధాజితుండు గనుఁగాకే భీఁ గనన్ శంక లే
కా సర్వేశ్వరి యెట్లు సేయునొ? తదిష్టావాప్తిఁ జేకొందు న
న్యాసక్తిన్ మదినొంద దుఃఖము సుఖంబౌఁ గాక యొండేల? మి
థ్యాసల్లాపము లేల? యంచు నరపాలాత్మోద్భవుం డున్నెడన్. ౬౧౮

ఉ॥ రాజులు సంతసిల్లి నృపరత్నము రాజకుమారుఁ డీతఁ డ
వ్యాజవచోధురంధరుఁడు ప్రస్తుతిపాత్రుఁ డటంచు మెచ్చి రు
ద్వేజితుఁడై యుధాజితుఁడు విన్నఁదనంబున లేచె నెల్లరున్
భోజనమజ్జనాదులకుఁ బోయిరి స్వస్వనివాసముల్ వడిన్.

క॥ అంతట సుదర్శనుఁడు స్వని, శాంతమునకుఁ జేరి భుక్తిసలిపి యథేచ్ఛన్
జింతిల్లుతల్లిఁ దేర్చుచు, సంతసమున నిల్చె మాతృసన్నిధి భక్తిన్. ౬౨౦

వ॥ అంత సాయంతనసమయం బగుటయు నఖిలరాజన్యనయనరాకాచంద్రనిదర్శనుం
డగు సుదర్శనుండును బరిణయోత్సాహంబునకు నలంకృతుండై రాఁదలంచు
తలంపున స్వనిశాంతంబున కరుగఁబోవు నను తెఱంగున మిహిరుండు మఱుంగు
పడియె: దన ప్రాణేశ్వరుం డరుదెంచె నను నానందంబున సముత్ఫుల్లంబు లగు
శశికలానయనంబుల గోటువడి విన్నంబోయినవపువున రాజీవంబులు ముకు
ళించెఁ బరదేవీకృపాతిరేకంబున సుదర్శనుండు నిఖిలరాజన్యపూజ్యుండై
జగత్ప్రకాశంబు నొందె నని సహింపం జాలని యుజ్జయినీపతి యపయశం
బో! యనుభాతిఁ దమం బెల్లయెడలఁ గలయం బర్వె, నీరాజకుమారు గుణం
బులు లెక్కించుచున్నవో? యను రీతిఁ జుక్కలు చుక్కలయ్యె, మదీయనామాం
కితం బగు కువలయం బ రాచపట్టి కరగతం బైన విల్లు శోభావిభూతిం బాటిల్లు

ననుచాయఁ గువలయంబుల నుల్లాసం బుల్లసిల్లె, మనోరమానందనుండు రాజైనం దనకు నిలువ నలవిగాదని ధరారాజ్యంబు విడిచి శత్రుజిత్తుఁడు గాంది శీకుం డగు ననుభంగి చక్రవాకంబు నిజసహచరిఁ బాసి పరునెత్తె మఱునాఁ డరుణోదయంబున మనోరమాత్మజుం డాత్మజసుందరుండై మత్తమాతంగం బులనడుమ గజారూఢుండై పరిణయాగతుండైనయెడ గజఘంటికారావం బులు మిన్నుముట్టిన నట్టియెడ హరిహరసంధ్యార్చనాసమయంబున ఘంటా నాదంబులు చెలంగె; నిమ్మహీపాలసుతు నుత్సవమునఁ బటవాస ఘనసార చందనాదిక్షోదంబులు చల్లులాటలం జదలు నలముకొను ననుతీరునఁ బ్రాగ్దిశా ముఖంబు సుధాంశుప్రకిరణపరంపరాసమాచ్ఛాదితంబై పాండుప్రభావిభాసం బయ్యె నట్టియెడ. ౬౨౧

సీ॥ కలుముల జవరాలి | కన్నతండ్రికిఁ బట్టి, గురునియిల్లాలికిఁ | గోడెకాఁడు
జారచోరుల విలోచనముల కపురంబు, విరహిణీజనముల | వేరువిత్తు
దంపతి విహారణోత్సవ కామకల్పక,మమరుల యాకంటి | కన్నరాశి
తొవ వెలందికిఁ బ్రేమఁ | దులకించు చెలికాఁడు, వెలి రాలఁగరఁగించువింతవాఁడు

గీ॥ తామరసపాళులకు నెల్లదరువు కాఁడు, కమ్మ విల్తుని పట్టంబుగట్టువాఁడు
చిఱుతగాలినిమంత్రిగాఁ జేయువాఁడు, చందురుఁడువచ్చెనుదయాద్రిచరియఁ బ్రాఁకి.

ఉ॥ కప్పురపుం దుమారములు | గప్పెనొ? కల్పతరుప్రసూనముల్
గుప్పలు వర్వెనో? గగనకూటము గచ్చులచే బిగించిరో?
యుప్పరవీదివాఁక చలదూర్మలచేఁ బొర లెత్తివచ్చెనో?
చెప్పఁగ లేని వింత యని | చెప్పఁగ వెన్నెల గప్పె దిక్కులన్. ౬౨౩

సీ॥ మధుపాన మద మత్త | మధుకరావళులచేఁ, దరలని పొగల నూఁదరలు పెట్టి
చందనాచలతటీ | సంచరచ్చటులగం,ధవహాభిల్లుల నంపి | దాడిఁ బెట్టి
కువలయోదరనాళకుహరోచ్ఛలచ్ఛకో,రముల గుండుగ రంజనము లొనర్చి
తుహిన దీధితి మహోద్ధుర దీర్ఘ తర గభ,స్తి కదంబకముల నిచ్చెనలు వేసి

గీ॥ విరహిణీ ధైర్య ధూరపహారణ కర్మ, కర్మఠుండైన వలరాజు | గండుమీఱి
కుసుమ కోదండ దీక్షకు | గురుఁడ ననుచు, నేకహేళిగ భువనంబు | లేలికొనియె.

ఉ॥ అత్తఱిఁ జంద్రరేఖ కుసుమాస్త్ర శరానలతప్తయై మదిన్
దత్తర మంది ప్రాణవిభు తావి భుగుల్కొను నంకపాళి న
చ్చొత్తిన రీతి నొత్తు గలయొద్దిక నెయ్యడఁ గాంతు నంచు దాఁ
గ్రొత్త తమిన్ దమిన్ గడపెఁ | గోరిక లీరిక లెత్తుచుండఁగన్. ౬౨౫

మ॥ జగదీశీ కరుణాంకురంబులు జగజ్జాలంబు నే నెవ్వఁడన్
జగదంతస్థ్సిత తన్మయుండను మనస్సందేహ మిం కేల? భూ
తగణంబుల్ తదధీనముల్ భయదచింతాతంతుసంస్యూతి మో
హగుణంబంచు సుదర్శనుండు సుఖనిద్రాప్రియత్నుఁడై యున్నెడన్. ౬౨౬

ఉ॥ వచ్చిన రాజులెల్ల ననివారిత మోహతరానుషక్తిచే
నచ్చపలాక్షి మమ్ముఁ గన కాప్త సుదర్శనుఁ గాఁగ నెంచి తా
నిచ్చవరించు లోకముల నెల్లరు నవ్వఁగ నిండ్లఁజొత్తు మం
చచ్చుగఁ దెల్లఁబోపు గతి నంతటఁ బ్రొద్దిశ వెల్లనయ్యెడిన్. ౬౨౭

కం॥ ప్రాతస్స్నాత ద్విజతతు,లాతత సలిలావగాహనావసర ధృతో
ద్గీత హరి ధ్యానంబులఁ, జేతఃప్రీతులు జనింపఁ జేసిరి ప్రజకున్. ౬౨౮

ఉ॥ సంపద లాపదల్ ధరణి సర్వసమానము లింతలోన నీ
పెంపుల కింత నిక్కుట వివేకము గాదని నవ్వినట్టులన్
బొంపిరి వోనితావులను బూసెను దమ్ములు కల్వగుంపులం
దింపుఁ దొలంగె నెల్లతఱి నెవ్వరికిన్ గొఱయౌనె యుబ్బఁగన్. ౬౨౯

చ॥ కమలగృహప్రవేశమునకై యతనం బొనరింపఁ బూజనా
సమయమటం చెఱింగి ద్విజసంతతి యాటను దంపతుల్ సదు
ద్యమ మొనరించు నట్ల తమయంగనలన్ గవఁగూడెనో యనన్
విమలసరోవరంబులను వేడుకఁగూడెను జక్రవాకముల్. ౬౩౦

ఉ॥ తామస మార్చి సత్త్వగుణతత్పరుఁడై మఱి తారకానుబం
ధామలచర్య వర్తిలి సుధాంధులఁ దృప్తులఁ జేయుటన్ గళా
ధాముని చిత్ప్రకాశ మన దట్టపుఁ దెల్వి యొసంగె దిక్కులన్
గామము గూపముల్ విడిచె నాఁగ నగోచరుఁ డయ్యె సోముఁడున్. ౬౩౧

సీ॥ తమ్ముల సంపదల్ తలఁగనీక జగమ్ము, మిత్రభావంబున మెఱయఁజేసి
వస్తువిజ్ఞానంబు వర్ధిల్లు జనులకు, హంసమూర్తి వహించి యతిశయించి
విష్ణుపదావాప్తి వెలయించి ద్విజచక్రి, పరిపాలన మొనర్చు పటిమ నెఱపి
కుముదబృందమునోర్చి కుజనులఁ బోకార్చి, చక్రవాకములకు జాడ దెలిపి

గీ॥ ఐహికాముష్మికంబుల ననవరతము, సమముగాఁజూచుఁ గావున జగమునెల్ల
నినుఁడితండని యెవ్వారలెన్నఁదరణి, యుదయగిరి దుర్గమెక్కి యభ్యుదయమొందె.

క॥ సమయోచిత కృత్యంబుల, విమలతఁ గని జనములెల్ల వెలసిరి రాజుల్
ప్రమదమున సభకు వచ్చిరి, సుమతి సుదర్శనుఁడు మెఱసె శోభాన్వితుఁడై.

సీ॥ అంతఁ గాశీనాథుఁ ÷ డాస్థానశాలకు, విచ్చేసి సంపూర్ణ ÷ విశదఫణితి
మహితస్వయంవర ÷ మండపంబునకు రా,జన్యులఁ బిలిపించె ÷ సకలనృపులు
మంచాంతరంబులు ÷ పంచాస్యడింభముల్, గిరు లెక్కునట్టు లె ÷ క్కి రహినిలిచి
రమలభూషణభూషి ÷ తాంగులు దివ్యశో,భాభాసితులు నాట ÷ నమరవరులు
గీ॥ దేవయానంబులను నిల్చు ÷ దీప్తిఁ గొలుప, వెలసిరి సుదర్శనుండును ÷ విశదరోచి
రుజ్జ్వలుండగు రవిఁబోల్కి ÷ నొప్పి రత్న,మహితసింహాసనం బెక్కె ÷ మాన్యయశుఁడు.

ఉ॥ ఎప్పుడు వచ్చునో? సరసిజేక్షణ యేనృపునిన్ వరించునో?
యప్పురుషుండె పూర్వసుకృ ÷ తాతిశయంబున మించువాఁడు చేఁ
దప్పి సుదర్శనున్ విరుల ÷ దండ నలంకృతిఁ జేసె నేని సీ!
తప్పదు పో! వివాదము ప ÷ దంపడి రాజుల కింక నెట్టులున్. ౬౩౫

కం॥ దైవవశ మెట్టు లున్నదొ?, కావలసినయర్థ మెల్లఁ ÷ గా కుండదు నీ
భూవరుల కిది వివాదం, బేవిధమునఁ దప్ప దింత ÷ యే నిక్క మగున్. ౬౩౬

సీ॥ వాదిత్రపటలముల్ ÷ వందిమాగధనుతుల్, నరవరాస్థానమం ÷ దిరవు గాంచఁ
గన్య నలంకృతఁ ÷ గాఁ జేయుచు సుబాహు, నానతిఁ బౌరాంగ ÷ నానివహము
తావినూనెలచేతఁ ÷ దలయంటి పన్నీట, జలకమార్చి మడుంగు ÷ వలువఁ గట్టి
ముత్తెంపుఁగుచ్చుల ÷ గుత్తంపుఁ గంచెల, బిగియించి వలెవాటుఁ ÷ బెట్టి రత్న
గీ॥ ఖచితభూషణరాజి యం ÷ గములఁ దీర్చి, కడలి వెల్వడి వచ్చిన ÷ కమల నాఁగ
నొడలి యొయ్యారములు గన్న ÷ పుడమితేఁడు, లతనుబారికిఁ బడ నలం ÷ కృతినిఁ జేసి.

క॥ తలిదండ్రులచెంగటికిన్, గలికిన్ దోడ్కొనుచు వచ్చి ÷ కనుపఱుపఁగ నా
యెలనాగఁ గాంచి జనకుం, డలరి నిజాంకమున నిల్పి ÷ యనియెన్ బ్రేమన్.

శా॥ పారావారసమావృతంబయిన భూ ÷ భాగమ్మునం దుండు భూ
దారుల్ బాహుబలాఢ్యు లందఱును నా ÷ తల్లీ! నినున్ గోరియు
న్నా రారాజకమధ్యమంబునఁ గులీ ÷ నత్వమ్మునన్ రూపమున్
ధౌరంధర్యము గల్గువాని మదిలోఁ ÷ దర్కించి చేపట్టుమీ. ౬౩౯

క॥ నీ కంటికి నింపగు సు,శ్లోకున్ జేపట్టితేని ÷ సుదతి యతనికిన్
నీకున్ బెండిలి సేయుదు, రాకాశశిరోహిణుల తె ÷ ఱంగున నిందున్. ౬౪౦

ఉ॥ కొమ్మనుచున్ మధూకసుమ ÷ గుంఫితదామము చేతి కిచ్చి రా
రమ్మను నంతఁ దండ్రిఁ గని ÷ రాజనిభానన ధర్మయుక్తమై
సమ్మతమైన వాక్సరణిఁ ÷ జల్లగఁ దండ్రిని జూచి పల్కె నే
నమ్మకచెల్ల! యన్యవసు ÷ ధాధిపసన్నిధి కేగు టెట్లొకో. ౬౪౧

క॥ నరవరులదృష్టిపథమున, కరుగుట ధర్మంబె? ధరణి నతిపలకును? న
 ప్పరిచితిఁ గోసలదేశపుఁ, దసుణులకుఀ గాక మనకుఁ దగునే? తండ్రీ!. ౬౪౩

క॥ ధర్మజ్ఞులగు మనీషులు, ధర్మవిధుల్ చెప్ప వింటి ధర నతివలకుఀ
 ధర్మమిది ధవునిఁ దప్ప న,ధర్మం బన్యులను జూడఁ దలఁచుట యనుటల్.

ఉ॥ పువ్వులమాలఁ జేకొనుచు భూపతిసన్నిధి కేగునంతనే
 నవ్వరె వారకాంత యని నామదికిఀ సరిపోదు, చూడమే?
 యివ్వసుధఀ బ్రితోళులకు నేగుట కోరినవానిఁ దెచ్చుటల్
 రవ్వకు సైచుటల్ విపణిరంగములఀ గణికాజనంబులఀ. ౬౪౪

ఉ॥ ఒక్కనిమీఁదనైన మదియుంచక యొక్కని ముందుఁ జూచి వే
 ఱొక్కనియొద్ద కేగుచు మఱొక్కనిఁ జూచుచుఁ బోవుచుంట స్త్రీ
 కెక్కడి ధర్మ? మేనియతి? యే యభిమానము? వారకాంత గా
 కెక్కట యీనెలంత సతియై పతిమెచ్చును గాంచనేర్చునే. ౬౪౫

ఉ॥ పెద్దలమంచు రాజకులభేద మెఱుంగక యజ్ఞులిట్టులఀ
 దిద్దుటె కాక ధర్మవిధిఁ దీర్చుటయే? యది యొప్పి రేని యా
 ముద్దియ లేకపత్ను లయి ముక్తత నంది దృఢవ్రతంబుచేఁ
 దద్దయుఁ గీర్తి నొందుదురె ధర్మవిధిజ్ఞులు మెత్తురే? భువిఀ. ౬౪౬

గీ॥ ఏను సామాన్యయును బోలె మానవాధిపతుల దండకు రాఁజాల ఫాలలిఖితు
 నొక్కని వరింతు నిం కేల పెక్కునుడులు,పతి సుదర్శనుఁడే కాక పరుఁడు గలఁడె.

చ॥ ఇతరవరాభిలాష జనియింపదు నామది;నానృపాత్మజుఀ
 మతిఁ గొని తెచ్చి శాస్త్రవిధి మన్ననఁజేసి యొసంగు నన్ను; నీ
 క్షితిపతిసంఘమధ్యమునఁ జేర్పకు మన్న సుబాహుఁ డాత్మలో
 నతితరచింత నొంది వికలాత్మకుఁడై మది నేమి దోఁచమిఀ. ౬౪౭

సీ॥ ఏ నేమి సేయుదు నిలఁ గల్గు రాజులు, చిత్రసింహాసనాసీను లగుచు
 నిలిచియున్నారు నే నీ కెంత దెల్పిన, వినవై తియున్నది విశ్వసించి
 బహుసైన్యములతోడఁ బార్థివు లక్కలహించి, యెదురెఱుంగక మీఁదికొత్తివత్తు
 రతిదుర్బలుండ సైన్యము లేదు దుర్గాధిపతిఁ గాను బోరాడుపటిమ లేదు
గీ॥ ఎట్టుల నిరాకరింతు నభీష్టమనుచుఁ, బుత్రిని సుదర్శనున కిత్తుఁ బో! యతండు
 తలఁప ససహాయుఁ డేకాకి తరముగాని, చింత మునిఁగితి నిఁక నేమి సేయువాఁడ.

చ॥ తలఁపు ఘటిల్లదాయె నని తందర నొంది సుబాహుఁ డెల్ల రా
 జులకడ [illegible] మ్రొగిచి చూపఱ కల్లను వింతగాఁగ మి

మ్మలసటఁ బెట్టితిర్ వితథమయ్యె మదిష్టము; పుత్రికేను వి
చ్చలవిడిఁ జెల్పినన్ విన నసహ్యమటంచని వీను లొగ్గమిన్. ౬౭౦

ఆ॥ తల్లి బుజ్జగించి దండించి చెప్పినఁ, జెవిరొఱసంగ దేమి సేయువాఁడ
శిరముఁ జేర్చి మీదు చరణాబ్జములమీఁద, వేడుకొనెదఁ బలుకు వినఁగవలయు.

సీ॥ జనకున కపకీర్తి సంతరించినయట్టి, తనయ నేమందు దుర్వినయగాదె
యజ్ఞోలి విడిచియు మజ్జన్మ సఫలత, నరుదెంచితిరి పూజ లంది మీరు
స్వస్వదేశములకుఁ జనుఁడు మీ కెల్లను, దాసుండ నైతి మద్భాగ్యవశత
కులవర్ధనులు గుంపుగాని దర్శనం బిచ్చి, మన్నించితిరి కీర్తి గన్నవాఁడ

గీ॥ ననుచుఁ బలుమాఱుఁ బ్రార్థింప నందుఁ గొంద, ఱాచితివహించి శాంతులై యరిగి రందుఁ
గొందఱు యుధాజితుండాదికుతలపతులు, నిగ్రహించుచు లేచి దురాగ్రహమున.

ఉ॥ మూఢుఁడవై యకార్య మిటు ముందరఁ జేసి సదంభవృత్తివై
గాఢమదంబుతో ముదిసి కాళ్లను వేళ్లను బడ్డ సైఁతురే?
వ్యూఢుఁడవై స్వయంవరమహోత్సవ మంచని చాటఁ బంచినన్
ప్రౌఢత వచ్చి రుర్విఁ గలపార్థివముఖ్యుల మోసపుచ్చెదే? ౬౭౩

ఉ॥ రమ్మన నీకుఁ జెల్లెనె? భరమ్మయినన్ జెడి వచ్చు త్రోవలన్
బొమ్మన నీవె కర్తవొకొ? భూరిభుజాబలగర్వసంపదన్
గొమ్మ బలాత్కృతిన్ గొనక కుంభినివారలు నవ్వ మాదు రా
జ్యమ్ముల కేగువారమె? యథార్థముఁ బల్కితి మింతయు న్నృపా. ౬౭౪

కం॥ నీమదిఁ దల పోయుము నా, భూమీపతిమధ్యమమున భుజగము పోల్కిన్
దామసము రేప నుజ్జయి, నీమండలభర్త లేచి నిష్ఠురఫణితిన్. ౬౭౫

ఉ॥ కన్నుల రక్తకాంతు లొలుకంగ సుబాహుని జూచి యద్దిరే!
మన్ననమాట లాడి నృపమండలిఁ బొమ్మని యా సుదర్శనున్
గన్నియఁ గూర్పఁగాఁ దలఁచి కందువఁ జేసెదొ? కార్యవేళ నీ
విన్నఁదనంబు సైఁతునె? పరీక్షీణుఁడవా! బళి! మాట లేటికిన్. ౬౭౬

ఆ॥ కార్యవేదులైన ఘనుల నాలోచించి, చేయవలదె? యింత సిగ్గు పఱచి
మానవాధిపతుల మానంబు దూలించి, చేసికొనెదె? స్వార్థసిద్ధి యధిప!

కం॥ ఇల్లాలు కూఁతు రఁట? తన, కల్లుండు సుదర్శనుండనో నఁట? ధనముల్
గొల్లలుగఁ గూర్చునఁట! నీ, యుల్లము రంజిల్లఁ గూఁతు రొందు సుఖంబుల్.

సీ॥ ముందు నీతలఁ ద్రుమ్మి మొనసి సుదర్శను, శీర్షంబు ఖండించి చిత్రగతుల
సడిదంబు మెఱయించి యడ్డమా వారల, మీకుఁ దోడుగఁ బంపి మెలఁతఁదెచ్చి
దౌహిత్రునకు నిచ్చి ధర నెల్ల నేలింతు, నే నుండఁ గన్నియ నెవ్వఁ డొప్పు
ననిలోన నీ వెంత? యాసుదర్శనుఁ డెంత?, మున్ను భారద్వాజ మునికృతమున
ఆ॥ నోర్చి విడిచినాఁడనో ర్తునే? యిచ్చోటఁ, గాన నీవు నీదు కాంత సుతులఁ
గలసి ముచ్చటించి కన్య నా దౌహిత్రుఁ, గూర్చి శుభము గొనుము కువలయేశ!

ఆ॥ మేలు గోరువాఁడు మేలుబంతులతోడఁ, గలయవలయుఁ గార్యగతి నెఱింగి
నాకు బంధు వైన నరనాథులకు నెల్ల,నగ్రపూజ్యతముఁడ వగుదు గాదె.

ఉ॥ నిర్ధనుఁ డా సుదర్శనుని నీసుతకున్ బ్రియుఁ జేసి తేని స
ర్వార్థము లెల్ల సిద్ధి గనునంచుఁ దలంచితొ? యీ వసుంధరన్
వ్యర్థతముండు మందుఁడు; ప్రియంబులకున్ బ్రియమైన నందనిన్
బార్థివ! శత్రుజిత్తునకుఁ బాడి దలంచి యొసంగు మియ్యెడన్. ౬౬౧

కం॥ రాజకులంబులు మెచ్చఁగ,రా జనయము మెచ్చఁ జేసి రాణింపుము నీ
రేజదళనేత్రిఁ దెమ్మిఁక, రాజసమక్షమున కిపుడు రమణులు గొల్వన్. ౬౬౨

మ॥ ధిషణాహీనుఁడవై చరింపక సుధీధీరంజకంబై సుహృ
ద్విషయ క్షేమదమైన కార్యము సమర్థింపంగ మేలయ్యెడిన్
విషమప్రక్రియ నొందనేల? చెలికై; విన్పించితిన్ గాన ను
త్కృషణం బేటికి సర్వసమ్మతముగాఁ గార్యంబు సాధింపుమా. ౬౬౩

గీ॥ అల సుదర్శను విడిచి యన్యావనీశు,నల్లునిగఁ జేసికొనిన నా కభిమతంబు
నిగ్రహము మానువాఁడ దురాగ్రహమునఁ,గార్యమెడఁ జేసి తేని నేఁగనలువాఁడ.

మ॥ బలవద్వైర మసాధ్య మెట్టులయినన్ బాహాబలోద్యుక్తి నిన్
గెలిపింపన్ గల శూరుఁ డెవ్వఁడు? కదున్ గీడ్పాటు వాటిల్లు లో
కులు దుష్కీర్తిపరుండ వందురు పొసంగున్ దైన్య; మింకేల? నా
పలు కాలించి నృపానుకూలకృతి సంభావింప మేలౌనన్. ౬౬౪

కం॥ ఇటులు విశాలాపతి యు,త్కటచటులవచోవిహారగరిమముఁ జూపన్
గటకట పడుచు సుబాహుఁడు, పటుగతి భవనమున కేగి బాష్పము లురలన్.

వ॥ నిజదారం గనుంగొని కొంతతడవు చింతించి నందనితో మాదలింపుము, రాజ
మండలం బుద్దండంబై భండనంబునకుం దొడంగంగలయది, దుర్బలుండనై నేయం
గల కర్జం బేమి యున్నయది, మద్వాక్యంబు లాలించి మదీయానుమతంబునం బ్రవ
ర్తింపుమని యనినం దల్లి కూఁతును జేరం బిలిపించి తల్లీ! నీ జనకుండు దుఃఖా

ర్తుండై యున్నవాఁడు, భవన్నిమిత్తంబైన కలహంబున యుధాజిత్తుండు నిన్నును నన్నును మడియంజేయు సుదర్శనుండొక్క-నన్యభూపాలుం బరిగ్రహించెదేని సర్వాభిమతంబగు, హాఠప్రవర్తనం బేటికి నభిలషితుం జేకొనినఁ గలహంబు సిద్ధంబు, మీతండ్రియెడర్ దయామతివై ప్రత్యుత్తరం బిమ్మని నుడివిన విని తల్లి దండ్రుల కిట్లనియె. ౬౬౮

గీ॥ నేను గోరినట్టి - నెయ్యుండు నాకు సు,దర్శనుండు ప్రియుఁడు - తప్పితేని ప్రాణమైన విడుతు - పలుమాటలేటికి, నన్య మది దలంప - నదినిజంబు. ౬౬౯

గీ॥ సరగఁ జని యిచ్చటికి సుదర్శనునిఁ దెచ్చి,నన్ను నొసఁగి రథంబుపై - నాథుతోడఁ గలిపి యధిరోహణ మొనర్చి - కటకమునకు, వెలికిఁబంపుము నీకేల - వెనుకపలుకు?

ఉ॥ కానగు నర్థ మెట్లగునొ - కందము, మీఁది విచార మేల? సం
ధాన మొనర్పఁ డిప్పగిది - దైవము సర్వ మెఱుంగు నంచు రా
జానన పల్కఁ దండ్రి వినుమమ్మ? ననుం గని సాహసక్రియల్
మానుము భూతధాత్రి మతిమంతులు దూరవిచారులొఁ గదా. ౬౭౦

కం॥ బహుజనవిరోధ మేటికి, సహియింపుము మాట వినుము - జననీ నిను నొ
క్క-హామైన విడిచి మనుదునె, యహహా నీ విటులు చెప్పనగునె కుమారీ! ౬౭౧

ఉ॥ వైరముచే ధరావరులు - వచ్చి రణంబున కోహటించి దు
ర్వారశరానలార్చుల జవంబునఁ బైఁబడిరేని సీతకై
కోరి పణంబు సేయు జనకుర్ బలెఁ జేసెద మెచ్చెదేని యా
శ్రీరఘురామునిం బలెనె - చేకొను మప్పణ మోర్చు రాసుతుర్. ౬౭౨

గీ॥ నేను జేయు పణము - నిర్వహించిన యేని,యతని కిత్తు మెచ్చుకట్టులైన
నంత శాంతి నొంది - యచలాధిపతు లెల్ల, నీమతంబు మెచ్చి - నిలుతురమ్మ.

శా॥ ఇచ్చర్ గోరు సుదర్శనుండయినఁ గాదే నన్యుఁ డైనర్ బణం
బచ్చంబౌ తన విక్రమంబున భుజాహంకారపారీణుఁడై
దర్పించం జాలునొ? వాని కిచ్చెద వివాదంబెల్ల మాయించెదర్
మెచ్చర్ జేతు వివాహమర్ మనసు గొమ్మా? యన్నఁ బూబోఁడియర్. ౬౭౪

ఆ॥ ఇట్టి మూర్ఖకృత్య - మే నెట్లు సేయుదు, మది సుదర్శనుండు - మగఁడటంచు
నిశ్చయించె మనసు - నిఖిలంబునకు బంధ,మోక్షకారణంబు - మున్న వినమె.

చ॥ పణ మొనరించెదేని జనపాలుర కెల్లను వశ్య నౌదు రా
ఙ్గణమున నెందఱేని పణకార్యధురీణత నిల్చిరేని యం

దణఁగుదువో క్కో? వారలకు ♦ నందఱ కిచ్చెదవో క్కొ? నన్ను నా
పణమున బెట్టి యమ్ముటకుఁ ♦ బాల్పడనే నరనాథ! నీమదిన్. ౬౭౬

ఉ॥ సందియ మెందు కార్యవిధిఁ ♦ జల్పఁగఁ జాల నృపాల! భీతిచేఁ
దందర నందనేటికి? సుదర్శనుఁ దెచ్చి యొసంగు నన్ను; న
స్పందమనీష నన్నిటికి ♦ సర్వజగజ్జనయిత్రి లేదె? వా
రందఱఁ జక్కఁజేయుటకు; ♦ నాపయిఁ జూచెదు నమ్ము మింతయున్. ౬౭౭

ఉ॥ రాజులయొద్ద కేగుము కరమ్ములు మోడ్చి స్వయంవరమ్ము ని
ర్వ్యాజము గాఁగ నెల్లి యగునంచు వచించి యమర్ష మాన్చి రే
రా జుదయించువేళ నిసరాతిరిఁ బెండిలిఁ జేసి పంపు మ
మ్మో జనకా! భయం బుడుగు ♦ మొల్లదు నామన మన్యుఁ జూడఁగన్. ౬౭౮

ఉ॥ ఈ కపటం బెఱింగి ధరణీశ్వరు లేపున నెత్తివచ్చినన్
లోకము లెల్లఁ గన్న యతిలోకపరాంబిక చించి చెండదే?
పాకభిదాదినిర్జరులు ♦ పైఁబడి వత్తురుగాక యేకమై
పోక కడంగి చక్కఁడఁచిపోయెడి యల్లుని వేఁడి చూడుమా! ౬౭౯

కం॥ దైవాధీనము సర్వము, గావున మా కపజయంబు ♦ ఘటియించినచోఁ
బావకశిఖలన్ మగ్గుదు, జావునకున్ వెఱపులేదు ♦ సందియ మేలా? ౬౮౦

ఉ॥ నీకుఁ గొఱంత లేదు ధరణీవరు లెల్లరు శాంతులౌదు రి
జ్జోక గణింపు మేలగు నసూయకుఁ బాత్రము గాకు మన్నఁ బు
త్రీకృతసాధువాక్యములఁ ♦ దెప్పిరి నిశ్చితబుద్ధియై నృపా
నీకముఁ జేరఁబోయి యవనీపతి పల్కె మృదూక్తి నిట్టులన్. ౬౮౧

ఉ॥ ఎల్లి స్వయంవరంబు విధియించితి మజ్జనభోజనాదులం
దుల్లము పల్లవింప నిట ♦ నుండుఁడు భక్ష్యము పేయమున్ రుచి
పోల్ల సితంబుగా శిబిరభూముల నించితి నాయెడన్ గృపో
త్ఫుల్లకటాక్షదృష్టిఁ జని ♦ పొద్దున రండు స్వయంవరార్థులై. ౬౮౨

కం॥ నయమునఁ జెప్పిన వినమిన్, భయమున నదలించి పెక్కుమాటలు నుడువన్
గయికొన దమ్మోన్ బొద్దునఁ, గయిసేసి స్వయంవరంబు ♦ గావింతు ననన్.

కం॥ బాలతచేఁ గ్రీడాకృత, లాలనచే వెఱవ దిపుడు ♦ లాలించి దయా
శీలతఁ బిన్న యెడన్ బరి,శీలించుట విధియఁగాదె ♦ క్షితిఁ దండ్రులకున్. ౬౮౩

సీ॥ ఇచ్ఛాపణం బొక * టేదేని విధియించి, యూఱడించి తనూజనొత్తి చెప్పి
యిందుఁ దెచ్చెదఁ బుత్రి * నిపుడు మీ మీ శిబి,రంబుల కేగుఁడు * రంపు పిదపఁ
బాత్రిర్వివిధేయంబు * బాహుజాతులకు స్వ,యంవరం బందు రుసదారమతులు
దయచేసి చనుఁడన్న * ధరణీశు లమ్మాట, వితథంబుగాఁ జేసి * వినిన యట్ల

గీ॥ తమ తమ నికేతనంబులు * దఱిసి నగరి, చుట్టు రక్షకులను నిల్పి * దిట్టపఱిచి
స్వస్వకార్యవిశేషముల్ సజరపికొనుచుఁ, బదిలపడి యుండి రంత; నుసబాహుఁ డెలమి.

ఉ॥ పౌరుల మంత్రి వృద్ధుల సుసవాసినులన్ దగు వారి నెల్ల వే
ర్వేఱ మిథోనిమంత్రిణల * విశ్వసనీయులఁ బిల్వఁ బంచి సం
భార మొనర్చి పుత్రికను * బాణిగృహీతిగఁ జేయ నెంచి యిం
పార సుదర్శనుం గడురహస్యముగాఁ బిలిపించి యొక్కెడన్. ౬౮౬

గీ॥ మంగళస్నాతుఁ గావించి * మహితరత్న,భూషణాలంకృతునిఁ జేసి * పుత్రి నటుల
స్నానభూషాంబరాదులఁ * జక్కఁబఱిచి, సంతసంబునఁ బరిణయశాలఁ జేర్చి.

సీ॥ సింహాసనమున నాసీనుఁగా నొనరించి, యర్ఘ్యం బొసంగి శాస్త్రార్హవిధుల
నాచమింపఁగఁ జేసి * యంబరద్వయ మిచ్చి, మధుపర్క మొసఁగి సమంత్రకముగఁ
గుండలంబు లొసంగి * గురుతరగ్రైవేయ, కటకహారాద్యలంకరణము లిడి
యుత్తమాంగములు కన్య * నర్పించి రుదకధా,రాపూర్వకముగ భూసరమణునకును

ఆ॥ దైన్య మెడలి యా సుదర్శనుఁ డవ్వేళ, స్వార్థసిద్ధిఁ గాంచి * సంతసించె
చంద్రరేఖ తనదు * సంకల్పసిద్ధిచే, బ్రమద మొనసి చింతఁ బాసె నంత.

క॥ తల్లి మనోరమ మనమున, నుల్లాసము నొందియును రణోత్సవకేళీ
భిల్లు లగు రాజమల్లులఁ, బెల్లుగ నొక్కింత దలఁచి * భీతిలుచుండెన్ ౬౮౯

క॥ అద్దంపతు లిద్దఱు గన, నిద్దపుఁ దేజమున రమను * నీరజనేత్రున్
దిద్దుగడ సేయు తెఱఁగునఁ, దద్దయుఁ జెలువొంది రతుల * ధర్మవిభూతిన్. ౬౯౦

ఉ॥ భూషణవస్త్రముఖ్యతతిఁ * బూజితుఁడైన సుదర్శనున్ దరిన్యా
ఘోషముల్ బురోహితులు * గుంపయి తోడుకవచ్చి సంభృతా
శేషయథోక్తవస్తుచయ * చిత్రితమైన వివాహవేది సం
తోషముతోడఁ జేర్చిరి విశిధుం డుదయాద్రినిఁ బోలె రంజిలన్. ౬౯౧

ఉ॥ కొందఱు మందగామినులు * గుంపులు గూడుచుఁ జంద్రరేఖ న
స్పందముదంబునన్ గలసి * బాహుయుగంబునఁ గౌఁగిలించుచున్
మందగతుల్ చెలంగ శుభసమందిరసీమకుఁ దోడి తెచ్చి వే
డ్కం దళుకొత్త వల్ల భునిసదగ్గఱఁ జేర్చిరి సంతసంబునన్. ౬౯౨

వ॥ అంతఁ బురోహితుండు వహ్నిపరిణామం బొనరించి వేదోక్తవిధానంబున లాజహోమంబును బ్రదక్షిణంబును జేయించి యథోచితంబుగా సర్వంబు నిర్వర్తించి నంత శ్వశురుండు సాలంకృతాశ్వయుతంబులగు శతద్వయపరిమితరథంబులును మదోత్కటంబులై గిరిశృంగ సదృశ దేహంబుల నొప్పారు గజంబులు శతంబును గరేణుకాసహస్రంబును బారిబర్హంబుగా సమర్పించి యనేకసహస్రంబులు రత్నంబులును సువర్ణంబులును బట్టాంబరంబులును బటకుటీరంబులును రెండువేల సైంధవంబులును,నన్నూఱు మతంగజంబులును, భారవహంబులు నగు నిన్నూఱు శకటంబులును నానాధాన్యరసాదులును సమర్పించి.

ఉ॥ వియ్యపురాలిఁ జూచి కడుఁ వేడుకఁ జేతులు మోడ్చి తల్లి! నీ
కెయ్యెడ దాసుఁడే దగు నభీష్టము లెవ్వి యొసంగువాఁడ నా
నెయ్యము నీ మనంబునను ( నిల్పు మటంచు వచించి కోడలిన్
జెయ్యినిఁ జెయ్యినైచి కృపఁ ( జేర్పు మటం చని యొప్పగించిరే. ౬౯౪

ఆ॥ కుర్చి కౌఁగిలించి ( కోడలి ముద్దాడి, భానుకులునిఁ జెట్టఁబట్టినావు
ధరణిజాత వోలె ( ధర నేలు మనుచు దీవించెఁ దండ్రిఁ జూచి ( వెచ్చ నూర్చి.

క॥ భారద్వాజకృపారస,ధారల నీ యంకురంబు ( తలయెత్తి భవ
ద్ధీరోపఘ్నతఁ బ్రాకి యు,దారఫలం బందె ననుచుఁ ( దనయ నిమురుచున్.

ఉ॥ తల్లివి దండ్రి వీ వని సుదర్శనుఁ జేతికి నప్పగించి రా
ట్తల్లజ! కాయ కంద దిని ( డస్సి ధరాధరకందరంబులం
దెల్లఁ బరిభ్రమించు ధనహీనుని నర్భకు నింతఁ జేయుటల్
పొల్లు సురాద్రిఁ జేయు పొలుపున్ దలపింపఁగ నయ్యె నియ్యెడన్. ౬౯౫

సీ॥ బలరూపవిభవముల్ ( గలిగి సమానులై, యలరు రాజుల కిత్తు ( రాత్మజలను
ధనహీనుఁడనక మత్తనయునకును గన్య,నిడితివి నీవంటిహితుఁడు గలఁడె?
విక్రమాదిత్యు లుర్వీపతుల్ పొదివిన, సాహసించిన నీయశం బగణ్య
మతిదీనవృత్తిచే ( నలమటించుచును రా,జ్యభ్రంశ మొంది యెచ్చటను జూడఁ

గీ॥ జుట్టములు లేక ధైర్యంబు ( చూఱలాడి, పరులు పైకెత్త ద్విజులలోపల వసించి
బ్రాహ్మణులమంచుఁ బ్రాణముల్పట్టియున్న, నన్నుఁగాచితివన్న నిన్నెన్న నేల.

క॥ ఏవంభూతవచోరచ,నావేశమ్మునను బల్కు ( నానృపుపత్నిన్
దేవీ! నారాజ్యమునకుఁ, గావించెదఁ గర్త నతనిఁ ( గైకొను మమ్మా. ౬౯౬

ఉ॥ వృద్ధుఁడనైతి రాజ్యపదవీ భరణంబున విశ్రమించితిన్
శుద్ధుఁడనై తపమ్ములకుఁ ( జొచ్చి మునీంద్రుల యాశ్రమంబులన్

శ్రద్ధపొసంగి నిల్తు నది సమ్మతమేనియు నియ్యకొమ్ము సం
బద్ధుఁడనై భవాంబుధి యపారము ముట్టెను జాలు భోగముల్. ౨౦౦

చ॥ నను విడఁజాలకున్నను ననంతబలంబులఁగూర్చి శత్రుకో
టిని సమయించుచుంగడుఁ గడిందిమగంటిమితోడ నీ సుతున్
మునుకొని సేన కెల్లఁ జలమున్ బలమున్ బురికొల్పి యి య్యనీ
కినులకుఁ బెద్ద నౌదుఁ బరికింపుము తల్లిరో! యస్మదిష్టముల్. ౨౦౧

కం॥ తనయునితో మదాజ్ఞ్య, మ్మనుశాసించుట మదీయమా మత మిా వి
ట్లనుసంధింపుము వేఁడెదఁ, బనిగొన కితరపరిసంగపద్ధతు లేలా. ౨౦౨

కం॥ నరవరులు ద్రొమ్మిఁజేసిన, శరకార్ముకధరుఁడ నగుచుఁ జక్కఁగ జని దు
ర్భరదోర్గర్వము లడఁచెదఁ, బరిభవ మందించి చక్కఁబఱుతుఁగనుమిా. ౨౦౩

వ॥ జయాపజయంబులు దైవాధీనంబులు; ధర్మపక్షంబునకు జయంబు దప్పదు
శ్రుతులు వితథార్థబోధకంబులుకావుగావున మనకు జయంబు సిద్ధంబు; కన్నియ
స్వానుకూలుఁ బరిగ్రహించె ననునెడ విమతు లగు వారిపక్షం బధర్మపక్షం బగు
సందియంబు వలవ దిందు వసింపుమని నిర్బంధంబుగాఁ బలికిన నమ్మనోరమ సుబా
హుని కిట్లనియె. ౨౦౪

ఉ॥ పుత్రులతోడ రాజ్యసుఖభోగధురంధరతన్ వహించి యా
వృత్రవిరోధిచాడ్పునఁ బ్రవృద్ధవిభూతిఁ జెలంగుమయ్య! నా
పుత్రిఁ డయోధ్యకున్ బతిగ భూరికృపాప్తిఁ దలంపు మంత ని
శ్శాత్రవనైజరాజ్యపదశాసకుఁ డయ్యెడు సందియంబొకో? ౨౦౫

ఉ॥ పోయెద మిప్పుడేము పరభూపతివర్గము చూడకుండ స
ర్వాయుధముల్ ధరించి జగదంబిక తోడయి పోవ ద్రొక్కఁగా? మా
పై యిసుమైన రాలునె? శుభంబగుఁ జింతఁ దొఱంగియుండు బ్ర
హ్మయు వొసంగు నల్లునకు నంబిక; చూచెదు పై విచారముల్. ౨౦౬

గీ॥ అంతిపురిలోన నిట్టులు వింతలైన, యట్టిగోష్ఠుల రాతిరి యరుగుటయును
బొద్దుపొద్దున రాజన్యపుంగవులు వి,వాహమగుట మెఱింగి దుర్వారులగుచు.

సీ॥ శంఖభేరీధ్వానశబ్దముల్ వినవచ్చెఁ, బరిణయం బొనరించెఁ బాపి వీఁడు
మోసగించెను వీని మోమోట మిాక నేల, లెండు సన్నద్ధులై రండు పోయి
పట్టి సుబాహుని బంధించి శశికళ, నపహరింతము వీనియఖిలరాజ్య
లక్ష్మితో మనల నిర్లక్ష్యంబుగా నెంచె, బరమకృతఘ్నుఁ డీ బాహుజుండు,

ఆ॥ తగినయట్లు వీని ఽ దండింప కింక ను,పేక్ష సేయఁజనునె ? ఽ యీక్షణంబ
వాని సైన్య మెంతఽవాఁ డెంత వీఁ డెంత, ప్రాజ్ఞుఁ డయ్యు నెట్లుఽపని యొనర్చె!

వ॥ అని యిట్లు పరస్పరంబు వీరాలాపంబుల నుద్బోధించుకొనుచున్నంత. ౨౦౯

మ॥ తగుమంత్రుల్ వెనువెంట రాఁ గదలి ప్రాఽతర్వేళఁ గాశీవిభుం
డగురా జున్నతుఁ డా సుబాహుఁడు నృపాఽలాభ్యర్ణముం జేరి దో
ర్యుగముం బట్టుచు మ్రొక్కి మీరలు మహాఽర్హుల్ నేఁడు మాయింటి విం
దుగఁ బూజల్ గొని నన్ను మన్ననకుఁ బాఽత్రుం జేయ మీ కర్హ్యమౌ. ౨౧౦

గీ॥ ఏమిసేతు సుదర్శనుఁ ఽడింటిలోని, కరుగుదెంచి వివాహించె ఽ నాత్మజాత
నెల్లవారలు క్షమఁ జేసి ఽ హిత మెలర్పఁ, గోరికొనినట్టి వరునిం ఽ గూర్పుమనిన.

వ॥ ఏనును నట్లసేయం గలవాఁడనై యొనర్చితి మన్నింపవలయునని ప్రార్థించిన నందుఁ
గొందఱు రాజన్యులు సుబాహుం జూచి యిట్లనిరి. ౨౧౨

ఉ॥ ఇంటికి వచ్చు టేల ? భుజిఽయించు టఁ కేటి కెఱుంగ వచ్చె నీ
బంటుతనంబు చాలు నిఁకఁ ఽ బాపుఁడవైతివి కన్య నిచ్చి; ని
ష్కంటకవృత్తి శేషవిధి ఽ సల్పుము రాజులు వోదు రిండ్లకుం
గొంటెతనంపుమాటలను ఽ గోడిగముం బ్రకటింప వచ్చితో. ౨౧౩

ఆ॥ చాలుఁ జాలుఁ బొమ్ము ఽ సందియం బేటికి, నన సుబాహుఁ డరిగె ఽ నంతిపురికి
ననునయమ్ము లెల్ల ఽ నభివందనాంతమ్ము, లనుచుఁ బల్కఁగాదె ఽ యఖిలజగము.

సీ॥ కొంద అడ్డమువచ్చి ఽ కొట్టి సుదర్శను, శశికళఁ జేకొని ఽ చనుద మనిరి
కొందఱు ప్రేమించెఁ ఽ గూడదు ద్రోహంబు, మనరాజ్యములఁ జేరఁఽజనుద మనిరి
కొంద ఱీరా జిట్లు ఽ కోడిగ మ్మొనరించె, నన్నసన్నలలేచి ఽ చనుద మనిరి
కొందఱు రణరంగఽమందిరదర్శనం,బును జేసి యిండ్లకుఁ ఽ జనుద మనిరి

గీ॥ ఇట్లు తమలోన రాజన్య ఽ లేవగించి, చేయునదిలేక చింతచేఁ ఽ జిక్కువడుచు
సిగ్గు తలముంచఁగా సునాఽశీరుఁ డమృత, మపహరింపంగ భుజగంబు ఽ లట్టులైరి.

గీ॥ కొంత తడవిట్లు చింతించిఽకుర్రిరు లగుచు, మార్గములుగాచి నిలిచిరిఽమనుజపతులు
నింటి కేగి సుబాహుఁడఽయ్యెడ వివాహ, శేషవిధు లాచరింపంగఁఽజేసెనపుడు.

ఉ॥ కొన్నిదినంబు లల్లునిని ఽ గూఁతునిటుల్ ప్రియపూర్వకంబుగా
మన్ననఁజేసి వారి నిజఽమందిర సీమకు నంపఁబూని తో
వన్నిజసేనలం గలసి ఽ వైరిధరాపతు లడ్డగింపఁ గా
వున్న విధం బెఱింగి వినఽయోజ్జ్వలు మంత్రిని గాంచి యిట్లనెన్. ౨౧౮

క॥ దుర్మార్గులగుచు రాజులు, ధర్మంబని యెఱుంగక కటకట దారిని నిజసై
న్యోర్మికల జలధు లట్టుల, వర్మితులై యున్న వారకవారణలీలన్. ౭౧౮

ఉ॥ చేయు నుపాయ మేది మనసేనల నిర్జితు లౌదురే? మహో
పాయధురంధరుల్ ప్రకటబాహుబలాఢ్యులు; కార్యసిద్ధి సో
పాయముగా లభించు తెఱంగైనది గాదని తెల్పఁ, జింతచే
నాయన విన్ననై వికలమైన మనమ్మున నున్న యత్తఱిన్. ౭౧౯

క॥ హితమతి ధ్రువసంధిసుతుఁడు, క్షితిపతిసన్నిధికి వచ్చి చే మోడ్చి దయా
మతి మాకు నానతీఁ దగుఁ, గుతుకంబు చనంగ మనవి గొనఁదగు ననుడున్.

—• చంద్రకలా సుదర్శనులు స్వదేశమున కరుదెంచుట •—

క॥ ఎద్దియు నన నేరక మీ, రొద్దిక మాయింట నిలువుఁ డొం డొకచో మి
మ్మిద్దఱ నుండంజేసెదఁ, బెద్దయు మిముఁజూచి గాదె పేర్మిగ నుంటల్. ౭౨౦

చ॥ అనుటయు నమ్మహావిభుని యాంతర మారసి శత్రుకోటి భీ
తి నిటువచించె దొక్కొ? జగతిన్ జగదీశ్వరిఁ గొల్చువారికిన్
గొనకొని యాపదల్ గలవె? ఘోరతమిస్రము భానుఁ గప్పునే?
చనెదము మమ్ముఁ జూడఁగ వెసన్ దమకించు మునీంద్రుఁ డెంతయున్. ౭౨౧

క॥ మా రాక కెదురుచూచుచు, భారద్వాజుండు మనసుఁ బట్టి వసించున్
గౌరవపాత్రులు తత్పద, సారసములఁ జేరి మ్రొక్క సమయము గానన్. ౭౨౩

చ॥ తడయఁగ రాదటంచు భుజదర్పఘనుండు సుదర్శనుండు వె
ల్వడుతఱిఁ బ్రీతితో నృపతి బాసటకై వెనువెంట సేనలన్
గడు రథసింధురాశ్వభటగంధమదేభములన్ గుదిర్చి యె
క్కుడుతమిఁ బారిబర్హముల గొబ్బున నల్లున కిచ్చి యంపఁగన్. ౭౨౪

క॥ చతురంగంబులు వెనుకొని, క్షితిపతిసుతుఁ డరద మెక్కి చెచ్చెర వంది
స్తుతివాద్యఘోషములతో, వితతోత్సాహమున నగరవీథిన్ వెడలెన్. ౭౨౫

క॥ మాతృవధూశిబికలు దా, సీతతితోఁ బొదివి నడువ క్షితిపతి సచివ
వ్రాతముతో నంప జనం, బాతతమోదమునఁ గనఁగ నతిరభసమునన్. ౭౨౬

—• సుదర్శనుఁడు శత్రుజిత్తు మొదలగు శత్రువులను దునుమాడుట •—

మ॥ కరిఘంటారథనేమికా హయఖురక్షగ్రైవేయహేషాధ్వనుల్
పురనారీజనమంగళారవపరిస్ఫూర్తుల్ జయధ్వానముల్

సురమార్గం బగలింప రాజసుతుఁ డచ్చో భాగ తేందు ప్రిం డన్
బురముగా వెల్వడి కాంచె సైన్యముల నంభోరాశి సామ్యంబుగన్. ౨౨౬

కం॥ అనుపఁగ వచ్చు సుబాహుం, డనుపమరిపుసైన్యసమితి నంతట నవలో
కన మొనరించి మనమ్మునఁ, బెనఁగొను సాధ్వసము గదుర భీరుం డయినన్. ౨౨౭

చ॥ ఉరువడిఁ గ్రమ్మి వచ్చు నహితోద్ధతిఁ గాంచి సుదర్శనుండు సు
స్థిరమతిఁ గామబీజము మదిన్ దలపోయుచుఁ జండ రౌద్ర భీ
కరశరధుల్ మొసుంగులుఁ బేకల్చి శరాసన మెక్కుపెట్టి దు
ర్భరశరకాండముల్ దొడిగి భండన కేళి యొనర్చె నంతటన్. ౨౨౮

సీ॥ ఇరువదిమూఁడగు నక్షౌహిణులతోడ, నభియాతిధరణీశు లావరించి
హర్తుకామత దారి కడ్డంబుగా వచ్చి, కోలాహల మొనర్చికొనుచు ఘోర
కార్ముకముసలముద్గర భిండివాలాది, సాధనంబుల రణోత్సాహకేళి
సలుపంగ నిరువాఁగు సైన్యముల్ దలపడి, పోరంగఁ జతురంగములు ధరిత్రిఁ

గీ॥ గూలి రుధిరప్రవాహముల్ కుతల మెల్ల, నావరింప సురాసురులట్ల విసువ
కతిభయంకరమై రణం బమరకోటి,యరు దరు దనంగఁ గనువారి కడరు దొడరె.

చ॥ పిటికితనంబుఁ బోవిడిచి భీమబలుండయి శత్రుజిత్తుఁ డే
ర్తైటఁ బరిఘంబు చేకొని కడిందిమగంటిమి వీనికంతమున్
దటిగెద నంచుఁ దోడ్పడి యుధాజితుఁడున్ వెనువెంట రాఁగ గ
ద్దటితన మూని పై దుమికి తందరఁజిందరఁ బెట్టి సేనలన్. ౨౩౦

ఉ॥ కొందఱు శత్రుజిన్నృపునిఁ గూడి నృపాలురు ఖడ్గహస్తులై
ముందు హుటాహుటిన్ నడవ మోహరపుంబల మంతకంతకున్
జిందఱ వందరై చెదరి చేడ్పడి దిక్కులఁ బర్వ యుద్ధపుం
గందువఁ జూపి రొక్క మొగిఁ గార్కొను బెబ్బులు లట్ల పెల్లునన్. ౨౩౨

ఉ॥ కొంద ఱిదేమి ధర్మ మని కోల్తల సేయుచుఁ జూచుచుండఁగా
సందడి యిన్మడించి జయశంఖనినాదము లుప్పతిల్ల నం
దంద ధనుర్గుణధ్వనుల నాకసమున్ బగిలింపుచున్ గడున్
గ్రిందుగఁ బోరి రొక్క మొగిఁ గట్టిఁడులైన ధరాధిపాత్మజుల్. ౨౩౩

వ॥ అట్టియెడన్ సుదర్శనుండు ధనుష్టంకారం బొనరించి రోదసీకుహరంబు నిండించుచు నానావిధశరసంపాత మ్మొనర్చన్ జెక్కలు ముక్కలును శిరంబులును గరంబులును మర్మంబులును జర్మంబులు ధరం దొఱంగఁ గట్టలుక ముట్టడింగొను రాచపట్టుల బెట్టిదంబులగు నంపసెలకట్టియలన్ దెట్టినవడి సుబాహుబలంబులు వెఱచి యొత

## देवी कूष्माण्डा



सुधासम्पूर्णकलशं रुधिराप्लुतमेव च ।
दधाना हस्तपद्माभ्यां कूष्माण्डा शुभदास्तु मे ॥

THE GITA PRESS, GORAKHPUR.

No. 405.

మూలకు నొదుగంబడ సుబాహుండును రథంబు నాయితంబుఁ జేసికొని పెనంగఁగ జొచ్చినఁ బీనుంగుపెంటలై రాజన్యబలంబు లొక్కుమ్మగి సింహనాదంబులు సేయుచుఁ బయిపయిం దుమికిన రాజన్యవరు లురవడించి యాగ్రహంబున నిగ్రహించిన సమ్మర్దంబై సంగరం బతిదుర్దమంబై భేరీభాంకారపటహకాహళరవంబులు సెలంగ బెండుపడి సుదర్శను బలంబులు పురికొనం జాలకున్న యెడ. ౨౩౪

— శ్రీ పరదేవి ప్రత్యక్షమగుట —

సీ॥ అరుణారుణప్రభాభరిత క్రుధావీక్ష, లాశావళులకు సంధ్యావ్యాప్తి నొసఁగఁ
గరసంభృతాయుధోత్కర పటుప్రభలు ధీ, వృత్తులు రోచిరుద్వృత్తిఁ దెలుప
నంతరాంతరమహోద్యత్సింహనాదంబు, లాకసంబున కనిశత్వత ఘటింప
దివ్యభూషణరత్నదీప్తులు పరిపంథి, కోటిదృష్టులకు సంకోచ మెనయఁ

గీ॥ దారశైలసదృక్షకంఠీరవమునఁ, బ్రథనసంరంభదోహదప్రతిభ వెలుఁగ
భక్తవత్సల యగుచు నీశ్వరి సుదర్శ, నాంతికంబున నిలిచెఁ బ్రత్యక్షమగుచు. ౨౩౫

మ॥ ధరణీవల్లభు లంబికం గని సముద్యద్విస్మయావిష్టులై
తరుణీరత్నము సింగ మెక్కి భయదోద్యద్భాసురాకారయై
పరికింపంబడు నీపె యెవ్వతెయొ? శుంభద్విక్రమాటోప దు
ర్భర నైపుణ్యము నందియున్నయది వీరశ్రీసముల్లాసయై. ౨౩౬

వ॥ అని బిక్కుమొగంబులతో నేమేమొ యూహించుచుండిరి. ౨౩౭

సీ॥ ధృతి సుదర్శనుఁడు నాదేవినిఁ జూచి సు, బాహునితోఁ బల్కెఁ బటురయమున
భక్తవత్సల దేవి పరతెంచె ననుఁ బ్రోవ; నని నీవు తెలియుమో యవనినాథ!
యద్దేవిఁ గనుఁగొన్న యంతట మనమున, సాధ్వసం బెడలేని సంభ్రమంబు
గంటివే? యని చెప్పఁ గరములు మోడ్చుచు, నిరువురు మ్రొక్కనయ్యెడఁ దదీయ

గీ॥ వాహదర్శనమున వైరివారణములు, జడిసి పరువెత్తె వీచెను జందనాద్రి
మారుతంబులు దెసలు నిర్మలము లయ్యె, నంతట సుదర్శనుఁడు మామఁ గనియె నిట్టులు.

శా॥ ఈరాజన్యులు చూడ నిర్భయుఁడనై యేనేగువాఁడం బలో
దారుల్ పార్థివు లడ్డమైన మది సంతాపంబుఁ బోఁజేసి స
ర్వారంభంబులు గావ నగ్రమునఁ బ్రత్యక్షంబుగా నిల్చె. ని
ర్వారాహీకరుణాకటాక్షములు ప్రోవంజాలవే భూవరా! ౨౩౮

మ॥ అని నిశ్శంక సుదర్శనుండు వలుకం సాహంక్రియోత్సాహులై
వనధిప్రావృత మేదినీవలయసర్వక్షత్రసంఘంబుతోఁ

గనఁ బెల్లార్చి యుధాజితుండు వెఱవంగాసేల పూఁబోఁడిఁ జే
కొని మిమ్మెల్లఁ బరాభవించి చనె గర్గో లొండుటల్ పాడియే? ౭౪౦

కం॥ సింగముపై నెక్కుచు నొక, యంగన రణమునకు వచ్చెనని భీతిలుటల్
సంగతియె యుపేక్షింపఁగ,ముంగలఁ జనువాఁడ రండు మోహారమునర్కు. ౭౪౧

ఉ॥ వీనిశిరంబుఁ ద్రుంచి పృథివీవరు లెన్న నెలంతఁ దెచ్చెదర్
హాని యెఱుంగ కిట్లు మన యగ్రిమునర్ జనుచున్నవాఁడు పం
చాననసన్నిధిన్ భయము సందని జంబుకమట్లు; వీనిఁ బో
నీను గనుం డటంచును రణేచ్ఛ యుధాజితుఁ డుత్సహించుచుర్. ౭౪౨

ఆ॥ శత్రుజిత్తుఁ గలసి సంగరంబున కేగ, యుద్ధకాము లగుచు యోధవరులు
నొక్కపెట్ట నడచి రురువడి నా సుదర్శనునిమీఁది కంత రణము వెలసె. ౭౪౩

చం॥ అపుడు యుధాజితుండు విశిఖాసన మెక్కిడి హేమపుంఖముల్
విపులసితాసితంబు లతివేలశిలీముఖముల్ ఘటించి పా
పపుమతి నూని పైపయి సభంగురలీల నిగుడ్చునంత ను
చ్చపటిమ నాసుదర్శనుఁడు చక్కఁడఁచెర్ నిశితాస్త్రపఙ్క్తిచేర్. ౭౪౪

కం॥ ఇత్తెఱఁగున సమరము కడుఁ, గ్రొత్తగ సమ్మర్ద మగుడుఁ గోపించి కృపా
యత్తయగు దుర్గ శరతతి, హత్తించె యుధాజితుర్ దురాగ్రహ మెడలర్. ౭౪౫

వ॥ అంత జగదీశ్వరి నానారూపధారిణియై దివ్యాస్త్రశస్త్రసంపన్న యగుచు నొక్క
పెట్ట సింగంబును దుమికించి శత్రుజిత్ప్రభృతిరాజవర్గంబును యుధాజిత్సహితంబుగ
ఖండించి యక్షౌహిణీ త్రిషష్టి పరివృతం బగు సైన్యంబును దైన్యంబు నొందించి
గాంధర్వగానంబులును దుంబురు నారదప్రముఖ వీణావినోదంబులును జెలంగ
భయంకరాకారం బవనయించి సుదర్శను ననుగ్రహింప సౌకుమార్యంబగు రూపం
బున నిలిచియున్న నమ్మహాశక్తిని హతశేషు లగు భూపాలురు గాంచి విస్మయ
చేతస్కులై నిలువ సుబాహుండు తన యల్లునకుఁ బరిపంథు లగు శత్రుజిత్ప్ర
భృతులు సమరంబున నిహతు లగుట యెఱింగి సంతసించి పరమప్రీతుండై దుర్గతి
నాశినియగు దుర్గర్ బ్రస్తుతింపర్ దొడంగె నంత. ౭౪౬

## —॰ మ హే శ్వ రీ స్తో త్ర ము ॰—

సీ॥ దేవీ ! జగద్ధాత్రి దీనపోషణ ! నీదు, చరణాంబుజంబులు సంస్తుతింతు
భగవతి ! కామదా ! పరశక్తి ! పావని, నారసింహీ ! వందనం బొనర్తు
శాంతి ! విద్యా ! శివా ! శాంకరీ ! మోక్షదా, చిత్తంబునను సదా చింతసేతు
మాహేశ్వరీ ! జగన్మాత ! కాత్యాయనీ, భువనేశ్వరీ ! నిన్నుఁ బూజసేతు.

గీ॥ నింద్రియంబులకును నింద్రియేశ్వరులకు, నీవె కర్తవు హర్తవు నిన్నెకాని
యొరులశరణంబు నొంద నీయెద్దనిలిచి, భజనమొనరింతుఁగరుణింపుబ్రహ్మజనని.

ఉత్సాహవృత్తము॥ సగుణలీలఁ జెలఁగు నిన్ను జననిఁ గాంచఁ జాల రే
నగుణవైనఁ దెలియనౌనె యనతిమాత్రశేముషీ!
జగము లెల్లఁ గనఁగఁ బెంప సమయఁజేయఁజాలు నో
భగవతీ! భయమ్ముఁణఁపుముపావనీ! మహేశ్వరీ! ౭౮౮

ఉత్సాహవృత్తము॥ మతివి నీవు గతివి నీవు మనసు నీవు భారతీ
సతివి నీవు సకలజంతుసమితి కెల్ల వేత నీ
కతిశయించు నాత్మ లేదె యఖిలజనని వీవెగా
సతము నిన్నె యాత్మఁ దలఁతు శాంకరీ! మహేశ్వరీ! ౭౮౯

ఉత్సాహవృత్తము॥ హరుఁడు బ్రహ్మ హరియు నిన్ను! ననిశమున్ భజింతు రా
సురలు నీ గుణమ్ము మేరఁ జూడఁజాల రెవ్వరున్
బరిమితుండనైన నేను బరఁగ నీ చరిత్రమున్
భరముగాదె దెలియ సర్వపావనీ! మహేశ్వరీ! ౭౯౦

ఉత్సాహవృత్తము॥ సరసులైన జనులగోష్ఠి సకల సిద్ధు లిచ్చు ఁటే
మరుదు దృష్ట మిదియ సుమ్మి యఖిలమర్త్యకోటికిన్
ధర సుదర్శనునిగుఱించి తల్లి! నీదు దర్శన
స్థిరత గల్గె నవశవృత్తిఁజేసి యో మహేశ్వరీ! ౭౯౧

ఉత్సాహవృత్తము॥ హరిహరాజముఖులకైన నలవిగాని నీ పరా
త్పరత నిశ్చయమున నెంచు పటిమ గల్గి యుండియున్
ధరఁ దపోజపములనైనఁ దనరరాని దర్శనం
బరయ వేగ నిడితి వేమి యందు నోమహేశ్వరీ! ౭౯౨

ఉత్సాహవృత్తము॥ జడుఁడనైన నాకు నేమిజననభేషజమ్ము నీ
కడిఁదిచూపు దొరకె ముక్తి గనుటఁజూడ వింతయా
బుడమి భక్తజనులఁ బ్రోచు భువనవంద్య వగుటచే
గడమవన్ని దెలియనయ్యెఁగాదె! యో మహేశ్వరీ! ౭౯౩

ఉత్సాహవృత్తము॥ వినుతిసేయఁగలనె నిన్ను విభుత లేక బీదనై
పెనుభయంబుఁ గొనిన యట్టిపిల్లఁడీ సుదర్శనున్
ఘనత దుర్మతక్షితీంద్ర కార్ముకాస్త్రబాధలన్
మనిచి వైరి నిహతి సల్పు మాత వో మహేశ్వరీ! ౭౯౪

ఉత్సాహవృత్తము॥ కనఁగ వింతయగునె సర్వ ♣ గణము గావ నీవె కా
ఘనతఁగోరి నృపసుతుండు ♣ కరుణఁ జెందుటయ్యెఁగా
విను చరాచరములు సృష్టి ♣ వినుటయెల్ల వేద వా
క్కునను నిన్నె పలుకుఁగాదె ♣ కొఱఁతయే మహేశ్వరీ! ౭౫౧

ఉత్సాహవృత్తము॥ భువనబీజమైన నీదు ♣ పోలుపుఁ దెలుప నేరమో
యవితథంపు మహిమ నెంచ ♣ నలవిగాదు బ్రహ్మకున్
యువతితోడఁ గలసియున్న ♣ యురుగుణున్ సుదర్శనున్
బ్రవిమలాత్మ! నిలిపి తీవు ♣ పదమునన్ మహేశ్వరీ! ౭౫౬

ఉత్సాహవృత్తము॥ అరులఁ గొట్టి కుశలమొందె ♣ నన నరేంద్రసూనుఁ డీ
కరణిఁ బూన్కిమై నొనర్పఁ ♣ గలుగు దైవ మీవె కా
పరమతత్త్వ మనుచు వేద ♣ పటల మెల్లఁ దెల్పదే?
కరమువింటి బుధులయొద్దఁ ♣ గంటినో మహేశ్వరీ! ౭౫౭

ఉత్సాహవృత్తము॥ జని జరామరణముఖములఁ ♣ జక్కఁగా సడల్చి నీ
వనుదినమ్ము నతులఁ బ్రోతు ♣ వనుట వింతయా నొకో?
నను భజించుజనులఁ బ్రోతు ♣ నాఁ బ్రతిజ్ఞఁ బూనినా
వనుచు వింటిఁ గరుణఁ జూడు ♣ మమ్మ యో మహేశ్వరీ! ౭౫౮

ఉత్సాహవృత్తము॥ కనఁగఁగోరి వినఁగఁగోరి ♣ కనఁగఁగల్గె నేటికిన్
వినఁగనేల మహిమ లెల్ల ♣ వీను లలర మాటికిన్
జనులలోనఁ బెద్దనయితి ♣ జగములోన మించితిన్
ఘనత బీజమహిమ గంటిఁ ♣ గరుణచే మహేశ్వరీ! ౭౫౯

కం॥ బాహువులెత్తుచు నిటుల సు, బాహువు వినుతింప మెచ్చి ♣ పార్థివ! మది సం
దేహింపక వర మడుగుము, నీహర్షము కొలఁది నిత్తు ♣ నిఖిలవిభూతుల్. ౭౬౦

—• మ హే శ్వ రి వ ర ము లి చ్చు ట •—

వ॥ ఇట్లు వరంబడుగు మని యమ్మహాదేవి యానతిచ్చిన విని హర్షోత్ఫుల్లనేత్రకమ
లుండై సాశ్రుకంఠుం డగుచుఁ బునఃపునఃప్రణామంబు లొనరించి దయాపర
యగు పరాశక్తిం గాంచి సుబాహుం డిట్లనియె. ౭౬౧

సీ॥ అమర సంస్తుత్య మహామాయవై దుర్గ, వై యొప్పుదేవి! నీ ♣ కహరహంబు
వందనం బొనరింతు ♣ వర మింక నేటికి, జన్మపరంపర ♣ సఫల మయ్యె
భువి సర్వసౌఖ్యముల్ ♣ దివి సర్వసౌఖ్యముల్, పర దేవి నినుఁజూచుభాగ్యమౌనె
నినుఁ గాంచుకంటెను ♣ నిఖిలలోకంబుల, నధికసౌఖ్యం బున్నెయరసి చూడ

గీ॥ నింక నేమి వరం బిత్తు ✽ నేమి గోరు, దేఁ గృతార్థుండ నైతి మ✽హీతలమునఁ
దల్లి! వర మిచ్చెదేని నా✽తలఁపు నీదు, భక్తియే గాని యొండొక్క✽భావ మేల

గీ॥ నాదు నగరంబులోన న✽నారతంబు, దుర్గ వై నిల్చుటయ నాకు ✽ దురితహరము
నిన్ను భజియింతుఁ బూజింతు✽నిలువు మిచటఁ, బురముఁ బాలింపవే యో✽భువనజనని!

చ॥ ఎటుల సుదర్శనున్ గనిక✽రించి విరోధులఁ ద్రుంచి కాచితో?
యటుల మదీయరక్షణ మ✽హర్నిశమున్ ద్వదధీన మౌట మ
త్కటకము భూతలంబునను ✽ దప్పక యుండునొ? యంతకాల మ
క్కటికముతోడ నిల్చి పురిఁ✽గావుము సర్వశుభోచ్ఛ్రయంబుగన్. ౨౬౪

చ॥ వర మిది నాకు దేవి భవ✽వారిధినావవు గాన వేఁడితిన్
గరుణ రణాంగణమ్ములను ✽ ఖడ్గము వేఁ గొని శత్రుకోటి సం
హరణ మొనర్చుచున్ దురిత ✽ మార్చుచు కామితముల్ ఘటించుచున్
నిరతము పూజ లందుచును ✽ నిల్చుట నాకు వరంబు వైష్ణవీ! ౨౬౫

ఆ॥ పరమనిష్ఠ నిటుల ✽ భయభక్తిసహితుఁడై, వేఁడుకొను సుబాహు ✽ వివిధదురిత
శిక్షణంబులైన ✽ వీక్షణంబులఁ జూచి, దుర్గ నతమునీంద్ర✽వర్గ పలికె. ౨౬౬

మ॥ ధరణీవల్లభ! సర్వలోకభరణో✽ద్యత్సత్కటాక్షేక్షనై
నిరతం బిందు వసింతు మద్భజనమున్ ✽ నిష్ఠాగరిష్ఠుండవై
నిరతిన్ జేయుము మేదినీతలము ని✽ర్ణీతంబుగా నిల్చు సు
స్థిరమై యెన్ని దినమ్ము లన్నిదినముల్ ✽ దీక్షామతిన్ నమ్ముమీ. ౨౬౭

క॥ అని కరుణించి వరం బి,చ్చినయంత సుదర్శనుండు ✽ స్థిరతరకరుణా
వనధి యగు దేవదేవిన్, విని వినతుం డగుచు భక్తి ✽ వినుతి యొనర్చెన్. ౨౬౮

ఉ॥ భక్తి నెఱుంగ నీ యెడల✽భావ మెఱుంగ జడుండ నట్టి య
వ్యక్తుఁడ నన్నుఁ గాచితి ద✽యాపరమూర్తివి పూజ సేయు స
ద్భక్తులఁ బ్రోచు టబ్రమె యు✽దార భవద్భజనాధురీణు లౌ
యుక్తులు ముజ్జగంబుల న✽నూనమహామహిమంబు గాంచరే. ౨౬౯

మ॥ కరణంబున్ భరణంబు సంహరణమున్ ✽ గల్పించి త్రైలోక్యమున్
గరుణన్ బాలన సేయునట్టి త్రిజగ✽త్కల్యాణి! నన్ బ్రోచు ట
బ్బురమే నీకు? నొసంగుమమ్మ చరణాం✽భోజముల్ భక్తలోకాఘసం
హరణంబుల్ శిరమందుఁ దాల్తు జగదం✽బా! సత్పదంబావనీ! ౨౭౦

కం॥ నీయాజ్ఞ శీర్షమం దిడి, మాయామయి సంచరించు ✽ మార్గ మ్మెదవెన్
దేయం బిది జీవించు న,పాయము నిడి కరుణఁ జూచి ✽ పాలింపుమనన్. ౨౭౧

సీ॥ అంత సుదర్శను ✽ నతి దయారసధారఁ, జిల్కుచూపులఁ జల్లఁజేసి దేవి
సాకేతనగరికిఁ ✽ జనుము నీ పితృపితా,మహభోగ్యమైనట్టి ✽ మహితలమ్ము
నీ యధీనంబగు ✽ నిర్జరేంద్రుఁడువోలె, విభవభోగములచే ✽ వెలయుమయ్య
స్మరియించి పూజించి ✽ సన్నుతింపుచు నన్ను,మఱవకుండుము నీదుమండలమున
గీ॥ సన్నిధానంబొనర్చి సాక్షాత్కరించి, నిలిచియుండెద సద్భక్తినియతి దనర
కామరాజంబు హృత్ప్రీతిఁ ✽ గదలనీక, సంస్మరింపుము నీకు వాంఛాప్రదంబు.

వ॥ మఱియును నష్టమీ నవమీ చతుర్దశీ తిథులందు బలిదాన విధాన పూర్వకంబుగా మత్పూజాపరాయణుఁడవై యుండుము, యుష్మద్రాజధాని యగు నయోధ్యా నగరంబున రత్నఖచితంబును గనకమయంబును నగు విమానంబు నిర్మింపంజేసి యందు సమంత్రకంబుగా నన్నుఁ బ్రతిష్ఠించి త్రికాలంబును సద్భక్తియుక్తుండవై మహాపూజ నొనర్పుము. శరత్కాలంబున విధితత్పరుఁడవై న న్నర్చింపుము, చైత్రాషాఢాశ్వయుజపౌష మాసంబుల మహాపూజ లొనర్పుము, విశేషించి కృష్ణ పక్షంబులఁ జతుర్దశ్యష్టముల మహాపూజ లొనర్పు మని వచించి సుదర్శనునిచే ననేకవిధంబు లగు సన్నుతులం గొని భక్తార్తినాశిని యగు దుర్గాదేవి యంతర్హిత యయ్యె నంత. 223

ఉ॥ ఆ మహిమంబు గన్గొని ధరాధిపు లెల్ల సుదర్శనున్ యశో
ధామునిగా నెఱింగి నయతత్పరులై యమరాదు లెల్ల సు
త్రామునకున్ జోహరిడు విధమ్మున మ్రొక్కుచుఁ జెంతఁ జేరి ని
ష్కామలచిత్తులై పలికి ✽ రందఱు సంస్తుతిపూర్వకంబుగన్. 224

ఆ॥ మాకు నెల్ల నీవె ✽ మహిపతి వైతివి, శాస్త వగుము నీదు ✽ శాసనంబు
తల ధరింతు మో సుదర్శన నరపాల, రమ్మయోధ్య కిపుడె ✽ రాజవగుము. 225

సీ॥ నీ యనుగ్రహమున ✽ నిఖిలేశ్వరినిఁ గాంచి, ధన్యుల మైతి మాత్మరచితములు
ప్రాగ్జన్మసుకృతసంభారంబు లెల్లను, సార్థకంబులు పునర్జన్మగహన
దహనంబు లగు జగద్ధాత్రివీక్షణములు, ప్రసరించె మామీఁదఁ ✽ బలుకు లేల?
ద్రోహచింతనమునఁ ✽ దొడరి నీమీఁదఁ జేయు, నపరాధశతముల ✽ నపనయించి
గీ॥ పరిజనులఁబోలె గృపఁజూచి ✽ పనులుగొనుచు, శాశ్వతైశ్వర్యధుర్యత ✽ సకలధరణి
నేలుకొనుము సితచ్ఛత్రమెత్తి యింద్ర,విభవసుఖభోగి వగుము సేవింతు మెపుడు.

గీ॥ ఆదిశక్తి విశ్వేశ్వరి ✽ యఖిలజనని, శివ చతుర్వర్గఫలద నాస్తికనిహంత్రి
యగు సనాతని యచటఁబ్రత్యక్షమయ్యె, నెఱుఁగమ ద్దేవిమహిమ మో క్షితిప మనగుచు.

మ॥ ధనదారాత్మజవాంఛలన్ బడి మదాంధప్రక్రియన్ జండికా
ఘనమాయార్ణవ మధ్యగాహన గళత్కల్యాణమార్గక్రియా
మననారంభ మెఱుంగమైతి మతికామక్రోధ సంవేల్లనం
బున మాచిత్తము లెల్ల నావిలములై మూఢంబు లయ్యెన్ గదన్. ౭౬౮

శా॥ సంసారాంబుధిఁ దేలు నీజనుల వీక్షాపాత ధారాస్మృతిన్
హింసల్ మానిపి చల్లఁజేసి హృదయాభీష్టప్రదానక్రియా
శంసన్ జెందుట సాధువృత్తియకదా చండీప్రభావంబు మీ
మాంసింపంగల వార లెవ్వరు రఘుక్ష్మానాథవంశాగ్రణీ! ౭౬౯

—. సుదర్శనుఁడు దేవీమహిమము చెప్పుట .—

ఉ॥ ఎట్టుదయించెనో? మహిమ యెట్టిదొ? యెట్టిదొ? దేవి రూప మి
ప్పట్టున మాకుఁదెల్పి భవపాశము లస్మదుపార్జితమ్ముల
న్నెట్ట సుమార్గ మిట్టిదని నిశ్చయ మొందఁగఁజేసి మమ్ముఁ జే
పట్టుము కట్టు మియ్యెడ శుభంకరతత్త్వవిచార రజ్జులన్. ౭౭౦

ఆ॥ కరుణఁ జూడు మనుచు నరవరుల్ వేడిన, నా సుదర్శనుండు హర్ష మెసఁగ
నాత్మదృష్టి దేవి నవలోకన మొనర్చి, యంబికామహత్త్వ మనువదించె.

సీ॥ ఈశ్వరేశ్వరి కటాక్షేక్షణంబులు మోహ,రక్షోభయార్తసంరక్షణములు
ఈశ్వరేశ్వరి కటాక్షేక్షణంబులు ఘోర,భవభీతిదుర్మార్గభక్షణములు
ఈశ్వరేశ్వరి కటాక్షేక్షణంబులు నన్య,చిత్తసంబోధనాశిక్షణములు
ఈశ్వరేశ్వరి కటాక్షేక్షణంబులు మహా,దురితదావాగ్ని సంధుక్షణములు
గీ॥ స్వమత సిద్ధాంత వాచా విచార భేద,బోధ బోధక జనన ప్రభేద జనన
ధర్మకర్మరజిహ్వాకాతక్షణంబు, లీశ్వరేశ్వరి సత్కటాక్షేక్షణములు. ౭౭౧

సీ॥ చిచ్ఛక్తి భజియించు చిత్తంబు చిత్తంబు,మాహేశ్వరిఁ దలంచుమనముమనము
కాత్యాయనిని బూన్చుకరములు కరములు, భువనేశిఁ గాంక్షించు బుద్ధి బుద్ధి
విమల విద్యను విను వీనులు వీనులు, పరమేశ్వరి నుతించు పలుకు పలుకు
బ్రహ్మణి వలగొను పదములు పదములు, శ్రీదుర్గ నుతియించుజిహ్వ జిహ్వ
గీ॥ ఇష్టకామేశ్వరిని గను దృష్టి దృష్టి, చిన్మయీశక్తికిని మ్రొక్కుశిరముశిరము
మాటలేటికిఁ బర దేవిమహిమఁ గనని, నరుఁడు నరుఁడౌనె? కుటిలవానరుఁడుగాక.

ఉ॥ ఏమని విన్నవింతు ధరణీశ్వరులార! తదీయ చర్య సు
త్రామముఖామరుల్ హరివిధాతలు గానఁగ లేరు ప్రాణులన్

గామితముల్ ఘటించు పనికై సగుణాకృతిఁ బూను నిర్గుణం
బౌ మహితస్వరూప మది యబ్బునె? యెంతటివాని కైనఁగన్. ౭౮౪

గీ॥ సర్వజనులను బాలింప సాత్త్వికయును, వైష్ణవియు నుత్తమయు నాచు గతిని
నిర్గుణయు నయ్యు భక్తసాన్నిధ్యములను, దివ్యదేహానుకృతిఁ గాంచు దేవదేవి.

ఉ॥ సృష్టి రజోగుణంబునను సేమము గూర్చుట సత్త్వభూతిచే
నష్టి తమోగుణమ్మున ననారతమున్ బ్రకటించుచున్ గుణ
వ్యష్టుల మాని సర్వగుణభాసురయై విహరించు జాడ్య సం
సృష్టతగాని నిర్గుణతనెందు మహేశ్వరి సర్వకాలమున్. ౭౮౬

ఉ॥ యోగిజనుల్ గనందగరు యుక్తులచే నిగమంబులున్ బురా
ణాగమముల్ వచింపఁగ సమగ్రత నొంద వఖండతత్త్వముల్
భోగసుఖాభియోగములఁ బొందుటకై దలపింపువార లు
ద్వేగము మాని సాత్త్విక నభేదమతిన్ భజియింపఁగాఁ దగున్. ౭౮౭

సీ॥ బాలుండ వయ్యు నిర్భయుఁడనై కానల, నెట్లు వసించితి విట్టి దేవి
నెట్టు భజించితి వీశ్వరి వైష్ణవి, నర్చించితో? మహాయోపాసనముల
మెప్పించితివి దయామృతవృష్టి వీక్షించి, సాహాయ్య మొనరించు సర్వ సిద్ధిఁ
గావించె నన రాజకమ్ము నిరీక్షించి, బాలుండనై మునిప్రవరునొద్దఁ

గీ॥ గామరాజంబు విని మనోగ్రమున నిల్పి, జప మొనర్చితి సర్వార్థసాధకంబు
తదుపపాద్యంబు పరదేవి దైత్యహంత్రి, నే దివారాత్రములు గొల్తు నిద్ధమహిమ.

ఆ॥ అని సుదర్శనుండు హర్షంబు మిన్నంద, బార్థివులకుఁ దెల్ప భక్తి భయము
లంకురింప శక్తి యఖిలలోకేశ్వరి, యనుచు నమ్మె యాజ్ఞఁ గొనుచుఁ జనిరి.

## — సుదర్శనుండు స్వపురము ప్రవేశించుట —

ఉ॥ మామ సుబాహుఁ డంత నిజమంత్రిసమాజముతో సుదర్శనున్
బ్రేమఁ గవుంగిలించి బలభిద్విభవంబున నాజ్ఞఁ గొంచు న
ద్ధామవరాఖనీతతు లుదారములై తనుఁ గొల్వ నూలభృ
ద్ధామము కాశిఁ జేరెను సుదర్శనుఁ డేగె నయోధ్యకున్ వెసన్. ౭౯౦

ఉ॥ అంతట శత్రుజిత్తు మృతుఁడౌట సుదర్శనుఁ డాజిఁ గెల్చుటా
ద్యంత మెఱుంగుటన్ మనకు నర్హుఁడు పాలకుఁ డీతఁ డంచు సా
మంతనృపాలయుక్తు లయి మంత్రులు తా రెదురేగి కానుకల
త్యంతముదమ్ముతో నిడిరి యట్టులె వేచిరి సర్వభూజనుల్. ౭౯౧

ఉ॥ తల్లియు ధాత్రియున్ సతియుఁ । దానును సర్వసుహృజ్జనావళుల్
వెల్లువగట్టి వార్నిధులఁ । వేగ్రఁగున సైన్యము లెల్లఁ జుట్టి రా
నుల్లము పల్లవింపఁగ నయోధ్యను రాజగృహప్రవేశనం
ఫుల్లమనోరవిందుఁడయి । పొల్చె సుదర్శనుఁ డంబికాకృపన్. ౭-౨

కం॥ వందులుచేసెడు నుతి పుర,సుందరు లిడు మంగళములు । సుస్వరములు మి
న్నందఁగఁ గన్నెలు చల్లిరి; బృందములై లాజకుసుమబీజము లధిపా! ౭-3

వ॥ ఇత్తెఱంగున సుదర్శనుండు. భార్యాసహితుండై గృహంబు ప్రవేశించి మాతృ సపత్నియగు లీలావతిన్ దర్శించి తల్లీ! శోకం బుడుగుము. భవత్సుతుం డగు శత్రుజిత్తును యుధాజితుండును నాచే నిహతులుగారు. సంగ్రామంబునఁ బరదేవిచే నిహతింజెందిరి. నాయెడ నపరాధం బింతయు లేదు. భవచ్చరణంబులాన యని పల్కి కాఁగల్గు నర్థంబులకుఁ బ్రతీకారంబు లేదుగదా? స్వకర్మవశుండై జీవుండు సుఖాసుఖంబు లనుభవించుట వినమె? యేను నీకు దాసుండ నగుదు. మనోరమ యట్టుల భావించెద సుఖాసుఖంబు లవశ్యభోక్తవ్యంబులు,సుఖదుఃఖంబుల నెక్కువ వారలం జూచి సుఖదుఃఖంబుల మఱవవలయు, శత్రువులగు హర్షశోకంబుల కాత్మ నర్పించుట. యాత్మద్రోహంబు,సర్వంబు దైవాధీనంబు, దారుమయంబగు పాంచాలికన్ భరతుండు వోలె సర్వంబు దైవంబ వర్తింపంజేయు, దేహసంచలనంబట్టులఁ దెలియుము. నేను బాలుండనై వనమ్మున కరుగునెడ మత్ప్రారబ్ధం బనన్యభోక్తవ్యంబని కాదె యిల్లు వెడలితిఁ దల్లి విధురయౌటయు మాతామహుం డీల్గుటయు మార్గమధ్యంబునన్ బాటచ్చరనిపాతనంబున ధనాపహరణాదికంబును విదల్ల ధాత్రేయీసహితులమై ఋష్యాశ్రమంబునఁ గందమూలఫలాదిభక్షణం బొనర్చుటయు నాదిగాఁ గల కష్టంబుల శోకంబును బ్రస్తుతహర్షంబును సమంబులుగాఁ జూచితింగాదె? రాజభోగంబులకన్న మునిపత్నీకరార్పితనీవారాన్నకబళభక్షణంబ సుఖదంబై యుండెడి దుర్లభంబగు మానుషత్వంబు నొందినవానికి ధర్మసాధనంబు కర్తవ్యంబు,దీనివలన స్వర్గమోక్షంబులు సులభంబులగు నితరయోనిజులకు లబ్ధంబులగునే యని బోధించిన లజ్జించి దీనవదనయై పుత్త్రశోకంబు మఱచి సుదర్శనున కిట్లనియె. ౭-౪

సీ॥ పాపశాధను బుత్త్ర! । శత్రుఁడై మాతండ్రి, నీతాతను వధించి । నిన్ను రాజ్య
మెడలించె వారింప । నే శక్తఁగననైతి, నతఁడు చేసినకర్మ । మతని దమ్యె
నిన్నుఁ జూడఁగఁజాల । నిఖిలకష్టంబుల, పాలుచేసితి నెంత । బాధపడితొ?
సవతి మనోరమ । సందర్శన మొనర్పఁజాల లజ్జించెద । సత్య మిదియ

ఆ॥ వారు సేయు కర్మవశమునఁ బాటిల్లు, హర్షశోకములను । నాత్మవికృతి
నొందనేల? యింక । నొరవరు నామది, హర్షశోకవికృతి । యంతనిజము. ౭-౫

గీ॥ భానువంశ! మనోరమ ‡ భగిని నాకు, నీవు కొమరుండవైతివి ‡ నిక్క మరయ
కోరిక మేటికి రాజ్యంబుఁగొనుము ప్రజలఁ,గాచి రక్షింపు భగవతికరుణగలదు.

మ॥ అని లీలావతి పల్క మ్రొక్కి యతఁ డయ్యాజ్ఞ దలఁ దాల్చి వే
చని యాస్థానగృహంబునన్ నిలిచి నిశ్చల్ మంత్రివర్గంబులన్
ఘన దైవజ్ఞుల బిల్వనంపుచు ముహూర్తం బొం డనుష్ఠించి యొ
య్యన హైమంబగు సింహపీఠమును రమ్యం బొందు నిర్మింపఁగన్. ౭౯౭

గీ॥ తగు పురోహితులను బిల్చి ‡ ధర్మవిధిని, బూజ లొనరించి పెద్దలఁ ‡ బూజచేసి
చిత్రకంఠీరవాసనాసీనుఁ డగుచు, మంత్రులను జూచి పల్కె నమందగతిని.

మ॥ పురిమధ్యంబునఁ జండికాంబకు మహాభోగార్థమై శిల్పులన్
ద్వరలోఁ బిల్వఁగఁబంచి రత్నఖచితస్తంభావళీజృంభణ
స్థిరమౌ మంటప మొండు నూతనముగాఁ ‡ జేయింపుఁ డచ్చో మణి
స్ఫురితంబై తగు పీఠి నంబికను సంపూజింప వాంఛించెదన్. ౭౯౯

గీ॥ ధర్మకామార్థమోక్షప్రదాయిని యగు, దేవి సింహాసనంబునఁ ‡ దీర్చి నిలిపి
నిత్యపూజలు సేయుచు ‡ నిఖిలరాజ్య,పాలన మొనర్తు సకలసంపత్సమృద్ధి.

మ॥ నగరావాసులు మీర లెల్లరు సదా ‡ నవ్యార్చనల్ సల్పుచున్
జగదంబన్ మదిఁ గొల్వుఁ డెంతయును వాంఛాసిద్ధి మీ కిచ్చు న
త్యగణీయంబగు శక్తి తత్త్వము మహార్థం బంచు వాచావిధిన్
నిగమంబుల్ వచియించుఁగాదె! పటునిర్ణిద్రప్రభావంబునన్. ౮౦౧

గీ॥ ఇటులఁ దెల్పు సుదర్శనుహితవచనము, లాలకించి ప్రధానజనాళి నగర
మధ్యమంబున దేవతామందిరంబు, శిల్పిరచితంబుగాఁ గట్టఁజేసి రంత. ౮౦౨

మ॥ ప్రతిమాకారత దేవి నందు ద్విజవర్యప్రోక్తకల్యాణసం
గతనక్షత్రముహూర్తకాలమున సాంగంబుగా బ్రతిష్ఠించి భూ
పతి హోమాదు లొనర్చి పూజ లిడుచున్ ‡ భావింపుచున్ నిత్య మ
ప్రతిమానంబుగ నుత్సవంబులఁ బొనర్పన్ జేసి రత్యుద్ధతిన్. ౮౦౩

గీ॥ వేదఘోషంబు లంబికావిమలహర్మ్య,సీమఁ బిక్కటిలంగ విచిత్రవాద్య
నిస్వనంబులు మొలయ నిర్ణిద్రుఁడగుచు, నమ్మహాదేవిని భజించు ననహరహంబు.

ఉ॥ కోసలదేశమందు జనకోటులు భూపతియాజ్ఞఁ దాల్చి దు
ష్టాసురహంత్రియైన జగదంబికఁ బూన్చుచు సర్వకామిత
శ్రీసముపేతులై వెలసి ‡ చెందిరి సర్వసుఖానుభూతి గో
త్రాసురముఖ్యవర్గము లుదారత భక్తి భజించి రెంతయున్. ౮౦౫

సీ॥ ధర్మిష్ఠుఁడగుచు సుదర్శనుం డఖిలరాజ్యములెల్లఁ బాలించు నవసరమున
రఘుదిలీపులు రాజ్యరక్షణ మొనరించు, కైవడి ధర్మసంకరత లేక
యాశ్రమగ్రామాదులందు నెవ్వారలు, ధర్మతత్పరు లౌచుఁ దగ వసింప
నొక్కఁడేని యధర్మ మొనరింపఁడు యథోక్తవిధిఁ జతుష్పాదమై వెలసె ధర్మ
గీ॥ మేమి చెప్పుదు వినుము భూమీశ? శార్ఙ్గి యవతరించుచు శ్రీరాముఁడై నినాఁటి
ధర్మపథవర్తనంబులఁ దఱుఁగనీక, రాజ్యమేలె సుదర్శనరాజమౌళి. ౮౦౬

శా॥ కాశీమధ్యమునన్ సుబాహుఁడు జగత్కల్యాణియౌ దుర్గకున్
బాశచ్ఛేదకమైన యట్టులు మహాభర్మాగ్రరత్నార్చులా
కాశం బెల్లెడ నావరింప నియతిన్ గట్టించె హర్మ్యంబు స
ర్వాశావాసిజనంబు లెల్లఁ గడు నత్యాశ్చర్యమున్ బొందఁగన్. ౮౦౭

గీ॥ ఈశ్వరేశ్వరుఁడైన విశ్వేశ్వరునకు, నెయ్యపుమ్మద్దుగొమ్మ గణింప మించి
నిత్యపూజ్యవిధానముల్ నెఱపుచుందు, రఖిలజనములు శ్రీవారణాసియందు.

శా॥ నానాదేశములన్ బ్రసిద్ధమయి గన్నన్ విన్న సర్వార్థ సం
ధానప్రక్రియ నచ్చటన్ నిలిచి భక్తవ్రాతముల్ గొల్వ సం
ధ్యానధ్యేయత దుర్గ దుర్జనదురాధ్యక్షుపరిభావంబునన్
స్థానారూఢతఁ గాంచెఁ దన్మహిమ మత్యాశ్చర్య మీ యుర్విలోన్. ౮౦౯

ఉ॥ భారతఖండమందు జనపాళికి సర్వకులంబులందుఁ బూ
జారతిఁ గొల్వఁగాఁ దగిన సర్వసుఖప్రద దుర్గ నీవునున్
భారతవంశచంద్ర! భయభక్తిసమేతుఁడవై మహేశ్వరిన్
సారతరార్చనల్ దనిపి సల్పుము తద్భజనంబు నిచ్చలున్. ౮౧౦

క॥ ధ్యానపరాయణులగు సన్మానులు వేదోక్తశుభదమంత్రావళి న
శ్చానిరతు లగుచుఁ గొలుతురు, గానన్ బరదేవికన్న గతి యొండగునే. ౮౧౧

కం॥ భువి భక్తితత్పరతచే, నవరాత్రములందు నర్చనము భజనమగున్
హవనమును యాగమును నుత్సవమును జేయుదురు సర్వజనములు వత్సా. ౮౧౨

సీ॥ వాగ్భవం బెవ్వాని వదనంబునను నిల్చు, నతనికిఁ బెరటివౌ నభ్రితరులు
స్మరరాజ మెవ్వఁడు సంస్మరించు సతంబు, నతనిగోష్ఠమునందునమరు సురభి
యమృతబీజోచ్చారణము నెవ్వఁ డొనరించు, నతనియింట నెసంగు నవనిధులును
నీవ లావల నెవ్వఁ డిమ్మాఁడును జపించు, నతనిహస్తగతంబు లష్టభూతు
గీ॥ లఖిలజననికి నత్యార్థ మభినయించు, మంత్రరాజంబు దీని నేమనుజుఁడైన
విడువక జపించు నట్టిఁడె పోవిభుఁడు ముక్తికని మెఱుంగుము జనమేజయక్షితీశ!

వ॥ నావుడు జనమేజయుండు. ౪౨౪

సీ॥ కర్మందివర శరత్కాలంబుఁ జనుదేర, నవరాత్రసంపూజనము విశేష విధిగాఁగ జేయుట ౹ వేదోక్తమని యంటి, వే విధానము ఫలం ౹ బెద్ది దాన మెట్టి దావ్రతము మదిష్టంబు గావున, దయదలిర్పఁగ నన్ను ౹ ధన్యుఁజేయు తద్విధానంబును ౹ దద్వ్రతచర్యయుఁ, దత్ఫలంబును సవిస్తరముగాఁగ

గీ॥ నన్నుమన్ననఁజేసి యనారతంబు, భగవతీభక్తి గలుగంగఁ ౹ బట్టుగొల్పి యానతియ్యంగఁ దగునని ౹ యర్థిఁబలుక, బాదరాయణుఁ డయ్యధిపతికి ననియె.

## — నవరాత్రోత్సవ విధి —

మ॥ విను రాజోత్తమ! యాశ్వినంబున సదావిర్భూతభక్తిక్రియా ఘనుఁడై వేదవిధిన్ జనుండు త్రిజగత్కల్యాణి నుద్యద్దయా వనధిన్ బూజ యొనర్పఁగాఁ దగు మనోవాల్లభ్యలభ్యార్చనా మననాభావనలన్ జెలంగు నతఁ డంబాపాదసాన్నిధ్యమున్. ౪౨౬

క॥ వాసంతశారదముల ను,పాసింపం దగు యథోక్తపద్ధతి యమదం ష్ట్రాసంజ్ఞకము లయ్యవి, శ్రీసతిఁ బూజించువారి ౹ సిలుగులు తొలఁగున్. ౪౨౭

క॥ భువి మేలు గోరువారికి, సవనములు శరద్వసంతసమయమ్ములలో నవిరళసంపద్దీర్ఘా,యువుల నొసంగును సమర్పితోత్సవములచేన్. ౪౨౮

సీ॥ సురభిశరత్తులు ౹ నరులకు ఘోరముల్, క్షయకరమ్ములు రోగజనకములును గావునఁ జండికార్చ్యము సేయఁదగుఁ జైత్ర, మాశ్వినంబును విశేషార్చ వలయు హవనసంభారమ్ము ౹ లఖిలమ్ము గూర్చి హ,విష్యాశియై వేదవిధి యెఱింగి మంటపంబు రచించి ౹ మానమ్ము షోడశ,హస్తసంయుతముగా ౹ ననువు పఱిచి

గీ॥ ధ్వజము లెత్తించి గోమయప్రథితగార, మృత్తికాలేపన మొనర్చి ౹ మృదులతరము గాఁ జతుర్హస్తవిస్తృతిగలుగ నొక్క, కేలి యెత్తున వేదిక ౹ గీలుకొలిపి. ౪౨౯

క॥ సహకారపల్లవంబుల, బహుతోరణపటలిఁ గట్టి ౹ బంధురరేఖా విహితముగ ముగ్గుదీరిచి, సహజాలంకరణయుక్తి ౹ సంధింపఁదగున్. ౪౩౦

చ॥ తొలుతటిరాత్రి వేదవిధిధూర్వహులన్ స్మృతి కర్మనిష్ఠులన్ నలువుర దాంతులన్ ద్విజుల ౹ నవ్యకళామయదేహులన్ యథో క్తులను వరించి నిల్పికొని ౹ దుర్జనదూరత సంతరించి వి చ్చలవిడి విత్తశాఠ్యము పొసంగఁగనీక ధనవ్యయాఢ్యుఁడై. ౪౩౧

మ॥ ప్రతిపద్వాసరమందు వేకువను నిద్రల్ మాని దేవీస్తుతి
ప్రతతుల్ నిష్ఠఁ బఠించి పంచఘటికాప్రాభాతవేళన్ సర
స్వతియో దీర్ఘతటాకమో సరసియో ౹ సత్తీర్థ రాజంబులన్
యతియై కుంకి విశుద్ధవస్త్రముల నొయ్యన్ దాల్చి తీరస్థుఁడై. ౮౨

కం॥ ప్రాతఃకృత్యముఁ దీర్చి ని, కేతనమున కేగుదెంచి ౹ కృతకృత్యత ని
ర్ధూతాఖిలాఘుఁడై సం,ప్రీతిన్ బ్రాహ్మణులఁ బూన్చి ౹ ప్రియపూర్వముగన్.

సీ॥ మాలతీమల్లికామందారకుటజ చం,పకకరవీరపుష్పవ్రజములఁ
జందనాగరుఘనసారకాశ్మీరక,స్తూరిహరిద్రికాచూర్ణములను
నారికేళాంబుసమన్నారంగదాడిమీ, ఖర్జూరమాతులుంగముల గముల
బిల్వదళంబులఁ ౹ బృథుధూపముల దీప,ముల జగద్ధాత్రి నింపలరఁబూన్చి

గీ॥ పాయసాపూపవటకముల్ ౹ భక్ష్యభోజ్య, లేహ్యపానీయములు గూర్చి లెక్కలేక
తృప్తిదీర్పంగవలయునంబదియములేక, మాంసభుక్కని ధర్మంబుమాంసమిడుట.

కం॥ కిరిమహిషచ్ఛాగాదుల, తరసం బుత్తమము దేవికనియుట కెదురన్
గరవాలముల్ దునిమిన, శరీరులకుఁ గలదు ముక్తిసౌఖ్యం బధిపా ! ౮౩

కం॥ మఖమునఁ జేసిన హింసన, మఘకర మసరాదు యజ్ఞమందగుటఁ బరా
విఘసము ముక్తిద మని శా, స్త్రఘనులు వచియింతు రంబికాపూజలలోన్. ౮౪

గీ॥ విశ్వజనని సపర్యల ౹ విశసనమును, జెందు జంతువు లెల్లను ౹ సిద్ధపదము
నొందు సందియ మిందు లేదిందువంశ!, చేయఁదగు నట్టి హింసావిశేష మెఱిఁగి.

గీ॥ అంబికార్చఁ ద్రికోణకుండంబు వలయు, నట్లు గాదేని స్థండిలం ౹ బనువుపఱిచి
హవన మొనరింపవలయుఁ దక్తన్వసములను, నిత్యజయసిద్ధి గోరు మహీశులకును.

శా॥ భేరీడిండిమ ఝర్ఝరీమురజ సద్వీణామృదంగాదినా
నారమ్యధ్వనుల్ దిక్కాలము విధానం బొప్పఁగా బూజలన్
బూరింపందగుఁ గర్త లేల్ భువిని విస్ఫూర్తిన్ రయింపన్ దగున్
గౌరీపూజకు ధర్మ మిట్టిదిసుమీ ౹ కళ్యాణముల్ గోరినన్. ౮౫

మ॥ వసనాలంకరణాన్నభోజనపయఃపానప్రమోదోజ్జ్వల
త్కుసుమస్రిగ్ధ్వసనారకుంకుమముల ౹ గూర్మిన్ గుమారీతతిన్
బసుపుల్ బూయుచు నొక్కరొక్కరిని సంభావించి వేర్వేఱ భ
క్తి సమేతుండయి పూజ్వఁగావలయు నర్థిన్ భోగమోక్షార్థియై. ౮౬

కం॥ దినదిన మేకోత్తరముగఁ, గొని యర్చించుట హితంబు । గొనకొని త్రొమ్మం
డ్రను బూజించుట ముఖ్యము, జననికిఁ గన్యార్చ నర్థ।శాశ్యరహితుఁడై. ౮౩౧

వ॥ మఱియు నొక్క విశేషంబు దెల్పెద గుమారీనామంబున ద్వివర్ష యుఁ ద్రిమూర్తినీ
నామంబునఁ ద్రివర్ష యుఁ గళ్యాణీనామంబునఁ జతుర్వర్ష యు రోహిణీ నామం
బునఁ బంచవర్ష యుఁ గాళికానామంబున షడ్వర్ష యుఁ జండికానామంబున
సప్తవర్ష యు శాంభవీనామంబున నష్టవర్షయు దుర్గానామంబున నవవర్ష యు
సుభద్రానామంబున దశవర్ష యు నగుటంజేసి తత్తన్నామంబులఁ దత్తద్వాస
రంబులఁ బూజించుట పరమహితంబు ప్రథమదినంబున రసజ్ఞానరహిత
యగుటం జేసి చందనాద్యనులేపవిహీనంబుగా భావించుట యుక్తంబు, సుభద్రా
పూజానంతరంబునఁ బూజోపసంహారం బొనర్పవలయు హస్తయందుఁ బూజా
రంభంబును శ్రవణాంతంబున నుద్వాసంబును నెఱింగి చిత్తానక్షత్రం బాదిగా
నవవాసరంబుల నంబికకు యథోక్తపూజఁ గావింపవలయునని చెప్పి మఱియు
నిట్లనియె. ౮౩౨

కం॥ ఈ యీ దినముల మఱవక, యాయా నామముల దేవి । నర్చించుటచే
నాయతి గలుగు న్నరులకు, నీయెడఁ దద్భేదఫలము । లెఱిఁగింతుఁ దగన్.

సీ॥ అరసజ్ఞ బాలిక । యగుట నయ్యర్చనా, భావనావిహితంబు । భక్తులకును
దుఃఖదారిద్ర్య శ।త్రుక్షయాయుర్ధన,వృష్టి కుమారి న।ర్చించుకతన
ధర్మకామంబు ల।ర్థముగల్గును ద్రిమూర్తి,నీ సపర్యలఁగొల్చ।నేని నియతి
ధనధాన్యపుత్రపౌ।త్రవచోజయావనీ,సుఖములు కళ్యాణి । సారిదిఁ బూన్ప

గీ॥ నిష్టసంసిద్ధి రోహిణి । నెలమిఁబూన్ప, శత్రువులఁగొట్టుఁ గాళిక । చండికాంబ
శాశ్వతైశ్వర్య మొసఁగును।శాంభవికిని, బూజసేయంగ మోహన । స్ఫూర్తి గలుగు.

గీ॥ పుత్రపౌత్రాభివృద్ధి యిం।పుగనొనర్చు, దుఃఖదారిద్ర్యము లడంచు।దురములందు
శత్రువిజయం బొసంగును । సౌఖ్యమిచ్చు, సుగతిఁగరుణించు దుర్గార్చ । జగములందు.

ఆ॥ వాంఛితార్థసిద్ధి । వలయునేని సుభద్రఁ, బూన్పవలయు భక్త।పుంగవులకుఁ
దెలిసి వేఱువేఱ । దేవిఁ బూజించిన, నుక్తఫలము లెల్ల । నొగి లభించు. ౮౩౬

వ॥ మఱియు బీజాక్షరముల బాలికాపూజయుఁ గకారాది క్షకారాంతంబులగు వర్ణ
చతుర్థులఁ, గుమారీపూజయు సత్త్వాదిగుణచతుర్థులఁ ద్రికాలవ్యాపిని యగు
త్రిమూర్తినీశక్తిపూజయుఁ, గళ్యాణకారిణీ చతుర్థిని సర్వకామద యగు
కళ్యాణీపూజయు, బీజప్రరోహిణీ చతుర్థిని సర్వభూతేశ్వరి యగు రోహిణీ శక్తి
పూజయు, లయకారిణీ చతుర్థ్యంతంబునఁ గల్పాంతవిహారిణి యగు కాళికాశక్తి

పూజయుఁ, జండికాచండరూప చండముండవినాశినీ చండపాపహారిణీ చతుర్థ్యంతంబులఁ జండికాపూజయు, నకారణసముత్పన్నచతుర్థ్యంతంబున సుఖప్రదాయిని యగు శాంభవీశక్తిపూజయు, సప్తదుర్గార్తినాశినీ సురాసురదుర్జ్ఞేయా చతుర్థ్యంతంబున సుభద్రాపూజయుఁ గాఁ, దేవిని దశవాసరంబులఁ బూజింపుచు వస్త్రాలంకరణ గంధమాల్య హరిద్రా కుంకుమాదు లేకోత్తరప్రకారంబున నైనను, నిత్యనవసంఖ్యాకంబుగా నైనను శక్తుండేని అసంఖ్యాకంబుగా నైనను గన్యకలఁ బూజించుట నవరాత్రంబుల నైహికాముష్మికఫలప్రదం బని చెప్పి మఱియు నిట్లనియె.

సీ॥ కన్నులు లేనట్టి ¶ కన్యయు నొకకన్ను, గల కన్యయును మెల్లకన్ను కన్య
యవయవంబులు లేని ¶ యట్టికన్యయుఁ, గుష్ఠరోగంబు గల కన్య ¶ రూపులేని
కన్య కుర్పులకన్య ¶ కంతులు గల కన్య, యన్యునకును బుట్టినట్టికన్య
యన్యు నంటినకన్య ¶ యతిరోమముల కన్య, రక్తపుష్పాదిసంయుక్తకన్య

గీ॥ చిక్కియున్నట్టికన్యయుఁ ¶ జెడినకన్య, విధవకును బుట్టు కన్యయుఁ బెండ్లికాని
పడఁతి గనినట్టి కన్యయుఁ ¶ గడుపుకన్య, పూజఁ జేయఁగాఁ దగ దెందు ¶ భూవరేణ్య!

కం॥ అందము గలదియు జబ్బుల, నొందనిదియుఁ బుండ్లులేక ¶ యున్నదియును బే
రందినకులమునఁ బుట్టిన, సుందరినిఁ బూజసేయ ¶ శుభ మగు భూపా!. ౨౩౯

గీ॥ ద్విజుఁడు ద్విజకన్యఁ బూజించి ¶ తేజమందు, రాజు ద్విజరాజకన్యలఁ ¶ దేజమందు,
వైశ్యుఁ డందును ద్విజరాజవైశ్యకన్య, లందు ద్విజరాజ వైశ్య శూద్రాంగనలను
శూద్రుఁ డొందును బూజించి ¶ శుభము లెపుడు. ౨౪౦

గీ॥ స్వకులసంభవమై యిచ్ఛవచ్చినటుల, భుక్తి గొనునట్టి కన్యక ¶ భోగవిజయ
సంపదర్థులు పూజింప ¶ సర్వసిద్ధిఁ, గలుగు నవరాత్రముల మహాకాళిఁ గూర్చి.

గీ॥ అనుదినముఁ బూజలకు నసమర్థుఁ డేని, యష్టమీతిథి నర్చించు ¶ టతిశయంబు
యోగినీకోటితో దక్షు ¶ నుక్కడంప, భద్రకాళి జనించె నష్టమినందు. ౨౪౨

ఉ॥ కావున నష్టమీతిథి నఖండతరార్చల దేవదేవినిన్
భావనచేసి పుష్పఫలపత్రరసాదుల భక్ష్యభోజ్యలే
హ్యావళులన్ యథేష్టముగ ¶ నర్చ లొనర్చుచుఁ దృప్తిఁ దేల్చి భూ
మీవిబుధవ్రజంబులకు ¶ మెప్పుగ సత్రము సేయఁగాఁ దగున్. ౨౪౩

కం॥ తొమ్మిది దినముల నుపవాస మ్మొనరించుటకు శక్తి ¶ చాలకయున్నన్
నెమ్మది సప్తమి మొదలుగ, నమ్మూఁడుదినంబులందు నటు సేయఁదగున్. ౨౪౪

సీ॥ ఇమ్మూఁడు దినముల । నేనియుఁ బూజించి, హోమపూజాదుల । నుత్సవముల
విప్రాన్న భోజన।విధులఁ గుమారికా, ర్చనముల శాస్త్రో క్త।సరణి నడచు
కర్తకు ఫలసిద్ధి । కట్టినమూటయే, యగు నాయురారోగ్య।హర్ష విజయ
సంతానధనధాన్య।సంపదల్ చేకూరు, సకలదానవ్రతా।చరణ మలరు
గీ॥ రాజ్యసుఖభోగవిద్యావి।రాగ కీర్తి, నిత్యసౌభాగ్యసంపదల్ । నివ్వటిల్లు
నైహికాముష్మికంబుల । నర్చకునకు, మాఱులేని మహామహి।మంబు గలుగు.

సీ॥ పూర్వజన్మల దేవిఁ । బూజింపలేనట్టి, జనులు దరిద్రులై । సంకటములఁ
బడి రోగులై దుఃఖ।భరితులై శత్రుసం,పీడితులై భవ।భీతు లగుదు
రబలలు వంధ్యలై । యధిపవిహీనలై, యసుఖలై యధనలై । యసుత లగుదు
రనుమానమున నన్వ।యవ్యతిరేకంబు, లారూఢములు శాస్త్ర।క్రమటులఁ దెల్పు
గీ॥ సంపదాపద్ద్వయంబుచే । సంభవించు, భోగులు దరిద్రులను జూచి।భూజనంబు
లటులఁ బల్కుట యొప్పదే।యార్తిహంత్రి, యర్చ సర్వార్థసిద్ధిద।మాట యరుదె.

చ॥ హరియు హరుండు పద్మజు డ।హర్పతి వహ్ని కుబేరుఁ డింద్రుఁడుర్
వరుణుఁడు నాదిగాఁ గలుగు।వారలు చండికఁ బూజసేయఁగాఁ
నరు లను టెంత? గావున న।నారతముర్ సకలైకధాత్రికిర్
సుర లసురుల్ నరుల్ ఫణులు । చొప్పడు భక్తులుగారె భూవరా! ౨౪౭

శా॥ స్వాహాకారముచేత నధ్వరములర్ । స్వర్లోక వాస్తవ్యసం
ఘాహారంబు స్వధాభిధర్ బితరు ల।త్యంతంబు తృప్తుల్ పితృ
వ్యాహారంబు దేవినామములుగా । స్వాహాస్వధాయుగ్మ మీ
యూహాపోహలతోఁ బనే మిఁకఁ ద।దీయుల్ గారె యెవ్వారలుర్. ౨౪౮

కం॥ పుట్టింప నలువ కాపుల్, పెట్టఁగ హరి యణఁప హరుఁడుఁ । బెద్దలు పర చే
పట్టినఁగాదే! జను లిఁక, నెట్టులఁ బూజింప నొల్ల।రీశ్వరి భక్తిర్. ౨౪౯

చ॥ నరు లమరుల్ విహంగములు । నాగములుర్ నగముల్ పిశాచముల్
సురరిపు లాది చేతనులు । చూడఁగఁ దత్కృప శక్తు లౌదు రీ
ధరణిఁ బరావిహీనులు య।థావిధిఁ బూరిఁ గదల్ప శక్తులే
శరణము దేవిగాక భవ।సాగరమగ్నుల కన్య లౌదురే. ౨౫౦

గీ॥ సర్వకామార్థ ఫలదయౌ।జనని యర్చ, తద్వ్రతంబు లొనర్పక । ధరణిలోన
సంసృతిసుఖంబుఁ గోరిన । సంఘటిలునె, వలయునేనియుఁబూజింప।వలయుఁ బరను.

కం॥ గురుతల్పారోహణముఖ, దురితము లొనరించినైనఁ । దొలఁగును భక్తి
స్థిరుఁడై నవరాత్రివ్రత, చరణం బొనరించు నరుఁడు । సత్యం బధిపా. ౨౫౧

సీ॥ కోసలమ్మున నొక్క కోనుటి నివసించు, దీనుఁడై బహుళసంతానుఁడగుచు
నర్థహీనతఁ గుటుంబబాధితుండై క్షుధ, పీడింప నొక పూటఁ బిల్లలకును
దనకు నాకలి భుక్తిదనియంగ లేకున్న, వెఱవక యతిశుక్లవృత్తి దినముఁ
గడపుచు శాంతుఁడై కర్మంబు లెడపక, సత్య మక్రోధంబు క్షమయు ధృతియుఁ

గీ॥ గలిగి విజ్ఞానియై పోష్యగణముఁ బ్రోచి, దేవపితృమానివరులను దృప్తిఁదేల్చి
భుక్తిఁగొని తానుగులములోఁబూజ్యుఁడగుచుఁ, గష్టదరిద్రతఁగాలంబుగడపుచుండ.

కం॥ ఒకతఱి విప్రుఁడు తనయింటికి వచ్చిన మొక్క కోమటి సుశీలుఁడు వాఁ
డకుటిలుఁడై యడిగెను నో,యకలంకమనీష! ప్రశ్న మడిగెద వినుమీ. ౫౧౮

సీ॥ బ్రాహ్మణోత్తమ! దరిద్రతఁ బీడితుండనై, యున్నాఁడ నీలేమి యుడుగు టెట్లు
ధనకామి నగుచుఁ బ్రార్థన సేయుట దలంప, నీకుటుంబముఁ బ్రోవనెదఁ దలంతు
కొడుకులు కూఁతులు కూటికి నేడ్తురు, పట్టెఁడులేదు నాపట్టి పట్టి
యేడ్చుచు తనతండ్రి యింటికిఁ జనె నది, మనసుఁగాల్పఁగఁ జొచ్చెధనములేదు

గీ॥ మనుటకై కోరదును హెచ్చు గొనుట వలదు, పిల్లపదియేండ్లదయ్యెను బెండ్లిలేదు
బ్రతుకు తెరు వెద్దియో స్వామి? పలుకవయ్య, నిర్ధనునిజీవితం బెల్ల నిష్ఫలంబు.

—॰ శ్రీ రా ము ని చ రి త్ర ము ॰—

కం॥ అని యడుగ నాద్విజోత్తముఁ, డనియె సుశీలునకు వైశ్య యఖిలాండేశిన్
దనుపుము నవరాత్రంబులఁ, గనియెద విష్టార్థసిద్ధి కలకాలంబున్. ౫౧౯

సీ॥ వేదోక్తవిధిని దేవీపూజఁ జేయుము, హవనంబు ద్విజభోజనాదికమ్ము
స్తుతిపాఠములును శ్రీసూక్తజపంబును, వేదపారాయణావిష్కరణము
కాలత్రయార్చన కన్యకాపూజయు, నుపవాసములు యథాయోగ్యముగను
జేయుము ధనధాన్యసిద్ధి నీ కయ్యెడు, వ్రతములలో నిట్టి వ్రతము లేదు

గీ॥ జ్ఞాన జయ మోక్ష భాగ్య సంతానవృద్ధి, గలుగును గుటుంబభరణంబె కాదు సర్వ
భువనభరణంబు సేసెదు పూర్వమునను, సతినిఁ గోల్పోయి శ్రీరామచంద్రవిభుఁడు.

కం॥ శుష్కోపవాసియై కడు, దుష్కర మీవ్రతము సల్పెధూర్వహుఁ డగుచున్
గిష్కింధానగరంబునఁ, బుష్కలసంభారవస్తుపూర్తిన్ గనుచున్. ౫౨౦

చ॥ వ్రత మొనరించి వారిధి నవారిత సేతువు గట్టిదాఁటి యు
ద్ధతు దశకంఠునిం దునిమి దైత్యుల నెల్లను రూపడంచి సం
యతుని విభీషణున్ దితిసుతాధిపుఁ జేసి పడంతిఁ గూడి స
మ్మతిగ నయోధ్య యేలె నృపమండనుఁడై వ్రతచర్య వింటివే. ౫౨౧

కం॥ అని బ్రాహ్మణుండు తెల్పిన, విని వైశ్యుఁడు శక్తిఁగొలఁది ఽ విశ్వేశ్వరి నిం
పొనర నవరాత్రములఁ బూ,జనముఁ గావించి కాంచె ఽ శాశ్వతభూతిన్. ౨౬౦

కం॥ నా విని జనమేజయవసు,ధావిభుఁడు ప్రమోదమంది ఽ తాపసవర ! మ
ద్భావము భవదీయవచ,శ్శ్రావణమున ధన్య మగుచు ఽ సంతసమందెన్. ౨౬౧

కం॥ ప్రాసంగికరామకథా, వ్యాసంగము మదిని ననితఽరాశాస్యముగాఁ
జేసెను బ్రాగ్భవతమమున్, బాసెన్ దేవీకథానుఽబద్ధుఁడ నగుటన్. ౨౬౨

శా॥ శ్రీరామక్షితిపాలమౌళి పితృవాఽక్సిద్ధాంతితుండై మహీ
భారం బొల్లక కాననున్ జనుటయున్ ఽ భామామణిన్ బాసి స
ర్వారంభంబులు గూర్చి యీవ్రతము సేఽయన్ సిద్ధి యెట్లయ్యెనో!
కారుణ్యంబున నిక్కథాశ్రవణమున్ ఽ గావించి నన్ దేర్పవే. ౨౬౩

ఆ॥ విన్నకొలఁది మీదు ఽ విమలవాక్యామృత,ధార సుధయుఁ బోలెఁ ఽ దనివి నన
యాసఁ బెనిచెఁ దెలుపుఽమనిన గాంధవతేయుఁ, డానతిచ్చె నయ్యుఽదంత మెల్ల.

సీ॥ శ్రీలు వర్ధిలు రాజఽశేఖరుండై దశ,రథుఁడను నొక మహాఽరాజు గలఁడు
దానధౌరేయుండు ఽ ధర్మమూర్తి ప్రతాప,పరిభూతవిద్వేషఽత్పార్థివుండు
సంతతద్విజసంఘఽసంరక్షణాక్షీణ, ధిషణాధురీణుండు ఽ ధృతిసహాయుఁ
డర్కవంశాబ్ధిశుఽభ్రాంశుఁడై యఱువది, వేలవత్సరములు ఽ విపుల యేలి

గీ॥ జీర్ణుఁడై యనపత్యతాఽశిథిలహృదయుఁ,డగుచుఁ బుత్రేష్టి యొనరించిఽయందుననలుఁ
డంది యిచ్చిన పాయసంఽబంది ప్రీతి, వారు మెసవిరి ముగ్వురుఽవనిత లపుడు. ౨౬౫

కం॥ కౌసల్య రాముఁ గైకే,యీ సరసిజనేత్రి భరతు ఽ నిర్వారను సుమి
త్రాసుదతి కనియె లక్ష్మణు, శాసితరిపురాజనివహు ఽ శత్రుఘ్ను నితోన్.

కం॥ వారలు నలువురు కృతసం,స్కారులు తండ్రికి ముదంబు ఽ కలిగించుచు దు
ర్వారశరాసనశరవి,ద్యారంభధురీణు లగుచు ఽ నలరెడునంతన్. ౨౬౭

సీ॥ కౌశికుఁ డధ్వరఽఘాతుకదితిజుల, దండింపఁగోరియు ఽ దశరథాధి
పతి యొద్ద కరుదెంచి ఽ పార్థివోత్తమ! నీదు, నగ్రినందను రాము ఽ నధ్వరంబు
రక్షింప నిమ్మన్న ఽ రామలక్ష్మణులను, ముని కొసంగిన వెంటఁ ఽ జనెడువేళ
తాటకయను నొక్కఽదైత్యాంగన వధించె, రాముఁడొక్కమ్మున ఽ రయము మెఱయఁ

గీ॥ గనలుచు సుబాహుఁ డరుదేరఽఘనశరమున, వానిఁ దెగటార్చి మారీచఽదానవుండు
పయిఁబడిననొక్క కోలచేఁఽబాఱఁద్రోలి, యధ్వరముగాచిమునితోడఽనతిముదమున.

చ॥ మిథిలకుఁ బోవుచో నడుమ మేదిని శాపము నొంది యశ్మమై
శిథిలత నొందు గౌతమునిచేడియ పాదరజంబునన్ దథా
విధిగ నొనర్చి పూజగొని వేడుకచే మునినాథుఁ గూడి త
త్పథమున మైథిలాధిపునిపట్టణ మల్లనఁజేరి యచ్చటన్. ౮౬౯

మ॥ హరకోదండవిఖండనం బను పణం బర్థించు నబ్భూపతిన్
బరమోత్సాహము నొందఁజేసి తనయన్ బాణిగ్రహం బయ్యె భూ
వరుఁడౌ మైథిలుఁ డంతఁ బ ఙ్క్తిరథు సర్వప్రాభవం బొప్పఁగాఁ
బురి కేతేరగఁ జేసి తద్ధరణిభుక్పుత్త్రత్రియిన్ గూర్చుచున్. ౮౭౦

కం॥ తనకూఁతు రూర్మిళను దన, యనుజుఁ గుశధ్వజుని బిలిచి యతని తనుజలన్
ఘనకచ మాండవి శ్రుతకీ, ర్తిని మువ్వుర ముగుర కిచ్చెఁ దేజోయుతుఁడై. ౮౭౧

సీ॥ శ్రీరామచంద్రుండు సీతామహాదేవి, లక్ష్మణుండును నూర్మిళాలతాంగి
భరతుండు మాండవీభామాశిరోమణి, శ్రుతకీర్తి శత్రుఘ్నుఁ డతివలుగను
బాణిగ్రహ మొనర్పఁ బఙ్క్తిరథుండు సోల్లాసియై పురము వెల్వడి నిజేచ్ఛఁ
గొడుకులఁ గోడండ్రఁ గూడి యయోధ్యకు, నరిగి శ్రీరామునం దవనిభార

గీ॥ మునుప యత్నంబు సేయుటవినుచుఁగైక, యాత్మరమణుండు తనకిచ్చినట్టివరయు
గంబు ప్రార్థింప నట్టులే గాకయనినఁ, బలికెఁ గైకేయి విభునితోఁ బాపబుద్ధి.

కం॥ భరతునకు రాజ్యమిచ్చుట, వరుసన్ శ్రీరాము విపినవాసంబునకున్
బరువడిగఁ బంపుటయు నని, తరుణి నుడువ ఖిన్నుఁడగుచు దశరథుఁ డంతన్.

చ॥ హితమతి నెంతఁజెప్పిన నొకింతయు వీనులఁ బెట్టకున్న నా
సతిమతి తా నెఱింగి క్షితిజాసహితుండయి లక్ష్మణున్ సమా
హితమతిఁ దోడుఁజేసికొని యేగె వనమ్మున కప్డు రాముఁడు
ద్ధ్యత దితిసంతతిప్రచురదర్పవినాశనకేళిలోలుఁడై. ౮౭౪

ఆ॥ మౌనిశాపవశత మానవనాథుండు, దశరథుండు శోకదళితుఁ డగుచు
సుత వియోగవహ్ని సుడివడియును బుణ్య,వశత దివ్యలోకవాసియయ్యె.

చ॥ భరతుఁడు మాతృహేతుకృతపైతృకసంస్థఁ దలంచి మేదినీ
భర మెద రోసి మౌనియయి పట్టణమున్ విడి యన్న రాక కై
విరతి వసించెఁ బంచవటి వీరత రాముఁడు సంచరించుచున్
స్మరవశయైన శూర్పణఖఁ జయ్యనఁబట్టి విరూపఁ జేసినన్. ౮౭౬

ఆ॥ ఛిన్ననాసయైన చెల్లెలిఁగాంచి ఖ,రాసురుండు కనలి యాహవమున
కేగుదేర వాని నేడెలఁ దునుమాడి, త్రిశిరు దూషణునిని దీర్చివైవ. ౮౭౭

సీ॥ అచ్చట నివసించు నఖిలతాపసజనుల్ విచ్చేసి రాము దీవించుకొనుచు
ముదము గూర్పఁగ రాజసముఖ్యులు స్వేచ్ఛావిహారులై వర్తించు నవసరమున
నేడ్చుచు లంకకునేగి ఖరాదుల, మృతిఁజెప్పి రాము నప్రమేయ శక్తి
వినిపింప శూర్పణఖను గొంత యోదార్చి మారీచు నయ్యాశ్రమమునకేగి

గీ॥ చెల్మి రావణుఁ డిక్కథఁ జెప్పి వాని, హేమమృగరూపిగాఁజేసి యినకులేశు
చేడె సీతను మోహింపఁజేయు మనుచుఁ, బంప వాఁడరుదెంచెను బంచవటికి.

—• శ్రీరాముఁడు మాయలేడిని వెంబడించుట •—

ఆ॥ దానిఁజూచి మోహతత్పరయై సీత, దైవవశమువలనఁ దద్దబ్రమసి
పట్టితెమ్మనుచును బతికిఁదెల్పిన విల్లు, పట్టి రాఘవుండు పట్టఁదలఁచి. ౮౭౯

శా॥ కార్యాలోచన మాత్మనెంచక వృథాకర్మానురోధంబునన్
శౌర్యోద్దీపితుఁడౌట వెంటఁబడి యాసారంగమున్ బట్టఁగా
ధైర్యోత్సాహము లిన్మడింపఁ బరువెత్తన్ జొచ్చినన్ లేడియున్
ధైర్యస్థైర్యము లాసఁగొల్పుచు వనీసంచారముల్ సేయుచున్. ౮౮౦

ఆ॥ కొంతదూరమరిగి కుంజపుంజంబుల, మఱుఁగుఁజొచ్చి యంతమాయమగుచు
గానఁబడుచు నిట్లు కాననంబునఁ జాల, వెతలఁబెట్ట రామవిభుఁడు విసిగి. ౮౮౧

మ॥ అతితీవ్రంబగు బాణమెక్కిడి ధనుర్జ్యాటంకృతిన్ జేసి యు
ద్ధతి నయ్యేణము నేయ భూమిఁబడుచో హా! లక్ష్మణా! యంచు నా
ర్తత ఘోరధ్వని సేయ జానకియుఁ దద్ధ్వానంబు వీనుల్ సోరన్
మతిలో బెగ్గిలి లక్ష్మణున్ గని యసన్మాన్య ప్రలాపంబులన్. ౮౮౨

శా॥ అన్నా! లక్ష్మణ! వింటివే! పలుకు మీయార్తధ్వనిన్ బోలు నీ
కన్నన్ దోడగు వారలెవ్వ రకటా! కాంతార సీమన్ భయా
పన్నుండై దితిజావళుల్ పొదివినన్ బక్షంబు లేమిన్ మదిన్
విన్నన్ బోయెను దైవయోగ మెటు లావిర్భూత మానో కదే!. ౮౮౩

క॥ వైరముఁ దలఁచుచును మహా, వీరులు మాయావు లెందు వెడలుదురు నిశా
చారుల్ వారల వలనను, గ్రూరత మెందే గలుగు నొకో కనుగొనుమా. ౮౮౪

చ॥ తడయఁగ రాదు వేగఁజని తత్కుశలం బరయంగఁ బోలు నా
వెడవెడ నూర్పు పుచ్చుచును వెంగలి భ్రాంతి జనింప నేల? యీ
యెడ నిలువంగ నాజ్ఞయిడి యేగినవాఁ డవనీవిభుండు ని
న్నడవిని నొంటిగా నిలిపి యచ్చటి కేగుట పాడియౌనొకో. ౮౮౫

## —• సీత లక్ష్మణుని నిందించుట •—

సీ॥ కృతవైరులై మమ్ముఁ గీడు నొందింపఁగాఁ, దలఁచి యీవనిలోన దైత్యవరులు
కనిపెట్టియున్నారు గావున నిన్నొంటి, విడువంగఁజాల నీయెడల మదిని
విడువు మధైర్యంబు విల్లు చేనుండిన, దేవాసురులకైన దెలియరాని
యమ్మహావీరుని నల్పునిఁగా నెంచి, పల్కెదే తల్లి! యీ పలుకు మాను

గీ॥ మన్నఁ బలు కాలకింపక యవలఁ జనుట, నాపదల కెల్ల మూలంబ యగును నాదు
మనవి నాలించి యూఱడు మమ్మ నీవు, సందియం బేటి కన్న నా సాధ్వి పలికె.

ఉ॥ నాయెడ నిక్కువంబు మది నాటినయట్టులఁ దోఁచెఁ గానలో
నీయెడ నిట్టి కీడతని కేవిధినైన ఘటించెనేని నీ
వా యతివన్ బలాత్కృతిని నర్థిమెయిన్ గొని తెమ్మటన్న భూ
నాయకుఁడైన యబ్భరతు నర్మసఖత్వముచేత వచ్చితో. ౮౮౭

కం॥ స్వైరవిహారిణినై యిటు, లాఱడిఁ బోఁదలఁతునొక్కొ యధిపుఁడు మృతుఁడై
యేరహిఁ బోయిన నిను నేఁ, గోరుదునే కామచర్యఁ గొని పాపాత్మా! ౮౮౮

ఉ॥ వల్లభుఁ డిందు రాక వనవాటికఁ గాలము నొందెనేని రా
ట్వల్లభుఁడైన మద్విభుని డగ్గఱి జీవితమున్ త్యజింతుఁగా
కుల్లముఁ జల్లనై బ్రతికియుండుదునే? యటుగానఁ గానలో
నెల్లెడ నాథునిన్ వెదకు మిష్టమ యేని యెఱుంగఁ దెల్పితిన్! ౮౮౯

ఆ॥ ఏకగర్భజనితు లిరువురు సౌహార్ద, మెందుఁ జనియె నన్న కింత కీడుఁ
దొరలఁ జూచుచుండఁ దోఁచెనే నీమది, గాంక్షితంబుగాదు గాదటనిన. ౮౯౦

సీ॥ అతికఠోరంబైన యమ్మాట సౌమిత్రి, విని దీనుఁడై కంట వెడలు నశ్రు
కణములను నఖముఖమ్ముల మీటుచుఁ, దల్లి! నీ విటువంటి దారుణంపుఁ
బలుకు విధికతానఁ బలికితేమో? మహా, మహునకుఁ గీడను మాట గలదె?
వాగ్బాణమున మేను వ్రయ్యఁజేసితి వింక, నెడలెద శ్రీరాము వెదకికొనుచుఁ

గీ॥ బాప మిసుమంత లేదు నీపాదమాన, పోయివచ్చెద నని మహాభుజుఁడు లేచి
యగ్రజునిపాదవిన్యాస మరసికొనుచు, శోకపరవశుఁడై పోవఁజొచ్చె వనికి.

ఉ॥ అంతట రావణుండు పరమాద్భుతభిక్షుకవేష మూని సీ
తాంతికసీమఁ జేరఁగని యయ్యరవిందదళాక్షి యర్ఘ్య మ
త్యంతముదంబుతోఁ దనకు నర్పెడ భైక్ష మొసంగఁజూచి యో
యింతి! యొసంగు మంచుఁ గొని యిట్లనియెన్ మృదులస్వరంబునన్. ౮౯౧

ఉ॥ ఎవ్వనికూఁతు రీవు? కమల§లేక్షణ? యెవ్వనియింతి వైతి ? వీ
వివ్వనసీమ నొంటిని జరింపఁగ నేమికతంబు ? ధీరుఁడై
జవ్వని నొంటిగా నిలిపి § సంచరణక్షముఁడైన పామరుం
డెవ్వఁడు? దేవకన్యలకు § నీడగు నీ విటు లుండనేటికిన్? ౭౯౩

కం॥ అని యద్దురాత్మ్కుఁ డాడిన, విని రావణు దేవమాని§విభునిగ మదిలోఁ
గని జానకి తన వృత్తము, వినయోత్సాహములు వెల్లి§వెడలఁగఁ బలికెన్. ౭౯౪

సీ॥ దశరథుండను రాజ§తల్లజునకు నాత్మ,సంభవుల్ నలువురు సమరసాహ
సాంకులు వారిలో § నగ్రజుం డగు రాము, నతివను నేను § బితాజ్ఞవలనఁ
గై కేయికొఱకు నిర్వాసితుండై చతు,ర్దశ వత్సరములు కాం§తారవాస
మునకు నై లక్ష్మణుం§డను కనీయునితోడఁ, జనుదెంచె జనకుని§తనుజ నేను
గీ॥ హరధనుర్భంగ మొనరించి§ పరిణయించె, నన్ను నారాముదోర్బలా§భ్యున్నతిని వ
సించియుంటిమి యిక్కాన § నేమమునను, దాపసోత్తమ విను మింక§దత్పరతను.

ఉ॥ హాటకశంబరం బొకటి § యక్షి ఫలంబుగ నిందు వచ్చినన్
గాటపుఁగూర్మిదొట్టి విభు § గట్టిగఁ బట్టుకరమ్మనన్ నిరా
ఘాటధనుర్ధరుం డగుచుఁ § గానల కేగినయంతలోన న
చ్చోట దురుక్తి వీనులకుఁ § గూడిన లక్ష్మణు నంపితిన్ వెసన్. ౭౯౬

కం॥ వారిరువుర భుజబలమున, ఘోరారణ్యముల భయము § గొనక వసింతుర్
మీరు మహాత్ములు మా కాం,తారనివాసంబు వినఁగఁ § దగువారుకదా. ౭౯౭

ఉ॥ వింటిరి మాయుదంత మిఁక § వీనులు చల్లఁగఁ జెప్పుఁ డింక మా
యింటికి వచ్చుటేమిపని § యింపగురూపము మేల్మిప్రాయమున్
దంటగ మీ యెడన్ గలుగుఁ § దథ్యము కానల సన్న్యసించి మీ
రొంటిగ సంచరించుటకు § యోజన సేయుటి దేమి హేతువో ? ౭౯౮

గీ॥ సత్యముగఁ జెప్పుఁడీమాట § సన్నిధికిని,రాముఁ డిప్పుడె యరుదెంచు § రక్తిదొట్టి
మీకు నర్చన గావించు § మిగుల సంత,సించునని పల్కి రావణుం § డింతి కనియె.

సీ॥ లంకాధిపుఁడ నేను § లలన మండోదరీ,ప్రాణవల్లభుఁడను § రావణుండ
నినుఁ గోరి యింతచ§క్క నిరూపు దాల్చితి, నాచెల్లెలగు శూర్ప§ణఖ వచింప
వింటిని సురలోక§కంటకుల్ ఖరదూష,ణుల వధించెను నీదు § చెలువుఁ డనుచు
భ్రష్టరాజ్యుండైన § పతి నేల వలచితి, వనవాసమున సిరి§వదలి బలముఁ
గీ॥ జెడినవాఁడయ్యె నాతని § విడిచి నన్నుఁ, జేకొనుము పట్టి రాజ్ఞివై § చెలఁగుదీవు
ఏను దాసుండ నగుదు నీ § వేలికొనుము, నాదు మందోదరీముఖ్య§నాయికలను.

కం॥ లోకత్రయంబు నేలితిఁ, బాకారిప్రముఖదేవశ్రేష్ఠు లనెల్లన్
జీకాకుఁ జేసినాఁడను, గైకొనుమీ పడుదుఁ బాదకమలములందున్. ౯౦౧

మ॥ ననుఁ జేపట్టి సనాథుఁ జేయుము మహానందంబునన్ దొల్లి నీ
జనకున్ వేఁడితి నిన్ను నిమ్మని పణచ్ఛద్మంబుచే నీక త
క్కెను ఘోరంబగు రుద్రచాపమును సంకేతించుచున్ రాక ని
ల్చినవాఁడన్ మది నీయెడన్ గలదు నిశ్చింతన్ ననున్ దేర్పుమీ. ౯౦౨

చ॥ వనమున నొంటిగా నిలిచి వర్తిలుచుంటివిగాన బూర్వసం
జనితమనోనురాగమున సారసగంధి! మనోజబాణవే
దన శమియింపఁజాలక పదమ్ములు పట్టితి నాదువాంఛితం
బును సఫలమ్ముఁ జేయుమని మ్రొక్కుచు రావణుఁ డిట్లు పల్కినన్. ౯౦౩

ఉ॥ అప్పలు కాలకించి జనకాత్మజ సాధ్వసవిహ్వలాంగియై
నిప్పులువోలె వీనులకు నిండుపొగల్ వెడచల్లఁ గంటికిన్
తెప్పలువోలెఁ గాచు ధరణీపతు లన్నయుఁ దమ్ముఁడున్ వనిన్
దప్పుడుదారివల్ల బడి వెతన్ దనయొద్దకు రాకయుండుటన్. ౯౦౪

చ॥ వడఁకుచు నేమిదోఁచక దైవం బలమున్ హరిణంబువోలె జే
డ్పడి యొక కొంత సేపునకు భావము సుస్థితిఁ గొల్ప నయ్యయో!
వెడవిలుకానికిన్ జెదరి వీటఁడియున్ బలె దుష్టవాక్యముల్
వడివడి నిట్లు పల్కుటకుఁ బాడియె స్వైరిణిఁ గాఁగఁ జూచితే. ౯౦౫

చ॥ జనకధరాధినాథునకు సంభవ మొందితి భానువంశతో
యనిధి శశాంకుఁడౌ దశరథాధిపు కోడలనైతి రామచం
ద్రునికర మూనితిన్ గుటిలధూర్తవచోవిహృతిన్ గలంతువే?
నను, మరణంబు సత్యమని నమ్ముము, రాము నెఱుంగవో కదే! ౯౦౬

ఆ॥ నన్నుఁ గూర్చి మృతిసనాథుండవైతివి, చటులదోర్బలాతిశాయి రాముఁ
డతఁడు విల్లు పట్ట హరిహరాదులకైన, నలవిగాదు కాతు మనఁగ మనఁగ.

కం॥ అని పర్ణశాలలోనికిఁ, జని యనలాభ్యర్ణమున నసనద్వాదివి నిన్
గనరాదు పొమ్మపొమ్మని, యనియెన్ రావణుని రణజిత్వరైరావణునిన్. ౯౦౭

— రావణుఁడు సీతను లంకకు దీసికొని పోవుట. —

శా॥ వైదేహీకథితోక్తులన్ విని దురాపక్రోధతామ్రాక్షుఁడై
పాదన్యాసమునన్ ధరిత్రి గదలన్ బాహాబలోద్రేకియై
రోదోరంధ్రము నావరించు భయకృద్రూపంబునన్ నిల్చి య
మ్మేదిన్యాత్మభవన్ బలాత్కృతిని రమ్మా! యంచుఁ బల్కెన్ వెసన్. ౯౦౮

గీ॥ రామ! రామ! రామ! యను నార్తరామసీత!, భయముచే విహ్వలాంగియై వణఁకుచుండ
వెంటనంటి బలాత్కృతి విడువ కంత, నీడ్చి యరదంబుపై నిడి యెగసి చనియె.

ఉ॥ అంబరచారియై యరుగు నప్పు డనూరుసుతుండు విక్రమా
త్యంబరరత్నమై తగు జటాయువు దారిని నడ్డగించి వా
నిం బటుతుండఘాతముల నేర్పున గ్రుచ్చిన రావణుండు ఘో
రాంబకకోటిఁ గూల్చి చనె నాసురవల్లభుఁ డంత లంకకున్ ౯౧౧

గీ॥ పిల్లి పట్టిన గోరువంక పిట్టఁ బోలె, జానకి నశోకవని నిశాచరవధూటు
లావరింపంగ నిలిపి సామాద్యుపాయ, పశ్యగాకున్న విసివి రావణుఁడు వదలె.

సీ॥ ఇచ్చట శ్రీరాముఁ డేణంబును వధించి, పర్ణశాలకుఁ జేరవచ్చునపుడు
నడుమ లక్ష్మణుఁ జూచి విడిచివచ్చితె సీత, నేకాకినిగ వని నెట్టు లుండు
నేల చేసితి విట్టి హేయంపుఁబని యన్న, నన్నతో లక్ష్మణుం డనియె ఘోర
నిస్వనం బాలించి నే వచ్చితి నటన్న, నెఱుఁగవే నా శౌర్య మేల వచ్చి

గీ॥ తనిన సీతావచశ్శరాహతిని నొగిలి, దైవయోగంబుచే నిట్టు వదలఁ జినాఁడ
ననుచు నిరువురు వేదన లందికంది, జానకీహీన యగు పర్ణశాలఁ గనిరి. ౯౧౩

ఉ॥ చూచి ఝుళంఝుళద్గళదసూక్ష్మపయఃకణ నేత్రగోళులై
గోచరజంతుకోటులను గోమలిఁ జూడరె యంచు వేడుచున్
సూచితసంశయస్థలులఁ జూచుచు నచ్చటఁ గూలియున్న విం
ధ్యాచలతుల్యకాయుని జటాయునిఁ గాంచిరి రామలక్ష్మణుల్. ౯౧౪

గీ॥ పక్షహతిఁ గూలి పడియున్న పతగవిభుని, వలన రావణహృతయయ్యె వనిత యనుచు
గొంతవడి వానితోఁ బోరి కూలినాఁడ, ననుచు విని రంత విహగంబు చనియె దివికి.

మ॥ ఖగనాథున్ దహియించి శాస్త్రవిధి సంస్కారంబు గావించి య
జ్జగదేకస్పృహణీయవిక్రములు బాష్పప్రోచ్చలన్నేత్రులై
మగువన్ గానక యెల్లెడన్ వెదకుచున్ మార్గంబునన్ బోవుచో
నగసంకాశుఁ గబంధుఁ గాంచిరి మహారోద్యద్భుజాగర్వాంధునిన్. ౯౧౫

గీ॥ వానిచే మీకు సుగ్రీవవానరాధి, నాథసఖ్యంబువలన సనాథవృత్తిఁ
గార్యసంసిద్ధి యగు నను ఘనముదమ్ము, గాంచి సుగ్రీవుతో సఖ్యకలన నెఱపి.

ఉ॥ వాలి వధించి తత్పురము వారక తమ్మని కిచ్చి వానితోఁ
జాలిన నెయ్యమున్ గొనుచు శ్రావణభాద్రపదంబు లచ్చటన్
గాలముఁ బుచ్చి భూమిజను గర్కశుఁడౌ దశకంఠుఁ డర్ణవా
భీలకృతాంతరూపమున బిట్టుగఁ బట్టుట కాత్మ గుందుచున్. ౯౧౬

సీ॥ తమ్ముఁడా! మన కెంత దైవమ్ము దయదప్పె, సీతావియోగాగ్నిచే మనమ్ము
దహియించెఁ గేకయతనయ సంపూర్ణ మనోరథ యయ్యె మనోవిషాద
మెసఁగెడు భూమిజ యెచ్చోట నుండెనో, సీతను విడిచి మజ్జీవనంబు
వ్యర్థం బయోధ్యకు వత్తునే? రాజ్యంబు, విడిచితి నడవిలోఁ బడితిఁ దండ్రి
గీ॥ మృతినిబొందెను రావణుండతివఁగొనియె, నింతయును దైవయోగంబెయింక నేను
సేయనున్నదొ? తెలియంగఁజేతనులకు, వశముగా దని పలుకు సద్వార్త వినమె.

మ॥ మనువంశంబునఁ బుట్టినారము జగన్మాన్యుండు ముత్తాత యి
ట్లనిశమ్ముం విడరానిదుఃఖమున నాయాసంబులం జెందుటల్
మన పూర్వార్జిత మాఁగదా! సకల సన్మానంబులం బాసి నీ
వును నాకై కడు దుఃఖముం బడితి దేవుం డిట్లు చేసెం గదా. ౯౨౦

కం॥ మన వంశంబునఁ బుట్టిన, జనులం దీపోల్కి దుఃఖజలధి మునుఁగు వా
రనుమాట వినుట యెఱుఁగము, వనంటం బొగిలితిని గడవ వల నెయ్యదియో?

చ॥ తలఁగని దుఃఖసాగరము దాఁటు నుపాయము గానరాదు దు
ర్బలుఁడ సహాయహీనుఁడను ద్రవ్యము లేదొక నీవె తోడుగాఁ
గలుషము నన్ను ముంచెఁ గొఱగామిఁ దలంచి కలంతు నెవ్వరిం
దొలఁగెను భోగవాంఛ; కడు దుస్తరమయ్యె విషాదవేదనల్. ౯౨౧

వ॥ మఱియు బాలభావంబున వైదేహి మనతో వర్తించుచున్నదై దుష్టంబగు దైవ
వశంబువలనఁ గష్టతరంబగు దశం జెంది భీకరుండగు దశాననునిచే బందీకృతయై
యెంత విలపించుచున్నదియో? నాయం దత్యంతానురక్తయుఁ బతివ్రతయునగు
నవ్వరారోహ స్వైరిణిగా నేరదు, తలంచినఁ బ్రాణధారణంబు దుస్సహంబని తోఁచు
చున్నయది, రావణునకు వశీకృతయగుట దోఁచదు, మృతయగు నేని నేను జీవింపఁ
గలవాఁడఁగానుజుమీ, భువనసుందరి యగు నబ్భూమిజ లభించుట జన్మాంతర
సుకృతంబుగదా? యట్టి యానందంబునకుఁ బాత్రుండ నగుదునే! యని బహు
విధంబుల విలపించు నన్నం గనుంగొని లక్ష్మణుం డూఱడించుచు నిట్లనియె.

—। లక్ష్మణుఁడు రామునికి దుఃఖోపశమనము చేయుట ।—

ఉ॥ తెచ్చెద భూమిజం దితిజుఁ ద్రెళ్ళఁగఁజేసెద సమ్మదమ్ము నీ
కిచ్చెదఁ గాతరుండవయి యిట్టులు ధైర్యము దూలియున్న నిం
మెచ్చుదురే? మహాత్ములు; సమీహితబుద్ధులు కీడునందు న
భ్యుచ్చయమందుఁదుల్యులయి యుందురుగాదె ? తలంచి చూడుమీ. ౯౨౨

ఆ॥ అల్పబుద్ధులయిన ఽ యట్టివా రాపద,లందు వివశు లగుదు ఽ రధికశుభము
లొంద నేని హర్షమంది యుబ్బుదురు నీ,వంటి దంట కిదియు ఽ భావ్యమగునె. -౨౫

కం॥ యోగము ఘటియించినను వి,యోగము సంధిల్లినను సమోదయములుగా
భాగింప దైవమేకద?, యీగతి శోకింప దేహి ఽ కేటికిఁ గనుమీ. -౨౬

గీ॥ రాజ్యవిభ్రంశమును మహారణ్యవాస, మంగనాహాని యాపదలయందుఁ గలిగె
రాజ్యసంప్రాప్తి వనవాసరహితవృత్తి, కామినీలాభ మట్టులు ఽ గాకయున్నె.

మ॥ మును దాఁ జేసిన పుణ్యపాపములకున్ ఽ భోగంబు నిర్వర్తకం
బని పెద్దల్ వచియింప విందుమకదా ఽ యన్యర్థి తీరునే?
మనమిట్లాఅడిఁబోతిమంచు వగవన్ ఽ బాల్పడ్డఁ బోనేర్చునే
మన మూరార్పుము శోకమున్ విడుము సన్మానింపు మ ద్వాక్యముల్. -౨౭

ఉ॥ వానరకోటులన్ బనిచి ఽ వారిధిముద్రితభూతధాత్రిలోఁ
గానలు కోనలున్ నదులు ఽ గట్టులు చెట్టులుగూడ నెల్లెడన్
జానకిజాడఁ దెచ్చుటకుఁ ఽ జాలినవాఁడు దివాకరాత్మజుం
డౌ నికఁ జింతనొంద మన ఽ కర్హముగాదు తలంచిచూడుమా? -౨౮

ఉ॥ పోయెద మెల్లచోటులకు ఽ భూర్భువరాదుల నెందు డాగినన్
వే యన నేల? పట్టుకొని ఽ విక్రమధుర్యత దైత్యుఁగూల్చి యిం
దాయతనేత్రిఁ దెచ్చెద మహార్నిశమున్ మదిలోన నెయ్యెడన్
బాయని చింతనొందుటకుఁ ఽ బాడియె భానుకులేంద్ర! తెల్పుమా. -30

కం॥ పరభేదక సేనలతో, భరతుని శత్రుఘ్నుతోడఁ ఽ బంపించెద నీ
సరసీరుహాక్షిఁ దెచ్చెదఁ, బరిపంథినిఁబట్టి యిపుడె ఽ బంధింతు వడిన్. -3౧

చ॥ అరదము నెక్కి భూభువనమంతయు సర్వసమంబుగా ద్వీప
ధ్ధరణిపకోటిఁగూల్చి నృపతల్లజుఁడై ధర యేలినట్టి భూ
వరుఁడు రఘుండు తజ్జననవార్నిధిచంద్రుఁడ వీవు వట్టి దు
స్తరతరచింతనొంది మదిధైర్యముఁ దూలిన ధర్మ మందురే. -3౨

ఉ॥ ఏ నొకరుండ విల్గొనిన ఽ నిజ్జగమెల్లను దల్లడింప నీ
యాన సురాసురాదుల సహాయము లేకయె గెల్తునిట్టినే
నీ నవఖండమండితమహీతల మెల్లను నావరించి స్వ
ర్భానుని శార్ఙ్గివోలెఁ బరిపంథిని వ్రచ్చెద సీతఁ దెచ్చెదన్. -33

చ॥ జనకమహీపతిన్ గలసి సర్వచరాచర భూతధాత్రిలో
జనకసుతాపహారియగు జాల్మునిఁ బట్టెద మత్పరాక్రమం
బను ననలంబునన్ మిడుత యట్టులఁ జేసెద భస్మసాత్కృతిన్
జొనుపకు మంతరంగమును శోకపురాతనకూపగర్తమున్. ౯౩౪

గీ॥ పుడమి సుఖమేగదుఃఖంబుఁ బొడముదుఃఖ, మరుగ సుఖమబ్బు వీనియన్యోన్యవృత్తి
చక్రనేమిక్రమంబున జరుగుఁగాదె, నీకుఁ దెలియని యర్థంబె నేను దెలుప.

ఉ॥ ఎవ్వని మానసంబు సుఖమెక్కిన సమ్మదమంది యుబ్బునో?
యెవ్వని మానసంబు సుఖమింకినఁ జింతలచేఁ దలంకునో?
నవ్వరె వానిఁజూచిన జనంబులు; వానికి సౌఖ్య మున్నదే?
యివ్వసుధాతలంబునెడ నేయదియున్ సతమానె యేరికిన్. ౯౩౬

సీ॥ నహుషుండు తొల్లి స్వర్నాయకుండౌ నంత, శక్రుండు దుఃఖించి సరసిలోనఁ
గమలనాళములోనఁ గాలమ్ము గడపుచు, నజ్ఞాతవాసియై యడరఁడొక్కొ?
యింద్రాణిఁ గామించు నెడ నగస్త్యుఁడు దిట్ట, నహుషుండు భువిఁబడ్డ నాకవిభుఁడు
స్వస్థానవాసియై సామ్రాజ్యమేలఁడో?, కావున నాపదల్ గడవ వొక్కొ
గీ॥ ప్రాకృతునిఁబోలె నీవిట్లు శోకిలంగఁ, దగదు సర్వజ్ఞుఁడవు రణోత్సాహి వాత్మ
వేదివిదలంచియుడుగుము వెతలుసతము, లనుటగలుగునె? యెచ్చోటననుచుఁబలుక.

—• శ్రీరామునకు నారదుఁడు నిజవృత్తాంతము బోధించుట •—

కం॥ ఇత్తెఱఁగునఁ దమ్ముఁడు ధృతి, హత్తించినఁ దేటి రాఘవాధీశుఁడు లోఁ
జొత్తిలు శోకం బుడుగుచు, నత్తఱి ననుజుండుఁ దాను నాస్థఁ గనంగన్. ౯౩౭

కం॥ వీణాధ్వానం బాశా, కోణంబులఁ గప్ప సామఘోషము లోక
ప్రీణనమై వెలయఁగ గీ,ర్వాణమునీంద్రుండు వచ్చె వారిన్ గనఁగన్. ౯౩౮

సీ॥ పరమహర్షముతోడఁ బఱతెంచు నారద, మౌనీంద్రుఁగని మ్రొక్కి మనుజవిభుఁడు
ఆసనం బిడి పాద్య మర్ఘ్య మర్పించుచుఁ, బూజించి ఫలము లింపుగనొసంగి!
చేతులు జోడించి చేరువ నివసించు, శోకమగ్నుని రాముఁజూచి పలికెఁ
బ్రాకృతుపోలిక శోకాగ్ని గ్రుంగెదు, దుష్టుఁడౌ దశకంఠు కష్టదశకె
గీ॥ సీత యపహృతయని సురశ్రేణి పలుక, శక్రుసన్నిధి వింటి నాశ్చర్య మేల?
నీవు భువిని జనించుట నిక్కువముగ, రావణవధార్థమే కదా రామచంద్ర!

ఉ॥ సీతను రావణుండు తన సేగికె చేకొనిపోయె నిక్కమ
క్కాతరనేత్ర తొల్లి మునికన్య తపస్వినియై వనంబునం

దాతత నిష్ఠచే దప మహర్ని శముర్ సలుపంగ రావణుం
డాతటిఁగాంచి మన్మథ శరార్దితుఁడై తమి యోర్వఁజాలమిన్. ౧౪౧

శా॥ నాకున్ జేరియసి నీవు గమ్మనుచు నన్నాళీకపత్రాక్షి న
స్తోక ప్రేమఁ గరమ్ము వట్టినను దద్దుష్టాసురస్పర్శఁ జీ
కాకై దేహము వీడఁగాఁ దలఁచి యాకంజాక్షి యో దుర్మతీ!
నీకై పుట్టుట నీ వెఱుంగవొకొ? హానింగాంతు వీ దుష్కృతిన్. ౧౪౩

గీ॥ అనుచును శపించెఁ గాన నయ్యంశ వసుధ, సీతయై పుట్టె నది సురరక్షమకరము
రావణుఁడు పొంచి రాముని రామఁగొనుట, కట్టిచెడుగున నని వింటి నమరపురిని.

మ॥ సుర సంప్రార్థితుఁడైన శార్ఙ్గివి సురస్తోమంబు రక్షింప నీ
ధర జన్మించితి దైర్యమొందుము సుఖస్వాస్థ్యంబుచే లంకలో
ధరణీనందన యున్న దాత్మ నిను సంధానించి రేయున్ బవల్
విరతిన్ ధర్మసహాయయై కలుగు నిర్విఘ్నంబు సేమం బికన్. ౧౪౪

కం॥ నీ విలలోఁ బుట్టుటయును, నా వెలఁదియు ధరణి కిట్టు లరుదెంచుటయున్
రావణ సంహృతికొఱకై, కావలసిన యర్థమాట గతి యిట్లయ్యెన్. ౧౪౫

మ॥ సురభిక్షీరము లేదిన మ్మెలమిమై శోధించి శకుంతు తా
సరహాస్యంబుగ సీతకున్ బనుపు నిచ్చల్ దాని ప్రాణేశ్వరుం
డరుదెంచున్ దితిజాధమున్ దునుముఁ గుయ్యాలించి నన్ దేర్చు నం
చరవిందాక్షి వసించియున్నయది లంకారామ మధ్యంబునన్. ౧౪౬

ఆ॥ ఏను జూచినాఁడ నిందీవరదళాక్షి, కుశల సుమ్ము దైత్యుఁగూల్చి బోటిఁ
జేకొనంగ మరుదజేయుండు రావణుం, డతనిఁ గెలువ విను మపాయ మనఘ!

కం॥ నవరాత్రివ్రతసుమహో, త్సవమును బొనరింపు దేవి సర్వేశ్వరి నీ
కవహిత మై సాహాయ్య, ప్రవణత మదినెంచి విజయఫల మిచ్చు నృపా! ౧౪౭

సీ॥ చతురధికాశీతి జాతిగర్భంబులఁ, బుట్టెనేమి తనంత గిట్టెనేమి
జన్మజన్మమునందు జాతీయవర్తనల్, నడచెనేమి తనంత విడిచెనేమి
విప్రజన్మములందు వేదోక్తభావముల్, చేసెనేమి తనంతఁ బాసెనేమి
వేదాంతియై యాత్మ విద్యారహస్యముల్, తెలిసెనేమి తనంత నలసె నేమి.

గీ॥ యెన్నిపోకలఁ బోయిన నీశ్వరేశ్వ, రీ చిదానందమగ్నసంప్రీతి నొంది
చిత్తవిశ్రాంతిఁ గనకున్న సిద్ధిగలదె, యైహికాముష్మికంబుల నజునికైన.

ఆ॥ భూప! సృష్టికెల్లఁ బూర్వంబు పురుషుని,గూడి విహృతి సల్పు గుణములకును
నందరాని తత్త్వ మద్దేవి సగుణమై, చేయు లోకసృష్టి చిత్రముగ. ౯౦

సీ॥ తొలుత బ్రహ్మాదులఁ గలిగించి శక్తులు, వేర్వేఱ నొసఁగి సంవిత్స్వరూప
యగు మూలకారణంబని కాంచు చేతనుల్, జన్మసంసారసంక్షయముఁ గందు
వేదంబులకు నెల్ల నాదివిద్య పరంబు, ధ్యేయమ్ము జ్ఞేయ మద్దేవినామ
కోటులు గుణకథాఘూర్ణితంబులు హరి,బ్రహ్మాదికృతశబ్దవర్గ మెల్ల

గీ॥ నాదిపంచాశదర్ణంబు లఖిలజనని, నామములు వాని లెక్కింపనలువకైన
నలవియే? యిట్టి పరశక్తి నావహించి, వ్రత మొనర్పుము రామభూవరలలామ!

కం॥ అని పలికిన నారదమునిఁ, గని రాముఁడు పలికె వ్రతముఁ గావించెదఁ బూ
జనవిధిఁ దెల్పు మటన్నను, జనపతితోఁ బలికె దేవసంయమి యంతన్. ౯౨

చ॥ విధివిహితంబుగా మృదులవేదికపైఁ జతురశ్రపీఠియం
దధిగతసర్వవస్తుసముదారత నంబిక నిల్పి శక్తిచే
దిథినవకంబునన్ నియమధీరతచే నుపవాసివై యథా
తథ భజనంబు సేయుము బుధప్రకరంబులు మెచ్చ నిచ్చలున్. ౯౩

ఉ॥ ఇట్టులు దేవమౌని వచియించిన సత్యముగాఁగ నమ్మి యి
ట్టట్టు తొలంగనీని మతి నర్కకులేంద్రుఁడు దేవి నిల్పి య
ప్పట్టున నాశ్వినంబున శుభంకరలీల వ్రతంబు సల్పె లోఁ
దొట్టినభక్తి వానరులు తోడ్పడి సర్వముఁ గూర్పఁ దత్పరుల్. ౯౪

శా॥ హోమంబుల్ బలిదానపూజలును గల్పోక్తంబుగా సల్పుచున్
నామోచ్చారణమంత్రబీజపఠనన్యాసాదిసంధానచ
ర్యామర్యాదలు దప్పనీక యుపవాసాయత్తచిత్తస్థితిన్
గామోల్లాసిని గౌరిఁ బూజ సలిపెన్ గళ్యాణి రాముం డొగిన్. ౯౫

కం॥ అనుజునితోఁ గలసి జగ,జ్జననిన్ బూజింప దేవి సాక్షాత్కృత యై
గనిపించి యష్టమీ మ,ధ్యనిశన్ సింహాసనమున సానుగ్రహయై. ౯౬

గీ॥ అట్లు ప్రత్యక్ష మగుచు విద్యాస్వరూప, యైన యాదేవి భక్తిభావానుబంధ
గంధగంధిలుఁ డౌ రాముఁ గాంచి పలికె, జలధిగంభీరవాచాప్రసారణమున.

ఉ॥ నీ వొనరించు నర్చలకు నిచ్చలు మెచ్చితి మోద మందితిన్
భావము పల్లవించె నను భావనఁ జేయుటకున్ ఫలంబు స
ద్భావుఁడవై వరం బడుగు తద్దయు వాంఛిత మిచ్చుదాన నిన్
గావఁ దలంచి వచ్చితిని గాంచుము భాస్కరవంశభూషణా! ౯౮

సీ॥ నారాయణాంశంబునను సురప్రార్థన, రావణు మర్దింప రామలీల
వహియించి వచ్చిన వాసుదేవుఁడ వీవు, మఱి మత్స్యమగుచు సోమకునిఁ దునిమి
వేదముల్ గొనితెచ్చి విధిని రక్షింపవే, కూర్మరూపంబుచేఁ గొండఁ దాల్చి
సుధఁ దెచ్చికావవే సురలను గిటి వౌచు, నిలఁ బంటనెత్తి దైత్యేంద్రుఁ గూల్చి
గీ॥ జగము భరియింపవే నృకేసరితఁ దాల్చి, ఘోరత హిరణ్యకశిపునిఁ గూల్చి వాని
కొమరుఁ బ్రహ్లాదుఁ బాలించికొనవె పొట్టి, వడుగవై బలిఁ ద్రొక్కవే యడుగులోన.

కం॥ జమదగ్నిమహామునికిం, గొమరుఁడవై క్షత్రియాళిఁ గూల్చితి విప్రుఁ డీ
పరమదాచోరుని రావణు, యమపురికిని బంప నీవ యైతివి రామా! ౯౬౦

ఉ॥ రావణపీడలన్ బడి సురప్రజ మెల్లను సన్నుతింప స
ద్భావన మొంది తీవు కపిపక్షులు నీకు సహాయులై సదా
సేవ లొనర్ప వారినిధి సేతువు గట్టి రణాంగణంబునన్
రావణకుంభకర్ణముఖరాక్షసులన్ వధియింతు వింకిటన్. ౯౬౧

కం॥ శేషాంశభవుఁడు తమ్ముఁడ, శేషనిశాచరులఁ గూల్చి జితశత్రు జగ
ద్భీషణుని మేఘనాదుని, రోషమున రణాంగణమున రూపుమాపున్. ౯౬౨

గీ॥ సురభిసమయంబులనుమతిస్ఫూర్తిభక్తి, వ్రతమొనర్పంగవలయు, రావణునిఁ గూల్చి
సీతఁగొని నీవు రాజ్యంబు సేయునపుడు, నేఁ బునర్దర్శనం బిత్తు నిజము సుమ్మి.

సీ॥ పదునొండు వేలేండ్లు పాలించి యిద్ధాత్రి, దివ్యభోగంబులఁ దృప్తినొంది
వైకుంఠమునకు రావలెనని వచియించి, దనుజనిహంత్రి యంతర్ధి నొందె
జపహోమదాన పూజనముల విధియుక్తి, వ్రతము సల్పి సురర్షి నతిముదమునఁ
బూజించి కపిసేనతో జలాశయము బంధించి లంకను బ్రవేశించి ద్రోహి
గీ॥ రావణు సపుత్రమిత్రంబుగా వధించి, పొలఁతిఁ జేకొని సాకేతపురమునందుఁ
బూర్ణసామ్రాజ్య వైభవభోగియగుచు, రామచంద్రుండు ధర యేలె రాజసింహ!

ఆ॥ కట్టఁ గప్ప నొసఁగి కర్మలయెడ విప్రతతి నలంకరింపఁ దగును నరుల
కట్టులేని సఫలమై పూజనక్రియా, వళియు సిద్ధిఁ బొదలు వసుమతీశ. ౯౬౫

వ॥ అది గావున నీవును నంబికాపూజార్థంబుగా నేక ద్వి త్రి చతుః పంచ నవ సంఖ్యా కులలో యథాశక్తి విహితం బగునట్లు విప్రులను బుత్విక్కులుగా సంగ్రహించి వేదాదికపారాయణార్థంబుగా వేదపారగుండును శాంతుండును నగు వేఱొక విప్రునిఁ జేకొని వస్త్రాలంకరణాదు లొసంగి స్వస్తివాచనంబు సలుప నిశ్చయించి వేదీమధ్యంబున సింహాసనంబుపై క్షౌమాంబరధారిణియు సాయుధచతుర్హస్తయు

రత్నభూషణభూషితయు ముక్తాహారవిరాజితయు సర్వలక్షణసంయుతయు శంఖ చక్రగదాపద్మహస్తయుఁ గా నద్దేవిఁ బ్రతిష్ఠించి మఱియు నష్టాదశభుజ యగునట్టిదిగా నైనను బ్రతిష్ఠించి పూజించుట యుత్తమంబు ప్రతిమా భావంబున నవాక్షరీమంత్రసంపుటితంబును హేమమయంబునుగా యంత్రంబున నైనను నావేశింపఁజేసి పూజించుట యర్హంబని తలంపవలయు నని చెప్పె మఱియును. ౯౧౭

సీ॥ గంగాదితీర్థ సంఘటితంబు హేమమ,యంబు సంభృతపల్లవంబు వేద
మంత్రసంస్కృతము సన్మణిగర్భముగ నొక్క, కలశంబు పూజించి నిలిపి చెంత
నర్చనాసంభార మంతయుఁ గూర్చి వా,దిత్రఘోషంబులు దెసల నునిచి
హస్తనక్షత్రంబు నాదిగా సంకల్ప, మొనరించి పూజింప నొసఁగు శుభము

గీ॥ ముందునియమంబొనర్చియమ్మూర్తిపూజ, సేయఁదగునుపవాసముల్ సేయుటొప్పు
శక్తిలేదేని వ్రత మేకభుక్తినైనఁ, జేయు టుచితంబు జనుల కో క్షితితలేశ!

కం॥ తల్లీ! నవరాత్రవ్రత, ముల్లాసముతో నొనర్తు నొగి విఘ్నంబుల్
తల్లడవెట్టకయుండఁగ, జల్లఁగ సంపూర్తిఁ జేయు జనని! యనఁదగున్. ౯౧౮

మ॥ నియమం బిట్టు లొనర్చి శక్తిఁ గొలఁదిన్ నిష్ఠాగరిష్ఠాత్ములై
భయమున్ భక్తియుఁ గల్గి వేదవిధి లోపం బింతయున్ లేక స
ద్వ్యయమున్ జేయుచు బ్రాహ్మణార్చనము సత్యశ్రద్ధఁ గావింపుచున్
జయ మర్థించు నరుల్ భజింతు రెలమిన్ సామ్రాజ్యమోక్షస్థితుల్. ౯౧౯

మ॥ మధుపానంబు సువాసినీజనుల సమ్యక్పూజ దేవిన్ యథా
విధిఁ బూజించుట క్రవ్యభోగములు గావింపన్ దగున్ శక్తుఁడై
బుధమార్గానుగతిన్ జరించు నతఁ డొప్పున్ సర్వ శత్రుక్షయ
ప్రథితప్రౌఢపరాక్రమప్రబలసంపత్కీర్తివిస్తారుఁడై. ౯౨౦

మ॥ హరిచే శంకరుచే విరించిపురుహూతాదిస్వరావాసిశే
ఖరసంఘంబులచే మహార్హమగు నీ గౌరీవ్రతం బాపదు
ద్ధరణోద్యుక్తులఁ జీర్ణమయ్యె నవరాత్రార్చావ్రతాఖ్యంబు భూ
వర! వేదాగమతంత్రకోటులను జెప్పన్ విందుమాఁగా? యెటన్. ౯౨౧

సీ॥ ఆలిఁ గోల్పోయి దేవాచార్యుఁ డొనరించె, మధువధార్థము చేసెమాధవుండు
త్రిపురసంహృతి దేవదేవుండు గావించె, వృత్రునిఁ గూల్ప స్వర్విభుఁడు సలిపె
కౌశికభార్గవకశ్యపకుంభోద్భ,వాదులు విజయార్థ మగుచు వేద
విధిచోదితం బని విశ్వేశిఁ బూజించి, చెందరే సర్వార్థసిద్ధి వారు

గీ॥ రాఘవేశ్వర! యీ నవరాత్రిపూజ, వేదచోదితముగఁ జేసి * విజయసిద్ధిఁ
గాంచి దశకంఠలుంఠనకర్త వగుము, నెఱపు మీ వ్రత మిందు నిర్ణిద్రవృత్తి.

చ॥ తడయక చేయుమన్న వ్రతతత్పరుఁడై రఘురామమూర్తి య
య్యెడఁ గరణీయ మెద్ది? విధి * యెద్ది? ప్రభావ మభీష్టసిద్ధికై
గడఁగి యొనర్చువాఁడ జయకాంక్ష పెనంగుచు నున్న దాత్మ నీ
వెడపక తద్వ్రతంబును రచింపఁగఁ జేసి కృతార్థుఁ జేయవే?

ఆ॥ అర్చనీయమైన * యీ దేవి యభిధాన, మెట్టు లొక్కొ? సర్వ * మెఱుఁగఁ జేయు
మనిన దేవమౌని * యర్కవంశజుతోడఁ, దెలుపఁ దొడఁగె దేవదేవిమహిమ.

సీ॥ సర్వకామప్రద * శక్తి సనాతని, సర్వదుఃఖనిహంత్రి * సృష్ట్యముఖ్య
సర్వకారణయును * సర్వేశి యద్దేవి, వలన జనించు సర్వమ్ము హరికిఁ
బాలన శక్తియై * బ్రహ్మకుఁ గర్తృత్వ, శక్తియై హరునకు * సర్వసంక్ష
యాత్మికయై భువనావళి సదసత్స్వ, రూపంబులను నెల్ల * మాపుచేయు

గీ॥ నట్టిశక్తికిఁ బుట్టు వేపట్టునందుఁ, గలదె? హరిహరవిధిశక్రకమలబంధు
చంద్రధరణీధరధరాబ్ధిసర్వవిలయ, సమయముల నెల్లఁ దానయై * సలుపు విహృతి.

కం॥ ఈపరశక్తి చరిత్రం, బేపురుషుఁడు విన్నఁ బరము * నిహముం గల్గుం
బాపఘ్న మే పురాణం, బీపగిదిది గాదటంచు * నే మదిఁ దలఁతుం.

కం॥ అని బాదరాయణుఁడు దెల్పిన విని జనమేజయుండుఁ * బ్రీతుండై య
మ్మని నవ్వలి కథ నడిగిన, వినిపింపఁ దొడఁగెఁ బూర్వవృత్తం బనుచుం.

ఉ॥ పాలితభక్తలోక! భవపాశనికృంతనభవ్యనామ! శం
పాలతికాప్రభాసురవిభాజయ రమ్య జటాభిరామ! లీ
లాలలితాద్రిజాహృదయలగ్నమనోహరదివ్యధామ! శుం
డాలసురారినిర్దళన * నవ్యపరాక్రమచంక్రమక్రమా!

కం॥ చండవరప్రద! సంధ్యా, తాండవలోలస్వభావ! * దండధరమదో
ద్దండోద్దండన! సురరిపు, కాండవిఖండనవినోదకర్మవిభేదా!

ఉత్సాహవృత్తము॥ కాలకాల! శూలఖేల * కల్పకాలఖేలనా
ఫాలనేత్రకిరణదగ్ధపంచబాణజీవనా!
హాలహాలభక్ష, దక్షయజ్ఞశిక్ష! పాలనా
వాలచిత్తవృత్త! యమవిశాల! శైలఖేలనా!

క౦॥ దేవీభాగవత స్కంధావళిని దృతీయ మచ్చ్రమాంబా జగ
జ్జ్ఞావరుల కభీష్టార్థశ్రీ వెలయఁగఁజేసి సుప్రసిద్ధిఁ జెందుఁ. ౯౮౧

—♦ గ ద్య ♦—

ఇది శ్రీమ త్పరమ శివాద్వైత భావనాసాధ్య సిద్ధ సారస్వత విద్యా సాన్నిధ్య
వేమనారాధ్య వంశార్ణవ కలానిధాన ములుగు పాపయారాధ్యాభి
ధాన ప్రణీతంబైన దేవీభాగవతం బను మహాపురాణంబునందుఁ
దృ తీ య స్క ం ధ ము
సం పూ ర్ణ ము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు

శ్రీ మహాగణాధిపతయేనమః

శ్రీ శారదాంబాయై నమః

శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము - శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## చతుర్థస్కంధము





గురుశిష్యానుమత
స్వాగత సమ్మోహనాస్త్ర హర్షితఫలభు
గ్రాగాధిక పరదేవీ
భాగవతంబునఁ జతుర్థభాగం బలరున్. ౧

కం॥ శ్రీమహిళావల్లభ శర, ధామనిధానాంతరచలద్ధామోద్దామా !
శ్యామలకంఠ సరీసృప, దామా ! శ్రీవిశ్వనాథ దైవలలామా ! ౨

వ॥ దేవా! సకలపురాణేతిహాస కథాసుధాస్వాదన నిస్తంద్రు లగు నమ్మునిచంద్రులకుఁ దన్మనోరథ రథచోదనాసూతుం డగు సూతుం డిట్లనియె. ౩

శా॥ శ్రీవాణీ గిరిజాధిభూశశిరవిక్షిత్యాది తత్త్వావళీ
భావాపత్య వసచ్చతుర్విధ జగద్బ్రహ్మాండ సృష్టిక్రియా
భావప్రార్థిత నిత్య ముక్త సుభగంభావైకతాపన్నమై
యే విశ్వేశ్వరి నిల్చు నప్పరకళన్ ధ్యేయన్ దలంతున్ మదిన్. ౪

వ॥ ఇట్లు సమజ్జన దుర్భవ దురిత లతాలావినియగు పరదేవిన్ భజించి. ౫

కం॥ ప్రాసంగిక గాథారతిచే సంప్రాప్తమగు రామచంద్ర చరిత్రం
బోసంయమివర ! నే విని, ధీసముపేతుండ నైతి । దృఢభక్తిరతిన్. ౬

—• శ్రీబలరామ కృష్ణ చరిత్రము •—

శా॥ శ్రీమంతుం డగు శూరసేనునకు నిస్సీమ ప్రతాపోదయ
స్థేమప్రస్ఫుట దోర్బలాతిశయుఁడై । దీపించె నేఁగా? గుణో
ద్దాముం డా వసుదేవుఁ; డచ్యుతుఁడు తద్గర్భంబునన్ బుట్టె స
ర్వామర్త్యస్తవనీయుఁ డా నృపుఁడు కారాంతస్థుఁడెట్లయ్యెనో ? ౭

కం॥ కంసుం డావసుదేవుని, సంసారము వెలితిఁబుచ్చి । సతితో బందీ
హింసలఁ బొల్పఱచుట స్వధ్వంసమునకు హేతువనుచుఁ । దానెఱుఁగఁడొకో.

చ॥ జగములకెల్లఁ గర్తయగు । శౌరి తదీయ ప్రచండసంభవుం
డగుఁగద యట్టి దంపతుల । కార్థిక బంధన మెట్లుగల్గె? నె
వ్వగలు జనార్దనోద్భవని । వారితముల్ గద శార్ఙ్గి పుత్రుఁడై
జగము లెఱుంగ వారలకు । సంభవ మొందెడు పుణ్య మెట్టిదో? ౯

కం॥ నందుం డను నాభీరుని, నందనిమై యెగసి కంసునకు నందక మి
న్నంది జగంబుల నబ్బుర, మందించె ననంగ విందు । మది యెట్టిదొకో. ౧౦

కం॥ మురహరుఁడు పెండ్లియాడెన్, బరిమితిఁ బదియాఱువేల । పై నెనమండ్రన్
దరుణులఁ దద్వృత్తాంతము, హరిగుణకథనంబు వినఁగ । నతిముద మొదవెన్.

వ॥ మఱియు మహాత్ములును బురాతనులును ధర్మపుత్రులు నగు నరనారాయణులు నిస్స్పృహులు కామక్రోధాదిరహితులు నచ్యుతాంశసంభూతులునై తపంబొనర్చు మహాభాగు లని విందుము, వారు కృష్ణార్జునులై భూభార నివృత్తి సేయుటకై విద్యమానశరీరులయ్యును నవతరించి రని నారదాదులు వచింప వినియుంటిమి, దేవతారూపులు బ్రహ్మణ్యు లగు నరనారాయణులు క్షత్రియయోనియం దెట్లు సంభవించిరి. శూద్రుండు ధర్మనిష్ఠుండై నవైశ్యుం డగుటయు నతండు ధర్మనిష్ఠుండై క్షత్రియుం డగుటయు రాజన్యుండు శుభాచారుండై బ్రాహ్మణుం డగుటయును దజ్జన్మంబున నిస్స్పృహుండై శాంతుండై ముక్తిం జెందు ననియుఁ జెప్పుదురుగదా! యిచ్చోట విపరీతంబుగాఁ దోఁచుచున్న యది, కర్మవ్యత్యాసంబుననో? శాపంబుననో ? యిట్టి జన్మంబు సంభవించుట యిది వినవలయుం గావున వచింపుమని వెండియు నిట్లనియె. ౧౨

ఉ॥ యాదవ వంశనాశము మహాత్ములశాపముచే నటంచు సం
వాదముచేత వింటిఁ గురువల్లభుఁడా ధృతరాష్ట్రపత్ని శా

పోదక మెత్తురట యదుకులోద్వాహులెల్ల సళించి రందు రి
త్యాది జనశ్రుతుల్ వినఁగ నయ్యెడు సందియ మిందుఁబాపవే. ౧౩

క॥ దేవాదిదేవుఁడగు హరి, పోవఁగ శంబరుఁడు కృష్ణపుత్త్రుని మాయా
ప్రావీణ్యముచే గొనుటయుఁ, గేవల సందేహ మాత్మఁ గీల్కొనియుండున్. ౧౪

గీ॥ సూతికాగేహమందుండు సుతునిఁ గొనుచు, దుర్గమంబైన ద్వారకాదుర్గ సీమఁ
గడచి నిశిచరుఁ డేగుటగనఁడె చక్రి,యిదియె సందియ మొనరించె నెదమునీంద్ర.

గీ॥ వాసుదేవుండు వైకుంఠవాసి యైన,యెడలఁ బాటచ్చరులు రేఁగి యిగురుఁబోండ్ల
బందిఁ బెట్టిరటంచు నేర్పడఁగ వింటి,నిదియు సందియ మయ్యె నాకెదఁదలంప.

సీ॥ విఘ్నసంశంబున విపులాభరంబెల్లఁ, దీర్పంగ వచ్చిన దేవుఁడయ్యు
ద్వారకనుండి మిత్త్రి వ్రజంబులు దాను, భయమున మథురకుఁ బఱచె ననుట
నదియునుగాక పాపాత్ముల శిక్షింప, ధర్మంబు రక్షింపఁ దాను వెడలి
తనకు ద్రోహము సేయుధన్యులఁ గనఁడొకొ,యవరోధజనులద్రోహంబు గనఁడె

గీ॥ ద్రోణ భీష్మాది హరణంబుతోన తనకుఁ,జేయఁదగు కార్యమా గాదె సేయరాని
వారిచే నెట్లు సేయించె శౌరి యిదియు,సంశయాపన్నమై నిల్చె సంయమీంద్ర.

గీ॥ రాజసూయ మొనర్చిన రాజమణులు, పాండవులు వారి కార్తిసంప్రాప్త మయ్యె
దొల్లిచేసిన సుకృత మే ధూళిఁగలసె, భీకరాఘాదు లెచ్చోటఁ బెనఁగి డాఁగె.

వ॥ మఱియును రజస్వలయై యేకవస్త్రయై యుండు పాంచాలికి సభాభవనంబున వస్త్రాపహరణంబును, గీచకునిచేఁ బట్టుపడుటయు, సైంధవునివలనఁ గట్టుఁబడి దుఃఖించుచు నాక్రోశించుటయు మొదలగు బహుదుఃఖంబు లనుభవించుటయుఁ, బాండవులవలనఁ దన్నివారణం బయ్యెంగదా యని పలుకం బనియేమి? మాన భంగం బగుట చచ్చుటయకదా? మఱియును మత్పూర్వజులు దేవాంశసంభూతులై భగవన్మనస్కులై దుర్వచనీయంబు లగు దుఃఖంబు లనుభవించిరి గాదె. సదాచారు లగు వారికి భీష్మ ద్రోణ వధంబు ధర్మంబగునే ? ప్రేరకుండగు వాసుదేవుండు వ్యాజంబున ఘోరం బగు పాపంబునన్ బ్రవర్తింపఁజేసె జగత్కుటుంబం బగు కురువంశంబు క్షయించెఁ బోషణీయులగు వారలవధించి రాజ్యసుఖంబు లనుభవించుటకన్న భిక్షాటనంబును నీవారభక్షణంబును మేలగుంగాదె? విచ్ఛిన్నం బగు వంశంబును దదుత్పాదకుండ వగు నీవలన వృద్ధిం జెంది యంతంబున నిట్లయ్యెం గదా! మజ్జనకుం డొక్కఁడు శపించి మానియై తపంబొనర్చు మహాత్ముని కంఠంబున నురగంబుఁ జుట్టం బనియేమి తత్కర్మవశంబునంగదా! మృతుం డగుటయుఁ గావునఁ బెక్కులగు సందేహంబుల విహ్వలం బగు మనంబు స్థిరం బొనర్చు

టకు సర్వజ్ఞుండ వగు నీవు దక్ష నన్యుల కలవియే యని ప్రశ్నంబు లొనర్చిన జనమేజయునకు బాదరాయణుం డిట్లనియె. ౧౯

—॥ కర్మఫలము ॥—

గీ॥ ఏమిచెప్పుదు భూమీశ? యిట్టిసంధు, లెల్ల నెఱుఁగక చేసితి వెద్దియైన ననుభవానశ్యనశ్యం బగుటంచు వినమె, కర్మగతిఁగాంచ నెవరికిఁగాదు సుమ్మ.

చ॥ గహనము కర్మమార్గము జగమ్ములఁ గానఁగలేరు వారినిన్ దహనునిఁజేయు వహ్ని నమృతంబొనరించును భూతకోటులం దహరహమున్ వసించుచును నావల నీవల నీవలావలన్ బహువిధహర్షశోకములఁ బాల్పడఁ జేయదె యెట్టివారలన్. ౨౧

సీ॥ దిక్పాలురను బట్టి దిరిప మెత్తఁగఁజేయుఁ, దిరిపగాండ్రను దిశాధిపులఁజేయు సింహడింభములను జింకపిల్లలఁజేయు, జింకపిల్లలఁ జేయు సింహములుగ సురకదంబముఁ దెచ్చి నరకదంబముఁజేయు, నరవితానముఁబట్టి సురలఁ జేయు నాకవాసులనైన నరకవాసులఁ జేయు, నరకవాసుల నాకచరులఁ జేయు

గీ॥ నేమి దలఁచినఁజేయు నింకేమి కొదవ, భూమి నాకాశమును దాశములుగఁజేసి పట్టి మోయింప నేర్చు నెప్పట్టునందుఁ, గర్మవిహృతికి నర్థంబుగలదె యెందు.

శా॥ చావున్ బుట్టువు లేని జీవులను సంసారాంధకూపంబులన్ ద్రోవల్ తప్పఁగఁద్రొక్కి కూలి పడఁగాఁ ద్రోయించుఁ బైకెత్తఁగాఁ బ్రావీణ్యంబు నిసర్గసిద్ధి మదిఁ గర్మప్రౌఢికిన్ బీజస ద్భావం బెల్లను గర్మకర్తృకము తత్సారం బపారం బగున్. ౨౩

గీ॥ జీవునకు దేహసంయోగసిద్ధికర్మ, మూలమాఁగాదె సుఖదుఃఖజాలములను చేడిసలఁబోలెఁ బడఁద్రోసి పెనుచుఁగర్మ, వేష్టితము.సర్వ మదియె వోవిడనికట్టు.

—॥ కర్మత్రియ నిరూపణము ॥—

సీ॥ కర్మంబు త్రివిధంబుగా వచింతురు పెద్ద,లది వేదనిశ్చితంబనుచుఁ గనుము ప్రారబ్ధ సంచిత వర్తమానవిభేద,మున. ద్రివిధం బౌచు వనజజాది సురలకైనను గానఁజొప్పడ దెవ్వారు, తద్వశంబునను బద్ధతను గండ్రు మరణజరాక్రోధమదసుఖదుఃఖ లోభాదులు ప్రాణుల నావరించు

గీ॥ అమరలోకంబునందున్న యఖిలజంతు,సంతతులఁ బట్టి పీడించు సకల.మెల్ల దైవవశమాటఁ బశుపక్షి తారతమ్య,మనుట లేదిది దేహమర్యాద సుమ్మ. ౨౫

ఉ॥ జ్ఞాతివసఖ్యబంధములు । జంటగఁ దోడయి భూతకోటికిన్
జ్ఞాతివమిత్రభావములు । జన్మ లొసంగుచుఁ ద్రిప్పుచుండు నీ
పుత్త్రకళత్రబంధుసఖపోషకపోష్యవిశేషభేద సా
ర్వత్రికకల్పనానియతి । రాజుల మన్నను దప్పిపోవునే. ౨౬

మ॥ పవలున్ జేయును దిగ్భ్రమంబు రవికిన్, । బాండుక్షయవ్యాధిసం
భవ మంభోజవిరోధికిన్ విధిశిరోభారంబు కాలారికిన్;
స్వవశంబే యది; కర్మసంభవముగాఁ । జర్చింపరాదొక్కొ ? దు
ర్భవముల్ సద్భవముల్ స్వతోవృతములే । ప్రాక్కర్మలన్ జెందెడిన్. ౨౭

గీ॥ ఆదియును నంతమునులేక । యండవదల,కఖిలజంతువులను ద్రిప్పునదియె కాదు
జంగమస్థావరాత్మక । జగము లెల్లఁ, జెడుట బాగౌట కర్మంబుచేతఁగాదె. ౨౮

శా॥ నిత్యానిత్యవిచారమూఢు లయి మానిశ్రేష్ఠు లశ్రాంతమున్
సత్యార్థంబుల నిశ్చయింపక వృథాసంవాదులై యిజ్జగ
న్నిత్యత్వంబును సంక్షయస్థితి ప్రమాణనిర్ణీతమై యుండెడిన్
నిత్యం బంచు వచింపరా దనినచో । నిర్వాద మెట్లయ్యెడిన్. ౨౯

కం॥ మాయాకార్యము జగ మ,స్థేయంబగు నెట్లు మాయ । తిరమనుచో న
మ్మాయ గలుఁగఁ దత్కార్యము,మాయంబగు నొక్కొ?యెట్లుమతినూహింపన్.

ఉ॥ మాయకు నిత్యతాప్తి నిగమప్రథితం బగుఁ గానఁ గర్మ బీ
జాయతమైన యిజ్జగ మనంతముగా పచియింపఁగావలెన్
స్థాయిత గానరాదు విదితంబు వినాశిత వాద వేద్యతన్
జేయదు సందియంబు ఫలసిద్ధి యొనర్చునె ? శాస్త్రపద్ధతిన్. ౩౦

మ॥ బిగియించున్ జగమున్ స్వకర్మవశతన్ । భేదించి తత్కర్త్రి మా
యగదా! మాయకుఁ గర్మబీజమునకున్ । సాంతస్థితిన్ జెప్ప రా
దగరీయంబుగ నుత్తమాధమములన్ । వ్యామోహమున్ దోసి స
ర్వగమై యోనులఁ ద్రిప్పు భూతములఁ గర్మం బింతకున్ మూలమై. ౩౧

శా॥ కర్మాధీనముగాక యి జ్జగము సాకల్యంబుగా స్వేచ్ఛమై
శర్మంబొందుట గల్గెనేని పర తేజఃప్రాఢుఁ డా శార్ఙ్గి దు
ష్కర్మప్రాప్యఝషాదియోనుల జనింపన్ గారణం బేమి? స
త్కర్మం బే, మలమూత్రధామము? లుదరోద్ధర్మంబు కర్మాళికిన్. ౩౩

కం॥ వైకుంఠంబున సుఖ మ,స్తోకము గాదొక్కొ? పుష్పసురభిళ వనకే
ళీకృతి మానుచు బహుదుః,ఖాకరగర్భాప్తి జడునకై నను దగునే. ౩౪

గీ॥ హంసతూలాభిరచిత తల్పాంతరమునఁ, గడు సుఖింపక తలఁకి ౹ందుఁగాఁగ వేఁల
మూఁరుఁడైనను గోరునే ౹ ముజ్జగములఁ, గష్టుఁడును వీణ విసక దుర్గతికిఁ జనునె.

ఉ॥ సాగరకన్యకాధరరసంబున జివ్వాకుఁ దుప్పి దుల్పు న
బ్భోగిశయానుఁ డెట్లు మలపూరితజంతుపిచండకర్దమా
భోగముఁ గోరుఁ గర్మఫలభోగము లట్టివ గాన దుస్తరం
బౌఁగద! ప్రాణికోటికి నిరంతరకర్మసముద్రి మీఁదఁగన్. ౩౬

క॥ గర్భస్థితికన్నను ధర, దుర్భరనరకములు గలవె ౹ దురితానలసం
దర్భములు గావె మునులు పు,నర్భవ భయమును దవమ్మ్రనెనె యణతురుగా. ౩౭

చ॥ హిత మహితం బెఱింగిన మనీషులు రాజ్యసుఖంబు మాని సం
తతవనవాసులై తప ముదారత సల్పుట గర్భనారక
స్థితులకు లోఁ బడన్ వెఱచి ౹ చేయుట గాదె? జనుండునన్ సమా
గతజరరాంతరస్థితికిఁ ౹ గాంక్ష, యొనర్చునె యెన్ని భంగులన్? ౩౮

చ॥ క్రిమిశతసంకులంబు మలకీర్ణము సంజ్వలదగ్నినిత్యసం
భ్రమణము మూత్రపూరితము ౹ పాశవివల్గిత మట్టి గర్భగో
శమున వసింపఁ బ్రాణులకు ౹ లాలసమే? ధరణీశ! కర్మభో
గమున ఘటించు నగ్గతికిఁ ౹ గాంక్ష, లొనర్చెడువార లుందురే. ౩౯

క॥ కారాగృహబంధన మని, వారితనిగళాప్తి వేయు ౹ వర్ష ములైనన్
ఘోరతరగర్భనరకవి,హారశతాంశంబుఁ బోల ౹ దవనీనాథా. ౪౦

సీ॥ పదినెలల్ గర్భాబ్ధిపంకంబులోఁ బడి, తొలఁగంగరానట్టి ౹ దుఃఖభరము
నిరతయోనిద్వార ౹ నిస్సరణంబున, దుర్వ్యధాప్తినిఁ జెందు ౹ దుఃఖభరము
బాలత్వమున మూకభావంబులోఁబడి, దురపిల్లుచున్నట్టి ౹ దుఃఖభరము
నుపతాపరోగాదు ౹ లోర్వక భైషజ్య,ధుర మానఁగా లేని ౹ దుఃఖభరము

గీ॥ బాల్యమున నిట్లు ప్రాప్తించు ౹ బహుళదుఃఖ నిరవధిశ్రమ మరసి భూవర! జనుండు
జన్మవాంఛకు లోఁబడఁ ౹ జాలునొక్కొ,-నరసురాదిజనుభేదమరయ నేల? ౪౧

గీ॥ వేల్పుగమిత్తోడనైనను ౹ వెఱవ కాజి, సాహసింపగఁ గలయట్టి ౹ జన్మమైన
సుఖవినాశంబు శ్రమదంబుగసూ! గణింపఁ,గూళకైనను జన్మంబుఁగోరఁదగదు.

—, యాదవుల పూర్వచరిత్రము ,—

కం॥ దేహముగల్గు సురాసుర, దేహులకును నరసిచూడ ౹ దిక్కగు దైవం
బూహాపోహలఁ బనిలే, దైహిక మాముష్మికమ్ము ౹ నదియగుఁ జుమ్మా. ౪౩

మ తపముల్ సేయుచు దానయజ్ఞముఖసద్ధర్మంబు లార్జించుచు
 న్జపముల్ సల్పుచుఁ బ్రాకృతం బనుభవింపంగాఁ గల్గు స్వర్గంబు త
 ద్విపులాభోగము చెల్లునంతట భువిన్ వేదోక్తియ రే? వానరుల్
 విపులన్ బుట్టుట రామపక్షమునకై వేల్పుల్ గదా! కంటివే. ౪౪

కం॥ గోపాలమూర్తి హరికిన్, గోపకులై సురలు దిగరె కుంభిని; కిది గా
 కా పద్మాపతి యుగయుగ, మాపాదింపండె తనదు నవతారకథల్. ౪౫

గీ॥ అచ్యుతాంశాంశమునఁ గృష్ణుఁడయ్యెఁ గాదె, యమ్మహాత్ముని జన్మగుణానుభావ
 కథన మొనరింతు మజ్జిహ్వ కసటుదీర, వినుము వీనుల నమృతంబు నునిచినట్లు.

ఉ ఏ వసుదేవుగర్భమున నీశ్వరుఁడౌ హరి సంభవించెనో
 యా వసుదేవుఁ డాదివిధినై యమరావళిఁ గన్నయట్టి పుం
 భావతపమ్ము కశ్యపుఁడు ప్రాక్తనశాపవశంబునన్ ధరన్
 గోవులఁ గాచువాఁడయినఁ గోమలు లిర్వురు నట్లనై రిలన్. ౪౬

కం॥ అదితియు సురభియు నను న,మ్మదవతు లీజన్మమునను మానుష తేజో
 విదితలు దేవకి యను నల, ముదితయు రోహిణి యనంగ మోహనగాత్రుల్.

చ॥ విధినవకమ్ములోపలను విశ్రుతుఁడౌ ముని కశ్యపాఖ్యుఁ డం
 బుధివిభుశాపతప్తుఁ డయి పుట్టె నరన్ మును విందునన్న స
 త్పథవశవర్తి యాతనికి భంగము రాఁబనియేమి యెట్టి దు
 ష్పథ మొనరించె వాఁపతికి భామలతో నిటు బన్నమంటెనే. ౪౭

వ॥ అదియునుంగాక శాపతప్తుండగు వసుదేవుగర్భంబునన్ బడి యోనియంత్రపీడి తుండై యదువంశంబునన్ బుట్టుటవలన మహాలక్ష్మీసఖ్యంబును బరమపదవాసంబును విడిచివచ్చుటగదా? పరమార్థంబు, ఆదినారాయణుండును సురశ్రేష్ఠుండును యుగాదియు సర్వాధారుండునగు వానికిఁ బారతంత్ర్యం బెట్లు దాపరంబయ్యె స్వస్థాన పరిత్యాగంబును బరగృహవాసంబును సంభవించుట యసహ్యంబగుఁగాదె? మానుష విడంబనంబున నానావిధభావోద్వర్తనంబు సంఘటించు నెట్లనినఁ గామంబును గ్రోధంబును హర్షంబును శోకంబును వైరంబును సఖ్యంబును సుఖంబును దుఃఖంబును క్షుధయును దృష్ణయు దైన్యంబును నార్జవంబును దుష్కృతంబును సుకృతంబును నయంబును దుర్నయంబును హననంబును రక్షణంబును జ్వలనంబును సంతాపంబును విమర్శంబును గపటంబును బంధనంబును మోచనంబును మొదలగు భావంబులు మానుషంబులై యవశ్యసమాచరణీయంబులుగదా! యిన్నియుం గల్గియు భగవంతుండై స్మరణమాత్రంబున భక్తులకు సుఖప్రదుం డనుట యబ్బురం బయ్యెడు భయాస్పదంబగు మానుషత్వంబు నేమి యభిలషించి యంగీకరించెఁ గర్భ

దుఃఖంబులు బాల్యయౌవనాదిదుఃఖంబులు బ్రహ్మచర్యగార్హస్థ్యాదిదుఃఖంబులు చెప్పుటకు వినుటకు నలవియగునే? సర్వజ్ఞుండయ్యును నిట్టి జంజాటంబునకు నెట్లొడంబడెనో? యెఱిఁగింపుమని మఱియు నిట్లనియె. ౫౦

ఉ॥ రాఘవుఁడై వయస్సునను * రాజ్యము గోల్పడి యాలితోడ వ
న్యాఘటితప్రవాసమున * నార్తత నొంది వధూవియోగపీ
డాఘనదుఃఖ మోరిచి బెడంగగు వేదన నొందెఁ గాదె? య
ల్లాఘవ మెట్టు లోర్చె వికలంబగుఁ జిత్తము విన్నవారికిన్. ౫౧

ఉ॥ యాదవుఁ డయ్యు మాతృపితృహర్ష మెఱుంగక యాలఁ గాచుచున్
మేదిని రాజ్యభోగముల * మేలున కర్హుఁడు గాక మామతో
వాదొనరించి కష్టపడి * వాని వధించి జగత్ప్రవాదసం
పాదన కోర్చెఁగాదె? యిది * పాడియె? భూపకులంపుఁగృత్యమే. ౫౨

కం॥ ఈ సందేహముఁ బాపి విలాసమ్మున మనము నిర్మలముఁజేసి నన్నున్
గాసిలనీక భరింపుము, భాసాన్నిధి తేజ! మౌనిపటలబిడౌజా. ౫౩

వ॥ అనిన నజ్జనమేజయునకు వ్యాసుం డిట్లనియె. ౫౪

శా॥ కౌరవనాథ? లేఖుల కకారణజన్మము లేల కల్గెడిన్
దా రొనరించు కృత్యముల * దండడిచేత ఘటిల్లెఁగాదె? ని
ష్కారణకర్మభోగములు * జంతువులందుఁ బొసంగ వెన్నఁడున్
గోరినఁ గోరకున్నఁ దనకున్ దనుఁ దానె కృతాప్తి చేకురున్. ౫౫

—• వరుణుని యాగపశువులను గశ్యపుఁ డపహరించుట. •—

గీ॥ ఆనుషంగికమైన యుదంత మిప్పు, డాలకింపుము వరుణునియధ్వరమున
యాగపశువుల కశ్యపుఁ * డాహరించె, సురభిసములు పయస్వినుల్ * చూడరోసి.

చ॥ తనదు కుటుంబినుల్ వలచి * ధర్మవిహీనతఁ దోలి తెమ్మనన్
మనమున శంకమాని యవమానసహిష్ణుత నింతఁ జేసె న
మ్మునిపతి "కాముకుల్ ధరణి * మూర్ఖులుగారె?" గురుండు బంధు వం
చని యరయంగ నేర్తురె? ధరాధిప! యవ్వరుణుండు క్రోధియై. ౫౬

ఆ॥ ఎల్లయెడల నరసి * యెచ్చోటఁ గానక, నమరజనకకృత్య * మనుచుఁ దెలసి
వినయగౌరవములు దనుక * సన్నిధిఁజేరి, కమలజునకు మ్రొక్కి * కడుముదమున.

శా॥ హా! మీకశ్యపు డాలికై వలచి నా * యాగీయగోబృందమున్
దోచెన్ ముచ్చిలె వేడినన్ గొనక నిర్భీతుండునై యున్నవాఁ

డామై నీసునఁ గోపకుండగుచు భార్యాయుక్తుఁడై పోవ ను
ద్దామప్రక్రియ శాప మిచ్చితిని దర్ధార్ష్ట్యంబుఁ గన్గొంటి రే. ౫౯

కం॥ ఘోషించుచు వత్సంబులు, శోషిల్లుచు నున్న వీనిఁ జూచి మఱియుఁ నే
రోషించుచు మృతపుత్రిక, దోషంబునఁ బోవ వానితో య్యాలి నంటిన్. ౬౦

చ॥ మఱియును బందిఁ జిక్కుచు నరమానుషవృత్తికి బంధువుల్ మదిన్
గొఱతగణించి సీయనఁగఁ గుత్సితజీవన మొందియుండఁగాఁ
బఱచితి నట్టులయ్యు మదిఁబట్టక గోవుల నీక యున్న వాఁ
డఱచుచు వత్సముల్ సెనఁగుచులాడుచు నుండె నటంచుఁ దెల్పినన్. ౬౧

ఉ॥ కశ్యపుఁ బిల్వనంపి కని కాంచనగర్భుఁడు వారుణాధ్వరా
వశ్యకగోతతిన్ గొనియు వారలు వేడిన నియ్యనైతి వీ
దృశ్యము చూచి యోర్వఁదగునే? కట! లోకపరీవృఢుండు కా
ర్కశ్యముగూడఁ గైకొనునె? కావున గోవుల నిమ్ము వానికిన్. ౬౨

మ॥ పరవిత్తాహరణంబు సేయుట మహాపాపం బటంచున్ వసుం
ధర విజ్ఞానులు పల్కఁగా వినవె? ధౌర్త్యం బేల? లోభంబు ని
ష్ఠురమున్ దుర్గతికారణం బనుచుఁ దోడ్తోఁ జెప్పినన్ మానమిన్
వరుణున్ జూచి హిరణ్యగర్భుఁ డనిరోధ వాకు ద్రవ్వఁగా రోయుచున్. ౬౩

కం॥ లోభోపహతుఁడు కశ్యపుఁ, డేభయమున వెఱవఁ డీతఁడేమందు? గవీ
లాభమె మేలని యపవా, దాభీలత కోర్చె నేమియందుఁ బ్రచేతా. ౬౪

శా॥ ధన్యుల్ మానులు కామముఖ్యరిపుబృందంబున్ బెడం బాయుచున్
వన్యావాస మొనర్చి శాంతిపరులై వర్తింతు రిమ్మౌని సా
మాన్యుండై యటు లయ్యు లోభవశుఁడై మర్యాదలన్ బాసి దౌ
ర్జన్యోద్వృత్తికిఁ జొచ్చినాఁడని దురాచారంభకుఁ డ్రోధోద్యుక్తుఁడై. ౬౫

— బ్రహ్మయును గశ్యపుని శపించుట —

కం॥ వరుణుని శాపానుగతిన్, ధరణిన్ జన్మించి ధేనుతతి కాపరివై
పరిభవము నొందుమని తా, మరసోద్భవుఁ డట్లు పలుక మది ఖిన్నుండై. ౬౬

మ॥ అపరాధంబు సహించి కావుమని దేవాధీశునిన్ వేడి క
శ్యపుఁ డంఘ్రిద్వయిమీఁద వ్రాలెఁ గరుణాయత్తైకచిత్తంబునన్
దపసీ! భూతలభారనిర్వృతికినై దైత్యారి నీ పుత్రుఁడై
యుపలాపించు భవద్విషాదమని నెయ్యంబొప్ప బల్కెన్ లలిన్. ౬౭

చ॥ అదియనుగాకఁ దొల్లి దితి ♦ యాగ్రహమూని సపత్నియైన య
య్యదితిని దిట్టె మానుషభ♦వాంతర మొందుచు శాపతప్తనై
పదపడి పుత్త్రులన్ గనుచుఁ ♦ బాయుచు నేస్వరచేఁ గృశింపు మం
చదయత నన్న గంధవతి♦యాత్మజుఁ గన్గొని పల్కె రాజయోగిన్. ౬౮

కం॥ వారిపుపురు దక్షసుత ల,వారిత కోపమున భగిని♦పైఁ గోపింపన్
గారణము తెల్పు మనఁగా, నారాజన్యునకుఁ దెల్పె ♦ నావృత్తంబున్. ౬౯

చ॥ నిజ మిది దక్షపుత్త్రిక ల♦నిందితరూపవిలాససంపదన్
ద్విజవరుఁ గశ్యపున్ గలసి ♦ వేడ్క సుఖించుచు నున్నయంత న
గ్గజనిభయాన యా నదితి ♦ గాంచె భుజాబలసాంద్రు నింద్రునిన్
నిజసుతదర్పనిర్హరణ♦నిష్ఠురవజ్రనిరస్తతంద్రునిన్. ౭౦

చ॥ కనుఁగొని యోర్వలేక తన♦కన్న బలాఢ్యునిఁ బుత్త్రుఁ గాంచఁగా
మనమున నిశ్చయించి తను♦మధ్య పతిన్ గని శక్రతుల్యుఁడౌ
తనయుని నాకొసంగుమని ♦ తద్దయు వేడిన మెచ్చి యట్ల యౌ
నని సుతసిద్ధికై యతివ ♦ యాత్మ గణింపు మొకండు దెల్పెదన్. ౭౧

కం॥ చేయుము పయోవ్రతమ్మును, నాయతభుజబలుఁడు శతమ♦ఖాభుఁడు పుత్త్రుం
డోయింతి! కల్గు నీ కన, నామెడఁ దద్వ్రతము సలిపె♦నట్టుల దితియున్. ౭౨

చ॥ వ్రత మొనరించి వల్లభు న♦వారితకామకళానుభూతులన్
మతిఁ గరఁగించుచున్ గదియ ♦ మానిని కంతట గర్భమయ్యెఁ ద
ద్వ్రత మెడలేక సల్పుచు న♦వారణమై భువిఁ బవ్వళింపుచున్
సతతము నిష్ఠ నుండు నెడఁ ♦ జారుకళామయమై చెలంగఁగన్. ౭౩

కం॥ గర్భము నానాఁటికి గడు,దుర్భరమై పెరుఁగ దితియు ♦ దుశ్చ్యవనసమా
నార్భకుని మోయుట శుభా,విర్భావముతోడఁ జూడ ♦ వింతఁగ నలరెన్. ౭౪

మ॥ దితియుత్సాహముఁ జూడలే కదితి యెం♦తే వేదనన్ మ్రగ్గుచున్
సుతుఁ డింద్రోపముఁ డివ్వధూజఠరమున్ ♦ జొచ్చెన్ మదీయాత్మజుం
డతిదౌర్బల్యము నొందునో? యనుచుఁ జిం♦తావిష్టయై గర్భ ని
ర్హృతి గావింపఁదలంచి యాత్మఁ గడు ని♦ర్వేదంబునుం బొందఁగన్. ౭౫

కం॥ పుత్త్రనిబర్హణధీరున్, శత్రుం బుత్త్రుఁ డనరాదు ♦ శాసింపఁదగున్
గాత్రమున రాజయక్ష్మను, సూత్రమ్మున నణఁపకున్న♦చో సుఖ మగునే? ౭౬

కం॥ కావున నుత్పన్నదశన్, వేవేగన్ జెఱుపకున్న ♦ వేడుక గలదే?
యీవెత కనఁగా మది శ,ల్యావహమై యున్న దెట్టు ♦ లగునో మీఁదన్. ౭౭

శా॥ ఏదేనే నొక నేర్పుచేఁ జెఱుపుమం చిందుర్ బ్రయోగించెదర్
భేదింపన్ గలవాఁ డటంచు సుతునిన్ బిల్పించి నాకున్ బ్రియ
ప్రాదుర్భావముఁ జేసెదేని దితి గర్భచ్ఛేదమున్ జేయు మా
మోదం బాత్మసుఖావహం బగు నన న్మూర్ఛించి జంభారియున్. ౭౮

—॰ ఇంద్రుండు దితిగర్భమును భేదించుట ॰—

వ॥ తల్లీ! పయోవ్రతంబున క్షీణదేహవై దుర్బలంబుగ నున్నదాన వని యరసి సేవింప నరుగుదెంచితి, గురుశుశ్రూషణంబుకన్నఁ బుణ్యంబు గలదె? యక్షయ ఫలం బొసంగుం గదా! నీకును మన్మాతయగు నదితికి నేమియున్ భేదంబు గల్గునే చరణసంవాహనం బొనర్చెద నని పాదంబులు స్పృశించి యొత్తంగఁ జూచినఁ దత్సుఖపరవశయై విశ్వసించి నిద్రం జెంద నంత శతక్రతుండు మే నెఱుంగక నిద్రామగ్నయై యుండుటఁ దలంచి యతిసూక్ష్మరూపంబున శస్త్రపాణియై యుదరంబుఁ బ్రవేశించి గర్భస్థుండగు నర్భకు సప్తఖండంబులుగా వజ్రంబున దునియ లొనర్చి వాఁడు రోదనం బొనర్చిన మా రుద! మా రుద! యను వాక్యంబుల మెల్లన నూరడించి సప్తశకలంబులు నొక్కొక్కటి సప్తశకలంబులుగా నేకోనపంచాశత్ఖండంబు లొనర్చి బహిర్గతుం డగునంతలోన ౭౯

కం॥ దితి గర్భవేదనంబున, మతిచెడి వేగంబ లేచి మఘవంతుని నీ
పతితా! యని కోపించి య,దితి కృత్యముగాఁగ నెంచి తీరనికిన్కన్. ౮౦

—॰ అ ది తి దే వ కీ దే వి య గు ట. ॰—

చ॥ శుభకర మంచు మజ్జరసూదన మిట్టులు పుత్త్రి నంపి నీ
వభయతఁ జేసి తింక ఖలుఁడై యొనరించెను నీ సుతుండు త
త్త్రిభువనరాజ్య మెల్ల రిపుతీవ్రబలాహతిచే నశించి ని
ష్ప్రభుఁడయి నీ సుతుం డొదుగుపాటున గుప్తతఁ గాంచిపోయెడిన్. ౮౧

కం॥ నాతనయులవలెఁ బొలుపరి, నీతనయులు పుట్టిపుట్టి నిహతు లగుదు రీ
వాతత బంధిం బడి శో,కాతురనై యుండె దనుచు నదితిం దిట్టెన్. ౮౨

శా॥ అంతం గశ్యపుఁ డాలకించి దితికోపావేశమున్ మాన్పి య
త్యంతప్రశ్రయవాక్యముల్ పలికి చింతన్ మాను మీ పుత్త్రికుల్
కాంతా! దేవగణంబులోఁ గలసి సఖ్యం బింద్రుతో సల్పి దు
ర్దాంతప్రాభవశాలు లయ్యెదరు సంతాపింప నీ కేటికిన్? ౮౩

కం॥ దితినిట్టుల నూరార్చి య,దితిఁ గన్గొని వరుణశాపతీవ్రతచే మ
త్కృతము నమానుషజన్మ,స్థితిచే నిది యనుభవింపఁ జేకుఱు జుమ్మా. ౮౪

సీ॥ అని దేవమాత సురార్చిన శాంతమై, సవతిపైఁ గోపంబు సడలి వైచె
దైవసంకల్పంబు దప్పదు గావున, దేవకియును వసుదేవుఁ డిరువు
రదితికశ్యపు లని యరయుమీ భూనాథ!, యనిన నాశ్చర్యమగ్నాంతరంగుఁ
డయి జనమేజయుఁ డనియె మహాభాగ!, విస్మయం బొసరించె వినినయంత
గీ॥ నియ్యుపాఖ్యాన మతిహృద్యమయ్యె మది న, పారసాధ్వసమొదవె సంసారబంధ
బంధనం బెంత హర్షనిర్గంధనంబొ, తలఁచి నంతట హృదయంబు తల్లడిల్లె. ౮౬

ఉ॥ చేతనకోటిఁ జెందు పరసిద్ధి యెఱింగితి సంసృతిస్పృహా
పాతము భీతిఁ గొల్పె నుతిపాత్రుఁడు కశ్యపునంతవాఁడు సం
ఘాతసదృక్షయోనిగుగర్తమునం బడె నంచుఁ బల్కి తీ
వేతరమయ్యె మేము? తరియించుట గల్గునె మమ్ము బోట్లకున్

ఉ॥ "అస్తు తథా" యటంచు హృదయంబున మే లనియెంచి విందు ది
వ్యస్తవనీయ నీవచనవర్ణితపూర్వకథాసుధాకృత
స్వాస్తికసంపదల్ మరగి జంతుపరంపరజీవనంబు ప్రా
జ్ఞస్తుతిపాత్రమం చనఁగ సమ్మతమే? యరయంగ నన్నిటన్. ౮౭

గీ॥ త్రిభువనాధీశుఁడైనట్టి దేవవిభుఁడు, దితికిఁ బుత్రుండుగాఁడె యద్దేవి యెడలఁ
గడు జుగుప్సితకర్మంబు నడపె గర్భ,గహనగాహము శిశువధకై యొనర్చె.

ఉ॥ దారుణచర్య కోర్చి జగదావహనైకధురంధరుండు దు
ర్వారశతక్రతూద్వహనవంద్యుఁడు ధర్మవినేత వజ్రి సాం
సారికతుచ్ఛవృత్తికి వశంవదుఁడౌట మదీయపూర్వజుల్
కౌరవకోటితోఁ బెనఁగు కైవడిఁ దోఁచె వచింప నేటికిన్. ౮౯

సీ॥ గంగాసుతద్రోణకర్ణ కృపాచార్య, తద్భాగినేయులు దండనీయు
లగుదురే? ధర్మంబ యాకృతిఁ దాల్చిన, యట్టి యుధిష్ఠిరుం డాహవమున
వారితోఁ బోరుట వచనీయమే? హరి, ప్రేరితులై కాదె యిట్టిపనికి
సాహసించు టసారసంసారమునకునై, యింతఁ జేసిరి సర్వమెఱుఁగరొక్కొ
గీ॥ క్రతుభుగంశులు గారె యాఘనులు వారి, నెన్న నేటికి హర్షించి విన్న నన్నుఁ
జంచలాత్ముఁడ ననరాదె శాస్త్రమైన, ధర్ముఁ డెటు గాఁడె? నిందింపఁదగు నతండు.

ఉ॥ ఆప్తునిపల్కు తథ్యమగు నందురు తథ్యమయేని దేహి రా
గాప్తిని నింద్రియార్థపరుఁడై చరియింపఁడె? రాగ మీర్ష్యచేఁ
గ్రప్తముగాదె ద్వేషమునకేఁ బరమాత్మ ఫలాభిలాష సం
తృప్తి కసత్య మాడఁడె యతిప్రవరా! యది కీడుఁ గాదొకో. ౯౧

మ॥ చరవృత్తిన్ హరి విప్రవేషత జరాసంధున్ విదారింపఁగా
సురరాజాత్మజభీములన్ జొనిపి యచ్చోఁ దానున్ విప్రుఁడై
కరణీయం బని వానిఁ గూల్పఁడె ? జగత్కల్యాణమైనట్టి య
ధ్వర మేతత్ఫలకాములై సలిపిరో ధర్మంబు లిట్లుండునే. ౯౨

సీ॥ యజ్ఞముల్ సేయుట యాముష్మికార్థులై, శాంతులై కాదె? రాజన్యవరులఁ
బరిమార్చి యనృతముల్ బలికి దంభ మొనర్చి, చేయుటవిధియొక్కొ? చిత్రమయ్యెఁ
బౌరాణికులు ధర్మపాదంబు లందురు, సత్యశౌచదయాప్రసర్పణములు
తద్విహీనములైన ధర్మముల్ ధర్మంబు,లగునె ? స్వర్గాదిఫలాప్తి యిడునె?
గీ॥ యిట్టి ధర్మంబు బోధించినట్టి కృష్ణుఁ, డిచ్చ సామ్రాజ్యసుఖభూతు లిచ్చగించి
రేమి చెప్పుదు శాస్త్రమై యిష్టుఁడైన, హరి యొనర్చిన కార్యంబులవని వినమె.

మ॥ కపటాచార్యుఁ డనంగ వచ్చు హరి శక్రప్రార్థితుం డౌచు ని
క్కపు విప్రుండును బోలె వామనతచేఁ గర్మిష్ఠుఁడై దానముల్
జపముల్ శీలము గల్గి పెక్కుక్రతువుల్ సర్వాంగసంపూర్తిఁ జే
సి పటిష్ఠుండగు పుణ్యమూర్తి బలి వంచించెన్ గదా ? కంటిరే. ౯౪

కం॥ స్థానభ్రంశ మొనర్చెన్, దానవరిపుఁ డతని దానఁ దన కెద్ది జయ
శ్రీ నెలకొనె నిరువురలో, న్యూనత యెవ్వరికి నగునొ యూహింపంగన్. ౯౫

కం॥ వంచించి బలిని శక్రుని, కంచితముగఁద్రిభువనముల కధికారము హ
త్తించెన్ నిర్వంచకుఁడై, పంచాయుధుఁ డిచ్చె నొక్కొ పరికింపంగన్. ౯౬

ఉ॥ ఎన్నివిధంబులన్ గనిన నెంత మహాత్ములకైన దంభ సం
ఛన్నత లేకపోవునొక్కొ చక్రధరుం డిటు సేయ దేహులం
దెన్నఁగనేల నామదికి నిట్టుల సందియ మిన్మడించు నీ
కన్నఁ బురాణవక్తలను గానము, సేయుము సంశయచ్ఛిదన్. ౯౭

క॥ వేదవ్యాసుం డిట్టులు, వాదించుచు నున్న నృపతివర్యునిఁ గని స
మ్మోదమునఁ బలికెఁ జక్రి క,నాదరణము లేదు బలిని నణఁచుట యెడలన్.

మ॥ బలివిద్వేషికిఁ బ్రార్థనావశమునన్ బ్రహ్మాండ సర్వస్వముల్
దొలుతన్ బట్టము గట్టఁగోరి సమయోక్తుల్ పల్కుటన్ జేసి య
బ్బలి వంచించి త్రివిక్రమప్రతిభ సంపాదించి సత్యవ్రత
స్ఖలనం బించుక లేనివాఁడని బలిన్ గాపాడఁడే చక్రియున్. ౯౯

గీ॥ ధర్మమూలంబు సత్యంబు ధరణిలోనఁ, గాన వామనమూర్తి యద్దానవేంద్రుఁ
బ్రోవ వానినిఁ గావఁడే భువన మెల్ల, వినఁగ నిది దంభ మన నేల విష్ణువునకు.

శా॥ మాయారూపిణియైన దేవి జగమాహాత్మ్య ప్రోద్ధసత్త్వాదులన్
హేయాహేయ విశేష భేదములచే - సృష్టిక్రియాచాతురిన్
జేయన్ దద్వశమై ప్రవర్తిలు మహాచిద్రూపిణీశక్తిచే
స్థేయంబా భువనత్రయంబునను స్వాధీనత్వ మొందొందునే. ౧౦౧

క॥ గుణసాంకర్యముచే జగ,మణురూపిణి నిండి యుండ - నఖిలము తత్కా
రణమున వర్తించుట యిం,దణుమాత్రంబైనఁ దెలియనగునే మనకున్

కం॥ ధర్మము లధర్మనిభము ల,ధర్మంబులు ధర్మరీతిఁ - దనకు భవానీ
కర్మపరిభావ మెఱుఁగుట, మర్మజ్ఞులకైన రాదు - మానవనాథా. ౧౦౩

సీ॥ నిస్సంగవృత్తిచే - నిష్పరిగ్రహతచే, హర్షశోకంబుల - నవలఁ ద్రోసి
సత్యవ్రతస్థులై - శాంకరి భజియించు,వారలు శుద్ధసత్త్వమ్మువారు
ఇతరంబు శబలితం - బీ గుణంబులు మూఁట, వేద పురాణాదివిద్యలందు
నేకవాక్యత లేదు - లోకంబు సగుణత, వర్తిల్లు నిర్గుణవర్తనంబు

గీ॥ సంభవింపదు గాన నీజ్జగము లెల్ల, నష్టదృగ్భావసంగతి - నడచుచుండు
నిర్వ్యళీకత ధర్మంబు - నెఱపుఘనుఁడు, గలఁడె యెందెందు వెదకినన్గారవేంద్ర.

వ॥ మఱియును మాయామోహితులై జన్మజన్మంబున భూతకోటులు మాయాగ్రస్తంబు లగు నింద్రియంబులఁ జేపట్టి తదాసక్తంబై మనంబు గుణప్రేరణంబున నానావిధభావంబులన్ జంతువులన్ బ్రవర్తింపన్ జేయుచు సర్వంబును దానయై యుండుఁ గాన బ్రహ్మాదిస్తంబపర్యంతంబులైన జంగమస్థావరంబులు మాయావశంబులై క్రీడించుచుండు నభిప్రేరితంబు లగు బలీవర్దంబులఁ గోపనుండగు కర్షకుండునుంబోలె నెల్లవారలన్ బ్రవర్తింపఁ జేయునది మాయామయం బగు మనంబె కదా. ఇంద్రియార్థంబుల నెంటం బడి విహరించు నరునకు ధర్మాధర్మంబు లనుట లేదు కావున ఛలంబు ననువర్తించు దానంజేసి పాపం బగ్గలంబగుఁ దద్ద్రోహంబులే కదా? కామక్రోధలోభాదిరిపువర్గంబులు, తద్వశంబునఁ గృత్యాకృత్యంబు లెఱుంగక ప్రాణులు ప్రవర్తింతురు. విభవమ్మునంజేసి యహంకారంబును దానిచే మోహంబును దానిచే మరణంబును గలిగెడి మఱియు సంకల్పవికల్పంబులు రాగద్వేషంబులు తృష్ణాదంభంబులును బ్రవర్తించు. దానంజేసి యధర్మంబున నరకంబు నొందునని మఱియును,

ఉ॥ దానము యజ్ఞమున్ వ్రతము - తైర్థికచర్యలు దంభయుక్తుఁడై
పూని యొనర్చెనేని యవి - పుట్టు వొనర్పు నదాంభికుండు నె
ద్దేనియుఁ జేసినన్ దుది నభీష్టఫలంబు లొసంగుచుండు దు
ర్మానఘనుండు సేయుకృతి - మత్తగజప్లుతి సాటియౌఁ గదా. ౧౦౬

గీ॥ వస్తుశుద్ధి మనశ్శుద్ధివలనఁ దెలిసి, ద్రోహచింతన మెల్లను దొలఁగఁబెట్టి
కార్యమొనరించు నాతఁడవార్యఫలము,లొందు నిసుమంతఁ జెడిన లేదెందు ఫలము.

మ॥ యజమానుల్ క్రియలున్ ధనంబులును మంత్రాదుల్ ద్విజుల్ మంత్రముల్
ఋత్విజులున్ గాలము దిక్తటంబులు విశుద్ధిన్ జెందెనే సమ్ముఖం
బజహత్పూర్ణఫలం బొసంగు విఫలంబై పోవు నిందొక్కటే
నిఁ జెడన్ దత్ఫల మంత మొందుఁజుమి సందేహంబు లే దిమ్మెయిన్. ౧౦౮

కం॥ తనకును సభియాతికి జయ,మును నపజయమును దలంచి మూఢత శుద్ధిన్
గనకున్న ఫలము వినిమయ,మునఁబొందుర్ దెలిసి చేయ మొనయ శుభంబుల్.

సీ॥ దైవంబు మదిలోనఁ దలఁచి పౌరుష కృత్య, మొనరింపవలయుఁ జేయునెడనది సు
కృతకార్యమొక్కొ? దుష్కృతకార్యమో మీదఁ, గర్తయి యొవ్వరుఁ డెగాఁ గలుగుఁగాన
సత్త్వసంభూతు లస్వప్నులం చననేటి, కన్యోన్య వైరంబు లందుఁ గలవు
క్షితిని దిర్యగ్జాతిఁ జెప్పనేటికి సురల్, జపతపోవిఘ్నముల్ సలుపరొక్కొ?
గీ॥ తృప్తి దీరమి లేదొకో ద్వేషమున ని,శాచరులతోడ వైరంబు సలుపరొక్కొ?
గాన సంస్కృతులివి యహంకారజనిత, ములు గదా రాగరోషముల్ గలుగుటరుదె?

మ॥ కృతకాలంబున రాగరోషములచేఁ గీడింపఁగా నిక్కలిన్
మతిహీనుల్ చరియించు టేమి యరుదమ్మాయామయంబైన సం
సృతి నద్రోహులు గల్గియుందురె? సురల్ స్వార్థస్థమై ద్రోహులై
క్షితి న్యూనాధికకర్మభోగములకున్ జేరంగ నూహింపమే. ౧౧౧

గీ॥ మానవులనంగ నెంతయిమ్మహితలమున, ద్రోహికిని ద్రోహమొనరించు ద్రోవసరిమె
ద్రోహమొనరింపకున్న యద్రోహి యెడల, ద్రోహమొనరింతురీవింతఁ దొడరనేల.

ఉ॥ కానలఁ గోనలన్ నిలిచి కందలుఁ గాయలు మెక్కి యెండకున్
వానకు నోర్చి శోషిలు తపస్విజనంబుల కంతరాయముల్
పూని యొనర్చునట్టి సురపుంగవుఁ డేమి యెఱుంగఁడయ్యెనో?
తానని యెంచనేమిటికి దైవికమాయగదా? తలంపఁగన్. ౧౧౩

మ॥ యుగభేదంబులతోఁ బనేమి? పురుషార్థోద్యుక్తుఁడౌ సాత్త్వికుం
డు గణింపన్ సకలంబునున్ గృతయుగాటోపంబునన్ జూచు స
ర్వగరీయుండగువాఁడు తత్పరులు సర్వం బాత్మసామ్యంబుగా
జగతిన్ గాంతురు వాసనావశతచే స్వస్వార్థ సంసిద్ధికిన్. ౧౧౪

## — నరనారాయణులు తపస్సు చేయుట —

కం॥ వాసన రెండు దెఱంగుల, భాసించును శుద్ధమలినభావంబులచే
నాసంకల్పము ధర్మము, లాసరణిన్ జేయఁజూడనగు నిద్ధాత్రిన్. ౧౧౫

కం॥ ఏతత్సాధకమైన పురాతనవృత్తాంత మొకటి బ్రాహ్మపతిప్ర
జ్ఞాతుఁడు ధర్ముఁడు నా విఖ్యాతుఁడు వేదవ్రితాంచితాత్ముఁడు వెలయున్. ౧౧౬

ఉ॥ సాత్త్వికుఁడై శ్రుతాధ్యయనసంపదలన్ జెలువొంది నిష్ఠచే
దత్త్వపరీక్షలన్ విబుధతండములన్ జతురుండు నాఁ గా
మత్వర దక్షకన్యల సమంత్రవిధిన్ దశసంఖ్యనొప్పు చా
రుత్వసతీత్వమాన్యల నిరూఢి వరించె గృహస్థధర్మియై. ౧౧౭

కం॥ అతివలతో రతితంత్రోన్నతుఁడై హరిఁ గృష్ణు నరుని నారాయణునిన్
సుతులన్ నల్వురఁ గాంచెను, రతిపతిసుందరకళాభిరామాకృతులన్. ౧౧౮

మ॥ హరి కృష్ణుండును యోగమార్గనిరతాభ్యాసక్రియాధుర్యులై
నిరతంబున్ భవనానురోధగతి నిర్ణిద్రస్పృహన్ వర్తిలన్
నరనారాయణు లిద్దఱున్ హిమగిరిన్ దరిప్రస్థముం జేరి బా
దరతీర్థంబున సత్తపోనియతి నుద్యన్నిష్ఠులై యుండఁగన్. ౧౧౯

కం॥ చిరకాలం బరిగినఁ దత్పరతన్ గంగానదీప్రపాతమ్మున ను
ద్ధురనిష్ఠ వేయివర్షము, లరుదుగఁ దప మాచరించి రతులస్థితిచేన్. ౧౨౦

## — ఇంద్రుఁడు నరనారాయణుల తపంబునకు విఘ్నంబు చేయుట —

సీ॥ వారి తపోనలజ్వాలల జంగమస్థావరాత్మకములౌ జగము లెల్ల
తపియింపఁజొచ్చినతఱిఁ బురుహూతుండుఁ, జింతించె నే నేమి సేయువాఁడ
ధర్మపుత్రులు తపస్తత్పరుల్ వీరలు, మత్పదం బాక్రమింపంగఁగలరు
సంకల్ప మెట్టిదో సందియంబు పొసంగెఁ, గామలోభక్రోధకల్పనమునఁ

గీ॥ దపముఁ జెఱిచెద ననుచు వేదండ మెక్కి, తత్తపోవిఘ్నకారియై తరలి శీత
శైలతటిఁ జేరి పరమనిశ్చలసమాధికలితులౌ ధర్మపుత్రులఁ గాంచి యంత.

మ॥ ధరకున్ డిగ్గిన భాస్కరద్వయమొకో? ధానంజయద్వంద్వమో?
హరిధాతృద్వితయంబొ? ధర్మసుతులో? యంచున్ విలోకించుచున్
హరియభ్యర్ణముఁ జేర వచ్చి భవదీయంబౌ తపశ్శక్తికిన్
గరుణింపన్ జనుదెంచినాఁడ వర మాకాంక్షింపుఁ డేదేనియున్. ౧౨౧

ఉ॥ తాపసులార! మీతప ముదారత మెచ్చితిఁ గోరుఁ డెద్ది సం
తాపముఁ జెంది డస్సితిరి తథ్య మెదేనియు నీదలంచితిః
యాపనమేల? వేడుఁ డన నత్తపసుల్ దృఢనిష్ఠ నంతరు
స్థాపితచిత్కళాజ్వలనతత్పరులై తనుఁ జూడకున్నెడః. ౧౨౩

సీ॥ గాంధర్వశాంబరీకల్పనాధుర్యుఁడై, వ్యాఘ్రసింహవరాహవనగజాది
భీకరాకృతుల నుద్దేశించి భయపెట్ట, వెఱవకయున్న దర్వీకరాళి
సరఘాకృతుల నేపఁ జలియింపకున్న వర్షాతప శీతహిమానిలాది
విసరణంబులఁ జాల వెతపెట్టఁ గదలమి, బెడిదంపుమాయలఁ బెనఁగి పెనఁగి
గీ॥ బెదరుకొల్పఁగ వచ్చి తాఁబెదరి పురికి, హరి యరిగెఁగాని భయమోహభరితవృత్తి
బాహ్యానుసంధాన మెఱుఁగకపరమనియతిఁ, దరలకుండెను దాపసద్వయము కడిమి.

గీ॥ గిరివిభేదనుఁ డట్టి నిష్ఠురతపస్వి, ధర్మనందన తాపసోద్ధరణమునకుఁ
జాలఁడన వేతె యొక్కండు శక్తుఁ డగునె, యట్లుతత్తాపసాగ్ని లోకాళినలమె.

మ॥ సకలాండేశ్వరి నాదివిద్యను మహాశక్తిః బురాణిః బరా
ప్రకృతిః శాంభవి నాత్మ నిల్పి నియమప్రారంభనిర్దంభది
వ్యకళాలోకనచేఁ దపించు మునిరాడంతస్థితిః ద్రిప్ప నే
రికి శక్యంబగుఁ గొండమైనను వెసః మ్రింగంగ శక్యంబగుః. ౧౨౬

క॥ దేవాసురకృతమాయా, భావము యన్మాల మట్టి మాయామయినిః
భావించు వారి నింకొక, శ్రీవన్ మాయలఁ గలంచునదు రెవ్వారుః. ౧౨౭

మ॥ అవనిః వాగ్భవ కామ రాజ యుత మాయా బీజముల్ సంతతా
ధ్యవసానస్పృహ జిహ్వాకాగ్రమున నుద్యన్నృత్యముల్ సల్పుచుః
భువనాలంకరణుండు వేల్పొకనికిః బొంకింప వేధింపఁగా
నవునే? నిర్జరనాయకుండె కద? దృష్టాంతంబు లోకంబులః. ౧౨౮

ఉ॥ అంత శచీవిభుండు హృదయాంతర దంతుర చింత నంత న
త్యంతముఁ గుందుచుః బుుషులఁ దాపసవృత్తిఁ గలంపఁగా రతీ
కాంత వసంతులః బిలిచి గ్రక్కున మీరు తుషారభూధర
ప్రాంతమునః దపించు బుుషిహంసల నిర్వార నేపఁగాఁ దగుః. ౧౨౯

గీ॥ గంధమాదనశైలపుఁగటకములను, దపము సేయుచు నున్నా రుదారనిష్ఠ
నేను వారల మాయామహేంద్రజాల, జాలముల నొడ్డిచూచితిఁజాలనైతి. ౧౩౦

మ॥ సుమబాణాసన ముక్త మోహక శరస్ఫూర్తిః విజృంభించి య
య్యమళంబుః భవదీయ విక్రమ పటువ్యాపారముల్ సేసి బో

ధము మాన్పఁగ యతనం బొనర్పఁ డన సుహృద్వ్యక్తి వారిర్వురన్
హిమశైలస్థలికిన్ బ్రయాణమయి రెంతే సాహసప్రౌఢిమన్. ౧౩౧

కం॥ కని మరుని నంత శక్రుం, డనియెన్ మత్ప్రియుఁడ వగుచు నరుగుము వారిన్
వనితావశులుగఁ జేయుము, ఘనకామాతురతఁ దపము కడచని నవయన్. ౧౩౨

కం॥ వంచుము పూవిలు శరముల, ముంచుము దట్టించి శైలమును విడిచి చనన్
గాంచుము నీ మాయాబల, మెంచుము మత్స్నేహసరణి నెదలో మదనా.

చ॥ హరియు హరుండు బ్రహ్మయును నర్కుఁడు చంద్రుఁడు లోనుగాఁగ నె
వ్వరు భవదీయ పుష్పశరవార నిపీడన నొందలేదు? స
త్వరముగఁ బొమ్ము తాపసుల ధైర్యము నీ కది యెంత పెద్ద? య
చ్చరలను నీకు దోడుగ నొసంగెద రంభ మొదల్ మనోభవా. ౧౩౪

కం॥ ఒక్కొక్క రెంతపనినేన్, జక్కం బెట్టెదరు నీవు చన రంభయునున్
మొక్కలపుఁ దిలోత్తమయును, నిక్క మ్మిందఱును గూడ నిలుచునె? నిష్ఠల్?

కం॥ రంభాతిలోత్తమాదిక, రంభోరుల నంపువాఁడ రతివల్లభ! సం
రంభింపుము మాని తప, స్స్తంభన మొనరింపు కోర్కి సఫలముగాఁగన్" ౧౩౬

ఉ॥ నాకముఁ గోరిరో? త్రిభువనంబుల నేలఁ దలంచిరో? జగ
ద్భీకరవృత్తిచేఁ దపము పెద్దయు మౌనులు సేయుచున్నవా
రేకత మొక్కొ? మాయ నలవరించిన బెగ్గిలరైరి నీదు న
స్తోకసుమాస్త్ర ఘట్టనలఁ జూడ్కి వశీకృతిఁ గూర్పు మిర్వురన్. ౩౩౭

— మన్మథుఁడు నరనారాయణుల తపంబునకు భంగము గలిగించుట —

మ॥ చనుమీ? యన్న సుమాస్త్రుఁ డిందుఁగని నీ సంకల్పితం బన్యథా
చనునే విష్ణువిధీశ్వరాదులగు స్వర్గశ్చారుల్ క్రుధాయత్తులై
నను దృష్ణావశులై వధూవివశహృన్నాళీకులై గంధమా
దన శైలేంద్రము డిగ్గి తూఱి పరువెత్తన్ జేతు దేవాధిపా. ౧౩౮

చ॥ ఎఱిఁగిన దొక్క విన్నపము నేనొనరించెద నాత్మలోపలన్
మఱవకు భక్తిభావమున మాయమహేశ్వరి దేవిఁ గూర్చి వా
రఱిముఱి నిష్ఠనుండినఁ దదంతిక మేఁ జొరవాఱ దీన న
న్నఱమఱమైఁ దలంపకు సుమాస్త్రవిఘట్టన మొంద దచ్చటన్. ౧౩౯

కం॥ దేవీపద నిష్ఠాకృత, భావనగలవారలైనఁ బైఁ జన నేరన్
గావునఁ బల్కితినని యాజ్ఞావశుఁడై పుష్పశరుఁడు చనియె నచటికిన్. ౧౪౦

వ॥ అంత గంధమాదనంబున సుమశరప్రివేశంబునకుఁ దొలుత వసంత ప్రివేశం బగుటయు సహకార వకుళ తిలక కింశుక సాల తాల తమాల తక్కోల మధూక చంపకాశోక నీప కురంటక కృత తమాల ఖర్జూర నారంగ నారికేళ క్రముక కర వీరాది తరుషండంబు లొక్క మొగిఁ బెక్కు తెఱంగుల బ్రివాళ ముకుళ కుసుమ ఫలభరితంబు లై నర్ల బారులు గట్టి ఝుంకారంబు లొనర్చుచు సుమనఃపరంపరా మధు ధారా సారంబులు గ్రోలుచు కుహూ నిశీథినీ సంతమసంబు పోలిక నెల్ల యెడలర్ల బిట్టుగా విహరించు నిందిందిర బృందంబులును జల్లఁ జల్లనఁ బల్లవ తల్లజంబులర్ల మెక్కి నిక్కి చలచ్చంచూపుట నిర్గళిత మధురాలాప శ్రవణ సంజ నిత విరహిజన వేదనానిభృతంబులగు పరభృతంబులును దీఁగఁబోండ్ల తెఱంగున రంగుదుఱంగలింపుచుఁ బుష్పిణులయ్యును, మాధవీ మృద్వీకాది లత లల్లిబిల్లిగా నల్లుకొనఁ బరవశు లగు కాముకుల వడువున నిశ్చలదీక్షంబులగు వృక్షంబులును సరోవర కమల కల్హారనాళికాస్వాదంబున మేదురంబులై నిజాంగనాసాహిత్య సమరప్రియతా సాహిత్య సుఖాశంసంబు లగు రాజహంసంబులును మరందబిందు తుందిలంబులై వల్లీమతల్లికలను బ్రివాళహస్తంబుల నభినయింపర్ల జేయుచు వారాంగనావతంసంబుల నటింపంజేయు భరతుండునుం బోలె విలాస సన్నా హుండగు మందగంధవాహుండును, బ్రేమయుక్తులై స్మరాతుర లగు స్వభార్యలం గలసి క్రీడాసక్తులై విహారచతురు లగు నరులును గలిగి వసంతంబు దురంతంబై దిగంతంబుల నిరంతర కంతువిజయ సమాక్రాంత త్రిలోక విశ్రాంతంబై ప్రవర్తించునెడ. ౧౪౧

కం॥ విషమశ్వసనాయామా,భ్యుషితేంద్రియ వృత్తు లగుచు ◊ నురుతర నిష్ఠా ధ్యుషితాంతఃకరణుల మను, ఋషివర్యుల కెల్లఁ జిత్తవృత్తులు చెదరెర్ల. ౧౪౨

మ॥ సుమకోదండము చేతఁ బూని విజయస్ఫూర్తిర్ల రసాలాస్త్రముల్ భ్రమరజ్యా ఘటియించి కీరతురగావల్గద్రథిర్ల దూఁగుచుర్ల హిమభూభృద్బదరీవనీతటమునం ◊ దిచ్ఛావిహారోచిత క్రమము ల్చూపుచుఁ గంతుఁ డంత జయ దీక్షాదక్షుఁడై చేరెర్ల. ౧౪౩

సీ॥ షట్పదషట్పదీ ◊ ఝుంకారములు మించె, శుక శుకీ నిస్వనస్ఫూర్తి మెఱసె పరభృత పరభృతీధ్వనులు మేరలు మీఱె, వృక్షపంక్తులు పుష్పవృష్టిఁ గురిసె నందంద మంద మందానిలంబులు వీచె, నరవిందగంధమ్ము ◊ లల మెదిశల విరహిణీ సమధికా వేదనల్ తఱచయ్యె, లలిత మాధ్వీ ఝురుల్ గలయ నలమె

గీ॥ నిట్లు ఋతురాజ విహరణోద్వృత్తి మెఱసె, వట్టిమ్రాకులుఁ జివురులు వెట్టుచుండ నితరు లన నేల త్రైలోక్యమెల్ల బ్రిథమ, రస పరీపాక జృంభణాక్రాంతమయ్యె.

మ॥ నరనారాయణు లిర్వు రప్పుడు మనో§నాళీకచింతాంకురో
త్కరముల్ మెల్లన సోగలై పెరుగఁ బ్రో§ద్యద్విస్మయావిష్టులై
సురభిప్రక్రియ ముల్లసిల్ల దెసలన్ § జూడంగఁ గాలంబు గా
దరుదయ్యెన్ నరు లెల్ల శంబరవిప§త్త్రాధీనతన్ బొందుటన్. ౧౪౫

ఉ॥ వింత గదా యటంచు సర§విన్ మునిచంద్రులు నిర్వురున్ మదిన్
భ్రాంతి వహింప నిర్విషయ§భావ మభావము నొంది చింత యం
తంతకు నగ్గలంబయిన § యాంతరవృత్తి ప్రసంగ దయ్యె ని
శ్చింతసమాధి యొత్తిగిలెఁ § జిత్తజశక్తి యెఱుంగ శక్యమే? ౧౪౬

క॥ ఆయెడ నకాలశిశిరా,పాయము వర్తిలఁగ జగము § పంచశరశరా
ధేయత శరతల్పాంత,స్థాయి ద్యునదీతనూజ § సదృశతఁ గాంచెన్. ౧౪౭

ఉ॥ పాయని యాంతరస్థితి క§పాయసదృష్టహృదయవ్యథాప్తి నా
రాయణమూర్తి నవ్వుచుఁ బు§రాతనమౌని నరున్ వసంతచ
ర్యాయతశోభలన్ గనుచు § హర్షరసాంబుధి నోలలాడుచున్
మాయిని దేవిచిత్రము ల§మానుషముల్ గద? యంచు నిట్లనెన్. ౧౪౮

ఉ॥ ధీరవిచార! కంటె! యతి§తీక్ష్ణపలాశనఖావళిన్ మద
క్రూరహిమాంతసింధురము § గుచ్చి ప్రఫుల్లరసాలమంజరీ
సారసటాచ్ఛటల్ పొడవు § సాఁగఁగ నిక్కి వసంతరాజకం
ఠీరవ ముల్లసిల్లె హరి§డింభము లార్చుచు గంతులేయఁగన్. ౧౪౯

సీ॥ కదళికాఘనసార§ఘనధూళికలు గావు, మచ్చుఁ జల్లించు భ§స్మములు గాని
చంచన్నికుంజపుం§జద్వారములు గావు, భ్రమకొల్పి త్రిప్పు గ§ర్తములు గాని
చందనాచలతటీ§మందానిలము గాదు, తావు లారయవచ్చు § తవళి కాని
చంచరీకావళీ§ఝుంకారములు గావు, కీలుకాండ్రొనరించు § లీలగాని

గీ॥ ఒడలు మ్రాన్పడె మదితడఁ§బడఁగఁజొచ్చె, వచ్చుచున్నాఁడు మదనపా§టచ్చరుండు
మానవిజ్ఞానధనములు§మాటుపఱచు, కాల మయ్యెను బరమార్థ§కాములకును.

గీ॥ తరు లకాలంబునను బుష్పి§తంబు లయ్యె, శారికాకీరకోకిల§స్వనము లెచ్చె
భ్రమరఝుంకారములుమహీ§జముల నెఱసెఁ, దమ్ముఁడా! కంటె వేజగ§ద్ధాత్రిమహిమ.

సీ॥ అరుణారుణాశోక§కర కింశుకాభాంఘ్రి, కమలాస్య రోలంబ§కచ మరాళ
యాన బిల్వస్తని § యసితోత్పలాలోక, బంధుజీవాధర § సింధువార
నఖర బర్హికలాప § నవకోకిలాలాప, పల్లవవసన ప్రా§గ్వాంశరసన
రమ్యశైవలరోమ§రాజివిరాజిత, శ్యామ లతాంగి వ§సంతలక్ష్మి

గీ॥ బదరికాశ్రమసీమలో నుపల వసించె, విస్మయం బయ్యెఁ ను నకాలవిహరణమున
నిచ్చగించెనో మనబోటిసబుషులకెల్ల, తపములకు నంతరాయంబు నదలఁ చెన్నొక్కొ.

ఉ॥ ధ్యానవినాశకం బగుచు దైవత యావత వేణు వీణకా
ధ్వానము లుల్లసిల్లె మఖనవంతుఁడు సత్తపముల్ దెరల్పఁగాఁ
బూనెను దొల్లి విఘ్నము లపూర్వముగా ఘటియించి సిద్ధి ని-
గానక భీతుఁడై కుటిలకార్యము లెవ్వి దలంచెనో కదే. ౧౧౩

ఉ॥ కంటివె చల్లఁ జల్లనయి గంధవహంబులు వీవఁ జొచ్చె నీ
కంటకవృత్తి యిందునిన కకారణ మేటికి సంభవించె నె
వ్వంటికి నిట్లు తాపసుల భంగము లారయుచుండు నింక వే
ఱొంటఁ గలంగ మీదృశఖలోద్యమముల్ పరికింపఁగాఁ దగున్. ౧౧౪

శా॥ ఏవంభూతవచోవిచారములచే నేకాంతగోష్ఠిం బరా
దేవిం డెందములోఁ దలంచుచుఁ గృతార్థీభూతచేతస్కులై
ధీవరిష్ఠులు నన్నదమ్ము లపు డెంతే నాత్మఁ జింతించుచో
బోనై వచ్చిరి మన్మథాదులు మునీంద్రుల్ తమ్ము వీక్షింపఁగన్. ౧౧౫

మ॥ నరనారాయణు లబ్బురం బొదవ వన్యావాళి గొల్వన్ నిరం
తరమై నిండుగ వచ్చు దేవచరబృందంబుల్ గనుంగొంచు నాం
తరహృద్వర్తన మెల్ల మాని తదుదంతంబుల్ నిరీక్షింప ని
ర్భరకౌతూహలులై వసించిరి సమర్థప్రౌఢి యల్లాఁ గదా. ౧౧౬

వ॥ అయ్యవసరంబున మన్మథ వసంతులును రంభా మేనకా తిలోత్తమా పుష్ప
గంధీ సుకేశీ శ్వేతా మనోరమా ప్రమద్వరా ఘృతాచీ గీతజ్ఞా చారుహాసినీ
సౌరభి కోకిలాలాపా విద్యున్మాలా కాంచనమాలినీ ప్రభృతు లగు దేవవరా
రోహానికురుంబంబు లెనిమిదివేలయేఁబది యగు సంఖ్యానంబున మృదంగ వేణు
వీణా మురజ నిస్వనంబులు మెఱయ నరుదెంచి బహువిధకామసైన్యంబులతో
సాష్టాంగప్రణామంబు లొనర్చి శిరంబుల నంజలులు ఘటించి నిలిచిరన్ దివ్యా
భరణభూషితలును, దివ్యమాల్యోపశోభితలును, గానసంయుతలును నగు
కామినులం గాంచి వారల యతిదుర్లభంబును, తానస్థానయుతంబును, మన్మథాది
వివర్ధనంబును నగు గానంబును వినుచు నృత్తం బాలోకింపుచు సంతోషించి భగ
వంతుఁ డగు నారాయణుం డిట్లనియె.

ఉ॥ వచ్చినవారు మామకనివాసముఁ జేరఁగ నాతిథేయ మే
నిచ్చెద నిల్వుఁ డంచుఁ దగ నెల్లరకున్ ఫలకందమూలవ

స్తూచ్చయత్వృత్తిఁ గూర్చి హృదయమోద్గతమా నభిమానవృత్తిచే
నిచ్చటి కిందుఁడు డంప శ్రమమెంచక వచ్చిరి మోసగింపఁగన్. ౧౫౮

గీ॥ కోరి వచ్చిరి గాన నిక్కు టిలమతుల, దివ్యసౌందర్యగరిమచేఁ దేజరిల్లు
నతివఁ బుట్టించి వీరి యహంకృతులకు, నంతరాయ మొనర్చెద నని తలంచి.

—•నారాయణమునివలన నూర్వశి జన్మించుట.•—

సీ॥ ఊరుభాగంబుపై నొకచేతఁ జఱచిన, నారాయణస్వామియూరునుండి
యూర్వశి యను నొకయోషాలలామంబు, విధిసృష్టికి నపూర్వవిభవ మెనయఁ
నిగపింప నక్కాంతఁ గని యప్సరఃపాళి, సిగ్గుచేఁ దలవంచి చిత్రలిఖిత
మూర్తియుఁ బోలె నమ్ముని మోముఁ జూచుచుఁ, దమకెల్లఁ బరిచర్యఁ దనుపఁ దగిన

గీ॥ పడఁతి యనిచిత్తములను విభ్రాంతి నొంది, నేయునదిలేక యంజలుల్ చేర్చి మ్రొక్కి
బహువిధోపాయనోద్యుక్తపాణులగుచు, స్తవ మొనర్పఁగ నెంచిరచ్చరవెలఁదులు.

వ॥ అంత న్మఱియుం గొందఱు దివ్యాంగన లా నారాయణమునియూరువునుండి
యుద్భవించుటయు. ౧౬౧

గీ॥ అరుగుఁదెంచిన యప్సరోహంసగమన, లందఱికి నందఱును నూరువందుఁ గనిన
చిత్రసృష్టికి నరుదంది చేతులెత్తి, మ్రొక్కుచును వారు వీరును మొనసియుండి.

ఉ॥ సారవధూమణుల్ తపసిజంటఁ గనుంగొని మానులార! మీ
ధీరత మీతపోమహిమఁ దెల్పఁగ నెంతటివార మస్మదీ
యోరుతరాభిమానము యథోచితమై నడలెన్ స్వరూపశో
భారమణీయమూర్తియగు భామ జనించె మనోహరాంగియై. ౧౬౩

మ॥ మును పే మేమి తపంబుఁ జేసితిమొ మిమ్మిం జూడఁ గన్నార మీ
ఘనమాహాత్మ్యముఁ జెప్పఁగా వశమె సాక్షాత్కేశవాంశంబు లే
మని వర్ణించెద మెందునేని భవదీయపరాభవంబౌనె క
న్గొనుఁడీ మమ్ముఁ గటాక్షవీక్షణముల్ గోపంబు శాంతింపఁగన్. ౧౬౪

చ॥ అమరులకైన మీకరుణ యాశ్రయణీయము మాకు వింతయే
సమదగతిన్ వృథాభిమణసంకట మందుచు సాపరాధతన్
బ్రమసితి మే మొనర్చు నపరాధము లెల్ల సహించి పోవుఁడీ
విమలచరిత్రులాగ్రహనివృత్తికి నర్హులు గారె యెమ్మెయిన్. ౧౬౫

సీ॥ అని సన్నుతించిన యప్సరఃకాంతలఁ, గనుచు మానీంద్రు లిట్లనిరి మీకు
వాంఛితం బెయ్యది వచియింపుఁ డిచ్చితి,మీ కుపాయనముగా మెలఁతఁ గొనుచు

నిందఱిసంతృప్తికి నియ్యంగనగు నీపె, దివికిఁ జనుండు సంతృప్తి నొంది
శుభమగు మీ కన సుందరీమణు లెల్ల, స్వామి! నీపదపంకజములు గాంచి

గీ॥ యెందుఁబో మెదమింకమాయందుఁగరుణఁ, జూపిపతివయిమముఁ దేర్పుసూనశరుని
బారిఁజిక్కితిమేము నీపడఁతుల మిఁక, నిన్ను సేవించెదము వర్ణనీయచరిత. ౧౬౬

క॥ ఈ యూర్వశీవధూమణి, పోయెడు స్వర్గమున కేము పోవుదుమె భవ
త్ప్రియసులఁజేసి మన్నన, సేయందగు మాకు నిష్టసిద్ధి యిది సుమీ. ౧౬౭

ఉ॥ కోరినకాంతలన్ విడుటకున్ దగవే? సుమబాణభిన్నతన్
ధీరతఁ దూలినారము మదిం బరికింపుము తృష్ణనొంది యి
చ్ఛారతి వచ్చు భామినుల సంకటపెట్టఁగరాదు ప్రాజ్ఞనుః
పూరితభాగ్యయోగమునఁ బొందితి మిందు భవత్పదాబ్జముల్. ౧౬౮

గీ॥ విడువఁ దగదన్న వారలయెడ దయాప్తి, ననియె నారాయణుండు సహస్రవర్ష
పూర్ణమైన తపం బెల్లఁ బూది గలపి, కామసుఖ మిచ్చగింతుమే కాంతలార!

శా॥ మాకుం గామసుఖాభిలాష గలదే ? మద్ధర్మవిధ్వంసకం
బేకాంతవ్రతనిష్ఠ శోషిలెడువా రీకృత్యముల్ సైఁతురే?
లోకమ్మం దెచటం బశువ్రజములున్ లోలంబులై స్వార్థనా
శాకాంక్షన్ విహరించునే? యిటులు మీ రాడంగ నూహింతురే? ౧౭౦

వ॥ అనిన నప్సరస లిట్లనిరి. ౧౭౧

చ॥ విషయసుఖంబు లేనిటను విశ్వసనీయసుఖంబు స్వర్న; త
ద్విషయఫలంబుఁ గోరితిమి వీనుల నానుచు మాదుసూక్తులన్
ఋషివర కేతుబాణగతి జర్జరతన్ బడనీక మమ్ము ని
ర్విషయసుఖా! భవత్సుఖము విందొనరింపఁ దలంపఁగాఁదగున్. ౧౭౨

గీ॥ వాంఛితం బేమి యని యిచ్చువాఁడపోలె, నడిగి తెల్పిన పిమ్మట నుడువుదప్పి
ధర్మవాక్యమ్ము లేవియో తడవుటేటి, ధర్మము మునీంద్ర! ఆడియుఁదప్పనగునె?

గీ॥ త్రిదివసుఖ మిచ్చగింపని దేని భువిని, గంధమాదన భూధరకందరముల
మమ్ముఁగూడి సుఖింపు మర్త్యలోక, సుఖసహస్రప్రమాణమౌసుఖముగలదు.

వ॥ అని. ౧౭౫

ఉ॥ అచ్చర లిట్లు పల్క మదినారసి ధర్మతనూజుఁ డక్కటా!
మచ్చరమొంచి యిచ్చెలులు మానము దూలఁగ నాడఁజొచ్చి రే

నచ్చుగ స్వాభిమానమున నంత విచారముదెచ్చికొంటి ధ
ర్మోచ్చయ నాశనం బగు నహహో మనుజాళి కహంకృతికిక్రియల్. ౧౭౬

క॥ మూలము సంసృతిశాఖికి, జాల మ్మజ్ఞానసలిలచరతతికిని కు
ద్దాలము ధైర్యలతకు నాభీల మ్మభిమాన మేల పెనఁగితినొక్కో. ౧౭౭

ఉ॥ మానముఁ బూని యావతసమాజముతోఁ బలుకాడకున్న ని
ర్మానమనస్కుఁడై చనదె లోలత నీ సని తెచ్చికొంటి న
జ్ఞానత నివ్వధూమణులు సంకటపెట్టఁ దొడంగి రిందు కే
మౌనో? స్వతంతుబద్ధమయి యాఁబడిఁబోయిన లూతనైతిగా. ౧౭౮

ఉ॥ కోపముఁబుట్టఁ జేసి యతి ఘోరవచఃప్రహారాభిఘాతిమై
శాప మొసంగిరన్ విసివి సర్వమనోరథభగ్నులై చనన్
బాపములేదు ముక్తికొడ బాటగు నిర్జనమౌ వనంబునం
దోపి తపింపవచ్చునని యుత్సుకుఁడై మదిలోఁ దలంచుచున్. ౧౭౯

సీ॥ క్రోధంబు సంతాపసాధకం బజ్ఞానబోధకం బానందవేధకంబు
క్రోధాభిభూతుఁడౌ కుటిలుండు హింసల, కొడఁబడి దుఃఖాబ్ధిఁ బడెడుఁగాదె
తరుజమౌ ననలంబు తరువు దహించిన, కరణి మేనునఁ బుట్టి కాల్చు మేను
నరకవసీవాపి నరులకుఁ గ్రోధంబు, క్రోధించినఁ దపంబు కూలిపోవు
గీ॥ నీవధూ వేధచేఁ గోపమెత్తి వీరి, శాపదావానలజ్వాలసమయునటులఁ
జేయ దప మెల్ల నశియించు సిద్ధమింతె, యనుచుఁ దలఁచి వచించెఁ దాననుజుతోడ.

క॥ శపియించినఁ దపము సెడున్, గృపఁ జేసిన వీరివలనఁ గీడగు రెంటన్
విపరీతమయ్యె మనగతి, జపతపములు విఘ్నదుఃఖసాత్కృతినొందెన్. ౧౮౧

క॥ దీనికి నుపాయమెయ్యది, యో? నీ వరయు మన శాంతి నూనుము క్రోధం
బానెడఁ దపము నశింపదె, గాన నహంకారవృత్తి కడుఁ గీడు గదా. ౧౮౨

ఉ॥ తొల్లి యహంకృతిం బెనఁగి దుష్టనిశాచరకోటితోడ ను
త్ఫుల్లపరాక్రమక్రమితభూర్భువరాధికుఁడౌ హిరణ్యజున్
దల్లడపెట్టి నత్తపము దండన సేయమె క్రోధ మెచ్చటన్
జెల్లదు శాంతి నూను మని చెప్పిన నగ్రజుఁ డట్ల సేయుచున్. ౧౮౩

క॥ శాంతి తపోమూలం బని, శాంతుండై యగ్రజుండు సహజన్మునితో
సంతసమునొందె నన భూ, కాంతుం డిట్లనియెఁ జూచి గాంధవ తేయున్. ౧౮౪

మ॥ హరినామస్మరణాంఘ్రిసేవన తదంశాలంకృతుల్ మానవుల్
హరిగా భావన సేయు భక్తుఁ డగు ప్రహ్లాదుఁడుండు; నారాయణున్

నరు సామాన్యునిగాఁ దలంచి రణసన్నాహంబులన్ బోరు ట
బ్బుర మయ్యెన్ దదుదంత మంతయును సంబోధ్యంబు శ్లాఘ్యంబగున్. ౧౮౫

శా॥ శాంతుల్ ధర్మసుతుల్ తపస్వులు మనస్సంబంధ చిద్వృత్తు లే
కాంత స్వేచ్ఛ విహారు లింద్రియసమాకర్ష స్వభావుల్ సదా
నంతధ్యానగరిష్ఠులై చెలఁగు నన్నారాయణుండున్ నరుం
డెంతే నబ్బుర మయ్యె సంగరము తా రెచ్చోటులన్ జేసిరో. ౧౮౬

కం॥ నరనారాయణదానవ, వరులకు సంగ్రామ మెట్లు వర్తించెఁ బర
స్పరవైరం బెట్లయ్యెను, నరనారాయణులు తపమునన్ గృశులుగదా. ౧౮౭

సీ॥ కామాదిరిపువర్గఖండనం బొనరించి, మనసు నిర్జితమయ్యె మత్సరమ్ము
క్లేశమ్ముఁ గెడపి నిష్క్రియతచే నుందురు, మును లహంకారమ్ము మునుపెలేదు
దానిచేఁ గద? పుణ్యతతిసమార్జనము ప్రహ్లాదుండు హరితోడ నాగ్రహింపఁ
బుణ్యంబు వితథమైపోవదే! మునులకు, శాంతిఁ బోవిడిచిన జపతపమ్ము

గీ॥ లడుగుఁబట్టవె యట్టి మహాత్ములందె, శాంతి లేకున్న మాబోఁటి జనుల కెట్లు
గలుగుజగములయందహంకారరహితుఁ, డభ్రకుసుమంబుగదము క్తికర్తృఁడెవఁడో.

—• ప్రహ్లాదుఁడు నరనారాయణమునులతోఁ గలహించుట. •—

గీ॥ జంగమస్థావరాత్మకజగము లెల్ల, సాభిమానంబులేకదా జన్మమృత్యు
సహితమగు సంసృతిని బరజ్ఞానమెట్లు, తెల్పి యీ సందియము నాకుఁదీర్పుమనఘ.

క॥ వేదాంతులసిద్ధాంతము, లీదృశమని తత్త్వవేదు లెఱిగింతురు స
ర్వాదరణీయమతం బిది, గాదొకో? మాదృశులు ముక్తిగనుటయుఁ గలదే. ౧౯౦

కం॥ సర్వ మహంకృతివృతమని, నిర్వాహణీయంబ యయ్యె నిష్ఠాపరులై
సర్వజ్ఞులైన మాను ల, ఖర్వాహవమునకుఁ దొడరు కథఁ జెప్పుమనన్. ౧౯౧

మ॥ అవనీవల్లభ! నీవు పల్కునది సత్యం బిద్దరన్ గారణం
బు విసర్జించినఁ గార్య మున్నదె? జగంబుల్ శాతకుంభై కసం
భవ కేయూరకిరీట కుండలములన్ స్వర్ణంబుఁగాఁ బల్కవే?
భువిలోఁ గారణకార్యభేద మగునే పూర్వోక్తు లిట్లుండవే. ౧౯౨

కం॥ పటతంతుసన్నిభము విధి, ఘటితచరాచరమహావికారముగాదే
స్ఫుటశాస్త్రప్రసిద్ధమత మిది, నటుఁడు వధూవేషుఁ డయ్యు నరుఁడయ్యెఁగదా.

శా॥ మాయాశక్తి గుణత్రియంబునను నిర్మాణంబు నొందెన్ జగం
బేమే రూపము నొందినన్ గుణమయంబే కాదె! బ్రహ్మాదులన్

ర్థేయభ్రాంతి నహంకృతిపరిభవమై ♦ దీర్ఘాటవీతుల్యమై
హేయిర్గా జెందని సంస్కృతిఁబడి దురంతాయాసముఁ జెందరే. ౧౯౪

క॥ నారదవశిష్ఠకశ్యప, భారద్వాజాదు లెల్లఁ ♦ బటుమాయాసం
సారనిబద్ధుడు జగతి శరీరులలో మోహగుణనిరీహులు గలరే. ౧౯౫

ఆ॥ దేహధారియైన ♦ దేహిని గామాది, వైరివర్గ మెట్లు ♦ వదలుఁ దన్ని
బంధనంబు విడక ♦ పరమార్థచిత్తతఁ, గాంచఁ డదియుఁగాక ♦ కాదు ముక్తి.

సీ॥ వేదశాస్త్రపురాణవిద్య లుపార్జించి, గంగాదితీర్థావగాహనములఁ
గృతకృత్యులై మరుకీర్తనధ్యానార్చనంబుల విప్రదానములవలనఁ
బుణ్యంబు లార్జించి ? పోరిఁబోరి విషయముల్, మది నేచఁ దత్సక్తి ♦ మరగనేని
సామజస్నానంబుసరణి నిష్ఫలతచేఁ, జనదొక్క కృతయుగంబునను మఱియు

గీ॥ ద్వాపరంబునన్నైనను ♦ ధర్మశుద్ధి, గలదె కలినేమి చెప్పంగవలయు లోభ
మోహమదమత్సరద్రోహములనుగాదె, సంసృతివిహార మెల్లెడ ♦ జనపతీంద్ర!

ఆ॥ క్రోధమత్సరాదికుటిలతల్ పెడఁబాసి, సత్యధర్మనియమసక్తిగలిగి
వెలయు సాధుజనులు ♦ వెదకినఁ గనరారు, కలిని దర్శనంబుగలదె? నీకు. ౧౯౮

క॥ అని సాత్యవతేయుఁడు నుడి,విన జనమేజయుఁడు పల్కె విషయాసక్తిఁ
దనుకక మదవర్జితులై, ఘనులు జగత్త్రయములందుఁ ♦ గలుగు టరుదెకా. ౧౯౯

శా॥ ఘోరారణ్యములన్ దపింపుచుఁ దపఃకూలంకషుండైన యా
త్మారాముం గని పాతకంబనక సర్వాంగంబు కంఠంబునం
దాదూఢంబుఁగఁ జుట్టె మజ్జనకుఁ డయ్యాభీలకాళ్మల్యకృ
ద్భారం బేను భరింపఁజాలక భయభ్రాంతుండనై యుండితిన్. ౨౦౦

చ॥ ఇదివఱ కేమి యయ్యెనొకొ ♦ యింతట ముందట నేమియౌనొకో?
విదితముగాదు మూఢుఁడు చరించెఁ గొన మద్యముఁ గ్రోలుఁగాని తా
విదిశల గంతు లేసి పలవించుచుఁ బాత మెఱుంగనట్లు దు
ర్మదుఁ డఘచింత నొంది గతిమాలుట గాంచునె యెన్నిభంగులన్? ౨౦౧

చ॥ గతజలసేతుబంధనముకైవడిఁ దర్విప్పను బూడ్చనేల యు
ద్ధతులవిధంబు లయ్యావి విధాతృకృతంబులు దప్పనేర్చునే
యతియుగ దానవపరిధన ♦ మవ్వల నెట్టుల వర్తిలెన్ దయా
న్వితమతిఁ దెల్పఁగాఁదగు సవిస్తరవాగ్రచనాచమత్కృతిన్. ౨౦౨

సీ॥ దారపుత్రధనేషఁ దవిలి యన్యోన్యంబు, కలహింతు రర్థార్థకారణమున
నీషణత్రితయావిహీనులు వారలు, గాపురం బొక్కచోఁ గాదు యతులు
బదరికాశ్రమమునఁ బాతాళమునను బ్రహ్లాదుండు నిలుతురు వాదమెట్టు
లచ్యుతాంశులు మౌను లని యెఱింగి సురారి, హరిభక్తుఁ డెట్టుల నాజిసలిపె
గీ॥ దివ్యవర్షసహస్రముద్వృత్తి రణము, జరుగుటెట్టులు జయము పరాజయముఁ దుదకు
సురల నసురులలోన నెవ్వరికో తెల్పవే? యనినఁ బల్కె సాత్యవతేయుఁ డంత.

చ॥ జనకుఁడు శాపదగ్ధుఁడయి సర్పముచే మృతుఁడై నభంబునన్
దనువు దొఱంగుటన్ దురితతాపము నొందె నటంచుఁ బుత్రుఁడౌ
టను జనమేజయుండు కడు దస్సి విధానము లెల్లఁ జేసి వే
దన సహియింప లేక పితృతత్పరతన్ వినువాఁడు గావునన్. ౨౦౪

గీ॥ ఇప్పురాతనచరితంబుఁ జెప్పెఁగాదె, సాప్తపూరుషసద్గతిస్థానకంబు
నిక్కథల్ మునులార! మీ రెలమి వినుఁడు, మద్గురుం డిట్టులని చెప్పె మహిపుతోడ.

కం॥ ఒకతఱి హిరణ్యకశిపుఁడు, ప్రకటనృసింహాగ్రనఖరపటలీదళితాం
గకుఁడై దివి కరిగిన భూమికిఁ బ్రహ్లాదుండు విభుత మెఱసి చెలంగెన్. ౨౦౬

—• చ్యవనుఁడు సర్పదష్టుఁ డగుట. •—

సీ॥ ప్రహ్లాదుఁ డిల యెల్లఁ బాలించుచును దేవ,భూదేవపూజనస్ఫూర్తి మెఱయ
క్షితిపతుల్ యజ్ఞముల్ చేసిరి విప్రులు, జపతపోధ్యాననిష్ఠలఁ జెలంగి
రసురులు శాంతులై రాత్మసాధకు లైరి, శూద్రులు ద్విజులశుశ్రూషఁ గనిరి
నరసింహునాజ్ఞ నాసురసింహుఁ డగుచుఁ బ్రహ్లాదుండు పాతాళమధివసించి
గీ॥ యున్నచో భృగునందనుం డొక్కనాఁడు, చ్యవనుఁడను మౌని నర్మదాస్నానమునకు
నరిగి జలమునఁ దోఁగియుత్తరణమునకు, నుద్యతుం డగు వేళ నయ్యోరఁ బొంచి.

కం॥ కేకరలోహిత మను దర్వీకరరాజమ్ము సలిలవేగోద్ధతమై
భీకరవిషదహనజ్వాలాకరమై వెంటఁ దవిలి యడుగడుగునకున్. ౨౦౮

గీ॥ దంష్ట్రలను బిబ్బిపట్టి పాతాళమునకు, నీడ్చుతఱి హృదయంబున నిందిరేశుఁ
జక్రపాణి జనార్దను సంస్మరింప, నిర్విషతనొంది విడిచె మౌనిని నతండు. ౨౦౯

కం॥ తాపసుఁ డగు నీతం డని, శాపమునకు వెఱచి పాపజాతిభుజంగం
బోపక విడుచుట దైవవ్యాపారమె కాదె శంకపడ నేమిటికిన్? ౨౧౦

ఉ॥ సమ్మతి నమ్మునీంద్రుఁడు రసాతలసీమకుఁ జేరి చిల్వరా
కొమ్మలు పూజలన్ దనుపఁ గొన్ని దినంబులు సంచరించి భో

గమ్ములు నిమ్ములన్ నెగడు కల్పవృభుగగణిశిరాజధానికిన్
బిమ్మట నెమ్మి నేగి కడు వేడుక నయ్యెడలన్ వసింపగన్. ౨౧౧

శా॥ సౌధాగ్రమ్మున నిల్చి యొక్కెడ విలాసప్రేక్షణోల్లాసియై
వీథిన్ దిమ్మరు నమ్మునిన్ గని మరుద్విద్వేషిపద్భుం డర్థియై
వేధస్సన్నిభుఁ డీతఁడం చెఱిఁగి యాత్మవిద్భాతభక్తిక్రియా
బోధం బొప్పఁగఁ బిల్వనంపి పదముల్ పూజించె గేల్మోడ్చుచున్. ౨౧౨

ఆ॥ ఏమి కారణమున నిందు వచ్చితిరి దే, వేందుఁ డంపెనొక్కొ హితముఁ గోరి
కాక నాదురాజ్యకఘనదిదృక్షావ్యాప్తి, నరుగుఁదెంచినారొ యనిన మౌని.

గీ॥ వాసవప్రేరితుండనై వచ్చుటకును, బల్లిధినాదునె సురలోకపతికి వినుము
నేను భృగుపుత్రుఁడను ధర్మనీతిపరుఁడఁ, జ్యవనుఁడనువాఁడ మదిలోనిశంకవిడుము.

మ॥ అవగాహార్థము నర్మదానదికి నొయ్యన్ వచ్చి తీర్థంబునం
దవగాహించి తటంబుఁ జేరుతఱి దంష్ట్రాభీలుఁడై యెవ్వఁడో
భవదీయాలయభోగి యీడ్చుకొని తా వచ్చెన్ రమావల్లభ
స్తవ మేఁ జేసితి నిర్విషంబయి యహీంద్రంబ్బేగ దైవాదృతిన్. ౨౧౪

ఉ॥ ఇచ్చటి కేను వచ్చుట నభీష్టఫలం బగు నీదుదర్శనం
బచ్చుగ సంభవించెఁ గమలాక్షునకున్ గరుణైకపాత్రమై
మెచ్చినభక్తవర్యుఁడవు మేటివి దానవకోటికెల్ల న
భ్యచ్చయ మయ్యెడిన్ నను నియోజితుఁగాఁ దలపోయ నేటికిన్? ౨౧౫

—: చ్యవనుఁడు తీర్థములు బోధించుట :—

చ॥ అని భృగువంశ్యుఁ డాడిన వచోమృతధారల సంతసిల్లి య
ద్దనుజపరీవృఢుండు మునిసత్తమ! తీర్థవిశేషరాశి భూ
మిని దివి నంతరాళముల మీరలు గంటిరిగాదె? నాయెడన్
మనమునఁ బ్రేమ నిల్పి యనుమానము దీర వచింపుఁడీ యనన్. ౨౧౬

మ॥ దితిజాధీశ్వర! వాఙ్మనఃకరణముల్ తీర్థంబు లెవ్వారికిన్
క్షితిలో వారికి నెల్లెడన్ గలవు సత్తీర్థేయంబులౌ తీర్థముల్
మతియున్ వాక్కును గాయ మెవ్వరి కగు న్మాలిన్యయుక్తంబు బల్
కత లేలా? మినుగంగ కీకటపురీకల్పంబె యవ్వారికిన్. ౨౧౭

కం॥ మానసము విమలమగు న, మ్మానవులకు జలము లేల మహితీర్థ మగున్
గాన మనశ్శుద్ధియె సం, ధానింపన్ దగు వివేకధన్యుల కెలమిన్. ౨౧౮

సీ॥ గంగాతటంబునఁ గలవు పురంబులు, వ్రజము లాకరములు గ్రామములును
ఖర్వముల్ ఖేటముల్ కైవర్తరాజ్యముల్, మ్లేచ్ఛహూణనిషాదకచ్ఛములును
అందందు నివసించు నఖిలజనంబులు, స్నానపానములందు సలుపరొక్కొ!
వారిలోఁ బరిశుద్ధ వర్తనుండగు నరుం, డొక్కండు గల్గునే పెక్కులేల
గీ॥ తీర్థయోగ్యతయం దెట్లు సార్థమగును, పావనత లేక యటువంటి భావశుద్ధి
సర్వకారణ మితర మసత్ఫలంబు, గాన మానసశుద్ధిసంగ్రహము మేలు. ౨౦

గీ॥ తీర్థవాసంబు గాదు కృతార్థతలకు, నందు నివసించి యఘము లెం దెందుఁ జేయ
నంతమునయాతనాహేతు వౌటె కాని, యుత్తమములగులోకంబు లొసఁగునొక్కొ

క॥ మిన్నేట నింద్రిసామజ, మెన్నెన్ని విధంబులను యథేచ్ఛాచరతమై
యున్నను దానఁ ఫల మే, మున్నది భావంబు శుద్ధి నొందఁగఁగలదే. ౨౨

ఉ॥ ముందుగఁ జిత్తశుద్ధి గద మూలము సర్వమునందు దానిచే!
నొందును ద్రవ్యశుద్ధి మఱియొంటను గల్గునె యట్లు సత్క్రియల్
పొందిక లొందెనేని యిఁక భూవర తీర్థము సిద్ధిఁ జెందుఁగా
కెందును దీర్థశుద్ధిగొన కెల్ల కృతంబులు వ్యర్థముల్ సుమీ. ౨౩

ఆ॥ బుద్ధిపూర్వకముగ భూతానుకంపచే, శుద్ధుఁడైనఁ గలదు సురపదంబు
దీనిఁబోలునట్టి తీర్థముల్ లేవెందుఁ, దెలిసి విను వచింతుఁ దీర్థములను. ౨౪

వ॥ సర్వతీర్థోత్తమంబు లగు తీర్థంబులు నైమిశంబును జక్రతీర్థంబును బుష్కరంబును, దదితరంబులగు తీర్థంబులకు సంఖ్యానంబు దుస్తరంబు, స్నానపానంబులచే నిన్నియుఁ బరలోకసాధకంబులును బరమపావనంబులు నగునని చెప్పిన విని దితిజవల్లభుండు నైమిశతీర్థంబునకుఁ బ్రస్థానం బొనర్ప నుద్యుక్తుండై రాత్రించరబృందంబుల నెల్లఁ బిలువనంపించి పుండరీకాక్షుండును బీతాంబరుండును నగు నచ్యుతుం డధివసించు నైమిశతీర్థంబునం దవగాహించి నారాయణుఁ దర్శింపఁగా వలయు నాయితంబు గమ్మనిన దానవోత్తములు సంతుష్టులై ప్రహ్లాదుం బురస్కరించుకొని పాతాళంబు నిర్గమించి నైమిశారణ్యంబు ప్రవేశించి రంత. ౨౫

సీ॥ అందుఁ దీర్థంబుల నవగాహమొనరించి, దానవుల్ దనచుట్టుఁ దఱిసికొలువ
దివ్యసరస్వతీతీర్థంబు తిలకించి, యందుఁ గృతస్నానుఁడై యశేష
దానంబు లొనరించి ధర్మతత్పరతచే, వేదోక్తముగ శ్రాద్ధవిధి యొనర్చి
తండ్రి పేరిట మహాదానముల్ చేసి దే, వాధీశుఁడైన జనార్దనునకుఁ
గీ॥ బూజలొనరించి యచ్చోటఁ బూర్ణవిభవ, శాలియై విప్రపూజలు జరిపి యమృత
తులితదివ్యాన్నసత్రముల్ తలఁపుకొలఁది, నిలిపి ద్విజకోటిఁ దనిపె నిర్నిద్రుఁడగుచు.

మ॥ కనియెం దైత్యవిభుండు నిర్ఝరఝరీకల్లోలమాలామిళ
ద్ఘనశాఖాగ్రవిశాలపర్ణపుటనౌకాఖేలదామర్త్యడిం
భనటస్మారిత కల్పకాలహరిడింభబ్రహ్మచర్యాభినం
దనతీరప్రజపత్సురర్షిహితతద్గాథంబు న్యగ్రోధమున్. ౨-౧౭

కం॥ కాంచి తదీయవిశాలో,దంచిత విస్తారవిటపతలసచ్ఛాయా
వంచిత కుహూతమస్తతి, సంచారోత్కటము వటము సన్నిధి నంతన్. ౨-౧౮

చ॥ బలములతో విలాసరసబంధురుఁడై కొలువిచ్చి మంత్రులున్
జెలులు భటుల్ దనుం గొలువఁ జిత్రరసప్రథమావతారశో
భలఁ జెలువొందు నవ్విటపిప్రాంతమునం దసితాంబకవ్రజా
కలితము మార్గణాసనయుగంబు గనుంగొని సంశయింపుచున్. ౨-౧౯

గీ॥ కంకపక్షశిలీముఖాక్రాంతము లివి, నిశితములు వీని నేధన్వి నిలిపెనొక్కొ?
దివ్యమునివాసమైన యీ తీర్థమునకుఁ, గ్రంక నెవ్వండువచ్చెనొకో! యటంచు.

సీ॥ నాసాగ్రనిశ్చలన్యస్త దృగ్రోచులు, పండువెన్నెలకాంతి నిండుఁజూప
నఖిలాంగకలితభస్మావకుంఠనశోభ, రజతాచలయుగప్రతిభ నీన
నతిదీర్ఘ దృఢతరాభ్యంచజ్జటాపాళి, తరుశిఫాభేదసాధనముగాఁగ
సరసపద్మాసనస్థైర్యంబు కవగూడు, సురశైలమందరస్ఫూర్తిఁగొనఁగ

గీ॥ నిశ్చలధ్యాననిష్ఠాభినిరతులైన, నరుఁడు నారాయణుం డను పరమమునులఁ
గాంచి శార్ఙ్గాజగవముల కరణి శాస్త్ర,లక్షణాన్విత మగు ధనుర్ద్వయముఁగాంచె.

ఉ॥ ధ్యాన మొనర్చుచు న్బహువిధంబగు తాపసవృత్తి నూని శు
ద్ధాసనపద్ములై విరచితాసనబద్ధసమాధినిష్ఠ లో
నూనుచు విప్రతాపసుల యొద్దిక వర్తిలుచున్నవారు వీ
రానతకార్ముకద్వయము నగ్రమునం దిడ నేమిహేతువో? ౨౩-౨

సీ॥ అని క్రోధతామ్రాక్షుఁడై రాక్షసాధీశుఁ, డెవ్వరు మీరు ధర్మేతరంబు
దంభవృత్తితపం బుదారతపస్వుల, నలువునఁ జేయుచున్నారు భువిని
దీర్ఘవాసముఁ జాపధృతియు నన్యోన్య వి,రుద్ధముల్ కలిధర్మరూఢినొక్కొ?
బ్రాహ్మణుం డేనియుఁ బరమవృత్తిఁ దపంబు, కార్ముకధారణక్రమము గలదె

గీ॥ జడలుఁ బెనుచుట చాపముల్ సడలకుంట, దంభ తాపసులకు మీకుఁదగినదయ్యె
మునుపుమునులందు నెందిట్లువినుటగలదె? భ్రామకులుగానిమీరు తాపసులుగారు.

చ॥ అతివినయంబు ధౌర్త్యమనునట్టులె యున్నది మీదువృత్తి నా
విని నరుఁ డాసురేంద్రుఁ గని వెంగలి! మమ్ముఁ బరాభవింపఁగాఁ

బనిగలదేమి మాయెడఁ దపంబు వృథా యన నేల? రెండిటన్
ఘనులగు వారికిన్ దగదె కార్ముకమున్ దపమున్ భరింపఁగన్.

చ॥ జప మొనరింపఁగా రణము సల్పఁగ ధీరుల మేము వింటనో
తపముననో సుధన్వులకుఁ ద్వైరథికవాసము గూడదొక్కొ? యా
నెపము లవేల యేగు మిఁక నీ వెటకేని వికత్థనోక్తులన్
దపసులతోఁ బనేమి నయతత్పరతన్ జరియింపు మిచ్చటన్. ౨౩౯

గీ॥ బ్రహ్మతేజో దురారాధ్యపటిమ నెగడు, బ్రాహ్మణులతోడఁ జర్చ శుభంబుగాదు
అటవిఁ దఱికొను తీక్ష్ణదావాగ్ని నెచట, నెవ్వరేని చుంబించి మేలొనయఁగలరె?

ఉ॥ శాంతిపరుండవై చనుము చక్కఁగ వచ్చిన త్రోవ నన్న దు
ర్దాంతరుషన్ వచించె ముని ధర్మ మొకింతయు లేదు మీయెడన్
సంతతమున్ జగత్త్రయము శాస్తి యొనర్చుచు ధర్మసేతువి
శ్రాంతుఁడనై సురాసురులఁ జక్కఁగ నేలెడువాఁడఁ గానొకో? ౨౩౨

గీ॥ మీర లీ పుణ్యతీర్థంబు మేరదప్పు, నడవడుల సంకరము సేయువడువు దోఁచె
నెందు నేనియుఁ జనుఁడు కాదేనినిలిచి, యాహవము సేయుఁడన్న నిట్లనియె మౌని.

సీ॥ రాక్షసాధమ! నీకు రణము సల్పుటయందు, మతిగల్గెనేని సమ్మతమ నాకుఁ
గోదండ మిపుడు చేకొనుము గర్వం బెల్ల, మాయింతు ననిన సమ్మాట కులికి
తాపసమ్మన్యుల ధర మిమ్ము నిర్జింతుఁ, గనుఁడు నాభుజశక్తిగరిమ ననుచు
విల్లందుకొని మహావిస్ఫార మొనరించి, స్వర్ణ పుంఖంబులౌ శరశతములు

గీ॥ నినుప నరుఁడును విల్లంది నిశితశరము, లసురవల్లభు పయినేయ నతఁడు కినిసి
నరునిశరములు నఱుక నన్నరుఁడు రోష, వివశుఁడై యేసె నతనిపై విశిఖశతము.

శా॥ దైత్యాధీశుఁడు మానిబాణతతి నౌద్ధత్యంబునన్ దుంచె దు
ష్కృత్యం బంచని యెంచ కమ్మునియరస్సీమన్ శర వ్రాతముల్
క్షిత్యాకాశములన్ వడంక నినిచెన్ గేడించి యవ్మౌని రో
షాత్యౌజ్జ్వల్యము జూపి యేనిట భుజాహంకారమున్ బాపినన్. ౨౪౦

కం॥ అయ్యెడ మానియు దితిజుఁడు, కయ్యము సేయంగఁ జూచు కాంక్షను సురలున్
జయ్యన విమానములపై, నెయ్యురతో వచ్చి నిలిచి నిశ్చలు లగుచున్. ౨౪౧

మ॥ నరమౌనీంద్రుని వీర్యశక్తియును సన్నాహస్ఫుటం బైన యా
సురరాజన్యుని దోర్బలంబును మనస్స్ఫూర్తిన్ విమర్శించి దు
ర్భరశౌర్యోన్నతిఁ గాంచి యిర్వురను శంభద్విక్రిమాదంభదు
ర్భరులంగా మది నెంచి సన్నుతము లార్పెన్ సాగి తొక్కమ్మడిన్. ౨౪౨

ఉ॥ అంత శరాసనంబు గొని యాసురనాథుఁడు కొండమీఁద దు
ర్దాంతపయోధరంబు జలధారలు గప్పెడురీతి బాణముల్
దొంతరలై పడన్ దనదుదోర్బలమెల్ల నెఱుంగఁజేయు చో
క్కింతయు వేసటన్ గొనక యేసిన మౌని చలించె నాజిలోన్. ౨౪౩

శా॥ రోషజ్వాలలు నింగిముట్ట విజయారాధుండు నారాయణుం
డీషాదండమువంటి విల్లుగొని బ్రహ్మేంద్రార్కవాయ్వాది ది
వ్యేషుస్తోమము గుప్పినన్ నిశిచరాధీశుండు దోర్దోడ ని
ష్పేష క్రీడరణాజిరాంబరము గప్పెన్ గాండఖండంబులన్. ౨౪౪

సీ॥ ప్రళయకాలాంభోదభయదగర్జార్భటీ, నిభసింహనాదముల్ నింగిముట్ట
విస్ఫారయుగళికావిర్భూతగిరిగుహా, ప్రతిశబ్దముల భూనభంబు లులియ
నన్యోన్యభుజనిర్భరాస్ఫాలనధ్వాన, మాలకించెడివారి కదరు గొలుపఁ
జరణచతుష్టయీసంఘట్టనోద్భూత, రావంబు జయభేరిరవము నెనయ

గీ॥ నొండొరుల గెల్చునుత్సాహమురవడింపఁ బోరు ఘోరాకృతి వహించుపాలుపు దెలుప
దుముల మతికర్కశంబైన నమరులెల్లఁ, బుష్పవృష్టులు గురిసిరి పొగడికొనుచు.

చ॥ అది గని దైత్యనాథుఁడు రయంబునఁ దీక్ష్ణతరాంబకమ్ములన్
గుదిగొననేయ నచ్యుతుఁడు ఘూర్ణిలి తద్విశిఖంబు లెల్లనన్
ద్రిదశులు మెచ్చ నాత్మశరతీవ్రతఁ జూర్ణముచేసి యార్చినన్
బదపడి ధర్మసూనుపయి బాణశతంబులు గప్పె దైత్యుఁడున్. ౨౪౬

శా॥ దైత్యప్రేరితబాణబృందముల నౌద్ధత్యంబునన్ ద్రుంచి యౌ
చిత్యం బేర్పడ మౌనివర్యుఁడు పలాశిశ్రేష్ఠుఁ బేరీసునన్
బ్రత్యాలీఢత నిల్చి తీక్ష్ణవిశిఖప్రత్యాహతిన్ నొంప నా
దిత్యుల్ గన్గొన మింట ఘోరశరసంధిధ్వాన మెచ్చెన్ దివిన్. ౨౪౭

కం॥ దేవాసురవిశిఖాసా, రావృతమై గగనతల మహర్నిశభేదం
బావహిలనీక ఘనతిమి, రావహమై చాక్షుషప్రమాపహమయ్యెన్. ౨౪౮

మ॥ దివి నీక్షించుచు విస్మయోపహతులై దేవేంద్రముఖ్యామరుల్
భువి నీక్షించుచు నివ్వెఱన్ నిలిచి గుంపుల్ గట్టి దైత్యావళుల్
భువనక్షోభక మీరణం బసదృశంబున్ భూతపూర్వంబు గా
దు విలోకింప నటంచు మెచ్చిరి పలాంధోమౌనిసంగ్రామమున్. ౨౪౯

సీ॥ విబుధకిన్నరయక్షవిద్యాధరాప్సరో, గంధర్వచారణగరుడవరులు
సురతాపసులు మింటఁ జూచుచు నాశ్చర్య, భరితులై పలుమాఱుఁ బ్రస్తుతింప

పర్వతనారదుల్ ౘ పరమహర్షమ్మునఁ, జూచుచు నొండొండఁ ౘ జూచి తొల్లి
యంబికాసుత తారకాసురసంగ్రామ, మచ్యుతమఘుకైటభభావహమ్ము

గీ॥ గంటి మచ్యుతమూర్తియోఁగాదె మాని, యిట్టి నారాయణునితోడ ౘ నెల్లిదంపు
టాజినోనరించెఁబ్రహ్లాదుఁడసదృశుండు, మెచ్చితిమటంచువీణెయల్ ౘమీఁటిరెలమి.

ఉ॥ ఆ యసురాధిపట్టిన శరాసనదండముఁ ద్రుంచి వైచె నా
రాయణమూర్తి యొండొకటి ౘ యందిన నట్టుల యయ్యె సింగిణుల్
వేయి పలాళి పట్టినను ౘ వేయు బలాళిశరాళి తుండెముల్
సేయఁగ నబ్బురం బొదవి ౘ చెచ్చెరఁ జేఁ బరిఘంబుఁ బూనుచున్. ౨౫౧

కం॥ రక్కసుఁడు మానిచందుృని, నక్కున వ్రేయంగ నవశరాహతిఁ బరిఘన్
జెక్కలుచేసి పదింటను, జెక్కుల్ బలలాశిమేను ౘ జెచ్చెర నతఁడున్. ౨౫౨

శా॥ ఘోరంబౌగద యొండు చేతఁ గొని నిర్ఘోషంబు బ్రహ్మాండమున్
బూరింపన్ బఱతెంచి క్రోధరస విస్ఫూర్జ ద్దృగర్చిర్జ్వల
ద్ధారాసారము పైపయిన్ గురియుచున్ ౘ ధర్మాత్మభూజుత్రిదే
శారాధంబుగఁ జేయఁ గొండవలె వక్షమ్మె సుస్థిరుండై కుర్దిన్. ౨౫౩

కం॥ నారాయణుండు బాణా,సారము వర్షించి పరిఘఁ ౘ జదిపి సురారిన్
ధారలుగ నొడలు నెత్తురు, లేఱులు పఱపించె ససురులెల్ల వడంకన్.

మ॥ అసురాధీశుఁడు శక్తిఁ బూని పటుసింహధ్వానముల్ సేయుచున్
విసు వొక్కింతయు లేక యేయ నది వ్రేవె పైపయిన్ రాఁగఁ దా
పసి ఖండింపుచు సప్తబాణముల నా ౘ ప్రహ్లాదునిన్ సప్తసం
ఖ్య శరస్తోమహతిన్ గలంప నతఁడున్ ౘ గార్యంబుతో నేయఁగన్. ౨౫౪

గీ॥ దివ్యవర్షసహస్రి ముత్రద్వృత్తి మెఱయ, దనుజమానులరణము చిత్రమ్ముగాఁగ
భూచరులుఖేచరులుమెచ్చభువనభయద, మగుచువర్తింపఁగరుణామయాత్ముఁడగుచు

—। నారాయణుఁడు ప్రహ్లాదునకుఁ బ్రత్యక్షమగుట. ।—

సీ॥ సురలతో మునిపరంపరలతోఁ, బల్లవా,ధరలతో సింధుజాధరలతోడ
సతులతో పరభాగవతులతో నప్సర, స్తతులతో నేకాంతయతులతోడ
యములతోఁ బంచాయుధములతో గీతగా,నములతో నభయదానములతోడ
శ్రుతులతో వందిసంస్తుతులతోఁ, ద్రిభువన, పతులతో నాకాధిపతులతోడ

గీ॥ విహగవల్లభపత్త్రాగ్రవిలసితాహి, రాజవిభ్రాజమానపర్యంకమునను
గొలువు దీరిచి భక్తవత్సలత మెఱయ, నాదినారాయణుండు ౘ ప్రత్యక్షమయ్యె

వ॥ అయ్యెడఁ బ్రహ్లాదుండు.

గీ॥ అట్లు ప్రత్యక్షమైన పద్మాక్షుఁ గాంచి, చేతులు మొగిడ్చి మ్రొక్కుచు జెంతనిలిచి
భక్తి భయములు రెండు తోడ్పాటుగాఁగ, వెన్నునకు మధురోక్తుల విన్నవించె.

మ॥ భువనాధీశ్వర నీవొసంగు వరముల్ బొంకవ్వె సత్యద్వయీ
భువనాంతర్గతులెల్ల నీకు నెదురన్ బోరాడ లేరంటి వీ
భువిలో వీరలు దుర్బలుల్ ద్విజులునై పోరన్ జితుల్ గార మా
నవు లిట్లైనను దేవతావళుల సన్నాహింపఁగా నేర్తునే? ౨౬౦

గీ॥ దేవతావళితోడ నుద్వృత్తి వేయు, వర్షములు పోరి గెలిచితి వాసవాది
నిర్జరుల బీదబాపల నిశితశరవి, పాటనము నోర్చలేనైతిఁ బరమపురుష!

ఉ॥ ఎద్ది యుపాయ మన్న హరి యిట్లనియెన్ దితిజాధినాథ! వీ
రిద్దఱు మామకాంశలు సమీహితబుద్ధులు తాపసోత్తముల్
పెద్దలు వీరితో నిటులు ద్వేష మదేటికి? నీదు వీటి క
స్మద్దయనీయతం గని విశంకత నేనలతోడఁ బొమ్మిఁకన్. ౨౬౨

ఉ॥ పాయక నన్నుఁ గొల్వు మనపాయసుఖస్థితి నీకుఁ గల్గు భో
గాయతనంబు నీభువన మంచని మాధవుఁ డానతీయ నే
నాయుతుఁడై సురారిభువనమ్మునకున్ జనె మౌను లందు ని
త్యాయతి నుండి రిద్దఱును నబ్బదరీవనికాశ్రమంబునన్. ౨౬౩

వ॥ అనిన విని జనమేజయుండు సాత్యవతేయుం గని మహానుభావా! పరమశాంతులు తపోధనులు నగు నరనారాయణులు తాపసులుగదా! రాగయుక్తులం బోరి వీర రసాస్వాదులయి యుత్తమంబగు తపం బుజ్జగించి ప్రహ్లాదునితో దైవవర్ష శతంబు సంగ్రామం బొనర్చుట కేమికతంబు? భగవదంశజాతు లగువారికి మనోవిజయంబు సులభంబు గాదననెడ మాబోటుల కెయ్యదిగతి? రాజ్యద్రవ్యకామినీనిమిత్తంబున సంగ్రామాభిమానంబు పొడము, విరక్తు లగుటవలన నిట్టి పనులియ్యకొనఁబనిలేదు గదా! మఱియును సర్వేశ్వరుం డగు విష్ణువు నవతారంబు లగుటకు దేహపీడలనోర్చి దుస్తరంబగు తపం బొనర్చుట కేమికతంబు? ధర్మనాశకంబగు యుద్ధంబును ఫల ప్రదంబగు తపంబును నగు నీరెంటితో నిరీహు లగువారికిన్ బని యేమి? యుభ యంబును దుఃఖప్రదం బేకదా! మూఢుండైనను దారుణకార్యంబున కిచ్చగించునే? యిట్టి ప్రయోజనంబు లహంకారమూలంబులగు, నిట్టివారలకు నహంకారమ్మ వర్జనీయం బేకదా యజ్ఞకర్తయు ధార్మికుండును నగు యయాతి స్వకృత పుణ్యో త్సారణమాత్రంబున వజ్రపాణిచే స్వర్గచ్యుతుండై భువిన్ బడునట్లుగాఁ

ద్రోహియంబడఁడే ఫలోద్దేశంబులేని కార్యంబు లేదు కావున యుద్ధతపఃకార్యంబులు నిష్ఫలంబులై ప్రవర్తింపవుగదా? యన్నరనారాయణులకు నిష్కార్యద్వయంబునందు నింత యభినివేశంబులు గలుగుట సంశయావిష్టంబై యున్నయది యిమ్మాలిన్యం బడంపవలయు నని వేడిన రాజేంద్రునకు మునివరుం డిట్లనియె.

సీ॥ కారణస్థితిలేని ✽ కార్యముల్ గలవె త,పంబును దానంబు ✽ భజన యజన
ముఖ్యముల్ సాత్త్వికా✽మూలముల్ రాజసం,బునను నట్టులు గల్గు ✽ భూవరేంద్ర!
తామసంబునను యు✽ద్ధములు ప్రవర్తించు, సర్వం బహంకార✽సంచితంబు
శుభమశుభంబును ✽ సుఖదుఃఖములు బంధ, మోక్షంబు లఘుముచే✽ మొనయుఁగాదె

గీ॥ బ్రహ్మ రుద్రులు విష్ణుండు ✽ పాకవైరి, మొదలుగాఁ గల్గువారెల్ల ✽ ముజ్జగముల
నారసిచూడ నహంకార✽యుతులుగారె,యితరు లననేల? మునులన ✽ నెంతవారు.

గీ॥ జంగమస్థావరాత్మక✽జగములెల్లఁ, జచ్చుచును బుట్టుచును నుంట✽స్వాభిమాన
వశతచేగాదె దేహాది✽వర్తనంబు, బండివంటిది సంసార✽మండలమున. ౨౬౬

శా॥ నక్షత్రంబులకైన లెక్కగలుగుఁ ✽ నానావతారంబులం
దక్షయ్యుండు జనార్దనుండుఁ బడఁడే ✽ యందేమి యిందేమి సా
ధ్యక్షంబైనది మాయ, తద్వశతచేఁ✽తజ్జ్ఞేతనుల్ సంసృతిన్
సాక్షాత్ప్రాతము నొంది వర్తిలుట లెం✽చన్ వచ్చునే యేరికిన్. ౨౬౭

## —♦ భృ గు ము ని హ రి ని శ పిం చు ట. ♦—

సీ॥ నారాయణుఁడు జగ✽న్నాథుండు వాసుదే,వుండు శౌరి జనార్ద✽నుండు విష్ణుఁ
డవతారములు పెక్కు ✽ లవలంబన మొనర్చి, రాజీవకమఠవ✽రాహసింహ
వామనాకృతులచే ✽ వర్తించె విధిచోది,తుండయి వైవస్వ✽తుండు రాజ్య
మేలుచో విష్ణుండు ✽ భృగుశాపమున ననే,కావతారంబుల ✽ ననుకరించి

గీ॥ శిష్టరక్షణ మొకకొంత ✽ దుష్టశిక్ష,యును మఱియొకింత సేయఁడే✽యనిన రాజు
సందియమునొంది శక్తిభూ✽నందనునకు, మ్రొక్కి యిట్లనిపలికె స✽మ్మదముగదుర.

సీ॥ జగదీశ్వరుండు కే✽శవుఁడట్టివానికి, భృగుశాప మెట్లయ్యెఁ ✽ బెద్దలెల్ల
సాత్త్వికుండు భృగుండు✽సంయమీశ్వరుఁడందు, రప్రియుం డెట్లయ్యె✽నచ్యుతునకు
నిర్జరారాధ్యుండు ✽ నిఖిలేశ్వరుఁడు హరి, యేవిరోధంబున ✽ నిట్లు భృగుని
వలన శప్తుం డయ్యె ✽ వాసుదేవుఁడు సర్వ,మునిపూజ్యుఁడయ్యును ✽ మునులవలన

గీ॥ నింత యెడరొందెననుట నా✽కెడఁగలంచె,సంశయమువాపితత్కథా✽శ్రవణమునను
దురితహరణంబొనర్పు మో✽పరమపురుష! యనిననిట్లని బాదరా✽యణుఁడుపలికె.

చ॥ వసుధావల్లభ! శార్ఙ్గి మానికృతశాపగ్రస్తుఁడై నట్టి చ
ర్య సమీచీనముగా విన్దగు జగద్బ్రహ్మణ్యుఁడై తొల్లి రా
క్షసస్పృష్టిన్ మదినెంచి కశ్యపుఁ డుదగ్రక్రోధులన్ దైత్యులన్
బ్రసభామర్త్యవిరుద్ధకృత్యుల సృజింపన్ జొచ్చె నొక్కమ్మడిన్. ౨౭౦

కం॥ అందు హిరణ్యకశిపుఁ డను, బృందారకవైరి లోకభీకరుఁ డగుచున్
గొందఱు దైత్యులతో సం,క్రందనుఁ బీడించె సురలు కలవరపడఁగన్. ౨౭౧

కం॥ అమరులు వేఁడఁగ నంతన్, గమలాక్షుం డాహిరణ్యకశిపు వధించెన్
సమృగేంద్రార్ధనరాకా, రమునన్ బ్రహ్లాదుఁ డసురరాజై కడిమిన్. ౨౭౨

సీ॥ తన తండ్రి సురవిరోధంబుచే హతుఁ డౌటఁ, దెలిసి ప్రహ్లాదుండు దేవసమితి
శాసించి సురలోకసార్వభౌమత నూనఁ, దలఁచి యింద్రుని మీఁద దండుదరలి
స్వర్గావరోధంబు సలిపి శక్రునితోడ, శతవర్షములుచేసె సంగరంబు
లోకంబు లల్ల కల్లోలంబు లయ్యె న, య్యాహవంబునను బ్రహ్లాదుఁ డింద్రు
గీ॥ చేఁ బరాజితుఁడై చాలఁ జింత నొంది, తపము ఫలదంబుగా నెంచి తనదుపౌత్రు
బలిఁ బ్రతిష్ఠించి నిజరాజ్యపాలనమునఁ, దపముఁ జేసెను గంధమాదనముమీఁద.

మ॥ బలియున్ దేవవిరోధియై త్రిభువనీపాలుండ నే నంచు న
బ్బలవిద్వేషిని దారసించి సమరప్రౌఢిన్ విజృంభింప నా
కులతన్ జెంది శచీవిభుండు గరుడాంకున్ దోడుగాఁ గొంచు దై
త్యుల మర్దించిన వారు భీతులయి కావ్యున్ జూచి ఖిన్నాత్ములై. ౨౭౪

శా॥ స్వామీ! నిర్జరకోటిచే బడలి హింసాభీతిచే వచ్చినా
మేమో యంచు నుపేక్షఁజేసిన సురాభీష్టంబు సిద్ధించు ని
ర్ధామంబై దివిజారి ధామతతి యారున్ బేరున్ లేక ని
క్షేమంబై చను నీసహాయమున వాసింగంటి మిన్నాళ్లకున్. ౨౭౫

కం॥ శరణాగతులము మ మ్మిఁకఁ, బరిభవహతి నొందనీక పాలింపుము నీ
చరణాశ్రయులము కరుణా, స్ఫురణమ్మునఁ బ్రోవుమనిన శుక్రుం డనియెన్. ౨౭౬

చ॥ సురరిపులార! మీరు బలసూదను వేఁడిమి కోర్వలేక నన్
శరణము నొందినారు సురశాసన మే నొనరింతు మంత్రితం
త్ర రచితకృత్యముల్ సలిపి ధైర్యధురీణత నిల్చి మానస
జ్వరములు వీడుఁడీ! తగినసాహ్య మొనర్తు నటన్న రక్కసుల్. ౨౭౭

కం॥ నిర్భయులై యుశనఃకృత, దుర్భరమార్గములచే విగధూతాపదులై
స్వార్భానుముఖులు సుఖసం,దర్భోత్సాహమున నుంట ఽ తద్దయు వినుచున్. ౨౭౮

చ॥ బలరిపుఁ డాదిగా సుర లనభంగురశుక్రినయాప్తిఁ దేజమున్
బలిమియుఁ గల్మిఁ గోల్కొనినవారని యందఱు నొక్కచోట ని
శ్చలమతి నొక్కనేర్పు స్వవశంబుగఁ జేకొని దైత్యు లీమెడన్
గలనికి రాక పీడు చొరఁగాఁ దలపోసిరి స్వస్థులై కడున్. ౨౭౯

కం॥ తప్పించి మనము పైఁబడి, చొప్పెఱుఁగకయుండ బందిఁ ఽ జూపినఁ జాలన్
డెప్పరమగువారికి నని,యప్పుడె హరిఁగూడి చనిరి ఽ యసురుల నొంపన్. ౨౮౦

ఉ॥ ఏమఱఁజేసి పైఁబడుట ఽ నెల్లరు దైత్యులు నిర్జరాళి సం
గ్రామమునందుఁ గొందఱు ప్రకంపితులై రొకకొంద ఱార్తమై
నేమియు సేయలేక సమరేచ్ఛలఁ బోరి యడంగి రిట్లు నా
నాముఖమై చికా కగుచు ఽ నాశమునొందె సురారిసైన్యమున్. ౨౮౧

కం॥ హతశేషులయిన దైత్యులు, వితథోత్సాహులయి కావవే ! మమ్మనుచున్
నుతు లొనరించుచు వెస భృగు,సుతుసన్నిధిఁ జేరి యార్తిసూచించుటయున్.

ఉ॥ పీడితులై సుధాశనుల ఽ వెన్కొన నోడిన దానవావళిన్
దాడితులైతిరే సురలు ఽ దర్పితులై మిము నింత చేసిరే?
యోడకుఁ డేను గల్గఁ బెఱయూహలతోఁ బనియేమి యంచు నా
లోడితకార్యుఁడై దివిజలోకము మంత్రవిధిన్ గలంచినన్. ౨౮౩

సీ॥ విబుధు లాసురకోటి ఽ విడిచి కాతరవృత్తిఁ, బఱచిన నన్నిశాచరులఁ జూచి
కావ్యుండు వల్కె ముకుందుండు దెల్ప, వింటి మీకును దమ్మికంటి వైరి
వారాహరూపియై ఽ వచ్చె హిరణ్యాక్షు, నరసింహరూపంబునను హిరణ్య
కశిపుని వధియించె ఽ ఘనుఁడు విష్ణుఁడు మంత్ర,కలన నాతనిఁ ఽ గెల్వఁగనుట భరము

గీ॥ గాన శంకరుఁ జేరి తత్కరుణ మంత్ర,శక్తిఁగొని తెచ్చియిత్తు నిశ్శంక హరినిఁ
గెలుతురందాకఁగాలమీక్షించుకొనుచు, నిలువుఁడని చెప్పనిశిచరుల్ పలికిరపుడు.

—॰ శుక్రుఁడు తపస్సు చేయుట ॰—

కం॥ బలవంతులెల్లఁగడచిన, బలహీనతఁ గొంద ఱిట్లు ఽ పడితిమి వెతలన్
జ్వలనాక్షు వేడిమంత్రము, లలవఱచినదనుక నెట్టులగు మాబ్రతుకుల్. ౨౮౫

కం॥ నా విని కావ్యుం డిట్లనె, దైవతరిపులార ! మంత్రతతిఁ గొను దనుకన్
సేవయొనర్చిరొ, శమధను, లై వనిఁ దాగిరొ, సహింపనగు మీకనిరన్. ౨౮౬

చ॥ సమయముగాని వేళ రిపుసన్నిధిఁ జేరుచు సేవఁ జేయుచున్
దమ కభివృద్ధి రాఁగలుగుదాఁక సహించి యణంచి శత్రులన్
సమదగతిన్ జరించు టది ౹ శాస్త్రమతంబగుఁ గాన నానుడిన్
శ్రమపడి యట్ల సేయనగు ౹ స్వస్వనిశాంతనివాససిద్ధికిన్. ౨౮౮

గీ॥ ఏ మహాదేవు సన్నిధి ౹ కేగి మంత్రి, శక్తి గొని వత్తు నిర్జరజయముఁ గొంద
మనుచుఁగా వ్యుండు దైత్యులనలరఁ జేసి, యరిగెఁ గైలాసమునకు మంత్రార్థి యగుచు

చ॥ అసురుల్ పంపిరి శక్రు సన్నిధికిఁ బ్రహ్లాదున్ మహాభాగ! నీ
వసమానుండవు సత్యవాదివి భవద్వ్యాహారముల్ నమ్మి సం
తస మొప్పన్ బరిచర్యకై పిలుచు నాతం డందుఁ గొన్నాళ్ళు తా
మసమున్ లో నణఁగించి యుందమని దంభస్ఫూర్తిసంరంభులై. ౨౮౯

ఉ॥ ఆసురవల్లభుండు చని ౹ యట్టులఁ దెల్పఁగ మోద మంది య
వ్వాసవముఖ్యులా దివిజవర్యులు సంతస మంద వారి సం
త్రాసము మాన్పి చేకొనిరి ౹ దైత్యులు తద్వశు లౌచు దాస్యమున్
జేసి వసించి రిష్టఫలసిద్ధిఁ గొనన్ మదిలోఁ దలంచుచున్. ౨౯౦

క॥ కొందఱు కశ్యపు నాశ్రమ,ను దావాసం బొనర్చి ౹ మహితతపస్యా
నందులయి శుక్రురాకను, డెందమునన్ గోరికొని నటించిరి మిషచేన్. ౨౯౧

గీ॥ ఆ సురగురూత్తముండు కైలాసమునకుఁ, జని మహాదేవు పదపంకజములదండ
దండమును బోలె సాష్టాంగదండ మిడుచు, నభినుతించుచుఁ బలికె నిట్లని నరేంద్ర!

సీ॥ అంగిరస్సంభవుం ౹ డభ్యసింపనియట్టి, మంత్రముల్ గొనఁగ నీసముఖువుఁ జేరి
నాఁడ నిర్జరులచే ౹ నైరృతుల్ మడిసిరి, రక్కసుల్ సురలఁ బరాభవింపఁ
గరుణింపవే యన ౹ హరుఁడు కావ్యుం డిట్లు, వేడుచున్నాఁడు వేవిబుధులయెడ
నెట్టు ద్రోహింతు మత్కృపఁగొని వారలు, మనుచున్నవా రని ౹ మదిఁ దలంచి

గీ॥ దుష్కృతం బని తలపోసి ౹ తొలఁగ నేల, యనుచు వచియించె శుక్రు నీ ౹ కనుచితంబె
మైన బోధింతు వ్రత మొక్క టది యొనర్పు, దాన నీ కిష్టసిద్ధియౌఁగాన వినుము.

మ॥ తలక్రిందై యొక వేయిహాయనము లుద్యన్నిష్ఠ ధూమాశి వై
చలనం బించుక లేక నిల్చినను నిష్టం బెల్ల సిద్ధించు ని
స్తులమంత్రావళి నీకు నబ్బు నన నత్స్తోకవ్రతప్రాప్తి న
ట్టుల నిల్చెన్ భువి భార్గవుండు దృఢనిష్ఠుండై మనోనిశ్చితిన్. ౨౯౪

చ॥ వ్రత మొనరించుచున్ భృగుఁ డవారితనిష్ఠఁ జలింపకున్నవాఁ
డతఁడు నిశాచరావళికి ౹ నభ్యుదయం బొసఁగున్ హఠాద్గతిన్

దితిజుల నెల్ల నుక్కచెడఁ దీక్ష్ణశరార్చులపాలుఁజేసి యు
ద్ధతి వధియింతు మంచని సుకథాంధులు గుంపులుగూడి యొక్కెడన్. ౨౯౫

ఉ॥ పట్టి నిశాచరావళుల బాధలఁబెట్టుచుఁ దున్మినైచుచున్
బిట్టుగ విక్రమింప నతిభీతిని దైత్యులు నిర్జరాళితో
నిట్టుల సాహసింపఁ బనియేమి భవద్వశవృత్తి నుంటి మి
ప్పట్టున నీ నిరాయుధులపైఁ జలమూనుట ధర్మమానొకో? ౨౯౬

గీ॥ మీకు శరణాగతుల మేము మేర మీఱి, సాహసింతురె! మామీఁదఁ జలమిఁ కేల!
సత్య మెడఁబాసి ధర్మంబు సడల భీత, హాతికిఁ దొడరుట యన్యాయమనుచుఁ బలుక.

సీ॥ త్రిదశు లిట్లనిరి మీ తెఱఁగు గానఁగవచ్చె, భార్గవు నంపించి ఫాలనయను
వలన మంత్రంబులు వచ్చునంతకు మీరు, దంభులై యున్నారు తపమువలన
నరిజయంబగు నని యరసితి రీక యుద్ధ, సన్నద్ధులై రండు సమరమునకు
వధియించెదము శత్రువధముల ధర్మంబుఁ, గొనవేల యొట్లైన గూల్చుటుచిత

గీ॥ మనిన వెఱఁబాఱి దైత్యు లాశాంతరాళ, కాననంబులఁ గొండలఁ గానరాక
యణఁగి శుక్రుండు రామిచే నటనుటించి, సంఘమై యంత భార్గవాశ్రమముఁ జేరి.

ఆ॥ కావ్యమాతఁ గాంచి కన్నతల్లి వి నీవు, కరుణఁజూచి మమ్ముఁ గావవలయు
నాత్మజుండు వచ్చునందాఁకఁ బ్రోవు మో, యమ్మ! యనిన వారి భయ మొనఁగి.

చ॥ నిలువుఁడు మత్సమీపమున నిర్జరభీతి స్పృశింప దిచ్చటన్
గలఁగఁగ నేల యన్న భయకంపవిహీనత నాయుధాళి వి
చ్చలవిడి పాఱనైచి సుఖసంస్థితులై వసియింప నీనడిన్
దెలిసి సురల్ రణోగ్రులయి ధీరత వచ్చిన వారిఁ జూచుచున్. ౩౦౦

ఆ॥ అభయు లగుచు నాదునాశ్రమసీమలో, నిలుచువారిఁ జంప వలదటన్న
వినక దైత్యపాళి వేధింప నిర్జర, కోటిఁ జూచి సాధ్వి కోపగించి. ౩౦౧

శా॥ తంద్రాబంధము నొంది పోవుఁ డని యంతన్ శాప మియ్యంగ స
ర్వేంద్రాదిత్రిదశుల్ వనీభువిని నొక్కింతైన బోధమ్ము లే
మిం ద్రాఘీయసియైన నిద్రఁబడి బన్ మిన్ దక్కఁ మొందెందుఁ బో
వం ద్రోవల్ గనలేక చిక్కిరి తపఃప్రాగల్భ్యమున్ గంటిరే. ౩౦౨

ఆ॥ ఒడలిచీరమెఱుఁగు కుర్విపైఁబడియున్న, యిందుఁ జూచి యయ్యు పేందుఁడనియె
నలసి తీవు నన్ను నండఁగాఁ గొనుమింద్ర ?, యనిన వాసవుండు నట్లచేసె. ౩౦౩

కం॥ హరి సంరక్షితుఁడై య, ప్పురుహూతుఁడు మనుటఁజూచి పొగులుచు భృగుజా
య రుషాన్వితమై వాసవ, హరిమఱుఁగున్ జొచ్చి బ్రతికి తని పెనుగినుకన్. ౩౦౪

మ॥ హరితో నిన్నుఁ దృణీకరించితి మదీయారంభమున్ గాంచు మం
చురుసంరంభముఁ జూప బెగ్గిలి కతంబూహించి యాశక్రుఁ డ
గ్గరుడాంకాన్వితుఁడై తపోబలమునన్ గాలూనఁగా లేక ని
ద్దుర మ్రిగ్గెన్ సురకోటి తల్లడిలెఁ దోర్దర్పోరవాపూర్ణమై. 3౦౫

శా॥ కంటే! మాధవ! నిన్నుఁ గూడియును మత్కార్యంబు నిర్దగ్ధమై
యుంటన్ దాళఁగఁజాల మానులము మహిమ్మోర్వంగ నెవ్వారు క్రిఁ
గంటన్ జూడఁగ నెవ్వఁ డోపునని దుర్గర్వంబుచే నుందు రీ
వెంటన్ నీవు నుపేక్షఁజేసినఁ జనున్ వేయేల మజ్జీవముల్. 3౦౬

—. హరికి భృకుభార్యను హింసించుట .—

సీ॥ విష్టరశ్రీవ! యొక్క వెరవుసేయు మటన్న, సురరక్షణార్థియై హరిమనమునఁ
జక్రిసంస్మరణంబు సలుప సంవర్తాగ్ని,పోలిక జక్రంబు భువనభేది
యాచు వచ్చినఁ గేల నంకించి పురుహూత,చోదితుండగుచు దాహమోదరుండు
కావ్యమాతృశిరమ్ము ఖండించె శతమన్యుఁ, డుత్సహింపఁగ నిర్ఝరోత్కరంబు

గీ॥ జయజయధ్వానములఁ దన్ను సన్నుతింప,గనలుచే నింతఁ జేసిరిగాని భృగుని
శాపభయమున వెఱచి రీశక్రిహరులు, చేయు కర్మం బనుభవింపఁ జేయుఁగాదె.

శా॥ మిన్నే టన్ గృతకృత్యుఁడై భృగుఁడు నెమ్మిన్ స్వాశ్రిమస్థాయియై
వెన్నుం డిట్లొనరించు టారసి సమావిర్భూతదుఃఖార్తుఁడై
మిన్నున్నన్నున్న నెఱుంగనీని కుక్షిధ మేర్మిన్ శార్ఙ్గిఁ గన్గొంచు నీ
కన్నాకై సురలందుఁ గీర్తిఁ గను దుర్గర్వంబు మ మ్మేచెనే! 3౦౭

సీ॥ "ఖురళీపదశాంతి కొండంత సాధించి, మూలడాఁగినయట్టి ముసలిఁ బొడిచె"
ననుమాట తథ్య మయ్యెను నీయెడల శౌరి!, పరమేష్ఠికి రజంబు పాలదృక్కు
నకుఁ దమోగుణముసాత్త్వికుఁడవందురు నిన్ను,విపరీతమయ్యె నీవిధి యొనర్ప
నిరపరాధ యవధ్య నిష్ఠాళు వీ యింతి, నిట్లుఁ జేసిన పాపి నేమి నేతుఁ

ఆ॥ జుట్టువాలుబంటు శూరత న న్నిట్లు, విధురుఁగాఁగఁ జేయ విధికి నయ్యె
నో దురాత్మ! యెట్టులోర్చెద శపియింప, కింత దురితకృత్య మెట్టులడఁగు 3౦౮

—. భృగుఁడు హరిని శపించుట .—

ఉ॥ చచ్చుచుఁ బుట్టుచున్ భువి నసారపుయోనులయందు దుర్గతిన్
జొచ్చుచు దుర్భనాపదల శోకిలుచుండెద వంచుఁ దిట్టి ని

న్నెచ్చటనేని దేవుఁ డని గీ యెవ్వరు గొల్తురొ వారు మూర్ఖులై
యచ్చుగ దానసాధమతసనంది విముక్తులు గాకయుం డొగిన్. ౩౦౦

కం॥ అవతరణమిషంబున ని,బ్భువి మానుషగర్భములను గీ బుట్టుచు నార్తిన్
వివశత నొందుమటంచున్, దవశిఖబలె మండి మాని గీ దరధరుఁ దిట్టెన్. ౩౦౧

ఉ॥ మాని శపించుటన్ హరియు గీ మానుషజన్మము లెత్తి మాధులౌ
మానవులట్ల వర్తిలుచు గీ మర్త్యమునన్ జరియింపనయ్యె నెం
దేనియు నెంతవారికిని గీ దెల్లము భోగ్యము కర్మ బ్రిహ్మాకున్
మానఁగరాని ధర్మ మిది గీ మానవనాథ! యటన్న వ్యాసుతోన్. ౩౦౨

చ॥ ధరణిపుఁ డిట్లు పల్కె గృహసధర్మవిహీనత మాని యెవ్విధిన్
ధరఁ జరియించెఁ జక్రిహతి గీ దార దివంబున కేగ; నెట్టు ల
ధ్వరములు పెక్కు చేసె? నిరతంబును హోమవిధాన మెట్లుగాఁ
బరిణతమయ్యె? నా విని కృపామతి సాత్యవ తేయుఁ డిట్లనెన్. ౩౦౩

ఉ॥ ఈసున పద్మలోచనుని గీ నిట్లు శపించి భృగుండు చాల లో
గాసిలి యింతిశీర్షమునఁ గీ గాయము సంఘటియించి మంత్రివి
న్యాస మొనర్చి యేను నిగమమార్గ మెఱింగితినేనిఁ గృత్యముల్
చేసితినేని మత్సతికి గీ జీవిత మబ్బెడునంచు వెండియున్. ౩౦౪

—• శుక్రుఁడు తన భార్యను బ్రతికించుకొనుట •—

సీ॥ నేను సత్యంబును గీ నేమంబు ధర్మంబు, శ్రద్ధయుఁ దపమును గీ శాంతి దాంతి
గలవాఁడనేని మహత్కాంత జీవన మొందు, సురలార! కనుఁడు మహత్ప్రసూనృతంబు
కనుఁడు తపోబలం గీ బని యభిమంత్రించి, జలముఁ జల్లినఁ బునర్జాత వోలెఁ
జిఱునవ్వు నవ్వుచుఁ గీ జేడె దిగ్గున లేచి, పతికి మ్రొక్కిన భూతపాళు లెల్ల
గీ॥ సన్నుతించిరి భృగుని విస్మయమునొంది, యింద్రుఁడాదిగనిర్జరు లెల్ల నతని
మంత్రశక్తికి నబ్బురమంది పొగడి, రంత నిందుఁడు సురలతో గీ ననియె నిట్లు.

ఉ॥ ఎంత మహానుభావుఁ డితఁ గీ డీతనియంతటివాఁడు కావ్యుఁ డ
య్యంతకవైరియొద్ద నియమాప్తి వసించెను వంతశక్తి య
త్యంతముఁ గాంచెఁ బోలుఁ బునరాగతుఁడైన నమర్ష చర్యచే
నెంతలు సేయునో యనుచు గీ హెచ్చువగం గని పోయె నింటికిన్. ౩౦౫

—• జ యం తీ దే వి శు క్రు నా రా ధిం చు ట •—

క॥ అంతఃపురిఁ జేరి మదిన్, సంతాపము నొంది తనదునందని నంతన్
జెంతన్ జేరఁగఁ బిలిచి జ,యంతీ! భార్గవునిఁ జేరనరుగు మటంచున్. ౩౦౬

చ॥ పలికి సురేంద్రుఁ డప్పు డతిభవా! నిను శుక్రున కిచ్చినాఁడ నీ
వలభృగుపుత్రుఁ జేరి వినయానతవై పరిచర్య సేయుచున్
జల ముడుగంగఁ జేసి సరసప్రియసూక్తులఁ దేల్చుచున్ మదా
కులగతి మాన్పఁజేయు మతికోపి యతం డెఱుఁగంగఁ జెప్పితిన్. ౩౧౮

క॥ ఆరాధింపుము కావ్యుని, ధీరత్వమె నాదుభయముఁ దీర్చుమని సునా
సీరుఁడు జయంతి నంపిన, నారీమణి చనియె భృగునినందనుకడకున్. ౩౧౯

మ॥ చని కాంచెన్ హరికన్య ధూమపటలాస్వాదానురోధ భ్రమ
ద్ఘన తారా యుగళాక్షి నిర్గత బృహద్భాను జ్వల జ్వాలికా
కనదుగ్ర స్వదృ గర్చి రున్నమిత రక్తత్విట్కదంభావధూ
త నవన్యస్త విభావిభాసుర మహాత్త్వాకున్ శుక్రునిన్. ౩౨౦

క॥ తలక్రిందుగ వ్రేలుచు నిశ్చలచిత్తముతోడఁ దపము సలిపెడు భృగుజున్
గలికి కనుంగొని జనకుని, తలఁ పెఱిఁగి ప్రదక్షిణించి దండంబిడుచున్. ౩౨౧

శా॥ రంభాపల్లవతాళవృంతమున నారంభించి వీచున్, హిమో
జ్జృంభాంభంబులు దెచ్చి పైఁ జిలుకు నక్షీణాతపగ్రీష్మసం
రంభం బాఱఁగఁ బైఁటచెంగిడి రవిప్రాగల్భ్యమున్ దేర్చు నా
రంభోరూమణి తండ్రియాజ్ఞఁ బరిచర్యల్ సల్పె నీరీతిగన్. ౩౨౨

వ॥ మఱియును బరిపక్వంబులు మధురంబులు నగు రసాలనారంగద్రాక్షా మోచాది
ఫలంబులు సంగ్రహించి సదేశంబున నునుచుచు శుకసన్నిభంబులై హరితంబులగు
కుశాంకురంబులు సంగ్రహించి సమర్పించుచు నిత్యకర్మానుష్ఠానసిద్ధికై తిలగంధ
పుష్పాక్షత జలకలశాదులు సమీపంబున నునుచుచు నిద్రాసమయంబులఁ బల్ల
వాస్తరణంబు ఘటించి ముని శయనించునెడ దూరస్థయై తానును వన్యాహారం
బొనరించి శాపభయంబున హావ భావాది వికారంబు లెవ్వియుఁ గనంబడనీయక
యనుకూలంబులగు హరిహరస్తుతిగానంబులఁ గాలంబు గడపుచుఁ బ్రబుద్ధుండగు
తఱి నాచమనోదకంబు లొసంగి మనోనుకూలంబుగా నప్పడఁతి వర్తించునెడ
నింద్రుండును గూఢచారులం బంపి మునివర్తనం బరయుచుండు నిత్తెఱంగున
నిర్వికారయు జితక్రోధయు బ్రహ్మచర్యపరాయణయు నై జయంతి శుశ్రూష
యొనర్చుచుండ వర్షసహస్రంబు పూర్ణంబయ్యె నయ్యెడ. ౩౨౩

— శుక్రుఁడు వరంబులు పడయుట —

మ॥ పరితుష్టుండయి పార్వతీపతి దయాపారీణతన్ భార్గవున్
బరమప్రీతి వరంబు వేఁడు మనుచున్ బ్రత్యక్షమై నిల్చె న

ప్పరమాత్ముం గని మొ్రొక్కి భార్గవుఁడు సద్భక్తి నుతుల్ సేయ నీ
శ్వరుఁ డేదేనియు నీదువాంఛితము తత్తత్సర్వంబు సిద్ధించెడిన్. ౩౨౪

కం॥ భూతావధ్యుఁడ వయ్యెదు, చేతోఽభీష్టంబు నీకు సిద్ధించు మను
వ్రాతము నీవశ మయినది, యీ తప మిఁకఁ జాలు నింటి కేగుము శుక్రా. ౩౨౫

మ॥ అని యంతర్హితుఁడయ్యె శంభుఁడు గృహాశయ స్త్రైకచిత్తంబునన్
గని శుక్రుండు జయంతి కిట్లనియె నో కన్యామణీ ! నీదు సే
వనముల్ మెచ్చితి నెద్ది గోరెదు మదావాసంబునం దేమికా
మనచే నిల్చితి తెల్పుమన్నను మహాత్మా ! విన్ము నేఁ దెల్పెదన్. ౩౨౬

—• శు క్రుఁ డు జ యం తి ని భా ర్య ను గాఁ గై కొ ను ట •—

శా॥ సర్వజ్ఞుల్ గద ! మీరు సర్వము తపశ్చర్యాగతిన్ గందు. రీ
యుర్విన్ మీ కెఱుగంగరానిపను లెచ్చోఁ గల్గునే ? యేను న
గ్గీర్వాణాధిపుపుత్రి నిన్ను నెదుటన్ గేల్మోడ్చి ప్రార్థించెదన్
నిర్వర్తింపఁగరాదె! వాంఛితము నే నీదాన నింకేటికిన్ ? ౩౨౭

గీ॥ తండ్రి నీకు సమర్పించె దారగాఁగ, నాదుపేరు జయంతి యన్నయు జయంతుఁ
డేను గామార్తనై మిమ్ము నెదఁదలంచి,వచ్చితిఁ గర౯గ్రహము సేయవలయు నన్ను. ౩౨౮

ఉ॥ పంచశరుండు నన్ను సుమబాణపరిప్లుతఁ జేసె మీకు ని
ర్వంచకవృత్తి దారనయి వర్తిలుచున్ విహరించుదాన నో
కించుకయన్యబుద్ధి యిదు దేని సహింపఁగఁజాల నేఁ దప్రా
కంచుకహీననై హృదయకాంక్షిత మెల్లను విన్నవించితిన్ ? ౩౨౯

కం॥ ఆమాటల్ విని శుక్రుఁడు, భామా! పది యేండ్లు నిన్ను భావించెద మా
యామహితుఁడనై భూత, స్తోమాగోచరుఁడ నయి కుతుక మెదఁబొదలన్. ౩౩౦

వ॥ అని శపథం బొనర్చి.

కం॥ ఇంటికిఁ జని శుక్రుఁడు వ్రాల్గంటిన్ జేపట్టి కుసుమకార్ముక కేళీ
కంటకితాంగుండై చెలి, నంటునఁ బదియేండ్లు గడపె నవోత్సవుఁడై. ౩౩౨

మ॥ పదియేం డ్లిట్లు జయంతిఁ గూడి నిఖిలబ్రహ్మాండభూతాళికిన్
వెదకన్ గానఁగరాక మాటుపడి యావిర్భూతమోహాతిరే
కదశచ్చిత్తవికారుఁడై యలరుటన్ గ్రవ్యాదబృందంబు త
త్సదనప్రాంతము జేరి శుక్రునియుదంతం బాకళింపన్ బొరిన్. ౩౩౩

కం॥ భవనములను భూరాదిక, భువనములను శుక్రు వెదకి పొడఁగానక దై
త్యవరుల్ భీతిల్లుచు భయ, వివశత దుఃఖార్తి నొంది వేసటపడుచున్. ౩౩౪

సీ॥ జగదీశ్వరుని శంభు సందర్శన మొనర్చి, వచ్చెద మంత్రముల్ దెచ్చి యిత్తు
వెఱవకుఁడని చెప్పి వెడలె శంకరుఁ గాంచి, స్వార్థసిద్ధి వహింపఁ జాలెనొక్కొ?
సిద్ధించెనేని చేరచ్చెర వచ్చి మన కెల్ల, జయ మీక తక్కనే చంద్రమౌళి
దర్శనం బిచ్చెనో తడయంగఁ బనియేమి, యీకుండెనో శుక్రుఁ డిల్లు చేర

గీ॥ ననుచు వింటిమి లేఁ డయ్యె నఖిలభువన, మార్గణ మొనర్చితిమి యనుమాన మేల?
సిద్ధిపొసఁగమి నచట లజ్జించి రాక, తక్కెనో! యేమి దలఁచెనో దైవ మకట.

—• గురుఁడు మాయాశుక్రరూపంబున రాక్షసులకు చెడుబోధ చేయుట. •—

వ॥ ఇట్లు రక్కసులు గురుసందర్శనలాలసులై యుండునెడ నింద్రుండు గురునికటమ్మున కరిగి. ౩౩౫

శా॥ ఏదే నొండొకమాయఁ జేసి దితిజాభీష్టంబు మాయించి ని
ర్వాదంబౌ విజయంబు మాకొసఁగి కార్యం బోలదే? యన్న మా
యాదంభంబున దానవుల్ చెడు నుపాయం బాత్మఁ జింతించి మ
ర్యాదన్ దప్పి గురుండు దైత్యగురు రూపాటోపదంభంబునన్. ౩౩౬

గీ॥ కావ్యనై పథ్యకుహనావికారమూని, దితిజసందర్శనమున కేతెంచు పోల్కి
ఆత్మసన్నిధి కరుదెంచునట్టి గురుని, గురునిగా నెంచి హర్షించి గుంపుగట్టి. ౩౩౭

మ॥ కుహనాచిత్రశిఖండినందను నసంకోచంబునన్ గాంచి మ్రొ
క్కి హరాభ్యర్ణమునందు మంత్రములు గోరికన్ గొంటివే? యన్న స
స్పృహతన్ మీకయి పోయి మానుదునె సంభేదించి మంత్రావళీ
గహనం బెల్ల నెఱింగి వచ్చితిని శంకల్ మానుఁడే నిచ్చెదన్. ౩౩౮

ఆ॥ దైత్యులార! హరుని దర్శించి తత్కృపా, మహిమమునను గొంటి మంత్రశక్తి
ననిన సురభయంబు నపనయించి సురారు, లధికహర్షసంభృతాత్ములైరి. ౩౪౦

కం॥ వింటివె భూవల్లభ! యీ, తుంటరితన మమరులందు దురితమనక య
ప్పంటికి నట్టు లొనర్చిరి, బంటుతనంబగునె శత్రుభంజన మిట్లే? ౩౪౧

ఉ॥ ఎవ్వరి నెట్లు సేయదు మహేశ్వరి తద్గుణవృత్తి మిశ్రమై
యివ్వసుధన్ జరాచరము నెల్ల సమాకృతి నుచ్చనీచముల్
ద్రివ్విన వైపరీత్యముల దండడి నొందఁగఁ జేయదొక్కొ? యీ
క్రొవ్విన నేత నిర్జరులకున్ దగునే యన రాజు మానితోన్. ౩౪౨

ఉ॥ అంగిరసుండు దైత్యగురుసనాకృతి దాల్చి సురారులందు నే
భంగ మొనర్చెనో? తెలుపు ✽ భవ్యముఁ జేకుఱు నీదు వాక్సుధా
భంగతరంగమజ్జనము ✽ పాపహరంబగు నమ్ము బోట్లకుఁ
వెంగలులై నిశాచరులు ✽ వేదుఱునొందిరె దేవమాయకున్. ౩౮౩

సీ॥ త్రిదశకోటికి నెల్ల దేశికుండయి సర్వ, విద్యానిధానమై ✽ వెలయుగురుఁడు
చలముచే దైత్యుల ✽ సాధింపఁగోరెనే, ధర్మశాస్త్రముల సత్యంబు ధర్మ
కారణంబని చెప్పఁగా విందు నంగిరః,పుత్రుఁడై యసురుల ✽ పొలుపుఁ జెఱపఁ
దథ్యం బతథ్యం బతథ్యంబు తథ్యంబు, గాఁ జేయఁగోరెనే ✽ కల్లలేని

గీ॥ వారు సంసారులం దిల ✽ లేరు సుమ్ము, అబ్జజాండాప్తికన్న నాహార మెక్కు
డయ్యె నిటువంటి మునులెల్ల ✽ నన్న కాము,లగుచు నన్నృతంబు లాడఁగనవ్వారలైరి.

ఉ॥ సత్త్వసముద్భవుల్ సురలు ✽ సాత్త్వికు లమ్మనుజావళుల్ రజ
స్తత్త్వము తామసంబు పశుసర్పమృగాదిక మంచు నెల్లెడన్
దత్త్వవిదుల్ వచింతురు గదా? గురు నంతటివాఁ డసత్యమున్
సత్యముగాఁగ నెంచె మనుజప్రతతిన్ గణుతింప శక్యమే. ౩౮౪

సీ॥ హరిహరుల్ మొదలుగా ✽ నపదేశవృత్తికి, నారంభణ మొనర్చి ✽ రఖిలసురలు
గౌతమాత్రివశిష్ఠకణ్వ విశ్వామిత్రి,నామదేవాదు లీవ్వారున నడుమఁ
గామరోషాదు లీక్కరణి విజృంభింప, ధర్మ మేగుహలలో ✽ దాఁగునొక్కొ?
శక్రధనంజయచంద్రాదు లన్యకాం,తాసక్తు లని విందు ✽ మఖిలమునను

గీ॥ విశ్వసింపంగఁ దగువారు ✽ వేల్పులందు, మానులందును లేరైరి ✽ గాన నింక
గ్రాహ్యమగ్రాహ్యమనుపల్కు గలదెయెందు,సందియముదీరదయ్యెనేమందువనిన.

వ॥ ముని యిట్లనియె. ౩౮౫

మ॥ శివుఁడున్ విష్ణుఁడు బ్రహ్మయున్ ధిషణుఁడున్ ✽ జిష్ణుండునున్ లోనుఁగా
భువి నెవ్వారు వికారసంయుతులు కోపుల్ రాగులున్ గారె? రా
గవికారం బెడఁ గల్గు వారలకు శంకాతంక మేలయ్య! కా
ర్యవశుల్గావున నప్పటప్పటికి వీరౌనట్లు వర్తింతొగ్రిన్. ౩౮౬

ఆ॥ దేహ మొందువాఁడు ✽ దేహగుణంబుల, బద్ధుఁ డౌటయరుదె? ✽ పార్థివేంద్ర!
ఆత్మనిర్గుణకము ✽ నవికారమును దేహ,ధారులందు నిర్వికార మద్ది. ౩౮౭

మ॥ గుణకార్యంబులు లోకముల్ త్రిభువనీకూలంకషంబుల్ గదా!
గుణముల్ కారణకార్యయుగ్మమున సక్షోభం బభేదంబు త

ద్గుణవై చిత్ర్యమె బ్రహ్మరుద్రహరిముఖ్యుల్ పంచవింశంబునన్
గుణకార్యంబు జరామరాత్మకము సంకోచంబులే దివ్యేద్దన్. 3౯౦

కం॥ సంసృతిశుభాశుభంబులు, శంసితమై గుణవికారసహితముగాఁగన్
"హంసస్సోహం"బను ముని,హంసులకున్ గుణవికార మంటకయున్నే. 3౯౧

సీ॥ ఒకవేళ విష్ణుండు యోగనిద్రాసక్తుఁ, డొకవేళ జపతపోయుక్తమూర్తి
యొకవేళ విశ్వావసనోత్సాహధుర్యుఁ డిం,కొకవేళ దితిజవైరోన్ముఖుండు
బ్రహ్మరుద్రులు నిట్టిపగిది నీగుణవశీ,కృతిని వర్తింతురు కేవలముగ
మానులు సైతమసమ్మాడ్కివారలె యన్న, నధిప ! యింకిందాద్రిదు లనఁగనేల

గీ॥ జంగమస్థావరాత్మకజగములందు, నియతి శక్తి వసించు నిర్ణిద్రయగుచు
నామహాశక్తియాజ్ఞ బ్రహ్మాదినిఖిల,విబుధశీర్షావతంసమై వెలయుఁగాదె.

శా॥ మానం బెక్కుడుగాని వేల్పులకు నీమైఁ జావులున్ బుట్టువుల్
దానాదానములున్ సుఖాసుఖములున్ దథ్యంబుగాఁ దప్ప వెం
దేనిన్ విందుమె నిత్యులంచు గుణకర్మేచ్చారతుల్లేని భూ
తానీకంబులు గల్గునే ? యవిరతాహంకారభూయిష్ఠముల్. 3౯3

కం॥ కామక్రోధాదులతో, నేమియు బంధంబు లేక యిల సంసార
వ్యామోహములణఁచిన గుణ,ధాములు దుర్లభులు వారు తత్త్వజ్ఞాతల్. 3౯౪

గీ॥ దేవగురునకు నిటువంటి తెలివిఁ గధర్మ, మనఁగ నేటికి నితనియిల్లాలు శశికిఁ
గులట యాతండు తమ్ముని చెలికి విటుఁడు,గాన సంసారచక్రచంక్రమములనదె!

కం॥ గార్హస్థ్యము ముక్తికి న,భ్యర్హం బగునొక్కొ? సంతతాహంకృతిచే
గర్హితము మనుజులైనన్, బర్హిర్ముఖులైన నొక్కపగిదియె సుమ్మీ. 3౯౬

కం॥ ఏటికిఁ దర్వైదు ప్రస్తుత, మాటికించెదనటన్న నవనీశుం డ
ఘాటనగురుకుహనాశ,ర్మాటన మెట్లయ్యె ననిన యతిపతి పలికెన్. 3౯౭

మ॥ కవిరూపంబున దైత్యులన్ గురుఁడు సౌఖ్యం బన్నిటన్ మేలు సౌ
ఖ్యవిహీనుల్ నిరయార్హులౌదురు యథేచ్ఛాయాతభోగంబులన్
బవలున్ రేయి సుఖింపఁగావలయు లోభం బత్యవశ్యంబు కా
మవశాత్మన్ విహరింపుఁ డంచు నిరయామ్నాయార్థముల్ తెల్పుచున్. 3౯౮

కం॥ స్మృతులకుఁ బురాణములకున్, శ్రుతులకు నన్యార్థబోధఁ జొనుపుచు నియమ
వ్రతకృత్య మానడింపుచు, సతతము బోధించి పరము జక్కడఁచె నృపా! ;

శా॥ శశ్వద్దుర్మతబోధలన్ గురుఁడు దోషాచారులన్ జొన్పఁగా
విశ్వాసమ్మున వారలున్ గురువచోవిభ్రాంతులన్ నమ్మి సిం
హాశ్వాధ్యానసమాధులన్ మఱచి యిచ్ఛాధీనులై కామభో
గైశ్వర్యంబులఁ జొక్కి దుర్గతులపాలై యుండు నవ్వేళలన్. ౩౬౦

కం॥ పంచద్వయహాయనములు, పంచాశుగకేళిఁ జొక్కి భార్గవుఁ డకటా!
వంచితులై త్రిదశులచేఁ, బంచతఁ గనిరొక్కొ? యసురపరివృఢు లనుచున్. ౩౬౧

కం॥ నా తెఱవుఁ జూచుచును వా, రే తెఱఁగునఁ జనిరొ? పోయి వీక్షింపవలెన్
దైతేయుల నని శుక్రుం, డాతురుఁడై లేచి యజ్ఞయంత్రిన్ గనుచున్. ౩౬౨

సీ॥ అతివరో! దైత్యులేమై యుందురో కదా?, నీతోడ సమయంబు నెఱపినాఁడ
దశహాయనాంతంబు దఱసె శిష్యులఁ జూడఁ, జని మెద వేగ నీసన్నిధికిని
వచ్చెద నెడఁబాసి వర్తింతునే? యన్న, ధర్మవర్తన మెల్లఁ దప్పనీక
యిందుండుదాన మీ కిచ్చవచ్చినయట్లు, వర్తింపుఁడని మ్రొక్కి వనిత పనుప
గీ॥ సత్వరంబున దానవసమితిఁ జూచు, వేడ్క చివురింప వచ్చి యాభృగుసుతుండు
దైత్యమధ్యస్థుఁడై తన తనువుఁ బోలెఁ, దనువుఁ దాల్చియున్న బోధకునిఁ గాంచి.

—• శుక్రునకును శుక్రాకారముతోనున్న గురునకును జరిగిన సంభాషణము. •—

మ॥ ధిషణుం డీతఁ డటం చెఱింగి యితఁ డీదిత్యాత్మసంభూతులన్
మిషచే బోధమొనర్పఁ బోలు నది నేనమ్మన్ విందుఁ గా కెట్టు ద
ద్విషయంబం చట నున్నపట్టున శ్రుతిద్వేషంబు సూచించు కి
ల్బిషవాదం బుపదేశ మిచ్చుచు సురాభీష్టంబు సాధింపఁగన్. ౩౬౪

వ॥ కపటశుక్రుం డున్నయెడ. ౩౬౫

ఉ॥ ఏను హరాంతికంబునకు నేగి తదీయరహస్యమంత్రసం
ధాన మొనర్చినాఁడ నని తథ్యగురుండు వచింప నంతలో
నేను హరాంతికంబునకు నేగి తదీయరహస్యమంత్రసం
ధాన మొనర్చినాఁడ నని దంభగురుండు వచింప నయ్యెడన్. ౩౬౬

మ॥ హరదత్తాగమశక్తిఁ జూపు మని తథ్యాచార్యుఁ డాడంగ నీ
హరదత్తాగమశక్తిఁ జూపుమని దంభాచార్యుఁడున్ బల్క దు
ర్భరసంవాదముఁ జెల్లెఁ గావ్యున కసభ్యాసభ్రమంబున్ మరు
ద్గురునం దభ్యసనేచ్ఛయున్ బెనఁగుటన్ గోలాహలప్రక్రియన్. ౩౬౭

సీ॥ వినిరె నయ్యుశనుండు వేదంబు భోగేచ్ఛ, నధ్వరంబులు సేయుమనుచుఁ జెప్పె
నందు హింసనము శాస్త్రనిష్టంబుగా “దహింసా పరో ధర్మ” యన్ సరణి వినరె?

యజ్ఞముల్ సేయుట ఽ యపరాధ మని వేద,నింద యొనర్చి యంఽదెందుఁ గామ
పరత వర్తించుట ఽ పరమధర్మము తాను, సుఖియించుటయుఁ బరఽసుఖము మేలు

గీ॥ గాన సురతంబు సర్వసౌఽఖ్యప్రదంబు, భోగపరులౌట మేలని ఽ బోధ గొల్పు
వాదమెల్లను విని స్వార్థఽపరత గురుఁడు,సురరిపుల దంభమునఁ జెడఁఽజూచెననుచు.

మ॥ బలభిత్ప్రేరితుఁ డౌచు నాంగిరసుఁ డిఽప్పాపంబు శంకింప కి
ట్టుల లోభోపహతిన్ జరించెఁ గడునై ష్ఠుర్యంబు గాదొక్కొ ? చం
చలులై దైత్యులు దుర్గతిన్ గనిరి మఽచ్ఛాస్త్రంబు లీక్షింప రీ
యలఘుం డింతకు నొప్పె ధర్మవిధులం ఽ దాఘ్యుండుగాఁ డక్కటా! ౩౧౯

కం॥ పాషండకృత్య మనక దు,రీర్షన్ గురుఁ డిట్లు బోధఽమిచ్చిన వీరల్
పాషండు లైరి మత్సమ,వేషం బెట్లూనె నితఁడు ఽ వింతయగుఁగదా. ౩౨౦

వ॥ అని మనంబున సందేహించి దైత్యులం గని చిఱునగవు మోమునం దంకురింప భార్గవుండు మత్స్వరూపావలంబి యగు గురుండితండు గురుండనని సురకార్యార్థియై మిమ్ము వంచించె, నీతఁ డహంకారదూషితుండు విశ్వసింపవలదు' దంభోపహతం బగు నేతద్బోధం బగ్రాహ్యంబు గురుండను నేను మీరు మదీయులగు యాజ్యు లింక నితనిని బరిత్యజింపుం డనిన విస్మితులై యెవ్వఁ డితండు సాక్షాన్మదీయ గురుండునుం బోలియున్నవాఁ డని శంకించుచున్న వారలంగని ధిషణుండు దేవ కార్యార్థియై మిమ్ము వంచించి చెఱుపందలంచి మదాకారుండై వచ్చినవాఁడు భ్రాంతిపడి యేతద్బోధం బంగీకరించితి రేని చెడుదు రని విశ్వసనీయంబు లగు దంభోక్తులు పలికినఁ గాలవైపరీత్యంబున భార్గవునందు గురుత్వంబు నిశ్చయింప నేరక నీవు మద్గురుండవుగావు, నిఖిలవిద్యాభ్యాసం బొనర్చె నితండ మా గురుం డని యాంగిరసుని "శ్రద్ధధానులై పదిసంవత్సరంబులు విద్యలం గఱపి దేవభయం బుడిపి రక్షణం బొనర్చుచున్నవాఁడు, నీవు కూహకుండ వని శుక్రు నిషేధించి నమస్కరింపుచుఁ బూజింపుచు బృహస్పతిమాయలం బడి యున్నంత. ౩౨౧

ఉ॥ భార్గవుఁ డాగ్రహించి తదుఽపాసకులై నను వీడినట్టి దు
ర్మార్గులు గాన మీ కిఁకఁ బఽరాభవ మయ్యెడు నష్టసంజ్ఞులై
దుర్గతి నొంది నావలనిఽద్రోహముచేఁ జెడుఁడీ నిజంబు మ
ద్దుర్గమశాపదోషమున ఽ ద్రోఁగి యడంగెద రంచు నెంతయున్. ౩౨౨

కం॥ క్రోధమున లేచి నిశిచర,యూథంబును విడిచి శుక్రుఁ ఽ డోరసిలిన సం
బోధింపుచు సురగురుఁడు స,నాథుండై దైత్యవరుల ఽ నమ్మించెఁ గడున్. ౩౨౩

ఉ॥ స్వార్థము సిద్ధిగాంచెఁ గవిఽశాపముచేఁ దన కంచు రాక్షసా
నర్థముచే శచీపతి కఽనారతమై భవవృద్ధియయ్యె నీ

వ్యర్థపరిశ్రమంబు తగదంచు గృహంబున కేగి యిందుమిత్రో
గ్రీర్ధవుఁ డీయుదంత మసకృత్ప్రమదంబునఁ దెల్పి యిట్లనెన్. ౩౭౪

గీ॥ శుక్రశాపోపహతిఁ జెంది సురవిరోధి, వర్గ మెల్లను దుర్దశావశతఁ జెడిరి
సమయమిది నీకు నాహవోత్సాహమునకు, శాపవహ్నికిఁదోడు మీసమర మనఘ.

ఉ॥ అంతఁ బురందరుండు త్రిదశావళితో ముదమంది గీష్పతిన్
సంతతపూజలన్ దనిపి సంగరకౌతుక మానవిహ్వల దు
ర్దాంతబలంబులన్ గొనుచు దైత్యులపై యతనం బొనర్ప వా
రెంతయు భీతినొంది గురుఁ డెచ్చటి కేగెనొ యింక నెట్లగున్? ౩౭౬

కం॥ సురబృందము సేనాని,ర్భరమై మన మీఁదఁ గవిసె భార్గవుఁ డిందున్
బరికించిన లేఁ డయ్యెన్, గురుశప్తుల మైతి మిదియె గుఱుతగు మనకున్. ౩౭౭

మ॥ గురురూపంబున భ్రాంతి గొల్పి పరమక్రూరుండు దేవార్యుఁ డి
వ్వరుసన్ దుర్దశ నొందఁ జేసె కుహనావ్యాసంగమున్ జెంది దు
ష్కరమా కీడును జెందినారము మరుత్కార్యంబు స్వార్థస్థితిన్
బరఁగెన్ జేయఁగ నెద్ది ద్రోచ దని దుష్కామంబు దూలన్ గదున్. ౩౭౮

సీ॥ మంత్రవిద్యాశక్తి మనకుఁ దెచ్చెదనని, కావ్యుండు భూతేశుకడకుఁ జనినఁ
గపటవేషం బూని గాఢించె ధిషణుండు, పునరాగతుం డయ్యె మనగురుండు
వాక్పతి మాయావివాదసంఘృష్టుల, మాటచే మనచేత నోటువడుచు
నిర్భర్త్సితుండయ్యె నిష్ఠురోక్తులనింకఁ, బ్రార్థితుండయ్యుఁ జేపట్టఁ డతఁడు

ఆ॥ ధిషణువలన మనము తెఱఁగుమాలితి మింత,ద్రోహియయ్యెవినమె తొల్లియనుజు
నాలి అంకుపఱచినట్టి దుర్మార్గుండు,చెడితి మింక నేమి చేయఁగలము. ౩౭౯

గీ॥ "విపది ధైర్య"మటన్న యర్వానికి గలదు, వెఱవ నేటి కటంచు నవ్వీరు లెల్ల
ముందుఁ బ్రహ్లాదు నిడుకొని మ్రొక్కికొనుచుఁ, బల్కకున్నట్టి భార్గవుపంచఁ జేరి.

చ॥ వినయముతో గురుం గని నవీనతరోక్తుల సన్నుతింపుచున్
నినుఁ దెలియంగఁజాల కతినింద్యులమైతిమి దుష్టబోధచే
ఘన మగు దుర్దశన్ బొరసి గాసిలినారము కావుకావు మో
మునివర యంచు వేడిన సముద్ధతరోషరసావలీఢుఁడై. ౩౮౦

—• రాక్షసులు శుక్రుని బ్రార్థించుట •—

సీ॥ దుర్మార్గులార! మీద్రోహంబు మిము నేచెఁ,జెడితిరి మున్ను నేఁ జెప్పినట్టి
పలుకులు వినమిచేఁ బరిభవంబు ఘటిల్లె, నగభేదకృత్ప్రేరణంబువలన

వంచింప జీవుండు \ వచ్చినవాఁడని, బోధింప వినక దుర్బుద్ధి నొంది
మచ్ఛాపవశమున \ మడిసెద రిదియేల, చనుఁడు మీ సద్గురుసన్నిధికిని

గీ॥ వలదు మాయింట నివసింప \ వంచకుండ, ననెడు దుర్బుద్ధినాయెడ ఘనము మీకు
సంశయావిష్ట మగుచోటఁ జనదు నిలువ, వెరవు గలచోటు వెదకుఁడు వెడలుఁడనిన.

మ॥ అనుగుందోయి కరంబులం గొనుచుఁ బ్రహ్లాదుండు నైరివ్యథం
బడి దుఃఖార్తుఁడనై భవత్కృపకు నేఁ \ బాత్రుండనై చేరితిన్
విడువంజూచెదె సర్వవేత్తవు భవద్ద్వేషంబునన్ దుష్టుఁడొ
క్కఁడు బోధించుట యింత వుట్టెఁ గృతమాఁ \ గార్యంబు భోగ్యంబెకా. ౩౭౩

గీ॥ నీవు మంత్రార్థివై ఫాలనేత్రుఁ గనఁగఁ, జనెడుతఱి నొక్క శైలూషుఁ డనువదింప
నమ్మి వంచన నంది మా నమ్మదూలి, చెడిన యజ్ఞానులము మమ్ము \ విడువవలదు.

చ॥ "జలము స్వభావసిద్ధముగఁ \ జల్లనిదై యనలాతపంబులన్
గలఁగుచు వేఁడిమిన్ గొనినక్కై వడి" మా యపరాధవృత్తిచేఁ
గలిగెను గోప మాఁపఁదగుఁ \ గాలగతిన్ ఘటియించె మీరు తద్
జ్ఞులు క్షణకోపు లిక్కనలు \ క్షుద్రసమం బిది ముట్టఁగూడునే. ౩౭౪

ఉ॥ ఇంక ననుగ్రహించి మదభీష్టము సిద్ధిఁ బొసంగఁజేయు ని
ర్వ్యంకలఁ గార్యయుగ్మము పవిత్రవర్తిలె మమ్మును వీడఁ జూతువో?
కింక యడంతువో? కనుము \ ఖిన్నుల మైత్రిమి కావవేని నే
బొంక రసాతలంబునకుఁ \ బోయెద దైత్యగణాన్వితుండనై. ౩౭౫

కం॥ అని పలుకు హిరణ్యకశిపు, తనయుని విజ్ఞానదృష్టి \ దర్శించి తపో
ఘనునిఁగ నెఱిఁగి మృదుస్మిత, మొనరిచి వెలువకుము నిలువు \ ముర్విని వత్సా!

—• శుక్రుండు ప్రహ్లాదునకు భావిపరిస్థితి దెల్పుట •—

శా॥ చేత స్స్థైర్యముచే వినుం డొకటి \ వాసింజూడ దైవంబు ని
ర్ణేతృప్రాభవ మల్పముల్ బుధవచోనింద్యం బగున్ మానుషం
"బేతత్కర్మ కరోమి" యంచు వచనం \ బీజాల దేవాళిచే
భీతిం జెంది బలంబుడస్సి కను నిర్వేదంబునన్ బొందుటన్. ౩౭౬

గీ॥ చనుఁడు పాతాళమునకు నిస్సంశయమున, నూరటవహింపుఁడేను బ్రహ్మోక్తి వింటిఁ
ద్రిభువనీపాలనంబు సిద్ధింపఁగలదు, కాలపర్యాయమునఁ జింతయేల? మీకు.

సీ॥ ఇందు్రసాఁదలబట్టి యీడ్చి ముజ్జగములు, నేకభోగంబుగా నేలినారు
దశయుగాంతంబు గా ధనధాన్యసంపత్సమృద్ధులచే సాటిక్రమించినారు
దైవయోగంబుచే దేవతాగణమున, కోడి యింతటిలోన నోహటించి
కాతరులౌటకే కతము? సావర్ణి మ,న్వంతరంబున మీకు నఖిలరాజ్య

గీ॥ వైభవంబబ్బుఁ బ్రహ్లాదపౌత్రుఁడగుచు, బలియ నెడువాఁడు ప్రభవింపఁగలఁడు కంతు
వానిచేఁ బూర్ణభోగంబు వచ్చు మీకు, నంతవట్టును సహియింపఁదగును గాదె.

గీ॥ కలిమిలేములు ప్రాణికిఁ గాలగతిని, సమతభోగ్యంబు లదిగాన సమరపరుల
కపటమున నట్టిసిరియును నెపమువలనఁ, జెడఁగలదు తెల్పెదను జింతఁబడఁగనేల!

ఉ॥ వామనరూపుఁడై హరి యవారణ నింద్రసుఖార్థియై మహో
ద్ధామత నధ్వరంబు బలిదా నొనరింపఁగ వచ్చి వేడినన్
గామితదాయియై యితఁడు కంజదళాక్షున కిచ్చునంత మీ
శ్రీమహిమంబు చూఁజయిడి చేరుదు రవ్వితలంబు పిమ్మటన్. ౩౯౨

కం॥ ఆమన్వంతరమున సు,త్రాముఁడ వయ్యెదవు నీవు త్రైలోక్యజయ
శ్రీమంజులసుఖభోగ, స్థేమత సర్వాధికారసిద్ధిఁ గనుచున్. ౩౯౩

వ॥ ఇదియునుంగాక మఱియొక్క వినోదంబు దెల్పెద. బలి రాజ్యభ్రష్టుండై పురందరభయంబున ఖరరూపంబు దాల్చి యొక్క శూన్యవాటికం బ్రవర్తించునెడ సురవల్లభుం డైరావతంబు నెక్కి యెల్లచోటు లరసి బలిం గానక బ్రహ్మోక్తంబున నిత్తెఱం గెఱింగి బలిం జేరి త్రిలోకవల్లభుండ వగు నీకు గర్దభరూపంబున నుండవలసెనే యని ప్రల్లదంబులు వలికిన రోషించి బ్రహ్మమహాత్మ్యాసాధ్వసంబునఁ గమలనాళంబున డాఁగి వర్షశతంబులు గడపవే? విష్ణుండు ఝష, కూర్మ, వరాహాదియోనులం బుట్టి వర్తింపఁడే? కాలవశంబున నెంతవానికిఁ బ్రారబ్ధం బనుభవైకయోగ్యం బగు దైవం బలంఘనీయంబని యెఱుంగుము దైవప్రాపణీయంబులగు సుఖాసుఖంబులకు వగవం బని లేదనిన నింద్రుండు సమ్మతుండై దివంబున కరుగు బలియును భోగ్యం బనుభవించి స్వస్థుండగు ననివింటె; దైవవశంబున నిప్పుడు మీరు దుర్బలులైనారు గావున శాంతిం బొంది కొన్ని దినంబులు సుఖులై యుండుండని ప్రహ్లాదాదులకున్ బోధించినఁ బ్రహ్లాదుండు సంతుష్టుండై దానవులం జూచి యట్ల చేయుదమే యనిన దైత్యు లిట్లనిరి. ౩౯౪

ఉ॥ సాహసమూని నిర్జరులు సంగరకేళికిఁ దారసింపఁగా
దేహసుఖార్థమై తొలఁగి ధీరత మానిన సవ్వారే జన
వ్యూహము? శూరధర్మమగు నొక్కొ? జయాజయయుక్తి దైవసం
వాహిత మట్టులేల పరవాహిని దార్కొన బుద్ధి ద్రొల్లుమీ. ౩౯౫

—• ప్రహ్లాదుండు దేవేంద్రునితో యుద్ధము సేయుట •—

శా॥ ఆచార్యుం డిటు దెల్ప నూఱడిల కన్యాయంబునన్ మీఱి సం
కోచం బించుకలేక యాహవము మీకుం జెల్లునే సేయ దు
ర్వాచాంగీకృతిఁ గొన్నినాళ్ళు వితలావాసంబునం దుండి పే
రేచంగాఁ దగునన్న దైత్యవరు లుద్దేశించి ప్రహ్లాదుతోన్. 396

ఉ॥ ఆయుధజీవనం బెఱుఁగనట్టి మహాత్ముల ధర్మమార్గముల్
న్యాయమె చేకొనన్ మనకు; నైజము వారికి సామ మెయ్యెడన్
ధీయుత సాహసించి యరి దీకొనఁజాలరు విప్రు; లాస్థితుల్
హేయము లస్మదాదులకు నేటికిఁ దాలిమి విక్రమింపుమీ. 397

గీ॥ నిన్ను సేనానిగాఁ గొని నిర్జరాళిఁ, దుమురుచేసెద మాహవోద్ధురుల మగుచు
మాదు నెత్తైఱమెదుట శక్రాదులెదురె?, గట్టుదుము పట్ట మాత్రిలోకంబు నీకు.

చ॥ వెడలు మటంచు దైత్యతతి వీఁకఁ గనంబడఁజేయ నాతఁ డ
య్యెడ సమరోన్ముఖుం డగుచు నింద్రునితోఁ బురుడించి పోర వీ
డ్వడి యుభయుల్ సురాసురు లవారణఁబోరిరి గెల్పుటాసచే
వడఁకఁదొడంగె శైలములు వారిధు లెల్లఁ గలంగి పర్వఁగన్. 398

సీ॥ పురుహూతవిక్రమస్ఫూర్తి గానఁగ నైన, విజయార్భటు లొనర్చు వేలుపుగమి
ప్రహ్లాదుఁ డొక్కింత బాహుబలముఁ జూప, నెగసి గంతులు వేతు రెఱచిదిండ్లు
ఉభయ లోకొక్కసారి యుబుసుఁబుచ్చుచునున్న, నడ్డమై పెనఁగు దేవాసురాళి
తుములంబు బెడిదమై దూకొన నిరువురు, దళమున కడ్డమై తారసిలుదు

గీ॥ రిట్టు లింద్రుడు ప్రహ్లాదు డెడరువేచి, యొండొరుల గెల్చు నాసచే నురువడించి
వర్షశత మాహవ మొనర్పహర్ష మొదవి, దితిసుతోద్ధతిఁ బరువెత్తె దేవబలము.

క॥ భార్గవమంత్రిబలంబున, దుర్గమ మగు దేవబలముఁ దొడరుచు దితిభూ
వర్గము జయమందినయెడ, స్వర్గాధిపుఁ జేరి గురుఁడు జడియకు మనుచున్. 400

—• ఇంద్రుఁడు పరమేశ్వరిని బ్రార్థించుట •—

క॥ స్మరియింపుము భువనేశ్వరి, కరుణించి జయం బొసంగఁగగాఁగల దనుచున్
బురికొల్ప భువనజననీ,స్మరణం బొసరించెఁ బాకశాసనుఁ డంతన్. 401

క॥ జయ దేవి మహామాయా, జయ శూలగదాసిశంఖచక్రప్రహారా!
జయ సర్వాభయదాత్రీ, జయ జగదానందధాత్రి జయ మద్ధాత్రీ. 403

సీ॥ వికృతులు ప్రకృతులు విషయము ల్విషయులు, విభులు ప్రారబ్ధముల్ వేదనములు
భూ జలానల మరు ద్వ్యోమతన్మాత్రాభి,మాన మహద్గుణమాయ లెల్ల
లేనిచోఁ గాలంబు లేనిచోఁ దలఁపులు, లేనిచోఁ "ద్వమహముల్ లేనిచోటఁ
దానను టెఱుఁగని తత్పరంజ్యోతివై, వెలుఁగు ని న్నెవ్వండు వెదకఁగలఁడు
గీ॥ సగుణరూపిణి వగుచు సాక్షాత్కరించి, దైత్య రణమున దుర్బలత్వమునఁ జెడిన
మ మ్మనుగ్రహ సుముఖివై సమ్మదమున, వచ్చి ప్రోవుము నతకల్పవల్లి! తల్లి!

సీ॥ కామ రోషాదిక గ్రాహ భీకర మహా, తాపత్రయావర్త దర్పితంబు
సంప దాపద్ద్వయీ సంరంభ కల్లోల, మాలికా డోలికా ఖేలనంబు
ధన దార పుత్ర బాంధవమిత్ర పోషణా, ద్యంబుప్రవాహ మోహాన్వితంబు
జన్మజరామర జ్వలిత బాడబశిఖా, పతనోల్లసచ్ఛీకపంకిలంబు
గీ॥ నగు భవాంబుధిఁ గూలిన యట్టివారు, నిన్ను మదినిల్పి భయముల నన్నివిడిచి
ముక్తిఁ గాంతురు చేయెత్తి మ్రొక్కినాఁడ, వచ్చి కరుణింపు నతకల్పవల్లి! తల్లి!

సీ॥ వసుధాది శర్వాంతవర్తమాన జగద్వి,చిత్ర సృష్టిక్రియా సూత్రగరిమ
సృష్టిప్రపంచ విస్పష్ట భేదాభేద, సవిమర్శ రక్షణాక్షమ సమృద్ధి
సృష్టసంభృత సర్వనష్టికృత్కాల రూ,పానుసంధాన విహారపటిమ
త్రిగుణ పారాపార దీవ్యత్పరంజ్యోతి, రాకారితస్వరూపాతిశయము
గీ॥ గలిగి యనవద్య మగుచు నఖండమగుచు, నిర్వికార నిరంజన నిరుపమాన
మైన నీ తత్త్వమెఱుఁగంగనౌనె నాకు, వచ్చి కరుణింపు నతకల్పవల్లి! తల్లి.

సీ॥ హరిహరబ్రహ్మేంద్ర వరుణ ధనాధ్యక్ష, పావకానిలయమప్రభృతిసురలు
కశ్యపాత్రివసిష్ఠ కణ్వభారద్వాజ, వాలఖిల్యాసిత ప్రభృతిమునులు
శుక వామదేవ శౌనక యాజ్ఞవల్క్య సౌ,భరి సౌమ్య షణ్ముఖప్రభృతివేత్త
లామ్నాయ నిగమాగమాధ్యాత్మ శాస్త్ర వే,ద శిఖాది తత్త్వ నిర్ధారకములు
గీ॥ అనుపమాగోచరంబు నైనట్టి నీదు, తత్త్వ మెఱుఁగక భేదభేదప్రచార
విహృతి యొనరింప మముబోట్లు వెదకఁ గలరె, వచ్చి కరుణింపు నతకల్పవల్లి! తల్లి!

సీ॥ నిన్నుఁ గొల్చినవారు నిఖిల సంసృతి దుఃఖ, రహితులై పరసుఖారాములైరి
నిన్నెఱుంగక దుఃఖనీరంధ్రదారిద్ర్య, భయరోగపీడా నిబద్ధులైరి
సిత చామర చ్ఛత్ర శిబికాభిరాములై, చెలఁగుట నిన్ను భజించి కాదె
సార్వభౌమతగాంచి సామంతపతులతో, మెలఁగుట నినుఁగొల్చుఫలముగాదె
గీ॥ కలిమిలేములు బంధమోక్షములు నిన్నుఁ, గొలిచికొలువక యొందైనఁగలవె జనుల
కైహికాముష్మికముల కీవమ్మ దొరవు, వచ్చి కరుణింపు నతకల్పవల్లి! తల్లి!

గీ॥ ఇత్తెఱంగున నుతియించు నిందుఁ బ్రిశకును, దేవి విశ్వసవిత్రి దేదీప్యమాన
రత్నభూషాఢ్య యై మృగరాజవాహ, మెక్కి ప్రత్యక్షమయ్యెఁ గట్టెదుట నంత.

వ॥ మఱియు శంఖ చక్ర గదా పద్మ హస్తినియుఁ జతుర్భుజయు రక్త మాల్యాం
బరయు దివ్యకుండల భూషితయు నగు నఖిలాండేశ్వరి ప్రసన్నవదనయై యింద్రా
దులం గని యభయం బొసంగితి వెఱవకుండుండని యూరార్చి శుభం బొనఁ
గూర్చెద నని సింగంబు దుమికించి దైత్యబలంబులపై నురువడించినఁ బ్రహ్లాదా
దులు భీతులై పురస్థిత యగు దేవిం గాంచి యొండొరులు తల్లడిల్లిరి. దేవరక్షార్థం
బేతెంచు చండికయుం బోలియున్నయది చండ ముండ వినాశిని యగు నిద్దేవి నా
యెడల నహితంబుఁ దలంచె. మనల నూచ ముట్టంజక్కడఁచు, సందియంబులేదు,
చక్రఖండితు లగు మధుకైటభుల తెఱంగున నయ్యెదమని బెగ్గడిలు నవసరంబునఁ
బ్రహ్లాదుం డన్నిశాచరులం గని యిట్లనియె. ౪౧౦

ఆ॥ దైత్యులార? పోరుఁగద మెు కాక శస్త్రాస్త్ర, సమితి విడిచి శైలసాగరముల
దాఁగియుండ మెుక్కొఁ వేగనిశ్చయ మెుందు, దెలుపుఁ డనిన నముచి పలికె నపుడు.

చ॥ సురపతి రక్షణార్థమయి చూపఱకెల్లను భీతిఁ బుట్ట సం
గర మొనరింపవచ్చెఁద్రిజగజ్జనయిత్రి నిమేషమాత్రి ని
ష్ఠుర కరవాలధార దితిజుల్ ధర లేరనిపింపఁ జూచు స
త్వరత రసాతలంబుఁ జొరఁగ బాఱుట మేలని చెప్పునంతటన్. ౪౧౧

సీ॥ ఇదిగాదు మత మిప్పుడేను సృష్టిస్థితి, సంహారకారిణి శక్తి నంబ
నభయప్రదాత్రి మహామాయ నాద్యను, శరణంబు వేడెద సాహసించి
యని చెప్పి ప్రహ్లాదుఁడార్తరక్షణి దేవి, కభిముఖుం డయి నిశ్చలాత్ముఁ డగుచుఁ
జేతులు జోడించి శిరముపై నిడి భక్తి, భయములు మనమునఁ బ్రబ్బికొనఁగ

గీ॥ నిలిచి యానంద బాష్పముల్ నీరజముల, నెడలు మధుధార లనఁగ దృగ్వీథివెడలి
కాల్వలై జాఱ సర్వాంగకవచమనఁగఁ, బులకములుప్రోదిగొనఁగ నిట్టులునుతించె.

— శ్రీ పరమేశ్వరిని ప్రహ్లాదుఁడు ప్రార్థించుట —

వృత్తనృత్యము

శ్రీమతి ! భగవతి ! కాళి ! మహేశ్వరి ! త్రిజగజ్జనని ! మహామాయీ ! నే
నొకవిన్నప మొనరించెద బాలుఁడ నీకను మదీయ వచస్సందోహం
బుల తప్పులు సైరింపుము. త్రిజగంబులకును దల్లివి సుర లసురులు నీ
కౌనుగ పిల్లలు ? భేద మొకింతయు లేనిది తెల్లము స్థావరజంగమ
భూపజగత్తులకుం బుట్టువు నీకలో నన్యులు కర్తల మని నిక్కఁగ

నీ విచ్చిన భారము తల్లికి నీ కీభేదం బేటికి మాయెడ బం
ధము సూచింప సుపర్వుల నభిమానమ్ము సహింపము ఖేచర దా
నవభేదము నాటించినను జగన్మాతృత్వము ఖండితమాఁగద! నిగ
మాగమసిద్ధాంతంబులు మిథ్యలు స్వార్థపరత్వము వారికి మాకును
నైజమె భేదం బించుకలేదు ధనంబు సమాసక్తియు సాధారణ
మకదా! యెల్లరకుఁ గశ్యపదాయాదులె తుల్యము స్వార్థ ఫలీకృతి
నై యిర్వుర మిందుఁడు నేను దురంబలరింపఁగ నీ విటు సాహ్యంబు స
మర్థించి సురాళికి విజయం బిడ మానిత ధర్మమె? నైరము విడువుఁడు
స్థిరయులై యుండుం డనియెదే? త్రిగుణ విభేదం బొనరించి సురాసుర ధ
ర్మము చేసితి వేమికతంబునఁ గామక్రోధాది విభేదంబులఁ బు
ట్టిన జంతుకదంబంబు లకారణవినిమయ మేటికిఁ జొప్పడు రాగ
ద్వేషంబులు లేని శరీరులు గలరే? షడ్వర్గములకుఁ గారణ మీ
వెగదా! కొడుకులలో నెవ్వరికిఁ విజయ మెవరి కపజయమానో? చూ
చెదనని వచ్చితివో యస్లే మానమదిఁ దోఁచెఁ నీ కీసంకల్పము
లేదేనియు నేకోదరులకు మా కీ దుషుకులు పుట్టుట కేటి నిమి
త్తము? ధర్మజ్ఞవు తెలియని దేయది? ధర్మం బెఱుఁగనివాఁడను నేఁగా
వున భోగార్థము వారలవలెనే పోరాడెద నిస్పృహుఁడెవ్వఁడు జగ
మున నభిలాషలు గలవారికి నోర్పులు గల్గునె? మమ్మననేటికి నమృ
తము కొఱకై దేవత లసురులు నొకతతిఁ బాల్కడలి మథించినహరి యె
వ్వరికతమున భేదించెనొకో? సురాసురులను ద్వేషము మానల్ల నెపు
ట్టెనె? సర్వజగద్భరణంబున శౌరిని నిల్పినదానవు మా సంపద
లిందునకుఁ జేర్చిన నదిచూచి సహించితి వొప్పిదమే? కామగవీ
కల్పద్రుమ ముఖ్యములను సమరులకై యిడనేటికి నాయాస ముభయ
ము సమంబేకద! యింద్రునకుఁ దీర్పునుగా విష్ణుని నిల్పితె? యిట్టి న
యజ్ఞులు సాత్త్వికు లా యమరుల? మేమా? కను తామసులము ధర్మాధ
ర్మము లెట్టివో? యెట్టివో కార్యాకార్యము లెవ్వరికిఁ విన్నప మొనరిం
చెదఁ దల్లివి నీ వీ ధర్మం బెట్టిదియై వర్తించెను దార్కిక మీ
మాంసక సిద్ధాంతములును నొకటేమార్గమె యానెడ భిన్నగుణా
శ్రయనానాభేదంబుల సంస్కారంబేల ప్రవర్తించు; నటంచును
బహుకర్తృకమానేని శ్రుతుల్ "సర్వంఖల్వి"ని పల్కునె? కావున సం
దేహంబె యసందేహ మటంచును దెల్పును దల్లీ! నిస్పృహు లెవ్వరు?
లేకుంట గనంబడెఁ గారణ మీవే కావున నీగుణమే సర్వ
త్రిఘటిల్లెఁగదా! నిస్పృహ నీయది తల్లి? కృపాళుత వచ్చుటచే మా

ఘునకై నను దెలియఁగద! శశిగురు వనితామణి జిష్ణుఁడు గౌతము కొమ్మను గురుఁ డనుజునిచేడెను గర్భిణి నననయమున రమియించిరి నిస్పృహులో? తత్త్వజ్ఞుఁడు కర్మిష్ఠుఁడు నెఱదాత బలీంద్రుని వామనరూపంబున హరి సిరి హరియించి యధస్థితముననే యడపంగలవాఁడట? కాలతంత్రియమునఁ గల యీ వింతలు సురలను నెంతలు చేసిన నూఁగొందువు సూటిగఁ దప్పిన నెన్నెన్నో కల వేటికి? నామొఱ యాలించి సితారుణ దృగ్గోచులలో నెందుకుఁ బాతుగలమో యట్లానరింపుము తల్లీ! నీపాదములే శరణమ్మని సన్నిధి మొగ్గిన ప్రహ్లాదునిఁ గని కరుణాత్ముల మన్నింపుచు దుర్గాంబిక హర్షముతో నిట్లనెఁ బరమేశ్వరి. ౪౧౪

సీ॥ ప్రహ్లాద! బలముతోఁ బాతాళమున కేగు, మిచ్చితి నభయ మింక కెల్లరకును
"గాలంబుసూ సర్వకారణంబు" ప్రతీతి, నేయుఁడు మీకోర్కి సిద్ధినొందు
"లోభోపహతుఁడు ముల్లోకంబు లేలియు, సుఖమొందఁ డస్పృహుండఖిలమెల్ల
విడిచి గృహవాసమెడపక సుఖియించు", నదిగాన నస్మదాజ్ఞానుకూల

గీ॥ విధి యొనర్పుఁడు మేలగు వేల్పులకును, దెలిసి చెప్పితి ననిన నదితితనూజు
లెల్ల, నోమని చనిరి మహేంద్రముఖులు, చనిరి యంతర్ధినొందె నీశ్వరి తనంత.

## —॥ శ్రీహరి యవతారములు ॥—

మ॥ భృగుశాపంబునఁ గంజలోచనుఁడుఁ బేర్మిం బాసి యెచ్చోట నే
యుగమం దే యవతారముం గొని యమేయోద్యోగియై వర్తిలెం
జగదీశుం డగు చక్రి కుత్సితగతిం జన్మించి యెట్లోర్చె న
ర్వగరీయుం డిటు లాపదల్ గనినచోఁ బారంబె మర్త్యాళికిన్. ౪౧౬

క॥ ఏయే మన్వంతరముల, నేయే యవతారమెత్తె నీశుఁడు విష్ణుం
డా యా చరితలు మధురి, తాయాసము లడఁగఁ జెప్పనగు విశదముగన్.

మ॥ అనిమిత్తంబుగ జన్మముల్ గొనెనో? కార్యార్థిత్వముం బూని యం
దనుకూలస్థితి నందెనో? తెలుపు మీవన్నిం జరిత్రిం వ్యాసుఁడుం
విని యావృత్తముఁ దెల్పఁజొచ్చె విను మహీనాథ! ధర్మాఖ్యుఁడౌ
మునికిం బ్రాక్తన పుణ్యకర్మవశతం ముల్లోకముల్ మెచ్చఁగన్. ౪౧౮

కం॥ నరనారాయణ నామా, శ్వరరూపము నొంది చక్రి చాక్షుషమన్వం
తరమున నేకాంశంబున, ధరణిం జనియించె బ్రహ్మతత్త్వగురుండై. ౪౧౯

సీ॥ అత్రి తరుణియైన యనసూయ కోరిక, నజుఁడు చంద్రుండయి యలరుచుండ
శివుఁడుదుర్వాసుఁడై చెలువారుచుండంగ, హరియదత్తాత్రేయుఁడయ్యె మఱియు

హరి నరసింహుఁడై యవతరించి హిరణ్యకశిపునిఁ ద్రుంచి విఖ్యాతిఁ గాంచె
నదితికశ్యపులకు నాత్మజాతుండయి, వామనమూర్తినా వాసి గాంచి

గీ॥ జన్నమును జూచు వేడుకఁ జని వరించి, బలిని బాతాళలోకమ్ముఁ బంపియుండెఁ
దివిరి యేకోనవింశమౌ త్రేతయందుఁ, బరశురాముఁడై జమదగ్ని పట్టియనఁగ.

ఉ॥ అయ్యవతారమెత్తి కమలాంబకు? డిర్వదియొక్కమాఱు నే
దియ్యని విక్రమంబున మర్దించిన రాజుల నెల్లఁ గొట్టి య
క్షయ్యవసుంధరాతలము కాశ్యపుఁ డన్ద్విజమౌని కిచ్చె సా
హాయ్య మెఱుంగఁ జెట్టి దురమైనఁ గుఠారమె తోడు తజ్జనిన్. ౮౨౧

వ॥ శ్రీరామచంద్రుండయి రఘువంశము నలంకరించె మఱియు. ౮౨౨

మ॥ ధరణీభారముఁ దీర్పఁగాఁ దలఁచి దుర్దాంతప్రతాపాఢ్యులై
నరనారాయణు లిర్వురున్ మఱియుఁ గృష్ణస్వామియై పార్థుఁడై
ధర జన్మించిరి యయ్యుదంత మసకృత్ప్రశస్యమౌఁ గాదె యి
క్కరణిన్ బెక్కవతారముల్ గనియె నాఁగా చక్రి యన్మైయెడన్. ౮౨౩

గీ॥ వారు వీరన నేల యెవ్వారలైనఁ, బ్రకృతివశులౌటఁ జక్రవిభ్రమణలీలఁ
జచ్చి పుట్టుచు నుందురు స్థావరములు, జంగమంబులు నిట్లికా జగమునందు.

చ॥ పురుషులకున్ వినోద మెదఁ బుట్టఁగఁ జేయఁగఁ జిత్రకల్పనా
నిరతిఁ బరిభ్రమింపఁగ ననేకవిధంబుల జంతుకోటులన్
బరిభవ మొందఁ జేయు క్షితిపాలక! యమ్మాయి నెందునున్ జరా
చరముల నమ్మహాప్రకృతిశాసన మించుక తప్పిపోవునే. ౮౨౪

సీ॥ స్రష్టయై పురుషుండు సకలంబు గనుఁగొను, సకలంబునకు నాది సర్వగుండు
పరమవ్యయుఁడు పరాత్పరుఁడు నిస్పృహుఁడుని,రాకారుఁడచలుఁడనంతుఁడతఁడు
వృక్షరూపోపాధి వెడలి యనాతపం, బన్యమౌనట్టు లీ జన్యమెల్ల
భిన్నమై తోఁచు నీవిశ్వంబు గల్పించి, పాలించి యడఁచుఁ గల్పంబులందు

గీ॥ విశ్వమోహినిఁ దాఁ గూడి విధియు విష్ణు,రుద్రులు సృజించి పాలించి రూపడంచి
వెలయుదురు స్వాత్మమాయచే విశ్వమెల్లఁ, గట్టివేయు నహంకారగరిమశక్తి.

శా॥ ముక్తిన్ గోరుచు ముక్తసంగులయి నిర్మోహుల్ ముముక్షుల్ సదా
భక్తిన్ గొల్తురు దేవి నీశ్వరిఁ బరబ్రహ్మైకనిష్ఠన్ ద్విధా
వ్యక్తం బౌచు నవిద్య విద్యయు ననన్ భాసిల్లి రెంటన్ జనున్
సక్తున్ ముక్తునిఁ జేయుచున్ మఱియు విశ్వవ్యాపినీశక్తియై. ౮౨౫

కం॥ ముగ్గురుమూర్తుల నంబిక, పగ్గముల౯ జుట్టినటులు ‡ బంధించినఁ దా
రెగ్గెఱుఁగని నడవడుల౯, మ్రగ్గుదు రవతారదంభ ‡ మర్దితు లగుచు౯. ౪౨౨

గీ॥ ఈయుదంతంబు విని ధరణీశుఁ డంత, బాదరాయణుఁ గనుఁగొని ‡ ప్రణుతిఁ జేసి
బదరికాశ్రమసీమఁ దాపసుల చరిత, మెట్లు వర్తిల్లెఁ జెప్పు మో ‡ మునివరేణ్య!

సీ॥ నారాయణునిఁ బ్రాణనాథుఁగాఁ గోరుచు, రంతుకామత నచ్చరలు గడంగి
వేధింప నరున కీ ‡ వృత్తాంత మెఱింగించి, శపియింప నూహించు ‡ సమయమునను
వలదని నరుఁడు ని ‡ వారింప శాంతుఁడై, పిదప నెట్టుల వారి ‡ విడిచిపుచ్చె
శక్రసంప్రేరితల్ ‡ స్వాత్మసంభూతలు, పరిణయింపఁగఁ గోరి ‡ పరవశమున

గీ॥ వేఁడుచుండఁగఁ దన తపోవిఘ్నభీతి, నాదరింపకయుండె మహాత్ముఁ డనుచు
వింటి నానలికథ యెట్టి ‡ వెరవువలన, మానికడఁ ద్రోచె నెఱిఁగింపు ‡ మా! కృపాబ్ధి!

శా॥ రాజన్యుం డిటు లీయుదంతము సమా ‡ రబ్ధస్పృహావేశితా
భ్రాజిష్ణుండయి తెల్పుమన్న ముని సం ‡ భావించి పల్కె౯ మహా
రాజా! ధర్మతనూజుఁడా మునిచరి ‡ త్రం బెట్లు వర్తిల్లె నం
భోజాస్యల్ చెలరేఁగిన౯ నరుఁడు సం ‡ బోధించె నా వింటివే. ౪౩౧

## —• నారాయణముని యప్సరసలను నోదార్చుట. •—

గీ॥ శాంతకోపుఁ డగుచు ‡ సరసిజాక్షులఁజూచి, హాసపూర్వకముగ ‡ ననునయించి
గారవించిపల్కె ‡ నారాయణస్వామి, వినుఁడు నాదుపలుకు ‡ వీను లలర. ౪౩౨

సీ॥ ఇంతులారా! వినుం ‡ డీ జన్మమున మేము, సిద్ధసంకల్పతఁ ‡ జేయుచున్న
తపముల కంతరా ‡ యపుదారసంగ్రహం, బెట్లు చేసెదము మీ ‡ రిందుఁ గడకుఁ
జనుఁడు నాపైఁ బ్రేమ ‡ సడలకుండుఁడు ధర్మ, వేదులు వ్రత మెట్లు ‡ విడుచువారు
శృంగారమునకు స్థా ‡ యియగుంగదా? రతి, యెట్టు లారతికి మే ‡ మిచ్చగింపఁ

ఆ॥ గారణంబులేని ‡ కార్యంబు గలదొక్కొ?, కవులవలన నెఱుఁగు ‡ వివర మిదియు
సుందరులకు మీకు ‡ డెందంబు నాపయిఁ, బ్రేమగల్గియుంట ‡ వేడ్కఁ గంటి. ౪౩౩

ఉ॥ అఱనుఱలేక నామెడఁ గృ ‡ పార్ద్రత నూని వరంబు సాంగమా
తెఱఁగున వర్తిల౯ దగు న ‡ తిప్రమదంబున నొందు జన్మమం
దఱుగొఱలేక యందఱను ‡ నాండ్రఁగఁ జేకొని యేలువాఁడ ద
బ్బఱయని యెంచ కిప్పలుకు ‡ స్వాంతము లేమఱకుండఁ గావల౯ ౪౩౪

కం॥ అష్టావింశద్ద్వాపర, దిష్టంబున భూభరంబు ‡ దీర్చుటకై నే
స్పష్టపు కృష్ణుఁడ నగుచు స, మష్టిన్ మిమ్మెల్లఁ బెండ్లి ‡ యాడెదఁ జుండీ! ౪౩౫

చ॥ మఱవక నాదుపల్కులు సమాదృతిమై ధరణీశు లిండ్ల నం
దఱు దనియించియుండుఁడు హితం బొసగంగలవాఁడ నన్న న
త్తతి మునియాజ్ఞఁ గైకొని నితంబిను లెల్లను శక్రుఁ జేరి నీ
కొఱకయి పోయి యోడితిమి కోపము సేయక మమ్ముఁ జూడుమీ. ౪౩౮

ఆ॥ అమ్మహానుభావు నంతికంబున మనం, డడుగుదమ్ములందు నడ్డపడఁగ
నైన జాలిలేదు గాన మా యొఱపులు, చిత్రపుత్రికావిచిత్రగతులు. ౪౩౭

శా॥ అన్నారాయణ మౌని యించుక కటాక్షాంకూరముల్ జేసినన్
గన్నాకై తమకెల్ల నిచ్చెలియ యంకం బందుఁ బుట్టెన్ సునం
పన్నంబౌ నని నీకు నిమ్మనియె నాబ్రహ్మణ్యు చిత్తంబు మా
వన్నెల్ మెచ్చునె? గ్రామభోగసుఖముల్ వాంఛించునే? యెమ్మెయిన్. ౪౩౮

క॥ ఈ సుందరిఁ జేకొమ్మని, వాసవునకు నొసఁగి రతఁడు వనితం గని యు
ద్భాసితముఖుఁడై మెచ్చుచు, నాసారసముఖులతోడ ననియెం బ్రేమన్.

ఉ॥ ఇట్టి కృపారసమ్ము మునికోటికి మాదృశ సౌఖ్యసంపదల్
కట్టిడిగాఁగ దుష్కృతులఁ గాసిలఁ జేసితి నిట్టులయ్యె నా
గుట్టు బయల్పడన్ సుదతిఁ గూర్చి నమస్కృతి సేయుచున్ వడిన్
గట్టెదురేగి యా నరునిఁ గంటిరె యాతఁడు నన్ను సైఁచెనే. ౪౪౦

ఉ॥ ఏ నపరాధకోటులను నెప్పుడుఁ జేసిన నీసుఁ జెంద రా
మౌనులు సత్కృపారతులు మాన్యులు నామెడ నంచుఁ బల్కి నా
మానిను లుత్సహించి బలమర్దను నానతి నిండ్ల కేగి ర
చ్చానను గూడి వాసవుఁడు సంతసమంది వసించె నద్దివిన్. ౪౪౧

క॥ నరనారాయణచరితము, ధరణీవర! వింటి విట్టి ధన్యులు గలరే?
ధరఁ గృష్ణార్జునులై భూ,భరముడిపిరి భృగుని శాపపద్ధతివలనన్. ౪౪౨

సీ॥ అన విని జనమేజయక్షితీశుండు కృష్ణావతార చరిత్రమానుపూర్వి
కంబుగా వినుటకుఁ గౌతుకంబొదవె న,ద్దరధరుఁ గాంచిన దంపతులకు
నలమటల్ కంసునివలనఁ బ్రాప్తములౌట, మధుర జనించి యమ్మాధవుండు
గోకులంబునఁ బెరుఁగుటయెట్లు? కంసుని, వధియించి ద్వారకావాసుఁడౌట

గీ॥ యేకతంబొక్కొ? తలిదండ్రులెల్ల బంధు,జనము వసియించు రాజ్యంబునను వసింప
కన్యభూమికిఁ జనుటయు నన్వయంబు, మానినీశాపహతిఁ జెందిమడియు టెట్లు?

వ॥ మఱియును గృష్ణుండు భూభారాపహారం బొనర్చి దేహమును విడిచి వైకుంఠంబు నకుం జనిన హరిపత్నులు దస్యులుంఠితలగుటకు నేమికతంబు? ముందు నచ్చోరుల నడంపక కృష్ణపార్థులేల యూరకుండిరి. భీష్మ, ద్రోణ, కర్ణ, బాహ్లిక, ధృష్టద్యుమ్న, విరాట, ద్రుపద, వికర్ణ, సోమదత్తాదులచే భూభారం బడంగెనే? పాటచ్చరశేషంబు భూవలయంబునకు నిసర్గంబయియుండఁ బోలుఁ. గృష్ణపుత్రులు దుఃఖ మనుభవింప నగు కారణం బెట్టిది? ధర్మసంయుక్తులగు పాండవు లిడుమలం బడుట, దుశ్శాసనునిచే సభామధ్యంబునఁ గేశగృహీతయై ద్రౌపది భంగపడుటయుఁ గీచకోపద్రవంబును బుత్రపంచకహననంబునుం బొందెఁగదా! సుభద్రయును పుత్రశోకాకులయయ్యె, దేవకియును బుత్రషట్కధ్వంసనంబున వెతలం బడియె యాదవకులక్షయంబును బత్నీలుంఠనంబును నీశ్వరుండగు హరికి సంభవించె, మఱియుం గొన్ని రుక్మిణీహరణాదులు లౌకికంబులేకదా! గోపికా గృహంబులఁ జౌర్యం బుగ్గడింపవచ్చునే? జరాసంధునకు వెఱచుట కేమికతం? బిట్టి సందేహంబు లపనయించి కటాక్షింపు మనిన బాదరాయణుండు జనమేజయున కిట్లనియె. ౪౪౪

—॥ భూమి భారనివృత్తిని గోరుట ॥—

మ॥ పుడమి మహాభరంబునను ॥ బొక్కుచు నాకముఁ జేరి భీతయై
వడఁకుచు ధేనురూపమున ॥ వాసవు సన్నిధి కేగ నాతఁ డీ
యొడరున కేమిహేతు వని ॥ యొచ్చరికించిన ధాత్రి పల్కె నా
యొడలిభరంబు సైఁపక భయోద్ధతి నిత్తెఱఁగొందితి న్విభూ. ౪౪౫

మ॥ జగతిన్ మాగధరాజ్యనాథుఁడు జరాసంధుండు దుష్టుండు దు
ర్భగుఁడౌ కంసుఁడు చైద్యుఁడున్ నరకుఁడున్ ॥ వత్సుండు సాళ్వుండునున్
భగదత్తుండును ధేనుకుండు మొదలౌ ॥ పాపిష్ఠు లొక్కుమ్మడిన్
దెగువం బోరుచు మత్తులై దురితవృత్తిన్ గ్రమ్మరన్ జొచ్చినన్. ౪౪౬

శా॥ ఈక్షోభంబు భరింపఁజాలక మనంబెంతో వెతన్ ముంప నే
నక్షీణవ్యధ దుఃఖమగ్న నయి మోయన్ రాని భారంబుచే
విక్షేపించితి నేమి సేయుదు మదోద్వృత్తిన్ హిరణ్యాక్షుచేఁ
జక్షుఃకర్ణపథంబుఁ జొచ్చితిఁగదా? ॥ సంవర్తకాలంబునన్. ౪౪౭

ఉ॥ సూకరరూప మూని మురసూదనుఁ డాపద నొంద నీక న
న్నేకదయామతిన్ మనిచె ॥ నించుక యేనియు నెమ్మి లేదు ని
ర్భీకత నేఁడు దుష్టు లగు ॥ పెక్కు నరేంద్రులొనర్చు కీడునన్
శాకవిరోధి! యూఱటకుఁ ॥ బాసితి భార మడంగఁ జేయుమీ. ౪౪౮

ఉ॥ నీదు కృపావిభూతి నొకనేర్పన నీ భరమెల్లమాన్పి న
న్నాదరణంబు సేయుము రయంబున నొండగునేని భార దుః
ఖోదధి మున్గు దాన నని యుర్వి వచించిన శక్రుఁ డోధరి
త్రీ! దెస యస్మదాదులకుఁ దెల్లము వారిజగర్భుఁ డారయన్. ౪౪౯

సీ॥ శరణాగతత్రాణ సాధకుం డగు నల్వ, యచ్చోటి కరిగి వృత్తాంతమెల్ల
వినిపింపు నీతోడ వెనుకొని నేవత్తు, నాపదల్ దొలఁగు నుపాయమునను
అని పల్క వసుమతి యంబుజాసనుఁ గాంచ, జనియె శక్రునితోడ స్రష్ట సురభిఁ
గాంచి విశ్వంభరఁగా నెఱింగి మొగంబు, మొలకనవ్వులఁ బేర్మి దొలుక దేవి!
గీ॥ యేల దుఃఖించెదవు నీదు నెడరుగంటి, నిన్నుఁ బీడించు నెవ్వండు నిజము దెల్పు
మనినఁ గాశ్యపి పల్కె దుష్టాత్ములైన పాపజాతులచే గష్టపాటు గలిగె. ౪౫౦

శా॥ చోరుల్ మత్తులు పాపచారులు దురాశుల్ ద్రోహు లన్యాంగనా
జారుల్ రాజకులంబునం బొడమి ప్రస్పర్థించి యన్యోన్యమున్
వైరంబుల్ బలియించి పోరుచు మహీపాలభ్య మర్థించుచున్
బ్రారంభించిరి దైత్యు లుద్ధతు లొనర్పన్ దద్భరం బోర్వమిన్. ౪౫౧
గీ॥ శరణ మర్థించితిని శక్రసహిత నగుచుఁ, గావు మని వేడ ధాత్రిని గని విరించి
మాకు వశమానె రక్షింప మాధవుండు, గలుగు మనకెల్ల దిక్కు చింతిలకు మనుచు.

చ॥ పరుసఁదనంబునన్ ధరణిపాలురు రక్కసులై మదించి యి
త్తఱి నిను నేచుచెల్లఁ దొలుతం గనియుంటిని వాసుదేవు డ
గ్గఱి శరణంబుఁ జొత్తు మని కంజభవుండు సురాళితోడ ముం
దఱ ధర నిర్గమింపఁగ ముదంబున నేగె రమేశుఁ జూడఁగన్. ౪౫౩

ఉ॥ సారసగర్భు రాక విని శౌరి పదంపడి పిల్వనంప నం
భోరుహనేత్రు సన్నిధికిఁ బోయి ధరాసురవాసవాన్వితుం
డై రమణీయరత్నరుచిరాసనపీఠి నలంకరించు ప
ద్మారమణున్ జనార్దనుని దండవదాచరితప్రణాముఁడై. ౪౫౪

సీ॥ వేయుశీర్షంబుల వేయునేత్రంబుల, వేయుపాదంబుల వెలయు దేవ
సృష్టిపూర్వుఁడవు విసృష్టవేదివి భూత,భవ్య భవిష్యత్ప్రపంచమునను
అమరులఁ జేసి మహిమ్మాదరించితి వీవ,యిది నీమహత్త్వంబు గద! ముకుంద!
కర్తవై భర్తవై హర్తవయ్యెద వీవ, గలియును మఱియును గాన నీవె
ఆ॥ మమ్ము నాదరింపు మాధవ! యని వేడ, సర్వరక్షకుఁడు ప్రసన్నుఁ డగుచు
దర్శనం బొసంగెఁ [illegible] నవనిమా. ౪౫౫

ఉ॥ ఏమిదలంచి వచ్చితి రిపోదేమి వసుంధర దీనవక్త్రయై
సేమము దక్కియున్నయది - చెప్పుమటన్నఁ బితామహుండనెన్
దామరసాక్ష! భూపతులు - దర్పితులై దురితక్రియారతిన్
భూమికి భారభూతులగు - పోరుల మీఱుచు నున్నవారలోగిన్. ౪౫౭

ఆ॥ శిష్టరక్షణంబు - దుష్ట సంహారణంబు, సలిపి ధాత్రి బరువు - చక్కపఱచి
కుశల మందఁజేసి - గోవింద! మనుపవే, దితిజుఁగొట్టి ధరణిఁ - దెచ్చినట్లు. ౪౫౮

ఆ॥ భారకుండ వనుచుఁ - బ్రార్థించితిమి యవ, తారమెత్తి దుష్టతతి నడఁపుము
ద్వాపరాంతమయ్యెఁ - దఱిసి యిక్కలిరాక, కారణమున దురితగతులు ప్రబలె.

చ॥ పఱిగొని దుష్టులం జిదిమిపాఱఁగ నైచి జగంబుసాఁకి యే
డ్తెఱ విహరింపఁగావలయు - దేవ! యుపేక్షకు వేళ గాదు మా
మొఱ వినఁబోలు నన్న హరిమోమున లేనగ వంకురింప నీ
వెఱుఁగవె సర్వధాత్రి! భరియింపు జగమ్ము విచార మేటికిన్. ౪౫౯

ఉ॥ ఏనును నీవు శంకరుఁడు - నింద్రకుబేరరవీందువార్ధినా
థానిలముఖ్యులెవ్వరు నహంకృతి కార్యము లేర్పరింపఁగాఁ
బూనుదుమే ? స్వతంత్రులమె ? - భూర్భువరాదిక సర్వలోకముల్
తానయి యోగమాయ నిరతంబు భరించు గుణత్రయాకృతిన్. ౪౬౦

ఆ॥ ప్రకృతిరూప మొంది - భగవతి రాజస,స్ఫురణ నెద్ది యెద్ది - పొడమఁజేయు
నదియెగాక వేఱయన్యవిధానంబు, గలదె ముజ్జగములఁ - గమలగర్భ. ౪౬౧

సీ॥ ఏను స్వతంత్రుండనేని దుచ్ఛంబులౌ, మీన కూర్మవరాహ మృగపతీంద్ర
జన్మంబు లేటికి - సంతరించెద దాన,ఫలమేమి గంటి దుర్భవము వలనఁ
బుణ్యంబో? సుఖమొకో? భోగమో? కీర్తియో?మఱియువిప్రుండనై మనుజపతుల
మడియించు టేమి ధర్మంబు తద్రుధిరంబు, సప్తహ్రదంబులై జగతిఁ బరఁగె

ఆ॥ రవికులంబునందు - రామరూపముదాల్చి, కట్టబట్టలేక - కంద దినుచు
నెఱకు బోయ కరణి - నిలయెల్ల వేఁటాడి, బ్రతికినాఁడ రాచపాడి యగునె.

వ॥ మఱియును మాయామోహితుండనై మైదు(మాయా)మృగంబు వెంటఁబడి
సీతంబాసి వనంబునం గ్రుమ్మరు వేళ ననుజుండు నచ్చోట లేమింగాదె భిక్షు
కుండై రావణుండు జానకిం జేకొని చనినన్ దుఃఖార్తుండనై సుగ్రీవు మైత్రిం
గోరి తదర్థంబుగా నిరపరాధిని వాలిని వధం బొనర్చి వానరసహాయంబున సాగ
రంబు బంధించి దారుణంబగు రణంబున రావణుం బరిమార్చుటకై పెనంగునెడ
నాగపాశబద్ధులమై తమ్ముండును నేనును గరుడాగమనంబునఁ బునర్జీవితులమై

రాజ్యభ్రంశంబున వనవాసంబును దశాననుం బరిమార్చి సీతం గైకొని చతుర్దశ హాయనంబు లిడుమలంబడి సాకేతంబు ప్రవేశించి యపవాదభీతుండై జానకిం బరిత్యజించి తద్వియోగంబున నడలి యడలి, దైవవశంబున స్వర్గంబుం జేరితి నిది స్వాతంత్ర్యంబగునే? నేనును నీవును రుద్రుండును బారతంత్ర్యపాశబద్ధులము, విమర్శించి యెఱుంగు మని తెల్పి మఱియు నిట్లనియె. ౪౯౩

ఉ॥ సారసగర్భ? తత్త్వగతి సర్వ మెఱుంగుము మాయచే జగ
త్కారణ మిట్టిదం చెఱుఁగఁ గానక నేను విరించి శంభుఁడున్
శౌరి నటంచు మోహమయసాగరమందు మునింగి సంసృతి
బారము నొంద లేక కడుఁబన్నము లొందుదు మీ వెఱుంగవే. ౪౯౪

సీ॥ సంవర్తమున మణిస్థగితాంతరీపంబు, నందు మందారవనాంతరమున
దేవీకదంబంబు తెలియఁ జెప్పినఁ దత్త్వ, పరిపాటి మఱచితే బ్రహ్మ! నీవు
సర్వకామప్రద శాంకరి సర్వేశి, ప్రకృతి మాయామయి పరమశక్తి
సంస్మరింపుఁడు సర్వసంసిద్ధి యని తెల్ప, బ్రహ్మాదిసురలు సంభ్రమము లెడలి
గీ॥ యోగమాయ సనాతని భోగమోక్ష, దాత్రి నభినుతి సేయ సత్తతిఁ గృపార్ద్ర
వీక్షణంబుల మన్నించి విబుధతతికి, సర్వజననియిత్రి యెదుట సాక్షాత్కరించె.

ఉ॥ కాంచిరి నిర్జరుల్ శ్రుతిశిఖాముఖనిశ్చితతత్త్వడోలికా
కాంచనపుత్రికోచ్చలితకారణశక్తిసహస్రసేవనా
భ్యంచితమూలపీఠనిలయాదిమతత్త్వవినోదకల్పనా
సంచితజీవభేదమయజాలవిమోహిని సింహవాహినిన్. ౪౯౫

## —• దేవతలు కాళీదేవిని బ్రార్థించుట •—

క॥ కనుఁగొని సర్వసుపర్వులు, వినయావనతు లయి మ్రొక్కి వేడుక లలరన్
వినుతింపఁ దొడఁగి రాగమ, ఘనసూక్తుల నిట్టు లనుచుఁ గాళిన్ బాళిన్.

చ॥ భువనజనిత్రి! నీ వెకద భూర్భువరాదికలోకజాలముల్
వివశత నొందనీక కడువేడుకఁ బ్రోవఁగ మత్సమీహితం
బవిహితమై ఫలాప్తిఁ గొనునట్లు దయామతిఁ జేయుమమ్మ ని
న్నవిరతభక్తిఁ గొల్చెద మదారకృపారసలోచనాంచలా! ౪౯౬

శా॥ తల్లీ! కంసముఖాదిరాక్షసగణోద్యద్విక్రమాటోపసం
ఫుల్లంబై దురితంబు భూమి కతివిస్ఫూర్జన్మహాభారమై
వెల్లింబర్వుచుఁ బర్వతాంబుధిసరిద్వ్రాతాటవీభారముల్
జెల్లన్ జేయుచు మోయరాని బరువై క్షీణత్వ మొందించెడిన్. ౪౯౭

సీ॥ నరకాసురునిఁ గేశి ఖరుని జరాసంధ, శిశుపాలముఖ్యులఁ జెండి వైచి
జగతీభరము మాన్పి జగము రక్షింపుము, విష్ణుశంకరులచే విహతులైన
కూ్రరులు నీశక్తికొలఁదిన కాన శౌ,ర్యోన్మత్తు లగుచు నన్యోన్యవైర
ముల ఘోరసమరముల్ బలియించి జనులకు, బాధాకరములైన పను లొనర్చి
గీ॥ యెదుపనదు రెండు లేక నిర్హేతుకలహ,కారులై దేవతాదిధిక్కారములకు
వెలివకున్నారు కడఁదోయియు నెరవులేక, బడలుపడియున్నది జగంబు పరమశక్తి.

మ॥ కరుణామూర్తివి నీ వొసంగని జగత్కల్యాణముల్ గల్గునే?
శరవిధ్వస్తులఁ జేసి రక్కసుల దుర్గర్చన్ బ్రహ్మరుద్రాదు లీ
శ్వరి! నీసాహ్యములేక శక్తులె? మముల్ సంరక్ష్యులన్ బ్రోవ నీ
కరుదే? మా జననావనంబులు త్వదన్యాయత్తతం గాంచవే. ౪౭౧

మ॥ ధర మోయన్ ఫణిరాజు లోకముల నుద్యత్కాంతి శోభింప భా
స్కరచంద్రుల్ సృజనావనక్షయములన్ సృష్ట్రస్వభూశంకరుల్
నిరతిం ద్వత్పదరేణుధూళనమునన్ నిర్వాహకుల్ గాన నీ
కరుణాంకూరము సర్వసాధకము రక్షాకాంక్షు లౌ వారికిన్. ౪౭౨

చ॥ హిత మహితం బెఱుంగని నిశాచరుల నీపగిదిన్ ద్రిలోకముల్
మతిగతు లెంచి ప్రోచుట కమర్త్యులలో నొకఁడైన శక్తుఁడే?
కృతము భవద్విభూతి పరికింపఁగ స్వార్థముగా వనన్య లే
క్షితిభర మార్పు టెంత పని? చేకొనుతల్లి! ప్రభుత్వసంపదల్. ౪౭౩

సీ॥ పరదేవి! నీపాదపంకజంబులు మాకు, శరణ మంచని చక్కఁజాగి మ్రొక్కి
వేడుచునున్న యావిబుధబృందముఁ జూచి, యఖిలాండజనని యిట్లనియె మీరు
ప్రస్తుతంబున నేమిపనిఁగోరి వచ్చితి, రది యసాధ్యంబైన ననుపజఱతు
విన్నవింపుఁడటన్న వేల్పులు భూభార, మడఁచి రక్షింపుమో యమ్మ! యనిన.
గీ॥ నెంతకార్యంబు వెలివకుం డిష్టసిద్ధి, సేయుదు నటన్న వేల్పు లామాయ నెలమిఁ
గాంచి పలికిరి తల్లి! నీకరుణఁగాదె, శాత్రవోచ్చాటనపుమంత్రశక్తి మాకు. ౪౭౪

సీ॥ చండవిక్రమకళాశౌండులై భువనముల్, దండించు దోర్బలోద్దాములైన
సురరిపుల్ శుంభనిశుంభదుస్సహచండ, ముండదుర్ముఖమూకఖండరక్త
బీజధూమాక్షాదిభీకరదైత్యుల, మర్దించి సేనలమడియఁ జేసి
మహిషాసురునిఁ బిల్కుమార్చి పేర్చిన నిశా,చరబృందములనెల్లఁ జక్కడంచి
గీ॥ కాచితివి నేఁడు దుర్భూతఖండనమున,బుడమిభర మెల్లమాన్పుచో నొప్పునని సకల
భూతకోటుల మనుపంగఁ బోలుననుచు,మఱియు వేడిన విని జగన్మాత యనియె.

వ॥ ఇత్తెఱంగు నాచే ముందుఁ జింతింపంబడియె, నెట్లనిన నంశావతరణం బొనరించి దుష్టులగు రాజుల నడంచి భూభారంబు నివర్తింపం జేయవలెనని రాక్షసాంశ సంభూతులగు మాగధాదులం గెడపెద మీరు స్వాంశంబుల నవతరింపుఁడు, మదీయంబగు శక్తి మీయం దధిష్ఠింపంగలయది, అదితి కశ్యపులు వరుణశాపమ్మున దేవకీవసుదేవులై యదుకులంబున నుద్భవించెదరు, భృగుశాపమ్మున నీ యచ్యుతుండు కృష్ణుండై యావిర్భవించు నేనును యశోదానందులకు నందననై స్వాంశంబున నుద్భవించెదఁ గారాగృహంబున జాతమాత్రుండగు కృష్ణుని గోకులంబుఁ జేర్చెద దేవకీగర్భంబున నంశావతరణం బొనర్చు శేషుని సురభి యంశంబగు రోహిణిం జేర్చెద నింద్రు నంశంబున నర్జునుం డగు ధర్మాంశంబున యుధిష్ఠిరుండు రాజగు, మారుతాంశంబున భీముండు నాసత్యాంశంబుల నకుల సహదేవులు నగుదురు, వస్వంశంబున గాంగేయుండగు, ద్వాపరాంతంబున భూభారంబు నివర్తించు మీమీభువనంబుల కరుగుం డిఁక నీకురుక్షేత్రంబున నఖిలసంక్షయంబుఁ గాఁగలయది, అసూయయు, నీర్ష్యయు, మతియుఁ, దృష్ణయు, మమతయు, నభిమతయు, స్పృహయు, జిగీషయు, మదమోహంబులును నను నీ పదుండ్రు మదీయ సఖులై ప్రళయంబునం బోలె సంక్షయం బొనర్తురు, విప్ర శాపనిమిత్తంబున యదుక్షయంబగుఁ గృష్ణుండును శాపవశంబున దేహంబు విడిచి వైకుంఠంబునకుఁ జనుదెంచు నని తెల్పి జగదీశ్వరి యంతర్ధానంబు నొందిన. ౪౭౬

మ॥ అమరుల్ గొల్వఁగ నింద్రుఁ డబ్జనయనుం ఽ డబ్జాసనుం డాదిగాఁ
దమలోకంబుల కేగి రుర్వి మదిఁ జింఽతల్ బాసె సస్యౌషధుల్
ద్రుమముల్ పూచి ఫలించె భూప్రజలు సంఽతుష్టాంతరంగంబులం
బ్రమదం బందిరి తాపసుల్ సుఖతపఃఽప్రారంభులై రత్తఱిన్. ౪౭౭

సీ॥ జనమేజయావనీఽశ్వర! కురుక్షేత్రప్రభాసంబులను జగఽత్పావనంబు
లాశ్రమంబు లొనర్చె ఽ నంబిక తనమాయ, యదువంశమున హరి ఽ యవతరించె
భృగుశాపమున నిద్ది ఽ పెద్దయే యద్దేవి, కుహనకు గొప్పయుఁ ఽ గొంచె మున్నె?
త్రిగుణశక్తికి జగఽత్త్రితయంబు లవమాత్ర, మచ్యుతుం డట్టులఽయగుట సాక్షి
ఆ॥ పుట్టు వందుటయును ఽ బోష్యత నొందుట, గిట్టుచుంట శక్తిఽకృత్యములుగ
విష్ణు వాదియైన ఽ వేల్పు లీతీరుగా, నితరజీవములను ఽ నెంచ నేల. ౪౭౮

శా॥ ముక్తిన్ గోరుట ముక్తసంగులయి నిఽర్మోహుల్ ముముక్షుల్ సదా
భక్తిన్ గొల్చుట దేవి నీశ్వరిఁ బరఽబ్రహ్మైకనిష్ఠన్ ద్విధా.
వ్యక్తం బౌట నవిద్య విద్యయు ననన్ ఽ భాసిల్లు రెంటన్ లలిన్
సక్తున్ ముక్తునిఁ జేయుచుండు మఱి విఽశ్వస్తుత్యయై శక్తియై. ౪౭౯

క॥ ముగ్గురు మూర్తుల నంబిక, పగ్గముల్ గట్టి నటులె బంధించినచో
నెగ్గెఱుఁగని నడవడులన్, మ్రగ్గుదు రవతారదంభసమర్దితు లగుచున్. ౪౭౦

వ॥ మఱియును. ౪౭౧

సీ॥ వైకుంఠమున రమావల్లభుఁడై యుండు, క్షీరపాథోరాశి శేషశాయి
దేవాసురాహవోద్వృత్తి నొక్కొకతఱి, నధ్వరోత్సాహియై యలరు నొకట
నతితీక్ష్ణతరతపోవ్రతము లార్జించుచు, వెలయు నొకప్పుడు విష్ణుమూర్తి
కాన స్వాతంత్ర్యంబు గలదె? యెవ్వరికిని, బరతంత్ర మఖిలంబు పల్కనేల
గీ॥ హరహరివిరించితరుణార్కహరిహయేందు, ధనదగంధవహాగ్నిసదాగతులును
సిద్ధసాధ్యాదులును మునిశ్రేష్ఠులెల్ల, విశ్వజనయిత్రిదాసులై వెలయుచుంద్రు.

—• ప్రాణులు శక్తికి లోఁబడియుండుట •—

చ॥ భరతుఁడు బొమ్మలన్ నడుపుభంగి వృషంబుల ముక్కుత్రాళ్లచేఁ
దరమిడి త్రిప్పు కర్షకువిధంబున నెల్లరఁ గాలపాశదు
స్తరతరబంధమున్ జొనిపి తద్దయుఁ ద్రిప్పుచునుండు దేవి త
ద్భరమున హర్షశోకములఁ బొల్పడి మ్రగ్గుచునుండు భూతముల్. ౪౭౩

చ॥ అమరులు నిర్జరుల్ త్రిదశు లందఱు దివ్యులు నామమాత్రులై
యమరుట గాని జన్మమృతు లయ్యెడఁ దప్పెనె? చావుపుట్టువుల్
క్రిమముల వారుఁ బొందుటలు గాంచమె? పక్షిమృగాదివృత్తిసా
మ్యము జగతిన్ జరాచరములందు సమానము భూతకోటికిన్. ౪౭౪

సీ॥ జీవులలో దినజీవులు మాసర్తు,జీవులు నేకాబ్దజీవులు శత
వత్సరజీవులు వర్షశతాయుత,జీవులు బహుయుగజీవు లగుచు
వర్తించులే కానివారలకును జన్మ,మరణముల్ దప్పవు హరివిరించి
ముఖులకు నైనను మొనయుఁ దత్తత్కల్ప,భేదంబులను మృతిభిన్నసరణి
గీ॥ చక్రినేమిక్రమంబున సర్వజంతు,సంతతులు మోహజాలవశంబు నొంది
తిరుగుచుందురు మాయాప్రదేశమునను, ద్రిప్పు జగదేకజనయిత్రి దేవిగాదె?

కం॥ దేహము సుఖదుఃఖాలయ, మూహింపఁగ నదియుఁ గల్గ నొండేల యగున్
దేహికిఁ గారణకార్యస,మూహముల్ భేదవిధులు మొనయుట గలదే?

చ॥ జనముల కెల్ల సౌఖ్యము లొసంగు రవీందుల కెందు రాహువీ
డన మెడలేదు చంద్రిన కోడల్ క్షయదగ్ధము ధాత పుత్రితో

వెనుకొని శీర్ష పాతమున * విహ్వలుఁ డయ్యె శివుండు పత్నివో
యిన గిరిపుత్రికం బరిణయింపఁడె! తప్పెనె హర్ష శోకముల్ ? ౯౮౭

చ॥ ఇదియనుగాక దుఃఖమున * నీశుఁడు భాస్కరకస్యఁ జూచి తా
మదనశరార్తి నొంది తమిసైన్మై నిలుపోపఁగలేక పైఁబడన్
దదవయవోగ్రచండిమను * దాపము నొందుచు నీల మాచు ను
న్నది మనకున్ నిదర్శన మసన్ గనఁజేయుచునుంటఁ గాంచమే. ౯౮౮

చ॥ మఱియును శంకరుండు భృగుసమానిచిరంటినిఁ జూచి నగ్నుఁడై
తెలియక వెంటనంట మునిసదిట్టిన లింగవిహీనుఁ డౌచుఁ గ్రి
మ్మఱు * దనుజామృతమ్ముఁ గొనె * నందె సురేంద్రుఁడు గోస్వరూపమున్
దఱిగెనె వారియందు వసుధావర ! కంటివె దేవిచిత్రముల్. ౯౮౯

కం॥ వసుధాధిప ! యిజ్జగముల, వినువుచు సుఖదుఃఖభోగవిహ్వాలిన్ బడ కె
ద్దెస నెవ్వఁడేనిఁ గలఁడే, మసలక చేయెత్తి చెప్పుమా! నా కతనిన్. ౯౯౦

గీ॥ మఱియు దశరథ రాముఁడై మహిజనించి, దుఃఖపాత్రంబుగాఁడొక్కొ తొలఁగనీదు
యోగనిద్రామహత్త్వంబు భోగవాంఛ, వెడలువారికి నమృతమైయిడును ముక్తి.

సీ॥ జన్మసంభవము రాజ్యభ్రంశ మవనిజా, విరహంబు లోనుగా * వెతలఁ బడఁడె
రాముండు తనదు సర్వజ్ఞత్వవిభుశక్తు, లేమయ్యె హాటకమృగము వెదకఁ
బనియేమి రావణాపహృతయా వైదేహిఁ, గానక తమ్మునిఁ * గాంచి యేను
విడిచెదఁ బ్రాణముల్ * విడిచెద వీవును, నస్మదర్థము మాత * లవరజులును

గీ॥ సంస్థితులు కైక సంకల్పశాలినియగు, ననుచుఁ జెట్టుల గట్టుల * నాపగలను
సీత నడుగుచు రాఁగదే సీతయనుచు, మసలుకొనె రాముఁ డది దేవిమాయకాదె?

గీ॥ సకలలోకశరణ్యుఁడౌ * సరసిజాక్షుఁ, డర్కజసహాయమున వానరాళిఁగూర్చి
వార్ధి బంధించి రావణవధ మొనర్చి, సీతఁ గొనుట మహాశక్తిచేత గాదె. ౯౯౩

క॥ జయ మిచ్చి యొక్కయెడ నప, జయ మిచ్చుచు భూతకోట్లసంసృతిలోనన్
దయయున్ నిర్దయయున్ లేక యథేచ్ఛన్ ద్రిప్పు దేవి * కర్మవశమునన్. ౯౯౪

క॥ కావున హరియంతటి వాఁ, డీవిధమున హర్ష శోకవృత్తులఁ గనఁడే
దైవాధీనము జగమని, భావించుచు వినుము కృష్ణుపావనచరితల్. ౯౯౫

* టిప్పణి : దనుజామృతమ్ము = దనుజ నిర్మితమైన (వాపియందలి) ఉదకము.

## —మధురపట్టణ వృత్తాంతము—

సీ॥ తరణికుమారికాతటమున మధువనం,బున లవణుం డను - దనుజవిభుఁడు
మధునందనుఁడు వాఁడు - మహిసురావళులకు,దుఃఖదుండగుచు న్పద్ధరత మెఱయ
శత్రుఘ్నుఁ డద్దైత్యు - సంగరంబునఁగూల్చి, తత్కుకుండును బుష్క-రాక్షుఁడ నెడు
తనపుత్త్రులకు సమృద్ధంబగు పురిఁ జేసె, మధుర య న్పేరిట - మహితముగను
గీ॥ రవికులక్షయమైన యాదవవిభుండు, దానిఁ దమ కున్కిఁగా రాజధానిఁ జేసి
యందునివసించి నిఖిలరాజ్యానుభూతి, వెలయుచుండెనుగొన్నినా - ళ్లలఘుచరిత!

ఉ॥ అన్నగరిన్ భుజాబలవిహారపరాస్తసమస్తవైరిభూ
భృన్నివహుం డుదారుఁడు విభిన్నకులాకులభేదవాదసం
పన్నుఁడు శూరసేనుఁ డను - పార్థివముఖ్యుఁడు భూమి నేలె న
త్యున్నతధైర్య ధిక్కృతశిలోచ్చయశేఖరుఁడై మహోన్నతిన్. ౪౯౭

## —దేవకీవసుదేవుల జననము—

చ॥ అతనికిఁ గశ్యపాంశమున - నాత్మజుఁడై వరుణాభిశప్తుఁడై
క్షితి వసుదేవుఁ డుద్భవిలెఁ - గేవల వైశ్యకులోచితక్రియా
సతతవిహారియై విబుధసన్నుతసద్గుణధుర్యుఁడై సమా
తతధనసంపదన్ వెలఁగె - దానధురీణత నప్రతీపుఁడై. ౪౯౮

ఉ॥ అత్తఱి నుగ్రసేనుఁడు సమస్తధరాస్థలి నేలుచున్ రసా
భృత్తతిలోన మేటియయి - పేర్మి వహింపఁగ నందుఁ గంసుఁ డు
న్మత్తుఁడు పుత్త్రుఁడున్ సుగుణమానిత దేవకి నాఁగఁ బట్టియున్
జిత్తము రంజిలం గలిగి - చేసిరి తండ్రికి నిండుమోదమున్. ౪౯౯

ఆ॥ వరుణశాపవశత - వసుదేవుఁడై పుట్టి,నట్టి కశ్యపునకు - నదితి దేవ
కిగ జనించి యతని - కేల్వట్టె నాయుత్స,వంబునాఁటి కత నృపాల! వినుము.

చ॥ పరిణయవేళ విష్ణుపదభారతి పల్కెను "కంస! కంస! యీ
తరుణికి సప్తమంబయి ప్రసాదంపడి యేర్పడు గర్భమందు శ్రీ
హరి జనియించి నిన్నడఁచు"నంచు వచింపఁగఁ గంసుఁ డాత్మలో
నిరతము సాధ్వసావహత - నెయ్యురతో వివరించి పొక్కెడిన్. ౫౦౧

ఆ॥ అంత గొన్నిదినము - లరిగిన పిమ్మట, గంసుఁ డాత్మలోనఁ - గళవళించి
చేయునదియులేక - చింతించె నాత్మలో, నేమిసేయువాఁడ - నింక ననుచు. ౫౦౨

## —• కంసుండు విచారించుట •—

సీ॥ కీడుపుట్టకమున్నె ఽ గెడపుట మేలని, శాస్త్రప్రసిద్ధముగదా ఽ సంశయింపఁ
బనియేమి యిచ్చోట ఽ బలిమిఁ జంపుట మేలు, స్త్రీవధం బని బుద్ధి ఽ సేయనేల?
మృత్యుభయాపహాఽకృత్య మాచరణీయ,మై యుండె నింకేమి ఽ యనఁగవచ్చు
దురితమైనను దాన ఽ నరకమైనను దేహ,సంరక్షణముసేయఁ ఽ జనెడుఁ గృతికిఁ

గీ॥ బాపములకెల్ల నిష్కృతిఁ ఽ బట్టియుండుఁ, గాన మత్ప్రాణరక్షావిఽధాన మిపుడె
సేయఁదగు నని చింతించి ఽ చెడుగు నిశిత,ఖడ్గమున దేవకిని జంపఁఽగడఁగి యంత.

## —• కంసుఁడు దేవకినిఁ జంపఁబూనుట •—

మ॥ కరవాలం బొఱఁదూసి కంసుఁడు మహోఽగ్రక్రూరచర్యారతిన్
దరుణిన్ జెల్లెలి దేవకిన్ దునుమఁగా ఽ దర్పించి పైఁబోవఁ ద
త్పరిచారుల్ తన కడ్డమైన సమరఽప్రారంభియై ఘోర భీ
కరమై కంసునకున్ భటాలికిని సంఽగ్రామంబు చెల్లెన్ గడున్. ౧౦౮

గీ॥ అంత యదువృద్ధు లరుదెంచి ఽ యడ్డగించి, పొలఁతి దేవకియయ్యె మోఽపూజనీయ
తగదు వీరుండవై స్త్రీవఽధంబు సేయఁ, గీర్తిహానియు దుఃఖంబు ఽ కీడుఁ గలుగు.

సీ॥ భూతభాషిత మది ఽ పురుషవర్యుఁడ వీవు, సత్యంబుగా నమ్మి ఽ సాహసింపఁ
జనునె? యవ్వసుదేవఽశత్రుఁ డెచ్చోటనో, గూఢవృత్తిని నిట్టి ఽ కోడిగంబుఁ
బలుకఁబోలును ధీరఽతిలకంబవై యశో,హానికార్యము సేయఽనగునె? నీకు
శుభకాలమున నింత ఽ సుజనగర్హ్యంబైన, కృత్యంబు తగునె? యౌఽచిత్యమెడలి

గీ॥ యధిప! భవితవ్యమన్యథాఽయగునెయనుచు, వృద్ధులగుయాదవులు చెప్పఽవినమి దెలిసి
ధర్మపారంగతుఁడుగాన ఽ దార కడ్డ,మగుచు వసుదేవుఁ డిట్లనిఽయనియె నంత.

గీ॥ బావ! యిప్పని సేయుట ఽ పాడిగాదు, వైరహేతువు వేఱొట ఽ వనితయెడల
సాహసింపఁగ నేల యీఽసతికిఁ బుట్టు, కొమరులను దెచ్చి యిత్తు నీఽకును నిజంబు.

సీ॥ సంతానహీనత ఽ సాప్తపూరుషముగా, మత్పూర్వజులు దుర్గఽమంబులైన
నిరయముల్ పొందిన ఽ నే సహించెదఁ దెచ్చి,యిచ్చెద బిడ్డల ఽ నీను మాను
మని పాదములఁబడి ఽ యాక్రందన మొనర్ప,యదువృద్ధు లివ్విధిఽయాత్మహితము
వసుదేవుఁ డనృతంబు ఽ వచియింపఁ డిది మేలు,కోపంబు విడువుముఽకొమిరెఁ జంపఁ

గీ॥ గూడదని తెల్పఁగంసుండుఽకోప మెడలి, శాంతుఁడయ్యెమహోత్సవాఽక్రాంతపటహ
భేరికాదుందుభులు మ్రోసెఽభూరివిభవ, మెసఁగెఁబరిణయమయ్యెనఽయ్యెడమహీశ.

గీ॥ తెలివ దేవకితో వసుఽదేవుఁ డంతి,పురముననుబంచశరకేళి ఽ నిరత సుఖము
లనుభవించెను రాజునఽకలుఁడై న, విభవ మతివేలముగఁ గోర్కెఽ వెల్లిపర్వ.

—• దేవకీవసుదేవులు పుత్రి నియ్యవలసివచ్చినందుకు దుఃఖించుట •—

ఉ॥ కొన్నిదినంబు లిట్లుచగఁ గోమలి దేవకి చూలుదాల్చి ప్రే
మ న్నెలలెల్ల నిండిన సుషమప్రదరప్రతిభాసుఁడౌ సుతుం
గన్నఁ బ్రియుం డెఱింగి యతిఘస్మరుఁ గంసుని లోఁదలంచి ని
ర్భిన్నహృదంతరుం డగుచుఁ బ్రేయసిఁజూచి వచించె ఖిన్నుఁడై. ౫౧౦

మ॥ లలనా! కంసునితోడఁ బల్కిన దురాలాపంబు దీర్పంగఁ బో
వలసెన్ బుత్రినిఁ దెమ్ము వేగ నిడెదన్ వాక్రుచ్చి; సత్యవ్రత
స్ఖలనం బొందిన కారవస్థితి యగున్ సందేహ మింకేల? ప్రా
ణులకుం గర్మఫలంబు దప్పునె? కదన్ గ్రూరంబు దైవం బహో. ౫౧౧

గీ॥ కాలపాశానువర్తనక్రమమువలన, దుఃఖసుఖభోగములు రెండు దొలఁగకుండు
మనకు భోక్తవ్యమైన కర్మఫలభోగ,మిట్లు పరిపాకమును బొందె నింతి యనిన.

సీ॥ ప్రాణవల్లభ! కర్మపరిపాక మట్టిద,యైన మద్వచనంబు లాలకించు
జపతపస్తీర్థాభిసరణంబులను బోదె, తనచేయు దురితంబు ధర్మవిధుల
నఘహరణంబు ప్రాయశ్చిత్త మని చెప్పు, ధర్మజ్ఞసూక్తులు దప్ప వెందు
బ్రహ్మఘ్నుఁడును హేమపాటచ్చరుఁడు సురా,పాయియు గురుతల్పపాతకుండు

గీ॥ ద్వాదశాబ్దవ్రతంబున దళితదురితు,లని వచింతురు మన్వాదు లనృత మగునె?
యట్లు సేయుట దగదె? పాపాపహృతికి,యతన మొనరింప బ్రదుకఁడే? యర్భకుండు.

మ॥ భవితవ్యం బది భోగ్యమన్న వివరింపన్ యాజ్ఞవల్క్యోక్తముల్
సవనంబుల్ బహుమంత్రవాదములు నక్షత్రగ్రహాయుర్విధా
నవచఃపద్ధతులెల్ల మిథ్యలె యగున్ దత్కార్యముల్ వ్యర్థముల్
భువి నిశ్శ్రేణియు ధర్మహాని కులమున్ బోవున్ గదా? నష్టమై. ౫౧౪

ఉ॥ ఇయ్యెడ నెట్టులైన సుతు నియ్యక ప్రాణముఁ గాచికొన్న న
క్షయ్యసుఖంబు గల్గును పరచ్ఛలనంబున కెద్దియేని పై
నొయ్యననొండు చేసికొను? టొప్పదె? నిష్కృతి జీవరక్షకొం
డెయ్యది తుల్య మీ సుకృత మీవును నెమ్మది నెంచి చూడుమీ. ౫౧౫

మ॥ వసుదేవుండు నిజాంగనం గని శ్రుతిప్రవ్యక్తంబు లిప్పల్కు లి
వ్వసుధన్ హర్షసుఖాంకురావహములై వర్తిల్లుఁ గర్మావళుల్
వెసఁ జుట్టుం ద్వివిధంబులై జనులకున్ వేయేల? భోగార్హముల్ ౫౧౬
వ్యసనోత్పాదకముల్ సురాసురసమవ్యాపారపారీణముల్,

వ॥ ఎట్లనిన నాగామి సంచిత ప్రారబ్ధంబు లనియెడు నామంబుల శుభాశుభబీజ భూతంబులు, వీనియం దాగామి వర్తమానంబులు సుకృత దుష్కృత భేదంబుల స్వర్గ నరక సుఖాసుఖంబులఁ బొరయంజేసి పుట్టింపుచు గిట్టింపుచు లింగదేహంబు నంటి యాతనావశంబునం ద్రిప్పు బ్రారబ్ధంబులు భోగయోగ్యంబులు ప్రాయశ్చిత్తంబుల నశింపనేర వని పలికి కొడుకుం డెమ్మని మఱియు నిట్లనియె. ౫౧౭

సీ॥ అపవాదపరిభూతుఁ ॥ డనుట కోర్వఁగఁబాల, జన్మ గల్గినయంతఁ ॥ జావు నిజము
శోకింపఁబనిలేదు ॥ సుతు నిమ్ము సత్యమ్ము, దప్పాట చచ్చుట ॥ ధరణి నన్ృత
వాదికి నరకమ్ము ॥ వాస్తవమని వేద,వాదులు పల్కరే? వారిజాక్షి,?
దైవవశం బిది ॥ తప్పఁదోఁచినఁబోదు, పాపంబు దుఃఖైకభాజనంబు
గీ॥ గానఁ బ్రారబ్ధ మిట్టిదై ॥ కానుపించె, బ్రతికియుండిన సుతులను ॥ బడయవచ్చుఁ
బాపచిత్తుండు కంసుండు ॥ ప్రతినకోలఁది, నిరువురనుజంపుఁ దడయుట ॥ కేమిఫలము?

సీ॥ ప్రాణవల్లభుఁ డిట్లు ॥ పలికిన దేవకి, దుఃఖార్తయై యెద్ది ॥ దోఁచకపుడు
వేపమానాంగియై ॥ వెక్కుచుఁ బుత్రునిఁ, జేకొని వసుదేవుచేతి కొసఁగ
నతఁడు గైకొని లోకులందఱు వెఱఁగంది, సఫలజీవుం డిట్టి ॥ సత్యవాదిఁ
గంటిమే కంసుఁ డకాలమృత్యువు వాని,కొసఁగఁ బుత్రునిఁ దెచ్చెనోర్వదగునె?
గీ॥ యనుచు వినుతింపఁ బుత్రునిఁగొనుచువచ్చి,కంసునకునొప్పగించినఁగనిమనమ్ము
నెఱఁగుపడ ధైర్యమునకునువిస్మయమ్ముఁ,జెంది బాలునిఁగనినవ్వి చెలిమిమెఱయ.

గీ॥ ఎంత ధన్యుఁడవైతి వీవిట్లు సాహసించి పుత్రునిఁదెచ్చి నాచేత నిడితి
వేను మృత్యువుననిచూడ ॥ విచ్చమెచ్చి,నాఁడ నిచ్చితి నాయు వీనందనునకు.

శా॥ హంతవ్యుం డగునొక్కరుఁడు ? వీఁడు కొనిపొమ్మా ! వీని నీయిష్టముల్
జింతింపం బనిలేదు తెమ్మవల విచ్చిన్నాత్మఁగాఁజేతు ని
శ్చింతన్ వీని గృహంబుఁ జేర్పుమని యిచ్చెన్ గంసుఁ డాపుత్రునిన్
గాంతం జేర్చె భవిష్యదర్థమును సాకల్యంబుగాఁ జెప్పుచున్. ౫౨౧

గీ॥ కంసుఁడంతట సచివులఁగాంచి వీనిఁ,జంప నేటికి నష్టముఁ ॥ జంపినైతు
ననుచుఁబల్కిన వార లత్యంతహర్ష,భరితులై కంసుఁ గనుఁగొని ॥ ప్రస్తుతించి.

వ॥ తమ తమ గృహంబుల కరిగినఁ గంసుండు యథేచ్ఛావిహారంబులఁ బ్రవర్తించుచున్న యెడఁ గతిపయదినంబులు చనిన పిమ్మట ౫౨౩

—• నారదుఁడు కంసునితో దేవతాసంభాషణము చెప్పుట •—

సీ॥ ఉగ్రసేనునిఁజూచు ॥ నోజ నిర్జరమౌని, చనుదేర నెదురుగాఁ ॥ జని విభుండు
నర్ఘ్యపాద్యాదుల ॥ నర్చించి మణిమయ, సింహాసనం బిడి ॥ చెంత నిలిచి

స్వాగతం బడిగిన § సంతసించి తపస్వి,యుచితోక్తిఁ బలుకుచు § నున్న యెడను
గంసుఁడు మ్రొక్కి నె § గని మందహాసమ్ము, మోమున నందంద § మొలకలెత్తఁ

గీ॥ గంసుఁగన్గొని పల్కె నేఁ § గనకశైల,మునకు నరిగితిఁ బరమేష్ఠి § ముఖ్యసురలు
నీకు నహితంబుగా మంత్ర § మేకతమునఁ, జేయుచున్నారు వినుము ని § శ్శేషముగను.

కం॥ ఆనకదుందుభి రాజీ,వానన దేవకికిఁబుట్టు § నర్భకుఁడు నినుం
బూని వధింపఁగలం డఁట ? సూనుఁడు హరియంశ మెఱుఁగు § సూక్ష్మంబనినన్.

ఉ॥ తాపసవర్య ! వింటినది § తథ్యమె యష్టమ గర్భమందు నన్
రూపఱఁజేయ నర్భకుని § రూపున విష్ణుఁడు పుట్టునంచు నీ
రూపముగాఁగ భారతి ని § రూఢముగా దివియందుఁ బల్కెను
దీపితకోప మూని వసు § దేవునితో వివరించి పల్కితిన్. ౨౮

కం॥ అష్టమగర్భార్భకు వి,స్పష్టముగాఁ జంపువాఁడఁ § జలమున నే సం
తుష్టుఁడ నయ్యెద నని ని,ర్దుష్టముగాఁ జెప్పినాఁడఁ § దొలఁగం డతఁడున్. ౨౯

గీ॥ ఎనిమిదవవానిఁ దెచ్చి నా § కిచ్చు నతఁడు, వాని ఖండింతు నిజ మన్య § వార్తలేల?
యనినఁగంసునితోఁబల్కె § నమరమౌని, యయ్యయో! రాజనీతియి § ట్లగునె వినుము.

సీ॥ దేవతామాయల § తెఱఁగు నీవెఱుఁగవు, నిలువెల్లదంభంబు § నిర్జరులకు
నష్టమం బనుట గ § ర్భాష్టమం బనరాదు, హరిపుట్టు నవతార § మష్టమంబు
వసుదేవునకు రమా § వల్లభుం డుదయించు, నవతార మష్టమం § బనుటవలన
నిందుదయించిన § నందనకోటిలో, నెవ్వఁడో హరిరూప § మెఱుఁగఁదగునె ?

గీ॥ కుశలమెదఁగోరి తత్పుత్ర § కులను జేవ,ముంచక వధించుటయె § నీకు మంచిపథ మ
టంచు నంతర్హితుండయ్యె § నమరమౌని, సంశయావిష్టుఁడగుచు నృ § పాంసుఁడతఁడు.

—♦ కంసుఁడు దేవకి మొదటి కుమారుని జంపుట ♦—

మ॥ బెడిదంబౌ నడిదంబు కేలఁగొని యా § భీలధ్వనుల్ సేయుచున్
బుడుతన్ గేల్గవ నీడ్చి తెచ్చి వసుదే § వుం డయ్యయో ! యింత గ
ష్టుఁడవై యేటికిఁ జంపె దీచిఱుత నం § చున్ వెంట రా త్రోయ క
చ్చెడు గాకాశము నంట నెత్తి పడవై § చెన్ బండపై నీసునన్. ౩౦

గీ॥ కావుకావు మటంచును § గన్నతల్లి, యంగలార్పఁగ నక్షలుఁ § డల్లునెవఁ
గావుకావు మటంచును § గంసు చట్టు,బెట్టు దవిలిన నఱచుచు § గిట్టె నంత. ౩౧

మ॥ విని భూవల్లభుఁ డబ్బురంబొదవ నా § శ్చర్యంబెదంగోరి యో
మునివర్యా! సురమౌని పాప మన కీ § మూర్ఖున్ గడున్ గూర్చిరన్నిన్

దనుజుఁ మర్త్యునిగాఁగ నెంచి పలుకన్ ౯ ధర్మంబె? యిట్లేల చె
ప్పెను దైవజ్ఞుఁడుకూడ బాలవధఁ దప్పింపంగ లేఁడయ్యెఁగా? ౹౹౩౭

గీ॥ పుట్టి పుట్టినయంతనే ౯ గిట్టఁబోవు, పాప మబ్బాలునకు నెట్లు ౯ పరిభవిల్లె
నిట్టి సంశయ మెడఁబాపి ౯ తొట్టినట్టి, మానసిక వేదనము మాన్పి ౯ మనుపు మనిన.

ఉ॥ నారద మౌనికిన్ మనమునన్ ౯ గలహంబు ప్రియంబు కౌతుకం
బూరక దేవకార్యముల ౯ యొద్దిక లెల్లఁ జెడంగఁ జేయు ని
చ్చారతుఁడౌటఁ దాపురపుఁసంగతి లే దిసుమంత సత్యవా
చారమణీయమూర్తియగు ౯ సత్యము విన్న ది బైలు సేయుటన్. ౹౹౩౮

—॥ మరీచి పుత్రుల వృత్తాంతము ॥—

చ॥ ఖలుఁడగు కంసుఁ డిప్పగిదిఁ ౯ గందుల నార్వురఁ బట్టి చంపె వా
రల కది పూర్వయోగము చిరంతన కర్మనశంబు కారణం
బెలమి వచింతు విన్ము పృథివీశ! స్వాయంభువు నాఁడు బ్రహ్మమై
యలరు మరీచి కూర్మకు మహాబలు లాత్మజు లుండి రార్వురున్. ౹౹౩౯

సీ॥ అయ్యార్వు రొక్కనాఁడంగనతోఁగూడు, నబ్జజుఁజూచి యహంకృత్యమునను
బ్రహసింపఁగని మీరు ౯ పాపులై మముఁజూచి, నవ్వుటవలన దానవులుగండు
పొండని శపియింపఁ ౯ బుత్రు లార్వురు కాల, నేమికి సుతులై రి ౯ నింద్యగతులు
మఱియొండు భవమున ౯ మనుజాశికి హిరణ్యకశిపుఁ డన్వానికిఁ ౯ గలిగి రట్టి

గీ॥ జన్మమున శాంతులై తపశ్చర్య సలిపి, యంబుజాసనుఁ బ్రార్థింప ౯ నతఁడు మెచ్చి
సన్నిధియొనర్పఁ బ్రణమిల్లి సంస్తుతించి, కరములు మొగిడ్చి నిల్చినఁ ౯ గనులజుండు.

గీ॥ నాదు శాపమువలన దానవతఁగాంచి, చాల బడలితి రిపుడు మీ శాంతిదాంతి
జపతపంబులవలన సాక్షాత్కరించి, మెచ్చితినికోర్కి వచియింపుఁడిచ్చువాఁడ.

ఉ॥ నావుడు సంతసించి విధినందను లిట్లని పల్కి రోమహా
దేవ! పిశాచ భూత నరదేవ నిశాచర సిద్ధ సాధ్య భూ
దేవ మహర్షి పన్నగనదీ జలరాశి శరాయుధాదులన్
జావక యుండఁజేయు మని ౯ సర్వము దెల్పిన మెచ్చి యిచ్చినన్. ౹౹౩౬

శా॥ అంభోజాసను నాజ్ఞఁగైకొని భుజాహంకారపారీణులై
జంభారాతి సమాన వైభవమునన్ ౯ స్వచ్ఛందులై దిమ్మరన్
శుంభత్తేజుఁడు తండ్రిచూచి నను విస్ఫూర్తిన్ గడన్ద్రోచి ని
ర్దంభప్రక్రియనున్న వారె మిగులన్ ౯ దర్పించి మోహాంధులై. ౹౹౩౫

—• జరాసంధాదుల వృత్తాంతము •—

సీ॥ పాతాళవాసులై బహుహయనములుండి, ద్వాపరాంతమున నిర్ధరణిలోన
వసుదేవునకును దేవకిగర్భమునఁ బుట్టి, మీతండ్రి కాలనేమి యనువాఁడు
కంసుఁడై మిమ్మెల్ల ఖండింప నేటటఁ, జత్తు రొక్కొకరు నిస్సంశయంబు
నేడవవాఁడు ఫణీంద్రుఁడు యోగమా, యాశక్తివలన గర్భాంతరమున

తే॥ నిహితుఁడగునై దవదియగు నెలను గడుపు, దిగబడియె దేవకికటంచు దెసలఁ జెలఁగు
గాని యదిరోహిణికి తానెగాంచు వృద్ధి, గర్భవిచ్ఛిత్తి విని పొంగుఁ గంసుఁడపుడు.

క॥ దేవకి కష్టమగర్భుం, డై విష్ణుఁడు భూభరంబు నణచుట కొఱకై
యావిర్భవించు నాఁటికి, దేవత్వముఁ గాంతు రనుచుఁ దెలుపుటవలనన్. ౫౨౧

వ॥ నిమిత్తవశంబున మరీచి పుత్రవృత్తాంతం బిబ్భంగిన్ బ్రవర్తించుటవలన నయ్యా
ర్వురకు శీఘ్రసంపాతం బిష్టం బని చెప్పిన విని జనమేజయుం డిట్లనియె.

సీ॥ మౌనీంద్ర! వసుదేవ మానవాధీశుండు, కశ్యపుఁడనియు సంకర్షణుండు
బలభద్రుఁడని రమాపతి కృష్ణుఁడనుచును, నంశత్రియము దెలియంగఁబడియె.
సురలు భూభరణావతరణార్థమై యెవ్వ, రెవ్వరు వచ్చిరి యెట్టులెరి
అసురులు నెట్టెట్టి యాకారములు దాల్చి, రివ్విశేషంబు నాకెఱుఁగఁ దెల్పు

గీ॥ మనినఁ దెల్పెద నని బాదరాయణుండు, దెలుపఁ దొడఁగిన దేవాది దేవజనులు
కశ్యపుఁడు వసుదేవుండు కాంతయైన, యదితి దేవకిదేవి దానయ్యె నెలమి.

మ॥ బలదేవుండు ఫణీంద్రుఁ డచ్యుతుఁడు గోపాలుండు గా వింటి నా
వలఁ బార్థుండు నరుండు ధర్మజుఁడు భాస్వన్నందనాంశంబు దో
ర్బలభీముండగు భీముఁ డాశుగుఁడు తద్భ్రాతృద్వయం బాశ్వినుల్
జలజాస్త్రాంశము కర్ణుఁడయ్యె గురు నంశంబయ్యె ద్రోణుం డొగిన్. ౫౨౨

సీ॥ విదురుండు శమనాంశ మదనసంహరు, నంశ ద్రోణపుత్రుఁడు సముద్రుండు శంత
నుండు జాహ్నవిభార్య నెండియు దేవకుం, డయ్యె గంధర్వరా జాపగేయుఁ
డయ్యె వస్వంశ సప్తానిలంబులు విరా, టుండు నరిష్టసుతుండు హంసుఁ
డనువాఁడు ధృతరాష్ట్రుఁ డయ్యెఁ గృపాచార్య, కృతవర్మ లనిన మారుతగణంబు

గీ॥ భూప? దుర్యోధనుఁడు కలియమూఁడవయది, మైనయుగమయ్యె శకుని శశాంకనంద
నుండు సౌభద్రుఁ డయ్యె శిఖండి దైత్యుఁ, డనలుఁడయ్యె ధృష్టద్యుమ్నుఁ డడవలవినుము.

వ॥ మఱియును బ్రద్యుమ్నుండు సనత్కుమారాంశంబును లక్ష్మ్యంశంబు ద్రౌపదియు
వరుణాంశంబు ద్రుపదుండును విశ్వేదేవాంశంబులు ద్రౌపది పుత్రులేవురును గుంతీ

మాదుిలు సిద్ధియు ధృతియు మత్యంశంబు గాంధారియు షోడశసహస్రింబు లగు కృష్ణపత్నులు శక్రిచోదితలగు నచ్చరలు రాక్షసాంశంబుల రాజులును హిరణ్యకశిపు నంశంబు శిశుపాలుండును విప్రజిత్తి యను నసురుండు జరాసంధుండును బ్రిహ్లాదుండు శల్యుండును గాలనేమి కంసుండును హయగ్రీవుండు కేశియును బలిపుత్రాంశం బరిష్టుండు కకుద్మియు అనుహ్లాదుండు ధృష్టకేతుండును బాష్కలుండు భగదత్తుంకును లంబుండు ప్రలంబుండును ఖరుండు ధేనుకుండును వారాహకిశోరులను దారుణదైత్యులు మల్లులగు చాణూరముష్టికులును వసుంధర యశోదయు మఱియుం దత్తదంశంబుల దేవాసురులు నలువ యానతింగొని యిట్లుప్రభవించిరి. నిర్జరులు హరిం బ్రార్థించుటకు వైకుంఠంబునకుం జనిన యప్పుడు శ్వేతకృష్ణంబులగు శిరోరుహంబులు సురల కొసంగుటవలస ధవళదేహుండు బలభద్రుండును నీలదేహుండు గోపాలమూర్తియునైన కతం బని యెఱుంగుము. ౫౭౬

ఉ॥ అష్టమగర్భసంభరణసమందెను దేవకి యన్నమాట వి
స్పష్టముగా నెఱుంగుచు నృశంసుఁడు కంసుఁడు తద్వధార్థమై
కష్టుల దుష్టరాక్షసులఁ గాపులుపెట్టె రమావిభుండు సం
తుష్టత మాతృగర్భమునఁ దోడనె తా వసియించె నిమ్ముగన్. ౫౭౭

ఆ॥ అమరకార్యసిద్ధికై యశోదాగర్భ,నిలయ యయ్యె యోగనిద్రియంత
గోకులమ్మునందుఁ గొమరుఁడై రోహిణి,కుదయమయ్యె బలుఁడుసవిదితబలుఁడు.

మ॥ బలవంతుండగు పుత్రునిం గనుచుఁ దద్భామావతంసంబు గో
కులమం దాసురభీతయై యొదిగి సంకోచంబునన్ నిల్చె మాం
సలుఁడై కంసుఁడు దేవకిన్ గొనుచు నిష్కారుణ్యుఁడై భర్తతో
బలిమిన్ బంది బిగించి రక్కసులఁ గాపన్ జేసెఁ బెన్భీతిచేన్. ౫౭౮

కం॥ ఆనకదుందుభి రక్షో,ధీనుండై ప్రేమతంతు దృఢబద్ధుండై
సూనోత్పత్తిఁ దలంచుచు, మానినితోఁగట్టుఁబడి శ్రమంపడుచుండెన్.

## —' శ్రీ కృ ష్ణ ని జ న న ము .—

సీ॥ దేవకీగర్భసందీపితుండై శౌరి, విబుధకార్యార్థియై వేవిధముల
నిర్జరుల్ వినుతింప నిలిచి నానాఁటికి, నభివృద్ధినొందుచు నంతనంతఁ
బదిమాసములునిండ బ్రిహ్మతారాయుత, శ్రావణ కృష్ణాష్టమీ విశేష
శుభముహూర్తంబునఁబ్రభవించెఁ గంసుండు, భయవిహ్వలుండయి భటుల నిలిపి

ఆ॥ జననమందు సుతుఁడు శత్రుంకు వానిని, సంహరింతు ననుచు సభయముగను
గరమునందు నిశితఖడ్గంబుఁబట్టి ని, స్తంద్రుఁడగుచు నిలిచె జలదరింప. ౫౮౧

ఉ॥ ముద్దులు మూటగట్టు నవ మోహనుఁ జూచి విషాదఖిన్నయై
యద్దమ రేయి ప్రాణవిభు హస్తయుగంబున సంజ్ఞఁ జేసి యీ
బుద్దులపోకఁ గంటివె యపూర్వ ముదం బొనరించుచున్న వాఁ
డద్దిర! శంఖచక్రములు హస్తములన్ గనుపట్టె నీయెడన్. ౧౧౨

సీ॥ ఏమి సేయుదు మీఁక నెద్దియుపాయంబు, రక్షణాభీలమై రాక్షసాళి
కనిపెట్టియున్నది కమలాక్షుమూర్తియే, కాని యింకొకటి నిక్కముగఁ గాదు
గోకులం బెట్టులైనఁ గొమరునిఁ జేర్పక, వెరవులే దింకొక్క విధము మనకు
నందపత్ని యశోద ననుఁ జూచి సమయంబు, చేసియున్నది "నన్నుఁ జేర్పు సుతుని
ఆ॥ ప్రాణసమముగాఁగఁ బాలింతు" నని యీర, హాస్యమెవ్వరెఱుఁగ రట్టులైనఁ
గొడుకు మనకుఁ దక్కు విడువఁజాలను వీని, విడిచి తేని మేను విడుచుదాన. ౧౧౩

కం॥ నావిని వసుదేవుఁడు కాం,తా! వినుమని యిట్టు లనియె దర్పోద్ధతులై
వేవురు రక్కసు లింటన్, గావలియున్నారు సుతునిఁ గావఁగనగునే. ౧౧౪

కం॥ గాటముగ నిండ్లలోనఁ గ,వాటంబుల గర్గళములు బంధించిరి యి
ప్పాట మనకెట్టు లీపని, వాటముగా దేమి సేయవచ్చు లతాంగీ. ౧౧౫

మ॥ అమలాంభోఘర తుంగభంగ నివహవ్యాలోల తాభీలమై
యమునాద్వీపిని పాఱుచున్నయది యత్యంతంబు దుష్పారమై
తమమా? కన్నులు మూసిన ట్లజిమురిన్ దట్టంపు టేకాకృతిన్
గుమురుల్ గట్టిన యట్టులున్నయది నాకు న్మేను గంపించెడిన్. ౧౧౬

సీ॥ ప్రారబ్ధభోగ మిప్పాటున వర్తింప, మనకెట్లు దక్కు నీమాణవకుఁడు
చూచెదఁ గాకని సూతికాగృహమునఁ,జొచ్చి యయ్యర్భకుఁ జూచినంత
దివ్యతేజఃపుంజదీధితుల్ కన్నుల, మిఱుమిట్లుగొల్ప డగ్గఱి యుపేంద్ర
మూర్తిగా నెంచి యిమ్మహావిక్రముఁ డీత్రి, విక్రముండు సురావనక్రముండు
ఆ॥ మనకు నేల పుట్టె మనుజాళి కనుఁ డొ,కించుకంత గనినఁ దుంచి వైచుఁ
గావ దైవమెవరు కట్టెడి విధి సేత, యెట్టులగునొ? యనుచు బిట్టు వగచి.

గీ॥ అమ్మహాదేవి విశ్వేశి యఖిలజనని, యార్తరక్షణి కరుణాకటాక్షములను
జూచిప్రోవంగఁదగు నన్యసుర సహస్ర, మిట్టిమెడ రార్పఁగలదె యంచెదఁదలంచి.

సీ॥ కాలకింకర కశాఘాతమ్ము లెఱుఁగరు, కాళికాచరణముల్ గన్నవారు
అపమృత్యు గండదోషాదిభీతులుగారు, విశ్వేశ్వరీకథల్ విన్నవారు
జనన జరామృతిశాంతిఁ జెందనివారు, చిన్మయి శక్తిఁ బూజించువారు
అహిత కృత్రిమ విరోధార్తి కందనివారు, వేదాంతవేద్య సేవించువారు

గీ॥ ఇన్నియును గల్గి పరదేవి నెదఁదలంచి, యనుదినము నేను భక్తుఁడ నైతినేని
కర్మఫలసిద్ధి నాయెడఁ గల్గెనేని, కాచి రక్షించు నీపట్టిఁ గన్నతల్లి. ౫౯౯

మ॥ అనుచున్ బుత్త్రిని మోముఁజూచు సతిపై నల్లార్చుఁ గందోయి; యో
జననీ! కావు మటంచు వేడుఁ గమలాక్షా! మాకు నీవేల సం
జననం బందితి వంచు నేడ్చు శిశు రక్షాదక్షు లెవ్వారొకో?
కనుఁడో దేవతలార! యంచుఁ గను నాక్రందించు మూఢాత్ముఁడై. ౬౦౦

ఉ॥ ఎత్తుకపోవఁ జూచు సుతు నెత్తఁగలే నను గంచు శృంఖలల్
తత్తఱపాటుతో విఱుగ ద్రోచు భరంబయినంత నీశ్వరా!
యెత్తఁగరాని కొండ బరువెత్తితినంచుఁ దలంచి కన్నులన్
జొత్తిలి నీరుకాల్వలయి సోనలుగట్టఁగ నేడ్చుచున్నెడన్. ౬౦౧

-॥ వసుదేవుఁడు శ్రీకృష్ణుని యశోదదగ్గర నునిచి యా శిశువును దేవకి ప్రక్కలో నునుచుట ॥-

సీ॥ అంబరంబున నిల్చి యఖిలాండజనని నీ, కేటికి భయమింక నేను గల్గ
నందనుఁ గొనిపోయి నందగేహిని కిమ్ము, భవదవరోధముల్ పాయఁజేతు
అచ్చోట సుతు నిల్పి యయ్యింతి యింటిలో, నవతరించిన దాన నబల నగుచు
బాలికఁ గొనివచ్చి పడఁతి యిద్దేవకి. ప్రక్కలో నిడుమింక భయమువలదు

గీ॥ కందు చేకొని పొమ్మని గగనవాణి, పశముగాఁబల్కు నప్పల్కు వలనెఱింగి
పట్టి కైకొనునంతటఁ బాదబంధ, మూడిపడ వసుదేవుండు నుత్సహించి.

సీ॥ అర్భకుఁ జేకొని యరుగఁ గవాటముల్, తాళంబులూడి యొత్తగిలినిలిచె
ద్వారపాలకులెల్లఁ దండాప్రమత్తులై, వివశులై యుండిరి విరిసెఁ దమము
తరణిపుత్త్రిక కటిదఘ్నమై తెరువిచ్చె, యోగమాయాప్రభావోదయమున
నానకదుందుభి యవలీల మందకుఁ,జేరి నందునియింట శిశువు నిలిపి

ఆ॥ నందపత్నిఁగన్న నందనిఁ జేకొని, యెవ్వరెఱుఁగకుండ నిల్లుచేరి
తనదు పత్ని సెజ్జ దద్బాలఁబడవైచెఁ, దెలిసితే నృపాల దేవిమహిమ. ౬౦౩

మ॥ తనరన్ దాఁ బదబంధముల్ బిగిసెఁ దద్ద్వారంబులన్ దాళముల్
మొనసెన్ భృత్యులు నిద్రలేచిరి తమంబుల్ గప్పెఁ గాళిందియున్
ఘనకల్లోల విశాల ఝూంకృతులచేఁ గన్పట్టె మార్గంబులన్
జనపాళుల్ దిరుగంగ వచ్చె విధి వశ్యంబైన నొండేలగున్. ౬౦౪

గీ॥ వచ్చి సతిఁ జూచి నందకవాటముననను, సుతుని సైరంధ్రిచే నిడి నుతనుగొనుచు
వచ్చితి నటన్న వసుదేవు నిచ్చమెచ్చి, తాను నజ్ఞాతయునుబోలెఁ ధరణియుండె.

ఆ॥ వసుమతీశ! నందునివాకిట సుతుఁగొని, సుతనొసంగి నట్టిసుదతి దేవి,
దేవతారహస్య ॥ మీవెర వెవ్వరుఁ, గానరైరి దేవి ॥ కరుణవలన. ౧౬౬

సీ॥ నారాయణుండైన నసనాఁ డచ్చరలకోర్కి-, సంతరింపఁదలంచి ॥ జారుఁడయ్యె
ననుచు విందుముగాని ॥ యచ్యుతుం డెన్నఁడు, చోరభావముగన్న ॥ చొప్పులేదు
తల్లిదండ్రులమీఁద ॥ దయమెట్టిదో కాని, జననమైనది మొదల్ ॥ జంతుకోటి
కావుకావనియేడ్చుఁ ॥ గావుకావుమటంచుఁ, గాళిఁజేరెనె యించుకయునుదాను
గీ॥ కంసభృత్యుల కేడుపుగాన నీక, జారచోరశిఖామణి ॥ చలము నెఱపి
చొచ్చె నందవ్రజము శౌరి ॥ సూతిగృహము, నందు బాలిక యేడ్పులందదండ నెఱసె.

గీ॥ బాలికారోదనము విని ॥ భటులు లేచి, భయము నొందుచు దేవకి ॥ పట్టిఁగనియె
రమ్మురమ్మని యంచు వేగమ్మె తెలుపఁ, గంసుఁ డరుదెంచి వసుదేవుఁగసరి పిలిచి.

ఉ॥ రమ్మిటు శూరపుత్రిక! చిరమ్మొడ సేయక పుత్రుఁ డెమ్మొ నై
రమ్మన వానిఁదున్మెదఁ గర మ్మనురక్తికి సైఁపనోప ఘో
రమ్మయి యేడ్పు వీనుల భరమ్మయి తోఁచెడు లేకయున్న బీ
రమ్మున దుంచివై చెద శిరమ్ము మదాజ్ఞ యెఱుంగవే మదిన్. ౧౬౯

సీ॥ వసుదేవుఁ డక్కంసువాక్యంబు విని మేను, గంపింప సూతికాగారసీమఁ
జొచ్చి బాలికఁదెచ్చియిచ్చి పెల్లేడ్చుచుఁ, గొమరుండు గాదిది ॥ కూతురయ్యె
బయలిపల్కుల కేమిపాటి కృపావృత్తి, మన్నింపుమని బతిమాలికొనుచు
దంభ దుఃఖాంభోధి ॥ దాఁటలేని తెఱంగు, దెలియఁజేసెడు వసుదేవుచేతి
గీ॥ పిల్లఁగొని చూచి భటులెంత ॥ బేలలైరి, కూఁతుఁగానక కొడుకని ॥ కూఁతలిడిరి
గగనభారతి పలుకిటు ॥ కల్లయయ్యె, ననుచుఁ గంసుండు వెఱఁగందియాత్మలోన.

శా॥ సర్వజ్ఞుం డగు నారదుండు వలికెన్ ॥ సందేహ మింకేల నే
గర్వోద్రేకముచే నుపేక్షఁగొని యీకందుం దెగన్ జూడ నే
నుర్విన్ గాలగతుల్ యథాస్థితములై ॥ యున్నట్లుగాఁ దోఁచ దం
తర్వాణుల్ శుభమెల్ల సత్వరత సాధ్యం బంచు నూహింపరే. ౧౭౧

## —• కంసుఁడు మాయాబాలికను నెగురవేయుట •—

గీ॥ దేవతామాయ మముబోట్లు ॥ దెలియఁగలరె
పురుషుఁ డాఁడుదియౌ; బోటి ॥ పురుషుఁడగును
దురిపదపుత్రుని వినమె యధర్మమము సర్వ
మనుచు బాలిక దుంపఁగా ॥ నాత్మఁదలఁచి. ౧౭౨

ఉ॥ మాంసలదోఃప్రచండమణిమండలమండితమండలాగ్ర వి
ధ్వంసితశత్రురాజజనతాసముపాత్తయశఃపరంపరా
శంసుఁడు పాపకృత్యబడిశప్రతిబంధిత సాధుసజ్జనో
త్తంసుఁడు కంసుఁ డేసె నొకదంషి శిలన్ బడ బాలికామణిన్. ౯౭౩

—• మాయాకుమారి కంసునకు భయము గలిగించుట •—

గీ॥ అంతలోనన యెగసి మాయాకుమారి, యాకసంబున నిలిచి దురాత్మ! నన్నుఁ
జంపి తేని దురారాధ్యశత్రుజయము, హస్తగతమయ్యెనొక్కొ సీయనరె? జనులు.

ఉ॥ పౌరుష దైవయోగముల పద్ధతి గానఁగ లేని నీచవై
నేరములేని నన్నిటుల నిందితమౌ పని సేయఁ జూచితన్
గారణమెల్లఁ దప్పునొకో కంస! నృశంస! నిన్నున్ వధించు దు
ర్వారభుజాబలుండు ధరవర్తిలునంచని మాయమై చనెన్. ౯౭౫

సీ॥ అద్దేవి మాటల కబ్బురంబును భయం, బినుమడింప భటాళినెచ్చరించి
చని ధరామండలి జనితులౌ శిశువుల, శోధించి యిండ్లలోఁ జొచ్చి చంపుఁ
డనుచు వేలకొలందినంపి నందవ్రజ, శోధనంబునకు నైశూరవరులు
బకవత్సధేనుక ప్రబల ప్రలంబులఁ, బంపి పూతన చాల బాలహనన

గీ॥ కర్మములఁ బ్రోడయని నేర్పుగ నపిపనిచి, భయముదలమునఁగాబడల్పడుచుఁ గంసుఁ
డించుకంతయు నిదురలేకెల్ల యెడల, సర్పభయభీతుఁడును బోలె జలదరించె.

ఉ॥ నందవధూటియున్ వ్రజమునన్ నివసించిన గోప గోపికా
బృందములున్ సుతాసుత విభేదవివేకము గాంచరైరి గో
విందకృపానుభూతియొకొ? విశ్వజనిత్రి విచిత్రయోగమో?
యందటి డెందముల్ సహజహర్షమునన్ జెలువొందె నయ్యెడన్. ౯౭౭

సీ॥ తల్లి చన్నులఁ బాలుదాఁగి యెన్నఁటికిని, దల్లి నీనట్టి యుత్కలిక నెఱపి
తండ్రి యొమ్మునఁ జేరి తండ్రి కెప్పటికిని, దండ్రి నీనట్టి యుత్సవము గూర్చి
తనతోడి జత గోపతనయులకెల్లను, దనతోడ జతగూడు తలఁపు లొసఁగి
భ్రమగొల్పి గోపగోపస్త్రీల సంస్మృతి, భ్రమలు మాయించి స్వభ్రాంతిగొల్పి

గీ॥ యనుదినము శైశవ క్రీడలందె భయద, విక్రమ ప్రక్రియలుచూపి వివిధజనుల
నద్భుతానంద రస వికాసానుభావ, భావముల బాలకృష్ణుండు ప్రబలె నచట.

ఉ॥ నందుఁడు పుత్రవైభవ మొనర్చి మహోత్సవ మాచరింప నం
దంద జనశ్రుతిన్ వినుచు హర్షముదక్కి ఖలుండు కంసుఁ డ
స్పందభయాబ్ధిమగ్నుఁడయి చారులచే వ్రజవృత్తమెల్లఁ దాఁ
గొందల మందుచున్ విని సఖుల్ తనుఁ గొల్వఁగ వారి కిట్లనున్. ౯౭౯

కం॥ నందవ్రజమున నానక,దుందుభికిం గలరుగా హితులు వారలు త
ద్బృందారకాంశజు లటం,చుం దొలి నారదుఁడు చెప్పె సూనృతఫణితిన్. ౫౦

వ॥ అట్లగుటంజేసి యుపేక్షించుట కర్జంబుగాదని వెండియు. ౫౧

—• శ్రీకృష్ణుఁడు పూతనను సంహరించుట •—

ఉ॥ పూతన బాలఘాతయెడఁ బో్రిడ యటం చని దానిఁ బంప ను
ద్యోతిత భూషణాంబర సముజ్జ్వలయై నవసూతికాకృతిన్
వే్రితలఁగూడి నందసతి వేశ్మముఁజేరి చెలుల్ మొఱంగినన్
బ్రీతయుఁబోలెఁ గృష్ణునకుఁ బే్రిముడిఁ జన్నిడినంతలోపున్. ౫౨

శా॥ సర్వజ్ఞుం డగు గోపబాలకుఁడు తత్కృత్స్నంబు చేద్దైన నం
తర్విజ్ఞానముచే నెఱింగి యసువుల్ స్తన్యంబుతోఁ బీల్చినన్
బూర్వాకారము డుల్లి సాఁగిలఁబడెన్ భూభృచ్ఛిఖారూపమై
సర్వోర్వీజను లాత్మ విస్మయపడన్ క్ష్మామండలం బూఁగఁగన్. ౫౩

ఆ॥ అంత నందపత్ని యబ్బురపడి వచ్చి, దాని ఱొమ్ముమీఁదఁ దాండవించు
పట్టి చంకనిడుచు ఫాలంబుపై బూదిఁ, బూసి కుస్తరించెఁ బుతురిఁ డలర.

—• శ్రీకృష్ణుఁడు ధేనుకాదులను వధించుట •—

వ॥ ఇత్తెఱంగునఁ బూతనావిధ్వంసం బెఱింగి కులాధముండును గృతఘ్నుండును నగు కంసుండు తనకు సంహారకుం డగు దారకుండు నందవ్రజంబున నుండనోపు నని నిశ్చయించి బక వత్స తృణావర్త ధేనుక ప్రలంబ కేశి గర్దభాదులం బంపించి వారెల్లరను గృష్ణబలభద్రులచేత మడియుట విని యాత్మమరణంబు నిశ్చయించి కొని ధనుర్యాగమిషంబున రామకృష్ణులం బిలువం దలంచి యక్రూరుంబంపిన నతండు నందవ్రజంబునకుం జని కంసాదేశంబున వచ్చినవాఁడ నని నందునకుం దెల్పి వారిరువురను రథాధిరోహణం బొనర్చికొని మధురాపురంబునకుం జనుదెంచిన,

—• శ్రీకృష్ణుఁడు కంసుని వధించుట •—

సీ॥ రామకృష్ణులు మధురాపురంబున కేగి, యసదృశంబైన బాణాసనంబు
ఖండించి నిర్జితరక్షకధ్వంస మొనరించి కువలయాపీడమత్తకుంభిఁ గెడపి
మూర్ఖులౌ చాణూరముష్టికులను, శల తోశలు లనుమల్లసమూహములను
గెడపి కిరీటంబుఁబడఁదో్రిసి కేశముల్, చేపట్టి పడనీడ్చి చిత్రముగను

గీ॥ గంసువధియించి పితృ మాతృకష్ట ముడిపి, యుగ్రసేనుని రాజ్యాభిషేకయుక్తుఁజేసి
కటకమెల్లను నిష్కంటకం బొనర్చి, దివ్యతేజోభివృత్తిచేఁ దేజరిలిరి. ౫౬

మ॥ వసుదేవుండు కులోచితంబుగ జగద్వాల్లభ్య మేపార నా
త్మసుతద్వంద్వము రామకృష్ణులకు శాస్త్రప్రక్రియన్ మౌంజిబం
ధసమావేశ మొనర్చి యిచ్చె బహురత్నస్వర్ణ గోభూగజా
శ్వసుచేలంబులు విప్రవర్యులకు నిష్ఠాభక్తియుక్తంబుగన్. ౧౮౭

కం॥ బుధుఁడగు సాందీపుని సన్నిధిఁజదివిరి సకలశాస్త్రనిగమాగమముల్
విధియుతముగ దివిషదు లంబుధిమథనముచేత నమృతమును గొనులీలన్. ౧౮౮

ఉ॥ విద్దెల పారముం దెలిసి విశ్రుతకీర్తులు రామకృష్ణు ల
య్యిద్దఱు దేశికోత్తముని నిష్టధనంబులఁ దృప్తిఁజేసి సం
పద్దళితేంద్రవైభవ శుభంకరమౌ మధురాపురంబులోఁ
దద్దయు వేడ్క వర్తిలిరి ద్వాదశవార్షికమౌ వయస్సునన్. ౧౮౯

— జరాసంధుఁడు శ్రీకృష్ణునిమీద దండెత్తి వచ్చుట —

మ॥ సమదాటోపవిజృంభితుం డగు జరాసంధుండు జామాతృనా
శముఁ గృష్ణుం డొనరించె నంచు విని యక్షయ్యప్రతాపోజ్జ్వల
క్రమసేనాసముదాయముల్ గొనుచు సంగ్రామోత్సవారంభ సం
భ్రముఁడై తా మధురాపురంబు పయి దీర్ఘక్రోధియై వచ్చినన్. ౧౯౦

చ॥ తెఱలకనిల్చి యాదవు లుదీర్ణపరాక్రమధుర్యవర్యులన్
దఱుఁగని దోర్బలంబులను దారసమై రణకేళి సల్ప న
త్తఱి మగధాధినాథుని యుదగ్రబలంబులు గూడఁ బర్వి డ
గ్గఱి కదనంబొనర్చె సురకౌతుక మావహిలంగ నయ్యెడన్. ౧౯౧

చ॥ అరదమునెక్కి యంతట ముకుందుఁ డాహవ మోహలక్ష్మిసం
భరిత ధనుర్విముక్తశరపాతములన్ జతురంగ సేనలన్
ధరఁదొఱఁగించి విల్ దునిమి దట్టపు టంపఱ వెల్లి ముంచుచున్
విరథునిజేయ మాగధుఁడు వే పఱచెన్ రిపుబృంద మార్వఁగన్. ౧౯౨

ఉ॥ ఈసునఁ గృష్ణుపై బలము లెత్తుచుఁ దారసమై రణావనిన్
గాసిలి కాందిశీకుఁడయి క్రమ్మఱుచున్ బదియేడుమార్లు పే
రాసఁ బెనంగుచున్ జయముసందక చింతిలి పాఱిపోవుచున్
వాసిగణింపలే కఖిలవర్తనలన్ జగ మేఁచుచుండఁగన్. ౧౯౩

ఆ॥ కాలయవనుఁ డనెడి ఖలుఁడు తురుష్కుండు, యాదవులకు నతిభయంకరుండు
మగధుఁ గలసి దుష్టమంత్రాంగ మొనరించి, వానితోడఁ గలసి వచ్చె ననికి.

సీ॥ పటుతరాక్షౌహిణీబహుదళంబులతోడ, సమరసాహసు జరాసంధుఁగలసి
మనతోడ నని సల్ప × మాత్సర్యమున వచ్చు, చున్నవాఁడని విని × యెన్నుఁడఖిల
యదువీరులను గూడి × యాలోచన మొనర్చె, మగధునితోఁ బోరు × మనకుఁజాలఁ
దలముసక లయ్యె నిర్దలు జరాసంధుండు, కాలయవనుఁడును × గదనమునకు

గీ॥ వచ్చిరట ప్రాణరక్షణం × బిచ్చు మనకుఁ, దొలఁగి ద్వారకఁ జేరఁగా నలయుఁ గడలి
చేరువయు రైవతాద్రికిఁ × జెంతఁగాన, నందు సుఖజీవనము గల్గు × నదియుఁగాక.

చ॥ హరియు హరుండు సాగర ధరాధిపమధ్యములందుఁ దామసీ
చరుల యుపప్లవంబులకుఁ × జాలకగాదె? వసించియుందు రి
వ్వెరవునఁ గాలముం గడపి × నేఁడియు రాఁదగు ద్వారకాపురీ
శరణ మవశ్యకార్య మని × సంతస మందఁగఁ జేసి యిట్లనెన్. ౧౯౬

మ॥ మధురారాజ్యము వానిదేశము సదా × మాత్సర్యధుర్యాత్ముఁడై
పరిధనారంభ మొనర్చి పోరుటకు సంబంధింప దీద్వారకా
వధి తద్రాజ్యము గాన నందు రిపుసంబాధంబు లే దందు ని
ర్వ్యథతన్ సౌఖ్యము నొందవచ్చునని చెప్పన్ యాదవుల్ సమ్మతిన్. ౧౯౭

గీ॥ రామకృష్ణులతో మధురాపురంబు, వెడలి సపరిచ్ఛదంబుగా వేగ నేగి
ద్వారకాపురిఁ జేరిరి × ధనదుపురముఁ,బోలి ద్వారకఁ జెలఁగ నభ్యుదయ మెనసి.

మ॥ బలభద్రుండును గృష్ణుఁ డిర్వురును శంఖత్స్యందనారూఢులై
చలమున్ బీరము గల్గి వచ్చెడు జరాసంధాదులన్ బోరులన్
బలిమిన్ దారసిలన్ దలంచి సమరప్రారంభకౌతూహలం
బలమన్ నిల్చిరి నిర్జనంబగు పురీమధ్యంబునన్ సజ్జులై. ౧౯౮

సీ॥ సామజంబులు వేలు × స్యందనంబులు లక్ష, లశ్వముల్ కోట్లు పదాతిగణము
లర్బుదంబులుగాఁగ × నవనిఁ గంపింపఁగా, బహుతరాక్షౌహిణీబలము లలమ
సమదోగ్రుఁడగు జరాసంధుతో మిళితుఁడై, యవనివల్లభుఁడు పెల్లార్చి పేర్చి
మధురానగరి చుట్టుముట్టుకొని నిలిచిన, వార్త యాలించి యవ్వాసుదేవుఁ

గీ॥ డభిముఖుండయి పర తేర × యవనివిభుఁడు,కృష్ణుఁబొడఁగాంచి క్రోధరోచిష్ణుఁడగుచు
నీతఁ డేకాకియయ్యె నే × నెగచిపట్టి, బద్ధునిగఁ జేతునని వెంటఁబడిన హరియు.

## ముచికుందుఁడు కాలయవనుని సంహరించుట

చ॥ బిఱబిఱఁ బాఱఁజూచినను × బింకముతోడుత వెంటనంటి య
మ్మొఱకు పయింబడన్ దునుక ముందఱఁ గృష్ణుఁడు వెంట న్లేచ్ఛుఁడుం

దఱుముక పోయిపోయి యొకకొండపట్టుపుఁ గానసీమఁ జొచ్చుచుఁ
దఱువునఁ జేరి తూలిచని ♦ మాటునఁ దోఁచివలు దప్పఁ దొరికి కుఱుచుఁ. ౬౦౧

గీ॥ కొండగుహలోనఁ బవళించికొనిఁడునిదుర, జెందు ముచికుందుచాటునఁ జేరి డాఁగఁ
గాలయవనుండు ముచికుందుఁ ♦ గాంచి వీఁడె, కృష్ణుఁడని కాలఁ దన్ని నఁగినిసియతఁడు.

శా॥ క్రోధజ్వాలలు కన్నులన్ నెఱయ సంక్షోభించి మేల్కాంచు దు
ర్బోధుం డెవ్వఁడు వీఁడు దన్నెనని యొక్కర్వున్ వీడి రాజర్షి దు
స్సాధర్మ్యపరిభవజ్వలజ్జ్వాలనవీక్షాపాతమున్ జేయ శు
ష్కైంధంబుం బలె దుర్మదుండు మడిసెన్ ♦ హేయంపు భస్మాకృతిన్. ౬౦౩

గీ॥ అంత రాజర్షి ముచికుందుఁడంబుజాక్షుఁ, గాంచి ప్రణమిల్లి యచ్చోటు ♦ గదలి వనికిఁ
దపమునకు నేగెఁ గృష్ణుండు ♦ ద్వారవతికి, వచ్చె బలభద్రుతోఁ గూడి ♦ వైభవమున.

—• శ్రీ కృష్ణుఁడు రుక్మిణిని బెండ్లియాడుట •—

మ॥ బలవద్వైరినిరాససౌఖ్యమున శుంభన్మూర్తి కృష్ణుండు ని
శ్చలభోగంబున నుగ్రసేనునకు రాజ్యంబెల్ల నర్పించి శ్రీ
లలనారూపిణి రుక్మిణిం గొనియె లీలాలోలుఁడై యెల్ల రా
జుల మర్దించి స్వయంవరమ్ము సుమహోత్సుక్యంబు దీపింపఁగన్. ౬౦౫

సీ॥ రుక్మిణీజనకుఁడు ♦ రూఢంబుగా శిశు, పాలున కొసఁగెదఁ ♦ బట్టి ననుచు
యతనంబు సేయ నేకతమున రుక్మిణి, తనుఁ గోరి యుండుట ♦ దలఁచి శౌరి
యదువృష్ణి భోజాంధకాది సైన్యములతోఁ, బఱతెంచి రాజులఁ ♦ బట్టి చమరి
రమణి రుక్మిణిఁ దనరథముపై నిడుకొని, బావ రుక్మియు నడ్డపడిన వానిఁ

గీ॥ బట్టి భంగించి రాక్షసపరిణయమున, భోజకన్యను జేకొనె ♦ భువనభయద
విక్రమాక్రాంత నరదేవచక్రుఁ డగుచుఁ, జక్రధరు శక్తి గణుతింపఁ ♦ జాలుటరిది.

—• శ్రీ కృష్ణుండు జాంబవతి మొదలగు కన్యలను బెండ్లియాడుట •—

గీ॥ జాంబవతి మిత్రవిందయు ♦ సత్య భద్ర, లక్షణ సుదంతయును నను ♦ లలన లార్వు
రతిమనోహర కాళిందియను నెలంత, వీరి వేర్వేఱ జేపట్టె ♦ శౌరి యలరి. ౬౦౭

సీ॥ ఎనమండ్రు చెలులతో ♦ నిష్టోపభోగంబు, లందుచు సుఖియించు ♦ నవసరమునఁ
బ్రభవించె శౌరికిఁ ♦ బ్రద్యుమ్నుఁ డనుపట్టి, భీష్మకన్యకయందుఁ ♦ బ్రియతరుండు
జాతకర్మాదిసంస్కారంబు లొనరించి, యుండు నత్తఱి శంబరుం డనంగఁ
బలలాశి సూతికాభవనంబుఁ జొచ్చి బాలుని మాయచేఁ గొని ♦ తనదుపురికిఁ

గీ॥ బోయి మాయావతి కొనంగ * బురజనంబు, లెల్ల భీతిల్ల జనయిత్రి * యెదఁ గలంగి
శోకరసమగ్న యగుడు నచ్యుతుఁడు పొగిలి, చేయునదిలేక చింతించి * నేమమరసి.

ఉ॥ ఆపదఁ బోవఁదోలి శుభమందఁగఁ జేసి కృపాకటాక్షదీ
క్షాపరతంత్రియై ధరణిసాధుజనావనపాలనక్రియా
దీపితయోగనిద్రి యని * దేవి మదిన్ శరణంబు వేడి ని
ష్పాపరుఁ డౌచుఁ గృష్ణుఁడుఁ బ్రశస్తవచోవివృతిన్ వచింపుచున్. ౬౦౯

ఉ॥ తొల్లి జగజ్జనిత్రి పరితోషిత వై ప్రణమార్చనాదులం
దుల్లము పల్లవింప వినయోజ్జ్వలతన్ బదరీవనంబునన్
దల్లియుఁ బోలె నన్మనిచి * ధర్మతనూజుఁడ నైననాఁడు రం
జిల్లఁగఁ జేసి నేఁడు విడఁజేయుట ధర్మమె వత్సలత్వమే. ౬౧౦

— శ్రీకృష్ణుఁడు దేవిని బ్రార్థించుట —

మ॥ ఖలుఁ డెవ్వండొకొ? సూతికాగృహమశంకం జొచ్చి మత్కౌస్తుభా
మలరత్నంబును బోలు బాలుఁ గొనియెన్ * మత్కర్మపాకంబు లి
ట్టుల యయ్యెన్ జఠరాపహారమృతి నైశ్వర్యంబులైనన్ మదిం
గలపంజాలునె యిట్టివింత జననీ! * గన్గొందుమే యెచ్చటన్.? ౬౧౧

ఉ॥ ఉన్నది దుర్గసీమ నగరోత్తమమా? దృఢగుప్త మిల్లు సం
పన్నము దోర్బలాఢ్య మగుఁ * బాలకబృందముచేత నిట్టులై
యున్న ఖలావధీరణము * నొంది సుతుం బెడఁబాయు టక్కటా!
ము న్నొనరించు మద్దురితమూలము గాఁగఁ దలంచు టొప్పగున్. ౬౧౨

ఉ॥ ఏను విపక్షమర్దనకు * నేగుటలేదు సమస్తయాదవుల్
పూని పురంబు గాచెదరు * పుత్త్రుని వేఱొక కూహకుండు గొం
పోనగునే? జగజ్జనని * భూరిభవత్కుహనావిజృంభితం
బే నెఱుఁగంగఁ జాలుదునె * యింతకు నీశరణంబె కోరితిన్. ౬౧౩

ఉ॥ తల్లి యెఱుంగ దట్టులనె * తండ్రిని నే నెఱుగంగఁజాల నా
యిల్లు విపక్షభేద్య మగునే? తలపోయఁగ నిట్టిచోట భీ
తిల్లక దేవదేహుఁడగు * తెక్కలి దక్కఁగొనెన్ భటాళికిన్
దెల్లము గాఁగనీక పరదేవి! తిరస్కరిణిన్ ఘటించితే. ౬౧౪

మ॥ ఇది చిత్రింబగునొక్కొ? నీకుఁ బరదేవీ! మాతృగర్భంబునన్
బదిలుండౌ సుతుఁ దెచ్చి యన్యసతి గర్భస్థాయిగాఁ జేయవే?

విదితంబే కద! రోహిణీసతిమెఱ్ఱ | విశ్వంబు మోహింపఁ జే
సెదు నీమాయ యెఱుంగ నేరికి నగుః | జిత్రాతిచిత్రంబగుః. ౬౧౫

ఉ॥ పుట్టింపన్ భరియింపఁ ద్రుంప నియతంబౌ బుల్ నీగుణంబుల్ జగం
బిట్టై యుండఁగ నీచరిత్రముల తీరెవ్వండు గాంచున్ జనుల్
పుట్టన్ గిట్టఁగ నింత యోపుదురు విస్ఫూర్తిన్ మహామాయనై
దట్టంబౌ భవవార్ధి ముంపఁగ దరిన్ | దార్పంగ నీకే తగున్. ౬౧౬

చ॥ జననము నొందెఁ బుత్త్రుఁ డను | సంతస మిచ్చితి వంతలోనె నం
దను నెడఁబాపి తద్విరహతాపముఁ గూర్చితి వీ విహారముల్
జనుల కెఱుంగ నౌనె? ఖలసాధువిభేదము పుత్త్రులందుఁ గ
ల్గునె? జనయిత్రికిన్ ఖలులకోర్కులు దీర్పఁదలంచితో శివా! ౬౧౭

చ॥ కొమరునిఁ బాసి తల్లి కడుఘూర్ణిలుచున్ బలవింపఁ జొచ్చెఁ జి
త్తము స్వవశంబుగాక పరితాపము నొందెడు నేమి సేతు దు
ర్గమమగు తావకప్రతిభ | తల్లి! యెఱుంగఁగఁజాల కేను నీ
కమలసదృక్పదద్వయము | గావఁగ దిక్కని నిన్నుఁ జేరితిన్. ౬౧౮

గీ॥ నందనోత్పత్తి కన్న నానందకరము, తద్విపన్నతకంటె నార్తతయు లేదు
గానఁ బుట్టుట గిట్టుట | గాంచి డెంద,మవియుచున్నది యేమి సేయంగనచ్చు!

కం॥ యాగవ్రతపూజార్థ, త్యాగంబు లొనర్తు నిన్నుఁ దలఁచి జనిత్రీ?
భోగ సుఖయోగకుశలా, భోగంబుల ధరణిజనులు | పొందుదురు గదా. ౬౨౦

కం॥ ధ్యాతృధ్యానధ్యేయ, ఖ్యాతిన్ జగమెల్ల నీవె | గావునఁ గృపచేఁ
బ్రీతిన్ గొమరునిఁ జూపుము, నాతల్లీ! పుత్త్రునిన్ గనక మనఁజాలన్. ౬౨౧

చ॥ అని నుతియించు కృష్ణుని సమాహితవృత్తికి మెచ్చి దేవి యో.
వనజదళాక్ష, చింతిలకు | వచ్చు సుతుం డిది శాపహేతు వౌ
నని వచియించి శంబరుఁడనన్ దితిజుం డనలీల మాయచేఁ
గొని చనె షోడశాబ్దమునఁ | గూరిమి నీసుతుఁ డేగుదెంచెడిన్. ౬౨౨

గీ॥ అన్నిశాచరుఁ జంపి నీయాత్మజుండు, పత్నితో నింటి కరుదెంచు | భయమువలదు
మత్ప్రసాదంబు గలదు నామాట వినుము, జడియనేటికి? నీ కిత్తు | సంతసంబు.

వ॥ అని పలికి జగదీశ్వరి యంతర్ధానంబు నొందిన దేవకీవసుదేవాదుల కేఱింగించి
వాసుదేవుండు సుఖం బుండెనని చెప్పిన జనమేజయుండు గాంధవతేయుం జూచి
యిట్లనియె. ౬౨౪

ఉ॥ వారిధిశైలమధ్యమణివప్రసమావృతదుర్గదుర్గమ
ద్వారవతీపురాంతరవతారమహాపురుషాచ్యుతాంగనా
గారవరాంతరాంతరితగాఢదృఢావితసూతికాగృహ
ద్వారముఁ జొచ్చి శంబరుఁడు దారకు ముచ్చిలు టబ్బురమయ్యెడిన్. ౬౨౫

శా॥ దైత్యధ్వంసకు చక్రశార్ఙ్గయుగ మేధాత్రీధ్రమున్ జేరెనో?
కృత్యాకృత్యవివేకవృద్ధజనపక్షీకార మేమయ్యెనో?
నిత్యానిత్యవిమర్శదక్షమగు మౌనివ్రాత మెందుండెనో?
ప్రత్యాసక్తివిహీనమై యిటులు కర్జం బెల్ల వమ్మయ్యెనే? ౬౨౬

కం॥ విన నబ్బురమయ్యెడు నా,మనమున నిది తేటపఱుపుమా! యనిన మహా
ముని జనమేజయునకు ని,ట్లని వినిపించెను సుధారసామలఫణితిన్. ౬౨౭

సీ॥ అవనీశ! మాయామహత్త్వంబు నరులకుఁ, దెలియంగవశమానె దివ్యులైనఁ
గనరన్న నరు లెంత గన మనుజతనంది, మోహవిభ్రాంతుల మొనయకున్నె?
యాఁకలి దప్పియు హర్షంబు శోకంబు, భయ మభిమానంబు భ్రాంతి తంద్రి
జరయును మరణంబు శాంతి యజ్ఞానంబు, ప్రీతి యసూయ విఖ్యాతి యాది
గీ॥ నైన గుణములు విడువక యహరహంబు, చేతనుల వెంటఁబడి త్రిప్పుఁ జిత్రమగునె
యిందుదృష్టాంతమగుఁగాదె యాశ్వరేశుఁ,డైన శ్రీరామమూర్తి యీయవనియందు.

వ॥ మహీవల్లభా! సావధానుండవై వినుము, పట్టాభిషేకభంగంబును, వనవాసంబును,
బితృమరణంబును, మాయామృగాగమనంబును, జానకీహరణంబును, వానరసహా
యంబును, సేతుబంధనంబును, సంగరంబున ననుజవిపత్తియు, నాగపాశబంధనం
బును, గరుడునివలనఁ దన్మోక్షణంబును, ననుజపుత్రమిత్రసహితంబుగా రావణ
వధంబును, సీతాపవాదనిరాసంబునకై యద్దేవిచే దివ్యంబు సేయించుటయు,
పట్టాభిషిక్తుండై లోకాపవాదంబున నదూష్యయగు వైదేహిన్ దూష్యగా నిర్ణ
యించి పరిత్యజించుటయు, నాత్మనందనుల మునివలన నాత్మీయులుగా నెఱుంగు
టయు, సీతాపాతాళగమనంబును, ధరాభేదనోద్యమంబును, గాలాగమనావేద
నంబును, సరయూప్రవేశంబును, శ్రీరామచంద్రునకు గోచరించెనే? నటుండు
వేషధరుండైన పూర్వోదంతంబు లుగ్గడించునే? యట్టుల కృష్ణుండు మానుష
దేహం బవలంబించి తద్భావంబున నభినయించుట గా నెఱుంగుమని చెప్పి వెం
డియు నిట్లనియె. ౬౨౯

మ॥ తొలుతం గంసునకోడి గోకులమునందోడ్త్రో జరాసంధు కో
ల్తల సైరింపక ద్వారకన్ నిలిచె సద్ధర్మజ్ఞుఁడయ్యున్ సుతన్

దలిదండురిల్ శిశుపాలు భామినిగ సంధానింపుచో నడ్డమై
లలనారత్నము రుక్మిణిన్ గొనియె లీలన్ గృష్ణుఁ డుత్కృష్టుఁడే? ౬౩౦

ఆ॥ ఆత్మజుండు గలుగ ♦ హర్షించి దితిజుండు, మురిచ్చిలింపఁ జింతనమునిఁగె దీన
నెగ్గుగలదె యీశ్వరేశ్వరుఁ డతనికి, బ్రాపణములు కాలయాపనములు. ౬౩౧

సీ॥ శ్రీకృష్ణుచర్యలు ♦ క్షితితలాధీశ్వర! చిత్రముల్ దివి కేగి ♦ జిష్ణుతోడ
గలహించి కల్పవృక్షము దెచ్చె భామకై, స్త్రీజితుఁ డనుటచేఁ ♦ జెడునె యశము
కల్పపాదపమునఁగట్టి నారదునకుఁ, బతిదానమిచ్చె నసభ్భామ పిదపఁ
గనకకృష్ణు నొసంగి ♦ కాంతునిఁ జేకొనె, నింతన శ్రీహరి ♦ కెగ్గుగలదె
గీ॥ కాన మానుషవేషియై ♦ కపటచర్య, నటన మొనరించె గోపికానవిటతఁ జూపె
నెన్నిపోకలఁ బోయిన ♦ నెడ వసించు, దేవి చిత్రింబటం చని ♦ తెలియవినుము.

గీ॥ తొలుత రుక్మిణీసుతులఁబ్రద్యుమ్నముఖులఁ, బడయుటఁదలంచి శ్రీకృష్ణుసజ్జజేరి
జాంబవతి పుత్రులను వేడఁజక్రధరుఁడు, తపముఁ జేసెను మైనాకధరముమీఁద.

## —• శ్రీ కృ ష్ణుఁ డు త ప ము చే యు ట •—

మ॥ శివభక్తుం డుపమన్యుఁ డమ్మునివరున్ ♦ సేవించి యయ్యోగిచే
శివదీక్షాపరుఁ డౌచు నిశ్చలతపస్సిద్ధిక్రియాలోలుఁడై
శివమంత్రంబు జపించుచున్ విషయవిక్షేపంబు డిందన్ సదా
శివపాదాబ్జమధూళికాద్రవమునన్ ♦ జిత్తంబు రంజింపుచున్. ౬౩౪

గీ॥ ఫలజలానిలభక్షియై ♦ పద్మనేత్రుఁ, డాఱుమాసము లఖిలేశు ♦ హరుగుఱించి
తపముఁ జేసినఁ గరుణించి ♦ దర్పకారి, సగుణరూపంబుతోడ సాక్షాత్కరించె.

సీ॥ భారతీప్రియశచీపాణిశేషముఖ బర్హి, రాననుల్ వెనువెంట ♦ నలమి కొల్వ
రంభాది దేవతారమణీమణీనాట్య, సంరంభ మతిశయోత్సవత నెఱపఁ
దుంబురునారదాద్భుతవిపంచీనాద, మేదురంబై నింగి ♦ నాదు గొల్ప
"అల మలం తపసాఽహమద్య తుష్టోఽస్మి" య,న్పలుకు లంభోదగర్జల నడంప
గీ॥ నిందువేడుకఁ గాపురంబుండు తనదు, కొండతోవచ్చెననఁగ నుద్దండతండు
కాండవాహనుఁడై మేల్మికొండవిలుతుఁ, డెదుటఁబ్రత్యక్షమైవచ్చెఁబ్రాఁతిగిశారి.

ఉ॥ దిగ్గునలేచి యామరనదీధరు పాదపయోజయుగ్మమున్
డగ్గఱి చక్కఁ జాఁగఁబడి ♦ డస్సినమేను వడంక లేచి తా
వెగ్గలపున్నుతుల్ సలిపి ♦ వేమఱు మ్రొక్కుచు వేసుచున్ దయా
దృగ్గరిమంబు గోరు హరిఁ ♦ దీర్ఘపదున్ గని శూలి యిట్లనున్. ౬౩౭

గీ॥ ఏల? తపియించె దిట్లు నీకెద్ది కోర్కె, వేడుమని యన్న గేల్మోడ్చి విష్ణుమూర్తి
మేఘగంభీరవచనామృతౌఘములను, నందివాహను నభిషేచనం బొనర్చె.

సీ॥ సర్వభూతార్తి నాశక! దేవదేవ! జగన్నాథ! దైత్యాంతకా! త్రిలోక
పాలక! హర! శూలి! నీలకంఠ! హిమాద్రి, కన్యకావల్లభ కాలకాల!
ధన్యుఁడనైతి నీదర్శనంబునఁ గృత, కార్యుఁడ నీపాదకమలయుగము
సందర్శన మొనర్చి జన్మసాఫల్యంబుఁ, గంటి సంసార సాగరములోన

గీ॥ నంగనాపాశబద్ధుండనగుచు మునిఁగి, శరణుఁబొందితిఁ గరుణింపు శైలచాప!
సంహృతగజాసురాటోప! శరణుశరణు, సగుణనిర్గుణనిర్లేప! శరణుశరణు. ౬౩౯

వ॥ దేవా! మానుషంబగు జన్మంబు నొంది ఖిన్నుండనై భవభయంబున శరణంబు నొందితి గర్భనరకంబు దుస్తరంబోగదా! పిదపఁ గంసభయంబున నందవ్రజంబుఁ జేరి తదాజ్ఞాబద్ధుండనై గోరజస్సంకీర్ణ కేశుండను బృందావనపరిభ్రమణనిరంతరక్లేశుండను నగుచు యవనభయంబునఁ బైతృకంబగు మధురమండలంబు విడిచి యయాతిశాపబంధంబునఁ బుష్కలంబగు రాజ్యంబు వాని కొసంగి ధర్మరక్షాపరుండనై యుగ్రసేనునకు దాస్యం బొనర్చుచు స్త్రీజితత్వంబునఁ బారతంత్ర్యంబు వహించి భవత్పాదానలంబంబు సంపాదించి మోక్షం బార్జింపనేరక యిప్పుడు రుక్మిణీనందనులను జూచి చూపోపక జాంబవతి ప్రేరేపఁ బుత్రార్థినై తపించుచున్నవాఁడ నని విన్నవించుకొనుటకు లజ్జించుచున్నవాఁడ; మూఢుండనై ముక్తివల్లభుండ వగు నిన్నుఁ దుచ్ఛఫలంబని మెంచక పుత్త్రియాచనం బొనరించితి సంసారంబు దుఃఖదంబని యెఱుంగుదు నట్లులయ్యును మనంబు విరతిం బొందదు. మహర్షి నగు నేను మహీమండలంబున మాయాపాశయంత్రితుండనై కష్టం బనుభవించుచున్నవాఁడనని విన్నవించిన శంకరార్ధాంగభాగినియగు నంబిక యిట్లనియె.

## —•దేవి శ్రీకృష్ణునకు వరంబిచ్చుట•—

ఉ॥ నీవు గృహస్థవృత్తిని ననిందితధర్మవిమర్శకుండనై
భావిశతాబ్దముల్ నిలిచి బ్రాహ్మణశాపమునన్ గులక్షయం
బై వసుధాతలాన నజహన్మధు మోహితవృత్తిఁ బుత్రిపౌ
త్రావళి గ్రుంగిరన్ గురుధరాధిపునంగన శాపముల్ గడున్. ౬౪౧

ఆ॥ అంటరాని వేల్పు దంటయై యనిలుండు, గవిసినట్లు రెండుఁ గవిసి విప్ర
శాపనృపవధూటిశాపంబులను యదు, క్షయము నగుచు సానుజంబుగాఁగ.

ఉ॥ అంతట దేహమున్ విడిచి యాజ్యుఁడవై యఖిలామరావళుల్
చెంతలఁ గొల్వ నీవిడిదిఁ జేరెదు శోక మడంగు దైవదు

ర్దాంతగతుల్ తొలంగునే? యథావిధిభోగ్యము గాకయుండునే?
చింతిల నేల దీనికి? నిరసీ! బుధు లొందుదు రే మనోవ్యథల్? ౬౪౩

క॥ అష్టావక్రునిశాపము, కష్టాధికకష్ట మగుచుఁ గ గాంతావళి యు
త్కృష్టవ్యథఁ జోరులచే, నష్టిం జెందుదురు కృష్ణ! నవసిన నేమా. ౬౪౪

వ॥ ఇట్లంబిక నొడువునెడ శంకరుండు కృష్ణున కిట్లనియె. ౬౪౫

శా॥ పుత్రార్థంబు తపంబుఁ జేసితివి విశ్వస్ఫూర్జత్కళాధుర్య లా
పుత్రుల్ వేలకొలంది గల్గెదరు సంబోధంబుచే నిజ్జగ
చ్ఛిత్రం బారసి భూభరం బుడిపి యక్షీణపరిభావుండవై
వృత్రారిప్రముఖామరుల్ గొలువఁగా వేంచేయుమీ వీటికిన్. ౬౪౬

ఉ॥ మానుషజన్మభోగము లమందమనోవ్యథలం గలంచుటన్
దీనునిపోల్కిఁ బల్కెదవు దేవవరేణ్యుఁడ విట్టి నీకుఁ దు
చ్ఛానుభవంబు లేటికి శతాబ్దము లిట్టులు సాక్షిరూపివై
పూనిక సల్పఁగాఁదగు నబోధముఁ బొందుట నిట్లు తోఁచెడిన్. ౬౪౭

సీ॥ అని శంకరుఁడు కృష్ణునానందరసవార్ధి, మజ్జనం బొనరించి మగువతోడ
బ్రహ్మాదిసురలతోఁ బరవస్తురూపుఁడై, యంతర్ధి నొందిన నచ్యుతుండు
శంకరు మదలోన సంస్మరింపుచు మహా, హర్షంబుతో నింటి కరుగుదెంచి
సతుల నిష్టాగోష్ఠి రతులఁ దేలించుచు, ద్వారావతిని రాజధాని నిలిచె
గీ॥ నీయుదంతంబు వినినవారెల్లఁ బుత్ర, పౌత్ర విభవాభివృద్ధులఁ బరఁగి దివ్య
సౌఖ్యములనొందుదురుయశస్సమరవిజయ, దక్షులైయిహిఁదుర్ఖ్యాతిఁ గదనరుటరుదె.

వ॥ అని యిత్తెఱంగున వ్యాస జనమేజయ సంవాదంబు వినిపించిన సూతునిం జూచి
శౌనకాదు లిట్లనిరి. ౬౪౮

సీ॥ పౌరాణికవతంస! భవదుక్తమున మాకు, సంశయంబొదవె నీశానుఁగూర్చి
తపమొనర్చుటదేమి దైత్యాంతకుఁడు దేవి, వరమిచ్చెనని పల్కితరయ నీవు
కారణాంతరమునఁ గార్య సంజననంబు, గల్గునే? యీ వింతగాన మెచటఁ
గాన సందేహంబుకడఁదొలియు మని వేడు, మునులతో సూతుఁడిట్లనియె మీదు
గీ॥ భావమెఱుఁగంగనయ్యె సంభావితంబు, మద్గురూక్తులచే విన్నమాడ్కి మీకు
విన్నవించెద నని తెల్పి వినుచు రాజు, బాదరాయణుతో నిట్లు పలికె నంత.

శా॥ సర్వేశుండు జగత్త్రియాకరణరక్షాశిక్షలన్ దక్షుఁడై
సర్వాభీష్టఫలప్రదాయకుఁడు [illegible]

శర్వుఁ గూర్చి తపంబు సేయుట మహాశ్చర్యంబు నొందించె నం
తర్వాణి ప్రవరా! వినంగఁదగు వృత్తంబెల్ల విన్పింపవే. ౬౫౧

మ॥ అనినన్ భూపతిఁజూచి పల్కె ముని యాత్మానందుఁడా నచ్యుతుం
డనపాయప్రథితప్రభావుఁడు సమస్తాభీష్టసంధాయి య
య్యును మాయామయమానుషాకృతిని దా ఽ నుద్యాతి వర్తించుచున్
మనుజక్రీడల సంచరించె జడసామాన్యస్థితిన్ జిత్రమే. ౬౫౨

వ॥ మఱియును వాసుదేవుండు మానుషభావావలంబంబున వర్ణాశ్రమ వర్తనంబును, వృద్ధపూజనమ్మును, గురువందనంబును, విప్రదేవతాసమర్చనంబును, హర్ష విషాద సమయంబులఁ దదుపభోగంబును, దైన్యవినయవాదంబులు, కామోల్లాస జృంభణంబును, లోభ మోహాది ప్రవర్తనంబును గలిగి వర్తించుట లోక ప్రసిద్ధంబు గుణమయ దేహులకున్ గుణావిష్కరణంబు నిసర్గంబే కదా! బ్రాహ్మణాది శాపంబున యాదవనిధనంబును, స్వదేహమోచనంబును, పత్నీలుంఠనంబును సంభవించె, భవత్ప్రపితామహునకు గాండీవసమాకర్షణ శక్తి లేకుండుట వింటివే కదా! ప్రద్యుమ్నానిరుద్ధుల శంబరచిత్రలేఖాహరణంబు లోనగు గుణంబులు మానుషచేష్టితంబు లని కనుంగొనుము. నరనారాయణాంశజు లయ్యును పార్థకృష్ణులకు యోగమాయాప్రభావంబునఁ బ్రతియుగంబున నిమిత్తవశంబున నిట్లగు గుణక్షోభంబు ప్రవర్తించుచుండు. ౬౫౩

ఉ॥ వీక్షణ చాలనంబుననె ఽ విశ్వములెల్ల సృజించి ప్రోచుచున్
శిక్షకులోను జేయుచును ఽ జీవుల రాకడఁ బోకడన్ గడున్
దక్షులఁజేసి త్రిప్పు విధిఽద్వైత్యహరాదిక తారతమ్య మే
పక్షమునందుఁగల్గునె స్వఽభావము సుమ్మది విశ్వధాత్రికిన్. ౬౫౪

సీ॥ సూతికాగృహమున ఽ సుతలుంఠనంబును, నందవ్రజంబులోఽనన వసించి
పశుపాలకుండౌట ఽ భయమున ద్వారకఁ, జేరుట వనితల ఽ చిత్తవృత్తి
లోఁబడియుండుట ఽ లోనగు చర్యలు, మాయావశంబులు ఽ మానవతికి
నొక తెకులోఁగువాఁ ఽ డకట? పంజరకీర,గతి నుండు నన వేలు ఽ కాంతలైనఁ

గీ॥ జిక్కువడుటెంత వింత సఽన్నేహమైన, సత్యకై యిందుఁతోఁబోరి ఽ స్వర్గమునను
బారిజాతంబు పెకలించిఽధారుణికిని, దెచ్చుట వధూటితత్త్వంబుఽదెలుపదొక్కొ?

కం॥ జననీజనకులు శిశుపాలున కొసఁగఁదలంచు కంజఽలోచన బలిమిన్
గొనుట పరసతిని బలిమిన్, గొనుటయొకా మానుషానుఽకూలత గాదే. ౬౫౬

ఉ॥ ప్రాణు లహంకృతిన్ దెలియ ఽ కప్పటి కప్పటి కిష్టవృత్తులన్
జాణతనంబుఁ జూపెదరు ఽ సత్తు నసత్తని రోయ రుర్వరన్

బాణులనంగ నేల భువనావళి సర్వ మహంకృతిన్ స్ఫుట
త్రాణము జెందు నా ప్రకృతిధర్మముగాదె యహంత భూవరా. ౬౫౭

కం॥ నలువ యహంకారంబున, గలిగించెం గాదె జగము గావున బంధం
బెలమి నహంకారమె, త,ద్విలయమె ముక్తి యన నొప్పు విశ్వజ్ఞునకున్. ౬౫౮

కం॥ ధనములు సతులును గృహములు,దనయులు బంధువులు ననుజతతి బంధములే
కనుగొన బ్రాణికి బంధము,జననాథ! యహంత సుమ్ము శాశ్వతికంబై. ౬౫౯

మ॥ ఇది యే జేసితి జేయుచుంటి నిది యెంత్రే జేయుచున్నాడ నా
కిదియెంతో పనియే యటంచు మదిలో నిచ్ఛానురూపంబునన్
మదలోభాదివశంవదుం డగుచు దుష్కర్మానంబున న్మానవుం
డుదితోత్సాహముతోన గట్టువడు నన్యోన్యాభిమానంబునన్. ౬౬౦

గీ॥ అన్యథాజ్ఞానబద్ధుడై యహరహంబు, స్వస్వరూపాపరిజ్ఞాన సంకటమున
బద్ధుడగుగాన దేహి వ్యాసచ్ఛుద్ధిలేక, బంధరాహిత్య మొందునే భరతవంశ్య!

ఉ॥ కారణ శూన్యమై జగతి గార్యము బుట్టునె మృత్తులేక యి
ద్ధారుణి గుంభసంభవము దా ధృతి జేయగ నౌనొకో? యహం
కారము మూల మింతటికి గావున దద్వశవర్తనంబునన్
బౌరవనాథ! సర్వమును బద్ధము గాగ దలంచి చూడుమా. ౬౬౨

కం॥ మాయామానుష సంభృత,కాయుం డచ్యుతుడు నయ్యె గావున జింతా
వ్యాయోగ నిమజ్జనమున్, బాయునె? గుణవృత్తి సహజబంధము సుమ్మీ.

సీ॥ అవతార దురవగాహ ప్రవాహ నిమజ్జ,నంబున హరి పతనంబు నొంది
శుభవర్తనుండౌనె సూక్ష్మదృష్టినెఱుంగు, సంసార మభిమాన సంభవంబు
నిరహంకృతిని లేదు నిజము సంసారంబు, త్రివిధ మహంకృతి దీనివలన
ముగ్వురు మూర్తులు మూడు తెఱంగుల, వర్తింతు రదిగాన వారలందు

గీ॥ సాభిమానస్థితుల గల్గు సంశయించు, పని యొకింతయు లేదు నిష్పక్షపాత
వర్తనంబున బ్రకృతి యనివార్యయగుచు,వర్తిలు గుణత్రయక్రియావర్తనమున.

ఆ॥ సాత్త్వికుండ ననుచు శౌరి యూరకయున్న, దైత్యభంగ మెట్లు తనకుజెల్లు
నదియకాన దత్తదవతారవర్తనం,బొంది కపట వేష మూనెగాదె. ౬౬౫

మ॥ జడులైనన్ జననీ మహా జఠరవాసం బాత్మలో గోర రె
న్నడు దేవేశుడు శౌరి గోరునె నిరాసనందైక సంసారముం
గడు లోకత్రయరక్షణార్థముగ శంకం బాసి మాయావియై
పుడమిం బుట్టుచు గిట్టుచుండె నిది దుష్కర్మోదయం బె దైత్యారికిన్. ౬౬౬

క॥ కౌసల్యా జఠరాంత,ర్వాసం బొనరించె శౌరి ॥ స్వవశుం డాతం
డౌ సంసృతి యతనికి నప,హాసాస్పద మానె సర్వ ॥ మాతం డౌ కాం డే. ౬౬౭

ఉ॥ దుష్టు లెఱుంగలేకయె మహోధ్రుద్విషుం డుర్వి జనించె మానుషా
రిష్టము లొందె దైవ మనుజరీతిం బొసంగునె యందు రయ్యయో?
దుష్టవిభంజనంబును నదుష్టజనావన మాత్మ గోరి వి
స్పష్టముగా స్వతంత్రుడయి ॥ వచ్చుట పోవుట గాంచంబోలదే?

సీ॥ జననిగర్భారణ్య ॥ సంచారములు రోసి, తీర్థయాత్రాదుల ॥ దేవనిష్ఠ
క్రతువిధానంబుల ॥ ఘనయోగచర్యల, నపునర్భవత్సిద్ధి ॥ నభిలషించి
వర్తింతు రెల్లరు ॥ వాసుదేవుని నట్ల, పరికించు టెల్లం బాపంబెకాదె?
యోగమాయవశంబునైనాని యద్దేవుండు, తనయందె తా నుండు నదనకు వేఱు

గీ॥ గలదె లోకమ్ములను దంతునఘటనం జేయు,నూర్ణనాభంబు దానికినోదవు సూత్ర
మునకు వేఱున్నదే సర్వము నెఱుంగ, వాసుదేవుండకాండె యోవసుమతీశ.

కం॥ దేవీ దేవులకును బర,భావంబులు గలవె వేఱె ॥ పరికింపంగ స
ద్భావం బట్టిదయై తగుం, గావున హరుం గొలువ గౌరి ॥ కరుణించెంగదా.

కం॥ అని బాదరాయణుండు దె,ల్పిన విని జనమేజయుండు ॥ ప్రీతుండై య
మ్మునిని కవ్వలికథ యడిగిన, వినిపింపం దొడంగె బూర్వవృత్తం బనుచున్. ౬౭౦

ఉ॥ శంకర! సర్వతాపసవశంకర! కింకర జన్మభీతినా
శంకర! పంకజాతభవసంస్తుతిరంజన! భంజితాఖిలా
తంక! విశంకటజ్వలనధామ! కపర్దభృతామరాపగా
పంకజసు ప్రహంసవరభాసురచంద్రికళాకళాలయా! ౬౭౧

కం॥ సామజదానవమర్దన!, సామశ్రుతిలోల! నిగమసంస్తుతిశీలా!
ధూమధ్వజనయనాంత, ర్ధామధ్వస్తాంగజాత! ॥ దక్షవిఘాతా! ౬౭౨

మాలినీవృత్తము॥ కరవిధృతకురంగా! ॥ కాలలీలావిభంగా!
శరధివరనిషంగా! ॥ శాంతిపూర్ణాంతరంగా!
తరణకరణచంగా! ॥ ధర్మదారార్ధసంగా!
భరితకరుణలీలాసాంగ! విశ్వేశలింగా! ౬౭3

క॥ దేవీభాగవత స్కంధావళిని జతుర్థ మచ్చుకమాంబా జగ్గ
త్మ్మావరుల కభీష్టార్థ, శ్రీవెలయఁ జేసి సుప్రసిద్ధిం జెందఁ. ౬౭౦

—◆ గ ద్య ◆—

ఇది శ్రీ పరమశివాద్వైత భావనాసాధ్య ములుగు సదన్వయ సిద్ధసారస్వత
విద్యాసాన్నిధ్య వేమనారాధ్య వంశార్ణవ కళానిధాన పాపయారా
ధ్యాభిధాన ప్రణీతంబైన శ్రీ దేవీభాగవత
మహాపురాణంబునందుఁ
జతుర్థస్కంధము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ ర స్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ శారదాంబాయై నమః

శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము - శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## పంచమస్కంధము



గుణగణభరణాగమ
రాగ విశేషానుమోదరమ్యము దేవీ
భాగవతంబున నైదవ
భాగము సుఖసన్నిధానభాగ్యం బలరున్. ౧

కం॥ శ్రీరామార్చిత చరణాం, భోరుహ! ప్రణవోపదేశ! మోక్షద! గంగా
తీరవినోదవిహారా, గౌరా! గౌరీసనాథ! కాశీనాథా! ౨

వ॥ దేవా యవధరింపుము. సకల పురాణేతిహాసకథా సుధాస్వాదననిస్తంద్రు లగు నమ్మునిచంద్రులకుఁ దన్మనోరథరథచోదనాసూతుం డగు సూతుం డిట్లనియె. ౩

సీ॥ శ్రీభారతీశచీసీమంతసిందూర, రేఖాంకముల నభివృద్ధిఁ గొల్పి
బ్రహ్మాదిదేవతాఫాలభాగస్థలీ, లేఖకాదోషముల్ చిదిమివైచి
తాపసాంతర్వాసనాపరంపరలలో, మాలిన్యముల నెల్ల మట్టుపఱచి
వేదాంతసిద్ధాంతవిమలవాగ్వల్లరీ, సామరస్యఫలార్థసరణిఁ జూపి

గీ॥ యేమహాదేవి పదయుగం బెల్ల జగము,లకు నుపాస్యంబు తా నయ్యె ప్రకటితార్థ
సిద్ధు లొనఁగూర్చు నరుణసుశ్వేతదివ్య, తేజ మప్పరవస్తు వర్థించువాఁడ. ౪

కం॥ సగుణయు నిర్గుణయగు నే, జగదంబిక యట్టిదేవి సంతతము ధ్యా
నగరీయుఁడనై కొలిచెద, నిగమార్థరహస్యవస్తు నిష్ఠారతినై. ౫

వ॥ ఇట్లు నమజ్జనదుర్భవదురితలతాలావిని యగు పరదేవిని భజించి. ౬

ఉ॥ ఇట్టులు బాదరాయణసమీరితసూక్తుల సంతసించి రా
పట్టి పరాశరాత్మజుని బ్రస్తుతిఁజేసె మహానుభావ! యి
ట్టట్టనరాని దేవిమహిమాతిశయంబు వినంగఁ గోరితిన్
దొట్టినప్రేమఁ దచ్చరిత దోషహరంబు వచింపు నావుడున్. ౭

గీ॥ యోగమాయాప్రభావంబు నోగివినంగ, నభిలషింపని మూఢుఁ డీయవనిఁగలఁడె
తెలిసివచియించువారెవ్వరలఘు చరిత!, దెలిపెదను విను నాబుద్ధి కొలఁది నిపుడు.

—॰ మ హి షా సు ర చ రి త్ర ము ॰—

సీ॥ పరదేవిమహిమంబు భక్తిచే వినఁగోరు, వారల కర్ణపర్వముగఁ దనకుఁ
బరిచితం బగు నంతఁ బలుకనివాఁడుసూ, మందుండు తొల్లి భూమండలమున
మహిషాసురుం డను మనుజాశి యొక్కండు, విక్రమంబున జగం బాక్రమించి
తనివిఁ దీరని తృష్ణఁదవిలి హేమాద్రిపై, దేవతల్ వెఱఁగంద ధీరవృత్తిఁ

గీ॥ బదియు వేలేండ్లు మారుతభక్షి యగుచు, నింగి గంపింప జలధి ఘూర్ణిల్ల దెసలుఁ
జిక్కువడ సూర్యచంద్రులుఁ జెదరిపాఱ, నియమనిష్ఠాగరిష్ఠుఁడై నెఱపెఁదపము.

ఉ॥ రాజమరాళ మెక్కి సురరాజి తనున్ గొలువంగ నల్వ వి
భ్రాజితమూర్తియై దితిజుపజ్జఁ బ్రసన్నతఁగాంచి నీదు న
వ్యాజతపంబు మెచ్చితిఁ గృతార్థుఁడ వయ్యెదు కోర్కె యెద్ది? నాఁ
బూజయొనర్చి మ్రొక్కుచు నపూర్వముదంబున దైత్యుఁ డిట్లనెన్. ౧౦

గీ॥ జరయు మరణంబులేక యిజ్జగములందు, నమరభావంబుచే నుండునట్టి వరము
దయ నొసంగు మటన్న నత్తమ్మిచూలి, యసురవల్లభుతోడ నిట్లనియెఁ బ్రేమ.

చ॥ ధర నుదయించువారికిని దప్పదు మృత్యువు కొన్నినాళ్ళపైఁ
బరిణతి నొందఁజేయు ననపాయము కాలునియాన కావునన్
జర మచరంబు నిట్టిది ప్రశస్త సుఖావహమైన వాంఛితం
బరయుము నీకు నిత్తు సముదాత్తమనీషఁ గొనన్ దలంచినన్. ౧౨

ఆ॥ క్ష్మాధరములు నదులు కాననంబులు మొదల్, స్థావరంబులెల్ల సమయుఁగాదె!
చరములైన జంతుజాలముల్ చెడవొక్కొ, చావుపుట్టు లఖిలసమతఁగనవె. ౧౩

చ॥ అన విని దైత్యుఁ డిట్లనియె ♦ నట్టుల యేని పుమర్థచేతనం
బున మృతిలేకయుండ వరమొసఁగ దయసేయు మటన్న నట్లయౌ
నని వరమిచ్చి పద్మజుఁడరిగెఁ బతి యస్తము నొందమనట్ల క
న్గొనుచు సురారినిల్వ ననుఁగుంగమితోడ నదృశ్యుఁడై చనెన్. ౧౪

ఆ॥ సతులవలనఁ దనకుఁ ♦ జావులేదని నీచుఁ, డడిగెఁగాని పద్మజాంతరంగ
భావ మెఱుఁగఁడయ్యెఁ బరులకు నలవియే, దైవఘటన మెఱుఁగ దరమె యెందు.

ఉ॥ ధాతృ వరప్రభావ కృతదర్పమునన్ భువనత్రయంబునన్
ఘాత సుపర్వనాగనరదుస్తర దోర్బలుఁడై నిశాచర
వ్రాతము చుట్టుఁ గొల్వఁగ నవారిత విక్రమకేళి సల్పెనాఁ
బ్రీత మనస్కుఁడై మునివరేణ్యుని గాంచి నరేంద్రుఁ డిట్లనెన్. ౧౫

ఉ॥ వ్యాసమునీంద్ర! యీ నిశిచరాగ్రణి యెవ్వఁడు? వీనికట్టు లీ
కాసరరూప మావహిలెఁ ♦ గర్ణయుగంబు తదీయవృత్తము
ద్భాసితమై వినన్ గడఁగెఁ ♦ దజ్జనన క్రమమెల్లఁ దెల్పుమీ
నీసరసోక్తి వినిక శ్రుతిద్వనిర్మితికిన్ ఫల మబ్బఁజేసెదిన్. ౧౬

సీ॥ అను మహీవల్లభు ♦ ననుయోగ మాలించి, బాదరాయణమౌని ♦ పలికె నంత
దను వను దైత్యుండు ♦ తనయుల నిరువురఁ, గనియె రంభకరంభులనెడు వారిఁ
బుత్రార్థులై వారు ♦ భూరితపంబులు, సలిపిరి వాయుభక్షణ మొనర్చి
బహువర్ష గణములు ♦ పంచనదంబున, జలమగ్ను లగుచు నిశ్చలత నిల్చి

గీ॥ యక్షవట మూలమునను బంచాగ్నిమధ్య, నధివసించుచు నున్న సురాధినాథుఁ
డెడరు వేచి హ్రదంబులోనడఁగి మకర, రూపి యగుచుఁ గరంభునిరూపుమాపె.

—॥ అనలుండు రంభునకు వరమిచ్చుట ॥—

కం॥ రంభుండు మకరివలనఁ గ, రంభుం డీల్గుటయుఁ గ్రోధరంహుఁడై దో
స్తంభ ధృత ఖడ్గధార న, దంభత నుంకించి శిరము ♦ దహన శిఖలలోన్. ౧౭

శా॥ వ్రేయంగాఁ దలపోసి కేశతతిఁ దీవెల్ చుట్టి చేపట్టి ఖ
డ్గాయత్తుండయి త్రెంపఁజూడ ననలుండద్దైత్యునిన్ జూచి యో
హో! యిట్లేటికి నాత్మహింస దురితంబూహింపు మెద్దేని చి
త్తాయత్తంబగు కోర్కెఁ దీర్చెద వృథాయాసంబు మానందగున్. ౨౦

కం॥ చచ్చి పిదప సాధించుట, మెచ్చోటం గలదె చింతయేటికి వర మే
నిచ్చెద బ్రతికిన వారలు, చచ్చిన వారలను గలిసి చనుట గలుగునే. ౨౧

మ॥ అనలుం డిట్టులు వల్క దైత్యుఁడు స్వహస్తాయత్త కేశావళిన్
విసయోత్సాహ ధురీణుఁడై విడిచి నన్ వీక్షించి రక్షింపఁగా
ఘనకారుణ్యము గల్గె నేనియుఁ ద్రిలోకఖ్యాత దోర్విక్రమున్
దనయున్ నాకు నొసంగు దానవసుధాంగస్త్రీనమ దుర్వారునిన్. ౨౨

వ॥ అనిన రంభకునితోఁ బావకుం డిట్లనియె.

కం॥ ఏజాతి వనిత యెడల మ,నోజవ్యథ నెతలనొంది నూతన సురతా
వ్యాజ కుతూహల మొందెదొ, యా జాతికిఁగలుగు తనయుఁడని శిఖి యరిగెన్.

శా॥ రంభుం డిట్లు కృశానుద త్తవరుఁడై రక్షఃపదం బేలుచున్
జంభారాతిముఖామరాసహభుజాసంరంభ శౌర్య క్రియో
జ్జృంభుండై విహరించుచో వనగజశ్రీరూప లావణ్యా ని
ర్దంభ ప్రక్రియఁ గానసాంతరమునన్ రంజిల్లు పెన్నైరిభిన్. ౨౪

కం॥ కాంచి తదీయ విచిత్రోఁ,దంచిత లావణ్యమునకు నచ్చెరువడి య
చ్చంచలుఁడు దానిఁ గవయఁగఁ, బంచశరశరాభిహతుల బడలేదనంతన్. ౨౫

ఉ॥ దానవుఁ డిట్లు మోహవశతన్ దనపై మదిఁ గీలుకొల్పుచున్
సూనశరాస్త్రవేదనలఁ జొక్కుట యారసి కామభోగ సం
ధాన మనస్కయై యదియుఁ దద్దయు నొద్దకుఁజేరె దైవతా
ధీనము సర్వమున్ ద్రిజగతిన్ గుణనైకృతిఁ జెప్పనేటికిన్. ౨౬

మ॥ మహిషాకారము నూని దానవుఁడు శుంభత్కామసంరంభుఁడై
మహిషీకామినిఁగూడి సాత్త్విక రసామందస్పృహాస్పంద ధూ
ర్వహ వృత్తిన్ రతికేళిఁ దేల్చిన సుఖావష్టంభయై గర్భమున్
వహియించెన్ దితిజుండు దానిఁ గొనుచున్ బాతాళ సంవాసియై. ౨౭

కం॥ విధివద్గృహీత సతి బలె, నిధువనములఁ బోషణముల నిరతోత్సవ సం
గ్రథనముల దానినేలుచు, రుధిరాశి యనన్యకర్మసంగాఢుం డయ్యెన్. ౨౮

— రంభునకు మహిషాసురుఁడు పుట్టుట —

సీ॥ ఇత్తెఱంగున రంభు డింతిపోలిక లుఱా,యాంగన నేలఁగ నంతనొక్క
మహిషంబుగనిదానిసమటుఁగి పైఁబడఁజూడ,గదగొని రంభుండు గవయమహిష
మురుశృంగముల నొత్తి యుర్విపైఁబడద్రోయ,రంభుండుమడిసె నాశర్తస్వరంబు
నేయుచు, మహిషి చెచ్చెర మూలవటవృక్ష, [illegible] యక్షవ్రజంబు

గీ॥ శరణ మొందినఽ వెను వెంటఽ సమదమగుచు, వచ్చు మహిషంబుగని యక్షఽ వరులుగదిసి
దండధర కింకరులఁ బోలెఽ దఱిమి తఱిమి, దండతాడితముగఁ జేయ ఽ ధరణిఁ గూలె.

ఉ॥ యక్షులు రంభుఁ డీలుగుట ఽ యారసి వాని దహింపఁ గోరి ప్రే
తక్షితిఁ దత్కళేబరముఁ ఽ దాల్చి చితిన్ బడవేసి వహ్ని సం
ధుక్షణకర్మకుల్ దొడరఁ ఽ దోడన యమ్మహిషీలలామ సా
పేక్షమనస్కయై యనుగఽమింపఁ దలంచెఁ బతిన్ సతీస్థితిన్. ౩౧

ఉ॥ అంతట యక్షపుంగవులఽ పారకృపారసచిత్తులై సతీ
ప్రాంతమునన్ బహూక్తుల నిఽవారణఁ జేసిన మాన కింతి య
క్కాంతునితోఁ జ్వలజ్జ్వలన ఽ గర్భముఁ జొచ్చెఁ దదీయ గర్భ దు
ర్దాంత కృశాను దత్త వరఽభావము వెల్వడి దానవాకృతిన్. ౩౨

సీ॥ కాలదండముఁ బోలు ఽ కరవాల మొకకేల, ఖేటకం బొకకేలఁ ఽ గీలుకొనఁగఁ
గులశైలములను గఽగ్గోలు బెట్టఁగఁ జాలు, చటులార్భటులు నభఃఽస్థలముగప్ప
నభ్ర విభ్రమదనీఽలాభ్రసందోహముల్, కొమ్ముచిమ్ములను దిఽక్కులకుఁ జెదర
వాలాభ్రవిసరణాఽవసర నిర్యత్ప్రభం, జనము లాశాపాళి ఽ వినిమయింప
గీ॥ ధరణి గంపింప సాగరోఽద్ధతులు నెఱయ, దానవులు పొంగ నిర్జరుల్ ఽ తల్లడిల్లఁ
బుడమి నింగియు నలము నఽబ్బూరి తేజ, మడరె మహిషాసురం డేచు ఽ నవనినాథ.

కం॥ దహన కృపాకలితాను, గ్రహమున రంభాసురుండు ఽ రమణి మహిషితోఁ
గ్రహములు చెదరఁగ వెడలెను, బృహదాకారమున రక్తఽబీజాసురుఁడై. ౩౪

ఉ॥ అమ్మహిషాసురుండు దితిఽజావళిఁ గూడి జగత్త్రయంబు శౌ
ర్యమ్మున నాక్రమించి యమఽరాధిపముఖ్యులఁ బాఱఁదోలి బీ
రమ్మున నేకభోగముగ ఽ రాజలలామ! పరాక్రమించె వృ
త్తమ్మిది సైరిభాసురకృఽతమ్మని విందుము పూర్వగాథలన్. ౩౫

సీ॥ కాసరాసుర మహోఽగ్రప్రతాపానల, జ్వాలావళులు ధరాఽచక్ర మెల్లఁ
గలయంగ నలమి భీఽకరవైరికాంతార, దవదహనంబులై ఽ తరతరముగ
రవిచంద్రవంశాధిఽరాజన్య తరువుల, భస్మసాత్కృతిఁ గూర్చి ఽ ప్రబలసైన్య
ఝుంఝూనిలంబుల ఽ సాహాయ్య మొనరింప, సాగర సంవృతఽక్ష్మాతలమ్ము
గీ॥ సకల సామంతగుల్మసంఽక్షయ మొనర్చి, నిభృతజాజ్వల్యమానమైఽ నభముఁ బుడమి
నంతరం బెల్ల నలమి తఽత్త్వాంతరైక, కబళనోద్ధత మయ్యె నాఽగాఁ దనర్చె. ౩౬

వ॥ మఱియును మహిషాసురుండు నిరాతంకుండై యేకచ్ఛత్రమ్ముగా భూమండలం
బెల్ల నాక్రమించి మహోత్కటుం డగు చిక్షురుండును, సేనాయుత పరివృతుం

డగు తామ్రుండును, మహావీరుండగు నసిలోముండును, బిడాలుండును, బాష్కలుండును, ద్రిచక్షుండును, కాలబంధకుండును, సేనాధిపతులై శతసహస్రాక్షౌహిణీ సంఖ్యంబులగు బలంబులతోఁ దన్నుంగొలువ క్షాత్రింబవలంబించి పోరాడు రాజన్యుల నిహతులం జేయుచుఁగరంబు లొసంగుచుఁ గరంబులు ముకుళించు నరవరులఁ మన్నించుచు యాగభాగంబు లర్పించు బ్రాహ్మణులఁ జేపట్టి విముఖులఁ జెండుచు మధ్యమలోకంబు స్వవశంబుచేసికొని స్వర్గవిషయాభిలాషంబునఁ దరలి సన్నద్ధుండై దండయాత్రి వెల్వడి ప్రస్థాన పటహ ప్రభృతి వాద్యంబులు మెఱయ గగనంబున కెగసి సురపురిఁ బట్టుకొనువాఁడై నగరబాహ్యంబున నొక్క యుపవనంబున నివసించి యొక్కప్రణిధిఁ బిలిచి యిట్లనియె. ౩౭

—• మహిషాసురుం డింద్రునిమీఁద దండెత్తుట •—

సీ॥ సత్వరంబున నీవు శక్రు సన్నిధి కేగి, నామాటగాఁ దెల్పు నాకవిభునిఁ
జదలులోపల నిల్చి స్వర్గంబు విడిచి నీ, వెందేనిఁ జనుము కాదేని రణము
సేయువాఁడ నటంచుఁ జెచ్చెర వెడలుము, వెఱచితి వేని పెద్దఱికమునను
శరణాగతుండవై చనుఁదెమ్ము మున్నింతు, నీ విక్రమము లెల్ల నేను గంటి
గీ॥ జన్యముల నెన్నిమాఱులో సాహసించి, పిఱికితనమునఁ బఱచిన తెఱవెఱుగమె
కాక గౌతము నిల్లాలి కాపురంబు, చెఱచినావని వింటి నమ్మెఱక వీవ. ౩౮

ఉ॥ రాజ్యము సేయఁగాఁ దగిన రాజగుణంబులు లేవు నీయెడఁ
బూజ్యత గాంచి నాకపురభోగి నటంచు వసింపనేల? సం
త్యాజ్యుఁడవైతి వింక మనసారఁగ నెచ్చటి కేని పొమ్ము నీ
విజ్యల భాగముల్ గొనఁగ నేటికి నర్హుఁడ వంచు నెంతువో. ౩౯

కం॥ వెఱవక తత్సన్నిధి ని, త్తెఱగున వచియింపు మనుచు దృఢమతిఁ జారుఁ
దెఱలక పంపినవాఁడుఁ, బిరబిర జని పలికె జంభభేదికి నిటులఁ. ౪౦

మ॥ విని క్రోధాన్వితుఁడై పురందరుఁడు నావిర్భూత మందస్మితా
నన చంద్రోజ్జ్వలచంద్రికల్ బెరయఁ దన్నవ్యోత్పత ద్వ్యాధి పీ
డనముఁ జేసెద మూఢ! వేగఁ జని చెట్టల్ పల్కు నీకేల? మూ
లనిపాతమ్మున మ్రానుగూల్చుగతి లీలఁ దుంచివేతుఁ నినుఁ. ౪౧

గీ॥ తనకుఁ గలహాభిలాషంబు దనికెనేని, వెడలుమని తెల్పు కొమ్ములు వేగఁబెఱికి
శృంగములు వంచి చాపంబుసేయువాఁడ, దీర్ఘ శృంగ బలంబునఁ దెలియఁడేమొ!

కం॥ యౌవన బలగర్వితుఁడై, దేవబలం బిట్లు మదిని దెలియక దుర్భా
షావలి నుడికిం[illegible] వర మా[illegible]రక సడరగఁ గాఁ గలుగు నాకో. ౪౩

కం॥ దూతల ఖండించుట వి, ఖ్యాతము గాదనుచు నిన్నుఁ గాచి విడిచితిన్
భీతిం గొన కేగి మహిషీ, జాతునితోఁ దెల్పు వేగఁ జను మనునంతన్. ౪౪

ఉ॥ చయ్యన వాఁడు పోయి సురశాత్రవుఁ జూచి నమస్కరించి యో
యయ్య! పురందరాంతికమునందు వచించితి నీదు మాటగా
నయ్యెడ నిన్ను లెక్కఁగొనఁ డాతఁడు దేవచమూసమూహసా
హాయ్యమునన్ భవద్బలసమర్థతఁ గాంచఁ డొకించుకేనియున్. ౪౫

సీ॥ చారులధర్మంబు సత్యంబు ప్రియమును, బ్రభువులసన్నిధిఁ బలుకవలయు
కేవలప్రియవాక్య కీర్తనమ్మునఁ గార్య, భంగంబు లగుఁగాదె భర్తలకును
పరుషంబుఁ బలుకుట పాడిగా దధిపుల, సన్నిధి మేల్కోరు చారులకును
ప్రత్యర్థిముఖములఁ బ్రసరించు కారులు, వలుకరు భృత్యులు పతులయెడల

గీ॥ నతఁడు వల్కిన పల్కులయట్ల పలుక, నోడియున్నది నా జిహ్వ యొండిఁ కేల?
గరళతుల్యంబు శక్రుని కథత మెల్ల, దేవరిపుచంద్ర! యీ నేర్పు తెలిసికొమ్ము.

గీ॥ హేతుగర్భంబుగా నిట్టు లెఱుక సేయు, దూతవాక్యంబు లాలించి దుర్మదమున
జలితలాంగూలుఁడై మూత్రజలము వెడలఁ, గ్రోధరక్తాక్షుఁడై దైత్యకుంజరుండు.

సీ॥ నిశిచరాధిపులార! నిర్జరేంద్రుఁడు రణో, త్సాహియై యున్నాఁడు సమరమునకు
నుద్యోగ మొనరింపుఁ డుద్యద్వరూథినీ, సన్నాహములు సల్పి సత్వరమున
వెడలుఁడు నా కాజి వెఱవని శూరుండు, గలఁడె లోకంబులఁ గనిన వినినఁ
బరదారగమనలంపటుఁ డప్సరోభోగ, మత్తుండు మాయావి మానులయెడఁ

గీ॥ బాపి విశ్వాసఘాతిఁ దీవ్రప్రతాప, దావదహనంబు దరిగొల్పి దేవవిభుని
భస్మసాత్కృతునొనరింతుఁ బల్కులేల, జయపటహభేరి వేయించి చనుఁడు ముందు.

ఆ॥ సంధి సేయువాని చాడ్పునఁ గపటియై, నముచిఁ గూల్చెఁ ద్రిదశనాయకుండు
పలుకులకును గట్టుపడి యాతఁ డతనిచే, బొంకుపడుచు మడిసి పోయెఁగాదె. ౪౬

వ॥ మఱియును గపటాచార్యుండును గూహకుండును నానారూపధరుండును దంభ పండితుండును నగు జనార్దనుండు వానికి సహాయం బొనరించుచున్నవాఁడు, తొల్లి మాయావరాహమ్మై జగజెట్టి యగు హిరణ్యాక్షున్ బరిమార్చె, మాయామయంబైన నృసింహంబై యవక్రవిక్రమోత్సాహి యగు హిరణ్యకశిపుం దెగటార్చె నొకింతయు దేవతలయెడల విశ్వాసంబు గనపడదు. కృతఘ్నవృత్తి సుస్థిరంబై యున్నయది విష్ణుండును రుద్రుండును విరించియు నింద్రునకు సహాయం బొనర్చి న న్నేమి సేయంగలవారు? త్రివిష్టపంబు చేకొనియెద. వరుణ యమ ధనద పావక చంద్ర సూర్యాదులన్ జయించి యాగభాగంబు లపహరించెద,

వరదానబలంబున దేవదానవ మనుష్యపన్నగ మృగాదులవలన మరణభయం బొకింతయు లేదు. శూరు లగువారికి వనితామూలం బగు నపజయంబు గలదే! పాతాళంబులఁ బర్వతంబుల సాగరంబులఁ జరాచరంబుల నచ్చటచ్చట వసించు నక్తంచరసేనలఁ బిలువుం డే నొక్కరుండ సర్వజయంబు సేయంగలవాఁడ బలంబులు శోభార్థంబు లని తెలియుండు, శృంగంబుల ఖురంబుల లాంగూలంబున నిఖిలసురలం బరిమార్చెద, నందనవనంబున మందారకుసుమలుంఠనం బొనర్పుఁడు, కామధేనుక్షీరంబులు గొనుండు, సుధాపానం బొనర్పుఁడు, గంధర్వులవలన గానంబు లాలింపుండు, మఱియు నూర్వశీ, మేనకా, రంభా, ఘృతాచీ, తిలోత్తమా, ప్రమద్వరా, మహాశ్వేతా, మిశ్రకేశీ, మదోత్కటా, విప్రచిత్తి, ప్రభృతులగు నప్సరోంగనలం బట్టి తెచ్చి నృత్తగీతసంభోగసౌఖ్యంబుల ననుభవింపుఁడు, భార్గవుం బిలువంబంచి విజయసిద్ధినిమిత్తంబుగాఁ బుణ్యాహం బొనర్చి సన్నిధానంబున నిలువంజేయుం డని శాసనం బొనర్చి మజ్జనభోజనాదుల సుఖసంతృప్తుండై యమ్మహిషాసురుండు సమయోచితకృత్యంబు లొనర్చుచున్న యెడ. ౧౦

సీ॥ చారుండు చనుదెంచి § సముద్ధతుండై మహిషుండు, తనకుఁ దెల్పుమటన్న § ధార్త్యమెల్ల
దెలిపి వాఁ డరిగిన § దేవేంద్రుఁ డవ్వార్త, వరుణధనాధ్యక్ష § వాయుశమన
పావకాదుల సభా § భవనంబునకుఁ బిల్చి, దూతవాక్యములు దో § డ్తోడఁ దెలిపి
మదమత్తుఁడై వాఁడు § మనల లెక్కింపక, స్వర్గంబు చేకొను § సాహసమున
గీ॥ నెత్తి రానున్నవాఁడు మీ § రెల్ల మంత్ర, శక్తి యోజింపుఁ డటమీఁద § సలుప నెద్ది
శుభమునశుభంబుదైవసం § సూచితములు, సంధియో? నిగ్రహంబొకో § సలుపఁదగవు. ౧౧

క॥ దుర్బలుల నడఁపఁదగు నన, దోర్బలధుర్యుండు సమర § ధూర్వహుఁ డతనిన్
నిర్బంధించి యడంచుట, దోర్బలశౌండులకు నీతి § తోవయ కాదే. ౧౨

సీ॥ సంధియోగంబున § సఖ్యంబు కార్యంబు, సత్వరంబుగ నెత్తి § చనుట కీడు
సంధి పోసంగమి § సమరంబు లగ్గగు, నైన బలాబల § జ్ఞానవాంఛ
నిస్సంగు లాప్తులు § నిస్పృహుల్ శీఘ్రగు, లింగితజ్ఞులు నైన § యిష్టజనుల
నంపి ప్రస్థానసే § నాభియోగప్రసం, ఖ్యానవీరోత్కర్ష § లరయవలయుఁ
గీ॥ దదభిజ్ఞులు బలాబలానుసం § ధాన మెడలి, సాహసింపఁగఁ దగదు వి § చార్యకార్య
కరణ మఖిలైకసిద్ధిదం § బరుల యెడల, సాధుసంగ్రాహ్యమంత్రాంగ § సరణి యిదియ. ౧౩

క॥ కార్యగతిఁ గనక సాహస, చర్యన్ వర్తించు పథము § సత్పథ మగునే?
యార్యులు మెత్తురె యామయ, శౌర్యము వితథాపథమునఁ § జక్కంబడునే? ౧౪

మ॥ అని మంత్రాంగ మొనర్చి శక్రుఁడు లులాయకప్రవ్యాభు క్సేనలన్
గని తద్వైరి బలాబలం బరసి వేగన్ రమ్మనన్ వాఁడునున్

జని సర్వమ్మును గాంచి వచ్చి పలికెన్ జంభారినిన్ జూచి యో
దనుజారీశ్వర ! విన్నవింతు వినుమా ! దైత్యేంద్రువృత్తాంతమున్. ౫౫

సీ॥ ప్రళయకాలమునాఁటి పాథోనిధులకైన, నంతంబు గలదనియనఁగవచ్చు
మహిషాసురునిచుట్టు మసలు సైన్యములకుఁ, బద్మజాతాండంబు పట్టుగొనదు
సన్నద్ధులై నిల్చుశతువీరులసంఖ్య, గణనీయమని పల్కఁగానఁ జుమ్ము
అసురాధిపతి మహిషాసురు నౌద్ధత్య, మింతంత యని చెప్పనెదఁ బొసంగ

గీ॥ దేమి చెల్పుదు నిర్జరాధీశ ! నీదు, పాదమాన దిశాధీశపటిమ నెల్ల
నొక్కయెత్తుగ నుఱుమంగనురువడించు, చాయఁ దోఁచుచున్నదీ సంగరమున.

గీ॥ హరిహరులనైన మార్కొనఁనార్భటించి, విక్రమించుచునున్నాఁడు వీరుఁడగుచు
ద్రొల్లి దితిజులఁ గనమె? యద్దుడుకులెల్ల, వీని కొనగోటిసాటి గావింపఁగలవె.

ఆ॥ దండు దరలి నగరిదాపున వనవాటి, విడిసినాఁడు సైన్యవితతిఁ గూడి
చేయఁదగినవిధులు చేయంగఁ దగునని, విన్నవించి దూత వెడలు నపుడు. ౫౭

మ॥ అసురాధీశునియుద్యమంబు విని జంభారాతి భీతిన్ మరు
ద్విసరాచార్య బృహస్పతిన్ బిలిచి యెంతే భక్తిఁ బూజించి కా
ర్యసమావేశమునన్ వచించె దితిజుల్ క్రౌర్యమ్మునన్ గుంపులై
యసమానప్రథితప్రతాపమునఁ బోరై పోరఁగా వేడుకన్. ౫౮

గీ॥ వచ్చువారయి యున్నట్టి వార్తఁ దెలిసి, కాసరసురారి వరగర్వగంధిలుండు
నన్ను నువ్వెత్తుఁగాఁ జూచినాఁడు ధైర్య, వీర్యసంపత్తిచే మహావీరుఁ డతఁడు.

సీ॥ యుద్ధకామత మహోద్యోగియై దానవా, క్షౌహిణీశతములుగూడి పెరయ
వచ్చుచున్నాఁడు కావలయు కార్యం బెద్ది, భార్గవుం డచ్చోటఁ బట్టుఁగొమ్మ
సర్వజ్ఞుఁడవు దయాసహితుండ వే మెల్ల, భవదీయసిద్ధాంతపద్ధతులను
గార్యకర్తల మౌచుఁ గంటిమి సంపదల్, దేవ ! నీకారుణ్యదృష్టిఁ గాదె?

గీ॥ ఆపద లడంచి సంపదలనుభవింపఁ, జేయు కారణ మటుగానసిద్ధిఁ బొదల
మంత్ర మొనరించి వైరులమద మడంప, మార్గ మానతి దయ సేయుమా ! మహాత్మ

కం॥ నా విని దేవాచార్యుఁడు, భావంబునఁ గార్యసిద్ధిపరుఁడై పలికెన్
దేవాధీశ్వర ! ధీరతఁ, బోవిడువకు ధైర్యమున నే పొందుదు సిరులన్. ౬౧

సీ॥ "విపది ధైర్య" మటన్న విజ్ఞోక్తి వినవొకో ! కాఁగల్గు కర్జముల్ గాకయున్నె ?
అవని "దైవాధీన మఖిలంబు" వేత్త లీ, యర్థంబు దెలిసియు స్వార్థపరత

తపములు సల్పరే ? ♦ దైవంబునకు మ్రొక్కి, పౌరుషం బాచరింపంగవలయు
సిద్ధ్యసిద్ధులయెడఁ ♦ జిత్తంబునను హర్ష, శోకంబు లొందుట ♦ సుపథమగునె?

గీ॥ పౌరుషము మాని దైవంబు ♦ పట్టువడునె?, దైవ మెడచేసి పౌరుషథాటిగలదె
యంధునకుఁ బంగునకును సనన్యోన్యమైత్రి, గలిగినట్టుల నవి రెండుఁగలుగ మేలు.

—• గు రు ని బో ధ •—

ఉ॥ పౌరుష మూని చేయునెడఁ ♦ బ్రాణికి సిద్ధి ఘటింపఁ గ దేని యె
వ్వారలు దైవయోగమున ♦ నంచితుఁ డయ్యె నటండ్రు గాని య
ప్పౌరుషమున్ హసింపరు స్వభావము యొక్కొక వేళ దుర్బలుల్
ఘోరరణంబులో గెలుపుఁ గొందురు పాఱుదు రెంత శూరులున్. ౬౪

సీ॥ ఆయుధములను మంత్రాంగంబులను సేన, లందు శక్తిత్రయమందు లేదు
కార్యసిద్ధి; సుఖాసుఖంబులు రెండు దై, వాధీనములు జయంబనఁగ నెంత
తనకన్న జయశాలి ♦ ధరఁగల్గు నపజయం, బన నెంత ? శత్రుపరాహతుండు
తనకన్నఁ గలఁడు వేదన కేమి యవకాశ, మాత్మ నెన్నఁటికిని ♦ హర్ష శోక

గీ॥ వివశుఁ జేయంగఁదగదు నిర్విషయవృత్తి, నాశ్రయించుట మేలు ధైర్యమున నెంతఁ
గీడు దొరలిన దుఃఖంబు ♦ గీలుకొనదు, ధీరునకు దైన్యదుఃఖముల్ ♦ దెరలి చనవె.

వ॥ అదియునుంగాక నిర్గుణుండును, నిర్మలుండును, నిరంజనుండును, నిరుపమానుండును,
నవ్యయుండును, నచలుండును, ననాదినిధనుండును, జతుర్వింశాతిరిక్తుండును నగు
జీవునకు సుఖదుఃఖములు జయాపజయంబులు ననుట గలుగునే? ప్రాణధర్మంబు
లగు క్షుత్పిపాసలును, మనోధర్మంబులగు శోక మోహంబులును, శరీరధర్మంబు
లగు జరామరణంబులునుం గలవే? షడూర్మిరహితుం డగు శివుండే కాఁడె
జీవుండు? దేహేంద్రియాదుల నంటక ప్రకృత్యతీతుండై నిర్వికారతఁ బ్రవర్తించుఁ
గాదే? ఇత్తెఱం గారసి దుఃఖాస్పదం బగు మమతం గడఁద్రోసి సుఖస్థానం
బగు హర్షం బవలంబించి భవితవ్యం బవశ్యభోక్తవ్యం బని నిశ్చయించి సుఖం
బునఁ బుణ్యక్షయంబును, దుఃఖంబునఁ బాపక్షయంబును నను కీలెఱింగి యానందం
బున నిశ్చలుండై కృతోద్యోగి యగువానికి సర్వకార్యసంసిద్ధి యగునని ధిషణుం
డుపదేశించిన. ౬౬

మ॥ పురుహూతుండు బృహస్పతిం గని సమిద్భూమిన్ హయారిన్ నిజ
స్థిరదోర్విక్రమకేళి నల్పి విజయశ్రీ జెందఁ గాంక్షించితిన్
బరిహీణోద్యముఁ డందునే యశము? ♦ నిష్ప్రాగల్భ్యమాఁ గాదె వై
రిరణారంభమున ... సుస్థిర్వ ... దిగ్గబో ...దుటల్. ౬౭

క॥ యతులకు విజ్ఞానము సం,తత మోదము విప్రులకును - ధర సంపదలన్
మతి గోరు వారలకు శ,త్రుతతిధ్వంసనముఁ జెప్పఁ - దుదురు గాదె? బుధుల్. ౧౮

క॥ బలుఁడును నముచియు నుద్య,ద్బలమున హతులైరిగాన - వాహద్వేషిన్
గలహించి నిహతుఁజేయన్, దలఁచితి నుద్యమము సేయు - తలఁ పొప్పుఁ గదా.

ఉ॥ దేవగురుండ వీవును నదీధరుఁ డద్రిధరుండు వజ్రిమున్
దేవ! యరాతి సంహరణ - దీక్షల నల్వురు తోడు గాదె? నా
కేవరునన్ సుఖస్థితికి - హేతువు లీయెడఁ గానరాసురున్
జేవ చెడంగఁ గొట్టుటకుఁ - జిత్తముఁ జేర్పఁగ నొప్పుఁ గదా. ౨౦

క॥ అని పురుహూతుఁడు పల్కిన, విని దేవగురుండు పొంగి - విశ్వాసముతోఁ
జనవున మన్నింపుచు ని,ట్లనియెన్ గంభీర వాగ్విహారము వలనన్. ౨౧

చ॥ హరిహయ! సంగరాంగణ విహారమునన్ గుతుకంబు గల్గి యు
ద్ధురత నెసంగితేని విను - తోడ్పడ మొక్కొ? నివారణ క్రియా
పరత రుచించునే? జయము - పట్టుల వేఱొకటన్ సమస్థితిన్
బరఁగుట వేత్తృలక్షణ మహార్యమటంచని పల్కెదన్ జుమీ. ౨౨

చ॥ హిమకరుఁ డింతి చేకొనిన - నేఁ బడు పాటు లెఱుంగవొక్కొ? నా
యమలిననీతి యెందుఁజనె - నాపద కోరిచి మేలుఁగొంటి న
ర్వము విధి మూల మెందు నురవల్లభ! దైవము భారకంబు సో
ద్యముల కుపాయసాధ్యములు - ధారుణిఁ గీర్తి సుఖాభియోగముల్. ౨౩

—• ఇంద్రుఁడు బ్రహ్మాదుల సన్నిధికి నేగుట •—

చ॥ తనగురుఁ డిట్లు తెల్పిన హితంబు నెద నూని శచీవిభుండు చ
య్యనఁ బరమేష్ఠిఁ గాంచి చరణానతుఁడై శరణంబు వేడుచున్
నను మహిషాసురుండు కదనంబున మార్కొన నుత్సహించె వాఁ
డనలవరానుభావమున - నప్రతిమానతఁ దేజరిల్లెడిన్. ౨౪

సీ॥ త్రిదివంబుఁ జేకొనఁ - దివిరి వీర్యోద్భటుల్, భటులు వేలకొలంది - పరిచరింప
నుద్యోగ మొనరించె - నురువడి మహిషుండు, భీతుండనై యిట్లు - బెదరి పాఱి
వచ్చి నీశరణంబుఁ - జొచ్చితి సర్వజ్ఞ, సాహాయ్య మొనరించి - శత్రునిహతిఁ
గావింపు మని వేఁడఁ - గమలాసనుఁడు నవ్వి, వైకుంఠమున కేగి - వారిజాక్షుఁ
గీ॥ గలసి కైలాసమున కేగి - కాలకంఠుఁ, గలసి కలహింపు మభియాతికర్కశుండు
హరిహరులు నీకుఁ దోడైన - నఖిల విజయ,సిద్ధి యయ్యెడు నటు సేయు దేవనాథ!

ఉ॥ దేశము కాలమున్ దెలిసి దేవపతాకినులన్ దళమ్ముగా
నాశలఁ బంపువెట్టి నళినాక్ష లలాటదృశుల్ సహాయ సం
వేశ మొనర్పఁ దారసిలి విగ్రహకేళికి నుత్సహింపు మా
వేశముఁ గూడ దిట్టయెడ వేమఱు నేర్పునఁ బోరు టొప్పగున్. ౭౯

గీ॥ అనినఁ బ్రార్థించి వాసవుం డబ్జగర్భు, ముందు నిడుకొని వైకుంఠమునకుఁ బోయి
సంస్తుతు లొనర్చి చరణాంబుజముల కెఱఁగి, వెన్నునకు నీయుదంతంబు విన్నవించి.

సీ॥ మహిషాసురుం డను మాయావి దోర్బల,ధుర్యుండు దితిజసందోహములను
బలువిడిఁ గూర్చి నాపయి నెత్తిరాఁ గోరి, యున్నవాఁ డతిచండిమోద్యతుండు
భీతుండనై భవద్భీషణ నిర్వక్ర, చక్రసాహాయ్యమ్ము సంతరించి
వైరి నిర్జింపఁగాఁ గోరితి నని వేఁడ, కమలాక్షుఁ డంభోజగర్భుఁ గూడి

గీ॥ వాసవుని వెంటఁ గొనుచుఁ గైలాసమునకు, నరిగి శంకరుఁ గాంచి వేదాగమార్థ
భరిత మంత్రస్తుతుల్ సల్పి ఫాలనేత్రు, నడుగుఁదమ్ముల కెఱఁగి యిట్లనియెఁ జక్రి.

గీ॥ దేవ! వాసవుఁ డార్తుఁడై దీనవదన, విహ్వలుం డయి మమ్మెల్ల వేడుకొనుట
మిమ్ము దర్శింపఁ గోరి సమీహితత్వ, మతులమై వచ్చితిమి మమ్ము మనుచు టొప్పు.

ఉ॥ మమ్ముఁ దృణీకరించి యసమానభుజాజితదిక్పరీవృఢుం
డమ్మనుజాళి లోకము దురాగ్రహమూని కలంపఁ జొచ్చె నీ
విమ్మెయి దోడుగామిఁ గలహింపఁగఁ జాలము లోకరక్షణా
ర్థమ్ముగఁ జిత్త మిచ్చి సమరమ్మునకున్ రుచి నింపు టొప్పగున్. ౮౦

కం॥ ఇందఱ మేకముఖమ్ముగ, సందీక పెనంగకున్నఁ జక్కఁబడఁ డో
యిందుధర! యనుచు వేడు ము,కుందుని మన్నించి సమరకుతుకము పొదలన్.

— మహిషాసురుండు దేవతలతో యుద్ధము చేయుట —

సీ॥ కదలెఁ గైలాస సంకాశ తాండవ మహా,వాహుఁడై చండికావల్లభుండు
కులధరోన్మూలనాకుంఠ పక్షానిల, పరిచయ తార్క్ష్యుని నెక్కి బలినియంత
పక్ష విక్షేప నిర్భర్త్సితాభ్రం బగు, నంచపై నెక్కి పద్మాసనుండు
బ్రహ్మాండకుహరనిర్భర మహోన్నతి మీఱు, నైరావతము నెక్కె నమరవిభుఁడు

గీ॥ పావకాంతకముఖదిశాపాలవరులు, మేష మహిషాదివాహులై రోషభీష
ణాకృతులు దాల్చి వెడలి రనంత దేవ,వాహినులు గొల్వ దితిజవిధ్వంసనేచ్ఛ.

చ॥ అమరచమూసమేతముగ నబ్జభవాదిసహాయధీరుఁడై
యమరవిభుండు దారసిలు టారసి యమ్మహిషాసురుండు దు

ర్దమ నిజవాహినీ సమితిదర్ప మెలర్పఁగ నావరింప వి
క్రమవిహృతిన్ వెలార్చి రిపుఖండన చండిమఁ జూప వెల్వడన్. ౮౩

వ॥ ఇత్తెఱంగున దేవదానవులు పరస్పరవిజయాకాంక్షలు ముప్పిరిగొనఁ బ్రళ
యార్ణవంబులఁ బోలె నొండొంటిన్ గదిసినఁ దుములంబు భీమంబై ప్రవర్తిల్ల
బాణ ఖడ్గ ప్రాస ముసల పరశ్వధ గదా పట్టిస శూల చక్ర శక్తి తోమర ముద్గర
భిండివాల హస్తులగు ప్రశస్తవీరులు తత్తదాయుధ హస్తులం గదిసి సరిగాఁ
బోరునెడఁ దత్తదాయుధ సంఘట్ట నోద్భూత దహన జ్వాలాజాలంబు లుత్పాత
భీషణంబులై ధరం దొరఁగ, రథంబులు వితథంబులైన నొండొక రథంబుల నెక్కి
తనివి సనక, కలహించు రథికులును, గరులు నుఱుమగుటయు, వారణాంతరంబుల
నధివసించి విగ్రహించు నాధోరణులును, దురంగంబులు సభంగంబు లగుటయు
వేర్వేఱ గంధర్వంబుల నెక్కి యేటులాడు రాహుత్తులును, బదాతులు గదాహతు
లైన వేఱొక వీరులం బిలిచి పోరాడు పదాతులును, గారు రుధిర ధారా ప్రవా
హంబులు నిర్వేలంబులై ప్రవహింపఁ గర చరణ భుజా వక్షో గండ నాసా
శ్రోత్ర శిరశ్శకలంబులు ధరణీతలంబు గప్పిన శమనమహానసంబుఁ బోలెఁ గదన
రంగంబు భయంకరంబై యుండఁ జిత్తురుండను దైత్యసేనాధిపతి పురందరుం గదిసి.

ఉ॥ జ్యానినదంబు లెల్లెడ దెసల్ గల వట్టును నిండి ఘూర్ణిలం
గా నిశితేషుపంచకము కార్ముక మం దిడి దైత్యుఁ డేయ న
య్యేనుశరంబులన్ నఱికి యే త్తెఱ వాసవుఁ డర్ధచంద్రధా
రానిహతిన్ నిశాచరునుశరమ్ముఁ బగిల్చెను మూర్ఛఁ దొట్రిలన్. ౮౫

ఆ॥ అంతఁ బోక చిత్తురారూఢ గజముపై, వజ్ర మెత్తి చమరె వాసవుండు
గజము పఱచె మ్రోయు ఘంటారవంబుల, మూక లెల్ల గలఁగ మోహరమున.

చ॥ అది గని యాగ్రహించి మహిషాసురమాళి బిడాలుఁ గాంచి దు
ర్మదుఁడయి వాసవుండు బలమర్దనుఁడై చెల రేఁగినాఁడు నీ
వదయత దేవసంఘముల నన్నిటిఁ బాఱఁగఁ దోలి యింద్రునిన్
జదుపుము నీభుజాబలము సర్వ మెఱుంగఁగఁ జేయుమీ! యనన్. ౮౭

ఉ॥ అంత బిడాలుఁ డాహవదురంతపరాక్రమధుర్యుఁడై దిశా
దంతియుఁ బోలు నున్నత మతంగజ మెక్కి మహేంద్రు డాయఁ గా
లాంతకుఁ బోలెఁ గ్రోధమున నంబకవృష్టి నిగుడ్చి వాసవుం
డెంతయు వాని నొంపఁ గడు నీసున శక్రశరాళిఁ ద్రుంచుచున్. ౮౮

క॥ పంచాశద్బాణముల న,చంచల దోర్వీర్య మెడల సంక్రందనునిన్
నొంచిన నవి నఱికె గదా,చంచద్గతిఁ దునిమె సామజముతుండంబున్. ౮౯

చ॥ తుండమునందుఁ బెట్టుపడి ✽ తూలుచు నేనుఁగు సంగరావనీ
మండలి ఘీంకృతిధ్వను ల✽మందములై నిగుడంగఁ బాఱుచోఁ
జండిమ: దూలి యద్దితిజ✽సైన్యము దైన్యము నొంది విచ్చె నా
ఖండలదోర్బలంబు సుర✽కౌతుక మావహిలంగఁ జేయఁగన్. ౯౦

చ॥ సమరమునందు బెగ్గడిలి ✽ సామజ మిట్లుఱుకన్ బిడౌజుఁ డు
త్తమరథ మెక్కి వాసవుని ✽ దర్ప మెలర్పఁగ నడ్డగించి ఘో
రముగ శరాళి ముంపఁగఁ బు✽రందరుఁ డాకులితేంద్రియస్థితిన్
దెమల జయంతుఁ డాజి సము✽దీర్ణబలుం డయి వానిఁ దాఁకుచున్. ౯౧

క॥ వచ్చితి జయంతుఁడను నిను, వ్రచ్చితిఁ జూడుమని యేను ✽ వాడిశరములన్
గ్రుచ్చిన నొల్లంబోవుచుఁ, జచ్చిన గతిఁ దేరిపై ని✽శాచరుఁ డొరగెన్. ౯౨

సీ॥ అన్నిశాచరు రథం✽బాహవభూమిలోఁ, సూతుండు దొలఁగించెఁ ✽ జూచి సురలు
జయజయధ్వనులచే ✽ సన్నుతించిరి పాక,శాసని, నింద్రుండు ✽ సంతసించె
సురదుందుభులు మ్రోసె ✽ సురవృష్టిగురిసె గం,ధర్వులు నప్సర✽స్తతులుఁ బెరసి
పాడిరి యాడి ర✽భ్రమున నిర్జరమాని, నటియింపఁజొచ్చె ✽ నానంద మలరి

గీ॥ దేవవిజయారవము విని✽తెలిపియాని, యీసు మది నుప్పతిల మహి✽షాసురుండు
తామ్రుఁ డనువానిఁ బంప నా✽తండు గినిసి, యాదితేయపతాకిని ✽ నడ్డగించి.

కం॥ ధారాధరములు పాథో,ధారల ధరఁ గప్పునటు లు✽దారుఁ డరిచమూ
వారము గప్పుచు బలదు,ర్వారుండై సురబలముల ✽ వారింపంగాన్. ౯౪

ఉ॥ దండధరుండు చండభుజ✽దండమునన్ బెనుగొండఁ బోలి యు
ద్దండత నొప్పు దండమున ✽ దానవ ఖండన చండ పాండితిన్
భండనకేళి సల్పుచు న✽పార పరాక్రమ సంప్రయోగ శౌం
డుండయి వచ్చి తాఁకెను గ✽ఠోర విరోధిని నవ్వరూథినిన్. ౯౫

చ॥ వరుణుఁడు పాశహస్తుఁడయి ✽ వాసవు నానతిఁ గాంచి యామినీ
చరబలమెల్లఁ బెల్లగిలఁ ✽ జండ దృగర్చులు దావ పావక
స్ఫురదురువిస్ఫులింగములు ✽ చూఱలు గట్టఁగ నాత్మ సేనతోఁ
దరణిసుతానుగుం డగుచుఁ ✽ దారసిలెన్ బిశితాశి సేనలన్. ౯౬

కం॥ మహిష మకరాధిరోహణ, మహితులు యమవరుణు లాజి ✽ మార్కొనుటను వృ
త్రిహుఁడు నిజసైనికాళీ,బహుళుండై గదిసె దాన✽వప్రతతిపయిన్. ౯౭

వ॥ ఇట్లిరుదెఱంగుల దేవదానవవాహినులు దలపడి పోరాడునెడ, శరధారాసారంబుల ముంచియు, ఖడ్గంబుల నఱికియు, ముసలంబుల మొత్తియు, శక్తులఁ జదిపియుఁ, బరశ్వథంబుల ఖండించియు, సింహనాదంబు లొనర్చుచు నిర్వాగువీరులు శతసహస్రంబుల కొక్కఁ డొక్కండును, నొక్కొక్కనికి శతసహస్రంబులుగాఁ బోరాడుచుఁ దనివిసనక పదఘట్టనంబుల నెగయురుధిరపంకంబున నభంబునకు నకాలసాంధ్యంబుసొంపు సంపాదింపుచుఁ బతద్గజఘటాంతరీపంబులఁ జుట్టుకొని లోహితతరంగిణీనివహంబులు వెల్లువలు గట్ట నిట్టట్టనరాని బెట్టిదంబుల నెట్టుకొని మట్టుమల్లాడ జగజెట్టి యోధుల నిరోధంబులఁ దొలంగంజాలక, బీరంబులు చెడి సంకులంబున మడియువారును, మింటం బూదండలు గేలం గొని యన్యోన్యశూరస్వయంవరార్థంబుగా వాదించు నప్సరోవేదండయానలదండ లపేక్షించి యొండొండ భండనంబున కుత్సహించి, తొలంగక రణంబున మేనులు దొరంగువారును, నాయకులు దూరమ్మున సమరకుతూహలులై యున్నవారిం దేనిఁ జనుట మేలని సన్నసన్నలం జాఱువారునై కాలత్రయనిరుపమానంబైన సాంపరాయంబు ప్రవర్తిల్లు నప్పుడు. ౯౮

ఉ॥ అంతకుఁ డంత నాగ్రహనిరంతరదంతురితాంతరంగుఁడై
చెంత శరాసనాంబుదవిశేషశిలీముఖజాలవృష్టి న
శ్రాంతము ముంచఁ గొండవలె శక్తినిఁ జేకొని దాని వ్రేయ నొ
క్కింతయుఁ జంచలింపక సమీరితకార్ముకుఁడై మహోద్ధతిన్. ౯౯

ఉ॥ వాసవుఁ డాదిగా నమరవారము నెల్లఁ దృణీకరించి సం
త్రాసము పుట్టి బెట్టుగఁ *గరదంబకదంబములన్ వెలార్చి ఘో
రాసురపాలురన్ ముదమునందఁగఁ జేయఁగ నిల్వు నిల్వు మం
చాసురవీరుపై నినిచి రస్త్రము లింద్రముఖామరేంద్రులున్. ౧౦౦

కం॥ ఏకముఖమ్ముగ శరములు, పాకారిప్రముఖు లెల్లఁ బయిపయి నేయన్
జీకాకై తామ్రుఁడు మూర్ఛాకులుఁడై పడియెఁ జెదరె నాసురబలముల్. ౧౦౧

శా॥ తామ్రుం డిట్టుల మూర్ఛ నొందుటయు దుర్దాంతప్రతాపక్రియా
సమోత్సాహధురీణతన్ బెనఁగుటన్ నానాముఖంబై బలం
బో? మార్గ్రిఁ గూలిన పక్షిబృందముగతిన్ బోవన్ నటత్క్రోధమై
ధూమప్రజ్యోతియుఁబోలె మోము గనలన్ దోడ్తో హయారాతియున్. ౧౦౨

మ॥ గద సారించి సురావళిన్ గదిసె నింకన్ బోవరా దంచు న
క్కుదనక్ష్మాతల మెల్లఁ గ్రుంగఁగ నహంకారంబు మిన్ముట్టఁగా

* కదంబ = బాణములయొక్క, కదంబములన్ = సముదాయములను.

సదయుండై చదుమంగ నొక్కమొగి హాహా యంచు బెగ్గిల్లుచున్
ద్రిదశాధీశుని మాటుచేర నతఁ డుద్దీప్తిన్ గజారూఢుఁడై. ౧౦౩

ఉ॥ కాసరదానవున్ గదిసి కార్ముక మెక్కిడి తూపు లేయ న
వ్వాసవుఁ జీరికిన్ గొనక వాఁడు గదాహతిఁ గుంజరంబు సం
త్రాసము నొందఁజేయ భిదురమ్మునఁ దద్గద ద్రుంచినైచి య
క్కాసరదైత్యుఁ ద్రుంచుటకుఁగాఁ గులిశంబు కరంబునన్ దృఢా
భ్యాసత నిల్పి పైకుఱుక వాఁడును ఖడ్గముఁ బూని పైకొనెన్. ౧౦౪

క॥ తఱుగని పోరాటములన్, దఱిమి తఱిమి యిరువు రిట్లు దార్కొని మదిలోఁ
బెరఁగిన యీసునఁ బోరిరి, మెఱయింపుచు భిదురఖడ్గసమిహిరప్రభలన్. ౧౦౫

చ॥ మహిషనిశాచరుండు బలసమర్దనువజ్రము దాఁకి యాయుధో
ద్వహమగు కేళి ఖడ్గము వృథాశకలీకృతమైన విస్మయా
వహముగఁ గొంత సేపు రణవల్గనముల్ వివిధాయుధావళిన్
విహృతి యొనర్చి యుల్లసిలె విశ్వవిమోహినిమాయఁ జూపుచున్. ౧౦౬

శా॥ అమ్మాయామహిమంబునన్ బ్రబలమాయాకాసరాకారభా
వ మ్మాకాశము భూమియున్ గలయ దుర్వారాయుధోద్యద్భుజో
గ్రమ్మై కోటిసహస్రవాహరిపుసంఘుం బాత్మసేనావళిన్
గ్రమ్మన్ జూచి పురందరుండు భయసంగ్రస్తాత్ముఁడై యున్నెడన్. ౧౦౭

చ॥ వరుణుఁడు భానుజుండును దివాకరుఁడున్ జ్వలనుండునున్ భయా
తురులయి పిక్కబల్మిని మతుల్ గలఁగన్ జెడి పాఱుచున్ మహే
శ్వరహరిధాత లున్నయెడ వారక యొత్తిగిలంగ వారు భీ
కరసురవైరిమాయఁ గని కౌతుక ముప్పతిలన్ మహోగ్రులై. ౧౦౮

క॥ కనమే రక్కసులన్ గడు, వినమే యెందెందు వీని విక్రమకేళీ
ఘనచరిత మద్భుతంబని, కొనియాడుచుఁ దారసించుకొను వేడుకలన్. ౧౦౯

ఉ॥ ఎచ్చటఁ జూచినన్ నిశిచరేంద్రునిరూపమె కాన నాజికిన్
జొచ్చి యనేకులన్ జదిపి చూడఁగ నెప్పటిపోల్కి రోదసిన్
గ్రిచ్చఁగ సూచికాగ్రమునకున్ జొరనీని సురారిమాయకున్
గ్రచ్చుఱ లోఁగి చేయునది గానక సాగ్రహులై రణస్థలిన్. ౧౧౦

క॥ కందుగొనని మహిషాసుర,బృందములన్ గెడపి గెడపి పెరుఁగుచుఁ బైపై
గ్రిందుకొను వానిరూపుల, సందడిఁబడి విసువునెడల జలజాక్షుఁ డొగిన్. ౧౧౧

శా॥ మాయానిర్మాణప్రచండమహితాహంమండపప్రభాచక్రముల్
స్ఫాయత్కల్పధనంజయస్ఫుటశిఖా జాజ్వల్యమానాస్త్రధా
రాయత్తప్రకటప్రతాపదళితాహవ్యగ్రామృతాంధోద్విష
చ్ఛ్రేయశ్చక్రముఁ జక్రముల్ బనిపె విచ్ఛిన్నాప్రసన్నక్రముల్. ౧౧౨

వ॥ అయ్యవసరంబున నా సుదర్శనంబు దైత్యదర్పనకర్శనం బై దశదిశాంతరాళం బులఁ గరాళంబులగు మాయామహిషాసురశతకోటిరూపంబుల రూపుమాపిన వెఱఁగంది దైత్యకుంజరుండు పరిఘంబు గొని మండలప్రచారంబుల వసుంధరా తలంబు గంపింపంజేయుచు భువనాంధకారం బడంగించి వెలుంగు మార్తాండ మండలంబు పగిది వెలుంగు దివ్యప్రహరణంబునకు నెఱచఱవక, సృష్టిస్థిత్యంత కారులగు జగదేకవీరుల్ మార్కొనం గడంగినఁ జిత్రరథుండును, సుగ్రీవుండును, నుగ్రవీర్యుండును నను సేనాధిపతులు రథారూఢులై తోడుపడ నసితుండును, ద్వినే త్రుండును, బాష్కలుండును, నంధకుండును మొదలగు నక్తంచరతల్లజు లొక్కు మ్మడి సన్నద్ధులై నడచిరి. ఇట్లు ప్రళయాంబుదంబులుపోలె గర్జిల్లుచు దైత్యవీరులు పొదివిన వత్సగణంబులు వృకంబులచేఁ జిట్టుపడు తెఱంగున సురగణంబులు చెదరి పఱవం దొడఁగిన శరపరంపరల వారలను ముంచుచు నంధకాసురుండు నారాయణుం దాఁకి. ౧౧౩

క॥ పంచశిలీముఖములచేఁ, బంచాయుధు నొంప నఱికి పంచాస్త్రముల్
జించె దైత్యునిగాత్రము, కొంచక హరి రణము ఘోరఘోరం బయ్యెన్. ౧౧౪

మ॥ పరశుప్రాసభుసుండిచక్రపరిఘాబాణాసికౌక్షేయతో
మరముఖ్యావితథాయుధంబుల రణక్ష్మామండలిన్ దైత్యవీ
రరమానాథుల కయ్యెఁ బోరితము వీరవ్రాతదృగ్విస్మయా
కరమై భీకరమై పరస్పరజయాకాంక్షల్ గడల్ద్రొక్కఁగన్. ౧౧౫

ఆ॥ ఆదికాలమునను హరిహరుల్ పోరిన,పగిది నున్న దంచు బర్హిరాస్యు
లబ్బురంబు నొందిరచ్యుతుండును నంధ,కాసురుండుఁ బోరునవసరమున. ౧౧౬

ఉ॥ అంధకుఁ డంతలోనఁ బరిఘాహతిఁ దార్క్ష్యుని వేయఁ గేశవుం
డంధకు నుగ్రదృష్టిఁ గని యండజనాథుని మేను హస్త సం
బంధము తొంగలింప దృఢపాటవయుక్తి మొనర్చి శింజినీ
సంధితశార్ఙ్గముక్తశరసంతతుల్ నిగుడింపఁజేయఁగన్. ౧౧౭

ఆ॥ క్రవ్యభోక్త వాని ఖండించి యేఁబది, నిశితవిశిఖములను నీరజాక్షు
మేనఁ జొనుపునంతలోన వైకుంఠుండు, చుట్టువాలుఁ బనుప మట్టుమీఱి.

చ॥ తనపయి వచ్చు భీషణపటుత్వ తాశనకీలయుఁ బోని చక్రముం
గని తన కేలి యాయుధము ౹ తత్క్షణ తలమధ్యమునందు వైవఁ జ
య్యనఁ దొలఁగెన్ నిరాయుధుని ౹ జంపఁగఁ దోడనె దైత్యుఁ డార్చె దే
వనిచయ మెల్ల బెగ్గడిలె ౹ వారిజలోచనుఁ డీసునన్ గడున్. ౧౧౯

చ॥ సురలు చలించు టాసురులు ౹ శూరతఁ బైపయిఁ దారసించి యు
ద్ధురులయి వచ్చు టారసి విఘుంఠుడు దకంఠవిదారి శత్రుసం
హారణకరోగ్రభీకరగదాహతి మూర్ధతలంబు వ్రయ్యఁగాఁ
గరమున వైవ మూర్ఛిలుచుఁ ౹ గ్రవ్యభుజుండుఁ బడెన్ ధరాస్థలిన్. ౧౨౦

కం॥ అంధకు నిట్టుల హరి ని,ర్గంధన మొనరింపఁ గనలి ౹ క్రవ్యాశివిభుం
డింధనబహుతాప్రజ్వలి,తేంధానుఁడు పోలె మండి ౹ యేత్తెఁ గలనన్. ౧౨౧

శా॥ క్ష్వేడారావమునన్ దిశల్ వగుల నక్షీణ ప్రతాపోజ్జ్వల
తీక్ష్ణక్రీడాలోలత మాధవున్ గదిసి సంఘీభూత దేవాదులన్
వ్రీడానముఖులఁ జేయఁ బోకుమని మార్గణ్వమున్ వింట సంధించి ప్రక్ష్వే
ష్వేడాసారము నింపి శౌరి యగలింపఁజేన్ వానిమే నమ్ములన్. ౧౨౨

కం॥ అన్యోన్యశరామర్దం, బన్యోన్యాంబకవిభేద మన్యోన్యవచో
విన్యాసకర్కశత య,న్యోన్యజయాకాంక్ష యయ్యె ౹ హరికి నసురకున్. ౧౨౩

గీ॥ ఇందిరావల్లభుఁడు గద ౹ యెత్తి వాని,శీర్షమున వ్రేయ మకుటంబుఁ ౹ జిదిపి వ్రేటు
బ్రహ్మరంధ్రంబుసోకనప్పలలభో,క్త,యిలఁబడియెమూర్ఛనొందిదైత్యులుగలంగ.

మ॥ సురసంఘంబుల దుందుభిధ్వనులు విస్ఫూర్తిన్ విజృంభించె నా
సురసంఘంబుల యార్తనాదములు మోసుల్ గట్టె వాఁ డంత ని
ద్దుర మేల్కొన్న తెఱంగునన్ నుసిలి తోడ్తో మాధవున్ దాఁకి చే
పరిఘం బెత్తిన డించె నీర్ష్యఁ బెరుఁగన్ ౹ బద్మాక్షుఁ డాలోపలన్. ౧౨౪

ఆ॥ విహగవల్లభుండు ౹ విగ్రహక్షోణికిఁ, దొలఁగి చనియె సురలు గలఁగి పాఱె
హరిని మఱుఁగుఁజొరఁగ ౹ నడ్డమై ఫాలాక్షుఁ, డశ్వవైరి ముంచె ౹ నస్త్రవృష్టి.

సీ॥ తఱిమి యకర్కశకంఠుఁ దాఁకి సైరిభనిశా,చరుఁడు వక్షమునను ౹ శక్తి వైచి
గర్జింప నాయస్త్రఘాతంబునకు నోర్చి, కన్నుల నరుణప్రకాశ మెనయ
శూలమ్మునను గ్రుమ్మ ౹ మే లాఘవమ్మున, వ్రేటు దప్పించి యవ్వీరుఁ డెగయఁ
దెప్పిరి విష్ణుండు ౹ దేవదేవుని గూడి, మార్కొన నిర్వుర ౹ మహిషుఁ డార్చి

గీ॥ యెదురుకొనికొమ్ముచిమ్ముల ౹ నెత్తియెత్తి, వృషభగరుఁడులవైచుచుకీకయడరఁ
బుచ్ఛమెత్తి శకృన్మూత్రవిస్ఫారణముల, సమరతలమెల్ల దూషించె ౹ సమదవృత్తి.

చ॥ అతిమురి శైలశృంగముల హస్తయుగంబున నెత్తి తెచ్చి వే
సరక నిశాచరోత్తముఁడు శంకరశార్ఙ్గులపై నిగుడ్ప డ
గ్గఱి తమఁ దాఁకకుండ శరఘట్టనలన్ విదళించుచున్ గడున్
దెరలక బాణఘాతములఁ దీవ్రతఁ జూపిరి వార లాతనిన్. ౧౨౮

చ॥ చెదరక దానవుండు గిరిశృంగములన్ దనతోఁకఁ జుట్టి బె
ట్టిదముగఁ బెల్లగించి నిగుడింపఁగ శౌరి శిలీముఖావళిన్
జిదుముచు వాని నంపగమిచేఁ బొదువన్ దితిజుండు వానినిన్
గదనతలంబునన్ నుఱుముగా నొనరించుచుఁ బేర్చి యార్చినన్. ౧౨౯

గీ॥ కనలి దైత్యవిరోధి చక్రంబుఁ దొడరి, వైవఁగఁ దదాహతిని రణావని నతండు
సొమ్మసిలఁబోయి తత్క్షణస్ఫూర్తి మెఱయ, మానుషాకృతి నూని యుమ్మలిక రేఁగి.

ఉ॥ పర్వతసన్నిభోన్నతి నపాకృతసర్వసుపర్వగర్వుఁడై
శర్వజనార్దనాగ్రమున సంభృతదీర్ఘగదాపరిమర్దనా
ఖర్వవిహారలోలుఁడయి క్రాలుటఁ గాంచి సురాళి భీతిలన్
ధూర్వహుఁడై కిలార్చి లయదుర్భరదండధరుండొకో యనన్. ౧౩౧

మ॥ పటుభేరీపటహాదివాద్యములు శంఖభల్లీల మ్రోయంగ ను
త్కటచాపాసిముఖాయుధోద్భటభటక్రవ్యాదసేనల్ సమి
చ్చటులారంభములై పయిన్ గవయ నబ్జంబొత్తె గోవిందుఁ డొ
క్కట భూభాగము సంచలించె రణరింఖత్పాంచజన్యధ్వనిన్. ౧౩౨

గీ॥ కదలి పొరలెత్తి వచ్చు నక్కడలిఁబోలు, దితిసుతపతాకినీకోటి తెరలిపాఱె
మారుతోద్భూతమగు మేఘమండలంబు, కరణిహరి యొత్తు శంఖనిర్ఘాతములను.

చ॥ మునులును దేవసంఘములు మోములఁ దెల్విఁ బుగుల్కొనన్ జయ
ధ్వను లలరించి రెల్లెడల దర్పమెలర్పఁగ దేవసైన్యముల్
సునిశితశస్త్రసంభరణసూచితసంగరకౌతుకోద్యమ
స్వనితములన్ సురారుల నవారణ వెంబడి నంటె నొక్కటన్. ౧౩౪

మ॥ నిజసేనల్ దెరలంగఁ జూచి మదిలో నిర్వేదమున్ బొంది త
ద్విజయోద్ధూతి జనింప మానుషసమావేశంబుఁ జాలించి పె
న్గజవైరిప్రబలాకృతిన్ గొని సటాఘాటంబు లల్లార్చి దే
వజయోల్లాసత సింహనాదము లొనర్పన్ బాఱె దేవావళుల్. ౧౩౫

వ॥ అంత దితిజపుంగవుండు సముత్తుంగచరణసహస్రప్రస్ఫురత్కరాళకరవాల ధారా
నిశితనఖరఖరతర కోటీసమాఘాతంబులను భయదదండధరదండసముద్దండదంష్ట్రా
కాండంబులను జక్రధరస్యందనపక్షంబులు క్షరద్రుధిర ధారా సారంబు
లుగా జించుచుం గొఱుకుచుం ద్రియంబకవృషభంబుపయిం బడి మూపురంబు
పద్మపరిభాభాసురంబులగు తరసంబు లురలించి వసుంధరాసుందరికి నూపురం
బులు వోలె నలంకరింపుచుఁ బితామహరాజహంసంబుపయిం దుమికి శరచ్చంద్ర
సంకాశంబులగు గరుత్పరంపరలు దొలంగించి నింగికిఁ బరివృతశరన్నీరదంబుల
చెలువు దొలకించుచు నైరావతపుండరీకవామనకుముదాంజనపుష్పదంతసార్వభౌమ
సుప్రతీకాదినిలింపస్తంబేరమంబుల కుఱికి ఝుంపావాతం బంబుదమ్ముల
విరియంజేయుచాడ్పున సాధోరణాంకుశఘాతంబులకున్ గట్టువడక పలాయ
నంబు నొందించుచుఁ గన్నుల నుల్కాశంకాసంకేతంబులగు దృక్పాతంబుల
సురచమూసంఘాతంబుల బునరాగమననిరపేక్షపరిద్రవణసముపేతంబు లొనర్చుచు
మండలభ్రమణంబులఁ గాతరులం బట్టి కండ లూడం గఱచుచుఁ గట్టెదుట
నిల్వనీక నెల్లరం బట్టి పుష్పితకింశుకమహీరుహసంకాశులన్ జేసిన సుర
సేనలు దైన్యంబు నొంది విచ్చియున్ నొచ్చియున్ బాఱియున్ జీకాకై చేయు
నది లేక దిక్కులన్ జిక్కువడువారల నొక్కియుఁ దొక్కియు మ్రక్కియు
సటలు నిక్కించుచు నెక్కడం జూచినం దానై విజృంభించు సింగంపుహూపు
రక్కసునకు నోటఱి బ్రతికి చూచెద మని పరాఙ్ముఖులై పఱవందొడంగిన. ౧౩౬

క॥ హరి మోహరించి చక్ర, స్ఫురణంబున రూపుమాపఁ * జూచి యులాయున్
గరచక్రంబున వైచిన, భరితజ్వాలముల తోడఁ * బైఁబడునంతన్. ౧౩౭

క॥ కేసరిత మాని యమ్మహి, షాసురుఁ డద్రియును బోలె * నంభోజాక్షున్
గాసిలఁ జేయుచుఁ గొమ్ముల, వ్రేసెన్ గుండియలు చెదర * వెన్నుం డంతన్. ౧౩౮

— మహిషాసురునకు భయపడి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు స్వస్థానముల కేగుట. —

చ॥ ఇది సమయంబు గా దితని * నెక్కటి పోరఁగఁ గాలపర్యయం
బుదితముగాఁగఁ జూడఁదగు * నోజ యటంచు విషాణభుగ్నమా
హృదయము చేత నొత్తుచు ని * జేచ్ఛ వికుంఠపురంబుఁ జేరె దై
న్యదశ విరించి శర్వులును * నచ్యుతుఁ గూడిరి ప్రాణరక్షకై. ౧౩౯

చ॥ భిదురము కేలఁ బూని బల * భేదనుఁ డాహవభూమి నిల్చె న
య్యదనునఁ బోరఁజాల కన * లాంతక నైరృతపాశివాయుయ
క్షదనుజభిచ్చరుల్ నిలిచి * కాపొనరించిరి నిర్జరేంద్రునిన్
బొదివి సుపర్వసేనలును * బోవక ప్రో[illegible]నత్తఱిన్. ౧౪౦

మ॥ ఇనచంద్రుల్ కృతనిశ్చయంబున సురాధీశుల్ విడంబాల కా
జి నవోత్సాహముఁ జూపఁ దారసిలి నిశ్చింతన్ గృతోద్యోగులై
ఘనసంరంభముఁ జూపి రెల్లరు సమగ్రక్రోధదీప్తాయుధ
స్తనితధ్వానము జూపుచున్ భయదరక్షస్సేనపై నుబ్బునన్. ౧౪౧

—. మహిషాసురునకు భయపడి దేవతలు పాఱిపోవుట .—

గీ॥ అర్చి సింహధ్వను లొనర్పసురసైన్య, మురవడించిన తుముల మహానాదమయ్యెఁ
బ్రళయవార్ధులు రెండుఁ దారసిలునట్లు, దేవదానవదుర్ధమోద్వృత్తిఁ దనరె.

శా॥ క్రుద్ధుండై మహిషాసురుండు మనుజక్రూరాకృతిన్ దాల్చి ని
ర్విద్ధాత్యుగ్రవిషాణఘట్టనల దోర్వీర్యంబునన్ దేవతా
యోద్ధృవ్రాతములన్ మథింపుచు రణోత్సాహియై సంతతా
రుద్ధామర్షనియుద్ధయుద్ధముల సంరోధించె నొక్కుమ్మడిన్. ౧౪౩

కం॥ తరులన్ గిరులన్ నెత్తురు, లురలన్ గరులన్ మథించి యురువడిఁగ నభ
శ్చరులన్ మరలంజేయుచుఁ, గరకరవాలంపుదుడుకు గనఁబరచె ననిన్. ౧౪౪

మ॥ ఖురఘాతంబులఁ బుచ్ఛచాలనములన్ గ్రోధోగ్రహుంకారని
ర్ఝరనాదంబుల శృంగఘాతనములన్ బల్మారు వేధించుచున్
సురసంఘంబుల నుగ్గునూచముగ సంక్షోభింపఁగాఁజేసి కా
సరదైత్యేంద్రుఁడు విక్రమించెఁ ద్రిజగత్సంహర్త రుద్రున్ బలెన్. ౧౪౫

శా॥ రోదోరంధ్రము వ్రయ్య నార్చుచు శరారుండై లులాయాసురుం
డాదిత్యాధిపుఁ డాదియౌ దిగధిపుల్ హర్షంబు దక్కంగ ని
ర్భేదోల్లాసముఁ జూపి శైలతరునిర్భిన్నాంగులన్ జేయ నా
నాదేశంబులఁ బాఱఁజూచిరి గతానందైకమందస్పృహన్. ౧౪౬

సీ॥ దిగధిపుల్ డాగిరి దేవఘాతములలో, గంధర్వు లడఁగిరి కాననములఁ
గిన్నరుల్ జరిగిరి గిరినికుంజములకు, యక్షు లొత్తిలిరి ద్వీపాంతరముల
సిద్ధు లేగిరి తపస్సిద్ధుల మనువేరఁ, జారణుల్ తీర్థసంచారులైరి
గరుడు లంతర్ధానకౌశలం బందిరి, గుహ్యకుల్ పాతాళగుహలు చనిరి

గీ॥ మఱియు దేవసహాయసంబంధు లెల్లఁ, దల్లడిలి వాని శరణంబు దఱిసి మనిరి
అశ్వరిపుభీతి యేమని యనఁగవచ్చు, దేవసంఘంబు లెల్లను చేవదక్కి.

మ॥ జయభేరుల్ మొరయించి దైత్యబలముల్ సన్నాహసంరంభతన్
హయహేషాకరిబృంహితధ్వనులతో నంతంత వేష్టింప న

త్యయకాలుండును బోలె శత్రువిజయోత్సాహంబు దీపింప ని
ర్భయుండై వీటికిం బోయె సంతసము వారాశిం గడల్ద్రొక్కఁగన్. ౧౪౫

గీ॥ నిరుపరోధాజివిజయనిర్నిద్రుఁ డగుచు, సమరపురిఁజూచునుత్సాహసమంకురింపఁ
జటులపటహాదివాద్యనిస్స్వనము లులియ, వెడలెవినువీథిమహిషుండువిజయయాత్ర.

సీ॥ పట్టించె శృంఖలాబంధంబు నభ్రము, వల్లభం బైన దేవద్విపంబు
శరరజ్జుసంధానసంబాధముగఁ గాడిఁ, గట్టించె భటులచేఁ గామగవిని
బటకుటీరము లెల్ల బలియించి సేనాధి,నాథుల విడియించె నందనమున
మందాకినీవారి మదగజంబులఁదోలి, కడిగించె రణరక్తగంధధూళి

గీ॥ గోపురమ్మున్న వేల్పులఁ గొట్టి తనదు, భటుల కోటల నిల్పి నిర్భయత నైజ
యంతమునఁ గొల్వుదీర్చె వాహాభియాతి, నిష్ప్రతీపప్రతాపనిర్నిద్రుఁడగుచు.

### —• మహిషాసురుఁడు స్వర్గంబు పరిపాలించుట. •—

కం॥ సురరాజ్యము చేకొని యా,సురవల్లభుఁ డిందసభను సురవారవధూ
వరనృత్తగీతవాద్య,స్ఫురణంబులఁ బొద్దుఁ గడపు సురవైరులతోన్. ౧౫౧

కం॥ స్థానభ్రంశ ధనక్షయ, మానత్యాగముల సురలు మర్దితులై యెం
దేని చని రొక్కొ? వెదకిన, గానఁబడరైరి దైవగతి గన వశమే? ౧౫౨

మ॥ శతవర్షంబులు సైరిభాసురుఁడు నిస్సాపత్న్య పౌరందర
ప్రతతాభోగసుఖానుభూతి గొని దివ్యప్రాభవుండై మహో
న్నతభద్రాసన మెక్కి యప్రతిహతానందానుసంధానసం
భృతచిత్తస్థిరతావశీకృతజయశ్రీఁ జెందె నుర్వీశ్వరా! ౧౫౩

ఆ॥ సురలు గిరులఁ దరుల జఱుల నెవ్వారల, కెఱుకపడక దాఁగి యింద్రుతోడ
నెనసి భారతీశునెడ కేకతమ చేరి, శరణమొంది బ్రహ్మసదనమునను. ౧౫౪

సీ॥ సిద్ధపద్మాసనాసీనుఁడై రాజన,త్శ్రీలు రంజిల మరీచిప్రభృతులు
మునులు సిద్ధులు వేదముల్ పురాణమ్ములు, ధర్మశాస్త్రములు సత్కర్మవిధులు
మూర్తిభవించి సమ్ముఖమునఁ గొలువంగఁ,గొలువున్న నలువఁ గన్గొని ప్రమోద
భరితులై సురలు సోపనిషద్రహస్యార్థ,సంభృతస్తుతుల నాశాంతనతుల

గీ॥ దేవదేవ! జగన్నాథ! దీనపోష, భారతీశ! దయానిధీ! పరమపురుష!
యనుచుఁ బ్రార్థించి యాఁద్దలంద్దుఁ గేలు,గవలుగీల్కొల్పిపల్కిరిశరణనపుడు.

ఉ॥ దానవపీడ నొంది స్వపదచ్యుతిఁ గొండలఁ గోనలన్ భయా
ధీనులమై చరించు మముఁ దేర్పఁగ నీవె కదా? సుఖానుసం
ధానము సేయ నెవ్వరికిఁ దండ్రికిఁ బుత్రులచో నుపేక్ష యెం
దైనను గల్గునే? విపదవాప్తి హరింపుము పద్మసంభవా! ౧౫౬

మ॥ అపరాధంబులు పెక్కు గల్గిన దురంతాయాససంక్షుబ్ధపు
త్రపరిత్యాగము తండ్రికిన్ దగునె? దైత్యవ్రాతపీడాహతిన్
విపదంభోనిధి మున్గినారము దయావిర్భూతి వాటించి మా
నెపముల్ సైఁచి కటాక్షవీక్షణసుధానిష్యూతిఁ గావింపవే! ౧౫౭

ఉ॥ కామగవీమణిన్ మిగులఁ గాసిలఁజేసి పరిగ్రహించి స
ర్వామరరాజ్యసంపద లహర్నిశమున్ భుజియింపుచున్ మహో
ద్దామత నందనద్రుమవితానము చూఱలు వెట్టె నక్కటా!
యా మహిషుండు వేల్పుసిరు లన్నియుఁ జక్కడఁచెన్ జతుర్ముఖా! ౧౫౮

ఉ॥ నీ వెఱుఁగంగరాని ధరణీగతచేతనచేష్ట లున్నవే?
దేవవిరోధిచేఁ బడిన దీనత నీమదిఁ దోఁచదొక్కొ? పుం
భావము లేటిలోఁ గలసె బన్నముపాలయి వీటఁబోయి నీ
సేవకుఁ బాత్రవృత్తిఁ గని చేరితి మింక మమున్ గణింపవే! ౧౫౯

ఉ॥ ఎచ్చటఁ బోతిమో? బ్రతుకు లెవ్విధి యయ్యెనొ? దుష్టచేష్టకున్
జొచ్చి సురారి మమ్ము బలశూన్యులఁ జేసి నిరాకరించె; మే
మెచ్చటఁ జొచ్చువారము? పరేంగితవేదివి మత్సుఖార్థివై
వచ్చి విరోధిఁ ద్రుంచి సుఖవర్తులఁ జేయుము పంకజోదరా! ౧౬౦

మ॥ గిరులన్ జేరి దవానలాంతరకనత్కీలాకలాపంబులన్
బరితఃపీడల నొందినారము మమున్ బాలింప నెవ్వారు? గీ
ర్వర! మచ్ఛాంతిపదంబు నీవ యని నేర్వన్ గోరి నీసన్నిధిన్
బరితాపాపహవాంఛఁ జేరితిమి కార్వన్ బోలదే పద్మజా! ౧౬౧

ఉ॥ దీనమనస్కులై బయలు దేఱుచుఁ జాల్కొను కంటినీరు నె
మ్మేనులఁ గ్రమ్మఁ జెమ్మటలు మించి విషాదము నొంది కుందు నిం
ధానముఖావళిన్ గని సుధారసశీతలదృక్పరంపరా
ధాన మొనర్చి పల్కె మధుధారలు చిల్కెడు పల్కు లాదటన్. ౧౬౨

మ॥ వరగర్వంబున మత్తుఁడై దితిజుఁ డవ్యాఘాతదోర్విక్రమ
స్థిరదుశ్చేష్టితవర్తనంబున మిమున్ దీర్ఘక్రుధావేశతన్

బరిభూతిఁ బడఁజేసె వాఁడు పురుషప్రధ్వంసయోగ్యుండు గాఁ
డరయన్ స్త్రీవధ పాతుఁ డిందఱము కైలాసంబుఁ బోవందగున్. ౧౬౩

గీ॥ దేవదేవున కీరీతిఁ దెలిపి మీఁద, శంకరునిఁ గూర్చికొని విష్ణుసదనమునకుఁ
బోవఁ దగునని వేల్పుల బోధఁ గొల్పి, వారిఁదోడ్కొని నలువ పుర్రారిఁగనఁగ.

ఉ॥ సారసవాహుఁడై త్రిపురశాసనుఁ గాంచఁగ నల్వ దేవతా
వారముతోడ నేగి తమవచ్చుట నందిముఖంబునన్ గళా
ధారికిరీటిసన్నిధికిఁ దారును విన్నప మాచరింప నా
ర్యారమణాజ్ఞఁ దత్సభకు నందఱు నేగి సుఖాసనస్థులై.

వ॥ ఒడ్డోలగంబుగాఁ బ్రమథులును, రుద్రులును, మునులున్ గొలువన్ గూర్చున్న దేవదేవునకున్ బ్రణమిల్లి కృతాంజలులై నిలిచియున్న బ్రహ్మన్ గనుంగొని, దీనులై ప్రార్థించుచు నమస్కరించుచున్న వాసవాదులన్ గనుంగొని కూర్చుండ నియమించి కుశలం బరసి నన్నుంగుటించి మీర లరుదెంచుట కేమి కతంబని యడిగిన విరించి యిట్లనియె.

సీ॥ లోకనాయక! ఫాలలోచన! సర్వజ్ఞ!, మహిషాసురుండు దుష్కర్మదము నొంది.
స్వర్లోక రాజ్యంబుసపరిచ్ఛదంబుగాఁ, గైకొని సురల సంగ్రామమునను
నదిశాధిపంబుగా నదమదం బొనరించె, వెఱచి కొండలఁ దూఱి వేల్పు లెల్ల
నేకతంబుగ వచ్చి యెంతయు నాతోడ, వివరింప నది దీర్చు వెఱవు లేమి

గీ॥ నిన్నుఁ బ్రార్థించువాఁడనై నిర్జరాళి, వెంట నిడుకొని వచ్చితి వేయు నేల;
భూతభావన రక్షించుపూన్కి నూని, చిత్త మీవలె వేల్పులచింత లణఁప.

గీ॥ ఇది యుపేక్షించితేని మహేంద్రముఖ్య, దేవతాసర్గకృతి ననందేహ మగుచు
నెడలు భారంబు నీపయి నిడినవాఁడ,ననిన నలువను గాంచి యిట్లనియె శూలి.

చ॥ పనచెడి తాన యిల్లుకొని వాకిలి మూసి యడంగి పోవు న
ప్పసినియుఁబోలె వానికి నభేద్యవరంబు లొసంగి నేడు సం
తసము చెడంగ నేల? మనుదర్పము దూలమె? పోర వానిచే
ననదృశదోర్బలుండు మహిషాసురుఁ డాతనిఁ దారసింతుమే? ౧౬౪

గీ॥ పురుషవధ్యుండుగాఁడువాఁడరయఁబొలఁతి, గెడపఁదగుఁగానఁదగునట్టిపడఁతిగలదె
నీదు నాదు నెలంతలు నిర్జరేంద్ర, నెలఁతయును హాంతుకామలై నిలువఁగలరె?

ఉ॥ కన్నియఁగాని వాని రణకౌశలిఁ జూపి యడంప లేదు ని
ర్భిన్నసురారి శౌరి నయనవేది యతండు ముహోదయుండైనను

పన్నము దేవకార్యము సభామాజముతో మన మేగి యెల్లరున్
వెన్నుని గూర్చుకోఁదగును శ్రీ విష్ణుఁడు నేర్పరి దుర్గమంబులన్. ౧౭౧

ఆ॥ అతనిమీఁది భార శ్రీ మఖిలకార్యములకు, సిద్ధియనెడు చంద్రశేఖరోక్తి
వలను దెలిసి నలువ శ్రీ వాసవాదులఁ గూడి, ప్రార్థనముల హరుని శ్రీ బట్టుగోల్పి.

ఉ॥ తానును శంకరుండు సురతండముతోఁ బురుహూతుఁడున్ శుభా
ధానమనస్కులై యజితధామముఁ జేరఁగ నేగి నిశ్చల
ధ్యానమునన్ హరిన్ దలఁచి శ్రీ దైవశిఖామణి! కావు కావు మం
చూనిన వేడ్క వాకిట నసనూనమనస్కత నిల్చియుండఁగన్.

కం॥ చల్ల నిగాడ్పులు వీచెన్, మెల్లన మృగపక్షిరుతము శ్రీ మించెన్ సిరి సం
ధిల్లు శకునములు వేల్పుల, కెల్లను బొడచూపె సిద్ధిహేతువు లగుచున్. ౧౭౪

కం॥ శుభసూచక శకునాళీ, ప్రభవంబున వేల్పుదొరలు శ్రీ పరిపంథి జయ
ప్రభగల్గును మన కనుచును, నభయస్థితి నొంది కనిరి శ్రీ హరిధామంబున్. ౧౭౫

వ॥ ఇత్తెఱంగున బ్రహ్మరుద్రాదులు సర్వశోభాఢ్యంబును మణిమయదివ్యగృహ విరాజితంబును, హంస సారస చక్రవాక కారండవ ముఖ జలవిహంగమ కలకల ధ్వని భరిత సరోవాపీ సరిత్సంయుతంబును జంపకాశోక కురంటక మందార వకుళ తిలక కురవక శాఖోపశాఖా చలత్కోకిల మయూర కీరారావ శోభితంబును గోస్తనీ మల్లికా మాలతీ మహిళాది వల్లీమతల్లికా ఫుల్ల ప్రసవ మధుధారాస్వాద మదవ దిందిందిర మాలికా ఝుంకార సంకులోపవన మృదుల పవమాన ప్రసారణ జనిత సుఖ పరవశ నిశ్చల ధ్యానానంద నంద సునందాది పార్షద భరిత రత్న ఖచిత ప్రాసాద విరాజితంబును గంధర్వాప్సరః కిన్నర నృత్తగీత వీణావేణు మృదంగధ్వని చిత్రమనోహరకూట సహస్రోపశోభితంబును శాంత మునిజన పాపఠ్యమాన చతుర్వేదసిద్ధాంతార్థస్తుతి ముఖరిత బహుసహస్రసభాభవనమండితంబును నిత్యమంగళంబును నగు నాదినారాయణుమందిరంబుఁ గనుంగొని తద్ద్వారంబున సువర్ణ దండహస్తులై సందడిన్ జడియన్ జేయు జయవిజయులన్ గాంచి మీరు భగవత్సన్నిధానంబునకున్ జని తద్దర్శనలాలసుల మగు మ మ్మెఱింగించి సుఖప్రవేశంబు గలుగన్ జేయుఁడని తెలిపిన విజయుం డద్దేవు సభాభవనమునకున్ జని ప్రణామంబు సల్పి జనార్దనున కిట్లని విన్నవించె.

శా॥ స్వామీ! శంభువిరించిశక్రశమనస్వాహాప్రియాదుల్ మహో
ద్దామస్వఃచర సేనతోడుత నిదే శ్రీ ద్వారంబునన్ దర్శనే
చ్ఛామాన్యస్థితి నిల్చినారు కరుణాసాక్షాత్కృతిన్ గోరి సు
త్రాముం డేమొకొ? దుర్దశన్ బడలు చంపదం బొందినాఁ డీశ్వరా! ౧౭౭

కం॥ వెనువెంట నంటి సింగము, గని పరుగిడు లేటికదుపుగ్రక్కై వడి వారల్
పెనునలజడిఁ బడి నోగులుట, గనుపడుచున్నయది దేవకార్యధురీణా.! ౧౮౮

ఉ॥ విన్నప మాలకింపు మని - వెన్నునితో విజయుండు దెల్ప ని
ష్పన్నసురాంతరంగుఁడయి - పంకజలోచనుఁ డంత లేచి యు
త్పన్నదయావలీఘుఁడయి - భాగవతావళి వెంట రాఁగ వా
రున్న గృహాంగణంబున కనూనత దా నెదు రేగి వేల్పులన్. ౧౮౯

చ॥ మధురవచోవిలాసముల - మంజుకృపాకలితేక్షణంబులన్
విధురత మాన్పుచున్ బ్రణయవేల్లన ముల్లసిలంగఁజేయ న
మ్మధురిపుపాదపంకజనమస్కృతులన్ భజియింపుచున్ యథా
విధినిగమాగమార్థఘనవిశ్రుతసంస్తుతు లుగ్గడింపుచున్. ౧౯౦

సీ॥ నారాయణా! జగన్నాథ! దేవేశ్వర, కరుణానిధీ! మమ్ముఁ - గావవయ్య
వాసుదేవ! ముకుంద! - వారిజాంబక! శౌరి!, పురుషోత్తమా! మమ్ముఁ - బ్రోవవయ్య
ఆర్తరక్షక! దైత్యహార! జనార్దన! చక్రి!, దీనపోషక! మమ్ముఁ - దేర్పవయ్య
భుజగతల్పశయాన! భువనవంద్య! రమేశ, ధర్మవర్ధన! మమ్ముఁ - దలఁపవయ్య
గీ॥ భక్తవత్సల! పరమేశ! - పరమపురుష!, యవ్యయానంద! దీనులమైన మమ్ము
నిట్లుపేక్షింపనేల? సర్వేశ్వరునకు, విడువఁదగువారు గలరె? యెయ్యెడల దేవ!

ఉ॥ పాహి హరే! యటంచు బహుభంగులఁ బ్రార్థనసేయు దేవసం
దోహముఁ గాంచి యందఱినిఁ - దోడ్కొని కొల్వున కేగి వెన్నుఁ డు
త్సాహము రేప పద్మజసుధానిధిభూషుల నాదరించి పా
కాహితు నూరడించి మృదులాసనసంస్థులఁ జేసి యెల్లరన్. ౧౯౧

ఉ॥ చింత మునింగి దీనులయి - చిత్తము లెల్లఁ గలంగియున్న వా
రింత పరాభవంబునకు - నెద్ది కతం? బెఱుఁగంగఁజేయుఁ డం
చెంతయుఁ బ్రేమచే నడుగ - నింద్రముఖామరఖేచరుల్ నిజో
దంతము విన్నవించిరి రమాధిపుతోఁ బెలుచన్ విషణ్ణులై. ౧౯౩

సీ॥ మహిషాసురుం డను - మాయావి చెలరేఁగి, బలవీర్య ఘనదైత్యబలముఁ గూర్చి
లోకంబులెల్లఁ గల్లోలంబులుగఁ జేసి, యవనీతలము నిర్జరాధివాస
మేకాతపత్రంబు - నేకభోగంబుగాఁ, గైకొని మ మ్మెల్లఁ - గాకుపఱచి
గట్టులఁ బట్టించి - కామధేనుగజాశ్వ,రత్నాప్సరోవధూరాజిఁ గొనుచు
గీ॥ మిమ్ముఁ జీరికిఁగొనని యప్రమేయశక్తి, గలిగి విధిదత్త వరగర్వకౌశలమున
నప్రతీపప్రతాపుఁడై - యఖిలరాజ్య, మేలుచున్నాఁడు, విధి నేత - కేది మేర?

కం॥ అడవులఁ గొండల వెతలఁ, బడఁజాలక నీదు పాదపంకజములపై
బడి వేడితి మభయము మా, కిడవలె రక్షింపుభార మిమ్ము మహాత్మా! ౧౮౬

కం॥ దానవమాయామథనా, నూనక్రియలందు నేర్పునూనిన దొర వీ
*వే నని వచ్చితిమి గతిఁ, గానము నీకన్న దైత్యఖండనచతురా! ౧౮౭

—బ్రహ్మాది దేవత లందఱు తమ శక్తు లన్నిటిని నొక్క శక్తికి సమర్పించుట.—

చ॥ పురుషులచే నవధ్యునిఁగ భూరికృపామతి నల్వ వానికిన్
వర మొసఁగెన్ దురమ్మున నవారణఁ గాసర దైత్యుఁ గూల్ప నీ
తరుణి సమర్థయో? యుమయొ? తామరసాలయయో? పులోమజా
సురవరభామయో? యరసి చూడుము తన్మృతికై రమాధిపా! ౧౮౮

ఆ॥ భక్తవత్సలుఁడవు పరమపూరుష! దేవ, కార్యసిద్ధి కీవె కారణంబ
వనుచుఁ జెంతఁ జేరి యర్థులమైతి మిం,కొకటియిడుము పోచునోజ యనిన.

ఉ॥ ఏటికి నింతదైన్యము సమీపములో మును వాని బల్నిరా
ఘాటపరాక్రమస్ఫురణ గన్నదిగాదె! మదీయశక్తిచే
నోటమి నొందఁ డద్దితిజు నుగ్రరణమ్మునఁ గూల్ప ధుర్యయా
బోటి ప్రసంగఁగావలయు భూరిభుజాబలనూత్నసృష్టమై. ౧౮౯

ఆ॥ స్వాంశ లెల్ల మనము సంధించి నిజవధూ, స్వాంశ లెల్ల గూర్చి శక్తిఁ జేసి
యస్మదాయుధంబు లన్నియు నర్పించి, పంపవలయు వానిఁ జంపుటకును.

సీ॥ అని పుండరీకాక్షుఁ డాలోచన మొనర్ప, నలువ యప్పుడు నిజాననమువలనఁ
బద్మరాగమణిప్రభాభాసితంబైన, విమల తేజం బొందు వెడలఁ జేసె
నది నిస్సృతంబయి హరిహరుల్ చూడంగ, నుష్ణమై శిఖికీల లుమియఁ జొచ్చె
శంకరాంగమునందు జాజ్వల్యమానమై, నీల తేజం బొందు నివ్వటిల్లె

గీ॥ భయదమై తీవ్రమై గిరిప్రఖ్య మగుచు, హరివిధులు చూడ నత్తేజ మమరులకును
విస్మయం బావహింపుచు విమలశుద్ధ, తామసాకారమై గాఢతమముఁబోలె.

ఆ॥ పద్మనాభు మేనఁ బాండురంబై సత్త్వ, తేజ మెసఁగె దేవదేవవిధులు
చూడఁ గొండవోలె సురుచిరాకారమై, యఖిలభువనములను నాక్రమించె.

వ॥ మఱియుఁ బురందర దేహంబునఁ జిత్రతేజంబు సముద్భూతంబై సర్వగుణాత్మకంబై దిక్కోణంబు లెల్ల నాక్రమింప హరిహరహిరణ్యగర్భు లబ్రమునొందుచుండఁ దక్కినపావక శమన నైరృత వరుణ వాయు కుబేర చంద్రశేఖర దివాకర సుధాకర ప్రభృతుల గాత్రంబులఁ దత్తత్తేజఃపటలంబులు వెలువడి ఘనీభ

* దొరవీవేనని– ‘ఇట’ ఈవు – ఏ – ను ‘అని’ ఇట్లు చూచుకోఁదగు.

వించుచుండె భార్గవీ భారతీ చండికా పులోమజాది దేవవధూజనంబుల వలన వెడలు మహాతేజంబులు రోదోవివరంబున మేదురంబులై మెఱయ నెల్ల తేజంబులు మహామేరుసంకాశంబై జ్వాలామయంబై జగద్భీషణంబై రాశీభవింప నందువలన నష్టాదశభుజయును, గుణత్రియాకారయు, విశ్వమోహినియు, శ్వేతాననయును, కృష్ణనేత్రియు, రక్తాధరయు, రక్తహస్తయునై, క్షణక్షణంబున శతసహస్రభుజ మండితయునై కృపాణ శర శరాసన పట్టిస భుశుండి ముద్గర ముసలాది బహు విధాయుధ పరిచారం బొనర్చుచునుండఁ దేజోరాశివలన దివ్యసుందరీరూపంబున నొక్క మహాశక్తి యభ్రంకషస్యందనంబున నారూఢయై సర్వతేజోమయగాత్రం బుల వాసుక్యాద్యనంతఫణిఫణాలంకారంబులు వెలుఁగఁ బొడకట్టెనని చెప్పిన.

కం॥ జనమేజయుండు వ్యాసుఁ, గనుఁగొని సర్వజ్ఞ! దేవకర్మందివరా!
మునిసత్తమ! యద్దేవీ, ఘన దేహోద్భవము వినఁగఁ ✽ గాంక్షిత మొదవెఁ.

సీ॥ ఎల్ల తేజంబులు ✽ నేకీభవించి త,ద్రూపంబు వెడలెనో? ✽ వ్యాపకముగ
భిన్న తేజంబు లభిన్నాంగకంబులు, పొడమెనో? విస్తరంబుగఁ దదీయ
సంభూతి యెట్లయ్యె? ✽ శరశరాసనముఖ్య,సాధనంబులు దేవసమితిలోన
నెవ్వార లెవ్వార ✽ లెట్టులు నిచ్చిరి?, తద్విధానము సవిస్తరముగాఁగ
గీ॥ శ్రోతుకాముఁడనై తిఁ గృపాతిశయము, జూపి వివరింపవలయు నస్తోకమహిమ
నట్టి దేవిచరిత్రంబు మట్టుమీఱి, వినఁగఁగోరనివాఁడె పో ✽ విధురుఁ డనిన. (౯౫)

ఉ॥ సత్యవతీసుతుండు నృపచంద్రునిఁ జూచి వచించె విన్ము నా
సత్యసమానరూప! పరశక్తిసముద్భవ మెల్లఁ దెల్పెదన్
సత్యముగాఁగ బ్రహ్మయును ✽ శంకరుఁడున్ హరియున్ మహేంద్రుఁడున్
నిత్యవిభూతియా జనని ✽ నిర్మలరూపమె యాఱెఱుంగవే? (౯౬)

—॥ శక్తిస్వరూపవర్ణనము ॥—

ఆ॥ అట్టివాని కెఱుఁగనరుదని పల్కుచో, దేవి నిజము నాకుఁ ✽ దెలియఁదరమె
పొడమెననుచుఁ దెలుపు పొలుపుమాత్రమె కాని, భువనజననియిపుడె పొడమెనొక్కొ!

గీ॥ దేవకార్యార్థ సిద్ధికై ✽ దేవదేవి, యెల్లవేళల నెల్లెడ ✽ నేకభూతి
నేకరూపంబుతో నిల్చు ✽ నెందునేని, గార్యగౌరవమున నట్లు ✽ గానఁబడును.

ఉ॥ రంగమునందు మానవుఁడు ✽ రక్తి మెయిన్ వివిధానుకారి యై
సంగతిఁ జూపు నొక్కఁడయి ✽ శక్తి జగంబుల నెల్లఁ దాన యై
వింగడ మొప్ప నొక్కెడల ✽ వేషముఁ దెచ్చినరీతి భిన్నభి
న్నాంగవికారముల్ [illegible] ✽ [illegible]ర్థశాలిన్. (౯౭)

ఆ॥ తా నరూప యయ్యుఁ ? దత్తదర్థంబుల, సగుణ యగుచు విశ్వ?జనని జగముఁ
బోచు నణఁచు నట్టి ? భువనేశ్వరీలీల, కార్యకర్మవశతఁ ? గానుపించు. ౨౦౦

శా॥ ఏకాకారయు దివ్యరూపయునునై ? యెందెందు లోకావనా
స్తోకప్రక్రియ నెల్లరూపముల సం?సూచించి నానాఖ్యలన్
బ్రాకట్యంబును బొంది వర్తిలు గుణ?ప్రఖ్యంబు లొక్కొక్కచో
లోకత్రాణపరాయణత్వమున ముఖ్లోకంబు లేలుం గదా. ౨౦౧

గీ॥ ఐన నా బుద్ధికోలఁది నీ?వడిగినట్టి, సంశయముఁ బాపువాఁడ రా?జన్యతిలక!
శంకరుని దివ్య తేజంబు ? జననిమోము, చంద్రసంకాశమై సిత?చ్ఛాయ నలరు.

గీ॥ బంభరగరుత్పరంపరా?భ్రమదదభ్ర, విభ్రమకచాభ హరినీల?విశదమగుచు
యామ్య తేజంబుచే వక్ర?మై మనోహ,రంబయి తనర్చు దీర్ఘవి?డంబనమున.

ఆ॥ భువనజనని మైన?పొలఁతికన్నులు మూఁడు, ధవళకృష్ణ రక్త?ధార లమర
ననలకాంతివలన ? నావిర్భవించెను, దత్త్రియంబె పావ?కత్రియంబు. ౨౦౪

సీ॥ కమలాంబకుని కార్ము?కద్వయీ తేజంబు, భువనేశ్వరీచల?ద్భ్రూయుగంబు
అనిల తేజోరాశి ? యఖిలాండ జననికి, శబ్దగ్రహద్వయీ?సంస్థఁ గాంచెఁ
దిలపుష్పసమమైన ? దేవినాసిక రాజ,రాజ తేజః పుంజ?రంజితంబు
సరసదంతప్రకా?శంబు ప్రాజాపత్య, తేజఃపరంపరా?దీపితంబు

గీ॥ అరుణ తేజంబుచే నధ?రాధరంబు, క్రౌంచరిపు తేజ మూర్ధ్వాధ?రంబుడంబు
బాహువులు విష్ణు తేజో?విభాసితములు,వసుమహాస్ఫూర్తి యంగుళీ?పటలిసుమ్ము.

కం॥ ద్విజరాజబింబ తేజము, గజరిపువాహనకుఁ గుచయు?గంబై తనరెన్
భజనప్రియ నడుము పులో,మజ తేజంబు గలిగి ? మహితంబయ్యెన్. ౨౦౫

సీ॥ పరశక్తికిని నూరు?భాగముల్ జంఘలు, వరుణ తేజఃపుంజ?వర్ధితములు
మహిమమర్దని నితం?బంబు వసుంధరా,దివ్య తేజఃపుంజ?దీపితంబు
నిఖిలదేవాంగనా?నిర్ణిద్ర తేజంబు, జగదీశ్వరీపాద?జలజయుగము
హావభావవిలా?సలావణ్యముఖ్యముల్, తత్త్వ చాతుర్వింశ?ధార్మికములు

గీ॥ గాన నఖిలాండజనని లో?కత్రయావి, శేష తేజస్సముద్భూత?సిద్ధి రూప
రూపితాద్భుతభావుక?వ్యాపకాను, భావభావిత విశ్వరూ?పంబు నొందె. ౨౦౬

గీ॥ దశదిశలు నిండి దివ్యసుం?దరశరీర,భాసురాకార మైన యప్పరమశక్తిఁ
జూచి మహిమప్రపీడిత?సురగణంబు, సిద్ధసంకల్పమై వేడ్క?జెందె నంత. ౨౦౭

ఉ॥ దానవమర్దనుండు సురసంతతండముఁ జూచి చిరత్నరత్నశో
భానిచితప్రకృష్ట రుచిబంధురభూషణపాళు లంగసం
ధాన మొనర్పఁడన్న విశదస్థితి నా చరణోత్తమాంగ భూ
షా నివహంబు దార్చిరి నిశాచరహంత్రికి దివ్యరంత్రికిన్. ౨౦౯

కం॥ దామోదరుండు సురలన్, మీమీ యాయుధములందు మేలగు తేజం
బీమెయి దేవికి శస్త్ర, స్తోమంబుగఁజేసి యిండు మరముల వలయున్. ౨౧౦

—• శక్తి దేవతల యాయుధంబుల నన్నింటిని గైకొనుట •—

మ॥ అని యిట్లానతి యీ మురాంతకుఁడు దేవానీక మెవ్వారు శ
స్త్రనికాయంబుల తేజముల్ గొనుచు భాస్వద్ధ స్తశస్త్రావళీ
జననం బొందఁగఁజేసి యిచ్చిరి రణోత్సాహోద్యదుగ్రప్రభా
వనవీర్యోజ్జ్వలదస్త్రశస్త్రవితతిన్ వాహద్విషద్ధంత్రికిన్. ౨౧౧

సీ॥ క్షీరసాగర మిచ్చెఁ జిత్రాంబరంబులు, విశ్వకర్మ యొసంగె విమలసరము
సూర్యకోటిప్రభాసుసుచిచూడామణి, కనకకుండలములు ఘనకిరీట
కేయూరములు రత్నకీలితంబులు త్వష్ట, దివ్యరత్నప్రభాదీపితములు
మంజీరములు దుష్టమర్దని కిచ్చెను, గ్రైవేయకము జలార్ణవ మొసంగె

గీ॥ రమ్యరత్నాంగుళీయకరాజి వికచ, కమలమాలిక యొసఁగె సాగరవిభుండు
పసిఁడిసింగంపురత్నముల్ పర్వతేంద్రు, డొసఁగెభూషణభూష్యమై యెసఁగుకొఱకు.

గీ॥ సరసిజాక్షుండు చక్రతేజంబువలన, రాక్షసధ్వంసకము సుదర్శన మొనర్చి
యొసఁగె శూలంబునను శూల మద్భవిల్ల, దేవి కర్పించె నమ్మహాదేవుఁ డపుడు.

మ॥ ప్రళయాంభోదనినాద మేదురము శంఖచ్ఛార దేందుప్రభా
విలసత్పాండురతానితాంతము సమావిఖ్యాత శత్రుంజయా
త్కలికానందము చిందమొక్కటి రిపుస్తంభక్రియాస్పందమున్
జలరాశిప్రభుఁ డిచ్చె దేవికి ద్విషత్సంధాల తాలావికిన్. * ౨౧౪

ఉ॥ మానసవేగమై రిపుసమాజవిభేదనసిద్ధయోగమై
దానవశాంబరీవిజయతత్పరమై వెలుఁగొందు కల్పకా
లానలశక్తి శక్తి యఖిలాండజనిత్రికిఁ దా నొసంగె నిం
ధానుఁడు భక్తినమ్రసముదంచితమూర్ధకృతానుధానుఁడై. ౨౧౫

కం॥ అంబకు ముఖజితహిమకర, బింబకు గంధవహుఁ డొసఁగె భిదుర ప్రతిమా
నాంబకపూరిత మగు నిషు, ధిం బరమప్రీతితో విధేయుం డగుచున్. ౨౧౬

* లావి = కొడవలి, [illegible]

క౦॥ తనచే భిదురమువలనన్, ఘనభిదురముఁ బుట్టజేసి కాళికి.బలశా
సనుఁ డొసఁగె భక్తినిష్ఠా,జనితోత్సాహమున శత్రుజయసాధకుఁడై. ౨౧౭

ఉ॥ సైంధవసింధురం బొసఁగె శత్రుసమాజవిఘూనసక్రియా
బంధురశబ్దనిర్దళితపద్మభవాండము శాంబరీదురా
పాంధతమిస్రదారణదురంతమహామహిమప్రకాండ మై
సంధిలు ఘంటికన్ జయవిశంకటమాక్తికవారఘంటికన్. ౨౧౮

క౦॥ దండధరుఁ డొసఁగెఁ దన చే,దండమునం బుట్టినట్టి దండము సహితో
ద్దండము దండం బిడి యఖి,లాండజనిత్రికిని బద్మజాండను మెచ్చన్. ౨౧౯

సీ॥ ఖనదీజలాపూర్ణకనకకమండలు, వర్పించె దేవి కబ్జాసనుండు
పాశంబు త్రిదశారినాశంబు వరుణుండు, దెచ్చియిచ్చెను బరాదేవి కపుడు
ఖడ్గఖేటంబు లుత్కళికచే సమవర్తి, యొసఁగి చేతులు మోడ్చి యొద్ద నిలిచెఁ
బరనిరాసకకళాభరపరశ్వథ మిడె, విశ్వైకవంద్యకు విశ్వకర్మ

గీ॥ భరితగంధోత్తమాపానపాత్రి మెదుటఁ, బట్టి నిలిచెను ధనదుండు పంకజంబు
కరమునం దుంచె నంభోధిపరివృఢుండు, రవి సుషుమ్నాఖ్యరశ్మి భైరవికి నిడియె.

వ॥ ఇత్తెఱంగున సాలంకారయు, సాయుధయు నగుచు భూర్భువరాది లోకంబు లెల్ల నిజతేజఃప్రకాశంబునఁ బూరింపుచు, తేఱిచూడ నలవి గాకుండు నద్దివ్య శక్తిం గని విస్మయమానమానసులై సర్వసుపర్వులు కృతాంజలులై యెదుట నిలిచి త్రైలోక్యమోహినీ! శివా! కల్యాణీ! శాంతీ! పుష్టీ! భగవతీ! రుద్రాణీ! కాళరాత్రీ! యంబికా! శత్రుతాపినీ! జననీ! నీకున్ జోహారొనర్చెదము; అస్మద్దురితంబు లడంచి శుభం బొనఁగూర్పం దలంచి తేని నీ తేజంబున మాయావియు, భయంకరుండును, స్త్రీవధ్యుండును, వరదర్పితుండును, సర్వదేవదుఃఖప్రదుండును, శఠుండును, నగు మహిషాసురునిన్ మర్దించి, భక్తవత్సలవై దానవపీడితుల మగు మమ్ము రక్షింపు మనన్యశరణ్యులమై భవచ్చరణయుగంబే శరణంబని వేడుచున్న సర్వదుఃఖప్రమర్దని యగు నమ్మహామాయ స్మితపూర్వంబు లగు శుభవాక్యంబుల నద్దితిజువలని భయంబు విడువుండు, వరదానంబున విమోహితుండగు వానిం బట్టి రణంబున సంహరింపఁగలదాన నని యట్టహాసం బొనర్చి సింహధ్వానంబుచేసిన నమ్మహారావంబున వసుంధరాతలంబు గంపించె సాగరంబులు ఘూర్ణిల్లె కులశైలంబులును జలించె. మేరుభూధరం బొడ్డగిలంబడియె దశదిక్కటాహంబులు ప్రతిశబ్దపూరితంబులై బీటలువాఱె భయగ్రస్తులై గీర్వాణులు చీకాకునం గావు కావు. మని శరణాగతులగుచు దేవిం బ్రార్థించిరని చెప్పి. ౨౨౧

సీ॥ అబ్బురం బిది వింటె ॥ హరిహరాదులు సర్వ,నిర్జరుల్ సంసారనియతిఁ జిక్కి
మోహాకృతభ్రాంతి ॥ మునిఁగి యద్దితిజుని, విక్రమంబున కోడి వెఱపుగొనిరి
దైవబలం బెందుఁ ॥ దరణీయ మగునొక్కొ, దేవాదులకు నైన దెలియనగునె!
దుఃఖసుఖంబులఁ ॥ దురపిల్లఁ జేయంగఁ, గాలుండు కర్తయా ॥ గాదె జగతి

గీ॥ సృష్టిపాలనసంహృతుల్ సేయ కర్తృత్వ శక్తులైన, హరిహరాదులు మాయచే ॥ నలమటించి
శతసహస్రాబ్దములు దుఃఖజలధిలోనఁ,బడియుడంగిరి చిత్రంబు పార్థివేంద్ర! ౧౨

మ॥ జగదంబాచరితాట్టహాసమున దిక్చక్రంబు ఘూర్ణిల్ల దు
ర్భగుఁడౌ నమ్మహిషాసురుండు నిజ భూభృచ్ఛత్రుఁ డాధదావానలం
బగణేయంబయి మండి పార్శ్వచరు నాశోహ్వానస్ఫులింగావళి
స్థగితంబై మెఱయంగఁ జేయుచుఁ గనత్సంరంభనిర్దంభియై. ౧౩

సీ॥ కులశైలకందరాగూఢసుప్తమృగేంద్ర, సంవేశసౌఖ్యముల్ ॥ చమరి చమరి
సగరభూకల్లోలసంఘట్టనోద్భూత,కోలాహలముల గర్వోలుపఱచి
కకుబంతసింధురగర్జితార్భటులఁ ద,ర్జించి నిర్భర్త్సనస్థితిఁ గడంగి
ప్రళయవారిదరవప్రతిమానగంభీర, నిర్ఘాతపాతముల్ ॥ నెఱపి నిఖిల

గీ॥ పద్మజాండంబు బీటలువాఱ ఘోర,నినద మొక్కటి వెడలె నిర్నిదరాద్రి
ముద్రితంబయియున్న దీ ॥ ముఖరవంబు, కీదృశమ్మొకొ యిది యనేకాదృశంబు.

—• మహిషాసురుఁడు శక్తినిఁ గనుంగొనుటకు రాక్షసుల నంపుట •—

చ॥ అమితమదాంధుఁ డెవ్వఁడొ మహార్భటిఁ జేసె నటంచు నెంచి చి
త్రము భయదాయకం బగుడు ॥ దైవతకృత్యమొ దైత్యకృత్యమో?
క్రమ మిది యెట్టిదో? తెలియఁగాఁ దగునంచు దురాత్ము వాని వే
గమ యిటు పట్టి తెండనుచు ॥ గ్రిక్కున దూతలఁ బంపి యుగ్రతన్. ౧౪

మ॥ స్మయదుర్మర్షణమందచిత్తుని దురాచారున్ హతాయుష్యు ని
ర్భయగర్జాకరు నీయెడన్ శమనసంభావ్యున్ దగన్ జేతు నె
ల్ల యమర్త్యుల్ పరిభూతులైరి దితిజాలంఘ్యంబు నా యాన దు
ర్నయుఁ డెవ్వాని దురాగ్రహంబొ? యిది సర్వం బారయంగాఁదగున్. ౧౫

ఉ॥ ఎవ్వఁడొ? యిట్టిగర్జితము ॥ నెల్ల జగంబులు ఘూర్ణిలం గడుం
గ్రొవ్వి సమార్భటించె నరుగుం డతివేగమె శబ్దకారణం
బెవ్విధియొక్కొ? యారసి మహద్దిష్టముఁ జేకుఱ రండు సత్వరం
బవ్విధివంచితుం దునిమి ॥ యుంచెద దండధరాగ్రభూమికిన్. ౧౬

ఉ॥ పొం డని దూతలం బనుపఁ ◊ బోయి హళాహళిఁ గింకరుల్ దిశా
కాండము లెల్లెడల్ వెదకి ◊ కాంచిరి యొండొకచో మరుచ్చమూ
తండము గొల్వఁ బూనిత్తి ◊ దాగొ్కని వేదశిఖావిజృంభితా
ఖండమహాస్తుతుల్ సలుపు ◊ కామిని నొక్క సమీకకామినిన్. ౨౨౮

సీ॥ సర్వాంగసౌందర్య◊సమరసోల్లాసంబు, సౌవర్ణమణిపరి◊ష్కారగరిమ
సర్వలక్షణవిభా◊సంపన్నమహిమంబు, దివ్యాయుధసహస్ర◊దీపనంబు
బ్రహ్మాండభరితదీ◊పప్రభాపటిమంబు, భక్తవత్సలకృపా◊భరణదృష్టి
తతకోటిశక్తికాం◊తాపరివారంబు, దురవగాహానంద◊ధూర్వహణము

గీ॥ గలిగి సౌవర్ణచషకసం◊ఘటితమద్య, పానఘూర్ణాయమానసం◊భరితశోణ
నేత్రకోణారుణప్రభా◊నిచితదిగ్వి, భాగ యయియున్న నొక మహా◊భాగఁ గనిరి.

మ॥ కని దీనాననులై తడంబడుచు నా ◊ క్రవ్యాదచారుల్ జగ
జ్జననీశక్తియకాఁ దలంచి భయవి◊స్రస్తాంగులై చండముం
డనిశాటప్రతిపక్షనిర్మథనశౌం◊డప్రక్రియావక్రదో
ర్ఘనశౌర్యోజ్జ్వల యిట్టిదేవి యెదుటన్ ◊ గాల్ నిల్వఁగా శక్యమే. ౨౩౦

చ॥ అని పరువెత్తి కాసరమ◊హాసురుఁ గాంచి జోహారుఁ జేసి యో
యనిమిషశత్రునాథ! భయ◊దార్భటికిన్ నెలవైన వింత గ
న్గొని యిదె వచ్చినారము క◊నుంగొన నబ్బుర మయ్యె మన్ను మి
న్నును గలయంగఁ దానయున ◊ నూత్నవధూమణి యున్న దొక్కెడన్. ౨౩౧

ఉ॥ చారణకన్యయో? దివిజ◊సారసగంధియొ? దివ్యరూపశో
భారమణీయమూర్తి నర◊భామిని గా దసురాబ్జనేత్రి గా
దారయ సింగ మెక్కి పది ◊ యాపయి నెన్మిది చేతులన్ మహా
కారత ఖడ్గహస్త యయి ◊ కాంచనపాత్రము కేల నూనుచున్. ౨౩౨

గీ॥ అతితరామోదగంధిలం బైన పారు,ణీరసము గ్రోలుచును నరు◊ణారుణాక్షి
పాతముల దిక్తటుల నెల్లఁ ◊ బద్మరాగ,రుచుల నింపుచు భయదో◊గ్రరూపమునను.

—॰ మహిషాసురుఁడు దేవికి రాయబార మంపుట ॰—

సీ॥ జయ పాహి జయ పాహి ◊ జయపాహి హే దేవి!,యనుచు నిర్జరకోటి◊యభినుతింప
"త్రాహి న స్త్రాహి న ◊ స్త్రాహి న" యని మునుల్, సర్వతోవృతులౌచు ◊ సందడింప
శం దేహి శం దేహి◊శం దేహి యని బ్రహ్మ,హరిహరాదులు చుట్టుఁ◊జెరసి కొలువ
జహి రిపూన్ జహి రిపూన్◊జహిరిపూ"నని సిద్ధ,చారణాదులు జయో◊త్సవము గొల్వ

గీ॥ గొలువు దీరిచి యున్న దకొమ్మ నేలి, కొనెడి వల్లభుఁ డెవ్వఁడో వనజనయన
యెవ్వతెయొ! యేమి సేయునో! యేమిగోరి, వచ్చెనో! మాకు దెలియంగ వచ్చునొక్కొ!

గీ॥ అమ్మహాదేవి తేజంబు గప్పిమ్మి దెసలు, గానఁజాలక దైన్యంబు గదిరి యడుగఁ
జాలమైతిమి సూర్యాంశు జాలములకుఁ, దమము బలె విచ్చితిమి మేము దైత్యనాథ.

గీ॥ అప్పయోజాక్షి శృంగార హాస్యవీర, రౌద్రచిత్రాదిరసముల రామణీయ
కంబు వివరింపవచ్చునే కడమ యేల, ఇజ్జగంబులఁ గన్న దయ్యిందువదన.

మ॥ పలికింపం బలుకంగఁజాలక భయభ్రాంతిన్ భవత్సన్నిధిన్
గల యర్థం బెఱిఁగింపఁగోరి యిటకుం గ్రివ్యాదమూర్ధన్య! ప్రా
ణలతాలంబుల మాచు వచ్చితిమి సన్నాహంబుతో మంత్రులన్
గలయంగూడి యుపాయవేది వయి యక్కాంతామణిన్ దేఁదగున్. ౨౩౮

క॥ సామాదిత్రితయముచే, భామామణి యబ్బకున్న భండనమున ని
ర్వ్యామోహతఁ జూపందగు, నా మహిషాసురుఁడు పల్కె నబ్బురపడుచున్.

మ॥ తొలుతన్ నేఁ జను టొప్ప దీవు సని తోడ్తో సామవాదంబులన్
జెలి నొప్పం బరికించి తోడుకొని విచ్చేయంజనున్ బొమ్మటం
చలఘున్ నర్మసఖున్ నిశాచరవరున్ హర్షంబుతో నొక్కనిన్
బిలువంబంచి నచించె సంచితవచఃపేశీమానుభావంబునన్. ౨౩౯

ఆ॥ వార్త విన్నయంత వలపు లువ్విళ్లూరి, సరసవచనరచన సంఘటించి
రసము చెడఁగనీక రమణిఁ వచ్చెనయేని, నేనె నీవ యనుచు నెచ్చరించి. ౨౪౦

ఉ॥ ఈ విటు వచ్చునంతకును నిచ్చట నుండెద నంచుఁ దెల్పి మో
హావిలుఁ డౌచు మంత్రివరు నంపిన వాఁ డట కేగి మ్రొక్కి దే
వీ! వనజాసనాదిసురవీరుల నెల్లఁ దృణీకరించి స
ర్వావని నేలునట్టి మహిషాసురమంత్రి నిగా నెఱుంగుమీ. ౨౪౧

సీ॥ ఏమిదలంచి నీ విం దరుదెంచితి, వెవ్వరిదాన విం దేమి కతము
మన్ముఖంబున నిన్ను మందలింపుచు నున్న, వాఁడు రాక్షసభర్త గాఁడె తలఁప
నరుల కవధ్యుండు నలినాసనుం డిచ్చు, వరములఁ ద్రైలోక్య వల్లభుండు
కామరూపధరుండు కామించినాఁడు నీ, విమలసౌందర్యంబు విన్నయంత
గీ॥ మనుజరూపంబుచే నిన్నుఁ గనఁదలంచెఁ, గరుణ నామెడఁ గల్గినఁ గదలిరమ్ము
కాక తక్కిన నాతండు గనఁగవచ్చు, నీకు వశుఁ డయ్యె మారాజు నీరజాక్షి!

గీ॥ దానవాధీశ్వరుండు నీదాసుఁడయ్యె, నేమిచెప్పుదు నీభాగ్య మిందువదన!
క్రొత్తయని చూడ కిమ్ము ప్రత్యుత్తరంబు, చెలియ! త్రిభువనమూర్ధాభిషిక్తవగుము.

ఉ॥ నా విని సవ్వి వాని వదఽనంబున దృక్ప్రతనం బొనర్చి య
దేవి వచించె మాధురులఁ ఽ దేలెడు వాక్కుల; మీ విభుండు ల
క్ష్మీవిభవానుభూతి బలిఽమిఁ గనినాఁడె? మృదూక్తిఁ బంపుటన్
ఛానము పల్లటిల్లె సులఽభంబగుఁ ద్వత్పదసన్నివేశముల్. ౨౪౪

సీ॥ నన్ను రమ్మని ప్రార్థఽనమ్ము సేయుటయును, దా వచ్చి ననుఁ జూచుఽతలఁపుగొనుట
కాంక్షితం బని కోరెఁ ఽ గావున మెచ్చితిఁ, గాదేని కాలాగ్నిఽకరణి నిన్ను
భస్మసాత్కృతుఁ జేతుఁ ఽ బాపిమైన లులాయ,నిశిచరుతోఁ బల్కు ఽ నీవు నాదు
మాటగాఁ "బాతాళఽమందిరంబున కేగు, మపరాధములు పెక్కు ఽ లాచరించి
గీ॥ దేవతాద్రోహి వైతి నీఽతెఱఁగు దెలిసె, నెదురు వలుక కథస్థలిఽకేగు" మనుము
వేఱొకటియేని మామక ఽ వికటచటుల,సాయక ప్రేరణమె పంపు ఽ శమనపురికి.

ఉ॥ తా నొనరించు తప్పులకు ఽ దండన సేయక సైఁచియుండితిన్
గానఁ దలంచి జీవితసుఽఖం బెదఁ గోరినయేని మేదినీ
స్థాననివాసముల్ విడిచి ఽ సత్వరుఁడై యతలంబుఁ జేరినన్
మానుదు దండయాత్ర దయఽమానమనస్కతఁ గాచి పుచ్చితిన్. ౨౪౬

గీ॥ కాక యొఱగొడ్డెములు వల్కఁఽగాఁ దలంపుఁ, గలిగెనేనియు శక్రభాఽగ్యద్రుమంబు
పండియొఱగుట యని తెల్పు ఽ భండనేచ్ఛ, గల్గెనేనియు రమ్మని ఽ గఱపు పతికి.

ఉ॥ నీకు నమ్మినబంటులైన యసురాఽనీకాధినాథుల్ బలా
స్తోకపరిక్రియఁ జుట్టుఁ గొల్వఁగ రణఽక్షోణీవిహారార్థివై
నాకున్ దోర్యుగకండువుల్ తొలఁగ సఽన్నాహింపు నీవంటి ని
ర్భీకుల్ పెక్కు లడంగినారు శరనిఽర్భిన్నాంగులై నా యనిన్. ౨౪౭

క॥ యుగయుగమున నాచే దు, ర్భగులగు నీవంటి యమరఽపరిపంథులసం
ఖ్య గణింప నేలఁ గూలిరి,మగటిమిఁ జూపింతు వేనిఽ మార్కొను మనుమీ. ౨౪౯

మ॥ నలినాస్త్రాహతి కోర్వలేక మదిలో ఽ నామీఁది ప్రేమంబునన్
గలయంగోరితి వస్మదీయశరసంఽఘాతప్రపాతంబులన్
గలయంగల్గెడు నన్ను; సంగరధురాఽగర్వంబు దుర్వారమై
యలరన్ మానుట శూరధర్మమె? యవఽధ్యత్వంబు నీ కుండఁగన్. ౨౫౦

క॥ వనితాతతి యెల్లిదమని, జనితానందమునఁ బురుహఽశాసన మెల్లన్
గని వర మొందితి నీకై, వనితారూపంబు దాల్చి ఽ వచ్చితి ననుమీ. ౨౫౧

సీ॥ స్త్రీరూపమున నిన్నుఁ ఽ జెండఁగా రణరంగ,సన్నద్ధనై వచ్చి ఽ సామగతుల
బోధించి నినుఁ గాచిఽపుచ్చితి జీవన,వాంఛ గల్గినఁ బొమ్ము ఽ వసుధ విడిచి

శకునిండు తనదైనసామ్రాజ్య మేలెడి, బ్రతికియుండిన మేలు వడయరాదె!
పాతాళమున దైత్యబలములు గొల్వంగఁ, దనివొందు కృపసేయుదాన నిన్ను
గీ॥ శతసహస్రపరార్ధివై సకలసురల, నెతలఁబెట్టితి వని నాకు విశదమయ్యెఁ
దథ్యముగ నిన్ను ఖండించుదాన ననుచుఁ, బ్రతినఁబట్టితి నని నీవుపల్కు మనిన.

ఉ॥ దానవమంత్రి పల్కె నిటు దర్పముచేఁ బలుకంగ నేటికిన్
మానిని వాహనాంగణవిమర్దన కోర్తువె? దైత్యవీరుతోఁ
బూని రణంబుఁ జేసెదె? యపూర్వభుజాబలుఁ డం చెఱుంగుమీ?
గాన సుఖానుభూతి యొకో? కార్ముకదండరణద్గుణధ్వనుల్ ౨౫౩

సీ॥ చిలుకపల్కులవంటి జిలిబిలిపలుకుల, నెలఁతలా రణభూమి నిల్చువారు?
లలితయౌవనకల్లోలాసపేశలలైన, యింతులా రిపులతో నెదురువార?
లిచ్చవచ్చినయట్టు లేకాంతవిహృతులా, మెలఁతలా సేనలో మెలఁగువారు?
మగలతో శయ్యపై మధురవాక్కులు వల్కు, చేడెలా యనిఁ దారసించువారు!
గీ॥ త్రిభువనోద్దండవిక్రమస్థిరతఁ బరఁగు, సాహసాంకుండు మహిషనిశాచరేంద్రుఁ
డట్టి వీరునితోడ నీకగునె పోరఁ, దలఁపని తలంపు పికవాణి! తలిరుబోణి! ౨౫౪

మ॥ సరసాగ్రేసరుఁడైన దైత్యపతిచే సన్మానముల్ బొంది రా
జ్యరమాపాలినివై త్రిలోకపదవీసామ్రాజ్యముల్ గాంచి మా
కరయన్ మ్రొక్కులు గాంచు దేవి వయి దేవాధీశముఖ్యామరుల్
పరివేష్టింపఁగఁ బీఠ మెక్కెదవు నాపల్కుల్ మదిన్ జేర్పుమీ. ౨౫౫

సీ. కులశైలములనైనఁ గొమ్ములఁ జిమ్ములఁ జిమ్మ, కోటిసంఖ్యలు గల్గు కుంజరములు
ఘనఘనాఘనవేగకలితంబులై దూఁకు, కదనధూర్వహతురంగమ్ములగములు
చక్రనేమిక్రమోచ్చరితశేషభుజంగ, సాహస్రఫణములౌ స్యందనములు
నంభోదగర్జితారంభసింహధ్వాన, విశ్రుతార్భటులైన వీరభటులు
గీ॥ నరిమహారణ్యచటులదావానలంబు, లాయుధంబులు మెఱయ ఘోరాహవమున
నిలుచు మహిషాసురునితోడ నిన్నుఁ బోలు, నతివలా? నిల్వఁ; బసిబాలవమ్మ నీవు.

గీ॥ జాజిపూదండఁ బోలు నీసరసగాత్రి, వల్లి సంగరమర్దనావసరములను
దాళఁజాలునె? యిటువంటి తలఁపుఁ గొలిపి, నట్టివారల నందు నిన్నననగ నేల?

సీ॥ రసభంగ మని నేను రక్తిఁ గొల్చెడు పల్కు, పల్కితి మా రాజుభయమువలన
మహిషుండు నీ మీఁద మరులున సామముల్, పల్కుమం చన నిట్లు పల్కినాఁడ
రూపయౌవనమదారూఢవు మిథ్యాభిమానవు నీ వెంతదాన నెదుర
నేకబాణమున నీకెత్తిన తలవెట్టి, వణఁపంగఁ జాలిన మతిబలుండు

గీ॥ ధరణి నతికెక్కు నీచక్కఁదనము మెచ్చి, మోహితుండయ్యె రాజు మో మోటవలన
ప్రియము హితమును బల్కితిఁ జెక్కులేల?, ధనము రాజ్యంబు నీకిచ్చు దాసుఁడతఁడు.

గీ॥ పదములకు మ్రొక్కి ప్రార్థింతు భావ మిచ్చి, యీసువిడనాడి మమ్మెల్ల నేలికొనుము
సకలలోకైకసామ్రాజ్య సౌఖ్యమెల్లఁ, బొంది మూర్ధాభిషిక్తనై పొదలెదమ్మ!

ఉ॥ భక్తుఁడనై పదాబ్జములు పట్టితి నమ్మహిషాసురుండు సం
రక్తి వహించి సర్వసుఖ రాజ్యధనాదిక మెల్ల నిచ్చి సం
సక్తిని నిన్నుఁ గూడి తన సంసృతి యెల్లను నప్పగించి నీ
యుక్తి నిదేశమట్టుల నియోజ్యతఁ గాంచు నటంచుఁ దెల్పినన్. ౧౬౦

—• మహిషాసురునిరాయబారితో శక్తి ప్రత్యుత్తర మిచ్చుట •—

సీ॥ విని జగజ్జనని యా వృత్తాంత మెల్లను, సచివుతో నిట్లను సరసఫణితి
శాస్త్రదృష్టంబైన చాతుర్యమున సర్వ, మనుచింతన మొనర్చి యాడితీవు
మహిషాసురునకు సన్మంత్రి వీవనవచ్చు, నతఁడు పల్కిన యట్టులాడవలదె?
పశువుఁ బోలినయట్టి పామరుండవు నీవు, మంత్రిత్వమున రాజుమనసు దెలిసె

గీ॥ నిట్టి మీ కిర్వురకు యోగమిల రచించు, విధినియోగంబు సదృశమై వెలసెఁజుమ్మ
రాజమంత్రులకును మంత్రిరాజులకును, సదృశయోగంబు సఫలమై జగతిఁబరఁగు.

సీ॥ సతులతోడుత రహస్యసప్రసంగంబులు, సల్పుట సతులకు సహజ మాటఁ
దగినచోటుల నంపఁదగునట్టి కృత్యంబుఁ, బొసఁగించి స్త్రీస్వభావుండ వైతి
విట్టివాఁడు ప్రధానుఁడే రాజునకుఁ గల్గు, వాఁడు సుబుద్ధియన్వారు గలరె?
తెలియుము మది నీవు స్త్రీ స్వభావుండవు, గావొకో యయ్యెదో? కడమయేల?

గీ॥ నేను బురుషుండఁగాను నా యెడలఁ దత్స్వ, భావమున్నదె? యాచించి బ్రహ్మవలన
స్త్రీవధము దెచ్చుకొని యెని సీమమహిషుఁ, దన్ను వధియించు తరుణిఁగాఁదలఁపవలదె?

సీ॥ సరసరంభానాట్య సంరంభములు గావు, చండికారణరంగ తాండవములు
విద్యాధరీతల్ప విహారణంబులు గావు, ధూమావతీ పదోద్ధూననములు
కిన్నరీకలకంఠ గీతధ్వనులు గావు, చాముండికాధనుష్టాంకృతములు
యక్షకన్యారదాంకక్షతంబులు గావు, కాళికాకరవాల కీలనములు

గీ॥ దేవకాంతలఁ జెఱఁబట్టి తెచ్చినట్టి, పౌరుషముగాదు మహిషవిదారణైక
రాగ్రకేశశిఖాకర్షణాభిపాత, కంటకధ్వస్తగాత్రసంఘట్టనములు. ౧౬౩

గీ॥ వీరరసవేది గాఁడు నీ విభుఁడు శూర, దుఃఖదంబైన సతిచేతి దుష్టమరణ
మభిలషించునె? యట్టులే నవని షండ, రతిసుఖము సుమ్ము సతిచేతి మృతి భటునకు.

ఉ॥ అల్పుఁడు నీ విభుండు మహిషాసురుఁ; డంగనలం చనర్థసం
కల్పమునన్ భ్రమింపడి నికారము మొనర్చి వరంబు వేఁడె ద
జ్జల్పిత మట్లుగాన వనజప్రభవుండు వరం బొసంగె న
ట్లల్పున కల్పబుద్ధి ధర నబ్బుర మేమి? ఫలించె నేటికిన్. ౨౬౫

ఉ॥ ఏను దదీయసంప్రీతికి నిచ్చ వధూమణినై వధింపఁగాఁ
బూనిక నేగుఁదెంచితిఁ బ్రబుద్ధుఁడయేని తొలంగి దేవతా
ధీనములైన సంపద లతిత్వర వారల కిచ్చి పుచ్చినం
గాని సుఖంబు వేఱొకటఁ గల్గదు సైరిభరాజమౌళికిన్. ౨౬౬

సీ॥ ధర్మశాస్త్రవిరోధతత్పరం బగుఁ దన, భాషితంబునఁ జెందు భయము గలదె?
విపరీతమగునేని విధి తృణంబైనను, గులిశమౌ విధి యనుకూలపడిన
వజ్రింబుతృణమౌను వాసవారిప్రచండ, సైన్యాయుధోపాయసహితుఁడయ్యుఁ
గాలంబు ప్రాప్తింపఁగలిసి రా దెద్దియు, బుద్ధిచాతుర్యంబు బూదిఁ గలియు
గీ॥ సుఖము దుఃఖంబు దైవసంసూచితములు, దేహి యేకారణమ్మునఁ దెగునో వాని
కదిదొలంగదు నిశ్చయంబదె సృజించు, వాఁడె సిద్ధాంత మొనరించె నలినభవుఁడు.

మ॥ వరదానంబున నిర్విశంకటగతిన్ వర్తించు టే కాని యా
మరుదర్పంబున మృత్యుధర్మములు సంభావింపఁగాఁగల్గునే
మరణం బెట్లును దప్ప నేరదు, వృథామానంబుచే మూఢులు
ర్వర వర్తిల్లుదు రిట్టు గాఁగ నృపుతో వాకుర్వు మిం తేటికిన్. ౨౬౭

గీ॥ యజ్ఞభాగంబు లార్జింతు రమరు లిందుఁ, డాత్మసామ్రాజ్యమేలు మీరహితలంబుఁ
జేరుఁడు మదాజ్ఞ; గాదేని చెడుదురింత, నిజము కల హెచ్చ వివరింపనీచగుణము.

ఉ॥ మందగతిన్ దురమ్మునను మార్కొనెనేని యవశ్య మాసురున్
జిందరవందరై కలనఁ జేడ్పడఁ జేసి వధింతు వేల్పు లె
ల్లం దనచేత నోటఁటిన లావున మత్తిలె నేని బ్రహ్మచే
నొందిన నవ్వరంపుఁగపటోక్తికిఁ దానె ఫలంబు గాంచెడిన్. ౨౭౦

క॥ పొమ్మని చెప్పిన దానవు, డమ్మాటల కుమ్మలించి యాత్మనృపునితో
నిమ్మార్గ మెట్లు దెల్పుదుఁ, గొమ్మన్ దెత్తునని యెదురుకొనియుండుఁ గదా.

ఉ॥ "పెండ్లికిఁ బిల్వఁబోయి యిలు వెళ్ళు" మటన్నటు లమ్మెఁ జూడ నీ
గొండ్లి; నృపాజ్ఞచే సరసగుంఫముగా వచియింప నాకు నూ
రేండ్లును నిండె నైనను సమీహిత మిందుఁ బొసంగ దమ్మెఁ బూఁ
బోండ్లను గందు నెలైడ విభ్రమత్వముచే నిటు గాన మెచ్చుటన్. ౨౭౧

ఆ॥ రాజనింద వినుచు ♦ రాజకింకరులకుఁ, జనుటచెల్లఁ దిచట ♦ సమరమునకు
సాహసించి పిదప ♦ స్వామిసంకల్పంబు, వఱద పాలు సేయఁగవచ్చు నెట్లు? -౨౩

మ॥ సమరోల్లాసముఁ జేయఁగూడ దిచటన్ ♦ సర్వంబు నే నేగి య
య్యమరారాతికిఁ దెల్ప నిర్ణయవిధుం ♦ డాతండు మంత్రానుపూ
ర్వముగా నెద్ది దలంచు నట్టిద యగున్ ♦ వా దేల? నాకంచు నం
దు మదోద్వృత్తిఁ దొలంగిపోయి పలభుగ్దూతాగ్రిణిన్ జూచుచున్ -౨౪

వ॥ దేవా! భవదీయాజ్ఞం గొని పోయి వచ్చితి నని మ్రొక్కి భవదుక్తంబు విన్నవించి పోసంగమిన్, జయాపజయంబుల దేవర కపరాధుండ నయ్యెద నని మరలి వచ్చినాఁడ, సవిస్తరంబుగాఁ జెప్పెదఁ గటాక్షించుటకుఁ బాత్రుండ నవధరింప వలయు, సింహాధిరూఢయై బద్ధాయుధంబులగు నష్టాదశభుజంబులతో మిన్ను ముట్టి భయంకరాకారంబునఁ బ్రవర్తించు, నట్టహాసబీజం బగు నల్ల వరారోహం గాంచి యో భామా! మహారాజగు మహిషాసురునకు న్మహిషివై త్రైలోక్య సామ్రాజ్యంబునకు మూర్ధాభిషిక్తవై చిరకాలంబుఁ ద్రిలోకవిభవంబు లనుభవింపుచు మా రాజున కాజ్ఞావశంవదవై యుండుము. చతుర్దశభువనభవనభామినీ బృందంబులలో మేలుబంతివై యుండెదు, నా వచనం బాలింపు మని తెల్పిన విస్మయావేశమోహితయై స్మితపూర్వకంబుగా నాతోఁ బల్కిన పల్కులు వినుము; మహిషీగర్భంబున సంభూతుం డగుటవలనఁ జతుష్పాదంబులలో నధముండగు తన్నున్ దేవీప్రీతికరంబుగా బలి సేయంగలదాన, నెంత మూఢ యగు కామినియు లోకంబున మహిషంబును బతింగాఁ గోరునే? మాదృశయగు వధూమణి పశుభావంబు భజించునే? కొమ్ములుగల జంతువులు గదా! అట్టివానిం బరిగ్రహించు, నే నట్టులు ప్రవర్తింతునే? సురలకు నజేయుం డగు తన్నుఁ బ్రధనంబున వధియింపం గలదాన, జీవితేచ్ఛ గలిగెనేని పాతాళంబునకుం జను మనుము మహేంద్రునిసామ్రాజ్యం బొసంగి, సురలకు హవిర్భాగంబు లిమ్మనుము. ఇట్లు పరుషంబులు పల్కిన సాహసించి శరశరాసనంబు లీక్షించి రసభంగం బగునని తలంచి భవదాజ్ఞావశంవదుండనై యందున కొడంబడక వచ్చితి బలోన్మత్తయై యబ్బామిని స్వాయత్తయై యున్నది. భవిష్యదర్థంబు సమర్థింప నే నెంతవాఁడ? యుద్ధపలాయనంబులలో నెద్దియేనియు శ్రేయస్కరం బని నిశ్చయింప నీవే సమర్థుండవని తెల్పిన. -౨౫

—॥ మహిషాసురుఁడు మంత్రులతో మంత్రాంగము చేయుట ॥—

ఉ॥ కాసరదైత్యపుంగవుఁడు ♦ కన్నుల శోణితధార లొల్క ను
చ్ఛ్వాసపరంపరల్ భుజగవల్లభఫూత్కరణంబులట్ల ను

ద్భాసితవృత్తి నుప్పతిల బంధుల వృద్ధుల మంత్రులఁ గ్రమా
ధ్యాసతఁ బిల్వఁబంచి జలదాభఘనధ్వనిఁ బల్కె వారితోఁ. ౨౭౮

గీ॥ సచివులార! మీ రీయెడ సంతసించి, నన్ను విస్రంభమునఁ జూచి నాదుపల్కు
లాలన మొనర్చి పల్కుఁడు కాలవశత, దెసల వెలువడె భయదమై దేవమాయ.

సీ॥ ఎడరు పుట్టిన వేళ నెల్లరు మీరలు, రక్షావిశారదుల్ రాజులకును
నిట్టివేళల నాకు నెయ్యది కర్తవ్య, మానతిం డన్నఁ బ్రధాను లెల్ల
సత్యంబుఁ బ్రియమును సచివులు పల్కంగ, వలయు హితాహితవర్తనముల
నొక్కొకచో సత్యమూహింప సహితమౌఁ, బ్రియమును నట్లయౌఁ బేర్మినొసఁగు
ఆ॥ సత్యమును బ్రియంబు జల్పితంబునఁగల్గఁ, బల్కు వినఁగ దుర్లభంబు గాదె ?
దురవగాహచింతఁ దొడరె శుభాశుభ, జ్ఞాని గలఁడె భువనజాలములను. ౨౭౯

ఆ॥ అనిన రాజుపల్కె నట్టు లేటికి మీరు, బుద్ధిఁ గొలఁది నన్ను బోధఁ గొలుపుఁ
డంతమీఁద నాత్మ నాలోచన మొనర్చి, కొనెద శత్రుజయము కొదవ యేల.

ఆ॥ మాన్యులైన వారి మతము విచారించి, కార్యదక్షులైన ఘనులు తమను
శ్రీయ మాచరింప సిద్ధించుఁ గార్యముల్, దైవబలము గల్గు దానివలన. ౨౮౦

ఉ॥ తోఁచినయట్లు పల్కుఁడని ధూర్వహుఁడై మహిషాసురుండు ర
క్షాచణులైన మాన్యులను గందువుఁ దెల్పుఁడటన్న నాతనిఁ
జూచి మహాబలుం డనియెఁ జోద్యము దైత్యకులాగ్రగణ్య యి
న్నీచపుసంగతిఁ వినుట నెయ్యర కబ్బురమయ్యె నీయెడన్. ౨౮౧

సీ॥ మత్తిల్లియిటు వల్కు మానినివాక్యముల్, విననర్హములె? మహావీరులకును
గాంత నాఁగ వరాకి గాదె బిభీషికా, మాత్రముల్ పల్కులు మందులైన
వెఱతురే? యింతుల వేఁదుఱుమాటల, కనృతంబు సాహస మతివలకును
సహజముల్, భువనముల్ సాధించి యింతికై, వెఱతురే? యపకీర్తి వెరవుగాదె!
గీ॥ నన్నుఁ బంపుము సమరసన్నాహి నగుచుఁ, జండికనుబట్టి తెచ్చి నీ శయ్యమీఁద
నిడుదుఁ గాదేని వధియింతు నెల్లసేనఁ, గూడి శస్త్రాస్త్రములను గర్గోలుపఱిచి.

గీ॥ అని మహాబలుఁ డాడినయట్టి పల్కు, మెచ్చి దుర్ధరుఁ డనె జగమెచ్చుమాటఁ
బల్కెను మహాబలుండు; నాపల్కు వినుము, ఆఁడుదాని మదోక్తి కిట్లనుట దగవె!

సీ॥ హేతుగర్భంబులై యింతుల పల్కులు, వర్తించు నిట్టుల వైరిమథన!
సౌందర్యగర్వితల్ సతులు కాముకులను, వలపింప నిట్టులు వల్కుటొప్పుఁ
గామినుల్ వక్రోక్తిఁ గాంతులఁ గలఁచుట, కామశాస్త్రజ్ఞులు గఱప వినమె?
రసవేదివీవు నీరసవృత్తి [illegible] మొనర్త

గీ॥ నంబకంబుల ననుట పుష్పాస్త్రకదన, రంగమునఁ దత్కటాక్షతీవ్రప్రసార
ణములుగా నెంచు వ్యంగ్యప్రణాళియటుల, "జాజిపువ్వులదండ" యాసకియపలుకు.

గీ॥ దానవాధీశ? మదిలోనఁ దలఁచినంత, నీకు వశగాని సఖి గల్గునే? తలంప
రసవివేకంబులేని నీరసపుఁబల్కు, నీవు మదిఁబెట్టఁగా వచ్చునే? తలంపు. ౨౮౫

ఉ॥ ఇన్నియుఁ జెప్పనేల దనుజేశ్వర? భావ మెఱుంగవచ్చె న
క్కన్నియ నీసుతల్పమునఁ గామవశంవద గాఁగఁజేతు ని
న్నన్నులమిన్న యాహవమునందుఁ బయింబడి కూల్తు నన్నమా
ట న్నెఅజాణవైన బెగడంద దగ దాపరమోక్తి నెంచుమీ. ౨౮౬

ఆ॥ పాణిపీడఁ జేతుఁ బరునెత్తిరమ్మను, పలుకుఁగవో కొక? ప్రాణసమిలను పీర్య
మగుటఁ దద్విహీనునిగఁ జేతు నని వ్యంగ్య, వచన మనుచుఁ గనుము వసితతలఁపు.

మ॥ రసరసంధానముఁ జేసెదేని మనసారన్ సామదానంబులం
దసమస్వాత్మవశీకృతిన్ జొనుపు మాద్యద్దంతికాంతం బలెన్
గసరంజూడక మంజువాగ్రచనలన్ గర్వంబు మాయించి పెం
పసలారన్ వలపించి తల్పమున కొయ్యం జేర్పవే నేర్పునన్. ౨౮౭

ఉ॥ ఆనతియిచ్చిపంపు మసహాయుఁడనై చని వాసిఁదెల్పు సం
ధానమొనర్తు నీకుసుమతల్పములన్ సుఖయింపఁజేయు మొం
డౌనె? మదీయనిశ్చయము హర్షదమయ్యెడుఁ గాదె? యెప్పుడున్
దానవనాథ యన్న విని తానుఱ్ఱిడువల్కె హయారిసన్నిధిన్. ౨౮౮

సీ॥ నాపల్కు విను దైత్యనాయక! యియ్యంతి, కామార్త యనురక్త గాదు సుమ్ము
తద్వాక్యములు వ్యంగ్యతత్పరంబులు గావు, మాయామయాకృతిసమహితమహిమ
యష్టాదశస్కంధ యతిభీమరూపిణి, భువనత్రయమున నభూతపాటిఁ
గందుమే? విందుమే? కడువిపరీతంబు, కాలకృతంబైన గతిఁబొసంగె

గీ॥ రేలు దుస్స్వప్నములు చాలఁగలిగె లుకొనియెఁ, గాంతయొక్కతె యేడ్చుచు గడపలందు
నల్లమైల ధరించి శోకిల్లునోడలఁ, బొరలు వెట్టుచు నున్నట్లు పొలిచె నధిప. ౨౯౦

గీ॥ అతివికారంబుగా విహంగావళులును, సౌధసౌధాగ్రముల నెక్కి చాలుగట్టి
యఱవఁజొచ్చెను దుర్నిమిత్తానుషంగ, సూచకోత్పాతములుగావె సురవిరోధి.

సీ॥ వినియున్నవాఁడ నే విశ్వంభరంబైన, దివ్యతేజంబు మూర్తీభవించి
దానవధ్వంసనతాండవోద్దండమై, చండికారూపంబు సంతరించి
యమరావళులతోడ ననుకూలవృత్తిచే, వర్తించునని యొంపు వార్త; మెట్టి
వనిత కేరడమున వాంఛించి నీతోడ, నాహవం బొనరించు నాశయమునఁ

గీ॥ దారసిలు? నన్నెలంత గాంధర్విగాదు, మానుషియుఁగాదు సురకృతమాయ సుమ్ము
మంచిదటులయ్యు వెఱచుటసమ్మతముగాదు, జయమపజయమ్ము విఫలమ్ము సతులయెడల.

క॥ జీవితమును మరణంబును, దైవాధీనములు వెఱవఁ * దగ దెవ్వరికిన్
బోవిడువఁజేయ నవనిన్, దేవాదులకైన వశమె? * తెలియమె? యెందున్. ౨౯౮

గీ॥ శుభమునశుభంబుఁ దెలిసియెక్కొచ్చటనైనఁ, గార్య మొనరించువారులోకమునఁ గలరె!
ప్రాజ్ఞులగువారు ధైర్యంబుఁబట్టి ప్రకృత, కార్యములొనర్పవలయు నిక్కమగు తెరువు.

క॥ దేవర? వెఱవకు మీ వికఁ, గావలసిన యర్థ మెట్లుఁ * గాకుండ దుపా
యావహముగ రణకౌతుక, మావహిలన్ జేయుటొప్పు * నని పల్కుటయున్.

చ॥ సురపరిపంథి తామ్రుఁ గని * చొక్కము నీమది నిశ్చయంబు సం
గరకృత కౌతుకంబున ముఖాముఖినై నెలనాగ యొద్దకున్
బరువడి నేగి ధర్మనయపద్ధతి బోధకుఁ జొన్పి మద్వశీ
కరణ మొనర్పఁబోలు నది * గామి పొసంగిన దండ మయ్యెడిన్. ౩౦౧

గీ॥ ఎన్నివిధములనైన నయ్యింతి గెల్చి, తెచ్చుట మతమ్ము సకలంబుఁ * దెలియుడీవ
బుద్ధి కొలఁది విచారించి పొలఁతిరాక, కెద్ది కారణమొక్కొ యెంతెఱుఁగవలయు.

ఉ॥ కామమొ? వైరమో? తొలుతఁ * గన్గొని యా పయిఁ దథ్యమిథ్యలం
దేమఱ కచ్చుగా నరసి * యెద్ది చికీర్షితమో? యెఱింగి, ని
ష్కామత వైరసాధకత * గల్గిన విక్రమధుర్యతాప్తి సం
గ్రామ మొనర్చి నిర్దయతఁ గట్టి బలాత్కృతిఁ దెచ్చు టొప్పగున్. ౩౦౩

గీ॥ వలయు సేనలఁగొని ధరావలయ మద్రువఁ, జనుము "మద్విక్రమంబు నీ వగనినయంతఁ
దెలియునట్టుల" నని చెప్పి దేవిమీఁది, మనసు తాదాత్మ్యమునఁ జొక్క మనుజభక్షి.

సీ॥ తగిన సన్నాహంబు * దాల్చి తామ్రాసురు, ననుపఁ గాలవశంగ తాత్ముఁడగుచు
నెఱచిదిండికి మ్రొక్కి * యిలయెల్లఁ గదలిన, పగిది సేనలఁగూర్చి * పథమునందు
దుర్నిమిత్తంబులఁ దోడఁబడి విస్మయ, సాధ్వసంబులు మది * సందడింప
నపునరావృత్తమా * నని నిశ్చయింపుచుఁ, జని సింహవాహనై * సకలఖచర

గీ॥ సిద్ధసాధ్యమునిస్తోమ సేవ్యమాన, యగుచు మధుపానగంధ సౌహార్దనిర్య
దతితరోచ్ఛ్వాసమారుత హతమ్ము గేంద్ర, పటుసటాఝాటయగు పరాత్పరను గాంచి.

గీ॥ తామ్రుఁడద్దేవి యెదుట నౌద్ధత్యమెడలి, సవినయమ్ముగ ననియె నీ చక్కఁదనము
కర్ణగోచరమైన నీ కరముఁబట్ట, నభిలషించెను ద్రిభువనీవిభుఁడు. విభుఁడు... ౩౦౭

సీ॥ అమ్మహారాజు హస్తావలంబంబున, ద్రిభువనీపాలనోద్దీప్తి గలుగు
సర్వాంగరుచిరంబు సర్వసుఖాస్పదం, బమ్మేటి యొడలు నీ కబ్బెనేని
నిరతిశయానందనిత్యత సహజంబు, సుఖదుఃఖములలోన సుఖము గ్రాహ్య
మాయుధంబులు పూన నగునె? నీకేల్గవ, బుష్పకందుకములఁ బూనఁదగదె?

గీ॥ కనుబొమలు కార్ముకంబులై కలుగ వేఱ, విల్లు పూనంగ నేటికి విశిఖతతులు
దాల్చితివి నీకటాక్షముల్ దక్కఁగొనవె?, యెంతశూరునినైన మత్తేభయాన!

క॥ ధనలోభాదినిమిత్తం,బున మూఢులు సంగరమున మొనయుదు రయయో!
విను సంసృతి దురమునక,న్నను గష్టంబొండుగలదె నాళీకముఖీ! ౩౦౩

క॥ అలసులు సోఁకినఁ గందెడు, లలితమ్మగు నీదు కేలు లాంపట్యముచే
బలవన్నిశితశరంబుల, నలయింపఁగనేల? సౌఖ్యహానియ గాదే. ౩౦౪

మ॥ తరుణీ! మే నలయంగ సంగరపుఁజేష్టల్ మాని మాదైత్యకుం
జరుఁ జేకొంటివయేని సర్వసుఖముల్ సంపూర్ణముల్ గావె? స
ర్వరసోల్లాసి మదీయనేత సుఖసారంబెల్ల నిర్జేర్చి రా
జ్యరమాపీఠము నెక్కఁజేయు మది నిస్సందేహ మిమ్మాటకున్. ౩౦౫

శా॥ నామాటల్ వినెదేని సర్వసుఖముల్ నాతోడ నీకబ్బు సం
గ్రామోల్లాసము లెంతవారలకునున్ గష్టంబులేగాదె? ని
స్సీమప్రాభవమొంది నిత్యవిభవశ్రీరాజ్ఞివై భోగముల్
సేమంబొందఁగ నీకుఁ గల్గు సుతుఁడున్ శ్రీమంతుఁడై రాజిలున్. ౩౦౬

ఉ॥ యౌవనకాలమందుఁ గుసుమాశుగభోగసుఖానుభూతిచే
భావము పల్లవింప నిజభర్తృకృపాస్పదవై సుఖింపు మా
ప్తావళి మమ్ముఁ బ్రోవుము జయాతిశయం బొడలెల్లఁ బ్రాఁకుచోఁ
గేవలసౌఖ్యవారినిధిఁ దేరుచునుండఁగఁ గల్గు మానినీ. ౩౦౭

చ॥ అని దితిజుండు పల్కెడు నసన్మదురుక్తుల నాలకించి య
జ్జనని వచించె మేఘరవఘర్ఘూంకృతి మూఢుఁడ! మూర్ఖుఁడై సుమా
స్త్రనిహతిఁ దూలి జ్ఞానలవసారవిదూరత నొంది మందచే
తనుఁడగు నీదుభర్తకు యథావిధి మద్వచనంబుఁ దెల్పుమీ. ౩౦౮

సీ॥ నాకుఁ దోఁకయు విషాణంబులు లేవు మ,హోదరిగాను నన్నాదరింప
హరిహరబ్రహ్మలు వరుణుండు ధనదుండు, పావకమిహిరప్రభంజనులును
మొదలుగాఁ గల రట్టి మోహనాకారుల,గణియింప నట్టిచో గుణవిహీనుఁ
బశుజన్ముఁ జేపట్టి పలువురు నిందింప, గర్హణ కోర్తునే? కలఁడు నాకు

ఆ॥ భర్తసర్వకర్త పరమేశ్వరుఁడు సర్వ,సాక్షి ప్రభుఁడు శివుఁడు సర్వదృక్కు
సర్వభావనుండు సర్వపూర్ణుఁడు శాంతుఁ, డక్షయుండు సర్వరక్షకుండు. ౩౯

ఆ॥ అట్టి లోకనాథుఁ డఖిలాండకర్త నా, వల్లభుండు వేఱవాంఛ గలదె?
మందబుద్ధి ఖలుని మహిషుఁ జేకొందునే?, జముని కిత్తు నాహవమున నణఁచి.

చ॥ జనులకు నీరు మోయఁగను సంతతమున్ సుఖవాహనంబుగా
ననిచెద జీవితేచ్ఛ మది నుండిన మేదిని క్రింద దూఱి మీ
దనుజబలంబుతోఁ జని యథాసుఖులై నివసింపుమన్ము, గా
దనిన దురమ్ములోఁ దనకు నంతకుసన్నిధిఁ దప్ప దింతటన్. ౩౧౧

క॥ సములగు వారికిఁ గామసు,ఖము సంసారమున సౌఖ్యకరమగుఁ గాదే!
యమరునె? సౌఖ్యము లొండిటఁ, దెమలక తన బ్రతుకుఁ దెరువు తెలియఁగవలదే!

సీ॥ భువనసుందరులైన పొలఁతులతోఁ దన, కేటివాదము జముఁ నెక్కిరింత
దూత! తా నిటు లేల త్రుళ్ళంగ శక్రుని, సామ్రాజ్య మర్పించి సకల సురల
యాగభాగము లిచ్చి యరుగు మన్నొండేని, సపరివార సబంధు సపరికరము
గాఁగ విధ్వంసనక్రియ మొనర్చెద బుద్ధి, గలిగెడునట్లుగాఁ గఱపు మనుచుఁ

గీ॥ దెలిపి యద్దేవిభ్రుకుటి సంరదీప్తవదన,కహకహార్భటి గ్రిమ్మ నుగ్రప్రచండ
సింహనాద మొనర్ప నక్షీణకల్ప,శుంభదంభోధరారవస్ఫూర్తి మెఱసె.

మ॥ ధర గంపించె వసుంధరాధరదరీధ్వానంబు పెల్లయ్యె నా
శరకాంతాజఠరంబు లొక్కమొగి విస్రస్తంబు లయ్యెన్ సరి
ద్వరముల్ ఘూర్ణిలెఁ దామ్రిఁ డంత ఘనసంత్రాసంబునన్ భీతుఁడై
పరువుల్ వెట్టుచుఁ గానరాసురసమీపస్థాయియై బెగ్గిలెన్. ౩౧౪

ఆ॥ దైత్యరాజరాజధానియం దాసురబృంద మెల్లఁ జెవులు బీటలెత్త
జననియట్టహాసచకితులై యెల్లరుఁ, జెదరి దెసలఁ గాందిశీకులైరి. ౩౧౫

ఉ॥ అంతఁ బ్రచండకల్పసమయాంబుదగర్జితసావధీరణా
క్రాంతదిశాంతమై భువనకంపనకృన్నినదం బొనర్చె దు
ర్దాంతమహోగ్రజాగ్రదభితస్సట లార్చుచు దేవిసింహ; మ
త్యంతము కొండ లెల్ల భయదప్రతిశబ్దత నుఱ్ఱి దుల్లఁగన్. ౩౧౬

శా॥ శబ్దద్వంద్వముచే దిగుల్కొని దురాశల్ మాని రక్షోవిభుం
డబ్ధోద్భూత మహానినాదములచే నల్కొందు నట్లాయురు
క్షుబ్ధంబుల్ కడఁ జేరుమాడ్కి భయభీతాత్మాంతరంగంబునన్
శబ్దం బేఖియు నోటలేక విషయాసంగంబునన్ మాన్పడెన్. ౩౧౭

ఆ॥ కొంత తడవు గుదిలుకొని తల్లడించుచుఁ, దేటి మోలగంబు ≈ దీర్చి సచివ
వరులఁ బిలువనంపి ≈ వారల కిట్లని, తెలిపెఁ గంఠగద్గదిక లెసంగ. ౩౧౮

ఉ॥ వింటిరె? యట్టహాసము; నవీనము విన్నది కాదు మున్ను; సం
లుంఠిత మయ్యె గుండియ; విశాలానము లయ్యెను నంగవల్లికల్;
బంటుతనంబుఁ జెల్లగిలె ≈ బాపురె! యెట్టిది యొక్కొ? మాయవా
ల్గంటి మృగేంద్రి మెక్కి చరశాలః దుమికించుచు నున్న దిత్తఱిఁ. ౩౧౯

ఉ॥ దుర్గములందుఁ జేరుదమె? ≈ దూఁకొని పోరుననే వసింతమే?
నిర్గమనోద్యమంబున వనీకుహరంబుల డాఁగియుందమే?
దుర్గమవీర్యభండముఖశుంభనిశుంభుల బరిమార్చినట్టి యా
దుర్గయుఁ బోలె నున్నయది ≈ దోర్బల మెల్లను రిత్తయయ్యెఁడిఁ. ౩౨౦

వ॥ అమాత్యులారా! దురాధర్షులు బుద్ధిసంపన్నులు నైపుణ్యవిశారదులు మీర
లాలోచనం బొనర్చి గోప్యంబుగా మంత్రశక్తిఁ బొనంగించి వెలిఁబుచ్చక
కార్యంబు నిర్ణయింపుఁడు, రాజ్యసుఖంబు లెల్లను మంత్రమూలంబులు గదా!
మంత్రభేదంబున రాజునకు స్వభ్రంశంబును రాష్ట్రభ్రంశంబును గలుగు, భేదం
బును బుట్టనీక యేకవాక్యంబుగా నెల్లరును హితం బుపదేశింపవలయు, నయ్యింతి
దేవనిర్మిత యగు శాంబరి గావ్లోవు, గాంధర్వియు మానుషియుం గాదు, నిరాలం
బయు నేకాకియునై సమరసన్నాహంబు పొడఁగట్టం జేయుచుఁ గన్నెపాయంబున
భండనం బభిలషించు చున్నయది, యబ్బురంబే కదా! జయంబును నపజయంబును
నెఱుంగువారలు భువనంబునఁ గలరే! యిరువాగును జయపరాజయంబులు
పొందుట గగనకుసుమంబగుం గదా! యుపాయవాదులు వాదంబుల దైవంబు
ప్రధానం బందు,రది యదృష్టం బెవ్వరిచే వీక్షితం బగు, నుద్యమంబు శూరకాతర
సాధారణంబు, కార్యసిద్ధియు నుభయ సాధారణంబే కదా! సర్వంబును విమర్శించి
కర్తవ్యాంశం బుపదేశింపుం డనిన హేతుగర్భంబును మహాశయంబును నగు దైత్య
పతివచనం బాలించి బిడాలుం డిట్లనియె ! ౩౨౧

సీ॥ దితిజవల్లభ! యిది ≈ దేవమాయయకాని, యొండుగాదని మది ≈ నూహచేసి
యతనంబుచే బోటి ≈ యాగమనంబును, గులశీలములు నెఱుంగుట మతంబు
బ్రహ్మాదత్తవరంబు ≈ పరికించి నిర్జరుల్, స్త్రీమూలవధ్యతఁ ≈ దెలిసి స్వస్వ
తేజంబు లొనఁగూర్చి ≈ దివ్యరూపిణిఁ జేసి, తెఱలక యుద్ధదక్షత్పృత్తు లగుచు

గీ॥ గూఢవృత్తిసహాయులై ≈ గుంపుగట్టి, నెలఁది ముందర నిడుకొని ≈ విష్ణుముఖులు
దితిజవధగోరియున్నారు ≈ దేవకార్య, మిట్టి దని నిశ్చయింపుమీ ≈ మొద సురారి!

గీ॥ ఏను సర్వజ్ఞుఁడనుగాను ♦ హితముఁ దెల్పు, వాఁడ సంగర మొనరింపవలదటనుచుఁ
బలుక దక్షుఁడగాను మా ♦ పట్ల నీవె, సర్వమునకుఁ బ్రమాణంబు శాస్త్రమతము.

ఉ॥ కార్యము దేవదుర్జయము ♦ గట్టిగ నాత్మ నసిద్ధికంబుగా
వీర్యపరాహతిన్ బడఁగ ♦ వేమఱు నిశ్చయ మొప్పఁ జేయు చా
తుర్యము శౌర్యమున్ గలుగు ♦ దోర్బలశాలివి నీదురంబునం
దార్యులు మెచ్చ మేను లిడు ♦ నట్టి నియోజ్యులుగా నెఱుంగుమీ. ౩౨౪

క॥ అనుజీవుల మగు మా కిది, ఘనధర్మ మ్మొక్క వీరకామిని కలనన్
మనతోఁ దారసమాటకు, మొనసెన్ సమ్యగ్విచారమున నగ్గలుమీ. ౩౨౫

చ॥ అనుచు బిడాలుఁ డిట్టులు యథార్థముఁ దెల్పఁగ దుర్ముఖుండు రా
జున కెదురై మదుక్తి విను ♦ సూనృత మేను వచించువాఁడ భం
డనమున మేరగల్గదు హఠంబునఁ బోరఁదలంచి వచ్చు శ
త్రునిచయమున్ గనుంగొని పరుల్ నగఁ బాఱుట వీరధర్మమే. ౩౨౬

మ॥ భువనంబుల్ బెగడంగ సర్వసురలన్ ♦ బోఁ ద్రోలి త్రైలోక్యమున్
స్వవశంబౌనటు చేసి యుత్తమపదస్థత్వంబునన్ బొంగి నేఁ
డవమానం బన కాఁడదాని కయమో ♦ హాస్యాస్పదుం డౌచు నా
హవ మీఁజాలక కాతరుండయిన శూరాళుల్ ధరన్ మెత్తురే. ౩౨౭

మ॥ అది గాన న్సమరమ్ముఁ జేయుటయ ప్రాయఃకీర్తిదం బౌటమిన్
మది నూహింపకు మీఁద దైవమును సంపన్నంబు గారాదె? కా
నిగి యానే? యగునట్టి కార్య మెడయానే? వచ్చినన్ గీర్తియున్
బరిమకన్ సౌఖ్యము గల్గు రెంటను గదున్ ♦ భవ్యంబు దైత్యోత్తమా? ౩౨౮

శా॥ జన్యం బెల్లను నశ్య మన్న పలుకుల్ ♦ శాస్త్రోక్తముల్ గావె? నీ
కన్యాలోచన మేల? భండనమునన్ ♦ బాధించదుజాదంభసం
విన్యాసంబున వైరిపై నడువు మాఁవిరూర్భతధైర్యంబునన్,
జన్యోద్యోగికిఁ గల్గు సౌఖ్యములు నిస్సందేహ మిం దందునన్. ౩౨౯

క॥ జీవితమరణంబులు భువి, జీవులకున్ దప్ప వెందు ♦ శ్రీయోవహమా
జీవనము వలయుఁ బ్రాణికి, దైవము తత్సిద్ధికరము ♦ దప్ప దని యనన్. ౩౩౦

ఉ॥ దుర్ముఖుఁ డిట్లు పల్క విని ♦ ధూర్తుఁడు బాష్కలుఁ డంత లేచి యీ
ధర్మము లెల్ల మానుఁడు వృథావచనంబు లిఁకేల? మానినిన్
ధర్మము గాదు తున్మిప నని ♦ తాళితిఁ గాని యిదెంత దొడ్డ? ని
ష్కర్మముగాఁగఁ జక్కడఁతు ♦ శాంకరి గింకరిఁ బోవనిత్తునే. ౩౩౧

సీ॥ చంచలలోచన ‡ చండి నే నొక్కఁడ, బాధింతు వీరరసంబు వెడల
స్థాయిభావంబ యుత్సాహంబు పరిపంథి,భయము దానిని జొరఁ‡బాఱనీక
కలహించి శమనసకాశంబుఁ జేర్చెద, హరిహరబ్రహ్మప్రభాకరేంద్ర
చంద్రబుధేంద్రాదిసాధ్వసభీతుండ, నాదునే యొక్కఁడవా దిఁకేల

గీ॥ చండకోదండనిర్ముక్తసాయకాగ్ని,పటలి సురలను జెండి యప్పుడేతిఁ గొనుచు
వత్తు నా బంటుపంతంబు ‡ మెత్తు వీవు, పోవఁదగ దాఁడుదానితోఁ ‡ బోరితంబె.

ఉ॥ ఇట్టులు బాష్కలుండు మదమెత్తి వచింపఁగ దుర్ధరుండు లో
దొట్టిన బెట్టిదంపుటురతో దితిజాగ్రణిఁ జూచి గుట్టలన్
గొట్టిన దిట్ట బెట్టు జెడఁగొట్టిన జెట్టివి గుట్టుమాలి యీ
వట్టి బిభీషికాకృతికి ‡ వా దొనరించెదు దానవేశ్వరా! 333

గీ॥ మానసంబైన మోహంబు ‡ మాను మింక, దేవనిర్మిత యగుఁగాక ‡ దివ్యతేజ
మెల్లఁ బోవగుఁగాక నీ‡ కేల వెఱవ, మన మెఱుంగని మాయ లిమ్మహిని గలవె.

సీ॥ రాజన్య! మంత్రులు ‡ రహి మూఁడు దెఱఁగులు,సత్వరజస్తమస్సహితు లగుట
రహి విందు సాత్త్వికుల్ ‡ రాజకార్యస్వార్థ,కర్తలై రాజార్థఘటనఘనులు
రాజసుల్ స్వార్థ సంగ్రహణతత్పరతచే, రాజకార్యమునందు ‡ రాగపరులు
తామసుల్ స్వార్థతత్పరులౌచు రాజకా,ర్యోపేక్ష మదిఁగల్గి ‡ యుజ్జగించి

గీ॥ లోభమోహాదిదుర్గుణలోలు రగుచు, శత్రుపక్షజనాళి కెచ్చరికఁ గొలిపి
రాజమర్మంబు వెలిఁబుచ్చి‡ప్రథనములను,బరుల కాత్మాధిపతుల లోఁబఱతురధిప!

గీ॥ విశ్వసింపఁగ రాదట్టి ‡ విధురజనులఁ, గార్యహానిఁ బొనంగు నిక్కముగ వారి
నెఱిఁగి యొడయలు వర్తింప ‡ హితము ఖలుల, నమ్మఁదగ దెంతవానికినట్టిగల్గు.

## —• దేవి బాష్కలదుర్ముఖులతో యుద్ధముచేయుట.•—

చ॥ కనుఁగొను మేను సంగరముఖమ్మున నిల్చెదఁ జింత మాను నె
మ్మనమునఁ దావకీనరిపుమర్దనకేళి నటించి మాయలా
డిని మదమార్చి గెల్తును గడింది మగంటిమిఁ జూపు మవ్వధూ
జనవిజయంబు శూరుల కసాధ్యమె కాణకపర్ది గాదొకో? 33౭

ఉ॥ నెమ్మది నిల్వుమంచు ధ్వజినీనికరమ్ములు గొల్వఁ బైనమై
యమ్మహిషాసురాజ్ఞఁ గొని ‡ యమ్మెయి బాష్కలదుర్ముఖుల్ శతాం
గమ్ముల నెక్కి ఘోరశరకార్ముకఖడ్గగదాశతఘ్నికుం
తమ్ములు లోనుగాఁ బ్రహరణమ్ములు పూని రణోత్సవంబులన్. 33౮

గీ॥ కదలి చతురంగబలపు మిక్కుటమువలనఁ, బుడమి గ్రక్కదలంగ దిక్కుప్పటము లగల
నడిచి యద్దేవి వసియించు నెడకు ననతి, దూరమున నిల్చి వినయమ్ము దురఁగలింప.

మ॥ ఘనగంభీరనినాదమేదురపరిష్కారోక్తులన్ బల్కె రో
జననీ! యేము త్రిలోకనాథుఁ డగు నశ్వద్వేషికిన్ జాల మ
న్ననకున్ బాత్రులమైన నెయ్యురము విన్నాణంబుగా నీదు మో
హనసౌందర్యము విన్ననాఁటఁగోలెఁ బుష్పాస్త్రావలీఘాత్ముఁడై. ౩౪౦

మ॥ పవలున్ రేయును గన్ను మూయఁడు మనోభావంబు నీయందు ని
ల్పి విహారంబులు మానెఁ బుష్పశరనిర్భిన్నాంగుఁడై రాజ్యభో
గవిచారమ్ముల జోలిఁబోవఁ డనురాగం బెంతగాఁ దెల్పుదున్
నవనీహారసఖస్మితం బతనిపై నల్వొందఁగాఁ జిల్కుమీ. ౩౪౧

ఉ॥ దివ్యవిభూషణోజ్జ్వలనధిక్కృతకాంచనశైలమో యనన్
దివ్యనరాకృతిన్ ద్వదనుదీపిత మారహి నుల్లసిల్లి స
ర్వవ్యయమైననున్ గొనక రాగముచే నినుఁ జూడఁగోరినాఁ
డవ్యయభోగశక్తి మహిషమాఖ్యుఁడు కాసరదైత్యుఁ డంగనా! ౩౪౨

గీ॥ అమ్మహావీరుఁ గూడి దివ్యానుభవము, గాంచు మతివల కెల్ల సౌఖ్యంబు కామ్య
మఖిలలోకాధిపత్యభాగ్యంబు నీకుఁ, గొంగుబంగారమై తీర్చుఁ గోర్కులెల్ల. ౩౪౩

మ॥ అని యిట్లాడుదురాత్ములన్ గని వృథాహంకారివై పేలు నీ
చునిసంరంభము చాలు మానుము క్రియాశూన్యంబు మందాత్ముఁ డా
ర్యనిషిద్ధుండు పశుస్వభావుఁడు వచోరమ్యుండు గాఁ డెందు నం
గన లాత్మప్రియుఁ గూడుటొప్పు సముడై కాంతుండు మేలింతికిన్. ౩౪౪

ఉ॥ చక్కనివాని వాక్యసరసత్వము గల్గెడువాని నాత్మలో
మక్కువలూరఁ గాంతునిగ మానిని లూనుదు రింతెకాని నీ
రక్కసిదుంతఁ గోరుదురె రాజనిభానన లెందునేని? నీ
తెక్కలికాఁడు దక్కఁగొనె దేవవిభుత్వము స్వాత్మహానికై. ౩౪౫

కం॥ కొమ్ములదున్నకు వలచెదు, కొమ్మలు గల రొక్కొ? రోతకూఁతలు వనిలే
దిమ్మెయి మార్మసలక వే,పొమ్మన రక్కసులు క్రోధపూరితు లగుచున్. ౩౪౬

మ॥ ధనువుల్ కేల్గన నెత్తి మౌర్వి బిగియన్ దట్టించి విస్ఫారఘో
రనినాదంబుల గర్జితంబుల రణారంభంబు సూచించి దు
ర్ఘనధారావృతిపోలె దేవిపయి తీవ్రప్రోథనారాచముల్
చొనుపన్ సవ్వచు దేవి ... ... ... ... ... వామ్ములన్. ౩౪౭

ఉ॥ బాష్కలుఁ డాగ్రహంబున నభశ్చరకూటము మెచ్చ సజ్జుఁడై
దుష్కరపాతబాణములతో నెదురై పరదేవిమీఁద నా
విష్కృతగర్జితధ్వనుల నవి న్నగలించుచు నంపవెల్లి బల్
ముష్కరధాటి ముంచె జనముల్ మది మెచ్చిరి వానిఁ గర్కశున్. ౩౪౮

మ॥ పరిఘాకుంతకుఠారఖడ్గశరసంపాతంబు ఘోరంబుగా
సురవిద్వేషికి దేవికిన్ దుముల మచ్చోఁ జెల్లె నమ్మైమె నిశా
చరుపైఁ బంచశరంబు లంబ నిగుడించెన్ వాఁడు ఖండించి కే
సరివాహన్ బ్రహరించె నేడిట ధనుర్జ్యాటంకృతుల్ మ్రోయఁగన్. ౩౪౯

ఉ॥ ఆసురుఁ డేయు బాణముల నన్నిటిఁ ద్రుంచి పదేనిటన్ సము
చ్ఛ్వాసదురాసదంబుగ నిశాచరుపై మృగరాజవాహ మే
గాసిల నేసి నవ్వుచు నొకంటన యర్ధశశాంకహేతి బా
ణాసనముం బగుల్పఁగ సురారి గదన్ గొని దూఁకె నంబపై. ౩౫౦

మ॥ గద చేఁబూని రణాంగణంబున నిర్ఘాటస్ఫురద్వైఖరిన్
గదియన్ దుర్గ పునర్గదాప్రహృతిచేఁ గ్రవ్యాదునిన్ మోఁద బె
ట్టిదముౕ బాసి వసుంధరన్ బడి సముద్దీనపరితాపక్రోధా
స్పదుఁడై యెందు గదన్ నిగిడ్చె ననిలోఁ జండిన్ భుజాటోపియై. ౩౫౧

ఉ॥ కన్నుల విస్ఫులింగములు గ్రమ్మఁగ రోషకషాయితాంతరం
గోన్నతయై జగజ్జనని హుమ్మని శూలముఁ బట్టి క్రుమ్మ వాఁ
డన్నిశితాయుధాహతి రణాంగణభూస్థలిఁ గూలి మ్రగ్గ వి
చ్ఛిన్నము లయ్యె సైన్యములు చేసిరి సన్నుతి మింట దేవతల్. ౩౫౨

వ॥ అంత బాష్కలుండు నిహతుం డౌటవలనఁ గ్రోధసంరక్తలోచనుండై బలాన్వితుండగు దుర్ముఖుండు ధనుర్బాణధరుండై, కంకటంబు సవరించి, రథంబు నడిపించి, నిలు నిలు బాలికా! యెందు వచ్చెదవని యదలించుచు నెదుర్కొను సురారాతిన్ గని శంఖంబు పూరించి జ్యాఘోషం బొనర్చి యుద్దండకాండంబులు తండోపతండంబులుగాఁ బయిన్ గురిసిన, వాఁడును నాశీవిషోపమంబు లగు తీక్ష్ణనారాచంబులు నిగిడింప నమ్మహామాయ ఖండింపుచు నస్త్రంబుల నాకసంబు నీరంధ్రంబుగాఁ బయిపయిం గప్పిన నొండొరులకు బాణశక్తిగదాముసల తోమరాదులఁ దుములంబు ఘోరంబగుచు రుధిరప్రవాహంబులుం బొరలెఁ దత్తీరంబులఁ గృపాణకృత్తరాత్రించరశీర్షంబులు యమకింకరులకు గేయసాధకంబు లగు వీణాతుంబీఫలంబు లయ్యె, నిట్లు రణరంగంబు ఘోరంబై పతితకళేబరఖాదనసమాగతవృకగోమాయుసారమేయకాకకంక గృధ్రమో

ముఖాదిజంతుజాలంబుల రొదలను దుర్గంధభరితవికృత వాయుప్రసారంబులను, దేవీకరశూలపరిహార చకితకాందిశీకభటసమాక్రందనధ్వనులను, నిజసేనాంగణంబు మృతచకితపలాయితమోహితభ్రాంతశకలితంబై దీనదశం జెందుటయును, గోపించి దుర్గ కభిముఖంబుగా రథంబుఁ బఱపి దుర్ముఖుం డిట్లనియె. ౩౧౩

ఉ॥ చండి! వృథాభిమానమున ♦ సాహస మేటికి? మమ్ము బోట్లపైఁ
జండిమఁ జూపెదే? తొలఁగి ♦ సాఁగితివేని సహింతు మర్త్రభర్త
నిండు మనంబుతోఁ గలసి ♦ నిత్యసుఖంబు గణింపు కానిచో
నొండన నేల? నాదు నిశితోగ్రశరమ్ములపాలుఁ జేసెదన్. ౩౧౪

కం॥ అమ్మాటల కాగ్రహము మ,నమ్మునఁ బెనఁగొనఁగ దేవి ♦ నవ్వుచు మృతికిన్
సమ్ముఖు లగు వారల కీ, ముమ్మరములు గలవు కనవె ♦ మూఢవిచారా. ౩౧౫

ఉ॥ చూచుచునుండ శాత్రవనికషాదను బాష్కలుఁ గూల్చునట్లు ని
న్నేచి మదీయబాణముల ♦ నేడ్తెఱఁ దుంచెద జీవితేచ్ఛచే
గోచరవృత్తి మాని బలుకొండల డాఁగితివేని పొమ్ము నీ
కీ చతురత్వ మేల సమకేచ్ఛఁ దొడంగితివేని బోరుమీ. ౩౧౬

ఆ॥ నిన్నుఁ గూల్చి పిదప ♦ నీ కొడయండైన, మహిషుఁ గూల్చుదాన ♦ మాటలేల
దురముకోలఁది జూపు ♦ దుర్ముఖా! యనిన న,చ్చండి మీఁద బాణశతము నించె.

శా॥ తోత్రాఘాతముచేత ఘూర్ణిలు కరీంద్రంబు ద్రిండో యనంగా మరు
చ్ఛత్రుల్ నిష్ఠురబాణవృష్టుల మహాప్రసారంబుగా ముంచుచున్
వృత్రున్ వజ్రధరుండు వోలె సమరోత్సర్వన్ గోలలన్ ముంప నా
రాత్రించారియు దేవిపైఁ బఱపె నారాచమ్ము లొక్కుమ్మడిన్. ౩౧౭

ఉ॥ ఒండొరులున్ బరస్పరజయోద్యములై తుములంబు సల్పుచోఁ
జండి శరావళిన్ డెగి నిశాచరబృందము నల్దెసల్ గడున్
నిండి పలాయితం బగుచు ♦ నివ్వెఱఁగందుచు భ్రాంతమయ్యెఁ జా
ముండయు నేనుబాణముల ♦ ముత్తునియల్ పడ విల్లు దుంచుచున్. ౩౧౮

ఆ॥ ఏనుమార్గణముల ♦ నిందరథంబుతో, సాటిమైన వాని ♦ స్యందనంబు
ధుమురు సేయ నేల ♦ దుమికి దుర్ముఖుఁ డంత, పరిఘ మెత్తి దేవిపయిఁ గడంగె.

కం॥ కంఠీరవశీర్షమున న,కుంఠత వైవంగఁ దాఁకు ♦ గొనకొన కది యు
త్కంఠత నిగుడంగ దనుజుని, కంఠము నసి నఱకె దేవి ♦ కదనావనిలోన్. ౩౨౧

సీ॥ భిన్నకంఠకబంధసంపృథుపాతనంబునఁ, బృథివీతలంబు కంపింపఁజొచ్చె
జయజయధ్వనులచే జతగూడి నుతియించు, నిర్జరధ్వనులచే నింగి మొరసె
సందీక కురియు నిర్జరమహీరుహపుష్ప,ధారాళవృష్టిచే ధరణి మునిఁగె
యక్షగంధర్వవిద్యాధరసిద్ధాప్త,హాసప్రతిధ్వానసమదుప్ర లలమె

గీ॥ దుర్ముఖుఁడు బాష్కలుం డిట్లు దురములోన,నంబికాహతులైరి యన్నట్టివార్త
చెవులు సోఁకినయంత దానవగణాధి, రాట్ప్రరాక్రిందనముజగత్త్రియమునిండె.

గీ॥ అంత మహిషాసురుండు సేనాధిపతులు, బాష్కలుఁడు దుర్ముఖుండును భండనమున
బడుటచేఁ గ్రోధమూర్ఛను బారవశ్య,మొంది మదిఁ గుంది బెగ్గలమంది కంది.

శా॥ సేనాధీశులఁ బిల్వనంపి దితిజశ్రేష్ఠుల్ మహావీరు లు
గ్రానూనప్రథనప్రతాపులు మదీయప్రాణతుల్యుల్ జయా
ధానుల్ బాష్కలదుర్ముఖుల్ పడిరి కర్తవ్యంబు నాకెద్ది? దే
వానీకంబుల గెల్చి నేఁ డిటు వృథాయాసంబు పాలౌదునే. ౩౬౪

గీ॥ ఆఁడుదానియెదుర నాఱడిపాలైతి, నెట్టి కర్జ మనుచు నెదఁ గలంగఁ
గ్రవ్యభుగ్ధురీణుఁగాంచి చిక్షురుఁ డను, పార్ష్ణిరక్షకుండు పలికె నంత. ౩౬౫

—• దేవి చిక్షుర తామ్రములతో యుద్ధము చేయుట •—

ఉ॥ ఏనిట నుండ నింత వెఱపేటికి? నొక్కఁడ పోయి దేవసే
నానివహంబులన్ గెడపి నవ్వుచు నయ్యెలనాగఁ దెచ్చి నీ
మానసచింత మాన్పెద నమానుష మత్ప్రకటప్రతాపసం
ధానియతుల్ గనుంగొనవె దానవనాయక! యెప్పుడెప్పుడున్. ౩౬౬

చ॥ కనుఁగొను నా బలం బనుచుఁ గన్నుల నిప్పులు రాలఁ జిక్షురుం
డనుపమసేనలన్ గొని దురాగ్రహుఁడై పతియాజ్ఞ నూని తా
మ్రనిఁ దనతోడుఁ జేసికొని ముజ్జగముల్ బెగడన్ వరూథినీ
నినదములన్ దెసల్ బగుల నిర్గతుఁడయ్యె రథాధిరూఢుఁడై. ౩౬౭

గీ॥ భూమి యీనినగతి బలంబులు చెలంగ,వచ్చు చిక్షురుఁ గాంచి చివ్వకుఁ గడంగి
విజయశంఖంబుఁ బూరించి విశ్వజనని, మార్వ్రమ్రోయించె దశదిశల్ మ్రాన్పడంగ.

మ॥ ధరణీభాగము సంచలించె వసుధాధ్రంబుల్ వణంకెన్ సరి
ద్వరముల్ ఘూర్ణిలె నాకసంబు పొర లెత్తన్ జొచ్చె దేవీధను
ర్వరటంకారము శంఖభాంకృతియు ఘోరంబై మహోద్భూతిచేఁ
బరఁగన్ విద్రుతిమై సురారిబలముల్ పర్వెత్తె నల్దిక్కులన్. ౩౬౮

సీ॥ చిక్కురుం డెలుగెత్తి x చెదరు నేసల నెల్ల, జేమ్రోత్తి పిలువంగఁ x జేరి గొనక
అరుగంగ నడ్డమై x యదలించి నేఁ గల్గ, నెఱవంగ నేటికి x విక్రమించి
మదవతి నిక్కాఁత x మడియింతు నిప్పుడ, నిలుఁ డని మరలించి x నిష్ఠురోగ్ర
కార్ముకం బెక్కిడి x కదిసి నాసీరంపు, మొగమున నిల్చి సమ్ముఖము గాఁగ

గీ॥ వచ్చు పరదేవిఁ గని యెందు x వచ్చె దీవు,మద మడంచెదఁ గాతరో x న్మథనముగను
జెలఁగి గర్జింప నేల? నీ x చేష్టితముల, కళుకుదునె స్త్రీవధంబు దో x షావహంబు.

ఆ॥ శాస్త్రగర్హితంబు x సతుల మాయించుట, యనుచు మానినాఁడ x సరుగు మేల
మమ్ముబోట్లతోడ x మార్కొన నీ యిచ్ఛ,వచ్చు చోటి కేగు x వనజనయన.

సీ॥ పంచాశుగాశుగ x పత్రితికాశములు నీదు, విశదరోచిః పుంజ x వీక్షణములు
త్రిభువనమానినీ x దీప్తసౌందర్యంబు, లోక్కటై యలరె నీ x చక్కఁదనము
హావభావవిలాస x హర్ష లావణ్యాదు, లప్రతీపములు నీ x యందుఁ గనఁగ
మొలకశృంగారంబు x మూర్తి గొన్నట్టుల, నందమై యొప్పు నీ x యంగలతిక

గీ॥ యిట్టి యొయ్యార మెచటనో x కట్టిపెట్టి, విల్లునమ్ములు పట్టి యీ x వెడఁగుఁబనికి
బూనితివి నీకు నెవ్వరు x బోధచేసి, యట్టు చేసిరి యయ్యయో x రాజవదన. ౩౭౭

గీ॥ విరులు సోఁకిన గసుగందు x వే కరమ్ము, లట్టి నీ కేల వాలంపు x గట్టెఁ బట్టి
జాజివిరిదండకన్నఁ బే x శలము తనువు, కదనమున గాసిపెట్టుట x కలికి తగునె.

శా॥ ఏలా! విక్రమజీవిజన్మము కదుర్ x హేయంబు కష్టావహం
బీలావణ్యము గల్గి వల్లభునకున్ x స్వేచ్ఛాసుఖం బిచ్చుచున్
వైలాభ్యంగముఖాదిసౌఖ్యముల నుత్సాహంబు దీపింప కీ
వేలా బేల వెలుంగవై తివిగదా x యీకష్టపున్ గయ్యముల్. ౩౭౮

సీ॥ జగ మెల్ల మెచ్చిన x జాణకూటమి గల్గి, రతిరహస్యార్థసం x గ్రహ మొనర్చి
సరసాన్నపానభో x జనసౌఖ్యముల మేను, లాలించి విరిశయ్య x లను వసించి
చతురనాయకునితో x సల్లాపసారస్య,గోష్ఠీవిలాసముల్ x కూర్మిఁ గొనుచు
వనవిహారంబుల x ఘనజలక్రీడలఁ, గాలముల్ జరుపుచుఁ x గసియొసంగ

గీ॥ సారసంసారసుఖరసా x స్వాదపక్వ,ఫలము సంతాన మార్జించి x పంకజాక్షు
లెందు విహరింతు రీ వెట్టి x యేమేల నీకు, మమ్ముఁబోటులతోఁ బోరు x మానుమమ్మ

కం॥ అమ్ములపోటుల మెత్తని, నెమ్మేనులు దూటులెత్త x నెఱపుదురని వా
రెమ్మెయి నే సుఖమున్నకై, సమ్మతులో వారిఁ జెప్పఁ x జనునే జగతిన్! ౩౭౯

సీ॥ ప్రియభోగసౌఖ్యంబు ♦ ప్రేమాస్పదం బని, తలఁపక రిపులతోఁ ♦ దారసిల్లి
కదనంబు సేయంగఁ ♦ గాంక్షించితివి దీనఁ,గల సుఖం బెట్టిదో ♦ తెలుపఁగలవె!
ఖడ్గపాతగదాప్రఘాతశిలీముఖ,భేదనాదులు పోరఁ ♦ బెద్దగలవు
మరణమొందినను గోరమాయుసంఘములచే, నీడ్పులుగాక యింక కేమిగలదు
గీ॥ కదనహతులకు స్వర్గభోగంబు లనెడు, వాదము గణింపఁగా నర్థవాద మనుచుఁ
గవులుచెప్పుట వినవె లోకముస నిట్టు, లెఱిఁగి యెఱిఁగియు నెట్లీ నీకకేటికమ్మ.
గీ॥ ఏను సహియించినాఁడ నెంక దేని చనుము, గాకయున్నను నానేస్సగఱచి త్రిభువ
నాథినాథు హయారితోననఁగిపెనఁగి, సుఖ మనుభవింపు మేలెద్దిచూచికొనుము.
సీ॥ అనిపల్కు చిక్షురునంబిక గని మూఢ!, బుద్ధిమంతునిపోల్కిఁ ♦ బొగరున నిటు
లాడెదు పెద్దల ♦ యంతరం బెఱుఁగవు, ధర్మమార్గం బిలఁ ♦ దప్పె దింత
మూర్ఖుండ వసి కంటె? ♦ మోహారంబున నీదు, నాధునిఁ గెడపి యనారతప్రి
వాహంబుగా నల్లవాఁక నెల్లువఁ జేసి, భూతభేతాళసంపూర్తి సలిపి
గీ॥ శాసనస్తంభ మెత్తించి ♦ సకలదిశల, మహిషమర్దని యను పేరమహిత కీర్తి
నెలయుదాన సురద్రోహి ♦ విమతు నొక్కంచించి చెండాడి నేల పాలేతుఁగాక.
ఉ॥ జీవితవాంఛ గల్గిన నికసీ? విడనాడి యథేచ్ఛఁ బొండు దే
వావలి యాగభాగముల ♦ నందునుగా కటు తక్కి పట్టునన్
గేవలనిశ్చయంబు మదిఁ ♦ గీల్కొని పోరికి రండు మిమ్ములన్
బోవఁగనీక పట్టి రణభూమికి నే బలిసేయఁ బూనితిన్. ౩౮౦
ఉ॥ అయ్యెడ దేవిమాటలకు ♦ నాగ్రహ మూనుచుఁ జిక్షురుండు లోఁ
గయ్యపుఁగేళి యుప్పతిలఁ ♦ గార్ముక మెక్కిడి బాణవృష్టి సం
డియ్యక సోనగాఁ గురియ ♦ నేచి గుణధ్వనిఁ జేసి యంపలన్
వ్రియ్య లొనర్చి దేవి శరవారము వానిపయిన్ నిగుడ్పఁగన్. ౩౮౧
క॥ ఒండొరుల తుములరణ ముద్దండత నబ్బురము నించె ♦ దనుపుత్త్రిగరు
త్తండములను బ్రహ్మాండము, నిండెన్ గాండముల తెట్టె ♦ నీరంధ్రంబై. ౩౮౨
చ॥ గదకొని దేవి వానియెద ♦ గాఢఁగనేయ నిలాతలంబునం
దదరి గుభిల్లునన్ బడి మృతాభతచే ఘటికాద్వయంబు మూ
ర్ఛ దవిలి వజ్రపాతమున ♦ శైలముఁ బోలె నణంగియున్న బె
ట్టిదముగఁ దామ్రుఁ డడ్డపడి ♦ డీకొన దేవి కృతాట్టహాసయై. ౩౮౩
గీ॥ దానవా!పోకు పోకు నిలదండధరుఁడు,పిలుచుచున్నాఁడు రమ్మి మీపెద్దయింట
జాగియున్నాఁడు సమరమూఢతను బ్రేత,బలులు మీతో డఁబోరినఫలముగలదె.

ఉ॥ దుర్బలు లిండ్లఁ జేరి రణధూర్వహుఁడౌ ఖలుఁ గాసరాసురున్
దోర్బలశాలి సంపుఁడు విరోధుంతుడు శౌరియపోలెఁ దుర్గింతు నం
తర్బల మెల్ల డాఁచికొని । దండిమగల్ బలె పోర నేల? యీ
దుర్బలభంజనంబు రుచిరోదూకొనఁజేయదు నెమ్మనంబునన్. ౩౮౫

ఉ॥ జీవనకామివై చను మిరోసీ! యనఁ దామ్రుఁడు కంట నెత్తురుల్
తీవలువాఱఁ జండిపయిఁ । తీవ్రశరంబులు గుప్పుచున్ ధను
ష్పావకవిస్ఫులింగములభాతిగ నంబుకదంబకంబు ల
భ్రావళి కొండఁ గప్పునటు । లంబికఁ గప్పుచు నార్భటింపఁగన్. ౩౮౬

క॥ భగవతి వాలమ్ములగుమి, భుగభుగ మని మంట లెగయ । భూరితరక్రో
ధగరీయ యగుచుఁ దామ్రుని, నొగిలింపఁగఁ జిక్కురుండుసనుం దోడయ్యెన్.

చ॥ తెఱలక యిర్వు రొక్క మొగి । దేవిపయిన్ బటుబాణజాలముల్
దుఱుములు గట్ట నేయ రణధూర్వహయై జగదంబ యిర్వురన్
దఱుగనియీసునన్ రుధిరధారలు గ్రమ్ముచుఁ గండ లూడ మై
మఱువులు దుళ్ళనేసి పలుమాఱుఁ జలమ్మున నమ్ము లేయఁగన్. ౩౮౮

క॥ శరతాడితులై దైత్యులుఁ గురుతరకోపాగ్నిరవులుకొన నద్దేవిన్
శరముల నొంపఁగఁ జూచిన, వరకింశుకతరుల సాటి । వాటిలెఁ బెలుచన్.

ఉ॥ అత్తఱి దేవి యేయు విశిఖావళిచే దితిభూచమూతతుల్
క్రొత్తగ నామనిన్ విరులగుంపుల నిండినతోఁటవోలె న
చ్చొత్తిన చిత్రరూప మన । నొక్కట నొత్తిలి చేష్ట దక్కి రా
జోత్తమ! పోవ నుండుటకు । నూహ యొనర్చ కెఱుంగ రయ్యెయో. ౩౯౦

గీ॥ తారసిలి తామ్రుఁ డంత నుద్దండలోహ,దండ మెత్తి పరాశక్తితనువు నాట
నేయసింగంబుదుమికియాహీనుఁడేయు,ముసలమున కడ్డమై నిల్చెమోహరమున.

ఉ॥ దేవియు ఖడ్గమున్ బెఱికి । తీవ్రతరాహతిఁ దామ్రునెత్తిపై
వైవఁగఁ గంఠమున్ దెగిన । వాని కబంధము యుద్ధభూమిలో
నావల నీవలన్ దిరిగి । యందఱకున్ భయ మావహించి య
మ్మైన్ వసుధన్ బడెన్ భుజగమాన్యునిమస్తము లూఁగి యాడఁగన్. ౩౯౨

చ॥ సమరమునందుఁ దామ్రుఁ డిటు । చచ్చినఁ జేఁ గరవాల మూని య
య్యుమపయిఁ బాఱు దేరఁ గని । యుబ్బుచుఁ గార్ముక మెక్కువెట్టి దు
ర్దమశరపంచకంబునను । దాడితుఁ జేసిన ఖడ్గమున్ శతాం
గము హరుల[illegible] సురుం డనిన్. ౩౯౩

కం॥ పిడుగడరఁ గొండఁగూలిన, వడువున రణభూమిఁగూల ♦ వాచఱచుచు న
య్యెడ దైత్యసేన లెల్లను, జెడి పఱవం జొచ్చె నమరసేనలు పొంగెన్. ౩౯౪

ఉ॥ ఇట్టులు తామ్రచిక్షురులు ♦ నిర్వురుఁ గూలిరి దేవసైన్యముల్
మట్టుకు మీఱు సంతసము ♦ మానససీమలఁ గ్రమ్మఁ బుష్పముల్
తిట్టలు గట్టఁగాఁ గురిసి ♦ దిక్కులు ఘూర్ణిల దివ్యదుందుభుల్
బెట్టుగ మ్రోయఁజేసిరి యభీతమనస్కత మింట నార్చుచున్. ౩౯౫

శా॥ అమ్మాయామయిచేత నిర్వురు సమిత్కాగ్రింబునన్ వ్యర్థులై
యమ్మైఁ గూలుట మాహిషుండు విని దైన్యాంభోధిలో మున్గుచున్
గొమ్ముల్ ద్రిప్పుచుఁ బుచ్ఛ మార్చుచు సముద్ఘోరాకృతుల్ దానవుల్
గ్రమ్మన్ ఘూర్ణిలుచున్ జమూపతులఁ బెక్కండ్రన్ వడిన్ బిల్చుచున్. ౩౯౬

వ॥ సమరసన్నాహంబు సేయింపంబంచి క్రోధారుణలోచనుండై సేనాధిపతులంజూచి
యిట్లనియె. ౩౯౭

— అసిలోముఁడు యుద్ధభూమియందు దేవితో ధర్మసంభాషణము చేయుట —

గీ॥ దండనాయకు లెల్ల నుద్దండు లగుచుఁ, జండిపైఁ జని దోర్దండచండకాండ
తండములఁ జెండి వేరండ పొండటంచుఁ, గ్రోధమునఁ దాండవింపుచుఁ గుతలమద్రువ.

సీ॥ అసిలోముఁడు బిడాలుఁడాదిగాఁ బెక్కండ్రఁ, గదనసంరంభకర్కశులఁ జూచి
సమదవరూథినీసహితులై చనుఁడని, యానతి యొసఁగ నయ్యసురవరులు
రథికులై చతురంగరాజి చుట్టు నెసంగ, గర్జిల్లుచును మహోగ్రముగఁ గదలి
రథనేమికాఘర్షరధ్వనుల్ హయహేష, లిభబృంహితములు మిన్నెల్ల నలమి

గీ॥ భటులక్ష్వేడారవములతో ♦ బలసి చెలఁగ, నాయుధంబుల మెఱుఁగులు నంగకంక
టద్యుతులు మించులనఁగ నవిద్యమాన, జలధరంబులువోలి యాఖలులు చనుచు.

చ॥ కరముల ఖడ్గఖేటములుఁ ♦ గాలి మృగేంద్రము కేక వేయుచున్
ధరణి వణంక గంతు లిడఁ ♦ దప్పక యాహవరంగచంక్రమో
ద్ధురతరఘోరవిక్రమవిధూతవిపక్షను దేవిఁ గాంచి యొ
క్కరుఁ డసిలోముఁ డాహవముఖమ్మున నిల్చి మహోరవార్భటిన్. ౪౦౦

కం॥ వినయావనతుం డగుచును, జననిం గని దేవి నీవు ♦ చనుదెంచి వృథా
జనహింస సేయ నేటికి, మనమున సంకల్ప మెద్ది ♦ మానుము కసరున్. ౪౦౧

మ॥ అపరాధం బిసుమంత లేక యకటా! ♦ హర్షంబుఁ బోనాడి ని
ష్కృపచే దైత్యుల నేల చంపెదు కతం ♦ బేమేనియున్ గల్గెనే?

విపరీతం బని తోఁచదొకో? మణులున్ విత్తంబులున్ సొమ్ములున్
ద్వీపముల్ ఘోటము లెన్నియే నొసఁగి సంప్రీతిన్ దగన్ జేసెదన్. ౪౦౨

ఉ॥ సంగరకాముఁరాల వయి సర్వసుఖావహ మైన యీ క్రియన్
భంగము నొంద నేల యిది పామరకార్యము ప్రాజ్ఞు లెల్ల రో
యం గడుఁ బౌరుషక్రియకు నాయిత మైతివి పుష్పసన్నిభం
బంగము బాణఘాతముల నాఁశివుచ్చెదె మందబుద్ధివై. ౪౦౩

శా॥ చాతుర్యంబున కెల్ల మూలము గదా సచ్ఛాంతి; క్రోధంబు సా
ఖ్యాతంకంబు నిరంతరాయముగ సౌఖ్యప్రాప్తి సాధించి స
ర్వాతీతంబగు శాంతి యొప్పదొకో? పూర్వాచారశాస్త్రార్థవా
చాతాత్పర్యము లెంచ రాదె సుగతస్వాభావ్య మిమ్మార్గముల్. ౪౦౪

చ॥ వయసునఁ గ్రామ్యభోగములవాంఛఁ బొసంగఁగఁ జేసి కంటి కిం
పయిన మనోహరున్ గలిసి స్వాంతము దీర సుఖానుభూతిచే
నయ మెఱుఁగంగ రాదె భువి నాకసుఖంబులఁబోలు సౌఖ్యముల్
గయికొని రామణీయక మహైశ్వర్యముగా నొనరింపఁగూడదే. ౪౦౫

చ॥ బలిమిఁ గలంగు వేళఁ బరపాతనకృత్యము మాని ధర్మసే
వల నవిరోధవర్తనము వర్తిలఁజేయఁగ రాదె? యిట్లు హిం
సలఁ బని యేమి ధర్మరతిఁ జక్కఁగఁ గల్గి పరంబు గాంచఁగా
వలదె? పరాపకారమునఁ బాపము పొందదె యెట్టివారలన్. ౪౦౬

ఆ॥ ధర్మమునకు నొడలు దయ ప్రాణములు సత్య, మిట్టి యర్థ మెఱుఁగనిచ్చగింపు
మదియుఁ గాన మేను నసువులఁ బ్రోచుట, ప్రాజ్ఞమతము గాదె పంకజాక్షి!

ఉ॥ కారణ మేమి కన్పడదు క్రౌర్యముచే దితిజాళి నెల్లరన్
మారిబలెన్ వధించెదవు మాన్యులు మెచ్చని మార్గవర్తనం
బారయ మేలొకో? యనిన నంబిక పల్కె మదాగమంబు చె
న్నార వచించుదాన వినుమా! యవధానముతోడ దానవా. ౪౦౮

సీ॥ న్యాయమార్గంబు నన్యాయమార్గంబును, జేతనావళి విమర్శించి యెందు
న్యాయంబు గల్గిన యచట వర్ధిలఁజేసి, యనయంబు గల పట్టులణఁచివైచి
విహరింతు జగమున విశ్వేశ్వరిని నేను, భోగేచ్ఛ యిసుమంత పుట్ట దెందు
ధర్మరక్షణఁ గోరి దండింతు దుష్టులఁ, బాలింతు సద్వ్రతపద్ధతులను

గీ॥ దుష్టసంహారణంబును శిష్టరక్షణంబు మా బోటులకు సువ్రతంబు గాన
దుష్టుఁడైనట్టి యీ రాజు శిష్టులెన, నిర్జరుల నేచె నదిగాన నిహతుఁ జేతు. ౪౦౯

మ॥ ఇది నాచేయు ప్రతిజ్ఞ నా కొరులతో నేలా? దురాత్ముఁడు దు
ర్మదుఁడౌ మాహిషుఁ డన్యులన్ బనిచి యిమ్మాడ్కిన్ వధింపించె వాఁ
డదయుండై యని కోర్చనేని తనబాహాహాటోపముం జూపి మ
త్కదనోల్లాసముఁ జూచుఁగాత నయసంధానంబునన్ సంధికిన్. ౪౧౦

ఆ॥ ఇచ్ఛగించెనేని హితులతోఁ బాతాళ, తలముఁ జేరి బ్రతుకు తత్పరతను
శక్రుని సిరు లొసంగి చనుమన్న ప్రహ్లాదు, ననుసరించి బ్రతుకుమని తెలుపుము.

ఉ॥ పొమ్మని దేవి పల్క సురపూర్వజుఁ డయ్యసిలోముఁ డా ప్రభా
వమ్మునఁ దా బిడాలుని జవమ్మున దగ్గఱఁ బిల్చి ప్రీతిపూ
ర్వమ్ముగ దేవిపల్కు నయవాక్యము వింటివె? సంధి మేలొ? వై
ర మ్మిఁక మేలొ? సంధియెడ రా జభిమానముఁ బూనఁ డింతయున్. ౪౧౨

ఆ॥ జగతిఁ బుట్టినట్టి జంతుసంతతు లెల్ల, మృత్యునియతు లనుచు మేర దెలిపి
పంపఁదలచినాఁడు భగవతిచేఁ గూల, దైవగతిఁ దరింపఁ దర మెవరికి. ౪౧౩

వ॥ మఱియును నజ్ఞానపరతంత్రులై రాజవశవర్తులైన మానహీనులకు సూత్రబంధ
నంబునఁ బాంచాలికలకుం బోలె, రాజుననుమతివలన వర్తనంబు దప్పదుగదా!
దేవీప్రేరితంబు లగు సంధివిగ్రహకృత్యంబులలో విగ్రహంబున బ్రతుకుట
దుర్లభంబు. సంధి కొడంబడుదు మనిన సపరివారంబుగాఁ బాతాళంబునకుం జన
వలయునని యింత కర్కశంబగు వచనం బెట్లు నుడువంబోలు. రాజకింకరులకు
సత్యంబును బ్రియంబును నగు పలుకు గఱపుట ధర్మంబు. మఱి యీ రెంటను
బ్రియం బిసు మంతయుఁ గానరాక యున్నయది. "మౌనం బుద్ధిమతాం సుఖ"
మను శాస్త్రోక్తివలన నూరక యుండుద మనిన రాజు గోపింపకయుండునే కావున
నవశ్యకర్తవ్యంబు జన్యంబ, స్వామికార్యంబులయెడల మరణంబు తృణప్రాయంబు
గదా! కావునఁ బోరుట ధర్మంబని యుద్ధతత్పరులును ధనుర్బాణధరులును,
రథాధిరూఢులును, సన్నద్ధులునై దేవి కభిముఖులై నడచి పోరాడు నెడ
నసిలోముండు చూచుచుండ బిడాలుండు బాణసప్తకంబునఁ బర దేవిం బ్రహరించిన.

—♦ దేవి బిడాలుని నసిలోముని సంహరించుట ♦—

ఉ॥ కార్ముక మెక్కువెట్టుచు జగజ్జనయిత్రి శరత్రయంబునన్
వర్మముఁ జించి రక్కసునివక్షము గాడఁగ నేయ మేనిలో
శర్మము దక్కి మూర్ఛ గొనె జంకె బిడాలుఁడు వానిఁ జూచి దు
ష్కర్మవశంబునన్ దనుజసంఘనిపాతన మావహిల్లెడిన్. ౪౧౪

ఆ॥ తప్పదనుచుఁ జాపదండంబు చేఁబూని, యాహవోన్ముఖుండు నగుచు సవ్య
కరముఁ జాచి పలికెఁ గాళితో నోదేవి, దానవులకుఁ జావుదప్ప దమ్మ.

సీ॥ మహిషాసురుం డతిమందబుద్ధి పిరియాపిరి,యంబులఁ గన నేరఁ డతని కేమ
వశవర్తులము గాన వానికి వెలిచుచుఁ, జేయు నీ సంధి వచింప లేక
దానవధ్వంసనాతాండవోత్సవ మైన, నీచేత నుడియుట నిశ్చయించి
దైవపౌరుషముల దైవ ముత్తమ మని, యనుట నిజంబుగా నసురు లెల్లఁ

ఆ॥ జచ్చుచున్నవారు జనని నీచే నని, యంప వెల్లి ముంచె నంబ వాని
కోల లెల్లఁ జిమ్మి కూరిశరమ్ముల, గలయఁ గ్రుచ్చె నిరవకాశముగను. ౪౬౭

ఆ॥ జనని వేయు బాణజాలంబు లసిలోము, మేన నలమ నేదు మెఱసినట్లు
దనరె వాఁడు రక్తధారలు పొరలుట, పుల్లకింశుకంబుపోల్కి నొప్పె. ౪౬౮

ఉ॥ అంత గదాధరుం డగుచు నయ్యసిలోముఁడు కాళికాంబపై
గంతులువేయుచుండ దుమికి కార్కొను సింగము మోఁద గర్జ ది
గ్దంతులుఁ బాఱఁ గేసరియు దానవ వక్షము గోరు లంట దు
ర్దాంతముగా నగల్ప నఖతాడన కోరిచి దానవుం డొగిఁ. ౪౬౯

ఆ॥ హరిశిరంబునందు నవలీల లంఘించి, చండి మీఁదఁ బరిఘఁజాచి వైవఁ
దత్ప్రహార మంబ దప్పఁజేయుచు ఖడ్గ,ధార వాని శిరము దఱిగివైచె. ౪౭౦

క॥ అంత బిడాలుఁడు రోషా,క్రాంతుండై దేవిఁ గదిసి కనలెడు శిఖిలో
గంతుగొను మిడుత కైవడి, గంతులు వేయుచును వడిసి కాల్గుఁ జేరన్.

సీ॥ రణశూరు లగునట్టి రాక్షసు లిర్వురు, భండనంబున నిట్లు పడుట దెలిసి
హాహారవంబుల నసురబలం బెల్ల, దిక్కుమాలుచు నలుదెసలఁ జెదరె
సురదుందుభులు మ్రోసె సుర లెల్ల జయజయ,ధ్వనులచే నాడిరి తలఁగిపోవు
దనుజసేనల మృగేంద్రదళింబు కొందఱఁ దినె, గొందఱు పరువెత్తి ఘోరభంగి

ఆ॥ మహిష! కావు కావు మ మ్మనిలో నసిలోముఁడును బిడాలుఁ డామెవలన
నిహతులైరి పెక్కు నీ భటకోటుల, గ్రుక్కఁగొనియె దేవి యొక్క హరియె.

వ॥ అని, ——

క॥ హతశేషు లైన రక్కసు, లతిదుఃఖభరమ్ము నొంది యసురవరునితోఁ
గొతుకుచుఁ దెల్పఁగ విని సం,తతచింతాక్రాంతుఁ డగుచు దర్పము దూలన్.

ఉ॥ కట్టలుకన్ లులాయుఁడు జగత్త్రియభీకరకోపయుక్తుఁడై
మెట్టులు నాక దేవిపయి యేడ్తెఱఁజూపఁ దలంచి దారకున్

నెట్టనఁ జేరఁ బిల్చి నవనిర్మితమై ధ్వజభూషితంబు నా
బెట్టిదపుఁ రథంబు రిపుభీకరలీల నలంకరింపుమీ. ౫౨౭

సీ॥ ఖరసహస్రనిబద్ధఘనయుగద్రఢిమంబు, బహుసహస్రధనుఃప్రభాసురంబు
దృఢదీర్ఘతరశరస్థిరభారసముపేత, మతినిశితాయుధపఙ్క్తిసహిత
మాయతచక్రమహానాదభరితంబు, పృథులకూబరసమన్వితము తతము
నిబిడకంకటసమున్నిద్రరౌద్రయుతంబు, దర్శనమాత్రభీతద్విషత్క

గీ॥ మైన యరదంబు పన్ని తెమ్మాహవమున, కేను వెడలెద నన సూతుఁడిట్టులనియె
దేవ!సన్నద్ధమగు తేరుదెచ్చినాఁడ, సాయుధము సాస్త్రణమయి యలరునదియు.

—• మహిషాసురుండు దేవితో యుద్ధముఁ జేయుట •—

గీ॥ ఆయితంబయి తేరుంట యరసి దనుజుఁ, డశ్వవైరిస్వరూపంబు నవలఁద్రోచి
సరసమానుషవేషంబు సంతరించి, యాహవంబున కేగఁగ నాత్మఁదలఁచి.

ఉ॥ శృంగము లేనునుఁ దరుణి చెంగటికేగిన నన్నుఁ జూచి య
య్యంగన మెచ్చునే? సతుల కాత్మహితం బగు రూపుగన్న న
ష్షాంగెడి నట్లుగాన రుచిభూషితభూషణయుక్తదేహినై
సంగ మొనర్చినఁ వికచసారసలోచన మెచ్చునం చొగిఁ. ౫౨౮

మ॥ అని యాత్మఁ దలపోసి రక్కసుఁడు మాయామానుషాకారముఁ
గొని సర్వాభరణాన్వితుండును సమిద్ఘోరప్రశస్త్రాయుధుం
డును దివ్యాంబరధారియుఁ జతురతాటోపప్రశస్తుండునై
వనజాస్త్రుండును బోలె నర్మసఖులు బార్శ్వంబులఁ గొల్వఁగఁ. ౫౨౯

గీ॥ పువ్వుబెత్తులు దాల్చి యంగబులును విల్లు, కరములఁ జెలంగఁ గాంతలకన్నులకును
వింత యగు చెల్వు దాల్చి యద్దుంతఁ జేడు,రథికుఁడై వచ్చె నాహవరంగమునకు.

శా॥ మాయామానుషవిగ్రహుం డగుచు నమ్మైమ్మవచ్చు దైత్యేశ్వరుఁ
స్సాయద్వీరసహస్రముఁ గని పరాంబాదేవి గర్జిల్లి హా
సాయత్తంబగు మోముతో విజయశంఖారావముఁ జేసె "ఛాం
భా"యంచుఁ దశదిక్కటాహములు సంభ్రాంతంబులై వ్రయ్యఁగఁ. ౫౩౦

చ॥ తెలియక మాహిషుండు పరదేవి ముఖాముఖిఁ జేరఁబోయి యో
తెలివరొ! సంసృతి న్నరులు తెల్లము సౌఖ్యము గోరువారు నీ
వలిమిటి పోరులఁ బడల నాయత మైతివి నీ వి దేల? వే
సరక వృథాభిహింసలకు సంతసమందుట యొప్పిదంబొకో. ౫౩౧

సీ॥ జనులకు సంయోగజంబగు సౌఖ్య మా, సంయోగము త్రిభేదసహిత మగును
భ్రీమతో నొక్కటి పెరయు దుఃఖంబున, రెండవదియు నొప్పుచుండు సహజ
మయిమూఁడవదియొప్పునామూఁటిలోమాత్ర, పితృపుత్ర యోగంబుపెద్దయగును
భ్రాతాదియోగంబు పరఁగ మధ్యమ మది, యధమంబు లోభ మోహాదిజంబు

గీ॥ మిత్రసంయోగ మన్యోన్యమైత్రిఁ జెలఁగు, నుత్తమాదిభేదంబుల నొందుదానఁ
గ్లేశజం బని కనుము సంకేతవశతఁ, బలుకఁబడు రెంటిలోఁ గల్గు బహువిధములు.

గీ॥ కార్యవశమున సంగతి గల్గి చిత్రవర్తనంబున నావికవ్యాధముఖుల
యెడల సంయోగము నిసర్గహేతుకంబు, ఉత్తమాదిప్రభేదమ్ము లాదవు దీన.

సీ॥ సమయౌవనంబును సమరూపమును గల్గి, కులశీలగుణములు గొంతఁగొనక
చాతుర్యవేషాదిసహితమై యలరారు, నంగనాపురుషులకైన యట్టి
సంయోగ ముత్తమసరణి వర్తిల్లెడు, రక్తిచే శృంగారరసము పొదలు
దానికి బీజంబు స్థాయిభావము రతి, యౌవనోద్ధతుఁడ నాయందదేల

గీ॥ చేయఁజూడవు దేవతాశిక్షకుఁడను, సకలసంపద్భరుండను శక్రముఖ్య
నిర్జరుల నోర్చి వారి యనేకరత్న, దివ్యవస్తువు లెల్లను దెచ్చినాఁడ. ౬౩౧

ఉ॥ అన్నిటి కీవె నేత్రివయి యాత్మ సుఖింపఁగరాదె? దేవివై
నన్ను భుజిష్యుఁ జేసికొని నా విభవంబున కెల్ల రాణివై
యున్నఁ ద్రిలోకభామినులు నొక్కట నీ పరిచర్యఁ జేయరే?
యిన్నియు నేల నీకరుణకేఁ దగుదుర్గ శపథంబు సేయుదున్. ౬౩౬

గీ॥ నీదుసౌందర్యవశుఁడనై పాదుకొనిన, కంతువేదన నిసుమంతఁ గదలలేక
నీదు శరణంబుఁ జొచ్చితి నీరజాక్షి, పాలన మొనర్పుమీ కామబాణహతుని.

సీ॥ ధర్మోత్తమోత్తమధర్మంబు శరణాగ, తావనంబే నీకు సేవకుఁడను
నీవాఁడనైతి మన్నింపుము ప్రాణాంత, వచనంబులను వేఁడువాఁడఁగాను
బాదపద్మములపైఁ బడితి నాయుధములు, విడిచి నాపైఁ గూర్మి వెల్లివిరియ
నాదరింపుము జననాది దీనత నొంద, హరిహరాదులను నాహవములందు

గీ॥ సోలయఁజేసిన నేను దాసుండనైతి, నమ్ముఖం బిమ్ము నావంకఁ జక్కఁగనుము
మేలిపూలత వోని నీ మెయి దురంపు, టలజడిని బెట్టనేల నాయాన చాన. ౬౩౮

## —• దేవి మహిషాసురునికి ధర్మబోధఁ జేయుట •—

చ॥ ఇటుల దురుక్తులాడు దనుజేశ్వరుఁ గాంచి పరిహాసపూర్వమై
యిటువలెఁ బాపపుంబలుకు లేటికిఁ బల్కెదురా దురాత్మ! య

క్కటికముతోడ నన్ను నెడ నాస పొసంగునె? నాకు భర్త యొ
క్కటఁ గలఁ డాత్మ పూరుషుఁడు కంతపదస్థితుఁ డాతఁ డెమ్మెయిన్. ౪౩౯

ఉ॥ ఎవ్వనియిచ్ఛమై జగము లెల్ల సృజించి భరించి కూల్తు నా
కవ్విభుఁ డుండ విశ్వమయుఁ డవ్యయుఁ డీశ్వరుఁ డంతకాంతకుం
డెవ్వరితోఁ బనేమి యతఁ డెప్పుడు నన్ గను నప్డు వానికిన్
జవ్వనినై శివా ప్రకృతి సంజ్ఞలచేఁ జలియింపకుండుదున్. ౪౪౦

గీ॥ అమ్మహామహుదృష్టి నాయందుఁ గలుగ, నేను జేతన నై యుందు నించుకంత
సడలెనేని జడాత్మనై సంచలింపఁ, జేయఁజాలను దృణమైనఁ జెలఁగి నేను.

గీ॥ ధర నయస్కాంతసంయోగ మరయఁ జలన, మాయసంబునఁ బుట్టించునటులు పరమ
పూరుషునిఁ గోరు మాబోటి పొలఁతులకును, గ్రామ్యసుఖవాంఛ గలుగునే కనవు గాని.

సీ॥ మూర్ఖ! మందుఁడ వౌట ముదితలఁ గోరెదు, పడఁతులు నరులకు బంధనములు
బంధశృంఖలలేని పాయు నొక్కొకవేళ, స్త్రీబంధ మెచ్చటఁ జెడదు సుమ్ము
మూత్రగేహమునకై ముచ్చటపడియెదు, మనసు శాంతికిఁ జొన్పి మమత విడుము
తెలిసి సంకట మగు తెలవల భోగంబు, కామింపవలదు సుత్రాము నెడల

గీ॥ నీసు పోఁదోలి రాజ్యంబు నిచ్చి సఖ్య, మార్జన మొనర్ప గా దేని యతల లోక
మరుగు మెదజీవితేచ్ఛ నీ కగున యేని, యిదియుఁ గాకున్న లేలెమ్ము కదనమునకు.

గీ॥ ఏను సురలెల్ల వేడిన నిచ్చ మెచ్చి, నిన్ను వధియింప వచ్చితి నిజము వినుము
చతురసల్లాపములకుఁ బ్రసన్న నైతి, ధరణి సఖ్యంబు సాప్తపదంబు గాన. ౪౪౪

ఉ॥ జీవనమేల వాసెదు సజీవుఁడవై సురరాజ్య మిచ్చి స
ద్భావనచేఁ బురందరుని బంధునిఁ గా మది నెంచి యెల్లరన్
గావుము జీవనేచ్ఛ మదిఁ గల్గద యేనియు వీరచర్యచే
వే వెడలన్ దలంపుము ప్రవీణుఁడవై రణరంగభూమికిన్. ౪౪౫

గీ॥ పుట్టు భూతంబు లెల్లను గిట్ట వొక్కొ, వ్యర్థమరణంబు నీ కేల వైరికుంభి
కుంభవిదళనసాహసోగ్రుండ వీవు, కదలుము దురంబునకు వేగ గనుము పరము.

ఉ॥ దేవి వచించు పల్కులకు దీర్ఘతరోచ్ఛ్వసనం బొనర్చి లో
నావిరి గ్రమ్మ కోపశిఖ నార్పుచు దేవినిఁ జూచి పల్కె వాఁ
డో వనితామణీ! మదిని నోర్చి నినున్ బ్రహరింపఁజాల ని
న్నే వెతఁ బెట్టఁ జూతునె? గ్రహింపుము నావచనంబు నెమ్మదిన్. ౪౪౭

వ॥ దేవీ! నీ వతికోమలాంగివి సర్వాంగసుందరివి సకలజగన్మోహినివి నేను హరిహర హిరణ్యగర్భలోకపాలాదులను జయించి శాసనంబునఁ బ్రవర్తింపఁజేయుచున్న వాఁడ, నే నెట్టు లింత పారుష్యంబున కోర్చి నీతో దురం బొనరింతును. రుచించె నేని నన్నుఁ బాణిగ్రహణం బొనర్పుము, కాదేనియు నెచ్చటనుండి యేతెంచి తివో యథేష్టంబుగా నచ్చోటికిం జనుము, నీతో సల్లాపకృతంబగు మైత్రి వాటించితి నిన్నుం బ్రహరింపంజాల హితంబును శుభంబును నగు మార్గం బెఱింగించితిని గావున యథాసుఖంబుగా నరుగుము జగదేకసుందరి వగు నిన్నుం గెడపుటనా కెట్టి సుఖం బెసంగంజేయు? స్త్రీహత్యయు, బాలహత్యయు, బ్రహ్మహత్యయు, దురత్యయంబని యెఱుఁగుదు నదియునుంగాక బలాత్కారంబున నిన్నుఁబురంబునకుంబట్టుకొనిచని సుఖంబనుభవించితి నేని దాన నేమిఫలంబుఁ బొందంగలవాఁడ విన యౌవనతుండనై యొక్క ధర్మంబు దెలిపెదను. పురుషునకు సుందరియగు కాంతం గవయమిని వనితకుఁ జతురుం డగు కాంతునితోఁ గవయమిని జన్మంబు నిష్ఫలంబుగదా! సంయోగంబున సుఖంబును వియోగంబున దుఃఖంబును నీవెఱుంగుదువే కదా! రూపసంపన్నవు భూషణభూషితవునై నన్ను భజింపని దెట్టి చాతుర్యంబో? భోగపరివర్జనం బెవ్వఁ డుపదేశించె? నిష్టభోగంబు బోధించు తెఱంగున వంచకుండీ బుద్ధిఁ గఱపె, నాగ్రహంబు విడువుము. మదీయాభిలాషితం బొనర్పుము. పతిహీనవై యేమి సుఖం బనుభవించెదు? లక్ష్మిం గలసి విష్ణుండును సరస్వతిం గలసి బ్రహ్మయును పార్వతిం గూడి రుద్రుండును శచి నెనసి శతముఖుండును సుఖంపరే? సుందరుండ నగు నన్నుంగామింపని నిన్ను సుమబాణంబుల మర్దింపకుండుట పంచశరుండు మందబుద్ధిగదా! అబల వని నిన్నుఁ గంతుండును బేరేపకుండుట దయావంతుండనవచ్చుఁ జుమీ? అదియునుంగాక నాయందలి రూపవైరంబున నిన్ను మరుండు వేధింపకుండెనో! మఱియును నాకుం బ్రతిపక్షులగు నిర్జరులు నాయెడల మోహంబును బుట్టకుండ దుర్బోధంబున బాణపాతంబు సేయకుండఁ జేసిరో? యదృచ్ఛాప్రాప్తంబయిన మత్సుఖంబు పరిత్యజించి పశ్చాత్తాపంబు నొందంగలదానవు, దివ్యసుందరుండగు ననుకూలపతి న్విడనాడి శఠుండగు రాజుం జేకొని పశ్చాత్తప యగు మందోదరి పోల్కి నయ్యెదు, దూరాలోచనం బెఱింగి నన్నుం జేకొను మని దురుక్తులాడు మహిషుం గని విశ్వేశ్వరి నవ్వుచు నిట్లనియె. ౪౪౮

## —• మందోదరి యను రాజకన్య వృత్తాంతము •—

కం॥ మందోదరి యను నయ్యరవిందానన యెవతి? దాని కవిడిచిన దెవ్వాం
డందికఁ జేకొనె నెవ్వం, డందముగా నయ్యదంత కమాద్యంతంబుల్. ౪౪౯

చ॥ ఎఱుగఁగఁజేయు మన్న దనుజేశ్వరుఁ డంబికఁ జూచి పల్కె నో
తెఱవ! సవిస్తరంబగు మహితింగని విన్మిదె తెల్పువాఁడ న
ద్దఱిసిరులన్ జెలంగి వసుధావలయంబున సింహళంబు నా
నుఱు వగు దేశ మొక్కటి యనూనమహాధనధాన్యసంపదన్. ౪౯౦

చ॥ తఱుఁగని పుష్పపాదపలతాభరితోపవనాళులన్ గడున్
దెఱలని భోగభాగ్యముల దీర్ఘసరోవరపాళులన్ ధరన్
బఱిపరివింతలన్ దనరి బంధురజానపదైకయోగ్యమై
గొఱలు తదీయరాజ్యమునకున్ ధరణీపతియై చెలంగుచున్. ౪౯౧

ఆ॥ చంద్రసేనుఁడనెడు సద్ధర్మవర్ధనుం, డరిమదాపహుండు సరసబుద్ధి
సత్యవాది సర్వశాస్త్రధర్మజ్ఞుండు, పృథివి నేలు నొక్క పార్థివుండు. ౪౯౨

ఉ॥ అమ్మహిపాలుభార్య కమలానన యెంతయు శోభనాంగి యం
దమ్ములపుట్టినిల్లు పతిహితత్పరశీలమునందు మేటి మూ
ర్తి మ్మఱుతల్లి సద్గుణగరీయసి ధీమతి యవ్వధూటి యా
ద్యమ్మగు గర్భమందు మెలఁతం గనె బంగరుబొమ్మ యాపెయున్. ౪౯౩

క॥ కర మరుదగు నక్కన్నియఁ, బరికించి మహోత్సవంబు పాటిల నందో
దరి యను నామం బిడి సాదరమతియై ముద్దుఁజేసె ధరణీపతియున్. ౪౯౪

సీ॥ చంద్రరేఖయుఁబోలె సంతతం బభివృద్ధిఁ, బరఁగుచుఁ బదియేండ్లప్రాయమునను
బెరుఁగుచునుండ నా బిడ్డకుఁ దగినట్టి, వరుఁ డెవ్వఁడో యను వాంఛవలన
జనకుండు దేశదేశంబుల రాజుల, నెమకంగ నాంధ్రదేశమున మేటి
రాజు సుధన్వుఁ డన్ రాజన్యకులునకు, సుతుఁడు కంబుగ్రీవుఁ డతులవీర్య
గీ॥ శౌర్యగాంభీర్యచాతుర్యసద్ధైర్యధనుఁడు, సర్వలక్షణశాలి విచక్షణుండు
గలఁ డటంచును విప్రులవలనఁ దెలిసి, కూఁతు నీయఁగ నారాజుఁ గోరికొనియె.

చ॥ గుణవతి భర్త మాట విని కూఁతును జేరఁగఁ బిల్చి కూర్మి నో
యణుసదృశావలగ్న! నిను నల్లునిగాఁ బరికించి యొక్క రా
జున కొసఁగందలంచె శుభశోభితలగ్నమునందుఁ దండ్రి; య
య్యనఘుఁడు కంబుకంఠుఁ డను నాఖ్య వహించు నటంచుఁ దెల్పినన్. ౪౯౬

ఆ॥ తల్లిఁ జూచి పల్కెఁ దనయ నే నొక్కనిఁ, బతినిగాఁగఁ గొనను బరమమైన
వ్రతముఁ బట్టియుంటి వ్రతము కౌమారంబు, కాల మెల్ల దానఁ గడఁపఁగలను.

సీ॥ స్వాతంత్ర్యమున నేను సంచరించెదఁగాని, పారతంత్ర్యమున నేఁ బడఁగఁజాలఁ
దపము సేయుదు ముక్తి తత్పరనై యుందు, సంసారజలధి మజ్జనము నొంది

పరబంధదుఃఖంబు ♦ భావింపక యథేచ్ఛ, సంప్రాప్తసుఖము మోక్షం బటంచు
శాస్త్రజ్ఞు లెఱుఁగింప ♦ సంగ్రహించితి ధర్మ, మదిగానఁ బతిచేతి♦యాజ్ఞ వలదు

గీ॥ పరిణయం బయ్యెనేని నశ్వపతికిఁ జిక్కి, తద్వశంబున నుండుట ♦ ధర్మ మరయ
భర్త్రధీనత కే నోడఁ♦బడితినేని, అతనియాజ్ఞకు లోఁబడు♦టాను గాదె. ౪౫౮

వ॥ మఱియును బావకసన్నిధానంబున భర్తతోడఁ బల్కిన పల్కులు తప్పక వర్తింపవలయును. పతిచిత్తానువర్తనంబును శ్వశురదేవరవర్గంబులకు దాస్యంబును, జ్యేష్ఠజ్యేష్ఠపత్నీకృతానుశాసనసహత్వంబును వేదనావహంబులే కదా! యొక్కొక్కతఱి వల్లభుం డన్యకాంతాసమాసంగంబుననో దాస్యాది సమాసంజనంబుననో బద్ధుం డయ్యెనేని తద్వశంబున నీర్ష్యాసంరంభిణి నై పతిం గోపించి క్లేశంబునుం బొందవలయు, స్వప్నసదృశంబగు సంసారంబునఁ బరతంత్ర లగు కాంతలకుఁ బారతంత్ర్యంబు కష్టాత్కష్టతర మని పెద్దలవలన వింటిని. పూర్వమ్మున నుత్తానపాదతనయుండు ధ్రువానుజుండును సర్వధర్మజ్ఞుండును నైన యుత్తముండు ధర్మపరయును సాధ్వియుఁ బతిభక్తిపరాయణయు సౌందర్యవతియును నైన కులపత్ని నపరాధ మొక్కింతయును లేక విపినంబున విడిచె నని విందు నదిగావునఁ బతిపరతంత్రలైన కాంతల కిట్టి దుఃఖంబులు తఱచు ప్రాప్తిం చుఁగదా! యదియునుంగాక. ౪౫౯

సీ॥ కాలయోగంబునఁ ♦ గాంతుండు మృతుఁడైన, వైధవ్యదుఃఖంబు ♦ వలయుఁగాదె!
పతి ప్రోషితుండైన ♦ భర్త కోపించిన, వల్లభుం డన్యాభి♦వాంఛ జనిన
శోకసంతాపముల్ ♦ సుఖనాశకంబులై, యాత్మ నిర్బంధింప♦నగునకాదె?
అదిగానఁ బతితోడి ♦ యనుబంధ మే నొల్ల, నని తెల్ప విని తల్లి ♦ యాత్మభర్త

గీ॥ కవగత మొనర్చె నిట్లని;♦యాత్మజాత, జపపరాయణయై వ్రతా♦స్థను వసించి
పతిని జేపట్ట రోసి యప♦పారమైన, సంసృతి "సదోష"మని యెంచి ♦ చకిత యయ్యె.

క॥ కౌమారవ్రతధారిణి, కామోత్సవవిముఖ తనయ ♦ గావున యుష్మ
త్కామిత మెట్లగుఁ బరిణయ, మేమని నేయంగనగు య♦థేచ్ఛ మహీశా. ౪౬౧

ఉ॥ కావునఁ బెండ్లి సేయనగు ♦ కార్య మొకింతయుఁ గల్గునొక్కొ, నీ
భావమునం దెఱుంగుమన ♦ భర్తయు నేమియుఁ బల్కఁ డయ్యె ని
ట్లా వనితాశిరోమణియు ♦ నాత్మగృహంబునఁ దల్లిదండ్రు లి
చ్ఛావశవర్తులై పెనుప ♦ సద్వ్రతనిష్ఠలకల్మి నుండఁగన్. ౪౬౨

గీ॥ అంతకంతకు యౌవనం ♦ బంకురించి, సంతతోల్లాసదం బయి ♦ స్తననితంబ
కాంతిగరిమంబుతఱచయ్యె♦గామదీప, కంబయిన కామ మొకయించు♦కయును లేక.

ఉ॥ చేడియ లంత నింత మదిఁ - జేరిచి కామకథానుభూతులన్
గూడుచు ముచ్చటింపుచును - గూరిమి నింగితభావచేష్టలన్
బాడుచు నాడుచున్ మరుని - ప్రెల్లదనంబులఁ జేరిణంబులన్
గూడిక లెల్లఁ దెల్ప నెదఁ - గోరదు వల్లభభక్తిహీనయై. ౪౬౪

సీ॥ సలలితోద్యానదేశంబుల బహులతా, పుంజకుంజంబులఁ - బొలఁతు లెల్లఁ
గూడియాడుచుఁ బూలు - గోయుచు విహరింప, జ్ఞానార్థవాక్యముల్ - చదువుకొనుచు
వ్రతతత్పరత్వంబు - వలన విరక్తయై, యుండ నచ్చోటికి - నొక్కనాఁడు
కోసలాధీశుండు - గుణగణాఖని మహా, వీరుం డుదారుండు - వీరసేనుఁ

గీ॥ డనెడు నరపతి రథ మెక్కి - యంతసంత, వెనుకఁ జతురంగబలములు - మొనసి నడువ
ముందువచ్చుచు నుండ - సమ్మదితసఖులు, గాంచి మందోదరిని జూచి - కలయఁగూడి.

ఉ॥ వచ్చుచునున్నవాఁడు మహి - వల్లభుఁ డొక్కఁడు రూపసంపదన్
మెచ్చులు గుల్క రాజులకు - మేటి రథస్థితుఁ డిందుఁ జేరఁగా
వచ్చి కనుంగొనన్ దగు న - వారితవిక్రముఁ డంచుఁ దెల్పుచో
నచ్చటి కేఁగుదెంచి వసు - ధాధిపుఁ డా చెలిఁ జూచి మోహియై. ౪౬౬

ఆ॥ రథముడిగ్గి తనదు - రాజసంబు ధరిత్రిఁ, దిరుగు మరునితోడ - దీటుపడఁగ
సవినయముగ వచ్చి - సతితోడఁ జనునొక్క, బోటిఁగాంచి పల్కె - భూవరుండు. ౪౬౭

ఉ॥ ఈలలితాంగికిన్ జనకుఁ - డెవ్వఁడు? నామము చంద మెట్టిదో?
కేలిక నీవనస్థలులఁ - గ్రీడ యొనర్చుట కేకతంబొ? యా
మూలముఁ దెల్పుమన్న నగు - మోమున బోటి వచించె నో మహీ
పాలక! నీదువృత్తము శు - భంబుగ మా కెఱిఁగింపఁగాఁదగున్. ౪౬౮

ఉ॥ అవ్వల మాయుదంతము స - మాహితనై వినిపించుదాన నాఁ
బువ్విలుకాని చక్కదన - మున్ నృపుఁ డచ్చెలిఁ జూచి పల్కె నో
జవ్వని! కోసలాధిపుఁడ - నందియ మొందకు వీరసేనుఁడన్
దవ్వుల నాదు సేనలు ప - దంపడి వచ్చుచు నున్న వెన్నియో! ౪౬౯

చ॥ సరసిజమిత్రుతాపమున - సైఁపక యవ్వనికిన్ జవంబుతో
నరదము నెక్కి వచ్చి మిము - నారయఁగంటిని దైవయోగ మి
త్తెఱఁగు ఫలింపఁజేసె ననఁ - దెల్లముగా విను నేను దెల్పెదన్
నరవర! చంద్రసేననృప - నందని యివ్వనిఁ గ్రీడ సల్పెడిన్. ౪౭౦

కం॥ మందోదరి పేరిటి యర,విందానన యీమె మేము - వెలఁదికిఁ గ్రీడా
నందము లిచ్చుచు వెనువెం,టం దిరిగెడు బోటులము త - దంబడ కెపుడున్. ౪౭౧

సీ॥ అన విని కోసలుం డనియె సైరంధ్రితో, నర్క-వంశ్యుఁడ మహాసమాన్వితుండ
గాంధర్వమున నీపెఁ గామింపఁ దలఁచితి, నెలమి యౌవనభరాన్వితుఁ డనయ్యుఁ
బరిణయింపఁగ లేదు పట్టంపురాణిగా, మీ కన్నె నేలుదు మెలపుతోడ
వలపింపు మనుకూల వల్లభుండ నటన్న, నవ్వి సైరంధ్రి భూనాథుఁ గాంచి
గీ॥ తెలిపెద నటంచుఁ బోయి యత్తె యవతోడ, మిహిరవంశ్యుండు నినుఁ జూచి మెచ్చి పెండ్లిఁ
గరముఁ బట్టంగఁ దలపోసి కాచినాఁడు, సమయ మిది వల్లభునిఁ గూడ జాణలకును.

గీ॥ పరిణయవిరక్తనై యిట్టి ప్రాయమునను, మిన్నకుండుటచేఁ దండ్రి మేరమీఱు
చింతచేఁ గుందుచున్నాఁడు చేడియలకు, నదను మదనుని సయ్యాట కరయఁ డిదియె.

మ॥ మము బోధింపుఁడటంచుఁ దండ్రి కడుఁ బల్మాఱుం దగం దెల్పె నీ
వమలాత్మజ్ఞత నీయకోమిఁ గని మాటాడంగ లేకున్న వా
రము పాణియంబున భర్తృభోగము ఫలారంభంబు తత్సేవనం
బు మహోల్లాసము నిందునందు నెఱుఁగంబోలుం గదా! కాంతకున్. ... ౪౭౪

కం॥ కావున నీ వటు సేయక, వైవాహికవిధికి మదిని వాంఛింపుము నీ
భావము పతివ్రతాన, ద్భావంబున కర్హ మనుచుఁ బల్మఱుఁ బల్కన్. ౪౭౫

ఉ॥ వల్లభు నొల్లమున్మఱు నవారితనై వచియించుదాన నా
తల్లికిఁ దండ్రికిన్ నెనరు దప్పఁగ నీక వచింతు నింక నేఁ
జెల్లఁ బతివ్రతానియతిఁ జిక్కి పదంపడి యన్యబద్ధనై
యుల్లము తూల నుండుటకు నోర్వఁగఁ జాల నెఱింగియుండుఁడీ. ౪౭౬

గీ॥ ఖండనోక్తులచే నిట్లు కాంత పలుక, నయ్యయో దురతిక్రమం బగునకాదె?
కాలమటులయ్యు మమ్మిట్లు గాదనంగఁ, దగునె పతిసుమ్ము దైవంబు తరుణులకును.

చ॥ వినుమని బుజ్జగించినఁ బ్రవీణతమీఱ వధూటులార! మీ
రనుదిన మిట్లు వల్కవల దంతట దైవమె కర్తగాన నా
జననవిసర్గ మిట్టి దని సైఁపుఁడు కర్మము కారణంబు నా
మనము వ్రతోల్బణంబు విని మన్ననఁ జేసి సహింపఁగాఁదగున్. ౪౭౮

చ॥ పలుమఱుఁ జెప్పరాకుఁ డన భామిను లెల్లరుఁ జింతనొంది ని
ర్మలము వధూటిచిత్త మని రాజున కింతయుఁ దెల్పి పోమ్మనన్
జెలిమొద వీతమోహుఁ డయి చిత్తజవేదన నార్చికొంచుఁ గో
సలపతి వచ్చుత్రోవఁ జనెఁ జానయు నింటికిఁ బోయె బోట్లతోన్. ౪౭౯

క॥ ఇత్తెఱఁగున జరిగెడుతఱి, నత్తఱివకుఁ జంద్రమతియన్నాఁ జెల్లెలు స
ర్వోత్తమసౌందర్యాన్విత, మత్తిలుమరుమా స్త్రివోలి మహి నలరారెన్. ౪౮౦

ఉ॥ వాలుమిటారికన్నవయు ♦ వక్త్రువయో కుచయుగ్మముర్ *గడా
నీ లలితంపుమేను నును ♦ నీటులు గుల్కెడు పెన్నెఱుల్ హఠాయల్
చాలయి మూర్తిఁ గొన్నగతిఁ ♦ జానకు యౌవన మంకురింప న
బ్బాలకుఁ బెండ్లిసేయుటకు ♦ భావము ప్రోదియొనర్పఁ దండ్రియున్. ౪౮౧

సీ॥ అంగవంగకళింగ♦బంగాళసౌరాష్ట్ర, మద్రాదిదేశరా♦జన్యులనెల్ల
రప్పించి రమణీయ♦రత్నాసనమ్ముల, నుండంగఁ జేసి య ♦ య్యువిద నంత
సలలితరత్నభూ♦షణకదంబముల న, లంకరించి మనోజ్ఞ♦లక్ష్మివోని
తనయఁ దోడుకవచ్చి ♦ ధరణీపతులలోన, ధైర్యగాంభీర్యసౌం♦దర్యములను

గీ॥ దగినవల్లభు నఱితేఁ ♦ బూదండ యిడిన, వాని కిచ్చెద నని తెల్ప ♦ వనజనయన
చంద్రమతి గోరె నొకరాజ♦చంద్రు దాని, వానికొసఁగెను దాఁ జంద్ర♦సేనుఁ డంత.

—♦ మందోదరి మద్రరాజును బెండ్లియాడుట ♦—

శా॥ మద్రాధీశునిఁ జూచి భ్రాంతి పడియెన్ ♦ మందోదరీకాంత; ని
ర్నిద్రప్రాక్తనదైవయోగవశతన్ ♦ నీరేరుహాస్త్రవ్యధా
ముద్రామృదిత యాచుఁ దండ్రిఁ గని సమ్మోదంబునన్ నేర్పుమై
ఛిద్రింపఁ బెవ్వరిఁ గానసీక వినిపించెన్ స్వాత్మవాంఛారతిన్. ౪౮౩

గీ॥ మద్రరాజన్యుపై నాకు ♦ మనసుదవిలె, సంధియొనఁగూర్చి నన్ను నీ ♦ చారుధిషణు
నకు నొసంగి వివాహంబు ♦ నర్పుమనిన, జనకుఁ డాతనిఁ బిలిపించి ♦ సంతసమున.

సీ॥ వివిధవాద్యధ్వనుల్ ♦ వినువీథి నగలింప, నురువైభవమున వే♦దోక్తవిధిని
దనయ నర్పించి మ♦ద్రమహీపతికిఁ జాలఁ, బారిబర్హంబు ల♦ర్పనముఁ జేసి
నందని నంప నా♦నందుఁడై మద్రేశుఁ, డతివఁ దోడ్కొనిపోయి ♦ యాత్మపురిని
గామోపభోగియై ♦ కతిపయదినములు, లాలింప వల్లభు♦లాలనముల

గీ॥ మేనుదెలియని సుఖభోగ♦మేళనములఁ, దవిలి వర్తించె నొకనాఁడు ♦ ధరణివిభుఁడు
శఠుఁడు గావున దాసితో ♦ సంగమింప, నది దెలిసి మెల్లమెల్లన ♦ నంతిపురిని.

కం॥ మందోదరిసైరంధ్రి య, మందోద్వేగమున నాత్మ♦మందిరమున న
స్పందత విరితల్పంబున, నందముగను దనదు దేవి♦యభ్యర్ణమునన్. ౪౮౬

మ॥ తరుణీ! కంటివె నీ మగండు శఠుఁడై ♦ దాసీవధూటిన్ మదో
ద్ధురుఁడై క్రీడకుఁ దార్పఁ గంటి నని తోడ్తోఁ దెల్ప రోషించి ని
ష్ఠురవాక్యమ్ముల భర్త నొంచిన నతండున్ జాల లాలించి స
ర్వరసాలంబనయుక్తులన్ గనరు దేరన్ గొన్నినాళ్ళేగినన్. ౪౮౭

౪౮౧ * కడానీ, దీర్ఘము చింత్యము, దిద్దఁబడమి నుపేక్షితము.

క॥ కాలాంతరమున దాసీ,లీలాగృహశాయి యగుచు – లిప్సావశుఁడై
యాలీలావతితో రతి,లోలుం డగు భర్త గాంచి – లుంఠితమతినై. ౮౫౫

క॥ సైరంధ్రి దెల్పినను మది, సైరించితి నేఁడు దృష్టిసాక్షాత్కృతుఁడై
జారిణితోఁ గలసి దురా,చారుండై భర్త దోషసంగతుఁ డయ్యెన్. ౮౫౬

సీ॥ మరునాఁడుగా నన్ను – మరగించి చేపట్టి, పలికినసమయముల్ – పదటఁగలిపి
వహ్నిసాక్షిగ వేదవాదులు బోధించు, విధిశాసనంబులు – వీటిబుచ్చి
పరభామినీసంగపరత దుర్గతిహేతు,వను సాధ్వసం బెల్ల – నవలఁ దోఁచి
ధర్మపత్నీపరితాపకారణకర్మ, మనుచితం బను శాంతి – నగడుపఱచి

గీ॥ సిగ్గుమాలిన యిట్టి దుశ్చేష్టవాని, సంగ మెదఁ గోరుకంటెను – జావు మేలు
నేఁటఁగోలెను సంసారనీచసుఖముఁ, బాసెదనటంచు రోసి య – ప్పంకజాక్షి.

చ॥ పతి విడనాడి మజ్జనకుపాల వసించెద నన్నుఁ దొల్లి నా
మత మొక కొన్నినాళ్ళు సవిమర్శ మెఱింగినవారు గాన "నీ
మతకము లీపె నైజములు – మానునె? పుట్టిననాఁటఁ గోలె నీ
గతిఁ గడఁదేఱ" నంచని వివేకవిక నవ్వుదు రప్పురాంగనల్. ౮౫౦

క॥ అదిగావున వైరాగ్యము, మదిఁ బెనఁగొనఁ జేసి నాదుమందిరమున దు
ర్మదనవనసౌఖ్యసంపదఁ, గదిమి విరక్తనయియుంట – కార్యంబనుచున్. ౮౫౨

మ॥ పతిమోహమ్మున దుఃఖశోకపరతాబద్ధాంతరంగంబునన్
స్థితనై సంసృతి రోసి భర్తృవశతన్ – జేకొక చింతాపరి
ప్లుతనై శోషిల రెంటికిన్ జెడియె నాపూఁబోణిదా వృత్తమున్
శ్రుతిమాధుర్యము గాఁగ వింటివొకొ? యీ – చొప్పొ భవద్వృత్తమున్. ౮౫౩

సీ॥ త్రిభువనంబులు గెల్చి – దేవాధిపత్యంబు, కొంగుబంగారుగాఁ – గొనినవాఁడ
హరిహరబ్రహ్మాదు – లాహవంబున కోడి, పరువెత్తఁ జేసిన – బల్లిదుండ
మించుబోండ్ల నథఃకరించి మించి యశేష, చేతనావధ్యతఁ – జెలఁగువాఁడఁ
గల్పభూజనిధానకామధేన్వాదులఁ, గదలకుండఁగ నింటఁగట్టినాఁడ

గీ॥ నిట్టి జగదేకవీరుని – నెత్తివేసి, నిర్గుణుని నాశ్రయింపంగ – నీతి యగునె?
వలచివచ్చితి నన్నిట్లు – వనటఁ ద్రోసి, పిదపఁ బరివేదనముఁ బొందు – బేలవైతి.

చ॥ మనసు వశంబుఁ జేసికొని – మన్ననమాటల నన్ను నేలి నీ
వనయము దాసుఁగాఁ గొను మహంకృతి మాను మటన్న నవ్వి యా
దనుజనిహంత్రి దుష్టమదతత్పరతం బెడఁబాసి నేనతోఁ
జను మతలంబుఁ జేరుము వెసన్ బలభేదికి నిమ్ము రాజ్యమున్. ౮౫౪

ఆ॥ ఇట్లు సేయవేని యెల్ల దైత్యులతోడ, నంతకాంతికమున కనిపి నిన్ను
నిచ్చవచ్చినట్లు లేగెద సాధుల, కెట్లు సౌఖ్య మబ్బు నట్లసేతు. ౪౯౬

శా॥ చావుం బుట్టు వెఱుంగనట్టి శ్రుతివాక్చాగోచరం గాని నే
నావిర్భూతగుణానుషంగమున దివ్యాకారముం దాల్చి స
ద్భావం బొప్పఁగ దుష్టశిక్షణకళాధౌరేయతన్ వచ్చితిన్
గావింపన్ జన దే? భవాదృశుల శిక్షన్ దుర్మదగ్రామణీ. ౪౯౭

మ॥ నిజముం దెల్పెద నిర్జరార్థమున నే నిన్నాహవక్షోణిలో
నజహద్విక్రమలీలఁ గూల్చుటకునై యారబ్ధయత్నంబుచే
భజనీయాకృతిఁ దాల్చి వచ్చితిని శుంభద్భండనోల్లాసినై
విజయాకాంక్షఁ బెనంగు మొండయిన నుర్విన్ దూఱి జీవింపుమీ. ౪౯౮

మ॥ పరుషోక్తిన్ జగదంబ పల్కుటయు నప్పాపాత్ముఁ డక్షిద్వయీ
భరితక్రోధరసారుణప్రభల భూభాగంబు సంధ్యారుణ
స్ఫురితప్రక్రియ నీనఁ గార్ముకము విస్ఫూర్జద్గుణధ్వానమే
దురితాభ్రంబుగఁ గేలనూని నిహతద్విక్రూరనాగం బనన్ ౪౯౯

శా॥ ఆకర్ణాంతముగాఁగఁ గార్ముకము ఘోరాకారుఁడై తీసి య
స్తోకప్రక్రియఁ బ్రస్తరాభవిశిఖస్థూణంబులన్ దేవిపై
భీకృద్వహ్నిశిఖాపరంపరలు దీపింపన్ మహాసారధా
రాకల్పంబుగ నేయ దేవి శరవారం బెల్లఁ ద్రుంచెన్ వెసన్. ౫౦౦

శా॥ దేవీదానవముక్తచండశరసందీప్తప్రభం బై నభం
బావేశించె లయాంతసంభ్రమదదభ్రాభ్రస్ఫురచ్చంచలా
శ్రీవర్ధిష్ణుసరోజజాండకుహరవ్యస్తేమాభిరామాకృతిన్
గ్రావంబుల్ పెటిలించె క్ష్వేడలును దత్కాలాభ్రగర్జార్భటిన్ ౫౦౧

కం॥ అన్యోన్యవిజయవాంఛా,జన్యాహవబాహువీర్యసంరంభకళా
విన్యాసంబులఁ దుములం, బన్యాపూర్వ ప్రచండమై వర్ధిల్లెన్ ౫౦౨

—: దేవి దుర్ధర త్రినేత్రాంధకు లను రాక్షసుల సంహరించుట :—

ఉ॥ దుర్ధరుఁ డంత నడ్డపడి దోర్బలముక్తనిశాతసాయకా
త్యర్థనిఘాతముల్ సలిపి యజ్ఞనయిత్రి నలంపఁ దత్క్రుధా
వర్ధితబాహువీర్య యయి వజ్రనిశాతశిలీముఖావళిన్
బార్థివుఁ జేసె సొం... దేవి వేగ నాతనిన్.... ౫౦౩

మ॥ స్వరుధారాహతిఁ గూలు శైల మన దుస్సర్వారపరితాపుండు దు
ర్ధరుఁ డాయోధుఁడు భూమిఁ గూలుటయు దుస్సర్ధాంతపరిభావోదయ
స్థిరతాంచద్భుజుఁడౌ త్రినేతుఁడు పరాశ దేవిన్ నిరోధించి ని
ష్ఠుర ఘోరాంబకసప్తకంబునఁ బ్రచండుండై యనిన్ వేసినన్. ౧౦౪

క॥ అన్నిటి కన్ని శరంబులు, మున్నుగఁ బరికించి తుంచి ॰ ముమ్మొనవాలుం
బన్ని త్రినేతుని గ్రుమ్మిన, వెన్నియక పోటువడుచు ॰ విపులం దెల్లెన్.

ఉ. అంధకుఁ డంత నాహవమదాంధతచేత గదాగ్రహస్తుఁడై
కంధర మిందిరాపమునఁ ॰ గ్రాలెడురీతి దురంబులోన న
గ్గంధగజేంద్రవైరితలఁ ॰ గాడఁగ మోఁద సటల్ విదిర్చి ని
ర్గంధనలోలమై నఖము ॰ ఖమ్ముల రక్కసుఁ గొట్టె నార్చుచున్. ౧౦౬

చ॥ హరినఖరాహతిన్ రుధిర ॰ మాపగవోలె మెయిం దొరంగ దు
స్తరతరవేదనన్ మునిఁగి ॰ ధారుణిపైఁ బడె నంధకుండు త
త్తరసము మెక్కి గర్జిలుచు ॰ దానవసేనల నుక్కడంచి ని
ష్ఠురనిజనిస్వనంబులఁ గకుప్పరత మిన్నగలించె సింగమున్. ౧౦౭

—• మహిషాసురుండు దేవితో యుద్ధముఁ జేయుట •—

ఉ॥ కట్టెదురన్ నిశాచరు లఖండపరాక్రమధుర్యు లిట్లనిన్
గిట్టుటఁ గాంచి దేవిపయిఁ ॰ గిక్కిఱియన్ నిశితాంబకంబు లి
ట్టట్టనరాక యుండ దెస ॰ లెల్లెడఁ గ్రమ్మఁగ సోనవాన నా
బెట్టుగఁ బైపయిం గురియ ॰ భీకరమూర్తి వహించె వేడుకన్. ౧౦౮

ఉ॥ రక్కసుఁ డేయు నంబకపరంపరలన్ నిశితాస్త్రఘట్టనన్
జెక్కులు చేసి తీవ్రశరనేకమునన్ రథరథ్యసారథుల్
దొక్కట మందఁజేయు రణధూర్వహుఁ డయ్యసురుండు పౌరుషం
బెక్కుడుగాఁగఁ బైఁ బఱపె ॰ నీశ్వరిపై నిశితాంబకంబులన్. ౧౦౯

శా॥ రక్షోహంతిరి చలజ్జ్వలజ్జ్వలన ఘోరస్ఫారకాంతిచ్ఛటా
పరిక్షేపాక్షయమౌ గదం గొని దురాపక్రోధియౌ రాక్షసున్
వక్షోభిత్తిపయిన్ నిగుడ్ప వెన దుస్సర్వారోగ్రతఘ్నాతనా
సక్షోభుండయి మూర్ఛనొంది పడియెన్ ॰ సంగ్రామరంగంబునన్. ౧౧౦

వ॥ అట్టియెడ రక్షోవల్లభుం డొల్లంబోయి యరదంబుపయింబడిన ననేకాక్షోహిణీరక్ష
స్సేనాధిపులు సేనానివహంబులతోడఁ జుట్టుకొని మట్టుమీఱి ముసల ముద్గర
భుసుండి గదా ప్రాస పరశు భిండివాల తోమర శతఘ్ని చక్ర కుంత, ఛురికా

నారాచ ప్రభృతి నానావిధాయుధంబులు పయింబఱపిన చండికాదేవి దండధర దండంబునుంబోని కోదండదండంబు మండలాకారంబుగా నాకర్ణాంతం బాకర్షించి పిడుగు కొదమలవడువున నెడలేక విడుచుచు బడికోలల విడివడి పుడమింబడు నేనుంగులగుంపులు శతధార ధారాఘాతంబుల గులగులలై రాలు కొండల పోలికం దిట్టలు గట్టి వీరయోధకళేబరంబులు జర్ఝరితంబులైనం బారలు శోణితసాగ రాంతరాళంబుల నంతరీపశోభం దులకింప; రాహుత్తు లగు రక్కసు లొక్క మొగిం బెక్కు కరవాలంబుల నలవాయిగొనక సింగంబుపయిం గదిసిన మిడుతలం గారు చిచ్చు పొడిం జేసి భస్మంబుగా రాల్చుపోలికం దురంగాంగంబులపై నరాంగంబులు, నరాంగంబులపైం దురంగాంగంబులుగాం దడంబడరాం బడద్రేయుచు శత సహ స్రాంగంబుల సరిగట్టి వీఁపుల నుచ్చి చనుచు బ్రహ్మాండకర్పరంబు లలంకరించు నవియునై రథధ్వజచక్రకూబరవరూథయుగచూర్ణ సికతిలధరాతల ఖురళీ సాధ నోత్పతన ధురంధరభట సింహనాద ప్రతిధ్వాన నిర్భిద్గిరి కంఠీరవాకుంఠ విహా రానుమిత దేవీసింహ విశ్వరూప ప్రపంచ సంధాయకంబులునై భువనత్రయం బునం బక్షవిక్షేపంబుల నక్షుద్రంబులై గరుడవిహారంబులు సలుప నణంగి సురం గంబులందూఱు భుజంగంబులును, తమోమయంబుగాం జుట్టుకొని యంత్రికృత ధారాసారావహంబు లగుట గృహాంతరాంతరంబులం డాఁగు మానవకదంబంబు లును, వికృతరక్షః కపాలకీలిత ముఖంబులై ప్రవర్తిల్లుటంజేసి యుత్పత నృహిషా సుర వీరభటనటనంబు లని వెఱచిపఱచు నిర్జరసముదయంబులునై విహరించు నెడ దేవీనారాచంబులు కిరీటంబులు రాల్చియుం గేయూరంబులు డుల్చియు, హారం బులు దెంచియు, శిరంబులు నుఱుముఁజేసియుం, గంఠంబులు నఱకియు, వర్మం బులు వ్రచ్చియు, వక్షంబు లగల్చియు, బాహులందఱిగియు డొక్కలు వ్రక్కలు నేసియు, గండంబులు తుండెంబులుచేసియుం, గర్ణనాసికాకుహరంబులం జొరంబడి దహరంబులు చెండాడియు, దానవవరూథినులం బీనుఁగుఁబెంటలు గావించిన మింటంబఱతెంచి సురవారవధూనికరంబు కంటికింపగు నాయకులం గూడికొని మందారమాలికాలంకృతులం గావించి సుఖోపగూహనంబులం దృప్తిఁదేలి యతితరానందంబు లనుభవింప నెగసి గంతులువేయుచు నారదుండు వీణా నాదంబునం దాండవింపం, దనివిసనక ప్రళయకాలాభీల నిజకాళరాత్రి రూపం బునం గండలు మెక్కుచు రుధిరంబులుగ్రోలుచుం బ్రేవుల నలంకరింపుచుం బ్రచండ గర్జిల జాముండ విహరించు నవసరంబున. ౯౧౧

శా॥ రక్షోనాథుఁడు మూర్ఛఁదేఱి సమరారంభోగ్రరంహోభరం
బక్షయ్యంబుగ హుంకరించి భయదంబౌ సింహనాదంబునన్
బక్షోజ్జృంభిత భూధరంబు బలె నంబాదేవి కడ్డంబుగాఁ
జక్షుఃకర్ణనిభాశుగప్రతతి నాసారంబుగా నేయుచున్. ౯౧౨

మ॥ మదవత్సింధురతుండికాభమును హేమస్రగ్విభూషాన్వితం
బుదితాగ్నిస్ఫుటకీలమైన గద క్రోధోద్రిక్తుఁడై యెత్తి దు
ర్మద మాకాశము ముట్టఁగా నెగసి యమ్మాయామయంబా హరిన్
మెదడంటన్ దలమీఁద మోఁదె నది యున్మేషంబు దక్కన్ వడిన్. ౨౧౩

క॥ దేవీ కరసంస్పర్శ వి,భావితమై సింగమెగసి పటునఖరశిఖా
గ్రావళి దైత్యుని రుధిర,స్రావముగా నొడలు వ్రచ్చె సమరావనిలో. ౨౧౪

ఉ॥ పీడితుఁడై సురారి కరిభిద్వపురాకృతిఁ దాల్చి భీకర
క్రీడల నేఁపు రేగి భిదురీభవదంఘ్రినఖచ్ఛటన్ బట్టు
క్ష్వేడలొనర్చు దేవి ఘనసింహము సేనలఁగొట్టఁ జండియున్
వ్యాడనిభాశుగప్రతతి వాని మదం బడఁచెన్ మహోగ్రయై. ౨౧౫

ఉ॥ సింగపురూపునన్ నొగిలి చేడ్పడి వేసరి మాహిషుండు మా
తంగపురూపుఁ దాల్చి భయదంబుగఁ గొండపెకల్చి తెచ్చి సే
నాంగములెల్ల బెగ్గిలఁ బరాంబికపైఁ బడవ్రేయ నవ్వుచున్
ముంగలియై శరమ్ములను ముంపఁగఁ దుత్తుము రయ్యెఁ గొండయున్. ౨౧౬

చ॥ ఎగసి భవాని వాహనమృగేంద్రము దానవనాథు నెత్తిపై
నగమున వజ్రముస్బలె సనాహతనాదసనాథమై నభం
బగలఁగ దూఁకి కుంభతటి నచ్ఛనఖచ్ఛట వ్రయ్యఁజేయ నం
త గగనవీథికై యెగసి దానవుఁ డయ్యెడ శారభాకృతిన్. ౨౧౭

ఉ॥ కేసరి పైపయిన్ దుమికి గిట్టి మథింపఁగఁ జూచునంత ఘో
రాసిని వ్రేసి చండి హననాతురయై పఱతేఱ లోక సం
త్రాసకరాసిఁ జండికశిరమ్మున నైవఁగఁ దారసించి య
య్యాసురవర్యు ఘోరనిశితాంబకపంక్తి నదల్చె దైత్యుఁడున్. ౨౧౮

చ॥ తొలఁగక నిల్చి తా నప్పుడు తొల్లిటి శారభమూర్తి మాని యు
జ్జ్వలతరదీర్ఘశృంగమహిషప్రవరాకృతిఁ దాల్చి భూనభం
బులు గలయంగఁ దాఁ బెరిఁగి పుచ్ఛముఁ ద్రిప్పుచు మోరఁజాచుచున్
జ్వలదనలప్రభాప్రసరసంప్లుతి నక్షులఁ జిచ్చు లూరఁగన్. ౨౧౯

సీ॥ అతి దీర్ఘలాంగూలహతుల భీకరఖురా, ఘాతనిర్ఘాత సంఘాతములను
పృథుల విషాణ సంపీడనంబుల శైల, తరువర ప్రస్తరోత్పాతములను
శాంబరీ కల్పితాశ్రాంతసర్పవ్యాఘ్ర, చటులాత్మ వృష్టి ప్రసారములను
బహురూప విక్రమప్రబలాయుధానేక, మర్దనక్రీడావమానములను

గీ॥ భూచరణఖచరణసమితిస్ఫురణములను, దర్శనాదర్శనోత్సాహతాండవములఁ
జండి నలయించి భండనోద్దండుఁ డగుచు, విక్రమాంభోధి నోలాడె వీరుఁడపుడు.

ఉ॥ చారణ సిద్ధ సాధ్య సురసంఘము దిక్కులఁ బాఱఁజొచ్చె బృం
దారక నాయక ప్రముఖ దైవతపుంగవు లింత నంతఁ బూ
ర్వారచితప్రవాసములకై యతనం బొనరించి రంబరా
పూరిత సింహనాదములఁ బొంగిరి యా హత శేషదానవుల్. ౧౧

చ॥ త్రిభువనభీకరుండగుచు దేవవిరోధివరుండు వజ్రస
న్నిభశితసాయకంబుల నసహ్యముగా బరదేవిని జిందుబిందుగా
రభసము నొందనీక ప్రదరస్ఫుటపంజరశారికం బలెన్
క్షుభితమనస్కఁ జేసి సురసూదనుఁ డిట్లు వచించె దేవితోన్. ౧౨

సీ॥ చండి! యించుక నేపుభండనంబున నిల్వు, నీ కాసఁ జెందెడు నిర్జరులకు
నూతేంల్లు నిండ నిన్ను మదీయనారాచ,ధారల కొప్పింతు గారవమున
నాపల్కు గైకోనదవైతివి వృథాగ, ముజ్జగంబు లెఱుంగ మూఢ వైతి
తరళాక్షి నీకు నే దాసుఁడ నని యన్న, దుర్బోధపాలయి దురము గొంటి

గీ॥ నిన్నుఁగొని నన్నుఁ గెలువంగ నిపుణులైన, శతుల కింకెద్దిగతి చిత్తజాడ్యమునను
నన్నుఁ జూచిన యట్టి యనాదరంపు, ఫలము సిద్ధించు నని పల్కె బ్రహ్మజనని.

ఉ॥ వేల్పులకు మింక దుర్మదము పెక్కన నిన్నిపు డాజిఁ ద్రుంచెదన్
జాల ముదమ్ము నొంది సురసంఘము లిష్టముఁ జెందఁ గాక యం
చోలి సువర్ణ పాత్రమున నొద్దికఁ జేడియ లంది యిచ్చు లీ
లాలలితోపహార శకలస్థగితం బగు పాలఁ గ్రోలుచున్. ౧४

సీ॥ మదవతీ శ్రేణీ సమర్పిత మణిపాత్రి, మధుమహాస్వాదనామ త్తతలను
అద్వితీయద్వితీయాంత రాచర్వణ, సౌఖ్య సంగత వివశత్వములను
ఖచర జయధ్వాన ఘటిత సంస్తుతి వాక్య,లాలసోల్లాస కోలాహలముల
మాసీందప్రి పాపత్యమాన సామశ్రీతి, గాన సంశ్రవణాభికలనములను

గీ॥ మది దువాళించి దైత్యనిర్మథన కర్మ, కర్మోత్సాహ మంతంతఁ గ్రమ్మికొనఁగ
మహిష మర్దన కుర్దనోన్మాద మోద, సాదరాలంకృతాంగియై చండి దుమికె.

ఉ॥ మిన్నును మన్ను నేకముగ మేరకు మీఱిన గర్జితంబులన్
గన్నుల విస్ఫులింగములు గ్రక్కెడు రోహితకాంతిధారలన్
దన్నెఱుఁగంగ నీని బలదర్పపు పెక్కునఁ దేలి సింగ మా
దున్న పిసాళి రక్కసునితో ననిఁ దారస మయ్యె నయ్యెడన్. ౧౬

ఉ॥ దేవి నిశాత సాయకపుఁ దెబ్బలకున్ మృగరాజజన్మఘో
రావిలదంష్ట్రికా నఖశిఖాహతికిన్ బెదివోక మాహిషుం
డావృత దిఙ్ముఖంబుగ మహాశనికల్పమహాంబకంబులన్
దేవవరూథినుల్ చెదర దేవిని సింగముఁ గప్పె నేర్తురన్ గీ ౨౭

ఉ॥ క్రమ్మెడు మేఘబృందముల గాడుపు వీడ్వడఁ జేయునట్టు ల
య్యమ్మల రూపు మాపి భయదాశుగకోటులు వానిపై నిగు
డ్ప మ్మహిషుండు తచ్ఛరనిపాతన మెల్ల మరల్చి దేవిపై
రమ్మని యార్చుచున్ శరపరంపరఁ గప్పె నిశాటు లార్వఁగన్. గీ ౨౮

శా॥ చండజ్యానినదంబు రోదసిఁ బెగల్చన్ భండనోద్దండ స
త్కాండంబుల్ దశదిగ్విభాగకలనాంతర్ధాన ధుర్యంబులై
నిండన్ దేవి హరీంద్రమున్ దఱిమి నిశ్ఛిద్ర ప్రభాచాతురిన్
శుండాదండము వోని శూలమున నచ్చో దైత్యునిన్ గ్రుమ్మినన్. గీ ౨౯

సీ॥ నిర్ఘాతపాతాభినిహతిఁ గూలిన మహీధరము చాడ్పున వసుంధరను దొరఁగి
పెనుమూర్ఛఁదొట్టియద్దనుజనాథుఁడు పడ్డ, జయదుందుభులు మ్రోసెఁ జదలసురలు
సన్నుతింపఁగను నచ్చరలు నృత్తము చేయఁ, దుంబురునారదాదులు నటింప
మునివరుల్ గీర్తింప మోహరమ్మున నంత, నాసార మణఁగిన యట్టులుండె

గీ॥ నదియ మృతిగాఁ దలంచిరి యంతలోన, మూర్ఛఁదెప్పిఱి దేవితో మొనసి తనదు
శాంబరీజృంభణంబున సమరభూమి, తలమున నగోచరుం డయి దానవుండు.

—• దేవి మహిషాసురుని సంహరించుట •—

వ॥ రోషావేశంబున భయంకరోరగసహస్రంబుల యాకృతుల్ దేవతల మునుల
సిద్ధ గంధర్వాదుల దేవీసహితంబుగా యానసింహంబున్ జుట్టుకొని బెగ
డొందం జేసిన సాట్టహాసమై గరుడ సహస్రాకృతులం దన్నిరోధంబు మాయిం
చిన, దనుజుండు హిరణ్యాక్ష హిరణ్యకశిపు రావణాసుర పద్మ భండాసుర జలంధ
రాది రూపంబులం బఱతెంచి యిట్టట్టుఁ గదలనీక సకంఠీరవంబుగాఁ జండిని
జుట్టుముట్టిన నృసింహ వరాహ రఘురామ శక్తిధర లలితా లలాటలోచనాది
రూపంబు లంగీకరించి పొలియం జేయుచు, సముద్రరూపంబునఁ దరంగంబుల
భూతలం బావరించుచు మిన్నంది పారమెక్కినఁ గుంభసంభవలీలలం బొడ
వడంగం జేయుచుఁ, గారుకొని తొలుకారు మొగులు తెఱంగునం గవిసిన పొలసు
దిండిం జంపావాయుప్రసారంబులు తోరంబుగా నెఱపి విరియం జేయుచుఁ, గాల
కూటంబు పోలుపున భస్మీకరణం బొనర్చుచుఁ బఱతేఱఁ గాలాగ్నిరుద్రభావం

బున నార్చుచు, దవానలంబు చాడ్పునఁ జుట్టుకొనిన ధారాళధారాసారంబులు దొరలించు పావృషేణ్య పయోధరంబుల తీరున శమింపం జేయుచుఁ, బరిపరి విధంబుల వాఁడొనర్చు మాయా మార్గ భ్రమణంబుల కంతరాయంబులు పచరించి యుపేక్షం జూచితినేని వీనివలన జగత్ క్షోభంబుఁ బుట్టంగలదని శంకించి.

సీ॥ కదనరంగంబున గదలక నిలువుమీ, కంతంబుఁ దునుముదుఁ జక్రమున ననుచుఁ
జక్రంబు చేఁబూని చండికాదేవి రోషారుణాక్షిప్రభల్ ఘోరదహన
కీలార్భటులు గ్రమ్మఁ గేల సంకించి యుద్ధతి వ్రేయ నదిపోయి దానవేంద్రు
కంఠంబుఁ జిదుమ నసికుంతధారాసార, రుధిరపూరంబు వారిధియఁబోలె

గీ॥ వెడలఁగఁగబంధమప్పుడుపుడమిఁబడియె, జయజయధ్వానములునిండెఁజదలదెసలఁ
బరువులిడురక్కసులనెగఁబడి పరాంబ, యెక్కుసింహంబుమెసవె భూమీశచంద్ర!

మ॥ హతుఁడై మాహిషుఁ డిట్లు గూలుటయు సేనాంగంబులెల్లన్ గడున్
మృతశేషంబుగఁ గాతరంబులయి పెంపేర్వన్ జెదర్ దిక్కులే
కతలంబున్ జొరఁబాఱి డాఁగె సుర లత్యానందులై దేవినిన్
స్తుతులం బూజలఁ దన్పి రయ్యమయు సంశోభించె నిచ్చారతిన్. ౫౩౩

ఉ॥ అంతట దేవముఖ్య విబుధావళు లెల్లను సంతసించి దు
ర్దాంత పరాక్రమ స్ఫురణ దానవవల్లభు రూపుమాపి మ
మ్మెంతయు వేడ్కఁ గాచె భువనేశ్వరి యీ మహిషాపహంత్రి ని
శ్చింతుల మైతిమంచు సురసిద్ధముఖుల్ వినుతించి రంబికన్. ౫౩౪

—• దేవతలు దేవిని నుతించుట •—

దండకము॥ శ్రీమన్మహాదేవి సర్వేశ్వరీ చండి దుర్గా భవానీ జగంబుల్ సృజింపన్ భరింపన్ హరింపన్ సురజ్యేష్ఠనారాయణాబ్జారిచూడామణుల్ నీకటాక్ష ప్రసారంబుచే గాదె? ధారంధరిం గాంచుటల్ వారి సంభూతి నీయందె కాదే? యుపేక్షించితేనిన్ జగత్కర్తృతన్ గాంతురే? కీర్తివిన్ శ్రద్ధవున్ బుద్ధివిన్ భూమివిన్ లక్ష్మివిన్ బుష్టివిన్ దుష్టివిన్ విద్యవున్ గాంతివిన్ మేధవున్ గౌరివిన్ బ్రాహ్మివిన్ జ్ఞాన దాక్షిణ్య ధైర్యప్రభావ స్మృతిక్షాంతి ధర్మార్థకామాప్తి నిశ్శ్రేయసాదుల్ సమస్తంబు నీవేకదా! వీనిలో నొక్కటూనంబమైనన్ జగత్కృత్యనిర్వాహకుండెవ్వఁ డీవంతయున్ మోయకున్నన్ భుజంగాదిరాట్కూర్మ వారాహ ధాత్రీధరాదుల్ చరింపన్ ధురీణత్వముంగాంతురే; వృష్టివై రక్షణాక్షీణకర్మక్షమత్వంబుచే దక్షవై నీవు రక్షింపకున్నన్ జగత్సాక్షిణీ! కించిదాధేయశేషంబు శేషించునే? యెవ్వఁడేనిన్ నినున్ గాన కిందాగ్ని నారాయణాంభోజగర్భాంధకధ్వంసిసూర్యేందు వైశ్వానరేజ్యేంద్రధర్మానిలాది స్వరావాసుల న్నమ్మినన్ నెమ్మి దా

నున్న దే? స్వాహవై నీవుసర్వార్థసిద్ధిం బొసంగింపనిన్నాత్మలోఁగాన కల్పజ్ఞులై వహ్ని యందెద్దియేనిఁ హవిర్ద్రవ్యమీఁగా ఫలంబేమిస్వాంశంబులఁ సర్వభోగప్రదత్వంబునఁ జంగమ స్థావరాళిఁ సదా జీవనంబిచ్చి పోషింతువౌ స్వీయులౌటఁ మరుద్రక్షణం బాత్మధర్మంబె దై త్యావనంబుఁ బొసంగింతు వీ చిత్రమే మమ్మరో! కంటిమెందేని యుద్యానముల్ వేయువారల్ వినోదార్థమై యెల్ల వృక్షంబులంబెంచి పోషింతురే గాని శాకోటకాది దుమచ్ఛేదనం బోర్తురే! కొందఱఁ బోసులఁ హంతృనామం బునఁ గూల్చుటల్ గంటి మెట్లన్న? దేవాంగనాభోగవాంఛామతిఁ నిక్కువారిం గదా ధ్వస్తులఁ జేతు విక్కర్మ తద్వాంఛనీయంబె నీచే ననిఁ బ్రాణముల్ వీడఁగా లేక దీర్ఘాయురారోగ్యముల్ గల్గి వర్తించు దైత్యుల్ భవత్క్రీడకుఁ శారికాకీరశోభఁ బ్రవర్తింపఁగాఁ జేయ నీబుద్ధిచాతుర్యమే ముష్కరంబౌ కలిఁ ముష్కరుల్ నిన్నుఁ బూజింపఁగా లేక బ్రహ్మాది సేవారతిఁ ధూర్తులౌ నెల్ల నీ చేయు తద్వంచనంబే కదా? తావకీన ప్రతాపంబునఁ గూలు రక్షఃకదంబంబుచే భర్జనాతర్జనాగర్జనాదిఁ మదం బెత్తి వితస్తులై పోవు దేవాళులఁ నమ్మొటల్ దీపముల్ చేతిలోగల్గియుఁ గూపగర్తంబులఁ గూలుటేగాదె జ్ఞానస్వరూపంబుచేఁ బీడలఁ బాఱఁగాఁ దోలి సంసారవారాశి నీఁదించి మోక్షంబునుం జెందఁగాఁ జేతు రీ యర్థముఁ గానఁగాలేని మూఢుల్ నినుఁ బూజ్యగాఁజూడ రంభోజగర్భాది సేవ్యంబు నీ పాదపద్మంబటంచుఁ మహాత్ముల్ సదా ధ్యానముల్ చేతు రెవ్వార లీ యర్థముఁ గాంచరో వారు భ్రాంతిన్ మహాదుర్భవాంభోధిలో మున్గువారే కదా చండి! నీపాదపద్మాగ్రరేణు ప్రసాదంబునన్ బ్రహ్మవిష్ణ్వాదు లిష్టార్థసిద్ధిన్ గడున్ గాంచఁగా దుర్మదాంధుండు గాఁడే భవద్భావశూన్యుండు వాగ్దేవతారూపవై వక్త్రమధ్యంబునన్ నీవు పేర్మి న్నటింపంగ నెవ్వారలుం బల్కఁగాఁ జాతురిన్ మింతు రీవిట్లు గాకున్న మౌఢ్యంబునన్ బోవరే! తొల్లి విష్ణుండు కోపంబునన్ భార్గవుం డుత్థితుండై శపింపన్ మహామీనమై కూర్మమై సూకరంబై నృసింహా కృతిం దాల్చి రామత్రయాకారమున్ బూని బుద్ధాదివేషంబులన్ జెంది యుత్పత్తిసంహారముల్ గాంచఁడే? శంకరుండున్ బ్రసిద్ధంబుగా లింగహీనత్వ మున్ జెంది శాపంబునన్ బోఁడే! యిట్టి దేవావళిన్ గొల్చి మూఢుల్ సుఖం బేమిగైకొందురో? కొంద ఱాదిత్య విఘ్నేశ ముఖ్యామరారాధనల్ సల్పి భోగాభి లాషంబునన్ సంచరింపంగ నూహింతు రో విశ్వధాత్రీ! సుఖారాధనీయంబు నీ పాదపద్మంబు గానంగ లేరయ్యయో! నీ కటాక్షంబు వర్ణింపగా శక్యమే పోరు లన్ నీకు శత్రుత్వమున్ బూని బాధించు రక్షస్సులన్ ఘోర నారాచపాతంబు లన్ మట్టుమల్లాడి యక్షయ్యనిశ్శ్రేయసం బిచ్చి ధన్యాత్ములన్ జేసితౌ నట్లు గాదేని యమ్మూఢులాదిత్యభూదండనంబొంది పారంబులన్ గొందు రే! బ్రహ్మవిష్ణ్వా దులున్ నీపరిభావంబు గానంగ లేరన్న మా బోటులా? గాన నీ మాయచే మోహ

విశ్రాంతిబంధంబులన్ బొందియున్నారమే కాదె? మానీంద్రుల్గూర్మి దుర్విభావ్య ప్రభంబైననీపాదపద్మంబు మాధ్యంబుచే నెంచఁగాలేక యేకాదశాదిత్య ముఖ్యామ రార్చాపరత్వంబునన్ బోవుటే కాని వేదార్థసిద్ధాంతవాఙ్నిశ్చితంబైన నీతత్త్వ మున్ గానలేరైరి బ్రహ్మాదిసంసర్గమున్ జేయుచెల్లన్ విమర్శింపఁగా నయ్యె నీతత్త్వ మెవ్వారికిన్ భావనీయంబు గాదంచుఁ గల్పించితో వారలన్ సన్నుఁ బూజింప కన్యార్చనన్ బోయిరం చెవ్వరిన్ నిగ్రహింపంగ నూహింప వీచిత్ర మేమమ్మ! యాఖీలమా నీకలిన్ సత్క్రియారంభముల్ శీఘ్రసిద్ధిం బొసంగించు నంచున్ గదా వ్యాసముఖ్యుల్ భవద్బాహ్యముల్ దాఁచి నీ భక్తులో వేల్పులన్ బూజ నేయంగ బోధించి రీయర్థవేత్తల్ మహాయోగసిద్ధిన్ నినుంగాంచి జన్మాదిదుఃఖం బులంబాసి నీమోక్షసామ్రాజ్యపట్టాభిషేకంబునన్ ధన్యతం గాంచి రాద్యంత శూన్యంబు సర్వోత్తరంబైన బ్రహ్మంబునం జిద్విలాసంబుచేఁ దావకానంద సంస్ఫూర్తిచే వ్యక్తమై 'అస్తి' వాగ్బోధ్యమై యొప్పఁగాకున్నఁ దద్వస్తు సిద్ధాంతముల్ గల్గునే పంచవింశంబులౌ తత్త్వముల్ చిత్సమానంజనం బొంది లోకత్రయీ సర్జన స్థాయులయ్యోఁ హృషీకాదులున్ స్వార్థ సంగ్రాహకత్వంబునన్ దక్షతన్ గాంచలేకున్న నర్థక్రియాసిద్ధికిన్ దావులౌనొక్కొ? మానీంద్రులున్ నిర్జ రుల్ స్వస్వభాగంబులన్ దృప్తులై యధ్వరాళిన్ బ్రమోదంబుచే నుంట స్వాహా కృతిన్ నీవు చాలించుటే కాదె! సృష్ట్యాదిలో సర్వసంసృష్టి గావించి తత్తద్విభుత్వంబు లన్ లోకపాలాదులన్ నిల్పుటల్ మూఢులై కాదె మన్వాదు లీయర్థ మార్గింపఁగా లేక మాధ్యంబునన్ మందభాగ్యుల్ స్వతఃకర్తృతంబాని తత్తద్విధుల్ తన్ని షేధం బులున్ జెప్పి లోకంబులన్ జీకులన్ జేయరే తల్లి! నేఁ డానురాధీశునిన్ గాసరున్ గూల్చి యస్మత్పరీపాలన ప్రౌఢిఁ బాటించుటల్ హేతుశూన్యంబులౌ నీ దయాదృగ్విలాసంబులే కావొకో! మేదినీ తత్త్వ నిర్ణీతిఁ బాటించి పూజారతిన్ గంటి మబ్బెంబు గాదే జగత్కంటకుండై నిరోధంబు వాటించి నీచే ననిన్ జచ్చుటం జేసి యీ లోక మం దద్భుతంబౌ యశం బొందె నాముష్మికంబైన నీ మూర్తి సామీప్య భోగంబునన్ సంసృతిన్ మీటి ధన్యత్వమున్ గాంచె నీ సత్కృపాంభోధికిన్ బార మేపారఁగా నున్నదే! భక్తులన్ మమ్ముఁ జేపట్టి ముక్తిం గటాక్షింపుమమ్మా పరంజ్యోతి! దేవీ! భవానీ! పరాశక్తి! దుర్గా! జగన్మాత! చండీ! జొహారమ్మ! సర్వేశ్వరీ! శ్రీ! నమస్తే నమస్తే నమస్తే నమః. ॥౩॥

చ॥ అని వినుతించు నిర్జరుల కై నంబిక గాంచి కృపాంబురాశి మ
జ్జనముల నోలలార్చి మృదుసల్లపనంబులఁ దేర్చి యింక మీ
మనముల నెద్ది దుస్తరమొ కై మాన్పెదఁ దద్వ్యథ విన్నవింపుఁ డే
యనువున సంస్మరించిన దశయాన్వితనై యపు డాదరించెదన్. ॥౩౬॥

చ॥ కుశలము నొందుఁడన్న సురకోటులు దేవిని గాంచి పల్కి రీ
యశిథిల మానసవ్యథల నార్చి మమున్ గడఁజేర్చి తీవు నీ
విశద కటాక్ష వీక్షణ నివేశన భాజనతన్ జెలంగి దు
ర్దశలఁ దొలంచినారము సదా భవదంఘ్రులు మాకు దిక్కగన్. ౧౩౭

చ॥ నిజ మిది విన్నవించెదము నీ పదముల్ శరణంబు మాకు నీ
భజనము సంతతవ్రతము బాస లిఁకేటికిఁ దావకీన ప
దజ్రజమునకన్న నన్య మొక రక్షక మున్న దె? వేయునేల? వి
శ్వజనని! నీకు దాసులము తథ్యము తథ్యము తథ్యమెమ్మెయిన్. ౧౩౮

ఉ॥ మమ్ముల నాదరించి చనుమానముతో వెతఁ దీర్చితీవు మా
యమ్మవు సుమ్మటంచు ముగురమ్మల మూలపుటమ్మ నంచు ని
న్నమ్మితి మంచు సన్నుతు లొనర్చిరి నిర్జరు లంచుఁ దెల్పఁగా
నమ్మహివల్లభుండు మునిహంసుని వ్యాసునిఁ జూచి యిట్లనెన్. ౧౩౯

కం॥ అమ్మహిషాసురమర్దని, యిమ్మెగఁ దమ కాచరించు హిత మెంతయు లో
కమ్ముల కబ్బుర మొదవుట, నమ్మెయి మెటులయ్యొ సురల యవ్వలి వార్తల్.

ఉ॥ తాపసవర్య! నీవదన తామరసప్రభవామృతంబు దే
వీపరమాద్భుతపవిత్రచరిత్రము లస్మదీయహృ
ద్దీపకమై పునఃపునరుదీరణ లాలసవృత్తి నెంతయున్
దీపియకాని తృప్తి తమిదీరదు శ్రోత్రతృషన్ హరింపవే! ౧౪౦

సీ॥ జగదీశ్వరీ కథాశ్రవణతృప్తుఁడుగాని, నరుఁడు గణింపఁ బామరుఁడు గాఁడె
ఫణులు వీనులులేక పలుకు లాలింపంగఁ, గోరంగ మనుజుఁడై కోర్కిదీర
దురితఘ్నములు పుణ్యధూర్వహంబులు పురా, వృత్తముల్ వీనుల వినఁగవలదె!
బ్రహ్మాదిభావ్యముల్ పరమపావన మన, స్తవ్యముల్ చండికా స్తవములందు

గీ॥ శ్రవణమధురంబు లవిగ్రోలి చాలునెను, పశువునకుఁ బాపసంసారపతననిగమ
మబ్బునే? యంబుజాప్త ప్రభావలోక, సౌఖ్యమబ్బునె! జాత్యంధజడున కెచట.

ఆ॥ మందభాగ్యులైన మనుజుల కఖిలాండ, జనని కథలు వినఁగ మనసు గలదె?
కలుగుఁగాక ముక్తికాంక్షులై సంసార, రక్తి డుల్లి మది విరక్తి గొనిన. ౧౪౩

సీ॥ ప్రాణాది సంయమాభ్యాసులై వర్తించు, పరమయోగులపాలి భాగ్యరాశి
ధర్మార్థ కామతత్ప్రవృత్తు లార్జించు, ధార్మికావళి పాలి ధననిధాన
మతివేల తాపసాయాస దుస్సహులైన, కర్మందితతి పాలి కల్పశాఖి
వేదాంతవిజ్ఞాన విమలానుభవులైన, యార్యులపాలిటి యమృతరసము

గీ॥ పాపజంబాలభరితదుర్భవనముద్రి,మజ్జనోన్నిద్రులైన దుర్మార్గులకును
గలుగునే? యందికొన జగజ్జననిచరిత,మధురసము ముక్తిసామ్రాజ్యనిధికిఁగాక.

గీ॥ పూర్వభవములఁ గరవీరపుష్పములను, మల్లికాసూనముల బిల్వపల్లవములఁ
గాళిఁ బూజించువారికిఁగాక యిట్టి, తత్త్వసారామృతంబులు ద్రావఁగలరె?

సీ॥ పూర్వోద్భవంబుల భువనేశి వర్ణింప, గానక భారతఖండమునను
ధనధాన్యహీనులై దాసులై సంతాన,హీనులై రోగభూయిష్ఠు లగుచుఁ
బరతంత్రజీవులై భారవాహకతచే, రాత్రిందివము స్వార్థరక్తు లగుచుఁ
గుబ్జులై బధిరులై కుష్ఠులై యంధులై, కష్టులై కులపదభ్రష్టు లగుచు

గీ॥ జెడుట యనుమానసంసిద్ధి సేయుటరుదె, యన్వయవ్యతిరేకంబు లలరవాక్క
శాస్త్రమతమున సిద్ధాంతసరణిగాదె, కరతలామలకంబుగాఁ గానఁబడుట.

గీ॥ భ్రష్టు లగువెల్ల దేవ్యర్చకిట్టపడమి, శిష్టు లగువెల్ల దేవిఁ బూజింపఁగనుట
అదియుఁ గల్గుట యిదిగల్గు టదియు లేమి,నిదియు లేమిగ విబుధులకెఱుఁగవలదె.

మ॥ ధనధాన్యాన్వితులై మనీషులయి సంతానాఢ్యులై భోగులై
ఘనవిద్యానిధులై యశోభరితులై కందర్పసౌందర్యులై
వనితావల్లభులై వెలుంగు నరు లర్వాచీనమార్గంబునన్
జననిం బూర్వభవంబులందు బెలుచన్ బ్రార్థించు పుణ్యంబుచే. ౫౭౭

సీ॥ మౌనీంద్ర! మహిషుని మర్దించి జగదంబ, యమరులచేఁ బూజలందికొనుచు
సకలతేజస్సారసంభూత యగు మహాలక్ష్మి దివ్యప్రభాలలిత దేవి
యెచ్చోటి కేగెనో యింద్రచంద్రోపేంద్ర, హరవిధిప్రముఖలోకాంతరముల
వర్తించెనో లేక వసుశైలహిమశైల, మందరాదుల నిజమందిరముగ

గీ॥ విహరణ మొనర్చుచుండెనో విశ్వజనని, వృత్త మెఱుఁగంగఁజేయు నాకీవు లలర
దేవిచరితంబు విననట్టి దీనజనుల, జనన మిష్టార్థసిద్ధిభంజనము గాదె? ౫౭౮

## —• దేవి మణిద్వీపంబున నివసించుట •—

మ॥ భువనేశీచరితామృతంబు శ్రవణాపూర్ణంబుగాఁ గ్రోలి న
త్పవితంబయ్యె మనంబు, పూర్ణకరుణాసాహిత్యమున్ బూని దు
ర్భవముల్ దూలఁగఁ దెల్పు మన్న విని పారాశర్యుఁ డుర్వీశుతో
వివరించెన్ జగదీశ్వరీచరిత ముత్ఫుల్లానురు మోదంబునన్. ౫౭౯

వ॥ జనమేజయా! ప్రసంగవశమ్మున హరిహరబ్రహ్మలు వనితారూపంబు నొంది
పునఃపురుషభావాంగీకరణమ్మున ధన్యులై సృష్టి స్థితి సంహారంబుల కధ్యక్షు

త్వంబు వహించిన పుణ్యస్థానం బొక్కటి యతిరమ్యంబును దివ్యతోజోవిరాజి తంబును నై పరదేవికిం గ్రీడాస్థానం బగు మణిద్వీపం బని వచించియుంటింగదా! అయ్యది సుధాసింధుమధ్యస్థితంబై పరమశోభనంబై నానారూపంబై యలరు, విహారస్థానం బగు నచ్చోటం బ్రవేశించి పరాశక్తి క్రీడావిలోలయై స్వేచ్ఛావిహారంబున వర్తించుచుండె. ౧౧౧

శా॥ అంతర్ధానము నొంది దేవి చనినన్ ౯ హర్షంబుచే దేవతల్
చింతాతంతువితానసంత్రుటనదక్షీభూతచేతస్కులై
శ్రాంతిం బాసి సురేంద్రుతోఁ గలసి స్వేచ్ఛావృత్తి వర్తించి దు
ర్దాంతుండౌ మహిషాసురుండు గొను రాష్ట్రిం బేలఁగా నొక్కనిన్. ౧౧౨

—♦ దేవతలు శత్రుఘ్నుని రాజుగా నియమించుట ♦—

సీ॥ నిశ్చయింపఁదలఁచి ౯ నీరేరుహాప్తుని, వంగడమ్మునఁ బుట్టి ౯ వసుధయేలు
సర్వలక్షణదక్షు ౯ సమరసాహసు వీర్యనిధి నయోధ్యాధీశు ౯ నధికధర్మ
కర్మకర్మఠు దేవకార్యనిర్వాహకు, శత్రుఘ్నుఁ డను ధరారాజునిఁ దెచ్చి
సింహాసనమున నాసీనుఁ జేసి సమస్తరాజ్యభారం బెల్ల ౯ రక్తి నొసఁగి

గీ॥ స్వస్వయానమ్ములెక్కియు ౯ స్వర్గమునకుఁ జనిరి యంతట రాజ్యశాసనమునందు
దక్షుఁడై ధర్మశాసనాధ్యక్షుఁ డగుచు, జగతిఁ బాలించె శత్రుఘ్న ౯ చక్రవర్తి.

సీ॥ ఈతిషట్కంబు నిర్ధూతమై పోవంగ, నీతిచేఁ బాలించె ౯ నిఖిలజనులఁ
బర్జన్యుఁ డనుకూలభరితధారావర్షపటలిచేఁ బుడమి సంపన్నఁ జేసెఁ
బాదపంబులు పుష్పఫలపూరితంబులై, ప్రకటితసుఖదానపరము లయ్యె
ధేనుసంఘము మహోదీర్ణపూర్ణక్షీరసంప్రాప్తిచే మహోత్సాహ మొనసె

గీ॥ నదులు ప్రవహించె ఘనజీవనములఁ బొదలి, ధనముధాన్యంబునింటింటఁ దఱుఁగదయ్యె
విమలతరగంధవహములువీవఁదొడఁగె, మించి శత్రుఘ్నుఁడవనిఁ బాలించునపుడు.

ఉ॥ ఆవిభుఁ డేలుకాలమున ౯ నగరికులుల్ నిగమార్థసార పుం
భావములో యనన్ నృపసభాస్థలి సర్వకళావిలాస సం
భావితులై కృతాధ్వరత ౯ బంధురనిత్యహవిష్మదర్చనా
సేవితతాపసర్షిపితృసిద్ధనిరంతరధర్మచింతనన్. ౧౧౩

సీ॥ ధర్మ సంసక్తులై ౯ దానాధ్యయనశీల, తత్పరత్వమున భూదారు లగుచు
శస్త్రవిద్యాభ్యాస ౯ సౌలభ్య సంధాన, సంరక్షిత ప్రజాసార్థ మెల్ల
వినుతింప న్యాయదండనమున శాంతులై, ధనధాన్యసంగ్రహోత్సాహు లగుచుఁ
బుత్రమిత్రకళత్రభూరిసంయుక్తిచే, భూభుజుల్ వెలసిరి ౯ భూతసమితి

గీ॥ యెడల నవిరోధమయ్యె నశేయ్యెడఁ బడంతు,లెల్లఁ బతిభక్తి నలరిరి శమెందుఁగనినఁ
ధనయులందును బితృభక్తి శతఱుఁగదయ్యె, నమ్మహారాజు భువి నేలుశనవసరమున.

వ॥ మఱియును బాషండవర్తనంబును ధర్మద్వేషంబును దలచూప దయ్యె, సకల వర్ణంబులు స్వోచితాచారంబులం బ్రవర్తించె, జాతుర్వర్ణ్యంబును దేవీభక్తి పరంబై నిత్యోపాసనం బొనర్చె నిఖిలభూమండలంబున నధ్వరంబులును, దేవాలయంబులును, తటాకంబులును, వాపీకూపసరోవరంబులును, మహోద్యానంబులును విస్తరించె. వేదశాస్త్రంబులే కాని తదితరవితండవాదులవాదంబులు గట్టునడిమె, కలహంబును, శూన్యంబును, దైన్యంబును లేదయ్యె; అకాలమరణాదిదోషంబులు లేమింజేసి యెల్లవారలకు సుఖంబు సులభంబయ్యె, స్వర్గంబున నిర్జరులువోలె నరులు సుఖులై విహరించిరి, మఱియుఁ జోరవంచకదాంభికపిశునలంపటస్తబ్ధవేదనిందకగురుద్రోహిజనంబులు వెదకినం గానరారైరి, ద్విజసేవయు, ధర్మపరాయణత్వంబును, సర్వత్ర నిర్వివాదంబయ్యె, సృష్టివైచిత్ర్యంబున సాత్త్విక రాజస తామస భేదంబుల బ్రాహ్మణులు త్రివిధులు, అందుసాత్త్వికులు వేదవిదులై ప్రతిగ్రహం బెఱుఁగక దయావంతులై యధ్వరంబులఁ బశువిశసనంబులు మాని పురోడాశంబుల నర్చిష్మంతు నర్చింతురు. రాజసులు విధిచోదిత మాంసభక్షణం బొనర్చుచు షట్కర్మనిరతులై వర్తింతురు. తామసులు నృపకింకరులును కోపనులును గర్మబాహ్యులునునై వర్తింతురు, అని వెండియు,

కం॥ ప్రథనంబున మహిషాసుర,మథనం బొనరించె దేవి శ మహిపా! మఱియున్
బుధనందిత దేవీజయ,కథనం బేఁ జెతు వినుము శ కడు ముద మొదవన్. ౫౮౯

—॥ శుంభనిశుంభుల ప్రభావము ॥—

ఉ॥ జంభవిరోధిముఖ్యసురశేఖరకూటము మనిన్ బెగడొందఁజేయు న
స్తంభపటుప్రతాపులు విశంకటదోర్బలు లివ్వసుంధరన్
శుంభనిశుంభు ల న్దితిజశూరులు ముజ్జగముల్ జయించి ని
ర్దంభవిభుత్వసంపదభిరమ్యత నేలిరి యొండొరుల్ దమిన్. ౫౯౯

ఉ॥ అన్నయుఁ దమ్ముఁడున్ బలియుశరై మగవారలచే నవధ్యులై
మిన్నలుముట్టు సేనల నశమిత్రకులంబులఁ జిక్కడంచుచున్
వెన్నుఁడు నాదిగాఁగ సురవీరుల నెల్లఁ బరాభవించి ము
న్నెన్నఁడు వీనులన్ విననిశ వృత్తముఁ జూపిరి ముజ్జగంబులన్. ౫౬౦

సీ॥ దుర్మార్గవర్తులై శ దుర్మదంబున రేఁగి, పరవధూటులఁ జెఱల్ శ పట్టుకొనుచుఁ
బరధనంబుల కొల్లగొట్టుచు యున్మత్తులై, యసహాయ దోర్బలోశదారు లగుచుఁ

దాపసాశ్రమముల దర్పంబుఁ జూపుచు, యాగభాగము లెల్ల నపహరించి
యప్రతీపప్రతాపాఢ్యులై చెలరేఁగి, యిదియది యనుటకు నేటి కవని

గీ॥ ననిశ మతిదారుణంబు లైనట్టిపనులు, కట్టలుకఁ జేయుచును గడు మట్టుమీఱి
చుట్టుకొనివచ్చు శుంభనిశుంభు లనెడు, రక్కసులఁ జెండెఁ జండి నిర్వక్రగరిమ.

ఉ॥ దేవహితంబు గోరి పరదేవి వధించెను జండముండులన్
గావరమూని పైకొను జగజ్జనకంటకు ధూమ్రలోచనున్
గేవలదుష్టవృత్తి భువిఁ గీడొనరించెడు రక్తబీజునిన్
జేవఁ జెడంగఁ గూల్చి కృపచే జగదంబిక గాచె లోకముల్. ౫౬౨

చ॥ భయము దెరల్చి ప్రోచుట నభంగురపూజ లొనర్చి దేవతల్
జయజయశబ్దపూర్వముగ సన్నుతిఁజేయ హిమాచలంబునన్
దయఁ జెలువార మానిజనతావినుతుల్ గయికొంచు భక్తసం
చయములు గొల్వ మించెఁ బరశక్తియనన్ మునిఁ జూచి రాజనున్. ౫౬౩

సీ॥ జగతి శుంభనిశుంభ జయ మొసంగిన వేల్పు, లెవ్వారు వారల కిట్టి బలిమి
గలిగి పుంవధ్యులు కాక స్త్రీవధమున, మడియుట యేతపోమహిమ నలరెఁ
దప మెట్లు సలిపిరి కృపఁజేసి యవ్వారం, బిచ్చిన వేల్పెవ్వ రెటులు మడిసి
రీ యుదంతంబు నా కెఱుఁగంగఁజేయుము, దేవీకథాసుధాసేవనమునఁ

గీ॥ దనియకున్నది నామది తాపసేంద్ర, పుట్టుమొదలు సవిస్తరంబుగ వచించి
దురితము లడంచి సద్భక్తిదుదురఁగలింపఁ, జేసి మన్నింపుమన నిట్లు చెప్పె మౌని.

గీ॥ అఖిలపాపప్రణాశనంబైన దేవి, చరిత సర్వార్థఫలదంబు జయకరంబు
శ్రవణపఠనంబులను సర్వసాధకంబు, వినుము వివరింతు ధరణీశ వీను లలర.

—• శుంభ నిశుంభుల తపము •—

క॥ కుంభీనసలోకంబున, శుంభనిశుంభు లను నమరసూదనులు జయా
రంభులయి యన్నదమ్ములు, కుంభినికిని వెడలివచ్చి కుటిలహృదయులై.

శా॥ అన్నంబున్ జల మేవగించి తప ముద్యన్నిష్ఠతోఁ జేయుచున్
విన్నన్ మన్న నెఱుంగరాని హృదయావిర్భూతసంశాంతిసం
పన్నంబై మెఱయంగఁ బుష్కరమునన్ వర్షాయుతం బంతర
చ్ఛిన్నప్రాణనిరోధతన్ దపము నిశ్చింతన్ వనిన్ సల్పుచున్. ౫౬౪

క॥ ఏకాసనమున నిల్చుచు, లోకంబులు బెగడ దనుజలోకము లలరన్
నాకౌకస్థితి తలఁకన్, దీకొని తప మిట్లు సలుప దితిజులు కడిమిన్. ౫౬౫

శా॥ అంభోజాసనుఁ డంత వారికి దయాపాంగస్ఫురన్మానసా
డంభోల్లాసముతోడ హంసపయిఁ బ్రత్యక్షీకృతిన్ సల్పి యో
శుంభా! యోయి నిశుంభ! చాలుఁ దప మంచున్ బల్కి మీవాంఛితా
రంభం బెట్టిది? డాపకే పలుకుఁ డబ్బ్రింబయ్యె మీ నిష్ఠకున్. ౫౧౯

ఆ॥ కామదుండ నగుచుఁ గదలివచ్చితిఁ దపో,బలముపెంపు పలుకఁ దలవియగునె?
మెచ్చినాఁడఁ గోర్కు లిచ్చెద వరములు, వేఁడుఁ డనిన దితిజవీరవరులు. ౫౨౦

సీ॥ శుంభనిశుంభు లయ్యంభోజసంభవు, గంభీరవాక్యసంరంభమునకుఁ
దెలి వొంది వేగ నుత్థితు లయి వలగొని, కేల్మోడ్చి తగ నమస్కృతి యొనర్చి
తనియక సాష్టాంగదండవత్ప్రణిపాత,శత మొనర్చుచుఁ గరాబ్జంబు లెత్తి
దేవదేవ! మహానుభావ! భక్తాభయ,ప్రద! మెచ్చితేని మాభయముఁ బాపి

గీ॥ చావు లేకుండ వర మిమ్ము సకలభువన,రక్షకుండవు నీవు సర్వజ్ఞ? మాకు
మరణజంబైన భయ మెల్లమాయఁజేసి, జలజసంభవ! కరుణింపవలయుమమ్ము.

ఉ॥ అస్మదభీష్ట మిట్టిదన నంబుజసంభవుఁ డిట్లు వల్కె నీ
విస్మయ మెందుఁ గందుమె? నవీనమతం బిది మెచ్చు సేయునే!
సస్మరణంబుగాఁ గనుఁడు సర్వమునం దిటు లెవ్వఁడేని యా
కస్మికవృత్తి నిత్యుఁడయి కల్గునె? యీభువనత్రయంబునన్. ౫౨౧

ఉ॥ పుట్టినవారి కెల్లరకు భూమిని గిట్టుట నిక్కువంబు క
న్పట్టెనె నిత్యుఁ డొక్కఁడయినన్; మును నా యొనరించు కట్టు లె
ప్పట్టునఁ దప్పఁ ద్రోయుటకుఁ బాడియె? వేఱొక కోర్కి వేఁడుఁ డి
ప్పట్టున మీ కొసంగెద శుభం బగు నెవ్వరి కీని దిచ్చెదన్. ౫౨౩

చ॥ ఇటు లజుఁడన్ దలంపకుఁ డహీనమనస్కత నెద్దిగోరినన్
ఘటిత మొనర్తు నన్న సురఘస్మరు లిట్టులు వల్కి రీశ! మా
కటులయినన్ సురాసురమృగాహివిహంగమముఖ్యపూరుషో
త్కటచటులప్రతాపముల ధాత్రి నవధ్యత నిమ్ము సత్కృపన్. ౫౨౪

క॥ వనితలచే భీతిం గన, మనుమానము లేదు మమ్ము నడఁపం గల యిం
తిని మింట మంట నెందుం, గననగునే?, దేవ! యనినఁ గమలజుఁ డంతన్.

క॥ మెచ్చితిఁ బురుషావధ్యత, యిచ్చితి సహజంబ యబల లింతులు వారల్
వచ్చుట వారలచే మీ, చచ్చుట యబ్బురము భువనజయు లైతి రనన్. ౫౨౬

కం॥ చాఁగిలి మ్రొక్కి సురారులు, రాగిలి యాజ్ఞప్తిఁ గొనిరి రాజీవభవుం
డాగతపథమున నంత,ర్భాగతుఁడయ్యెన్ దపస్విగతండముతోడన్. ౫౨౭

సీ॥ శుంభనిశుంభు లుత్సుకత వీటికి నేగి, సానందులై వరప్రదానగరిమ
భృగుమాని సద్భక్తిఁ బిలిపించి పూజించి, తతభూషణాద్యలంకృతునిఁ జేసి
శుభమాస శుభపక్ష శుభతిథి శుభవార, శుభముహూర్తమున నిస్తులచిరత్న
రత్నకీలితసువర్ణపరిభాభాసుర, సింహాసనమ్ముఁ రచింపఁజేసి

గీ॥ యందు నొడ్డోలగంబున నధివసించి, భువనపరిపాలనోన్నిద్రభూరిశక్తి
రాజిలఁగ నేలుమనుచు నిర్వైరబుద్ధి, రక్కసులు గొల్చిరాదృతి మిక్కుటముగ.

—• శుంభ నిశుంభులు దిగ్విజయము చేయుట •—

ఉ॥ చండుఁడు ముండుఁడుం గలసి సర్వధరావలయాధికార మి
తం డొకఁ డేలు మేలనుచు దర్ప మెలర్ప ననేకభండనో
ద్దండవరూథినీతతు లుదారతఁ జేకొని కొల్చి రెల్ల బ్ర
హ్మాండము సింహనాదములయావళి క్రొవ్వక తల్లడిల్లఁగన్. ౫౭౮

చ॥ విడిసెను రక్తబీజుఁ డను వీరుఁడు పెక్కు వరూథినుల్ తడం
బడక కడింది శూరత నిరంతరిణత్ గొలువంగ వచ్చి తో
డ్పడియెను శుంభునిన్ బ్రిబలబాహుబలుం డగు ధూమ్రలోచనుం
డుడుగనిమైత్రిచేఁ గలసె నొక్కట భీమచమూసమేతుఁడై. ౫౭౯

గీ॥ రక్తబీజుండు సమరసంరంభములను, నొడల రక్తంబు లురలుచుఁబుడమిఁబడిన
దత్సమాను లనేకు లుద్భవముగనుట, వానికిని రక్తబీజాఖ్యవఱలెఁజుమ్ము. ౫౮౦

చ॥ జగములఁ గల్గు రక్కసులు సంఘములై కొలువంగ శుంభుఁ డ
త్యగణిత దోర్బలంబున దిగంతరముల్ కడిమిన్ జయించి ప
న్నగపతికిన్ భరంబగు ఘనంబగు మూఁక నభంబు ముట్టి బె
ట్టుగఁ దనుఁ గొల్వ సంభృతహాసుండయి యేలె ధరాతలం బొగిన్. ౫౮౧

సీ॥ అన్న యిట్టులు దోర్బలోన్నతుండయి ధరా, చక్రి మేలంగ నిర్వక్రవిక్రి
మాక్రాంతపరధరాచక్రుఁడై తమ్ముండు, నంతసమ్మున నన్నశాసనమున
వశవర్తి యగుచు సర్వము తదధీనంబు, గావించి సురలపైఁ గదనమునకు
జండముండులు జయోద్దండులౌ ధూమ్రలో, చనరక్తబీజులు వెనుకొనంగ

గీ॥ దరలి దావాగ్నిపోని యుద్ధతనిశాట, పటుతరపతాకినీశతోత్కటచతుర్వి
ధాజిసన్నాహ మలర దేవాధినాథు, పురికి దండెత్తె భూనభంబులు గలంగ.

ఉ॥ రక్కసు లిట్లు వచ్చుట పురందరుఁ డారసి రోషదీప్తుఁడై
పెక్కు సుపర్వసేన లతిభీకరతన్ గలయంగ నెక్కి పై

నెక్కి నిశుంభునిన్ గదిసి యేడ్తెఱ దిక్పతు లెల్లఁ దోడుగా
నెక్కటిపోరులన్ భిదురమెత్తి శిరమ్మున వ్రేసి యార్చినన్. ౫౨౪

మ॥ కులిశోగ్రాహతి మూర్ఛఁదొట్టె యని రక్షోనాథుతమ్ముం డుదు
ర్బలుఁడై యాహవభూమిఁ గూలిన రణాసాస్తంబులై సైన్యముల్
దోలఁగం బాఱిన శుంభుఁ డంత విని తోడ్తో దేవసేనావళిన్
జ్వలనోద్యత్ప్రదరప్రతానముల నాశ్వం జేసె నొక్కుమ్మడిన్. ౫౨౫

ఉ॥ అత్తఱి దేవసేనలకు నాసురనాథునకున్ రణంబు సో
దాత్తధనుర్ధ్వనిప్రచుర మద్భుతగర్జితభీషణంబు సం
కృత్తపరస్పరాంగ మసికేతురథాశ్వవిమర్దకంబునై
యొత్తొఱపుం గరాగరిక నొప్పెసఁగెం దుములాహవస్థితిన్. ౫౨౬

సీ॥ బలభిత్ప్రముఖదేవపరివృఢుల్ కులశైల, ఘనగుహావాసముల్ గాంచి రపుడు
నాకవాస్తవ్య సేనాప్రతానంబులు, తిరుగ నంతంత నక్కడైనలు పఱచెఁ
గదిసి చూచిన నింటికావలికాఁడైన, లేక పాడయ్యె స్వర్లోక మెల్ల
దివ్యభోగాన్నత్యదీపితం బగు దేవ,సభ యెల్ల శూన్యమై విభవ మెడలె

గీ॥ వీథులను సౌధముల దివ్యవేదికలను, మందిరంబుల మణిమయమంటపముల
నెల్లెడలఁజూడ రాక్షసాన్వీత మగుచు, దేవపురమయ్యె నృప! పూర్వదేవపురము.

సీ॥ కట్టించె గజఘటల్ ఘనకల్పపాదపో,జ్జ్వలవిశంకటపటుస్కంధములను
బట్టించెఁ జెఱలు రంభామేనకాఘృతా,చీవరూథిన్యాదిరోవెలఁదులఁ
బెట్టించె సుధ కొల్లఁ బృథులరక్షస్సైన్య, సేనాపరీవృఢశ్రేణి కెల్ల
మట్టించె దేవతామందిరంబులు యోధ,జనకఠోరాంఘ్రిఘట్టనలచేత

గీ॥ నేమి సేయండు సురలోకమెల్లఁగదిసి, చెండుచెండాడి సాలముల్ చెఱచి గోపు
రంబులఁ బెకల్చి మణితోరణంబులెల్ల, గెడపి శుంభుండు కసరెల్లనుడిపికొనియె.

చ॥ ధనదుని భానునిన్ శశిని ధర్ముని బావకు నంబుధీశు నీ
శుని బవనున్ డెరల్చి యని శుంభుఁడు తత్తదధీనరాజ్యముల్
గొని నిజశాసనంబున నకుంఠగతిన్ బరిపాలనక్రియా
జనితముదాస్పదుం డగుచు సర్వజగత్ప్రభుఁ డయ్యె నయ్యెడన్ ౫౨౭

—. దేవతలు పాఱిపోవుట .—

చ॥ సురలు హృతాధికారులయి శూన్యమహాగిరికందరంబులన్
భరితలతాకుడుంగముల బంధురఘోరవనాంతరంబులన్

నిరశనులుఁ నిరాయుధులు నిష్ప్రభులుఁ నిహతావలంబులుఁ
నిరతవిచారులై చనిరి నిర్జరవైరుల ధాటి కోర్వమిన్ ౫౯౦

శా॥ స్థానభ్రష్టులు నిర్విచేతనులునై సర్వామరుల్ సౌఖ్య మెం
తేనిఁ గానక లోకపాలకులతో దిక్కేది పూర్వార్జిత
గ్లానిన్ జెంది సుఖంబు మాలి నిజలోకంబుం బెడంబాసి క
ట్టా! నానాపదలఁ మునింగి రపు డాహా! యేమి చెప్పందగుఁ. ౫౯౧

కం॥ బలవంతుల నెల్లను దు,ర్బలులఁ దుర్బలుల నెల్ల బలవంతులుగాఁ
దలకొని దైవము సేయఁ, గల దది తప్పింప నోరులు గలరే జగతిఁ. ౫౯౨

సీ॥ చక్రవర్తులను భిక్షావర్తులను జేయు, భిక్షులఁ జేయు సదధ్యక్షవరుల
దాతల యాచనాసక్తులుగాఁ జేయు, నిల యాచకులను దాతలుగఁ జేయు
శూరావతంసుల భీరులుగాఁ జేయు, భీరులఁ జేయును శూరవరుల
బుధవర్యులను మందబుద్ధులుగాఁ జేయు, దుర్బుద్ధులను బండితులుగఁ జేయు

గీ॥ శతమఖంబులు చేసి విశ్వమ్ము లేలు, నిందునకు నింత వెత ఘటియింపఁజేసెఁ
గాలమై చిత్ర మేమని గణుతి సేయఁ, గాలగతి తప్పఁద్రోయంగఁ గాదుసుమ్ము.

శా॥ ధర్మిష్ఠుఁ దురితాత్ముఁ జేయు హరి యాశ్రద్ధత్యంబు మాయించి ప్రా
క్కర్మాధీనత సూకరాదిభవసాంకర్యంబుఁ గల్పించె ని
ష్కర్ముఁ శంకరునిఁ గపాలధరునింగాఁ జేసెఁ గాలంబె పో!
మర్మ ధ్వంసక మెల్లవారలకుఁ దన్మాహాత్మ్య మల్పంబొకో. ౫౯౪

—• దేవతలు తమ పరాభవమును గురునితోఁ జెప్పుకొనుట •—

వ॥ ఇత్తెఱంగున రాజ్యభ్రంశంబు నొంది పురందరాదిబృందారకులు మందరముఖ
గిరికందరంబుల యందు మందానందులై దుర్దమంబు లగు దుర్దశలం బడలి
యేకతంబున నాంగీరసుం జేరి బహుప్రకారంబులఁ బ్రార్థించి భవదీయాను
మతంబున నింతవట్టు భోగంబు లనుభవించి ధ్వస్తసుఖుల మైతిమి విజయా
వహంబు లగు వేదమంత్రంబుల శత్రునిరాసపూర్వకంబుగా నస్మద్రాజ్యం బాపా
దింపవలయు నని ప్రణతులై వేడిన గురుం డిట్లనియె. ౫౯౫

శా॥ వేదోక్తంబులు మంత్రముల్ సకలముల్ వేయేల? మంత్రాళు లా
సాదించుఁ గద దైవదత్తఫలముల్ స్వాతంత్ర్య మం దెద్ది మీ
రే దైవంబులు వానికిఁ మిగుల నూహింపంగ మీ రెల్లరుఁ
మోదంబించుక లేక దుఃఖవశతామూఢాత్ము లైనారుగా. ౫౯౬

సీ॥ అధ్వరక్రియలందు హరిహయానలముఖ్య,యజనంబు విధిచోది తార్హకృత్య
మట్టివారల కెల్ల నాపత్తి వాటిల్లె, నిష్టు లెవ్వరిఁగూర్చి యే నొనర్తు
భావ్యంబులకు లేదు ప్రతీకార మెచ్చోట, శిష్టానుశాసనస్థితి వినమొకో ?
బలమ దైవం బని పండితుల్ పల్కిరి, యది వ్యర్థ మధిక ముపాయ మనిరి

గీ॥ కొంద ఱివిరెండు వలయునందు రొక్క,దైవమున నానె? సంసిద్ధి తనయుపాయ
సాహితి ప్రసంగవలయు మతత్సమ్మతార్థ,మిది విచారించి మీ రెల్ల నెఱిఁగికొనుఁడి.

సీ॥ మహిషాసురుఁడు మిమ్ము మర్దించి స్వపురని,ష్కాసితులుఁగ జేయఁ గడలుపట్టి
నెతనొంది శరణంబు వేడినఁ గరుణించి, దితిజబాధ లణంచి తెలివి గొలిపి
తేర్చిన యద్దేవిఁ దెలియక మీ రిట్లు, దురపిల్ల నేల తోడ్తోడ మిమ్ము
నాపద దొరసిన యంత న న్వేఁడు డే,నహితులఁ గూల్చి మిమ్మాదరింతు

గీ॥ ననుచుఁ బలుకుటమఱచిమీరలమటింప,నేలపర దేవిఁదలఁచి మీ యెడరుదొలఁగుఁ
డనుచు నాంగిరసుఁడు చెల్ప సమరవరులు, తెలిసి యానందభరితులై సకలయఁగూడి.

చ॥ గురుఁ డెఱిఁగించె దేవి మదిఁ గూర్మి ప్రసంగి వచించెఁగాదె? మీ
కరిభయ మొందు వేళ నను నాత్మఁ దలంపుఁడు వచ్చి శత్రుసం
హరణ మొనర్తు నంచుఁ దుహినాద్రిపయిన్ విహరించు నాపె మే
లరసిన వార మాట మన మందఱ మచ్చటి కేగఁగాఁ దగున్. ౪౮౯

గీ॥ చండికారాధన మొనర్చి శత్రుమథన,కృత్య మొనరింపఁగాఁదగుఁ గేవలంబు
విశ్వజనయిత్రి సత్కృపావీక్షణమున, నాపదలఁ బాసి సంపద లందు టరుదె.

—। పరాశక్తిని దేవతలు స్తుతించుట ।—

చ॥ అని కృతనిశ్చయంబున హిమాద్రికిఁ బోవఁదలంచి నిర్జరుల్
మనముల సంస్మరింపుచు సమంత్రకపూజ లొనర్చుచున్ జిరం
తనవచనార్థసారనుతి తత్పరులై యభియుక్తకాలమం
దనితరవేద్యమైన వినయమ్మున సన్నుతి చేసి రందఱున్. ౬౦౧

గీర్వాణదండకము॥ నమస్తే నమస్తే నమస్తే నమో దేవి! విశ్వేశ్వరి! ప్రాణనాథే సదానందరూపే! సురానందదే తే నమో దానవాంతప్రదే మానవానా మనేకార్థదే! భక్తిగమ్యస్వరూపే! ననామ్నాం హి సంఖ్యాం న తే రూప మీదృక్త యా కోపి వేదాఽఽదిరూపే త్వమే వాసి సర్వేషు దేవేషు శక్తిః ప్రజాసృష్టి సంహారకాలే సదైవస్మృతి స్త్వం ధృతి స్త్వం త్వమేవాసి బుద్ధి ర్జరా పుష్టిమేధే ధృతిః కాంతిశాంతీ చ విద్యా చ లక్ష్మీర్గతిః కీర్తిసంజ్ఞే త్వమేవాసి విశ్వస్య బీజం

పురాణం యదా మైస్స్వరూపైః కరోషీహ కార్యం సురాణాం చ తేభ్యో నమా మోఽద్య శాంత్యై క్షమాయోగనిద్రా దయా త్వం వివక్షా స్థితా సర్వ భూతేషు శస్త్రైస్స్వరూపైః కృతం కార్య మాదా త్వయా యత్సురాణాం హతోఽసౌ మహారి ర్మదాంధో హయారి ర్దయా తే సదా దేవవర్గేషు దేవి! ప్రసిద్ధా పురాణేషు వేదేషు గీతా కిమత్రాస్తి చిత్రం యదంబా సుతాన్ స్వా ముదా పాలయే త్తోషయే త్సమ్య గేవ ప్రధానం నకిం త్వం జనిత్రీ సురాణాం సహాయా కురుష్వైక చిత్తేన కార్యం సమగ్రం న తే చస్తుతీనా మియత్తాం స్వరూపం వయం దేవి జానీమహే విశ్వవంద్యే! కృపాపాత్ర మిత్యేవ మత్వా తథాఽస్మా న్భయేభ్య స్సదా పాహి పాతుం సమర్థే? వినా బాణపాతై ర్వినా వజ్రఘాతై ర్వినా శూలఖడ్గై ర్వినా శక్తిదండై రిపూన్ హంతు మే వాసి శక్తా వినోదా ద్వయం విద్మ దేవి! త్వదీయం చరిత్రం పరం శాశ్వతం యే వదంతీహ మూఢా నకార్యం వినా కారణం సంభవేద్వా ప్రసిద్ధ్యా వయం కల్పయామోఽనుమానం ప్రమాణం త్వ మే వాసి విశ్వస్య మాతా తదానీ మజ స్సృష్టికర్తా హరిః పాలకో నై హరో నాశకృ ద్వై ప్రసిద్ధాః పురాణై ర్న కిం త్వ త్ప్రసూతా స్తప తే యుగాదా త్వ మేవాసి సర్వస్య తేనైవ మాతా త్రిభి స్త్వం పురారాధితా దేవి! దత్తా త్వయా శక్తి రుగ్రా చ తేభ్య స్సమగ్రా తయా సంయుతా స్తే ప్రకుర్వంతి మాత! ర్జగత్పాలనోత్పత్తిసంహార మేవా ద్య చైవం విధాఽపీహ నః పాతు మార్యే! కి మర్థం విలంబః? పరై ర్వంచితాస్స్మ వయం పాహి నః పాహి నః పాహి దేవి!

శా॥ నిన్నున్ బూజ యొనర్ప నేరక జనుల్ నిర్భాగ్యులై మందులై
కన్నుల్ గానకపోదు రీవు జగముల్ గన్నట్టి విశ్వేశి వ
చ్ఛినోష్ణ పాసక కామదాయినివి లక్ష్మీ భారతీపూజ్యవ
త్యన్నత్యాస్పద విట్టి ని న్నెఱుఁగలే రాముష్మ లేమాత్రమున్. ౬౦౩

చ॥ పరమపదం బటంచు నిను భ్రాంతి నెఱుంగక చక్రపాణి శం
కరరవిముఖ్య దేవతలె కాంక్షితదాత లటంచు నమ్మి ము
ష్కరు లయి కొంద అర్చనలు సల్పుదు రంతట నేమి కాంక్షితం
బరయఁగఁ గల్గు వారలకు నాగమతత్త్వ మెఱుంగ నేర్తురే ? ౬౦౪

చ॥ హరిహరముఖ్యపూజిత వటంచు నినున్ గననేర కయ్యయో!
ధరణిని గొంద అజ్ఞులయి తావకసత్కృపఁ జెంద లేక దు
ష్కరనిరయాగ్నికీలలను గ్రాఁగుదు రవ్విధి మాయచేతనే
విరచిత మంచుఁ గానఁగను విశ్వపరాత్పర దిక్కు నీవెగా! ౬౦౫

మ॥ పవలుఁ రేయును స్వీయకాంతను మదిం • బద్మాక్షుఁ డూహించి పా
దవనేజంబుల రంజనం బిడు సుధాధామావతంసుండు స్వా
త్మవధూపాదపరాగసేవనమునం • ధన్యత్వముం జెందు నం
చు వచింపం బరు లెంతవారు? భవదస్తోకాంఘ్రిపూజారతిన్. ౬౦౬

మ॥ జననీ ! నీచరణార్చనావిరహితుల్ • సంసారకూపాంతరం
బున వర్తించుచుఁ గష్టులై వికలులై • మూర్ఛాదిరోగవ్యథా
ఖనులై సౌఖ్యవిహీనులై కృపణులై • కాష్ఠప్రకృష్టపరిభా
రనమచ్ఛీర్షపదాల్పులై చెడుదు రర్థభ్రష్టులై దీనులై. ౬౦౭

ఉ॥ తొల్లి నినుం భజించు మహితుల్ ధనధాన్యకళత్రపుత్రసం
ఫుల్లరమాకళావిజయపుష్టిధృతిస్మృతిభోగయోగముల్
కొల్లలుగాఁ గాంచి చిత్తమునఁ • గోరిన కాకుతముల్ భుజించి రం
జిల్లుట కేమి వింత? బుధసేవధి వీవయి కాచి యుండుటన్. ౬౦౮

గీ॥ ఇవ్విధంబున భజియించు • నెల్ల సురల, కంబికాదేవి దివ్యభూసాధ్య యగుచు
నెదుటఁ బ్రత్యక్ష మయ్యెఁ దదీప్సితంబు, లెల్ల ఫలియింపఁ జేయ నభీష్టదాత్రి.

—• పరాశక్తి దేవతలకు వరంబు లిచ్చుట •—

సీ॥ దివ్యభూషణములు • దివ్యాంబరంబులు, దివ్యమాల్యంబులు • దీప్తి మెఱయ
దివ్యచందనచర్చదిఙ్ముఖంబుల గంధ,వహున కన్వర్థత • వఱలఁ జేయ
నద్వితీయస్వరూపాకృతిసర్వల,క్షణ లక్షి తాంగియై • జగము లెల్ల
మోహింపఁ జేయు నమ్మూర్తిఁ దాలిచి తమ, సన్నిధి సన్నిధిసరణిఁ బొల్చి

గీ॥ జాహ్నవీస్నానకామయై • శైలబిలము, వెడలివచ్చుచు సురనుతుల్ • విన్నయంత
మేఘగంభీరవాక్కులు • మెఱయ వేల్పు,తండములఁ జూచి నవ్వుచుఁ • దల్లి పలికె.

మ॥ సురలారా ! యభయం బొసంగితిని నస్తోకవ్యథాబద్ధులై
పరివేదించెద రేమి కార్యము? రిపుప్రాబల్యముల్ కల్గెనో ?
భరితోత్సాహముతోడ నుండుఁడు భవత్ప్రత్యర్థివిధ్వంసనో
ద్ధురనై నే గలుగంగ నేటి కిటులన్ • దోధూయమానవ్యథల్. ౬౧౧

క॥ వచ్చిన కార్యం బెద్దియొ, చెచ్చెర వినిపింపుఁ డనినఁ • జిత్తము లలరన్
విచ్చేయు మమ్మ సురరిపు, లెచ్చిరి మాకిచ్చు నభయ • మిడ నదనయ్యెన్. ౬౧౨

క॥ పరిణతుల మైతిమి కృపచే, గణియించి నిరస్తదుఃఖకల్మషకలనా
గణనీయులఁ జేయుము నీ, వణుమాత్రము పాదరజము • నొందల నిడుచున్.

మ॥ మహిషామర్త్యవిరోధిఁ గూల్చి త్రిజగత్సన్మాన్యాకృతిన్ దాల్చి మా
కహితోద్వాసనసౌఖ్యసంపదనుకూలాభోగముల్ దార్చి తే
ర్చి హిమాద్రిన్ వసియించి తీవు నిరతశ్రీ నొంది యిందాఁక న
న్వహభోగంబుల నొందినారము భవద్వాల్లభ్యభాగ్యస్థితిన్. ౬౧౪

క॥ అరి సాధ్వసముల నన్నన్, స్మరియించిన శత్రునిహతి ఽ సల్పెద ననుచున్
వరమొసఁగి నేఁ డుపేక్షా,పరతన్ వర్తింప నెట్లు ఽ బ్రతుకుదు మంబా! ౬౧౫

వ॥ దేవీ! యిక్కాలంబున శుంభనిశుంభు లను రక్కసులు ఘోరదర్పనులై పురుషావధ్యతాధైర్యంబున సురభోగాంతరాయకర్తలై వర్తించుచున్నవారలు, రక్తబీజుండును ధూమ్రలోచనుండును చండముండులు నను నసురవీరులఁ దోడుఁజేసికొని సురరాజ్యం బపహరించి యనవరోధంబుగాఁ ద్రిభువనీవైభవం బనుభవింపుచున్నవారు, త్వదేకశరణ్యుల మగు మమ్ముం గటాక్షింపుము, అస్మదీయ విపద్వినాశనంబునకు గతి నీవ కదా! రక్కసులం బరిమార్చి భువనరక్షాకరణం బొనర్పుము, నీవే శరణం బని విన్నవించిన. ౬౧౬

చ॥ ఇటులు నుతించు నిర్జరుల ఽ నెల్లరఁ జూచి జగజ్జనిత్రి యొ
క్కట రిపుకోటిఁ ద్రుంతు నలుకం బని లేదని తేర్చి మేన ను
త్కటభయదాకృతిం బొడమఁగాఁ దలపించి ప్రచండ రౌద్రసం
స్ఫుటగతి నొందు రూపమును ఽ బుట్టఁగఁ జేసెను గాళి నా రుషన్. ౬౧౭

క॥ కాళీనామమ్మున భువ,నాళీ విద్వేషిచయము ఽ నడఁచుచు వినమ
త్పాళీపాలన చంక్రమ, కేళీరతి నలరె దేవి ఽ కృతనిశ్చయమై. ౬౧౮

—॥ అంబికాదేవి కాళరాత్రిరూపంబున శుంభనిశుంభుల సంహరించుటకుఁ బోవుట ॥—

సీ॥ అంబికాదేవి రూపాంతరంబు వహించి, యింద్రనీలప్రభాసాంద్రరుచుల
దైత్యసంహరణ సంరంభాలోలయై ఘోర,రూపంబు దాల్చి నిర్ధూత దుష్ట
కృత్యవర్తనమునఁ ఽ గేవల స్వనమజ్జ,నంబుల నిష్టార్థసమహితులుగను
జేయుచుఁ ద్రిభువనీస్థితచరాచరపాల,నంబున దక్షయై ఽ యంబరమునఁ
గీ॥ గాళరాత్రి యనంగ విఖ్యాత యగుచు, వెలసె నాదేవిరూపంబు ఽ విశ్వహృద్య
మఖిలభూషణభూషితం ఽ బాగమాంత, వేద్య మనుపమలావణ్య ఽ విశద మరయ.

గీ॥ అంత నయ్యంబికాదేవి ఽ యమరవరులఁ, జూచి వెఱవకుఁ డనిలోన ఽ శుంభముఖ్య
దితిజహరణం బొనర్చెద ఽ దేవరాజ్య, మిచ్చెదఁ బురందరునకు మీరెల్లఁ గనఁగ.

మ॥ తతబాహాబలవిక్రమాస్తమిత దైత్యవ్రాతసంపత్సమా
తతసంరంభత మిమ్ముఁ దేర్తు నని యుద్యద్విగ్రహోపేతయై

కృతసింహారవనిర్దళద్గగనసాంద్రీభూతరంధ్రచ్ఛటా
స్రుతవేధోండబహిర్జలాభసుమవృష్టుల్ దోఁచి మేన్పెంచుచున్. ౬౨౧

ఉ॥ కాళిక వెంట రాఁగ సురకార్యధురీణత సింహవాహనో
ద్వేలనిజాభియాన యయి దేవచమూనిచయంబుఁ గొల్వ ను
త్తాలధనుర్విముక్తశరతండము దానవపత్తనంబుపై
స్థూలతరాశనిధ్వనులతో బెగడొందఁగఁ జేసె వీఁకమై. ౬౨౨

ఆ॥ దండు దరలి దేవి తత్పురాంతక మహో,పవనసీమ కుసుమభరితవకుళ
వంజులావనీజకుంజపుంజంబుల, విడిసి కొల్వు దీర్చి వేల్పు లలర. ౬౨౩

మ॥ జగతీమోహనమోహనం బయి సుధాసారోల్లసన్మాధురీ
స్థగితంబౌ కలనిస్వనంబున జగద్ధాత్రీమహాదేవి య
త్యగణేయస్థితి నొక్కరాగము జరద్దార్వంకురస్థాయిగా
నగరావాసజనంబు లెల్ల వినఁ గంఠం బెత్తి పాడెన్ రహిన్. ౬౨౪

సీ॥ అద్దేవిగానంబు నాలించి ఖగములు, మృగములు మొదలుగా మేర మీఱు
సంతసంబునఁ బొంగఁ జదలునఁ దెఱగంటి,గము లెల్లఁ గరఁగంగఁ గటకమునను
శుంభదైత్యుని భుజిష్యులు చండముండులు, నచ్చోట రమమాణు లగుట దేవి
గాన మాకర్ణించి కదలి యచ్చటఁ జేరి, జగదేకమోహనాశ్చర్యధుర్య
గీ॥ నంబికను గాంచి యద్దేవియంతికమునఁ, గాళికాదేవిఁ గాంచి యక్కలికిరూపు
మదికి విస్మయ మొదవ నున్మత్తు లగుచు, దానవాధీశుఁ డగు శుంభుదండఁ జేరి.

చ॥ శిరమునఁ గేలు మోడ్చి భటసేవితుఁడై కొలువున్న శుంభునిన్
గర మనురక్తిఁ గాంచి సురకంటక! నేఁడు హిమాద్రినుండి సుం
దరతరమూర్తి యొక్క వనితామణి లక్షణలక్షితాంగి యి
ప్పురి వనసీమ నున్నయది భూస్థలిఁ దాదృశఁ గాన మెన్నఁడున్. ౬౨౬

ఉ॥ ఇంతియ గాదు దేవపురి కేగియు నిట్టి నెలంతఁ గాన మా
వంతయుఁ దద్వధూమణికి నన్యపురాంతరభామ లెల్ల నా
ద్యంతము సాటిగారు వినఁగాఁ గనఁగా నటువంటి బోటి లే
దెంతయు బ్రహ్మసృష్టి యెడ నింత విచిత్రము గాన మెన్నఁడున్. ౬౨౭

గీ॥ పరభృతాంగన మర్త్యసంభాషణముల, నలరునట్టులు గానరసాంబురాశి
మగ్నమైయున్న దాచెంతమాఱుమసలు, నఖిలమృగములు మధురస్వరాభిలాష.

సీ॥ ఎచ్చటనుండి యయ్యింతి విచ్చేసెనో?, యెవ్వనిపుత్రియో? యేమి కార్య
మెదలోఁ దలంచుచు నిం దరుదెంచెనో?, తగియున్న దాబోటి దైత్యరాజ!

నీ వేగి యాబోటి నిలయమ్మునకుఁ దెచ్చి, కమలలోచనఁ బెండ్లి గమ్ము వేగ
సంసారమున నిట్టిసతి గల్గు టబ్బురం, బీ నిశ్చయము సేయు మేల తడయ

గీ॥ దేవరత్నంబు లెల్లను దెచ్చినాఁడ, విట్టి స్త్రీరత్న మన్నిటి కింపు గొలుపుఁ
గాన నెడ సేయక బోఁటిఁ గదియఁ జూడు, మగువఁ గలసిన మముబోఁట్ల మఱవవలదు.

వ॥ దానవేంద్రా! పురందరు నోడించి యైరావతంబు నుచ్చైశ్శ్రవంబును గల్పవృక్ష కామధేనుచింతామణులను, మరాళధ్వజసంయుతం బగు బ్రహ్మవిమానం బును, యక్షేశ్వరుం డగు కుబేరునినవనిధులును, వరుణునిఛత్రంబును, పాశం బును, వహ్ని శక్తియు, యమునిదండంబును, బలాత్కారంబున నపహరించి తివి, సముద్రుం డమ్లానపంకజం బగు వైజయంతిఁ భయార్తుండై సమర్పించె రంభాద్యప్సరసలు నీ పురంబున వీటివేశ్యలై వర్తించుచున్నవార లిత్తెఱంగున ద్రిభువనాంతస్థరత్న పరిగ్రహీత వగు నీకు నిట్టి కాంతారత్నంబు వలవదే! భవద్గృహీతంబు లగు రత్నంబుల కెల్ల మెఱుంగుఁ బెట్టినట్లగుఁ గదా? యవ్వధూ రత్నంబు వచ్చెనేని రత్నాకరుండ వీవె యగుదు వదిగావున సత్వరంబ చని నీ భార్యంగాఁ జేకొని సుఖం బనుభవింపు మని పలుతెఱంగుల బోధించిన. ౬౩౦

—• శుంభుఁడు కాళికయొద్దకు దూతను బంపుట •—

ఉ॥ చండుఁడు ముండుఁడుం దెలుపఁ జక్కటి నారసి మేను పొంగఁగా
దండ వసించు నొక్కరుని దగ్గఱఁ జేర్చి వచించె నీవు పొ
మ్మండజయానసన్నిధికి నాస బుగుల్కొనఁ జేసి మాధురీ
మండితవాక్కదంబముల మానిని బోధకుఁ జొన్పు మీయెడన్. ౬౩౧

క॥ నామాఱుగ నీవై చని, భామామణి తోడ సరసభాషల రసను
క్షేమంబు గాఁగ జల్లఁగ, సామోపాయం బొనర్చి సంధింపఁదగున్. ౬౩౨

మ॥ రసభంగం బెడఁబుట్టనీక నుడులన్ రక్తిన్ బొసంగించి కై
వస మానట్టులు బోధచేసి సతికిన్ వాంఛానుకూలంబుగా
వెస నేమేనియుఁ గోరెనేని బొరి నావిర్భూతమా మోహ మిం
పెసఁగన్ సర్వము నిత్తునం చని మనోభీష్టంబుగాఁ బల్కుమీ. ౬౩౩

క॥ కామిని యఁట? సరసుండగు కాముకునిన్ గోర దొక్కొ? కామితముల పైఁ
గామము లేకుండునొక్కో?, కామించిన సకల మిందుఁ గలదని చెపుమా. ౬౩౪

గీ॥ నీవు సుగ్రీవుఁడవు గాన నీకుఁ బల్కఁ, గఱపఁ బనిలేదు చాతుర్యగరిమ ఘనము
నీదు నేర్పునఁ జెలి నాదునెయ్యమునకు, నొడఁబడిన నేనె నీవుసూ!తడయవలదు.

చ॥ చనుమని దూత నంపిన నిశాచరనాథుని యాజ్ఞఁ గొంచుఁ జ
య్యనఁ జని వాఁడు దేవిఁ గని । యంజలి సేయుచు సింహవాహనం
బున నధిగూఢయై భువనభూషణమోహనమూర్తియైన య
య్యనిమిషవందనీయచరణాంబుజతో వచియించె నిమ్మెయిన్. ౬౩౮

సీ॥ త్రిభువనీవిజయసందీపితుం డగు దేవ, తారాతి శుంభునియనుఁగు బంట
సుగ్రీవుఁ డనువాఁడ । సుందరాకారుండ, శూరుండ సమరవిహారములను
మారాజు ననుఁ జూచి । మన్నించి నీ చెంత, కరుగుమం చని పంపె । నంతరంగ
గోపనీయము తనకోర్కి నాతోఁ దెల్పె, వినిపింతు నో దేవి! । వినుము నీదు
గీ॥ రూపలావణ్యవిభ్రమశ్లాఘ విన్న, మొదలు మదనాభితప్తుఁడై । మోహజలధి
మునిఁగియున్నాఁడు నీతోడ । ముచ్చటించి, తనదుమదికోర్కిఁ దెల్పుమంచనియెనతఁడు.

ఉ॥ ఆసురనాథుమాట విని । యమ్మహనీయవిలాసమూర్తితో
నాసఁ బెనంగి దేవివయి । యాతనిసంపద లెల్ల నీవిగా
భాసిలు మమ్మ! యేకతమ । పల్కినపల్కులు విన్నవింతు నే
నో సరసీరుహాక్షి! చెవియొగ్గి వినందగు నెట్టు లంటివా? ౬౩౯

సీ॥ యాగభాగము లెల్ల । నపహరించి సురాళి, నడవులు పట్టించి । యఖిలమునకు
నధిపతినై భువనావళిరత్నంబు, లార్జించి భోక్తనై । యమరు లసురు
లాజ్ఞావశంవదులై యుండ జగదేక, చక్రవర్తిత్వంబు । సల్పువాఁడ
నీ సొంపు విని రేలు । నిద్దు రెఱుంగక, పంచాస్త్రసుమశరప్రహారణముల
గీ॥ బడలియున్నాఁడ దాసుండఁ । బాదయుగముఁ, బట్టి వేడెదఁ జార్వంగి! మట్టుమీఱు
మరులు సఫలమ్ముఁ జేయు మమ్మాత్రటి కేను, ద్రిభువనములకుఁ బట్టంపుదేవిఁ జేతు.

క॥ మరణావధిగా నాజ్ఞా, కరణం బొనరింతు సురనికాయంబులచేఁ
బరిభూతి లే దవధ్యుఁడ, నిరత సువాసినివి గమ్ము । నిక్కము నాచే. ౬౪౦

క॥ నందనవనముఖ్యములం, దెందెందు సుఖింపఁగోరె । దీ వం దందున్
సుందరి? నీతో భోగము, లందెద సుమశరునియాన । యని పల్కెఁ జుమీ. ౬౪౧

ఉ॥ ఇప్పగిదిన్ వచింపు మనియుర్విన్ మధురాక్షర మెద్ది దెల్పినన్
దప్పక విన్నవింతు నది । దానవనాథునితోడ; నింక నీ
కొప్పిద మేని చిత్తమిడి । యోర్చి వచింపుము గాకయున్న నే
చొప్పు గణించెదో? యటులు । చూడుము తథ్యముఁ బల్కితిన్ జెలీ! ౬౪౨

ఉ॥ హత్తి నృపాలవాక్యముల । యాశయ మెల్ల వచించినాఁడ నీ
చిత్తము వాని భాగ్యము వచింపుము మద్విధి సార్థకంబుగా

నిత్తతి నీమదిఁ దలఁపు ౯ మిన్నిటికిఁ భవదుక్తసర్వముఁ
దత్తరుణీమనోభవుఁడు ౯ దానవభర్తకుఁ దెల్పుదుం జుమీ. ౬౪౩

చ॥ దితిసుతదూత పల్కు విని ౯ దేవి మొగమ్మున లేఁత చిన్నిన
వ్వతులసితద్యుతుల్ గులికి ౯ యబ్బుర ముబ్బుకొనంగ వానితో
నతిమధురంబుగాఁ బలికె ౯ నాసురకామితసాధకంబుగాఁ
గుతుక మొనర్చె నీవచన౯గుంఫన మన్నిట సంతసించితిన్. ౬౪౪

కం॥ శుంభనిశుంభుల నెఱుఁగుదు, జంభారిప్రతిభటులు విశ్వశంకట పటుదో
స్తంభస్తంభితవిద్విట్కుంభులు తద్విక్రమం బశకుంతిత మరయన్. ౪౪౫

సీ॥ సర్వగుణోల్లాస౯సంరంభజృంభులు, సర్వసంపద్భోగ౯సామరస్య
ఖేలనాదంభులు ౯ కృతరణారంభులు, సౌందర్యగాంభీర్య౯శౌర్యగుంభు
లనుచు శుంభనిశుంభు౯లను ముప్పదియు రెండు, లక్షణంబులు గల్గి ౯ యక్షయప్ర
తాపనైపుణి నవ౯ధ్యత్వంబు సాధించి, రంజిల్లి రదిగాన ౯ రత్నములకుఁ

ఆ॥ గాంచనాశ్రియంబు ౯ కాంక్షణీయమె గాన, దర్పితుఁ డామ నైతి ౯ దృప్త మిదియు
నాదిదేవదేవ ౯ యక్షగంధర్వాదిసమితి గెలిచినట్టి ౯ జాణ లైరి. ౬౪౬

కం॥ కావున వారలఁ జూడంగా వేడుక గల్గి కాదె౯కాంక్షించితిఁ ద
ద్దేవారాతుల వీటికి, నే వచ్చుట నీదుపతికి ౯ నెఱిఁగింపఁదగున్. ౬౪౭

ఉ॥ ఏకత మున్న నీ విభున ౯ కేను వచించుటఁ గాఁగఁ దెల్పు మ
స్తోకగుణుండ వాఢ్యుఁడవు ౯ శూరుఁడ వుత్తమవంశజుండ వా
టీకితభోగశాలివి ధృ౯ఢీకృతదేవజయుండ వంచు నీ
కై కద యేను వచ్చితి సు౯ఖంకరవల్లభవాంఛ పేరిమిన్. ౬౪౮

ఆ॥ నీకుఁ దగిన యట్టి ౯ నిండు సంపత్తుల, కేను దక్ష నగుదు ౯ నెల్లమెడలఁ
బాల్యమంద యేను ౯ బట్టితి నొక్క నోము, మాటపాటియమున వ౯యస్య లలర.

సీ॥ వివరింతు నాపూర్వ౯వృత్తాంత మెవ్వండు, నాతోడ నని చేసి ౯ నన్ను గెలిచి
బలదర్పముల నాకుఁ ౯ బ్రతివీరుఁ డగునట్టి, శూరునిఁ గైకొందుఁ ౯ జుమ్మ కలన
నోడిన నిరసింతు ౯ నురువడి నప్పంద, నని తోడిచెలు లెల్ల ౯ వినఁగఁ బలికి
దృఢనిశ్చయమ్మునఁ ౯ దెగువఁ జేసితిఁగాన, నావ్రతం బారసి ౯ నన్ను గెలిచి

గీ॥ తమ్ముఁడో తానొ వే నన్ను౯దక్కఁగొనఁగ, దగుదురని తెల్పు మనియును౯దైత్యనాథు
ననికి రమ్మనుమని తెల్పు౯మనియుననుము, పొమ్మనుచుఁ బల్కె నద్దూత౯యుమ్మలించి.

ఉ॥ నవ్వుచు నిట్లు పల్కె నెలనాగవు గాన వచించె దిట్లు నీ
జవ్వనమున్ నిగారమును జక్కఁదనంబును మార్దవంబునున్
మవ్వము నిట్లు గల్గి శతమన్యుముఖప్రముఖామరాళులన్
జివ్వలఁ దుప్పు డుల్చిన విచిత్రచరిత్రునితోడఁ బోరెదే. ౬౫౧

ఆ॥ అట్టి వీరు గెలువ నభిలషించితివొక్కొ, యాహవమ్ములందు నతనితోడ
మార్కొనంగ నిట్టి మగువలా! తెలియు మీ, బేలతనము చాలు మేల మేల.

చ॥ తనబలమున్ బరప్రతిభ తప్పక యారసి పల్కఁబోలు మె
చ్చనిపనిఁ బూనఁ జూతురె? విశంకటబాహుబలోగ్రుఁడైన యా
ఘనునకు నీకుఁ బోరితము గా దిటు లేటికిఁ బల్కె దీవు? మం
తన మొనరించి దైత్యవిభుదండ వసింపఁగఁ గోర మేలగున్. ౬౫౩

సీ॥ జంభారివిజయదోస్తంభుండు శుంభుండు, చేపట్టు మతని నీచిత్తమునకు
మెచ్చుగాఁడేని యక్కర్మలి నిశుంభుని నేలు, శృంగారలౌల్యంబు చేతనులకుఁ
బ్రార్థనీయము, శాస్త్రపద్ధతి యిది దీన,నిర్విఘ్న సౌఖ్యంబు నిన్నుఁ జెందుఁ
గా దేని కోపించి క్రవ్యాదసింహుండు, పరిచారకుల నంపి పట్టఁగలఁడు

గీ॥ దిట్ట లగు దానవులు తలపట్టి యీడ్చి, యెత్తికొనిపోయి దైత్యునికిత్తు రకట?
ప్రాణసంరక్షణము సదాభావ్య మఖిల, జనులకును బ్రాణములకన్న ధనముగలదె.

కం॥ మానము ప్రాణాధిక మని, చానలకున్ దెలుపుఁగాదె శాస్త్రము; సుఖసం
ధానముగానన్ మానిని!, మానము గాపాడుకొనుము మన్నించి ననున్. ౬౫౫

శా॥ సారాచారవిచారవై సుఖరసాస్వాదైకసంభారవై
దూరాలోచన మెంచి చూడుము సమిద్ధుర్యుండు నీ వేగి త
త్కారుణ్యంబు వశమ్ముఁ జేసికొనుమీ! క్రౌర్యంబు మేలౌనె? త
ద్ఘోరాజిహ్మగమర్దనంబులకు నీకున్ వచ్చునే? యోర్వఁగన్. ౬౫౬

ఆ॥ నీకు మేలు గోరి నే వచించితి నింత, సుఖము వలసెనేని శుంభునేని
అతని తమ్మునేని యభిలషింపుము జగ,త్త్రియము నేలికొనుము తరుణి!యనిన.

సీ॥ సుగ్రీవ! నీ విట్లు సూనృతం బంటివి, నిపుణవాక్యంబుల నేరుపరివి
శుంభనిశుంభవిజృంభణం బెఱుఁగుదు, దోర్బలధుర్యులు దురములందు
బాలభావమున నేఁ బట్టిన వ్రత మెట్లు, సడలెద నీ వేగి సమరమునకు
రమ్మని తెల్పు మీ రాజుతో దురమున, గెలువనివాని నేఁ గేలుఁబట్ట

ఆ॥ నన్ను గెలిచెనేని నాథుఁడై నా కేలు, పట్టుమని వచింపు ప్రథనమునకు
రమ్మటంచుఁ దెల్పు రమణులతోఁ బోరు, తనకు దుష్కరంబె? తరలు మనుము.

క॥ భీకరమగు నా శూలపుఁ, దాఁకులకుఁ వెఱచెనేని ॥ ధరణికిఁ గ్రిందా
లోకమునకుఁ బొమ్మను మ, స్తోకభుజాబలుఁడ వేని ॥ దుర మిమ్మనుమీ. ౬౯౯

చ॥ అని వచియించు దేవిపలు ॥ కారసి యాత్మఁ దలంచి యేను దూ
తను విభుఁ డెద్ది సేయు నది ॥ తప్పదు దూతల కెల్ల సత్యవా
చనము నిసర్గ, మేను జని ॥ సామికి విన్నప మాచరింతు నా
యన మది కెట్లు దోఁచు నటు ॥ లారయు నంచు సురారి యేగియున్. ౬౮౦

ఉ॥ శుంభునిఁ జూచి మ్రొక్కి సురశాసూదన! దూతల కెల్ల సత్యవా
గ్గుంభము సత్యవర్తనము ॥ కుంభిని నైజము సత్యముల్ ప్రియా
రంభము నైన పల్కు సుకరంబు బయి దుర్లభ మట్లు గాన సం
స్తంభితవాగ్విహారత బుధతంబు వచింతు సహింపఁగాఁదగున్. ౬౮౧

ఆ॥ ప్రియము పల్కెఁడేనిఁ ॥ బ్రియుఁడు గాఁ డధిపున, కప్రియంబుఁ బల్కనాజ్ఞసేయు
రెంట దూతలకును ॥ వెంటఁ గీడగుఁగాన, నైనఁ బల్కకుండ ॥ నగునె? మాకు.

ఉ॥ ఎచ్చట నుండి యెచ్చటికి ॥ నేగుచు నిచ్చటి కేగుఁదెంచెనో?
మచ్చరికించి నే నడుగశమానితి భావము మచ్చెకంటికిన్
గచ్చ బిగంగఁ గట్టినది ॥ గట్టిగఁ దన్ను రణంబు లోపలన్
మెచ్చగఁజేయకున్నఁ గడిశమిన్ బరిణీతికి మెచ్చనం చనెన్. ౬౮౩

గీ॥ ఆటప్రాయమునను ॥ మాటవశంబునఁ, జేడె లెల్ల వినఁగఁ ॥ జేసినట్టి
వ్రతము గలదు గాన ॥ వచ్చి నన్నని గెల్చి, కేలు వట్టు మనుచు ॥ బాల దెల్పె.

సీ॥ సంగరంబున నన్ను ॥ సాధించి దోర్బల,ఘనుఁడైన వాని నేఁ ॥ గరముఁ బట్టి
లాలింతు నని నవశలాలు వినంగ నేఁ,బల్కిన దాన నాశప్రతిన నెఱపి
చేపట్టు మనెఁగానఁ ॥ జిత్తంబు రంజిల్లి, యబలల గెల్చుట ॥ యరిది యొక్కొ!
నీ కని ముద మొంది ॥ నే నరుదెంచితి, నిచ్చవచ్చిన యట్టు ॥ లింతిఁ గనుమ
ఆ॥ సింగ మెక్కి యనికి ॥ సిద్ధమై యున్నది, వెడలు మింక నీకు ॥ వెఱపు దగునె?
సతు లనంగ నెంత! ॥ సమరనిశ్శంకుండ, వైన నీదు దోర్బశలాహమికకు.

గీ॥ సిద్ధవద్భావమును గార్యశసిద్ధిఁగనిమె, నన్ను మఱవంగఁ దగదని ॥ నతి యొసర్ప
దూతవాక్యంబు లెల్లఁదోశడ్తోనవినుచు, శుంభుఁడునిశుంభు నెమ్మోముఁశజూచిపల్కె.

ఉ॥ వింటివె? దూత వాక్యములు? ॥ వేమఱు తమ్ముఁడ! యుద్ధవాంఛ వా
ల్గంటి నన్ గుఱించి యనికై వెడలందగు నంచుఁ బల్కె నీ
వొంటిఁగ నేగెదో? యనికి ॥ నొద్దిక నన్నునుపం దలంచెదో?
బంటుదనంబుఁ జూపి సతిశబట్టుట ప్రోడతనంబు సుమ్మనన్. ౬౮౭

ఉ॥ అంత నిశుంభుఁ డిట్లనియె ♦ నన్నకు నేనును బోవఁగూడ దీ
వెంతయు నట్లు కాన నతిహీనత గాదొకొ? యాఁడదానికై
యింత విచార మేటికి? యత్యధిచ్ఛ మహాబలు నెవ్వనేని న
క్కాంతను బట్టి తెమ్మనఁగఁగాదొకొ నీ కిది సంవిభావ్యమే. ౬౬౮

ఆ॥ ధూమ్రలోచనుండు ♦ దోర్బలశాలి నీ, యాజ్ఞఁ గొనుచు రణముఁనందు గెల్చి
పట్టి తెచ్చు సఖిని ♦ బరిణయింపుము వేగ, శుభముహూర్తమునను శుంభ! యనిన.

క॥ తమ్ముని మాటలు విని మోదమ్ము మనమ్మునను బెనఁగ ♦ దండ నిలిచి బీ
రమ్ము గల ధూమ్రలోచను, రమ్మని చేరంగఁ బిలిచి ♦ రక్కసుఁ డనియెన్. ౬౭౦

చ॥ తగుబల మెల్ల వెంటఁ గొని ♦ దర్ప మెలర్పఁగ ధూమ్రలోచనా!
బెగడక పోరికిం జని యభీరుఁడవై మదమత్తమైన య
మ్మగువను బట్టి తెమ్ము చనుమానము నీయెడఁ జాలఁ గల్గు నా
యగణితసఖ్య మెల్ల మెఱయన్ దలపింపఁదొడంగు మీయెడన్. ౬౭౧

చ॥ అమరులు దానవుల్ మనుజయక్షముఖుల్ కదనంబులోన నా
రమణికిఁ దోడుగాఁ గదనరంగమునం గలరేని వారలన్
దెమలఁగ నీక నీదు శరతీవ్రతఁ బట్టి వధించి పార్శ్వసం
భ్రమణము సేయఁ గాళికను ♦ బట్టి మదం బడగింపఁ జూడుమీ. ౬౭౨

చ॥ సమరము సేయు వేళఁ బటుశస్త్రధరుల్ చెలికై సహాయతన్
గుములుగ నుండి పోరిన నకుంఠితవిక్రమ కేళి సల్పుచున్
సమయఁగఁ జేసి యచ్చెలికి ♦ సాయక మంటఁగనీక చాల య
త్నమునఁ జరింపఁగావలయుఁ ♦ దన్వి మహామృదు దేహగావునన్. ౬౭౩

ఆ॥ పొమ్ము నేను నీకు ♦ బుద్ధులు గరపంగఁ, జాలువాఁడ నొక్కొ సఖ్యమునకు
సమయమిదియనుమ్ము ♦ సఖుఁడు గల్గుటఁగదా?, సకలసిద్ధియ నెడు ♦ శాస్త్రమతము.

—♦ ధూమ్రలోచనునిఁ గాళిపై యుద్ధమునకుఁ బంపుట ♦—

ఆ॥ ఆహవంబునకును ♦ నరుగు మటంచును, జదురుదిగఁగ నంపి ♦ సంతసించె
శుంభుఁడంత సమరశూరత వెడలెను, ధూమ్రలోచనుండు ♦ దురమునకును. ౬౭౫

వ॥ సన్నద్ధుండై బహుసేనావారంబులు వెంటఁ గొలువ . నాయుధసహస్రంబులతో
శూర సహస్రంబులు తన్నున్ బరివేష్టింప నుపవనమధ్యంబునఁ దుహినాచలమ్ము
నందున్ బలె సింహవాహనయై కాళికాశక్తితోడం జతురసల్లాపంబు
లొనర్చుచుఁ జెలంగుచున్న యంబికాదేవిం గాంచి హేతుమంతంబులును జతు

రంబులు నగు మధురవాక్యంబుల నో దేవీ! త్రిలోకాధిపతి యగు శుంభుండు విర హాతురుండై దూతంగాఁగొని మున్ను సుగ్రీవుం బనిచిన నీతివిశారదుండగు నతండు రసభంగభయంబున సామపూర్వకంబుగా నుడివిన పల్కులకుఁ బునరుత్తరంబుగా నీ వానంగిన హేతుమద్వాక్యంబులకుఁ దాత్పర్యం బెఱుంగనేరక విపరీతంబుగా నచించినఁ జింతావిష్టమానసుండై కామమోహితుండు గావున వలపునంబడి మఱుంగుచున్నవాఁడు, హేతుగర్భంబుగా రణంబున జయించి నన్నుం జేకొను మనుట రసగర్భంబు గావున రెండవయది దుఃఖదంబును బ్రథమసంగ్రా మంబు భవచ్చిత్తమనోహరంబును నగుట యింగితజ్ఞుండు గావున నెఱింగి నన్నుం బంపె, నావచనంబు వినుము. త్రిలోకేశ్వరుండును, దేవదర్పనిబర్హణుండును నగు శుంభునకుఁ బట్టంపురాజ్ఞివై భోగంబు లనుభవింపుము, కామబలంబున నితండు నిన్నుం జయింపఁగలఁడు. హావభావంబు లన్యోన్య సాధకంబులు గాఁగలవు. కాళికాదేవి నర్మసాక్షిణియై వర్తించు. విరితల్పంబుల నఖదంతఘాతంబుల రక్తదేహధరం జేయంగలఁడు. నీకుం దగిన ప్రియుండు శుంభుండు గాఁగలఁడు. నా వచనంబు మన్నింపుము. నీతో దురం బొనర్చువాఁడు మందభాగ్యుండు, పాద పాతనంబున నశోకంబు వికసింపఁజేయు తెఱంగున భవత్ప్రియుండగు శుంభునట్లుం జేయుమని బహువిధంబుల విన్నవించి ధూమ్రలోచనుం డూరకున్నఁ జిఱునవ్వు నవ్వుచుఁ గాళికాశక్తి యిట్లనియె. ౬౭౬

క॥ శైలూషుని వలె మాటలు, చాలఁ మధురంబుగాఁగఁ జదివెదు నుడులఁ
జాలముల విదూషక కృత, హేలల నిష్టార్థసిద్ధి యెటులొనఁగూడున్. ౬౭౭

సీ॥ దుర్మదంబున దైత్యసంధూర్తుఁడౌ శుంభుండు, నినుఁ బంపనేలయన్న యును ముందుఁ
దెలుపమే? యిద్దేవి దృఢశక్తి శుంభని, శుంభుల రణసమాజృంభణమున
మథియించి నినుబోటి మానవాశుల నెల్ల, మర్దించి హిమశైలమందిరమున
కరుగంగఁ గలదు విశ్వాతిమోహినియైన, యిద్దేవి యేడ? తా నేడ ధరణి
గీ॥ నింతటి యనర్హసంసార మెందుఁగలదె?, భువనములు నవ్వ నింత దుర్బుద్ధివలదు
సింహకాంతకు జంబుకన్నేహ మగునె?, కుంభినికి గర్దభంబుతోఁగూట మగునె?

ఉ॥ ఏచక వేగఁబొమ్ము భవదీశుఁడు శుంభుని తోడఁ దెల్పు మీ
నీచపుఁ బల్కుమాని యవినీతిఁ దొలంగి రణాజిరంబునన్
ధీచతురత్వమున్ నెఱపె నేనియు మెచ్చెద మొండు పల్కులే
లా! చనుఁ డింక వేగ నతలంబున నుండ సబంధుమిత్రులై. ౬౭౮

క॥ గవయము సురభిం గోరఁగ, నవునే? వేపోయి దానవాధీశునకున్
వివరింపు మనుచుఁ దెలిపిన, నవహితమతి ధూమ్రలోచనాసురుఁ డంతన్. ౬౮౦

ఉ॥ కాళికఁ జూచి బాహుబలగర్వితుఁడై యరుణాక్షిజానల
జ్వాలలు మింటఁ బర్వ రససంభృతమైన మదుక్త భారతీ
జాలము మెచ్చఁజాలవె? విశంకట ముద్ధనురుద్యదంబకా
స్ఫాలన నిన్నుఁ గూల్చి పిదపన్ రణదుర్మద కేళిలోలతన్. ౬౮౧

ఉ॥ సింగముఁ గూల్చి యీ దుడుకుఁజేతల బిత్తరి నీడ్చి తెచ్చి స
ర్వాంగమనోహరుండయిన స్వామికి నప్పన సేతు మాధురీ
భంగము గాక సామమునఁ బల్కిన మెత్తువె? చూడు మంచు భ్రూ
భంగ రటన్నిటాల తటవక్రివళి క్రమ విక్రమార్భటిన్. ౬౮౨

మ॥ ధనువున్ సజ్యముఁ జేసి ఘోరశరసంధానం బనూనంబుగా
ఘననిర్ఘోషము దిక్కులన్నలయ నిర్ఘాతప్రపాతంబుగా
ఘన ముద్యద్గతి వృష్టి ముంచు గరిమన్ గాళీ మహాదేవిపై
నినిచెన్ గోలలు ధూమ్రలోచనుఁడు నిర్నిద్రప్రతాపోగ్రుఁడై. ౬౮౩

గీ॥ కాళికాదేవి వాఁడేయు ఘనశరములు, ద్రుంచి గగన పథంబున ద్యుచరకోటి
జయ జయ ధ్వానములు సేయఁ జండకాండ, దండ భిన్నాంగుఁ జేసె నద్దనుజునంత.

ఉ॥ కావఁగ వేళ నుమ్మనుచుఁ గాళిని మింటఁ బురందరుండు సం
భావన సేయ రక్కసుని పైఁ బటుకాండము లేయ వాఁడునున్
బోవక పైపయిన్ విశిఖముల్ పరఁగింపఁగఁ బోరు ఘోరమై
దేవచయాద్భుతావహతఁ దీవ్రతరంబయి చెల్లె నయ్యెడన్. ౬౮౪

సీ॥ భయద బాణాబాణి పరిబల ఖడ్గాఖడ్గి, చటులకుంతాకుంతి కుటిల మగుచుఁ
బటురథారథి పరిస్ఫుటగదాగది విశం,కటకచాకచి భయోత్కటము నగుచు
ముద్గరాముద్గరి ముసలాముసలి కృపా,ణాకృపాణి ప్రచండతర మగుచు
జ్వలిత శూలాశూలి సరయ చక్రాచక్రి, రౌద్రదండాదండి రచిత మగుచుఁ

గీ॥ గాళికాధూమ్రలోచనాఖిలవిలయ, కాలకాలాగ్నికీలాతివేలసమర
చాలనము దేవదానవజాలములకు, నబ్బురమ్మలయాగుబ్బు లబ్బఁ జేసె.

ఉ॥ అప్పుడు రోషవహ్ని విలయజ్వలనమ్మును బోలెఁ గ్రమ్మఁ దే
రుప్పరవీధిఁ దార్చి చటులోగ్రనిశాత శిలీముఖంబులన్
గప్పుచు ధూమ్రలోచనుని గాటపుఁదేరు విపాటఘాటముల్
దొప్పఁగఁ ద్రోఁగ నేసి ధరఁ దున్మఁగఁ జేసెను నుగ్గు నూచమై. ౬౮౫

ఆ॥ అరద మట్లు గూల్చి యంబరం బగలంగ, నట్టహాసవిలసితాస్యయగుచుఁ
గాళిఁ జూచి రోషకనదక్షుఁడై యొండు, తేరిమీఁద నెక్కి దైవరిపుఁడు,

క॥ కాళికపై శస్త్రాస్త్ర,జ్వాలలు నిగుడింపఁ గనలి ఽ శరతతినిహతిం
గేలిశరాసముఁ దుంచి సు,రాళులు విస్మయము నొంద ఽ నని గర్జిలుచున్. ౬౮౯

శా॥ రోదోరంధ్రము నిండఁ గాళిక పున ర్దోర్దండ కోదండ భూ
నాదంబుల్ దివి ముట్ట నుజ్జ్వలకణ ఽ న్నారాచముల్ వేయ ని
ర్వాద ప్రక్రియఁ గూలె నొక్క మొగి శుంఽభచ్ఛుంభ సేనాసహ
స్రాదిత్యద్విపదావళుల్ భయదఝుంఽఝాధూతమేఘాకృతిన్. ౬౯౦

చ॥ అరదము గర్దభంబులు శఽరాసనమున్ వడి నుగ్గునూచమై
ధరఁదొరఁగించి సారథిని ఽ దర్ప మడంచి సురాళి మెచ్చఁగా
నరి ననిఁ దూలఁబుచ్చి విజఽయారవశంఖముఁ బూరగించి దు
ర్ధరనిబిడాట్టహాసమున ఽ దర్పముఁ జూపెను గాళికాంబయున్. ౬౯౧

గీ॥ విరథుఁడై గర్జలను వినుఽవీధు లగల, దండధరదండనిభగదాఽదండ మెత్తి
ధూమ్రలోచనుఁ డాహవోఽద్ధురత నిలిచి, కాళికాదేవిపై రాఁగఁ ఽగాంచి యంబ.

—• అంబికాదేవి ధూమ్రలోచనుని సంహరించుట— •

శా॥ కోపభ్రూకుటి నెమ్మొగమ్మున నతిఽక్రూరస్ఫురత్కాళరా
త్రీపారంపరి నీన, హుంకృతమునం ఽ దేవారినిన్ భస్మసా
ద్రూపుండై యిల రాల్ప, విచ్చె బలముల్ ఽ ఘోరానిలాధూతి నా
శాపారంబుల నంటఁగాఁ బఱచు చంఽచత్కాలమేఘాకృతిన్ ౬౯౩

గీ॥ అంబికాదేవి తామసు ఽ నసురు నణఁపఁ, గాళికాశక్తి సంతోషఽకలిత యయ్యె
ఋభుగణంబుల దివ్యదుంఽదుభులు మొఱసె, విరులవానలుగురిసె దేఽవిపయి నెలమి.

సీ॥ రణరంగ మెల్ల దాఽరుణకంకగృధ్రాది, పలల ఖాదనముల ఽ బహు సృగాల
సంచారములఁ బ్రేతఽసంకటంబుల రక్త, పంకమాక్షికరణఽఝుంకృతులను
శాకినీ డాకినీ ఽ సంరంభముల భూత, గణపిశాచధ్వాన ఽ కలకలములఁ
గరపాదనాసికాఽకర్ణ విచ్ఛేదన, క్రందన్నిశాచరాఽక్రందనముల

గీ॥ భీషణంబయి బీభత్సఽపృథుల హేయ, దురవగాహంబుగాఁగ నుఽత్సుకవిహార
సుందరంబగు వనకుంజఽమందిరమున, నంబికాదేవి విడిసె సైఽన్యంబు లలమ. ౬౯౫

క॥ హతశేషులైన రాక్షస, వితతులచే సమరవార్త ఽ విని శుంభుం డా
తత విస్మయంబు బెనఁగొన, నతుల క్రోధమున ననియె ఽ నసురావళితో. ౬౯౬

మ॥ తరుణిన్ దేరఁగ ధూమ్రలోచనుఁడు సోఽత్సాహంబుగా నేగి. యెం
దరిగెన్? సైనికు లెల్ల నేమయిరి? యేఽమయ్యెన్! సరోజాక్షి; శం

ఖరవం బౌకసమూర్చె బగిల్చె నది శంకాకారణంబయ్యె వి
స్తరలీలన్ రణవృత్త మెల్ల వినిపించం జెల్లు నా నంతటన్. ౯౮

ఉ॥ దానవచంద్ర! సర్వమును దథ్యముగా విను మాహవంబునన్
సేనలు భస్మసాత్కృతిని జెందెను డిందెను ధూమ్రలోచనుం;
డానతులాదిగా నసురులందఱు కాళికచే నడంగి రా
సేన యమానుషంబు విధిచేష్టయె కాక సతీకృతం బౌనే? ౯౯

గీ॥ విజయశంఖంబుఁబూరించి విడిసె నొండు, చోట రణభూమి హేయమౌచొప్పుఁదెలిసి
యంబికాదేవి తత్కర్మహర్షదుఃఖ, దంబు దేవాదిదేనవితానములకు. ౯౯

ఉ॥ ఏమని తెల్పవచ్చు దనుజేశ్వర! యంబిక యెక్కు సింగము
ద్దామపరాక్రమంబున మదస్ఫురితం బయి రాక్షసాళి ను
గ్గై మహిఁగూల నేచి జఠరాంతరముల్ పగిలించి మెక్క స
ర్వామరబృందముల్ గనఁగ నబ్బురమయ్యె రణాజిరం బొగిన్. ౨౦౦

సీ॥ మాతంగఘట లెల్ల మడిసె నొక్కుమ్మడి, రథికులతోఁగూడ రథములగలెఁ
జాపచుట్టుగఁ గూలెఁ జటుల తురంగముల్, భటసముత్కర మెల్ల భగ్నమయ్యె
బాణచక్రిగదాసి పరశుముద్గర భిండి,వాలాదులెల్లను వఱదఁగలసె
క్షతజవాహినులు నాకాగమ్యత వహించె, ధూమ్రలోచనుఁడు పెన్బూళిఁబ్రుంగె

గీ॥ విజయశంఖంబుఁ బట్టి దేవీసహస్ర, మలమి వెనువెంట రాఁగ నుద్యానవనికి
నంబికాదేవి చనియె దేవాళియంత, విరులవానలు గురిసె ద్యోవీథినుండి. ౨౦౧

చ॥ సచివులఁగూడి మాంత్రికవిచారము సేయుము సాహసంబుచే
నుచితముఁగూడి రాదు సమరోర్విని నొక్కతెయై పడంతి యి
ట్టి చతుర సాంపరాయముఁ గడిందిగ సల్పుట విస్మయంబు ది
వ్యచరితమై చెలంగె విధివద్ఘటితం బని యెంచఁగాఁ దగున్. ౨౦౨

సీ॥ బలభేది యాదిగాఁ బార్ష్ణిగ్రాహులై, సురబృందములు గొల్చిచుట్టు నిలువ
రాజసంబున నిల్చు నోజమాత్రమె కాని, కత్తిఁబట్టెడు వాఁడొకండు లేడు
అసహాయమై మృగేంద్రారూఢయై శూల, హస్తయై చరియించు నాహవమున
సాహసించుటగాదు సామంబు దానంబు, సలిపి యబ్బోటి వశమ్ము సేత

గీ॥ పాడిగాఁ దోఁచుచున్నది పరిభుఁడ వీవు, కార్యమెట్టో! యథారుచిగా గణింపు
మాకుఁ దోఁచిన యర్థ మిమ్మాడ్కిగాన, విన్నవించితి మికఁ జిత్తవృత్తియనిన.

ఉ॥ అంత నిశుంభునిన్ బిలిచి యాసురనాథుఁడు మంతనంబునన్
జింతయొనర్చి వింటివె ? విచిత్రకథల్ బలి ధూమ్రలోచనుం
డెంతయుఁ గాళికై కలననేపడి రూపఱె సైన్యమెల్ల దు
ర్దాంత మదీయసాహసవిధానమునన్ మడిసెన్ రణక్షితిన్. ౨౦౪

సీ॥ జ్ఞానవంతులకైన జ్ఞేయంబు దుర్జ్ఞేయ, మశనియైనను దృణంబగు నొకంట
యవసంబు నశనియౌ నంగన యొక్కతె, భండనంబున నిట్లు ప్రౌఢి నెఱపె
బలహీనుఁడైనను బలవంతుఁ డగునట్లు, బలవంతుఁడైనను బలిమిఁ దఱుఁగుఁ
గారణంబెట్టులు గాఁగలదో? చెలి, వచ్చుటఁ గన దైవవశము సుమ్ము
గీ॥ పిన్న పెద్దతనంబు రూపింప నీదు, బుద్ధి గౌరవ మదిగాన బోధసరణిఁ
గనుముకృత్యంబుమనకుసంగరమొయెందు, నేనియుఁబలాయనంబొమేలెఱిఁగికొనుము

ఉ॥ అన్న వచించు పల్కు విని యాసురనాథుఁడు శుంభుతోడ నే
విన్నప మాచరింతు విను వీరులు వైరులచేతిపోరులన్
వెన్ను మరల్చిపోవుటయు బీరపుఁబ్రౌఢిమ మానె? చూడు మా
యన్నన నెంతె? నేన సమరావనిఁ జెచ్చెరఁబట్టి తెచ్చెదన్. ౨౦౬

క॥ బలములతో రక్షోవర, కులములతో నరద మెక్కి కుంభిని యదరన్
జలమున నడచెద నాదో,ర్బలమున నొడిచెదను రిపులు బడలుపడంగన్. ౨౦౭

ఉ॥ తెంపునఁ బట్టి తెత్తుఁ బడఁతిన్ వశమందక యున్న నాజిలోఁ
జంపెదఁగాని నే మరల సంధ గణింపుము సంశయింపఁబో
కంపుము నన్ను నాజికి, మదాహవచాతురిఁ జూడు మీఁద దై
వంపుఁదలంపుచొప్పునఁ బ్రవర్తిలుఁ గాలగతుల్ జనాళికిన్. ౨౦౮

ఉ॥ ఏను జయించితేని భవ దీప్సితసిద్ధియె కాక యొండుఁగా
నైనను సాహసించి సమరావనికిన్ జని పోరితంబునన్
మానినిఁబట్టి తెమ్ము సురమండలి గర్వమడంగ; బోటిపై
దానవనాథ! యెత్తిచను దర్పము నీ కదియెంత వింతయే. ౨౦౯

చ॥ అవరజుఁ డిట్లు పల్క విని యగ్రజుఁడిట్లనెఁ జండముండులన్
బవరములందు నేర్పరులఁ బంపెదఁ దమ్ముఁడ? యేన్గుఁబంపఁగా
నవునె? శశంబుఁ బట్టుకొన నంగనపై నినుఁ బంపుటేల? యం
చవరజు మాన్చి సైన్యసముదాయసమేతులఁ జండముండులన్. ౨౧౦

గీ॥ అనికిఁ జని గర్వపర్వతా,ధ్యక్షులైన, యక్షినిటు పట్టితెండు తత్పక్షులైన
పింగలోచన కాళిక పీఁచమణఁచి, రండు కార్యంబును మహత్తరంబు సుండు.

## महाकाली




खड्गं चक्रगदेषुचापपरिघाञ्छूलं भुशुण्डीं शिरः शङ्खं संदधतीं करैस्त्रिनयनां सर्वाङ्गभूषावृताम् ।
नीलाश्मद्युतिमास्यपाददशकां सेवे महाकालिकां यामस्तौत्स्वपिते हरौ कमलजो हन्तुं मधुं कैटभम् ॥

THE GITA PRESS. GORAKHPUR.

ఉ॥ కామిని మీకు కైవసము ♦ గామియె గన్పడెనేని కార్ముకో
ద్దామ నిశాత సాయక వితానమునన్ రణపండితత్వగ
ర్వానయ మెల్ల మాన్పి సమరావనికిన్ బలిఁజేసి రండు మ
త్ప్రేమకుఁ బాత్రులన్ గనుఁడు ♦ భీమభుజాబల మెల్లఁ జూపుచున్. ౭౧౨

—• కాళిపైకిఁ జండముండులు యుద్ధమునకుఁ బోవుట •—

చ॥ తడయఁగ నేల? లెండని కుతూహలభావశవర్తిఁ జండముండులన్
గడువడి దైత్యసేనల నఖండపరాక్రమధిక్కృతారులన్
విడివడి వెంటనంటి కడువేగమె యంబికఁ బట్టి తెండు మీ
కడిమిఁ గనంగనౌ ననుచుఁ ♦ గయ్యపు మాటలు పెక్కు దెల్పుచున్. ౭౧౩

క॥ పంపినను జండముండులు, తెంపున రక్షోబలములు ♦ తెమలక నడువన్
గుంపుగొని భూమి యీనిన, సొంపున రణరంగతలముఁ ♦ జొచ్చిరి వారల్. ౭౧౪

ఉ॥ అచ్చట సింగ మెక్కి వకుళామ్రకురంటకచంపకాదిపు
ష్పోచ్చలసిక్తపేశలవనోర్వులఁ గేళివిహారచంక్రమిన్
వచ్చుచుఁ బోవుచున్న సురవారముతో మృదువాక్యసంగతుల్
ముచ్చటలాడుచున్న నవమోహిని నంబికఁ గాంచి రచ్చటన్. ౭౧౫

క॥ కాంచి తదీయ విహారో,దంచిత లీలానుభూతి ♦ కచ్చెరువడి వా
రచ్చెరుపఁ జని మొక్కుచు, నొచ్చెము లేనట్టి వినయ ♦ ముప్పతిలంగన్. ౭౧౬

వ॥ ఓ చిన్నదానా! సురబలార్దనుం డగు శుంభునిఁ దురాషాడ్విజయోద్ధతుం డగు నిశుంభుని నెఱుంగఁజాలక యేకాకిని యగు కాళికం దోడుఁజేసికొని జయింపం గోరుచున్నావు. స్వవినాశార్థంబుగా దేవతలు పేరేపించుచున్నవారు, స్వపర బలాబలంబు లెఱింగి కార్యం బొనర్పుము, పదునెనిమిది భుజంబులు గలవని గర్వించెదేని భుజంబులు నాయుధంబులు శ్రమప్రదంబులేగాని యైరావతకరచ్ఛేత్త యగు శుంభుని మెదుటఁ గార్యకరంబులగునే? వృథాగర్వంబు మాని దుఃఖనాశంబగు మద్వాక్యంబు వినుము. హేతుశూన్యం బగు నభ్యుదయంబు వాంఛింతురే? సందేహాయిత కార్యంబునందు వేత్తలు ప్రవర్తింతురే? ప్రత్యక్షఫలంబు లేక భావిఫలంబునకు వాంఛించుట పామరోచితంబు. శుంభునిం జెఱుపంజాలక దుర్బోధం బొనర్చిన సురలచే వంచింపంబడితివి. స్వార్థసాధకు లగు దేవతలబోధలు నీకు సుఖకరం బులు గావు. కార్యమిత్రులం బరిత్యజించి ధర్మమిత్రుల నంగీకరింపుము; చతురుం డును, శూరుండును, సుందరుండును, గామశాస్త్రవిశారదుండును, సర్వలోకేశ్వరుండును నగు శుంభునిన్ భర్తగాఁ గొని త్రిభువనసామ్రాజ్యం బనుభవింపు మని

దురుక్తులాడు చండునిం గని జగదంబిక మేఘగంభీరనినదంబుల గర్జించుచు నిట్లనియె. ౨౧౭

సీ॥ హరిహరాదులనైన ✱ నాత్మ మెచ్చనిదాన, మూర్ఖ! నాతో నిట్లు ✱ ముచ్చటింపఁ
జూతువే? శుంభనిశుంభుల నెఱుఁగనే, యిటువంటి దుర్మార్గు ✱ లెందఱేని
హతులైరి నాచేత ✱ ననురబృందంబులు, దేవకదంబముల్ ✱ దెగినవారు
నట్టుల దైత్యసంహారకం బగు కాల, మరుదెంచె వితథమా ✱ యత్నమునను
గీ॥ బనిగొనదు వీరధర్మంబు ✱ పట్టి యనికి, సాహసింపుము కీర్తి రక్ష్యంబుగాని
యొడలు రక్ష్యంబుగాదు నీ ✱ కొరులతోడ, నేల? నీ వీరధర్మంబు ✱ నెంచికొనుము.

కం॥ పలుచదువులఁ బని యేమిఁక, గలనం దెగి చనుఁడు మీఁదు ✱ గతికిన్ మీమీ
కల బంధువు లెల్లను మిముఁ, గలయంగలవారు కొలఁదికాలములోనన్. ౨౧౯

మ॥ ఎడ రిం కేటికి? మిమ్మునెల్ల ననిలో ✱ బృందారకశ్రేణికిన్
గను మోదంబుగఁ ద్రుంచినైతు సమరాకాంక్షన్ ననన్ దాఁకి యీ
యొడళుల్ వీడుఁడు నిశ్చయంబిదిసుమీ ✱ యూహించి నాతోడుతన్
గడిమిం బోరిన సద్గతుల్ గలుగు శంకన్ మాని పోరాడుఁడీ. ౨౨౦

కం॥ శుంభనిశుంభుల దోర్బల,జృంభణ మణఁగింతు శత్రుజితులై చనుఁ డా
జంభారిప్రముఖుల సం,రంభము నుల్లసిలఁజేతు ✱ రండిఁక ననికిన్. ౨౨౧

ఉ॥ పట్టుము కేలఁ గార్ముకము ✱ భండన భీకర వృత్తి వైరులన్
గొట్టుము భీతియేని రణకుంభిని నిల్వక పొమ్ము వీకమైఁ
గట్టలుకల్ జనింపఁగను ✱ గారులు ప్రేలెదు కాతరుండవై
నట్టులఁ దోచుచున్నయది ✱ యాత్మ యథామతి నిచ్చగింపుమీ. ౨౨౨

చ॥ మసలక లెమ్మటన్నను నమర్షము దొట్రిలఁ జండుఁ డాహవ
వ్యసనముచే ధనుర్ధ్వనుల ✱ నాకసమున్ బగిలింపుచున్ శరా
భ్యసనవిచిత్రకౌశలము ✱ నాజి నెలర్పఁగఁ జేయుచున్ లయ
శ్వసనమువోలె ఝాంకృతుల ✱ శంఖరవంబుఁ జెలంగఁజేయుచున్. ౨౨౩

చ॥ శరతతు లంబపైఁ బఱప ✱ శత్రువిఘాతుక కేళి వాహకే
సరియును గ్రోధఘూర్ణితవిశంకటవృత్తి నటల్ నటింప ను
ద్ధురతర గర్జితధ్వనులఁ ✱ దూటులు వుచ్చె నభంబు తత్పురం
దరముఖనిర్జరుల్ ప్రథనతత్పరులై చెలరేఁగి యార్వఁగన్. ౨౨౪

గీ॥ యక్షగంధర్వసిద్ధసాధ్యాదు లెల్ల, నింగి నన్యోన్యభయదనిర్ణిద్రసమర
చండకోలాహలములకు ✱ జంకువొడమి, తొలఁగి రంతంత దూరంపుఁద్రోవలకును.

గీ॥ చండికాచండులకుఁ జండశరకాండభయద,భండనము చెల్లెఁ బరిఘాకృపాణబాణ
ఖడ్గములఁ జండముక్తాస్త్రకాండ మెల్ల, నంబికాశరచూర్ణిత మయ్యె నంత.

ఉ॥ అసురుఁ డేయు బాణముల నన్నిటిఁ ద్రుంచి భుజంగసన్నిభో
ల్కాసమశస్త్రసంతతులఁ గప్పె నభంబు జగజ్జనిత్రి; వ
ర్షాసమయంబ బల్మిఁ శలభసంఘముఁ బోలి భటావళుల్ చెడం
గా సురవైరి చండుఁడును గాసిలఁజేసె శరాళి నంబికన్. ౨౨౮

— మహాశక్తి చండముండులను సంహరించుట —

సీ॥ భూనభంబులు నిండఁ బోరిఁబోరి సురవైరి, పఱఁగించు శరపరంపరల దేవి
కనలి భ్రూకుటి వక్రగతిఁ దెమల్పఁగ నందు, వ్యాఘ్రచర్మోత్తరీయంబుఁ గప్పి
గజచర్మపరిధానకలితమై ముండమా,లాంకితమై శుష్కమైన కొలను
పగిదిఁ బ్రచండంబు పరఁగ ఖడ్గంబును, బాశంబు నిరుఁగేలఁ బట్టి ప్రళయ
ఆ॥ కాళరాత్రిఁబోలెఁ గడు దీర్ఘమగు నాల్క, చాలనం బొనర్చి జఘనయుగము
భారమునకు శేషఫణిఫణారత్నముల్, రాల రొద్రి వెడలె రణమునందు.

వ॥ అమ్మహాశక్తి కహకహార్భటుల దనుజవీరులగుండె లగలంజేయుచుఁ గొందఱఁ గరంబులం బట్టి వదనంబున నిడుకొని నమలుచుఁ, గండలు పేవ్రులం బొడి సేయుచుఁ, బరిఘంబుల వ్రక్కలు సేయుచు, భిండివాలంబులఁ జెండుచు, నతి భైరవరణక్రీడావిహారంబు సలుపునెడ, విచ్చియు, నొచ్చియుఁ, జచ్చియు, నానాముఖంబుల హన్యమానం బగు నిజబలంబులం గాంచి చండముండులు బాణాసారంబుల దేవిం గప్పి సింహనాదంబు లొనర్చుచుఁ జెలంగుచున్నయెడఁ జండకరసదృశం బగు చక్రంబు దేవిపయిం బ్రయోగించి చండుండు సింహనాదం బొనర్చిన. ౨౨౯

ఉ॥ గర్జిలు చండదైత్యవరుఁ గాంచి మొగమ్మునఁ గోపతర్జనా
గర్జనముల్ చిగుర్ప సితకాండమునన్ దితిజుండు వేసియ నా
దుర్జయచక్రమున్ నిలిపి తోడుతఁ దీక్ష్ణశిలాజితాంబకో
త్సర్జనకేళి కాళి విహ్వాతం బొనరింపఁగ వాఁడు మూర్ఛిలెన్. ౨౩౦

కం॥ చండుఁడు మూర్ఛితుఁడై నడ,గొండ యొరఁగుపోల్కి నేలఁగూలినఁ దన త
మ్ముండు పడుటఁ గని యొడలున్, గుండియతో నొగిలి క్రోధఘూర్ణితుఁడగుచున్.

ఉ॥ క్ష్వేడితగర్జితంబుల నభేద్యధనూరుచి విద్యుదుద్ధతిన్
గ్రీడయుఁ బోలె ముండు శరవృష్టులఁ గాళికఁ దోఁగి యుచ్చల

ద్వ్యాడనిభాశుగంబులఁ దశదంబకముల్ ధర రాల్చి యీసునన్
దాడితుఁ జేసె నాజి నిశితంబగు నర్ధశశాంకపత్త్రిచే. ౨౩౨

క॥ అఱనెలకోలం బుడమిన్, దొఱఁగెడు రుధిరంపుఁబొరలు దొట్టఁగ నిల లే
కొఱగిన ముండునిఁగని యని, మొఱవెట్టుచు నంత సోఁకుసమూఁకలు విచ్చెన్.

ఉ॥ అంతట నింగి వేల్పులు జయధ్వనులన్ గడు సంతసించి ర
త్యంతము మూర్ఛఁ దేఱి నిశితంబగు దండధరోగ్రదండదు
ర్దాంతగదాగ్రహస్తుఁడయి దండి మగంటిమిఁ జండుఁ డాహవ
శ్రాంత బలంబునన్ దుమికి సవ్య భుజంబునఁ గొట్టెఁ గాళికన్. ౨౩౪

మ॥ తనుసంకోచము నొంది కాళిక గదాదండప్రహారంబు నా
యన్నఁ దప్పించి ధనుర్విముక్తమగు పాశాస్త్రంబు మంత్రోక్తకీ
లనముల్ దార్చి వడిన్ నిగుడ్ప నొడ లెల్లన్ బంధ సంయుక్తి నొం
దిస బద్ధుం డయి చండుఁ డుర్విఁబడ నుద్దిక్తాహవోత్సాహుఁడై. ౨౩౫

ఆ॥ మూర్ఛ దేఱి లేచి ముండుండు పటుశక్తి, కేలఁ గీలుకొల్పి కాళిమీఁదఁ
గవయ మంత్రకీలకంబున వాని ని,బద్ధుఁ జేసి పుడమిఁబడఁగఁ ద్రోసి. ౨౩౬

ఉ॥ చండుని ముండునిన్ శశకశాబములం బలెఁ గేలఁబట్టి యు
ద్దండతఁ ద్రిప్పికొంచు బలదర్పము లాఱఁగ నీడ్చికొంచు వే
ధోండము బీటలెత్తఁ జటులార్భటి చేయుచుఁ బెద్ద నవ్వు లొం
డొండఁ జెలంగఁ జండసమరోర్వి నటించెను గాళి హేలగన్. ౨౩౭

శా॥ కాలుంగేలు బిగంగఁబట్టి కరయుగ్మం బందు వ్రేలంగ నా
భీలప్రక్రియఁ ద్రిప్పుచున్ బులుఁగులన్ బీడించు భిల్లీవధూ
లీలన్ నల్పుచుఁ గాళి యంబకడ నల్గ్రేవల్ చెరన్ ద్రొక్కుచున్
నేలన్ వేయుచుఁ జండితో ననియె నిర్నిద్రప్రతాపోద్ధతిన్. ౨౩౮

ఉ॥ భండనయజ్ఞసిద్ధికయి పట్టితి నీ పశుయుగ్మముల్ జయో
ద్దండతఁ బ్రీతి వేల్పు మని దానవ వీరులఁ జండముండులన్
నిండిన వేడ్కఁ జూప నవనీతుల దైత్యులఁ జూచి వీరలన్
జెండుము పోవనీక సురసిద్ధికి నై వెఱపేల కాళికా! ౨౩౯

చ॥ అని వచియించు నంబఁ గని యాహవదోహల కాళి పల్కె నీ
దనుజుల హింస సేయుటకుఁ దత్పరఁ గాను రణాధ్వరంబునన్
సునిశితఖడ్గయూపములఁ జుట్టి బిగించి యథార్థవృత్తిచే
తను విశసింతుఁ జూడు మని దండధురీణ కృపాణపాణియై. ౨౪౦

చ॥ దనుజులకంఠముల్ దునిమి ॥ తదుధిరంబు గళాంతకుక్షిపూ
ర్ణనిచితమై తొలంకఁగ ఘనస్వనమ్ముం బొనరించి చండన
ర్తనములు సల్ప నంబికయు ॥ దర్పధురీణులు చండముండు లీ
యనువునఁ గూలు టెల్లనమరాళికి మేలొనఁగూడు టౌఁ గదా. ౨౪౧

ఆ॥ ఇష్టసిద్ధి యయ్యె ॥ దుష్టు లీ దనుజులు, చండముండు లిపుడు ॥ భండనమునఁ
బడిరి శుంభముఖులు ॥ పడపడి, గూలెద, రనుచు సూక్తు లిట్టు ॥ లాడికొనఁగ.

మ॥ హతశేషాసురవీరు లొక్కమొగి హాహాకారముల్ సేయుచున్
నతులై శుంభునిఁ జేరి పల్కి రతిదీనత్వంబునన్ దేవ! యి
ట్లతిభీమంబుగఁ జెల్లె భండనము, క్రోధాభీలమై కాళి యు
ద్ధతి సేనాంగము లెల్లఁ గూల్చి సమరాహంకారనిశ్శంకమై. ౨౪౩

ఉ॥ చండుని ముండునిన్ బొదివి ॥ సాహస విక్రమధుర్యమై సము
ద్దండత "డేగ పిట్టలను ॥ దన్నుకపోయిన రీతి" నీడ్చి యొం
డొండఁ గృపాణధారఁ దలలూడిచి రక్తముఁ గ్రోలె నొక్కరున్
దండిమగండు లేమి బలతండము లెల్లను జెండి వ్రేయుచున్. ౨౪౪

సీ॥ కరయుగ్మములు దెగి ॥ కావు కావు మటన్నఁ, బోనీక కొందఱ ॥ బొడిచిపొడిచి
చరణముల్ దెగిన నుర్వరఁ గూలు కొందఱఁ, గూరశూలంబులఁగుచ్చి క్రుచ్చి
రుధిరంబు గారంగ ॥ రోదనం బొనరించు, కొందఱ నురుమాడి ॥ కూల్చి కూల్చి
పరువెత్తి పోవంగఁ ॥ బట్టి కొందఱ నీడ్చి, నవ్వుచుఁ గండలు ॥ నమలి నమలి
గీ॥ మాంసపంకంబు నాయుధమకర మలక, శైవలంబు సితచ్ఛత్రి ॥ సైకతంబు
గాఁగ రుధిరాపగలు జాఱఁ ॥ గాళి చెలఁగి, తా నొనర్చెనురణరంగ ॥ తాండవంబు.

ఆ॥ ఆడుదానివలన ॥ నతివీరులౌ చండ,ముండ దైత్యవరులు ॥ ముగిసి రకట!
"జంబుకంబువలన ॥ శార్దూలయుగళంబు, గూలి"నట్ల దైత్యకుంజ రేంద్ర!

ఆ॥ కానఁ గావు మమ్ముఁ ॥ గాళికాభీతిచే, గుండె లవిసి చాల ॥ బెండువడితి
మాహవంబు ప్రళయ ॥ మనుకరించెను రణ, క్షోణి సర్వదనుజశూన్యమయ్యె.

ఉ॥ కాళిక శూలమున్ గొని జగద్విలయం బొనరింపఁజొచ్చె నిం
తేల? యుగాంతకృత్య మయి ॥ యేచి రణోర్వి నటింపఁజొచ్చెఁ బా
తాళముఁ బట్టిపోదము సతంబుగఁ బ్రాణము గల్గెనేనియున్
మేలగు వంశరక్షణము ॥ మేదిని సార్వజనీనమౌఁగదా. ౨౪౫

వ॥ దానవేశ్వర! యమ్మహాదేవి ప్రళయకాలరాత్రియుం బోలె సర్వక్షయంబునకు
సంకల్పించెఁ దదీయయానంబగు సింహంబును రణంబున విరాళించి దానవులం

గ్రుక్కంగొనియె; సానుజుండ వై నీవును నవ్వనితం గోరి సాహసించియున్న వాఁడవు; త్రిభువనకామినీసుఖోపలంభసంభావితుండ వగు నీకు నొక్క రంభోరూపరిరంభం బున సుఖారంభం బగునే? కులవినాశిని యగు నబ్బోటితోడి కూటమికిం బాటించి పుత్రమిత్ర కళత్ర బంధుసుహృద్విద్రావణంబునకు నుపక్రమింతుకే! కించిత్కరంబగు నర్థంబునకై మహాదుఃఖంబుఁ బ్రాపింపంజొచ్చె; విధివైచిత్ర్యంబుఁ గంటివే? భువనత్రయంబు జయించి యేకవీరుండ వగు నీకు నొక వధూటి వలన నపజయంబు సంప్రాప్త మయ్యెఁగదా! దిక్పాలకజేత వగు నిన్నుం బ్రార్థించి రణంబునకుం బిలుచుట దైవచోదితం బగు రహస్యం బని తెలియుము. తొల్లి పుష్కరంబున దేవతాపనం బగు తపం బొనర్చి ప్రసన్నుం డగు పితామహుని వేడిన వరం బెఱుంగుదు వే కదా! బోటుల జీరికింగొనక పురుషులచే నవధ్యుండ నగుదు నని యనుటం దలంచి హంతుకామయై సర్వసంహారకారిణియు, సర్వశక్తి సమన్వితయు, నజేయయు, నక్షయయు, నిత్యయు, సర్వజ్ఞయు, వేదమాతయు, గాయత్రియు, సంధ్యయు, సర్వగుణాలయయు, సగుణనిర్గుణయు, సర్వసిద్ధిప్రదయు నగు తామసశక్తి సర్వేశ్వరి యావిర్భవించె నని యెఱింగి వైరంబు పరిత్యజించి శరణం బర్థింపుము, నిన్నుం బాలింపంగలదు, తదాజ్ఞాకరుండ వైతివేని కులంబు సంజీవితంబగు. హతశేషులు జీవింతు రనిన వారలం జూచి శుంభుం డిట్లనియె. ౭౪౯

ఉ॥ భంగమునొంది మీరు రణబాధితులై భయమొందినారు నీ!
చెంగటి కేల వచ్చితిరి జీవనకాంక్ష వసింపఁ డెందునే
నిం గనఁగా జగంబు మది నిక్కముగాఁ దెలియంగ దైవ సం
సంగమునన్ రహించు సురసంఘము లెల్లను దైవబద్ధముల్. ౭౫౦

కం॥ దైవాధీనము లోకము, దైవవశంబుననె విబుధతండము లెల్లన్
గేవలసుఖదుఃఖంబుల,చే వర్తించెదరు వేఱ చెప్పఁగనేలా. ౭౫౧

చ॥ హరియు హరుండు బ్రహ్మయును నగ్నియుఁ జంద్రుఁడు భాస్కరుండునున్
వరుణుఁడు శక్రుఁడున్ ధనదవాయుముఖుల్ మది నెంచ దైవత
త్పరత వసింతు రెల్లరకు భావిఫలానుభవంబు దప్పునే?
మరణము నుద్భవంబు క్షితిమండలి భూతనిసర్గమే గదా. ౭౫౨

చ॥ తన సుఖదుఃఖభీతిఁ గులధర్మము దప్పునె? ధీరుఁ డెచ్చటన్
మనుజులకున్ విధీప్సితము మానునె? కాలగతిం బొసంగు బ్ర
హ్మను హరినిన్ శివున్ విధి శుభం బశుభంబును జెందఁజేయదే?
మనుజు లనంగ నెంత? సురసంఘమండలికిన్ గతి దప్పిపోవునే. ౭౫౩

ఆ॥ ఏను సట్ల కాలకేమిాక్షించి వకుఁడనై, స్వకులధర్మకీర్తిసంగ్రహముల
జయమొ? అపజయంబొ సంతరింపఁగఁబోవ, నగుదుఁగాక! మేను లక్ష్యములె.

ఉ॥ ఆటది భండనమ్మున నహంకృతి రమ్మని పిల్వఁ బందనై
యోటమి కాందిశీకత నరాయో! చిరజీవుఁడ నౌదు నొక్కొ? నేఁ
బోటరినై జగత్త్రయిని భూరియశంబున నింపి నేఁడు; కుం
దేటికి వేఁటకాఁ డెచట నేనియుఁ దాఁ బరుగెత్త వింటిమే? ౭౫౫

ఉ॥ కొట్టెద దేవకోటులను గూల్చెద శక్తులఁ గామచారిణిఁ
బట్టెద నవ్వధూటిని "శుభం బనుభోగ్య"మటంచు నెంచి నేఁ
గట్టెదఁ గమ్మ, ప్రాణులకుఁ గాలగతుల్ భువిఁ దప్పవచ్చునే?
మట్టెద భీతచిత్తులను మార్గమ్మగమై దల యెత్తకుండఁగన్. ౭౫౬

గీ॥ కార్యయత్నంబుఁ జేసెడి ఘనుల కెల్ల, దైవవాదంబు యుక్తియుక్తంబు గాదు
ఉద్యతుఁడు గాకయున్న నీయుర్విఁ గామ, సిద్ధి గాంచునె తెలియంగ నెల్లదొక్కొ!

ఉ॥ కాతరు లిట్లుపల్కుటయె కాని జగంబున భావ్యమెల్లఁ జే
సేఁత ఫలింపకుండునె? యిసీ! బలవంతము దైవమందు రా
రీతులు మూఢనై జములు ధృష్టులు మెత్తురె? వారు వారు స్వ
స్వాతత బుద్ధిచోదితమతానుసృతిన్ వచియింతు రెంతయున్. ౭౫౮

గీ॥ దృష్టమౌనె యదృష్టమెంతదేని మూర్ఖ, జనులు వెలిచుటయేగాని జగతిఁ గార్య
యత్న మెడలిన సంసిద్ధియగునె! పనుల, సోద్యముఁడెకాఁడె సిద్ధిసంస్యూతుఁ డరయ.

ఉ॥ ఏయెడ యత్నశూన్యుఁ డయి యిష్టము నొందెనటంట "కాకతా
లీయము" దేశకాలములు లెక్కిడి శత్రుబలాత్మశక్తులన్
బాయక యాత్మనెంచి యనపాయకృతక్రియుఁడై నఁ గార్యని
శ్చాయకుఁడై ఫలంబు గను సందియ మందఁగ నేటి కిందుకున్. ౭౬౦

కం॥ అది గావున భండనమున, మదవతి నిర్జింతు విజయమరణంబులకున్
బదపడి వెనుఁజూతునె? మ, ద్విదితము మత మిదియె యింక వేయును నేలా. ౭౬౧

మ॥ అని శుంభుండు రణైకనిశ్చయత ఘోరాకారుఁడై రక్తబీ
జుని రావించి రణోద్ధతిన్ గఱపి యస్తోకప్రతాపాఢ్యతన్
జని నీ దోర్బలమెల్లఁ జూపి సురహర్షంబెల్ల మాయించి య
వ్వనితారత్నముఁ బట్టి తెమ్మనిన నవ్వార్త మదిన్ జొన్పుచున్. ౭౬౨

## —• ర_క్తబీజుని యుద్ధము •—

సీ॥ దానవాధీశ యఽనూన రక్షస్సైన్య, సంవృతాంతికుఁడవై § స్వల్పమైన
కార్యంబునకు నింత § కళవళింపఁగనేల, తెలవ నేఁజని పట్టి తెత్తుఁ జుమ్ము
మసలెనేనియుఁ బోర § మర్దింతు మద్ఘోర, సమరచాతురిఁగాంచి § సంతసిలెదు
దాస్యభావమున నీ § దండ నుంచెదను వే,దండయాన నటంచు § దండ మిడుచు

గీ॥ ర_క్తబీజుండు గదలె ఘోఽరప్రశ_స్త, దానవానీకినీ మహోఽద్దామశత స
హస్ర సంవృతుఁడై యాహవావితథర,థాధిరోహణ మొనరించి § యవని గదల.

మ॥ బలవత్కార్ముక బాణపాణి యయి శుంభద్గర్జితధ్వాన ని
స్తుల సంరంభ మదంభమై మెఱయ నఽస్త్రోకకుధ్రిధా భీషణో
జ్జ్వలదృగ్రోచులు ర_క్తవాహినులఁ దాఽర్వ ర_క్తబీజుం డొగిన్
విలయాంభోదము నాఁగ మేని రుచులన్ § జీఁకట్లు గ్రమ్మన్ జనెన్. ౭౬౪

చ॥ చని రణభూమి హేయ మని § శైలవిహారవిలోలమై ఘనా
ఘనగత శంపవోలె వనికాకుసుమద్రుమశీతలానిల
మ్మున మెయిచెమ్మటల్ సొగయ § ముందఱఁ గాళిక ముచ్చటింపఁ జ
ల్లనగు తమాలకుంజమృదుఽల స్థలి వ_ర్తిలు దేవిఁ గాంచుచున్. ౭౬౫

గీ॥ ర_క్తబీజుండు సైనికోఽగ్రప్రచండ,రథరథాంగ ధ్వనులు పుష్కరమ్ము నొరయ
గట్టి నలుమూలలును జుట్టి § కదన భయద,నినద కోలాహలముల బంఽదికిఁ జొరంగ

సీ॥ కులమహీధ్రముల గఽగ్గోలు సేయుచు మహా,పంచాస్యబృందముల్ పరువులె_త్త
మదవద్దిశాదంతిఽమండలమ్ము నిబద్ధ, శృంఖలల్ దెగఁద్రొక్కి § చెదరి పాఱ
ధరణీప్రకంపనోఽద్ధతిఁ గుర్రింగు భుజగరా,జన్యఫణామణుల్ § ఝల్లురనఁగ
స్ర_స్తవేధోండరంఽధ్రవినిర్గతావర,ణాంబువుల్ వర్షాగఽమా_ప్తి నెనయ

గీ॥ దానవానీక మెల్లను § దందరింప, నాదితేయప్రతానంబు § హర్ష మెనయ
నెక్క సింగంబు నింగికై యెగసి దుముక,విజయశంఖంబు మ్రోయించె విశ్వజనని.

చ॥ తన రణచండిమంబునకు § దర్పము దూలి నిశాటులెల్లఁ జ
య్యనఁ బరువె_త్తి పోవుదు రఽటంచనియో? జయశంఖ మొ_త్తె ని
వ్వనిత యటంచు నవ్వుచు నఽవారణ నిర్భయవృ_త్తి నంబికా
వనముఁ జొరంగఁ బాఱి నుడుఽవన్ దొడఁగెన్ మృదువాక్చమత్కృతిన్. ౭౬౬

చ॥ నను వెఱపించెదే? విజయఽనాదమునన్ బళి! ధూమ్రలోచనుం
డని మదిలోఁ దలంచితివె § యాహవదోహలు రక్తబీజునిన్

వినవా కొ? సంగరేచ్ఛ మది వేచిన సజ్జవు గమ్ము, దుర్జయుం
డను గనె దీవు నాబలము డాయుము పట్టుము కేల విల్లొగిన్. ౨౧౯

వ॥ దేవీ! యేనొకనికిం భార్యగాఁ బ్రహించఁగాను, నీవు వృద్ధసేవ యొనర్చి నీతి శాస్త్రంబు లభ్యసించి యర్థవిజ్ఞానంబు గలిగి విద్వద్గోష్ఠుల నడసన్నదానవునై సాహిత్య తంత్రి విజ్ఞానంబు చొప్పడెనేని పథ్యంబగు నావచనంబు వినుము. నవ రసంబులలోన శృంగారశాంతరసంబులు ముఖ్యంబు లగు, నందు శృంగారంబు రాజగు. మనుష్యోరగ రక్షోగంధర్వ యక్షకిన్నర పశ్వాదిచేతనంబులకు స్థావ రంబులకు నుపాస్యంబు. విష్ణుండు సిరితోడను, శంకరుండు పార్వతితోడను, చతు రాననుండు సావిత్రితోడను, వృక్షంబులు తీఁగెలతోడను, మృగంబులు మృగాంగ నలతోడను, ఖగంబులు ఖగవధూటులతోడం గలసియుండుట యెఱుంగవే? సర్వప్రాణులు సంయోగరసికంబులు గావే? అప్రాప్తభోగు లగు కాతరులు దైవవంచితు లగు మూఢు లని యెఱుంగుము. సంసారవిరహితులు వంచకులచే వంచింపఁబడి రని కనవలయు, త్రిభువనాధిపతి యగు మనోభవుండు రాజై యుండ జ్ఞానవైరాగ్యంబుల కవకాశంబు గలదే? కామంబులందు మతి గలుగంజేసి మహాబలుం డగు శుంభునిం గాని నిశుంభునింగాని యొక్కని జేకొని కాంతునింగా బరిగ్రహింపుమని కొంతనుడివి రక్తబీజుం డూరకున్నఁ గాళికాచండు లపహసించుచుఁ గ్రోధారుణలోచనంబులను జూచుచుం జూచుచున్నయెడ మేఘగంభీరధ్వానం బున నంబికాదేవి యిట్లనియె. ౨౨౦

## —• రక్తబీజుండు మూర్ఛనొందుట •—

మ॥ మునుపే దెల్పనె మందబుద్ధివయి యిమ్మూర్ఖంపుఁ బల్కుల్ వికత్థనతం బల్కెదు దూతయోగ్యములుగాఁ దర్కించె దిమ్మాడ్కి; నీ
దనుజాధీశుని కేలు వట్టుదునె? దుర్దాంతప్రతాపోద్ధతిన్
నను సంగ్రామమునన్ జయించినఁగదా నాథుండు నాకయ్యెడిన్. ౨౨౧

క॥ శుంభనిశుంభులతో నిర్దంభముగాఁ దెల్పు సమరతలమున మద్దో
ర్జృంభణ మణఁగించిన సుభగంభావుకు వల్లభునిగఁ గైకొందుఁజుమీ. ౨౨౨

మ॥ ఇదియే నాదుప్రతిజ్ఞ, పల్కుపని లే దిమ్మాడ్కి ధీరోద్ధతిన్
గదనారంభ మొనర్చి నన్ గెలిచి నా కైఁబట్ట మేలొందు నం
చిది నామాటగఁ దెల్పు వానికిఁ, దదీయేష్టంబు సిద్ధింపఁగా
నదియే, తక్కనలేదు, పోరుము జయంబాశాస్యమానేనియున్. ౨౨౩

ఆ॥ సాధ్వసమ్మువలన ! సంశయించెదవేని, పొందు నీవు దొరలు ! భుజగనాథు
భువనమునకు, లేక ! పోరెదేని దలంచి, కేల విల్లు పట్టి ! క్రీడసల్పు. ౭౭౪

ఉ॥ శూరుఁడనైతి వేని వెనుఁ జూడక లెమ్మన, క్రోధభీషణుం
డై రహి రక్తబీజుఁడు దుఃరంత కృతాంత కరాంత దండదో
స్సారముతో శరంబుల నసంఖ్యముగా జగదంబ మెక్కు కం
ఠీరవరాజగాత్రము నుడింబడ నేసి కలంచి యార్చినన్. ౭౭౫

ఉ॥ నింగి భుజంగమాకృతుల ! నిండి పయిం జనుదెంచు దానవా
భంగశరవ్రజంబుల నపాస్తములై చన నిందిరాకార్ముకో
త్తుంగనిజాంబకాసనవిధూతపృషత్కకదంబకంబులన్
మ్రింగిన పోల్కి నన్నిటి నమేయత రూపఱఁజేసి దేవియున్. ౭౭౬

శా॥ ఆకర్ణాంతముగాఁగ విల్ దిగిచి ధారాంభోదమున్ బోలి య
స్తోకప్రక్రియ రక్తబీజుని సమిద్ఘోరాశుగవ్రాత రే
ఖాకృత్తవ్రణగాత్రుఁ జేయఁ బెను మోహం బొంది యత్తేరిపై
వీఁకం బాసి పడెన్ సురారి బలముల్ ! భీతిన్ దెసల్ ద్రొక్కఁగన్. ౭౭౭

ఆ॥ అఖిల సైన్యములకు ! నాదేశ మొనరించి, భండనంబు చాటఁబనిచి శుంభుఁ
డంబరంబు పగుల ! నార్భటించుచు ఘోర, సమరయాత్ర వెడలె ! సాహసించి.

—। కాళికాదేవితో శుంభుండు యుద్ధమొనరించుట ।—

సీ॥ అంగ వంగ కళింగ ! బంగాళ సౌరాష్ట్ర, ముఖ దేశముల సోఁకుమూఁక లెల్లఁ
గదలి రాసాఁగిరి ! కాలకేయ నివాత, కవచకాంభోజులు ! గ్రిచ్చుకొనిరి
సప్త సాగర మధ్య ! సలలిత ద్వీపాంత, రాంతర దైత్యాళు ! లందుకొనిరి
గిరి గుహా మందిరోత్కీర్ణ రక్షోధ్వజుఁ, బలవితానము లెల్ల బలసి నడచెఁ

గీ॥ త్రిభువనంబులఁ గలయట్టి ! దేవరిపులు, బహుతరాక్షౌహిణీ సముద్భట కఠోర
భయదచతురంగములు వెంటబలసికొలువ, శుంభుఁ డెదిరించెనాహవోజ్జృంభణముగ.

మ॥ జగ మెల్లన్ దితిజావృతంబుగ మహాసంరంభుఁడై శుంభుఁ డ
త్యగణేయాహవదోహలకుత్రిత బలాహంకార మేపార శా
క గనుంగొంచు సురాధిపుల్ దెలుప శంకం బాయుఁ డిష్టంబు సి
ద్ధి గొనెన్ దైత్యకులదుర్మూల మగు నీదెబ్బన్ దెగన్ జూచెదన్. ౭౮౦

ఉ॥ వేర్వియుఁడు ఘంటికల్ సమరభేరి ధణం ధణ నాద ఝాంకృతుల్
నేయుఁడు శింజినీనినదశౌర్యదనంతముగా ధనుష్ప్రకాం

డాయతహస్తులై నిలువఁ డంచు నమర్త్య బలాధినాథులన్
బాయక యెచ్చరించి పటుభాంకృతిఁ జిందముఁ బూరగించుచున్. ౭౮౧

క॥ కంఠీరవ మెక్కి జయా,కుంఠగళోద్భూత నిసదకోలాహల ము
త్కంఠ నొనర్చుచు మధు వా,కంఠంబుగఁ గ్రోలి చండి కదలెనని కొంగిన్. ౭౮౨

మ॥ కదలెన్ గాళిక భండనంబునకు నుగ్రక్రోధ ఘూర్ణాయమా
నదళద్వహ్ని శిఖాకలాపకృతసన్నాహస్ఫురద్దృక్ప్రభా
స్పదసంక్షోభము దైత్యులన్ భసితసాత్కారంబు గావింపఁగా
విదితోత్సాహధురీణ మై వెలయ నావిఖ్యాత శౌర్యాఢ్యయై. ౭౮౩

ఉ॥ శక్తు లసంఖ్య మొక్కమొగిఁ జండిక మేన జనించి కోప సం
సక్త మహోగ్ర గర్జిత విశంకట దంత కటంకటధ్వనుల్
దిక్తటముల్ పగుల్పఁ బరిధీకృత లై పరదేవి చుట్టునున్
సోక్తుల యుద్ధనైపుణులు సూచన సేయుచు సాగి రమ్మెయిన్. ౭౮౪

సీ॥ చండికాహుంకార సహిత శక్తి కదంబ, గంభీర గర్జితాకలనములును
కాళికా రణ కేళి కౌతూహ లోత్క్రాంత, సద్ధికా స్ఫాలన స్వానములును
జయఘంటికా ఘోర శంఖనిస్వనధరా, భృత్ప్రతిధ్వానభీషణతలు
సిద్ధ విద్యాధరశ్రేణికా జయజయ, స్వస్తి వాచా ఘోషసరభసతలు

గీ॥ గ్రమ్మి దెసలెల్ల నిండి యుగ్రమ్ముగాఁగ, నింగి నెగయుచు సటలెల్ల నిక్కి చండి
సింహధోరణ మార్భటింపఁచిన నిశాట,కోటి ఘూర్ణిల్లె రణనిరాఘాటధాటి. ౭౮౫

ఉ॥ దానవు లెల్ల నొక్కమొగిఁ దారసమై పెడబొబ్బ లేయుచున్
స్థానకశుద్ధిచే ముసలచక్ర గదా శల భిండివాల నా
నా నిశితాయుధంబులు ఘనాఘనముల్ పెనువృష్టి ముంచు నే
ర్పాని జగజ్జనిత్రిపయి నుక్కున నేసిరి పెక్కుమూఁకలై. ౭౮౬

కం॥ అద్దారుణ సమరంబునఁ, దద్దానవ శరనిపాతతాడన నిలువన్
బెద్దయు నోర్వక సురవరు, లద్దేవిన్ జేరి శరణ మర్థించి రొగిన్. ౭౮౭

వ॥ అట్టి సమయంబున బెట్టుదట్టించి బెట్టిదంబుగ సింగంబునుం దుమికించి భండనంబు నకుం జండి గండుమిగులు నవసరంబునఁ ద్రిభువనంబుల నే యే నిర్జరులకు నేయే నామంబుల నే యే రూపంబుల నే యే వాహనంబుల విహారంబులు సుప్రసిద్ధంబులో తన్నామరూపవాహనంబులఁ దద్దేవతలు శక్తిరూపంబులై సాక్షసూత్ర కమం డలులై వరటావాహనంబున బ్రహ్మాణియుఁ జక్రగదాధరయై గరుడవాహనంబున వైష్ణవియును, త్రిశూలార్ధచంద్రాహివలయభూషితయై వృషారూఢ యగు శాంక

రియును, శక్తిధారిణియై మయూరవాహనంబునఁ గౌమారియు, వజ్రహస్తయై ధవళమాతంగవాహన యగు పులోమజయు, సటావృతయై సూకరాకారయగు వారాహియు, జగద్భయంకరయై నృసింహాకారంబున నారసింహియు, దండహస్తయై మహిషారూఢ యగు యామ్యయును, పాశహస్తయై మకరవాహనంబున వారుణియు, మదోత్కటయై నరవాహనంబునఁ గౌబేరియు, నిట్లుంగు ననేక శతసహస్ర సంఖ్యాక లగు శక్తులు భూమియు నాకసంబును సందీక మునరి కొని చండికాదేవిం జుట్టికొని తదాజ్ఞావశంబున భండనంబున కభిముఖ లగుటయు, సురలు సంతోషంబునం బొదలిన నాసురవర్గంబు భయకంపితంబయ్యె నయ్యెడ.

సీ॥ సమరోన్ముఖంబైన ♦ శక్తిబృందంబుచే, నావృతుండై యనర్గలాత్ముఁడంతఁ
జండికాదర్శనోత్సాహియై చనుదెంచి, యెడసేయ కసురులనెల్లఁ ద్రుంచి
శుంభనిశుంభాదిశూరుల వధియించి, దైత్యబలాభిమర్దన మొనర్చి
శక్తిసంఘము తమసన్నివేశములకు, నరిగెడుఁగాక దేవాళి యింక

గీ॥ యజ్ఞభాగంబు లార్జించు ♦ నఖిల విప్రు,లధ్వరంబులు చేసెద ♦ రవనిజనులు
సంతసిల్లంగ నుత్పాతసమితు లెల్ల, శాంతినొందును లోకమ్ము సంతసించు. ౭౯

ఉ॥ వారిదముల్ కృషీవలుల ♦ వాంఛితముల్ ఫలియింపఁజేయు దు
ర్వారములైన యీతులు ధరం దొలఁగుఁ గడ వేల ? దుష్టదే
వారుల సంహరించి విజయాంచితవై జగమేలికొమ్ము భూ
భార మడంప నీదె కద ? ♦ భారము వేల్పులఁ గావఁగాఁ దగున్. ౮౦

గీ॥ అనుచు నీరీతి దేవితో ♦ నానతిచ్చు, నెడఁ దదీయాంగమున శక్తి వెడలె ఘోర
భీషణాతిప్రచండయై ♦ పెక్కుగర్జి,తము లొనర్చుచు నాహవోత్సాహ మూని.

చ॥ వెడలి మహేశుఁ గన్గొని ప్రవీణుఁడ వీవు సురారిచెంతకున్
వడిఁ జని దూతవై కుశలవార్త వచింపుము మన్మథార్తుఁడై
బడలినవాఁడు తమ్ముఁడును ♦ భానజమత్తుఁడు గాన వారి కీ
నడి వలదంచుఁ దెల్పి తగ ♦ సన్మతిఁ బుట్టఁగఁ జేసి కావుమీ. ౮౧

—၊ శుంభునకు శంభుఁడు నీతులు చెప్పుట ၊—

సీ॥ చిరసంపదలు సమార్జించి వైభవ ధురం,ధరుఁడౌచు విక్రమోద్దామ భీమ,
సమర సాహస ధైర్యశౌర్య చాతుర్యాది, గుణములు గల్గి యకుంఠ గరిమ
వర్తించువాఁడు తద్వ్యథ మేల ? మంకువా,నికి బుద్ధిగఱపి యనింద్యమతిని
పాతాళమున కేగి ♦ బ్రతుకుమంచని తెల్పి, బోధించిరమ్ము భూభువనమునను

గీ॥ నిలిచినను జావు దప్పదు దనిక్కమనుచు, మనసు పుట్టంగఁ జెప్పు ముమ్మాటికేను
నిశ్చయమ్ముగఁ దెల్పితి నిఖిలజనులు, సుఖులెయౌట మదీయహృత్సుఖము దేవ.

చ॥ సురలకు యజ్ఞభాగములు చొప్పడు శక్రుఁడు రాజ్యమేలు సు
స్థిరత జనమ్ములెల్లను బ్రతిష్ఠితులౌదురు గాన వారికి
వ్వరుసను బోధఁగొల్పు మని పంపిన ఫాలవిలోచనుండు ని
ర్జరరిపు శుంభుఁ జేరఁ జని సమ్మతిచేఁ దన రాకఁ దెల్పుచున్. ౭౯౪

వ॥ శుంభుని సభాభవనంబుఁ బ్రవేశించి సముచితంబుగా నిశ్చయోక్తుల దేవి సందేశంబు తేటపడ నిట్లని వినిపింపం దొడంగె. ౭౯౫

గీ॥ బ్రతికియుండిన సిరు లెన్ని పడయరాదు, తరలిపొం డెల్లవారు పాతాళమునకు
ధరవసించితి రేని మద్దండనమున, దండధరుదండఁ జేరెద రొండె కేల. ౭౯౬

మ॥ సమరాకాంక్షఁ బెనంగఁ జూచిన వృథా సందేహ మింకేల? దు
ర్దమ సంరంభముతో నెదుర్కొనుము మద్బాహాధనుర్ముక్త చం
డ మహోద్దండశరావళిన్ దునిమి తోర్దన్ జంబుకశ్రేణికిం
బ్రమదోత్సాహముఁ గొల్పుదున్ భవదసృఙ్మజ్జాస్థిమాంసంబులన్. ౭౯౭

గీ॥ కలఁడు ప్రహ్లాదుఁ డతలలోకమున మీకు, సఖుఁడు తత్సఖ్యమున సంతసమ్ముగలుగఁ
గలుగు మీయెడ మత్కృపాకలిత దృష్టి, వింటిరేనియు మీదాన వెఱవనేల.

మ॥ ఇది నామాటగఁ దెల్పుమంచనియె మీ యిష్టంబుఁ దెల్పుండు పో
యెదరో? పోవరో? రెంటిలోన నది మీయిష్టంబు? పోకుండినన్
గదనోత్సాహధురీణతన్ గదలుఁ డింకన్ శంక మానుండు దు
ర్మద విధ్వంస మొనర్తు నంచనియె నిక్కమ్మైఁ బల్కుఁడీ? రక్కసుల్. ౭౯౯

చ॥ నిటలవిలోచనుం డిటులు నిశ్చితరీతి వచింప దానవుం
డిటులు వచించె "నీ పడఁతి యెంత మదోద్ధుర" యంచు నెంచి యు
త్కటబలశాలులైన నరకంటకులం గని పల్కె వింటిరే?
కుటిలమనస్క యాఁటది యసంకుచితమై వచియించు వైఖరుల్. ౮౦౦

ఆ॥ ఇంతవాని దూతకృత్యంబునకుఁ బంపె, మత్తయగుటఁ గాదె మాటలేల?
తడయవలదు దండుదరలి దానిని జుట్టి, పట్టుకొనమి శూరపథముగాదు. ౮౦౧

### — శుంభుఁడు యుద్ధమునకుఁ బోవుట —

ఉ॥ లెండని యాజ్ఞ నిచ్చి తరలెన్ సమరమ్మునకంచుఁ దెల్పుమీ?
కొండిక కంచుఁ బల్కె పటుకోపమునన్ నిటలాక్షు నంపి శుం

భుండు కృతాట్టహాసుఁ డయి ♦ భూతతతుల్ బెగడంగఁ బట్టి కో
దండము; శింజినీరవవిశదారిత పద్మభవాండభాండుఁడై. ౮౦౨

వ॥ తరలుటయు. ౮౦౩

సీ॥ అంతరిక్షం బకాండడాభ్రనిర్ఘాతపాతములతో రక్తవర్షములు గురిసెఁ
గులశైలసహితమై ♦ చలియించి కుంభినీతలము కుమ్మరిసారె ♦ పోలుపుఁజూపె
దుర్దమ దుర్దినోద్ధురత గాఢతమమ్ము కకుబంతరముల నెల్లఁ గ్రమ్ముకొనియెఁ
బ్రతికూలమారుత ♦ ప్రసరణమ్ముల ధూళి, పాళికల్ సందీక ♦ బలువుకొనియె

గీ॥ వరడు లఱవంగఁ జొచ్చె నశ్వముల వాల,మూలములు నిప్పుచిద్రుపలు గ్రోలఁజొచ్చె
శుంభుఁ డాహవజృంభణారంభముననుఁ, గదలునప్పుడు దానవుల్ ♦ గదలి చెదర.

గీ॥ దుర్నిమిత్తావలోకన దురవగాహ, సాహసమ్మున నాహవోత్సాహి యగుచు
నడచె శుంభుండు ఖరఖురానమిత భూతతతధరాచక్ర మగు రథోత్తమము నెక్కి. ౮౦౪

ఉ॥ వంచిరి విండ్లు దానవు లవారిత గర్జిత ఘోషయుక్తిచే
ముంచిరి బాణవర్షముల ♦ ముష్కరదుష్కరలాఘవంబులన్
బెంచిరి దేహముల్ ప్రళయ ♦ భీకృత వారిధరావధీరణల్
నించిరి దిక్కటాహముల ♦ నిస్తులశింజిను లుల్లసిల్లఁగన్. ౮౦౫

సీ॥ సురవరూథినులెల్ల ♦ సోఁకుమూఁకల యంపసోఁకోర్వక భరింబు ♦ సొచ్చికొనియె
శక్తిపతాకినీ ♦ చరణప్రసారంబు లనవకాశస్ఫూర్తిఁ గొనుచు నిలిచెఁ
గాళికాకరశూలకంపనంబులు కోశ, సంగోపనక్రియాసరణిఁ గనియె
దేవికాధోరణోద్దీప్త వల్గన జాతి, ధర్మానుకూల వర్తనలఁ బరఁగె

గీ॥ నిందు నందును సందును గొందు నెందు, సూది మొన మోపనందని చోప్పుగాంచి
నిండెఁ బద్మభవాండ కరండ మెల్ల, నాసురవరూథినీ పేరితాశుగములు. ౮౦౬

చ॥ ఉబుసుఁ గొనంగ రాదనుచు ♦ నొక్కట శక్తులు దేవసంఘముల్
గుబులుకొనంగ మోమునఁ జిఱుగుర్కొను లేనగవుల్ దళు క్కనన్
గుబుసము లూడు చిల్వ లనుకోఁదగు వాఁడి శరావళుల్ నిగు
డ్చి బలిమిఁజూపెఁ దద్వి శిఖశృంఖల లూడిచె దేవి యంతటన్. ౮౦౭

ఉ॥ అంతటఁ గాళి శూలమున ♦ నాసురసంఘముఁ గుచ్చి యొడ్చుచున్
దంతములన్ బెకల్చి నఖతండములన్ విదళించి మాంస; మం
తంతలు కళ్ళు చేసికొని ♦ యాకలి దీరఁగ మెక్కిమెక్కి దు
ర్దాంతరణోత్సవంబునను ♦ దాండవచండిమఁ జూపె నమ్మెయిన్. ౮౦౮

శా॥ దేవీవాహనసింహరాజము సముద్దీవ్యజ్జటాఝూటముల్
ద్యోవీథిన్ దెలినిగ్గు లీన నఖనిర్ఘాతాళిన్ సురారాతులన్
బ్రేవుల్ ద్రెంపుచుఁ గండ లూడ్చుచుఁ బోరిన్ భీకృత్క్రియా పాటవ
మ్మావాసిం ద్రుటిఁ జక్కడంచె జగదేకాశ్చర్యచర్యారతిన్. ౮౧౦

ఉ॥ హంసతురంగ మెక్కి కమలాసనవల్లభ ఘోరరూపయై
మాంసలవృత్తిచేఁ దన కమండలుశంబరసేకవృష్టులన్
హింసకబృందమున్ గెడపె నెక్కుడు బీరము నొంది శాంబరీ
శంసన మయ్యె రక్కసులఁ జాపము నమ్ములు లేక కూల్చుటన్. ౮౧౧

ఉ॥ శంకరురాణియున్ వృషభసైంధవ మెక్కి రణావనిన్ నిరా
తంకత శూలమున్ గొని నితాంతమదోద్ధతదానవావళిన్
దుంకుచు బెట్టు గ్రిచ్చె సురతూర్యము లాకస మంటి మ్రోయ ని
ర్వంకలఁ జాఱనీక యఱవాయి మదిన్ జొరనీక వీఁకచేన్. ౮౧౨

మ॥ ఒక కేలన్ బెనుగొండ వోని గదచే నుద్దండయై యట్టులోం
డొకచేఁ జక్రముఁ బూని విష్ణురథపృష్ఠోల్లాససంక్రీడనో
త్సుకతన్ దానవులన్ దెరల్చె భయకృచ్ఛుండాహతిన్ దుండి కా
తుక మొప్పార ననంటులం జిదుము గంతుల్ చూపుచున్ వ్రేఁగునన్. ౮౧౩

మ॥ రజతాహార్యముఁ బోలు నేన్గుపయి ఘోరహ్రాదినీహస్తయై
నిజదీపప్రతిభప్రతాపపటుతానిర్ణిద్రరూషిన్ బులో
మజ దైత్యార్దనకాళరాత్రి యయి భీమప్రక్రియన్ జూపెఁ ద
త్సజయోల్లాసము చండికాంబ కజహాత్సమ్మోద మిచ్చెన్ గడున్. ౮౧౪

శా॥ వారాహీరణశక్తి చంక్రమము దుర్వారప్రతాపాఢ్యతన్
ఘోరంబై పటుతుండదంష్ట్రికలచేఁ గ్రూరాసురాంగస్రవ
ద్ధారాసృగ్ఘరిణీఖురంబులు దిగంతంబుల్ వెసన్ బర్వఁగా
నారాత్రించరసేనలన్ జెలఁగె నాహా పుట్టఁగాఁ జేయుచున్. ౮౧౫

ఉ॥ దారుణదంష్ట్రికానఖవిదారితదానవచర్మమర్మదు
ర్వారతరోరురుద్ధరుధిరంబుల భూతపిశాచడాకినీ
వారముఁ దేల్చి యప్రతిమవైఖరి వీరరసంబుతోడ సం
ధ్యారుణితాంబరప్రతిమయై రణరంగ మెసంగె నెల్లెడన్. ౮౧౬

మ॥ శివదూతీకరశూలఘాతముల రాశీభూతులై కూలు దా
నవపుంజంబులఁ బ్రోవుఁ జేసికొనుచున్ జాముండయున్ గాళియున్

నవజృంభదుద్రిధిరాసవంబుఁ గొని యానందించుచున్ మాంసఖం
డ వసాస్వాద మొనర్చి యార్చిరి యజాండంబుల్ కదల్ డొల్లఁగన్. ౮౧౭

శా॥ కౌమారీకృతభండనద్రఢిమశంకాపంకసంక్షాళన
క్షేమోద్దామమయూరఘోషణమునన్ జెల్వొందె నద్దేవిసం
గ్రామహోద్భట దైత్య నిర్మథన ఘోర ప్రక్రియల్ చూపుటల్
భీమంబై లయకాలరుద్రకలనాభీలంబుగాఁ జొప్పడెన్. ౮౧౮

శా॥ గ్రాహారోహణధీరయై కరతలోగ్రపాంశుపాశావృతిన్
వ్యూహాకర్ష మొనర్చి దైత్యుల ననేకోత్సాహ బాహాబల
స్వాహంకారత నీడ్చి యొక్కొకని దుర్వ్యాపారసోల్లుంఠన
వ్యాహారంబుల నొంచి చంపెఁ బడి యాసర్వన్ వారుణీశక్తియున్. ౮౧౯

మ॥ జగదంబావయవోత్థశక్తిబలముల్ సంగ్రామరంగంబునన్
జగమెల్లన్ బెగడన్ నిశాచరబలోచ్చాట్రియంబులన్ గూల్చె ని
జ్జగతిన్ దైత్యకబంధ ఘోరతరసాంక్షాత్సర్గమున్ జేసి విం
తగఁ బద్మాసనుఁ డెల్లవారలకు నాత్మప్రౌఢిఁ జూపించె నాన్. ౮౨౦

మ॥ మదవద్దైత్యగణాభిమర్దనమునన్ మత్తిల్లి దేవీగణం
బుదితోత్సాహధురీణమై యెగసి యన్యోన్యానులాపంబులున్
మదకోలాహలముల్ స్ఫుటార్భటులు గానంబుల్ పరీహాసముల్
కదనక్ష్మాతల మెల్ల గ్రమ్మగ నశంకన్ సల్పె నొక్కుమ్మడిన్. ౮౨౧

క॥ విచ్చలవిడి నుమ గెలువన్ , వచ్చినయపు డసురసేన వసుధన్ గప్పెన్
విచ్చలవిడి నుమ గెలువన్ జచ్చియు ధరఁ, గప్పికొనియె సాశ్చర్యముగాన్.

శా॥ మింటన్ దుందుభినిస్వనంబు చెలఁగెన్ మించెన్ జయధ్వానముల్
దంటల్ గూడుచు నచ్చరల్ సరసవాద్యప్రౌఢి నర్తించి రా
వెంటన్ దుంబురుగానముల్ సెలఁగె దేవీహస్తవిన్యస్తస
ఘంటాంచజ్జయశంఖనాద మెసఁగెన్ గాఢీప్రమోదంబుతోన్. ౮౨౩

## —• రక్తబీజుని యుద్ధము •—

గీ॥ భూరినినదంబు రోదసీ బూరగింప, రక్తబీజుండు గనలి సంగ్రామసీమఁ
బాదసంఘృష్టపావకప్లవగ మనఁగ, నులికి కోదండ మెక్కిడి యుగ్రుఁడగుచు.

చ॥ అరదము నెక్కి కోపకుటిలారుణదృష్టులు శక్తికోటిపై
నురుతర విస్ఫులింగనికరోద్భటపావకకీల లట్లు దు

స్తరతరవేదనన్ గొలుపఁ జండగుణధ్వని సల్పుచున్ ధను
ర్ధరుఁ డయి యాజికి న్నడచి దైత్యనిహంత్రి దార నెంచఁగన్. ౨౫

గీ॥ ఆదిశూరత్వ మెల్లను నంతమునను, నవజయకదంబ యా నన నటులు దేవి
కాలు చేయార్చకుండ నాకర్ణకృష్ట,విశిఖధారాసుతతుల ముంచె వింతగదుర.

ఉ॥ పార్థివ! వాని కింత రణపాటవ మగ్గలమాట కిందుబిం
బార్ధధరుండు మెచ్చుచు రణావని శోణితబిందుసంతతిన్
బార్థివరేణువుల్ దడియఁ బైపయి నాత్మసమానయోధు ల
త్యర్థముఁ బుట్టువార లని యాదరణం బొనరించుచున్ జుమీ. ౨౭

ఆ॥ ఒడలి రక్తబిందు లుర్విపైఁ బడునంత, రక్తబీజదైత్యరాజి పొడము
నట్టివరము కలిమి నంబికపైఁ దూపు, లడరఁజేసి నిర్భయమున నసుర. ౨౮

కం॥ అంగముతోడుత దేవిన్, మ్రింగుదు నను నీర్ష్య వాఁ డమేయదగ్రిమా
భంగురవిక్రమవిభవో,త్తుంగతఁ జైచుముకునంతఁ దురమునఁ గనుచున్.

మ॥ గరుడాధోరణ మెక్కి వైష్ణవి ధనుఃకాండప్రముక్తాశుగో
త్కరముల్ గప్పుచు నడ్డపడ్డ రవిభాసదండాభమా పెన్గదన్
శిరముల్ దారఁగ నేయ నొండొకగదన్ జిత్రప్రక్రియన్ వ్రక్కలై
ధరణిన్ గూలఁగనేసి యార్చి పటు దోస్సద్దర్పంబునన్ గ్రమ్మఱన్. ౩౦

ఉ॥ కేల సుదర్శనంబు గొని క్రీడయ వోలెను రక్తబీజు నా
భీలతరాహతిన్ దునుము పేరిమి నైచినఁ జక్రనిష్ఠురో
త్కీలన ఘుర్ఘురీకృతిని దేహము శోణితధార లొల్కఁ ద
త్కాలము రక్తబీజసముదాయము వెల్వడె వేలు లక్షలై. ౩౧

కం॥ దిక్కులు నింగియు నిండుచు, నొక్కొక శక్తికిని నిలువ నూల్కొనకుండన్
బెక్కగుచు రక్తబీజులు, మొక్కలపున్ మోహరమున మొనసిరి వీఁకన్.

సీ॥ రథికులై యా యువరప్రతతి శక్తులనెల్లఁ, జీకాకు పఱచుచుఁ జెలఁగువారు
ఏనుంగుగున్నల నెక్కి శక్తికదంబ,ములకుఁ ద్రొక్కటముగా మెలఁగువారు
కరవాలముసలముద్గరభిండివాలముల్, పఱపి శక్తుల నాజి నొరయువారు
పోనీక పట్టుఁడు పొదుగుఁ డంచని శక్తి,సేనల నెల్లవంచించువారు

గీ॥ శక్తులకు మాఱుమసలు దోశ్శక్తికడిమి, రహిఁ బెనంగుచు జగమెల్ల రక్తబీజ
విశ్వరూపంబునా నూఱువేయు లక్ష, కోటి శతకోటులను లెక్కకును రహించె.

కం॥ ప్రాచీనుఁడు నూతను లను, వాచాన్నై ఖరికి నంద వశపడక జగం
బాచాంత మమ్యో శౌర్య,ప్రాచురిమై రక్తబీజరాతిరించరుచే. ౩౪

శా॥ చక్రక్రూరహతిస్రవద్రుధిర మాంసారంబుగా ధాత్రిపైఁ
జక్రీడాహతనారికేళసలిలక్షేపంబు నాఁ బర్వఁ జం
డక్రోధంబగు రక్తబీజతతి నిండెన్ నిండె బ్రహ్మాండ మా
చిక్రంసాతిశయంబు నల్వకు మహాచిత్రాతిచిత్రంబుగన్. ౮౩౫

శా॥ జెట్టుల్ చీమలు వోలెఁ జుట్టుకొని చేసే కాలు కాల్ చుట్టుచున్
మిట్టుం బల్లము గానరీక దెసలన్ మిన్ గంగ నుంకించుచున్
వెట్టింగొల్పుచు శక్తి సేనలను నుర్విన్ గాల్ గదల్పంగనీ
కట్టెత్తంగను దిప్పకుండ గుములై వ్యాపించెఁ దద్రూపముల్. ౮౩౬

వ॥ ఇత్తెఱంగున రక్తబీజాసురు రక్తంబున సిక్తంబగు పృథ్వీపరాగం బెల్ల రక్తబీజాకృతులు వహించుటయును దద్దైత్యులచే శక్తిసేనలు చీకాకగుటయుం గని యింద్రుని రాణి యడ్డంబై వజ్రాహతిం గొట్టినఁ బునఃపునస్స్రవద్రుధిరాసారంబులఁ బృథివిం బొడము రక్తబీజసహస్రంబులు క్రుధావిష్టంబులై శచిం జుట్టుకొనిన బ్రహ్మాణి మొదలగు శక్తు లడ్డంబై బ్రహ్మాణి బ్రహ్మదండంబునను, మహేశ్వరి త్రిశూలంబునను, నారసింహి నఖాఘాతంబులను, వారాహి దీర్ఘ కోదండంబునను, కౌమారి శక్త్యాయుధంబులను, మాతృకలు గదా శక్తి తోమర ముసల ముద్గర ప్రభృతి నానాయుధంబులను, నంబికాంగసముద్భూత శక్తులు వేర్వేఱ నిశితవిశిఖాసారంబుల వానిం బొదివిన, వాఁడును గ్రుద్ధుండై నిశాత శిలీముఖంబుల వారలను నొప్పింపుచును బ్రచండవిక్రమోద్దండుండై యనేక రూపముల శక్తిసేనలం గలంచుచున్న జండికాదేవి కనలి సింగంబు దుమికించి నిశాతశరంబులు నిగుడ్పఁ దచ్ఛరాఘాతంబునఁ గొండయుం బోని రక్తబీజ గాత్రంబున వెడలు రుధిరంబు పుడమింబడి తత్సదృశు లగు రక్తబీజు లనేకులు పొడమి జగం బెల్ల నిండి సన్నద్ధులును సాయుధులునై రణంబొనర్చుచు శక్తులం బ్రహరించుచు బాధింపుచుండం గనుంగొని సురలు భయభీతులై విషణ్ణులై శోకకర్శితులై యా రక్తబీజరూపంబులు క్షయించుట యెట్టులగును? చండిక యొక్కర్తు కాళికం గూడి యేమి సేయంగలదు? మఱియును రణశూరు లగు శుంభనిశుంభులు వచ్చుచున్నవారు, భయం బగ్గలంబయ్యె, నేమి సేయుద మెందుఁ జనుద మెవ్వరు దిక్కని యడలు నవసరంబున నంబికాదేవి చాముండికను జూచి యిట్లనియె.

—॰ కాళి యుద్ధభూమిని జిహ్వ పఱచుట ॰—

గీ॥ రక్తబీజుండు సమరదుర్వారపటిమ, విక్రమించెను వీఁడు నిర్వక్రగరిమ
రాజశేఖరదత్తవరంబువలన, నెదురు శూరుఁడు లేక యుక్కల్లెపు రేఁగె. ౮౩౭

గీ॥ వీని రుధిరంబు సోఁకినయేని పుడమి, రక్తబీజులు జనియించి రణమొనర్తు
రట్లు గావున నీవు జిహ్వాను ధరిత్రి, గ్రమ్మ వదనంబు తెఱచి సంగరమునందు.

చ॥ పెనఁకువ వీని నేను రణభీకరఘోరతరాంబకంబులన్
జొనిపి యణంతు నంత రిపుశూన్యత మేదిని సౌఖ్య మొందు జి
హ్వాను బడునంతఁ దదుధిర మానుము వెండియు రక్తబీజసం
జననము లేక యుండు సురసంఘముకార్యము చక్కనయ్యెడిన్. ౨౪౦

ఉ॥ అట్టులు దేవి పల్క విని యమ్మన మాల్కొని కర్ణమోటి యి
ట్టట్టనరాని విక్రమపునాయతి జిహ్వకఁ జాచి భూస్థలిన్
గట్టలుకన్ గడల్ గలయఁ గప్పిన నంబిక రక్తబీజునిన్
గొట్టఁగ రక్తముల్ గురియఁ గో! యని వీలిచెఁ గర్ణమోటియున్. ౨౪౧

ఉ॥ అంబిక నిగ్రహించి మునలాగ్రమునన్ గరవాలధార కా
లాంబుదగర్జనాతిభయదార్భటిఁ జేసిన వాఁడు కుద్ధుఁడై
వెంబడి కర్ణమోటిని నభేద్యగదాహతి వ్రేయ నొచ్చియున్
సంబరమంది క్రొత్తె క్షతజం బెడతీయక చండికాజ్ఞచేన్. ౨౪౨

గీ॥ రక్తబీజసహస్రముల్ శక్తివర్గ, మాజి మార్కొని యుండుట యరసి యరసి
యంబికాదేవి పరిమార్చె నట్టివారిఁ, గబళన మొనర్చె వారలఁ గర్ణమోటి.

ఆ॥ రక్తజాతమైన రక్తబీజశ్రేణి, నరసియరసి కూల్చె యంబ సహజ
రక్తబీజదైత్యు రణమునఁ గరవాలధార నఱకె సురలు బోరుకలఁగ. ౨౪౪

సీ॥ రక్తబీజుండిట్లు రణమునఁ గూలిన, గుసుమ వర్షంబులు గురిసె మింట
భయకంపితాంగులై పాఱిరి దితిజులు, హాహారవంబు లంతంత నెఱసె
హతశేషు లగు దైత్యు లసురనాథునిఁ జేరి, కర్ణమోటీచిత్రకరణమునను
నంబికాదేవి ఘోరాహవంబున ఖడ్గధారచే వెనుఁదీక తతిమితిమి

గీ॥ రక్తబీజుని మడియించె రాక్షసేంద్ర?, యేమి చెప్పుదు మసురుల యెల్లవారి
కేమొ మిగిలితి మసువులెట్లొట్లొ బిగ్గఁబట్టి తక్కిన సైన్యంబు పదటఁగలసె. ౨౪౫

చ॥ ఎగఁబడి దేవి సింహము యథేచ్ఛ నిశాచరసేనలందు మృ
త్యుగతిని సంచరించెను మదోద్ధతి నెల్లరఁ గొల్లఁగొట్టి బి
ట్టుగఁ బలపిండరూపులుగ డొల్చినఁ గాళిక మెక్కె నొక్కఁడున్
దిగఁబడఁ డాహవక్షితి హతింబడ కీ నడి దెల్పు టబ్రహా. ౨౪౬

సీ॥ అంబికాదేవి సామర్థ్య మేమని తెల్ప, మత్షయ్య సుమ్ము దేవాసురులకు
గరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్యాహి, నరులకు మార్కొన నశముగాదు

చిచ్చున గనిలంబు గ్రె చెల్మి గాంచినట్లు, శచి మొదలైనట్టి గ్రె శక్తులెల్ల
సాయుధవాహలై గ్రె చనుదెంచి రవ్వారి, జెప్పనలవిగాదు గ్రె చిత్రమయ్యె

గీ॥ నెల్లవారలు బ్రోవయి గ్రె యిట్టివీరు, రక్తబీజుని గెడపి నిరంధ్ర శౌర్య
దుర్మదంబునఁ జెలరేగి గ్రె దురవగాహ, ఖేలనము సేయుచున్నారు గ్రె జాలిమాలి.

మ॥ అసహాయప్రతిపక్షనిర్మథనచర్యాధుర్య యచ్చండి సా
ధ్వసశంకానవకాశవిక్రమకనత్సాహిత్యలై నిత్యలై
దెసలం బేర్కొను శక్తులెల్ల జతలై గ్రె దీకొన్న నోండౌనె? ర
క్కసిగుంపుల్ చెడకుండ నేర్చునె? కనంగాఁ జెట్టపుట్టెం గదా! ౨౪౮

కం॥ అదిగావున సచివులతో, "నిదమిత్థప్రతిభమంత్ర" గ్రె మేర్పఱిచి కదుఁ
కదనంబు మేలొ? కోటలు, వదలి పలాయనము మేలొ? గ్రె వాసిం గనుమా. ౨౪౯

మ॥ మనకుం మేలగు సంధి సేత సకలామర్త్యాళితో సఖ్యమున్
జను నీ విందుల కొప్పవేని త్రిదశేష్టంబెల్ల సిద్ధించు నొ
క్కనినైనం దితిజుం గడంబడఁగ నీకుం గాలుద్రోల్సేర్చుఁ గా
ళిని సైగం బనుపం మెసంగు నది హేళిం సర్వదైత్యావళిం. ౨౫౦

గీ॥ సింహచాముండికలు మనసేనమీఁద, నుఱుమునప్పుడు రక్షస్సమూహ దేహ
కీకసరజోంశమైనఁ జిక్కనది చూడ, మవని మన కేటి బ్రతుకు దైత్యాధినాథ.

గీ॥ సంగరపువాంఛఁ గలనైనఁ జనదు తలఁప, జావుసిద్ధంబు బ్రతుకుటసందియంబు
చండి గా దది సురకార్యసర్వసిద్ధి, సేయుటకు దైవమాయగాఁ గ్రె జిత్తమిడుము.

ఉ॥ నా నరభోజుఁ డిట్లనియు గ్రె నవ్వుచుఁ గాలకృతోదితక్రియా
ధీనిపుణుండు గాన రణధీరత జగ్గిలినారు మీరు; సం
ధానముఁ జేయఁ జూచెదరు గ్రె ధైర్యవిహీనులు పొందు లేచి; నే
మానుదునే? దురమ్ము, రిపుమర్దన దుర్దమ శక్తి గల్గియున్- ౨౫౩

ఉ॥ చంపెద శక్తిబృందముల గ్రె సంయమనీపురరక్షణార్థమై
పంపెద వారలం, సురశుభంకర వృత్తుల సైఁచువాడనే?
నింపెద వీర.ఘోరరణనిర్గమవిశ్రుతకీర్తి దిక్కులం;
దెంపెద దేవమూలములఁ గ్రె దీర్చెద నాజికృతపరిశ్రమల్. ౨౫౪

క॥ విడుతునె? సురరాజ్యంబును, బడఁతికి నై వెఱచి నిందపాలై కలనన్
బొడిచెద రిపులను శక్రుని, నడఁచెద నడినెత్తిమీఁద గ్రె నతలము పడ్డఁ. ౨౫౫

ఉ॥ పాణిసమానులైన దితిపట్టుల నిట్టులఁ బిల్కుమార్చి సం
త్రాణనలోలతన్ దొలఁగి దాఁగుదునే? యతలంబునందుఁ బూఁ
బోణినిఁ దెత్తు నేఁడు సురభూధర మిట్టటులైనఁ దప్పునే?
పాణిము గల్గి శుంభుఁడు ధరాస్థలి నిల్చినఁ జండికిన్ జెపుల్. ౨౫

మ॥ అభయుండై యిటు ప్రల్లదంబుల నిజాహంకారముల్ జూపుచున్
సభయెల్లన్ విడనాడి తమ్ముని రణోత్సాహంబు దీపింప నీ
విభసంరంభవిజృంభితుండ వయి పోర్కిన్ బార్ష్ణిరక్షక్రియా
రభసం బేర్పడ వెంటరమ్ము భయదప్రౌఢిన్ రణక్షోణికిన్. ౨౬

ఉ॥ ఏను నిశాతసాయక సమిద్ధరణాంగణభూమి శక్తి సం
తానము నెల్లఁగూల్చి ప్రమదామణి నంబికఁ బట్టి తెత్తు సం
దీని భుజాబలంబున నభీష్టము సిద్ధిఁ బొసంగఁ జేతు నా
పూనికఁ జూడు మన్న దితిభూపతితోడ నిశుంభుఁ డిట్లనెన్. ౨౭

ఉ॥ ఇంతననేల? పోరికి జయేచ్ఛఁ బొసంగఁగ నేను బోయి దు
ర్దాంత బలంబునన్ గలఁచి దర్ప మెలర్పఁగ బాలఁదెత్తు న
శ్రాంతుఁడవై ననున్ బనుపు సాహస మేటికి నల్పసిద్ధికై
చింతఁ దొలంగు మానసికసిద్ధిఁ బొసంగఁగఁ జేతు నేడ్తెఱన్. ౨౮

## — నిశుంభుఁడు యుద్ధమునకుఁ బోవుట —

గీ॥ బాలిక యనంగ నెంత నీపాదమాన, భువనభీకరమైన మహద్భూరి శక్తి
నోడిచి తెచ్చెద నిసుమంతయోర్చి భోగ,పరుఁడ వయ్యెదు బోటితో భండనంబె!

ఉ॥ కార్యధురీణతన్ బిరుదుగట్టిన నే నిటు లుండ నల్పమౌ
కార్య మొనర్పఁ జూతురె? యకంపితవృత్తి జనార్దనాదులన్
ధైర్యధురంధరుండ నయి దర్ప మడంచెద దేవకోటి ని
ర్వీర్యముగా నొనర్చి నగరిన్ నినుఁ గొల్వఁగఁ జేతుఁ జూడుమీ. ౨౯

సీ॥ అనిపల్కి యన్నచే నానతిఁగొని నిశుంభుఁడు రథస్థుండయి భువనభయద
రక్షోవరూథినుల్ రణసముత్సాహదో,హలత వెన్వెంటరా నంతనంత
వందిమాగధులు కైవారంబు లొనరింపఁ, జటులతూర్యధ్వనుల్ సందడింప
సపరిచ్ఛదుండును సాయుధుండును నౌచు, నగరు వెల్వడి రణానందమునను

గీ॥ చండ కోదండ శింజినీతాండవములు, ఝూంకృతులతోడ భువనభీషణతఁ జూప
సమరసన్నాహసంరంభసహితముగను, శక్తిబృందంబుపై జయోత్సవత వెడలె.

గీ॥ విజయమో? నేఁడు మృత్యువో? నిజమటంచు, నాహవోద్యముఁడై నిశుంభాసురుండు
దేవి కభిముఖుఁడై క్రోధదీప్తవదన, శోభ లెరగలిఁ గికురింపఁ జొచ్చె ననికి.

ఉ॥ తమ్మునికిన్ సహాయముగఁ దానును బ్రేక్షకుఁడై యనేక సై
న్యమ్ములతోడ రాఁగ విజయమ్మొదఁ గోరుచు దైత్యవల్లభుం
డుమ్మలికంబు గ్రమ్మ మది నొక్కటఁ గోత్తలఁ జేసె వచ్చి దై
వమ్ము పరాహతంబయిన వమ్మగుఁగాక క్రియల్ ఫలించునే. ౮౬౪

ఉ॥ అంబుదమండలంబులు నిజావరణంబులు గాఁగ దానవా
డంబర మెల్లఁ జూచుచుఁ దడంబడు చిత్తములన్ సురాళి య
య్యంబిక గెల్పుఁ గోరుచు జయాపజయమ్ముల సంధిహీనులా
చుం బరికించుచుండిరి నిశుంభుఁడు జృంభితమూర్తియై యనిన్. ౮౬౫

మ॥ సురరాట్కార్ముకసన్నిభం బగు ధనుస్తూణంబు సజ్యంబుఁ జే
సి రణోర్విన్ నిశితాస్త్రజాలములు నింపెన్ దేవిపై; నంత దు
ర్భరకోదండముఁ బూని చండిక తదస్త్రవ్రాతముల్ ద్రుంచుచున్
బరిహాసద్యుతు లాననంబు నలరింపన్ గాళితో నిట్లనెన్. ౮౬౬

ఉ॥ కంటివె? కాళి వీరి భుజగర్వము; దానవమర్దనంబు లి
ట్లుంటయు రక్తబీజముఖు లూరక వీఁడి పోవుటల్ గనుం
గొంటయు లేక గొంటు లయి క్రూరత బంటుతనంబుఁ జూపఁగాఁ
దుంటరు లేలవచ్చెదరొ దుస్తర మీశ్వరశక్తి యెరికిన్. ౮౬౭

ఉ॥ ఆస జయింప నెవ్వరికి నౌనొకొ? ఱెక్కలులేని పక్షులై
వాసి దొలంగి సైన్యము లవారణ వమ్మయి పోయినన్ రణో
ల్లాసముచే జయింతు మను లాలసతాభరమూనఁ జూచి రా
యాసము వెట్టిగాని నరుసనాస దొలంగదు చచ్చునంతకున్. ౮౬౮

కం॥ ఆశాపాశావృతులకు, నీ శంకలు గలుగు నొక్కొ? యేటికి మన కీ
యాశరుల యెడలఁ దాలిమి, నాశము ప్రాపించె సుగుణనాశము వలనన్. ౮౬౯

కం॥ సురలకు వరమొసఁగితి మి,మ్మరిభయములఁ గాతు ననుచు నది భరమై నా
శిరమున నున్నది దించితిఁ, దరతమముగఁ గొంత సాంతతం బౌరయు నికన్.

ఉ॥ కాలముఁ దీరె వీరికి నకాండపవిప్రతిమాన నై శిఖ
జ్వాలల మ్రగ్గఁజేతు సురసంఘము; నీవును జూచుచుండ నా
భీలధనుర్గుణంబు కరపీడన లేకయె మ్రోఁగుచున్న దో
వాలుగ గంటి? దీని విని వైరులు గూలెద రింత లోపలన్. ౮౭౧

## —॥ దేవితో శుంభనిశుంభులు యుద్ధము చేయుట ॥—

మ॥ అని కోదండము కేల నూని భయదం బౌ శింజినీటంకృతిన్
దనుజశ్రోత్రపుటప్రభేదనసముద్యన్నృత్యముల్ సల్పుచున్
వినతోత్సాహిని చండి యాకసము నుర్విన్ నిండ నారాచసం
జనితజ్వాలలఁ గప్పె దైత్యబలకక్ష్యల్ సారెకు న్నీఱుగన్. ౨౭౨

ఉ॥ కప్పె నిశుంభునిన్ దహనకల్పశరంబులఁ గల్పవేళలం
దుప్పర మంటి మంటల నెనూనత నొప్పు లయాగ్నిఁబోలె లోఁ
దెప్పర మైన యీసున నతిప్రకటప్రబలప్రతాపతన్
గుప్పన గుప్పలై పడఁగఁ గోయని యార్చుచుఁ జండి నెండియున్. ౨౭౩

ఉ॥ దానవుఁ డుజ్జ్వలజ్వలనదాహకమోహకసాయకాళిచే
వాని మరల్చి దేవిపయి వాఁడి శరంబులు గప్ప నప్పు డ
ద్దానవచండికాంబలకు దారుణమై తుములంబు చెల్లె దే
వానకదానవానకభయానకరావము ఘూర్ణిలెన్ గడున్. ౨౭౪

ఉ॥ కేసరి యాజిలో దుమికి కీర్ణరణాంగణధామధూళికా
ధూసరితోరువాలము విధూనన కేళి నెసంగఁ ద్రిప్పి య
య్యాసురసేనలన్ గలఁచె నార్చుచు నేన్గు కొలంకు లట్ల దం
ష్ట్రాసమితిన్ నిశాటులశిరంబులు వ్రక్కలు సేయుచున్ రుషన్. ౨౭౫

సీ॥ చండి యొక్కెడ దైత్యసంక్షయం బొనరింపఁ, గేసరి యట్టులె క్రీడ సల్పఁ
గాళికాముఖశక్తికామినుల్ చెలరేఁగి, సోఁకుమూఁకలను జీకాకుఁబఱప
నాకర్ణకృష్టచాపాంతరనిర్ముక్త, బాణజాలముల నభ్రమ్ముఁ గప్పి
తరమిడి శక్తుల దర్పంబు లణఁచుచు, నప్రతీపప్రతాపాతిశయము

గీ॥ గదురఁ జీఁకటిగమిని భాస్కరుఁడువోలె, నంబికాదేవి శరదుర్దినంబు గదిమి
సమరతల మెల్ల రథచంక్రమములు గలయ, శక్తిసేనల వెలిచె నిశ్శంక నసుర. ౨౭౬

చ॥ మఱియును గొంద ఱొక్కుమొగి మానవఖాదను లంబికన్ మదిన్
బెరిగిన యీసునన్ బొదివి పెద్దయుఁ బ్రిద్దుఁ బెనంగుచుండఁగా
గొఱల నిశుంభుఁడున్ వెనుకఁ గోయని యార్చుచుఁ గూడముట్టి చి
చ్చఱపిడుగుం బలెన్ బడియెఁ జామను బట్టుఁడు గట్టుఁ డం చొగిన్. ౨౭౭

కం॥ అదె కాళిక యడ్డంబై, పొదివెడు రాసీక దాని పొడ వడఁపుఁడు నే
నిదె వచ్చితి వెఱవకుఁ డీకఁ, గదనజయశ్రీయు నబ్బెఁగా మన కనియెన్. ౨౭౮

వ॥ ఇట్లు పత్తిల్లదంబులాడు శలభకదంబంబునడుమ దీపజ్వాలయుంబోలె మండుచు దానవుల నుఱుమొనర్చు నంబికాదేవిం గని సంబాధంబు నొందుటం జేసి చిక్కువడినదానిం గాఁ దలపోసి సన్నిధికి నరుగుదెంచి శృంగారరౌద్రరసమిశ్రయు, విపులాపాంగియుఁ, త్రైలోక్యసుందరియుఁ, గ్రోధరక్తేక్షణయు నగు చండికం గాంచి దురవగాహజ్వాలాభీలం బయిన తదీయ తేజోమయం బగు దివ్యార్చిఃపుంజంబు విభ్రాంతుండై కనుంగొనుచుఁ బరిగ్రహేచ్ఛన్ మాని విజయాపేక్షం దొరంగి నిశ్చితమరణుండై కార్ముకంబు సారించు నిశుంభునిం గని చండికాదేవి యిట్లనియె. ౨౧౯

మ॥ తలఁగుం డాహవసీమకుం, జనుఁడు పాతాళమ్మునన్ డాఁగఁగా<br>
బలభిద్రాజ్యము లొప్పగింపుఁడు వృథాస్త్రభారంబు మీ కేల? యి<br>
మ్ముల జీవింపఁదలంచిరన్ విడుతు మిమ్మున్ మూర్ఖతన్ బోరఁగాఁ<br>
దలఁ బొక్కింతయు నుండెనేనియు ధనుర్దండంబు లూనన్ దగున్. ౨౨౦

కం॥ మద్గుణగుంభితచాపో,ద్యద్గురుశరతతులఁ దెగిన యంతట మీకున్<br>
సద్గతులు గలుగు నితరా,సద్గోష్ఠులతోఁ బనేమి సాహసమె తగున్. ౨౨౧

ఉ॥ కాతరులైన శూరతలు గల్గునె? మెచ్చటనైన! మచ్ఛరా<br>
ఘాతములన్ రణాజిరవిఖండితులేని సురేంద్రలోక వి<br>
ఖ్యాతసుఖంబు లందెదరు కాదనకే నభయం బొసంగుదున్<br>
నీతి గణించి తేఱి సుఖనిశ్చలులై చనుఁ డెందు నేనియున్. ౨౨౨

మ॥ కరుణాపూరితలోచనాంత యయి వక్కాణించు నా దేవి మా<br>
ధురులం దేలెడు వాక్కులన్ గినిసి దైత్యుం డాఁపగారాని ని<br>
ష్ఠురకోపంబున ఖడ్గఖేటములు రెండున్ బూని చండిన్ మదో<br>
ద్ధురుఁడై వ్రేసెద నంచుఁ బైనడరె గంతుల్ వ్రేయుచున్ వ్రేల్మిడిన్. ౨౨౩

మ॥ చని యద్దేవిని నుత్తమాంగమునఁ జంచన్నైపుణిన్ దూఁకి వ్రే<br>
సిన ఖడ్గాహతి మేనివంచన నపక్షిప్తంబుగాఁ జేసి చ<br>
య్యనఁ బారశ్వథపాత మయ్యసురబాహామూలమం దంటఁ జే<br>
సిన వాఁ డట్టులఁ జండినేసి యని నార్చెన్ సింహనాదోగ్రుఁడై. ౨౨౪

సీ॥ అసుర శేఖరుని ఖడ్గాహతి నొంచియుఁ గ్రోధంబు నెమ్మోము గుదిలపఱుప<br>
జయఘంటఁ జేకొని చండనాదమ్ముల, గిరిగుహాకుహరముల్ గెరలి మ్రోయ<br>
వాయించి మధురసాస్వాదనంబున మేను, మత్తిల్ల నాకంఠమహితముగను<br>
మాటిమాటికిఁ బొంగుమధుమాంద్య మత్తులఁ, జిగురొత్త మొగమెల్లఁ జేగుఱింపఁ

గీ॥ క్రోధఘూర్ణాయమానమై కుటిలదైత్య, నిర్మథనకర్మ కర్మఠనిర్నిమేష
మానసోల్లాస మంతంత మాఱుమసలఁ, జండి దుమికించె హరి నిశిచరునిమీఁద.

చ॥ ఇరువురకుం బరస్పరజయేచ్ఛలఁ బోరితమయ్యె నాసురా
సురులకు నద్భుతావహము సూచితనైరవచోవిజృంభణం
బురుతరబాణసంక్రమణ ముజ్జ్వలరోషకషాయితేక్షణ
స్ఫురితము నై జగత్ప్రళయసూచికదంబకఘోరవృష్టులన్. ౮౭౮

సీ॥ అసురసేనలమీఁద నఱచుచుఁ గంకగృ,ధ్రధ్వాంక్షవాయసోత్కరము తిరిగె
సారమేయానీకజంబుకపఙ్క్తులు, పలలఖాదనకాంక్షఁ బరువులిడియెఁ
బ్రేతభూతపిశాచభీకరారావముల్, శ్రవణపుటంబులజడనుపఱచె
రథతురంగేభవర్తనసాగరానీక, రక్తకదంబభారంబు నెఱసె

గీ॥ శరనికృత్తాంగభటజనస్వనము లెగసె, దనుజమాంసవసాస్థిదుర్దమితపంక
ఘట్టములు కంఠదఘ్నవిస్తరతఁ దనరె, నట్టితుములంబునందు నేమందు నధిప.

మ॥ గద సారించి నిశుంభుఁ డుగ్రుఁడయి శంకంబాసి దేవీరిత
ప్రదరవ్రాతకృతాభిముఖ్యమునకుం బాటింప కుద్యద్రుషా
స్పదచిత్తుం డయి సింహశీర్షముపయిన్ బాహాబలోద్వృత్తిచే
నదయాఘాత మొనర్చి యార్చె నిఖిలాశాంతంబు లల్లాడఁగన్. ౮౭౯

కం॥ అంతంబోవక గదచే,నెంతయుఁ దీవ్రముగ మీఁది కెగసి నిలింపుల్
జింతిలఁ జండిక నతిదు,ర్దాంతాహతి నొవ్వఁజేసి దాఁటెన్ బుడమిన్. ౮౮౦

—• నిశుంభుఁడు చండిచేఁ గూలుట •—

చ॥ కనలుచుఁ జండికాంబ పలలఖాదనుఁ జూచి చలింపకుండుమీ!
సునిశితఖడ్గధార నిదె చూడుము కుత్తుకఁ ద్రెంచుదాన నం
చనిమిషు లెల్ల విస్మయము నందఁగఁ జేతికృపాణధారచేఁ
దునిమె సురారిమస్తకము తోరముగా రుధిరమ్ము గ్రమ్మఁగన్. ౮౮౧

చ॥ వడిఁ దల నేలఁ గూలుటయు వాని కబంధము సాంపరాయపుం
బుడమి గదాసమేత మయి భూతభయంకరలీల వేల్పులన్
బడలుపడంగఁ జేయుచు సభంగురవృత్తి నటింప దేవి న
వ్వడ రెడు మోమునన్ దృఢశరాహతిఁ గూలఁగ నేసె నేలపై. ౮౮౨

ఉ॥ కొండయుఁబోలె నేలపయిఁ గూలునిశుంభునిఁ గాంచి సైన్యముల్
చండిక గాదు మృత్యువని సాధ్వసపీడితులై రణావనిన్

గుండెలువ్రీల నల్దెసల ఽ గుంపులు గట్టుచుఁ బాఱఁజొచ్చి రు
ద్దండమృగేంద్రయానమునఁ ఽ దాండవచండిమఁ జూపెఁ జండియున్. ౮౯౨

మ॥ నలుదెసలన్ వడిన్ బఱచు ఽ నైజబలమ్ములఁ జూచి శుంభుఁ డు
మ్మలికమునొంది యేటి కభిఽమానముఁ దూలఁగఁ బాఱుచున్న వా
రలఘుభుజాబలుండయిన ఽ యట్టి నిశుంభుఁడు గల్గఁ డొక్కొ త
ద్బల మెఱుఁగంగఁజాల కిటుఽబాఱఁగ నేటి కటంచుఁ బల్కఁగన్. ౮౯౩

మ॥ హతశేషుల్ చని శుంభుఁ జూచిన మహాఽహంకారమున్ జూపి దై
వతసైన్యంబులఁ దూలఁబుచ్చి భుజగఽర్వప్రౌఢిమన్ జండితో
వితతాయోధన కేళి సల్పి సమరోఽర్విన్ జండికాఖడ్గవి
స్త్రుతధారాహతిఁ గూలెఁ దమ్ముఁడు జయఽశ్రీలోలుఁడై యక్కటా! ౮౯౪

ఉ॥ రాక్షసనాథ! యింక సమఽరమ్మున నాసఁ బెనంగరాదు లో
కక్షయహేతువైన యలఽకాళియ గాని పడంతి గాదు స
ర్వక్షయ మయ్యె సైన్యము భఽవత్సవిధంబునఁ గీడుఁ దెల్పఁగా
సక్షతదేహశేషములఁ ఽ జయ్యనఁ బాఱుటఁ దక్కెఁ బ్రాణముల్. ౮౯౫

సీ॥ దేవకార్యార్థమై ఽ దిగివచ్చు నమ్మహా,మాయగాని యలంతి ఽ మగువ గాదు
అసురకులాంతకోఽద్ధారమైన యచింత్య,చరిత పరాశక్తి ఽ జగము లెల్ల
సంక్షయింపఁగఁజాలు ఽ సంహారకారిణి, ప్రాకృతశక్తి నాఽబలుకవలదు
నానాకృతులు దాల్చి ఽ నానావిహారముల్, సల్పు నొక్కొక్కెడ ఽ సర్వమథని

ఆ॥ కల్పకాలభయదఽకాళరాత్రియగాని, యొండు దలఁపవలదు ఽ చండి నాఁగ
నామమాత్రమయ్యె ఽ సరభోజివల్లభ !, కాదు మనకు విజయఽకాల మిపుడు.

వ॥ మఱియు నానారూపధరయును మాయామూలవిశారదయును విచిత్రభూష
ణయు నానాయుధధారిణియు నతిగహనయు గూఢచరిత్రియు సర్వలక్షణ
సంయుతయు నంతరిక్ష సంచారిణియు సర్వప్రాణి సంపూర్ణయు నద్భుతాటో
పయు నగు వైష్ణవియే సుమీ, యొండు తెఱంగు గానంబడదు. దేహరక్షణం
బభిలషించినచోఁ బలాయనంబు సుకరం బని తోఁచుచున్నయది. శిరంబు గల్గినఁ
గదా యుష్ణీషంబులు వెదకుట? యిక్కాలంబున జీవితుల మైతిమేని కాలాంత
రంబున విజయంబు సులభంబు. కాలవివేకం బెవ్వరికి నశక్యంబు, తృణంబు మేరు
వును మేరువు తృణంబుగా నొనరింపఁ గలయది, హరిహరాదులు కాలవశంవదులు,
సురలయెడ సమ్ముఖంబై మన యెడలఁ బరాఙ్ముఖంబై వర్తించుచున్నది.
కాలస్వరూపం బేకాకారంబున వర్తించునే? తచ్చేష్టితంబులు నానారూపంబులు,
సృష్టికాలంబును, బ్రస్థితికాలంబును, బ్రళయకాలంబును నని యనేకా

కారంబుల వర్తించు, నీకుం గరదు లగు నిలింపులకుఁ గరంబానంగు తఱి యయ్యె, నిశుంభుండు దేవాసురల కజేయుండే గదా! యట్టి వాఁ డాఁటదానిచే నోటఱి పాటితుండయ్యెం గావునఁ గాలపరీక్షణం బొనర్చి పాతాళంబునకుం జనుట మేలని తోఁచుచున్నయది చిత్తం బెట్లు వర్తించునో యట్ల సేయు మని యూర కున్నంత ఫణిహారులం జూచి శుంభుం డిట్లనియె. ౮౯౭

శా॥ దూరాలోచనదూరు లైన యతిమంత్రుల్ మీరు; మీబోధనల్
సారార్థప్రతిపాదకంబులె? రణోత్సాహంబు నే వీడ దు
ర్వారుల్ నెచ్చెలు లెంద ఱీల్గిరి మదర్థంబై; త్రపాహీనతన్
శారీరస్థితి నిత్య మంచు బ్రతుకన్ నిల్వఁగా నేర్తునే? ౮౯౮

కం॥ కాలము శుభాశుభములకు, మూలము మదిఁ జింత యేల ముగ్గొని యేయే
వేళల నెట్టెట్టగు నా, వేళల నట్టట్లె కాకవేఱగు నొక్కొ? ౮౯౯

ఉ॥ జీవితవృత్తి గల్గిన నశేషజగత్త్రయరాజ్యపాలన
శ్రీ విలసిల్లువాఁడ రణసీమల నొండగు నేని స్వర్గల
క్ష్మీవిభుతావధీరితవిశిష్టసురాసురభోగశాలినై
దైవతకోటి మీఱి జయతత్పరతన్ గనువాఁడ నింతకున్. ౯౦౦

శా॥ కాలం బొక్క తెఱంగు గా దనుచు వక్కాణింపఁగా నేల? య
మ్మూలం బే నెఱుఁగంగఁజాలనొకొ? సామ్ముఖ్యంబు వై ముఖ్యమున్
గాలీనం బగు షడ్విధార్తవములున్ గాలవ్యతిక్రాంతతన్
గ్రాలున్ గాదె? యొకానొకప్పుడు; సదా కాలంబె దైవంబగున్. ౯౦౧

కం॥ ఐనను నిమిత్తమాత్రము, గా నుడివెదఁ గాలమును నకల్మషమతినై
జాలన్ బరిశీలించిన, నాలోచన దైవమొక్కఁ డధికము సుమ్మా. ౯౦౨

ఉ॥ దైవముచేత నిర్మితము తథ్యము సర్వము దైవచోదితం
బై విలసిల్లు సర్వవిధి నన్యము గా దిది యట్టులేని పుం
భావజయావహుల్ సమరపండితులౌ నసురేంద్రు లిట్లు దే
వావళి గెల్చి నేఁ డకట! యంగనచే ననిఁ గూలిపోదురే? ౯౦౩

కం॥ పౌరుషము వితథ మనఁదగుఁ, బౌరుషవంతులయి యిట్లు పడి రసురేంద్రుల్
ఘోరాహవసంక్రీడన, పారంగతుఁ డగు నిశుంభుపాటేఁ గంటే. ౯౦౪

ఉ॥ కావునఁ గీర్తిఁ బోవిడిచి కామిని కోటఱి సంగరంబులో
జీవితవాంఛచే మరలు చిత్తముఁ జేర్తునె? ప్రాప్తకాలమై

నా విధి నన్నుఁ దుఃఖించుటకు నర్మిలి సంగత మయ్యెనేని నే
నే వరుసన్ దొలంగుదును? నెట్లయినన్ ననుఁ బోవనిచ్చునే? ౯౦౫

కం॥ నలువ పరార్థద్వయమున, బలవద్విధివశత నొంది పట్టుఁబడఁడె! య
న్యుల కెట్లు తప్పనేర్చును!, జలజాక్షభవాదు లట్లు చనరే? తెలియన్. ౯౦౬

చ॥ యుగములు నాల్గు నే వరుస నొక్కటఁ జన్న యెడన్ విరించికిన్
బగ లగు, నందులోన నవపాకభిదుల్ మనువుల్ ద్విసప్తకుల్
తెగుదురు చావు కింత మదిఁ దెప్పరమైన విచారమేల? భూ
గగనములున్ రవీంద్రులును క్ష్మాధరముల్ చనకుండ నేర్చునే? ౯౦౭

కం॥ పుట్టుట యెల్లను బుడమిని, గిట్టుటకై కాదె? జగతి గిట్టుట యెల్లన్
బుట్టుటకుఁగాదె? యధ్రువ, మిట్టి శరీరమున కింత యేలా వగవన్? ౯౦౮

వ॥ అని సభికులతో నిట్లుగ్గడించి తమ్మునిఁ దలంచి కొంతసేపు కన్నుల బాష్పంబులు రాలఁ జింతాక్రాంతుండై వాని పరాక్రమంబులును, దనయందలి వాని సౌహార్దంబును దలంచి చింతించి యట్టి యనుజన్మునితోడం గూడి దివంబునకుం బోవుట కంటె జన్మసాఫల్యంబు గలదే? యని వితర్కించి, రోషభీషణుండై కాలోచిత కృత్యంబు లాచరించి మజ్జనభోజనంబు లొనర్చి, రక్తమాల్యాంబరధరుండును, రక్తగంధాంకిత వక్షస్థ్సలుండునునై రత్నోజ్జ్వల కిరీటంబు ధరియించి, దండధర దండోద్దండంబగు కోదండంబు కేలం గీలించి శరధిద్వయంబు కక్షంబుల నలవరించి సారథిం జూచి యిట్లనియె. ౯౦౯

## —' శుంభుండు యుద్ధమునకు వెడలుట •—

చ॥ అరదముఁ దెమ్ము శీఘ్రగమనాంచితగర్దభరాజిఁ గూర్చి; సం
గరమున కేగఁగావలయుఁ గాళికయాదిగఁగల్గు శక్తులన్
ఖరశరధారలన్ దునిమి కట్టెడిఁ గామినిఁ బట్టి తెత్తు నే
మరణభయంబునన్ దురభిమానముఁ దూలుదునే? విరోధికిన్. ౯౧౦

మ॥ అని కృతనిశ్చయుం డగుచు నాయితమైన రథంబు నెక్కి చ
య్యన గుణటంకృతుల్ చెలఁగ నార్చుచు "నంబిక యెందు నున్న దొ
య్యనఁ జన నిమ్ము తే రచటి" కంచు వచించుచు ఘోరవాహినీ
వననిధికల్పకాలఘనవార్ధియుఁ బోలెఁ గలంగి వెంట రాన్. ౯౧౧

సీ॥ హస్త్యశ్వరథపదాత్యావళుల్ వెనువెంటఁ, గ్రేళ్లువాఱుచును గ్రిక్కిఱిసినదువ
పటుభేరికధ్వానభాంభానినాదముల్, ధరగుహాళులఁ బ్రతిధ్వనుల నీన

బ్రహ్మాండభాండంబుఁ బగిలించు నిజసింహ, గర్జితారావముల్ గడుఁజెలంగఁ
బటుధనుష్టంకారచటులతల్ రోదసీ, తల మెల్ల దట్టమై తాండవింప

గీ॥ జంభభిన్ముఖదేవసంరంభ మెల్లఁ, గుంభితంబయి వానినిర్దంభశక్తి
జృంభణంబున నంత సంస్తంభ మెనయ, శుంభుఁ డేతెంచె సమరవిజృంభియగుచు.

క॥ వచ్చి నిరంతరభక్తి వి, యచ్చరు లెల్లను భజింప నతిమోహినియై
విచ్చలవిడి సింహముపై, నచ్చట విహరించు దేవి నవలోకించెన్.

సీ॥ సర్వాభరణవేష సర్వలక్షణయుత, సురరాజముఖసురస్తూయమాన
గరుడగంధర్వకిన్నరయక్షసాధ్యాది, సంపూజితాంఘ్రికంజాతయుగళ
మందారమాల్యసమావృతసర్వాంగ, విజయశంఖారావవిహరణోగ్ర
త్రిభువనమోహినీ దేవాదిదేవత, జగదంబ శాంకరిఁ జండికాంబఁ

గీ॥ గాంచి కామశరాహతిఁ గంది యాపె, దివ్యసౌందర్య మీక్షించి తెలియరాని
మరులు సెందుచు నద్దేవి మహిమఁ గాన, కసురవల్లభుఁ డుద్వేగమంది కుండి.

శా॥ ఈకాంతామణి సౌకుమార్యము బళారే! చూడఁగా వింత, య
స్తోకం బీచెలిరూప మే మనఁగ వచ్చున్? శౌర్య మాహా! జయో
ద్రేకం బద్భుతమయ్యె జాలమయి యుద్దీపించెఁ బంచాస్త్రమా
యాకల్పంబయి రామణీయకము, భాసమానీకసామాన్యమే? ౯౧౬

కం॥ మానసిక మగు వికారం, బీనవలాయందు లేని దేనియు రక్షో
గ్లాని యిటు లెట్లు చేయును, గానరు కామాదు లలుక గదిరినవారల్. ౯౧౭

ఉ॥ ఏమి యుపాయ మీ పడఁతి నెవ్వరు నాకు వశంబు సేతు రిం
కేమియు దోఁచ దెద్దిగతి యీ చెలి మంత్రికలాకలాప ని
ష్ఠామహామాత్రిమంత్రికృతసాధనఁ దెల్పియుఁ బట్టఁ గొల్ప ది
బ్భామ మెడన్ సరోజశరబాధకు నెట్టుల నోర్తు నక్కటా! ౯౧౮

గీ॥ ఇజ్జగన్మోహినికి నాదు నెడ మనంబు, పుట్టు టెట్టులు? నాకోర్కి మట్టుమీఱి
గుట్టు పెకలించె వశవర్తిఁ గొనుట యెట్లు, తలఁపుసిద్ధిని గొనఁగ నాతరముగాదు.

సీ॥ సామదానముల మెచ్చదు దురమ్మున నెట్లు, లిబ్బోటి నలయింతు నేమి సేతు
విషమవృత్తిఁ బొసంగ విష మేషుఁ డదయుఁడై, విదలించుఁ జిత్తంబు వివశమయ్యె
దగు నుపాయముఁ జెప్ప ధన్యు లెవ్వరు పోరి, గెలిచి గైకొనుమంచుఁ దొలుతఁ బలికె
నోడఁబడి యాసేత కూహింతు నేని య, న్నెలఁత కే నోడిన నిఖిలజగము

గీ॥ నవ్వ నయశంబు పాలౌదుగనన్నుఁబోలు, ధూమ్రలోచనముఖులెల్ల ధూళిఁగలసి
రేను గెలిచెద ననుధైర్యమెట్లుగలుగు, దైవము జయాపజయకర్తతలఁచిచూడ.

గీ॥ సమబలులతోడయుద్ధంబుసలిపి గెలుపు, నోటమియుఁబొందుటుచితంబుయువతిచేతి
మృతి గతి నొసంగనేరదిమ్మెయిగణింప, రెంటఁజెడనయ్యె బ్రతుకు వాల్గంటివలన.

మ॥ సురమాయామయచర్య యీ సుదతియై చూపట్టె నిబ్బోటి యా
సురవిధ్వంసనకేళి సల్పు నిచటన్ సొంపౌనె? సామాదులన్
దరమానే? తెలుగంటి గుంపుల యెడన్ దార్కొన్న చో భేదముల్
సరిగాఁ దోఁపదు దండసాధ్యగతి యచ్ఛంబై పొసంగెన్ గదా. ౯౧

కం॥ జయమో? యపజయమో? యెట్లయినన్ గానిమ్ము కాంత నాహవకేళిన్
బయిकొనుదు నన్న నిచ్చెలి,మెయి నలుగుల నొవ్వనేయమెయికొను టెట్లో. ౯౨

చ॥ అని మరణంబె మేలగు జయాపజయంబులు దవ్వ నేల? మ
ద్ఘనశర వేదనానలము గ్రమ్మఁగఁ జేసెదఁ దాళలేక యీ
వనజదళాక్షి యోటజెన, వాంఛితసిద్ధియె యట్లుగాక యొం
డనఁ బనియేమి యంచని దృఢాశయుఁడై ధృతకార్ముకస్థితిన్. ౯౩

ఉ॥ జ్యానిర్ఘోషముచే దెసల్ బెదర రంహస్స్ఫూర్తి ఝుంఝానిలా
నూనపత్రిక్రియ నొప్పుచున్ మదపుటేన్గుంబోలి గర్జిల్లుచున్
సేనావారముఁ జేయి వీచి శరనిక్షేపక్రియోద్యుక్తుఁడై
మానంజాలక దేవిఁ జూచి పలికెన్ మత్తిల్లి శుంభుం డొగిన్. ౯౪

గీ॥ నామనఃకామ మిది గాదు నలిననయన!, నీమనఃకామ మిటులై నసినీరజాస్త్ర
డిరువురకు సాక్షి యింక నీవిచ్చ నిన్ను, గెల్తు నను నాస సట సుమీ కేవలముగ.

మ॥ రమణీ! ధర్మము గాదు సుమ్మిది ధనుర్దండంబుఁ జేపట్టి యు
ద్ధము నేయంగమకించు; టింతులకు నౌద్ధత్యంబు రాణించునే?
బొమలే విండ్లు శరాళి చూపులు మనోభూహావభావంబులే
యమలాస్త్రంబులు లక్ష్యమౌఁ బురుషుఁ డాహా! బేలవై తేలొకో? ౯౫

శా॥ త త్సన్నాహమె? యంగరాగము, సఖీతండంబులే? సారథుల్
త త్సంకల్పము వేఱు తూణములు సత్తారుణ్యపున్నేరుపుల్
తత్సంభూతములైన యీర్ష్యలు తదర్థప్రాప్తి భేరుల్ రహో
మాత్సర్యంబులు పోరితంబులు సుమీ మాబోట్లతో బోటికిన్.

కం॥ యోషామణులకు జగతిన్, భూషామణి సిగ్గు దీనిఁ బో విడిచి వధూ ౯౬
వేషముఁ జెడి యీ లీలన్, భీషణములు చూపనేల? బేలవె బాలా?

సీ॥ గదఁబట్టి వైరిపైఁ గదిసి మార్కొనువేళ, మందయానం బెందు మాటఁగలవు
ఆకర్ణకార్ముకాభ్యాకర్షణంబులఁ, గఠినస్తనము లెట్లుగప్పఁగలవు
అభియాతితోఁ బోర నాగ్రహించుచును బిం, బాధరం బెట్లు పల్లానఁగలవు
కలకంఠధిక్కారికలకంఠమున ఘోర,సింహనాదం బెట్లు సేయఁగలవు

గీ॥ నిండుచందురుఁ బోలు నీనెమ్మొగమున, నోటముల దైన్యరసమెట్టులూనఁగలవు
తెలిసి యీజోలియేటికిఁదెచ్చికొంటి, వాగడనుసుమ్ము నాయానహంసయాన!

కం॥ కాళీచాముండి కలా,భీలలు సఖులైరి నీవు బేలవు తన్మం
త్రాలోచన మిత్తెఱఁగున జాలములోఁ, జిక్కు చేపచంద మొనర్చెన్. ౯౩౦

సీ॥ వెలఁదులు సవరించు విరుల సజ్జలుగావు, కర్కశకదనరంగములు గాని
భామినుల్ వేయు వింజామరంబులు గావు, శరగరున్మారుతచ్ఛటలు గాని
వేణువీణాగానవిసరణమ్ములుగావు, పటురాత్రిచరమహార్భటులుగాని
అతులకాశ్మీరగంధాంగరాగముగాదు, క్షతనిర్యదస్రపంకంబుగాని

గీ॥ కామిజను లాడికొను కందుకములు గావు, భయదవైరిప్రహితబాణపటలిగాని
తెలిసి యీ వెట్టి నీ కేల తిరిగి పొమ్ము, తెంపు సేయక నన్నుఁ బాలింపరమ్మ.

సీ॥ సమదగంధగజేంద్రసంచారములు మాని, తెఱనోటిమెక మెక్కి తిరుగనేల
వీను లానఁగ వేణువీణాధ్వనులు మాని, చటులఘంటారవశ్రవణ మేల
సరససౌరభ్యపుష్పస్రజంబులుమాని, కఠినతూణములు మైఁ గట్టనేల
లీలారవిందంబు కేలఁ బట్టుట మాని, విల్లు నంబులు వట్టివిసువ నేల

గీ॥ సరససంగీతసాహిత్యచతురిమములఁ, బ్రొద్దుగడపక వాయసభూరిమాయు
కంకగృధ్రాదిభయదఘూంకరణములను, గడపఁదలఁచితె? యిది మేరగాదు పోర.

సీ॥ రూపయౌవనకళారూఢసౌందర్యంబు, కొఱగాదు పోరాడఁ గోరితేని
లంబోష్ఠివై దీర్ఘలంబాంఘ్రివై ధ్వాంక్ష, వర్ణవై క్రూరవై పరుషవు నయి
కుఱుచవై మార్జారకుక్షివై ఘూకాభ, నయనవై కృశవౌచు నన్ను నెదిరి
కర్కశాలాపవై కఠినవై నాతోడఁ, జెడుగుఁబల్కులను గర్జించితేని

గీ॥ ఆహవం బొనరింతుఁ బుష్పాభమైన, నీదు మే నంపగముల వెన్నికనిలిచి
నొంపఁజాలను నీమేనునింపుగనినఁ, బొలఁతి! మద్ధర్మపత్నితోఁబోల్పఁదగియె.

మ॥ అని దుర్భావలు పల్కుచున్న దనుజాతాధీశుఁ గన్గొంచు వీఁ
డనయుండై కుసుమాస్త్రశస్త్రనిహతిన్ బ్రాపించియున్నాఁడు వీ
నిని నేఁ దారసిలంగరా దనుచు వానిన్ జూచి యోమూఢ! నీ
వనిసేయం దగుఁ గాళితో నుడువు దంభాలాపముల్ వేల్మిడిన్. ౯౩౪

కం॥ చాముండికతో నైనను, గామిత మలరంగఁ బోరఁ గావలయుఁ జుమీ ?
    కామము చేకుఱు నని సం, గ్రామమునకుఁ గాళిఁ జూపి కాళికి ననియెన్. ౯౨౫

— కాళికా శుంభుల యుద్ధము —

ఉ॥ కాళిక! నీదు ఘోరశరకర్కశతన్ దనుజేంద్రుతోడ నా
    భీలతఁ బోరి రూపడఁచి వేగఁగగు తద్బలమెల్లఁ గూల్చి యు
    ద్వేలపరాక్రమస్ఫురణ దేవజయం బొనఁగూర్చు మన్న న
    క్కాళి భయంకరోగ్రతరకాయము నింగిఁ బెరుంగఁజేయుచున్. ౯౩౬

మ॥ గద సారించుచు శుంభుపైఁ గవయ నుగ్రక్రోధతామ్రాక్షుఁడై
    కదనాభీలగదాధరుం డగుచు నక్కాళీమహాదేవిపైఁ
    గదియన్ దేవమునీంద్రకోటి పొగడంగాఁ బోరు ఘోరాకృతిన్
    బొదలన్ శుంభుఁడు కాళికన్ దఱిమి నైకపుణ్యాంబుచే నేసినన్. ౯౩౭

గీ॥ కనలి కాళిక శుంభుపైఁ గదిసి వాని, యనుపమం బగు రథము రథ్యములఁ గూల్చి
    సూతుఁ దెగటార్చి గర్జితస్ఫూర్తి నెఱప, జృంభితాటోపుఁడగుచును శుంభుఁడంత.

చ॥ అసుర పదాతియై పరిఘు హస్తమునన్ దెమలింపుచున్ బటు
    వ్యసనము లేవఁ దారసిలి వైళమ కాళిభుజాంతరమ్మునన్
    విసరిన మేని వంచనపు నేర్పునఁ దప్పఁ దొలంగి ఖడ్గ ధా
    ర సురవిరోధిబాహువు ధరన్ బడఁగా నఱకె రయంబునన్. ౯౩౯

ఆ॥ ఛిన్నపాణి యయ్యుఁ జిడిముడిఁ గాళిక, నొంచు పరిఘుఁ గొనుచు నురువడించి
    రుధిరధార లొలుకరోషించి వ్రేసినఁ, జిఱునగవున మోము చెంగలింప. ౯౪౦

— శుంభుఁడు ప్రాణము విడుచుట —

మ॥ కరవాలమ్ము కరమ్మునన్ గొనుచు నక్కాళీమహాదేవి భీ
    కరయై శుంభునిఁ బైపయిన్ గవిసి యుగ్రక్రోధవిక్షేపరం
    పరచే భస్మము సేయురీతిఁ జని భీమంబైన రక్షశ్చమూ
    వరు దోర్దండముఁ ద్రెంచి మోదుపఱచెన్ వాల్చూపు లల్లార్చుచున్.

మ॥ కులిశక్షుణ్ణగరుద్గిరీంద్రము బలెన్ ఘోరాకృతిన్ గాళికన్
    జల మొప్పారఁగ నంటఁబ్రాకు నసురన్ జంచత్కృపాణంబునన్
    దల డొల్లన్ ధర డొల్ల నేసి కకుబంతంబుల్ కదుర్ ఘూర్ణిలన్
    గులశైలప్రతిరావకృద్రవముల్ గుప్పించి యార్చెన్ వడిన్. ౯౪౨

చ॥ తల దెగి వజ్రపాతమునఁ ధాత్రిని గూలిన కొండవోలె సే
నలు చెదరంగ శుంభుఁడు రణంబునఁ బడ్డ సురల్ మునీంద్రులున్
గలకల నవ్వుచున్ గలసి కాళి నుతించిరి చల్లగాడ్పు లిం
పొలయఁగ వీచె దిక్కులు ప్రభోన్నతి మించె రహించె వహ్నులున్. ౯౪౩

క॥ హతశేషులైన రక్కసు, లతిభీరుత నాయుధంబు లవనిన్ బడనే
సి తలల్ వంచుచు నంబిక, కతులనమస్కృతు లొనర్చి యతిదీనతచేన్.

శా॥ తల్లీ! నీయెడ సాపరాధులము చిత్తం బిచ్చి రక్షింపు మా
యుల్లంబుల్ భయభీతముల్ కరుణ లోనూనన్ దగున్ సంపదల్
కొల్లల్ వోయిన నెందునేని బ్రతుకన్ గూర్మిన్ గటాక్షింపు మం
చెల్లన్ రక్కసు లిట్లు వేడినఁ గృపావిష్టాప్తి మన్నింపుచున్. ౯౪౪

క॥ పాతాళముఁ జనుఁడంచును, బ్రీతి నభయ మొసఁగ మ్రొక్కి పృథుభక్తిమెయిన్
వే తరలి సోఁకుమూఁకలు, పాతాళతలంబుఁ జేరి బ్రతికిరి పెలుచన్.

సీ॥ జనమేజయక్షితీశ్వర! దేవివృత్తంబు, వినిపించితిని వింటె వీను లలర
సావధానుండవై సంస్మరించిన జగ,జ్జనయిత్రి నీకు సాక్షాత్కరించు
నేతదాఖ్యాన మెవ్వఁడేని పఠింప, విన సంగ్రహింప దేవీకృపాప్తిఁ
బుత్రమిత్రకళత్రపాత్రసంపద్భోగ,భాగ్యాభివృద్ధిచేఁ బ్రబలి శౌర్య
ధైర్యగాంభీర్యచాతుర్యాదికంబుల, ననితరసాధారణానుభూతిఁ

గీ॥ జెలఁగి యిహమున సత్కీర్తిఁ జెంది పరమునందు జగదీశ్వరీస్వరూపైక్యమొంది
కారణత్రయి కందఁగఁ గాని నియత,నిశ్చలానందసంధాననిరతిఁ గాంచు.

ఉ॥ సాత్యవతేయుఁ డిట్లు మహిషప్రముఖాఖిలదుష్టశిక్ష నా
దిత్యులఁ బ్రోచినట్టి కథ తెల్లముగా విని పల్కెఁ దాపసా
దిత్య జగజ్జనిత్రిని క్షితిన్ భజియించిన వార లెవ్వ? రా
కృత్యము లెత్తెఱంగులు? ధరిత్రిఁ బ్రసన్నతఁ గాంచె నేరికిన్. ౯౪౭

కం॥ ఆ వృత్తాంతము వినఁగా, నావహిలెన్ జిత్తవృత్తి యఖిలాండేశీ
భావుకచరితము వినుటయె, కేవలసాయుజ్యసిద్ధి కృతకృత్యులకున్. ౯౪౮

కం॥ కరుణించి తత్సమర్చా, విరచనవిధి విశదఫణితి వివరించి పరా
కరుణాప్రసాద మొందిన, నరుఁ డెవ్వఁడొ తెలుపవలయు నా కవ్విధముల్.

చ॥ అని జనమేజయుండు చరణాబ్జములన్ దలమోపి వేడినన్
మునిపతి రాజుఁ జూచి స్మరమోహనమూర్తి కలండు ధాత్రిలో

సురథుఁ డనంగ నా నృపతిసూర్యుని వృత్తము విన్మ తెల్పెదన్
వినినఁ జిరాయురున్నతులు విశ్వవిభుత్వము వారి సొమ్మగున్. ౯౬౧

—• సురథుఁడను సత్యవ్రతుని వృత్తాంతము •—

సీ॥ స్వారోచిషుం డను జనపాలు మన్వంతరమున సత్యవచస్కుఁ డమలచిత్తుఁ
డగ్నివర్ణారాధనాసక్తుఁ డతిశాంతుఁ, డస్త్రపారంగతుం డాత్మవేది
పరసతీవిముఖుండు భావజ్ఞుఁ డాగమ, వేది కర్మరతుండు వెలయు నతఁడు
హస్త్యశ్వరథపదాత్యాపళుల్ గొలువంగ, నుర్విఁ బాలింపుచు నున్నయెడల

గీ॥ బలములను గూర్చికొని మ్లేచ్ఛపతులు కడిమి
మెఱసి గుంపయి యా రాజు మీఁద నెత్తి
ధరణిఁగొను నాస నొకతఱిఁ దారసిలిన
దురము సేయఁగడంగి యాధూర్త నృపుల. ౯౬౨

మ॥ భుజసంరంభవిజృంభితుం డగుచు నంభోరాశితో సాటియౌ
నిజసేనన్ గొని పోరి పోరి రిపురాణ్ణిర్వాపితోద్యద్బల
వ్రజుఁడై దైవవశంబునన్ విహతుఁడై భర్జింపఁగా లేక ని
ర్ధ్వజినీకుండయి వీడు చేరి బలవర్థ్వానంబుఁ జింతింపుచున్. ౯౬౩

చ॥ నిజసచివుల్ విపక్షులకు నెయ్యురుగాఁ గనిపెట్టి వారితో
గుజగుజమాని దుర్గమునఁ గొన్ని దినంబులు డాఁగి మీఁదటన్
భుజబలవిక్రమంబునను బోరుట మేలని యూహచేసి య
గ్గజిబిజి మాన్పఁగాఁ గలుగు గండి వసించి తలంచె నాత్మలోన్. ౯౬౪

మ॥ తనవా రెల్లను శత్రుపక్షవశులై ధర్మంబుఁ బోనాడి దు
ర్జనులై యుండిరి నమ్మరా దిచట నాజాడన్ బరీక్షించి యొ
య్యన వైరిన్ గొనివచ్చి చూపఁగల రట్లాచోటఁ జేయంగ నే
యనువున్ జొప్పడ నేర దెద్ది గతి మాయాపుల్ గదా? శాత్రవుల్. ౯౬౫

మ॥ ధనకాంక్షాపరులైన వారలకు మిత్రభ్రాతృపుత్రాదిభే
దనముల్ నైజము లందు లోభనిరతుల్ తథ్యం బమాత్యుల్ గురుం
డని దేవుండని చూచువారలె యథార్థయత్నుల్ కడు న్మత్తు, లం
చని నిర్ధారణచేసి సాదియయి దుర్గావాసమున్ మానుచున్. ౯౬౬

—• సురథుండు సుమేధుని గనుంగొనుట •—

మ॥ అసహాయుండయి దుర్గమున్ విడిచి యేకాంతంబుగా సాధ్వస
వ్యసనుండై యతిఘోరకాననమునన్ వాస్తవ్యుఁడైయుండి యం

త సమీపంబునఁ దాపసాశ్రమపు వార్తల్ విని సచ్ఛోటికిన్
వెసమైఁ బోయి సుమేధుఁ డన్ ఘనముని న్వీక్షించె భూమీశుఁడున్. ౯౭

వ॥ మఱియును రసాలతాల తమాల తక్కోల హింతాల ప్రభృతి నానావిధ మహీరుహశీతలచ్ఛాయాజటిలంబును, నతిమృదులనదీపులినవిశాలంబును, నిర్వైరశ్వాపదాకీర్ణంబును, గలకంఠకులకంఠకాకలీవిలసితంబును, శిష్యపరంపరాభ్యస్యమానశ్రుతిశబ్దాఢ్యంబును, నానామృగగణావృతంబును, నీవారాన్నకందమూలఫలాదిశోభితంబును, హోమధూమసుగంధప్రాణిప్రీతిదాయకంబును, నవధీరితస్వర్గసుఖంబును నగు నత్తాపసాశ్రమంబు గాంచి విశ్రమించి తురంగంబు నొక తరుమూలంబున బంధించి వినయాన్వితుండై మృగాజినాసనాసీనుండును, శాంతుండును, దపఃకృశుండును; శిష్యాధ్యాపిత వేద శాస్త్రార్థవిమర్శుండును, గోధలోభవియుక్తుండును, ద్వంద్వాతీతుండును, విమత్సరుండును, నాత్మజ్ఞానరతుండును, సత్యవాదియు, శమసంయుతుండును నగు సుమేధుం గాంచి, దండవత్ప్రణామం బొనర్చి, తత్సన్నిధి నశ్రుకణాపూర్ణనయనుండై యున్నయంత. ౯౮

శా॥ ప్రేమార్ద్రుం డయి మౌనివర్యుఁడు శుభాశాభిప్రాయగర్భంబుగా
భూమీవల్లభు లేవనెత్తి కరుణాస్ఫూర్తిన్ దగం జూచుచున్
బ్రేమన్ శిష్యునిచే సుఖాసనము నర్థిం దేరఁగాఁ బంపి యం
దామోదంబున నిల్పి యర్ఘ్యమును బాద్యం బిచ్చి భూపాలునిన్. ౯౯

ఉ॥ ఎచ్చటి కేగువాఁడవయి యిచ్చటికిం జనుదెంచినావు నీ
వొచ్చెము లేని భక్తి మము నొయ్యనఁ జేరుట కేకతంబు? సం
పచ్చయ మెల్లఁ దూలి కడు బన్నము నొంది విషాదయుక్తిచే
వచ్చినయట్లు దోఁచె జనవల్లభ! మా కెఱిఁగింపు నావుడున్. ౧౦౦

గీ॥ ఏను సురథుం డనెడివాఁడ నెల్లరిపులు, చుట్టుకొని పోర రణములోఁ జొచ్చికలఁచి
దైవవశమునఁ బరిభూతిఁ దవిలి భూమి, గోలుపోయితి వనమున గూఢవృత్తి. ౧౦౧

చ॥ అడఁగి విరోధిభీతి నిఖిలావని నొంటిగఁ గృచ్ఛ్రవృత్తిచే
గడపుచుఁ బూర్వజన్మశుభకర్మవశంబున మిమ్ముఁ గాంచితిన్
జడుఁడఁ గృశుండ నార్తుఁడను సాధ్వస మెల్ల నడంగఁ జేసి నా
యెడరు తొలంగఁ జేసి కృప నేలుటకై తలపోయుఁ డీరనన్. ౧౦౨

కం॥ మాయాశ్రమమున వైరుల, మాయా కృత్యములు సొరవు మది బెదరక సు
స్థేయుఁడవై యుండుము నిర, పాయము నీ జీవనంబు భవ్యచరిత్రా!

ఉ॥ ఈ వనమధ్యమందున నరహింసకర్తల్ వసియించి వన్యసం
జీవికచే మదాశ్రమము సిద్ధసుఖాస్పదమం చెఱింగి యీ
దైవిక సంకటంబు విడఁదాఁటుము నీ కభయం బొసంగితిన్
గావున నీకు మేలగు నకల్మషవృత్తిఁ జరింపుమీ? యనన్. ౯౬౪

ఉ॥ సంతసమంది యానృపతి సంయమిమౌళి సుమేధు నాశ్రమా
భ్యంతరవాసియై ఫలజలానిలకందములన్ స్వపోషణం
బెంతయు వేడ్కఁ జేయుచు నభీష్టసుఖంబుల నొంది నిర్భయా
క్రాంతమనమ్మునన్ నిలిచెఁ గార్యగతిన్ దరుమూలవాసియై. ౯౬౫

వ॥ అట్లుండి యొక్కనాఁడు. ౯౬౬

మ॥ తన వృత్తాంతము రాజ్యభోగము మహౌదార్యంబు సంపత్తియున్
వనితాపుత్రసఖాదులున్ హయగజాశ్వప్రౌఢవీరావళీ
ఘనసంరంభము దోర్బలంబు మొదలౌ గాటంపు పెన్ వైభవం
బనిమిత్తంబుగ సంస్మరించి మిగులన్ వ్యగ్రాంతరంగస్థితిన్. ౯౬౭

సీ॥ అవనీభరం బరిహస్తగతంబయ్యెఁ, బాపకర్ములచేత బద్ధులగుట
బంధువులెల్లను భంగముల్ పొందిరి, యాఁకలి డస్సె మా హయాదికములు
బ్రాహ్మణజీవనపద్ధతుల్ నశియించె, బరిచారకులు వైరిపక్షులైరి
మత్పాలితులు పాటి మాటున డాఁగిరి, ధనములెల్లను నసద్వ్యయమునొందె
గీ॥ పాత్రదానమ్ములెడలెఁ బాపములు బలిసెఁ, గోశముక్షయించె మిత్రాళికుదికిలఁబడె
ననుచుఁ జింతాసమాక్రాంతుఁడగుచు సురథుఁ, డగణనీయవ్యథావ్యాప్తివగచి వగచి.

—॰ సమాధి సురథునితో మైత్రిచేయుట ॰—

గీ॥ వెతలఁ గలఁగుచు నున్నయవ్వేళ నొక్కఁ, డూరుజుండందుఁ జనుదెంచి యుబుసుదీర్ప
శీతలచ్ఛాయ వసియింప క్షితిభుజుండు, వానిఁ గనుఁగొని పలికె నసద్వాక్యఫణితి.

శా॥ ఏదేశంబుననుండి వచ్చితివి నీ వెవ్వాఁడ వాఁకంట నే
లాదైన్యంబున నున్నయట్లు మది నుత్సాహాల్ గొల్పె సత్సఖ్యమౌఁ
గాదే? సాప్తపదీన, మట్లగుట శంకల్ మాని నీవృత్తమున్
బ్రాదుర్భూతమనఃప్రమోదమున సంభావించి పల్కందగున్. ౯౭౦

కం॥ పలుమఱు ధరణీపతి యిటు, వలికిన నవ్వైశ్యవరుఁడు పాటించి నిరా
కులమతి ధరణీపతితోఁ, బలికెన్ సత్సాధుసంగపరతామతియై. ౯౭౧

చ॥ అధిప! కిరాటవంశ్యుఁడ సమాధి యనందగు పేరివాఁడ ధా
న్యధనవివృద్ధులన్ దనరి యక్షయధర్మవిచక్షణుండనై

బుధులకు నర్చ సల్పుచు స్వవిభూతికొలందిగ దాతనై తథా
విధసుగుణేడ్యతన్ జెలఁగి విశ్రుతవృత్తి సుఖించుచున్నెడన్. ౯౨౨

మ॥ ధనలోభంబునఁ బుత్రులున్ బడఁతియున్ దద్బంధులున్ దొమ్మిగా
నను బంధించి ధనంబుఁ జేకొనిన విన్నంబోయి యిల్ రోసి కా
ననసీమంబడి యాకలంబుఁ దినుచున్ గాలంబు యాపింతు నీ
వనవాసంబున కెద్ది హేతువు? భవద్వార్తన్ వినంగోరెదన్. ౯౨౩

ఆ॥ చిత్తమిచ్చి నాదుచెలిమిఁ బరీక్షించి, తెలుపవలయునన్న నలరి విభుఁడు
సురథుఁడనెడు రాజసూనుఁడ రిపులచే, జితుఁడ నగుచు నడవిఁ జేరినాఁడ. ౯౨౪

శా॥ పూజ్యంబై తగు రాజ్యమున్ విడిచి యీ భూభాగమున్ జేరి సా
మ్రాజ్యశ్రీసుఖసంపదం దనియు గాత్రింబిడ్డభృత్యంబులన్
ద్యాజ్యంబౌ నని లోఁ దలంచి గహనవ్యాపారులన్ గూడితిన్
వ్రజ్యాయాసము మాని నిల్వుము సుఖావాసంబునన్ నీవునున్. ౯౨౫

కం॥ మన కిరువురకున్ సఖ్యం, బనుకూలము నిర్భయంబు నను విది నిలువన్
మనమునఁ దలపోయుమనన్, జనపతిఁ గని వైశ్యుఁ డనియె సాధూక్తులచేన్.

సీ॥ స్వస్థంబుగాదు మదాత్మాంతంబు పుత్రులపై నాసవిడదు, సంపాదితంబు
ధనము వేలకొలంది ధర్మశూన్యులచేతఁ, జిక్కి దుర్వ్యయములచే క్షయించె
నధ్యక్షహీనత నస్మత్కుటుంబంబు, వ్యసనార్తమై యెంత వనటఁ గనెనో!
దారసౌఖ్యములేక తనయసౌఖ్యములేక, చింతపాలై మేను జిక్కె నధిప!

గీ॥ కూటిపై నీటిపై బుద్ధిగొనదు కంట, నిదుర లేదెందు నేనియు నిలువఁజాల
వలయు వారెల్ల విడిచిరి వారి విడువఁ, జాలకున్నాఁడ ననిన భూపాలుఁడనియె.

ఉ॥ బాలిశులై సుతాదికులు పాతకమంచని చూడ కయ్యయో!
మాలిమి మాలి నిన్ను నవమానము చేసిన వారిపై దయా
శీలుఁడ వౌట మొగ్గునకుఁ జిక్కుచు "గొంగడి గాదు వీడినన్
జాలదు నన్ను వీడ" నను చాయగదా? యిటు లేలనా నన్. ౯౨౮

చ॥ హిత మొనరించు వైరికిని నీడనరాదు సుహృత్తు; దుష్టసం
గతి నపకారి యేనియును గాదు సఖుం; డరి యట్టు లయ్యు సం
తత మపకారి యయ్యును బదంపడి యాత్మజునుండు గావ్యుఁ డం
చతిశయధర్మవాదు లిటులాడుదురెట్లఁగద? యట్టు లౌటచేన్. ౯౨౯

ఆ॥ బాలురగుట నన్నుఁ బలిచి రంచని మది, దారపుత్రముఖుల దండ విడక
యేచుచున్న దింక నెద్ది యుపాయంబు, విడువఁజాల నిల్లు విభువరేణ్య! ౯౩౦

చ॥ అన విని రాజు వల్కె వినుమా! నను నిట్టుల యేచుచున్నదీ
యనవరతప్రభూతచతురంగబలోద్భటసంగరక్రియా
ఘనతరరాజ్యవైభవసుఖప్రతిరోధి విరోధి జన్యమై
యెనసిన దుఃఖ మిట్లగుట నిర్వురమున్ మునిఁ వేడఁగాఁ దగున్. ౯౦౧

క॥ రమ్మని కోమటిఁ జేకొని, యమ్మునిసన్నిధికి నేగి యడుగులఁ బడినన్
లెమ్మని యిర్వుర నెత్తి దయ మ్మునివర్యుండు పల్కె నాదరణముతోన్. ౯౦౨

మ॥ అసహాయంబున నస్మదాశ్రమనివాసాలోలతన్ నిచ్చలున్
మసలన్ నీ కొక మిత్త్రుఁ డీతఁ డెవఁ! డెట్లమ్మాడ్కిన్ జతన్ గూడె? ని
క్కస టూనన్ బనియేమి? యెవ్వరు నినున్ గారించి? రీవృత్తమున్
వెస మాకున్ వినిపింపు మన్న విని యుర్వీనాథుఁ డమ్మౌనితోన్. ౯౦౩

సీ॥ మానీంద్ర! యితఁడు కోమటి దారపుత్త్ర పౌత్రాదుల వలన నిరస్తుఁ డగుచు
వనవాసి యై నన్నుఁ గని మైత్రి వాటించె, బటుకుటుంబవియోగబాధ నొంది
మఱుఁగుచున్నాఁడు నెమ్మది శాంతి నానఁడు, నేనును బాలించునేల విడిచి
వనచారి నై యిట్లు వనట నొందితిఁ గడు, వెతఁ గుందుచున్నాఁడ నేవేయు నేల
గీ॥ ధనము వమ్మయ్యెఁ జతురంగతతులు సమసెఁ, బుత్త్రమిత్త్రకళత్త్రవిభూతిసహిత
బహుకుటుంబంబు నన్నుఁ బాసి బాధనొంది, కుందుచుండునటంచు నెక్కొనియెఁ జింత.

మ॥ జగమా మిథ్య, సమస్తసంపదలునున్ స్వప్నాభముల్, మేను లే
వగ వర్తించిన నమ్మరాని వని యావద్బోధ లోఁ గల్గియున్
దగు మార్గంబును మానసంబు దృఢతన్ దార్కొదు మీపాద మా
న గుణోద్భూతి పొసంగ దెట్లు గడతున్ దైన్యంపుటంభోనిధిన్. ౯౦౫

ఉ॥ ఘోటము లేనుఁగుల్ ద్రవిణకోటులు పుత్త్రులు మిత్త్రులున్ జగ
న్నాటకసూత్రధారి ఛలనాట్యమటంచని తెల్వి గల్గియున్
మాటికి మాటికిన్ బుగులు మానని చింత మునింగి నాఁడ నె
ప్పాటఁ దరింతు? మానిజనభాస్కర! మోమునఁ దెల్విమాలితిన్. ౯౦౬

చ॥ నను విడనాడె వైభవము నా మది డస్సి విడంగలేక యీ
వనటకుఁ బాలుపడ్డది యవశ్యము మీ కెఱుఁగంగఁ బోలు నీ
ఘనతర మోహకారణపుఁ గందువ నా కెఱుఁగంగఁ జేయు మో
మునివర దానిఁ బాసి కడుమోదమునొంది సుఖింతు నం చనన్. ౯౦౭

సీ॥ రాజేంద్ర! వినుము కారణము మోహమ్మున, కెద్ది యంచని సంశయించి ప్రశ్నఁ
జేసితి వివరించి [illegible] కారణంబు

బ్రహ్మవిష్ణ్వాదులు ॥ ప్రాణికూటంబులు, సురలు గంధర్వకిన్నరులు తరులు
పశుపక్షిమృగములు సంభవాళి ప్రపంచంబు, మాయచే జిక్కి యిమ్మాడ్కి దిరుగు

గీ॥ స్థావరము జంగమంబును ॥ దద్వశంబు, మోహజాలవృతంబు సమ్మమము ధరిత్రి
నీవనఁగ నెంత? రాజసభావనుఁడవు, క్షత్రియుండవు మోహసంకటము విడునె?

—• బ్రహ్మ విష్ణు సంవాదము •—

గీ॥ సర్వసంసార నాశనక్షమము దెలియ, జ్ఞానమొక్కటి సుమ్ము ప్రజ్ఞాఘనమ్ము
బ్రహ్మవిష్ణ్వాదులెల్లను రాగవశత, భ్రమణ మొందుదు రొరు లెట్లు గాయగలరు.

వ॥ రాజేంద్రా ! తొల్లి కృతయుగంబున నారాయణుండు శ్వేతద్వీపంబున బ్రహ్మ
విద్యాప్రసక్తుండై పదివేల వర్షంబులు విపులతపం బొనర్చి, యనశ్వర సుఖ
ప్రాప్తి సిద్ధించుటకై చింతించుచుండె. బ్రహ్మయును బరమాద్భుతం బగు నొక్క
నిర్జనప్రదేశంబున మోహనివృత్తి నభిలషించి తపించె, నిరువురకుం దపస్సిద్ధి
లభింపక తత్తద్దేశంబులం దత్తదాశ్రమంబుల నిట్లు దపించుచు నొక్కయెడం గలసిన
తఱి నన్యోన్యంబు నీవెవ్వండవు నీవెవ్వండ వని ప్రశ్నంబులు నడచె నయ్యెడ
నవ్విరించి వాసుదేవున కిట్లనియె. ౯౯౦

ఉ॥ ఏను జగంబులెల్లను సమాహితబుద్ధి సృజించినాఁడ వి
ద్యానిధినై సమస్తజగదంతరచేతనరూప మొంది వి
జ్ఞాన ఘనుండనై నిగమజాలములెల్ల సృజించి యర్థసం
ధాన మొనర్చి నిర్గుణపదస్థితి బ్రహ్మమునై వెలింగెదన్. ౯౯౧

కం॥ సర్వజ్ఞుఁడ సర్వగుణుఁడ, సర్వాతీతుండ సర్వసాక్షిని నేనై
సర్వము పరిపాలించెద, సర్వము నే ననినఁ గనలి ॥ జలజాక్షుఁ డనెన్. ౯౯౨

ఉ॥ ఎక్కడివాఁడ వీవు? జగమెల్ల సృజించి భరించి తుంచి నల్
దిక్కులు నేనమైన పరదేవుఁడ సత్త్వగుణుండ నీవు నా
కెక్కుడుగావు రాజసగుణాధితవృత్తివి దుర్బలుండ వీ
వక్కట ! నీ వెఱుంగవె సమాహితవృత్తిఁ దలంచి చూడుమా. ౯౯౩

శా॥ సంవర్తంబున దానవుల్ బెరసి నిన్ ॥ సంక్షోభ మొందింపవా
రిన్ వారింపఁగ లేక నా కడకు నిర్విణ్ణుండవై చేరినన్
సంవాదంబున వారలన్ గెడపి నిన్ సంరక్షణన్ సల్పితిన్
కింవాదంబుల గర్వివై మసలి తీ కించిజ్ఞతల్ మానుమీ. ౯౯౪

క॥ మందుఁడవై మోహాంధత, నం దొడరెద వీవు కలఁడె ॥ నా కధికుం డీ
చందము తగ దిమ్మాటలు, పొందవు వే చనుము చెడుగుబాములు తగునే.

ఉ॥ ఇట్టుల నిర్వురుం గలసి ♦ యేపునఁ గన్నులు శోణితప్రభల్
దొట్టఁగ నోష్ఠముల్ గదల ♦ దూఁకొని పోరొనరింప నంతలోఁ
బుట్టెను వారిమధ్యమున ♦ భూర్భువరాదుల మించి దీర్ఘమై
మట్టెఱుఁగంగ రాని యతిమానుషలింగము దివ్యరూపమై. ౯౯౫

ఉ॥ కన్నులు ద్రెప్పలెత్తి కనఁగా వసపోవక దివ్యకాంతులుం
మిన్నును మన్ను నేకమయి ♦ మించుచు మంటలు గ్రమ్ముచుం దురా
పోన్నతి నంతకంతకును ♦ నూర్ధ్వజగంబులు దాఁటి పోవఁగా
మిన్నక బ్రహ్మవిష్ణువులు ♦ మేమెయిఁ జూచుచు నున్నవేళలం. ౯౯౬

ఆ॥ అంతలోన మింట ♦ నశరీరిణీరూప, మైన యట్టి మాయ ♦ యంబుజాక్షు
వనజభవులఁ గాంచి ♦ వాదింపఁ బనియేమి, వాదు విడుఁడు శాంతిఁ వలయుమీకు.

ఉ॥ మీఁదును గ్రిందునుం గనఁగ ♦ మేర యొకించుక లేక నిశ్చయా
పాదనశక్తి చాలక భవత్ప్రముఖుల్ వెఱఁగంద బ్రహ్మము
ఖ్యాదుల కందరాక పొడవై వెలుఁగొందెడు దివ్యలింగముం
బాదములం శిరంబుఁ గని ♦ పొగ్రిమఁ జూపుఁడు గౌరవం బగుం. ౯౯౮

గీ॥ అడుగుఁజూడంగ నచ్యుతుండరుగుఁ గాక,యీవు శీర్షంబు గనఁజను ♦ మిరువురిట్లు
చనినఁగడఁ గన్నవారికి ♦ సర్వశక్తి, గలుగు నాతండు పూజ్యుఁడౌఁగాక యనిన.

ఉ॥ ధాతయు సమ్మతించె నిటు ♦ తామరసాక్షునకుం వచింపనోఁ
గాత మటంచు నిర్వురును ♦ గౌతుక మందిరి యచ్యుతుండు వి
ఖ్యాతవరాహరూపమున ♦ క్ష్మాతలభేద మొనర్చుచుం జనెఁ
ద్యోతలమెల్ల నారయుచు ♦ ధూర్వహుఁడై చనె స్రష్ట మింటికిం. ౧౦౦౦

ఉ॥ విష్ణుఁడు గొన్నియేండ్లు చన ♦ విశ్వమయం బగు లింగమూర్తి రో
చిష్ణు మహాకృతిం గనుచుఁ ♦ జితేంద్రియమానసుఁడై తనంత వ
ర్ధిష్ణుత నంతకంత కతిదీర్ఘతరం బని డస్సి చూతు నం
తృష్ణ యడంగి తొల్లిటి గతిం బడి మట్టునఁ జేరె హృష్టుఁడై. ౧౦౦౧

ఉ॥ రోషము మిన్నుముట్టి తలఁరోయుచు మింటికిఁ బోయిపోయి మేం
శోషిల లింగమూర్తి తుద ♦ జొప్పరయం వసపోక ఖిన్నుఁడై
ఘోషిలునంతఁ బారిషదకోటి యజింపఁగఁ దూలిరాలు పు
ష్పేషువిపక్షశీర్షధృత ♦ మిమ్ముఁగఁ గాంచెను ధాత కేతకిం. ౧౦౦౨

క॥ కాంచి మదీయమనోరథ, మంచద్గతి నొందెనని ప్రహర్షించుచు న
క్కాంచనగర్భుఁడు [illegible] విశిష్టుఁడపోలెం. ౧౦౦౩

ఉ॥ పోయితివే విధాత! యహిభూషణు మూర్ధముఁ గంటె? యన్న నా
రాయణుఁ గాంచి చూచితి వృషాంకుశిరం "బిది సాక్షి" యంచు దో
షాయతి కోర్చి కేతకి నహంకృతిఁ జూపిన యట్లపల్కె నాఁ
గా యని యంతలోన గిరికార్ముకుఁ డద్భుతదివ్యమూర్తియై. ౧౦౦౬

—• ఈశ్వరుఁడు విధివిష్ణులకుఁ బ్రత్యక్షం బగుట. •—

సీ॥ పక్షవిక్షేపక్షుంభన్మహాకలధౌత,కుధరమో యను నందికుజ్ఞ నెక్కి
జయజయధ్వనులచే సందడించుచు మాని, సురసమూహము లెల్లఁ జుట్టునడువ
వ్యాఘ్రచర్మోత్తరీయంబు వక్షంబునఁ, బసిఁడినిగ్గులు దేఱి పరిఢవిల్ల
నఱమేన మగరాయి హరినీలమునఁగూర్చు, నోజ నెమ్మోయి గౌరియుల్లసిల్లఁ

గీ॥ బ్రిమథు లిరువంకఁ జెలరేఁగిబలిసి కొలువ, దిశల జాజ్వల్యమానమై దీప్తిమెఱయ
హరివిరించులనడుమ లింగాంతరమున, హాటకాచలధన్వి ప్రత్యక్షమయ్యె.

గీ॥ హరివిధాతలు లేచి సాష్టాంగమిడుచు, సన్నుతించుచు నున్న నచ్చమగు ప్రేమ
వెన్ను మన్ననఁ జేసి యవ్విశ్వగురుఁడు, పలికె నిట్లని మధురసంభాషణముల.

ఉ॥ మెచ్చితి నిన్నుఁబోలిన యమేయగుణుల్ గలరే? త్రిలోకిలో
నొచ్చెములేని బుద్ధులకు నొజ్జవు సాత్త్వికమూర్తి వీవు లో
కోచ్చయమెల్లఁ బ్రోచు సుగుణోదధి విట్టి నినున్ నుతింపఁగా
వచ్చునె? వేయునోళ్లు గల వాయుభుగగ్రణికిన్ రమాధిపా! ౧౦౦౭

ఆ॥ ద్రోహమనుచుఁ దెలిసి ద్రుహిణుండుసడికోర్చి, నిన్ను గెలువ దలఁచి నిందు్యఁడయ్యె
నాదు శిరముఁ జూడ నలువకుఁ దరమౌనె?, కంటి ననుచుఁ బల్కె గర్వమెక్కి.

చ॥ శిరమున నుండి జాఱి క్షితిఁ జేరఁగ వచ్చెడు కేతకిన్ నభ
స్సరణిని గాంచి సాక్షి కయి సందు కొనంగ నసత్య మాడి యి
ద్ధరణిని నిందు్యఁడయ్యె విధి దానవమర్దన! తారతమ్య మి
ట్లరయఁగ లేక తాను జెడి దానికి హేయతఁ దెచ్చె నేమనన్. ౧౦౦౯

వ॥ ఇయ్యది సత్పురుషగర్హణీయం బగుటం జేసి నేఁడు మొదలు నాకుం బూజార్హంబు
గాకుండుఁ గాక యనుటయు.

శా॥ మందాక్షంబున మోము వంచె హరి సంభావించి యంతన్ శతా
నందుం డోటఱిమెన్ జగత్త్రయి ననూనప్రక్రియన్ మించె గో
విందుం డప్పటికోలెఁ గేతకి జగద్విఖ్యాతనిందాప్తిచే
నెందున్ బూజ కయోగ్యమై చెడుట భూమీశా! ప్రసిద్ధం బెగా. ౧౦౧౧

క॥ మాయాబల మిట్టిది నా,రాయణ పరమేష్ఠు లిట్టు లైరి యనంగా
నేయెడ నెవ్వరు మాయన్, బాయంగలవారు? నరులపాళమె తెలియన్. ౧౧౧

సీ॥ సర్వేశ్వరుండైన శార్ఙ్గియంతటివాఁడు, ధర్మనిర్మథనైక తత్పరతల
నవతారదశకంబు నందుట తత్తద్గుణక్షోభములఁ జెంది నవయుటెల్ల
యోగమాయాబలోద్యుక్తియే కాదొకో?, కామలోభాదులఁ గట్టువడఁడె
వీతరాగులు మానివిభులును బ్రకృతికి, బద్ధులైయుంట యేర్పడఁగ వినమె?

గీ॥ మాయలోఁగాదె జగమెల్ల మగ్నమగుట, బంధమోక్షప్రదానసంబంధములను
మోహమును జ్ఞానము నొసంగి ముజ్జగముల, మజ్జనోన్మజ్జనముల చేయు మార్చు మాయ.

గీ॥ మాయ యన యోగనిద్రయే మానవేశ!, దేవి జగదంబ సుమ్ము నిర్దేశభేద
మఖిలమును దానయని నగోత్రాధినేత, యమికులవతంసుఁ జూచి యిట్లని యెనపుడు.

ఉ॥ ఎట్టులు సంభవించెనొకో? యెట్టిదో? రూపము నెట్టిదో? బలం
బెట్టిదో? తత్ప్రథంబు మన కిచ్చి కృపామతి యయ్యుదంతమున్
దొట్టిన మోహజాలములఁ దుందుఁడు కెల్లను బాయఁద్రోలి యి
ప్పట్టున దేవివృత్తము శుభంకరవృత్తి వచింపుమీ? యనన్. ౧౧౪

సీ॥ భూమీశ! దేవికిఁ బుట్టువు నాశంబు, లెవ్వియు లేవు వేదేతిహాస
శాస్త్రసిద్ధాంతంబు సంశయింపకు నిత్య, కారణంబుల కెల్లఁ గారణంబు
సర్వభూతాంతస్థ శక్తిహీనం బెల్ల, శవసమానము సుమ్ము! సర్వభూత
సురకార్యసిద్ధికై చూపు నావిర్భావ,మును దిరోధానంబు ముజ్జగముల

గీ॥ వినతు లగువారిఁ బ్రోవ నావిర్భవించు, బహువిధరూపంబులను వారి భంగమణఁచు
నెల్లవారలుఁ బ్రకృతి కధీను లగుదు, రమ్మహాదేవి స్వేచ్ఛచే నధిగమించు.

ఆ॥ కాలవశగ గాదు కాలంబు తద్వశం,బఖిలమునకు నాశ్రయంబు తాన
పురుషుఁ డగుణుఁ డట్టి పురుషాన్యమెల్లను, సగుణ మదియు దేవి సంతు సుమ్ము!

చ॥ పురుషుఁడు సంతసించుటకు భార్యవరాదికనాటకంబులన్
గరము సృజించి చిత్రరసగంధిలమై యదియుం గ్రసించి దు
స్తరమహిమన్ బతిం గవయుఁ దామరసాక్షుఁడు లోనఁగాఁగ నీ
సురలను నాటకగ్రథనసూత్రితఁ గల్పనచేయు భూవరా! ౧౧౭

ఉ॥ కారణకారణంబగుచుఁ గారణమూర్తుల మువ్వురన్ బ్రమో
దారవిచిత్రసంపదల నందఁగఁజేసి సతీముఖాంగనా
వారము తోడుఁజేసి నిజవర్తనలన్ దిరుగంగఁజేయు నె
వ్వారల కంద దా జనని వారలు [illegible] ధ్యానపరాయణులన్. ౧౧౮

గీ॥ తత్కృపాదృష్టిపాత ముక్తమముల యెడలఁ, గలుగుసృష్టిస్థితిధ్వంసకార్యములను
వారలు సమర్థులగుదు రవ్వారిగాఁగ, సిద్ధులెల్లను దదధీనసిద్ధి నొందు. ౧౦_౨౦

ఉ॥ ఈ వొనరించు ప్రశ్నమున కేను వచించితి నాత్మబుద్ధికిం
గేవలగోచరంబయిన గీర్వివృతిం శ్రుతివాగగోచర
శ్రీ వెలయుం జెలంగు మునిసేవధి దేవిమహత్త్వ మెన్నఁగా
నేవిధి గోచరంబగునె! యీశ్వరిమాయ నెఱుంగ శక్యమే. ౧౦_౨౧

కం॥ పరదేవీవృత్తాంతము, సరసమతిం జదువ వినిన సంపద్విద్యా
నిరతోత్సవ సుఖలాభ,స్థిర జయసామ్రాజ్యపూజ్యసిద్ధి పొసంగుం. ౧౦_౨౨

చ॥ అది విని రాజు మౌనిఁ గని యంబిక యర్చన మెట్టులో తత్క్రియా
విదితములైన మంత్రముల విస్మృతి యెట్టిదొ? హోమకర్మ మె
ట్టిదొ ? వివరించి తెల్పుము పఠించిన విన్నను మోక్షసాధనా
స్పద మగుఁగాన నే వినెద సాత్యవతేయ ! దయానుయస్థితిం. ౧౦_౨౩

సీ॥ అన విని జనమేజయక్షితీశ్వర! విన్ము, కామవిజ్ఞానమోక్షదము గాన
వివరింతు నామ్నాయవిధి నవగాహించి, శుక్లాంబరధరుండు శుచియు నగుచు
సంధ్యాదిజపతపస్స్వాధ్యాయ పితృక్రి,పూజ లొనర్చి విస్ఫూర్తి గలిగి
శుభమంటపాంతరస్ఫురిత వేదీమధ్య, సిద్ధిఁ బద్మాసనాసీనుఁ డగుచు

గీ॥ విధివదాచమనక్రియావిధి నొనర్చి యంబికాపూజనస్థాన మనువుపఱచి
పంచశుద్ధిపరుం డయి ప్రాణపవనుఁ, గుంభకస్థునిగా నిల్పి దంభ మెడలి.

గీ॥ నిష్ఠితుండయి ప్రాణప్రతిష్ఠఁజేసి, సకలసంభారముల నెల్ల జతనుపఱచి
కాలమెఱిఁగి మంత్రన్యాసకలితుఁ డగుచు, నిశ్చలాసనసంస్థాననిరతి నరుఁడు.

సీ॥ సౌవర్ణతామ్రభాజనముల నొక్కండు, సంగ్రహించి యథాస్వశక్తి నంది
చందనంబున నందు షట్కోణము లిఖించి, బహిరష్టకోణంబు పట్టుగొలిపి
పృథునవాక్షరమంత్రబీజముల్ లిఖియించి, యంత్రంబు (బూన్చి వేదాగమోక్తిఁ
గర్పూరకాశ్మీరకాంచనముఖవస్తు,ఘటితవిగ్రహముగా గౌరి నిలిపి

గీ॥ యాగమోక్తంబులైనమంత్రావళులను, భగవతిసపర్య యొనరించి పరమనిష్ఠ
సతతము నవాక్షరీమంత్రజపమునిలిపి,హోమ మొనరింపవలయుశాస్త్రోదితముగ.

ఆ॥ తద్దశాంశముగను దర్పణం బొనరించి, తద్దశాంశ విప్రతతులఁ దనిపి
విత్తశాఠ్య మెడలి విధివిహితంబుగా, ద్రవ్యశుద్ధిఁ బూన్పఁదగుఁ బరాంబ.

వ॥ మఱియును శరత్కాలంబు భగవతీపూజనార్థంబు బగుట నవరాత్రింబులను కుమారీపూజనం బొనర్పవలయు వసంతంబున నవరాత్రిపూజనంబు విధిచోదితంబగు, నుపవసించుచుఁ బూజించుట యుత్తమంబు, తదశక్తుం డేనియు మితాహారియై ధ్యానపూజాదుల నంబికం దనుపుచు శర్కరామధుఘృతమిశ్రిత పాయసంబుల హోమంబు లాచరింపుచు మంత్రానుష్ఠానంబు లొనర్చుచు ఛాగమాంసంబుల రక్తకుసుమంబుల శర్కరాయుతతిలల హవనంబు లొనర్చుచు నష్టమీచతుర్దశీనవమీతిథులందు విశేషించి దేవీపూజనంబులును నవశ్యకర్తవ్యంబులు, నిర్ధనులకు ధనసిద్ధియు రోగులకు నీరోగంబును నపుత్రికులకుఁ బుత్రసంపదయు రాజ్యభ్రష్టులకు రాజ్యప్రాప్తియును శత్రుపీడితులకు వైరివిజయంబును విద్యార్థులకు సాంగవిద్యాభ్యసనంబు నగును, జాతుర్వర్ణ్యంబులవారికి నవరాత్రివ్రతం బాచరణీయంబు, నవరాత్రింబుల విశేషించి మంటపాలంకారంబులు రంభాస్తంభవితానతోరణరంగవల్లీకల్పనంబు లొనర్చి మంత్రపూజాకలశస్థాపనవిశేషంబులఁ ద్రికాలంబు నర్చింపవలయు, గీతవాద్య స్తుతి పాఠంబులను గన్యకాపూజనంబులను జందన వస్త్ర భూషణ పాయసాపూపనివేదనంబుల నంబికం దనుపుచు శక్తికొలఁది నన్నదానం బొనర్చుచు సేవించు వారలయెడ దేవి స్వసామ్రాజ్యంబు చూఱలిచ్చు ననుటకు సందియంబు వలవ దని పలికి నీవు నిష్ఠాపరుండవై చండికం బూజింపుము, మఱియు నితోధికపుత్రసంపత్సారస్వతజయశ్రీలను జెందుదు వని సుమేధుండు రాజునకును వైశ్యునకును బోధించిన. ౧౦-౨౮

ఉ॥ కన్నుల నీరు కాల్వలయి కారఁగ నంతట రాజవైశ్యు ల
భ్యున్నతభక్తిఁ బాదములయోర ధరం బడి చాఁగి మ్రొక్కుచున్
మన్ననఁ జేసి తెల్పితివి మాకు శ్రుతిస్మృతి సార మిట్టి యా
పన్నులఁ బ్రోచు టెల్ల మునిభాస్కర ! నీదయ పెంపునం గదా. ౧౦-౨౯

సీ॥ ప్రాకృతంబగు పుణ్యఫలమున మీదండఁ, జేరినవారము చెప్పనేల?
మీసూక్తి త్రిపథగామిని భగీరథుఁబోలెఁ, దరియింపఁ జేసె మాదురిత మణఁచి
సాధుసంభవము భూస్థలి దీనపోషణా,ర్థంబె కాదొకో? భవద్దర్శనంబు
దుఃఖవిధ్వంసనాధూర్వహంబగుఁ గాదె?, యాత్మార్థజీవుల నననఁగనేల?

గీ॥ మిమ్ముఁబోలఁబరోపకారమ్మునందుఁ, దత్పరులు గలరొక్కొ! దుస్తరదవాగ్ని
బోలు సంసృతి తాపంబుఁపొందియున్న, మమ్ముఁ గరుణించితివి జగన్మాన్యచరిత.

ఆ॥ దుఃఖమొదలి భరితదురితంబు లెడఁబాసి, సఫలజన్మభావసరణిఁ గాంచి
తెలివి నొందినాము దేవ! దేవీమంత్ర, మొసఁగి మమ్ముఁ గావు ముచితవృత్తి.

మ॥ అని ప్రార్థించిన రాజవైశ్యులకుఁ బ్రేమమావిష్టచేతస్కుఁడై
మునిచంద్రుండు సుమేధుఁ డాంతరతమోమూలచ్ఛిదంబౌ పరా
మనురాజంబు నవాక్షరం బొసఁగె సమ్యగ్జ్ఞాన పూర్వంబుగాఁ
గొని రాత్మాఘము లెల్ల డుల్ల శ్రుతివాగ్గోప్యంబు తన్మంత్రముల్. ౧౧౩౨

వ॥ వాగ్భవమాయామదనబీజంబును జాముండాచతుర్థ్యంతంబును స్వాహా యను నక్షరద్వయ మిశ్రితంబును దన్మంత్రోద్ధారణంబును నైన. ౧౧౩౩

సీ॥ దేవీనవాక్షరస్థిరమంత్రరాజంబు, పఠియించి యిరువురుఁ బరమనిష్ఠ
జపియించుచును మహాశ్చర్యధుర్యత నిరాహారులై కాననాభ్యంతరమున
నేకాంతమున నిల్చి హితవృత్తి నొకనెల, ఫలము భక్షించియుఁ బరమనియతి
జలమారు తాహారశాంతక్షుధావృత్తిఁ, దపియింప నంతకఁ దతకును వారి

గీ॥ మానసంబులు స్థిరములై సమహితవృత్తి, నిశ్చలత్వంబు నొంది యనేహ మిటులఁ
గడపుచును మౌనియొద్ద నేకతమ నిల్చి, ధ్యానపరులౌచు నొక్కవత్సరము నిల్వ.

వ॥ మఱియును దపం బభివృద్ధి నొందుతఱి నొక్క వత్సరంబు పర్ణాశనంబును నొక్క వత్సరంబు జలాహారంబునుంగా నిట్టులు కొన్ని వత్సరమ్ములు, కొన్ని వత్సరంబులు కందమూలఫలాహారంబులను గాలంబుఁ గడపుచున్నతఱి నప్పరాంబిక రక్తాంబరధరయును జారుభూషణభూషితయును జతుర్భుజయును నష్టాదశభుజయును నష్టభుజయునుం గా స్వప్నసమాధిమధ్యంబులఁ దోఁచినం గనుంగొనుచుఁ బ్రత్యక్షదర్శనలాలసులై చింతించుచుఁ బ్రసన్న గాకుండుటచే దేహత్యాగం బొనర్పం దలంచినవారై హస్తప్రమాణంబును ద్రికోణాకారంబునుగాఁ గుండంబు నిర్మించి దేహమాంసంబున హోమంబు సేయుచు బ్రహ్మాదిదేవతలకు నామో ద్దేశంబున రుధిరతర్పణం బొనర్చుచు భగవతింగుఱించి యంగంబులు ఖండించి బలిప్రదానంబు సేయుచుండ జగజ్జనని ప్రసన్నయై దర్శనం బిచ్చిన. ౧౧౩౪

ఉ॥ రాజును వైశ్యుఁడుం జనని రాఁ గని లేచి నమస్కరించి యు
త్తేజితభావులై నుతిశతిం భజియించినఁ జూచి వారలన్
మీ జపనిష్ఠ మెచ్చితి నమేయము కోరికఁ దెల్పుఁ డిచ్చెదన్
భూజనరంజనంబుగ విభూతిఁ దలిర్పఁ గొనుండు కామ్యముల్. ౧౧౩౫

క॥ అని పల్కిన దేవింగని, జనపతి యిట్లనియె దేవి! శత్రునికృతిచే
వినిహతి నొందిన రాజ్యం, బనుపొందఁగ నొసఁగి ప్రోవుమమ్మా జననీ! ౧౧౩౬

సీ॥ అనుదినంబును గాననాంతరంబునఁ జాల, బడలితిఁ గరుణించి యడరు మాన్పి
కావుమన్నను దేవి గనుఁగొని యింటికి, నేగుము నీమంత్రు లెదుట వచ్చి

నీ రాజ్యమునకును నీవు కర్తవుగాఁగఁ, జేకొనిమెద రన్నఁ జెలఁగి రాజు
స్వగృహాభిముఖుఁడైన సచివులు చనుదెంచి, తనదు సింహాసనస్థునను నిలుపఁ

గీ॥ బదియు వేలేండ్లు రాజ్యసంపన్నుఁ డగుచు, శత్రునిరసన మొనరించి సకలదిశల
యశము వెలుగొందఁజేసి జన్మాంతరమున, నతఁడె వైవస్వతుం డయి యవతరించె.

ఉ॥ కోమటియుర్ బరాంబఁ గనుఁగొంచుఁ గృతాంజలియౌచు మ్రొక్క నీ
వేమి వరంబుఁ గోరెద! వరహీనమనస్కతఁ గోరుమన్న మా
యామహనీయమూర్తిఁ గని యమ్మ! గృహంబులఁ బుత్రమిత్రులర్
గోమలులర్ ధనంబులను గోరను బంధకరంబు లౌటచేన్. ౧౦౩౯

గీ॥ స్వప్నవన్నశ్వరము లౌట సంపదలను, గోర విజ్ఞాన మొసఁగు నా కోర్కిదీర
మందులకుఁ గాదె సంసారమజ్జనంబు, దేవి! నినుఁ గన్నవాని కెందేని గలదె!

ఉ॥ నావిని పిన్ననవ్వొలయ నర్మిలి వైశ్యునిఁ జూచి నీదు స
ద్భావము మెచ్చితిన్ గలుగు భవ్యతరంబగు జ్ఞాన మంచుఁ బ్రే
మావృతచిత్తయై పలికి యంతఁ దిరోహితయయ్యె దేవి; సం
భావితచిత్తుఁడై యతఁ డభంగురనిష్ఠఁ దపించె నచ్చటన్. ౧౦౪౧

ఆ॥ రాజు దేవికరుణ రాజవల్లభుఁ డౌచు, రాజ్య మేలె నక్కిరాటుఁ డమల
తప మొనర్చి జ్ఞానదగ్ధసంసృతి యౌచు, ముక్తి నొందె జ్ఞానమూర్తి యగుచు.

కం॥ ఇది యోగమాయ మహిమము, విదితంబుగఁ దెలియునట్లు వివరించితి నీ
వుదితమనస్కుఁడ వగుచున్, సదనం బొనరుపుము మనము జననికి ననిరో.

మ॥ బహుజన్మార్జితపుణ్యభోగఫల మంబాపూజనాభాగ్య మ
న్వహముం దన్మనుమంత్రరాజము సదాధ్యానానుసంధానమున్
సహజం బెవ్వని కబ్బు నన్నరుఁడు సాక్షాన్ముక్తికన్యా సము
ద్వహనోల్లాసి యటంచుఁ బల్కెద భుజాద్వంద్వంబు మిన్నంటఁగన్. ౧౦౪౪

క॥ అని బాదరాయణుఁడు దెల్పిన విని జనమేజయుండు ప్రీతుండై య
మ్మునిని నవ్వలికథ యడిగిన, వినిపింపఁదొడంగె బూర్వవృత్తం బనుచున్.

చ॥ నతజనపాల! బాలతపనజ్వాలదభ్రికపర్దమర్దలో
న్నతరవచండతాండవ! ఘనపర్వమదపర్తిబద్ధచిత్త! సం
తతగిరికన్యకాహృదయతామరసప్రవిహారచంచరీ
కితనిజరూప! జీవభవకిల్బిషభంజన! భక్తరంజనా! ౧౦౪౬

క॥ కాశీపట్టణపంచ, క్రోశాంతస్ఫురితనాదఘూర్ణప్రణవా
కాశ ప్రకాశ! శ్రీవి, శ్వేశా! గౌరీశ! యీశ హేయవినాశా. ౧౦౪౭

ఉత్సాహ॥ కాలకర్మమథన! భవ వికారదూర! శమరసా
వాల! శూలధర! కృపాలవాల! దైత్యమర్దనా
భీలశైలచాప! దుష్టభీ సమూలభేదనా!
బాలమునిదయాసముద్ర! భద్రజగదనుగ్రహా. ౧౦౪౮

క॥ దేవీభాగవత స్కం,ధావళిఁ బంచమము నచ్చమాంబా జగ్గ
క్ష్మావరుల కభీష్టార్థ, శ్రీ వెలయం జేసి సుప్రసిద్ధిం జెందున్ ౧౦౪౯

## గద్య

ఇది శ్రీమత్పరమశివాద్వైత భావనాసాధ్య ములుగు సదన్వయ సిద్ధ సారస్వత విద్యా సాన్నిధ్య వేమనారాధ్యవంశార్ణవ కళానిధాన పాపయారాధ్యాభిధాన ప్రణీతంబైన శ్రీదేవీభాగవతం బను మహాపురాణంబునందుఁ బంచమస్కంధము సంపూర్ణము.

శ్రీదుర్గాదేవతార్పణ మస్తు.

శ్రీ శ్రీ శ్రీ



# తప్పొప్పుల పట్టిక

## ముఖ్యాంశములు

మొదట నొకపీఠిక వ్రాసితిని. ఎన్నివిషయములలో దానిలో గతార్థము కానివి మిగిలి యున్నవి. మూఁడవస్కంధము మొదలుకొని నేనే దీని సంస్కరణమున కుపక్రమించితిని కాని వృద్ధుఁడ నగుటచే నేను సంస్కరించిన గ్రంథభాగములలోఁగూడఁ గొన్నిప్రమాదములు మిగిలియే యున్నవి. అందొకటి యిచ్చుట మచ్చు చూపెదను.

౪౯౭ వ పుటలో ౭౧౬వ పద్యము—

'క॥ కాంచి' అని యెత్తుకొని రెండు చరణములు బిందుపూర్వక చకారముతో నడిపి మూడవ చరణములో— అచ్చెరువ అని చకారద్విత్వముతో ముగింపఁబడినది. పౌరాణికులకు నిట్టివి బాధింపవు గాని లాక్షణికుల కివి బాధకములు. ఇంకను నిట్టివి మఱికొన్ని గలవు. ౩౮౪ వ పుటలో—

'శా॥ క్రోధ' అని యెత్తుకొని నాల్గవచరణములో—

శుష్కంధఁబు

అని యనుస్వారపూర్వకముగాఁ బూరింపబడినది. ఇట్టివి భ్రాంతిమూలకములు, పాండిత్యలోప ప్రయుక్తములు కావు. కాకున్నను సవరింపవలసిన భారము సంస్కర్తది కాకపోదు. చాలవఱకు బరిశీలించితిని; కాని యింకను మిగిలియున్నవి. రాఁబోవు ముద్రణమున సంస్కర్తలు సవరింతురుగాక. కొన్ని పౌరాణికులను బాధించెడివి సైతము కలవు. ౧౪౦ వ పుట ౨౪ వ పంక్తిలో—

"పుత్ర సంగ్రహం జనన్యకద్రవ్యం జని"

అని పడినది. దీనిని— "అవశ్యకర్తవ్యంజని ఈరీతిగా సవరించుకొనవలయును."

| పుట. | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౨ | ౬ | పార్వతమ్మాభి ధమున | పార్వతమ్మాభి ధాన |
| ౧౭ | ౨౦ | వితరత | వితీర్ణ |
| ౨౦ | ౨ | మానవులశువుల్ | మానవులశ్రవల్ |
| ౨౦ | ౨౭ | భాగవతాం బుధీకృత | భాగవతంబుధీకృత |
| ౨౨ | ౩ | వేద్యంబు మా | వేద్యం బుమా |
| ౨౨ | ౮ | శాస్త్రాద్వలన్ | శాస్త్రతర్కలన్ |
| ౨౨ | ౧౭ | పూర్వ్వ | పూర్వ |
| ౨౮ | ౧౪ | యర్మ్మలి | సర్మ్మలి |
| ౩౦ | ౧౨ | అట్టివారున్నని | అట్టివా రున్నచో |
| ౩౨ | ౧౯ | పాడమ నిలిపి | పుడమినిలిపి |
| ౩౪ | ౩ | సురలుసాధ్య సాధ్వసులు | సురలసాధ్య సాధ్వసులు |
| ౩౫ | ౩౦ | నామ సంధ్యాన | నామసంఖ్యాన |
| ౩౬ | ౯ | దేవాపదా | దేవాపద |
| ౩౬ | ౨౩ | భవశ్రీర్ణమస్తే | భవ శ్రీనమస్తే |
| ౩౭ | ౨౮ | కవిమార్గ | కతిమాత్ర |
| ౩౮ | ౨౯ | భక్తానుగ్రహి | భక్తానుగ్రహ |
| ౩౯ | ౧౩ | బయ్యేడునని | బయ్యెడినని |
| ౪౧ | ౨౫ | కర్ణముల జాతులగుచు | కర్ణమల జాతులగుచు |
| ౪౨ | ౧౭ | ఉదోద్బధించి | ఉదోద్యతించి |
| ౪౩ | ౧౨ | భాగ్యము | భోగ్యము |
| ౪౪ | ౨ | విష్ణో! హరీ | విష్ణూ! హరీ |
| ౪౪ | ౧౨ | మేల్కనఁడు | మేల్కొనఁడు |
| ౪౮ | ౨౫ | సవిమర్శక | సువిమర్శక |
| ౪౯ | ౫ | మహామయు | మహామయ |
| ౫౫ | ౨౭ | గాచె! భవత్ప్ర కర్షముల్ | గావె భవత్ప్రకర్షముల్ |
| ౫౬ | ౨౬ | శుంభపాధి | శుంభత్ప్రాధి |
| ౫౯ | ౭ | సానుకూల్య మును | నానుకూల్యమును |
| ౬౨ | ౧౫ | పురుషోక్తులు | పరుషోక్తులు |
| ౬౬ | ౯ | దేనవిభుండటంచు | దేవ! విభుండటంచు |
| ౬౮ | ౧౩ | అచ్చోట నెట్లుండెనో | అచ్చోట నెట్లుంచెనో |
| ౭౨ | ౨౬,౨౭ | ద్వావధివాసము దొఱఁగఁగ | షడ్వధముఖులనెల్ల విడియం |
| ౭౩ | ౯ | అధ్వర్వముఖ | అధ్వరముఖ |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౭౪ | ౧౭ | గాద పాంసుల | గాదు పాంసుల |
| ౮౨ | ౨౯ | గర్త నీయఁడే | గర్తఁడీయఁడే |
| ౮౩ | ౧౭ | యేలను సృజించె | యేటికి సృజించె |
| ౮౭ | ౨౮ | లభ్యమానటులు | లబ్ధియైనటులు |
| ౯౧ | ౧ | వణిజవీథుల | వణిజుల బజార్ల |
| ౯౫ | ౩ | బ్రహ్మజీవుఁ | బ్రహ్మమును |
| | | డటన్న | జీవుఁడన్న |
| ౯౫ | ౨౭ | నోపాధియై | సోపాధియై |
| ౯౭ | ౧౯ | ఒడయుండు | ఒడయండు |
| ౯౮ | ౨౭ | పీవరయనుకన్యక | పీవరియటన్న కన్యక |
| ౧౦౨ | ౧౪ | నొప్పునఁజేసి | నొప్పఁగఁ జెప్పి |
| ౧౧౮ | ౧౦ | చేకూరు నీశ్వరా, | చేకూర్చు నీశ్వరా, |
| | | జ్ఞావితతిఁ | జ్ఞావళితఁ |
| ౧౧౧ | ౧ | వీర్యవర్ధని | వీర్యవర్ధిత |
| ౧౧౧ | ౯ | మానువయి | మానవయి |
| ౧౧౨ | ౨ | దంతురరయై | దంతురమై |
| ౧౧౨ | ౨౧ | నిల్పుమిఁక | నిల్పుఁడిఁక |
| ౧౧౭ | ౪ | ద్యువియు | దివిని |
| ౧౨౦ | ౬ | జెలువారు | జెలువారె |
| ౧౨౫ | ౧౪ | స్వీకృధ్ఘన... | స్వీకృతఘన శస్త్రా |
| | | గనులు | స్త్రములు గములు |
| ౧౨౬ | ౨౭ | దుర్వార్యుడై | దుర్వారుఁడై |
| ౧౨౮ | ౪ | హస్తగ్రాహ్యము | హస్తగ్రాహము |
| ౧౨౯ | ౩ | డెక్కటి గర్వ | యెక్కటి గర్వ |
| | | వృత్తులకు, | వృత్తులకు |
| ౧౨౯ | ౭ | దప్పకవిక్రమరేఖ– | దర్పకవిక్రమరేఖ |
| ౧౨౯ | ౯ | గల్గునోయుగము | గల్గసోయగము |
| ౧౨౯ | ౨౧ | వోఢవో లేక | ఊఢవో లేక |
| | | యవోఢవో, | యనూఢవో |
| ౧౩౩ | ౬ | జాలపర్యాయపళత | గాలపర్యాయపళత |
| ౧౩౪ | ౨౬ | స్వార్థంబేమ | స్వార్థంజేను |
| | | ఘుటింప | ఘుటింప |
| ౧౩౮ | ౨౧ | న్యూనం | న్యూనల్వ |
| | | బెటులౌనో! | మెట్లౌనో! |
| ౧౪౨ | ౨౭ | సురకల్లోలము | సురకల్లోలిని |
| | | చెంత, | చెంత, |
| ౧౪౩ | ౧౦ | తనయులనే | యేపురు |
| | | వురితో, | తనయులతో |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౪౪ | ౧ | వంశాంతర | వంశాంత |
| | | సమాయంబు, | సమయంబు |
| ౧౪౪ | ౨౨ | వధించె | వధించి |
| | | నొక్కనిఁ, | యొక్కనిఁ |
| ౧౪౬ | ౯ | నాసమెడల్చి | మీసమెడల్చి |
| ౧౪౭ | ౨౨ | పృథవ్యావాప్తి | పృథివీవ్యాప్తి |
| ౧౪౭ | ౨౫ | దివ్యసరంబులఁ | దివ్యసరస్సులఁ |
| ౧౪౮ | ౧౧ | నిన్నుఁ జూచె | నిన్నుఁ జూపె |
| ౧౪౮ | ౧౭ | నిస్సందతు | నిర్ధగుని |
| ౧౫౩ | ౯ | బాహుబాద్ధను | బ్రాంచద్ధను |
| | | షోక్కటి | షోక్కటి |
| ౧౫౩ | ౧౧ | గ్రీవమందుంచె | గ్రీవయందుంచె |
| ౧౫౫ | ౨౩ | విన్నమనస్కుండవై | భిన్నమనస్కుం |
| | | | డవై |
| ౧౫౭ | ౧౫ | మృతియగుట | మృతయగుట |
| ౧౫౯ | ౩ | విహాగణ్యుఁడో | విహాగేస |
| | | యర్ఘజలం | రుండర్ఘ జలం |
| ౧౬౩ | ౧౪ | వేసుపనీతిఁజేసి | వేయుపనీతుఁ జేసి |
| ౧౬౪ | ౨౨ | తత్తునిచె | తత్తుపచే |
| ౧౬౫ | ౨ | కడుహన్యుఁడు | కడునాఘ్యుఁడు |
| ౧౬౫ | ౪ | రూపవిలాసియా | రూపవిలాసయా |
| ౧౬౬ | ౧౫ | పితృహంతమార | పితృహంతృమార |
| | | ణము | ణము |
| ౧౬౬ | ౨౮ | పితృద్వేషాపనోద | పితృద్వేషాప |
| | | క్రియుఁ | నోదాత్ముఁ |
| ౧౬౭ | ౩ | డెట్టులనుచు | డిట్టులనుచు |
| ౧౬౭ | ౯ | సలిపెడినవ్వార్త | సలిపెడి యవ్వార్త |
| ౧౬౮ | ౧౦ | విశ్రాంతియగునింక | విశ్రాంతిగను నింక |
| ౧౭౦ | ౩ | నింతనంతరంగము | నింతయంతరంగము |
| ౧౮౦ | ౧౭ | రహితమై | రహితుఁడై |
| ౧౮౧ | ౨౮ | స్వాద | స్వాది |
| ౧౮౪ | ౧౨ | రక్తచోలం | రక్తచేలం |
| ,, | ౧౫ | బడియె | బడుట |
| ౧౮౬ | ౧౭ | గామినొక | గానిదొక |
| ౧౮౮ | ౧౮ | నా | మా |
| ,, | ౨౩ | మభ్భరణ | మాభరణ |
| ౧౯౨ | ౩౦ | ముక్త్యేక | ముక్తైక |
| ౧౯౪ | ౪ | హ | హర్త |
| ౨౦౩ | ౧౫ | గాదొ | గావొ |
| ౨౧౪ | ౮ | తామస | దామస |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౧౧ | ౩ | జారచర్యల | సారచర్యల |
| ౨౧౩ | ౧౯ | నిల్చిసరి | నిల్చెఁబరి |
| ౨౧౫ | ౬ | యేదివరా | ఏదివరా |
| ౨౧౬ | ౨౯ | వేతృత్వ | వేతృత్వ |
| ౨౩౧ | ౨౫ | దత్తరం | దత్తీరం |
| ౨౩౬ | ౮ | మునునవ్వా | మునుపవ్వా |
| ౨౩౭ | ౧ | నందినీ | నందినీగో |
| ,, | ౧ | వనెగోయ | వనెయ |
| ,, | ౪ | వీని | దీని |
| ౨౩౯ | ౧౩ | దొల్లి | దల్లి |
| ౨౪౨ | ౯ | బుట్టి | పుట్టి |
| ౨౫౦ | ౫ | వీం | వీ |
| ,, | ౨౭ | యిర్షలి | నీష్లి |
| ౨౫౩ | ౯ | బ్రాప్తిం | ప్రాప్తిం |
| ౨౫౫ | ౧౪ | పట్టంబు | జట్టంబు |
| ౨౬౭ | ౭ | దుమికి | దుమికె |
| ౨౮౭ | ౧ | వంశ | వంశ్య |
| ౨౯౯ | ౧౧ | పుమ్మద్దు | పున్మద్దు |
| ౨౭౪ | ౧౯ | హారంబు | హారంబుల |
| ౨౯౯ | ౧౫ | జల్లనై | చల్లనై |
| ౨౯౦ | ౧౬ | గూడిన | జూడిన |
| ,, | ౨౯ | పట్టి | పట్ట |
| ౨౯౫ | ౧౨ | యడర | యడల |
| ౨౯౯ | ౨౧ | డోపుఁ | డొప్పుఁ |
| ౩౦౪ | ౨ | మూరు | మూర్థు |
| ౩౦౪ | ౨౫ | దెలసి | దెలిసి |
| ౩౧౨ | ౨౧ | బోలుపరి | బోలుపటి |
| ౩౨౧ | ౨౯ | రసన | రశన |
| ౩౨౨ | ౨౧ | సౌరభి | సౌరభీ |
| ౩౨౩ | ౭ | నిగపిం | గనిపిం |
| ౩౨౭ | ౨౪ | నతెండు | వసంత |
| ౩౩౧ | ౨౪ | అతి | అని |
| ౩౪౪ | ౬ | వేశ | వేళ |
| ౩౪౭ | ౪ | తెలివు | తెరువు |
| ౩౫౫ | ౩ | హస్తిని | హస్త |
| ౩౫౬ | ౨౫ | మరుల | మరులు |
| ౩౬౧ | ౬ | పుత్రులు | పత్నులు |
| ౩౬౭ | ౧౫ | డఁడె | బడఁడె |
| ౩౮౧ | ౨౬ | హర్షసు | దుఃఖసు |
| ౩౮౪ | ౨౨ | విక్రము | నక్రము |
| ౩౮౭ | ౧౪ | అచ్చోటు | నచ్చోటు |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౭౩ | ౨౫ | యవని | యవన |
| ౩౭౦ | ౧౪ | నిష్టా | నిష్ట |
| ౩౯౧ | ౧౬ | నిట్లగు | నిట్ల |
| ౪౧౨ | ౩ | జంపమి | నంటమి |
| ,, | ౭ | డుఁబడ్డె | డువడ్డె |
| ౪౧౪ | ౨౪ | పోర | బోర |
| ౪౧౭ | ౧౬ | వెలవు | వెరవు |
| ౪౨౦ | ౨౫ | వీర్యధున | వీర్యఘున |
| ౪౨౨ | ౬ | భుశుండి | భుసుండి |
| ,, | ౧౫ | కెట్టులుని | వెట్టెట్టులి |
| ,, | ౨౨ | వాని | వారి |
| ,, | ౨౭ | దెచ్చిన | దాల్చిన |
| ౪౨౩ | ౨౦ | గెమహి | గిసురమహి |
| ౪౨౪ | ౮ | స్వధస్త | స్వచ్ఛస్త |
| ౪౨౫ | ౨౩ | ణ్యులమై | ణ్యులమైత్రిమి |
| ౪౨౮ | ౧౦ | యున్ననొ | యున్నయొ |
| ౪౩౨ | ౧౪ | వాఁడె | నాఁడె |
| ౪౩౨ | ౩౦ | మెచ్చుట | నెచ్చుట |
| ౪౪౧ | ౧౯ | బొసంగు | పొసంగు |
| ౪౪౨ | ౧౪ | కారినై | కారియై |
| ౪౪౪ | ౨౪ | కొనకది | కొనకయ్యది |
| ౪౪౮ | ౧౬ | తక్కి | తక్కు |
| ౪౮౭ | ౩౦ | పతాక | బతాక |
| ౪౫౦ | ౩ | సుఖావహ | సుఖాపహ |
| ౪౫౨ | ౨౯ | యేడ్తెల | నేడ్తెల |
| ౪౫౩ | ౧౪ | నంచొగిన్ | నచ్చుగన్ |
| ,, | ౨౪ | అయత | అయిత |
| ,, | ౨౪ | మైత్రివినీవి | మైత్రివహోయి |
| ౪౫౪ | ౧ | ఆంయో | సంయో |
| ౪౫౬ | ౧౬ | లాషితం | లషితం |
| ౪౬౦ | ౩౦ | హస్తి | కరిణి |
| ౪౮౧ | ౧౪ | భాలించు | పాలించు |
| ౪౮౩ | ౨౦ | రాదుల | రాదులీల |
| ౪౭౫ | ౨ | దోఁచి | దోఁప |
| ,, | ౪ | రాంతక | రాంతిక |
| ౪౯౧ | ౨౦ | మహా | కదుఁ |
| ౫౦౧ | ౩౦ | విరా | గరా |
| ౫౧౦ | ౧౭ | దీప | దీప్త |
| ౫౧౬ | ౧౯ | నియు | నియె |
| ౫౨౯ | ౨౨ | దిత్యు | దిత్యె |
| ౫౩౫ | ౧౭ | బ్రిహ్మామ | బ్రిహ్మామ |

# महागौरी




श्वेते वृषे समारूढा श्वेताम्बरधरा शुचिः ।
महागौरी शुभं दद्यान्महादेवप्रमोददा ॥

THE GITA PRESS, GORAKHPUR.

No. 397'

శ్రీరస్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ శారదాంబాయై నమః

శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము - శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## షష్ఠస్కంధము





గంధావహమై ఫల
భోగప్రదమై సుధాన్నభోజ్యము దేవీ
భాగవతంబున నాఱవ
భాగము సౌఖ్యప్రసిద్ధిఁ భాగ్యం బలరన్

కం॥ శ్రీరమ్య ప్రాభవ భవ, సారవిశేషానువచనఁచణసంభారా
భార సుగంభీర వరా, భారతరత విశ్వనాథఁభావసనాథా! ౧.

వ॥ శౌనకాదిమునులు సూతమహామునితో నిట్లనిరి.

ఉ॥ సూత! మహాత్మ! వ్యాస మునిఁసూక్తములై శుభదాయకంబులై
ప్రీతికరంబులౌ కథలుఁ వీనుల విందుగ వింటిమయ్య! ప్ర
ఖ్యాతుఁడ వీవు తెల్పు వచఁనామృత మెంతయుఁ గ్రోలుచుండినన్
నీతులు క్రొత్తలౌ రుచులుఁ నింపుటఁ దీరదు తృప్తి కావునన్, ౨

ఉ॥ ఇంకను నొక్క సత్కథను ♦ నింపు జనింపఁగఁ జెప్పుమయ్య! క్రొం
బొంకము వేదసమ్మతము ♦ పూర్వచరిత్రము పాపనాశనం
బంకిలి లేని పద్ధతి శుభాంకము వృత్రనిశాచరున్ మన
శ్శంకను ద్వష్టృసంభవునిఁ ♦ జంపెఁ బురందరుఁ డెంత వింతయో. ౫

ఉ॥ దైవత పక్షుఁడౌను గద? ♦ త్వష్ట తదీయసుతుండు విప్రుఁడున్
బావనుఁడున్ మహాబలుఁడు ♦ ప్రాజ్ఞుఁడు దేవతలన్న సత్త్వవా
గ్భావులు, రాజసాంచితులు ♦ గాదె? మనుష్యులు; తామసంబు లౌఁ
గావున జంతుసంతతికి ♦ జ్ఞానము గల్గమి లోకధర్మమా. ౬

చ॥ సురపతి యిట్టి దుష్కృతము ♦ శుద్ధమతిన్ బొనరించు టెట్లు? శ్రీ
హరియును సాత్త్వికోన్నతుఁడునై యలరారుచు వజ్రమధ్యమం
దురువడిఁ జేరియుండుటయు ♦ నొప్పని యట్టి యకృత్య మూనుటల్
నురుఁగున నూరుచుండుట విశనోదముగాఁ గనుపట్టు నెంతయున్. ౭

చ॥ హరియును నింద్రుఁడున్ గలసి ♦ హైన్యము నందిరె మాయచేసి రి
క్కరణిని నేమి కారణము? ♦ గౌరవపాత్రు లుదారు లుత్తముల్
సురలు సుధర్మవర్తనులు ♦ సూనృతవాక్కులు నయ్యుఁ బాపముల్
పరువడిఁ జేయుచుండు నెడఁ ♦ బామరులన్ వచియింప నేలొకో? ౮

చ॥ సురపతి వృత్రుఁ జంపె ననుశచున్ వచియించెద విప్ర డంబికే
శ్వరి వధియించె వృత్రు నని ♦ చయ్యనఁ జెప్పితి వప్పుడేల యీ
వరుసను భేదమయ్యె మఱి ♦ బ్రాహ్మణుఁ జంపిన బ్రహ్మహత్య నే
కరణిని నింద్రుఁడొందె నధికంబగు సంశయ మెట్లు పోవు నాన్. ౯

— దేవేంద్రుఁడు వృత్రుని జంపుటకుఁ గారణము —

చ॥ మునిపతి సూతుఁ డిట్లనియె ♦ మోదమునన్ మునులార! వ్యాసుఁడున్
మునుకొని భూవరుం డడుగ ♦ ముందిటు దీనికి నందు నుత్తరం
బును వచియించె నేను నది ♦ పొందికఁ జెప్పెద రాజు వ్యాసునిన్
గని మునినాథ! యింద్రుఁ డెటుకగా నల వృత్రు వధించెఁ జెప్పవే. ౧౦

సీ॥ తపముఁ జేయుచునున్న ♦ ధన్యుని వృత్రుని, నింద్రుఁ డేవిధముగా ♦ నేర్చి చంపె?
సాత్త్వికోన్నతుఁడై నశాంతుండు శ్రీహరి, మాయాగుణంబు నేమాడ్కి నొందె?
నఖిలకామ్యదమైన ♦ యట్టి మహాదేవి, యెట్టు లీ దైత్యుని ♦ మట్టుమాపె?
నొక్కని వధియింప ♦ నొండొంట నిరువురు, కారకు లౌట కే ♦ కారణంబొ?

గీ॥ ఇట్టి మహనీయ చరితంబు ‡ నెల్ల మాకుఁ, దేటపఱుపుము తృప్తి యెం ‡ దేనిఁ గలదె?
యంబికాదేవి విభవంబు ‡ లద్భుతములు, వినుచు నున్నఁ గొలందిని ‡ వీను లలరు.

సీ॥ అనుచుఁ బల్కెడి రాజుఁ ‡ గని వ్యాసుఁ డిట్లనె, నితిహాసములు విన ‡ నిచ్ఛ కలిమి
గౌరవాదరణంబు ‡ గలిగి యుండుటఁ జేసి, ధన్యాత్ముఁడవు నీవు ‡ తథ్యముగను
నమృతంబు త్రావెడి ‡ యమరులకైన నే,తీరున నైనను ‡ దృప్తి గలుగు
దినదినంబును నీవు ‡ వినుచుండు వీక భక్తి, భావంబు లెంతయుఁ ‡ బ్రబలుచుండు
గీ॥ వినెడివారలు ప్రీతితో ‡ విన్నయెడల, వక్తలెప్పుడు శ్రద్ధమై ‡ పలుకుచుండ్రు
గాన నంతయు బోధింపఁ ‡ గలను వినుము, యోగమాయాప్రభావంబు ‡ యుక్తి కలిమి.

ఉ॥ వాసవవృత్రయుద్ధమును ‡ బాగుగఁ జెప్పఁ బురాణముల్ శ్రుతుల్
వాసిని గాంచి యింద్రుఁడు ప్రభున్ ద్రిశిరున్ ఘను వృత్రు మాయ న
భ్యాసముఁ జేసి విష్ణుని సహాయముఁ గైకొని గెల్చె నన్న వ్య
త్యాసము లేదు మాయఁబడి ‡ తాపసు లందఱు వంత నందరే? ౧౩

క॥ హరియును మాయకు లోఁబడి, సురశత్రులఁ ద్రుంచుచుండు ‡ సొరిదిని స్వాత్మం
బెఱుఁగఁడు సాత్త్విక గుణశేఖరుఁడైనను నన్యు లెన్నఁగా నేటికొకో? ౧౪

శా॥ లోకంబుల్ తలక్రిందుఁ జేయు వెలయున్ ‡ లోలోన నుంకించు ని
చ్ఛాకల్పంబున నెల్ల మానవుల కాసక్తిన్ బ్రయోగించు మో
హాకూపారమునందుఁ ద్రోయు మది కాంధ్యంబుం బ్రకల్పించు వి
ద్యాకర్మంబులఁ ద్రిప్పుచుండు బరమాయాదేవి చిత్రంబొకో? ౧౫

సీ॥ మత్స్యంబు మున్నుగా ‡ మహిమాణువులయందు, యుగసహస్రంబుల యోగమంది
యప్పటికప్పుడా యాయి వేళలయందు, నాత్మరూపంబు లందంద నిలిపి
నరమునితోఁ గూడి ‡ నారాయణుండైన, స్వాత్మశక్తిజ్ఞాన ‡ మరయలేమి
విహితం బవిహితంబు ‡ వేఱెన్నఁగాలేక, కార్యముల్ పొనరుచు ‡ ఘనుఁ డతండు
గీ॥ నాది దేహంబు గృహము ధనంబు నాది, వీరు పుత్రులు నావారు ‡ వెలఁదినాది
వీరు స్వజనమ్మనుచు మదివిఱ్ఱవీఁగి, తిరుగుచుండు నరుఁడు పరదేవి మహిమ.

శా॥ పాపంబైనను బుణ్యమైన జగదంబాదేవికిన్ మాయకున్
శాపంబో? వరమో? యనం దగిన యాశాపాశముల్ గ్రమ్మఁగన్
దాపై మూఁడు గుణమ్ములన్ మునిఁగి నిందన్ గీర్తి కాశించుచుం
బాపంజాలఁడు మోహజాలములు భూపా! యెట్టి విజ్ఞానియున్. ౧౬

ఉ॥ కావున మాయలో మునిఁగి ‡ కంజదళాక్షుఁడు దేవనాథుఁడున్
భావము కల్మి మాయఁ గొని ‡ స్వార్థవశీకృతు లౌట వృత్రునిన్

జీవము దీయు హేతువగుఁ ॥ జెప్పెద విన్ము మహాతపస్వి వి
ద్యావిదుఁ డుత్తముండు సురధర్మకరుం డయి త్వష్ట యుండెదుర్. ౧౮

కం॥ ఆతఁడు నిందురిని వైర,మ్మాతతమగుటం ద్రిశీర్షునగ్రసుతునిగాఁ
బూతచరిత్రుని ద్విజ వి,ఖ్యాతునిఁ గనె విశ్వరూపు ॥ నతిమోహనునిన్. ౧౯

—• విశ్వరూపుఁడు తపస్సు సలుపుట •—

సీ॥ ఒక ముఖమ్మున వేదముచ్చైస్స్వరంబున, స్వాధ్యాయపఠనంబుసలుపుచుండు
మఱియొక్క ముఖమున ॥ మధురపదార్థమ్ము, లన్ని గ్రహించుచునలరుచుండు
మూఁడవమోమున ॥ మునుకొని దిశలెల్ల, సారిది నొక్కప్పుడే ॥ చూచుచుండు
సుమనోహరములు శీర్షములు మూఁడింట వే, ర్వేఱు కార్యముల వర్తిల్లుచుండు
గీ॥ మఱియు భోగమ్ము లన్నియుమానినైచి, ధర్మమృదుమార్గములు మదిఁదప్పకింతె
దాంతుఁడయిదుష్కరంబగుతపమునందు,మనమునిల్పిచేయుచునుండెమునివిభుండు.

సీ॥ వేసవికాలంబు ॥ వృక్షాగ్రమునను బం,చాగ్నిమధ్యంబున ॥ నధివసించు
వర్షకాలంబున ॥ బహుజలమధ్యమం, దెంతో నిష్ఠను నివసించుచుండు
శీతకాలంబున ॥ శిశిరత్వమున కోర్చి, నిర్వికారుండయి ॥ నిలుచుచుండు
నాహారమును మాని ॥ యాత్మను నియమించి, యఖిల పరిగ్రహంబట్టె విడుచు
గీ॥ బుద్ధిమంతుఁడై యితరుల ॥ బుద్ధిఁ గనని, చేయనలవియుఁగానట్టి ॥ స్థిరతపంబు
చేయుచుండంగ నింద్రుండు ॥ చేరి చూచి, స్వీయపదమును గొను నని ॥ భీతినొందె.

చ॥ అతని తపంబు వీర్యము మహాబలమున్ గని సత్యమార్గమున్
మతమును నెంతయున్ దలఁచి ॥ మాసక యీ త్రిశిరుం డసాధ్యుఁడై
సతతము చేయుచుండె నతిసాహసవృత్తిఁ దపంబు వీనికిన్
హిత మగు మత్పదంబు గొనుటింతయు సత్య మిఁకేమి చేయుదున్. ౨౨

చ॥ అదియునుగాక శాత్రవుని ॥ నారసి యూరక చూచుటొప్ప ది
య్యది బుధధర్మమూఁగద యుపాయము చూడనలెన్ దపంబునం
పద చెడఁగొట్టఁజాలినది ॥ మానిని మించి మఱొండులేదు చూ
చెద మదిరాక్షులం బనిచి ॥ చిక్కకయున్నె యితం డతంద్రుఁడై. ౨౩

—• అప్సరసలు త్రిశిరునియొద్దకు నేగుట •—

॥ కావున భోగవాంఛ గలుగన్ గమకించుట యుత్తమం బటంచున్
ఉ॥ భావనచేసి చిత్తమున ॥ బాగని కైకొని బుద్ధిమత్తరున్
మేవి తిలోత్తమన్ మఱియు ॥ మేనక రంభ ఘృతాచి నూర్వశిన్
"మీవలనన్ గృతిన్ ఫలము ॥ మేకొను"నంచును నెచ్చరించుచున్. ౨౪

ఉ॥ మీరలు జీవముల్ గలుగు మేలిమి బంగరుబొమ్మ లౌటచే
వారక చేయఁగాఁ దగిన భారపుఁగార్యము గల్గె నెంతయున్
ధీరుఁడు శాత్రవుం డొకఁడు తేఁకువతోఁ దప మాచరించువాఁ
డారసి వానినిన్ గలసి హావము భావములన్ వెలార్చుఁడీ. ౨౫

చ॥ మనమున లేదు స్వాస్థ్య మణుమాత్రము; మామక మాసనంబు చే
కొనుటకు ఘోరమౌ తపము కోరిక లూరఁగఁజేయుచుండె నె
మ్మనమునఁ గల్గు తాపమును మాన్పఁగ మీ కగు మేలు సేయుఁడీ
యని బహురీతులన్ బలుక నప్సరసల్ ప్రణమిల్లి భక్తితోన్. ౨౬

సీ॥ దేవేంద్రి! నీవు భీతిని వీడు మెంతయు, యత్నము చేసి యా యతినియమము
మాన్పఁగాఁ జూతుము మానేర్పు లన్నియు, నీ వెఱుంగనివియు లేవు గాదె?
యొకవేళ నృత్యమ్ము లొనరించి యింకొక, వేళ సంగీతమ్ము మేళవించి
కడగంటి చూపులఁ గలవరపడఁజేసి, యంగభేదములచే నటమటించి

గీ॥ ముని మనమ్మును గరఁగించి మోహబీజ, మంతలోననె ఫలియింప సంతరించి
వెంటనంటించి కొనివత్తు మంటుపఱచి, తపసు లచ్చరలిండ్లబందాలుగారె. ౨౭

వ॥ అని త్రిశిరునియాశ్రమంబు చేరి.

సీ॥ ఆనంద శంకర శ్రీ నాటకాదిరా, గానుభావాలాపహావములను
పద్మినీ సుమగంధ ఫలితానుమోద భా, వభవానుకూలస్వభావములను
భరతానుసారి నృత్యరసజ్ఞసుమనోజ్ఞ, తానప్రతాననిదానములను
సకలాంతరంగ విశాల విస్ఫురితాంగ, సంతానవివిధప్రసంగములను

ఆ॥ రాళ్ళు గరఁగుచుండె మోళ్ళు చివిర్చెను, గాని మూఁసు తలలు పూనుమాని
కదలఁ డింతసంత మెదలఁడు వదలఁడు, ధ్యానమేమొ! మునినిదానమేమొ.

ఆ॥ మూఁగవాఁడు కూడ మును కొని భాషించుఁ, జెవిటివాఁడు గూడఁ జెవులనొగ్గుఁ
గాని మౌని విషయకలన మెఱుంగఁడు, మానసంబు మేలి మానికంబు.

ఆ॥ కొన్నిదినము లుండి వన్నెలుఁ జిన్నెలు, వలపులెన్నొ చేసి యలసి సొలసి
ఫల మొకింత లేక పడఁతులు స్వర్గంబుఁ, జేరదలఁచి మఱియుఁ జేసి రిట్లు.

సీ॥ పరిపక్వఫలములు పరువడిఁ గొనితెచ్చి, మించినోటను బెట్టనెంచు నొకతె
కస్తూరిమున్నగాఁ గల వస్తువులు దెచ్చి, మెచ్చి యొడలినిండ మేఁగు నొకతె
మలయానిలాంకురముల శీతలాంబువుల్, చక్కఁగాఁ బైపైనిఁ జల్లునొకతె
కరపల్లవంబుల సురుచిరతనువును గలఁచి యానందింపఁ దలఁచు నొకతె

గీ॥ ఇట్టు లచ్చర లెల్లఁ బుష్పేషు నండఁ, గొనుచుఁ ద్రిశిరుని వంచింపఁ గోరి స్వీయ
చాతురులు చూపి విసివిరిసంశయమున, నించుకయు నాతఁ డెదఁ గజంచలింపఁడయ్యె.

చ॥ విసివి సుమాంబకుండు సురవేశ్యలతో బలభేది వీటికిన్
వెసఁజని యింద్రుతోడ ననె వేసరినారము మేము నేర్పుమై
నసపడఁ జేయఁజూచితిమి వాసవ! యించుకయైన బాహ్య దృ
గ్విసర మెఱుంగఁ డాత్మకృతవేదన మొక్కటి తప్ప మౌనియై. 33

సీ॥ పూర్ణకుంభక సముద్భూత నిశ్చలవృత్తిఁ, గాఢ యోగస్ఫూర్తిఁ కారుకొనఁగ
నొడలెల్ల గ్రమ్మిన జడలతుట్టెల నూడ, లల్లిన మట్టితో ననుకరింప
ఘన తపశ్చర్యానుగతనిర్యదనల సం, తాపంబు దెసలెల్లఁ దట్టిమెఱయ
నాహారవిరహితాభ్యాస నీరంధ్రాంత,రంగవిలీనతల్ అట్టుఁ గెడప

గీ॥ నిట్లుదపియించు మౌనికట్టెదుట నిల్వ, నోడివచ్చితి మేమి సేయుటకుఁగాదు
దేవ! మీచిత్త మొండొక తెలివువలన,నతనిచిత్తంబుఁ జెఱుపంగననగును మీకు.

గీ॥ దైవయోగమ్ముచే శాపదహన కీలఁ, బడక తొలఁగితి మిదియె మహద్భాగ్యవశత
నించుకంత మనంబులోనీసువోడమ, నాక మప్సరోవిరహితమగుట యరుదె. ౩౫

శా॥ మీ యిచ్ఛన్ గల యట్టులన్ మునిని జృంభింపం దలంపన్ దగన్
మా యావద్బలమందుఁ జూపితిమి మాకమా నేరుపుల్ చాల వం
చాయా కంతుముఖుల్ చనంగ వితథుండై వజ్రిపాపోద్యమ
స్థేయ స్సంభ్రమ సాహసంబుల విపక్షీభావ సంరంభియై. ౩౬

— దేవేంద్రుఁడు త్రిశిరుని గెల్చుట కాలోచించుట —

మ॥ ఇటు లోభోపహతిన్ బలారి మునిపై నీర్ష్యన్ గడున్ లేచి యు
త్కట కోపానల ధూమకందలిత వక్త్రభ్రూకుటీ ఘోరుఁడై
చటులం బౌ నశనిన్ ధరించి హననోత్సాహంబునన్ బోయి త
జ్జటిలుంగాంచి మనమ్ములో నడలుచున్ సందేహ సాళంకుఁడై. ౩౭

ఉ॥ ఎట్టుల నీతనిన్ దునుము టీతఁడు దీర్ఘతపస్వి యెవ్వరిన్
గొట్టఁడు తిట్టఁ డీ దురితకుత్సన మెట్టులొనర్తు మత్పదం
బెట్టులనైనఁ జేకొనఁగ నిచ్ఛదలంచెదుఁ బాపమంచు నే
గట్టువడంగఁ జూచినను గార్యము దప్పు నికేమి సేయుదున్. ౩౮

చ॥ ధరణికి నేగుదెంచి రవితారకనాథులలోన నొక్కఁ డీ
వరుసఁ దపించునో యనెడి మైఖరి దోచెడి నీ తపస్వి యం

దరసి వధింప నెట్టు లగునంచు విషాదము నొంది కుందియున్
బరువత గోర్చి వాసవుఁడు పామరుఁడై సడి గోర్చి యంతటన్. ౩౯

— ఇంద్రుఁడు విశ్వరూపునిశిరంబులను ఖండించుట. —

చ॥ కులిశముచేఁ దలల్ నఱుకఁ గుంభినిఁ గూలిన శైలమో యనన్
జలజల రక్తముల్ దొరఁగ సంయమి బాష్పజలాళితో నిలా
తలమున విశ్వరూపు నియతవ్రతశుద్ధకళేబరంబు సం
చలదహినాథమస్తమయి చాఁగఁబడెన్ భువనంబు ఘోషిలన్. ౪౦

మ॥ అపరాధం బిసుమంత లేక తప ముద్యన్నిష్ఠచే సల్పు నీ
తపసిన్ "బాప"మటంచు నెంచక వృథాదర్పాంధుఁడై వజ్రి పా
పపుఁ జైదం బిటు సేయనేల యని వాక్పారుష్యముల్ జూపుచున్
దపసుల్ మున్నుగ సర్వభూతములు సంతాపించె నొక్కుమ్మడిన్. ౪౧

ఉ॥ వాసవుఁ డిష్టసిద్ధి యనివారితమంచని వీటి కేగె ను
ద్భాసితమూర్తియై తపసి ప్రాణవిహీనత నొందియున్ మహో
ల్లాసత * జీవమాన కళలన్ వెలుగొందుచు నున్నఁ గాంచి భూ
వాసులు విస్మయం బొదవ వచ్చుచుఁ బోవుచుఁ జూచుచుండఁగన్. ౪౨

గీ॥ ఏను వధియించి వచ్చితి నిట్టులయ్యు, నిత్తపస్వి నిరంతరోద్దీర్ణ విభల
వెలుఁగుచుండెనటంచు నిర్విణ్ణహృదయుఁ, డగుచుఁ జింతిలుచుండె లేఖాధినేత.

ఉ॥ ఇట్టులు చింత నొంది యమరేంద్రుఁడు నిర్జరవర్ధకిన్ గడున్
దొట్టిన యీసునం బిలిచి దుర్వచనం బిటు దెల్పె నేఁ దలల్
గొట్టితి వజ్రధార నవికుంఠత నొప్పెడు విశ్వరూపుఁ డీ
వట్టుల నేగి గాత్రముఁ దిలాకృతిఁగాఁ దునుమంగ నొప్పగున్. ౪౪

సీ॥ ఇత్తెఱంగునఁ బల్కు నింద్రుని కర్కశ, వ్యాపారమున నొచ్చి యమరతక్షుఁ
డమ్మహాస్కంధుని యంగంబు నాచేతి, పరశువుచేఁ గొట్టఁబడదు వితథ
ధారమై చెడుఁగాన దండింపఁజాల నిం, తియగాదు గర్హితక్రియకుఁ జొరఁగఁ
జాల నిక్కార్యంబు సన్నింద్యము మహాఘ, సంపాదకము నీదు సాహసంబు

గీ॥ వినిన మది యోర్వ దాతండు విగతజీవుఁ, డయ్యె మృతుఁడైనవాని నేమని వధింతు
వెఱపునొందఁగ నీ కేల విశ్వరూపుఁ, డీల్గె మృతుఁ డెందు మరల జన్మించునొక్కొ?

---

* టిప్పణి. జీవమాన, ఇది మూలమున నున్న, "జీవమానఇవ" అను ప్రయోగమం బట్టి సాధువు; ఇట్లే జనిత్రి (జనయిత్రి), యనుటకు బదులు) యనునది కూడ సాధువని తెల్పెడి.

చ॥ భయముఁ దొలంగియుండు మనఁ ‡ బాకవిరోధి వచించెఁ జచ్చియున్
భయ మొదవింపఁజొచ్చె నతి భాసురమై దెసలెల్ల వెల్గఁగా
జయకరశోభలన్ జెలఁగి ‡ శాశ్వతమైన తెఱంగునన్ దద
వ్యయ తనుభావ మొప్పె సురవర్ధకి దాన భయంబు నొందితిన్. ౪౬

క॥ దంభోళిధరుని భయసంరంభము విని దేవతక్షు ‡ వ్రియ్యాలుపడ ని
ష్కుంభిని నాతనిఁ గూల్చియుఁ, బుంభావముఁ దొలఁగ నీకు ‡ బోలునె యనినన్. ౪౭

ఆ॥ జీవరహితుఁ డయ్యు ‡ జీవనోపేతుఁడై, యున్నయట్ల తపసి ‡ యున్నవాఁడు
గాన వెఱతు నేను ‡ గడికండలుగఁ గొట్టు, మతఁడు గర్భశత్రుఁ డనిమె వజ్రి. ౪౮

ఆ॥ బ్రహ్మహత్యవలన ‡ భయమంద కిట్టులు, క్రూరకర్మఁ జేసి ‡ కొంక కిపుడు
సిగ్గువిడుచు టేల ‡ చెప్పు మటన్నను, దేవతక్షు కనియె ‡ దేవవిభుఁడు. ౪౯

క॥ ప్రాయశ్చిత్తక్రియలన్, బాయును బాపంబు శత్రుభంజనకర్మం
బేయెడల నుపేక్షించుట, న్యాయము గాదండ్రు బుధులనన్ వాఁ డనియెన్. ౫౦

క॥ లోభోపహతుఁడవై యఘలాభము గాంచితివి నీవు ‡ లజ్జింపక! ని
ర్లోభుఁడనై తత్క్రియకున్, సాభిప్రాయుండ నగుట ‡ యర్హామె? యనినన్. ౫౧

క॥ యాగంబులఁ బశుశిరమున్, భాగంబుగ నిచ్చునటులఁ ‡ బాల్వెట్టితి ను
ద్వేగము వల దాతని మెయి, భాగింపుము నాదుచేతి ‡ పరశువున ననన్.

—• విశ్వకర్మ విశ్వరూపుని తెగినశిరంబులు చెక్కుట •—

సీ॥ ముదమంది శక్రుని ‡ పదనుకుఠారంబుఁ, బూని యచ్చటి కేగి ‡ పుడమిఁ బడిన
సంయమీంద్రునితలల్ ‡ చదివిన విహగముల్, వెడవెడ వెడలె నవ్వింత వినుము
శ్రుతులు పఠించుచు ‡ సోమపాన మొనర్చు, నెమ్మోమునఁ గపింజలమ్ము లెగసె
దెసలు గన్గొను నానననరోజమున గుంపు, గుంపులై తిత్తిరుల్ ‡ గుములు గట్టె

గీ॥ మదిరగ్రోలు ముఖంబున ‡ మందలగుచుఁ, జటకములు లేచియంతంతఁ జదలఁ బొదలె
వానిఁ గని మోదమందుచు ‡ వాసవుండు, పురికిఁ జనె విశ్వకర్మయుఁ ‡ బోయె దివికి.

ఉ॥ ఇంటికిఁ జేరి వాసవుఁ డనహీనముదమ్మునఁ దాఁ గృతార్థతం
గంటి నటంచుఁ బొంగి మదిఁ ‡ గట్టిఁడినై యిటుఁ జేసితిన్ గటా!
తుంటరిచైద మయ్యో నిది ‡ తోడుత నన్నలయింపకున్నె? యె
న్నంటికి బ్రహ్మహత్య ఫలనశ్యము గాక తొలంగనేర్చునే. ౫౩

మ॥ అనుచున్ జింత మునింగి వాసవుఁడు నేరన్ రాని కార్యంబుఁ జే
సిన యుద్వేగము చిత్తమేర్చ నవిశక్తిఁ గాంగుడై యుండె ని

ట్లనయుండై తనయుర్ శచీపతి జఘన్యావస్థ నొందించుటల్
వినుచున్ ద్వష్ట దురంతవేదనల నావిర్భూతకోపస్థితిన్. ౫౫

—: వృత్రాసురుఁడు పుట్టుట :—

సీ॥ సురలార! వింటిరే సుతుని నిరాగసు, వధియించె దుష్టుఁడీ వాసవుండు
ఇతని వధింపంగ నేడ్తెఱఁ గలయట్టి, తనయునిఁ గల్పింతుఁ దథ్య మిదియు
సమయంబుఁ జేసితి సంశయం బేటికిఁ, దనదురితం బెల్లఁ దానె పొందు
వినుఁడు నాదుప్రతిజ్ఞ కనుఁడు నా తేజంబు, ద్విజులఁ గీడునఁ బుచ్చి తెమలఁగలఁడె
గీ॥ యనుచు రోషించి త్వష్ట వేదార్థవిధుల, నగ్నిఁ బ్రణయించి యాథర్వణానుకూల
గతులఁ బుత్రార్థియై వేల్వఁ గాలదహన, భాసురుండయి పుట్టె వృత్రాసురుండు.

క॥ పావకకీలాకులమ, ధ్యావిర్భూతప్రకాశుఁడగు సుతుఁ గని సం
భావితముదమున రెండవ, పావకుఁ డని యెంచి రుచివిభాసురుఁ డగుచున్.

ఉ॥ ముందు నటించు పుత్రుఁ గని మోమున సంతస ముప్పతిల్ల నా
నందజలంబు లెల్ల నయనమ్ముల ధారలుగట్టి త్వష్ట య
స్పందత నంకమం దిడి సుధాశనవల్లభు నుక్కడంపు నా
డెందము చల్లనౌ నని కడిందిమగంటిమి నుబ్బి యార్చుచున్. ౫౬

శా॥ భావం బేకముఖంబుఁ జేసి తనయున్ భావించి "హే! ఇంద్రశ
త్రో! వర్ధస్వ" యటంచుఁ బల్కి మహురాగాఢంబుఁగా దీవనల్
గావింపన్ దనయంత వర్ధిలె మహాగాత్రప్రభన్ గల్పకా
లావిర్భూతమహాగ్నిపోలె జనకుం డాశ్చర్యమున్ జెందఁగన్. ౫౭

కం॥ గడెగడెకున్ గులశైలము, వడువునఁ బెరుఁగుచును ద్వష్టృవదనముఁ గని పు
త్త్రుఁడు మిన్నందుచు ననుఁ గనఁ,బుడమిన్ నీ కేమికోర్కెపొడమెఁ దెలుపుమా.

సీ॥ చింతాతురుండవై చెనఁటివై తి విదేమి, కార్య మెయ్యది? యెద్దిగఱపె దీవు
మన్నామ మెయ్యది మదిఁ జింతనొందుట, కేమికారణము నాకెఱుక సేయు
మదియడంచెదఁ దండ్రి మొదలు దీర్పని పుత్రుఁ, డేటికి వాఁడిల కెగ్గుగాఁడె
దక్షుఁడౌసుతునితోఁ దన గోడుఁ దెలుపని, తండ్రి భూమికి భారతముఁడుగాఁడె
ఆ॥ సాగరములుఁ బీల్తు శైలముల్ నుసిసేతుఁ, బుట్టుచున్నతరణిపోలుపు మాపి
యమునితోడనింద్రుననంభోధిఁబడనైతుఁ,బుడమిఁగడలిలోనననడఁగఁద్రోతు. ౬౦

మ॥ జనకుం డిట్టుల నాదుపుత్రుఁ గని చంచద్వర్ధమానాంగుఁడై
తనయా! పుత్రుఁడ వీవు నాదు వృజినత్రాణంబునన్ నీకుఁ జే

రెనయు న్నీకును నన్నయా త్రిశిరు నాశయిందుఁ డింక వజ్రాహతిం
దునిమెర్ వేదవిదుండు మాని యన కెంతేతో దుర్మదాంధ్యంబునన్. ౬౩

గీ॥ మూఁడుశిరములుద్రుంచె నిశర్మోమహుఁడగుచు, నతనివంచింపఁగంటినిశన్ననుచుఁదెలిపి
శక్రసంహృతికై బాహుశశక్తి నొసఁగి, తగిన యాయుధసమితి నాతని కొసంగె.

వ॥ మఱియును త్వష్టృప్రజాపతి పురుహూతుం బరిమార్చుటకై ఖడ్గ, శూల, గదా, శక్తి, తోమర, శార్ఙ్గ, బాణ, పరిఘ, పట్టిస సహస్రాక్షయసాయకతూణీయుగ దివ్యకవచ రథ ప్రముఖాయోధనసాధనంబు లొసంగి ప్రేరేచినం గ్రోధసమన్వితుండై వేదపారగులయుఁ బవిత్రులయుఁ గృతస్వస్త్యయనుండై రథారోహణం బొనర్చి పురందరవిజయార్థియై వృత్రుండు వెడలునప్పుడు పూర్వంబున దేవపరాభూతులగు యాతుధానులు సహాయులై కూడి నడువ నతండు వచ్చు టారసి దేవదూత లింద్రునిం గనుంగొని యిట్లనిరి. ౬౪

## —• వృత్రుండు స్వర్గముపై దండెత్తుట •—

ఉ॥ వాసవ! వృత్రుఁడన్రిపుడు వైరి చమూతతిచుట్టుఁ గొల్వ ను
ద్భాసితమూర్తియై భయదబాహుబలంబున వచ్చుచున్న వాఁ
డాసురుఁ డాయితంబయి మహాగ్రహ మూనుచు వహ్ని వేల్చి పే
రీసునఁ ద్వష్ట వీనిఁ గనె నేఁడ్తఱి వహ్ని నిరాకరించెదీ. ౬౬

ఉ॥ నందనుఁ గూల్చితీ వని ఘనంబగు నాగ్రహ మూని త్వష్ట య
స్పందకృతాభిచారమున బాహుబలోజ్జ్వలు వృత్రుఁ గాంచె నీ
కుం దరమానె? యాతని నశకుంఠగతిఁ గెలువంగ దుస్సహుం
డందఱుఁ బిల్కుమార్పఁగలఁ డాహవకేళి నటంచుఁ దెల్పిరన్. ౬౭

మ॥ విని యమ్మాటలు వాసవుండు హృదయాశవిర్భూతభీతిఁ గదుర్
ఘనసంరంభవిజృంభగుంభితచమూశఘుర్షోజ్జ్వలద్దేవవా
హినులన్ గూర్చుచునున్న యత్తఱి మరుద్బృందంబు లేతెంచి యో
యనఘా! వింటివె భీమరావము దెసల్ వ్యాపించి యేతెంచెదీ. ౬౮

వ॥ అదియునుంగాక. ౬౯

గీ॥ భయముసూచించుచును మనపట్టణమున, దుర్నిమిత్తంబులంతటఁబొడఁ దోఁచెఁగె
గాకగృధ్రంబు లింటింట మూఁకలగుచు, నదలుపుల బెగ్గడిలక పెల్లఁబవఁజొచ్చె.

క॥ "చీ చీ కూచీ"రవముల, వాచఱచుచుఁ గంకఘూకసవర్గము విహృతి
పాచుర్యము లెసఁగించెను, జూచియు విని యెఱుఁగ మేమి చోద్యము! వజ్రి!

సీ॥ తేమ్మెరల్ విసర మీాఽతేరులపై నున్న, ధ్వజపతాకములెల్ల ఽ ధరణిఁ బడియె
గజఘోటకాదుల ఽ కన్నుల బొళబొళ, నెడలేక జలధారఽ లేపుమీాఱె
శేలు నిర్జరగేహఽపాళుల నాకాశ,నాదంబులు సరోదఽనములు మించె
నల్లచీరలు చుట్టి ఽ నల్లని మేనుల, నాఁడుగూప్రులు వీథిఽనాడఁజొచ్చె

గీ॥ నిదురఁబోయెడు వేళల ఽ మదవతులను, బట్టి తలవెంట్రుకలు చేతఁ ఽ జుట్టి యీడ్చి
రక్కసి నెలంతుకలు చాలఁ ఽ జిక్కఁ పఱచి,నట్లు గలలయ్యె నింటింటఽనమరనాథ!

ఆ॥ దుర్నిమిత్తములు విఽధూమ దావాగ్నుల, పగిది గుండియలను ఽ బగులఁజేయు
వెఱచి వెఱచి మీాకు ఽ విన్నవించితి మింక,నరసి సేయఁదగినఽయట్లు సేయు. ౨౩

సీ॥ త్రిదశదూతలు తెల్పు ఽ తెఱఁగులారసి వజ్రి,కడు భీతుఁడై కార్యఽఘనుని గురుని
నామంత్రణము సేసి ఽ యడుగుల కెఱఁగి య,త్యున్నతాసనమున ఽ నుండఁజేసి
గురువర్య! పురిలోనఁఽగుటిల దుశ్శకునముల్, వొడమంగఁజొచ్చె నఽబ్బురముగాఁగఁ
బ్రతికూలవాయువుల్ఽబలసె నుల్కలుడుల్లె, గోమాయునినదముల్ఽగోరలె బురిని

గీ॥ సర్వభూతాంతరంగవిఽజ్ఞాని వీవు, కననివింతలుగలవె? మీాఽకన్న నాకు
వేఱగతియున్న దే? శాంతిఽవిధులొనర్చి, ధైర్యమొనఁగూర్పు మోసురాఽచార్యవర్య!

ఆ॥ దేవతాగురుండ ఽ వీవు సర్వజ్ఞత, నెడరు చెందకుండ ఽ నెదఁ దలంచి
సాధ్వసంబు దొలఁగుఽజాడఁ బరీక్షించి, కావు మనిన శక్రుఁఽగాంచి గురుఁడు. ౨౪

సీ॥ ఏమి సేతు మహేంద్ర? ఽ హితము దప్పినపనిఁ, జేసితి వది యింత ఽ జేసె మనల
నిరపరాధిఁ దపస్వి ఽ నిర్దయఁ దుంచితి, వత్యుగ్రపుణ్యపాఽపానుభవము
తప్పునె? తోడనె ఽ తాఁకు లోభాహతి, బ్రహ్మహత్య యొనర్చి ఽ పాపి నైతి
పరహింసనము సేయఁ ఽ బాడియె? వానికి, సుఖమెట్లు గలుగు? నీఽచునకుఁగాక

గీ॥ ఇట్లు సేయంగఁ దగుదు వేఽహేయకర్మ, కీయకొంటివి భోగింప ఽ కెట్లు దొలఁగు?
మీాకు వధ్యుఁడె? వృత్రుండుఽమేటియసుర,వర్గములఁగూడి నీమీాఁదఽవచ్చుఁ జూవె?

చ॥ అశనికి సాటియైన భయఽదాయుధముల్ సృజియించి త్వష్ట త
ద్వశములు చేసె నీకు గెలుఽవర్గ వనపోఁడు ప్రపత్తిఁ జూపి త
ద్భ్రుశకరుణావిధేయతఁ జఽరింపుము వీఁడె రథాధిరూఢుఁడై
ప్రశమముఁ దూలి వచ్చె నరిఽభంజనుఁ డాతని నిగ్రహించెదే. ౨౫

క॥ అనియిట్లు గురుఁడు వజ్రికి, మన మూరడఁజేయఁ బలుకఁఽమన్న నసలుపర్
గొనకొనుతఱి హాహారవ, మెనయఁగ నిర్జరులు వెడలి ఽ రేడ్చుచు నిండ్లన్.

— వృత్రుండు దేవతలును యుద్ధము చేయుట —

క॥ సురగరుడోరగకిన్నర, వరగంధర్వాదివిబుధవర్గంబులు న
య్యరిభంజను వృత్రుని న,బ్బురముగఁ గన్గొని రపూర్వభుజబలగాత్రున్.

వ॥ అంత సునాసీరుండు పడవాండ్రం బనిచి వసురుద్రాదిత్యులను నశ్వినులను బూష
భగవాయుకుబేరవరుణులను దండధరపావకులను దమతమవాహనంబులనెక్కి
సాయుధపరివారంబుగా వచ్చునట్లు పిలువుం డని నియోగించి బలవంతుఁడగు
వృత్రుండను నొక్కరక్కసుండు మనలం దార్కొనువాఁడై యనికిం జొచ్చె నని
తెలియంజేయుఁ డని తెల్పి బృహస్పతిం దోడ్కొని నిజసభాభవనంబునకుం జని
తానును సన్నద్ధుండై సర్వామరుల స్వస్వవాహనంబుల సాయుధులుంగా నిలువం
జేసి సమరంబున కురువడింప వృత్రాసురుండు దానవవరూథినీ సహస్ర పరి
వృతుండై మానసోత్తరంబు సర్వశోభాఢ్యంబును బుష్పఫలపల్లవభరితపాదప
లతాకీర్ణంబును శీతలచ్ఛాయాబంధురంబును గావున భండనంబున కుచితంబని
విడిసిన నిందుండును సముత్కటత్రిదశవాహినీసమేతుండై గురుసహితంబుగా
నచ్చటం బ్రవేశించె నిట్లయ్యిరువాగును బరిఘ ముద్గర గదాసి భిండివాల బాణ
శక్తి పరశ్వథాదులం బోరాడ మానుషప్రమాణంబున శతాబ్దంబులు గడచనిమె
నంతకంతకు సమరసంరంభంబు విజృంభించిన.

సీ॥ వరుణుం డనీకినీవర్గంబుతోఁ బోరి, పఱచి యంభోరాశిఁ బజ్జఁ జేరె
వాయుగణంబు దుర్వారంబుగాఁ బోరి, దండిగొండలదండ నండఁగొనియె
భండనంబున కోడి పాఱె దండధరుండు, సపరివారంబుగాఁ జదలఁ బఱచె
జ్వలనుండు తనవేఁడి చల్లాఱి నిలువక, యొత్తడంబున కోడి యోరసిల్లె

గీ॥ మఱియుఁ దక్కినవారు మాఱ్మసలఁజాల, కసురవల్లభు వృత్రునిఁ యాహవమున
మాఱుమొగమైన శక్రుండు సమసలలేక, చని పరాఙ్ముఖుఁ డయ్యె నేమనఁగలదు.

ఉ॥ అయ్యెడ వృత్రుఁ డాహవజయావహుఁడై పితృసన్నిధిం గదుం
నెయ్యముతో వసించి యని నిర్జరులెల్లను వీఁకఁ దక్కి మో
మియ్యఁగ లేమిఁ దెల్పి త్రిదశేంద్రుని గొట్టి గజంబుఁ దెచ్చితిం
డయ్యుచుఁ బాఱె నిందుఁడు వెఱడంగయి యేనుఁగుఁ గొమ్ముఁ దెచ్చితిం.

ఆ॥ కాందిశీకు లగుటఁ గాంచితి శక్రాది, సురల నట్టివారి పరిభవంబు
వీరధర్మమగునె? విశ్వసింపుము నాదు, పలుకటంచు ముదముఁ గొలిపి జనకు.

ఉ॥ ఎద్ది యభీప్సితంబొ? వచియింపుము వేగమ చేయువాఁడ నీ
ముద్దున కర్హుఁడం ద్రిదశముఖ్యుని గెల్చుట [illegible]లి? పై

పెద్దల ముప్పురఁ గెలుతుఁ గ బెద్దఱికంబులఁ జూచి మానితిఁ
గద్దఱి మద్భుజానలముకాఁకలసోఁకుల వీఁకదక్కరే. ౮౪

క॥ ఏవంవిధవాచార్భటి, గావింపఁగ సుతునిఁ జూచి కడుమోదమునన్
నీవలనఁ బుత్రినైతిని, నేవధినై పుత్రిఫలముఁ జెందితి వత్సా! ౮౫

ఉ॥ నీదు పరాక్రమంబు గని నే ముదమందితి మానసజ్వరం
బీఁదితి నిశ్చలంబయి హృదీప్సిత మెల్ల ఫలించె సర్వసం
పాదక మా తపంబు దృఢభావము నేఁగొని చేయు మింక ని
ష్పాదితదుష్టవర్తి యగు పాకవిరోధిని నమ్మఁబోకుమీ. ౮౬

—• వృత్రుండు తపంబుఁజేసి బ్రహ్మచే వరంబుఁ గొనుట •—

క॥ తపమున లక్ష్మీసమృద్ధియుఁ, దపమునఁ దేజోభివృద్ధి తపమున బలమున్
దపమున నాయుర్వృద్ధియుఁ, దపమున స్వర్గంబు గలుగుఁ దథ్యము తనయా.

చ॥ నలువగుఱించి సేయుము ఘనంబు తపంబు తపోభివృద్ధిచేఁ
గలిగెడు సర్వసిద్ధి; పితృకార్యసముత్సుకతం జెలంగు మ
క్కలుషపురందరున్ గెడపుకంటె మదీప్సిత మెద్ది లేదు నీ
కల జలజాసనుండు వశుఁడై సమకూర్చు వరంబు పుత్రకా! ౮౮

క॥ అవిరళమగు తపమున నీ, వవినాశిత్వంబు గాంచి యమరాధిపు నా
హవమున నిర్జింపుము వాఁ, డవమానితుఁ జేసె నన్ను నాత్మజహృతిచేన్.

ఉ॥ తాపసుఁడైన మత్తనయుదర్ప మెలర్పఁగ దుంచినట్టి య
ప్పాపుఁడు ప్రాణముల్ గలిగి బంటుతనంబున నున్నవాఁడు నే
స్వాప మెఱుంగ మద్హృదయసంకట మేమని తెల్పువాఁడ నా
కూపిరి గల్గునంతఁ బురుహూతుఁడు లేఁడనిపింపు మర్భకా! ౯౦

మ॥ జనకుం డిట్టులు దెల్ప రోషసముదంచద్వాక్ప్రరాభూతిచే
మన మొక్కింతయు నేద దేఱిక క్రుధాసమందాంతరంగంబునన్
వనజాతమ్ములఁ బోలు తండ్రిచరణద్వంద్వమ్ముకు ఫాలమ్ము సో
క నతుండై వడిలేచి యాజ్ఞఁగొని శంకన్ మాని సోత్సాహుఁడై. ౯౧

సీ॥ తపమొనర్పంగఁ దత్పరుఁడౌచు వృత్రుండు, గంధమాదనశైలకటక మెక్కి
గంగాతరంగిణీగాహనం బొనరించి, సిద్ధదర్భాసనాసీనుఁ డగుచు
నన్నపానాదులయం దాసఁ బోఁద్రోచి, పూర్ణకుంభకయోగబుద్ధి నెఱపి
బాహ్యేంద్రియంబులఁ బ్రత్యాహరించుచు, నిశ్చలధ్యాననిర్నిద్రగతుల

గీ॥ యక్షపన్నగగరుడవిద్యాధరాది, విఘ్నముల కోహటింపక వృత్రదితిజుఁ
డంతకంతకు వెగ్గలంబైన తపముఁ, జేసె దిగ్దంతు లల్లాడఁ జిఱుతనాఁడు. ౯౨

ఉ॥ ఇట్టులు నూఱువర్షము లహీనతపం బొనరింప విఘ్నముల్
నెట్టనఁ జేయువారలు విసిందితులై చెడి కాందిశీకులై
పుట్టెడుభీతిచేఁ దొలఁగ భూర్భువరాదుల నెట్టపుట్ట ని
ట్టట్టనరాని ఘోరతప మాతఁ డొనర్చె దృఢాసనస్థితిన్. ౯౩

సీ॥ పరమనిష్ఠను శతాబ్దంబు లిట్టులు దప, శ్చర్యాభియుక్తుఁడై సంతతంబు
తపియింపఁ బంకజోదరుఁడు ప్రత్యక్షమై, వాంఛితం బెయ్యది వరము వేఁడు
మనినఁ గన్నులు విచ్చి యసురుండు కనుఁగొని, సాష్టాంగవినతుఁడై సన్నుతించి
నలువఁ గనుంగొని పలికె రక్షోమాళి, నాళీకసంభవ! నన్ను మెచ్చి
గీ॥ సన్నిధి యొనర్చి తీవు సాక్షాత్కరించి, పెన్నిధి లభించినట్టి పెన్పెదనైతి
నన్నుఁ బోలిన ఘను లెవ్వ రెన్న నేల?, మంటి ధన్యుఁడనైతి నిన్ గంటి దేవ.

ఉ॥ శక్రముఖాదిదేవతతి సంగరకేళి జయించి వారి ని
ర్వక్రపదంబు లెల్లఁ గొని వైభవముల్ గయికొంటి నస్మదీ
యాక్రమణంబు సైఁచుటకు నన్నిజగంబులవార లోడి రీ
విక్రమ మెల్లలోకముల వేఁడిమి వాఁడిమిఁ జూపె నీకృపన్. ౯౫

గీ॥ ఇన్నివైభవముల కెల్ల వన్నెఁ బెట్టి, నట్లు నీకృప గల్గె నాయందు మదిని
నొక్కకోరిక గలదు నీవుత్సహించి, వినుము వివరింతుఁ జేకొమ్ము విశ్వవంద్య!

క॥ శుష్కార్ద్రింబుల శరముల, దుష్కరమంత్రముల రిపుల దోర్బలములకే
ముష్కరమగు మృత్యుభయా, విష్కరణము లేకయుండ విధియింపఁగదే. ౯౭

చ॥ భువనములందు నిర్వ్యథత భూమి సుఖించెదనన్న నవ్వి నీ
సవినయవృత్తి మెచ్చితిని సత్యము నీమదికోర్కి యయ్యెడున్
వివిధరణాజిరంబులఁ బ్రవీణుఁడ వయ్యెదు మృత్యుభీతి నీ
దవులదు శుష్క మార్ద్రిమును దానవవర్య నినున్ గలంచునే. ౯౮

ఆ॥ శిలలలోహకాష్ఠచేతనాచేతన, వస్తుహతుల మృత్యువశత లేదు
భోగపరుఁడ వగుచు భువనంబు లేలుము, తపముఁ జాలు ననుచు ధాత చనియె.

ఉ॥ సారసయోనిపల్కులకు సంతసమందుచు వృత్రుఁ డంత దు
ర్వారముదమ్మునన్ వర మహావారణఁ జేకొని తండ్రిఁ జూడ నిం
పార రథమ్ము నెక్కి పలలాశులు వేలకొలంది గొల్వ స్వే
చ్ఛారతి  స్వాపతివైభవ మెల్లనెల్లఁగన్. ౧౦౦

ఉ॥ త్వష్టను గాంచి భాతృవరదర్ప మెలర్ప నమస్కరించి యా
సృష్టప్రకృపాప్రసాదసుఖసంస్మృతి మజ్జన ముగ్గడించి వి
స్పష్టముగాఁగఁ దెల్పుచుఁ బ్రభామహితుండయి తన్నుఁ జూపి సం
తుష్టతఁ దేలు తండ్రికడఁ దొట్రిలఁ బ్రేమ వసించి యొక్కెడన్. ౧౦౧

—॰ వృత్రుండింద్రునిపై యుద్ధమునకుఁ బోవుట ॰—

ఉ॥ అన్నను జంపినట్టి దురితాత్ముఁ బురందరు గెల్వుమంచు న
త్యున్నతరోషభీషణత తోఁపగఁ దండ్రివచింప నట్ల నీ
మన్ననఁ గాంతునం చని యసమానుమవిక్రమధుర్యుఁడైన యా
చెన్నటివృత్రుఁ డింద్రుఁపయిఁ జివ్వకుఁ బోవఁగడంగి యున్నెడన్. ౧౦౨

సీ॥ త్వష్ట యిట్లనియె నందనుఁ జూచి యోపుత్ర, కర్మత్రయంబునఁగాదె సుతుఁడు
తండ్రికి మేలువాఁడంద్రు పుత్రుని జీవ,మానుఁడౌ తండ్రిచేమాట వినుట
తండ్రి చన్నను విప్రతతిఁ దదుద్దేశంబు, గాఁ దృప్తిఁ దేల్చుటయు నరిగి
పిండంబు లిచ్చుటపెనుధర్మములుగాన, నే నున్న యెడల నీవింద్రుఁ గూల్చి

గీ॥ సత్యవాదిసుశీలుండు సంయమీంద్రుఁ, డనపరాధిఁ ద్రిశీర్షుఁ డాతని వధించు
నీసుఁబోఁజేసి వైర మీడేర్పవలయు, దీన నినుఁ బుత్రుఁగాఁ గొందు దెల్లమెందు.

కం॥ కావున నామదిలో సం,భావిత మగు, నీసు మాన్ప బలభేదకునిన్
గావింపుము త్రిశిరుని జత,సేవింపుము తిరిగి కార్యసిద్ధుఁడ వగుచున్. ౧౦౪

ఉ॥ తలఁచిన గుండె భగ్గురను ధర్మపటిష్ఠుఁడు తాపసుండు ని
శ్చలహృదయుండు మత్సుతుఁడు శక్రునిచే హతుఁడైన దాది నా
కులమయి మానసంబు కడుఁ గుందెడు నావెతఁ దీర్చి వేయుఁటే
చలము బలంబుఁ బుణ్యమును సాహసమున్ దగు నీకుఁ బుత్రకా! ౧౦౫

వ॥ అని కన్నులం దొరఁగు బాష్పంబులు గోటన్ మీటుచు రోషాగ్నికీలల జగం
బులు దహించుపోలిక నరుణప్రభావిభాసురంబులగు నయనంబుల నిప్పులుప్పతిలు
జనకునిం గాంచి యూరడించుచుఁ దదనుజ్ఞం గొని రథాధిరూఢుండై రణదుందుభి
నిర్ఘోషంబులు శంఖారావంబులు మంగళోపకరణంబులుఁ జెలంగ నిజాలయంబు
వెలువడి పరిచారకులను సేనానాయకులను గనుంగొని వాసవుం బరిమార్చి సుర
రాజ్యం బకంటకంబుగా నేలం గలవాఁడనని మదోద్వృత్తిం బలుకుచు సైన్య
నిర్ఘోషంబుల సురపురిం దల్లడి వెట్టుచు దాడి వెట్ట నుద్యోగించిన. ౧౦౬

మ॥ పురుహూతుండు భయావహంబులయి గుంపుల్ గట్టి దైత్యావళుల్
పరితోవ్యాప్తి దిగంతరాళముగఁ బైపై వచ్చుటన్ గాంచి దు

ర్భరసేనానివహంబుఁ గూర్చికొని దిక్పాలాదులన్ దోడుగా
త్సరుబాభాసురదోర్విలాసుఁ డయి యుత్సాహించి యుద్ధార్థియై. ౧౧౭

క॥ సాహస మెనయఁగ గృధ్రి,వ్యూహముగా నొడ్డు దీర్చి యురువడి బలసం
దోహములు నిలువంగఁ దురా,సాహుం డని మోహరించె సంరంభమునన్.

సీ॥ అంతవృత్రాసురుం డతిభీమరక్షశ్చ,మూవారములు చుట్టి మొనసినడువఁ
బురుహూతుతోఁ దాఁకి పోరుటకై రాఁగ, సురసేన లడ్డంబు చొచ్చునపుడు
వృత్రాసురుని మొనల్ వెలివక యడ్డమై, కలహింపఁ దుములంబు బలితమగుచుఁ
జతురంగబలములు చతురంగబలములఁ, దాఁకినఁ దొలుతాఁకు తనివిసనని

గీ॥ వేటువాటుల నొండొరుల్ గాటమైన, సూటిదెబ్బల గర్జితోద్ఘాటనముల
సాటిదప్పిన రుధిరంపుఁ దేటిగములఁ, గూటువలు గట్టె రథిరాట్కిరీటివింటె. ౧౧౯

ఉ॥ ఒండొరు గెల్చువేడుక ననూనపరాక్రమకేళిధుర్యులై
భండనభూమి నాసురుఁడు పాకవిరోధియుఁ బోరుచో సము
ద్దండకృపాణబాణముఖదారుణపాతహతాంగనిస్సృతా
ఖండరుధిరాయితాసృగధికసురీతి నేలులువాటెఁ జిత్రమై. ౧౨౦

ఉ॥ ఆయుధఘర్షణోద్యదనలాతతదీప్తులు మింటఁ గ్రమ్మఁ దే
జోయుతకల్పకాలఘనశోభినిరంతరచంచలాలతా
స్ఫాయదనూనవల్గనము చందమునన్ బెగడొందఁజేసె న
త్యాయతసాంపరాయచటులామరదైత్యచమూభటాళికిన్. ౧౨౧

సీ॥ రథవిదారణశరారంభనిర్దళనచా,పధ్వంసరథరథ్యపతనములను
అన్యోన్యఖడ్గఘాతావలేహనదేహ, నిస్సృతాస్రౌఘతోన్నిద్రగతుల
దృఢశరాపాతసందీప్తమూర్ఛాపార,వశ్యప్రహారసంవర్ధనములఁ
బునరుద్యదామర్షభూరికోలాహల, స్ఫుటరణారంభవిస్ఫూర్జనముల

గీ॥ దేవదానవదుర్మదోద్రేకహరణ, పరిణతంబయి బలభేదిపలలఖాది
భండనము చండమైదిశాకాండమెల్ల, బెండువడ భూతచయభయోద్దండమయ్యె

— వృత్రుచే దేవేంద్రుఁడు పరాజయముఁ బొందుట —

ఉ॥ అట్టిమహాహవంబునఁ బరాక్రమజైత్రుఁడు వృత్రుఁ డింద్రునిన్
గట్టి భయంకరాకృతిని గాలునుగేలును బట్టి తొట్టి పె
న్గట్టలుకన్ గ్రసించె భయకంపితమై సురవార మెల్లరున్
దిట్టలు గట్టి బెగ్గిలుచు దిక్కులఁ జేరఁగ ఘోరలీలచేన్. ౧౨౩

ఆ॥ మ్రింగి తండ్రి కసటు ♦ మ్రింగెడి నేఁటితో, నను ముదంబు గ్రమ్మ ♦ నసురవరుఁడు
గర్జితారవములఁ ♦ గదనరంగమునందుఁ, దాండవించె జగము ♦ తందరించె. ౧౧౪

మ॥ సురవారంబుల నార్తనాదములు సంక్షోభంబులుఁ మించె హా!
సురనాథా! బలజంభముఖ్యుల మహాశూరుండవై కూల్చి భీ
కరవృత్రాసురదానవాహవుఁగడంకన్ భస్మమైపోయితే?
సురరాజ్యంబులు చూఱవోయెనె కటా? ♦ క్షుబ్ధంబులై నేఁటికిన్. ౧౧౫

గీ॥ ఏమి సేయుదు మెచ్చోటి ♦ కేగువార, మెవ్వ రడ్డంబు వచ్చువా ♦ రేది మార్గ
మెద్ది కార్యంబు దైవం బకహేతుకముగ, నెడరు సంధించె నని నెత్తఁబడిరి సురలు.

—: దేవతలు గురునితో మొఱవెట్టుట :—

ఉ॥ దానవు లేపుమీఱి సురసంతతమెల్లఁ బరాభవించుచున్
మానముఁ దూలఁబుచ్చుచును ♦ మర్దనతాడనపీడనాదులన్
మాననియాసురన్ జిదుప ♦ మార్గముగ మిచ్చుచుఁ బొఱి దుఃఖసం
ధానితులై గురుం గని యనారతబాష్పఝరీపరీతులై. ౧౧౭

క॥ అడరెడిరుష శకుని వృత్రుఁడు మ్రింగె నిఁకేమి సేయఁగదోఁచదు దితిజుల్
విడివడి మర్దించిరి మా, యెడఁ గృప సేయంగవలయు ♦ నెడ రడఁగంగన్. ౧౧౮

సీ॥ ఆభిచారక్రియాశక్తుండవై వేగ, విడిపింపఁబోలదే? ♦ విబుధవరుని
నీ వుపేక్షించిన ♦ యెడలఁ గార్యము దప్పు, శక్రుఁడి మోచనక్షముఁడ వగుము.
కాదేని మన మెల్లఁ గడచన్నవారమ, యని శోకవికలులై ♦ యమరవరులు
విన్నవించినవార్త ♦ విని సురాచార్యుండు, జీర్ణంబుగా కింకఁ ♦ జిక్కునొక్కొ?
గీ॥ గర్భగతుఁడయ్యె నింక నాఖండలుండు, గలఁడె మనకంచు ధిషణుఁడుసగలఁగె భువన
భయదమయ్యెను దక్రియపార్థివేంద్ర, యేమి చెప్పుదుఁ దత్క్షోభమేపుమీఱె.

క॥ ఇత్తెఱంగున గురుసహితము, తత్తఱపడి సురచయంబు ♦ తన్మోక్షసమా
యత్తమనస్కత నెన్నో, యుత్తలమున యత్నవిధుల ♦ నొనరించి రొగిన్. ౧౨౦

ఉ॥ ఎవ్వియుఁ దద్విమోచనసమీహితవృత్తికి నోపకున్న వా
రవ్వేత సైఁపనోపక హృదంబుజవీథి జగజ్జనిత్రినిన్
మవ్వముగాఁ దలంచి యసమ స్తుతి సల్పిన యంతఁ బ్రేమతో
నువ్విళులూర దేవి కరుణాంబుధి శకునిఁ గావఁగాఁ గృపన్. ౧౨౧

గీ॥ భ్రామికాశక్తిఁ బ్రేరేపఁ ♦ బటురయమున, దేవకార్యార్థమైవచ్చి దేవి వృత్రు
నావహించినఁ దద్వశుఁ ♦ డయ్యె నసుర, తద్వశంబున ♦ జృంభ యుద్భవము నందె.

క॥ అయ్యావులింత వెరవున, నయ్యెడ వదనంబు వివృతమయ్యె నసురకుఁ
దయ్యములయెడయఁ డంగము, లొయ్యన సంకుచితవృత్తినొందఁ వెడలెఁ.

క॥ జృంభిక యనుపేర ద్విష, త్స్తంభిని యద్దేవి భూతసతతియెడ నిలిచెఁ
జంభారి వెడలుటను సుభ, గంభావుక మయ్యె సురలకౌతుక మెల్లన్. ౧౨౪

— • జంభారివృత్రుల యుద్ధము • —

ఉ॥ దారుణమై జగత్త్రితయదాహకమై పదివేలయేండ్లు జం
భారికి వృత్రదైత్యునకు నాహవ మయ్యె సరోమహర్షమై
చారణసిద్ధసాధ్యముఖసర్వసురాసురకౌతుకప్రదా
పారవిహారధీర మయి పద్మభవాండము తల్లడిల్లఁగన్. ౧౨౫

ఉ॥ ముప్పదిమూఁడుకోట్లు సురముఖ్యులు నొక్కట వృత్రుఁ డొక్కటన్
విప్పగు విక్రమంబున నవీనవినోదము లేర్పరించుచున్
జొప్పిలు రక్తనిర్ఝరులఁ జూపఱ కెల్లను వింతవింతగాఁ
గుప్పలుఁ దెప్పలై భటులు గూలఁగఁ బోరిత మయ్యె నత్తఱిన్. ౧౨౬

— • ఇంద్రుఁడు పలాయనముఁ బొందుట • —

గీ॥ అంత వృత్రాసురుని దోర్బలాతిశయత, కోహటించి పురందరుఁ డురువడింపఁ
జాలక పలాయనమునొందె సకలసురలుఁ, బఱచి రాహవవిజయియై సప్రబలె నసుర.

వ॥ అంత నింద్రునిం గని విషాదంబు నొంది సురలు రణంబుఁ జాలించి పరిత్యక్తాయుధులై పఱచిరి. వృత్రుండు గృహీతదేవసదనుండై దేవోద్యానంబులఁ గ్రీడింపుచు, నభ్రమూవల్లభంబు నెక్కి విహారంబులు సల్పుచు, నుచ్చైశ్శ్రవఃప్రభృతి దివ్యవాహనంబుల మందురాశాలలం గట్టించి దేవవిమానంబులు సేనాధిపతుల కొసంగి కామధేను కల్పపాదప చింతామణి దేవవారవధూజనంబులన్ జేకొని దివ్యభోగంబు లనుభవించుచున్నయెడ స్థానభ్రంశంబును ధనక్షయంబును జెంది నిలింపులు యాగభాగంబులు లేమి క్షుధార్తులై నవయుంజొచ్చిరి. త్వష్టయు సురసదనంబున నిష్టోపభోగంబు లనుభవించుచు సుతసమేతుండై ముదంబునొందె. సురలును గురున్ గూడుకొని మన కేది యుపాయంబని భయంబు గదురఁ గైలాసంబున కరిగి యంబికావల్లభునకుఁ బ్రణమిల్లి ప్రాంజలులై యిట్లనిరి. ౧౨౭

— • దేవతలు విష్ణుతో మొఱపెట్టుకొనుట • —

గీ॥ దేవదేవ! మహాదేవ! దీనపోష!, యార్తరక్ష! దయాంబుధే! ఆదిదేవ!
పరమపురుష! జగత్పతే! పార్వతీశ! పాహిపాహి యటంచును బ్రస్తుతించి.

సీ॥ సర్వజ్ఞ! వృత్రుండు సమరంబున మహేంద్రు, నిర్జించి స్వర్గంబు నెలవుఁ జేసి
పాలింపుచున్నాఁడు భయపరాజితులమై, శక్రుతోఁగూడ మీ సన్నిధికిని
వచ్చితి మెవ్వరికవారమై మనెదము, దిక్కెవ్వ రింక మా దిగులు మాన్ప
దుఃఖోదధి తరించి తొలఁగునుపాయంబు, గానరా దెయ్యది గతిదలంపఁ

గీ॥ జిత్తగించి సహాయంబుఁజేయుమయ్య, వృత్రుని జయించి శుభము గావింపుమయ్య!
బ్రహ్మవరమునగర్వించిప్రబలెనయ్య!,యభయమీయంగదయ్య!మహాత్మ్యమయ్య!

మ॥ సురలి ట్లార్తత వేడుచున్నఁ గని యచ్చో దేవదేవుండు దు
స్తర మిక్కార్యము వారిజాక్షుఁడు భుజస్తంభక్రియాచాతురీ
భరసంరంభి యతండు దీర్చు మన కాపత్క్షోభ; మెవ్వారముఁ
హరిఁ గాంచందగుఁ బోదమం చని యమర్త్యాళీసమేతంబుగన్. ౧౩౧

గీ॥ భక్తవత్సలు శ్రీహరిఁ బరమపురుషు, దర్శన మొనర్ప వైకుంఠధామమునకు
నరిగి రమరులు భయభీతు లగుచు వగచు, మానసంబుల దిక్కెవ్వండు లేనికతన.

మ॥ చని వేల్పుల్ గని రంబుజాక్షుని జగత్సంరక్షణాపేక్షునిన్
ఘనకౌశేయవిశాలవక్షుఁ ద్రిజగత్కల్యాణకృద్దక్షునిన్
దనుజోత్పాదనదక్షు ధర్మపదసంస్థాపనోల్లసద్వీక్షునిన్
మునిలోకస్తవనాసదృక్షుఁ ద్రిజగన్మోక్షాంగనాధ్యక్షునిన్. ౧౩౩

గీ॥ కాంచి బ్రహ్మాదిసురలు సమంచితాబ్ధి, రుచి చకచ్చకలీను తద్రుచిరచరణ
కిసలయంబులదండఁ జాగిలుచు మ్రొక్కి, వేడుచున్నఁ గనుంగొని వెన్నుఁడంత.

క॥ అన్యోన్యనమస్కృతులను, నన్యోన్యాలింగనముల నాశీర్వాచా
విన్యాసంబుల వేల్పుల, మాన్యామోదమునఁ దనిపి మఱి యిట్లనియెన్. ౧౩౪

మ॥ శుభమే శంకర? భవ్యమే ద్రుహిణ? యొచ్చోఁ గానరా వేమి? వ
జ్రి? భయం బెద్దియొ నెమ్మదిన్ దవిలి సంరక్షీణప్రభావుండవై
తి భవద్గర్వము దీనతన్ బడలె నీ దిక్పాలసంఘంబునం
దభయం బించుక కానరాదు రిపు లెందైనన్ విజృంభించిరో? ౧౩౭

క॥ వినియుంటిమి వృత్రాసురుఁ, డను దనుజుఁడు పెచ్చుపెరిఁగి యన్యాయపువ
ర్తనమున భువనవినాశం, బొనరించె నటంచుఁ దెలుపుఁ డొయ్యన నాకున్.

చ॥ హితులకు నాపదల్ దొడరనేనియు నాత్మవిపత్తిగాఁగ నం
చితమతి నెద్దిఁ బల్కక సహించెను వారిజనేత్రుచెంగటన్.
వ్రాత మొనరింపనట్టి హితుఁడే యహితుం, డభయం బొసంగితిన్
గొతుకక తెల్పుఁ డన్న సురకోటి కృతాంజలి యొచు నిల్చి ని ౧౩౮

ఉ॥ ఏమియు నాడ కిట్లు హృదయేంగితవేది యతం డటంచు సు
త్రామముఖామరుల్ నిలునఁ దామరసాక్షుఁడు ప్రేమ జొబ్బిలన్
సామవచోవిహారములు సల్పుచు వేల్పులఁ జూచి యిట్లనెన్
వేమఱు మీరు నేల ? సరవిన్ వినుపింపుఁడు మీదుకష్టముల్. ౧౩౯

ఆ॥ అమరులార ! మీకు సముఖంబునను రాయ, బార మేల పలుకవలయుఁ బలుకు
పలుకుఁ డింక నేమిపనియు లేకున్నచో, మందుఁడేని తిరుగఁ డెందు నరక. ౧౪౦

ఉ॥ కావున మీర లేమి మదిఁ గాంక్ష పొసంగి నన్ను గుఱించి సం
భావనఁ జేసి వచ్చితిరి పల్కుఁ డటన్న నిలింపులెల్ల దే
వావళి నీ కృపాబలము నందియె కాదె వసించు నీయెడన్
దేవ ! సుపర్వవాంఛితము తెల్లముగాదె మనంబులోపలన్. ౧౪౧

సీ॥ సర్వజ్ఞ ! నీవు గాంచని యర్థ మున్నదే ?, తెలిసి మ మ్మడిగిన తెలుఁగ దేమొ!
వామనాకృతిఁ బూని వైరియౌ బలిచక్ర, వర్తిని బంధించి వాసవునకు
బలమియ్యవే ! సుధాపాథోధి మథియించి, యమృతమిచ్చుటకునై యసురవరుల
వధియించి మముఁ గాచువాఁడవు నీవెకా, ప్రభుఁడవు మాకు సర్వజ్ఞ ! నీవు
గీ॥ నెడనెడ నుపద్రవంబుల నెల్ల మాన్పి, మమ్ముఁ బోషించితివి దైత్యమథన ? నేఁడు
వృత్రుఁడను రాక్షసేశుండు విక్రమించి, త్రిభువనంబులఁ బాలించు దేవదేవ.

క॥ పడరాని పాట్లు పడుచున్, విడిచితి మే మెల్ల సౌఖ్యవృత్తుల గిరులం
దడవుల వసియించుచు మే, మెడరునఁ బడితిమి కృపాప్తి నేలన్ దగదే. ౧౪౩

సీ॥ నీ వుపేక్షించిన నిఖిలంబు నశియించు, నీవు కటాక్షింప నిఖిల మొనరు
నని వేడు వేల్పుల నంభోరుహదళాక్షుఁ, డాదరించుచు భయమందఁదగదు
అసుర వధించు నుపాయంబుఁ దెల్పెద, వినుఁడు తద్వృత్తంబు వీను లలర
శత్రుమారణమునఁ జతురుపాయంబులు, శాస్త్రవాదులు వల్కుసరణి వినరె!
గీ॥ సామదానాదు లవి వీని సమయఁ జేయ, శక్తములు గావు వీని కాసక్తి యిచ్చు
వరముగల దండువలన దుర్వారుఁడయ్యెఁ, బయిని దండ్రిబలిమికూడ బాసటయ్యె.

ఆ॥ ఎట్టులైనవాని గట్టిగ వంచించి, వధ మొనర్పవలయు వైరులకును
నడ్డిగెంటరాని యట్టి పరాక్రమం, బందుఁ గలదు వానికనఁగ నసదె ! ౧౪౫

వ॥ సురలారా ! యీ యర్థంబు మనంబుల నిలుపుకొని ఋషిగంధర్వాదులం గలసి బలవంతుండగు వృత్రాసురునిం గూడి సామంబున సఖ్యం బొనర్చి శపథాదుల నమ్మించి వానిని విశ్వసింపఁజేయుం డేనును నదృశ్యుండనై వాసవు వజ్రంబున నావహించి శక్రునకు సహాయం బొనర్చువాఁడ సమయంబు ప్రతీ

క్షించుచుండుఁడు, వానికింకను గొండొకకాలం బాయుక్షేమంబున్నదని బోధించి యిందు్రుండు విశ్వాసఘాతజం బగు పాపంబు నంగీకరించి మత్సాహాయ్యంబుఁ గొని వజ్రింబున వానిం బరిమార్పంగలండు; శతు్రుహననంబుల శాస్త్రచింత నంబునకుం బనిలేదు. వామనుండనై బలిపరిమితారణం బొనర్పనే? మోహినీ వేషంబున దైత్యుల నిర్జింపనే?యదియునుంగాక సర్వేశ్వరి యగు యోగమాయను బ్రార్థింపుఁడు. మఱియు నద్దేవి మీకు మేలొనఁగూర్చుంగదా! సిద్ధిదయును, కామదయును నగు సాత్త్వికిని భజియించుచుంటిమికదా! విశేషించి వాసవుండును నయ్యంబ నారాధించిన మోహినినైై మునిఁ భ్రమియింపఁజేయు, శతు్రుండు సాధ్యుండగు, దేవికటాక్షంబునఁ బంచవర్ష సహస్రింబులు పోరి మధుకైటభులఁ భంజింపనే? కావున మీరలు దేవి నారాధింపుఁడని బోధించి పంపిన, ౧౪౭

—॰ దేవతలు దేవిని నుతియించుట ॰—

సీ॥ మందారభూమిజశబృందమండితమైన, కనకధరాధరకటకముననను
నేకాంతనిలయమై ♦ యెద నాత్మరూపంబు, ధ్యానించునట్టి భూశధరతనూజ
సృష్టిసంహారకర్త్రిని సింహవాహినిఁ, జండికఁ గాంచి నిస్సంశయముగ
వలగొని సాష్టాంగశవందనంబు లొనర్చి, వేదార్థసంస్తుతుల్ ♦ విమలఫణితి
తే॥ నేకముఖముగ నిర్జరుశలెల్లఁ గరము, లొందలల నిల్పి మ్రొక్కుచు ♦ నంబికాంబ
సన్నుతి నొనర్పఁదొడఁగిరి ♦ సరసభక్తి, యుక్తినిష్ఠాగరిష్ఠులై ♦ యురువడించి.

వృ త్త భే ద ము లు

సిరు లలరారఁ బ్రసిద్ధము నీపదశసేవనముఁ దృఢచిత్తులకుఁ
సురరిపువృత్రునిశహూరతచే బలశసూదనుఁ డాదినిలింపతతుల్
పరిపరివిధముల ♦ భర్జితులైరి కృశపామతితోడుత నేఁడుగున్
జరణసరోజము ♦ సన్నిధిఁ జేరిన ♦ సాధుల విడకు జగజ్జననీ! ౧౪౮

హరియు హరుండు వశచోధిపుఁ డాదిగ ♦ నఖిలజగంబుల నిర్మితికిఁ
నిరతము కర్త్రివి ♦ నీ వయి శాసనశనిపుణత నేలఁగ నెలకొనదే
చర మచరము గుణశచాపలమున భ్రూశచలనముచేతన త్రిప్పుటకుఁ
బరగతి వీవయి ♦ భర మనవలదు శుశభంబుల నొసఁగు జగజ్జననీ! ౧౪౯

మదమున నినుఁ గను ♦ మార్గము దెలియక ♦ మసలితి మిదివఱ కతిజడతఁ
విదితము నేటికి ♦ వెరవెఱిఁగి భవశత్పదములఁ బడితిమి ♦ పాపగుమా?
వదలక ప్రోవఁగ ♦ వలదొకొ? పుత్రుల ♦ వదలునె? తల్లి నెపంబులచేఁ
జెదరఁగ నీక పోసింపుము మాయెడఁ ♦ జిత్త మొసంగి జగజ్జననీ! ౧౫౦

దోసఁగని యెఱుఁగక x దుర్భరసంపద x నెసఁగి నిను మదిని x నెఱుఁగమిచే
కసరు జనించెనో? x కతముల నెమకెదె? x కారణ మీవxకదా జననీ!
వసపడనీయ కxవశ్యము నలమిన x వక్రిత లెవ్వియు నీ విడకే
కిసరుడిగి కృపాంxకిత వీక్షణములఁ x గేవలమేలు జగజ్జననీ! ౧౫౧

వెడఁగులమై నిను x బడిబడి వేడుచు x నడుగులఁ బడినను x. గడుఁగృపచేఁ
జెడుగగు మాహిషుఁ x జెండి హుటాహుటిఁ x గడపితి వాపద x పిడుగుబలెఁ
విడివడి మమ్ముల x వెతఁబడఁ జేసెడు x వృత్రుని నడఁచి దిxవిఁ సురలఁ
గడిమిని నిల్పుము x గాయకులను మముఁ x గావుము వేగ జxగజ్జననీ! ౧౫౨

సురల నణంచిన x శుంభనిశుంభుల x శూరుల శత్రులమిత్రులతో
దురమునఁ గూల్చితి x ధూర్వహుఁడై కడు x దుష్టత జగములు రూపఱఁగఁ
వరబల మూనిన x వాఁడగు వృత్రునిxవాఁడి యడంపఁగ నీవెకదా?
వెరవగుదని నీ x చరణయుగమ్మును x దరిసితి మమ్మ! జగజ్జననీ! ౧౫౩

బలమఱి సర్వసుxపర్వులు వృత్రునిxపాటున కోటఱి x బన్నములఁ
గలఁగుచుఁ దలఁగుచుఁ x గాతరులై గిరిxకాననములఁ బడి x గాసిలరే
తలఁచి దయారసxధారలు చిలుకక x తక్కిన నితరుల x తరమొకో రం
జిల మముఁ జేయఁగ x శ్రీకరి రాఁగదె? x సింగము నెక్కి జగజ్జననీ! ౧౫౪

స్తుతమతి! వృత్రనిxషూదన మఘమని x తోఁచినయేని పురందరునిఁ
శితవిశిఖమ్ముల x చే సమయింపుము x స్థిరపద మందెడు x సిద్ధగతిఁ
హతుఁడయి నీవిశిxఖాహతి నొచ్చిన x యతనికి దురితము లంటునొకో?
వితథుని జేయుట x గతిచెడి దీనత x గాసిలకున్నె? జగజ్జననీ! ౧౫౫

జయమున శాశ్వతxసంపద లొందిన x జనులకుఁ గీఁడొనరించుటచే
నయశముగాదు రxణాంగణమున భవxదంబకధారల హతుఁ డయినఁ
వ్యయరహితమ్మగు x వైభవ మందఁడె? x వాసవుఁ గావఁగ సన్మతిచే
భయదుఁడు వృత్రనిxభంజనమున వెతఁ x బాపుము హారికి జగజ్జననీ! ౧౫౬

వరమున మత్తిలి x వాఁడు దురమ్ముల x వైరమున న్మముఁ బఱచుటచే
"శరణం భవ" యని x చరణముఁ జేరిన x సాధులయెడల నుపేక్షలచే
వర మొసఁగుట మముxవానికి నెరగా x వైచుటయకదా? వల దీక వే
శరణాగతులకు x సర్వద వని శ్రుతిxజాలము పొగడు జగజ్జననీ! ౧౫౭

అలరులఁ జివురులు x నన్నితరువులను, గలిగించిన నినుఁ x గామనచే
నలరులఁ జొన్పుట x అపహాసితం... [illegible] x వ్యర్థులమై

గెలిచిన నోడినఁ గీరితిఁ జీయదిచి, పలుకులు వేయును నేటి కీర్తిఁ
వలవల నొగిలెడి వారల మమ్మును, వారక ప్రోవు జగజ్జననీ! ౧౫౯

జనులకుఁ గాంతిని శాంతిని దాంతిని శర్మలఁ గర్మల ధర్మములన్
ధనములఁ దత్త్వద్భజనము కోలఁదిగఁ దత్పరవై నిరతంబునిడన్
మన మిదు కడు నభిమానముగల్గిన, మాతవు నీవయి మమ్ము నిటుల్
వనఁటలలోపల నైవఁగ నేటికి, వాంఛలనిమ్ము జగజ్జననీ!* ౧౬౦

సీ॥ ఇట్టుల నుతియించు నింద్రాదినిర్జర,తతులకు నెల్లఁ బ్రత్యక్షమగుచుఁ
బొడచూపు దేవికి భువనమాతకు మ్రొక్కి, యెదుట వేల్పులు నిల్వనిట్టు లనిమె
నెద్ది గోరితిరి మీ రెదలోనఁ దెల్పుఁడ,టన్న నిలింపు లిట్లనిరి తల్లి!
వృత్రాసురుని మోహవివశునిగాఁ జేసి, మముఁ బ్రోవుమన్న నమ్మాయ యట్ల
గీ॥ యగునటంచని వరమిచ్చియరుగ వేల్పు,లెల్లముదమునఁ బొదలుచు నెనక మెసఁగఁ
బ్రాప్తవరులైన కతమున ప్రమద మొంది,చనిరి వృత్రాశ్రమమునకు వినయమున.

ఆ॥ మూఁడులోకములను మొనసి మ్రింగెడుపోల్కి, మండుచున్న దితిజమండలేంద్రు
గాంచి భయము నొంది కడు సఖ్య మార్జించి, పలికి రిటులు మధురభాషణముల.

ఉ॥ అంతట మౌనివర్యులును నాసురవల్లభుఁ గాంచి పల్కి ర
త్యంతవిరోధ మూని కుధరారియు నీవుఁ బరస్పరాత్మలన్

*షరా:— ఆ యీ దేవీస్తోత్రి కవిత్వమునకుఁగాఁ జెప్పిన 148 వ సంఖ్య మొదలు 160 వఱకును గల వృత్తముల పేరేదియో నాకు గోచరించుట లేదు. ఈరచనలోఁ గొన్నింటిలో మూడు విశ్రమములును గొన్నిటిలో నాల్గును గనిపించుచున్నవి. దానికిఁ గత మేమో! నాకన్న ముందు సంస్కరించినవారు కవిరాజవిరాజితములు అను శీర్షిక పెట్టి గణనియమములోనైనవి తదనుగుణముగాఁ జాలవఱకు సవరించిరి కాని కవితాత్పర్యమున కాసవరింపుగాని ఆ శీర్షిక గాని యభిమతము కాదని అట్టి సవరణకు మున్నున్న పద్యములలోని యక్కరములే కాక

వృత్తభేదములు

అను శీర్షికవలనఁగూడ నవగతమగుచున్నది. 4 వ స్కంధము 355 వ పుటలోఁగూడ నించుమించుగా నిట్టి రచనయే కనుపట్టినది. దాని శీర్షిక.

వృత్తనృత్యము

అని యున్నది. ఈ పేళ్లుగల రచన నా కిప్పటి కెక్కడను గోచరింపకున్నను గణబద్ధమై హృద్యమై యుండుటచే నేనున్న దున్నట్లే యుంచితిని. వృత్తనృత్యరచనకును దీనిరచనకును ప్రాస నియమ మొక్కటి బాగుగ గమనింపఁదగినది కనుపట్టెడిని. తక్కిన దొకటి రెండక్కరము లెక్కువగాఁ గనుపట్టినను నడకలో భేదము కానరాదు. ఈ రచన కాధారము గ్రంథకర్త కుపలబ్ధ మయినదే యున్నను నాకు నది గోచరింపలేదు. దీనికి వృత్తభేదనామ మెట్లు గల్గెనో? సహృదయాః ప్రమాణమ్.

జింతల మున్గినారు నినుఁ జేష్పడఁజేయ నతండు, నాతనిన్
గంతుగొనంగఁజేయుటకుఁ గాఁ గొని నీవును నుంట చేటగున్. ౧౬౩

గీ॥ అతనివారును నీవారు నట్లనెతలఁ, గుందియున్నారు వైరంబు గొరలుకతన
సంస్కృతులు సౌఖ్యముఖ్యముల్ సౌఖ్యమెడలి, వర్తిలుట పండితమ్మన్యవర్తనంబు.

ఉ॥ ఆహవదోహలుల్ దురము నందు రమింతురుగాక పండితుల్
సాహససార మీ దురము సౌఖ్య మొకించుక లేదు సామ ము
త్సాహవివర్ధకం బనుచు సమ్మతిఁ జూపుదు రట్లుగాన నీ
మోహము మాని నెయ్యములు మూర్తిగొన న్మను టింపు నింప దే! ౧౬౪

క॥ శృంగారరసవిభంగము, సంగర మింద్రియబలంబు సమయించు నెటో
కొంగుపసిండి సుఖం బెసఁగంగ మనఁగ రాదె! యురక కదన మిదేలా? ౧౬౫

సీ॥ ఆహవంబుల జయం బపజయం బిరుద్రోవ, కెద్దియో సిద్ధించు దెలియఁగరాదు
బాణతాడన ఖడ్గపాతాదిదోషంబు, లగ్గలంబులు ధనహానిబంధు
నాశంబు నిరవధికారాశాసముజ్జృంభ, మంబుజాక్షీవిలాసాతిదూర
మాత్మపూరుషనిశ్చయానఘాతమమీఁదఁ, బురుహూతపురసుఖాభోగరసిక

గీ॥ మనుప్రలోభోక్తి నమ్మి యిట్లహరహంబు, వెఱ్ఱిఁదలపోసి రాజులు వేడ్కఁగొంద్రు
కలిమియెడ బల్మియెడల నిశ్చలతగలదె? యెఱిఁగి సుఖయింపవలెఁగాక యెవ్వరేని.

క॥ పరలోకసుఖ మదృష్టం, బరయఁగ నాహవమునందు హతులైన గతే
బరములు నక్కలపాలగు, నరరే! యుద్ధమును బ్రాజ్ఞు లాసించెద రే. ౧౬౬

క॥ కావున మీ కిరువురకును, గేవలసఖ్యంబు సుఖముఁ గీర్తియు నొసఁగున్
నీ విపు డియ్యకొనందగు, భావజ్ఞుఁడ వీవు తెలుపవలయును యితరుల్. ౧౬౭

ఉ॥ నీవును వజ్రియుం గలసి నిశ్చలసఖ్యసుఖానుభూతిసం
భావితులైన మాదృశులు బంధురసౌఖ్యము లొంది యెల్లరున్
దావుల స్వస్థతన్ మనుచు దాల్మి వసింతుము నందనాదులన్
దేవవధూజనంబును ద్వదీయతదీయసుఖప్రదంబగున్. ౧౬౮

ఉ॥ ఎల్లరమున్ సుఖించుటకు హేతువు మీ యనుబంధ మిట్లు సం
ధిల్లఁగఁజేతు మిట్లొనర దీర్ఘతరాయువు గల్గి మమ్ము రం
జిల్లఁగఁ జేతు రీ సమయశిక్షణ మెల్లను మాయధీన మీ
వుల్లమునందు నియ్యకొను మూర్జిత మయ్యెడి మాట లేటికిన్. ౧౭౦

సీ॥ నీచెంత నివసించి నిర్జరేందుఁడు మనో,భీష్టంబు సిద్ధింపఁ బేర్మిఁ గొల్పు
సత్యంబు మూలంబు సర్వంబునకు సత్య,మాధార మిలకు నసహాన్యరుండు

శశియు సత్యంబుచే జగములు గాచును, సత్యంబుచే నిల్చు సాగరంబు
కావున సత్యవాక్యమున మీ కిరువుర, కగును సఖ్యంబు శయ్యాసనాన్న

గీ॥ పానసుఖభోగముల నిరపాయవృత్తి, గలుగ సుఖియించు మూఁడులోకములు నాది
దేవ దేవులు నెయ్యంపుఁ దెఱఁగుఁ గొనిన, రతన మపరంజిఁ గూడిన పవితము గాదె.

ఉ॥ దేవసమక్షమందు ముని దేవవరుల్ వచియించునట్టి సం
భావితవాక్యముల్ వినియు మానిత తేజులు మీరు దెల్పు వా
చావిభవంబు మేలగుఁ బ్రసక్తి ఘనంగునె? మాకు వారికిన్
వావిరి నిర్గ్ల వెన్నెలలు వర్తిలునే? జతగూడి మెచ్చరే? ౧౭౩

వ॥ మహాత్ములారా! శాంతులు సదాచారులు నగు మహాత్ములవాక్యంబు లలంఘ
నీయంబులైనను మద్వాక్యంబు లాలింపుఁడు. ఫలకారణంబుగాఁ బరబోధనంబునం
బలికెదరు. కృతఘ్నుండును శఠుండును స్తబ్ధుండును గాముకుండును నిర్దయుండును
నిర్లజ్జుండును దురాచారుండును బ్రహ్మఘ్నుండును నగు నింద్రుని విశ్వసింపం
దగునే? అద్రోహులగు మీకుఁ దథావిధు లగు ద్రోహులమనంబు లరయ
వచ్చునే? యని వృత్రుండు పలికిన మును లాతనిం జూచి కృతంబులగు శుభాశుభం
బులకు భోక్త చేతనుండు, విశ్వాసఘాతుకుండు నిరయంబున నవయఁగలవాఁడు;
"కృతఘ్నే నాస్తి నిష్కృతిః" అను విరించివాక్యంబు సత్యంబే కదా! మఱి
యును బ్రహ్మహత్యా సురాపాన విశ్వాసఘాతుకతా మిత్రద్రోహంబులకు
నిష్కృతి ఘనంగ నేర దిది యట్టుల నుండనిమ్ము; నీమనంబునకు ననుకూలంబగు
సమయంబు బొనర్పు మట్టుల శక్రుని నొడంబఱచువార మనిన నసురవల్లభుం
డిట్లనియె.

సీ॥ శుష్కార్ద్ర వస్తు సంయుత్యేతిచే నశ్మంబు, లను గాత్రముల దివంబునను రేయి
వధ్యుండు గాకుండ వాసవుతోడ, సమయంబుఁ జేసిన సఖ్యపడుదు
నిది నాకు సమ్మతం బిట్టుల నేనియుఁ, జెలిమి వాటిలు సునాసీరుతోడ
ననినఁ దాపసవర్యు లట్టుల నొడఁబడి, శక్రుని కెఱిఁగింప సంతసించె

గీ॥ నుభయులకు నగ్నిసాక్షిగా నొదవె నెయ్య, మసురపతి విశ్వసించి పాకారితోడ
సఖ్య మొనరించెఁ దాపసవిధమునను, గలసి రిరువురు నేకసఖ్యమునఁ బొదలి.

క॥ నందనమునఁ గనకాచల, కందరముల వారిరాశికందువల మహా
నందమునన్ మెలఁగిరి సం,క్రందనుఁడును వృత్రుఁడును సరాగుల పోల్కిన్. ౧౭౪

చ॥ త్రిదశవరుండు దానవవరున్ వధియించుటకై నిరంతరం
బదయత రంధ్రమార్గణమునందుఁ గుతూహలియై వసించె.గీ.

డెద నెఱుఁగంగఁజాలక సమీహితవృత్తిఁ జరించె వృత్రుఁ, డ
య్యదనునఁ దండ్రి వృత్రుఁగని యన్న ! యిదేమి ప్రసంగ మెఱుంగఁ జెప్పుమీ! ౧౭౭

సీ॥ కృతవైరుఁడై శచీపతి నిన్నుఁ గలహించు, శత్రునితో నేటి సఖ్య మకట!
మఱితోరి వఁ దలఁచి యిమ్మాడ్కి వర్తించెదు, విశ్వాసఘాతి యీ విబుధవరుఁడు
లోభి యున్మత్తుండు లోకగర్హ్యుఁడు ద్రోహి, పరసతీలోలుండు పాపబుద్ధి
యభియాతి మనకు మాయావిరంధ్రాన్వేషి, మాతృగర్భముఁ జొచ్చి మారుతముల
గీ॥ జిదుము టేగాదు తపసి నాచిఱుతపట్టి, హతునిఁ జేసినయట్టి దుష్టాత్ముతోడఁ
జెలిమి యేటికిఁ "బాపికి సిగ్గు గలదె?", పొంచి వంచించు నిన్ను సాధించితీరు.

గీ॥ ముజ్జగంబులవారు నమ్ముమ్మాఘు నెడలఁ, జెలిమి సేయరు నీ వెంత తెలియకుంటి!
నాదువాక్యంబు లాలించి నన్నుఁ గన్న, తండ్రి ! వాసవుతోఁ జెల్మి తగదు తగదు.

క॥ ఈసరణిని దండ్రివచో, వ్యాసంగము నొంది మది భయంపడినను వాఁ
డాసన్నమరణుఁ డౌటను, దా సరకుంగొనఁడు విధివిధానము గాదే. ౧౮౦

ఉ॥ అంతట నొక్కనాఁడు విబుధాధిపుఁ డాసురనాథు నాపగా
కాంతునితీరమందుఁ గని కాలము సంజయు నౌటఁ గాంచి మే
లెంతయుఁ గూడివచ్చెనని యెంచి యహర్దివమాట లేదు ని
శ్చింత వధింపఁబోలు నని చిత్తమునన్ దలపోసి యుబ్బునన్. ౧౮౧

—• ఇంద్రుఁడు వృత్రుని సంహరించుట •—

గీ॥ ఏకతము నిల్చి పాకారి యిందిరేశు, సంస్మరించిన విచ్చేసె శార్ఙ్గి భూత
విషయిగావున నింద్రైకవిషయుఁడగుచు, వచ్చి హరిఁ దేర్చి పవిలోనఁ జొచ్చియుండె.

మ॥ బలవిధ్వంసియు వానిఁ గూల్చుటకు నై పాటించి యే నెట్టు లీ
పలఘాదిన్ మడియింతు నంచు వెఱపున్ బైపై దువాళింప నె
ట్టులనేనిన్ మదభీష్టసిద్ధి యది తోడ్తోఁ జేయనేర్తున్ నిరా
కులమై శ్రీయము నన్నుఁ జెంద దనుచుం గ్రూరాత్ముఁడై యెంచుచున్. ౧౮౩

వ॥ అంత నయ్యింద్రుం డంభోధితీరంబునఁ బర్వతోపమానంబై పడియున్న ఫేన
కూటంబుం గాంచి యిది శుష్కంబును నార్ద్రంబునుం గాక యున్నయది యని
నిశ్చయించి, జలక్రీడాచ్ఛలంబున దానిం బుచ్చికొని యావేశితమురహరంబగు
భిదురం బందు సంధించి వృత్రునిం జేరంబిలిచి నవ్వుచు వానిపయిం బఱపిన. ౧౮౪

శా॥ సత్రాసంబున భూనభోంతరము లాశాపాళులన్ మ్రగ్గ న
క్షత్రంబుల్ భువిరాల సప్తకుధరీసప్తార్ణవక్షోభమున్
ధాత్రిం బుట్టఁగఁజేసి ఫేనపిహితోద్యద్వజ్రి మావంతలో
వృత్రుం గూలిచె వాఁడు గూలె నిలపై భిన్నాద్రిశోర్లన్ నృపా. ౧౮౩

సీ॥ వృత్రుండు మడియు నవ్వేళ వాసవముఖ్య, నాకవాసులు మహానందులైరి
తాపసోత్తములు బృందారకాధీశుని, సన్నుతించిరి మహోత్సాహు లగుచు
నిఖిలామరస్తోత్రనిర్మలానందియై, క్షీరాబ్ధిశాయి యర్చింపఁబడియెఁ
జల్లగాడ్పులు వీచె నెల్ల దిక్కులుఁ దీరె, నాడిరి రంభాదికాబ్జవదన

గీ॥ లలరువానలు గురిసె దివ్యాధ్వముననుఁ, దుందుభిధ్వానములుమించెఁదుంబురుండు
మీటె వీణయుఁ గలహాళి మెదలలేక తేఁపఁజొచ్చెను వృత్రుండుదెగిన వేళ.

ఆ॥ కార్యసిద్ధి యయ్యెఁ గావున వైకుంఠ, ధామమునకు నరిగె దానవారి
శంకమానుఁ డగుచు సంక్రందనుఁడు బ్రహ్మ, హంత నైతిననుచు నరిగెఁబురికి.

చ॥ మునులు విషాదమొంది యతిమూఢుఁడు వాసవుఁ డక్కటా! మముల్
ఘనతరవేదనన్ బఱపెఁ గట్టిఁడి విశ్వసనీయుఁ గూల్చె ని
ప్పనికిని మూలమైతిమి తపంబును బాకము నొంది యింతకై
యనుభవయోగ్య మయ్యె నుభయఘ్నులమైతిమి మాట లేటికిన్. ౧౮౮

శా॥ ఇన్నీ! యేటికిఁ బుట్టినారము తపం బింతయ్యె బొంకించి బ
ర్హిస్సాధారణు వృత్రునిన్ శపథసాహిత్యంబుచేఁ గూల్చి శ్రే
యస్సాకల్యము నొందినారము సుపర్వాధీశుఁ డిట్లాట వ
ర్చస్సామ్రాజ్యవిహీనతన్ నిరయసంచారంబుఁ బాపించెఁగా. ౧౮౯

ఆ॥ కారకుండుఁ గర్త ప్రేరకుం డనుమోది, భాగనములు గారె వసుధలోన
శకునకును దాను సాహాయ్య మొనరించి, మాధవుండు దురితమగున్నెఁడయ్యె.

మ॥ పురుషార్థంబులు నాలుగండ్రు విబుధుల్ బొంకయ్యె నాద్యంత త
త్పరతల్ శూన్యము; లర్థకామములు దుర్వారంబులై నిల్చె నె
వ్వరుసన్ ధర్మ మటన్న వార్త జనసంవాదంబు దంభోక్తి యా
నరయంగా శతమన్యుఁ డెంతకుఁ గృతఘ్నారంభి యయ్యెన్ గటా! ౧౯౧

ఆ॥ ఇట్లు వాగిలిపడుచు నేకాంతవర్తులై, మౌను లెల్ల స్వాశ్రమములఁ జేరి
తత్తదుచితవిధులఁ దత్పాపహతికినై, నియతిఁ జేసికొనిరి నిష్కృతులను.

సీ॥ త్వష్టృప్రజాపతి తనయుండు వజ్రిచే, హతుఁ డౌట విని కన్ను లశ్రుజలము
కాల్వలై వర్షింప ఘనదుఃఖవేదనా, భరమున నడలుచుఁ బట్టిఁ దలఁచి

హాపుత్ర! హాపుత్ర! ✽ హాపుత్ర యనుచును, నేడ్చుచుఁ జేయంగ ✽ నెద్దిదోఁచ
కడవులఁ గొండల ✽ నాక్రందనధ్వనుల్, వెలయ ఘోషించుచు ✽ వృత్రుఁ జూచి

ఆ॥ కొండవోలె నున్న ✽ కొడుకు కబంధంబు, గాంచి పొరలి పొరలి ✽ కనిన విన్న
వారి నెల్ల దైన్య✽వారిధి ముంచుచుఁ, దనకుఁ దానె తేటి ✽ ధైర్యమునను.

క॥ వేదోక్తవిధుల ననలా,పాదన మొనరించి తనుజుఁ ✽ బండించియు ని
ర్వేదాంబుధిబాడబమున, నాదట సంతప్తుఁ డగుచు ✽ నటమీఁద నెర్సె

—• ఇంద్రుని త్వష్ట శపించుట •—

వ॥ అవగాహం బొనరించి పుత్రునకు యథా✽ర్థ్యంబుగా నీర మి
చ్చి విధిప్రోక్తత నౌర్ధ్వదైహికము ని✽శ్శేషంబుగాఁ జేసి పు
త్రవిఘాతిన్ మఘవుం గుఱించి తనయున్ ✽ దర్పోన్నతిన్ మాయచే
వివశున్ జేసి వధించెఁ గాన నగరీ✽విభ్రంశమున్ జెందుచున్. ౯౯౫

క॥ స్వర్గచ్యుతుఁడై దుర్గమ, దుర్గంబుల భ్రంశమంది ✽ దురవస్థలచే
దుర్గతి నొందెడు నను చు న,నర్గళముగ శాప మిచ్చె ✽ నార్తుం డగుచున్

ఆ॥ ఇటులు శాప మిచ్చి ✽ యెడలేనిశోకంబు, గదుర మేరుశిఖర✽కందరమున
నధివసించి త్వష్ట ✽ యతిదుష్కరంబైన, తప మొనర్చె ననినఁ ✽ దపసిఁ జూచి.

సీ॥ జనమేజయుం డిట్టు ✽ లనియె వృత్రునిఁ గూల్చి, వాసవుం డేయే య✽వస్థ నొందె
నత్యుత్కటములైన ✽ యట్టిపుణ్యంబును, బాపంబు ననుభవిం✽పక యె చనునె?
విశ్వరూపునిఁ దపో✽విభవసంపన్నుని, నతనితమ్ముని వృత్రు ✽ నటులు గెడపి
సద్విష్టయు వేదశా✽స్త్రరహస్యవేదియు,నగు త్వష్ట నిప్పొల్కి ✽ నలఁతపఱచు

గీ॥ నిట్టి దోషంబు లెల్లను గట్టి ✽ కుడుప, ననుభవింపక ✽ తీఱునే? ✽ యమరపతికి
నతని కన నేల బ్రహ్మకు ✽ నైన వశమె?, సాధుసంతాప మఖిలసంక్షయము గాదె

వ॥ నావుడు వ్యాసుం డిట్లను, జనమేజయా! కృతంబగు శుభాశుభకర్మంబు లనుభ
వింపక తొలంగునే? బలిష్ఠులును, దుర్బలులును, దేవాసురమానుషు లనం బని
యేమి? యెల్లరకును జేయు కర్మంబు భోక్తవ్యంబగు; సందేహింపఁ బనిలేదు,
సర్వజ్ఞుండగు, వాసుదేవుం డివ్విధంబున బోధింప వాసవుం డిక్కార్యం బొనర్చె
నదియునుంగాక. ౯౯౬

సీ॥ దైవంబు ప్రతికూల✽మై వర్తిలెడు వేళ, నొకఁడు సహాయుఁడై ✽ యుండునొక్కొ
తల్లులుఁ దండ్రులుఁ ✽ దాతలన్నలుఁ దమ్ము,లాంఢ్రు బిడ్డలు మిత్రు✽లనఁగ లేవ్వ

రనుకూలవర్తులై యాపదల్ తఱియింపఁ, జేతురే! యీ వెఱ్ఱి జెందనేల?
తాను జేసినకర్మఁ దాను భోగింపక, తొలఁగునే? యెందైన దురితమనఁగ
గీ॥ ఇంత విశ్వాసఘాతియౌ నింద్రుఁ డపుడు, తేజమెల్లను గడచన్న దీనుఁడయ్యె
బ్రహ్మహంత యటంచని పలికి రమరు,లతనిఁగూడంగ వెలిచేసె నయ్యఖిలజగము.

గీ॥ అగ్నిసాక్షిగ నమ్మిక లాచరించి, యెంతదుర్మార్గ మొనరించె హేయమనఁగ
సజ్జనులు చూడ రోసిరి స్వఃపతియును,గీష్పతియనంగఁగలదె దుష్కీర్తి యెడల.

సీ॥ వేదశాస్త్రవిధిజ్ఞు విశ్వసనీయుని, విశ్వరూపుని మునివృషభుఁ గూల్చె
నమ్మించి వృత్రుని నశియింపఁగాఁ జేసె, నింత సాహసవృత్తి కేల చొచ్చె
నీతని సహవాస మేటి కంచని రోసి, గురుఁడు గంధర్వ కిన్నరులు మొదలు
సురలు ముచ్చటలకుఁ జొచ్చినచో నెల్ల, నీద్రోహకథనంబు లెసఁగ మెసఁగెఁ
గీ॥ బలుక రెవ్వరు శక్రుతోఁ బనులువినరు, కొలువునకు రారు సఖులైనఁ గూడికొనరు
వలదు బ్రహ్మఘ్నుతోఁ జోలిఁ దొలఁగుఁడనుచు, నింద్రు వెలివెట్టి రెల్ల వారిందువంశ్య!

గీ॥ దేశదేశంబులందు నీతెఱఁగులెల్ల, నొకరొకరుఁ జెప్పికొనుచు దురుక్తు లాడి
బ్రహ్మహత్య యొనర్చె దుర్మార్గవృత్తి, ననిరి యెల్లరు నీ నింద విని బలారి.

ఉ॥ ఎక్కడి గోడు వచ్చె జగమెల్ల హసించెను చేఁతఁ జేసితిన్
వెక్కర నైతి వీథితల వెళ్ళఁగ జూడఁగఁ గూడదయ్యె నా
దిక్కొకరైనఁ జూడరు పదింబదిగా మది నిశ్చయించి యీ
కక్కస మేల చేసితి వికావిక నవ్వెద రెల్ల వారలున్. ౨౦౮

సీ॥ అపకీర్తి పాలైతి నక్కట! కుత్సిత, జీవనం బెందు నిర్జీవనంబె
నిఖిలంబుఁ దెలిసియు నిందకు నోర్చితి, నధిపుఁ డింద్రద్యుమ్నుఁ డనెడు రాజు
యసమతి స్వర్గాన కతిదూరుఁడై పోఁడె?,యల్పపాపమున యయాతి పడఁడె?
భృగుపత్ని వధియించి నగధరుండు వరాహ,మత్స్యకూర్మాదిజన్మముల నొంది
గీ॥ యర్కవంశజుఁడై యరణ్యముల నవని, నాలిఁ గోల్పడి దుఃఖంబు లనుభవించెఁ
గాదె! నే నింతఁ జేసితిఁ గాన దానఁ, గర్మభవ మెట్లు భావ్యంబుగాకఁదక్కు.

ఉ॥ ఏమియుఁ దోఁచ కిట్లు మది నెచ్చిన చింతలచేత మున్గి సు
త్రాముఁడు దేహగేహముల రక్తిఁ దొలంగుటఁ గాంచి యంతఁ బౌ
లోమి విభుం గనుంగొని విలోచనబాష్పము లెల్లఁ బైటచే
వేమఱుఁ బాయఁజేయుచుఁ బ్రవీణవచోరచనాచమత్కృతిన్. ౨౦౯

సీ॥ హీనప్రభుండవై యెడలేక రోఁజుచు, సాధ్వసంబున నష్టసంజ్ఞ నొంది
యేటికి వెతనొంద హృదయశల్యంబైన,యహితుండు మృతి నొందె నాత్మచింత

వదలక శోకించె దిది యేమి? నాసామి, కారణం బెద్దియుఁ గానరాదు
బలవంతుఁ డగునొండు పగతుఁ డెందేనియు, దలచూపినట్టి దఱదడియులేదు

గీ॥ ఏను నీదాన నిజము నీయాన సురలు, నీకు వశ్యులు రాజ్యము నీకు వశము
నందనాది విహారముల్ డెందమునను, నందగింపని హేతువేమనుచు నడుగ.

ఆ॥ మందయాన! నాకు మతి భీతిలేదు బ్రహ్మఘ్నతాప్తి వెఱచియటమటించు
చున్నవాఁడ రిపుల కోటఱు యెన్నఁడు, గలదె? విప్రహత్యగలఁచె మనము.

ఉ॥ నందన కేలికావిహరణమ్ముల మందిరచంక్రమంబులన్
నందనవాక్యమాధురుల నవ్యసురాబ్జముఖీమనోజ్ఞ వ
క్త్రేందువిలాసలాలసత నింపగు నృత్తవిలోకనంబులన్
డెందము పల్లవింపదు కడిందివిచారముచే సతీమణీ! ౧౦౯

సీ॥ గంధర్వసంగీతకలనావినోదంబు, లాలింప వీనుల కందగింప
వమరగోరత్నభూజాదులం దైనను, వాంఛ పుట్టదు కన్ను వైవ నెపుడు
ప్రాణవల్లభ! నిన్నుఁ బల్కరింపఁగ నైన, నిచ్ఛ జనింప దింకేమి సేతు
సుఖహేతువులు దుఃఖసూచకంబులు గాఁగ, దోఁడగె నీయెడరు వోవిడుచుటెట్లు

గీ॥ కఠినదురవస్థఁ బడితి నో కాంత! సుఖము, గగనకుసుమంబు గాఁదోఁచెఁ గాన నింత
వెతలఁ గుందితి గడముట్టు వెరవుగాన, నిజము నీయాన కంటికి నిదుర రాదు.

— ఇంద్రుఁడు పాఱిపోవుట. —

గీ॥ అని యిటుల నాత్మగేహిని కంతరంగ, మెఱుకపఱచి శచీపతి యెలమిదక్కి
యెల్ల వేల్పుల కింతికి నెఱుకగాని, వెరవునను లేచి స్వర్గంబు విడిచి చనియె.

మ॥ ద్విజహత్యాపటుతాపవేదనలచే భీతిల్లి నిల్వోపలే
కజహృద్దుఃఖభరావలీఢుఁడయి వన్యాధ్వంబులన్ జొచ్చి ని
ష్ప్రజమానుత్తరమానసంబున నికుంజక్రీడరాజీవనా
ళజతంతువ్రజమధ్యమంబున దృణాళాలంబంబుగా నొత్తిలెన్. ౧౧౨

వ॥ ఇత్తెఱంగునఁ బురందరుండు కల్మషాభిభూతుండై యెవ్వరికిం దెలియ రాకుండఁ బ్రచ్ఛన్నుండై యసహాయుండును విగతేంద్రియుండును నై పొడవడంగియున్న యెడఁ జింతాయత్తులై మరుత్తులు స్వస్వగృహంబుల నిష్ప్రయోజకులై యుండిరి. ఇంటింట నుత్పాతంబులు దఱచయ్యె. జగంబు లరాజకంబులగుటవలన ఋషి సిద్ధ గంధర్వాదులు కాందిశీకులై డాఁగియుండిరి. దేశోపద్రవంబులు దఱచయ్యె ననావృష్టివలన క్షీణసస్యయై పృథివి నిస్సారతం బొదలెఁ దరంగిణులు

పరివారాగుప్తిం గనియెం గొలంకు లిగురంజొచ్చి నయ్యెడ సురలు గురుసమేతులై యాలోచించి ధర్మిష్ఠుండును శతాధ్వరావభృథస్నాతయు నగు నహుషుం దెచ్చి స్వర్గంబున కధినాయకుం జేసికొని తదాజ్ఞావశంవదులై యున్న నద్ధరావల్లభుండు;

## — నహుషుండు దేవేంద్రుఁడగుట —

సీ॥ నందనాదివిహార ♦ నవ్యకేళులఁ జొక్కి, యప్సరోయువతినాట్యములఁ గనుచు
గంధర్వవీణికాగానంబు లానుచు, దివ్యసౌధవిలాసదీప్తుఁడగుచు
నమరులపైఁ దనయాజ్ఞ చెల్లించుచు, వెల్లయేనుఁగు నెక్కి ♦ వేట చనుచుఁ
గామధేనుమనోజ్ఞ ♦ గవ్యముల్ గ్రోలుచు, నిందాధిపత్యంబు ♦ నెల్లఁదనదు

గీ॥ సొమ్ముగావించికొని శచీసుగుణసరణి, విని సుమాశుగ వేదనావివశుఁడగుచు
నమరమానులఁగాంచి సభాంగణమున, నహుషుఁడిట్లని పలికెదుర్నయముగదుర.

ఉ॥ నాకాధీశ్వరుఁజేసి నన్ను భువనానందంబు భోగింప న
స్తోకసాభివ మొందఁజేసితిరి విస్ఫూర్తి మదాయత్తత
లోకంబుల్ విలసిల్లె, నింద్రవిభవాళుల్ సర్వముల్ బాలన
శ్రీకౌశల్యము నొందె నింద్రసతి నన్ సేవింప కేలుండెడిన్? —౧౧౭

## — ఇంద్రపత్నిని నహుషుఁడు మోహించుట —

ఆ॥ ఇంద్రభోగ్యజాల ♦ మెల్లను ననుఁ జేరె, నింద్రపత్నిఁ గొనమి ♦ కెద్దికతము?
నాదు ప్రియమొనర్ప ♦ రాదె మత్సేవకు, శచినిఁ బంపు టర్హ సరణిగాదొ? —౧౧౮

ఆ॥ దేవలోకములకు ♦ దేవబృందముల క, ధీశ్వరుండనైతి ♦ దేవదేవి
నన్నుఁ గొనకయుంట న్యాయంబు గాదది, తెలిపి పంపుఁడాత్మనిలయమునకు.

ఉ॥ దుర్నయ మాత్మ నెంచక విధూతనిజత్రపుఁడై నిధీశధీ
నిర్ణయవృత్తి గాంచక వినింద్యముగా నహుషుండు పల్కుచోఁ
గర్ణకఠోరమయ్యును బ్రకంపితులై సురనాథునాజ్ఞ న
ధ్యర్ణపదంబుఁ జేరి సురవర్గము లిట్లని రింద్రపత్నితోన్. —౧౨౦

ఉ॥ మొక్కెద మమ్మ తల్లి? యధముండు దురాత్ముఁడు నీతిఁ దప్పి నీ
చక్కటి కేగి తెల్పుమని ♦ సాహసియై నహుషుండు పంపె ని
న్నక్కట! సేవకై పిలువు ♦ మన్న కటూక్తి వచించె వాఁడు వే
రొక్కటిఁ జెప్పినన్ గనలి ♦ యుగ్రతఁ జూపెడు నేమి మా కికన్. —౧౨౧

ఆ॥ ఎల్లవార మతని ♦ నిందుఁగాఁ గైకొంటి, మతని యాజ్ఞ లంఘ్యమగుట మెట్టు
లేమి సేయువార? ♦ మెద్ది మాకికఁ దోవ, యనిన వెఱచి శచి నిజాత్మ నొగిలి.

క॥ గురునిపదంబులపైఁ బడి, శరణంబని వేడి నహుషసాహసమునకె
వ్వరున నొనర్చెద వి త్తతిఁ, గరుణింపఁగ నీవె దిక్కు కరుణాభరణా!

ఉ॥ ధర్మవిహీనుఁడై పరునిదారను గోరఁదలంచె నెట్టు లీ
కర్మము ప్రాప్తమయ్యె? విధికౌతుక మిట్లు ఘటిల్లె నెట్టు లీ
దుర్మదు బారి దప్పునని తొయ్యలి కన్నుల నీరు జాఱలో
శర్మము దూలి వాచవిఁ శక్రిసతిం గని జీవుఁ డిట్లనెన్- ౧౧౨

—. గురుఁడు శచిని సంరక్షించుట .—

సీ॥ తల్లి! నీ కింతేల దైన్యము వెఱవకు, హీనాత్మునకు నిన్ను నియ్యఁజాల
శరణాగతులఁ బ్రోవఁజాలని దురితాత్ముఁ, డేగఁడే నిరయాగ్నిభోగములకు
నెమ్మది నాయింట నిలువుము నిన్ను నే,విడువంగఁజాల నవిశ్వాసింపు
వేల్పు లెల్లను ధర్మవిధి నూనకాతని, పలుకుఁ బల్కిన నిన్నుఁ బంపఁగలరె?
గీ॥ జలనిధులు మేరఁ దప్పిన సకలభూత, సంక్షయంబైన నహుషుదుస్సాధ్వసంబు
నిన్ను సోఁకంగనీను నిర్ణిద్రి వగుము, వెఱవకుండుము వేల్పులవిభునిరాణి.

మ॥ హరిరాణిన్ గురుఁ డడ్డమై నిలిచి రక్షాక్షీణశౌర్యోన్నతిన్
బరిపాలించుట యాత్మ నారసి దురాపంబౌ నమర్షంబునన్
సురలం గైకొన కద్దురాత్ముఁడు గురున్ శోధించి వేధింపుఁ డం
చు రయం బారఁగ నాజ్ఞయిచ్చె సభికస్తోమంబు హా! హా! యనన్. ౧౧౪

చ॥ పరుషవ్యాహృతి నిట్లు గర్జిలెడు నప్పాపున్ సురల్ చూచి భీ
కరసంరంభము నోర్వఁజాలక సశంకత్వుబ్ధచేతస్కులై
దఱియంజాలక సాధువాక్యములఁ గ్రోధంబార్పఁగాఁ జూచుచున్
సరసోక్తుల్ పచరించి రిట్లు నిగమస్థైర్యార్థని ర్ణీతిచేన్. ౧౧౫

ఉ॥ ఏటికిఁ గోపగించెదు సురేశ్వర! శాంతిని నమ్మదు క్తులన్
బాటిగఁ గొన్ను పాపమతిఁ బాయుము నిందిత మెల్లవెంటలన్
బోటులమీఁదివాంఛ, ప్రియపూర్వముగాఁ బరపత్నిఁ గొంట దో
షాటకవృత్తి త్వాదృశుల కర్హమె? యర్హులు మెత్తురే భువిన్? ౧౧౬

గీ॥ శక్రపత్ని పతివ్రత సాధుహృదయ, యన్యపూరుషు మెచ్చునే? యధిపుఁ డవని
జీవమానుండునై యుండఁ జెడిపనేత, కిచ్చగించునె? బోధించు లెవరి కగునె?

చ॥ భువనమునందుఁ బాపములు పుట్టినఁ బట్టి యడంప శాస్త్ర వీ
వవిదిత ధర్మమెద్ది? భవదాశయ మిట్టిదయైన లోకముల్

నవయవె? పాపమగ్నత జనంబులు పాటిగఁ జూతురే? మహా
సవములఁ బిల్తురే మునులు? సర్వజగంబులు మెచ్చఁ జూచునే? ౨౨౬

గీ॥ ఎల్లవిధముల రాజు సన్నిహితముగ, ధర్మరక్షణ వర్తింపఁ దగవు సుమ్ము
రాజు ధర్మంబుఁ దప్పిన రాష్ట్రమెల్లఁ, జెడదె? రాజానుసరణంబు క్షితిని వలదె?

క॥ కావున ధర్మాభ్యుదయముఁ, గావించుట నీకు వలదె కాంక్షించినచో
దేవవధూశతములు గల, రీ వేదుఃఖుఁ జెందనేల హితమతిఁ గొనుమా. ౨౨౮

సీ॥ కరణంబు రతియె శృంగారరసంబున, కది బలాత్కృతమైన ననుచితంబు
సమకాములకుఁగాని సంగమంబు రుచింప, దది విషమంబైన హాని వొడము
నదిగాక హేయమార్గనని యెంచి శచిమీఁద, వలపుఁ జాలింపు మసవాచ్యసరణి
పరదారపై నాసఁ బాసి సద్భావుండ,వైన నుత్తమపదావాప్తి గలుగు

గీ॥ బుద్ధి నశియింప నాశంబుఁ బొందుఁ దన్ను, దాని యభ్యుదయంబె యాత్మకు వివృద్ధి
పుణ్యవర్తనమున బుద్ధి పొలుపుఁ గాంచుఁ, బుణ్య మెడలిన సద్గతిఁ బోఁడు జనుఁడు.

వ॥ అనిన. ౨౩౦

మ॥ గురు నిల్లాలినిఁ జందురుఁడుఁ, మునిసతిన్ గోతారియున్ బట్టుచో
సురలారా! యెటు పోతి రొక్కొ? పరులన్ జూపోవలే కిట్టు ము
ష్కర మిక్కార్య మటంచుఁ దెల్పుటలు నైజం బయ్యెనో చెప్పవా
రరు దే? చేయరుగాక ధర్మవచనప్రారంభసంరంభముల్. ౨౩౧

ఉ॥ నాయెడఁ జెల్మిఁ గోరెన ననారత మాత్మభవాభితాపమున్
మాయఁగ నిందురాణికిని మచ్చికఁ గొల్పి వచించి తెండు సం
ధాయకవృత్తిఁ గొండు నుడిఁ దప్పినఁ బట్టి బలాత్కృతిన్ సరో
జాయతనేత్రిఁ దెచ్చి మదనాహతసౌఖ్యముఁ జెందకుందునే. ౨౩౨

చ॥ అన విని మచ్చరించు మదనాతురుఁడౌ నహుషున్ గుఱించి మే
మనయము తావకీన విభవాతిశయం బెదఁ గోరువార మిం
తనఁగఁ బనేమి? యూరడిలనాడి శచీసతిఁ దెత్తుమంచు నా
కనిలయు లంగిరస్సుతునగారముఁ జేరి దృఢాశయంబులన్. ౨౩౩

చ॥ గురునకుఁ గేలుమోడ్చి నయకోవిద! యిందురిరాణి నీగృహాం
తరమున నుంట యారసి పదంపడి తోడుక రమ్మటంచు న
ద్దురితమనస్కుఁ డంపె మముఁ దొయ్యలిఁ దక్క మహేంద్రభోగ మి
ప్పురుసున నేలువాఁ డతని పాలిదిగాదె? పులోమసూతియున్. ౨౩౪

ఆ॥ ఇంద్రురాణి యతని । కిష్టభోగార్హయై, యుండవలదె? యతని । కోహటించి
యెందుఁజనెడువార । మిమ్మతంబున కీవు, నోడఁబడంగఁ దగదె?।యురుగుణాఢ్య!

ఉ॥ ఒండొకమార్గమైన విబుధోత్తమ! నాకసుఖంబు రోయుచుం
గొండల నుండఁగా వలయుఁ । గ్రూరుఁడు వాని యమర్షమూర ।
ట్లుండెడు నన్న నాంగిరసుఁ । డుగ్రమనస్కత నిట్లు వల్కె. నా
యండ వసించి నాకు శరణాగతయౌ శచిఁ బట్టనిత్తునే? ౨౩౬

ఆ॥ అతఁడెకాఁడు త్రిభువనావాసు లేకమై, పట్టవచ్చిరేని । భయదమంత్ర
దహనజాలములను । దహియింతుఁగాక నే, నిన్నెలంత విడువనన్న సురలు.

ఆ॥ అట్టులైన నతని । ననునయించు నుపాయ, మెద్దియేనిఁ గల్గు । మిట్టు గామి
నహుషుఁ డుగ్రశాసనమ్ము వాఁడెలుఁగవే?, యనిన ధిషణుఁ డిట్టులనియె మరల.

చ॥ ఉచిత మెఱింగి చేయఁదగు । నోడకయంచు వచించి యిప్డు ని
ర్వచనముగాఁగఁ దత్సభ కనశ్యముఁ బోదము వానితోడ నీ
శచి నయవాక్యలం బలుకు । సర్వదిశావలయంబునందు భ
ర్తృచరిత లేకయున్న నినుఁ । బ్రేమ వరింతు నటంచు నేర్పుమై. ౨౩౭

ఆ॥ అశుభమునకుఁ గాలహరణంబు మేలగుఁ, బిదప నింద్రు వెదకి । పేర్మి నతనిఁ
దెచ్చువార మనుచుఁ । దెలిపొంది తానును,శచియు సురలుఁగూడి । చనిరి సభకు.

సీ॥ శచిఁగొంచు వచ్చిన । సర్వసుపర్వులఁ, గనుఁగొని నహుషుండు । కనుల నగుచు
సురలను మన్నించి । సుందరీమణి నింద్రపత్నిని దిలకించి । పల్లవించు
భావంబుతో నేఁడు । ప్రభుఁడ నైతిని నన్నుఁ, బరిరంభణ మొనర్పఁ బడఁతియనిన
హరిరాణి పల్కె నే । నమరేంద్ర! యాచింతు, వర మొక్కటింద్రుండు । వసుధలోనఁ

ఆ॥ గలఁడొ! లేఁడొ! తెలిసి । కాంక్షింతు నంతకు, నోర్వవలయు ననిన । నుల్లమునను
మెచ్చి యట్లసేతు । మేకొంటి నని స్వస్థచిత్తుఁడయ్యె నతఁడు । నేమ మరసి.

వ॥ అంత నంతరంగంబున సంతుష్టయై మహేంద్రపత్ని నహుషావరోధంబువలన విసృష్టయై బృహస్పతిసదనంబుఁ బ్రవేశించి యింద్రాగమనంబునకు యత్నం బొనర్పుఁడని సురలం బ్రార్థించిన వారలు వైకుంఠంబున కరిగి శరణాగతవత్సలుం డగు జగన్నాథునకుం బ్రణమిల్లి దేవా! బ్రహ్మహత్యాపీడితుండై యింద్రుం డెందుఁజనెనో? భవదాలోచనంబున కదా! యింద్రుం డిక్కర్జం బొనర్చుట? మాకుఁ గతి నీవమై తన్నివృత్తికిం దెరువుఁ దెల్పి మమ్ముం గరుణింపు మని ప్రార్థించు వేల్పుల వచనంబు లాలించి పురుషోత్తముఁ డిట్లనియె, శక్రతాపనివారకం బగు నశ్వమేధం బొనర్పుఁడు, పుణ్యం బగు తదధ్వరంబున నింద్రునికింద్రత్వంబు లభి

యించు, నిందాక్రిణియు భగవతీపూజ యొనర్పఁగలయది, తదర్చనంబున నహుషుండు మాయామోహితుండై నశియించు ననినఁ దద్వాక్యం బాలకించి యింద్రాన్వేషణం బొనర్చుచు నతని నాశ్వాసించి యథావిహితంబుగా హయమేధం బొనర్పంజేసి, వృక్షంబుల నదులఁ బర్వతంబులఁ బృథివిని స్త్రీలయందు బ్రహ్మహత్యం బంచి యిచ్చి పురందరుని విజ్వరుం జేసినఁ గాలకాంక్షియై, సర్వభూతాదృశ్యుండై పద్మనాళంబున నధివసించె, వేల్పులు నిజస్థానంబు లేలిరి, పౌలోమియు గురుం బ్రార్థించి దుఃఖితయై యశ్వమేధం బొనర్చినను నదృశ్యుం డగుటకు నేమి కతం బేను బ్రియుం గాంచుట కుపాయంబు సంఘటింపఁ జేయు మనిన గురుం డిట్లనియె. ౨౮౨

— దేవీమహిమంబున శచీదేవి యిందుౕనిఁ గాంచుట —

సీ॥ హరిరాణి ! నీవు మాశయామయి శాంకరి, భగవతి నర్చించు పతిని జూపు
దురితాత్ముఁడై నట్టి ద్రోహిని నహుషుని, మోహితాత్ముని జేసి మోసపఱచు
ననిన నిందాౕగన యాగమోక్తంబుగా, భువనేశ్వరీ దేవి పూజ సేయఁ
దాపసీవేషంబు ధరియించి త్యక్తస్వభోగ సంభారయై భూరినిష్ఠ
గీ॥ బూజసేయఁగ నద్దేవి ప్రోవఁదలఁచి, హంసవాహనయై వరదాభయాది
హస్తసము పేతయై ప్రసన్నాననమున, శక్రపత్నికి నెదుట సాక్షాత్కరించి.

గీ॥ జలద గంభీర శబ్దానుసారమధుర, వచన రచనల హరిరాణి ! వగవనేల ?
వరము వేడు మొసంగెద వెఱవవలదు, కోర్కెనొసఁగెదనవిన నకొౕమ్మయనియె.

ఉ॥ ఏనొనరించు భక్తికి సమీహితవృత్తిఁ బ్రసన్నవైతి వెం
తేనియు ధన్యనైతి మది హెచ్చిన తాపము సైఁపఁజాల నా
పూనికఁ దీర్చి మత్పతిని బొందు నుపాయముఁ దెల్పి తల్లిరో !
యీ నహుషావరోధము సురేశ్వరి ! నన్నుఁ దొలంగఁ జేయుమీ. ౨౮౫

ఆ॥ పతిని జూడఁగోరి భ్రాంతనై యిట్టుల, నెడరుఁజెందియుంటి గడమయేల ?
నన్నుఁ గరుణఁ గల్మి నాతల్లి ! కావుమీ, యనిన యోగమాయ యనియె శచికి.

ఉ॥ ఇచ్చభయంబుఁ బాసి ముద మెచ్చఁగ రమ్మిఁక నన్నుఁగూడి నిర్
బచ్చనివింటివాని వెతఁ బాల్పడ నీక మహేంద్రుఁగూర్తు సం
దొచ్చెము లేని కూర్మి శచి యొయ్యనఁ దోడ్కొని మానసోత్తమం
బచ్చుగఁజూపి యింద్రుఁ బతి నారయు మాతఁడు వొల్చు దీనిలో. ౨౮౬

చ॥ అని జగదంబ పల్కి సవిధాంతర పద్మ మృణాల మధ్యమం
బున ఘనతంతుసంవృతిని మాధత సాధ్వసవృత్తి నున్న యిం

దుర్గినిఁ బాడఁజూపి నీవు పతిస్రతో రమియింపుము నేను భూపతిన్
ఘనతర మోహపాశములఁ - గట్టెద భ్రాంతునిఁ జేతు నంచొగిన్. ౨౪౯

ఆ॥ వరము సంగి శచిని - వల్లభుతోఁ గూర్చి, భువనజనని నహుషు - భూరిమోహ
బద్ధుఁజేసె నంతఁ బత్నిని బాడఁగాంచి, విస్మయమునఁ బల్కె - విబుధవరుఁడు.

ఉ॥ ఎట్టుల నన్నుఁ గాంచితివొ - యేకత మున్న నన్ గనుంగొనన్
నెట్టనఁ గల్గు నెట్లు ? నవనీరజలోచన ! యెవ్వ రీ తెఱం
గిట్టి దటంచుఁ దెల్పిరి? స్వామిహితబుద్ధిఁ దలంప! విస్మయం
బుట్టిపడెం గదా? వినెద - నొయ్యన నా కెఱుఁగంగఁ దెల్పుమీ. ౨౫౦

ఆ॥ సర్వభూతములకు - సాక్షాత్కృతికిఁగాక, యణువులందుఁ గలసి - యణఁగియున్న
నన్నుఁగనుట యెట్లు? - నాకుఁ దెల్పుమటన్న, వేల్పురాణి ప్రాణవిభున కనియె.

చ॥ జగములఁ గన్నతల్లి యగు - శంకరురాణి మదీయభక్తికిన్
మిగులఁ గృపాప్తినొంది నను - మెల్లనఁ దోడ్కొని వచ్చి నేర్పుతో
నగుపడఁ జేసి తా నరిగె - నంతట నిన్ గనుఁగొంటి నీదు లే
మి గని సురల్ దివిన్ నహుషు - మేకొని రాజొనరించి రెల్లరున్. ౨౫౧

ఉ॥ ఏను విభుండనైతి నిఁక - నిందుర్గినితోఁ బనియేమి? భర్తృతా
ధానముచే ననుం గనుము - తప్పదు మెచ్చవ యేని యింక నే
మానుదునే? బలాత్కృతిని - మన్మథసౌఖ్యకలానుభూతి కా
లానముఁ జేయువాఁడను విలంబన మేలని సాహసించినన్. ౨౫౩

క॥ అంతకు నోడఁబడి రమరులు, సంతాపము నొంది గురుని - శరణాగతనై
చింతిల్లుచు నడుగులఁబడ, నంతట మానంబు గాచె - నాచార్యుఁడొగిన్. ౨౫౪

ఉ॥ హద్దుకు మీఱి వాఁడు గురుపత్నికు మీఱిన నేర్పుఁ జేసి నే
నొద్దకు నేగి యార్యమతమూని యొడంబడఁ జేసి యెట్లొ యా
పద్దశ నీఁగఁగాఁ దగిన - పల్కులు వల్కి వ్రతంబుఁ బూనితిన్
ద్వద్దయనీయఁగా నెఱుఁగు - తాల్మిఁ గొనందగు నంచుఁ బల్కుచున్. ౨౫౫

— • ఇంద్రుండు శచీదేవి కుపాయము చెప్పుట • —

ఆ॥ నీదు కుశల మరసి - నేఁజను దెంచెద, ననుచుఁ బూన్కి నెఱపి - యరసితి నిను
నింకఁ దడయరాదు - సంకటం బాదవె నా, కెద్దిగతి యటన్న నింద్రుఁ డనియె.

గీ॥ కాలపాకమ్మునను గార్యసకలన చెలఁగుఁ, దత్పరాకాంక్షినై యుంటిఁ సుదతి? నీవు
బెగడ కెద సాహసింపక ప్రియము వలన, గాల మెడ పేయుఁ దగునన్న గాంత పలికె.

సీ॥ పురుహూతుఁ డిటులాడఁ బౌలఁతి దుఃఖించుచు, నోడలెల్ల వడఁకఁ గ్రొమ్ముడి విదిర్చి
నిట్టూర్పు గాడ్పులు నిగిడి మోమలమంగ, విభుని గన్గొని మోము వెల్లఁబాఱ
నెట్టులోర్తు దురాత్ముఁ డిచ్ఛానువర్తియై, వశమొనర్పఁగఁ గోరి వలపుమీఱి
వరదానగర్వియై గురుని మెచ్చక తుళ్ళి, సాహసోద్యోగియై శాంతి మాలి
గీ॥ నడవడుల నేచుచున్నాఁడు నాకవాసు, లతనివారయి యున్నవా రడ్డగింపఁ
జాల రీ యెడ రీఁదంగ జాల నేమి, సేయుదానను విధి యిట్లు చేసె నకట. ౨౫౮

మ॥ కులటావృత్తి ఘటింపఁగాఁ దలఁచెనో? ఘోరంబుగా దైవమి
క్కలుషం బెట్లు సహింతు నీయెడల వాక్కాయంబు లేకంబుగా
వలపుం జెందు మనంబు గల్గి యెటు నే వర్తింతు నేఁడిట్టి యా
కులతల్ సంఘటిలెన్ దరించు గతి నాకున్ జూపి తేర్పందగున్. ౨౫౯

క॥ పాకప్రమథన! నీవి, క్లైకత మున్నను మదుక్తి నెవఁ డాలించున్
లోకాపవాద మెడలన్, జేకొని రక్షింపు మనిన జిష్ణుం డనియెన్. ౨౬౦

ఉ॥ ఏనొక నేర్పు దెల్పెద సమీహితవై యిటు సేయు మింత నీ
మానము రక్షితంబగు సమస్తజగంబుల శీలలక్షణం
బేనలినాక్షులందు గణియింపఁ దలంచిన ధర్మమాత్మలో
నీ నయ మెంచి కీర్తి చెడనీక పతిప్రియవౌదు వన్నిటన్. ౨౬౧

చ॥ నహుషుఁడు నీయెడన్ వలపునన్ బలవత్కృతి సల్పఁ జూచినన్
దహతహఁ జెంద కొక్కశపథం బొనరింపుము దాన మానమ
న్వహమును రక్షితంబగుఁ బ్రియంబుగ ముచ్చట సల్పి కామస
న్నిహితునిఁగా నొనర్చి పరినిష్ఠితమానసుఁ జేసి యాతనిన్. ౨౬౨

మ॥ మునియానమ్మున మద్గృహంబునకు సమ్మోదమ్మునన్ వచ్చి నా
మన మామోదము నొందఁ గోర్కెఁ గను మిమ్మెమ్మె నే ముదం బొందెదన్
జను నిస్సంశయ మింతమీఁద ననినన్ సంతోషమున్ జెంది య
ట్లన సేయున్ నహుషుండు, మీఁద ఋషిజాలం బిచ్చు మన్మోదమున్. ౨౬౩

క॥ కర్మందిశాపవశమున, దుర్మదుఁడౌ రాజు గూలుఁ దోడ్తో మనకున్
శర్మము గలదని పలికిన, నర్మిలి హరిరాణి తెరవు నాటిన మదితోన్. ౨౬౪

ఉ॥ ఎప్పటిపోల్కి నాంగిరసు నింట వసించి రహస్యవృత్తిమైఁ
దప్పక యుండ వాక్సమయతత్పరయై నహుషాంతికస్థితిన్
జిప్పిలు వాక్యమోహములఁ జేరిక లిచ్చుచు ముచ్చటించినన్
గప్పెడు మోహతత్పరతఁ గానక వేలుపురాణి మెచ్చుచున్. ౨౬౫

## —॰ శచీదేవి నహుషుతో మునివాహనుఁడవు గమ్మనుట ॰—

ఆ॥ నహుషుఁ డిట్టు లనియె ⸗ నలినాక్షి! నీ నవ్య,పాశబంధములకుఁ ⸗ బట్టువడితి
నాదుకోర్కెఁ దీర్చి ⸗ నన్నేలుకొను మన్న, నింద్రపత్ని యనియె ⸗ సాంద్రఘణితి.

సీ॥ నీదాననైతి నన్నాదరించుట కొక్క, సమయంబు గలదది ⸗ సలిపి నన్ను
మన్నింపఁదగు నెట్టు ⸗ లన్న సప్తర్షులు, వహియించు శిబికపై ⸗ వచ్చి సెజ్జ
నొద్దిక నను గూడు ⸗ టుచితంబు విభునకు, నీ వట్లసేయుము ⸗ నిన్ను మెత్తు
నింద్రవైభవమున ⸗ కెల్ల దక్షుఁడ వీవు, నే నెందుఁ బోయెద ⸗ నిన్ను విడిచి
ఆ॥ యనిన నట్లసేతు ⸗ నని నూత్నబలభేది, శపథపూర్వకముగ ⸗ సమ్మతింపఁ
గార్యసిద్ధి యయ్యెఁ ⸗ గడ తేఱు తెరువయ్యె, ననుచు సంతసించి ⸗ యతివ యనియె.

సీ॥ ఇంద్రుఁ డైరావతం ⸗ బెక్కు మేషంబున, ననలుండు మహిషంబు ⸗ నందు జముఁడు
మకరిపై వరుణుండు ⸗ మారుతహరవిరించులు మృగోక్షహంస ⸗ ములమీఁద
విహగవల్లభునిపై ⸗ విష్ణుండు విహరింతు, రిట్టులుగాక య ⸗ భీష్టమైన
మునివాహనము నెక్కి ⸗ ముదమంది ననుఁ జేర్ప, వచ్చుటసుమ్ము నా ⸗ వాంఛితమ్ము
గీ॥ సర్వదేవాధికుఁడవయి ⸗ సరసరచన, నన్నుఁ గూడంగఁ దగునన్న ⸗ నహుషుఁ డనియెఁ
దపముచేవారికన్న ను ⸗ త్తముఁడనగుదుఁ, దెలివ! ఋషివాహనమున నే ⸗ తెంతుఁ జుమ్ము

గీ॥ కేళితల్పంబునందు సం ⸗ కేత మరసి, యుండు మరు దెంతు నని శచి ⸗ నూఱడించి
కొలువుదీరిచి సురలతో ⸗ గోష్ఠి సలిపి, కామ దేవుండు మదికి నుత్కంఠ నెఱప.

మ॥ మునులన్ బిల్వఁగఁబంపి యర్హవిధులం ⸗ బూజించి మీరెల్ల శా
సనపీఠంబున నింద్రవైభవము సాక్షాద్భోగధుర్యంబుగా
నను భోగింపఁగ నిల్పరే సురవరానందంబు భుక్తంబు నె
మ్మన మూటాడెను నింద్రపత్నియును నస్మద్భోగపాత్రింబగున్. ౨౭౦.

క॥ అద్దేవీభోగము యుష్మద్దయనీయంబె కాదె? ⸗ సర్వర్షులు నన్
దద్దేవీగృహమునకున్, బెద్దయు మన్నించి యనుపఁ ⸗ జెంపొప్పుఁగదా. ౨౭౧

చ॥ లలితవిమానరాజము నలంకృతమా నటుచేసి యందు ను
జ్జ్వలగతి నన్ను నిల్పి యనివారణమోసి తదాప్తిఁ జేర్పఁగా
వలయునటన్న డెందముల ⸗ వారని కిస్క పొసంగియున్ నిరా
కులగతి సమ్మతించికొని ⸗ కూడి "సమీహిత" మన్నయంతటన్. ౨౭౨

ఉ॥ సంతసమూని కామశరసమ్మథన వ్యథితాశయంబునన్
జింతఁ దొరంగి యిద్దురిత ⸗ సేవ యనర్హమటంచెఱుంగ నా

వంతయుఁ గొంకులేక నహుషామరభర్త విమాన మెక్కి ని
ష్కాంతవిచారుఁడై శచినికాయము నొయ్యనఁ జేరఁబోవఁగన్. ౨౨౩

క॥ పాదాంతికవాహుం డగు, యాదోనిధివైరి శీర్ష ॥ మాత్మపదాంగు
ష్ఠాదృతసంజ్ఞావ్యసనా, పాదనమునఁ దాఁకనేయ ॥ భయదాగ్రహుఁడై. ౨౨౪

—• అగస్త్యుఁడు నహుషుని శపించుట •—

శా॥ వింధ్యాహార్యమదాపహర్త హృదయావిర్భూతగాఢక్రుధా
వంధ్యజ్వాలలు దిక్కులం దలమ గర్వాగ్రిస్తుఁడై వీఁడు ఘో
రాంధ్యం బొందినవాఁ డటంచుఁ బరుషవ్యాహారదీక్షన్ దృశా
సాంధ్యం బర్కగభస్తులన్ నులుమ నాసర్పవాప్తిమన్ జూచుచున్. ౨౨౫

గీ॥ "సర్ప సర్ప"యటంచని ॥ సత్వరమునఁ, బాదమునఁ దాచి దృఢకశాచోదనమునఁ
దను వగల నేసెఁగాన దుర్దాంతసర్ప, మగుచు వని నుండుఁగావుత ॥ మని శపించె. ౨౨౬

ఉ॥ ధర్మవివర్ధనుం డయిన ॥ ధర్మతనూభవుదర్శనోక్తులన్
గర్మఫలు లెల్ల డుల్లి దివిఁగాంచెద వంచుఁ బునర్విముక్తియున్
మర్మము వీడి తెల్పె నభిమానహార్తిన్ నహుషుండు సర్పమై
శర్మముఁ దూలి ఘోరవని ॥ సంకటపాటును బొందె భూవరా! ౨౨౭

—• ఇంద్రుఁడు స్వర్గమునకు అధిపతి యగుట •—

వ॥ అంతటఁ బురందరుండు లోపాముద్రావల్లభు ననుగ్రహంబున నిర్వైరుండై సంతసం బొదవుట విని గమనోన్ముఖుం డగు ననసరంబున వేల్పులెల్ల గుమిగూడి మునులం గలపికొని యతనిం దోడితెచ్చి స్వర్గరాజ్యంబున నభిషిక్తుం జేసిన శచిం గూడికొని నందనాదివిహారంబు లొనర్చుచు భువనాధిపత్యం బకంటకంబుగా ననుభవించె. జనమేజయా! ప్రసంగవశంబున వృత్రాసురవధోపాఖ్యానంబు సవిస్తరంబుగా వివరింపంబడియె. మూలప్రకృతి యగు యోగనిద్రామహాశక్తి చారిత్రంబు లిట్టివని యెఱుంగుము. "కృతంబగు కర్మం బవశ్యభోక్తవ్యం" బని శాస్త్రనిశ్చయంబుఁ దెలిపిన ముదం బంది బాదరాయణునకు నమస్కరించి పరీక్షిన్నందనుం డిట్లనియె. ౨౨౮

—• వ్యాసుని జనమేజయుఁడు తన పూర్వుల కష్టములనుగురించి ప్రశ్నించుట •—

ఉ॥ వింటి మహానుభావ! సురవీరుఁడు శక్రనివృత్తమెల్ల లో
నంటిన సందియం బొకటి ॥ యబ్బుర ముప్పతిలంగఁజేసె ని

ష్కంటకభోగశాలి త్రిదశవ్రజనేత శతక్రతుం డదే
వెంటను స్వర్గివాసమును ౹ వీడి వగం బెగడొందె దీనుఁడై. ౫౨

గీ॥ కారణంబు బ్రహ్మఘ్నత ౹ గాన నెడరు, సంధిలుట యొప్పుఁ బదపడి ౹ శాస్త్రసరణి
నశ్వమేధం బొనర్చుట ౹ నదియుఁ బాసి, సిరుల నొందుట తగవయ్యె ౹ జిత్రమగునె!

సీ॥ మత్పూర్వజులు ధర్మ ౹ మహితులు కృష్ణైక, జీవనుల్ సాత్త్వికుల్ ౹ శిష్టమతులు
ద్విజభక్తి తత్పరుల్ ౹ దేవపూజారతుల్, దేవకల్పులు సము ౹ ద్దీప్త తేజు
లదిగాక రాజసూ ౹ యాధ్వరం బొనరించి, విప్రవళుల సాంగ ౹ విధులఁ దనిపి
ఫలదాయకుని యాద ౹ వశ్రేష్ఠు నర్చించి, రిట్టివారయ్యుఁ బెక్కుడుము లొంది

గీ॥ రమ్మహావీరవరుల క ౹ ల్లాలు ద్రుపదు, కన్నె పసుపాటులకు లేదు ౹ గణన సభను
వలువలొలువంగఁబడియె దు ౹ ష్టులకుఁ గీచ, కులకు లోఁబడి ఘనదుఃఖ ౹ జలధిమునిఁగె

ఆ॥ కనిన వినిన దురిత ౹ గంధగంధము లేక, కృష్ణు నాశ్రయించి ౹ కృష్ణయనెడు
పేరఁ బరఁగి ద్విజులఁ ౹ బ్రీతిఁ బూజింపుచు, నింత వెతలఁ బడుట ౹ కేమికతమొ!

మ॥ నరనారాయణు లచ్యుతాంశజులు నా ౹ నాదుష్టనిర్ధూతికై
ధర జన్మించి రటంచుఁ దెల్పితివి దు ౹ ర్దాంతవ్రతారంభులై
చిరకాలంబు తపం బొనర్చిన జగ ౹ త్త్రేమాదరుల్ వారు బా
దరికారణ్యమునన్ దపించుట కిమ ౹ ర్థం బీశులై కాములే? ౫౩

క॥ వారేకద కృష్ణార్జును, లై రాధికి నెక్కునట్టి ౹ యధికులు! దుఃఖా
పారముగ గర్భవాస, మ్మేరీతి సహించి రింత ౹ హీనత గలదే! ౫౪

క॥ ఒక్కనిమేషము కుక్షిం, జిక్కుట నిరయం బటండ్రు ౹ చిరకాలము తా
రెక్కుడు వెత కోరిచి యా, వెక్కురు గర్భాబ్ధి మునుఁగు ౹ విధ మెట్టిదొకో. ౫౫

ఉ॥ దైవతకార్యసిద్ధికయి ౹ తా రుదయించి రటన్న గర్భవా
సావహదుఃఖ మోర్చుటకు ౹ నయ్యెనె? "సంగతిగానిజోలి" గా
దే! విన నర్థమానె? యిది ౹ యెల్ల నటుండఁగ నిమ్ము ధర్మజుం
డే విధిచోదితం బనుచు ౹ నెక్కటిఁ బోరె దురోదరంబులన్. ౫౬

గీ॥ ఇన్నిటికిఁ గారణమ్ము లె ౹ ల్లెట్లు కలిగె, వినఁగ వేడుక యయ్యె స ౹ విస్తరముగఁ
దెలుపు మనినను గంధవ ౹ తీతనూజుఁ, డాదరంబున విభున కి ౹ ట్లని వచించె. ౫౭

సీ॥ కర్మంబులకు నెల్ల ౹ గతి మూఁడు దెఱఁగులు, శాస్త్రచోదిత మది ౹ సంచితంబు
వర్తమానంబును ౹ బ్రారబ్ధ మను పేర, సంచితంబును జన్మ ౹ సంగ్రహంబు

సాత్త్వికంబును రాజసంబును దామసంబన నది త్రివిధంబయి చెలంగు
బహుకాలికం బయి పరిబలి శుభాశుభసరణి వర్తించు నా సంచితంబు

గీ॥ ననుభవింపక నశియింప దదియు జన్మజన్మముల జీవులను బట్టి సంకటములఁ
ద్రోయుబహుకల్పములనైనఁ దొలఁగిచనదు, భోగనశ్యమ్ముసుమ్మది భూమిపాల!

వ॥ మఱియును, గ్రియమాణంబగు కర్మంబు వర్తమానంబనంబడు జీవుండు దేహస్థుం
డై శుభాశుభంబు లొనర్చుచుండు మఱియుఁ గాలంబు సంచితరాశినుండి కొన్ని
కర్మంబుల సమాహరించి ప్రారబ్ధం బను పేర జీవులను భుజింపం జేయుచుండు,
ప్రారబ్ధంబును భోగంబున క్షయించును బురాకృతంబులగు శుభాశుభంబులు దేవా
సురమనుష్యయక్షగంధర్వపన్నగాదులకును దప్పిపోవు, కర్మంబున దేహారంభంబు
కర్మనాశంబున జన్మనాశంబు నన్వయవ్యతిరేకంబుల శాస్త్రనిశ్చితం బని యెఱుం
గుము, బ్రహ్మవిష్ణ్వాదులును గర్మవశంవదు లట్లుగాకున్న సుఖదుఃఖాలయంబగు
దేహం బొందుదు రే? పాతకంబున దుఃఖంబును, బుణ్యంబున సుఖంబగును; బుణ్యా
తిశయంబున మానవులు సురలగుటయును బాపాతిశయంబున సురలు మనుజు
లగుటయును నట్టిదగుటఁగాదే? ధర్మపుత్రులగు నరనారాయణులు కృష్ణార్జునులగుట,
మునులవలనఁ గీర్తితంబగు పురాణపీఠికాప్రకారం బిట్టి చందంబునం బ్రవర్తిల్లు
విభవాతిశయంబు గలుగువారలు దేవాంశజులు, కావ్యకల్పనాచతురులు ఋష్యంశ
జులు, శివపూజాపరులు రుద్రాంశజులుఁ గాకయున్న నన్నదాతలు గానేరరు, నారా
యణాంశంబున భూపాలు లగుదురు రాజులకు నిందాగ్ని యమ వరుణాదుల
విభవప్రతాపసాహస శాలిత్వాదులు సంభవించు, బల భాగ్య భోగ విద్యా
ధనంబులు గలవారలు దేవాంశజులని తెలియవలయును, గావునఁ బాండవులును
వాసుదేవుండును దేవాంశజు లయ్యును సుఖదుఃఖభాజనంబగు దేహంబుల నొం
దుటవలన దైవాధీనులై వనవాసంబు మొదలగు కష్టంబులం బొందిరి. రాజ
సూయకరణంబు మొదలగు పుణ్యంబులం గాంచిరి, మఱి యర్జునుండు దుష్కరతపం
బొనర్చిన కష్టం బీశ్వరదత్తవరదానంబున సుఖంబు గాంచె, దేహసంబంధంబున
నిట్టివారలకుఁ గర్మగతి గహనంబై వర్తించు వాసుదేవుండును దేహబంధంబునఁ
బదునొకండు వర్షంబులు తల్లిదండ్రులం బాసి నందునింట వసించుట కష్టంబు,
పిదప మధురాపురంబునఁ గంసాదివధం బొనర్చి ద్వారకఁ బ్రవేశించి పుత్రపౌత్ర
సుహృద్భృత్యభ్రాతృ సహితుండై షోడశసహస్రపత్నీసౌఖ్యం బనుభవించుట
సుఖంబు, దేహగ్రహణమాత్రంబున నెంతవారికిని సుఖదుఃఖంబులు తొలంగనేరవని
సంక్షేపరూపంబుగా వచించిన జనమేజయుండు బాదరాయణున కిట్లనియె. ౨౮౯

సీ॥ భూమి గోరూపంబుఁ బొంది విరించిని, శరణంబుఁ బొందిన సన్నిష్ట హరినిఁ
బ్రార్థించి భూభారసంహరణంబు సేయంగ, నవతరింపు మటన్న సద్రిధరుఁడు

త్రిదశులతోఁగూడ * దీనరక్షకుఁడౌచు, భరతఖండంబునఁ * బ్రభవ మొంది
బలభద్రుతోఁ గూడి * పాపుల మర్దించి, ద్రోణభీష్మాదులఁ * ద్రుంచివైచి

గీ॥ తనువు దిగనాడె నంతటఁ * దనదుసతులు, శబరులకుఁ బట్టువడుట తా * సర్వ మెఱిఁగి
సమరములవారిఁ జంపమి * సంశయంబు, మానకున్నది నామది * మానివర్య!

ఆ॥ సంశయంబుఁ బాపఁ * జను నన్న వ్యాసుండు, పల్కె రాజుతోడఁ * బార్థివేంద్ర!
కాలధర్మ మొక్కరగతిఁ బ్రవర్తించదు, దైవనిశ్చితంబు * దప్ప దెపుడు. ౨౯౧

— కాలధర్మములు —

సీ॥ కృతయుగంబున ధర్మపరతు లెల్ల జీవులు, ధర్మార్థపరులు తత్పరతఁ ద్రేత
ధర్మార్థకామతత్పరులు ద్వాపరమునఁ, గలిలోనివా రర్థకామపరులు
యుగధర్మములు దప్ప * వొక్కప్పుడును గర్త, కాల మన్నిటికిని * గర్మవశతఁ
బూర్వపూర్వంబులు * పోరిఁబోరి నుత్తరో, త్తరకారణంబులై * తనరుచుండు

గీ॥ వీరు వారననేటికి * వివిధజంతు, సంతతులు పూర్వపూర్వంబు * సంచితప్ర
వర్తనంబున సుఖదుఃఖవర్తు లగుచు, మెలఁగుచుందురు చక్రనేమిక్రమమున.

వ॥ నావుడు జనమేజయుం డిట్లను, ౨౯౩

సీ॥ కృతయుగంబునఁ బుట్టి * కృతధర్ములౌ వారు, వసియింతు రెచ్చోట * వసుమతీశ!
ధర్మార్థవర్తులై * తగఁ ద్రేతవా రెందు, నిలిచియుందురు మానవకులలలామ!
ధర్మార్థకామసంఘాతలౌ ద్వాపర, యుగమువా రెందుందు * రుజ్జ్వలాంగ!
పాపిష్ఠులై కలిఁ * బ్రభవించు జీవులు, తొలుత నెందుందురో * తెలుపు మనఘ!

గీ॥ ఏయుగముల వా రెల్లరు * నాయుగములఁ, బుట్టుదురొ? కాక విపరీతసంభూతిగలదొ?
యిట్టి సందేహ మెల్ల నా * కెద జనించెఁ, దెలియఁజెప్పుము సత్యవతీతనూజ!

చ॥ అన విని రాజుఁ గాంచి కరుణాతిశయంబున మౌనిచంద్రుఁ డి
ట్లనియెఁ గృతంబునన్ మనుజు * లందఱు ధర్మపరైకచిత్తులై
ఘనసుకృతం బొనర్చి యధికప్రమదంబున స్వర్గలోకసం
జనితసుఖానుభోక్త లయి * సల్పుదు రైహికవర్తనంబులన్. ౨౯౫

క॥ చాతుర్వర్ణ్యంబులవా, రాతతసత్క్రియలు సలిపి * యనుపమలోక
స్థిత లయి సౌఖ్య మొంది ని, రాతంకమనీష నాత్మ * రంజింతు రొగిన్. ౨౯౬

సీ॥ సత్యంబు దయయును * శాంతియు దానంబు, స్వస్త్రీసుఖంబును * సర్వసమత
యఖిలభూతంబులం * దద్రోహవృత్తియు, ద్విజభక్తి దేవతాతీర్థసేవ
మొదలగు ధర్మముల్ * వదల కుపార్జించి, చరమజాతులు మొదల్ * సర్వజనులు
స్వర్గలోకసుఖంబు * సాధించి దివ్యభోగంబులఁ జెంది యపరప్రకాశ

గీ॥ భాసమానాంగులై దేవ భవనములను, నామరోద్యాన కేళివిహారములను
బ్రొద్దుఁబుచ్చుచునుందురు పుణ్యమాత్ర, భోగపరులౌటఁ గృతయుగంబున నరేంద్ర!

వ॥ త్రేతాద్వాపరంబులం గూడ నట్ల యగు. ౨౯౮

గీ॥ ద్వాపరాంతంబునందును బాపులైన, నరకవాసులు కలిజనంబు నొంది
కష్టసుఖములు రెంటినిఁ గర్మలబ్ధ, గాతులై కీడు మేళ్ళను గాంచుచుందు. ౨౯౯

ఉ॥ ఇట్టివి కాలవర్తనము లిప్పథ మన్యగతిం బొసంగ దె
ప్పట్టున దైవయోగమునఁ బ్రాణులు తద్యుగవైపరీతిమైఁ
దొట్టిన యుత్తమాధమవిధుల్ గలయట్ల యుగభేదభూతిచే
నెట్టన వర్తనంబు గని నిల్తురు స్వస్వగుణానువృత్తులై. 300

ఆ॥ దైవయోగవశతఁ దత్తద్యుగంబులఁ, బుణ్యపాపములను బొదలి వినిమ
యంబు నొందిరేని యట్టిచేతనులకుఁ, దదనురూపగతులు తప్ప వధిప! 301

క॥ సత్యయుగంబుల దుష్టు ల,సత్యయుగంబులను, బుట్టినలుపుదు రిటులన్
సత్యము గల కలిజనులకు, సత్యయుగోద్భూతి దొరకు సందియ మేలా! 302

చ॥ ఇటులు పరాశరాత్మజుఁ డహీనకృపాతిశయంబుతో వచ
స్స్ఫుటగతిఁ దెల్ప రాజనియె భూరిదయామయ! యేయుగంబులం
దెటువలె ధర్మవర్తనము లింపలరారునొ, తద్విశేషముల్
పటుగతి మీనులన్ వినఁగ భావము నా కుదయించెఁ దెల్పుమీ. 303

గీ॥ దేవ! భవదీయవాక్యసందీపితార్థ, మాధురికిఁ జొక్కి చిత్తంబు మరలదయ్యె
వినఁగఁగోరినవాఁడ సవిస్తరముగ, నానతీయవె! యుగధర్మ మతిశయముగ.

వ॥ అనిన. 304

మ॥ యుగధర్మంబులు దెల్పెదన్ వినుము చేయ్యోల్ వేఱువేఱౌచుఁ ద
ద్యుగభూతంబుల వర్తిలున్ సుకృతసంబంధుండయ్యు మీతండ్రి యీ
యుగధర్మంబునఁగాదె? మానివరు నయ్యో! యంతగాఁ జేసి యీ
యుగచారిత్రజమధ్యపాతియయి సర్వోపప్లుతుల్ గాంచఁడే. 305

గీ॥ కలివశంబునఁ గాదె యర్కపవిత్రాప!
క్షత్రికులజుండు మీతండ్రి సర్పశవము
మౌనిగళమునఁ జుట్టి యమ్మాడ్కి యగుట
కాన యుగయుగమున వృత్తిగతులు మాఱు. 306

క॥ యుగముల వర్తనములుగని, జగముల విజ్ఞానఘనులు సద్ధర్మములన్
బొగడొందుదు రది తొలఁగిన, నగధీరా! కలదె యెంట నాకసుఖంబుల్. ౩౦౮

సీ॥ కృతయుగంబున విప్రతతులు చతుర్వేద, పారంగతులు దేవభక్తిపరులు
స్వాచారనిరతులు సత్యప్రతిజ్ఞులు, వేదోక్తధర్మప్రవృత్తిరతులు
క్షత్త్రియుల్ ప్రజల కుజ్జ్వలశుభంబులు దార్చి, పాలింపుచుందురు పరమనియతి
వైశ్యులు కృషియును వాణిజ్యమును బశు, రక్షణంబును గల్గి రక్తిఁ గొందు

గీ॥ రిట్టి వర్ణత్రయమువారి యెడల నిత్య, సేవ యేమఱకుందురు క్షితిని శూద్రు
లిట్టి సత్యయుగంబున నెందు నేని, దురిత మనుమాట గలుగునే ధరణినాథ!

ఆ॥ ఇంచుకంత తగ్గు నింతమాత్రమె కాని, త్రేతయందు సత్యదృఢత గలదు
ద్వాపరంబు నట్ల దానికి నిసుమంత, గడమ గాని ధర్మగరిమ ఘనము. ౩౧౦

సీ॥ పూర్వంబు రక్కసి పుట్టువు లొందిన, యధములు కలియందు నవతరించి
బ్రాహ్మణాదులయందుఁ బాషండులై లోక, వంచకులై దేవవంచనమున
గురువంచనంబునఁ గ్రూరులై శ్రుతిధర్మ, విరహితులై సత్యవిధులు దొలఁగి
మదలోభదంభాభిమానముల్ వదలక, శూద్రసేవకుఁ జొచ్చి క్షుద్రమతులు

గీ॥ వాదములు చేయుచును బ్రతివాదులయెడ, సత్యవిరహితులై యర్థసంగ్రహముల
మనసుఁ జొన్పుచుఁ గలిఁ బుట్టుగొనినయట్టి, వారు వర్ధిల్లుదురు దురాచారు లధిప.

గీ॥ వారు వీరన నేల? సర్వత్ర జనులు, శూద్రధర్మంబులకుఁ జొచ్చి సుగతిఁ గనక
నిరయములు పూర్తి నొందించి నిగమవిధుల, బూదిపాలొనరింతురు భూపవర్య!

శా॥ కామాచారపరాయణత్వమున శంకాతంకము ల్లేక మి
థ్యామోహంబుల భర్తృవంచనము నేయన్ జూచుచున్ గల్లలున్
బూమెల్ పన్నుచుఁ బాపచిత్తలయి నిర్మోహంబుచే నర్థకాం
క్షామూలంబగు వర్తనంబునఁ గలిన్ గాంతల్ చరింతు ర్వారిన్. ౩౧౩

సీ॥ ఆహారశుద్ధిచే నగు మనశ్శుద్ధులు, దానధర్మము శుద్ధిఁ దనరుచుండు
వృత్తిసంకరముచే విపులాతలంబున, వర్ణసాంకర్యం బవార్యమగును
అన్నింటికిని మూల మాహారశుద్ధియే, కలికాలమున నది గలుగ నేర
దిచ్చవచ్చిన యట్లు హేయభక్షణములఁ, జిత్తముల్ చెడ నన్ని చెడకయున్నె!

గీ॥ కలుషులై జననంబైనఁ గలిని సర్వ, ధర్మనాశన మగుఁ బుణ్యతముఁడు లేమిఁ
బుణ్యలోకకవాటముల్ మూసికొనియె, దుర్గతి ద్వారములు దీయుదురు మహాత్మ!

ఉ॥ వింతయె భూమిపాలకులు ♦ విస్తృతరోషదవాగ్నికీలలం
గంతులు వేయుచుం జెడిసి ♦ కాంతురు నారకవాస; మూర్వరా
కాంతలలామ! యాదవులు ♦ గర్వితులై కలు ద్రావికాదె దు
ర్దాంతరణోర్వి నొండొరుల ♦ తాఁకులఁ గూలుట భస్మశేషమై? ౩౧౫

మ॥ అనిమిత్తంబుగ భండనంబునను ♦ నన్యోన్యాగ్రహం బూనుచుం
దనయుల్ దమ్ములుఁ దండ్రు లన్నలుఁ జెలుల్ ♦ తత్తత్సఖుల్ గుంపులై
వనధిప్రాంతమునం బ్రభాసమున ♦ సర్వధ్వంసమున్ గాంచరే?
వనజాక్షుం డిసుమంతఁ దా నెఱిఁగియుం ♦ వారింపఁడే యమ్మెయిన్? ౩౧౬

గీ॥ ద్వారకావాసు లెల్లను ♦ దరలిపోవఁ, గడలి ముంపదె యవ్వీడు ♦ కాన దేవి
మహిమ వేల్పుల కెఱుఁగంగ ♦ సహజమా నె,మనుజు లన నెంతవారల ♦ మ్మార్గమరయ.

వ॥ నరేంద్రా! దేవాసురమానుషంబగు జగంబు దైవాధీనంబు, బ్రహ్మ విష్ణ్వాది నిలింపులును వశిష్ఠ వామదేవాది ఋషులును సనకాదిబ్రహ్మపుత్రులును దైవ వశులే కదా? కామక్రోధ లోభ మోహమదాదులు శరీరసంభవమాత్రంబున దేహులకు స్వభావసిద్ధంబులు, కాలయోగంబున సుఖదుఃఖాదిద్వంద్వంబులు దేహులయందు దృశ్యంబు లగుటవలన నది దైవయంత్రితం బనవలదే, శ్రుతిస్మృతి పురాణేతిహాసంబులయందు నొక్కొక్కతఱి హేయంబున కుపాదేయత్వంబును, నుపాదేయంబునకు హేయత్వంబును విందువుగదా! ఉభయంబును నర్థవాదంబని యెఱుంగుము, బ్రహ్మ విష్ణురుద్రాదుల యుపాసనంబులయెడల నొక్కొక్కరిం జేపట్టి యొక్కొక్కరి నిరసించుట యన్యోన్యార్థవాదంబులు గావె? ఇట్టి దురిత ప్రివర్తనంబు లిక్కలియందకాని కృతాదిత్రయంబున వేదమార్గంబు లేకముఖంబులు. స్త్రీ,శూద్ర, ద్విజ బంధువ్రాతంబులు వినరామిం జేసి పురాణంబులు తద్ధితంబుఁ గోరి వచింపంబడియె, పెక్కు పలుకులం బనియేమి? జగన్నాటకసూత్రధారిణి యగు మహామాయాశక్తివైచిత్ర్యంబు దుర్జ్ఞేయంబును, దుర్లంఘ్యంబునని యెఱుంగుమని తెల్పిన బాదరాయణుం గాంచి జనమేజయుం డిట్లనియె. ౩౧౭

## — పుణ్యతీర్థములు —

సీ॥ తీర్థ రాజములు పృథ్వీతలంబున మర్త్యులకు సులభగమ్యంబులై ♦ చూడ వినఁగఁ
దోఁగఁ ద్రావఁగఁ బుణ్యాధపూర్వమాహాత్మ్యము గల్గు, నెవ్విక్షేత్రములు సమిద్ధమహిమ
విలసిల్లు నెవ్వి? తత్ఫలము లెట్టివి యింకఁ, దత్కృత్యములు నెట్లు ♦ దానవిధులు
నియమంబు లెవ్విధి నివ్వాటిల్లును దత్ప్రకారంబు వినఁగ నా ♦ కాంక్ష పొడమెఁ

గీ॥ బూర్ణకరుణారసస్ఫూర్తి ✽ బొదల నాదు,జన్మ సాఫల్య మగునట్లు ✽ సాంగముగను
దెలిపి చరితార్థుఁ జేయంగ ✽ వలయుననిన,యతివచుం డిట్టులనియె ✽ నయ్యనిపతికి.

గీ॥ నదులలోపల నెల్ల ను ✽ న్నతి వహించు, జాహ్నవీనది తీర్థ రా ✽ జ్యంబులందు
నందుఁ దోఁగిన జనులకు ✽ హస్తగతము, మోక్షసామ్రాజ్యభోగంబు ✽ మునిమతంబు.

వ॥ మఱియును యమునయు, సరస్వతియు, నర్మదయు, గండకియు, సింధువు, గోమ
తియును, దమసయును, గావేరియును, జంద్రభాగయు నను నవి సర్వదోషాప
హరణసమర్థమ్ములు శ్రావణభాద్రపదంబులను రెండుమాసంబుల రజస్వలావస్థ
జెంది వృష్టియోగంబున గ్రామ్యవారివహలై వర్తిల్లు, నట్టితఱిని స్నానపానంబుల
కనర్హత వాటిల్లు, గంగా సరస్వతులయందు నైమిత్తికక్రియలయెడల ముఖ్య
కరణీయం బవగాహనంబై యెయ్యెడల నందు రోగోత్పత్తి బొసంగదు. పుష్క
రంబును, గురుక్షేత్రంబును, ధర్మారణ్యంబును బ్రభాసంబును బ్రయాగంబును
నైమిశంబును నర్బుదారణ్యంబును నను నివి యిహపరసాధకంబులై విశ్రుతంబులగు;
శ్రీశైలంబును, సుమేరువు, గంధమాదనంబును మొదలగు శైలంబులు తపః
ఫలప్రదంబులు, పుణ్యప్రదంబులగు సరోవరంబులు మానసంబును బిందుసరం
బును మోక్షదంబు లనునివి సుప్రసిద్ధంబులు, ఆశ్రమంబులలో సద్యస్కాలంబున
సేవించువారికి ననితరసాధ్యంబులగు ఫలంబు లొసంగుచు మునివరోపాస్యంబులై
బదరికాశ్రమంబును వామనాశ్రమంబును యూపాశ్రమంబును నను నివి నరనారా
యణాదిమహామునుల కావాసంబులై ప్రసిద్ధిఁ గాంచుచుండు. ౩౨౧

సీ॥ పతితంబు లగునట్టి ✽ పావనస్థానంబు, లన్నియు మునులకు ✽ నాలయమ్ము
లిట్టి తావుల ధర్మ ✽ తీర్థులు దానంబు, లధ్వరంబులును బె ✽ క్కాచరించి
రట్టులఁ గొందఱు ✽ నెట్టనఁ దపియించి, ముక్తిఁ జెందిరి పుణ్య ✽ మూలమునను
ద్రవ్యక్రియామనో ✽ దార్ఢ్యంబు గల్గుచో, ఫలదంబులగు నివి ✽ పావనములు

గీ॥ ద్రవ్యశుద్ధి యొకప్పుడు దనరుఁ గర్మ,శుద్ధియును జిత్తశుద్ధియు ✽ సులభసిద్ధి
గాంచునొక్కొక్కయెడలదు ✽ ర్ఘటముగాదె, జగతిఁగరణత్రయముశుద్ధి ✽ నెగడుటధిప!

గీ॥ ఎన్నిశుద్ధులు గల్గిన ✽ నిందువంశ్య !, చిత్తశుద్ధియె మూలంబు ✽ చిత్త మెపుడు
విషయలాంపట్యములఁ బడి ✽ వెడలలేక, పంకనిర్మగ్నమత్తేభ ✽ భాతి నొగులు.

క॥ అతులతప స్తీర్థాట, వ్రతములఁ గామాదిశత్రు ✽ వర్గమువలనన్
వెతనొందించుచుఁ జిత్తము, సతతము చేతనులఁ జాల ✽ సంకట పెట్టున్. ౩౨౪

క॥ సత్యం బస్తేయంబును, నిత్యశుచిత్వము నహింస ✽ నిజధర్మము దాం
పత్యము నింద్రియనిగ్రహ, మత్యంత ఫలప్రదమ్ము ✽ హరిణాంకకులా! ౩౨౫

క॥ తీర్థాటనముల నిజధ, ర్మార్థంబులు జరుగకునికి నభిలషితంబుల్
వ్యర్థములౌటయె కాక ని,రర్థకదుష్కృతముఁ జెందనగుఁ బ్రాణులకున్. ౩౨౬

ఆ॥ దేహమలముఁ దుడుప దీర్థంబులగుఁ గాని, చిత్తమలముఁ దుడుచు చేవగలదె ?
యట్టులేని నదుల గట్టుల నివసించు, మునులలోన దురితఘనులు లేరె ? ౩౨౭

క॥ విశ్వామిత్రాదులు నవి, నశ్వరజపనిష్ఠ నొంది నదులన్ గిరులన్
శాశ్వతవాసము సేయరె, విశ్వాసము గలదె భూతవితతులయెడలన్? ౩౨౮

క॥ రాగద్వేషంబులచే, రాగిల్లుచు ముక్కుమూసి రమణులఁ గనినన్
భోగపరులైరి గాదే ?, యోగులు వా రనుట శబ్దయోగము గాదే. ౩౨౯

సీ॥ శుద్ధులైనన్నెనను సుస్థిరంబుగ డెంద, మాత్మవశంబు సేయంగనగునె?
గంగాదితీర్థావగాహనంబులకన్న, మానసతీర్థంబు మాననీయ
మన్నిటికంటె ముఖ్యము సాధుసేవయే,యితరతీర్థములచే నెల్లఁ జెడని
దుర్మలంబుల నెల్లఁ దుడిచివేయఁగఁజాలు,నదియపో? యాశ్రయం బందువలనఁ
గీ॥ జిత్తమతిశుద్ధమగు దానఁజేయునట్టి, కర్మఫలములు సద్గతుల్ గలుగఁజేయు
మానసికశుద్ధిలేని యామ్నాసవులకుఁ బుట్టుచావులు నెప్పుడుఁ గట్టువడవు. ౩౩౦

క॥ గాధిసుతుండు వశిష్ఠుఁడు, సాధుత విడనాడి పెక్కు సంవత్సరముల్
క్రోధావిష్టతఁ బోరరె, బోధఘనుల్ గారె చిత్తములు శాంతములే? ౩౩౧

క॥ గాధేయుండు హరిశ్చం,ద్రాధీశునికొఱకు శప్తుఁడై పోవఁడె? స
క్రోధుఁడు వశిష్ఠుచే దు,స్సాధము హృచ్ఛుద్ధి మనుజసాధారణమే. ౩౩౨

ఉ॥ కౌశికుఁడున్ వశిష్ఠముని కౌశికకోపకషాయశప్తుఁడై
యాశయహీనతన్ బిదప నట్టులె తా శపియించె నిర్వురున్
గౌశికభీకరాటవులఁ గప్వాయు నాడియు నొచు నీసుతో
నాశరవృత్తిఁ బోరుట ధరాధిప! మానసశుద్ధిచందమే. ౩౩౩

—। హరిశ్చంద్రునికథ ।—

క॥ అనినన్ జనమేజయుఁ డి,ట్లనియెన్ మునిచంద్రుతోడ యతివర్యుల కీ
ఘనవిద్వేషం బెట్టులఁ, బెనసెన్ స్వాంతములఁ దెలుపవే! యని యన్నన్.

సీ॥ రవికులాధిపుఁడైన రామచంద్రునకును, బూర్వుఁడైనట్టి యపూర్వవిభుఁడు
సత్యవచోరూఢసంధాననిష్ఠుండు, జనవల్లభుఁడు హరిశ్చంద్రుఁ డనఁగ
నతఁడు త్రిశంకున కాత్మజాతుం డయి, చక్రవర్తిత్వంబు సంతరించి
యేడుదీవుల నేకహేలతో నేలంగ, ననపత్యతాదోష మతని నలమఁ

గీ॥ బుత్రకామత మఖము నంభోధివిభుని, గూర్చి నరమేధ మొనరింపఁ గోరి యతఁడు
సాంగదక్షిణముగ యాగమవభృథాంత, మాచరింపఁ దలంచినయంతఁ బాశి.

వ॥ సాక్షాత్కరించి. రాజా! నీకుం బొడము కొమరుం బశువుగా నొనర్తువే నావుడు హరిశ్చంద్రుండు వల్లెయనియె వరుణుండును. 336

క॥ అట్టుల కరుణించినరా, పట్టి వధూరత్న మంత పతి ముద మొందన్
నెట్టన గర్భముఁ దాలిచి, పట్టిం గనె ముద మెసంగ భాస్కరతేజున్. 337

చ॥ కొమరుఁడు గల్గు సంతసము కూరిమితోడుత నల్లిబిల్లియై
కొమరు వహింప విప్రగురుకోటులఁ బూన్చుచు నంత జాతక
ర్మముఖవిధిప్రణీతములు రా జొనరించి ధరాసురావనీ
జముబలె నర్థిబృందముల సంతసమందఁగఁ జేసి మెచ్చుగన్. 338

ఆ॥ సాటిలేక రాజకోటులలో మేలు, బంతి యగుచు ముదము పాలవెల్లి
పగిదిఁ బొంగ నాన్నృపాలచంద్రుం డుల్ల, మలర సౌఖ్య మొందునవసరమున.

చ॥ వరుణుఁడు విప్రవేషమున వారిజబంధుకులీనుఁడైన యా
ధరణిపుఁ జేరి పూజనల ధర్మవిధిం గొని సంతసించి భూ
వర! తనయున్ వధించి శ్రుతివాఙ్నియతిన్ గ్రతు వాచరింపు నా
నిరవధికవ్యథాభరవినీతమనోగతిఁ జంచలింపుచున్. 340

ఆ॥ తొల్లి ప్రతిన నేయు టుల్లంబునఁ దలంచి, వెత యడంచి సత్యభీతి వరుణుఁ
గాంచి కేలు మోడ్చి క్రతు వొనర్చెద వేద, విధివిధాన మమర వేయు నేల!

క॥ ఈవచ్చు పౌర్ణమాసిని, గావించెద నధ్వరంబు కాంతామణి స
ద్భావమున శుద్ధి నొందున్, గావున నరమేధదీక్షఁ గావింతు నన్. 341

ఉ॥ సంతసమంది యబ్ధిపతి సాంత్వనవాగ్రచనం బొనర్చుచున్
జింతలు మాని రాజు ననురాగరసాంబుధి నోలలార్చుచున్
జెంతఁ దొలంగి స్వాశ్రమముఁ జేరఁగ నంతటఁ బౌర్ణమాసి య
త్యంతవిషాదఘూర్ణితహృదంతరుడై విభుఁ డుండఁ దార్కొనెన్. 343

—• వరుణుఁడు జలోదరంబు గలుగునని శపించుట •—

ఆ॥ సాహసించి రాజు సలుపునో? సలుపఁడో?, క్రతు వటంచు వార్ధిపతి పరీక్ష
నేయఁదలఁచివచ్చె క్షితిపాలుసంకేత, దివస మరసి ధరణిదేవుఁ డగుచు. 344

ఉ॥ వచ్చినవారినాథు ననివారితపూజలఁ దన్పి మొక్కి యో
సచ్చరితా! మదాత్మజుఁడు సంస్కృతి నొందఁడు క్షత్రియార్భక

రోన్మిచ్ఛయవృత్తి సంస్కరణ ॥ మొప్పఁగఁజేసి మఖంబొనర్తు వి
ప్రోచ్ఛయ మెల్ల మెత్తు రన ॥ నోర్వక పాశధరుండు క్రోధియై. ౩౪౫

క॥ అనృతపుఁబలుకుల నన్నిటు, నెనయింతె? పరితాపములం ॥ నీదోషముచే
జనుము జలోదరరోగ,మ్మునఁ బీడం జెంది యనియెఁ ॥ బొగిలెడి మదితోన్.౩౪౬

ఉ॥ అంతట విప్రశాపము ధరాధిపతిన్ వెత నొందఁజేసె దు
ర్దాంతదురాగ్రహంబున సరస్వదధీశుఁడు లేచిపోయె వృ
త్తాంతము సర్వమున్ విని ధరాధిపనందనుఁ డంతరంబునన్
జింతిలి తండ్రి సంకటముచే మదిఁ గుందుట గంచు వేదనన్. ౩౪౭

వ॥ వనంబున కరిగి యట నివసించుచు. ౩౪౮

క॥ చింతిల్లుచున్నతఱి నే,కాంతమ్మున మంత్రియొక్క ॥ కఠినుఁడు ధరణీ
కాంతుని గతిఁ దెలిపి సమా,క్రాంతత విసయోక్తి నిట్లు ॥ గఱపెన్ సుతునిన్.

చ॥ జనకుఁడు రోగపీడల విశంకటజాడ్యము నొందియుండ నీ
వనితరలభ్యసౌఖ్యముల ॥ నందుచు వేటలఁ దోఁటలన్ సుఖా
సనముల నున్నవాఁడవు విచక్షణవృత్తియె? తండ్రి కిట్టి నం
దను లోక కోటియైన సుఖతత్పరతల్ ఘటియిల్లునే ధరన్? ౩౫౦

ఆ॥ కన్నవారి మేలు ॥ గనఁగనేరని నీదు, జన్మ మెల్ల లేని ॥ చందమయ్యె
జనకపీడ లడఁపఁజాలని పుత్రుండు, మనియె నేమి? దివికిఁ ॥ జనియెనేమి? ౩౫౧

—• ఇంద్రుఁడు బోధచేయుట •—

క॥ మన్నన మానిసి యగుటం, గన్నంత యెఱుంగఁజేయఁగా రాజసుతుం
డన్నం గనుఁగొననేఁగఁగ, నున్నెడ వాసవుఁడు బ్రాహ్మణోత్తముఁ డగుచున్.

మ॥ వెనువెంటం జని రాట్సుతుం గని దయావిష్టుండువోలెన్ ద్విజుం
డనియెన్ దండ్రిమనోగతం బెఱుఁగ వీ ॥ వత్యంతమందుండవై
తనఘాత్మా! నరమేధయాజి యయి యజ్ఞాగంబునన్ నిన్ను యూ
పనియుక్తిన్ విశసించి నిర్దయతఁ జంపం గాఁదలంచెన్ జుమీ. ౩౫౩

ఆ॥ పోవవలదటంచు ॥ బుద్ధి గొల్పిన దైవ, మాయవలన భ్రమసి ॥ మాణవకుఁడు
పోవ కచట నిలిచెఁ బొరిఁబొరిఁ దనతండ్రి, వెతలు వినుచుఁ బ్రాణభీతికతన.౩౫౪

చ॥ పలుమఱుఁ దండ్రిపాటు వినిపట్టి చనన్ దమకించునంతలో
బలరిపుఁ డట్టి సైగఁగని ॥ పల్మఱుఁ బోవఁగనీక భీతి పె
ల్లలమఁగఁజేయునట్టియెడ ॥ నాత్మగురుం గని తండ్రి పల్కె నీ
యలమటఁ దీర్చి ప్రోవఁదగు ॥ నట్టి యుపాయముఁ దెల్ప గాదగున్. ౩౫౫

## — శునశ్శేపుండు యజ్ఞపశు వగుట —

మ॥ అనృతద్రోహము రాకయుండఁగఁ గృపాయత్తైకచిత్తుండవై
ననుఁ దేలింపు మటన్న రాజుఁ గని యాశ్వాసనందించి కుంభోద్భవుం
డనియెన్ ధర్మవిధిన్ ద్వాదశవిధాన్యపుత్రుల్ సుతుల్ క్రీతు నొ
క్కనిఁ బుత్రున్ విశసించి యధ్వరవిధిన్ గావింపు మే లయ్యెడిన్. ౩౪౬

గీ॥ ఈవు నరమేధ మొనరింప నెడరుమాను, వెఱవ నేటికిఁ జనుమన్న విభుఁడు మంత్రిఁ
గాంచి మనరాజ్యమున ధనగ్రామముఖ్య, వస్తుసంక్రీతు నొకనిఁ దేవలయుఁగాన.

ఉ॥ ఆరసి విప్రనందనుని నధ్యయనాదిపటిష్ఠు రూపశో
భారుచిరాంగు నొక్కని నభంగురవృత్తి ధనం బొసంగి య
వ్వారిగఁ దల్లిదండ్రులకు వాటిక లెల్లఁ బరిభ్రమించి దు
ర్వారుఁడవై మదాజ్ఞఁ గొనిరమ్ము ద్విజుం గొని తేవలెన్ జుమీ! ౩౪౭

వ॥ ఇట్టు లాజ్ఞాపించుటయు, ౩౪౮

సీ॥ సత్వరంబున విప్రజనుల వాటికలందు, యాగీయపశువుగా నాత్మజులను
నిచ్చువా రెవ్వార లెఱిఁగింపుఁ డిత్తు మభీష్టార్థము లటంచు నింటనింట
రాజకార్యార్థియై రాజమంత్రీంద్రుఁడు, చాటించి యొక్కచో జనపదమునఁ
గని దరిద్రుని నజీగర్తుని. మువ్వురు, కొడుకులతోఁ బొట్టకూడు లేని

గీ॥ వానిఁ గొమరు శునశ్శేపుఁ బాలుఁడగుగు, ధన మొసంగుచు మంత్రిసత్తముఁడు పిలిచి
పుత్రమధ్యముఁ దెచ్చి యభ్భూపతికిని, నొప్పనముఁ జేసె విభుఁడు మహోత్సవమున.

## — విశ్వామిత్రుఁడు శునశ్శేపుని రక్షించుట —

గీ॥ సప్తతంతుసంభారముల్ సంగ్రహించి, ధరణివల్లభుఁ డా ద్విజాత్మజుని యూప
బద్ధుఁ జేయ గాధేయుఁ డప్పట్టునందుఁ, జేరఁ జని పల్కె రాజుతో జలదరించి.

చ॥ వల దిటు సాహసింపకుము బ్రాహ్మణపుత్రునిఁ బోవనిమ్ము నా
పలుకులు వీనులం దిడుము ప్రార్థనఁ జేసితి నీకు మేలుగాఁ
గలయది తల్లిదండ్రు లధికంబగు వేదన గుందుదు రక్కటా!
కలదొకో యింత కర్కశత? కావుము సత్కృప నూని యర్భకున్. ౩౫౦

ఆ॥ ఆత్మదేహరక్షణార్థమై పరదేహ, పీడ సేయువాఁడు పెద్ద యగునె?
పెద్దయనఁగఁ బరులఁ బెంపుగోరుచు నాత్మ, దేహ మిచ్చువాఁడె తెలియుమింత.

---

షరా:—ఈ నరమేధఘట్టము చాలవఱకు మూలమునకు భిన్నముగను సంగతిదూరముగను గనుపట్టెడి.
కవికి దొరికిన మూల మెట్టిదో! —చె. వేం. శా.

ఉ॥ నీవు నిజాంగవర్ధనము నెమ్మదిఁ గోరి పరుఁ వధింపఁగా
భావముఁ గొల్పినాఁడవు కృపామతి నూనుము బాలునందు స
ర్వావని నాత్మదేహమునకైప్రియమందనివార లుందురే?
మా వచనంబునందునఁ బ్రమాణము గల్గిన వీఁడు నర్భకుఁ. ౩౬౪

గీ॥ ఇంత చెవిఁజాటి చెప్పిన నించుకేనిఁ, దపసి వాక్యంబుపై ననాదరము గొలిపి
వీఁడకున్నను గోపించి వేగ విప్రశిశువు కుపదేశ మొనరించె సిద్ధమనువు.

ఉ॥ వారుణమంత్రరాజము నవారణదీర్ఘతరప్లుతధ్వని
స్ఫారము గాఁగ నర్భకుఁడు సంయత పాశనిపీడనార్తుఁడై
ఘోరున నుచ్చరింప సురపుంగవుఁ డవ్వరుణుండు మెచ్చి య
ద్దారకుబంధముల్ డులిచి తద్దయు భీతి యడంచి కాచుచుఁ. ౩౬౬

ఆ॥ ఆమయంబుఁ బోవ నణఁచి భూవల్లభుఁ, బోచి వరుణుఁ డేగె భూసురుండు
పితృమునమ్ముఁ గూర్చిప్రియమందె గాధేయుఁ, డానృపాలుమీఁద నాగ్రహించి.

—॰ వసిష్ఠ విశ్వామిత్రులు కలహించికొనుట ॰—

వ॥ సభామధ్యంబునఁ దన్నాదరించి మాట వినమివలన మనంబునం బొడమిన రోషానలం బనింధనేంధానంబై నిజాశ్రమంబునకుం జనియె, నంత నొక్కనాఁడు హరిశ్చంద్రుండు మృగయావినోదంబున హయారూఢుండై వనవిహారం బొనర్చుచు సూకరంబుఁ దఱిమికొని మధ్యాహ్నంబునఁ గౌశికీతటంబునఁ జనుచున్న వృద్ధబ్రాహ్మణవేషధరుండై వచ్చి విశ్వామిత్రుండు వేఁధించి తుదకు సప్తాంగ సమేతంబుగా రాజ్యం బభ్యర్థించిన నొసంగి దీనుం డయ్యె నది యెఱింగి వశిష్ఠుం డచ్చోటి కరుగుదెంచి" క్షత్రియాధమా! మృషాబ్రాహ్మణవేషధరుండవై మదీయయజమానుం డగు రాజుఁ భ్రమియింపంజేసి పెక్కు వెతలం బాల్పఱచి శిష్టునిం బోలి బకధ్యానపరాయణుండవై వర్తిల్లెదు గాన బకంబవు గమ్మని శపించె; నిట్లు శప్తుండై కోపించి గాధేయుండు నీ వాడీరూపధారివై పొమ్మదవని యరుంధతీజానిఁ శపియించె నిత్తెఱంగున నన్యోన్యంబు శప్తులై యాడీబక రూపంబుల శకుంతంబులై నీడంబులం జేరి దినదినంబును సంగ్రామం బొనర్చుచు బుష్పితకింశుకంబులం బోలి చంచునఖాఘాతంబుల రుధిరక్లిన్నాంగులై యనేక వర్షంబులు పోరాడుచుండి రని చెప్పిన విని జనమేజయుండు మునీంద్రా! వార లిరువురు మరల స్వస్వరూపంబు లెట్లు పొందిరో వినవలతు నావుడు వ్యాసుం డిట్లనియె.

—॥ ఆదీ బకములు పూర్వరూపంబు లందుట ॥—

క॥ ఏవంవిధముగ దురమ,ర్షావేశము పెచ్చుపెరుఁగ ◊ నయ్యిరువురు మహా
ఖ్యావహవృత్తిఁ బెనంగఁగ, దైవవశంబునను నలువ ◊ దర్శన మిచ్చెన్. ౩౧౯

మ॥ సురబృందంబులతోడ నిచ్చమెయి నరుదెంచ్చె భారతీవల్లభుం
డురుసంప్రీతిని వచ్చి వారలకుఁ బూర్వోదారలీలాకృతుల్
గరుణించెన్ సుఖులై తపస్యులయి తత్తత్కార్యంబుఁ బోనాడి యి
ర్వురు సన్నేహమనస్కులై కనిరి దేహవుం బ్రాపుగాఁ బద్మజున్. ౩౨౦

క. మైత్రావరుణియుఁ గౌశికుఁ, డత్రిసత శాపనిహతి ◊ నందినకథ భూ
చిత్రతరంబయ్యె ద్విప,జైత్రా! సర్వంబు వింటె ◊ సంతతర క్తిన్. ౩౨౧

సీ॥ వేదవిదులు తపోవిజ్ఞానమూర్తులు, మౌను లయ్యిరువు రీ ◊ మాడ్కి నెలసి
రిలమానవు లనంగ ◊ నెంతటివారు దే,వాసురులైన నిశ్చల్లరయుమయ్యా!
అభిమాన మెడలక ◊ యగునె సౌఖ్య మ్మెుంట, ధర్మసాధనవృత్తిఁ ◊ దప్పనీక
దానతపోజపాధ్యయనతీర్థక్షేత్ర, సేవనా విప్రాదిసేవలందు

గీ॥ సాత్త్వికశ్రద్ధచే సంతసమునఁ బొదలి, విమలవిజ్ఞానులై శాస్త్రవిధి వదలక
కామముఖరిపువర్గంబు కడకుఁ ద్రొక్కి,మలయువారలు ముక్తులై ◊ వెలయువారు.

క॥ ఇత్తెఱఁగునఁ బలుకు ముని కు,లోత్తమువాక్యంబు వినుచు ◊ నుర్వీశుఁడు మీ
రిత్తతి మైత్రావరుణిగ, నెత్తిరి ప్రసంగవశత ◊ నీ బ్రహ్మసుతున్. ౩౨౩

శా॥ ఈ వృత్తాంత మదెట్టిదో? మునికులాధీశా! కృపాదృష్టి సం
భావింపం దగునన్న నిట్లనియె ◊ నావ్యాసుండు తన్మాని బ్ర
హ్మావిర్భూతుఁడ యట్టిఁడయ్యు నిమిశాపావేశతన్ దుర్గింగి రా
జా! వేఱొక్కట మానిపుత్రుఁడయి తత్తత్సూ క్తిన్ గనెన్ వింటివే. ౩౨౪

గీ॥ అనిన దివ్యానుభావుఁడైనట్టి మునికి, జనవిభుఁ డాసంగు శాపంబుసంఘటిలుట
కేమికత మెుక్కొ? తెలుపంగనిచ్చ సేయు,మనుడుముని చెప్పఁదొడఁగెనయ్యవనిపతికి.

సీ॥ ఈ శాపమూలంబు ◊ నే నెఱుంగుదుఁ దొల్లి, మాయామయంబు భూమండలమున
సంసారయంత్రంబు ◊ క్ష్మామండలంబేలు, రాజులకును వనరాజి గాథ
తప మొనర్చు మునీంద్రతండంబులకు నొక్క, రూపంబ యభిమానరూఢమరయ
మనము మాయాగుణసమగ్నమై యలరారు, దానలోభాదులు ◊ దఱుఁగకుండు

గీ॥ బ్రాహ్మణాదులు రాజసప్రభమితులగుచుఁ, గర్మ లొనరింతు రదిగానఁ ◊ గలిని సత్త్వ
గుణము గల మానవుం డెందొక్కరొండు లేఁడు, గాన రాజర్షు లిరువురు సరులోనిరి.

గీ॥ సాత్త్వికాదిగుణత్రయసంభృతంబు, గాన సంసృతిబద్ధులై త్త్మావరుండు
మునియు నన్యోన్యశాపసమ్మూర్ఛితులగుచు, నధికదుఃఖోదధి నిమగ్నులైరి భూప!

ఉ॥ ద్రవ్యము శుద్ధమైనయెడఁదద్హృదయం బటుకాదు, రెండునుర్
భవ్యములైనఁ దత్క్రియలు పాయును శౌచము, మూఁడు శుద్ధిచే
నవ్యయవృత్తిఁ గాంచుట దురావహ మెచ్చట నట్లుగాన సం
భావ్యములౌ ఫలంబు లనపాయతఁ గాంచు నె యెన్నిభంగులన్? ౩౭౮

## —॰ నిమిచక్రవర్తి యాగంబుచేయుట ॰—

సీ॥ జననాథ! యిక్ష్వాకుజననసంభూతుండు, గుణవరిష్ఠుఁడు ధర్మకోవిదుండు
సత్యవాదిమహేంద్రసమవైభవుఁడు నిమి, దానవంతుఁడు శిష్టమానసుండు
ద్వాదశరాజన్యధర్మసంశాస్త్రమై, నాలుఁగు చెఱఁగుల నేల యేలి
ప్రజలఁ బోషించుచు భక్తిచే గౌతము, నాశ్రమప్రాంతమునందుఁ దనదు
గీ॥ పురవరంబు జయంతంబు పొలుపెసంగ, నందుఁ బట్టాభిషిక్తుఁడై యజ్ఞవిధికి
నుత్సహించి మునీంద్ర సమూహములను, రాఁబనిచి పూజ లొనరించి రాజసమున.

ఆ॥ జనకునాజ్ఞవలన సకలసంభారముల్, గూర్చి యంగిరసు భృగునిఁ బులస్త్య
గౌతమునిబుచీకుఁ గ్రతుఁబులహువశిష్ఠు, వామదేవముఖుల వలచి తెచ్చి. ౩౮౦

సీ॥ వేదవిదుల యజ్ఞవిధివిధానజ్ఞుల, విబుధవర్యులను వేర్వేఱఁ బిలిచి
యొక్కటఁ గొఱఁత గాకుండ సంభారముల్, నిండంగఁగూర్చి యనిందితముగ
నాత్మవంశాచార్యుఁడగు వశిష్ఠుని గాంచి, వినయాన్వితుండయి వినుతి సల్పి
యాజకత్వము నూని యధ్వరం బలరింప, వలయు సర్వజ్ఞుండ వలఘుచరిత!
గీ॥ వలయు వస్తువులెల్ల నవ్వారిగాఁగ, సంగ్రహించినవాఁడ మహచ్ఛాసనంబు
భవదధీనంబు సర్వంబు పట్టుకొల్పి, కార్య మీఢేర్పవలయు నాఁగాదె? యనిన.

ఉ॥ శకుఁడు యాగదీక్షకయి నంతసమొప్ప ననున్ వరించె ని
ర్వకత నే నియంత్రితుఁడ వాసవు నధ్వరపూర్తియైన నే
నీక్రతుకర్మ మూనెద మహేశ్వర! పంచశతాబ్దకాలికం
బౌక్రతు వంతవట్టు భవదధ్వర మొయ్యన నిల్పఁగాఁదగున్. ౩౮౧

ఆ॥ సావభృథముగాఁగ హరి యధ్వరంబైన, వచ్చి నీమఖంబువలన నిలుతు
నోర్వవలయుఁ బిదప నొజ్జనై యెల్లయు, నంతరింతు ననిన జనవిభుండు.

సీ॥ వేత్తలౌమును లెల్ల విచ్చేసియున్నారు, సమకట్టితిని సర్వసంగ్రహముల
నస్మదాచార్యుండ వయ్యు నీ విట్టుల, నంతరాయము సేయ టర్హ మగునె?

కులగురుండవు వేదకోవిదుండవు మమ్ముఁ, గాదని యన్యథా ౹ కాంక్ష యేల
నీవు లోభాసక్తి ౹ నెగడిన మా కెద్ది, బలము మద్యజ్ఞనిర్వహణమునకు

గీ॥ ననుచుఁ బలుమాఱు దెల్పినఁ గనాఁ గకతఁడు, మఘవు మఖమున కేగ సమ్మానవేంద్రుఁ
డలుక దొట్టిన మదితోడఁ నార్యుఁడింత, విఘ్న మొనరించెనని మహావీరుఁ డపుడు.

ఉ॥ గౌతముఁ జేరఁగానరిగి ౹ కాళ్ళకు మ్రొక్కి మహానుభావ! వి
ఖ్యాతుఁడు మద్గురుం డిటులు ౹ కట్టిఁడి యయ్యె మదధ్వరంబు మీ
చేత సమగ్రమై వెలయఁ ౹ జేయుఁ డటన్న మనస్కరించి సం
ప్రీతి దలిర్పఁ దత్క్రియ ౹ కభీష్టదుఁడయ్యె నతండు వానికిన్. ౩౮౬

క॥ హిమవద్గిరిపార్శ్వంబున, నమరులు మెచ్చంగ ఋత్విఁగన్వితుండై
ప్రమదమున వెడలి విదితక్రమమున యజ్ఞం బొనర్చె ౹ ఘనమతి నిమియున్.

వ॥ అంతఁ బంచశతవర్షావధికం బగు నింద్రాధ్వరంబు సమాప్తం బగుటయు నరుంధతీ వల్లభుండు నిమిచక్రవర్తి యాగ దిదృక్షన్ జయంతపురంబున కరుదెంచి రాజ దర్శనార్థంబు యతనం బొనర్చిన నిద్రితుండుగావున రాజెఱుంగఁడయ్యె భృత్యులు దెలుపంజాలకుండి రియ్యది యవమానంబుగాఁ గొని క్రోధమూర్ఛితుండై మదాజ్ఞాతిక్రమం బొనర్చి మదంబున నన్యునిచే యాగంబు నిర్వర్తించుటవలన విదేహుండ వయ్యెద వని శపియించె, నంత భృత్యవ్రజంబు వెఱచి రాజుం బ్రబోధించి మునీంద్రుండగు వశిష్ఠుం డిట్లాగ్రహపీడితుండై శపించెనని తెల్పిన సత్వరుండై యచ్చోటి కరుదెంచి బ్రాహ్మణా! నాయం దపరాధంబు లేశం బున్నదే! నాకు గురుండవై యజమానుండనగు న న్నవమానించి తృష్ణాతురుండవై చని జుగుప్సితంబగు కర్మం బొనర్చియు లజ్జనొందక యతిసూక్ష్మంబగు విప్రధర్మగతిం గానవైతివి, క్రోధావిలుండవయ్యేని ద్విజుండును జండాలుండ యగు, నీవును విదేహుండ వయ్యెదవని శపియించె; నిట్టు లిర్వురు శాపదీపితులై దేహంబులు దొరంగి వాయుమాత్రదేహంబుల దుఃఖంబు లనుభవించుచునుండ వశిష్ఠుం డొక్క తఱి నలువం గని యిట్లనియె. ౩౮౮

సీ॥ నిమిశాపమున నిట్లు ౹ నిర్దేహినై చాల, వెతఁ జెందియున్నాఁడ ౹ విశ్వరక్ష!
దేహంబునొందెడు ౹ తెఱఁగు నా కెట్టులో, నన్యునియందో నీయందో నాకుఁ
గరుణింపు మని వేఁడ ౹ గమలయోని వశిష్ఠుఁ,గాంచి తేజోఘనుల్ ౹ కర్మనిధులు
మిత్రావరుణులు తత్పుత్త్రుండ వగుమన్న, నంగీకరించి యయ్యతుల తేజ

గీ॥ మున నధివసించియుండ నిమ్ముగ హిరణ్యగర్భు నాత్మజు భావ్యర్థకారణముగ
నిలిచె నూర్వశి యొకతఱి ౹ బలవిభేది యాన వెలిక త్తియలతోడ ౹ నటకువచ్చి

క॥ వృత్రవిభేదిమతమ్మున, మిత్రావరుణుల తపంబు మెల్లనఁ జెఱుపన్
జిత్రవిహారము సలుపఁగ, నేత్రంబులు విచ్చి మునులు నెలఁతన్ గనుచున్.

— మిత్రావరుణులకు నగస్త్యవశిష్ఠులు జన్మించుట —

ఉ॥ మానసముల్ చలింపఁ బటుసమన్మథబాణకృతాభిఘాతసం
ధానము నొందినన్ నిలుపు దప్పిన వీర్యముఁ బ్రస్ఖలింప న
మ్మానిని వారి యాజ్ఞ ఘట మధ్యమునన్ స్ఖలితేంద్రియంబులన్
బూని భరింప నిర్వురు ప్రభూతత నొందిరి మానిపుంగవుల్. ౩౯౧

వ॥ ప్రథమంబున నగస్త్యుండును రెండవదాన నరుంధతీజానియు జన్మించి రియ్యాది పూర్వవృత్తం బతి రహస్యం బనియెఱుంగు మగ్రజుండగు నగస్త్యుండు పిన్ననాఁటం గోలెఁ దపస్వియై వనవాసి యయ్యె, నిక్ష్వాకుండు వసిష్ఠుం బురోహితుంగా వరించె; నీవృత్తాంతం బిట్టిది యని తెల్పిన విని ప్రముదితుండై బాదరాయణుం జూచి జనమేజయుం డిట్లనియె. ౩౯౨

చ॥ కమలజసూతుఁడైన మునికాయము నూనుట వింటి నట్టు లా
నిమిజనవల్లభుం డొడలు నెమ్మి వహించుట యెట్టులొక్కొ? సం
యమికులవర్య! తెల్పు మన నాతని కిట్లనె మానిచంద్రుఁ డా
క్రమమున శాపమొందు నిమికాయ మిలం బడెఁ గట్టె చాడ్పునన్. ౩౯౩

గీ॥ అంత ఋత్విగ్వరులు నిమిప్రాణహీనుఁ, డవుటఁ దల్లడమంది యాయధ్వరంబు
సుప్తమయ్యెను భ్రంశ మిచ్చోటఁ దవిలె, నేమి సేయుదమని చాల నెదఁగలంగి.

మ॥ బహుమంత్రక్రియలన్ దదంగమున నుచ్ఛ్వాసంబు పుట్టించి య
న్వహగంధాదులఁ బూన్చి స్తంభనకలాపాండిత్యమున్ జూపి ని
ర్వహణప్రథిమ సాంగమానటులు నిర్వర్తించి రయ్యజ్ఞమున్
మహురామంత్రితు లాచు వేలుపులు నామోదించి రక్కర్మకున్. ౩౯౪

సీ॥ అంత నిర్జరకోటి యవనీపతినిఁ గాంచి, ప్రీతుల మైతిమి పృథుయశంబు
నొందితి వీవేమి యుల్లంబులోపలఁ, గోరెదు తెల్పు మనోర్కి దీర్తు
మమర దేహంబైన నదిగాక యొండైన, నడుగుము నందనోద్యానముననొ?
నరలోకముననొ? యానందంబుఁ జెందఁగఁ, గోరెదవో? యన్న గుత్తలవిభుఁడు.
గీ॥ సకలభూతాంతరంగినై చక్షురగ్రి, వాసమున సర్వసాక్షిత వర్తిలంగఁ
గోరితి నటన్న నిర్జరకోటి యటుల, నయ్యెడు మటంచు నరిగి రిచ్ఛానుభూతి.

క॥ యాగాహూతంబగు ముని, పూగము పూజలను దనిసి పోయె నిజేచ్ఛన్
యాగము జగదగణేయ, త్యాగంబుల భోగముల నుదాత్తంబయ్యెన్. ౩౯౬

ఉ॥ అయ్యెడఁ గొంద ఱాప్తులు మహాత్ముల మానులఁ గూర్చి మాయెడన్
నెయ్యముఁ గోరి రాజగు నరనిందితు నొక్కరు నీయఁగాఁ దగున్

—॥ నిమిశరీర మథనంబున మిథి జనించుట ॥—

జయ్యన నంచు వేడ నిమిసంహననంబు మథించి రాబుషుల్
పయ్యరతోడుదవడ్డ యలపావకుఁ బోలి సుతుండు వెల్వడెన్. ౩౯౭

క॥ మథనము వలనం గలుగుట, మిథి యని నామం బొసంగి మెయికొని వానిన్.
బుధగణనీయతఁ బుడమికి, నధిపతిగాఁ జేసి పొదలి రయ్యులవారల్. ౩౯౮

క॥ జనకుఁడు విదేహుఁ డగుటన్, జననాయక తత్కులజులు జనకవిదేహా
వని నాథులైరి జగముల, వినుచుందుము గాదె, వారివృత్తాంతంబుల్? ౩౯౯

సీ॥ అమ్మహారాజు దేవాపగాతటమున, మిథిలాపురంబు నిర్మించి యందు
ధనధాన్యములను సౌధంబులఁ గోటల, గోపురంబుల రత్నకూటములను
వెలితి లేకుండఁ గావించి పెక్కేఁడులు, క్షితిమండలము నాల్గుచెఱఁగు లేలె
తేజోవిశేషంబు దేవదుర్లభముగా, వర్తించె భువనైకవంద్యమైన
గీ॥ కీర్తినొందెఁ బ్రసంగసాంకేతికముగ, నీయుదంతంబు దెలిపితి నిదిశుభంబు,
లిచ్చునజన మేజయపృథివిపతియుఁ, బలికె మునిఁ జూచి సంశయాపన్నుఁడగుచు.

ఉ॥ అంబుజసూతికిన్ గొమరుఁడైన వశిష్ఠున కిట్టి యీసు డెం
దంబునఁ బుట్టు టొక్కటి బుధస్తవనీయతఁ గాంచు రాజు ను
ల్లంబున మానిపై నిటుల శ్లాఘువ మెంచక యీసువుట్టు ట
బ్బింబయి తోఁచె నిర్వురను బాడిఁ దలంపర యేమి చెప్పుదున్. ౪౦౧

గీ॥ తనదుయజమానుఁడని మానితలఁపఁడయ్యెఁ, దనపురోహితుఁడని రాజుతలఁపఁడయ్యె
ననుచితంబని యిర్వురునాత్మఁ గనక, శప్తులగు టబ్బురంబయ్యె శాంతిపదమ.

క॥ ఈసందియ మెదఁ బాయం, జేసి కటాక్షింపు మనిన క్షితిపతితోడన్
వ్యాసమహాముని పలికెన్, భాసాన్నిధి తేజ! వినుము పలుకు లటంచున్.

సీ॥ అడవి నుండిననేమి యవని నేలిననేమి, మనసు పండని యట్టి మనుజులకును
అభిమాన మెడలని యట్టి వర్తనమెల్ల, నగ్గిలో వేల్చు నాజ్యంబు గాదె?
క్షమలేని మనుజుని జన్మంబు జన్మమే, పలు రక్కసులు పుట్టి బ్రతుక లేదె?
కామలోభాదులఁ గడకుఁద్రోయఁగఁగల్గు, పురుషుండు కడు దుర్లభుండు గాదె?
గీ॥ హరిహరబ్రహ్మలోకంబులందు నైన, ద్వేషరాగాదులను గెల్చు తెఱఁగుగలదె?
బ్రహ్మమానసభవు లెల్లబ్రహ్మలైన, నొచితిఁదొలంగుచుంద్రు కామాదులెడల.

గీ॥ సర్వభూతాంతరజ్ఞానసాక్షియైన, కపిలునంతటివానిఁ నిష్కారణముగ
నగరపుత్రులఁ గాల్పఁడే సందియంబె?, త్రిగుణబంధంబు విడుచునే? దేవుఁడైన

సీ॥ సకలంబునకు నధిష్ఠాన మహంకార, మదియె దుష్కార్యాళి కాలవాల
మజహరీంద్రాదుల కా గుణత్రయబంధ, మవియునే? మానవు లనఁగ నెంత?
సత్త్వరజస్తమస్త్రయము నొక్కొకవేళ, నొక్కొక్కఁ డభివృద్ధి నొందుచుండు
గుణశూన్యుఁడైనట్టి కూటస్థచైతన్య, మొక్కఁడు పరమాత్మ యొండు చోటఁ

గీ॥ త్రిగుణజంబాల మంటని దిక్కుగలదె,యదియలక్ష్యంబు తచ్ఛక్తి యనుపమాన
మద్వితీయంబు తద్భక్తి యబ్బు టరుదు, తెలియువాఁడె శివుం డట్టి రిలను లేరు.

ఆ॥ శిక్షలేక గుణము సిద్ధింప దెచ్చోటఁ, గ్రోధసహితులెల్ల గురువులు పుడమి
వారు బోధఁగొల్ప వచ్చునే శాంతంబు, కారణంబులేని కార్య మున్నె? ౪౦౭

సీ॥ జ్ఞానంబు ద్వివిధంబు శాబ్దికం బందులో, వేదశాస్త్రార్థ వివేకజంబు
తంత్రకల్పితములు తర్కముల్ నానాప్ర,కారకంబులు తత్త్వవారకములు
అట్టి తర్కంబుల నగు బుద్ధివిభ్రంశ, మది జ్ఞాననాశకం బగున కాదె?
యనుభవాఖ్యం బయి యలరు రెండవయది, దుర్లభంబది వేత్త దొరకనేని

గీ॥ సిద్ధమగు లేనిపట్ల నబద్ధమయగు, మానసికమైన దోషసామగ్రి నెందు
శబ్దవిజ్ఞాన మడచునే? జగతి దీపవార్తఁ జీఁకటి నడచు నెవ్వారు గలరె? ౪౦౮

ఆ॥ వె॥ ఎది యొసంగు ముక్తి నదియ విద్దియ యేది,బంధముడుపు నదియ పరఁగఁగర్మ
మనఁగ నన్యకర్మ లాయాసకరములు, ముక్తి నీయకునికి భూవరేణ్యా! ౪౦౯

గీ॥ పరహితము శీలసంపత్తి ప్రమద మోర్పు,ధైర్య మీమైదు విద్యావిధానమునకు
ఫలములని కాంచుమీ! విద్య కలిగినంతఁ, గామముఖదుర్గుణంబులు కడకుఁ జనవు.

క॥ దీనికి మూలము జనవర!, మానసనిగ్రహము శుద్ధమాయామయ మ
మ్మానసము దానిఁబట్టిన, యేనిన్ సర్వంబు సుకర మెవ్వారలకున్. ౪౧౧

ఆ॥ మనసు నిల్చెనేని మానసజాతముల్, కామముఖము లెల్లఁ గ్రాఁగిపోవు
నందువలన విద్య యనితరకథనీయ, ముక్తి నొసఁగు సర్వ మూల మిదియు. ౪౧౨

మ॥ అదిగాన న్నిమి కమ్మహామునికి నాత్మాధీనముల్ గాని దు
ర్వాదయోద్యన్మమతాభిమానములచే నీర్ష్యల్ దరంగింప శా
పదవాగ్నిన్ జెడి కాలి మగ్గి నిజదైవపాథివాసారసం
పదచే దేతి శుభస్థితిన్ గనిరి యమ్మార్యన్ గనన్ శక్యమే. ౪౧౩

సీ॥ భార్గవుండు శపింపఁ ॥ బరమశాంతి వహించి, భరియించెఁగాని శాపంబు మరల
నాతని కిడెనె? యయాతి యట్టుల నోర్చి, ముదిమి భరింపఁడే ॥ మొనసి యట్లు
తా నోర్చి భూపాలతల్లజుం డగు రాజు, నిమి శాప మీకుండ ॥ నేరఁ డయ్యెఁ
గ్రోధు లక్రోధులు ॥ కోటానుకోటులు, గల రెల్ల శిక్షింపఁగలుగు టెట్లు?
గీ॥ భావభేదంబులను బహుభంగులిటుల, వర్తిలు జగంబు హైహయభార్గవులకు
ధననిమిత్తంబుగా నీసుదనుకఁ బోరి, మడియ రే? యమ్మహాదేవి మాయ కరుదె!
క॥ నా విని జనమేజయుఁ డ,ప్పావనయతితిలకుఁ గాంచి ॥ పలికెన్ భృగుజుల్
పావనమూర్తులు వారల, కేవిధి హైహయులు కీడు ॥ నెంచిరొ చెపుమా! ౪౧౭

## —॰ హై హ యు ల వృ త్తాం త ము ॰—

మ॥ భృగువంశోద్భవులౌ పురోహితులు ॥ పేర్మిన్ బూజనీయుల్ కదన్
బగచే హైహయు లింత సేయుట యసంభావ్యంబు బ్రహ్మఘ్నతా
ప్తి గణింపన్ దలపోయ రే? వినఁగ నర్థిన్ గోరితిన్ సందియం
బగణేయస్థితి మాన్పవే! యనిన నా ॥ వ్యాసుండు సమ్మోదియై. ౪౧౮
సీ॥ ఇది నిక్కువంబు మహీసురుల్ వేదజ్ఞు, లతితపస్వులు భార్గవాత్మభవులు
రాజులగాఁ దమకుఁ బురోహితుల్ పెక్కు వి,ధంబుల నాశ్రితత్వమున మనిరి
హైహయుల్ దురవగాహప్రతిష్ఠాధుర్యు, లార్యు లీ వైరంబు ॥ లంకురింపఁ
గత మేను వింటిఁ బ్రాక్తనమౌని సన్నిధి, వివరింతు వినుము సవిస్తరముగ
గీ॥ నర్జునుండను రాజు హైహయులలోన, వేయుచేతులుగల మహావీరుఁ డతఁడు
సప్తసాగరములు దాఁటి ॥ చక్రవర్తి, యగుచు ద్వీపసప్తకమును ॥ నాక్రమించి.
శా॥ దత్తాత్రేయమునీంద్రుశిష్యుఁడయి దైత్యద్వేషి దివ్యావతా
రోత్తంసం బయి సిద్ధుఁడౌచు భృగుయాజ్యుండౌ మహాయజ్వయై
వి త్తం బుత్తమ దేశికావళులకున్ ॥ వేవే లొసంగన్ గృపా
యత్తుండై బహుయజ్ఞకోటులు మహాయత్నంబునన్ సల్పుచున్. ౪౧౯
ఆ॥ అందువలన భృగువు ॥ లందఱు ధనికులై, గజతురంగరత్నకలితు లగుచు
సకలభోగభాగ్యశాశ్వతైశ్వర్యులై, భూతలంబునందుఁ ॥ బొగడు గనిరి. ౪౨౦
గీ॥ కార్తవీర్యార్జునుండు స్వర్గగతుఁడైన, హైహయులు ధనహీనులైయడలుచుండి
భృగువుల జయించి ధనము దేదగు నటంచు, నందఱునుగూడి దండెత్తిరవనినాథ!
ఉ॥ సామముతోడ హైహయులు ॥ సంగర కేళికిఁ దక్కి వేడినన్
వేమఱు లేదులే ధనము ॥ ...

భూమిని డాఁచి కొందఱును ॥ భూసురకోటి కొసంగి కొంద ఱి
చ్ఛామహితాత్ములై చనిరి ॥ క్షత్రియభీతి భృగూద్వహుల్ వెసన్. ౪౨౧

—॥ హైహయులు భృగుమునులధనంబు లపహరించుట ॥—

చ॥ ప్రబలధనాశ దుఃఖపడుచువారిని హైహయపాళిఁ బాయుచున్
నిబిడనిరంధ్రిదుర్గసరణిన్ ధరణీసురు లెల్ల నిల్వ నం
త బహుళకార్యగౌరవముచేనన్ వెతఁ జెందుచు హైహయుల్ ధన
ప్రబలతదాశ్రమస్థలులపైఁ బడిరప్డు ధనార్జనార్థులై. ౪౨౨

మ॥ జనశూన్యత్వమునన్ బొసంగు భృగువేశ్మంబుల్ గనుంగొంచు ద
ద్ధనకాంక్షన్ మునిగేహముల్ విడిచి చెంతన్ నిల్చుచున్ దన్ని కే
తనముల్ కోపమునన్ బగిల్చి ధరణిన్ ॥ ద్రవ్యంగఁ గన్పట్టి నం
తన తద్ద్రవ్య మపాస్తమయ్యె నని చిత్తంబుల్ వెతన్ గుందఁగన్. ౪౨౩

క॥ శరణు శరణంచు ధరణీ, సురులు భయోద్రిక్తు లగుచు ॥ శోకించుచు స
త్వరత గృహాని స్సృతంబగు, నురుతరబహుధనము వెదకుచుండన్ గినుకన్.

చ॥ శరములఁ గుచ్చిచ్చిన్ నిలువఁజాలక బాడబు లద్రిదుర్గ మం
దిరులయియుండ హైహయులు ॥ దిగ్వలయంబుల నెల్లచోటులం
దరయుచు నోడ కాభృగుల ॥ నందఱ గర్భవిభేదనంబుగా
నఱికిరి తత్ప్రియాంగన లనారత దుఃఖపయోధి మున్గఁగన్. ౪౨౫

మ॥ భృగుపత్నీజనగర్భభేదనము గావింపంగ వీక్షించి ధీ
రగురుల్ తాపసముఖ్యు లాదరితకార్యప్రక్రియాదక్షులై
తగు గర్వాంధుల బాహుసంభవుల నుద్యత్కోపపూర్ణ మింతేల? మీ
కగునే? విప్రవిఘాతపాతక మయుక్తారంభ మింకేటికిన్. ౪౨౬

క॥ అత్యుత్కటపుణ్యాంహః, కృత్యంబుల ఫలము లనుభవింతు రిహమునన్
నిత్యవిభూతిని గోరి య, కృత్యంబులు సేయఁదగునె ॥ యెవ్వరికైనన్. ౪౨౭

వ॥ అని మందలించుటయు హైహయు లవ్వారి కిట్లనిరి. ౪౨౮

సీ॥ సాధుతామత్పూర్వజనపాలురన్ బట్టి, వంచించి చోరులవలె ధనంబు
దంభవృత్తిని దురాచారంభులై కొనినారు, తాపసుల్ గారు వృత్తమున వీరు
వినయంబుమైఁ బాదవృద్ధికి బుణముగా, నిండని వేడినచేసియరైరి
కష్టంపుదశనుండి ॥ కాచియేఁబడు మమ్ము, నాస్తివాదు లగుచుఁ ॥ గస్తియిడిరి
గీ॥ కార్తవీర్యునిచేఁ దొల్లి ॥ క్రతువులందుఁ, గొల్లగా ధనరాసులు ॥ గూర్చినారు
సంచితముగాఁగ ధనముఁ గూర్పంగఁదగమ, విప్రజాతికి ననిక దా ॥ వేదమతము.

— హైహయులు భృగువంశజులను మిక్కిలి బాధించుట —

మ॥ విధివద్దైవతపూజలన్ మఖములన్ ౯ విత్తంబు దాఁపంగఁబో
క ధరాదేవులఁ బూజఁ దన్పవలె వీఁకన్ జోరరాజన్యవ
హ్నిధరాధీశులచే భయంబుపొడమున్ ౯ లేకున్న; నట్లాటచే
బుధు లాసంబడి దర్వ్యరక్షణమునన్ ౯ బుద్ధిం గొనంబో రెటన్. ౪౩౦

గీ॥ కాక దర్వ్యంబుపై నాస ౯ గలిగి సంచి,తం బొనర్చిన సద్గతుల్ ౯ దప్పఁ బుడమి వేల్పులకుఁ; బాదవృద్ధికి ౯ వేఁకొనిన, ధనము లోభంబుచే నీమి ౯ ధర్మమగునె.

ఉ॥ తారు భుజింపలేక గుణశతత్పరులా పృథివీసురాళికిన్
సారత నియ్యలేక ధనసంగ్రహణం బొనరించు పాపులన్
ధీరత శిక్ష సేయుఁడని ౯ తెల్పవె? వేదము; లట్లుగాన ని
ప్పాపుల లోభదూషితులఁ ౯ బట్టుక కొట్టుట ధర్మదూరమే? ౪౩౨

క॥ మీరు మహాత్ములు మాపైఁ, గారుణ్యము సేయవలయుఁ ౯ గడుఁ గ్రోధమునన్
బాపులని వెఱచువారమె, వీ రందఱ నడఁతు మిపుడ ౯ వేయునునేలా? ౪౩౩

మ॥ అనుచున్ హైహయు లిట్లు వల్కు కఠినవ్యాహారముల్ వించు న
మ్మునులే మేనియుఁ బల్కకుండినఁ గడున్ ౯ మూర్ఖత్వమున్ బూని రా
జనికాయంబు దురాత్మతన్ భృగువతంసవ్రాతమున్ బత్నులన్
ఘననిర్బంధముగాఁగఁ బీడ గుడుపం ౯ గాసిం గడుం గుందుచున్. ౪౩౪

చ॥ భయమున నార్తి నొంది భృగుపత్నులు కొందఱు ఖిద్యమానలై
పయిపయినూరు బాష్పములు ౯ పైఁట నడంచుచు వేపితాంగులై
దయ యొక యింత లేక తము ౯ దండన సేయుచు నున్న యట్టి హై
హయులను గన్ను గప్పి తుహినాద్రికిఁ బాఱిరి భీతచిత్తలై. ౪౩౫

గీ॥ అర్థకాముకులైన హైహయులు భృగుకు,లంబువారల నిర్దయాశలంబు లగుచుఁ
గొందఱిని బిల్కుమార్చిరి ౯ కొందఱిఁ బొరిఁ,గట్టి కొట్టిరి యతిపాపకర్మ లగుచు.

వ॥ జనమేజయా! సర్వప్రాణులకు లోభంబు దేహసంస్థంబైన గొప్పశత్రు వని యెఱుంగుము. సర్వదుఃఖకరంబును, దుస్సహంబును ప్రాణనాశకంబును నిఖిల దురిత మూలంబును దృష్ణాశ్రయంబును విరోధకారణంబును సర్వార్తిజనకంబును నగు లోభంబు; తద్వశంబున వంశధర్మంబులను శాస్త్రధర్మంబులను బరిత్యజించి మాతృ, పితృ, భ్రాతృ, గురు, మిత్ర, బాంధవ, పుత్ర, భగిన్యాదులన్ బాధించి ధనంబులు గొనన్ జూతురు. లోభంబున కన్న వేఱొక శత్రువిండు గలఁడే!

కామక్రోధాహంకారాదుల కన్న లోభంబు కడు దుస్తరంబు పెక్కు వచింప నేల ? తద్బద్ధులై ప్రాణంబైనఁ బరిత్యజింపం జూతురుగాదె ! నీకుఁ బూర్వజులగు మహారాజులు ధర్మజ్ఞు లయ్యును సత్పథవర్తులయ్యును, కురుపాండవులు రణంబున హతు లగుట రాజ్యలోభంబునన కదా ! సత్యసంధుం డగు భీష్ముండును వేదార్థ ప్రవీణుండగు ద్రోణుండును గృపకర్ణ బాహ్లీకభీమసేనధర్మపుత్రాదులును రణంబునఁ బరస్పరంబు కుటుంబకదనంబునం బోరుటకు లోభావేశంబె కదా ? ముఖ్యకారణంబు, కావున లోభాభిభూతుం డొనరింపని యధర్మంబు గలదే ? పాపబుద్ధులగు హైహయులచే భార్గవులు నిహతు లగుటకు సంశయింపం బనిలేదని చెప్పిన, ౪౩౭

సీ॥ బాదరాయణుఁగాంచి ♦ పల్కె నో మునిచంద్ర!, భృగుపత్ను లెల్లను ♦ బెదరి దుఃఖ
సాగరమ్మున మున్గి ♦ శైలకాననములఁ, జని రని వింటి న ♦ చ్చంచలాక్షు
లెట్టులు చనిరి? తద్భృగువంశ మెట్లయ్యె?, నతిలోభులై బ్రాహ్మణాపచార
మట్టులు చేసిన ♦ హైహయు లేమైరి?, యీ కథాపీయూష ♦ పాకమునెడఁ
గీ॥ దృప్తి తీరక యున్నది ♦ తెలుపనీదు, మన్మనము తదనంతరమహితచరిత
తెలుపు మన మౌని నృపునితోఁ బలికెనప్పు, డధిపు చిత్తంబు నిస్సంశయంబుగాఁగ

క॥ జనమేజయక్షితీశ్వర!, విను మవ్వలి వృత్త మెల్ల ♦ వినిపించెద న
వ్వనజాక్షులు దుఃఖించుచుఁ, జనిరిగదా! శీతశైలసానులకడకున్. ౪౩౯

గీ॥ పతులపై నానదొరఁగి దుర్భరత శైల, వితతకాననకందరావివశ లగుచు
నతితరం బగు భయమున ♦ నలమటించి, యున్న వేళల హైహయుల్ లోట దక్కి.

ఉ॥ అచ్చటికిన్ సరోషులయి ♦ యంగనలన్ గెడపంగ నేగినన్
బొచ్చెముమై నొకానొకతె ♦ పొందుగ గర్భము సక్థిలోపలన్
నిచ్చలు డాఁచి పాఱిచన ♦ నిర్భయులై వెనువెంట నంటి తా
రొచ్చెముఁ దక్కి హైహయనృపోత్కర మాగ్రహవృత్తిఁ బర్వఁగన్. ౪౪౧

క॥ పట్టుండు పోవుచున్నది, కట్టుం డీలేమ గర్భకలితఁ బడంగా
గొట్టుం డని హైహయతతి, కట్టలుకం జుట్టుముట్టి ♦ ఖడ్గము లెత్తన్. ౪౪౨

—♦ ఔర్వమహాముని జననము ♦—

సీ॥ ఆలేమ భయభీత ♦ యగుచు వారలఁ జూచి, సక్థిస్థతనయ రక్షణముఁ గోరి
వెతనొంది దుఃఖించి ♦ వీఁకెడినై కాంది, శీకయై వెడలెదు ♦ వీఁక లేక
దీనత రక్షించు ♦ తెఱవులేక తపించి, హరిసంగృహీతయౌ ♦ హరిణిబోలె
సంచలించుచునున్న ♦ జననిఁగావఁగబూని, యుదయాద్రివెడలు సూర్యుండువోలెఁ
గ్రోధోగ్రదృష్టులఁ ♦ గూల్తు హైహయులను, ననుపోల్కి నూరుగర్భాంతరాళ

గీ॥ మపుడ భేదించి యరుదెంచు నద్భుతాంగు, నర్భకునిఁ జూచునంతట నైహయులకు
దృష్టిపాతంబు దొట్టిన దిగ్భ్రమమునఁ, బుట్టుగ్రుడ్డుల పోలికఁ బొగిలికొనుచు.

ఉ॥ ఎట్టివిచిత్రమో! మనకు నెల్లరకున్ బలితంపుఁగీఁడిటుల్
పుట్టెను నర్భకుం గనుటఁబో? యిది; నేత్రవిహీనవృత్తిచేఁ
జెట్టలమైతి మీ వనిత చిత్రచరిత్రముకల్మి వ్యర్థతన్
బట్టువడంగ సంఘటిలె బాపురె! యంచని దుఃఖితాత్ములై. ౪౪౪

సీ॥ అడరి చింతించుచు నక్షిహీనత నిరా,శ్రియు లౌచు నబ్బోటి శరణువేడి
యంఘ్రులపైఁ బడి యభయమ్ము గోరుచుఁ, జేతులు జోడించి శిరము లెల్ల
వంచుచు మిగుల దుఃఖించుచు నో తల్లి!, క్షత్రియాధములము సహజదురిత
సాపరాధులము గర్వాంధచిత్తులము నీ,యాత్మజుఁ గన్నంత నంధభావ

గీ॥ మెనసితిమి నీతపోవీర్య మెఱుఁగలేక, పాపకారులమై యిట్టి బన్నములకుఁ
బాలుపడినారమమ్మ?దుర్భావ మణఁచి,యమ్మ కనులిమ్ము!నీవ దిక్కమ్మ!మాకు.

గీ॥ మరణమైనను మేలుగా మాకుఁ దోఁచె, నంధభావంబు భరియింప నతిభరంబు
కరుణఁ జూచి పునర్దృష్టిఁ గలుగఁజేసి, పరిచరులుఁగాఁగ మమ్ముఁ జేపట్టుమమ్మ.

చ॥ ఇదిమొద లిట్టి కార్యముల కెన్నఁడు బుద్ధిఁ జొరంగనీక పు
ణ్యదమగు వృత్తిచే బ్రతికి యాగ్రహముల్ విడనాడి భార్గవా
స్పదముల సేవఁ జేయుచు శుభంబుల నొందెద మజ్ఞవృత్తిచే
నొదవిన నేరముల్ మదిని నుంపక ప్రోవఁగదమ్మ! పేరిమిన్. ౪౪౭

ఆ॥ వైరభావ మెల్ల వదలి భార్గవులతో, దాస్యవృత్తి నుండఁ దలఁచినాము
ఇదియె శపథ మొండె కేల నీ సుతునితో, సుఖము లొందుమమ్మ! శుభము ౪౪౮.

క॥ సానుగ్రహవీక్షణముల, మానవతీ! మమ్ముఁ జూచి మన్నించిన నెం
దేనియుఁ జని బ్రతికెద మిఁక, మానెద మీ దురితవృత్తి? మానుము కిన్కన్.

మ॥ అనుచున్ వారలు విన్నవించుటయు బ్రహ్మద్వేషులై తన్ను నొం
చిన రాజన్యులఁ జూచి యారడిలుఁడీ చిత్రంబు నాచే నటం
చనఁగా నేటికి? నా కెదన్ గినుక లే దాత్మోద్భవుం డర్భకుం
డనఘుం డీతఁడు భార్గవుం, డితనిచే నయ్యెన్ దృశాస్తంభముల్. ౪౫౦

క॥ తన పితరుల మీరు నిషూ,దన మొనరించుట దలంచి ధర్మమెడలి యి
ట్లనఘుల వధియించితి రని, జనితాగ్రహవృత్తి నిట్లు సలిపెన్ గనఁగన్. ౪౫౧

చ॥ భృగువులఁ జంపి మీరు మదిబెగ్గిలఁ దత్సుతులన్ వధించి బి
ట్టైగసిన యీసునన్ సతుల కెల్లను గర్భము లూడ్చి ఘోరతన్

నెగడిన భీతనై గిరుల నిష్ఠురవేదన నోర్చి యారుసం
దోగి సుతునిల్పి వర్షశత మోర్చితిఁ డాఁగి పరిభ్రమించుచున్. ౪౫౩

సీ॥ అఖిలవేదములు షడంగపూర్వములుగా, జఠరంబునను నిల్చి చదివినాఁడు
భృగువంశవృద్ధికై పెద్దకాలం బోర్చి, పరిపూర్ణకళలచే బరఁగినాఁడు
దివ్యప్రభాదీప్త దృఢతేజమున జగ, త్త్రితయంబు వెలయింపఁ దీరినాఁడు
ద్రోహులై నను బట్టి త్రుంచివేయఁగఁ జూచు, మిమ్ముఁ గూల్చెడిశక్తి మెఱసినాఁడు

గీ॥ ఇమ్మహాభాగు దృఢతేజ మిట్లుమీకు, నాంధ్యదోషంబుఁ బుట్టించె నర్భకునకు
దాసులై మీరు వినయసంధానగతుల, వేఁడుఁడు కృపాన్వితుండయి వేడ్క సేయు.

క॥ దృష్టి ప్రతిబంధంబుల, నష్టత సంధించి మీ కనారత సౌఖ్యో
త్కృష్టత నొసంగు నాగ, స్పష్టీకరణం బొనర్ప భావి శుభ మగున్. ౪౫౪

మ॥ అనుచున్ భార్గవపత్ని తెల్పినను సర్వప్రక్రియన్ హైహయుల్
వినతుల్ సేయుచు నర్భకున్ గడువడిన్ వేడంగ నయ్యౌర్వుఁడుం
డనఘుం డౌట మదిన్ గణించి మిగులన్ హర్షించి వా రందఱన్
గని మీ మీ యపరాధముల్ మఱచితిన్ క్షాంతిన్ గదున్ బూనితిన్. ౪౫౫

ఆ॥ దైవనిర్మితములు భావంబు లెల్లర, భోగకాలమునను బొందుచుండు
నిందువలన శోక మొందక మీ గేహములకుఁ జనుఁడు దృష్టి మొనయు మీకు.

మ॥ విగతక్రోధత మాయెడన్ మెలఁగి యావిర్భూత పూర్వోన్నతిన్
జగతీమండల మేలుచున్ సుఖులరై సద్గోష్ఠి సాధించుచున్
భగవద్ధ్యానగరిష్ఠులై మనుఁడు నా బ్రహ్మణ్య నౌర్వుం గదున్
స్థగితాంతఃకరణంబులన్ బొగడ దీక్షాదత్తులై రందఱున్. ౪౫౬

గీ॥ అంత నౌర్వమహాముని యాజ్ఞఁ గొనుచు, హైహయుల్ చనిరిండ్లకు నాత్మజాతు
వెంటనిడుకొని భృగుపత్ని తొంటి తనదు, నాశ్రమంబున కేగి సుఖాప్తి నొందె.

గీ॥ భార్గవులు కీడునొంది శుభంబు లెడలి, హైహయులచేతఁ జెడుట నౌర్వాశ్రయమున
వసుధఁ బ్రబలుట యానుపూర్వముగ నీకు, నెఱుకపఱచితి నన్నమహీశుఁ డంత.

ఉ॥ పాపమతిన్ భృగూద్వహుల భగ్నులఁ జేయుచు దుష్టులై దురా
టోపముచేత హైహయు లిటుల్ చెడి మేల్గనుటల్ భవద్వచః
ప్రాపిత మాధురీరస సుఖాస్పదముం గని తృప్తి నొందితిన్
బైపయి నొక్కసందియము పట్టువడెన్ మఱీ దానిఁ దెల్పెదన్. ౪౬౦

—॰ హైహయు లను పేరు వచ్చుటకుఁ గారణము ॰—

ఆ॥ కార్తవీర్యవంశ ¶ గణ్యులౌ వారికి, హైహయాఖ్య లెట్టుఁగలిగె నొక్కొ?
భరత యదుకులముల ¶ భారతుల్ యాదవు,లైన యట్లు హైహయాఖ్యగలదె!

చ॥ అని వినఁగోరినాఁడ గరుణాన్విత వైఖరిఁ దెల్పుమన్న న
మ్మునికులచంద్రుఁ డిట్లనియె ¶ మున్ను పురాతన గాథ గల్గు స
జ్జనగణనీయమై దురితసంహరమై జనమేజయా! ధరః
జనపతియొక్కఁ డొప్పెసఁగు ¶ జంద్రదినేంద్రసమానుఁ డాఢ్యుఁడుర్. ౪౬౩

గీ॥ అమ్మహారాజు రాజహయమ్ము నెక్కి, భగవ దవలోకనాపేక్షఁ ¶ బరమపదముఁ
జూచు వేడుక నరుగ నాసొంపుగాంచి, సాగరోద్భవ సంభృతాశ్చర్య యగుచు.

సీ॥ నిక్కు వీనులతోడ ¶ నింగికై యేతెంచు, సురుచిరాశ్వము సొంపుఁజూచి చూచి
శతసుమాళుగ ధుర్యసౌందర్య గరిమచే, మించు నారాజన్యుఁగాంచి కాంచి
యతనిదివ్యపరిభాషావ్యాప్తి నాకస మెల్ల, మెఱయంగ మదిలోన మెచ్చి మెచ్చి
కాయశోభితపరిష్కారరత్నమనోజ్ఞ, కాంతిచ్ఛటలఁ జూచి ¶ కరఁగి కరఁగి

గీ॥ యద్భుత రసంబు మదిలోన ¶ నావహింప, స్తంభితాంతఃకరణ యాచు ¶ జలధికన్య
వెఱఁగుపడి నిల్వ నవ్వింతవిష్ణుమూర్తి, గాంచి మదిలోన సంశయగ్రస్తుఁడగుచు.

చ॥ కలశపయోధినందనినిఁ ¶ గాంచి యిదే మలవాని నిట్లు ని
శ్చలత వహించి చూచెదవు ¶ సైంధవ దర్శన లాలసత్వమో?
విలసితరాజదర్శననవీనతరస్మరచాపలంబొ? నీ
కలఘువిమోహ మంతరమునందు జనించుట కేమి హేతువో? ౪౬౪

ఆ॥ వాజి నెక్కివచ్చు ¶ వాఁడెవ్వఁ డతనిపై, నింత వెఱ్ఱి వోడము లేమి కతము
నీకు సుతుఁడుగాఁడె? ¶ నీరజాస్త్రుఁడు వాని, మోహవశత నిట్లు ¶ మునుఁగనగునె!

—॰ విష్ణుమూర్తి లక్ష్మీదేవిని శపించుట ॰—

చ॥ హరి యిటు లాడు మాటలకు ¶ నంబుధికన్యక దైవయోగ మ
ట్లుఱుముట నెందు కేని జలజాక్షునితో మఱుమాట యీమి దు
స్తరతర కోపవేగమున ¶ సైఁపక యంగనఁ గాంచి పల్కె నో ౪౬౫
తరుణి! భవత్సహోదరతఁ ¶ దప్పకచూచెదె? వానియశ్వమున్.

మ॥ అది యుచ్చైశ్శ్రవమౌట దానిఁ గని య్యాహా! నీకుఁ దోడ్పాటనో
మది నుత్సాహము నొంది గాంచెదవు నీమాయల్ గనుంగొంటి మేల్
విదితంబయ్యెను నీదుచాపలము లుర్వీ బాలికృతం బోలి యె
ల్లిద మొప్పారఁగఁ జంచలత్వమునఁ గొల్లోలవై యుండుమీ. ౪౬౬

ఆ॥ తోడఁబుట్టువైన తురగంబుఁ దిలకించి, మరులుపడితి కాన మాటలేల?
బడబవగుచు ధాత్రి విడివడి తిరుగుచు, నుండుమని శపించె నోజ మాని. ౪౯౯

ఉ॥ అంతట భీతయై కమల యంబురుహాక్షుని జూచి కన్నులన్
దొంతరగా జలం బురలఁ దోడన పాదములందు వ్రాలి య
త్యంతవిషాద వేదనకు నాస్పదయై వినయాన్వితాంగియై
సంతసమెల్లఁ దూలఁ హరిఁ జక్కఁగఁ గాంచుచుఁ బల్కె నిట్టులన్. ౫౦౦

సీ॥ కరుణాకరా! జగత్కల్యాణ! కేశవ! యపరాధ మత్యల్ప మాగ్రహించి
శాప మొసంగితి శాశ్వతం బని నీదు, సఖ్యంబు నమ్మితిఁ జనునె? యిటుల
నెన్నండు నాపయి నింతకోపముఁ జూప, వకట? నిర్ఘాతమ్ము నట్టి పల్కు
సఖులపైఁ జనునె? యాశ్చర్యమయ్యెడి వర, యోగ్యనా నే శాపయోగ్యనైతి

గీ॥ నిన్ను నెడఁబాసి ప్రాణముల్ నిలుపఁజాల, దనువు విడిచెదఁ గరుణింపఁ దలఁచి తేని
శాప మోక్షంబుఁ బలుకుము సన్నిధాన, మెన్నఁడొ నేఁ గెడవని వేడు చున్నఁ జూచి.

క॥ ధారుణి మత్స్యముఁ జెపుడు కు, మారుఁడు నీ కొదవు నాఁడు మత్సౌఖ్య రసో
దారవయి సుఖితవయి మ, ద్దారతఁ జేకొందు వనుచుఁ దరుణిన్ బలికెన్. ౫౦౨

వ॥ అనిన. ౫౦౩

సీ॥ కాలయోగమునఁ బద్మాలయ హరిశాప, తప్తయై యెటులు వర్తన మొనర్చె
రేవంతుఁ డెటుల వర్తించెనో! యద్దేవి, బడబాంగధర యాచుఁ బరఁగె నెచటఁ
బ్రోషితభర్తృక పోల్కి వల్లభుఁ బాసి, యెంతకాలము గహనాంతరమున
నివసించి యేమేమి నెఱపెనో యెప్పుడు, పతి తోడఁ గూడెనో పతివియుక్త

గీ॥ యగుచుఁ బుత్రునిఁ గనె నెట్టు లఖిలవృత్త, మెలమి విస్తరముగఁ దెల్పవే యటంచు
నడుగ జనమేజయునిఁ జూచి వ్యాసుఁడనియె, నంచు సూతుఁడు మునులతో నానతిచ్చె.

క॥ జనమేజయుఁ డిటు లడిగిన, విని గంధవతీసుతుండు వేడుక లలరన్
జనపతితో నిట్లనియెను, వనజాక్షుని కోపదృష్టి వలను దెలియుచున్. ౫౦౫

## —• లక్ష్మీదేవి తపముచేయుట •—

చ॥ పతికృతశాపతప్తయయి భార్గవి వేదనచే గృశించుటల్
సతతదురాగ్రహంబునఁ బ్రసక్తతఁ గాంచు రమేశుఁ గాంచు భూ
పతి యటుపోవ భీతిలి జవంబున గుఱ్ఱము డిగ్గి దూరమం
దతులితభక్తి మాధవున కంజలిఁ జేసి యథాగతంబుగన్. ౫౦౬

ఆ॥ సత్వరమునఁ దండ్రి సన్నిధానముఁజేరె, నెన్నఁ డింతిమీఁద వివశఁ డగుచు
శాప మిచ్చుటయును సరసిజాలయదుఃఖ, మూఢ యగుచు హరికి మ్రొక్కి వేగ.

సీ॥ యమునానదీ సంగమమున సువర్ణాక్ష, తీర్థరాజము పొంత దృఢమనస్క
యై సర్వకామ ప్రదాశ్రమవనభూమి, నిలిచి మహాదేవు నీలకంఠు
శంకరు వాంఛితసంధాయి శూలిని, శశిభూషుఁ బంచాస్యు శర్వు భర్గు
దశభుజుఁ గర్పూరధవళాంగు సార్ధనా, రీశ్వరుని గపాలి నిభవరాజి

గీ॥ నోత్తరీయు భుజంగభూషోత్తమాంగు, మదిని నిల్పి తపంబు రమావధూటి
బడబయై సేయుచుండఁగఁ బరమనియతి, దివ్యవర్ష సహస్రంబు దిరిగె నంత.

— లక్ష్మీదేవి కీశ్వరుఁడు ప్రత్యక్షమగుట —

చ॥ హరుఁడు ప్రసన్నుఁడై హిమధరాత్మజతోఁ బ్రమదాన్వితుండునై
పరమకృపాప్తి నెమ్మదిని బర్వఁగ నందితురంగుఁడై చను వ
చ్చి రమను గాంచి యో జనని! చిత్తముఁగందెడియిట్టి ఘోరని
ష్ఠురతపమేల చేసెదు? దుర్ దెలిపొందు ముపాస్తి యేటికిన్. ౪౭౮

సీ॥ సర్వలోకేశుండు సర్వార్థదుఁడు నీదు, భర్త ముక్తివిధాత పరమపురుషుఁ
డట్టి దేవుని వీడి యన్యభావం బేల, చేసెదు? సతులకుఁ జెల్ల దిట్లు
పతిసపర్యయె సతీపరమధర్మము విశేషించి ముకుందుండు సిద్ధభావ్యుఁ
డతఁ డుండ మమ్మేల యాశ్రయించెదు సర్వ, సేవ్యుండు హరి యవ్విచిత్రమేమి

గీ॥ విశ్వవల్లభుఁ డాతని విడిచి మమ్ము, బోటులను గొల్చుటెల్లను బొల్లుదనము
భర్తసన్నిధికరుగుము పలుచుఁదనము, వలదు పొమ్మని పలుమాఱు పలికి హరుఁడు.

ఉ॥ వినను నన్నుఁగూర్చి తప మాచరణం బొనరించి యుంటి నీ
మానసమెద్ది గోరుఁ బరమంబగు నవ్వరమిచ్చువాఁడ నీ
పూనిన కోర్కెఁదెల్పు మనఁ బూర్ణశశాంకనిభాస్య లక్ష్మి మ
న్మానసరాజహంస! వినుమా! వినిపింతు మదీయవృత్తమున్. ౪౭౯

గీ॥ దైవవశమునఁ బతి కోపభావమూని, బడబ వగు మంచు శపియించె బరుసనూక్తి
నంత పాదాంబుజములపై నడ్డపడిన, శాపమోక్షంబు దెల్పెఁ దత్పరణి వినుము

మ॥ బడబారూపమునంది భూతలమునన్ బ్రహ్మణ్యుఁడౌ నందనున్
బడయన్ శాపముఁ బాయునంచుఁ బలికెన్ భావంబునన్ రోసి యీ
సడికిన్ దాళక యేది తోఁచక మనస్సంకల్పసంసిద్ధికై
కడు వేడ్కన్ నినుఁ గోరి యుత్తపము శంకర జేయఁగాఁ గోరితిన్. ౪౮౦

క॥ సర్వార్థదాయకుఁడవును, సర్వేశుఁడ వీ వెఱుంగఁ ౹ జాలని యర్థం
బుర్విఁ గలదె? పతిహీనకు, శర్వాణీనాథ? యెట్లు ౹ సంతతి గలుగున్.

ఆ॥ నిరపరాధనైన ౹ నిజపత్ని నన్నెడఁ, బాసి వల్లభుండు ౹ పరమపదము
నంద యున్నవాఁడు ౹ నందనుండెట్టులు, గలుగు నాకు మేలుగలుగు టెట్లు?

—। లక్ష్మీదేవి హరిహరాభేదమును జెప్పుట ।—

వ॥ మహానుభావా! యేనొక్క విన్నపం బొనర్చెదఁ దొల్లి యేకాంతంబునఁ బ్రసంగ వశంబున వల్లభుం డెఱుఁగం జేసిన పూర్ణ భావంబు విన్నవించెద, సావధాన చిత్తంబున వినుము, భావభేదంబులు కల్పితంబులు, సర్వానుస్యూతంబైన వస్తు తత్త్వం బేకాకృతి వహించు, హరిహరాది నామభేదంబులు వ్యవహారకల్పితంబులై జగత్ప్రవర్తనోపాయంబు లగుం గాన నాకును హరునకు నేకభావంబుగాని యన్యం బొక్కింతయు లేదు, మఱి యీ రహస్యం బెఱుఁగుటవలనఁ బడంతులకు భర్తృవ్యతిరేకంబుగా జపతపోధ్యానంబులు గగనకుసుమంబు లయ్యును భవ దారాధనతత్పరనై యిట్టు లున్నదాన నని పలికిన పద్మాలయం గని హరుండు దేవీ! యీరహస్యంబు నీచేత నెఱుంగం బడుట వింతయై తోఁచుచున్నయది నాకును హరికిని భేదంబు లేమి సత్యంబ, ఏతదర్థంబు దేవాదులకు నగోచరంబు వేదతత్త్వానభిజ్ఞు లగు కుతర్కోపహతులకు నెట్లెఱుంగనగు? మద్భక్తు లయి విష్ణు నిందకు లగుచును విష్ణుభక్తులై మన్నిందకు లగుచును గాలపర్యాయంబునఁ బరివర్తించెదరు, దుర్జ్ఞేయంబగు నీ పరమార్థం బకృతాత్మలకు నెఱుంగ నగునే? హరిహరుల మగు మాకు నైక్యంబకాని భావభేదంబు లేదు. నీ వెఱుంగుట యెట్టులో నాకుం దెల్పు మన హరివల్లభ ప్రసన్నవదనయై విజ్ఞానబోధంబు విన్నవించుట కుపక్రమించి యిట్లనియె. ౧౮౬

సీ॥ ఒకనాఁడు దేవదేవోత్తముఁ డగు హరి, మదిలోన ధ్యానసమాధినిష్ఠఁ
దపమాచరించు నత్తఱిఁ జూచి యాశ్చర్య, మొంది నే నడిగితి ౹ నుత్సుకతను
దేవదేవ! జగత్పతీ! మాధవ! యనంత!, బ్రహ్మాది సుర దైత్యపటలిఁ గూడి
సాగరంబు మథించు ౹ సమయంబునను బుట్టి, భర్తృకాముకత గీర్వాణకోటిఁ

గీ॥ జూచి వారలలోన శ్రేష్ఠుండ వనుచు, నిన్ను వరియించితినిగాన ౹ నీకుఁ దక్క
నన్యుఁ డధికుండు గలఁడె? యీ ధ్యానమెవరిఁ, గనఁ దలంచి రచించెదో కైటభారి.

చ॥ అని నిజకాంతఁ బల్కిన స్మితాననుఁడై హరి దెల్పె నమ్మహే
శుని గిరిజాపతిన్ హరుని ౹ శూలధరున్ గుఱియించి యేఁ దపం
బొనరిచి కొల్చువాఁడఁ గరుణార్ణవధి శంభుఁడు నాకుఁ బ్రాణ మా
యనకును నేను బ్రాణ ముభయాంతర మించుక లేదు సుందరీ. ౧౮౭

క॥ ఎందేని నాదుకింకరు, లిందుధరుల్ ద్వేషబుద్ధి నేమేని నచిం
పం దండధరుని దండన, మొందెద రిది సత్యమనుచు నుగ్రతఁబల్కెన్. ౪౮౯

క॥ కావున మీకిద్దఱకున్, భావం బేకంబ కానఁ బరమదయాప్తిన్
గావింపుము మత్పతితో, వావిరి నేఁ గలిసికొనెడి వైభవ మభవా! ౪౯౦

ఉ॥ ఇట్టులు వల్కనిందిర సమీహిత మెంచి కృపాళుఁడౌచు నా
గట్టులతేనియల్లుఁ డల కంజదళాక్షిని గారవించి నే
నెట్టన నీదువల్లభుని నిక్కమ తెచ్చెద నూరడిల్లు మా
చుట్టఁబిసాళివాలు గల సొంపరి నీ కనుకూలుఁ డయ్యెడిన్. ౪౯౧

క॥ ఘోటీరూపము గల నిను, ఘోటకమై వచ్చి కలసి కొమరు నొసంగున్
బాటింపుము మద్వచనము, పాటిలు నీసుతుఁడు భూమిపాలనశక్తిన్. ౪౯౨

ఉ॥ నాథునితోడ నీడయిన నందనుఁగాంచి ప్రహర్షచిత్తవై
సాధితకార్యసిద్ధివయి చక్కఁగ నీపద మొందెదీవు ని
ర్బాధత శత్రులం గెలిచి పట్టి భువిం గులకర్తయై మహో
త్సేధసువర్ణసౌధములఁ జిత్తము రంజిల భోగి యయ్యెడున్. ౪౯౩

ఆ॥ ఇటులుదెల్పి శూలి యిందిర నూరార్చి, గౌరిఁగూడి యరిగె గగనవీధి
నంత సంతసమున నంభోజవాసిని, నీరజాక్షుఁగోరి నిలిచె నచట. ౪౯౪

చ॥ రజతగిరీంద్రశృంగమున రాజకళాధరుఁ డుండి యిందిరా
గజగమనన్ దలంచి ప్రియకామన నొక్కఁడఁ జిత్రరూపుఁ డ
న్నిజగణనాథుఁ గాంచి హరికన్ గని చెచ్చెర నాదుపల్కఁగా
నిజమరివై వచింపుమవినీతిపదం బిది నీకుఁ గేశవా! ౪౯౫

క॥ అలమటచేతఁ దపించుచు, జలజానన నీదుపత్ని సడలని తమిచే
వలపుఁగొనియున్న దీయెడ, గలయుము తత్ఖేద మడఁపఁగా వలయుఁ దగన్.

## — చిత్రరూపుఁడు హరియొద్దకుఁ బోవుట —

సీ॥ నావిని యగ్గణనాథుండు బహుతరో,ద్యానంబు వాపీలతాన్వితంబు
హంసకోకిలమయూరారావభరితంబు, స్వర్ణపతాకికాసగితగృహము
మధురవీణావేణుమందరధ్వానంబు, విహగకూజితవృక్షవిలసనంబు
సహకారవకుళకేసరచందనాశోక, మందారముఖభూజమండితంబు

గీ॥ నిఖిలసంతోషదంబైన నీరజాక్షు, సదన మాతఁడు చేరి నిస్సంశయముగ
జయునివిజయునిఁగాంచి యచ్చపుమురువు క్రీ... ...మొక్కుచు వినవించె.

ఉ॥ శంకరునానతిన్ దనుజశాసను సన్నిధి కేగుదెంచితిన్
గింకరుఁడన్ బ్రహర్షమునఁ గేశవుతో నెఱిఁగింపఁగావలెన్
గొంకక తెల్పుఁడన్న నయకోవిదుఁడా జయుఁడేగి మ్రొక్కి ని
శ్శంక వచించె దేవ! హరి! శార్ఙ్గి! వికుంఠపతీ! వినందగున్. ౯౮

క॥ ప్రతిహారదేశమునఁ బశుపతికింకరుఁ డొక్కరుండు భావజహరునా
నతి వచ్చి యున్నవాఁ డానతి యెట్టిదొ? చిత్తమనిన నారాయణుఁడున్ ౯౯

ఉ॥ సందియమేటికో జయ! నిశాకరశేఖరుకింకరున్ మహా
నందముతోడఁ దోడికొని నాయెడకున్ జనుదెమ్మటన్న న
స్పందమనీష వేగఁ జని శంకరుసేవకుఁ జిత్రరూపు గో
విందునియంతికంబునకు వేగమె తోడుక వచ్చె నాతఁడున్. ౧౦౦

క॥ ప్రణిపాతవిధుల నారాయణు నభ్యర్థించి ప్రఘటితాంజలి యగుచున్
బ్రణుతించి నిలువ హరి యగ్గణనాథుని జూచి హాసకలితుం డగుచున్. ౧౦౧

చ॥ కుశలమె? దేవదేవునకుఁ గుంజరయానకు నద్రికన్యకున్
గుశలమె? వీరభద్రగుహకుంజరవక్త్రముఖాత్మజాళికిన్
గుశలమె? తెల్పు భృంగిరిటగోపతి ముఖ్యగణాధిపాళికిన్
గుశలమె? నిన్నుఁ బంపుటకుఁ గోరిక యెద్ది శశాంకమౌళికిన్. ౧౦౨

ఆ॥ అనినఁ జిత్రరూపుఁ డఖిలేశ! నీ వెఱుంగనిది గలదె? జగతిఁ గాలకర్మ
సూత్రధారి వీవు సూచించు టిది యనుక్రోశ మంచుఁ గంటి నో శుభాంగ.

ఉ॥ కాదననేల? యాగమన కారణ మొక్కటి గల్గె నద్ది నీ
కాదట విన్నవించెద రహస్యమునందు; శివాజ్ఞ సర్వథా
తాదృశమన్న నాతఁడు ప్రదంపడి యేకత మిచ్చెఁ జెప్పె ని
ర్వేదము నొందియున్నయది విశ్వజనిత్రి యెఱుంగవే హరీ! ౧౦౪

క॥ కాళిందీతమసాంతఃకూలమునన్ బడబ యగుచుఁ గూరిమి నీపై
వేలాతిగకంధింబలె, జాలిం బఱుపంగ దుఃఖజలధిని మునిఁగెన్. ౧౦౫

సీ॥ అమ్మహాదేవి కటాక్షవీక్షణములు, ప్రాణికోటికి సంపదాస్పదములు
త్రైలోక్య జనని సత్త్వామరసాక్షిని, విడిచి యే సౌఖ్యంబుఁ బడసి తీవు?
నిర్ధనుండై నను నీరజాక్షులఁగూడి, బలవంతుఁడగు ధరాతలమునందు
నపరాధహీనయైనట్టి యద్దేవిని, గలహించి విడనాడు కత మదెద్ది?
గీ॥ సంసృతిని బత్ని విడనాడు జనని బ్రతుకు, కాల్పనే? యన్నె లంతుకఁ గాంచినట్టి
రిపులు కటకట పడుచుండఁ గృపవలవదె? భార్గవిని దెచ్చికొమ్ము సంపదలకిమ్ము.

చ॥ కమలను బాసియున్న నినుఁ | గాంచి జనుల్ నగరే? దివానిశం
బమలగుణాఢ్య లక్షణసమన్విత భవ్యసుశీల రూపకాం
తిమహిత చారుహాసముఖి | నీరజలోచన పత్నిఁ దావకాం
కమున వసింపఁజేసి సుఖసౌరవ మొందుము దేవపూజితా. ౧౬౭

క॥ ఏకాకి వగుచు నెట్టులు, లోకము నిందింపఁ గంజలోచన లక్ష్మిం
జేకొనక సహస్రాబ్దము, లీకోలఁదిని నిల్చుటెల్ల | హేయము కాదే. ౧౬౮

ఉ॥ కావున నీవు వేగఁజని | కంజవిలోచనఁ దోడితెమ్ము నే
దేవిని బాసి మున్గనిన | దీనత సర్వము నీ వెఱుంగు దో
దేవ! తురంగరూపమున | దేవిని దేల్చి సుతుం గటాక్షవీ
క్షావహవృత్తిచే నొసఁగి | కాంచు మభీష్టము లబ్జగేహతోఁ. ౧౬౯

వ॥ ఇట్లు పలుకుటయు. ౧౭౦

ఆ॥ చిత్రరూపుఁడనెడు | శివదూతవాక్యంబు, లాలకించి వాని | నంపి తాను
పరమపదము వెడలెఁ | దురగరూపంబుచే, బడబ యున్న కడకుఁ | బాఱుతెంచి.

మ॥ యమునాతీరమునందుఁ గామవశమై | యార్తింగడున్ మున్గి చి
త్తము నిర్విణ్ణత నొంద మై సుమధనుస్సంతప్తంబుగా నేగుచు
న్న మహేశింగనె నాపెయున్ హరిని విన్నాణమ్ముమైఁ గాంచి హా
సమనోజ్ఞానన యాచు నక్షులను బాష్పంబుల్ కదురన్ జిందఁగన్. ౧౭౧

గీ॥ చెంత కరుదెంచి పతిఁజూచి | చిన్నఁబోవు, నాననంబున మ్రొక్కిన | హరియునంతఁ
దమక మాఁపంగలేక కందర్పకేళి, ననునయించెను భార్గవి | యమునపొంత.

ఉ॥ అంతట గర్భమయ్యెఁ గమలాలయకున్; బడబాంగి యాట న
త్యంతముదంబునన్ హరియు | నంబుజగేహినిఁగాంచి నీవు దు
ర్దాంతభుజాబలున్ సుతుని | రంజిలఁగాంచి స్వదేహమూని నా
చెంతకు రమ్మటన్న విని | చేడియ యిట్లని పల్కె నాధుతోన్. ౧౭౨

—• లక్ష్మీదేవికి హైహయుఁడు జనించుట •—

సీ॥ ఆత్మసంభవుఁడైన | యర్భకు విడిచి నే, నెట్టులు చనుదెంతు | నెల్లరకును
స్నేహంబు విడువంగఁ | జెల్లునే? మఱియును, దనయమోహం బనంతంబుగాదె!
అసమర్థుఁడై బాలుఁడై నదీతటమున, నిర్జనస్థలిఁబట్టి | నిల్చుటెట్టు?
లిట్టి సుఖంబు నే నెట్టులు విడిచెద, నింతసాహసమున | నెట్టులోర్తు?

గీ॥ ననుచుఁబతితోడఁబల్కెడుననంతలోన, బాలుఁడుదయించెనుదయార్కభాస్వరుండు
దివ్య తేజోమయుం డౌచు దేవికంత, బడబరూపం బడంగి శ్రీప్రకృతి యొదవె.

వ॥ అంత లక్ష్మీనారాయణులు పూర్వరూపంబులగు తురంగరూపంబులు సడలి జగన్మోహనాకారంబుల వర్తించుటం జేసి సనకసనందనాదిమహర్షి సంస్తూయమానం బును సురాసురపరివేష్టితంబును నగు నొక్క విమానంబు గరుడధ్వజాంకితం బగుచుఁ జనుదెంచిన గంతుకాములై విమానాధిరోహణం బొనర్పునెడ వల్లభుం గాంచి పుత్రుం గైకొమ్ము, కాంతిచేత నిన్నుంబోలి ప్రాణప్రియుండై యున్న యిన్నందనుని నిటువంజాల, వైకుంఠంబునకుం గొనిపోవుద మనిన గోవిందుండు పత్నింజూచి విషాదంబు నొందకు మిచ్చోట సుతుంసు వసియించుఁ గావుత, వలయు రక్షణంబుం బొనర్చెద, నీ యర్భకుం డిచ్చోట వసియింపం గలవాఁడు వీని వలన నొక చిత్రంబు గాఁగలయదిమైయున్నది, యయాతి యను మహీ వల్లభునకు నందనుండగు తుర్వసుండు పుత్రకామతఁ దపం బొనర్చుచున్న వాడు, తన్నిమిత్తంబుగా నీతండు నిర్మింపబడియె, నేనును హరివర్మాపరాభిధుండగు వానిఁ బ్రేరేపి తపోమిషంబున నతని కొసంగం గలవాఁడ నతండు తన గృహ మునకుం గొనిపోయి దివ్యోపభోగంబుల వర్ధిలంజేయు నంశయింపకు మని బోధిం చిన నియ్యకొనియె, నిట్లు ముచ్చటించి విమానం బధిరోహించి యద్దంపతులు వైకుంఠంబునకుం జని రని చెప్పిన, ౧౧౧

సీ॥ జనమేజయుం డంత సత్యవతీసూనుఁ, గనుఁగొని సంశయగ్రస్తమయ్యె
మన్మనం బచ్చోట మాణవకుం డెట్టు, లేకాకియై రక్ష యెద్ది లేక
వ్యాఘ్రసింహాదుల వలనిపీడఁ దొలంగి, వర్తించుటెట్టు లెవ్వారు దిక్కు?
వివరింపవలె నన్న విని బాదరాయణుం, డట్టులు దలిదండ్రు లాత్మపదము

గీ॥ నొందఁ జంపకుఁడను మహాస్పంద విభవుఁ, డైన విద్యాధరుండొక్కపడతివెఁగూడి
యందు విహరింప వచ్చి బాలేందుసదృశు,నర్భకునిఁగాంచియతిలోకహర్షుఁడగుచు.

—॥ చంపకుఁడు శిశువును బెంచుట కుద్యమించుట ॥—

తే॥ సాధ్వితోడుత నాతండు సత్వరమున, దేవయానంబు డిగి మహాతేజు సుతుని
మదనసుందరుఁ జేకొని మహిళయగు మ,దాలస కొసంగె నబ్బోటిప్రియాదరించి.

చ॥ తనయుని గాఁగిలించి వితతంబగు ప్రేమయు నాదరమ్మునుం
బెనఁగొన ముద్దుగొంచు మదిఁ బేరిమిఁగూరిమి నివ్వటిల్లు నా
ధునిగని యిట్టి యర్భకుని దుష్టమృగాకులకాననంబునన్
గనికర మింతలేక విడఁగా సహియించెనొ తల్లి; యేమనన్. ౧౧౨

సీ॥ ఎవ్వాని కొమరుఁడో? ‡ యిక్కాననంబున, నేకాకిగా నుంచు ‡ టే కతంబొ?
సర్వేశ్వరుండైన ‡ శంకరుండు కృపా_ప్తిఁ, గలుగంగఁజేసె నిష్కారణముగ
నా విని పత్నితో ‡ నాథుండు సర్వజ్ఞుఁ, డిందు్రుండు మనమేగి ‡ యీ యుదంత
మెఱిఁగింపవలయు నిచ్చిఋత గంధర్వుఁడో, యమసుఁడో కాకపూర్వామరుండొ

గీ॥ నిజముఁ దెలియక పుత్త్రుఁగా నియతి సేయ, ధర్మమగునొక్కొ కావునఁ దడయకిపుడ
చని సురాధీశుతోఁ దెల్పి ‡ వినుటమే ల,టంచు సురపురి కేగి పాకారిఁగాంచి.

ఉ॥ చంపకుఁ డిందు్రిపాదముల ‡ సన్నిధి వందన మాచరించి సే
వింపుచు దేవనాథ! యొక ‡ విన్నప మే వచియింతు దాని నా
లింపుము తీర్థసన్నిధి నిలింపసమానుఁడు బాలుఁ డబ్బె శం
కింపక వీనిఁ దెచ్చితిని ‡ గేవల మశు్రివృత్తుఁ డెట్లొకో. గ. ౨౧

ఉ॥ ఎవ్వని పుత్రుఁడో! యితని ‡ నిట్టులు దుస్తర కాననంబునం
దెవ్వతె పాఱవైచి చనె ‡ నెద్ది యెఱుంగ భవన్ముఖోక్తిచే
నివ్విధి నిశ్చయింపఁగ గణింపఁగ యోగ్యత గల్గెనేని నే
మన్వము మీఱఁ బుత్రునిగ ‡ మన్ననఁ జేసెద నీదు నాజ్ఞచేఁ. గ. ౨౨

క॥ సుందరుఁ డీతఁడు నాకు నె,లందికి హర్షంబు పుట్టె ‡ లాలింపఁగ ధ
ర్మాందోళనఁ గృత్రిముఁడన,గం దనయుఁడు నుండుఁగాదె? ‡ కాంక్షఁ గొనఁగన్

చ॥ అనిన సురేందు్రిఁ డిట్లనియె ‡ నాతనితోఁ దురగాకృతిన్ మహీ
వనజదళాయతాక్షునకు ‡ వల్లభ యా బడబాజ్జగేహకున్
దనయుఁడు హైహయుం డనఁగ ‡ ధారుణి నీతఁడు సంభవించె నీ
తని కల తుర్వసాహ్వయుఁడు ‡ తండి్రియగున్ బరిపాలన కి్రియన్. గ. ౨౪

సీ॥ అంబుజాక్షునిచేత ‡ నమ్మహీపాలుండు, ప్రేరితుండై వచ్చుఁ ‡ బేర్మి నతఁడు
వచ్చునంతకుఁ బుత్రు ‡ నచ్చోట నిలుపుము, కాదేని దుఃఖింపఁగలఁ డతండు
అది గానఁ జంపక! ‡ యతివేగఁ జని బాలు, వనమునందిడుము చేకొనఁగలండు
విభుఁ డేకవీరుఁడన్ ‡ విఖ్యాతనామంబు, గాంచంగఁ గలఁడు సంగా్రిమభీమ

గీ॥ చండకోదండనిర్ముక్తసాయకోగ్రి, ఖండితారాతియై మహీమండలంబు
పాలన మొనర్పఁ గలఁడు నిష్పక్షపాత, రాజ్యశాసనమున జగత్పూజ్యుఁడనిన

చ॥ చంపకుఁడంత వేగమున ‡ శకుని. భావ్య విధాన వాక్కు లా
లింపుచుఁ బుత్రుఁ గొంచు నవలీల వెసంజని పూర్వదేశమం
దింపుగ బాలునిన్ నిలిపి ‡ యేగె విమానము నెక్కి యిందిరా
చంపకగంధితోడఁ జనె ‡ శౌరియుఁ దుర్గముఁ దువ్వ నోటికిన్. గ. ౨౬

ఆ॥ తనుఁ గనంగ వచ్చు ౘ వనజాక్షుఁ బొడఁగాంచి, హర్షవర్షపులకితాంగుఁ డగుచు
దివ్యతరవిమానదేదీప్యమానుఁడౌ, విష్ణుదేవు మ్రొక్కి ౘ వివిధగతుల. ౨౮

ఆ॥ దండవత్ప్రణామతత్పరుఁడై భూమిఁ, బడి నమస్కరించు ౘ భక్తుఁ గాంచి
వత్స! లెమ్ము లెమ్ము ౘ వాంఛిత మొసఁగెద, ననుచు నెదుట నిల్చు ౘ హరిగుతించి.

క॥ నీదర్శనమున కన్నను, లేదు శుభం బఖిలపాపనికరక్షయదురాపం
బో దేవదేవ! కరుణా,యాదోనిధి! లోకనాయకా! కమలేశా! ౨౯

ఆ॥ విషయవాంఛ లేక ౘ విరహితస్పృహులైన, సుజను లెలమి నిన్నుఁ ౘ జూతురనఁగఁ
బటుదురాశలకు నివాసమై తగు నాకుఁ, గలిగె దర్శనంబు ౘ కమలనయన!

క॥ ఈరీతి వినుతిఁ జేసిన, భూరమణునిఁ గాంచి సుధనుబోలు నదుక్తిన్
శౌరి వచించెను నీమదిఁ, గోరికఁ దెల్పఁదగు నిత్తుఁ ౘ గుతుకము వొడమన్. ౩౧

చ॥ ఎదుట దయామృతంబుఁ దులకించుచు నిల్చిన విష్ణుమూర్తి స
త్పదములు మ్రొక్కి పల్కెను దపం బొనరించితి పుత్రికామతిన్
మది ముదమంది యాత్మసమ ౘ మాన్యసమస్తగుణాభిరామునిన్
సదయతఁ బుత్రు నిమ్మనిన ౘ సస్మితదివ్యముఖారవిందుఁడై. ౩౨

—॥ శ్రీహరి హరివర్మకుఁ బుత్రు నొసంగుట ॥—

చ॥ నరపతికోర్కెఁ దీర్పఁగ మనంబున నిశ్చయమంది యిట్లనున్
బరమదయన్ యయాతిసుత! ౘ భానుసుతాతమసాప్రసంగతిన్
బరఁగిన పుణ్యతీర్థమున ౘ నాకుఁ బయోనిధికన్యయందుఁ బు
ట్టి రహిఁ వహించు పుత్రుని వరేడిం గొను నీకొఱకై సృజించితిన్. ౩౩

క॥ హరివాక్యము విని భూపతి, పరమానందమును జెందె ౘ భగవంతుఁడు దా
వర మొసఁగి కమలతో నిజ,పురికిన్ వైకుంఠమునకుఁ ౘ బోయె యథేచ్ఛన్.

చ॥ హరి దివి కేగునంతట యయాతిసుతుం డతులప్రమోదుఁడై
సరయశతాంగ మెక్కి చని ౘ శౌరి వచించినచోటుఁ గాంచి సుం
దరతరమూర్తి బాలుఁ గని ౘ తద్దయుఁ గేలఁ బదాంగుళంబుఁ బూ
ని రహిఁ ముఖంబునం దిడెను ౘ నేర్పుఁ గనుంగొని యబ్బురంబునన్. ౩౫

సీ॥ తన పదాంగుష్ఠంబు ౘ తన కేలితోఁ బట్టి, తననోటఁ జుంబించుతతనయుఁ గాంచి
వనజాక్షుఁ బోలిన ౘ వాఁడు నందనుఁ డని, మదనాతిసౌందర్యమహిమఁ జూచి
కమలాక్షుకరుణచేఁ ౘ గమలామహాదేవి, గర్భసంభూతుఁ డీ ౘ యర్భకుండు
పూర్వపుణ్యోద్భూతి ౘ భుజగతల్పుఁడు కూర్మి, నబ్బె నా కితఁ డంచు ౘ హర్షరసము

గీ॥ వదనపంకజమునఁ దొల్త శ్రీవాసుదేవు, మహిమ వర్ణించుచును జగన్నామ్న్యభూతి
నలరిపొంగుచు హరివర్మ ♦ యాత్మహస్త, పంకజంబుల సుతుఁగొని సవటుముదమున.

ఉ॥ చెక్కులు గీటి ముద్దుగొని ♦ చిన్ని కుమారక! నేఁడు నీవు నం
దక్కఁగొనంగఁ జేసితె? యథావిధిఁ బుత్రుఁడ వౌచుఁ బుంభయం
బెక్కువ గాక భీతిలేదు ♦ హీనుని నన్నుఁ గృపన్ గణించితే?
దిక్కయి సద్గతుల్ గలుగఁ ♦ దేర్చితె తండ్రి? జగంబెఱుంగఁగన్. ౹౯౩౭

సీ॥ వర్షశతంబు దుశ్చర్షమౌ తపమునఁ, బుత్రార్థినై యున్న ♦ భూరికరుణఁ
గరుణాధురీణుండు ♦ కమలామనోహరుం, డొసఁగ సంసారసుఖోదయంబు
వర్ధిల్ల మీతల్లి ♦ వనజాతవాసిని, యస్మదర్థంబుగా ♦ నడవి విడిచి
హరితోడ నేగెఁ బూర్వార్జితపుణ్యాభి,వృద్ధిచే నబ్బితి ♦ వే మనందు?

గీ॥ నాదు సంసారకంధికి ♦ నావ వీవ,యనుచుఁ గొనియాడుచును ముద్దులాడుకొనుచు
సకలసేనాసమేతుఁడై ♦ సచివవర్గ, మలమికొనఁ బౌరులెల్ల నత్యర్థిఁ దెలిసి.

ఉ॥ కానుకలూని గుంపులయి ♦ కౌతుకముప్పతిలంగ రాఁగ స
న్మానితులౌ పురోహితులనందగతిన్ జనుదేర వందిసం
తానము లెచ్చరింప మృదుతానములన్ గణికాజనంబు నా
నానయ నృత్యగీతముల ♦ నవ్యగతిన్ బ్రకటింపఁజేయఁగన్. ౹౯౩౮

ఆ॥ పురముఁ జేరి సకలపూజనంబులు గాంచి, పూజఁ దనిసి ప్రేమపూర్ణుఁ డగుచు
వర మొసంగె హరి యవారణసుతుఁ డబ్బె, మత్పురార్జితంబు ♦ మాన్యమయ్యె.

ఉ॥ నా విని మంత్రివర్గము లనంతముదంతరులై చెలంగ సం
భావితసద్గుణాభినుత పత్ని ♦ ప్రియుం గని చెంతఁజేర సం
భావనఁజేసి యర్భకు నమందముదంబుగ నిచ్చి సమ్మదో
ద్భావితు లౌచు దంపతులు ♦ ధన్యత నొందిరి హర్షపూర్ణులై. ౹౯౪౦

సీ॥ అంత నవ్వసుధేశు ♦ కాంత కాంతునిఁగాంచి, మదనసుందరుఁడై నమాణవకుఁడు
ఎట్టులు గల్గె మీ ♦ కెవ్వ రొసంగిరి, మత్పూర్వపుణ్యంబు ♦ మహితమయ్యె
వచియింపుమనిన నవ్వామాక్షిఁ గనుఁగొని, మధుసూదనుం డిచ్చె ♦ మనకుఁ బట్టి
నంభోజవాసిని ♦ యతిముదంబునఁగన్న, పుత్రుఁ డీతండు శుంభత్ప్రతాపి

ఆ॥ మదనసుందరుండు ♦ మాన్యయశశ్శాలి, యితనిచేతఁగల్గు ♦ నెల్లగతులు
ననుచుఁ బల్కు ప్రియుపినవాదరంబునఁగాంచి, యాత్మజాతు ముద్దులాడుకొనుచు.

—• హరివర్మ పుత్రునకు నేకవీరుం డని పేరుపెట్టుట •—

చ॥ కవులకుఁ బండితాళికి నఖండముగాఁగ ధనాగ్రహారసైం
ధవగజముఖ్యదానములు - తద్దయు వేడ్కనొనర్చి భూవిభుం
డు విబుధవర్గసన్నిధిఁ గడుం బ్రియమొదుచు నేకవీరుఁ డం
చవనిఁ బ్రసిద్ధనామ మిడి - యద్భుతసౌఖ్యము నొందె నెమ్మెయిన్. ౫౮౩

ఆ॥ ముజ్జగంబు లెఱుఁగ - ముద్దుపట్టి గుణాఢ్యు, శౌరివలనఁ గాంచి - శక్రతుల్య
వివిధవిభవుఁ డగుచు - విలసిల్లె భూపతి, సుతునిఁ బెంచి ప్రేమ - జొత్తిలంగ.

సీ॥ జాతకర్మాది సంస్కారముల్ గావించి, యనుదినవర్ధమానాంగుఁడైన
తనయునిచే సౌఖ్యవనధి నోలాడుచు, ముఖ్యబుణత్రయమోచనంబుఁ
గలిగె నంచును హర్షకలితుఁడై యాఱవ,మాసంబునను బాలు - మంజులాంగు
సరసాన్నభక్షణాసక్తుఁ గావించి బం,ధులఁ బౌరులను మహోద్యుక్తిఁ దనిపి

గీ॥ మఱియు మూఁడవయేట సమ్మదముతోడ,రహిఁ దలిర్పంగఁ జూడాకరణ మొనర్చి
భోజనదరిద్రగోబృందపూజనములఁ, దనిపె విప్రుల హరివర్మ - ధర్మమతిని.

గీ॥ పదునొకండవయేఁట నర్భకుని మౌంజి, బంధనక్రియ లొనరించి పటుముదమున
నవధను ర్వేదవిద్యాసనాథుఁ జేసి, నీతిశాస్త్రమునందు వినీతుఁ జేసె. ౫౮౬

చ॥ పటుతరవిక్రమోజ్జ్వలదభంగురశక్తిసమగ్రుఁ డౌటను
త్కటనిజరాజ్యసంపద కుదారతఁ బట్టిని నిల్పఁబూని స
త్పటలము నెల్ల రాఁబనిచి - భవ్యమహోత్సవశాలియై విశం
కటసకలార్థసంఘటన కౌతుకియై ధరణీశుఁ డంతటన్. ౫౮౭

ఉ॥ దివ్యనదీజలంబులను - దేరగఁ బంచి విచక్షణాళితో
నవ్యచిరత్నరత్నకలశామయ పీఠమునందు నుంచి వా
స్తవ్యుల మంత్రివర్గముల - సర్వజనంబుల సన్నిధిన్ గుణా
స్తవ్యుని నేకవీరు వసుధాపతిఁ జేసె యథోక్తసద్విధిన్. ౫౮౮

గీ॥ విప్రపూజ లొనర్చి తీవ్రప్రతాప, భాసితుం డగు హరివర్మపట్టి నిటులు
పుడమి నభిషిక్తుఁ జేసి తాఁ బడఁతితోడ, ఘనవిరక్తిని జనెఁ దపోవనములకును.

సీ॥ మైనాకశిఖరిపై - మానవాధీశుండు, ఫలజలాద్యాహారకలనఁ దపము
దుస్తరంబుగఁ జేసి - తొయ్యలితోఁ గూడ, దివ్యవిమానసందీప్తుఁ డగుచు
సురలోకమున కేగి - సురసమూహము లెల్లఁ, బొగడంగ శక్రుఁడు - భూరితేజ
మునఁ గద్దె యొసఁగ సమ్మదమున నివసించె, న వ్వార్తవిని పుత్రుఁ - డార్తినొగిలి

గీ॥ వేదనిర్దిష్ట మగుకర్మ సవిధివిధాన,ముగను బైతృక మొనరించె సముజ్జగములు
మెచ్చ రాజ్యమ్ము పాలించె సమిత్రబంధు, గురుజనంబులఁ బోషించుచుఁ గొనుచు మెఱసి.

ఉ॥ ఇట్టుల నేకవీరుఁడు మహీతల మెల్లను భోగసంపదల్
మట్టుకు మీఱ మంత్రిజనసమ్మానితుఁడై పరిపాలనక్రియన్
దిట్టతనంబు గల్గి రణధీరత శాత్రవమండలంబులన్
గొట్టుచు నేలె నీవుల నసుగుఁ సురభూరుహ మాతఁ డెంతయున్. ౧౧౧

—• ఏకవీరుఁడు వేఁటకు వెడలుట •—

ఉ॥ అంతట నొక్కనాఁడు వినయాన్వితుఁ డా వసుధాధినేత దు
ర్ధాంతహయమ్ము నెక్కి సఖసతండములున్ జతురంగసేనలున్
జెంతలఁ గొల్వ వేఁటతమి చిత్తము హర్షముఁ గూర్ప కాననా
భ్యంతరసీమ కేగె నుదయార్కసమానవిభావిభాసియై. ౧౧౨

సీ॥ వేదధ్వనినినాదవిశ్రుతంబులు కోకి,లాలాపమధురవాచాలములును
బుష్పఫలస్తోమసపూరితంబులు షట్ప,దాళీవిరావవిశాలములును
బహుపాదపావళీభాసురంబులు నైన, మునియాశ్రమంబులు గనుచు హరిణ
బృందవేష్టితములు పృథుతరవీహులు, నైన కేదారంబు లరసికొనుచుఁ

గీ॥ జంపకాశోకవకుళవిశాలసాల,నీపమందారతిలకావనీజభరిత
దివ్యవనములఁ గాంచుచు భవ్యగతులు, మెఱయఁగఁ జరించె వనవాటి మేటిధాటి.

మ॥ చని కాన న్నృపుఁ డంతరాంతర పయ స్సంజాతకంజాతగం
ధనవోన్మేషమిళన్మరుద్రియచలద్దర్వోజ్జ్వలద్భంభర
స్వనఝుంకారఘుమంఘుమాయితమహాసౌగంధ్యసంబంధపా
తనపాథోఝరతుంగ గంగఁ గనియెన్ ధాత్రీశుఁ డుత్కంఠయై. ౧౧౪

క॥ కని య వ్వసుధాధీశుఁడు, చని సలిలముఁ దావి పంకజపాంతమునన్
గనకాభ కమలలోచన, ఘనకుచ యగు నట్టి యొక్కకాంతన్ గనియెన్. ౧౧౫

క॥ వినతాననయై శోకాం,బునిధిన్ మునుఁగుచును నశ్రుపూర్ణాంబకయై
వనరుచుఁ గురరియుఁ బోలెన్, మినుకుచు నున్నట్టి యొక్క మెలఁతన్ గనుచున్.

వ॥ పడంతీ! నిన్నుఁ గనుంగొనిన నవమోహనాంగివై కన్నుల కానందంబు పుట్టింపు
చున్నదానవు. నీ వెవ్వ రెవ్వరినందనివి ? గంధర్వివో ? దేవకన్యవో ? సిద్ధచార
ణాదిసంభూతవో ? యేకతంబున నేకతంబున దుఃఖింపుచున్నదానవు ? నీవిభుం
డెందుఁ జనియె ? జనకుం డెచ్చోట నున్నవాఁడు ? నీకుం జింతాసంతాపం బేమి

నెపంబున సంభవించె ? నేను రాజ్యంబు శాసింపఁ జోరరాక్షసదుర్జనపీడాదుల కవకాశంబు లేదు. మఱియును వ్యాఘ్రసింహవరాహపక్రిముఖదుష్టసత్త్వం బులు మదాజ్ఞకుం గట్టువడు, నీ జాహ్నవీతీరంబున రక్షణహీనవై విలపింపం బని యేమి ? దైవమానుషంబులలో నెట్టి యుపప్లవంబునయిన సణంచి రక్షింపం గలవాఁడ నెఱుంగంజేయు మనిన నన్నెలంత మృదుస్వరంబున మహీకాంతునితో నిట్లనియె. ౫౫౭

మ॥ ధరణీవల్లభ! మామకీనహృదయోత్థంబైన సంతాపదు
స్తరశోకాకులవృత్తి విపత్తివిధముల్ సాకల్య మొప్పంగ నే
విరచింతుల్ విను మెందు నేని కను మావిర్భూతదుఃఖాత్ములై
పరిభూతిల్ గను లెల్ల హేతురహితవ్యాపారముల్ గాంచు నే. ౫౫౮

—: రభ్యునకు హోమమ్మున నొక్క కుమార్తె గలుగుట :—

గీ॥ నీవు భావించు రాజ్యంబు కేవ నొక్క, పరమధార్మికుఁడైన భూపాలవరుఁడు
రభ్యుఁడను రాజు గలఁడు తత్సదిమణి రుక్మ,రేఖ నాఁ దగును శశాంకరేఖఁబోలి.

చ॥ చతురయు సాధ్వి సర్వగుణసంయుత పుత్రులు లేక యార్తయై
పతిఁ గని పుత్రహీనలకు భాగ్యము యోగ్యము గాదు నాదుజీ
విత మిఁక నేల వంధ్యనయి వేదుఱు నొందితి నన్న రభ్యుఁ డ
య్యతివను నూరడించి నిగమాగమవేత్తలఁ బిల్వనంపుచున్. ౫౬౦

ఆ॥ పుత్రకాముఁ డగుచు భూరితరాగ్నుల, హోమవిధులు సలుప నుదయమందెఁ
బూర్ణచంద్రవదన భువనసుందరి శుభ,లక్షణాంగి యొక్క లలన యంత.

ఉ॥ హోత తదంగనం గనుచు నో మహిపాలకులావతంస! వి
ఖ్యాతముగాఁ ద్వదర్థమయి యగ్నులు వేల్చినఁ బుత్రి గల్గె సం
భూతి యెలర్ప దీనిఁ గొనిపొమ్ము జనార్దనుఁ డిచ్చె నందియుం
బీతటి నొందనేల యెది యీశుఁ డొసంగు నదే గ్రహింపనా. ౫౬౨

ఉ॥ నా విని భూమిపాలుఁడు ఘనంబగు మోదము నొంది కన్నియన్
గేవల సంప్రమోదమునఁ గ్లేవ నెత్తి ప్రియాంగనామణిన్
భావము పల్లవింపఁ గని భామిని! దైవ మొసంగె దీని సం
భావితవై కొనం దగును బాయుము మానసచింత యీ పయిన్. ౫౬౩

క॥ వల్లభుసల్లాపంబులు, ఫుల్లానన యగుచు వినుచుఁ బూఁబోఁణి సురేల్
మొల్లముగ నందికొని మన, ముల్లసిలన్ బెనిచె మంగళోచితవిధులన్. ౫౬౪

మ॥ అవనీవల్లభుఁ డంత ఋత్విజుల శాస్త్రార్హంబుగా దక్షిణా
పరివణపక్రియఁ దని యాగము సమగ్రంబొప్పఁగా సల్పి దా
నవిధిన్ విప్రులఁ దేల్చి సర్వసుఖసంధానైకహృష్టాత్ముఁడై
వివిధోల్లాసము నొంది ధన్యతఁ గనెన్ విస్ఫూర్తి రాణించుచున్. ౧౬౭

గీ॥ పుత్రికావైభవోత్సవస్ఫూర్తి నెఱపి, పరమహర్షంబు నొందె నప్పట్టి నాఁడు
నాఁటికిని వర్ధమానాంగనవ్యశోభ, మెఱసె మదిఁ జింతవీడి భామినియుఁ దనిసె.

క॥ తలిదండ్రు లతిముదంబున, లలితోత్సవ విధులు సల్ప లలన వయోహా
పలసద్విగ్రహ యగుచును, విలసిల్లెన్ దినదినంబు విభవసమృద్ధిన్. ౧౬౮

గీ॥ అమ్మహారాజు మంత్రికి నాత్మజాత, నగుదుఁ బేరు యశోవతి యవనిపాల
తనయకును నాకు సఖ్యంబు దనరుచుండు, నీడుజోడును నొకటిగా నెనఁగుకతన.

—• రత్నతనయ యేకావళీదేవి గంగావిహారమునకుఁ బోవుట •—

ఉ॥ ఆ లలితాంగి యెయ్యెడల నంబుజగంధగుణానుబంధలీ
లాలలితంబులౌ కొలఁకులన్ విహరింపఁగఁ గోరు; నొక్క నాఁ
డోలి సఖీమణుల్గొలువ నొక్కట జాహ్నవిఁ జేరి కేళికా
లోలమనస్కయై విహృతిలోభత బద్ధమనోరవిందయై. ౧౬౯

క॥ విహరింపఁదలఁచు నెడ నే, మహిపాలునిఁ జేరి నేఁడు మానవనాథా!
బహుదూరతరంబగు దుస్సహగంగాకేళిఁ బుత్రి సలుపఁదలంచెన్. ౧౭౦

చ॥ అన విని రాజు పుత్రిఁ గని యమ్మ! విహారవిలాసకేళికిన్
దనియ సరోవరంబులు ననంతముగా నగరమ్మునందు నీ
కనువుపడంగఁ జేసెద నటన్నను మానక జాహ్నవీనదీ
ఘనసలిలావగాహనము కౌతుకమందఁగఁ జేయు నిచ్ఛతో. ౧౭౧

చ॥ యతన మొనర్చి తోడిచెలులందఱు గుంపులుగూడి రాఁగ స
మ్మతి నిడ కాఁగలేక రిపుమర్దకమౌ చతురంగసేన నా
క్షితిపతి వెంట నంపె నతిచిత్రరథోత్తమ మెక్కి తన్వి సం
వృతసఖియై సురాపగకు వేడుక వచ్చెను నోలలాడఁగన్. ౧౭౨

సీ॥ ఇరువంకలను సఖీసరసిజాక్షులు నిల్చి, రమణీయమగు చామరములు వీవ
సాయుధహస్తులై సమరసన్నద్ధతఁ, బలసి నల్వంకల భటులు నడువ
నదిరాజవిహారహర్షణోత్కర్షత, జలకేళి సలుపంగ సరస నేను
గూడి రా నప్సరఃకుంజరగమనాస, మేతయూ రమఁ బోలె మృదులగతుల
నేకావళీ దేవి యేతేర ధరణీధ్రుని గహ్వరంబున నున్న కాలకేతుఁ

గీ॥ డనెడు రాక్షసకులవీరుఁ డడ్డ మగుచుఁ, జాపబాణగదాసిదురాపభటస
మాజములతోడవచ్చియమ్మహిళఁగాంచి,మదనవశుఁడౌచునంతంతఁగదిసియపుడు.

క॥ రెండవరతిఁ బోలె సరో,మండితమృదులారవిందమండలి నడుమన్
గొండొకవిహృతిన్ మెలఁగఁగఁ, జండుండై వచ్చువానిఁ జక్కటిఁ గనుచున్.

శా॥ అమ్మా! భీషణమూర్తియై దితిజుఁ డాహా! యెవ్వఁడో వచ్చె వే
రమ్మా! సైనికమధ్యమంబున నిన్నున్ రక్షింపఁగాఁబోలు నిం
దిమ్మై వేడుక నుంటిమేని కుటిలుం డేమౌనో? యల్లని క
ష్టమ్మౌఁగాదె? యనంగ నంతట భయస్వాంతమ్ముతో నాపెయున్. ౫౭౫

గీ॥ వెఱచి చతురంగబలముల వెనుక కరుగఁ, గాలకేతుండు మోహినీకాంత వోని
పణఁతి నేకావళిని గాంచి భయదమైన, పరిఘ చేకొని వెనువెంటఁ బరువు లిడుచు.

క॥ ప్రతికూలమారుతమ్మునఁ, జతికిలఁబడుతీవఁ బోలె సాధ్వసవిచల
న్మతి యగు నేకావళి నుద్ధతిఁ గౌఁగిటఁ బట్టె వాఁడు దర్పకవశుఁడై. ౫౭౭

చ॥ వలవ దనుగ్రహింపు మని వారక యడ్డమువచ్చి యెన్నిభం
గులఁ బలవించి చెప్పినను గ్రూరుఁడు నా పలు కాదరింప కా
కులపడు తన్విఁ గొంచుఁ దనగుంపునకై చనుచుండ రక్షకుల్
నిలునిలు మంచు నడ్డపడి నిష్ఠురఖడ్గగదాదిహస్తులై. ౫౭౮

శా॥ చుట్టుంజుట్టుచు భీషణంబగు బలస్తోమంబుతో నాఁగఁగాఁ
గట్టల్కన్ దితిజాధముండు పరిఘాగ్రధ్వస్తసేనాంగుఁడై
యెట్టు న్నిల్వక బోటిఁ జేకొని నిజాభీష్టంబు సిద్ధించె నం
చిట్టట్టుం దొలఁగంగనీక చనియెన్ స్వేచ్ఛానుకూలంబుగన్. ౫౭౯

ఆ॥ తనదు సేనఁ గలిసి దానవనాథుండు, పురముఁ జేర బోటి బుగులుకొనెడు
దుఃఖతాపములను దురటిల్లుచున్నది, విడువలేక నేను వెంటఁ జనితి. ౫౮౦

ఉ॥ అంతట వాఁడు తన్విఁ గొని యంతిపురంబున నిల్పి చుట్టు దు
ర్దాంతసురారికన్యలను దత్పరిరక్షణసేయఁ బంచె నే
నెంతయుఁ బ్రాణహానియెడ నించుక సందియ మంద కేగి య
భ్యంతరసీమఁ గాంచితి నిరంతరదుఃఖపరీత యా చెలిన్. ౫౮౧

ఆ॥ నన్నుఁ జూచి సాశ్రునయనయై బెగ్గిలి, కౌఁగిలించి యేడ్చు కన్నెఁ గాంచి
యేను శోకిలంగ నిరువురఁ గని వాఁడు, ప్రేమపూర్వకముగఁ బిలిచి నన్ను. ౫౮౨

ఉ॥ నీవు సఖీవతంసమవు ఽ నిక్కము బోటికి నూరడించి స
ద్భావము నూనఁజేసి నను ఽ బాలనసేయఁగ నూలుకొల్పి ని
చ్ఛావిహితంబుగా సకలఽసంపద లెల్ల నొసంగువాఁడ దుః
ఖావిలచిత్తునై కృశత ఽ నందఁగ నేటి కటంచుఁ దెల్పుమీ. గు౩

ఉ॥ కంటివె? నాదుభాగ్యము లఽఖండము లిందిరసమానభూతిచే;
వింటివె? నాదుకీర్తి భువి ఽ విశ్రుతమై విలసిల్లె నెల్లెడన్;
బంటుతనంబుచే నెదుట ఽ భండన సీమల నిల్చువానిఁ గ
న్గొంటె? సురేంద్రముఖ్యుల నఽకుంఠగతిన్ గెలుపొందితిన్ గదా. గు౪

మ॥ అని దుర్బోధలఁ గొల్పి దివ్యతరమా ఽ హర్మ్యంబులోఁ జాటుగా
ననుకూలక్రియ నిల్పఁజేసి దితిజాఽతాళిన్ ముమ్మున్ గావఁగా
బెనుమూఁకన్ దిటకొల్పి స్వస్థుఁ డయి యఽవ్వేతాళుఁ డొక్కొక్కెడన్
నను బోధించు సఖీమణిం గలుపఁగా ఽ నానావిధాలాపియై. గు౫

సీ॥ ఒక్కొక్కయెడలఁ దా ఽ నుగ్మలికడఁ జేరి, సరసంపుఁబలుకులు ఽ సాహసములు
ధనలాభములుఁజూపి ఽ తత్పరుండై "బోటి, యిల్లాల వగుము నీఽకేటిచింత?
ముల్లోకముల కెల్ల ఽ ముఖ్యంపురాణివై, రాజ్యపాలనమున ఽ రహివహించి
నాచేతఁ బనిఁగొన్ని ఽ నన్ను సేవకునిఁగాఁ, బాలింపు మని సుమఽబాణదళిత

గీ॥ హృదయుఁడై మాఱుపల్కనిఽయింతిఁగాంచి, బలిమిఁగొన లేక ననుఁజూచిఽపడఁతియిట్టి
మాఱుమత మెల్ల వదలించిఽమారు కేళిఁ, గలయఁ జేయుమటంచు నఽఖ్యముగఁదెల్పు

ఆ॥ విసివి యేను దెల్ప ఽ వెఱచెదఁ బడఁతితో, నీవె తెల్పుమనుచు ఽ నే వచింప
వినయవశుఁడ వోలెఽవిబుధాభియాతి యొ,క్కొక్కయెడలఁ బల్కఽనుత్సహించి.

మ॥ లలనా! మన్మథమంత్రతంత్రములఁ జాఽలన్ నీవు విన్నాణముల్
గల పోల్కిం జెలువొందె దిట్లగుట తఽక్కన్ నీపయిన్ మోహ మి
ట్లలమై నిల్చునె? నీ వశుండ నయి కఽష్టా! యింత జాలిన్ బడన్
వలసెన్ దాసుఁడనైతి నీదె సుమి మఽద్వాల్లభ్య మింతేటికిన్. గు౬

ఆ॥ కామబాణహతులఁ ఽ గాసిలియున్నాఁడఁ, జంచలంబు వయసు ఽ సడలెనేని
చేయ నెద్ది? కార్యఽసిద్ధిఁ బొసంగఁగాఁ, జేసి నన్ను నేలు ఽ చెలియ? యనిన. గు౭

సీ॥ జనకుఁడౌ రభ్యుచే ఽ సంభూతి నొందితి, నేకవీరునకునై ఽ యేను నిజము
హైహయుం డగు భూతఽలాధీశ్వరుని నేను, మనమునఁ జేకొంటిఽమాట లేల?
అన్యవల్లభు నాత్మ ఽ నభిలషింతునె? ధర్మ, వేదివి శాస్త్రఽవివేకమతివి
నీ వెఱుఁగని ఽసలఁతలు పరతంత్ర), లదిగాన జనకునిఽయాజ్ఞ వలయు

గీ॥ ననుచుఁ జెప్పిన వినక దుష్టాత్ముఁ డసుర,విడువఁజాలఁడు పూఁబోఁడి వేఁదుఱ త్తి
సంకటము నొందితిమి చేయుసరణి లేదు, దీనజనరక్షణోత్సాహ! దివ్యదేహ!

క॥ పాతాళగహ్వరంబున, భీతింబడి వాని నగరపృథుమర్గమదు
ర్గాతతబందీగృహమునఁ, జేతఃప్రియ! మావెలంది చిక్కిన దధిపా. ౯౫౧

గీ॥ ఇది సుమీ! శోకకారణం బిందు నిన్నుఁ, గాంచితిని వానిఁగననీక పొంచివచ్చి
విన్నవించితి మదిలోని వృత్త మెల్ల, నాపదలఁ బాప నీవె మా ప్రాపటనిన.

సీ॥ ధరణీశుఁ డిట్లనె దురితాత్ముఁ డగువాని, పుర మెట్లు వెడలి? తత్పురముగాఁగ
హైహయార్థంబుగా నంగనతోఁ దండ్రి, పల్కెనంచని పల్కుఁ బల్కి తీవు
హైహయుండను నేన యన్యులు లే రెందు, నిది సందియంబయ్యె నిట్టులేని
భండనంబున వానిఁ బరిమార్చి తన్వంగి, విడిపింతు వాఁ డుండు వీకు దెల్పు

ఆ॥ తండ్రి నా కొసంగ దానవుం డిట్టులు, బందిఁబెట్టె నట్టి పడఁతి తండ్రి
దితిజు నడఁచి కూఁతుఁ దెప్పింపలేఁడొకో?, యిట్టు లుంట కేమి హేతువొక్కొ.

ఆ॥ ఇట్టి పాపకృత్య మెఱుఁగంగఁ దెల్పి నా, చిత్త మెల్లఁ జెదరఁ జేసి తీవు
కాలకేతు నడఁచి కలికిని విడిపించు, మెప్పు డెప్పు డనుచు నెద కృశించె.

## —॥ యశోవతి స్వప్నవృత్తాంతము ॥—

ఆ॥ పాపకర్ముఁ డైన వాని వీడెట్టులు, వెడలితీవు? చాల వికటులైన
దనుజసంఘములను దప్పించి యెట్టులు, వచ్చితిందుఁ దెలుపవలయుననిన. ౯౫౨

వ॥ మహీపాలా! యేను బాలభావంబున మంత్రసిద్ధుండగు బ్రాహ్మణునివలన భగవతీ
విషయంబగు మంత్రంబు న్యాసధ్యానపూర్వకంబుగాఁ జేకొంటి, మచ్చిత్తంబు
సర్వదా తదాయత్తంబు, చండవిక్రమ యగు చండికాదేవి ననుదినం బారాధిం
చెద, సర్వసాధనసమర్థయు, భక్తానుకంపినియు, సృష్టిస్థితిసంహారకారిణియు,
బంధమోక్షప్రదాయినియు, నిరాకారయు, నిరాశ్రయయు, విశ్వేశ్వరియు,
రక్తాంబరాలంకృతయునుంగా భావించి యొక్కమాసం బేకసమాధిమధ్యంబున
నుపాసించితి, నద్దేవి మత్స్వప్నంబున సాక్షాత్కృతమై యశోవతీ! సత్వరంబు
గంగాతీరంబునకుం జనుము, హైహయుం డచ్చోటి కరుగుదెంచు, నతండు
భయంకరుండగు కాలకేతుం జదిపి మిమ్ము విడిపింపంగలవాఁడు, పదంపడి యేకా
వళి తదీయపత్నియుం గాఁగలయది యని పల్కి యంతర్ధానంబు నొందిన నేను
మేలుకొని యీ వృత్తం బేకావళికిం దెలుపఁ బ్రసన్నవదనయు సంతుష్టయు
నగుచు భగవతీవాక్యం బన్యథాసిద్ధం బగునే! సత్వరంబునం జనుమని యాజ్ఞ

నొసంగిన శుభసూచకంబు లెదుర్కొన నచ్చోటుగదలి మహామాయాప్రసాదం
బున మార్గజ్ఞానంబును, శీఘ్రగమనంబును గలిగి యిందువచ్చితి, మచ్ఛోకకార
ణంబు సర్వంబును విన్నవించితి, నీ వెవ్వండవో! మహానుభావుండవు. భవద్వృత్తాం
తంబు సవిస్తరంబుగాఁ దెల్పుమనినఁ బ్రఫుల్లవదనాంభోజుం డగుచు లక్ష్మీనందను
డగు హైహయుం డిట్లనియె, ౫౯౬

క॥ విపులపరితాపుఁడగు నా, నృపసత్తముఁ డేకవీరుఁ డింతింగని తా
నపు డాత్మవృత్త మిట్లని, నిపుణతఁ జెప్పందొడంగె నిశ్శంకగతిన్.

సీ॥ హైహయుండని నీవుహర్షమ్ము దొలుక ము, న్నాడితి గాదె? తదాహ్వయంబు
గలవాఁడ నేనాదుఁ గావున నన్నేక, వీరుఁ డందురు భార్గవీసుతుండ
నాదు నీచే నిప్పు డపహృతంబయ్యె మ, చ్చిత్తంబు నే నేమిసేయువాఁడ?
మునుమున్న త్రిజగతీమోహిని యని బోటి, చెలువంబు చెప్పితిచిత్తజాత

గీ॥ ఖరశరాహతిఁగూర్చితి గాన విరహ, పీడితుఁడ నైతి నబ్బోటిపృథులసుగుణ
వివరణ మొనర్చితివి గదా వేయునేల, విన్నయంతటఁ జివురించె విస్మయంబు.

చ॥ అదియును గాక హైహయునకైన నెలంత నటంచు దైత్యుతో
మొదల వచించె నంటివి యమోఘశరంబయి యిట్టిపల్కు నా
యెద నగలించె భృత్యతకు నీహ యొనర్చె నిఁ కేమి సేతు? న
మ్మదవతి యున్నతావుఁగను మార్గముఁ దెల్పుము వేయు నేటికిన్. ౫౯౯

క॥ దురితాత్ముఁడైన రాక్షస, వరు డుండు పురంబుఁ జూపు వచ్చెద వానిన్
దురమున వధ్చెద మీకున్, బరమోత్సవ మాచరింతుఁ బ్రతిన యిది సుమీ.

చ॥ అతితరదుఃఖతాపమున నాత్మఁదలంకఁగ వేగుచున్న యా
క్షితిపతిపుత్రి యుత్తలముఁ జించి విముక్తను జేసి తండ్రికి
చ్చితినని నిశ్చయింపుము విశేషవిధిజ్ఞత నుద్వహింతు నా
మతి నిది నిశ్చయంబనుచు మానిని నమ్ముము లెమ్మ చయ్యనన్- ౬౦౧

ఆ॥ పాపజాతివాని పట్టణం బిది యని, తెలిపితేని నా యుదీర్ణవిక్ర
మక్రమంబు గనెద వంగనాచోరుని, మడపకుంట నాదుమతముగాదు. ౬౦౨

క॥ దుర్గమమగు దైత్యపురీ, మార్గంబెఱుఁగంగ లేకమసలుట సుమ్మీ!
యర్గళమె నాదుశక్తికి, భార్గవికృప వానిఁబట్టి బంధింతు నన్. ౬౦౩

మ॥ వసుధాధీశుని పల్కులెల్ల విని యవ్వామాక్షి యద్దానవుం
డసమానప్రథితప్రతాపుఁడు తదీయధ్వంసనం బబ్రమా

౫౯౯. మద్యమపు [illegible]

ననలారఁ జగదేకమాతయగు నార్యఁ జిత్తమం దుంచి నే
నోసఁగంగా మను విచ్చగించితి మహోద్యుక్తిఁ గ్రహింపం దగున్. ౬౦౪

ఆ॥ అనుచుఁ దెల్పి యంబికానుగ్రహప్రద, మైన మంత్రమొక్కఁ డధిపునకును
న్యాసపూర్వకముగ నలినాక్షి యొసఁగి నీ, వింక గెలుతు వాని శంక లేల! ౬౦౫

## —కాలకేతువధ.—

సీ॥ కాలకేతుండునా గణుతి కెక్కిన మహా, వీరుండు సురలోక విజయశాలి
వాని మర్దింపంగ వశమె? యెవ్వారికి, భగవతీకరుణాప్రభావమునను
భండనంబున వానిఁ బరిమార్చు టెంత నీ, కని రాజపుత్రుని ఘనచమూస
మేతుఁగాఁ గైకొని పాతాళ వివరంబు, గనిపింపఁ జేసినఁ గదలి ఘోర

గీ॥ దనుజసంక్రాంతమైనయద్దానవేంద్ర, పురముఁ జేరంగఁ జనిమహోద్భూతి మెఱయఁ
జటులగుణటంకృతియు సముద్భటకఠోర, సింహనాదం బొనర్చె నాక్షితిపమౌళి.

చ॥ అది విని దైత్యదూతలు భయాతురులై పరువెత్తుచున్ మనో
ముదమునఁ గామబాణహతి మొక్కల మాట నెలంతఁ జేరి దు
ర్మదమున బుజ్జగించుచు నమందత నంతిపురంబులోన నా
స్పదమున నున్న దైత్యుఁ గని పల్కిరి మేనులు కంప మొందఁగన్. ౬౦౭

ఉ॥ దానవనాథ! యొక్కఁడు ప్రతాపధురంధరుఁడైనవాఁడు సే
నానివహంబుతోఁ బురమునం జొరఁబాఱి చికాకు సేయుచున్
మానక యెత్తివచ్చె ననుమానము లేదిఁకఁ గార్తికేయుఁడో?
యా నముచిప్రతాపహరుఁడా సురవల్లభుపట్టియో సుమీ! ౬౦౮

గీ॥ భయదచతురంగబలము వెంబడిని ముసరి, కసిమసఁగివచ్చుచున్నది కదనసమయ
మయ్యె వారలతోఁ బోరి యందికొనుము, విజయ మెడలేదు దేవర! వెడలుమింక.

గీ॥ వింతమై తోఁచుచున్నది వెంటనంటి, మనయశోవతి హర్షసంభరిత యగుచు
వచ్చుచున్నది సాధింపవలయు సమర, భేరి మ్రోయింప సెలవిమ్ము పెక్కులేల?

మ॥ అని దూతల్ వచియింప దానవుఁడు క్రోధాన్వితుఁడై దైత్యులన్
గని మీ రెల్లరుఁ దారసింపుఁడని యాజ్ఞం గొందఱన్ బంపి య
వ్వనజాతాక్షిని జూచి "వచ్చు నృపుఁ డెవ్వాఁడో? త్వదర్థంబుగా
ఘనసైన్యాన్వితుఁడౌచు వచ్చెనఁట! నిన్ గాంచంగ నర్థించుచున్. ౬౧౧

క॥ విరహాతురుఁడై జనకుం, డరుదెంచుచు నున్నవాఁడె? యటులేని మహా
దరమునఁ బూజించెద సం,గరమునకే నిచ్చగింపఁ గలికి! దెలుపుమీ- ౬౧౨

ఉ॥ తోడుకవచ్చి రత్నములు ధూర్వహతుంగతురంగరత్నముల్
గూడ నొసంగి యయ్యధిపుఁ గూడి మహోత్సవ మేను సల్పెదన్
వేడుక నాకుఁ దెల్పు మఱి వేఱొకఁడైనను జుట్టుముట్టి య
ప్పోడిమిఁ దూలఁబుచ్చి రణభూమికి నే బలి సేయుదన్ జుమీ! ౬౧౩

గీ॥ గంధగజయాన దుర్బుద్ధి కలిమి నింత, మందమతి యాచుఁ బ్రతిపక్షమథనదక్ష
దీక్షితుఁడనైన నాతోడఁ గక్షఁబట్టి, పోరఁజూచునె "తగ" రెట్లు పొడుచుఁగొండ!

చ॥ నిజముగఁ దెల్పుమన్న నవనీరజ పత్త్రిదళాక్షి పల్కె నీ
గుజగుజ యెట్లు నీచెఱను గుండెదు నాకెఱుఁగంగ వచ్చెడిన్
నిజమరివై కనుఁగొనుము నిక్కము మజ్జనకుండు గాఁడు సు
మ్మజహదవక్రవిక్రముఁ డహఃపతి తేజముతోఁడ వచ్చెడిన్. ౬౧౪

ఆ॥ ఇట్టివాని నిన్ను నెదిరింపఁ గడఁగిన, దుడుకునృపసుతుండు కడిమిఁగలఁడు
కారణంబుఁ గనుట కర్జంబు నీకిఁక, నిశ్చయంబు దెలియ నేర ననిన. ౬౧౫

ఆ॥ అట్టులైన నీవయస్య యశోవతి, యెటులు చనియెఁ గార్యమేర్పరించి
తెచ్చె నొకనిఁగాక త్రిజగంబులో నాకుఁ, బ్రతిభటుండుగలఁడె? భామ! యనుచు

క॥ కుటిలానన నేకావళిఁ, జటులోక్తుల దూఱునెడ విశంకట వాచా
ఘటితార్భటులై భటులొ,క్కట వేగమవచ్చి దైత్యుఁ గని మొక్కి వేసన్.

ఉ॥ స్వస్థుఁడ వోలి యింట మది సంశయ మందక నిల్చియుంటహో!
దుస్థత గాదె? బాహుబల ధూర్వహుఁడైన యరాతి వీటిపైఁ
బ్రస్థితుఁడయ్యె భండనము పాల్పడియెన్ వనితాధనార్థులం
దాస్థ యిఁకేల? లెమ్మనిన నాసురవల్లభుఁ డాహవోద్ధతిన్. ౬౧౯

చ॥ అరదము నెక్కి కార్ముకశరాన్వితుఁడై చతురంగసేన లు
ద్ధురతె మహార్భటిన్ వెడలఁ దోరపువిక్రమశక్తిఁ బోరికై
పురి వెడలెన్ ధరాధిపుఁడు మున్నె చనెన్ వెస నేకవీరుఁ; డి
ర్వురును గడంగి పోరిరి యరుంతుదఖడ్గగదాశరాదులన్. ౬౨౦

సీ॥ వృత్రవాసవు లట్ల వెన్నిక శస్త్రాస్త్ర, వితతులఁ బోరాడి వేవిధముల
నొవ్వంగఁ జేయుచు నొచ్చుచు సురలోక, భీకరంబుగఁ జాలవీఁకఁ బెనఁగు
నవసరంబున సింధుజాత్మజుం డాసుర,పతిని గదాయుద్ధపాటవమున
నడఁచినఁ బిడుగుచే నచలంబుఁగూలెడు, వడువున దైత్యుండు వడియె ధరణి

గీ॥ నసురు లెల్లఁ బలాయితులైరి యంత, నంతిపురికి యశోవతి యరిగి తోడి
బోటి నేకావళిని [illegible] కేళివోలె.

ఉ॥ పోరున దైత్యుఁ గూల్చి భుజభూరిపరాక్రముఁ డేకవీరుఁ డీ
హారతి నిన్నుఁ గాంచుటకు నాసఁ బెనంగుచు నున్నవాఁడు శం
పారుచిరంబు నీతనువు పార్థివు సన్నిధిఁ జేరవచ్చి శృం
గారరసానుభావముగఁ గట్టెదుటన్ గనఁ జేయఁ బోలదే? ౬౨౨

గీ॥ తెలియఁ జెప్పితి జాహ్నవీతీరమునను, నీదువృత్తంబు సకలంబు మోదమాన
హృదయుఁడై యున్నవాఁడు నినున్ని క్షుసలుప, రమ్ము జగ దేకసుందరి! రాజుఁ గనుము.

క॥ అనుచు యశోవతి పలికిన, విని రాజుం జూడ మనసు వేడ్కఁ గొనియె నో
వనజాక్షి! దీనదశచేఁ, గనుసెట్లగు ననెడు శంకగదిరెడు మదిలో. ౬౨౪

క॥ శోకాతుర మగు మదితోఁ, నేకావళి బోటిఁ గూడి యెడలీని మనోఁ
స్తోకానురాగ సూచిత, పాకంబగు సోయగమునఁ బతిఁ గనె నంతన్. ౬౨౫

ఉ॥ రాజకుమారుఁ డంతఁ దన రాజస మెల్లను వీడి దీనవై
యోజఁ దొలంగియున్ గదల కుండెను చంచల వోలె నెయ్యపున్
రాజముఖిం గనుంగొని విశాలి మునుంగుచు నాదుచూపు తృ
ష్ణాజయమందె నంచని విశంకట మోహపరీతుఁడై నెడన్. ౬౨౬

క॥ కామాతురులగు నిర్వుర, వామాక్షి వయస్య చూచి వనితామణి ని
న్నీ మహిమాధ్యుఁడు తండ్రికి, నీమదిఁ దలపోసినాఁడ హేతుకృపార్తిన్. ౬౨౭

—॥ ఏకవీరుం డేకావళిని బెండ్లియాడుట ॥—

వ॥ అనిన నట్లకాక యని యామోదించినం జతురంగబలసమేతుండై, సఖీమణుల నిర్వురను "బితృసన్నిధానంబునఁ బరిణయింపఁ దలంచి" తోడ్కొని చని జనక నగర సవిధోద్యానంబునం బ్రవేశించి తమరాకఁ దండ్రికిఁ బుత్తెంచిన రభ్య మహీవల్లభుండు సచివసమేతుండై యెదుర్కొని చిరకాలదృష్టయు, మలినాం బరయు నగు నందనిం గౌఁగిలించుకొని, యశోవతిన్ మన్నించి యేకవీరునిం జమూసమేతంబుగా గృహంబునకుం దోకొని చని, యొక్క సుముహూర్తంబున యథోక్తంబుగ వివాహంబొనరించి యల్లునకుఁ బారిబర్హంబు లనంతంబుగా సమర్పించి యశోవతీసహితంబుగాఁ గూఁతు ననిపిన, నేకవీరుండు బహుభోగంబు లనుభవింపుచు క్షితితలంబేలె నతని పుత్రుండు కృతవీర్యుండు, తత్పుత్రుండు కార్తవీర్యుండు నని చెప్పిన జనమేజయుండు బాదరాయణున కిట్లనియె. ౬౨౮

మ॥ మునిచంద్రా! భవదాననాంతర కథామోదామృతాస్వాదమున్
గొని నాచిత్తము తృప్తినొందదు మహాగోప్యంబు హృద్యంబునై

మన మామోదము నొందఁజేసె భగవన్నామహాత్మ్య; మీ హైహయా
వనినాథాన్వయవృత్తమి త్తతి జగద్వాల్లభ్యముం జేసెడిన్. ౬౨౯

సీ॥ సర్వస్వతంత్రుండు సర్వేశ్వరుఁడు సర్వ,సాక్షి సర్వజ్ఞుండు సర్వసముఁడు
నారాయణుఁడు జగన్నాథుండు శ్రీరమా,వల్లభుండు జగన్నివాసుఁడైన
హరి పరతంత్రుఁడై యశ్వభావము నూని, సంచరించుట మహాశ్చర్యకరము
సర్వజ్ఞమూర్తి! యీ సందేహమడఁచి మ,త్స్వాంతంబు నిష్కల్మషమ్మొనర్చి

గీ॥ విశదపఱుపు మటన్న నవ్విభుని పలుకు, లాలన మొనర్చి గంధవతీ లతాంగి
కొమరుఁడైనట్టి మునిపట్టి కుతలపతికి, వినగఁజేసెను దొల్లింటివృత్తమెల్ల.

ఉ॥ నారదమౌనిచే వినిన నల్వున సందియమెల్లఁ దీర్తు గో
త్రారమణా! వినందగుఁ బితామహపుత్రుఁడు నారదుండు శో
భారమణీయమూర్తి బుధపాలనలాలనచక్రివర్తి సాం
పారఁగ నొక్కనాఁడు వసుధాంతరసీమ విహారలోలుఁడై. ౬౩౧

సీ॥ స్వరతాళసంయుక్తసరస వీణారవ, స్థితి మేళనంబుగాఁ జిత్త మలరి
రాథంతరాది విభ్రాజితామృత సామ, గానామృతమ్మున మేను సొలయ
విహరించుచును సదావిర్భూత తేజోవి,భాసిమై పరమంబుఁ బావనంబు
శర్మదంబును నగు సారస్వతంబైన, తీర్థరాజము నందు దివ్యమునులు

గీ॥ నేను నచ్చోట నివసించినియతిఁదపము, సేయుచుండంగ నటకు విచ్చేసె నతని
కెదురుగాఁజని మునులతో నిష్టనిధుల,నర్ఘ్యపాద్యాదులొనరించియతిముదమున.

క॥ శమ్యాప్రాసమ్మను ముని, రమ్యాశ్రమసీమ మౌనిరాజియు నతనిన్
సౌమ్యాంతరంగు విష్టర,గమ్యుంగా నెఱిగి కొలిచి కౌతుక మలరన్. ౬౩౩

క॥ ప్రకృత ప్రసంగసంగతి, నకుటిలచిత్తములఁ గాలమార్చెడువేళన్
బ్రకటోత్సవినై నీవలె, నకలంకుని మౌనిఁ జూచి యడిగితి నెలమిన్. ౬౩౪

సీ॥ యతిచంద్ర! సంసార మత్యసారం బిందు, జనులకుఁగల్గునే సౌఖ్యమెచట
సంతరీపంబున నర్భకు ననుఁ గని, త్యజియించి తాఁబోయెఁ దండ్రికడకు
మాతల్లి, యడవిలో మత్కర్మసంప్రాప్తి, నే ననాశ్రయుఁడనై నిలిచి తపముఁ
జేసితిఁ గొండలఁ జెప్పఁ జిత్రము శత,వర్షముల్ జరిగిన వామదేవుఁ
డంబికావిభుఁడు ప్రత్యక్షమై సుతునిచ్చె, నయ్యర్భకునికి శుకాఖ్యపెట్టి

గీ॥ జాతకర్మాదు లొనరించి సకలవేద, శాస్త్రసర్వస్వ మెల్లను జదువఁజేసి
పరతరాద్వైతబోధం బపారముగను, గలుగఁ జేసితి రెండవ నలువ యనఁగ.

ఉ॥ అట్టి సుతుంపు నాబ్రతుకు నాఱడిఁ బుచ్చి వనాంతరంబునన్
గట్టెడిదైన నన్ను విడిచెం గాదె? భవద్వచన ప్రబోధచేఁ
గట్టులఁ గానలన్ గుహలఁ గందువలందు మనోవిషాదినై
మట్టుకు మీఱు తాపమున మ్రగ్గుచునుండుట నీవెఱుంగవే. ౬౩౭

ఉ॥ నందను మీఁది ప్రేమమునఁ నాఁటికి నాఁటికి దుఃఖపూరితా
స్పందమనస్కతన్ గృశతఁ బాటిలి సంసృతి మిథ్యయంచు లో
నం దెలివొంది తల్లిని గొనన్ మదిఁ బుట్టు విచారధీరతన్
సందియమేది దిక్కుహరసంచారత వచ్చుచు నంత నొక్కెడన్. ౬౩౮

గీ॥ శంతనుండను భూపాలచంద్రుఁ డాపెఁ, జేకొనుట వించు నచ్చోటఁ జెదరనీని
చిత్తమున నాశ్రమమ్ముఁగాఁ జేసికొనుచు, నిలిచి యుండుట విశదమే నీకునవఘ?

ఉ॥ శంతనుఁ డంత స్వర్గతికిఁ జన్నఁ బిఱుంద మదీయమాత లోఁ
జింత మునింగి భీష్మకృతసేవలఁ గాలముఁ దీర్చుచున్ బరి
శ్రాంత మనోనిశాంతయయి సర్వధరావలయంబునందు ని
శ్చింతత నగ్రపుత్రునిడి నేమముతో ధర యేలుచుండఁగన్. ౬౩౯

ఆ॥ కాలవశత నొంది కాలుని పురికినై, యతఁడు చనిన పిదప ననుజుఁడగు వి
చిత్రవీర్యు రాజ్యసింహాసనమునకు, దక్షుఁజేసి యేలె ధరణి నెల్ల. ౬౪౦

## —♦ పాండవ సంగ్రహ చరిత్రము ♦—

వ॥ మఱియు నవ్విచిత్రవీర్యునకు స్వయంవరారంభంబున మహోత్సవంబు సలుపు నెడ భీష్మునిచే బలాత్కారంబునఁ గాశిరాజపుత్రికలం దోడితెప్పించి పుత్రు నుద్వాహింపం జేసిన నతం డనపత్యుండై రాజయక్ష్మచేఁ బీడితుండై దివంబునకుం జనిన పిమ్మట, దుఃఖపూరితయై యున్న సత్యవతి సన్నిధింజేరి కోడండ్రు పతిం గూడి యనుగమించెద మని పలుక నివారించి భీష్మునితో నాలోచన మ్మొనరించి నన్ను స్మరింప మాతృస్మృతి పరిజ్ఞానంబున నందుఁ జని తల్లికి నమస్కరించి పుత్రశోకకర్శితయై తప్తాంగి యగు మాతంగాంచి తల్లీ ! యదర్థం బామంత్రితుండనైతి ? మఱి తీర్థంబును, దైవంబును, సర్వంబును, నీవ కానఁ గృతాంజలినై ప్రార్థించెదను, దత్కార్యం బానతిమ్మని యూరకున్న నన్నుంగని నీ భ్రాతలిరువురు దైవవశంబున దివంబునకుం జనిన రాజ్యం బరాజకంబయ్యె గాంగేయానుమతంబున వంశస్థాపనంబొనర్చి మద్దుఃఖం బపనయింపఁ గాశిరాజ పుత్రికలం గవిసి పుత్రోత్పాదనం బొనర్పుము భ్రాతృవంశ పాలనంబున దురితంబు పొరయనేరదు, వినుమనిన మాతృవాక్యంబులఁ జింతాలజ్జాకులచిత్తుండనై

యతితరపాపంబగు పరదారాభిమర్శనం బధర్మపథంబు భ్రాతృభార్యావ్యభిచారంబు నిగమాగమజ్ఞుండ నగు నేనెట్లొనర్తును? వంశరక్షణంబయ్యును నన్యాయంబునం బ్రవర్తించుట యొప్పిదంబె? పితరు లుత్తమలోకంబుల నివసింపం గలరే? పురాణోపదేష్టనై కుత్సిత కర్మంబునకు లోఁబడి భవదుక్తం బాచరించుట మతంబు గాదని పల్కుచుఁ దెల్పిన శోకించుచుఁ బరితపించుచు వంశరక్షణం బొనర్చుట దురితంబు గాదనియును సదోషంబయ్యును గురువచనం బలంఘ్యంబనియును నిట్టులు శిష్టాచారంబులు గలవనియును నస్మత్సంతోషసంధానంబు సద్యశ్శ్రేయఃప్రదం బనియును దెల్పి మఱియు దుఃఖించుచున్న జననితో నెద్దియేనియును నుడువం జాలక చింతించు నెడ భీష్ముండును ధర్మనిర్ణయంబులయెడ వెనుదీయుట యధర్మంబనిన నెట్టకేలకు జుగుప్సితంబునకు నొడంబడి యంబికతో బ్రవర్తించిన నది విగతమానస యగుట నంధుండగు ధృతరాష్ట్రుండును, రెండవ దినంబున నంబాలికతోఁ బ్రవర్తించిన నది జటిలుండ నగు నన్నుం గాంచి తెల తెలఁబోవునెమ్మోమున నుండుటవలనఁ బాండువర్ణుండగుచు సుతుండు పాండుండు నగుటఁ గాంచి యిరువుర యెడల గర్హం బొనర్చుచు మరల నమ్మానినుల నెచ్చరించిన వారలు భుజిష్యననిపిన భుజిష్యతోడం గదిసి పుత్రునొసంగితి నతండు శుభలక్షణసంయుతుండును మంత్రాంగరక్షకుండును నయ్యె నిట్లు పుత్రత్రయస్నేహంబున శుకసంబంధంబు విడిచి తొలంగితి; చుత్యజయును, బలవతియును నగు మాయ యకృతాత్ముల కెఱుంగ నలవియే! యరూపయు నిరాలంబయునై విజ్ఞానుల మోహింపంజేయుఁగదా! మాతృస్నేహంబున నింత సంస్మృతిం బడితిని జిత్త ముపశమింపనేరదు, డోలాయమానంబై సరస్వతీతటంబున నీ యాశ్రమంబున నిలిచినయెడ నిర్వాసీక త్రిప్పుచున్నయది, యొక్కొక్కయెడ విజ్ఞానంబు మనంబునఁ బొడమ వ్యభిచారసంభూతు లగు పుత్రులు పరలోకం బొసంగి నన్నుం దేర్పఁగలరే? బలవత్తరంబగు మాయాసాగరంబునం బడి పతితుండనైతిఁగదా! యని మనస్తాపం బొంది కృశింపు చున్నవాఁడ నని మఱియును. ౬౪౧

ఆ॥ అంధుఁడనుచుఁ బెద్దకనధికారమున నిల్పి, పాండరాజు రాజ్యకభర్తయగుచు
భీష్మ సమ్మతముగఁ క బృథువిక్రమాక్రాంత,వైరి వీరుఁడగుచు క వసుధ యేలె.

సీ॥ కుంతిభోజునిబిడ్డ క కుంతినాఁ బూఁబోఁడి, మద్రేశుకూతురు క మాద్రినాఁగ
నిరువురఁ జెలులుగా క నేలుచు మునివర్యు, శాపంబునను మనకస్సంశయమున
నిర్వేదనము నొంది క నెలఁతలతోఁ గూడి, వని కేగి యచ్చోట క వర్తిలంగఁ
బుత్రుని జూఁడ నే క [illegible] కరిపురి కేగి క యస్రగపభ్రాతుఁ

బుట్టుఁజీకుఁ గాంచి ఽ పొగిలెడు మనమున, నాశ్రమమున కేగ ఽ నంతఁబాండుఁ
డర్క జాతవాయుఽహరిహయాశ్వినులచే, సుతులఁగాంచె క్షేత్రిఽజుల మహీశ.

ఆ॥ అంత నొక్కనాఁడు ఽ కాంత మాద్రినిఁగూడి, విప్రశాపహతిని ఽ విధివశమున
దివికిఁ జనియెఁ బాండుఁ ఽ డవనీతి యెట్టును, జెఱుపకున్నె? యెంతఽశిష్టునైన.

మ॥ మును లప్పాండుమహీశు సంస్కరణ సంఽభూతిన్ బొసంగించి ర
వ్వనితారత్నము మాద్రియున్ శిఖిముఖఽవ్యాకీర్ణయై భర్తతో
ననుసర్గంబుగ మించెఁ గుంతి సుతులన్ ఽ నల్వొందఁ జేకొంచు భీ
ష్మునిఁ జేరంజనె నాదరించి యతఁ డాఽమోదించి నిల్పెన్ గదా! ౬౦౬

క॥ అది విని దుఃఖవిచారా,స్పదవృత్తినిఁ జాలఁ బీడ ఽ బడలితి నేనన్
గదనవిదగ్ధుఁడు పాండుని, సోదమల నీ గతినిఁ దలఁచిఽకొని తలపోతన్. ౬౦౭

సీ॥ ధృతరాష్ట్రనందనఽశతము పాండుకుమార, పంచకంబును నొక్కఽపగిది భోగ
ధుర్వహులై యుండ ఽ ద్రోణుండు, చనుదెంచి భీష్మునిచేఁ బూజఁఽబేర్మిఁగొనుచు
వేదధనుర్వేదఽవాదవిద్యాభ్యాస, మొనరింపఁ గుంతికి ఽ నొదవినట్టి
ప్రథమపుత్రుఁడు మహాఽబలుఁడు కర్ణుఁడు గూడి, రాజపుత్రులలోన ఽ రక్తిఁజదువు
గీ॥ లభ్యసించెడునెడ నతఁ ఽ డంధజులకుఁ, గూర్చువాఁడౌట నన్యోన్యఽకుటిలమతుల
భీమ దుర్యోధనాది సంఽప్రేరణములు, బద్ధమాత్సర్యధుర్యతఁ ఽ బరఁగుచుండె.

క॥ ధృతరాష్ట్రుం డది యారసి, మతిలోఁ జింతించి పాండుఽమహిపతి సుతసం
తతి వారణావతంబున, జతుగృహమున నిల్పెఁ బ్రేమఽసంబద్ధమతిన్. ౬౦౮

ఉ॥ సాధుజనైకదూష్యుఁడయి ఽ శంకఁదొలంగుచు ద్రోహబుద్ధి దు
ర్యోధనుఁ డప్పురంబునను ఽ నుగ్రతరాగ్నులఁ దద్గృహంబులన్
గ్రోధమునన్ దహింపఁగ నఽకుంఠగతిన్ విదురాదిబోధనన్
బాధఁదొలంగి భూబిలముఁ ఽ బ్రాఁకి బయల్పడి రేఁగ రేచ్చచే. ౬౦౯

ఆ॥ అయ్యుదంత మరసి ఽ యధికచింతాతంతు, సంభృతుండ నగుచుఁ ఽ జాలబడలి
పాండవులను దేర్చి ఽ పాంచాలపురికినై, ప్రేరణంబొనర్చి ఽ వారి నిలిపి. ౬౧౦

ఉ॥ చింతఁదొలంగి యాశ్రమముఁఽజేరితి బ్రాహ్మణవేషధారులై
కుంతిసుతుల్ పదంపడి సఽఖుల్ ద్విజులేగఁగ వారిఁగూడి య
త్యంతముదమ్మునన్ ద్రుపదు ఽ నంతికసీమకుఁజేరి యేవురున్
గాంతఁ ద్రిలోకసుందరినిఁ ఽ గైకొని రచ్చట ద్రౌపదిన్ రహిన్. ౬౧౧

ఆ॥ తల్లిమాటవలనఁ ఽ దరుణి నేవురుఁ బెండ్లి,యాడు టెఱిఁగి యాత్మఽనతిముదమ్ము
నొందినాఁడ వారఽలుగ్మలిఁ గూడుక, చనిరి కరిపురికిని ఽ జననిఁగలసి. ౬౧౨

సీ॥ అంధభూపతి వారి కతిముదమ్మున ఖాండ, వప్రస్థపురమున వలనువఱచి
నివసింపఁజేయ నన్నెలవున రాజసూ, యంబొనర్చిరి జగదద్భుతముగ
నవ్విభవముగాంచి యసహమానుండయి, దుర్ద్యూతమున వారిఁ దూలఁబుచ్చి
క్షితియెల్లఁ జేకొనఁ జేడ్పడి ద్వాదశ, వార్షికంబగు వనవాస దుఃఖ

గీ॥ మనుభవించిరిఁగాదె! బ్రహ్మాత్మజాత!, యేనఁగనెవ్వఁడను? సుతులెవ్వరిందు
సుఖము దుఃఖంబు ననన్ది? శోకహర్ష, డోలికలనూఁగె మచ్చిత్తబాలికుండు.

గీ॥ అట్టి సందేహవారాశి నట్టనడుమఁ, దొట్టగిలి పారమొందఁగా దుస్తరమగు
వేదనఁబడి భ్రమించుచు వివిధ విపిన, నదనదీసంచరణవృత్తి నొడిగి యుంటి.

క॥ ఈ సంసృతి భూతంబుల, వే సరణిం బాయు? సుఖము లెట్లు లభించున్
వాసిగ విగతజ్వరమై, భాసిలుట మనమ్మునకును బాటిలు నెట్లో. ౬౫౫

—• పర్వత నారదుల చరిత్రము •—

సీ॥ సంశయంబులఁ బాపి సదసత్పరిజ్ఞాన, లాభంబుఁ గల్పించి లోభమోహ
విరతి నొందింప నీ వేడితినన్నఁ బా, రాశరిఁగాంచి నారదుఁడు పల్కె
మోహకారణ మిట్లు మొనసి నన్నడిగితి, దేహంబు మోహసందీపితంబు
బ్రహ్మవిష్ణ్వాదులు భవదురధ్వంబున, మాయలోఁబడిన నుపాయమెద్ది!

ఆ॥ యెల్లభూతములకు నిట్టి సంసార సం, కటములకును మూలకారణంబు
మోహమనుచుఁ దెలిసి మోక్షైకకాములై, పరఁగరొక్కొ? బ్రహ్మవాదులెల్ల;

ఆ॥ నన్ను వేత్త యనుచు మన్నించి భ్రాంతిచే, నడిగెదీవు నాదు సఖలమెల్ల
నెఱుఁగఁజేతు వినుము హేయవర్తనలచే, ననుభవించుపాటు లడుగనేల! ౬౫౭

ఉ॥ ఏనును బర్వతుండును మహీతల మెల్లఁ బరిభ్రమించుచున్
గానన శైల దుర్గముల కందువ లందు వసించుచున్ ముని
స్థానఘనాశ్రమంబులను సంచరణం బొనరించుచున్ గడున్
మానసముల్ చెలంగ ననుమానముఁ దక్కి చరింతు మెల్లెడన్. ౬౫౮

క॥ శయనాసన భోజనములఁ, బయనంబులఁ జిత్తవృత్తి భావవిభేదం
బయి తోలఁగకుండ శపథము, గయికొంటిమి బయలుదేఱుకాలమునందున్

చ॥ ఇటు సమయం బొనర్చికొని యిర్వురమున్ దివినుండి భూస్థలిన్
బటువిహృతిన్ జరించు తఱి భాస్కర తీక్ష్ణమరీచిరోచిరు
త్కటమగు వేసవిన్ బడలి తాలిమిఁ దూలి మహోపభోగ భూ ౬౬౦
జటిలము స[illegible] [illegible] మొక్కపట్టునన్.

క॥ మారాకఁ దెలిసి జనపతి, యాహార్షిన్ బూజ సల్పి యభ్యంతర శృం
గారభవనాంతరమ్ములఁ, గూరిమితో నిలిపె నిల్చి కొంటిమి ముదమున్

క॥ పదపడి చాతుర్మాస్యము, విదితంబుగ నాల్గునెలలు విభుఁ డచ్చోటన్
ముదమున మాకున్ సేవలు, గదియించుచు నిలిపె మమ్ముఁ గడువేడుకతోన్.

చ॥ ఎనిమిది మాసముల్ దిరిగి యే మచటచ్చటఁ దీర్థసేవలన్
దనియుచు వార్షికావసరతత్పరతన్ నిబిడాశ్రమంబునన్
జను నివసింపనంచు బుధసంచయమెల్ల వచింపఁగాన న
మ్మనుజవరేణ్యువీట బహుమానసపర్యలు గొంచు నుండఁగన్. ౬౬౩

—। నారదపర్వతులకు మదయంతి శుశ్రూష చేయుట ।—

క॥ ఆరాజవరుని పుత్రిక, నారీతిలకంబు కమలనయనునిమాయా
కారవధూరూపం బని, యారయ మదయంతి పేర నలరున్ ధరణిన్. ౬౬౪

సీ॥ పరిచర్య సేయంగఁ బాల్పెట్టి మాయొద్ద, నివసింపఁజేసె నన్నీరజాక్షి
జనకుని యాజ్ఞచే సన్నిధానమునందు, వసియించి సదభీష్ట వస్తుఘటన
మొనరించుచును గృహోద్యోగయై స్నాన పానాదుల భోజనాద్యవసరముల
నిష్టసంధానంబు లెడలేక సేయుచు, నెద్ది గోరిన నిష్టమెల్లఁ దీర్చు

గీ॥ భిక్షఁ జేసిన పిమ్మటఁ బెద్దగాఁగ, నభినవవ్యజనాదుల నార్చుఁ జెమట
లిట్టు లిర్వుర సేవించునెల్ల ప్రొద్దు, భక్తి దళుకొత్త నారాచపట్టి యుండ.

క॥ వేదాధ్యయన మొనర్చుచు, మోదమ్మున వీణె యంది ముహురభివాంఛన్
నాదించి సామగానా, మోద మ్మొనరింతు రసము మొనయఁగ నేనున్. ౬౬౬

శా॥ గానాస్వాదకుతూహలమ్ము మది రాగవ్యాప్తి సేయంగ ని
త్యానందంబున నాఁడునాఁటికిని నుద్ధామానురాగమ్ముచే
మానంజాలక యప్పటప్పటికి సన్మానంబు వాటింపుచున్
నానాచేష్టల మోహ మగ్గలముగా నాయందుఁ జూపున్ రహిన్. ౬౬౭

—। పర్వతుండు నారదుని శపించుట ।—

వ॥ ఇత్తెఱంగున దినదిన సేవావసరంబుల నాకుం బర్వతునకును గించిదంతరంబుఁ బొడఁగట్టం జేయుచును, ఉష్ణజలావగాహనంబులను దధిపయోఘృతాది సేవనంబులను మృదులపర్యంకాస్తరణంబులను నన్నుం దేల్చుచు శీతలజలావగాహనంబులను దక్షాద్యనుసంధానంబులను సాధారణాస్తరణంబులను నతని నుపచరించుచు సానురాగవీక్షణంబుల నన్నుం దిలకించుచు విశేషసేవాతత్పరయై

రాజపుత్రిక యుండుట దెలిసి మనంబునం జింతిల్లి విస్మితుండై రహస్యంబున దత్కారణంబు వివరించి నన్నడిగిన స్మితముఖుండనై యిక్కన్నియ నన్నుం బరిగ్రహింపం దలంచినది నాకుఁ మనోభావం బట్టిద యని తెల్పినఁ గ్రోధసంయుతుండై ధిగ్ధిక్ప్రయోగం బొనర్చుచు మొదట శపథంబొనర్చి నన్ను వంచించితివి గావున వానరవక్త్రుండ వగుమని శపించిన నట్టివాఁడనై సహింపక స్వల్పాపరాధి నగు నన్ను శపించిన కతంబున నూర్ధ్వలోకంబు లేక మర్త్యంబునఁ బడి యుండం గలవాఁడవని నేనును శపించితిని, అక్కన్నియ నాయందు యథాపూర్వంబుగనే బద్ధానురాగయై యుండె పర్వతుండు నన్ను విడనాడి యెందేనియుం జనినను నేను మాత్రము తదధీనహృదయుండనై యందే నిలిచితి, సృంజయుండును బ్రికటయౌవన యగు పుత్రికి వివాహం బొనర్పం దలంచి మంత్రిం గాంచి యిట్లనియె. ౬౯

సీ॥ పరిణయకాలంబు ప్రాప్తవ్యమై వచ్చెఁ, బుత్రిక ననుకూల పురుషుఁ గూర్ప
వలయు శూరుండు సుసజ్జ్వలరూపయుక్తుండు, నగు రాజపుత్రుఁడెవ్వఁడైనఁ గలఁడె
తెలుపుమన్నఁ బ్రధాని దేవ! మహారాజ, పుత్రులు లేరె? యీభూమిలోన
నెవ్వానిపై రుచియింతికి జనియించు, నాతని కిమ్ము ధరాతలమున

గీ॥ గలుగు రాజకుమారులఁ గలయఁబిలిచి, చేయుము స్వయంవరమ్ము నిశ్చింతన నేడు
సచివువాక్యంబు విని యంతజనవిభుండు, నిశ్చితోద్యోగుఁడై యున్న నెలఁత దెలిసి.

క॥ ధాత్రిం జేరఁగఁ బిల్చుచుఁ, బుత్రీమణి పల్కె నీవు పోయి జనకుతో
సూత్రముగఁ దెల్పు నామది, పాత్రముగా నారదర్షి బరిరంభించెన్. ౭౦

ఉ॥ అమ్మహితానుభావుని రసాస్పదగానసుధానుభూతిచే
నెమ్మది సంతసిల్లి యతని వరియింపఁగఁగోరి యుంటి నా
కిమ్మహి వేఱుభర్త గణియింపఁగ నేటికి? వానికిచ్చి పు
ణ్యమ్మన ధారఁబోయుము నృపాంతరమార్గణ మేల భూవరా! ౭౧

క॥ అని ధాత్రివలనఁ బుత్రెంచిన వాక్యము లాలకించి చెంగటఁ దనపత్నినిఁగైకేయిఁ గనుంగొని, జననాథుం డనియెఁ గూఁతు చక్కటి వింటే! ౭౨

ఉ॥ వానరవక్త్రుఁడైన మునివల్లభు నారదుఁ బెండ్లి సేయు మం
చారయఁ జెప్పి పుచ్చె నిది యాగడ మయ్యెడు బుద్ధి గాక ని
స్సారపుఁ జైదమయ్యె సరసప్రసవాయుధ మోహినీచమ ౭౩
త్కారవిలాస [illegible]

—॥ మదయంతి నారదుని వివాహము చేసికొనుటకు నిశ్చయించుకొనుట ॥—

ఆ॥ బికిర మెత్తునట్టి బీదబాపండెక్క, డబ్జరేఖవోనియతివ యేడఁ
గాలవైపరీత్యగతిఁ బొసంగె నీకేమి, సేయువాఁడ బుద్ధిఁజెపును సుతకు.

ఉ॥ నీనిపుణత్వ సంపద ననిందిత మయ్యెడు నట్లు కార్యముల్
బూని ప్రసంగఁ జేయుమనఁబోయి నిజాత్మజఁ గాంచి తల్లి మేల్
నీనయగారముల్ సొబగునీటు నొయారము వీటిఁబుచ్చుచుల్
వానరవక్త్రుఁ జేకొనఁగ వాంఛ జనించెనె? యక్కటక్కటా! ౬౭౫

ఆ॥ విన్నవారు హాస్యవిధి నల్పెద రటన్న, మాటతోఁచదొక్కొ? మర్కటాస్యు
నెడల వలపు పుట్టునెడ వింతయయ్యెడి, నింత హేయబుద్ధి యెటులు దోఁచె.

సీ॥ వానరాస్యునితోడి వలపు దువాళించి, చతురవాక్యము లెట్లు నలిపెదమ్మ?
కుత్సితుండగువానిఁ గోరి తల్పంబున, సరససంగతు లెట్లు జరిపెదమ్మ?
మదనసుందరులైన మహిపాలు రుండంగ, బడుగుబాపనిఁ జెట్టఁబట్టెదమ్మ?
తల్లిదండ్రులు దుఃఖతత్పరు లగుదు రం, చీయెడ నేల లేదాయె నమ్మ?

గీ॥ "జాజి తీవియ కంటకశాఖి నలము", తెలుఁగుగాఁదోఁచె నీ సాటి తెలవలెల్ల
రోయ నిటువంటి బుద్ధి యన్యాయమమ్మ!, యిదిగని సహింపలేరమ్మ యెల్లప్రజలు.

సీ॥ క్రముకతాంబూలికా ఘనసార మృగమద, చర్వణం బే? నోట నలుపునమ్మ
శ్వశురదత్తకిరీటనరసరత్నప్రభల్, సుదతి? యేశిరముపైఁ జూపునమ్మ?
హావ భావ విలాసహాసలాలిత్యంబు, లే నేత్రవృత్తుల నెనయునమ్మ?
కుండలప్రముఖసుమండనోల్లాసంబు, లే గండతలముల నెనఁగునమ్మ? ౬౭౮

గీ॥ చూచువారలుమదిరోయుచునుహసింప, గుటిలుఁడగుభర్తఁ జేపట్టి కొనియయారె?
"యడవిఁగాసిన వెన్నెల" యట్ల నీదు, చెలువ మెల్లను వితగాఁగఁ జేసెదొక్కొ?

ఉ॥ చక్కని వాఁగ్వాక్యసరసత్వము గల్గిన వాని సంపదల్
జొక్కము గల్గువాని నృపసూనునిఁ గోరి వరించి భోగముల్
పెక్కులు సంతరించి నిజుపేదలఁ బ్రోచుచునుండ లేక య
మ్మక్క? యిదేమి వింత? నడిశకానఁ బెనంగెదు వెఱ్ఱికూఁతురా! ౬౮౦

క॥ అని పెక్కు తెఱంగుల ని,ట్లనుమానము వీడి యాడు నంబికపలుకుల్
విని కృతనిశ్చయమై నం,దని జననిం జూచి పల్కెఁ దత్పరమతియై. ౬౮౧

సీ॥ జవ్వనంబేటికిఁ జక్కఁదనంబేల?, మూర్ఖుఁడై యుండెడి మొద్దునకును
రాజ్యంబు లేటికిఁ బ్రౌఢత్వమేటికి, సారస్యమెఱుఁగని చంచలునకుఁ

జతురవిజ్ఞానార్థ సంశయచ్ఛేదికి, నెద్ది లేకున్నను నేమి కడమ?
విద్యావిచక్షణావిఖ్యాత చతురిమ, గలవాని కిసుమంతగలదె కొఱత

గీ॥ జననిః సప్తస్వరోల్లాస జనితగాన, మాధురీసాధురీతి కామహితనయవి
శారదుండైన యిట్టి యీనారదునకు, సాటిచతురుండు గలండె యీజగమునందు.

క॥ హరిణంబులు తృణభక్షణ, పరిచయమ్ముమాని ప్రాణబాధకు లోనై
మరుగునట? గానసుఖలకు, నరు లనఁగా నెంత? కళలనాణెము గంటే! ౬౮౩

సీ॥ ధనవంతుఁడయ్యు సౌందర్యశాలియు నయ్యు, గుణహీనుఁడగువానిఁగొనుటతగవె!
మూర్ఖునితోఁ బొందు మొనసి కోరుటకంటె, మరణము మేలను మాటవినమె!
మదమత్తుఁడైనట్టి మహిపతికన్నను, గుణవంతుఁడగు భిక్షుకుండు మేలు
సర్వజ్ఞుఁడును గానసరసుండు నారదుం, డతనిఁ జేకొనుట యన్యాయ మగునె

గీ॥ గానవిద్య యొసంగినగతిఁ బరంబు, గంగయు నొసంగలే దను ఘనతపినవె!
యతుల సంగీత విద్యారహస్యమెల్ల, దేవమునిసొమ్ముగాదె? యత్తెఱఁగువినవె!

క॥ గరళముగ్రక్కెడు ఫణులును, హరిణంబులు మొదలుగాఁగ నారణ్యకముల్
సరసతరగానలోలము, లరయ న్నరులకును లౌల్యమరుదే? జగతిన్. ౬౮౪

చ॥ జనకుఁడు నారదప్రథితచాతురిఁ గాంచఁగలేక యయ్యయో?
ననుఁ బెడబుద్ధిఁగొల్ప నిటు న్యాయమె? యమ్ముని నాకు భర్తయి
వ్వనచరవక్త్రసంగతి యవశ్యము దైవికమాట భావ్యమై
గొనకొనెఁ గిన్నరాదు లనుకో విన మే? తురగాస్యులం చిలన్. ౬౮౫

గీ॥ గానవిద్యావిశారదుల్ గారె వారు, దేవకాంతావిలాసులై దీప్తిఁగొనరె!
గాన జనకునికెఱుఁగంగఁగలవి నాదు, వాంఛితముఁ దీర్పుఁడనుచు నవ్వనితపలుక.

ఉ॥ నందనిమాటలెల్ల విని నవ్యసరోరుహనేత్ర తల్లి య
స్పందత భర్తచెంగటికిఁ జక్కఁగ నేగి బహూక్తులేల? బు
ద్ధిం దలపోసి యిజ్జగము తెల్లము దైవవశంబు గాదె? కా
నం దనయన్ సురర్షికి నననన్యమనస్కత నిమ్ము నావుడున్. ౬౮౬

క॥ జననాయకుండు సతిచెప్పిన మాటలు వీనులాడుఁ బెట్టి దృఢమతిన్
దనయన్ బ్లవగాస్యుం డగు, ముని కర్పణఁ జేసె నాకు ముజ్జగ మెఱుఁగన్. ౬౮౭

సీ॥ అత్తెఱంగునఁ బెండ్లి యాడి యచ్చోటనే, వసియించితిని బోటి వాంఛఁదవిలి
పరిచర్య సేయంగఁ బడఁతి నచ్చినయెడ, దుఃఖసంతాపముల్ తొడిఁబడంగఁ
దురటిల్లుచుండుదుఁ దొయ్యలి ననుఁగాంచి, ఫుల్లాంబుజాస్యయై యుల్లమునను
విరసతఁ గొనక నావేదించు భోగముల్, కతిపయదినము లిక్కరణి జరుగ

గీ॥ సకల తీర్థాటన మొనర్చి సంయమీంద్రుఁ, డయిన పర్వతుఁ డరుదేరఁ నతనిగాంచి
యెదురుచని కౌఁగిలించి య భీష్ట పూజఁ, దనిపి యాసీనుఁ జేసితిఁ దల్పమునను.

—• పర్వతుఁడు నారదుని శాపమును నివారించుట •—

ఉ॥ అత్తఱి నన్నుఁ జూచి హృదయవ్యథ ఖిన్నమనస్కుఁడై దయా
యత్తుఁడు గానఁ బర్వతుఁ డుదారతఁ "గోపవశుండనౌచు దు
ర్వృత్తి శపించినాఁడ" సరవిన్ గొను నిష్కృతి సేతు దానికిన్
జిత్తములోఁ గలంగకుము చెట్టతనం బని మెంచి సైఁపుమీ. ౬౯౧

ఆ॥ మామ! యే నొనర్చు మహిత తీర్థాటన, పుణ్యభరము వలన భూరి తేజ
మొనరఁగల్గి భోగయోగ్యమౌ నీమోము, పూర్వవిధము నొందిపోలుచుఁగాత.

చ॥ అని వచియించు పర్వతుని యాదరణంబున నేను నంత జం
ద్రనిభవిలాసవక్త్రుఁడయి రాజిలి రాజసుతానుభావభా
జనమయి యొప్పి యెంతయును శాంతమనస్కత సంతసించితిన్
జనపతికన్యయున్ మిగుల సంతస మంతరమందు నొందఁగన్. ౬౯౩

సీ॥ అంతిపురంబున కరిగి యల్లుని మోము, దివ్యతేజంబునఁ దేజరిల్లెఁ
దిలకింపుమని పల్కె దేవి వల్లభునకు, నమ్మాటఁ దెల్పిన హర్షమలరి
పర్వతుఁ బూజింపఁ బరమహర్షంబున, రంజిల్లి రెల్లరు రాజవర్య
ముఖ్యులత్తఱిఁ జెందు మోదంబు దెలుపంగ, వశమె యెవ్వారి కవ్వారియయ్యె

గీ॥ గాన మాయామహత్త్వంబు గణుతిసేయ, నగునె? ప్రాణుల లోపల ననుభూత
దుఃఖ లున్నారె? యరివర్గ దురవగాహ, కారణమ్మున దేహముల్ గలుగుఁగాదె?

—• నారదుడు స్త్రీ యగుట •—

చ॥ అదియును గాక హాస్యకలనాస్పదవృత్తి నొకానొకప్పు డే
మహిళగ మాఱి భూపతికి మానిని నై నృపునింటఁ బుత్రులన్
బదపడి పల్వురన్ గనుచు బాధల నొందితి నన్న వ్యాసుఁ డె
ట్టిదొ? వినఁగోరినాఁడను గడిందివిచిత్రమిదంచుఁ బల్కుచున్. ౬౯౫

తే॥ మదిని సందేహ మొదవె నమ్మాడ్కి నీవు, పొలఁతిగా మాఱి తెప్పుడి పూరుషరూప
మెనసెఁ బుత్రిలఁ బల్వుర నెట్లు గంటి, వెలమిమైఁ దెల్పుమన మునియిట్టులనియె

—• వ్యాసునకు నారదుఁడు తనకష్టములు చెప్పుట •—

క॥ మాయామాహాత్మ్యంబున, కేమెడ నడ్డంబుఁ గలదె "యేనుఁగు నెలుకన్
జేయం జాలెదు" సర్వము, మాయామోహితము వినుము మహితవిచారా.

వ॥ బాదరాయణా! యొక్క సమయంబున సత్యలోకంబు వెలువడి మనోహరంబగు శ్వేతద్వీపంబున వసియించు నద్భుతక్రియారంభుం డగు హరిఁ దర్శింపం దలంచి సామస్వరతానంబుల మహతి మొరయించుచుఁ జని చక్రపాణియు గదాధరుం డును కౌస్తుభోద్భాసితోరస్కుండును మేఘశ్యాముండును జతుర్భుజుండును బీతాంబరపరిధానుండును మకుటాంగదరాజితుండును లక్ష్మీవిలాసక్రీడమానుం డును నగు వాసుదేవుం గాంచునంతలోన నంతర్ధానంబై యిందిరాదేవి యదృశ్య యగుటకు నివ్వెఱఁ గంది దేవేశా! వచ్చు నన్నుంగని లోకమాత యగు లక్ష్మి యదృశ్యయగుటకు నేమికతంబో యేనుజడధూర్తులలోనివాఁడఁగాను దాపసుండ జితేంద్రియుండ జితక్రోధుండ జితమాయుండ నగునామెడ నంతర్ధిం బొనరిం చుట కేమికతంబో? యెఱిఁగింప వలయు ననిన నప్పలుకులువిని జనార్దనుండు మందస్మితసుందరవదనారవిందుఁడై యిట్లనియె. ౯౯౮

ఉ॥ నారద! భూతలంబున సనారత మిట్లగు వారు వీర లం
చారయ నిశ్చయింపఁ దగదయ్య సతీమణు లెందు నేని సం
సారపుగౌరవంబు కొనసాఁగఁ జరించెడివారలేని యే
పూరుషు నన్యునిం గనుట బోలదు నీతివిదుల్ వచింపరే. ౯౯౯

—• నారాయణుండు నారదునకు మాయామహిమం బెఱిగించుట •—

సీ॥ మాయామహత్త్వంబు మహితంబు దుర్జయ, మెంతవారికి నైన నెఱుఁగ వశమె
యాగమజ్ఞులు నిరాహారులు తాపసుల్, జితమారుతులు నష్టచేష్టులైన
మాయలోఁ బడకుండు మనుజులు గలరె నే, మాయ గెల్చితి ననుమాట గలదె
యేనును శివుఁడు వాణీశుండు సనకాదు, లెవ్వరేనియు మాయ నెఱుఁగఁదరమె

గీ॥ దేవదేహ నృదేహముల్ తిర్యగాది, దేహములు దాల్చువారికి మోహమయము
మాయ గెలువంగనగు నె నేమాయ గెల్చి, కడగఁదొలఁగితి ననునట్టిఘనుఁడు గలఁడె.

సీ॥ వేదవేత్తలనైన వేదహీనులఁ జేయు, నంతర్వివేకి బాహ్యమునఁ ద్రోయు
రూపహీనునిఁ గంతు రూపవంతుని జేయు, విద్వాంసు మూర్ఖుఁ గావించుచుండు
సుకృతాత్ము నైనను నకృతాత్ముఁ గావించుఁ, బృథుభోగినైనను భిక్షుఁ జేయుఁ
బ్రారబ్ధవశమొ స్వభావమో? యీ చేత, తచ్చేష్టితంబు దుస్తరము తెలియ

గీ॥ జంగమస్థావరంబైన జగ మపార, మాయలోపల మునిఁగి యిమ్మాడ్కిఁ దనరు
జ్ఞాను లజ్ఞాను లనియెడు సరణి గలదె, తెలియు మాత్మవివేకినై దేవమౌని.

క॥ అనిపలికి యూరకున్నఁ, వనజాక్షునిఁ గాంచి నేను వగ నెమ్మదిలోఁ
బనుపడి సంశయమ్ముం బెనఁగొన మాధవునకిట్లు ...మెలర్పన్. ౧౦౦౨

సీ॥ దేవ! రమాపతీ! దీనశరణ్యా! యిమ్మాయ యనంగ నెమ్మాడ్కి నలరు
నెవ్విధిరూపమో? యెంతబలంబొక్కో?, యెచ్చోట నుండునో? యెవఁడు మాయ
కాధారమో సర్వ మరయంగఁ గాంక్షించి, యున్నవాఁడను దెల్పుమన్న శార్ఙ్గి
త్రిగుణ సర్వాశ్రయ దేవమానుషతిర్యగాదిరూప యజేయ యఖిలనిలయ

గీ॥ మాయ దానిఁ గనంగ నెమ్మదిఁ బొసంగె, నేని నాతోడ గరుడుని నెక్కి దానిఁ
గనఁగఁ జేసెద నని తార్క్ష్యుమనమునందుఁ,దలఁచె నంతటఁ జనుదెంచెఁ బిలశయారి.

చ॥ గరుడునిఁ జూచి కేశవుఁడు కన్నుల నవ్వుచు నన్నుఁ గొంచు న
త్వరముగ నెక్కి లోకము లుదారతఁ గాంచుచు శైల కాననాం
తరవనగోకులవ్రజనదహ్రదపట్టణతాపసాశ్రమో
త్కరములు చూచుచుం మృగవితానము నెంచుచుఁ బోవుచుండఁగన్. ౨౦౪

—— నారదుఁడు కన్యాకుబ్జపుర సరోవరమున మునింగి స్త్రీయగుట ——

క॥ ధన్యతర భోగమహితము, కన్యాకుబ్జాపురంబు గాంచి పదయుగీ
విన్యాసంబునఁ బుడమిన్, మాన్యత నొందంచి యందు మలయుచు నొకచోన్.

సీ॥ అరవిందబృందఝుంకరణకృద్భృంగంబు, హంసకారండవవ్యావృతంబు
చక్రవాకవిహంగజంపతిరుచిరంబు, బహువర్ణ రాజీవబంధురంబు
మధుమాధురీమిళన్మహితపానీయంబు, నవధీరితాభ్రగంగాభిమంగ
మతితరోత్తుంగసంగతహస్తరంగంబు, ఖగకులారావరంగత్తటంబు

గీ॥ నగుచుఁ జెలువొందు నొక్కజలాశయంబు,గాంచి నన్నుఁజూచి నారద కంటివొక్కొ?
యీసరోవర మతిహృద్యమి త్తటమున, నిలిచి యొక్కింత సుఖయింత మలపుదీర.

చ॥ అని కృతనిశ్చయమ్మునఁ దటాకనిరంతరశీతలానిల
స్వనితమిళిందఝుంకరణశ్వేదనాతపమంజుమంజరీ
జనిత సుగంధసంపదలఁ జాల ముదమ్మును బొంది యొక్క చ
క్కని సహకారమూలమునఁ గౌతుక మంది వసించి యున్నెడన్. ౨౦౨

ఉ॥ ఇందుసుధాసమాంబుచయ మిం దవగాహ మొనర్పు మీఁద నే
నుం దమకించి సేయుదు నసనూనతఁ దానము, సాధుచిత్త ని
న్యంభిక్షమ్ము పోల్లె నిర్మలత నందెడు నిజ్జల మాత్మహృద్యమై
యంధ్రమ్ము నొందఁజేయు వనజాంతరగంధిలగంధసంపదల్. ౨౦౭

క॥ నా విని భగవద్వాక్యము, చే వీనులు చల్లనగుచుఁ జిత్తం బలరం
గా వరసరోవరంబున, పావనమవగాహనమ్మునఁ బరఁగితి నంతన్. ౨౦౮

సీ॥ కాసారసలిలావ । గాహనం బొనరించు, నంతఁ బుంగూప మెం । దరిగెనొక్క ?
కుంభికుంభసమాన । కుచయుగంబును జక్రి, కటితటంబును భృంగ । కచభరంబు
నరవిందదళముల । నపహసించెడు కన్ను, లాకసంబును బోలు । నట్టి నడుము
నరటులసోయగం । బపనయించెడితొడల్, పల్లవంబులఁ బోలు । పదయుగంబుఁ

గీ॥ గలిగి యతిమోహనాకార । కాంత యైన, కాంత నై చారుభూషణా । క్రాంత నగుచుఁ
గంచెల బిగించి మృదులాంబ । రాంచలములు, మట్టియలు రాయ నెట్టన । గట్టుచేరి.

ఉ॥ కంకణఝుంకృతుల్ స్వకర । కంజములన్ గులుకంగఁ బౌరుషా
హంకరణంబు దూలి నలి । నాక్షులమెచ్చిద మెల్ల మేన నల్
వంకల నావరింపఁ దర । హాసంబయి చిత్తము భర్తృకాంక్షు ని
శ్శంకఁ బెనంగఁ బూర్వగుణ । సంస్మృతి మాటుపడన్ దటాలునన్. ౭౧౧

క॥ మఱచితిఁ గృష్ణాజినమును, మఱచితి వాదానుబంధ । మహతీవరమున్
మఱచితిఁ గమండలువు నేఁ, గొఱఁతయు లే కాఁడుఁ గొమరు । గుటికొనమేనన్. ౭౧౨

ఆ॥ నాదు పరికరములు । నవ్వాచుఁ జేకొని, ఖగవరంబు నెక్కి । కమలనయనుఁ
డాత్మగేహమునకు । నరిగె నే నంతటఁ, దటముఁ జేరి యేక । తంబ వనిన. ౭౧౩

— స్త్రీరూపముతోనున్న నారదుని తాళధ్వజుఁడు చేపట్టుట. —

మ॥ మనమున విస్మయం బొదవ । మాటికి వీడనిచింత మున్గుచున్
వనతరుమంజరీకుసుమ । వాసన కాసఁ బెనంగుచున్ లతా
ఘనతలకుంజపుంజములఁ । గౌతుక మొప్పఁగ సంచరించుచున్
మొనసిన కారుకౌతుకము । మఃంపఁగ నందు మెలంగుచుండఁగన్. ౭౧౪

సీ॥ అవనికి నేతెంచు । నంబుజాప్తుని డన, జగతికి నేతెంచు । చంద్రుఁ డనఁగఁ
జతురంగబలసము । చ్ఛ్రియచమూబృందముల్, కెలఁకుల నెల్లఁ గ్రిక్కిఱిసినడువ
స్యందనధ్వజపటాంచలమారుతంబుల, జలద సంఘంబులు । జలదరింపఁ
గొమరు పాయమ్ము గ్రొక్కలొను మేని సోయగం, బింతులమనము లుర్రూతలూగ

గీ॥ వేటతమి మదిఁ బ్రేరేప । విబుధనాథ, విభవసందీపితుం డయి । వింత గులుకు
సోయగంబున వచ్చె నచ్చోటి కపుడు, లలితశుంభద్భుజుండు తాళధ్వజుండు.

సీ॥ వచ్చి యచ్చోట విహరణ । వాంఛఁ దవిలి, సంచరించుచు దివ్యభూషణవిలాస
భాసమానాంగినగు నాదు । పజ్జఁ జేరి, కాంచి తటకావడుచుఁ బల్కెఁ గడుముదమున.

ఉ॥ చారణకన్యవో? విబుధ । సారసనేత్రివో? పన్నగాంగసా
[illegible]

ఘోరవనాంతరాళమున కేర్పడ జనుదేరఁగ నేకతంబు? మ
త్స్వారసగంధివై విడక ♦ దక్కఁగొనందగు నన్ను భామినీ! 208

క॥ నీపాఁడ నగుచు నెప్పుడు, భావము రంజిల్లఁ జేసి ♦ పంచశరకళా
సేవధి వని నిను వీడక, సేవించెద నేలికొనుము ♦ చిత్తం బలరన్. 209

చ॥ ఇటులు వచించు రాజు పలు ♦ కెంతయు వీనుల కింపు పుట్ట మా
అట వలరాజ వీవు వివరంబుగ నాపలు కాదరింపు మొ
క్కొకట వివరింతు సర్వమును ♦ గుంభినిఁ దల్లియుఁ దండ్రియున్ సఖుల్
సటలు దనంతఁ దా నయిన ♦ చక్కటి యెట్టిదో? నాకు నేనయై. 210

ఆ॥ ఈజలాశయంబు నెడ వసించెడిదాన, నాదువృత్త మిది యనంగ నింతి
మహితలేశుఁ డెంతొ ♦ మదనాతురుండయి, పరిజనంబుఁ జూచి ♦ పలికె నిట్లు. 211

సీ॥ కౌశేయవసనసంకలితంబు మౌక్తిక, జాలజాలకపరిష్కారయుతము
సౌవర్ణమణిమయోజ్జ్వలము విశాలంబు, నైన యానమ్ము దెండనిన శిబికఁ
గొనివచ్చి యచ్చోట నునుపఁ దజ్జననాథు, ప్రియచికీర్షను గోర్కె బెరసి యందు
నారోహణ మొనర్ప ♦ నభిలషించితి రాజు, చేపట్టియందు వసింపఁజేసి

గీ॥ పురికిఁదోడ్కొని పోయి యొప్పుగవివాహ,మయ్యె నాతనివల్లభ ♦ నగుచుఁ బ్రాణ
తుల్యనై భాగ్యభోగ్యముల్ దులుపడఁగ, నందు సౌభాగ్యసుందరి యనఁగ నిలిచి.

శా॥ నానాభోగవిలాససంపదల విన్నాణంబుగా భర్త ని
త్యానందంబునఁ దేల్చుచున్ విగతకార్యాపేక్షుఁడై మద్రతిన్
బౌనఃపున్యసుఖంబు నందుచు రమింపం జాలఁగాలంబు న
ద్యానాంతర్విహృతిన్ జనన్ మఱియుఁ దత్తత్కాలికస్వేచ్ఛలన్. 212

సీ॥ అతితరోత్తుంగసౌధాంతరంబులయందు, దీర్ఘికానిమ్నగాతీరములను
గంధోత్తమాపానకౌతూహలంబుల, మహిపాలనోద్యుక్తి ♦ మఱచి నన్ను
లాలించె జనపతి లోలనై తత్కేళి, పరవశీభూతనై ♦ పౌర్వదేహ
భావంబు లెఱిఁగియు ♦ బయలు గానీక త, త్ప్రియ మొనరింపుచు బ్రేమ నతని

ఆ॥ పట్టరాజ్ఞి నగుచు ♦ ఫలియించె నాకోర్కె, జీవితంబు సఫలసిద్ధి నొందె
ననుచునుంటిఁగాని ♦ యధిగతవిజ్ఞాన,పూర్వభావ మెల్లఁ బోలియు మెఱుఁగ. 213

క॥ ధరణీవల్లభుకూటమిఁ, బరిచితనై నిలిచియుంటిఁ ♦ బదిరెండేడుల్
కరమొక్క గడియ పోలిక, నరిగెన్ గాలంబు వింత ♦ యద్యో మహాత్మా! 214

### — స్త్రీరూపముతో నున్న నారదునకు సంతానము గలుగుట —

ఉ॥ అంతట గర్భమయ్యె సుకృతాతిశయమ్మున బూర్ణ కాముడై
కంతుసమాను నందనుని గాంచితి క్ష్మావిభు డంతరంగమం
దెంతయు మోదమున్ బెరసె నిట్టులె రెండవ యేట గర్భమై
కాంతుడు మోదమంద సుతు గాంచితి నింకొకనిన్ ముదమ్మునన్. ౭౩౦

సీ॥ ఏటేట నిటులు మహీపతి యుప్పొంగ, ద్వాదశసంఖ్య నందనుల గాంచి
పదపడి యెనమండ్రు బాహుబలాఢ్యుల, దనయుల గాంచితి దనయులెల్ల
బరిణయించిన బుత్రపౌత్రసున్నుషా బంధు, పరివార మెల్లను బలసి కొలువ
నానాటి కతిశయానందంబు పెనుపొంద, సుఖము నైశ్వర్య మహోచ్చపడి పెరయ

గీ॥ నంత గొన్ని దినంబుల కంతరంబు, ప్రొడమి కొడుకులు కోడండ్రు పోరితముల
గసిమసంగుచు గలహింప గడవరాని, చింత సంతాపమొందితి జెప్పనేల!

క॥ సంకల్పముచే సంసృతి, సంకల్పవిహీనమైన సంసృతి లేదీ
పంకమున బడని నామది, శంకింపగ జొచ్చె మనసు సంసృతిజలధిన్. ౭౩౨

క॥ పుత్రుల జూచుచు వారల, పుత్రుల గాంచుచు బ్రమోదపూరితనై నే
క్షత్రియ పత్నులలో సర్వత్ర ప్రసిద్ధనని మది సవారణ నుంటిన్. ౭౩౩

వ॥ అంత దూరదేశాధిపతి యగు నొక్క రాజన్యుం డరాతిభావాపన్నుండై పతితోడం గలహింపం దలంచి చతురంగబలసమేతుండై కన్యాకుబ్జం బను మన్నగరంబు బందిపెట్టందలంచిన బుత్రపౌత్రవర్గంబులు సంగ్రామంబునకున్ వెడలి కాలయోగంబున బరాజితులై హతులైరి, రాజును భగ్నుండై పురంబు జేరె బుత్రులెల్ల సంగ్రామంబున హతులౌట విని రణక్షోణికిం జని పుత్ర కళేబరంబులు గాంచి యాక్రందించుచు బలిష్ఠంబగు దైవంబున బుత్రులారా! హతులైతిరే యని విలపించుచున్న సమయంబున నమ్మధుసూదనుండు వృద్ధద్విజరూపంబు దాల్చి మత్సమీపంబునకుం జనుదెంచి నన్నుం జూచి యిట్లనియె. ౭౩౪

### — నారాయణమూర్తి నారదునకు బూర్వరూపం బొసంగుట —

సీ॥ ఏల యాక్రందించె దంత మోహభ్రాంతి, బ్రకటించెదేల! యెప్పాట నడలి
తండ్రి యెవ్వడు నీకు దరుణి? నీవెవ్వతె, వాలోచనము సేయు మాత్మగతికి
స్వస్థవై లెమ్ము లోచనముల బాష్పముల్, దుడువుము పుత్రులకు దుర్మలతికిని
జలప్రదాన మొనరించు స్వర్గతులకెల్ల, స్నానదానంబులు సలుప నలయు

ఆ॥ ధర్మనిశ్చయంబు ౹ దప్పదు లెమ్మని, యూరడింప లేచి ౹ యుక్తజనులు
చుట్టురాఁగ విప్ర౹సూచితం బగు త్రోవ, నింటి కేగి పుత్ర౹సహిత మొనర్చి. ౨౩౦

క॥ ద్విజపూజారతిఁ దత్త,ద్భుజనం బొనరింపఁ బూర్వ౹భావాపన్నుం
డజరుఁడు చతుర్భుజుఁడు న, న్నజహత్కృపఁ దెల్పి పలికె ౹ సతిధర్మోక్తిన్. ౨౩౧

సీ॥ తనయులకై యిట్లు ౹ తందరపడ నేల, యెన్ని జన్మము లెత్తి ౹ యిట్టి సుతుల
నెందఱఁ గాంచితి ౹ వెందఱు తలిదండ్రు, లెంద ఱన్నలుఁ దమ్ము౹లెంద ఱధిపు
లెందఱు చనిరి వా౹రందఱకై యిట్టు, లేటికి విలపింప ౹ నిబ్భవమున
వీరికై విలపించు ౹ వెట్టి యేటికి? స్వప్న,సదృశంబు దేహంబు ౹ సట మెఱుంగు
గీ॥ మిట్టి నీవుందువే ? వేయి౹యేండ్లఁ దనుక, నిందు నందన నేల ? స౹ర్వేశ్వరుండు
సర్వగతుఁడని తెలియుము ౹ సందియంబు, మాను మఖిలంబు నాతని౹మాయగాదె?

చ॥ అని వచియించు నాద్విజుని ౹ యానతి దుఃఖము నుజ్జగించి యా
తని వెనువెంటఁ బుణ్యజల౹ధన్యముఁ బౌరుషసంజ్ఞికంబునా
ఘనమగు తీర్థమందు నవ౹గాహ మొనర్పఁగఁ బోయి యందు మ
జ్జన మొనరింప నంతఁ బురు౹షత్వము సంభృతమయ్యె మేనికిన్. ౨౩౩

క॥ హరి తత్తీరంబున ఘన,కరుణారసభరితుఁ డగుచుఁ ౹ గానఁగనయ్యెన్
గరకలితమహతితో నా,హరిణాజినధారి యగుచు ౹ నబ్బుర మొదవన్. ౨౩౪

గీ॥ శౌరిఁ గాంచునంత ౹ సంస్మృతి జనియించె, నేను నారదుండ ౹ నితఁడు శార్ఙ్గి
మాధవుండు నన్ను ౹ మాయావిమోహితుఁ, జేసెనొక్కొ? యనెడు ౹ చింతనుంటి.

ఉ॥ అప్పుడు నన్నుఁ జూచి సున౹య మ్మలరార సురర్షివర్య ! యీ
యప్పులఁ దోఁగినాఁడ విట ౹ నక్కట ? యేటికి జాగు సేయ ర
మ్మిప్పుడె పోవఁగా వలయు ౹ నిట్టిటు రమ్మని చేరఁబిల్వ నా
కప్పుడ స్త్రైణభావము ల౹యమ్మయి పౌరుష మొప్పెఁ బూర్ణమై. ౨౩౬

— తాళధ్వజుఁడు భార్యకై విలపించుట. —

సీ॥ అంతఁ దాళధ్వజుం ౹ డచ్చోటి కరుదెంచి, ననుఁజూచి యో ముని౹నాథ! నాదు
పడఁతి యెం దరిగె నం౹భస్సున మునిఁగెనో?, యేమి సేయుదు నింక ౹ నెందుఁ జొత్తు?
నని విలపించుచు ౹ హా! విపులశ్రోణి, హా! నాదుజీవిత౹మా! యటంచు
నాక్రందనముఁ జేసి ౹ యక్కటా! నాబహిః,ప్రాణంబవనియుంటిఁ ౹ బడఁతి! నిన్ను
ఆ॥ విడిచి బ్రతికియుంటి ౹ వేదుఃఖుఁగొంటిఁ బ్రి,త్యుత్తరం బొసంగు ౹ ముత్పలాక్షి!
ప్రథమసంగమంపు౹బ్రణయ మెచ్చోఁ జేరె, నిజ్జలాశయమున ౹ నేమియైతి.

గీ॥ మత్స్యకచ్ఛపాది ॥ మండలంబులు నిన్నుఁ, బట్టెనో? యబ్ధిపతి వరించి
కొనియెనో? నీవు ॥ కొమరులతోఁ జని, ధన్యనైతి దుఃఖతమనుఁ బాసి.

సీ॥ కొడుకులపై నీకుఁ ॥ గూర్మి పెక్కువ నేగి, నన్నిట్లు విడుచుట ॥ న్యాయమగునె?
నందనస్నేహ మానందంబొనర్పంగ, నన్నిట్లు విడుచుట ॥ న్యాయపథమె?
ప్రాణవల్లభ! నిన్నుఁ బాసి యిట్లుండుట, విధిలిఖితంబు సంవిదిత మయ్యె
దంపతిమరణ మంతరముగాఁ జేయుట, విపరీత మిట్టేల ॥ విధి యొనర్చెఁ

గీ॥ బతి ననుగమింప ధర్మంబుఁ ॥ బలికినట్టి, మునులు సతులకు బోధింప ॥ మొనయరైరి
ధర్మశాస్త్రంబు లెల్లను ॥ దరతరంబ, వీటిఁబుచ్చంగ వలవదే? ॥ విధురులకును.

వ॥ అని పలవించుచున్న జనపతిం గాంచి జనార్దనుం డిట్లనియె. ౨౪౦

## — నారాయణమూర్తి తాళధ్వజుని విచారము నివారింపఁ జేయుట. —

మ॥ ధరణీవల్లభ! యేల శోకిలెదు? నీ ॥ తన్వంగి యెందేగె? సం
సరణాంభోనిధి మున్గువారలకు నిశ్చల్ బన్నముల్ దప్పునే?
ధర సంయోగ వియోగముల్ గన వినోదంబుల్ గదా? నీవు నా
తరుణిల్ పుత్రులు మిత్రులంట గలదే? ॥ తథ్యంబు లోనెంచుమీ. ౨౪౧

క॥ ఏమిటి కీదురపిల్లుట, నేమంబున నింటికేగు ॥ స్థిరముగ రాజ్య
శ్రీమహితుఁడ వగుము వృథా, క్షేమము చెడి యిట్టివగపు ॥ చెల్లునె? నీకున్. ౨౪౨

క॥ దైవాధీనంబులు గద?, స్థావరజంగమము, లందు ॥ సంయోగ వియో
గావహవృత్తులు నెమ్మది, నీవిధములు దెలిసి యింత ॥ యేటికి వగవన్. ౨౪౩

క॥ ఇచ్చోట బోటిఁగూడితి, విచ్చోటనె పాసి తింక ॥ నేటికి వగవన్
నిచ్చలు జంతువిహారము, లచ్చంబుగఁ గాక తాళ ॥ మని కన వలదే? ౨౪౪

ఉ॥ కొన్ని దినంబు లత్తరుణిఁగూడి విహార మొనర్చితీవు నే
డన్నలినాక్షిఁ బాసి బ్రతుకాఁడి యయ్యె నటంచు వేదురున్
గొన్న మనంబుతో నెడరుఁ ॥ గూరితి విట్టివె భూతచేష్ట లీ
విన్నఁదనంబు మాని నిజవేశ్మముఁ జేరుము తాళకేతనా. ౨౪౫

ఉ॥ ఎట్టులు నిన్నుఁగూడి తరళేక్షణ భోగములన్ రమించెనో?
యట్టులు నిన్నుఁ బాసి చనె ॥ నవ్విధి యివ్విధి యేకరూపమై
నెట్టన హర్షశోకముల ॥ నీఁదగఁ జేయుచునుండుఁ దొల్లి నీ
వెట్టులు వచ్చితో? యట్టులు ॥ నేగుము తెమ్మది నట్టినేయుచున్. ౨౪౬

ఉ॥ ఎంత కృశించి శోకిలిన ♦ నింతి నినుం గవయంగ వచ్చునే ?
సంతతదుఃఖతాపముల ♦ సంగడి దండడి నొందె దింతెకా
కంతము గల్గునే? విధివశాగతయోగవియోగభూమికా
దంతురతాండవస్థితికిఁ ♦ దప్పదు నాపలు కాలకింపుమీ. ౨౮౭

క॥ కాలవశంబున భోగము, కాలవశంబుననె విడుపు ♦ కావునఁ దత్త
త్కాలికయోగాయోగో, ద్వేలత ప్రాణులకు సహజవిధి యనుకొనుమీ. ౨౮౮

మ॥ ఘటికాయంత్రమువోలె దుఃఖసుఖసంఘాతంబు సంసారసం
కటదుర్గంబుల నేగుప్రాణులకు శంకర్ సంతతభ్రామణో
త్కటపీడన్ ఘటియించు నొక్కట సుసౌఖ్యం బొక్కటన్ దుఃఖవి
స్ఫుటభావం బరయంగఁజేయు విడుమీ ♦ శోకమ్ము ధైర్యమ్మునన్. ౨౮౯

క॥ క్షణభంగుర మిద్దేహము, గణుతింపఁగ దుర్లభంబుగదా? మానుష మి
వ్వెణఁగుఁదన మేల ? నీయెడ, గుణియై యాత్మానుభూతిఁ ♦ గొనుమీ వినుమీ.

క॥ రసనారహస్యవిభ్రమ, మెసఁగున్ బతుకొటియెడల ♦ నించుక సంవి
దృసవేదన గలదొక్కొ, వెస నింతయు నెఱిఁగి చనుము ♦ వీటికి సధిపా. ౨౫౧

క॥ జాయాధనపుత్రాదులు, మాయామయు లనుచు దేవమాయకు నడ్డం
బేయెడ లేదని కను మను, నాయచ్యుతుఁ జూచి క్షితితలాధిపుఁ డంతన్. ౨౫౨

చ॥ తల యిల సోఁక మ్రొక్కి విధితత్పరతన్ సలిలాశయంబునన్
జలములఁ దోఁగి విప్రతతి ♦ సంతతపూజలఁ దన్పి వీటికిన్
బలములు చుట్టుఁగొల్వఁ జని ♦ పౌత్రునిఁ బట్టముఁ గట్టి యాశ్రమ
స్థలులఁ దపోభిలాష మునిసన్నిధిఁ జేరి కృతార్థుఁడై చనెన్.

సీ॥ జగదీశుఁ డింటికిఁ ♦ జనిన పిమ్మట నధో,క్షజుఁ జూచి ధరణి సాష్టాంగ మిడుచు
ననుఁ జూచి నవ్వ నన్నారాయణునిఁ గాంచి, వంచించితివి నన్ను వాసుదేవ!
నీదు మాయాబలనిర్ణీతి నెఱిఁగితి, నాఁడు దేహంబుచే ♦ నాచరించు
వృత్తి యిప్పటికిని ♦ విస్మయం బొనరించు, నే నేడ? నాకర్మనియమ మేడ ?

గీ॥ అట్టి వానికి నింత మోహాంధకార,మజ్జనంబున నంధత ♦ మదినిఁ బొడమె
నితరు లన నెంత? మాయామహేంద్రజాల,నాటకంబు జగత్త్రియీనటన నీకు.

వ॥ దేవా! యిక్కాసారంబున నవగాహం బొనర్చి మోహిద్దేహంబు నొంది మహి
ళాంగుండనై పౌలోమి వాసవుం బోలెఁ దాళధ్వజుం బరిణయించి తచ్చిత్తంబును
తద్దేహంబును రూపభేదంబకాని యొక్కటై యుండియు స్మృతినాశనంబు నొంది

భుక్తభోగనై విధిహీనభోజనంబులును సురాపానంబులును జేయుచు నెన్నెన్ని
బన్నంబుల నొందితి నిన్నియు నీమాయావిలాసంబులే కదా! యనిన జనార్దనుండు
నారదున కిట్లనియె. ౭౫౫

సీ॥ నారద! కంటివే నాదు మాయాశక్తి, నిఖిలజంతువులందు నిలచి వేఱు
వేఱుభేదంబులు వివిధభోగంబులు, గల్పించి భ్రాంతులఁ గలయఁగూర్చి
జాగ్రదాదులయందు సందీక చక్రినే,మిక్రమంబునఁ జేతనక్రమంబు
నర్తింపఁజేతు నెవ్వాఁడు ప్రబుద్ధత, మోదించు వానికి లేదు మాయ,

గీ॥ మూఢుఁడగువాఁడుగనలేక గాఢమోహ,మగ్నుఁడై సుప్తు పోలికమఱియుమృతుని
తెఱఁగునను మాయతోఁగూడుగ్రదెంపలేక, వీడఁడితనంపుఁజెయ్వులువిడువలేఁడు.

సీ॥ గజము మర్దింపంగఁ గడగె నెందేనియుఁ, బరువెత్తఁజాల నప్పగిది మనుదు
ననియుఁ జచ్చినతండి ననుఁ జూడ నాయింటి,కరుదెంచె నని, విందులారగించెఁ
దెల్పితినని, పత్నిదివ్యభూషణముల, వర్తిల్లె దేవతాంగనవితఁబోలె
ననియును, దనుపార ధనము నాయిలునిండఁ, గలిగెనం చని, కలల్గాంచి లేచి

గీ॥ యెద్దియును లేక వలవంతనేవగించి, మూఢుఁడగువాఁడుదుఃఖంబుగ్ మొనయుచుండు
జ్ఞానియగు వాఁడు మిథ్య లీస్వప్నములని, జాగ్రదాదులఁ దెల్పితోఁ సంచరించు.

గీ॥ మాయ యనఁగఁ బరాశక్తిమాయవిధముఁ గనుట దుర్ఘట మేనునుగరళగళుఁడు
నిన్నుఁ గన్నట్టివేల్పునమున్నె యెఱుఁగ, మనఁగ నన్యుల కెఱుఁగంగనగునెవత్తు!

ఉ॥ స్థావరజంగమాత్మకము సర్వముఁ దద్గుణకల్పితంబు మా
యానశవర్తి సంసృతిగుణాత్ములమై జగముల్ సృజింపఁగాఁ
బ్రోవ నడంపఁగా గరిమఁ బొందిన మేమును గాన మెచ్చుటల్
వావిరిఁ దద్విహీనుఁడగువాఁడు జగంబుల లేఁడు నారదా! ౭౫౬

ఆ॥ నేఁడు మాయఁగంటి నే నను వెట్టి నీ, కేల పొడమె ? నో మునీంద్ర! యెదియు
మాయగాదె? జగముమాయామయంబని, తెలియువాఁడెపరముఁ దెలియువాఁడు.

క॥ ఆయెడఁ బ్రసంగవశతన్, మాయామహిమంబు విని యమానుష తేజః
స్థాయి యగు నారదుం గని, నాయిచ్చినప్రశ్న వినుము నరనాథమణీ! ౭౬౧

ఉ॥ నారదుచేత నే వినిన నాఁటనుగోలె మనమ్ములోన మా
యారుచిరప్రభావము భయంకరమై యెరియింపఁజొచ్చె నె
వ్వారికి నెంతవారికి నపారము గావున నమ్మునీంద్రు ఫ
త్సారసముల్ దలంచుచును దత్వము దెల్పెద విన్ము క్ష్మానాథా. ౭౬౨

ఆ॥ మానిచంద్రి! నీదు ఽ మాయామహత్త్వంబు, వినిన యంతనుండి ఽ విహ్వలించి
మనము సంచలించె ఽ మఱియును దత్కథ,వినఁగఁ గౌతుకంబు ఽ విస్తరిల్లె. ౨౬౩

ఆ॥ అనుచుఁ బ్రశ్న సేయ ఽ నవనీతలాధిప !, దేవమాని నాకుఁ ఽ దేటపఱచు
నయ్యుదంత మిప్పు ఽ డంతయు వివరింతు, విను మటంచు మానిఽవిభుఁడు పలికె.

క॥ గరుడధ్వజుండు వేడుక, గరకొన వైకుంఠమునకుఁ ఽ గదలెడుతఱి నన్
గరుణామయదృష్టులఁ గని, వరదుండై పలికె మానిఽవల్లభ! నీవున్. ౨౬౫

ఉ॥ ఏ వైకుంఠముఁ జేరఁబోయెదను నీఽయిష్టంబు నాతోడుతన్
రా వాంఛించెద వేని రమ్ము మఱియున్ ఽ బ్రహ్మవలోకస్పృహన్
బోవాంఛించెద వేని పొమ్మనిన నంఽభోరాశితల్పున్ గడున్
భావాంభోజమునందు నిల్పికొని దేఽవున్ మ్రొక్కి తత్సన్మతిన్. ౨౬౬

సీ॥ జలజసంభవుఁ గాంచు ఽ సంతసంబున నేను, జనితి వైకుంఠంబు ఽ చనె యథేచ్ఛ
నేను దండ్రినిఁ గాంచిఽయెదఁ గ్రమ్మ సద్భక్తిఁ, బాదాంబుజములకుఁ ఽ బ్రణతిసల్పి
మదిఁ గలంచుచునున్న ఽ మానినీజన్మసం,భవదుఃఖవేదన ఽ బడలుపడుచుఁ
జిన్నఁబోవుచు నున్న ఽ నన్నుఁ గన్గొని నల్వ, యెందుఁబోయితివి నీఽయెడ విచార
గీ॥ భావపరిభూతిఁ గాంచంగఁ ఽ బడియె నెందు, నేమివంచన నొందితో? ఽ యెందులేని
యద్భుతముఁ దిలకించితోఽయపగతాత్మ, సంవిదుఁడువోలె నున్నావుఽసంయమీంద్ర!

ఉ॥ నా వుడుఁ దండ్రిఁ గాంచి మది ఽ నాటిన పూర్వజనుస్సముద్భవో
ద్భావిత మాత్మవృత్తము యఽథావిధి విన్నప మాచరించి మా
యావిభవంబు పెంపుఁ గన ఽ నబ్బురమయ్యె మదీయచిత్త మీ
డావహమై నన్ గలఁచె ఽ నక్కట! విభ్రమ మొంది కుందుదున్. ౨౬౭

ఆ॥ దురవగాహమనుచుఁ ఽ దోఁచె మాయాబల, మెటుల దానిఁ గందుఽ నెటులు గడతు
నయ్యుపాయ మిప్పు ఽ డనువొంద వివరించి, తేటపఱుపవలయు ఽ దేవదేవ! ౨౬౮

సీ॥ దీనాననుండనై ఽ తెలిపిన ననుఁ జూచి, మందహాసముఖారఽవిందుఁ డగుచు
మాయ దుర్జయ మది ఽ మానులకును యోగ,నిరతులకును గాంచ ఽ నరిది యేను
మురవైరి రుద్రుండు ఽ మొదలగువారము, కనలేము దుర్జ్ఞేయ ఽ గాదె? కాల
కర్మస్వభావాదిఽకారణంబుల భూత,కోటుల నెల్లను ఽ గుందఁజేయు
గీ॥ సుఖము దుఃఖంబు ననియెడు ఽ చొప్పులేద, యెల్లయెడలను దానయై ఽ యేకధాటి
జంగమస్థావరాత్మక ఽ జగములందు, విశ్వరూపిణియై తాన ఽ విస్తరించు. ౨౭౦

క॥ విస్మయ మందఁగ నేటికి, నస్మత్ప్రముఖామరులకు నవిభేద్యము త
ద్ఘస్మరతఁ జెందనలవియె, నస్మితుఁడై యరయవలయు శాంబరివృత్తుల్. ౭౭౧

ఉ॥ ఏటికి విస్మయంబు మది నించుక యేనియు సంశయింప కు
త్పాటితసంసృతిభ్రమతఁ బాటిలి యాత్మసుఖోపభోగివై
హాటకశైలముఖ్య కుధరారాశి మసీమఁ దపించుచు న్నిరా
ఘాటమనస్కతన్ గను మఖండసుఖస్థితి నాత్మసంభవా! ౭౭౨

ఆ॥ నలువ యిట్లు బోధ గాలిపిన మదిలోని, సంశయంబు లెల్లఁ జక్కఁజేసి
నిరతతీర్థవాసనిపుణత వర్తింతుఁ, గాన నీవు నటులె కనుము సుఖము. ౭౭౩

శా॥ భోక్తవ్యంబు కృతంబు తప్ప దది యంభోరాశిలోఁ డాఁగినన్
వక్తవ్యంబు త్రియాగతార్థము మనోభావానుబంధంబుగా
సక్తిన్ జెందక సంసృతిన్ భ్రమనిరీక్షాశిక్షణోత్సాహివై
ముక్తిస్వస్థసుఖోపలంభకలనామూలంబు సాధింపుమీ. ౭౭౪

ఆ॥ ఇట్టి కీలుఁ దెలిపి యెందు నేనియు దేవ, మాని చనియె నేను మనసుగుదిరి
యెలమితోడఁ గాల మేగింప నిబ్భాగ, వతముఁ జేసినాఁడ వసుమతీశ! ౭౭౫

సీ॥ బహువిధాఖ్యాన సంబంధగంధిలము వే, దసమాన మద్వైతరసనిబంధి
దేవీమహత్త్వ సందీపితంబు పురాణ, రాజంబు మునిమనోరంజనంబు
మాయాప్రవర్తనోన్మథన సాధనముఖ్య, మపవర్గభోగనిర్వ్యాజదాయి
పఠనపాఠనమాత్రభరితవిజ్ఞానంబు, పరతత్త్వవివృతి యీభాగవతము

గీ॥ పరమపావన మీకృతిప్రకరణమున, మాయ జంజాట మెల్లను మాయమయ్యె
మనము హర్షించెఁ జింతలు మాటుపడియె, సంశయము లెల్ల సడలె నోజనపతీంద్ర!

వ॥ కావున సర్వేశ్వరుం డగు చతుర్భుజుండు తురంగరూపంబున హేయవృత్తి నెట్లు ప్రవర్తించెనని యనసంబనిలేదు; దారవంబగు పాంచాలికం జేకొని వర్తించు మహేంద్రజాలికుఁ బోలె, సదేవాసురమానుషంబును బంచేంద్రియసమాయుక్తంబును, మనశ్చిత్తానుబంధంబును, నగు బ్రహ్మాదిస్తంబపర్యంతంబైన స్థావరజంగమాత్మక ప్రపంచంబున వ్యాపించి యమ్మహామాయ నటించు, గుణత్రియం బింతటికిఁ గారణంబు, భిన్నభిన్న భావంబుల గోచరించు గుణంబులు మాయికంబులు, గుణవిహీనం బెద్దియుఁ గనంబడదు, కలిగె నేనియుఁ దంతురహితపటంబును మృద్రహితఘటంబును నగుం గదా! దేవమనుష్యతిర్యగాదులగుణరాహిత్యంబు గందుమే? మూర్తిత్రియంబు సగుణంబు, తత్తద్గుణంబులఁ గాలవశంబున సంచరించుట వినమే? వారును నానాకృ యెడల భిన్నగుణాశ్రియులై భిన్నభిన్న

గుణంబులు నెఱపుట శ్రుతిప్రసిద్ధంబే కదా! ఇతరు లెంతవారు ? సర్వంబును మాయాధీనంబు, విష్ణుండు బహురూపధారియై కల్పకల్పంబుల విన్మాత్ర సంకటంబులఁబడి గర్భవాసదుఃఖం బనుభవించుట యోగనిద్రారూపిణి యగు మాయాశక్తిమహిమం బని యెఱింగి నిశ్శంకుండవై సర్వంబు పరతంత్రంబని సావధానచిత్తంబున వసింపుమని తెల్పి, నీవు సేయుప్రశ్నంబునకు సముత్తరం బిట్టిదని యెఱింగించి, సకలకథాసారభూతంబును నిగమతుల్యంబును బ్రమాణానువిద్ధంబును నగు నిబ్భాగవతంబు పరమభక్తిసంపన్నుండవై వినుచున్నవాఁడవు. నీకు నిహపరంబులఁ గొఱంతయుఁగలదే. ౭౭౭

క॥ అని బాదరాయణుఁడు దెల్పిన విని జనమేజయుండు సంప్రీతుండై య
మ్ముని నవ్వలి కథ యడిగిన, వినిపింపఁదొడంగెఁ బూర్వసవృత్తంబనుచున్.

మ॥ ధరణీస్యందనఖేలనప్రకట నోద్ధత్య ప్రచండత్రిపూ
స్సురభిద్భేదనమోటితత్రిజగతీసస్ఫూర్జత్స్తుతివ్రాత బం
ధురసంసన్మణిపీఠపుణ్యాచయవసన్మూర్తి భవదూప్రభా
స్వరలీలామహిమానుభావ విజయసవ్యాపారధీధూర్వహా. ౭౭౮

క॥ కల్పాంతవిజయ భేరీ, కల్పానల్పప్రణాదసఘంటారవ సం
కల్పితశబ్దబ్రహ్మా, స్వల్పవ్యాపన సమస్తసర్గోల్లాసా. ౭౭౯

కవిరాజ విరాజితము.

జయజయ సూర్యశశాంక ధనంజయ, చారువిలోచనసచంక్రమణా
జయజయ దానవశాసనదుర్దమ, శాశ్వతవిక్రమసచంక్రమణా
జయజయ తాపస సంస్తుతిభాజన, శాంతజనావస శైలశయా
జయజయ భూధరచాప నివర్తిత,సర్వచరాచరజాలభయా !. ౭౮౦

క॥ దేవీభాగవత స్కంధావళి షష్ఠ మిది యచ్చమాంబా జగ్గ
క్ష్మావరుల కభీష్టార్థ , శ్రీవెలయఁగఁ జేసి సుప్రసిద్ధిం జెందున్. ౭౮౧

గద్య

ఇది శ్రీమత్పరమశివాద్వైత భావనాసాధ్య ములుగుసదన్వయ సిద్ధ సారస్వత విద్యాసాన్నిధ్య వేమనారాధ్య వంశార్ణవ కళానిధాన పాపయారాధ్యాభిధాన ప్రణీతంబైన శ్రీ దేవీభాగవతం బను మహాపురాణంబునందు షష్ఠస్కంధంబు

సంపూర్ణము.

శ్రీదుర్గాదేవతార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ



## షష్ఠస్కంధము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪ | ౨౭ | మత్తర్త | మత్తచేశ |
| ౬ | ౨౧ | వ్యాపార | వ్యాహార |
| ౯ | ౨౬ | నాదు | నాడు |
| ౧౭ | ౪ | దోహములు | దోహము |
|  | ౨౨ | రుద్యదా | రుద్యతా |
| ౧౮ | ౬ | సరసురా | సర్వసురా |
| ౧౯ | ౧౪ | కృద్దతు | కృద్దీతు |
| ,, | ౧౬ | చకచ్చక | ఁజకచ్చక |
| ౨౦ | ౫ | వలయుఁబ | వలయుప |
| ౨౫ | ౨౨ | వధ్యుండు | వధ్యుండఁ |
| ౩౫ | ౧౦ | నర్చించు | నర్చింపు |
| ౪౫ | ౧౧ | దేవాసుర | సదేవాసుర |
| ౪౭ | ౩ | రాజ్యంబు | రాజంబు |
| ౫౨ | ౫ | తపస్య | తపస్వ |
| ౬౬ | ౧౧ | భావించు | పాలించు |
| ౬౮ | ౨ | దని | దన్ని |
| ౮౮ | ౨౭ | పాండ | పాండు |
| ౯౦ | ౧౯ | మెల | మెల్ల |

షష్ఠస్కంధమునందు 2 వ పుటలో—

ఉ॥ దైవతపత్నుఁడు, అను పద్యము చక్కఁగా సమన్వయించుట లేదు. ఈ సంగతి యిటీవల గోచరించినది. ఇట్టి వింకను మఱికొన్ని యుండకపోవు. విచక్షణులగు సంస్కర్తలు పునర్ముద్రణమునం దా యీ లోపములు దీర్పఁగలరు — శక్తి తగ్గిన వార్ధక్యములో నుంటచే—

"మహత్సు విధినా భారోఽయ మారోపితః

ఇట్లు,
సంస్కర్త,
వెం. శా. శతావధాని.

శ్రీ ర స్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ శారదాంబాయై నమః

శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము – శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## సప్తమ స్కంధము



గుణరాగ పరీమళ
యోగ ప్రదమై సుఖానుభోగ్యము దేవీ
భాగవతంబున సప్తమ
భాగము కీర్తిప్రధానప్రభావం బలరున్

క॥ శ్రీకరకరుణా వీక్షా, నేక! జగద్రక్షణావిశేషధురీణా
నాకౌకస్తటినీధర, రాకాశశిధవళకాయ భ రక్షోఽపాయా? ౧

వ॥ దేవా! సకలపురాణేతిహాసకథాసుధాస్వాదననిస్తంద్రులగు నమ్మునిచంద్రులకుఁ
దన్మనోరథరథచోదనాసూతుం డగు సూతుం డిట్లనియె. ౨

శా॥ శ్రీవాణీగిరిజాస్వరూపముల నర్థిం దాన యిల్లాలునై
భావోద్భూతి జనార్దనాబ్జజహరోద్భాసంబు గావించి త
త్ప్రావీణ్యంబున లోకపాలన మొనర్పం జాలు నద్దేవిచే
ష్టావాల్లభ్యము పౌరుషోత్సవదమై సంధింప నే మ్రొక్కెదన్. ౩

సీ॥ ఏదేవి బ్రహ్మాచ్యుత శేశుల సృజియించుఁ, బ్రతికల్పమున గుణత్రయమువలన
సృష్టిస్థితిధ్వంస శేముషీపటిమంబు, వారల కొసఁగు నే వనజనయన
బ్రహ్మాండనిర్మితి త్రైవిధ్యమునఁ బరాత్పరుని కేబోటి సంతతస మొనర్చు
భారతీగిరిసుతా భార్గవీరూపంబు, లొంది యేదేవి పెంపొలయుచుండు

గీ॥ నట్టి జగదంబ శాంకరి యాదిశక్తి, శాంతిరససౌఖ్య మొనరించి సంతసమున
మమ్ము నేలెడుఁగాత సంభావ్యమాన, పౌరుషార్థచతుష్టయ ఫలము లొసఁగి.

వ॥ ఇట్లు నమజ్జనదుర్జనదురితలతాలావిని యగు పరదేవిని భజించి.

ఉ॥ గంధవతీతనూజముఖ గంధిల దివ్యకథాసుధాప్లుతిన్
సంధిలు సంతసంబు మది సందడిఁ బెట్ట నృపాలమాళి క
ర్మందివరేణ్యుఁ గాంచి గరిమన్ మృదువాగ్రచనాచమత్క్రియా
సంధిత వక్త్రమాధురి నసంశయచిత్తతఁ బల్కె నిట్టులన్ ౬.

చ॥ రవికులజాతులైన నృపరాజుల వంశకథాప్రసంగ సం
శ్రవణమునన్ మనంబు సుఖసంస్తుతమయ్యె సవిస్తరంబుగా
భవదతులప్రసంగగతి భావుకచంద్రకులాధినేతృరా
జవరచరిత్రయున్ వినఁగ స్వాంతము పల్లవితత్వ మొందెడిన్. ౭.

క॥ దురితధ్వంసక మగు నీ, చరితము వివరించి మదికి సంతసమిడి స
త్కరుణాభరణత నన్నున్, జరితార్థక్రియునిఁ జేసి సన్నుతిఁ గనవే? ౮

చ॥ అని జనమేజయుండు వినయావనతుండయి పల్క వ్యాసుఁ డ
జ్జనపతిఁ జూచి సంతసము సంధిల నోషధిపాలవంశపా
వన! భవదీప్సితంబయిన భవ్యచరిత్ర శ్రవస్సుఖంబుగా
విను వచియించువాఁడ నని వేడ్క నుదాహృతి సల్పె సత్తతిన్. ౯

సీ॥ నారాయణస్వామి నాభికంజంబునఁ, జతురాననుం డాది సంభవించె
తప మొనరించె నుద్ధతి మహామాయను, మదిలోన నిల్పి యమ్మలికమాని
దేవి యాతని తపస్స్థితికి మెచ్చి ప్రసన్న, యై సృష్టికర్తృత్వమతని కొసఁగఁ
చెలఁగి మానవసృష్టి నేయనేరక చాల, వెతఁబడి యంబికా విమలకరుణ

గీ॥ మానసికసృష్టిఁ జేసె నసమానశక్తి, నది జగత్త్రితయోద్భవాస్పదతఁ గాంచెఁ
దత్ప్రకారంబు వివరింతు ధరణినాథ, విను సవిస్తరముగ వచో విమలఫణితి.

వ॥ మరీచియు, నంగిరస్సును, నత్రియు, వశిష్ఠుండును, పులహుండును, క్రతుండును,
పులస్త్యుండును, నను నందన సప్తకంబు సృజియించె, రోషంబున రుద్రసంభవం
బొనర్చి యుత్సంగంబున నారదుఁ బాదాంగుష్ఠంబున దక్షుని నిర్మించి, మఱియు

సనకాదుల మనంబునం బొడమంజేసి, వామపాదాంగుష్ఠంబున సర్వాంగసుందరి యగు వీరిణి యను దక్షపత్నిం బుట్టించి, తద్గర్భంబున నారదునకుఁ బునరుత్పత్తి సంఘటింపఁజేసె ననిన విని జనమేజయుండు గంధవతీనందనుంగాంచి విరించిసంభవుండగు నారదునకు దక్షపత్నీసంభూతి సంభవించుట కెద్ది కారణంబు ? పూర్వదేహం బెట్లు విముక్తంబయ్యె ? మహాత్ముల శాపకారణంబుననో ? నిమిత్తాంతరంబుననో ? నారదునకు జన్మాంతరంబు సంభవించుట వినవలతుం జెప్పవే యని యడిగిన బాదరాయణుం డిట్లనియె. ౧౧

ఉ॥ వారిజసంభవుండు నిజశాసవర్తన దక్షు సృజించి సృష్టి సం
భార మొసంగి భూతతతి శ్రీ మత్కృప సృష్టి యొనర్పుమన్న సం
పూరితసృష్టికర్తృత నపూర్వబలుఁడయి సృష్టిసల్పె నా
ప్వార సహస్రపంచకము శ్రీ పట్టుల వీరిణియందు దిట్టలన్. ౧౨

ఉ॥ వారలఁ జూచి నారదుఁ డవారణ కాలకృతానుభావ సం
పేరణ సృష్టికామత నభీతిఁ జరింపగనేల మీకు ని
ద్ధారుణియెల్లఁ జూచి క్షితిధర్మము లెల్ల నెఱింగి లోకని
ర్ధారితచిత్తులై సృజనఁ శ్రీ దప్పకఁ జేసిన సిద్ధిఁ బొందెదర్. ౧౩

గీ॥ భూతకోటి పరిమాణంబు శ్రీ భూతధాత్రి, మానమును గాంచి సృష్టిసంబంధులైన సిద్ధిఁగాంచెదరని పల్కఁ శ్రీ జిత్తములను, సంతసిలి వార లన్యోన్యసహితు లగుచు.

చ॥ సురమునిపల్కు సత్యమని శ్రీ చూచుచు దైవవశంబునన్ బర
స్పరముఁ దదర్థనిశ్చయము శ్రీ సల్పఁగఁగోరి దృఢైకచిత్తులై
ధరణిఁ జరింప సంతసము శ్రీ దట్టి యథేచ్ఛల నేగి రందఱున్
ద్వరపడి పూర్వపశ్చిమపథంబుల నుత్తరదక్షిణాదులన్. ౧౪

సీ॥ దక్షుఁ డత్తెఱఁ గెల్లఁ శ్రీ దప్పక తిలకించి, దుర్బోధ మొనరించి శ్రీ దుష్కృతమున నారదుం డిట్టు లన్యాయంబుచే దన, పుత్రుల నెడఁబాపి శ్రీ పోయెననుచు మదిలోనఁ జింతించి శ్రీ మఱియు నందనులను, నట్టులఁ గని వారి శ్రీ నభినవముగ సృష్టి నేయుఁ డటంచుఁ శ్రీ జెప్పిన నారదుం, డప్పటిపోల్కి వారందఱకును

గీ॥ భూపరిమాణంబు దెలిసి యప్పుడు సృజింప,సిద్ధిగాంచెద రని తెల్ప శ్రీ సృష్టిమాని చనిరి యన్నలపోలిక శ్రీ సకలదిశల, నది యెఱిఁగి దక్షుఁ డతనిపై శ్రీ నాగ్రహించి.

గీ॥ నాదునందనకోటి నన్యాయపథము, నొంది యెడఁబాపి తీవు నిష్పందవృత్తి గాన నిర్దేహివై పునర్గర్భవాస, మొందుమని శాప మొసఁగె నసూనవృత్తి.

క॥ పుత్రులఁ గాంచిన తన్ను న,పాత్రత్వము నొందఁజేయఁ శ్రీ బాడియె? దానన్ బుత్రుఁడనై వేగమ మ, త్క్షేత్రంబునఁ బొడము మనుచుఁ శ్రీ గినిసి శపింపన్.

క॥ అది కారణమున నారదుఁ, డుదితుండుగావలసె దక్షునకనువిదకు; దక్షుం
డది మొదలుగ పుత్రికల న,ర్వదిసంఖ్యం గాంచె రూపవతుల ధరిత్రిన్. ౧౯

వ॥ మఱియు వీరిణీ గర్భసంభూత లగు పుత్రికలను బదమువ్వురను గశ్యపునకు నొసంగి పదుండ్రి ధర్మునకు నిచ్చి యిర్వదేడ్వుర సుధాంశున కర్పించి యిరువుర భృగువునకు నిడి నలువుర నరిష్టనేమి కొప్పించి నిద్దర నంగిరస్సునకు నుద్వాహింపం జేసి మఱియు నిరువురను గాలాంతరంబున నయ్యంగిరసునకే పత్నులంగా నొసర్చి సుఖం బుండెనని చెప్పి. ౨౦

సీ॥ ఆ సతీపతులందు నన్యోన్యరాగాను, వర్ధనంబున సృష్టి వసుధఁ బ్రబలె
పుత్రులై పౌత్రులై భువియెల్ల దక్షసృష్టి, వెలసె దిఙ్ముఖముల వేఱువేఱ
దేవదానవులందుఁ దెరల కన్యోన్యంబు, వైరులై పోరాట వదల కెపుడు
గెలుచుచు నోడుచుఁ గృతకృత్యతలులేక, విషువని మత్సరావేశములను

గీ॥ జన్మజన్మాంతరోత్సర్గసక్తు లగుచుఁ, బోరుచుండిరి యిది యెల్ల భువనజనని
మాయికోల్లాస మని నీవు మదినెఱింగి, సాక్షివై సంచరింపు మో జనపతీంద్ర.

క॥ జనమేజయజనవల్లభుఁ, డనువొందఁగ మౌనిఁ గాంచి యనియెన్ మఱియున్
వినఫలతు భానువంశ్యుల, ఘనచరితము మౌనిచంద్ర! కడుఁ గుతుకమునన్.

సీ॥ అని జనమేజయుండడిగిన బాదరా,యణుఁ డిట్టులనియె నయ్యధిపుతోడ
మునుపు నారదునిచే వినినట్టు వివరింతు, వినుము తద్వృత్తంబు విశదఫణితి
దివ్యసరస్వతీతీరంబునను బావ, నాశ్రమంబునఁ దపోభ్యాననియతి
నిశ్చలచిత్తత నేనున్న యెడ నబ్జ,సంభవాత్మజుఁడు మత్సన్నిధాన

గీ॥ మొనరఁ జేసిన సంతోషవినయకలన, నెదురుగాఁజని తోడ్తెచ్చి ముదముగదుర
నానవార్ఘ్యాదివిధులచే నర్చసలిపి, వినయ మలరంగ మ్రొక్కి యమ్మునినిఁ గాంచి.

ఉ॥ పావనమయ్యె నాశ్రమము భావుక మయ్యెను నాదుజన్మ సం
భావితమయ్యె మత్తపము భవ్యగృహారతి నిందు రాక మే
ధావిశిఖామణీ! నృపకథావిదితుండవు నీవు గాన మ
ద్భావము పల్లవింప రవివంశచరిత్రము లానతీఁగదే. ౨౪

క॥ ఏడవ మనువంశంబునఁ, బోడిమి నెవ్వార లుదయమును బొందిరి య
వ్వాడిమగల చరితంబులు, వేడుక విననగోరెనాడ వినిపింపు తగన్. ౨౫

ఉ॥ ఇట్టులు వేడ నారదుఁ డహీనమనస్కత నన్నుఁ గాంచి యి
ట్టట్టనరాని ప్రేమమున హాసము మోమున విస్ఫటిల్ల నీ

కిట్టి విశేష సంశ్రవణహేతుమనీష జనించెఁ గీర్తికిం
బట్టగు తత్కథార్థ వచనస్రమాధురిఁ గూర్చెద విన్ము వేడుకన్. ౨౬

క॥ నారాయణ నాభీనవ, వారిజమున బ్రహ్మవొడమె వసుధాముఖత
త్త్వారంభసర్గనోద్ధత, సారజ్ఞుం డగుచు సర్వశక్తిధరుండై. ౨౭

మ॥ పదివేలేండ్లు మహానుభావుఁ డయి సంభక్తాపసోద్వృత్తిచే
మది నైశ్చల్యము నొంద దేవికృప సంభావించి నిస్తారతిన్
విదితుండై పరశక్తి సత్కరుణచే విఖ్యాతచారిత్రులన్
ముదితోత్సాహులఁ బుత్రులన్ బడసె సంభూతిన్ మరీచ్యాదులన్. ౨౮

ఉ॥ అందు మరీచికిన్ గలిగె నద్భుతసృష్టికళావిచక్షణుం
డిందుసమానసుందరుఁ డహీనతపఃకలనాధురంధరుం
డుం దన తండ్రిఁ బోలిన పటుత్వమహత్త్వవిభాసి కశ్యపుం
డెందుఁ దదీయసద్గుణసమృద్ధి గనంబడ దేమి తెల్పుదున్. ౨౯

ఆ॥ అమ్మహానుభావుఁ డతిమనోహరగాత్రి,లైన దక్షసుతల నతిముదమునఁ
బదియు ముగురు సతులఁ బరిణయించెను వారి,వలన నయ్యె సృష్టి వర్ధనంబు.

ఆ॥ అమరు లసురవరులు యక్షులు పన్నగుల్, పశువు లండజములు బహుముఖములఁ
గలిగి యెల్లజగము లలరె నందియక, భూతకోటి భువనపూర్ణమగుచు. ౩౧

మ॥ అమరానీకములోనివాఁడయిన యయ్యంభోజమిత్రుండు దు
ర్దమతేజున్ మనువుం గనెన్ మనువు దర్పంబొప్పఁ బాలించుచున్
బ్రమదం బొప్పఁగఁ బుత్రునిం బడసె నిక్ష్వాకుం డనా సూర్యవం
శమహావర్ధనుఁడై చెలంగె నతఁ డాశాపాలనోల్లాసియై. ౩౨

వ॥ అమ్మహీపాలునకు నాభాగుండును, ధృష్టుండును, *సంయాతియును నరిష్యంతుం డును, ప్రాంశుండును, అరిష్టుండును, నత్తముండును, కరూశుండును, బృషధ్రుండును, నను తొమ్మండ్రు తమ్ములు, తత్తేజోవిశేషంబున జగంబెల్ల దురంత తేజోవిస్తారం బునం బ్రవర్తిల్లె, వారల వృత్తాంతంబు సంక్షేపించి వచించెద. నాభాగునకు ధర్ముండును, సత్యసంధుండును, బ్రజాపాలనతత్పరుండును నగు నంబరీషుం డుద యించె, ధృష్టున కుదయించిన సంతానంబు సంగ్రామకాతరంబై బ్రహ్మ ధ్యానంబునం బ్రవర్తిల్లె. సంయాతి యనువానికి నానర్తుం డను నందనుండును రూపలావణ్యసంయుత యగు సుకన్య యను నొక్క కన్యకయును జనియించిరి. అక్కన్నియ యంధుండగు చ్యవనునకుఁ బత్నియై పాతివ్రత్యమహిమంబున భర్తను సులోచనుం జేసెనని తెలిపిన నావృత్తాంతంబు విని జనమేజయుండు బాద

* టిప్పణి : సంయాతి, శర్యాతి—ఇవి రెండును నొక్కరికే నామము లని తెల్పెడి.

రాయణుం గనుంగొని రూపవతియు సలక్షణయు నగు నందనిని సంయాతి యంధున కెట్లొసంగెఁ? గన్యయు నెట్లు నంధుని వరించె? నిక్కారణంబు సవిస్తరం బుగాఁ దెల్పుమని యడిగిన ద్వైపాయనుండు ప్రసన్నుండై యిట్లనియె. ౩౩

గీ॥ అర్కవంశజుఁడైన సంయాతినృపుఁడు, సర్వలక్షణసుగుణసంపన్నలైన పణఁతులను నాల్గువేవురం బరిణయించె, నందు నొకబోటి కుద్భవంబందెఁ గన్య.

ఉ॥ కన్నియ రూపసంపద నఖండితమై పితృమాతృహార్దసం పన్నత ముజ్జగంబులను బ్రస్తుతి కెక్కిన సద్గుణంబులన్ మన్ననఁగాంచి దివ్యమహిమంబునఁ బిన్నతనంబునం దవి చ్ఛిన్నకలాకలాపమున శ్రీఁ దళుకొత్తె నెలంది మిన్నయై. ౩౫

సీ॥ అక్కన్నె యొక్కనాఁ డతిముదమ్మున జల, క్రీడావిలాసైకఖేలనమున వేడ్కొలంది నిర్వేల వైభవమున, నాళీజనావళు లలముకొనఁగఁ దాలతమాలతక్కోలపున్నాగవ,టాశ్వత్థ కదళీసమావృతంబు జంబీరఖర్జూరచలదళచంపక, కేతకీమధునారికేళవృతము

గీ॥ యూథికామల్లికాలతాయూథసుమస,నాథ, బహువల్లికాసముత్సేధకుంజ పుంజరంజిత మగు నొక్క మంజుసలిల,విమలకాసారతటి కేగె విభవమెసఁగ.

క॥ అక్కాసారముపొంతను, నొక్కండై చ్యవనుఁ డను భృగూద్వహుఁడు తపో ధిక్కృతసకలాశుండై, పెక్కేఁడులు తపమొనర్చు పేర్మిన్ నిలిచెన్. ౩౭

శా॥ ఆహారంబు పరిత్యజించి విగతవ్యాహారుఁడై తాపస వ్యూహంబుల్ మది మెచ్చఁ బ్రాణపవనవ్యూఢాత్మచిత్తాబ్జుఁడై యూహాపోహ లెఱుంగ కద్భుతతపస్స్యోత్సాహ సంరంభని ర్మోహుండై వసియింపఁ బుట్ట పెరిగెన్ మూర్తిస్ఫురన్మూర్తికన్. ౩౮

శా॥ చుట్టుం దీవెలుసుట్టి కుంజచయసంస్యూతంబుగా నుండుటన్ మట్టున్ మీఱి పిపీలికావితతి యస్మిన్ గుంపుగట్టంగఁ దా గట్టుగ్రంబు తపంబు సల్పుచు మనఃకంజాంతరబ్రహ్మాదృ గ్ఘట్టం బాంతరసంవృతం బగుచుఁ జోకక్కన్ మానీ వర్తింపఁగన్. ౩౯

ఉ॥ అత్తఱిఁ బుత్రికాసహితుఁడై చతురంగబలంబుఁ గూడి భూ భృత్తముఁ డేగుదెంచుటయుఁ బేర్మిఁ దనూజ సఖీసమేతయై క్రొత్తవిలాసముల్ నెఱపికొంచు సుమంబులు గోయుచున్ మహో ద్వృత్తరుశాఖలన్ గిప్పలు లెమ్మని త్రుంచుచు నచ్చటచ్చటన్. ౪౦

సీ॥ మహనీయమంజీరమంజులారావముల్, ఘలుఘల్లుమనుచు సంభ్రమములఁ జెలంగ
రత్నకీలితభవ్యనూత్నాభరణపాళి, దశదిక్కులను దళత్తళయనంగ
జిలిబిలిపల్కుఁ దేటలు గూడి దశనకాంతిచ్ఛటలును నిగన్నిగయనంగ
రవల యొడ్డాణంబు రమణీయఘంటికాగణవికాసము ఝణంఝణయనంగ

గీ॥ మేదినిఁ జరింప నిలిచిన మెఱుపనంగ, నంతటంతట వనమధ్యమాంగణమునఁ
గలయఁ దిరుగుచు నారాజకన్య చెలులఁ, గలసి యప్పుట్టచెంత కొక్కర్తు వచ్చి.

ఆ॥ వామలూరుసవిధవర్తిని యై దాని, పొడవుఁ జూచి మదిని బొడము వేడ్కఁ
జెంతఁ జేరి యొక్క ఛిద్రాంతరముఁ గని, యందు దివ్యతేజ మమరఁ గాంచి. ౪౨

ఉ॥ ఎద్దియొ? యిట్టి తేజము సమీహితమై చెలువొందెఁ జూడఁగా
గద్దఱి జ్యోతిరింగణము కైవడిఁ గాంచఁగ నయ్యె నంచు న
మ్మద్దియ కంటకం బెనసి మోహవశంబునఁ గన్నుదోయిపై
నెద్ది మెఱుంగ నెట్లొడిసి యేర్పడ నొత్తెను దైవవశ్యయై. ౪౩

ఉ॥ అంతఁ దపస్విపుష్పధనురంగనబోని నృపాలపుత్రికన్
జింత మునింగి చూచి వెతచే నతిశాంతుఁడు గాన బోటి! యీ
చెంతకు రాకు మేను మునిశేఖరుఁడన్ దపియించుచుంటి ని
శ్చింతుఁడ దూర మేగుమని చెప్పిన వీనుల నానదేమియున్. ౪౪

గీ॥ మాటిమాటికి రాజసోన్మాదమునను, గంటకంబుల నప్పుట్ట కసుఁ బెకల్చి
తపసిగా నెంచి యచ్చోటు దఱలి చెలులఁ, గూడి విహరించె నవ్వనీకుంజములను.

క॥ అద్దురితము రాజునకును, ముద్దియలకు నశ్వకరిసమూహంబులకున్
గద్దఱిభటబృందములకుఁ, దద్దయు మూత్రావరుద్ధతను గలిగించెన్. ౪౬

ఉ॥ సేనలనారు రాజునకుఁ జెప్పినఁ దానును బత్నులున్ గడున్
సైనికులున్ వ్యథన్ బడుట స్వాంతమునందుఁ దలంచి చింతలో
నూని యిదేమి యొక్కొ? విధియోగము సంగత మయ్యె నంచు శం
కానియతాత్ముఁడై కలఁగి క్రిచ్చఱ నిట్లు దలంచె రా జొగిన్. ౪౭

సీ॥ పరివారసంయుక్తిఁ బట్టణంబున కేగి, చింతార్తుఁడై పరీక్షించి హేతు
నిశ్చయం బెఱుఁగక నిర్నిమిత్తంబైన, నిష్ఠురవ్యథ పుట్టె నిజ మెఱుంగ
నెట్లు సంభవమొందె నిద్దురితంబు? వాహ్యాళికై చనునవసరమున
సంభూతమయ్యె నచ్చట సరస్థలిపొంత, భార్గవచ్యవనుండు పరమనియతి

గీ॥ తపము సేయుచునుండె నత్తపసి కేమి, యడరుఁ బుట్టించిరో సైనికాదులెల్లఁ
దత్ఫలం బనితోఁచె నత్తపసిమహిమ, యెఱిఁగియున్నాఁడ రెండవయీశ్వరుండు.

క॥ అని నిశ్చయించి యెల్లరఁ, దనయొద్దకుఁ బిలువనంపి ఽ తాపసియెడ నీ
రును వెడలి దొసఁగు సేయుట, యనితోఁ జెప్పి నిజముఁ దెల్పుఁడని వచియించెన్.

ఉ॥ నందనిఁ జేరఁబిల్చి లలనాఽనా! వనవీథి విహారవేళ నా
నందము నొంది యెందయిన ఽ న్యాయము దప్పిన సేఁతఁ జేసితే
కొందలమంద నెల్లరకు ఽ ఘోరరుజోద్ధతి సంక్రమించె న
స్పందత నున్న రూపుఁ దెలుపఽందగు నంచని పల్కెఁ గన్యయున్. ౯౦

ఆ॥ పీడ్యమానమైన ఽ ప్రియజనంబును గాంచి, యడరుఁ జెందుతండ్రి ఽ నట్లు చూచి
చింతనొంది తానుఽజేసిన యపరాధ, మిటులు దెల్పె వినయ ఽ మెసకమెసఁగ. ౯౧

ఉ॥ ఏమని తెల్పుదాన వసుఽధేశ్వర! బోటులతోడఁ గూడి యా
రామవిహారముల్ సలుప ఽ రక్తివహించి చరించువేళ ను
ద్దామలతాప్రతానముల ఽ దట్టముగాఁ గడునల్లికొన్న య
చ్చో మది కద్భుతం బగుచుఁ ఽ జూడఁగ నొప్పిన పుట్టఁ గాంచితిన్. ౯౨

క॥ సుషిరద్వితయాన్వితమౌ, విషధరనిలయంబుఁ జూడఽవేడుక యొదవన్
బృషదశ్వభుగ్భయంబున, ధిషణాశూన్యనయి సవిధఽదేశస్థితిచేన్. ౯౩

సీ॥ వల్మీకరంధ్ర భాఽస్వత్తేజ మీక్షించి, ఖద్యోతవిభ్రాంతి ఽ గడలుకొనఁగ
నతిదీర్ఘకంటకఽహస్తనై యత్తేజ, మగలంగఁ బొడిచితి ఽ నంతలోన
కంటకం బార్ద్రమై ఽ కనుపట్ట దానికి, వెఱవక పొడిచితి ఽ వేడ్కఁగదిరి
అంత వల్మీక మఽధ్యంబున నాహాని,నాదంబు పొడమె నంఽతట మనంబు
ఆ॥ విస్మయంబు నొంద ఽ విడిచి దూరం బేగి, చింతనొంది వగచి ఽ చెప్ప వెఱచి
యున్నదాన నింతఽకన్న నన్య మెఱుంగ, నిది మనంబులోన ఽ నేపఁ జొచ్చె. ౯౪

మ॥ అనుచుం దెల్పిన పుత్త్రివాక్కులకు గోఽత్రాధీశుఁ డాత్మన్ భయా
వనతుండై చ్యవనాపరాధమని సంఽభావించి వేవేగ న
వ్వనికిం జేరఁగ నేగి శోకిలుచు నొఽవ్వం బీడితుండైన య
మ్మునివృద్ధుం గని దండవత్ప్రణతుఁడై ఽ మోమెత్తి కేల్మోడ్చుచున్. ౯౫

క॥ వినయావనతుండై కడుఁ, బెనఁగొను సాధ్వసము మదినిఁ ఽ బ్రేరేపఁగ న
మ్మునియెదురఁ గృతాంజలియై,జనపాలుఁడు వల్కె వినయఽసాధ్వసములతోన్. ౯౬

సీ॥ అపరాధినైతి నా ఽ యజ్ఞానమున నింత, యడరు సంభవమయ్యెఁ ఽ బడఁతి నాదు
కన్నియ వేఁదుఱుఽగదిరి దుష్కృత మిట్లు,చేసె బాలిక బాలఽచేష్ట దవిలి
సహియింపఁదగు మునుల్ ఽ సహజనిష్కృపులు, సాపరాధులయందుఁఽగోపమిడరు
మహిమాఢ్యులని [illegible] [illegible] లఽవ్వేఁదియెడల

గీ॥ కసరుమాసంగఁదగు మమ్ముఁ గావవలయు,
ననుచుఁ బలుమాఱు వేఁడుచు నభయ మభయ,
మనుచుఁ బ్రార్థింపుచున్న యయ్యధిపుఁ జూచి,
భార్గవచ్యవనుండు తాఁ బలికె నిటులు.

మ॥ ధరణీవల్లభ! దైవయోగమునకున్ దప్పేమి? నా కెట్టులి
వ్వరుసన్ సంఘటితంబు దుఃఖము; జరాభారంబు పెల్లయ్యె ని
ష్ఠురమై యంధత వాటిల్లె రుజయుఁ దోడ్తో మై విరాళించె సం
చరణోత్సాహము దప్పె నింకెటు తపశ్చర్యాస్థితుల్ వర్ధిలున్. ౬౮

గీ॥ నాదుపరిచర్య సేయంగ మీఁద నింకఁ, గలరె యెవ్వారలైన నేఁగతిఁ జరింతు
మొదలముదుసలినై యుంటిమొనసియాంధ్య,గతియొదవెనెట్లుసహియింతుఁగాలగతిని

గీ॥ అంతరాయంబు సంభవమయ్యెఁ దపము, సలుపుటకు నెద్దిగతి యనిచాలవగచు
పారికాంక్షివతంసుతోఁబలికె నృపుఁడు, మీదుపరిచర్య కింతేల మెచ్చొనర్ప.

ఉ॥ వేలకొలంది సేవకుల వేడుక నిల్పెద మీదుచెంత; ని
ర్వేలమనస్కులై నిలిచి విశ్రుతవృత్తి వసింపుఁడన్న నిం
తేల! మదీయరక్షణ ముపేక్ష యొనర్పక చేసెదేని నీ
బాల నొసంగు మప్పడఁతి పజ్జ వసించు మదీయసేవకున్. ౭౧

గీ॥ సాధకతఁ గాంచెనేని మజ్జపతపములు, సానుకూలతఁగాంచు నేయ్యమున నిట్లు
సంతసమునొందిమ త్తపస్సఫలతకును,దోడుపడుమన్న మదిశంకలుదుఱఁగలింప. ౭౨

వ॥ అమ్మహీపాలుండు తపస్వివచనంబు లాలకించి శంకించుచుఁ గన్నియ నొసంగ
కున్న నిత్తపసి శాంతివహింపండు మదీయసంకటంబు నివర్తింపనేరదు. వృద్ధుం
డును, గురూపియు, నంధుండును నగు నిమ్మానికి దేవకన్నియంబోని నందని
నెట్లొసంగుదు? నెఱింగియు సంసారసుఖాభిలాషిణి యగు నిప్పడంతి యంధునిం
జేకొని పంచబాణ శరార్దితయై కాలం బెట్లు గడపు? వృద్ధుం డగు గౌతముం బరిణ
యించి సుందరియగు నహల్య వాసవవంచితయై ధర్మవిపర్యయంబునఁ బతిచే శపి
యింపంబడియెఁగాన నంధుం డను నంధువున బాలం బడందోచి యెట్లు తరింతు?
రాజ్యభ్రంశంబైనను సహించెదంగాని యియ్యంజాలనని విమనస్కుండై పురంబున
కరిగి మంత్రులం బిలిపించి యిట్లనియె. ౭౩

ఆ॥ సచివులార! యిట్టి సంకటంబు పొసంగె, ననుచు నంతయును యథార్థముగను
మంత్రులకును దెలుప మహిపతితో వార, లిట్టు లనిరి విను మహీనగరిమ. ౭౪

గీ॥ దుర్భగుండైన తపసికిఁ దోయజాక్షి, నందని నొసంగుటెల్ల నన్యాయ్య మనరె
జను;లెఱింగియు నిటులేలసలిపెదనుచుఁ, దెలిపి రవ్వార్త వినిపుత్రి దీన యగుచు,

సీ॥ తండ్రిసన్నిధిఁజేరి తగునె నీ కిటులేల, రాజకన్యలు మునిరాజులొద్ద
పరిచర్య సల్పరే? బ్రహ్మణ్యమూర్తియా, నవమాని చెంత నే నధివసింతు
మత్కృతంబగు వెత మాన్పంగవలవదే?, యిట్టి విషాద మింక కేటికయ్య!
అర్పింపు మతనికి నహరహంబును బరిచర్య సేయుచునుండు సందియంబు

గీ॥ వలవదంచును నిశ్చయవాక్యసమితిఁ, దండ్రి కెఱుగంగఁజెప్ప భూధవుఁడు వగచి
ఆత్మనందనిఁ జూచి యిట్లనియెఁ దల్లి, యెట్టు లిచ్చెద నంధున కేను నిన్ను! ౬౬

ఉ॥ వింటిరె మంత్రులార! పృథివీసమ శాంతి వహించి కన్య యి
ట్లంట సహింపఁజాల విసయమ్మున వశ్యుఁడు గాఁడు మౌని యీ
కుంట మహాపరాధ మగు నొచ్చెము సంఘటియించునంచు లో
నంటిన నెవ్వగం బొగిలి యాత్మజఁ గాంచి వచించె రాజొగిన్. ౬౭

మ॥ మరునిల్లాలికిజోడు నీ చెలువు సామాన్యంబు గాదమ్మ! ని
ర్భరమోహంబునఁ బెంచినాఁడను జగత్ప్రావీణ్యదోర్విక్రమ
స్థిరసంపత్ప్రవణుంఁడుగా నెఱిఁగి యర్థిన్ రాజకుమారున్ మనో
హరుఁ దోడ్తెచ్చి యొసంగఁగాఁ దలఁతు నమ్మా! యిట్లు నీ కేటికిన్? ౬౮

క॥ అంధునకుం బరిచర్యా,బంధంబున కెట్లు నిన్నుఁ బొల్పఱతు దయా
సింధువు లగు రాకొమరులు, గంధేభసమానయాన! కల రీభువిలో. ౬౯

ఆ॥ క్రోధనుండు వృద్ధుఁ డొక్కరి సేఁతల, బడుగు తపసి కెట్లు పట్టి! నిన్ను
నొప్పగించి వెతలఁ గూర్చెద? నే నింత, సేయఁజాలనమ్మ! చిన్నికూన! ౭౦

మ॥ ధనధాన్యాదిసమృద్ధులై క్షితితలోద్దామైకసౌఖ్యక్రియా
ఘనులై చెల్వగు రాకుమారకుల నీకై తెచ్చి నే మెచ్చు న
జ్జనపాలాత్మజుఁ గూర్తుఁగాని వనిలో సన్న్యాసియై యున్న య
మ్మునికే నిత్తునె? నూఱులాఱులైనన్ ముగ్ధాక్షి! సైరింపుమీ. ౭౧

సీ॥ శాతకుంభస్తంభసౌధంబులా? కావు, కఠినవల్లీకుడుంగములు గాని
వేణువీణాస్వానవివరణంబులుగావు, వ్యాఘ్రాదివనమృగధ్వనులు గాని
రసవదన్నాదితర్పణసుఖంబులుగావు, కందమూలాదిభక్షణలుగాని
సరసతల్పోత్సంగశయనసౌఖ్యముగాదు, ప్రస్తరతల్పానుభవమెకాని

గీ॥ వికటఖరకులపరివారవితతిగాని, పరసఖీజన కేళికాభరము గాదు
ఇట్టి సుకుమారమూర్తి వీ వెటులు చటుల, గిరితటుల నుండఁగా నిచ్చగింతునమ్మ!

క॥ సేనాసంక్షయమైనను, గానిమ్ము మదీయవిభవగౌరవవిహతుల్
గానిమ్ము నిన్ను నంధున, కే నీయఁగఁజాల మృతికినేని సహింతున్. ౭౩

ఆ॥ మేను పోవనిమ్ము మేదిని పోనిమ్ము, సహజసౌఖ్యమెల్ల నడలనిమ్ము
చీఁకువాని కిచ్చి చిన్నినాతల్లి! నే, నోర్వఁజాల వేయియుక్తులేల? ౨౪

చ॥ అని బహుభంగులన్ గనుల నశ్రులు వెల్లువ గట్ట నందనిన్
దనమెదఁ గౌఁగిలించుకొని తద్దయుఁ బ్రేమభరంబు సైఁచలే
కనుచితవృత్తికిన్ జొరనటంచను తండ్రిని గాంచి కన్యకా
జనతిలకంబు పల్కెఁ సరసవప్రథమానవచశ్చమత్కృతిన్. ౨౫

శా॥ అన్నా! యిట్టులు పల్కనేల? నను నీవర్పింపు మమ్మౌనికిన్
గన్నుల్ చల్లఁగ నమ్మహామహుని జోక న్నే వసింతున్ మదిన్
జిన్నంబోవఁగ నేల! నా కొఱకునై చింతింప కొప్పింపుమీ
నన్నున్ మౌనికి; సర్వసౌఖ్యములు విన్నాణంబుగా నబ్బెడిన్. ౨౬

క॥ భోగేచ్ఛ వలదు ముని సద్యోగంబున సేవ సల్పి యొందెదఁ బుణ్య
శ్రీగరిమ; దాన నిహపర, భోగంబులు గలవు ముక్తిఁ బొందంగల్గున్. ౨౭

సీ॥ పతిచెంత వసియించి పరిచర్య సల్పుదుఁ, బూజార్థమై తెత్తుఁ బువ్వుపటలి
మెడనెడఁ జేపట్టి యిందందుఁ దిప్పుదు, నాసనాస్తరణాదు లలవరింతు
వలయువేళలఁ దృప్తి వాయంగఘటియింతు, శీతలోదకములఁ జేర్చి యిడుదు
నగ్నిహోత్రసపర్యయందు మెచ్చొనరింతు, సర్వసంభారముల్ సంతరింతుఁ
గీ॥ గొఱఁత గనుపడనీక యెక్కుడగుభక్తి, కొలఁది భర్తృప్రసాదంబుఁగొందునింద
నందు దివ్యసుఖంబుఁ జేకొందువెనుక, ముందువెదకక నన్నిమ్ముమునికిఁ దండ్రి! ౨౮

క॥ శంపాలతికలఁబోలిన, సంపదలకు నాసపడఁగఁజాలను మునినై
లింపపతిచెంతఁ జేరి సుఖింపఁగఁ గోరితిని సుకృతకృతకృత్యతచేన్. ౨౯

క॥ ఎల్లరతో సుఖినై నీవుల్లంబునఁ బల్లవించు నుత్సాహముతో
నల్లనఁ జనుదెమ్మెడఁదను, నుల్లాసము నొంది భర్తయొద్ద వసింతున్. ౩౦

ఉ॥ ఒండననేల? మౌనివరునొద్ద వసించి తపోవిశేష ము
ద్దండత సల్పుచున్ నిలుచు తత్పరవృత్తి కుతూహలించె నా
ఖండలభోగసంపదకుఁ గాంక్ష పొసంగునె? వేయునేల? నే
నుండెద మౌనిచెంత మహిమోన్నతుఁ డాతనిసేవ యల్పమే. ౩౧

చ॥ ఇటులు వచించు పుత్త్రిఁగని యేమియుఁ బల్కఁగఁజాల కర్థవా
క్పటులత కోడి తండ్రి జనసమ్మతుఁడై మునికిచ్చు నిశ్చయో
త్కటపటుబుద్ధిఁ బుత్త్రిఁ గొని గంధగజేంద్రము నెక్కి మౌనిరా
డుటజముఁ జేరఁగాఁ జనియె నుద్ధతుఁడై చతురంగసేనతోన్. ౩౨

ఉ॥ వచ్చితి ధారుణీశ్వరుఁడ ✽ వందన మే నొనరించినాఁడ నీ
కిచ్చెద నందనిం గొను మహాహీనతపోమహిమానుభావ! నీ
యిచ్చ సుఖించు సన్నిధి సమాహితయై పరిచర్య సల్పు నం
చొచ్చెముఁ దక్క రాజవరుఁ ✽ డొప్పన సేయుచు మౌనికిం సుతన్. ౮౩

సీ॥ విధివిహితంబుగా ✽ విభవసంపన్నత, మునినాథునకు వేడ్క ముదిత నిచ్చి
పరిణయం బొనరించి ✽ పారిబర్హంబులు, పెక్కు లర్పించి సంప్రీతిఁ బొదలి
ధరణీశ్వరుండు సోత్సాహుఁడై ముదమందెఁ, జతురంగముల రుజాసంకటంబు
సడలెఁ దాపసమాళి ✽ సంతోషభరితుఁడై, నృపుని దీవించె సన్నిధిని బల్మి

ఆ॥ గారవించె సతియుఁ ✽ గడుముదంబును బొంది, తపసిచెంత నిలిచె ✽ ధైర్యగరిమ
నించు కంతయైన ✽ నెడలేక పరిచర్య, సలుపుకొనుచు సిద్ధసరణిఁగొనియె. ౮౪

వ॥ అట్టి సమయంబునఁ దండ్రినిం జూచి యక్కన్నియ రత్నఖచితంబులగు నాభర ణంబులు, మృదులంబు లంబరకంచుకాదులుం గొనిపొమ్ము. ముని సతీవేషంబున నజినపరిధానం బవలంబించెద; ముల్లోకంబుల నీకుం గీర్తిపొసంగునట్లు వర్తించెద; నంధునకుం గన్య నొసంగితి నను చిత్తం బెడఁబాసి సుఖం బుండుము; దివానిశంబు పరలోకసుఖాభిలాషచే భర్తృపరిచర్య సల్పుచు వశిష్ఠునకు నరుంధతియు, నత్రి కనసూయయు, ధర్మపత్నులగు వడువున నమ్మునికిఁ బత్నినై యుభయ వంశంబులకుఁ బుణ్యం బార్జింతుఁ జింతిల్లకు మని యూరడింప, ధర్మవేది గావునఁ గూఁతునకు నజినపరిధానాదు లొసంగి వివర్ణవదనుండై చాల నుమ్మలికనొందె నెల్లవారును వేపమానాంగంబులతో శోకించుచు విన్నంబోయిరి. అంత భూపాలుండు కొన్ని దినంబు లచ్చట వసియించి యద్దంపతులచే నామంత్రితుండై పురంబున కరిగెనని చెప్పి యమ్మాయామహిమంబులు తృణమేరూకరణమునను మేరుతృణీకరణంబునను సమర్థంబులుగదా? యని పల్కి మఱియును. ౮౫

సీ॥ రాజన్యుఁ డాత్మ పురంబున కేగిన, పదపడి యక్కన్య ✽ భర్తృసేవఁ
దత్పరయై బృహద్భానుసేవనమున, కనుకూలపరికరాద్యఖిలవిధుల
సమకూర్చి వనిలోన ✽ సరసఫలంబులు, స్వాదుమూలంబులు ✽ సంగ్రహించి
నీవారములు గూర్చి ✽ నిర్మలోదకములు, పక్వముల్ చేసి తా ✽ భర్తకరము

గీ॥ పట్టి తోడుకపోయి శుభ్రముగ నీటఁ, దోఁగఁజేసి యొడల్ దుడ్చి ✽ తోన ధౌత
వస్త్రములు గట్టఁజేసి యభ్యంతరమునఁ, గృష్ణమృగచర్మమున బృసి ✽ గీలుకొల్పి

గీ॥ తోడుకొనివచ్చి సద్భక్తిఁ తులఁగలింపఁ, గరము లందించి యందు సుస్థిరునిఁ జేసి
యాచమింపంగఁ జేసి యత్యంతభ సిత, జలకమండలు లందిచ్చి ✽ సంతసమున.

గీ॥ నిత్యకర్మాదు లొనరించి నేర్పు గలిపి, యతఁడు కృతకృత్యుఁడైన యనంతరమున
స్వాదుఫలములు పక్వనీవారభుక్తిఁ, గందమూలంబులను దృప్తిఁ గనొంద నొసఁగి.

సీ॥ భుజియించుపిమ్మటఁ బూతుఁడౌ భర్తను, లేవఁగఁదీసి సంభావనమున
ముఖవాస మర్పించి సుఖకరపల్లవ, శయ్యపైనుంచి యాజ్ఞాప్రసాద
మడిగి తా భుజియించి యధిపుసన్నిధిఁ జేరి, యెద్దికార్య మటంచు నెఱుకఁ జేసి
సమయోచితంబుగాఁ జక్కఁబెట్టుచు సంజ, హోమాదు లొడఁగూర్చి యుచితవిధుల
భుజియింపఁ జేసి యొప్పుగఁ దాను భుజియించి, సెజ్జఁ జేరిచి భర్త చెంతఁ బాద

గీ॥ సేవఁ జేయుచు స్త్రీధర్మసిద్ధు లడిగి, భర్త నిద్రాణుఁడైన యప్పట్టునందు
వ్యజన సేవ యొనర్చి యయ్యధిపుచరణ, సన్నిధిని దాను గూర్కనా చంచలాక్షి.

శా॥ హేమంతావసరంబులందు సతి తా నిచ్ఛారతిన్ గట్టియల్
స్తోమం బొప్పఁగఁ జేసి వహ్ని యిడి సంసూత్యతజ్జ్వాలజ్జ్వాలలన్
నేమంబొప్పఁ దపింపఁ జేయుచు సుఖస్థేమాభిరామాదృతిన్
స్వామీ! మేను సుఖించెనే? యనుచు సంభావించి లాలించుచున్. ౯౦

సీ॥ గ్రీష్మకాలమునఁ దాపసికన్న ముందఱ, మేల్కని జలపాత్ర మృత్తికలను
సన్నిధినిల్పి శౌచపవిత్రమున, కధిపు లేవఁగఁదీసి యనతిదూర
మునఁ దాను నిల్చి యమ్ముదుసలి కాల్యంబు, గడపి లేచినమీఁదఁ గరముఁబట్టి
యుటజమధ్యంబున నుపవిష్టుఁగాఁ జేసి, చరణముల్ గడిగి యాచమనశుద్ధి

గీ॥ పిదపఁ దా దంతకాష్ఠంబు ప్రియునకిడి ముఖమ్ముగడిగించి యుష్ణోదకముల నతని
గాహన మొనర్చి ధౌతముల్ గట్టఁ జేసి, పూర్వవిధమునఁ గర్మముల్ పూర్తిసలుపు.

చ॥ ఎడనెడ దేవతార్చనకు నిష్టసుమాదులు సంగ్రహించి చొ
ప్పడఁగ నొనర్పఁ జేసి విధివజ్జ్వలనోచితహోమకృత్యముల్
గడపుచు నిచ్చలున్ నియతకార్యములం దెడలీక మానికిన్
బడఁతి యొనర్పఁ జొచ్చె మునిభార్యసపర్యలు ధైర్యధుర్యయై. ౯౧

గీ॥ అతిథిశుశ్రూషణంబు నిత్యముగ జరుపు, విసువు లెఱుఁగదు రాజసాన్వితయునయ్యు
అత్రివల్లభనా వశిష్ఠాంగన యన, జపతపోభ్యాసముల వృత్తి సల్పుఁ దాను. ౯౩

ఉ॥ అత్తఱి నశ్వినుల్ చ్యవనునాశ్రమభూములఁ గ్రీడ సల్పుచున్
దత్తరుణీలలామ శుభతత్పర యై నదిఁ దోఁగి యుంటకిన్
దత్తఱపాటుతోఁ జనఁగఁ దప్పక చూచి మనోభవవ్యథా
యత్తమనస్కులై నిలిచి యామరభామినిఁ బోలు తత్సతిన్. ౯౪

ఆ॥ చెంతఁ జేరి చెదరు ★ చిత్తము లలరంగఁ, జెలియ! నిలిచి మాటఁ ★ జెప్పరాదె
దేవసుతుల మేము ★ తెలివ! నీసొబగు వీక్షించి విస్మయంబుఁ ★ జెందుటరుదె.

ఉ॥ ఎవ్వనికన్నె వీవు? పతి ★ యెవ్వఁ? డిటొంటిఁ జరింపనేటి? కీ
విన్వల నిత్తటాకమున ★ నేటికిఁ దాన మొనర్తు? లీలమై
నివ్వసుధం జరించు సిరియే యన బుద్ధిఁ జలింపఁజేసె దిం
దివ్విపరంబు నిన్నడుగ ★ నిచ్చ జనించెను దెల్పఁగూడదే. ౯౬

క॥ ముదితా! మృదులము లగు నీ, పదములు కాంతారవర్త్మకఠినస్థలులన్
సదమదముగఁ బీడించుట, మదికిన్ నెఱిపుట్టఁజేసె ★ మఱి యిఁక నేలా. ౯౭

ఉ॥ దేవవిమానరాజమున ★ దివ్యవిహార మొనర్పఁజాలు నీ
వీవిపినంబునందు సముదీర్ణశిలాతలఘట్టనంబులన్
గేవల నిర్వికార వయి ★ క్రీడ యొనర్చుట విఁతయయ్యె సం
భావితవృత్తిమై విభవభవ్యత నుండఁ దలంపఁగూడదే. ౯౮

క॥ దాసీశతపరివృతవై, భాసిల్లెడు నీకు నిట్టి ★ పాటొనఁగూర్పన్
జేసెనె? విధి;యచ్చరవో?, వాసిగ నృపకన్యవో? వికవాహితవొక్కొ? ౯౯

క॥ ఏతల్లి ధన్యయయ్యెనో?, యేతండ్రి కృతార్థుఁడొక్కొ? ★ యీ నినుఁ గనుటన్
జేతోమోదంబున నినుఁ, బ్రీతిం జేకొన్న భర్తసిరి యల్పంబే? ౧౦౦

క॥ నీకోమలపదఘృష్టం, బీకానన మమగలోకహేలానికృతిన్
జోకగణింపదె? యిచ్చటి, శీకరములు పత్త్రు లెంత ★ చేసెనో? తపమున్. ౧౦౧

మ॥ కొనియాడం బనియేమి? నీవు మది సంకోచింప కర్థిన్ మమున్
వినఁగాఁజేయుము నీదువృత్తము; పతిన్ ★ వీక్షింప మా చిత్తముల్
ఘనసంరంభముఁ జెందియున్నయవి వీక్షాపాతమున్ సల్పి యొ
య్యన సర్వంబు వచింపఁగావలయు సుసమ్మజ్జాక్షి! నా నిట్లనెన్. ౧౦౨

సీ॥ శర్యాతి యనునట్టి ★ జననాథుపుత్త్రిని, చ్యవనమహర్షికి ★ సతిని నేను
అవనీశుఁ డిమ్మని ★ యంధుఁ డంచని యెంచ, కర్పించె మీరు మా ★ కతిథులైతి
రదె? యాశ్రమమువచ్చియాతిథేయముఁగొన, వలయునంచనిన నవార్త వినుచు
నయ్యెదో? అంధుఁడం ★ చనక యమ్ముని కెట్టు, లర్పించె నిన్ను ఘోరాటవులను
గీ॥ ధరణిఁ జరియించునట్టి సౌదామినీవి,ధమ్ము గననయ్యె నీయెడఁ ★ దరుణి! దేవ
భామినులయందు నీసాటి ★ పడఁతి గలదె?, విధికృతం బిటు లయ్యెనే!యవేయునేల?

సీ॥ కమనీయచేలముల్ గట్టునీమేనికి, హరిణాజినం బెట్టు లనువుపడియె?
రత్నసంఘటితాభరణయుక్త మగునీకుఁ, దాళికాతాటంకతతి పొసంగెఁ
జందనాద్యనులేపసర్వాంగి వగు నీకు, భస్మావకుంఠనప్రాప్తి యెసఁగె
మరునిబోలెడుభర్తమది గరంచెడినీకు, నంధుండు ముసలియౌ నధిపుఁడౌనె

గీ॥ దివ్యమోహనమూర్తివై తేజరిలుచు, సుమశరునిబాణములఁ బోలుచూపుకొనల
నెవనిఁ దిలకింతు వయ్యయో! యిట్టి ఘటనఁ, జేసిన విధాత ననవలెఁ జెప్పనేల?

ఆ॥ అంధుభార్య వగుట నతిమోహనంబైన, యౌవనంబు నీది యటవిఁ గాయు
వెన్నెలయ్యె నిట్టి వెట్టి నీ కేటికిఁ, గొనుము తగినవానిఁ గూర్మిపేర్మి. ౧౦౫

ఆ॥ లేమ! కంటిచూపు లేనిభర్తను గూడి, వననివాస మజినవసనములను
బూని జీవితంబు బూదిపాల్సేయుట, తగదు సుమ్ము నీకుఁ దలిరుఁబోణి! ౧౦౬

సీ॥ దేవనందనులము దివ్యాంగసౌందర్య,ఘనుల మిర్వురలోనఁ గాంతుఁ గాఁగ
నొక్కనిఁ జేకొను ముచితకార్యం బది, వృద్ధు నంధునిఁ గూడి వెత మునింగి
భావవర్జితుఁడైన పతిఁ జేరి తోషణ,రక్షణంబులు లేక రాగహీన
వగుచు నుండఁగనేల? యనవద్యసౌందర్య, ధుర్యవై తగునాథుతోడఁ గూడి

గీ॥ చైత్రరథనందనాదివిచిత్రవనుల, దేవయానంబునను వేడ్కఁ దిరుగవలదె?
యిట్టి గ్రుడ్డినిఁగూడి నీ వెట్టుకాల, మపనయింపంగఁగలవు పద్మాయతాక్షి?

ఆ॥ భూమిపాలవరునిపుత్రివి శుభలక్ష, ణాంగి విట్టియంధు నాశ్రయించి
భోగహీన వగుచుఁబొరలెదు ఘోరకాం,తారసీమ జీవితంబు వృథగ. ౧౦౭

చ॥ ఇరువురలోన నొక్కని నహీనమనోహరమూర్తి నాథుఁగాఁ
గర మనురక్తిఁ జేకొనుచుఁ గాంక్ష యెలర్పఁగ దేవభోగముల్
పరిపరిభంగులన్ గనుచు భానము పల్లవితంబు గాఁగ ని
జ్జరతుని మాని తేని సుఖసారము నీదగుకొంగుముల్లె యౌ. ౧౦౮

ఆ॥ అటవిలోనఁ దిరుగుటది దుఃఖకరము వృద్ధానుషంగ మరయ నంతకన్న
దుఃఖకరము; గానఁ దోయజపత్రాక్షి!, యిర్వురందు నొకని నేలుకొనుము. ౧౧౦

చ॥ ఫలజలభక్షణంబులను బ్రాణము లూరటఁ జెందఁ జేయుచున్
బలవదపూపసూపఘృతభక్షణ సౌఖ్య మెఱుంగ కయ్యయో!
చెలి! కృశియింపనేల? యిది చెల్వము గల్గిననీకు నచ్చెనే?
సలలితభోగసంగ్రహణసౌఖ్యముఁ బోలఁగఁజాల దెద్దియున్.

గీ॥ తెలియఁ దగిన వృత్తిఁ * దెలిపితి మిటమీఁద, నీదుచిత్త మనిన * నీరజాక్షి
అశ్వినులను జూచి * యభిధావన మొనర్చి, పలికె నిట్టు లనుచుఁ * బ్రౌఢిమెఱయ.

వ॥ మహాత్ములారా! మీరు జగత్కర్మసాక్షియగు దివాకరునందను, లతండు కశ్యప ప్రజాపతివలన సంభవించె, నమ్మహాముని బ్రహ్మమానససంభూతుం, డిట్టి సంప్రదాయంబున జనియించి యనర్హసంభాషితంబు లుపన్యసించుట యొప్పునే! కులకన్యలు పతిం బరిత్యజించి యన్యులకు నొడంబడుదు రే! అసారంబగు సంసారంబున ధర్మనిర్ణయం బెఱింగి యధర్మంబను నంధకూపంబునఁ బడఁజూతురే! యేను శర్యాతిపుత్త్రిని; బతిభక్తి పరాయణను. మీర లొండు వచింపక యథాగతంబుగాఁ జనుండు. పదంపడి యిట్టి దురుక్తు లాతిడి రేని శపియించెదనని కనరుట్టం బల్కిన శంకమానమానసులై రాజనందని! భవద్ధైర్యంబునకు మెచ్చితిమి. మేము సుపర్వచికిత్సకులము. నీవల్లభు నుల్లంబు పల్లవింప ఫుల్లాంబుజసన్నిభంబు లగు కన్నులు గలవానిం జేసి మనోజ్ఞరూపసంపన్నునిం జేసెదము. పదంపడి మా ముగ్గురలో నేకతముం బరిగ్రహించెదుగాక యనినఁ దద్వాక్యంబులకు విస్మితయై పతిసమ్మతి వడయు నిచ్చతోఁ జని తత్సన్నిధిం జేరి యిట్లనియె. ౧౧౩

శా॥ స్వామీ! సూర్యసుతుల్ మనోజ్ఞసుషమాసంపన్నులౌ నశ్వినుల్
ప్రేమన్ నన్ గని కామతత్పరత నిర్భీకత్వముల్ జెంది యెం
తో మత్తాలపనంబులన్ గఱపినన్ * దోడ్తోడఁ గోపించి యు
ద్దామప్రక్రియ నే శపింతునన నుద్యత్సాధ్వసోపేతులై. ౧౧౪

సీ॥ మెచ్చి నీకు వరమ్ము * లిచ్చెద మతివ! నీ, విభునికన్నులు గల్గు * నెరవుగొల్పి
సమయౌవనోదయసహితుఁ గావించెద, మవల ముగ్గురలోన * నంతరంగమునకు మెచ్చొనరించు * ఘనునిఁ జేకొను మన, విస్మయం బొదవి యివ్విధము నీకు
విన్నవించితిఁ గార్యవిధి నిశ్చయింపుము, దేవమాయాగతిఁ * దెలియఁదగదు

గీ॥ వారిదంభ మదెట్టిదో? * వలను దెలిసి, నీయభీప్సిత మెఱుఁగంగఁ * జేయు మనిన
భార్గవచ్యవనుండు తద్భాషణముల, కచ్చెరువు నొంది పల్కె నిర్గల్లాలిఁ జూచి.

ఉ॥ సందియ మేల నీకు; రవిసంతతి వారలఁ దోడితెమ్ము ని
ష్పందతఁ గార్యసంగతిఁ బొసంగు నటన్న మునీంద్రునాజ్ఞ చేఁ
గొందలమెల్ల మాని యనుకూలత వారలఁ దోడితెచ్చి రా
ణ్ణందని "యేగుదెంచి" రని * నాథునితో నెఱిఁగింప మానియున్. ౧౧౫

క॥ నాసత్యులఁ దెలిసి మహోల్లాసముతో నిష్టసిద్ధులన్ దనిపెద రం
చీసకియ వచించె దమోద్భాసితులై యట్లు సేయఁదగు మీ కనినన్. ౧౧౬

ఉ॥ అశ్విను లమ్మునిన్ గొనుచు నచ్ఛపయఃపరిపూరితంబు శ్రీ
తశ్వసనాంచితంబు నవతామరసప్రసవాగ్రఝుంక్రియా
శశ్వదనల్పభృంగగణసంయుతమైన సరోవరంబునన్
విశ్వసనీయవృత్తిఁ దలఁపింపఁగ నోడక వచ్చి చెచ్చెరన్. ౧౧౮

గీ॥ ఆ సరోవరతీరమం దధిపకన్య, నిలిచి చూడంగ ముర్వురు నీటఁ దోఁగి
వెడలునంత సమానులై విమలరూప, శోభమానతఁ జెలువొందిరోయగమున.

సీ॥ దివ్యకుండలకర్ణ దేదీప్యమానులై, మృదులాంబరోల్లాస మేదురతల
మందహాసముఖారవిందులై చెలువొందు, నందంబుతో మహానందు లగుటఁ
దిలకించి విస్మయోద్దీపితయా మానిని, సతిఁ గాంచి యిటులు నాసత్యు లనిరి
మా యీ త్రితయమందు మగని నీ కగువాని, వరియింపు మనిన నవ్వనిత యేక

గీ॥ రూప వేషాదులను దుల్యరూఢి మెఱయు, వారిఁ గాంచి సమాకులస్వాంత యగుచు
నింద్రజాలంబువిధ మయ్యె నేమి సేతు, నిందుఁ బతి యెవ్వఁడొక్కొ? నేఁగందు నెట్లు?

గీ॥ సంశయగ్రస్తమయ్యె మత్స్వాంత మెల్ల, సంకటాంబుధిలో మున్గెఁ జాలబుద్ధి
వైపరీత్యంబు మృతిగాదె? వనటఁ జెందు, జీవితము వృథయంచని చెప్ప వినమె.

మ॥ అని చింతించుచు నెద్దియుం దెలియ కయ్యబ్జాక్షి. యీసంశయం
బను పాథోనిధి నీఁదు టెట్లనుచుఁ జింతాడోల నూఁగాడుచున్
మన మాందోళన నొందఁ దొట్రుపడుచున్ మాయామయంబైన యి
ప్పని నిర్ధారిత మెట్లొకో? యనుచు నాపద్వార్ధి నిర్మగ్నయై. ౧౨౨

వ॥ ఇవ్విధంబున మనంబున నెడతీని వేదనం బొగిలిపడుచు నాపదంభోధి సముత్తర
ణంబునకు జగదీశ్వరీచరణనౌకాధిరోహణంబు తప్ప శరణంబు లేదని నిశ్చ
యించి భృశదుఃఖిత నగు నాకు భవచ్చరణంబులు దిక్కు సతీధర్మంబు చెడకుండ
జీవయాత్ర గడపనెంచు నన్నుఁ జేపట్టి పావనమార్గంబున వర్తింపం జేయుము.
శ్లో॥ "నమః పద్మోద్భవే! దేవి! నమ శ్శంకరవల్లభే! విష్ణుప్రియే! నమో
లక్ష్మి! వేదమాత! స్సరస్వతి!" అని నమస్కరించి, తల్లీ! స్థావర జంగమాత్మ
కంబగు జగంబు భవత్సృష్టంబు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులకుం దల్లివై పురుష
ప్రియం బొనర్పఁ బ్రకృతిరూపంబున సర్వంబును సృజియించి పోషించి ఆయా
కల్పంబులందు క్షీణింపం జేసెదవు. సకలప్రాణులకును భుక్తి ముక్తి ప్రదవై
ప్రాజ్ఞులం బాలింపుచు నజ్ఞానుల నున్మూలింపుచు యోగులకు మోక్షసిద్ధి ప్రదవై
వెలుంగు నిన్ను శరణంబు వేడితి. దేవరచిత్తం బగు నింద్రజాలంబున విభ్రాంతనై
శోకసాగరంబున మునుంగు నాకుం బతి విజ్ఞానంబునకు సహాయం బొనర్పు మని

వేడిన నాతిత్రిపురసుందరి రాజనందనిహృదయంబున నిలిచి సుఖోదయంబగు పతి జ్ఞానంబు కటాక్షించిన. ౧౨౩

మ॥ మది నిస్సంశయవృత్తిచేఁ దగ మనుశ్శర్యాతిప్రయాసంబునన్
విదితజ్ఞానధురీణయై యితని సంప్రీతిన్ వరింతున్ మనో
ముద మీనాథునియందటంచుఁ దపసిన్ ♦ బూర్వాధిపున్ గేల్గొనన్
సదయోత్సాహత సూర్యనందనులు రాజన్యాత్మజన్ మెచ్చుచున్. ౧౨౪

క॥ పాతివ్రత్యంబున నిన్నాతి యరుంధతినిఁ బోలు ♦ నవనవసుషమా
ఖ్యాతిన్ దేవాంగనయే, యీతరుణిం బోలు సుదతు ♦ లెచ్చోఁ గలరే. ౧౨౫

గీ॥ అంబికాకరుణాతిశయంబువలన, నిష్టసిద్ధి ఘొసంగె నీయింతి కనుచు
నరిగి రంతట నాసత్యు ♦ లధిపుఁగూడి, యిష్టసంభోగములఁ దనియించె నతివ.

మ॥ రవిపుత్రుల్ చనునప్పు డయ్యిరువురన్ ♦ రక్తిన్ గనుంగొంచు మేల్
భవదీయంబగు సత్కృపన్ నయనముల్ ♦ పాటిల్లె మేనన్ సుధా
పవయోవైభవ ముప్పతిల్లె ముది మిప్పాటన్ గడంబట్టె సం
భవమై యొప్పెడి మానసోత్సవము సామాన్యంబె మీ ప్రాపహా! ౧౨౭

క॥ ఉపకారపరులకును బ్రత్యుపకారము సేయకున్న ♦ నుర్వర వానిన్
విపరీతుఁ డనుచు నెల్లరు, నెప మెంతురు మీదు ఋణము ♦ నేను సహింపన్. ౧౨౮

సీ॥ అదిగాక మీవాంఛితార్థ సిద్ధిఁ బొసంగ, వరమిచ్చువాఁడ దేవతలకైన
దుస్తరంబగునేని ♦ తొలఁగక యొసఁగుదు, భవదుపకారంబు ప్రవణయ ఋషియె
ననినఁ దాపసునకు ♦ నర్కనందను లిట్లు, ముని శేఖరుని మెచ్చి ♦ యనిరి దేవ!
జనకుని యనుకంప ♦ సర్వంబు గలయది, కడమ లేదెందు మాకామ్య మొకటి

గీ॥ సోమసంగ్రహణంబున ♦ సురవిభుండు, కనకగిరి యాగ మొనరించి ♦ కనలి మమ్ము
భిషజుల మటంచు సోమ మర్పింపఁడయ్యె, నీవు శక్తుండ విక్కోర్కి నెఱపుమయ్య.

క॥ ఇది వాంఛిత మని తెల్పిన, యుదితం బాలించి భృగుకులోద్భవుఁడు మదిన్
సదయుండై యశ్వినియు,ముద మొందుఁడు యాగభాగములు గలిగింతున్. ౧౩౦

క॥ శర్యాతియాగమున సుర, వర్యులతో రంపు సోమపానాంచారతిచే
ధుర్యులఁ జేసెదనన నా, సూర్యాత్మజు లరిగి రంత ♦ సురపురి కనఘా! ౧౩౧

సీ॥ అమ్మహాముని పత్నితోఁ గనుకూలసౌందర్య, ధుర్యుఁడై యాశ్రమమున నుండు నగుచు
స్వైరవిహారతత్సత్కార్యజపతపో, ధ్యాననిష్ఠల మహోత్సాహ మెసఁగ

అతిథిపూజలను దేవార్చనంబులఁ బరా,యత్తత లేక నిజాభికలన
వర్తించుచును ధర్మవర్తిని యగు పత్ని, లాలింపుచును రతిలలన నెనయు

గీ॥ మరునికై వడి సుఖభోగ మహితవృత్తి, నమ్మహామాయకరుణాకటాక్షవశత
సద్భుతానందరసవార్ధియందు నోల,లాడుచుండెఁ దపస్వుల కబ్బురముగ. ౧౩౨

గీ॥ అయ్యుదంతంబువిని బాదరాయణునకు, మ్రొక్కి జనమేజయుండుసమ్ముదితహృదయుఁ
డగుచు విస్మయవార్ధి నత్యంతమజ్జ,న మ్మొనర్చుచుఁ బల్కె నానందమునను.

సీ॥ అశ్వినుల్ భార్గవు ననుకంప నెట్టుల, సోమపాన మొనర్చి శుద్ధులైరి
మానుషంబగుశక్తి మహితుఁడౌ నమ్మౌని, యింద్రుచే భాగ మిప్పించుటెట్టు
లిందురిందు వారల నెట్లు నిషిద్ధులఁ,జేసి భాగం బీక చేసెఁ దెంపు
ఇట్టి విస్మయహేతువృత్తాంతము వినంగ, మది గోరికొనియె ధర్మజ్ఞ! తపసి

గీ॥ వృత్తము సవిస్తరంబుగ విపులదురిత,గంధనిర్గంధనముగ మహత్కర్మతృష్ణఁ
దీర్పఁజాలిననిపుణుండ వేర్పరించి, తెలియఁజెప్పు మటన్నఁ దాఁ బలికె మౌని.

క॥ జనమేజయ! విను తెల్పెద, మునివృత్తము పిదప నతని ముదితకుఁబితయౌ
జనపతి శర్యాతి మఖం,బొనరింపఁగ నొక్క వింత యొదవెఁ గనుమీ. ౧౩౪

ఉ॥ సుందరి పత్నిఁ గూడి స్మరసుందరుఁడై చ్యవనుండు చంద్రసం
క్రందననందనాదులను గాఁజియ వెట్టెడు సోయగంబుతోఁ
జందనచూతసాలనటచంపకమంజులముఖ్యభూరుహా
స్పందవనీనికుంజములఁ జారువిహారములన్ వసింపఁగన్. ౧౩౫

సీ॥ శర్యాతి యిల్లాలు చనవుచే నందనిఁ, దలఁచి చింతిలి ధరాధ్యక్షుఁ గాంచి
వేపమానాంగియై వెడవెడఁ గన్నీరు, మున్నీరులై పాఱ మోము వంచి
కంఠగద్గదిక మొక్కలమాచుఁ దడఁబడ, నాథ! పుత్రిని మునినాథుఁ డనుచు
నంధున కిచ్చితి మడవి నేమయ్యెనో?, మృతయొ జీవితయొ యమ్మెలఁతకుశల

గీ॥ మెఱుఁగమైతిమి యం దేగి యెట్టు లౌట, దెలియకుంటిమి నెవ్వగ దీరదయ్యె
తాపసాశ్రమమున కేగి తనయవార్తఁ, దెలియకున్నను మది వెతల్ దీరవనిన.

మ॥ ధరణీవల్లభుఁ డార్తుఁడై మహిని సంతాపించి యబ్జాక్షినిం
గర మూరార్చి రథాధిరూఢుఁ డయి శంకాపంకసంక్షాళనో
ద్ధురతన్ మౌనివరాశ్రమంబునకుఁ దోడ్తో నేగి ఘోరాటవీ
సరణిం గాంచె నికుంజపుంజముల నుచ్చైర్లీల భాసిల్లఁగన్. ౧౩౭

గీ॥ చూచి యవ్వింత మను చూచు । చొప్పుగాదు, ఫుల్లపల్లవఫలసము । ద్భూతి వనము
నందనముఁబోలి యున్న దీ । చంద మనుచు, విస్మయము నొంది మేదినీ । విభుఁడు మదిని.

ఉ॥ వింతగఁ దోఁచుచున్న యవి । వృక్షలతాదులసొంపు; లిందు భూ
కాంతుఁడు లీనమై నిలుచు । కై నడిఁ గానఁగ నయ్యెఁ బుత్రి దు
శ్చింతత నంధునిన్ విడిచి । చెల్వుని వేఱ గడింపఁబోలు న
క్కాంతునిమాయలం బడని । కాంతలు గల్గుదురే? ధరాస్థలిన్. ౧౪౦

సీ॥ అంధుఁడై వెతలచే । నలసి తాపసవర్యుఁ, డీల్గిన నయ్యని । నెనసి పుత్రి
రాజభోగంబుల । రక్తి వహించుచు, విహరింపఁబోలు ని । ర్విధముఁ జూడ
నెఱిఁగి నే నిట్టుల । నేటి కంధున కిచ్చి, మనువంశసత్కీర్తి । మంటఁ గల్పి
యనుచితం బిట్టుల । నాచరించితి స్వార్థ, సిద్ధికై పల్కులఁ । జెప్ప నేల?
గీ॥ మానవతులకు యౌవనో । న్మాద మెత్తి, యెంత సేయరు పితృమాతృ । వృత్తములకు
వెఱతురే? యిట్లొనర్చిన । వెఱ్ఱితనము, తనది యగుఁగాక యన్యుల । ననఁగఁదగునె.

మ॥ అని చింతించుచు ఘూర్ణమానహృదయుం । డై యాశ్రమప్రాంతభూ
మిని సైన్యంబులు నిల్పి యొక్కఁడును బేర్మిన్ జొచ్చి పోవంగ నొ
య్యన నాథాంతికసీమ నిల్చి సరస । వ్యాహారముల్ సల్పు పు
త్రిని గాంచెన్ వసుధావరుండు ధరణీ । పేంఖత్తటిద్భాస్వరన్. ౧౪౧

సీ॥ ధరణీవిహారసో । త్సాహియై యంగంబు, దాల్చి వచ్చినయట్టి । దర్పకుండొ?
అట్టులఁ గేళీవి । హారంబు సల్పంగ, నరుదెంచినట్టి యిం । ద్రాత్మజుండొ?
వనవాటికామధ్య । వాసనోల్లాసియౌ, మహితరూపోద్భాసి । మాధవుండొ?
తనసతీతతి రోసి । తరుణి మత్పుత్రికై, తవిలి వచ్చిన నిశా । ధవుఁడొ? కాక
గీ॥ యధిపుఁ డీల్గిన నన్యరా । జావతంసుఁ, గోరికొని తెచ్చి యతనితోఁ । గూడె నొక్కొ!
కాక యున్నను నాచేతఁ । గన్నెఁ గొనిన, యంధుఁ డగునల్లుఁ డెట్లగు? । నబ్బురంబు.

క॥ విపరీతవృత్తిఁ దనతో, నుపమించిన కాంతుఁ దెచ్చి । యొగి నాతనితో
నుపభోగించెడు దీనిన్, నెపమెన్నక చంపువాఁడ । నిజమని మఱియున్. ౧౪౨

ఆ॥ ఆఁడుదానిఁ జంపు । టది దుస్తరం బఁదుఁ, గూఁతుఁ జంపు టధిక । ఘోరదురిత
మేమి సేతు, విధి ని । కేమందు? నక్కటా!, యనుచుఁ జింత నొందు । నవసరమున. ౧౪౩

చ॥ జనకునిఁ గాంచి నందనియు । సంతస మొప్పఁగఁ బ్రేమడొట్టియె
య్యనఁ జనుదెంచి మ్రొక్కి వి । నయమ్మలరార మహానుభావ! నీ
మనమువఁ గోపతాపములు । మల్లడిగొన్నటు లుప్పతిల్లెఁ బొ
వనుఁడగు నీదు [illegible] కరవీక్షలఁ గాంచు మీయెడన్. ౧౪౪

ఆ॥ రమ్ము రమ్ము చరణసరాజీవయుగళికి, వందనంబు సల్పు వలదు వనట
యెన్నిదినములయ్యె నేనిన్నుఁ గనుఁగొంటిఁ, జూడఁదలఁచియుండెఁ జూ! తపస్వి.

ఉ॥ నందని యిట్టు లాడిన మనమ్మునఁ గ్రోధము దీర కాగ్రహా
మందత నల్లుఁ డేడి? మదమత్తుఁడు వీఁ డెవఁ డిట్టివానితో
సుందరి! యెట్లు గూడితివి? చూడఁగవచ్చునె నిన్ను? నామదిన్
సందియ మయ్యె వృద్ధుఁ డని చంపితె? తాపసిఁ బాపకారిణీ! ౧౪౮

క॥ నూతనుఁ డగు నల్లుభునిం, జేతఃప్రీతిగ గడించి చిడిపితనమునన్
నాతో నిటు లాడెను దుర్నీతిన్ గులటాత్వసిద్ధి నీ కయ్యెనొకో! ౧౪౯

సీ॥ నీ దురాచారంబు నిన్నింత చేసెనే?, వంశధర్మం బెల్ల వఱదఁ గలిపి
దుఃఖవారిధి నన్నుఁ దొరలించి మహిమాఢ్యు, మునివల్లభుని దపోవనధి నిట్లు
విడనాడి యన్యున కొడఁబడి విహరించి, యిహపరంబులు రెండు నేఁటఁద్రోచి
తగుమునం చని ధర్మతత్పరతను బోలె, మాటలాడె దటంచు మానవేంద్రుఁ

గీ॥ డలుక గదురంగ నిట్టులనాడు పలుకు, వినుచుఁ జిఱునవ్వు నవ్వి యవ్విపులనేత్ర
చెట్టఁబట్టుక పతిచెంతఁ జేరఁదిగిచి, జనకుతో నిట్టు లనియె నుత్సాహ మెసఁగ.

శా॥ అన్నా! యల్లుఁ డితండు భార్గవుఁడు పద్మాప్తాత్మజుల్ మెచ్చి యి
క్కన్నుల్ యౌవన మందమున్ గలుగఁగాఁ గౌతూహలం బొంది సం
పన్నుం జేసిరి నాదుభాగ్యమున నిష్పాపున్ మనోజ్ఞాకృతిన్
గన్నంతన్ సతు లెల్ల మోహవశతన్ గాంక్షింతు రిత్తాపసిన్. ౧౫౧

గీ॥ ఎన్నఁ డుపకార మొనరించి యెఱుఁగ మట్టి, వార లశ్విను లిద్దఱుఁ జేరు టసుదు
వచ్చి మత్పూర్వపుణ్యసాఫల్యముగను, ప్రేమ నొసఁగిరి మామకాభీష్ట మెల్ల.

సీ॥ ఏను బుత్రిక నాట నీపల్కు పల్కుల, సందియంబొదవుఁబో? సత్యవాది
యల్లుండు తపసి నీ వడుగుము కేల్మోడ్చి, సర్వమ్ము వివరించు సత్యముగను
నమ్ము మన్నను మానిసనాథునికడ కేగి, వందన మొనరించి వసుమతీశుఁ
డత్తపస్విని వృత్తమంతయు నడుగంగఁ, బడఁతి చెప్పినయట్లు పలికి యతఁడు

గీ॥ సోమపానార్హు లగుటఁ దత్సోమసిద్ధి, నేతు మీ కంచు వరము నిచ్చితిని నేను
తద్దయాసారమునను నేత్రములుగలిగి, ముదిమిఁ దొలఁగితిఁ గంటినిసమ్మోహనతను.

క॥ దైవానుకూల్య మిట్టులు, గావించెనటన్న రాజు కడుముదమున సం
భావించె నల్లునిం గుల, పావని యని కూఁతు నెడఁదఁ బరిరంభించెన్. ౧౫

గీ॥ రాజపత్నియు ననురాగరసము లొలుకఁ, గూఁతునల్లునిలాలించెఁ ‖ గుతుకమున ము
నీంద్రునానతి నచ్చో నభీష్టమలరఁ, గతిపయదినంబు లుండి రక్కటిక మెఱయ.

ఉ॥ కొన్నిదినంబు లమ్మెయి నకుంఠపురాణకథావిధానసం
పన్నతఁ బ్రొద్దుపుచ్చునెడ ‖ భార్గవుఁ డమ్మహిపాలుఁ జూచి నే
మన్ననఁజేసి యశ్వినుల ‖ మాటకు లోఁబడియుంటఁజేసి నీ
జన్నములోనఁ జేయఁదగుఁ ‖ జక్కఁగ వారికి యజ్ఞభాగముల్. ౧౫౬

ఆ॥ ఇంద్రుఁ డడ్డమయ్యెనేని మత్తాపస, శక్తివలన నతని ‖ సాహసంబు
లణఁచి యశ్వినులకు ‖ నధ్వరంబున సోమ, పానసిద్ధిఁ జేతుఁ ‖ బ్రతినవట్టి. ౧౫౭

సీ॥ జామాత యిటు పల్క ‖ శర్యాతి ముదమంది, పురమున కేగి యధ్వరవిధాన
సంరంభమున సర్వసన్నాహ మొనరించి, యజ్ఞాయతనపాళి ‖ నలవరించి
పూజ్యులౌమునికోటిఁ ‖ బూజించి భార్గవు, నధ్వర్యుఁగాఁ గొని ‖ యజ్ఞదీక్ష
నధివసించిన దేవతావళుల్ భాగార్థు, లగుచు వచ్చినయెడ ‖ నర్కసుతులు

గీ॥ కూడఁ జనుదేరఁ జూచి శక్రుండు కనలి, వీరలు చికిత్సకులు సోమవిధికిఁ దగరు
వీరి నాహ్వాన మొనరించువార లెవ్వ?, రాశ్వినేయులు సోమంబు ‖ నందువారె!

మ॥ అని కోపించి పురందరుండు సురలారా! సోమసాంకర్య మ
య్యెను దేవార్హముగాదు యజ్ఞమని యెంతే భీమణాటోపసం
జనితాలాపభయానకాననత విచ్ఛాయాంతరుండైన న
మ్ముని దేవాధిపుఁ జూచి పల్కె వినయమ్మొంగొ విధముల్ జూపుచున్. ౧౫౯

గీ॥ ఎల్లవారలు సోమంబు ‖ గొల్లఁగొనఁగ, వీరికేటికి నర్హమిా ‖ విధి సురేంద్ర!
యేతదధ్వరమున వీరి ‖ కీకమాన, నాశ్వినులు గానిచో నెవ్వ ‖ రర్హులింక? ౧౬౦

శా॥ ఏ నాహ్వాన మొనర్చినాఁడఁ గులశైలేంద్రంబు లూటాడినన్
భానుండున్ గతిఁదప్పినన్ జలధు లంభఃపాళి లోకావళిన్
గ్లానిం బొందఁగఁ జేసినన్ విడుతునే? ‖ కట్టుగ్రతన్ సోమసం
ధానం బార్కుల కే నొనర్తు నిది సంధాబంధ మిట్లొప్పదే? ౧౬౧

క॥ అంధుఁడనగు నాకు విపద్బంధము పోఁజేసినట్టి ‖ ధన్యులు వీరల్
బంధువులుగాన సౌమిక, సంధాన మొనర్చువాఁడ ‖ సమయపరుఁడనై. ౧౬౨

ఉ॥ ఇట్టులు నిగ్రహించు ముని ‖ నిందుగ్రిడు గాంచి చికిత్సకుల్ కదుర్
బెట్టుగఁ బల్కఁజూచెదవు ‖ భీతి యొకింతయులేక దేవతల్
పట్టరు వీరితో సవనభాగము; లిమ్మెయి జన్న మెల్ల ని
ట్టట్టయి వ్యర్థతన్ గనదె? ‖ యాగ్రహ మేటికి? మానుమంచనన్. ౧౬౩

సీ॥ గౌతమాంగనఁ జూచి * కామించు నీశుద్ధి, యలరదే? యీ భాస్కరాత్మజులకు
బ్రహ్మఘాతుకుఁడవై * పరిభవించిన నీదు, సంశుద్ధిలేదె? భాస్వత్సుతులకు
దేవవేశ్యాభోగసద్రుఢకామి వగు నీదు, నాచార మమరదే? * యార్యులకును
సహజమిత్రులను రాక్షసులఁ గూల్చెడు నీదు, సద్వృత్తి లేదె? నాసత్యులకును

గీ॥ జగములకు నెల్ల నపకృతి * సల్పి సర్వ,రక్షణం బొనరించు నీ * రవికుమారు
లేటికి నసర్హులైరి మహేంద్ర! యాగ,భాగ మొసఁగక పోదునే? * ప్రీతినఁబట్టి.

క॥ పురుహూతునకును దాపస, పురుహూతున కిట్లు వాదమ్మున్ బెరుఁగఁగ న
ధ్వరమున నొక్కుమ్మడి నిర్జరులును దాపసులు సాధ్వసమునొంది రొగిన్. ౧౬౫

ఉ॥ భానుసహస్రతేజుఁ డగు * భార్గవుఁ డప్పుడు మంత్రపూతముం
గా నొనరించి సోమము నఖండితదీక్ష నొసంగు వేడ్కలోఁ
బూనఁగ నంత శక్రుఁడు విభూతి యెలర్పఁగ నాగ్రహించి య
మ్మానివరుం గనుంగొనుచు * మాననియానునఁ బల్కె నీగతిన్. ౧౬౬

గీ॥ బ్రహ్మబంధుండవగు నీవు * క్రతువునందు, భాగమార్జింతువే? నిన్ను భస్మసాత్క
రణమొనర్చెద నీదు దురాగ్రహంబు, విశ్వరూపానురూపత వెలయఁజేయు. ౧౬౭

శా॥ మర్యాదం బెడవాపి దుష్టకలనామందస్వభావంబులన్
జర్యల్ సల్పెదె? తొల్లి భూపతులు యజ్ఞంబుల్ కడున్ జేయరే?
యార్యుల్ సన్నిధిసేయరే? యచట నీయభ్రంకషంబైన దు
ష్కార్యం బిట్టులు పుట్టెనే? విడువుమా? * సంధానుబంధంబులన్. ౧౬౮

ఆ॥ కానిపనికి నిట్లు * పూనుట గర్వంబు, మాను మనినఁ బల్కె * మానివరుఁడు
ఇట్టి పుణ్యులను మహేంద్ర! యేటికిఁ జెడ,నాడెదీవు? కాదు * న్యాయసరణి.

క॥ బృందారకసమునిగ ముని, బృందారకమధ్యమున నభీష్టవిలాసా
నందితు ననుఁ జేసి యశముఁ, బొందిన ఘను లింతకన్నఁ * బుణ్యులు గలరే? ౧౭౦

ఉ॥ అధ్వరభాగముల్ గొనఁగ * నర్హులు వీరలెగాక దుష్టస
ప్తాధ్వములం జరించు సురలా సవనార్హులు? మాటలేల? ని
స్సాధ్వసవృత్తి దుర్వచనసంగ్రహ మేటికిఁ జేసె దీవు? నీ
వ్యధ్వ మణంచి యూరడిలు * మాగ్రహ మేటికిఁ? పాకశాసనా! ౧౭౧

ఆ॥ ఈవు వలదటన్న * నేను సైరింతునే?, యిత్తు నిత్తు నన మహేంద్రుఁ డంత
నిచ్చెదేని సైతునే? నీదు శీర్షంబు, కులిశధార నేలఁ * గూల్తు ననిన. ౧౭౨

వ॥ అంత భార్గవచ్యవనుండు రోషభీషణుండై మహేంద్రవచనంబుల ననాదరణం

బొనర్చి కోపారుణనయనంబుల వెడలు దృక్పరంపరలు జ్వాలజ్జ్వాలనజ్వాలలం బోలి మహేంద్రుఁ జుట్టికొనఁ జురచురం జూచుచు, సోమపాత్రంబు చేఁబూని యర్కసుతుల కొసంగ నుత్సహించినఁ బిపాసాతురులై వారలు చేకొనం దలంచునవసరంబున నవలోకించి వాసవుండు పాత్రంబు నాసత్య వినియుక్తంబేని శిరంబుఁ దుంచెదనని భిదురంబుఁ బూని నిలిచిన నించుకంతయు వెఱవక సోమపాత్రం బశ్వినుల కొసంగె. సునాసీరుండును గ్రోధంబున సూర్యకోటిసమప్రభంబును సర్వాయుధవిమర్దకంబును నగు నిజాయుధంబు కరంబున నంకించి విడువం జూచిన మహాతపస్వి యగు భార్గవుండు మంత్రబలంబున భుజాస్తంభనం బొనర్చి యింద్రనిర్హారణార్థంబు సంకల్పించి విధివద్విధానంబున ననలంబు వేల్చిన నతిక్రూరుండును, మహాఘోరుండును, సర్వప్రాణిభయంకరుండును, బర్వతాకారుండును, నగు నొక్క రక్కసుండు మదుండనువాఁడు, శతయోజనాయామదంష్ట్రలును, దశయోజన దీర్ఘదంతంబులును, బర్వతసంకాశభుజంబులును, గిరిశృంగసన్నిభగ్రీవయును, వ్యాఘ్రనఖరతుల్యఖరనఖరంబులును, వహ్నిజ్వాలాప్రతిభటంబులగు రక్తకేశంబులును, కాటుకకొండంబోలు దేహంబును, దావానలకీలాసన్నిభంబులగు నేత్రంబులును, భూమ్యంతరిక్షంబుల నావరించు దాడలును గల్గి బహువిధాయుధశరాద్రింబగు నాకారంబునం బొడమిన నెల్లదిశలం ద్రిదశులు పర్వందొడంగిన నింద్రుండు భయత్రస్తుండై సమరంబునకుఁ దారసింపక వివర్ణవదనుండై యూరకున్నంత వ్యాత్తాననుండై ఘోరదృష్టిం గ్రసింపందలంచి శతక్రతుం దఱిమిన నెల్లవారును నింద్రునెడల నిరాశులై చనిరి. అయ్యెడ నింద్రుండును నెద్దియుం దోఁచక మనంబున గురుం దలంచిన. ౧౭౩

గీ॥ స్మరణమాత్రంబుచే బృహస్పతి మహేంద్రు, నకును సన్నిధిఁజేసి దానవునిఁగాంచి
భీతుఁడగు శక్రుని సురారిభీతు లగుచుఁ, బఱచుసురలను జూచి యప్పట్టునందు.

చ॥ బెడిదపు నాపదం బడుచు భీతిలి రెల్ల సుపర్వు లింద్రుఁడుం
గడుభయ మందె రక్కసుఁడు క్రౌర్యమునం జ్యవనుండు నల్పు ని
క్కడిఁది మగంటిమిం సవనకల్పితుఁడై జగముల్ గ్రసింపఁగాఁ
గడువడి నుద్ధతుం డయి యఖండబలోద్ధతుఁ డయ్యెఁ జూడఁగన్. ౧౭౪

ఆ॥ మానివరుబలంబు మహితంబు వారింప, నలవిగాదటంచు నమరవరుని
కడకు నేగి వినయగౌరవపూర్వంబు, గాఁగఁ బల్కె గురుఁడు కార్య మెంచి.

సీ॥ అమరేంద్ర! వినుము నాయాడెడి పలుకులు, చ్యవనుని నీ వేగి శరణమన్న
యెడ నీయడరు దప్పు నింతియెకాని ని,వారింప నలవి యెవ్వారికిఁ గాదు
ఆత్మకృతంబైన యట్టికృత్యయ గాన, మరలింప దక్షుఁడు మౌనివరుఁడు
బ్రహ్మతేజంబు దుర్భర మాగ్రహంబున, నెదు రెఱుంగక యున్న యెడల నీదు

గీ॥ విక్రమం బవరోధనవిధికిఁ దగునె?, సామవాక్యంబులను దేర్చి శాంతుఁ జేయ
నీవుశరణమ్ము వేడుము నేర్పుకొలఁది, జెడిదమగు నాపదలు దీర్పఁగడఁగవలదె.

గీ॥ పుడమిసురలకుఁ గోపంబుపుట్టుటరుదు, పొడమెనేనియు క్షణికంబు పుణ్యమూర్తి
భార్గవుం డానతులయెడఁబటుకృపార్ద్ర, చిత్తుఁడగు లెమ్ము మునిచెంతఁజేరఁగొమ్ము.

ఉ॥ ఒండు విచార మీయెడ నయుక్తము రక్కసుఁ డుగ్రమూర్తియై
కొండలఁ గోసలన్ సురలఁ గూడను మ్రింగెడు పోల్కి వచ్చె ను
ద్దండత నిన్ను నన్ను సురతండమునెల్ల గ్రసించు నన్న నా
ఖండలుఁ డార్తుఁడై తపసికాళ్ళపయిం బడియెన్ గృపార్థియై. ౧౭౯

క॥ వేడుచు దీనుని నను గా,పాడుము కరుణార్ద్రదృష్టిఁబఱపుము నీకే
నోడితి ముమ్మాటికి నిఁక, వేఁడిమిఁ జల్లార్పు చిత్తవీథి మహాత్మా! ౧౮౦

శా॥ నీయాజ్ఞన్ దల మోచి యశ్వినులకున్ నిర్నిద్రయాగార్హతన్
జేయంజూచితి నింతనుండి ఘనవిచ్ఛ్రేణుల్ మహోత్సాహులై
యీ యర్థంబున కిచ్చగింతురు భవద్వీక్షామృతాస్వాదినై
బాయంద్రోచెద నాపదం, గరుణచేఁ బాలింపు మౌనీశ్వరా! ౧౮౧

క॥ నీసంకల్పితమున కేఁ, జేసిన యవరోధమెల్లఁ జిరతరకీర్త్యు
ద్భాసకమై నీతేజము, వాసిన్ ద్రిభువనములందు వర్ధిలఁ జేయున్. ౧౮౨

గీ॥ అవనినాథుండు శర్యాతి యధ్వరంబు, సుపరిక్షితమయ్యె నీ సూర్యతనయ
సోమపానోద్ధరణమున సురలకెల్ల, నిడియ సమ్మతమని యెంచుమీ మునీంద్ర!

క॥ భీకరకోపజ్వాలా,ప్రాకటదృగ్భరము చల్లఁబఱచి కృప న్ని
ర్భీకత నభయ మొసంగుము, నాకమునకు నేను రాజనై యుండంగన్. ౧౮౪

చ॥ అభయము వేడినాఁడనని యామరవల్లభుఁ డిట్లు పల్కఁగన్
సభయత వేడ భార్గవుఁడు సంతసమంది కృపార్ద్రచిత్తుఁడై
సభికజనంబు లెల్లఁ బెలుచన్ బొగడన్ గన రెల్లమాని యా
ఋభువిభుఁ గాచిపుచ్చెను సమీహితశాంతరసస్వభావుఁడై. ౧౮౫

ఉ॥ వాసవు నూరడించి మునివల్లభుఁ డా సురకృత్య మప్పు డా
శ్వాస మొనర్చి యంగనలఁ బానములన్ మృగయాపణమ్ములన్
వాసిగ నేర్పరించి నిలువన్ విధియించి భయంబు మాన్పి యు
ద్భాసితమూర్తియై చెలఁగె భార్గవుఁ డాత్మనిరర్గళప్రభన్. ౧౮౬

క॥ అది మొదలు భానుపుత్రులు, విదితాధ్వరభాగభోగసంసిద్ధిసమ్మతులై
పొదలిరి ముజ్జగములలో, ముద మొదవంగ నింద్రసభ సముజ్జ్వలలీలన్. ౧౫౮

క॥ చ్యవనమహాముని వేడుక, నవగాహించినకొలంకు ♩ హర్షప్రదమై
భువి యూపవిమండితమని, వ్యవహృతమయ్యెన్ జ్యవన మహాముని పేరన్.

క॥ తన యాశ్రమమున వైభవ, మనువొందఁగఁ బత్నిఁగూడి ♩ యభినవలీలా
వననిధుల నోలలాడుచు, జనితోత్సాహమునఁ దపము ♩ సల్పుచునుండెన్. ౧౫౯

వ॥ మఱియు శర్యాతికి నానర్తుఁడును వానికి రేవతుఁడును బొడమిరి. ౧౬౦

మ॥ చతురంభోధిపరీతభూమితలరక్షాదక్షిణోల్లాసియై
సతతార్థివ్రజకల్పవృక్షమగు నాక్ష్మాజాని యంభోధిగ
ర్భతటిన్ వీడు కుశస్థలం బనఁగ నిర్మాణంబు గావించి యా
స్థితుఁడై పుత్రశతంబునుం గనియె నిస్సీమప్రభావంబునన్. ౧౬౧

సీ॥ ఆ నందనశతంబునందు నగ్రజుఁడు, కకుద్మి యనెడివాఁడు ♩ కొమిరె నొర్తు
సుందరీతిలకంబు ♩ శుభలక్షణాకృతి, పరిణయయోగ్యయై ♩ పరఁగు కతన
ననుకూలుఁడగురాజు ♩ నరయుచు సరిలేమి, సంశయింపుచు బ్రహ్మసభకుఁ దనదు
కూఁతుఁ దోడ్కొనిపోయి ♩ కోమలి మ్రొక్కించి, సర్వజ్ఞ! దీనికి ♩ సాటియైన

గీ॥ వల్లభుం డెవ్వఁడో? తెల్పవలెనటంచు, నమరగంధర్వవేదయజ్ఞాగమాద్రి
సిద్ధమునిమధ్యమునను నాసీనుఁడైన, సరసిజాసను నడిగె నిస్సంశయముగ. ౧౬౨

క॥ అని బాదరాయణుం డ, జ్జనపతికిం దెలుప వినుచు ♩ జనమేజయుఁ డ
మ్మునిచంద్రుఁ గాంచి పలికెన్, వినయము దళుకొత్త గుణవివేకోత్తరుఁడై. ౧౬౩

చ॥ మునివర! తొల్లి విప్రవరమూలముగా వినియుంటి రేవతుం
డనియెడు రాజు రేవతిని ♩ నాత్మతనూజను గొంచుఁ బంకజా
సనుభువనంబుఁ జేరఁ జనఁజాలెనె? యెట్టులు పోయె నొక్కొ! య
జ్జనపతి; యిట్టిసందియము ♩ సంకటపెట్టె నెఱుంగఁదెల్పవే. ౧౬౪

సీ॥ అన విని బాదరాయణుఁడు దెల్పెఁదొడంగె, సందియం బేటికి ♩ జనపతీంద్ర!
కనకాచలశిఖాగ్రఘటితంబులై యొప్పు, స్వర్గాదిలోకముల్ ♩ సత్యలోక
వైకుంఠకైలాసవనజబాంధవచంద్ర, భువనంబు లెల్ల నస్బురముగాఁగ
నిపితామహుఁడైన ♩ నిర్జరేంద్రసుతుండు, పంచవర్షము లున్న ♩ ప్రతిభ వినవె
మానుషతనువులతోన కకుత్స్థాది, భూపాలు రెల్లను ♩ బోవ రొక్కొ!

గీ॥ అరయ బలవంతులై దైత్యులలమియింద్రు,సదనమున కేగియందు నాస్కందనంబు
సలిపి రనుమాట వినవె? యబ్జప్రసూతి, భువనముల కేగి వచ్చెడు భూపులరుదె.

వ॥ అదియునుంగాక తొల్లి మహాభిషుండను రాజు సత్యలోకంబున సుఖాసనస్థుండై యటకు వచ్చుచున్న గంగామహాదేవినిం గాంచి మారుతవశంబునఁ దొలంగం బాయు నూరుపటంబువలన మర్మస్థలం బొక్కింత యొరగంటం జూచి నవ్విన నద్దేవియుఁ గామార్తుంగా రాజు నెఱింగి తానును సాభిప్రాయంబుగా మందహాసం బొనర్ప నది యెఱింగి హిరణ్యగర్భుండు శపింప దంపతులై భూతలంబున నధివసించుట వినవే! దానవపీడితులై నిర్జరులు వైకుంఠంబునకుం జని జగన్నాథుం బ్రార్థింప నవతరించి లోకకంటకులను వధియించుట దృష్టాంతంబె కదా. సందేహింపం బనిలేదు సర్వలోకంబులు కృతపుణ్యులగు తాపసులకు, భూపతులకు, యజమానులకు, సుఖాభిగమ్యంబు లగునని చెప్పిన సంతసించి జనమేజయుండు రేవతాభిధానుండగు భూజాని రేవతిం గొని చని వారిజాసనుతోఁ బ్రశ్నం బొనర్చెం గదా? యతనిచే నెద్ది సమాదిష్టంబయ్యె? నందని నేరాజునకు నతం డుద్వాహం బొనర్చెఁ దత్సర్వంబు సవిస్తరంబుగా వినవలతుననిన గంధవతీనందనుం డిట్లనియె.

సీ॥ రేవతుం డను రాజు దేవతాజ్యేష్ఠుని, సభకు నేగె నటన్న సరణి వింటి
దేవేశుఁ డగు బ్రహ్మదేవునకును మ్రొక్కి, యిక్కన్యకును వరుం డెవ్వఁడొక్కొ?
కుతలంబునం దెల్లఁ గుమారి తగువానిఁ, గననైతి సర్వజ్ఞ? కన్నియకును
సర్వలక్షణదక్షు సబలుఁ గులీనుని, ధర్మశీలునిఁ గాంగ ధవునిఁ దెలుపు

గీ॥ మనినఁ జెఱునవ్వు నవ్వుచు నబ్జగర్భుఁ, డీవు కన్యకు వరుని నన్వేషణంబు
నేయుచున్నావు తద్రాజసృష్టి యెల్ల, మాసెఁ గాలవిపర్యయో న్మథిత మగుచు.

శా॥ ఆనర్తంబులు రూపుమాసె భవదీయాజ్ఞాపరీపాలితా
స్థానంబుల్ గిరిరైవతంబును గుశస్థల్యాదులున్ రూపఱెన్
నానాగోత్రకళత్రమిత్రనృపసంతానంబు వమ్మయ్యె నం
దే నెవ్వండని తెల్పువాఁడ విభుఁ డేఁడీ? నీ తనూజాతకున్. ౯౮

చ॥ ఇరువదియాఱు ద్వాపరము లేగెను నాఁటి నృపాలకోటి నొ
క్కరుఁడును లేఁడు చంద్రకులకల్పితుఁడై తగు నుగ్రసేనుఁడన్
ధరణిపుఁ దుర్వరాధిపత చాలిచి యమ్మధురాధికారియై
సురపతి వైభవంబునను శోభిలుచున్ స్థితిఁ బొందినాఁ డొగిన్. ౯౯

చ॥ అతఁడు యయాతివంశ్యుఁడగు నాతనికిన్ సుతుఁ డయ్యెఁ గంసుఁ డ
ప్రతిహత విక్రమాన్వితుఁడు వంకలచిత్తుఁడు గానఁ దండ్రినిన్

బలితమనస్కుఁడై మెఱసి బంది బిగించి సురాపకారముల్
. కొతుకకచేయుచుర్ జెలఁగెఁ గూ్రరత దుష్టపథానువర్తియై. ౨౦౦

ఆ॥ అతనిగుణములకును ననుకూలవర్తులై, నృపులు కొంద ఱవని నీతి దప్పి
భారభూతు లగుట భరియింపలేక భూ, దేవి నన్నుఁ గాంచి దీన యగుచు. ౨౦౧

గీ॥ తామరసగర్భ! కంసాదిదైత్యపటలి, దుర్మదాంధత నతిఘూర్తకర్ములగుచు
సురగురుద్రోహములసముద్ధురత మెఱసి, సుకృతమనుమాట జగమునసున్న జుట్టి.

శా॥ వర్తింపర్ భరియింపఁజాలక మదిర్ వాంఛించి దుఃఖార్తనై
యార్తత్రాణపరాయణుండ వని దేవా! నిన్నుఁ బ్రార్థించితిర్
గర్తృత్వంబున భర్తృహర్తృతలు సంకల్పించి కావించు స
త్కీర్తుల్ నీదునధీనముల్ ననుఁ గరుర్ గీడొందనీ కేలవే? ౨౦౩

గీ॥ శరణ మర్థించితి నటంచు ధరణి వేడ, నమరులను గూడి హరిఁ జేరియవతరణము
సలిపి భూభారహరణంబు సరసిజాక్ష!, చేయుమని వేడికో నట్లచేసె హరియు.

గీ॥ దేవకీగర్భమున వసుదేవవీర్య,సంభవుం డయి కమలలోచనుఁడు పొడమెఁ
గృష్ణుఁ డనఁ గంసు మర్దించి కృపదలిర్ప, నుగ్రసేనున కొసఁగె రాజ్యోపభుక్తి.

వ॥ మఱియు దురితాత్ముండగు కంసుని శ్వశురుండు జరాసంధుం డనువాఁడు మథురాపురంబు నిరోధించిన సముద్రగర్భంబున ద్వారవతియను పురంబు విశ్వకర్మచే రచియింపంజేసె, నందు యదువృష్ణి భోజాంధక సహితుండై కృష్ణుండు వసియించి యున్నవాఁడు, తదగ్రజుండగు బలభద్రునకుం గన్నియ నర్పించి బదరికారణ్యమునఁ దపముసేయుమని తెల్పిన నట్లచేసి రేవతుండు గంగాతీరంబున దేహత్యాగం బొనర్చి పుణ్యలోకంబునకుం జనియెనని చెప్పిన. ౨౦౬

క॥ పారిక్షితుండు తాపస, వారిజబాంధవునిఁ గాంచి వదనమున నిజ
స్ఫారావలోకన సుధా,ధారలు దొరఁగంగ హాసతత్పరుఁ డగుచుర్. ౨౦౭

మ॥ వినఁగా నబ్బురమయ్యె నీచరిత ముర్వీపాలుఁ డంభోజగ
ర్భనివాసంబున కేగునంతట విపర్యాసంబుగాఁ గాల మిం
తనఁగానేల యుగాంతరంబులు గదా? యక్కన్నెకుర్ దీర్ఘయౌ
వన మెట్లయ్యెను? నింత యాయు వలభూప శ్రేష్ఠుఁ డెట్లందెనో? ౨౦౮

గీ॥ పెక్కుయుగములు జరిగినఁ బిన్నతనము,సడల కక్కన్యయుండుట జనపతికిని
నాయువభివృద్ధినొందుటయబ్బురంబు, సందియముఁ బాపుమనఁ బరాశరసుతుండు,

సీ॥ పలికె నిట్లు గుణ... [illegible] ... పరమేష్ఠి భువనంబులను నిల్చు పుణ్యులకును
జరయును క్షుత్పిపాసలు మృత్యుభయమును, బొసఁగవు దివ్యానుభూతివలన

శేవతుం డచటి కఠరిగినఁ దత్సంతతి, దానవధ్వస్తమై ధరణిఁ గూలె
హతశేషులగు కొందఱు అచ్చోటు వాసిరి, యిక్ష్వాకుఁ డామీఁదఁ బృథ్వి నేలె

గీ॥ మనువునకుఁ దుమ్మువలననీయయనఘుఁడుదితుఁ, డయ్యె నారదునుపదేశమంది యితఁడు
శక్తిమంత్రంబు జపియించి శతము సుతులఁ, బడసె నందు వికుక్షి యర్కవాఁడు పెద్ద.

వ॥ మఱియు నీపుత్రశతజనకుండగు నిక్ష్వాకుం డయోధ్యాపురంబు ముఖ్యస్థానంబుగా నొనర్చి సుఖంబుండి శకునిప్రముఖులగు పంచాశత్తనయుల నుత్తరాపథంబుల కభిషిక్తులం జేసి యష్టచత్వారింశత్పుత్రులను దక్షిణాపథంబున భూపాలనంబునకు నియమించి తక్కంగలయిద్దరను దనకుం బాసటగా స్వసన్నిధి నుంచుకొని రాజ్యం బేలుచుండె. ౨౧౧

చ॥ ఒకతఱి నిష్టికై నృపతి యొయ్యనఁ బుత్రు వికుక్షిఁ గాంచి నీ
వకుటిలశౌర్యధుర్యత వనావని కేగి నవామిషంబు త
ప్పక కొనిరమ్మటన్న దృఢబాహుబలుండు వికుక్షి చాపసా
యకములు దాల్చి ఘోరవిపినాంతరసీమల కేగి చెచ్చెరన్. ౨౧౨

శా॥ సారంగంబుల సూకరంబులను శశ్వత్ప్రౌఢిఁ జక్కాడుచున్
ధీరుండై శశబృందమున్ గెడపి యుద్దీపించు క్షుత్తృష్ణలన్
భారం బాఁగఁగలేక యవ్విపినభూభాగంబునన్ వహ్నిపా
కారంభంబున మాంసమున్ మెసవె క్షుత్తాపంగ నిశ్శంకుఁడై. ౨౧౩

వ॥ పదంపడి. ౨౧౪

గీ॥ వచ్చి తరసంబు దెచ్చినవార్త గురున, కెఱుఁగఁజేసినఁ గాంచి యానృపుఁడు దెచ్చు
నామిషము భుక్తశేషంబుగా మనంబు,నందుఁ దిలకించి పాకదూష్యం బటంచు.

గీ॥ భూపతికిఁ దెల్పఁ గోపించిపుత్రు నపుడు, దిశల నిస్సారణ మొనర్ప శశము మెసవు
కతమునశశాదుఁడను పేరుగాంచియడవి,విహరణ మొనర్చెఁబితృకోపనిహతుడగుచు.

సీ॥ కొన్నిదినంబులు చన్నపిమ్మటఁ దండ్రి, సురపురి కేగిన సుతుఁ డయోధ్యఁ
జనియు శశాదుండు సర్వసర్వంసహా,చక్రంబుఁ బాలించి సరయుచెంత
నధ్వరమ్ములు పెక్కు లాచరించె యశమ్ము, త్రిభువనంబులు గ్రమ్మవినకరాభు
పట్టి కకుత్స్థుని బడసె నాతఁడు నిందృ, వాహనమాఖ్యచేఁ బరిబలె ననిన

గీ॥ తాపసోత్తముఁ జూచి యద్ధరణివిభుఁడు, నామభేదంబు లిట్లు భూనాధునకును
గలిగియుంటకుఁ గారణములు గలుగునె?, తెలుపుమనిపల్కఁగర్మందితిలక మనిమె.

చ॥ జనకుఁడు స్వర్గతుండయినఁ జక్కటిఁ బైతృకమైన రాజ్యమున్
దనభుజశక్తిఁ జేకొని యథావిధివన్మఖకోటి సల్పుచున్

జనపతివర్యుఁడై క్షితి యశం బొడఁగూర్చుచు నుండువేళ దై
త్యనిహతులై సురల్ బెదరి తామరసాక్షునిపాలిపుఁ జేరిరన్. ౨౧౯

చ॥ అమరులఁ జూచి శౌరి యభయం బభయం బని యూరడించి దు
ర్దమ విపదాహతిం బడిన దైన్యము మోములఁ గాంచనయ్యె న
న్నమలమనస్కులన్ శరణ మంచని చేరు టెఱుంగనయ్యె సం
తమసము భానుఁ డూచ్చుగతి దైత్యులఁ గూల్చెద నిత్తు శ్రేయమున్. ౨౨౦

గీ॥ వెరవు దెలిపెద మీ రెల్లవిపుల కరిగి, వీరుఁడు కకుత్స్థుని సహాయవృత్తిఁ గోరి
ప్రార్థన మొనర్పుఁ డతఁడు తోడైన దైత్య,హతి తృణప్రాయమగు మీకు నమరులార!

శా॥ ధర్మాత్ముండగుఁ గాన నాతఁడు మరుత్సంఘంబు ప్రార్థించినన్
వర్మంబున్ ధనువున్ శరంబులును సేవం బూని మీపక్షమై
శర్మంబుం బెడఁబాయ దైత్యవరులన్ జక్కాడి మీకున్ సమి
త్కర్మోల్లాసము విస్మయావహముగాఁ గానంగఁ జేయున్ జుఁడీ. ౨౨౧

మ॥ చనుఁ డన్నన్ హరివాక్సుధారససమాస్వాదమ్మునన్ దేవతల్
చని యవ్వీరుఁ గకుత్స్థుఁ గాంచి దితిభూసంఘాతపాతవ్యథా
జనితోద్వేగత నిన్నుఁ జేరితి మొగిన్ సాహాయ్యమున్ బూని పా
వనచారిత్ర! కృపాబ్ధిమజ్జనముచేఁ బాలింపుమీ! మమ్ములన్. ౨౨౨

సీ॥ అని వేడునంత భూపాగ్రణి విబుధులఁ, గాంచి కేల్మోడ్చుచు ఘనులు మీరు
దర్శనం బిచ్చుట ధన్యంబు మజ్జన్మ,సాహాయ్య మొనరింతు సంగరమున
నాఖండలుఁడు వాహనాకృతిచే నన్ను, వహియించెనేని దుర్వారబలుల
నసురుల మర్దింతు నాఖండలున కిత్తు, భువనాధిపత్యంబుఁ బొగడు లేల

గీ॥ యనిన వాసవుఁ గాంచి యయ్యమరవరులు, వ్రీడ విడనాడి వాహనాకృతివహింపు
గెలుపుఁగొందుము దైత్యులఁ గ్రీడవోలె, వృషభ వాహనుపగిది నవ్వీరుఁ డలరు.

ఉ॥ నా విని వ్రీడఁజెందు సురనాథునిఁ గార్యవశంబునం దస
ద్భావము గూడదంచు హరి పంకజనేత్రుఁడు సైగసేయఁ గా
ర్యావనతుండు గాన విబుధాధిపుఁ డంత వృషస్వరూపుఁడై
భూవరవాహనం బగుచుఁ బొల్చె "సుఖార్థులు దూష్య మెంతు రే?" ౨౨౪

గీ॥ వృషకకుత్స్థుండుగాన నవ్విభువరేణ్యు,నకుఁ గకుత్స్థుండు నా భువి నామమయ్యె
నరిపురంబులు గూల్చు నయ్యతిశయమున, నతనికిఁ బురంజయుండను నభిఖ యలరె.

ఉ॥ సంగరకేళిఁ బేర్చి దితిజవ్రజమున్ సమయించి దైత్య స
ర్వాంగము లెల్ల నింద్రునకు నప్పనఁ జేసె యమర్త్యసంఘముల్

పొంగి తనర్చ గడుంబొగడ ౘ భూరిభుజాబలశౌర్యధుర్యుఁడై
నింగియు నేలయుర్ యశము ౘ నిండఁగఁజేసెఁ గకుత్థ్సుఁ డొప్పుగర్. ౨౨౬

క॥ అది మొదలు కకుత్థ్సునిపేరఁ దనరె నన్వయము; దానఁ ౘ బ్రిథముండగు భూ
మిదయితునకుఁ దనయుండై, యుదితార్కునిఁబోలియుదయమొందెఁబృథుఁడర్.

వ॥ మఱియు నమ్మహీపాలునకు విశ్వరంధియు, నజ్జనపతికిఁ జంద్రుండును, నభ్భూపతికి యువనాశ్వుండును, న త్తేజస్వికి శావంతుండును గలిగిరి. ఇతండు త్రిదివంబునకు నుద్దియగు శావంతియను నగరంబు నిర్మించె; నారాజునకు బృహదశ్వుండును నారాజన్యునకుఁ గువలయాశ్వుఁడును గలిగిరి. ఇతఁడు ధుంధుండను రక్కసుం బరి మార్చుటం జేసి ధుంధుమారుండయ్యె; నారా త్తిలకంబునకు దృఢాశ్వుండును నమ్మే దినీపతికి హర్యశ్వుండును, నప్పార్థివునకు నికుంభుండును, నా నృపునకు బర్హణాశ్వుండును, నద్ధరాపతికిఁ గృశాశ్వుండును, నవ్విశ్వంభరాభ ర్తకుఁ బ్రసేనజిత్తును, నతనికి యౌవనాశ్వుండును, నా ధరిత్రీవల్లభునకు మాంధాతయు నుదయించిరి. అతండు జననీజఠరంబున నుదయంబు నొందక జనకోదరమ్ము భేదించి వెడలెనని తెల్పిన జనమేజయుండు విస్మయంబు నొంది యిమ్మహానుభావుజన్మవృత్తాంతంబు సవిస్తరంబుగాఁ దెల్పుమనిన సత్యవతీతనూజుం డిట్లనియె. ౨౨౮

మ॥ *యవనాశ్వుం డనపత్యుఁడై శతసతీహార్దాన్వితుం డయ్యుఁ బ్రా
భవ మింద్రాభతఁ గాంచియుర్ వరసుతాభావంబునర్ జింతచేఁ
బవలుర్ రేయిఁ గృశించుచుర్ విపిన భూభాగంబులం దాశ్రమాం
తవనీవాస మొనర్చుచుర్ గడు విఘూర్ణత్వంబునం దెల్లెడర్. ౨౨౯

క॥ చింతాపరవశుఁడై ముని, సంతానము లెల్లఁ జూడ ౘ శాంతిప్రచుర
స్వాంతుండై నెతఁజెందఁగ, నంతటఁ గొందఱు మునీంద్రు ౘ లనుకంపమెయిర్.

మ॥ ధరణీవల్లభుఁ గాంచి పల్కిరి ధరాధారేయ! నీ వేల దు
స్తరకాంతారములర్ దపించెదు? కిమర్థం బీ ప్రయాసంబు? నీ
కరివిద్వేష మొకింతలేదు వనవాసాయాసహేతూ క్తి వి
స్తరిలర్ దెల్పు మటన్నఁ బల్కె యవనాశ్వక్షోణిపాలుం డొగిర్. ౨౩౧

సీ॥ చతురంగబలసమన్వితము మత్సామ్రాజ్య, మంగనాశతము భోగాస్పదంబు
వెదకిచూచిన నెందు ౘ వినరారు శాత్రవుల్, సామంతనృపతిశాసనము వృత్తి
కార్యనిర్వాహసంకల్పనానల్పంబు, మంత్రివర్గంబు భూమండలంబు
చతురబ్ధిసంగతం ౘ బతివేలవైభవ, శ్రీ మించియును గులక్షేమకరముఁ

టిప్పణి *ఇట యా[illegible] గణభంగము.

గీ॥ పారలౌకికసౌఖ్యసంధారకంబు, పుత్రసంతాన మదిలేమి ౹ భూరితాప
తప్తమై యంతరంగంబు ౹ తల్లడిల్ల, నడవిఁ దిరుగుచుఁ దప మిట్టు ౹ లాచరింతు.

క॥ సంతానహీనునకు గతి, యింతయు లేదనుచు బుధు లహీనాగమవా
క్యంతానములను దెల్పఁగఁ, జింతాదందహ్యమానచిత్తుఁడ నైతిన్. ౨౩౩

ఆ॥ మానులార! మీరు ౹ మహితసర్వాగ్రజ్ఞు, లతితపోనుభావు ౹ లగుట మిమ్ముఁ
గోరినాఁడఁ గరుణఁ ౹ గూర్చితిరేని సం,తానదంబులైన ౹ ధర్మవిధులు. ౨౩౪

ఉ॥ బోధ మొనర్చి నందనులఁ ౹ బుట్టఁగఁజేసెద రేని మన్మనో
వ్యాధి దొలంగు మీదయకు ౹ నాలయ మయ్యెదఁ యుష్మదీయని
ర్వేధతపోబలంబునఁ బ్రవీణతఁ గాంచిన యిష్టి సల్పి త
త్సాధన మెల్లఁ జేయఁదగు ౹ సంయములార! యటంచు వేడినన్. ౨౩౫

ఆ॥ కారణజ్ఞు లగుటఁ ౹ గర్మకు లెల్లను, నింద్రదేవతాక ౹ మిష్టి యొకటి
చేసి యతని కిష్టసిద్ధిఁ జేయుద మని, సలిలపూర్ణకలశ ౹ మలవరించి. ౨౩౬

ఉ॥ ఆగమమంత్రపూతముగ ౹ నధ్వరశాలను దాని నుంచి దే
శాగతమానులున్ దమరు ౹ నయ్యవనీశుఁడు నిద్దురింపఁ దృ
ష్ణాగతుఁడై విభుండు కలశస్థజలంబులు ద్రావ మాను ల
య్యాగము విఘ్నితం బగుడు ౹ నుల్లములన్ గడు నార్తి నొందుచున్. ౨౩౭

ఉ॥ ఎవ్వరు ద్రాగి రిజ్జల మొకించుక శేషము లేదు భూవిభుం
డి వ్విపినంబునం దృష జనించి గ్రహింపఁగఁబోలు లేనిచో
నెవ్వఁ డొనర్చు నింతపని? ౹ యే మొనరించు విధాన మంతయున్
నవ్వులకయ్యె నంచు మునినాథులు భూవరు మందలించిరన్. ౨౩౮

గీ॥ ఏను దృష్ణావశంబున ౹ నిజ్జలంబు, ద్రావితి నటన్న గుత్సించి ౹ దైవయోగ
మవని దుర్లంఘ్య మని యిష్టి యనుగతార్థ, సరణి సాంగం బొనర్చిరి శంకమాని.

ఉ॥ అంతట గర్భమయ్యె వసుధాధిపమౌళికిఁ గాలయోగసం
క్రాంతముగాన వాని యుదరస్థజలోద్గతపిండ మద్భుతా
త్యంతమహామహోజ్జ్వలత ౹ నర్భకుఁడై జనకోదరంబు దు
ర్దాంతముగాఁ బెకల్చికొని ౹ దాఁటున వెల్వడె దివ్యదీప్తులన్. ౨౪౦

క॥ దైవానుగ్రహకృతసం,భావనమున నవ్విభుండు ౹ మరణము నొందం ౨౪౧
డావిధి మానీంద్రులిష్టి [illegible] ముర్వీపాలవతంసా!

క. ఇంద్రానుగ్రహమున ధర, ణీంద్రుఁడు మాంధాత యనఁగ నెసఁగి వరయశ
శ్చంద్రికలు వెలయ సుశ్రీ, సాంద్రుండై పృథివియేలెఁ జతురబ్ధివృతన్. ౨౪౩

సీ॥ సత్యసంధుఁడు కుభృచ్చక్రవర్తి యటంచు, జనులెల్లఁ బొగడ రాజన్యవరుఁడు
ధర నాల్గుచెఱఁగులు తన శాసనమునకు, వశ్యమైయుండఁ దద్వైరు లెల్ల
గిరిగుహావాసులై పరువెత్తుటను ద్రస,దస్యుండు నాఁ బేరు ధరణిఁ బరఁగె
నమ్మహీశ్వరునకు నంగనామణి బిందు,మతి యనరూపసంపదల నలరు

గీ॥ నాపెయందున మాంధాతృభూపమౌళి, నందనుల నిద్దరను గాంచె మందరాద్రి
తులితధీరుల వీరుల దురితహరవి,హారులను శూరులను మనోహర్ష మెసఁగ.

క॥ తత్సుతులు వర్ధిలిరి పురు,కుత్సుఁడు ముచికుందుఁ డనఁగ ఘోరారిమనో
మత్సరవిపినానలులై, కుత్సితమార్గాపహరణకోవిదు లగుచున్. ౨౪౪

మ॥ పురుకుత్సుండు కుమారునిం గనియె దోర్ర్యాభివిక్రమాక్రాంతిచేఁ
బరిపంథిధ్వజినీచయంబులను భూభాగంబునన్ సున్నగాఁ
బరఁగన్ జేయుచు బ్రాహ్మణావళుల సంభావించుచున్ సద్గుణా
భరణుం డైన యరణ్యుఁ; బుట్టె బృహదశ్వాభిఖ్యుఁ డీ తేనికిన్. ౨౪౫

గీ॥ అతఁడు పితృభక్తితత్పరుఁడగుచుసుతుని, గనియె హర్యశ్వుఁడనవానితనయుఁడలరెఁ
దగఁ ద్రిధన్వాఖ్యుఁడాతనితనయుఁ డరుణుఁ, డతనికొడుకు సత్యవ్రతుఁడనఁగ నెగడె.

మ॥ అతఁ డిచ్ఛాపరతంత్రుఁడై సుమకదంబాభోగభోగోల్లస
న్మతి విప్రాంగన నాత్మహాని యని క్షేమంబెంచ కర్థించి దు
ర్భరబాహాబలశక్తిచేఁ జెఱఁగొనన్ బ్రాహ్మణ్య మెల్లన్ వ్యథా
తురతన్ దండ్రికిఁ దెల్పఁ బుత్రుఁ గని క్రుద్ధుండై విభుం డాత్మజున్. ౨౪౬

సీ॥ గుణవిహీనుఁడ వతిక్రూరుండ వస్మదీ,యావని నిలువ ననర్హతముఁడ
వయ్యయో! విప్రుల కపరాధ మొనరింపఁ, దగునె? దుష్టత విప్రతరుణిఁ గొనిన
శ్వపచుఁడై పోవఁడే? సద్ధర్మ మెడలి దు,ష్కర్మం బొనర్చితి గాన నీవు
శ్వపచసంసర్గంబు సలుపుచు నా వీడు,విడిచి యెందేనియు వెడలు మనినఁ

ఆ॥ బక్కణంబుఁ జేరి భయదధనుర్బాణ,పాణి యగుచు మాంసభక్షణమునఁ
బెరుఁగుచుండి తండ్రి పేరిమి యోర్వక, క్రోధమునఁ జరించె వ్యాధవృత్తి. ౨౪౭

క॥ వాసిష్ఠప్రేరణమున, నాసర్వంసహా జనంబు లందఱు హర్షో
ద్భాసితులై చరియింపఁగ, నా సత్యవ్రతుని తండ్రి యనపత్యుండై. ౨౪౮

మ॥ నిజరాజ్యంబు పరిత్యజించి వనులన్ నిర్వేదనన్ జెందుచున్
భజమానాత్మతఁ దాపసాశ్రమములన్ బర్యుత్సుకుండై తపం

టిప్పణి:— ౨౪౮ వ పద్యములోని మొదటి పదము ౨౫౦ వ పద్యములోని కన్వయించుకొనగు.

బజహద్వర్తనఁ జేయఁగా సరిగె నఱమ్మ్యోవేళలఁ భూస్థలిఁ
బ్రిజలం దెల్లెడ ధర్మముల్ దఱిఁగె నిఱప్పాపంబుచే నెల్లెడఁ. ౨౧౦

క॥ పదిరెండేఁడులవగ్రిహ, ముదితంబై క్షామ మెసఁగె నురువడిఁ జోరుల్
గదిసి పురగ్రామంబులు, సదమద మొనరించి దోఁచఁసాఁగిరి జనులఁ. ౨౧౧

వ॥ అట్టి సమయంబున విశ్వామిత్రుండు సంసృతిఁ భరియింపం జాలక దారపుత్రాదులం బరిత్యజించి కౌశికీతీరంబునఁ గందమూలాదిభక్షణంబున దేహయాత్రఁ జేయుచుఁ గాలంబు గడపునెడఁ దదంగనామణి కుటుంబభరణంబుఁ జేయం జాలక దుఃఖితయై యతిక్షుధచే దీను లగు బాలకులం గాంచి, యచ్చటచ్చట భిక్షించి కొన్నిదినంబులు గడపి క్షుధాతురంబై జగంబు సమయం జొచ్చినఁ జింతించి ప్రజారక్షకుం డగు రాజు తపంబున కరిగె. ధనహీననగు నన్నుం బాసి వల్లభుండు తపంబునకుం జనియె. సమర్థుం డయ్యును నన్ను భరియింపంజాలకపోలంగెం గదా! యిద్దుర్భిక్షంబున శిలోంఛవృత్తుల కవకాశంబులేదు. నీయర్భక భరణం బెట్లొనర్తు? క్షుధితంబై సంతానంబు మడియఁగలదు గావున నొకని విక్రయించి యన్యులం బోషింతు. సర్వసంక్షయం బయుక్తంబని హృదయంబు కఠినం బొనర్చి సుతత్రయంబున మధ్యముకంఠంబున రజ్జువు బిగియించి విక్రయణంబునకుం జని తిరుగు సమయంబున. ౨౧౨

గీ॥ శబరవాసమ్మునందున్న ఱజనపతీంద్రు, కొడుకు సత్యవ్రతుఁడు మానిఱకువలయాక్షిఁ
గాంచి యబ్బుర మొంది యఱక్కటిక మెఱయఁ, ద్రోవకడ్డంబువచ్చి యఱత్త్రొయ్యలికిని.

ఉ॥ కంఠమునందు రజ్జువు బిఱగం గదియించి మనమ్ములోన ను
త్కంఠ యొకింతలేక యిటు ఱ కట్టెఁడివై భ్రమియించెదేల? యి
క్కుంఠితవృత్తి విప్రులకుఁ ఱ గూడదు సుమ్ము విచారధుర్యవై
లుంఠితకర్మకుం జొరుట ఱ లోకులు నవ్వరె యిట్టులేటికిఁ? ౨౧౪

ఉ॥ ఎవ్వరిపత్ని వీవు? కమఱలేక్షణ! యిట్టి విచారమేల? నీ
విప్రవిపరీతవృత్తికి నఱభీష్టముఁ గొల్పుట కూడదంచు న
జ్జవ్వనివృత్తముఁ దెలియ ఱ స్వాంతముఁ గొల్పిన బోటి పల్కె వా
కుర్విఁగ లజ్జయయ్యెడు నఱగుంగద? లోక మఱేని దెల్పెదఁ. ౨౧౫

సీ॥ ఏను విశ్వామిత్రుఱనిల్లాల నౌరసుం, డీ పిన్న యొందేని ఱ పాప వీని
విక్రయించెదనని ఱ విపణిమధ్యంబునఁ, గ్రేతలఁ జూతు ఱ నేఁడేని కొన్న
నవ్విత్తమున జీవఱనార్థులమై యిట్లు, వెడలితి ననిన నఱవ్విభుఁడు దేవి!
పట్టిఁ బాలింపుము ఱ భక్ష్యంబు నే నొత్తు, నిరతంబు వలలంబు ఱ తరువుకొమ్మ

గీ॥ గట్టువాఁడ నయ్యదిగొని కడుపునిండఁ, గొడుకులును నీవు భక్షించుకొనుచు నెడరు
గడపుమన్నను సమ్మదాక్రాంత యగుచుఁ, దనయుగళబంధమూడిచి తరుణినిలిచె.

క॥ భూలలనావల్లభ? విను, గాలవుఁడు సుమీ? యతండు కాలవశతచేఁ
దూలి యిటులయ్యె విధి యాభీలము దుర్లంఘ్య మెంత పెద్దలకైనన్. ౨౫౮

చ॥ తనయులతోడఁగూడి వనితామణి నిచ్చలు నాశ్రమంబునన్
జనపతిసేయు రక్షణము సంతతమున్ గలదాట నాశ్రమా
వనులఁ జరించుచున్ గడపె వావిరిమై నతఁడామిషంబు తాఁ
గొని తరుశాఖఁ గట్టు ననుకూలత విప్రసమర్పణార్థమున్. ౨౫౯

చ॥ అనుదిన మింతి యప్పలల మాదరణంబున సంగ్రహించి భో
జనవిధి సల్పుచున్ నృపతిసంశ్రయణంబున సంతసింపుచున్
గనియెను దృప్తి, క్షామమును గాలవశమ్మునఁ దీరిపోయె న
జ్జనపుఁ డయోధ్యఁ జేరి పురసన్నిధి వర్తిలుచున్న నయ్యెడన్. ౨౬౦

గీ॥ శ్వపచసంసర్గదోషాఘసంహృతికిని, దగ వశిష్ఠుండు దెలుపు నధ్వరము సల్పి
జనసమాదృతిఁబురిఁ జేరి సర్వరాజ్య, దక్షుఁడై యొక్కతఱి వేఁటతమి పొసంగి.

మ॥ శరచాపమ్ములు పట్టి పర్వతవనీసంచారమున్ జేయుచున్
హరిణవ్యాఘ్రవరాహసింహశరభాద్యక్రూరజంతువ్యథా
కరుఁడై యచ్చట నచ్చటన్ దిరిగి యుగ్రక్రోధతామ్రాక్షుఁడై
కరమొప్పారఁగఁ బెక్కుసత్త్వములఁ జక్కాడెన్ మహోల్లాసియై. ౨౬౧

సీ॥ మృగయావిహారంబు మెఱయింపుచును దాను, దండ్రి నివాసించుతఱి వసించు
వని కేగి యచ్చట వదలక యాత్మైక, రక్షణంబున నున్న భిక్షువనిత
కొఱకునై యచ్చోటఁ గొఱలుచునున్న వ, శిష్ఠగోవును గాంచి చెట్టతనపుఁ
జైదంబునను దానిఁ జంపి క్షుధార్తుఁడై, యొకకొంత తాఁ దిని యొయ్యనొయ్యఁ

గీ॥ గొంత తరుశాఖఁ గట్టిన నింతిగవ్య, మనుచు నెఱుఁగక తానును నాత్మజులును
మెసవిరి వశిష్ఠుఁ డది గాంచి కసిమసంగి, క్రోధఘూర్ణితుఁడై రాజుఁగూర్చి పల్కె.

మ॥ దురితం బక్కట! శంకలేక జడతన్ దోగ్ధ్రిన్ వధింపంగ నీ
కర మెట్లొగ్గెను? గోవుఁ జంపితివి జోకన్ విప్రనిల్లాలినిన్

* టిప్పణి: “శ్వపచ సంసర్గ” అనుపద్యము మొదలు శాపమువఱకును గల గ్రంథమునకును మూల మునకును సంబంధము లేదు. దీనింబట్టి గ్రంథకర్తకు లభించిన మూలగ్రంథము నేఁటి గ్రంథముల కన్న భిన్నమని యూహింపనయ్యెడిని.

బరఁగం బట్టితి తండ్రి కోపమునకుం బాత్రుండైతి విశ్వామిత్రుఁడు ని
ష్ఠురశంకుల్ గద? నీకు వీనివలనన్ సొంపెల్లఁ దూలున్ ధరన్. ౨౬౩

చ॥ కడిఁది పిశాచరూపమునఁ గన్పడుచున్ బటు ఘోరరూపినై
చెడుగ! త్రిశంకునామమునఁ జిత్తమునన్ వెత నొందుచున్ గడున్
జడత వహించి పోదు వని శప్తునిఁ జేసె వశిష్ఠుఁ డాతనిన్
గడువడి మత్తవృత్తి వృథగాఁ జనునే భువి నెంతవానికిన్? ౨౬౪

క॥ నా విని జనమేజయవసుధావరుఁ డమ్మౌనిఁ గాంచి తత్పరమతియై
దేవ! త్రిశంకుని శాపం బేవిధమునఁ బోయె ముక్తి యెట్లాతనికిన్?

చ॥ తెలుపు మటన్న నమ్ముని యుదీర్ణకృపామతి నిట్లు పల్కె ను
త్తలపడి యా త్రిశంకుఁడు వెతల్పడి ఘోరపిశాచరూపియై
స్థలజలమధ్యభాగముల సంచరియించుచు నొక్క మౌనిచే
ఫలితముగా నవాక్షరి శుభస్థితిమై నుపదిష్టుఁడై యొగిన్. ౨౬౬

సీ॥ సత్యవ్రతుం డిట్లు శాపపీడితుఁ డయ్యు, మునుల యాశ్రమముల మూలమంత్ర
జప మొనర్చుచు వనస్థలుల మల్లాడుచు, వన్యవృత్తులఁ గాలవర్తనంబు
సలుపుచుఁ దన్మంత్రజపహోమకృతికినై, యాశ్రమవాసి మహాత్ములకును
మ్రొక్కి మీరలు నాకు దిక్కయి నేఁ జేయు, మంత్రమ్మునకు హోమమార్గవిధులు
గీ॥ సలిపి మత్కార్యసంసిద్ధి గొలుపవలయు, నేను సత్యవ్రతుండను మానవేంద్ర
పుత్రుఁడను నన్నుఁ గరుణింపఁ బూని సన్నిధాన మొనరింపవలయుఁ బ్రార్థన మొనర్తు.

గీ॥ ఇటులు సత్యవ్రతుండు ప్రార్థింప విప్రులతనితోఁ బల్కిరిట్లని యవనినాథ!
గురుని శాపవశంబున ఘోరమగు పిశాచరూపము వచ్చె నిస్సంశయముగ.

ఉ॥ ఏము ధరాతలామరుల మిట్టి దురాత్మున కెట్లు పూని యీ
హోమ మొనర్తు మెల్లెడ సయోగ్యతఁ గాంచితి లోకగర్హితం
బీమెయిఁ బూనజాల మన నెద్దియుఁ దోఁచక తాపతప్తుఁడై
సీ! మరణంబు మేలనుచుఁ జిత్తము తత్తఱమంద నాత్మలో. ౨౬౯

మ॥ అకటా! యెన్నివెతల్ ప్రసంగె గురుశాపాధఃకృతిం జెందుచున్
వికటక్రూరపిశాచరూపమున నిర్వేదంబుచేఁ గుందుచున్
జకితాంతఃకరణంబునన్ విపినభూసంచారినై జీవన
ప్రకటౌద్ధత్య మిఁకేల దేహ [illegible] ప్తత్యమున్ జేసెదన్. ౨౭౦

చ॥ ఇది సమయోచితంబయినసత్కృత్య మటంచు సమిచ్ఛయంబుచేఁ
బదపడి ప్రోవొనర్చి యటఁ బ్రజ్వలితజ్వలనంబు గూర్చి ని
ర్మదుఁడయి నీటఁ దోఁగి దృఢసంహమునన్ జ్వలనాంతికంబునన్
గొదుకక చండికం దలఁచి కొబ్బున దూఁకఁదలంచునంతలోన్. ౨౮౧

ఆ॥ మర్త్యకాముఁడైన మానవాధిపుఁ బ్రోవఁ,దలఁచి దేవదేవి తత్క్షణంబ
సింగ మెక్కి నింగి చెంగటఁ బ్రత్యక్షమూర్తిఁ గానఁజేసి ముదిత యగుచు.

మ॥ ఘనగంభీరనినాదయై పలికె శంకన్నాను మీకర్జ మే
మని యూహించితి? వేను గల్గ శిఖయం దాత్మార్పణం బేల? నీ
జనకుం డెల్లసుఖంబులన్ విడిచి రాజ్యంబెల్ల నీ కిచ్చి మా
నినికాయాశ్రమవాసి యయ్యె విభుమీ నీ కేల ? యీ దుఃఖముల్ ౨౮౩

సీ॥ మద్భక్తునకు ఘోరమార్గంబు లేటికి, సుస్థిరుండవు గమ్ము శోక మేది
నీ యమాత్యులు వచ్చి నిన్ను రాజ్యంబున, కభిషిక్తుఁ జేసి సర్వావనికిని
నధిపతిఁ జేతురు హర్షంబు నిండారు, నెల్లి యెల్లరును నీయెడకు వత్తు
రనుచుఁ బల్కి పరాంబ యంతర్ధి నొందిన, రాజపుత్రుండు విరాజమాన

గీ॥ హృదయుఁడై మృతి మాని యభీష్టకలన, వర్తిలఁగ నేతదీయమౌ వర్తనంబు
జనకునకు నారదుఁడు దెల్ప స్వాంతమునను, ఖేదమందుచు మదిలోనఁ గృపదలిర్ప.

వ॥ అమాత్యులారా! శోకపరిప్లుతుండౌ పుత్రచేష్టితంబు వింటి రే? యేను నిగ్రహించుట
వలన నరణ్యంబున నధివసించి మదాజ్ఞావశంవదుండై ధనహీనుం డగుచు విజన
స్థలంబున నట్లు వర్తించె వశిష్ఠుశాపవశంబునఁ బిశాచసదృశుండై దుఃఖపరి
తాపంబున హుతాశనప్రవేశం బొనర్పందలంచిన దేవీకృపాతిశయంబున
నక్కడు దొలంగె నని నారదముఖంబున వింటి. మీరలు సత్వరంబుగాఁజని పుత్రా
నయనంబు సేయందగు నేను శాంతుండనై వానప్రస్థాశ్రమంబునకుం జనువాఁడనని
పల్కిన వారలు చని వినయంబుగా సత్యవ్రతుని దోడి తెచ్చిన జనకుం డాలింగనం
బొనర్చి సర్వరాజ్యంబున కభిషిక్తుం జేసి ప్రేమపూర్వంబుగా ధర్మోపదేశం బిట్లు
సేయందొడంగె. ౨౮౫

సీ॥ ధర్మంబునందుఁ దత్పరుఁడవై యుండుము, మాననీయము ధరామరజనంబు
న్యాయాగతధనంబు లార్జింపు ప్రజలను, రక్షింపు సత్యంబు రక్షణీయ
మపమార్గసంచార మాచరింపకు మాని.జనములఁ బూజింపు శత్రువధము
సేయు మింద్రియజయస్థితుఁడవై యుండుము, కార్యసిద్ధికి యత్నఘటన సల్పు

గీ॥ మంత్రగోపన మెడలీకు మంత్రివితతి, నాదరింపుము స్వల్పుని నైన నరిని
నడఁచివేయుము పరులపై [illegible] విశ్వాసయముగ.

సీ॥ శత్రుమిత్రులవృత్తి చారముఖంబునఁ, దెలియుము వితరణోద్దీప్తిఁ గనుము
శుష్కవాదము సేయఁ జూడకు దుష్టుల, సంగంబు మానుము సవనవాంఛ
యెడపక మఖము లహీనతఁ జేయుము, స్త్రీజనంబుల విశ్వసింపవలదు
ద్యూతమద్యములకుఁ దొలఁగుము వేటపై, నత్యాదరము మాను మర్థులందుఁ
గీ॥ గృపదలంపు మెల్లపుడును గేయవిద్య, మతిని జొనుపకు గణికాసమాజములను
గూటమికిఁ జొన్పవలదు సంకోచబుద్ధి, బ్రజలమర్మంబు దెలియుము ప్రౌఢిమెఱయ!

సీ॥ బ్రాహ్మకాలమునందుఁ బరఁగి నిద్దురలేచి, స్నానసంధ్యాద్యనుష్ఠానవిధులు
సలిపి విప్రులయిండ్లఁ గలిమిలేము లెఱింగి, సభ నిల్చి ధర్మశాస్త్రములు వినుచు
వేదవేదాంగాదివేత్తలౌ విప్రుల, నర్చించి సత్పాత్రమని యెఱింగి
ధనగోతురంగాదిదానముల్ సేయుము, వేత్త గాఁడేని భూవిబుధు విడుము
గీ॥ మూర్ఖునకునైన నన్నంబు మొనసి యిడుము, మఱచియైనను విప్రావమానములను
మనసుఁ జేర్పకు తాపసుల్ మాననీయు, లని యెఱుంగుము బాల్యకృత్యము లువలదు.

సీ॥ సకలవర్ణములకు జనకంబు ద్విజజాతి, యప్పుల ననలంబు నశ్మములను
లోహంబుపోలిక నూహింప క్షత్రియ, జాతికి బ్రాహ్మణుల్ జనకపదము
బ్రహ్మతేజము జగత్త్రయపూజ్య మగుటఁ ద, త్పూజ క్షత్రియునకు భూతిహేతు
వగుట దానంబున నాదరంబున వారిఁ, బూజింపవలయును బుడమి ఱేడ
గీ॥ లఖిలధర్మజ్ఞులను సభలందు నిలిపి, తదనుసారత దండవిధానకృత్య
మాచరింపుచు నన్నిటి కాది యగుటఁ, గోశ మార్జింపవలయును గుతలపతికి.

ఆ॥ వత్స! నేను దెల్పు సత్సంప్రదాయముల్, ధర్మముల నెఱింగి తత్పరతను
జనుల నేలు మనఁ ద్రిశంకుండు ప్రణతుఁడై, జనకునాజ్ఞ సలిపె శాసనంబు. ౨౮౦

క॥ ఇత్తెఱఁగునఁ దనయుఁ మతి, మత్తముఁగాఁ జేసి తండ్రి మహితద్యునదీ
సత్తటమున వసియించుచుఁ, జిత్తము పరిశుద్ధినొంది చేరెఁ దివికిన్. ౨౮౧

క॥ అని తెలిపినఁ బతి వినయా, వనతుండై, మానిఁ గాంచి వందనమిడి యో
మునినాథ! త్రిశంకుఁడు గురు, ఘనశాపముదొలఁగి యెట్టిగతిఁ జెందెననన్. ౨౮౨

ఉ॥ కుంభజుచేత శప్తుఁ డయి ఘోరపిశాచత నొంది కాంతిసం
స్తంభితదుష్టరూపమున ధాత్రిఁ జరింపఁగ నొక్కవిప్రుఁ డు
త్కుంభితసత్కృపన్ విజయధూర్వహమైన నవాక్షరంబు వి
స్రంభముతోడ నిచ్చెను బ్రసన్నతఁ గాంచెను దేవి వానికిన్. ౨౮౩

సీ॥ సర్వేశ్వరీమంత్రజపపరాయణుఁడైన, వానికిఁ గలదె? దుర్వర్తనంబు
భువనేశ్వరీకృపోద్భూతి గల్గినయట్టి, ఘనునకుఁ గల్గునే? కల్మషంబు

విశ్వేశ్వరీతత్త్వవిజ్ఞప్తి గలయట్టి, నరునకుఁ గలదె? యన్యాయపథము
కామేశ్వరీసమర్చామాన్యుఁ డగునట్టి, జనునకుఁ గలదె? దుష్కర్మసమితి
గీ॥ దివ్యదేవీనవాక్షరదృఢజపాను, భావ మెపుడబ్బె నపుడె యప్పార్థివునకుఁ
బాపసంచయములు పటాపంచలయ్యె, నమలతేజంబు గల్గె బాలార్కుపగిది.

చ॥ గురుఁడు వశిష్ఠుఁడున్ మదినిఁ గూర్మివహించి యనుగ్రహించె స
త్వరముగఁ దండ్రియున్ సుగుణతత్పరుఁడై మన సిచ్చె రాజ్యము
ద్ధురతఁ బొసంగ ధర్మనయధూర్వహుఁడౌచుఁ ద్రిశంకుఁ డేలి య
ధ్వరములు పెక్కొనర్చె భగవత్కృపగల్గిన నింత యబ్రమే. ౨౮౫

ఉ॥ సాంద్రయశస్కుఁడై తగు త్రిశంకునకున్ సుతుఁ డయ్యెఁ బో హరి
శ్చంద్రుఁడు; రూపసంపదలఁ జంద్రునినైన నధఃకరించు దే
వేంద్రుఁడు వైభవంబున నభీష్టధనంబుల యాచకాళి ని
స్తంద్రకృపాతిరేకమున సంతతమున్ దనియించు మిన్నయై. ౨౮౬

గీ॥ ఆ హరిశ్చంద్రు యువరాజ్యమందు నిల్పి, మానుజాంగంబుతోడ నమర్త్యపురికిఁ
గంతుకామతఁ గుంభజుకడకు నేగి, ప్రణతి యొనరించి యిట్లని పలికె నపుడు.

ఉ॥ దేవ! మహానుభావ! భవదీయకృపామతిచేఁ దదంగసం
భావితవృత్తి స్వర్గసుఖపారముఁ జెందఁగఁ గోరినాఁడ స
ర్వావని సౌఖ్యభుక్తుల నుదారుఁడనైతి మదీయరక్షకుం
డావల మీవు నా పలుకు తథ్యముగాఁ జెవి నానఁగాఁదగున్. ౨౮౮

సీ॥ అప్సరాంగనలతో ననుకూలసంభోగ, సారస్య మార్జింపఁ గోరినాఁడ
తుంబురునారదాదులవిపంచీస్వానముల మాధురులఁ గ్రోలఁదలఁచినాఁడ
ధరణి యాజకకృతాధ్వరభాగభోగంబు, లిచ్చ భక్షణ సేయ నెంచినాఁడ
గగనగంగాతరంగముల నోలలొనర్పఁ, జిత్తంబుఁ జేర్చి కాంక్షించినాఁడ
గీ॥ మానుషంబైన కాయసంబంధమునన, త్రిదశపురభోగములఁ గూర్చి తీర్పనీవె
దక్షుఁడవుగానఁ బ్రార్థనార్థముగ నిన్ను, నాశ్రయించితిఁ గరుణింపు మయ్య! నన్ను.

శా॥ ఏయాగంబుల నిట్టిభోగములు సిద్ధించున్ మనుష్యాళి క
య్యేయాగంబు లొనర్పఁ జేసి సురలోకావాసమున్ జెందఁగాఁ
జేయంజాలిన పుణ్యమూర్తివి కటాక్షింపన్ దగున్ వేగ నం
చాయుర్వీశ్వరుఁ డిట్లు వేడ మునిగోత్రాధీశునిన్ జూచుచున్. ౨౯౦

క॥ మానుషదేహమ్మున సుర, ధానికిఁ బోనెట్లు గల్గు దథ్యము కృతసం
ధానులకు దేహ మెడలిన, పై నిర్జరసౌఖ్య మబ్బుఁ బ్రథితము శ్రుతులన్.

చ॥ విడువుము దుర్లభంబయిన ♩ వేడుకయిట్టి మనోరథంబు చొ
ప్పడ నొనరింప యజ్ఞము లశేషము, లంగముఁ బాసి తద్గతిఁ
బడసెద విమ్మనోరథము ♩ ప్రాజ్ఞులు మెచ్చరు పెక్కులేల? నీ
కెడయని పుణ్యలోకముల ♩ నిచ్చెడి దేవి; యొకండు లోపమే? ౬౩

సీ॥ అనభిలష్యం బిది ♩ యాగమోక్తముఁగాదు చనుమన్నఁ గోపించి ♩ జనవిభుండ
నిన్నె సర్వజ్ఞుఁగా ♩ మన్నింతునే? తెత్తు, వేఱయధ్వర్యుని ♩ విబుధభోగ
మార్జింతు నన గురుం ♩ డతికోపియై నీవు, క్షితితలంబునను దుస్థితి వహించి
చండాలుఁడవు గమ్ము ♩ శాప మిచ్చితి నని, శ్వపచుండవై గోవుఁ ♩ జంపి విప్ర

గీ॥ సతిని జెఱపట్టి దుష్టచేష్టలఁ జరించు, నీవుఁ జచ్చియు విబుధేంద్రనిలయసౌఖ్య
మొందకుండెదు తథ్యమింకెందుఁ జనినఁ, దనువుతో స్వర్గ మిచ్చు నశ్వరముగలదె!

చ॥ గురుఁ డిటు నిగ్రహింప నతికోపఘనీమఁ ద్రిశంకుఁ డందు స
త్వరమున లేచిపోవునెడఁ ♩ దక్షిణ మశ్మమయంబులై మెయిఁ
గెరలెడు సొమ్ములుఁ మలినకృత్తియు విణ్మయగంధముఁ గడుఁ
బరుషవినీలకాంతియును ♩ భాసిలఁగా శ్వపచానుకారియై. ౬౪

క॥ చండాలతఁ గాంచి ధరా,ఖండలనై భవముఁ గాంచి ♩ గర్జిల్లెడును
ద్దండుఁ డగురాజు మదిలో, గం డడఁగుచుఁ జాల నిటులు ♩ గడుఁజింతించెన్. ౬౫

వ॥ అక్కటా! మహాత్ముండగు గురుని శాపంబున రాజరూపంబు వదలి శ్వపచా
కృతిం జెందితి దీనుండనై మందిరంబున కేరీతిం జనుదును? గర్తవ్యం బెఱుంగనైతి
నేమి సేయుదు? నెందుఁ జనుదు? దుఃఖక్షయం బెట్లగును? బుత్రికళత్రాదు లంగీక
రింతురే? సచివులాదరింతురే? జ్ఞాతిబంధువర్గంబులు మత్సంగంబున గొడంబడుదురే!
సర్వత్యక్తుం డగువానికి జీవితంబునకన్న మరణంబు మేలు, విషభక్షణ జలపతన
కంఠబంధన వహ్నిప్రవేశాదులలో నొక్కంట దేహంబు పరిత్యజించెద నంటినేని
యతిపాపంబగు నాత్మహత్యకుఁ జొరఁగూడదు. స్వకృతంబు భోగాన్యంబునఁ
జక్కంబడునే! ప్రారబ్ధకర్మంబులకు భోగంబున నాశంబను శ్రుత్యుక్తి తప్పునే!
ఇట్టి కర్మంబు భోక్తవ్యం బయ్యె నాశ్రమవాసంబును దీర్ఘసేవనంబును నంబికా
స్మరణంబును సాధుసంగంబును మొదలగు సుకృతంబులఁ గర్మక్షయం బొనర్తు
నని చింతించి పురప్రవేశంబునకు విముఖుండై గంగాతీరంబున వసియించి
యున్నంత. ౬౬

సీ॥ తండ్రివృత్తాంత మంతయు హరిశ్చంద్రుండు, విని దుఃఖితుండయి ♩ తనదుమంత్రి
వర్గంబు ననిపిన ♩ వార లచ్చటి కేగి, ప్రణతి యొనర్చి మిాఁపట్టి మమ్ముఁ

బ్రేరేచి పంపించెఁ - బ్రేమచే మీ రందు, రంపు మే మెల్ల మీరాకఁ గోరి
యున్నవారము మమ్ము - మన్నించి మాచేయు, పరిచర్యలకు మది పట్టుగొల్పి

గీ॥ నిలిచి యున్నను గురువినిర్నిద్రకోప, శాంతి యొనరించెదము సుప్రసన్నుఁడగుచు
దుఃఖనిర్గంధనము సేయు ధూర్వహుండు, గురుఁడు మదిలోన మీకు సంకోచ మేల?

ఉ॥ రమ్మని మాటిమాటికిఁ గర మ్మనివార్యత వేడువాఁడ దూ
రమ్మున నన్నుఁ బాసి వనరాజి వసింపఁగ నేల? రాజ్యభా
రమ్ము భవద్విహీనత భరమ్మయి తోఁచె నుపేక్షచే నగా
రమ్ము దొలంగ నేటి కనురక్తికిఁ బాత్రుఁడ నంచుఁ దెల్పుచున్. ౨౯౮

గీ॥ మాటిమాటికి నిటు తెల్పి మంత్రివరుల, మమ్ము మీనందనుఁడు పంపె మండలేంద్ర!
గమనము రుచింపఁ జేయుము తత్క్షణికఁ గులుక, ననుచు సచివులు వల్కరాజాలకించి.

సీ॥ రాజధానికి వచ్చు - రక్తి చొప్పడదయ్యె, మరలిపోవుం డింక - మంత్రులార!
నాదువాక్యములుగా - నందనుతోఁ దెల్పుఁ, డేను రాజ్యంబున - కిచ్చగింప
సధ్వరంబులు చేసి - యగ్రవర్ణులఁ బూన్చి, ప్రజలఁ బాలింపుము - పతితవేష
గర్హితుండను గానఁ - గటకంబుఁ జొరజాల, నని తెల్పుఁ డాతని - కయ్యయోధ్య

గీ॥ రత్నసింహాసనమునకు - రాజు నతనిఁ, జేసి తచ్ఛాసనంబున క్షితి భరింపుఁ
డనుచుఁ బంపిన మంత్రు లయోధ్యాధిపునాజ్ఞ, నలిపి సుస్థిరులైరి నిశ్చలవిభూతి. ౩౦౦

శా॥ సత్యాలాపధురీణుఁడై తగు హరిశ్చంద్రుండు సర్వంసహా
నిత్యప్రాభవనై భవాధ్యుఁ డయి నిర్నిద్ర ప్రజాపాలనా
చిత్యం బేమఱ కర్థులం దనుపుచున్ - జెల్వంబుచేఁ జంద్రనా
సత్యాధఃకరణప్రవీణుఁ డయి రాజ్యం బేలె నిర్వైరతన్. ౩౦౧

వ॥ అని తెల్పిన. ౩౦౨

సీ॥ సంయమీశ్వర! హరిశ్చంద్రుండు రాజైన, జనకుఁడైన త్రిశంకు - జనవిభుండు
చండాలదేహసంసక్తుఁడై యెయ్యెడ, మృతుఁ డయ్యెనో? లేక - వితతకరుణ
గురునిచే మన్ననఁ గాంగాని శాపతాపంబుఁ, దొలఁగెనో? సకలార్థధూర్వహుఁడవు
గాన నభ్భూపతి - కథ సవిస్తరముగ, వివరింపుమనిన నవ్విభునిఁ జూచి

గీ॥ బాదరాయణుఁ డిట్లని - పలికె సుతుని, దత్తు జేనిగఁ జేసి తాఁ - దపసియగుచుఁ
దిరుగుచుండంగ వచ్చె గాధిజుఁడు స్వాశ్రమమున కాలిబిడ్డల యెడ - మమత గ్రమ్మ.

శా॥ ఇల్లాలిం గని పుత్రులం గని ముదం బేపార దుర్భిక్షమం
దెల్లన్ బెన్వెత నొందు వేళల సతీ! - యెట్లీసుతుల్ నీవు న

త్త్యల్లాసం బఱకుండఁగా బ్రదికినా ఽ రో? దీదివింగాదె? శో
భిల్లన్ బ్రాణము లాత్మ సంతసిలె సం ఽ ప్రీతిన్ మిమున్ జూచుటన్. ౩౦౪

ఆ॥ ఏను దపము సేయ ఽ నేగితి నర్భక, సహితవగుచు నెట్లు ఽ స్వస్థవైతి
వే యుపాయమున సుఖించితి వే దేవు, డడ్డపడుచు మనిచె ఽ నది వచింపు. ౩౦౫

సీ॥ నిర్ధనుండనుగాన ఽ నీచెంతఁ జేరంగ, నానదోట్టిన రాక ఽ మానినాఁడ
ఏ నతిక్షుధ నొంది ఽ యెల్లచోటులఁ బొట్టఁ, బట్టఁజాలక యొక్క ఽ పక్కణమున
శ్వపచగేహమునందుఁ ఽ జౌర్యభావంబూని, శునకమాంసముఁ గొనఁ ఽ జూచువేళ
నెప్పుడు నాయింటి ఽ కేకతంబున వచ్చి, మ్రుచ్చిలించెదనని ఽ మొరఁడుఁబట్టి
గీ॥ కొట్టవచ్చిన శ్వపచేశఁ ఽ గొట్టువడితి, బ్రాహ్మణుఁడఁ దాపసుఁడఁ జోర ఽ భావమూని
యతిథినై తిని గాన న ఽ న్నాదరించి, పలల మిమ్మని వేడ నఽప్పట్టునందు. ౩౦౬

శా॥ చండాలుండను మద్గృహం బిది తప ఽ శ్శాంతుండవై దుష్టమా
భాండస్థామిషమున్ గొనందలఁచి యి ఽ ప్పాపంబు సేయంగ నే
లొండే భక్ష్యములేదె? కుక్కురపలం ఽ బోహో! స్పృశింపంగరా
దండోద్భూతములైనఁ గల్గవె? తదా ఽ హారంబు మేలౌఁ గదా. ౩౦౭

సీ॥ మానుషజన్మంబు ఽ మతిదుర్లభంబందు, ద్విజుఁడౌట గలుగదు ఽ తెలియనందు
నవనీసురుండౌట ఽ యత్యంతదుర్లభం, బట్లయ్యుఁ దెలియమి ఽ యద్భుతంబు
మన్వాది ధర్మవా ఽ క్యమ్మర్మంబు లెఱుఁగవే, జాతిచండాలుండ ఽ శ్వపచకులుఁడఁ
గర్మచండాలతఁ ఽ గడఁగి మాంసములలో, హేయమౌ నిమ్మాంస ఽ మేలకొనెదు!
గీ॥ వర్ణసంకరదోషంబు ఽ వలన వెఱచి, నిన్ను వారింతుఁగాని నిఽర్నిదప్రలోభ
పరవశుఁడఁగాను నామాటఽ బట్టితొలఁగు, బ్రహ్మతేజంబు నెలమిఁ గాఽపాడుకొనుము.

శా॥ ఆలోకింపఁగరాని వాఁడనగు న ఽ న్నంటంగ ధర్మంబె? మ
చ్ఛాలాంతస్థితిఁ గూడునే? శునకమాం ఽ సం బిట్లు భక్షింపఁగా
నాలోచింతురె? యెందునేని చనుమీ ఽ వ్యాపారసంక్రీడనం
బేలా? పొమ్మని పల్కు వానిఁ గని నే ఽ నిట్లంటిఁ గాంతామణీ! ౩౦౮

ఉ॥ ధర్మ మెఱింగి పల్కితివి ఽ తథ్యమె యైనను సూక్ష్మమార్గముల్
ధర్మములందుఁ గల్గు నవి ఽ తద్దయుఁ దెల్పెదఁ గీడువేళ దు
ష్కర్మ మొనర్చినన్ దొసఁగు ఽ గల్గదు కల్గినఁ బాపశాంతి స
త్కర్మల నౌఁగదా! నిగమ ఽ ధర్మము లిట్టివి వేత్తృవేద్యముల్. ౩౦౯

క॥ ఆపదలు లేనివేళలఁ, బాపముల నొనంగు దుష్ట ఽ పథవర్తన మ
య్యాపదఁ దొడరిన నెయ్యది, పాపమునకుఁగాదు ధర్మ ఽ పథ మని గనుమీ. ౩౧౦

ఉ॥ ఆఁకలిచే మృతుం డగుట - యంధతమస్థితి కారణంబు; ని
రీక్షకత నెట్టులైన క్షుధ - పెల్లగు వేళల హేయభక్షణ
వ్యాకులవృత్తి నొందక సుఖాతిశయంబున మెక్కఁబోలుఁ గిం
పాకవర్ణ్యా! నా యెడ నపాకరణం బొనరింప నేటికిన్! ౩౧౨

క॥ అదిగావునఁ బాటచ్చర, విదితంబగు ధర్మ మూని - వెడలితి దేహా
పద దీనఁ దొలఁగు కతమున, నిది కర్తవ్యంబ కాక - హేయంబగునే. ౩౧౩

క॥ భక్షింపఁదగనిమాంసము, భక్షించిన దురిత మేను - బర్జన్యునకై
కక్షగొని యిడుదు నీదు,ర్భిక్షము తన్మూలమగు నభీతుఁడ ననినన్. ౩౧౪

వ॥ క్షుధార్తుండ నగు నాకు భక్ష్యం బెద్దియుం బొసంగక రోషభీషణుండనై యిబ్భా
షణంబు సేయునంత పర్జన్యుండు గగనంబున నావరించి హస్తిహస్తాభధారా
సారంబు లపారంబులు వర్షించిన మేదిని చల్లంబడియె. ముదితుండనై యేను బక్క
ణంబు వెడలి పర్ణజలాహారణంబు లొనర్చితి; నట్టి యెడరున నీవు కాలం బె
ట్లుపసయించితి వఖిలభూతాపహారకంబగు కాంతారంబున నెట్లు వసించితి వనిన
నబ్బోటి భర్తం గని యిట్లనియె. ౩౧౫

క॥ ఎడలని దుర్భిక్షంబున, బడలుచుఁ గడునార్తులగుచు - బాలురు శోకం
బడరఁగఁ బడువేదనచేఁ, దడఁబడి కొన్నాళ్ళు గడపి - తత్పరమతినై. ౩౧౬

క॥ జలముల నచ్చోనచ్చో, ఫలముల నీవారముఖ్యభక్షణములఁ బె
ల్లలమట నొందుచుఁ దత్థితి, నెలయింపఁగలేక యిల్లు - వెడలితి నవలన్. ౩౧౭

చ॥ కొడుకును విల్వఁజూపిన నకుంఠితధార్మికుఁడైన యొక్క రా
జడవిని నన్నుఁ జూచి యకటా! యిటు లేటికిఁ గ్రుస్సియుంటి వీ
కడిఁది విచారమేల? సుతకంఠమునన్ ఘనరజ్జుబంధ మి
ట్లిడి విలపింప నేల యిది - యెల్ల వచింపఁగదమ్మ! సాధ్విరో! ౩౧౮

మ॥ పలలం బీతరుశాఖ నిచ్చలును నే - బంధింతు నీకై క్షుధా
కులతన్ జెందక దీనిఁ గొంచు సుతులన్ - గోర్కెన్ భరింపన్ దగున్
వల దీనేత యనంగ మే లనిన మద్వాక్యంబు పాలించి భూ
తలనాథుం డటు సేయ నే బ్రతికితిన్ - దథ్యంబు ప్రాణేశ్వరా! ౩౧౯

గీ॥ అట్లు సత్యవ్రతుండు నుసనహారహంబు, జీవనోపాయ మిడుచుఁ బోషించి యొక్క
నాఁడు గోమాంసమిడియె నానందనులును, నేను భుజియించితిమి యిట్టివృత్త మెల్ల.

చ॥ తెలిసి వశిష్ఠుఁ డాతని సుదీర్ఘతరాగ్రహ మూని రాజవై
మలినత గోవుఁ జంపితిమి [illegible] భూ

తలపతి యట్టులైనఁ గడు దైన్యము నొందితి నస్మదర్థ మి
ట్టులు శ్వపచత్వ మొంది నృపుఁడుర్వి వెతనొందుచు నున్నవాఁ డనన్. 3౨౧

ఆ॥ కాంతఁజూచి పలికెఁ గౌశికుం డటులేని, శాప మెడలఁజేసి జనపతీంద్రు
యోగ్యుఁజేతు నిట్టి యుపకారి విడుతునే?, నా తపోబలంబు నాతి! కనుము. 3౨౨

చ॥ అని చెలి నూరడించి వసుధాధిపుదుఃఖ మడంపఁబూని య
మ్మునిజననాథునిన్ వెదకి మూర్ఖతఁ బక్కణవాసియైన వా
నినిఁ గనుఁగొన్న నాతఁడు మునిం గని విస్మితుఁ డౌచు మ్రొక్కినన్
జనవర! రమ్మటంచుఁ దన సన్నిధిఁ జేరిచి పల్కె నిట్టులన్. 3౨౩

క॥ నీ వాంఛాపూరణమున, కే వలతిన్ దెలుపు మనిన ఖేదంబాఱం
గా వాచంయమివర? మ,ద్భావము సంతసిలె విన్నపం బొనరింతున్. 3౨౪

ఉ॥ ఏను సకాయతన్ దివికి నేగఁగఁ దొల్లి వశిష్ఠుఁ బిల్చితిన్
రా నని పల్కెవేఱ మునిరాజును దెచ్చెదనన్న నాగ్రహో
ద్దీనమనస్కుఁడై నను శపించిన నిట్లయితిన్ గటాక్ష వీ
క్షానియతిన్ దదధ్వరము సల్పి కృతార్థుని జేయుమం చనన్. 3౨౫

గీ॥ శాపభీతి నిరాకరించఁగఁదలఁచి, గాధిసూనుండు యజ్ఞసంకల్పమునకు
సకలసంభారములు గూర్చి సర్వదిశల, మునుల రావించెను బుల స్త్యాముఖుల నంత.

సీ॥ అది యెఱింగి వశిష్ఠుఁ డత్తాపసులఁ జూచి, కర్త చండాలుఁడు క్షత్రియుండు
యాగంబు సేయింప నధికారి మీరలు, వేద వేదాంగ సంవేదులయ్యు
సత్రింబునకు నెట్లు చనెదరో? శ్వపచాన్న, మెట్లు భుజింతు రట్లైన మీర
లభిశస్తులయ్యెద రని పల్క నెవ్వరు, మునులు రారైరి తన్మౌల మెఱిఁగి
తే॥ గాధిసూనుండువిమనుఁడై కడలుకొనెడు, దుఃఖమున రాజుతోఁబల్కె ధూర్తుఁడైన
యవ్వశిష్ఠునిమాత్సర్య మద్భుతంబు, విప్రులు తదాజ్ఞలోఁబడి వెడలరైరి.

ఉ॥ సర్వనిరాకృతిప్రవణసాహసధీరుఁడ సర్వవిద్విష
ద్గర్వతమఃపతంగుఁడ విధానవిధిజ్ఞుఁడ నాకుఁ దోడె? యీ
చర్వితచర్వణోత్సుకులు జంగమభూతము లిట్టి విప్రులన్
ధూర్వహతన్ గణింతునె! బుధుల్ తమ కేయని తుళ్లిఁ బాటునన్. 3౨౮

గీ॥ నీదు యాగంబునకు రాక నిగ్రహించి, చనియెదరుగాక యజ్ఞ విఘ్నంబు మేల!
యేను జేసిన సుకృతంబు లెల్ల నీకు, ధారవోసెదఁ జను పురందరునిపుడికి. 3౨౯

చ॥ అని సలిలంబు చేతఁగొని మౌని మహీపతినిధానశాస్తిన
జ్జనవిభు కేల ధారయిడి సభ్యుఁడవై తిఁక నిచ్చవచ్చిన

ట్లనిమిషపట్టణంబునకు నర్హుఁడ వైతివి నీకు మేలగుం
జను మని పల్కె నవ్విభుఁడు సత్వరతం జనె నభ్రవీథులన్. ౩౩౦

చ॥ అది గని నిర్జరాళి త్రిదశాధిపుఁ గాంచి సురేంద్ర! వచ్చువాఁ
డదె గను దుష్టుఁడై గురునిరాకృతిచే శ్వపచత్వ మొందె నా
పదపడి పుణ్యలోకపరిభావకుఁడై చనుదెంచె దేవతా
సదన మపూజ్యమై చనదె శాసన మీ వొనరింపఁగాఁదగున్. ౩౩౧

ఉ॥ నిర్జరు లిట్లు వల్క మలినీకృతచిత్తవిఘూర్ణితాకృతిన్
గర్జిలి శక్రుఁ డీ యధముఁ గట్టుఁడు కొట్టుఁ డటంచుఁ దర్జనా
భర్జనలన్ దదాననముఁ బల్మఱుఁ జూచుచుఁ బల్కె నోరి! పా
పార్జనచిత్త! రాకు చనుమా! యని త్రోయఁగఁ బంపెఁ జారులన్. ౩౩౨

గీ॥ అంతఁ జారులు చని త్రోయ నతఁ డధశ్శిరస్కుఁడై వచ్చివచ్చి యాక్రందనమున
నిలువఁజాల విశ్వామిత్ర! నేలఁ బడితిఁ,బడితిననివచ్చు వేళఁ దాపసవరుండు. ౩౩౩

ఆ॥ క్షీణపుణ్యుఁడైన చేతనుండు దివంబు, విడిచినచ్చుచున్నవసుపు దోఁప
యవనిఁ బడుచునున్నయట్టి త్రిశంకుని, బట్టి నిలిపె భువనభాగమునను. ౩౩౪

మ॥ తన తేజోతిశయంబుచే క్షితిపతిన్ దాఁ బట్టి విధ్యుక్తమై
ఘనమౌ నిష్టి రచించి రెండవదివిం గల్పించి యందుండఁగా
జనపాలాగ్రిణి కాజ్ఞ యిచ్చి విధిసృష్టంబెల్ల ద్వైధాగతిన్
గొనఁగా వేఱొక శక్రు నిల్పుటకునై ఘోరాకృతిన్ జూపినన్. ౩౩౫

ఉ॥ వాసవుఁ డేగుదెంచి మునివల్లభ! యాగ్రహ మేల? యింత యా
యాసముఁ జెందు టేమి? యనివార్యత నివ్విధి యేల చేసె? ది
చ్ఛాసము పేత మెయ్యది? ప్రసన్నతఁ గాంచుచుఁ దెల్పు తేని వి
న్యాస మొనర్తు నెట్టిపని యైనను దెల్పు మటన్న హృష్టుఁడై. ౩౩౬

సీ॥ విబుధేంద్ర! నీపురి వెడలి నేలకు వచ్చు, నితనిఁ గొంపోయి నీయిక్క నిల్పు
టది నాకు సమ్మతం బనిన విశ్వామిత్రునకు శంకితుం డౌచు నాకవిభుఁడు
ఇంత తేజం బల్పమే? దేవదానవ,దురవగాహంబు నేఁ ద్రోవఁదగదు
దుష్టమైనను వేదజుష్టం బటంచును, జేయకున్నను గల్గుఁ జెఱుపు దినికి.

తే॥ ననుచు దివ్యాంగుఁ జేసి యయ్యధిపు దేవ,యానమునఁగొనిపోయె వృత్తాంత మెల్ల
విని హరిశ్చంద్రభూపతి వేడ్కనొంది, యవనిఁ బాలించుచుండె నత్యాదరమున.

క॥ ప్రజలం బరిపాలించుచు, గజవాజిశతాంగభటనికాయము గొలువన్
నిజభుజ తేజోగరిమన్, విజయముఁ జేకొనియె సమరవీరాగ్రణియై. ౩౩౭

వ॥ ఇత్తెఱంగున ననేకాబ్దంబులు రూపయావనచాతుర్యధుర్యలగు భార్యలం గలిసి సుఖించియు ననపత్యుండై వశిష్ఠాశ్రమంబునకు మహిషీసమేతుండై చని వశిష్ఠుం గాంచి, "గురువర్యా! దివ్యభోగంబులు పెక్కు కాలం బనుభవించితి, అవస్థాత్రయంబున సుఖరహితంబై మనంబు నిర్వేదనం బొంది సంతానహీనుండ నగుటవెతం బొందితి; నిప్పడంతి మత్పరిగ్రహంబు వంధ్యాత్వంబునం దసహిష్ణువై లజ్జించుచు శోకాగ్నిం బొరలుచు శృంగారంబున మనం బిడక ఆనందంబు సడలి లజ్జావశంబున మన్ముఖంబున నిట్లు పలుకుచున్నయది. మంత్రవిద్యావిశారదుండవు, దైవజ్ఞుండవు, సంతతిం బడయు నుపాయంబు దెలుపుమన ననపత్యులకు దుర్గతి యనుట నెఱింగియు నేల యుపేక్షించెదు? పశుపక్షి మృగంబులు సంతాన లాభంబున సంతసించు, మందభాగ్యుండనగు నాకుఁ దత్సిద్ధి పొసంగదయ్యె" నని పదంబులపైఁ బడి బహువిధంబులఁ బ్రార్థించిన. ౩౩౯

క॥ ఆలించి యతనివాక్యము, లోలిన్ మన్నించి తథ్య § మొగి నీపలుకుల్
జాలిపడవలదు నీ కొక, కీ లెఱిఁగించెదను వినుము § కృతమతి వగుచున్. ౩౪౦

చ॥ వరుణుఁడు పుత్రదాయకుఁ డ§వశ్యము సేయుము తత్సపర్య, ని
ర్భరసుఖదాయకున్ సుతుని § భవ్యతచేఁ గరుణించు శోక మి
ట్లుఱిముఱి నేలపొందెదు? ప్ర§యత్నము లిష్టము లిచ్చుఁ గాన నో
నరవర! పుత్రలాభమున § నట్లయినన్ సుఖియించె దీవనన్. ౩౪౧

చ॥ సురతటినీతటంబున వి§శుద్ధమనస్కత యాదసాంపతిన్
గరమలరన్ గుఱించి యధి§కప్రమదంబున భూమిభర్త దు
స్తరతప మాచరింపఁగఁ బ్ర§సన్నతఁ గాంచి కృపాళుఁడౌచు సా
గరవిభుఁ డిట్లు పల్కె నృప! § కామ్యమ దెయ్యది? దెల్పుమంచనన్. ౩౪౨

మ॥ అనపత్యుండ భవత్కృపామతిని నే § నాముష్మికంబైన సౌ
ఖ్యనిధానంబు ఋణత్రయాపహరమున్ § గాఁ బుత్త్రు వాంఛించితిన్
ఘనమా నీ వర మిమ్ము ప్రేమ నన మ§త్కాంక్షార్థసిద్ధి న్గడున్
వినయంబొప్ప నొనర్తు వే ఖరకర§స్ఫీతున్ గుమారోత్తమున్. ౩౪౩

క॥ కరుణించెద మద్వాంఛిత, కరుఁడవు గావలయుఁ బశువు§గాఁ గొని సుతు న
ధ్వరమున యజింపు మన నర,వరుఁ డాతని కిట్టు లనియె § వగ బుగులెత్తన్. ౩౪౪

చ॥ జలనిధినాథ! వంధ్యతకు § సైఁపఁగఁజాల నిన్ గుఱించి వి
చ్చలవిడి యాగమున్ సలిపి § సద్విధి నందనునిన్ బ్రియంబుగా
ఫల మెదఁ గోరి యజ్ఞపశు§పద్ధతి నర్పణ సేతు నన్న రం
జిలి వరుణుండు నంద[illegible] § [illegible]చ్చెఁ గల్గ నటించు నగినన్. ౩౪౫

సీ॥ అయ్యభీష్టము దెల్పి యంగనామణితోడ, నేకాంతకేళుల నెనయు నంత
గర్భంబు దాలిచి కలికి పుత్రునిఁ గాంచె, జాతకర్మాదిసంస్కారవిధులు
గావించి యతిథిసత్కారమ్ము లొనరించి, విప్రులఁ బూన్చి భూవిదితవాద
నిస్వనంబులు మ్రోయ నిర్జరేంద్రసమాన, వైభవమ్మునఁ గృపావనధి రాజు

తే॥ పుత్రజన్మోత్సవోత్సాహభూరిగరిమ, మెఱయఁ జతురబ్ధిసంగతమేదినీప్ర
జాళి ముద మొంద నభినవకేళికలను, సతులఁ దనుపుచు సుఖగోష్ఠి జరుపుచుండె.

క॥ నందనజననోత్సవ మా,నందము దొలఁకంగ ధరణినాథుఁ డనుభవా
స్పందుఁడయియుండుతఱి ముద,మందుచు వరుణుండు వచ్చె నధిపునికడకున్.

క॥ వచ్చినవరుణున కెదురుగ, వచ్చి నమస్కృతియొనర్చి వసుధాధిపుఁ డ
త్యుచ్చమగు నాసనం బిడి, యిచ్చెను నారాజు పూజ లిచ్చన్ మెచ్చన్. ౩౪౮

సీ॥ అంత నావరుణుండు నవనీశునకు దీవ,నలు సల్పి వినయవాక్కుల నియమ
సంకల్పసిద్ధి బొసంగెనే? తనయుండు, గల్గెనే? వంధ్యత కడకుఁ జనెనె?
పలికినపలుకు దప్పక యధ్వర మొనర్చి, వానిచే భజియింపవలదె? వేగ
ననవుడుఁ జింతాతురాంతరంగుండయి, యేమి సేయుదు నిట్టి యెడరు పుట్టెఁ
గులతంతువగునట్టి కొమరుని విశసించి, జన్న మెట్లొనరింతు? సత్యవచన

తే॥ మెడలి జీవించు టెట్లు? మహేంద్రసముఁడు, సాగరాధీశుఁ డరుదెంచి సవనవిధికిఁ
దడవు సేయకు మనిపల్కెఁ దగునె? సేవ, హేళనము సేయు టెవ్వారి కిద్ధసరణి.

శా॥ పుత్రస్నేహము వీడజాల నతికోపుండైన యాదఃపతిం
సత్రంబే నొనరింపఁ జాలనని యే శాంతిం బొసంగించు టె
ట్లీత్రాసంబును నొంచు టెట్లగు? సదాభీష్టంబు సంతానసౌ
ఖ్యత్రాణం బీక నేమి సేతు నని యొయ్యన్ ధీరచేతస్కుఁడై. ౩౫౦

చ॥ వినయముతోడ మ్రొక్కి నయవేదివి జాతము దీరఁ దండ్రికిన్
గొనకొని కర్మయోగ్యత యగున్ భువిఁ దల్లికి నొక్కమాసమున్
జనిన విశుద్ధి యబ్బు నని శాస్త్రవిధిజ్ఞులు పల్కరొక్కొ? యే
యనువున యాగమున్ సలుప నానొ? కొంత సహింపఁగాఁదగున్. ౩౫౧

శా॥ దీనత్రాణపరాయణుండ వనుచున్ దెల్లంబుగా విందు ముం
దేనట్లధ్వరదీక్షు గైకొనెద నీ యిష్టంబు చేకూర్చెదన్
గాని మ్మిం చుక కాలయాపనము నీ కామ్యంబు నిండారు సం
తానప్రాభవ మించుకంతయిన నాత్మన్ సౌఖ్య మీఁబోలదే? ౩౫౨

క॥ కాలాంతరంబునను ర,మ్యాలంభ మొనర్చి నీకు ♦ నర్పించెద మ
త్పాలనము సేయు మన భూ,పాలునకున్ స్వస్తి యని యపాంపతి యరిగెన్.

సీ॥ సింధునాథుఁడు పోవ ♦ జిత్తంబు రంజిల్లి, గోశతంబును విప్రకోటి కొసఁగి
సుతు నెమ్మొగముఁ జూచి సుఖమొంది లోహితా,స్యుం డను పేరిడి నిండు ముదము
దళుకొత్త నృపుఁ డున్న తతిని నెల జరిగిన, వార్ధినాథుఁడు వచ్చి ♦ వసుమతీశుఁ
గాంచి కృతాతిథ్య ♦ కలితుఁడై జన్నంబు, సేయు మంచన రాజు ♦ చిత్తమునను
తే॥ విన్నఁబోవుచు నధ్వరవిధి కదంత,పశువుగూడ దటందురు ♦ ప్రాజ్ఞజనులు
దంతములువచ్చుతఱిఁగృతాధ్వరుఁడనగుదుఁ,గరుణఁజూడుమటన్న నవ్వారుణుఁడంత.

క॥ అంగీకృతవచనుండై, పొంగుచు నిలుసేరె రాజు ♦ పుత్రుని గని యు
త్తుంగతరవైభవంబు లె,సంగన్ సుఖగోష్ఠిఁ బ్రొద్దు ♦ జరపుచునుండెన్. ౩౫౧

మ॥ రదనోద్భూతి పొసంగునంత గనున ప్రారంభియై వచ్చి రా
ట్పదనంబున్ జొరఁబాఱి యిష్టికి సుదిష్టంబిప్డు చేకూరె స
మ్మద మొప్పారఁగఁ జేయుమన్న వినుచున్ ♦ మున్మున్ను తా మ్రొక్కి పెం
పొదవన్ బూజ లొనర్చి పల్కె విభుఁ డెంతో పేర్మి వాటిల్లఁగన్. ౩౫౬

గీ॥ గర్భకేశుండు యోగ్యుండు ♦ గాఁడు విధికి, విధిపరిజ్ఞానదక్షత ♦ వెలయు దీవు
వృద్ధముఖమున నివ్విధి విన్నవాఁడఁ, గొన్ని దినములు శమియించికొనుమటన్న.

మ॥ ధరణీవల్లభ ! మాటిమాటికిని నిర్బంధంవాదివై యుండె దీ
కరణిన్ జూడఁగఁ బుత్రమోహమున శంకన్ జెంది యిట్లాడెదో ?
పరిపూర్ణంబుగ యజ్ఞసాధనము లొప్పన్ గల్గియున్ నన్నెటో
పరిభావింపుచు నున్నవాడవు వచఃప్రాగల్భ్యముల్ మేలగున్. ౩౫౮

గీ॥ చౌలకర్మము నెఱవేర్చి ♦ సత్రమునకుఁ, జొరక యున్నను శపియింతుఁ రాజ! నరేంద్ర
సత్యవాగ్ధుర్యు లిక్ష్వాకుజననభవులు, మఱవవలదని వచియించి మగుడఁజనియె

శా॥ అంతన్ గొన్ని దినంబు లిట్లు చన గోత్రాధీశుఁ డాత్మోద్భవున్
సంతోషంబునఁ జూచి చౌలకృతహర్షప్రాపకంబయ్యు లో
సంతాపించుచుఁ జేయకుండ నగునే? ♦ సత్కర్మ యంచున్ నిజా
భ్యంతర్గేహమునన్ దదుత్సవము సేయంబూని సోత్సాహియై. ౩౬౦

సీ॥ తనయు నిల్లాలి యుత్సంగంబుపై నుంచి, పంచమహావాద్యపటలి మొరయ
విభవసమేతుఁడై ♦ విభుఁడున్నతతిని విప్రవర్యుఁడై వచ్చెసి ♦ వార్ధినాథుఁ
డగ్నిసాక్షాత్కృతుం ♦ డయ్యెనో? యన దివ్య, తేజోనుభావసందీప్తుఁ డగుచు
వెలుగంగ నాతని ♦ వేడ్కవచ్చి సాధ్వస, విహ్వలుండై యథావిహితముగను

తే॥ బూజ సలిపి కృతాంజలిపుటము తనదు, మౌళిఁ గీల్కొల్పి యో దేవముఖ్య మొనర్తు
నించుక వచింపఁదగు పల్కు లిందుఁ గలవు, తగిన వినుమని పల్కె నద్ధరణివిభుఁడు.

క॥ ఎనిమిదవయేఁట ద్విజులకుఁ, జను నుపనయనంబు వైశ్యసమితికిఁ బదిరెం
టను నగు రాజులకు నుపన,యన మేకాదశమునంద టందురు విజ్ఞుల్. ౩౬౨

ఉ॥ ఆగమధర్మవేదివి యుదారుఁడ వాత్మతనూభవుండు బా
ల్యాగతకేళితత్పరత నాడెడు వీని నుపానయించి నీ
యాగము సానుకూలముగ నాచరితంబుగఁ జేతు సత్యమున్
గాఁగ గణించి నాపలుకుఁ గ్రమ్మఱ, బోఁదగు నీకు వీటికిన్. ౩౬౩

గీ॥ ఇటులు చెప్పిన రాజు మన్నించి వరుణుఁ, డాత్మపురిఁ జేరె నాలితో నధిపుఁ డలరె
నంతదశవత్సరములయ్యె నాత్మజునకుఁ, జేయఁదగు వ్రతబంధంబు చింత కనుచు.

మ॥ విధివత్కార్య మొనర్పఁగా విభుఁడు నిర్వేదంబునం గుందియున్
బుధులన్ మంత్రుల మానులం బిలిచి సభ్యుల్గాఁగ మన్నించి కా
ర్యధురీణుం డగు రాజు వైభవసమగ్రప్రౌఢి నుత్సాహ సం
గ్రథనోల్లాసముతోడ నుండఁగ నుదగ్రక్రోధియై పాశియున్. ౩౬౪

గీ॥ విప్రవేషధరుండయి విభునిఁ జేరి, పూజఁగొని చెంత నిలుచున్న పుడమిఱేని
సమయమయ్యెఁగదా? మాకు సవనమునకుఁ, జేయుమెడతీక యజ్ఞంబు క్షితిప! యనిన.

సీ॥ నావంధ్యభావంబు నశియించె మదిలోని, దుఃఖంబులెల్లను తొలఁగి చనియె
సాంగదక్షిణముగా సవన మేనొనరింతు, నొక్క విన్నపము నీ వుత్సహించి
విను సమావర్తనవిధి సల్పి యధ్వరం, బొనరింతుఁ గరుణింపు ముల్ల మలర
విను మిప్పు డింటికిఁ జనుమన నృపవర్య! మమ్ముఁ బ్రతారించు మాటలాడె
తే॥ దైన నీయుక్తి యుక్తమైనట్టి పలుకు, వినెదఁ బోయెద వచ్చెద వేల్పుమనుచు
సాగరేశుండు చనె నాత్మసదనమునకు, సంతసము నొందె నారాజచంద్రుఁ డంత.

ఉ॥ రాజకుమారుఁ డిట్లుదధిరా జరుదెంచుట తండ్రి యాత్మ ను
ద్వేజితవృత్తి నుంట గని వీరల వారల మంతనంబుచే
నోజ యెఱింగి యాత్మమరణోన్ముఖకార్య మటంచుఁ గాంచి ని
ర్వ్యాజమనస్కుఁడై తనదు నాప్తులతో నడురేయి యొక్కెడన్. ౩౬౭

క॥ నగరము వెల్వడి దుర్గమ, నగములఁ గాంతారముల ననారతము మృగీ
మృగముల ఖగీఖగంబుల, నగుతృప్తుల నచటఁ గాలయాపన సల్పెన్. ౩౬౮

సీ॥ దుఃఖితుండయి రాజు దురపిల్లి చారులఁ, బంపి యన్వేషించి పట్టఁ గాన
కార్తుఁడై విలపించు నవసరంబునఁ గంధి, వలభుండరుదెంచి వసుమతీశు

మఖ మొనర్ప మటన్న ♦ మార్గమ్మము పెట్టుచు, పుత్రుఁ డెందేని యుఁ ♦ బో మెగిరుల,
జఖులఁ గానలఁ దాప ♦ సస్థానములఁ జాల, వెదకించితిమి యిల్లు ♦ వెడలిపోయి

తే॥ యెందుఁబోయెనో?. మద్దోష ♦ మిందు లేదు, దేవ! మి మ్మలరింపఁగ ♦ దెసవుఁగాన
నైతి మిముఁ బూన్చుభాగ్యంబు ♦ నందనైతి, నేమి సేయుదు నన నంబు ♦ ధీశ్వరుండు.

చ॥ కనలు మదిన్ జనించి నృప! ♦ గౌరవహీనముగాఁగ వాక్యవం
చన మొనరించి తీవు కొను ♦ శాపము నీవు జలోదరార్తితోఁ
జనియెద వంచు నాగ్రహావ ♦ శమ్మునఁ దిట్టిన రోగపీడచే
ఘనమగు దుఃఖమందుచు జ ♦ గమ్ములఁ దిమ్మరుచుండ నంతటన్. ౩౭౧

మ॥ వరుణుం డాత్మపురంబుఁ జేరె సుతుఁ డ ♦ వ్వార్తల్ వనావాసులౌ
నరు లంతంతటఁ దెల్పఁగా విని గతా ♦ నందాత్ముఁడై తండ్రికిన్
డరయన్ నిశ్చితగంతుకామత సమ ♦ భ్యర్హక్రియావైఖరిన్
మనమం దూనఁగ నందు విప్రుఁడయి య ♦ మ్మవాసవుం డడ్డమై. ౩౭౨

ఉ॥ ఇంటికిఁ బోవ నేల? పృథి ♦ వీశ్వరుఁ డధ్వరవహ్నిలోపలన్
గంటకభావమూని తిల ♦ ఖండ సమంబుగఁ ద్రుంచి వేల్పఁగా
నుంట యెఱుంగవే? చనకు ♦ ముర్వర నెల్లర కాత్మవల్లభం
బంట త్రయీశ్రుతంబు; కల ♦ దాతనికిన్ బ్రియమట్లు సేయఁగన్. ౩౭౩

గీ॥ నిన్నుఁ జంపి తనదు ♦ నిష్ఠురసలిలోద, రామయంబు నణఁచు ♦ నట్టి కాంక్ష
నున్నవాఁడు తండ్రి ♦ చన్న మీఁదట నింటి, కేఁగఁదలఁచితేని ♦ యేఁగుమయ్య!

క॥ కావున నిలు మివ్వనిలో, నీవని వాసవుఁడు దెల్ప ♦ నెద్దియనక య
భ్భూధనసుతుఁ డచ్చోటునఁ, దావలముగ నిల్చెఁ బ్రాణ ♦ తత్పరుఁ డగుచున్. ౩౭౫

మ॥ అటు లేకాబ్దము నిల్చి తండ్రిగతి య ♦ మ్మైవార్తలన్ వించు నె
ప్పటిపోల్కిన్ గమనంబుపై మన సిడం ♦ బాకారి విచ్చేసి య
చ్చటఁ బోవ న్వలదంచుఁ దెల్పిన నన ♦ స్థానంబు దా వీడ కె
ప్పటిపోల్కిన్ వసియించె నెల్లప్రజకుం ♦ బ్రాణంబు తీపౌఁగదా. ౩౭౬

వ॥ అంత హరిశ్చంద్రుండు దుఃఖార్తుండై పురోహితుండగు వశిష్ఠునకున్ మ్రొక్కి రోగహారణోపాయం బడిగిన క్రయక్రీతుండగు పుత్రున్ విశసించి వేల్చిన రోగం బుడుగు దశవిధులగు పుత్రులు పుత్రసము లగుదురుగాన వరుణుండు ప్రసన్నుండై సుఖకారిగాఁగలండు. ధనలోభంబున నొక్క ద్విజుండు పుత్రు విక్రయించునని గురు ప్రేరితుండై నృపతి ప్రధానుం బంపిన నజీగర్తుండను ద్విజుండు పుత్రక్రయణం బొనర్చునని విని యాతని బర్వేంతు, నధ్వరవశంబుగా నొకని నిమ్మని యడిగిన నవ్వి

పుత్రుండు క్షుధాపీడితుండై శునఃపుచ్ఛ, శునశ్శేఫ, శునోలాంగూలురను ముగ్గురు కొడుకులలో నొకరి నీయం దలంచి జ్యేష్ఠుండు మత్పారమార్థికుండు కనిష్ఠుఁడు మాతృప్రేమాస్పదుండు మధ్యముండగు శునశ్శేఫు నిచ్చెదనని యొడంబడిన గోశతంబుఁ గొని వాని నిచ్చిన నమ్మంత్రి గళబంధం బిడి కొని తెచ్చి యూప స్తంభంబునం గట్టివేసె. దుఃఖించుచుఁ గంపించుచు దీనుండై బద్ధుండగు బ్రాహ్మణ పుత్రుం గాంచి యేను విశసింపం జాలనని శమితకరుణాళుం డగుశతన వినతుండైన నజీగర్తుండు ద్విగుణధనం బిచ్చితేని యిప్పుడువు నేన వధించెద మఖంబొనర్పు మనిన నట్ల కాక యని ద్విగుణధనం బొసంగె. జనకుండు హననోద్యోగియైన హాహాకారంబుల సభికులు వానిం జూచి వీఁడు ద్విజుం డగునే! క్రూరకర్ముండు, ద్విజాకృతిఁ బొరసిన పిశాచంబు, వీనిఁ గాల్పనే! యిద్ధనంబున నేసుఖం బనుభ వించు నని కోలాహలం బొనర్చిన విశ్వామిత్రుండు రాజసన్నిధిం జేరి యిట్లనియె.

క॥ విడువు శునశ్శేపుని నీ, కెడరు నివర్తించు సుకృత ॥ మిది దయతో నె
య్యెడ నేయవి సరిదూఁగవు, పుడమి నహింసాసమంబు ॥ పుణ్యము గలదే.

గీ॥ ఆత్మరక్షానిమిత్తమై ॥ యన్యదేహ, తక్షణం బొనరించుట ॥ ధర్మమగునె?
చేయఁగూడదు హింస మేల్ ॥ చెందగోరు, నరునకును సార్వభౌతికానందమలరు.

సీ॥ తనతోడ సాటి గాఁ దలఁచి భూతమ్ముల, దయ నేయుటయె సర్వథా సుశాంతి
శాంతి, గల్గినవాని ॥ సర్వేశ్వరియు మెచ్చు, జీవులకును మెచ్చు ॥ జీవనంబు
ఆత్మసౌఖ్యంబునకై యన్యు వధియించె, దాతని కిట్టులయ్యగున కాదె?
పూర్వకృతంబులఁ ॥ బొడము దుఃఖంబులు, పరహంతుకామతఁ ॥ బాసి చనునె?
తే॥ యన్యువైరంబు లేక నిష్కారణబుద్ధి, నేయ మనుజజన్మమున నట్ల ॥ నేయునతఁడు
నిన్ననఁగ నేల? తండ్రియు ॥ నిష్ఠురంపు, గతికిఁ జొరఁ బాతె నిది దైవశఘటననుమ్ము.

సీ॥ చాలు నట్టులు పుత్ర ॥ సంతతి గలదని, కొడుకుఁ జంపఁ దలంచెఁ ॥ గ్రూరకర్మ
విప్రుఁడె యీతండు ॥ వేదబాహ్యుఁడు గాఁడె? పలువురు గలిగినఁ ॥ బట్టులందు
నొకరి నేనియు వీడ ॥ నుచితమే? గయ కేగు, నొక్కఁడు యజియించు నొకఁడు నీల
వృషభంబునై ననువిడుచు నొక్కఁడు గాన, బితకు దూష్యులుగారు పెక్కుసుతులు
తే॥ దేశమునఁ బాపకర్ముఁడై ॥ తెగున నేయు, పాపిపాపంబు లాఅవసాలు రాజు
నంటివచ్చు నిషేధింప ॥ నగును వాఁడు, పుత్రవిక్రేత యేటికిఁ ॥ బూజ్యుఁడగును?

మ॥ రవివంశంబునఁ బుట్టినాఁడవు మహారాజా త్రిశంకుండు స
త్యవచోనిష్ఠుఁడు తండ్రి యిట్టులయి యాసద్ధామ్యమా కర్మ నీ
వవలంబించుట గూడునే? విడువు మీ ॥ యత్యంతదీనుర్ వపు
ర్భవరోగం బడఁగుర్ మదీరితము సంభావింపు రాజోత్తమా!

సీ॥ శాపయోగంబునఁ జండాలుఁ డైనట్టి, నీతండ్రి నంపితి నిర్జరేంద్రు
పురికి దేహముతోడఁ భూర్భువరాదులు, మెచ్చంగ మదియైన నిచ్చఁదలఁచి
విడువు మీబాలకు వేపమానాంగుఁడై, శోకించుచున్నాఁడు చూడు వీని
మత్ప్రార్థనము సుంతమదినెంచు మెంతప, రాధమో ? బ్రాహ్మణప్రార్థితంబు
తే॥ సర్వథా దేయ మటుగాన సడ్డసేయ, దురితమగు సందియము లేదు దుష్టకృత్య
మిటులు మానుమటన్న భూమిశ్వరుండు, స్వాత్మకార్యార్థియై పల్కె సభవినంగ.

శా॥ రోగార్తిన్ గృశియించుచున్ మఘుసమారూఢుండనై యున్న న
న్నోగాధేయ ! హితుండవయ్యు మఘుమయ్యో ! విఘ్నితంబౌ నటు
ల్యాగారంభ మొనర్చినాఁడవు దురంభఃపూర్ణగర్భార్తిచే
వేగం జాల యజింపకుంటుదునె? నేవేయేల ? శాంతింపుమీ. ౩౫౪

శా॥ అన్యం బే యదియైనఁ గోరిన నలభ్యంబైన నేనిత్తు మ
ద్దైన్యధ్వంసకమైన యిమ్మఖము చేతల్ మానుమీ? యంచిటు
ల్వన్యావృత్తులు మీఁగు పల్కనగునే వాదేల ? చిత్తంబులో
మన్యుప్రేమ గణించి నన్నుఁ గరుణింపం జూడుఁ డిచ్ఛారతిన్.

ఉ॥ కార్యధురీణుఁడై యటులు ఖండితవాక్యములాడు రాజు మా
త్సర్యపుఁ జూపులం గనుచుఁ దద్దయు జాలి యెలర్ప సత్తపో
ధుర్యుఁడు యాగయూపమున దుఃఖితుఁడై బెగడొందు బాలకున్
ధైర్యము గల్గియుండుమని తత్త్వ దీర్చి కృపావలంబియై. ౩౫౬

క॥ వారుణమంత్రం బొసఁగి యు, దారత జపియింపుమనిన నర్భకుఁడమ్మం
త్రావర్తన మొనర్చెను సభా, స్తారులు వినఁ గౌశికోక్తసరణిస్ఫుటతన్. ౩౫౭

సీ॥ అమ్మంత్ర మహిమచే నంబుధీశ్వరుఁడు, కృపార్ద్రచిత్తుండయి యర్భకునకు
సాక్షాత్కృతుండయ్యె సభ్యు లబ్బురమంది, ప్రణతియొనర్చి రప్పార్థివుండు
విస్మితుండయి సమావిర్భూతభయభక్తి, పుంభావమనతేఁడు పూజనలిపి
యభివందన మొనర్చి యంజలి ఘటియించి, దేవదేవ! మహానుభావ యేను
తే॥ మందచిత్తుండఁ గృపణుండ నిందనీయుఁ, డను గృతఘ్నుఁడ నపరాధినని తలంచి
నన్ను క్షమియింపఁదగు హేళన మ్మొనర్చి, నందన స్నేహమున నిన్ననాదరించి.

ఆ॥ వంచన మ్మొనర్చు కించిద్జ్ఞుఁడను బాప, భీతి భయముఁబొందె జేత మనఘ!
అజ్ఞుదూషణంబు లాత్మలోనిడక వి, జ్ఞానఘనులు గనరె! శాంతినెలమి. ౩౫౮

మ॥ అతిరుట్పీడన మొంది బెగ్గడిలి యాత్మామయానసంశాంతికై
యతులోత్సాహముతో సభ్వారము స్తోయంబుగాసలిపి వంచన

స్థితిచే నెచ్చట డాఁగెనో సుతుఁడు సంశ్రదేహింప కీవిప్రుని
విత తార్థంబుల విల్చి యధ్వరము గావింపన్ జొరంబాతిరిన్. ౩౯౦

మ॥ భవదానందము సేయఁగోరి సవనప్రారంభినై యున్న దు
ర్భవదోషంబు లడంగ నీవు చనుదేరం గంటి శాపోదితో
ద్భవగర్భస్థజలోదరామయముఁ బోవం జేసి రక్షింపఁగా
నవునంచున్ బలుమాఱు వేడినఁ గృపాహాసోల్లసచ్చిత్తుఁడై. ౩౯౧

క॥ విడువు శునశ్శేపుని గడు, బడలుచునున్నాఁడు యజ్ఞపరిపూర్ణఫలం
బిడుదు జలోదరమును నిను, విడుచునన్ సభికవితతి విస్మయ మందెన్. ౩౯౨

సీ॥ సవనయూపంబున సంధించు ద్విజపుత్రు, విడిపించె ధారుణీవిభుఁడు సభను
జయజయధ్వానంబు సకలదిక్కులయందు, ఘూర్ణిల్లె సవనసంకోచ మిడక
మంత్రపూర్ణముఁ జేసి మహితులైరి జలోద,రామయం బెడలి గోత్రాధినాథుఁ
డలరె శునశ్శేపుఁ డానందియై సభా,సదులఁ గాంచి నుతించి సత్యధర్మ
తే॥ నిర్ణయం బొనరింపుఁడు నేను ధరణి, నెవ్వరిసుతుండ వేదాగమేతిహాస
వాదులరు గాన నడిగితి వరుసఁ దెల్పుఁ, డతని శరణంబు వేడెద ననిన నంత.

ఉ॥ కొందఱు వెట్టివాఁ డితనికోడిగ మేమని పల్కి రందులోఁ
గొందఱు తండ్రియుండ నడుగన్ దన కెవ్వరు తండ్రి యయ్యెడిన్?
మందు డితండు పీని చెతుమాటలతోఁ బని యేమి యంచు ని
ష్పందమనస్కులైరి సభ బ్రాహ్మణపుంగవు లెల్ల విస్మితిన్. ౩౯౪

గీ॥ వీఁ డజీగర్తుకొమరుండు వింతమాట, లాడె "నంగా"త్త నెడిశ్రుతి యలర దోఁకొ
తండ్రి పాలించలేదె? విఖ్యాతగ మదీయ, జనకుఁ డెవ్వం డనియె నెట్టిచంద మనుచు.

సీ॥ సామాజికోత్తముల్ సందియం బందంగ, వామదేవతపస్వి వార్త లెల్ల
వినుచు నీతఁడు చూడ వేఁడుఁగాఁడు వి,క్రీతుఁ డయ్యెను దండ్రిచేత విత్త
సంగ్రహంబునఁ జనె జనకత్వ మతనికి, ధనదానమున రాజతనయుఁ డగును
గాదేని వరుణునికతన జీవితుఁ డయ్యెఁ, దత్పుత్రుఁ డనఁబోలు ధర్మవిధుల
తే॥ నన్నదాత భయత్రాత లగుదు రిరువు, రట్ల విద్యాప్రదాత విత్తప్రదాత
కనినవానితో నేవురు కాఁగలారు, తండ్రు లని చెప్పుదురు ధర్మతత్త్వవిదులు.

గీ॥ ధర్మవిత్తములార! సద్ధర్మ మరసి, నిర్ణయింపుఁ డటన్న నన్నెలవునందు
జనకరాజన్యవరుణసంశయవివాద, నాదమున వా దొనర్చి నిర్ణయము గనమి.

వ॥ అప్పు డరుంధతీవల్లభుండు సభాసదులారా! శ్రుతిసమ్మతం బగు నిర్ణయం బే నొన
ర్చెద; రుచించిన యేని వినుండు. విక్రయంబున దండ్రి విక్రయించుటవలన

సంబంధంబు గతం బయ్యె. హరిశ్చంద్రునకుఁ గ్రీతుండగు పుత్రుం డనియెద మంటి
రేని యూపబద్ధునిఁ జేయుటచేఁ దత్సంబంధంబును సంగతంబు గాదు. వరుణునకుం
గొమరుఁ డనవలదు; మంత్రజపంబునఁ బ్రసన్నుం డగుట నిమిత్తం బయ్యె.
మధురవాక్యంబుల నుతియించిన జగంబులఁ బారితోషికం బిడుట యరుదే!
మరణభయంబునుండి తొలఁగించుటవలన గాధేయుకొమరుం డగునని సిద్ధాంతం
బొనర్చి వచించిన. ౩౯౮

శా॥ విశ్వామిత్రుఁడు సంతసించి యెదుటన్ విచ్చేసి యయ్యర్భకున్
శశ్వత్ప్రీతిని గౌఁగిలించి కరుణాసారంబు పైఁ జిల్కి స
ద్విశ్వాసంబున నాకుఁ బట్టి వని యావిర్భూతరాగంబుచే
నాశ్వాసించి కుమారుదక్షిణకరం బాలంబమున్ జేయుచున్. ౩౯౯

క॥ తన యాశ్రమమున కర్భకుఁ, గొనిపోయెన్; సభ్యు లెల్లఁ గొనకొని చని రా
త్మనికేతనములు వాల్చెడి, వనములకున్;రోగబాధ వదలెన్ బతికిన్. ౪౦౦

సీ॥ తగ హరిశ్చంద్రుండు ధరణిఁ బాలించుచు, నలరు సత్ప్రీతి లోహితాస్యుఁ డతని
వృత్తాంత మెల్లను విని యింటి కరుదెంచె, నది విని యెదురేగి హర్షపులకి
తాంగుఁడై పుత్రుని నాలింగన మొనర్చి, తనయుండు సాష్టాంగదండపతితుఁ
డగుటఁ జేతుల నెత్తి యాఁదల మూర్కొని, ప్రేమచే నుత్సంగపీఠమునను

తే॥ నుంచి బాష్పార్ద్రనయనుఁడై యుత్సహించి, తనయుతో నరమేధవృత్తాంబు దెలిపి
రాజసూయముఖాధ్వరప్రతతి సలిపి, హోతఁ జేసె వశిష్ఠు నయ్యుత్సవమున.

గీ॥ కతిపయాబ్దంబు లిట్టులు గడచునంత, నొకతఱి వశిష్ఠుఁ డమరేంద్రు నొద్ద కేగి
నపుడ గాధేయుఁ డచ్చటి కరుగుదెంచె, మిళితులైరి సుధర్మపై మేదినీశ!

ఉ॥ కౌశికుఁ డవ్వశిష్ఠుఁ గని కౌతుక మొప్పఁగ విస్మయాత్ముఁడై
యాశకు మించి యెవ్వఁడు సమాహితుఁడై నినుఁ బూజసల్పె వి
త్తేశసురేశయోగ్యము లహీనము లాభరణంబు లర్కసం
కాశత నిచ్చె నీయెడల గట్టిగఁ దెల్పుము సత్యవాదివై. ౪౦౩

వ॥ అని. ౪౦౪

క॥ గాధేయుం డడిగిన సుర,నాథునిసన్నిధి వశిష్ఠు నాకనివాసో
త్సేధముగఁ దెల్పె నవనీ,నాథుఁడు త్రైశంకవుండు నా కర్పించెన్. ౪౦౫

సీ॥ ఉర్వీశుమఖమున హోత నౌట సపర్యఁ, దనిపి పూజించె నద్ధార్మికుండు
అతనితో సాటియౌ [illegible] భూతభవిష్య కాలములను!

సత్యవాదియు దాత ♦ సత్కర్మకుశలుండు, ధార్మికుండు విపక్షదళనదక్షుం
డనిన విశ్వామిత్రుం ♦ డతికోపనుం డయి, క్రోధసంరక్తదృక్కుటిలుం డగుచు

తే॥ నేల నుతియించె దాతని; ♦ హిత మెఱుంగం, డనృతవాది శఠుండు నన్యాయవర్తి
జన్న మొనరింతునని సంధి సలిపి వరుణు, వంచన మొనర్చెం గూడ దవ్వార్తవినంగ.

క॥ మజ్జన్మార్జితపుణ్యము, తజ్జనకున కిచ్చినాండం ♦ దద్వంశ్యుల కీ
వొజ్జవుగద ? యాతనియెడ, ముజ్జగము లెఱుంగం గలదె ! ♦ మోమోటంబుల్.

క॥ నీ వార్జించుతపఃఫల, మీవలె నా కిష్ట కాదయేనియు రాజుల్
భూవిదితముగను సత్యపుం, దోవలు చెడం జేతు సమయదుర మిది సుమ్మీ.

ఉ॥ సత్యముం దప్పం జేసి క్షితిశాసను భర్జితుం జేయనేని నా
సత్యతపఃఫలం బిడుదు ♦ సర్వము నీ; కటు కాదయేని నీ
సత్యతపఃఫలంబు గొని ♦ సంస్తుతులన్ జరియింతుం బన్నిదం
బత్యయమైన నే విడువ ♦ నంచు వచించెను గౌశికుం డొగిన్. ౮౧౯

క॥ పురుహూతుండును నగ నిర్వురు, భరితక్రోధు లయి పోరభావముల నిరం
తరరాదోర్దేకముచే, సురపతియాజ్ఞం గొని చనిరి ♦ సుస్థిరమతులన్. ౮౨౦

సీ॥ సమయవర్తన హరిశ్చంద్రుం డాఖేటార్థ, మడవికిం జని యందు ♦ నందు విహ్వాతి
నలువుచు నొక్కచో విలపించుచును జాల, వెతం జెందుచున్నట్టి ♦ యతివం గాంచి
భువనైకసుందరి ♦ పోలంతి ? యెద్దిగుఱించి, యాక్రందనము సేయుననని తలంచి
కరుణాపరుండయి ♦ కలికి ! నీ వేటికి, విలపించె దెవ్వరు ♦ వెత యొనర్చి ?

తే॥ రెవ్వతెవు నీవు ? భర్త నీకెవ్వం ? డడవి, నొంటి జరియించె దేల ? యిట్లొపడంతి !
నిన్ను నొప్పించువాని నిర్నిదళశక్తి, నెంతవాండైన భంగింతు ♦ నెఱిఁగికొనుము.

శా॥ నారాజ్యంబునం బాపకర్మములు పూసంగల్గునే ? దోర్బలో
దారుండౌ దితిజుండునైన; మది చింతల్ బాసి ని న్నేచుదు
ష్టారంభుం "డితం" డంచుం దెల్పు మన బాష్పాంబుపరిసిక్తాస్యయై
యారాజాస్య వచించెం "దెల్పెద మదీయంబైన వృత్తాంతముల్. ౮౨౧

సీ॥ వినుము విశ్వామిత్రుం ♦ డను మౌని యతిఘోర, తప మొనర్చుచు మదర్థంబు వనుల
నన్నలయించుచున్నాండు నీరాజ్యంపు, సిరిగాంగ నన్ గను ♦ చిత్తమునను
అటుగాన దుఃఖిత ♦ నైయుంటి" నని పల్క, విని రాజు వెఱవక ♦ విశ్వజనని !
వారింతు నాతని ♦ వ్రతము నల్పకయుండ, నని యూరడించి యమ్మునివరేణ్యుం

తే॥ జేర నేగి నమస్కృతిం ♦ జేసి యిట్టు, లేల కృశియించె ? దీతపం బేల ? నీదు
వాంఛితం బిత్తు లెమ్ము మహద్వ్రతవినుము, దృఢతపంబుల జగము వేధించ నేల ?

ఉ॥ చాలుఁ దపంబు లెమ్మ ధనసంచయ మెంతయినన్ గొనందగున్
వేలకొలంది నిచ్చెదఁ బ్రవీణతఁ జేకొను మింతకూర్మిర చిం
తాలుతితాంతరంగమునఁ దానవతానవ మేల యంచు నా
భూలలనావిభుండు ముని బోధయొనర్చినఁ గ్రోధచిత్తుఁడై. ౪౧౪

క॥ అచ్చోటు విడిచి మునిపతి, చెచ్చెర మఱియొక్క యడవిఁ జేరి తపముచే
విచ్చలవిడిఁ గృశియించుచు, నిచ్చన్ దలపోసె రాజకృత్యం బెల్లన్. ౪౧౫

చ॥ ఇతఁడు వశిష్ఠపక్షమున కెల్ల సహాయుఁడు పక్షపాతి మ
ద్వ్రతమునకున్ నిరోధకుఁడు వాసవసన్నిధి పీనికై కదా?
వ్రతిన వశిష్ఠుతో విడక పట్టితిఁ దత్ప్రతికారవృత్తి నా
కతిశయసాధనీయము సమర్థుఁడనై యొనరింపకుందునే. ౪౧౬

ఉ॥ పట్టినవాఁడ నేఁ బ్రతిన పార్థివు మాయికవృత్తిచేఁ జెడం
గొట్టెద నంచుఁ జిత్తమునఁ గ్రోధము ముప్పిరిగొనఁగ మూర్ఖతన్
దిట్టయ కాన దైత్యు నతితీక్ష్ణపరాక్రముఁ బ్రోత్రియాపుత్రో
నుట్టి పడంగఁ జేసి కుటిలోక్తుల రక్కసుతోడ నిట్లనున్. ౪౧౭

ఉ॥ నాదు తపోబలంబున ననారతధైర్యముఁబట్టి కానలన్
నాద మొనర్చుచున్ నృపవసనంబుల మానులయాశ్రమంబులన్
బ్రోదియడంచి యెల్లెడల భూజను లెల్ల భయంబు నొంది ని
ర్వేదమునొంద నీవితతవిక్రమమెల్ల నెఱుంగఁ జేయుమీ. ౪౧౮

ఉ॥ ఇంచుకమైనఁ గొంకకు సమీహితమద్వ్రతశక్తి తేజమున్
వంచనలేక యిత్తు ననివారణఁ బొమ్మని పల్క భూధరో
దంచితసూకరాకృతి నుదారబలుం డయి దుర్మదోద్ధతిన్
గొంచక యాజ్ఞ గొంచు మునికుంజరునాశ్రమభూమి వెల్వడెన్.

వ॥ మఱియు, సంవర్తసమయసముజ్జృంభితగంభీరాంభోధరగర్జితసంరంభంబుల సంస్తం
భింపంగల దారుణధ్వానంబుల మిన్నగలించుచు, విపినంబులు విటతాటనం బొన
ర్చుచుఁ, దాపసాశ్రమంబులు తందరపడఁ జేయుచు, విమలకాసారంబులు గలంచి
కమలకువలయనాళఖండంబులు మెక్కుచు, వనచరవాటికలఁ జొరఁబడి ధనుర్ధరులై
భిల్లు లెదిరించినఁ గోల్మసంగి తల్లడిలం జేసి మట్టుమల్లాడుచు, నభిరామారామం
బుల మాలతులం దూలం జేయుచు, యూథికలను వేధింపుచుఁ, జంపకంబులం
దుళింపుచు, మల్లికలం బెల్లార్చుచు, ముచికుందంబులఁ జిందువందాడుచుఁ, దాళం
బులఁ గూలం ద్రోయుచుఁ, గరవీర కర్ణికార మిర్దార నారికేళ పనస వంజుల వకుళ

సప్తచ్ఛద కపిత్థాశ్వత్థ రసాల సాల తమాల తక్కోల హింతా లాంగోలాది మహీరుహంబుల నురుమాడుచు, వనపాలకులం గులిశనిశితదంష్ట్రాగ్రంబులం జీరి ఘుర్ఘురారావంబులం గసిమసంగి చిందఱవందఱ సేయుచు, బాణంబుల గ్రుచ్చియు, శిలల ఱువ్వియు, నాయుధంబుల నఱకియు, వెనువెంటం బడి మర్దింపం గడంగు దుర్దమవీరభటులం జదిపియు, నక్కోలంబు జగంబుల సమయించు ప్రళయకాలంబునుం బోలె పెల్లురేగి యెచ్చోటులం దానై, నదీనదకందరజనపద నగరాదులం దిరుగుచు, బెగడునఱచినం గగ్గోలుపడి జనంబులు సాధ్వసధ్వస్తులై కావు కావు మని హరిశ్చంద్రుం జూసి విన్నపం బొనర్చిన. ౪౨౦

సీ॥ అవనీవిభుండు భయదయార్తులం దిలకించి, యభయ మొసంగి యిం తబ్బురంపు
వెత వచ్చు కత మేమి వేల్పులు రక్కసుల్, వెఱతురు మద్భుజావిక్రమమున
కెవ్వండు మీ కింతయెడరు పుట్టంగఁ జేసెఁ, దుంచెద నొక్కకోలధూర్తుఁ డగుచు
నిట్లు సేయునరాతి కేటి జీవనము? కాలంబు దీరుట నిశ్చయంబు సుండు

తే॥ ఎట్టిఁడో? వానివిక్రమం బెట్టిదొక్కొ? దైవమాయయొ?రక్షస్సొదేవుఁడొక్కొ?
రూపమెటువంటిదొక్కొ? ఆక్రూరు నిపుడె, పట్టి భంజింతు నన వనపాలు రనిరి.

ఉ॥ కాఁ డమరుండు దైత్యుఁడును గాఁడు పిశాచులలోనివాఁడునుం
గాఁడు మహోరగాకృతియుఁ గాఁడు గణింపఁగ దీర్ఘదంష్ట్రలం
వాఁడి చెలంగు క్రోడ మనివారితపోత్రిబలంబు పోఁడిమిం
వేఁడిమిఁ జూప రాజ్యములవేడుక లూడనిబాడు భూవరా? ౪౨౧

గీ॥ పుష్పవాటిక లెల్లను బూదిఁగలిపె, నారికేళఫలములెల్ల జక్కాడఁదోడఁగెఁ
గాననంబులు నేలలోఁగలపఁజొచ్చె, నధిప! యేమందు మవ్వరాహంబుకడిమి?

ఉ॥ ఎందఱు భిల్లులం గెడపె నెందఱు శూరుల నేపుమాపె న
ప్పందికిఁ దారసంబయి యభంగురఘోరశరంబు లేసినం
గందదు దాని మేను; తటకాపడి చెట్టులు గుట్ట లెక్కి యే
మిందఱు మెట్టులో బ్రదికి యీ నినుఁ గాంచితి మెట్టకేలకుంన్. ౪౨౪

క॥ దండంబుల ముసలంబుల, గుండియ లవియంగ మొత్తి గుంపై కనదు
ద్దండత నెగిచిన శూరులఁ, జండగతిం జదిపె దాని శౌర్యం బనదే? ౪౨౫

క॥ అని వనపాలురు దెల్పిన, జనపాలుం డశ్వ మెక్కి చాపధరుండై
ఘనచతురంగబలంబులు, వెనుకొన విపినమున కరిగె వేఁటతమిగొనన్. ౪౨౬

చ॥ అడవికి నేగి యంజనమయాద్రియు బోలె భయంకరాకృతిం
దొడిఁబడ శాశ్రమస్థలులు దూఱుచుఁ దోఁటలు వీటఁ బుచ్చుచుం

దౌడ రెడు వీరులం జదిపి దూఁకుచుఁ బైపయిఁ బాఱుతెంచు న
చ్చిడిముడి పోత్రినిన్ గనిమెఁ జేరున ధాత్రిని భూమిభర్తయున్. ౪౨౭

గీ॥ కాంచి విల్లందుకొని రోషకలితహృదయ, మదయమై రెచ్చ దానిని హంతుకామ
మాత్మఁబెనఁగొన వేగ సజ్యం బొనర్చి, శరము లెక్కిడి మర్దించు సాహసమున.

మ॥ తురగంబున్ దుమికించి పైఁ జనినఁ దోడ్తో ఘుర్ఘురధ్వానదు
ర్భరదంష్ట్రాయుగళీకటత్కట రవదారిఘీష్మమై సమ్ముఖ
త్వరచేఁ బైఁబడి పాఱుతేరఁ గని భూపాలుండు బాణాళి న
క్కిటియమైఁ జొన్పిన మై మరల్పుల శరాఘాతంబు వంచించుచున్. ౪౨౯

సీ॥ జనపతి వంచించి చటులవేగంబున, విపినంబు వెల్వడి వికటగమన
సమ్మర్దమున కానఁ జదియదూరం బేగ, నత్తిటి వెనువెంట నంటి రాజు
నశ్వంబు దూఁకించి యటు నిటు వెదకిన, గానరాదయ్యె సూకరముగాన
చింతార్తుఁడై రాజు చిత్తంబుచెదర న, య్యడవిఁబోత్రిని రోయు నవసరమున

తే॥ నచట నొకయాశ్రమంబున నగ్రవర్ణు, నాకృతినిఁజెంది గొణుఁగుచు నగ్నివేల్వ
వేదిమధ్యంబున వసించి వేదమంత్ర, ములు జపించు విశ్వామిత్రమునిని గాంచి.

గీ॥ నే యశఃకామి నైతిని నీ యభీష్ట, మెయ్యది వచింపు మన రోష మెనఁగుకతన
నీదు చతురంగబలముతో నిఖిలభూమి, దాన మొసఁగుమటన్న నరద్ధరణివిభుఁడు.

శా. మాయామోహితుఁడౌట భూమిపతి సామ్రాజ్యంబు సర్వంబుఁ దా
నై యిచ్చెన్ మునిభర్తకున్ మునియుఁ దా హస్తంబుచేఁ గైకొనెన్
దేయాదేయములంచు దాతలకు సందేహంబు లెట్లుండు? దీ
ర్ఘాయుర్భాగ్యము లొందకుండునె? మహోదారాగుల్యులౌ వారికిన్. ౪౩౧

గీ॥ దత్తమని పల్కె రాజు నత్తపసియును గృ, హీతమనిపల్కెఁ దనదు నభీష్టమెల్లఁ
దీరెనని మాని దక్షిణఁ దెమ్మటన్న, నెట్టి ధన మిష్ట మనియె నా పృథివిభర్త.

ఉ॥ దానఫలాభిసిద్ధికిని దక్షిణ జీవము గాన నిత్తు నె
ద్దాన మనంబు గల్గుననఁ దద్దయుఁ బొంగి తపస్వి సర్వభూ
దానముఁ జేసినాఁడవు తత్సమ్మగు దక్షిణ యిచ్చుటొప్పు మ
న్మానసవీథిఁ దోఁచినది మానవనాథ! వచింతు సంచొగిన్. ౪౩౪

గీ॥ హేమభారద్వయమ్ము నాకిమ్మటనిన, నట్లయని పల్కి నృపతి చింతార్తుఁడగుచుఁ
జనియె నింటికి సైనికుల్ చనిరి వెంట, నడిగినను జెప్పఁడయ్యె లో నడరుచింత

చ॥ ఎఱుగక చేసినాఁడనని - యెంతయుఁ జింతిలుచున్ మనమ్ములో
గిరిగొను వేదన న్నొగిలి - కేవల మేకత మచ్చటచ్చటన్
మఱపు ఘనంబుగా మనసు - మల్లడి గాంచ ధరాధిరాజ్యపున్
మొఱయను వీనులం దిడక - మూఢునిపోలిక నుండె నివ్విధిన్. ౪౩౯

గీ॥ అడవిఁ బాంథులు పాటచ్చ-రాళివలన, మోసపోయినపోలిక - మూఢబుద్ధి
ధరణి సోపస్కరంబుగాఁ - దపసి కిడి ప్రతారితుఁడనైతి నెయ్యది - దారియింక?

వ॥ అని యెద్దియుం దోఁచక మంత్రిజనంబుతో నాలోచింపక ప్రజాపాలనంబునకుం జొరక విహ్వలుం డగు పతిం జూచి విమనుండవై యుండుట కేమి కారణంబు? పుత్రుం డిలు సేరె; రాజసూయం బొనర్చితివి, వెదకినను విపక్షుండు లేఁడు; వరుణుండు సంతుష్టుం డయ్యె. దేహవ్యథ యడంగె. చింతం బరిత్యజింపవలయు. స్వస్థుండ వగుమని సచివులుం దారయుఁ బుత్రాదులు నడిగిన శుభాశుభంబు నెద్దియుం దెలుపక నిరశనుండై, నిద్ర యెఱుంగక, యొకభంగిని గృత్యంబులు నిర్వర్తింపుచు నిట్టు లున్న యవసరంబున.

ఆ॥ గాధినందనుండు - భూధవుఁ జూడంగ, నరుగుదెంచి పూజ - లంది నాదు
ధరణి వెడలు మింక - దక్షిణార్థధనంబు, దెమ్ము తడయరాదు - తెలిసికొనుము.

ఉ॥ సత్యపరుండ వీవు జన-సమ్మతి నిచ్చెదనన్న సొమ్ము వా
కృత్యత వీడకుండఁగ విశం-కటబోధ నొసంగఁ బోలదే!
వ్యత్యయవృత్తి గూడదని - వంచనవృత్తిని మాని పల్క స
త్కృత్యము సేయ కేను సు-మతీ! యెడసేతునె మాట లేటికిన్? ౪౪౦

ఉ॥ ఇప్పు డశక్తిచే నిడక - యెద్దియు లేమి ఋణస్థవృత్తికై
యొప్పితి కాలయోగమున - నొప్పనఁ జేసెద; నిచ్చునంతకున్
దప్పున కోర్వఁగా వలయు; - దారయు నేను సుతుండు మువ్వురుం
దప్పఁగ నెద్ది లేదు ప్రియ-తత్పరతన్ సహియింపఁగాఁదగున్. ౪౪౧

క॥ అని మునికిఁ దెల్పి యింతిని, దనయునిఁ జేరంగఁ బిల్చి - ధర యెల్లను వి
ప్రున కిచ్చినాఁడ వేగమ, చను టొప్పిద మిందు నిల్వ - సైఁపదు మనకున్. ౪౪౨

చ॥ అనుచు వచించి నందనుఁడు - నంగనయున్ వెనువెంట రాఁగ స
జ్జనపతి సర్వమున్ విడిచి - సంకట మొంది పురంబు వెల్వడన్
గని జను లెల్ల బెగ్గడిలి - క్రందుగ ఘూర్ణిలఁ బట్టణంబు క్రం
దన నినదంబులన్ బ్రళయ-కాలతఁ గాంచె వచింప నేటికిన్? ౪౪౩

శా॥ హాహాకారముతోడ నల్దెసలఁ బౌరాళుల్ సబాష్పాక్షులై
యోహో! యెంత ఘోసంగె రాజునకుఁ గష్టుగ్రింపుఁగష్టంబు స
న్నాహింపఁ గద! బ్రాహ్మణుండు పరుషోన్మత్తస్థితిన్ జేయు న
య్యూహల్ గానఁగలేక యిట్లు చెడెనం చూహింప రా జంతటన్. ౪౪౪

ఆ॥ నగరు వెడలి వనికి నడువ రాజును గాంచి, కౌశికుండు వెంటఁ గదలిరాగ
ఘుర్షు రారవముల ఘూర్ణిల్లుచును బోత్రిఁ దఱిమి కొనిన మానిసతల్లడిల్లి. ౪౪౫

ఉ॥ కావుము భూమిపాల! యని కాతరుఁడై నటు లేగుదేరఁ బుం
భావపరాక్రమం బనఁగ బాహుబలంబున శత్రుకోటులన్
జీవఁజెడంగఁగొట్టు నృపశేఖరుఁడైన త్రిశంకునందనుం
డావిలచిత్తుఁడై సశరమా విలు గొంచుఁ దురంగ మెక్కెచున్. ౪౪౬

గీ॥ అవ్వరాహంబు వెనువెంటనంటి తఱుమ, నడవిఁ జొరఁబాఱి కానరాదయ్యె నదియు
నంత మధ్యాహ్నమగుడుఁ దృష్ణార్తుఁడగుచు, వాహనశ్రాంతిఁ గనలేక వనమునందు.

సీ॥ అశ్వంబు డిగి యొక్క యవనీరుహముపొంత, వసియించి దిగ్భ్రాంతి కసిమసంగి
యెద్దియుఁగానక యేమి సేయుదు నెందుఁ, జనుదు సహాయు లిచ్చటను లేరు
కటకముల్ పల్లెలు గనరావు నిర్మను, ష్యం బయ్యె మార్గంబు సరణి దెల్పు
వా రెవ్వరని చాల వనట బొందుచునున్న, తఱియందు నది గాంచి తటినిఁదోఁగి

తే॥ జలముఁ ద్రాగి తురంగంబు నలఁతఁదీర్చి, భ్రాంతివశమున పురిఁజేరు సంతసంబు
వొడమిచింతిలుచున్నయప్పొంత నొక్క, ముదుకబ్రాహ్మణుఁడై వచ్చె మునివరుండు.

వ॥ అంత నభ్భూపాలుండు ప్రణమిల్లిన స్వస్తి యని పల్కి వివిక్తారణ్యంబున నేకాకివై
యేచికీర్షితంబునం జరించెద వది తెల్పుమనిన నొక్క సూకరంబు మర్దింపందలంచి
ససైన్యుండనై నగరంబు వెల్వడి వచ్చినవాఁడ వరాహం బెచ్చోట నడంగెనో
దృగ్గోచరంబుగాదయ్యె క్షుధితుండనై, తృషితుండనై, సైన్యభ్రష్టుండనై, యిచ్చో
టం జేరితి రాజసూయం బొనర్చిన హరిశ్చంద్రుండ యజ్ఞార్థంబున ధనేచ్ఛ గలిగె
నేనియు నస్మదీయనగరంబునకు రాఁదగునని వచించిన. ౪౪౭

సీ॥ విశ్వంభరాభర్త విన్నపం బాలించి, మందహాసముఖారవిందుఁ డగుచు
అమ్మహీభర్తతో ననియె ని త్తీర్థంబు, పాపసంహారణంబు పావనంబు
కాన నిందుల నవగాహనం బొనరించి, తర్పణం బొనరింపఁదగదె నీకు
గణ్యమా తీర్థంబుగాంచి తోఁగకయున్న, నఘమని పల్కె స్వాయంభువుండు

తే॥ ఇందు జలములఁ దోఁగి నిష్పందవృత్తి, శక్తికొలఁది ధనమ్ము లిచ్చుముగ ద్విజుల
కర్థుల కొసంగు మంతట నాత్మపురికిఁ, ద్రోవఁ దెల్పెదఁ జక్కఁగాఁ బోవఁగలవు.

గీ॥ కపటుఁడనుచును నప్పారికాంక్షిఁ గనక, తత్తడిని మారినఁ గట్టి ధృతికోస్త్రీయు
డగుచు దైవవశంబునకనందుఁ గురింకి, శుచియగుచుఁ దాపసోత్తముఁ జూచిపల్కె.

మ॥ ద్విజవర్యా! మదిలోని కాంక్షితము నాకు దేశించు భూధేనుకర్ణ
మజవాశ్వేభరథాదు లెవ్వి యయినన్ మన్నించి యే నిత్తు నిం
దజహత్పాపిధిమ రాజసూయమఖ మొకయ్యం జేసి సేర్పడ్డవాఁ
డ జనం బెల్ల నెఱుంగు తీర్థతటి వేఁడంబోలు విప్రాలికిన్. ౪౭౩

గీ॥ వేఁడుమని పల్కఁ దాపసి విభునిఁ జూచి, పలికెను వశిష్ఠుఁ డెఱిఁగించె ప్రభావంబు
సవితృకులుఁడు హరిశ్చంద్రుకసాటిదాత, యభ్రకుసుమంబు కాలత్రయంబునందు.

మ॥ అని యప్పల్కులు వింటిఁ గాన నిను సభ్యర్థించెదన్ నాదు నం
దనుఁ డుద్వాహము సల్పఁగాఁ దగిమె విత్తంబేమియున్ జేత లే
మిని జాలిం బడియున్నవాఁడ మదిఁ గూర్మిం జాలువిత్తంబు చ
య్యన నాకీఁ దగునన్న నట్ల యనియెన్ హర్షంబుతో మానియున్. ౪౭౪

సీ॥ గాంధర్వమాయ సంఘటితంబుగాఁ జేసి, సుకుమారమూర్తుల సుందరులను
గల్పించి యుద్వాహకాలంబు గార్హస్థ్య, దానంబు యజ్ఞకర్మంబునకును
దొడ్డగుసస ధరాధూర్వహుం డమ్ముని, మాయచే విభ్రాంతి మది జనించి
యంగీకరించిన యంత నాఁ డొసఁగెద, సన్నదక్షిణ ముట్ట దయ్యె విత్త

తే॥ హీనుఁడవు విత్త మిప్పు డేమిడఁ గఁగలవు? దక్షిణావిరహితమైన ధరణిదాన
మేను గొనఁజాల నీ రాజ్యమెల్లఁ గొనుము, లోభ మొదఁగల్గెనేని యేలుముధరిత్రి.

క॥ ఇచ్చిన యీవికి దక్షిణ, యిచ్చిన సఫలంబు కాదయేనియు విఫలం
బిచ్చినపట్టిన వారికి, నొచ్చెంబని స్మృతులు వల్కుననూహింపఁదగున్. ౪౭౬

ఉ॥ నోటికిలోలందిఁ బల్కి మదిననొవ్వఁగ యాచకకోటి నింత చే
ట్పాటున నొంపనేల ? యనఁ బార్థివమాళి నమస్కరించి యి
ప్పాటు సహింపఁగావలయుఁ బట్టణమున్ దగఁ జేరి యిత్తు న
చ్చోట ధనమ్ము; నేఁడు కృపఁ జూపుము కానల నెట్టు లిచ్చెదన్? ౪౭౭

వ॥ ఇట్టులు విశ్వామిత్రుండు వెట్టు పెనుబాధలు సహించెంగాని హరిశ్చంద్రుం
డసత్యంబు వచింపఁడయ్యెంగావున సూర్యవంశోత్పన్ను లగు మహారాజులప్రభావం
బిట్టిది. ౪౭౮

క॥ అని బాదరాయణుఁడు దెల్పిన విని జనమేజయుండు ప్రీతుండై య
మ్మునిని నవ్వలికథ యడిగిన, వినిపింపఁదొడంగెఁ బూర్వవృత్తం బనుచున్. ౪౭౯

శా॥ భూతాధీశ! దయాపయోనిధి! యురోగభూషాయితాహీంద్ర? ప్ర
ద్యోతద్యోతితమండలాంతరసమిద్ధోద్యత్ప్రభాభావనా
భీతస్వామలదివ్య తేజ! సురరాడ్భీకృత్కళాకల్పితా
రాతిధ్వంసనకృజ్జలంధర! గరభ్రాజన్మహాకంధరా! ౪౬౦

క॥ అక్షుద్రనిజాంఘ్రిద్వయ, వీక్షాసద్యోవిముక్తివితరణ దీక్షా
దక్షితకరుణాధ్యక్షా, పక్షిధ్వజశరవిపక్షబలసంశిక్షా. ౪౬౧

ఉపేంద్రవజ్రవృత్తము. కటీతటాంచద్గజచర్మచేలా
కుటీభవద్భక్తనిగూఢశీలా
జటీభవద్వ్యోమశశాంకబాలా
భటీభవత్సర్వసుపర్వజాలా!

క॥ దేవీభాగవతస్కంధావళి సప్తమము నచ్చశమాంబా జగ్గ
క్ష్మావరుల కభీష్టార్థ, శ్రీ వెలయంగం జేసి సుప్రసిద్ధిం జెందున్. ౪౬౩

గద్య॥ ఇది పరమశివాద్వైతభావనాసాధ్య ములుగుసదన్వయ సిద్ధసారస్వత విద్యా
సాన్నిధ్య వేమనారాధ్యవంశార్ణవ కళానిధాన పాపయారాధ్యాభిధాన
ప్రణీతంబైన శ్రీ దేవీభాగవత మహాపురాణంబునందు
సప్తమస్కంధంబు
సంపూర్ణము.

శ్రీమహాదేవ్యై నమోనమః.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

షరా:—ఈ సప్తమస్కంధము నాంధ్రీకరించుటలో గ్రంథకర్తయే కారణముచేతనో సగము స్కంధము కన్నం దక్కువే ఆంధ్రీకరించి హరిశ్చంద్రోపాఖ్యాన మాంధ్రీకరించుచు విశ్వామిత్రునికి దాన మొసంగువఱకుం గొన్ని కొలఁదిపాటి మార్పులతోఁ గథను నడిపి చట్టన ముగింపును సూచించు వాక్యము—“విశ్వామిత్రుండు పెట్టు పెనుబాధలు సహించెం గాని హరిశ్చంద్రుం డసత్యంబు వచింపండయ్యెం గావున” అనునది నొడివి కథ తేల్చివేసెను. ఆ “పెనుబాధలు”అను పదము సూత్రప్రాయమై భార్యా విక్రయణము, శ్మశాన నివాసము; లోనైన కష్టములకు సూచకము. కథ సుప్రసిద్ధమే కదా! అనుక్త మన్యతో గ్రాహ్య మనుసూక్తి ననుసరించి చదువరులు ప్రవర్తింతురని ఆరాధ్యులవా రూహించిరని తోఁచెడిని. హరిశ్చంద్రోపాఖ్యానమే కాక తుట్టతుదిని శతాక్షీమహిమాదికము బోలెఁడు మిగిలినది కలదు. ఇట్లు చేసినది గ్రంథకర్తయేగాని మధ్యవారు కారని రచన స్పష్టపఱచుచున్నది. ఇందులకుఁ గారణము గోచరించుటలేదు. విజ్ఞులు విచారింతురుగాక.

సంస్కృతములోనున్న సుమారు నలువది యధ్యాయములు త్యజించి ముగించెనని యెఱుఁగునది.

వేం. రా॥, శతావధాని.

## సప్తమస్కంధము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ౧౧౮ | ౨౦ | నేమెచ్చు | నీమెచ్చు |
| ,, | ౨౨ | లైనర్క | లయినర్క |
| ౧౧౯ | ౨౬ | అర్థవా | ఆపెవా |
| ౧౨౨ | ౨౨ | వలయుసు | వలయుఁజు |
| ౧౨౮ | ౧౬ | సోత్సాహిమై | సోత్సాహుఁడై |
| ౧౫౫ | ౧౮ | పుత్రి | పుత్త్రి |

షరా:— అత్యవసరమైన ప్రమాదములు మాత్రమే చూపఁబడినవి. అవి సున్నలు లోనైనవి చదువరులే సవరించుకొనఁ బ్రార్థితులు.

ఇట్లు,
సంస్కర్త,
వెం. శా.. శతావధాని.

శ్రీ ర స్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ శారదాంబాయై నమః

శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము – శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## అష్టమస్కంధము



గరి మాధారంబై,
వాగనుసంధానురూపప్రభవమై దేవీ
భాగవతమ్మున నష్టమ
భాగము భోగ్య ప్రధానప్రభావం బమరున్. ౧

క॥ శ్రీకాశీపుర వల్లభ!, లోకాతీతా! లలాటలోచన! పూర్ణ
ప్రాకామ్య! నిగమవర్ణ్యైక, ధాకలిత గుణాభిరామ! ప్ర దైవలలామా. ౨

వ॥ దేవా! సకల పురాణేతిహాస కథా సుధాస్వాదననిస్తంద్రులగు సమ్మునిచం
ద్రులకుఁ దన్మనోరథ రథచోదనాసూతుం డగు సూతుం డిట్లనియె. ౩

శా॥ శ్రీవాణీగిరిజాంగనల్ పదనఖశ్రేణీ ప్రతిచ్ఛాయలన్
సేవాకాలములందుఁ గాంచి పతులన్ ప్ర జీరంగ వారెల్ల ర
ప్పై వీక్షించి యుగాంతరంబుల నిజవ్యాపార సంసిద్ధికై ౪
పోవుల్ గట్ట సృజించె నంచుఁ దలఁపన్ ప్ర బొల్పొందు చిద్రూపిణీ. ౫



వ॥ ఇట్లు సమజ్జన దుర్భపదురితలతాలావిసి యగు పరదేవిని భజించి.

గీ॥ ఇవ్విధంబున వినుపింప నిందుకులుఁడు, సూర్యచంద్రాన్వయోదంతసమార్యసమ్మ
తంబు విని కృతకృత్యతఁ దాల్చినాఁడ, నద్భుతంబయ్యెఁ గర్ణరసాయనముగ. ౬

సీ॥ మానీంద్ర! నేనిప్డు సానుపూర్వంబుగా, జగదంబచరితంబు శ్రవణపర్వ
ముగ వినఁగోరితి ముందు మన్వంతర, కాలంబులను యదాకారములను
నెచ్చోట నెచ్చోట నెట్టెట్టు వసియించు, నే మంత్రబీజంబు లెఱిఁగి దేవిఁ
బూజింపవలయునో పొందెదు ఫలమెట్టి, విధమొ? సకృత్స్నంబు వినఁగవలయుఁ
తే॥గీ॥ గరుణ చిగిరింప వాక్సుధాకలనములను, మనస్మన స్తృప్తి సేయు మోమానిచంద్ర!
యనుచు వేడిన బాదరాయణుఁడు పొంగి, విను మటంచును దెల్పె నీసవృత్తమెల్ల.

వ॥ జనమేజయా ? యవ్వలికథ వినిచెద నాలింపుము.

ఉ॥ ఇట్టులె నారదుండు కమలేశుని వేడిన బోధ గొల్పె నాఁ
డట్టుల విస్తరింతు వినుమా సురమాని జగత్త్రయంబునన్
దొట్టి వినోదముల్ గనుచుఁ దోడుత నొక్కెడ నాశ్రమంబునన్
బట్టు తపంబుఁ జేయుచుఁ బ్రవీణతఁ దాపసు లున్న చోటులన్. ౯

గీ॥ కాంచి హర్షంబు దళుకొత్తఁగదలి యంత, నంత నారాయణాశ్రమప్రాంతమునకుఁ
జని మహామునిఁ గాంచి వందన మొనర్చి, యందు సత్కృతి నొందియిట్లని యెనధిప!

మ॥ జగదాధార ! మునీంద్రవందితపదాబ్జా! దేవదేవా! పురా
ణ! గరీయః ప్రథిత ప్రభావ! నిరతానందాత్మ! నారాయణా!
భగవద్రూప! భవత్పదాబ్జములకున్ భక్తిచే మ్రొక్కెదన్
సగుణం బిజ్జగ మెట్టి చందమున సృష్టంబయ్యె విన్పింపవే. ౧౧

సీ॥ ఎవ్వరిచే వృద్ధి నెనఁగు? నెచ్చోటను, విలయంబు నొందు దుర్వ్యమహామైన
యే జ్ఞానమున మాయయెడలు నే పూజల, నే జపంబుల ముక్తి తేజరిల్లు
నజ్ఞానతమమెల్ల నణఁచు నే యే ధ్యాన, మర్కోదయము నట్టులఖిలజనులు
విన్నంతమాత్ర సంవిద్రూపులై ఘోర, సంసారపారంబు చక్క నెక్కి

తే॥ నిర్మలాద్వైత భావనిర్నిద్రులగుచు, నిశ్చలానందమును జెంది నిలుతు రట్టి
యుత్తరము కృపఁ జేసి మచ్చిత్తసంశయములఁ బాపుమటన్న నారాయణుండు.

మ॥ విను మంభోజభవాత్మజా! శ్రుతిమతావిర్భూత వాక్ప్రౌఢిమన్
వినిపింతున్ జగమెట్లు పుట్టెనని యీశ్వరంబుచేఁ బ్రశ్నమిం
పొనరం జేసితి వెద్ది విన్న నరుఁ బాయున్ భ్రాంతి తత్సర్వ మే
నను వాప్పన్ జగదంబ తెల్పు విని మాహాత్మ్యం బద్దె వెల్గన్ జుమీ. ౧౩

క॥ హరియును హరుడును నజుడును, దరణియుఁ జందు్రిందు భూతతత్త్వంబులు ద
ఱొక్కరు లెవ్వరు లేనియెడలఁ, బరిపూర్ణతఁ గాంచు సర్వపావని తానై. ౧౪

వ॥ అట్టి పరంజ్యోతీరూపంబగు ననాదివస్తువు మూలప్రకృతి గుణత్రియ కల్ప
నంబున నదేవమానుషపన్నగంబగు జగత్త్రియంబుఁ బుట్టింపుచుఁ బరిపాలిం
పుచు నళియింపం జేయుచుఁ జరాచరంబులు తానైయుండు నమ్మహాదేవి
రూపంబు సిద్ధర్షిపూజితంబును సర్వపాపఘ్నంబును గామదంబును మోక్షదం
బునైయుండుఁ, దొల్లి బ్రహ్మపుత్రుం డగు స్వాయంభువుండు జనకుం డగు ప్రజా
పతిం గాంచి నమస్కరించి యచ్చెంత నిలిచిన పుత్రునిం గాంచి నీవు జగదంబి
కారాధనం బొనర్పుము తత్ప్రసాదంబునఁ బ్రజాసర్గసిద్ధి కాఁగలయది యనిన
నతండు తపంబున దేవిం దృప్తి నొందించి ప్రసన్న యగుటయు సర్వకారణ
కారణంబును సర్వతత్త్వాతీతంబును నగు నా సర్వేశ్వరికిం బ్రణమిల్లి యిట్లని
సన్నుతించె. ౧౫

సీ॥ శంఖచక్రగదాది సాధనోపేతవై, వర్తిల్లు నీ కిదే వందనంబు
మాయవై యఖిలైకమాతవై నిగమైక,మూర్తివౌ నీ కిదే మోడ్పుఁ గేలు
సర్వదేవ మనోజ్ఞ సంస్థానమైన మ,హేశ్వరి చేతు నే నిదె జోహారు
బ్రహ్మవిష్ణ్వింద్ర సంపత్ప్రదాయినివైన, జయలక్ష్మి ! యిదె నమస్కారశతము

తే॥ వేదసూత్రప్రమాణజ్ఞ ! విశ్వరూప !, వికృత సంసార రోగ నిర్భిద్యమాన
జనపరీతాపహరణప్రసక్తహృదయ, తల్లి ! నీ కిదె సాష్టాంగదండ మమ్మ.

గీ॥ సర్వమంగళ మాంగళ్య ! సర్వసిద్ధి, సాధని ! శరణ్యా ! గౌరి ! విశ్వప్రకాశ !
దేవి ! నారాయణీ ? నీదు దివ్యపాద, వనజయుగళికి నేఁ జేతు వందనంబు.

సీ॥ ఆద్యంతశూన్యవై యఖిలైక మాన్యవై, యంతరాత్మతచేత నఖిలమెల్ల
నేకరూపంబవై యెసఁగు పరంజ్యోతి, బ్రహ్మాచ్యుతులు భవత్పరమకరుణ
జగము సృజింపఁ బోషణ మొనర్ప నడంప, మూలమైతివి కల్పకాలమునను
మధుకైటభాదిసంభవభయార్తుండైన, పరమేష్ఠిఁ బాలించి భయమడంచి

తే॥ భక్తవాత్సల్యమున హరిత్పాలకులను, దత్తదధికారము లొసంగి తనిపి తీవ
దివ్యమహిమానుభావబుద్ధిప్రదాన, పూర్ణత నొసంగి నన్నేలు భువనజనని.

గీ॥ నీవ కావటమ్మ నిఖిలమ్ము కాంతియుఁ, గీర్తి మతియు స్మృతియు గిరిజ కమల
వేదగర్భ విద్య విశ్వధాత్రి యనంగఁ, దనరు నామములకుఁ దావలంబు. ౧౯

ఉ॥ నిన్ను భజింతు నిక్క గొలుతు నీకు నమస్కృతిఁ జేతు నిన్నుఁ గం
దు న్నిను [illegible] నిన్నుఁ బరితుష్ట నొనర్చెద నిక్క జపించెదక్

నిన్ను నుతించెదన్ నిను గణించెద నెంచెద నెందుఁగన్న నీ
కన్నఁబరంబు లేదు ననుఁ గన్న జనిత్రివి నీవె చండికా! ౨౦

ఆ॥ మూఁడులోకములకు మూలమై మాంగల్య, నిలయమై నటించు నీకుఁ మ్రొక్కి
యాశ్రయించువాఁడ నఖిలాండజనని! ప్రణామలు నీకు నేనమస్సు లిడుదు. ౨౧

క॥ అని బహుభంగుల సన్నుతు, లొనరించుచునున్న సారసోద్భవతనయున్
గని దేవి పల్కె నీ తపమున కే మెచ్చితిని వేఁడుము వరం బనినన్. ౨౨

మ॥ జననీ! నీవు ప్రసన్నవై కరుణ వాంఛాసిద్ధిఁ గావించెదే
ననయంబున్ జనసర్గ శక్తి దయసేయంబోలు నా మెచ్చి వి
ఘ్ననిరాసంబుగ "నట్లయా" నని ప్రసన్నంబైన చిత్తంబునన్
గని నీసేయు స్తవంబు విన్నఁ జదువన్ గల్గున్ సిరుల్ మర్త్యులన్. ౨౩

సీ॥ అనుచు స్వాయంభువు ననునయించి పరాంబ,యంతర్హితయగుమనువు
సత్యలోకమునకుఁ జని నల్వఁ గనుఁగొని, జనసర్గ మొనరింప సమ్మతమగు
నావాస మొక్కటి యానతిమ్మనఁ బుత్రు, వచనంబు లాలించి వనజభవుఁను
చింతించె నిట్టులు సృష్టిచేయుచు నున్న, కాల మనంతమై కడచె నాకు

ఆ॥ ధరణి నీట మునిఁగె ధరణీధ్రములు మొదల్, పరమపూరుషుండు పంకజాక్షుఁ
డెద్దిసేయు నొక్కొ? యెల్లవిధంబుల, నచ్యుతుండె దిక్కటంచు మదిని. ౨౪

ఉ॥ ధ్యానము సేయుచున్న యెడఁ దామరసోద్భవు ఘ్రాణరంధ్ర సం
ధానిత మూర్తియై యొక యుదారవిభావిభవంబుపోవు చం
దాన వరాహడింభము బుధప్రతతుల్ వెఱఁగందఁ బుట్టె న
మ్లానత నొక్క యంగుళపు మానమునన్ గన నద్భుతంబుగన్. ౨౫

క॥ సనకాదిమునులు గనుఁగొని, జనితానందు లగుచుండ క్షణమాత్రమునన్
ఘనమేరు సదృశదేహం,బున మిన్నలమంగఁ జొచ్చెఁ బూర్ణాంగంబై. ౨౬

సీ॥ స్తబ్ధరోమావళ్లు దంభంబునను నొక్క, సత్త్వంబు మన్నాన సంభవించె
నంగుష్ఠశీర్షంబున్ నంతమాత్రం బయ్యె, గులశైలమునుబోలి కొమరుమిగిలె
ఖేదించుచున్నట్టి నాదు మనశ్చింతఁ, బాపంగఁదలఁచిన పంకజాక్షుఁ
డొక్కో యను తలంపూని నల్వగణింప, నంతలోఁ గిటిడింభ మద్రిదర

ఆ॥ దిశలు బెగ్గడిలఁగ దీర్ఘనాద మొనర్ప, సత్యలోకవాసి సంయములును
సరసిజోద్భవుండు ఛందోమయములైన, సంస్తవముల నెలమి సలిపి రపుడు.

ఉ॥ వారొనరించు సన్నుతు లవారణ వించుఁ జతుర్భుజుండు వి
స్తారదయావిలోకన సుధాప్లుతి నందఱఁ దేర్చి యర్ణవా

పార జలంబులన్ మునిఁగి కి బంధుర నైజసటాచ్ఛటా మరు
ద్ధోరణులన్ విదిర్ప మదిఁ గి దొట్రిలు భీతి మహార్ణవం బొగిన్. ౨౮

గీ॥ పాహి పాహి కృపానిధే కి పరమపురుష, శరణు జనరక్ష యనుచు విశ్లథశరీరు
డగుచు మొఱఁబెట్టనాలించి యతనిఁ దేర్చి, కలఁచనంబుధులెల్లనొక్కటమునింగి.

ఉ॥ ఈవల నావలం దిరిగి కి మెల్లమెడం బరికించి యాత్మనా
సావివరమ్ములన్ గొడవసల్పుచు మూర్కొనుచు న్మహార్ణవ
స్థావనిఁగాంచి యాత్మదశనాగ్రిమునన్ గరి తమ్మి నెత్తు పో
ల్పావహిలంగ నెత్తె నిల కి నచ్యుతడింభవరాహమూర్తి తాన్. ౩౦

వ॥ అంత విరించిప్రభృతులు సంతసిల్లుచు దంష్ట్రోత్థితవసుంధరుం డగు దరధరుం గాంచి భక్తార్తిహరుండవు సర్వకామప్రదుండవు సర్వేశ్వరుండ వగు నిన్నుంగాంచి జయించితిమి, భవద్దేహంబున మతంగజ కరోద్ధృత యగు తామర కైవడి విశ్వం భర శోభిల్లం జొచ్చె. భవచ్ఛరీరంబు భూ సంపర్కంబున హస్తాగ్రపంకజంబగు దిగ్గజాంగంబు కైవడి రంజిల్లె. దేవేశ్వరా ! సృష్టిసంహారకారకా ! దానవధ్వం సంబు కోరి క్రోడాకృతి వహించితివో, సర్వామరాధారుండవై వెలుంగు నీకు ముహుర్ముహురభివాదన మొనర్చెద. నీచేఁ బ్రజాసర్గంబున నియుక్తుండ నైతిని, ద్వత్సాహాయ్యంబున నిందుఁడు సుధాంబుధి మథియించి యమృతం బార్జించి త్రిలోకసామ్రాజ్యం బనుభవించె. సురసంఘపూజితుండై లక్ష్మిం జేకొని పావకునకుం జాతరాది భేదంబుల దాహకతాశక్తి యొసంగి దేవాసుర మనుష్యుల కాప్యాయనం బొనర్చెదు. కర్మ ఫల దానంబున ధర్ముండు బ్రవర్తిం చుట భవన్నియోగంబే కదా ! నైరృతి, వరుణ, వాయు, కుబేరేశానాదులు తత్తత్కర్మ నియంతలై లోకపాలు రగుట భవదాజ్ఞావశంబే కదా! జగదీశ్వరా! నమస్కరించెదము. జగన్మయా ! మ్రొక్కెదము, వేడెదము, పాడెద మని, బహువిధంబుల వేఁడుచున్న నలువం గరుణించి, సంరంభం బొర్వక పైకిం జను దెంచు హిరణ్యాక్షుం గదాతాడనంబునఁ జక్కాడి తద్రక్తపంకదిగ్ధాంగుం డగు భగవంతు డంతర్ధి నొందె, నెల్లవారలు సుఖప్రతిష్ఠులైరి. అంత నాత్మజుండగు స్వాయంభువుం గనుంగొని మహీతలంబున నివసించి ప్రజాసర్గం బొనర్పుమని మఱియు నిట్లనియె.

గీ॥ దేశకాల విభాగంబుఁ కి దెలిసి నీవు, యజ్ఞపురుషుని భజియింపు కి మఖిలధర్మ
మాచరింపుము వర్ణాశ్రమాదినియతి, నిట్లుసేయఁ బ్రజాసర్గ కి మెలమిఁగలుగు.

సీ॥ గుణవంతు లగు సుతాగ్రణుల నిన్ బోలిన, వారిని గను మనివార్యధైర్య
సౌందర్య చాతుర్య కి సహిత[illegible] సుతల, సంధించి తత్పుత్రసమితిఁ గూర్చి

యచ్ఛిన్నవంశనిశత్కృతలు సాధించుచు, భగవద్గణములఁ భక్తి నెగడి
నను బోలి సృష్టి సంవిధానం బొనర్పుమం, చని యారడించి స్వాయంభువాఖ్యు
తే॥ బనిచి యంతర్హితుం డయ్యెనబ్జయోని, యంత స్వాయంభువుఁడు ధరాభ్యంతరమున
నలరఁజేసెఁ బ్రజాసర్గ మఖిలమెల్ల, నమ్మహారాజు సృష్టిసమ్మవనినాథ. 33

వ॥ అట్టి స్వాయంభువ మను చక్రవర్తికిఁ బ్రియవ్రతోత్తానపాదు లను నిద్దఱు పుత్త్రులును, ఆకూతి, దేవహూతి, ప్రసూతి లను ముగ్గురు కన్యకలు నుదయించిన, రుచి యను వాని కాకూతిని, గర్దమునకు దేవహూతిని దక్షునకుఁ బ్రసూతిని నొసంగిన రుచికి నాకూతి వలన యజ్ఞుం డను నాదిపురుషుండును, గర్దమునకు దేవహూతి వలన సాంఖ్యాచార్యుండైన సర్వలోకవిఖ్యాతుం డగు కపిలుండును, దక్షునకుఁ బ్రసూతి వలనఁ గన్యాశతంబును బొడమెఁ, దత్కన్యకల సంతానంబె కదా? దేవ తిర్యఙ్మనుష్యరూపంబుల లోకవిఖ్యాతంబై సర్గప్రవర్తకం బయ్యె. రుచిపుత్త్రుం డగు యజ్ఞుండు దేవగణపరివృతుండై స్వాయంభువమన్వంతరంబున రక్షోవిధ్వంసం బొనర్చెఁ గర్దమపుత్త్రుం డగు కపిలుండు జటావల్కలంబులు ధరియించి యధ్యాత్మజ్ఞాననిశ్చయంబగు శాస్త్రం బుద్ధరించి నిజమాత యగు దేవహూతికి నవిద్యానివర్తనం బొనర్చి పులహాశ్రమంబున నిప్పటికిని నివసించి యున్నవాఁడు. తత్స్మరణంబు సద్యోముక్తిప్రదం బని యెఱుంగుము. ఇంక స్వాయంభువనందను లగు ప్రియవ్రతోత్తానపాదుల ప్రభావం బభివర్ణించెద, ద్వీప వర్ష సముద్రాదివ్యవస్థలకు మూలంబు వార లని యెఱుంగుము. 3౪

క॥ స్వాయంభువునకు నందనుఁ, డాయతభుజుఁ డగ్రజుండు నైయతిహర్షా
ధాయకతఁ బ్రియవ్రతుఁ డన, శ్రేయంబలరారు ధర్మశుచిత్వమునన్.

సీ॥ ఆ నందనునకు విశ్వాతిశాయి సురూప, విశ్వకర్మతనూజ వినుతసుగుణ
బర్హిష్మతి యనంగఁ బరఁగు పడంతిని, బరిణయం బొనరింపఁ బరమహర్ష
భరితుఁడై పుత్త్రులఁ బడసెఁ బదుండ్రను, గూఁతు నొక్కర్తు విద్యోతమాన
నూర్జస్వతిని నాతఁ డొప్పి, రాగ్నీధ్రుండు, నిధ్మజిహ్వుం డన నిరువు రవల
తే॥ యజ్ఞబాహు మహావీరు లనఁగ నిరువు, రధిక తేజోభిరాములై యవని వెలసి
రరిమథనదీక్ష నంతతాసక్తు లగుచు, నప్రతీప ప్రతాపంబు లతిశయిల్ల.

వ॥ మఱియును రుక్మశుక్రుండును, ఘృతపృష్ఠుండును, సవీతుండును, మేధాతిథియు, వీతిహోత్రుండును, కవియు ననం బ్రసిద్ధులై ర న్నందనదశకంబునందు *సవీతుండును, కవియును, మహావీరుండును నను ముగ్గురుతనయు లాత్మవిద్యాతీర్థ స్నాతులై, యూర్ధ్వరేతస్కులై, పరమహంసాశ్రమంబున నిస్పృహులై ప్రవర్తించుచున్నంత. 3౭

* టిప్పణి: ఇప్పుడుపలబ్ధమగు ప్రాతములలో సవీతుఁడు అను పాఠము గానరాదు. సవనుఁడని యున్నది.

ఉ॥ అన్యవధూటియందున బ్రియవ్రతుఁ డాత్మభవత్రియంబు రా
జన్యలలామమై మెఱయఁ జక్కఁగఁగాంచె ననన్యశక్తి న
న్యోన్యము వార లొప్పి రిల నుత్తమతామస రైవతాఖ్యలన్
ధన్యతఁగాంచి వైరిచయదర్పవిభంజనకార్యధుర్యులై. ౩౮

గీ॥ వారుముగ్వురు మనువులై వసుధఁ బ్రబలి, రెల్లెడఁ బ్రియవ్రతుండు సమీహితుఁడయి
పదునొకొండర్బుదముల సంవత్సరములు, ధరణిఁ బాలింపుచును మహోద్ధురతనలరె.

సీ॥ అయ్యెడ నొక్కనాఁ డర్కుని బరికించి, మత్పాలితంబైన మహిని నొక్క
భాగంబు మెఱయించుఁ బదపడి యొకభాగ, మంధకారం బేల? యపనయింపఁ
డని విచారించి నే నవనిఁ బాలించుచోఁ, దమమెట్లు తలచూపుఁ దన్నివృత్తి
సేయుదు ననిపూని చిత్రవిక్రమశక్తి, నాదిత్యవర్ణ మహా స్యందనమున
తే॥ నధివసించి తమం బెల్లనణఁగ రథము, పుడమి వలగొనఁ దిరుగ నప్పుడు రథాంగ
నేమి సంఘృష్ట రేఖికా నిచయ మెల్ల, సప్తసాగరములనంగ జగతిఁ బరఁగె. ౪౦

వ॥ అమ్మహీవల్లభు రథావర్తమధ్యభాగంబులు ద్వీప బు లయ్యె, జంబూ, ప్లక్ష, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, పుష్కరంబు లను నామంబులం బ్రవర్తిల్లె, నీ యంతరీపంబుల వలయాకారంబు నావరించి క్షారేక్షురస, సురా, ఘృత, క్షీర, దధి శుద్ధోదంబు లనుస్యూతంబులై ప్రవర్తిల్లు, క్షారోద వేష్టితంబు జంబూ ద్వీపంబు తద్వల్లభుం డాగ్నీధ్రుం డయ్యె. ఇక్షురససంవృతంబు ప్లక్షద్వీపంబు. దానికి నిధ్మ జిహ్వుం డధికారి యయ్యె. సురార్ణవ పరివృతంబు శాల్మలీ ద్వీపంబు. దానికి యజ్ఞబాహుండు రాజయ్యె. ఘృతోదక పారావార పరివృతంబు కుశద్వీపంబు దానికి మహావీరుం డభిషిక్తుండయ్యె. క్షీరోదధిసంవేష్టితంబు క్రౌంచ ద్వీపంబు దానికి రుక్మశుక్రుండు నాయకుండయ్యె. దధిసముద్ర పరివేష్టితంబు శాకద్వీపంబు దానికి ఘృతపృష్ఠుండు పార్థివుండయ్యె. శుద్ధ జలసాగరసమావృతంబు పుష్కర ద్వీపంబయ్యె. దానికి మేధాతిథి యధిపతియయ్యె. ఊర్జస్వతి యను కన్యక శుక్రునకు వధూమణియై దేవయాని యను కన్యకం బడసె, నంత ప్రియవ్రతుండు వివేకవశగుండై యోగమార్గావలంబనంబున విరక్తుండయ్యె మఱియును. ౪౧

సీ॥ జనమేజయక్షితీశ్వర! ధరాపరిమాణ, మెఱిఁగింతు వినుము సమీహితముగ
జంబువు లక్షయోజనము విశాలంబు, వర్తులాకారమై వర్షనవక
సంయుతంబై నవసాహస్రయోజన, క్రమమునఁ గులశైల కలితమగుచు
వర్షద్వయము విండ్ల వడువున దక్షిణో, త్తరములఁ జెలఁగు నాల్గరయఁ బొడవు
గీ॥ నన్నిటి కిలావృతంబు మధ్యంబు దాని, తెఱఁగు చతురస్రమై యొప్పు దేవనగము
లక్షయోజనమానమై లలినెసంగు, బుడమి యను తమ్మికిని దుద్దుపోల్కి నధిప.

ఉ॥ హాటకశైలశీర్షమున § నాయతి ముప్పది రెండువేలు న
ప్పాట ధరాంతరాళమున § భాసిలుచుండుఁ బదాఱువేలతోఁ
బాటిలు దాని యంతరపు § భాగమునన్ గుధరత్రియంబు ము
న్నీటికి నంటి మిన్నలమి § నీలము శ్వేతము శృంగవంతమున్. ౪౩

క॥ ఇమ్మూఁడుగిరులు నవవ,ర్షమ్ముల కవధులయి యొప్పి § రంజిలు ద్విసహ
స్రమ్మగు యోజనముల నెన,కమ్మగు నదనదుల వనులఁ § గడుసుఖదములై. ౪౪

సీ॥ వఱలు నిలావృత § వర్షమ్మునకు దక్షి,ణమ్మున నిషధమ్ము § నాఁగ హేమ
కూటంబనఁగ రెండు § కుధరంబులును హిమా,చలమును నయుత యో § జనత మెఱయు
దక్షిణవర్ష స § మాక్షమంబులు నిలా,వృత పశ్చిమంబున § నెసఁగు మాల్య
వంతంబు తత్పూర్వ § భాగంబులను గంధ,మాదనం బన నివి § మానమునను
గీ॥ నీలనిషధంబులంటి నిర్నిద్రవృత్తి, భాస్కరోదయ హేతుతా § ప్రకటనముల
నచటి వర్షమ్ములకు వెలుం § గలమఁ జేయు, యోజనద్విసహస్ర వి § భాజితములు.

గీ॥ మందరాద్రియు నల మేరు § మందర మన,నట్టుల సుపార్శ్వ § కుముదంబు § లనఁగ నాల్గు
శైలములు పదివేల యో § జనము లలమి, కనకశైల చతుర్దిశ § క్రమతఁ జెలఁగు.

గీ॥ ఇత్తెఱంగున స్వర్ణాద్రి § యుత్తరమున, మూఁడు దక్షిణమున నట్ల § మూఁడు పార్శ్వ
ములను రెండును దన కగు § నెలవు నొకటి, కలసి నవవర్షము లనంగ § గణుతిఁ గాంచు.

వ॥ ఇత్తెఱంగున భారత కింపురుష హరి కేతుమాలా భద్రేలావృత *త్రిషుక హిర
ణ్మయ కురువర్షంబు లలరు, సువర్ణాద్రికి దిశా చతుష్టయంబున నలరు మేరు మందర
సుపార్శ్వ కుముదంబుల శీర్షంబులఁ జూత జంబూ న్యగ్రోధకదంబంబులను మహీ
రుహంబులు బ్రహ్మాండ కేతనంబులపోల్కి నేకాదశ శతోచ్ఛ్రయంబులై యంతియ
విటపవిస్తారంబులఁ జెలంగునట్టులే పయోమకరందేక్షురసశుద్ధ జలపూరితం
బులై ఉపస్పర్శన మాత్రంబున యోగైశ్వర్యంబు లొసంగుచు సురలఁ దృప్తి
నొందింపుచు, దివ్యకాసారంబులం జెలంగుచు, నందన చైత్రరథ వైభ్రాజ
సర్వభద్రకంబులను వేదోద్యానంబుల లలనాయూథసనాథంబుగా దేవగంధర్వా
దులు గ్రీడింతురు. మందరాగ్రస్థిత సహకార ఫలంబులు గిరికూటప్రమాణం
బులై పండి ద్రవించి స్వరసంబుల నరుణోదం బను నదిం బ్రవర్తింపం జేయు,
తత్తీరంబున నరుణామహాదేవి యనం జను దేవిని నానోపహారంబులం బూజించి
తత్కృపావలోకనంబునఁ దత్రత్యులు క్షేమారోగ్యంబులం జెందుదురు. ఆద్యయు,
మాయయు, అతులయు, మాతయు, బుద్ధియు, నీశ్వరమానినియు, దుష్ట
హంత్రియు, కాంతియు, ధాత్రియు, నను నామంబుల నద్దేవి పూజింపంబడుచుండు.

* టిప్పణి॥ ఇప్పటి ప్రతులలో, త్రిషుకకు బదులు రమ్యక అని యున్నది.

సీ॥ అరుణోద యను ≀ నది యచ్చోట మందర, గిరి దిగి స్వర్ణాద్రి≀ కేగ దొరలుఁ
దత్తీరమున మునిధామమ్ము లధ్వర, శాలలు నిర్జరసమితి యలరు
సతులతోఁగూడి యచ్చట దేవసంఘముల్, నివసించియుండు రనేకవిధుల
నంబిక యచట జంబ్వాదిని యను పేర, జంబూనదీ తటి ≀ డంబుమీఱు

తే॥ గౌరి భువనైక జనని యనారతంబు, దేవసంపూజ్య యగుచు భూతావళులను
గాంచి రక్షించుఁ దత్కృపాకలితవీక్ష, భవ్యభోగంబులకు నాటపట్టు గాఁగ. ౪౯

గీ॥ కమలలోచనయును గామకళయు ధన్య, కరుణ కరపూజితయును శాంకరియుభక్తి
కలిత కర్పూరవిగ్రహకాంతి యనెడు, నాఖ్యల భజించుచుందు రయ్యంబ నచట.

క॥ అన్నదతీరంబునఁగల, మన్నెల్ల సువర్ణ మది యమర్త్యుల కెల్లన్
వన్నియ నిడు వరణమ్ములు,కు న్నెలవగు భోగమోక్ష ≀ కుశలముఁ దాల్పన్.

శా॥ న్యగ్రోధాన్వితకోటరాంతరముల≀ న్నానాముఖోల్లాసన
మ్యగ్రావంబుల నేను ధార లజహన్మాధ్వీసుధామాధురీ
నిగ్రాహం బొనరించుచున్ గురిసి యుస్నిద్రంబులై సాఁగి స్వ
ర్ణగ్రావంబు కొలంకుల≀ న్బొరలుఁ గన్న న్విన్న నబ్రంబగున్. ౫౨

క॥ సురలకు గరుడోరగకి,న్నరసిద్ధాదులకు సేవనాసుఖదంబై
కర మలరఁగ శతయోజన, నిరతసుగంధంబు లొసఁగు ≀ నిర్జరధారల్. ౫౩

సీ॥ పంచధారాతీరభాసురయై దేవి, ధారేశ్వరి యనంగఁ ≀ దనరు నచటఁ
గాలరూపయు మహాకర్మఫలప్రద, కాంతారవాసిని ≀ గహనచరిత
దేవపూజిత నిత్యదివ్యభవ్యోత్సాహ, యనెడు నామంబుల ≀ నచట జనులు
బలికర్మహోమాది ≀ పటలి నిచ్చలుఁ బూన్చి, భోగమోక్షంబులఁబొలుపు గాంచి

తే॥ నిత్యవైభవశాలులై ≀ నిలిచియుందు, రమ్మహాదేవిచరిత మహత్యద్భుతంబు
కాంచుమాత్రంబునను భక్తకామదంబు, సర్వసిద్ధిప్రదంబు నిస్సంశయముగ.

క॥ కుముదాచలశిఖరమ్మున, నమరు కదంబానసీజమందుఁ బొడమి య
త్యమలినజలములు నదములు, కొమరారు ననేక ఝరులు ≀ కుంభినిమీఁదన్.

క॥ అన్నదముల దోఁగిన నరు, లన్ని సిరుల నలరి మధుగుడాన్నఘృతమ
యాభ్యన్నతదధిభోజనసం, పన్నతచేఁ బొదలుదురు ≀ క్షమావరతిలకా!

వ॥ మఱియు, నన్నదంబులు సువర్ణాచలంబునకు నుదగ్భాగంబునఁ బ్రవహించుఁ దత్తీరంబున మీనాక్షీనామంబున నంబిక నిత్య నివాసినియై దేవాసురనిషేవిత యగుచు నీలాంబరయును, [illegible] దేవపూజ్య ప్రదయు, వరదయు, నతి

మాన్యయు, నతిపూజ్యయు, మత్తమాతంగగామినియు, మథనోన్మాదినియు, మానప్రియయు, మారవేగధరయు, మారపూజితయు, మారమాలినియు, మయూరవాహనయు, శిఖివాహనమాతృకయు నను నామంబులఁ బూజ్యయై జపతపస్స్మరణంబుల నమజ్జనులకు భోగమోక్షంబు లొసంగు, నన్నదీపానీయ పానానుగతచేతస్కు లగు ప్రజలకు జరాపలితలక్షణంబులు లేవు. శీతాతప వాతాతిశయంబులు లేక సమధర్మంబులఁ గాలంబు ప్రవర్తిల్లుచుండు. ౫౭

సీ॥ మఱియును విను మయ్య ✽ క్ష్మాతలాధీశ్వర!, హాటకశైలంబు ✽ నావరించి
యిరువది శైలంబు ✽ లింపొందుఁ దమ్మికిఁ, గేసరంబులపోల్కి ✽ భాసురముగ
నమ్మృతకురంగముల్ ✽ కుముదకసుంభవి,కంకటంబులు పతంగంబు త్రిశిర
మవల త్రికూటంబు ✽ నగు సితీవాసంబు, కపిలశంఖంబులు ✽ క్రికచరుచక

తే॥ నిషధవైదూర్యహంసముల్ ✽ నెగడు నవల, నాగకాళంజరంబులు ✽ నారదంబుఁ
జారుధియు నాఁగఁ బేరు లెసంగు వాని, కబ్బురంబుగ దేవతా✽వాసము లవి. ౫౮

క॥ మింటఁ భాస్కరుపోలిక, మంటఁ హేమాద్రి వెలయు ✽ మహిమాస్పదమై
మింటికి మంటికిఁ బొడవున, నంటె జగంబులకుఁ దాన ✽ యాధారంబై. ౫౯

సీ॥ అమ్మేరుశిఖరాగ్రమందునఁ బదివేల, యోజనంబులమాన ✽ మొనరినలువ
నగరంబు చెలువొందు ✽ నవ్యహేమమయంబు, బ్రహ్మవేదుల కాటపట్టు నగుచు
నవ్వీటి కష్టది✽శాంతరంబులయందు, దిక్పాలపురములు ✽ తేజరిల్లు
సార్ధలోచనసహ✽స్రప్రమాణీకృత, యోజనంబుల నవి ✽ యొప్పు మిగులు.

తే॥ దివ్యకాసారశతముల ✽ దివ్యనదుల, దివ్యవనముల శోభిల్లి ✽ దీప్తిపటలి
నంధతమసంబునకు నిల్వ ✽ నందరాక; దివ్యతేజోమయంబులై ✽ తేజరిల్లు. ౬౦

వ॥ అప్పురంబుల కభిధానంబులు మనోవతియు, నమరావతియు, సంయమనియు, కృష్ణాంగనయు, శ్రద్ధావతియు, గంధవతియు, మహోదయయు, యశోవతియు నన బ్రసిద్ధంబులు; తదధినాయకులు బ్రహ్మేశానాంతంబుగా నధివసించి వర్తింపుచుండు రని చెప్పి. ౬౧

సీ॥ యజ్ఞమయుండైన ✽ యచ్యుతు వామపా,దాంగుష్ఠనఖభిన్న ✽ మైన యండ
మునను జనించి య✽మోఘధారాసార, రంగత్తరంగమై ✽ గంగ మేరు
శృంగంబునకు జాఱి ✽ జీవకోటుల నెల్లఁ, బూతులఁ జేయుచు ✽ భువనజనని
భగవతి యను పేరఁ ✽ బద్ధతిఁబ్రవహించి, యుగసహస్రములచేఁనొక్క కొంత

తే॥ యంబరంబున విష్ణుప✽దం బనంగ, నలరు దివ్యపదంబున ✽ నావరించి
విష్ణుపాదపరాగసం✽వేద్య యమ్మె, నచటనేకద? ధ్రువుఁడు నిత్యతేఁ జెలంగు.

క॥ అచ్చట సప్తర్షీశులు, నిచ్చలు వర్తింత్రు నియమనిష్ఠ లలర నీ
యిచ్చగణింపుము వినువా, రుచ్చైస్సిద్ధుల సుఖింతు రొప్పుగ దీనిన్. ౬౩

సీ॥ అద్దేవి విష్ణుపదాంత రాళంబున, దేవయానములచే దేవకోటు
లభినుతింపఁగ నంబుజాసనుపురమున, నాల్గుదెఱంగుల నడచె సీత
యనఁగ నందన యన నలకయు నన విష్ణు,భద్ర యనంగ శుభంకర యయి
యమ్మనోగతిలోన నధివసించెను గేస,రాభ యందురు దాని యభిధ భువిని

తే॥ గంధమాదనగిరిమీఁదఁ గడఁగి పాఱి, ప్రాఙ్ముఖంబుగఁ గడలికై పాఱె విష్ణు
భద్ర ప్రవహించెఁ దా వేగవతి యనంగ, నాల్గుతెఱఁగులుపడమర నడచెనంత.

క॥ దేవావళు లెల్లపుడా, దేవతటినిఁ దోఁగి దివ్య తేజోమహిమన్
స్థావరులై వసియించిరి, దేవవిమానముల దివ్యదీధితి మెఱయన్. ౬౪

గీ॥ అలకనందయుఁ దామునా నభిఖ నొంది, దక్షిణపుఁద్రోవ గిరికూటతటము లొరసి
హేమకూటంబుఁ జెంది నిజేచ్ఛ భరత,ఖండమునఁ జొచ్చి జలధికిఁ గడఁగిపాఱె.

క॥ అతివేగవతీనామము, క్షితిఁ గనె నత్తటినియందుఁ జేరి నరులు పా
పతతుల్ వాసి సుఖింతురు, వితతస్వర్గోపభోగవిభవములఁ గదుర్. ౬౫

ఉ॥ అన్నదిఁ దోఁగినంత జను లాదట నధ్వరకర్మసత్క్రియా
భ్యున్నతదివ్యభోగముల నొందుదు రట్టి మహాఫలంబు లి
చ్చు న్నియమంబుగా నిలిచి సూనృతులై యట స్నానపానముల్
గొన్నఁ దదీయవైభవము కుంభిని నెచ్చటనైనఁ గల్గునే? ౬౬

చ॥ అదియునుగాక మందరమహారజతాద్రులఁ బుట్టి దొట్టి యొ
ప్పిదముగఁ బెక్కు నిమ్నగలు పేర్మి వహించు నదంబులున్ బ్రతీ
చిదిశకునై యనేకముఖజృంభదుదారతరంగరింగణా
స్పదముగ సాగరంబునకుఁ జాఁగి కడుం బ్రవహించు వింతగన్. ౬౭

గీ॥ అన్ని వర్షంబులందున నధిక ధర్మ;కర్మ కర్మఠమై సమాక్రాంత నిఖిల
భువనసుకృత ప్రదాయియై పొలుపుమీఱు, భరతఖండంబు దేవతావసవరేణ్య.

క॥ ధరణీ స్వర్గ పదంబులు, పరికింపఁగ నివియునెల్ల భారతవర్షం ౭౦
బరయఁ గరణీయకర్మల, కరుదుగ భోగంబులిచ్చునట్టిది సుమ్మీ.

ఉ॥ భారత భిన్నవర్షము లపారసుఖప్రదవైభవంబులై
యారయఁ [illegible] ధారులన్

సారసుఖోపభోగములఁ దజక్కఁగఁ జొక్కఁగఁ జేయు నాఁగ దు
ర్వారనిరంతరాయసుఖవైభవ మొందఁగఁ జేయు నెప్పుడున్. ౭౨

సీ॥ అవ్వర్షములలోన నధివసించిన భూత,కోటులు పదివేల కుంజరముల
జవమున దేవతాసన్నిభులై పుత్రి,మిత్రకళత్రాద్యమేయసుఖము
నిండారి వజ్రాంగనిశ్చలులై మహా,సురత సంతుష్టులై సుందరులను
గలసి వర్తించుచుఁ గాలంబు త్రేతాయు,గ ప్రతీకాశమై గడలుకొనఁగ
గీ॥ నయుత సంవత్సరాయుష్యనియతు లగుచు, నిత్యసుఖభోగులై కర్మనియతి దేవి
నర్చ నలుపుచు భోగమోక్షానుభవము, లందుచుందురు చేతను లందునందు.

మ॥ నవవర్షంబులయందు నుందురు మహానందంబుతో నిర్జరుల్
నవరత్నోజ్జ్వల దివ్యయానముల నానాక్షేత్ర తీర్థంబులన్
నివహంబుల్ గొని సంచరింతురు పొరి న్నిర్నిద్ర గాంధర్వగా
నవిలాసంబుల నప్సరోనటన సంగధాసక్రియాచాతురిన్. ౭౪

వ॥ మఱియును, సర్వర్తు కుసుమశ్రేణీఫలపల్లవపత్రశోభానిరంతరపాదపంబు లగు విపినంబులం జెలంగు వర్షపర్వతసానువులందు నిర్మలోదక ధారాళంబులును, వికచోత్పల కమల కల్హార విహార హారి హంస సారస సంచయంబులును నగు నిర్ఝరంబుల, సుందరీ సహితులై యోలలాడుచు విశాలాయతనంబుల విహరించుచు, నిర్జరులు నిత్య సన్నిహితులై వర్తింతురిట్టి నవవర్షంబులకు లోకానుగ్రహకరుండై లక్ష్మీవల్లభుం డగు నారాయణుండు సన్నిధానం బొనర్చు నిలావృతంబున భగవంతు డగు రుద్రుండు పార్వతీసమేతుండై యధివసించు నచ్చోట నెవ్వరికిం బ్రవేశంబు దురవగాహంబు, చొచ్చెనేనియుఁ బురుషునకు నాఁటతనంబు చొప్పడు, భవానీభజనం బొనర్చు నసంఖ్యంబు లగు గణకోటులచేఁ బరివృతుండై దేవదేవుం డగు రుద్రుండు సంకర్షణుతో మైత్రి యవలంబించుచుఁ దామసమూర్తిం జేకొని "ఓం నమో భగవతే మహాపురుషాయ, సర్వగుణ సంఖ్యానాయానంతాయా వ్యక్తాయ నమః" అను మంత్రంబు జపించుచు మఱియును. ౭౫

ఉ॥ తామరసారుణంబు లగు తావక పాదపయోరుహంబులం
దేమఱకుండఁ జిత్తమున నెల్లపుడున్ భజియించుచున్ నవో
ద్దామభవాపహం బయిన త్వచ్చరితంబు పఠించుచున్, సుఖా
రామత భూతభావన! నిరంతర! నామెడ నిల్పియుండు మీ! ౭౬

ఉ॥ మాధవ! దుర్ఘటంబయిన మాయలలోఁబడి చేతనావళుల్
బోధ మెఱుంగలేక గుణబోధల నిగ్గ గనఁ జాల రద్భుతో

త్సేధములైన నీదు నతి¶దీప్తిమహస్సుల నాత్మనిగ్రహో
ప్రోదిత బాహ్యవృత్తులయి ¶ రోయఁగ నెవ్వరి కౌను గేశవా. ౭౭

చ॥ అసదృశవృత్తులన్ వెలుఁగు ¶ నట్టి మహాత్ముఁడ వీవు సంసృతి
ప్రసృత మదాభిమాంద్యమునఁ ¶ బల్మఱు ఘూర్ణిత దృక్కులైన తా
మసులకు శక్యమే తెలియ ¶ మంజులకంజయుగంబుఁ బోలు నీ
యసమపదాంబుజంబులను ¶ నాశ్రయ మీవె జగన్మయాత్మకా. ౭౮

చ॥ భుజగ శిరస్సహస్రమునఁ ¶ బూనిన యిజ్జగమెల్లఁ బ్రోవఁ గా
వఁ జెలువ నీవకావె? సుర¶వందిత! యట్టుల యయ్యు మూఁటితో
నజిత! యలేపివై వెలుఁగు ¶ నట్టి నిరూ గన నెవ్వఁ డోపు? నీ
నిజ మిది యంచుఁ దెల్పఁగదె? ¶ నీరజపత్ర విశాలలోచనా! ౭౯

ఉ- ఎవ్వని యాజ్ఞచే జగము ¶ లెల్ల భజించు భుజంగవల్లభుం
డెవ్వని కూర్మిచే సకల ¶ మెల్ల నెఱుంగుఁ బయోరుహోద్భవుం
డెవ్వని మాయచే సకల ¶ మేకసహాయత మాయఁజేయు నే
నవ్విధిముఖ్యసన్నుతుని ¶ నచ్యుతు మాధవు నిన్నుఁ గొల్చెదన్. ౮౦

శా॥ పుట్టింపం బెనుపంగఁ గూల్పఁగ మహాస్ఫూర్తిన్ విజృంభించు మే
మిట్టై సూత్రనిబద్ధపక్షు లన నెం¶తే నీకు లీలార్థమై
దట్టంబౌ ప్రమదంబు గూర్తుముగదా ¶ తత్త్వజ్ఞు లెవ్వార లీ
గుట్టుంగానక మమ్ముఁ గర్తలుగ నా¶కర్ణింతు రజ్ఞేక్షణా. ౮౧

క॥ జగదాత్ముఁడవై జగముల, నగపఱుపఁగ మాయనొర్తు ¶ నడ్డంబిడ దీ
వగణేయమహిమ గల యో,భగవంతా యట్టి నీకుఁ ¶ బ్రణుతి యొనర్తున్. ౮౨

క॥ అని యిత్తెఱఁగున ననుదిన,మును రుద్రుఁ డిలావృతమున ¶ మునుకొని దేవున్ ౮౩
వనజాక్షు సన్నుతింపుచు, జనితానందమున నిల్చు ¶ సంయమివర్యా!

క॥ అట్టుల భద్రాఖ్యంబున, బట్టంగారాని భక్తి¶పాటవమున న
ప్పట్టునఁగల జనులెల్లను, గట్టిగ హయశీర్షుఁగొలువఁ ¶ గాంక్షింతు రొగిన్. ౮౪

వ॥ తొల్లి భద్రశ్రవుం డను నొక్క మహాత్ముండు వాసుదేవు నవరావతారంబై
యచ్చోటను దివ్య తేజంబు వెలుంగంజేసెఁ గావున నవ్వంశంబున జనియించు
వారెల్ల భద్రనామకులై హయగ్రీవమూర్తిన్ భజియింపుచు, "ఓం నమో భగ ౮౫
వతే ధర్మాయాత్మవిశోధనాయ నమః" అని జపియించుచు మఱియును.

సీ॥ పరమపవిత్రంబు భగవద్విచేష్టితం, బిసుమంత జనునకు నెప్పుడేని
ఆగామిసుఖదుఃఖ మరయంగనీదు మే, మెఱుఁగక చేసిన దెద్దియేని
క్షమ సేయవలవదే? కడఁగి పుత్రులు సేయు, నపరాధములు తండ్రి యణఁపఁడొక్కొ
యిజ్జగతీత్రయం బెల్ల నశ్వర మని, పరతత్త్వవేత్తలు పలుకరొక్కొ?
గీ॥ అల్లెటింగియు నణుమాత్రమైన నెఱుఁగ, మిట్లు నీమాయచేఁ గాదె యెఱుఁగకుంట
నజ్ఞులముగాన నపరాధ మాత్మ నోర్చి, కావు మపరాధులను మేము కైటభారి!

ఉ॥ దేవ! యకర్తవయ్యు జగతిన్ సృజియింప భరింప నొంపఁగా
నీవ యటన్న మాటకును నిక్కము నేను నటంచు నోర్చు నీ
భావము చిత్రమే సకలభావజనుఃకృతికారణుండవై
యావల సర్వ మంటని పరాత్మవు నీ వని కొల్తు మచ్యుతా! ౮౭

ఉ॥ ప్రళయమునన్ దరియావితతి పాతకి దైత్యుఁడు గొంచుఁ బోవ ని
శ్చలమతిఁ దో దురంగముఖసంవృతి నొంది పయోధిఁ జొచ్చి త
జ్జలముల మున్గు వేదతతిఁ జక్కఁగఁ జేకొని బ్రహ్మ కిచ్చు నీ
సలలితమూర్తిఁ జూచెదము సన్నిధిఁ జేయు దయాపయోనిధీ! ౮౮

క॥ అని సన్నుతించుచుందురు, పనిఁగొని నిచ్చలును నచట భద్రశ్రవసుల్
వినినఁ బఠించిన వారల, ఘనచరితము పాతకములఁ గడఁద్రోయుఁజుమీ. ౮౯

క॥ హరివర్షంబున హరి నర, హరియై యాత్మైకశరణు లందఱు దురితో
ద్ధరణ మొనర్చుచుఁ గావఁగ, నరు లలరుదు రెలమి సిరు లనారత మెసఁగన్.

క॥ కడువేడుక ప్రహ్లాదుం, డెడ తెగని సపర్యలను నభీష్టఫలంబుల్
విడివడి కొనుచు నృకేసరి, యడుగుల సద్భక్తియుక్తి నధ్యక్షుండై. ౯౧

వ॥ సేవించుచు "ఓం నమో భగవతే నారసింహాయ నమస్తేజస్తేజసే ఆవిరావిర్భవ వజ్రనఖ వజ్రదంష్ట్ర కర్మాశయాన్ రంధయ నమోనమ ఓం స్వాహా, అభయమ్మమాత్మని భూయాత్, ఓం క్ష్రౌం" *అను మంత్రంబు జపించుచు. ౯౨

సీ॥ జగముల కెల్లను స్వస్తియగుంగాక, భూతంబు లెల్ల నిన్ బూజఁ జేసి
శుభ మొందుదురు గాక సుగత సద్భక్తితో, నామనం బచ్యుతు నాటుఁగాక
నిష్కారణముగఁ దా నిచ్చలు సద్బుద్ధి, హరిని నావేశించి యలరుఁగాక
యీషణత్రయమున నెలమి వహించియు, భగవత్ప్రియంబైన పనికిఁ జొచ్చి
తే॥ చిత్తమునఁ బరితుష్టుఁడౌ జీవి కవని, నందరానిపదంబు లే దెందు వెదక
నతఁడె విజితేంద్రియుండు ననవతఁ డెధీరుఁ, డతఁడె స్వచ్ఛందవృత్తియై యలరువాఁడు.

---

* టిప్పణి: ౯౨ లోని మంత్రాక్షరములు నేఁటి ప్రతిలో నిందున్న వాని కించుక భేదముగా నున్నవి. దీనికి గ్రంథముల యందలి పాఠభేదములే నిమిత్తము. మఱికొన్ని మంత్రములుగూడ నిట్లే భేదించినవి.

ఉ॥ ఎవ్వని యాశ్రియంబున నభీష్టసుఖంబులు గల్గి వీర్యముల్
జవ్వనముల్ జిరాయువును సంతతపావనతాదు లొప్పఁగల్
నెవ్వగ లేమఁ లుల్ దొలఁగి నిర్మలుఁడై భవకంధి దాఁటు నా
కవ్వపుఁగొండదారి నభికాంక్ష యొనర్చిన లేమి గల్గునే. ౯౪

మ॥ హరిపై నించుక భక్తిగల్గిన నరుం డత్యచ్ఛతారంభగుం
ఫరసోల్లాసగుణావళుల్ గలిగి సన్మాన్యుండు గాకుండునే?
హరిపై భక్తి యొకింత లేని విరసుండా మర్త్యుసం దేల యు
ర్వర సాద్గుణ్యము గల్గు నభ్రమునఁ బుష్పవ్రాతముల్ గల్గునే. ౯౫

ఉ॥ చేతనకోటి కెల్ల హరి జీవనదాయి తదాశ్రియంబు సం
స్యూతము మానవావళికి సొంపఱి దూఁటిలువాఁడె వేసవిన్
శీతజలంబు క్రోలెడి విశిష్టుఁడు సంసృతి రోసి దుష్కృత
వ్రాత మణంచు దుర్భవనివారకు శ్రీహరి నాససేయఁడే? ౯౬

క॥ ఇత్తెఱఁగునఁ బ్రహ్లాదుఁడు, చిత్తస్థిరతానిరస్తశేషుం డగుచున్
మత్తిలు నచ్యుతు పట్టపు, హత్తి యనన్ దిరుగు ననయు లందఱు గొలువన్.

వ॥ మఱియుఁ గేతుమాల వర్షంబున స్మరరూపధరుండై వర్షాధిపతులచేఁ బూజ
లందుచు భగవంతుం డధివసించు, ప్రజాపతి యవ్వర్షాధిష్ఠాన దేవతయై, "ఓం
హ్రాం హ్రీం హ్రూం నమో భగవతే హృషీకేశాయ, సర్వగుణవిశేషై ర్విలక్షి
తాత్మనే ఆకూతీనాం చిత్తీనాం చేతసాం విశేషాణాం చాధిపతయే షోడశకళాయ
ఛందోమయాయ అన్నమయాయ, అమృతమయాయ, సర్వమయాయ,
సహసే ఓజసే బలాయ, కాంతాయ కామాయ నమస్తేఉభయత్ర, భూయాత్"
అను మంత్రంబు జపియించుచు మఱియును. ౯౮

ఉ॥ ఇంతులు నిన్నుఁ జూచి చలియింపని చిత్తములన్ దలంచి నిన్
గాంతుని గాఁగఁ గోరి యతికాంక్షల నట్లయి పుత్రమిత్రది
ర్గాంతధనాదు లొందుచు స్వతంత్రతచే విహరింతు రిందు మా
కాంత! భవత్కృపారస మఖండితసౌఖ్యము లిచ్చునో గదా! ౯౯

క॥ అకుతోభయుండ వగు ని,న్నకుటిలమతిఁ గోరువారి కభయదుఁడవు వే
ఱొకని భజించినఁ గలుగునె, సకలమునం దాత్మలాభసంసిద్ధియె కా. ౧౦౦

ఉ॥ ఎవ్వతె నీ పదంబుల నభీష్టసపర్యలు సల్పకుండు నా
జవ్వని నీదుతీక్ష్ణశరజాలములన్ బరితప్యమానయై
నెవ్వగఁ గుందకుండునె! మనీషిహృదంతరమధ్యవాసి! నీ
మవ్వము నన్ను [illegible] పరమాత్మ! రమామనోహరా! ౧౦౧

ఉ॥ నీదు పరంపదంబునను నిల్వఁగఁ గోరికదా! తపింతుర
త్యాదరనిష్ఠలన్ విధిసురాధిపముఖ్యులు నిచ్చలున్; భవ
త్పాదపరాయణుల్ గనని భాగ్యము లున్నవె యింద్రియాబ్ధిలో
నీఁదఁగలేని నన్నుఁ గరుణించుట యెట్లొకొ దీనరక్షకా. ౧౦౨

ఉ॥ నీదుపదాంబుజంబుల ననిందితవై ఖరి మ్రొక్కుచున్న నా
యౌఁదల నీకరం బిడితి వన్నిభయంబులు వాసె నెవ్వఁడ
త్యాదరమూర్తియై శరణ మన్నఁ బదంపడి ప్రోవఁ డన్యుఁ డ
న్యాదృతమౌనె యిగ్గుణ మనాహతమండలమధ్యమందిరా. ౧౦౩

గీ॥ ఇవ్విధంబునఁ బ్రహ్లాదు లిద్ధతేజుఁ, గామరూపు జగన్నాథుఁ గడుముదమునఁ
బూజ సలుపుచుఁ బ్రొద్దులు పుచ్చువార, లఖిలసుఖములు గల్గి దివ్యానుభూతి.

క॥ రమ్యకవర్షమ్మున నతి,రమ్యం బగు మత్స్యమూర్తి రంజిల హరి దు
* ర్గమ్యమగు వర మొసంగు ని,యమ్యతఁ దనుఁ బూజసలుపు నచటి నరులకున్.

వ॥ మఱియును నా రమ్యకఖండంబునకు నధిపతియై మనువు "ఓం నమో భగవతే ముఖ్యతమాయనమః; సత్త్వప్రాణా యౌజసే జలాశయాయ మత్స్యాయనమః" అను మంత్రంబు జపించుచు.

క॥ వెలుపల లోపల వెలుఁగుచు, నలరె యలక్ష్యత మహార్ణవాంతరమునఁ బెన్
కలముగొని చేతనావళి, నలయక త్రిప్పితివి పొగడనగునె! మహాత్మా! ౧౦౪

ఉ॥ నీ మహిమంబుగానక యనేకముఖంబుల మచ్చరించి సు
త్రామముఖామరుల్ కడు సధఃపతనంబును జెంది పక్షులై
గోమహిషద్విపాద్భుజగఘోరతరాకృతు లూని నీ కృపో
ద్దామత గోరుచుందురు గదా? ప్రళయాండజరూప? కేశవా! ౧౦౫

క॥ ప్రళయాబ్ధిభంగమాలా, కులమౌ క్షితితలము మమ్ముఁ గూడఁగ సకలం
బలయక నిలిపిన జలచర,కులతిలకా! వందనంబు గొనుమీ! ప్రేమన్. ౧౦౬

క॥ ఇప్పొలుపున మనువు మదిన్, గొప్పగ నుప్పతిలు భక్తిఁ గొలుచుచుఁ దఱచౌ
నిప్పలుకుల నుతియించుచు, నెప్పుడు పాఠీనవిభున కెఱఁగుచుఁ దిరుగున్ ౧౦౭

వ॥ మఱియును, హిరణ్మయఖండంబునఁ గూర్మరూపధరుండై భాస్కరునిచేఁ బూజలం గొనుచు, దివ్యయోగనిదర్శనం బొనర్పుచు, నివసించు నద్దేవుని భాస్కరుండు "ఓం నమో భగవతే అకూపారాయ, సర్వసత్త్వగుణవిశేషోపలక్షితస్థానాయ,

* టిప్పణి: "ఈ దుర్గమ్య" ప్రయోగము ప్రాసలో నుంటచే దిద్దఁబడమి నుపేక్షితము, చింత్యము.

నమో వర్యాయ నమోఽర్వ్యణ్వే భూమ్నే నమోఽవధ్యాయ నమస్తే నమో నమః" అను మంత్రంబున జపియించుచు. ౧౧౧

సీ॥ వేదవేదాంగాది । వివిధసిద్ధాంతంబు, లెవ్వాని మహిమంబు । లెఱుఁగలేవు
సంతతం బాత్మైకశరణులౌ భక్తుల, కెవ్వాని సదూపి । మెఱుఁగరాదు
చుక్కలకైనను । లెక్క గల్గెడుఁగాని, యెవ్వాని గుణముల । కేది లెక్క?
ఘటపటాదివిభేదకలనంబు గల్పించి, యెవ్వండు నిజతత్త్వ । మెఱుఁగనీఁడు

గీ॥ అట్టి యఖిలాండజనకుండవైన నీదు, పదపయోజంబులకు నిజభావరూఢి
వలగొనుచు సన్నుతించుచు వందనములు, సలుపుచుందు ననాదికచ్ఛప! ముకుంద!

చ॥ ఘటములు కుడ్యముల్ నదులు । కాననముల్ గిరు లండజంబులున్
బటములు సాగరంబులు ద్వీపంబులు నాకస మభ్రబృందముల్
కటకములున్ దటాకములు । కల్పితభేదము లింతె కాక యం
తట భవదేకరూపము గదా? కమఠాధిప! నీకు మ్రొక్కెదన్. ౧౧౩

చ॥ ఇరువదినాల్గుతత్త్వము లనేకగుణంబులు రూపభేదముల్
పరిపరిభంగులన్ గలుగు । పద్ధతులన్ బరికించి సాంఖ్యు లాం
తరసువిమర్శనంబుగ ననారతమున్ వివరింతు రింతయున్
గర మరుదంద నీ వాకఁడ । కావె జనార్దన! కచ్ఛపాకృతీ! ౧౧౪

క॥ ఇక్కైవడి సప్తాశ్వుం, డక్కచ్ఛపదేవుఁ గొలిచి । యహరహమును న
మ్మిక్కాముమోక్షసౌఖ్యము, లొక్కటఁ గొనుచుండుఁ దాపసోత్తమ! వింటే.

వ॥ మఱియుఁ గురువర్షంబునం దాదివరాహమూర్తి యగు యజ్ఞపురుషుని ధరిత్రీదేవి యథోక్తవిధిం బూజించి "ఓం నమో భగవతే మంత్రతత్త్వలింగాయ, యజ్ఞక్రతవే, మహాధ్వరావయవాయ, మహాయశస్వినే, కర్మశుక్లాయ, త్రియుగాయ నమస్తే" అను మంత్రంబు జపియించుచు. ౧౧౬

సీ॥ దక్రియాక్రియాహేతు । భవ్యంబు లేకకారణములై మాయికగుణములైన
వస్తురూపముల నిర్వసుధఁ గొందఱు గందు, రాన్వీక్షకీవిద్య । ననుశయించు
నాత్మబుద్ధులు కొంద । ఱతిదుర్ఘటంబైన, మాయకు నవ్వలిమహిమరూపు
గాగఁ నిర్గొందఱు । గనుఁగొందు రట్టినీ, మూలంబు నిజముగా మొనసి తెలియ

గీ॥ నెవ్వఁడోపు మహాత్మ! సమీహితముగ, నిన్నుఁ గనఁజేసి నీమూర్తినిజముఁ జెప్పి
నన్ను మన్నింపుమయ్యా! యనాథనాథ!, సగుణనిర్గుణరూప! కేశవ! ముకుంద! ౧౧౭

చ॥ జగముల సర్గసంభరణసంక్షయవర్తులుగా నొనర్చుచున్
జగములలోపలన్ బయిట । సంచరియించు చుతలమాయకున్

దగ నెల్లవై నిరస్తగుణసత్త్వరతన్ గుణకర్మసాక్షివై
నెగడు నమేయవిగ్రహ! మనీషిహృదంతరవాస! మ్రొక్కెదన్! ౧౧౮

ఉ॥ ఆదివరాహరూపమున నత్యయవేళల నీట మున్గు న
న్నాదరవృత్తి దంష్ట్రికొన నబ్బురమందఁగ నెత్తి క్రీడ నా
మోదముతో నటించు పరమున్ జగదాది ననంతు నవ్యయున్
వేదశిఖావిహారు నిను విశ్వమయున్ నుతియింతు నచ్యుతా! ౧౧౯

క॥ అనుదిన మిట్లులు ధరణీ, వనజాక్షి నుతింపఁబూన్ప నర్తించుచు స
జ్జనరక్ష దుష్టశిక్షయు, ననువొందఁగఁ జేయుచుండు నచ్యుతుఁ డచటన్. ౧౨౦

వ॥ మఱియుఁ గింపురుషవర్షంబున సర్వేశ్వరుండు దాశరథియై సీతాసమేతుండై యాంజనేయునిచేత ననుదిన మర్చింపఁబడుచు, భక్తవాత్సల్యంబునఁ దత్ప్రియులఁ బరిపాలింపుచుండు, నద్దేవు ననిలపుత్రుండగు హనుమంతుండు "ఓం నమో భగవతే, ఉత్తమ శ్లోకాయ నమ, ఆర్యలక్షణ శీలవ్రతాయ నమః, ఉపశిక్షితాత్మనే, ఉపాసితలోకాయ నమః, సాధువాదనికషణాయ నమో బ్రహ్మణ్యదేవాయ మహాభాగాయ నమః" అని యిమ్మంత్రంబు జపియించుచు. ౧౨౧

సీ॥ స్వానుభూతిని గాని స్వస్వరూపం బీక, యేకమై గుణవృత్తులెల్ల నడఁచి
పరిత్యక్తప్రశాంతమై పరమశాంతాత్మోప, లభ్యమై యాత్మోపలబ్ధి గమ్య
మయి నామరూపాదు లంటక యహమాది, జనకమై యొద్ది నిస్సంశయముగ
నఖిలంబు తానమై యలరు పరంజ్యోతి, వీవు మర్త్యుండవై యొలమిఁగనుచు

గీ॥ సుజనరక్షణఁ గోరి దుష్టుల వధించు, క్రీడయే కాదు ప్రకృతి సంక్రీడనంబు
జగతిఁ దెలుపంగఁదలఁచి యజ్జనకజాతఁ, గూడి వర్తించితివి యోగగుప్తివలన.

చ॥ జగముల కాత్మ వౌట విలసన్మనుజాకృతిఁ దాల్చి లీలచే
నగపడు టింతెకాక జనకాత్మజ వీడుట దైత్యమర్దనా
ద్యగణితకర్మకౌశలి సతమ్ముగఁ జూపుట నీ వినోదమం
చగచరజాతులైన మనుజాదులు గాంచఁగలేదె? కేశవా! ౧౨౨

ఉ॥ నీదు ననుగ్రహంబునకు నిమ్మలు నాకృతులున్ శుభోక్తులున్
వాదపటుత్వముల్ సుగుణవర్తనలున్ బని లేదు నిత్యభ
క్త్యాదరమూర్తి వీ వెడ నహైతుకకృత్యమ కాదె? క్రోతులా
మాదృశులన్ సఖిత్వమున మన్ననసేయుట లక్ష్మణాగ్రజా! ౧౨౪

క॥ సుర లసురు లనఁగ నేటికి, నరు లురగు లనంగనేల? నతులై నిచ్చల్
శరణాగతులై చేరినఁ, గరుణింతువు రామచంద్ర! కరుణాసాంద్రా! ౧౨౫

ఆ॥ అని నుతించి మారుతాత్మజుఁ డచ్చోట, నధివసించు కోసలాధినాథు
నర్చ సలుపుచుండు నచ్యుతుం డద్దేశ,వాసులకు నభీష్టవరము లొసఁగు. ౧౨౬

వ॥ మఱియు నీ భారతవర్షంబున కధీశ్వరుండనై యాదిపురుషుండ నగు నన్ను నీవు భజింపుచు "ఓం నమో భగవతే ఉపశమశీలాయ, ఉపరతానాత్మ్యాయ నమోఽకించన విత్తాయ, ఋషిఋషభాయ, నరనారాయణాయ, పరమహంసపరమగురవే, ఆత్మారామాధిపతయే నమోనమః" అని జపించుచు. ౧౨౭

క॥ సర్గాదిహేతు వగుచు ని,రర్గళముగ దేహసహితుఁ డయ్యుఁ జెడక నై
సర్గికవిభూతి నింద్రియ, వర్గముల కగోచరతఁ బ్రవర్తించు హరీ! ౧౨౮

వ॥ అని వెండియు. ౧౨౯

గీ॥ ఐహికాముష్మికంబుల నధికకామ, లంపటత దారపుత్త్రాదులను భరించి
రాగ మెడలని పండితరాజిబోధ, భరితుల మటంట తెలియ దంభంబుగాదె.

ఉ॥ నీవు ప్రభుండ వేనుగన నీకడ దాసుఁడ దేహబంధసం
భావితమౌ మమత్వమున బద్ధుఁడ నైతి భిదాఖ్యరజ్జుబం
ధావిలచిత్తు నన్ గని దయన్ భిద మానిచి నీ పదైకసం
భావన నూని యోగి నయి మన్నన నొందఁగఁ జేయు మీశ్వరా. ౧౩౦

క॥ ఇట్టులు నుతించుచును నా, చుట్టున్ వలగొనుచు నిత్యశుశ్రూషుఁడనై
యిట్టుంట యెఱుఁగుదే కద, నెట్టన సంసృతిభయంబు నీ కేల మునీ! ౧౩౧

వ॥ ఓ దేవఋషివర్యా! ఏకాగ్రమానసుండవై యిబ్భారతవర్షంబునం గలుగు పుణ్యక్షేత్రంబులు పుణ్యతీర్థంబులు వచించెద నాకర్ణింపుము. మలయంబును, మంగళప్రస్థంబును, మైనాకంబును, త్రికూటంబును, ఋషభంబును, కూటకంబును, కొల్లంబును, సహ్యంబును, దేవగిరియు, ఋష్యమూకంబును, శ్రీశైలంబును, వేంకటాచలంబును, మహేంద్రంబును, వారిధారంబును, వింధ్యంబును, శుక్తిమంతంబును, ఋక్షపర్వతంబును, పారియాత్రంబును, ద్రోణంబును, చిత్రకూటంబును, గోవర్ధనంబును, రైవతంబును, కుకుభంబును, నీలంబును, గౌరముఖంబును, ఇంద్రకీలంబును, కామగిరియు మొదలగు శైలంబులును, దదుత్పన్నంబులై స్పర్శన, దర్శన, కీర్తనావగాహనంబులఁ ద్రివిధదురితంబుల నడంచు నదులు పెక్కులు వానిలోఁ దామ్రపర్ణియు, జంద్రవశయుఁ గృతమాలయు, వటోదకయు, వైహాయసియుఁ గావేరియు, వేణయుఁ బయస్వినియుఁ, దుంగభద్రయుఁ, గృష్ణవేణియు, శర్కరావర్తకయు, గోదావరియు, భీమరథియు, నిర్వింధ్యయుఁ, జర్మణ్వతియుఁ, దాపియు, రేవయు, సురసయు, నర్మదయు, సర

స్వతియుఁ, జర్మణ్వతియు, సింధువు, సంధశోణమ్ము లనెడి రెండు మహానదమ్ము లును ఋష్యకుల్యయుఁ,ద్రిసామయు, వేదస్మృతియు, మహానదియుఁ, గౌశికియు, యమునయు, మందాకినియు, దృషద్వతియు, గోమతియు, సరయువును, రోధ వతియు, సప్తవతియు, సుధామయు, శతద్రువును, జంద్రభాగయు, మరు ద్వృధయు, వితస్తయు, అసిక్నియు, విశ్వయు నను నామంబుల నొప్పు, మఱియు నిందలిజనులు సాత్త్విక రాజస తామసాత్మకంబు లగు స్వస్వకర్మముల ననుసరించి తత్తత్ఫలమ్ము లనుభవించుచుందురు, వెండియు, నివ్వర్షంబు స్వకర్మలబ్ధజన్మ లగు పురుషులకు నానావిధభోగంబుల నొసంగి యపవర్గం బిచ్చుచుండు నని మఱియును. ౧౩౩

శా॥ తీర్థక్షేత్రబహుత్వసంపద సమర్థీభూతమా భారతం
బర్థింపందగు జన్మనొందుటకు నైకయన్యంబు లీడౌనె? స
త్స్వార్థంబుల్ వసియించు నిందు, సుర లిచ్చన్ నిచ్చలున్ సత్క్రియా
స్వార్థాభీప్సితసిద్ధికై నిలుతు రీ స్థానంబునన్ నారదా! ౧౩౪

ఆ॥ అన్య మేల చెప్పనచ్యుతుం డీవర్ష, సీమ నచట నచటఁ జెందెఁ గాదె
పెక్కురూపు లొరుల పేరేమియూ రేమి, పావనోత్తమంబు భారతంబు. ౧౩౫

క॥ జనమేజయ! భారతమున, జనియించినజనులజన్మసాఫల్యముఁ జె
ప్పనలవియే? హరి యిచ్చట, జనియించెన్ గానఁ జాత్రుసమస్థితిగతుఁడై. ౧౩౬

సీ॥ ఎచ్చోటఁ బంకజాక్షేక్షణ పాదపల్లవసంస్మృతి గలుగు నవిరతంబు
నచ్చోట నతితరాయాససాధ్యములైన, నధ్వరవ్రతతపోధ్యానజపము
లేటి కయత్న మభీప్సితం బగు ముక్తి, కరతలామలకమై కరిందుకొనఁగఁ
బ్రియాంతముగఁ దపోవ్రతము లొనర్చిన, సిద్ధించునే? సిద్ధి క్షితితలేశ?
గీ॥ భారతమున నిమేషంబు పరమపురుషు, భజన మొనరింపఁగలుగు నపాయరహిత
మగు పదంబు ప్రసంగోక్తముగ గణింప, వలదు సత్యంబు సత్యంబు పలుకువాఁడ.

ఉ॥ ఎచ్చటఁ బంకజేక్షణసమీహిత దివ్యకథల్ ప్రసంగవో
యెచ్చటఁ దత్పదాశ్రయసమిద్ధమనస్కులు లేకయుందురో
యెచ్చట యజ్ఞపూరుషు నభీష్టసపర్యలు గల్గకుండునో
యచ్చటి యింద్రభోగము లయారె! నిరర్థకముల్ గణింపఁగన్.

ఉ॥ భారతఖండమందుఁ బ్రభవంబును బొందినభూతకోటి ని
స్సారపు ఘోరసంసృతి ననసక్తత నించుక నీశ్వరేశు దు
ర్వారపదాబ్జనిష్ఠితశుభంకరభావనఁ గాంచి రేని సం
సారనిబద్ధులై ధరణి సంభవ మంద రికెన్నఁ డేనియున్. ౧౩౭

ఉ॥ ఎందఱు వేల్పులర్ నుడివి యెందు హవిస్సు లొసంగిరర్ సదా
నందు ముకుందు నామమున నర్మిలి నాహుతి యొక్క టిచ్చనే
నందఁగరాని దివ్యపద మైనను గొంగునముల్లె గాదె ? గో
విందుని యంశలే కద? భువిన్ దివిఁ జేతనకోటు లెల్లెడర్. ౧౪౦

చ॥ అడిగిన దెద్దియైన శరణావళి కప్పు డొసంగు నట్టి వాఁ
డెడపక తమ్మికంటి యను చింతయు నెమ్మది నర్థవాదమం
చుడుగుఁడు మందబుద్ధి; నిగమోదితసారముగా గణింపుఁ డ
య్యడుగు లభీష్టదంబు లని యాత్మల నెంచుఁడు నిశ్చితస్థితిన్. ౧౪౧

క॥ హర్షమున సురలు భారత,వర్షంబునఁ బరమపురుషు వర్ణింతురు సం
కర్షణుఁడు పరమహర్షో,త్కర్షత నారాయణాఖ్యుఁ గని యం దుండున్ ౧౪౨

వ॥ మఱియును జంబూద్వీపంబునకు దిగ్భాగంబుల నెనిమిది యుపద్వీపంబులు గలవు. సముద్రోదకంబుల నన్యోన్యంబును హతమార్గంబులై వర్తించు, స్వర్ణప్రస్థంబును జంద్రశుక్రంబును, నావర్తనంబును, రమణీకంబును, మందరోపంబును, హరిణంబును, పాంచజన్యంబును, సింహళంబును నను నామంబులఁ దేజరిల్లు. జంబూద్వీప ప్రమాణంబు కీర్తితం బయ్యెఁగదా! తావత్ప్రమాణంబున మేరువు జంబూద్వీపంబుచే నావరింపఁబడుకై వడి క్షారోదధిచే నావరింపఁబడు. తద్ద్విగుణంబుగాఁ బ్లక్షద్వీపంబు పరివేష్టించుఁ, దద్ద్వీపంబునకు లవణోదధి పరిఘారూపంబునఁ జెలువొందుఁ దత్ప్రమాణంబు ద్విలక్షయోజనంబు, హిరణ్మయం బను పర్వతంబందుఁ బ్రతిష్ఠితంబై యుండుఁ బ్రియవ్రతనందనుం డగు సప్తజిహ్వుం డధివసించు. నతండు విభజించి సప్తవర్షంబులు స్వనందనుల కొసంగి యోగచర్యాశ్రితుండై భగవదుపాసనం బొనర్చుచుం జనియె. ౧౪౩

గీ॥ శివయవసభద్రశాంతముల్ క్షేమమమృత,మభయమని యెడినామంబులమరునచటి
సప్తవర్షంబులకు నొప్పు సప్తనదులు, సప్తశైలంబులును, వానిసంజ్ఞ లలరు.

క॥ అరుణయును సుప్రభాతాం, గిరసులు సావిత్రి సృమ్ణ *కృతభర సత్యం
భర యను నామంబులచే, నరుదగు నీయేడు నదులు హర్షప్రదలై. ౧౪౪

సీ॥ కులశైలములు మణికూటంబు నజ్రకూ,టం బింద్రసేనంబు డంబు మిగులు
జ్యోతిష్మదాఖ్యంబు సొంపొందఁగ సువర్ణ,మును హిరణ్యాష్ఠీవమును మఱియును
మేఘమాలం బన మెఱయు నచ్చో నున్న, నదులు స్పర్శనదర్శనములవలన
తామస రాజస ధ్వంసం బొనర్చుచు, జనులకు సత్త్వసంస్కార మొసఁగు

---

* టిప్పణి:—నదీనామములలో మూలములో నున్న ఋతంభరకు బదులుగా నను వాదములో కృతభర అని పడినది. [illegible] మగుటచే గ్రంథకర్తకు దొరకిన పాఠ మిదియే యని తెల్ల మగుటచే దిద్దలేదు. ఇట్టి పాఠభేదము లెల్ల నిట్లే యెఱుంగనగు.

గీ॥ హంసలుఁ బతంగులూర్ధ్వాయ ♦ నాభిధులును, గలరు త్రైవర్ణికులునట్లు ♦ గలరువృషలు
లందు సత్యాంగులను పేళ్ల ♦ నలరు వార, లాయు వేకసహస్రాబ్దమగుఁ దపసి!

క॥ అచ్చోట మెలఁగు జనులకు, నిచ్చలు ఖేచరత గలదు ♦ నియమవ్రత స
త్ప్రోచ్చయము వీడ దెప్పుడు, నచ్చెరు వగు రూపకలన ♦ లతిరిత్యులకున్. ౧౮౬

క॥ అయ్యంతరీపముఖముల, నయ్యై నరకోటి కలరు ♦ నాయుర్బలముల్
వెయ్యేల సకలగుణము ల,జయ్యములై యొక్క తెఱఁగు ♦ సంధిల్లు నృపా!

వ॥ మఱియుఁ బ్లక్షద్వీపం బావరించి యిక్షురసోదధి చుట్టియుండుఁ దదుత్తరంబున శాల్మలం బను ద్వీపంబు పూర్వద్వీపద్విగుణంబై పరివర్తించు. తత్ప్రమాణంబు తదర్ణవంబును; నందు శాల్మలీవృక్షంబు గరుడాధిష్ఠితంబై చెన్నొందు, నందుఁ బ్రియవ్రతనందనుం డగు యజ్ఞబాహుండు వల్లభుండై విభజించి కొడుకుల నేడ్వుర వర్షాధిపతులం జేసె, నవియును సురోచనంబు, సౌమనస్యంబు, రమణంబు, దేవవర్షంబుఁ, బారిభద్రం, బాప్యాయనంబును, విజ్ఞాతంబును, ననంబడు, నందు సరసంబును శతశృంగంబును వామదేవంబును గందకంబును గుముదంబును బుష్పవర్షంబును సహస్రశ్రుతియు నను కులశైలసప్తకంబు వఱలు, శినీవాలియు, ననుమతియును, సరస్వతియుఁ గుహువు, రజనియు, నందయు, రాకయు నను నదీసప్తకంబు గలదు. శ్రుతధరులును, వీర్యధరులును, వసుంధరులును, నిషుంధరులును నను నామంబుల నాల్గువర్ణంబులవారలట బరివర్తింతురు. వేదమయుం డగు సోమేశ్వరున్ భజియింపుచు నచ్చటిప్రజలు సర్వాభీష్టంబులం జెందుదురు. ౧౮౭

సీ॥ అయ్యంతరీపంబు ♦ నావల మదిరాబ్ధి, ద్విగుణపూర్వంబుగాఁ ♦ దేజరిల్లు,
నచటఁ గుశద్వీప ♦ మందుఁ గుశస్తంబ, మాశాముఖమ్ముల ♦ నావరించి
రంజిలు నందు హిరణ్యరేతుం డను, మనువుమన్మఁడు క్షితిమండలంబుఁ
బాలించి యట్టులె ♦ పట్టుల కేడ్వుర, కిచ్చె ద్వీపం బెల్ల ♦ నేలుకొనఁగ

గీ॥ వసువసుదానుఁడను నాఖ్య ♦ నెనగువాఁడు, దృఢరుచియు నాభిగుప్తుండు ♦ దేవకుండు
నలరు స్తుత్యవ్రతుఁడు వివిక్తాఖ్యుఁడతని; కొమరులీ పేళ్ళవర్షముల్ ♦ గొనియెఁ బిదప.

వ॥ మఱియును జక్రింబును జతుశ్శృంగంబును గపిలంబును జిత్రకూటంబును దేవానీకంబును, నూర్ధ్వరోమంబును, ద్రవిణంబును నను శైలసప్తకంబును రసకుల్యయు మధుకుల్యయు మిత్రవిందయు శ్రుతవిందయు దేవగర్భయు ఘృతచ్యుత్తును మంత్రమాలికయు నను నదీసప్తకంబును; కుశల, కోవిదాభియుక్త కులకనామంబులఁ జతుర్వర్ణంబుల వారునుం గలిగియుందు, రందు జాతవేదుండు పూజ్యుండు. తత్రస్థులగు జనంబు లతనివలనఁ బురుషార్థచతుష్టయంబుఁ బొందుచుందురు.

సీ॥ *అట్టి కుశద్వీప ♦ మావరించి ఘృతోద,కంబు పరివర్తించుఁ ♦ గ్రౌంచమనెడు
ద్వీప మావలఁగల్గు ♦ ద్విగుణపూర్వంబయి, ఘృతపృష్ఠుఁడను ప్రియ♦వ్రతసుతుండు
పాలించి యేడ్వురు ♦ పట్టులకును భూమి, విభజించి నెమ్మది ♦ విరతినొందె
నామంబు మధురుహం ♦ బన మేఘపృష్ఠంబు, దామక్రభ్రాజిష్ణు♦నామకములు
గీ॥ లోహితార్ణవనస్పతు♦లు నను వర్ష,సప్తకమునందు భూధర♦సప్తకంబు
సర్వతోభద్రశుక్ల భో♦జములు నంద,వర్ధమానకనందన♦బర్హిణములు. ౧౫౨

వ॥ మఱియును నభయయు, నమృతౌఘయు, నాచార్యకయుఁ దీర్ఘవతియు, వృత్తిరూప వతియుఁ, బవిత్రవతియు, శుక్లవతియు నను నదీసప్తకంబును, స్నానోపస్పర్శనం బులఁ బుణ్యదంబులై వర్తించుఁ; బురుష, బుషభ, ద్రవిణ, దేవకు లను చతుర్వర్ణ జనంబులు హయగ్రీవుం బూజింపుచుఁ గృతాంజలులై యుందురు. "ఆపః పురుష వీర్యేణ భూర్భువ స్వశ్చ తాః పునః, యదంఘ్రిస్పర్శనా త్పూతా జగత్యాః పర మాత్మనః" అను మంత్రంబు సకలజనజప్యంబై ద్వాత్రింశదక్షరసంఖ్యాకంబై చతుర్వర్గఫలంబు లొసంగుచుండు. ౧౫౩

క॥ తద్ద్వీపోత్తరమునఁ బూ,ర్వద్విగుణంబగుచు దధి స♦రస్వంతము భా
స్వద్వీతతతరంగంబై, విద్వన్నుత యావరించు ♦ విశదప్రభలన్. ౧౫౪

వ॥ మఱియు నచ్చట శాకద్వీపం బన నొక్క యంతరీపంబు వెలుంగు నందు నభ్రం లిహంబై శాకమహీరుహంబు చెన్నలరుటంజేసి శాకద్వీపం బనం బరఁగెఁ, బ్రియ వ్రతనందనుండు మేధాతిథి తత్పాలకుండై పుత్రుల కేడ్వురకు విభజించి యొసంగి తాను యోగగతిం జనియెఁ బురోజవుండును, మనఃపూర్వుండును, జయుండును, బవమానుండును, ధూమ్రానీకుండును, జిత్రరేఫుండును రుచియు నను నామఁబుల వారు వర్షసప్తకం బేలిరి; ఈశానంబును, నురుశృంగంబును, బలభద్రంబును, స కేశవంబును, సహస్రాంతంబును, దేవయానంబును, మహానసం బును నను గిరిసప్తకంబును, ననఘయు, వపుర్దాయయు, నుభయస్పృష్టియుఁ, బరాజితయుఁ బంచపదియు, సహస్రస్రుతియుః, నిజధృతియు నను నదీసప్తకంబును జెలంగు; సత్యవ్రతులును, గులవ్రతులును, దానవ్రతులును, ననువ్రతులును, నను చతుర్వర్ణంబుల వారును వర్తిల్లుదురు; నచ్చోట వాయుదేవుఁడు భగవంతుండై తత్రస్థులచేఁ బూజితుండై చతుర్వర్గంబు లొసంగుచుండు. ౧౫౫

సీ॥ అన్వల క్షీరాబ్ధి ♦ యలరుఁ బూర్వద్విగు,ణంబయి తేజో♦విడంబనమున
రంజిల్లుఁ దత్తీర♦రమణీయ మగు పుష్క,రద్వీప మది భోగ♦రమ్యతలము
నచ్చోటఁ దరువుల♦యాకులు వహ్నికీ,లలపోల్కి వరతార♦కల విధమునఁ
గనకభాజనముల♦కై వడిఁ జెలువొందు, నది పరంధామున ♦ కాలయంబు

* టిప్పణి: కుశద్వీప [illegible] ద్వీపవర్ణనము [illegible]ప్రతులకు సంపడుటలేదు.

గీ॥ అది దనరు మానసోత్తరం బనెడి శైల, వరముచే రెండు పాళ్లుగా వఱలు గాని
శిఖరములఁ దమ్మిచూలికిఁ జెలఁగునాల్గు, నగరములు తేటిచూడ నభ్రగములగుచు.

క॥ అమ్మానసగిరిమీఁదను, దమ్ములచుట్టమ్ము దిరుగుఁ దప్పక వర్షా
త్మమ్మను చక్రి మహోరా,త్రమ్ములు వెలయించుఁ దపనమండలవిహృతిన్. ౧౭౭

క॥ స్వాయంభువమనుపుత్రుం, డాయెడ ధర యేలి తనదునాత్మజ బాహు
స్థాయిగ ధర నిల్పి పర,స్థేయమతిన్ జనియె విమలధీయుక్తుండై. ౧౭౮

ఆ॥ అందు వీతిహోత్రనందను లిరువురు, రమణ ధాతకు లన రాజు లగుచు
వర్ష యుగళిఁ గొనుచు వసుధ యేలిరి భగ,వంతు కరుణ సుగుణవంతులగుచు ౧౭౯

వ॥ మఱియు బ్రహ్మస్వరూపుఁడగు నారాయణుఁ గర్మయోగాభ్యాసంబుల నచ్చటి వార లుపాసింపుచు, నిష్టార్థంబు లొందుచుందురు. సర్వంబును వాసుదేవమయంబై పరివర్తింపుచుండు. ౧౮౦

గీ॥ అవల శుద్ధోదకార్ణవ మతిశయిల్లు, ద్వీపసాగరసంఖ్య సుధీజనంబు
ద్విగుణ మని నిశ్చయాత్మతఁ దెలియవలయు, లక్షయాది చతుష్షష్టిలక్షగణన.

ఉ॥ అవ్వలఁ జక్రవాళము మహామహిమమ్ముల కాలయమ్ము పై
నవ్విధి విష్ణురుద్రముఖు లష్టదిగీశులు దివ్యభూతులన్
మవ్వము గాంచుచుందు రతిమానుషశోభలఁ జెన్నుమీఱుచున్
గవ్వపుగుత్తివోలె నిలఁ గ్రమ్మియజాండకటాహ మంటెడున్. ౧౮౨

గీ॥ దర్పణోదరతుల్యమై ధరణికాంత, దివ్యకాంచనశోభలఁ దేజరిల్లి
జీవకోటికి నేటికిఁ జేరరాక, కలిగియుండును గొంత భూతలముమీఁద. ౧౮౩

క॥ చీఁకటి వెలుపల, లోపల లేకుండుటఁ జేసి దాని లెక్కింతురు పో!
లోకాలోకంబని సు,శ్లోకులు తన్మధ్యమున వసుంధర నిలిచెన్. ౧౮౪

వ॥ మఱియును, సూర్యాదిధ్రువాంతంబు లగు రశ్మిపరంపరలు లోకత్రయంబు లెఱింగింపం జేయుచుఁ జక్రవాళంబున కర్వాచీనంబులై పరాచీనంబులు గాక మెఱయు నప్పర్వతేంద్రంబు సూర్యరశ్మిపరిమాణోన్నతంబై వర్తించు నిది లోకవిన్యాసంబు, పంచాశత్కోటియోజనగుణితంబు భూగోళచతుర్థాంశంబై చక్రవాళంబు వ్యాపించుఁ దచ్ఛిఖరాగ్రంబులఁ జతుర్దిశంబుసఁ దమ్మిచూలిచే వృషభ, పుష్కరచూడ, వామన, పరాజితంబు లను దిగ్గజంబులు లోకస్థితికై నిలుపంబడియె. సకలభూతవీర్యసత్త్వైశ్వర్యవర్ధనం బొనర్చుచు విష్వక్సేనాదిపరివృతుండై సాయుధసవాహనశక్తికంబుగా భగవంతుం డగు విష్ణుండు స్వమాయారచిత సృష్టిగోప

నార్థంబునకుఁ గర్త యైయుండు. బ్రహ్మాండమధ్యంబునఁ బంచవింశత్కోటి యోజనపరిమాణంబున మార్తాండుం డధివసించి దిగ్విభాగం బొనర్చు. దేవతిర్యఙ్మనుష్యసరీసృపవీరుడాదికంబునకు సూర్యుం డాత్మ. ఇది భూమండల సన్నివేశంబు. దివంబున నేతన్మానంబున నిర్ణయంబు, సూర్యుం డీ యుభయమ్మునకు మధ్యస్థుండై త్రిలోకమ్ములకుఁ దన దీప్తి నొసంగుచుండు, నుత్తరాయణ, దక్షిణాయనంబుల నారోహణావరోహణంబులం జెంది, నభంబున గతిమాంద్యశీఘ్రత్వంబులం జరించుచు దినంబులందు దీర్ఘహ్రస్వతలు వెలయించి, విషువత్కాలంబుల గతిసామ్యంబు నొంది దినసామ్యం బొనర్చు, మేషతులాధిరూఢుండై సమతయు, వృషభ వృశ్చికాధిరూఢుండై శీఘ్రతామాంద్యంబుల నొందుచు విపర్యయంబున వర్తింపుచుండు. ౯౬౧

సీ॥ మఱియు వచించెద ॥ మార్తాండగమనంబు, శీఘ్రమందాదికస్థితిఁ ద్రివిధము
సర్వగ్రహంబుల ॥ స్థానంబు లట్లగు, నైరావతం బుత్తరాయణంబు
వైశ్వానరం బవాక్పథమున నశ్విని, కృత్తికయును యామ్య ॥ నెనసి మూఁడు
పథములై చెలువొందు ॥ భానునకును రోహిణియు నార్ద్రమృగశిరల్ నియతి దెలియ
గీ॥ సింధురాద్రిముపుష్యయాశ్లేష రవియుఁ, దెలియ నైరావతాధ్వంబు ॥ దేవమౌని!
ఉత్తరానుత్తరపురథ్యలోలయుచుండు, ననియెఱుంగుము శాస్త్రరహస్య మిదియు.

వ॥ మఱియు ఫల్గునీద్వయంబును మఖయు, హస్త చిత్రా స్వాతీ విశాఖానూరాధా జ్యేష్ఠా మూలా పూర్వాషాఢోత్తరాషాఢా శ్రవణ ధనిష్ఠాదులు దక్షిణమార్గంబనంబడు, నుత్తరంబున దినవృద్ధియు రాత్రిక్షయంబును దక్షిణంబునఁ బాశపేరిణ వశంబున దినహీనతయు రాత్రివృద్ధియు నగునట్టులు పాశపేరిణాపేరిణ సమావస్థల గతిభేదంబు లేర్పడును; నిదియునుంగాక. ౯౬౨

సీ॥ స్వర్ణాద్రిపై నిట్టి ॥ చక్రంబు దిరిగెడు, నగ్గిరితూర్పున ॥ హరిహయునకు
రాజధానియు నైంద్రి ॥ రవిసూనునకు దక్షిణమున సంయమనినా ॥ నగర మగును
బ్రత్యగ్దిశను గంధపతికిఁ బ్రమ్లోచని, యుత్తరంబున సౌమ్య ॥ యొనరు యక్షపతికి నైంద్రిని రవి ॥ బయలుదేఱియు సంయమనికి మధ్యాహ్నం బగుమరఁగ వచ్చు
గీ॥ సాయమునకు వారుణి కేగు ॥ సౌమ్య కరుగు, నప్పటికి నడురేయి యహస్కరుని గమనము నీరీతిఁ దెలియుము ॥ మధ్యకాల, మపుడు హాటకాద్రికి నని యరయు మనఘ.

క॥ కనుపడుట యుదయ మందురు, కనుఁగొనరాకున్నఁ గ్రుంకుకాలం బని యి
జ్జనములు పల్కుదు రింతియె, యనునకు నుదయాస్తమయము ॥ లెక్కడివి మునీ!

ఆ॥ ఉన్న చోట నుండి ॥ మొగ మెత్తి త్రిపురములు ... జేయుచుండు మిత్రుఁ డెపుడు
నొగిని సిద్ధనగర ॥ మొక్కటి కాలాంతరమునఁగాని సూర్యరశ్మిఁ గానదు. ౯౬౩

గీ॥ సాగరద్వీపవర్ష సంచయము లెన్ని, విధములైనను గన నేకవిధముగాఁగ
నన్నిటికి మేరు వుత్తరమై చెలంగు, నిదియ సిద్ధాంత మని కను మిద్ధచరిత! ౧౨౧

ఆ॥ భానుఁ డుదయమంది పఱతెంచు నెచ్చోట, నదియ తూర్పుదిక్కనాఁ జెలంగు
హాటకాద్రి దానికగు వామభాగంబు, నందు నిలుచునట్టిదని తెలియుము ౧౨౨

గీ॥ అయనములు రెంట నినుఁడు దశశాంకఘటిక, కాలమునను సపాదసంఘటితకోటి
యుగ్మసార్ధక దశలక్షయోజనముల,పైనిఁ బంచశతసహస్రపదమునడచు. ౧౨౩

క॥ నాలుగు పురములఁ దిరిగెడు, కాలంబున నినుని కిట్ల గతి జరుగు మహా
కాలాత్మకమగు చక్రి,వ్యాలోలత బుద్ధి నెఱుఁగవలయు బుధులకున్. ౧౨౪

సీ॥ ఎల్ల గ్రహంబులు నిట్టులు గతి నొండ, నక్షత్రములఁ గూడి నడుచుచుండు
నుగ్రాంశురథము ముహూర్తంబునను జతు,స్త్రింశ లక్షల మేర తెరువు నడచు
నతఁడు వేదమయుండు గతిచక్రవశతచే, నేకచక్రము నాభు లెలమి మూఁడు
నంచులు పదియు రెం డతని రథంబున, కది వత్సరాత్మకంబమరగిరిని

తే॥ నక్షమును మానసోత్తరంబలరి బండి, యలరి తిలకారకుని యంత్రమట్ల తిరుగు
రథము నీడంబు ముప్పదాఱ్లక్ష లగును, దాని పరిణాహ మగు తుర్యతానిరూఢి.

సీ॥ ఉగ్రాంశునరదంపుయుగము తావన్మాత్ర,మగు నేడు ఛందంబు లశ్వసమితి
భువనావనమునకై భువనలోచను మోచు, నతనికి సారథి యరుణుఁ డనఘ
వాలఖిల్యులు డాసి వత్తు రర్వాదివేలు, దివ్యసూక్తుల సన్నుతించుకొనుచు
మఱియును గంధర్వమాని దేవాంగనా, మునియాతుధానాదిముఖ్యసమితి

గీ॥ ద్వాదశాత్ముని సప్తిసప్తకనిరూఢి, నిటుల వర్తించు జగ మెల్ల నెలమి మిగిలి
దివ్యబోధంబుఁ గూర్చు నాదిత్యమూర్తి, యఖిలభువనంబులకునాత్మయై మహీశ.

గీ॥ జనులకు శుభాశుభంబులఁ జాఁటికొనుచు, గ్రహము లెల్లను గతిభేదకలన నెఱపు
శింశుమారవశంబునఁ జెలఁగి గ్రహము,లకును మేరుప్రదక్షిణోల్లసన మమరు.

గీ॥ కాలచక్రంబు సవ్యసంక్రమిత మయ్యు, గ్రహవిహారంబు విపరీతగతిఁ బొసంగు
నదియు నక్షత్రవశ మని యరయవలయు, ధరణిని గతిద్వయము విరుద్ధంబుగాదు.

చ॥ పరఁగఁ గులాలకుండు తన *బండి యథాక్రమవృత్తిఁ ద్రిప్పుచోఁ
గర మలరంగ దానిపయిఁ గందువ స్వైరగతిన్ బిపీలికల్
దిరుగుట వింతయే యటులఁ దీవ్రత మందత వృత్తిభేదముల్
సరిగొన భానుముఖ్యులకు సంచరణంబు పృథక్స్థితిన్ గనన్. ౧౨౫

* టిప్పణి: బండి = కుమ్మరిసారె, అని లాక్షణికారము.

ఉ॥ పాయక సర్వలోకములు క పాలనసేయుచు దివ్యమూర్తి నా
రాయణుఁ డందు మధ్యమున క నందఱకున్ శుభసంవిధాత్రమై
చేయన నేల రక్షణ మగవిశ్లథమై విలసిల్లఁజేయ సం
దేమెడ నెద్దియైనను సమీహితభావము దప్ప నేర్చునే. ౧౫౦

క॥ వేదంబులు నిగమాగమ, వాదంబుల నిర్ణయించుగపగిదిఁ దెలిపిరిన్
మోదమున నెల్లవారి క, నాది ముకుందుండు రక్షణాదక్షుఁ డగుట. ౧౫౧

క॥ వర్ణాశ్రమముల వారికి, వర్ణాశ్రమధర్మవృత్తి క వదలనిగతి నా
యర్ణవశాయికి భరణ ము, దీర్ణత సహజంబు తేటగ తెల్లం బధిపా. ౧౫౨

వ॥ మఱియుఁ గాలచక్రగతుండై జగంబులు వెలుంగంజేయుచు మెలంగు జగ చ్చక్షుండు రాశిద్వాదశకసంచరణసౌఖ్యం బనుభవింపుచు, జగద్బోధం బొనర్చు నట్టి వత్సరంబునకు మాసంబులు పదియు రెండు, మాసద్వయంబు ఋతు వగు; మాసంబు పక్షద్వయంబు. పక్షంబు పంచదశ దినంబు. దినం బహోరాత్రి ప్రమాణంబు. భానుండు గగనవీథిని నబ్దంబు భాగద్వయం బొనర్చి యుదగ్దక్షిణ భేదంబుల మందశీఘ్రసమగమనంబుల సంచరించు, నిట్టి హరిదశ్వునకు లక్ష యోజనోన్నతుండై శశి నిజామృతంబుల నమరులఁ బ్రీతులం జేయుచు నహోరాత్ర విభేదం బొనర్చి సర్వచేతనప్రాణుండై త్రింశన్ముహూర్తంబుల నొక్కొక్క తారకన్ భోగించుచు మనోమయుండును, మంత్రమయుండును, నమృతధాముండును దేవతిర్యఙ్మనుష్యాద్యాప్యాయనశీలుండును నై కాలచక్రంబున లక్షయోజన ప్రమాణంబున మేరుప్రదక్షిణం బొనర్చుచు భగవదాజ్ఞం బ్రవర్తించు నతనికి నూర్ధ్వంబున శుక్రుండు ద్విలక్షయోజనంబుల శీఘ్రమందసమగతులన్ భువ నంబుల కనుకూలుండై వర్తించు నబ్భార్గవున కూర్ధ్వంబున ద్విలక్షయోజన ప్రమాణంబున శుక్రవడువున గతిత్రయంబు గలిగి రాశిసాన్నిధ్యంబున సూర్యున కవ్యతిరేకుండై బుధుండు వాతాతపవృష్ట్యాదిభయసూచకుండై భయ హర్తయు, శుభప్రదుండునై వర్తించు నతనికి ద్విలక్షయోజనోర్ధ్వంబునఁ బక్ష త్రయంబున రాశి ననుభవింపుచు భౌముండు వక్రగతి లేని తఱి వర్తించు, నతనికి రెండులక్షల నాంగిరసుండు సంవత్సరం బొక్కొక్క రాశి ననుభవింపుచు వక్రగతి గలుగనిచో వర్తించు, నతనికి నూర్ధ్వంబున యోజనద్విలక్షంబున శనైశ్చరుండు వర్తించు నితండు శుభప్రదుండు కాఁడు. అచ్చటికి దశలక్షప్రమాణంబున సప్తర్షి మండలంబు సర్వలోకశుభంకరంబై వర్తిల్లుచుండు. ౧౫౩

సీ॥ తాపసమండలోర్ధ్వప్రదేశంబున, బదుమూఁడులక్షుల క పరిమితముగ
విష్ణుపదం బలరు క వైష్ణవోత్తముఁడైన, యౌత్తానపాది నిత్యప్రకాశి

గీ॥ యిందు రెండుఁ గశ్యపుఁ డెలమి విరించియు, ధర్ముండు మొదలుగా దైవసమితి
దనకుఁ బూజ్యులు గాఁగ దనరు వారలఁ గూడి, తారకాగ్రహగతుల్ తనకు నిమిష

గీ॥ భావితంబులు గాఁగ బరిరవ్యక్తమైన, రంహమున సంభ్రమించు నారాయణునకుఁ
బరమభక్తుఁ డితండు సర్వప్రమోది, స్తంభసంబంధవృషభంబు సరణి నధిప.

క॥ ఇత్తెఱఁగున గ్రహతారల, మొత్తంబులు ధ్రువునిఁ బట్టి ముదమునఁ గల్పాం
తోత్తరము సంభ్రమించును, వృత్తి సమీరాశ్రితంబు వివరింపంగన్. ౧౮౫

సీ॥ జ్యోతిర్గణంబుల స్తోమంబు లెల్లను, బ్రకృతిపూరుషుల సంభరణవశతఁ
బడక నభోవీథిఁ బట్టియుండురు కాల, చక్రంబు రూపంబు క్షమను బుధులు
శింశుమారాకృతిఁ జెప్పుదు రది యోగ, ధారణకర్మచేఁ దపసిపోల్కి
నర్వాక్ఛిరస్కమై యలరుపృష్ఠంబున, ధ్రువుఁ డుండుఁ దోఁక సరోజసూతి

ఆ॥ పంకజాసనుండుఁ బావకుండును ధర్ముఁ, డుండు రచటఁ జివర నందు రల్ల
ధాతయును విధాత దాని కటిస్థలిఁ, దవసిన ప్తకంబు తనరి నిలుచు. ౧౮౬

గీ॥ దాని పార్శ్వోదయంబునఁ దనరు నుత్త, రాయణంబును దగ దక్షిణాయనంబు
నేయుతారల సమసంఖ్య చిత్రగతుల, గ్రహగమన మేర్పరించుచుఁ గ్రమము చెడక.

సీ॥ భాగరాశ్యష్టమ భాగస్థమై యభ్ర, తటిని వర్తించుఁ దక్షత్రిష్ఠ యగుచుఁ
బుష్యపునర్వసుల్ పొనఁగుఁ గేశంబుల, నార్ద్ర యాశ్లేషయు నంఘ్రులందు
నభిజిత్తు మఱియు త్తరాషాఢ యంసముల్, మూలాధనిష్ఠలు మొనయుఁ జెవుల
దక్షిణాయనమునఁ దనరు మఖాదికం, బుదగయనంబున నొనరు మార్గ

గీ॥ ముఖములు శతర్క్ష *జ్యేష్ఠయు భుజము లరయ, నుత్తరహనుస్థుఁడై యగస్త్యుండు దనరు
నన్యహనువు నముంచు నుయముఁడు ముఖము, నంచుఁ గుజుఁ డురహస్యంబు నందు శనియు.

ఆ॥ సురగురుండు మూపున సోకుమూఁకల గొంగ, హృదయమున మనంబు నెడల శశియు
స్తనములందు నర్క తనయులు పొక్కిట, నుశనుఁ డుండు దాని కొప్పు మిగిలి.

గీ॥ ప్రాణము నపానమును గూడఁ బట్టి బుధుఁడు, రాహుకేతులు గళమున రంజిలుదురు
దాని సర్వాంగములు దేవతామయంబు, లట్లగుట దానిరూపు హర్యాత్మకంబు.

సీ॥ శాస్త్రజ్ఞు లగువారు సాయంతనములందు, నియతులై తల లెత్తి నింగివలనఁ
జూచుచు వేదసంస్తుతు లొనర్చుచు వక్ష్య, మాణమా మంత్రంబు మదిని నిలిపి
అనిమేషదృష్టులై యవలోకన మొనర్పఁ, గాలత్రయము నేయు కలుషపటలి
తరణిప్రకాశంబు తమ మడంచినరీతి, నమభిధానావశేషం బొనర్చు

* టిప్పణి: శత ర్క్ష జ్యేష్ఠ – ఇట ఛందోభంగము సహ్యము, లేదా పృథక్పదముగాఁ జూచికోఁదగు.

గీ॥ నిది పురాతనసూక్తి యభీష్టసిద్ధి, నేయు నిస్సంశయము నిరపాయవిధుల
నేను నిరతం బొనర్తు మభీష్టసరణి, నల్లమంత్రింబు వచియింతునయనఘ! వినుము.

వ॥ తత్ప్రకారంబు "నమో జ్యోతిర్లోకాయ కాలాయానిమిషాంపతయే మహాపురు
షాయాభిధీమహి" యని ప్రవర్తించుం గావున నిమ్మంత్రంబు గ్రహనక్షత్రాధి
దైవికంబై స్మరించు వారికిఁ ద్రికాలంబును గాలజంబగు పాపంబు దొలంగం
జేయుచుండు.

క॥ అరవింద బాంధవునకును, దరతమభావితసహస్రదశ యోజనవి
స్ఫురితుఁడయి క్రింద రాహువు, చరియించుఁ వక్రగతి నసహ్యాబలమునన్. ౯౯౩

ఆ॥ సైంహికేయుఁ డర్కచంద్రుల నిర్వురఁ, గాలగతిని మ్రింగి క్రాయుచుండు
నభ్రవిహరణంబు నమరత్వమును శార్ఙ్గి, కరుణవలన దైత్యవరున కలరె. ౯౯౪

చ॥ ఇనశశిమండలంబులకు నిట్టులు గీడొనరించె రాహు వం
చని హరిచోదితం బయినయట్టి సుదర్శన మభ్రమండలిన్
గనుపడునంతలో నెగసి కాతరుఁడై దితిజుండు పోవు న
య్యనువున లోకముల్ మెఱయు నర్కశశాంకుల దివ్యదీధితిన్ ౯౯౫

గీ॥ అచ్చటికిఁ గ్రింద సిద్ధోరగాదిభువన, పటలి వెలుఁగొందు యోజనప్రమితి నయుత
సంఖ్యచేఁ బుణ్యఫలభోగసంవిధాన, మూలములటంచుఁ గనుము సన్మునివరేణ్య.

క॥ అచ్చటికిం బదివేలను, నిచ్చలు నుండుదురు యక్షనివహము రక్షో
భ్యుచ్చయము పిశాచాదులు, నచ్చెరువై యుండు వారియంబరవిహృతుల్. ౯౯౭

క॥ అది యంతరిక్ష మందుఁ, విదితంబుగ వాయువశత విషధరబృందం
బుదితతటిద్గర్జితముల, నదనుల వర్షించుకొనుచు నచ్చటఁ దిరుగున్. ౯౯౮

చ॥ జలధరమండలంబునకు సన్నిధి భూతల మందుఁ బార్థివం
బులు గల వండజోద్భిదసమూహము స్వేదజరాయుజాళియున్
బలుదెఱఁగుల్ గదా! యదియు వర్ణితమయ్యె ధరాంతరంబునన్
గల వపటంబు లేదు సుఖకందము లాచరితంబు వినొమ్మగిన్. ౯౯౯

సీ॥ అతలంబు వితలంబు సుతలంబు నతలాత, లమహాతల రసాతలము లనంగ
బాతాళ మన బిలస్వర్గంబు లివిసుమీ, సందు సహస్రయోజనము లమరు
నయుత యోజనముల నంత రాయామముల్; సర్వర్తుసుఖదముల్ సమరసములు
కామభోగములచే [illegible] గరిమెయులు [illegible] బహువంతులై చెలువుమీఱి

గీ॥ పుత్రమిత్రకళత్రసంపూర్తి నొంది, బహుళపరిచారకులు తమ్ముఁ బలసి కొలువ
మయవినిర్మితమైనట్టి మాయ గల్గి, యచ్చట గృహస్థు లుందు రనంతముగను.

మ॥ భవనాట్టాలకగోపురంబులును శుంభత్సౌధసాహస్రముల్
నవరత్నోజ్జ్వలచైత్యచత్వరసభానానావిధాగారముల్
జవనాశ్వేభవిచిత్రపంజరశుకీసారంగహంసావళుల్
స్తవనీయోత్సవదాయకంబు లయి తత్తత్పుల్ సుఖం బెప్పుడున్. ౧౦౧

సీ॥ దివ్యరత్నోజ్జ్వలత్ దేవవిమానముల్, చంద్రికాసితచంద్రశాలికలును
విమలపాథఃపూర్ణవితతకాసారముల్, శీతలచ్ఛాయలఁ జెలఁగు వనులు
హంసకారండవాద్యావృతనిమ్నగల్, వనజోత్పలాకీర్ణవాపికలును
జగదేకమోహనాశ్చర్యకాంతావళుల్, విబుధగాయకసత్కవివ్రజములు

గీ॥ నింద్రియోత్సవకారులై యెసఁగుసుఖము, లెల్లఁ గలిగియు సురపురి నీసడించు
నట్టి భవనంబు లవి యేడు నందు సుఖము,లందుదురు పుణ్యవర్తనులైనవారు.

ఉ॥ ఇది పవ లయ్యె మేలుకొనుఁ డెల్ల పనుల్ దగఁ దీర్పుఁ డిప్పుడే
యిది నిసి యయ్యె వేగ నిదురింపుఁ డటంచును గాలభేదముల్
గదియవు తజ్జగంబులను గాల మఖండత నొప్పఁ బన్నగుల్
విదితశిరోమణిప్రభల విచ్చఁగఁ జేతురు ధ్వాంత మచ్చటన్. ౧౦౩

క॥ దివ్యౌషధరస సేవన, దివ్యనదీస్నాన పానదృఢసంగతిచే
నవ్యాధు*లనాధులునై, భవ్యముఁ గాంచుదురు భువనవాస్తవ్యులొగిన్. ౧౦౪

చ॥ పలిత వివర్ణదోషములఁ బాసి జరామరణ క్రమాది సం
చలనము లేక నిత్యశుభసంస్మృతులై వసియింతు రొక్క.డన్
గలుగు సుదర్శనంబునను గాలము నందుట ధర్మపద్ధతిన్
దొలఁగిర యేని వేఱ యొక తో్రవ జనింపదు భీతి వారికిన్. ౧౦౫

వ॥ మఱియుఁ బ్రథమంబగు నతలాఖ్య వివరంబున మయపుత్రుం డగు బలుండు షణ్ణవతి సంఖ్యాకంబు లగు మాయలం బ్రవర్తింపం జేసె, నచ్చటి వార లెల్లను మహామాయావులై చెలంగుదురు, కాంతాజనంబు లోకత్రయ మోహకంబై స్వేచ్ఛావశంబునఁ దిరుగు, హాటకాఖ్యరసంబున విలాసావలోకానుగుణస్మిత సల్లాప విభ్రమాదులచే స్త్రీపురుషులు గ్రీడించుచు "ఈశ్వరోఽహ మహం సిద్ధ" యను నాత్మాద్వైతంబున మదాంధంబై వర్తించు, రెండవ వితల వివరంబున హాటకేశ్వర నామంబునఁ బ్రమథగణ పరివృతుండై భవానింగూడి బ్రహ్మకృత సర్గంబునకు

---

* టిప్పణి॥ అనాధులు = నవిద్యతే, అధిర్యేషామితి విగ్రహః – అధి(మనోవ్యాధి)శూన్యులు.

నుపబృంహణం బొనర్చుచు, దేవాదిపూజితుండై హరుండు వర్తించుఁ దద్వీర్య
సంభవం బగు హాటకాఖ్య సువర్ణంబు దైత్యవల్లభంబై యాభరణసంపదం
బొసంగం జేయుచుండు. ౧౦౬

క॥ దానికిఁ గ్రిందను సుతలము, దానవవల్లభుఁడు బలి ప్రధానుం డచటన్
నానాభోగామోదవి, ధానమునకు నిలిపె నతని త్రైవిక్రముఁడున్. ౧౦౭

క॥ పురుహూతాదులఁ బాయుచు, నిరవుగ శ్రీలక్ష్మి యతనియింట వసించెన్
హరి తత్పూజితుఁడగుచున్, గరిమంబున ద్వారసీమఁ గావలియుండున్. ౧౦౮

సీ॥ సర్వేశ్వరుండగు శౌరికి భూదాన, మిచ్చిన ఫలము సమాహితముగ
భువనాధిపత్యంబుఁ బొంది వైరోచని, సర్వార్థసిద్ధుఁడై జయమునొందె
భగవంతునకునిచ్చు ఫలమురిత్తగు నొక్కొ, పురుషార్థములు నాల్గుఁ బొసఁగఁజేయు
నచ్యుతునామంబు లవళంబుగానైనఁ, దలఁచిన కర్మబంధములు వీడు

గీ॥ సాంఖ్యయోగాది సాధనసమితి వలన, నాజవంజవ బంధంబు లడఁగ వట్లు
యతులు భజియింతు రెవ్వాని నాత్మలందు, నట్టి వానికి వితరణం బల్పమగునె.

వ॥ అవ్విరోచన పుత్రుండగు బలి సర్వక్లేశాదిహంత యగు వామను భగవంతుంగా నెఱింగి "మూఢుం డగు నింద్రునకు సంపల్లాభం బొనర్చు మిషంబున నన్ను భవబంధంబులు వీడ వరుణపాశంబుల బంధించి పుడమి యెల్లం జేకొనుట మద్భాగ్యవశంబు గాదె? మత్పితామహుం డగు ప్రహ్లాదుండు భగవత్ప్రియుండయ్యును నన్నుంబోలి భగవద్బద్ధుండుగాఁడు, ధన్యుండ" నని నిరతంబు హరింబూజించుచు వర్తించుచున్నంత దిగ్విజయోత్సాహియై యతని జయింపంగోరి రావణుండు సుతలంబుపై దాడిఁ బెట్టిన భక్తానుగ్రహకారి యగుచుఁ దత్ప్రతీహారి యగు శౌరి పదాంగుష్ఠంబునఁ బ్రక్షేపం బొనర్చిన నయుతయోజనసహస్రం బెగసి చనియె. నిట్టి మహామహిమంబు లనుభవించుచు బలి సుఖం బుండు నని తెల్పి మఱియును.

సీ॥ అచ్చోటికిని గ్రింద నతివిపులంబు త,లాతలలోకం బలంకృతంబు
మయుఁడను దానవమండలేశ్వరుఁడందు, వసియించు నాతండు నామదేవుఁ
డలికాక్షమునఁ గాల్చినట్టి పురంబుల, యధికారియై రాజ్యమనుభవించు
మాయావులకు నెల్ల మాయావి రాక్షస, బలములకెల్లను బ్రభుత గలిగి

ఆ॥ సకలభోగములను సంసిద్ధుఁడై దేవ, దేవుఁడైన శంభు దివ్యకరుణ
నధివసించు నందు నచ్చటికిని గ్రింద,నగు మహాతలంబనా భువనము. ౧౧౧

క॥ కద్రూసంభవు లందు సు,పద్రవ మెద్దియును లేక బహుళ క్రోధో
న్నిద్రులయి విక్రమంబుల, కాద్రితెఁ గనఁజేతు రతితరంబగు శక్తిన్. ౧౧౨

సీ॥ కూహకుండును దక్షకుండు సుషేణుండుఁ, గాళియుండన నధిక ప్రశస్త
తము; లందు నెల్లరు దర్పదోర్దర్పాది, క్రూరగుణంబులఁగను నెలవులు
బహుశిరస్కులు నేకఫణులు ద్వివక్త్రులుఁ, ద్రిచతుర్ముఖులు పెక్కు తెఱఁగువారు
నాండురిబిడ్డలు చెలులాప్తులుఁ బరివార,మలమఁ గుటుంబ హర్షాస్పదు లయి

గీ॥ నిఖిలసంక్రీడనంబుల నిలిచి మత్త,తనువులై విహరింతురు తాపసేంద్ర!
యచ్చటికి గ్రిందను రసాతలాహ్వయంబు,కలదు భువనంబు నిఖిలభోగముల తావు

సీ॥ అందు హిరణ్యాఖ్యమగు నగరంబునఁ, గాలకేయనివాతకవచు లనఁగఁ
దిరిదళవరిజంబుచేఁ దెమలని వీరులై,యతిసాహసంబులు నధిక కాయ
ములు గల్గి బంధులు ముదితలు సుతులును, బహుపరివారముల్ బలసి కొలువ
బిలశాయులంబోలి పృథుధరాగర్భంబు,లందుల వసియించి యమరవరుల

గీ॥ మాయలనుమంత్రములభుజామహితశక్తి, నతిశయించుచు నచ్చోటనలరుచుండు
రచ్చటికిఁ గ్రిందఁ బాతాళమహికులేంద్రు,లందు వాసుకిముఖు లుందురవనినాథ.

వ॥ మఱియును శంఖుండును, గుళికుండును, శ్వేతుండును, ధనంజయుండును, మహా
శంఖుండును, ధృతరాష్ట్రుండును, శంఖచూడుండును, గంబళుండును, నశ్వతరుం
డును, బరాంతకుండును లోనుగాఁగల భుజంగవల్లభులు మహాభోగులు, పంచ
మస్తకులు, ఫణసప్తకులును, దశఫణులును, శతశీర్షులు, సహస్రశిరస్కులు, శిరో
మణిధరులునై, తదంధరింబున స్వప్రభలచేఁ దిమిరంబు నిరాకరించుచు సదా
సంజాతక్రోధు లయి వర్తింతు రబ్బువనమూలంబునఁ ద్రింశత్సహస్రయోజన
పరిసంఖ్యాతంబై తామసి యను భగవత్కళ యహంకారరూపంబై యచ్చోట
నధివసించు, సంకర్షణనామంబున భగవత్సాత్వతీయం బగు తేజంబు సహస్ర
శిరంబుల భూమండలంబు భరియింపుచు ననంతుండును శేషుండు నను నామంబుల
సర్వంబును *సిద్ధార్థంబు వడువున భరియించు మఱియు సంవర్తంబున సంజిహీర్షం
బొడమిన యేకాదశరుద్ర వ్యూహమ్ముచేఁ బరివృతుండై సంకర్షణుండను రుద్రుండు
శూలంబు కేల నలవరించి మహాసత్వసంపన్నుండై యచ్చోట నధివసించు నమ్మ
హానుభావుని మణిబంధంబులఁ బదతలంబుల భూషణరూపంబులై పన్నగ రాజులు
చెలంగుచు నేకాంతభక్తియోగంబున నమస్కరించుచు నతని సమ్ముఖంబున
నిలుతురు, శేషపుత్రిక లగు ననేకనాగకన్యాసహస్రంబులు సుందరులై చంద
నాగరుగంధలేపనంబుల నలంకృతలై తదభిమర్శకాలంబున స్మితంబు లొన
ర్చుచు సవ్రీడాలోకనంబులఁ దిలకించి యనురాగమదోన్మత్తవిఘూర్ణారుణ
లోచనుండును, గృపామయుండును నగు సంకర్షణరుద్రుం గొలుతు రతండు
భగవంతుం డని యెఱుంగుము. ౨౧౫

---

టిప్పణి: సిద్ధార్థంబు = ఆవగింజ

సీ॥ అతఁడు మహాసత్త్వుఁ డతుల మహాశయుం, డధికగుణాంభోధి యాదిదేవుఁ
డమరులు సిద్ధులు నసురులు మునులును, గంధర్వు లురగులు గరుడవరులు
గొలిచియుందురు వారిఁ గూర్మిచే లాలించి, వైజయంతి ధరించి వక్షమునను
తులసీదళంబులతోరముల్ మెఱయంగ, నసితాంబరముఁ గట్టి హాలముఁబట్టి

గీ॥ యేకమండలుఁడై సాత్త్వతేద్యుఁడగుచుఁ, జెలఁగు నద్దేవు మహిమంబు సృష్టికర్త
నలువసభ నారదుండు వీణానినాద, మేదురుం డయి సభికుల మెచ్చఁజేయు. ౨౧౬

ఉ॥ ఏ మహితానుభావుని సమీహితదివ్యవిలాసదర్శన
*ప్రేమ బుధుల్ సదా సదసదీడ్య మటంచుఁ గనంగ లేక శం
కామిళనంబు నొందుదు రఖండమనస్కతనట్టి దేవు స
న్నామము సంస్మరించిన యనంతసుఖం బగుఁ గాదె? యేరికిన్. ౨౧౭

క॥ పతితుం డార్తుఁడు శఠుఁ డుద్ధతుఁడున్ దన్నామపఠనతత్పరుఁ డేనిన్
వితతపద మొందుఁ బన్నగపతి కన్న ముముక్షులకు నుపాస్యుం డెవఁడో. ౨౧౮

చ॥ శిరమున భూమిగోళమును శీర్ణత నొందఁగనీక నిమ్నగా
గిరిసరిదీశ్వరాటవులఁ గేతనముం బలెఁ దాల్చునట్టి య
య్యురగకు లేంద్రు విక్రమపు నోజ గణింపఁ దరంబె? పంకజో
దరునకు నైనఁ; దద్భజన దప్పునె? సత్ఫలదంబు గాకిలన్. ౨౧౯

గీ॥ అట్టి మహిమానుభావుఁ డనంతమూర్తి, వసుమతీమూలమున నాత్మవశత నిలిచి
సర్వభారకుఁడై యుండు సంయమీంద్ర!, తేటపఱిచితి నీ విట్లు తెలియవలయు.

ఉ॥ ఎన్నియొ భేదభేదముగ నే వచియించితి భోగభూము ల
య్యన్నియుఁ బ్రాణికర్మగతు లాత్మ నెఱుంగుము చిత్తశుద్ధిచే
వెన్నుని యాజ్ఞ కర్మఫలవేదులు తత్ఫలసిద్ధి సేతు రా
పన్నుల; కింత తథ్యమని పట్టుము దేవమునీ! నిజంబుగన్. ౨౨౦

ఉ॥ చేతనకోటి పుణ్యరతిఁ జేయును గర్మవశమ్మునన్ సుఖో
ద్భూతి యొసంగుఁ బుణ్యగతి భోగము సర్వముఁ దెల్పితిన్ గతి
వ్రాతము లెంతవట్టు శ్రుతివర్ణిత ధర్మవశమ్ము లంచు ని
ష్ణాతులు పల్కుపద్ధతి ప్రసంగవశమ్మున నీకుఁ దెల్పితిన్. ౨౨౧

క॥ తెలియఁగల యర్థమెల్లను, దెలిపితి నీకింక నెద్ది తెలియఁగవలయున్
దెలియంగ నడుగు మంతయుఁ, దెలిపెద నని పల్కె మౌని తెల్లముగాఁగన్.

*టిప్పణి, ప్రేమ...సదీడ్య - ఇయ్యెడ విశ్రమము చింత్యము, సహృదయులు పరికింతురుగాక.
౨౨౦-౨౨౧ సంఖ్యలుగల పద్యములకు సమన్వయము విజ్ఞులు విచారింతురు గాక!

క॥ స్వామీ! భగవత్కృతమౌ, నీ ముజ్జగమందుఁ గర్మ ♦ యేకంబగుఁ ద
త్సామాన్యంబున నొక తెఱఁ, గేమిట లేదయ్యె భేద ♦ మెటులయ్యెనన౯. ౨౪

సీ॥ కర్మతత్పరతచేఁ ♦ గర్తలాత్మీయమౌ, శ్రద్ధావశమ్మున ♦ సంతరించి
యుత్తమమధ్యాధ♦మోద్దేశముల నొప్పి, గతులు చెందుదు రాత్మ♦కర్మవశత
సత్త్వరజస్తమస్సంయుక్తిఁ దచ్ఛ్రద్ధ, త్రివిధమైయుండు నా♦తెఱఁగు వినుము
సాత్త్విక శ్రద్ధచే ♦ సౌఖ్యంబు లభియించు, రాజసతామస♦యోజనమున

ఆ॥ శ్రద్ధ దుఃఖమౌ ధ్రువ♦సంభవం బొనరించు, భోగమెల్ల వేఱు ♦ పొసఁగుఁగాన
గతులు తారతమ్య ♦ గతిఁ బ్రవర్తించు న,నాద్యవిద్య కారణాతిశయత. ౨౫

వ॥ అది గావునఁ బుణ్యగతులు వేర్వేఱ వర్ణించితి. మఱియు దుర్గతులం దెల్పెద, త్రిజగదంతరాళంబున దక్షిణ దిఙ్మూలంబున నతలంబున కుపరిభాగంబున నగ్నిష్వాత్తాదులగు పితృగణంబులు స్వస్వగోత్రగణంబులతోఁ గొలువుఁ దీర్చి ప్రేత రాజన్యుండు స్వకింకరులచే ధర్మాధర్మ ప్రవర్తకులగు జీవుల నాతివాహిక దేహంబులఁ బట్టి తెప్పించి భగవదాజ్ఞాధారకుండు గావున వారల కర్మశ్రద్ధాభేదంబు లరసి ధర్మిష్ఠు లగు వారిని సద్గతులకుం బనిచి, తదితరుల నిరయంబులం బ్రవేశింపం జేయు, నవి యేకవింశతి సంఖ్యాకంబు లనియు, నష్టావింశతిమితంబు లనియుఁ బలుకుదురు. తామిస్రంబును, నంధతామిస్రంబును, రౌరవంబును, మహారౌరవంబును, గుంభీపాకంబును, గాలసూత్రంబును, నసిపత్రారణ్యంబును, సూకరముఖంబును, నంధకూపంబును, గ్రిమిభోజనంబును, దప్తమూర్తియు, వజ్రకంటకంబును, శాల్మలియు, వైతరణియుఁ, బూయోదంబును, బ్రాణరోధంబును, విశసనంబును, లాలాభక్షణంబును, సారమేయాదనంబును, నవీచియు, నయ్యయంబును, క్షారకర్దమంబును, రక్షోగణంబును, శూలప్రోతంబును, దందశూకంబును, వటారోధంబును, బర్యావర్తనంబును, సూచీముఖంబును, నను నష్టావింశతి నరకంబులు పాతకులకు యాతనాభోగభూములై వర్తించు నని దెల్పిన నారాయణమహామునిం గని నారదుం డిట్లనియె. ౨౬

గీ॥ యాతనాప్రాప్తభూములై ♦ భూతకోటి, దండితులఁ జేయు కర్మ భేదంబులెన్ని
వినఁగఁ గోరితి నవి దెల్పు♦వే మహాత్మ!, యనిన నారాయణస్వామి♦యనియె మునికి.

క॥ పరదారాపత్యంబులఁ, బరధనముల నపహరించు ♦ పాపుల యమకిం
కరవరులు కాలపాశో, త్కరముల బంధించి యీడ్చి ♦ తామిస్రములో౯. ౨౭

ఉ॥ దండన తాడనంబులను ♦ దర్జన భర్జన గర్జనంబుల౯
బెండుపడంగఁ జేయ మదిఁ ♦ బెల్కురి మూర్ఛల మునిమునిఁ యెం

డొండ దురంత వేదనల నోరువఁజాలక పాపతప్తులై
యుండుదు రాత్మకర్మకృత మొయ్యన లోనఁ దలంచి యేడ్చుచున్. ౩౨౯

క॥ తనయాలి మొఱఁగి యన్యుని, వనితన్ భోగించు దుష్టవర్తను యామ్యుల్
గొని యంధతమిస్రములోఁ జొనుపుచు దండింతు రర్కసుతు నానతిచేన్. ౩౩౦

ఆ॥ నష్టదృష్టు లగుచు నష్టబుద్ధులు నౌచు, మూలభేదనమునఁ గూలుతరువు
లట్ల యాత్మపాతకావళిఁ దలఁచుచు, నడలుచుందు రం దహర్నిశంబు. ౩౩౧

క॥ నా యొనరించినకతమున, నాయది యని కర్మవర్తనంబుల జడులై
చేయుదురు సంసృతిని నెవ, రాయతగుణ! యందుఁ జేర నర్హులు వారల్. ౩౩౨

క॥ రౌరవ మను నరకంబున, ఘోరంబగు యాతనలను గుందుచు భయదు
ర్వారత నడ రెడుచేతన, వారము లొనరించు కలుషవర్తన వినుమీ. ౩౩౩

మ॥ ఇహలోకంబున జంతుకూటముల నెంతే దేనిన్ మిమన్ గొల్పి య
న్వహమున్ రూపఱఁ జేతు రట్టి జనులన్ దజ్జంతువుల్ సాధ్వసా
వహతన్ రౌరవమూర్తులన్ గొని కడున్ బాధింతురన్ దానిపే
రహహా! రౌరవమయ్యె నందు రుధిరాస్వాదంబు సేయున్ రురుల్. ౩౩౪

క॥ రురునామక మగు జంతూ,త్కర మచ్చట నిలిచి వారి దండించుటచేఁ
గర మొప్పు రౌరవం బని, పిరచింతురు తత్పురాణవేదులు పుడమిన్. ౩౩౫

క॥ పాయక రంధ్రాన్వేషణఁ, జేయుచుఁ బరహింసనంబు చిత్తములందున్
బాయని పాపుల తనువులఁ, జేయుదు రవటములఁ జికిలి చేసినయసురుల్. ౩౩౬

సీ॥ క్షుత్పిపాసలచేత శోకింపఁగాఁ జేసి, తప్తోదకంబులఁ దడిపి తనువు
లుడుకు తైలంబుల నుడికించి పరహింసఁ, జేసెడు దురితాత్ముఁ జిక్కఁబట్టి
భయదకుంభీపాక పతితునిగాఁ జేసి, దండఘాతంబులఁ దనువు లడిచి
వేధింతురు స్వార్థవిహితంబుగాఁ బశు,హననంబొనర్చిన యట్టి పాపిఁ

తే॥ గీ॥ బట్టి యప్పశుతనురోమపటలసంఖ్య, యంతయగునన్ని వేలేండ్లు వంతగించి
వైతు రసిపత్రివనములో వారివెతలు, దెలుప శక్యంబె? వేనోళ్లు గలిగియున్న

గీ॥ కశల మర్దించి యిటునటుఁ గట్టి యీడ్చి, కరికచములఁ గోసి కర్మానుగతమటంచుఁ
జెప్పియసిపత్రములవై చి చిదిమిమూర్ఛ, మునుఁగఁ జేయుచునుందురు మునివరేణ్య!

ఆ॥ రాజవరులుగాని రాజపూరుషులేని, నిరపరాధు శిక్ష నెఱపిరేని
సాపరాధు ద్విజుని నట్ల సలిపిరేని, సూకరాస్యమందుఁ జొత్తు రనఘ!

వ॥ అందు యమకింకరులు వారల యవయవంబులు పిష్టసదృశంబులుగా నొనర్చి మర్దింప నార్తరవంబులఁ బలవించుచు మూర్ఛితులై యనేకకాలంబు పీడ్యమానులగుదురు. మఱియును వివిక్తదేశంబులఁ ద్రోవ లడ్డగించి యీశ్వరకృత రక్షణంబులగు భూతకోటులఁ బీడించి వేధించువార లంధకూపంబునఁ బడి క్రూరంబు లగు పశు మృగ పక్షి సరీసృప మశక యూక మత్కుణ మక్షికా దందశూకాదులచేఁ బీడితులై వేధింపంబడుదురు. పంచయజ్ఞంబు లొనర్పక యత్కించిద్భక్షణం బొనర్చిన పాపపురుషులు క్రిమిభోజనంబునను నిరయంబుననుం బడి లక్షయోజన విస్తీర్ణం బగు భయంకరక్రిమికుండంబునఁ బొరలుచు దుష్కర్మవశంబున యమకింకరులచే బాధింపంబడుదురు. చాపల్యంబున నుత్తమబ్రాహ్మణాధీనం బగు హిరణ్యరత్నాదికం బపహరించినఁ దప్తమూర్తి యను నిరయంబునం దగ్నిసదృశంబు లగు నయోగోళంబులఁ గాల్పంబడుదురు; పురుషుం డేనియు, నాఁడేనియు నగమ్యాగమనంబు లొనర్చిన శాల్మలీనిరయంబునం బడి తప్తస్తంభంబుల నాలింగనం బొనర్చుచుఁ దప్తసూచికలఁ గ్రుచ్చంబడుచుఁ బీడ్యమానులగుచు నుందురు. ౨౮౦

సీ॥ రాజన్యు లగువారు రక్తిచే శ్రుతియుక్త, ధర్మంబు లెఱుఁగక తప్పుత్రోవ
నడువ వైతరణి యన్ నదిలోనఁ బడుదు ర,య్యది వహ్నిమయ మనివిదితమయ్యె
యాదోగణం బెల్ల నాత్మదంష్ట్రలచేతఁ, దనువు భక్షింపఁగ దరికిఁ జేరఁ
జాలక పొరలుచు స్వస్వకర్మవశమ్ము, ఫలభోగ మిది యని పదరికొనుచు

ఆ॥ నందుఁ బొరలువెట్టి యపహరహంబును యామ్య, భటులచేతఁ గొట్టఁబడుదు రంత
వేదనాభరంబు వెనుతీక తము ముంప, నలఁతనొందువార లహర్నిశంబు. ౨౮౧

సీ॥ బ్రాహ్మణుండై యుండి పశుబుద్ధియై శ్వాన,గర్దభాదులఁ బెంచి కడుపుకొఱకు
భక్షించరానివి భక్షించి శూద్రితో, భోగించి శౌచంబు బూదిఁ గలిపి
వర్తించువాఁడు దుర్వాసనావిణ్మూత్ర, రక్తపంకిలగర్తరాజిలోనఁ
బడి మున్గి పీడలఁ బడుచుండు వానికి, నలువ లాలాభక్షణంబు నెలవు

తే॥ గాఁగ నిర్మించె క్షేత్రతీర్థాదికముల, వేఁటలాడుచు మృగపక్షివేధ సేయు
వారలును యమకింకరవశ్యు లగుచు, నిరయభేదంబులందున నిలుచువారు.

ఆ॥ సభలఁ జేరుగాఁగ సవనమిషంబునఁ, బశువుఁ బట్టినట్టిపాతకులను
యామ్యభటులు వైశసాంతరంబున వైచి, కశల నడిచి త్రొక్కిఁ గట్టుచుండ్రు.

క॥ కులసతిని మోహవశమునఁ,గలయుచు రేతంబు గుడుపుకతమున వారిన్
దలపడి రేతఃకుండం,బుల వైతురు యామ్యభటులు పోనీక నృపా. ౨౮౨

ఉ॥ దొంగల నగ్నిదాహగరదుల్ మొదలైన దురాత్ముర్లం గడుం
భంగ మొనర్చి కీడ్పఱచి ౯ పట్టి వధింపని రాజవర్యులం
బొంగుచు యామ్యకింకరులు ౯ పోవఁగనీక పెనంగి పట్టి దు
స్సంగతి శ్వానఖాదనవిశంకటదుర్గతిఁ జేర్తు రెంతయుం ౨౮౫

వ॥ అన్నరకఁబున వింశత్యుత్తరసప్తశతసంఖ్యాకంబు లగు శునకంబులు బాధకంబులై యుండును, మఱియు నవీచిపరిముఖంబుల నెఱిఁగింతు వినుము. ౨౮౬

సీ॥ సాక్షివాదముల నసత్యముల్ పలుకుచు, వితరణవ్యత్యాసవిధులు సలిపి
యప్పు లిచ్చినవారి ౯ నటమటించుచుఁ దాను, నొకరి కీక ఋణంబులోనఁగిలి నని
పాపబుద్ధుల నిట్లు ౯ పలుకు పేరితలఁ బట్టి, శతయోజనసం బగు ౯ శైలశృంగ
మెక్కించి పడఁద్రోతురిదియ వీచియటంచు, నుడువుదురా నరుఁడడవిఁ బడుచు

తే॥ తిలసదృశఖండదేహియై తెగిపడఁబడిన, వానిఁ బోవుగ నొనరించిపూనియటుల
క్రిందఁబడఁద్రోచి మీఁద నెక్కించియిటుల, సేయుచుందురుయమభటుల్ చెప్ప నేల.

గీ॥ బ్రాహ్మణక్షత్రివైశ్యశూద్రకులలోన, నెవ్వఁడేనియు సురఁద్రావి ౯ యెలమిసోమ
యాజిదారను జెకొన్న ౯ నతని కొండ, చఱియఁ బడఁ ద్రోతు రతిపాతసంజ్ఞక మది.

ఆ॥ పోవనీక వానిఁ ౯ బొదివి కింకరకోటి, కంచు కరఁగి నోట ౯ నించుచుందు
కల్లు ద్రావునోటఁ ౯ గంచు ద్రావుమటంచు, నెత్తిపొడుచుచుందు రెత్తిపొడిచి.

సీ॥ విద్దెలవయసున ౯ విమలకర్మంబుల, నొనరెడు వారల ౯ నోర్వలేక
నిరసించువారల ౯ నిష్ఠురోక్తులు వల్కి, యమభటుల్ క్షారకర్దమ మనంగ
బెడిదమౌ దుర్గతిఁ ౯ బడఁద్రోచి తలక్రిందు,గాఁ గొట్టి చాలసంకటములందు
నిడుములఁ బడఁజేసి ౯ యేడ్పింతురి నరమేధ, మోహితులై జన్నములనొనర్చి

తే॥ కపటమార్గంబులనటించుచపలజనుల, నందుఁబడఁద్రోయ రుధిరంబులానికొనుచు
వెడలనీకున్న నేప్పుచు ౯ విసివికొనుచుఁ, దల్లడింతురు క్షారకర్దమములోన.

క॥ విశ్వాసఘాతుకజనుల, శశ్వద్గతిశూలసూత్రసాధనములచే
శాశ్వతయాతనలను గం,శశ్వసనము లాడనీ కడంతురు యామ్యుల్. ౨౯౦

క॥ శూలముల గ్రుచ్చ నాఁకట, సోలుచుఁ గంకములు గొఱుక ౯ సుడివడి యచ్చో
నాలంబ మెద్ది లేకే, జాలింబడి యామ్యపీడ ౯ సైఁపరు వారల్. ౨౯౧

మ॥ అపరాధంబు లొనర్చునట్టి జనులం ౯ హర్షంబుచే మత్తులై
నెపముల్ చెప్పుచు గీడుసేయు జనులం ౯ నిర్ఘాతపాతంబులం

గృప యొక్కింతయు లేక మొత్తెద రొగ్గి । గీనాశభృత్యుల్ కఠుర్
విపరీతంబుగ దండశూకముల నాగవేశింపఁగాఁ జేయుచుర్. ౨౫౩

సీ॥ కాకులఁ గఱపించి । కసరు బెబ్బులులచేఁ, గఱపించి భుజములు । గట్టి త్రొక్కిచి
పాములఁ బడవైచి । పటుపాశములను గం,ఠావరోధ మొనర్చి । యగ్నివైచి
పొగలయుక్కలఁ బెట్టి । పొరలించుచుందురు, సమయాతిథులఁ జూచి । చండకోపు
లగు గృహస్థులఁ గట్టి । యత్తులు పెకలించి, వజ్రతుండములైన వాయసములుఁ

తే॥ గంకగృధ్రాదులును దినఁగా నొనర్చి, శూలముఖ మను దుర్గతిఁ గూలఁ ద్రోచి
పీడఁ బెట్టిన నొల్లండి । భీతు లగుచుఁ, బొరలుచుందురు కింకరప్రోత్థితులయి. ౨౫౪

వ॥ మునీంద్రా, యిట్టినిరయంబులు బహువిధంబులు, నొక్కొక్కనరకంబున యాతనాస్థానంబులు పెక్కు గలవు. దిక్ప్రదర్శనం బొనరించితి. సుఖాధికంబులగు ధర్మలోకంబులు పెక్కు గలవు. ఒక్కొక్క లోకంబునఁ బెక్కు భోగభూములు గలవు. ధర్మాధర్మంబులు బ్రహ్మాండంబున సుఖదుఃఖభేదంబుల భోగంబు లొసంగుచుండు. సంసారపారావారంబునకు నుద్ధారకం బగు దేవీపూజనంబు నరులకు సుఖానుఖభయంబు లంటనీక పారంబుఁ జేర్పంగలయది. తదితరం బెద్దియు జీవసంతారకంబు గాదనిన, జనమేజయా! నారాయణమునిం గాంచి నారదుం డిట్లనియె. ౨౫౫

సీ॥ దేవి నారాధించు । తెఱఁ గెట్టిదో? దేవి, సంపూజనం బెట్టిచంద మగునొ?
యెట్టులఁ బూజింప । నెట్టుల భజియింప, దుర్గమదుర్గతుల్ । దూలఁ బుచ్చి
భూతపాళులఁ బ్రోచు భువనేశ్వరి కృపాప్తి, నమ్మార్గ మెఱిఁగింపు । మన్న వినుచు
నారదుఁ గనుఁగొని । నారాయణస్వామి, యేకాగ్రచిత్తత । నెఱిఁగికొనుము

తే॥ దేవిఁ బూజించు తెఱఁగెల్ల దెలియఁ జేతుఁ, దాదృశములైన ధర్మభేదముల నెఱిఁగి
జీవితేశ్వరి నర్చనల్ । సేయవలయుఁ, దత్కటాక్షంబు నరకసంతారకంబు. ౨౫౬

వ॥ మునీంద్రా! శారీరమానసంబులలో మానసం బుత్తమంబ యట్లయ్యును గ్రియాసిద్ధికి నావటంబులగు పరికరంబులు గలిగినవాఁడు భావశుద్ధి నొందితి నని తూష్ణీంభావంబున నుండుట నా మదికి మెప్పొనరింపనేరదు. యథావద్విహితంబుగా బాహ్యపూజలం దేవి నారాధింపవలయు నది మానసంబు ననుసంధించుఁ బ్రతిపత్తిథియందు బ్రాహ్మణునకు ఘృతదానం బొనర్చి సర్పిర్ద్రవ్యంబున దేవి నారాధించిన రోగహీనుండగు, నట్టుల శర్కరచేఁ గావించిన ద్వితీయ దీర్ఘాయుష్ప్రద యగుఁ; దృతీయ దుగ్ధపూజచే దుఃఖంబు లణంచుఁ, జతుర్థి యపూపపూజచే విఘ్నవిచ్ఛిత్తి యొనర్చుఁ, బంచమినిఁ గదళీఫలనివేదనం బొనర్చి తద్దానంబు సల్పిన మేధావంతుండగు, షష్ఠినాఁడు మధుపూజనం బొనరించి తద్దానం బొనర్పఁ దేజోవంతుండగు,

సప్తమిని గుడనివేదనం బొనర్చి విప్రునకుఁ దద్దానంబు సేయ శోకహీనుండగు, నష్టమిని దేవికి నారికేళం బర్పించి తద్దానంబున బ్రాహ్మణుం దృప్తుంజేయఁ బరితాపంబు లడంగు, నవమీతిథిని దేవికి లాజ లర్పించి తద్దానంబు ద్విజున కొసర్ప నిహపరంబుల సుఖించు, దశమిని నల్లనువ్వులఁ దేవి నారాధించి యర్పించి బ్రాహ్మణునకు దానంబొనర్ప యమభయం బంట, దేకాదశిని దేవికిం బెరుఁగర్పించి తద్దానంబున విప్రు నలరించిన దేవికినిష్టుండగు, ద్వాదశినటుకులు సమర్పించి దేవిం బూజించి తద్దానంబు విప్రున కిడ దేవీకటాక్షంబు నిండారు, త్రయోదశిని దుర్గకుఁ జణకంబు లర్పించి విప్రునకుఁ దద్దానం బొసంగిన సంతానంబు వృద్ధింజెందుఁ జతుర్దశిని మహాదేవికి సక్తుసమర్పణం బొనర్చి తద్దానంబున విప్రునకు సంతసంబు గూర్చిన శివానుగ్రహంబు గలుగు; పూర్ణిమను బాయసం బర్పించి పాయసదానం బొనర్చినఁ బితృదేవతల నుత్తమలోకంబుల కనుపుఁ దత్తిథులచే హోమంబు లొనర్చిన నరిష్టంబు లెల్ల నశించు; నివేదితంబు తారు భుజించి వేఱువేఱ వస్తుదానంబు లొనర్పవలయు, భానుప్రభృతివారంబులఁ బరమాన్న పయః కదళీఫల నవనీత శర్కరా సితశర్కరా గోఘృతంబులు సమర్పింప వలయు. సప్తవింశతి నక్షత్రంబుల ఘృత తిల శర్కరా దధి దుగ్ధ సితామృత దధ్యోదన మోదక ఫేణక ఘృతమండ గుడ పృథుక ద్రాక్షా ఖర్జూర రాజకాపూప నవనీత ముద్గాన్న కంసార వటపత్రఘృత ఫేణక వటక కోక రసక సూరణ మధుసూరణ మాతులుంగంబులు నివేదింపవలయు; విష్కంభాదియోగంబుల గుడ మధు ఘృత దుగ్ధ దధి తక్రాపూప నవనీత కర్కటీ కూశ్మాండ మోదక పనసకదళీ జంబూ ఫలామ్రఫల నారంగ దాడిమ బదరీ ధాత్రీఫల పాయస పృథుక చణక నారికేళ జంబీరఫల కశేరు సూరణంబులు క్రమంబున నర్పింపవలయుఁ, గరణంబులఁ గంసార మాడక ఫేణక మోదక వటపత్రి లడ్డుక ఘృతపూర తిల దధి ఘృత మధువు లర్పింప వలయు నని చెప్పి మఱియును. ౨౫౭

సీ॥ మఱియు నొక్కటి దేవి ♦ మహిమంబుఁ దెల్పెద, వినుము దేవమునీంద్ర ♦ విశదముగను
చైత్రశుద్ధ తృతీయ ♦ సద్భక్తిచేఁ బంచ, ఖాద్యముల్ కల్పించి ♦ హృద్యములగు
నైవేద్యములు దెచ్చి ♦ దేవి నావాహించి, మధుక వృక్షమున సం ♦ భావితముగఁ
బూజించి యుపహార ♦ భాజనంబులు చెంత, నిల్పి నివేదించి ♦ నియతుఁ డగుచుఁ

తే॥ గీ॥ దత్ప్రసాదంబు భుజియించు ♦ ధన్యునకును, నైహికాముష్మికముల సర్వమ ♦ ప్రసిద్ధు
లలరు నీదృశభక్తులు ♦ గలరు దేవి, దనియునంత సపర్యలఁ ♦ దనుపువారు. ౨౫౮

క॥ పదిరెండవ సితపక్షువుఁ, దదియల భువనేశిఁ బూన్చు ♦ ధన్యునకు సుఖ
ప్రదమై మోక్షప్రదమై, యుదితోత్సాహమున నతని ♦ యొద్ద నటించుఁ.

టిప్పణి: ౨౫౭ వ సంఖ్యగల వచనములోని నైవేద్యపదార్థములు నేటి మూలమునకు సరిపడవు.

వ॥ మఱియుఁ జైత్రమాస శుక్లతృతీయయందు శ్రీదేవిని మధూకవృక్షమం దావ హింపఁజేసి పంచఖాద్యనైవేద్యం బర్పించి పూజింపవలయు. ౯౭౦

సీ॥ వైశాఖమున గుడార్పణము జ్యేష్ఠంబున, క్షౌద్రి మాషాఢమాసమున వెన్న శ్రావణంబునఁ గండచక్కెర భాద్రపదమున నొప్పగు పంచదార యిడఁగ నాశ్వయుజంబున నగుఁ బాయసం బీయఁ, గార్తికంబునను దుగ్ధములు లెస్స మార్గశీర్షంబున మధురఫేణంబులు, దధి కూర్చి పుష్యమందమర నొప్పు

తే॥ మాఘమున గోఘృతంబు సమాహితంబు, నారికేళంబులగు ఫాల్గునంబు నందు మధుకవృక్షాత్మయగుమహామాయనిట్టు,లర్చనము సేయఁగొఱఁత లెందైనఁగలవె?

వ॥ ఇత్తెఱంగునఁ దత్తన్మాసంబులఁ దృతీయలయందు మంగళయు, వైష్ణవియు, మాయయుఁ, గాళరాత్రియు, దురాసదయు, మహామాయయు, మాతంగియుఁ, గాళియు,గమలవాసినియు,శివయు,సహస్రచరణయు,సర్వమంగళయు,నను ద్వాదశ నామంబుల మధూకంబున దేవింబూజించిసర్వకామసమృద్ధంబుగా, వ్రతపూర్ణత్వ సిద్ధియగునట్లుగా, మధూకస్థయగు మహేశ్వరిని, బుష్కరనేత్రి, జగద్ధాత్రి, మహేశ్వరి, మహాదేవి, మహామంగళమూర్తి, పరమాయాపహంత్రి, పరమార్గప్రదాయిని, పరేశ్వరి, పరబ్రహ్మస్వరూపిణి, మదదాత్రి, మదోన్మత్త, మానగమ్య, మహోన్నత, మనస్విని,మునిధ్యేయ,మార్తాండసహచారిణి,ప్రళయాంబుదసన్నిభ, సురాసురపూజిత, యమపూజ్య, యమనిగ్రహరూప, యజనీయ, సర్వేశి, సంగవివర్జిత, సంగవినాశకరి, కామరూప, కారుణ్యవిగ్రహాకార, కంకాళి, కామాక్షి, మీనాక్షి, మర్మభేదిని, మధుర, శివ, మంత్రవతి, మంత్రప్రియ, మనుష్యమానసగమ్య, మన్మథారిప్రియంకరి, అశ్వత్థవటనింబామ్లకపిత్థబదరీగత, దయనీయ, దధిప్రియ, సర్వజ్ఞవల్లభ, యను నామమ్ములు స్మరించి పూజానంతరంబున నుతింపవలయు.

సీ॥ నరుఁడెవ్వఁడేని యిన్నామస్తవ మొనర్ప, వ్యాధులఁ నాధుల నపనయించి మాయ నిర్జించు గోమార్జింపుచును సర్వతఃపరమార్థతత్పరతఁ గాంచి మోక్షార్థియగునేని ముక్తి సంపదగాంచు, ద్విజుఁడు వేదంబు క్షత్రియుడు శక్తి నూరుజాతుఁడు సిరినొంగి శూద్రుఁడుసుఖంబు, గాంచునెవ్వఁడుశ్రాద్ధకాలమునను

తే॥ జదువు నిద్దాని దాన నక్షయఫలంబు, భక్తిఁదగసల్పి పూజించు భక్తులకును జెందరాని ఫలంబు లేదెందుఁగాని,మధుకవృక్షస్థయా దేవిమహిమ వింటె. ౯౭౩

గీ॥ ప్రకృతి వందన వివరణ ప్రతిభ లేని, నరుని విజ్ఞాన మాంత రానంద మీదు ముక్తిదాయకమైన యున్మోక్షవిద్య, తెలియ వివరింతు వినుమునసందియము లేక,

వ॥ అని యిత్తెఱంగున నారాయణుండు, నారదునకుం దెలిపిన వృత్తాంతంబు బాద రాయణుండు జనమేజయునకుం జెప్పె నని. ౨౬౫

శా॥ పారావారనివంగ, చంద్రికిరణప్రస్పర్ధిరోచిర్లతా
స్ఫారోపఘ్నవరాయతాంగ, మురభిచ్చక్రప్రదానానుకం
పారారజ్యదపాంగ, ఫాలనయనజ్వాలాహృతానంగ, యా
తారామీకృతకర్మచంగ, శివలింగా! యదిజాలింగనా! ౨౬౬

క॥ సత్త్వోల్లసిత హృదంతర, తత్త్వాతీతానుభావ తాపసవినుతా
ణుత్వాద్యష్టవిభూతిమ, హత్త్వాశ్రియధామ! తత్త్వసమర్థ విరామా. ౨౬౭

ఉపేంద్రవజ్రవృత్తము

చిరంతనోక్తి ప్రకటీకృత ప్రభా, కురంగ భూమీకృతహస్త శస్త్ర భా
పరంతపప్రాభవరుద్రయుక్సభా, నిరంతరాంభోజభవాండ తుందభా. ౨౬౮

క॥ దేవీభాగవతస్కంధావళి నష్టమము నచ్చనమాంబాజగ్గ
ధ్యానవరుల కభీష్టార్థ, శ్రీవెలయం జేసి సుప్రసిద్ధిఁ జేయుఁ. ౨౬౯

—• గద్య •—

ఇది శ్రీపరమ శివాద్వైత భావనా సాధ్య ములుగుసదన్వయ సిద్ధ
సారస్వత విద్యాసాన్నిధ్య వేమనారాధ్య వంశార్ణవ
కళానిధాన పాపయారాధ్యాభిధాన ప్రణీతంబైన
శ్రీ దేవీభాగవతం బను మహాపురా
ణంబునం దష్టమస్కంధంబు.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు
శ్రీ మహాగణాధిపతయే నమః
శ్రీ శా ర దాం బా యై న మః
శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము - శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## నవమస్కంధము





గిరివాస ప్రియమై
రాగాది ప్రస్తుతాభిరామము దేవీ
భాగవతంబునను నవమ
భాగము విజయ ప్రధానవాక్యం బలరున్.

క॥ శ్రీవిశ్వేశ్వర! సకల, స్థావరజంగమహృదబ్జసంచార! లస
జ్జీవనదాయక! దేవను,రావన! హిమశైలకన్యకార్ధాంగయుతా. ౧

వ॥ దేవా! సకలపురాణేతిహాసకథాసుధాస్వాదనని స్తంద్రు లగు నమ్మునిచంద్రు
లకుఁ దన్మనోరథ రథచోదనాసూతుం డగు సూతుం డిట్లనియె. ౨

ఉ॥ శ్రీలకు నాలవాల మవిశేషవిశేషన శేష శేషితా
మూల మకాలదేశగుణముద్రిత భద్రవినిద్రకాద్రిని
ర్వేలము నిత్యనిర్గుణనిరీషణనిర్మలనిష్ప్రపంచితా
వాల మమూలమూల మను వస్తువు మాకుఁ బ్రసన్నమయ్యెడిన్. ౪

వ॥ ఇట్లు సమజ్జనదుర్భవదురితలతాలావిని యగు పరదేవిని భజించి. ౫

క॥ నారాయణమునివాక్యసు,ధారసధారలను దోఁగి - తత్పరమతియై
నారదముని వినయావన,తారంజితుఁ డగుచుఁ బల్కెఁ - దాపసవరుతోన్. ౬

సీ॥ ప్రకృతిలక్షణ మెల్లఁ - బంచవిధం బని, పలికితి వది తేటఁ-పఱుపవలయు
గణనాథజనని దుర్గాదేవి, భార్గవి, బ్రహ్మాణి, సావిత్రి, - రాధ యనెడు
నామభేదము వింటి - నామూల మెద్దియు, విశదంబుగాదు హృ-ద్విదితఫణితి
నెద్దిమూలముగాఁగ - నిబ్భేదమయ్యెనో, పంచప్రకారమై - పరఁగు టెట్లొ!
తే॥ తచ్చరిత్రంబుఁ బూజావి-ధానగరిమ, తదవతారకథాగోష్ఠి - తాపసేంద్ర!
చిత్తసందేహ మెల్లను - జెదరిపాఱఁ, దెలుపవలె నన్న సమ్మని - తెలుపఁదొడఁగె.

ఆ॥ ప్రకృతి లక్షణంబు - పరికించి తెలుపంగఁ, గమలజునకునైనఁ - గాదు సుమ్మ
అట్టులయ్యు విశద - మైనట్టు దెల్పెద, ధర్మువలన విను ను-దంతమెల్ల. ౮

చ॥ ప్రకృతి యనంగ దేవి యని - పల్కఁబడున్ జగదాదిసృష్టికై
ప్రకృతి వహించుటన్ బ్రకృతి-భావముఁ దాల్చెఁ బ్రకృష్టవాచియై
ప్రకృతికి నాదివర్ణమును - బ్రస్ఫుటసృష్టికృత ప్రసిద్ధమై
ప్రకృతి పదంబు రంజిలె శు-భంకరమై శ్రుతిమార్గనిశ్చితిన్. ౯

గీ॥ ప్రథమవర్ణంబు సత్త్వమై - పరఁగె రాజ,సంబు రెండవయది తామ-సంబు శిష్ట
వర్ణమగును ద్రివర్ణమై - వఱలెఁబ్రకృతి, త్రిగుణరూపిణి యగుచు న-ద్దేవి తపసి!

మ॥ కలిగింపన్ బెనుపంగఁ ద్రుంపఁగ జగ-త్కల్యాణి యద్దేవి ని
శ్చలధారేయత నొప్పు నాత్మ మొదలన్ - సర్గక్రియాయోగకా
శలిఁ దా రెండు తెఱంగులయ్యె నొక యం-శంబయ్యె పుంరూప మ
ట్టులె శిష్టాంశము భాసిలెన్ బ్రకృతి యా-టోపంబునన్ గాంచఁగన్. ౧౧

గీ॥ దక్షిణార్ధంబు పురుషుండు - దక్షిణేత,రంబు ప్రకృతియు నాఁగఁ ద్వి-ప్రప్రకాశ
బ్రహ్మరూపత నుభయంబుఁ-బరిఢవిల్లె, నిత్యమును నిర్మలంబునై - నిగమ మెన్న.

క॥ అదిగావున యోగీంద్రులు, విదితస్త్రీపురుషభేద-విశ్రుతి లేదం
చుదితోల్లాసతఁ బల్కరి, సదసద్రూపము పరాత్మ - శాశ్వతమనుచున్.

ఆ॥ అనలునందు దాహ - మట్టుల నెల్లెడఁ, బ్రకృతి నెనసి యాత్మ - పరఁగునటుల
నాత్మనెనయుఁ బ్రకృతి - యాభేద మెవరికిఁ, దెలియ నలవిగాదు - దేవమౌని!

సీ॥ మూలప్రకృతి నాఁగ - మొదలి తత్త్వంబిది, జగముల సృజియించు-జన్మపదము
తచ్ఛాసనంబునఁ-దదభిన్నమై యొప్పెఁ, బ్రకృతిపంచకము దు-ర్వారగరిమ

సృష్టికర్మ విభేద శిక్షణానుగ్రహ, తత్పరం బిది సుమ్ము తాపసేంద్ర!
గణనాథజనని దుర్గాదేవి శివరూప, శివవల్లభయు నొప్పుచుం జెలంగు సఖల

తే॥ మమ్మహాదేవి సకలవేదాధిపేంద జనని, నలువ మొదలగు దేవతల్ నతులొనర్ప
సర్వరూప సనాతని సర్వనిలయ, సర్వమంగళమై సర్వసాక్షి యమ్మె. ౧౫

క॥ ఆపద లణంపంగ మోక్ష, ప్రాపణ మొనరింప సర్వభారము తనపై
నోపికం దాల్చుచుం బోషించుం గృపాపర దేవియయి భక్తపారాయణమై. ౧౬

సీ॥ శరణాగతత్రాణసంధానధౌరేయ, పరమతేజోరూప భావగమ్య
సర్వశక్తివిలాస సర్వసిద్ధిప్రద, శివభక్తి యఖిలాండసృష్టికర్త్రి
బుద్ధినిద్రాక్షుధా బోధనీయస్మృతి, భ్రాంతిశాంతిక్షాంతి కాంతులెల్లం
దానయై సర్వప్రదాత్రియై లోభమో, హాదుల కనకాశ మందనీక

గీ॥ భక్తరక్ష యగుచు భగవంతునకుం బ్రాణ, తుల్యమైన పడంతి దురవగాహ
మహిమ సర్వశక్తిమహితమై యలరారుం, బ్రథమమైన ప్రకృతి పరంగ వినుము.

క॥ రెండవప్రకృతిని దెల్పెద, నిండుముదంబునను వినుము నీరజనాభుం
డుండెడు నెలవున నిలుచు న, ఖండస్ఫుటశక్తి కమలగాం గనుంగొనుమీ! ౧౭

వ॥ అమ్మహాదేవి పతిసేవాపరాయణమై వికుంఠధామంబున మహాలక్ష్మి యనం
దగి స్వర్గంబున స్వర్గలక్ష్మియు, రాజ్యంబున రాజ్యలక్ష్మియు, గృహంబున
గృహలక్ష్మియు, వనంబున వనలక్ష్మియు ననందగి తత్తల్లక్ష్మీరూపంబుల నెల్లెడం
దానయై సర్వభూతంబుల శోభారూపయై, పుణ్యాత్ములయెడం బ్రీతిరూపిణియై,
రాజులయెడం బ్రభారూపిణియై, వణిజులయెడల వాణిజ్యరూపిణియై, సర్వసమ్మ
తయు, సర్వపూజ్యయు, సర్వవంద్యయు నగుచు నెలయుచుండు, ౧౮

గీ॥ అమ్మహాదేవి వైకుంఠ మధివసించి, తమ్మికంటికిం బత్నిగాం దనరి యతని
కభిమతార్థంబులొసంగుచు నతిశయిల్లు, మఱియు నొక్కటి దెల్పెద మానివినుము.

సీ॥ పంకజోదరునకుం బత్నిగాం దనరి వా, గ్బుద్ధి విద్యాజ్ఞాన బోధములకు
నిలయమై బ్రహ్మతో నిచ్చలు నెనయుచు, బ్రహ్మాణి నా సర్వభరితయగుచు
శ్రుతులు పురాణముల్ శుద్ధాంతములును వ్యా, ఖ్యానముల్ తానయి కల్పనములు
సర్వముల్ మెఱయించి సందేహభంజన, పటిమ బోధస్వరూపమున నెగడి

గీ॥ పటుతర గ్రాంథిక విచారపరిణతులను, సరససంగీతసాహిత్య సామరస్య
విషయ విజ్ఞాన బోధంబుల వెలయంజేసి, వీణయును బుస్తకముం దాల్చి విశ్వజనని.

క॥ హిమచందనకుందసుధా, విమలాంగప్రభల వేదవేద్యుని విష్ణున్
సుమహితముగ జపియించుచు, నమరు సరస్వతి యనంగ నభిధానముచే. ౨౨

చ॥ సకల తపఃఫలంబులకు జన్మనివాసము సిద్ధవిద్యయై
ప్రకటిత బోధలన్ సుజనపాళులఁ దన్పుచు భూతధాత్రియై
యకలుష దివ్యరూపమున నబ్రముగా జనియించుఁ దత్కృపా
శకలము లేనిచో నగు ద్విజాతియు మూఁగ యెఱుంగఁ జెప్పితిన్. ౨౩

వ॥ మఱియును దురీయ యగు ప్రకృతి చతుర్వర్ణంబులకు వేదవేదాంగంబులకు ఛందంబులకు సంధ్యావందనమంత్రంబులకు నిఖిలతంత్రంబులకు జన్మస్థానంబై బ్రహ్మతేజోరూపయుఁ దపస్వినియు సర్వసంస్కారకారిణియుఁ బరమానందరూపిణియు సనాతనియుఁ బవిత్రియు శుద్ధస్ఫటికసంకాశయు శుద్ధసత్త్వస్వరూపిణియు బ్రహ్మస్వరూపయు నిర్వాణదాయినియు సర్వాధిష్ఠాత్రియునై నిజస్పర్శనంబున దీర్థంబులకు గంగాదినదులకు నాత్మశుద్ధి యొసంగుచు స్వచరణరజస్సేకంబునఁ జగంబులఁ బూతంబు లొనర్చుచు సావిత్రీగాయత్రీ నామంబుల బ్రహ్మప్రియంకరియై వర్తించుచుండు.

సీ॥ పంచమప్రకృతి నేర్పరిపింతు వినుము ప్రాణాధిదేవత జగదంతరాత్మ
అఖిలలోకమనోహరాంగి సౌభాగ్య, సౌహార్దంబులకు నెల్లనాటపట్టు
భామిని గౌరవప్రతిభ నిజావాస, ప్రాణాధిక ప్రియ పతికి నెపుడు
వామార్ధదేహ స్వభావతేజోబల, గుణనవావరణ సంగుప్త పరమ

తే॥ కృష్ణపరమానసాంభోజ క్రీడనైక, లోల రాసవిహారవిలోల నిఖిల
రంజన సుఖాబ్ధిమజ్జనారామసీమ, సగుణనిర్గుణరూప యజ్జనని గనుము. ౨౪

వ॥ మఱియును రాసమండలసంభూతయు గోపీమండితయు రసేశ్వరియు రసికయు రసావాసయు నిరాకారయు నిర్లిప్తయు నాకాశరూపిణియు నిరీహయు నిరహంకారయు భక్తానుగ్రహవిగ్రహయు వేదానుసారిధ్యానగమ్యయు సురమునిపుంగవ వాగ్గోచరియు వహ్నిశుద్ధాంశుకయు రత్నాలంకారభూషితయుఁ గోటిచంద్రప్రభా విలాసినియు శ్రీకృష్ణభక్తిదాస్యతత్పరయునై చెలువొందుచుండు. ౨౫

క॥ ఆదేవి నీరజాక్షుఁడు, భూదారతఁ దాల్చునపుడు పొందుటకొఱకై
యాదట వృషభానునకును, నాదరమునఁ బుత్రియగుచు నవని జనించెన్. ౨౬

సీ॥ ఏదేవిచరణంబు లిసుమంత సోఁకుటఁ, బరమపవిత్రమై పరఁగె వసుధ
బ్రహ్మాద్యగోచరభావంబుచే సర్వ, సందృష్టి యగుచు నే జనని తనరు
స్త్రీరత్నములలోనఁ జెలువుమీఱి ముకుందు, వక్షస్స్థలమున నే వనిత చెలఁగుఁ
దారాపథంబునఁ దటిదాకృతి వహించి, మెఱయించు జగము లే మెఱుఁగుఁబోఁడి

తే॥ షష్టివర్షసహస్ర నిశ్చలతపంబుఁ, జేసి కాంచంగలేఁ డయ్యె ‡ సృష్టికర్త
స్వప్నమున నైనఁ గానంగఁ ‡ జాలఁ డనిన, నమ్మహాదేవిఁ జూడంగ ‡ నతని కగునె.

గీ॥ పిదప బృందావనమున నా ‡ సదయ యైన, శక్తి రాధాకృతి వహించి ‡ జనన మొందు
తఱి నలువఁ గాంచెఁ ద్రిభువన ‡ తరుణు లెల్ల, నమ్మహాశక్తి యంశాంశ ‡ కలని యెఱుంగు.

గీ॥ ప్రకృతిపంచక మిమ్మాడ్కి ‡ బరఁగు నిఖిల, భువనజననులు త్రిగుణసం ‡ పూర్ణరూప
లిట్టి శక్తుల గరిమచే ‡ నిజ్జగముల, సృష్టిపాలనసంహృతి ‡ క్రియలు చెలఁగు. ౩౦

ఉ॥ ఇందుఁ బ్రధానరూప యగు ‡ నే జగదీశ్వరి తన్నిజాంశమై
యం దుదయించె గంగ భువ ‡ నావళిపావని విష్ణువిగ్రహా
నందజలద్రవాకృతి న ‡ నాది సనాతని పాతకవ్రజా
క్రిందనశీల యాగమని ‡ కాయపరిస్తుతయై చెలంగెడిన్. ౩౧

వ॥ మఱియు మహాపాతకోపపాతకాది నిఖిలదురితదారుదాహంబునకు ధనంజయ రూపిణియై పానావగాహనాదుల జనులకు నిర్వాణపదం బొసంగుచు, గోలోక ప్రస్థాన సుఖసోపానరూపంబునఁ బవిత్రింబగు తీర్థంబయి, సరిచ్ఛిరోమణియై, శంభుజటాకటాహంబున ముక్తాలలామం బనం బరఁగి, భారతఖండంబునఁ దపఃఫలంబు లొసంగుచుఁ, గుందేందునిభశుద్ధప్రకాశంబున నిజసత్త్వంబుఁ బ్రకటించుచు నిర్మలయు నిరహంకారయు సాధ్వియు నారాయణప్రియయు నై చెలంగుచుండు.

సీ॥ హరికి భూషణ మాచు ‡ హరిపాదసంస్థయై, తపసుల కెల్ల ని ‡ దాన మగుచు
సారవస్తువులలో ‡ సారమై పరమప, విత్రయై ప్రాచీన ‡ విభఁ జెలంగి
దర్శనస్పర్శనా ‡ దానంబులను ముక్తి, నొసఁగుచుఁ గలిదోష ‡ ముజ్జగించి
తన జన్మమున వసుం ‡ ధరఁ బవిత్రముఁ జేసి, స్పర్శనంబునఁ దీర్ఘ ‡ ఫలద యగుచుఁ

తే॥ గర్మముల కెల్లఁ దను దాన ‡ కర్త్రి యగుచు, మోక్షకాముల కెల్లను ‡ ముక్తి యొసఁగి
భరతఖండస్థులకుఁ దాన ‡ పారిజాత, కల్పయై యొప్పె ధర్మార్థ ‡ కలశి తులసి. ౩౩

వ॥ మఱియుఁ బ్రకృతి ప్రధానాంశంబై కశ్యపసంభూతయు, శంకరశిష్యయు, జ్ఞాన విశారదయు, నాగేశ్వరభగినియు, నాగపూజితయు, నాగరోహిణియు, యోగినియు, విష్ణుభక్తి పరాయణయుఁ, దపఃఫలదయు, హరిహరులకుఁ జక్రశూల ప్రదాత్రియు నగు జరత్కారుపుత్రి భారతఖండంబునఁ దా బ్రహ్మతేజోరూపిణియై, సర్వమంత్రాధిష్ఠాత్రి యగుచు నస్తీకునకుఁ దల్లియై, జరత్కారునకుఁ బత్నియై, బ్రహ్మభావనచేఁ జరించుచుండు, ౩౪

సీ॥ ప్రకృతియంశంబునఁ ‡ బ్రభవించి జగముల, దేవసేన యనంగ ‡ దేవమాత
పుత్రపౌత్రకళత్ర ‡ మిత్రసంవర్ధని సుందరి యువతి ని ‡ సులగుణౌఘ

శిశువృద్ధికారిణి సృష్టికర్త్రి జనిత్రి, యట్టిమహాదేవి నఖిలజనులు
సూతికాగృహముల సొంపొప్పఁ బూజింప, సర్వదోషంబులు సమయుచుండు

గీ॥ మునితపశ్శక్తిచేఁ బుట్టి ముజ్జగములు, స్థలజలంబుల శిశురక్ష సలిపికొనుచు
మాతృభావంబునను జగన్మాన్యచరిత, వర్తిలుచు నుండు దేవి యవార్యమహిమ.

వ॥ మఱియుం బ్రకృత్యంశంబున మంగళచండిక యను మహాదేవి ప్రకృతిముఖసంభూతయై సృష్టియెడ మంగళరూపయు, సంహారంబునఁ గాళికయునై పుత్రపౌత్ర ధనైశ్వర్యాదు లొసంగుచు సర్వవాంఛాప్రదాయినియై, నిఖిలశక్తిసంహారదక్షయై మహేశ్వరినాఁ బ్రవర్తించుచుండు. ౩౬

సీ॥ ప్రకృతియంశంబునఁ బ్రభవించి కాళినా, దుర్గాలలాటసంసర్గమునను
శుంభనిశుంభుల దంభముల్ మాయించి, కోటిసూర్యప్రభాకుంఠ యగుచు
సర్వసిద్ధి ప్రద సర్వశక్తిలలామ,యై కృష్ణభక్తిచే నఖిలహరణ
దక్షయై రక్షోవిదారణం బొనరించి, బ్రహ్మాదులు నుతింప భక్తులకును

గీ॥ ధర్మముఖపురుషార్థముల్ తడయ కొసఁగి, లోకసంక్రీడన మొనర్చు లోకజనని
యమ్మహాదేవిమంత్రమ్ము లవనిమీఁద, నవవిధమ్ములఁ జెలువొందు శుభవహములు.

వ॥ మఱియుఁ బ్రకృతి ప్రధానాంశంబున వసుంధరాదేవి సర్వాధారయు, సర్వసస్యప్రవర్ధనియు, రత్నాకరయు, రత్నగర్భయుఁ, బ్రజావందితయు, సర్వజీవినియు, సర్వసంపద్విధాయినియు నాచు సర్వంబునకు నాధారంబై చరాచరంబుల భరించి తేజరిల్లుచుండు, మఱియుం బ్రకృతికళావరణంబులు వివరించెద నని నారదునకు నారాయణస్వామి యిట్లనియె. ౩౭

ఉ॥ ఏసతి యాజ్ఞ లేక జను లెల్లను నాహుతి వహ్నిలోన న
ధ్యాసిత మంత్రపూతముగ నర్పణసేయఁగఁ జాల రట్టి స్వా
హాసరసీరుహాక్షి జ్వలనాంగన తత్కళగా నెఱుంగుమీ!
యేసతి యెట్టిరూపమున నెందు వసించినఁ దత్స్వరూప వే. ౩౮

వ॥ మఱియును యజ్ఞపత్నులగు దక్షిణాదీక్షలు, పితృపత్నియగు స్వధయు, గణపతిపత్నియగు పుష్టియు, ననంతపత్నియగు తుష్టియు, నీశానపత్నియగు సంపత్తియుఁ గపిలపత్నియగు ధృతియు, సత్యపత్నియగు సతియు, ధర్మపత్నియగు సాధ్వియుఁ బుణ్యపత్నియగు ప్రతిష్ఠయుఁ, గర్మపత్నులగు సిద్ధికీర్తులును, ఉద్యోగపత్నియగు క్రియయు, నధర్మపత్నియగు మిథ్యయు, భ్రమపత్నియగు సంభ్రాంతియు, సుశీలపత్నులగు లజ్జాశాంతులును, జ్ఞానపత్నులగు బుద్ధిమేధాస్మృతులును ధర్మపత్నియగు [illegible]యుఁ, గాలాగ్ని రుద్రపత్నియగు నిద్రయుఁ, గాలపత్నులగు

సంధ్యారాత్రి దినంబులును, లోభపత్నులగు క్షుత్పిపాసలును, దేజఃపత్నులగు ప్రభాదాహికలును, బ్రజ్వారపత్నులగు కాలకన్యా మృత్యు జరలును, సుఖపత్నులగు నిద్రాకన్యకలు తంద్రాప్రీతులు, వైరాగ్యపత్నులగు శ్రద్ధాభక్తులు, కశ్యపపత్నులగు దేవమాతయగు నదితియు, గోమాతయగు సురభియు, దైత్యమాతయగు దితియు, సర్పమాతయగు కద్రువయు, పక్షిమాతయగు వినతయు, మొదలగు నీ యోషిత్సంఘంబు ప్రకృతికళావతరణంబ యని యెఱుంగుము. ఇందొక్కరేనియుఁ గొఱంతవడిన సృష్టికిం గొఱంత యని యెఱుంగుము. మఱియును జంద్రపత్నియగు రోహిణియు, సూర్యపత్ని యగు సంజ్ఞయు, మనుపత్ని యగు శతరూపయు, నింద్రపత్నియగు ప్రాచియు, గురుపత్నియగు తారయు, వశిష్ఠపత్నియగు నరుంధతియు, గౌతమపత్నియగు నహల్యయు, నత్రిపత్నియగు ననసూయయుఁ గర్దమపత్నియగు దేవహూతియు, దక్షపత్నియగు ప్రసూతియుఁ, బితృకన్యయుఁ బార్వతీమాతయు నగు హిమవత్పత్ని మేనకయు, నగస్త్యపత్నియగు లోపాముద్రయుఁ, గుబేరపత్నియగు కుంతియు, వరుణపత్ని వరుణానియు, బలిపత్ని వింధ్యావళియుఁ, గుంతియు,దమయంతియు, యశోదయు దేవకియు, గాంధారియు, ద్రౌపదియు, శైబ్యయు, సత్యవతియు, రాధయు, మండోదరియుఁ, గౌసల్యయు, సుభద్రయు, రేవతియు, సత్యభామయుఁ గాళిందియు, లక్షణయు, జాంబవతియు, నాగ్నజితి, మిత్రవింద, రుక్మిణి, లక్ష్మి, సీత, కాళి, ఉష, చిత్రరేఖ, ప్రభావతి, భానుమతి, మాయావతి, రేణుక, ఏకనంద, దుర్గ, మొదలగు ననేకవరారోహలు ప్రకృతికళారూప లని యెఱుంగుము. ప్రకృతికళాంశంబు లగుట స్త్రీజనంబులు ప్రకృతిరూపంబుగా నెఱింగి తత్పరాభవంబు ప్రకృతిపరాభవం బనియును, దత్పూజనంబు ప్రకృతిపూజనం బనియును నెఱింగి వస్త్రాలంకార చందనాదులఁ బూజింప వలయు నని తెల్పి మఱియును. ౪౦

క॥ ఎనిమిదియేఁడుల కన్నియ, ననితరసద్భక్తినర్చనాదులఁ దనుపన్
జనులకు సాక్షాత్ప్రకృతిన్, దనుపొందఁగఁ గొల్చు టనుట తపసీ! గనుమీ.౪౧

ఉ॥ ఉత్తమ మధ్యమాధమగుణోత్తరమై భువనేళి యుండుటన్
దత్తదుదారరూపములఁ దా నుదయించు జగత్త్రయంబు నం
దత్తఱి సత్త్వ ముత్తమము నంతకుఁ దక్కువ రాజనంబు పు
ణ్యోత్తమ! తామసం బధమ మూహ నెఱుంగుము తద్వశంబునన్. ౪౨

సీ॥ సాత్త్విక సంభూత సరసిజాక్షులు పతివ్రతకామ పతిధర్మసేవ ర్తనముల
నుందురు రాజసల్ కొందఱు భోగమో,గ్యత సుఖసంభోగకలిత లాచు
స్వస్వకార్యారంభసంతుష్టలై వసి,యింతురు తామసల్ హేయబుద్ధి
దుర్ముఖుల్ కులటలు దుర్వృత్తలు సాత్త్వికులు స్వతంత్రలు నౌచుసనమరపురిని

గీ॥ నచ్చర లసంగ ధరణి వేశ్యలు ననంగఁ, బ్రకృతి తామసవశమునఁ బరఁగి పుంశ్చ
లీత్వమున వర్తిలుదురు తత్తత్త్వ మహిమ, వ్యాపకంబయి సర్వత్ర వర్తిలెడిని.

చ॥ ప్రకృతిమయంబుగాని దొక పట్టున వస్తువులేదు సుమ్ము మా
నక సకలంబు తన్మయ మనందగు భారతఖండమందు న
త్యకలుషచిత్తులై జను లహర్నిశముం బరదేవిఁ బూన్చి స
ర్వకలుషముల్ దొరంగి పరవైభవముం గనుచుందు రెప్పుడున్. ౪౪

సీ॥ తాను రాజ్యభ్రంశతను బొంది సురథుండు, దుర్గార్తినాశని దుర్గఁ బూన్చి
యకుటిల రాజ్యసింహాసనస్థుం డౌచు, ధరణిఁ బాలించి యుదాత్తుఁ డయ్యె
రావణుఁ బరిమార్ప రాఘవుం డర్చించి, సీతఁ జేకొని రాజ్యసిద్ధి నొందె
దక్షకన్యక యాచుఁ దాను సర్వేశ్వరి, తండ్రియాగమునందు దర్పకారి

గీ॥ నింద కోర్వక యోగాగ్ని నీఱుగాఁగ, మేను దిగఁద్రావి యంతట మేనకాధ
రేంద్రులకుఁ బుట్టి దేవి నర్చించి హరుని, భర్తగాఁ గొని కష్టముల్ పరిభవించె.

మ॥ హరియంశంబున నద్ధరాత్మజకు నెయ్యంబొప్ప స్కందుండునన్
గరివక్త్రుండును బుత్రులైరి మఱియున్ గల్యాణరూపంబునన్
సరసీజాలయయై జగమ్ములను బూజల్ గాంచి త్రైలోక్యస
ద్భరితాకారత మౌనిపుంగవులచేఁ బ్రస్తుత్యయై వర్తిలెన్. ౪౬

శా॥ గోలోకంబున రాసమండలములో గోబృందముల్ పూన్పఁగా
హేలాలోలత రాధయై సురలచే నిష్టార్చనల్ గొంచు స
ర్వాలంబస్థితి గోపగోపికలు తన్నర్చింప శ్రీకృష్ణుఁడున్
లీలన్ బూన్పఁగ వర్తిలున్ జనని తల్లీలల్ జగన్మాన్యముల్. ౪౭

గీ॥ సురభి మొదలగు గోమాతృసుదతులెల్ల, భూపదీపాది పూజనోద్ధురతఁ గాంచి
వాంఛితము లెల్లఁ గొనుచు నవార్యమహిమ, నిత్యభోగంబు లందిరి నిత్యగరిమ.

క॥ గిరిశోపదేశమున ని,ద్ధరణి సుయజ్ఞుండు నాఁగ ధాత్రీశుఁడు శాం
కరి భారతఖండంబున, నిరతోత్సాహమునఁ బూన్చె నిర్మలమతియై. ౪౮

సీ॥ జగదీశుఁడగు శంభుశాసనంబున జగ, త్త్రికమెల్ల వ్యాపించి సకలదిశల
మానులు పూజింప మఱియుఁ బట్టణముల, గ్రామంబులను గిరిగ్రావములను
బుణ్యతీర్థంబులఁ బుణ్యాశ్రమంబులఁ, దత్తత్కళాంశలఁ దనువులొంది
శతసహస్ర ప్రకాశత శక్తిరూపముల్, వహియించి నిత్యసపర్యలంది

గీ॥ భక్తులకు నిష్టసంపదల్ పరఁగనొసఁగి, యైహికాముష్మికంబుల కాశ్రయంబు
తానయైనట్టి పరదేవతాస్వరూప, ప్రకృతి [illegible] ? వాక్పతికినైన.

క॥ అని తెల్పిన నారాయణ,మునిఁగాంచి సుపర్వమౌని మొక్కి మహాత్మా!
వినినాఁడ ననంతోచిత, వినిపింపుము విస్తరించి విశ్వేశికథల్. ౫౧

గీ॥ అమ్మహాదేవి సృష్టికి నాదియందుఁ, బ్రకృతియై పంచవిధయౌచుఁ బరఁగు టెట్లు
సర్వవేదివి నీవాక్యసరణి వినఁగ, నానగొల్పెడు మది, కూర్మి నానతిమ్ము. ౫౨

ఉ॥ వారలు తత్తదాకృతులు వర్తిలు టెవ్విధమొక్కొ? వారలన్
గోరి భజించి పూన్చి యలఘుస్థితి గాంచుట యెట్లొ? భక్తిచే
వారి నుతించుచున్ భజన వర్తనఁ గాంచుట యెట్లొ! తత్తదా
కారము శౌర్యమున్ గవచకల్పనమున్ వచియింపు మంచనన్. ౫౩

గీ॥ దేవముని యిట్లు దేవీప్రభావ మడుగఁ, బేర్మి నారాయణస్వామి పృథుకృతార్థ
చిత్తుఁడై నారదునిఁ జూచి చిత్త మిచ్చి, వర్ణనమొనర్చె నిట్లు భూవరమహేంద్ర.

వ॥ సావధానుండవై వినుము. ఆత్మయు, నాకాశంబును, గాలంబును, దిక్కులు, గోలో
కంబును, వైకుంఠంబును నిత్యంబులగు పోలిక,సనాతనియు,బ్రహ్మపత్నియు, నభిన్న
యగునట్ల యాత్మయందుఁ బ్రకృతి యవిచ్ఛిన్నయగు, స్వర్ణకారుండు హేమంబు
లేక కుండలాభరణకరణంబున కక్షమతఁ దాల్చిన కైవడిఁ గులాలుండు మృత్తం
గొనక ఘటకల్పనాసమర్థుం డగునట్లీశ్వరుండు ప్రకృతి నెడఁబాసి జగత్కృత్యం
బొనర్పం జాలండు. సర్వశక్తిస్వరూపయగు నా ప్రకృతి లేమిం జేసి యశక్తుం డవుం
గదా! కావునఁ బ్రకృతి పురుషులకు నించుకయు భేదంబు లేదు. జ్ఞానసమృద్ధి సం
పద్యశస్తేజోబలంబులు భగశబ్దవాచ్యంబు లగుట భగవతీ భగవన్నామంబులు
బ్రహ్మశక్తులకు స్వభావసిద్ధంబు లని యెఱుంగుము. ౫౪

సీ॥ సాకారమూర్తి నిరాకారమూర్తినా, వర్తిల్లు బ్రహ్మంబు వ్యాపకంబు
ధ్యానింతు రద్దేవు మౌనులు సత్యంబు, జ్ఞానంబు చిత్తు నీశ్వరుఁ డదృశ్యుఁ
డఖిలదర్శకుఁడు సర్వాతీతుఁ డగుణుండు, నా వైష్ణవులు సగుణంబటంచుఁ
బలికి తేజోరూపి బ్రహ్మంబు స్వేచ్ఛామయంబు సర్వగతంబు నయ్యు దివ్య

గీ॥ రూపమయి కార్యకారణరూఢి నెఱసి, తరుణసుందరరూపంబు దాల్చి శాంత
మూర్తిని గిశోరయౌవనోద్వర్తి యగుచు, నీలనీరదమూర్తియై నెగడుచుండు.

వ॥ మఱియును, శరత్పద్మశోభాభాసురలోచనుండును, ముక్తాఘుటికాప్రతీకాశదంత
పఙ్క్తిమనోహరుండును, మయూరపుచ్ఛచూడుండును, మాలతీమాల్యమండితుం
డును, సునాసుండును, సర్వస్వతంత్రుండును, సర్వమంగళుండును, బరిపూర్ణుండును,
సిద్ధుండునుంగా భావించి జన్మమృత్యుజరావ్యాధిశోకభీత్యాదిదూరుం డగు,
ననంతకల్యాణగుణాశ్రయుం డగు నప్పరమాత్మునకు బ్రహ్మాయుష్యంబు నిమేష

మాత్రంబు. అతండే యాత్మయు, బ్రహ్మంబును, కృష్ణుండును, నను నామంబులం బ్రవర్తించు. ప్రథమవర్ణంబు ఋషివాచకంబు. ద్వితీయంబు దాస్యవాచకంబు. భక్తిదాస్య ప్రదాత యగుట కృష్ణుం డనంబరఁగె, నతండు సర్వంబును నాదియందు సృజియించి స్వేచ్ఛామయుండై వామాంగంబు స్త్రీరూపంబును, దక్షిణాంగంబు పురుషుండునై ప్రవర్తిల్లుచుండు. ౫౭

సీ॥ అద్దేవు వామాంగ మందు జనించిన, దేవి కామాధార ౹ దివ్యమూర్తి
యతికమనీయ పద్మావాస, పూర్ణేందు,బింబనితంబవిడంబ చారు
కదలికాస్తంభోరు కమనీయ, మాలూర, వక్షోజ, పరమపావన, సుధాభ
రత్నభూషిత, చకోరమ్ముల పోలికఁ, గృష్ణుని ముఖచంద్రు ౹ నెపుడుఁగ్రోలు

తే॥ కన్నుఁగవ నొప్పు చాన నిక్కమగు మంచి, వర్తనమ్మున మెలఁగుచు వశముగాని
మోహమునఁగొల్వ నిరువురు ముదితులగుచు, నాదికాలంబునందు నిత్యత వహించి.

ఉ॥ ఆదికి నాదియై చెలఁగునట్టి ప్రభామయమూర్తు లిర్వుర
త్యాదర మొప్ప నుండుతఱి ౹ నాదిమపూరుషుఁడైన కృష్ణుఁడ
పైఁబదలిఁగాంచి పూర్ణరస భావమునన్ జగదద్భుతక్రియా
సాదరకల్పనంబునకు ౹ స్వాంత మిడెన్ నిఖిలైకబీజుఁడై. ౫౮

సీ॥ కస్తూరితోఁగూడ ౹ గంధసారము మేనఁ, బూసి సిందూరంపు ౹ బొట్టుఁబెట్టి
కుటిలాలకము లెల్లఁ ౹ గూర్చి చక్కఁగ దువ్వి, జాజిపూదండల ౹ జడ యమర్చి
మగరాలసరుల నిమ్మగు రవణమ్ముల, లలితమౌ నెమ్మె నలంకరించి
కోటిచంద్రప్రభాంకూరజాలమ్ముల, నెమ్మోము చిగురింప ౹ నిలిచి నిలిచి

గీ॥ హంసగమనంబులను బ్రియు ౹ నంతికమున, కరుగుదేరంగ రాసేశుఁ డతివఁగాంచి
యంత నేకాంతలీలావిహారలోలుఁ, డగుచుఁ గ్రీడించె నదియె రాసాభిధంబు.

క॥ శృంగారమూర్తి పోలిక, నంగనతోఁగలిసి వీర్య ౹ మగ్పించె మెయిన్
బొంగుచు నిర్వురకున్ స,ర్వాంగము ఘర్మోదయమున ౹ నభిరంజించెన్. ౬౧

క॥ సురతాయాసము పెనఁగొన, భరితోచ్ఛ్వాసములఁ జెలఁగె ౹ బహుళములగుచున్
సురమానివర్య! యేమని, వివరించెదఁ దన్మహత్త్వవిశ్రుతి పొసఁగన్. ౬౨

క॥ ఆ జంపతి మైఁజెమటల, నీ జగతీగోళమయ్యె ౹ నిట్టులు వదనాం
భోజముల వెడలునూర్పుల, చే జీవులకెల్లఁ బ్రాణసృష్టియుఁబొసఁగెన్. ౬౩

క॥ ప్రాణాపానవ్యానో, దానసమానము లనంగఁ ౹ దగు మారుతముల్
నానాజగదాధారత, నా నాలుగు సృష్టి ప్రథమ ౹ మూహింపంగన్. ౬౪

గీ॥ ప్రాణవల్లభ మైన తత్ప్రకృతిమూర్తి, మంతమగు నట్టివాయువు ♦ మారుతమ్ము
లేనును గణింపఁ బరమాత్మ ♦ కృష్ణునకును, బ్రథమసంభూతజీవులై ♦ బరఁగుదురు వారు.

ఉ॥ అంతట నజ్జలంబునకు ♦ నంతటి కీశ్వరతన్ వహించి స
ర్వాంతరుఁడైన కృష్ణుని నిజాంశమునన్ వరుణుండు పుట్టె న
య్యంతికిఁ దోడుతన్ జలనిధీశునకున్ వరుణాని నా జగ
త్కాంతమనోహరాకృతినిఁ ♦ గానఁగనయ్యెఁ దదిచ్ఛమాత్రచేన్. ౯౯

వ॥ తదనంతరంబు కృష్ణజీవనియును, కృష్ణప్రియయును, కృష్ణసంగినియును, కృష్ణ వక్షస్స్థితయు నగు వామాంగప్రాణవల్లభ శతమన్వంతరంబులు గర్భంబు దాల్చి స్వర్ణాభుండును, విశ్వాధారుండును నగు నర్భకునిం గని యా శిశువు స్వాభిమతుండుగాఁ గన్పట్టమిఁ గోపంబున బ్రహ్మాండగోళస్థితజలమ్మునఁ బాఱ వైచె, నయ్యది గని కృష్ణుండు హాహాకారం బొనర్చుచుఁ గోపశీలవై డింభకుం బరిత్యజించుటచే నీక నెప్పటికి ననపత్య వగుమని శపించిన నద్దేవి స్వాంశం బుల దేవాంగనలం బుట్టించె. వారలు నిత్యయౌవనలయ్యును ననపత్య లైరి. తదనంతరంబున నద్దేవి జిహ్వాగ్రంబున శుక్లవర్ణయు, శ్వేతవస్త్రయు, వీణాధారిణియు, రత్నభూషితయు, సర్వశాస్త్రాధిదేవతయు నై యొక్క కన్య జనించి ద్వివిధరూపంబులఁ బ్రవర్తిల్లె. వామార్ధసంభూత లక్ష్మియు దక్షిణార్ధసంభూత రాధికయు నయ్యె, నయ్యెడఁ గృష్ణుండు రెండు తెఱంగులం బ్రవర్తించి దక్షిణాంగంబున ద్విభుజుండును, వామాంగంబునఁ జతుర్భుజుండును నై నాకుం గామినివి గమ్మని లక్ష్మిని గోరిన నట్ల యొనర్చి చతుర్భుజు సంతుష్టుం జేసి, ద్విభుజునకు రాధ నొసంగిన నిర్వురం దోకొని కృష్ణుండు వైకుంఠంబున కరిగె, నందు రాధాంశంబున నారాయణాంశంబునఁ జతుర్భుజులును దేజోవయోరూపంబుల హరిసమానులు నగు పార్షదులు బహుకోటు లుదయించి, రట్టులే కమలాంగంబున దాసీకోటు లుదయించి, రట్టులే గోలోకనాథుండగు కృష్ణు రోమవివరంబుల నసంఖ్య గోపాలకులును, రూపగుణ విక్రమంబుల హరికిం బ్రాణతుల్యులై పార్షదులును బొడమిరి. అట్టులే రాధాంగరోమకూపంబుల రాధాతుల్య లగు గోపకన్యకలు పెక్కండ్రు పొడమిరి. మఱియును, ౯౭

సీ॥ అత్తఱి శ్రీకృష్ణుఁ ♦ నంగసంభూతమై, విష్ణుమాయారూప ♦ వెడలె దుర్గ
నదియు నారాయణి ♦ యనఁగ సర్వేశ్వరి, బుద్ధ్యధిష్ఠాత్రియై ♦ పొగడు గనియె
సర్వశక్తులకు బీజం బమ్మహాదేవి, పరిపూర్ణ చిద్రూప ♦ భావగమ్య
తప్తకాంచనవర్ణ ♦ తరణికోటిప్రభా, ధామ ప్రసన్న సుధామయాత్మ

ఆ॥ భుజసహస్రములను ♦ బొగడొంది శస్త్రాస్త్ర,కలిత యగుచు మూఁడుకన్నులలర
వహ్నిశుద్ధవసన ♦ వరరత్నభూషణయగుచు విశ్వమెల్ల ♦ నలమికొనియె. ౯౮

గీ॥ భువనసుందరు లెల్ల నభ్భువనజనని, కళలు గావున సర్వలోకప్రశస్త
మోహనాకారవాయమై ముక్తిఁగోరు, ధన్యులకు సిద్ధి సేయుఁ దత్ఫలము లెల్ల.

సీ॥ కామార్థులకు నెల్ల కామముల్ సంధించి, వైష్ణవి యనఁదగి వైష్ణవులకు
ముక్తీచ్ఛులకుఁ దానె మోక్షదాయినియౌచు, సుఖకాంక్షులకు నెల్ల సుఖములొసఁగి
స్వర్గవాసులకును స్వర్గలక్ష్మియనంగ, గృహలక్ష్మి యనఁదగి గృహములందు
మునులఁ దపోలక్ష్మి మూర్తియై నృపులందు, రాజ్యలక్ష్మియనంగ రహివహించి

ఆ॥ జ్వలనునందు దాహశక్తి భాస్కరునందుఁ, బ్రభయు, శోభ కుముదబంధునందుఁ
దాన యగుచు హరికి నానావిధాకార, శక్తిరూప యగుచు జగము నిండె.

గీ॥ ఏ మహాదేవి గల్గిన నెల్లజగము, శక్తిమంతంబు, లేనిచో జగములెల్లఁ
గనఁగ జీవన్మృతంబులు గాన నట్టి, శక్తి సంసారవృక్షబీజంబు సుమ్ము. ౭౧

సీ॥ క్షుధ పిపాసయు ధృతి క్రోధంబుఁ గామంబు, భ్రాంతి శాంతులు లజ్జ కాంతితంద్ర
తుష్టిపుష్టులు దయాదులు సర్వగుణములు, నే దేవి కాత్మవినోద నమ్మ
లట్టి మహాదేవి యచ్యుతుచెంగట, నిలిచినఁ జూచియు నీరజాక్షుఁ
డానందమునను రత్నాసనం బిడి నిల్పె, నత్తఱి సత్స్త్రీకుఁ డగుచు బ్రహ్మ

ఆ॥ పద్మనాభు నాభిపద్మంబు వెల్వడి, చేఁ గమండలువును జెలఁగ నాల్గు
మోము లలర దివ్యమూర్తియై వెలుఁగుచు, జలజనేత్రు నెదుట నిలిచియుండె. ౭౨

క॥ అయ్యెడ శతచంద్రప్రభ, లొయ్యారము గుల్క పడఁతి యొప్పునఁ దగి తా
నొయ్యన వెడలెనొ యనఁగా, నయ్యెలనాగయుఁ దనర్చి యచ్యుతు నెదుటన్.

గీ॥ రత్నసింహాసనమ్మున రత్నభూష, ణాంగియై దుస్తతోఁగూడ నతివినయము
దోలఁకఁ గూర్చుండె నద్దేవి నలువతోడ, వెడలివచ్చిన బ్రహ్మాణి వినుము తపసి.

ఉ॥ అంతటఁ గృష్ణరూపుఁడగు నంబుజనేత్రుఁడు రెండు రూపముల్
సంతసమొప్పఁ దాల్చె విను శంకరుఁ డయ్యెను వామభాగమ
త్యంతమనోహరాకృతిని దక్షిణభాగము గోపికా విభుం
డెంతయుఁ దేజమొందిరి యహీనవిభావిభవాతిశాయిత్వన్. ౭౫

వ॥ ఇట్లావిర్భవించిన వారిరువురలోపలం బ్రభామయ తేజోజాజ్వల్యమానుండును, శుద్ధస్ఫటికసంకాశుండును, శతకోటిరవిప్రభుండును, త్రిశూలపట్టసధరుండును వ్యాఘ్రచర్మాంబరుండును, వ్యాఘ్రచర్మోత్తరీయుండును, జంద్రశేఖరుండును, దిగంబరుండును, నీలకంఠుండును, సర్పభూషితుండును, గపాలాంచితదక్షిణహస్తుండును నగు హరుండు బ్రహ్మతేజోరూపం బగు చక్రంబు కరంబున నలవరించి,

వేదాతీతుం డగు కృష్ణుం బ్రశంసింపుచు మృత్యుంజయుండై రత్నసింహాసనంబున నధివసించెఁ బదంపడి మున్ను జలంబునఁ దల్లిచే విసువంబడిన యర్భకుండొక బ్రహ్మ కల్పపరిమాణం బగు కాలం బట్లన యుండి తుదకు ద్విధాభూతుం డయ్యె. ౭౯

ఉ॥ ఈ కరణిఁ ద్విధాకృతుల ◊ నేర్పడు నా శిశుయుగ్మ మందొకం
డాఁకలికల్మి నేడ్వఁగ ని◊రాశ్రియతన్ జలమధ్యమందునన్
బ్రాకటవృత్తి దాచిరి కృ◊పారహితాత్మతఁ దల్లిదండ్రు ల
య్యో! కడుఁగష్టజీవి యన ◊ నొప్పెఁ దదర్భకుజీవితం బటన్. ౭౭

గీ॥ ఇట్టు లబ్బాలు గతిదోఁప ◊ నెలమి నెల్ల, సూక్ష్మవస్తువులం దతిసూక్ష్ముఁడగుచు సరసిజాక్షునిషోడశాంశంబు తేజ, మర్భకుఁడు గాంచె సందు తేజోభివృద్ధి. ౭౮

వ॥ అబ్బాలకు రోమకూపంబులం దనేక బ్రహ్మాండమ్ము లలరారెడి నట్టి విరాట్టుని గతి యిట్లు నిరాధారంబును నయోమయంబును నైయుండ నితరులం గూర్చి విస్తరింపనేల యని మఱియును. ౭౯

క॥ ప్రతి*బ్రహ్మాండమునందును, గృతులు త్రిమూర్తులు వసింతు ◊ కృష్ణుండును ద
త్థితిగతు లెఱుంగఁ డనుచో, నితరులు వివరింపనేర్తు ◊ రెట్లు మునీంద్రా! ౮౦

వ॥ మఱియుఁ బాతాళమ్ము మొదలు బ్రహ్మలోకపర్యంతమును బ్రహ్మాండ మనం బడు, దీనికి వెలుపల వైకుంఠమును, దానికి నావల నేఁబదికోట్ల యామడలమేర గోలోకమ్మును నలరు; నీ లోకమ్ములు రెండును బ్రహ్మాండబహిర్భూతంబు లని యెఱుంగునది. ౮౧

గీ॥ బ్రహ్మలోకంబుతోఁగూడఁ ◊ బైజగంబు, లేడు నట్టులనే క్రింది ◊ యేడుజగము లనఘ! పాతాళములును బ్రహ్మాండ మయ్యె,నిందు మధ్యమజగము మహీతలంబు.

క॥ ఈ యీ లోకము లెల్లను, బాయక శిశురోమకూపవర్తులు కడు దీ
ర్ఘాయతి గలయవి వారిధి, తోయోత్థితబుద్బుదములతో సరి యనఘా! ౮౩

క॥ నిత్యము గోలోకంబును, నిత్యము వైకుంఠపదము ◊ నిజ మిది ప్రకృతి
ప్రత్యేకరోమకూప, స్థిత్యాలంబనము వీనిసేమము నెఱపున్. ౮౪

గీ॥ హరిహరబ్రహ్మలెల్ల బ్రహ్మాండములను, నుండ్రు దిక్పాలకులునుందురుండురిక్క లవని వర్ణముల్ నాలుగటం చెఱుంగు, ముండ్రుపాతాళముననాగులోమునీంద్ర!

గీ॥ పటువిచిత్రాతిచిత్ర శోభల వెలుంగు, జగము లమ్మెయిఁగాంచి యజ్జగములోన నర్భకుఁడు క్షుత్తుదీరక ◊ యటమటించి, పల్లటించుచు విజ్ఞానపదవి నూని. ౮౬

---

టిప్పణి: ప్రతిబ్రహ్మాండము – ఇయ్యెడ రేఫద్విత్వపూర్వక మునకు గురుత్వ లఘుత్వములు రెండును సంస్కృతాంధ్రోభయ మహాకవిసమ్మతము లని యెఱుఁగునది.

వ॥ ఇత్తెఱంగున నంతర్ధ్యాననిష్ఠాగరిష్ఠుండై యంతటపాసనం బొనర్చి, పరమపురుషుం డును, బ్రహ్మజ్యోతియు, నవీనజలదశ్యాముండును, బీతాంబరుండును, మురళీ నాదవినోదియు, శ్రితసంతానార్తినిర్మోచనుండును, శంఖచక్రాదివ్యాయుధధారియు సనాతనుండును నీశ్వరుండును నగు నిజజనకుఁ గృష్ణునిం గాంచి చిఱునవ్వుతో నమస్కరించి నుతించినఁ బ్రసన్నుండై యర్భకా! నీవు క్షుత్పిపాసాజరామరణాది వర్జితుండవై నన్నుంబోలె నాకల్పంబు సుఖం బుండు మని దీవించి వరం బిచ్చి యొక్క మంత్రం బుపదేశించె, దాని స్వరూపంబు. ౮౭

గీ॥ ప్రణవ మాది యగుచుఁ బరఁగఁ * బావకవని,తాగ్రమగుచుఁ గృష్ణ*యనెడు శబ్ద మునఁ జతుర్థిఁగూర్చి * మూలమంత్రంబిది, యెఱిఁగికొనుమటంచు*నిచ్చెవిభుఁడు.

సీ॥ ఇమ్మంత్ర మఖిలేశ్వ*రైకాంతబంధక, మిది నిత్యపూజార్హ* మెఱిఁగి జప్త పరిపూర్ణతముఁడును * భావనాగమ్యుండు, నిర్గుణుండై నట్టి * నీరజాక్షు నకు సమర్పణసేయ * నవ్యగుణోద్భూతి, గల్గునం చని తెల్పి * కరుణ యలరఁ దల్లియుఁ దానును * దనయునిఁ బొడఁగాంచి, యింకెద్ది వరము నీ*కిష్ట మనిన

గీ॥ దేవ! నీపదభక్తి సుస్థితివహించి, యెన్ని దినములు నిలుచు నా * కన్ని దినము లాయువుండంగవలె ననియడిగి నీకు,భక్తుఁడను ముక్తుఁడనుగాని * బ్రతుకు వలదు.

ఉ॥ ఎన్నిదినంబు లాత్మ హృద*యేంద్రియవర్తనచేఁ జరించు నా కన్నిదినంబులుఁ జిర*తాయువ మొందఁగఁజేసి మూర్ఖతా పన్ననిఁ గాఁగనీక ననుఁ * బాలనసేయుము నీదుభక్తి సం పన్నుని కందరాని ఫల*భాగ్యము లున్నవె? యెట్టిపట్టులన్. ౯౦

క॥ అని బాలకుఁ డడిగిన న,వ్వనజాక్షుఁడు వాని మధుర*వాక్ప్రవణముచే మనమునఁ బొంగుచు నిట్లనె, దనయా! ననుఁ బోలి నీవు * తద్దయు మనుమీ.

క॥ కోటులు బ్రహ్మలు చనినను, గోటులు దిక్పతులు చనినఁ * గొంచకయె నిరా ఘాటముగ నిలిచియుండుము, సాటిగొనన్ నేనె సుమ్ము * సదృశుఁడ నీకున్. ౯౧

ఉ॥ ఏను మహావిరాట్టనయి * యెల్లెడ విశ్వంభరంబుఁ దాల్తు ని మ్మైని ననుఁ బోలి విశ్వభర * మానుచు క్షుద్రవిరాట్ట వయ్యొ ద న్న్యూనత నీదు నాభి నుద*యోన్నతిఁ గాంచును నల్పసృష్టినం ధాన మొనర్చు నాతఁడు య*థావిధి సర్వచరాచరాంశమున్. ౯౩

గీ॥ ఆతనిలలాటమధ్యంబు*నందు శివుని యంశమున సృష్టిసంహార*నిష్ఠమగుచుఁ

బడియు నొక్కండుగా రుద్రు లుదయమగుదు,
రందుఁ గాలాగ్నిరుద్రాంకుఁ డడఁచు జగము. ౯౪

క॥ నీ నెలవున మద్రూపము, గా నొక విష్ణుండు పాడమి కాచు జగముల్
నే నం దావేశించెద, ధ్యానంబున నీకు నెపుడు దర్శన మిత్తున్. ౯౫

శా॥ నీకున్ దల్లియు నాకు దార యగు నీ నీరేజపత్రాక్షి ల
క్ష్మీకాంతామణి నిత్యసన్నిధిగఁ గూర్మిన్ నిన్ను మన్నించు ము
ల్లోకమ్ముల్ వెలయింతు నే ననుచు సుశ్లోకుండు వైకుంఠుఁ డ
స్తోకప్రాభవ మొప్ప నేగి పిదపన్ శుంభద్వచోవైఖరిన్. ౯౬

క॥ వనజాసనశంకరులన్, గని మీ రిర్వురును సృష్టికార్యార్థముగాఁ
జని క్షుద్రవిరాట్టుని నా,భిని నళికమునందు నుద్భవింపఁగవలయున్. ౯౭

క॥ మీ మీ యంశలఁ జనుఁడన, నామెయి వా రిరువు రరిగి యంభోమధ్య
స్థేము లయి కనిరి జలములు, ధామముగాఁ దనరు విశ్వధాము ముకుందున్. ౯౮

వ॥ ఇట్లు క్షుద్రవిరాట్టుం జేరి తన్నాభికమలంబునఁ గమలాసనుం డుదయించి శైశవ
వశంబున స్వజన్మస్థానం బగు పద్మనాళంబున కాధారం బెవ్వఁడో కనియెద నని
లక్షయుగంబులు పరిభ్రమించి విసివి, యిన్నాభి యెవ్వరి యంగంబో యతండే
మజ్జనకుండు, తచ్ఛక్తియే మన్మాత, యని కమలాగ్రింబుఁ జేరి కృష్ణపాదాంబుజ
ధ్యానం బొనర్చి జలతల్పశయానుం డగు క్షుద్రవిరాట్టుం గని తద్రోమకూపంబులఁ
దత్తద్బ్రహ్మాండంబులను, దదీశ్వరులను, మహావిరాట్టగు శ్రీ కృష్ణుని, గోపగోపీ
సహితంబగు గోలోకంబును గాంచి, స్తుతించి, తద్వరంబున సనకాదిమునుల
సృష్టియుఁ, జరాచరాత్మకం బగు జగత్సృష్టియుఁ గావించె. శివాంశంబగు రుద్రు
లును నతని ఫాలంబునం బొడమిరి. ఏతద్విశ్వపాలకుండై క్షుద్రవిష్ణుండును నుద్భ
వించి క్షుద్రవిరాట్సన్నిధిం బ్రవర్తించె. చతుర్భుజుండు శ్వేతద్వీపాధివాసి యయ్యె
బ్రహ్మ విశ్వసృష్టి యొనర్చుచు స్వర్గ మర్త్య పాతాళంబులు సృజియించుచుండెఁ
బ్రళయంబునఁ గాలాగ్నిరుద్రుండు సంహరించుచుండె, నిది సృష్టిప్రకారంబు,
నిఖిలబ్రహ్మాండంబులు నిత్తెఱంగునం జెల్లుచుండు. ౯౯

క॥ అని తెలిపిన నారదుఁ డి,ట్లనియెన్ మునిచంద్రుతోడ ననఘా! యుష్మ
ద్ఘనకారుణ్యము నాయెడ, ననువొంద సుధాప్రవాహమై తనరెఁ గదా. ౧౦౦

సీ॥ ఎన్నండు వినని సర్వమీహితవృత్తంబు, వింటి మీ కారుణ్యవిభవమునను
నమృతోపమానమై [illegible] చిత్తంబుఁ దద్భక్తి పూజావిధాన మెట్లొ

యద్దేవి యవనికి నరుదెంచు టారయఁ గలిగెనో? లేదో? సంకల్పవిధుల
నెవ్వరు పూజించి రెవ్వరు నుతియించి, రెట్టిది తద్ధ్యాన మెద్ది చరిత
గీ॥ మెవరి కోరిక లిచ్చె నభీష్టసిద్ధి, నెవ్వ రందిరి? తత్సర్వ మెఱుఁగఁ జేయ
వలె నటన్నను నమ్మౌనివర్యుఁ డెలమి, వినుమటంచును దెల్పె సవిస్తరముగ.

సీ॥ గణపతిజనని దుర్గాదేవి రాధిక, లక్ష్మి వాణి యన నాల్గవది తనరు
సావిత్రి యేనవజనని యిత్తెఱఁగున, బ్రకృతిపంచక మని పల్కినాఁడ
వారి పూజావిధి వారలచరితంబు, పరమపావనము శుభంకరంబు
ప్రకృతులయంశముల్ ప్రకృతిసత్కళలును, సర్వంబు వచియింతు సావధాన
గీ॥ మతిని వినుము మహాకాళి మహియు గంగ, మంగళాంబిక తులసియు మానసియును
స్వాహ నిద్రియు దక్షిణ స్వధయు ననఁగ, వీరిచరితంబు సంక్షేపవిధి వచింతు.

గీ॥ జీవకర్మాదిపాకంబు సిద్ధిదంబు, శ్రుతిమనోహర మత్యంత సుందరంబు
ఐహికాముష్మికప్రదమనుచుఁ గనుము, సందియము లేదు సుమి శతానందతనయ!

క॥ దుర్గారాధాకథ లప, వర్గదములు విశదములును బ్రచురంబులు త
త్సర్గము సమర్చ్చ పిదప న, నర్గళమతిఁ దెలుపువాఁడ నారదమౌనీ. ౧౦౪

సీ॥ శ్రీకృష్ణమూర్తిచే సృజియింపఁబడె భార, తీపూజ యదిలేమి దీనుఁడగును
బండితుఁడైనను భక్తిచే నదిగల్గు, మూఁగయైనను బుధముఖ్యుఁ డగును
అతని సహస్రార మం దాదిశక్తియై, భారతి ప్రభవించి భర్త గాఁగ
నచ్యుతు నెదఁ గోర నదియెఱింగి ముకుందుఁ, డద్దేవితోడ నిట్లనియె వినుము
గీ॥ నాదునంశంబు సుమ్ము సృష్ట్యాదివేళ, నతఁడు సుందరమూర్తి నారాయణుండు
తరుణమోహనమూర్తి మత్సముఁడు కామ, తంత్రదీక్షాగురుండు తథ్యమ్ముసుమ్ము.

ఉ॥ ఆతని భర్తగాఁగఁగొను మట్టిదె నాయెడ రాధ గల్గు ను
ద్యోతిత కామరోష భరణోల్లసనంబుల దక్షు, దోర్బలో
ద్ధూతవిపక్షుఁడౌ నతఁడు తొయ్యలులన్ భరియింపఁగల్గు నీ
కీతఁడె కార్యసిద్ధి యగు నిష్టములెల్ల ఫలించు నంగనా. ౧౦౬

గీ॥ సర్వసంపూజ్య సర్వేశి సర్వవంద్య, సర్వసౌఖ్యద రాధ మత్సన్నిధాన
మునను వసియించు మత్ప్రాణముగ భరింతు, నరిగి యర్ధాంగివగుము నారాయణునకు.

గీ॥ దివ్యభోగంబులెల్ల సిద్ధించు నీకుఁ, బరమవైకుంఠమున కేగి భర్త గాఁగ
నా చతుర్భుజుఁ జేకొని యఖిలభోగ, మంది యానందమున నిల్వు మందయాన.

క॥ కామక్రోధాదిగుణ, స్తోమము లెవ్వియును లేని తొయ్యలి కమలా
కామిని వికుంఠధామము, లోఁ గమలయు నీకుఁ దోడు లోలాక్షి తగన్. ౧౦౯

ఉ॥ ఆ సతితోడఁగూడి యనశయంబును మచ్చికచే స్వభర్తృవి
శ్వాసముఁ గాంచి వర్తిలు మశజనసిము భర్తృకటాక్ష వీక్షణో
ల్లాసవిలాస నైన నఖిలంబును దత్కమలావధూటితో ౧౧౦
మాసరమైన భోగములు ౘ మానక నీకు ఘటించు నుగ్మలీ!

మ॥ ప్రతికల్పంబున మానవుల్ మునులు దేవవ్రాతముల్ సిద్ధులున్
దితిపుత్రుల్ వసువుల్ ఖగేంద్రులు మొదల్ ౘ దివ్యార్చనల్ సల్పుచున్
సతతంబున్ భజియింతు రాపరియయున్ ౘ గణ్వోక్తశాఖావిధిన్
గృతులై షోడశపూజలన్ దనుపుచున్ ౘ శ్రీభుక్తిముక్తుల్ గనన్. ౧౧౧

వ॥ మఱియును, సువర్ణరూపఘుటికయందు నీదు ప్రతిబింబరూపంబు సంగ్రహించి గంధ చందన చర్చలం దనిపి కంఠంబుల దక్షిణభుజంబుల భవత్కవచంబు ధరియించి సతతంబొనర్చుచుఁ బూజాకాలంబులఁ బారాయణంబొనర్చుచుఁ బూజించుచుందు రని తెల్పెంగావున నీశ్వరాజ్ఞాపరికారంబున నిప్పటికి బ్రహ్మ విష్ణు రుద్రులు, ననంతుండును, ధర్మండును, మునీంద్రులగు సనకాదులును, దేవవ్రాతంబులును బూజింతు రని తెల్పిన నారదుం డిట్లనియె. ౧౧౨

క॥ ధ్యానావధానకవచవి,ధానసపర్యలను దేవి ౘ నర్చించు విధుల్
వీను లలర వినఁగోరితి, మౌనీంద్రా! తెలుపు మనిన ౘ మఱి యిట్లనియెన్. ౧౧౩

గీ॥ మాఖశుద్ధపంచమిని సన్మాన మలరఁ, గలిత పూర్వాహ్ణమునను సంకల్పనియతి
స్నాన మొనరించి శుద్ధుఁడై ౘ సదనమునను,గలశసంస్థాపన మొనర్చిగౌరవమున.

శా॥ హేరంబున్ దిననాథుఁబూన్చి పిదపన్ ౘ స్వేష్టాది దేవిన్ సవ
ర్యారంభంబుల ధ్యానపూర్వకముగా ౘ నావాహితం జేసి యి
చ్ఛారూఢిన్ దగ సోపచారముగఁ బూజన్ దన్పి వేదోక్తమా
సారపరిస్ఫుటవస్తుతృప్తుల సమర్చా ప్రీతి సేయందగున్. ౧౧౪

సీ॥ దధిపయస్సులు ఘృతతైలముల్ నవనీత, లాజ లిక్షురసంబు ౘ లడ్డుకములు
శర్కరాగుడమధుద్రాక్షాదులముల్ పృథుకముల్,పాయసంబులు నపూపములు వడలు
గోధూమచూర్ణాది ౘ ఘుటిక లిష్టాన్నముల్, నారికేళరసంబు ౘ నానఁబాలు
లలితరంభాఫలంబులు రసాలంబులుఁ, బనసలు బదరికాఫలశతములు

గీ॥ కాలదేశోద్భవంబులఁ గలిమికొలఁది, నర్పణ మొనర్చి పుష్పమాల్యాదు లొనఁగి
చందనముఁ బూసి శుభవస్త్రమ్ము లిచ్చి, దేవి వేదోక్త విధులను ౘ దృప్తఁజేసి.

సీ॥ శతచంద్రచంద్రికా ౘ సంకాశదేహినీ!, భువనైకమోహనోత్ఫుల్లవదన!
పరమపావన! శుభప్రదధ్యానమౌదేయు!, మందహాసముఖారవిందలలిత!

నవరత్నభూషణోన్నతచారు సర్వాంగి!, సురమునీంద్రాది సంస్తూయమాన!
హరిహరబ్రహ్మరుద్రాదిక సంస్తుత్య!, కమనీయతర హేమగాత్రకలిత

గీ॥ భారతీదేవి! పాపము ల్బాపుమమ్మ!, శారదాదేవి! మద్వాంఛ సలుపుమమ్మ!
భగవతీ! కోర్కె లిడఁ బాలుపడఁగదమ్మ! శ్రీసరస్వతి! మమ్ము రక్షింపుమమ్మ.

చ॥ అని నుతియించి తత్కవచ మంగమునన్ గదియించి పావకాం
గన తుదయున్ రమాకపటకంజశరుల్ మొదలన్ సరస్వతీ
నినద చతుర్థియున్ గలిపి నిర్మలమా మను వుచ్చరించుచున్
జనని సపర్య సేయఁ దగు శాశ్వతవైభవకామి కేమెడన్. ౧౧౮

సీ॥ నారాయణుం డిచ్చె నాకుసంభవునకు, నతఁడిచ్చె భృగునకు నతఁడు సుతున
కిచ్చె మారీచున కిచ్చె నాతం డతం, డిచ్చె వాక్పతికిని నిచ్చె నాతఁ
డ స్త్రీకునకు నిచ్చె నాతండు ఋష్యశృం, గున కిచ్చె నతఁ డిచ్చె గోతమునకు
నతఁడు సూర్యున కిచ్చె నాతండు కణ్వున, కందెఁ గాత్యాయనుం డతనికతన

గీ॥ శేషునకు నాతఁడిచ్చె నాశీవిషాధి, నేత పాణిని కిచ్చె నన్నిర్మలుండు
నింద్రగురుపుత్రునకు నిచ్చె నిటు పరంప, రాప్రకల్పన మిమ్మంత్రరాజమునకు.

క॥ నాలుగులక్షల జపమున, బోలంగా మంత్రసిద్ధి పొసఁగు జపితకున్
లీల బృహస్పతిసముఁ డగు, వాలాయము నతఁడు బహుళవచనము లేలా? ౧౨౦

క॥ నావిని నారదుఁ డప్పుడు, వేవిధముల ముని నుతించి వినఁ గోరితి న
ద్దేవీకవచముఁ దెల్పుము, నావిని నారాయణుండు నర్మిలిఁ బలికెన్ ౧౨౧

సీ॥ సర్వకామద మిది శారదాకవచంబు, శ్రుత్యుక్తమిది వేదసూచితంబు
కృష్ణుండు గోలోకకీర్తనీయుం డగు, నారాయణుం డిచ్చె నాకుఁదొలుత
రాసమండలమున; రాసేశ్వరుం డిచ్చు, కవచంబు విష్ణువక్షుస్థితంబు
అశ్రుతాద్భుతమంత్రవిశ్రుతంబు పఠించి,గురుఁడు చతురుఁడయ్యెసురవిరోధి

తే॥ గురుఁడు దానవపూజనాకుంతుఁ డయ్యె, వాగ్మియయ్యెను వాల్మీకి వ్యాసుఁడఖిల
వేదములు విభజించెను విమలులైన; కణ్వగౌతమముఖు లెల్ల ఘనతఁగనిరి.

గీ॥ ఋషి ప్రజాపతి, ఛందంబు బృహతి యైన, మిశ్వరేశ్వరుఁడైన రాసేశ్వరుండు
సర్వతత్త్వపరిజ్ఞాన సాధనంబు, దీని వినియోగ మని కను దేవమౌని.

వ॥ మఱియు సర్వార్థసాధకంబగు నీ సరస్వతీకవచంబునకు న్యాసప్రకారంబు వివ
రించెద, లక్ష్మీమాయాద్యంబై వహ్నిజాయాంతం బగు సరస్వతీచతుర్థ్యంతమను
రాజంబు మచ్ఛిరోదేశంబుఁ బాలింప వలయు లక్ష్మీబీజాద్యంబై పావకాంగ
నాంతంబై వాగ్దేవతా చతుర్థ్యంతమిళితం బగు మంత్రంబు మత్ఫాలంబుఁ బరి

టిప్పణి: 'నారాయణుఁడు' అను సీసములోని గురుపరంపర నేటి సంస్కృతమునకు సరిపడుట లేదు.

పాలింప వలయు, మాయాద్యంబై ధనంజయజాయాంతంబు సరస్వతీ చతుర్థ్యంత మిళితం బగు మంత్రంబు మచ్ఛ్రోత్రంబులఁ బాలింపవలయు. ప్రణవలక్ష్మీ మాయాద్యంబై వైశ్వానరభామాగ్రంబై సరస్వతీ చతుర్థ్యంతమిళితం బగు మంత్రంబు మన్నేత్రయుగ్మంబుఁ బాలింప వలయు, వాగ్భవమాయాద్యంబై యనల భామాగ్రంబై వాగ్వ్యాపినీ చతుర్థ్యంతమిళితంబగు మంత్రంబు మన్నాసికం బాలింప వలయు, ప్రణవాద్యంబై వీతిహోత్రలలనాగ్రంబై విద్యాధిష్ఠాత్రీచతుర్థ్యంతమిళి తంబగు మంత్రంబు మన్ముఖంబుఁ బాలింపవలయు. ప్రణవభార్గవీమాయాద్యంబై జ్వలనకుటుంబిన్యగ్రంబై బ్రాహ్మీచతుర్థ్యంతమిళితంబగు మంత్రంబు మద్దంత పంక్తిఁ బాలింపవలయు, ప్రణవరూపంబైన యేకాక్షరమంత్రంబు మత్కంఠంబు పరిపాలింపవలయు. ప్రణవపరంబై జాతవేదోయోషిదగ్రంబై శ్రీచతుర్థ్యంత మిళితం బగు మంత్రంబు మత్స్కంధంబులం బరిపాలింపవలయు. ప్రణవాద్యంబై బర్హిర్వనితాగ్రంబై విద్యాధిష్ఠాతృదేవీచతుర్థ్యంతం బగు మంత్రంబు మద్వ క్షంబుఁ బాలింపవలయు. ప్రణవమగ్నిప్రియాశయోషాగ్రంబై విద్యా స్వరూప చతుర్థ్యంతంబగు మంత్రంబు మన్నాభిం బరిపాలింపవలయు. ప్రణవ మాయామదనబీజాద్యంబై కృష్ణవర్త్మసీమంతిన్యగ్రంబై వాణీచతుర్థ్యంతం బగు మంత్రంబు మత్కరంబులం బరిపాలింపవలయు. ప్రణవాద్యంబును శోచిష్కేశ మహిళాగ్రంబును సర్వవర్ణాత్మికాచతుర్థ్యంతంబు నగు మంత్రంబు మత్పాద యుగ్మంబు పరిపాలింపవలయు. ప్రణవాద్యంబును బృహద్భానువధూసమగ్రంబును వాగధిష్ఠాతృదేవీచతుర్థ్యంతంబు నగు మంత్రంబు మత్సర్వాంగంబులం బరిపాలింప వలయు. ప్రణవాద్యంబును కృశానునార్యగ్రంబును సర్వకంఠవాసినీ చతుర్థ్యంతం బునగు మంత్రం బిందాగ్నిదిశలం బరిపాలింపవలయు, సబీజంబై స్వాహాంతంబైన మూలమంత్రంబు నన్ను దక్షిణదిశం బాలింపవలయు. వాగ్భవ కామ రాజ లక్ష్మీబీజాద్యంబై లోహితాశ్వకమలలోచనాగ్రంబైన బాలామంత్రంబు నైరృతి దిశం బరిపాలింపవలయుఁ బ్రణవాద్యంబును వాయుసఖసఖ్యగ్రంబునై సర్వజిహ్వా గ్రవాసినీచతుర్థ్యంతం బగు మంత్రంబు వరుణదిశం బాలింపవలయుఁ బ్రణవా ద్యంబును హుతభుగంగనాగ్రంబై సదాంబికాచతుర్థ్యంతంబగు మంత్రంబు వాయు దిశం బరిపాలింపవలయు. వాగ్భవలక్ష్మీపంచతరబీజాద్యంబును హవ్యవాహన ప్రమదాగ్రంబును గ్రంథవాసినీచతుర్థ్యంతం బగు మంత్రంబు నన్ను నుత్తరంబునం బాలింపవలయు. ప్రణవాద్యంబును శుచివామలోచనాగ్రంబును గ్రంథ బీజస్వరూప చతుర్థ్యంతమిళితంబును నగు మంత్రం బూర్ధ్వాధోభాగంబుల నన్నుం బాలింపవలయు నని యంగంబుల న్యసించవలయునని తెల్పి యిక్కవచంబు విశ్వ మయంబను పేరం బ్రవర్తిల్లు [illegible] గంధమాదనంబున వింటి,

భవదీయస్నేహంబున నీకుఁ దెల్పితి. వస్త్రాలంకార చందనాదుల గురువు నర్చించి దండవత్ప్రణామం బిడి యుపదేశంబుఁగొని మంత్రోక్తవిగ్రహం బగు నిక్కవచంబు పంచలక్షపునశ్చరణంబున బృహస్పతిసమానుండై కవీంద్రుం డగు త్రైలోక్య విజయుండును నగు, నిది కణ్వశాఖావిదితంబు, ధ్యానవందన విధానంబు లెఱింగించెద సావధానుండవై వినుమని యిట్లనియె. ౧౨౪

ఆ॥ ప్రాజ్ఞుఁడైన యట్టి ✠ యాజ్ఞవల్క్యుఁడు తొల్లి, స్వగురుశాపవశత ✠ సకలవిద్య
లెడసిపోవ దుఃఖపడి రవిలోకంబుఁ, జేరి తపమువలన ✠ సిద్ధుఁడగుచు. ౧౨౫

సీ॥ స్తానుగ్రహుం డగు ✠ భానుని దర్శించి, యడుగులపైఁబడి ✠ యడలుకొనుచు
శాపవశంబున ✠ సమసె నా విద్యలు, దయచేసి విద్యాప్రదానపరత
ననుఁ దేర్పుమన్న నన్నాళీకబంధుండు, పఠియింపఁజేసె నిస్ప్రావనంబు
సర్వవిద్యాప్రదస్థాన మీ స్తవ మని, యాజ్ఞవల్క్యుం డప్పు ✠ డాదరమున
తే॥ స్నానసంధ్యాద్యనుష్ఠానసమితి సల్పి, భక్తినమ్రోత్తమాంగుఁడై బ్రహ్మజననిఁ
బ్రార్థన మొనర్చెగురుశాపభయమువలనఁ,బొగిలిపడునోడలెల్లనుబాదిఁగలయ.

శా॥ తల్లీ! మద్గురుశాపకీలలు మదుద్ధామప్రభాబృంహణం
బెల్లం బెల్లగిలించి రా శ్రుతికళల్ ✠ హీనంబు లయ్యెఁ గదుఁ
జెల్లంబో! చెడువృత్తి పాలయితి విచ్ఛిన్నత్వముం జెంది నా
యుల్లం బజ్ఞత భ్రష్ట మయ్యె ననుకంపోద్యుక్తిఁ బాలింపుమీ. ౧౨౬

సీ॥ జ్ఞానవిద్యాస్మృతుల్ ✠ సంధించి సద్గ్రంథ, కర్తృత్వశక్తి సంఘటనపఱిచి
బ్రహ్మవాదుల సభాభవనంబు లందు వ్యాదక్షమత్వము మదినట్టపఱిచి
సంక్షయించిన యట్టి ✠ సకలయోగంబులు, నవనవోన్నత సమున్నతి వహించి
భసితమై పోకుండఁ ✠ బ్రతితి వర్ధిలఁజేయు, మని వేడుకొనిన నయ్యఖిల జనని
తే॥ కూర్మి నట్టులఁ గరుణించి ✠ కొనియెఁగాన, నమ్మహాస్తవ మే నిప్డొనతిత్తు
భాస్కరోదిత మది జగద్భావ్య మఖిల, వేదసారంబు విబుధైకవేద్య మనఘ!

గీ॥ సర్వవిద్యలకును నధిష్ఠాన మగుచుఁ, బ్రాక్తనంబయి బ్రహ్మసంభావ్య మగుచు
నే తలోదరి యా పరంజ్యోతి యయ్యె, నట్టి వాగ్దేవి భారతి ✠ నభినుతింతు.

సీ॥ కాలసంఖ్యలు మహాకాలనిర్ణయములు, వ్యాఖ్యాస్వరూపముల్ ✠ వ్యాకృతులును
భ్రమలు సిద్ధాంతముల్ ✠ పాఠ్యపాఠనములు, శక్తి లక్షణాలు వ్యంజనలు గతులు
స్మృతులు జ్ఞానంబులు ✠ సిద్ధులు ప్రతిభలు, కల్పనాశక్తులు ✠ కవనములును
లక్ష్యలక్షణములు ✠ లలితపాకంబులు, ముఖ్యగౌణములు సంబోధనములు
తే॥ నెల్లయవి తానయై జగం ✠ బెల్ల నెఱసి, తాను లేకున్న నిశ్శబ్దతను వహింపఁ
జేసి శబ్దోత్తరబ్రహ్మచిత్తుగాఁగ, వెలయుచున్న సరస్వతీ! ✠ వినుతిఁ జేతు. ౧౨౭

గీ॥ నలువ యుపదేశ మొనరింప మొలకలెత్తె, సస్యము లనంగ విద్య లచ్చముగ బలసి
పూర్ణసిద్ధాంతములు చేసి పొదలెఁగా! స, నత్కుమారుఁడు తద్దేవి నమ్మినాఁడ.

గీ॥ వసుమతీకృప నే దేవి వైభవంబుఁ, దెలిసి శేషుండు విజ్ఞానదృఢతఁగల్గి
మూఁగయయ్యును సిద్ధాంతములు వచించె, నట్టి శ్రీశారదా దేవి నభినుతింతు. ౧౩౨

గీ॥ బాదరాయణుండు పటుభక్తి వాల్మీకి, దెలుపఁ దెలిసి నిండు తెలివి గలిగి
యఖిలనిగమభేద మలరించెఁగాదె? య, బ్భువనజనని మదిని బొగడువాఁడ. ౧౩౩

ఉ॥ ఇంతియ కాక వ్యాసుఁడు సమీహితబుద్ధిని బుష్కరంబునన్
స్వాంతమునన్ శతాబ్దము లచంచలతన్ స్మరియింపుచున్ దప
శ్చింత మెలంగి తత్కరుణచే సకలజ్ఞతఁగాంచెఁ గాదె? దు
ర్దాంతమహానుభావ యగు తల్లిని శక్తిమతల్లి వేడెదన్. ౧౩౪

సీ॥ అభవుచే నుపదేశమంది మహేంద్రుండు, తత్త్వవిజ్ఞానంబుఁ దాల్చెఁగాదె?
చక్రిధరుండు పూజనముఁ జేసి యభేద, విజ్ఞానసంపత్తి వెలసెఁగాదె?
నిరతంబు భజియించి నీరజగర్భుండు, నిగమముల్ రచియింప నేర్చెఁగాదె?
* జైగిషవ్యాదు లర్చనలు సల్పి తపంబు, ఘనసిద్ధిఁగానఁ జేసికొనిరిగాదె?

తే॥ స్తుత్యములలోన సంతతస్తుత్యమైన, వస్తు వెడఁ జేసి స్తుతియించువాఁడు గలఁడె
తల్లి జగదేకజనని విధాతృరమణి, నభినుతింతు నహర్నిశమంతరమున. ౧౩౫

క॥ అని యాజ్ఞవల్క్యుఁ డిట్టులు, వినుతించిన మెచ్చి దేవి విద్యావిభవం
బనువొందఁ జేసె నాతని, వినమే గురుశాప మిట్లు విడిచెను గంటే. ౧౩౬

గీ॥ మూర్ఖుఁడైనను జడుఁడైన మూఁగయైన, నేకవర్షము పఠియించె నేని యతఁడు
పండితుండయి సుకవియై పరఁగుఁజుమ్మ, నేను భుజమెత్తి దెల్పెద నీ నిజమ్ము ౧౩౭

సీ॥ వైకుంఠమునఁ దొల్లి వాసుదేవుని యొద్ద, గంగానదీశాపకలుషితాంత
రంగయై వాగ్దేవి రక్తిఁ దొలంగి భా, రత ఖండమున ఝురాకృతి వహించి
పుణ్యపవిత్రయై పుణ్యతీర్థంబయి, పుణ్యవజ్జనముచేఁ బొగడు వడసి
భక్తులకును దపఃఫలము సంఘటియించి, పాపేంధనానలప్రతిభ యగుచు

గీ॥ దెలిసి తనయందు మృతిఁ బొందు దేహులకును, శాశ్వతబ్రహ్మలోకవిశ్రాంతి యొసఁగి
హరిహరాంతిక సీమల నందఁ జేయు, నమ్మహాదేవి యభినుతి యజున కవునె.

గీ॥ గ్రహణములఁ బూర్ణిమలఁ జతుర్మాసములను, నక్షయాహంబులను నిష్ఠ యాత్మలేక
యానుషంగంబుచే నైన నందుఁదోఁగఁ, గలదు వైకుంఠకైలాసనిలయ పదవి.

టిప్పణి: జైగిషవ్య – జైగీషవ్యః అని మూలమున నుంటచే హ్రస్వము చింత్యము.

క॥ ఎడపక యొకమాసం బం, దుడుగక యవగాహనంబు నొందిన మనుజుం
గడు గొనుపుణ్యము నీకుర్, విడువక తెల్పెద నతండె విబుధగురుండా. ౧౮౦

గీ॥ ఆ సరస్వతి నీట నిత్యంబు మునిఁగి, ముండన మొనర్చు మానవముఖ్యతముఁడు
తల్లిచనుఁబాలుఁగ్రోలంగఁ దలఁపఁడెన్నఁ, డిదిసుమీ! భారతంబున నిష్టతమము.

క॥ అని తెల్పిన నారాయణ, మునివచనము లాలకించి మునిముఖ్యుండా
వనజభవసూతి యిట్టుల, ననియెర్ భవదుక్తి వినఁగ నబ్బురమయ్యెర్. ౧౮౨

సీ॥ గంగామహాదేవి గనలి సరస్వతి, శపియించుటకు నేమి నెపముగల్గె
స్వకళాంశమున నెట్లు సరిదాకృతి వహించె, సారార్థవిజ్ఞానసరణి మరఁగి
యన్యకౌతుకమున కాశించునే చెవుల్, నీకథామృత మిందు నెఱయఁజేసి
యీ శాపవృత్తాంత మెల్ల నెఱిఁగించి, సంశయచ్ఛేదంబు సలుపవలయు

తే॥ సర్వరూపిణియైన యజ్జనని కెట్లు, నిమ్నగారూప మయ్యెను నిత్యసత్త్వ
యైన గంగకు మది నీర్ష్యయడరు టెట్లొ, గూఢవృత్తిని నెఱిఁగించి కుతుక మిడవె.

ఉ॥ నారద! యీయుదంతము వినర్ మదిఁగోరితి సర్వపాపసం
హారక మద్భుతంబును సమాహితమర్ స్మృతిబోధకంబు దు
ర్వార తపఃఫలార్థదము వస్తువిభాగసమేధితంబు స
చ్చారువచస్సుధాసరణి సంశ్రవణం బొనరింపు మింపుగర్. ౧౮౪

వ॥ నావుడు నమ్మహామహుం డిట్లనియె. ౧౮౫

సీ॥ గంగాసరస్వతీకమలలు మువ్వురు, నాదికాలంబున హరికి సతులు
హరిసన్నిధానంబునందున వశవృత్తు, లగుచు మువ్వురు నుండు నవసరమున
గంగామహాదేవి కమలాక్షు నీక్షించి, కామినియై హాసకలితవదన
యగుట నాపెను జూచి హరి చిఱునవ్వున, లాలించె నయ్యెడలను ముఖంబు

తే॥ చంద్రసంకాశమై యొప్పె జాహ్నవికిని, నదియుఁ గన్గొని భార్గవి యాదరించె
నీర్ష్యనూని సరస్వతి యెదఁ గనలుచు, బొమలు ముడివడ సిరిఁగని బుజ్జగించి.

గీ॥ పతికి మనమెల్ల సరిగాదె? పత్నులందు, భర్త కెవ్వరిపై రక్తి పట్టుగొల్పు
వారి లాలించు నతఁడు తద్వారణంబు, సతులకును ధర్మమగునె? విస్మరణ మేల.

మ॥ అనుచుర్ బల్కుచు నోర్వఁజాలక యసూయాబద్ధయై వాణి శాం
తి నెరర్ నిల్పఁగ జాల కచ్యుతుని గుర్విద్ధీభూతయై రక్తలో
చన రక్తాస్యయు నొచ్చుఁ గంపమున నోష్ఠం బాఱ్చుచుర్ బల్కె వా
చని కాఠిన్యంబులు గుల్లు గల్లుఁగ సరస్వచ్ఛన్నదసంజాతయై. ౧౮౬

గీ॥ పతియు గుణవంతుఁడేని తాఁబణఁతులందు, సమత గనఁజేయు నంతటికి సత్త్వమూర్తి
వైన నీ బుద్ధి విపరీతమయ్యె ఖలుల, చొప్పుఁ దలపోసి తీఁక నేమి చెప్పవలయు.

గీ॥ సుందరులలోన నీ గంగ చూడ నధిక, సుందరిగఁ దోఁచెనా? నీకుఁ జూడు మింది
రామహాదేవి యందేమి రామణీయ, కంబు గడమగఁదోఁచె నిక్కముగఁ దెల్పు.

ఉ॥ అందఱిలోన గంగయెడ నందము గల్గినటుల్ దలంతు వీ
యిందిరయం దొకింత కొఱ యెంతువు నాయెడ సర్వశూన్యతన్
గాంతువు సత్త్వవృత్తికి నగారముగా నినుఁ గాంచుచుందు ర
భ్యంతరసీమఁ బండితు లహర్నిశమున్; దగ విట్టి చైదముల్. ౧౫౧

ఆ॥ నిన్నుఁ గొల్చువారు నిజము మూర్ఖులుగాని, బుద్ధిమంతు లనఁగఁ బోలదయ్యె
తగునె? యిట్టిభేద తాత్పర్య మిటులైన, మగల నమ్మరాదు మానవతులు.

చ॥ అని పలుమాటలాడుచు దవానలకీలలువోని చూపులన్
దనుఁ గనుచున్న కాంతఁ గని తానపు డెద్దియుఁ బల్క కచ్యుతుం
డనువుగ లేచి యాత్మబహిరంగణ సీమకు వచ్చె నంత నె
మ్మనమున నిర్భయస్థితి నమందరుషన్ వచియించె వాణియున్. ౧౫౩

సీ॥ సతులసన్నిధిని లజ్జావిహీనత నీవు, కామించి గర్వించి గడన కెక్కి
వర్తించెదవు నీదు వాల్లభ్య మెట్టిదో, కనిపింపఁ జేయుము కాదయేని
నీ యహంకారంబు నీరుచేసెద భర్త, కూర్మిగల్గినఁ గొనగోటిసరియె
నన్నేమి యననోపు నాథుండు సిగఁబట్టి, వంచి గుద్దెద నాదు వాసిచూడు

ఆ॥ వె॥ మనుచు లేవఁబోవ నంబుజాలయ లేచి, నడుము నడ్డమగుచు నన్నుఁజూడు
మనినఁ గమలఁ జూచి యాగ్రహించుచు వాణి, కసరికొనుచు రోషగద్గదికల.

క॥ వృక్షసరిదూపమున చే, నీక్షితి వర్తింపు మనుచు నిచ్చెను శాపం
బక్షుభిత యగుచు విడువక, యక్షయబలమునను బుట్టెనానతి యంతన్. ౧౫౫

శా॥ శ్రీకాంతామణిఁ జూచి గంగపలికెన్ జేపీడు మింతేల! య
స్తోకప్రాభవ మొప్ప నన్ను గెలువన్ దోడ్తోడ రానిమ్ము ద
త్ప్రాకట్యంబు గనంగఁజేతుఁ గడు దుర్భాషల్ పొసంగించెడిన్
లోకుల్ మెచ్చఁగఁజేతుఁజూడు విడు మీ లోలాక్షి నొక్కుమ్మడిన్. ౧౫౬

వ॥ అదియునుంగాక, దుశ్శీలయు దుర్ముఖియు, దురాచారయుఁ, గలహప్రియయుఁ
గావున నీచవృత్తికిం జొచ్చె. దీనియోగ్యతాశక్తు లెక్కొలందు లనియో? చూచె
దం గాక! విడుము. స్వపరబలంబు లెఱుంగక యడిచిపడుచున్నది. సకల జనం
బులు తనదు నాదుప్రభావంబు లెఱిఁగెదరుగాక యని కోపించి సరిదూపవై

మర్త్యలోకంబునఁ బాపిష్ఠసాంకర్యంబు వహించియుండెద వని శపించె. నదియు విని నీవును నట్ల యగుదని పునశ్శాపం బొసంగె, నయ్యెడరున భగవంతుం డగు చతుర్భుజుండు పార్షదచతుష్టయంబుతో నరుదెంచి సరస్వతిం గరంబున నదిమి పట్టి వక్షఃపీఠంబున నునిచి, రహస్యవిజ్ఞానం బుపదేశించి శాపప్రతీకారంబు కల్పావసానం బని నుడివిన నమ్మువ్వురుం జేడ్పడియుండు నెడ లక్ష్మిం గాంచి. ౧౫౭

క॥ క్షీరాబ్ధిజ! ధర్మధ్వజ, భూరమణుని పురముఁ జేరఁ బోయి యయోని
ప్రారంభవశత వాని కుమారికవై వృక్షరూపవై యుండు మొగిన్. ౧౫౮

సీ॥ నా యంశమున దైత్యనాథుఁ డొక్కఁడు శంఖ, చూడుండ నెడివాని సుదతివగుచుఁ
పిదప మత్పత్నివై ప్రేమఁ గాంచెదవు ర్త్రె, లోక్యపావనివి సుశ్లోక వగుచుఁ
దులసీసమాఖ్యచే నిలుమని సిరిఁ దేర్చి, యంశంబునను నిమ్నగాకృతియును
గాంచ నబ్భారత ఖండంబునను భార, తీ శాప మిట్టులఁ దీరు నీకుఁ

గీ॥ బుణ్యుఁడు భగీరథుఁడు గొనిపోవు కతన, నీకు భాగీరథీఖ్యాతి నివ్వటిల్లు
నాదు నంశంబు శంతను మేదినీశు, నకును రాణివి గమ్ము నిర్ణయము సుమ్ము. ౧౫౯

క॥ అని గంగ నూరడించుచు, వనజాక్షుఁడు వాణిఁ జూచి వచియించె సతీ!
యనుభవము దప్ప దేరికిఁ, జను నదివై పిదప బ్రహ్మసదనము గనుమీ! ౧౬౦

చ॥ నళినజపత్నివై నిలు మనారతమున్ విధియోగ మిట్టులై
ఫలము నొసంగె గంగ శివపట్టణమందు వసించు లక్ష్మి మ
న్నిలయమునంద యుండెడి ననింద్య గుణాకర శాంతచిత్త ని
చ్చలు సహధర్మచారిణియు సాత్త్విక రూపయు నా కతంబునన్. ౧౬౧

గీ॥ శాంతరూప సుశీల నిశ్చలమనోను, వృత్తులఁ జరించు పడఁతులు విభుని మెచ్చు
లటులఁ గామిఁ గదా యిట్టులయ్యె వారి, సంచితము లేమనందునో సంయమీంద్ర?

క॥ భార్యలు భృత్యులు బంధువు, లార్యులు గాకున్నఁ గడమ యగు టబ్బురమే
భార్యాధీనతయున్ బహు, భార్యత పురుషునకుఁ గీడు బాటగు టరుదే? ౧౬౩

ఆ॥ కలహశీలలైన కాంత గల్గుట కంటె, నడవిలోన వృక్షమగుట మేలు
జలము స్థలము ఫలము సర్వంబు సులభంబు, కాన గాదు సుఖనిధానమదియు. ౧౬౪

సీ॥ కారుచిచ్చులనైనఁ గదిసి నిల్వఁగవచ్చు, రెచ్చు బెబ్బులిఁ బట్టవచ్చుఁ జుమ్మ
దుష్టకాంతాసంగ దోషంబు కష్టాతి, కష్టంబు జనులకుఁ గనెద రేని
యిహపరంబులఁ గర్మ మెద్ది చెందరు పడంతులతోని జంజాటములసెనేని
అంగనావశుఁడై న[illegible] జన్మమృతుం, డౌటఁ గాఁ దెలియుట యనఘతమము

తే॥ వ్యాళవిషముఖ్యకీలలనలమవచ్చు, దుష్టకాంతాముఖజ్వాలనదొడరు టరుదు
మృతిగనుట చాల మేలగునెమెలఁతలకును, జిక్కియుండుట నరకంబునక్షితితలమున.

గీ॥ పావకజ్వాలలో నిల్వఁబడఁగవచ్చు, వ్యాఘ్రిముఖమున నైన నిల్వంగవచ్చు
దుష్టకాంతాముఖంబునఁదొట్రుపడక, నిలుచునే? యెంతవాఁడైన నెనెఱతనమున.

సీ॥ పతికి మార్వలుకక - పనులు నిర్వర్తించి, యెదుట నిల్వఁగఁగల్గునిందువదన
పిలిచినప్పుడె వచ్చిపేర్మి మీఱఁగ మాట, లాలించి లాలించు - నంబుజాక్షి
పరుషభాషలఁబోక్కిపడక సాత్త్వికవృత్తి, బతివశ్యమైయుండు - పద్మగంధి
గయ్యాలితనమునగద్దించి సవతుల, నెరవెట్టఁజూడని - యిగురుఁబోఁడి
తే॥ గీ॥ పురుషునకు నైహికస్వర్గభోగ మనుట, వింతగాదది యెవ్వాసెయింతి యట్టి
పొగడు నొందునో వాఁడెపో - భోగిసుఖియు, వల్లభుఁడుకానివాఁడు జీవన్మృతుండు.

క॥ అని యిట్లు జగన్నాథుఁడు, వనితలఁ బదరంగ వెఱచివారడలుచు వే
దన నొంది బాష్పధారలు, కనుఁగవలఁ దొరఁగ శోకగద్గదికలచేఁ. ౧౬౮

క॥ పతిఁ గౌఁగిలించి దుఃఖో, ద్ధతిఁ జిత్తముఁ ద్రిప్పలేమిదైత్యాంతకుఁ డ
య్యతివలఁ గని నాచెప్పిన, గతి నుండెదరని వచింప - గగనతటిని తాఁ. ౧౬౯

సీ॥ అతివలమై యిట్టి - యపరాధ మొనరిచి, పతిని బాయుట మాకు - భావ్యమగునె?
సిందకు లోఁబడి - నిలిచి జీవించుట, బ్రతికియుఁ జచ్చినపాటిగాదె?
పతిపరిత్యక్తలై - బ్రతికియున్నా రను, నాడిక యాకల్పమగునుగాదె?
దేహముల్ త్యజియించి - దేవదేవుఁడనైన, పతిని నిఁక గలయుట - ఫలముగాదె
తే॥ కాన నిన్నెడఁ బాయంగఁ - గాదు మాకు, నిజము నీయాన ప్రాణముల్నీరుచేసి
నిన్ను నెనసెద మని గంగనిజముఁబల్క, బ్రాహ్మి యిట్లని పలికె న ప్పతినిజూచి.

సీ॥ ఏ యపరాధ మీతయెడ నిశ్చిత మొనర్చి, నను విడనాడెదో - నాథ! నీవు
నిర్దోషమైనట్టి - నెలఁతను విడుచుట, స్త్రీవధంబని స్మృతుల్ - సెప్పఁగాదె?
యింత సాహసవృత్తి - కిచ్చగించినవాఁడు, నారకుం డగుట యన్యాయమగునె?
నీవు మనస్ఫూర్తినిజముఁ బల్కుటమైన, దేహంబు తృణముగా - ద్రెంచుటరుదె?
తే॥ ధర్మపత్నిని నన్ను నిర్ధాత్మతత్త్వ, పండితిని వీడఁ జూచినఁ - బాప మిత్తుఁ
దప్పదని పల్క లక్ష్మి యత్యంతవినయ, వచనరచనలఁ బతితోడఁబలికె నిట్లు.

సీ॥ సత్త్వమూర్తివి నీదుజంటఁబాయఁగఁజాలఁ, గ్రోధంబు క్షమియించుకొనఁగవలయు
వహ్నిసాక్షిగను వివాహితనై నీకుఁ దక్కిన దాన నా - తప్పుఁగాచి
సానుగ్రహాలోక - మూనుము భారత, ఖండంబులోన శోకమును బొంది
యెంతకాలము నిల్తు - మిన్నలిటు నీదు వరణముల్ గనకొంటు - ప్మాతలమున

తే॥ స్నానసంస్పర్శనంబులఁ జడల కెవ్వడుఁ, బాపులాత్మీయ పాపముల్ వాయ మమ్ముఁ
బూనియుందురు తన్ముక్తి పొసఁగునెట్లు, నిన్నుఁ గనుటెట్లు ప్రాణేశ నిజముఁ దెలుపు.

క॥ కళచేఁ దులసీ రూపం, బలవడి ధర్మధ్వజుని గృహంబున సుతనై
గలిగి భవత్పద సేవన, కెలమిం బ్రాపించు టెట్లొ యే నేమందున్. ౧౭౩

వ॥ అని వెండియు నిట్లనియె. ౧౭౪

క॥ సారస్వత శాపంబున, భారత ఖండమున గంగ పరివహింపఁ గృపా
పారీణత, నెన్నఁటికిఁక, నారమణిం దెచ్చుకొనెద వాత్మముదమునన్. ౧౭౫

చ॥ సురనది శాపమొంది కడు సుక్కు సరస్వతి భారతంబునం
దరుదగు నిమ్నగాకృతి నహర్నిశముల్ బ్రవహించుచుండు నీ
చరణ సరోజసన్నిధి పొసంగుట యెట్లగు? శాపమోచన
స్థిరశుభసిద్ధి యెట్లగునొ; చెప్పుమటం చని మాటిమాటికిన్. ౧౭౬

క॥ గంగకు కైలాసము భా, షాంగనకున్ బ్రహ్మసదనమంటివి వారీ
భంగమున కోర్వఁజాలరు, సంగతమగు వృత్తి నీర్ష్య సహియింపఁదగున్. ౧౭౭

మ॥ వనితారత్నము వార్ధికన్యక మహావాల్లభ్య మొప్పార ని
ట్లనుచున్ విన్నప మాచరించుచుఁ బదాబ్జాగ్రింబులన్ జేరి వి
న్నని నెమ్మోమున నిట్లు పల్కఁగ మహానందంబునన్ భార్గవిన్
దన వక్షంబునఁ జేర్చి యిట్లనియె నో తన్వీ? మదిన్ మెచ్చితిన్. ౧౭౮

క॥ నీమాట లాలకించితి, నీమది సంతోషసిద్ధి నే నొనరింతున్
నా మందిరమున భారత, నీమన్ వాగ్దేవి నిలువఁ జేతున్ వినుమీ. ౧౭౯

శా॥ అర్ధాంశమ్మున బ్రహ్మలోకమున నట్లర్ధాంశచేఁ బుణ్యకృ
త్తీర్థంబై భువి భారతంబునను నెంతే వేడ్కచే నుండు నీ
యర్థం బాపెకుఁ దప్పనేరదు మదీయప్రీతియున్ గల్గు న
త్యర్థంబున్ విహరించుఁగాత మని నెయ్యం బొప్ప వెన్నుం డొగిన్. ౧౮౦

వ॥ మఱియు గంగానది తెఱంగెఱింగించెద వినుమని యిట్లనియె. ౧౮౧

మ॥ ఇనవంశ్యుండు భగీరథుం డనెడు ధాత్రీశుండు కార్యార్థియై
తనుఁగొంపోవు నొకంశచేఁ ద్రిభువనస్థానంబులన్ నిల్చి పా
వనతన్ గూర్చుచుఁ దన్నివాసులకు సాఫల్యంబు గల్పించు నా
ధుని యోగంబున శంభుసన్నిధియుఁ జెందున్ సిద్ధిగాంచున్ మదిన్. ౧౮౨

సీ॥ నీ వొండుకళ నూని - నీరజారాతిని, నెనసి పద్మావతి - యనెడు తటిని
వై భారతంబున - వర్తించి తులసినై, వృక్షరూపంబున - వెలసి కలిని
పంచసహస్రాబ్ద - పరిమాణకాలంబు, గడపి నన్నంతట - గలయఁగలవు
సంవత్సరంపరా-సంధాయకంబులు, గలవు భారతనామ-ఖండమునను ౧౮౩

తే॥ పెక్కువస్తువు లన్నిటఁ - బేరుకొనఁగ, నాదు సద్భక్తిగలిగిన - నరుఁడు ముఖ్య
తీర్థమై యొప్పు నమ్మహా-తీర్థసేవ, మీకుఁ బాపాపహారియై - జోకఁగాంచు.

వ॥ కావున మన్మంత్రోపాసకులును, మదీయచరణారవింద భజనానందులును, బహువిధకైంకర్యపరాయణులును, నగు మద్భక్తుల దర్శనస్పర్శనావగాహనంబుల మీదు దురితంబు లడంగు, భూమండలంబున నిఖిలతీర్థకోటులు మద్భక్త దర్శన స్పర్శనంబుల పవిత్రంబులగు మహాతీర్థంబు లగు వారలచ్చటచ్చటం దిరుగుచుందురు. మహాపాతకోపపాతకంబు లొనర్చియు మద్భక్తదర్శనంబుల జీవన్ముక్తులగుదురు. ఏకాదశీహీనులును, సంధ్యాహీనులును, నాస్తికులు, నరఘాతుకులు, అస్థిజీవులు,మాంసజీవులు, ధావకులు, గ్రామయాజకులు, వృషవాహులు, విశ్వాసఘాతుకులు, మిత్రఘ్నులు, మిథ్యాసాక్షులు, స్థాప్యహరులు, అసగ్నులు, జారులు, పుంశ్చలీపతులు, తత్పుత్రులు, శూద్రసూపకారులు, దేవలులు, అదీక్షితులు, పితృమాతృభ్రాతృభార్యాతనయసుతాగురుభగినీ శ్వశ్రూశ్వశురదూరులు, అశ్వత్థనాశకులు, మద్భక్తనిందకులు, శూద్రాన్నభోజులు, దేవవిప్రద్రవ్యాపహారులు లాక్షారసాదివిక్రేతలు, శూద్రశవదాహకులు మొదలగువారు మద్భక్తస్పర్శనదర్శనంబులం బవిత్రులగుదు రట్టి మహాత్ముల సంగమంబున మీకుం బాపంబులు బొరయనేర వని తెల్పిన మహాలక్ష్మి భర్తతో నిట్లనియె. ౧౮౪

సీ॥ హరిభక్తి లేక య-హంకారవర్తులై, స్వప్రశంసారత-శఠత నూని
యంధులౌ వారల - నాత్మపాదరజంబు, సోఁకునంతటఁ బ్రోచు - సుకృతులైన
తద్భక్తజనుల పా-దస్పర్శసంబునఁ, బావనంబగును భూ-భాగమెల్ల
నదియ తీర్థముగాక - యమ్మయమ్ములు శిలా,మయములు తీర్థనా-మములె తెలియ

ఆ॥ వె॥ నెట్టి తీర్థమైన - నేకక్షణంబునఁ, బావనతను గూర్పఁ-బాలుపడునె?
దేవ! నీదుభక్తి - సేవ యొక్కటిగాక, యవని వేఱ తీర్థ - మనఁగఁ గలదె ?

క॥ అట్టి మహాత్ముల లక్షణ, మిట్టి దని వచింపు మనిన - నీశ్వరుఁడు కృపా
ధట్టము పెనఁగొన సిరితో, నిట్టని తెలుపందొడంగె - నింపు దలిర్పన్.

సీ॥ దేశికోక్తుల మంత్ర-దీక్షఁ గైకొని మాల, మంత్రంబు జపియించు-మానవుండు
పరమపవిత్రుండు - పుణ్యస్నానంబుల, శతమైనఁ గడతేర్పఁ - జాలునతఁడు

నాకంబునందున్న । నరకంబునందున్న, నెందేని జన్మంబు । లొందియున్నఁ
దన పితృవర్గంబు । ననుచు మన్మత్కికి, మద్భక్తియుక్తుఁడు । మద్గుణములు

తే॥ గీ॥ గుణకథలు విన్నమాత్రఁడసద్గతికఁ బొడమి, సాశ్రు నేత్రతఁ బారవశ్యంబునొందు
నతఁడు మద్భక్తుఁ డాతఁడ । యమరలోక, ధాత్రులోక సుఖంబైన । దక్కఁగొనఁడు

క॥ బ్రహ్మలు మొదలుగ నిఖిల, బ్రహ్మాండంబులును బూదిసపాలగు నన్మ
ద్బ్రహ్మాత్మకవాది జనములు, బ్రహ్మణ్యులు వారు చెడరు । ప్రళయామలచేఁ.

క॥ భారతఖండంబునను న, నారతము నిట్టిజను లనంతము వారల్
కోరి చరింతురు మీామీా, తీరములఁ గలవు పుణ్యతీర్థము మీాకున్. ౧౯౦

చ॥ కలిగెను నాదుసన్నిధి నఖండమదీయపదారవింద సే
వల దృఢనిష్ఠులైన బహు । వైష్ణవు లచ్చట; వారి సేవచే
నలలితమత్పదాంతికము । నందియ మందక శాపముక్తులై
కలయుఁడు న న్నటంచనియెఁ । గాంచన వాసుఁడు; మీాఁద వారలున్. ౧౯౧

సీ॥ ఆది సరస్వతి । యధిపుశాసనమున, నర్ధాంశమున నంద । యధివసించి
అర్ధాంశమునఁ బుణ్యమైన భారతమునఁ, బుణ్యవాహినియౌచుఁ । బొదలి మగని
వాగధిష్ఠాత్రియై । వాణినా వెలయుచు, సరసులచే సరస్వతి యనంగఁ
దనరుచుఁ బుణ్యతీర్థంబయి పాపుల, పాపంబులను బూదిసపాలు చేసి,

తే॥ వెలసె గంగయు నేకాంశకలితయౌచు, నలభగీరథు కార్యార్థ । మవతరించి
యచ్చటన శంభుమౌళి సమాశ్రియమున, నలరె భాగీరథి యనంగనవనిలోన.

క॥ సిరియును గళచేత వసుంధరఁ బద్మావతి యనంగఁ । దటినీమణియై
కర మలరి భారతంబున, హరిశాసన మంది మఱియు । నపరాంశమునన్. ౧౯౩

సీ॥ ధర్మధ్వజునకును । దనయయై తులసినా, విఖ్యాతి నొంది యిశ్వ్వమెల్ల
వృక్షరూపంబున । వెలయించెఁ గలిలోనఁ, బంచసహస్రాబ్దపరిమిత మగు
కాలంబు జరిగిన । కైటభమర్దను, సన్నిధినొంది రీసరణి మువురు
కృతమెంత వారికిఁ । గెడయునే? దృష్టాంత, మీద్దేవులే మన । కెద గణింప

తే॥ గీ॥ మఱియు నొక్కటి వివరింతుసమాని! కాశి, తులసి దక్కిన భూస్థలిఁగలుగుతీర్థ
బృంద మెల్లను హరిఁజేరుఁ । బిదప నైదు, వేల కలివత్సరమ్ముల । వేళయందు.

వ॥ సాలగ్రామంబులును, జగన్నాథ మహిమంబును దప్ప, వైష్ణవసిద్ధాంతంబులును,
పురాణంబులును, శ్రాద్ధతర్పణాదివేదోక్తకర్మంబులును సత్యధర్మంబులును వేదం
బులును గ్రామదేవతలును వ్రతవాదివ్రతంబులు వైకుంఠంబునం జేరు, నది

మొదలుకొని కలి ప్రబలంబై తనధర్మంబులు ప్రకటించు దత్ప్రకారంబు వినుమని యిట్లనియె. ౧౯౬

సీ॥ కంటికింపైనట్టి కాంతలఁ గనుగొన్నఁ, గలయంగఁ జూతురు కామవశతఁ
గలనైన సత్యంబుఁ బలుకరు చౌర్యంబుఁ, బరహింసయును జాలఁ బ్రబలఁ జొచ్చుఁ
దులసి నర్చింపంగ దొరకొన రాలాప, పారుష్యమును నహంకారఘనత
వావి వర్తనములు వదలుచు సౌఖ్యంబె, పురుషార్థమని యిచ్చఁ బొంగిపడుట

గీ॥ స్త్రీలయాలోచనంబులఁ జిత్తగించుట, తనకు నిల్లాలు గృహలక్ష్మి యనుట యన్న
దాతలందైన సాహసోద్ధతి పొసంగి, బాధఁ జేతురు తర్జనభర్జనముల.

గీ॥ యోనిసంబంధ మధికమై యుల్లసిల్లు, మాతృపితృబంధువులమీఁద మమత కొఱఁతె
చేటులును దాసులును నింటిపాటుగనుదు, రర్థవంతులు బలవంతు లగుదు రవని.

సీ॥ ఎల్లకర్మంబులు నేటిపాలొనరించి, యజ్ఞసూత్రములు చిహ్నములుగాఁగ
బ్రాహ్మణుల్ నామమాత్రత సంచరింతురు, క్షత్రియవిట్ఛూద్రజాతులెల్ల
నాచారమెడలి మ్లేచ్ఛాచారులై మ్లేచ్ఛ, శాస్త్రముల్ పఠియించి సంచరింతు
రధమసేవకులోఁగి యగ్రవర్ణులసూప,కారులై తత్తదగారములను

తే॥ మెలఁగుదురు నాఁడు నాఁటికి మేదినీత,లంబు దురితావహంబయి లక్ష్మిఁ బాసి
లేమి తఱచైనఁ దేజంబు లేక మిగుల, జీర్ణదశనొందు వేయింకఁ జెప్పనేల. ౧౯౭

సీ॥ సస్యహీనత ధరాచక్రంబు నశియించి, ఫలహీనతను జెందుఁ బాదపములు
ధర్మహీనత నృపుల్ ధరణిఁ బాలింతురు, సతివలలో భర్తృహైన్య మెసఁగు
నదు లప్రవాహత నసువొందు నంతంతఁ, బుణ్యకర్మములెల్లఁ బొడవడంగు
లక్షలందైనను లక్షింప ధర్మిష్ఠుఁ డగపడఁ డడవులౌ నఖిలదిశలు

గీ॥ వనగిరుల బంది తఱచగు వైష్ణవులను, లెక్కసేయరు పీడ లెల్లెడ ఘనమగు
నుత్తమక్షేత్రములనైన హత్తి పైరు, పంటపండదు సఖ్యంబు పాటిగొనదు.

క॥ హింసకదాంభికచోరనృ, శంసానృతభాషిమలినజడరోగి నయ
ధ్వంసకజనములు తఱచై, మాంసాశన మన్న వెఱపు మాలుదు రెలమిన్. ౨౦౦

గీ॥ పదియునాఱవయేఁటనే ప్రజలలోనఁ, దలలు నెఱెయుట కదలుచు దంతపటలి
పట్టుదప్పుట వార్ధకప్రబలతయును, గలిగియుండును దృష్టివికార మొదవు. ౨౦౧

సీ॥ అష్టమవర్షంబునందుఁ గన్యకలకుఁ, బుష్పోదయపుసముద్భూతి పొదలు
నది మొదల్ బిడ్డల [illegible] సూతు లుడుఁగు

సతులలో సంతానపరత లచ్చటచ్చట, వెదకినఁ గలవొటఁ । దుదకు నోదవు
ధనమునకై కన్నతనయుల విలుతురు, శైలూషులై జీవచర్యఁ గందు

తే॥ గీ॥ రన్నవిక్రయణంబు పెరక్కాను ధరణి, దనమ చెల్లెండ్ర నక్కాల । ధనులకడకు
నంపి యార్జించుకొందురనల్పధనము, లతిథులను వీడిభుజియింతురల్పమతులు.

సీ॥ దేవతావృత్తిభూ దేవతావృత్తుల, నపహరించుచు నుండ్రు । నృపవరులును
ఆత్మదత్తంబులు । నన్యదత్తంబులు, నగు భూము లార్జింతు । రవనిపతులు
ఆత్మకాంతలనైన । నన్యకాంతలనైన, సరి గారవింతురు । నరవరులును
న్యాయార్జితంబు నన్యాయార్జితంబును, నైన విత్తముఁగూర్తు । రధిపతులును

తే॥ వావివర్తనలెల్లఁ బోవదలి యిచ్చ, వచ్చినట్టు లగమ్యల । దచ్చనంపు
మాటలకు లోనుబలుచుచు । మదనవశతఁ, గామపుసార్థలోలతఁ గందు రిజనులు.

వ॥ మఱియు నక్కాలంబున నధర్మంబు చతుష్పాదపూరితంబై విహరించునయ్యెడ నలీక
వాదులు, జారచోరులు, లంపటులు, హింసకులు, సారఘాతులు, బ్రహ్మఘ్నులు,
లాక్షాలోహవిక్రేతలు, షడ్రసవిక్రియులు, వృషవాహులు, శూద్రశవ
దాహులు, శూద్రాన్నభోజులు, వృషలీపతులు, యజ్ఞసూత్ర విహీనులు, సంధ్యా
శౌచరహితులు, పుంశ్చలీరజస్వలాగాములు, యోనినియమరహితులు, నాశ్రమ
పరిత్యాగులు, మ్లేచ్ఛసఖులునై యగ్రవర్ణులు మెలంగుదు రనునెడ నితరులఁ జెప్పం
బనియేమి? హస్తమాత్రప్రమాణవృక్షంబులు నంగుష్ఠమాత్రపరిమాణమానవులు
నుంగలిగి కాలంబు లయకాలంబునుంబోలి వర్షశూన్యయు వృక్షశూన్యయు గృహ
శూన్యయునై ధరణి యుండునెడ, ద్వాదశాదిత్యోదయంబై సర్వంబు నీఱునేయం
దత్కాలంబున విష్ణుయశుం డను విప్రునకుఁ బుత్రుండై కల్క్యవతారంబున
జగన్నాథుం డుదయించుఁ; దపస్సత్త్వయుక్తంబై ధర్మంబు పూర్ణంబగుఁ; దపస్వి
జనంబులు ధర్మిష్ఠులు వేదజ్ఞులు నగు బ్రాహ్మణులును బతివ్రతలును యోగులును
దలుచగుదురు. రాజులు విప్రభక్తి గలిగియుండురు. వైశ్యులు వాణిజ్యరతులై
ధార్మికు లగుదురు. శూద్రులు పుణ్యశీలురు విప్రసేవకులు నగుదురు. చతుర్వర్ణం
బులవారు విష్ణుయజ్ఞపరాయణులును విష్ణుమంత్రరతులును విష్ణుభక్తులును శ్రుతిస్మృతి
పురాణధర్మజ్ఞులు నగుదురు. ధర్మంబు పూర్ణంబగు. త్రేతాయుగంబున ధర్మంబు
త్రిపాదంబు, ద్వాపరంబున ద్విపాదంబు, కలినేకపాదంబు, వారంబు లేడును, తిథులు
పదియాఱును, మాసంబులు పదిరెండును, ఋతువులాఱును, పక్షద్వయంబును, అయన
ద్వయంబును, అహోరాత్రంబులు, నాల్గునాల్గుయామంబులు గల్గి త్రింశద్ది
వసంబుల మాసంబగు, నిక్కాలంబు సంఖ్యాక్రమంబునఁ దత్ప్రమాణంబులఁ
గొన్ని దినంబుల బ్రహ్మవిలయంబు గలుగు, నది ప్రాకృత ప్రళయం బనంబడు,

నయ్యెడ వసుంధరయదృశ్యయగు, విశ్వంబులు జలప్లుతంబులగు, బ్రహ్మవిష్ణ్వాదులు దేవర్ష్యాదులు పరాత్పరుండగు కృష్ణునందు విలీనులై యుందురు. ఇక్కాలంబు కృష్ణున కొక్క నిమిషంబు, బ్రహ్మాండంబులు నిమేష నిమేషంబునం బుట్టుచు నణంగు చున్నను గోలోకవైకుంఠ కైలాసంబులు సపార్షదంబులై నిత్యంబు లగు చుండు, కల్పగణనంబును బ్రహ్మాండగణనంబును నెవ్వఁడెఱుంగు. సర్వంబున కీశ్వరుం డొక్కరుండ, అతఁడు ప్రకృతికిఁ బరుండగు, కృష్ణుంఁడును బ్రహ్మాదులును దదంశంబులు, అతండు మహావిరాట్టనంబడు, తదంశంబున క్షుద్రవిరాట్సహస్రంబు లగు, కృష్ణుండు చతుర్భుజుండును ద్విభుజుండును నై సృష్టి యొనర్పుఁ; దదంశంబుల బ్రహ్మాదులు తత్ప్రవర్తకు లగుదురు. అతండు మహావిభూతియు సర్వజ్ఞుండును సర్వ దర్శకుండును సర్వవ్యాపియు సర్వేశ్వరుండును. తన్మాయ ప్రకృతి యనంబడు నదియ వేదమాతయు సావిత్రియునై ద్విజపూజ్య యగుచుండు.

సీ॥ అద్దేవి సర్వవిశ్వాతిశాయిని సర్వ,వంద్య సర్వస్తుత ౪ వాసుదేవ
వామాంగసంభూత ౪ వరుఁడు శ్రీకృష్ణుని, ప్రాణంబ యగుచు సర్వాధికమగు
రూపంబు తేజంబు ౪ రూఢి సౌభాగ్యంబు, గలిగి రాధిక యన ౪ జలరుహాక్షు
వక్షస్థలంబున ౪ వసియింపఁగాఁ గోరి, శతశృంగమున బహుశతసహస్ర

తే॥ హాయనములు నిరాహారయగుచుఁ దపము,సల్పి శ్రీకృష్ణమూర్తి వక్షస్థలమున
నధివసించె జగన్నాథుఁడఖిలసిద్ధి, దుర్లభం బగు వరమిచ్చెఁ ౪ దొయ్యలికిని. ౨౦౬

శా॥ దేవీ! నీవు వరిష్ఠవై సతులలోఁ ౪ దీప్తిన్ విజృంభించి సం
భావింపన్ దగు దంచు వల్లభులలోఁ ౪ బ్రాణంబుగాఁ జూచుచున్
సావాసంబు ననుగ్రహించెఁ దపమే ౪ సాధించె నీ పేర్మి త
చ్ఛ్రీ వర్ధిల్లఁగఁ జేయదే సురమునీ! ౪ చిత్తంబునన్ గంటివే. ౨౦౭

ఉ॥ అట్టులు దివ్యహాయన సహస్రము శీతనగంబుమీఁద లోఁ
బట్టగు నిష్ఠచేఁ దప మపారముగా నొనరించి దుర్గ య
ప్పట్టున సర్వపూజ్య యయి ౪ భాసిలె నట్ల తపోగరిష్ఠయై
నెట్టన గంధమాదనవనిన్ బహుదివ్యసహస్రవర్షముల్. ౨౦౮

క॥ భారతి తప మొనరించుచుఁ, జారుతరప్రౌఢిఁ గృష్ణు ౪ సమ్యక్కృపచే
గౌరవముగాంచి సర్వ వి,శారదయై ప్రతిభఁగాంచె ౪ సర్వజ్ఞతచేన్. ౨౦౯

సీ॥ షష్టివర్షసహస్రసంతప్తుఁడై నల్వ, శతసహస్రంబుల ౪ శంకరుండు
మన్వంతరశతంబు ౪ మాధవుండును దశ, మన్వంతరముల ధర్మాత్ముఁడును
తపము నొనర్చి సంతతపూజ్యులైరి తా,పసులును మన్వాది ౪ పార్థివులును
బ్రాహ్మణుల్ కృష్ణుని ౪ భగవంతు నర్చించి, తప మొనరించి యుదాత్తసిద్ధి

తే॥ నొందిరటుగానఁ గృష్ణుని యురుమహత్త్వ, మభినుతింపంగ నాబోటి కగునె? యనుచు
సంస్తుతింపుచు సురమౌని సంతసింప, హసితముఖుఁడయ్యె నపుడు నారాయణుండు.

ఉ॥ అయ్యెడ నారదుండు వినయంబున నమ్మునిఁ జూచి ముక్తిసా
హాయ్యము నీ కృపాతిశయ మబ్బురమయ్యెఁ గృపాప్తి నాయెడన్
నెయ్యము మీఱి సంశయ మనిందితవృత్తిని బాపఁగావలెన్
జయ్యన నంచుఁ బల్కె మునిచంద్రుని జూచుచుఁ గేలు మోడ్చుచున్. ౨౧౦

సీ॥ అంబుజాక్షు నిమేష మంభోజసంభవు, పాతం బదియె సుమ్ము ప్రకృతివిలయ
మట్టి సంవర్తంబు నందు నంతర్ధాన, మొందె విశ్వములు గోవిందునందు
లీనంబు లయ్యెడు లేదు వసుంధర, యని వచించితివి సృష్ట్యాదియందు
విశ్వధాత్రీసమావిర్భావ మెట్లగు, సర్వాశ్రయంబైన క్ష్మాజననము
తే॥ విశ్వమంగళ మది గాన విస్తరించి, తెలియఁ జెప్పంగవలయు నో దేశికేంద్ర!
యనిన సంతసమంది నారాయణుండు, పలికె దేవమునీంద్రుతోఁ బ్రస్తుతంబు.

క॥ సర్వాది సృష్టి విశ్వము, సర్వంబును గృష్ణువలన సంభవ మొందున్
సర్వశ్రుతి సిద్ధాంతము, నిర్వాణము నొంది యందె నిలుచు జగంబుల్. ౨౧౨

క॥ ఆవిర్భావంబు తిరో,భావము ప్రళయంబు నివియుఁ బంకజనేత్రి
ప్రావీణ్య కారణంబులు, గావున వివరింతు వినుము కారణచర్యల్. ౨౧౩

క॥ కొందఱు మధుకైటభని, ష్యందవపుర్మేద మనుచుఁ బలుకుదురు వినం
గం దగు మన్మతము శతా,నందతనూభవ! వచింతు నర్మిలి వినుమీ. ౨౧౪

క॥ మధుకైటభు లాహవమున, విధిజనకునితోడ నిట్లు వేడిరి మమ్మున్
వధియింపు ధరావిరహిత, పథమున నను పల్కు శ్రుతినిబద్ధం బయ్యెన్. ౨౧౫

ఉ॥ దైత్యులు పుట్టువేళ వసుధాతల మేటికి లేకయుండెఁ బ్రి
స్తుత్యపరాక్రమస్ఫురణ సోఁకులఁ గూల్పఁగ రోమకోట్లయం
దత్యయవేళ నిప్పుడమి యంతయు లీనమొనర్చె మీఁద స
త్ప్రత్యయలీలఁ గానఁ బలుకఁ బర్వగత మే విధియయ్యె భ్రాంతిచేన్. ౨౧౬

క॥ ఆ దానవమేదంబుల, నాదట సంసృష్ట యగుట నవనీస్థలికిన్
మేదిని యని భ్రాంతికృతా,పాదన యిటులయ్యె వినఁగఁ బథ్యమ్మగునే. ౨౧౭

గీ॥ ధర్మువలన వింటి ధాత్రీజనుస్థితి, సర్వమంగళంబు శ్రవణ సుఖద
మద్ధరిత్రిపుట్టు వాద్యంత విశదంబు, గాఁగ వినుము మన్ముఖంబువలన. ౨౧౮

సీ॥ సర్వభూతాంతర సంస్థితుండును సర్వ,గుండు సర్వాతీత ఘోరమూర్తి
యగు విరాట్పూరుషుని యంగరోమంబుల, వివరాంతరంబుల విలయవేళ



టిప్పణి” ౨౧౨ - ౨౧౩, ఈ రెండుపద్యములును, ఇప్పటి మూలమునకు సరిపడవు.

ధాత్రియడంగి యక్తతఁ గడతేఱిన, బహిరుదంచితవృత్తిఁ బరఁగుచుండు
నటులఁ దిరోభూతి యటుల నావిర్భూతి, సర్వవిశ్వంబులు సంభవించు

ఆ॥ వె॥ సప్తసాగరములు సప్తాంతరీపముల్, సప్తశైలములును సర్వలోక
సముదయంబుఁ గల్పసమయంబులను జగ,న్నాథునందుఁ బూర్ణబోధ మొందు.

క॥ ఇది యది యననేటికి హరి, యుదరములో సర్వజగము లుంచును మాయా
స్పదవృత్తి నస్తినాస్తులు, విదితం బొనరించు నిగమవేద్యుఁడు తానై. ౨౨౦

ఉ॥ ఎద్దియు లేనివేళ జగదీశ్వరు తావులు రెండు నిల్చు న
న్మద్దయఁ దండ్రి దెల్ప విని సంతసమందితి నా నివాస మా
పద్దురితాటవీదహనభాస్వరమైన పరంపదం బగుఁ
బెద్దల వాక్యనిశ్చయము పేర్మి బహుశ్రిత మయ్యె నెమ్మెయిన్. ౨౨౧

వ॥ అదియునుంగాక సంవర్త సమయంబుల నశ్వరంబులును గృత్రిమంబులును నగు విశ్వంబులు మహావిరాట్టునందు నడంగి సృష్ట్యాదిఁ బునస్సృష్టంబు లగుచుండు స్థితిపరిలయంబులు నిత్యంబులు, సర్వాధిష్ఠాత్రియై వరాహపూజిత యగు నివ్వసుంధర మునిమనువిప్రగంధర్వాదులచే సంభావింపఁబడు విష్ణుపత్నిగా నెఱుంగుము. శ్రుతి రాద్ధాంతితం బిట్టిది. తత్పుత్రుండు మంగళుఁడు, మంగళపుత్రుండు ఘటేశుండు, భూమి బహుజననియు సర్వాధారయు నని తెల్పిన నారదుండు వరాహపత్నియగు నిమ్మహీదేవి యేయే రూపంబులఁ బూజితయగుఁ దత్పూజావిధానంబును మంగళ ప్రాదుర్భావంబును విశదంబుగా వివరింపు మనిన నారాయణుం డిట్లనియె. ౨౨౨

సీ॥ ఆదివరాహమై యచ్యుతుండు హిరణ్య, లోచను వధియించి లోకులకయి
నెమ్మది నాధాత్రి నిలిపె జలంబులఁ, బద్మపత్రము పోల్కిఁ బద్మజుండు
దానిపై నివసించి తగ సృష్టి యొనరించె, నయ్యెడఁ గాముకుండగుచు శౌరి
కోటిసూర్య ప్రభల గుల్కు నమ్మేదిని, మోహనమూర్తిగా మొనసి దివ్య

తే॥ హాయన సహస్ర మాప్తితో నతనుభోగ, సామరస్య పరిస్ఫూర్తి జరిపె నదియుఁ
బారవశ్యంబు నొందె నప్పాటశౌరి, తత్సమాశ్లేషమునను బోధము వహించి.

క॥ బహుహాయనంబు లంత, శ్చహిరుద్యోగములు మఱచి పద్మాక్షుఁడు త
ద్విహృతి యొనర్చుచు నంతట, వహియించెఁ బూర్వరూపవైభవ మమరన్.

మ॥ కిటిరూపంబు వహించి యచ్యుతుఁడు ముగ్ధీభూతచేతస్కుఁడై
పటునిష్ఠారతి ధూపదీపసహిత ప్రస్తుత్య పూజావిధిన్
జటులస్ఫూర్తి సమర్చనల్పి బలునిష్ఠం దృప్తిఁగావించి యు
త్కటవాచార్భటి ధాత్రిఁగాంచి పలికెన్ త్రైలోక్యసౌఖ్యార్థియై. ౨౨౩

సీ॥ సర్వచరాచరసంచయమహాచు మునిమను, సురసిద్ధ దానవస్తోమ మెల్ల
నర్చింప రాణింపు ♦ మంగనాజనముల, శుభశోభనముల వాస్తుపశ్నస్త
వాపీ తటాకకూప వనగృహారంభ,ముల నిన్నుఁబూజించు ♦ ముజ్జగములు
నిన్నుఁ బూజింపమి ♦ నిరయంబు నొందుదు, రఖిలంబునందుఁ బూజ్యతఁబొసంగి
తే॥ వెలయుమని వరమిచ్చి యావిష్ణుమూర్తి,చాల లాలింప సంతోషసహితయగుచు
విశ్వధాత్రీమహాదేవి ♦ విభునిఁజూచి,పలికెనిట్టులు మృదులసంభాషణముల. ౨౨౯.

వ॥ దేవా! భవదీయాజ్ఞం బ్రివర్తించెద. లీలామాత్రంబునఁ జరాచరంబగు విశ్వంబు భరియించెద. సర్వంసహనయ్యు ముత్తియంబులును, శుక్తులును, భవదీయాంశంబులగు శివలింగంబులును, దేవీరూపంబులును, శంఖంబులును, బ్రదీపంబులును, మాణిక్యంబులును, వజ్రంబులును, యజ్ఞసూత్రంబులును, బుష్పంబులును, బుస్తకంబులును, దులసీదళంబులును, జపమాలికలును, బుష్పరసంబులును, గర్పూరంబును, సువర్ణంబును, గోరోజనంబును, చందనంబును, సాలగ్రామతీర్థంబును మొదలగు వీనిని నిరాస్తరణంబుగా భరియింపంజాల ననిన, భగవంతుండగు జనార్దనుం డిట్లనియె. ౨౨౨

గీ॥ వసుధ నీ వస్తుబృంద మెవ్వారలైన, శూన్యభూస్థలి నిడిరేని ♦ సొంపు దఱిఁగి
కాలసూత్రంబుఁ వారికిఁ ♦ గల్పశతము, లనుభవింపంగ నగునని ♦ యానతిచ్చె.

గీ॥ అవ్వరాహమూర్తి ♦ నంటుట ధాత్రికి, గర్భమయ్యె శౌరి ♦ కళ పొసంగి
మంగళగ్రహంబు ♦ మార్తాండసమతేజ, మలరి వెడలె జగముఁలఁబ్రపడఁగ. ౨౨౮

సీ॥ కణ్వశాఖోక్తమార్గమున మానులు మనుల్, హరి యాజ్ఞ పూజించి ♦ రవని దేవిఁ
దన్మూల మంత్రంబుఁదాల్చి నైవేద్యాదు, లర్పింపవలయు భక్త్యతిశయమున
ననిన నారదుఁ డిట్టులనియె మానీంద్రుతో, ధ్యానంబు మూలమంత్రంబుస్తుతియు
వినఁగోరుచున్నాఁడ ♦ వివరింపు మన మాని,పలికె నాలిని బూన్చె ♦ భక్తయైన
తే॥ యాదిమవరాహ, మవ్వల ♦ నబ్జజుండు, మానివర్యులు మనువులు ♦ మానవులును
అమరగంధర్వ సిద్ధ విద్యాధరాదు, లర్చనలు సల్పి రిటు సేయు ♦ టబ్బురంబె. ౨౩౦

ఉ॥ తారము మాయ లక్ష్మియును ♦ దర్పకుఁడుర్వ వసుధాచతుర్థియుర్
గూరిచి వహ్నిజాయ నిడి ♦ కూడఁగఁబల్కిన *మంత్రరాజమా

*టిప్పణి: ఓమ్ హ్రీమ్ శ్రీమ్ క్లీమ్ వసుధాయైస్వాహా ఇయ్యాది మంత్రస్వరూపము, మఱియు నిమ్మహాకవి పూన్చు ధాతువును సర్వత్రపూజించు అనువర్థమున వాడియుండెను. నిఘంటువులో లేక పోవుటయే కాక నా యెఱిఁగినంతలో వ్యవహారమునఁగూడ నీ యర్థ ముపలబ్ధము కాకున్నను, కవియందలి గౌరవముచే దిద్దలేదు. వెం॥ శా॥

నేరి కగోచరం బిది మహీవలయమ్మున జ_ప్తకోటులన్
బారముఁ జేర్చి సంసరణబంధము లూడుచు శంక మానుమీ. ౨౩౧

వ॥ ఇది మంత్రంబని యెఱుంగుము. ౨౩౨

సీ॥ సితపుండరీక భాసితవపుష్మతి!, శరచ్చంద్రనిభానన! సత్ప్రభాస!
సరసపటీరసంసక్త! సర్వాధార!, రత్నభూషణభూష్య! రత్నగర్భ!
రత్నాకరాంబర! రమ్యోజ్జ్వలనచారు, ధౌతపరీధాన! ధర్మమూర్తి!
విమలమందస్మిత! విజయప్రదాయిని!, విశ్వధాత్రి! ధరిత్రి! విపుల! యనుచు.

తే॥ ధ్యాన మొనరింపఁదగు వసుంధర సుపర్వ,వరులు నిట్టులు ధ్యానించి కరముభక్తి
మానసికపూజసల్పుచు సమహితులైరి, ధ్యానమిది సుమ్ము భూమికిఁ దాపసేంద్ర.

క॥ ధరణీస్తోత్రముఁ దెల్పెద, పరిపూర్ణంబైన భక్తిభావన వినుమీ
పరమము శుభదము సర్వా,దరణీయము శాశ్వతంబు ధర్మదము సుమీ. ౨౩౪

క॥ జయజయ విజయాధారా!, జయశీల జయప్రదాన సమ్మదచిత్తా
జయ యజ్ఞకిటినితంబిని, జయ యిమ్మా! మాకు నెపుడు సౌఖ్యప్రదవై. ౨౩౫

క॥ మంగళసంధాయిని శుభ, మంగళగుణధాత్రి సర్వమంగళరూపా!
మంగళనాయిక మాకున్, మంగళము గూర్పుమమ్మ మాంగళ్యమయీ. ౨౩౬

క॥ సర్వాభీష్టవిధాయిని, సర్వాఘధ్వంసనాఢ్య! సర్వపురాణీ!
సర్వసనాతన వంద్యా!, సర్వేశ్వరి! మమ్ము నేలు సంతత మవనీ! ౨౩౭

క॥ పుణ్యాశ్రమచయ నిలయా, పుణ్యోజ్జీవన చరిత్రి! పుణ్యాధారా!
పుణ్యప్రదాన దోహల!, పుణ్యము నిండార మమ్ముఁ బ్రోవుము ధాత్రీ! ౨౩౮

క॥ సస్యాలయ! సస్యప్రద, సస్యాత్మిక! సస్యఫలద! సస్యమనోజ్ఞా!
సస్యావని నీ కుక్షికి, సస్యములము మాకు నిడు ప్రశస్యత ధరణీ! ౨౩౯

క॥ భూమిపతిపోషణోత్సవ!, భూమిపతి ధనప్రదాన పుణ్యగుణాబ్ధీ!
భూమీపోషణ కర్త్రీ!, భూమి యొసఁగి ఫలముఁ గూర్చి ప్రోవుము పృథివీ. ౨౪౦

క॥ ఇది పుణ్యతరం బిది శ్రుతి, విదితము భూస్తవము దీని వేడ్కఁ బఠింపన్
ముదమున నృపాలుఁడై సిరి, గదియన్ విష్ణుండ పోలె ఘనుఁడై యలరున్.

సీ॥ ఇది పఠించిన వారి కిల దాన మొనరించు, ఫలము సిద్ధించు విప్రవ్రజంబు
వృత్తిగైకొన్న నావిర్భూతమగు పాప, మణఁగుఁ దటాకకూపాదులందు
గాధముల్ పెంచిన కలుషంబు లడఁగు న,శ్వాలంభపుణ్య మొయ్యన లభించు
జలనిషిద్ధక్రియల్ సల్పుపాపంబులు, భస్మావశేషతఁ బాసిపోవు

తే॥ గీ॥ నిమ్మహా స్తవరాజంబు నెవ్వఁడేని, సంగ్రహముగ నర్చి నిరతంబుఁ జదివికొనినఁ
బరులకుపదేశ మొనరింపఁ బరము నిహముఁ, గరతలామలకంబులుగాక యున్నె.

క॥ నారదముని యిట్లనె నో, నారాయణ! భూమి యొసఁగు నవనవపుణ్యం
బేరీతి? పాపమెట్టిది?, యీ రీతులు దెల్పుమనిన నతఁ డిట్లనియెన్. ౨౮౩

గీ॥ పుణ్యబృందములకు నెల్లభూమిదాన, మునకు సరిలేదు పుణ్యంబు పొసఁగ భూమి
నపహరించిన స్వర్ణదోషాతిశయత, శతగుణంబగుఁ బాపంబు సందియంబె? ౨౮౪

సీ॥ వలయుకొలంది విశ్వంభర విప్రున, కిడునంత వైకుంఠ మేగువాఁడు
సస్యగర్భావని సాధువిప్రున కిచ్చి, తద్రేణుసంఖ్యగాఁ దనరు దివిని
అగ్రహారం బిచ్చునతఁడు వైకుంఠ వాసులలోన శ్రేష్ఠుఁడై వెలయుచుండు
దాత భూమి యొసంగు తఱి సంతసించిన,వాఁడు వైకుంఠ నివాసి యగును

తే॥ ప్రేరకుం డౌచుఁ బుడమి యిప్పించినట్టి, పుణ్యుఁడు వసించు హరిపురిఁ బుత్రపౌత్ర
సహితుఁడై చంద్ర సూర్యనక్షత్రతతులు, నిలుచునందాఁక నింగిని నిర్మలాత్మ!

ఉ॥ భూమి యొసంగకుండ నృపు బోధ యొనర్చినవాఁడు దుర్మదో
ద్దామ దురంతదుర్గతి నధఃపతితుం డయి పుత్రపౌత్రి హై
న్యామయనిస్వతాముఖ మహామరితంబుల నొంది జన్మ సం
స్థామితదుఃఖపుంజముల సందడి దండడి గాంచు నెప్పుడున్. ౨౮౬

క॥ గోవుల మేఁతకుఁ జన నీ, కావల నీవలను సస్యమడ్డముగా మా
ర్గావలి గ్రమ్మిన యాతఁడు, కేవల నిరయమున నిలుచుఁ గృతహీనుండై. ౨౮౭

సీ॥ గోష్ఠవాటము దున్ని కొని పైరుఁ బెంచిన, వాఁడు రౌరవమున వదలకుండు
నేకాంతమున వీర్య మిలమీఁద నిడి భూమి, రేణుమానముగ భరించు శాస్త్రి
అన్నార్థముగఁ దటాకాదు లమ్మెచు ధన, మార్జించి నిరయంబు నందునతఁడు
ధర్మార్థమై ధనదానంబుఁ జేసి స్వార్థముగ వ్యయించు నాతండు తుదను

తే॥ నిరయమును జెంది మనువులు నిలుచుదనుక, యాతనల పాలుపడి దుఃఖమనుభవించు
సూకరఖరాది జఠరనిస్తుల మహాగ్ని, వేదనల నొందుఁ దరియించు వెరవు లేక.

క॥ పరకృతవాపీకూపము,లరుదుగఁ బంకంబులూడ్చి యలరించు నతం
డిరవుకొని బ్రహ్మపదమున, నిరతము వసియించువాఁ డనిందితఫణితిన్. ౨౯౦

గీ॥ తల్లిదండ్రుల శ్రాద్ధముల్ దప్పఁద్రోచి, మహిని వర్తించునట్టి దుష్కర్మ్ముఁ డరయ
నరకమునఁబడి వెతలచే నవసినవసి, పుట్టగతిలేక దుర్గతుల్ పొరయుచుండు.

గీ॥ ఏను భరియింపలేనని యిల నుడివిన, పూజ్యమగు వస్తుబృందంబు భూమి నిడిన
వాఁడు నరకంబు లన్నింటి వదలకుండుఁ, దప్ప దీమాట యాచంద్ర తారకముగ.

గీ॥ ధరణి కంపించునప్పుడు తరణిచంద్రు, ముల కుపప్లవ మొదవిన ముఖ్య పుణ్య
కాలముల భూమి ద్రవ్వినఁ గష్టునకును, నంగహీనత వాటిల్లు నపరజన్మ. ౨౫౨

వ॥ మఱియు నిత్తెఱంగునఁ దత్తత్పుణ్యంబులకుఁ దత్తద్భోగంబులును, దత్తద్దురితంబులకుఁ దత్తన్నిరయ వేదనలును గల్గియుండునని తెల్పిన. ౨౫౩

ఉ॥ వింటి మహానుభావ! పృథివీచరితంబు సవిస్తరంబుగా
నంటిన పాపముల్ దొలఁగె నభ్రధునీ చరితంబు భవ్యమున్
లుంటిత కల్మషంబు మది లో విన నిచ్ఛజనించె నెట్లు ము
క్కంటి శిరంబుపై నిలిపె? క్ష్మావిభుఁ డెవ్వఁడు దెచ్చె భూమికిన్? ౨౫౪

ఆ॥ భరతఖండమునను బ్రభవించెనెట్టులు, తత్క్రమంబు వినఁగఁ దత్పరుండ
నైతిఁ దెలుపుమనిన నయ్యుదంతంబెల్ల, నమరమునికి మౌని యానతిచ్చె.

సీ॥ సప్తపారావార సంవృతోర్వీతల, భరణధుర్యభుజాభి భాస్కరుండు
మదవద్విపక్షని ర్మథనకోలాహలా, ప్రతిమానవిక్రమ ప్రాభవుండు
నిందుచందనకుంద మందారసితయశో, గంధిలబ్రహ్మాండ గహ్వరుండు
కంతుజయంతవ సంతాదిసౌందర్య, ధిక్కారచణవపు ర్దీప్తిశాలి

తే॥ రవికులాంభోధిచంద్రుండు రాజరాజ, మకుటఘటితాగ్రరత్న శుంభన్నవాంఘ్రి
మంజరీపుంజపదపీఠ మానితుండు, సగరుఁ డలరారు భూలోక చక్రవర్తి. ౨౫౬

గీ॥ అతనియిల్లాలు కేశిని యనెడు సుదతి, దివ్యసౌందర్యగరిమచే దేవవనిత
యనఁగనెగడుచుఁ బతిభక్తి యతిశయముగ, సలవసిష్ఠాంగనయనంగ నలరుచుండె.

క॥ పతినుతిఁ జేయుచుఁ బద్మా,సతి కంతునిబోలె నింద్ర సతియు జయంతున్
వితతోత్సాహతఁ గను గతి, సుతుఁగనె నసమంజుఁ డనెడు సుగుణగణయుతున్.

ఆ॥ మనసుదీరఁ బుత్ర మండలాపేక్షచే, శంభుఁగూర్చి తపము సలిపి యందుఁ
బిదపఁ జూలు దాల్చి పెంచె నూఱబ్దముల్, పతికి సంతసంబు భాసిలంగ. ౨౫౯

చ॥ జగముల నెల్ల నేలికొనఁ జాలెడు పుత్రుఁడు కల్గునంచు న
మ్మగువముదంబు వారినిధి మాడ్కిఁ గడల్ వడఁ ద్రొక్కి నొక్కెడన్
వగపుల కాటపట్టయి యవద్యపు మాంసపుఁబిండ మొండు పెం
పు గదురఁబుట్టెఁ [illegible] ౨౬౦

క॥ శివకరుఁడు జగమ్ముల కని, శివునిన్ భజియించి యిట్టి చెఱుగర్భంబుల్
దివిరితి నని శోకార్తిన్, బొవులుచు విలపింప శివుఁడు బోటిపయిఁ గృపన్. ౨౬౧

మ॥ ద్విజవేషమ్మునఁ జేరవచ్చి తరుణీ! వేయేల? చిత్తంబునం
దజహాన్మోదము నిచ్చు పెక్కుసుతులిం దత్యంత తేజస్వులం
బుజబంధుప్రతిమాను లెంతయును సొంపుల్ బెంపు సంధిల్ల శ
త్రుజయోత్సాహులు గల్గువా రనుచుఁ దోడ్తోఁ బల్కి యొక్కమ్మడిన్. ౨౬౨

గీ॥ మాంసపిండంబు విభజించి మందహాస, విశదముగ డాఁచి యఱువదివేలసంఖ్య
సుతులఁ బుట్టించె శాత్రవసూదనులను, గ్రీష్మమార్తాండ తేజఃప్రకీర్ణ తనుల.

వ॥ అక్కుమారగణంబు. ౨౬౪

గీ॥ అశ్వమేధాశ్వమునకునై యబ్ధిఁ ద్రవ్వి, కపిలకోపాగ్ని భస్మసాత్కార మొంద
నగ్రజుం డసమంజసుండనుజులకును, నూర్ధ్వగతిఁ గోరి తపమున కుత్సహించి.

సీ॥ లక్షహాయనముల నక్షయతపమున, గంగఁ దేఁ దలపోసి కాలవశత
నమరేంద్రపురి కేగ నతనితనూభవుం, డంశుమంతుండు జాహ్నవిని దేర
నట్టుల తపియించి యాతండు మృతుఁడైన, యతని పుత్రుండు దివ్యప్రభావుఁ
డగు భగీరథుఁడు మహాభాగవతుఁడు వైష్ణవుఁడునై గుణవృద్ధి చాలఁగలిగి

తే॥ గంగ నుర్వికి రప్పించు కారణముగ, నటులె లక్షాబ్దములు తపోభ్యాసపరత
నిలిచి తపియించి తిలకించె నీరజాక్షు, సూర్యకోటి సమప్రభాసుంద రాంగు. ౨౬౬

వ॥ మఱియును ద్విభుజుండును, మురళీహస్తుండును, గిశోరుండును, గోపవేషుండును, బరమానందుండును, భక్తానుగ్రహవిగ్రహుండును, స్వేచ్ఛామయుండును, బరిపూర్ణుండును, బ్రభుండును, బ్రహ్మ విష్ణు రుద్ర స్తుతుండును, మునిగణ పరివృతుండును, నిర్లిప్తుండును, సాక్షియు, నిర్గుణుండును, బ్రకృతిపరుండును, మందస్మితవదనారవిందుండును, బీతాంబరుండును, రత్నభూషణ భూషితుండును నగు జనార్దనుం గాంచి పునఃపునఃప్రణామంబు లొనర్చి పులకాంకితవిగ్రహుండై వాంఛితసిద్ధిం బడసె, నయ్యెడ భగవంతుండును భగీరథు ననుగ్రహించి యంతర్ధానంబు నొంది జాహ్నవిం గాంచి యిట్లనియె. ౨౬౭

క॥ భారతి శాపవశమ్మున, భారతఖండంబునకును బరమామోదం
బారఁగఁ జని సగరసుతుల, గౌరవముగఁ బావనులనుగాఁ జేయవలెన్. ౨౬౮

గీ॥ దివ్యమూర్తులు ధరియించి దివ్యరథము, లెక్కి మత్సన్నిధి వసింతు రెట్టివారు
నీ జలస్నానపానముల్ [illegible] నా యాలయంబు.

ఉ॥ భారతఖండమందు విధిపద్ధతి నించుకయైనఁ బుణ్య వి
స్ఫారితబుద్ధి గల్గి యనపాయత స్నానమొనర్చి రేని వా
రారమణీయమూర్తులయి యంతిమజన్మమువారలేని ని
స్సారతఁ గర్మభోగముల సందడి మీటరె? గోటిచిమ్ముల౯. ౨౭౦

శా॥ త్రింశత్కోటిసహస్రజన్మముల నుర్వి౯ జేయు పాపావళుల్
ప్రాంశుత్వత్సలిలావగాహనమున౯ బాయంగ నాత్మీయులా
వంశస్థుల్ తమ చుట్టుఁజుట్టుకొన నిర్వాణంబు వాటిల్లి నా
యంశల్ చేకొని మత్సమానులయి యభ్యాశంబునం దుండరే! ౨౭౧

క॥ ఎఱుఁగం జేసెడి దేమన, నెఱిఁగి యొనర్చినను దురిత మేగు౯ నదుల౯
మఱపున నైనను నీలో, గిరికొని మునిఁగినను వాఁడు కృతకృత్యుఁడగు౯.

క॥ పుణ్యాహస్నానంబు ల,గణ్యము లిఁక మన్వాదివసగాహనమున నా
పుణ్యము నగణ్యమగుట౯, ఫణ్యాధిపతి కాదు శ్రుతులు బలుక వెఱచెడి౯. ౨౭౩

సీ॥ సామాన్యజలముల సంకల్ప పూర్వక, స్నాన మెక్కువ పుణ్యజాల మరయ
నంతకన్నను ముప్పదగు గుణంబులు రవి, సంక్రమణంబుల స్నానవిధుల
నమవస నట్టుల నంతకు ద్విగుణంబు, దక్షిణాయనమునఁ దనరు సుకృత
ముత్తరాయణమున నొనరుఁ దద్దశగుణ, మనలఁ జాతుర్మాస్య లందుఁ గ్రుంకఁ

తే॥ బుణ్యమగు బౌర్ణమాసి నగణ్యమగును, నిది శ్రుతి నిరూపితం బిది విదిత మఖిల
దేవభూదేవతలు చేరు తీర్థమునకుఁ, దీర్ఘమగు నీనుతీర్థంబు తీర్థమూర్తి.

సీ॥ మన్వంతరంబుల మాఘసప్తములను, భీష్మాష్టముల వ్రతపిప్రియదినముల
నర్ధోదయమహోదయంబుల జన్మర్క్ష, జన్మవారంబుల జన్మతిథుల
హరివాసరంబుల నమవసలందును, బితృదినంబుల దీక్షఁ బెనఁగునెడల
నయ్యయికాలంబులందు నీలోఁ దోఁగు, పుణ్యముల్ శతగుణస్ఫురితము లవి

తే॥ యెద్ది గోరినఁ దత్ఫలంబీయఁ జాలు, ననుదినంబును స్నానపానాది విధుల
నీదుతటమున నిచ్చలు నిలిచియున్న, వారి కిహపరసుఖము లవ్వారిగావె!

గీ॥ నీదు పాపంబు మద్భక్తినిరతులయిన, వైష్ణవుల పాదసంస్పర్శవలనఁ బాయు
వెఱవ నేటికిఁ బాపుల వివిధదురిత, గంధనిర్గంధ మొనరింపు గగనతటిని.

వ॥ మదీయసద్భక్తులు ఫలసంధానరహితులు జీవన్ముక్తులు మదేకశరణ్యులు;
మదీయంబగు నష్టాక్షరీమంత్రంబు వారి హృదంతరంబున వసియించుం గావునఁ
బూర్వపితృగణంబు [illegible] పితృగణంబును భగినీ భ్రాతృ

భాగినేయ మాతులశ్వశ్రూశ్వశుర గురుపత్నీపుత్రమిత్రసహచారి భృత్యశిష్య చేటప్రముఖులఁ దనతోడం దరింపఁజేయుఁ దత్సంస్పర్శనంబున భారతతీర్థంబులు పవిత్రంబులు తచ్చరణరజస్స్పర్శనంబున వసుంధర పరిపూత యగు సర్వజలంబులు తీర్థంబులగు నమ్మహాత్మ్ములు భగవన్నివేదితంబుగాని యన్నంబు మలంబును జలంబు మూత్రంబునుగాఁ బరిత్యజించి ప్రసాదభోక్త లగుదురు కావున వారికతన సకల పాపంబులు పలాయనంబు నొందుఁ దదీయాంగస్పృష్ట మారుతంబున భువనత్రయంబు పూతంబు విష్ణుచక్రంబు వారల రక్షించుచుండు మద్గుణ శ్రవణమాత్రంబున మేను గరుపాడిచి డగ్గుత్తిక వాడమి యానందాశ్రులు దొరఁగి సంచరించువారు వైష్ణవోత్తము లగుదురు, వారలయెడ నాకుం బుత్ర స్నేహంబు, గృహారామాదికంబు నాకు నర్పించి బ్రహ్మాది స్తంబపర్యంతంబు ప్రాకృతికంబు విష్ణుజన్యం బని యెఱింగినవారు వైష్ణవోత్తము లని తెల్పి గంగ నూరార్చి పొమ్మని యనుజ్ఞ నొసంగిన. ౨౭౭

క॥ భారతి శాపంబున నే, భారతఖండమున కేగి ✽ ప్రాణేశ! భవ
ద్ద్వారమున నిలుచు టయ్యెఁ, గౌరవమున నన్నుఁ దలఁపఁగావలెఁ గృష్ణా.

క॥ పాపులు నాలోఁదోఁగినఁ, బాపంబులు నన్నుఁ జేరుఁ ✽ బాపచయంబుల్
పాపఁగ దక్షంబగు నొక, పాపహరము దెలుపు నాకుఁ ✽ బరమాత్మ! హరీ!

మ॥ అని గంగానది పల్క మాధవుఁడు నెయ్యంబొప్ప లాలించి నీ
వనుమానింపకు నాదునంశమున నం ✽ దంభోధి గల్గుం గదా?
అనయం బాతఁడ నేను, నీవు నదివై ✽ యచ్చోట నిస్సంశయం
బనువొప్పన్ వసియింపు సర్వమును నేనై యుందు నిం కేటికిన్. ౨౮౦

క॥ భారతఖండంబునఁ గల, వారయ బహునదులు వాని ✽ కన్నిటికి మదా
కారుఁడగు లవణవారిధి, భారకుఁడై యుండు దురితపరిహృతికొఱకై.

క॥ కలి నేనువేలయేఁడులు, దలఁగిన శాపంబు నీకుఁ ✽ దగులదు నీవున్
జలరాశియు నిత్యోన్నతిఁ, గలసి మెలసి యుండవచ్చుఁ ✽ గడుమోదమునన్.

చ॥ ఇలఁ గల యన్నినాళ్ళును యశఃప్రభ భగీరథపార్థివుండు కో
ర్కెలు దనరారఁజేయు నల ✽ గీతనుతిన్ బ్రణయించి భారత
స్థలి నివసించునట్టి జనసంతతము నిన్ను నుతించుచుండు న
య్యలఘుతర స్తవంబు విజయావహమై నుతికెక్కు నెల్లెడన్. ౨౮౩

గీ॥ కణ్వశాఖోక్తముగ నిన్ను ✽ ఘనతఁ బూన్చు, నట్టివారలు పొందుదు ✽ రశ్వమేధ
ఫలముభోగాంతమున నన్నుఁ గలయుటబ్బు, నైహికాముష్మికములు నీ యందకలవు.

క॥ గంగాగంగా యని యల,రంగా నెవ్వాఁడు పచించు ౹ రక్తి దనర వా
డుంగను జ్ఞాన మ్మంతము,నం గను మత్పదము దురిత౹నాశ మగుటచేఁ. ౨౮౫

క॥ ఎందఱు నీలోఁదోఁగిన, నందఱ పాపములు నీకు ౹ నాటవు ధరలోఁ
గొందఱు మద్భక్తులు గల, రందుఁదదీయానుబంధ ౹ మలరుఁ నీకుఁ. ౨౮౬

క॥ పాపిశవస్పర్శనములఁ, బాపంబులఁ బాప నాదు ౹ పటుమంత్రికళా
జాపకు లుండిరి తత్పద, లేపనమున నీకుఁ బాప౹లేశము గలదే. ౨౮౭

గీ॥ ఎచ్చటెచ్చట నామంత్రి ౹ మెవ్వఁడేని, పఠనమొనరించు నాతండు ౹ పావనుండు
సంతతంబును నీ కథ౹స్థాన మచటఁ, గలదె పాపంబు కలనైన ౹ గగనతటిని.

గీ॥ దురితకోటు లొనర్చిన ౹ దుర్జనుండు, దోపి.యై నినుఁ దోఁగిన ౹ దురితమైన
నాదు భక్తాంగ సంస్పర్శ ౹ నవసి నీకు, నిత్యశుద్ధి పొసంగు ౹ నిర్ణితిసుమ్మి.

గీ॥ నీదునామంబు స్మరియించి ౹ నిఖిలధాత్రి, నెందు నేనియు సంస్థితిఁ ౹ జెందువాని
కేను సాలోక్యమిడి వాని౹యిష్టమెల్ల, నొసఁగి పార్షదు నొనరింతు ౹ నుత్పలాక్షి.

గీ॥ నీదుతీరంబులందున ౹ నిలిచినట్టి, వారు మత్పార్షదులుగాన ౹ వరవిమాన
యానముల నాదుసన్నిధి ౹ నందఁజేసి, ముక్తిపట్టంబు గట్టుదు ౹ ముగుద వినుము.

గీ॥ నాదు మంత్రంబు జపియించు౹నరుల నీదు, తీరమునఁ బూన్చి సుచిరా౹తిథ్యములను
దృప్తి పొసఁగంగఁ జేసిన ౹ దివ్యలోక, మరుగు రత్నేంద్రయానంబు ౹ నధివసించి.

మ॥ అని గంగానది నూఱడించి వనజా౹తాక్షుండు వేవేగ న
య్యినవంశాఢ్యు భగీరథుం గరుణచే ౹ నీక్షించి యీరీతి నా
తనికిఁ దర్శన మిచ్చి “పార్థివ! భవ౹ద్వాంఛాప్తి యయ్యెఁ మరు
ద్ధునిఁ బ్రార్థింపుము నీదు సన్నిధికిఁ దో౹డ్తొవచ్చు నాయానతిఁ”. ౨౯౩

క॥ నా విని భగీరథుఁడు గం,గావాహిని సన్నుతింపఁ ౹ గడు ముదమున సం
భావితయై యరుదెంచినఁ, గావించె సపర్య నృపతి ౹ కణ్వోక్తవిధిఁ. ౨౯౪

గీ॥ అంత నారాయణస్వామి ౹ యానసంబుఁ, గాంచి నారదుఁ డిట్లను ౹ కణ్వశాస్త్ర
విధిని బూజించు టెట్టు లా౹విభవ రేణ్యుఁ, డెట్లు పూజించెనో తెల్పు౹మీ యటన్న.

సీ॥ స్నానసంధ్యాద్యను౹ష్ఠానముల్ పచరించి, గణనాథు భాస్కరుఁ ౹ గమలనేత్రు
బావకు శంకరు ౹ భవహంత్రి శక్తిని, నార్వురఁ బూజించి ౹ యధికనిష్ఠ
నర్చింపవలయు దే౹వాపగ గణపతి, విఘ్నవిచ్ఛిత్తికి ౹ విష్ణుదేవు
ముక్తికై యారో౹గ్యమునకు విభాకరుఁ, బావకు శుద్ధికై ౹ దేవదేవు

తే॥ జ్ఞానసిద్ధికి శాంకరి ♦ సర్వసిద్ధిఁ, గోరి యర్చించి మదిలోనఁ ♦ గోర్కెఁదీర
సురతటినిబూన్నవలయుసం ♦ స్తుతులెసంగ, నిదనిగమపద్ధతియటంచు ♦ నెఱుఁగవలయు.

వ॥ మఱియు, నద్దేవి ధ్యానంబు సర్వపాపపరిణాశనంబును, మోక్షదంబును, సుఖ కామపుణ్యప్రదంబునుం గానఁ దద్ధ్యానపరికారంబు వివరించెద. శ్వేతపంకజ వర్ణయుఁ బాపనాశనియుఁ గృష్ణ సంభూతయుఁ బావకోజ్జ్వల పరిధానయు, రత్న భూషితయు, శరచ్చంద్రశతసంకాశయు, మందహాసముఖియు, స్థిరయౌవనయు, నారాయణప్రియయు, శాంతయు, సౌభాగ్యసమన్వితయు, మాలతీమాల్యసంవృత కబరీభారయు, సిందూరచందన బంధురతిలక మనోజ్ఞముఖియు, బృహత్కుచ మండలయు, బృహచ్ఛ్రోణియు, రంభాస్తంభోత్సంగయు, స్థలపద్మసంకాశచర ణయు, రక్తపాదుకారూఢయు, నింద్రమకుటమందారమకరందసంసిక్త యావక రక్తాంఘ్రియు, సురసిద్ధదత్తార్ఘ్యయుఁ దపస్వినమస్కృతయు, ముక్తిప్రదయు వర, దయు, విష్ణుపదియునుంగా ధ్యానించి యాసనపాద్యార్ఘ్యాచమనానులేపధూపదీప నైవేద్యతాంబూలశీతలజలవసన భూషణ మాల్యగంధతల్పాదులఁ బూజించి నమస్కరించి కృతాంజలియై నుతింప నశ్వమేధఫలంబుఁ జెందు నని మఱియు నిట్లనియె. ౨౯౭

క॥ నారాయణాంగసంభవ!, గౌరవిభా! గానలోల! ♦ కరుణామయ దృ
క్చారువదన! రాధాంగవి, హారిణి! వందన మొనర్తునమ్మా! జననీ. ౨౯౮

గీ॥ ఆది గోలోకమునఁబుట్టి ♦ యందు రాస, మండలంబున విహరించి ♦ ఖండపరశు
సన్నిధి వసించు దేవి! నీ ♦ చరణములకు, వాంఛ దీరంగ నేఁజేతు ♦ వందనములు.

క॥ గోపీగోపజనంబులు, వ్యాపింపఁగ రాధ యలరఁవర్తించు సరి
ద్వ్యాపారకు నీకుఁ, మ, త్పాపము లణఁగంగ మ్రొక్కి ♦ ప్రార్థింతు ధునీ! ౩౦౦

క॥ యోజనకోటుల నెల్లెడఁ, దేజంబునఁ బొదలి పొదలి ♦ దీపించుచు గో
రాజాస్థానమునందున, భ్రాజిల్లు మహానుభావ! ♦ ప్రణతు లొనర్తున్. ౩౦౧

క॥ అఱువది యోజనములచే, నిరవొందఁ జతుర్గుణముల ♦ కెక్కువగా శ్రీ
హరిలోకంబున మెలఁగెదు, ఝురిణీ! నే మ్రొక్కువాఁడఁ ♦ జరణంబులకున్.

క॥ యోజన లక్షత్రయమున, రాజవిభూషణుని నగరు ♦ రంజించుచు ను
త్తేజిత పంచగుణంబుల, భ్రాజిల్లెదు పొడవు గల్గు ♦ పడఁతికి జేజే. ౩౦౩

ఆ॥ లక్ష యోజనముల ♦ నక్షయయామంబు, సత్త్వగుణిత ధైర్యసంభృతంబు
నగు ఝురంబుతోడ ♦ నలరుచు బ్రహ్మపురంబుఁ జేరి, నిలుచు దేవి! నిన్నుఁ ♦ గొలుతు నతుల.

గీ॥ ఏకలక్షప్రమాణతఁ సనిందుప్రలోక, మునను వసియించి వ్యాపించి । మొనసి పంచ
గుణిత దైర్ఘ్యంబునను భక్తసకోటి నేలు, నిర్జరాపగ! నే జేతు । నీకుఁ బ్రణుతి.

వ॥ మఱియును షష్టియోజనాయామంబును దశగుణ దైర్ఘ్యంబునుం గలుగు ఝరంబున సూర్యలోకంబును, సహస్రయోజనాయామంబును దశగుణదైర్ఘ్యంబునుం గల్గు ఝరంబున జనుర్లోకంబును, లక్షయోజనాయామంబును, బంచదైర్ఘ్యంబునుం గలుగు ఝరంబునఁ దపోలోకంబును, సహస్రయోజనాయామంబును సప్తగుణ దైర్ఘ్యంబునుం గల్గు ఝరంబునఁ గైలాసంబును, శతయోజనాయామంబును దశగుణ దైర్ఘ్యంబును నగు ఝరంబున నిందప్రలోకంబును, దశయోజనాయామంబును దశగుణ దైర్ఘ్యంబునుంగల్గు ఝరంబునఁ బాతాళంబును, వ్యాపించి యతిసూక్ష్మ వాహినియై యలకనందానామంబునఁ గనకభూధరాగ్రమునం బ్రవహించి కృతయుగంబున క్షీరవర్ణయుఁ ద్రేతయం దిందుసన్నిభయు, ద్వాపరంబునఁ జందనాభయుఁ, గలియుగంబున సితజలరూపిణియు నగుచు, స్వర్గంబున నిత్యశ్రీ రాగయై వర్తించు నీకు వందనంబు లొనర్తుఁ; బాపాపహారిణియుఁ, బుణ్యప్రదయు నని నిగమాగమంబులం బ్రస్తుతికెక్కు నీకు నమస్కారంబు. బ్రహ్మహత్యాది మహాపాతకంబు లేకజలకణికాస్పర్శంబున నణంచు నీకు మ్రొక్కెద నని యెవ్వండేని నిరతంబు నమస్కరించు నతండు పుత్రవంతుండును, రోగహీనుండును, గళత్రవంతుండును, స్పష్టకీర్తియుఁ బండితుండుననగుఁ, బ్రాతఃపఠనంబున శుభప్రాప్తియు, దుఃఖనివ్వారణంబు నగునని చెప్పి నారదునకు నారాయణుం డిట్లనియె. ౩౦౬

సీ॥ ఏవంవిధస్తోత్ర । పావనుం డగుచు భ, గీరథుం డప్పుడు । కృత మెఱింగి
సాక్షాత్కరించిన । స్వర్లోకవాహినిం, గొనిపోయి తన పితృ । కూటములను
బ్రవహింపఁజేయ నప్పాట వారెల్లను, దివ్యవిమానాల । దివ్యవేష
భూషితులై సర్వ । భువనోత్తరంబైన, పద్మలోచను పరం । పదమునందు

తే॥ నధివసించిరి రవివంశ్యుఁ డగు భగీర, థుండు దెచ్చుట నామ మ । ఖండితముగ
నలరె భాగీరథి యనంగ । నమరధునికి, వింటి మిన్నేటి తెఱఁగెల్ల । విబుధమౌని!

క॥ నావిని నారాయణుతో, దేవమునీంద్రుండు పల్కె । దేవా! శివగా
నావృతు లగు రాధాచ్యుతు, లీ వాహిని జననమునకు । హేతువు లెటులో? ౩౦౭

క॥ ఎచ్చోట నున్నవారలు, సచ్చరితము గాంచి యెట్టి । చందంబులచే
నిచ్చలు వర్తించిరో నా, కిచ్చ జనించెను వినంగ । నెఱిఁగింపు మనన్. ౩౦౮

సీ॥ కార్తికతిథియందుఁ । గైటభాంతకుఁడైన, కృష్ణుండు రాధికఁ । బ్రేమఁ బూన్చి
రాసమండలమున । కర్తృ శ్రీ నేవింప, బ్రహ్మాదు లెల్లరుఁ । బరమనిష్ఠ

నద్దేవిఁ బూజించి రయ్యెడఁ గృష్ణుండు, గానం బొనర్ప వీణానుమోద
యగుచు సరస్వతి యట్లులఁ బాడంగ, మెచ్చి కృష్ణుఁడు హారమిచ్చె వాణి

తే॥ కట్టుల శివుండు నభినవహార మొసఁగె, మఱియుఁ గౌస్తుభ మర్పించె మాధవుండు
రాధిక యొసంగె నవరత్నరాజిసరము, కనకకుండలయుగళంబు కమల యొసఁగె.

సీ॥ విష్ణుమాయాశక్తి విశ్వంబునకు నెల్ల, మూలప్రకృతి దుర్గ ముక్తిపదము
మెచ్చి శ్రీకృష్ణునిమీఁది సద్భక్తిని, నొసఁగి మన్నించె మహోత్సవముగ
ధర్మబుద్ధి నొసంగె ధర్ముండు సత్కీర్తి, నొసఁగె నవ్వేళ మృత్యుంజయుండు
వహ్ని శుద్ధి నొసంగె వాయువు మణిమయ, హంసకంబు లొసంగె నంత హరుఁడు

తే॥ బ్రహ్మ ప్రేరేపఁ గృష్ణు నభ్యాశమునను, రాసలీలామహోల్లాస రంజితమగు
సరసగీతముఁ బాడఁ దచ్ఛ్రవణజనిత, సంభృతానందమున సురల్ సంతసింప.

ఉ॥ శంకరగీతికారసవిశంకటలోలుభర్తన్ సురాసురుల్
సంకులవృత్తిచేఁ బరవశత్వము నొందుచుఁ జిత్రపుత్రికా
శంక వహించి యెద్దియు వశంపడ కున్నెడ రాసమండలం
బింకఁగరాని పెన్ హ్రదము నేపుననుండె జలావిలంబుగన్. ౩౧౨

క॥ రాధాకృష్ణవిహీనవి, బోధంబున గోపజనము పొక్కుచు శోకో
ద్బాధితమనస్కులై నెడ, వేధ యెఱింగించె గీతవిభవ మటంచున్. ౩౧౩

గీ॥ *ధరధనుష్కునిగీతి రాధయును గృష్ణుఁ, డుభయులుఁ రసార్ద్రిత వహించి రూరకుండుఁ
డనుచు నూరటఁ గొల్పి బ్రహ్మాదులెల్ల, వినుతి సేయఁగఁ దొడఁగిరి విష్ణుదేవు. ౩౧౪

శా॥ నీమూర్తిన్ గనఁ జేయుమయ్య? భవదన్వేషంబునన్ జిక్కి మా
మోముల్ విన్నఁదనంబు నొందెఁ గరుణాంభోరాశివై చూపుమా?
నీ మందస్మితచంద్రికావిలసనోన్నిద్రాననాబ్జంబు; ని
త్యామేయప్రథితానుభావజయధుర్యా కృష్ణ! దేవాగ్రణీ. ౩౧౫

క॥ అని ప్రార్థింపఁగను నభో, వనితా రూపమున నొందు వచనము వెడలెన్
విని రందఱు మధుమధుర, స్వనధోరణి గల్గునట్టి వాగ్వైఖరులన్. ౩౧౬

వ॥ తత్ప్రకారం బెట్టి దనిన. ౩౧౭

సీ॥ సర్వాత్మగుండను సర్వగుండను నేను, భక్తవత్సల రాధ పరమ శక్తి
యిరువురకును మాకు నేటికి నిర్దేహా, ధారణం బద్వైతతత్పరతను
నుందుము, మముఁ గాంచ నుల్లమ్ములందున, మన్మంత్రపూతులై మానవులును
మానులు గన్గొందు రేను సర్వాతీత, పదమున నిలుతు మహద్భావుఁ డగుచు



* టిప్పణి: ధరధనుష్కుఁడు=శివుఁడు

ఆ॥ శివుఁడు నాదు నాజ్ఞఁ జేసి వర్తించు నీ, వట్లు నాదు నాజ్ఞ నధివసించి
మద్విశేషశాస్త్రసమహితుఁడవై దివ్య, మంత్రసృష్టిఁ జేసి మహిమ గనుము.

గీ॥ ధ్యానపూజావిధులు మంత్ర యంత్రకవచ, సన్నుతు లొనర్చి శిష్టులఁ జనువఁ జేసి
నాదు సద్భక్తి వారికి నాటఁ జేయ, వారి కొనఁగెద సాయుజ్యనైభవంబు.

సీ॥ నాదుమంత్రోపాసనమునకు విముఖులై, చరియింప నిరయంబు సంభవించు
మంత్రపావనులైన మానవుల్ నాచెంత, నధివసింతురు పదంబంధఁ జేతు
మఱియొండు మార్గంబు మమ్ముఁ జేరుటకునై, సంభవింపదు గాన స్వర్గమర్త్య
పాతాళముల నిల్చు ప్రజలకు బోధింపు, మిమ్మార్గ మభవున కెఱుకఁ జేయు

తే॥ మనుచుఁ బల్కిన నభవున కవ్వచనము, దెల్పె నట్టుల నిర్వాహు దేవదేవు
ద్యోధునీతోయములయందుఁ దోఁగి తాను, మంత్రశాస్త్రక్రమంబు లమందవృత్తి.

క॥ వివరించి లోకములలో, నవిరళతఁ బ్రసిద్ధిఁ జెందు నట్టుల నతులుర్
గవచములు మంత్రములు సం, స్తవయుతములు చేసి సిద్ధి నలిపిరి జగతిన్.

క॥ గంగామహిమం బెవ్వ ర, భంగురగతి శుద్ధమనక పరిపాటిమెయిన్
వెంగలులై పల్కిన వారిం గాలుఁడు దుర్గతులకుఁ ద్రెరేచుఁ జుమీ. ౩౨౨

క॥ అని యొక వాక్యముగా నా, వనజాసనుఁ డభవుఁ డఖిలవాస్తవ్యులు నె
మ్మనమున నలరుచు వినఁగాఁ, గొనకొని పలుకంగ నంత గోలోకమునన్.

క॥ రాధాసహితుండై తగ, మాధవుఁడు ప్రసన్నుఁ డగుట మానసములు స
ద్బోధములు గాఁగ సురముని, యూధము వినుతించె సంతసోత్సాహమునన్.

ఉ॥ అయ్యెడ శంకరుండు హృదయంబునఁ బిచ్చిలు భక్తియుక్తిచేఁ
జయ్యన ముక్తిగీతము లసంఖ్యత గానమొనర్చె గోపకుల్
నెయ్యము మీఱ సంతసిలి నీరజనేత్రునిఁ బాడి యాడుచున్
దియ్యని వాక్సుధావళి నుతించిరి కాంచి రభీష్టసంపదల్. ౩౨౫

సీ॥ ఆది గోలోకంబునందు రాధాకృష్ణ, దేహసంభూతయై దివ్యమహిమ
శివపంకజాసనుల్ సేవింప సురలును, మానులుఁ బూజింప మహిమఁ దనరి
కృష్ణుశాసనమునఁ గెరలి తల్లోక, వాసయై పావనావాసములను
స్నానపానాదుల జనుల కిల్బిషపాళి, హరియించి సర్వవిఖ్యాతిఁ గాంచి

తే॥ యాపగలలోన మేల్బంతియగుచు శౌరి, యాకృతియె కానఁ దటినీశు నాశ్రయించి
భరతఖండంబులో జగత్పావనియగు, గంగ వసియించు క్రమమిది గనుము వత్స!

ఉ॥ అంబుజగర్భసూతి ముని ♦ యానతి యిచ్చు నుదంత మెల్లఁ జి
త్తంబున సంతసంబిడఁగఁ ♦ దాపసవర్యునిఁ జూచి *యన్నదీ
నాంబుజపత్రనేత్ర విబుధాపగ పంచసహస్రసంఖ్య య
బ్దంబులు దీరినన్ గలిని ♦ దత్తటినీస్థితు లెట్టు లయ్యెనో? 3౨౭

క॥ అని నారదుఁడు వచించిన, విని నారాయణుఁడు పల్కె ♦ విబుధాపగ వా
గ్వనితామణి శాపాంతము,గని వైకుంఠంబునకును ♦ గ్రమ్మఱ నరిగెన్. 3౨౮

క॥ భారతియును శాపము చన, భారతఖండంబుఁ బాసి ♦ పద్మాపతితో
గౌరవమునఁ గలసెను గమ;లారమణియు హరిని గూడె ♦ లాలితగతులన్. 3౨౯

గీ॥ గంగయు సరస్వతియు లక్ష్మి ♦ గలసి తులసి
తోడఁ గూడుచు హరిలోకసధూర్వహ లయి
యందు నివసించినా రని ♦ యాగమములు
పలికెడు నటన్నఁ బునరుక్తిఁ ♦ బల్కె మౌని. 33౦

మ॥ హరిపాదాబ్జమునందుఁ బుట్టుట జగత్ఖ్యాతంబుగా ధాత్రి నె
ల్లరు వాదింతురు తత్క్రమంబు తపసుల్ ♦ తథ్యంబుగా నెంతు ర
వ్వర మోదంతముఁ దెల్పుమన్న విని తెల్పంజొచ్చె మౌనీంద్రుఁ డ
ద్ధరణీశాగ్రణి కబ్బురంబొదవ మేధా మోదవాచార్భటిన్. 33౧

వ॥ అత్తెఱంగు సవిస్తరంబుగాఁ దెల్పెద వినుము, సృష్ట్యాది గోలోకంబున రాధా కృష్ణాంగద్రవరూపిణియై, దేవాధిష్ఠాత్రియై, యప్రతిమరూపిణియు, నవయౌవన సంపన్నయు, సర్వాభరణభూషితయు, శరన్మధ్యాహ్నపద్మాస్యయు, మందస్మిత మనోహరయుఁ, దప్తకాంచనశాలినియు నగుఁ గంగ గఠినోన్నతస్తనయుగళంబును, వర్తుల చారునేత్రంబులును, నాకర్ణభ్రూవల్లికలును, మాలతీవేల్లిత కబరీ భారంబును, జందన సిందూరపంకలేపంబును, గస్తూరికాపత్ర గండయుగ్మంబును, బంధూకారుణోష్ఠంబును, బక్వదాడిమదంతపటలంబును, భావకారుణవదనంబును మెఱయ, సకామయై, కృష్ణపార్శ్వంబున లజ్జావశంబున మోమునఁ బటం బోరఁ జేసికొని నిమేషరహితలోచనంబుల సంగమలాలసయై విభుం గనుంగొనునెడఁ ద్రింశత్కోటిగోపికాపరివృతయై కోపంబున నరుణకమలంబువోలె నెమ్మోము చివురింప సఖీసమూహంబులతోఁ గృష్ణపార్శ్వంబున కరుగుదెంచు సమయంబున, రాధికం గనుంగొని కృష్ణుండు లేచి కౌఁగిలించి సింహాసనంబునఁ గూర్చుండ నియ మించి మధురాలాపంబుల సంభాషించునెడ గోపాలురు నమస్కరించిరి. గంగయు భీత యగుచు వినయంబునఁ బ్రత్యుత్థానం బొనర్చి పతియాజ్ఞ నభయంబు గొని సింహాసనంబున నాసీనయై, బ్రహ్మతేజంబును, ననేకబ్రహ్మాండకర్తృత్వంబును గలుగు రాధికం జూచి నిమేషరహితలోచనంబులఁ దనివిసనక వర్తించునంత.



టిప్పణి॥ * అన్నదీన=అసముద్రునియొక్క, (నదీనాం ఇనః, సముద్రః)

శా॥ రాధాదేవి మనోజ్ఞరాజసము రాజరాజప్రభల్ గూర్పఁ దా
నాథుం జూచి వచించె దేవ! హృదయానందంబునన్ సంస్థితో
ద్బోధంబై వదనంబు రాజిల నిరున్ బూర్ణానురాగంబునన్
మాధుర్యస్ఫురితాబ్జనేత్రముల సన్మానించఁ గన్గొంటివే. 333

క॥ ఈనెలఁత యెవ్వతెయొ నీ, పై నెయ్యముఁ గొల్పి గగుర్పాటున నెమ్మిన్
మేనెల్లఁ గ్రిమ్మికొన నిను, మానక తిలకించె దురభిమానము పేర్మిన్. 33౪

సీ॥ ఏను బ్రాణములతో నెనసియుండఁగ నిట్టి, దుర్వృత్తి వాటిల్లెఁ దోడుతోడ
నెన్ని మాఱులు చూచి యే సహింపఁగ నేర్తుఁ, జందన కాననస్థలులయందుఁ
గాళిందితోఁ గూడఁ గని సఖుల్ దెల్పఁగా, నోర్చితి నామాట మెఱఁగి మెఱఁగి
నీవు డాఁగితివి తన్నీరజపత్రాక్షి, తను వ్రాల్చి యాపగాతనువుఁ దాల్చి

తే॥ యిప్పటికి నందుఁ బ్రవహించు నేను విడిది, కేగ నంతటఁ జనుదెంచి యింతిఁ దలఁచి
వెతఁగలంగవె? పల్కులు వేయునేల?, కాముకులు వేయుఁ దెల్పినఁ గనుటగలదె?

ఉ॥ నీవెత కోర్వఁజాలక ధునీమణి యోగినిరూపుఁ దాల్చి స
ద్భావముతోడ నీ కిడియె దర్శనమున్ జెలిఁ గూడి; యాపెతో
భావభవక్రియల్ సలుప బంధురగర్భభరంబు దాల్చి య
ప్పావని సప్తవార్ధులను బట్టులుగాఁగనెఁ గొంకకుండునే. 33౬

క॥ చంపకవనమున శోభా, చంపకగంధిన్ రమింప సైఁగ మెఱఁగి న
న్నంపిరి సఖు లీ వేగితి, విప్పు చెడి నెలందిఁ గలసె నిందని వినమే. 33౭

క॥ అత్తఱి శోభాంశంబులు, తత్తఱపడి యువతిరత్న దర్పణ పాళిన్
మెత్తని పువుటెత్తుల విరి, మొత్తంబులఁ బల్లవముల మొదవులపాలన్. 33౮

సీ॥ సన్నంపువలువల స్వర్ణశాప్యంబులఁ, జందనపంకంబులందుఁ జక్వ
ఫలముల నృపదేవభవనంబులను సస్య, చందనకర్పూరసంచయములఁ
దత్ప్రతిచ్ఛాయగా దర్శించుచును మనో, వ్యథఁ బాయుచుండితి వాసుదేవ!
పరిచితంబైన యభ్యాసంబు వదలునే, తెలుపంగఁదగువారు తెలుపుచున్న

తే॥ నీకు నెప్పటికిని గామినీవిలోల, చిత్తసాంకర్య మెడఁబాయఁ జేయు టవునె?
మఱియు బృందావనంబున మరులుగొనుచు, గోపికాబృందములతోడఁ గూడికొనవె?

వ॥ అని బహువిధంబులఁ బ్రాణేశుఁ దర్కింపుచున్న రాధికాదేవి కోపసంరంభంబు
సహింపంజాలక భయవిహ్వలయై యంతర్ధానంబు నొంది గంగామహాదేవి స్వజ
లాంతర్భూతయయ్యె, నది యెఱింగి త్రిభువనంబునం గలుగు జలంబునెల్ల రాధిక

గండూషింపం గడంగినఁ దద్విహాస్యం బెఱింగి శ్రీకృష్ణచరణాంభోజంబునఁ బ్రవేశించె. రాధికయు, గోలోకంబును, వైకుంఠంబును, బ్రహ్మలోకాదిలోకంబులును, శోధించి గంగం గానక బ్రహ్మాండంబు జలశూన్యం బొనర్తు నని సర్వజలంబులు పానంబొనర్ప బ్రహ్మవిష్ణురుద్రానంతధర్మేంద్రేందుదివాకర దేవసిద్ధతపస్విప్రముఖులు శుష్కకంఠతాలుకులై గోలోకంబున కరుగుదెంచి.

సీ॥* వరుని వరేణ్యుని వరదు వరిష్ఠుని, విశ్వకారణు సర్వవిభు నిరీహు
నిర్వికారుని నిత్యనిగమైకవేద్యుని, నిర్గుణు సాకారు నిరుపమాను
భక్తవత్సలు పరాత్పరు నిరంజను నిరాశ్రయు సత్త్వరూపుని సత్యమూర్తిఁ
బరముఁ బరేశునిఁ బరుఁ బరమాత్ముని, భక్తిగమ్యుని నీశుఁ బరమపురుషు

గీ॥ గోపికాగోపసేవ్యుని గోమలాంగు, రత్నసింహాసనాగ్ర విరాజమాను
గోపికానృత్తలోలు వైకుంఠధాముఁ, గృష్ణుఁ గాంచిరి రాధికాకేళిలోలు. ౩౮౧

గీ॥ రాధికాదత్తతాంబూలరక్తిదవిలి, మేను పరవశ మొంద నవ్విలి వడంతి
మోముఁ గనుఁగొని చిఱునవ్వు మొలకలెత్తఁ, గొలువు దీరిన జగదీశు నలమిఁ గొనుచు.

ఉ॥ మానవమాని సిద్ధసురమండలి హృష్టమనస్కులౌచు లో
నూనిన భక్తి పెక్కువ ననూననమస్కృతు లాచరించి నా
నానిగమాగమస్తుతు లనంతముగాఁ బఠియించి భారతీ
జానిని గాంచి పల్కిరి నిజమ్ముగ సర్వశరణ్యసన్నిధిన్. ౩౮౩

గీ॥ ఏము వచ్చి దర్శనేచ్ఛచే నున్నట్టి, వార్తఁ దెలుపు మనిన వనజభవుఁడు
విష్ణుశంకరులను వెంటఁ దోకొని కృష్ణు, నంతికమున కేగి యచట నిలిచి. ౩౮౪

వ॥ ఇత్తెఱంగునఁ దామరసోద్భవుండు రత్నసింహాసనసంస్థితుండును, ద్విభుజుండును, మురళీహస్తుండును, వనమాలావిభూషితుండును, మయూరపింఛచూడుండును, కౌస్తుభవిరాజితుండును, శాంతసుందరవిగ్రహుండును, సర్వమయుండును, సర్వైశ్వర్యసమన్వితుండును, ఒక్క నిమేషంబునన సాకారనిరాకారగోచరుండును నగుచు స్త్రీపుంభేదంబు తెలియఁబడనీక రాసలోలుం డగు శ్రీకృష్ణుని ధ్యానించి నుతించి నేత్రంబులు విచ్చి యంతలోనం బార్షదగణంబులు చుట్టు నలమ రాధావక్షస్థలస్థితుఁడై యుండు కృష్ణునిం గాంచి పునఃపునఃప్రణామంబు లొనర్చి నుతించుచుఁ గృతాంజలియై నలువ నిలువంబడిన భగవంతుం డిట్లనియె. ౩౮౫

చ॥ హర్రి, కుశలంబె; శంకర, యనామయమే; పరమేష్ఠి సేమమే?
సురలకు మీకు నెల్లెడల శోభనమే? భవదాగమంబు ని
ర్జరతటినిన్ గొనం దలఁచి; సన్నిధిఁ జేరినవారు గంగ మ
చ్చరణసరోజగర్భమున సాధ్వస మొంది వసించియుండుటన్. ౩౮౬

టిప్పణి॥ * ౩౮౦ పద్యము ... సీసములోని పునరుక్తి సహ్యము.

ఉ॥ ర_క్తి చెలంగ మీర లిటు ꠰ రాధిక సన్నుతిఁజేసి యర్చలర్
భ_క్తి దలిర్పఁ గొల్వుఁడు శుభంబగు గంగ నొసంగువాఁడ సం
స_క్తభయంబునం దొలఁగి ꠰ సాధ్వి సురాపగ మిమ్ముఁజేరు సు
వ్య_క్తత సర్వసౌఖ్యములు ꠰ వాటిలు మీకన నల్వ నెమ్మదిన్. ౩౪౭

గీ॥ నాల్గుమోములె_త్తి ꠰ నవ్యవాగ్రచనల, భ_క్తినమ్రుఁడగుచుఁ ꠰ బడతి రాధ
సన్నుతించె నిగమసరణి నానావిధ, చతురవచనరచన ꠰ సందడింప. ౩౪౮

సీ॥ గంగ నీ యంగసంగముఁ గృష్ణుని యందు, రాసమండలమున ꠰ రహి వహించి
దివ్యరూపమున నద్రిలెఁగాదె? యబ్బోటి, మీ యందు సంభూతి ꠰ మెఱయుకతనఁ
గన్యక యగుఁగాదె ꠰ కరుణింపఁదగు నీవు, మంత్రంబు గ్రహియించి ꠰ మహితపూజ
సేయుచు సద్భ_క్తిఁ ꠰ జే నీకు వశ్యయై, యననిలో బ్రవహించి ꠰ యంబురాశి

తే॥ వల్లభుని గాఁగఁ జేకొని ꠰ వ_ర్తిలంగఁ, గరుణసేయుమటన్న నక్కమలభవుని
మాటలాలించి రాధ సమ్మతమనస్క, యగుఁడు గృష్ణాంఘ్రి వెడలె దివ్యాంగ గంగ.

ఉ॥ అయ్యెడఁ గృష్ణపాదనఖరాగ్రము వెల్వడివచ్చు వాహినిన్
జయ్యనఁగాంచి నల్వ తనసన్నిధి హ_స్తకమండలంబునం
దొయ్యనఁ గొంత చేకొనియె ꠰ నొప్పుగఁ గొంత శశాంకమౌళి తా
నెయ్యముమీఱ నౌదలను ꠰ నిల్పుకొనెన్ బ్రమదంబు నిండఁగన్. ౩౫౦

గీ॥ అంత గంగామహాదేవి ꠰ కబ్జజుండు, రాధికామంత్ర కవచసంబోధనంబుఁ
జేసె గంగయుఁ దన్మంత్రసిద్ధివశసి, నిలిచె వైకుంఠమున నల్వనేర్పుకొలఁది.

గీ॥ తోయజాలయ భారతి ꠰ తులసి గంగ, వీరు నల్గురు వైకుంఠవెలఁదు లగుట
స్థితమతిని గొల్వ ꠰ సంపదల్ చేరు ననిన, నారదునితోడ నమ్మునినాథుఁ డనియె.

సీ॥ మందహాస ముఖారవిందుఁడై కృష్ణుండు, హరిహరవిభులతో ꠰ ననియె నపుడు
కాలవృ_త్తాంతంబు ꠰ గనఁగ దుర్బోధంబు, గానఁ దెల్పెద మీకుఁ ꠰ గలసి వినుఁడు
మునులు సుపర్వులు ꠰ మనువులు సిద్ధులు, నెవ్వార లెవ్వార ꠰ లిందు వచ్చి
యధివసించితిరో? నాయంతికంబున మీరు, శేమించియున్నారు ꠰ సృష్టియెల్ల

తే॥ జలగతంబయి ప్రాకృతప్రళయమందె, గాలచక్రంబునకు మీఁదుగాను నిలిచి
యలరె గోలోక మట్టులె ꠰ యక్షయముగఁ, గలదు వైకుంఠ మఖిలంబుగలసె నీట.

క॥ చని మీ రెప్పటిపోలిక, ఘనసృష్టి యొనర్పవలయుఁ ꠰ గల్పాంతము గా
వున బ్రహ్మాండము మొదలుగఁ, గనిర్మె నాయం దభేదగరిమను వినుఁడీ.

సీ॥ బ్రహ్మాండసృష్టి చేయునప్పుడ మీర లొనరింపుఁ, డక్కారణములు నేనలరఁ జేతు
మన్ని మేషము బ్రహ్మకుమానంబు తెలిసి గ, తాగతభేదంబు కలరయుఁడనుచు
నంత రాధానాథుఁ డంతఃపురంబున, కరిగె బ్రహ్మదులెయఖిలసృష్టి
నేయుచుండిరి గంగచెలఁగి గోలోకంబు, తన కధిష్ఠానమై తనర నిఖిల
తే॥ భువనములయందునిజకళాస్ఫూర్తిబహుళము, ఖంబులవహించిప్రవహించెగాగ టభాగి
చరణసంభూత గావున జగములందు, విష్ణుపది యను నామంబు వెలసెఁజుమ్ము.
క॥ గంగావిర్భావము ప్రా,సంగికగతిఁ దెలుపనయ్యె సర్వార్థదమౌ
మంగళకర మిది వినఁగలు,గుం గైవల్యంబు సుజనకోటికి వత్సా! ౩౫౬
సీ॥ అన విని నారదుండనియె లక్ష్మి సర,స్వతులు గంగయు జగత్పావని యగు
తులసియు నల్వురు తోయజాక్షునకు నం,గన లన వింటి గంగయు వికుంఠ
ధామంబునను సుఖస్థానంబుగా నిల్చు,టయు వింటి నద్దేవి ప్రియుని గాఁగ
హరిని జేకొనెనంటి వయ్యుదంతంబు న,విస్తరంబుగఁ దెల్పవే! యనంగ
తే॥ నుతగుణుం డగు నారాయణుండు వనజ, సంభవాత్మజుతో గంగచరిత మెల్ల
దెలిపె నిట్టులు సురనదీదేవి పిదపఁ, బరమపదమున కేగి యాహరికి మ్రొక్కి.
గీ॥ అందు నివసించె నయ్యెడ నబ్జభవుఁడు, హరిపదముఁ జేరి వలగొని యభినుతించి
సిద్ధసింహాసనమున నాసీనుఁడైన, యభ్ధికన్యావిభుని జూచి యనియె నిటులు.
వ॥ దేవా! కృష్ణాంగసంభూతయు, ద్రవరూపిణియు, యౌవనసంపన్నయు, శుద్ధసత్త్వ స్వరూపయుఁ, గ్రోధాహంకారవర్జితయు నగు గంగ యెవ్వరిం జేకొనక నిన్ను వరింపం గోరినది. గోలోకంబునఁ దేజస్వినియు, మానినియు నగు రాధాదేవికిఁ వెఱచి కృష్ణచరణంబున లీనంబగుటవలన లోకంబులు నీరసంబులయ్యె, నంత రాధిక నూరార్చి రాధామంత్ర కవచస్తోత్రంబు లిద్దేవిచేఁ బఠింపంజేసి కృష్ణు ననుమతి నిద్దేవిం గొని యిం దరుగుదెంచితి. నీవు గాంధర్వవివాహంబునం జేకొనవలయు. వేల్పులలో రసికుండవు. కాంతల యం దీపె సారస్యసంధాయిని. ప్రౌఢులకుఁ బ్రౌఢాంగనాభోగంబు గుణవంతంబు. స్వయ మాగతయగు నంగనం జేకొనని పురుషులకు లక్ష్మీప్రసాదంబు దూరంబుగదా! ప్రకృతి ధిక్కరణంబు పురుషులకుగర్వాంబు. కామినులు ప్రకృతికళలు, నీవు ప్రకృతి పురుషుండవు. నీ యర్ధాంగంబున నలద్విభుజుండగు కృష్ణుండును, నట్టులె రెండవభాగంబునఁ జతుర్ముఖుండుం గలిగిరి.* రాధా కృష్ణాంగసంభూత యగు నిగ్గంగ కాముకియైయున్నయది. వామాంగంబున భార్గవిని జేకొనినయట్లు దక్షిణాంశజయగు నిబ్బోటిం జేకొనవలయునని సమర్పించి తమ్మి చూలి చనిన గాంధర్వ వివాహంబునఁ జతుర్భుజుం డాపెను జేకొనియె, నిరువురు స్వేచ్ఛారతులం బ్రవర్తించిరి, నిమిత్తవశంబునఁ బృథివీగతయయ్యును బిదప గంగ

టిప్పణి॥ * రాధా......నిగ్గంగ, ఇయ్యెడ నిప్పటి మూలగ్రంథమునకు భేదం చేఁజెని.

నిజస్థానంబగు పరమపదంబునఁ బరమపురుషభోగరసికయై యున్నయది. ఇట్లన్యోన్య శాపంబులును దత్తన్నివర్తనంబులును దెలుపంబడియె నింక నెయ్యది వినఁగోరెద వనిన నారదుం డిట్లనియె. ౩౫౯

సీ॥ దేవదేవ! మహానుభావ! నారాయణ!, తులసి యెచ్చోటఁ బ్రాదుర్భవించె?
నే వంశమునఁబుట్టె! నెట్లు నిరీహంబు, నిర్వికారంబును నిరుపమాన
మద్వయం బఖిలాశ్రయంబు నారాయణ, బ్రహ్మంబుతోడ సంబంధగరిమ
మే తపంబునఁ జెందె నెట్టుల వృక్షత్వ, మొందె నిక్కథ నాదు డెంద మిపుడు

తే॥ వినఁగఁ గోరుచునున్నది విశదఫణితి, నెఱుఁగఁజేయఁగ వలెనన్న నిచ్చగించి
యమరమునితోడ నిట్లని యానతిచ్చెఁ, దులసి వృత్తాంతమెల్ల సాధుత్వగరిమ.

వ॥ పూర్వకాలంబునఁ బుణ్యవంతుండును వైష్ణవుండును దపస్వియు, విష్ణ్వంశసంభూతుం డును నగు నొక్కమనువు దక్షసావర్ణి యనం గలండు. తత్పుత్రుండు బ్రహ్మసావర్ణి, తన్నందనుండు ధర్మసావర్ణి, తన్నందనుండు రుద్రసావర్ణి, వానికొడుకు దేవసావర్ణి వాని కొమరుం డింద్రసావర్ణి, ఇతనికొడుకు వృషధ్వజుండు, తాత ముత్తాతలు విష్ణుభక్తులితండు శివభక్తి పరాయణుం డీతనివలనిప్రేమ్మకతన నమ్మహాదేవుం డీతనియాశ్రమంబున యుగత్రితయపరిమితం బగు కాలంబు నివసించె, నప్పరమ శివుం డీతనిఁ గుమారాధిక మ్మగు పుత్రస్నేహంబునఁ బ్రేమించుచుండ బ్రహ్మ దుల లెక్కగొనక లక్ష్మీసరస్వత్యాదిసపర్యలం బోవిడిచి శివపూజారతుండై యజ్ఞంబు లొనర్పక సూర్యాదుల నిందించుచు వర్తించు నెడ నర్కుండు కోపించి భ్రష్టరాజ్యుండ వయ్యెద వని శపించినఁ ద్రిశూలంబు ధరించి దివా కరు నణంతునని శంకరుండు పరువిడ భీతుండై దినేశుండు బ్రహ్మలోకంబునకుం జనిన శివుండు భీషణుండై యచ్చటికిం బోవ సూర్యుం బురస్కరించుకొని తమ్మిచూలి వైకుంఠంబునకుం జని సర్వేశ్వరుండగు నారాయణునకుం బ్రణమిల్లి భయకారణంబు నుడివిన నభయం బొసంగి యే నుండ సాధ్వసంబునకుం బని యేమి? చక్రహస్తుండనై భీతిచ్ఛటానివారణం బొనర్చెద; జగంబులకు బ్రహ్మరూపంబున స్రష్టనై, రుద్రరూపంబున సంహర్తనై యుందు. నేను, నీవును, రుద్రుండును, సూర్యుండును, నానారూపంబుల సృష్టిస్థితి సంహారంబు లొనర్తుము; మద్వరంబున మీకు భయంబు వలవదు; సర్వేశ్వరుండును, భగవం తుండును, మూర్తిత్రయాతీతుండును నగు శంకరుండు భక్తాధీనుండును, భక్తవత్స లుండును నాట నతండు నాకుఁ బ్రాణాధికప్రియుండు; బ్రహ్మాండంబులయం దెం దును మా యిరువురకన్నఁ బరంబులేదు. మహాదేవుండు సూర్యకోటులను బుట్టిం పంగలవాఁడు. జ్ఞానస్వరూపుఁ డతనిని సదా నేనును బహువిధంబులఁ జింతించు చుందునని వెండియు. ౩౬౧

క॥ మా కిరువురకును భేదము, లేకుండు జగత్త్రయమున ✽ లీలావిభవా
ప్తోకత నుండెద మిది గని, జోకన్మముఁ గొలిచి జనులు ✽ శుద్ధిఁ గనరే. ౩౬౩

సీ॥ ఇత్తెఱంగునను లక్ష్మీశ్వరుం డబ్జజు, నాదరించుచు నున్న ✽ యయ్యెడరున
శూలహస్తుం డయి ✽ శూలి రక్తాంబుజ, నయనుఁడై వృషవాహనంబు నెక్కి
యచ్చోటి కరుదెర ✽ నతిశాంతమూర్తియై, రత్నపీఠంబున ✽ రత్నభూష
ణంబులు మెఱయ ఘనశ్యాముఁడై చతు,ర్భుజుఁడును జామరోద్ధూతవాత

గీ॥ చలితపీతాంబరుం డయి ✽ సరసిజాత, హస్తతాంబూలమిడఁ జర్వణానుభూతి
నచ్చరలయాటఁజూచుచునద్భుతప్రి, మోదియగుచుండిపరమాత్ము✽మోముగాంచి.

మ॥ హరి మ్రొక్కఁగని శంభుమూర్తికిని సాష్టాంగఁబుగా బ్రహ్మయున్
సరసీజాప్తుఁడు లోనుగాఁ గలుఁగు నాస్థానీనివాసుల్ సమా
దరవృత్తిన్ జరణాంబుజాతములకున్ ✽ దండంబు లర్పింప శం
కరుఁడున్ గేశవు సన్నుతించుచుఁ దద✽గ్రస్థాయియై యున్నెడన్. ౩౬౪

గీ॥ రత్నసింహాసనంబున ✽ రాజమకుటు, విశ్రమింపంగఁ జేసి య✽విష్ణుమూర్తి
దివ్యపీయూషధారావ✽దీర్ణమయిన, మధురతరసూక్తి వచియించె✽మదిఁ జెలంగి.

క॥ లౌకికవైదికములు న,స్తోకత వివరింతు వీవు ✽ సుభగులకెల్లన్
బ్రాకట వరప్రదాతవు, నీకే నొక ప్రశ్న యిత్తు ✽ నిర్మలచరితా! ౩౬౬

గీ॥ తపములకునెల్ల సత్ఫల✽దాయకంబు, సర్వసంపద లందించు ✽ సాధకంబు
నీదుసంప్రశ్న నిఖిలైక ✽ నిర్వహణము, గాన నేఁ బ్రశ్న మొనరింతుఁ✽గనలనలమ.

సీ॥ ఏమిదలంచి నీ✽విం దరుదెంచుట? కనలుచెందుట కేమి✽కారణంబు?
రక్తలోచనములు ✽ రక్తాననమ్మును, మెఱయ సంరంభ మి✽మ్మెయిఁ దనర్చెఁ
దెలియఁజేయుమటన్న ✽ దేవదేవుండైన, హరుఁడు వృషధ్వజుం✽డనెఁ నృపరాజు
ప్రాణాధికుండగు ✽ భక్తుండు వానిపై, సవిత్రుఁడు కోపించి ✽ శాప మిచ్చెఁ

ఆ॥ గాన సూర్యమీఁది ✽ కనలున శూలంబు, కేలఁ గొనుచు నతనిఁ ✽ గీటడంప
దలఁచి వచ్చునంత ✽ తామరసోద్భవు, నండగొనిన యంత ✽ నాగ్రహించి ౩౬౭

ఉ॥ ఏనును సత్యలోకమున ✽ కేగఁగ వారలు నిందు వచ్చుటన్
మానని యీసునన్ గనలి ✽ మాధవ! యిం దరుదెంచినాఁడ నీ
ధ్యాన మొనర్చి నీచరణ✽తామరసంబుల నాశ్రయించినన్
వానికి నాపదల్ గలవె ✽ వారిక శాంతుఁడ నైతి నంతటన్.

వ॥ అని పల్కిన పురహరుమిత్రవచనంబులకు సంతసించి చిఱునగవు నెమ్మోము నలంక
రింప శంకరుం గాంచి ప్రయాణంబునకుం బనిలేదు. మీర లిప్పై వైకుంఠంబున కరుగు
దెంచుటవలన నిందుఁ గాలమానంబు బహుళంబై కడచె. మీ రెఱుంగరే! వృషభ
ధ్వజుండు కాలవశంబునన్ మడిసె, నతని సుతుండు రథధ్వజుండును, దత్పుత్రులగు
ధర్మధ్వజ కుశధ్వజులును, హృతశ్రీకులై రాజ్యభ్రష్టులైరి. పదంపడి లక్ష్మీకటాక్ష
వశంబున వారిరువురు సంపద్యుక్తులై నృపశ్రేష్ఠు లగుదురు. నీకు భక్తుండగు వృషభ
ధ్వజుండు కడచనియె. సర్వజ్ఞులు మీ రెఱుంగని వృత్తాంతంబు లేదు. భవద్భక్తాప
రాధి యగు సూర్యునిం గటాక్షింపవలయు నని ప్రార్థించి నమస్కరించిన శరణా
గతరక్షకుండు గావున సంతసించి శివుండు నిజవాసమునకుం జనియె. విష్ణుండును
నభ్యంతరంబునకుం జనియె. బ్రహ్మాదులు నిజనివాసంబుల కరిగి రని చెప్పి వెండియు.

క॥ భుజబలశాలులు ధర్మధ్వజుఁడు గుశధ్వజుఁడు నహిత । దర్పోద్ధతిచే
నిజవిభవ మెల్లఁ జెడి యంబుజహస్తం గుఱిచి తప మపూర్వము గాఁగన్. ౩౨౧

ఉ॥ చేయుచు నిష్టసిద్ధిగొను । చేవదలిర్పఁగ శత్రుసంహృతిన్
బాయఁగఁ జేసి రాజ్యము లపారపరాక్రమశక్తిఁ గాంచి సో
పాయము గాఁగ నేలిరి జనావళులన్ బరిపాలనక్రియా
స్థాయిత ధర్మవర్ధన ప్రధానముగా నొనరించుచుండఁగన్. ౩౨౨

క॥ అందుఁ గుశధ్వజునకు నర, విందాక్షి సురూపగరిమ । విబుధాంగననా
డెందమునన్ బతిభక్తి య, మందత గిరికొనఁగ సుజనసమాన్యతఁ గొనుచున్. ౩౨౩

మ॥ కమలాంశంబునఁ బుత్రికం గనియె వీఁకన్ జంద్రబింబాస్య యా
ప్రమదారత్నము నాఁడు నాఁటికి జగద్భవ్యాకృతిన్ బొల్చి దు
ర్దమవేదార్థవివేకతత్పరత నత్యంతంబు రాణించుటన్
సుమతుల్ వేదవతీసమాఖ్య తగునంచున్ మెచ్చి రక్కన్నెకున్. ౩౨౪

సీ॥ మానినీమణి జాతమాత్రంబునన పూర్ణ, వైరాగ్యరసము దుర్వార మగుచు
మది బెనంగొన సదాసమహితసద్గుణచర్యఁ, దప మొనరించుఁ దత్పరత దవిలి
సిద్ధభోగములు నిషేధించి సుస్నాత, యగుచు నారాయణధ్యానగరిమఁ
బుష్కరంబను నొక్కపుణ్యతీర్థంబున, నొక్కమన్వంతర । ముగ్రతపముఁ

తే॥ జలిపెఁ జిక్కదు చొక్కదు । చక్కఁదనము
నాఁడు నాఁటికిఁ బొలిపోక । నవనవముగ
వర్ధిలునుగాని యొసుమంత । వాడుటయును
నొగులుటయు లేక పెనుపొందె । నున్నగరిమ. ౩౨౫.

ఉ॥ అంతట నొక్కనాఁడు గగనాంగన పల్కెఁ బడంతి! నీకు జ
న్మాంతరవేళ నల్ల హరి యట్టులు బ్రహ్మముఖామరాళి క
త్యంతము దుర్నివారుఁ డగునట్టి పతిం గనె దంచుఁ బల్క న
య్యింతియు సంతసించి జగదీశుని శౌరిగుఱించి యిట్టులన్. ౩౭౮

గీ॥ గంధమాదన భూధరకందరముల, నిర్జనంబున నిలిచి యనిందితైక
తప మొనర్పఁగ నచ్చోట దశముఖుండు, కనఁగనయ్యెను దైవసంకల్పవశత.

ఆ॥ అవ్వేలంది వాని నతిథిభావనఁ బాద్య, మర్ఘ్య మొసఁగి సోపహారముగను
దృప్తిఁ దీర్ప వాఁడు తెలవఁ గన్గొని పాప,చిత్తుఁ డగుచుఁ బ్రశ్నఁ జేసె నిటులు.

ఉ॥ ఎవ్వరికన్య వీవు? జలజేక్షణ! నీసగుమోము సోయగం
బివ్వసుధాంగనామణుల కెచ్చటఁ గానము చూచినంతనే
యుర్విళులూరఁజొచ్చె మతియొక్క మృదూక్తి వచింపరాదె? నీ
జవ్వన మివ్వనిన్ దపము నల్పుచుఁ గాననచంద్రికయ్యెఁగా!* ౩౭౯

సీ॥ అని పల్కి యబ్బోటి యాననాంభోజంబు, మకరంద మానఁగ మధుకరంబు
పోలిక మదిఁ గోర్కె పొరిఁబొరిఁ జిగురింప, నవ్వరారోహ వీనాంగయష్టి
గుప్తంబులగు గబ్బిగుబ్బలు సదమల, సంరంభరథచక్రసదృశకటియు
మందహాసముఖారవిందంబు గని పంచ, శరశర వేదనాభరము కరము

తే॥ మదిఁ బెనంగఁగ నెడతీని మరులుకొనుచు
మూర్ఛల మునింగి తెలివొంది ముగుదకరముఁ
బట్టి శృంగారవనమున బలిమి గలియు
చందము దలంప నంతలో నిందువదన. ౩౮౦

శా॥ రంభాస్తంభవిజృంభితోరురుచిభారం బవ్వనీపాలిక
స్తంభాష్టాపదకాంతు లీనఁ గృశమధ్యం బంత జవ్వాడ ని
ర్దంభప్రక్రియఁ జివ్వునన్ గదలి దూరం బేగి యా దుర్మతిన్
స్తంభించెన్ నిజమంత్రశక్తిజడుఁడై తారాడలేకుండఁగన్. ౩౮౧

క॥ కరపాదంబులు గదలక, భరితోత్సాహంబు దొలఁగి పలుకఁగఁ గించి
త్తరశక్తి లేక దుర్బల, భరపరవశవృత్తి నిలిచెఁ బంక్తిముఖుండున్. ౩౮౨

ఉ॥ ఎద్దియుఁ జేయనేరక మదేభసదృగ్గమనావతంస మి
ట్లెద్దడి గొల్ప బెండుపడి హీనగళంబున దేవి! నన్ను నీ

టిప్పణి: చంద్రిక + అయ్యె. చంద్రికయ్యె. ఈ సంధి బహుమహాకవిసమ్మత మగుటచే దిద్ద
నైతిని. శ్రావణకటువుగా నుండనిచో నిది సమ్మతము. వెం॥ శా॥

యుద్దడిఁ బోవఁగావలె నతనినాసమనస్కత నంచు వేడ న
మ్ముద్దియ పంక్తికంఠు నతిదుర్మార్గునిఁ గాంచి వచించె నిట్టులన్. ౩౮౩

ఉ॥ కన్నులుగాన కట్లు ననుఁ గామనఁజేసితి కాన నేను సం
పన్నతపస్క నైన సుతబంధుసువ్యాజ్జనపాళితోడ ని
ర్భిన్నుఁడ వయ్యెదంచు నతిభీకరశాప మొసంగి దుర్మతీ!
నన్ను స్పృశించినాఁడవు మహనం దగ దీ తను వంచు నిశ్చితిన్. ౩౮౪

క॥ యోగాగ్నివశత దేహ, త్యాగ మొనరించె నంత దశకంఠుఁడు లో
రాగము పెనఁగొన నబ్బుర, మీగరిమ మటంచు నింటి కేగెన్ బిదపన్. ౩౮౫

సీ॥ కాలాంతరంబునఁ గలికి విదేహుని, యాగవాటములోన నవతరించి
జన్మాంతరజ్ఞానసంస్మృతిఁ దపముల, కందంగరాని మహానుభావు
దైత్యమర్దనునవతారంబు శ్రీరామ, చంద్రునిఁ జేకొని సర్వసౌఖ్య
సంప్రాప్తి గలిగి నిచ్చలు రాజభోగంబు, లనుభవించెనుగాదె యవనిఁ దపము
తే॥ సేయువారికి నిఖిలార్థసిద్ధి యరుదె?
యమరతాపస! యిది యుదాహరణ మనుచుఁ
దెలియుము దృఢార్థసంధానకలనవలనఁ
గారణము పూర్వకృతమాట గలుగదొక్కొ? ౩౮౬

చ॥ జనకునియాజ్ఞఁ గాంచి రఘుచంద్రుఁడు రాముఁడు లక్ష్మణుండునున్
వనితయుఁ దోడరా విపినవాస మొనర్చుచు వార్ధిచెంగటన్
ఘనతరకుంజపుంజముల కందువలన్ జరియించి యొక్కచోఁ
గనియెను వహ్ని నచ్చటనె కల్పితవేషత నగ్రజాతునిన్. ౩౮౭

ఆ॥ అమ్మహానుభావుఁ డర్కాన్వయుండైన, రామచంద్రుఁ జూచి రక్తిదొలఁకఁ
బలికె నొక్కపలుకు భగవంతుఁడవు నీవు, తెలియరాని దెద్ది దేవదేవ! ౩౮౮

క॥ వినను దెల్పెద నొక్కటి, జ్ఞానులకును దైవవశత సడలదు సీతా
మానినికి రావణునిచే, హాని పొసంగెడు నివారణార్హం బగునే. ౩౮౯

సీ॥ ఏను నిర్జరులచే నేతదర్థంబుగాఁ, బ్రస్థాపితుఁడనైతిఁ బావకుఁడను
జానకియే జగజ్జనయిత్రి యీ సతి, రక్షింపవలెఁ జుమ్ము రామచంద్ర!
యేను రక్షించెద నిమ్ము నీ వలసిన, యెడల నర్పించెద నెదఁ దలంక
వల దన రాముఁ డవ్వార్త యాలించుచుఁ, దల్లక్షణములు తత్పరతఁ దెలిసి
తే॥ సీత నొసఁగిన జ్వాలనుండు చిత్రగరిమ, తత్సమానాంగిగా నొక్క తరుణి నిచ్చె
రామచంద్రుండుఁ [illegible] దరణిజాతను గొని వహ్ని యరిగెనంత.

క॥ ఇది దేవతారహస్యము, విదితముగా దెవ్వరికి సర్వవిధముల నతఁడుఁ
గదిసియు లక్ష్మణుఁ డెఱుఁగఁడు, పదపడి యింకొకరి కెట్లు ♦ ప్రాపించెడినో? ౩౯౧

వ॥ ఇత్తెఱంగునఁ బావకాధీనయై భూతనయ నివసించె. శ్రీరామసన్నిధిని మాయా సీత వసియించె, నట్టి సమయంబున మాయామృగంబై మారీచుండు పర్ణశాలా ప్రాంతంబున సంచరించునెడ సీతాప్రేరితుండై రాఘవుండు లక్ష్మణు నచ్చోట నిలిపి ధనుర్బాణంబులు ధరియించి వెనుసని దానిం బడనేయ నమ్మృగంబు లక్ష్మణ నామోచ్చారణం బొనర్చి దేవతానుకూల్యంబు సంధించి వైకుంఠద్వారసంస్థుం డగు కింకరుండు గాన స్వపదంబున కరిగె; ననంతరంబున సీత విహ్వలయై లక్ష్మణుం గాననమున కన్న నన్వేషింప నంప రావణుండు సీతం గొనిచనియె. రాముండు లక్ష్మణుం గూడి చింతిల్లుచుఁ బర్ణశాలయెడ జానకిం గానక కాల వశంబున రావణాసీత యగుట యెఱింగి వానరసహాయుండై సాగరంబు బంధించి సబాంధవంబుగా రావణుం బరిమార్చి పావకపరిశోధితం జేయ హుతాశనుండు వాస్తవరూపంబున జానకి నొసంగె, నంత మాయాసీత నా కెద్దిగతి? యన రామ ధనంజయులు పుష్కరక్షేత్రంబునఁ దపింపు మనిన నట్టులె త్రిలక్షవర్షంబులు తపం బొనర్చినపదపడి కృతార్థతం గనియె, నీపెయే కృతయుగంబున వేదవతియై త్రేతాయుగంబున సీతయై, ద్వాపరంబున ద్రౌపది యన్యోనని యెఱుంగు నది; ఆ యా మాయాభేదంబులు జగజ్జననీచిత్రంబు లనిన నారదుం డిట్లనియె.

క॥ పతు లేవు కాట యెట్లో, సతి ద్రౌపది కనిన మౌనిచంద్రుఁడు పలికెన్
బతియగు శ్రీరాముని సం, గతి వాస్తవి జనిన పిదపఁ ♦ గడు వెత పడుచున్. ౩౯౩

సీ॥ మాయాధరిత్రిజ ♦ మదిఁ జింతిలుచు వేడ, రామాగ్ను లిరువురా ♦ రామఁ జూచి
తపముఁ జేయుమటంచుఁ ♦ దత్పరత్వముతోడఁ, బలుకరే యట్ల యప్పుడఁతి హరుని
గూర్చి తపించినఁ ♦ గోమలి కంధక, హరుఁడు ప్రసన్నుఁడై ♦ యడుగు వరము
నావుడు నబ్బోటి ♦ భావజార్తికి లోఁగి, పంచవారంబుగాఁ ♦ బతి నొసంగు

తే॥ మనుచు వేడిన వరమిచ్చె ♦ నభవుఁ డాన, నమునఁ జెఱునవ్వు చిగురింపఁ ♦ బ్రమదయలరె
నంత నంతర్హితుం డయ్యె ♦ నంబుజారి, శేఖరుండైన దేవతాశేఖరుండు. ౩౯౪

క॥ ప్రస్తావవశంబున ని, వ్వాస్తవ మంతయును నెఱుఁగఁ ♦ బలికితిఁ గౌదవక
నిస్తులగతి శ్రీరాముం, డస్తోకత లంక నసురుఁ ననుజున కొసఁగెన్. ౩౯౫

క॥ సీతను జేకొని రామ, క్ష్మాతలపతి సంతసమున ♦ సాకేతమునన్
ఖ్యాతిగ నేకాదశ సం, ఖ్యాత సహస్రాబ్దములు జగం బేలెఁ జుమీ. ౩౯౬

క॥ భారతఖండంబున నిటు దు, ర్వారత రాజ్యంబు నేలి ♦ రాముఁడు వైకుం
ఠారాముఁ డయ్యెఁ గమలాం, శారంజిత వేదవతియు ♦ శౌరిని గూడెన్. ౩౯౭

క॥ ఈయాఖ్యానము సిరు లన, పాయంబుగ వినినఁ జదువఁ ‡ బ్రజలకు నిరత
స్థాయిగ నొసఁగును శుభదం, బై యఖిలసుఖంబు లొసఁగుననని పల్కె తగన్.

సీ॥ ఆ కుశధ్వజునకు ‡ ననుజన్ముఁడైన ధ, ర్మధ్వజుపత్ని యళరాళచికుర
మాధవి నా భర్త ‡ మన్నింప గంధమా, దనశైలమున సుఖస్థానములను
జల్లని వాయువుల్ ‡ సందడింపఁగ దివ్య, రత్నభూషితులయి ‡ రాజు నింతి
సురతకేళులయందు ‡ విరతి యెఱుంగక, దైవవర్షశతం బుదారగరిమ

తే॥ ననవరతసౌఖ్యరససమాశయత్త చిత్తు, లగుచు నున్నెడ సురతేచ్ఛయవ్విభునకు
విరమణమునొందె బోటికి ‡ వింతవింత, భోగములపైని నడియాస ‡ పోవదయ్యె.

ఉ॥ దైవవశంబునన్ దరుణి ‡ తద్దయు గర్భము దాల్చి దివ్యశో
భావహవృత్తి నంది శత ‡ మాదరభారము నొంది యొక్క వు
ణ్యావృతవేళ లగ్నము జయప్రదమై విలసిల్లఁ గామసం
జీవనిఁ గన్యకన్ గనియెఁ ‡ జెల్వుగఁ గార్తికపూర్ణిమాతిథిన్. ౮౦౦

క॥ అక్కన్నియ సిరిగావునఁ, జక్కఁదనంబునను దేవసతులకు నెల్లన్
ధిక్కృతిఁ బొనఁగించుచు దశ, దిక్కులఁ దనసాటి లేక ‡ తేజం బెసఁగన్. ౮౦౧

సీ॥ పర్వచంద్రానన ‡ పంకజలోచన, పక్వబింబాధర ‡ భావగర్భ
రక్తహస్తద్వయ ‡ రమ్యత్రివళియుక్త, రక్తపాదాంభోజ ‡ రక్తినిలయ
ఘననితంబ సుఖోష్ణకలితసర్వాంగక, శ్యామ మనోరమ ‡ జలదకేశి
పీతచంపకవర్ణ ‡ పృథులస్తనద్వంద్వ, సుందరులం దతిసుందరాంగి

తే॥ యట్టికన్యకఁ గాంచి జనాళి యనువ, మాకృతివహించుట యెఱింగి యాదరమునఁ
దులసి యన్ను నామమిడిరి యంత్తోయజాక్షి, భోగములవీడి తాఁ దపంబునకునరిగె.

క॥ బదరీవనమధ్యంబునఁ, గదలక దైవాబ్దలక్షఘనవర్షము లా
మధనజనకుండు పతి యని, మది నిశ్చితి నూనఁజేసె ‡ మానిని తపమున్. ౮౦౩

సీ॥ కమలనయన గ్రీష్మకాలంబునందున, నసలమధ్యంబున ‡ నధివసించె
వర్షావసరముల ‡ వదలక శైలాగ్రి, బహిరావరణముల ‡ బట్టబయల
వర్షధారల కనుపవర్తనంబుగ మోము, పైకెత్తి నిలిచి శుంభద్దినముల
ఘులజడి కోర్చి యక్కలికి యిర్వదివేల, హాయనమ్ములు సలిలాశనంబు

తే॥ నటుల ముప్పదివేలేఁడు ‡ లాకు మెసవి, యటుల నలుబది వేలేఁడు ‡ లనిలభక్ష
ణం బొనర్చుచు దశసహస్రంబు వత్స, రములు నాహారమెడలి తపము నొనర్చె.

క॥ అట్టులు ద్విలక్షవర్షము, లిట్టట్టుం గదల కొక్కయెడ నేకాంఘ్రిన్
మట్టుగ నిలిచి తపింపఁగ, నట్టన సాక్షాత్కరించె ‡ నజుఁ డంత ప్రీతిన్. ౮౦౫

ఉ॥ రాజమరాళ మెక్కి ద్విజరాజముఖిం గని యేచు బ్రహ్మ నం
భోజదళాక్షి! నీతప మసంభూతవిధిం బ్రథితంబుగాన నీ
యోజ గణించి వచ్చితి మహాన్నతితోడ వరంబువేడు మం
చా జలజోద్భవుం డడుగ నయ్యెలనాగ వచించె నీగతిన్. ౪౦౯

సీ॥ ఈవు సర్వజ్ఞుఁడ వేను గించిజ్ఞను, నాకోర్కె మెఱిఁగియు నన్ను నడుగఁ
బనియేమి తులసినై బహుకాలములు కృష్ణ, వల్లభనై యతిశవాంఛఁ దవిలి
గోలోకమున నుండు కోమి రెను శౌరితోఁ, జిరకాలసుఖములఁ జెంది తృప్తి
నొందక యతిమోహ మంది తత్సన్నిధి, రాసమండలమున రక్తి దవిలి
తే॥ యున్న రాధిక యరుదెంచి నన్నుఁగాంచి, పతిని భర్జించి నాకు శాపం బొసంగె
నదిమెఱిఁగిశౌరిననుఁజూచియనిమెనాదు,నంశమునభర్తభజియించునవనిమీఁద.

గీ॥ అమ్మహాదేవి శాపవహ్నిచోభిత ప్త, నగుచు మానవినై తపం బాచరింతు
నచ్యుతుఁడు నాకు భర్తగానానుమతంబు, సేయుమని వేడ నలువ యచ్చేడకనిమె.

వ॥ దేవీ! సుదామాభిధానుండగు గోపాలకుండు కృష్ణాంగసముద్భవుండును, దాదృశ
తేజస్వియు నగు నతండు రాధాశాపవశంబున దనువంశంబున జనియించి శంఖ
చూడుం డనం బ్రసిద్ధినొందె. భువనత్రయంబున ననదృశుం డతండు. గోలోకం
బున నిన్నుఁ గాంచి మదనోన్మథితమానసుండై రాధికాశాపంబున భవసాగర
పతితుం డయ్యె, నివ్వు డాతనికిం బత్నివై పిదప నారాయణుం జేకొనెదు. నీవును
వృక్షరూపవై విశ్వపావనివై విష్ణుప్రాణాధికవై బృందావనంబున నివసించెదు.
నీవులేని దైవసపర్యలు నిష్ఫలంబు లగుంగావుత మని నలువ నుడివిన సంతసించి
త్వత్ప్రసాదంబున దుర్లభుం డగు గోవిందుం జేకొనిమెద, రాధామంత్రం బుప
దేశింపు మని వేడిన షోడశాక్షరం బగు మంత్రం బుపదేశించె. మద్వరంబున
గోవిందునికిఁ బ్రాణతుల్యవై యెవ్వరికిని గోచరంబుగాని శృంగారం బనుభవించెదు,
కొఱంతపడవల దని తన్మంత్రకవచపూజావిధానపురశ్చర్యాదు లుపదేశించె,
నబ్బోటియు నట్టులె పూజించుచు విశ్వదుర్లభంబైన లక్ష్మీశ్వరునితోడి మహా
భోగం బనుభవించెఁ దత్ప్రకారంబెల్ల సవిస్తరంబుగాఁ దెలిపెద విను మని నారా
యణుం డిట్లనిమె. ౪౧౦

ఉ॥ వారిజసంభవుండు కృపవటిల సర్వముఁ దెల్పి బోటి! నీ
కోరిక దీరు నీ తప మహకుంఠితమయ్యె సుఖానుభూతి నిం
డారఁగ నింటి కేగుమని యల్లనఁ దెల్పఁగ హృష్టమానసాం
భోరుహయై గృహంబునకుఁ బోయి సుఖస్థితి సంచరించుచున్. ౪౧౧

క॥ నారాయణాంశసంభవుఁ, డై రంజిలు దివ్యసుందరాంగుఁడు గోపా
కారుఁడగు శంఖచూడుం, డారయఁ జేకొనుట కల్గు ననుమోదమునన్. ౪౧౧

చ॥ విరహము చేఁ గృశించుచును వేమఱుఁ బూవులసెజ్జ నెమ్మెయిన్
సరసవిలాసలాలసవిశంకటవృత్తిఁ బొసంగఁ జేర్చుచున్
గర మనురక్తిమై మనసు గందుచుఁ బుష్పశరాశుగాహతిన్
నిరతముఁ దూలి తూలి పడి నిష్ఠితమోహభరానుబంధయై. ౪౧౨

సీ॥ విరిసెజ్జ మెయిఁజేర్చి విభుసమాగమకాంక్ష, గరుపాఱి మేనెల్లఁ గలఁగుచుండ
సాత్త్వికోదయదశాసంపత్తి నరుణలోచనముల ననురాగసార మొలుక
క్షణచేతనత్వంబు క్షణవిచేతనతయు, క్షణశుష్కతాపత్తి క్షణికమూర్ఛ
క్షణసుఖోల్లసనంబు క్షణకృతోద్వేగంబు, క్షణపరితాపంబు క్షణికజడత
తే॥ కలిగి లేచుచుఁ దిరుగుచుఁ గళవళమున, దెసలు చూచుచు నదె వచ్చె దేవుఁడనుచు
నాసనొందుచుఁ దలఁపు చాయాన మెసఁగ, సెజ్జపై నంత నిద్దురఁ జెందె బోటి.

ఉ॥ అత్తఱి దివ్యసుందరుఁ డనర్ఘవినూతనరత్నభూషణా
యత్తవపుర్విశాలుఁడు సుమాంచితమాల్యమనోహరుండు గం
ధోత్తమబంధురాంగుఁడు మహోన్నతయౌవనశాలి యొక్కఁ డా
బిత్తరిచెంతఁ జేరి తమిఁ బేర్మి సుమాశుగకేళిఁ దన్పుచున్. ౪౧౪

సీ॥ గుత్తంబు లగు గబ్బిగుబ్బదోయి నఖాగ్ర, కర్షణంబులఁ జాలఁ గలఁచి కలఁచి
సరససుధాసారసంభృతాధరబింబ, చుంబనంబులఁ జాల సొక్కి సొక్కి
చతురశీతివిభేదసంబంధరతికథా, సరసగరిష్ఠతల్ సల్పి సల్పి
తమియుగ్గలంబైన దర్శనంబుల నాత్మ, సుచిరాననకళల్ చూచి చూచి
గీ॥ మోహనారంభలసదుపగూహనముల, గట్టిపట్టులఁ దమి దీరఁ గదిసి గదిసి
స్వప్నసంభోగమున నొక్క సరసుఁడంతఁ, గలసి నట్టులు కలఁ గాంచెఁ గాంత వింత.

క॥ కలగాదు నిక్క మనియెడు, కలనన్ నెఱజాణతోడఁ గలసి కలసి య
క్కలికి మెయిమఱచి మరు ను, త్కలికన్ దమిఁ బెనఁగుచున్న తఱి నంతంతన్.

ఉ॥ ప్రాణవిభుండు లేచి యెడ బాటునఁ జిక్కక పోయినట్లు పూఁ
బోణి యెఱింగి న న్విడిచి పోవుట ధర్మమె? పాయఁ జాల నా
ప్రాణము నీయధీన మని పల్కుచుఁ బట్టఁగఁ బోవునంతలోఁ
బాణిసరోజబద్ధుఁ డయి పట్టున జిక్కకయున్న యంతటన్. ౪౧౭

ఉ॥ బెగ్గిలి నిద్రమేల్కొని సభీతిమనస్కత సొమ్మసిల్లి న
వ్వగ్గణనీయమా నతిని యంచితము జెందుముట్టో గద్దెపున్

వెగ్గలమైన కంతుశరవేదనచేఁ దమి నిల్వఁజాలక
య య్యగ్గలపుం విరాళి వలపాఱశిఁ బోయె నటంచు బోటియుం. ౯౧౭

సీ॥ కలకంఠశారికాకంఠహుంకారముల్, మదిలోనఁ బ్రియు మీఁది మమతఁ బెంప
సరససారసభృంగఝుంకారరవములు, చిడిముడిగొని సొమ్మసిల్లఁజేయ
మాకందసంచరన్మలయమారుతడింభ, సంచారములు తాల్మి సమయఁజేయఁ
బంచాశుగోన్మాదపరిభవం బెక్కటీక, సంతతపారవశ్యంబుగూర్ప
గీ॥ బ్రాణవల్లభుపైఁగూర్మిపట్టువిడక, యన్యచేష్టావిరామత నందగింప
విరహభరమున నబ్బోటి వెతఁగలంగు, నవసరంబున భారతీశాజ్ఞఁ గాంచి.

వ॥ నవయౌవనసంపన్నుండును, గామదేవసమప్రభుండును, శరత్పార్వణచంద్రాస్యుండును, శరత్పంకజలోచనుండును, రత్నవిమానస్థుండును, మణికుండలమండితగండస్థలుండును, బారిజాతమాలికాలంకృతుండును, గస్తూరీకుంకుమాన్వితచందనలిప్తాంగుండును నగుచు శంఖచూడుం డచ్చోటి కరుగుదెంచిన నతనిం గాంచి తనతోడం గలసిన సరసుం డీతండ యని దరహాసముఖారవిందయై కటాక్షంబుల నీక్షింపుచు నవసంగమలజ్జిత యగుట నెమ్మోము పయ్యెదచెఱంగునం గప్పికొనియున్నంత ౯౨౦

సీ॥ శరదిందుబింబాస్య చరదళిభ్రమరక, మణిమయానర్ఘభూషణవితాన
క్వణితమంజీర సంఘటితమాల్య సుకేశ, తాటంకయుగధగద్ధగితగండ
మణిహారవక్షోజమధ్యస్థలోజ్జ్వల, కంకణఝణఝణత్కారసహిత
రత్నాంగుళీయవిరాజితకరకంజ, మేఖలాంచితమధ్యరేఖ యగుచు
తే॥ పడఁతి భూగతచంచలపగిది మెఱయ, నవ్వరారోహఁ గాంచి యుదారమోహ
పరవశీభూతచిత్తుఁడై పజ్జఁజేరి, మధురగంభీరవాక్కుల మందలించె. ౯౨౧

ఉ॥ ఎవ్వరిదానవే సరసిజేక్షణ! కాంతలమేలుబంతి! నీ
జవ్వనముం బిసాళి కనుజగ్గులు వింత యొనర్చె నామదిం
గవ్వపుగొండదారి పెనుసగ త్తరిమోహినిరూపుఁ దాల్చి న
ట్లివ్వసుధం జరింతె విధి యేమొకో సర్వసుఖప్రదాయినీ? ౯౨౨

సీ॥ భోగాతిసారంబు పొలతి! నీ నెమ్మోము, సతి! మనోహరము నీచన్నుదోయి
కలికి! నీమధ్యంబు గగనధిక్కారంబు, తమ్మిపూవుల నేలుఁ దరుణి! కేలు
మన్మథాధారంబు మగువ! నీ చెలువంబు, లలన! కాంతి జగద్విలక్షణంబు
బోటి! నీ నెమ్మేను భువనమోహనలీల, నెలఁత! బంగారమ్ము నీమెఱుంగు
తే॥ నిన్నుఁ జూచినయది మొదల్ నీరజాక్షి! పంచశరుబారిఁ బడి చాలఁ బల్లటించె
నాదు చిత్తంబు ననుఁ జూచియాదరించి, యొక్కమాటాడుమమ్మ చన నుత్పలాక్షి!

గీ॥ మందహాసంబు నెమ్మోమునఁ జిందగింప, సమ్రివదనాంబుజాత మానంద మొసఁగ
నేను ధర్మధ్వజకుమారి నిందుఁ దపము, సలిపెడఁ దపస్విని నటంచుఁ దరుణి పలికె.

ఆ॥ ఎందునుండి వచ్చి తేమి కార్యము గల్గె, నిందు నీకుఁ దెలియ నిచ్చగొనెద
నే కులంబువాఁడ వెవ్వండ వింతులఁ, బల్కరించు టేమి ప్రాభవంబు? ౮౬౭

తే॥ ఏకతమ్మున నున్న నాళీకముఖుల, కడ కరుగుదెంచు టొకతప్పు ఘనకులునకు
వచ్చి పలుకరించుట పయిపెచ్చు తప్పు, నీకుఁ దెలియదె యెంతటి నేర మిదియు.

సీ॥ సత్కులజాతుండు సద్ధర్మవర్తియు, నగు శిష్టుఁ డతివల కానఁగొనునె?
విషకుంభములు విషావిర్భూతసుధలు ని,ష్ఠురఖడ్గహృదయలు సులభవచన
లాత్మకార్యంబుల నభిమతల్ కార్యార్థ, మన్యులయెడల నిష్టాప్తివాఞ్ఛ
నంతర్మలిన లానస్నాబ్జవిసన్నలు, శ్రుతిపురాణాదిగర్హితలు సతులు

తే॥ వారియెడ విశ్వసించెడువారు గలరె, ప్రాజ్ఞులకు వారిఁ జేపట్టఁ బాడియగునె?
కాంతలకు మిత్రశత్రువుల్ గలరె జగతి, సుందరునిఁ జూచి వాంఛింపఁజూతు రెందు.

గీ॥ అంతరంగంబులోన దురాశయంబు, గలిగియును బాహ్యలాంపట్య గరిమఁ గాంతు
రాత్మకార్యార్థమై వేత్తలైనవారు, వారి జంజాటమున కాసపడుదు రొక్కొ?

ఆ॥ పైకి లజ్జ గలుగు వీక నటించుచు, సురతవాంఛ మదిని జూఱఁగొనఁగ
సాత్త్వికోదయం బెసంగించి యేకాంత,మందు నగుదు రెంత యధికునేని. ౮౭౯

క॥ అతిశయసంభోగంబునఁ, గుతుకంబును నటు లనల్పకూటమ్ములచేఁ
బతి మొఱఁగి యన్యపురుషుల,రతి కాశించెదరు సతులరక్తిం గనమే. ౮౭౦

ఆ॥ పిన్నవయసువాఁడు ప్రియవచనంబుల, రసికుఁడైనవాఁడు రతికిఁ గలుగఁ
బతులకూర్మి మఱచి పరమనిర్మోహంబుఁ, బట్టియుందు రెట్టి పాప మొక్కొ.

క॥ ధనికుఁ డగుఁగాక యంద,మ్మున కిక్కయె యగునుగాక ముష్కరసురత
మ్మున మెచ్చఁజేయు పురుషునిఁ, గనినట్టులు వాని నతివ గనుఁగొన దెపుడున్.

గీ॥ సాహసంబు మదము నటలు దోషంబులు, వట్టి వలపు లానఁబుట్టఁజేసి
హరిహరాదులైన నడియానఁబొందంగఁ, జేయు మాయలాఁడు చేడె లవని.

ఆ॥ కంఠపాశములును ఘనమోక్షపురకవా,టికలు పుణ్యమార్గవికటమతులు
మగువ లనఁగఁ జండమాయాకరండముల్, గాన వారి నమ్మరాదు సతుల.

సీ॥ ఆజవంజవకారలందుఁ గట్టఁగ నమో,మయశృంఖలలుగారె మానవతులు
ఇంద్రజాలములు మ[illegible] సతులు

అంతర్విచారదుష్కరాంతరంగలై యయ్యు. బాహ్యశుద్ధతఁ జూపు ♦ పాపమతులు
నిలువెల్ల నటు గాఁగ ♦ నేర్పులఁ బచరించి, బొంకు వెఱువని ♦ పరుషరతులు
తే॥ ఇంత లననేల! మదనుని ♦ దంతులట్లు, మనసుఁ గఁదంగనీక ముష్కమ్మరపుమతఁ
గలఁచి కాంతులబల మెల్ల ♦ వలపుపేరి, వహ్ని నాహుతి సేతు రక్కవ్వనిత లనఘ!

సీ॥ నెమ్మోము కన్నులు ♦ నిద్దంపుఁజెక్కులు, గుత్తంపుబిగిగబ్బి ♦ గుబ్బదోయి
కేలిసోయగము జంఘకెనచూపు టొయ్యార, మందంపునడక ♦ సోయగపుఁజెక్కు
గలిగించి వెలుపలఁ ♦ గదలని మెఱుపులఁ, జెలువంబు గనఁజేసి ♦ చెలిమికాని
మోసపుచ్చుటెకాని ♦ మూత్రవిట్కర్దమ, కంఢూనిదాఘదుర్గంధములను
తే॥ మునుగఁజేయుచు నిరయంబుకమూల నిఱుకు,నరకవాసునితో వెతల్ ♦ సరిమెగాక
సతులసుఖములు సుఖములె ♦ వెతలుగాక, వెఱ్ఱిభ్రమితల మగవారు ♦ విడువలేరు.

గీ॥ నిదురయును సౌఖ్యమునుబట్టి ♦ నేలఁ గలుప
మగువలను నిర్మితిరియొనర్చె ♦ మాయలాఁడు
నలువ మగవారు గనలేక ♦ న్యాయ్య మనుచు
సతుల వలఁతురు ప్రాక్కర్మసంగ్రహమున. ౪౩౭

క॥ నా విని నెమ్మోమున నగ, వావిర్భూతంబుగాఁగ ♦ నంగనఁ గని దై
ర్యావహుఁడు శంఖచూడుఁడు, భావం బలరంగఁబలికెఁ ♦ బడఁతిఁ గనుచున్.

ఉ॥ నీ విశదంపువాక్యము లనింద్యతముల్ మధురంబు లయ్యు మి
థ్యావహవృత్తులున్ బ్రకృతతత్త్వరతత్త్వమహత్త్వవృత్తులున్
బోవఁగనీక నెమ్మది కపూర్వముదం బొనరించెఁ గొంచిదు
చ్చావచవాక్ప్రవర్తనము ♦ సల్పెద విన్మిట సావధానవై. ౪౩౯

సీ॥ సర్వమోహనముఁగా ♦ సల్పిన కాంతాసృష్టి, యొనరించె వాస్తవంబొప్ప వినుము
శస్యం బశస్యంబు ♦ సరసిజాక్షుల సృష్టి,యందుఁ గల్గెడుఁ గాన ♦ నరయవలదె?
గుణము దుర్గుణమును ♦ గుటిలతాకుటిలతల్, బుద్ధిమంతుల కాత్మబోధ గానవె?
దుగ్ధ ముష్ణంబైనఁ ♦ దొడిఁబడి తక్రంబు, వేఁడియం చనునట్టి ♦ వెఱ్ఱి గలఁడె?
తే॥ జంగమస్థావరంబుల ♦ జగములందు, నుత్తమాధమభేదంబు ♦ లుండవొక్కొ?
మహివిమర్శకు లయినట్టి ♦ మానవులకు, నివ్విభేదంబు లెఱుఁగు టక్కెంత దొడ్డ. ౪౪౦

వ॥ మఱియును సృష్టికాలంబున లక్ష్మి, సరస్వతి, దుర్గ, సావిత్రి, రాధిక, వీరల సర్జ
నంబు ప్రథమంబై సత్త్వరూపం బయ్యె. రాధికాలక్ష్మీ సదృశరూపంబు జగం
బున వాస్తవంబును నగు, నది యశోరూపంబును, సర్వమంగళాకారంబును, ప్రశస్యం
బునునై యుండు. శతరూపా, వేదవతీ, స్వధా, స్వాహా, దక్షిణా, ఛాయా,

రతీ, రోహిణీ, వరుణానీ, శచీ, చిత్రరేఖాదిత్యదితి, లోపాముద్రానసూయా తులస్యహల్యారుంధతీ మేనా తారా మండోదరీ దమయంతీ గంగా యమునా పుష్టి తుష్టి స్మృతి మేధా కాళికా షష్ఠీ మంగళా చండమూర్తి ధర్మకామినీ స్వస్తి శ్రద్ధా శాంతి క్షాంతి కాంతి నిద్రా తంద్రా క్షుత్పిపాసా సాంధ్యరాత్రి దినదేవతా సంపత్తి ధృతి కీర్తి క్రియా శోభా శివాది స్త్రీరూపంబు యుగయుగంబున నుత్తమంబును, బ్రశస్యంబును దదన్యంబగు వస్తువు వేశ్యాక్రమంబున నప్రశస్యంబై విశ్వంబునం బుంశ్చలీరూపం బగు. సత్త్వరూపంబు సాధ్వీరూపంబు. రజస్తమోరూపంబులు త్యాజ్యంబులు. మఱియు దేహాదిపీడల సంసర్గంబుల, సాధుగోష్ఠుల శరీరభయంబుల నొక్కొక్కయెడ రజోరూపంబున నెప్పటికి సాధ్వీత్వంబు పోనంగదు. శ్రుతిమతం బిట్టిదియని నిశ్చయింపుము. కులసంభవుండును, బాపరహితుండును, నిష్కపటుండును నగు పురుషుండు విజనజనంబుల రహస్యారహస్యంబులం బరసతులం బలుకరించు, శంకకుం బనిలేదు. నిన్నుం బలుకరించుట నాకుం గొఱంతయే? నేను గాంధర్వంబున నిన్నుం బరిగ్రహించెద. శంఖచూడుం డనువాఁడ, దనువంశసంభూతుండ, హరిదాసుండ, హరికిం బ్రాణాధికులగు గోపాలకులలోన నధికుండ, రాధికా శాపంబున జాతిస్మరుండనై కృష్ణమంత్రప్రభావంబున సర్వంబు నెఱుంగుదు నని పల్కి యూరకున్నంతం దులసియు సస్మితంబుగా నిట్లని పలుకం దొడంగె. ౨౨౧

ఆ॥ ఇంతధర్మ మెఱిఁగెడునేనియుఁ గాంతుండు, విశ్వమునఁ బ్రశంస ♦ వెలయు నతఁడు
వాంఛ గల్గెనేని ♦ వనితతోఁ గవయంగ, మెచ్చటంచు మెచ్చునెచ్చు నతని.

గీ॥ సాత్త్వికుఁడ వౌట నే నీ ప్రసంగవశత
నీయెడఁ బరాజితత్వంబునెనసితి నిఁక
స్త్రీజితుఁడుగాని పురుషుండు ♦ త్రిభువనములఁ
బూజ్యుఁడని చెప్పుదురుగదా ♦ బోధఘనులు. ౨౨౩

సీ॥ బంధుబృందములకు ♦ భ్రాతృకోటులకును, దలిదండ్రులకును బుధవ్రతతికి
నీరజాక్షులచేత ♦ నిర్జింపఁబడువాఁడు, నింద్యుఁ డటంచును ♦ నిగమపథము
దశదినంబులమీఁదఁ ♦ దరియించు నాశౌచి, యంగనాజితులకు ♦ నవధి లేదు
అట్టివాఁ డొనరించు ♦ నౌర్ధ్వదైహికములు, పితృదేవతలు గొనఁ ♦ బ్రీతిపడరు
తే॥ వానిచే బూజఁగొనరు దేవతలు నిఖిల, విధుల గర్హితుఁడని చెప్పు ♦ వేదమతము
స్త్రీజితుని జన్మజన్మమేశక్షితితలమున?, నడవినొక భూరుహాకృతియైన మేలు. ౨౨౪

ఆ॥ జపతపోధ్యానమంత్రవిజ్ఞానములను, యౌవనంబున విద్యచే ♦ నధికుఁ డయ్యు
స్త్రీజితుండైన వాఁడు [illegible] యవని నీయెడ నామెడ ననఁగనేల.

శా॥ ఈ యర్థంబుఁ బరీక్ష సేయుటకునై యేతద్వచఃకౌశలిన్
మాయావాద మొనర్చి కంటిని భవన్మాహాత్మ్యముల్ బోటులన్
వేయింకేటికి నేలుకోఁదగదె? యుష్మద్విన్ బ్రహ్మసర్గంబునన్
ధ్యేయం బయ్యె భవత్ప్రశస్తి, వలదే స్త్రీకిన్ భవత్సఖ్యముల్. ౪౪౯

సీ॥ అంగహీనునకును నామయావిలునకు, గుణహీనమతికిని గుత్సితునకు
జ్ఞానహీనునకును జంచలాత్మునకును, గోపయుక్తునకును గుటిలునకును
గడు దరిద్రునకును గార్పణ్యబుద్ధికి, మూర్ఖుఁడౌవానికి ముగ్ధునకును
జడున కల్పునకును శఠవాదపరునకుఁ, బశుతుల్యునకుఁ బాపభర్త్సితునకుఁ

తే॥ దనదు కన్య నొసంగిన తండ్రి కవని, బ్రహ్మహత్య ఘటించు నన్నవలుకు వినమె?
శాంతుఁడై పండితుండయి సరసుఁడైన, వరున కొసఁగుట దశయజ్ఞఫలముసుమ్మి.

గీ॥ కన్నియను దండ్రి కడుపారఁ గాంచిదాని, ధనముఁగొని యమ్మెనేని యాతండు కన్నె
మలమూత్రంబు ప్రాణంబు నిలుపునవిగఁ, గుంభికాపాకమునఁ బడి క్రుములుచుండు.

ఆ॥ మఱియు వాఁడు క్రిములు మైఁద్రొల్వమనుచతు, ర్దశకమభ్రమునను దడసినిలుచు
నంతవట్టు నరకమందు వసించుచుఁ, గుష్ఠి యగుచుఁ బుట్టుఁ గుతలమునను. ౪౪౮

ఆ॥ మఱియు భువిని బుట్టి మాంసభారము మోచి, విక్రయించుకొనుచు విసివి చావు
పుట్టువులను బొరలి పొరలి కృశించుచు, గతి యెఱుంగ కతఁడు కళవళించు.

వ॥ అని యిరువురు సంభాషించునెడఁ దమ్మిచూలి సాక్షాత్కరించి శంఖచూడునిం గాంచి నీవి చ్చేడియను గాంధర్వంబునం బరిగ్రహింపుము. విదగ్ధయగు బోటికి విదగ్ధునితో సంగమంబు గుణవంతంబు. మీ రిరువురు పురుషస్త్రీరత్నంబులు. నిర్విరోధంబగు నీదృశ సుఖంబుఁ బరిత్యజించు దుర్భగుండు గలఁడె! భోగార్హంబైన వస్తువు త్యాగంబొనర్చుట పశుబుద్ధియని తెల్పి పడంతినిం గాంచి, యితఁడు సురాసురనరవిమర్దకుండు, ఇట్టి కాంతునిఁ జేకొనుట కాంతల కర్హంబు, లక్ష్మి జనార్దను, రాధ కృష్ణుని, సావిత్రి నన్ను, భవాని శంకరు, ధర వరాహంబు, దక్షిణ మఖంబును, అనసూయ యత్రిని, దమయంతి నలు, రోహిణి చంద్రు, రతి కాముని, దితి కశ్యపుని, నరుంధతి వశిష్ఠు, నహల్య గౌతము, దేవహూతి కర్దముని, తార బృహస్పతి, శతరూప స్వాయంభువును, స్వాహా హుతాశను, శచి మహేంద్రుని, పుష్టి గణేశ్వరు, దేవసేన కుమారు, మూర్తి ధర్ముని, బరిగ్రహించుపోలిక నీ వితనిం బరిగ్రహించి చిరకాలము సుఖం బనుభవించి, స్వేచ్ఛావిహారం బొనర్చి యంతంబున గోలోకంబున శ్రీకృష్ణుం జేరెదవు. సుఖంబుండుమని యాశీర్వదించి నలువ నిజాలయంబునకుఁ జనియెనప్పుడు. ౪౪౯

క॥ గాంధర్వవివాహంబున, గంధేభసమానయానఁ గలసె నతఁడు సా
ధాంధోదుందుభి వాద్యము, బంధురమై మొరసెఁ బూలవానలు గురిసెన్.

మ॥ హరి తా నొంటయు లచ్చి యాపె యగుచున్ హర్షంబు పెంపొంద ని
ర్వురు సంభోగధురీణు లయి నీవున్ నేను నా వేఱు లే
కరయన్ రాని మనోజకేళుల రహస్యవ్యాపారలీలారతిన్
గర మొప్పారిరి నాఁడు నాఁటి కెద శంకాతంకముల్ మానుచున్. ౭౫౩

గీ॥ కడుఁ జతుష్షష్టికళల పొంకములు దెలిసి, చతురశీతిప్రకారపంచశరకదన
మర్మము లెఱింగి రసికసంబంధగోష్ఠి, రాసకేళిఁ బెనంగిరి రమణు లపుడు.

శా॥ ఆరామంబులఁ బుష్పవాటికల సౌధాగ్రంబులన్ నిమ్నగా
తీరస్థానములన్ యథావిహృతి నెంతేఁ జొక్కుచున్ నూత్నబం
ధారంభంబుల గంధచర్చల *నభీష్టాభోగసంతృప్తులన్
బ్రారంభించిరి మన్మథోపనిషదర్థవ్యాకృతిస్వీకృతిన్. ౭౫౪

క॥ తమతమ చెలువుల నుండెడు, నమలినగతి మానసముల నార్జించిరి యు
త్తమరమణీరమణులు ప్రేమము పొరలెత్తంగ ననుపమానప్రీతిన్. ౭౫౫

సీ॥ పడఁతి గందముఁ బూసెఁ బ్రాణేశు నురమునఁ, దిలకంబుఁ దీర్చె నింతికి నతండు
చెలువుని భుజములఁ జెలి దీర్చె భుజకీర్తు, లింతికిఁ గడియంబు లిచ్చె మగఁడు
పద్మాక్షి యధరంబు పంట నొక్కె విభుండు, కొమ్మ రాజు గళంబు గోట నొక్కెఁ
గలికిఁ గౌఁగిటఁ జేర్చి కామించె దయితుండు, మగని చెక్కిలి నొక్కె మందయాన

తే॥ అట్టులు పరస్పరముఁ గ్రీడ లాడికొనుచు, సురతభోగాంతమున లేచి సూనశయ్య
డిగ్గి భూషణములు దాల్చి తేవఁ దనరి, యిచ్ఛవచ్చినయట్లు చరించి రెలమి. ౭౫౬

శా॥ తాంబూలంబుల గంధలేపముల సుహృద్యాస్వాదుభోగంబులన్
గంబూరల్ గులుకంగ నొండొరులు శృంగారంబు పొంగార డెం
దం బానందము నందగింప సురతోత్సాహప్రవీణాత్మతా
సంబంధేంద్రియపారవశ్యకలనాసంభ్రాంతులై యున్నెడన్. ౭౫౭

వ॥ మఱియుఁ, ద్రిలోకదుర్లభంబును, ననల్పరత్ననిర్మాణంబును నగు నొక్క
యంగుళీయకంబు నీకుం దాసి నగు నేను సమర్పించెద నని యుచ్చరించి నమస్క
రించి లోచనంబుల నిర్నిమేషదృష్టియై పతియాననంబు, దిలకించిన నతండు
కరంబుఁ బట్టి పయికిం దిగిచి లజ్జావనతం బగు నెమ్మోము చుబుకంబును ముద్దు

* టిప్పణి :— అభీష్ట + ఆభోగ – అని యథాకథంచిత్తుగా సమన్వయించుకోఁదగు. ఆ + భోగ— అనుచో, ఆఁజుమెడ తెగని అని ఫలితార్థము.

గొనుచు వరుణానీతంబులగు నగుణవసనంబులును, దదానీతంబ యగు రత్న మాలికయుఁ, బావకానీతం బగు స్వాహామంజీరద్వంద్వంబును, జందానీతంబులగు నిశాకేయూరంబులును, రోహిణీకుండలంబులును, దదంగుళీయక కరభూషణంబులును, విశ్వకర్మానీతంబులగు తజ్జాయాంశంబులు తాటంకంబులును, విచిత్రపద్మసరంబును, భూషణంబులను నొసంగి తత్తదవయవంబుల నలంకరించి, కర్పూర రేఖాతిరికాన్వితంబగు చందనం బలంది, కుంకుమబిందు సేకం బొనర్చి, తచ్చరణంబుల యావకంబు నఖాగ్రింబులం దీర్చి స్వవక్షంబున నచ్చొత్తి నీకుం దాసుండ నని పలుకుచు రత్నవిమానంబున నునిచికొని, మలయంబున, దేవ నిలయంబున, శైలంబులఁ, దపోవనంబుల, రమ్యస్థానంబులఁ బుష్పోద్యానంబులఁ, గంద రంబుల, సింధుతీరంబుల, నదీతటంబులఁ, బులినంబుల, నందంబుల, మధుకరమధుర ధ్వనినాదితకాసారంబుల, నందనంబున, గంధమాదనంబునఁ, జంపక కేతకీ మాధవీ కుంద మాలతీ కుముదాంభోజ కాననంబులఁ, బారిజాతవనంబుల, మఱియు నచ్చ టచ్చటఁ జల్లని మందమరుత్కిశోరంబుల, మేని యలసట లార్చుచుఁ, గాము కులై యద్దంపతులు హావిర్భోజనంబునఁ బావకుండునుం బోలె వివిధ భోగంబుల నన్యోన్యసుఖతృప్తి దనివిసనక నొక్క మన్వంతరంబు దేవాసుర శాసకులై సంచరించు నెడ నిర్జరులు హృతాధికారులై విషణ్ణు లగుచు నీ వృత్తాంతంబు నలువకుం దెలిపిన నతండు వేల్పులం గూడి జరామృత్యు హారంబును, బరమధామం బును నగు వైకుంఠంబుఁ జేరి వదియాఱుద్వారంబు లారసి ద్వారపాలకులం గని తద్వృత్తాంతంబుఁ దెలిపిన వారలు హరికి విన్నవించి వచ్చునంతె నెల్లవారలు ప్రీతిహర్ష్యాన్వితులై హరిసభామధ్యంబుఁ బ్రవేశించి తదీయవిభవంబున కచ్చెరువుపడి యన్యోన్యంబు నిట్లని వితర్కింపం దొడంగిరి. ౪౭౫

సీ॥ ఒకచోట దేవర్షు ♦ లొకచోట బ్రహ్మర్షు, లొకచోట రాజర్షు ♦ లున్నవారు
ఒకచోటఁ బార్షదు ♦ లురుచతుర్భుజముల, నచ్యుతాకృతులచే ♦ నలరినారు
గరుడ గంధర్వ కిన్నర సిద్ధ చారణ, తతులనందడిఁ జెప్పఁ ♦ దరముగాదు
చామరచ్ఛత్రహ ♦ స్తపరిశ స్త్ర నురాంగ, నా జనంబుల నిల్చు ♦ నోజ వింత
తే॥ రత్నరుచిరంబు చతురస్ర ♦ రంజితంబు, రత్నదర్పణకోటివి ♦ రాజమాన
మతిమనోజ్ఞవితానంబు ♦ నగుచు శౌరి, సభ చెలంగెను జయజయ ♦ స్తవ్య మగుచు.

సీ॥ హరిమణి స్తంభవి ♦ న్యాసంబు లన్నియు, నన్నియుఁ బురుపర ♦ త్నాంచితములు
పద్మరాగప్రభా ♦ భరితంబు లన్నియు, నన్నియుఁ జిత్ర రే ♦ ఖాంచితములు
ముక్తావితాననం ♦ యుక్తంబు లన్నియు, నన్నియు ముకురశ ♦ తాంచితములు
రత్నసోపానవి ♦ భ్రమదంబు లన్నియు, నన్నియు స్వర్ణకుం ♦ భాంచితములు

తే॥ నన్నియును బారిజాతమాల్యాంచితంబు, లన్నియును గుంకుమాలేపనాంచితములు
నన్నియును జందనాసేచనాంచితమ్ము, లచ్యుతుని భర్మహర్మ్యచయంబు లహహ.

క॥ అని యబ్బురమందుచు సుర, లనుపమహర్షమునఁ బొదలి యంబుజభవము
ఖ్యనిలింపతతులు వెనుకొని, కనిరి జగన్మయుని శౌరిఁ గౌస్తుభధారిన్. ౪౬౭

సీ॥ రత్నకిరీటవిభ్రాజితశీర్షుని, మకరకుండలభాసమానకర్ణు
వనమాలికాలసద్వక్షస్స్థలోపేతుఁ, జందనగంధాంకచర్చితాంగుఁ
గ్రీడాసరోరుహాక్రీడనాంచితహస్తు, దైవాంగనానృత్తదత్తనయను
నంబుజగేహినీహస్తాగ్రదత్త తాం, బూలచర్వణసుఖాలోలహృదయు

తే॥ సురధునీకరధవళచామరమరుత్కు, శౌరహృతఘర్మ భక్తసంస్తుతినినాద
సంశ్రవణసాదరసురారిశాసనైక, దక్షుని నధోక్షజుని గాంచి రా క్షణమున.

తే॥ కాంచి సర్వాంగపులకితోత్కంఠు లగుచు, సాశ్రునేత్రులు గద్గదస్వరులు భక్తి
పరవశులు నమ్రులగుచును బరమనియతి, సురలు మ్రొక్కిరి యమ్మధుసూదనునకు.

క॥ అంతటఁ దామరసోద్భవుఁ, డెంతయు సద్భక్తితోడ నెదుటికిఁ జని శ్రీ
కాంతునితోడను దమ వృ, త్తాంత మ్మిట్లనుచుఁ దెలిపె నామోదమునన్.

శా॥ స్వామీ! యేమని విన్నవింతుము జగత్సంహారధారేయతో
ద్దామప్రస్ఫుటవిక్రమాక్రమణుఁడై తా శంఖచూడుండు సం
గ్రామోల్లాసత నెల్లలోకములపైఁ గారాట సారించెఁ ద
ద్ధామం బేము సహింపలేక యిటకున్ దర్శింప నేతెంచుటల్. ౪౬౮

గీ॥ అతనివలని యుపద్రవం బాఁకగొనక, వెతగలంగఁగఁ జేయ నీవేల్పు లేను
గలసి మీదర్శనమున కిక్కరణి వచ్చి, నార మస్మదుదంత మంతయును దెల్ప.

సీ॥ అన విని పద్మాక్షుఁ డందఱఁ గనుఁగొని, కంటి మీమదిలోని కార్యసరణి
మద్భక్తుఁ డాతండు మహితుండు పార్షద, ప్రవరుండు రాధ శాపంబువలన
దానవుండై పుట్టె గాన నాతండు మ, ద్భక్తియుక్తుఁడు తొల్లి పరమహర్ష
మలర రాధికఁ జూడ నరిగితి నొక్కెడ, నయ్యెడ నాతోడ నరుగుదెంచె

తే॥ విరజ, తద్వార్త కింకరీవిశదభణితిఁ, దెలిసి రాధిక కోపింప దిగులుచెంది
స్వాలయంబున కేగిరిసఖులు విరజ, యంత ననుఁ జూచి రాధిక యాగ్రహించి.

క॥ తర్జనములఁ గోపవచో, భర్జనముల వెతఁగలంపఁ బలుకక వినయ
స్ఫూర్జనముల వేడిన రుష, గర్జింపుచుఁ బదరుచుండఁ గని యాలోన్. ౪౬౯

సీ॥ అసహమానుండయి యాత్మభక్తుఁడు గోప, వర్యుండు రాధికావనితఁ జూచి
సర్వేశ్వరుండైన జలజాక్షు నిట్టులు, తర్జించెద [illegible] ! నీకు

నని యాగ్రహించిన నరుణలోచనములఁ, బావకజ్వాలలపగిదిఁ గోప
రసధార లురలంగ రాధిక యాతని, వెడలింపఁదలఁచి యావేళ మెనసి

తే॥ దైత్యుఁడవు గమ్మటంచు నుదరుణి శాప, మొసఁగె నంతటసతఁడు నయ్యువిదచరణ
కమలయుగ్మంబుపైఁ బడి కావు మనిన, నతికృపాళుత రాధిక యతనిఁ జూచి.

ఉ॥ కన్నుల నీరు నించి గుణగౌరవ మెంచక యాగ్రహించి నా
మన్ననఁ గోలుపోయితివి మద్వివశస్థితి శాప మొంది నీ
విన్నియు నేల? నిన్విడిచి యెల్లరు గోపిక లోర్వఁజాల రీ
సన్న మెఱింగి శాపము వశంపడఁ జేసెద విన్ము పుత్త్రికా! ౪౭౧

క॥ కలియుగ నొక మన్వంతర, మిలలో నీ వుండువాడ విది శాపాంతం
బలమీఁదట గోకులమున, కలరుచు వచ్చెదవు పరమహర్షముతోడన్. ౪౭౨

క॥ అని పంపెఁ గాన రాధిక, జనియించెన్ దైత్యుఁ డగుచుఁ జయ్యన వానిన్
గొనియెద సన్నిధి కభవుం, డనిలో శూలాగ్రమునను హతునిన్ జేయున్. ౪౭౩

వ॥ అంత. ౪౭౪

గీ॥ బ్రహ్మ శక్రపురోగముల్ పరమహర్ష, భరితులై భారతంబున కరుగుదెంచి
రజుఁడు ప్రార్థింపఁగా లసంహరుఁడు శంఖ, చూడహరణార్థియై మహోత్సుకత వెడలె.

చ॥ అమరులు నాత్మవాసముల కల్లనఁ జేరిరి పంకజోద్భవుం
డమలినచిత్తుఁడై నిజగృహంబున కేగె విరోధియాధదు
గ్ధమహరణార్థియై హరుఁడు తత్పరతన్ గొని చంద్రభాగ నా
నమరెడు నేటివంత గగనాంతరచుంబివటద్రువేదికన్. ౪౭౫

మ॥ లయకాలాగ్నియుఁబోలె భూతగణముల్ ప్రక్షుభ్యదంభోధరో
చ్చయముల్ వోలెను జుట్టునిల్వఁగ రుషాసంభూతదృగ్జాలికా
భయకృచ్చండపరంపరల్ నిగుడఁ దీవ్రప్రౌఢి రుద్రుంపు దు
ర్జయునిన్ జిత్రరథుండు నా నెగడు శూరశ్రేష్ఠు గంధర్వునిన్. ౪౭౬

ఆ॥ చేరఁబిలిచి నీవు చెచ్చెర నా శంఖ, చూడునగరి కేగి సురవిరోధిఁ
గాంచి యనికి నేగుదెంచితిమని తెల్పు, వెంటనంటి నేను వెడలుదు నన.

సీ. స్ఫాటికమణిగణస్థగితవప్రములతో, ఘనపరిఘాన ప్రాకారంబుతోడ
జ్వాలదగ్నినిభరత్నచారుసౌధములతోఁ, దపనీయఘంటాపథములతోడఁ
బహువస్తుసంభారభరితాపణములతో, ధనికావళీసద్మతతులతోడఁ
బంచయోజనదీర్ఘపరిణాహకలనతో, దశయోజనాయామతలముతోడఁ

తే॥ యక్షవల్లభుపురి సురాధ్యక్షునగరి, లెక్కగొనని మహత్త్వంబు పికటిలఁగ
నద్భుతంబుల కాలయంబగుచు నెగడు, దైత్యవల్లభుపురికి గంధర్వుఁ డరిగి.

వ॥ మఱియు, నన్నగరాంతరంబున, వలయాకారంబును, బూర్ణేందు సదృశంబును, జ్వాల దగ్ని సదృశ ప్రాకార పరిఘా వేష్టితంబును, శతురిపుర్వారంబును, గగన చుంబితహర్మ్యంబును, బహుకలధౌతద్వారకంబును, మణిమంటప సహస్రోప శోభితంబును, నగు శంఖ చూడాలయంబుఁ గాంచి, ప్రతిహారిం గనుంగొని, నిజ వృత్తాంతం బెఱింగించిన, నాఁ డభ్యంతరమందిరంబునకుం జని మనవి యొనర్చి తదాజ్ఞావశంబున శివదూతం దోడ్కొని చన, నతండు రాసమండలమధ్యస్థుండై స్వర్ణసింహాసనంబున నొక్క రత్నదండంబు చేకొని, భృత్యజనంబులచే మొక్కు లందించుకొనుచుఁ జామరమారుతంబు లొలయఁ, బార్షదులును శస్త్రపాణులగు దానవులును జుట్టుం గొలువ, నొడ్డోలగంబుననున్న శంఖచూడుం గనుంగొని సాశ్చర్యచిత్తుండై శంకరభృత్యుం డిట్లనియె. ౨౮౦

సీ॥ దానవాధీశ్వర ॥ దండధరధ్వంసి, కింకరుండను నీకు ॥ శంకరుండు
వినిపింపు మన్నట్టి ॥ వృత్తాంత మాలింపు, కనలకు దూతసంఘటితవాక్య
కలనకు; వేల్పుల ॥ ఘనవైభవంబులు, నధికారము లొసంగి ॥ యనుగు మింక
శరణాగతత్రాణశపథుఁ డాతనిపాద, సేవఁ జేయుచుఁ జెంతఁ ॥ జేరు మిపుడ

తే॥ పుష్పభద్రానదీతీరపులినములను, నధివసించినవాఁడు దేవాదిదేవుఁ
డెడఁ గొనఁగరాదుపదమిచ్చి ॥ యేగుటొండె, ననికి వెడలుటయొండెనొండెడనఁగవలదు.

గీ॥ అనినఁ జిఱునవ్వునవ్వి దైత్యాధినాథుఁ, డే నుషఃకాలమున వత్తు ॥ నిందుధరుని
కడకు, మున్నేగు నీ వని ॥ కలయఁ దెలిపి, పంప నతఁ డేగి వినరించె ॥ భవునితోడ.

సీ॥ అయ్యెడ గుహుఁడు మహాకాళుఁడును నంది, వీరభద్రుండును ॥ విఘ్నపతియు
బాణుండు మణిభద్రబాష్కలుల్ కపిలుండు, దీర్ఘదంష్ట్రుండును ॥ దీప్తతనుఁడు
వికృతివిరూపులు ॥ వికటవిశాలాక్షు, లష్టభైరవులు కాలాగ్ని రుద్రుఁ
డాదిత్యులును దానవాంతకుండును దుర్గ,యుండును రణశాఖ ॥ హుతవహుండు

తే॥ నశ్వినులు విశ్వకర్మయు ॥ నష్టవసువు, లింద్రచంద్రులు నేకాదశేందుధరులు
యముఁడునలకూబరుంకుజయంతుఁడనిలుఁ, డంబుపతి మొదలగువారలభవుఁగనిరి.

వ॥ మఱియును, ఉగ్రదంష్ట్రుండును, ఉగ్రకోటరుండును, కైటభుండును, కాలజిహ్వుం డును, కులోచనుండును, కాలకంఠుండును, వశీభద్రుండును, సుభద్రుండును, మఱియు నష్టభుజ యగు భద్రకాళి రత్నవిమానంబున రక్తవస్త్ర రక్తమాల్యం బులు ధరియించి నటించుచు, నవ్వుచు, గానం బొనర్చుచు, భక్తుల కభయం బొసంగుచు, యోజనాయతంబగు, వికటజిహ్వం జాచి గిరగిరం ద్రిప్పుచు, శంఖ, చక్ర, గదా, పద్మ, ఖడ్గ, చర్మ, ధను, శ్శర, ఖర్పర, శూల, శక్తి, ముద్గర, ముసల, వజ్ర, ఖట్వాంగ, ఘంటాంబులు, పాశ, పట్టిస, పరిఘ, నాగ, నారాయణ,

గంధర్వ, బ్రహ్మ, గరుడ, పర్జన్య, పర్వత, జృంభణ, మహేశ్వరాస్త్రంబులను సంగ్రహించి యమదండంబునుం బోని త్రికోటి యోగినులతోఁ ద్రికోటిచండికలతో నిలిచియుండె. భూత, ప్రేత, పిశాచ, కూశ్మాండ, బ్రహ్మరాక్షస, బేతాళ, రాక్షస, యక్ష, కిన్నర గణంబులతోఁ గుమారుం డరుదెంచి పితృసహాయంబుగా నిలిచె; నంత నక్కడ. ౪౮౪

గీ॥ శంఖచూడుండు దూతప్రసంగమెల్ల, వినుచు నంతఃపురంబున \ విపులరత్న పీఠిపై నున్న తులసితోఁ \ బ్రేమ మొలుకఁ, గదనవృత్తంబుఁ దెలిపినఁ \ గలికియలికి.

సీ॥ ప్రాణనాయక! నీవు \ భండనం బనియన్న, శుష్కకంఠోష్ఠినై \ సొలపుమాలి యుంటిఁ గన్గొంటివే! \ యొక్కక్షణంబైన, నాయురంబున నిల్చి \ నాదువాంఛ దీర్చుము నినుఁ బాసి \ తివిరి నే క్షణమైన, నిలునంగఁజాల నిశనిద్రవృత్తి నాందోళితములయ్యె \ నసువులు తనువునఁ, గంపంబు పొడమె నుత్కలిక చెడియె

గీ॥ వేగుజామునఁ గలలోన \ విడువరాని
వెతలగొలిపెడి కలఁగంటి \ వేయునేల
భండనం బేల? సిరు లేల? \ ప్రభుత యేల?
యిరువురము సౌఖ్య మొందుట \ యిది హితంబు. ౪౮౬

గీ॥ అసితులసివల్క ప్రాజ్ఞుఁడయ్యసురవరుఁడు, హితముసత్యంబునయధుర్యమిష్టముచిత మగు వచనధార యోజించి \ మగువతోడఁ, బలికె నిట్లని ప్రేమసంభరితుఁడగుచు.

సీ॥ కాలవశంబునఁ \ గామభోగంబులు, సుఖదుఃఖములు భయ \ శోకములును గాలవశంబునఁ \ గాదె? వృక్షంబులు, పుష్పించి ఫలియించి \ పొలుచుచుండుఁ గాలవశంబునఁ \ గాదె? బ్రహ్మాదులు, సృజియించి పాలించి \ చెఱుపుచుండు కాలవశంబునఁ \ గాదె? సర్వంబును, బ్రకృతిలోఁ గలసి విశ్రామ మెనయు

తే॥ నిన్ని యననేల? సకలంబు \ నీశ్వరేశు, కన్నుబామ ద్రిప్పునంతన \ కలుగుఁదలఁగు వేయునేమిటి కనియన్న \ వెఱపిఁ కేల?, యమ్మహామాయ యద్భుతం \ బరయఁగలమె

ఆ॥ జనుఁడు జనునివలన \ జనియించు జనులను, జనులు ప్రోతు రటులె \ జనులజనులు సమయఁ జేతు రిట్టి \ సమయవేదినిగృష్ణు, భజనఁ జేసి జనులు \ బ్రతుకవలదె. ౪౮౮

సీ॥ ఎవ్వనియాజ్ఞచే \ నిల యెల్లఁ జరియించి, కాచి రక్షించును \ గంధవహుఁడు ఎవ్వనియాజ్ఞచే \ నిల యెల్ల మెఱయించి, పటుబోధ మొనరించు \ భాస్కరుండు ఎవ్వనియాజ్ఞచే \ నేకార్ణవంబుగా, వర్షించి ధరఁ బ్రోచు \ వాసవుండు ఎవ్వనియాజ్ఞచే \ నీ సకలధ్వంసము, మొనరించి మృత్యువు \ తనివి నెనయు

తే॥ జ్వాలనుదాహంబు చంద్రునిఁ జల్లఁదనము, యమునియుగ్రత యెవ్వానియాజ్ఞ చేత
జగముల వెలుంగు నద్దేవుసత్యరూపుఁ, గృష్ణుని భజింప వలదె? యక్షీణగరిమ.

గీ॥ కర్తలకునెల్ల నొక్కండ కర్త యగుచు,భర్తలకునెల్ల నొక్కండ భర్తయగుచు
హర్తలకునెల్ల నొక్కండహర్త యగుచు, వెలయుకృష్ణుని భజియింపవలదె మనకు.

క॥ నీ వెవతెవో? నే నెవఁడనో, భావింపఁగ విధినియోగపద్ధతి సుఖదుః
ఖావళి సంయోగవియో, గావహగతి జనములందు నరుదే సుదతీ! ౭౮౨

క॥ అజ్ఞానులు విలపింతురు, విజ్ఞానులు వెతలఁ బడరు విధినిర్మాణం
బజ్ఞానికి విజ్ఞానికిఁ, దజ్ఞులు సమమందురి ద్వైతతత్త్వ మిది సుమీ. ౭౮౩

క॥ మదనజనకు మది నిల్పుచు, బదరీవనమందు నేఁ దపస్విని గానే
మదవతి! నీవును నాకై, పదపడి తపియింపలేదె పద్మజకృపకై. ౭౮౪

సీ॥ బృందావనంబున నందనందనుఁడనై, చరియింతు నిష్టసంచారములను
గోలోకమునను గోపాలకత్వమునూని, చరియింతు నిష్టసంచారములను
దానవాకృతి వీడి తత్తత్ స్థలంబుల, విహరింతు నచ్చోట వెలఁది! నీవు
నన్నుఁ జూడఁగఁగందు వెన్నాళ్ళు విధియోగ, మన్ని దినంబులు నలరుఁగాదె

తే॥ సతిపతుల కైన సయ్యాటసత్యమిదియె, రాధికాశాపవశత భారతమునందు
విహృతి విధియోగ వశమని విశ్వమెల్లఁ, బలుకు ననుభవ మట్టిదె యలరుఁగాదె.

క॥ ఏగూటనుండు ఖగపతి, యాగూటికి, దినము దీరునప్పుడు చనుటల్
బాగగుఁ గాదే? యోగవి,యోగంబులు గలవె? స్వవశయుక్తి నరులకున్.

సీ॥ అని పల్కి యబ్బోటి నలరించి పుష్పచం,దనచర్చితంబైన తల్పమునను
రత్నమందిరముల రత్నప్రదీపికల్, వెలుఁగఁగా నారాత్రి వెలఁదిఁ గలసి
మొదఁ గదియించి సుఖేతరంబుగ నిరా,హారమై దుఃఖించు నంబుజాక్షి
నతిశయజ్ఞానబోధానుభూతుల దివ్య,బోధంబుఁ జొన్పి మాధవుండు

తే॥ దాను జేకొన్న బోధంబు తరుణి కపుడు, భూరిదుఃఖాపహమగు బోధగొల్పి
తెలివి నెలకొల్పి మదిచింత దీర్చి రేయి, నంతన మొనర్చెఁ దులసి కత్యంతిపురిని.

వ॥ ఇత్తెఱంగున నద్దంపతులు సుఖసాగరనిమగ్నులును, పులకాంచిత సర్వాంగులును,
సురతోత్సుకులునై, యర్ధనారీశ్వరరూపంబున, నేకాంగులునై సహర్ష సుఖ
సంభోగరసాస్వాద మేదురహృదయారవిందంబుల నిష్టసల్లాపంబు లొనర్చుచు,
సురతవిరతి యెఱుంగక విషయమదంబున క్షణపరాజయంబును, క్షణవిజయం
బును నొందుచు, నారేయి గడపి, మఱునాఁ డరుణోదయంబునఁ గృష్ణసంస్మరణ

తే॥ రీతివడువున దివసాంత్యరీతి గనునె!, ఉదయమధ్యాహ్నసాయంబు లొక్కరీతిఁ
గాలవిధ మెడలేకుండఁ గడచునొక్కొ?, యీశ్వరేచ్ఛయె మూల మిా విశ్వగతికి.

సీ॥ ఉపరాగములఁ జంద్రుఁ డొకచాయ నలరునే?, చిక్కిచీఁకటులఁ గృశించుఁగాని
పూర్ణిమలందు విస్ఫూర్తి మాయించునే?, యద్భుతప్రతిభచే నమరుఁగాని
శుక్లపక్షమునందు సొంపుదొఱంగునే?, దినదినవృద్ధి సొంపెసయుఁగాని
నసితపక్షంబుల నతిశయంబొందునే?, యనుదినక్షీణుఁడై యరుగుఁగాని

తే॥ దుర్దినంబుల నింగినిఁ దోఁచకున్నఁ, గానఁబడకుండునే? శరత్కాలనిశల
నెల్లవేళలఁ గాలంబు లేకరీతిఁ, గలఁచునే? దైత్యభూరేయ? కనవుగాక. ౫౧౪

క॥ విశ్వాధారంబగు నీ, విశ్వంభర యంబుమగ్న విలయంబులలో
నశ్వర మనవచ్చునె? ధర, శశ్వద్గతి నొక్కయెడల సంతస మిడదే. ౫౧౫

క॥ విశ్వంబులు విశ్వేశులు, నశ్వరగతిఁబోవ దేవనాథుండగు నా
విశ్వేశ్వరుండు బ్రహ్మము, శశ్వత్ప్రిభలఁ జెలంగు శాశ్వతుఁ డగుచున్. ౫౧౬

వ॥ మఱియును, నఖండ సచ్చిదానందమయుండై యొక్కండ బ్రహ్మము వెలుంగుఁ బ్రకృతియనఁ బురుషుండన నాత్మయన జీవుండన నతండు సృజియింపఁ బాలింప హరింపఁ దత్తద్రూపంబులు వహించి వెలుంగుచుండు, మూర్తిత్రయమ్మునందుఁ గాలాగ్నిరుద్రుం డాభీలుండు, వైనతేయభయంబున నురగంబుకైవడి మృత్యువు తద్భయంబున నణంగియుండుఁగాన, సర్వంబును గాలాత్మయగు నీశ్వరు నధీనంబని యెఱింగి స్వపరహైన్యవృద్ధులకుఁ దల్లడింపక సుఖించుట మేలని పల్కిన శంఖచూడుండు విని వినయపూర్వకంబుగాఁ జంద్రశేఖరుం గాంచి కొంతతడవు ప్రశంసించి యిట్లనియె. ౫౧౭

సీ॥ దేవాదిదేవ! నీవు తెలిపిన పల్కులు, సత్యార్థబోధనస్థాయితఁ గను
నైన నావిన్నపమాలకింపుము జ్ఞాతి, ద్రోహకృత్యము మహాదురిత మనుచుఁ
బలికితి వమరులు పాడిఁదప్పి బలీంద్రు, సర్వంబుఁ జేకొని సమదవృత్తి
సుతలంబుఁ జొరఁజేయ సొలసి యచ్చోటనె, కదలకయుండె నిక్కరణి వినమె!

తే॥ భ్రాతృసహితునిగాఁగ హిరణ్యనయనుఁ, గూల్పరే? శుంభముఖులనుగ్రారులగుచు
మడియఁజేయరె? నిర్జరమాన్యవృత్తి, మన మెఱుంగమె వేయేల మదనమథన!

క॥ సాగరమథనంబున సుధ, భాగం బీలేక యసురభంజనకేళీ
యోగము తమకెల్ల సుఖా, భోగమ్ముగ మెలఁగరో? బుధభుల్ చంద్రధరా! ౫౧౯

ఆ॥ దేవదానవులకు దెరలని వైరంబు, నిత్యమగుట జయముసేని యపజ
యంబునేని పొందుటాది నైజమ దైవ,మిరువురకును గలఁ డసహేతుసఖుఁడు.

క॥ ఏమును వేల్పులు నొకసరి, యేమెయు దైవాజ్ఞ తొలఁగునే సమరమునన్?
మాయాజయాపజయముల, స్వామిద్రోహంబు లనెడి సందియ మేదీ! ౧౧౧

ఆ॥ ఒకటి నా మనంబు నుడికించుచున్నది, భూతనాథ! నీవు *పోరటమున
కిచ్చగించి లజ్జ నెనయక యుండుట, మతముగాదు దూష్యమతము సుమ్మి ౧౧౨

వ॥ అనిన నమ్మహాదేవుండు బ్రహ్మవంశసముద్భవుండ వగు నీతోఁ భండనంబు సేయుట నాకుం గొఱంతయే? మధుకైటభసంహారంబును, హిరణ్యాక్ష హిరణ్యకశిపు మర్దనంబును హరి యొనర్పఁడే, త్రిపుర విజయంబు తొల్లి నాచేఁ జేయంబడదే? సర్వైశ్వర్యసమన్వితుండవు, దైత్యవల్లభుండవు గాన నీతోఁ నని యొనర్చుట నాకు యశంబ. సర్వేశ్వరియగు ప్రకృతి శుంభాదిని ర్హరణం బొనర్పదే? పార్షద ప్రవరుండ వగు నీవు కదనంబునకుం దగినవాఁడవు. యుద్ధం బొనర్పుము. కాదేని దేవరాజ్యం బొసంగి తొలంగు మనిన సామాత్యుండై లేచి శివునకుం బ్రణమిల్లి దేవయానంబున నధిష్ఠించి శంఖచూడుం డాయోధనాభిముఖుం డయ్యెనంత. ౧౧౩

గీ॥ అంత నుభయబలంబు లత్యంత భీమ,ణోగ్రతఁ గడంగి భండనోద్యుక్తి నడచి
యడరు నొండొంటితోఁగలయంగఁబడియె,శంఖచూడుండు శంభుండునంతసింప.

సీ॥ *పార్వతేయుఁడు వృషపర్వుతోఁ బురుడించెఁ, జిత్రభానుఁడు విప్రజిత్తినెదిర
నిందుఁడు దంభదైత్యేంద్రుతో నెదిరించె,వహ్ని గోకర్ణుతోఁబ్రతిఘటించెఁ
గాలస్వరునితోడఁ గాలుఁడు కలహించెఁ, గాలకేయుని బోరెఁగర్బురుండు
కడు భయంకరునిపైఁ గాలమృత్యువు దూఁకె, శమనుండు సంహారు సంక్రమించె

గీ॥ అబినాధుండు కలవింకు నాక్రమించెఁ, జంచలునితోడ సమీరుండు సరిఁబెనంగె
బుధుఁడు ఘృతపృష్ఠుపై నెత్తి పోరికెనసె,శనియు రక్తాక్షునకునుదా సమరమిచ్చె.

వ॥ మఱియు, రత్నసారునితో జయుండును, రక్షస్సంఘంబులతో నష్టవసువులు, దీప్తిమంతునితో నశ్వినులును, ధూమ్రసుతో నలకూబరుండును, ధూమధరునితో ధర్ముండును, గనకాక్షునితో నంగారకుండును, బికరునితో మన్మథుండును, గోధాముఖ, చూర్ణ, ఖడ్గ, ధ్వజ, కాంచీముఖ, పిండ, ధూమ్రసంది, విశ్వ, పలాశులతో నాదిత్యాదులును నేకాదశభయంకరాసురులతో నేకాదశరుద్రులును, దత్తదేకాదశసహస్రరక్షస్సులతో నేకాదశ రుద్రసేనలును, ఉగ్రచండాదులతో మహామారియును, పరిశిష్ట దానవ సంఘంబు

---

టిప్పణి: * పోరటము— దీనిని పోరాటమునకు రూపాంతరముగా నిమ్మహాకవి పలుచోట్ల వాడెను.

* టిప్పణి: ఈ సంకులయుద్ధమునందలి దేవాసురయోధుల నామములు మూలగ్రంథమునకుఁ గొన్ని సరిపడుటలేదు. దీనికిఁ గారణము గ్రంథములయందలి పాఠభేదమే యని తెలివిడి.

లతో నందీశ్వరాదులును గలయంబడి సన్నద్ధులై యుద్ధం బొనర్చునెడఁ బ్రళ
యంబునంబోలె సంగ్రామంబు భయంకరమయ్యె నయ్యెడ. గ. ౨౬

మ॥ వటమూలంబునఁ గాళితో గుహునితో । వల్గద్ధనుఃపాణియై
నిటలాక్షుండు గనుంగొనంగ భయదానీదృక్ప్రతాపార్చి రు
త్కటఘోరాకృతిరత్నపీఠమున నంతర్ శంఖచూడుండు దు
ర్భట రాతిప్రించరకోటు లార్వఁగ నుదారప్రౌఢి దీపించుచున్. గ. ౨౭

చ॥ కనుఁగొనుచుండ నొండొరులు । క్రవ్యప హవ్యపు లొక్కపెట్టునన్
గనలి ధనుర్గుణధ్వనుల । క్ష్మాతలమెల్ల నడంక గర్జిత
ధ్వనులు లయాంబుదధ్వనులదండడి గూర్పఁ జరాచరంబు పె
ల్చన బెగడొందఁ బోరిరి చలమ్ము బలమ్ము దలమ్ముగా నొగిన్. గ. ౨౮

సీ॥ కరములు శిరములు । ఖండఖండములుగాఁ, గరవాలముల్ త్రిప్పి । నఱకువారు
వాహముల్ దేహముల్ । వఱవనెత్తుచు లూర, శక్తికుంతంబులఁ । జమరువారు
ధనువులఁ దనువులుదళితముల్గాఁ జండ, కాండముల్ చొనిపి చక్కడఁచువారు
చలములు బలములుసదమదంబుగఁ బెక్కు,భటులఁ దుత్తుమురుగాఁబఱచువారు

గీ॥ నగుచు దేవాసురులు పోరునవసరమున,దానవోత్సాహమున కొర్వఁదరముగాక
దేవసేనలు బెగడంది । తెరలి పర్వ, దేవసేనావిభుండు సందీప్తగరిమ. గ. ౨౯

క॥ ఋభులార! పఱవనేటికి, నభయం బభయం బటంచు । నాడుచు రక్షో
విభుసేనలపైఁ గవిసెద, సభయత రక్షోబలంబు । సందుల నీఁగన్. గ.30

వ॥ అని గర్జింపుచు. గ.31

సీ॥ క్రౌంచభేదనుఁడు దీర్ఘక్రోధియై ధను,ర్గళితప్రకాండసంఘములగముల
నాకసమ్మును నేల । యేకార్ణవంబుగా, రంగత్తరంగముల్ రహిఁ బ్రవహించె
ననఁగఁ బెల్లేయుచు । నక్షౌహిణీశత, దైత్యపుంగవులను । దఱిమి తఱిమి
నఱకుచు దశలక్ష । నాగేంద్రములు శత,లక్ష వాజుల నెల్లనాక్షణంబ

తే॥ కాలు కేలను భేదంబు । గనఁగనీక, పుడమి ధూళిసమంబుగాఁ । బొడవడంచె
నట్టి యాయోధనంబు వింతనగ నేల?, శతసహస్రికబంధముల్ । క్షితినటించె.

ఉ॥ అంతట భద్రకాళి విలయాంబుదకాళిక* వార్ధిగ్రోలు న
ట్లెంతయు దైత్య నిర్గళ దసృగ్ఝర మెల్లను ద్రావి శక్తు లం
తంతటఁ దాండవోత్సవ ముదారత సల్పఁగ యుద్ధభూమి స
త్యంతవిలాసతాండవము । లబ్బుర మొందఁగఁ జేసె నయ్యెడన్. గ.33

*టిప్పణి: అంబుదకాళిక=మేఘమాలిక. 'పరిణతగజవత్సమాధేయ' మని యెఱుంగునది.

గీ॥ స్కందశరపాతపతితరక్షస్సమూహ, శిష్టగణ మెల్ల నెఱచి నిశ్శంకముగ ది
శాముఖంబులఁ బఱవ నిర్జరగణంబు, వఱద లెత్తంగఁ బుష్పవాన గురిసె. ౫౩౪

గీ॥ ప్రాకృతప్రళయంబునా భండనంబు, భీషణం బౌట నాగ్రహప్రేరణమునఁ
బ్రళయమేఘంబు నా ధనుర్బాణవృష్టి, శంఖచూడుండు పఱపె నిర్జరులమీఁద.

ఉ॥ అంబరచారియై మణిగణాంచిత దివ్యవిమాన మెక్కి ఘో
రాంబుదధార లట్ల విశిఖావళి నింపఁగ దిక్కులెల్ల నా
లంబున మున్గ నందిమొదలౌ గణవల్లభు లెల్ల భీతిలన్
శంబరధారివల్లభుఁడు సాహసియై రణకేళి సల్పఁగన్. ౫౩౬

సీ॥ కదనాగ్రమున నిల్చి కార్తికేయుఁడు మహా, గ్రహమున దైత్యమర్దన మొనర్ప
శంఖచూడుఁడు శిలాసర్పభూరుహశైల, మయముగా మాయికమార్గణముల
ధరయెల్ల నింప నర్కత్తతి మంచు గవిసిన, భాస్కరుండునుబోలె బాహులేయుఁ
డన్నిటిఁ దునుమాడు నంతలో విలుద్రుంచి, యరదంబుఁ జక్కాడి యాగ్రహమున

తే॥ శక్తివైచిన నది వేగ శక్తిధరుని, వక్షమగలింప మూర్ఛకుఁ బాలువడియుఁ
దెలిసి యొండొకరథ మెక్కి దివ్యధనువుఁ, జేకొని రణాంధకారంబుఁ జించివైచి.

క॥ మాయామయకదనము సో, పాయముగాఁ జెఱిచివైచి యతికుపితుండై
స్థాయద్ధనుర్గళత్పటు, సాయకములు పఱపె దివ్యశస్త్రప్రహతిన్. ౫౩౭

చ॥ అరదము దున్మిచి కార్ముక మనంత శరావళి నుగ్గునూచమై
ధరఁ బడనేసి సారథి నుదారతఁ గూల్చి కిరీటకుండలా
భరణము లెల్ల డుల్చి పటుభాస్కరశస్త్రగభస్తిరోధిదు
ర్భరమగు శక్తి వైవఁగ నసౌరమ్మునఁ దాఁకిన మూర్ఛనొందుచున్. ౫౩౯

ఆ॥ అంతఁ దెలిసి యన్యమగు శతాంగం బెక్కి, దండధరకరోగ్రదండసదృశ
చాపదండ మొండు సంధించి కుహనాప్రభండనమున గుహుని బఱపె నసుర.

మ॥ శరజాలంబులఁ గార్తికేయు రుధిరచ్ఛన్నాంగునిం జేసి భా
స్కరతేజఃప్రతిమానశక్తిఁ గొని యుల్కల్ నింగిఁ బర్వంగఁ గ్రౌం
చరసాభృద్బలభేది నేయ నది యంచద్వహ్నికీలాకలా
పరసోజ్జృంభితమై యుమాతనయుపైఁబై ఘోరమై పర్వినన్. ౫౪౧

ఆ॥ భద్రకాళి యంతఁ బార్వతీతనయునిఁ, జంక నిడుక హరుని సన్నిధికిని
జేరఁదిగువ నంత శ్రీకంఠుఁ డతనికి, బల మనంత మొసఁగి పంపె ననికి. ౫౪౨

వ॥ అంత శక్తిధరుఁ డరుదెంచు నంతరంబున భద్రకాళి సమరంబున కభిముఖియై యరు
దెంచు నవసరంబున నందీశ్వరాదు లగు గణవీరులును, దేవగంధర్వ యక్షరాక్షస

కిన్నరులును వెనువెంట నడువ గగనంబు బీఁటలెత్తుచుండ, భేరీశంఖపటహాదివాద్యం బులు మొరయ, మధుభాండంబులు బహుముఖంబులం జనుదేరనెడ, మద్యపానం బొనర్చుచు, సింహనాదంబులు భూనభంబు లవియ నెఱయంజేసిన నొక్కపెట్ట వేల్పు లెల్ల నార్చిన, దానవులు మూర్ఛంబొంది దిక్కులం బఱవ, భండనంబున భద్రకాళి తాండవం బొనర్చునెడ, శంఖచూడుండు చిందంబు మొరయించి దైత్యుల కభయం బొసంగుచుఁ గాళిపయిం గదియ నద్దేవి ప్రళయాగ్నిశిఖోప మంబులగు బాణంబులం బఱపిన, వానినన్నింటి నడుమం దునుమాడి, పైపయిం గదియ కాళి నారాయణాస్త్రంబు ప్రయోగించిన నతండు దానిం దిలకించి సభక్తి కమ్మ్రగ దండవత్ప్రణామం బిడిన నది శాంతంబయ్యె; నంత దేవియు బ్రహ్మా స్త్రంబు ప్రయోగించిన దాని దానం జక్కడఁచె. మఱియు దివ్యాస్త్రంబులు ప్రయోగించిన దివ్యాస్త్రంబుల వానిని ఖండించె. దేవి జ్వాలనోపమంబగు శక్తిం బఱప దివ్యాస్త్రంబుల శతఖండంబు లొనర్చె. దేవి మంత్రపూతంబుగాఁ బాశు పతంబు ప్రయోగింపం దలంచిన నాకాశవాణి తచ్ఛరంబున వానికి మృతి గలుగ దనిన నది మానె, మఱియు నశరీరోక్తంబునఁ దత్సతికి సతీత్వభంగం బగుదనుక వానికి జరామృత్యుభయంబులు లేవని బ్రహ్మవరంబు గలిగియుండె నని యెఱింగి చేయునది లేక శతలక్షంబు లగు దానవసేనల భక్షించుచు శంఖచూడుపయిం గవి సిన దివ్యాస్త్రంబుల నతండు నివారించె; ఖడ్గంబు వఱపిన శతఖండంబు లొనర్చె? మఱియును భక్షించెదనని పైపయిం గవిసి ముష్టులం బడలుపడఁజేసి, రథంబు జదిపి, సారథిం జంపి, శూలంబుఁ బఱపి, వామహస్తంపుఁ బిడికిటం బొడువ, భూమి తుండై మూర్ఛం జెంది, తత్క్షణంబునఁ జైతన్యంబు నొంది బాహుయుద్ధంబునకుం దలఁపడిన. ౧౪౩

ఆ॥ భద్రకాళి వాని పాణిద్వయముఁ బట్టి, యూర్ధ్వమెగురవైవ నొడిసి దుమికి
తత్ప్రతాపమునకు ధైర్యంబునకు మెచ్చి, మ్రొక్కి యొండు రథము నెక్కెనసుర.

సీ॥ భూచరఖేచరాభూతపూర్వం బగు, రణమొనర్చిన దేవి రాక్షసేంద్రు
భండన మెద మెచ్చి పరివారరాక్షస, ప్రకరాసృపానసంభవమదంబు
పారవశ్యము గూర్ప భద్రకాళిక శంక, రాంతికంబున కేగి యభ్రవాణి
పల్కుదెల్పి మహానుభావ! యద్దైత్యుండు, పాశుపతంబునఁ బడనివాఁడు

తే॥ బలములెల్ల నడంగె దోర్బలముకొలఁది, లక్షశీర్షంబుగాఁ గబళద్వయంబుఁ
జేసతిని వాని మర్దించుచేవ లేదు, వాఁ డవధ్యుండు సేయు ముపాయమెట్లొ.

ఉ॥ నావిని రాజశేఖరుఁ డనాహతవహ్నిశిఖాకలాపసం
భావితదుర్నివారమహిమప్రచురంబును వైరిఘాతుకం

బావిలశత్రుప్రసారము నుగ్రదారసహస్రధనుర్విశాలమ్ముఁ
జీవపరస్వరూపమును జిత్రికటంబుగ లీలఁ దాల్చెఁగఁ. ౧౪౯

గీ॥ దశసహస్రసుదర్శనోద్ధతముసైన, రూపుఁ దాలిచి బ్రహ్మాండరూపమథన
రూఢి నిరవొందు కాలాగ్నిరుద్రు పగిది, దానవునిమీఁద నడరి కంసదర్పవైరి.

మ॥ అనలజ్వాలలు మింటఁ బర్వ బటుశూలాభీలహస్తాబ్జుఁడై
దనుజధ్వంసనతత్పరత్వమున నుద్దామప్రభ లీలఁ బై
కొని మృత్యుంజయుఁ డేగుదేరఁ గని చేఁ గోదండమ్ముఁ వైచి యొ
య్యన శ్రీకృష్ణపదాంబుజాతభజనవ్యాపారపారీణతన్. ౧౪౮

సీ॥ యోగాసనారూఢి సద్వృత్తిని వసించి, దృఢతరనిష్ఠాగరిష్ఠుఁ డగుచు
సద్భక్తిపుంభావసాక్షాత్కృతుండు నాఁ, బరమభాగవతశుంభన్నిరూఢి
నన్యంబు మఱచి చిత్తాబ్జంబు భగవదా,కారానుకారిమై కళల నెనయఁ
బరిణతాత్మధ్యానపారీణతను సొక్కి, బహిరంతరవిభేదపరత మాని

తే॥ శంఖచూడుండు కదననిశ్శంకుఁడగుచు, నిశ్చలస్థితి నిల్వ నన్నీలగళుఁడు
శతసహస్రార్క శోభావిశంకటంబుఁ, ద్రిప్పి శూలంబు వైచె నద్దితిజుమీఁద. ౧౪౯

ఉ॥ శూలము నిర్జరాహిత నిషూదన నర్మకలాప కల్పనా
భీలము మింట నుల్కలను బెల్లుగఁ జల్లుచు యోగరూఢుఁడై
కాల్చెలు సురాంతకుం గదిసి కాలధనంజయుపోల్కి భస్మమై
నేలఁ దొరంగఁజేసె నవినీతి దొలంగునె? యెట్టివానికిన్. ౧౫౦

సీ॥ అంత దానవనాథుఁ డమ్మేను దిగఁద్రావి, గోపవేషంబునఁ గొమరు మిగిలి
దివ్యరూపంబును ద్విభుజంబులును గేలఁ, బిల్లనగ్రోవియుఁ బృథులరత్న
భూషణమ్ములు దాల్చి భూరిరత్నవిమాన, మారోహణ మొనర్చి యావరించి
గోలోకవాసులౌ గోపకోటులు గొల్వ, నింగికి నెగసి నిర్నిదరితేజ

తే॥ మర్కకోటుల నీన రాధాంగనామ,నోహరుండగు శ్రీకృష్ణు నూత్నదర్శ
నమున నెఱివొంది పాదాంబుజములకెఱఁగి, చెలఁగి బృందావనముఁబ్రవేశించె నంత.

క॥ రాధాకృష్ణులు నవగత,రోధంబుగ నతనియెడ నిరూఢకృపాసం
బాధమగుచూపుఁ జొనుపుచు, సాధుస్థితి భృత్యునిగఁ బ్రసాదించి రొగిన్.

సీ॥ అయ్యెడ రాతిరించరాధిపు నీఱుగాఁ, జేసి యా శూలంబు శివునికడకుఁ
జనుదెంచె దైత్యాస్థిశకలంబులెల్లను, శంఖజాతము లయ్యె శంఖసలిల
మఖిలదేవతలకు నర్హంబు శంఖంబు, పావనంబగు శంఖభావనమునఁ

దగ్గతతీర్థంబు క ధర్మదంబు వసించు, శంఖంబుపై లక్ష్మి క సన్నిధిఁగను
శంఖతీర్థమ్ములు క శిరముల నిడుకొన్న, నఖిలతీర్థస్నాతయగు నరుండు

తే॥ హరి కధిష్ఠాన మాశబ్ద్రమంగనలకు, శూద్రజనులకు భీతినిష్పూదనంబు
సంపదాయుమ్మంగళంబును క సర్వసిద్ధిదంబు శంఖంబు దేవతాతాపసేంద్ర!

ఆ॥ శర్వునకును దక్క సర్వదేవతలకు, శంఖతీర్థమునను క స్నాన మలరుఁ
గలితపాద్యములను క గాఢ్యంబు శివునకుఁ, జేయఁగా వలవదు క సేచనంబు.

వ॥ అట్లు హరుండు శంఖచూడుం బరిమార్చి వృషభారూఢుండై ప్రమథగణము లతో రజతాచలంబున కరిగె. సురలును దమతమ గృహంబుల కరిగిరి. సుర లోకంబున దివ్యదుందుభులు మొరసె. గంధర్వకిన్నరాదులు గానంబులు పాడిరి. రంభాదిదేవాంగనలు నటనంబు లొనర్చిరి. అవిచ్ఛిన్నధారాసారంబుగా భూత నాథు శీర్షంబునం బుష్పవృష్టి గురిసెఁ, దాపససంఘంబులు మహేశ్వరుం గొని యాడిరి, నిఖిలజగంబులు నానందంబునం బొదలె ననిన నారదుండు నారాయణ స్వామితో నిట్లనియె. ౧౧౧౧

ఆ॥ శంఖచూడసతికి క జలజాతనేత్రుండు, వ్రతము చెఱిచె నన్న క వాదు వింటి
నెట్టి రూపు దాల్చి యెక్కార్య మొనరించె, ననిన మౌనిచంద్రుఁ డనియె మునికి.

సీ॥ శంఖచూడుం డిట్లు క సమరంబులోపల, మడిసినపిమ్మట క మధువిరోధి
యతని కంకటము శరావళి చాపంబు, భూషణంబులు మొదల్ క భూరిశక్తి
నాకర్షణ మొనర్చి క యాత్మాంగ మద్దైత్యు, నాకృతితుల్యత క ననువుగొలిపి
తులసి గృహానకు క దుందుభిధ్వానముల్, మొరయఁ జయూవారములును నలర

తే॥ ద్వారసన్నిధి కరుదెంచి దర్పమలరఁ, బ్రియునికై వడిఁ బ్రియజనుల్ పిక్కటిలఁగ
నిలువ నవ్వార్త వినుచు నన్నీరజాక్షి, వీక్షణ మొనర్చె సౌధగవాక్షవీథి.

ఆ॥ అరుగుదెంచె నాథుఁ డంచు ముదంబంది, యెదురుగాఁగ నంపి క మదవతులను
కప్పురంపుదీపకళికల నలరించి, పంచి పెట్టె ధన మపారముగను. ౧౧౧౮

శా॥ గోవిందుండు రథంబు డిగ్గి యుదితార్కుంబోలు తేజంబునన్
దేవీరత్నగృహాంతరంబునకు నేఁ తేరన్ మనఃకాంతుఁగాఁ
దా వీక్షించి పడంతి పాద్య మిడి తత్పాదాంబువుల్ గ్రోలి తే
జోవర్ధిష్ణుసుఖాసనం బిడి ముదశ్రుల్ కాల్వలై పాఱఁగన్. ౧౧౧౯

క॥ తాంబూల మొసఁగి సతి కుశలం బారసి నాదుజన్మ క లాలిత మయ్యెన్
జంబాలమడఁగెఁ ... లోక్య ... సిద్ధిలలితంబయ్యెన్. ౧౧౨౦



(షరా) తులసిని మోసగించిన గ్రంథభాగము నేటి గ్రంథమునకుఁ జాలభిన్నముగాఁ గన్పట్టెడిని.

చ॥ అని వినయోక్తిఁ బల్కుచు ముఖాబ్జమునన్ జిఱునవ్వు లంకురిం
ప నవనవోల్లసద్విశదభావమునం బులకాంకురచ్ఛటాం
చనమున మేను పొంగ సరసవ్యజనమ్ముల మేనిచెమ్మటల్
చనవున నార్చుచున్ గదనసంగతు లారయు వేడ్కఁ దొట్రిలన్. ౫౬౧

గీ॥ సర్వసంహారకుండైన శంకరుండు, నీకుఁ బ్రీతిపక్షియయ్యె నిర్నిద్రవృత్తి
నట్టి కాలాగ్నిరుద్రుని నాహవమున, నెట్టు లోర్చితి వన్న నయ్యింతి కనియె.

ఉ॥ ఏమని తెల్పువాఁడ జలజేక్షణ! యబ్దశతంబు పూర్ణముం
గా మహితాద్భుతంబయిన కయ్యము చెల్లుట దానవుల్ మహో
ద్దామత శూలహస్తుని ప్రతాపము సైపక నల్దెసల్ జనన్
దామరసోద్భవుండు కృపదార్కొని తద్రణమధ్యమంబునన్. ౫౬౩

గీ॥ అడ్డమయి నిల్చి యిరువుర నానుకూల్య, మందఁజేసిన విధియాజ్ఞ నమరపతికి
స్వర్గ మొసఁగితి వారలు సంధిపడిరి, శివుఁడు రజతాద్రి కేగె నిశ్చింతుఁడగుచు.

మ॥ చిరకాలం బెడబాసి కామవశతన్ జిత్తంబు సోఁకోర్చి సం
గరకౌతూహలినై పెనంగుకతనన్ గాంతామణీ! నేఁడు దు
ర్భరమోహంబున నాదుచిత్తము భవద్బాహాపరీరంభత
త్పరతన్ మత్తిలుఁగాని యన్యసుఖసంబంధంబు వాంఛించునే? ౫౬౪

క॥ అని యిత్తెఱఁగున పల్కుల్, పెనఁగొనఁ గుహనాప్రియుండు ప్రీతి యెలర్పన్
వనితామణి యగు తులసిన్, జనితోత్సాహమున రతులు సల్పుచుఁ దేర్చెన్.

ఉ॥ కొన్నిదినంబు లిట్లు సురకుంజరుఁడైన ముకుందుతోడ న
క్కన్నియ కామభోగముల కందువలం దనివొంది భోగసం
పన్నత నప్పటప్పటికి భావము వింతగఁ దోఁప సంశయా
పన్నమనస్కయై తులసి పంకరుహాక్షునితోడ నిట్లనెన్. ౫౬౭

క॥ ఎయ్యదికుల? మెయ్యది పే? రెయ్యది సంబంధ? మిటకు నేటికి నాతో
నెయ్యమొనరింప వచ్చితి? వియ్యెడఁగల నిజము దెల్పుమీ! కాదేనిన్. ౫౬౮

గీ॥ నా సతీత్వంబు నశియించె నన్ను మరులు, గొల్పి తీవు శపింతు మహోగ్రశాప
హతి నడంగెద వన శంకితాత్ముఁడగుచు, నాత్మరూపంబుఁ జూపె నయ్యచ్యుతుండు.

వ॥ అంత నత్తులసీమహాదేవి సనాతనంబును, నవీననీరదశ్యామంబును, శరత్పంకజ
లోచనంబును, కోటికందర్పలీలాభంబును, రత్నభూషణ భూషితంబును, మంద
హాస లలితంబును, బీతాంబరశోభితంబును నగు శ్రీకృష్ణు దివ్యమూర్తిం గాంచి

పారవశ్యంబు నొంది తెలిసి "స్వామీ! నీ హృదయంబు పాషాణసదృశంబు, మద్ధర్మభంగంబున సర్వధర్మనిరాసం బొనరించితి. దయాహీనుండ వగుటచేఁ బాషాణస్వభావుండవై యుండెదు, నిన్నుఁ బూజించిన భ్రాంతులై యెల్ల వారలు చెడియెద'' రని శపించి శోకార్తయై విలపింపం దొడంగినఁ గరుణా సాగరుం డగు నచ్యుతుండు వినయోక్తుల లాలించుచు భవదుక్తంబు సత్యం బగు నని యంగీకరించెఁ దులసియుఁ దద్దేహంబు బరిత్యజించి దివ్యదేహంబుఁ జేకొనియెఁ దత్తనువు గండకీనది యయ్యె, నందు దేవపూజాసాధనంబులై పవిత్రంబులగు సాలగ్రామరూపంబుల విష్ణుతనువు లుద్భవించె, నచ్యుతుండును నద్దైత్యకాంతను దులసీనామకవృక్షంబ వై స్వర్గ మర్త్య పాతాళంబుల గోలోకంబున విరజాతీరంబున రాసమండలంబున బృందావనభాండీరచంపక చందన మాధవీ కుంద మాలతీ వనంబుల మఱియుం బుణ్యస్థానంబుల మత్సన్నిధానంబు గల్గి వర్తించెద వని యనుగ్రహించి సర్వతీర్థ సర్వదేవతాధిష్ఠానంబవై శిరోధారణంబున గంగాస్నాన ఫలం బొసంగుచు, భవత్పత్రజలాభిషేకంబున సుధాఘట సహస్రాభిషేకఫలంబు నొసంగుచు భవన్మూలమృత్తికా స్పర్శంబున భవత్స్పృష్టతీర్థసేవనంబునఁ బూజనంబున ధారణంబునఁ గాష్ఠనిర్మిత ఘుటికా మాల్యజపంబున నశ్వమేధాది ఫలంబు లొసంగుచు, నిందించిన వారలకుఁ బదునల్గురింద్రులు చనువఱకును గుంభీపాకనివాసంబు గల్గించుచు నుండం గలదాన వని యనుగ్రహించి. ౧౭౦

సీ॥ పూర్ణిమ నమవసఁ బూషఁ దత్తద్రాత్రి, సంక్రమంబుల నిశాసంధ్యలందు
నభ్యంజితుం డౌచు నార్ద్రపరీధానుఁ, డౌచు నాశౌచంబులందు నశుచి
యగుచు మధ్యాహ్నంబు లందును గామాది, బద్ధుఁడై నీ పత్రభంజనంబుఁ
జేసిన వారి శిరశ్ఛేదనం బొనరించు, టగుఁ బితృకార్యంబు లందు దేవ

తే॥ తార్చనంబులఁ బావనంబగు చునన్ను, నిచ్చలును గూడి సంయుక్తి నెఱపుకొనుచు
నుండెదవు నేనుగూడ నీయందఁ గొండ, రూపు దాలిచి యుందు నిరూఢిమెఱయ.

ఉ॥ కొన్ని దినంబు లిట్లు నసఁ గోమలి! నీవు రమాస్వరూపవై
వెన్నుఁడనైన నాకు మదివేడుక పుట్టఁగఁ బత్ని వై సమా
సన్నతఁ గాంచె దేనును విశంకటతావక శాపబద్ధతన్
సన్నిధిసేతు గండకిని సంతతదివ్యవిహారలోలతన్. ౧౭౨

క॥ మధూపంబుగ మదిలో, భద్రశిలల్ పొడముఁ గీటపాటనమున ని
ర్నిద్రతఁ జక్రాకృతు లగు, ముద్రితమధూపనిత్యములు గ్రావంబుల్. ౧౭౩

క॥ అందుఁ. జతుశ్చక్రము నద్బిందుకమై జలదనీలసప్రభులవ్రదమై
యందంబగుఁ దత్సదృశా, నందంబగు మూర్తి లే దనారత మెందున్. ౧౭౪

వ॥ అమ్మూర్తి లక్ష్మీనారాయణం బనం బరఁగుచుండు, నదియే వనమాలారహితం బైన లక్ష్మీజనార్దనం బగు, ద్వారద్వయంబును జతుశ్చక్రంబును వనమాలా విరాజితంబును నగునది రఘునాథాభిదంబు; అతిక్షుద్రద్విచక్రంబును వనమాలా రహితంబు నగునది వామనంబగు; అతిక్షుద్రద్విచక్రంబును వనమాలా సహితంబును నగునది శ్రీధరంబగు; స్థూలంబును వర్తులంబును వనమాలా సహితంబును ద్విచక్రంబును నగునది దామోదరంబగు; మధ్యవర్తులంబును ద్విచక్రంబును శరవిక్షతంబును నగునది సీతారామం బగు; మధ్యనస్తచక్రంబును ఛత్రచామర భూషితంబును నగునది రాజరాజేశ్వరం బగు; ద్వినస్తచక్రంబును స్థూలంబును నగునది ననంతం బగు; చక్రాకారం బయి ద్విచక్రంబులు గలిగి సశ్రీకంబును నతినీలంబును నగునది మధుసూదనం బగు; గదాధరంబును ద్విచక్రంబును జక్రాకారంబును నగునది సుదర్శనం బగు; రెండు చక్రంబులు గలిగి గుఱ్ఱపుమొగము వలె నుండునది హయగ్రీవం బగు; విస్తృతాస్యంబును విచక్రవివరంబును నగునది నారసింహం బగు; ద్విచక్రంబును విస్తృతాస్యంబును వనమాలా సహితంబును నగునది లక్ష్మీనృసింహం బగు; ద్వారపార్శ్వద్విచక్రం బగునది వాసుదేవంబగు; నట్టిది సూక్ష్మచక్రంబు ప్రద్యుమ్నంబు; బహుసుషిరంబును నేకవివర ద్విచక్రంబును నగునది సంకర్షణం బగు; వర్తులంబును సచక్రంబును నగునది యనిరుద్ధంబగు; నిట్టు లనేకవిధంబుల మమ్మూర్తు లుద్భవించు; నందేనును లక్ష్మియు సరస్వతియు సర్వతీర్థంబులును వసియింతు మిన్నియు దురితహారంబులు ఛత్రాకారంబగు మూర్తి రాజ్యంబును వర్తులం బగు మూర్తి సంపదలను గలిగించు, శకటాకారం బగు మూర్తి దుఃఖంబును శూలాకారం బగునది మరణంబును వికృతాస్యమూర్తి దారిద్ర్యంబును, పింగళమూర్తి హానియు, భగ్నచక్రంబు వ్యాధియు విదీర్ణంబు మరణంబును నొసంగుచుండు. ౫౭౫

శా॥ సాలగ్రామశిలాభిషేకసలిలస్నానంబు నిష్టాప్తికై
యోలిం జేసిన సర్వదానఫలసంసూర్తిన్ నరుం డొందుఁ ద
త్సాలగ్రామశిలావలోకనము సాక్షాన్మోక్షదం బౌచు లీ
లాలోలుండగు కృష్ణుచెంగట సముల్లాసంబుఁ జెందించెడిన్. ౫౭౬

సీ॥ దివ్యతీర్థము లెల్లఁ దివిరి సాలగ్రామ, సంస్పర్శఁ గోరుచు సంతసించు
జగతి సాలగ్రామసందర్శనంబునఁ, బాయంగరాని పాపములు లేవు
భక్తి సాలగ్రామ పరిచర్యచే యమకింకరావళికైనఁ బొంక మణఁగు
నెదుట సాలగ్రామ మీక్షించి మ్రొక్కని, జనునకు లేదు కేశవపదంబు

తే॥ పితృగణంబులు సద్భక్తిఁ బేర్మిఁ దమదు, వంశమున నెవ్వఁడేని యత్నవార్యనియతిఁ
దత్సపర్య యొనర్చినఁ దరల కెపుడు, దివ్య పదపీఠముల నెక్కి దిగక నిలుచు.

(వ్రా) ఈ సాలగ్రామలక్షణ నిర్వచనము నేటి గ్రంథములకుఁ దలచు భిన్నముగ నున్నది.

క॥ సాలగ్రామముఁ దులసియుఁ, జాలన్ సద్భక్తియుక్తి శంఖంబును ని
ర్వేలమతి సంగ్రహించిన, శ్రీలక్ష్మీపతికృపాప్తిఁ జెందెడుఁ జుమ్మా. ౫౭౮

సీ॥ అని తులసికిఁ జెప్పి యచ్యుతుండు ఖగేంద్ర, సాదియై వైకుంఠసదనమునకు
నరుగంగఁ దులసియు నాత్మదేహము వీడి, లక్ష్మియై విభునితో లలితగతుల
నెనసె నత్తులసికాతనువు గండకియాచు, నిలమీఁదఁ బ్రవహించె నీరహస్య
మనితరవేద్యంబు నధికసుఖప్రదం, బమరతాపస! ప్రస్తుతానుకూల

తే॥ సరణి వినిపించినాఁడ నీశ్వరకృపాప్తిఁ, జెందుటకు నీ ద్వయంబు నిశ్చితమసుమ్మ
అనవిని సుపర్వమౌని నారాయణాంఘ్రి, వినతుఁడై భక్తి నిట్లని విన్నవించె.

ఉ॥ ఎచ్చటనేని యీతులసి నిష్టసపర్యలఁ దన్పి సన్నుతుల్
నిచ్చలుఁజేసి యిబ్బువి ననిందితవైఖరి భక్తిముక్తులం
దొచ్చెము లేక సౌఖ్యముల నొందిరె? తత్కథ యానతిచ్చి పా
పోచ్చయ మెల్లఁ బోనడఁచి యుబ్బొనరింపు మటన్న హృష్టుఁడై. ౫౮౦

గీ॥ సరసిజావాసతోఁ గూడి సరసిజాక్షుఁ, డలతులసిఁ బూన్చి లక్ష్మిసామ్యం బొసంగి
లాలన మొనర్ప నది చూచి చాల మదిని, సీసుపొడమి సరస్వతి యెదఁగలంగి.

ఉ॥ వల్లభు సన్నిధానమున వంచనచేఁ దులసిన్ గలంప న
ప్పల్లవపాణి యెవ్వరికి భవ్యనిజాంగముఁ గాననీక వ
ర్తిల్లఁగ నచ్యుతుండు సుదతిన్ దులసిన్ విడనాడి నిల్వలే
కుల్లమునన్ దలంకి చని యొక్కెడ నత్తులసీవనంబునన్. ౫౮౨

గీ॥ నిర్మలస్నానుఁడై యంత నీరజాక్షుఁ, డమలినాంబరములు గట్టి యధికనిష్ఠఁ
దులసిఁబూజించినుతియించి తలఁపుచేర్చి, యమ్మహామంత్రముజపించె నాత్మయందు.

మ॥ కమలామాయలు కామభారతులు జోకంగూర్చి పూర్వంబునన్
విమలంబైన దశాక్షరంబు రుచి దేవీయోజితాంతంబుగాఁ
గమలాకామి జపించె భక్తజనతాకల్పద్రుమీ వీ మంత్రము
త్తమనిష్ఠన్ జపియించువారి కొసఁగున్ ధర్మార్థముఖ్యార్థముల్. ౫౮౪

క॥ ధూపంబుల సిందూరవి, లేపంబుల సరసకుసుమస్రక్తృప్త సమర్చా
స్థాపనముల గోఘృతయుత,దీపంబులఁ బూన్చి యిష్టతృప్తిన్ సల్పెన్. ౫౮౫

చ॥ హరి యొనరించుపూజలకు నాత్మఁ జెలంగి మహీరుహాంతరో
ద్ధురజఠరంబునన్ వెడలి తోన నిజాకృతిఁ జూపి యచ్యుతుం
గర మురుదండఁజేయ మురశాసనుస్మరుఁ డచ్చెలి మెచ్చి యాత్మసా
దరుఁడయి సర్వపూజ్యత యథాస్థితి దేవికొసంగి యిట్లనెన్. ౫౮౬

గీ॥ నిన్ను నొందల ధరియింతు ♦ నీరజాక్షి! యెవ్వరేనియుఁ దలఁదాల్ప ♦ నిష్టసౌఖ్య
మొందెద రటంచుఁ గరుణించి ♦ యువిదతోడఁ, బరమపదమున కేగె నా ♦ హరి తపస్వి.

వ॥ మహానుభావా! తద్ధ్యానప్రకారంబును, బూజావిధానంబును బ్రకటించుమని వేడిన సరస్వతీకలహంబున నంతర్హితయై తులసి యగోచర యగుటం దన విరహాతురుండై హరి బృందావనంబునఁ దులసిం బూన్చి బృందారూప యగు నామహాదేవి యభ్యర్థితయై సౌభాగ్యసౌఖ్యప్రదాయకం బగు ఫలలాభం బొసంగు నద్దేవిం బూజించెద, నసంఖ్యకుసుమపత్రంబులు గలిగియు, నేకమేని తులసీపల్లవంబులేమి నన్నియు నపావనంబులగు నప్పరమపావని వర్ణించెద, నెల్లసురలును యత్పత్రవిరహితంబగు పూజం గొనకుందురో, యట్టి పుష్పసారస్వరూప యగు దేవిం దర్శించెద. యత్ప్రాప్తివశంబున భక్తానందం బగు నట్టి దేవిం దిలకించెద. జగమ్మున ననమాన యగుటం జేసి తులసీనామంబున విఖ్యాతయగు దేవిం బ్రశంసించెద. మజ్జీవనరూపయు, మత్ప్రియతమయు నగుటం జేసి కృష్ణజీవనినా నెగడు దేవి నాకు జీవనం బయ్యెడుగాత మని నుతించి సాక్షాత్కృతయై కన్నుల బాష్పంబు లురుల నెదుటం జనుదెంచు నచ్చేడియం గౌఁగిటం జేర్చి సరస్వత్యాను కూల్యంబున స్వాలయంబున కరిగి సర్వపూజ్యవు గమ్మని పల్కుచు శిరంబున ధరియించె. సరస్వతియు, లక్ష్మియు, గంగయుఁ దులసితోడంగూడి సుఖించిరి. మఱియు బృందయు, బృందావనియు, విశ్వపూజితయు, విశ్వపావనియుఁ బుష్పసారయు, నందనియుఁ, దులసియుఁ గృష్ణజీవనియు నను నామాష్టకంబున నద్దేవిని బూజించువారికి నశ్వమేధఫలంబు గల్గు; కార్తికపూర్ణిమనాఁడు తులసిం బూజించిన విష్ణులోకంబు గల్గు. తద్దానంబున గోసహస్రదానఫలంబు సిద్ధించు. మఱియు, నైహికంబులు, నాముష్మికంబులు నగు ఫలంబులు పెక్కు సిద్ధించు నని తెల్పి ధ్యానపూజావిధులు కణ్వశాఖోక్తమార్గంబున నని నీవును నెఱింగియుందువు. ఆవాహనవిరహితంబుగాఁ దులసీవృక్షంబు నాసనపాద్యార్ఘ్యాదులం బూజించుట శాస్త్రచోదితం బగునది గావునఁ దత్ప్రకారంబు విస్మరింపక నియమమ్మునఁ బూజింపవలయు నట్లు పూజించు పుత్రకాములకు సుపుత్రప్రాప్తియు నారోగ్యకాములకు నారోగ్యమ్మును నాయుస్కాములకు నాయువును మఱియుం గల యెట్టి కోరికలేనియు నిహమ్మున సిద్ధించుటయ కాక వైకుంఠప్రాప్తి సైతము గలిగెడు నని తెలిపిన నారదుండు నారాయణున కిట్లనియె. ౫౦౮

ఉ॥ ఆదియుగంబునందు సుజ్ఞనావళు లెచ్చటనైన నాత్మలం
దాదరవృత్తి నిత్తులసి ♦ నర్చన సల్పినవార లుండిరే
*నా, దురితాపహుండగు మ ♦ హాముని నారదుఁ గాంచి పల్కె భూ
మీదయితుండు గల్గు నొక ♦ మేటి జగన్మహనీయకీర్తియై. ౫౦౯

* టిప్పణి: ఈ మాదిరి విశ్రమము అమ[illegible]

సీ॥ ప్రత్యర్థిమర్దన ప్రబలదోర్బలశాలి, బంధుపోషకుఁ డశ్వపతి యనంగ
నద్రరాధిపునకు నంగనామణి ధర్మ,చారిణి మాలతీ సమభిధాన
హరికిఁ బద్మయుఁ బోలె నధిపున కనురాగ, రసముఁ లూరఁగ మనోరక్తిఁ దవిలి
యెల్లభోగంబుల నిష్టయయ్యును నన,పత్యతచేఁ జాల బడలుపడుచు

తే॥ గురుఁడగు వశిష్ఠు నుపదేశగరిమవలన, వ్రతమొనర్చెను సావిత్రి మతిఁ దలంచి
యట్టులయ్యును బొడచూప దయ్యె దేవి, దానఁ బరితాపమంది భూదారుపత్ని.

క॥ అంతఃపురి నేకాంతతఁ, జింతించుచు నున్న పత్ని చెంతకుఁ జని భూ
కాంతుఁడు మంతనమునఁ దదు,దంతము సర్వంబుఁ దెలిసి యతిశయనిష్ఠన్.

గీ॥ అధికతరభక్తి నిర్జనంబౌ వనంబు,నందుఁ దా నొనరించె నాహారనియతిఁ
దపము శతవత్సరంబులు దర్శనం బొ,సంగదయ్యెను సావిత్రి జనపతికిని. ౯౯౨

మ॥ మది నెంతేనియుఁ బ్రీతినొందక యదంభస్థైర్యధైర్యోద్ధతిన్
బదిలంబౌ శమసంయుతిన్ దపము సల్పన్ దివ్యవాగ్దేవి దా
సదయాంతస్థితిఁ బల్కె భూప! దశలక్షంబింక గాయత్రి యె
ప్పిదమైయుండఁ దపించుమంచుఁ బిదపన్ బ్రేమన్ నృపాగ్రంబునన్. ౯౯3

గీ॥ అనఘుఁడు పరాశరుండు తపోధికుండు, సన్నిధియొనర్చె నారాజు సంతసమునఁ
బొదలి తాపసిఁ బూజించి భూరినియతి,హస్తములు మోడ్చి యచ్చెంత నధివసింప.

సీ॥ శక్తినందనుఁ డంత జనపాలుఁ గనుఁగొని, వచియించె గాయత్రి వసుమతీశ!
యొకసారి నుడివిన నుసుగును గతినాఘు, మట్టులు దశవార మది జపింప
రేబవల్ దురితంబు దాఁ బోవు శతవార,జపమున మాసాఘశాంతి యొదవు
నొకసహస్రము జపోద్వ్యక్తి నేకాబ్దంపు, దురితం బడంగు దుస్తరము నాక

తే॥ పజ్జిలక్షంబు జపియింపఁ బాయు లక్ష, జన్మదురితము శతలక్షజపమువలన
జన్మశతదోషము లడంగు జనపతీంద్ర!,నలుపఁదగు నిట్లు గాయత్రిజపము నియతి.

వ॥ మఱియుఁ గరంబు సర్పఫణాకారంబుగా నిలిపి సమశిరస్కుండై యచలుండును, బ్రాఙ్ముఖుండును నగుచు ద్విజుం డనామికామధ్యదేశారంభంబుగా వామక్రమం బునఁ దర్జనీమూలపర్యంతంబు లెక్కించుచు జపించెనేని తీర్థంబుల దేవతాలయం బుల జపించినయట్లగు. జపసరంబు పంచగవ్యంబున దడిపి సంస్కరించి జపింప శత లక్షజపంబునఁ బాపక్షయంబగు సావిత్రీదర్శనంబును లభియించు, నెట్టియెడరుల సంధ్యావ్యతిక్రమంబు వలవదు. సంధ్యాహీనునకుఁ దద్దర్శనం బలభ్యంబు. పూర్వ పశ్చిమసంధ్యలం దెద్దని విరహితంబైన నితరపుణ్యకర్మంబుల కనర్హుండు. సురలు

వానిచేఁ బూజంగొనరు. అట్టులే పితరులు తర్పణం బిచ్ఛగింపరు. అట్టుల విష్ణు మంత్రహీనుండు, శూద్రాన్నభోజియు, శూద్రశవదాహియు, వృషలీభోగియు, శూద్రసూపకారుండును, శూద్రపతిగ్రాహియు, శూద్రయాజియు, వృషవాహుం డును, మాంసజీవియుఁ, బరాన్నభోజియు, ఋతుస్నాతాన్నభోజియు, భగజీవియు, వార్ధుషికుండును, గన్యావిక్రేతయు, విద్యావిక్రయుండును, సూర్యోదయాస్త మయములసుప్తుండగునేని నతండును ద్విజాధముండగునని తెలిపి సావిత్రీధ్యానాది సదుపదేశం బొనర్చి పరాశరుండు నిజాశ్రమంబున కరిగె. అశ్వపతియును దత్ప్ర కారంబున సావిత్రిం బూజించి సాక్షాత్కృతయగు సావిత్రిం దిలకించి దివ్య సుఖంబుఁ జెందె ననిన నారదుండు నారాయణున కిట్లనియె. ౫౯౬

క॥ సావిత్రీధ్యానసమర్చావిధినుతిమంత్రికవచసరణి వినంగా
భావం బలరెడి నా నృపుఁ, డేవిధిఁ బూజించి కొనియె నిష్టం బనినన్. ౫౯౭

గీ॥ జ్యేష్ఠ కృష్ణత్రయోదశిఁ జిత్తమలరి, యుపవసించి చతుర్దశి నుక్తవిధిని
నిత్యకృత్యంబుదీర్చి యగ్నియును బరిక, రములు తగునట్లు మిగులసంగ్రహ మొనర్చి.

సీ॥ పదునాలు గేండ్లు సద్భక్తి సంకల్పించి, పదునాల్గు విధముల ఫలచయములు
పదునాల్గు నైవేద్యపాకంబు లొనరించి, గంధచందనపుష్పకలితముగను
వస్త్రోపవీతధూపప్రసారణములు, మంగళారతులు నైవేద్య మొసంగి
గణనాథభాస్కరకైటభార్యద్రిజా, శివులతోఁగూడఁ బూజించె దేవి

తే॥ నిష్ఠఁ బూజలఁ దన్పి గరిష్ఠమైన, దేవిమంత్రంబు జపియించి భావశుద్ధి
స్తోత్ర మొనరింపఁదగుమనస్సూర్తిఁ దత్ప్ర, కార మెఱిఁగింతు వినుము నిక్కముగఁ దపసి.

సీ॥ తప్తకాంచనవర్ణ తరుణారుణజ్వాల, ద్బ్రహ్మతేజోరూప పరమశక్తి
మధ్యాహ్నమార్తాండమహితస్ఫురితకాంతి, మందహాసముఖారవిందరుచిర
వహ్నిశుద్ధాంశుక వరరత్నభూషణ, భక్తవత్సల సుఖప్రద మహేశి
దాంతముక్తిప్రద శాంత సర్వాకార, సర్వసంపద్రూప శాస్త్రగమ్య

తే॥ యనుచు నుతియించి ధ్యానించి యతులషోడ, శోపచారంబు లిడి భక్తియుక్తి శక్తి
నెఱపి సంతృప్తి యొనరించి నిఖిలనుతుల, నతులగతుల గాయత్రికి నర్చ సల్పి.

వ॥ మఱియును శీతలజలతాంబూలభూషణమాల్యతల్పహారకేయూరాదు లొసంగి ప్రదక్షిణనమస్కారంబు లొనర్పవలయు. ౬౦౧

గీ॥ పూజ యొనరించునప్పుడు భువనమాత, కఖిలవస్తుసమర్పణాద్యవసరముల
మంత్రపూతంబుగాఁ జేయుమాన్యులకును, నైహికాముష్మికములు హస్తాంచితములు.

క॥ సావిత్రీపూజనముల, భావించుచుఁ బాద్యముఖసపర్యలఁ దన్మం
త్రావాహన మొనరించుట, పావన మహోల్లిఁ బూజ కె బహుఫలద మగుఁన్. ౬౦౩

వ॥ తత్ప్రకారం బెట్టిదనఁ దీర్థవాహినీశుద్ధోదకంబులఁ బాద్యంబును బావనపవిత్రం బును దూర్వాపుష్పలతాన్వితంబును సపుష్పశంఖతోయంబును నగు నర్ఘ్యంబును సుగంధితోయంబును స్నేహసౌగంధ్యకారణంబును నగు స్నానీయంబును దివ్య గంధద్రవ్యోద్భవం బగు గంధంబును సర్వమంగళప్రదంబును బుణ్యంబును నగు పుష్పాంజలియుఁ; బుణ్యప్రదంబును సుగంధయుక్తంబును నగు ధూపంబును దర్శ నీయంబును నంధకారధ్వంసబీజంబును నగు నీరాజనంబును స్వాదురసయుక్తం బగు నైవేద్యంబును సోపస్కరంబగు తాంబూలంబును నిర్మలంబగు గంధోద కంబును మృదులంబు లగు వసనంబులును గాంచనమయంబు లగు రత్నభూషణం బులును; మధురంబులగు ఫలప్రతతులును బుష్పనిర్మితంబులును శోభాసమన్వి తంబులు నగు మాల్యంబులును బాదాలంకారంబగు సిందూరంబును బట్టసూత్ర నిర్మితంబును విశుద్ధగ్రంథిసంయుక్తంబును నగు యజ్ఞసూత్రంబును సమర్పించితి నని తత్తత్పూజ లొనర్చునెడ మూలమంత్రోచ్చారణపూర్వకంబుగా లక్ష్మీ మాయా కామబీజ పూర్వంబును స్వాహాంతంబును సావిత్రీచతుర్థ్యంతమధ్యంబును నగు నీయష్టాక్షరంబు జపియింపవలయు. బ్రాహ్మణు నర్చించి సదక్షిణ తాంబూ లంబు లొసంగి వ్రతం బాచరించు నరుండు సర్వకామంబులం జెందు నిత్తెఱంగున శ్రీకృష్ణుండు సావిత్రిం బూజించి గోలోకంబున బ్రహ్మకు నొసంగె, నెప్పటికి నద్దేవి బ్రహ్మలోకంబున వసియించి పరమేష్ఠిం బతిగాఁ గామించిన నతండును నారాయణ స్వరూపిణీ! నారాయణీ! సనాతనీ! నారాయణోద్భూతా! ప్రస న్నవు గమ్ము నందరూపిణీ! సర్వమంగళా! ప్రసన్నవు గమ్ము. నిత్యానిత్య తేజస్స్వరూపిణీ! పరమేశ్వరీ! ప్రసన్నవు గమ్ము. పరమానందరూపిణీ! బ్రహ్మ తేజోరూపిణీ! ప్రసన్నవు గమ్ము. నిత్యా! నిత్యప్రియా! నిత్యానందరూపిణీ! సర్వ మంగళా! సర్వప్రసన్నవు గమ్ము. సర్వస్వరూపిణీ! విప్రమంత్రరూపిణీ! సుఖ మోక్షప్రదా! ప్రసన్నవు గమ్ము. బ్రహ్మతేజోమయీ! దురితాటవీదవానలా! ప్రసన్నవు గమ్ము. మనోవాక్కాయంబుల నరుం డొనరించు దురితంబు భవత్స్మ రణమాత్రంబున భస్మం బగునని వరంబు నొసంగి పత్నింగాఁ గొనియె, నిది పరమ రహస్యంబు హాయపతియును నివ్విధంబునఁ దదుపాసనం బొనర్చి సావిత్రిం దర్శించి కృతార్థుం డయ్యెనని చెప్పి మఱియును. ౬౦౪

ఉ॥ భారతి యమ్మహీవిభుఁ గృపామతిఁ బుత్రిని బోల్కిఁ గాంచి మో
భూరమణాగ్రగణ్యా! మదిఁ కె బుట్టిన కోరిక యెద్ది? వాంఛితం
బారయ సిద్ధిఁ గాంచు భవపదంగన యాత్మజఁ గోరె దివ్యశో
భారమణీయుఁ డౌ సుతుఁడు కె పతికిన్ గల్గు వరంబ నందుమీ. ౬౦౫

ఆ॥ నీదుపత్నిమదిని నిరతంబుఁ గూఁతుఁ గామించుఁగాన సుత జనించుఁ బిదపఁ
గొడుకుగల్గు మీకుఁ గోర్కులు రంజిల్ల, నఖిలసౌఖ్యపదవి నందఁగలవు.

ఆ॥ అని వరం బొసంగి యఖిలేశి యంతర్ధి, నొందె నంత రాజు సువిదఁ గూడి
నిధువనోపభోగనిరతి నున్నెడఁ బత్ని, గనియె నొక్క కన్యఁ గాంతిధన్య. ౬౦౭

ఉ॥ అయ్యొలనాగ రూపమున నచ్చరపోలె మనోహరాకృతిన్
నెయ్యముఁ దియ్యముల్ గొలుప నిచ్చలు నత్తలిదండ్రులొద్ద వే
తియ్యనిముద్దుచేఁ బెరిఁగి దిద్దుగడన్ నెలకొంచు యౌవనం
బయ్యెడ నింతనంతఁ బొలుపారఁగఁ బౌరుషభోగవాంఛచే. ౬౦౮

సీ॥ ఏకభోగంబుగా నిలయెల్ల నేలెడు, సత్యవ్రతుం డను జనపతీంద్రు
సత్యవ్రతుని నిత్యసంపన్న సద్గుణ,భూషు ద్యుమత్సేనపుత్త్రుఁ దనకుఁ
బతిగాఁగఁ గోరిన పడఁతిభావ మెఱింగి, తండ్రి యాతని కిచ్చెఁ దరుణిఁ గొనుచు
సత్యవ్రతుఁడు తనసదనంబునకుఁ బోయి, వనవిహారార్థియై తనదు తండ్రి

తే॥ యాజ్ఞఁ గొనిపోయె వెంబడి నరిగె వనిత, దైవయోగవశంబునఁ దరువు నెక్కి
జాఱిపడి సంస్థితుం డయ్యె శమనుఁ డంతఁ, గాలదండాగ్రహస్తుఁడై కసిమసంగి.

క॥ అంగుష్ఠసదృశుఁ డగు జీవుం గరమునఁ బట్టి నింగిఁ బోవఁగ సతియున్
సంగతి విడువక తోఁ జన, నంగనఁ గని శమనుఁ డనియె నతిమధురముగన్.

ఉ॥ ఎచ్చటి కేగ వచ్చెదు చెలీ! నిలు మిట్టులు మానుషాంగివై
వచ్చుట గల్గునే? దివికి వచ్చెద వేని యొడల్ త్యజించి ర
మ్మెచ్చెము లేదు భౌతిక మహో! భువి నశ్వర మిట్టి మేనితో
వచ్చుట కూడ దింకఁ దెలుపవా! నిలువంబడు మంచుఁ బల్కుచున్. ౬౧౧

ఆ॥ నీదుభర్త కాలనియతి దేహము వీడి, కర్మవశత వచ్చుఁ గాని నీకు
వలదు రాఁగఁ గర్మవశతచే మానవుల్, చచ్చి యిటకుఁ బిదప వచ్చువారు.

సీ॥ కర్మవశంబునఁ గాదె? యింద్రుండైన, భూతలంబునఁ జచ్చి పుట్టుచుండు
బ్రహ్మపుత్త్రుండు నారదుఁడు జన్మలయంబు, లొందఁడే కర్మభోగోపయుక్తి
విష్ణుసాలోక్యాదివిభవముల్ గాంచఁడే? స్వర్గంబువారు భూవలయమునకు
తామె జనించెడువారు స్వర్గలోకమునకు, వచ్చెడి పోయెడివారు గారె?

గీ॥ శివుఁడు నగుటయు నటులె కేశవుఁడు నగుట, ధనులు నిర్ధను లగుటయు ధరణిసురులు
క్షత్త్రియు లగుట కర్మవశమ్ముగాదె?, కర్మమున కడ్డ మున్న దే? గణుతిసేయ.

సీ॥ జంగమరూపముల్ శైలరూపంబులు, కర్మవశమ్మునఁ గాదె? తెలియ
నధికు లౌటయు నీచులౌటయు వివరింపఁ, గర్మవశంబునఁ గాదె? తెలియ
రాక్షసు లగుటయు రాజన్యు లగుటయుఁ, గర్మవశమ్మునఁ గాదె? తెలియఁ
బండితు లగుటయుఁ బశుజీవు లగుటయుఁ, గర్మవశమ్మునఁ గాదె? తెలియఁ

తే॥ గాన సర్వంబు కర్మభోగప్రదంబు, నీదు భర్తకు భూభోగనియతి వదలె
నీకు నీదేహమున నిందురాక తగదు, మరలు మని పల్క శమనుతో నమగువయనియె.

గీ॥ దేవ! నీ సన్నిధి వసించు తెరువుకన్న, సార్థకస్థితి గల్గునే జనుల కెచట
ధర్మమూర్తివి నీదు సందర్శనమున, నఘచయంబులఁ బాసితి ననుచుఁ బలికె.

ఉ॥ దివ్యజనాగ్రిగణ్యుఁడవు దేవుఁడ వీవు భవత్కృపాప్తిచే
భవ్యము సర్వవిశ్వమును బావనమూర్తి! భవన్ముఖోక్తిచే
నవ్యయధర్మసాధకవచోతిశయంబుగ నాదు ప్రశ్న సం
భావ్యముగా గణించి నను మన్ననఁ జేసి వచింపగాఁదగుఁ. ౬౧౬

సీ॥ కర్మ మెట్టిది? దేనఁ గల్గు నయ్యది యట్టి, హేతు వెయ్యది? దేహి యెవ్వఁ డనఘ!
కాయ మెట్టిది కర్మకారకుం డెవ్వఁడు, జ్ఞానంబు నా నెట్టి చందమునను
నెసఁగు? బుద్ధి యనంగ నెట్టిది దేహికిఁ, బ్రాణేంద్రియంబు లెవ్వాటఁ గలిగెఁ
దల్లక్షణము లెట్లు తద్దేవతలు నెట్లు, భోక్తృభోజయితలు భోగములును

తే॥ నెట్టి వగు? జీవపరమాత్మ లెట్టివార, లేతదర్థంబు వివరించి యేర్పరించి
తెలుపవలెనన్న నా ధర్మదేవుఁ డతివఁ, గాంచి యిట్లని పలికె నిగమ విధమున.

క॥ వేదోదితధర్మాచర, ణాదృతి కర్మంబు మంగళాస్పద మిది త
ద్వేదవిహీనము దుఃఖా, పాదితమగు నశుభ మిదియ పద్ధతి సుమ్మా. ౬౧౮

సీ॥ సంకల్పరహితమై సంతతంబు నహేతు, కంబగు విష్ణుసంఘటితసేవ
కర్మనిర్మూలన కర్మదంబౌ ఫల, భోక్త నిర్లేపుండు భోగ మనఁగ
జన్మమృత్యువులును జరయు వ్యాధియు శోక, భీతు లెవ్వియు లేవు విష్ణుసేవ
ముక్తి నొసంగుఁ దన్ముక్తియు ద్వివిధంబు, సర్వసమ్మతమును సాధ్వి! మోక్ష

తే॥ పదము నొసఁగును నమ్ముక్తి భాగవతులు, గోరుచుందురు కొందఱుకుతలమునను
నదియు నిర్వాణ మని పల్కనగుఁ దదీయ, సాధనంబులు బహుకర్మసాధకములు.

గీ॥ ప్రకృతిపరుఁడైన కృష్ణుండు పరఁగఁ గర్మ, రూపియును గర్మహేతుస్వరూపుఁడరయ
జన్యమగు దేహము నశించు శాశ్వతుండు, భోక్త యాత్మ యతం డెపో భోజయితయు.

క॥ భోగమన విభవమనఁ జను, భోగాపేక్షాదిహీన భోగము నిత్యం
బాగమ వేద్యము [illegible] దవ్యభావ్యం బగునే. ౬౨౧

సీ॥ సత్తు నసత్తు బీజము రెండు దెఱంగులు, జ్ఞానంబు బహువిధసంకలితము
విషయభోగము భేదవిహితబీజంబగు, జ్ఞానబీజము బుద్ధిగాన నదియుఁ
జేతనారహితంబు వాతసంఘంబులు, ప్రాణముల్ దేహికి బలము నవియె
యింద్రియంబులకును నీశుండు ప్రేరకుం, డటులె కర్మంబుల కధిపుఁ డతఁడు

తే॥ దుర్నివారుం డదృశ్యుఁడు దురితభేది, లోచనాదులె యింద్రియాళులు గణింపఁ
బ్రేరకంబగు సంగంబు పృథివిమిత్ర, శత్రుకూపత సుఖదుఃఖసంగ్రహములు.

క॥ భానుఁడు మొద లింద్రియసం, తానములకు నధిపు లటుల ధర దేహాది
స్థానికుఁడగు జీవుఁడు సువి, ధానతఁ బరికింపు కృతివిధానము సుమ్మా. ౬౩

గీ॥ పరమమును వ్యాపకంబును బ్రహ్మ మవగు, ణంబు ప్రకృతి పరంబు నిత్యంబు తార
ణంబు తారణములకెల్ల నలిననేత్ర!, యతఁడె శ్రీకృష్ణుఁ డని కాంచుమంతరమున.

క॥ నీ వడిగిన సర్వంబును, నే వీనుల నిడితి నింక నెయ్యది యడుగం
గావలసియున్న దనినను, సావిత్రి వచించె శమనసన్నిధి నిట్టుల్. ౬౪

వ॥ దేవా! జ్ఞానార్ణవుండవగు నిన్నుఁ గాని మత్ప్రాణనాథుంగాని విడిచి నే నెందుఁ జను
దాన. నాయొనరించు ప్రశ్నంబులకు సమంజసోక్తులు వివరింప నీవ యర్హుండ వని
మరల సావిత్రి మహాత్మా! యేయే కర్మంబుల జీవుం డేయే యోనులయం దధి
వసించు? నెట్టి కర్మంబులకు స్వర్గనరకంబులు ప్రాప్తించు? నేయే కర్మంబుల ముక్తి
గలుగు? హరిభక్తియు, బ్రాహ్మణత్వంబును, దీర్ఘజీవనంబును, స్వల్పాయుష్యం
బును, సుఖదుఃఖంబులును, అంగహీనకాణబధిరత్వాదులును, అంధకుబ్జత్వాదు
లును, లుబ్ధక చోరక జన్మంబులును, సాలోక్యాదిచతుష్టయసిద్ధియు, బ్రహ్మభావం
బును, దపస్విత్వంబును, భోగాతిశయంబును, వైకుంఠకైలాస గోలోక ముఖ్య
నివాసంబును, ఆరోగ్యవ్యాధులు, ప్రియాప్రియనిషేవనంబును, మొదలగువానికి
హేతుభూతంబులగు కర్మంబు లెట్టివి? దయచేసి వివరింపవలయునని యడిగినఁ
జిఱునగవు నగుచు సావిత్రితో ధర్మరా జిట్లనియె. ౬౫

శా॥ సావిత్రీ! పదిరెండు వర్షములకే సర్వజ్ఞ వీవైతి నీ
భావం బచ్చము యోగివర్యులకు దుష్ప్రాపంబు దేవీవర
ప్రావీణ్యంబున సత్కలామహితవై పాపదుర్భవం బంది తీ
వీ విజ్ఞానము నీ వివేకము జగం బెంచంగ సామాన్యమే! ౬౬

సీ॥ హరి హరిరాణియు హరునిఁ గాత్యాయని, యదితి కశ్యపుని నహల్య యత్రి
పదు శచి యింద్రుని భాను సంజ్ఞయుఁ జంద్రు, రోహిణి రతి కాము స్వాహ వహ్ని
స్వధ పితృగణము నస్వరుణుని వరుణాని, దక్షిణ యజ్ఞంబు ధర వరాహు
దేవసేన కుమారు నేవిధి నావిధి, సత్యవంతుని గొల్తు సాధ్వి! నీవు

ఆ॥ ఇద్ది యొక్కవర మిఁక కేమి కావలెనన్న, నేను బలిని గలసి యింపుదనరఁ
బుత్రశతముఁ గాంచు పుణ్యంబు గరుణింపు, మిదియఁగాక యొక్కకటీప్సితంబు.

క॥ మామ సనేత్రుం డగుచును, భూమండలభర్త యగుచు భోగముచే సు
త్రాముఁడన నెగడి విభవ, శ్రీమత్తగ వెలయవలయుఁ గృతకృత్యుఁడుగన్.

వ॥ మఱియు నపుత్రికుండగు మజ్జనకునకుఁ బుత్రశతకం బుదయింపవలయు నింతియ
కాక. ౬౩౦

క॥ అంతమున నబ్ధితనయా,కాంతపరమపదమునందు ఘననైభవ మ
త్యంతము నొంది సుఖింపఁగ, నెంతయుఁ మా దంపతులకు నీవలె దేవా. ౬౩౦

వ॥ అని వెండియు. ౬౩౨

క॥ విరివిగఁ దత్తజ్జీవుల, యఱిముఱికర్మముల తెఱఁగు లన్నియు నాకున్
గరుణమెయిఁ దెలుపవలయును, గుఱుతుగొనన్ మఱియు దేవకుంజర!యనినన్.

వ॥ దేవీ! సర్వంబును మనోమయంబగు జీవకర్మపాకంబు, శుభాశుభ పరికారంబుల
ద్వివిధంబై భారతంబున ఫలదం బగుచుండు, సురనరగంధర్వాదులకు సదసత్కర్మ
జనకంబు భారతంబ; శుభభోగంబు సద్యోనులం గలుగు నశుభభోగంబు క్షుద్ర
యోనిజననప్రదంబగు విశేషించి జీవులు సర్వయోనులం బరిభవించుచుఁ
బూర్వార్జితంబులగు శుభాశుభంబు లనుభవింతురు. శుభంబున స్వర్గంబును,
నశుభంబున నరకంబును, గర్మ నిర్మూలనంబున హరిభక్తియు నగు, రోగులును
క్షీణాయువులును దుఃఖులు నంధులు నంగహీనులు దుష్కర్మజాతులు; దీర్ఘ
జీవులు నరోగులును సుఖులును సంపన్నులును సుకర్మజాతులు; సుకర్మజాతులకు
నిది సామాన్యలక్షణంబు; విశేషంబు వచించెద. ఇయ్యది శ్రుతిస్మృతి పురాణ
గోప్యం బగు కతన ననితరలభ్యమ్ము, దుర్లభంబు. మానుషంబు నందును
బ్రాహ్మణుం డగుట యత్యుత్తమంబు; మఱియు విష్ణుభక్తుండై భరతఖండంబున
జనియించుట పరమదుర్లభంబు. నిష్కామసకామభేదంబున నప్పాటులు రెండు
తెఱంగులై యుండుదురు. సకాములు కర్మభోగులు, నిష్కాములు నిరుపద్రవులు
నగుదురు. అట్టివారు కర్మనిర్మూలనం బొనరించి హరిసేవాపరాయణులై దేహాం
తంబున నిరామయంబును బునరావృత్తిరహితంబును నగు ద్విభుజకృష్ణపదంబగు
గోలోకంబున దివ్యరూపధరులై విహరింతురు. వార లొక్కొక్క తఱి హరిసేవా
కామంబున భారతంబునం బొడమి బ్రాహ్మణులై వైష్ణవులై తత్సపర్యాపరత వర్తిం
చుచు భగవత్సన్నిధిం గాంచెదరు. విష్ణుభక్తిహీనులకు బుద్ధినైర్మల్యంబుపొసంగదు,
మఱియును బ్రహ్మనిష్ఠులు, తీర్థనిష్ఠులు, తపోనిష్ఠులు, శైవులు, శాక్తులు, గాణాపులు

తత్తద్దేవతాసేవలఁ దత్తల్లోకనివాససౌఖ్యం బనుభవించి పదంపడి భారతంబునకు మరలివత్తురు. విప్రులు స్వధర్మంబగు నగ్నిహోమాదియజనంబు నెఱపి మరల భారతంబున జనియింతురు. హరిభక్తులు నిష్కాములై పునరావృత్తిరహితం బగు పదంబుఁ జేరుదురు. స్వధర్మరహితులకు నుత్తమగతి పొసంగదు. శ్రుతిసిద్ధంబగు నిమ్మార్గంబు నీ కుపదేశించితి, మఱియు వినుము. ౬౩౪

గీ॥ ధర్మనిరతుఁడైన ॥ ధరణీసురుఁడు నిజ,ధర్మనిరతుఁడైన ॥ ధవుని వెదకి
కన్య నిచ్చెనేని ॥ కల దాతనికిఁ జంద్ర,లోకసుఖము మానిక(?)లోకనుతము. ౬౩౫

క॥ సాలంకారతఁ గన్నియ, శ్రీలొందగ ద్విజున కిచ్చి ॥ క్షేమముగను వాఁ
డాలోకంబున ద్విగుణాసు,ఖాలంబుం డగుచునుండు ॥ నాకల్పముగన్. ౬౩౬

క॥ ఫలకాము లగుచుఁ జేసిన, ఫల మిట్టి దటంచుఁ బలుకఁ(?)బడె మదిలో నే
ఫల మిచ్చగింప కిడినను, గల వాతని కంబుజాక్షు(?)కై వల్యగతుల్. ౬౩౭

సీ॥ గవ్యంబు రజతంబు ॥ కాంచనంబును దేనె,ధన మాజ్యమును మొదల్ (?)ద్రవ్యసమితి
యిచ్చువారికిఁగల్గు ॥ నిందులోకము తన, త్రిపురుషోద్దేశంబు ॥ తెలియవినుము
తపనీయగోరూప్య(?)తామ్రాదికము లిచ్చి, యర్కలోకమునందు ॥ నధివసించి
పదివేలయేండ్లు ది(?)వ్యసుఖంబు లార్జించు, దక్షిణాన్వితముగా ॥ ధర యొసంగి

ఆ॥ విష్ణులోకమునను ॥ విపులసుఖంబుల, నొంది సూర్యచంద్రు ॥ లుండుదనుకఁ
దెగనివీర మెక్కి ॥ దివ్యప్రభలతోడ, దైత్యదమనుకరుణఁ ॥ దనరు వాఁడు. ౬౩౮

ఆ॥ ఎవ్వఁడేని ద్విజున ॥ కిష్టాప్తి గృహ మిచ్చి, సపరికరముగాఁగ ॥ నలువుఁ బూజ
నతఁడు విష్ణుభవన(?)మందుఁ దద్గృహరేణు, సంఖ్యావత్సరములు ॥ నడలకుండు.

ఆ॥ కడుదరిద్రులైన ॥ పుడమివేల్పులకును, భవనదాన మొసఁగు ॥ భవ్యజన్మ
సఫలతను వచింప ॥ సాహసోద్భవుఁడైన, శక్తుఁడగుటగలదె? ॥ జగతిలోన. ౬౪౦

ఉ॥ దానమొసంగువేళలను ॥ దాతకుఁ గాలము దేశపాత్రముల్
మానితవృత్తిగల్గిన న(?)మానుషలోకనివాససౌఖ్య మ
న్యూనత సంభవించు నని ॥ యొప్పుగ నప్పరమేష్ఠి పల్కె నె
వ్వానికి నీత్రయంబు గుణ(?)వంద్యత నబ్బిన నెంతభాగ్యమో. ౬౪౧

సీ॥ రహి ధనుశ్శతసహస్రప్రమాణంబైన, కించిదూనంబైన ॥ వాంఛితముగ
బావి ద్రవ్వించి యొక(?)వ్వాఁడు సత్పాత్రంబు,నందు నర్పించు వాఁ(?)డొందు ఫలముఁ
జెప్పంగనలవియే? ॥ చెఱువులు నట్టులఁ, జేయించి యచ్చెంతఁ ॥ జెట్లు వేసి
యొసఁగినఁ దత్ఫలం ॥ బూహింపనలవియే, వాపీతటాక పంక(?)శాపనయము

తే॥ సేయుటయు నక్షయఫలంబుఁ * జెందఁజేయుఁ, దివిరి యశ్వత్థవృక్ష ప్రతిష్ఠ సేయు
వాఁడు చెలఁగి తపోలోక* వాసియగుచు, విభవములఁ జెందఁగను బదివేలయేండ్లు.

గీ॥ మణివిమానంబు గల్పించి * మాధవున కు,మాధవున కిచ్చెనేని య*మ్మానవుండు
హరిహరాంతికములను మ*న్వంతరంబు, స్థిరములగు దివ్యసుఖములఁ* జెందుచుండు.

గీ॥ రాజమార్గములందున * రమ్యసౌధ, నిర్మితి యొనర్చెనేని య*న్నిపుణమతికిఁ
గలదు పదివేలయేండ్లు సౌఖ్యంబు శక్తి, సన్నిధానంబునందు ని*స్సంశయముగ.

ఆ॥ వేదవేత్తలయిన * విప్రుల కిడు దాన, మధికఫలము విప్రు*లందు మఱియు
జ్ఞానఘనున కొసఁగి * మానితసౌఖ్యంబుఁ, బడయు టరుదె? నాల్గు*పాళ్ల రెట్లు.

క॥ హరిహరులకు శిబికలు చ,ప్పరములు డోలలును నిచ్చు * ధన్యుఁడు తన్మం
దిరములలో నొక మన్వం,తర సౌఖ్యమ్మొందు భక్తి*తత్పరమతియై. ౬౪౬

సీ॥ ఎద్ది యెద్ది యొసంగు * నెందేని మానవుం, డది గల్గువానికి * నవనిలోనఁ
బుణ్యంబు సురలోక*భోగహేతువుగాన, నది దీరి భారతం*బందుఁ బొడము
నందు విప్రకులంబు * నం దుత్తమాన్వయం, బందు విజ్ఞానలం * దమరుచుండఁ
దపమున బ్రాహ్మణ*త్వంబు సంపాదించు, నిది శ్రుతిపద్ధతి * యిందువదన!

గీ॥ ధర్మరహితులు క్రిమికీట* తనువులొంది, నిరయమును జెందుదురు ధర్మ*నిరతు లమర
భోగములఁగాంతు రేదియు*భోగనశ్య,మనుచు నెఱుఁగుము జన్మకో*ట్యంతరములఁ

క॥ శుభమగు కర్మంబైన న,శుభమగు కర్మంబునైనఁ * జొప్పడి భోగా
నుభవంబునఁ దీరును గుణ, శుభతర్క దచ్ఛుద్ధిగలుగు * సూనృతఫణితీ. ౬౪౭

వ॥ అనిన సమవర్తిం గాంచి సావిత్రి దానంబులలో నుత్తమదానం బెయ్యది యని
యడిగిన నతం డిట్లనియె. ౬౪౮

గీ॥ అన్నదానంబు విప్రుల * కవనిలోనఁ, జేయు నాతఁడు వైకుంఠ * సీమమునను
అన్న మెన్నికణంబులో * యన్ని యేండ్లు, దివ్యసౌఖ్యానుభూతిచేఁ * దేజరిల్లు.

వ॥ మఱియు, దానంబులలో ముఖ్యదానం బన్నదానంబు. సత్పాత్రంబు లభియించె
నేని తత్ఫలంబు వచియింపనలవియే? తత్సమం బగు దానంబు భూతభవిష్యత్కా
లంబుల ననమం బగు మఱియు, బ్రాహ్మణులకు సుఖాసనతల్పాదు లొసంగిన
వర్షాయుతంబు దివ్యసుఖంబు గల్గు, పాత్రుం డగు విప్రునకు ధేనుదానం బొసంగినఁ
దల్లోమమానంబులగు నబ్దంబులు భగవదంతికంబున వసించు నయ్యది పుణ్య
దినంబున నగునేని చతుర్గుణఫలం బగుఁ, బుణ్యక్షేత్రమ్మున నగునేని శతగుణఫల
ప్రదంబగు, నారాయణక్షేత్రమ్మునం దగునేని చెప్పవలసిన దేమి? కోటిగుణితం

బగు, భారతంబున నెచ్చటనేనియు వర్షాయుతంబు గోదానఫలంబు చంద్రలోక సుఖం బొసంగు. అం దుభయముఖిదానంబు భగవదంతికంబునఁ దల్లోమమాన వర్షంబులు దివ్యసుఖం బొసంగు, సాలగ్రామదానంబున వైకుంఠంబును, ఛత్రదానంబున వరుణలోకంబును, వస్త్రదానంబున వాయులోకంబును, శయ్యాదానంబునఁ జంద్రలోకంబును, దీపదానంబున వహ్నిలోకంబును, గజదానంబున నింద్రార్ధాసనంబును, అశ్వదానంబున వరుణలోకంబును, శిబికాదానంబున వాయులోకంబును, వ్యజనచామరాదిదానంబుల నట్టుల వాయులోకంబును, ధాన్యరత్నదానంబులఁ జిరంజీవిత్వంబును లభించు. తిలదానంబున వైకుంఠం బనుభవించి విప్రాదియోనుల జనించి చిరంజీవి యగుచు వర్తించు. తద్దానంబు తామ్రపాత్రస్థం బగునేని ద్విగుణఫలకంబు. సాలంకృత కన్యాదానంబునఁ జంద్రలోకంబు, మఱియు గంధర్వలోకంబును, సార్వశీసౌఖ్యంబును, బహుపత్నీకత్వంబును గల్గు, ఫలప్రదానంబునఁ దద్బీజమానవర్షంబుల శక్రలోకంబును, మఱియు, బ్రాహ్మణాదిజన్మంబులునుం గల్గి సఫలవృక్షారామశాసకుం డగు. నానాద్రవ్యయుక్తం బగు గృహదానంబున సురలోకంబును, సస్యగర్భం బగు భూదానంబున వైకుంఠంబును, గ్రామప్రదానంబున లక్షగ్రామాధిపత్యంబును, ఫలవృక్షసమన్వితం బగు నగరం బొసంగిన వైకుంఠంబున దశలక్షమన్వంతరంబులు వసియించు, నగరశతం బొసంగినఁ గోటిమన్వంతరంబులు వసియించి, సుయోనిసంభూతుండై జంబూద్వీపపతి యగుచుఁ గల్పాంతజీవియగు, స్వాధికారం బొసంగి విప్రుని మన్నించెనేని చతుర్గుణ ఫలం బగు, ద్వీపం బొసంగిన శతగుణ ఫలం బగునని చెప్పి మఱియును. ౬౫౧

సీ॥ దానశూరత నెన్ని ♪ దానముల్ చేసిన, నపునరావృత్తి సౌఖ్యంబుగాదు
హరిభక్తియించుక ♪ యంతరంగంబునఁ, గలిగిన నతనికిఁ ♪ గమలభవుని
కల్పముల్ కడచన్నఁ ♪ గలుగదు పాతంబు, కదల కెప్పుడు నిల్చు ♪ మదనజనకు
వైకుంఠమునను గోలోకానను వసించు, విష్ణుమంత్రోపాస్తి ♪ విడనినరుఁడు
తే॥ జన్మమృత్యుహరంబును ♪ శాశ్వతంబు, నైన భగవత్స్వరూపత ♪ నలరునతఁడు
విష్ణుకైంకర్యలోలత ♪ వెలయువాని, జన్మసఫలతఁ జెప్ప వాగ్జాని కగునె? ౬౫౨

క॥ నరసురగంధర్వాదుల, కరయ విరామంబు గలదు ♪ హరిభక్తులకున్
జిరతరకైవల్యశ్రీ, పరిణతి లభియించు దిగరు ♪ పరమపదమునన్. ౬౫౩

మ॥ తులసీదానము కార్తికంబున గృహస్థుం డెవ్వఁడేనిన్ సము
జ్జ్వలనిష్ఠాతిశయంబునన్ సలిపినన్ ♪ సాలోక్యసారూప్యముల్
జలజాతాక్షుఁ డొసంగి యెప్పుడు నిజస్థానంబునన్ నిల్పు నా
వలఁ గైంకర్యకృతాభిలాషత భువిన్ ♪ వర్తించు సద్యోనులన్. ౬౫౪

క॥ గంగావగాహనంబున, నంగము శుద్ధత నెసంగు । నాతఁడు యుగష
ష్టిం గైటభమర్దనుపురి, నంగీకృతవిభవుఁ డగుచు । నలరు సతతమున్. ౬౫౫

క॥ నిరతము గంగాస్నానము, కర మరయుచుఁ జేయునతఁడు । కమలాప్తుని వై
ఖరి నలరి యశ్వమేధ, స్ఫురితఫలం బనుభవించు । భూపావనుఁడై. ౬౫౬

గీ॥ మీనకర్కటములయం ద।మేయనిష్ఠ, గోప్రదానంబుఁ జేసిన । కోవిదుండు
హరిహరపదంబులందు ది।వ్యానుభూతి, వెలయు నమరావళులు తన్ను ।వినుతిసేయ.

సీ॥ వైశాఖవాసరా।వసరంబులను సత్తు, దానంబు జేసిన । ధర్మపరుఁడు
కృష్ణజన్మాష్టమీ।కృతసువ్రతుండైన, సద్భక్తవర్యవి।చక్షణుండు
శివరాత్రి నీశ్వర।శీర్షంబునను బిల్వ, పత్రింబుఁ బూన్చిన । భక్తవరుఁడు
చైత్రమాఘములందు । శంభుసన్నిధి వేత్ర, పాణియై కొలిచిన । భవ్యతముఁడు
గీ॥ పుత్రమిత్రకళత్రస।ద్భోగములను, నైహికసుఖంబు లొంది ని।త్యానుభూతి
హరిహరపదంబులందుఁ దా।నధివసించి, ముక్తిసామ్రాజ్యవైభవో।ద్యుక్తిఁ దనరు.

క॥ శ్రీరామనవమివ్రత నియ, మారూఢిన్ భారతమున । నతిభక్తి మెయిన్
బ్రారంభించిన నరునకు, సారసదళనేత్రు కూర్మి । సంపద గల్గున్. ౬౫౯

సీ॥ జగదీశ్వరికి భక్తి । శారదం బగునట్టి, సమయంబునను నర్చ । సలిపి మేష
గజఖడ్గమహిషాది।*క్రవ్యంబు సంపూర్తి, నుపహారముగఁ జేసి । యుచితవిధుల
గంధగంధిలదీప।కలికాదులను దృప్తి, గావించి వాద్యసం।ఘటితముగను
నృత్తగీతాదిసం।పత్తుల నెలకొల్పు, వాఁడు సాక్షాచ్ఛివా।వాసమందు
ఆ॥ నిచ్చదీర సౌఖ్య । మెనసి జంబూద్వీప, సార్వభౌముఁ డగుచు । జననమంది
ఫుత్రపౌత్రమిత్ర । భూరిసంపద లంది, రాజరాజకీర్తిఁ । దేజరిల్లు. ౬౬౦

గీ॥ శుక్లపక్షాష్టముల మన।శ్శుద్ధిగల్గి, భువనజనని మహాలక్ష్మిఁ । బూన్చునతఁడు
యావదింద్రచతుర్దశం । బంతతడవు, నిత్యగోలోకవాసియై । నెగడుచుండు. ౬౬౧

సీ॥ కార్తికపూర్ణిమా।కాలంబునను రాస, మండలం బొనరించి । మధ్యపీఠి
స్వర్ణప్రతిమఁ గృష్ణ । సాన్నిధ్య మొనరించి, రమ్యతరో।పచారములఁ బూజ
సల్పి గోదానముల్ । శతము విప్రుల కిచ్చి, గోపికాశతములఁ । గూర్చి పూన్చి
హరిమంత్రి మార్జించి । యతినిష్ఠుఁ డగువాఁడు, శ్రీకృష్ణసన్నిధిఁ। జెందియచటఁ
తే॥ బార్షదుం డయి నిచ్చలుఁ । బతనరహిత, దివ్యభోగోపభోగ సం।దీప్తుఁ డగుచు
శాశ్వతైశ్వర్యసౌఖ్య వి।శ్రాంతినొంది, చెలఁగి శ్రీకృష్ణుతో నివ।సించు నతఁడు.

టిప్పణి. *క్రవ్యంబు = మాంసము. బ్రాహ్మణేతరుల కిది సమన్వయించుకోఁదగునని కాళికా పురాణము.

గీ॥ శుక్లకృష్ణపక్షంబుల శుద్ధుఁడగుచు, హరిదినంబుల నుపవాస మలరఁజేసి ద్వాదశిని బారణ మొనర్చి దైత్యదమనుఁ, బూన్చునాతఁడు గోలోకపూజితుండు.

గీ॥ భాద్రపదమాసమున శుక్లపక్షమునను, ద్వాదశీతిథి భక్తి సంస్థానగరిమఁ జక్రిఁ బూజించి దేవవాసమున నిలిచి, విభవ మార్జించు నణువది వేలయేండ్లు.

గీ॥ అర్కసంక్రమణంబున నాద్యపక్ష, భానువారంబున సహస్రభానుఁ బూన్చి తగహవిష్యంబుభుజియించునధన్యుఁడర్క, భువనముననిల్చు నాచంద్రపూజకముగ.

వ॥ మఱియును మాఘశుక్ల పంచమీతిథియందు సరస్వతిం బూజించిన వైకుంఠవాసంబును, సువర్ణాలంకృత యగు గోవును బ్రాహ్మణున కొసంగిన గోలోమ ప్రమాణ హాయనద్విగుణంబు హరిమందిరంబున నివసించు. భారతంబున బ్రాహ్మణులకు మృష్టాన్నం బిడిన విప్రలోమప్రమాణాబ్దంబులు విష్ణుమందిరవాసి యగు. హరి సహస్రనామంబులు లిఖించి దానంబుఁజేసిన యుగసహస్రంబులు విష్ణుసన్నిధి వసించు. నారాయణక్షేత్రంబునఁ దన్మంత్రంబు జపించిన విష్ణుసారూప్యంబునొందు. పార్థివ లింగపూజ యొనర్చి పరిశుద్ధుండగు నాతండు లింగరేణు ప్రమాణాబ్దంబులు శివలోకంబున వసించు. సాలగ్రామంబున హరిని భజించి తత్తోయం బాస్వాదించిన హరిపదంబు గలుగు. తపోవ్రతాదులు విడువక యొనర్చువారలకు వైకుంఠ వాసంబు సులభంబు. సర్వతీర్థస్నాతయగువాఁడును, భూప్రదక్షిణం బొనర్చు వాఁడును, సర్వలోకసుఖకరుండై దివ్యభోగము లనుభవించు. నశ్వమేధం బొనర్చిన నశ్వలోమమితాబ్దంబుల కాలం బింద్రార్ధాసనంబున వసించు, రాజసూయం బునఁ దచ్చతుర్గుణఫలంబు, పుత్రేష్టియు, లాంగలేష్టియు, నరమేధంబును, గోమేధం బును నొనర్చువారలకు దివ్యసుఖం బవశ్యంబు లభించు, ఫలహోమంబును, బుష్ప హోమంబును, బద్మహోమంబును విశేషఫలదంబులు, నన్నిటికంటె విష్ణు యాగంబు ప్రధానంబు. తత్సవనంబు బ్రహ్మ యొనర్చుచుండ దక్షశంకరులకుఁ గలహం బయ్యె, నందు దక్షుండు కోపించి నందిని శపించె, నది నెపంబున దక్ష యజ్ఞంబు హరుండు భంజించె. పిదప హరి వైష్ణవేష్టి యొనర్చె. ధర్ముండును, గశ్యపప్రజాపతియు, శేషుండును, గర్దముండును, స్వాయంభువుండును, బ్రియ వ్రతుండును, సనత్కుమారుండును, గపిలుండును, ధ్రువుండును వైష్ణవేష్టి యొనర్చి రాజసూయసహస్రఫలంబుఁ జెందిరి. విష్ణుయజ్ఞసదృశం బగు యజ్ఞంబు లేదు. దేవతలయందు విష్ణుండును, విప్రులలో గురుండును, విద్యలలో వేదంబును, వర్ణం బులయందు బ్రాహ్మణ్యంబును, దీర్థంబుల గంగయుఁ, బవిత్రులలో శివుండును, వ్రతంబుల నేకాదశియుఁ, బుష్పంబులఁ దులసియు, నక్షత్రంబులఁ జందురుండును, యక్షులలో గరుడుండును, స్త్రీలలో రాధావాణీవసుంధరలును, శీఘ్రగంబులలో మనంబును, బ్రజాపతులలో బ్రహ్మయు, వనంబుల బృందావనంబును, వర్షంబుల

భారతంబును, శ్రీమంతులలో లక్ష్మియు, విద్వాంసులలో సరస్వతియుఁ, బతివ్రత
లలో దుర్గయు, సౌభాగ్యవతులలో రాధికయు, గరీయంబు లగునట్లు యజ్ఞం
బులలో వైష్ణవేష్టి గరీయంబు. మఱియును. ౬౬౬

సీ॥ అశ్వమేధశతంబు ౹ లాచరించిన వాఁడు, స్నానశతంబులు ౹ సలుపువాఁడు
యజ్ఞదీక్షలయందు ౹ నభ్యస్తుఁ డగువాఁడు, వ్రతతపోవిధులందు ౹ వఱలువాఁడు
నిగమచతుష్కంబు ౹ నెఱిఁ బఠించినవాఁడు, భూప్రదక్షిణవృత్తిఁ౹బొల్చువాఁడు
క్షేత్రతీర్థంబులఁ ౹ గెరలిపూన్చెడు వాఁడు, సాధుసజ్జనగోష్ఠి ౹ సలుపువాఁడు
తే॥ మఱియు నేదేని పుణ్యంబు ౹ గర మొనర్చు, వారి పుణ్యంబులకుఁ గల్గు౹మేరకృష్ణ
సేవనమునకు మితిలేదు ౹ చెప్పనేల?, వేదశాస్త్రపురాణైక౹విదిత మిదియు.

క॥ హరివర్ణన హరికీర్తన, హరివందన హరిజపములు ౹ హరి సంస్మృతులున్
హరిపాద్యాస్వాదనమును, వరవర్ణిని సర్వమునకు ౹ వాంఛితమ సుమీ. ౬౬౮

క॥ భజియింపు కృష్ణమూర్తిని, నజహత్సద్భక్తి నిష్ఠ ౹ ననితరభోగ
వ్రజములు చెందును మదిలో, గజిబిజియిం కేల పొమ్ము ౹ కటకంబునకున్. ౬౬౯

సీ॥ వైవస్వతుఁడు పల్కు౹వార్త లాలించి యా, సావిత్రి పల్కె నో ౹ సవితృతనయ!
పాపతారకమైన ౹ పద్మాక్షుచరితంబు, శ్రోతృవక్తలకు సం౹శోభనంబు
సురనరయక్షకి౹న్నరసిద్ధముఖులకుఁ, బరమపదంబు దై౹త్యారిపుభక్తి
నిగమాగమములకు ౹ నిఖిలశాస్త్రములకు, హరిసేవనము పర౹మార్థపదము
తే॥ ముక్తి యమరత్వమును సిద్ధి౹ మొదలు గల్గు, దివ్యభోగంబు లెన్నైన ౹ దేవదేవు
భజనమునకును షోడశ౹భాగమైన, సాటి గావని యెఱుఁగు ని౹స్సంశయముగ.

వ॥ అని మఱియు నిట్లనియె. ౬౭౧

చ॥ హరి భజియించునట్టి విధి౹యారయ నెట్టిదొ? తత్ప్రకార మీ
వరయఁగ నిశ్చయించి విను౹నట్టులు దెల్పు మటంచు భక్తి న
మ్రరుచిరశీర్షమై నిటల౹మధ్యము పాదములందుఁ జేర్చి య
త్తరణికుమారు నిట్లని యు౹దారమనీష నుతించె నెంతయున్. ౬౭౨

ఆ॥ నిఖిలచేతనులకు ౹ నిశ్చయించి కృతాంత, నామమునకుఁ దగిన ౹ నలువు దోప
చరమవిధి విధించు ౹ సర్వజ్ఞ నీపాద, వనజములకుఁ జేతు ౹ వందనంబు. ౬౭౩

ఆ॥ సర్వజీవులకును ౹ శాస్త్రమై తచ్ఛుద్ధి, హేతువైన దండ ౹ మెత్తిపట్టి
భయదరూపమునఁ బ్ర౹వర్తించు సద్దండధరుని చరణములకు ౹ దండ మిడుదు.

ఆ॥ విశ్వకలన మెల్ల విహితకృత్యముగాఁగ, దుర్నివారవృత్తి దొడర సర్వ
కరణకౌశలమునఁ గడుఁ గ్రీడసల్పెదు, కాలమూర్తి నీకుఁ గరము మ్రొక్కు.

క॥ స్థావరజంగమకర్మా, భావితఫల మొసఁగి ధర్మ పదవర్తనచే
బావనవైష్ణవధర్మని, షేవణమునఁ జెలఁగు నీకుఁ జేతు జొహారుల్. ౬౭౭

క॥ జ్వలనజ్వాలాలీలా, కలితం బగు తేజమునఁ బ్రకాశించుచు ని
చ్చలు బ్రహ్మరూపమున భా, సిలు పరదేవుఁడవు నీకుఁ జేతుఁ బ్రణతుల్.

మ॥ అని సావిత్రి నమస్కరించి వినయవ్యాహారలీలారతిం
దనుఁ బ్రార్థించిన మెచ్చి యా శమనుఁ డత్తన్వంగికిన్ వైష్ణవం
బును వేదోక్తరహస్యమున్ దురితనిర్మూలంబునౌ మంత్రమున్
ఘనకారుణ్యముతో నొసంగి పలికెన్ గౌతూహలం బొప్పఁగన్. ౬౭౮

క॥ శుభమగు కర్మవిపాకం, బభయస్థితి వింటి విప్పు డశుభవిపాకం
బభివర్ణించెద విను మని, యుభయాన కెఱుంగఁజేసె నినసుతుఁ డంతన్. ౬౭౯

ఉ॥ జీవుఁడు పుణ్యకర్మములఁ జేసి శుభస్థితిఁ గాంచుచుండు న
జ్జీవుఁడు పాపకర్మములఁ జేసి మహానిరయంబు నొందు సం
భావితకర్మమూలములు భావ్యము లౌ ఫలముల్ శుభాశుభో
ద్భావితవృత్తి జీవులకుఁ దప్పవు స్వర్నరకాదివాసముల్. ౬౮౦

వ॥ ఇత్తెఱంగున దుష్కర్మవశంబున ననుభవనీయంబు లగు నిరయంబులు నానావిధంబులై నానానామభేదంబుల బహుప్రకారంబులై గర్తంబులనియును, హ్రదంబులనియును కుండంబు లనియును భయంకరంబులై వర్తిల్లు. కుండంబులు షడశీతిభేదంబులు, *వహ్నికుండంబును, యూపకుండంబును, రక్తకుండంబును, దప్తకుండంబును, క్షారకుండంబును విట్కుండంబును మూత్రకుండంబును. గర్భకుండంబును, దుష్టాకుండంబును, వసాకుండంబును, మజ్జానకుండంబును, గాత్రకుండంబును రోమకుండంబును, సూత్రకుండంబును, మాంసకుండంబును, నఖకుండంబును, తీక్ష్ణకుండంబును, గకుత్కుండంబును, విషకుండంబును, బ్రతప్తకుండంబును, ద్రైలకుండంబును, క్రిమికుండంబును, సర్పకుండంబును, బ్రరోమకుండంబును, శకృత్కుండంబును, సక్షికుండంబును, దామ్రకుండంబును, లోహకుండంబును, జర్మకుండంబును, సురాకుండంబును, దంశకుండంబును, గుంభకుండంబును, వజ్రదంష్ట్రకుండంబును, వృశ్చికకుండంబును, శరకుండంబును, శూలకుండంబును, ఖడ్గకుండంబును, గోళకుండంబును, వక్రకుండంబును, గాకకుండంబును, శ్వానకుండం

* టిప్పణి॥ ఈ కుండములు మూలమునకుఁ గొండొక భిన్నములు. దీనింబట్టి గ్రంథభేద మూహ్యము.

బును, జాపకుండంబును, గరకుండంబును, దప్తపాషాణకుండంబును, దీక్ష్ణపాషాణకుండంబును, లాలాకుండంబును, శమికాకుండంబును, జూర్ణకుండంబును, జ్వాలి కుండంబును, వక్రికుండంబును, గూర్మకుండంబును, జ్వాలాకుండంబును, మహాకుండంబును, దప్తసూచియు, నసిపత్రంబును, క్షురధారంబును, నసిముఖంబును, గోకాముఖంబును, నరముఖంబును, గజదంశంబును, గోముఖంబును, గుంభీపాకంబును, గాలసూత్రంబును, మత్స్యోదంబును, మలోదంబును, పాశభేదంబును, పాశవేష్టనంబును, శూలపోత్రంబును, బ్రికంపనంబును, నుల్కాముఖంబును, సంధకూపంబును, వైశసనంబును, దాడనంబును, జాలరంధ్రంబును, దేహచూర్ణంబును, దళనంబును, శోధనంబును, సూర్యజ్వాలాముఖంబును, ధూమాంధంబును, నాగవేష్టనంబును ననునామంబులఁ బాపిక్లేశదంబులై నిరయంబులు ప్రవర్తిల్లుచుండు. ౬౧౧

సీ॥ దండబాణాసిగదాశక్తి హస్తులు మద,మత్తు లతిభీమసమత్సరులును
నతిదయాహీనులు నతికోపనులు నిరా,తంకులు పింగళతామ్రనేత్రు
లతిశతుల్ దుష్టులునగు నట్టి నా భృత్యు, లక్కుండములచుట్టు నాక్రమించి
యాసన్నమృత్యు దుష్టాళికిఁ బాడచూపి, బంధించి వానిలోఁ బడఁగఁ ద్రోచి
తే॥ పాతకము లెంచి బాధించి భంగపఱతు, రట్టి కింకరు లాత్మధర్మాభిరతిని
నిరతులగువారి చెంగట నిలువఁబోరు,నాదుశాసన మటులుండు నళిననయన.

క॥ హరిహర నిష్ఠాయుక్తుల, గురుతత్పరులను వ్రతానుకూలుర వేదాం
త రహస్యవేదులను గాం, చిరయంబునఁ దొలఁగుదురు భజించుచు వారిన్. ౬౧౩

క॥ గ్రామంబులు గృహములు నతి,భీమత దగ్ధములు చేయు పీడాకరులన్
నేమమఱ వహ్నికుండము,లో మంటల నిడుదు రతిబలుల్ మద్భృత్యుల్.

ఆ॥ ఆత్మరోమ మానహాయనంబులు వహ్ని,కుండమున మునింగి కొంత మీఁదఁ
బశువు లగుచు దొనఁగుపాలయి తత్కర్మ, ఫలముఁ గొందు రవలఁ బంకజాక్షి.

గీ॥ దప్పి నాఁకటఁ దపియించి ధరణిసురుఁడు, తనదు నింటికి నరుదేరఁ గని విసీతిఁ
దృప్తుఁజేయని మనుజులఁ దెలిసి తప్త,కుండమునఁ ద్రోచి కూల్తురు దండధరులు.

ఆ॥ అంగరోమ మానహాయనంబులు తప్త,కుండమునను వారు గుదిలకొనుచు
దుఃఖమంది వెడలి తోడన పక్షులై, యడవిఁ దిరుగుచుందు రంబుజాక్షి. ౬౧౭

సీ॥ రవివారమునను సంక్రాంతి నమావాస్య, శ్రాద్ధవాసరముల క్షారకటుక
భక్షణం బొనరించు పాపకర్ముఁడు క్షార,కుండంబులోపలఁ గూలువాఁడు

తద్భక్తి దీరినంతతటను నిర్ణేజక, యోనులం బొడమి దుఃఖానుభూతి
బడలు స్వదత్తమో? ॥ పరదత్తమో? విప్రవృత్తి హరించిన ॥ వెంగలికిని

ఆ॥ బొసంగు విట్కుంభవానత ॥ ద్విజనమ్ము,లబ్దశత మావల ఘటించు ॥ నఖువదియును
వేయువత్సరసంఖ్యచే ॥ విస్మయమగు, గర్తమున క్రిమిపుట్టువు ॥ కలికిమిన్న!

గీ॥ పరకృతతటాకముల నీరు ॥ పాఱఁ దోలియు, వానికిని దత్తకుండస్ ॥ వాస మమరు
నబ్దశతమందు నిలిచి వృ ॥ షాకృతిఁ గొని, భారతంబున వసియించు ॥ బాపి పిదప.

క॥ వాపీకూపంబులు మనిఁ, బాప మనక శ్లేష్మమూత్ర ॥ పంకిలములుగా
నాపాదించిన దుర్మ్తల, కూపంబున నంతమునను ॥ గూలు మృగాక్షీ. ౬౯౦

గీ॥ తల్లిదండ్రుల గురువులఁ ॥ దనదుసుతుల, పోషణము మాను పాపులఁ ॥ బోవనీక
గరళకుండంబులో నైవఁ ॥ గలరు నాదు, కింకరులు తథ్య మిది సుమ్ము ॥ వంకజాక్షి.

ఆ॥ విషము మెసవికొనుచు ॥ విసువక నూఱేండ్లు, నిలిచి పుడమిలోన ॥ నెలవుకొనుచు
భూతయోనిఁ బుట్టి ॥ భూరిదుఃఖంబుల, ననుభవించుచుండు ॥ రబ్జవదన. ౬౯౧

సీ॥ నడునింగిని వసించి ॥ నలినాప్తుఁ డుండెడు, నవసరంబున నింటి ॥ కరుగుదెంచు
నతిథిని గనుఁగొని ॥ యాస్యంబు గికురించు, వానిని గని పితృ ॥ వర్గమెల్ల
జలము గ్రహింపరు ॥ సకలదోషంబులు, వానిన చేరు న ॥ వాచ్యుఁ డాతఁ
డంతకాలమున భృ ॥ త్యాత్మాత మప్పాపిఁ, గోపించు, దూషికా ॥ కుండమునను

తే॥ వేయునూఱేండ్లు నివసించి ॥ విపులభూత, యోని శతవర్షములు నిల్చి ॥ దీనుఁ డగుచుఁ
జచ్చి నిరయంబుఁ జేరుచు ॥ వచ్చిపుడమిఁ, బుట్టుచును రాకపోకల ॥ బొగులు వాఁడు.

గీ॥ దానపాత్రున కిచ్చిన ॥ ద్రవ్యజాత, మొండొకని కిచ్చునెడ వసా ॥ కుండమునను
నదియె మెసవుచుఁ గృకలాస ॥ మౌచుఁ బుడమి, సప్తజన్మల వర్తించు ॥ సరసిజాక్షి!

ఆ॥ పిదప శూద్రుఁడగుచుఁ ॥ బృథుదరిద్రతఁ గుంగి, యల్పజీవి యగుచు ॥ నవనిలోనఁ
జావుపుట్టువులకు ॥ నడలని జీవుఁడై, వచ్చుచుండుఁ బుట్టి ॥ చచ్చుచుండు. ౬౯౨

ఆ॥ అతివ యేని పురుషుఁ ॥ డగు నేని యన్యోన్య, శుక్లపాన మిడిన ॥ క్షుద్రమతులు
శుక్లకుండమునను ॥ జొచ్చి నూఱేఁడులు, వీర్యపాయులగుచు ॥ విసువువారు.

క॥ పదపడి క్రిమియోనులలో, నుదయించుచుఁ జచ్చుచును మ ॥ హోగ్రవ్యథలన్
బొదలుచు సంతాపించుచు, వదలక దుర్గతుల నిలుచు ॥ వాఁ డబ్జాస్యా! ౬౯౩

క॥ గురుఁడగు విప్రుని దుఃఖో,త్కరమునఁ బొదలించి రుధిర ॥ దర్శి యగు నతం
డరయంగ నస్రకుండాం,తరగతుఁడై ధ్వాంతు మగుచు ॥ ధరణి జనించున్.

ఆ॥ కరఁగి కనుల నీరు గార్చెడి భక్తుని, గాంచి మ్రొక్కకున్నఁ గైటభారి
కీర్తనమున హాస్యవర్తియైనను వాని, కఱుకుకుండవాస మని యెఱుంగు. ౯౯

గీ॥ అవలఁజండాలుఁడగుచుఁజన్మాంతరములఁ, జచ్చుచునుబుట్టుచునుదుఃఖజలధిమునుఁగు
కలుగునో! శుద్ధివానికిఁగలుగ దొక్కొ!, దైవవశమునఁ దెలియంగఁదరమె పడఁతి!

ఆ॥ చెలిమికాని యొడలు చెడ దండన మొనర్చు, వాఁడు గాత్రకుండసన్నిధియగుచు
నవలగర్దభంబు నగుచుఁ ద్విజన్మమ్ము, లవులమూట నక్కయగుధరిత్రి. ౨౦౧

ఆ॥ చెవిటివాని నవ్వు చెనఁటికిఁ గూర్మకుం, డాదివాసమొనరు నందు నూఱు
హాయనములు నిల్చి యవలదరిద్రుఁడై, బధిరుఁ డగుచు జన్మపటలిఁగాంచు.

క॥ తనపొట్టకొఱకు జీవుల, హననం బొనరించునట్టి యధముఁడు గోకుం
డ నివాసియగుచు నటహా,యనలక్షం బుండు శునకమౌ బయిజన్మల్. ౨౦-

క॥ తనకూఁతుఁ బెంచి విక్రయ, మొనరించిన యర్థలోభి కొదవుల్ దల్లో
మనికాయాబ్దము లెడపక, యనుభోగ్యము మాంసకుండ మదియ మొసవుచున్.

సీ॥ వాని మత్కింకరుల్ వదలక మర్దించి, తప్తభాండము నెత్తి తార్చి తప్త
రక్తంబు ద్రావించి రాయిడిఁ బెట్టుచు, నరయదుఃఖములలో నెరవుకొల్పఁ
బడపడి భారతవర్షంబులోఁబుట్టి, కన్యామలక్రిమిగా నటించి
యఱువదివేల హాయనములు వ్యాధుఁడై, మూఁట వరాహమై మొనసి సప్త

తే॥ జన్మముల కోడియై మలజలముఁలందుఁ, గప్పయై జలగ యగుచుఁ గాకియగుచు
జన్మజన్మంబులను బుట్టి చచ్చుచుండుఁ, గల్గునో! శుద్ధి వానికిఁ గల్గదొక్కొ.

వ॥ మఱియును వ్రతోపవాస శ్రాద్ధంబుల సంగమంబును, క్షౌరంబును నొనర్చిన శ్వానాదికుండంబుల వీర్యగోమాదిభక్షణం బొనర్చుచుఁ గింకర దండతాడితుం డగు; కేశశోధనం బొనర్పక పార్థివలింగంబు నర్చించినఁ గేశకుండంబున స్వరోమాబ్దంబులు వసించి సప్తజన్మంబులఁ గుక్కుటంబై చరించు. తృణాదుల సర్పరూపంబొనర్చి పరుల భయముకొల్పినవాఁడు దండతాడితుండై సర్పవిడ్భోజియగు. పిదప సర్పంబై పదంపడి నల్పాయుర్మానవుండై సర్పదష్టుండగు. విధిప్రదత్తజీవులగు క్షుద్రజంతువుల మడియంజేయు నాతండు దంశకుండంబున జంతురోమాబ్దంబులు వానిచే భక్షితుండై, యనాహారుండై, యమకింకరులచే దండితుండై, తజ్జంతుజన్మంబులెత్తి మానవుండై దరిద్రుండగు. మధుమక్షికంబులం జంపి తేనియఁ గ్రోలు నాతండు వహ్నికుండంబునం బడి దండతాడితుండై మక్షికజాతిం బుట్టి క్షుదరినరుండగు. అదండ్యుం దండించిన వజ్రదంష్ట్రకుండంబునం బడి తల్లోమమానాబ్దశతంబు లుండి వానిచే భక్షితుండై రోదనంబొనర్చుచు, సూకరయోనిం

బొడమి, సప్తజన్మంబులు వసించి మూఁడుజన్మంబులఁ గాకియై శుద్ధుండగు. ధనలోభంబున బ్రజాదండం బొనర్చిన వృశ్చికకుండంబునంబడి తజ్జాతింబుట్టి సప్తజన్మంబులఁ జండాలుండై శుద్ధుండగు. బ్రాహ్మణుండు శస్త్రంబు ధరించి సంధ్యాహీనుండై హరిహరభక్తివిముఖుండగుచు చరించెనేని స్వలోమాబ్దంబులు శరకుండంబునంబడి శరవిద్ధుండగు. కారాగారంబులం బడద్రోఁచి ప్రజల హింసించు నాతఁడు గాఢాంధంబగు గోళకుండంబునం బడి కీటవిద్ధుండై మ్లేచ్ఛనక్రాదిజననంబుల సప్తజన్మంబుల శుద్ధుండగు. స్వర్ణస్తేయియై దేవతాబ్రాహ్మణద్రవ్యంబు హరించెనేని పంచాననకుండంబునం బడి దండతాడితుండై తన్మలంబు భక్షించుచుఁ ద్రిజన్మంబుల శునకంబై సప్తజన్మంబుల దరిద్రుండై వర్తించుచుండు. ౨౦౬

క॥ వెండియు వసనంబులు భూ,మండలమున నపహరించు । మానవుఁడు దృష
త్కుండములో లోమాబ్దము,లుండుఁ జరణామయమ్ము । నొందుఁ బిదపన్. ౨౦౭

క॥ బంధకియింటన్ గుడిచిన, యంధుఁడు తల్లోమమాన । హాయనములు ని
ర్బంధమునను లాలాకుం,డాంధువునన్ బడి వసించు । నస్మన్నగరీ. ౨౦౮

ఆ॥ అవల నేత్రరోగి । యై శూద్రుఁడయి మ్లేచ్ఛ, జీవి యాయుధోప । జీవి యగుచు
నుండు బ్రాహ్మణుఁ డసి । కుండములోఁ బడు, నాత్మలోమమాన । హాయనములు.

ఆ॥ ఎవ్వఁడేని ద్విజుల । యిండ్లను గుళ్ళను, ధాన్యతల్ప పీఠ । *తాంబులములు
మురిచ్చిలించి భటులు । మొత్తఁ జూర్ణాఖ్య కుం,డంబులో శతాబ్ద । ముండు నబల!

ఆ॥ అవలఁ గోడి మేక । యగుచు జన్మత్రయ, దుఃఖ మనుభవించి । తోడ మనుజుఁ
డగుచుఁ గామపీడ । నల్పాయు వగుచును, వంశహీనుఁడగు ధ్రువంబు లలన! ౨౧౧

క॥ గోవిప్రులయెడఁ గీడులు, గావించిన వక్రకుండ । ఘటితుండై భృ
త్యావళి మొత్తఁగ యుగశత, మావిష్టుం డగుచునుండు । నంభోజాక్షీ. ౨౧౨

ఆ॥ ద్రవ్య మపహరించి । ధరణీసురావళిఁ, గూల్చువాఁడు చక్ర । కుండమునను
నబ్దశతము నిల్చి । యమభృత్య తాడితుం,డగుచుఁ బిదప మనుజుఁ । డై జనించు. ౨౧౩

ఆ॥ తైలకారుఁడగుచు । దారిద్ర్యరోగముల్, పీడ నలుపఁ బుడమిఁ । బెండ్లిలేక
వంశహీనుఁ డగుచు । వక్రాంగుఁడై పోవు, సప్తజన్మములను । సరసిజాక్షి. ౨౧౪

ఆ॥ కచ్ఛపామిషంబు । కడిగొను విప్రుండు, కూర్మకుండమునను । గూలి యబ్ద
శతము కూర్మపీడ । జంకుచు నావలఁ, గూర్మమగుచుఁ బుట్టుఁ । గుతలమునను.

ఆ॥ పిదపఁ బందియగుచు । బిల్లియై నెమలియై, యవనిలో జనుత్రి । యంబునొంది
శుద్ధినొందుఁ గర్మ । శుద్ధి భోగింపక, యూరకేల కలుగు । నుత్పలాక్షి. ౨౧౬

* టిప్పణి॥ ౨౧౦ పద్యమున తాంబులశబ్దము చింత్యము.

క॥ సురవిప్రుల ఘృతతైలము, లరయక ముచ్చిలిన యట్టి యధముఁడు నూతం
డ్లురుతరవీడల యమకిం, కరహతుడై మత్స్యమూషకప్రభవుఁడగున్. ౭౧౭

ఆ॥ గంధతైలపాత్రి గంధాదిచోరత, దేవవిప్రులిండ్లఁ దిరిగెనేని
దగ్ధకుండవహ్నిదగ్ధుఁడై నిజలోమ, మానహాయనములు మసలి పిదప ౭౧౮

వ॥ సప్తజన్మంబులు దుర్గంధదేహియై, జన్మత్రయంబు మృగనాభియై, జన్మసప్తకంబు గండరోగియై పిదప మానవుండై శుద్ధింబొందు. ౭౧౯

క॥ చలమున బలిమిని విప్రుల, నలసట నొందించి భూమి హరియించినవాఁ
డలయుచును దప్తసూచీ, కలుషితకుండమునఁ గూలి కడుదుఃఖించున్. ౭౨౦

వ॥ పిదపఁ దైలద్రోణియందు దగ్ధుండగుచు దప్పికచే నడలు దేహంబుతోఁ గర్మక్షయంబునకు నిరీక్షించుచు సప్తమన్వంతరంబులు నిరాహారవశంబునఁ గేకలేయుచు నా దూతలచేఁ దాడితుండై విట్క్రిమిభక్షణం బొనర్చుచు, షష్టిదశసహస్రవర్షంబులు భూహీనుండై దరిద్రుండై శుచిరూనిం జనించు, ౭౨౧

ఆ॥ కత్తిచేతఁబట్టి కరుణావిహీనత, నర్థకాంక్ష నన్య హతునిఁజేసి
నట్టివాఁడు నిల్చు నసిపత్రవనముల, యావదంద్ర మన్మదంతికమున. ౭౨౨

వ॥ పదంపడి జన్మాంతరంబుల ఖడ్గహతుం డగుచు, నాఁకంట రోదనం బొనర్చుచు, నూఱుజన్మంబులు *మన్థానంబై, యట్టులె సూకరంబై, కుక్కుటంబై, సృగాలంబై వ్యాఘ్రంబై, వృకంబై, మండూకంబై, మహిషంబు నగుచుఁ బిదప శుద్ధింబొందు.

ఆ॥ పల్లెలందునేని పట్టణంబులనేని, చిచ్చుఁబెట్టి జనులఁ జెఱచువార
లతిభయంబుగొల్పు నల క్షురధారంబు, నందు మూఁడుయుగములుందు రబల!

వ॥ తదనంతరంబున సప్తజన్మంబు లమేధ్యభోజులై పదంపడి కపోతనకులజన్మంబులెత్తి యనంతరంబు మానవజన్మంబు నెత్తి యపుడు శుద్ధులగుదురు. ౭౨౪

ఆ॥ ఒరుల వీనులందు నోరులపై నిందలు, గట్టి బోధఁ గొల్పు కపటమతులు
సూచికాముఖంబుఁ జొచ్చి యుగత్రయి, భృత్యతతులవలనఁ బీడగొందు.

వ॥ అనంతరంబు సప్తజన్మంబులు వృశ్చికత్వంబు నంది యట్టులె వజ్రకీటకత్వమ్మునంది భస్మకీటకత్వముగాంచి తప్యమానులై వ్యాధులం బొరసి శుచు లగుచుండ్రు. ౭౨౬

ఆ॥ అంబుజాక్షి! కాపురంబుఁ జేయు గృహస్థులిండ్ల వస్తుసమితి యెద్దియేని
ముచ్చిలించి దేహములు పెంచుకొనువారు, భృత్యతతులచేతఁ బీడఁబడుచు.

* టిప్పణి॥ మన్థానంబు = ఇదియు నొక జంతు ప్రభేద మని వ్యాఖ్యాత.

వ॥ గోకాముఖంబునఁ గొంతకాలంబు వసించి, నిత్యరోగులును దరిద్రులును భార్యాహీనులును, బంధుహీనులును నగుచు మిగులఁ దపియించి పిదప శుచులగుచుండ్రు.

క॥ మొదవులు మేఁకలు గొఱ్ఱెలు, మొదలగువానిన్ హరించు ✻ మూఢులు పీడా
స్పదులై నక్రిముఖంబునఁ, గదలక త్రియుగము వసింతు ✻ కంజదళాక్షీ!

వ॥ మఱియు నావల జన్మంబులఁ బశువు లగుచు వ్యాధులంబడి విశుద్ధిం బొరయుచుండ్రు. ౨౩౧

క॥ తురగంబుల నాగంబుల, నరులన్ బశువులను జంపు ✻ నాశకుఁ డతిభీ
కరమగు గజదంశమునన్, భరముగఁ ద్రియుగంబు నిలుచుఁ ✻ బద్మదళాక్షీ. ౨౩౨

వ॥ మఱియు, నావలఁ ద్రిసప్త జన్మంబులు తురంగంబై యట్టుల గజంబై మ్లేచ్ఛుండై భోగాంతంబున శుద్ధిం బొరయుచుండు. ౨౩౩

క॥ వాపిని జలమానెడుచోఁ, నే పాపాత్ముండు గోవు ✻ నేఁచు నతఁడు దు
ష్ప్రాపక గోముఖమున భృత్యాపారవ్యథల నొంది ✻ యవ్వలఁ దరుణీ. ౨౩౪

వ॥ ఒక్క మన్వంతరంబు తృష్ణాతప్తుండై, మూఁడు జన్మంబుల గోహీనుండై, మహారోగియై, దరిద్రుండై, జన్మసప్తకం బంత్యజాతియై పిదప శుద్ధుం డగుచుండు.

ఉ॥ గోవులఁ జంపి బ్రాహ్మణులఁ ✻ గూలిచి పొందఁగరాని యింతులన్
భావజకేళిఁ గూడి యతి ✻ బాధ లొనర్చి వధూనిహంతయై
పోవు దురాత్ముఁ డంతకుని ✻ పోలునఁ గింకరపీడితాంగుఁడై
వావిరిఁ గుంభపాకమున ✻ వాస మొనర్చుచు యావదింద్రమున్. ౨౩౫

వ॥ మఱియును, మదీయభటులచేఁ దాడితుండై, వహ్నితప్తుండై, కంటకతప్త, తైలతప్త, తోయతప్త, లోహతప్త, తామ్రాది నిరయంబులఁ బెక్కుకాలంబు పీడితుండై జన్మసహస్రంబుల గృధ్రంబై, శతజన్మంబుల సూకరంబై, సప్తజన్మంబులఁ గాకంబై, షష్టి సహస్రవర్షంబుల మలభక్షకక్రిమియై పిదప వృషలుండును, గుష్ఠరోగియు, దరిద్రుండును నగుచు నవ్వల శుద్ధిం బొరయుచుండు నని తెల్పిన సమవర్తికి దండప్రణామంబు లాచరించి సావిత్రి యిట్లనియె. ౨౩౬

సీ॥ పొందరాని వెలంది ✻ పొలఁతుల నెట్టిది?, యెవ్వండు సంధ్యావిహీన జనుఁడు
ఈక్షితిలోన నదీక్షితుం డెవ్వఁడు, ధనచోరుఁ డెవ్వండు? ✻ ధరణిలోన
గ్రామయాజిత్వంబు ✻ గలుగు విప్రుం డెవ్వఁ, డెవ్వండు దేవలుం ✻ డెఱిఁగికొనఁగ
శూద్రజనాళికి ✻ సూపకారుం డెవ్వఁ, డెవ్వండు భార్యతో ✻ నెనయువాఁడు?

ఆ॥ వీరిలక్షణములు ✻ వివరించి తెలుపవే!, వేదవిద్వరిష్ఠ! ✻ విమలచరిత!
యనిన ధర్మరాజు ✻ హరిమధ్యతో నిట్టు, లనుచుఁ జెప్పఁదొడఁగె ✻ నమరమాని!

క॥ నీ వొనరించిన ప్రశ్నల, కావల సుత్తరము లిత్తు నవధానముతో
భావిదిత ధర్మసంగతు,లే వివరించెద నెఱుంగు మెంతయుఁ బ్రీతిన్. ౨౩౯

క॥ హరిపూజల హరపూజల, హరిహర మృన్మయములైన యర్చలను విభా
కరునెడఁ దన్మణియందును, గరివదన తదర్చలందుఁ గమలదళాక్షీ. ౨౪౦

గీ॥ బుద్ధిభేదం బొనర్చిన భూసురునకు, బ్రహ్మహత్య లభించు విప్రజన శ్రుతుల
స్వగురు దేవుల యెడలను స్వపితృ మాతృ, యుగళియందును నట్లెనియొదవు హత్య.

గీ॥ శైవ వైష్ణవ బ్రాహ్మణజనములందు, భావభేదం బొనర్చుట బ్రహ్మహత్య
ద్విజచరణ తీర్థజలముల దేవతీర్థ, జలములందున భేదంబు దలఁప నటులె.

సీ॥ విప్రనైవేద్యంబు విష్ణు నైవేద్యంబు, భావభిన్నము లన్న బ్రహ్మహత్య
సర్వేశ్వరుండును సర్వకారణమును, నగు కృష్ణునకును మాయకును జగతి
భావభేదము సేయ బ్రహ్మహత్య ప్రసంగుఁ, బితృ దేవ తార్చావిభేదనంబు
నరయకున్నను బ్రహ్మహత్య హృషీకేశుఁ, దన్మంత్రజాపకు దరియు నెడల

తే॥ భావభేదంబుఁ జేసిన బ్రహ్మహత్య, సచ్చిదానందమూర్తియు సర్వసేవ్యుఁ
డైన శ్రీకృష్ణు నద్దేవు నాకృతియగు, సర్వజనయిత్రిఁ బ్రీతిని సమత గనుము.

ఆ॥ ఎవ్వరేని దనకు హితముఁ జెప్పఁగ వారి, నపహసించెనేని యట్టివాఁడు
బ్రహ్మహంత యనుచుఁ బల్కు వేదంబులు, మునుల మతము లిట్లు దనరు వింటె.

సీ॥ కృష్ణ జన్మాష్టమి శ్రీరామనవమియు, శివరాత్రి యేకాదశీవ్రతంబు
లివి వ్రతశ్రేష్ఠంబు లిందెవ్వఁడేనియు, వ్రతము సల్పకయున్న బ్రహ్మహత్య
పావనమైన కూపంబుల జలములు, పంకిలంబులు సేయ బ్రహ్మహత్య
తల్లిదండ్రులఁ బ్రీతి నెల్లవిధంబులఁ, బాలింపకున్నను బ్రహ్మహత్య

తే॥ పరిణయంబుల విఘ్నసంపాదనములు, ధారుణీసురగోదండ తాడనమ్ము
నెద్దునెక్కుట మొదలుగా నిట్టిచేఁత, లవనిసురులకు బ్రహ్మహత్యాసమములు.

క॥ గోవుల కిడు టుచ్ఛిష్టము, గోవాహులయిుట కుడుపు గోమర్దనముల్
గోవాహుపంక్తిఁ గుడుచుట, గోవధతుల్యంబు లగును గోమలి వినుమా. ౨౪౮

క॥ వృషలీపతితోఁ గుడుచుట, వృషలీపతి కధ్వరంపుఁ బిలుపు సలుపుటల్
వృషలుఁడు తానగుటయె గో,వృషశతహతిదురిత మావహించుటయె సుమీ.

వ॥ మఱియును పావకున కభిముఖంబుగాఁ బాదంబుఁ జాచుటయు, స్నానంబొనర్చి మరలఁ బాదప్రక్షాళనం బొనర్పక దేవగృహంబుఁ జొచ్చుటయు, సూర్యోదయ సూర్యాస్తమయ సమయంబుల భుజించుటయుఁ, దడికాళ్ళతోఁ గుడుచుటయు

నిద్రించుటయు, గోహత్యాసమంబులు, విప్రశూద్రు లన్యోన్య జాతిభేదంబులఁ దత్కాంతలం గవయుట వలనఁ జండాలుర కన్న నధము లగుదురు. వాండ్రొనర్చు తర్పణంబు మూత్రతుల్యంబు, జన్మాంతరంబుల విడ్భోజులై వర్షసహస్రంబులు విసివి యపుడు చండాలత్వముం గాంచి వర్తించుచుందురు. ౨౪౮

సీ॥ గురుని యిల్లాలును - గుంభినీపతిబోటి, శ్వశురుని పూఁబోఁడి - జనని సవతి
కూఁతురు చెల్లెలు - కొడుకు ముద్దులగుమ్మ, తమ్ముని వాల్గంటి - తనకు మేన
మామపెండ్లామును - మాతృసోదరులును, తనతండ్రి భగినులు - తనకుఁ బొందఁ
దగనివారలు వారిఁ - దగదు భోగింపంగ, నిది బ్రహ్మహత్యయం - చెఱుఁగవలయు

ఆ॥ వానిఁబట్టి కుంభ - పాకంబులోపల, దండధరుని భృత్య - తండ మెల్ల
దండతాడనముల - దండించి యుద్దండ, యాతనముల పాలు - సేతు రబల. ౨౪౯

ఆ॥ శుద్ధిగలిగియున్న - శుద్ధిలేకున్నను, మూఁడు వేళలందు - మూఁడుసంధ్య
లర్ఘ్యయుక్తముగ ను - పాసించి గాయత్రి, నెదఁ దలంచి భువి జ - పింపవలయు. ౨౫౦

ఆ॥ ఇట్లొనర్పకున్న - నితఁడు సంధ్యావిహీనుండు వీనిఁబట్టి - దండధరుని
భృత్యసమితి నిరయ - పీడల పాల్సేతు, రవల హీనకులము - నందుఁ బుట్టు. ౨౫౧

సీ॥ శైవవైష్ణవశాక్త - సౌరగాణాపత్య, మతములలోన నే - మతమునైన
నవలంబన మొనర్చు - నాగమపద్ధతి, తెలిసికై కొనమి న - దీక్షితుండు
ముదిత! ప్రభాసంబు - మొదలుగ బ్రహ్మాచ, తుష్టయావధిగాఁగ - దురితదూర
గంగచెంగట నిల్చు - కైటభారాతి శ్రీ, హరిపదంబదియె నా - రాయణాఖ్య

తే॥ నలరుక్షేత్రంబు తత్తట - మందు నెవ్వఁ, డేని మృతిఁబొందు నాతం డ - హీంద్రతల్పు
నంతికంబున వసియించు - నతనిచెంత, జేరదు మదీయభటులు మ - చ్ఛిక్షవలన.

శా॥ గంగాసాగరసంగమస్థలములన్ - గాశీప్రయాగంబులన్
రంగత్పుష్కరతీర్థరాజమున దీ - పింప బ్రభాసంబునం
దంగత్యాగ మొనర్చు నాతఁడు మహా - ర్హంబైన యానంబునన్
నింగిన్ బొంగి విహారముల్ సలుపుచున్ - నిర్వాణముం జెందెడున్. ౨౫౩

వ॥ ఆ యా పుణ్యక్షేత్రమ్ముల నెవ్వఁడు దానంబు పరిగ్రహించు నవ్వాఁడు తీర్థప్రతిగ్రాహి యనంబడు వాఁడు కుంభీపాకంబునం గూలునని వెండియు. ౨౫౪

క॥ వైశ్యుఁడు వృషలిన్ వృషలుఁడు, వైశ్యన్ రమియించెనేని - వా రిరువురు న
ద్వ్యశ్యతఁ గషాయకుండ మ, వశ్యముఁ జొచ్చెదరు కల్ప - పర్యంతముగన్. ౨౫౫

వ॥ మఱియు శతాబ్దంబు లచ్చోట నిలిచి, క్షుద్రయోనులం బొడమి మూత్రపాయులును మలభక్షకులును నై చచ్చుచుం బుట్టుచు, నిరయవేదనం బొరలుచు, జన్మసప్తకంబున వరాహంబులై పదంపడి శుచు లగుచుందురు. ౨౫౬

ఆ॥ పాణియందుఁ దులసిఁ బట్టి బాస యొనర్చి, సలుపఁడేని వాఁడు జ్వలనముఖము
నందుఁ గూలునటుల హస్తంబులో హస్త, మిడి తొలంగువాని కెనయుఁ జుమ్ము.

క॥ సురముని ధరణీసురలకు, గరమునఁ దా ముట్టి బాసఁ గట్టుపడమి దు
ర్భరవహ్నికుండ వాస, స్థిరుఁడగు స్వీయాఘమున కిరసీ! యని కనుమీ. ౨౫౯

క॥ గోఘ్నుఁడు మిత్రద్రోహి కృతఘ్నుండును గూటసాక్షి ధరణిని విశ్వా
సఘ్నుఁడు నట్లగుదురు వృత్రఘ్నులు పదునలుగు రుండురదనుక మృగాక్షీ.

వ॥ మఱియుఁ దులసీస్పర్శనార్చనలం దప్పినవాఁడు చండాలుండై పదంపడి శుచి
యగు, హస్తస్పృష్టయు, విప్రస్పృష్టయు, గోస్పృష్టయు, సప్తజన్మంబులు సర్ప
వృశ్చికంబులై, మూఁడుజన్మంబులు బధిరులును మూకులునై భార్యాబంధు
వంశహీనులై పిదప మ్రుచ్చులగుదురు. మిత్రద్రోహి నకులంబగుఁ, గృతఘ్నుండు
గండకంబగు, విశ్వాసఘాతివ్యాఘ్రంబగు,మిథ్యాసాక్షి మండూకంబగు,మఱియును
బూర్వసప్తకంబును నధోలోకంబునం బడఁద్రోయ దుర్గతిం బొరయుచుండు. ౨౬౦

సీ॥ నిత్యకర్మంబులు నేలపా లొనరించి, నిగమవాక్యంబుల నిందగొల్పి
సతతవ్రతోపవాసంబులు పోఁద్రోలి, పరనిందకుండగుఁ బామసుండు
జ్వలనకుండంబున శతవత్సరంబులు, నివసించి యవ్వల నీటిలోన
జంతుజన్మము లొంది శతజన్మియై*మూఢ,మూర్ఖజన్మములొందిరముదిత! యవల

ఆ॥ శుద్ధి నొందు భూమి సురలను గురులను, నవహసించి యర్థ మపహరించు
వాఁడు పితృశతంబు వసుమతిఁ బడఁద్రోచి, ధూమ్రకుండమునను దొలఁగకుండు.

వ॥ మఱియు ధూమాంధుండును, ధూమపాయియు నగుచు, నష్టావింశతి సహస్ర
వర్షంబులు నిరయంబున వసించి, మూషకంబై శతజన్మంబులు గడపి, పిదపఁ
బక్షిజాతంబులఁ గ్రిమిజాతంబుల నుద్భవించి శుచి యగుచుండు. ౨౬౨

శా॥ దైవజ్ఞుండును వైద్యజీవియుఁ జికిత్సాదత్తుఁడున్ లోహలా
క్షావిక్రేత రసక్రియుండు నయి యిచ్చన్ ధాత్రి వర్తించు దు
ర్భావుం డారయ నాగవేష్టమున దుఃఖాబ్ధిన్ బడున్ నాగదం
శావిర్భూత మహావ్యథన్ నిజతనువ్యాలంబిరోమాబ్దముల్. ౨౬౩

వ॥ పిదపఁ బక్షిజాతులం బొడమి నవయుచుండు. ౨౬౪

---

*టిప్పణి: ఈగ్రంథకర్త మూఢ మూర్ఖశబ్దములు భిన్నార్థకములుగాఁ జాలచోట్ల ప్రయోగించెను. కొన్ని సవరించితిని, ఇట నట్లేయుంచితిని, దుఃఖశోకాదులవలె నివియును సాధ్యములని తోఁచెడిని.
శ్లో॥ మూఢో మూర్ఖో ... అని యభియుక్తి కలదు.

గీ॥ ఇట్టి పాపం బొనర్చిన యట్టివారి, కగు ప్రసిద్ధంబులైన కుండాంతరములు
కొన్ని తెలిపితిఁ జేతనుల్ ఘోరకర్మ, వశత భుజియింతు రీవెతవారిజాక్షి. ౭౬౫

క॥ నా విని సంతసమందుచు, సావిత్రీదేవి శమనుచరణంబులకున్
వేవేగ మ్రొక్కి యిట్లను, దేవా! నేఁ బ్రశ్నఁ జేతుఁ దెలుపఁగ వలయున్. ౭౬౬

ఆ॥ సర్వసమ్మతంబు సర్వసారంబును, సర్వకర్మహరణసంగ్రహంబు
సర్వమంగళంబు సర్వప్రదంబును, నైన కర్మ మెద్ది? యఖిలమునను. ౭౬౭

శా॥ ఏ కర్మం బొనరించి మానవులు తా రీక్షించ రీ కుండముల్
స్తోకంబైనను దుఃఖమున్ బొరయ రెంతో వేడుకల్ గందు రే
లోకంబందున జన్మమున్ గొనక యాలోకింతు రా వైక్యదీ
ప్తాకల్పంబగు ముక్తి నట్టి తెఱఁగున్ స్వామీ! వచింపంగదే! ౭౬౮

సీ॥ అచ్చోటి కుండాళి యాకృతు లెట్టివో, తద్భోక్తలైన చేతనుల కెల్ల
దేహము భస్మసాత్కృతి నొంద నచ్చోట, నే దేహముల నిల్తు రెట్లు వారి
తనువులు వెతలచేఁ దఱుగకుండు గణింప, దురవగాహంబయి తోఁచె నిదియు
నిట్టి సందేహంబు నెడ సేయు మన విని మందహాసముఖారవిందుఁ డగుచుఁ

తే॥ గమలమిత్రతనూజుఁ డా కాంతతోడ, భావ మిగురింప శ్రీకృష్ణదేవుఁ దలఁచి
పలుకఁగ నుపక్రమించె బాపఘ్నమైన, పావనోదంత మప్పుడు పరమనియతి.

క॥ నానావేదంబులలో, నానాధర్మవిధులందు నానాస్మృతులన్
నానాపురాణములలో, నానావేదాంగముల సనాతన మగుచున్. ౭౭౦

శా॥ సర్వాద్యంబును సారభూతమును సాక్షాన్మంగళం బాగమా
ఖర్వం బాద్యము జన్మమృత్యుహరమున్ సంతాపనాశంబు సం
తర్వాణీడిత మేకసేవ్యము జగత్సంతారకం బాత్మకున్
నిర్వాణైకఫలప్రదంబు నగు నెంతేఁ గృష్ణనామం బిలన్. ౭౭౧

వ॥ మఱియుఁ గృష్ణనామసంసేవనంబు జన్మమృత్యు జరావ్యాధిసంతాపనాశకం
బును, నరకార్ణవోత్తారకంబును, సాలోక్యసారూప్యాదిముక్తిప్రదంబును కర్మ
వృక్షనిరాసకంబును, భక్తివృక్షాంకురకారకంబును, గావున శ్రీకృష్ణభక్తులు
నరకకుండంబులను స్వప్నంబులనైనం గనుంగొనరు. అయ్యవి సర్వథా హరి
భక్తివిహీనులకు నుపభోగ్యంబులు; హరిపదతీర్థంబును, హరివాసరవ్రతం
బును, నిత్యవ్రతంబు లగు వారలకు నిర్వాణం బన వేఱ కలుగునే? వారలు
సర్వదా ముక్తిభాజనులు కృష్ణోపాసకులం గని గరుడుం గాంచిన యురగంబుల
పోలిక యమకింకరులు తొలంగుదురు. హరిభక్తులకు మధుపర్కాదికం బొసంగిన

ధన్యులు బ్రహ్మలోకాతీతంబగు పరమపదంబు గందురు. ప్రజ్వలద్వహ్నికీలలం
బడు శుష్కతృణంబుల పోలికఁ గామక్రోధాదులు వారలయెడ నశించునని
చెప్పి దేహవివరణంబు చేసెద వినుమని యిట్లనియె. ౨౨౩

సీ॥ సృష్టికాలమునందు - చేతనావళులకు, భూతపంచకము సంభూతి నెలవు
అందు జీవుఁడు శమనాంతికంబునఁ జేయు, శస్త్రాస్త్ర బాధల - సంకటములఁ
దప్తదర్వంబులఁ - దప్తలోహంబులఁ, దప్తపాషాణాదిదండనముల
దగ్ధుఁడై భగ్నుఁడై - తా రూపు చెడకుండుఁ, బరితాప మేవేళఁ - బాయకుండు
తే॥ దేహవృత్తాంత మిట్టిది - తెలియ! వినుము, ప్రాగ్భవాధీనకర్మసంప్రాప్తివలనఁ
గష్టభోగోపభోగియై - కాల మిట్లు, గడపి శుచియాచు జన్మసంకటములొందు.

ఉ॥ చేసిన కర్మసంచయము - చేతనపాళికి నించుకేనియున్
వీసరపోదు సర్వమును - విస్తృతభోగము నందఁజేయు నీ
శాసన మేనొనర్తు విధిసమ్మతి నింకిటఁ గుండసంచయ
వ్యాసము లేర్పరింతు విను - మబ్జదళాక్షి! మదీయవాక్యముల్. ౨౨౪

సీ॥ పూర్ణేందుమండలస్ఫూర్తంబు తప్తకుండంబు వర్తులము దీర్ఘంబు దూత
పాలితం బీశ్వరపరినిర్మితము దుఃఖదంబు నాకల్పకస్థాయి యగుచు
శతహస్తమానంబు - జ్వలదగ్నిసదృశంబు, క్రోశదీర్ఘంబునై - ఘోరశబ్ద
ఘూర్ణితంబై యుండుఁ - గూలిన నరులకు, నార్తరవంబున - ననవరతము
తే॥ భువనభయదంబు నగుచు నెప్పుడు మదీయ, కింకరాక్రాంతమై నిరాతంకశాస
నమునఁ జెలువొందు సంతతోన్మథనదురిత, హరణభీషణశోషణవ్యాప్త మగుచు.

సీ॥ క్రోశపరిమాణమై - ఘోరమై శతహస్త, దీర్ఘమై విషవహ్నిదిగ్ధ మగుచు
శుష్కకంఠోష్ఠులై - సోలి యాఁకటఁ గ్రుస్సి, మత్కింకరవ్రాతమర్దితులయి
పాహిపాహి యటంచుఁ - బ్రలపించు జీవుల, యార్తనాదములు మిన్నులమిన్నఁగ
నత్యంతదుర్గంధమయి భీషణంబయి, యొప్పు నచ్చోటఁ దప్తోదకంబు
తే॥ మఱియు గవ్యూతిమాత్రమై మద్భటాళి, మర్దనమొనర్ప జీవులు - మార్గముల
రక్షరక్ష యటంచు నార్తస్వనంబు, సేయనగు మూత్రకుండంబుఁ - జెప్పఁదరమె.

మ॥ క్రిమిపూర్ణంబయి శ్లేష్మకుండము భయార్తిన్ వజ్రదంష్ట్రాహిత
ర్గమువంతక్షతు లొంది నోళ్ళురవ ఘోరధ్వానముల్ సేయుచున్
దెమలన్ రాని మహాభయంబుల నిరస్తిభూతులై నిచ్చలున్
శ్రమచేఁ బీడితులౌదు రన్నరయ మత్ప్రం బొచు నొప్పారెడిన్. ౨౨౫

గీ॥ శుక్లకుండంబు భీషణాశుక్లకీట, సంయుతము క్రోశమాత్రమస్మద్భబాహు
పాలితంబు వనాపారభరిత మగుచు, నారకుల కెల్ల భోగ్యమై - నలువుమీఱు. ౨౨౬

---

టిప్పణి: [illegible]

గీ॥ రక్తకుండంబు క్రోశమాత్రంబు పూతి,గంధయుతము గభీరంబు రక్కసులగు
మద్భటుల సందడుల నసంభావ్యమగుచు, నారకుల కార్తి గొలుపు ననారతంబు.

గీ॥ అశ్రుకుండంబు కన్నీళ్ల నలమికొనుచు, భృత్యతాడితచేతనాభీలమగుచు
నొగిఁ జతుష్క్రోశమాత్రమై యొప్పునరక, వాసిజనములు మొఱవెట్ట వనజనయన

వ॥ మఱియు, మజ్జాకుండంబు దుర్గంధసంయుతంబై చతుష్క్రోశమానం బగు నిందుఁ గన్యావిక్రేతలు మద్దూతతాడితులై పాహిపాహీతిశబ్దంబుల మొఱలు వెట్టుచు వర్తింతురు. అట్టులె తామ్రకుండంబును దత్ప్రమాణంబై దూతభయంకరంబై, చేతనభీషణం బగుచుండు; నందుఁ దామ్రప్రతిమలు లక్షలకొలఁది ప్రతప్తంబులై తదాలింగనంబుల భూతవ్రాతంబుల హింసించుచుండు; లోహకుండంబు గవ్యూతిమాత్రంబై యట్టులె యుండు. తప్తలోహకుండంబు ప్రజ్వలితలోహప్రతిమాలింగనంబులఁ జేతనులం బేర్చుచు, ద్విగవ్యూతి ప్రమాణంబై, హాహారవపూరితం బగుచుండుఁ, దన్నామంబునన చర్మకుండ, సురాకుండంబులు చేతన వ్రాతభీకరంబులై మద్భృత్యరక్షితంబులై వర్తించుచుండు. శాల్మలీకుండంబు కంటకాక్రాంతంబై క్రోశమానంబునఁ జేతనభీతిప్రదంబై జలం దేహీతి శబ్దంబుల శుష్కకంఠులు మొఱలు వెట్ట దారుణంబై యుండు. తైలకుండంబు క్రోశమానంబై కాకస్వరంబుల భూతంబులు మొఱలు వెట్ట భయదంబై యుండు. శూలకుండంబును జతుష్క్రోశప్రమాణంబై శస్త్రవేష్టితంబగు; సర్పకుండంబు తీక్ష్ణసర్పపీడితు లగు చేతనులు మొఱ లిడఁ జతుష్క్రోశప్రమాణంబై వర్తించు. మశక, వృశ్చిక, వజ్రకుండంబులు తత్తత్ప్రమాణంబులై తజ్జంతుదంశితు లగు చేతనుల హాహాకారంబుల నిండి యుండు. గోళకుండంబు రక్తపూరితంబై, తమోమయంబై, కీటకసంకులంబై, వాప్యర్ధప్రమాణంబున వర్తించు, దుర్గంధపూరితంబై యూపకుండంబు క్రోశార్ధంబై వర్తించు. పంచాస్యనక్రకుండంబులు తద్భక్షితచేతనవికృతంబులై క్రోశార్ధమానంబున భయదంబు లగు; శ్వానకుండమ్మును జతుశ్శతహస్తమానంబగు, ధ్వాంతమయంబగు; ప్రస్తరకుండంబు జ్వలదంగారసదృశంబై క్రోశమాత్రం బగు; తప్తతోయకుండంబు ధనుశ్శతమానంబై చేతనపీడాకరం బగు; చూర్ణకుండంబు క్రోశమానంబై మద్భటసంవృతంబగు; లాలాకుండంబు షోడశారంబై శతహస్తమానం బగు; వక్రకుండంబు ద్విగవ్యూతి ప్రమాణంబై యుండు, రంధనాకుండంబును, కచ్ఛపకుండంబును, బహుకచ్ఛపాక్రాంతంబై క్రోశప్రమాణంబగు; భస్మకుండంబు క్రోశమానంబై తప్తపాషాణలోహభరితంబగు; జ్వాలాకుండంబు చతుష్క్రోశమానంబు; ప్రతప్తమూర్తికుండంబు రక్తపూర్ణంబై క్రోశార్ధమానంబగు; అసిపత్రంబు చతుశ్శతమానంబు, క్షురధారంబు నట్టుల సూచీముఖంబు పంచాశద్ధనురాయామంబు; గోకూటకుండంబు గోముఖాకారంబై మేదఃపూరితంబగు; కూపకుండంబు ధనుష్షోడశ

మానంబున నక్రిముఖంబై యుండు, గజదంశంబు ధనుర్వింశతిమానంబు; కాలచక్రంబు గిరగిరం దిరుగుచుఁ గుంభాకారంబును జతుర్హస్తోశ్రమానంబును నగు; గభీరకుండంబు లక్షపురుషమానంబై యుండు; కుంభీపాకంబు సర్వకుండప్రధానంబై యావత్కుండగతులగు చేతనులకుఁ జతుర్గుణం బగు యాతనచే భూతసంఘంబు ఘూర్ణిల్లఁజేయుచుండు; కాలసూత్రంబు చతుర్వింశతిధనుఃప్రమాణంబుననుండు; రవకుండంబు చతుర్వింశతిహస్తప్రమాణంబై తప్తధూళిపూరితంబై వర్తించుచుండు. ౭౮౧

ఆ॥ పాశవేష్టనంబు పాతమాత్రింబునఁ, బాపిజనుల శూలపాతనములఁ
గూలఁద్రోయుచుండుఁ గ్రోశమాత్రిం బది, శూలకుండమట్లు గ్రాలుచుండు.

గీ॥ అట్టులఁ బ్రకంపనం బను నట్టి కుండ, మలరుఁ గ్రోశార్ధమై కింకరాళి మెలఁగ
వింశతిధనుఃపరిమాణమై వెలయు నదియె, వృశ్చికాక్రాంతమై భూతవితతి నొంచు.

గీ॥ లక్షపురుషపరిమాణమై యాక్షణంబ, పాపులను వేల్చుచుండునుభయదమగుచు
నది ధనుశ్శతమానమై యంధకార, కుండ మన నొప్పు చేతనఘోర మగుచు.

గీ॥ అంధకూపంబు ధ్వాంతమయంబు నగుచు, భయదశస్త్రాస్త్రపాణులౌ భటులవలన
బాధనొందుచుఁ జేతనపాళి నొగులు, నది ధనుశ్శతమాత్రమై నలరు నవల.

గీ॥ జాలరంధ్రంబు నారకజనులఁ జూర్ణ, దేహులుగఁ జేసి పీడించుఁ దెమలనీదు
అది ధనుర్వింశతిపరిమాణ మబ్జనయన!, దండధరదండనోద్దండదారితంబు.

గీ॥ దళన మనుకుండ మతిశయధ్వాంతగహన, మదిధనుర్వింశతిపరిమాణమందుఁ బాపు
లస్మదీయభృత్యులచేతనధికబాధఁ, బొలియుదురు మూర్ఛలమునింగిపొగిలిపడుచు.

గీ॥ వాలుకాకుండమున భూతజాల మెల్ల, శుష్కకంఠత నొగులుచుసోలుచుండు
నదియు ముప్పదిధనువులం దస్మదీయ, భటుల కోలాహలమ్ము లపారములగు.

క॥ శతపౌరుషమానంబై, వితతధ్వాంతమ్ము భృత్యవేష్టితమై సం
తతము జలాహారం బను, నతులితకుండంబు యాతనాన్వితమమరున్. ౭౮౯

క॥ ఘనశూర్పాకారముఖం, బనుకుండము దుఃఖభయదమై భూతతతిన్
బెనుభీతినొందఁజేయును, ధనువులు పదిరెంటిపొడవు తద్వితతి యరయన్. ౭౯౦

క॥ జ్వాలాకుండం బనల, జ్వాలాభీలంబు భూతసాధ్వసకరమై
గ్రాలు ధనుర్వింశతి పరి, శీలితమగు పొడవు గలిగి శిక్షాస్పదమై. ౭౯౧

---

షరా:—ఆ యీ భాగము మూలములో నున్నను సంగ్రహించినచో సమంజసముగా నుండెడిది. సప్తమస్కంధములో రసవంతమగు భాగము, మూలములో నున్నది, హరిశ్చంద్ర చరిత్రఁ జెప్పుచుఁ జెప్పుచుఁ జట్టనఁ దేల్చి ముగించుటకును, ఆ యీ నీరసభాగము 'తు, చ' తప్పకుండ ననువదించుటకును [illegible] కవిత్వ కవ కారణములేదు. శం॥ కా॥

వ॥ మఱియును దప్తేష్టికంబును, దప్తంబును, ధూమ్రింబును, శ్వానబంధంబును నాగపూర్ణంబును మొదలగు కొన్ని కుండంబులు, ధనుశ్శతమానంబులై పాప భర్జనం బొనర్చుచు జీవుల శుద్ధులం జేయునని తెలిపిన సావిత్రి యిట్లనియె.

సీ॥ సారంబులగు నెల్ల x సారంబు నిర్వృతి, ద్వారంబు నరకాబ్ధిx తారకంబు
రంజనం బఖిలాఘx భంజనంబగు శక్తి, పాదాబ్జభక్తిఁ జొప్పడిచి నన్నుఁ
దరియింపఁ జేయుము x ధర్మమూర్తివి నీవు, ముక్తినా నెట్టిదో x ముక్తిలక్ష
ణంబు లవెట్టివో! x నాకు నబలకు న,జ్ఞానకుఁ గరుణించి x స్వాంత మెక్కఁ

ఆ॥ దెలుపవలయు దాన x తీర్థ యజ్ఞస్నాన, జపతపోవ్రతములు x జగదధీశ
చరణసేవవలన x సంసిద్ధికరములై, ముక్తిగలుగు విశదx ముగ వచింప. ౭౯౩

ఆ॥ శతగుణంబు లెచ్చు x జనకుని కన్నను, జనని యంతకన్న x శతగుణములు
జ్ఞానదాత హెచ్చు x గాన సద్గురుఁడవు, వేడుకొంటిఁ దెలుపx వే! మహాత్మ.

ఆ॥ అనిన శమనుఁ డిట్టులx లనియె నో సావిత్రి, నీదు కోర్కె దీర్తు x నెమ్మనంబు
శైశవమ్మునందx సద్గోష్ఠి మరగుట, పూర్వజన్మపుణ్యx ము సుమి సాధ్వి. ౭౯౫

సీ॥ ఏను మొగంబుల x యిందుశేఖరుఁడైన, దైత్యమర్దని నెన్న x దక్షుఁ డగునె?
నాల్గుమోములు గల్గు x నలినసంభవుఁడైన, నంబిక వర్ణింప x నర్హుఁ డగునె?
ఆఱుమోములు గల్గు x నార్యాసుతుండైన, శక్తి సన్నుతిఁ జేయఁ x జతురుఁ డగునె?
వేనోళ్లు గలిగిన x విషధరాధిపుఁడైన, శ్రీదేవిచరిత వర్ణింపఁ గలఁడె!

గీ॥ గణపతిప్రముఖావళి x గణుతి సేయు, నేటి కాగమశాస్త్ర ధx ర్మేతిహాస
శతములైనను దద్గుణాంx శంబులోన, షోడశకళాంశసాదృశ్యx సూక్తి కగునె.

గీ॥ భారతియుఁ దద్గుణస్తుతి x బడలుననఁగ, సనకధర్మసనందనx సవితృకపిల
ముఖులఁ జెప్పంగనేల? యx మోఘశక్తి, దేవదేవీమహత్త్వంబుx దెలియవశమె.

క॥ యోగులు మునులును సిద్ధులు, శ్రీగౌరిం బొగడఁగలరె! x చేతోఽతీతం
బాగమకారణ మజముఖు, లా గిరిజాభక్తు లనుట x యబ్బురమగునే. ౭౯౮

ఆ॥ రాసమండలమున x రాజీవనేత్రుని, వలనఁ గొనిన బోధ x వత్సలుఁడయి
యఱ్ఱుఁ డొసఁగె నాకు x నతనిచే వింటి నే,నది యెఱుంగఁ జేతు x నతివ! వినుము.

క॥ గగనము స్వాంతం బెఱుఁగని, పగిది దనపాడవుఁ దెలియఁ x బరశక్తియుఁ దా
నగుణయయి చాల దన్నను, భగవతిఁ దెలియంగ నొరుల x పాలమె సాధ్వీ! ౮౦౦

సీ॥ సర్వాత్మ సర్వంబు x సర్వేశ్వరుండును, సర్వపాలకుఁడును x సర్వకర్త
సర్వకారణమును x సర్వసాక్షియు సర్వ,పూజ్యుండు సర్వసంx పూర్ణుఁ డరయ

నిత్యానిత్యానంద । నిరుపమ నిర్లిప్త, నిర్గుణ నిశ్శంక । నిత్యరూప
నిర్విరోధ నిరాఖ్య । నిర్గతాశ్రయుఁడును, బరులకెల్లను దానె । పరతరుండు

గీ॥ ప్రాకృతోత్పత్తి హేతువు ప్రకృతి తనదు, రూపు పురుషుండు గనఁ దన రూపమయ్యెఁ
బ్రకృతిపురుషులకన్నను । బరతఁ గనియు, భక్తుల ననుగ్రహింపంగ । వ్యక్తుఁడయ్యె.

సీ॥ రమణీయమును సుందరమును మనోహరమును, నీరదశ్యామంబు । నిర్మలంబు
కందర్పకోటిసంకాశంబు శరదబ్జ, లోచనంబు భవౌఘమోచనంబు
గోపకిశోరంబు । కోటీందుశోభాప్ర, భాననం బాపద్విధూననంబు
హాసోజ్జ్వలంబు పీతాంబరంబు చిరత్న, రత్నభూషితము పూర్ణంబు బ్రహ్మ

గీ॥ తేజము పరాత్పరంబును । ద్విభుజమత్స్య, వైజయంతీయుతంబును । వరసుగంధ
చర్చితము మాలతీమాల్యసంయుతంబు, నగుచుఁ జెలువొందు రాధేశు సంగమబల.

క॥ భక్తిపరిప్లుతగాత్రులు, భక్తులు భజియింతు రెపుడుఁ । బరమపురుషుఁ ద
త్సూక్తిని బ్రహ్మాదులు సు, వ్యక్తముగాఁ గార్యసరణి । వర్తింతు రొగిన్. ౮౦౩

సీ॥ ఎవ్వనియాజ్ఞచే । నెల్లజీవులకును, గర్మానుసారమౌ । గతి ఘటంగు
నెవ్వాఁడు ఫలదాత । యెల్లమానులకును, దా రొనర్చినయట్టి । తపములకును
నెవ్వాఁడు రక్షకుం । డీరేడు జగముల, భయమెల్ల నార్చి సంపదల నొసఁగ
నెవ్వాని యానతి । నీ జగంబుల నెల్లఁ, గాలాగ్నిరుద్రుండు । గాల్చివైచు

తే॥ నే మహాత్ముఁడు విజ్ఞానమెల్లఁ దెలుప, శివుఁడు మృత్యుంజయుం డయ్యె । సితగభస్తి
శేఖరుండైన నిర్జరశేఖరుండు, పరముఁడట్టి రాధామనోహరుఁడు సాధ్వి!

ఉ॥ గంధవహుండు వీచుటయుఁ । గంజకులాప్తుఁడు దీప్తిఁ గొల్పుటల్
బంధురవృత్తి దిక్పతులు । పాలకులై దిశలెల్లఁ గాచుటల్
సింధువులెల్ల మర్త్యులకు । జీవనదాయిను లౌట యింతయున్
గంధగజేంద్రయాన! కనఁగా వినఁగా నలవాని భీతిచే.

సీ॥ యద్భయంబున సూర్యనహరహంబును శింశు, మారంబు వహియించు మలుపులేక
యద్భయంబున భూరుహావళుల్ తీవలు, ఫలపుష్పభరితతఁ । బరిఢవిల్లు
యద్భయంబునఁ గాలుఁ డఖిలంబు గ్రసియించి, కల్పాంత సమయమ్ము గాచియుండు
యద్భయంబున సర్వమాత్మానురూపకా, ర్యానువర్తనలచే । నలరుచుండు

గీ॥ యద్భయంబున జంతుసంహారకములు, వ్యాఘ్రహర్యక్షముఖజంతు వర్తనములు
మసలకుండు నద్దేవుని । మహిమ మెన్న, సులభమౌనొకో? యత్తన్వి చూలికైన.

సీ॥ జలరాశిమీఁదఁ గచ్ఛపరాజు నిల్చుట, కచ్ఛపంబున ధాత్రి కదలకుంట
ధాత్రిపై నబ్ధిభూధరములు నిల్చుట, భూతపరంపరల్ । పుట్టుచుంట

యేకసప్తయుగంబు ♦ లిందులోఁ బడు నిల్చుట, నిరువదెన్మండ్రు దేవేంద్రు లరుగ
ధాత కొక్కదినంబు ♦ దరియుట యిది యెల్ల, నెవ్వాని శాసనం ♦ బెఱుఁగవలదె?

ఆ॥ యట్టి బ్రహ్మ చనుట ♦ హరికి నేత్రోన్మీల, నంబు ప్రకృతి కదె లయంబు నలువ
లోన సర్వ మడఁగు ♦ మానినీ! శ్రీకృష్ణు, నాభిపంకజమున ♦ నలువ వొచ్చు.

క॥ వటపత్రశాయి యగు హరి, తటుకునఁ దద్వామపార్శ్వతలమున మాయా
పటుశక్తి యణఁగు నొగి దుర్ఘటశక్తిచయంబులందుఁ ♦ గలియుంగాదే. ౮౦౮

వ॥ మఱియు, నారాయణాంశం బగు స్కందుండు తద్వక్షంబునందును, గణేశ్వరుండు తద్బాహువులయందును, బ్రకృత్యంశంబులగు లక్ష్మీరాధికలయందు గోపికలును దేవాంగనలును, గృష్ణునకుఁ బ్రాణప్రియురాలగు రాధిక తత్ప్రాణంబులయందును, సావిత్రి సరస్వతియందును, వేదశాస్త్రంబులు, తద్విజ్ఞానంబును శ్రీకృష్ణ జిహ్వ యందును, గోలోకమునందుండు గోపాలకులు తల్లోమంబులయందును, సర్వప్రాణం బులు తత్ప్రాణంబులయందును, హుతాశనుండు జఠరాగ్నియందును, జలంబు తద్రసనయందును, భాగవతులు తచ్చరణాంభోజంబునందును, మహావిరాట్టు తత్స్వరూపంబునందును గలియు. మఱియు నెవ్వాని నేత్రనిమీలనంబు ప్రళయం బగు నట్టుల నున్మీలనంబును సర్గంబగు; నట్టి మహానుభావుని గుణకీర్తనం బొనర్ప నెవ్వండు సమర్థుండగు మజ్జనకుం డాదిత్యుండు తెల్ప నిది వింటి; మఱియు ముక్తి ప్రకారంబుఁ దెల్పెద వినుము.

క॥ ముక్తి చతుర్భేదం బని, వ్యక్తంబుగ వేదసమితి ♦ వర్ణించు యథా
శక్తి వచియింతు హరిపద,భక్తియు నిర్ముక్తికంటెఁ ♦ బరమని కనుమీ. ౮౧౦

సీ॥ ముక్తి నాలుగు విధంబులను వర్తిలుచుండు, సాలోక్యదం బనఁ ♦ జను నొకండు
సారూప్యదం బన ♦ జగతి రెండవయది, సామీప్యదంబనఁ ♦ జనుఁ దృతీయ
నిర్వాణద యటంచు ♦ నెగడు నాల్గవయది, యిన్నాల్గు విధముల ♦ నెదఁ దలంప
రచ్యుతైకాంతికు ♦ లట్టుల నిందిరా, బ్రహ్మాదులనైనఁ ♦ బరిహసింతు

తే॥ రందు శ్రీహరి కైంకర్యమొందకుంట, జేకొనఁ దలంప రీభక్తి ♦ చిత్తములను
గోరుదురు భాగవతులు వైకుంఠచరణ, సేవనారూప మగుటచేఁ ♦ జిగురుబోఁడి.

ఆ॥ సఫలజన్ములైన ♦ సద్భక్తు లద్దేవు, సేవనంబు పరమసంభావనీయ
మదియె జ్ఞాన మనుచు ♦ నంగీకరింతురు, నిగమ మట్లు చెప్పు ♦ నీరజాక్షి! ౮౧౨

ఉ॥ నీవొనరించు ప్రశ్నలకు ♦ నిశ్చితబోధ మెఱుంగఁ జేసితిఁ
గావున నింటి కేగుమని ♦ కాంతుని జీవితుఁ జేసి యిచ్చి సం
భావితఁ జేసి యేగుటకు ♦ భావము గొల్పిన నమ్మహాత్ము ను
చ్చావచవాగ్విలాసముల ♦ నన్నుతిఁజేసి విమోగభీతయై. ౮౧౩

క॥ పావనశమనాంఘ్రిద్వయ, సేవాలోల యయి యెడరుఁ జెందిన మదితో
సావిత్రి బాష్పలోచన, యై విలపింపఁగఁ గృపాళుఁడై యాతండున్. ౮౧౪

సీ॥ ఏల దుఃఖించెదు లోలాక్షి! లక్షవర్షంబులు భరత వర్షంబునందు
సుఖ మొంది యంతట శుభదమౌ శ్రీకృష్ణ భవనంబుఁ జేరెదు భయమువలవ
దింటికి నేగి నీవింతులకెల్లను, ముఖ్యవ్రతముగాన ముదముఁ జెంది
పదునాల్గు వర్షముల్ పావనవ్రతనిష్ఠ, నలుపుచునుండుము సకలశుభము

తే॥ లొందు నివ్విధి జ్యేష్ఠంబునందుఁ గృష్ణ, పక్షమునను జతుర్దశి భవ్యమనుచుఁ
దప్పనీక యొనర్పుము దైత్యమథనుఁ, డయిన శ్రీకృష్ణదేవుని ప్రాపు గలుగు.

సీ॥ పడఁతి! యిట్టులు భాద్రపద శుక్లపక్షగ, తాష్టమి లక్ష్మీవ్రతార్చనంబు
ద్వ్యష్టవర్షంబులు తప్పక ప్రత్యబ్ద, మొనరింప హరి ప్రాపు నొందఁగలవు
ప్రతిమాసమును శుక్లపక్షమష్టులయందు, మంగళకర్త్రి నిమ్మాడ్కిఁ బూన్పఁ
గలిగెడు హరిప్రాపు కార్తికి రాధికా, వ్రత మిట్లు యొనరింప వాసుదేవు

తే॥ ప్రాపు సిద్ధించుఁ దత్తద్వ్రతోపవాస, విధులు నడలంగనీక శ్రీవిష్ణు మాయ
దుర్గ భగవతిఁ బూజింప దొరకెనేని, కలదు శ్రీకృష్ణదేవాంఘ్రికమలపదవి.

క॥ అని పల్కి యూరడించినఁ, జనియెన్ నిజకాంతుఁ గొనుచు సావిత్రి నికే
తనమునకు శమనుఁడున్ జనెఁ, దనపురికిన్ స్వర్ణివాసతాపసచంద్రా!. ౮౧౫

సీ॥ అంతట సావిత్రి యత్తమామలకును, గమలయుగముఁ బోలు కన్నులమరఁ
గన్నతండ్రియుఁ బుత్రిఁ గనుఁగొని యెడతీని, యానందపారవశ్యంబు నొందె
లక్షవర్షంబులు లక్ష్మీవ్రతాదులు, భారతంబున సల్పి పతిని గూడి
గోలోకమున కేగి గోపికాగోపకుల్, మన్నింప శ్రీకృష్ణు మందిరమున

తే॥ నిత్యసౌఖ్యంబునొంది నిర్నిద్రవృత్తి, హరిచరణ సేవనమునఁ దత్పరతఁ గనియె
నీ యుదంతవశంబున నెల్లజీవ, కర్మపాకంబు లిట్టివి గావె తపసి. ౮౧౬

గీ॥ ఇంక నెయ్యది వినఁగోరు నిచ్చగల్గు, తెలుపుమన్నను బల్కె నద్దేవమౌని
అత్యుత్కృష్టపాఖ్యాన నరణి తెల్లముగ వినఁగ, నిచ్చగించితి నెఱిఁగింపవే! యటన్న

సీ॥ ఆదికాలమునఁ గృష్ణాంగసంభూతయై, రాసమండలమున రమ జనించెఁ
బదియురెండేడుల ప్రాయంబు సోయగం, బబ్బురం బవినాశి యౌవనంబు
పసిమి సంపఁగిరూపు పర్వచంద్రాస్యంబు, పద్మలోచనములు భాసిలంగ
ధైర్య తేజోవర్ణత తద్గుణంబుల, నీశ్వరుసాటియై యిందువదన

తే॥ చూపులను జిఱునవ్వుల సొంపుగులికి, వామభాగస్థయై పుట్టె వాసుదేవు
దక్షిణాంశను రాధికాతరుణి యయమ, స్వేచ్ఛ [illegible] కృష్ణుని జేపట్టె దేవి యయ్యో

గీ॥ అమ్మహాలక్ష్మి దీనాన నాబ్జయగుట, యరసి కృష్ణుండు రూపద్వయంబుదాల్చి
దక్షిణాంగంబు ద్విభుజుఁడై తనర వామ, భాగము చతుర్భుజుండయి పరఁగెనవల

మ॥ కమలాదేవిఁ జతుర్భుజుండు గొనియెన్ గాంగన్ మహాలక్ష్మియున్
విమలోత్సాహత విష్ణుపత్నియయి యీ విశ్వంబునన్ జేర్గొనెన్
సమ లీకృష్ణులు బాహుభేదమున నీసద్భిన్నులై యిర్వురున్
బ్రిమదం బొప్పఁగ నేలుచుందురు సుమీ వైకుంఠగోలోకముల్. ౮_౨౧

గీ॥ రమయు రాధయు నిరువురు రక్తిఁ గులికి, ప్రియుల లాలింతు రిందిర ప్రేమఁ బతికి
ముఖ్యయై యుండు సత్త్వాభిమూర్తియగుచు, సకలనిర్జరగణములు సన్నుతింప.

వ॥ మఱియును స్వర్లోకంబున స్వర్గలక్ష్మియు, ధనికులయెడ ధనలక్ష్మియు, గోవులలో సురభియు, యజ్ఞంబుల దక్షిణయుఁ, బాలకడలి యెడఁ బద్మయు, గమలంబుల యందు శ్రీయు, సూర్యచంద్రుల శోభయు, భూషారత్న ఫల జల నృప నృప పత్ని శిష్ట సత్త్వ వస్త్ర సురుచిరస్థాన ప్రతిమా తటాక మంగళ ఘట మాణిక్య ముక్తాదర్పణ హీర చంపక చందన మేఘ ప్రభృతిద్రవ్యంబుల లీలారూపిణియునై వైకుంఠంబున విష్ణుండును, సత్యంబున విధియును బూజింప, మనువులు, ఋషులు, గంధర్వులు, పన్నగులు, స్వస్థానంబుల నారాధింప భాద్రపద శుక్లాష్టమీ తిథి యందును, పౌషసంక్రాంతి నిమేషంబునందును భువనత్రయీపూజిత యగు. మహేంద్ర మంగళ నీల సుబల ధ్రువోత్తానపాద కశ్యప దక్ష కర్దమ వివస్వత్ ప్రియవ్రత చంద్ర కుబేర యమ వహ్ని వాయు వరుణ ప్రభృతి సురజ్యేష్ఠులచే వందితయై సర్వేశ్వరియు సర్వసంపద్రూపిణియు సర్వమంగళయునై వర్తించునని తెలిపిన నారదుండు నారాయణుం గాంచి వైకుంఠవాసిని యగు నద్దేవి సింధు మథనంబున జనించుటకుఁ గతం బేమి? యనిన నతం డిట్లనియె. ౮_౨౩

సీ॥ శక్రుండు దూర్వాసు శాపవశంబున, భ్రష్టచేతస్కుఁడై పటిమ సడలి
భ్రంశంబు నొందుట బర్హిర్ముఖావలి, బడలిన దుఃఖసంప్రాప్తి నొంది
తల్లక్ష్మి వైకుంఠధామంబుఁ జేర నింద్రాదులు బ్రహ్మసభాంతరమున
కరిగి యాతనితోడ హరిఁ జేరి శరణన్న, దీనులఁ గాంచి యద్దేవదేవు

తే॥ నాజ్ఞ నంభోధిలోఁ దన యంశమునను, శ్రీమహాలక్ష్మి నివసించి సింధుమథన
దంభమునఁ బుట్టె దేవతల్ దానవులును, గంధి మథియించి రిది పూర్వగాథసుమ్ము.

క॥ జనియించి సింధుకన్యక, వనమాలిక వైచి విష్ణువల్లభ యయ్యెన్
కని రమగులు రాజ్యశ్రీ, ఘనవైభవ మెల్ల నిదియె కారణ మనిరన్. ౮_౨౪

ఉ॥ నారదుఁ డమ్మునీంద్రుఁ గని ♦ నవ్వుచు బ్రహ్మవిదగ్రగణ్యుఁ డౌ
ధీరుఁడు శక్రు నేటికి ధృక్ర్త్రీ శపియించె సురాసురుల్ మహో
దారత నెట్లు వారినిధిఁ ♦ ద్రచ్చిరి లక్ష్మి ప్రసన్నయౌట యె
ట్లో రహిఁ దెల్పుమన్న ముదితోక్తుల మౌని వచించె నిట్టులన్. ౧౫౯

సీ॥ మధుపానమత్తుఁడై ♦ మఘవుఁ డొక్కెడ మహారణ్యంబులో రతారంభుఁడగుచు
రంభతో వర్తింప ♦ రజతశైలంబున, హరుఁ గాంచి దూర్వాసుఁ ♦ డరుగునెడల
బ్రహ్మతేజస్కుఁడై ♦ భానుసహస్ర ప్రభాంచితుఁడయి తప్తకాంచనాభ
జటలు జీరాడ సుజ్జ్వలఫాలతిలకంబు, చంద్రప్రభలు గుల్క ♦ సాంద్రధవళ

తే॥ భస్మసంఛన్నుఁడై యురోభాగమాక్తి, కోపవీతంబు దండంబు ♦ నురుకమండ
లువుఁ జెలంగమహోజ్జ్వలలోచనముల, వఱలి వెలుఁగొందునట్టిదూర్వాసుఁగనియె.

గీ॥ కాంచి వినతోత్తమాంగుఁడై గ్రావభేది, భక్తి దళుకొత్తఁ బదములఁ ♦ బ్రణతిఁజేసి
వేదవేదాంగపటలానుమోదిశిష్య, సమితి లాలించి మునిచంద్రు ♦ సన్నుతింప.

క॥ దీవించి మౌని హరిసం, భావితమగు పారిజాతమాలిక యొసఁగన్
దేవాధీశుఁడు చేకొని, కావరమున హస్తిమస్తకంబున నిడియెన్. ౧౬౦

గీ॥ రాజ్యసంపన్మదంబునఁబూజ్యకుసుమ, మాల్యమహిమంబు గనకయమర్త్యవిభుఁడు,
తనశిరంబునఁ దాల్పక ♦ ఘనమదాంధ, సింధురశిరాన నిడుట రోషించె మౌని.

గీ॥ అమ్మహామాల్య సంస్పర్శ ♦ మబ్బుకతన, రూప తేజోగుణంబులఁ ♦ *బాపమథను
హరికృపావాప్తిసాదృశ్య ♦ మంది గజము, చనియె శక్రుని విడిచి కాననము వెంట.

గీ॥ కల్పమాల్య మపుడు ♦ గమన వేగంబునఁ, బుడమి జాఱిపడిన ♦ భూరివిభవ
మత్తుఁడగుటఁ గనఁ డమర్త్యవల్లభుఁ డంత, శక్రుఁ జూచి మౌని ♦ శాప మిడియె.

సీ॥ మద మత్తవృత్తి నమర్త్యవల్లభ! నీవు, మద్దత్తమగు పుష్పమాల్య మిభము
పైనిడితీవది ♦ పద్మనాభుని నివేదితము తన్నైవేద్య ♦ దివ్యమహిమ
తెలియక చేసితి ♦ దీనుండవై పురభ్రష్టుండవై జనభ్రష్టతఁ గని
బ్రహ్మఘ్నతను బొంది ♦ పాపివై చనుమని, శపియించె నందుఁ గేశవుని కర్పి

తే॥ తంబగు ఫలంబు జలము నంభతసుఖోప, భుక్తిగొనకున్న ఖలుఁడు పెంపునశుభంబుఁ
నొందునే? ప్రాప్త మగునంత ♦ నుల్లమలరి, తద్గుణగ్రాహి ముక్తికి ♦ ధవుఁడుగాఁడె.

* టిప్పణి: పాపమథను హరి కృపావాప్తి – ఇయ్యెడ, పాపమథనుఁడైన హరియొక్క అని అర్థము రావలయును. అప్పుడు మథనుఁడు అని ప్రథమాంతముగా నుండుటయే బహుమహాకవిసమ్మతము కాని ద్వితీయాంతముగాఁ గూడ శిష్టప్రయోగములు ('రావుసింగమహీపాలు దీవిశాలు, నిండు కొలువున్ లోనైనవి) కన్పట్టుటచేఁ గన్నచోట్ల దిద్ది కొన్నిచోట్ల దిద్దనైతి నని యెఱుంగునది.

గీ॥ హరిసమర్పితభోజియౌ నతనిఁ బూన్చు, నతఁడు విష్ణుసమానుఁడై యలరునతని
సోఁకుగాడుపు నెవ్వానిసోఁకు నతఁడు, ముక్తివల్లభుఁ డందురు మునులు సురలు

సీ॥ పుంశ్చలుల్ శూద్రులు పుత్రికావిక్రయుల్, శ్రాద్ధభోక్తలు చికిత్సకులుమాధు
లంగనాజీవులు నశుచులు శూద్రయాజులు నదీక్షితులు దుష్కులులు మిత్ర
విశ్వాసహంతలు వృషవాహులు నశుద్ధ, పర్యుషితాదులు భక్షితావ
శిష్టభోజులు శూద్రిఁ జేకొనువారలు, శవదాహకు లగమ్యఁ గవయువారు

తే॥ మొదలుగాఁ గల్గునట్టి యీసమూర్ఖులెల్ల, హరినివేదితమైన పదార్థమంటి
కాని, తత్స్పర్శ గాంచిన గాలిసోఁకి, గాని ముక్తాఘులై ముక్తిఁగాంతు రెలమి.

సీ॥ అజ్ఞానమున నైన హరి నివేదిత మించు, కంత యబ్బినవాని కయుతజన్మ
శతసమార్జితపాప సంచయధ్వంసమౌ, నట్టి శ్రీహరి మాల్య మభయవశత
గంధేభకుంభాగ్రఘటితంబుఁ జేసితి, గాన నిన్నుఁ దలంగుఁ గమల, యేను
హరిభక్తుఁడను భయం బావంతయును లేదు, కాలమృత్యువునైన గణనసేయ

తే॥ జనకుఁడగు కశ్యపుఁడు బృహస్పతియు నైన
నన్నుఁ జెనకంగఁ గలరె? యోనముచిమథన
యిక్కుసుమ మాఁదల ధరించు నెవ్వఁడేని
యతనిశీర్షంబు చక్రింబు నంటఁగలదె? 136

గీ॥ నీ మదాంధత నీ సిరుల్ నేలఁగలసె, నని వచించుచుఁ గ్రోధాగ్నియాకృతిఁ గొను
కైవడి వెలుంగు దూర్వాసుఁగని తలంకి, పాకశాసనుఁ డతిభయభ్రాంతుఁడగుచు.

ఉ॥ కన్నుల బాష్పపూరములు గారఁగ నమ్మునిఁ జేరి దీనుఁడై
విన్నఁదనంబు దోఁప కనువేదుఱు నొందుచుఁ బాదపంకరు
టన్నిధి నాపదల్ దొలఁగ సన్మతిఁ గూర్పుము పాపమార్గ సం
ఛన్నుఁడ బుద్ధిఁ గొల్పి నను సాఁకి ప్రసన్నత నొందవే? యనఁ. 137

వ॥ పురందరా! విభవమదంబున నిట్లు సంపద్భ్రంశంబు నొందితివి. మదాంధుండు, జన్మమృత్యు జరాశోకరోగభీతిప్రదం బగు భవాంబుధిపతితుండును, సంపన్మాంధుండును, విపదంధుండును, గామియు, రాజసేవకుండును నగువాఁడు బలవంతుం డయ్యును ముక్తిం గొనంజాలునే? రాజసతామసభేదంబుల విషయాంధత్వంబు ద్వివిధం బయియుండు నందాద్యంబు శాస్త్రజ్ఞానంబు గల్గియు నెఱుక లేమి, రెండవది కేవల మూఢ్యంబును నని యెఱుంగనగు. జీవులు దుఃఖపథంబగు నిట్టి ప్రవృత్తిమార్గంబు నభిలషింతురే? అనేకజన్మంబుల విషయాంబుధింబడి కొన్నిదినంబుల మీఁద భవతారకంబగు సత్సంగంబు నొంది సత్త్వప్రదీపంబు చేపట్టి ముక్తిమార్గం

బరయుదురు. యోగంబును, తపంబును, ననశనంబును దానికి సాధకంబు లగు. నదియట్లుండె, నీకురాజ్యభ్రంశంబు వాటిల్లి పదంపడి బృహస్పతి సమాలోచనంబున నిష్టం బొనగూడునని తెలిపి దూర్వాసుండు యథేచ్ఛం జనియె నంత. ౮౩౯

చ॥ దినదినవర్ధమానముగ \ దేవవిభుండు విరక్తినొంది యొ
య్యనఁ బురి కేగి దైత్యులును \ నాశరులుఁ బురమందు నెల్లెడన్
దను వెఱపింప బంధురహితంబయి శాత్రవవేష్టితంబునై
మనమున భీతిఁగొల్ప నిజసమందిరముం జొరలేక దీనుఁడై. ౮౪౦

క॥ మందాకినితటమున గో,విందుని భజియించు గురుని \ వెదకుచుఁ జని సం
క్రందనుఁడుచూచెఁ బరమా,నందంబున రవి నుపాసనము సేయునెడన్. ౮౪౧

సీ॥ కర్మిష్ఠవర్యుండు \ ధర్మిష్ఠఘనుఁడు న,రిష్ఠుండు సగుణగరిష్ఠుఁ డాత్మ
విజ్ఞాననిధి బ్రహ్మవిజ్జ్యేష్ఠుఁడగు నాత్మ,గురుని జీవుని బురందరుఁడు గాంచి
పాదాంబుజంబులఁబడి బాష్పజలములు, సందీక పొరల నాక్రందనమున
నాతురుండై శోక \ మడరెడు మదితోడఁ,'పాహిపాహి' యటంచుఁ \ పాకభేది

తే॥ ప్రార్థన మొనర్ప బుద్ధిమత్ప్రవరుఁడైన, యంగిరోనందనుఁడు లోచనాంబుజముల
నరుణదీధితు లొలుక స్వస్వాంతరసము, దొలుక నిట్లని పలికె మధురముగాఁగ.

ఉ॥ ఏటికి దుఃఖ మందెద వహీనగుణజ్ఞుఁడ వీవు సంపదు
చ్చాటనమూలమా నెపము \ సర్వ మెఱింగితిఁ గాతరుండు దుః
ఖాటకుఁడై వెతల్ గడుపఁగాఁగలఁ డొక్కొ? నయజ్ఞుఁడైన న
ప్పాట విపత్పరంపరల \ పట్టున నించుక కొంకుఁజెందునే? ౮౪౩

వ॥ సురవల్లభా! సంపత్తి విపత్తులు పూర్వకర్మవశంబున సంప్రాప్తంబులై చక్రనేమిక్రమంబున జన్మజన్మంబుల జీవులకు సుఖదుఃఖంబు లొసంగు కేవలసుకృతంబున ముక్తిసంభవించు, శుభాశుభంబులు కర్మలభ్యంబులు; పరితపింపఁగానేల? కల్పకోటిశతంబులనైనను స్వకృతకర్మంబు భోక్తవ్యంబు, పరమాత్ముండగు శ్రీకృష్ణుండు నిగమంబుల నిట్లు పలికె, కోటిజన్మార్జిత కర్మంబులును పీసరపోవక జీవుల ననుగమించుఁ, గాలదేశభేదంబులఁ గోటిగుణితంబులగు, జగంబులఁ గృషికులకుఁ గాలదేశభేదంబుల ఫలాఫలతారతమ్యంబు లెఱుంగుదుము గదా! అట్టుల నమాసంక్రాంతి చాతుర్మాస్యా పౌర్ణమాసీగ్రహణాదులఁ దత్తద్వస్తుదానంబులు కోటిగుణితంబు లగు నట్టులఁ బుష్కర, కేదార, భాస్కర, క్షేత్ర హరిద్వార విష్ణుమందిరాదుల దానంబు గుణాధికంబు. ఇట్టుల తంతుమాత్రోపజీవి నిత్యకర్మానుష్ఠాతృపండితజితేంద్రియపాశుపతభాగవతాదిపాత్రంబుల దానంబులు తత్తదను

గుణ గుణాధికంబులుగాఁ గన్పట్టు నట్టుల సకలకర్మంబులు తత్తద్దేశకాలంబుల నధిక ఫలాఫలంబుల నొసంగునని యెఱుంగుము. ౨౪౪

సీ॥ ఎవ్వాఁడు బీజమై । యీ రేడు లోకంబు, లలరించె సృష్ట్యాది । నచ్యుతుండు
ధాతల కెల్లను । ధాత పాతల కెల్లఁ, బాలకుండును సృష్టిప్రపటలమునకు
సృష్టి, సంహర్తల । సంహర్త యాపన్నుఁ, డాత్మఁ దలంచినయంత నతఁడు
విపదాంధ్యభాస్కరుం । డుపకర్త బ్రహ్మాదు, లిట్టులు వల్కుదు । రీవు శార్ఙ్గి

గీ॥ నాశ్రయింపుము వెతలెల్ల । నణఁచు ననుచు, బోధగొల్పినఁ దెలివొంది భూధరారి
యాంగిరసుఁ గొంచు సురసమూహములు గొల్వ, గమలజుం జూడ బోయెన క్కటిక మెఱయ

క॥ చని వాణీవిభునిం గనుఁ, గొని పాదంబులకు మ్రొక్కి కుపితుండగు న
మ్మునిసేతఁ దెల్పి దీనా, ననుఁడై యచ్చెంత నిలువ । నలువ మహేంద్రున్.

సీ॥ ఆదరించి మహేంద్ర । యడలకు మద్వంశ, జాతుండవు క్రియా విచక్షణుఁడవు
ధిషణశిష్యుండవు । దేవాధిపతివి మా, తామహుండగు నీకు । దక్షుఁ డతఁడు
హరిభక్తుఁడు కులత్రయంబు శుద్ధంబగు, వాఁడ వహంకృతిఁ । బడసి తెట్లు?
తల్లి పతివ్రత । తండ్రి ధన్యుండు మా, తామహమాతులుల్ । ధన్యతములు

తే॥ ధరణి నటు లున్న యన్న రుండరయ గర్వి, యగునే తద్దోషమునఁ గదా హానికలుగు
నట్టి దెద్దియు లేదు, నీ యానసమున, దైన్య మేటికిఁ గలిగె భూధరవిమర్ది? ౨౪౮

సీ॥ సర్వాంతరాత్మయు । సర్వేశ్వరుండును, నచ్యుతుం డాతని । యనుచరులము
కపిలనారదులు తత్సనకసనందనులును, నేను రుద్రుండును । నిఖిలసురలు
చక్రింబు పొరలినఁ । జక్రినేమివిధంబు, నను దన్మతిఁ జరింతు । మనవరతము
అట్టి జగన్నాథు । నంఘ్రిని వేదితం, బభవుండు తలఁ దాల్చు । ననఁగ వినవె?

ఆ॥ ధూర్తమానియైన । దూర్వాసుఁ డచ్యుత, శేష మొసఁగ హస్తిశిరమునందు
నిడగఁదగునె తలనె । యిడికొన్న భద్రిమ్ము, లొందుఁ గాదె నిన్ను సురకచెడితి.

ఆ॥ దైవవంచనమున । ధర్మంబు విడనాడి, యిట్టియడరుఁ జెందితీవు దైవ
బలము గెలువ నగునె! । భాగ్యహీనునకును, నిన్నుఁ బ్రోవ నెవఁడు నిపుణతముఁడు.

ఆ॥ కడిమి చెడియె నెడరు । గలిగెఁ గాపురమెల్లఁ, గడలిఁ గలసె నీదు । గర్వమునను
హరిని వేదితముల । నాదరింపని వాని, కెట్లు సిరులు గలుగు । నింక వినుము. ౨౫౦

క॥ సర్వామరబృందముతో, సర్వేశ్వరు శార్ఙ్గిఁ జూడఁ । జనియెదము శర
త్పార్వణశశిఁ గనినఁ దమ, స్సర్వస్వం బణఁగుఁ గాదె? । సందియ మేలా. ౨౫౧

చ॥ అని వచియించి నల్వ సకలామరబృందముతోడ రాఁగఁ జ
క్రిని గను వేడ్కనేగి విధురీకృతచిత్తత నంత నంత నో
య్యనఁ బ్రతిహారిమూలమున నంతిపురంబున కేగి యచ్చటన్
గనిరి యనంతపార్షదనికాయము గొల్వఁగ నొప్పు కృష్ణునిన్. ౧౯౩

సీ॥ శాంతు ననాదిమధ్యాంతు ననంతు లక్ష్మీకాంతు నందాదిసేవ్యమాను
గంగాసరస్వతీకమలాపరీవృతు, మధ్యాహ్నరవికోటిమహిత తేజుఁ
గని బ్రహ్మముఖులు సంఘటితకరాంబుజులై మ్రొక్కి భక్తినమాలినములును
సాశ్రునేత్రులు నొచు సాష్టాంగ మిడుచును,వృత్తమెల్లను దెల్పి విహ్వలమయి

తే॥ నట్టి దురవస్థ నందుట కాత్మఁగుంది, వస్త్రభూషణ నిస్త్రింశ వాహనాది
వర్జితంబౌటఁగాంచి యవ్వాను దేవుఁ, డాదరించి కృపామతినభయ మొసఁగి.

ఆ॥ ఏనుగలుగ మీకు నేటికి భయ మొంద, మరలనిత్తు సిరులు మది దలంక
వలదు సామయికముగలదు కృత్యము నాదు, పలుకు వినుఁడు భయవిభంజనముగ.

సీ॥ మదధీను లగువారి మందిరంబుల నేను, వసియింతు లక్ష్మితో వదల కెపుడు
ఏను భక్తులవాఁడ నితరుల జంజాట,మెఱుఁగ,వారలె నాకు నిష్టతములు
వామదేవుండు దూర్వాసుండు నిర్వారు, మత్పరుల్ వైష్ణవుల్ మహితగుణులు
వారల నిందించువారల లక్ష్మితో, నే వసియించుట కిచ్చగొనను

గీ॥ శంఖనాదము విప్రభోజనము తులసి, లేనిచో లక్ష్మియును నేను లేము నిక్క
మట్ల మద్భక్తులకు ధాత్రి నపహసించు, నెళవులను నీరజాసన! నిలువనేర.

సీ॥ హరివాసరవ్రతి మలరని చోటుల, మజ్జన్మదినభోక్తృమందిరముల
నాదునామం బమ్ము నరుల తావులలోనఁ, గన్యకావిక్రియల్ గలుగునెడల
నతిథిభోజనశూన్యమగు నాలయంబున, సంతత శ్రాద్ధభోజకుల యిండ్ల
శూద్రశవగ్రాహి శూద్రాన్నభోజుల, చెంతలఁ గఱ్ఱశిచిత్తు లిండ్ల

తే॥ క్రూరహింసక నిందక కుటిల శూద్ర,యాజి పుంశ్చలీసుతు లిండ్ల నబ్ధిపుత్రి
కన్ను వేయదు గోళ్ళచేఁ గసవుద్రుంచు, వారలను లక్ష్మిచూడ దపాత్రులగుట.

వ॥ మఱియు నుదయాస్తమయంబుల భోజననిద్రాదు లొనరించు వారును, అవీరాన్న
భక్షులును, దివాసురతకారులును, ఆచారహీనులును, శూద్రప్రతిగ్రహులు, నదీక్షి
తులు, మూఢులు, నస్నిగ్ధపాదులై నగ్నులై శయనించు వారును, విప్రగోదండనం
బొనర్చువారును, తైలంబున శిరసంటి నదుల మునుంగువారును, వ్రతోపవాస
సంధ్యా విష్ణుభక్తివిహీనులును, దయాహీనులు, హరిపూజావిరహితులు నగు దురా
త్ములును లక్ష్మికటాక్షంబునకు నర్హులుగారని యెఱుంగుము. ౧౯౭

సీ॥ మత్పూజనంబును మద్వందనంబును, మత్సేవ మద్భక్తమాన్యతయును
శంఖనాదము నాదు చక్రపూజయు శిలా, తులసీదళంబులుఁ దొలఁగ కెచట
నివసించు నచ్చోట నిలుచు మద్గేహిని, యని తెల్పి బ్రహ్మతోఁ దనని మె శార్ఙ్గి
యావు పాథోనిధి కేగుము మద్వరం, బున లక్ష్మి యచ్చోటఁ బొడము ననుచు
తే॥ దెలిపి యంతఃపురికి నేగె దేవదేవుఁ, డబ్జజుండును నమరులు నబ్ధిఁ జేరి
మథన మొనరింప జలధి నమందగతుల, యతన మొనరించి యచ్యుతునాజ్ఞవలన.
గీ॥ మందరాచలంబు మంథాన మొనరించి, కూర్మపాత్రమునను గుండలీంద్రుఁ
ద్రాడుగా నొనర్చి త్రచ్చిరి వారిధి, దేవదానవులు భుజావిభూతి. ౮౫

సీ॥ ధన్వంతరియు సుధాధవళాశ్వగజములు, రత్నముల్ సురభియు రమయుఁ జక్రి
రాజంబు వనమాల రత్నరాజంబైన, కౌస్తుభంబును శశికల్పతరులు
మొదలగువస్తువు లుదయింప దేవాళి, యాశ్వరేశ్వరి లక్ష్మి నిష్టనుతులఁ
బూజించి భజియించి పొగడిరి బ్రహ్మయు, శంకరుండును శార్ఙ్గి శక్రునింట
తే॥ నధివసించి కృపామతి నాదరించి, యతని రక్షింపు మని వేడ నబ్ధికన్య
శక్రలోకంబునందు నిశ్చలువసించె, నిదిసుమీ! లక్ష్మ్యుపాఖ్యానసమిద్ధచరిత.

సీ॥ అన విని మౌనీంద్రుఁ గని నారదుం డిట్లు, వలికె నో మునిచంద్ర! పరముఁడైన
హరికీర్తనంబును హరివధూపాఖ్యాన, మాలించి ధన్యుండనైతి ననఘ!
అద్దేవి ధ్యానంబు నద్దేవి సంస్తుతి, వివరింపవలయు నా కీవు లలర
నెవ్వనిచే సదాభీష్టప్రదాత్రియై, స్తుతియింపఁబడియె నస్తోత్రమహిమ
గీ॥ నిదియుఁ దెల్లంబుగాఁ దెల్పవే? యదీయ, పూర్ణవిజ్ఞానమున నరుల్ భూరిభోగ
భాగులయ్యెదరో? మహాభాగ! కరుణ, నెఱయ వినిపింపు మనిన మౌనియువచించె.

చ॥ మునుపు శచీమనోహరుఁడు ముజ్జగముల్ వినుతింప దేవవా
హినిఁ దగఁ దోఁగి శుభ్రత నహీనములౌ వసనంబు లూని నూ
తనతరమంటపస్థలి నుదారతఁ జక్కని వేదిఁ జేసి యం
దనుపమరంగవల్లికల నంచిత లీలలు గూర్చి యొయ్యనన్. ౮౬

గీ॥ కలశసంస్థాపన మొనర్చి గణపతి ప్రభాకరాచ్యుతశంకరపార్వతులను
ధ్యాన మొనరించి తన్మధ్యతలమునందు, శ్రీమహాలక్ష్మి నునిచి యచ్ఛిన్ననియతి.
సీ॥ ఐశ్వర్యరూపిణియగు మహాలక్ష్మినిఁ, బూజించెదగ నాకభువనభర్త
అట్టులె తాపను లరుకుండు శంభుండు, గణనాయకుఁడును బ్రాహ్మణులు నితరు
లెల్లరుఁ దనుఁ గొల్వనెద నిష్ఠఁ గొలుపుచు, బాటీరసంయుక్తపారిజాత
సుమములు గొంచు నిస్తులవృత్తి నాంతర, ధ్యానంబొనర్చి యథార్హవిధులఁ

తే॥ బూజయొనరించె నెలమిమై + భువనభర్త, హరియుననితెల్పుటయువినిశ్చయ త్తపస్వి,
ధ్యానమెటులన? నంత నారాయణుండు, దెలిపెదధ్ధ్యాన విధియనునుదెల్లముగను.

సీ॥ దళదబ్జకర్ణికాంతరనివాసిని శర, త్పార్వణకోటీందుశుభాస్వదాస్య
సుఖలాభకారిణి + సుందరాకారిణి, సౌవర్ణరత్నభూషాకలాప
మందహాసముఖారవింద కడారాంశు, చేల సంపద్ధాత్రి + స్థిరవయస్క
పరిజ్వల త్తేజోవిభావిభాసుర మనో, హరమూర్తి యనెడు నామాంకనముల

తే॥ ధ్యానమొనరించి యుపచారతతి పొసంగ, వేదవాక్యంబులను వేదవిధివిధాన
యుక్తముగఁ బూజసల్పి సద్భక్తి యుక్తి, నర్చ సలుపంగవలయు నుదారచరిత.

ఆ॥ విశ్వకర్మ శిల్పివిమలచిరత్నర, త్నాన్వితముగఁ జేసినట్టి రత్న
పీఠమొసఁగినాఁడ + ప్రేమచేఁ గైకొమ్ము, కలశవార్ధిపుత్రి! + కనకగాత్రి!

గీ॥ శంఖగర్భస్థితంబైన + జలము గంధ, గంధిలం బవగాహింపు + కరుణతోడ,
నిదె సమర్పించినాఁడ నభీష్టసరణి, లోకజనయిత్రి! రుచిరతారస్తోకగాత్రి!

గీ॥ దేహసౌందర్యబీజంబు + దివ్యతరము, పట్టువసనంబు నీకు నర్పణ మొనర్చి
ధన్యత వహించినాఁడ నుదారనిష్ఠ, శ్రీమహాలక్ష్మి చేకొమ్ము + సిరుల నిమ్ము.

గీ॥ దేహశోభాకరమును నుదీర్ణరత్న, కనకఘటితంబు సుప్రభాకరము రత్న
భూషణస్తోమ మిదె నాదు + పుట్టువెల్ల, సఫలముగఁ గొమ్ము కలశాబ్ధిజాత! ప్రేమ.

ఆ॥ వె॥ దివ్యగంధముల నుదీర్ణమై దేహసౌం, దర్యమూల మగుచుఁ + దనరు దివ్య
చందనంబు గొనుము + సద్భక్తి నొసఁగితి, జలధిరాట్కుమారి! + జయముఁగోరి.

క॥ సద్యశ్శోభాకరమును, హృద్యంబును నైన ధూప + మిచ్చితి గొనుమీ!
విద్యారూపిణి! నిగమా, వేద్యా! చేకొనవె నాకు + విభవము లీవే. ౫౨౧

గీ॥ మాలతీకుందమల్లికాసమాల్యసమితి, నర్పణ మొనర్చినాఁడ నీయంతరంగ
మలరఁ జేకొనవమ్మ మముమ్మాదరింప, వమ్మ! హరికొమ్మవమ్మ! మాయమ్మవమ్మ!

క॥ దేవాంగనాకరాంబుజ, భావితనీరాజనానుబంధాంఘ్రిసరో
జా! విన్నప మిదిగో! దీ, పావళిఁ గైకొమ్ము మంగళారతిని రతిఁ. ౫౨౩

సీ॥ బ్రహ్మస్వరూపంబు + ప్రాణిరక్షకమును, దుష్టిదం బమలంబుఁ + బుష్టిదంబు
స్వాదుతాకరము సచ్ఛంబు మృష్టంబును, నగు నన్న మిదె పాత్రియందు నునిచి
సూపాద్యశాకసంస్యూతి నర్పించితి, సఘృతంబుగా శీతజలముతోడ
దధిదుగ్ధములు గూర్చితని యొందఁ గైకొమ్ము, క్షుద్బాధపనోదనకరములయిన

## श्रीमहासरस्वती




घण्टाशूलहलानि शङ्खमुसलौ चक्रं धनुस्सायकं हस्ताब्जैर्दधतीं घनान्तविलसच्छीतांशुतुल्यप्रभाम् ।
गौरीदेहसमुद्भवां त्रिजगतामाधारभूतां महापूर्वामत्र सरस्वतीमनुभजे शुम्भादिदैत्यार्दिनीम् ॥



THE GITA PRESS, GORAKHPUR. No. 399.

ఆ॥ మృదులతాళవృంతకమేదురమారుత, స్పర్శనముల మేను చల్లఁబఱచి
నేనఁజేతు నీదుగచిత్తంబు రంజిల్ల, దృష్టిగొనఁగదమ్మ! దేవదేవి! ౮౭౮

వ॥ మఱియు స్వాదుతాయుక్తంబగు పరమాన్నంబును శర్కరాగవ్యమిశ్రితంబగు *స్వస్తికంబును మనోహరంబులును బంచామృతరసాయనంబులును నగు పక్వాపక్వగుడపిండంబులును ఫలంబులును యవగోధూమచూర్ణశర్కరాజ్యపక్వంబులగు భక్ష్యవిశేషంబులును సమర్పించితి. కర్పూరసంవాసితంబగు తాంబూలంబును నర్పించితి. జగజ్జననీ! సర్వమంగళా! మత్కృత సమర్చనంబు గ్రహించి నన్ననుగ్రహింపుమని ప్రార్థించి భూషణాఢ్యంబగు తల్పంబున నధివసింపంజేసి లక్ష్మీమాయా కామరూపవాణీబీజంబు లుచ్చరించి కమలవాసినీచతుర్థ్యంతంబుగా వైదికంబగు నిమ్మంత్రరాజంబు దశలక్ష జపించిన మంత్రసిద్ధి యగు నిమ్మంత్రంబు కల్పవృక్షాహ్వాయంబు. ఇది జపించి శకుంతుడును సావర్ణియుఁ బ్రియవ్రతోత్తానపాదులు కేదారుండు మొదలగు వారలు పరమైశ్వర్యసంపన్ను లైరి. శకుంతుడు ప్రసన్న యగు నిద్దేవిని బ్రహ్మోదాత్తంబగు స్తోత్రంబునఁ బులకాంచితసర్వాంగుండును సాశ్రునేత్రుండునునై యిట్లని స్తుతియించె. ౮౭౯

సీ॥ కమలవాసిని! పద్మ! కైటభారిప్రియ!, పద్మాననా! లక్ష్మి! పద్మనేత్ర!
వైష్ణవీ! పద్మిని! కృష్ణప్రియా! సర్వ, సంపత్స్వరూపిణీ! సర్వజనని!
ధాత్రి! శ్రీహరిభక్తిదాత్రి! మహాదేవి!, సంపత్త్యధిష్ఠాత్రి! స్వర్గలక్ష్మి!
వృద్ధిస్వరూపిణి! వృద్ధిదాయిని! చంద్ర, శోభాస్వరూపిణి! సుజనగమ్య!
తే॥ స్వర్గవైకుంఠకైలాస సత్యకలశ, వార్ధిగృహ గోనృపాలయ వసుమతీందు
సూర్యసురలందుఁ దన్నామ సూచితవయి, యలరుచుందువు మ్రొక్కెదనమ్మ తల్లి.

లక్ష్మీదండకము॥ శ్రీమజ్జగద్ధాత్రి! సత్యస్వరూపా! పరంధామ్ని! నారాయణోరస్స్థలీపీఠసంవాసినీ! శారదాదేవి! మాతా! మహాలక్ష్మి! సాలోక్యసామీప్య సారూప్యసాయుజ్య సంధాయినీ! భక్తదాస్యానుకూలా! పరాదేవి! నీదా దయాదృష్టి యెచ్చోట లేకున్న నచ్చోటు భస్మావశిష్టంబగుఁ నీవు లేకున్న జీవన్మృతప్రాయమౌ విశ్వమెల్లన్ శివప్రాయమౌఁ గాదె లోకంబు నీవెల్ల లోకాళికిన్ దల్లివే; మాతృహీనుల్ ధరన్ జీవనం బొందుటల్ గల్గునే; సుప్రసన్నాత్మవై నన్నుఁ బాలింపు మాత్మాపరాధంబులన్ సర్వసంపద్విహీనుండనై బంధుదూరుండనై పోవుటల్ మన్మదాంధ్యంబులన్ గాదె ధర్మంబు సత్యంబు సౌభాగ్యముల్ వాంఛితంబుల్ బ్రభావప్రతాపంబులుం గల్గఁగాఁజేసి యీ భిక్షుకత్వంబుఁ బోగొట్టి నీ పాదపద్మంబులన్ నిచ్చలున్ భక్తియుక్తుల్ గటాక్షింపు మమ్మా! పరంజ్యోతి వమ్మా! యటం చింద్రుఁ డిబ్బంగిఁ

టిప్పణి: * స్వస్తికము = భక్ష్యవిశేషము.

గీ ర్తింపఁగా, సారసావాస మన్నించి లేఖాధిపుం జూచి నిర్మాల్యమాల్యంబు తత్కంఠమం దుంచి నీదా పరీవారముల్ నీదు లోకత్రయీశిక్షణాక్షీణచాతుర్యముల్ గల్గు నంచుల్ గటాక్షింప సర్వామరుల్ గేలు మోడ్పంగ సంపూర్ణ సంపత్సమృద్ధుల్ యథాపూర్వతన్ స్వర్గలోకాధిపత్యం బయత్నంబుగాఁ గల్గి యొప్పారు నద్దేవి మాహాత్మ్య మెన్నంగ మాబోట్లకున్ శక్యమే? దేవమౌనీంద్ర చూడామణీ! ౮౭౭

గీ॥ మూర్ధుఁడైనఁ గర్మసమూర్ధుఁడైనను మహా, దేవి నిటులు తృప్తిఁ జేర్చు నతఁడు రాజరాజసమత రాజరాజేంద్రుఁడై, యాచతుస్సముద్ర మవని నేలు.

మ॥ అని నారాయణమౌని పల్క విని భాషాధీశపుత్రుండు నీ వనఘా! సర్వగుణోత్తరుండవయి యజ్ఞాత్మావతారంబు చే కొని యొప్పారితి వీ వెఱుంగని కథాగూఢార్థము ల్లేవు గా వునఁ దత్పూజ పురాణమార్గముల నేర్పొల్కుమా బ్రశస్తంబుగన్. ౮౭౯

క॥ అని యడిగిన మునివాక్కులు, విని యవ్వల దీని నీకు వినుపింతుఁ దగ్రి యున్ ఘనవిధులం డెందేనియు, వినవలతే యన్న మౌని వివరించె నొగిన్. ౮౮౦

ఆ॥ దేవదానములను దేవి స్వాహాభిఖ్య, పైతృకముల స్వధయుఁ బరఁగు దక్షి ణాఖ్య దేవి పూజ్య యఖిలకర్మంబుల, వారిచరిత వినఁగవలయు ననిన. ౮౮౧

వ॥ నారాయణమౌనీంద్రుం డిట్లనియె.

సీ॥ ఆదికాలమునందు నాతురులయి సుర, లాహారకాంక్ష నబ్జాసనునకు నభివందన మొనర్చి యాఁకటఁ గ్రుస్సితి,మని నివేదించిన నబ్జభవుఁడు యజ్ఞస్వరూపుఁడౌ నచ్యుతునకుఁ దెల్ప, నతఁడు కళారూపి యగుచు నధ్వ రమ్ములలో హవిర్భాగంబు గల్పింప, నట్టులు ద్విజబాహుజాదు లొసఁగ

ఆ॥ నతివిషణ్ణు లగుచు నమరులు గైకోక, యబ్జజునకుఁ దెలుప నతఁడు హరిని శరణ మొంది పూన్ప శార్ఙ్గి శాసనముచేఁ, బ్రకృతి సర్వశక్తిభరిత యగుచు.

గీ॥ భక్తుల ననుగ్రహింపంగ భావ మలరి, మందహాసమ్ము నెమ్మోము నందగింప విధికిఁ బొడఁజూపి వరమిత్తు వేఁడుమనిన, బ్రహ్మయిట్లని పలికె నా ప్రకృతితోడ.

క॥ దేవీ! నీవు దయామతి, పావకునెడ దాహశక్తిభావముఁ గని స ద్భావమున నిలిచియుండుము, పావని! నాయందుఁ గరుణపాటిలె నేనిన్. ౮౮౪

క॥ నీ నామపూర్వకము భువి, నే నరుఁడు హవిస్సు నొసఁగు నిష్టముగాఁ ద న్నానావిధహవిరాద్యులు, మానక సురలెల్లఁ గొందురు మానితలీలన్. ౮౮౫

క॥ ఇట్టులు విధి వేడిన య,ప్పట్టున నాపరికృతి మెచ్చి ౯ పావకు నెడలన్
గట్టువడి నిలిచె నవ్విధి, కట్టుగ సురలకును భుక్తిఁ ౯ గలిగించె మునీ. ౮౮౬

వ॥ మఱియుఁ గొండొక యవాంతరవిశేషంబు గలదు వినుము.

గీ॥ పరికృతి తమ్మిచూలి ౯ పలుకులు విని విష,ణ్ణాంతరంగ యగుచు ౯ నాత్మఁ బొగిలి
వనజగర్భుతోడఁ ౯ దనయభిప్రాయంబు, దెలిపె నిట్టు లనుచుఁ ౯ దేటపడఁగ.

సీ॥ ఏను గృష్ణునకును ౯ నిల్లాల నగుకోర్కిఁ, దప మొనర్చెద నన్యథా మనమ్ము
గలదె? నా కిప్పుడు ౯ కర్తవై నీవుండ, హర్తయై శివుఁ డుండ ౯ నహివిభుండు
సర్వంబు భరియింప ౯ సాక్షియై ధర్ముండు, వర్తింప సురలచే ౯ వరసపర్య
లంది గణేశుఁ డానందియై చెలువొంద, నని పల్కి యా జగజ్జనని కడఁగి

గీ॥ యేకపదమున నిలిచి తా దేకనిష్ఠ,లక్షవర్షంబులను సురాలభ్యమైన
కృష్ణదర్శన మొనరించి ౯ తృష్ణ పేర్మి, వలచిమూర్ఛమునింగె నవ్వారిజాక్షి. ౮౮౯

మ॥ తదభిప్రాయ మెఱింగి శౌరి, ముదితా! ౯ తాపంబు నీ కేల మ
ద్హృదయాంభోజమునన్ వసింపు మని కూర్మిన్ వక్షమున్ జేర్చి నీ
మది నిశ్చింత వహింపు స్వాంశమునఁ బ్రేమ న్నాగ్నజిత్యాఖ్యచే
మదనుకోరికత భార్య వయ్యెదవు భామాలోకరత్నంబవై. ౮౯౦

క॥ ఇప్పుడు వహ్నిముఖమ్మునఁ, జొప్పడి దాహాఖ్యశక్తి సూచిత వగుచున్
గుప్ప లగు హవిర్ద్రవ్యము, లొప్పుగ వేల్పుల కొసంగు ౯ టుచితము నీకున్. ౮౯౧

ఉ॥ పేరిమ ధనంజయుండు నినుఁ ౯ బెద్దగ మన్ననఁ జేసి యేలు సు
త్రామముఖామరుల్ నిను సదారతఁ బూన్తు రటంచుఁ దెల్పి యు
ద్దామనిజాత్మభూతివితతప్రభ నింగి నదృశ్యమైన య
చ్చో మహితాత్ముఁడౌ శుచియుఁ ౯ జూడఁగ వచ్చె విరించిచెంతకున్. ౮౯౨

గీ॥ వచ్చియవ్వార్త తెలిసియవ్వారిజాక్షు,నాజ్ఞఁగొని దేవిఁబూజించియదియు మొదలు
దివ్యవర్ష శతంబులు ౯ దేవి నేలె, నిర్జనస్థలులందు సన్నిహితుఁ డగుచు. ౮౯౩

ఉ॥ అంతట గర్భమయ్యెను హుతాశన సంగతి దాహశక్తికిన్
జింతితసిద్ధి యౌనటులు ౯ చేరిక ద్వాదశవత్సరంబు దు
ర్దాంతత గర్భభారము యథావిధి మోచి మనోహరాంగులన్
శాంతుల దివ్యమూర్తులను ౯ శాంతతపఃప్రతిభాగవిర్తులన్. ౮౯౪

గీ॥ దక్షిణాగ్నియు గార్హపత్యంబు ననఁగ, నిరువు రాహవనీయంబు ౯ నెసక మెసఁగ
ముప్పురగు నందనులఁ గాంచె ౯ మునులు సుర్లు, మెచ్చ నద్దేవి పావకాప్రమేయశక్తి.

సీ॥ స్వాహాంతముగ మనూచ్చారణం బొనరించి, వేల్పులెల్లను హోమవిధులు సల్పి
రవని స్వాహాయుక్తమగు మంత్రి మెవ్వాఁడు, చేకొను నతనికి సిద్ధిగలదు
విషవిహీనంబైన విషధరంబునుబోలె, విద్యలేనట్టి భూవిబుధుపోల్కి-
బతిభక్తిమాలిన భామినీమణి రీతిఁ, బురుషత్వ మెడలినపురుషుమాడ్కి-

తే॥ ఫలములును పుష్పములులేనిపాదపముల, కరణి స్వాహావిహీనమైకర్మఫలము
నొసఁగఁజాలదుమంత్రంబుయోగ్యమగుచు, మంత్రపటలంబుస్వాహాంతమానితంబు.

వ॥ మఱియు సామవేదోక్తంబగు స్వాహాస్తోత్రి పూజావిధానంబు వివరించెద వినుము.
యజ్ఞారంభంబుల, సాలగ్రామంబులనేని, కలశంబులనేని స్వాహను బూజించి, మంత్ర
సిద్ధిస్వరూపిణీ, కర్మఫలప్రిదాయినీ, స్వాహా యని ధ్యానంబొనర్చిన నియతంబగు
సిద్ధింబొందు 'ఓంహ్రీంశ్రీం వహ్నిజాయాయై దేవ్యైస్వాహా' అనుమంత్రంబున నభీష్ట
సిద్ధియగు, స్వాహ, వహ్నిప్రియ, వహ్నిజాయ, సంతోషకారిణి, క్రియ, శక్తి,
కాలధాత్రి, పరిపాకకరి, ధ్రువ, గతి, దాహిక, దహనక్షమ, సంసారసారరూప,
దేవపోషణకారిణి, ఘోరసంసారతారిణి, దేవజీవనరూప యను పదియాఱు
నామంబుల స్తుతియించిన, నిహపరంబుల సర్వసిద్ధి యగు, నీసిద్ధికతన భార్యాపుత్ర
హీనులు రంభాశక్రితుల్యు లగు జాయానందనులు గలిగి సుఖింతురు, సత్యంబని
పల్కి, నారదా! పితృతృప్తికరంబును, శ్రాద్ధఫలవర్ధనంబును నగు స్వధో
పాఖ్యానంబు వివరించెద నని యిట్లనియె. ౯౯౭

సీ॥ ఆదికాలమునందు నంభోజగర్భుండు, పితృనప్తకంబుఁ గల్పించి వారి
వేదమూర్తుల మహావీర్యులఁగాఁ జేసి, యాహారకల్పనం బూహఁదలఁచి
శ్రాద్ధభోజులుగాఁగ సంధాన మొనరించె, స్నానంబు తర్పణాంతంబు, దేవ
పూజ శ్రాద్ధాంతంబు పుడమి నాహ్నికముత్రి, సంధ్యంబటంచును జాటుశ్రుతులు

గీ॥ సంధ్యయును శ్రాద్ధమును బితృసమితి దేవ, సమితివాచంయమాంతికసమితి విడుచు
విప్రునకు ముక్తిలేదని వేత్త లనిరి, వారు విషహీనభుజగుల వంటివారు.

క॥ పరదేవ్యర్చాహీనులు, హరిభుక్తవిహీను లశుచి కాలయములుగా
ధరఁ బరఁగుదు రాదేహం, బరయఁగ నీ నాల్గు ద్విజుల కావశ్యకముల్.

వ॥ మఱియు నాదికాలంబున, ౯౦౦

క॥ పితరులు ముక్తిం బొందెకు, నతిశయమున జనులు పిండ మవని నిడరు న
ప్పితరులును గొనరు నిట్టులు, కతిపయకాలంబు జరుగఁ గమలజునభకర్.

సీ॥ ద్విజులు విషణ్ణులై గజిబిజిపడుచు నం, భోజగర్భునిఁ జూచు మోదమునను
జని యా యుదంతంబు సారసగర్భుతో, నెఱిఁగించి దేవ యింకెంటిఁ బితరు

లార్తులై యున్నారఁ గలవని వారలకును, నెవ్వారు పిండంబుఁ గిడరు పిండ
మిడిన వారలు గొనఁగఁబడుగక యన్యోన్య, మావహించెను మనోవ్యథలు వీని

తే॥ నణఁచు గతిదెల్పు మనిన నయ్యబ్జజుండు, మానసికసృష్టిచే నొక్కమానవతిని
గల్పన మొనర్చి త్రిజగత్ప్రకాశితముగ, దివ్యరమణీయరూపంబుఁ దెఱవ కొసఁగి

క॥ శతచంద్రసమానన సం,తతగుణఘన రూపవతి సుధానిధి రేఖా
ప్రతిమాన రత్నభూషా,ప్రతతోజ్జ్వల ప్రాకృతాంశఁ భాసిలుదానిన్. ౯౦౩

క॥ స్వధ యను నామం బిడి నీ, వధరీకృత సర్వనిర్జరాంగనవై నీ
కధినాథతఁ బితరులఁ గొని, యధికప్రీతిని వసింపుఁ మని పితరులకున్. ౯౦౪

ఉ॥ ఇచ్చిన వారుఁ జేకొని యహీనముదమ్మును బొంది రిచ్చమై
నిచ్చలు నెవ్వరేనియు ననిందితలీల స్వధాంతమంత్రబీ
జోచ్చరితంబుగా నిడినఁ నొయ్యనఁ బిండములన్ గ్రహించి స
ర్వోచ్చపదంబు గాంతురు సమున్నతులై పితృదేవవర్గముల్. ౯౦౫

క॥ అదిమొదలుగ జను లెల్లను, విదితస్పృహఁ బిండమిడిరి పితరుల కెల్లన్
ముదమొందె నుభయపక్షము, లిదియ స్వధాచరిత మెఱిఁగితే! మత్పూర్తిన్.

క॥ దేవతలకు స్వాహాయుఁ బితృ, దేవతలకు స్వధయు నగుటఁ దెల్లము క్రతుసం
భావితదక్షిణ ధరణీ, దేవులు తత్తద్విధుల్ విధింతురు వహ్నిన్. ౯౦౬

వ॥ ఇత్తెఱంగున స్వధోపాఖ్యానంబు ప్రవర్తిల్లు. సామవేదోక్తంబులగు తద్ధ్యాన
స్తోత్రంబులు సర్వసమ్మతంబులు. నీ వెఱుంగనియది లేదైనను నెఱిఁగించెద.
కన్యాకృష్ణ చతుర్దశీ మఘాప్రభృతి శ్రాద్ధ దినంబుల స్వధాపూజనం బొనర్చి
శ్రాద్ధం బొనర్పవలయుఁ గాదేని నిష్ఫలంబగు. పితృపూజ శ్రాద్ధఫలదంబుగాన
సాలగ్రామంబునం దేని స్వధావాహనం బొనర్చి ప్రణవమాయామదనబీజాద్యం
బుగా మంత్రం బుచ్చరించి పూజించి నమస్కరించిన వాంఛాప్రదంబును, గంగాతీర్థ
స్నానఫలదంబును నగు, స్వధాస్తోత్రపాఠం బొనర్చిన వాజపేయఫలంబు గలదు,
అశక్తుండేని త్రివారంబు స్వధోచ్చారణంబున శ్రాద్ధఫలంబునొందు, శ్రాద్ధకాలంబున
స్వధాస్తోత్రంబు వినినను శ్రాద్ధశతఫలంబు గలదు. పితృప్రాణతుల్యా, ద్విజజీవనరూపిణీ,
శ్రాద్ధాధిష్ఠాతృ దేవీ! శ్రాద్ధఫలప్రదా, బ్రహ్మమానసకన్యా, పితృతుష్టిప్రదా, ద్విజప్రీతి
కరీ, నీవు నిత్యవు, సత్యవు, పుణ్యవు. ఆవిర్భావతిరోధాన సృష్టిస్థితి సంహార
క్రమంబుల నిఖిలశక్తిరూపిణివై వేదంబులఁ బ్రసిద్ధవు, శ్రీకృష్ణుండు వక్షఃస్థలం
బున ధరియించుటవలన స్వధవై సురతతృప్తవుగాక, గోలోకం బుడిగి విశ్వంబున
బృందావనంబునఁ గృష్ణాలింగనం బొనర్చి తత్పుణ్యంబున బ్రహ్మకన్యవై రతిం

దృప్తిం గొనక స్వధానామంబున ఫలచతుష్టయంబు నొంది, రాధికాసఖివై గోకులం బునఁ గృష్ణునితో రాసక్రీడాభోగం బనుభవించి రాధికచే శప్తవై విశ్వంబున కేతెంచి కృష్ణాలింగనపుణ్యంబున వహ్నికామినివై సుశీల యను నామంబున నామోచ్చారణమాత్రంబున దురితహరణం బొనర్చుచుఁ గృష్ణపార్శ్వంబున వసించి పిదపఁ దచ్ఛాపంబున విశ్వంబున కేతెంచి దక్షిణవై వల్లభుదక్షిణభాగంబున నుండుటవలన దక్షిణవైతివి. నిన్నుం జేకొని పితరులు హర్షంబునం బొదలి రని నుతించి ఫలసిద్ధి గాంతు రని తెల్పి, స్వాహాస్వధాఖ్యానంబులు వింటివి గదా! దక్షిణాఖ్యానంబు వినుమని యిట్లనియె. ౯౦౮

సీ॥ గోలోకమునను సుశీలయన్ గోపిక, హరికిఁ బ్రేయసియౌచు నలరుదాని
రాధ మన్నించు నారామ మనోహర, సుందరి సుశ్రోణి సుభగ సుదతి
సుస్తని గుణవతి సుగుణ కళావతి, తామరసాక్షియుఁ గోమలాంగి
హాసప్రసన్నాస్య యమలరత్నవిభూష, శ్వేతచంపకవర్ణ శిశిరచిత్త

ఆ॥ కామశాస్త్రనిపుణ కామిని మదహంస,గమన యిట్టి రూపకలన గలిగి
రాధపార్శ్వమునను రమణుండు కృష్ణుండు, హితమొనర్ప నిలుచు నెల్లయెడల.

ఉ॥ వల్లభుఁడైన కృష్ణు డనివారణచాతురి నాత్మసన్నిధిన్
దెల్లముగాఁగ నీపె వసతిన్ గొనియుండుట రాధ కీసు సం
ధిల్లు నటంచు బెగ్గడిలఁ దీవ్రరుషన్ జని రాధ యొక్కెడన్
వల్లభు నిష్ఠురోక్తులను వంచన గొల్పఁగ వచ్చుచున్నెడన్. ౯౧౦

సీ॥ అతిభీతి శ్రీకృష్ణుఁ డంతర్ధి నొందుచుఁ, గాతరుండై పోవు కాలమునను
గోపికాకోటులు గోపకోటులుఁగూడ, నతిభీతినొంది కృతాంజలులయి
'రక్షింపు రక్షింపు రాధికా'యని పాద, పంకజంబులమీఁదఁ బడుచునున్న
నైకోక పరువెత్తు కాంతునితోఁగూడ, *ననుగమించుచు నున్న యతివఁగాంచి

తే॥ నేఁడుమొదలుగ గోలోకనివసనంబు, నీకు లేకుండుఁగాక యశస్తోకగతిని
వచ్చెదేనియు భస్మమై చచ్చెదనుచుఁ, దిట్టి యచ్చెంత శ్రీకృష్ణదేవుఁగనక.

గీ॥ విరహకాతరమై రాధ వివశయగుచు, నొక్కొకక్షణంబు కల్పశతోపమాన
ముగను విలపించి శ్రీకృష్ణమూర్తి! నిన్నుఁ, బాసి నిలువంగఁజాలఁ జేపట్టు నన్ను.

సీ॥ పతిదేవతలకెల్లఁ బతి బాంధవుం డధి, దేవుండు మాన్యుండు పావనుండు
ధర్మవర్ధకుఁడును ధనదుండు సుఖదుండు, శాంతిదుండును బ్రాణసఖుఁడు విభుఁడు

---

టిప్పణి. * అనుగమించుచు నున్న యతివన్ = సుశీల యనెడి గోపికను.

మాననీయుఁడుగాఁగ మాన్యుండు భరియించి, భర్త, పాలించియుఁ బతి శరీర
పాలనంబున స్వామి బంధుత బంధుండు, కామదానంబునఁ గాంతుఁ డగుచుఁ
తే॥ బ్రీతిదానంబుచేతను బ్రియతముండు, ప్రాణరక్షణకృతులచేఁ బ్రాణవిభుఁడు
రతుల రమణుండుగాన నిరంతరమును, వల్లభునిసాటి యగుదు రెవ్వారు జగతి.

గీ॥ దయితు రేతంబువలనన తనయు లగుటఁ,గాన నార్యులు పుత్రులకంటెఁ బ్రియుఁడు
ప్రియుఁడు పతిగా నెఱుంగని వెలఁది కులట, సర్వతీర్థోత్తముఁడు పతి సతులకెల్ల.

గీ॥ ఎన్ని పూజలు చేసిన నెన్ని వ్రతము, లాచరించినఁ బుణ్యాసమర్చనంబు
లెన్ని చేసిన గురుసీతు లెన్నియైనఁ, బతిచరణసేవతో సాటి వచ్చునొక్కొ.

క॥ దేవద్విజగురుసేవలు, భావింపఁగ లక్షమైనఁ బతిభక్తికి నీ
డై వెలయునె? ధరలోనన్, దేవుండు గురుండు నతఁడె తెలివల కెందున్. ౯౧౬

సీ॥ పతిభక్తి సతతంబుఁ బాయక మెలఁగినఁ, బ్రాణవల్లభుఁడు లోఁబడును సతికి
మదమత్తనై నేను మాధవు నెఱుఁగక, వైధుర్యమును బొంది వనటఁదవిలి
యలఁత నొందితి నని యతిఖిన్నయై బాష్ప,జలములు కన్నులఁ జాలుకొనఁగ
నిష్ఠురవ్యథ రాధ నిశ్చేష్టయైయుండఁ, బద్మనాభుఁడు కృపాభరితుఁడగుచు
తే॥ నెదుట రాఁజూచి మన్నించె నేపుదగిలి, *దక్షిణాదేవి శాపవిధ్వస్తయగుచుఁ
దపమొనర్చి రమాదేవి తనువునందు, సంక్రమించి వసించె నిశ్చలత మెఱయ.

వ॥ దక్షిణ యట్లంతర్ధి నొంది యుండునెడ. ౯౧౭

క॥ దేవావళి యధ్వరములు, గావించియుఁ దత్ఫలంబు గానక జడులై
దేవాధీశునిఁ గాంచి య,థావిధి విన్నపమొనర్పఁ దద్దయు వేడ్కన్. ౯౧౮

క॥ వారిజభవుఁ డాదిగ సుర,వారము శౌరికినిఁ దెల్ప వారిజనేత్రుం
డారయ దక్షిణఁ గనుఁగొని, వారల కర్పించె యజ్ఞవర్ధనకొఱకై. ౯౨౦

సీ॥ అద్దక్షిణాదేవి నంభోజగర్భుండు, యజ్ఞున కర్పించె నతిముదమున
భానుకోటిసహస్రభాసమానాంగిని, గమనీయగాత్రి నరకమలనయన
బింబోష్ఠి సుందరిఁ బృథుసైకతశ్రోణి, రత్నభూషణభూష్య రాజవదన
మునిమానసోల్లాస మోహనాంగి సువేణిఁ, గామదేవాధారఁ గమలచరణ
గీ॥ నట్టి పూఁబోఁడిఁ గాంచి మూర్చానుభావ,పారవశ్యంబు నొంది తత్ప్రాణనాథుఁ
డైన యజ్ఞుండు పూజించి యాపెఁగలసి, దివ్యవర్ష శతంబు సాధించెఁ గ్రీడ. ౯౨౧

టిప్పణి:- *దక్షిణాదేవి=సుశీలయను గోపిక. (ఆ గోపిక కిది నామాంతర మని తెల్పుడి)

ఆ॥ పదఁతిచూలుదాల్చి ( పదిరెండువర్షముల్, మోచి సుతునిఁగనియె ( ముజ్జగములు
మెచ్చ ఫలసమాఖ్య ( మెఱసె సత్కర్మల, కెల్ల ఫలము లొసఁగు ( నీశుఁడగుచు.

క॥ అద్దంపతు లక్కొమరుఁడుఁ, దద్దయు సుఖమంది రవని ( ధర్మంబులకుఁ
బెద్దయగు ఫల మొసంగుచు, నద్దయఁ బాలించెఁ గర్మకసాధుల నెల్లన్. ౯౩

చ॥ అమరులు సంతసించి నిలయంబుల కేగిరి తండ్రి ధర్మచే
విమలము నీయుదంతము సవిస్తర మొప్పగ వింటి ధాత్రిలో
నమలినవృత్తిఁ గర్మకరణైకసమర్థులు పూర్ణదక్షిణా
క్రమమున నాచరింపమిని ( గర్మఫలంబులు చెందఁబో రొగిన్. ౯౪

క॥ కర్మాంతంబున దక్షిణ, నిర్మలమతి నొసఁగిరేని ( నిఖిలఫలంబుల్
శర్మదములగుచు వారల, వర్మమువలెఁ గాచు సౌఖ్యవర్ధకము లగున్. ౯౫

వ॥ కర్మాంతంబున దక్షిణాదానంబు ముహూర్తసమతీతంబైన ద్విగుణముగ నొసంగ వలయు; నేకరాత్రంబు వ్యతీతంబైన శతగుణంబు, త్రిరాత్రవ్యతీతంబైన నద్దానికి శతగుణంబగు, మాసంబు వ్యతీతంబైన లక్షగుణకంబగు, సంవత్సరము వ్యతీతం బైనఁ ద్రికోటిగుణకంబై కర్మము సర్వస్వంబును నిష్ఫలంబగు. తత్కర్త బ్రహ్మ స్వహారియు, కర్మానర్హుండును, అశుచియు, దరిద్రుండును, వ్యాధియుక్తుండును నగు. వానివలన వహ్ని యాహుతిఁ గొనండు; బ్రాహ్మణుండు ప్రతిగ్రహింపఁడు. యాజ్యయాజకు లిరువురును ఛిన్నరజ్జుఘటంబులంబోలె నంధకూపంబునం బడుదురు. అట్టికర్త పిదపఁ గుంభీపాకంబున లక్షవర్షంబులు వసించి, చండాలుండై సప్తపౌరు షంబు పితృవర్గంబునుం బడఁద్రోసి దుర్గతిం బొరయు నని చెప్పి నారదా! యెద్ది విన వలతని యడిగిన నారదుం డిట్లనియె. ౯౬

సీ॥ దక్షిణాహీనమా ( తత్కర్మ మెట్టిది?, తత్ఫలభోక్త యే ( తరమువాఁడు?
దక్షిణాపూజావిధాన మెట్టిది? దీని, వివరింపు మనిన నవ్వేదమూర్తి
నారాయణుఁడు పల్కె ( నలినసంభవపుత్ర!, కర్మలు దక్షిణాంగములు సుమ్మ
దక్షిణాగ్రములైనఁ ( దగిన ఫలంబులు, కర్మంబు లొసఁగుఁ దత్కర్తలకును

తే. దక్షిణాహీనకర్మ వ్యర్థాశ్రమంబు, ఫలముల నొసంగ దిది వేదపఠితసూక్తి
అట్టి కర్మల ఫల మెల్ల ( నాహరించు, వాఁడు బలిచక్రవర్తి ధ్రువమ్ము నమ్ము.

వ॥ ఇట్లు వామనుండు మున్ను శాసించె నని మఱియును గణ్వశాఖోక్తంబగు దక్షిణా దేవీ ధ్యానంబును, స్తోత్రంబును, బూజయు, వివరించెద వినుము. తొల్లి లక్ష్మి చూలి విష్ణుప్రేరిత యగు దక్షిణం గొని తెచ్చి యజ్ఞున కొసంగె నని మద్వాక్యం బుల వింటివేకదా! అతండు తత్సౌఖ్యం బభిలషించి పూతుండై తద్ధ్యానస్తోత్ర

పూజావిధు లొనర్చె. తత్ప్రకారంబు వినుము. దేవీ! నీవు గోలోకంబున నుండు
గోపీరత్నంబవు, రాధకుం బ్రతినిధి యగు సతివి, కృష్ణప్రేయసివి. కార్తికపౌర్ణిమ
యందు రాసమండలమ్మున రాధామహోత్సవంబునం గృష్ణదక్షిణాంగంబున
సుశీలానామంబునం బొదలి రాధాశాపంబున గోలోకధ్వస్తవై మద్భాగ్యంబునం
గనిపించితివి. నన్ను దయం జూచి పతింగాం గొనుము. కర్మకర్తలకు ఫలదవు
గమ్ము. త్వద్విహీనంబగు కర్మ నిష్ఫలంబు, కర్మరూపియగు బ్రహ్మయు, కర్మ
ఫలస్వరూపి యగు మహేశ్వరుండును, యజ్ఞరూపి యగు కృష్ణుండును నీవ. ప్రకృతి
మయం బగు కృష్ణతత్త్వంబున వెలుంగు కర్త్రివి. నీతో నెనసి కర్మశక్తుండ నైతినని
నుతించె; నిది పఠించిన రాజసూయ గోమేధ నరమేధ లాంగల విష్ణుయజ్ఞ పుష్కర
పుత్రేష్టి గజమేధ స్వర్ణయజ్ఞ శివయజ్ఞ శక్రియజ్ఞ వరుణయాగ వైరిమర్దనసూచి
యాగ ప్రభృతి యాగంబులందు నిర్విఘ్నఫలంబు నొసంగు నని తెలిపి మఱియును
పూజావిధానంబు వినుము. సాలగ్రామమ్మునం దొండెం గలశమ్మునం దొండె
లక్ష్మ్యంశసంభూతురాలైన దక్షిణాదేవి నాగమోక్తవిధానంబున నావహింపం జేసి.

తే॥ విధివిధానంబుగాఁగ భా✽వించి ప్రణవ, భార్గవీకామమాయాది✽ప్రథితబీజ
సహితముగ నంతమున వహ్ని✽జాయఁ గూర్చి, దక్షిణాసంప్రదాన మం✽త్ర్యంబుగాఁగ.

గీ॥ మూలమంత్రంబు జపియించి✽మోదమునఁ దదీయ పూజావిధానంబు✽ తెఱఁగుసలుప
భుక్తిముక్తుల నొసఁగు న✽బ్భువనజనని, దక్షిణాఖ్యాన మిది సుమ్ము✽తాపసేంద్ర!

సీ॥ ఈ దక్షిణాస్తోత్ర✽మెవ్వఁడేని పఠింప, నంగహీనునకును ✽ నంగపటిమ
పుత్రులు లేకున్నఁ ✽ బుత్రసంపద గల్గు, గుణహీనునకుఁ గల్గు ✽ గుణసమృద్ధి
దారహీనునకు సుం✽దరి వరారోహయుఁ, గులజ పతివ్రత ✽ కోమలాంగి
తరుణి సిద్ధించు వి✽ద్యాహీనునకు విచక్షణత గలుగు ✽ భిక్షుకుండు

తే॥ ధనికుఁడగు భూవిహీనుండు ✽ ధరణిపుఁడగు, సంకటంబులఁబడు నెట్టి ✽ జాతియైన
బంధవిచ్ఛేదనముఁ జెంది ✽ పరుల నణఁచి, స్వేచ్ఛ వర్తించు ముక్తి సం✽సిద్ధినొందు.

గీ॥ అనిన ముదమంది యబ్జగ✽ర్భాత్మజుండు, బహువిధాఖ్యానములు విని✽ప్రమద మొంది
నాఁడ, శక్తులచరిత మెం✽తయును వినఁగఁ, గోరితిని దెల్పుమన్న న✽ప్పారికాంక్షి.

గీ॥ ఎల్లశక్తుల మహిమంబు✽లేను వింటి, నిగమముల వేఱువేఱ న✽నింద్యవృత్తి
నే మహాదేవి చరితమ్ము ✽ నిచ్చఁ దలఁచి, యున్నవాఁడవు తెల్పుమ✽టన్న మౌని.

సీ॥ బాలాదిదేవతా✽ప్రవర మహామాయ, బాలఘ్న, బాలద, ✽ ప్రాణధాత్రి
దేవమాతృక, షష్ఠి,✽ దేవసేనాభిధ, శక్తిధరయుఁ బ్రాణ✽సమ యటంచు
దెలుపంగ విందు ని✽ద్దేవి యుపాఖ్యాన, మెఱిఁగింపు మనిన న✽వ్యోడఁ దపస్వి
శిశుపార్శ్వనిలయయా ✽ సిద్ధయోగిని బాలరక్షణోత్సుక సర్వ✽దక్షు దేవ

తే॥ సేనపూజావిధానంబు చిన్నవాఁడ, నగుచు మాతండ్రి దెలుప నొయ్యన నెఱింగి
నాఁడ సుఖదంబు నది పురాణ ప్రసిద్ధ, మెఱుఁగఁ జేసెద వినుమని యిట్టులనియె.

క॥ స్వాయంభువాత్మజుఁడు ది,వ్యాయత తేజస్వి యగు ప్రియవ్రతుఁడు తపో
వ్యాయత్తచిత్తుఁడయి భా,ర్యాయోగ విరక్తి నొంది యాదటఁ బిదపన్. ౯ ౩౧

సీ॥ అంభోజగర్భుని యాజ్ఞఁ బెక్కేండ్లకుఁ, బరిణయంబై భోగపరతఁ దవిలి
కామోపభోగసౌఖ్యప్రలుబ్ధతఁ జాల, కాలంబు గడపియుఁ గాలవశత
ననపత్యుఁడై తనయాభిలాషంబునఁ, బుత్రేష్టి సేయంగఁ బూని మౌని
కశ్యపు నధ్వర్యుఁగాఁ బెట్టుకొనె మౌని, జ్వలనంబు వేల్చి తజ్జన్యచరువు

తే॥ కాంత కొసఁగిన నబ్బోటి గర్భభార, మూని ద్వాదశవత్సరానూనభార
పరత సంభూతమై యొక్కపట్టిఁ గనియె, సకలజనతతి సంతోషసాంద్రులుగను.

వ॥ అయ్యర్భకుండు కనకప్రభుండును, సర్వావయవసంపన్నుండును సారసలోచనుండును, నతిమనోహరాంగుండును నయ్యుఁ బుట్టిన యుత్తరక్షణంబునన మృతుం డగుట దెలిసి సర్వజనంబులు దుఃఖించిరి. తల్లి పుత్రశోకంబున మూర్ఛఁ బొందె. జనకుండు బాలకుం జేకొని పితృవనంబునకుం జని యక్కాంతారంబునఁ దనయుని వక్షంబున నిడుకొని ప్రాణపరిత్యాగంబున కుద్యుక్తుండైన నయ్యెడ నొక్క మహాదేవి దివ్యవిమానంబున నధివసించి ప్రసన్నయైన నాపెను బూజించి తల్లీ! నీ వెవ్వరు? నీ వెవ్వరి తల్లివి తెలుపుమనిన మంగళ చండికారూపిణి యగు దేవసేన, యేను దైత్యగ్రస్తు లగు నిలింపుల రక్షించుశక్తిని, బ్రహ్మ మానః కన్యను, నన్నుఁ దమ్మికంటి భార్యగా గుహున కర్పించె. షష్ఠియను దేవమాతనై మహాప్రకృతిషష్ఠాంశంబునఁ బ్రవర్తించెద; దరిద్రులకు ధనంబును, ననపత్యులకుఁ బుత్రులను నొసంగుదు. సుఖదుఃఖ భయశోక హర్షమంగళ సంపత్తి విపత్తులు జీవులకుఁ గర్మవశంబునఁ బ్రాప్తవ్యంబు లని తెలిపి సజీవుం జేసి యయ్యర్భకుం జేకొని గగనంబున కెగయసమకట్టినఁ బ్రియవ్రతుండు శుష్కకంఠోష్ఠతాలుకుండై మొఱఁబెట్టిన నద్దేవి నన్నుం బూజింపుము, నీకుం బుత్రు నొసంగెద ననియు నా యీ నందనుండు సువ్రతుం డనుపేర గుణవంతుండును, బండితుండును, నారాయణసముండును, లక్షమాతంగబలుండును, ధనియు, గుణియుఁ దపస్వియుఁ జాత్రయు, దాతయుఁ గాఁగలం డనియుఁ బలికి యంతర్ధి నొందిన. ౯ ౩౨

సీ॥ మానవేశ్వరుఁ డాత్మమందిరంబున కేగి, యవ్వార్తలెల్ల జనావళులకుఁ
జెప్పిన సంతుష్టచిత్తులై వారలు, సంతసిల్లిరి రాజు సదనమునను
బ్రతిమఁ గావించి యప్పావనిఁ గౌమారి, షష్ఠిఁ బూజించుచు జనపదముల
నగరంబులందు [illegible] పూజలు, [illegible] జేసి [illegible]యమును నూతి

గీ॥ గృహములందును శుభముల¤నహరహంబు, పూజ లొనరింపఁ జేసె స¤త్పూజనంబు
విధముఁ దెల్పెద వటమూల¤వేదియందుఁ, బయివితానంబు సంధించి¤ప్రతిమనిలిపి.

గీ॥ పుత్రపౌత్రప్రవర్ధని! ¤ భువనజననీ!, శ్వేతచంపక వర్ణాభ¤సిద్ధి! పూజ్య!
దేవసేనామహాదేవి! ¤ దేవమాత!, యనుచు శీర్షంబునందుఁ బు¤ష్పాక్షత లిడి.

వ॥ షోడశోపచారంబులఁ బూజించి 'ఓం హ్రీం షష్ఠీదేవ్యై స్వాహా' అను మంత్రంబు జపించి యుపహారం బొసంగవలయు, నిమ్మంత్రంబు లక్ష జపియించినఁ బుత్రసిద్ధి యగునని బ్రహ్మ నిశ్చయంబుగ వచించె, నిట్టులు తొల్లి తమ్మికంటి యద్దేవి నుతియించె, నా స్తోత్రంబు పఠియింపవలయుఁ, దత్ప్రకారంబు మహాదేవి సిద్ధి శాంతి, మాయ, షష్ఠాంశరూప, సిద్ధయోగిని, తుషార, శారద, పర, పూజ్య, స్కందకాంత, సర్వకర్మఫలప్రద, దేవరక్షణకారిణి, సత్త్వస్వరూప, నరవందిత, క్రోధహింసారహిత, షష్ఠీదేవి మాకు ధనంబును, ధర్మంబును, నయంబును, గల్యాణంబును, భూమియు, విద్యయుఁ బుత్రులను నొసంగుమీ యని నుతించె. కావునఁ బ్రియవ్రతుం డిత్తెఱంగునఁ బఠియించి కృతార్థుం డయ్యె. ఏకవర్షం బెవ్వఁడేని తన్మంత్రంబు పఠియించిన నతండు వీరపుత్రునిం బడయు నియ్యది షష్ఠ్యుపాఖ్యానంబు; మఱియు మంగళచండికోపాఖ్యానంబు వచించెద విను మని యిట్లనియె. ౯౮౦

ఉ॥ మంగళచండికాస్థితి య¤మానుషమాఁగద తత్సమర్చనా
సంగతి ధర్మవక్త్రిమున ¤ సర్వము విన్న తెఱంగుఁ దెల్పెదన్
సాంగముగా వినందగు న¤పాకృతమా దురితంబు వాంఛితా
భంగసమృద్ధిఁగూర్చు నన¤పాయ మొసంగును సర్వసిద్ధికిన్. ౯౮౧

సీ॥ సర్వకామములెల్ల ¤ సంఘటింపఁగ దక్ష, తత్పూజ సర్వసం¤ధానకర్త్రి
మంగళవాసర¤మందుఁ బూజించుట, సర్వసిద్ధిప్రద¤స్థానకంబు
మనువంశతిలకంబు ¤ మంగళుం డనెడు స, ప్తాంతరీపవిభుండు ¤ హరిసమానుఁ
డతనిచేఁ బూజల ¤ నందుట మంగళ, చండికానామంబు ¤ సంభవించె

తే॥ దేవి మూలప్రకృతి నాఁగఁ¤ దెలియవలయు, భక్తకారుణ్యమూర్తి యా¤ప్రకృతిమూల
భేదమున సృష్టిమూలమై¤పెంపుఁ గనియెఁ, బ్రథమపూజిత హరునిచే ¤ బాసలేల.

గీ॥ త్రిపురసంహార మొనరింప¤దేవదేవుఁ, డలికనేత్రుండు పూజించె ¤ నసురనాశ
కర్మ మొనరింప బ్రహ్మయుఁ¤గంజనేత్రుఁ, డెలమిఁ బోధింపఁ బిదప మం¤గళపరాంబ.

మ॥ ఎదుటన్ నిల్చి మహేశుతో ననియె నీ ¤ కింతేల చిత్తంబునన్
గదిరెన్ విస్మయ మేను గల్ల ననిలో¤గ్రవ్యాధులన్ గూల్చు దు

ర్మదులే యాశరు లస్మదాజ్ఞ భయసంభ్రాంతుండ వాఁటేల? నీ
కెదురే? ముజ్జగముం గలంచు హరి తోడఁడిప్పాట మృత్యుంజయా. ౯౪౪

గీ॥ అనుచు నంతర్హినొంద నయ్యబ్జభవుఁడు, తోడుగా శంకరుఁడు మహాయుద్ధరవరాక్ర మక్రిమంబున నసురుల నాహవమునఁ, జంప నుంకింప విష్ణుండు శస్త్రమయ్యె.

ఉ॥ అయ్యెడఁ దచ్ఛరంబున మహాహవదీక్ష వొసంగి శంభుఁ డ
క్కయ్యములోన దైత్యపురఘస్మరుఁడై చెలువొంద వేలుపుల్
చయ్యన భక్తినమ్రులయి శంభుని సన్నుతిఁ జేసి రాకస
మ్మొయ్యనఁ బుష్పముల్ గురిసె నుజ్జ్వలతన్ వెలుఁగొంది రెల్లరున్. ౯౪౬

గీ॥ హరివిరించులు మది సంప్రహర్షమొదవ, వేయు విధముల శంకరు వినుతిఁజేసి రళికలోచనుఁ డాత్మ నత్యంతనిష్ఠ, సలిపె నర్చన మంగళచండికకును. ౯౪౭

క॥ పాద్యార్ఘ్యాచమనాదుల, హృద్యంబగు పుష్పపూజ నిచ్చఁగొలఁది స
ద్వేద్యయగు దేవిఁ బూనిచి, సద్యఃఫలద యగు దేవి సద్భక్తిమెయిన్. ౯౪౮

సీ॥ మృదువులై రుచిగల్గు మేషమాంసంబుల, మద్యరసలులాయమాంసములను
మఱియు గండకురంగమత్స్యమాంసంబుల, గంధోత్తమసుగంధగంధిలముగ
నుపహార మర్పించి యురుతరకదళికా, ఫలముఖ్యములు సమర్పణముఁ జేసి
వస్త్రాద్యలంకార వస్తువు లర్పించి, పాయసఫేనికాపటలి యొసఁగి
తే॥ దివ్యసంతృప్తి గూర్చి యుద్దీర్ణనృత్త, గీతవాద్యధ్వనులఁ జారు కీర్తనముల
సన్నుతి యొనర్చి వేదోక్తసరణిఁ ద్రిపుర,హరుఁడు మంగళచండిక కర్చ సల్పి.

సీ॥ ప్రణవమాయారమాప్రసవసాయక బీజ,వర్గంబుగూర్చి యవ్వలను సర్వ
పూజ్యయు దేవియుఁ బొసఁగ మంగళ చండి,కయు ననునామముల్ గలిపి వాని
సంబుద్ధి లోఁగూర్చి సరగ*హుంహుం ఫటు, స్వాహా యన్వాక్యంబుసంఘటించి
యేకవింశతికార్ణ మిమ్మంత్రము జపించి, దశలక్షజపసిద్ధిఁ దనరి మంత్రి
గీ॥ సిద్ధుఁడయి సర్వదేవప్రసిద్ధుఁడయ్యె, దేవదేవుండు పదపడి దేవదేవి
ధ్యాన మది తెల్పెద నెఱుంగుధాతృనిర్మి,తంబు వేదమయంబును దాపసేంద్ర.

సీ॥ స్థిరయౌవనయు సుదతియు సుబింబాధర, శరదిందునిభవక్త్ర చారునేత్రి
మందహాసముఖారవింద జగద్ధాత్రి, సర్వధాత్రీశ్వరి చారుచరణ
సంసారసాగరోచ్చాటనమంత్రమ్ము, మునితపోరూపిణి మోక్షజనని
షోడశవర్షయు సుభగ సుశీలయు, నని ధ్యాన మొసరింప నగు సురేశి

---

* టిప్పణి: పద్యములో ననువదించుటచేతనో యేమో మంత్రాక్షరములు భేదించినవి. మూల గ్రంథమున నున్న విధమిది—(ఓం హ్రీం శ్రీం క్లీం సర్వపూజ్యే దేవి! మంగళచండికే! హుం హుం ఫట్స్వాహా. తుట్టతుదిని ఫటు అనుటచే 21 వర్ణములమంత్రము 22 గావలసివచ్చిన దని యెఱుఁగనగు.

గీ॥ నెవ్వఁడేనియు నీధ్యాన ✱ మెలమి మిగుల
నెద నొనర్చిన నతఁడె సంపదల నెళవు
మఱియుఁ దత్స్తోత్రి మెఱిఁగింతు ✱ మానివర్య!
యార్తుఁడై శంభు డొనరించె ✱ నదియు వినుము. ౯౫౧

సీ॥ రక్షించు రక్షించు ✱ రక్షోవిమర్దని, సర్వేశి మంగళ ✱ చండికాంబ
పాలింపు పాలింపు ✱ భవసరస్వత్తరి, సర్వజ్ఞ మంగళ ✱ చండికాంబ
జయ మిమ్మ జయ మిమ్మ ✱ సర్వలోకశరణ్యా, సారజ్ఞ మంగళ ✱ చండికాంబ
కరుణింపు కరుణింపు ✱ కాంచనోజ్జ్వలగాత్రి, జగదాత్మ మంగళ ✱ చండికాంబ

తే॥ మంగళము మంగళాలయ✱మహితపూజ్య, మంగళము సర్వమంగళ ✱ మంగళాంగి
మంగళము మంగళార్హ్వ మహన్మాతృరూప, మంగళము మంగళాధార✱మంగళాంబ.

గీ॥ ఇట్లు సన్నుతిఁ జేసి యహర్ధేందుధరుఁడు, వారవారంబు మంగళ✱వారములను
బూజ యొనరించి వాంఛిత✱పూర్ణుఁడగుచు, నిష్టములు సెందెలోక మహ✱హిష్టుఁడగుచు.

వ॥ మఱియుఁ, దత్పూజారంభంబునఁ బ్రథమవారంబున సర్వమంగళ యనియును, ద్వితీయవారంబున మంగళగ్రహరూపిణి యనియును, దృతీయవారంబున మంగళ నృపపూజితయనియును, జతుర్థవారంబున మంగళసుందరి యనియును, బంచమ వారంబున మంగళకాంక్షిణి యనియును, షష్ఠమంగళవారంబున మంగళమూర్తి యనియును, సప్తమవారంబున మంగళ చండిక యనియును బూజింపవలయు, నిత్తెఱంగున దేవ, ఋషి, మానవ పూజార్చితయయ్యె; నీస్తవంబు శుభదంబును ఆయుర్భాగ్యపుత్రపౌత్రాభివర్ధనంబును నగుచుండు. ౯౫౨

సీ॥ మానివల్లభ! నీవు ✱ మంగళాధ్యానంబు, వింటివి నిగమైక✱విశ్రుత మగు
మానసాఖ్యానంబు ✱ మఱి విను ధర్మముఖంబున నే వింటిఁ ✱ గశ్యపునకు
మానసోద్భూతయై ✱ మహిఁ బూజ్యతరయయ్యెఁ, గన్యకారూపిణి ✱ కమలనయను
మనమునఁ బొడముట ✱ మానసయై దేవి, వర్తిల్లె భువనైక✱వంద్య యగుచు

గీ॥ నమ్మహాదేవి ద్వియుగ మాత్మైకనిష్ఠఁ, గృష్ణుగుఱియించితప మొనర్చెనుయ థేచ్ఛ
నొక్కతఱి నమ్మహాదేవి✱యొద్దకు హరి, తా జరత్కారుఁడై వచ్చి ✱ తరుణిఁగాంచి.

గీ॥ వాంఛితంబెద్దియని పల్కి✱నలయుకోర్కు, లొసఁగి పూజించి యద్దేవి✱ననిచికొనిమె
నాభిచక్రింబునను సదా✱నంద యగుచు, నిలిచి పూజితయయ్యె న✱న్నీరజాక్షి.

క॥ సురనరపన్నగలోక, స్థిర వాసిని యగుచు మును✱లచేఁ బూజితయై
కరమలరె జగద్గౌరీ, స్థిరనామముఁ గాంచె భక్త✱సిద్ధిప్రదయై. ౯౫౩

క॥ శివపూజారతయాటను, శివశక్తి యనంగఁ బరఁగె ♦ శ్రీపతిపూజో
త్సవ యగుట వైష్ణవియునై, ప్రవీణయై యొప్పె భక్తపాలనచర్యన్. ౯౫

క॥ పారిక్షితు నధ్వరమున, సారకృపోద్భూతి సర్పసంరక్షణియై
ధారుణి నాగేశ్వరి యను, పేరన్ విషహంత్రియగుచుఁ ♦ బేర్మిఁ జెలంగెన్. ౯౬

సీ॥ సిద్ధయోగిని యయ్యె ♦ సిద్ధయోగముల వి, జ్ఞానయోగిని యయ్యె ♦ జ్ఞానమహిమ
మృతుల సంజీవింప ♦ మృతరక్షిణియటంచు, విఖ్యాతిఁ గనియె నవ్విశ్వజనని
ధర్మవర్తన జరత్కారు నిల్లాలౌచు, నాస్తికమాతయై ♦ యలరె జగతిఁ
గశ్యపహృదయాబ్జకల్పిత యాటచే *మానసకన్యయై ♦ మహిఁ జెలంగె

తే॥ నమ్మహాదేవిఁ దలఁచిన ♦ నభినుతింపఁ, బూన్ప నహివృశ్చికాదిభూభువనఘోర
భయము లెల్లఁబటాపంచలయి తొలంగు, నమ్మహామానస నుతింపనలవియగునె.

వ॥ మఱియును, జగద్గౌరియు, శివశక్తియు, వైష్ణవియు, నాగేశ్వరియు, నాగభగి
నియు, జరత్కారువల్లభయు, నాస్తికమాతయు, విషహారిణియు, జ్ఞానయోగి
నియు, సిద్ధయోగినియు, విశ్వపూజితయు, మానసకన్యకయు నను ద్వాదశ
నామంబు లెవ్వఁడేని పఠింప శయనాసనాదుల నాగభయంబు దొలంగు. దశలక్ష
జపంబున సిద్ధియగు. సర్పంబుచేతం జుట్టుకొనినను, దత్తల్పంబున శయనించి
నను, సాధ్వసం బెఱుంగకుండు నని చెప్పి సామవేదోక్తంబగు తద్ధ్యానపూజా
విధు లెఱింగింతు విను మని యిట్లనియె. ౯౭

సీ॥ శ్వేతచంపకవర్ణ స్థిరరత్నభూషణ, జ్వలనశుద్ధాంశుక ♦ సర్పభూష
సిద్ధిదాయిని జ్ఞానసిద్ధ ప్రపూజిత, సర్వసిద్ధిప్రద ♦ సర్వజనని
యని ధ్యాన మొనరించి ♦ యద్దేవిమూల మంత్రంబునఁ బూజింపఁ ♦ దగు ననేక
పూజోపహారముల్ ♦ పొసగించి పుష్పగంధానులేపనముల ♦ నర్చ సలిపి

తే॥ ప్రణవమాయారమాకామప్రాగ్భవములు, మానసాంక చతుర్థ్యంతమహితముగను
వహ్నిజాయాంతముగ మంత్రపఠన సల్పి, పూజయొనరింపఁదగు భక్తపుంగవులకు.

గీ॥ లక్షజపమున నమ్మంత్రి ♦ మక్షయమగు, ఫల మొసంగును నమ్మంత్రపాఠకుండు
వెలయు ధన్వంతరి సమానవిశ్రుతుఁ డయి, త్రిభువనంబుల నధికుఁడై ♦ తేజరిల్లు.

గీ॥ మకరసంక్రాంతి నద్దేవిమాననీయ, నాద్యఁబంచమిఁబూన్చి యిష్టాన్న బలులఁ
దృప్తి సేయంగఁదగు ధనావాప్తి విభవ, పుత్రకీర్తి సుఖాది విస్ఫూర్తి గలుగ.

టిప్పణి: *మూలగ్రంథములో సర్వత్ర మనసా అని యున్నను వ్యాఖ్యాతలు తదనుసారముగా వ్యాఖ్యానించినను అనువాదములో "మానసకన్య" అని తద్ధితప్రత్యయము చేర్చుట చింత్యము. దిద్దుటకు వీలుగానిచోట్ల నసకృదావృత్తిగా వాడినకతన దిద్దనైతిని.

గీ॥ నేను ధర్మముఖంబునఁ బూని వినిన, యమ్మహాదేవి యాఖ్యాన మనూనసమగ్ర
ముగ వినఁగఁ జేతు నవధానమున మదుక్తి, వినుము పరమేష్ఠినందన! వీనులలర.

గీ॥ ఆదికాలమ్మునను బన్నగావళులకు, వెలిచి భువనత్రయంబు నిర్విణ్ణమయ్యె
నిఖిలజనములు పన్నగనిహతు లగుచు, సంక్షయము నొందఁ జొచ్చిన సర్వమెఱిఁగి.

సీ॥ సర్వజ్ఞుఁడైన కశ్యపుఁడు మానులఁగూడి, పరమేష్ఠి యాజ్ఞచే బరమనిష్ఠ
మానసాధిష్ఠాతృ మహిమచే నిద్దేవి, సృజియించెఁ దన తపస్సిద్ధివలనఁ
గౌమారమున నాపె కైలాసమున కేఁగి, భక్తి శంకరుఁబూన్చి భవ్యనిష్ఠ
దివ్యవర్షసహస్ర దృఢసేవ లొనరింప, సంతుష్టుఁడై యర్ధచంద్రధరుఁడు

తే॥ జ్ఞానబోధంబు గల్పించి సామగాన, పఠన మొనరించి కృష్ణానుభావకమగు
మంత్ర మష్టాక్షరము నిచ్చె మహితనిష్ఠ, నది జపించెను దేవి నిత్యాహ్నికముల.

క॥ హరిజాయామాయాస్మర, సరసిజభవదార బీజ సంఘటితంబై
వరకృష్ణచతుర్థీసు, స్థిరమై స్వాహాంతమైన దివ్య మను విఱ్ఱే. ౯౬౮

వ॥ మఱియును, త్రిభువన మంగళంబగు కవచంబును, బూజాక్రమంబును, బురశ్చర్యా క్రమంబును, శంకరసన్నిధిం జేకొని, యుగత్రయంబు పుష్కరంబునఁ దపింపఁ గృపాళుండై హరి సాక్షాత్కృతుం డౌచు వరంబొసంగి సర్వపూజ్య వగుమని యంతర్ధినొందె, ప్రథమంబునఁ గృష్ణపూజ్యయయ్యె, బిదప శంకర, కశ్యప, సురముని, నాగపూజితయునై పిదప లోకత్రయ పూజ్యయయ్యె, నంత జనకుండు జరత్కారున కొసంగిన నతండు తపశ్శ్రాంతుండై యద్దేవి యుత్సంగంబున నిదురించుతఱి రవి యస్తమింప, ధర్మలోప భయంబున నద్దేవి మేల్కొలిపిన నిద్రాభంగంబగుఁ గాదేని కర్మలోపంబు కతన బ్రహ్మహత్య సంఘటిల్లు, నుక్తకాల సంధ్యాహీనుండును, నశుచియు నగునని, బోధింపఁ బతి కుద్ధుండై నిద్రాభంగం బొనర్చితివి, భర్త కపకారం బొనర్చిన సతికిఁ దపోదానవ్రతంబులు నిష్ఫలంబులు. పతియన హరియ కాఁడె! తీర్థదాన వ్రత తపో ధర్మ దేవపూజాదులు పతిభక్తికి షోడశాంశ సదృశంబులే. భారతంబునఁ బతిసేవ గల్గు సతికి వైకుంఠ, కైలాస, బ్రహ్మలోకం బులు కరగతంబులు, పతికి నప్రియం బొనరించి యావచ్చంద్రదివాకరంబు కుంభీ పాకంబునంబడి పిదపఁ జండాలియై పోవునని కోపించు భర్తచరణంబులంబడి నిరప రాధినియగు నన్నుఁ గోపింపఁబనిలేదు. శాంతినొందు మని దుఃఖించు సమయంబున.

సీ॥ కడుఁ గోపియగు జరత్కారు సన్నిధికిని, సంధ్యతోఁ గూడ భాస్కరుఁడు వచ్చి
ధర్మలోపముగల్గు తఱియయ్యె నను భీతి, నిద్రమేల్కొల్పె నా నీరజాక్షి
శరణాగతుఁడనైతి శమియింపుమీ యాసు, నవనీతసమమునూ యవనిసురలఁ
గ్రోధంబు! సైరింపు కులజుండ వీవు తేజస్వివి శ్రీకృష్ణ సంశ్రయుఁడవు

తే॥ క్షమకు నర్హుండ వనిన హర్షంబు నొందె, మౌని, భాస్కరుఁ డేగె స్వస్థానమునకు
శోకసంయుక్తయై దేవి శూలి నాత్మ, భూమునుకుందులఁ గశ్యపుఁ బ్రాగడిక్కొనిన.

చ॥ హరి హర కశ్యపాంబుజభవాదులు సన్నిధి సేయ వారలన్
స్థిరతరభక్తిఁ బూన్చి "యరుదెంచుట కేమికతంబు దెల్పుఁ" డం
చగసిన బ్రహ్మ వల్కె వినుమయ్య మదీయవచఃప్రపంచమున్
ధరణిఁ బతివ్రతామణిఁ గ్రుధం ద్యజియించుట ధర్మమౌనొకో! ౯౭౧

ఆ॥ పడఁతివలన నొక్కపట్టినిఁ గని నీవు, పిదపఁ జనుము తపము పేర్మిగల్గు
నురక పత్ని విడుచు నరుని పుణ్యము జల్లె, డందుఁ బోయుజలముచంద మెఱుఁగు.

క॥ వైరాగ్యంబున నేనియు, దారన్ విడనాడరాదు తపసికి నైనన్
బోరాని యీసుతగునే, యారయ పుత్రుని నొసంగు మాత్మాంగనకున్.

ఆ॥ అనిన బ్రహ్మసూక్తి కానందమును బొంది, యవ్వెలంది నాభియంటె నతఁడు
దాన గర్భమయ్యెఁ దరుణీమణికి నందు, నాస్తికుండు వాఁడమ ననిమొనతఁడు.

వ॥ అని యాపె నుద్దేశించి

సీ॥ దేవి! నీ గర్భమందావిర్భవించుఁ దేజస్వి యశస్వి వర్చస్వివరుఁడు
ధార్మికుండును ఘనుండు ధరణీసురాగ్రణి, వేదశాస్త్రజ్ఞుండు విష్ణుమయుఁడు
హితకారియును గుణాన్వితుఁడు జితేంద్రియుం, డర్భకుండలఘుఁడౌ నతని వలనఁ
బితరులెల్లను నూర్ధ్వగతు లౌదు రెవ్వాఁడు, హరిభక్తిపరుఁడు తదన్వయంబు

తే॥ వాని తలిదండ్రులును జగద్వంద్యభావ, మందుదురు విష్ణుపాదసేవాభిరతులు
ధర కలంకారభూతులు తరుణి వినుము, విష్ణుభక్తిప్రదాతయే విశ్వగురుఁడు.

ఉ॥ కావున విష్ణుభక్తి కలకాలముఁ గల్గి సుఖించునట్టి య
ప్పావను నిచ్చినాఁడ నను బాములఁ బెట్టక పోవనిమ్ము శో
భావహమైన పుష్కరము నందుఁ దపం బొనరింపఁ బోదు సం
భావన సేయు మన్న మునిపత్ని జలాకులలోచనాబ్జయై. ౯౭౨

వ॥ ప్రాణేశ్వరా! యల్పదోషంబునఁ గోపించి చనియెద నంచు నున్నవాఁడవు. నే
నెప్పుడు స్మరియించిన నయ్యెడ దర్శనం బిచ్చెదని చనుము. బంధు పుత్ర భర్తృ
వియోగంబులలో నుత్తరోత్తరంబులు దుస్సహంబులు, వేత్తలకు శాస్త్ర పరిశీ
మంబును, వణిజులకు వాణిజ్యంబునుబోలె సతులకుఁ బతిభక్తి నిసర్గం బని వచించి
గాఢాలింగనం బొనర్చి వక్షంబున శిరంబుఁ జేర్చి బాష్పంబులఁ బతిమేను దడిపిన
నతండును గన్నీరు నించె, నిట్లిరువురు నాత్మవిజ్ఞానంబున విశోకులై యూరడిల్లిరి.
అంత జరత్కారుండు తపంబున కరిగె. తత్పత్నియు మనంబున గురుండగు హరిం
దలంచి కైలాసంబున కరిగి యందుఁ బార్వతీబోధంబునఁ దెలివినంది యొక

శుభలగ్నంబున నారాయణాంశం బగు పుత్రునిం గనియె. శివుండు పత్నీసమేతుండై యప్పుడంతికి హర్షప్రదంబుగాఁ బుత్రోత్సవం బొనర్చి వేదవేదాంగంబు లుపదేశించి దేవద్విజగురుజనంబులయెడ భక్తిగల్గు తల్లికి జనించుటవలన నస్తికుం డను సార్థకనామం బిడియె. నంత శంకరాజ్ఞం గొని మహామంత్రంబుఁ జేకొని దివ్యవర్షత్రిలక్షంబు కాలంబు తపంబొనర్చి కైలాసంబున కరిగి,తల్లిం గాంచి జననిం దోడ్కొని కశ్యపునిం జూచిన, సపుత్రయగు కూఁతుఁ గాంచి శిష్యప్రియః ప్రదంబుగా నతండు విప్రపూజ యొనర్చె, నది చూచి మునులు సంతోషించిరి. ఇది మానసోపాఖ్యానంబు.*అస్తికోపాఖ్యానంబు వచించెద వినుమని నారదునితో నారాయణుం డిట్లనియె. ౯౮

సీ॥ అభిమన్యునందనునకుఁ బుట్టిన పరీక్షిత్తుం,డను రాజు మృగయకై యడవి కేగి
తృష్ణాతురత్వంబు దీపింపఁ దాపసాశ్రమమున కరిగి యచ్చట జపించు
తాపసుని న్వేడ ధ్యాననిష్ఠుం డౌటఁ, బలుకకయున్నఁ గోపమునఁ జెంతఁ
బడియున్న సర్పశవంబు తత్కంధరఁ, జుట్టి రా జరిగిన సుతుఁడు గనలి
జనకునియెడ సర్పశవముఁ జుట్టిన మూర్ఖు, సప్తాహమునను దక్షకవిషాగ్ని

తే॥ దగ్ధుఁడగుఁగాక యని పల్కె ధరణివిభుఁడు, జాహ్నవీతీరమునఁ జేరి సప్తవాస
రాంతముగ ధర్మసంహితలన్ని వినుచుఁ,గడపుతఁడే దక్షకుఁడువచ్చెఁగదలినెళవు.

గీ॥ దందశూకాభిభూతుఁడౌధరణివిభుని, గాచెద నటంచు విప్రుఁడౌ కశ్యపుఁడురాఁగ
నతని ధన్వంతరి యటంచు నరసి వలయు,ధనము లిడి యంత మరలించె దక్షకుండు.

మ॥ ధరణీనిర్జరుఁ డింటి కేగ నతికుద్ధస్ఫూర్తి నత్తక్షకుం
డరివిధ్వంసి నృపాలుమస్తకముపై నారూఢుఁడై యుజ్జ్వల
ద్గరళాగ్నిన్ దహియింప నాత్మ హరిసంస్కారాన్వితుండై విభుం
డరిగెన్ శ్రీహరిసన్నిధానమున; కొయ్యన్ దత్సుతుం డుగ్రుఁడై. ౯౯

గీ॥ తండ్రికపరాధ మొనరించు దందశూక,సమితి మడియింతు నని సర్పసవనదీక్ష
దక్షుఁడై వేల్వ సర్పసంతతులు యజ్ఞ,పావకజ్వాలలను బడి భస్మమయ్యె. ౧౦౦

ఉ॥ తక్షకుఁ డంత భీతుఁ డయి దర్పము దూలి మహేంద్రుఁ జేరి "మాం
రక్ష'' యటంచు వేడిన శరణ్యతఁ బూనె, విభుం డెఱింగి మం
త్రాక్షరపూతమానటుల నధ్వరఋత్విజులన్ గొఱంత లే
దక్షయశాసనంబు మనహమాహుతి వేల్తమటన్న వారలున్. ౧౦౧

టిప్పణి: *అస్తికశబ్దవ్యుత్పత్తి యితరత్ర వేఱొకవిధముగఁ గూడఁ గలదు. భారతమున అస్తీకుఁడని దీర్ఘమధ్యము కలదు. దీనిలోఁగూడ నిడికలదు. (३७८ పుట చూ.) ఆయా యీషద్భేదములు చాల పెక్కుఁ గలవని తెలివిడి.

శా॥ స్వస్వాలోచిత మాంత్రికాచరణదీక్షన్ సేంద్రుఁడై తక్షకుం
డీ స్వాహాహుతి గాంచుఁగాత మని యెంతే నీసునన్ వేల్వ న
చ్చో స్వర్వాసులు సేంద్రులై జ్వలనసంక్షోభంబునన్ మగ్గువా
రై స్వస్థానపరిచ్యుతిన్ గొనఁగ నయ్యాస్తీకుఁ డచ్చోటికిన్. ౧౦౮

గీ॥ మాతులానుజ్ఞఁ గొని వచ్చి మఖసమాప్తి, సలిపి యాదేవతాళి రక్షకత గనియె
సంతసిలి విప్రులెల్ల నుత్సాహగరిమ, నస్తికు నుతించి *మానసి | కర్చసల్పి.

వ॥ మఱియు షోడశోపచారంబులం బూజించి బలిప్రదానం బొనర్చిరి. మహేంద్రుండు జనమేజయుం జేరి తక్షకు రక్షింపు మని ప్రాణదానంబు గోరిన నట్లయొసంగి యతండు మానసిం బూజించి నగరంబుఁ బ్రవేశించె. ఇది యస్తిక మాహాత్మ్యం బని నారదునకు నారాయణుం డెఱింగించె; నిమ్మహాత్ముని శక్తి నీ వెఱుంగుదువు కదా! యని వ్యాసుఁడు జనమేజయునకుఁ దెల్పిన నతండు హర్షించి స్వామీ! శక్రుండు బ్రహ్మకన్యక యగు మానసి నెవ్విధంబున నుతియించె. తత్పూజాక్రమం బెత్తెఱంగు? వినవలతు నని యడిగిన వ్యాసుండు నీ వొనర్చు ప్రశ్నంబుపోలికి నారదుం డడిగిన నారాయణుం డిట్లనియె నని చెప్పందొడంగె.

సీ॥ స్నానసంధ్యాద్యనుష్ఠానముల్ పచరించి, కలితధౌతాంబరంబులు ధరించి
భస్మావకుంఠనప్రతిభఁ జెన్నలరారి, మణిమయాసనమున | *మానసాఖ్య
శక్తి నావేశించి | స్వర్నదీజలముల, స్నానసంస్కారంబు | సల్పి వస్త్ర
పాద్యార్ఘ్యము లొసంగి | భక్తిసంయుక్తుఁడై, గణనాథశుచిదివాకరమహేశ

ఆ॥ శక్తి కేశవులను | సన్నిధిఁ బూజించి, మానసను యజించు | మంత్రమునను
సోపచారవిధుల | నుత్సాహమునఁ బూన్ప, వలయు నిటులఁ బూన్చె వాసవుండు.

గీ॥ ప్రణవమాయారమాబీజపటలి గూర్చి, మానసాదేవి శబ్దసంబంధసంప్ర
దానమున వహ్నిజాయతోఁ దనరఁ గూర్పఁ, దగు దశాక్షరమంత్ర మాతల్లి కలరు.

సీ॥ పంచమహావాద్యపటలి మ్రోయఁగ శక్రుఁ, డద్దేవి నిట్లని | యభినుతించె
దేవి! నే నుతియింతు | దీనమందారవు, సాధ్వీప్రవర వీవు | సర్వజనని!
పరశక్తి! నీ స్తోత్రపారాయణ మొనర్పఁ, దెలియవచ్చునె గుణాతీతమూర్తి
నభినుతింపఁగ శక్తి | యగునె మా బోట్లకుఁ, బ్రాణరక్షణసేయు | ప్రాణదాత్రి

తే॥ నీదు ననుకంపఁ గోరి యెన్నెద మదీయ, మానసమ్మున నిలుపు సమాహితవయి
నన్నుఁ గడకంటఁ జూచి యనారతంబుఁ, బూజగొనవమ్మ! మాయమ్మ! భువనజనని!

సీ॥ ఆషాఢసంక్రాంతియందుఁ బంచమితిథిఁ, బవలేని రేయేని | పరమనిష్ఠ
నిన్నుఁ బూజించిన | నిఖిలసంసిద్ధులఁ, జెంది యవశ్యులై | జితవిపక్షు

*టిప్పణి:— మానస, మానసి — ఈ రెండును పర్యాయములని తెలివిడి.

లగుచు విద్యావంతు లగుచుఁ దేజోవంతు, లగుచు సద్గుణవంతు లగుచు నరులు
వెలయుదురు ధనులు విభవసమృద్ధుల, మెఱయుదు రహిభయంబు మెఱుక గొనరు.

ఆ॥ స్వర్గలక్ష్మి వీవు సత్యవైకుంఠకై, లాసలక్ష్మి వీవు లలిత వీవు
తనదు తపమువలనఁ దండ్రి కశ్యపుఁ డిట్లు, మమ్ముఁ బోవఁబంపె మర్త్యమునకు.

సీ॥ అదిగాన దాసుల మైత్రిమి యెవ్వారు, నిన్నుఁ బూజింపంగ నిపుణు లవని
సత్యస్వరూపవు సర్వదేవాఢ్యవు, సర్వేశ్వరివి సర్వసాక్షివనుచు
నుతియించి శకుని డగనూన హర్షంబునఁ, జనిమె సౌపర్వణసదనమునకు
దేవి పూజితయయ్యె దేవలోకంబుల, గోలోకమున సర్వగోపికలును

తే॥ బూజ సల్పిరి సురభియుఁ బూన్చె నిదియె, మానసస్తోత్ర మెవ్వారుఁ బూని చదువ
విషము లమృతీకరించుట వింతకాదు, సర్వశయుఁడైన లేదు పో సాధ్వసంబు.

ఉ॥ గోవులకెల్ల నాది సురగోతిలకం బది యెట్లు పుట్టె సం
భావిత యెట్టు లయ్యె? ననుభావ మ దెట్టిది? తచ్చరిత్ర మా
ర్యావళి సన్నుతించు ననయంబు తదీయకథావిధాన మో
దేవ! యెఱుంగఁజేయు మన దేవముని గని యాతఁ డిట్లనెన్. ౯౯౨

గీ॥ సురభివృత్తాంత మది శ్రుతిచోదితంబు, జనకుఁ డెఱిఁగింప వింటి నే సాంగముగను
నీకు వినిపింతు వినుము సందియము మాని, శార్ఙ్గి బృందావనవిహారచతురుఁడగుచు.

చ॥ ఒకతఱి రాధికన్ గదిసి యువ్విళులూరు మనంబుతోడ నొ
ద్దికఁ విహరించుచున్ మది సుదీర్ఘవిలాసరసానుబంధముల్
వికసితవృత్తి సొంపెసఁగ వెన్నుఁడు దుగ్ధము లారగింపఁగా
సకుతుకుఁడై సృజించె సరససస్పృహఁ గామగవీగవీమణిన్. ౯౯౪

గీ॥ ఆత్మవామాంగమున నవతాస్సనుషంగ, సురభి సృజియించి యమ్మధుసూదనుండు
జన్మమృత్యుజరాధ్వాంతచండకిరణ, మైన దుగ్ధంబు కలశమ్మునందుఁ బితికె.

క॥ సౌరావారసమం బగు, క్షీరము కలశమ్ము నిండఁ గృష్ణుఁడు హస్తాం
భోరుహములఁ బిదికి విహా, రారంభము మెఱయఁ గ్రీడ లాడుచునుండెన్. ౯౯౬

శా॥ ఆదుగ్ధం బది సర్వవిస్మయకరంబై రాధికాకేళికిన్
మోదం బొప్ప సరోవరం బగుచు సంభూతిన్ గనెన్ దద్గవీ
ప్రాదుర్భూతములై యనేకసురభుల్ బ్రహ్మాండమున్ నిండి యు
త్పాదించెన్ బహువత్సకోటుల జగద్వ్యాప్తిన్ విజృంభింపఁగాన్. ౯౯౭

టిప్పణి:—గవీమణిక్ — దీని [illegible] (శ—స్త్రీ — ఆవు — శ. ర. చూ)

క॥ అంతట ద త్తత్సంతతు, లెంతయు సంఖ్యలకు మీఱి యిలనెల్లను న
త్యంతము నిండి కనఁ గిన, సంతస మొసఁగెఁ ముకుందుస్వాంతంబునకున్.

క॥ తద్ధ్యానస్తోత్రంబు ల,మిథ్యామతి వినుము జగదమేయము జనకుం
డధ్యాత్మవిదుఁడు దెల్పఁగఁ, దథ్యముగా వింటి నయ్యుదంతము పేర్మిన్.

సీ॥ ఆదిమాయాబీజ మవ్వల సురభిచ,తుర్థ్యంత మొనఁగూర్చి తొల్తను బ్రణ
వంబు నమో యని వచియింపఁగఁ దగిన, ధరణిలో సురభిమంత్రంబు దీని
లక్ష జపింపంగ నక్షయఫలదంబు, కల్పశాఖి యటంచు గణుతికెక్కె
యాజుమ మిమ్మంత్రి మద్దేవిధ్యానంబు, బుద్ధియు వృద్ధియు శుద్ధినొసఁగుఁ

ఆ॥ గామదంబు నగుచుఁ గైవల్య మొసఁగును, గాన జాపకుల కఖండితముగ
సిరులు దొరలఁజేయు సిద్ధలక్ష్మి స్వరూ,పంబు సుమ్ము సురభి పాకాంక్షి!

చ॥ సహచరి రాధకున్ విబుధసంస్తవనీయగవీపవిత్రనూతి వృ
త్త్రిహముఖపూజ్య భక్తసుఖదాయిని లోకపవిత్ర గాన ని
మ్మహిఁ గలశమ్మనందయిన మానక ధేనువునందు నైన నా
వహిలఁగఁజేసి పూన్పఁదగు వారము వారము సంపదాప్తికై. ౧౦౦౧

క॥ సాలగ్రావజలానల, కీలలఁ గటురాటఁ బూన్చి కేవలతృష్ణా
లోలత మునులు తపోవన, జాలములఁ దపించి బ్రహ్మసన్నిధి గనరే. ౧౦౦౨

వ॥ తొల్లి పురందరుండు దేవీ ! నీవు సురభివి, గోలోకాధిష్ఠాత్రివి, సర్వపూజ్యవు,
సర్వజీవనరూపవు, మునిరాజ్యమవు, సర్వకామప్రద వని వినుతించిన నా నైచికి
తుష్టయై, మహేంద్రునకు. దుర్లభంబగు వరం బొసంగి గోలోకంబునకుం జనియె;
విశ్వంబు దుగ్ధఘృతపూరితం బయ్యె నీ స్తవంబు పఠించిన గోధనకీర్తిమంతుండై
సర్వతీర్థస్నాతయు, సర్వయజ్ఞవిధిదీక్షితుండును నగుచు నంతంబునఁ గృష్ణసన్ని
ధానంబునఁ జేరునని తెలిపిన నారదుండు రాధికాఖ్యానంబు వినఁగోరితిఁ దదు
త్పత్తిస్థానకవచస్తోత్రంబులు దెలుపవలయు ననిన నారాయణుం డిట్లనియె. ౧౦౦౩

సీ॥ కైలాసమునఁ దొల్లి కాలకంఠుఁడు భగ,వంతుండు ప్రమథసభాంతరమున
నాసీనుఁడై యుండె నద్రిజ హాసము,ఖాంభోజ యగుచు నయ్యధిపుఁ జేరి
చిఱునవ్వు మోమునఁ జెంగలింపఁగఁ గృష్ణ,చరితంబు రాసనంచరణమహిమ
జరుగుచున్నెడ ముఖ్యశాస్త్రంబు పాంచరా,త్రంబు సిద్ధాంతోత్తమంబు భక్తి

టిప్పణి:—కైలాసమున అను సీసమునఁగల పార్వతీ ప్రశ్నము నేటి మూలగ్రంథమునఁ గానఁ
బడదు. అందుచే దాని గీతమునందలి యనన్వయ। దోషము సవరింపవలనుపడదయ్యె. ఆ గ్రంథము
దొరకునవఱకును నది సవరింప నవకాశము లేదు. (ఆ గ్రంథము దొరకుట దుర్లభము.)

తే॥ శాస్త్ర మది వినఁగోరితి సర్వశక్తి, చరితమున రాధికాఖ్యానసరణి మీదు
వచనరచనల వినిపింపవలయు ననిన, సమ్మహాదేవుఁ డది ద్విజ కాంతకిచ్చె. ౧౦౦౪

గీ॥ ఆగమారంభసమయంబునందుఁ జక్రి, గోప్య మని తెల్పె నదిగాన గొమ్మ నీవు
నా మనోర్ధాంగరూపవు నాకు నీకు, వేఱులేదదిగాన నీ వృత్త మెల్ల. ౧౦౦౫

సీ॥ వినఁగోరి యడిగితి విశదీకరింతు నీకథ పూర్వపూర్వంబు కడు రహస్య
మహివల్లభుఁడు బ్రహ్మయఖిలమునీంద్రులు, నింద్రుండు సిద్ధాదులెఱుఁగ గొనరు
ప్రాణాత్యయంబైనఁ బ్రకటింపరాదిది, గోపనీయముసుమీ కువలయాక్షి?
నారాయణుండు బృందావని గోలోక,రాసమండలమున రత్నశిఖరి

తే॥ మాలతీవనమధ్యను మణిగణాగ్ర, ఖచితసింహాసనమున నొక్కరుఁడు నిలిచి
స్వేచ్ఛరమణోత్సుకుండయి సృష్టికాంక్షఁ, దాన రెండు తెఱంగులఁ దాల్చె రూపు.

గీ॥ దక్షిణాంగంబు కృష్ణుఁడై తాను నిలిచి, వామభాగంబు రాధికాభామ యగుచు
రాసవిహరణతత్పరారంభకుశల,మతిఁ బ్రవర్తించె నవ్వేళ మాధవుండు.

సీ॥ రత్నభూషణయును రత్నపీఠాగ్రగ, సుందరి సర్వాంగశుద్ధ వికచ
శతపత్రనేత్ర చంద్రచద్దీర్ఘ కబరికా,మాలతీమాలికామాననీయ
జపవగహస్త గ్రీష్మప్రభాకరతుల్య, వర్తులస్తనయుగ్మ వనజవదన
పృథులనితంబ సుప్రీతమనోవృత్తి, నూత్నయౌవన సదానూనకామ

తే॥ యగుచు రాధావధూమణియనుపమాన,రామణీయకయై మనోరమణుఁ గృష్ణు
వీక్షణంబుల సస్నేహవివశవృత్తి, నధివసించిన శ్రీకృష్ణుఁ డతివఁ గాంచె.

క॥ రమియించు వాంఛ రసనం,భ్రమితకటాక్షముల రాధఁ బల్మఱుఁ గాంచన్
రమణీరమణుల కిరువుర, కమృతోపమహాసజనితహర్షము పొడమెన్. ౧౦౦౯

గీ॥ అప్పు డన్యోన్యలలితవీక్షానుషంగ,వశత నుదయించి రామరవాము లెల్ల
*'రా'యనఁగను దానంబు 'ధా'యనంగ, ముక్తివాచకమయ్యె నమ్ముగుద పేరు.

శా॥ గోపీసంఘములెల్ల రాధవలనన్ గోటానకోటుల్ కదున్
గోపాలవ్రజ మెల్లఁ గృష్ణువలనన్ గోటానకోటుల్ మహా
కూపారాంబుతరంగచంక్రమణసద్ఘోషంబునన్ గల్గి రా
వ్యాపారంబు జగత్క్రియాకరణనిర్వాహోద్ధతిన్ వర్తిలెన్. ౧౦౧౧

---

*టిప్పణి:—రాధాశబ్ద వ్యుత్పత్తి 'రాధ్నోతి' అని - రాధ సిద్ధౌ అను ధాతువునుండి చేసినట్లు మూలమం దున్నది. ఈయన అన్యథాకరించుటకుఁ గారణము చింత్యము. లేదా వేఱొకచో నిటు లున్నదేమో! దీనింబట్టియు లోఁగడఁ జూపిన భేదములంబట్టి గ్రంథభేదము స్పష్టమే.

వ॥ మఱియును, రాధా వామాంగంబున మహాలక్ష్మియు, కృష్ణ దక్షిణాంగంబునఁ జతుర్భుజుం డగు విష్ణుండును బొడమి మహాలక్ష్మిం గలసి వైకుంఠంబునకుం జనిరి. త్రిభువనలక్ష్ములు, తత్తదంశంబులు. సర్వాధిష్ఠాత్రియై విష్ణువక్షంబున నమ్మహాలక్ష్మి యధివసించె. సృష్టివైచిత్ర్యంబు వివరింపఁ బనిలేదు. సర్వాద్యంబును, త్రిగుణాత్మకంబును, పరంబును, ప్రధానంబును, పరమంబును, పరమాత్మయు, నిరీహంబును, ప్రకృతిపరంబును, స్వేచ్ఛామయంబును, నిత్యరూపంబును, భక్తానుగ్రహవిగ్రహంబును నగు బ్రహ్మంబు నానావిధవిచిత్రచర్యలఁ బెక్కుపోకలం బోవుచుండు. కృష్ణప్రాణాధిక యగు రాధ మూలప్రకృతి యగుం గాన వైష్ణవీ, బ్రహ్మాణీ, మాహేశ్వరీప్రభృతినానావిధరూపంబులఁ బ్రవర్తిల్లు. బ్రహ్మాదుల కలభ్యం బగు నద్దేవిదర్శనం బని తెలిపి మఱియు నిట్లనియె. ౧౦౧౭

గీ॥ అమ్మహాదేవి శ్రీకృష్ణుశాపవశమునను, బరఁగు శ్రీదాముఁడను గోపవరునివలనఁ
గోపమున భూమి కరుదెంచి - కువలయాక్షి, వృషభునింట వసించె నివ్వింత వింటె.

క॥ అని పల్కు ప్రాణవిభునిఁ, గని పార్వతి పల్కె నన్యకాంతలపగిదిన్
జనవంద్య,రాధ శాపం, బునఁ బుడమికి వచ్చుటెట్లు - భువనస్తుత్యా!

చ॥ వినఁగఁ దలంచితిన్ దెలుపవే! జగదేకశరణ్యా! యన్న న
య్యనలవిలోచనుండు విను - మద్భుత మొక్కెడ రాధికావధూ
ఘనరసలోలుఁడై హరి జగన్మయుఁడా శతశృంగశైలమం
దొనర రమించుచుండ మొరఁగి - యొండొక గోపికఁ గూడియున్నెడన్. ౧౦౧౮

క॥ గోలోకంబున నిముసపుఁ, గాలంబయ్యె నది పుడమిఁ - గడచె మఱెంతో
కాలము దూతిక జని హరి,జాలము రాధికకుఁ దెల్పె - సాహసవతియై. ౧౦౧౯

సీ॥ రత్నభూషణరాజి - రత్నమాల్యంబులు, రత్నదర్పణములు - రాచివైచి
చందనాద్యనులేపనాసక్తి దూర మొనర్చి, తనువెల్ల జలమునఁ దడిపికొనుచు
ముక్తకేశియు ధూమ్రముఖియునై మాసిన, వలువ ధరించి యవ్వాసుదేవు
చెంగటి కరుదేర - శ్రీకృష్ణుఁ డతిభీతి, నంతర్ధినొందిన - నాగ్రహమున

ఆ॥ సరసకేళితల్పశాయితయౌ విరజను, హంతుకామ యగుచు - నంతిపురికిఁ
జనఁదలంపఁ గోరి - సాధ్వసంబున సరి,ద్రూప యగుచుఁ బరచె - రోష మెఱిఁగి.

చ॥ నదులు నదంబు లంబుధులు - నాఁడు జనించినవం చెఱుంగు మీ
ముదితయు రాధ* యిర్వురును - ముచ్చిలి గానఁగరామి నంతటన్
సదనముఁ జేరె నచ్చట బ్రసన్నమనస్కుని గృష్ణుఁ గాంచి తా
ననయత భర్త్సనోన్ముఖత - నాగ్రహ మావహిలంగఁ జేయఁగన్. ౧౦౨౦

*టిప్పణి:— ఇర్వురును = గోపికయు, శ్రీకృష్ణుఁడును.

క॥ శ్రీదాముఁ డనెడు గోపుడు, వాదింపఁగఁ గసలి రాధ । వాని నసురుఁ
బ్రాదుర్భూతుఁడ వగుమని, యాదట శాపం బొసంగె । నట్టుల నతఁడున్.

ఆ॥ రాధఁ జూచి కనలి । రమణి భారతమున, గోపకన్య వగుచు । గోపకులము
నందుఁ బుట్టు మనుచు । నత్తఱిఁ శపియించి, వెఱచి రాధఁ గాంచి । వేడికొనిన.

గీ॥ వానిఁ గరుణించి పుత్ర్యనువర్తనమున, మన్నన మొనర్చి రాధికసమహితవృషభ
నాముఁ డగు గోపవల్లభు । నాలవాని, పత్నికిఁ గుమారియయ్యె నక్రంబుగాఁగ.

గీ॥ ఆ మహాదేవి పుట్టుక । యబ్బురంబు, తల్లి గర్భంబు మారుతోదార మగుచు
మాసములు నిండఁ గను వేళ మాయవలనఁ, దాను బుత్రికయై చేరెఁ దల్పమునను.

ఉ॥ అంతట యౌవనంబు పెనుపారినఁ గృష్ణుఁ డెఱింగి కంసదు
ర్దాంతవధంబు గోరికొని । ద్వారవతిన్ జనియించి యచ్చటన్
గాంతను రాధనుం గనక । గాసిలి యుండఁగ గోపవల్లభుం
డెంతయుఁ బ్రేమ రాధ నిడి యర్మిలి హరి కుద్వాహనంబు సేయుచున్. ౧౦౨౩

సీ॥ సర్వేశ్వరుం డయ్యుఁ । జక్రి రాధాదేవి, దివ్యస్వరూపంబు । తెలియకునికి
షష్టివర్ష సహస్ర చటులతపం బుండె, రాధికాపదసమారాధనంబు
గోరి పుష్కరమున । ఘోరతరం బగు, చర్యచేఁ దత్తపశ్చరణవలన
బృందావనంబునఁ । బ్రీతిమై నద్దేవిఁ, గాంచి క్రీడించె నక్కటిక మెసఁగఁ

తే॥ బిదప గోలోకమున కేగి ముదితతోడ, నాత్మసామ్రాజ్యసౌఖ్యంబు లందెఁ గృష్ణుఁ
డమ్మహాదేవి చరితంబు । లద్భుతములు, పరమపురుషునకైన నసంభావ్య మగునె?

వ॥ అద్దేవీమాహాత్మ్యంబునఁ గళావతీ యశోదలు వృషభానునందులు గోపీగోపాల
కులును షట్త్రింశల్లక్షసంఖ్యలతో ముక్తులై గోలోకంబునకుం జనిరి. ఆ నందుండు
బ్రహ్మాంశంబు; యశోద సరస్వతి, వసుదేవ దేవకులు కశ్యపాదితులు, తమతమ
తపోవిశేషంబుల నద్దంపతిసమారాధనంబున ముక్తులైరి. ఇది రాధికాఖ్యానంబు.
చతుర్భుజావాసంబు వైకుంఠంబు, ద్విభుజావాసంబు గోలోకంబు, మహాలక్ష్మీ
గంగా సరస్వతీ తులసీ సమాఖ్య పరాశక్తి వైకుంఠంబున నిలిచె. రాధిక గోలో
కంబున వసించె, రాధానామంబు ప్రథమంబున నుచ్చరించి పిదపఁ గృష్ణనామంబు
పఠింపఁ డేని బ్రహ్మఘ్నుం డగు. కార్తిక పౌర్ణిమ రత్నఘుటికయందు రాధిక
నారాధించి శౌరి కటకంబు ధరియించె, వార లన్యోన్యపూజ్యులు, మహేంద్ర,
వరుణ, మను, మానవ, సూర్య, చంద్ర, వాయు, మునీంద్రులు పూజింతురు.

---

టిప్పణి:— ఈ రాధా చరిత్ర భాగ మంతయు నిప్పుడున్న మూలగ్రంథమునకు సరిపడుట లేదు. వేఱొక గ్రంథమునం దుండు నని యూహింపక తప్పదు. అనువాదకుని లోపమనుట తప్పు.

సర్వపూజ్య యని యెఱుంగు మని తెల్పినఁ బార్వతీదేవి భారతఖండంబున నే
రాజు పూజించె ననిన మహేశ్వరుం డిట్లనియె. ౧౦౨౬

సీ॥ మనువంశతిలకంబు మానవాధిపుఁడు సుయజ్ఞుఁడన్వాఁ డభియాతి విక్రి
మాక్రాంతరాజ్యుఁడై యఱువదివేలేండ్లు, భోగియై భాగ్యవిస్ఫూర్తి నిలిచె
నతఁడు స్వాయంభువు నాత్మజుండైన యుత్తానపాదుని పుత్రుఁడైన ధ్రువుని
కొమరుఁ డుత్కలుఁడు తద్విమలకీర్తి నటింప, నబ్రింబు రాజసూయాధ్వరములు

ఆ॥ వేయొనర్చె నపుడు వేలకొలందిగాఁ, బ్రాహ్మణులకు రత్నపాత్ర లొసఁగె
నతనియాత్మజాతుఁడగు సుయజ్ఞుఁడు వాని, మహిమఁ జెప్పఁదరమె మహితలమున.

క॥ ద్వాదశలక్షలు గోవుల, నాదరమున ద్విజుల కిచ్చె ననవరతం బ
న్నాదిసుఖభోగ్యవస్త్వా, త్పాదకసత్త్రములు పెక్కు పరఁగించె మహిన్. ౧౦౨౮

గీ॥ అతఁడు యాగ మొనర్చి యజ్ఞాంతముననుఁ, నిడియె ముప్పదికోటు లక్షీణధనము
నవనిసురులకు నతితృప్తులగుచు వారు, మోయలేరైరి యబ్బురంబుగ వెలంది!

సీ॥ సింహాసనమున నాసీనుఁడై యొకతఱి, బంధుబృందము తన్ను బలసికొలువ
విభవదేవేంద్రుఁడై విలసిల్లునెడ విప్రుఁ, డతిమలినాంగుఁడై యఱచికొనుచుఁ
బరిచారకులకెల్లఁ బ్రణతు లొనర్చుచు, నృపతికి మ్రొక్కుచు నేత్రములను
బాష్పముల్ దొరఁగ నప్పట్టున కెదురుగాఁ, జనుదేరఁ గోపించి జనవిభుండు

తే॥ రోషసందష్టవదనుఁడై భాషలాడ, నతఁడు కోపించి దపసి యిట్లాడె నరరె!
రాజ్యవిభ్రంశమును బొంది రాజసంబు, వదలి దుర్బుద్ధి వగుమని పిదపఁ బలుచ.

ఆ॥ విభునిమందిరంబు వెలువడి ద్విజుఁ డేగ, సభికు లెల్ల నవ్వి సాహసించి
విప్రనింద సేయ విని భీతుఁడై రాజు, సాపరాధి ననుచుఁ దాపసుండు.

ఆ॥ ఎద్ది గోరి యిచటి కేతెంచెనో విప్రుఁ, డతనిఁ బూన్పఁజాల కడఁచితిఁ గటా!
అనుచు వెంట నంట నంతట సభలోని, వార లెల్ల విప్రవలను గనిరి. ౧౦౩౧

సీ॥ పులహుండు భృగుఁడు దేవలుఁడుఁ బ్రచేతుండు, కాత్యాయనుండును గాశ్యపుఁడును
జాబాలి పాణిని సనకసనందనుల్, జమదగ్ని వాల్మీకి *జైగిషవ్యుఁ

---

టిప్పణి:—మనువంశతిలకంబు అను సీసపద్యములో నారంభమైన సుయజ్ఞనృపాలుని చరిత్రము లోని యే భాగముగాని నేఁటి సంస్కృత దేవీభాగవతములో నుపలబ్ధ మగుటలేదు. గ్రంథకర్త నాఁడు దొరకిన పుస్తకమున నుండె ననుట నిర్వివాదము. ఈ స్కంధసమాప్తి యీ చరిత్రముతోడనే యీయన చేసినాఁడు. అన్యు లన్యథాగా ముగించిరి.

* జైగిషవ్యుఁడు చింత్యమని లోఁగడ వ్రాసితిని. ఇటీవల గురుజ్ఞానవాశిష్టములో నొకప్రయోగము దొరకినది (౨ పాదము ౧ అధ్యాయము చూ.) ఇది దీర్ఘమధ్యముగా దిద్దవీల్పడును. ఏమైనను బరిశీలింప వలెనే కాని చట్టన మహాకవుల రచనలను తప్పని పరిష్కరించరాదని విమర్శకులకు నా విజ్ఞప్తి.

డౌర్వుంను కణ్వుండు - నత్రి జరత్కారుఁ, డంగిరసుంను నారాయణుండు
నరుఁను దక్షుఁడు పరాశరుఁను విశ్వామిత్రుఁ, డాస్తికుంను నగస్తి - యాసురుంను
ఆ॥ శక్తి వామదేవ - శాకల్య గోవత్స, పంచశిఖ విభాండ - భాస్కరులును
దుర్ఘటప్రభావ-దూర్వాసుఁ డాదిగా, నఖిలమునులు చనిరి - యతనితోడ.
మ॥ చని ధాత్రీశ్వరు నడ్డగించి ద్విజవంశా! క్రోధ మిట్లేటి కం
చని యూరార్చుచు నేద దేర్చుచు మృదువ్యాహారముల్ సల్ప నా
య్యన దూర్వాసుఁడు నీతిపూర్వముగ దివ్యస్తోత్రముల్ సేయుచుం
విన మోల్లాసము రెట్టిగొల్పుచు నయావిఖ్యాతి సూచించుచుం. ౧౦౩౩
ఆ॥ అంతలో నృపాలు-స్నానస్థాని వెలువడి, పితరు లమరు లగ్ని - వితతవిభవ
శీలకీర్తి ధర్మ-జాలంబు లేతెంచె, నపుడు భ్రష్టగుణుని - నధిపు విడిచి. ౧౦౩౪
ఆ॥ తనదు శాపవహ్ని-దరికొన విప్రుండు, వచ్చువానిఁ గాంచి - మెచ్చుకొనిమె
విప్రహృదయ మెంత - విమలంబొ నవనీత, సదృశ మనుచుఁ బలికి - చాటవలదె.
వ॥ ఇట్లెల్లవారలు గూడం జని విప్రేంద్రా! కోపం బుపసంహరింపుము, భగ్నాశుండై
యతిథి యెవ్వాని గృహంబు వెలువడు నచ్చోటనుండి నిరాశులై పితృదేవా
గ్నులు వెలువడుదురు, స్త్రీ గో కృతఘ్న గురుతల్పగ తుల్యదోషంబు సంభ
వించు, రాజ్య శ్రీ విజ్ఞానభ్రష్టుం డగు, నేకాదశిని విష్ణుస్తుతి, విష్ణునైవేద్య భక్షణ
విహీనసదృశుండగు, దీక్షలు విఫలంబులగు, ధనహీనుండును, మంత్రహీనుండును
నగు; శవవహన దురితంబును, పితృమాతృభక్తి హీనకల్మషంబును బొంది సప్త
జన్మంబుల ఘూకంబగు, గురు బ్రాహ్మణ దేవతా శ్రద్ధాహీనులపోల్కి సూకర
జాతిం బొడము, సర్వంబు క్షమియించి రాజు ననుగ్రహింపు మని బహుప్రకారం
బుల వేడుకొని రాజుం జూచి నీవు విప్రునకుం బ్రణామం బొనర్చి గృహంబునకుం
దోడుకొని చని బ్రాహ్మణాశీర్వాదంబు గొనుమని బోధించి మునులు యథేచ్ఛం
జని రంత. ౧౦౩౬
చ॥ జనపతి యంత సంతసిలి - శాంతి వశిష్ఠునిఁ గూడి విప్రునిం
గని యిలఁ జాఁగి మ్రొక్కి యలు-కం బెడఁబాసి ననుం గణింపు మో
మునికులచంద్ర యం చని స-మున్నతపీఠమునందు నిల్పి వా
గ్వినయముతోడ నిట్లనియె - విప్రశిఖామణి! కావవే దయం. ౧౦౩౭
సీ॥ అపరాధి నైతి నా - యజ్ఞానము సహించి, కావుమయ్యా! కడ-కాలఁ దన్ని
యెఱుఁగక చేసిన - యిద్దురితంబుల, బూదిపా లొనరింపు - పుణ్యపురుష!
సాష్టపూరుషము స-స్వర్గులౌ పితరుల, నరకంబుపా ల్చేసి-నాఁడఁ జుమ్ము
ధనమదాంధత నిట్లు - తను వెఱుంగక బ్రహ్మ, మూర్తివౌ నీయెడ - మోసపోతి
ఆ॥ ననుచు విప్రపాద-వనజాతములమీఁద, శిరముఁ జేర్చి బాష్ప-శీకరములు
జాలువార ఘర్మ-సలిలంబు [illegible] ౧౦౩౮

సీ॥ నీనామ మెయ్యది? నీవంశ మెయ్యది?, నీతండ్రి యెవ్వండు । నీవు కపట
మూ_ర్తివై వచ్చిన । మురహరుండవుగాక, యన్యుండ వగుదువే? । యఖిలపూజ్య!
జ్ఞానమూ_ర్తివిగాక । సామాన్యుఁడవె? బ్రహ్మ, తేజోమయుండవు । దీనరక్ష!
నీమాయఁ గనలేక । నిశ్చలజ్ఞానహీ,నుండనై చెడితి నిం । కొండు గలదె?

తే॥ నాదు రాజ్యంబు నఖిలంబు । నీదిగాఁగఁ, జేకొనుము నేను భృత్యుండ । క్షితితలంబు
నాచతుస్సాగరంబుగా । నర్పణంబుఁ, జేసితిని బాలన మొనర్పు । చి_త్తగించి.

చ॥ అని పలుమాఱు వేడు వసు । ధాధిపువాక్యము లాలకించి మో
మునఁ జిఱునవ్వు మోసుగొన । ముఖ్యకులీనుఁడు శాంతి నొందితిౕ
మనమున సంతసింపు మను । మానము లే దిక నాదువృ_త్త మొ
య్యన వివరింతు నమ్మ విన । యమ్మ నయ మ్మనయమ్ముఁగూడఁగన్. ౧౦౪౦

సీ॥ అంభోజసంభవు । నాత్మజాతుండౌచు, నలరె మరీచి త । దాత్మజుండు
కశ్యపుఁ డతనికిఁ । గలిగిన కొమరులు, వేల్పులు నాఁగఁ బ్ర । వీణులైరి
పిదపఁ గశ్యపుఁడు సం । ప్రీతుఁడై పుష్కర, క్షేత్రంబునను జగ । జ్జైత్రమయిన
తప మొనర్చిన మెచ్చి । ధరధరుం డతనికి, బ్రహ్మతేజస్సహా । పట్టిదోయి

తే॥ నొసఁగె నేఁ గాశ్యపుఁడ నందు । నొక్కరుండఁ, దనకు విద్యాప్రదాత స । దాశివుండు
ప్రకృతిపరుఁడైన కృష్ణుండు । పరమపురుషుఁ, డిష్టదైవంబు నాకు య । థేచ్ఛ నందు.

గీ॥ తత్పదాంబుజసంసేవ । దక్క నితర, మెద్దియునుగోర సర్వంబు । నే వచింతుఁ
ద్రిభువనైశ్వర్య మన్నను । దేఱిచూడ, నని వచించిన వినుచు సు । యజ్ఞనృపతి.

సీ॥ సంసారజలదఝం । ఝానిలంబగు కృష్ణ, పదభ_క్తి గల యట్టి । బ్రాహ్మణుండు
కోరునే? యన్యంబు । కొనునె? నే నిచ్చెదు, ధనకనకాదు లి । ద్ధరణిసురుఁడు
తరియింపఁ జేయఁడే । ధన్యుఁడీ తండు న,న్నని పాదకమలంబు । లందుఁ బడిన
వెఱవకు మింకేల । విభుచంద్ర! పెక్కేండ్లు, రాజ్యంబుఁ జేసితి । రాజసమున

తే॥ నీదుసుతుమీఁద రాజ్యంబు । నిలిపి పత్ని, నతని బోషింపుమని చెప్పి । యటవి కేగి
యందు వసియించి తాపసా । నందుఁడవయి, కడపు మిఁకఁ గాలమన్యంబు । గలదె నీకు

సీ॥ బ్రహ్మయాదిగ_స్తంబ । పర్యంతమును జగం, బెల్ల మిథ్యయటంచు । నెఱిఁగికొనుము
రాధాప్రియుండై న । రమణీయతరమూ_ర్తి, పరమాత్మ కృష్ణుండు । పరము సుమ్ము
బ్రహ్మాద్యలభ్యుండు । పరఁగ నావిర్భావ,మును దిరోధానంబు । తనదిగాక
వ_ర్తించు బ్రహ్మాది । వర్గంబు దిక్పాల,వితతి తదాజ్ఞచే । వెలయుచుండు

తే॥ వాయుసూర్యాగ్నిశశిముఖుల్ । వదల కతని, యాజ్ఞ నుందురు పర్జన్యు । డంబువృష్టి
నలుపును దదాజ్ఞ వసుమతి । సాగరాది,వర్తనం బెల్ల శ్రీకృష్ణు । వలనఁ జుమ్ము

వ॥ మఱియును స్వర్లోకాది సప్తోర్ధ్వలోకంబులును, అతలాద్యధోలోకంబులును,
బ్రహ్మాదిభువనంబులును, సుర, నర, నాగ, గంధర్వ, యక్ష, రాక్షస, పన్నగ,

మృగాదులు, సర్వంబును శ్రీకృష్ణవశంబులును, కృష్ణాశ్రితంబులునై శ్రీ కృష్ణుని నాభిపద్మంబున నీ సర్వంబు వసించు. తల్లోమంబుల విశ్వంబు నివసించు. విరాడ్రూపంబగు బ్రహ్మాండంబు కృష్ణసంభవంబు. క్షుద్ర విరాట్సర్వస్వంబును తత్ప్రకృతి కళాంశంబు, సంహారంబున జగంబు లీనంబై కృష్ణునిం జేరు. తత్తత్కాలంబుల నావిర్భావతిరోధానంబులగు బౌరయు నని సుయజ్ఞునకుఁ గశ్యపనందనుండు బోధించి ముక్తి నొందించె నని యద్రిజకుం జంద్రశేఖరుండు చెప్పిన తెఱంగున నారాయణుండు నారదునకు బోధించు ప్రకారంబు వ్యాసభట్టారకుండు తెలుప జనమేజయుండు సంతసించి బారాశర్యునకు సాష్టాంగవందనం బొనర్చి వినయావనతుం డయ్యెనని సూతుండు శౌనకాదులకుం దెల్పిన సంతసించి యమ్మునివర్గం బవ్వలివృత్తాంతంబు వివరింపవలయు నని యడిగిన. ౧౦౪౫

మ॥ ధరణీవారిధనంజయానిలవియత్సత్ప్రాత్మ్యదాక్షాయణీ
వరజీవాష్టకరూపయంత్రితజగత్సద్వస్తుక్రియాచాతురీ
నిరతోత్సాహధురీణ సర్వమయతా ! నీరంధ్రసంవ్యాపన
స్ఫురదాత్మీయమహామహోద్ధృతశిరస్స్ఫూర్జన్మరున్నిర్ఝరా. ౧౦౪౬

క॥ నిర్జరభయదత్రిపురీ, దుర్జయరక్షశ్చయాగ్ర్యదోఃఖండన సం
తర్జిత గర్జత్క్ష్వేళా, భర్జిత శతకోటికోటిపటురవచటులా! ౧౦౪౭

ఉత్సాహ॥ వారణాసిపురవిహారిభక్తచిత్తరంజనా
వారణామరారిగర్వవారిదప్రభంజనా
సారసాక్షమర్దళానుషంగచంగనర్తనా
సారసాసనోక్తిగమ్య ! సత్త్వచతురవర్తనా! ౧౦౪౮

క॥ దేవీభాగవత స్కంధావళి నవమంబు నచ్చమాంబా జగ్గ
క్ష్మావరుల కభీష్టార్థ, శ్రీవెలయఁగఁ జేసి సుప్రసిద్ధిం జెందున్. ౧౦౪౯

గద్య

ఇది శ్రీమత్పరమశివాద్వైత భావనాసాధ్య ములుగు సదన్వయ సిద్ధ సారస్వత విద్యా
సాన్నిధ్య వేమనారాధ్యవంశార్ణవ కలానిధాన పాపయారాధ్యాభిధాన
ప్రణీతంబైన శ్రీ దేవీభాగవతం బను మహాపురాణంబునందు
నవమస్కంధము సంపూర్ణము.
శ్రీదుర్గాదేవతార్పణ మస్తు

---

షరా:— ఈ నవమస్కంధమందే కాక ప్రతిస్కంధమునందును నేఁడుపలబ్ధమగు మూలగ్రంథమునకుఁ గొంచెము భేదమే కాదు, గాథలకు గాథలే భేదించినట్లు లోఁగడ సూచించినాఁడను. దీనికి ముఖ్యకారణము గ్రంథభేదమే కాని కవిలోపము కాదని సువిమర్శకులు తెలిసికోఁగలరు. ఇతరులో ! తెలిసీ తెలియని శంకలకు లోనగుదురు. నన్నయాదుల భారతాంధ్రీకరణమునఁగూడ నిట్టిభేదము గల్గుటకు నిమిత్త మిదియే యని యితరత్ర వివరించి యుండుటచే నిట స్పృశించి విడిచితిని.



వెం॥ శా॥ శతవధాని.

# తప్పొప్పుల పట్టిక

## అష్టమస్కంధము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౮౬ | ౨౩ | వేఁడు | వేడు |
| ... | ౩౦ | ధైర్య | ధైర్య |
| ౧౮౭ | ౧౩ | ద్వీపబు | ద్వీపంబు |
| ౧౮౯ | ౯ | సమాత్షమం | సమత్షమం |
| ౧౮౯ | ౨౪ | వేదోద్యానం | దేవోద్యానం |
| ౧౯౫ | ౨౨ | లెటెంగింప | వెలింగింప |
| ... | ౨౭ | సృషి | సృష్టి |
| ౨౦౪ | ౩౦ | ౨౨౦-౨౨౧ | ౨౨౧-౨౨౨ |

(షరా):—తుట్టతుదిసంఖ్యకు సంబంధించిన సవరణ టిప్పణికి సంబంధించినది. మఱియు ౧౭౧ వ పుటలో ౨౧ వ పంక్తిలో మనోవతి అను పదము తరువాయిని తేజోవతి అను పదము చేర్చికోవలయును. ఆ యీ పుటలోనే 23 వ పంక్తిలో బ్రిహ్మేశానాంతంబుగా అనునది బ్రహ్మాదియీశానాంతమ్ముగా అని మార్చి చదివికోఁదగు. ౧౮౯ వ పుటలో ౨౧-౨౩ పంక్తులలో నున్న వాక్యములకు సమన్వయము చక్కఁగా సరిపడుటలేదు. వచ్చు ముద్రిణములో నది సవరింపవలసియున్నది. భవిష్యత్సంస్కర్తలుపేక్షింపకుందురుగాక.

## నవమస్కంధము

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౨౨ | ౨౫ | వివరించెద | విరచించెద |
| ౨౨౪ | ౨౬ | పట్టస | పట్టుస |
| ౨౩౨ | ౧౫ | హీనంబుల | హీనంబున |
| ౨౪౧ | ౧౪ | వర్ణుల | వర్ణులు |
| ౨౪౩ | ౨ | విలిను | విలీను |
| ౨౪౬ | ౨౯ | లబము | లబ్ధము |
| ౨౫౧ | ౧౨ | శుౕితులు | శుౕితులు౯ |
| ౨౮౭ | ౧౦ | నందంబు | నదంబు |
| ౨౭౩ | ౭ | విజాని | విజ్ఞాని |
| ౨౭౮ | ౧౯ | అబి | అబ్ధి |
| ౨౯౦ | ౨౯ | జేసతి | జేసెతి |
| ౩౦౭ | ౨౯ | కాశికా | కాళికా |
| ౩౧౭ | ౧౪ | బ్రితి | బ్రికృతి |
| ౩౨౦ | ౨౯ | యుక్తి | యుక్త్యోక్తి |
| ౩౨౩ | ౧ | రకర్కసు | కర్కశు |
| ౩౩౨ | ౧౦ | సగుణ | సుగుణ |
| ... | ౧౭ | గడుప | గడప |
| ౩౪౫ | ౨౧ | విద్యాహీను | విద్యావిహీను |
| ౩౫౧ | ౨౮ | రాధినియ | రాధినిన |
| ... | ౩౦ | సుర్ల | సుగుల |
| ౩౫౭ | ౨౧ | జని | చని |

ఇవిగాక యీ స్కంధములో ౨౪౦ వ పుటలో ౮ వ పంక్తి కంద ద్వితీయచరణము—

"నారత మిటు వంటిజన మనంతము" అనియు ౨౬౭ వ పుటలో ౩౦వ పంక్తిలో కందప్రథమ చరణము క॥ భారతఖండంబున దు" అనియు ౨౭౮ వ పుటలో ౧౯ వ పంక్తి గీత ద్వితీయ చరణము "చంచలునితో సమీరుండు" అనియు సవరించుకోవలయును. మఱియు ౩౫౫ వ పుటలో ౪-౫ పంక్తులలోనున్న 'మర్త్యమునకు, అవని' అను రెండుపదములును పడికట్టురాళ్ళుగా గమనించఁదగు.

శ్రీ ర స్తు
శ్రీ మహాగణాధిపతయే నమః
శ్రీ శా ర దాం బా యై న మః
శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము - శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## దశమస్కంధము





గణనాతీతంబై
త్యాగప్రభుతాది విలసితార్థము దేవీ
భాగవతంబునఁ బదియవ
భాగము భోగ్యప్రసాదభావం బలరున్.

క॥ శ్రీరంజిత! భక్తజనో, ద్ధారక! కరుణాంతరంగ! * దనుజవిభంగా!
కారణ కారణ! సంసృతి, తారణ! సుకవీంద్రశరణ * ధర్మోద్ధరణా! ౨

వ॥ దేవా! సకల పురాణేతిహాస కథా సుధాస్వాదన నిస్తంద్రులగు నమ్మునిచంద్రులకుఁ దన్మనోరథ రథ-చోదనాసూతుం డగు సూతుం డిట్లనియె. ౩

క॥ శ్రీలలర భువనసంతతి, మూలంబై సర్గభరణ * ముక్తిపద శుభా
వాలమగు చిదానంద, జ్వాల జగద్యోని దేవి * సంరక్షించున్. ౪

వ॥ ఇట్లు నమజ్జనదురితలతాలావిని యగు పరదేవిని భజించి. ౫

క॥ జనమేజయుండు వ్యాసుని, గని నారాయణ మునీంద్రు ౹ ఘనతరవాచా
జనితోల్లాసముచే సుర,సను నాతనిఁ గాంచి సంతసమున నతుండై. ౬

ఆ॥ ఎద్ది యడిగె మౌని ౹ యెద్ది ప్రారంభించె, నది వినంగఁగోరి ౹ యంతరంగ
మానఁగొనియెఁ దెలుపు మన్న నవ్వలి కథ, దెలిపె మౌనిఁ జూచి ౹ దేవమౌని. ౭

ఉ॥ పాపలతాలవిత్రమగు ౹ పావన శక్తిచరిత్ర మింటి ని
ష్పాపుఁడనైతి నొండొకటి ౹ భావమునన్ జిగురించె, దేవి యే
రూపమునొంది యే కరుణ ౹ రూఢి వహించెనో! యెప్పు డెప్పు డి
చ్ఛాపరతంత్రయయ్యెనొకొ ౹ సందియమెల్లను దీర్పుమీ యనన్. ౮

క॥ ఆ యా మన్వంతరముల, మాయా విభవంబు నీదు ౹ మది మెప్పగొనన్
జేయుదు దేవీకథ లన,పాయత వినఁగోరనట్టి ౹ పందలు గలరే. ౯

సీ॥ పరదేవిచరితంబు ౹ ప్రశ్న చేయని వాని, పాండిత్యమెల్ల నిష్ఫలముగాదె?
అడిగినఁ దెలిసిన ౹ యంత చెప్పనివాని, వాచావిభూతియు ౹ వంధ్యగాదె?
శ్రోతృవక్తలఁ జూచి ౹ సుముఖుండుగాని దు,ర్జాతి ధాత్రికిని భారమ్ముగాదె!
శక్తికథావళి ౹ ముక్తి మూలం బని, పలుకనివాఁడు దుర్భగుఁడు గాఁడె!
తే॥ ఎంతని వచింతు మద్భాగ్య ౹ మీవు సేయు, ప్రశ్నచే మోదసాగరాంతఃప్రగాహ
నంబుకై వడి మన్మానసంబు శిశిర, శీతలంబయ్యె హర్షంబు ౹ చిగురులొత్తె.

చ॥ వినుము నిలింపతాపస! ప్రవీణ మనస్కృత విష్టపత్రయీ
జనన నిదానమౌ నలువ ౹ శౌరి సముజ్జ్వల నాభిపద్మ సం
జననము నొంద నన్నలువ ౹ సర్గమునందున రూపు రెండుగాఁ
గొని మనువున్ దదంగనయుఁ ౹ గూడను నయ్యె శ్రుతిప్రసిద్ధుఁడై. ౧౧

ఆ॥ అతని దక్షిణాంగ మలరె స్వాయంభువుం, డట్ల యతని పత్ని యయ్యెఁగాదె
సరసిజాతనయన ౹ శతరూప యను పేర, సృష్టి కాది వీరిఁ ౹ జెప్పనేల. ౧౨

సీ॥ క్షీరపాథోరాశి ౹ తీరంబునను మహా,హర్షంబు నొంది స్వాయంభువుండు
పార్థివంబున దేవి ౹ ప్రతిమఁ గావించుచు, నిరతంబుఁ బూజించి ౹ నిష్ఠ పేర్మి
జితమారుతుండు నిర్జితభక్షణుండును, నియమ కర్షితుఁడునై ౹ నిలిచి యేక
పదమున నోట వాగ్భవబీజము జపించి, శీతవాతాతప ౹ స్థిరత గలిగి
తే॥ నూఱువర్షంబు లింద్రియానూన నిగ్ర,హోగ్రతప మాచరించి సువ్యగ్రనిష్ఠ
దేవిపదచింతన మొనర్ప ౹ దృఢనియతికిఁ, గరుణచే రాజునెదుట సాక్షాత్కరించి.

చ॥ తపమున డస్సినాఁడవు ముదంపడి మెచ్చితి నెద్దికోర్కె? నేఁ
గృపదొరలంగ నిచ్చెద నరేశ్వర! వేఁడు మనః ప్రహృష్టుఁడై

యపరిమిత పరిణామముల ♦ నంబిక మెప్పొనరించి యాత్మలోఁ
వ్యపగతసంశయుం డగుచు ♦ నర్థి వచించె నరాభిలాషచే. ౧౪

సీ॥ దేవి! విశాలాక్షి! ♦ దీనకల్పద్రుమ!, సర్వాంతరస్థిత! ♦ సర్వపూజ్య!
నీ కటాక్షస్ఫూర్తి ♦ నీరజగర్భుండు, జగమెల్లఁ గల్పించు ♦ శార్ఙ్గి ప్రోచు
హరుఁడు ముక్తి నొసంగు ♦ నమరాధినాథుండు, పాలించు, దండించు ♦ భానుసుతుఁడు
సలిలంబు గురియించు ♦ సాగరపరివృఢుం, డర్థంబు లొసఁగు య ♦ క్షాధిపతియు

తే॥ తక్కనిర్జరులెల్ల న ♦ ద్వైతమూర్తి,వైన నీ యంశభవులు నా ♦ యందుఁ గూర్మిఁ
జూపితివి నిన్నుఁగను కన్న ♦ శుభములెవ్వి?, నీదు వాగ్భవమంత్ర సం ♦ వాదినైతి.

క॥ ఇమ్మంత్రంబు జపించిన, నెమ్మెయి సిద్ధింపరాని ♦ వెవ్వియుఁ గలవే?
కొమ్మ! నీ సకలాభీష్టము, లిమ్మహి భక్తులకు నిరత ♦ మిచ్చుట గాదే? ౧౫

ఆ॥ అఖిల కామధేను ♦ వగు నిన్నుఁగని కోర్కు,లడుగకుండు టెట్టు ♦ లమృతహస్తుఁ
డగుచు బికిర మెత్తి ♦ నట్లని వేడెదఁ, దలఁపు నిలుపవమ్మ! ♦ దైత్యమథని! ౧౬

సీ॥ జాతిస్మరత్వంబు ♦ సరసవక్తృత్వంబు, జ్ఞానసిద్ధియు నిత్య ♦ శౌచగరిమ
కర్మమార్గాసక్తి ♦ కడుఁ బుత్రపౌత్రాభి,వృద్ధి యితోఽధిక ♦ విధిఁ జెలంగఁ
జేయు మంచని వేఁడ ♦ జిఋనవ్వు నవ్వుచు, సముపార్జితంబయ్యె ♦ సర్వకామ
మెద్ది యొసంగెద? ♦ నేను బ్రసన్ననై, యెదురనిల్చిన నీకు ♦ నేటికొఱఁత

తే॥ వాగ్భవజపంబుచే సర్వ ♦ వశ్యమయ్యె, నీదు రాజ్యంబు కంటక ♦ నిరవశేష
మాత్మజులు వంశకరులు, ప్ర ♦ జాభివృద్ధి, యగుట మత్పాదభక్తి య ♦ నల్పమగుచె.

ఆ॥ అని వరంబు లొసఁగి ♦ యతనిచే నభినత,యగుచు నతఁడు చూచు ♦ నంతలోన
గగనపథమునందుఁ ♦ గలిగి వింధ్యాటవీ,వీథులందు నలిపె ♦ విహృతి దేవి. ౧౮

ఉ॥ భానుపథావరోధియయి ♦ పంకరుహప్రభవాండమెల్ల ని
ర్గ్లానముగాఁగ నీ యచల ♦ లోకధురీణుఁ డొనర్చె నట్టి సం
తానతమాలసాల ముఖ ♦ ధాత్రిరుహాటవివాటి సంతతా
నూనము వింధ్యశైలము గ ♦ నుంగొన నేరికి నబ్బురం బగున్. ౨౦

ఆ॥ అట్టి వింధ్యవాటి ♦ ననవరతమ్ము,ను, దనకు నిజనివాస ♦ మనఁగ విష్ణు
ననుజ సర్వపూజ్య ♦ యగుచు శ్రీ వింధ్యవా,సిని యనంగ దేవి ♦ చెలఁగు నచట.

వ॥ అని వచించునెడ శౌనకాదులు వింధ్యాచలంబు గగనావరోధంబు సేయుట కేమి కతంబు. మైత్రావరుణి యగు తపస్వి యెవ్విధంబున నయ్యచలంబుఁ బ్రకృతిస్థంబుఁ జేసె? నీ వృత్తాంతంబు సవిస్తరంబుగాఁ దెలుపు మనిన సూతుండిట్లనియె. ౨౨

గీ॥ వసుమతీమండలమున న॰వార్య గహన,మండలీ సంవృతంబయి ॰ చండకిరణ
ఘృణులు చొరనీక॰దట్టమై కెరలు పుష్ప,పాదపచ్ఛాయమగు వింధ్య॰పర్వతంబు.

మ॥ మహిష వ్యాఘ్ర వరాహ వానర మదోన్మత్తేభ కంఠీరవో
ద్వహసారంగ శశర్క్ష సంతత దురాపంబై లతాగుల్మినీ
బహుళంబై సుమగంధగంధిలకుజప్రాలంబికీరావళీ
మహితధ్వానగభీరమై వెలయు శంభల్లీల వింధ్యం బిలన్. ౨౪

సీ॥ రాజీవరాజీవి॰రాజితకాసార, సారసకేంకార॰సంకులంబు
గంధర్వకిన్నరా॰కలితవీణావేణు, సంతతగాన వి॰శ్రాంతతటము
అప్సరోనటననిర్వ్యాపారసారంగ, బృంద బృందీకృతా॰మందవనము
శిఖర శేఖరచర॰త్సింహడింభకలోక, చకిత ఘోటకరవి॰స్యందనంబు

తే॥ తాలహింతాలపనస తక్కోలసాల,జాలకాకీర్ణ కాంతార॰చటులభిల్ల
మల్లకార్ముకగుణర వా॰మందపూరి, తాంబరంబగు వింధ్యశై॰లంబు గనఁగ.

ఉ॥ అద్ధరణీధరేంద్రమున ॰ కామరతాపసుఁ డొక్కనాఁడు భూ
భృద్ధనురంగనాభజన॰పేశలతన్ మది రంజిలన్ గళా
భృద్ధిమశారదాభ్ర రుచి॰వీచిక లాకసమెల్లఁ గ్రిమ్ముకొన్
సిద్ధ సుధాతరంగముల ॰ సేకము బ్రోఁకఁగ వచ్చెఁజెచ్చెరన్. ౨౬

క॥ వచ్చిన సురముని కెదురుగ, వచ్చి నమస్కృతి యొనర్చి ॰ వసుధాధర మ
త్యుచ్చమగు పీఠమిడి లవ, మొచ్చెము లేకుండ నడపె ॰ నుచితసపర్యల్. ౨౭

సీ॥ దేవర్షివర్యుండు ॰ దివ్యసింహాసనా,సీనుఁడై కూర్చుండి ॰ చెలిమి మెఱసి
ధరణీధరాగ్రణి ॰ తావకౌన్నత్యంబు, జగదేకవిఖ్యాతి ॰ సంగ్రహించెఁ
గంటి నివ్వసుధలో॰గల భూధరంబుల, నినుఁబోలునట్టి య॰నింద్యచరితుఁ
గాన నిచ్చొ నాత్మ ॰ గడుఁ బ్రమోదమునొందె, భవ్యమే నీకును ॰ బర్వతేంద్ర!

తే॥ యనుచు కుశలంబొనర్చి య॰పారసరస, వచనరచనలఁ గాలంబు ॰ వాల్చునపుడు
వింధ్యశైలంబు మునిఁగాంచి ॰ వినతిసల్పి,యిట్టులని పల్కె సద్భక్తి॰యిగురులొత్త.

ఉ॥ మానికులావతంస! నను॰మన్ననసేయఁగ నీదు నాగమం
బౌనెకదా? భవద్విహృతి ॰ యల్పులమౌ మముబోట్ల శుద్ధులం
గా నొనరింపనేఁగద య॰కల్మషమయ్యె మదీయవంశ ము
త్థానమునొంది పూర్వులు య॰థావిహృతిం గని యూర్ధ్వలోకముల్. ౨౯

క॥ ఆ రాకఁ జకోరము నిం, డారగ ముదమందినట్టు ॰ లమరతపస్వీ!
నీరాక నన్నుఁ దేల్చె ను,దారత నానందవార్ధి ॰ నవగాహములన్. ౩౦

ఆ॥ అనిన దేవమౌని యద్రిరేంద్రుని గాంచి, యేము కనకగిరికి నేగి యందుఁ
గలుగు వింతలెల్ల గని యచ్చటచ్చట, వార్తలెల్లఁ గనుచు వచ్చు టరయ.

సీ॥ శక్రాదిదిక్పాలకసమితి లోకంబులు, శిఖరాగ్రములమీదఁ జెలువెసంగు
నన్నియు సుఖభోగ మానుభవింపఁగఁ జేయు, సుకృతాంతరంగులౌ సుజనులకును
సిరులకు గడమలేదరయ నింటింటను, గల్పవృక్షంబులు కామగవులు
రత్నసౌధంబులు రత్నమందిరములు, రత్నపీఠంబులు రత్నవేదు

గీ॥ లెద్దియుఁ గొఱతలేదని యేమియనక, పెద్దనిట్టూర్పుపుచ్చుచుఁ బ్రియము నద్రి
యమును వలుకక మిన్నకున్నంతఁ జూచి, యంజలిఘటించి చిఱునవ్వు నంజెలంగి.

క॥ స్వామీ! దీర్ఘోచ్ఛ్వాసం, బేమిటి కిచ్చెదరు హేతువేమి మదుక్తిన్
నేమము దొలఁగెను మదిలో, నేమేని యభిజ్ఞపొడమెనే! తెల్పుమనన్.

క॥ నా యుచ్ఛ్వాసనిదానము, నీయెడ వివరింతు విను మహీనగుణకృతో
పాయుఁడ వఖిలమహర్షివి, ధేయుఁడ వీ వెఱుఁగనట్టి తెఱఁగుల్ గలవే. ౩౩

సీ॥ ముక్కంటి మామయై మూలప్రకృతిశక్తి, తండ్రియౌ హిమధరాధరముఁ గనమె
దేవదేవునకు మందిర మౌచు జగదేక, ధన్యమౌ కైలాసధరముఁ గనమె
నిషధశైలమ్మును నీలాచలమ్మును, గంధమాదనమును గనమె వినమె
దినదినంబును చుట్టుదిరుగుచుండు సహస్రకరుఁడు తన్నని మేరుగిరి ధరిత్రి

ఆ॥ నచలములకునెల్ల నధిరాజ నని దర్ప, మేర్పడంగఁ దనకు నెందు సములు
లేరటంచు మఱివికారమూనెఁ గదా! య,టంచుఁ దెలిసి యుచ్ఛ్వసించినాఁడ.

వ॥ అని పలికి ప్రసంగవశంబున నీ వృత్తాంతమ్ము నాప్తుండవును సుగుణుండవు నని నీతో
నుగ్గడించితి. గృహస్థులతో మాకుం గాలయాపనంబేటికిఁ బోయివచ్చెద నని దేవ
ముని బ్రహ్మలోకమునకుం జనియె. ౩౪

సీ॥ మునివరుండు యథేచ్ఛఁ జనినపిమ్మట వింధ్య, శైలంబు మదిలోన శాంతిమాలి
నిఖిలభూభారంబు నిర్వహింపఁగఁజాలు, మముబోటి శైలముల్ మహిని గలుగ
దుర్గర్వమునఁ బొంగి దుర్వచోవ్యాపార, దుర్మదుం డయ్యెఁ దోడ్తోడఁ గనక
గిరి గర్వ మడఁప నిప్పరుసున నెది మూల, మెట్టు స్వస్థతనంది మెసఁగు మనము

తే॥ నాదు బలపౌరుషంబులు నాదుకులము, నాదు నుత్సాహము యశమ్ము నాదుకలిమిఁ
గాల్పనే! సాటియరిగల్గు కష్టజన్మ, మడవిఁగాసిన వెన్నెలయగుచు గాదె. ౩౬

క॥ త్రొల్లి మృకండు తనూజుం, డుల్లమలరి పలికెఁగాదె! యుర్వర శత్రుం
డుల్లసిలు నెవ్వనికి భువిఁ, బొల్లుసుమీ వానిజన్మ భూభరమనుచున్. ౩౭

సీ॥ తనచుట్టు దిరుగు నక్షత్రతరణియంచని గర్వ,మెత్తియున్నదియపో? ॥ హేమధరము
అదిమి యధోలోక ॥ మంటంగఁ ద్రొక్కెదఁ, గాలచక్రంబులఁ ॥ గడకుఁద్రోతు
భానుని బంధింతు ॥ బ్రహ్మాండమెల్లను, బిక్కటిలంగ నేఁ ॥ బెరుఁగువాఁడఁ
దనపేరుఁబెంపు నే ॥ దరినిజేరునో? కావ,నెవ్వరో? తనకని ॥ యెఱుఁగమాలి

ఆ॥ దెసలుగ్రమ్మి నింగి ॥ తెరపిలేకుండంగఁ, జేతు ననుచుఁ బెరిఁగె ॥ శీతకిరణ
తరణితారకాది ॥ సురపదభువనముల్, గప్పికొనుచుఁ గనుల ॥ రొప్పికొనఁగ. 3౮

గీ॥ ఏను దివినంటఁ బెరిఁగిన ॥ హేమకూట, దర్పమెప్పాట నుండునో! ॥ తడయవలద
టంచు నిశ్చితిఁ జేసి విరించిలోక, మవధిగా నంటఁబెరిఁగె వింధ్యాద్రి యంత.

వ॥ అట్టి సమయంబున నెప్పటి పోల్కి నారేయి గడచి ప్రభాతం బగుటయు, ప్రభా
కరుండు తనరాక కెదురుచూచు కృశాంగి యగు పద్మిని నుపలాలనం బొనర్చుట
కేతెంచు నను పోల్కి దక్షిణదిశాభిముఖుండై యరుదెంచు నెడ ననూరుండు
రథంబు సాఁగమిని జడనుపడి సూర్యాభిముఖుండై కనకాచలంబుతో స్పర్ధించి
వింధ్యాద్రి బ్రహ్మాండ కటాహంబు నిండఁ బెరిఁగియున్నవాఁడు, మనకుంబోవు
నుపాయం బెయ్యది యని విన్నవించిన. ౪౦

సీ॥ వినతాసుతుని వాక్యవివృతి పరీక్షించి, చింతిల్లుచును నెద్ది ॥ సేయువాఁడ
గగనమార్గంబెల్లఁ ॥ గట్టుపడ్డది పార్శ్వ, గతులకుఁ జొరనీదు ॥ కడిఁది గట్టు
కాంతారములఁబోవఁగా రాదు కాలంబు, వినిమయంబయ్యె నద్విధులు దొరఁగె
నరిది తమఃకాంత ॥ మయ్యె బ్రహ్మాండంబు, ప్రళయ మకాండమై ॥ పరిఢవిల్లె

గీ॥ నేమిసేయంగ నగు ననిన యెదఁగలంగె, నినుఁడు రాహుచేఁ జిక్కియు ॥ నేకఘటిక
నిలువనట్టి సహస్రాంశుఁ ॥ డలఁతనొంది, కట్టుపడి నిల్చె నవ్విధిఁ ॥ గడవఁ దరమె!

గీ॥ పవలు రేయను మాట యేర్పడమిఁ గర్మ, విధులు వక్రించెఁ జీఁకటిని వెన్నెలలును
నెండనీడయు ననుమాట ॥ లెసఁగవయ్యె, దీనులై లోకవాసులు ॥ దెరలిరపుడు.

క॥ లోకంబులు పదునాలుగు, లోకాధీశ్వరులతోడ ॥ లోలము లయ్యెన్
వ్యాకులతఁ జిత్రగుప్తులు, నాకులపడి వ్రాయరైరి ॥ యఖిలక్రియలన్. ౪౩

సీ॥ ఎవ్వాని ప్రభలచే ॥ నెల్లలోకంబులు, కాలవిజ్ఞానంబు ॥ గలిగియుండు
నట్టి భానుండు దైవవాహతిబద్ధుఁడై, నిలువ స్వాహాకారములు నశించెఁ
బ్రాచీముఖంబులు ॥ పశ్చిమత్వమునొందెఁ, బశ్చిమలోకముల్ ॥ ప్రాచులయ్యె
నటుల దక్షిణ ముత్తరానుభూతిఁ బొసంగెఁ; జెలఁగి యుత్తరము దక్షిణమునయ్యె

తే॥ నిట్లు దిగ్భ్రాంతిపొడమిన ॥ నెల్లజనులు,కడుభయభ్రాంతులై భయంకర మభూత
పూర్వమగు నయ్యవస్థను ॥ బ్రోదిగొనక, చేయునది లేకపుడు మృతప్రాయులైరి.

క॥ ఆ తఱి వేల్పులు చని పురు, హూతునిఁ గని పద్మయోని యొద్దకుఁ జని సం
ఘాతమయి దేవదేవుని, భూతాధీశునిఁ గనంగఁ బోయిరి వెలుచన్. ౮౭

సీ॥ అంభోధు లెల్ల నేకార్ణవం బగునాఁడు, *కరటిసోఁకులు లేని కటకమెద్ది
కాలాగ్ని రుద్రాదిఘనులకెల్లను విహా,రస్థలంబైన దే రాజధాని
బ్రహ్మాదిదేవతాపటలంబులకు నెల్ల, వెదకంగఁ దగని దే పీటమిన్న
దేవతాసార్వభౌమాననధం బాచు, శ్రీలొందు నే నగరీమతల్లి
తే॥ అట్టి కైలాసపురము కృతార్థవృత్తిఁ, గనఁ గలిగె నేఁడు మనకంటికలవుదీర
ననుచు ముదమంది యమరాళి యమ్మహేశు,కోటవాకిటఁ జేరి నిష్కుటిలమతులు.

క॥ ప్రతిహారులతోఁ దమ సం,గతిఁ దెల్పినవారు దెల్పఁగా విని దేవ
ప్రతతులఁ దోడ్కొని చన వా, రతినమత్ప్రహరునిఁ గాంచి రంజలియుతులై. ౮౮

సీ॥ జయ దేవగణనాథ సర్పమాలాభూష, యష్టసిద్ధి సమేత యార్తిహరణ
పంచాస్య పరమాత్మ పార్వతీవల్లభ, నందివాహ సురాధినాథవినుత
కైలాసనిలయ శ్రీకంఠ మృత్యుంజయ, జయజయ దీనపోషక మహేశ
బహురూప విష్ణుహృత్పద్మనివాస వి,ష్ణుస్తుత గిరిశయ శస్తవిభవ
తే॥ యోగగమ్య, సనాతన యోగిపాల, యోగఫలదాయి, సద్భక్త భాగధేయ
కాలకాల, కృపానిధి కలుషమథన, యనుచు సాష్టాంగపడిరి యయ్యమరవరులు

క॥ నతులై కరములు మోడ్చుచు, నతు లొనరించుచును దేవ "నో దేహి ముదం
వితతా" మని దీనాస్యత, గతిమాలిన యట్లు నిల్వఁగాఁ గని వేడ్కన్. ౮౯

ఉ॥ ఏను బ్రసన్నమానససమీహితవృత్తిఁ బొసంగినాఁడ మీ
రాననముల్ గలంగి యభిమానము దూలి కడున్ శుభస్థితిన్
గానని యోజ నుఁడుటకుఁ గారణమేమి వచింపుఁ డన్న దీ
నాననులై నిలింపులు వృషాధిపవాహనుతోడ నీ గతిన్. ౯౦

చ॥ పలికిరి దేవదేవ శశిభానుశుచిత్రయనేత్ర! ధాత్రి ను
జ్జ్వలమయి వింధ్యశైలము జవంబునఁ గర్వరమంటఁ దాఁకి య
జ్జలరుహబాంధవాధ్వము వెసన్ బ్రతిరోధ మొనర్చెఁ బేర్చుచున్
గలఁగెను విష్టపత్రయము కాలగతిన్ విటతాటనంబుగన్. ౯౧

గీ॥ కొన్ని దేశంబు లెండలఁ గుములఁ జొచ్చెఁ, గొన్ని రాజ్యంబు లీకువఁ గుదిలపడియె
భువనవాస్తవ్యులకు నెల్లఁ బుట్టరాని, యడరు పుట్టించె నవ్వింధ్య మళికనేత్ర!

క॥ జంభారిప్రముఖులు ద,త్సంభనకున్ జాలరైరి సర్వజ్ఞ! కృపా
రంభమున మమ్ముఁ బ్రోవు మ,దంభముగా నాదరించి దర్పకహరణా. ౯౩

* కరటి సోఁకులు = కరటి + సోఁకులు = ఏనుఁగుల దెబ్బలు

ఉ॥ నావిని శంకరుండు చిఱునవ్వుల నెమ్మొగ మందగింప దే
వావళులార! యిట్టి యడరైనయెడన్ భువనైకరక్షణ
శ్రీ విలసిల్లఁజేయ హరి ధృష్టుఁడు సర్వజగత్ప్రభుండు ర
క్షావిధి కర్త యందఱము కైటభమర్దనుఁ జేరఁగాఁదగున్. ౫౪

క॥ అనిపలికి వారలన్ గొని,చనియెన్ మదనాంతకుండు సారసనేత్రుం
గనువేడ్క చిగురులొత్తఁగ, మనములు హర్షాంబురాశి మగ్నత నొందన్. ౫౫

వ॥ చని యద్దేవు సందర్శించి దేవా! నీవు పాఠీనంబవై త్రయీచోరుం దెగటార్చి లోకంబులు రక్షింపవే? కమఠంబవై సురకార్యంబులు సమర్థింపవే! ఆదివరాహంబవై వసుమతి నుద్ధరింపవే? నారసింహంబవై హిరణ్యకశిపునిఁ దెగటార్చి దైత్యడింభకుం గాపాడవే? వామనుండవై త్రిలోకైశ్వర్యమోహితుం డగు బలిన్ బంధింపవే? రేణుకానందనుండవై సహస్రకరు నిర్జింపవే? దశరథనందనుండవై దశకంఠవిలుంఠనంబు సేయవే? వాసుదేవుండవై కంస దుర్యోధనాది దుష్టభారాక్రాంత యగు ధరిత్రీభారం బపనయింపవే? బుద్ధుండవై పరహింసానివృత్తి బోధించి ప్రజల మన్నింపవే? మ్లేచ్ఛప్రాయం బగు ధారుణీతలంబు చక్కంజేసి కలికిరూపంబున వర్తింపవే? నీవే కదా! సర్వదుఃఖాపహరుండవు, భక్తార్తినాశకుండవు. నీకన్న దయానిధి యొక్కండు కలఁడే? యని వేడుచున్ బాడుచున్ నటించుచున్న సుపర్వాలం గని గరుడధ్వజుం డిట్లనియె. ౫౬

సీ॥ అమరేంద్రులార మీ యభినుతికిని బ్రసన్నుండనైతి వెఱవకుండుఁ డింక
నిట్టి యాపద గల్గ నేమికతం బొక్కొ.?, యభయమిచ్చితి నాత్మ నడలవలవ
దెద్దిగోరిన నిత్తు నిష్టమ్మగు వరమ్ము, నా భక్తి గల్గిన నరుల కెందు
శోకంబు గల్గునే లోకమ్ములను వారి, యింటను లక్ష్మి వసించు నెలమి

తే॥ భూతభేతాళ నిశిచరోద్భూత భయము, లంటఁ జాలునె వారి సర్వార్థ సాధ
నమ్మెనర్చెను మీస్మృతి నమ్ముఁడింక,ననుచుఁ బలికిన హరి పల్కులాలకించి.

సీ॥ సర్గస్థితి ధ్వంస వర్గత్రయోల్లాస!, దేవదేవ! మహానుభావ! శౌరి!
వింధ్యంబునా నొక్క విపులాధరము భాను,మండలమున కడ్డమయి ధరిత్రి
దశదిశల్ ఘూర్ణిల్లఁ దారాపథమునంటఁ, బెరిగి లోకత్రయీపీడఁ జేసె
యాఁకటఁ గ్రుస్సితి మధ్వరంబులు లేవు, కాలమర్యాదలు గట్టువడియె

తే॥ ననమయప్రళయంబునా నంకురించె, సకల భువన భయంకర స్థానమగుచు
నార్తిపడి వచ్చితిమి కావుమయ్యప్రోవు,మయ్య మాయయ్యయని వేడ నచ్యుతుండు.

సీ॥ ఏ దేవి మూర్తిత్రయేశ్వరి సకలైక, కర్త్రి జగద్ధాత్రి కాల రూప
యట్టి పరంజ్యోతి నఖిలాండజనని,  పుంగవుండు

కుంభసంభూతుఁ డదంభ తేజోమూర్తి, యగు నగస్త్యుండు మహామునీంద్రుఁ
డవిముక్తమునను౦డు నతనిఁ బ్రార్థింపుఁడు, వారణాసికిఁ బోవ వలయు మీర

ఆ॥ లమ్మహామునీంద్రుఁ గడచలావరోధంబు, నడఁపఁజాలునట్టి యసమబలుఁడు
చనుఁ డటన్న మ్రొక్కి శౌరి యనుజ్ఞచే, నాకులెల్ల వారణాసి కరిగి. ౫౩

వ॥ సప్రదక్షిణంబుగాఁ బంచక్రోశమధ్యంబగు నవిముక్తంబు ప్రవేశించి భాగీరథీ సలిలంబులఁ గృతావగాహనులై, దేవఋషి, పితృపూజ లొనర్చి, ప్రశాంత శ్వాపదాకీర్ణంబును, నానాపాదపసంకులంబును, మయూర, సారస, హంస, చక్రవాక ప్రభృతి జలవిహగ కోలాహలభరిత సరోవరంబును, సింహ, వ్యాఘ్ర, శార్దూల, గజ, గవయ, మృగ, రురు, ఖడ్గ, శరభ ముఖ జంతు పరస్పర విరోధ రహితంబును, విజ్ఞానలక్ష్మీసుఖాస్థానంబును, నగు నాశ్రమంబున వసించిన యగస్త్యమహామునిం గాంచి, సాష్టాంగదండప్రణామంబు లొనర్చి, కృతాంజలులై నిలింపు లిట్లని సన్నుతించిరి. ౫౪

సీ॥ ద్విజగణాధీశ్వర! దీనపోష! శరణ్య!, పూజ్యపూజిత! తపస్స్ఫురితమూర్తి!
వాతాపిసంహార! వరద! విద్యానిధి!, స్వామి! బ్రహ్మధ్యానసతతహృదయ!
సాగరాపోశన! సలిలకల్మషహారి!, కాశీనివాస! సోత్కంఠహృదయ!
పటుజటామండల భాసమానశిరస్క!, సర్వామరస్తవ్య! సద్గుణైక

తే॥ నిలయ! తాపసజనవంద్య! నీకు మేము, దాసులమునుమ్మ నేఁడు దుర్ధరుఁడు వింధ్యుఁ
డండమై యర్కమండలం బంటిమింటి, త్రోవ కవరోధ మొనరించె దుస్తరముగ.

సీ॥ అమరావళులకెల్ల నధికార మొనరించు, కులిశాయుధుని లెక్కగొనఁ డతండు
హవ్యకవ్యంబుల కాశ్రయుండై నట్టి, వైశ్వానరుని వశవర్తి గాఁడు
సత్కర్మసాక్షియై సమవర్తియగునట్టి, దండధారుని వెఱపందఁ డతఁడు
అఖిలప్రభంజకుండైన మహాబలుం, డడుగు సాఁగఁడు వాని యతిబలమున

తే॥ కెట్టి తపమాచరించెనో! యెవని యాఁతో, మమ్ము నవ్వెత్తుగాఁ గొనిమానరాని
కినుక నిట్లవరోధించి కెరలె ననిన, మౌనివర్యుండు సురల యుమ్మలిక మఱచి.

గీ॥ విబుధవరులార! నిగ్రహాన్వితులు మీరు, సిద్ధులెనిమిదిగూడ మీచేతఁ గలవు
మీకు దుస్తరమయ్యెనే? లోకములకుఁ, గీడొనర్చెనె! వింధ్యుండు కెరలి కొరలి.

శా॥ కానిం డెంతటికార్య మిప్పుడికి మీకై వచ్చెదన్ దీర్చెదన్
హానిన్ విష్టపపాలికెల్ల భవదీయాభీప్సితం బిష్టసం
ధానం బౌఁగద! నామనంబునకు మీ స్థానంబులం దెల్లరున్
దీనత్వంబుఁ దొలంగి నిల్వుఁ డని యాశీర్వాద బోవఁగాఁ జేయుచున్.

క॥ అకార్యంబున కోడఁబడి, మిక్కిలి జాలిన్ దలంకి - మెలఁతన్ గని యా
మిక్కిలికను దేవరకును, మక్కువపట్టైన నగరశ్రమణి కాశికపై. ౬౪

వ॥ భక్తివిశ్వాసంబులు దఱచై విడరాని తమకంబున నిట్లని పలుకందొడంగె. ౬౫

సీ॥ ఎలనాగ! వింటివే - యెల్లదేవత లిట్లు, చనుదెంచి చెప్పిన - సరణి నేఁడు?
వింధ్యుండు గర్వించి - విన్నంటఁ బెరిఁగి యర్కనిరోధము నొనర్చి - కడిమి మెఱసి
కారణం బెద్దియుఁ - గనరాదు భువనసంక్షోభంబు పుట్టె - నస్తోకగరిమ
మదిఁదలంపునకు నింపగు ద్రోవగాదయ్యె, దైవంబుదలఁచు టెంతయుధ్రువంబ
తే॥ యేను జనకున్నఁబోవ దీశయెడరు భువికి, నెట్లు పోయెద నవిముక్త - మిట్లు విడిచి
వారణాసి నివాసంబు - వదలఁదగని, దనుచు నోాక్షే చ్ఛలువచిఁతుశరబల! వినమె.

క॥ కరణత్రియశుద్ధముగా, నిరతము కాశిని వసింతు - నే నని మది నా
దరమున నిల్చిన విఘ్నో, త్కరముఁ బొసంగించె దైవఘటనం బకటా. ౬౭

గీ॥ మేలుగోరినదైవంబు - మే లొసఁగునె, యటుల రెండవదియుఁ గాన - నన్నిటికిని
దైవ మనుకూలమైనఁ జేయంగవచ్చుఁ, బౌరుషముతుచ్ఛమదినమ్ము వారుగలరె?

సీ॥ కరతలంబున సుధాకబళంబుఁ గలిగియు, బికిరంబునకుఁ బోవు - భిక్షుపగిదిఁ
గరతలామలకమై - కైవల్య మిచ్చెడు, ముక్తిపీఠం బవిముక్తసీమ
మిట్టి మోక్షస్థాన - మిట్టులు విడనాడి, యడవులఁ గొండల - నరుగవలసె
నిల నెన్నిజన్మంబు - లెత్తియు నవిముక్త, సీమఁ గోరుదురు వసింప ఘనులు
తే॥ మన కయత్నైకసిద్ధమై - యనువుకొనియు, సంతరాయంబు సంధిల్లె - నంతరంగ
మక్కటా! చాల వెతనొందె - నర్థులైన, వేల్పులకు నియ్యకొనుట యీవెతఘటించె.

క॥ అని లోపాముద్రికుఁ దన, మనమునఁ గల వెతను దెల్పి - మార్మసలుట యొ
ప్పని దని గమనోన్ముఖుఁడై, మునిమణి విశ్వేశుఁ గాంచు - మోదంబలరన్.

సీ॥ మణికర్ణికామధ్యమందిరుం డగునట్టి, పాతాళవల్లభు - భవునిఁ గాంచి
సాష్టాంగ మిడి జగజ్జనక! ని న్నెడఁబాసి, యేగంగవలసె నా - కెద్ది దిక్కు?
దండపాణీ! నీకు - దండ మర్పించితి, వీడితివే నన్ను - వింధ్యగిరికిఁ
గాలభైరవ? నీవె - గతి యని నమ్మిన, న న్నిట్లుచేసితే? - నరులకెల్లఁ
తే॥ గల్గు కాశీనివాసవిఘ్నంబు లడఁచి, భక్తరక్షణ సలుపు నో - పరమపురుష!
యేను జేసిన యపరాధ - మెద్దిగలదు?, కాశి నెడఁబాయఁజేయ నేకారణంబు.

గీ॥ పరుల నిందించి యెఱుఁగను - బరులసొమ్ము, లపహరించి యెఱుంగ నాశవంతమైన
ననృతవాదంబు లేదు నాయందు [illegible] కర్మవిపాక మొకో.

వ॥ అని కాశీనివాసులైన దేవతలకును మునులకును నమస్కరించి పంచక్రోశ ప్రదక్షిణం బొనరించి, వెలువడి కార్యసిద్ధిం గోరి దుఃఖవిఘ్నంబు నకుంఠనుతిం గొనియాడి లోపాముద్రావల్లభుం డుల్లంబునం గాశీవిరహసంతాపంబు దందహ్యమాన దవానలంబు శుష్కతృణంబుల నీఱగునట్లు సేయుపగిది నన్యచింతలు భస్మీకరింప ననవరతకాశీస్మరణుండై భార్యయుం దానును దక్షిణాభిముఖుండై కదలి చని. ౨౩

మ॥ కనియెన్ దాపసి వింధ్య మర్కపదవీసంగాఢావరోధోన్నత
స్తనయిత్నుప్రచయోజ్జ్వలచ్ఛిఖరసంఛన్నాభ్రిజాగ్రిత్త మో
ఘనసీరంధ్రితదిగ్విభాగకలనాసంకల్పాంతకాలవ్యథా
జనితోద్వ్యజ్జనతానిరంతరకృతాసంస్థాస్థ్యక్రియావంధ్యమున్. ౨౪

క॥ కని ధరణీధరమహిమం,బున కచ్చెరువందుచు మౌనిముఖ్యుఁడు గదియన్
జనునంత వింధ్యశైలము, వినయంబున భాసమానవిశదస్థితియై. ౨౫

సీ॥ కమలజాండకటాహఘనతరక్షోభక,నిజతనూవిభవంబు నేలఁ గలిపి
కనకాచలముపైని గవయు గర్వంబెల్ల, నడఁగించి సాష్టాంగపడుచుఁ దపసి
యంఘ్రిపద్మంబుల యండకు నొరగి కృ,తాంజలియై భక్తి యతిశయింపఁ
బాద్యాదివిధుల సంభావించి యచ్చెంత, నిలిచినఁ గని మౌనిసీరజాప్తుఁ

తే॥ డతనిఁ గాంచి ప్రసన్నుఁడై యాభిముఖ్య,కలన గౌరవ మొనరించి పలికె శైల
వర్య! నీ సద్గుణంబు లసవార్యగరిమ, మెచ్చుగొల్పెను నేఁ బోయి వచ్చుదనుక.

క॥ ఉచ్చావచ మగు రూపము, నిచ్చలు గానంగ నీక నిపుణతఁ బుడమిన్
గ్రిచ్చుకొని నిలువు మిచటికి, వచ్చెదమని చెప్పి చనె నవారణ మునియున్.

మ॥ మలయాహార్యముఁ జేరి యచ్చట మునుల్ మన్నింపఁ గొన్నాళ్లు ని
శ్చలవృత్తిన్ దప మాచరించి ప్రమదాసంయుక్తుఁడై శ్రీగిరిన్
జ్వలనాక్షున్ శివు మల్లికార్జునుని సేవన్ గొన్నినాళ్లుండి య
మ్మలయాహార్యముపై వసించె విడ కమ్మైత్రి నేఁటికిన్ నారదా! ౨౮

క॥ అడుగో! వచ్చె నగస్త్యుం, డెడసేయఁడు వచ్చుననుచు నిప్పంటికి విం
ధ్యుఁడు దక్షిణాభిముఖుఁడై, కడువడి నెదురెదురు చూడఁగా నయ్యెఁ జుమీ.

క॥ అత్తఱి స్వాయంభువుచే, నుత్తమ మగు పూజ లంది యుత్సాహసమా
యత్త యయి దేవి వింధ్యకు,భృత్తలమున నధివసించెఁ బ్రీతి దలిర్పన్. ౩౦

చ॥ భువనములన్ బ్రసిద్ధయయి భూజను లర్చలు సల్ప వింధ్యవా
సవిహితసంతతప్రమదసంయుతయై జగదంబ యచ్చటన్
బ్రవణతఁ గాంచె కుంభభవసంభవ్యచరిత్రము వింధ్యమర్దనో
ద్భవవిదితంబు దీని విను వారలఁ జేరుఁ జిరాయురున్నతుల్. ౩౧

సీ॥ అగ్రవర్ణజులకు నామ్నాయవిజ్ఞప్తి, రాజన్యులకును వీర్యప్రశస్తి
వైశ్యకోటికి నెల్ల వాణిజ్యసంపత్తి, శూద్రావళులకును సుఖసమృద్ధి
ధర్మార్థులకు నెల్ల ధర్మసంస్థితియును, ధనకాంక్షులకు నెల్ల ధనగరిమము
కామార్థులకు నెల్లఁ గామగరిష్ఠత, మోక్షార్థులకు నెల్ల ముక్తిపటిమ

తే॥ గలుగు స్వాయంభువునిమహోజ్జ్వలచరిత్ర, మాదరంబున వినిన నయ్యాదిదేవి
ప్రథమమన్వంతరంబునఁ బ్రథితయగుచు, నవతరించిన వృత్తాంతమనఘ! వినుము.

సీ॥ అనిన నారదుఁ డిట్టు లనియె స్వాయంభువ, మనుచరిత్రము వింటి మౌనివర్య!
అన్యులవృత్తాంత మానుపూర్విగ నిట్లు, వినఁగోరితిని దెల్పవే! యటన్న
దేవికృపాప్తి సంభావితుం డగు నాది,మనువు పిమ్మట జగన్మాన్యుఁడైన
యట్టి ప్రియవ్రతు నాత్మోద్భవుండు స్వారోచిషుఁ డను దివ్యరూపధరుఁడు

తే॥ రవిసుతాతీరమున శుభారామముననుఁ, సర్వసత్త్వప్రియంకరస్వాంతుఁ డగుచు
జీర్ణపర్ణాశనుండయి స్థిరతరమగు, తపము సేయంగఁబూని యత్తఱిఁ గడంగి.

శా॥ దేవీమూర్తిని మృన్మయంబుగ సముద్దీపింపఁగాఁ జేసి ని
ష్ఠావైధుర్య మెఱుంగ కన్వహము పూజాలోలుఁడై పూర్ణభా
వావిర్భూతపటిష్ఠనిశ్చలత నేకాంతంబునన్ నిల్చి తే
జోవర్ధిష్ణుఁడు ద్వాదశాబ్దములు విస్ఫూర్తిన్ దపించెన్ గడున్. ౮౪

సీ॥ పదివేల సూర్యబింబములతో సరివచ్చు, డంబుతో హసదాననంబుతోడఁ
గరుణారసతరంగగంధిలం బగు కటా,క్షంబుతో భక్తపక్షంబుతోడ
సహచరస్థితిఁ గ్రాలు చటులశక్తికదంబ,కంబుతో మానివ్రజంబుతోడ
సురదుందుభిధ్వానసూనధారాప్రసా,రంబుతో సింహవాహంబుతోడ

తే॥ నెదుటసాక్షాత్కరించి మహీశుఁ డొసఁగు, నర్ఘ్యపాద్యాదులనుబూజలందివరము
వేడుమన్నను గద్గదాన్వితకంఠ,మధురవచనంబుల నుతించెమనువిభుండు. ౮౫

ఉ॥ పెన్నిధిఁ గాంచినట్టి నిరుపేదవిధంబున నిన్నుఁ గాంచితిన్
గన్నులకర్వుదీరఁ; జిరకాలతపఃఫల మెల్ల నబ్బె సం
పన్నుఁడనైతి వేఱొకటి మానసమం దికఁ గల్గునొక్కొ? యా
పన్నశరణ్యా! దేవి! భవపాశనికృంతని! యన్న మెచ్చుచున్. ౮౬

క॥ మన్వంతరానుభూతి స,మన్వయముగ నతని కొసఁగి యంతమున సుఖం
బన్వహము గలుగ సురపురి,ని న్వేడుక నిలుతు వనియె నెఱి దేవి కృపన్. ౮౭

ఆ॥ అమ్మహీవిభుండు నట్టుల మన్వంత, రాధిపత్యసుఖము లనుభవించి
అహితపటలి నణఁచి యమునిలోకమునకు, ననిచె నతనిచరిత మరిదిగాదె.

సీ॥ మూఁడవమనువు సంపూరితార్థీప్సిత, దోహదుం డహితసందోహజేత
ఉత్తమక్షితిపాలుఁ డురుతరభక్తిచే, జాహ్నవీతీరసంస్థాయి యగుచు
వర్షత్రయంబు వాగ్భవజపం బొనరించి, దేవి నారాధింపఁ బావనుఁ డగు
నట్టి ప్రియవ్రతుపట్టికి సాక్షాత్కరించి దేవి యనుగ్రహించి కరుణ

తే॥ నతని మన్వంతరంబున కాధిపత్య, కలితుఁ గాఁ జేయ వసుధ నిష్కంటకముగ
నేలి చిరకాల మంతిమకాలమునను, నంబికాసన్నిధానసౌఖ్యంబు నొందె. ౮౯

సీ॥ తామసుం డనువాఁడు ధరణిఁ బ్రియవ్రత, తనయుండు నర్మదాతటమునందుఁ
గామరాజధ్యానకలితుఁడై జనయిత్రి, నిరతంబుఁ బూజించి నిష్ఠపేర్మి
నవనవప్రతిభచే నవరాత్రపూజల, వాసంతముల శరద్వాసరముల
నంబికఁ బూన్పఁ బ్రత్యక్షమై కరుణించి, తత్కృపానాప్తి నుదారుఁ డగుచు

తే॥ నవనిఁ జతురర్ణవాంతంబు నాధిపత్య, మొనరఁ జేసి బలోద్ధతతనయసమితిఁ
బడసి యంతంబునను దురవాప్యమైన, శక్తిసామ్రాజ్యలోలుఁడై చనియెఁ జుమ్మి. ౯౦

సీ॥ అతనితమ్ముఁడు రైవతాభిఖ్యుఁ డగువాఁడు, కాళిందితటమునఁ గామరాజ
బీజంబు జపియించి ప్రేమఁ బ్రసన్నయై, దేవి మన్నింప నుదీర్ణుఁ డగుచు
నిష్కంటకంబుగా నిఖిలరాజ్యం బేలి, పుత్రపౌత్రాదివిస్ఫూర్తి నొంది
ధర్మవ్యవస్థలు తఱిఁదఱి శిక్షించి, చరమకాలమ్మున శకుపదము

తే॥ నొంది యింద్రసమానభోగోన్నతుఁడయి, రాజఋషు లెల్ల వినుతింప రాజమాన
దివ్యతేజఃపరంపరాస్థితిఁ జెలంగి, చెడనిపదవి వసించె నిశ్చింత నతఁడు. ౯౧

క॥ ఐదవమనుచరితము ప్రీతి,పాదింపఁగ నయ్యె నంగపార్థివుకొమరుం
డై దివి భువి నుతియింపఁగ, నాదటఁ బ్రఖ్యాతినొందె నది విను మింకన్. ౯౨

వ॥ చాక్షుషుం డను నమ్మనువు పులహుఁడను బ్రహ్మర్షిం జేరి శరణాగతుండై మునీంద్రా! యేను గింకరుండ, నిన్నాశ్రయించితి. సర్వవసుంధరాధిపత్యంబును, నవ్యాహతభుజబలంబును, శస్త్రాస్త్రనైపుణ్యంబును, చిరకాలీనసంతతియు, నఖండైశ్వర్యంబును, చరమంబున స్వర్గలాభంబునుం గల్గునట్లు వరం బొసంగు మనినఁ బులహుండు చాక్షుషునితో నిట్లనియె. ౯౩

ఉ॥ కర్ణరసాయనంబును నఖండితహర్ష సుఖప్రదంబు వి
స్తీర్ణముగా వచింతు విను దేవి పరాంబిక నర్చ సల్పు సం
పూర్ణసమర్చలన్ దనిసి భోగము లెల్ల ననుగ్రహించు ను
త్తీర్ణులఁ జేయు సంసృతి నుతింపుము విశ్వజనిత్రి నారహిన్. ౯౪

ఉ॥ ఇట్టి తెఱంగునన్ భువి మహేశ్వరిఁ బూజ యొనర్ప నొప్పు నా
నెట్టులొ నాకుఁ దెల్పు మన నీరజసంభవతుల్యుఁడైన యా
డిట్ట వచించె వాగ్భవ మదీర్ఘత నీవు జపింపు దేవి చే
పట్టు మనోరథంబు లనివారణ నిచ్చు జయంబు గల్గెడున్. ౯౭

సీ॥ వాగ్భవంబునకన్న వరమంత్రములు లేవు, బలవీర్యవృద్ధు లహప్పటఁ గలవు
హరిహరబ్రహ్మాదు లమ్మంత్రము జపించి, సర్గస్థితిక్షయస్థాయులైరి
పాకభిదాదిదిక్పాలకుల్ తన్మంత్ర,జపమున సర్వార్థశక్తులైరి
యది గాన రాజన్య! యట్టుల జగదంబ, నర్చింపఁ గల్గు నీ యభిమతంబు

తే॥ చను మనినఁ జాక్షుషుండు నమ్మునికి మ్రొక్కి, విరజతటమున నిష్ఠచే విశ్రమించి
వాగ్భవంబు జపించుచు ద్వాదశాబ్ద,తప మొనర్చెను భువనముల్ తల్లడిల్ల.

ఆ॥ మొదటి యేఁటఁ జివురు మొలకలు భక్షించి, యవలఁ దోయభక్షియై తృతీయ
హాయనమున వాయు వాహార మొనరించి, కదలకుండెఁ గొండకరణిఁ దపసి.

క॥ ఇట్టులు పదిరెండేఁడులు, గట్టులదొరబిడ్డఁగుఱిచి కడుఁ దపియింపన్
గట్టువడి కరుణపేరిమి, నెట్టన సాక్షాత్కరించె నియతుఁ డతనికిన్. ౯౮

గీ॥ అంత రాజన్యుఁ డతిహర్షితాంతరంగ, సంగతుం డయి వలగొని చరణవనజ
యుగముపైఁబడి నుతియించి భగవతీ!మ,హేశ్వరీ! కావు మని వేడ నిచ్చగించి.

మ॥ ధరణీపాలక! నిన్ను మెచ్చితిని సంతాపింపఁగా నేల? నే
వర మీయం గలదాన వేడు మనినన్ వాగ్బీజసంధానమా
ధురి తేనెల్ దిగజాఱువాగ్రచనఁ దోడ్తోఁ బల్కె మన్వంతరో
ద్భవసామ్రాజ్యభరం బొసంగుము సముద్యద్భగ్నారివర్గంబుగన్. ౧౦౦

ఉ॥ నా విని దేవదేవి కరుణామృతపూరితలోచనాంతయై
భావము పల్లవింప క్షితిపాలనశక్తియుఁ బుత్రపౌత్రసం
భావితవృత్తియున్ గలుగ మన్ననఁ జేసితి నేకభోగివై
భూవలయంబు నేలుము విభూతిఁ దలిర్పఁగ నింద్రభోగివై. ౧౦౧

వ॥ అని యతనివాంఛితం బొసంగి సంతుష్టాంతరంగయై జగదంబిక యంతర్ధి నొందె. చాక్షుషుండు సార్వభౌమపదంబు నొంది బలవంతులగు పుత్రులం బడసి మనుమండలిలో మాన్యుండై యంతంబున దేవీసామ్రాజ్యం బనుభవించెనని చెప్పి.

క॥ సప్తముఁడగు వైవస్వతుఁ, డాప్తావనశీలి దేవియర్చకతమునన్
సప్తద్వీపము లేలె ప్రదీప్తుండై యిప్పు డున్నతిఁ గొనుచుండెన్. ౧౦౩

సీ॥ వసుధ సావర్ణి నా % వసుమతీపాలుఁ డష్టముఁడైన మనువు తచ్చరిత వినుము
జన్మాంతరంబున % జనయిత్రిఁ బూజించి, యాదట మన్వంతరాధిపత్య
దక్షుఁ డయ్యె నతండు % దళితారియై జగత్త్రయసుప్రసిద్ధుఁడై % తనరె ననిన
జన్మాంతరంబున % జననిఁ బూజించుట, యెట్టులో కాంక్షితం % బీయ దేవి

తే॥ కరుణ సేయుట యెట్టులో కథవినంగఁ, గోరియున్నాఁడఁ దెల్పు ముదారచరిత!
యనిన నారాయణస్వామి % యమరమునికి, నిట్టులని తెల్పె వినుము మహీశచంద్ర!

క॥ స్వారోచిషమన్వంతర, మారూఢంబగుచుఁ గడచు % నయ్యెడ విదితుం
డారాజన్యుఁడు సురథుఁడు, సారజ్ఞుఁడు ధర్మపరుఁడు % శాసించుతఱిన్. ౧౦౧

సీ॥ సర్వాస్త్రకుశలుండు % సంగ్రామకర్త యా, చక్రమండలమునకు % సర్వదాత
యరిమర్దనుండు ధర్మాధీనచిత్తుండు, మాని మహాబలమాన్యతముఁడు
నగుచు ధారుణి యేలునవసరమ్మున శత్రుభూపతుల్ చెలరేఁగి % పాదివిక్షోసిన
నగరంబు వెలువడి % నగధీరుఁడగు సురథుండు సైన్యముల నుద్ధురతఁ గూడి

తే॥ భువనభయదంబుగాఁ బోరి % పోరఁజాల, కరులచే నిర్జితుండౌచు % నాత్మపురము
నందు నిలువంగ నేరక హయమ్మెక్కి, వేఁట మిషమున నడవికై % వెడలి యచట.

మ॥ విజనారణ్యమునందుఁ జింతిలుచు నిర్వీర్యుండు నిస్సైన్యుఁడున్
విజహద్బంధుఁడునై చరించుచును సుర్విన్ గాలు నిల్వంగ లే
క జహత్ప్రీడ మునింగి యొక్కఁడును నాహయాసనంబునన్ గ్రుస్సి భూ
మిజగుల్మాంతరసీమలన్ దిరుగుచున్ % మేనెల్ల శోషిల్లఁగన్. ౧౦౨

వ॥ ప్రశాంతజంతుసంయుక్తంబును, సరసకాసారవితతజలసమృద్ధంబును నగు సుమేధుం
డను నొక్క మునివర్యు నాశ్రమంబునఁ జేరి వినయాన్వితుండై యమ్మునికి
మ్రొక్కి తన యాభీలం బగు కృఛ్రంబు దెల్పి, స్వామీ! శత్రునిర్జితుండను,
త్యక్తరాజ్యుండను నయ్యు, సుజ్ఞానతత్పరుండ నగుట నైహికభోగంబులు తుచ్ఛంబు
లని యెఱుంగుదు. నాకుఁ బూర్వభోగం బెట్లు లభించు నని వెతంబడుచున్న
నా మనంబునకు నూరటగా భవదనుగ్రహంబు సంపాదితం బయ్యె. నాకు సర్వథా
భవచ్చరణంబే శరణంబుగాన భవిష్యచ్ఛ్రేయంబునకు నింక నెద్ది యుపాయంబని
విన్నవించిన సుమేధుం డిట్లనియె. ౧౦౩

క॥ దేవీమహాత్మ్యమున్ శ్రుతి, పావన మఖిలార్థదంబు % పరమంబు జయ
శ్రీవహము తత్ప్రకారము, నే వివరించెదను వినుము % నిర్మలహృదయా! ౧౦౪

సీ॥ దేవి మహామాయ % త్రిభువనేశ్వరి బ్రహ్మ, విష్ణుహరాత్మిక % విశ్వజనని
యద్దేవి భూతప్రజాంతరంగంబులు, నాకర్షణ మొనర్చి % యాత్మమాయ

భ్రాంతంబులుగఁ జేయు ౯ బ్రహ్మాండముల కెల్ల, సర్గస్థితిధ్వంసకవర్గములకు
మూలమై విహరించు ౯ మునిజన స్తుత్య కా,మద కాళరాత్రి దుష్కర్మదనిహంత్రి

తే॥ విశ్వసంహారిణి జనిత్రి ౯ విమల కమల,నిలయ సర్వంబు తానయై ౯ నెగడునట్టి
దేవి కృప యెవ్వనికిఁగల్గుఁ దధీయుఁడతఁడు,మూఁడులోకంబులకు వాఁడె మోహకుండు.

క॥ అన విని జనమేజయుఁ డిట్లనె సాత్యవతేయుతోడ ౯ నవధారు జగ
జ్జనయిత్రి యెందుఁ బొడమెనో?, వినవలతుఁ గరుణఁ దెల్పవే యని యనిన్.

చ॥ నృపకులచంద్ర! విశ్వజననీ జననంబు విధంబుఁ దెల్పెదన్
జపలతలేని చిత్తమున ౯ సారతరంబు శుభప్రదాయకం
బపరిమితానుభావకము ౯ నా జగదంబ చరిత్ర వీనులన్
వ్యపగతకిల్బిషాత్ములయి ౯ యానుదురే రలవారెవో! ఘనుల్. ౧౧౩

సీ॥ ఆదినారాయణుం ౯ డఖిలేశ్వరుండు విశ్వము లెల్ల నణఁచి సంవర్తమునను
శేషశయానుఁడై ౯ శేషియై నిదురించు,తటిని దత్కర్ణసంస్థాయిత గను
మలమున నిర్వురు ౯ మధుకైటభులు నాఁగ,దానవుల్ పొడమి యుద్ధతి విధాత
మర్దింపఁదలఁచిన ౯ మానవాళులఁ గాంచి, వెఱచి విధాత యీ వెత దొలంగఁ

తే॥ జేయజాలిన వెరవరి ౯ శ్రీవరుండు, నిద్రితుండైనవాఁడు మహద్భద్రమెటులొ?
యేమి సేయుదు నేనింక ౯ నెందుఁజనుదు, ననుచుఁ జింతిలుచున్న నయ్యబ్జజునకు.

క॥ కార్యప్రసాధకం బని,వార్యంబని బుద్ధి పొడమె హరి నిద్రితుఁడౌ
టార్యావశత్వమున నని, ధైర్యమ్మున యోగనిద్రఁ దలఁచి నతుండై. ౧౧౪

గీ॥ దేవదేవి! జగద్ధాత్రి! ౯ దీనవరద!, సాగరశయాన! భక్తవాంఛానిదాన!
కాళరాత్రి! మహారాత్రి! ౯ కార్యదక్ష, సర్వమును నీ వశంబమ్మ! ౯ సర్వజనని!

సీ॥ మాయినీ! మహనీయమాన్యా!మహానంద, సేవధీ! మధుమతీ! ౯ జీవనిలయ!
భువనసమారాధ్య! ౯ పుష్టిలజ్జాక్షమా, కాంతికారుణ్యవిగ్రహా! మహేశి!
జనని! *పరాశరజనయిత్రి! కమనీయ!, జగదాది! పరమ! యాశ్చర్యనిలయ!
పరపరులకుఁగూడఁ ౯ బరమేశి! దేవేశి!, యద్వితీయ! త్రివర్గహర్ష! నిత్య!

తే॥ మద్యపానరతోత్సుక! ౯ మానవాశి,మదవిభేదిని! మాతంగి! ౯ మదనమత్త!
నిన్ను సేవింతు భజియింతు ౯ నీదుచరణ, కమలయుగ్మంబుఁ జేరితిఁ ౯ గావుమమ్మ!

వ॥ మఱియు దేవీ! నీ వేకవు, నేకస్వరూపవు, నద్వితీయవు, ద్వయాత్మికవు, త్రయివి, త్రివర్గనిలయవు, తురీయవు, తురీయాత్మికవు, పంచమివి, పంచభూతేశివి, షష్ఠివి, షష్ఠేశ్వరివి, సప్తమివి, సప్తవారేశివి, సప్తసప్తి వరప్రదవు, నష్టమివి. నష్టవసు

టిప్పణి * పరాశరజనయిత్రి-ఈ విశేషణము మూలమున లేదు. శక్తేః పౌత్రం అను శ్లోకములోని శక్తిపదము దేవీవాచకమా? ఋషివాచకమా? విజ్ఞులు విచారింప వలయును (శ్లో॥ వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్రం, చూ.) వశిష్ఠునికొడుకు శక్తి, శక్తికొడుకు పరాశరుఁడు, పరాశరునికొడుకు వ్యాసుఁడు— ఇది వంశవృక్షము.

నాథవు, నవమివి, నవమేశ్వరివి, నవనాగకళవు, నవసంఖ్యవు, నవేశ్వరివి, దశమివి, దశదిక్పూజ్యవు, ఏకాదశివి, ఏకాదశరుద్రసేవితవు, ద్వాదశివి, ద్వాదశాదిత్యజన్మభూమివి, త్రయోదశివి, విశ్వదేవాధిదేవతవు, చతుర్దశివి, చతుర్దశమనుజననివి, పంచదశివి, పంచాధికదశావేద్యవు, షోడశివి, షోడశభుజవు, నగు నీచే గృహీతుండై రమాపతి యున్నవాఁడు; మధుకైటభు లాక్రమించి నన్ను వధించువారైరి, జగన్నాథుం బోధింపు మని వేడిన పరాశక్తి ప్రీతయై యట్టు లొనర్ప నచ్యుతుండు దెలివొంది పంచవర్షసహస్రంబు లద్దనుజులతో నియుద్ధం బొనర్చి పోరాడుచున్నయెడ మహామాయామోహితులై నీ శౌర్యంబునకు మెచ్చితిమి, వరంబు వేడు మనిన సంతసిలి రమాకాంతుండు మీ రిర్వురు నాచేత వధ్యత నొందవలయునని వేడిన నిర్జలంబునఁ దమ్ము వధించుటకు వా రొడంబడుటచే మాయామహిమంబున నిర్జలంబైనయెడ వారి వారల వధించె, నిది దేవీసముత్పత్తి యని తెలియుము. ఇంక నమ్మహాలక్ష్మీసముత్పత్తి వచించెద నాకర్ణింపుము, ౧౧౭

క॥ మహిషీజఠరోద్భూతుఁడు, మహిషుం డను దానవుం డసమానుష తేజో
మహితుఁడు దిక్పాలకతతి, కహితుఁడు భువనముల కెల్ల నలజడిఁ బెట్టెన్. ౧౧౮

సీ॥ శక్రాదిహరిదీశసైన్యముల్ మర్దించి, హరిదీశ్వరాధిపసత్యములు గొనుచు
లోకత్రయంబు నస్తోకభీకరవిక్రమాక్రాంతి స్వాయత్తమై చెలంగ
మూర్తిత్రయంబుతో మొనసి దురమ్ములఁ, బోరాడుచును బలస్ఫూర్తి వలన
నెదు రెందు లేక దోర్మదమున సకలారిమర్దనుండై దేవమాన్యు లెల్లఁ

తే॥ దనకుఁ బరిచర్య లొనరింప దానవుండు, యాగభాగంబు లెల్లను నపహరించి
తానె భుజియింప నెద్దియుఁ దరముగాక, కలఁగిరి నిలింపవరు లెల్లఁ గౌరవేంద్ర!

సీ॥ అత్తఱి మూర్తిత్రయంబుతో నెల్లరు, విబుధు లేకాంతనివాసములను
దద్వధోపాయంబుఁ దలఁచి చింతిలువేళ, హరివక్త్రకుహరంబునందు వెడలె
భానుకోటిప్రభాభాసమానం బగు, దివ్యతేజం బట్ల దేవకోటి
యొడళుల వెడలె మహోద్ధత తేజంబు, లందు శాంకర తేజ మాస్య మయ్యె

తే॥ యామ్యతేజంబు కేశంబు లయ్యె విష్ణు, తేజమున బాహు లప్పు డుత్థితములయ్యె
సౌమ్యతేజంబునను బరాస్తనయుగంబు, శక్రతేజంబు మధ్యమస్థాన మయ్యె.

సీ॥ జలనాథు తేజంబు జంఘికల్ మేదినీ, తేజంబు జఘన మాదిత్యయంత్రు
తేజంబు చరణముల్ దివ్యమానవ తేజ, మంఘ్ర్యంగుళములు కరాంగుళములు
వసు తేజ మబ్జసంభవ తేజ ముదరంబు, ననిల తేజంబుల నయ్యె శ్రుతులు
నిట్టుల వేల్పుల యెల్ల తేజములతో, మహిషమర్దని నా సమాఖ్యఁ దనరి

తే॥ త్రిభువనోజ్జ్వలసౌందర్యదీప్తి మెఱసి, దేవకాంతాసహస్రసంభావిత మగు
గౌరవము శౌర్యధైర్యముల్ గలిగి యలరు, నమ్మహాదేవిఁ గాంచియయ్యమరవరులు.

సీ॥ శూలంబు శివుఁడు విష్ణుండు చక్రంబును, శంఖంబు వరుణుండు శక్తి వహ్ని
వాయువు శరములు వజ్రంబు శక్రుండు, ఘంట నైరావతగజము యముఁడు
ఘోరమౌ దండంబు క్షీరాబ్ధి హారంబు, నంబరంబులును శిఖావతంస
కటకముల్ కుండలాంగద పానపాత్రముల్, మద్యమ్ము మొదలైనహృద్యవస్తు
తే॥ సమితి సూర్యుఁడక్షయశరసముదయంబు, కంజజుఁడు కమండలు విశ్వకర్మయూర్మి
కలు తుషారాచలంబు సింగంబు వివిధ, మణితతు లొసంగె నప్పుడు మానవేంద్ర.

క॥ భగవంతుండగు నహిపతి, భగవతికిఁ భక్తి నొసఁగె ఫణిసరము నిలిం
పగణము గని వెఱఁగందుచుఁ, బొగడిరి జగదేకకీర్తి భువనజనిత్రిన్. ౧౨౩

చ॥ స్తుతిశతతుష్టయై యహితసూదని వేల్పులఁ గాంచి మీదు స
న్నుతి కెద మెచ్చితిన్ వర మనూనత వేడుఁ డటన్నఁ దల్లి! నీ
యపరిమితప్రభావమున నద్భుతశౌర్యుని ధైర్యధుర్యునిన్
వ్యపగతధర్మకార్యు మహిషాసురు సంహృతుఁ జేయు మంచనన్. ౧౨౪

గీ॥ మహిషమర్దని కుతుకంబు మానసమునఁ, జెలఁగుటయు సింహనాదంబుఁ జేసె దేవి
తన్నినాదంబు భూనభోంతరము లెల్ల, సందిడక బూరటిలు ప్రతిశబ్ద మిడియె. ౧౨౫

సీ॥ జగదేకజనయిత్రి సర్వసైన్యంబులఁ, దనమాయఁ గల్పించుకొని మహోగ్ర
జాగ్రన్మృగేంద్రసంచారియై మహిషాఖ్య, నడఁపంగఁదలఁచి దిగంతరములు
నిశితశిలీముఖనివహంబులను గప్పి, విజయాభిలాషచే వెడలునపుడు
చిక్షురతిశిరులు చెలఁగి దుర్ముఖుఁడును, ఘస్మరతామ్రబాష్కలబిడాల
తే॥ దుర్ధరాదులు లోనుగా దురమునకును, బెక్కు సేనలు తనచుట్టు బెరసి నడువ
నతిభయంకరుఁడై మహిషాసురుండు, వెడలె సంగ్రామమునకు నిర్వేలమహిమ.

ఉ॥ అంతటఁ గోపతామ్రవదనార్చులు దిక్కుల విస్ఫులింగసం
క్రాంతి నొసంగ దేవి శరకార్ముకముల్ విదళించి దానవా
క్రాంతపరాక్రమస్ఫురణజర్ఝరితం బగున ట్లొనర్చి దో
స్సంతతనిర్యదంబకవిసారమునన్ బడఁగొట్టె నెల్లరన్. ౧౨౬

సీ॥ అంతట మాహిషుండపగతసైన్యుఁడై, రోషమూర్ఛాసమారూఢి నెఱయ
మాయావిసారణోన్మథితనిర్జరసైన్య, సమితియై రూపాంతరములు మెఱయ
మాయచే నద్దేవి మదిఁ గలంచిన దానఁ, గోపించి యమ్మాయఁ గుదిలపఱచి
పాశబద్ధునిఁ జేసి పటుచక్రమున వాని, శీర్షంబు ద్రాత్రిపైఁ జిదిమి వైవ

తే॥ సేన హాహారవంబులఁ జెదరి దెసలఁ, బఱచె విబుధవ్రజంబు లసప్పాట హర్ష
జలధి నోలాడె నిది రమాజననివిధము, మహిషమర్దని యద్దేవి మానవేంద్ర.

వ॥ మఱియు, సరస్వతీ ప్రాదుర్భావంబు వచించెద, మదబలోత్కటుం డగు శుంభుం డను దైత్యుండు మహాబలధుర్యుం డగు నిశుంభుం డను భ్రాతం గలసి యెల్ల లోకంబు లేలుచు నవక్రవిక్రమంబున నెల్లదేవతలం బీడింప వారలు హిమవంతంబున కరిగి దేవేశ్వరీ! భక్తార్తినాశినీ! దానవధ్వంసినీ! భాగ్యదాయినీ! ప్రసన్నవై శుంభనిశుంభులం దెగటార్చి మారాజ్యంబు మాకొసంగుమని వేడిన, నా హైమవతి స్తుతియించుచున్న వేల్పులఁ జూచుచున్న యవసరంబునఁ దన్ముఖకుహరంబు వలనఁ గాళి యను ఘోరశక్తి వెడలి యేను ప్రసన్ననైతి వరంబు వేఁడుఁడనిన శుంభనిశుంభసంహారం బొనర్చి మమ్ముఁ గావుమని వేడిన మీకు సేమంబయ్యెడు, సుఖంబుండుఁ డని యంతర్ధి నొందె ననంతరంబు. ౧౨౯

ఉ॥ అమ్మహనీయశక్తిఁ గని యాసురభృత్యులు చండముండు లన్
ద్రిమ్మరు లాశరేంద్రుఁ గని దేవ! భవత్సుఖభోగయోగ్యయా
కొమ్మ యొకానొకర్తు మనకున్ వశవోలెఁ జరించుచున్న దా
చ్చె మ్మొకయింత లేదు మదిఁ జేర్పుము నేర్పున బోటిఁ దేఁదగన్. ౧౩౦

క॥ సురగంధర్వనిశాచర, నరపన్నగయక్షసతుల నానావిధసుం
దరుల గములందు నెందా, తరుణికి సరియైనబోటి తా లేదరయన్. ౧౩౧

క॥ అన విని సుగ్రీవుం డను, తనసఖునిన్ జేరఁబిలిచి త్వరితంబున నీ
వనుమానింపక చని య,వ్వనితన్ దోడ్తెమ్మనంగ వాఁ డేగి వెసన్. ౧౩౨

సీ॥ దేవి! శుంభుండను దేవారి త్రిభువనీ,విజయలక్ష్మీభోగవిశ్రుతుండు
భోగ్యవస్తువులెల్ల భుజియించినాఁడు ది,క్పాలకజేత శుంభత్ప్రతాపి
నీవు సుందరివి యనింద్యచరిత్రవు, దేవాసురులయందు దివ్యవస్తు
సమితి యార్జించిన సాహసి యతనితో, నెనసిన సతి! వాంఛలెల్లఁ దీరు

తే॥ నాదువచనంబుఁ జేకొను నలిననేత్ర!, శుంభుఁ జేకొనెదేని యదంభవిభవ
సర్వసామ్రాజ్యభోగసంస్థాయిని వయి, విజయమందెదు నామాట వినుమటనిన.

వ॥ అంబిక వాని కిట్లనియె. ౧౩౪

సీ॥ సారస్యసహితవాక్సంధాన మొనరింప, నిపుణుండ వని నీదు నిజము దెలిసె
నీ వచించిన చొప్పు నిజము, నీ యధికారి, భోగ్యవస్తుసమూహభోక్త యగును
మమ్ముఁ గాంచినయంత మది రంజిలుట యబ్బు,రంబుగా దది సవసంబెకాని
ఆలింపు ప్రతిన నా యంతరంగంబులోఁ, గల దది చెలులతోఁ గలసిమెలసి

ఆ॥ పిన్ననాఁడు పల్కి-యున్నదానను నన్నుఁ, బోరి గెలుచువానిఁ - బొందుదాన
నన్యుకేలు పట్ట-నంటిఁ గాన మదీయ,సంగరమున నిల్చు-జాణ గలఁడె? ౧౩౬

క॥ నా యభిమానము దూలఁగఁ, జేయంగాఁగలుగు శూర-శేఖరుఁడైనన్
నీ యధికారినిఁ జేకొని, చేయుదుఁ దత్కార్యసిద్ధిఁ - జెప్పఁగనేలా. ౧౩౭

ఆ॥ ఏను జేయుప్రతిన - మాని యన్యులక్రియఁ,జేయఁ జాల నిటులఁ - జెప్పు మనిన
వాఁడు చని నిశాట-వరునితోఁ దెల్పిన, నిది మదీయసిద్ధి-హేతువనుచు. ౧౩౮

తే॥ ధూర్తవర్యుఁడైన - ధూమ్రాక్షు రావించి, యెట్టియెడలఁ దగిన-యట్టి పలుకుఁ
బలుకు చాతురియును - ప్రావీణ్య మెడఁగల్గు,వాఁడ వౌటఁ బోవ-వలయు నటకు.

ఉ॥ ఇష్టములైన వస్తువు లభీష్టము దీరఁగ బోటి కిచ్చి సం
తుష్టి యొనర్చి మన్మథవి-ఘాతశరాహతి నోడి పాఱు మ
త్కష్టము ద్రయ్య నయ్యువిద - గ్రక్కునఁ దెమ్ము పరోపకార ము
త్కృష్టము సర్వకార్యములఁ - గేవల మే నిటు చెప్పువాఁడనే! ౧౩౯

క॥ ఏ యే సిద్ధులయెడలన్, జేయంగావలయు బుద్ధిఁ - జేరక గల నీ
కీయెడ బోధింపఁగ నేలా? యరుగు మటన్న వాఁ డ-లంకృతుఁడగుచున్. ౧౪౦

మ॥ మదవద్దానవకోటిఁ గూడికొని ధూ-మ్రాక్షుండు శీతాద్రికిన్
గదియంగాఁ జని యందు సన్నుతశిఖా-గ్రక్రీడలన్ దేలు న
మ్మదకంఠీరవయానఁ గాంచి చెలియా! - మా రాజు నీ సోయగం
బెదలోఁ నెంచెఁ గరంగఁజేయుము తదీ-యేష్టంబు హృష్టంబుగన్. ౧౪౧

క॥ శుంభునితోఁ గలసిన మద,కుంభిసదృగ్యాన! నీ వ-కుంఠిత తేజో
గంభీరత భువనావన,జృంభణకున్ రాజ్ఞి వౌదు - చెప్పఁగ నేలా. ౧౪౨

ఉ॥ ఏ వచియించు మాటలకు - నిచ్చ పొసంగక యొండు దెల్పినన్
జేవడిఁ గేశబంధమునఁ - జేకొని నిన్ను బలాత్కృతిన్ జగ
ద్భావభవుండు శుంభునకుఁ - బాల్పడఁ జేయుదు, నడ్డగింప దే
వావళి సైఁతురే? రిపుభ-యంకరు సర్వవశంకరున్ ననున్. ౧౪౩

చ॥ అని కఠినోక్తులాడు విబు-ధారిఁ గనుంగొని క్రోధదీప్తి హు
మ్మని యన నంతలో నసుర - యుగ్రదవానలధట్టఘట్టనం
బునఁ గసవుం బలెన్ మడిసి - భుగ్గున బూడిదయయ్యె; సైన్యముల్
పెనుభయ మంది నల్దెసలఁ - బేర్కొన లేక కలంగె నయ్యెడన్. ౧౪౪

సీ॥ అయ్యుదంతంబు దైత్యాధీశుఁ డాలించి, కనుబొమల్ ముడివేసి కసిమసంగి
కోపదావానలోగ్రుండయి చండముండుల రక్తబీజునివలను జూచి
చనుఁ డన్న వారలు సమరసాహసమహాహేవాకమున నాజి కేత్తి వెడలి
యద్దేవి బంధించునభిలాషఁ దోడ్తోన, యతనం బొనర్ప స్మితాస్య యగుచుఁ

ఆ॥ గేల శూల మెత్తి కినిసి ముప్వురఁ గ్రుచ్చి, నేలఁ గూలనేయ నిలువలేక
దైన్యనిహత మగుచు సైన్యంబు పఱచిన, దితిజవల్లభుండు దెలిసి కదిసి.

మ॥ సమరోత్సాహధురీణుఁడై యనుజుఁ డా సాహాయ్యముం గొంచు నా
ప్రమదారత్నము నేన తెత్తునని శుంభద్విక్రమాటోపసం
భ్రమసంరంభదురావహుండగుచు శుంభద్విగ్రహోల్లాసనం
క్రమణప్రక్రియ సాహసించె రణరంగత్స్యందనారూఢుఁడై. ౧౪౬

చ॥ కని జనయిత్రి సింహతురగంబు హళాహళి నుప్పరంబునం
దున దుముకంగఁ జేసి కరదుర్భరశూలము విస్ఫులింగముల్
దొనకొన నార్చి గ్రుచ్చి పడఁద్రోయఁగ శుంభుఁడు గూలె నంతలో
ననుజుఁడు దాఁక నన్నకడ కంపెను వాని నదే క్షణంబునన్. ౧౪౭

సీ॥ జయజయధ్వనుల నుచ్చైస్స్వరంబుల దేవసందోహ మెల్లను సందడించె
సురదుందుభులు మ్రోసె సుమవృష్టి గురిసెఁ దా, పసులు హర్షించి రాబాలగోప
మవని సుఖావహ మయ్యె లోకత్రయి, నిష్కంటకంబయి నెగడు వడసె
శుంభనిశుంభాదిశూరులఁ దెగటార్చి, యఖిలాండజనని జయంబు గొనిన

తే॥ తెఱఁగిది యెఱుఁగు మ్మ హైమవతీప్రభావ, మెల్లఁ దెలిపితి నద్దేవి నెదఁ దలంచి
భజన సల్పుము సర్వశుభంబు లొనఁగు, నమ్మహామాయఁ దెలియ శక్యంబె జగతి.

చ॥ ఇటులు వచించు నమ్మునిమహేంద్రునిపల్కుల నాలకించి సం
ఘటితమనస్కుఁడై నృపతి కామఫలప్రద విశ్వమాత ను
త్కటనియతిన్ *నిరాశిత నఖండితనిష్ఠఁ దదీయమూర్తి వి
స్ఫుటతరమృన్మయాకృతిని బూన్చి సమగ్రసపర్య నయ్యెడన్. ౧౪౮

వ॥ ఇత్తెఱంగున రాజన్యుండు భజింప, జగద్యోనియు, కృపావతియు నగు దేవేశ్వరి ప్రాదుర్భూతయయి, వరం బడుగు మనిన, నజ్ఞాననాశకంబగు జ్ఞానంబును, నిష్కంటకరాజ్యంబును, వేడిన నట్ల యొసంగి, మఱియు జన్మాంతరంబున సూర్యవంశ్యుండవై మన్వంతరాధిపతి వయ్యెదు పెక్కుసుతులం గాంచె దని యంతర్ధానంబు నొందె; నిది సావర్ణివిధంబు; మిగిలిన మనువుల చరిత్రంబులు చిత్రంబులు; శ్రవణమాత్రంబున శుభప్రదాయకంబులని తెల్పి యిట్లనియె.

*టిప్పణి:— నిరాశితన్ — ఉపవాసమునన్

క॥ వైవస్వతమనువునకున్, భావభవాకృతులు సుగుణబంధురులు మహా
త్త్వావిర్భూతవరిత్రచర్యావహసంపద్విశేషహర్షోత్కర్షుల్. ౧౩౦

సీ॥ ఆర్యవ్రాతోద్భవు లందుఁగరూషుండు, తొలుత నవ్వల వృషధ్రుండుమఱియు
నాభాగుఁడును దిష్టనాముండును యయాతి, యును నాద్రిశంకుండు నురువిభవులు
వీరలు రవిసుతాతీరంబునను నిరాహారులై విజితసమీరు లగుచుఁ
బార్థివమూర్తి సంభావించి వివిధోపచారంబులను నర్చసల్పి వేఱు

తే॥ వేఱ భజియించుచును దపోవృద్ధినిరత, జీర్ణపర్ణానిలాంబురశ్మిప్రముఖ్య
భక్షణంబుల నాయాసపడుచు దేవి, చరణముల బద్ధచిత్తులై నలుపఁ దపము.

గీ॥ సర్వమోహవినాశకాశాంతివిమల, మతి పాడమ నాత్మలందు సమస్తజగము
లద్భుతంబొప్పఁ గాంచుచు నటులు ద్వాద, శాబ్దికతపంబొనర్చిరి శ్రమముదక్కి.

శా॥ పాదుర్భూతతఁ గాంచె దేవి సహజప్రావీణ్యశృంగారదీ
క్షాదక్షంబగు మూర్తిఁ దాల్చి యెదుటన్ దత్కాలసంజాతని
ష్ఠాదృష్టాపరిమానతచ్చరణకంజద్వంద్వసాన్నిధ్యమం
దాదృత్యవ్యవధానులై ధరణి సాష్టాంగంబుగా మ్రొక్కుచున్.

వ॥ దేవీ! నీవు మహేశ్వరివి. ఈశానివి. పరమ కరుణాలయవు. వాగ్భవారాధన ప్రీతవు. వాగ్భవప్రతిపాదితవు. క్లీంకార విగ్రహవు, క్లీంకారప్రీతి దాయినివి. ఈశ్వరతోషిణివి, మహామాయవు, మహాసామ్రాజ్యదాయినివి, భోగవర్ధనివి, భగవతి వని వినుతించి మమ్ముఁ గటాక్షింపు మనివేడిన రాజనందనులారా! మదుపాసనంబున నిష్కల్మషులైతిరి. వరంబు వేఁడు డనిన నిష్కంటక రాజ్యంబును, చిర జీవిసంతానంబును, అవ్యాహతభోగంబును, యశస్తేజంబులును, వేడిన నట్లగుఁ గాక యని పలికి మఱియు మీ రార్వురును మన్వంతరపతు లయ్యెదరు. దీర్ఘాయుర్భాగ్యంబులు గల్గి వర్తించెద రని తెల్పి రాజరాజేశ్వరి యంతర్ధానంబు నొందిన.

సీ॥ వార లార్గురు సర్వవసుధాధినాథులై, యజ్జన్మమున భోగమనుభవించి
జన్మాంతరంబుల జగదీశ్వరీదత్త, వరమహిమంబున మరలఁ బుట్టి
మనువులై సావర్ణిమహిపతిపిదప భూమండల మేలి రఖండభూతి
దక్షసావర్ణి యంతట మేరుసావర్ణి, బ్రహ్మసావర్ణి నాఁ బరఁగ నవలఁ

తే॥ జంద్రసావర్ణి యనఁగ నక్షయబలుండు, నింద్రసావర్ణి యనఁగ మహేంద్రభోగి
రుద్రసావర్ణి యనఁగ నారూఢబలుఁడు, మహిఁ జతుర్దశమనువులై మహితులైరి.

క॥ ఇది పదునలువురు మనువుల, విదితచరిత్రంబు దీని వినువారలకున్
ముద మొనఁగి దేవి తనదగు పదమ్మున సామ్రాజ్యసిద్ధి పరఁగన్ జేయున్. ౧౩౬

వ॥ అని యిత్తెఱంగున నారాయణుండు నారదునకుం దెల్పిన వృత్తాంతంబు బాదరాయణుండు జనమేజయునకుం జెప్పె నని. ౧౫౭

ఉ॥ దారువనీమునీంద్రవనితాజనతాకుహనావిటాకృతీ!
స్ఫారజగత్త్రియావినుత! శ్రీ సర్వవిమోహిత! చంద్రమఃకళా
ధార! ధరాధరేంద్రతృణతాకృతివిక్రమధీర! నిర్గుణా
కార! వికారదూర! సుమశ్రీకార్ముకశోషణ! భోగిభూషణా. ౧౫౮

క॥ మణికర్ణికాపయోవిహారణ! పాతాళేశకందరారామందిర! రా
వణసంస్తంభనవిక్రమ, చణపాదాంగుష్ఠ! యాత్మసంపన్నిష్ఠా! ౧౫౯

పంచచామరము॥ చరాచరాచరాంతరప్రచార! విశ్వరక్షణా!
పరాత్పరా! పరా! విభూతిభాల! నైకవీక్షణా!
సురాసురస్తుతాంఘ్రిపద్మ! శ్రీ సూరిమోదదాయకా!
పరాపరప్రకారసర్వభార! శౌరిసాయకా! ౧౬౦

క॥ దేవీభాగవత స్కంధావళి దశమంబు నచ్ఛమాంబా జగ్గ
త్స్వామివరుల కభీష్టార్థ, శ్రీ వెలయఁగఁ జేసి సుప్రసిద్ధిఁ జెందుఁ. ౧౬౧

గద్య

ఇది శ్రీమత్పరమశివాద్వైత భావనాసాఖ్య ములుగు సదన్వయ సిద్ధసారస్వతవిద్యా
సాన్నిధ్య వేమనారాధ్యవంశార్ణవకలానిధాన పాపయారాధ్యాభిధాన
ప్రణీతంబైన శ్రీ దేవీభాగవతంబను మహాపురాణంబునందు
దశమస్కంధము సంపూర్ణము.

శ్రీదుర్గాదేవతార్పణ మస్తు

శ్రీ శ్రీ శ్రీ

---

(షరా) ఈ దశమస్కంధము భ్రామరీచరిత్రముతో ముగిసినట్లు సంస్కృతమునందున్నది. ఈ యనువాదమునం దీచరిత్ర పూర్తిగా లోపించినది. దీనింబట్టియేమి, యిట్టులే మఱికొన్ని వ్యత్యాసములంబట్టి యేమి గ్రంథకర్తకు లభించిన భాగవతమునకును నేఁడు తెలుఁగులిపిలోని దేవీభాగవతమునకును అక్కడక్కడ భేద మున్నదనుట విస్పష్టము. కావున దీనిని చదువరులు గమనించవలయును. నాగరలిపిలోఁగూడ నిట్టిభేద ముండునని తోఁచదు. తాటియాకులలో గ్రంథములు వ్రాసికొను కాలమున నింకను నిట్టి వ్యత్యాసము లెన్నియేని యుండుననుటకు సందియ ముండదని తెల్పెడి.

వెం॥ శా॥ శతవధాని.

శ్రీ ర స్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ శా ర దాం బా యై న మః

శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము – శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## ఏకాదశస్కంధము



గనియై సర్వాగమ

రాగంబై సకలఫలసు ఽ రాగము దేవీ

భాగవతము పదియొకటవ

భాగము సర్వార్థరూప ఽ భావం బలరున్. ౧

క॥ శ్రీలలిత! సర్వజగతీ,పాలన కేళీవిలోల! ఽ భవభయజాలా

భీలస్వనామ! దనుజవి,ఫాలా! ఫాలాక్ష! ముక్తి ఽ పట్టణదక్షా! ౨

వ॥ దేవా, సకలపురాణేతిహాసకథాసుధాస్వాదనని స్తంద్రులగు నమ్మునిచంద్రులకుం దన్మనోరథ రథచోదనాసూతుం డగు సూతుం డిట్లనియె. ౩

క॥ శ్రీచక్రస్యందనరుచి, వీచీబిందూకృతార్క ఽ విధుశిఖతారా

సూచితకాలత్రిజగ, ద్వ్యాచిక్రీంసాప్రకాశి ఽ యఖిలాండేశీ! ౪

సీ॥ నఖరబింబిత జగ ఽ న్నవ్యావలోకనా, వాప్తిచే విజయసం ఽ ప్రాప్తిచేతఁ

దిగ్గుణశక్తి విధాన ఽ దివ్యానుభావవై, భవముచే నాత్మసం ఽ భవముచేత

నాదరానాదరోపాత్త సత్త్వాసత్త్వ,వృద్ధిచే భువనప్రసిద్ధిచేత
సర్గస్థితిధ్వంస సహజకార్యవిధాన, శక్తిచే సతతానురక్తిచేత
తే॥ మొదటివారైనవారికి మొదటిదాన, వీవె యని వేదవాదంబు లెచ్చరింపఁ
జాటుతరపాటవాప్తి జంజాటమేల, మనసు నీదమ్మ దేవి! నన్ మఱవకమ్మ. ౫
వ॥ ఇట్లు నమజ్జనదుర్భవదురితలతాలావిని యగు పరదేవిని భజించి. ౬
క॥ దేవీచారిత్రము సం,భావితమయ్యెన్ ద్వదుక్తి పరమాశ్చర్యో
ద్భావకమగుఁ దత్ప్రౌఢు,ర్భావము దైత్యాపహృతియుఁ బరఁగన్ వింటిన్. ౭
శా॥ ఏ యే కర్మలచేత సంతసిలు నే యే గోష్ఠులన్ దేవి స్వే
చ్ఛాయుక్తిన్ బదభక్తులన్ మనుచుఁ దచ్చారిత్రమెల్లన్ గృపా
దేయం బౌనటు లిచ్చఁగొల్పి మది సందేహంబు మాన్పన్ దగున్
నా యజ్ఞాననివృత్తిబీజమతి గానన్ దెల్పు మౌనీశ్వరా. ౮
క॥ అని యమరముని వచించిన, విని నారాయణుఁడు పల్కె వేదోదిత మ
త్యనఘము దేవీవృత్తము, దినదినకర్తవ్యమదియుఁ దెల్పెద వినుమీ. ౯

—• ధర్మస్వరూప నిర్ణయము •—

సీ॥ ఉదయాస్తమయముల వదలని సత్కర్మ,వేత్తకు నిత్యనైమిత్తికముల
నాముష్మికములందు నదియె తోడగుఁ గాని, తనకుఁ దోడగుమె తల్లిదండ్రు
లింతియే తెల్లము హితులు నిల్లాండ్రును, జ్ఞాతులు పశుధనసంచయములు
నెవ్వియుఁ దోడుగా వెక్కటి ధర్మంబు,తోడగు విడువంగఁ గూడ దదియె
తే॥ తమ మడంగించు లోకబాంధవుని పోల్కి, నాంతరతమంబు లెల్ల నిరాకరించు
ధర్మమొక్కఁడు తోడయి తనకు నిలుచు, ధర్మపథవర్తులకు సరిధరణిఁ గలదె? ౧౦
క॥ ధర్మముఖం బాచారము, మర్మం బిది వేదవిహితమార్గము దానన్
గర్మిష్ఠుఁ డిందువలనన, శర్మిష్ఠుం డగును వినుము సాధువరేణ్యా! ౧౧
సీ॥ ఆచారమునఁ గల్గు నాయుర్వివృద్ధియు, నాచారమునను సుతాభివృద్ధి
యాచారమున నన్న మక్షయ్య మగుచుండు, నాచారమునఁ బాపమడఁగుచుండు
నాచారహీనుల కవనిఁ బూజ్యతలేదు, దుఃఖపీడాదులు దొలఁగకుండు
ధర్మహీనునకు నర్థముఁ గామమును సటల్, ధర్మంబు విద్వేషతను బొసఁగిన
తే॥ విడువఁదగనిది గోముఖ్యవిశసనంబు, హేయమైనను బరలోకమిచ్చుఁ గాదె!
హితమునహితంబుననవేల! శ్రుతివిహితము,లైహికాముష్మికములిడునని తెలియుము.

—• ప్రాణాయామ స్వరూపము •—

వ॥ మఱియు ధర్మంబులలో ముఖ్యధర్మంబులు వర్ణించెద. నసుమ రేయి నిద్దురం
దొరంగి సవ్యచరణంబు దక్షిణోరువునం దనుసంధించి చుబుకంబు కంఠగర్తంబు

సం గీలించి నిమీలితాక్షుండై సాత్త్వికుం డగుచు నన్యోన్యదంతాస్పర్శనంబుగాఁ దాలుస్థాచలజిహ్వుండై, సంవృతాస్యుండును సన్నిరుద్ధేంద్రియగ్రాముండును నగుచు ద్విగుణత్రిగుణంబులుగాఁ బ్రాణాయామంబు లుపక్రమించి హృదయ కుహరంబున దీపాంకురం బగు నాత్మయం దాత్మధారణంబు సేయవలయు; వధూమవిధూమ సగర్భాగర్భ సలక్ష్యాలక్ష్య భేదంబుల షడ్విధం బగు ప్రాణాయామసమంబగు యోగంబు ప్రాణాయామంబ యగు, రేచక పూరక కుంభకంబులచే నకారోకారమకారాత్మక వర్ణత్రయ సంపుటీకృతంబుగావున నోంకారంబు ప్రణవం బనంబడు, ఇడచే మారుతంబు పూరించి స్వోదరంబున షోడశమాత్రోచ్చారణకాలంబు కుంభించి పింగళచే మృదుస్పర్శనంబున రేచింప వలయు; ఆధారస్వాధిష్ఠానమణిపూరానాహతతాలుమూలలలాటంబులఁ జతుర్ద్వా దశ ద్విదళ షోడశ ద్విపత్త్రంబులగు కమలంబులగు; నక్కమలంబుల వశషసలును బభమయరలలును డఢణతథదధనపఫలును కఖగఘఙ చఛజఝఞ టఠలును అకారాది షోడశస్వరంబులును హంక్షంబీజంబులును గలుగుఁ గావున వర్ణరూపిణి యగు మాతృకను భజింపుచు నరుణకమలాసనయుఁ గమలరజోవర్ణయు హారాధీనచిత్తయుఁ బాశకోదండబాణాంకుశధారిణియుఁగ నుపాసించి నీవేగతి నీవే మతి నీవే ధృతి యని వేగునంతను గురుధ్యానాదులఁ గాలంబు గడపవలయు.

ఆ॥ కర్మహీనుఁడైన ♦ కలుటిని వేదముల్, శుద్ధుఁ జేయలేవు ♦ శ్రుతియు సాంగ
పతితమైన మృత్యుపరిణతి నీడంబు, విడుచు పక్షులట్ల ♦ విడుచు వాని.

## —॰ శౌచనిర్ణయము ॰—

సీ॥ ఏంబ దేనిటి మీఁద ♦ నెనఁగు నుషఃకాల, మవల సూర్యోదయం ♦ బగును, నాల్గు
కాలముల్ నిద్దుర ♦ గడపి నాల్గింటిలో, మూడు ముఖ్యంబులు ♦ మూటిలోన
నొండొక యెడ లేచి ♦ యొక్కింత సేపేని, భగవతి నంబికఁ ♦ బరమభక్తి
ధ్యానించి పిమ్మట ♦ నంబుపూరితమగు, కలశంబు గొని యిల్లు ♦ గదలి యవల

గీ॥ * నిఋతిదిశ కేగి తృణగుల్మవిరహితమగు, నట్టిచో మలమూత్రముల్ ♦ నెట్టివేయ
వలయు నచ్చోటఁ దృణమిడి ♦ వసన వేష్టి,తోత్తమాంగత నలరిన ♦ నుత్తమంబు.

ఆ॥ జన్నిదంబు బ్రహ్మచారికిఁ గుడిచెవి, నవల నిరువురకును ♦ నార్యసూక్తి
పృష్ఠలంబితముగ ♦ విష్ఠింపఁ దగునని, మొ్రయుచుండు ♦ మానిముఖ్య! వినుము.

సీ॥ పలుకు బంధించి యుచ్ఛ్వాసనిశ్వాసముల్, మర్దించి దున్నిన ♦ మహీజలములఁ
బర్వతంబుల జీర్ణ ♦ భవనంబులను దేవ, భూముల శాద్వల ♦ భూములందుఁ

టిప్పణి॥ * నిఋతి ఇది చింత్యము. నిర్రృతి యని సవరించినచో ఛందోభంగము. "అపి మాషం మషం కుర్యా చ్ఛందోభంగంతు న", విజ్ఞులు విచారింతురు గాక. (ప్రాసభంగము కూడదు) "నిర్రృతిదిశకు నరిగి నిస్తృణ మగు" అని సవరించుట యుక్తము. నిర్జనమగు అని సవరించినను వచ్చు హాని లేదు.

బుట్టల దారుల ♦ భూతసంఘములందు, నేటిపొంతల బూది ♦ నెముకలందు
మలవిసర్జనము ము♦మ్మాటికిఁ గూడదు, శౌచహీనునకు ని♦ష్ఫలము సర్వ
గీ॥ మంబుమధ్యంబు దేవగృ♦హాంతరంబు, పుట్ట మూషకగ ర్తంపు♦భూమివలన
శౌచమృత్తికఁ దేరాదు ♦ సాధుసూక్తి, పూర్వవిష్ఠంబు గారాదు♦ భూసురులకు.
గీ॥ శౌచరతముల శీర్ష వస్త్రంబు వేఁలు, స్నానభోజన మైథునో♦త్సారదంత
ధావనప్రస్రవములందుఁ ♦ దగదుమాట, లాడుటకు భూమిసురులకు♦నమరమాని!
వ॥ మఱియు నుభయసంధ్యల జప్యంబులఁ బితృకార్యంబుల, దైవకార్యంబుల, గురు
సన్నిధిని, ప్రాణాయామంబుల, మౌనంబు స్వర్గజనకంబని వేదవిదితంబగుచుండు.
గీ॥ ద్విజుడు మూత్రపురీషముల్ ♦దివమునం దు,దఙ్ముఖుండయి సేయంగ♦దగుఁ,(రియాను
నుభయసంధ్యలఁ దగదక్షి♦ణోన్ముఖుఁడయి, సేయఁదగు నిట్లునిగమంబు♦చెప్పుచుండు.
సీ॥ పగలు రేయిని ♦ భూజపటలినీడల మల,మూత్రముల్ సేయుట♦ మొఱకుఁదనము,
వాయ్వగ్ని గోవిప్ర♦వరభాస్కరులఁ దిల,కించుచు మలము వర్జించఁజనదు
ఒకటి మేహనమున ♦ కొకటి కేలికి మూడు, పాణిద్వయమునకుఁ ♦ బరగ నటుల
మూత్రశౌచమునకు ♦ ముఖ్యంబు మృత్తికా, పిండము ల్మలవేళ♦ ద్విగుణమరయ
గీ॥ నయిదు గుదమున కట్టుల♦ హస్తమునకుఁ బదియుఁ బాణిద్వయికి నేడు♦ పరగుశుద్ధి
సవ్యపాదంబు దక్షిణ♦చరణమును గ్రి,మంబుగా నాలుగిటను శు♦భంబు శుద్ధి.
గీ॥ ఇది గృహికిఁ జెప్పనాచార ♦ మిటులె కడమ,మువ్వురకు రెట్టిగా శౌచ♦ములు దనర్చు
నన్నిటికి మూల మాచార ♦ మగ్రజులకు, వేదవిహితంబుఁ దప్పింప ♦ వెరవుగాదు.
సీ॥ ద్వాదశాంగుళమాన♦తతమై కనిష్ఠికా, స్థూలమై ఖదిరంబు ♦ చూతమును గ
దంబ ముదుంబర♦తరుజంబుఁ జంపక, తిందుమారములును ♦ దెచ్చుకొనుట
దంతధావనమునఁ ♦ దగుఁ జిరశోధన, శ్రోత్రియ మట్టులను బు♦రీషమూత్ర
మైథునస్నాన*కేశ♦శాధూనశయనాదు,లందు సమ్యక్శుద్ధి♦యాయు వొనఁగు
గీ॥ బలము యశము శుభంబును ♦ బ్రజ్ఞ మేధ, నొసఁగుఁ గావునఁ జిరకాల♦మోర్చి శుద్ధి
సేయఁదగు నెల్లవారికిఁ ♦ జిరము శీఘ్ర,ముగ ముగింపఁగరాదుసూ ♦ మునివరేణ్య.
ఆ॥ దంతధావనంబు ♦ తత్తఁ బదిరెండు గం,డూషములు పొసంగు ♦ నుర్వీజనుల
కర్కుఁ దుదయమైన ♦ యట్టిచోఁ దచ్ఛుద్ధి, పితృకులంబునందుఁ ♦ బీడఁజేయు.

---

టిప్పణి॥ * కేశాధూన, ఇది మూలమున నున్న దాని కనువాదము కాదు. దిద్దుటకుఁ బ్రాసస్థాన ములో నుంటచే నవకాశము లేదు. పొరపాటు కాదని తోఁచెడిని; ఈస్కంధమునందు, భ్రూణశబ్దము భ్రూణ అనుకొని యతిస్థానమున నసకృదావృత్తిగా వాడఁబడినది. అది సవరించితిని. ఇది సవరింపలేక పోతిని. విజ్ఞులు పరిశీలింతురు గాక. ప్రమాదో ధీమతామపి. అపిరేవ కారార్థకః (కేశ+అధూన) కేశా ధూన శబ్దమునకు క్షురకర్మ యని ప్రకరణమునుబట్టి యర్థము చెప్పుకొన్న సరిపోవునని తోఁచెడిని.

శాం. శా.

గీ॥ పాడ్యమిని దర్శ షష్ఠిని బంకజాప్తు, వాసరమ్మున నవమిని వలదు దంత
ధావనము చేసితేని సప్తమునిదనుకఁ, గులముచెడుఁగాన నేయంగఁగూడదపుడు.

వ॥ మఱియు మొదలఁ బాదశౌచం బొనర్చి, విమలంబగు జలంబు ముందుగా నాచ
మించి ద్వివారంబు జలంబునఁ బాదస్పర్శనం బొనర్చి, నాసయు నోష్ఠయుగ్మంబును
స్పృశించి యంగుష్ఠానామికలచే నయనయుగంబు నిమిరి, కనిష్ఠంబునఁ గర్ణ
యుగ్మంబు నిమిరి, అంగుష్ఠంబున నాభియుఁ దలంబున హృదయంబును, అంగు
ళుల శిరంబును ముట్టికొనుట విధి యని నిగమంబులు వచించుచుండు. ౨౬

సీ॥ మొదల శుద్ధస్మార్తములును పౌరాణిక, వైదికంబులును, నప్పాటఁ దాంత్రి
కంబు శ్రౌతంబును గల వాఱు తెఱఁగులఁ, గర్మముల్ శ్రుత్యుక్తగరిమ మెఱసి
విణ్మూత్రములశుద్ధివిధిఁ జెప్పఁగా నొప్పు, స్మార్తపౌరాణముల్ సంధ్యలందు
వైదికశ్రౌతముల్ బ్రహ్మయజ్ఞమునందు, నస్త్రవిద్యలఁ దాంత్రికాఖ్యకర్మ

గీ॥ ఆది నోంకారము పఠించి యవల వ్యష్టి, వర్ణముల శిఖ ముట్టి యవ్వల జలంబు
లాచమించి హృదాదిపాదాంతముగను, స్పర్శ మొనరింపఁదగు విప్రజాతి కధిప!

క॥ క్షుతనిష్ఠీవనవేళల, పతితానృతభాషణముల పలుముట్టినచో
నతముగ దక్షిణభాగపు, శ్రుతిముట్టఁ దగవుసుమ్ము సూరుల కెలమిఁ. ౨౭

గీ॥ చంద్రసూర్యులు వేదముల్ జ్వలనుఁ డవని, దక్షిణశ్రవణంబునఁ దరలకుందు
రదియుఁ గావున ననుచితం బడకునెడల, దక్షిణశ్రుతి ముట్టుట ధర్మ మనఘ!

గీ॥ కర్మవిధులు పెక్కు కర్మకాలము సూక్ష్మ, మదియుఁగాన నుచిత మనుచితంబు
నుభయమందు నామ ముచ్చరించుట శుభ,స్పర్శనంబు రెండు చను గణింప.

## —॰ గాయత్రి వివేచనము ॰—

సీ॥ గాయత్రికన్న ముఖ్యం బైహికమునందు, నాముష్మికమునందు నరయ లేఁదు
తన్నుఁ బఠించినఁ దరియింపఁ జేయుట, గాయత్రి యనుపేరు గలిగెఁ జుమ్ము
ప్రణవయుక్తంబుగాఁ బఠియింప గాయత్రి, ఫలమొసంగును బ్రాణబంధముగను
గుంభకం బొనరించి కులధర్మ మెడపక, వైదికంబు జపించవలయు ద్విజుఁడు

ఆ॥ తాంత్రికోక్తి వలదు ధరణీసురున కెందు, నావుగొమ్ముమీఁద నావగింజ
నిలుచునంత వట్టు నిలుచు నేనియుఁ గోప, ముభయపక్షకులము నుర్వి గలపు.

వ॥ మఱియు శ్వాససంయుక్తంబగు విధూమంబును, శ్వాసవర్జితంబగు సధూమంబును
జపయుక్తంబగు సగర్భంబును ధ్యానమాత్రంబగు నగర్భంబును నెద్దియేనియు
నాచరించుచు స్నానం బొనర్చి పితృతోషకంబగు స్నానాంగతర్పణంబు సలిపి
శుద్ధవస్త్రపరీధానుండై విభూతిధారణం బొనర్చి రుద్రాక్షంబులు దాల్చవలయు.
తత్ప్రకారంబు వివరించెద నాకర్ణింపుము. 3౨

—• రుద్రాక్ష మాహాత్మ్యము •—

సీ॥ గళమున రుద్రాక్షకములను ముప్పదిరెండు, తలమీఁద నట్టుల నలువదియును
నాఱాఱు కర్ణంబు లందు హస్తద్వయిఁ, బదిరెండు పదిరెండు బాహువులను
బదియాఱుఁ బదియాఱు నెద నూటయెనిమిది, శిఖ రెండునరయిఁ బరశివుఁడతండ
వెండిచేనైనను విలువబంగరునైనఁ, బొదిగి రుద్రాక్షంబుఁ బూనవలయు
గీ॥ గంటకరముల ధరియింప గలదు ముక్తి, జన్నిదంబునఁ దాల్చుట శాస్త్రమతము
దాన రుద్రాక్షయేకాని దాల్చరాదు, ప్రణవపంచాక్షరమునఁ దాల్పంగవలయు.

క॥ పంచాక్షరిఁ బఠియించుచుఁ, బంచజనుం డంగమునను బటురుద్రాక్షల్
సంచితములఁ దగఁ దాల్చినఁ, బంచాననమూర్తియగుచుఁ బరఁగుఁ ధరణిన్.

గీ॥ జన్నిదంబున వేదముల్ శయమునందు, దిక్కులను గంఠమునఁ బల్కుఁ దెలివనలు
భావనము సేయఁగాఁదగు బ్రాహ్మణులకు, మొదటిధర్మంబుసుమ్మిది మునివరేణ్య!

క॥ నాలుగు కర్ణంబులకును, బోలం దాల్పంగవలయు భువిరుద్రాక్షల్
శ్రీ లలర విప్రతతిలో, లీల న్నాల్గాశ్రమములు లెక్కింపఁ దగున్. ౩౬

సీ॥ రుద్రాక్ష ధరియింప రుద్రుఁడౌ సందియం, బొక్కింత వలదు దక్షయోగ్యులొరులు
నిందింప వినినను నిందించినను భక్తి, విడిచినఁ బరిహాస మిడిన వాని
కగు నిరయంబు, రుద్రాక్షధారణమున, సర్వపాపవిముక్తి సంభవించుఁ
దద్ధారి భుజియింపఁ దరుణేందుధరుఁడు భు, జించిన యట్టుల; సిగ్గువలనఁ
గీ॥ దాల్చ నొల్లనివానికి దండధరుని, శాసనము దప్ప దెప్పుడు జన్మకోటి
వలన సంసారమోక్షంబు గలుగదనుచు, శ్రుతిమతముసుమ్ము సిద్ధాంతసూచితమ్ము.

క॥ రుద్రాక్షధారిఁ గనుఁగొని, రుద్రుం డని భక్తిగొనక రోసినవానిన్
భద్రములు చెంద వంతక, రౌద్రమునకుఁ బాలుపఱచు రక్కసుఁ జేయున్. ౩౭

గీ॥ సత్యసంకల్పులైనట్టి సకలమునులు, బ్రహ్మభావంబు గాంచిన బ్రహ్మవేత్త
లయ్యురుద్రాక్షములుదాల్చి యన్వహంబు, ధన్యులమటంచుఁ దలఁతురు తపములందు.

సీ॥ రుద్రాక్షధారణాసక్తులౌ వారికి, వస్త్రధాన్యాదు లెవ్వం డొసంగు
నతఁడు పాపంబుల నపనయించి వివేక, చిత్తుఁడై శివలోకసిద్ధి నొందు
శ్రాద్ధకాలముల నిస్సందేహముగ నట్టి, వారికిఁ దృప్తి యెవ్వండు సలుపు
నతనికిఁ బితృలోకమావశ్యకము ధృతి, రుద్రాక్షుచరణముల్ రూఢిఁ గడిగి
గీ॥ జలము ద్రావిన సర్వదోషంబు లడఁగి, శివునిసన్నిధిఁ జేరుఁ బ్రసిద్ధుఁడగుచు
హారకటకాదిసదృశతనవియుఁ దాల్చు, వాని శివునిగ భావించువాఁడు శివుఁడు.

క॥ ఏకంబయినను దల రుద్రాక్షన్ ధరియించు నతఁ డసురాతులఁ దన య
స్తోకగరిమ నణఁచి గణానీకంబుల నడుమ నగ్రణీత్వముఁ జెందున్. ౪౧

వ॥ మఱియు నెవ్వఁడేని యమాత్రికంబుగానైనను రుద్రాక్షంబు భావవర్జితంబుగా లజ్జం బోఁదొట్టి ధరించిన సర్వపాపవిముక్తుండై సమ్యగ్జ్ఞానంబు నొందు, రుద్రాక్ష మాహాత్మ్యంబు నాకు వర్ణింపనలవియే! తద్ధారణంబు విప్రుల కావశ్యకంబనిన నారదుండు రుద్రాక్షంబున కింతపూజ్యతాకారణం బెట్లబ్బెననినఁ దొల్లి షణ్ముఖుం డిట్లడిగిన సర్వేశ్వరుండగు భగవంతుం డెఱింగించిన తెఱంగు తెల్పెద నని యిట్లనియె.

సీ॥ త్రిపురుండు నా నొక్క ¦ దితిజుండు సర్వదుర్జయతచే లోకముల్ ¦ సంకటముల
పాలుచేసిన దేవతాపటలి బ్రహ్మయు విష్ణుఁడును శక్రుఁడాదిగా ¦ వచట నన్నుఁ
గాంచి విన్నప మాచరించిన ఘోరాస్త్ర, మాత్మలోఁ దలచి తత్పదంబకమునఁ
ద్రిపురసంహారంబు ¦ దేవతాతారణం, బఖిలవిఘ్నధ్వంసమగు నటంచు

గీ॥ సర్వదేవమయంబును ¦ సర్వసంక్షయంబు నగునట్టుగా నుద్భవంబు నొంద
దివ్యవర్ష సహస్రంబు ¦ తెఱపి యాక, కన్ను మొగిచి తలంచితి ¦ గాఢవృత్తి.

మ॥ నయనంబు ల్ముకుళించి నిశ్చలసదానందస్థితిం దారకా
త్రియ మస్పందత నిల్ప భాస్కరశశిద్వంద్వానలార్చిస్స్రితిఁ
రయమొప్పారఁగ నస్రముల్ దొరఁగ దత్రద్రాశిం బ్రకృష్టంబు ల
వ్యయముల్ పెక్కుమహీజముల్ పొడమె రుద్రాక్షాభిధానంబులై. ౪౪

గీ॥ అమ్మహీజము లస్మదీయాజ్ఞ నిఖిలపూజ్యములు బ్రహ్మ తేజోవిభూషితములు
నగుచు నెల్లరకు శుభంబు ¦ లగణితముగ, నివ్వటిలఁ జేయుచుఁ జెలంగెఁ ¦ గింగి భువిని.

సీ॥ సూర్యనేత్రంబునఁ ¦ సుచిరంబులు కపిలంబులు భానుసంఖ్యంబు లయ్యెఁ
జంద్రనేత్రంబునఁ ¦ సాంద్రముల్ శ్వేతముల్, పదియాఱువిధములఁ ¦ బ్రభవ మొందె
ననలనేత్రంబున ¦ నసితముల్ దశవిధంబులు నొంచు విఖ్యాతి ¦ నలముకొనియె
ఇన్నియు ముప్పదియెనిమిది భేదంబులలవడి యెల్లెడ ¦ నతిశయించె

తే॥ ధవళవర్ణంబు ద్విజుఁడు రక్తంబు రాజు, మిశ్ర మూరుజుఁ డసితంబు ¦ మెఱసె వృషలు
డగుచుఁ దత్తత్ప్రకారంబు ¦ లగుకులముల, ధారణార్థంబు లగుచును ¦ దనరుచుండు.

గీ॥ అట్టులయ్యు రుద్రాక్షంబు ¦ లఖిలవర్ణ, ధార్యత వహించు రుద్రాక్ష ¦ ధారణంబు
రుద్రభావంబు నిడుఁగాన ¦ రూఢి మెఱసి, యిలఁ గులాకులభేదంబు ¦ లెంచనేల.

సీ॥ ఏకవక్త్రము శివుం ¦ డిది దాల్ప బ్రహ్మహత్యలు పటాపంచలై ¦ యడఁగిపోవు
రెండు మోములది యొక్కండు దాల్చిన నైహి, కాముష్మికాఘంబు ¦ లవలఁ ద్రోయు
మూఁడు మోములది యగ్ని గ వహ్నిరూపమై, స్త్రీహత్యల దహించుఁ ¦ దెరలనీక
తుర్యాననము బ్రహ్మ ¦ తోఁడుత నరహత్య, నడఁచి శుద్ధుసేయు ¦ నవని నరుని

గీ॥ అయిదు మోములయదియుఁగాలాగ్ని రుద్ర, మదియభక్ష్యాశనాదులనవలఁద్రోయు
షణ్ముఖము కార్తికేయుండు సకలదురిత, నాశకంబగు దివ్యప్రకాశమగుచు.

సీ॥ సప్తవక్త్రి మనంతసంజ్ఞంబు బంగారు, మ్రుచ్చిలించు దోసంగు మచ్చచూపు
నష్టవక్త్రింబు గజాననానామంబు, భ్రూణహత్యాదోషముల నడంచు
మఱియు స్వర్ణస్తేయమారకంబును గురు, దారిహానాశకము ప్రత్యూహభేది
యగుచుఁ బరంపద మంతంబునం దిడు, నవవక్త్రి మెన్న భైరవము వామ

గీ॥ బాహుధార్యంబు ననుబోలుబల మొసంగు, భ్రూణబ్రహ్మహత్యలయఘములనణంచి
భుక్తిముక్తుల నొసఁగుటబ్బురముగాదు, పరమొసంగుట ముఖ్యమౌఫలమునున్మి.

శా॥ భూతప్రేతపిశాచరాక్షససముద్భూతంబులుఁ బన్నగ
వారితోద్భూతము లౌ భయంబులను బోవంజేసి పాపౌఘని
ర్ఘాతంబై దశవక్త్రి మైనయది సాక్షాద్దరిద్రసేవాసము
ద్భూతిన్ దాన యొసంగుమూర్తి యది యంభోజాక్షుఁ డంచెన్నమీ. ౧౦

క॥ ఏకాదశముఖ మది రు, ద్రైకాదశరూప ముత్తమాంగంబున సు
శ్లోకుఁడయి తాల్చునతఁ డ, స్తోకాశ్వాలంబకోటితుల్యఫలు డగుఁన్. ౧౧

క॥ పదిరెండుముఖంబులు గల, రుద్రాక్షం దాల్పగను నరుం డశ్వంబుల్
పదివేల గోవులట్టుల, వదలక వేల్చినఫలంబు వడయుంజుమ్మా! ౧౨

క॥ కొమ్ములు కోరలుగల స, త్వమ్ముల భయములును వ్యాధిభయమును విడగాఁ
జిమ్మి సుఖి యగును నిచ్చలు, నిమ్మహి ద్వాదశముఖమ్మునెదఁ దాల్చుటచే.

సీ॥ పదుమూఁడు ముఖములఁ బరఁగు రుద్రాక్షంబు, లమరుల కైన లభ్యములు గావు
రసరసాయనసిద్ధి రహి వహింపఁగఁ జేయు, సర్వకామార్థముల్ సంతరించు
భోగ్యభూతములెల్ల భుజియింపఁగాఁ జేయుఁ, బితృమాతృగురులకుఁ బీడసల్పు
దోషంబులను గడద్రోయు నా రుద్రాక్ష, శిరమునఁ దాల్చిన శివుఁడెయగును

గీ॥ తలచు వర్ణింపనేల? ద్వాదశముఖంబు, సర్వపూజ్యంబు నిహపరసంగ్రహంబు
విబుధసేవ్యంబు వివిధైకవేద్య మమల, మది లభించుట పూర్వజన్మార్జితంబు.

సీ॥ శిరమున నొక్కటి శిఖచుట్టు నిరువది, యాఱు నేఁబది హృదయంబునందు
బాహులఁ బదియాఱు పదిరెండు మణిబంధ, ములను నష్టోత్తరముఖ్యమైన
శతముఖ్యమైనను సర్వదా రుద్రాక్ష, మాలిక ధరియించు మానవునకు
నెంత పుణ్యముగల్గు నెఱిగింపు మన్నచో, నెవఁడు శక్తుఁడుగామియే ధ్రువంబు

తే॥ ఫల మనంతంబు త్రికస త్తకపౌరుషంబు, పితృసుఖప్రద మది శివకప్రీతికరము.
* కృష్ణవర్ణంబు ధరియింప గేవలంబు, గడియగడియకు ఫల మధికంబునుమ్మి.

సీ॥ బ్రహ్మముఖంబు పురంజయుఁడగు బిందు, వంబుజాక్షుండు పుచ్ఛంబు భోగ
మోక్ష ఫలంబు రుద్రాక్షంబు పంచవింశతి సంఖ్య పంచాస్యసంచయంబు
రక్తవర్ణంబును రంధ్రగర్భితమును, గంటకాన్వితముగాఁ గలుగు నక్ష
మాలిక ధరియింపఁ బోలు వక్త్రంబున, వక్త్రంబుగదియింపవలయు నటులె

తే॥ పుచ్ఛమునఁ బుచ్ఛమునుగూర్చి పొనఁగ మేరు, పూర్ధ్వముఖముగ నిల్పి తదూర్ధ్వమునను
గ్రంథియగు నాగపాశంబుగాఁ గుదిర్చి, జపమొనర్పంగఁదగు ధాత్రిజపితలకును.

వ॥ మఱియును నక్షసరంబు నంగుష్ఠతర్జనీమధ్యమాంగుళుల నిలిపి పంచగవ్యగంధ తోయ శివతీర్థంబులఁ గడిగి మంత్రికవచావకుంఠనంబు లొనర్చి మూలమంత్ర న్యాసంబు చేసి మూలమంత్రం బష్టోత్తరశతంబు జపియించి పీఠంబున నునిచి యందుఁ బరమకారణంబగు శివుఁ బ్రతిష్ఠించి మూర్ధంబునఁ గంఠంబునఁ గర్ణంబున నెందు నేనియు ధరింపవలయు నివి జపసంసిద్ధింజేయు. కంఠమూర్ధహృత్కరణబాహువులఁ దద్ధారణం బావశ్యకంబు; స్నానదానజప హోమవైశ్వదేవసురార్చన శ్రాద్ధ దీక్షల రుద్రాక్షంబు విడిచి వైదికకర్మం బొనర్చిన నిరయంబు నొందు, సువర్ణ మణి మిశ్రంబుగా ధరించుటచే ఫలమధికంబు, అశుచియై ధరింపఁగూడదు. రుద్రాక్ష తరుసంభూత వాతోద్ధూతతృణస్పర్శంబును బునరావృత్తిరహితం బగు శివలోకం బొసంగు, నిట్టులు జాబాల ఋషులు వచింతురు. పశువేనియు, రుద్రాక్షధార ణంబున రుద్రత్వంబు నొందు నన నొండు చెప్పఁదగునే? సర్వదుఃఖధ్వంసకంబును సర్వపాపవిమోచనంబును నగు రుద్రాక్షంబు; తదలంకృతులు భాగవతోత్త ములు; శ్రేయోర్థులకు నియ్యది ముఖ్యధార్యంబు; మూర్తిత్రయంబును, తద్వి భూతులు దేవతలును గోత్రఋషులును కూటస్థులు వంశప్రసూతులు మునులు శ్రౌతధర్మపరులును రుద్రాక్షధారు లని మెఱుంగునది; బహుజన్మార్జితశ్రేయో విశేషంబున నందు శ్రద్ధ జనించు; దానంజేసి మత్ప్రసాదంబు లభించు. తద్దర్శన ధారణజపంబుల శతకోటిగుణితం బగు పుణ్యం బగు మఱియును. ౫౭

సీ॥ రుద్రాక్షము ధరింప రుద్రుఁడై చరియించు, భూతకోటికి వంద్యుఁడాతఁడరయ
దేవాసురులకును భావింపఁదగు వాఁడు, వందనీయుఁడు నరవ్రాతములకు
నుచ్ఛిష్టవస్తువు లుపయోగపఱచియుఁ, బాపసంస్పర్శలఁ బడఁ డతండు
గళమున రుద్రాక్షకలుగు కుర్కురమైన, మృతి నొంది చెడని సద్గతికి నరుగు

* టిప్పణి:- ఈ "కృష్ణ" పదమున్న భాగమునను మూలమున లేశమును గోచరించదు.

తే॥ మనుజునకుఁ జెప్పనేల? దన్మహిమ సర్వ, పాపనిర్ముక్త మది దాల్చు పామరుండు
నైనఁ గుల ముద్ధరించు మహదాజ్ఞ సుమ్ము, పార్వతీపుత్రి! నిగమసంపఠిత మిదియె.

మ॥ కులబంధంబులు పుత్రజీవములు పెక్కుల్ గల్గు ధాత్రీస్థలిన్
బహుపాశంబులు ద్రోయఁజాలవు సుమీ బ్రహ్మణ్య రుద్రాక్షముల్
వశునిన్ జేయును నన్ను వాని సరిగా వర్ణింప నెందేనియున్
వశమే? చెప్పఁగఁ దన్మహామహిమమున్ వాకువ్వ నా కానొకో.

సీ॥ పురుషులలోపలఁ బురుషోత్తముండను, గ్రహములలోన భాస్కరుఁడు నదుల
గంగయు మునులలోఁ గశ్యపబ్రహ్మయు, హయములలో దేవహయము సతుల
యందు గౌరియు నిర్జరాళుల నేనును, నెట్టుల గరిమచే నెసఁగుచుండు
నట్టుల రుద్రాక్ష మట్టివ్రతంబును, నట్టి స్తోత్రంబును నట్టిదాన

గీ॥ మెయ్యెడల లేదు సుమ్ము వేయేల యొక్క, యెడల శివభక్తునకు దానమిచ్చెనేని
యట్టి పుణ్యఫలంబు నాకైన నలవి, యగునె వర్ణింప నితరుల ననఁగ నేల. ౬౦

క॥ రుదురాక కంఠమందున, వదలక ధరియించు వాని వస్త్రాదుల స
మ్మద మొదవఁ జేయువానికి, మదవాప్తిప్రసంగు నాదు మన్నన గలుగున్. ౬౧

సీ॥ అవని నెవ్వని ఫాలమందు భస్మము లేదొ, గళమున రుద్రాక్షఘటన లేదొ
అతఁడు నన్ను భజింప నర్హుండు గాఁడు వాఁ, డగ్రజుండే శ్వపచాధముండు
మాంసంబు మెసవిన మద్యంబుఁ ద్రావిన, నంత్యకులాంగన నలమికొనినఁ
బాతకంబుల నెల్లఁ బాయును రుద్రాక్ష, శిరమున నున్న యన్నరున కెపుడు

గీ॥ సర్వయజ్ఞతపోదానశాస్త్ర నిగమ, పాఠములఁ గల్గు ఫలము లప్పాట నొందు
నేని రుద్రాక్ష ధరియింప నెసఁగు శతగు, ణంబుగా ఫల మిట సంశయంబు లేదు.

ఉ॥ వేదపురాణతీర్థపరివేదన లెంతయు సంగ్రహించినన్
గా దననేల? పుణ్యములు గల్గును నీ రుదురాక్షఁ దాల్ప సం
పాదితమైన పుణ్యమున భాగశతాంశముఁ బోల దెద్దియున్
వేదవిదగ్రవాదముల విశ్రుత మీపథ మద్రిజాత్మజా! ౬౩

ఆ॥ చరమకాలమునను జనులకు నొడల రు, ద్రాక్ష గలిగెనేని యతఁడు దివికి
నరిగి రుద్రసమత నలరారుఁ బునరుద్భ, వంబు లేదు క్షితితలంబునందు. ౬౪

ఆ॥ కరములందునైనఁ గంఠంబునందైన, నెచటనైన నొక్క యెడలఁ గలిగి
మరణ మొందెనేని మనుజుని రుద్రాక్ష, మభవుఁ జేర్చుఁ బిత్రుజనాళితోడ.

సీ॥ బ్రాహ్మణుండైనను ǂ బామరుండైనను, గుణవంతుఁడైన నిర్గుణుఁడునైన
శుద్ధి గల్గుచు నున్న ǂ శుద్ధి లేకున్నను, బరఁగ భక్ష్యాభక్ష్య ǂ భక్షి యైన
భస్మరుద్రాక్షముల్ ǂ భక్తిఁ దాల్చిన మర్త్యుఁ,డభవుండుకా కన్యుఁ ǂ డగునె? జగతి
శిరమునఁ దాల్చినఁ ǂ జెందు ఫలంబున, కన్నను ఫల మబ్బుఁ ǂ గర్ణములను

గీ॥ అంతకన్నను శతకోటి ǂ యయుత దాని,కన్న *మూర్ధంబునందున ǂ నధిక ఫలము
గలుగఁజేయును రుద్రాక్ష ǂ ఫలముఁ దెలుప,నలవియే వేదములకైన ǂ నాంబికేయ!

క॥ ఉపవీతంబునఁ దాల్చిన, నుపమాతీతమగు ఫలము ǂ నొసఁగున్ మణిబం
ధపుఁ దాల్పు చెప్పనేటికి, నపరిమితాద్వైతసిద్ధి ǂ యగును గుమారా! ౬౭

క॥ రుద్రాక్ష దాల్చి భువి నిర్ణిద్రిత వైదిక మొనర్ప ǂ నిఖిల మతనికిన్
భద్రము యమభటతతికి, న్విద్రావణ మట్టిఫలము ǂ వెలయునె యొంటన్. ౬౮

ఆ॥ తత్పరుండుగాక ǂ తాల్చెనేనియు రుద్ర,రాక పేరు బంధ ǂ రజ్జు వగును
శ్రద్ధగలిగి తాల్చు ǂ జనుఁడు పాశచ్ఛేది,మోద మందు శివుని ǂ ముక్తిసభను. ౬౯

క॥ రుద్రాక్ష లభింపక తన, మదిలో నభిలాష గల్గు ǂ నెవ్వని కేనిన్
విదితుఁడు మాహేశ్వరుఁ డని, పదపడి యాతండు లింగ ǂ భావితుఁడు సుమీ.

క॥ విద్వాంసుఁడైన నేమి య,విద్వాంసుండైన నేమి ǂ విధియుక్తముగా
సద్వాంఛఁ దాల్చెనేని శి,వాద్వైతిన్ జేయు శంకర ǂ రాక్షము వత్సా! ౭౧

ఆ॥ భస్మ నుదుట నోటఁ ǂ బంచాక్షరంబు రు,ద్రాక్ష మెడను హృదయ ǂ మందు ♦లింగ
మయుత యజ్ఞసూత్ర ǂ మాఁదల శిఖఁ గల్గు, నతఁడు విప్రలక్షణాన్వితుండు. ౭౨

— ♦ రుద్రాక్ష భారవహనంబున గర్దభంబు ముక్తినొందుట ♦ —

ఆ॥ మానవులకుఁ గలదు ǂ జ్ఞానంబు తెలిసి యి,ట్లగుట చెప్పనేల ǂ యాంబికేయ!
తొల్లి కీకటమున ǂ ధురము మోసిన గర్ద,భంబు ముక్తినొందెఁ ǂ బరఁగ వినమె.

వ॥ అని జగదీశ్వరుండు వచింపఁ గుమారుండు దేవా! గర్దభంబునకు రుద్రాక్ష భారం బెట్లు సంభవించెఁ దత్ప్రకారం బెఱింగింపు మనినఁ దొల్లి వింధ్యపర్వత ప్రాంతంబునఁ గీకటదేశంబున నొక్క పథికుండు గర్దభంబుపై రుద్రాక్ష భారంబు వైచి మార్గంబునఁ జనుతఱి నధికభారంబున నయ్యది నేలంబడి ప్రాణంబులు విడిచిన దానిం గరుణించి మదంతికం బొసంగితి; నయ్యది రుద్రాక్షముఖసంఖ్యాక యుగసహస్రంబులు శివలోకంబున నివసించె, నవిధ్యుక్తంబుగా నేని సుగుణం

*టిప్పణి:—మూర్ధమ్మునందు – ఈ పద్యమునందే "శిరమున" అని యున్నది. శిరోమూర్ధశబ్దములు పర్యాయములైనను మూలగ్రంథమున నట్లు వాడుటచే గ్రంథకర్త తన అనువాదమునందుఁ గూడ గ్రహించె నని యెఱుఁగునది. యత్కించిదర్థభేదము కల్పించి సమన్వయించుకొనవలయును.

♦ఈ ఘట్టములో లింగధారణము మూలములో లేకున్నను కవి (ఆరాధ్యుఁడగుటచే) చేర్చెనని తెల్పెడి.

బులు ఫలించుచుండు, విధ్యుక్తంబులు ఫలదంబు లగుట వింతయే! ఇట్టి రహస్యంబులు శిష్యులకుం దెల్పవలయు, నభక్తులకును మూర్ఖులకుం దెలియఁదగనివి. అభక్తుండేనియు భక్తుండేనియు నీచుండేనియు నీచతరతుండేనియు రుద్రాక్షధారి పాతకవిముక్తుండు. తత్సదృశపుణ్యంబు కాలత్రయంబునను లేదు. తద్ధారణంబు మహావ్రతంబు. సహస్రంబు ధరించిన దేవవంద్యుండగు, లభింపని యెడల బాహుశిఖాకరకంఠమస్తకంబులనైనను లభించునంతలో ధరించెనేని తమంబు భానుని సోఁకనియట్లు పాతకంబు లతని నంటవు. జపంబుల రుద్రాక్షం బుత్తమంబు; రుద్రాక్షహీనుని జన్మంబు నిరర్థకంబు. అట్లయగుఁ ద్రిపుండ్రరహితుని జన్మంబును; స్నానకాలంబున శిరంబున రుద్రాక్షంబు గల్గిన నయ్యది గంగాస్నానఫలదంబగు. ఏకపంచైకాదశచతుర్దశముఖంబులగు రుద్రాక్షంబులు శంకరోన్ముఖంబులై యీశ్వరు నిత్యసన్నిహితుం జేయు. ఇది రుద్రాక్షమహిమం బని శంభుండు గుహునకుం దెల్పుటవలన జగత్ప్రసిద్ధం బయ్యెనని మఱియును. 23

సీ॥ రుద్రాక్షదర్శనారూఢపుణ్యంబునకన్నఁ, గోటి గుణంబు గల్గు సోఁక
దత్కోటిగుణితంబు ధారణంబున నంత, కన్నను జపమునఁ గల్గు హెచ్చు
రుద్రాక్షసదృశంబు *భద్రాక్షమును దానిఁ, దాల్చుటచే మహత్తరము ఫలము
తాల్ప నుత్తమమగు ధాత్రీఫలాభంబు, మధ్యమంబగు రేఁగుమాత్రపుపండు

గీ॥ పాటిమైనది యంతకు స్వల్పమధమ, మిట్లు దెల్పును వేదంబు లిందులోనఁ
గలుగునాలుగు వర్ణంబులలఘుఫలము, లొనఁగునాలుగు నుర్వి నసమానమహిమ.

సీ॥ ధవళవర్ణంబులు ధరణీసురాన్వయుల్, రక్తవర్ణంబులు రాజకులులు
పచ్చనికాంతివి వైశ్యకులంబులు, హరినీలరుచులు శూద్రాన్వయాయు
లెఱిఁగి వర్ణములవా రెల్లరు తత్తత్కు, లంపు రుద్రాక్షల న్లాసింపవలయు
సమములుస్నిగ్ధముల్ విమలముల్ దృఢములు, దాల్పంగవలయు రుద్రాక్షములను

గీ॥ వర్తులంబులుగానివి వలదు రంధ్రములు చెడినవేని క్రిములచేఁ దొలువఁబడిన
యట్టివానిఁ బరీక్షించియవలఁ దోచి, యెఱిఁగి రుద్రాక్షములు సంగ్రహింపవలయు.

గీ॥ తనకుఁ దానయి తొలుత రంధ్రంబుగలుగ, నుత్తమము పౌరుషోద్యుక్తి నొనరుసుషిర
వంతములు మధ్యమంబులు వానిఁ క్షౌమ, వసురజతసూత్రములఁ దాల్పవలయుశుద్ధి.

ఆ॥ హేమరేఖ మొదట నెసఁగెనేనియు శాణ, ఘర్షణమున నట్లు గలిగెనేని
నదియు నుత్తమంబు వదలక తాల్పంగ, వలయుఁ జుమ్మ వేదవాదులకును.

క॥ అష్టోత్తరశతముల నుత్కృష్టంబుగ సరులుగూర్చి కేవలనియమా
విష్టుఁ డయి తాల్చునరుఁడు మ, దిష్టుం డతఁడే నటంచు నీశ్వరుఁ డనియెన్.

టిప్పణి॥ భద్రాక్ష ధారణము రుద్రాక్షాభావమం దని వ్యాఖ్యాత లిఖించెను.

క॥ హారంబులఁ గుండలకే,యూరంబుల మకుటముల ననూనత నియతా
హారుఁ డయి తాల్చు నతనికి, గౌరీపతి లోకసిద్ధి ◆ గలుగు నియతమై. ౭౯

క॥ నిదురించిన మేల్కొనినను, వదలక రుద్రాక్షఁ దాల్చువాఁ డీశుండౌ
నిది వేదవిహితధర్మము, త్రిదశతపస్వీ! యెఱుఁగు మిదే మతుత్కీర్తిన్. ౮౦

గీ॥ తనువునందు సహస్రంబుఁ ◆ దాల్ప నుత్తమంబు పంచశతము మధ్యమంబు త్రిశత
మధమ మదిగాన నెఱిఁగి రుద్రాక్షతతులు,సంగ్రహించి ధరించుట ◆ సాధుమతము.

గీ॥ మస్తకంబున "నీశాన" ◆ మంత్ర మెఱుత
నగు "నఘోరంబు" "తత్పురుషాఖ్య" చెవుల
"వామదేవంబు"నను నెద ◆ వరునఁ దాల్చి
"సద్యము"న నన్నిటను దాల్చు ◆ సాధుమతము. ౮౨

వ॥ మఱియు నేకవక్త్రంబు పరతత్త్వప్రకాశకంబు, ద్విముఖధారణంబున నర్ధనారీశ్వ
రుండగు. త్రివక్త్రంబున ననలుండును జతుర్ముఖంబునఁ బ్రజాపతియుఁ, బంచముఖం
బున మహేశ్వరుండును, షడ్వక్త్రంబునఁ గార్తికేయుండును బ్రసన్నులగుదురు;
సప్తవక్త్రంబున మహారోగ్యంబును, నష్టవక్త్రంబున నష్టశక్తివశీకరణంబును, నవ
ముఖంబున నవశక్తి వశీకరణంబును దశవక్త్రంబున దశదిగ్వశీకరణంబును నేకాదశ
వక్త్రంబున సౌభాగ్యవర్ధనంబును ద్వాదశముఖంబున ద్వాదశాదిత్య వశీకరణంబును
త్రయోదశముఖంబునఁ గామసిద్ధియుఁ జతుర్దశముఖంబున సర్వవ్యాధిహరణంబును
మద్యమాంసలశునపలాండుశ్లేష్మాతక విడ్వరాహభక్షణదోషవారణంబును నల
వడు, గ్రహణంబుల మఖంబుల సంక్రమణంబులఁ బౌర్ణమ్యమావాస్యల మఱియుం
బుణ్యతిథుల రుద్రాక్షధారణంబు పాపవిమోచనం బగుట నావశ్యకంబని తెల్పి
భూతశుద్ధిప్రకారంబు వివరించెద వినుమని యిట్లనియె. ౮౩

— • భూతశుద్ధి ప్రకారము • —

సీ॥ మొదల మూలాధారమునను మేల్కొలిపి కుండలిని సుషుమ్నసంగడగొని బ్రహ్మ
రంధ్రస్థఁగాఁగ నారాధించి స్మరియించి, హంసమంత్రమున బ్రహ్మమున నీఁవు
యోజించి సాధకుండొనరఁ బాదాదిగ, జాన్వంతముగ సహస్రకము స్వర్ణ
వర్ణంబులన బీజవాసంబు స్వస్తికా, కృతి భూమి యని నిశ్చయింపవలయు.

గీ॥ జానునాభులు గలయంగఁ ◆ జంద్రఖండ,సదృశ మంబుజచిహ్నంబుస్ఫటికకాంతి
యగుచు 'వం'బీజయుక్తమైనయంబుమండ,లంబని యెఱుంగవలయు సత్యమ్ముసుమ్మి.

మ॥ అవల న్నాభిమొదల్ హృదంతముగ రక్తాభంబు "రం"బీజసం
భవమున్ స్వస్తికమున్ ద్రికోణమునునై ◆ భాసిల్ల నాద్యంతమున్
బవనా ప్తంబగు మండలం బనుచు సంభావించి తజ్జాపకుం
డవనిం బూర్ణసమాధినిష్ఠుఁడయి చేయంబోలు నీ నిష్ఠితిన్. ౮౫

సీ॥ హృదయంబు మొదలుగా ◊ నెనసి భ్రూమధ్యప,ర్యంతంబు ధూమ్రాభమై తనర్చి
షడ్బిందులాంఛనస్థానమై ''యం''బీజ, కలితమై వాయుమండలము చెలఁగు
నదిసంస్మరించి భ్రూయమళంబు మొదలుగ, బ్రహ్మరంధ్రాంతంబు ◊ వర్తులంబు
'హం'బీజయుక్తంబు ◊ నభ్రమండలమని, స్మరియించి భూతపంచకమునిటుల

గీ॥ ధరణి జలముల జలములఁ దహనునందు,దహనుఁబవనునియందు గంధవహు మింట
మిన్న హంకృతి నహము నమేయమగుమ, హత్తునందునుగలిపి సద్వ్రతుఁడగుచు.

—• పా ప పు రు ష వ ర్ణ న ము •—

గీ॥ మాయలోన మహత్తును మాటుపఱిచి,మాయ నాత్మను యోజించి ◊ మాఱులేక
సచ్చిదానందమయుఁ డౌచు ◊ జఠరమునను,బాపపురుషునిఁ జింతించి ◊ పట్టవలయు.

వ॥ అతండు వామకుక్షిగతుండును కృష్ణవర్ణుండును నంగుష్ఠపరిమాణుండును బ్రహ్మహత్యాశిరస్కుండును గనకస్తేయబాహుండును మదిరాపానహృదయుండును గురుతల్పగమనకటియుతుండును దత్సంసర్గపదద్వంద్వుండును నంగప్రత్యంగ పాతకుండును నుపపాతకరోముండును రక్తశ్మశ్రువిలోచనుండును నచేతనుండును నధోవక్త్రుండును దగ్ధతరుసదృశుండును ఖడ్గచర్మధరుండును నగుట వాని వాయు బీజంబు స్మరియించి పూరించి శోషింపఁజేసి వహ్నిబీజస్మరణంబున దహించి సుధాబీజస్మరణంబున నండసదృశంబుగఁ బిండం బొనర్చి విశుద్ధముకురాకారం బుగ బ్రహ్మరంధ్రమ్మున నిల్పి భూతపంచకంబు పునరుత్పాదితం బొనర్చి బ్రహ్మ రూపంబు ధ్యానించి పిదపఁ బ్రకృతిమహదహంకారంబులు స్మరియించి కుండలీ బీజం బవలంబించి సుధాయోగమ్మున హృదయంబుననిల్పి ప్రాణశక్తిని ధ్యానింప వలయు, నా ప్రకారం బెట్టిదనిన. ౮౮

—• శి రో వ్ర త ని ర్ణ య ము •—

సీ॥ రక్తాంబురాశిలో ◊ రంజిల్లు నుడుపంబు, కైవడిఁ దనరు శోకనదమునను
నధివసింపఁ గరాళియందుఁ బాశంబును, నిక్షుచాపము హాలం ◊ బిషుచయమును
నంకుశంబును శోణితాపూర్ణమగు కపా,లంబును గలిగి పీనంబులైన
వక్షోజములు పావకాక్షులు గల్గి బా,లార్కవర్ణయునైన ◊ ప్రాణశక్తి

గీ॥ మాకు సుఖకరి యగుఁగాక మదిని నిల్చి
యనుచు ధ్యానించుచును బరమాత్మరూపఁ
బదిఁబది విభూతి ధరియింప ◊ బ్రాహ్మణులకు
వేదవిహితంబు దీనిచే ◊ వెలయు శుచియు. ౮౯

గీ॥ తత్ప్రకారంబు వివరింతుధరణిసురుల, కిది శిరోవ్రత మామ్నాయవిదిత మిందు
విధివదారాధ్యుఁ డగువాని ◊ విమలవృత్తి, జ్ఞానసంపత్ప్రదంబు నజ్ఞానహరము.

ఉ॥ ఇట్టి శిరోవ్రతంబున రమేశశశీశముఖామరేంద్రులే
పట్టున నొచ్చెము ల్గొనక భవ్యతరంబగు బ్రహ్మబోధ చే
పట్టి నిరంతరానుభవభావ్యత విశ్వమయానుభావులై
నెట్టన నిల్చియుండుదురు నిర్గుణసత్త పొసంగునంతకున్. ౯౦

క॥ ఇవ్వసుమతిలోపల జనుఁ, డెవ్వండేనియు శిరోవ్రతేచ్ఛాపరుఁడై
నివ్వటిలు వాని చరితము, చివ్వలయోగిరపుఁదపసి! చెప్పఁగఁదరమే. ౯౧

ఆ॥ తపసులకును మూలసాధనము తపంబుల, కాదితపము వ్రతములందు ముఖ్య
మటులఁ దెల్పుచుండు నాథర్వణశ్రుతి, బ్రాహ్మణత్వవిధికిఁ బట్టుఁగొమ్మ,

క॥ బహుశాఖ మగుట వేదము, బహునామక మగుచు భస్మ పరఁగున్ శ్రుతులం
దిహపరసౌఖ్యప్రద మన్వహము శివాఖ్యవ్రతంబు నగు నిది తెలియన్. ౯౪

ఆ॥ ఈ శిరోవ్రతంబు నెనయనిహీనుండు, ధర్మవర్జితుండు ధరణి నతఁడు
నఖిలకర్మలకును నధికారి గాఁడని, తెలియవలయు శైవదేశికులకు. ౯౫

క॥ ఆథర్వణవేదంబున, బోధితము శిరోవ్రతంబు బోధకవిద్యా
సాధకము పాపసంచయశోధక మీసాటి చెప్పఁజూపఁగఁగలదే. ౯౬

సీ॥ అగ్నిరిత్యాది మంత్రావళి నంగావకుంఠనం బొనరించికొని త్రిపుండ్ర
ధారణం బొనరింపఁదగు శిరోవ్రత మిది, సంజల ముఖ్యంబు నంతరింప
నిది యొనర్చెడువాని యెల్లవిద్యలు బ్రహ్మవిద్య లతండ పో! వేదవేత్త
ద్వాదశాబ్దంబైన ద్వాదశాహంబైన, రూఢిగా సల్ప శిరోవ్రతంబు
గీ॥ స్నానదానాదిసత్కర్మసమితి కెల్ల, ఫలదమై యొప్పు నిదిలేని పామరాళి
చదువులెల్లను జిలుకలచదువులట్లు, జగతిఁ బూర్వోత్తరాలంబసరణి గనునె!

సీ॥ గురుజనంబులలోన గురుఁడు కారుణికుండు, బ్రహ్మవిద్య యొసంగు పండితుండు
దేవాళిలోపల దేవదేవుఁడు ముక్తి, నొసఁగువాఁ డత్యుత్తమోత్తముండు
వ్రతములలో శిరోవ్రతము జన్మాంతర,దురితాపహం బెఱుంగ రిది యొరులు
పూర్వజన్మంబునఁ బుణ్యాత్ములకె కాక, శ్రద్ధపొసంగ దీవ్రతమునందు
గీ॥ చాలఁ జదివితి మంచు దుస్తరతమంబు,గొలఁది సద్ధర్మములయెడఁ గుటిలమతులు
ద్వేషమొనరించుచుందు రెత్తెఱఁగు జన్మ, జన్మముల లేదు వారికి సత్పథంబు.

### భస్మమాహాత్మ్యము

ఆ॥ భస్మనిష్ఠ గలుగు పండితుల్ బ్రహ్మోప, దేశమునకుఁ దగిన తెఱఁగువారు
రూఢనిష్ఠ నీశిరోవ్రతంబున మది, లేనివారు గతులు లేనివారు. ౯౯

తే॥ భస్మమం దభిలాష యెవ్వనికిఁ గలదు, వాని కుపదేశ మొనరింపవలయు లేని
వాని కుపదేశ మొనరింపవలదు వలదు,వలదటంచును నిగమముల్ పలుకుఁగాదె!

ఆ॥ పశువు పశువుగాదు ✽ భస్మంబుపై నిష్ఠ, లేనివాఁడు పశువు ✽ వాని పశుత
యీశిరోవ్రతంబు ✽ నెనసినఁ బెడఁబాయు, ననుచు వేదవాదు ✽ లాడుకొనిరి.

వ॥ మఱియు భస్మోద్ధూళనత్రిపుండ్రంబులు మాయానివర్తకంబు లని యాథర్వ ణంబు వచించు వర్ణాశ్రమంబుల వారికి సమంత్రకంబైనను నమంత్రకంబైనను, త్రిపుండ్రధారణం బావశ్యకం బని జాబాలంబు నుడువు. "త్ర్యంబక" మంత్రంబు నను నతారంబగు శివమంత్రంబునను ద్రిపుండ్రధారణం బొనర్చుట గృహస్థ ధర్మంబు, యతులకుఁ బ్రణవత్రయోచ్చారణంబున ధారణం బుత్తమం బని జాబాలంబు పల్కు. "త్ర్యంబక" మంత్రంబునఁ బ్రణవశివంబులు మేళవించి వానప్రస్థుండు ధరియింపవలయు, "మేధా" వీతి మంత్రంబున సజలభస్మంబులు బ్రహ్మచారి ధరింపవలయును; నంగంబున నవకుంఠంబును లలాటమ్మునఁ ద్రిపుం డ్రంబును మహాదేవసంబంధం బొనఁగూర్చు; నిది బ్రాహ్మణులకు నిత్యకర్మంబు; భస్మావకుంఠనత్రిపుండ్రధారణలింగార్చనంబులు ద్విజునకు నిత్యకృత్యంబులు, మోహంబున నైనను బరిత్యజింపఁ దగదని నిశ్చయింపుము. ౧౦౨

గీ॥ తారమున నైనఁ 'దర్యంబ'కోక్తమున నైన, నటులఁ బంచాక్షరంబున ✽ నైన గౌణ
భస్మమునఁ దాల్పవలయును ✽ ఫాలమునను, దత్త్రిపుండ్రంబు విధిచోది ✽ తంబుగాన.

క॥ శూద్రుండు భక్తిచే ని,ర్నిద్రత నిర్మంత్రముగ న ✽ నిందితమగుచున్
రుద్రాక్షలు భస్మంబును, భద్రంబుగఁ దాల్పవలయుఁ ✽ బటుభక్తి మెయిన్.

క॥ ఉద్ధూళనత్రిపుండ్రము, లిద్ధర ధర్మోత్తరంబు ✽ లెఱిఁగి ద్విజాళుల్
శుద్ధమతిఁ దాల్చుటయె *వేదోక్తంబగు విధియటంచు ✽ నూహింపఁ దగున్. ౧౦౩

సీ॥ పాణిపాదంబులు ✽ ప్రక్షాళన మొనర్చి, యతిశుద్ధజలముల ✽ నాచమించి
అగ్నిహోత్రజమైన ✽ యట్టి భస్మము పాత్ర,మున నుంచి తన్మంత్ర ✽ మున స్పృశించి
తొలుతఁ బ్రాణాయామ ✽ ధూర్వహుండయి 'అగ్ని', పదమాదిఁ గలమంత్ర ✽ వరము పేర్మి
వచియించి యబ్భూతి ✽ యాపాదమస్తంబు, నవకుంఠన మొనర్చి ✽ యవలనుదుట

గీ॥ హృదయభుజముఖ్యములను ధ ✽ రింపవలయు, స్వాశ్రమోచితమంత్రము ✽ ల్పదివికొనుచు
మధ్యమానామికానులో ✽ మమువిలోమ,ముగఁ ద్రిపుండ్రంబు దాల్చుట ✽ ముఖ్యమనఘ!

ఆ॥ అగ్నిహోత్రజాత ✽ మజ్ఞానవిధ్వంస, మదియు గౌణ మవని ✽ నరయ బహువి
ధంబులగుచునుండు ✽ ధర్మజ్ఞులకు దాని, తెఱఁగెఱుంగవలయుఁ ✽ దేటపడఁగ. ౧౦౪

వ॥ తత్ప్రకారంబు వినుము అగ్నిహోత్రజంబును నౌపాసనజంబును సమిద్ధోమజంబును బచనాగ్నిజంబును దావానలజంబును నను భేదంబుల భస్మంబు పెక్కు తెఱంగు

టిప్పణి: — వేదోక్తంబు. ఈరీతిప్రాసములు భారతేతరమహాకవులు వాడిరని యెఱుఁగఁదగు.

లగు; నందుఁ ద్వైవర్ణికులకు నగ్నిహోత్రజంబును, గృహస్థుల కౌపాసనజంబును బ్రహ్మచారులకు సమిద్ధోమజంబును శూద్రులకు శ్రోత్రియాగారపచనాగ్నిజంబును దదన్యులకు దావానలజంబు నని తెలియవలయు. ౧౧౮

సీ॥ పర్వకాలములందు ◊ భక్తి లింగార్చన, కారంభ మొనరింపఁదగును దీర్థ
తీరంబు నాశ్రమ ◊ మారామ శంకర,క్షేత్రంబులను విమర్శించి యచటఁ
దొలుత నాఁగఁ దోఁగి ◊ వలయు నాహ్నిక మెల్లఁ, దీర్చి యాచార్యు నిర్దేశమునను
దత్పూజ యొనరించి ◊ తా నలంకృతుఁడౌచు, గురుశాసనంబునఁ ◊ గుశలు ముష్టి

గీ॥ నునిచి సంకల్ప మొనరించి ◊ యుత్తరముగ, నాసనంబున నిల్చి ప్రాణాదిపవన
సన్నిరోధంబుఁ జేసి యాకాశయమునందు, శాంకరీశాంకరుల నోలి ◊ సంస్మరించి.

ఆ॥ ఆశరీరపాత ◊ మాద్వాదశాబ్దంబ, యేని వ్రతము సేయ ◊ నిచ్చగించి
యున్న వాఁడ సిద్ధి ◊ యొసఁగఁగా వలయు నం,చాదిదంపతులకు ◊ నాత్మ మ్రొక్కి.

చ॥ అనయము నగ్ని నాజ్యసమిధాదులు వేల్చి షడక్షరోక్తిచే
ననువుగఁ దత్త్వము ల్తనదుదేహంగమునందు వసించుఁగాత మం
చని సకలేంద్రియంబులును ◊ నాంతరవర్గముఁ బ్రాణధాతువు
ల్మనమును బుద్ధ్యహంకృతులు ◊ మట్టున నిల్వఁగ సంస్మరింపుచున్.

ఆ॥ ప్రకృతిపూరుషులను ◊ రాగవిద్యాకళా, నియతి మాయలను నదనింది తాత్మ
విద్య నీశు శివుని ◊ విశ్వజనిత్రినిఁ, బరులఁ దలఁచి విరజభావ మొంది.

సీ॥ అనలంబు రక్షించుకొనుచు హవిష్యాశి, యై త్రయోదశి దినములు జరిపి
అవలఁ జతుర్దశియందు నట్టుల నిరా,హారుఁడై హోమాంతమాచరించి
ఉక్తప్రకారంబునుజ్జగింపక త్రిపుం,డ్రాంకితుండై త్రిసంధ్యంబు నిటుల
నియతవ్రతస్థుఁడై ◊ నిష్ఠచే శివభావ, మొంది జటాలుఁడై ◊ యున్న నతని

గీ॥ నంటు నే పశుభావంబు ◊ లతఁడ ధరణిఁ, బాశుపతదీక్షితుండు నిష్పాపుఁ డాత్మ
వేది యధ్వరశతకర్త వేద వేత్త, యతనికి సమానుఁ డెవ్వఁ డీ ◊ యవనిలోన.

వ॥ మఱియుం బూర్వోక్తప్రకారంబున భస్మసంగ్రహణం బొనర్చి ముండిగా లేక జటిగా నొండె నుండి లజ్జవలనిసంకోచంబు లేనిచో దిగంబరుండై సంకోచంబు కలవాఁడేని కాషాయచర్మవల్కలచీనాంబరంబులం దేదేని యథాలాభంబుగ ధరించి భస్మంబు జలంబున మెదిపి ధరియించు మహాత్ముఁడు సాక్షాత్సదాశివుఁడని యెఱుంగవలయు; నిట్టి శిరోవ్రతకరణంబు భస్మంబు శాంతికంబును బౌష్టికంబును గామదంబును నని మూఁడు తెఱంగు లయ్యె; గోమయంబు సంగృహీతం బొనర్చి పంచబ్రహ్మమంత్రంబుల దహించి భస్మం బొనర్చినది శాంతికంబు;గోమయంబు పుడమిం బడనీక

పట్టి షడంగంబుల దహించినఁ బౌష్టికంబగు; నల్ల గోమయంబు *ప్రాసాదమంత్రం
బున దహించినఁ గామదంబగు. భస్మనిష్ఠుం డగు వాఁడు గోష్ఠంబుల వసించి గోకులం
బులఁ బూజించి నమస్కరింపవలయు. విప్రునకు శ్వేతగోవును రాజన్యునకు రక్త
గోవును వైశ్యునకుఁ బీతవర్ణంబును శూద్రునకుఁ గృష్ణవర్ణంబును ముఖ్యంబులు;
గాన నష్టమ్యమావాస్యలఁ బ్రాసాదమంత్రంబున గోమయంబు సంగ్రహించి
''హృదయ''మంత్రంబునఁ బిండంబు లొనర్చి రవికిరణంబుల శోషింపఁజేసి యరణ్యో
ద్భవంబున నైనను శివాగ్నినైనను దహించి మొదల నంబుస్నానం బొనర్చి పిదప
భస్మస్నానంబుచేసియాచమించి''ఈశాన''మంత్రంబున శిరంబును,దత్పురుషంబున
మొగంబును, ''అఘోర'' మంత్రంబున హృదయంబును, ''వామ'' మంత్రంబున
నాభియు, ''సద్యో''మంత్రంబున సర్వాంగంబు నుద్ధూళనం బొనర్చి త్రిపుండ్ర
ధారియై మూర్ధ లలాట కర్ణ కంఠ హృదయ బాహుల ధరియించి, మూర్ధంబునఁ
బంచాంగుళంబులఁ ''ప్రాసాద''మంత్రంబున ధరియింపవలయు; ఫాలంబున నంగుళ
త్రయంబున ''శిరోమంత్రంబు''న ధరియింపవలయు,దక్షిణకర్ణంబున ''సద్యో''
మంత్రంబున, వామకర్ణంబున ''వామదేవ్యం''బునఁ;గంఠంబున ''నఘోరం''బున
మధ్యమాంగుళమున ధరియించి; హృదయంబున దక్షిణభుజంబున శిఖామంత్రం
బున వామభుజంబునఁ గవచమంత్రంబున నంగుళత్రయమ్మున ధారణం బొనర్చి,
నాభి ''నీశాన''మంత్రంబున మధ్యాంగుళివిరహితంబుగా ధరించి, రేఖాత్రయం
బున మూర్తిత్రయంబును నేకాంగుళధారణంబుల నీశ్వరుండును శిరోమధ్యంబున
బ్రహ్మయు లలాటంబున నీశానుండును గర్ణంబుల నశ్వినులు గళంబున గణాధి
పతియు నధిపతులని యెఱింగి, ధరింపవలయు; ధరించునెడలఁ ద్రైవర్ణికులు సమంత్ర
కంబును, శూద్రులును నదీక్షితులును నమంత్రకంబుగను ధరియింపవలయు;
క్షత్రియ వైశ్య శూద్రులకు నుద్ధూళనంబు వలవదు; పుండ్రధారణమువఱకే
వారల కధికారంబని యెండియు. ౧౧౮

సీ॥ కపిల వేయుచునున్న ॥ కడి క్రిందఁబడకుండ, బట్టి దుర్గంధంబు ॥ పరుషమైనఁ
గానక స్వచ్ఛంబైనఁ ॥ గాని పిండము లొనర్చి, పంచాక్షరంబుచేఁ ॥ బరమశైవ
విధి శైవవహ్నిలో ॥ వేసి దహించి పాత్రంబున భస్మంబు ॥ దాఁచిపుచ్చి
శుచియాచుఁ దాఁగాని ॥ శ్రుత్యుక్తముగ నుక్త, విధి ధరించిన వానిఁ॥వినుతి సేయ

గీ॥ నలవియే? వానికిఁ గృతంబయ్యకృతమెల్ల, వేదములు దేవత లనంగ॥వెఱపుగలదె
వానికి వ్రతోపవాసాది॥వర్తనములు, సిద్ధికరములె సర్వసం॥సిద్ధుఁ డతఁడు.

టిప్పణి:- * ప్రాసాదమంత్రము=హౌమ్ అనుమంత్రమని వ్యాఖ్య; మఱియు నీభస్మోద్ధూళన
ప్రకారంబు సవిమర్శంబుగ నెఱుంగఁ దలఁచినవారు సంస్కృత గ్రంథము సవ్యాఖ్యానము చూచుట
శ్రేయము. అనువాదములలో నివి గుఱికి భారెఁ డెచ్యుతగుగ నుండును.

ఆ॥ భస్మధారణంబు పరిహృతం బొనరించి, ముక్తిఁ గోరునట్టి మూర్ఖతముఁడు
గరళ మాని బ్రదుకు గాంక్షించువాఁడెపో?, వేఱ చెప్ప నేల విబుధమాని!

గీ॥ పరికరాదుల సర్వసంభరితమైన, యింట జ్వాలనంబు లేకున్న నెవ్విధంబొ
యటుల నన్నియుఁ గల్గియు భవుపూజ, భస్మరహితంబునైన నిష్ఫలమునుమ్ము.

గీ॥ భూతి నుద్ధూళనంబు త్రిపుండ్రమాత్ర, శ్రద్ధధానతఁ జేయఁగఁ జను నరునకు
నది యెఱుంగక చేసిన నాఫలంబు, వినిమయంబుగ నైష్ఫల్యవిధి యొనర్చు.

గీ॥ ద్విజులు మంత్రోక్తముగ భూతి దేహమునను, బూనవలయును మంత్రవిహీనకర్మ
నలుపువారికి సంసారజలధితరణ, మబ్బునే! యజ్ఞజమునకు నట్లు గాక.

ఆ॥ బూదిగట్టులందుఁ బొరలెడు సూకరం, బట్లు గాదె బ్రాహ్మణాన్వయుండు
మంత్రరహితభస్మ మయిః దాల్చుకొనుటెల్ల, మంత్రవిధి ధరింప మఱచువాని?

సీ॥ భస్మత్రిపుండ్రాంకభరితంబుగాని దే,హంబు గాదది శ్మశానంబుగాని
భస్మావమానోక్తిఁబలుకుచుండెడి శాస,నంబు గా దది యాసనంబుగాని
భస్మబోధకశాస్త్రపఠనంబు లేని యా,ననముగా దది యె కాననముగాని
భస్మదర్శనమోదభరితంబుగాని డెం,దంబుగా దది బుద్బుదంబుగాని

గీ॥ బూదితో నెద్దియైనను బోల్చువాని, మతియుఁగా దది ఘోరదుర్గతియ కాని
భసిత మననౌనె? యది జగద్భర్తయైన, శంభుమూర్తి వరప్రకాశంబ కాదె?

ఆ॥ బూది లేని నొసలు పురభేది గుడిలేని, యూరు నీశుఁ బూన్పకుండు జన్మ
మభవు నాశ్రయింపనట్టి విద్యయుఁ బట్టి, కారుచిచ్చులోనఁ గలుపవలదె.

గీ॥ ఎవ్వఁడేని త్రిపుండ్రంబు నీసడించు, నతఁడు శివనింద చేసినయట్టివాఁడు
ఎప్పుడు విభూతి ధరియించునెల్లయెడల, నతఁడె శివలింగమును దాల్చునట్టివాఁడు.

గీ॥ ధర్మములకెల్ల నుత్తమధర్మ మగుట, ధరణిసురులకు శివలింగధారణంబు
ముఖ్యధర్మంబు తత్సమంబుగ విభూతి, దాల్చుట ద్విజాతికెల్లను ధర్మ మరయ.

ఉ॥ పంకజసంభవుండు నరుఫాలము నడ్డముగా సృజించె నూ
ర్ధ్వాంకము వర్తులాంకమును నౌనటు లేటికిఁ జేయఁడయ్యె న
ప్పాంకము గాఁగ రేఖలును బుట్టఁగఁజేసెను నల్వ యచ్చటన్
గొంకక యూర్ధ్వవర్తులతఁ గూర్తురు బొట్టులు మర్త్యు లేమొకో.

సీ॥ తిర్యక్త్రిపుండ్రము లీర్చి భస్మంబున, సాలంకృతులుగాని చంద మెటులొ
తద్ధ్యానతద్జ్ఞాన తద్దానములఁ బోలు, తపము లింకేటివో ధరణిలోన

బూదిఁ బూయని యట్టి ✽ భూమీసురున కధికార మెద్ది కులోక్త ✽ కర్మములకు
అభసితద్విజుఁడు శైవ ✽ వార్చలఁ గొఱగాఁడు, వేదపాఠమునకు ✽ వృషలునటులఁ

గీ॥ గాన సంకల్పపూర్వక ✽ తాన్నధార, గాదు లొనరింపవలయు, బ్రహ్మాండపంచ
కములఁ బరిణవంబుచేనైనఁ ✽ గర్మసిద్ధిఁ, దనరు నభ్భూమిసురునకు ✽ దక్కఁగానఁగ

క॥ సత్యము శౌచముఁ దపమును, నిత్యము నైమిత్తికంబు ✽ నిగమాధ్యయనం
బిత్యాదికర్మలెల్ల న, సత్యము లగు భస్మరహిత ✽ జనులకు నెల్లన్.

ఆ॥ శ్రాద్ధయజ్ఞహోమ ✽ జపవైశ్వదేవసు, రార్చనంబు లెల్ల ✽ నవయవముల
భూతిఁ దాల్చిచేయఁ ✽ బూతంబు లగుచుఁ ద, త్కర్మ ఫలము లొసఁగుఁ ✽ గడమ లేదు.

వ॥ మఱియు మహాపాతకోపపాతకవిధ్వంసకంబగు భస్మంబు యతులకు జ్ఞానదంబును నై యుద్ధూళనత్రిపుండ్రంబుల భూతరక్షణం బొనర్చుచు నన్నియెడల శ్రుతి బోధితంబై రక్షతాపవిత్రతాకర్మసిద్ధిశివపూజావిజ్ఞానంబులకై సర్వభూతవశ్యకరం బని వైదికశ్రుతి పఠించుచుండు. మూర్తిత్రయంబును దదన్యులగు సురలు, దేవీత్రయంబును దదన్యలగు దేవతాకాంతలును జతుర్వర్ణంబులవారును నుద్ధూళనత్రిపుండ్రంబు లాచరింతురు. మునులు నట్లు వర్తింతురు. ఇత్తెఱంగెఱుంగుట శిష్టత్వంబని నిగమంబు వచించు. ఆ భస్మంబు శివాలంకారంబు, భవభేషజంబు, ముక్తివశ్యకరంబు. ఇటులఁ బంచాక్షరంబును నని యెఱుంగుము. మూర్ఖుండేనియు భస్మలేపంబు లేక భుజింపకుండిన నతనియింట హరుండు భిక్షుకుండై యుండు. భస్మచ్ఛన్నగాత్రుని బాతకంబులు స్పృశింపవెఱచు, భస్మదిగ్ధాంగు నుతించు, వానిం బాపంబులు పొరయవు. తద్ధారికిం గంబళం బేనియు నొసంగిన సర్వఫలభోక్త యగు. శిరంబునఁ ద్రిపుండ్రంబు గలిగిన నరుని గని కీకటులైనఁ దరింతురు. అతఁడు వసించు క్షేత్రం బవిముక్తంబు, దుశ్శీలుఁడైనఁ దద్ధారి యోగిపుంగవుండును బూజ్యపూజ్యుండును సర్వపాపనాశకుండును నగు; నతనిం బూజించుట దేవీసహితంబుగ మూర్తిత్రయంబు నర్చించుట, యజ్ఞదానతప స్తీర్థయాత్రాదానధర్మంబులు త్రిపుండ్రంబునందు షోడశాంశంబునకుఁ బోలంగలవే! రాజులు స్వముద్రాధారణంబుల జనుల నాత్మీయులుఁగాఁ జూచునట్లు శివుండు త్రిపుండ్రాంకుల నాత్మజులంగాఁ జూచు; ద్విజుండేనియు మ్లేచ్ఛుండేనియు సితభస్మంబున నలంకృతుండైన నతనికి రుద్రుండు వశ్యుండగు నని చెప్పి మఱియును.

౧౫

సీ॥ ఆశ్రమాచారంబు ✽ లపనయించినఁగాని, భస్మాంకితుఁడు సర్వ ✽ పావనుండు
భస్మావకుంఠనా ✽ భరణుఁడౌ నరునందుఁ, గులశీలశోధన ✽ ల్పూడ దెందు
భస్మత్రిపుండ్రాంక ✽ ఫాలుఁడౌ మానవుం, డగ్రిపూజలకెల్ల ✽ నాశ్రయంబు
భస్మావలీఢునిఁ ✽ బరితృప్తి సేయుట, సకలజగత్తృప్తి ✽ సల్పు టరయ

గీ॥ భస్మపంచాక్షరీమంత్రఽభవునకన్నఁ, దీర్థములు దైవములు వేఱఽ తెలుపఁగలవె ?
యదియ తీర్థంబు, నదియ మంత్రాధిరాజ, మదియ దైవంబ పల్కితిఽ హస్తమెత్తి.

సీ॥ అఖిలదుఃఖధ్వంసఽమని యాత్మఁ దెలివొంది, భస్మత్రిపుండ్రాంకఽపాలితుఁడగు
నంత్యజుండే కాని ఽ యధముఁడే కాని య,చ్చో వసియించు నీఽశుండు శివుఁడు
సర్వభూతములతో ఽ సర్వతీర్థములతో, నివసించియుండు సఽన్నిధి యొనర్చి
యిది శివతీర్థంబు ఽ విదితంబు వేదాళి, నిది దైవలిఖితంబు ఽ లెల్లఁ దుడిచి

గీ॥ ఫాలమున నిల్చి ప్రమథాధిఽపతికృపాక,టాక్షనిర్మజ్జన మొనర్చి ఽ యఖిలసిద్ధి
యొసఁగు భూతివిలేపంబుఽబసుమ మలఁదు, వారి కేఁ జేతుఁ బదివేలఽవందనములు.

సీ॥ భస్మభూషితునిఁ దృఽప్తునిఁ జేయువానికి, సకలపాపంబులు ఽ సంక్షయించు
శ్రుతులు పురాణముల్ ఽస్మృతులు భూతిమహత్త్వ, మెడలేక బోధించుఽనెల్ల యెడల
మూఁడు సంధ్యల భస్మఽమును దాల్చువానికి, శివలోకసంసిద్ధి ఽ చెంగుముల్లె
ఆపాదతలమస్తఽకాక్రాంతముగ యోగు, లబ్భూతిఁ బూయుదు ఽ రన్వహంబు

తే॥ సర్వగాత్రంబునను భస్మఽచర్చ సలుపు, వార లుద్ధారకులు పితృఽవర్గములకు
నంబుగాహంబునకు సహఽస్రాభిగుణిత, మై తనర్చు భూతిస్నానఽమనుట ధ్రువము.

గీ॥ సర్వతీర్థావగాహనఽసమితివలన, ఫలము లెవ్వి లభించు నాఽఫలములెల్ల
జగతి భస్మావకుంఠనఽచరితమునను, షోడశాంశంబు సరిగావు ఽ సురమునీంద్ర !

సీ॥ ఉర్వి మహాపాతఽకోపపాతకములు, భస్మశుద్ధుని మేను ఽ వాసిపోవుఁ
బావకజ్వాలలోఁ ఽ బడునింధనములట్లు, లంతకన్నను బరం ఽ బవని లేదు
అతిపవిత్రం బంచు ఽ నాదిశివోక్తంబు, నట్లయాచారంబు ఽ నలుపుచుండు
నట్టుల బ్రహ్మాదు ఽ లభవసేవార్థులై, యఖిలకర్మల భస్మ ఽ మలఁదుకొందు

ఆ॥ రట్లుగాన శివుని ఽ కాలయంబు విభూతి, తద్విలేపనం బుఽదారగరిమఁ
జేయువాఁడు రుద్రుఁఽడేయని శ్రుతులెల్లఁ, జాటిచెప్పుచుండు ఽ సభలలోన.

ఆ॥ భస్మధారిఁ గాంచి ఽ పరితుష్టు లగువారు, సురమునీంద్రసమితి ఽ స్తోత్రపూజ
లందుచుండు రతని ఽ కభివందన మొనర్చు, వాసవుండునైన ఽ వదల కెపుడు.

క॥ భక్షింపరానివైనను, భక్షించిన నవియు నెల్ల ఽ భస్మయుతునకున్
భక్ష్యములగు విశ్వ మతని, భక్ష్యము సకలంబునకును ఽ భక్షకుఁడుసుమీ.

ఆ॥ బ్రహ్మచారిమొదలు ఽ పరఁగ భస్మస్నాన, పాత్రు లగుదు రందుఁ ఽ బాపలేశ
మించుకైనఁ బొరయ ఽ దిల యతీంద్రులకును, విహితకర్మవేదఽవిధి గణింప.

క॥ గంగావగాహనాదులు, సాంగంబుగఁ జేయకున్న ✽ సతతము భస్మం
బంగమునఁ బూయఁ బాప్రకృత,భంగంబులు పొరయ వతనిఁ ✽ బార్థివముఖ్యా!

గీ॥ పాప్రకృతి గెలువఁదలఁచు✽పండితకోటికి, భస్మలేపమునకుఁ ✽ బాటియైన
వ్రతము లేదు భువన✽వారంబులోపల, లింగసదృశ మేది✽లేని యట్లు. ౧౩౯

వ॥ మఱియును రక్షార్థంబును మంగళార్థంబును బవిత్రార్థంబును గా నసురులవలన వెఱచు దేవికి దేవదేవుండు భస్మ మొసంగె; నిట్లు శివస్థానంబగు నాగ్నేయంబు భస్మమ్ము భవపాశమోచకంబు; రక్షఃపిశాచపూతనాబాలఘాతుకభంగదంబు అశీతివాతరోగంబులును సప్తపంచకశ్లేష్మరోగంబులును నగ్నిచోరనృపదుష్టగ్రహభయంబులును సింహావలోకనంబునఁ బరువులిడు గజంబులట్లు పరువిడు; శుద్ధాంతఃకరణులై భస్మత్రిపుండ్రంబులు ధరించుట బ్రహ్మభూయంబు నొందుట. శిరోలలాటభుజకంఠనాభివక్షస్థ్సలపార్శ్వధారణంబువలనఁ బరస్త్రీసమాలింగనజన్యంబగు పాపంబు సయితము నశించునని వెండియు, ౧౪౦

సీ॥ భస్మావగాహన✽ప్రౌఢుఁడౌ మనుజుండు, భస్మనిష్ఠుం డని ✽ పలుకు శ్రుతులు
భస్మత్రిపుండ్రాంక✽ఫాలుఁడైన నరుండు, భస్మనిష్ఠుం డని ✽ పలుకు స్మృతులు
భస్మపరిమార్జైక✽పరుఁడైన పురుషుండు, భస్మనిష్ఠుం డని ✽ పలుకు విధులు
భస్మసంపద్భోగ✽భరితుఁడౌ మర్త్యుండు, భస్మనిష్ఠుండని ✽ పలుకు కథలు

గీ॥ ప్రేతభూతపిశాచాది✽పీడలెల్ల, భస్మనిష్ఠునిఁ దిలకించి ✽ పరువులెత్తు
భాసనమున భసితంబును✽బాపభక్షణమున భస్మంబు సంపత్ప్రదము విభూతి.

క॥ రక్షోభూతగ్రహముఖ, రక్షణమున రక్ష యగుచు ✽ రంజిల్లు వ్రతా
ధ్యక్షమగు భూతి సకలం, బక్షయమగు దీనిఁ దాల్ప ✽ నమరమునీంద్రా. ౧౪౨

సీ॥ భూతిభూషితుఁ జూచి ✽ భూతంబులెల్లను, భయకంపముల నొందుఁ ✽ బ్రీతిభదక్ష
భస్మసంస్మరణంబు ✽ పాపప్రణోదనం, బభవుఁ దలంచిన ✽ యట్ల ధరణి
నన్యకార్యసహస్ర ✽ మాచరించుచు భస్మఁ, దోఁగిన దురితము✽ల్దూలిపోవు
వహ్ని సోఁకిన మాత్ర ✽ వనములట్ల విభూతి, సోఁకిన పాతక✽స్తోమ మడఁగు

గీ॥ శీఘ్రముగఁ బాతకంబులఁ ✽ జిదిమివైచు, మృత్యుకాలంబునందు న✽మేయగరిమ
బూదిఁ దలఁచినఁ గైలాస✽భువనమునను, నాత్మభవనంబు పోలిక ✽ నధివసించు.

సీ॥ ధర్మార్థ కాములై ✽ తనరువారల కెల్ల, ధర్మార్థదంబయి ✽ తనరు భూతి
కామమాత్మలయందుఁ ✽ గాంక్షించు వారికి, నిష్టార్థసంసిద్ధి ✽ నిచ్చు భూతి
మోక్షకామమున ము✽ముక్షులౌ వారికి, సిద్ధిమోక్షముఁ గటా✽క్షించు భూతి
నాల్గుసిద్ధులఁ గోరు ✽ నరులకు వర్గచ,తుష్టయం బొనఁగూర్పఁ ✽ దొడరు భూతి

గీ॥ దండధరకింకరులమీఁద ఽ దాడివెట్టు, నండఁజేరంగనీక యూర్ధ్వదండ వృత్తి
జరమకాలంబునను నెట్టి ఽ నరునకైన, ఖండపరశునిఁ జేర్చు నొక్కండు భూతి.

క॥ సలిలస్నానము నరులకు, మలనిర్మోచనము భస్మఽమహితస్నానం
బలఘు మనోమలహరమగుఁ, దలఁపఁ భస్మవ్రతంబు ఽ తర మొం డగునే.

మ॥ సలిలస్నానము లేకయున్నను మహాఽసంరంభియై నిత్యమున్
మలనిర్మోచన మానటుల్ మహితభస్మస్నానము న్సల్పినన్
ఫల మత్యర్థము బాహ్యమాంతరమునా ఽ పాపంబు పాయున్ మహా
ఫలముం జేయు శివాంఘ్రిసన్నిధికిఁ జేర్పం జాలు ముమ్మాటికిన్.

క॥ కృతములగు దురితములను న,కృతములుగాఁ జేయు ధర నఽకృతసుకృతములన్
గృతములుగాఁ జేయుచు; విధి, యుతమగు భస్మంబుసాటి ఽ యొండున్న దొకో?

ఆ॥ కోటితీర్థములను ఽ గ్రుంకిన భస్మావ, కుంఠనంబు సేసిఽకొనినవాని
ఫలములోన లేశఽఫలమైనఁ జెందదు, భస్మ పరములకును ఽ బరము సుమ్మి.

ఆ॥ భస్మమహిమ వేదఽపటలియే యెఱుఁగును, నట్లయెఱుఁగు నంతఽకాంతకుండు
తలఁప నొరుల కెట్లు ఽ దెలియు భూతిమహత్త్వ, మర్థసిద్ధులకు నిఽజాలయంబు.

సీ॥ అఖిలామరులలోన ఽ నంతకాంతకునట్లు, వ్రతములలో మహాఽవ్రతము భూతి
భూతి పూయక కర్మఽభోగ మార్జింపంగఁ, గోరినవాఁడె పో ఽ కుత్సితుండు
పావనంబులలోనఁ ఽ బావనంబగు భస్మ, మంగళంబుల కెల్ల ఽ మంగళంబు
విధిచోదితములకు ఽ విధిచోదితం బది, కాలత్రయమునందుఁ ఽ గర్మపరుఁడు
గీ॥ భస్మమునఁ దోఁగవలయు నఽపానవాయు,జృంభమూత్రసముత్సర్గఽచిత్తచలన
దోషముల భస్మసంస్పర్శ ఽ దురితహరము, అన్యథా శుద్ధిలేదని ఽ యాగమోక్తి.

గీ॥ అగ్నిరిత్యాదివేదమంత్రాళిఽపూర్వ, భస్మ శోధించి మేనఁ దాఽల్పంగవలయు
ధర్మము త్రివర్ణముల నరుఽల్ధరణిలోన, ద్విజులుగానఁ ద్రిపుండ్రము ఽ దీర్చుటొప్పు.

సీ॥ ఉపనయనంబున ఽ కుచితు లెవ్వరో వారు, దాల్పంగఁదగినట్టి ఽ ధర్మ మిదియ
భస్మఁ దాల్పక కర్మఽపరుఁడైనవానికి, గృత మకృతం బగుఁ ఽ గేవలంబు
గాయత్రి జపియించుఽకాలంబునను భస్మఁ, దాల్పక జప మెల్ల ఽ దంధనంబు
బ్రాహ్మణ్యమునకు నాఽలవాలంబు గాయత్రి, భస్మాంక మది లేక ఽ పాడి యగునె?
గీ॥ మొదలఁ ద్రిపదోపదేశంబు ఽ ముక్తిమూల,మైనభస్మంబు దాల్పకఽయధికృతుండె
భస్మరహితలలాటుఁడుఽబ్రాహ్మణుండు,గాఁడనుచుఁ దెల్పె శ్రుతులలోఽగమలజుండు.

సీ॥ భస్మఁ దాల్చిన ఫాలభాగంబు గలవాఁడె, పండితుం డైనట్టి బ్రాహ్మణుండు
మణుల పోలికను భస్మము గూర్చువాఁడెపో, పండితుం డైనట్టి బ్రాహ్మణుండు
సహజమౌ ప్రేమ భస్మంబుపై లేదేని, ధరణిఁ జండాలుఁ డాతండ కాఁడె?
ధనముపోలిక భస్మదాఁచి పూయనివాఁడు, ధరణిఁ జండాలుఁ డాతండ కాఁడె
గీ॥ భస్మఁ దాల్పక ఫలముఖ్యభక్షణంబు, సేయువారికి నరకసంసిద్ధి యగుదె?
భస్మఁదాల్పకయే తులాభారిమైన, నతని కర్మంబు నిష్ఫలం బనఁగ వలదె?

—॰ భస్మధారణవిధి ॰—

గీ॥ భస్మధారణ కర్మతోఁ బ్రీతినిధియగు, కర్మ వేఱొండు లేదు తత్కలన లేని
యతని కర్మాధికారంబులభ్రకుసుమ, సమము లిదిసత్యమని చెవిఁజాటుశ్రుతులు.
గీ॥ శ్రౌతమగు బూది వలయునుసంగ్రహింప, లేనిచో స్మార్త మేనియుఁబూనవలయు
నదియుఁ గాకున్న లౌకికంబైన వలయు, భస్మ లేకున్నఁ గర్మకుఁబాత్రుఁడగునె?
వ॥ మఱియు ధరియించు నవసరంబున దక్షిణకరమధ్యాంగుళీత్రియంబున షడంగుళీ యుతంబును గించిదధికమానంబుగానైనను నేత్రయుగ్మప్రమాణంబుగాఁ ద్రిపుండ్రంబుఁ దీర్ఘవలయు. అంగుళీత్రియం బకారోకారమకారంబును ద్రిగుణాత్మకంబునుంగాఁ ద్రిసంధ్యంబు ధరియింపవలయునని చెప్పి ద్విజులకుఁ దత్తత్కాలంబుల నూర్ధ్వపుండ్రంబు ధరియింపవలయుఁ, దత్ప్రకారంబు వివరించెద వినుమని యిట్లనియె. ౧౧౬
సీ॥ పర్వతాగ్రముల నాపగపొంత శివతీర్థ,మున సింధుతీరంబునను భుజంగ
నిలయంబులందును దులసిమూలమ్మున, నెసఁగు మృత్తిక సంగ్రహింపవలయు
శ్వేతరక్తశ్యామపీతముల్ హరిభక్తి,వశ్యత సంపత్తికి వలయు శాంతి
నొసఁగు నంగుష్ఠంబు నురుపుష్టిదం బగు, మధ్యమ యాయుష్యమహిత మగును
తే॥ ముక్తిద యనామికాఖ్యంబుభక్తపటలి,యంగుళీభేద మెఱిఁగి తాల్పంగవలయు
గోరుసోఁకంగనీరాదు ఘోరనిరయ,సాధకం బని యందురు శాస్త్రవిదులు.
ఆ॥ వజ్రదీపముకుళపాఠీనకూర్మశు, భాకృతులను దాల్పనగుఁ ద్రిపుండ్ర
మదియు నూర్ధ్వముగ దశాంగుళమానమై, యుత్తమం బటంచు ననుచితమయ్యె
క॥ తొమ్మిది యంగుళములు మధ్యమ్మగు నెనిమిదియు నేడు నట్లగు నాల్గు
న్నెమ్మిన్ మూఁడును నివి యధమ మ్మగుఁ ద్రివిధంబు ధార్యమయి యొప్పెనఁగుర్.
సీ॥ అళికభాగమ్మున నలరు కేశవుఁడు నా,రాయణుం డుదరంబునందు నిలుచు
మాధవుం డక్కున మలయు గోవిందుండు, కంఠంబునను వరాంగమునఁగుడిని
విష్ణుండు నెడమను విశ్రమించును మధు,సూదనుం డెడమ దా శ్రుతిఁ ద్రివిక్ర
ముండును గుడి వామనుండును వామబాహువులఁ గుడి శ్రీధరుండును నెడమవైపు

గీ॥ తా హృషీకేశుఁ డటు పృష్ఠతలము పద్మనాభుఁ డలరుఁ గకుత్ప్రదేశనలువుమీఁద
మోదమిగురొత్తనిలుచుదామోదరుండు,ద్వాదశాఖ్యలఁబుండ్రంబుదాల్చుటొప్పు
క॥ పూజల హోమంబుల సం, ధ్యాజపముల నూర్ధ్వపుండ్ర మలరించెడిచో
భూజనులు ద్వాదశాభిధ, లోజన్ బఠియించి పుండ్ర మొప్పు ధరింపన్. ౧౬౧
సీ॥ అశుచియైన నతండశేషయాచారవంతుండు, శుచి యూర్ధ్వపుండ్రసంన్యాతుఁడరయ
నూర్ధ్వపుండ్రముఁ దాల్చియుర్వి మృతుండైనఁ, జండాలుఁడైన నాకసఖుఁడు వాఁడు
ఏకాంతులైనన్ను నెద నూనువారలు, సాదరంబునఁ బుండ్రమూఁదువారు
మత్పాదభక్తులా మహితులు పసపున, శూలాభముగఁ దాల్చి శుద్ధులౌదు
ఆ॥ రెలమిఁ బుడమిఁ గొందఱతీపలావల మృన్మయంపు రేఖికల గ్రహింపుచుందు
రవియు వేణుపల్లవాకృతి దీపాభ, లింగసమతఁ దాల్ప సంగతంబు. ౧౬౨
క॥ అచ్ఛిద్రిత సచ్ఛిద్రిత, నచ్ఛంబుగఁ దాల్చుటొప్పు నాగమవిధిచే
నచ్ఛిద్రీకరణము తగు, నచ్ఛిన్నైకాంతికులకు నమరతపస్వీ! ౧౬౩
క॥ పరమైకాంతికులకుఁ దగ, దరయఁగ నచ్ఛిద్రపుండ్ర మలరించుట త
ద్దురితము నిరవధికం బని, విరచింతురు వేదవిధుల విద్వాంసు లొగిన్. ౧౬౪
వ॥ ఇత్తెఱంగున నమోంతంబుగా నామము లుచ్చరించుచు నూర్ధ్వపుండ్రంబు ధరించు వారల హృదయంబుల రమాసహితుండై విష్ణుండు వసించు, నిరంతరాళంబుగా ధరించిన నిరయం బగునని కొందఱు వచింతురు. ఊర్ధ్వపుండ్రవిరహితులై కర్మం బులు సేయువారికిఁ గర్మఫలం బలభ్యంబు. త్రిశూలంబును వర్తులంబును జతుర శ్రంబును నర్ధచంద్రంబునుం గా నిచ్ఛానుసారంబుగ ధరియింప నర్హంబు. వేద పథంబునఁ బ్రవర్తించు నరునకు నూర్ధ్వపుండ్రంబు విహితంబు. అభక్ష్యభక్ష్య ణాగమ్యాగమనాదిదోషనిర్హరణం బగు. తిర్యగూర్ధ్వపుండ్రంబు విడిచి యొండు ధరించెనేని నారకి యగు. ధర్మమార్గాశ్రయణంబునఁ బ్రవర్తించు తాంత్రికుల కును శ్రౌతలింగంబు లుపపన్నంబులగు ; దేవతాలింగంబులు తప్పక ధరియింప వలయు. వేదప్రసిద్ధులగు హరిహరులు సంసారమోచకు లగుటఁ దల్లింగంబులు శ్రౌతంబు లనంబడు. నిరతంబులు శ్రౌతంబులు ముక్తిదాయకంబు లగుటంజేసి హరిహరలింగంబులు వైదికంబున కావశ్యకం బని చెప్పి సంధ్యోపాసనంబు విను మని యిట్లనియె. ౧౬౫

## సంధ్యోపాసనక్రమము

శా॥ ప్రాతస్సంధ్యయు నర్కమధ్యమ యగున్ భానుండు నింగి న్విర
సీభూతుండై తగు వేళ భాస్కరరుచిశ్రేణుల్ గనంగల్గుచో
ఖ్యాతప్రక్రియఁ బశ్చిమంబయిన సంధ్యం దీర్పఁగా నొప్పు నీ
రీతిన్ వేదవిధాన మగ్రజులకు న్వృత్తంబు మానీశ్వరా! ౧౬౬

క॥ తారకలుండుట యుత్తమ, మారయ మధ్యమను తారకలణఁగిన నుదితుం
డౌ రవిగని యధమముగా, నూరులు షట్సంధ్యవిధముకనూచించి రొగిన్. ౧౬౭

చ॥ ధరణిసురుండు వృక్షమగు కదానికి మూలము సంధ్య వేదము
ల్వరఁగఁగఁ గొమ్మలందు సుమకపాళులు ధర్మము లట్లుగాన సా
దరమతి మూలరక్షణము కతప్పదు మూలము ఛిన్నమైన య
ప్పుడసున సర్వము న్విఫలకపాకము చెందుగదా! తలంపఁగన్. ౧౬౮

సీ॥ మొదలు పాృణాయామకమును గేశవాదిక, నామపూర్వము విష్ణునామములును
నిరువది నాల్గింట కనెనసి స్వాహాంతంబు, పృణవాదిగా మూఁట కబాణి గోవు
కర్ణాభముగఁ జేసి కకరతలంబున మాష, మాతృజలమ్ము ముకమ్మాఁ బీల్చి
యధికహీనతలు లే కకాచమింపఁగఁ దగు, నటుగామి సురగ్రోలికనట్ల యగును

గీ॥ కరయుగంబు రెంటఁకగడిగి రెంటను మోము,దుడిచి రెంటశిరముకదోఁగిమూఁటఁ
బాణిపాదశిరము కపైనట్ల పోృక్షించి, ద్వాదశాంగమర్శకతగ నొనర్చి. ౧౬౯

క॥ కుడిచే నుదకము గ్రోలెడు, నెడ వామస్పర్శ యొప్పు కనిది శుద్ధికరం
బుడుగక యంగుష్ఠముతోఁ, విడువఁదగుఁ గనిష్ఠ వేదకవిధిఁ గోృలెడిచోఁ. ౧౭౦

వ॥ అనంతరంబ పృణవస్మరణపూర్వకంబుగాఁ బాృణాయామం బొనర్పవలయు, దక్షిణరేచకంబును వామపూరకంబును గుంభకధారకంబును నగునట్లుగా నొనర్ప వలయు, దక్షిణనాస నంగుష్ఠంబునఁ బీడించి కనిష్ఠానామికల వామనాసఁ బీడించుచు నుభయసమంబుగాఁ గుంభించుట యోగసిద్ధంబు, రేచకంబున వాయూత్పత్తియుఁ బూరకంబున నిరోధకంబును గుంభకంబున సమస్థితియు నగు, చతుర్భుజుండును నీలోత్పలశ్యాముండును నగు నారాయణు నాభిమధ్యంబునఁ బూరకవేళఁ జింతించుచుఁ గుంభకవేళ హృదయంబునఁ బితామహుఁ జింతించుచు నొనర్చినఁ దత్సాయుజ్యసిద్ధి యగు, పదంపడి మందేహాదిదితిజులు భాస్కరు నాస్వాదింపఁ జనుదెంతురు. కావున నుదకాంజలిని బృక్షేపణం బొనర్పవలయు, నజ్జలంబు వజ్రసన్నిభంబై నిశిచరుల నశింపఁజేయు నిది ఋషినిశ్చయంబని యెఱింగి చేయందగు, పిదప గాయత్రిఁ ధ్యానించి జపించి స్వస్థానంబున కనుపందగు, తద్ధ్యానంబున ఖేచరసాధనం బొనర్పందగు, భ్రూమధ్యంబున నంతర్గతదృష్టియైన నది లభించు,దానికి సిద్ధాసనంబు ముఖ్యంబు, యోనిమూలంబున నంఘ్రిబంధించి సమాంగుండైయుండి దేవి పరమదైవం బను నర్థంబు బోధించు మంత్రంబు మొదలుకొని సరస్వతి యను పర్యంతంబుగా నుచ్చరించి బ్రహ్మస్మరణంబున బ్రహ్మశాపంబును విశ్వామిత్రస్మరణంబునఁ దచ్ఛాపంబును వసిష్ఠస్మరణంబునఁ దచ్ఛాపంబును బోఁదోృలి హృదయమధ్యంబున శంఖచకృత్రిశూలపాశ పట్టిన

ముద్గరకరుం డగు పరమాత్మను ధ్యానించి మంత్రన్యాసం బొనర్పవలయు; తత్ప్రకారంబు ప్రథమంబున వ్యాహృతిన్యాసంబును బిదప మంత్రఖండన్యాసంబును నవ్వల మంత్రవర్ణన్యాసంబును న్యసించి ధ్యానశ్లోకపఠనం బొనర్చి చతుర్వింశతి ముద్రాపారాయణం బొనర్చి మంత్రజపం బొనర్పవలయు. ౧౭౧

సీ॥ గాయత్రి జపియించు ♦ కాలమ్మునను భిన్న, పాద గాకున్నను ♦ బ్రహ్మహత్య
అదిగానఁ బాదంబు ♦ లన్యోన్య విరళంబు, గా జపింపఁగఁ బోలుఁ గ♦ర్తలకును
బ్రణవయుక్తంబుగా ♦ భక్తితో జపియింప, సఫలమై ప్రాప్తించు♦జపము ధరణి
నవలఁ ద్రిశూలయో♦న్యాది ముద్రాసప్త, కంబు సూచింప శు♦భంబొసంగు

గీ॥ నుత్తరధ్యాన మవ్వల♦నొనరఁజేసి, లాదిసాంతంబుగా నర్చ♦నాదు లొసఁగి
యష్టముద్రలుసూచించి♦యఖిలజనని, ప్రణతిపూర్వకముగ క్షమా♦పణమువలయు.

ఆ॥ తర్పణంబు సేయఁ ♦ దగు నిందు గాయత్రి, ఛంద మృషియు గాధి♦సంతతియును
సవిత దేవతయును ♦ జపతర్పణము విని, యోగ మనుచు మొదట♦నొనరఁ దలచి.

గీ॥ వేదపురుషులకును ♦ విపులాదిలోక పు, రుషులకును నొనర్చి ♦ ఋషిఁ ద్రిపద
తర్పణంబు సేయ♦దగుఁ దత్తదభిధాన, మహితముగ యథోక్తి ♦ మాన్యచరిత.

గీ॥ మఱియుఁ గొన్ని కొన్ని ♦ మంత్రముల్ పఠియించి, శాంతిసూక్తులెల్లఁ ♦ జదువవలయు
తనదు పితృనమాఖ్యఁ ♦ దలఁచి కేల్మోడ్చుచు, సంధ్యలందు శుద్ధి♦ నలుపవలయు.

గీ॥ ఎద్ది యొనరింపఁగలుగు న♦భీష్టసిద్ధి, నట్టి మాధ్యాహ్నిక క్రియ ♦ యనువదింతు
సావధానమనస్కత ♦ సాదరముగ, వినుము నిర్జరమానీంద్ర! ♦ వీను లలర.

సీ॥ సావిత్రియును ద్రిలో♦చన శ్వేతవర్ణయు, వరదాక్షమాలికా♦వలిత హస్త
వృషరూఢ యాది దే♦వియు రుద్రదైవత, తామసగుణయుఁ ద♦ద్ధర్మమూర్తి
సవితృమార్గైక సం♦చారిణి తామస, గుణ భువర్లోకరిం♦ఖణ విచిత్ర
యగు నాదిదేవి న♦నాది ధ్యాన మొనర్చి, యాచమనంబు పూ♦ర్వానుగుణత

గీ॥ నలిపి యర్ఘ్యంబు సుమబిల్వ♦సహితముగను, సవిత కభిముఖుఁడై సేయఁ♦జనునరుండు
అవల సర్వంబు తొల్లిఁటి♦యట్లు చేసి, శాంతి సేయంగఁ దగుఁ బూర్వ♦సరణిఁదపసి.

గీ॥ ఉదయసంధ్య గాయత్రియై ♦ యొప్పు నవల, సంధ్య సావిత్రియై పేర్చు♦సాయమున స
రస్వతియనంగఁదగు వివ♦రం బెఱింగి, చేయఁదగు వేళయైన ని♦శ్చితము కీడు.

---

టిప్పణి: — సావిత్రి అను సీసములో "తామస గుణ" అను పదము ద్విరావృత్తమైనది. ప్రాస స్థానములో నుంటచే దిద్దలేము. ఋషి కవిత్వములలో నిటులుండుట కలదు.

క॥ మందేహాది నిశాచర, బృందధ్వంసనముఁ గోరి ఋషు లిటు రవిఁ బెం
పొందఁగఁ జేతురు శ్రుతిమత,ముం దప్ప దవశ్యకృత్యముగఁ జేయఁదగున్. ౧౭౯

ఆ॥ మింటినడుమ నిల్చి మిత్రుఁడుండెడి వేళఁ, బ్రసవమైన బిల్వపత్రమైన
గలిపి యర్ఘ్యమిడఁగ వలయు నందురు ఋషుల్, సాంగఫలముఁ జెందు సచ్చరిత్రులకును.

ఆ॥ ఉదయసంధ్యరీతి నొప్పరఁ దర్పణం, బాచరించి సూర్యునందు మనసు
నిలిపి నుతియొనర్చి నిపుణమనస్కులై, జప మొనర్పఁదగును జపితలకును.

గీ॥ జపమునందు నుదయసంధ్యఁ గేలెత్తుచు, సంజఁ గేలు క్రింద సాచికొనుచు
నడిమి సంజఁగేలు నాభిపైఁ జేర్చుచు, మ్రొక్కి జపము సేయ ముఖ్యమగును.

వ॥ మఱియు సహస్రగాయత్రి యొనర్చిన గోపితృ మాతృ భ్రూణహత్యలం బెడఁ
బాసి గురుతల్పగమనంబును బ్రాహ్మణక్షేత్రాపహరణవృజినంబును సురా
పానదోషంబునుం బెడంబాసి బ్రహ్మభూయంబు నొందు, తొల్లి గాయత్రీజప
ఫలంబును జతుర్వేదపారాయణఫలంబును దులాయంత్రంబునం బ్రతిష్ఠింప
గాయత్రీజపఫలంబు దుర్భరంబయ్యె నని నాచేత మునుల వలన వినంబడియె
నింక బ్రహ్మయజ్ఞక్రమంబు. ౧౮౩

— బ్రహ్మయజ్ఞక్రమము —

సీ॥ ముమ్మ ఱాచమనించి మోము రెంటను మార్జ,నంబు పైనుపమర్శనం బొనర్చి
సవ్యపాణిస్థిత జలములఁ బాదముల్, ప్రోక్షించి శిరమును నక్షియుగము
నాసికశ్రోత్రహృన్నలినంబులను ముట్టి, దేశకాలముల నుద్దేశ మొనరఁ
దెలిసి దర్భలు రెండు వలకేల ధరియించి, మూఁడాసనంబుపై మోపి సోప

గీ॥ వీతియై శిఖగట్టుచు విడసిపాద, మూలములు గల్గి కిల్బిషోన్మూలనార్థ
మే నొనర్చెద బ్రహ్మసంధాన విధుల, బ్రహ్మయజ్ఞం బటంచును బఠన సల్పి.

వ॥ తొలుతఁ జతుర్వేదమంత్రంబులు సంహితాచారమంత్రంబులు సమాచార
మంత్రంబులు పాణినీయసూత్రంబులు దీక్షామంత్రంబులు పూర్వమీమాం
సోత్తరమీమాంసాసూత్రంబులు యథాశక్తిఁ బఠియించి శాంతి నుడివి బ్రహ్మకు
నమస్కరించి పిదప దేవతర్పణం బొనర్చి ఛందంబులఁ బ్రణవ వషట్కార
వ్యాహృతి సావిత్రీగాయత్రీయజ్ఞ ద్యావాపృథ్వ్యంతరిక్షాహోరాత్ర సాంఖ్యసిద్ధ
సముద్రనదీ గిరిక్షేత్ర వనస్పతి గంధర్వాప్సరో నాగ వయో* గో సంధ్యావిప్ర
యక్షరక్షో భూతకీర్తనం బొనర్చి ఋషితర్పణం బొనర్పవలయు, శతవర్ణ మాధ్యమ
విశ్వదేవ విశ్వామిత్ర వామదేవ భారద్వాజ వసిష్ఠ సనక సనందన సనాతన సనత్కు

*టిప్పణి: వయః = పక్షులు.

మార కపిల జాబాలి పంచశీర్ష సుమంత జైమిని వైశంపాయన ధర్మాచార్యగౌతమ శాకల్య మాండవ్య గార్గ్యమైత్రేయ కాశీతక బాష్కలసుజాత శౌనకాశ్వలాయ నాచార్యాదులం దృప్తి నొందించి పిదపఁ బితృతర్పణం బొనర్చి యవలఁ గుల గోత్రులకు సూత్రనిష్పడనోదకంబు లర్పించి యాచమించి శాంతి యొనర్పం దగు నిట్లు బ్రహ్మయజ్ఞం బొనర్చిన వేద వేదాంగ పఠన ఫలంబు నొందు ననిచెప్పి మఱియును. ౧౮౫

క॥ సాయంతన సంధ్యాక్రియ, నేయందగు ద్విజుఁడు సర్వసిద్ధి ప్రదమై
మాయాప్రసాదజనకం, బై యొప్పంగాన నియమితాత్ముం డగుచున్. ౧౮౬

## — సాయంసంధ్యావిధానము —

క॥ పూరక ముఖ్యత్రితయము, ధీరతఁ దొల్లింటి యట్ల తీర్చి త్రివిధా
కారములగు ముద్రల, తత్ప్యారూఢి వహించు టొప్పు నస్తమయమునన్. ౧౮౭

క॥ హంసి మృగి ఖేచరియు నన, శంసితములు ముద్ర లందు శక్తిగొలఁది న
త్తంసిత నిష్ఠుం డయ్యును, శంసత నంతర్దృగాప్తి నలుపఁగ వలయున్. ౧౮౮

మ॥ అవలన్ ధ్యాన మొనర్పఁగాఁ దగుఁ బయోజాస్త్రాదివారన్ బున
ర్భవవిధ్వంసిని భక్తమండలకృపాపారీణ విద్యామయిన్
స్తవనాలోల సరస్వతి న్నియతుఁడై స్వాంతంబునన్ ధ్యాన చ
ర్య వరిష్ఠుండయి నిత్యకర్మ విధికై యాస్థ న్ససంకల్పుఁడై. ౧౮౯

సీ॥ ఆచమనించి పూర్వానుకారంబుగా, సాధకుం డగునట్టి జనుఁడు తనదు
పాదము ల్గడించి పాణిద్వయమ్మున, సలిలమ్ము గూర్చియంజలి ఘటించి
సూర్యార్ఘ్యమొసఁగి యచ్ఛోదర్పణము సేయఁ, దగుఁదద్విధానంబుఁ దనరవినుము
ఋషి వసిష్ఠుండు శార్ఙ్గియె దేవతయు ఛంద, మొగి సరస్వతి వినియోగమపుడు

గీ॥ తర్పణంబున ననుచు విధాన మెఱిఁగి, పిదపఁ దత్తదభిఖ్యల విదితమంత్ర
పూతముగఁ దర్పణము సేయఁ బోలుఁ దత్ప్ర, కార మెఱిఁగింతు వినుము సాంగముగఁ దపసి.

వ॥ ప్రణవంబును సామవేదంబును రవిమండలంబును హిరణ్యగర్భుండును బరమాత్మయు సరస్వతియు గాయత్రియు నాకృతిసత్యంబులు, సంధ్యయు ఋషిచ్ఛందస్సులును సిద్ధులును భూర్భువస్సువరాదులును ప్రకృతి పురుషులును దర్పణంబు నేయందగు వారలు, ఇది సాయంసంధ్యావిధానంబు; దీనం బాపనాశంబును దుఃఖహారణంబును వ్యాధి ధ్వంసంబును నాచార్యవృద్ధియు నిష్టప్రాప్తియు నగునని చెప్పి గాయత్రీ పురశ్చర్యావిధానంబు వివరించెద వినుమని యిట్లనియె. ౧౯౧

—॰ గా య త్రీ పు ర శ్చ ర్యా వి ధా న ము ॰—

సీ॥ శైలాగ్రములఁ నదీసైకతంబుల బిల్వ, తరుమూలముల జలస్థానములను
గోష్ఠంబునను వేల్పుగుళ్ళలో నశ్వత్థ, సన్నిధి నారామసంచయముల
తులసీవనముల నిర్మలతీర్థముల గురు, పార్శ్వంబులను *బిత్రుభవనములను
సంచలింపక పురశ్చరణ మొనర్చిన, సాధకు నిష్టంబు సఫలమగును

గీ॥ గాన గాయత్రి జపతపోధ్యానగరిమ, నిత్య మయుతంబు జపియింప నియతబుద్ధి
గలుగు నెల్లర కిది విధిగనుక శైవ, వైష్ణవవిభేద మెంచంగవలదు సుమ్ము.

ఆ॥ వేదమాతయగుట ద్విజులెల్ల గాయత్రి, జప మొనర్పఁదగుఁ బ్రసన్నమతుల
సార్థకముగ మంత్రసంగ్రహం బొనరించి, తజ్జపంబు సేయ ధర్మ మరయ.

సీ॥ అద్దేవి పంచదశాక్షరియును శతా, క్షర సహస్రాక్షర సంఖ్య లొంది
వర్తించు నది మంత్రివరుల సన్నిధిఁ బూర్వ, ముత్తరంబును సంగవృత్తిఁ దెలిసి
మూఁడులక్షల జపమ్ము నన జపించుట చాలు, నష్టలక్షంబు మేలంత కన్న
యాజ్ఞవల్క్యుఁడు చెప్పెనంతకు నిరువది, నాల్గులక్షల విధానంబు జపిత

గీ॥ శక్తిఁ గోలఁదిగఁ జేయంగఁ జనుఁ దదాది, మంత్రశోధన మయ్యాదిమహితమగును
నయిదు పదియును బ్రణవంబులాదినిడుదు, రవ్విభేదంబు లెఱుఁగంగనగు మహాత్మ.

గీ॥ ఇట్లు మంత్రంబు జపియించి యెవ్వఁడేని, హోమతర్పణములు సేయకున్నఁ గీడు
తపము చేఁ గర్మఫలమిచ్చుఁ దపమువలన, నైహికాముష్మికములు హస్తాగ్రగములు.

వ॥ అది గావునఁ దపంబు సర్వార్థసిద్ధిదంబు దానికి శరీరశోధనంబు ముఖ్యసాధనంబు, కృఛ్రచాంద్రాయణంబుల నంతశ్శుద్ధి సాధింపవలయు. అయాచితోపపన్నంబగు నన్నం బనుభవించుచున్నఁ గర్మశుద్ధి యగు; కర్మయన్నానుసారంబుగను బుద్ధికర్మానుసారంబునుంగా నగుఁ గాన సత్కర్మమొనర్పందగు, పలలస్పర్శనాదులు మాని భిక్షాన్నంబుఁ దెచ్చికొని భాగచతుష్టయం బొనర్చి, యేకభాగంబు విప్రుల కొసంగి యట్టుల గోవులకును నతిథులకు నొక్కొక భాగం బిడి శిష్టంబు భాగద్వయం బొనర్చి తానును దారయుఁ దృప్తినొందుచు నాశ్రమధర్మంబులు వదలక చరించుట యుత్తమంబు, గ్రాసాష్టకంబు గృహస్థవానప్రస్థులకు బ్రహ్మచారికి యథేష్టంబు భుజింపవలయు, గాయత్రిచే గోమూత్రప్రోక్షణంబు నవ

* టిప్పణి:— పితృభవనములను — ఇది మూలములో లేదు. శ్మశానమని యర్థము యథాకథంచిత్తుగా జెప్పుకొనవచ్చును గాని అపుడు శిష్టాచారమునకు బాధకల్గును.

ఈ ఘట్టమునందుఁ జక్రవాకపక్షికి సంబంధించిన చిన్న యితిహాసము మూలమునందున్నది. అనువాదములో లేకుండుటకుఁ గారణము గ్రంథకర్తకు లభించిన ప్రతిలో లేక పోవుటయే యని యెఱుఁగనగు. శా॥ శా॥

వారమడ్వార త్రివారంబులుగాఁ జేయుచు సావిత్రి జపియించుచు శూద్రసంపర్క సహవాసాదులు వర్జించి చోరచండాలాదులైన క్షుధాతురులేని యన్నంబిడుచు వర్తించుట గృహస్థ ధర్మంబు. ౧౯౬

క॥ ఏ మంత్రము జపియించిన, నా మంత్రాక్షరము లెన్నియగుఁ దల్లక్ష
ల్సేమంబుగ జపియింపం,గా మహి నుత్తమము సాధక ప్రతతి కొగిన్. ౧౯౭

ఆ॥ మంత్ర మెద్దియేని ♦ మహిఁ బురశ్చరణంబు, లేకయున్న హంసలేని దేహ
మటులు నిష్ఫలంబ ♦ యగుఁ గానఁ గర్తవ్య, నిశ్చయంబునగుఁ బురశ్చరణము.

వ॥ ఇవ్విధానంబునందు జ్యేష్ఠాషాఢ భాద్రపద పుష్యంబులు మంగళ భౌమవాసరంబులు, వ్యతీపాత వైధృతులు, అష్టమీ నవమీ షష్ఠీ చతుర్థీ త్రయోదశీ చతుర్దశ్యమావాస్యా ప్రదోషంబులు, మాయాగ్ని రుద్ర సర్పేంద్రవసు శ్రవణ జన్మర్క్షంబులు, మేష కర్కట తులా కుంభ మకర వృశ్చికంబులు వర్జ్యంబు లని యెఱింగి చంద్రతారానుకూలంబుగా శుక్లపక్షంబున నైనచో సిద్ధిఁ బొందు. స్వస్తివాచనంబును నాందీశ్రాద్ధంబును విప్రసంతర్పణంబుఁ బొనర్చి యారంభింపవలయు, ప్రారంభంబు మొదలుకొని సమాప్తి పర్యంతంబు నేకప్రమాణంబున జపంబుత్తమంబు, పిదపఁ దర్పణ హోమంబులు సేయవలయునని తెలిపి మఱియు.

సీ॥ గాయత్రికన్నను ♦ గలదె యుత్తమ మంత్ర మది మితభోజనుండగుచు నిరత
నిష్ఠుఁడై జపియింప ♦ నిపుణత ఫలసిద్ధి, లక్షత్రయము సేయ ♦ నక్షయంబు
కర్మార్పణము సేయఁగాఁదగు దేవికి, కర్మలోపము సేయఁగాదు సుమ్ము
ఆదిత్యు నుదయించు ♦ నంతకుమును నీట, దోఁగి శుద్ధుండయి ♦ తొలఁగ కెపుడు,

గీ॥ నొక సహస్రము జపియించుటుదితపథము, దీన నాయుర్వివృద్ధి సంశయము లేదు
ఇదియు సిద్ధికి హేతువౌ ♦ నిహముఁబరము, గోరువారికి నదియెల్లఁ ♦ గొంగుముల్లె.

గీ॥ అన్నిటికి మూలమగుచు నాహారనియతి, శక్తికొలఁది ననుష్ఠింపఁ ♦ జను నరునకు
స్నానకాలంబునను బుణ్యజలములందు, శతము గాయత్రి జపియింప ♦ సర్వసిద్ధి.

క॥ చాంద్రాయణాదిఫలము ల,తంద్రితగాయత్రి యొసఁగుఁ ♦ దత్పరమతివై
సాంద్రతరభక్తి సలుపు ము,నీంద్రా! సిద్ధింపరాని ♦ దెద్దియుఁ గలదే. ౨౦౨

గీ॥ బ్రాహ్మణ క్షత్ర వైశ్య శూద్రప్రతతికి, గలవు మంత్రంబు లధికారగరిమ వాని
జపతపంబులు సల్పి తజ్జపము సిద్ధి, నొందుటకు హోమతర్పణ ♦ యుక్తి వలయు.

క॥ జపలక్షణంబు నింటివి, సపురశ్చర్యాక్రమమున ♦ సంగత మయ్యెన్
వ్యపగత సందేహతచే, నిపు డొక్కటి తెల్పువాఁడహితమతి వినుమా. ౨౦౪

## — వైశ్వదేవ విధానము —

గీ॥ వైశ్వదేవవిధానంబు । వలయు విప్రతతికిఁ జేయంగ *సూనవిదారణంబు
తద్విధానంబు శ్రుత్యుక్త । ధర్మసరణి, జేయ నధికారిగాఁడసూ । క్షితిసురుండు.

సీ॥ యజ్ఞంబులన దేవయజ్ఞంబు బ్రహ్మయజ్ఞంబును భూతయజ్ఞంబును బితృ
యజ్ఞంబు మానుషయజ్ఞమ్ము నన నివి, యాచరింపఁగఁదగు । నగ్రజులకుఁ
గత్తిపీఁటయు సన్నికల్లు సమ్మార్జని, యంబుఘటంబు ప్రొయ్యనెడు నైదు
జీవహింసలకును । దావలంబులు గాన, వానిచే గృహులకు । వచ్చుదోసఁగు

గీ॥ తద్దురితశాంతికై సేయఁదగును వైశ్వదేవ మగ్ర్యాన్వయులకు విధిప్రబోధి
తంబు కుండంబునను స్థండిలంబునందు, నైనఁ గర్తవ్య మాగమోక్తానుభూతి.

సీ॥ పాణిపద్మమున శూర్పమున మేధ్యాజినంబున నైన ధమనింపఁబూనవలదు
పటమునఁ దెవులు శూర్పమున నర్థవినాశనంబు మృత్యువగుఁ గరంబువలన
మోముచే ఘర్మంబు మొనయుఁ గావున హస్తమంతరంబుగఁ జేసి యగ్ని ధమన
మాచరింపఁగ వచ్చు । నాగమోదిత వస్తు, సంగ్రహం బొనరించి । నలువవలయు

గీ॥ దధిపయోయుక్తి శాస్త్రవిధాన మటుల, సంభవింపక యున్న శుద్ధాంబువులను
నైన సేయంగఁదగు నది । లేనియెడల, హింసకతవాఁదు గృహికి మనీషిచర్య!

క॥ ఏయేకాలంబులఁ గల, వేయే వస్తువులు వానినేర్పఱచి యెడం
బాయని శ్రద్ధకుఁ దానై, చేయందగు వైశ్వదేవ । సిద్ధికొఱకునై. ౨౦౫

ఆ॥ పావనంబు వైశ్వదేవంబు విధ్యుక్తముగ నొనర్ప కవని । మూఢుఁ డగుచుఁ
గుడిచెనేని వాఁడు । ఘోరదుర్గతిలోనఁ, గూలు మంట శిరము । వ్రేలుచుండు.

శా॥ శాకంబన్నము మూలము ల్ఫలములున్ । సంకల్పపూర్వంబు న
స్తోకప్రక్రియ నగ్ని వేల్వఁదగుఁ దోడ్తో సర్వసిద్ధిప్రదం
బై కర్మంబు ఫలించు నాతురతచేఁ । బ్రాల్మాలి విప్రుండు స్వే
చ్ఛాకృత్యంబులఁ బోయె నేని కలవే । స్వర్గాపవర్గంబులున్. ౨౧౦

ఆ॥ అకృతవైశ్వదేవు । డైనను భిక్షార్థి, యన్నమునకు వచ్చునట్టి వేళ
వాని కన్నమిడిన । వైశ్వదేవఫలంబు, తనకుఁ దానె హస్త । తలగతంబు.

గీ॥ వైశ్వదేవంబు సేయని । వానిదోష, మర్థి మెత్తుకపోవు భిక్షార్థి కిడని
వలుదదోషంబు బోఁద్రోల వైశ్వదేవ, కర్మ చాలదు సుమ్ము నిక్కముగ తపసి

ఆ॥ యతియు బ్రహ్మచారి । యన్నభర్తలుసుమ్మ, వారి కన్న మిడని । వారిదురిత!
సంగమెడలనీదు । చాంద్రాయణాది సత్కర్మలెన్ని యేసిఁ । గలిగియున్న

* టిప్పణి: సూనము లనగా దోషములు. అవి యైదు. వానిని "యజ్ఞంబులన" అనెడి దీని తరువాయి సీస పద్యములో మూఁడవ చరణములోఁ జూడఁదగు.

ఆ॥ ఇటులు వైశ్వదేవ మొనఁగించి గోగ్రాస, మిడఁగవలయు దానినేర్పరింతు
ముందు మదిని సురభిబృందంబు ధ్యానించి, పూజసల్పి పిదపఁ బూనవలయు.

గీ॥ తల్లి! సురభి! విష్ణుదైవత! గోలోక, నిలయ! నేను జేయు నీదుపూజ
చేకొనంగఁదగు వశీకృతనై నాకు, నిహముఁ బరము గలుగనిచ్చగించి. ౨౧౫

క॥ దండం బిడిమెద నీకుర్, దండధరోద్దండదర్పదళనముకొఱకై
నిండారు వేడ్క నాకు న,ఖండస్థితి సిరు లొసంగఁగావలె సురభీ. ౨౧౬

మ॥ అని పూజావిధి సల్పి గోతతికి సత్యానక్తిఁ గాలీన మా
ఘనవస్తుప్రతతిన్ సమర్పణముగాఁ గావించి కేల్మోడ్చి దో
హనమాత్రింబగు కాల మయ్యెడ స్వగేహాయాతుఁడై యన్నము
న్గొన కాఁకంటఁ గృశించి విప్రుఁ డతిథి న్గోరందగున్ భక్తిచే. ౨౧౭

గీ॥ అతిథి యెవ్వనియింట భగ్నాశుఁ డగునో, వాని పుణ్యంబు లెల్లను వానితోడ
వెడలుఁ బితృవర్గ మెల్లను విబుధలోక, వాస మెడలి యధస్థితి వర్తిలుఁగద.

క॥ ఔపాసనాగ్ని యతిథియుఁ, బాపంబులఁ బాపువారు పరమిడు వారున్
రేపు న్మాపు న్వారలఁ, గాపాడఁగవలయు శ్రుతుల కట్టడియె సుమీ. ౨౧౮

ఆ॥ తల్లి తండ్రి గురుఁడు తనయుండు భృత్యుండు, తనకుఁ బ్రోచుటకును దగినవారు
అగ్ని యతిథి యిరువు రట్టివారని చూచు, టుత్తమంబు గృహికి యోగ్యుఁడేని.

గీ॥ ఇట్టి యర్థం బెఱింగిన యెవ్వఁడేని, మోహమున లోభమున నైన మొనయకున్న
నతని యాముష్మికం బెల్ల నవల నవల, దూరదూరతరమ్మయి తొలఁగిపోవు.

గీ॥ సోమయాగం బొనర్చిన సోమయాజి, చెందు సద్గతిఁ బడయు నెందెందుఁ బంచ
యజ్ఞపరుఁడైన విప్రుఁ డో యవనినాథ!, తద్విహీనుండు క్షితి దరిద్రతవహించు.

గీ॥ వినుము ప్రాణాగ్నిహోత్ర సద్విధి వచింతు, జన్మమృత్యు జరాదినిస్తారకంబు
ఎద్ది దెలిసినఁ బ్రాణికి నెసఁగు ముక్తి, తత్పరిజ్ఞాన మాత్మ కుత్సాహ మొసఁగు.

క॥ విధియుక్తముగాఁ గుడిచిన, బుధునకు ఋణముక్తి గలుగుఁ బూతుండగు న
వ్విధము పరిజ్ఞేయమ్మగు, నధమతె సిద్ధించు నేతదజ్ఞానమునన్. ౨౨౪

క॥ శ్రుతిబోధితకర్మజ్ఞుఁడు, క్రతుఫలమున్ జెందు నరకగతమగు పితృసం
తతి నుద్ధరించు నూర్ధ్వ,చ్యుతి లే కెల్లెడల నిత్యశుభములఁ జెందున్.

క॥ మనన మగు నరణి మారుత, మను రజ్జువుఁ జుట్టి మథన మనయము సల్పన్
జనితం బగు జ్ఞానానల, మునఁ గర్మము వేల్చవలయు మోక్షార్థులకున్.

సీ॥ తారంబు ముందిడి తన్మంత్రములకెల్ల, ననలజాయాంతంబుగను వచించి
యంగుళీక్రమ మెల్ల నరసి ప్రాణాహుతి, పంచకం బిడుట సత్పథము ద్విజుల

కాననంబున నుండు నాహవనీయంబు, గార్హ పత్యంబు వక్షమున నుండు
నాభి దక్షిణవహ్ని శోభించు హోతలు, ప్రాణాదులు సమానవాయువందు

తే॥ యాజమాన్యంబు గొనుచుండు నహము పశువు
రోమములు స్రుక్స్రువంబులు రూఢముగను
క్షుత్తు వహ్నిముఖంబని కోవిదులకుఁ
దెలియఁదగు నర్థ మిది సుమ్ము దేవమౌని. ౨౨

వ॥ మఱియు క్షుదగ్నికంబగు ప్రాణంబునకు నాదిత్యుండు దేవత, గాయత్రి ఛందంబు గానఁ బ్రణవాది స్వాహాంతంబు మంత్రం బుచ్చరించి యాదిత్యున కగుంగాక యని యాహుతి యిడవలయు, నట్టుల శ్రద్ధాగ్నికంబగు నపానంబునకు సోముండు దేవత, ఋషి ఛందంబుగానఁ బ్రణవాది స్వాహాంతంబుగా నాహుతి యిడవలయు, పూర్వప్రకారంబున నుదానున కొసంగవలయు, సత్యాగ్నికంబగు సమానునకుఁ బర్జన్యుం డధిదేవత, పంక్తి ఛందంబుగానఁ బ్రణవాదిస్వాహాంతంబుగా నాహుతి యిడవలయు, నిటుల నొసంగి తత్తదధిదేవతలకు నగుంగాక యనినుడివి నాకు వలవదని నుడివి భుజించెనేని యతండు బ్రహ్మభూయంబునకు నగునని తెల్పి మఱియును.

సీ॥ ఉత్తరాపోశన మొనరించి హస్తంబు, ప్రక్షాళితము చేసి పాతకములు
వాలియంగ గండూషమిలఁ జేయఁగాఁ దగు, నిమ్మంత్రముల నుచ్చరించుకొనుచు
పితరులు సంతృప్తిఁ బెరసి సుఖింతురు, భూమిస్థులగు వేలుపులును గులజ
కులజదాసులు నింకఁ గల జంతుకోటులు, తృప్తులయ్యెదరు వర్ధిష్ణు లగుచు

తే॥ నని జలంబిడి ఘటితకుశాగ్రమైన, గ్రంథి సడలించి పుడమిపైఁ గలుపరహిత
తలమునఁ బడంగ నేసి శుద్ధతఁ బొసంగ, నాచమింపంగవలయు నానుపూర్వి.

క॥ ధరణీసురుఁ డుచ్ఛిష్టం, బరయంగా నంటెనేని యారేయి క్షుధా
తురుఁడయి మెసవక మఱునాఁ, డరుణుఁడురాఁ బంచగవ్య మానంగఁదగున్.

క॥ ఉచ్ఛిష్టసహితుఁడై య,న్యోచ్ఛిష్టస్పృష్టుఁడైన నుక్తవిధియగున్
స్వోచ్ఛిష్టరహితుఁడై య,న్యోచ్ఛిష్టము సోఁక స్నాన మొనరింపనగున్. ౨౩

సీ॥ అన్న మేకాహుతి యంత భిక్షంబిడ, గోయజ్ఞఫలమును గొమరొసంగు
నంతకన్నను మిక్కిలగునేని ఫలము న,నంతమ్ముగలదు నిరంతరమ్ము
అతిథితృప్తి యొనర్చు నట్టిదాతకు ఫలం, బెంతని తెల్ప నయ్యిరువురకును
స్వర్గంబుగలదు నిశ్చలు నర్థి భుజియించు, నొక్కొక్క కబళ మశ్వమేధ్యార్జితముగుఁ

తే॥ బంచగవ్యఫలంబు ప్రాపింపఁజేయు, నగ్ని వేల్చుట విప్రున కన్నమిడుట
ధరఁ బురశ్చరణంబుతోఁ దాల్య మొందు,నిట్టి సత్కర్మ మొనరింప నెసఁగుసిరులు.

— ఉత్తమ ధర్మంబులు —

వ॥ మఱియు నుత్తమధర్మంబులు వచించెద. అధర్మ్యయనుండును జితక్రోధుండును జితేంద్రియుండును మితాశియు వినీతుండును శాంతచేతస్కుండును త్రిషవణస్నాతుండును మితభాషణుండును శూద్రి పతిత నాస్తికభాషావిరహితుండును అపిశునుండును నై జపహోమార్చనాదులఁ బొనరింపఁ గావలయు. సర్వావస్థలయందును మైథునత్యాగంబు బ్రహ్మచర్యంబు, ఋతుస్నాత యగు స్వదారయందపవర్తనంబు దోషం బగునని ధర్మంబులు వచించు; త్రైవర్ణికుల కుచితంబు ఋణత్రయవిమోచనం బటు గాన సుతోత్పాదనంబు శ్రుతిచోదితంబు, బ్రహ్మచర్యంబున ఋషులకు, సంతానంబునఁ బితరులకు, యజ్ఞంబున దేవతలకు, ఋణవిమోచనం బొనర్పవలయు. వ్రతాదులయందు క్షీర ఫల శాక హవిష్య భిక్షాశియునై చాంద్రాయణం బొనర్చుచు లవణక్షారామ్లగృంజనకాంస్య భోజనతాంబూలద్విభుక్తిత్యాగం బొనర్చి శ్రద్ధావిరోధంబుగా వర్తింపవలయుఁ గాదేని దేవతా పితృ ద్రోహంబు సంభవించు, మౌనంబును నిత్యపూజా దాన స్తుతి కీర్తన గురు దేవ విశ్వాస భూశయ్యా బ్రహ్మచర్య త్రిషవణస్నాననైమిత్తికార్చన శూద్రికర్మ వివర్జనంబులు నాఁ బదియు రెండు ధర్మంబులు నడుపవలయు. సూర్యోపస్థానంబును గర్మసమర్పణంబును నెఱింగి నడచు విప్రునకు స్వర్గంబు కరగతంబు, సంకల్పసిద్ధియు, నేయే కర్మంబుల నేయే దేవతల స్మరించినఁ దత్తత్ఫలసిద్ధు లగునట్టి మార్గంబులును దెలిపెద విను మని యిట్లనియె. ౨౩౩

సీ॥ మొదటఁ బురశ్చర్య ♦ ముఖ్యంబు సిద్ధికిఁ, గారణం బది గాన ♦ క్షమానుపంచు
స్వాధ్యాయనిష్ఠుఁడై ♦ సరవిఁ బ్రాజాపత్య, మాచరింపఁగఁ బోలు ♦ నట్టిపనికిఁ
గేశాదిఖండనకృత్యుఁడై రాతిరి, పగలు నాహారంబు ♦ పరిహరించి
మౌనియై సుపవిత్ర ♦ మార్గంబుతోఁ దార, పూర్వంబు సావిత్రి ♦ బొగడుకొనుచు
తే॥ వ్యాహృతిసమేతముగ జపపాఠి నిలిచి, తర్పణంబులు హోమంబు ♦ దనరఁ జేసి
వర్జ్యముల నెల్ల వర్జించి ♦ వలయుకొలఁది, నాసహస్రంబు జపియింపనగు బుధులకు.

సీ॥ మొదలఁ బ్రాజాపత్యమును గృచ్ఛమును సాంత, పనమునాదిగఁ గల్గుఘనవిధులను
శుద్ధుండుగాఁదగు ♦ సొరిది నిం దొక్కటి, గలిగెనేనియు ముక్తి ♦ గలుగుననిన
నన్నియుఁ గలవాని ♦ కగుట యబ్బుర మొక్కొ, వంద్యులై దేవతల్వారములోనఁగి
మన్నింతు రా ధన్యు మహిఁ బూజ్యత మెసంగు, బ్రహ్మాది లోకముల్భువనములగు
గీ॥ నట్టి సత్కర్మ లాగమోక్తానుభూతిఁ, దెలిసి సేవింపఁదగు భూమి దేవతలకు
నట్టి వారల కొలఁది వేదాగమేతి, హాసవిదితంబు సర్వార్థభాసకంబు.

వ॥ తత్తత్ప్రకారంబు లయాచితోపపన్నగ్రహణంబును గోమూత్ర గోమయక్షీరదధిసర్పిఃకుశోదకోపవాసాన్యతమాచరణంబును నేకగ్రాసభక్షణంబును ద్వ్యాహ

సప్తాహ పక్షమాసాద్యేకాహారమును చంద్రవృద్ధిక్షీణతానుకూల తత్తద్గ్రాస భక్షణత్యాగంబును మొదలగు కృఛ్రింబులఁ గాలంబు గడపుచు నశక్తుండేని హవిష్యాశియై వ్రతాచరణం బొనర్చి కర్మంబున నతంద్రితుండైనఁ దత్సిద్ధిఁ బొందు, నన్నిటికిని దేహశోధనం బావశ్యకంబు, పిదప నాచారనిర్ణయంబు, దీనఁ దుర్గాప్రసాదంబు లభించు, నిహంబునఁ బూజ్యతయుం గల్గు, సదాచారంబున నైహికాముష్మికంబులఁ గొఱంతయుంగలదే యని వచించి నారాయణుండు సదాచారనిర్ణయం బెఱింగితివే యని నుడివిన నారదుండు విని హర్షించి తచ్చరణంబులకుఁ బ్రణతుం డయ్యె. ౨౩౬

క॥ అని బాదరాయణుండు దెల్పిన జనమేజయుండు ప్రీతుండై య
మ్మునిఁ నవ్వలికథ యడిగిన, వినిపింపఁదొడంగెఁ బూర్వవృత్తం బనుచున్. ౨౩౭

చ॥ ధరణిధరాత్మజాహృదయతామరసాంతరచంచరీక! సుం
దరతరదివ్యరూప! సురతాపససం స్తవనీయ! సామగా
నరసనదీనదీప! మునినందనదుగ్ధఘురీప్రదానత
త్పర! కరుణాకటాక్షచయభాసుర! కృత్తజలంధరాసురా. ౨౩౮

క॥ కాలానలలీలావిల,హాలాహల గిళన దుర్మదాసురవర్గా
భీలప్రతాపదహన, జ్వాలాజాజ్వల్యమాన సత్యాలానా! ౨౩౯

మానిని॥ హర! శివ! శంకర హరినయనార్చిత చరణసరోరుహ! చంద్రధరా
వరద! దయానిధి కరిముఖజనకా! భరణక్షణోద్ధత వహ్నికరా
శరణ! జనావన! శాశ్వత! ఖండనచండ విఖండిత దురితభరా
పురహర! గిరిచర భూతివిలేపన పరమ! చరాచర భరణధురా. ౨౪౦

క॥ దేవీభాగవత స్కం, ధావళి రుద్రాఖ్య మచ్చమాంబా జగ్గ
క్ష్మావరుల కభీష్టార్థ, శ్రీ వెలయించుచును సుప్రసిద్ధిం జెందున్. ౨౪౧

గద్య

ఇది శ్రీమత్పరమశివాద్వైత భావనాసాధ్య ములుగు సదన్వయ సిద్ధసారస్వతవిద్యా సాన్నిధ్య వేమనారాధ్యవంశార్ణవకలానిధాన పాపయారాధ్యాభిధాన ప్రణీతంబైన శ్రీ దేవీభాగవతం బను మహాపురాణంబునందు ఏకాదశస్కంధము సంపూర్ణము.

శ్రీదుర్గాదేవతార్పణ మస్తు శ్రీ శ్రీ శ్రీ

---

షరా:— ఈ యేకాదశస్కంధమునందు శ్రోతకు సంబంధించిన సంబోధనములు — అనఁగా నారదునికిని జనమేజయునికిని సంబంధించినవి కలగపులగముగా నున్నవి, చదువరులు జాగ్రత్తగా గమనించుకోవలయును. ఈ పుటలో నున్న 'మానిని' లో యతిప్రాసములే కాక గణసంఘటన కూడఁ గ్రొత్తగా నున్నది. విజ్ఞులు పరిశీలింతురు గాక!

వెం॥ శా॥ శతావధాని.

శ్రీ రస్తు
శ్రీ మహాగణాధిపతయే నమః
శ్రీ శారదాంబాయై నమః
శ్రీ భవానీ ముక్తీశ్వర సహాయము - శ్రీ కాత్యాయనీ సహాయము



శ్రీ

# దేవీ భాగవతము

## ద్వాదశస్కంధము





గౌరవపరిణతమై
యోగీశ్వర హృద్యమానసోక్తము దేవీ
భాగవతము పదిరెండవ
భాగము సర్వార్థసారసఫలభర మలరున్. ౧

క॥ శ్రీమదవిముక్తనిలయ, క్షేమంకరసత్కటాక్ష సంశ్రితజనపక్షా
సామశ్రుతిలోల పరంధామా జితకామ మదనదర్పవిరామా!

వ॥ దేవా! సకలపురాణేతిహాస కథాసుధాస్వాదన నిస్తంద్రులగు సమ్మునీంద్రులకుం
దన్మనోరథ రథచోదనాసూతుం డగు సూతుం డిట్లనియె. 3

ఉ॥ శ్రీమదనంతశక్తి మణిసింధువు స్వాత్మవిభేదశూన్య ము
ద్ధామగుణాగుణప్రథితసత్పర మాగమవేద్య మాద్యత
త్త్వామృత మప్రమేయ మజరామరమై వెలుగొందు నా పరం
ధామము మా కొసంగు నిరతం బనపాయ పరార్థచింతనల్. ౪

వ॥ ఇట్లు నమజ్జనదుర్భవలతాలావిని యగు పరదేవిని భజించి, ౫

ఉ॥ దేవ! మహానుభావ! భవదీయ కృపాతిశయంబుచేత స
ద్భావుఁడనైతి ధర్మవిధిపాకములుం ఫలముల్ హృదంతర
స్థావిలకల్మషం బుడుగ సన్నియు వింటి సుఖావహంబు నౌ
దేవికథామృతంబునను దేలితి మీఱితిఁ జేరితిం దరిన్. ౬

గీ॥ అంబికానుగ్రహంబు సుఖానుభూతి, గలుగు నిట్టి పథంబు లేకర్మ నగునో
అదియువివరింపఁగాఁదగువిదితముగను, మఱియునింకొక్కటివచింతుమానిచంద్ర!

—• గాయత్రీ వర్ణము, ఛందము మొదలగునవి •—

క॥ ఏ యాచారము మేలగు, గాయత్రి యుపాసనమున గాయత్రీవ
ర్ణాయత సంఖ్య యదెట్టిదో!, యాయా వర్ణముల ఋషుల యాగతి యెటులో.

క॥ గాయత్రీవర్ణములకు, నేయే ఛందంబు లొక్కొ యే దేవతలో?
నా యంతరంగ మిది విన, నాయత్తం బయ్యెఁ గరుణ నానతి యీవే.

వ॥ అని నారదుఁడు ప్రశ్న చేసిన నమ్మహాముని యిట్లని వచించె. వామదేవాత్రి వసిష్ఠ శుక్ర కణ్వ పరాశర విశ్వామిత్ర కపిల శౌనక యాజ్ఞవల్క్య భారద్వాజ జమదగ్ని గౌతమ వేదవ్యాస లోమశాగస్త్య కౌశిక వత్స పులస్త్య మాండుక దుర్వాసో నారద కశ్యపులు వర్ణఋషులు. గాయత్రియు నుష్ణిక్ అనుష్టుప్ బృహతీ పఙ్క్తి త్రిష్టుప్ జగత్యతి జగతీ నత్యయుఁ బ్రస్తారపఙ్క్తియు ప్రస్తరపఙ్క్తియు నక్షరపఙ్క్తియు జ్యోతిష్మతియు త్రిష్టుభంబును జాగతీచ్ఛందంబును మహాఛందంబును మహానిధియు, భూశ్ఛందంబును, భువశ్ఛందంబును, సువశ్ఛందంబును సమ్యక్ఛందంబును గృతియు నతియు స్థితియు నననివి వర్ణచ్ఛందంబులు. అగ్నియుఁ బ్రజాపతియు సోముండు నీశానుండును వరుణుండును నాదిత్యుండును బృహస్పతి మిత్రావరుణులు భగుండు యముఁడు సవిత త్వష్ట పూషుం డింద్రాగ్నులు వాయువు వామదేవుండు మైత్రావరుణి విశ్వేదేవులు మాతృక విష్ణువు వసువులు రుద్రుఁడు కుబేరుఁ డశ్వినులు బ్రహ్మయు వారుణులు విద్యాధరులు గగనంబు కిన్నరులు కింపురుషులు బ్రహ్మయు విరాట్టును ద్వాత్రింశద్వర్ణగాయత్రీ ప్రకారంబున వర్ణాధిదేవతలు, పిశ్వయు శేషయు వ్యాపినియు హాతయు మలఘ్నయు తమోహారిణియు సూక్ష్మయు విశ్వయోనియుజయయుఁ బరయుఁదమోలయపరయు శోభయు భద్రియుఁ ద్రిపదయు బ్రాహ్మియు మహేశ్వరియుఁ గౌమారియు వైష్ణవియు వారాహియు నారసింహియు నింద్రాణియు చండికయు దాక్షాయణియుఁ గాత్యాయనియు నను శక్తులపేరం జెల్లుచుండు మఱియును. ౧౦

సీ॥ చంపకం బతసియు స్ఫటికంబు నీలంబు, తరుణార్కశంఖదీప్తములు పద్మ
మణిపాకశాసనమణిమౌక్తికార్జున, రవిరత్నవైదూర్యరంజితములు
ష్ఠాదిని శాకృష్ణకలితము లుగ్గార్క, శుకపుచ్ఛశతపత్రసుందరములు
బిల్వకేతకులును బృథువకుళంబులు, నాగభూతసువల్లికాగణములు

గీ॥ కలితకరవీరమును వర్ణగణములందు, గాంతు లిట్టులు వర్తించుఁగ్రమముతోడఁ
దత్తదుద్ధారభేదముల్ దదనరఁ దెలిసి, యరయవలయును బుధులు గాయత్రియందు.

సీ॥ భూతంబు లయిమును భూతగణంబులు, జ్ఞానకర్మేంద్రియసంచయంబు
ప్రాణాదిమారుతపంచకంబును వాయు,వులును వ్యక్తావ్యక్తములును నందు
తత్త్వంబులని వర్ణతత్త్వజ్ఞు లిట్టులు, వచియింతు రాగమవాక్యములను
వితతసంపుటములు విస్తృతసుముఖముల్, షట్సప్తముఖము లంగజలియు వ్యాప

గీ॥ కంబు శకటంబు యమపాశకంబు కథిత, మున్ముఖాధోముఖంబులు నొనరముష్టి
కంబు మత్స్యంబు కూర్మపల్లంబనములు,ముద్గరవరాహపల్లవంబులుసుమఱియు.

గీ॥ యోనిసురభిత్రిశూలముల్ మౌనివర్య, అక్షమాలాబ్జలింగంబులటుల నవల
నలసుసింహమహాక్రాంతములుగనంగ,ముఖ్యములుసుమ్మిగాయత్రిముద్రలివియు

క॥ అని యిత్తెఱఁగునఁ దెల్పిన, విని నారదమౌని మౌనివిభునకు ననిర్మో
మనమున సంశయ మొక్కటి, జనియించెఁ దన్నివృత్తి సలుపఁగవలయున్.

గీ॥ జగతి నిరువదినాల్గు మిగశ్రింపుఁగళల, బద్ధుఁడగు జీవుఁ డెబ్బంగి బ్రహ్మభావ
మందు దేహంబునిఖిల దేవాత్మకంబు, మంత్రరూపంబునగునట్టిమాడ్కి యెటులొ.

గీ॥ మఱియు గాయత్రికినిమూలమంత్రమునను,న్యాసవిధు లెట్టులో ఋషినామములును
ఛందమును నధిదైవంబుచందమెట్లొ, యనిన నారాయణుఁడు మునికనియె నిట్లు.

వ॥ మఱియు సావధానంబుగా వినుము, గాయత్రీకవచస్తోత్రంబునకు మూర్తి
త్రయంబు ఋషులు; చతుర్వేదంబులు ఛందంబులు; పరబ్రహ్మరూపిణి యగు
గాయత్రి దేవత. ప్రథమపాదాదిబీజంబు, ద్వితీయపాదాది శక్తి, తృతీయపాదాది
కీలకంబు; మోక్షార్థంబగు జపంబున నిది వినియుక్తంబు. మంత్రం బాఱు ఖండం
బులు చేసి ప్రణవాదిగ హృదయ మారంభించి యస్త్రాంతంబుగ బ్రహ్మవిష్ణు
రుద్రేశ్వర సదాశివ పరబ్రహ్మాత్మకంబుగ నంగన్యాసం బొనర్చి ప్రణవాది యగు
లోకత్రయోచ్చారణంబున దిగ్బంధనం బొనర్చి యనంతరంబు. ౧౭

సీ॥ తామ్రప్రవాళకారక్తస్వరహరినీల,ధవళదీధితులు వక్త్రముల మెఱయ
సూర్యచంద్రానలాక్షులతోడ మణికీలి,తాంబుజాహితకిరీటంబుతోడఁ

దత్త్వార్థవర్ణ తాదాత్మ్యమై వరదాభ,యాంకుశకశలు*గదాబ్జయుగళ
శంఖకపాలముల్ చక్రంబు కరములఁ, దాలిచి త్రిజగదాధార యగుచు

తే॥ బ్రహ్మ తేజోవిడంబవిభ్రాజమాన, మూర్తిఁ జెలువొంది భక్తానువర్తినిపయి
యలరు దేవి వటంచు గాయత్రి నాత్మఁ, దలఁచి భజియించవలె ధ్యానతత్పరుండు.

సీ॥ పదపడి కవచంబు పఠియింపఁదగుఁ దత్క్రమం బెల్ల వివరింతు మౌనివర్య!
హరిదిశ గాయత్రి యమదిశ సావిత్రి, పశ్చాన్ముఖంబున బ్రహ్మసంధ్య
రైనాథుదిశను సరస్వతి నాగ్నేయిఁ, బార్వతి యసుర దిగ్భాగమునను
దానవహంత్రి సదాశివు దిక్కున, పావమానియు శూలపాణిదిశను

తే॥ రాత్రి యూర్ధ్వాధరంబుల బ్రాహ్మిమఱి, వైష్ణవిని బ్రోవుమని వేడి ఫలమునందు
నిచ్చఁబోఁదోలి విప్రుండు నిచ్చలు మది, నంగకవచంబు పఠియింపనగు మునీంద్ర!

వ॥ తత్క్రమంబు వివరించెద, మంత్రంబునఁ బ్రథమపదంబు పాదంబులును, రెండవది జంఘలును, మూఁడవది కటిప్రదేశంబును, నాల్గవది నాభియు, పంచమంబు హృదయంబును, షష్ఠంబు గల్లంబులును, సప్తమంబు నేత్రంబులును, నష్టమంబు లలాటంబును, నవమంబు శిరంబును, దశమంబు శిఖయును రక్షింపవలె నని పదన్యాసం బొనర్చి శిరఃఫాలచక్షుశ్చుబుక కంఠస్కంధ హస్తద్వయ హృదయోదర నాభికటిగుహ్యవృషణజానుజంఘాగుల్భపాదంబులఁ జతుర్వింశదంగంబులఁ జతుర్వింశాక్షరంబులు రక్షించు నని న్యాసింపవలయు; నేతత్ప్రకారంబునఁ గవచం బొనర్చువానికిఁ జతుష్షష్టికళాబంధనంబులఁ బ్రత్యంగంబులను బఠనశ్రవణంబులఁ బాతకముక్తియు గోసహస్రదానఫలంబును బ్రహ్మభూయంబును నగునని చెప్పిన నారదుం డిట్లనియె. ౨౦

క॥ దేవా! గాయత్రీ హృద, యావిర్భవనంబు దెల్పుమని వేడినఁ బుం
భావబ్రహ్మంబగు ముని, యావలికథఁ దెలుపఁదొడఁగె నధికప్రీతిన్. ౨౧

సీ॥ ఎద్ది యెఱింగిన నిహపరంబులు రెండు, కరగతంబులు భక్తికలితునకును
హృదయవిజ్ఞానంబు నెఱుఁగఁ గల్గుట మంత్ర,విజ్ఞానమున కన్నవే గుణములు
తత్క్రమం బెఱిఁగింతుఁ దత్పరుండవుగమ్ము,ఋషి ప్రజాపతియని యెఱిఁగికొనుము
పరమాత్మ దేవత పరఁగ గాయత్రియే, ఛందంబు తత్త్వంబు జ్వాలనమరయ

గీ॥ వ్యాహృతుల్ శక్తులై చను వశపసహలు,లక్షలును బీజములు బిందులలితములయి
తెలియుటకు గోప్యమిది సుమ్ము తెలిసెనేని, దేవలోకాదులగు దేటతెల్లముగను.

---

* టిప్పణి: మూలములో గదా అనిలేదు, గుణశబ్ద మున్నది. వైదిక పాఠానుసారముగ గ్రంథకర్త అనువదించెనని తెల్పెడి.

క॥ నా విని నారాయణముని, తో విబుధఋషీంద్రుఁ డనియె ◊ దుస్తరమగు నీ
దేవీచరిత్ర మస్మ, త్సేవధి నై చెప్పి కాళ! ◊ దెలుపు మటనిర్ల. ౨౩

వ॥ తదనంతరంబ నారాయణుండు వచించె ఋషిచ్ఛందో దేవతావర్ణ స్వరబీజముద్ర లెఱింగి మూర్తిధ్యానం బొనర్చి మంత్రార్థగతమనస్కుం డై సిద్ధాసనంబున వసించి, శిరంబున బ్రహ్మయు శిఖను విష్ణుండును ఫాలంబున రుద్రుండును హృదయంబునఁ బరమాత్మయుఁ గన్నులఁ జంద్రాదిత్యులును గర్ణంబుల శుక్రబృహస్పతులును దంతంబుల నశ్వినులును నోష్ఠంబున సంధ్యలును ముఖంబున నగ్నియు, జిహ్వను సరస్వతియు వాక్కున బృహస్పతియు స్తనంబుల వసువులు బాహువుల మరుత్తులు వక్షంబునఁ బర్జన్యుండును నుదరంబున నాకసంబును నాభి నంతరిక్షంబును కటి నింద్రాగ్నులును జఘనంబునఁ బ్రజాపతియును ఊరువులఁ గైలాసమలయశైలంబులును జానువుల విశ్వదేవతలును జంఘలఁ గౌశికుండును గుహ్యంబునఁ బితృదేవతలును పాదంబుల వనస్పతులును రోమంబుల ఋషులును నఖంబుల ముహూర్తంబులును అస్థుల గ్రహంబులు నై సంవత్సరంబు నిమేషంబుగా జ్వాలజ్వాలారూపిణియై సహస్రనేత్రయు భక్తవరదయు నగు గాయత్రీదేవిని బ్రహ్మరుద్రాచ్యుతమూర్తినిగా నమస్కరించుట గాయత్రీహృదయం బయ్యె నిది ప్రాతః పఠనంబున రాత్రికృతపాపంబును సాయంపఠనంబున దివకృతపాపంబును బోనడఁచి సర్వతీర్థస్నాతుండును సర్వదేవజ్ఞాతుండునగునని తెల్పిమఱియునిట్లనియె.

సీ॥ జగతి నభావ్యభాషణము నభక్ష్యభక్షణము నవాచ్యవాచన మభోజ్యభోజనంబు నయాజ్యయాజనంబు నపచ్య, పాచనంబు నసూచ్యసూచనంబు
తలఁప నసాధ్యసాధనము. నలేహ్యాలేహనము నపేయపానాదికంబు
లటు లగమ్యాగమనాఘంబు నంటక, దుష్ప్రతిగ్రహజాతదోష మణఁచి

గీ॥ క్రతుసహస్రఫలంబు లొక్కటనె కొనుచు, బ్రహ్మవిజ్ఞానమార్జించి బ్రాహ్మణాయుతములఁ బూజించు ఫలసిద్ధి ◊ తనకుఁ గలిగి, సర్వపాపవిముక్తుఁడై ◊ జపిత వెలయు.

వ॥ అని గాయత్రీహృదయంబును దెల్పిన స్వామీ! పాపనాశకంబగు గాయత్రీహృదయం బెఱింగితిఁ దల్లక్షణం బెఱింగింపుమనిన నారాయణమునీంద్రుండిట్లనియె.

సీ॥ వినుము గాయత్రి సావిత్రి సరస్వతి, బ్రాహ్మి వైష్ణవి రౌద్రి ◊ రక్త ధవళ
అసిత యనందగు ◊ నభిధానవకంబు, దేవికిఁ బొల్చును ◊ దివ్యరూప
మలరు శైశవముచే ◊ నట్టుల మధ్యాహ్న, వేళ యౌవనముచే ◊ వెలయు సంధ్య
వార్ధకంబున నొప్పు ◊ వాలఖిల్యాదులు నట్టుల ధ్యానింతు ◊ రంతరముల

ఆ॥ హంసవృషభగరుడాసనలందు నధిష్ఠించి, ప్రథమనిగమపాఠభరిత యగుచు
ధరణియందుఁ దిరుగు ◊ సురపథంబున యజుః, పఠన సల్పు సామపాడునెలమి.

క॥ మూర్తిత్రయలోకంబుల, మూర్తంబగు రూపుఁదాల్చి ✽ మునులు నుతింపన్
వర్తించు భక్తకోటికి, నార్తుల నెడఁబాపి యిచ్చు ✽ నానందంబున్. ౨౮

సీ॥ వరద దుర్గ వరేణ్య ✽ వరవర్ణిని వరిష్ఠ, సంధ్య సర్వద మార✽జన వినీల
భోగమోక్షద గంగ✽భువనైక మోహిని, యని ముని స్తుతయాచు ✽ నఖిలదిశలఁ
బాతాళమున భోగ✽వతి మర్త్యమునను భా, గీరథి యన జన✽కీర్తిత యయి
మందాకినీనామ✽మహితయై సురపురి, లోకత్రయమునందు ✽ శోకభీతు

గీ॥ లెడలఁ జేసి భువర్లోక ✽ మెక్కి వాయు, శక్తి యగుచు మహర్లోక✽సంచరణత
సిద్ధియగుచుఁ దపోలోక ✽ చిత్రవిహృతి,చేఁ దపస్విని యగుచు ని✽శ్చింత మసలి.

క॥ అంభోజజాతు భారతి, యంభోరుహనేత్రుఁ గమల ✽ యభవుని గౌరీ
కుంభస్తని యన నెల్లెడ, దంభాపేతమగు విహృతిఁ ✽ దనుకుచునుండున్. ౩౦

సీ॥ ముప్పిరిపై నిల్చి ✽ మూలప్రకృతి యాచు, నవల మహామాయ✽యగుచు మీఁదఁ
బరమాత్మతోఁగూడఁ ✽ బరశక్తి యగుచు ని,చ్ఛాక్రియాజ్ఞానసంజ్ఞలఁ దనర్చి
గంగార్కనందినీ✽కాళికీ దేవికా, సరయూ సరస్వతీ ✽ శతద్రువులును
నర్మదైరావతీ ✽ నలినీ విపాశాహి,రణ్యవాహా సింధు✽పుణ్యనదులు

గీ॥ తాపసియు గండకియును గోదావరియును, గోమతీ వేత్రవతులను ✽ గూడియెల్ల
నదులు పరదేవిరూప మ✽నారతంబు, నిగమములు వల్కు నిట్లని ✽ నిశ్చయమున.

వ॥ మఱియు నిడాపింగళాసుషుమ్నలు గాంధారీహస్తిజిహ్వాపూషలును, అలంబుసా కుహూ శంఖిన్యాదులగు శరీరస్థంబులగు నాడికలును, గంఠస్థయగు బ్రాణశక్తియుఁ, దాలుస్థయగు సదాధారయుఁ,బ్రహ్మస్థయగు సదామాలినియు, నుదరస్థయగు కుండలియు, కేశస్థయగు వ్యాపినియుఁ దత్స్వరూపముగా నెఱింగి భగవతీ! దేవీ! త్రిసంధ్యారూపిణి! నీకు జోహారని నుతించి కీర్తింపవలయు. ౩౨

సీ॥ ఇది పాపనాశకం✽బిది మహాసిద్ధియుఁ, గాన నీ సూత్రంబు ✽ కంఠసీమ
నెవ్వండు నిల్పువాఁ✽డిలఁ బుత్రియును నర్థి,యయి తపోవితరణ✽యజ్ఞఫలము
నంది భోగంబుల ✽ ననుభవించి శరీర,సంక్షయంబునను మోక్షంబు నొంది
యపునరావృత్త ✽ మానట్టి పదంబున, నిలుచుఁ దరంగిణీ✽జలములందు

తే॥ స్నానపానాదు లొదవక ✽ సంకటములఁ,బడియు నెందేని మునిఁగిన✽బాపులెత్తి
పలుకు నిది పఠియించినఁ ✽ గలుగు సర్వ,సిద్ధి నిత్యంబు సత్యంబు ✽ చెప్పనేల.

సీ॥ అనిన నారదుఁ డిట్టు✽లనియె నో సర్వజ్ఞ!,సర్వస్వతంత్ర! నీ✽సమ్ముఖమున
శ్రుతిపురాణరహస్య✽సూక్ష్మాంశములు వింటి, నెద్దాన విజ్ఞాన ✽ మెసఁగుచుండు

బ్రహ్మసాక్షాత్కార ॥ పరిణతి యొద్దాన, జీవకోటికి మోక్షసిద్ధి దేన
బ్రహ్మణాళికి నెద్ది ॥ పరలోకగతిహేతు, వెద్దాన మృత్యువు ॥ నెనయకుండు

తే॥ నైహికాముష్మికఫలంబు ॥ లలరు దేన, నట్టి సాధన మొకటి నా ॥ కానతిమ్ము
వేదశాస్త్రపురాణాదివిద్యలందుఁ, జతురుఁడవుగానఁ బ్రార్థింతుసంయమీంద్ర!

మ॥ అనిన న్నారదుఁ జూచి మౌని యనిమెం ॥ బ్రాజ్ఞుండ వీ వన్నిటన్
నినుఁ బోలఁ ధరఁ బ్రశ్న సేయునిపుణు ॥ న్నేఁ గాన సమ్యగ్వచో
జనితోల్లాసముతో వచింతు విను నీ ॥ సందేహము ల్వాయు నో
య్యన మోక్షంబు సుఖోపలబ్ధమగు గాయత్రీకథాకర్ణనన్. 3౫

— గాయత్రీస్తవము —

క॥ దేవీసహస్రనామ,ప్రావీణ్యము భూతకోటి ॥ వడయు శుభంబుల్
గావునఁ బాపధ్వంసక, మై వేదప్రథితమైన ॥ దది వివరింతున్. 3౬

ఉ॥ సృష్టికి నాదికాలమున ॥ జీవుల నెల్లఁ దరింపఁ జేయఁగా
స్రష్ట శ్రుతిస్మృతుల్ వెదకి ॥ సాధుల నెల్లను బ్రోవనెంచి వి
స్పష్టముగా నొనర్చె నఘశాంతికి దేవిసహస్రనామముల్
హృష్టుఁడవై వినందగు సమాహితబుద్ధి వచింతు నారదా! 3౭

సీ॥ ఈ స్తవంబునకు వాణీశుండు ఋషియయ్యె,ఛందం బనుష్టుభంబిందు దేవి
గాయత్రి హల్వర్ణగణ మెల్ల బీజముల్, శక్తు లచ్చులు మునిసార్వభౌమ!
అంగవిన్యాసంబు ॥ హ స్తవిన్యాసంబు, నలరింపఁదగు మాతృకాక్షరములు
ధ్యానంబు రక్త పీత శ్వేతహరినీల, ధవళాననంబులు ॥ తరణిచంద్ర

గీ॥ వహ్నినయనంబులును హంసవాహనంబు, మణికిరీటంబు చక్రంబుసహితకుండి
కాంబుజం బబ్జపీఠంబు ॥ డంబుమీఱ, నమరఁ బూజితమైన గాయత్రిఁదలఁతు.

క॥ అని నెమ్మదిఁ బ్రార్థించుచు, జనితోత్సాహంబుతోడ ॥ సాధకుఁడు స్థిరా
సనమున నిశ్చలుఁడయి యిట్లనినామ స్తవము సల్పనగు నియతుండై. 3౮

వ॥ ఓం అచింత్యలక్షణా, అవ్యక్తా, అర్థమాతా, అమృతార్ణవమధ్యస్థా, అజితా, అపరాజితా, అణిమాదిగుణాధారా, అర్కమండల సంస్థితా, అజరా, అజా, అపరా, అధర్మా, అక్షసూత్రధరా, అధరా, అకారాదిక్షకారాంతా, అరిషడ్వర్గభేదినీ, అంజనాద్రిప్రతీకాశా, అంజనాద్రినివాసినీ, అజితా, అజపా, అవిద్యా, అరవిందనిభేక్షణా, అంతర్బహిస్స్థితా, అవిద్యాధ్వంసినీ, అంతరాత్మికా, అజా, అజముఖావాసా, అరవిందనిభాననా, అర్థమాత్రా, అర్థదా, అనఘా, అరిమండలమర్దినీ, అసురఘ్నీ, అమావాస్యా, అలక్ష్మీఘ్నీ, అంత్యజార్చితా, ఆదిలక్ష్మీః, ఆదిశక్తిః, ఆకృతిః, ఆయతాననా, ఆదిత్యపదవీచారా, ఆదిత్యపరిసేవితా,

ఆచార్యావర్తనా, ఆచారా, ఆదిమూర్తినివాసినీ, ఆగ్నేయీ, అమరీ, ఆద్యా చారా, ఆద్యా, ఆసనస్థితా, ఆధారనిలయా, ఆధారా, ఆకాశాంత నివాసినీ, ఆద్యాక్షరసమాయుక్తా, ఆంతరాకాశరూపిణీ, ఆదిత్యమండలగతా, ఆంతరధ్వాంత నాశినీ, ఇందిరా, ఇష్టదా, ఇష్టా, ఇందీవరనిభేక్షణా, ఇరావతీ, ఇంద్రపదా, ఇంద్రాణీ, ఇంద్రరూపిణీ, ఇక్షుకోదండసంయుక్తా, ఇషుసంధానకారిణీ, ఇంద్ర నీలసమాకారా, ఇళాపింగళరూపిణీ, ఇంద్రాక్షీ, ఈశ్వరీ, ఈహాత్రయవివర్జితా, ఉమా, ఉషా, ఉడునిభా, ఉర్వారుకఫలాననా, ఉడుప్రభా, ఉడుమతీ, ఉడుపా, ఉడుమధ్యగా, ఊర్ధ్వచారిణీ, ఊర్ధ్వకేశా, ఊర్ధ్వాధోగతిభేదినీ, ఊర్ధ్వబాహు ప్రియా, ఊర్మిమాలా వాగ్గ్రంథదాయినీ, ఋతా, ఋషిః, ఋతుమతీ, ఋషి దేవనమస్కృతా, ఋగ్వేదా, ఋణహర్త్రీ, ఋషిమండలచారిణీ, ఋద్ధిదా, ఋజుమార్గస్థా, ఋజుధర్త్రీ, ఋతుప్రదా, ఋగ్వేదనిలయా, ఋజ్వీ, లుప్తధర్మప్రవర్తినీ, లూతారివరసంభూతా, లూతాది విషహారిణీ, ఏకాక్షరా, ఏకమాత్రా, ఏకా, ఏకైకనిష్ఠితా, ఐంద్రీ, ఐరావతారూఢా, ఐహికాముష్మిక ప్రదా, ఓంకారా, ఓషధీ, ఓతా, ఓతప్రోతనివాసినీ, ఔర్వా, ఔషధ సంపన్నా, ఔపాసన ఫలప్రదా, అండమధ్యస్థితా, అఃకారమనురూపిణీ, కాత్యా యనీ, కాళరాత్రీ, కామాక్షీ, కామసుందరీ, కమలా, కామినీ, కాంతా, కామదా, కలకంఠీ, కరికుంభస్తనభరా, కరవీరసువాసినీ, కల్యాణీ, కుండలవతీ, కురుక్షేత్రనివాసినీ, కురువింద దళాకారా, కుండలీ, కుముదాలయా, కాలజిహ్వా, కరాళాస్యా, కాళికా, కాలరూపిణీ, కమనీయగుణా, కాంతిః, కళాధారా, కుము ద్వతీ, కౌశికీ, కమలాకారా, కామచారప్రభంజనీ, కౌమారీ, కరుణాపాంగీ, కకుబంతా, కరిప్రియా, కేసరీ, కేశవనుతా, కదంబకుసుమప్రియా, కాళిందీ, కాళికా, కాంచీ, కలశోద్భవసంస్థితా, కామమాతా, క్రతుమతీ, కామరూపా, కృపావతీ, కుమారీ, కుండనిలయా, కిరాతీ, కీరవాహనా, కైకేయీ, కోకిలా లాపా, కేతకీకుసుమప్రియా, కమండలుధరా, కాళీ, కర్మనిర్మూలకారిణీ, కలహంసగతిః, కక్షా, కృతకౌతుక మంగళా, కస్తూరీతిలకా, కమ్రా, కరీంద్ర గమనా, కుహూః, కర్పూరలేపనా, కృష్ణా, కపిలా, కుహరాశ్రయా, కూటస్థా, కుధరా, కంప్రా, కుక్షిస్థాఖిలవిష్టపా, ఖడ్గఖేటకరా, ఖర్వా, ఖేచరీ, ఖగవాహనా, ఖట్వాంగధారిణీ, ఖ్యాతా, ఖగరాజోపరిస్థితా, ఖలఘ్నీ, ఖండితజరా, ఖండాఖ్యానప్రదాయినీ, ఖండేందు తిలకా, గంగా, గణేశగుహ పూజితా, గాయత్రీ, గోమతీ, గీతా, గాంధారీ, గానలోలుపా, గౌతమీ, గామినీ, గాధా, గంధర్వాప్సరసేవితా, గోవిందచరణాక్రాంతా, గుణ త్రయవిభావితా, గంధర్వీ, గహ్వరీ, గోత్రా, గిరిశా, గహనా, గమీ, గుహావాసా, గుణవతీ, గురుపాపప్రణాశినీ, గుర్వీ, గుణవతీ, గుహ్యా

గోప్తవ్యా, గుణదాయినీ, గిరిజా, గుహ్యామాతంగీ, గరుడధ్వజవల్లభా, గర్వాపహారిణీ, గోదా, గోకులస్థా, గదాధరా, గోకర్ణనిలయాసక్తా, గుహ్యామండలవర్తినీ, ఘర్మదా, ఘనదా, ఘంటా, ఘోరదానవమర్దినీ, ఘృణిమంత్రమయీ, ఘోషా, ఘనసంపత్తిదాయినీ, ఘంటారవప్రియా, ఘ్రాణా, ఘృణిసంతుష్టికారిణీ, ఘనారిమండలా, ఘూర్ణా, ఘృతాచీ, ఘనవేగినీ, జ్ఞానధాతుమయీ, చర్చా, చర్చితా, చారుహాసినీ, చటులా, చండికా, చిత్రా, చిత్రమాల్యవిభూషితా, చతుర్భుజా, చారుదంతా, చాతురీ, చరితప్రియా, చూళికా, చిత్రవస్త్రాంతా, చంద్రమఃకర్ణకుండలా, చంద్రహాసా, చారుదాత్రీ, చకోరీ, చంద్రహాసినీ, చంద్రికా, చంద్రధాత్రీ, చౌరీ, చోరా, చండికా, చంచద్వాగ్వాదినీ, చంద్రచూడా, చోరవినాశినీ, చారుచందనలిప్తాంగీ, చంచచ్చామరవీజితా, చారుమధ్యా, చారుగతిః, చందిలా, చంద్రరూపిణీ, చారుహోమప్రియా, చార్వా, చరితా, చక్రబాహుకా, చంద్రమండలమధ్యస్థా, చంద్రమండలదర్పణా, చక్రవాకస్తనీ, చేష్టా, చిత్రా, చారువిలాసినీ, చిత్స్వరూపా, చంద్రమతీ, చంద్రమాః, చందనప్రియా, చోదయిత్రీ, చిరప్రజ్ఞా, చాతకా, చారుహేతుకీ, ఛత్రయాతా, ఛత్రధరా, ఛాయా, ఛందఃపరిచ్ఛదా, ఛాయాదేవీ, ఛిద్రనఖా, ఛన్నేంద్రియవిసర్పిణీ, ఛందోన్యుష్టుప్ప్రతిష్ఠాంతా, ఛిద్రోపద్రవభేదినీ, ఛేదా, ఛత్రేశ్వరీ, ఛిన్నా, ఛురికా, ఛేదనప్రియా, జననీ, జన్మరహితా, జాతవేదా, జగన్మయీ, జాహ్నవీ, జటిలా, జేత్రీ, జరామరణవర్జితా, జంబూద్వీపవతీ, జ్వాలా, జయంతీ, జలశాలినీ, జితేంద్రియా, జితక్రోధా, జితామిత్రా, జగత్ప్రియా, జాతరూపమయీ, జిహ్వా, జానకీ, జగతీ, జరా, జనిత్రీ, జహ్నుతనయా, జగత్త్రయహితైషిణీ, జ్వాలాముఖీ, జపవతీ, జ్వరఘ్నీ, జితవిష్టపా, జితాక్రాంతమయీ, జ్వాలా, జాగ్రతీ, జ్వరదేవతా, జ్వలంతీ, జ్వలదా, జ్యేష్ఠా, జ్యాఘోషాస్ఫోటదిఙ్ముఖీ, జంభినీ, జృంభణా, జృంభా, జ్వలన్మాణిక్యకుండలా, ఝింఝికా, ఝణనిర్ఘోషా, ఝంఝామారుతవేగినీ, ఝల్లకీవాద్యకుశలా, ఞరూపా, ఞభుజా, టంకబాణసమాయుక్తా, టంకినీ, టంకభేదినీ, టంకీగుణకృతాఘోషా, టంకనీయమహోరసా, టంకారకారిణీ, ఠఠశబ్దనినాదినీ, డామరీ, డాకినీ, డింభా, డుండుమారైకనిర్జితా, డామరీతంత్రమార్గస్థా, డమడ్డమరునాదినీ, డిండీరవసహా, డింభలసత్క్రీడాపరాయణా, ఢుంఢివిఘ్నేశజననీ, ఢక్కాహస్తా, ఢిలివ్రజా, నిత్యజ్ఞానా, నిరుపమా, నిర్గుణా, నర్మదా, నదీ, త్రిగుణా, త్రిపదా, తంత్రీ, తులసీ, తరుణా, తరుః, త్రివిక్రమపదాక్రాంతా, తురీయపదగామినీ, తరుణాదిత్యసంకాశా, తామసీ, తుహినా, తురా, త్రికాలజ్ఞానసంపన్నా, త్రివళీ, త్రిలోచనా, త్రిశక్తిః, త్రిపురా, తుంగా, తురంగవదనా, తిమింగిలగిలా, తీవ్రా, త్రిస్రోతా, తామసాదినీ, తంత్రమంత్రవిశేషజ్ఞా, తను

మధ్యా, త్రివిష్టపా, త్రిసంధ్యా, త్రిస్తనీ, తోషాసంస్థా, తాలప్రతాపినీ, తాటంకినీ, తుషారాభా, తుహినాచలవాసినీ, తంతుజాల సమాయుక్తా, తారహారావళిప్రియా, తిలహోమప్రియా, తీర్థా, తమాలకుసుమాకృతిః, తారకా, త్రియుతా, తన్వీ, త్రిశంకుపరివారితా, తలోదరీ, తిలాభూషా, తాటంకప్రియవాహినీ, త్రిజటా, తిత్తిరీ, తృష్ణా, త్రివిధా, తరుణాకృతిః, తప్తకాంచనసంకాశా, తప్తకాంచన భూషణా, త్రియంబకా, త్రివర్గా, త్రికాలజ్ఞానదాయినీ, తర్పణా, తృప్తిదా, తృప్తా, తామసీ, తుంబురుస్తుతా, తార్క్ష్యస్థా, త్రిగుణాకారా, త్రిభంగీ, తనువల్లరీ, థాత్కారీ, థారవా, థాంతా, దోహినీ, దీనవత్సలా, దానవాంతకరీ, దుర్గా, దుర్గాసురనిబర్హిణీ, దేవరీతిః, దివారాత్రిః, ద్రౌపదీ, దుందుభిస్వనా, దేవయానీ, దురావాసా, దారిద్ర్యభేదినీ, దివా, దామోదరప్రియా, దీప్తా, దిగ్వాసాః, దిగ్విమోహినీ, దండకారణ్య నిలయా, దండినీ, దేవపూజితా, దేవవంద్యా, దివిషదా, ద్వేషిణీ, దానవాకృతిః, దీనానాథస్తుతా, దీక్షా, దైవతాదిస్వరూపిణీ, ధాత్రీ, ధనుర్ధరా, ధేనుః, ధరిణీ, ధర్మచారిణీ, ధురంధరా, ధరాధారా, ధనదా, ధాన్యదోహినీ, ధర్మశీలా, ధనాధ్యక్షా, ధనుర్వేదవిశారదా, ధృతిః, ధన్యా, ధృతపదా, ధర్మరాజప్రియా, ధ్రువా, ధూమావతీ, ధూమకేశీ, ధర్మశాస్త్రప్రకాశినీ, నందానందప్రియా, నిద్రా, నృనుతా, నందనాత్మికా, నర్మదా, నళినీ, నీలా, నీలకంఠసమాశ్రయా, నారాయణప్రియా, నిత్యా, నిర్మలా, నిర్గుణా, నిధిః, నిరాధారా, నిరుపమా, నిత్యశుద్ధా, నిరంజనా, నాదబిందుకళాతీతా, నాదబిందు కళాత్మికా, నృసింహినీ, నగధరా, నృపనాగ విభూషితా, నరకక్లేశశమనీ, నారాయణపదోద్భవా, నిరవద్యా, నిరాకారా, నారదప్రియకారిణీ, నానాజ్యోతిస్సమాఖ్యాతా, నిధిదా, నిర్మలాత్మికా, నవసూత్రధరా, నీతిః, నిరుపద్రవ కారిణీ, నందజా, నవరత్నాఢ్యా, నైమిశారణ్యవాసినీ, నవనీతప్రియా, నారీ, నీలజీమూతనిస్వనా, నిమేషిణీ, నదీరూపా, నీలగ్రీవా, నిశీశ్వరీ, నామావళిః, నిశుంభఘ్నీ, నాగలోకనివాసినీ, నవజాంబూనదప్రఖ్యా, నాగలోకాధిదేవతా, నూపురాక్రాంత చరణా, నరచిత్రప్రమోదినీ, నిమగ్నా, రక్తనయనా, నిర్ఘాత సమనిస్వనా, నందనోద్యాన నిలయా, నిర్వ్యూహోపరిచారిణీ, పార్వతీ, పరమోదారా, పరబ్రహ్మాత్మికా, పరా, పంచకోశవినిర్ముక్తా, పంచపాతక నాశినీ, పరచిత్తవిధానజ్ఞా, పంచికా, పంచరూపిణీ, పూర్ణిమా, పరమా, ప్రీతిః, పరతేజఃప్రకాశినీ, పురాణీ, పౌరుషీ, పుణ్యా, పుండరీకనిభేక్షణా, పాతాళతలనిర్మగ్నా, ప్రీతా, ప్రీతివివర్ధినీ, పావనీ, పాదసహితా, పేశలా, పవనాశినీ, ప్రజాపతీ, పరిశ్రాంతా, పర్వతస్తనమండలా, పద్మప్రియా, పద్మసంస్థా, పద్మాక్షీ, పద్మసంభవా, పద్మపత్రా, పద్మపదా, పద్మినీ, ప్రియభాషిణీ, పశుపాశవినిర్ముక్తా, పురంధ్రీ, పురవాసినీ, పుష్కలా,

పురుషా, పర్వా, పారిజాతసుమప్రియా, పతివ్రతా, పవిత్రాంగీ, పుష్పహాసా, పరాయణా, ప్రజ్ఞానతీసుతా, పాత్రీ, పుత్త్రపూజ్యా, పయస్వినీ, పట్టిపాశధరా, పఙ్క్తిః, పితృలోకప్రదాయినీ, పురాణీ, పుణ్యశీలా, ప్రణతార్తివినాశినీ, ప్రద్యుమ్నజననీ, పుష్టా, పితామహపరిగ్రహా, పుండరీక పురావాసా, పుండరీక సమాననా, పృథుజంఘా, పృథుభుజా, పృథుపాదా, పృథూదరీ, ప్రవాళశోభా, పింగాక్షీ, పీతవాసాః; ప్రచాపలా; ప్రసవా; పుష్టిదా, పుణ్యా, ప్రతిష్ఠా; ప్రణవాగతిః; పంచవర్ణా; పంచవాణీ; పంచికా, పంజరస్థితా; పరమాయా; పరంజ్యోతిః; పరప్రీతిః; పరాగతిః, పరాకాష్ఠా, పరేశానీ, పావనీ, పావకద్యుతిః, పుణ్యాభద్రా, పరిచ్ఛేద్యా, పుష్పహాసా, పృథూదరా, పీతాంగీ, పీతవసనా, పీతశయ్యా, పిశాచినీ, పీతక్రియా, పిశాచఘ్నీ, పాటలాక్షీ, పటుక్రియా, పంచభక్ష్యా, ప్రియాచారా, పూతనా, ప్రాణఘాతినీ, పున్నాగవనమధ్యస్థా, పుణ్యతీర్థనిషేవితా, పంచాంగీ, పరాశక్తిః, పరమాహ్లాదకారిణీ, పుష్పకాండస్థితా, పూషా, పోషితాఖిలవిష్టపా, పానప్రియా, పంచశిఖా, పన్నగోపరిశాయినీ, పంచమాత్రాత్మికా, పృథ్వీ, పథికా, పృథుదోహినీ, పురాణన్యాయమీమాంసా, పాటలీ, పుష్పగంధినీ, పుణ్యప్రజా, పారదాత్రీ, పరమార్గైకగోచరా, ప్రవాళశోభా, పూర్ణాశా, ప్రణవా, పల్లవోదరీ, ఫలినీ, ఫలదా; ఫల్గుః, ఫూత్కారీ; ఫలకాకృతిః; ఫణీంద్రభోగశయనా; ఫణిమండలమండితా; బాలబాలా; బహుమతా; బాలాతపనిభాంశుకా; బలభద్రప్రియా; వంద్యా; బడబా; బుద్ధిసంస్థితా; బందీదేవీ; బిలవతీ; బడిశఘ్నీ; బలిప్రియా; బాంధవీ; బోధితా; బుద్ధిః; బంధూకకుసుమప్రియా; బాలభానుప్రభాకారా; బ్రాహ్మీ; బ్రాహ్మణదేవతా; బృహస్పతిస్తుతా; బృందా; బృందావనవిహారిణీ, బలాకినీ; బిలాహారా; బిలావాసా; బహూదకా; బహునేత్రా, బహుపదా; బహుకర్ణావతంసికా; బహుబాహుయుతా; బీజరూపిణీ, బహురూపిణీ; బిందునాదకళాతీతా; బిందునాదస్వరూపిణీ; బద్ధగోధాంగుళిత్రాణా; బదర్యాశ్రమవాసినీ; బృందారకా; బృహత్స్కంధా; బృహతీ; బాణపాతినీ; బృందాధ్యక్షా; బహునుతా; వనితా; బహువిక్రమా; బద్ధపద్మాసనాసీనా; బిల్వపత్రతలస్థితా; బోధిద్రుమనిజావాసా; బడిస్థా; బింబదర్పణా; బాలా; బాణాసనవతీ; బడబానలవేగినీ; బ్రహ్మాండ బహిరంతస్థా; బ్రహ్మకంకణసూత్రిణీ; భవానీ; భీషణవతీ; భావినీ; భయహారిణీ; భద్రకాళీ; భుజంగాక్షీ, భారతీ; భారతాశయా; భైరవీ; భీషణాకారా, భూతిదా; భూతిమాలినీ; భామినీ; భోగనిరతా; భద్రదా; భూరివిక్రమా; భూతవాసా; భృగులతా; భార్గవీ; భూసురార్చితా; భాగీరథీ; భోగవతీ; భువనస్థా, భిషగ్వరా, భామినీ, భోగినీ, భాషా, భూరిదక్షిణా, భర్గాత్మికా, భీమవతీ, భవబంధ

టిప్పణి: కొన్ని పునరుక్తులు వ్యాఖ్యాతలు సవరించెను. ఈపుటలోని 'భామినీ' పునరుక్తిని స్పృశింపనే లేదు.

విమోచనీ, భజనీయా, భూతధాత్రీరంజితా, భువనేశ్వరీ, భుజంగవలయా, భీమా, భేరుండా, భాగధేయినీ, మాతా, మాయా, మధుమతీ, మధుజిహ్వా, మధుప్రియా, మహాదేవీ, మహాభాగా, మాలినీ, మీనలోచనా, మాయాతీతా, మధుమతీ, మధుమాంసా, మధుద్రవా, మానినీ, మధుసంభూతా, మిథిలాపురవాసినీ, మధుకైటభసంహర్త్రీ, మేదినీ, మేఘమాలినీ, మందోదరీ, మహామాయా, మైథిలీ, మసృణప్రియా, మహాలక్ష్మీః, మహాకాళీ, మహాకన్యా, మహేశ్వరీ, మహేంద్రీ, మేరుతనయా, మందారకుసుమార్చితా, మంజుమంజీరచరణా, మోక్షదా, మంజుభాషిణీ, మధురద్రావిణీ, ముద్రా, మలయా, మలయాన్వితా, మేధా, మరకతశ్యామా, మాగధీ, మేనకాత్మజా, మహామారీ, మహావీరా, మహాశ్యామా, మనుస్తుతా, మాతృకా, మిహిరాభాసా, ముకుందపదవిక్రమా; మూలాధారస్థితా; ముగ్ధా; మణిపూరకవాసినీ; మృగాక్షీ; మహిషారూఢా; మహిషాసురమర్దినీ; యోగాసనా; యోగగమ్యా; యోగా; యౌవనకాశ్రయా; యౌవనీ; యుద్ధమధ్యస్థా; యమునా; యుగధారిణీ; యక్షిణీ; యోగయుక్తా; యక్షరాజప్రసూతినీ; యాత్రా; యానవిధానజ్ఞా; యదువంశసముద్భవా; యకారాది హకారాంతా; యజుషీ; యజ్ఞరూపిణీ; యామినీ; యోగనిరతా; యాతుధాన భయంకరీ; రుక్మిణీ; రమణీ;రామా; రేవతీ; రేణుకా; రతిః; రౌద్రీ; రౌద్రప్రియాకారా; రామమాతా; రతిప్రియా; రోహిణీ; రాజ్యదా; రేవా; రమా; రాజీవలోచనా; రాకేశీ; రూపసంపన్నా; రత్నసింహాసనస్థితా; రక్తమాల్యాంబరధరా; రక్తగంధానులేపనా; రాజహంస సమారూఢా; రంభా; రక్తబలిప్రియా; రమణీయయుగాధారా; రాజితాఖిల భూతలా; రురుచర్మ పరీధానా; రథినీ; రత్నమాలికా; రోగేశీ; రోగశమనీ; రావిణీ; రోమహర్షిణీ; రామచంద్ర పదాక్రాంతా; రావణచ్ఛేదకారిణీ; రక్తవస్త్ర పరిచ్ఛన్నా; రథస్థా; రుక్మభూషణా; లజ్జాధిదేవతా; లోలా; లలితా; లింగధారిణీ; లక్ష్మీః, లోలా, లుప్తవిషా; లోకినీ; లోకవిశ్రుతా; లజ్జా; లంబోదరీ; లలనా; లోకధారిణీ; వరదా; వందితా; విద్యా; వైష్ణవీ; విమలాకృతిః; వారాహీ; విరజా; వర్షా; వరలక్ష్మీః; విలాసినీ; వినతా; వ్యోమమధ్యస్థా; వారిజాసనసంస్థితా; వారుణీ; వేణుసంభూతా; వీతిహోత్రా; విరూపిణీ; వాయుమండలమధ్యస్థా; విష్ణురూపా; విధిప్రియా, విష్ణుపత్నీ; విష్ణుమతీ; విశాలాక్షీ; వసుంధరా; వామదేవప్రియా; వేళా; వజ్రిణీ; వసుదోహినీ; వేదాక్షరపరీతాంగీ; వాజపేయఫలప్రదా; వాసవీ; వామజననీ; వైకుంఠనిలయా; వరా; వ్యాసప్రియా; వర్మధరా; వాల్మీకి పరిసేవితా; శాకంభరీ; శివా; శాంతా; శారదా; శరణాగతిః; శాతోదరీ; శుభాచారా; శుంభాసుర విమర్దనీ; శోభావతీ; శివాకారా; శంకరార్ధశరీరిణీ; శోణా; శుభాశయా; శుభ్రా; శిరస్సంధానకారిణీ;

శరావతీ; శరానందా; శరజ్జ్యోత్స్నా; శుభాననా; శరభా; శూలినీ; శుద్ధా; శబరీ; శుకవాహనా; శ్రీమతీ; శ్రీధరానందా; శ్రవణానందదాయినీ; శర్వాణీ; శర్వరీవంద్యా; షడ్భాషా; షడృతుప్రియా; షడాధారస్థితా; షణ్ముఖప్రియకారిణీ; షడంగరూపా; సుమతీ; సురాసురనమస్కృతా; సరస్వతీ; సదాధారా; సర్వమంగళకారిణీ; సామగానప్రియా; సూక్ష్మా; సావిత్రీ; సామసంభవా; సర్వావాసా; సదానందా; సుస్తనీ; సాగరాంబరా; సర్వైశ్వర్యప్రియా; సిద్ధిః; సాధుబంధుపదక్రమా; సప్తర్షిమండలగతా; సోమమండలవాసినీ; సర్వజ్ఞా; సాంద్రకరుణా; సమానాధికవర్జితా; సర్వోత్తుంగా; సంగహీనా; సద్గుణా; సకలేష్టదా; సరఘా; సూర్యతనయా; సుకేశీ; సోమసంహతిః; హిరణ్యవర్ణా; హరిణీ; హ్రీంకారీ; హంసవాహినీ; క్షౌమవస్త్రపరీతాంగీ; క్షీరాబ్ధితనయా; క్షమా; గాయత్రీ; సావిత్రీ; పార్వతీ; సరస్వతీ; వేదగర్భా; వరారోహా; శ్రీగాత్రీ; పరాంబికా.

వ॥ ఇత్తెఱంగున సుకృతప్రదంబును పాపహరంబును సంభవత్సంపత్ఫలకంబును నగు గాయత్రీసహస్రనామస్తవం బొనర్చి నిరంతరంబు జపహోమ తర్పణాదులం దనుప వలయు; కృష్ణాకృష్ణాష్టముల యందు విశేషించి పఠితవ్యంబు, ఇయ్యది భక్తుండును శిష్యుండును నగువానికి నొసంగ వలయు; భ్రష్టసాధకమూఢాదుల కుం దెలుపంబనిలేదు. ఇది లిఖించి సన్నిధి నునిచికొనిన లక్ష్మి చంచల యయ్యును వానియింట ననారతంబు నిలుచు; నిది గుహ్యంబును దరిద్రులకు నిధిప్రదంబును ముముక్షువులకు మోక్షదంబును కాములకుఁ గామప్రదంబును నగు; రోగుల నరోగులం జేయు బ్రహ్మహత్యాది పంచ మహాపాతకంబులఁ దొలంగించి బ్రహ్మసాయుజ్యం బొసంగు; నిది సత్యంబని త్రిరుచ్చారణంబుగాఁ దెలిపిన నారదుండు దేవా! సహస్రనామస్తోత్రంబు శ్రుతంబయ్యె, నింక దీక్షాలక్షణంబు సవిస్తరంబుగాఁ దెలుపందగునని వేడిన నారాయణుం డిట్లనియె. ౪౦

—• గాయత్రీదీక్షాలక్షణము •—

సీ॥ పరమేష్ఠినందన! ✱ పరమపావనమగు, ప్రశ్నం బొనర్చితి ✱ పరమహర్ష
సహితుండనైతి దీక్షాలక్షణం బేను, వివరింతు సద్భక్తి ✱ వీను లలర
వినుము విప్రుఁడు వేదవిధులందు నధికారి, యిది లేక కానేరఁ డింత ✱ నిజము
ముక్తిసిద్ధ మ్మిది ✱ మూలంబు నరులకుఁ, ద్రివిధమై యుండు నీ ✱ దీక్ష తెఱఁగు

టిప్పణి:—ఈ గాయత్రీదీక్ష మొదలుకొని స్కంధసమాప్తివఱకును నొక యక్షరముకూడ నేఁటి మూలగ్రంథమునకు సరిపడదు. అది వేఱు, ఇది వేఱు. కారణము: గ్రంథకర్తకు దొరకిన గ్రంథమునందలి మార్పే. ఇప్పు డుపలబ్ధమగు గ్రంథ పాఠములకును పూర్వమీయనకు లభించిన పాఠములకును నెన్నో చోట్ల నెన్నో వ్యత్యాసములు గలవు. ఈయన యనువాదమునందు ద్వాదశైకాదశ స్కంధములు పూర్తిగాఁ దాఱుమాఱైనవి. మొత్తమునకు సరిపడినను ఆ స్కంధమున నున్నది యీ స్కంధము నందును, ఇందలిది యందును నుండుట కొంతచిక్కును గల్పించును. ఈ చిక్కు మూలమును దీనితోఁ బోల్చి చూచువారికేగాని తదితరుల కుండదు. అట్లు పరిశీలించువారు విమర్శకులు. వారికొఱకే యీ మాటలు వ్రాయవలసివచ్చినది. వెం॥ శా॥

ఆ॥ అర్థహీనులయిన * నాచార్యకరుణయే, కారణంబు భక్తి * గలుగునేని
మండలాధిపహిత * మహితసంఘటనంబు, గలుగు టరిదిగాఁ * గ్రమము కలదె!

క॥ సంసారనివృత్తికి నా,శంసించుచు నుండువాని * సద్గురుఁ డఘవి
ధ్వంసనముఁ బొందఁ గోని మీ,మాంస యొనర్చుచుఁ ద్రియాస * మాహితగతిచే.

సీ॥ ఆజ్యంబు తిలలును * నాదిగాఁ గల్గు హో,మద్రవ్యసంతతి * మహితతృప్తి
సంగ్రహించి యథోక్త * శాస్త్రపద్ధతి విరా,గత నంఘ్రిగతుఁడై నఁ * గలుషమడఁగ
శిష్యుని శోధించి * స్థిరత విమర్శించి, కర్మ మనోవాక్య * గతులు దెలిసి
భగవన్మయంబైన * పరతత్త్వ మెల్లనుఁ, దా నని యద్వైత * తత్పరుఁడయి

గీ॥ దీక్ష యొసఁగిన ఫలసిద్ధి * యాక్షణంబ, గల్గు సర్వాంతరస్థుఁడై * కైటభారి
నిండియుండుట గురుశిష్య * లొండొరులకు,నాశ్రయాశ్రయి భావంబు * లందికొనరె.

సీ॥ వ్యాపకభేదంబు * వ్యాప్యభేదంబును, నుభయమిశ్రింబునై * యొప్పు నిదియ
స్థూలభేదంబును * సూక్ష్మభేదంబును, నుభయసంయుక్తత * నొనరుచుండుఁ
దత్త్వత్రియం బది * తత్త్రివిధంబును, దన్మయం బొప్పును * దత్త్వపరత
విష్ణుతత్త్వం బిదే * వేర్వేఱ విభజించి, యానుపూర్వంబుగా * నరయవలయుఁ

ఆ॥ బిండరూపుఁ డగుచు * భేదభేదంబుల, నండరూపుఁ డగుచు * నలరు హరియె
మంత్రరూపుఁ డగుచు * మాంసపిండము డుల్చి,త్రివిధరూపియగుచు * దీప్తి వెలయు.

గీ॥ మంత్రముల కెల్ల మూలమై * మంత్రరూపి, యగుచు నివసించి ప్రారబ్ధ * మపనయించి
మంత్రిమంత్రార్థములకై సకే * మూర్థివృత్తి, భేదసంక్షయకర్మము * ల్పనుచు శార్ఙ్గి.

క॥ ఇట్టి యవస్థాత్రియమున, నెట్టనఁ ద్రివిధుండు నగుచు * నీరేజాక్షుం
డిట్టట్టనక జగంబులఁ, గట్టువడి యనుగ్రహించుఁ * గావున నెమ్మిన్. ౪౬

సీ॥ అంకుశం బాదిగ * నండజాధీశాంత,మదియె స్థూలంబని * యాత్మనరసి
కంజాతముఖముగాఁ * గౌస్తుభాంతంబుగా, సూక్ష్మమార్గం బెల్ల * శోధపఱిచి
యాదివరాహాంత * మైన నృసింహంబు, నుభయమిశ్రింబుగా * నూహఁగొల్పి
యస్త్ర మస్త్రార్థంబు * నరసి సప్తదశా,క్షరమగు మంత్రిరా * జమ్ము దెల్పి

తే॥ సర్వసిద్ధిప్రదంబును * సర్వగతము, నగుచు వ్యూహచతుష్టయా * ద్యంతతత్త్వ
సమరసాద్వైతసాయుజ్య * సౌఖ్యద మని,శిష్యశిరమున కీ రీతిఁ * జెప్పవలయు.

సీ॥ సకలంబుఁ దానయ్యు * శక్తిభేదంబుల, సంకోచములఁ జెంది * సంజ్ఞలొంది
మహదహంకారత * న్మాత్రిలై భూతంబు, లై తద్గుణంబుల * నట్లు యింది
యమ్ములు నధికారు * లయి సర్వమెల్లను,భేదభావంబులఁ * బెరసి హరియె
యమ్మహామంత్రింబు * నందు సన్నిధిఁ జేసి, లక్ష్మితో నివసించు * లలితగతుల

గీ॥ బ్రకృతికిఁ బరంబు తనమీఁదఁ బరములేదు, పంచకోద్భూత తత్త్వప్రపంచమెల్ల! దానయయియున్న యటులుండుఁ దన్మహత్త్వ, మెఱిఁగికొన వేదములకైన నఁదరమెతపసి

క॥ ఇవ్విధ మెఱుఁగని వారల, కవ్విధి యొనరింపనగునె యాగమవేద్యం బెవ్వరికి నెఱుఁగనగు నా, కవ్వపుమలదారి యెఱుఁగుఁగద! యిది యెల్లన్.

క॥ ఈ దీక్షావిధి భువి లక్ష్మీదీక్ష యనంగఁ బరఁగుఁ గేవల మఖిలం బాదృతి నేలఁగ మంత్రాప్రాదితుఁడయి తత్త్వబీజపద్ధతి నిలుచున్. ౫౦

క॥ స్థూలము సూక్ష్మముఁ బరమును, శీలించి త్రిధానుకూలశిక్షల శిష్యుల్ లాలించి యొసఁగెనేనియుఁ, గాలాతీతమగు గతిని గాంచు నతండున్. ౫౧

సీ॥ బ్రహ్మచర్యంబునఁ బరిణతులై జితేం, ద్రియ వృత్తి నాచార్యదేవవహ్ని తత్పరులై వర్ణధర్మంబు లరసి సత్యము శౌచమును భక్తి తత్పరతయు సంసారవిరతియు సాధుసంగతియును, గలిగి దక్షత నిష్ఠఁదవిలి నిలుచు వానికి నాచార్యవరుఁడు సద్విధి దీక్ష, యొసఁగుట నిర్వారఁ గొనరు మేలు

ఆ॥ వినిమయంబు గల్గ విధులెల్ల వ్యత్యస్త, భావ మొందు నిహముఁ బరముఁ గలుగ దదియుఁగాన నుభయులారసి గురుశిష్యు, లెఱిఁగి చెలఁగి యాశ్రయింప వలయు.

సీ॥ సంపుటీకృతబీజసంతతుల్ మంత్రముల్, దెలిసి యథావిధి దేశికుండు త్రివిధదీక్షలు సేయఁ దెఱఁగెల్ల నారసి, యొనరింపఁ దద్దీక్ష యుత్తమంబు మధ్యమంబును ద్వంద్వమహితంబునైన స్వ, కాలజంబును భోగగరిమ యొసఁగుఁ బూర్వ పూర్వ మనంతభోగప్రదంబగు, ననుభావమహిమంబు లట్టులగుట

ఆ॥ గురుఁడు ప్రాజ్ఞుఁడైనఁ గోటిగుణంబగు, నజ్ఞుఁడైన నంధుఁడంధుఁ గొనుట సమయవేత్తలైన స్థానిక సంఘంబు, నరసి గురుని దెచ్చు టభిమతంబు.

దీక్షావిధి

వ॥ ఇదియునుంగాక విశేషాచార్యపరిశీలితంబు లగు దీక్షావిధు లైదు విధంబులు, అందు సమస్తులగు విష్ణుచేతస్కుల తెఱంగొండగు; భక్త స్త్రీ విషయం బొండు తెఱంగగు, పుత్రాదుల నొండు తెఱంగగు, సాధకులకు వేఱొక తెఱంగు, సామాన్యులకు వేఱొక విధంబగు, నటులయ్యును బంచవిధంబులు క్రమంబున బ్రహ్మసాయుజ్యఫలదంబు లగు, తత్తదధికారభేదంబుల వేర్వేఱువిధానభేదంబు గలిగియుఁ దత్త్వసంగ్రహం బేకరూపంబై యుండు. సృష్టి సంహారమార్గంబుల మంత్రంబులు తత్తద్బీజసంయుతంబులై ఋషి దేవతాభేదంబుల భిన్నభిన్నంబు లగు, నక్షరపదభేదంబులవలన వ్యూహాదిమూర్తిభేదంబులు యోజించి పంచవింశతి తత్త్వంబులఁ దత్తద్బీజన్యాసంబు సేయందగు, నీశ్వర ప్రకృతి మహదహంకారతన్మాత్రభూతవిషయేంద్రియ దేవతాభేదంబులు శోధించి క్రమం

బున నాచార్యుండు దీక్ష యొసఁగిన నది యనంతఫలదాయకంబగు; తత్త్వసంస్థంబగు మంత్రగణంబు శోధించి శుభదివసంబున హరిం బూజించి నృసింహమంత్రాస్త్ర చక్రమంత్రంబులు శోధించి క్రమంబున నాచార్యుండు దీక్ష యొసంగిన నది యనంత ఫలదాయకం బగు, నభిమంత్రించి పంచగవ్యప్రాశనం బొనర్చి స్వర్ణాదికలశస్థాపనం బొనర్చి విమలోదకంబులఁ బూరించి యర్చించి పీఠంబున నిల్పి పూజించి ప్రదక్షిణక్రమంబున ధూపదీపాదు లర్పించి కుండంబు నందయినను స్థండిలంబునం దైనను హోమం బొనర్చి గురుండు సకలీకృతవిగ్రహుండై శిష్యు నట్లొనరించి తదంగంబులు మంత్రమయంబులుగా ధ్యానించి సకలుండును నిష్కలుండును నగు పురుషోత్తమునితో నేకభావంబుగా భావించి సంసారాబ్ధితారకం బగు మంత్రం బొసంగవలయు. పదంపడి సపాదాంగుష్ఠద్వయపూతంబగు తీర్థంబును దద్భుక్తశేషంబు నొసంగి పరతత్త్వ పిండంబుగా భావించి నిఖిలంబు ప్రతిష్ఠితం బయ్యెనని స్వానుభవబోధంబున శిష్యుఁ గడ తేర్చుట దీక్షాధర్మంబని సావధానంబుగాఁ దెలియందగునని తెల్పిన. ౫౪

సీ॥ తామసోద్భూతతత్త్వప్రపంచంబున, సంభూతులై రాగసహితు లగుచుఁ
పాశబంధములలోఁ బడి యవిద్యాగ్రస్తు, లగుచుఁ గాలనియంత్రణాస్పదులయి
భూతవ్రజం బెల్లఁ బొరలుచుండుట తదీ, యాఘంబు లణఁచుటకై ఫలాభి
వృద్ధిగాంచుటకునై వేదోక్తవిధి గురుం, డనలంబు వేల్వంగ నగు యథోక్త

తే॥ విధిని గృతకృత్యత లభించు వేయునేల, పాదమారంభముగఁ జేసి భక్తశిరము
నవధిగా నిల్చు దురితంబులడఁగ సాంగ,హోమ మొనరింపఁదగునిగ మోక్తఫణితి.

గీ॥ భోగమోక్షద్వయం బెల్లఁ బొసఁగి మాంస,పిండవిచ్ఛేదమును మంత్రపిండసృష్టి
యగుచుఁ బ్రాకృతమగు దేహమడఁగి దివ్య, దర్శనీయతఁ గల్గు బంధములు మడిసి.

గీ॥ కామనాదిహితంబులౌ కర్మములను, వహ్ని వేల్వంగఁ దగు మోక్షవాంఛితులకు
దీనఁ బనియేమిగలదు సందియమువలదు, సర్వసిద్ధుండతఁడు మంత్రసంగ్రహమున.

క॥ తనకును శిష్యునకునుఁ గురుఁ, డనువొందఁగ సూత్రబంధ మలరించి సదా
యనుస్మృతి యెడతీక హుతా,శనకుండాభ్యాసమునను సన్నిధివలయుఁ. ౫౮

వ॥ మఱియు నీశ్వరాది భూమ్యంతంబుగా సృష్టిహోమం బొనర్చి సర్వాంగంబులఁ బ్రారబ్ధబంధంబులగు జీవకళలఁ జాజ్వల్యమానదివ్యజ్యోతిం బ్రవేశం బొనర్చి ప్రదీపాలంకృతంబగు గేహంబునుం బోని తద్దేహంబునఁ దత్త్వగుణంబులు నిర్మూలించి వ్యాపకంబును సర్వమయంబునగు పరమాత్మరూపంబు భావించి మస్తకాది హృదయపర్యంతంబును బరతత్త్వంబుగా భావించి హృదయాదినాభిపర్యంతంబును బ్రధానంబుగా భావించి నాభ్యాదిపాదపర్యంతంబును దన్మాత్రంబుగా భావించి యేకద్విత్రిపంచనవవారంబులు క్రమంబున నీశ్వరప్రధానతన్మాత్రస్మరణంబు చేసి

యేకైకాంగంబులఁ దత్తదంగంబులఁ దత్త్రివిధహోమం బొనర్చి ప్రధానబీజంబున సార్ధత్రింశచ్ఛతంబు వేల్చి శిష్టాంతంబుగాఁ గర్మ సలిపి పూర్ణచంద్రాభం బగు బుద్ధిం దాలుమధ్యంబునఁ గుసుంభరాగసంకాశంబగు నహంకారంబు తాలుమూలంబున రక్తోత్పలద్యుతిధరంబగు మనంబు తాలుకంఠంబున భావించి భాస్వజ్జ్యోతిఃప్రభవంబులై భూతపంచకప్రభలు వెలుఁగ శిష్యునకు నేకమాత్రోచ్చారణంబునఁ గార్మికంబు వదలించి ద్విరుచ్చారణంబున నవస్థలు మాయించి యనుగ్రహింపవలయు. ఈ యగ్నిహోత్రకర్మంబు ప్రభాతంబున నొనర్చుట యుత్తమంబు. ఇట్లు సంపాతహోమాంతంబుగా నొనర్చి సూత్రంబుఁ బూజించి శిష్యుఁడు దక్షిణపాణిఁ బంధించి యాచమనం బొనర్చి సర్వకర్మంబులు కృష్ణార్పణంబుగాఁ జేయవలయు. ౫౯

గీ॥ హోమకాలంబునకుఁ బూర్వకము క్తవిధిని, బంచగవ్యంబు సాధించి పరమనియతి
గురుఁడు శిష్యుండు దురితనిర్వారణ విధిని, నాచరింపంగవలయు సర్వాభిమతము.

సీ॥ ఇత్తెఱంగున హోమ మెల్లఁ బూర్తిగ సల్పి, ప్రక్షాళితాంఘ్రియై పరమనియతి
దేవు జగన్నాథుఁ దీర్ఘపాదుఁ బ్రదక్షి,ణించి, పూజించి యనిందితముగ
నారేయిఁ బ్రణవమాయాదియా వింశతి,వర్ణమంత్రంబు భావన మొనర్చి
శయనించి నడురేయిఁ జక్కమేల్కని పున,శ్శుద్ధుఁడై బలివేసి సుఖదవృత్తి

గీ॥ శంఖభేరీనినాదము లఖిలదిశల, మొరయ సంగతనిస్వనంబులు చెలంగ
నిచ్చవచ్చిన హర్షంబు లెనక మెసఁగఁ, జేయఁదగు నంతటఁ బ్రభాతసిద్ధియగుట.

క॥ ప్రాభాతికహోమంబును, శోభావహవృత్తి సల్పి శుద్ధి దనర దీ
క్షాభేద మెఱిఁగి పవనస,ఖాభిముఖంబుగను విధివదాగమఫణితిన్. ౬౨

గీ॥ మూలమంత్రానుపూర్విగా ముఖ్యవస్తు
సంగ్రహ మొనర్చి ద్రుతసమాస క్తముగను
బూర్ణమగు నాహుతి యొనర్పఁ బోలు స్వస్వ
రూపవిజ్ఞానసంపత్తి రూఢముగను. ౬౩

క॥ ఇది మంత్రదీక్షా పద్ధతి, విదితం బొనరించినాఁడ విను మవ్వల మ
ద్వదనోదిత వాచార్భటి, గదితంబగు మంత్రశుద్ధిగతి వివరింతున్. ౬౪

—॰ మంత్రశుద్ధి వివరము ॰—

గీ॥ దేశికుండు మంత్రసదృఢసిద్ధి సేయంగఁ, దగును దాన మంత్రతండ మెల్ల
శుద్ధినొందుఁగాన నూత్రోక్తవిధి నట్లు, సేయఁదగు యథోక్తసిద్ధి గనఁగ.

సీ॥ భూతబీజంబుల భూతపంచకమును, శోధించి తన్మాత్రశోధనంబు
నట్టుల సల్పి యప్పట్టున జ్ఞానేంద్రియంబులఁ గర్మేంద్రియముల వాని
విషయవర్గంబుల వేర్వేఱ శోధించి, ధ్యానాదిశోధనావాప్తిఁ దనరి
యిటులె ప్రధానంబు నెలమి శుద్ధియొనర్ప, నం దనీశ్వరుఁడు శుద్ధాంశనొందు

గీ॥ సృష్టిసంహారములను విస్పష్టముగను, బరము నొండొరు సంధించి భావశుద్ధి
గాంచవలయును గురుఁడు సమంచితముగ, శిష్యులకు నిట్లె యుపదేశసిద్ధి వలయు.

ఉ॥ ఇట్టుల నాత్మసన్నిధి సమీహితుఁడై నివసించి శిష్యుని
న్నెట్టన నాత్మహస్తమున నిష్ఠితుఁడై స్పృశియింప నీశ్వరుం
దొట్టి వసుంధరాంతముగఁ దోరపుఁదత్త్వములన్ స్మరించి చే
పట్టినవానిఁగాఁ దలఁచి చేయు ననుగ్రహ మెల్ల మేలగున్. ౬౭

క॥ ధాతుత్రిం డట్టులఁ దా గురు, సూత్రింబునఁ బొడము పెల్ల శోధించియు నా
ముత్రిక మెల్లను దనచే, సూత్రించిన యట్ల తెలియు సుఖబోధగతిన్. ౬౮

వ॥ ఇత్తెఱంగునఁ బూర్ణదీక్ష యొసంగి తదవసానంబున శిష్యునకుఁ జిత్తస్థిరీకరణార్థంబుగా సమాధిమర్మంబు నెలవుకొల్పి హృదయంబున మూలమంత్రవిధానంబుగా నాత్మారామంబగు పరతత్త్వంబుఁ బూజింప నెలవుకొలిపినఁ బిండమధ్యగతంబగు తేజస్తత్త్వంబునందుఁ బ్రబోధసామర్థ్యంబును నైశ్వర్యంబును లభించు, దీనంజేసి తత్త్వోత్పత్తియుఁ దత్త్వసంహారంబును నగు, పదంపడి శాంతికర్మంబు లొనర్చి శిష్యుం గరావలంబితుం జేసి ధన్యుండ వైతివని హర్షపూర్వకంబుగా నుగ్గడించిన భ్రమరకీటకన్యాయంబున మంత్రాంతర దేవతాంతర సాధనాంతర రహితుండై శిష్యుండు గురునిపట్ల సర్వతోముఖుండును సర్వవ్యాపకుండును సర్వగురుండునునై వెలుంగునని చెప్పి మఱియును. ౬౯

సీ॥ శిఖచేత శీర్షంబుచే హృన్మయంబైన, మంత్రంబుచే నట్ల మాయచేత
జపమంత్రసూక్తిచే శ్రవణసూక్తంబుల, నింద్రియాంతముగ లక్షయింపవలయు
ఘ్రాణ మారంభించి ఘన హోమకర్మల మానసమ్మునఁ గీర్తి మంత్రమునను
నక్షిమంత్రమ్మున నభిమానవిలయమ్ము రహిసల్పి మూలమంత్రమ్ము వలనఁ

గీ॥ బూర్ణపూర్ణాహుతి యొనర్చి భూతపంచకమ్ము ప్రకృతి లయించి సత్త్వమ్ముగాఁగ
నీశ్వరేశ్వర తత్త్వమ్ము నెనయఁగూర్చి, తానయీశ్వరుఁడగుచుఁదత్త్వము గణించి.

గీ॥ సృష్టి యెందువలనఁ జెలువొందె నచ్చోట, సర్వనిలయవృత్తి సంఘటించు
నదియుఁగాన నీశ్వరాధారసర్వస్వుఁ, జేయవలయు శిష్యు సిద్ధవిధుల.

వ॥ మఱియుఁ బ్రత్యక్షరాకారుండును విశ్వుండును విశ్వాత్మకుండును ననాదినిధనుం
డును దేవుండును నచ్యుతుండును నభేద్యుండును నమృతుండును నక్షోభ్యుండును
నతీంద్రియుండును నప్రత్యయుండును బరమాత్ముండు నగు నారాయణుమూలమంత్ర
విధానంబునఁ దృప్తిఁ బొందించి మోక్షార్థసంకల్పుండై సర్వతత్త్వాతీతంబగు
పరతత్త్వంబునందుఁ దన్నును శిష్యుని నేకరూపంబుగా భావించి వాసనావిర
హితంబగు నేకకలనంబునఁ జైతన్యద్వైవిధ్యంబులేక యానందం బానందంబున
లయించి మహానందంబున షడూర్మి షడ్గుణాతీత స్వశక్తి వైభవ ప్రతిభానం
బునఁ జతుర్విధవృత్తిసముజ్జ్వలితం బగు సప్తాక్షరమంత్ర ముచ్చరించి ప్రణ
వాదినమోంతంబులగు తత్ప్రమేయ నిర్విణ్ణామనస్క నిరామయ సూక్ష్మ
సర్వంగతనిత్యధృతావ్యయేశ్వర నామంబుల దశామిళితంబగు నట్లు గురుశిష్యులకు
సర్వగతతత్త్వంబున విలయించుట వైష్ణవం బగు ముక్తిదీక్ష యగునని చెప్పి
మఱియును. ౭౨

గీ॥ తత్త్వసంహారముగ దీక్షఁ । దనరఁ జల్పి, యిది పునర్భవరాహిత్య । మిదియె ముక్తి
యని యనుగ్రహ మొనరించి । యనుగతమగు, బ్రహ్మసాగరచైతన్య । భరితవృత్తి.

క॥ సర్వవ్యాపకుఁ డగు హరి, సర్వేశ్వరుఁ డఖిలమంత్ర । జనకుం డగుచున్
సర్వ మెఱిఁగి పూజించుట, సర్వఫలంబులకు సిద్ధి । సఫలతఁ గాంచున్. ౭౪

సీ॥ ఇది గోపనీయంబు । విదితంబు సర్వత్ర, రక్షణీయము శ్రుతి । రంజనంబు
గాన నారాయణా । ధీనచిత్తమ్మున, తన్మంత్ర తద్జ్ఞాన । తత్పరతలఁ
దవిలి తత్పూజలఁ । దద్భక్తినిష్ఠలఁ, దద్బోధకోక్తులఁ । దనివి సనక
సర్వదా తన్మంత్ర । జపతత్పరతగల్గి, యక్షమాలిక పాణి । యమరఁగఁ దాఁచి

గీ॥ మంత్రగోప్యత సంధించి । మనమునందు, గురునిపై నిష్ఠ నెక్కొల్పి । కోటిమైన
లెక్కగొనక గురూక్తిపై । మక్కువగొని, వర్తిలుట మేలు భువి శిష్య । వర్గమునకు.

క॥ ఉచ్చాసనమున నుండుట, యొచ్చెము గురు నెదుట భోగ । యోగ్యంబులు తా
విచ్చలవిడి గురునకు నిడి, మెచ్చించుట శిష్యునకును । మేలగు ధరణిన్.

వ॥ మఱియును హరివాసరంబులఁ బక్షోత్సవ మాసోత్సవాదుల విశేషించి హరిపూజ
నంబును దదాలయయాత్రలును దద్భక్తదాస్యోపచారంబులును దత్కథాశ్రవణ
పఠనవిధానంబులును నొనర్చుచుఁ బ్రతిపత్పూర్ణమాస్యష్టమీ చతుర్దశ్యుపరాగ
సంక్రాంతుల విమాన సమ్మార్జనములు గావించుచుఁ దచ్ఛాస్త్రశ్రవణంబు
లనాద్యంతంబు లగుచుండుగతిఁ బూజావిశేషోత్సవంబులు సల్పుచు ఫల
మూలపుష్పాన్నగంధాదిగ్రహణంబుల ననివేదితంబులు గొనక సోమసూర్య

గవాగ్నిపూజల యెడల హరివిభేదనం బొనర్పక, యట్లుల గురువిప్రమాతా పితాదిపూజల వర్తించుచు గురునగ్రింబున మాత్సర్యాపరివాదాదులు వదలి, ఖలజనసంపర్కంబులు మాని, మనోవాక్కాయంబులఁ బరద్రోహపరధన పరదారాహరణంబుల మనం బిడక, యధికోత్సవంబుల గురుసాన్నిధ్యంబు గలిగి యవిరుద్ధసుఖంబు లనుభవించుచు స్త్రీబాలాదుల మన్నించుచుఁ బతిశూన్య లగు వనితలఁ గనికరంబునఁ బాలింపుచు సర్వంబును విష్ణుమయంబని యెఱింగియుఁ దన్మనోరథంబుల గురునకు వంచనం బెఱుంగక వర్తించు పురుషుండు భాగవతా గ్రేసరుండై విష్ణుసాన్నిధ్యంబు కొల్లగొనం గలవాఁడని తెల్పి మఱియును. ౭౭

క॥ హరిపూజాతుల్యంబుగ, హరి భక్తార్చనలు సల్పఁదగు భక్తులకున్
హరి పరికరముల నట్టుల, హరిభావన సేయవలయు నభియుక్తులకున్. ౭౮

సీ॥ గురుఁడు బోధించు నాకుంఠితోక్తులఁ దాను,కలనైన మఱవంగఁ గాదు సుమ్ము
ఎద్ది కార్యం బనిన యెదుట నిల్చి గురూక్తిఁ, గొని సేయఁగాఁ దగుఁ గ్రోక్కపనులు
భుజియించి శయ్యపైఁ బొరలెడు గురుపాద,సంవాహనము శిష్యసమితికిఁ దగు
గురురహస్యముఁ జెప్పఁగూడ దెవ్వారికిఁ, బుత్రాదులకునైనఁ బోలుపు దప్పి
గీ॥ గురుఁడు హరి హరి గురుఁడని యరయవలయు, నించుకైనను భేదంబు నెంచరాదు
ఇట్లు బోధింపవలయును నెందునేని, భక్తులకుఁ జెప్పవలవ దభక్తులకును.

గీ॥ అని వచించిన దేవర్షి యమ్మునీంద్రు, నడుగులకు మ్రొక్కి పితాదులందు సాధ
కాళులందును సమయస్థులందు నుండ, వలయు లక్షణములు దెల్పవలయుననిన.

సీ॥ అమ్మునీంద్రుం డిట్టు లనియె నారదుతోడ, మంత్రనిష్ఠలు గల్గు మనుజులకును
బ్రహ్మచర్యము సత్యభాషణంబు జితేంద్రి, యత్వంబు ధీరత యతులబుద్ధి
సచ్ఛ్రద్ధ వ్రతనిష్ఠ సర్వదా గురుసేవ, నిత్యప్రసాదంబు నిర్మలతయు
విష్ణుశాస్త్రవిమర్శ వేదోక్తవిధిసమ,యజ్ఞత మంత్రయోగానుభూతి
గీ॥ శంఖచక్రగదాదిలక్షణసమష్టి, హరిదినవ్రతచర్యవిప్రార్చనంబు
శాంతి హరిచింతనము సాధుసంగ ముచిత,వర్తనంబులు విడరాదు వైష్ణవులకు.

క॥ కాలముగలన్ని దినములు, కాలవ్యవసాయ మెల్లఁ గడపుచుఁ గాలా
భీలమగు శాస్త్రచింతల, నోలిం జరపంగవలయు నుచితజ్ఞులకున్ ౮౦

గీ॥ తాలుకాద్వాదశాంతస్థదైత్యదమను, నోలిఁ దెలిపితి సద్గురుకీలకంబు
మఱవకెప్పుడుఁ బూర్వోక్తసామాన్యసుగుణ,యుక్తుఁడై యుంటశిష్యునకుచితమనఘ

చ॥ నియమితుఁ డౌచు శాస్త్రకృతినిశ్చయ మెల్లను శ్రద్ధచేత నే
భయమును భక్తియుం గలిగి బ్రహ్మపదస్థితి గోరువాఁడు ని

ర్ణయముగ మంత్రసిద్ధుఁ డయి ◊ నవ్యగురూత్తమపాదపంకజా
వ్యయదృఢ సేవ నెల్లపు డకవారణఁ జేసిన సిద్ధి చేకుఱున్. ౨౪

సీ॥ ధైర్యంబు దృఢత యుత్సాహంబు నెడలక, యేకాంతవృత్తి లక్ష్మీశు నీశు
నచ్యుతు హరిఁ బంకజాక్షు గోవిందుని, మది నుంచి యన్యసంబంధిగాక
యీషణత్రయవాంఛ ◊ నెడ సేవగించుచు, స్వాధ్యాయనిష్ఠుఁడై ◊ సంతతంబు
సంతసం బెడలక ◊ సౌఖ్యప్రదం బగు, నాసనంబున నిల్చి ◊ యాంతరీయ

తే॥ లక్ష్యదృష్టిని నిశ్చలోల్లసితమంత్ర, లయము నొందుట జపితకు ◊ లక్షణంబు
దీనను సమాధిసిద్ధి వర్తిలుటకతన, మంత్ర మనువృత్తిసేయుట ◊ మాన్యవృత్తి.

క॥ ఫలములనో విమలములగు, జలములనో కందమూలశాకాదులనో
వలనొప్ప వృత్తిసలుపుచు, నిలుచుట ధర్మంబు మంత్రనిష్ఠున కెలమిన్. ౨౬

క॥ నిచ్చలు ప్రసన్నహృదయత, నచ్చంబుగ నచ్యుతుని నహర్నిశ మెదలోఁ
గ్రచ్చుకొనుభక్తి పెక్కువ, నెచ్చుగఁ దలపోయవలయు ◊ నెల్లెడ నియతిన్. ౨౭

వ॥ మఱియు నిశాసమయంబులందు నిదురించుదనుక నారాయణుం బరాత్పరు నచ్యుతుని స్మరియించుచు నిదురించి ప్రభాతంబగుటయు వామపాదంబు నిలాతలంబునం దునిచి శయ్య డిగ్గి ప్రతిపదంబును మంత్రస్మరణం బేమఱక మౌనియై మలోత్సర్జనాదు లొనర్చి జలాశయంబున బాదప్రక్షాళన గండూషంబులును దంతశోధనంబును నవగాహంబును మొదలగు కృత్యములు నిర్వర్తించి శుచియై వైష్ణవ గాయత్రిని జపియించి యాశ్రమంబున కరిగి మంత్రగ్రహంబు పూజించి ప్రహరద్వయంబు నిష్ఠాళుండై హోమం బాచరించి మాధ్యాహ్నికకృత్యంబులు సలిపి యవసానంబున సంధ్యాహరిపూజనాదులు నిర్వర్తించి భోజనం బొనర్చి హరిని స్మరింపుచు శీతలస్నిగ్ధదేశంబున శయనించి యర్ధరాత్రంబున శుచియై జపార్చనాదు లొనర్చుచు సర్వం బీశ్వరార్పణంబుచేసి యిత్తెఱంగున వర్తించుచు మంత్రారాధనతత్పరుండగు నతం డజితుం డగు, శాపానుగ్రహములకై ఫలంబు వినియోగింపందగదు. మంత్రముద్రాయంత్రంబులు గోప్యంబు లొనర్చుచుఁ దత్త్వజ్ఞుండై యాచార్యసదృశులతోడం జెలిమిసేయుచుఁ జరించు సాధకుండు లక్షణాన్వితుం డగునని చెప్పి మఱియును, ౨౨

క॥ లోభంబుల రోగంబుల, లాభంబుల కాసఁ జెంది ◊ లక్ష్యాప్రదమౌ
నీభావం బీఁదగదు సు,మీ? భవులకు నీకయుంట ◊ మేలగుఁ జుమ్మీ. ౨౯

సీ॥ అతివినీతులు భక్తులగువారు ప్రార్థించి, చిరకాల మాశ్రయించిన నెఱింగి
శాంతిహోమాదులు ◊ సంకల్పపూర్వంబు, సల్పి ప్రసన్నమౌ ◊ స్వాంతమునను

వైఖానసాదులు వైష్ణవులై కొల్వ, దృఢచిత్తులకు నిట్టి తెఱంగుఁ దెల్పి
పూర్ణాభిషేకంబు పొలుపొందఁ జేసి దుఃఖధ్వంసకంబుగాఁ గడునుదమున

గీ॥ కల్పవిధి నాచరించిన గలదుసిద్ధి, యన్యులకు నీయఁగూడ దీ యతిరహస్య
మెఱిఁగి యాచార్యు లీ విధుల్సలిడఁగవలయు. నిట్టిదీక్షలు పురుషార్థహేతుకములు.

వ॥ మునీంద్రా! నిఖిలమంత్రములలోన శాబరంబులు ముఖ్యంబులు; వాని కన్న వైనాయికంబులు, తన్మంత్రంబులకన్న వైష్ణవంబు లుత్తమంబులు; మఱియును నంత కన్న శాంభవంబు లధికంబులు; నన్నిటికంటెను దేవీమంత్రంబు లుత్తమోత్త మంబులు; నందు షోడశాక్షరంబు మహిమాధికంబు. కాలత్రయంబున నంతకన్న నతిశయం బెందును గలుగనేరదు. గావున దేవీమంత్రంబులకుం బ్రధాన దీక్ష గావలయు నది సర్వకామఫలప్రదయును బాపవిశోధనియు నని వర్ణింపఁబడు; జగ న్మాతయగు మహాదేవీమాహాత్మ్యంబు పాపనాశనంబును ధనదంబును యశస్యం బును భోగమోక్షదంబును నని విరించికి భగవంతుండు బోధించె; నతండు నార దున కొసంగె; నమ్మునిసనకునకుం దెల్పె; నయ్యతివరుఁడు బ్రహ్మర్షులకుఁ దెల్పుట వలన నేను విన్నవాఁడనై నీకుం దెల్పితి నని తెల్పి నీవు సాధూపదేశం బొనర్చుట ధర్మంబని తెల్పిన నారాయణముఖోద్ధృతంబగు దేవీమాహాత్మ్య తత్త్వంబు నాస్వాదించి కృతార్థుండై నారదుం డొక్కరుండు మదీయాశ్రమంబునకుఁ జను దెంచి నిర్హేతుక కృపాకటాక్షంబున నంబికామయంబగు దేవీభాగవతంబు నా కుపదేశించె నని బాదరాయణుండు జనమేజయునకు బోధించె; నిదియేకదా గురుపరంపరయగు; నిట్టి పరదేవికి జనార్దనునకు బ్రహ్మకు సనకునకు బ్రహ్మర్షులకు నారాయణర్షికి నారదునకుఁ గ్రమంబున నమస్కరించి మదీయగురుఁడగు బాదరాయణునకు నమస్కరించెద నని సూతుండు దెల్పిన ఋషులు సంతో షించిరి. జనమేజయుండు వ్యాసముఖంబున నవిస్తరంబుగా దేవీభాగవతంబు విని కృతార్థుండయ్యె, నెవ్వరేనియు నీ భాగవతశ్రవణం బొనరించిన నిహంబునఁ బుత్రధనధాన్య గోసమృద్ధిఁ జెంది తుదిని భగవతీసాయుజ్యంబు నొందుదు రని సర్వార్థసంసిద్ధి యగునట్టుగా వివరింపఁబడియె; నిది పావనపావనంబును ధర్మ ధర్మంబును మంగళమంగళంబు నని యెఱుంగుట విజయావహంబు. ౯౧

ఉ॥ అంధకదైత్యభంజన! మదాంధజలంధరహా! నిరంజనా!
కంధరనీలకంధర! జగత్త్రయసద్మపిచండ! నందిరా
సైంధవ! భృంగిరత్న విచక్షణ! భక్తహృదంబుజాతపు
ష్పంధయ! కాశికాపురనివాసవిధాయక! విశ్వనాయకా! ౯౨

క॥ నిత్యానుభావ! భాస్వద,సత్యమహోద్రేక తిమిరభాస్కర సత్యా
సత్యానుగ్రహ నిగ్రహ, మృత్యుంజయ! చక్రితాబ్జమిత్రామిత్రా. ౯౩

విద్యున్మాలావృత్తము॥ భావాభావాకారాధారా, దేవా! శ్రీవాణీశాధీశా!
జీవా జీవా లీలాలోలా, సేవాధీవద్రక్షాధ్యక్షా. ౯౪

క॥ దేవీభాగవత స్కంధావళి ద్వాదశము నచ్చకమాంబా జగ్గ
క్ష్మావరుల కభీష్టార్థ, శ్రీవెలయంగఁజేసి సుప్రసిద్ధిం జెందున్. ౯౫

ఇది శ్రీమత్పరమశివాద్వైత భావనాసాధ్య ములుగు సదన్వయ సిద్ధ సారస్వత విద్యా
సాన్నిధ్య వేమనారాధ్యవంశార్ణవ కలానిధాన పాపయారాధ్యాభిధాన
ప్రణీతంబైన శ్రీ దేవీభాగవతం బను మహాపురాణంబునందు
ద్వాదశస్కంధము సంపూర్ణము.
శ్రీదుర్గాదేవతార్పణ మస్తు.
శ్రీ శ్రీ శ్రీ



శా॥ ఏతత్సంస్కృతి పూర్తిగాఁ దేమలునో? యేమౌనో ? యంచు న్మనో
భీతిం బుఱ్ఱింగెడి నాకుఁ దోఁపపడి సంప్రీతిం గనంజేసి నా
కాతర్యంబు దొలంచి నన్ను సుకృతిం గావించినా వంబ! యో!
చేతు ల్నీకు నమస్కృతుల్ గొను మివే చెళ్ళపిళ్ళ సద్వంశ్యుఁడన్.

ఇట్లు సంస్కర్త,
చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి,
శతావధాని.

# తప్పొప్పుల పట్టిక

## దశమస్కంధము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౪౨ | ౧౫ | చారియై | చారిణి |

ఈ స్కంధమునం దింతకన్న (అచ్చుతప్పులతప్పు) సవరణలు లేవు.

---

## ఏకాదశస్కంధము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౯౦ | ౧౨ | మతి | మది |
| ౩౯౩ | ౧౨ | ఆది | నాది |
| ౪౦౦ | ౧౬ | మాగ్రిను | మాగ్రి |
| ౪౧౦ | ౧౭ | తంబు | తబు |
| ౪౧౨ | ౧౯ | వశ్యత | వశ్య |
| ౪౧౮ | ౧ | సుమంత | సుమంతు |
| ... | ౪ | నిష్ప | నిష్పి |
| ... | ౨౮ | చార్య | చార |

ఈ స్కంధములో నింతకన్న లోపములు గోచరించలేదుగాని ౪౨౦ వ పుట ౧౮ వ పంక్తిలోని శుద్ధాంబువులను అనునది స్వచ్ఛమగునీట, అని సవరించుకోఁదగు. ౪౨౪ వ పుటలో తొమ్మిదవ పంక్తిలో క॥ అని బాదరాయణుఁడు చెప్పిన విని॥ ఈ విధముగాఁ జదివికోవలయును.

---

## ద్వాదశస్కంధము

ఇందు ౪౩౧ వ పుటలో ౨౩ వ పంక్తిలో అర్ధమాత్ర మహేశ్వరీ అనియు ౪౩౭ వ పుటలో ౨౪ వ పంక్తి "నరసియు సప్తదశాక్షర మంత్రరాజమ్ము చెప్పి॥ అనియు ౪౪౨ వ పుటలో ౧౦ వ పంక్తిలో "పట్టున వానిగాఁదలఁప భద్రము లబ్బు ననేకభంగులన్॥ అనియు సవరించుకోవలయునని చదువరులు ప్రార్థితులు. పద్యమెత్తికొన్నతోడనే కవికి దానిలోఁ గొన్ని యక్కరములు లేకున్నను తుదివఱకు నడిచిపోవును. అక్కతన నితరుల కింకను గొన్ని నెరసులు పొడకట్టునేమోగాని నా కింతకన్న గోచరించలేదు.

— వెం. శా॥ శతావధాని.

---

# తుదిపలుకు



ఈ ద్వాదశస్కంధములో స్కంధాంతపద్యములలో తుట్టతుదిదానిలో నాల్గవ చరణములో

"ధీవదరిత్రాఢ్యత్రా!

అనియున్నది. ధీమద్రత్రాఢ్యత్రా అని దిద్దవలసియున్నను దిద్దలేదు. కారణము కవి యేర్పఱచుకొన్న యమకనియమమునకు భంగముకల్గుటయే. ఇట్టిప్రమాదములు క్వాచిత్కముగఁ గవులకుఁ గల్గుచుండుట సహజము. ఇంతమాత్రముచే వారి కాయాయి శబ్దవ్యుత్పత్తులు తెలియ వనుకొనువారు సహృదయు లనిపించుకొనరు. ఎవరివి వారికి గోచరింపవు. ఒకరి వొకరికి గోచరించును. నేను దీనిని దిద్దనచో నీలోటు చదువరులకు గోచరించెడి దేకాదు. కాని దిద్దినచో వచ్చెడి విప్రతిపత్తిని దెల్పియే యున్నాను. పయిగా నిది దిద్దినను గోచరించును. అట్టి విప్రతిపత్తి లేనివి సవరించియే యున్నాను. ఇట్టిలోపము మా కవిత్వములో నొకటి యిటీవలఁ గొన్ని వత్సరముల నాఁడు చూకే పొడకట్టినది. అది మొదలు దానిని దిద్ది ఆ పుస్తకములు పంపుచున్నాను. అది యిది.

కృషీవంతులు కావలెఁ బొట్టకూటికిఁ (నానారాజ. చూ) ఇయ్యెడ వంతులు అనునది యతిస్థానములోఁ బడినది.

కృషీమంతులు

అని దిద్దినచో విశ్రమభంగము. కృషీవర్తులు అని యథాకథంచిత్తుగా దిద్ది పంపుచున్నాను. ప్రస్తుతము

ధీమత్

అని దిద్దినచో గణభంగాదికము లేకున్నను యమకనియమము చెడునని యుపేక్షింపవలసివచ్చినది. ఇఁక నొక ముఖ్యాంశ మిటఁ బ్రస్తావింపవలయును. సంస్కృత గ్రంథముల ననువదించునపుడు నన్నయాదులు కొంచె మించుమించుగా మూలమును బట్టి ప్రవర్తించిరి. ప్రకృతగ్రంథకర్తయు నట్లే ప్రవర్తించెను. దేవీస్తుతి లోనైన ఘట్టములలో స్వకపోలకల్పితము గొంత చేర్చి తన భక్తిప్రపత్తులను బ్రకటించెను.

కాని సప్తమస్కంధములో సుమారు 40 అధ్యాయములు వదలి ఆ స్కంధమును చట్టన హరిశ్చంద్రోపాఖ్యాన మాంధ్రీకరించుచు ముగించుట కెంత సరిపెట్టుకొన్నను హేతువు స్ఫురించుటలేదు. అదియటులుండఁగా మరల నీ ద్వాదశస్కంధమున నట్టిదే వేఱొక సందర్భము పొడకట్టినది. దీనిలో గాయత్రీసహస్రనామములవఱకును మూలానుసారముగనే అనువాద మున్నది. అది మొదలు మూలముత్రోవ మూలముదియు, దీనిత్రోవ దీనిదియుఁగా నున్నది. మూలాధారము లేనికారణముచే నాయీ భాగమున నున్న పద్యములు సంస్కరించుట కుపాయములేక యించుమించుగా నున్నవున్నట్లే యుంచవలసివచ్చినది. ఈ కారణముచేఁ గొన్నిపద్యము లయోమయముగ నుండును. ఇది దేవికిఁ బ్రాధాన్య మిచ్చెడి పురాణము. దీక్షాద్యుపదేశములు పరాశక్తికి సంబంధించినవిగానే మూలమందున్నవి. అనువాదములో నటుండక శ్రీమన్నారాయణునకు సంబంధించియున్నవి. ఇంతమాత్రమే కాదు. మూలములోనున్న గాయత్రీశాపాదికము, కేనోపనిషద్గాథ లోనైనవి దీనిలో లేనేలేవు. ఏ కొంచెము గూడ పై సందర్భములను స్పృశించినట్లే లేదు. అతివిస్తర మెందులకు? సంస్కృతములో గ్రంథమును ముగించుటకును అనువాదములోనున్న ముగింపునకును దక్షిణోత్తర ధ్రువములకున్నంత వ్యత్యాసము కనవచ్చుచున్నది. దీనిని చదువరులు గమనింతురుగాక! దీనికి హేతువు విచారింపఁగా గ్రంథకర్తకు దొరకిన గ్రంథ మిట్టిదియనియే నా సమాధానము. అనువాదములోఁ గవులు కొంచెము మార్చిన మార్తురేమో కాని యింతగా మార్చరు. ఈయనయు మార్చలేదు. ఈకవి సుమారు నూఱేళ్ళనాఁటివాఁడు. అప్పుడు దొరకుచున్న తాటాకు ప్రతులలో నీయనకు దొరకిన ప్రతిలో నీ యనువాదమునకాధారము తప్పక చిక్కును గాని అది యిపుడు మనకు లభ్యమగు టెట్లు? ఈ విషయ మత్యావశ్యకమగుటచే నిందుఁ జదువరులు సంశయగ్రస్తులగుదు రని యీనాల్గు మాటలును వ్రాసితిని. పూర్వకవుల అనువాదములలోఁ గథాసందర్భములు తాఱుమాఱైన వనియు నసలే కొన్ని పరిత్యజింపఁ బడినవనియు నిప్పుడు దొరకు మూలగ్రంథములనుబట్టి కొందఱు విమర్శకు లనుచుందురు. వారు ప్రకృతవిషయము నవగతము చేసికొన్నచో నందులకుఁ గారణము సుగమముగా గోచరించెడి నని విన్నవించుచు దీని నింతతో ముగింతును. నాకుఁ బ్రకృతమున్న యోపికనంతయు వినియోగించి దీనిని సంస్కరించితిని గాని దొరకిన ప్రతి చాలలోపములు గలదిగా నుంటచే నింకను గొన్ని లోపము లిందు నిల్చియున్నవని నేను నమ్ముచున్నాను. పునర్ముద్రణము నప్పుడా లోపము తీరవలసియున్నది. ఇది భవిష్యత్సంస్కర్తలకు నా విజ్ఞప్తి.

మఱియు నా సంస్కరణవిధానము నేఁటి సంస్కర్తల విధానము ననుసరింపదు. వ్రాఁత పొరపాటులను గ్రంథకర్త విజ్ఞుఁడయ్యును భ్రాంతి పురుషధర్మమగుటచే దొరలిన దోసఁగులను మాత్రమే స్పృశించునుగాని నా మతమునకు విరుద్ధముగా నుండినను గ్రంథకర్త బుద్ధిపూర్వకముగా వాడికొన్న ప్రయోగములజోలికిఁ బోవెఱచును. కావుననే—పూన్చు — పోరటము లోనైనవి యుపేక్షించితిని.

### కాలీన శబ్దము

పాణినీయముచే సాధ్యముగాకున్నను విద్యారణ్యాది మహావ్యాఖ్యానములలో నుండుటయేకాక దండికూడ నంగీకరించుటచే నుపేక్షించితిని.

### మృన్మయ శబ్దము

ణకారఘటితముగా నుండవలయు ననుటకుఁ దెలుఁగులిపిలో నచ్చైన మహామహుల గ్రంథములు తెల్పుచున్నను అయ్యెడ ణత్వము రాదని యెఱిఁగి దిద్దితిని. దీనింగుఱించి యింతకన్న నిక్కడ వ్రాసినను నెవరో విద్వత్కవులు తప్పఁ బౌరాణికులును దత్సదృశులగు నితరవిమర్శకులును గ్రహింపఁజాల రని విరమింతును. ఎంత శ్రద్ధగా దిద్దినను పొరుగూరినుండి ప్రూఫు దిద్దుటచేతనేమి వార్ధక్యాదికారణములచే నేమి దొరలిన కొన్ని లోపముల దప్పొప్పులపట్టికలో నుదాహరించి యున్నాఁడను.

శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు సంస్కర్త,
చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి,
శతావధాని.



